కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 23 యోగశిఖోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ యోగజ్ఞానే యత్ పదాప్తి, సాధనత్వేన వి(శ్రుతే,
తత్రైపదం బ్రహ్మతత్త్వం, స్వమాత్రమ్ అవశిష్యతే॥



యోగ-జ్ఞాన సాధనముల అంతిమ ప్రయోజనముగా ఏ పదము విశ్రుతము అగుచున్నదో, అదియే బ్రహ్మతత్త్వపదముగా (లేక) (నాలోని నేనైన నేనేగా) అగు స్వస్వరూపముగానే శేషించుచున్నది. అట్టి త్రైపదమగు బ్రహ్మతత్త్వము మన అఖండ - స్వరూపమునకు అన్యమైనది కాదు. అనన్యము॥

## ప్రథమాధ్యాయము

ఓం! (హిరణ్యగర్భో వాచ॥)

**1.** సర్వే జీవాః సుఖైః దుఃఖైః
మాయాజాలేన వేష్టితాః।
తేషాం ముక్తిః కథన్, దేవ!
కృపయా వద, శంకర!

**సృష్టికర్తయగు హిరణ్యగర్భుడు :**
ఓ దేవాది దేవా! పరమశివా! శంకర భగవాన్! మీరు ప్రసాదించిన సృష్టి సామర్థ్యము వలన నాచే సృష్టించబడుచున్న జీవులంతా కూడా సుఖ-దుఃఖములు అనబడే రెండు వరసల పురికొసలతో నిర్మితమైన మాయాజాలముచే చుట్ట చుట్టుకొనబడినవారై ఉంటున్నారు. హే దేవా! వారు దృశ్య సంబంధ రూపములగు సంసార దుఃఖముల నుండి ముక్తి (RELIEF) పొందేది ఎట్లా? కృపతో వివరించమని ప్రార్థిస్తున్నాను.

---

సర్వ సిద్ధికరం మార్గం
మాయాజాల నికృన్తనమ్,
జన్మ మృత్యు జరా వ్యాధి
నాశనం, సుఖదం వద।
– ఇతి హిరణ్యగర్భః పప్రచ్ఛ॥ –

స్వామీ! సర్వసిద్ధికరము, మాయాజాలము (వల) నుండి విడుదల ప్రసాదించునది, జన్మ - మృత్యు - జరా - వ్యాధి రుగ్మతలను నశింపజేయునది, పరమ సుఖప్రదమైనది అగు '**ముక్తిమార్గము**'ను దయతో ప్రవచించండి. (అని హిరణ్యగర్భుడు అడిగారు)

---

**2.** సహోవాచ మహేశ్వరః
నానా మార్గైస్తు దుష్ప్రాపం
కైవల్యం పరమం పదమ్।

**మహేశ్వరభగవానుడు**
పరమాశయముపట్ల సుస్పష్టమైన అవగాహన లేకుండా - అనేక మార్గములలో వెళ్లుతూ ఉంటే పరమపదమగు కైవల్యము. ఉపాయం లభించదు. దుష్ప్రాప్యము కూడా. ఈ జీవుడు కేవలీ స్వస్వరూపమగు కైవల్యము కొరకై యత్నం లేకపోతే అందుకోజాలడు. (Multiple Approaches without clarity of main objective lead to no where).

---

'సిద్ధి' మార్గేణ లభతే,
న అన్యథా, పద్మసమ్భవ!

ఓ పద్మసంభవా! బ్రహ్మ భగవాన్! కేవలాత్మానంద స్వరూపమగు కైవల్యము '**సిద్ధి' మార్గము** చేతనే సులభము. (ఏ మార్గములో "సోஉహమ్, తత్త్వమ్" భావనలు స్వాభావికమౌతాయో- అదియే **సిద్ధి మార్గము.)**

---

పతితా శాస్త్ర జాలేషు
ప్రజ్ఞయా తేన మోహితాః,
స్వాత్మ ప్రకాశరూపం తత్
కిం శాస్త్రేణ ప్రకాశ్యతే?

అట్టి సిద్ధి మార్గము (లేక) అట్టి కైవల్యపదము కొరకై శాస్త్రపుటలలో వెతికితే లాభమే ముంటుంది? శాస్త్రజాలములో పడినవాడు ప్రజ్ఞామోహితుడు అగుచున్నాడు. ప్రకాశరూపమగు స్వాత్మ అంతరముననే వేంచేసి యుండగా అట్టి ఆత్మపదము బయట గల శాస్త్రములు ఎట్లా ప్రకాశింపజేస్తాయి? ఆత్మ ప్రకారము అనుభవమువవలసినది అంతరముననే.

**నిష్కళం నిర్మలం శాన్తం**
**సర్వాతీతం, నిరామయమ్,**
**తదేవ 'జీవ' రూపేణ**
**పుణ్య-పాప ఫలైః వృతమ్॥**

కేవలీ స్వస్వరూపమగు ఆత్మ నిష్కళంకమైనది. (కళంకరహితమైనది)। అత్యంత నిర్మలము। పరమశాన్తము। ఈ దృశ్య-దేహ-మనో-బుద్ధి- -చిత్త అహంకారాది సర్వమునకు అతీతమైనది। నిర్విషయ-నిరామయమైనది। అట్టి కేవలీ ఆత్మయొక్క అంశయే 'జీవుడు'. తన అంశవంటి రూపమును స్వీకరించినదై ఉండగా, అట్టి జీవరూపము పాప-పుణ్యాఫలములగు సుఖ-దుఃఖములచే కేవలాత్మ ఆవరించబడుచున్నది. ఆత్మయొక్క 'అంశ' అగు జీవునికి సంబంధించినదే జగదనుభవము! ఆత్మకు ఎట్టి ఫలములతో సంబంధమే లేదు.

---

**బ్రహ్మో వాచ :-**
**పరమాత్మ పదం నిత్యం,**
**తత్ కథం జీవతాజ్గతమ్**
**తత్త్వాతీతం? మహాదేవ!**
**ప్రసాదాత్ కథయ, ఈశ్వర!**

**బ్రహ్మభగవానుడు** : అట్టి సర్వాతీతము, నిత్యనిర్మలము అగు ఆత్మ ఎందుచేత, ఏ విధంగా జీవిత్మత్వము పొందినదిగా అగుచున్నది? హే మహాదేవా! ఈశ్వరా! తత్త్వాతీతమగు ఆత్మ నిత్యనిర్మలము కదా! అది జీవుడుగా అవటమేమిటి? ఎంతటి చమత్కారం? ఎందుచేత? ఆత్మయొక్క అంశ ఆత్మను బంధించటమేమిటి?

---

**ఈశ్వరో వాచ**
**సర్వభావ పదాతీతం,**
**జ్ఞానరూపం, నిరంజనమ్,**
**వాయువత్ స్ఫురితం**
**స్వస్మిన్ తత్ర "అహంకృతిః' ఉత్థితా।**

ఈశ్వరుడు : అవును. సర్వభావములకు, సర్వపదములకు అతీతమైనది, కేవల జ్ఞానరూపము, దోషమే లేనట్టిది. నిరంజనము అయినట్టి ఆత్మాకాశము నందు - ఆకాశంలో వాయువు, వాయు తరంగములు స్ఫురిస్తున్న విధంగా - 'అహంకారము' (అహంకృతి - నేను దీనికి కర్తను →అను భావస్ఫూర్తి) బయల్వెడలుచున్నది. **కర్తృత్వము** ఏర్పడుచున్నచోట **భోక్తృత్వము** కూడా వచ్చిపడుతోంది.

---

**పంచాత్మకమ్, అభూత్ పిణ్డం**
**ధాతు బద్ధం, గుణాత్మకమ్**
**సుఖ-దుఃఖైః సమాయుక్తం**
**జీవ భావనయాకురు।**

'అహమ్‌కృతమ్' కల్పన నుండి - భూ, జల, అగ్ని, వాయు, ఆకాశ సమ్మేళన రూపమగు పంచాత్మక దేహత్వము (అభూతపిండము) జనిస్తోంది.

'అభూతపిణ్డము' అగు దేహిని ఆశ్రయించి అంతరంగము - అంతరంగ చతుష్టయం (మనో-బుద్ధి-చిత్త-అహంకారములు),

- ధాతువులకు సంబంధిత బద్ధము,
- సత్వ-రజో-తమో త్రిగుణాత్మకము
- సుఖ దుఃఖ భావ సంయుక్తము

అగు **జీవభావము** అంకురించుచున్నది. (అభూతపిండము = భావనారూప ఉత్సుకత)

---

**తేన 'జీవాభిదా' ప్రోక్తా, విశుద్ధే పరమాత్మని!**
**కామ క్రోధ భయం చ అపి**
**మోహ లోభ మదో రజః;**
**జన్మ మృత్యుశ్చ కార్పణ్యం**
**శోకః తన్ద్రా క్షుధా తృషా**
**తృష్ణా లజ్జా భయం దుఃఖం**
**విషాదో హర్షఏవ చ..**
**ఏభిః దోషైః వినిర్ముక్తః**
**సజీవః 'శివ' ఉచ్యతే॥**

ఫలితంగా,.. సర్వదా విశుద్ధుడగు **'పరమాత్మ'** యందు **'జీవాత్మ'** అనబడు ఆరోపణ (Attribution) బయల్వెడలుచున్నది. ఇది 'జగత్తు' అనే నాటకంలో పాత్రధారణ వంటిది.

**జీవాత్మ యొక్క లక్షణ విశేషములు** - ఏదో ఇంకా కావాలనే రూపముగల **కామము;** సుదీర్ఘ కోపరూపమగు **క్రోధము;** ఎప్పుడు ఏమౌతుందోననే **భయము;** కొన్ని కొన్నిటి పట్ల **ఇచ్ఛ;** సత్యవిచారణ చేయకుండా ఏర్పడే అభిప్రాయ ఆవేశరూపమగు **మోహము;** "నేను తదితరుల కంటే ప్రత్యేకమైనవాడినిగా ఉండాలి'' - అనే రూపమైన **మదము; జన్మ-మత్య్య-వార్ధక్య-మమకారములు; శోకము; అలసత్వము, ఆకలి-దప్పికలు; తృష్ణ; లజ్జ, భయము; దుఃఖము; విషాదము; హర్షము..** ఈ మొదలైనవన్నీ జీవుని దోష లక్షణములు. భ్రమాత్మకమగు ఈ ఈ దోషములన్నిటినీ వదిలించుకుంటే.. **ఈ జీవుడే శివుడు.**

---

**3. తస్మాత్ దోష వినాశార్థం**
**'ఉపాయమ్' కథయామి తే!**

అందుచేత ఓ చతుర్ముఖ బ్రహ్మ భగవన్! ఈ జీవాత్మపరంగా మనము చెప్పుకొన్న దోషములు పూర్తిగా నశించటానికి ఉపాయములేమిటో చెప్పుకుందాము. ఇది మీరు అడిగిన దానికి సమాధానము కాగలదు. ఈ జీవునిపట్ల ఉపాధి పరంపలుగా ఏర్పడుచున్న మానసికమైన భ్రమ బంధము (సంసార బంధము) తొలగగలదు.

'జ్ఞానం' – (ఇతి) కేచిత్ వదతి।
అన్యత్ర కేవలం తత్ న సిద్ధయే–
యోగహీనం కథం జ్ఞానం
మోక్షదమ్ భవతి ఇహ భోః?

**"జీవదోష నివారణకై జ్ఞానము మాత్రమే ఉపాయము మరొక ఉపాయమేదీ లేదు"** అని కొందరు చెప్పుచున్నారు. అయితే జ్ఞానము మాత్రమే జీవునికి సిద్ధిని ప్రసాదించగలదా? అనగా, తెలుసుకొంటే సరిపోతుందా? లేదు. జీవుడు దృశ్య సంబంధ భ్రమలను జయించి, అతీతుడుకావద్దూ? యోగాభ్యాసం లేకుండా జ్ఞానము మోక్షమును ఎట్లా ఇవ్వగలుగుతుంది? ఇవ్వలేదు. (జ్ఞానము = తెలుసుకోవటము. యోగాభ్యాసము = అనిపించటానికి చేసే ప్రయత్నము)

---

యోగోఽపి జ్ఞాన హీనస్తు
న మోక్షో (క్షమో) మోక్ష కర్మణి।
తస్మాత్ జ్ఞానం చ యోగం చ
ముముక్షుః దృఢమ్ అభ్యసేత్॥

అదేవిధంగా, కేవలమూ 'యోగము'నకు మాత్రమే పరిమితమైతే కూడా (జ్ఞానము లేకుండా - కేవలం కర్మలకు పరిమితమైతే కూడా) - మోక్షము లభించదు.
అందుచేత ముముక్షువు **(1) జ్ఞానము (2) యోగము** - ఈ రెండూ దృఢంగా ఒకే సమయంలో అభ్యాసం చేయాలి.

---

జ్ఞాన స్వరూపమేవ ఆదౌ।
జ్ఞేయం జ్ఞానైక సాధనం।
**'అజ్ఞానం కీదృశం చ?'**
ఇతి ప్రవిచార్యం ముముక్షుణా।
జ్ఞాతం యేన నిజం రూపం
కైవల్యం పరమం పదం।

మొట్టమొదట 'జ్ఞానము' గురించే బోధించబడుతోంది. సంసారము అనగా తెలుసుకొని ఉండకపోవటము - అను రూపము గల అజ్ఞానమే. కాబట్టి, తెలుసుకొనవలసిన ఆత్మ (జ్ఞేయము)కొరకై జ్ఞానమే మొదటి సాధనమే. జ్ఞానముచే ఆత్మానుభవం తప్పక సిద్ధిస్తుంది. ముముక్షువు అయినవాడు ముందుగా **"ఈ అజ్ఞానము అనగా ఏట్టిది? ఎట్టి స్థితి కలిగి ఉన్నది? ఈ దృశ్యజత్తంతా స్వతఃగా ఏదిగా అయి ఉన్నది"**-ఈఈ ప్రశ్నలకు సమాధానముతో ఈ జీవుడు తన నిజరూపం తెలుసుకొంటేనే కైవల్య పదమును చేరగలడు. తనయొక్క నిజరూపము గురించిన ఎరుకయే జ్ఞానము. తెలుసుకొంటున్నది అనునిత్యంగా అనిపించటానికి అభ్యాసమే - యోగము)

---

**4.** అసౌ దోషైః వినిర్ముక్తః
కామ క్రోధ భయాదిభిః
సర్వదోషైః (ఆ)వృతో జీవః
కథం జ్ఞానేన ముచ్యతే?

అభ్యాసవశంగా అనేక దోషములచే ఆవృతుడైయున్న ఈ జీవుడు జ్ఞాన సమాచారము సంపాదించినంత మాత్రంచేత కామ-క్రోధ- భయముల నుండి విముక్తుడు కాగలడా? అవలేడు. ఆయా సంసార దోషములను తొలగించుకోవటానికి యోగాభ్యాసము కూడా అవసరము. అత్యవసరము.

---

స్వాత్మరూపం యథా జ్ఞానం
పూర్ణం తత్ వ్యాపకం తథా।
కామ క్రోధాది దోషాణాం
స్వరూపాత్ నాస్తి భిన్నతా।
పశ్చాత్ తస్య విధిః కిన్ను?
నిషేధోఽపి కథం భవేత్?

అయితే 'జ్ఞానము'చే, దేనిని గురించి తెలుసుకోవటం? తన రూపం గురించే కదా! **స్వాత్మరూపము ఏతీరుగా *(1) తనకు తానే పూర్ణమో, (2)* సర్వవ్యాపకమో - ఎరుగుటయే జ్ఞానం.** ఆ విధంగా పూర్ణ- సర్వవ్యాపక స్వస్వరూపాత్మ సర్వదా ఏకము, అఖండము అయి ఉండగా, అందులో స్వరూప - భేదములే ఉండజాలవు. "స్వరూపతః భిన్నత్వమే లేదు. కామక్రోధములు కూడా ఆత్మకు భిన్నంగా లేవు" - అని ఎరిగిన తరువాత ఇక విధి-నిషేధాలు మాత్రం ఎక్కడుంటాయి? వాటికీ స్థానము ఉండదు.

---

వివేకీ సర్వదా ముక్తః,
సంసార భ్రమవర్జితః।
పరిపూర్ణ స్వరూపం
తత్ సత్యం, కమల సమ్భవ!

ఓ కమల సంభవా! బ్రహ్మదేవా! అవివేకము చేతనే ఈ జీవుడు సంసార భ్రమను కొనసాగిస్తూ, తత్ఫలితంగా బద్ధుడు అయి ఉంటున్నాడు. **"ఆత్మ పరిపూర్ణ స్వరూపము. పరమ సత్యము"** అని స్వస్వరూపము గురించి, అద్దాని సర్వాత్మకత్వము గురించి తెలుసుకున్న వివేకియో? సంసారభ్రమ తొలగించుకొని **నిత్యముక్తుడగుచున్నాడు. పరిపూర్ణమగు తత్ సత్యమే తానగుచున్నాడు. (బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి)**

---

**5.** సకలం నిష్కళంచైవ
పూర్ణత్వాచ్చ తదేవ హి।
కలినా స్ఫూర్తి రూపేణ
సంసార భ్రమతాం గతమ్।

(1) స-కలము (సంసారమగ్నమున మునిగి తేలుచున్న జీవాత్మ). (2) నిష్కళము - (నిర్మలుడు అగు కేవలాత్మ) ఈ రెండూ పూర్ణము అయియే ఉన్నాయి. అజ్ఞానములో మునిగి తేలుచున్నంత మాత్రం చేత జీవాత్మ తన యొక్క నిష్కళ - నిర్మల ఆత్మస్వరూపము పోగొట్టుకొని ఉండలేదు. కేవలమగు నిర్మలాత్మయే తన యొక్క స్ఫూర్తి (Inelination) చే కలనము (కల్పన)ను ఆశ్రయించి తన కల్పనయగు సంసారమునందు (మందనుండి విడివడిన కోతిలాగా) తిరుగాడుచున్నది.

నిష్కలం నిర్మలం సాక్షాత్।
సకలం గగనోపమమ్,
ఉత్పత్తి స్థితి సంహార స్ఫూర్తి
జ్ఞాన వివర్జితమ్।
ఏతత్ రూపం సమాయాతః
స కథం మోహసాగరే
నిమజ్జతి, మహాబాహో!
-త్యక్త్వా విద్యాం పునః పునః?

నిష్కలము, నిర్మలము సాక్షాత్ స్వరూపము, ఆకాశమువలె నిష్క్రియము, అనంతము అగు ఆత్మయే తాను. కానీ, ఈ జీవుడు తన యొక్క అఖండ - అప్రమేయ- నిత్యత్వాది ఆత్మలక్షణములను ఏమరిచి, లీలగా **జ్ఞాన వర్జితము** అగుచున్నాడు.

హే మహాబాహో! బ్రహ్మదేవన్! అటువంటి అఖండతతత్త్వమగు ఆత్మ తన యొక్క ఉత్పత్తి - స్థితి-లయస్ఫూర్తిని కలిగియున్నప్పటికీ.. తన యొక్క స-కల (కల్పనా, భావనా) రూపము (జీవాత్మత్వము) నకు పరిమితమై చరిస్తోంది. తన విద్యత్వమును ఏమరచినదై, మోహసాగరంలో మునుగుతోందే? ఏమి చమత్కారము!

---

సుఖ దుఃఖాది మోహేషు
యథా సంసారిణాం స్థితిః,
తథా జ్ఞానీ యథా తిష్ఠేత్
వాసనా వాసితః తథా।

ఒక సంసారి (అజ్ఞాని) ఏ విధంగా అయితే సుఖము - దుఃఖము మొదలైన మోహములలో ఉండి ఉంటున్నాడో, అట్లాగే శాస్త్ర సంబంధమైన జ్ఞానము తెలిసి కూడా ఆ (శాస్త్ర) జ్ఞాని-వాసనా సహితుడైయ్యే ఉంటున్నాడు. 'వాసనలు' అనే సంసార భావనల విషయంలో ఆ ఇద్దరికి తేడా ఏమీ లేదు. ఆత్మ గురించి ఎరిగినంత మాత్రంచేత సంసార దోషము తొలగదు. ఎందుకంటే, తెలుసుకుంటే చాలదు. అనిపించాలిగా!

---

తయోః నాస్తి విశేషో
అత్ర, సమా సంసార భావనా।
జ్ఞానం చేత్ ఈదృశం జ్ఞాతమ్
అజ్ఞానం కీదృశం పునః॥

"ఇక్కడ కనబడేదంతా సర్వదా సహజము - కేవలము- అఖండము అగు ఆత్మస్వరూపమే" అని తెలుసుకున్నంత మాత్రం చేత కూడా, ఆ తెలుసుకున్న వాని యొక్క మనో-బుద్ధి సంబంధమైన సంసార చేష్టలు (అజ్ఞానము) ఇంకా వీడవు. (అభ్యాసము కావాలిసిందే). లేదా, అజ్ఞానము మరల వచ్చి పడగలదు.

---

'జ్ఞాననిష్ఠో విరక్తోఽపి
ధర్మజ్ఞో విజితేంద్రియః
వినా దేహోఽపి యోగేన
న మోక్షం లభతే, విధే!

ఓ విధీ! ఒకానొకడు - ఆత్మ గురించిన సమాచారము చదువుట, వినుట మొదలైన వాటిచే తెలిసియున్నవాడు, విరక్తుడు, ధర్మజ్ఞుడు ఇంద్రియములు కట్టి చేయ కలిగినవాడు అయినప్పటికీ కూడా యోగాభ్యాసము లేకపోతే ఆతనికి మోక్షము లభించదు. (రోగము గురించి తెలుసుకున్నంత మాత్రాన ఏమి లాభము? మందు వాడాలి కదా!)

---

అపక్వాః పరిపక్వాశ్చ
దేహినో ద్వివిధాః స్మృతాః।
'అపక్వా' యోగహీనాస్తు,
'పక్వా' యోగేన దేహినః॥

ఈ దేహధారులు రెండు తీరులుగా విభజించి చెప్పబడవచ్చును.
(1) అపక్వుడు - యోగాభ్యాసమును నిర్వర్తించనివాడు.
(2) పక్వుడు - యోగాభ్యాసముచే తాను తెలుసుకొన్న జ్ఞానమును 'అనుభవము'గా తీర్చిదిద్దువాడు. సమస్తము బ్రహ్మముగా అనిపిస్తూ ఉన్నవాడు.

---

**6.** సర్వో యోగాగ్నినా దేహో హి, అజడః శోక వర్జితః
జడస్తు పార్థివో జ్ఞేయో హి, అపక్వో దుఃఖదో భవేత్।
ధ్యానస్థో అసౌ తథాపి ఏవమ్
ఇంద్రియైః వివశో భవేత్।

యోగాభ్యాసఫలమగు 'యోగాగ్ని'చే ఈ భౌతిక దేహము తన జడత్వము త్యజించి మానసికంగా చైతన్యవంతము, తేజోవంతము అగుచున్నది. అట్టి యోగి-శోకము (Worry and meloncholy)ను మొదలంట్లా తొలగించు కొనగలుగు చున్నాడు. యోగాభ్యాసము లేని వాడు అగు అపక్వుడు - ఆత్మగురించినది పాఠముగా తెలిసినా కూడా, ఆత్మ గురించిన ధ్యాని అయినా కూడా, ఇంద్రియములకు వివశకుడుగానే ఉండిపోవుచున్నాడు. జడమగు పార్థివ దేహబద్ధుడగుచున్నాడు.

---

తాని గాఢం నియమ్యాపి
తథాపి అన్యైః ప్రబాధ్యతే।
శీతోష్ణ సుఖ దుఃఖ ఆద్యైః
వ్యాధిభిః మానసైః తథా
అన్యైః నానావిధైః జీవైః
శస్త్రాగ్ని జలమారుతైః, శరీరం పీడ్యతే।
తైస్తైః చిత్తం సంక్షుభ్యతే తతః॥

జ్ఞానసమాచారము మాత్రము కలిగి యోగాభ్యాసి కాకపోతే,...అట్టివాడు ఇంద్రియములను గాఢంగా నియమించినప్పటికీ, అవి బాహ్య విషయములతో ప్రభావము పొందటము మానవు. విషయములు బాధిస్తూనే ఉంటాయి.

ఈ జీవుని యొక్క ఈ భౌతిక శరీరము→ శీత-ఉష్ణ సుఖ-దుఃఖ ఇటువంటి వాటిచే తను, శారీరక వ్యాధుల చేతను, మానసికమైన ఆధిలచేతను, శాస్త్ర నియమముల చేతను, అగ్నిచేతను, జలము చేతను, గాలి చేతను→బాధలుపడటం జరుగుతోంది. దానితో చిత్తము కూడా సంక్షోభము పొందసాగుచున్నది.

తథా ప్రాణవిపత్తౌ తు
క్షోభం ఆయాతి మారుతః।
తతో దుఃఖ శతైః వ్యాప్తం
చిత్తం క్షుబ్ధం భవేత్ నృణామ్।
దేహావసాన సమయే చిత్తే
యత్ యత్ విభావయేత్,
తత్ తదేవ భవేత్ జీవః।
<u>ఇత్యేవం జన్మకారణమ్।।</u>

ప్రాణములకు విపత్తు భావములు కలుగుచున్నప్పుడు దేహములోని వాయువు కూడా క్షోభ పొందుచున్నది. ఫలితంగా వందల దుఃఖములతో వ్యాప్తిని పొంది ఈ జీవుని మనస్సు/చిత్తము - అనేక రుగ్మతల వలన క్షుబ్దము పొందటం జరుగుచూనే ఉంటోంది.

ఈ జీవుడు - దేహము యొక్క అవసానస్థితిలో (At the Point of this Physical Body getting perished) - ఆతని చిత్తములో ఏఏ విశేషములు ప్రకాశమానమై ఉంటాయో, ఆయా భావములను అనుసరించేయే మరొక భౌతికదేహము సంక్రమించటం జరుగుతోంది. చిత్తములోని దృశ్యసంబంధిత విశేషములే మరుజన్మ యొక్క తీరుకు కారణమగుచున్నాయి. జ్ఞాని అయి ఉండి కూడా (యోగాభ్యాసము లేకపోతే) ఆతడు వాసనలకు తలవంచి ప్రవాహపతితుడు అగుచున్నాడు.

---

<u>దేహాన్తే కిం భవేత్ జన్మ</u>
<u>తత్ న జానన్తి మానవాః।</u>
తస్మాత్ జ్ఞానం చ వైరాగ్యం
జీవస్య కేవలం శ్రమః।

**"దేహము అంతమైన తరువాత ఈ జీవునికి ఏ జన్మ రానున్నది?".** ఇది ఈ మానవుడు ఎరిగియుండటం లేదు. ఈ విధంగా యోగసాధనలతో కూడి ఉండనట్టి జ్ఞాన, వైరాగ్యములు ఈ జీవుని పట్ల శ్రమయే అగుచున్నాయి. ఇంద్రియములకు సంబంధించిన అభ్యాసములే పెత్తనం చెలాయిస్తున్నాయి. యోగాభ్యాసము చేతనో? - అవన్నీ జీవునికి వశమై ఉంటాయి.

---

పిపీలికా యథా లగ్నా
దేహే ధ్యానాత్ విముచ్యతే,
అసౌ కిం వృశ్చికైః దష్టో
దేహాన్తే వా కథం సుఖీ?

తన యొక్క దేహము గురించిన ధ్యానములో మునిగి తేలుచున్న ఒక చీమ (పిపీలికము) శరీరముపైకి ప్రాకుచూ, క్రిందకు త్రోసివేయపడగానే,.. ఎక్కడో పడి మరెటోగా అగుచున్నది చూచారా! ఆవిధంగా, అసంఖ్యాత వస్తు-రూప-నామ-సందర్భ విషయములతో మునిగి తేలుచున్న ఈ జీవుడు-ఈ దేహము శిధిలమగుచుండగా - 'విషయములు' అనే తేళ్లతో కుట్టబడుచున్న తీరుగా బాధలు పొందుచున్నాడు. ఇక ఈ దేహం పోయిన తరువాత మాత్రం సుఖం ఎక్కడిది? ఏవేవో సంస్కారములు (వాసనలు), ప్రభావము చూపుతూ ఏవేవో ఉపాధులలోకి ఈ జీవుని త్రోసివేస్తున్నాయి.

---

**7.** తస్మాత్ మూఢా న జానన్తి
మిథ్యా తర్కేణ వేష్టితాః
అహంకృతిః యదా యస్య
నష్టా భవతి, తస్య వై।
దేహస్తు అపి భవేత్ నష్టో
వ్యాధయశ్చ అస్య కిం
పునః? జలాగ్ని శస్త్ర
ఘాతాది బాధా కస్య భవిష్యతి?

అందుచేత మూఢత్వము - మూర్ఖత్వము ఆశ్రయించి, తర్కములతో కప్పుకొని ఉన్న జీవుడు తన యొక్క వాస్తవ స్వరూప-స్వభావములను ఎరుగుచుండుటయే లేదు.

అయితే, ఎవ్వరి పట్లయితే అహంకారము (నాకు చెందినది-అను భౌతిక-మానసికాత్మక భావన) తొలగిపోవుచున్నదో, వారి పట్ల ఈ భౌతిక దేహము కూడా మొదలే, వర్తమానంలోనే నశించిపోయినదిగా అగుచున్నది. దేహమే లేనప్పుడు ఇక వ్యాధులు మాత్రం ఎక్కడుంటాయి? జలము-అగ్ని- శస్త్రఘాతముల వలన బాధలు మాత్రం ఏమి ఉంటాయి? **యోగాభ్యాసముచేతనే దేహముపట్ల ఏర్పడి ఉంటున్న 'మోహము' తొలగ గలదు.**

---

యదా యదా పరిక్షీణా
పుష్టాచ 'అహంకృతిః
భవేత్, తమ్ 'అనేన'
అస్య నశ్యన్తి ప్రవర్తన్తే రుగాదయః।
కారణేన వినా కార్యం
న కదాచన విద్యతే,
'అహంకారం వినా తద్వత్
దేహే దుఃఖం కథం భవేత్?

అపరిశీలన చేత- బలముగా పుష్టిగా ఇప్పుడు కనిపిస్తున్న అహంకారము- యోగ బలముచే ఎప్పుడు క్షీణిస్తుందో, ఆ వెనువెంటనే శారీరక మానసిక రుగ్మతలు కూడా నశించినవే అగుచున్నాయి.

ఒక కార్యమునకు కారణము నశిస్తే ఆ కార్యము కూడా తొలుగుచున్నది కదా! (అజ్ఞానకార్యమగు) అహంకారము - "ఆత్మానుభవము"చే తొలగితే, ఇక - ఈ దేహము, ఆ దేహముతో స్నేహము వలన కలుగుచున్న దుఃఖము - మిగిలి ఉంటాయా? ఉండవు. రహితమైపోగలవు. అటువంటి "నాకు దేహమనునది మొదలే లేదు" - అను రూపముగల దేహారాహిత్యము యోగాభ్యాసము చేతనే సుసాధ్యము. ఆత్మగురించి ఎరిగినంత మాత్రం చేత సరిపోదు.

| | |
|---|---|
| **శరీరేణ జితాః సర్వే।**<br>**శరీరం యోగిభిః జితమ్।**<br>**తత్ కథం కురుతే తేషాం**<br>**సుఖదుఃఖాదికం ఫలమ్?** | సర్వజనులు శరీముచేత జయించి వేయబడుచున్నారు. అయితే **ఒక్క యోగి మాత్రం శరీరమునే జయించివేసినవాడై ఉంటున్నాడు.** శరీరమునే జయించివేసి ఉండటంచేత, ఇక ఆపై యోగికి సుఖ-దుఃఖాది ఫలములేమి ఉంటాయి? జ్ఞానముతో బాటుగా యోగము అభ్యసిస్తూ ఉంటేనే కర్మల వలన ఏర్పడే సుఖ-దుఃఖ ద్వంద్వములు జయించబడగలవు. అధిగమించబడగలవు. |
| **ఇంద్రియాణి మనో బుద్ధిః, కామక్రోధాదికం జితమ్,**<br>**తేనైన విజితం సర్వమ్, న అసౌ కేనాపి బాధ్యతే।** | ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, కామ-క్రోధములను ఏయోగి అయితే జయించి, తన వశం చేసుకొని ఉంటాడో, అట్టివానిని ఇక ఇక్కడ బాధించగలిగినది ఏముంటుంది? అవి జయించబడాలంటే అభ్యాసము అవసరము. |
| **మహాభూతాని తత్త్వాని**<br>**సంపూతాని క్రమేణ చ,**<br>**సప్త ధాతుమయో దేహో**<br>**దగ్ధో యోగాగ్నినా శనైః**<br>**దేవైరపి న లక్ష్యేత, యోగదేహో మహాబలః॥** | యోగాభ్యాసి పట్ల పంచమహాభూతములు, వాటి వాటి తత్త్వవిశేషములతో సహా క్రమంగా జయించబడి, ఆతనిని సేవించునవిగా అవుతాయి. యోగాగ్నిచేత సప్తధాతు మయమగు ఈ దేహము నెమ్మదిగా దగ్ధమైనదిగా అగుచున్నది. ఆతడు దుర్గ్రాహ్యుడు! **“ఆతని యోగబలము ఇట్టిదికదా”** అని దేవతల చేత కూడా తెలుసుకోబడటము లేదు. అందుచేత భౌతిక దేహం కంటే యోగదేహమే మహా బలవంతము, మహత్తరము కూడా! |
| **8. భేద బన్ధ వినిర్ముక్తో, నానా శక్తి ధరః పరః**<br>**యథా ఆకాశః తథా, దేహ – ఆకాశాదపి నిర్మలః,**<br>**సూక్ష్మాత్ సూక్ష్మతరో దృశ్యః**<br>**స్థూలాత్ స్థూలో, జడాత్ జడః।** | పరాత్మ→ సర్వభేద-బంధములు లేనట్టిది. నానా శక్తియుతమైనది.<br>యోగీశ్వరుని ఆత్మ దేహము - ఆకాశము వలె ఆద్యంతములు లేనిది అగుచున్నది. ఆకాశము కంటే కూడా అత్యంత నిర్మలము.<br>దృశ్యము కంటే సూక్ష్మాతిసూక్ష్మము. స్థూలములన్నిటికంటే స్థూలమైనది. జడవస్తువులన్నిటి కంటే కూడా జడమైనది. అందుచేత యోగాభ్యాసిని ఈ దృశ్యము అడ్డుకోజాలదు. |
| **ఇచ్ఛారూపో హి యోగీన్ద్రః**<br>**స్వతంత్రస్తు అజరామరః** | యోగీంద్రుడు దేహానంతరము తాను ఇష్టము వచ్చిన రూపము పొందుటయందును, జరామరణముల పట్ల కూడా సర్వస్వతంత్రుడై ఉంటున్నాడు. యోగాభ్యాస బలము లేకుంటే ఈ జీవుడు కర్మలకు, సంస్కారములకు వశుడై అస్వతంత్రుడు అగుచున్నాడు. |
| **క్రీడతే త్రిషులోకేషు**<br>**లీలయా యత్ర కుత్ర చిత్**<br>**అచిన్త్య శక్తిమాన్ యోగీ**<br>**నానా రూపాణి ధారయేత్।**<br>**సంహరేచ్చ పునస్తాని**<br>**స్వేచ్ఛయా విజితేంద్రియః।** | **యోగాభ్యాసముచే సిద్ధిపొందినవాడు...**<br>→ త్రిలోకములూ క్రీడామైదానములుగా కలిగి ఉండగలడు.<br>→ లీలగా సర్వత్రా స్వతంత్రంగా సంచరించువాడవగలడు.<br>→ అచిన్త్యమగు శక్తిమంతుడై ఆ యోగి అన్ని రూపములు తానే అయి ధారణ చేస్తున్నాడు. ఏ రూపమైనా ధరించగలిగే యోగిని ‘రూపపరిమితము’ ఏముంటుంది? ఈ భౌతిక దేహాకార - దేహ స్వభావములకు ఆతడు పరిమితుడై ఉండడు.<br>→ ఇంద్రియములను జయించుటచే ‘స్వేచ్ఛ’ (Freedome) పొందిన వాడగుచున్నాడు.<br>ఇంద్రియములు తనకు వశమై ఉన్నవాడు - ఏ రూపమైనా పొందగలడు, ఇచ్ఛానుసారము ఉపసంహరించగలడు. ఉత్తరోత్తర జన్మలు ఆతనికి అధీనము. |
| **న అసౌ మరణమ్ ఆప్నోతి**<br>**పునః యోగబలేన తు**<br>**హారేన మృత ఏవ అసౌ,**<br>**మృతస్య మరణం కుతః?** | తనయొక్క యోగబలము చేత మృత్యువును హరించివేసిన వాడై ఉంటాడు. అందుచేత ఆతనికి మరణము ఉండదు. **“ఈ దేహముతో ఇప్పుడు ఉన్నట్లే దేహ పతనము తరువాత కూడా ఆత్మగా నేను యథాతథము”** అని సిద్ధి పొందిన వానికి, ఈ శరీరమును “ఇప్పటికిప్పుడే మృతించిన వస్తువు”గా దర్శించిన వానికి - **ఇక మరణమెక్కడిది?** |

**మరణం యత్ర సర్వేషాం**
**తత్ర అసౌ పరిజీవతి**
**యత్ర జీవతి మూఢస్తు**
**తత్ర అసౌ మృత ఏవ వై॥**

అందరికీ ఎక్కడ మరణము సంఘటితము అవుతోందో, అక్కడ యోగి జీవించియే ఉంటాడు. ఎక్కడ మూఢుడు జీవించియే ఉంటాడో, అక్కడ ఎల్లప్పుడు మృత్యువు ఉండియేఉంటున్నది అగుచున్నది.

**యోగి** → నిత్య జీవనుడు **అయోగి** → నిత్య మృతుడు

---

**కర్తవ్యం నైవ తస్య అస్తి।**
**కృతేన అసౌ న లిప్యతే।**
**జీవన్ముక్తః సదా స్వచ్ఛః,**
**సర్వదోష వివర్జితః॥**

ఆత్మాఽహమ్ భావన, సిద్ధించుకున్న యోగికి 'కర్తృత్వము' (నేను ఇది చేయాలి అనే తపన) ఉండదు. " అహంకర్తా" అనునది మొదలంట్లా లేకుండటం చేత, **'ఏదో పొందాలి'** అనేదీ ఉండదు. అందుచేత ఆతనికి కర్మల దోషము అంటదు. ఆతడు సర్వదోషములు తొలగినవాడై **'జీవన్ముక్తుడు'**గా ప్రకాశించుచున్నాడు.

---

**9. విరక్తా జ్ఞానినశ్చ అన్యే**
**దేహేన విజితాః సదా,**
**తే కథం యోగిభిః తుల్యా**
**మాంసపిండా కుదేహినః,**
**దేహాన్తే జ్ఞానిభిః పుణ్యాత్**
**పాపాచ్చ ఫలమ్ ఆప్యతే?**

యోగాభ్యాసముచే యోగసిద్ధిని పొందక, ఈ భౌతిక దేహమును 'జయించని' వారి గురించి ఇంకా కూడా ఈ తీరుగా ఉంటుంది.

కొందరు శాస్త్రజ్ఞానముచే విరక్తి పొంది ఉండి కూడా, వారు - యోగాభ్యాసము లేని కారణంగా - దేహములచే జయించబడుచున్నారు. మాంసపు ముద్దల రూపమగు కుత్సితదేహమునకు వశులై జీవిస్తున్నారు. ఈ దేహము నశించిపోయిన తరువాత కూడా జ్ఞాని (శాస్త్రజ్ఞాని) విషయములో **పాప-పుణ్య ఫలములు ఫలీకరిస్తూనే ఉంటాయి. యోగి విషయంలోనో? ఫలీకరించలేవు. యోగి సమస్త ఫలములను నిష్ఫలము చేసివేయగలుగుచున్నాడు.**

---

**ఈదృశస్తు భవేత్ తత్ తత్**
**భుక్త్వా జ్ఞానీ పునర్భవేత్।**
**పశ్చాత్ పుణ్యేన లభతే**
**సిద్ధేన సహ సంగతిమ్।**

ఆ పాప-పుణ్యఫలములగు దుఃఖములను, సుఖములను అనుభవించ టానికి జ్ఞాని మరల దేహధారి అవవలసి వస్తుంది. పునఃజన్మ పొందవలసి వస్తోంది. యోగియో? దేహ పరంపరలను జయించి 'సిద్ధుడు' అగుచున్నాడు. సాక్షిత్వము సిద్ధించుకుంటున్నాడు. (జాగ్రత్-స్వప్న-సుషుప్తులు నాచేతనే సిద్ధింపబడుచున్నాయి" అని అనుభూతుడగు చున్నాడు)

ఒకనికి పుణ్య కార్యముల ఫలితంగా యోగసిద్ధపురుషులతో సాంగత్యము (గురుసామీప్యము) లభించుచున్నది.

---

**తతః సిద్ధస్య కృపయా**
**యోగీ భవతి, న అన్యథా।**
**తతో నశ్యతి సంసారో**
**న అన్యథా, శివభాషితమ్।**

అనగా, ఆ **యోగ-సిద్ధపురుషుని కృపచేత (గురుకృపచే) యోగసేవకుడు 'యోగసిద్ధుడుగా అగుచున్నాడు.** అట్టి గురు ఆశ్రయము, యోగాభ్యాసముల సిద్ధిచే 'సంసారము' నశిస్తోంది. 'శివము' అని భాషితము (చెప్పబడు) స్థానమును ఆ యోగాభ్యాసి చేరుచున్నవాడగుచున్నాడు. ఇది శివప్రవచిత భాష్యము.

---

**<u>యోగేన రహితం జ్ఞానం</u>**
**<u>న మోక్షాయ భవేత్, విధే!</u>**
**<u>జ్ఞానేనైవ వినా యోగో</u>**
**<u>న సిధ్యతి కదాచన।</u>**

కాబట్టి ఓ సృష్టికర్తా! మహాప్రాజ్ఞా! బ్రహ్మదేవా! యోగాభ్యాసము, యోగసిద్ధి లేకుండా కేవలము జ్ఞానముచే మోక్షము లభించదు.

అట్లా అయి ఉండి కూడా, 'జ్ఞానము' లేకుండా కేవలము యోగము మాత్రమే వలన మోక్షము సిద్ధించదు. ముముక్షు ఈ రెండు విషయములను సుస్పష్టపరచుకొని ఉండాలయ్యా.

---

**జన్మాన్తరైశ్చ బహుభిః**
**యోగో జ్ఞానేన లభ్యతే।**
**జ్ఞానం తు జన్మని ఏకేన**
**యోగాత్ ఏవ ప్రజాయతే॥**

అనేక జన్మల జ్ఞానసముపార్జన యొక్క ఫలప్రదముగా యోగాభ్యాసము లభిస్తోంది. అయితే జ్ఞానమో? ఒక్క జన్మలో యోగము యొక్క అభ్యాసముచే లభించగలదు. యోగ-జ్ఞానముల సిద్ధిచే ఈ జీవుడు మోక్షాకాశములో విహరిస్తున్నాడు.

(అనగా 'సిద్ధి' లేక 'మోక్షము'-లభించాలంటే జ్ఞానమార్గములో అనేక జన్మలు ఆవస్యకమౌతున్నాయి. యోగాభ్యాసికి ఒక్క జన్మలో అది సిద్ధించగలదు)

**10. తస్మాత్ యోగాత్ పరోనాస్తి।**
**యోగమార్గస్తు మోక్షదః।**
ప్రవిచార్య చిరం జ్ఞానం
'ముక్తో౽ హమ్' ఇతి మన్యతే।
కిమ్ అసౌ-మననాత్ ఏవ
ముక్తో భవతి తత్ క్షణాత్॥

అందుచేత 'యోగము'ను మించినది ఏదీ లేదు. యోగమార్గమే త్వరితంగా మోక్షప్రదాత. చిరకాలము జ్ఞానవిశేషములను దీర్ఘ- తీవ్రవిచారణ చేయుచుండగా 'నేను ముక్తుడనే' అను భావన జనిస్తోంది.

"నేను ఎట్లాముక్తుడను?" అని 'మననము' చేయుచూ, తత్ యోగ-మార్గముగా తక్షణమే ముక్తుడు అగుచున్నాడు. ఈవిధంగా యోగ - జ్ఞానములు పరస్పరము అన్యోన్యత పొందినవై, ముక్తికి దారి తీయగలవు.

---

పశ్చాత్ జన్మాంతర శతైః, యోగాత్ ఏవ విముచ్యతే
న తథా భవతో యోగాత్, జన్మమృత్యూః పునః పునః।

జ్ఞానము సంపాదించుకున్న తర్వాత.. వందజన్మల తరువాత అయినా కూడా చివ్వరికి 'యోగము' చేతనే ముక్తుడు అగుచున్నాడు. యోగసిద్ధి లభించగా, ఇక ఆపై పునఃపునః జన్మ-మృత్యువులు అనేవి ఉండవు.

---

ప్రాణ-అపాన సమా యోగః
చంద్ర-సూర్య ఏకతా భవేత్।
సప్తధాతుమయన్ దేహమ్
అగ్నినా రంజయేత్ ధృవమ్।
వ్యాధయః తస్య నశ్యంతిః
ఛేద ఖాతాధికాః తథా।
తత్ అసౌ పరమాకాశరూపో దేహీ అవతిష్ఠతి॥

"ప్రాణ-అపానముల సమానము" అను యోగమార్గములో చంద్ర-సూర్యుల (శీత-ఉష్ణముల) ఏకత్వము (ఐక్యము) రూపుదిద్దుకొనుచున్నది.

అందుకుగాను సప్తధాతుమయమగు ఈ దేహమును యోగాగ్నిచే ధృవముగా రంజింపజేయాలి. యోగాగ్నిచే కాల్చి పరిశుభ్రము చేయాలి.

అట్టి ప్రాణ-అపానముల సమానయోగము వలన జనించిన అగ్నిచే దేహములోని 'ఛేత(Inner cuts)- పిత్త -ఖాత (వాత)' మొదలైన అధిక-అల్ప దోషములు తెచ్చుచున్న వ్యాధులు నశించుచున్నాయి. ఈ జీవుడు భౌతికత్వమును అధిగమించి 'పరమాకాశరూపుడు'గా అవతిష్ఠితుడు అగుచున్నాడు.

---

కిం పునః బహునా ఉక్తేన?
మరణం నాస్తి తస్య వై।
దేహివత్ దృశ్యతే లోకే
దగ్ధ కర్పూరవత్ స్వయమ్।
చిత్తం ప్రాణేన సంబద్ధం
సర్వ జీవేషు సంస్థితమ్॥

ఇన్ని మాటలెందుకు? ఆతని పట్ల 'మరణము' అనునది 'లేనిదే' అగుచున్నది. దేహ-దేహాంతరములుగా స్వస్వరూపము వదలక **"మరణముతో నేను ముగియను. జన్మతో ఆరంభంకాను"** - అను దేహసంబంధమైన సునిశ్చిత స్వానుభవమును పుణికిపుచ్చుకొనుచున్నాడు. ఆతడు వర్తమానదేహమును కూడా దగ్ధమైన కర్పూరము వలె నశించిపోయిన వస్తువుగా దర్శించుచున్నాడు.

సర్వ జీవులలోను (1) చిత్తము (2) ప్రాణము పరస్పరంగా సంబద్ధము కలిగినవై ఉంటున్నాయి. (Mutually tangled)

---

రజ్జ్వా యత్వత్తు సంబద్ధః
పక్షీ తత్వత్ ఇదం మనః।
నానా విధైః విచారైస్తు
న బాధ్యం జాయతే మనః॥

ప్రాణాయామాభ్యాసముచే ఈ చిత్తము -త్రాడుచే కాలుకట్టబడిన పక్షి వలె - ఆ అభ్యాసికి వశమై ఉంటుంది. ఇకప్పుడు ఆ చిత్తము (లేక) మనస్సు అనేక దృశ్యసంబంధమైన విచారములు (Worries) పొంది కూడా బాధింపబడజాలదు. (దర్పణము తనలోని ప్రతిబింబిత దృశ్యములకు సాక్షిగా, వేరుగా ఉండు తీరుగా, వాటిచే బాధించబడనట్లుగా) మనస్సు నానా విచారణ విషయములతో సంబంధము కలిగి ఉండి కూడా, దేనిచేతనూ బాధింపబడజాలనిదై ఉండగలదు.

---

**11.** తస్మాత్ తస్య జయ-ఉపాయః (జయోపాయః)
ప్రాణ ఏవహి, న అన్యథా।
తర్కైః జల్పైః, శాస్త్ర జాలైః
యుక్తిభిః మంత్ర భేషజైః
న వశోజాయతే ప్రాణః
'సిద్ధ' ఉపాయమ్ వినా, విధే!
ఉపాయం తమ్ అవిజ్ఞాయ యోగమార్గే ప్రవర్తతే
ఖండ జ్ఞానేన సహసా జాయతే క్లేశవత్ తరః॥

అందుచే, చిత్తమును (లేక ఈ మనస్సును) జయించుటకు ఉపాయము ఏది? ప్రాణయోగమే। మరొక ఉపాయమేదీ లేదు.

ప్రాణము వశమైతే, మనస్సు సులభంగా వశమౌతుంది. అట్టి 'ప్రాణము' వశమయ్యేది ఎట్లా? యోగసిద్ధి చేతనే!

ప్రాణాయామము గురించిన చర్చ - వర్ణనములచేత, తర్క-వితర్కముల చేత, శాస్త్రజాలములచేత, యుక్తులు - ఉపాయములచేత, మంత్రతంత్రముల చేత ప్రాణసిద్ధియోగాభ్యాసము లేకుండా (లేక ప్రాణనిశ్చలములేకుండా) ప్రాణము వశము కాదు. మరొక విషయం కూడా. ఉపాయములు తెలుసుకోకుండా, అఖండాత్మజ్ఞానాశయము అర్థం చేసుకోకుండా కేవలము యోగమార్గములో ప్రవర్తించటం చేత క్లేశములు ఇంకా అధికమౌతాయి. ఖండజ్ఞానము కొనసాగిస్తూ అఖండజ్ఞానమును అర్థం చేసుకోకపోతే ఆ యోగ-అభ్యాసము వృథాయే!

| | |
|---|---|
| **యో అజిత్వా పవనం మోహాత్**<br>**యోగమ్ ఇచ్ఛతి యోగినామ్**<br>**సో- "అపక్వం కుమ్భమ్"-**<br>**ఆరుహ్యా సాగరం తర్తుమ్ - ఇచ్ఛతి।** | ఎవ్వడైనా (ప్రాణ యోగాభ్యాసముచే) వాయురూపమగు మనస్సును జయించకుండా, **"యోగుల యోగస్థానము నాకు సిద్ధించాలి"** - అని కోరుకోవటము → **"పచ్చికుండ (కాల్చనికుండ)ను చేతపట్టుకుని సముద్రంలోకి ఉరికి 'నేను ఆవల ఒడ్డుచేరుతాను"** - అని ఇచ్ఛగించటము (కోరుకోవటము)' వంటిది. |
| **యస్య ప్రాణో విలీనో**<br>**అన్తః సాధకే జీవితే సతి,**<br>**పిణ్డో న పతితః తస్య**<br>**చిత్తం దోషైః ప్రబాధ్యతే,**<br>**శుద్ధే చేతసి తస్యైవ**<br>**'స్వాత్మజ్ఞానం' ప్రకాశతే।** | ఏ యోగి యొక్క ప్రాణము ఆతడు జీవించి ఉండగానే విశ్వ ప్రాణమునందు ''సంవిలీనము'' పొందుచున్నదో, అట్టివాడు పిండపతనము (సంసారము నందు దేహములుగా పడిపోవటము) జరుగదు. ఆతని చిత్తము దోషములచే బాధించబడదు. యోగాభ్యాస బలముచే సమస్తమునకు సాక్షి అయి ఆనందముగా చూస్తూ ఉండగలడు.<br>ఆతని చిత్తము యోగాభ్యాస ప్రయోజనంగా పరిశుద్ధమౌతూ ఉండగా, స్వాత్మజ్ఞానము స్వయముగా ప్రకాశించగలదు. |
| **తస్మాత్ జ్ఞానం భవేత్ యోగాత్ జన్మని ఏకేన, పద్మజ!**<br>**తస్మాత్ యోగం తమేవ ఆదౌ సాధకో నిత్యం అభ్యసేత్।** | ఓ పద్మజా! బ్రహ్మదేవా! 'యోగాభ్యాసము' చేత ఒక్క జన్మలోనే జ్ఞానము సిద్ధించవచ్చును. అందుచేత ముముక్షువైనవాడు మొట్టమొదటగా సాధకుడై జ్ఞానముతో కూడిన యోగమును నిత్యము అభ్యసించును గాక. |
| **ముముక్షుభిః ప్రాణజయః, కర్తవ్యో మోక్షహేతవే।**<br>**యోగాత్ పరతరం పుణ్యం। యోగాత్ తత్ పరతరం శివం।**<br>**యోగాత్ పరతరం సూక్ష్మం। యోగాత్ పరతరం నహి।** | ప్రాణజయమే ముముక్షువులకు మోక్షము కొరకై కర్తవ్యము. ప్రాణయోగాభ్యాసము మహత్తరమగు మోక్షోపాయము.<br>యోగమును మించిన పుణ్యము, శివము, సూక్ష్మ మార్గము మరింక ఏదీ లేదు. యోగముచే సిద్ధించనిదంటూ ఏదీ ఉండదు. |
| **12. యో అపాన-ప్రాణయోః ఐక్యం**<br>**స్వ రజో-రేతసోః తథా**<br>**సూర్యా-చంద్రమసోః యోగో**<br>**<u>జీవాత్మ-పరమాత్మనోః,</u>**<br>**<u>ఏవన్తు ద్వంద్వ జాలస్య</u>**<br>**<u>సంయోగో-'యోగ' ఉచ్యతే॥</u>** | యోగము = ఏ ప్రయత్నము చేత<br>❖ అపాన - ప్రాణములు,<br>❖ స్వకీయ రజో - తేజస్సులు (రేతస్సులు)<br>❖ సూర్య - చంద్రమసములు,<br>❖ జీవాత్మ - పరమాత్మలు<br>... ఇటువంటి ద్వంద్వజాలము సంయోగము పొందగలవో, ఏకత్వము సంతరించుకోగలవో, అట్టి అభ్యాసమే 'యోగము' |
| **అథ 'యోగశిఖాం' వక్ష్యే**<br>**సర్వజ్ఞానేషు చ ఉత్తమామ్।**<br>**యదా అనుధ్యాయతే మన్త్రమ్**<br>**గాత్ర కమ్పో అథ జాయతే।** | ఓ మహాప్రాజ్ఞుడవగు చతుర్ముఖ బ్రహ్మదేవా! ఇప్పుడిక సర్వజ్ఞానములలో ఉత్తమమైనదగు **'యోగశిఖ'** గురించి వివరించుకుంటున్నాము.<br>మొట్టమొదట మంత్రముతో ధ్యానము చేయుచుండగా గాత్ర (శరీర) కంపనము కలుగుచూ ఉంటుంది. (అందుచేత స్థిరము అయిన సుఖాసనము ఆవశ్యకము). |
| **ఆసనం పద్మకం బధ్వా**<br>**యచ్చ అన్యదపి రోచతే।**<br>**నాసాగ్రే దృష్టిమ్ ఆరోప్య**<br>**హస్త పాదౌచ సంయతౌ।**<br>**మనః సర్వత్ర సంగృహ్య**<br>**'ఓం' కారం తత్ర చిన్తయేత్।** | ❖ పద్మాసనము గాని, (లేక) యోగికి సానుకూల్యమైన మరేదైనా ఆసనముగాని ధరించి,<br>❖ దృష్టిని నాసాగ్రము (ముక్కుకు పైభాగమున) ఆరోపించి (నిలిపి)<br>❖ పాదములను చేతులతో పట్టుకొని ఉండి,<br>❖ మనస్సును విషయముల నుండి ఉపసంహరించి,<br>❖ (జాగ్రత్-స్వప్న-సుషుప్తుల కేవల సాక్షీ స్వరూప పరమాత్మ సంజ్ఞయగు) 'ఓం'కారమును చిన్తన చేయునుగాక! |
| **ధ్యాయతే సతతం ప్రాజ్ఞో**<br>**హృత్ కృత్వా పరమేశ్వరమ్॥** | ప్రాజ్ఞుడు తన హృదయకమలము నందు వేంచేసియున్న పరమేశ్వరుని ధ్యానము చేస్తూ ధ్యాసను నిలుపుచుండాలి. |

| | |
|---|---|
| **13.** ఏకస్తమ్భే నవద్వారే త్రిస్థూణే పంచదైవతే<br>ఈదృశే తు శరీరే వా మతిమాన్ న ఉపలక్షయేత్।<br>ఆదిత్య మండలాకారం, రశ్మిజ్వాలా సమాకులమ్<br>తస్య మధ్యగతం వహ్నిం, జ్వాలయేత్ దీపవర్తి వత్। | (1) ఒక స్తంభము (2) '9' ద్వారములు(3) '3' స్థూణములు (స్థూల - సూక్ష్మకారణములు) (4) '5' గురుదేవతలు (పంచేంద్రియములు)- ఇవి తన యందు కలిగి ఉంటున్న ఈ శరీరము నందు బుద్ధిమంతుడైనవాడు లక్ష్యమును ఉంచడు. ఒక చీకటి గదిలో దీపపు ఒత్తిని వెలిగించు విధంగా- ఆదిత్య మండలాకారమైనట్టిది, కిరణ జ్వాలలతో కూడినట్టిది - అగు జ్ఞాన-తేజస్సును శరీరమునందే ప్రజ్వలింపజేయాలి. దేహము మధ్యగా వెలిగించి, ఈ దేహ పరిమితభావ అజ్ఞాన చీకట్లను పారద్రోలాలి. |
| దీపశిఖా తు యా మాత్రా, సా మాత్రా పరమేశ్వరే!<br>భిన్దన్తి యోగినః సూర్యం, యోగాభ్యాసేన వై పునః॥ | గదిలో దీపపుశిఖ ఎటువంటిదో, ఈ దేహమునందు పరమేశ్వరుడు అటువంటివారు.<br>యోగాభ్యాసముచే యోగులు దేహములోని సూర్యుని (సూర్యనాడిని) ఛేదించుచున్నారు. (యోగాభ్యాసముచే 'పింగళ'ను అధిగమిస్తున్నారు) |
| **14.** ద్వితీయగ్ం సుషుమ్నా ద్వారం<br>పరిశుభ్రగ్ం సమర్పితమ్।<br>కపాల సంపుటం పీత్వా<br>తతః పశ్యతి 'తత్' పదమ్॥ | రెండవది : సుషుమ్ననాడీ ద్వారమును పరిశుభ్రపరచి కుండలినీ శక్తిని సుషుమ్నకు అంతరమును - ఊర్ధ్వంగా గమనమును చేయిస్తున్నారు. కపాల సంపుటమునకు జేర్చుచున్నారు. కపాలమును (బ్రహ్మరంధ్రమును) చేరిన సుషుమ్న కపాల సంపుటమును మ్రింగివేసి (దాటివేసి) (సహస్రారములో) తత్‌పదమును దర్శించుచున్నది. (కుండలిని = ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తి ; తత్ పదం = సహస్రారం) |
| అథ తత్ ధ్యాయతే జన్తుః<br>ఆలస్యాచ్చ ప్రమాదతః,<br>యది త్రికాలమ్ ఆగచ్ఛేత్<br>స గచ్ఛేత్ పుణ్య సంపదమ్॥ | కపాల సంపుటిలో ప్రవేశించిన యోగి అలసత్వము, ప్రమాదము (బద్ధకము) పొందుచున్నాడు. పై త్రికాలములలోను కపాల సంపుటమును ప్రవేశము చేయు యోగాభ్యాసముచే వాటిని జయిస్తూ పుణ్య సంపదాఫలము సంపార్జించుకోవాలి. |
| పుణ్యమ్ ఏతత్ సమాసాద్య<br>సంక్షిప్య కథితం మయా<br>లబ్ధయోగో అథ బుధ్యేత<br>ప్రసన్నం పరమేశ్వరమ్। | పరమశివుడినగు నేను సహస్రారస్థానమున సర్వదా వేంచేసిఉన్నాను. త్రికాల యోగాభ్యాసముచే పుణ్యఫలంగా కపాల సంపుటమునకు కుండలినిని జేర్చిన యోగి, నాచే సంక్షిప్తంగా బోధించబడి, సత్యమును ఎరిగి ప్రసన్నుడై పరమేశ్వర సంబంధమైన స్వీయతత్త్వమును ఎరుగుచున్నాడు. |
| జన్మాంతర సహస్రేషు యదా క్షీణస్తు కిల్బిషమ్,<br>తదా పశ్యతి యోగేన సంసారోచ్ఛేదనమ్ మహత్। | (బ్రహ్మరంధ్రమునకు కుండలినీ శక్తిని సుషుమ్నా నాడి ద్వారా చేర్చటము అనే) యోగముచే వేలాదిజన్మల కర్మదోషములు నశించిపోగా, మహత్ రూపమగు సంసారము యొక్క విచ్ఛేదనము (cut off)ను - పశ్యేత్ - చూచుచున్నాడు. |
| అధునా సమ్ప్రవక్ష్యామి, <u>యోగాభ్యాసస్య లక్షణమ్।</u><br>మరుత్ జయో యస్య సిద్ధః, సేవయేత్ తత్ గురుం సదా।<br>గురువక్త్ర ప్రసాదేన కుర్యాత్ ప్రాణజయం బుధః। | **యోగాభ్యాస లక్షణములు** - ఓ పద్మసంభవా! ఇప్పుడు మనము జీవులకు సర్వశుభములు కలుగజేయు "యోగాభ్యాసలక్షణములు" గురించి, చెప్పుకుంటున్నాము.<br>'వాయుజయము' సముపార్జించుటకు సంసిద్ధుడగుచున్న ముముక్షువు (లేక) యోగాభ్యాసి **ముందుగా గురువును సేవించునుగాక!**<br>గురుముఖతః యోగ విధానమును నేర్చి, వారి ప్రసాదముచే బుధులు **'ప్రాణజయము'**ను యోగాభ్యాసముగా నిర్వర్తించుచున్నారు. |
| వితస్తి ప్రమితం దైర్ఘ్యం<br>చతరంగుల విస్తృతమ్,<br>మృదులం ధవళం ప్రోక్తం<br>వేష్టన అమ్బర లక్షణమ్।<br>నిరుధ్య మారుతం గాఢం శక్తిచాలన యుక్తితః<br>అష్టధా కుండలీభూతా(త్వా)మ్<br>ఋజ్వీం కుర్యాత్తు కుండలీమ్। | 8 మెలికలతో చుట్టచుట్టుకొనియున్న కుండలినీ శక్తిని నిదురలేపి ఋజు మార్గంగా కదల్చాలి. అందుకుగాను 4"ల వెడల్పు, (12" పొడవు) గల తెల్లటి వేష్టనము(వస్త్రము)ను పరచి మూలాధారములోని కుండలినీ శక్తియొక్క యోగాభ్యాసం కొరకు సంసిద్ధము చేయాలి.<br>**"శక్తిచాలనము"** - అనే యుక్తిచే వాయువును దృఢముగా నిరోధించాలి. (ప్రాణ-అపానముల ఏకత్వ రూపమగు 'కుంభకము'ను అభ్యసించాలి). అష్టవిధ ప్రకృతి రూపమగు కుండలినీ శక్తిని - **ఋజ్వీం కుర్యాత్తు** - ఋజుమార్గంగా (Streight forward) చేయాలి. |

**15. పాయోః ఆకున్చనమ్ కుర్యాత్**
**కుండలీం చాలయేత్ తదా।**
**మృత్యువక్త్ర గతస్య అపి**
**తస్య మృత్యుభయం కుతః?**

**"పాయువును (మూలాధార స్థానమును)ఆకుంచనము (బిగింపు) చేస్తూ కుండలినీ శక్తిని చలింపజేయుటము"**- అనే యోగవిధానమును అభ్యసించాలి. ఏ యోగి కుండలినీ శక్తి చాలనమును సిద్ధింపజేసు కుంటాడో,.. అట్టివాడు మృత్యువు యొక్క ముఖము ఎదురైనప్పుడు కూడా మృత్యుభయము పొందడు. స్వస్వరూపమునందు అచ్యుతుడై ఉంటాడు.

---

**ఏతత్ ఏవ పరం గుహ్యం, కథితస్తు మయా తవ।**
**వజ్రాసనగతో నిత్యమ్, 'ఊర్ధ్వాకున్చనమ్' అభ్యసేత్।**
**వాయునా జ్వలితో వహ్నిః, కుండలీమ్ అనిశం దహేత్**
**సంతప్తాసా అగ్నినా, జీవశక్తిః - త్రైలోక్యమోహినీ,**
**ప్రవిశేత్ చంద్రఖండే తు సుషుమ్నా వదనాన్తరే।**

అట్టి 'కుండలినీ చాలనవిద్య' అను యోగ రహస్యము నాచే మీతో చెప్పబడుతూ వస్తోంది.

[పాదములను చేతులతో గట్టిగా పట్టుకొని, చీలమండలముచే ఆసనమును (కందమును, మూలాధార క్రింద ప్రాంతమును)నొక్కి ఉంచి, ఎడమవైపుగా ఉదరమును నిలిపి ఉంచి, హృదయమును గళము వైపుగా లాగి ఉంచటము అనబడు] "వజ్రాసనము" ధరించి, క్రిందకు ప్రయాణించు అపాన వాయువును పైకి లాగుట" అను "ఊర్ధ్వ అకున్చనము"ను నిత్యము అభ్యసించాలి.

ప్రాణ-అపాన సంయోగముచే (ప్రాణాయామముచే) జనించు అగ్నితో కుండలినీ శక్తిని ఎప్పుడూ దహిస్తూ ఉండాలి.

త్రిలోకములను మోహింపజేయు 'జీవశక్తి' అగు కుండలినీ శక్తి సుషుమ్న నాడి యొక్క ముఖద్వారము ద్వారా **'చంద్రఖండము'** నందు (సుషుమ్నలోని చల్లటి ప్రదేశములో) ప్రవేశము పొందుచున్నది.

---

**వాయునా వహ్నినా సార్థం**
**బ్రహ్మగ్రన్థిం భినత్తి సా।**
**విష్ణుగ్రన్థిం తతో భిత్వా**
**రుద్రగ్రన్థౌ చ తిష్ఠతి।**

వాయు-అగ్నిలతో కూడిన స్పర్శచే కుండలినీ శక్తి బ్రహ్మగ్రంథి (The tinge and emotional sense pertaining to creation)ను భినత్తి→ ముందుగా ఛేధించుచున్నది. తరువాత విష్ణుగ్రంథిని (The tinge and Emotional sense of maintaining creation) కూడా ఛేదించి 'రుద్రగ్రంథి'లో తిష్ఠించుచున్నది (Taking seat)

---

**తతస్తు కుమ్భకైః గాఢం, పూరయిత్వా పునః పునః**
**అథా అభ్యసేత్ సూర్యభేదమ్, ఉజ్జాయీం చ అపి శీతలీమ్।**
**భస్త్రాంచ సహితో నామస్యాత్ చతుష్టయ కుంభకః।**
**బన్ధ త్రయేణ సంయుక్తః**
**"కేవల ప్రాప్తి" కారకః॥**
**అథ అస్య లక్షణం సమ్యక్**
**కథయామి సమాసతః।**

ఈ విధంగా కుండలినీ శక్తి → రుద్రగ్రంథిలో ప్రవేశించి, స్థితి కలిగియుండగా 'కుంభక ప్రాణాయామము'చే రుద్రగ్రంథిని మరల మరల పూరించుచూ, క్రమంగా సూర్యభేదనముచే (By consciously reducing Heat) "ఉజ్జాయీ శీతలి"ని అభ్యసించాలి.

ఇక్కడికి '4' కుంభకములు అగుచున్నాయి. (1) ప్రణా-అపానముల కలయిక కుంభకమగు **భస్త్రి (2) బ్రహ్మగ్రంథి కుంభకము (3) విష్ణుగ్రంథి కుంభకము (4) రుద్రగ్రంథి కుంభకము.**

కుంభకము → (మూలబంధ, ఉడ్డీయాణ, జాలంధర) త్రిబంధకములతో కూడి "కేవలప్రాప్తి" అను దానికి కారకమగుచున్నది. అట్టి 'కేవల ప్రాప్తి' యొక్క యోగ (సమ్యక్) లక్షణముల గురించి సంక్షిప్తంగా చెప్పుచున్నాను వినండి.

---

**16. ఏకాకినా సముపగమ్య వివిక్త దేశం,**
**ప్రాణాదిరూపమ్ అమృతం పరమార్థ తత్త్వమ్**
**లఘ్వాశినా ధృతిమతా పరిభావితవ్యం**
**సంసారరోగ హరమ్ ఔషధమ్, అద్వితీయమ్॥**

**పూరక - కుంభక- రేచక → అభ్యాసము**

- ఏకాకిగా (Lonely) ఏకాంత ప్రదేశము (Isolated place) చేరి,
- ఇంద్రియ విషయములను తగ్గించుకొని, 'లఘ్వాశి' అయి, ధైర్య - ఉత్సాహములను కలిగియున్నవాడై,
- 'పరమార్థతత్త్వము' - ఆశయముగా కలిగియున్నవాడై
- సంసార రోగమునకు మహత్తరమగు ఔషధము. అమృత ప్రాణరూపము అగు, 'ప్రాణాయామ యోగాభ్యాసము'ను ఆత్మయొక్క మాధుర్యమును ఆస్వాదిస్తూ అభ్యాసము ఈ క్రింది విధంగా నిర్వర్తించాలి.

**(1) సూర్యనాడీ భేదక ప్రాణాయామము**

**సూర్యనాడ్యా సమాకృష్య**
**వాయుమ్ అభ్యాస యోగినా,**
**విధివత్ కుమ్భకం కృత్వా**
**రేచయేత్ శీతరశ్మినా।**
**ఉదరే బహురోగఘ్నం**
**క్రిమిదోషం నిహంతి చ।**
**ముహుర్ముహుః ఇదం కార్యం**
**'సూర్యభేదమ్' ఉదాహృతమ్॥**

**I. సూర్యనాడీ భేదక ప్రాణాయామము**

'వెన్నెముక'కు మధ్యగా సుషుమ్ననాడి. కుడివైపు - పింగళ (సూర్యనాడి). ఎడమవైపు - ఇడ (చంద్రనాడి).

(1) అభ్యాసయోగి → సూర్యనాడి ద్వారా వాయువును (కుడి ముక్కు రంధ్రము ద్వారా) పీల్చి - పూరకం చేయాలి.

(2) యథావిధిగా (ముఖమునందు, గుండెనిండా) కుంభకము చేసి ('3' గ్రంథులలో) వాయువును నిలిపి ఉంచాలి.

(3) ఆ తరువాత చంద్రనాడీ ద్వారా (ఇడ ద్వారా) - ఎడమ ముక్కు పుటము ద్వారా - గాలిని వదలాలి. (రేచకము చేయాలి).

ఈ విధమైన ప్రాణాయామముచే ఉదరములోని ఆయా అనేక రోగములను, క్రిమిదోషములను పోగొట్టగలదు.

ఈ విధమైన ప్రాణాయామమును మరల మరల నిర్వర్తించటమును "సూర్య భేదము" - అని అంటారు.

---

**(2) ఉజ్జాయి కుంభక ప్రాణాయామము :**

**నాడీభ్యాం వాయుమ్ ఆకృష్య**
**కుండల్యాః పార్శ్వయోః క్షిపేత్।**
**ధారయేత్ ఉదరే పశ్చాత్**
**రేచయేత్ ఇడయా సుధీః॥**

**II. ఉజ్జాయి కుంభక ప్రాణాయామము :**

ఇప్పుడిక : ఇడ-పింగళ.. ఉభయనాడులలో వాయువును నింపి కుండలినీశక్తికి ఉభయ పార్శ్వములుగా ప్రతిక్షేపించి కుంభకం చేసి ఉంచాలి. ఆ తరువాత ఆ వాయువును ఉదరములో (పొట్టలో) కూడా ధారణ చేసి, అప్పుడిక 'ఇడనాడి' ద్వారా వదలాలి. (రేచకము చేయాలి).

**కంఠే కఫాది దోషఘ్నం**
**శరీరాగ్ని వివర్ధనమ్।**
**నాడీ జలావహం**
**ధాతుగత దోష వినాశనమ్।**
**గచ్ఛతః తిష్ఠతః కార్యమ్**
**ఉజ్జాయ్యాఖ్యస్తు కుమ్భకమ్॥**

ఈ విధమైన ప్రాణాయామయోగాభ్యాసముచే కంఠములోని కఫదోషము తొలగుచున్నది. శరీరములో అంతటా అగ్ని, తేజస్సు వృద్ధి చెందుతాయి. నాడులలో జలము పేరుకోవటము తొలగుతుంది. ధాతువులలో దోషము నశిస్తుంది.

ఇటువంటి 'ఉజ్జాయీ కుంభకప్రాణాయమము' - ఒకచోట కూర్చునే (ఆసనము స్వీకరించియే) చేయనక్కర్లేదు. నడుస్తున్నప్పుడు మామూలుగా కూర్చుని ఉన్నప్పుడు కూడా నిర్వర్తించవచ్చును.

---

**(3)శీతలీకరణ ప్రాణాయామము :**

**17. ముఖేన వాయుం సంగృహ్య**
**ఘ్రాణరంధ్రేణ రేచయేత్।**
**శీతలీకరణం చ ఇదమ్ → హన్తి**
**పిత్తం, క్షుధాం తృషమ్॥**

**III. శీతలీకరణ ప్రాణాయామము :**

***నోటితో గాలిని పీల్చటము.***

ముక్కు రంధ్రముతో (ఒకసారి కుడి మరొకసారి ఎడమ ముక్కు రంధ్రముతో, ఆ తరువాత రెండు ముక్కుపుటములతో) విడవటము - **ఇది శీతలీకరణ ప్రాణాయామము.** దీనివలన ఆకలి, దాహము స్వాధీనమవుతాయి. వాత పిత్తదోషములు (వాయు అధిక - అల్ప దోషములు, శరీరములో చెడు పదార్థములు నిలువ ఉండటము) - తొలగుతాయి.

---

**(4) భస్త్రీ కుంభక ప్రాణాయామము**

**స్తనయో రథ భస్త్రేవ**
**లోహకారస్య వేగతః**
**రేచయేత్ పూరయేత్**
**వాయుమ్→ఆశ్రమం దేహగన్ధియా**
**యథా శ్రమో భవేత్ దేహే,**
**తథా సూర్యేణ పూరయేత్॥**

**IV. భస్త్రీ కుంభక ప్రాణాయామము :**

ఒక లోహకారుడు వేగముగా గాలి పీల్చి, వెంటనే తోలు తిత్తి నుండి అగ్ని రగిల్చుచోటికి వాయువును వదులుతాడు కదా! ఆ విధంగా వేగంగా (రెండు ముక్కుపుటముల ద్వారా)గాలిని బయటకు రేచకము చేసి, ఆ తరువాత పూరకము చేసి అప్పుడు రెండు స్తనముల సమీపంగా గాలిని నిలపాలి.

(2) శ్రమ అనిపించేంత వరకు సూర్యనాడి (కుడివైపు పింగళలో) పూరించి ఉంచాలి.

**కణ్ఠ సంకోచనం కృత్వా**
**పునః చన్ద్రేణ రేచయేత్।**
**వాత పిత్త శ్లేష్మ హరం।**
**శరీరాగ్ని వివర్ధనమ్।**
**కుండలీ బోధకం**
**వక్త్ర దోషఘ్నం శుభదం, సుఖమ్॥**

(3) కంఠమును సంకోచింపజేసి చంద్రనాడి (ఇడ, ఎడమవైపు ముక్కుపుటము) ద్వారా రేచకము చేయాలి. (గాలిని వదలాలి). ఈ విధంగా మరల మరల (10 ని॥ నుండి 15 ని॥ వరకు) చేస్తూ ఉండాలి. ఈ విధమైన భస్త్రీ ప్రాణాయామము వలన కూడా →

→ వాత (దోష వాయు), పిత్త (దోష పదార్థముల) శరీరాంతర్గత దోషములు తొలగుతాయి.

→ శరీరాగ్ని వివర్ధనము పొందుతుంది. (The fire in the Body improves). కుండలినీ శక్తి ప్రబోధము పొందుచున్నది.

ముఖములోని (వక్త్ర) దోషములు తొలగి, ముఖము తేజోవంతమగుచున్నది.

బుద్ధి శుభప్రదము, మనస్సు సుఖప్రదము అగుచున్నాయి.

---

**బ్రహ్మనాడీ ముఖాన్తస్థ**
**కఫ – ఆది యత్ గళ నాశనమ్।**
**సమ్యక్ బంధ సముద్భూతం**
**గ్రంథిత్రయ విభేదకమ్।**
**విశేషేనైవ కర్తవ్యం**
**భస్త్రాఖ్యం కుమ్భకం తు ఇదమ్ (కుంభకంత్విదమ్) ॥**

'బ్రహ్మనాడీ' ప్రవేశమార్గములో పేరుకొని ఉంటున్న కఫము తొలగిపోతుంది. తదితర అడ్డంకులు గళము నుండి బ్రహ్మనాడి వరకు తొలగుతాయి.

బాగుగా భస్త్రీ కుంభకము నిర్వర్తిస్తూ ఉండటము వలన.. బ్రహ్మ-విష్ణు - రుద్ర త్రిగ్రంథులు త్వరగా విభేదము చెందుతాయి. కుండలినీ శక్తి కపాలము వైపుగా విస్తరించుటకు ప్రతిబంధకములు త్వరత్వరగా తొలగిపోతాయి. అందుచేత ఈ భస్త్రీకుంభక ప్రాణాయామము విశేషంగాను, అధికంగాను చేయుటము యోగాభ్యాసికి కర్తవ్యముగా చెప్పబడుతోంది.

---

## బంధత్రయము

**బంధత్రయమ్ అతః ఇదానీం ప్రవక్ష్యామి**
**యథా క్రమమ్॥**

ఓ మహామతీ! బ్రహ్మ భగవాన్! ఇప్పుడు మనము బంధత్రయము గురించి యథాక్రమంగా చెప్పుకుందాము.

---

**18.** **నిత్యం కృతేన తేన అసౌ**
**వాయోః జయమ్ అవాప్నుయాత్।**
**చతుర్ణామ్ అపి భేదానాం కుమ్భకే సముపస్థితే,**
**'బన్ధత్రయమ్' ఇదం కార్యం వక్ష్యమాణం మయా హి తత్।**
**ప్రథమో .. <u>మూల బన్ధస్తు।</u>**
**ద్వితీయా .. <u>ఉడ్డీయణాభిధః</u>**
**<u>జాలంధరః</u> .. తృతీయస్తు।**
**లక్షణం కథయామి అహమ్।**

((1) రేచకము (2) పూరకము (3) కుంభకము (4) పునఃరేచకము అనబడు) నాలుగు విధములగు (ప్రాణాయామ- అభ్యాస విభాగములతో కూడిన యోగాభ్యాసముచే వాయు జయము సిద్ధించగలదు. ఈ విధమైన చతుర్విధములైన విభాగములతో కూడిన ప్రాణయోగము కొంత అలవాటు అయిన తరువాత, ఇక ఆపై నేను చెప్పబోవుచున్న 'బంధత్రయము'ను చక్కగా అర్థం చేసుకొని నిర్వర్తించాలి.

**(1) మూలబంధము (2) ఉడ్డీయాణ బంధము (3) జాలంధర బంధము**

ఈ మూడిటిని **"బంధత్రయము"** అని పిలుస్తున్నారు.

ఈ మూడింటి లక్షణములను వివరించుచున్నాను. వినండి.

---

**<u>(1) మూలబంధము</u>**

**గుదం పార్ష్ణ్యాతు సంపీడ్య వాయుమ్ ఆకున్చయేత్ బలాత్।**
**వారం వారం యథా చ ఊర్ధ్వం సమాయాతి సమీరణః।**
**ప్రాణ–అపానౌ, నాద–బిన్దూ**
**మూలబన్ధేన చ ఏకతామ్।**
**గత్వా యోగస్య సంసిద్ధిం యచ్ఛతో,**
**<u>న అత్ర సంశయః॥</u>**

**(1) మూలబంధము** : గుదస్థానమును ఎడమకాలి మడమ (Toe) తో త్రొక్కిపెట్టి వాయువును ఆకుంచనము (రేచక - పూర్వక -కుంభక- పునఃరేచకములను) చేయాలి.

మాటిమాటికీ - వాయువు పైకి వచ్చు విధంగా - (మూలాధారము నుండి బయటకు వెళ్లువాయువు వెనుకకు మరలి, పైకి రావటం రూపంగా) యోగాభ్యాసం చేయాలి.

అప్పుడు ప్రాణ-అపానములు, నాద-బిందువులు మూలబంధ కుంభకముతో ఏకము పొంది, ఆ అభ్యాసి యోగసిద్ధిని పొందగలడు.

ఆ యోగి యోగమునందు త్వరగా విజయము పొంగలడు. ఇందులో సందేహమే లేదు.

| | |
|---|---|
| **(2) ఉడ్డియాణబంధము**<br>**కుమ్భక-అంతే.. రేచక ఆదౌ**<br>**కర్తవ్యస్తు ఉడ్డియాణకః**<br>**బన్ధో యేన సుషుమ్నాయాం**<br>**ప్రాణస్తు ఉడ్డీయతే యతః॥**<br>**తస్మాత్ ఉడ్డీయణాఖ్యో**<br>**అయం యోగిభిః సముదాహృతః॥** | **(2) ఉడ్డీయాణ బంధము :** <u>కుంభక అంతే - రేచక ఆదౌ।</u><br>కుంభకము అంతమయిన తరువాత → రేచక ప్రారంభము ఇంకా ప్రారంభం కాకముందు → అక్కడ బంధమును (ప్రాణ మనో చిత్త కుంభకమును) అభ్యసించటమును **'ఉడ్డియాణబంధము'** అని అంటారు.<br>అటువంటి "కుంభకాంత - రేచక ఆదౌ" స్థానములో నిర్వర్తించు కుంభక ప్రాణాయామముచే సుషుమ్ననాడి యందు ప్రాణము ఊర్ధ్వముఖమై పైకి లేచుచుండటం చేతనే అద్దానికి **'ఉడ్డీయాన బంధము'** అనే పేరుతో యోగశాస్త్రజ్ఞులచే పిలువడం జరుగుతోంది. |
| **ఉడ్డీయాణస్తు సహజం**<br>**గురుణా కథితం సదా।**<br>**అభ్యసేత్ తత్ అతన్ద్రస్తు**<br>**వృద్ధోఽపి తరుణో భావేత్।** | కుంభక - రేచక మధ్య స్థానయోగాభ్యాసము - సహజముగా నిర్వర్తించటం (పూరక రేచక ప్రయత్నములు లేకుండా అభ్యసించటం) - గురుముఖతః నేర్చుకోవటం చేత, అద్దానిని ఎల్లవేళలా (All times and in all contents / positions) - సహజముగా అభ్యాసం చేయవచ్చు. ఆలస్యము, అశ్రద్ధ లేకుండా అధికంగా అభ్యసిస్తే, అట్టి యోగి వృద్ధాప్యంలో కూడా యువకునివలె ఉత్సాహ, సాహస, సమన్వయ ప్రజ్ఞలు కలిగి ఉంటాడు. |
| **19.** **నాభేః ఉర్ధ్వమ్ – అధశ్చాఽపి, ప్రాణం కుర్యాత్ ప్రయత్నతః।**<br>**షణ్మాసమ్ అభ్యసేత్, మృత్యుం జయత్యేవ। న సంశయః॥** | నాభికి(బొడ్డుకు) క్రింద-పైనగా కుంభక ప్రాణాయామము ప్రయత్న పూర్వకంగా 6 నెలల కాలము అభ్యసించటం చేత, అట్టివాడు (మార్పు-చేర్పుల రూపమగు) మృత్యువును జయించగలడు. సందేహం లేదు. |
| **(3) <u>జాలంధరబంధము</u>**<br>**పూరక – అంతేతు కర్తవ్యో**<br>**బన్ధో <u>జాలన్ధరాభిధః॥</u>**<br>**కంఠ సంకోచ రూపో**<br>**అసౌ, వాయుమార్గ నిరోధకః**<br>**కంఠమ్ ఆకుంచ్య హృదయే**<br>**స్థాపయేత్ దృఢమ్ ఇచ్ఛయా।**<br>**బన్ధో <u>'జాలంధర'</u> ఆఖ్యో**<br>**(అ)యమ్ అమృతాప్యాయ కారకః॥**<br>**అధస్తాత్ కున్చనేనాశు కంఠ సంకోచనే కృతే,**<br>**మధ్యే పశ్చిమతానేన స్యాత్, ప్రాణో బ్రహ్మనాడిగః॥** | **<u>జాలంధర బంధము - పూరక అంతే।</u>**<br>పూరకము ముగియగానే నిర్వర్తించు ప్రాణబంధమును **'జాలంధర బంధము'** అని పిలుస్తున్నారు. ఇందులో రెండు ముఖ్య విశేషదశలు.<br>(1) కంఠ సంకోచ రూపము (2) వాయు మార్గ నిరోధకము<br>కంఠమును అకుంచనము (పూరక-కుంభకములు)చేసి హృదయములో దృఢముగా స్థాపించాలి.<br>ఈ విధంగా పూరకం ముగిస్తూ ఉన్న తత్క్షణంలో ధారణ చేయు వాయు జాలంధర బంధము మరియు ఇచ్ఛాపూర్వకంగా కంఠమును ఆకుంచించి హృదయములో ప్రాణ-స్థాపనము-అమృతప్యాయకరము.<br>కంఠమును సంకోచింపజేసి, క్రిందకు కుంచింపజేసి, మధ్యగా "పశ్చిమ తానము"చే ప్రాణము శిరస్సు ఉపరిభాగమున గల బ్రహ్మనాడిని చేరుచున్నది. |
| **వజ్రాసన స్థితో యోగీ**<br>**చాలయిత్వాతు కుణ్డలీమ్**<br>**కుర్యాత్ అనన్తరతో భస్త్రీం**<br>**కుణ్డలీమాశు బోధయేత్।** | యోగి 'వజ్రాసనము'ను ధరించి కుండలినీ శక్తిని ఊర్ధ్వముగా కదల్చుచూ భస్త్రి మధ్యగా (గాలి పీల్చు-వదలు ఊర్ధ్వగత ప్రదేశంలో) వాయు సంచలనము చేయుచుండగా 'కుండలిని' లేపబడుచూ ఊర్ధ్వగామి అగుచున్నది. |
| **భిద్యన్తే గ్రన్థయో వంశే**<br>**తప్తలోహ శలాకయా।**<br>**తథైవ పృష్ఠవంశస్స్యాత్**<br>**గ్రన్థి భేదస్తు వాయునా।** | కాల్చిన లోహపు కడ్డీలో వెదురు యొక్క కణుపులు పగిలిపోవు తీరుగా జాలంధర బంధముచే బ్రహ్మ-విష్ణు-రుద్ర త్రిగ్రంధులు భేదనము పొందుచున్నాయి. |
| **పిపీలికాయాం లగ్నాయాం**<br>**కణ్డూః తత్ర ప్రవర్తతే,**<br>**సుషుమ్నాయాం తథా అభ్యాసాత్**<br>**సతతం వాయునా భవేత్॥** | పిపీలికము (చీమ) లగ్నమయి (చిక్కి) పైకి ఎగబాకు విధంగా- సుషుమ్న యందు వాయువును అభ్యసించుచుండగా బ్రహ్మ-విష్ణు-రుద్ర గ్రంధుల పరిధులను దాటుచూ, కుండలిని (చీమ వలె) వెన్నెముక నుండి పైగా ఎగబాకగలదు. |

**20** **రుద్రగ్రన్థిం తతో భిత్వా, తతో యాతి శివాత్మకమ్।**
**చంద్ర-సూర్యౌ సమౌ కృత్వా, తయోః యోగః ప్రవర్తతే।**
**గుణత్రయం అతీతం స్యాత్, గ్రంథిత్రయ విభేదనాత్।**
**శివశక్తి సమాయోగే, జాయతే పరమా స్థితిః।**

కుండలిని→సుషుమ్ననాడిలోని రుద్రగ్రంధిని భేదించి, సుషుమ్న నాడి ద్వారా ఊర్ధ్వగామి అయి, కపాల మండలము (zone of circle around skull) చేరి, బ్రహ్మరంధ్ర ఆకాశము దాటి ఊర్ధ్వంగా శివాత్మకత్వము సంతరించుకొనుచున్నది.

సూర్య-చంద్ర (పింగళ - ఇడ) నాడులు యోగాభ్యాసముచే ఏకత్వము పొందినవగుచున్నాయి. గ్రంధులు (సృష్టి స్థితి లయ పరిధులు) భేదించుచూ ఉండగా ఆ యోగి త్రిగుణములను దాటివేయుచున్నాడు. శివశక్తుల సమాయోగముచే ఆ రెండింటికి ఆవల స్థితి యోగికి సిద్ధించుచున్నది.

---

**యథా కరీ కరేణైవ పానీయం ప్రపిబేత్ సదా,**
**<u>సుషుమ్నా వజ్రనాళేన పవమానం గ్రసేత్ తథా।</u>**
**వజ్రదణ్డ సముద్భూతా మణయశ్చ ఏకవింశతిః(21)**
**సుషుమ్నాయాం స్థితాః సర్వే <u>సూత్రే మణిగణా</u> ఇవ।**

ఏనుగు తొండముతో ఏ విధంగా జలమును త్రాగుచూ ఉంటుందో, ఆ విధంగా సుషుమ్న వజ్ర నాళముగా అయి వాయువును పీల్చుటము జరుగుచున్నది. వజ్ర దండము (వెన్నెముక)లో 21 ప్రకాశమాన స్థానములగు మణిపూసలు (వెన్ను పూసలు) దారమునుకు గ్రుచ్చబడిన మణులవలె ఉంటున్నాయి. అవన్నిటియందు మధ్యగా **'సుషమ్ననాడి'** విస్తరితమై యున్నది.

---

**21.** **మోక్షమార్గే ప్రతిష్ఠానాత్, సుషుమ్నా విశ్వరూపిణీ,**
**యత్రైవ నిశ్చితః కాలః, చంద్ర-సూర్య నిబన్ధనాత్,**
**ఆపూర్య కుమ్భితో వాయుః, బహిః నో యాతి సాధకే,**
**పునః పునః తత్ వదేవ, పశ్చిమద్వార లక్షణమ్।**
**పూరితస్తు స తత్ ద్వారైః, ఈషత్ కుమ్భకత అంగతః।**
**ప్రవిశేత్ సర్వ గాత్రేషు, వాయుః పశ్చిమ మార్గతః।**
**రేచితః క్షీణతాం యాతి, పూరితః పోషయేత్ తతః।**

**విశ్వ-సుషుమ్న :** సుషుమ్నయే ఈ విశ్వమంతా తన యొక్క రూపముగా కలిగి ఉన్నది. విశ్వరూపిణి యగు సుషుమ్న దేహములో మోక్షమార్గమున ప్రతిష్ఠితమైయున్నది.

చంద్ర-సూర్యనాడులలో యోగి పూరించి, కుంభకము నిర్వర్తించిన వాయువు - (కాలము స్థబ్దమై ఆగిపోయిన విధంగా), ఉభయనాడుల బంధనములో నుండి ఇక బయల్వెడలక, అను నిత్య కుంభకము జరుగగలదు. మరల మరల పశ్చిమ ద్వార ప్రవేశముగా పూరించబడిన వాయువు అచ్చటనే కుంభకత్వము పొంది కొంచము కొంచముగా నిలిచిపోవటం జరుగుతూ ఉంటుంది.

పశ్చిమ మార్గమును అనుసరించిన వాయువు దేహములోని సర్వాంగములలో ప్రవేశము పొందినదై రేచకముచే → క్షీణత్వము పొందుచూ, పూరకముచే→ వృద్ధి పొందుచూ అంగాగములలో వాయువు యోగాభ్యాసంచే వాయుయామము జరుగసాగుచున్నది.

---

**యత్రైవ జాతం స కళేబరం**
**మనః తత్రైవ లీనం**
**కురుతే స యోగాత్।**
**స ఏవ ముక్తో నిరహంకృతిః సుఖీ।**

(ప్రాణాయామ అభ్యాసముచే) దేహములో మనస్సు యొక్క జనన స్థానము ఆ యోగికి అనుభవమగు చున్నది. యోగాభ్యాసంచే మనస్సు ఎక్కడ జనిస్తోందో, అక్కడనే లీనము పొందుచున్నది. అట్టి యోగి మనోలయము పొందినవాడై, ముక్తుడై, నిరహంకారుడై, సర్వసంసార బంధములు త్రెగిపోగా, 'సుఖి' అగుచున్నాడు. మనోలయంతో బాటే సంసారలయము కూడా జరుగుచున్నది.

---

**మూఢా న జానన్తి హి పిణ్డపాతినః।**
**చిత్తం వినష్టం యది భాసితం స్యాత్,**
**తత్ర ప్రతీతో మరుతోఽపి నాశః॥**

యోగాభ్యాసము లేనప్పుడు ఈ జీవుడు 'సంసారము' నందు పిండపాతుడగుచున్నాడు. అట్టి మూఢుడు చిత్తమును నశింపజేయలేడు. యోగి,- **చిత్తము ఎక్కడ జనిస్తోందో అది గమనించి, అచ్చోటనే చిత్తమును లయింపజేస్తూ ఉండగా మనోలయమును కూడా సిద్ధింపజేసుకుంటున్నాడు. అట్టివాడు స్వస్వరూపమునుండి దిగజారడు.**

---

**న చేత్ యదిస్యాత్।**
**న తు తస్య శాస్త్రం।**
**న ఆత్మ ప్రతీతిః।**
**న గురుః। న మోక్షః।**

మనో జనన స్థానమును, చిత్తప్రారంభ స్థానమును యోగాభ్యాసముచే (సుషుమ్న యందు కుంభకాభ్యాసముచే) ఎరిగి, అద్దానియందు లయింపజేయు యోగసిద్ధిని ఆశ్రయించనివాడు...,

- శాస్త్రములు విని మాత్రం ప్రయోజనమేమి? -ఆత్మతత్త్వము తెలుసుకొని మాత్రం లాభమేమి?

- ఆత్మాభావన ఎట్లా లభిస్తుంది? విశ్వరూపిణియగు సుషుమ్నయందు నిలకడ ఎక్కడిది?

- ఆతనికి గురువు చెప్పి ఏ ప్రయోజనం?

"చిత్తమును జనన స్థానము నందు లయింపజేయు యోగము"ను సిద్ధించుకొన్నవానికి ఇక క్రొత్తగా -శాస్త్ర, ఆత్మ ప్రతీతి, గురు పార్శ్వంశములతో ఇంకేమి పని?

| | |
|---|---|
| **22.** జలూకా రుధిరం యద్వత్<br>బలాత్ ఆకృష్యతి స్వయమ్,<br>బ్రహ్మనాడీ తథా ధాతూం తు<br>సంతత అభ్యాసయోగతః।<br>అనేన అభ్యాస యోగేన<br>నిత్యమ్ ఆసన బన్ధతః,<br>చిత్తం విలీనతామ్ ఏతి।<br>బిన్దుః నో యాతి అధః తథా॥ | జలగ శరీరమును పట్టుకొని దేహములోని రక్తమును స్వయముగా లాగి బలవంతంగా పీలుస్తుంది కదా! ఆ విధంగా సంతత అభ్యాస యోగము వలన బ్రహ్మనాడి (సుషుమ్న) ధాతువులను తన వైపు ఆకర్షించి, వాటి ప్రభావములను స్వీకరించుచున్నది.<br>నిత్యము పద్మాసనము (లేక) ఏదైనా సుఖాసనమును స్వీకరించి, ఆసన బంధముతో ధ్యానము అభ్యసిస్తూ ఉండగా, చిత్తము చిత్‌యందు విలీనము పొందుచున్నది. (అనగా, 'ఇష్టము' అనునది కేవలమగు 'ఎరుక' యందు లయమును పొందుచున్నది). అప్పుడు ఇక బిందువు యధాస్థానంలోనే ఉంటుంది. కానీ, (సంసార బంధరూపముగా) క్రిందకు జారదు. |
| రేచకం పూరకం ముక్త్వా,<br>వాయునా స్థీయతే స్థిరం।<br>నానా నాదాః ప్రవర్తంతే,<br>సంస్రవేత్ చంద్రమండలమ్<br>నశ్యన్తి క్షుత్- పిపాసాద్యాః,<br>సర్వ దోషాః తతః సదా॥ | రేచక - పూరకముల అవసరము ఏ మాత్రము లేకుండానే సమాన వాయువుచే తనే (కుంభకరూపంగా) బిందువు క్రిందకు జారక, స్థిరముగా నిలబడుచున్నది. ధ్యాస నిలకడ పొందుచున్నది. (పరమాత్మభావన జీవాత్మత్వముగా దిగజారదు)<br>చంద్రమండలము స్రవించుచుండగా అనేక నాదములు ప్రవర్తించుచున్నవౌతాయి. ఆకలి దప్పిక మొదలైన శరీర దోషములన్నీ నశించుతాయి. [చంద్రమండలము - ఆలోచన (లేక) మనస్సు జనించి సంచరిస్తూ ఉన్న మండల స్థానము] |
| **23.** స్వరూపే సత్-చిత్-అనన్దే<br>స్థితిమ్ ఆప్నోతి కేవలమ్।<br>కథితస్తు తవప్రీత్యా హి<br>ఏతత్ అభ్యాస లక్షణమ్। | అప్పుడు ఆ యోగి కేవలమగు సత్-చిత్-ఆనంద స్వరూపమును పొంది, అట్టి స్థితి యందు సంస్థితుడగుచున్నాడు.<br>ఓ సృష్టికర్తా! జగత్ పితామహా! యోగ పరాకాష్ఠకు సంబంధించిన ఈ ఈ లక్షణములన్నీ మీమీద, సమస్త జనులపైన నాకు గల ప్రీతిచే ఈ విధంగా వివరించి నాచే చెప్పబడుచున్నాయి. |
| మన్త్రో లయో హఠో<br>రాజయోగో అన్తర్భూమికాః క్రమాత్,<br>ఏక ఏవ→చతుర్ధాఽయం<br>'మహాయోగో' అభిధీయతే।<br>'హ' కారేణ బహిః యాతి<br>'స' కారేణ విశేత్ పునః।<br>"హంస హంస" ఇతి మంత్రోఽయం<br>సర్వజీవైశ్చ జప్యతే। | ఓ బ్రహ్మభగవాన్! ఇప్పుడు మనము **(1) మంత్ర యోగము (2) హఠయోగము (3) లయయోగము (4) రాజయోగము** - అని చెప్పబడువాటి గురించి వివరించుకుందాము.<br>ఈ నాలుగు కూడా క్రమంగా **"మహాయోగము"** యొక్క **అంతర్భూమికలు**గా చెప్పబడుచున్నాయి. (The 4 stages with in).<br>**మంత్రయోగము (వాయువులయొక్క బాహ్య-అంతర రాకపోకల గమనిక)**<br>సర్వజీవుల పట్ల కూడా 'హ'కారముచే వాయువు బయటకు వెళ్లటము.., 'స' కారముచే తిరిగి వాయువు లోనికి రావటము జరుగుచూ ఉన్నది.<br>"హం-స" "హం-స" అను ఈ మంత్రము సర్వజీవులచేతనూ (అసంకల్పితంగా) జపించబడుచూనే ఉన్నది. |
| **(1)** మంత్రయోగము<br>గురువాక్యాత్ సుషుమ్నాయాం<br>విపరీతో భవేత్ జపః।<br>'సోఽహమ్', 'సోఽహమ్'<br>ఇతి ప్రోక్తో 'మన్త్రయోగ' ఉదాహృతః। | **(1)** మంత్రయోగము : గురువాక్యానుసారం యోగాభ్యాసము చేయు యోగ సాధకుని విషయంలో ఈ 'హంస' జపము సుషుమ్ననాడి యందు విపరీతముగా జరుగుచున్నది. 'సోఽహమ్। సోఽహమ్' అను మననమే **'మంత్ర యోగము'** అని చెప్పబడుచున్నది. "అదియే నేను" అను అర్థము గల జపభావన సుషుమన్న యందు - బ్రహ్మ రంధ్రము వరకు విస్తరిస్తూ నిండు కుండలోని జలంలాగా - నిండి ఉండటమే 'మన్త్ర యోగము'.<br>(సో= సహజము, హం = సందర్భము, మంత్రము= ఆ రెండిటి గమనిక) |
| **(2)** హఠయోగము<br>**24.** ప్రతీతిః మంత్ర యోగాచ్చ<br>జాయతే పశ్చమే పథి।<br>'హ' కారేణ తు సూర్యస్స్యాత్<br>'స' కారేణ ఇన్దుః - ఉచ్యతే।<br>సూర్యా-చంద్రమసోః ఐక్యం<br>'హఠ' ఇత్యభిదీయతే। | మంత్రయోగము వలన క్రమంగా పశ్చమ పథము (The wordly side of yogi) ప్రతీతి (Effective, potentiality) పొందుచున్నది.<br>**(2) హఠ యోగము (ప్రాణ-అపానముల ఐక్యత)**<br>'హ' కారము..అనునది 'సూర్యుడు' అని (సర్వత్రా ఏర్పడినదై ఉన్న 'నేను') 'స'కారము.. అనునది 'చంద్రుడు' (దేహిగా దేహములో ఏర్పడి ఉన్న నేను) - అని చెప్పబడుచున్నది. సూర్య-చంద్రమండలముల ఐక్యము (బయటకు పోవు - లోనికి వచ్చు వాయువులు ఐక్యము) - ఏకము చేసి ధారణ చేయటమును **'హఠయోగము'** అని పిలుస్తున్నారు. అదియే ఈ జీవునిపట్ల ఇహ-పరముల ఐక్యము అయి ఉన్నది.) |

హఠేన గ్రస్యతే జాడ్యం
సర్వదోష సముద్భవమ్

హఠయోగము యొక్క అభ్యాసము వలన ఇంద్రియ విషయసంబంధమైన సర్వదోషముల కారణంగా జనించే జాడ్యమంతా తొలగిపోగలదు.

---

**(3)** లయయోగము :

క్షేత్రజ్ఞః పరమాత్మా చ
తయోః ఐక్యం యదా భవేత్,
తత్ ఐక్యే సాధితే, బ్రహ్మన్!
చిత్తం యాతి విలీనతామ్।

**(3) లయ యోగము (జీవాత్మయొక్క పరమాత్మయందు లయము)**

హే బ్రహ్మన్! ఈ సాధకుని యొక్క వ్యష్టి క్షేత్రజ్ఞుడు ఎప్పుడైతే సర్వక్షేత్రములలోని (సర్వ-దేహములలోని) క్షేత్రజ్ఞునితో (దేహితో లేక **పరమాత్మతో**) ఐక్యము పొంది విశ్వక్షేత్రజ్ఞునితో అఖండము-ఏకము అయినప్పుడు, ఆ మరుక్షణం చిత్తము లయించినదగుచున్నది. **పరమాత్మయందు వ్యష్టిగతమైన ఎరుక లయించటమే లయయోగము.**

---

పవనః స్థైర్యం ఆయాతి
లయ యోగ-ఉదయే సతి।
లయాత్ సంప్రాప్యతే సౌఖ్యం
"స్వాత్మానందం, పరంపదమ్"।

అటువంటి లయయోగము సిద్ధించగానే చిత్తముతో బాటే వాయువు స్థిరము (స్థైర్యము) పొందుచున్నది. అనగా ప్రాణచలనము పరమాత్మతో మమేకముచే స్వాభావికంగానే నిశ్చలమవగలదు.

వాయు స్థైర్యము, చిత్తలయములచే **"స్వాత్మానందరూపమగు పరమ పదము"** - అను స్వాత్మసుఖము లభించగలదు. "వ్యష్టిగతమైన (Incidental) 'నేను' మొదలేలేదు. సర్వగతమైననేనే నేనై ఉన్నాను" - అనునదే లయయోగము.

---

**(4)** రాజయోగము :

యోని మధ్యే మహాక్షేత్రే
జపాబన్ధూక సన్నిభమ్।
రజో వసతి జంతూనాం
దేవీతత్త్వం సమావృతమ్।
<u>రజసో-రేతసో యోగాత్</u>
<u>"రాజయోగ"</u> ఇతి స్మృతః
అణిమాది పదం ప్రాప్య రాజతే రాజయోగతః।

**4. రాజయోగము (భావించువాడు-భావనల ఏకత్వము)**

"మహాక్షేత్రము" అనుబడు ఈ శరీరము యొక్క యోని మధ్యగా (Central Zone) మంకెనపువ్వుతో సమానమగు - దేవీతత్త్వము (ప్రకృతి, భావన, కళ, సంకల్ప, ఊహ అగు) 'రజస్సు' - సర్వ జీవుల హృదయాకాశములో ఏర్పడి ఉన్నది.

అట్టి 'రజస్సు' రేతస్సుతో ఏకమగు యోగాభ్యాసము చేత బుద్ధికి ప్రకాశమైనప్పుడు 'రాజయోగము' సిద్ధిస్తోంది. [రజము = అంతరంగ చతుష్టయముతో సహా ఈ సమస్త సంప్రదర్శనము. "ఇదంతా నా ప్రదర్శనమే! నేనే!" అనునదే రాజయోగము]. అట్టి రాజయోగముచే ప్రాప్తించే రాజపదము వలన అణిమ మొ॥న అష్టాంగ యోగ సిద్ధులు ప్రాప్తించగలవు.

---

ప్రాణ- అపాన సమాయోగో
జ్ఞేయం '<u>యోగచతుష్టయమ్</u>'॥

ఈ విధంగా మంత్ర-హఠ-లయ-రాజయోగములనబడే యోగ చతుష్టయము - **ప్రాణ- అపాన సమాయోగము చేతనే లభించగలవు** - అని తెలుసుకొనబడునుగాక॥"

---

**25.** సంక్షేపాత్ కథితం, బ్రహ్మన్।
న-అన్యథా శివభాషితమ్।
క్రమేణ ప్రాప్యతే ప్రాప్యమ్
అభ్యాసాత్ ఏవ। న అన్యథా।

హే బ్రహ్మ భగవాన్! ఈ విధంగా యోగచతుష్టయము గురించి సంక్షిప్తంగా చెప్పుకున్నాము. వీటిచేతనే **ఈ జీవుడు శివస్వరూపుడు అగుచున్నాడు.** మరి వేరే మార్గం లేదు. **ఇది శివ భాషితము.**

ఇవన్నీ కూడా అభ్యాస వశంచేతనే (By regular Practice only) క్రమంగా సిద్ధిస్తున్నాయి. మరే విధంగానూ కాదు.

---

<u>మర్కటక్రమము</u>

ఏకేనైవ శరీరేణ యోగాభ్యాసాత్ శనైః శనైః,
చిరాత్ సంప్రాప్యతే ముక్తిః, మర్కట క్రమ ఏవ సః।

మర్కటక్రమము (సద్యోముక్తి)

నెమ్మది నెమ్మదిగా చిరకాల-యోగాభ్యాసము చేత ఒక శరీరముతోనే (అనగా ఇప్పుడే, ఇక్కడే) ముక్తి ఈ జీవునికి సిద్ధించగలదు. ఇది **మర్కట క్రమము(లేక) మర్కట న్యాయము.** (కోతి పిల్ల తల్లి మెడను పట్టుకొనుచుండగా, కోతి చెట్లపై దుముకుచున్నట్లుగా) - అనబడుతోంది.

---

<u>కాక మతము (క్రమముక్త)</u>

యోగిసిద్ధిం వినా దేహః ప్రమాదాత్ యది నశ్యతి,
పూర్వ వాసనయా యుక్తః, శరీరం చ అన్యథా ఆప్నుయాత్।
తతః పుణ్యవశాత్ సిద్ధో గురుణా సహ సంగతః।
పశ్చిమ ద్వార మార్గేణ జాయతే త్వరితం ఫలమ్॥

ఒకవేళ ఒకానొక యోగాభ్యాసి విషయంలో - యోగసిద్ధి సిద్ధించకపూర్వమే ఈభౌతిక దేహము (ఆతని పట్ల) నేల కూలటం జరిగితే?

పూర్వవాసనాయుక్తుడగు ఆ యోగాభ్యాసి (లేక) ముముక్షువు మరొక (యోగసాధనకు అర్హమైన) శరీరమును పొందుచున్నాడు.

అట్టి నూతన శరీరముతో ఆ ముముక్షువు పుణ్యవశంగా గురువుతో సమాగమము పొందినవాడై, - పశ్చిమ ద్వారా మార్గంగా (In the path of worldly practices) అతి త్వరలో ఫలములను (అష్టాంగ యోగ సిద్ధులను, ఆత్మసిద్ధిని) పొందుచున్నాడు.

**26.** పూర్వజన్మ కృత అభ్యాసాత్
సత్వరం ఫలం అశ్నుతే।
ఏత దేవ హి విజ్ఞేయం।
తత్ 'కాకమతమ్' ఉచ్యతే।
నాస్తి కాకమతాత్ అన్యత్।
"అభ్యాసాఖ్యమ్" అతః పరమ్।
తేనైవ ప్రాప్యతే ముక్తిః, న అన్యథా శివభాషితమ్।

క్రితం జన్మలలో నిర్వర్తించిన అభ్యాసమును అనుసరించి ఆతడు సత్వరము ఫలములను పొందుచున్నాడు.

ఇది ముముక్షువు ఎరిగి యుండునుగాక! దీనిని కాకమతము అని కూడా అంటారు. ఇతః పూర్వపు అభ్యాసవశంగానే ఇప్పుడు ఈ తీరుగా తెలియబడుతోంది" అను దానికి వేరుగా (కాక మతమునకు వేరుగా) ఏదీ లేదు. ఏదైనా అభ్యాసము చేతనే సిద్ధించగలదు. అయితే వర్తమాన అభ్యాసము-కాకమతము (ఇతః పూర్వపు అభ్యాస ఫలము) కన్నా గొప్పది.

"అభ్యాసము చేతనే ముక్తి లభించగలదు. మరింకేవిధంగానూ కాదు" - అనునదే శివభాషితము. అందుచేత వర్తమాన అభ్యాసమే కాకమతము (The influence of the past) నకు ఔషధం.

---

హఠయోగక్రమాత్ కాష్ఠా, సహజీవ లయాదికమ్।
నాకృతం మోక్షమార్గంస్యాత్, ప్రసిద్ధం పశ్చిమం వినా।

"హఠయోగము" యొక్క క్రమము - అనే పరిశ్రమ చేతనే జీవలయము, 'జీవుడు' అనునది అఖండాత్మతో ఏకము చేయటం - ఇదియే '**పశ్చిమ మార్గం**'. పశ్చిమ మార్గము వినా వేరైన మోక్షమునకు మార్గము లేదు. (పశ్చిమమార్గము, ఉత్తరోత్తర గతులనుండి ఉపసంహారము)

---

ఆదౌ రోగాః ప్రణశ్యన్తి,
పశ్చాత్ జాడ్యం శరీరజమ్।
తతః సమరసో భూత్వా
చంద్రో వర్షతి అనారతమ్।

(హఠము మొదలైన యోగ చతుష్టయము వలన) → **మొట్టమొదట - రోగములు తొలగుతాయి.** తరువాత - శరీరముతో జనించే జాడ్యములన్నీ తొలగుతాయి. (శరీరములో గల మనోబంధము తొలగుతుంది).

ఆపై - చంద్రుడు సమరసమగు అమృతమును అవిచ్ఛిన్నముగా కురిపించుచున్నాడు. [మనస్సు అమృతభావనను (Changeless seage) సంతరించుకొనుచున్నది].

---

**27.** ధాతూంశ్చ సంగ్రహేత్ వహ్నిః
పవనేన సమంతతః।
నానా నాదాః ప్రవర్తంతే।
మార్దవంస్యాత్ కళేబరమ్।
జిత్వా వృష్ట్యాదికం జాడ్యం।
ఖేచరః స భవేత్ నరః।
సర్వజ్ఞో అసౌ భవేత్,
కామరూపః పవన వేగవాన్।
క్రీడతే త్రిషు లోకేషు
జాయన్తే సిద్ధయో అఖిలాః।
కర్పూరే లీయమానే
కిం కాఠిన్యం తత్ర విద్యతే?
అహంకార క్షయే తద్వత్
దేహే కఠినతా కుతః?

**<u>ఇంకా కూడా, ప్రాణ-అపాన సమయోగము (లేక) ప్రాణయోగము అభ్యసిస్తూ ఉండగా</u>** →

- అగ్నిచేతను, వాయువుచేతను ధాతువులు స్పృశించబడి, సమత్వము పొందుతాయి. శరీరములో ధాతువుల అధిక - అల్ప దోషములు తొలగుతాయి.
- దేహములో పలు రకములైన సంగీత నాదములు బయల్వెడలుతాయి.
- శరీరము మృదువుగా అగుచున్నది.
- దేహములో జాడ్యము (Desease) వలన ఏర్పడే వృష్టులు (పైత్య-జఠర రస ప్రవాహ దోషములు) తొలగుతాయి.
- అట్టి సాధకుడు యోగాభ్యాసముచే 'ఆకాశ సంచారము' మొదలైన సిద్ధులు పొందుతాడు.
- **"ఈ దేహమందు నేనెవరు? ఇప్పుడు నేను ఎవరు? ఈ దేహము తొలగిన తరువాత నేనెవరు? నాకు ఈ దేహ-దృశ్యాలకు సంబంధం ఏమిటి? ఎట్లా కలుగుతోంది?"** ఈఈ ప్రశ్నలకు సమాధానములు తెలియుచుండగా - సర్వజ్ఞుడు అగుచున్నాడు.
- కోరుకొన్న రూపము ధరించగలుగుచున్నాడు. "వర్తమాన దేహానంతరము దేహము తరువాత ఏ దేహము పొందాలి?"అను విషయంలో స్వతంత్రుడగుచున్నాడు.
- వాయు వేగమును సంతరించుకుంటున్నాడు.
- ఆతనికి స్వర్గ-మర్త్య-పాతాళ త్రిలోకములు ఆతనికి తాను వినోదముగా విహరించే క్రీడా స్థలముల వలె అగుచున్నాయి.
- సమస్త సిద్ధులు ఆతనికి సిద్ధిస్తున్నాయి. **"ఈ సమస్తము సిద్ధించుకొనుచున్నది నేనే"** - అనే సిద్ధత్వము లభిస్తోంది.
- కరిగిపోవుచున్న కర్పూరమునకు ఇక కాఠిన్యము ఉండదు కదా! అట్లాగే యోగాభ్యాసి పట్ల 'అహంకారము' కరిగి పోవుచుండగా, ఇక ఆతనియందు కాఠిన్యము ఇంకేముంటుంది? ఉండదు.

| | |
|---|---|
| సర్వ కర్తా చ యోగీన్ద్ర స్వతంత్రో అనన్తరూపవాన్।<br>జీవన్ముక్తో మహాయోగీ జాయతే। న అత్ర సంశయః। | ఆ యోగీంద్రుడు **"సర్వమునకు కర్తను నేనే"** అని గ్రహిస్తున్నాడు. **"నేను ఎవరిపైనో ఆధారపడి ఉన్నవాడను కాను. స్వతంత్రుడను. అనంతరూపుడను"** - అని గమనిస్తున్నాడు. ఆ మహాయోగి జీవన్ముక్తుడై ఈభూమిపై విహరిస్తున్నాడు. ఇందులో ఏ మాత్రం సంశయము లేదు. (Sense of Independence) |
| ద్వివిధాః సిద్ధయో లోకే,<br>కల్పితా- అకల్పితాః తథా।। | ఈలోకంలో సిద్ధులు రెండు రకములైనవి.<br>(1) కల్పితములు (సందర్భ మాత్రములు), (2) అకల్పితములు (సహజములు, స్వాభావికములు). |
| రస ఔషధి క్రియా జాల<br>మన్త్ర అభ్యాసాది సాధనాత్<br>సిద్ధ్యన్తి సిద్ధయో యాస్తు<br>కల్పితాస్తాః ప్రకీర్తితాః।<br>అనిత్యా అల్పవీర్యాస్తాః<br>సిద్ధయః - సాధన ఉద్భవాః। | **(1) కల్పితసిద్ధులు :** ప్రకృతిలోని కొన్ని ఆకు రసములు, ఓషధులు స్వీకరించటం చేత, హఠమునకు సంబంధించిన ఆయా (యోగ సూత్రములలో చెప్పిన) క్రియా జాలము వలన, మంత్ర-తంత్ర అభ్యాస-సాధనముల వలన ఏఏ సిద్ధులు సిద్ధిస్తాయో → అవన్నీ కూడా **"కల్పిత సిద్ధులు"**. అటువంటివన్నీ అనిత్యము. కృత్రిమమైనవి. వాటి శక్తి అల్పము అయినట్టివి. సాధనచే (లేక) సేవనచే ఉద్భవిస్తాయి. సాధన విరమిస్తే కొంతకాలానికి తొలగిపోతాయి. అవన్నీ ఆత్మానందమును ప్రసాదించజాలవు. |
| సాధనేన వినాపి ఏవం<br>జాయంతే స్వత ఏవ హి। | **(2) సహజ సిద్ధులు / అకల్పిత సిద్ధులు :**<br>వాటి కొరకు ఉద్దేశ్యించకుండానే, తమకు తామే వచ్చి యోగిని ఆశ్రయిస్తాయి. ఇవి **ఉత్తమమైన సిద్ధులు.** |
| **28.** స్వాత్మయోగైక నిష్ఠేషు, స్వాతన్త్ర్యాత్ ఈశ్వర ప్రియాః<br>ప్రభూతాః సిద్ధయో యాస్తాః, కల్పనా రహితాః స్మృతాః। | **స్వాత్మ-యోగైక** నిష్ఠవలను, **ఆత్మస్వాతంత్ర్యాభ్యానము** వలను, సహజీవులను ఆత్మాభావనతో అవ్యాజప్రేమ కలిగియుండుట వలను అట్టి వారు ఈశ్వర ప్రియములై వారిని సిద్ధులు ఆశ్రయిస్తూ ఉంటాయి. అటువంటి సిద్ధులు **కల్పనారహిత సిద్ధులు. స్వాభావిక సిద్ధులు అనబడుచున్నాయి.** |
| సిద్ధా నిత్యా మహావీర్యా ఇచ్ఛారూపాః స్వ యోగజాః,<br>చిరకాలాత్ ప్రజాయంతే వాసనా రహితేషు చ।<br>తాస్తు గోప్యా మహాయోగాః పరమాత్మపదే అవ్యయే<br>వినా కార్యం సదా గుప్తం, యోగ సిద్ధస్య లక్షణమ్। | యోగి 'వాసనారహితుడు (One Relieved of worldly Tendencies) అగుచుండగా, స్వభావసిద్ధంగా సిద్ధించేవి వాస్తవమైన సిద్ధులు. స్వకీయ యోగాభ్యాసముచే తమకు తామే లభించేవి ఇచ్ఛాసిద్ధులు. అవి చిరకాలము ఆ యోగిని అనుసరించి, ఆశ్రయించి ఉంటాయి. విశ్వాసముగల సేవకులవలె ఆశ్రయించి, లోక కళ్యాణ కారకములౌతాయి.<br>మహాయోగములన్నీ - అవ్యయమగు పరమాత్మ పదమునకు వెనుకగా - రహస్యముగా దాగినవై ఉంటాయి. **"అట్టి సిద్ధులు రహస్యముగాను, తదితర జనులయందు ప్రదర్శించబడనివిగాను ఉండటము"** - మహాయోగుల పట్ల, యోగసిద్ధుల పట్ల - సహజ లక్షణము. |
| **29.** యథా ఆకాశం సముద్దిశ్య<br>గచ్ఛద్భిః పథికైః పథి,<br>నానా తీర్థాని దృశ్యంతే<br>నానా మార్గాస్తు సిద్ధయః,<br>స్వయమేవ ప్రజాయన్తే<br>లాభ-అలాభ వివర్జితే,<br>యోగమార్గే తథై వేదం (తథైవ ఇదం)<br>సిద్ధిజాలం ప్రవర్తతే।<br>పరీక్షకైః స్వర్ణకారైః<br>హేమ సంప్రోచ్యతే యథా,<br>సిద్ధిభిః లక్షయేత్ 'సిద్ధం',జీవన్ముక్తం తథైవ చ। | ఏ విధంగా అయితే ఆకాశము దేవతల, అనేక తదితరుల, అనేక వాహనముల రాకపోకలకై అనేక పథములు (paths) (పథికుల పట్ల) కలిగి ఉంటుందో, సిద్ధపురుషులు ఉన్నచోట సర్వతీర్థములు, నానా యోగ-మోక్షమార్గములు-రూపుదిద్దుకొని ఉంటాయి. వారున్నచోటే తీర్థము.<br>(తీర్థీ కుర్వాని తీర్థాని। సుకర్మీ కుర్వాన్తి కర్మాణి।)<br>లాభా లాభ వివర్జితులగు యోగులను స్వయముగా తీర్థములు ఆశ్రయిస్తాయి. ఒక సుదీర్ఘ బాటసారికి మార్గమధ్యంలో తీర్థములు తీర్థమార్గములు తారసపడుచున్న తీరుగా యోగ మార్గములో సంచరించు వారి పట్ల సిద్ధులు సిద్ధిస్తూ ఉంటాయి.<br>ఒక స్వర్ణకారుడు పరీక్షకుడై సంప్రోచన (గీయటం మొదలైనవి) నిర్వర్తించి, "ఇది బంగారమా? కాదా?" అని పరీక్షించి, బంగారము అయితేనే తదితర స్వర్ణకార్యములకొరకు స్వీకరిస్తాడు కదా?<br>అట్లాగే జీవన్ముక్తియే ఆశయముగా గల మహదాశయుడు తనను సమీపించిన సిద్ధులను "అవసరమా? అనవసరమా?" - అని పరీక్షించి లోక కళ్యాణార్థం మాత్రమే స్వీకరిస్తాడు. తన కొరకు కాదు. |

అలౌకిక గుణః తస్య
కదాచిత్ దృశ్యతే ధృవమ్।
సిద్ధిభిః పరిహీనస్తు
నరం బద్ధన్తు లక్షయేత్।
అజరామర పిండో యో
జీవన్ముక్తః స ఏవ హి॥

అయితే యోగుల పట్ల అలౌకిక (లోకమునకు పరిమితముగాని) ఉత్తమ గుణములు స్వభావసిద్ధంగానే ప్రదర్శితమౌతూ ఉంటాయి.

సిద్ధులు స్వల్పమైన విశేషములని, అవి బంధహేతువులని వారు (ఉత్తమ యోగులు) భావించియే ఉంటున్నారు. కృత్రిమమైన సిద్ధులు బంధమేగాని, ముక్తిని కలిగించేవి కావు.

'జరామరణములు లేనట్టి ఆత్మ పిండముయొక్క అనుభవము కలవాడే జీవన్ముక్తుడు. జీవన్ముక్తత్వమే ఉత్తమ యోగాశయముగాని, సిద్ధులు కానే కాదు.

---

**30.** పశు కుక్కుట కీటాద్యా
మృతిం సంప్రాప్నువన్తి వై
తేషాం కిం పిండపాతేన
ముక్తిః భవతి, పద్మజ?
న బహిః ప్రాణ ఆయాతి
పిణ్డస్య పతనం కుతః?

**'ముక్తి'** అనునది దేహముల రాకపోకలకు సంబంధించినది కాదు. ఓ బ్రహ్మదేవా! పద్మజా! మృత్యువు భౌతిక శరీర సంబంధమైనది మాత్రమే! సిద్ధులు భౌతికమైనవి మాత్రమే! **జీవన్ముక్తుడు దేహసంబంధములను జయించినట్టివాడు కదా!** పశువులు, కుక్కుటములు (కోళ్ళు), కీటకములు దేహములను పొందటం, కోల్పోవటం జరుగుచున్నది. దేహము నశించినంత మాత్రం చేత (పిండపాతము చేత)ముక్తి లభిస్తుందా? ప్రాణములు దేహములు బహిర్గతం అయినంతమాత్రం చేత **దేహ పరిమితత్వము** లేక **పిండత్వము** తొలగుతుందా? ముక్తి లభిస్తుందా? లేదు. మరణించిన వానికి మరొక దేహము సిద్ధమే అగుచున్నది కదా!

---

పిణ్డ పాతేన యా ముక్తిః
సా ముక్తిః న తు హన్యతే।
దేహే బ్రహ్మత్వమ్ ఆయాతే
జలానాం సైన్ధవం యథా,
అనన్యతాం యదా యాతి
తదా 'ముక్తః' స ఉచ్యతే।

శరీరము పతనము చేత ఏ ముక్తి శరీరము నుండి కలుగుచున్నదో, అది ముక్తి కాదు. అది పరిస్థితుల మార్పు-చేర్పుల వంటిది మాత్రమే.

సైంధవ లవణము నీటిలో వేసినప్పుడు అద్దాని నామరూపాలు నీటిలో ఏ విధంగా కరిగిపోతాయో, ఆ విధంగా - దేహత్వము బ్రహ్మత్వము నందు లయమగుచుండటమే 'ముక్తి'. ఎప్పుడైతే అన్యత్వమంతా తొలగిపోతుందో (అనగా) **"ఈ దృశ్యమంతా ఆత్మగా నా స్వరూపమే"** అను అనన్యత్వము సిద్ధిస్తుందో, అప్పుడు మాత్రమే ముక్తి సిద్ధించినట్లు. అంతేకాని, సిద్ధులు లభించినప్పుడు కాదు.

---

విమతాని శరీరాణి ఇంద్రియాణి తథైవ చ,
బ్రహ్మదేహత్వమ్ ఆపన్నం
వారి బుద్బుదతామ్ ఇవ।

ఈ భౌతిక దేహ స్వభావమును దాటివేసిన యోగి యోగాభ్యాస ప్రభావం చేత బ్రహ్మము-అను పరదేహత్వము సంతరించుకొనుచున్నాడు. అట్టి బ్రాహ్మీదేహాత్మకునికి ఈ దేహము, ఇంద్రియములు, అతీత శక్తులు - ఇవన్నీ నీటిలో బుడగలవలె అగుపిస్తాయి.

---

దశద్వారపురం దేహం
దశ నాడి మహాపథమ్,
దశభిః వాయుభిః వ్యాప్తం
దశేన్ద్రియ పరిచ్ఛదమ్।
షట్ ఆధార అపవరకం,
షట్ అన్వయ మహావనం,
చతుః పీఠ సమాకీర్ణం
చతుః ఆమ్నాయ దీపకమ్।
బిన్దు నాద మహాలింగమ్
శివశక్తి నికేతనమ్॥

ఈ దేహము దేహికి యోగ సిద్ధిని ప్రాప్తింపజేయగల దేవాలయము. ఇది సిద్ధాలయము. సిద్ధిని పొందింపజేయ గలిగినట్టిది.

## శరీరము

**ఈ దేహము ఎటువంటిదంటే...**

- దశద్వారములు (10 Entrances) గల **పురము.**
- దశ ముఖ్యానాడులతో కూడిన అనేక రహదారులు కలిగిన **మహాపథము.**
- "పంచప్రాణ+పంచ ఉపప్రాణము"లచే (దశవాయువులచే) ఇది వ్యాపించబడియున్నట్టిది.
- "పంచకర్మేంద్రియ+ పంచజ్ఞానేంద్రియ" పరిచ్ఛేదముల (Partitioned) చే ప్రదర్శితమైయున్నట్టిది.
- "మూలాధారము - స్వాధిష్ఠానము- మణిపూరకము - అనాహతము - విశుద్ధము - ఆజ్ఞా - అనబడు షట్ ఆధారములు కలిగియున్నట్టిది.
- 'పంచభూతములు+మనస్సు' అనే '6' అన్వయములు గల మహావనము. అన్నమయ-ప్రాణమయ-మనోమయ -విజ్ఞానమయ-ఆనందమయ - జీవాత్మల సమన్వయము.

**దేహం శివాలయం (దేవాలయం) ప్రోక్తం, సిద్ధిదం సర్వ దేహినామ్।**

- మనోబుద్ధి చిత్త అహంకారములనబడే '4' పీఠములు కలిగి ఉన్నట్టిది.
- చర్మము - రక్తము - మాంసము - మజ్జ అను '4' ఆమ్నాయములు కలిగి దీపించుచున్నది. చతుర్వేదయుతము.

ఇందులో బిందు నాద మహాలింములతో శివ+శక్తి సమేతము ప్రదర్శితమైయున్నది. ఈ దేహములో సర్వదా 'సిద్ధిప్రదాత' అయి శివుడు వేంచేసియున్నాడు. దేహమే దేవాలయము.

---

**31. గుద మేఢ్రాంతరాళస్థం మూలాధారమ్ త్రికోణకమ్, శివస్య జీవరూపస్య స్థానం తద్ధి ప్రచక్షతే। యత్రకుణ్డలినీ నామ 'పరాశక్తిః' పతిష్ఠితా।**

**(1) మూలాధార చక్రము - పరాశక్తి**

ఈ శరీరములో గుదము - మేఢ్రముల అంతరాళమున (Inner Recess) - త్రికోణాకారముగా మూలాధార చక్రము ప్రతిక్షేపించబడి ఉన్నది. **"ఇది శివుడు జీవుడుగా ఉంటున్న స్థానము"** అని తత్త్వజ్ఞులు చెప్పుచున్నారు. [Three phased (Perceiver, Object and Perciving)] అట్టి మూలాధారచక్రము (లేక) మూలా ఆకాశములో **'కుండలినీ శక్తి'** అనిపిలువబడుచున్న పరాశక్తి ప్రతిష్ఠితమై యున్నది.

---

**యస్మాత్ ఉత్పద్యతే వాయుః, యస్మాత్ వహ్నిః ప్రవర్తతే, యస్మాత్ ఉత్పద్యతే బిన్దుః, యస్మాత్ నాదః ప్రవర్తతే, యస్మాత్ ఉత్పద్యతే హంసో, యస్మాత్ ఉత్పద్యతే మనః తత్ ఏతత్ కామరూపాఖ్యం పీఠం, కామఫలప్రదమ్॥**

అట్టి మూలాధారములో ప్రతిష్ఠితిమైయున్న పరాశక్తి నుండియే -

- వాయువు (చలనములు) బయల్వెడలుచున్నది.
- వహ్ని (అగ్ని) జనించినదై ప్రజ్వలితమౌతోంది.
- అద్దాని నుండియే చిత్తప్రదర్శములగు బిందు-నాదములు ఉత్పన్నములై ప్రదర్శనమగుచున్నాయి.
- అద్దాని నుండే 'హంస' (జీవాత్మ, సోఽహమ్) కూడా బయల్వెడలుతోంది.
- ఆలోచన, మనస్సులు.. అద్దాని నుండే బయలుదేరుచున్నాయి.

అది సర్వకామఫలప్రదమగు దేవీశక్తి స్థానము. కామరూపాఖ్యము (ఇచ్ఛాశక్తి పీఠము) - ఇతి విశ్వ మూలాధారస్థానః।

---

**"స్వాధిష్ఠానా" హి అయం (స్వాధిష్ఠానాహ్వయం) చక్రం లింగమూలే షడశ్రకే।**

**(2) స్వాధిష్ఠాన చక్రము**

- ఇది లింగమూలమున స్థానము కలిగియున్నది. షట్(6) కోణాకారమైయున్నది.

---

**నాభిదేశే స్థితం చక్రం దశారం "మణిపూరకమ్"।**

**(3) మణిపూరక చక్రము**

నాభి ప్రదేశములో దశారంగా సంస్థితమైయున్న చక్రము. 10 రేకుల చక్రము.

---

**ద్వాదశారం మహాచక్రమ్ హృదయేచాపి చ "అనాహతమ్"। తదేతత్ "పూర్ణగిరి", ఆఖ్యం పీఠం, కమలసంభవ!**

**(4) అనాహత చక్రము**

12 రెక్కలు గల 'మహాచక్రము'. హృదయస్థానము. దీనిని "పూర్ణగిరి పీఠము" అని కూడా అంటారు.

---

**కంఠకూపే "విశుద్ధ" ఆఖ్యం యత్ చక్రం షోడశాశ్రకమ్। పీఠం "జాలంధరం" నామ తిష్ఠతి అత్ర, సురేశ్వర!**

**(5) విశుద్ధ చక్రము**

కంఠకూపములో ఉన్నది. '16' దళములు గల చక్రము. హే సురేశ్వరా! కమల సంభవా! ఇక్కడ "జాలంధర పీఠము" ఉన్నది.

---

**"ఆజ్ఞా" నామ భ్రువోః మధ్యే ద్విదళన్ చక్రమ్ ఉత్తమమ్॥ ఉద్యాణాఖ్యం మహాపీఠమ్ ఉపరిష్టాత్ ప్రతిష్ఠితమ్॥**

**(6) ఆజ్ఞాచక్రము**

భ్రూమధ్యగా గల చక్రము. రెండు దళముల చక్రము ఇక్కడ ఉన్నది. దీనికి పై ప్రదేశములో **"ఉద్యాణ మహాపీఠము"** ప్రతిష్ఠితమైయున్నది.

| | |
|---|---|
| చతురశ్రం ధరణి అదౌ<br>బ్రహ్మా తత్ర అధిదేవతా।<br>అర్ధ చంద్రాకృతి జలం<br>విష్ణుః తస్య అధి దేవతా।<br>త్రికోణ మండలం వహ్నీ<br>రుద్రః తస్య అధి దేవతా।<br>వాయోః బింబస్తు షట్కోణమ్<br>ఈశ్వరో అస్య అధి దేవతా।<br>ఆకాశమండలం వృత్తం<br>దేవతా అస్య సదాశివః।<br>నాద రూపం భృవోః మధ్యే<br>మనసో మండలం విదుః<br>ఇతి ప్రథమోఽధ్యాయః | **మహా పంచభూత అధి దేవతలు**<br>**ఆదౌ (మొదట) ధరణి (భూమి)**<br>చతురశ్రాకారమండలము<br>అధిదేవత : **బ్రహ్మ దేవుడు**<br>**జలము** : అర్ధ చంద్రాకృతి ఆకార మండలము<br>అధిదేవత = **విష్ణువు**<br>**వహ్ని (అగ్ని)** = త్రికోణ ఆకార మండలము<br>అధిదేవత : **రుద్రుడు**<br>**వాయువు** : బింబము. షట్కోణ ఆకారమండలము.<br>అధిదేవత = **ఈశ్వరుడు**<br>**ఆకాశమండలము**: వృత్తమండలాకారము<br>అధిదేవత = **సదాశివుడు**<br>**నాదరూపము** : భ్రూమధ్య స్థానము. (నాద బ్రహ్మము) ఇది మనో మండలము.<br>**ఇతి ప్రథమోధ్యాయము** |

| | |
|---|---|
| **ద్వితీయో అధ్యాయః** | **ద్వితీయో అధ్యాయః - యోగమహత్మ్యము** |
| 1. **బ్రహ్మో వాచ:**<br>**పునః యోగస్య మహాత్మ్యం, శ్రోతుమ్ ఇచ్ఛామి, శంకర!**<br>**యస్య విజ్ఞాన మాత్రేణ, ఖేచరీ సమతాం వ్రజేత్।** | **బ్రహ్మభగవానుడు :**<br>ప్రభూ! శంకరభగవాన్! యోగమహాత్మ్యము గురించి మరికొంతగా వినాలని ఉన్నది. దేనిని తెలుసుకున్నంత మాత్రం చేత వాయు సమత్వము ఈ జీవునికి సిద్ధించగలదో, అట్టి 'ఖేచరీ సమతత్త్వము' గురించి మరికొంచము వివరించ ప్రార్థన. |
| **యోగమహత్మ్యము**<br>**శంకరో వాచ:**<br>**శృణు బ్రహ్మన్! ప్రవక్ష్యామి, గోపనీయం ప్రయత్నతః।**<br>**'ద్వాదశాబ్దంతు శుశ్రూషాం యః కుర్యాత్ అప్రమాదతః**<br>**తస్మై వాచ్యం యథాతథ్యం దాన్తాయ బ్రహ్మచారిణే।** | **శంకర భగవానుడు :**<br>హే బ్రహ్మన్! రహస్యమగు యోగ మహత్మ్యము గురించి చెప్పుకుంటు న్నాము. ప్రయత్నతః వినండి.<br>ఎవ్వడైతే 12 సంవత్సరముల పూర్తికాలము అప్రమత్తుడై శ్రద్ధగా గురుశుశ్రూష నిర్వర్తిస్తాడో, ఇంద్రియ నిగ్రహము కలిగి దాంతుడై ఉంటాడో, బ్రహ్మ విద్యకొరకై 'విద్యార్థి' అయి ఉంటాడో, అట్టివాడికే ఇది బోధించబడును గాక! |
| **పాండిత్యాత్ అర్థలోభాద్వా**<br>**ప్రమాదాద్వా ప్రయచ్ఛతి,**<br>**తేన అధీతం శ్రుతం,**<br>**తేన తత్ న సర్వమ్ అనుష్ఠితమ్।** | ఎవ్వరైనా - తన పాండిత్యము ప్రదర్శించటానికో, ధనము లభిస్తుందనో, అర్థలోభము చేతనో, గొప్పలు చెప్పుకోవటానికో, ఏదో పొరపాటుగానో మరొకరికి ఈ విద్యను చెప్పనారంభిస్తే - ఆ రెండవ వాడు (వినువాడు) పుచ్చుకొన్నట్లు కాదు. అనుష్ఠించినట్లు కూడా కాదు. |
| **మూలమన్త్రం విజానాతి**<br>**యో విద్వాన్ గురు దర్శితమ్,**<br>**శివ-శక్తి మయం మంత్రం**<br>**మూలాధారాత్ సముత్థితమ్।**<br>**తస్య మంత్రస్య వై, బ్రహ్మన్।**<br>**శ్రోతా వక్తా చ దుర్లభః।।** | హే బ్రహ్మదేవా! యోగాభ్యాసి (లేక) ముముక్షువు గురువును సమీపించి - మూలాధారము నందు సంస్థితమైయున్న శివశక్తి మయమగు మంత్రము గురించిన మూలమంత్రము (మననము), మూలతత్త్వమును ఎరుగటం మోక్షమునకు గొప్ప ఉపాయము. అందుకు శిష్యుడుగా గురువును ఆశ్రయించాలి.<br>అట్టి శివ-శక్తి సమన్వితమగు మూలాధారముల మంత్రమననము గురించి చెప్పటము, వినటము కూడా దుర్లభమే! |

| | |
|---|---|
| ఏతత్ 'పీఠం' ఇతి ప్రోక్తమ్<br>నాద లింగం చిదాత్మకమ్।<br>తస్య విజ్ఞాన మాత్రేణ<br>జీవన్ ముక్తో భవేత్ జనః।<br>అణిమాదికమ్ ఐశ్వర్యమ్<br>అచిరాదేవ జాయతే॥ | అట్టి మూలాధార స్థానము **"నాద-లింగ-చిదాత్మక పీఠము"** గా చెప్పబడుచున్నది.<br>అట్టి మూలాధారమును తెలుసుకొనుటచేత జీవులు జీవన్ముక్తులు కాగలరు.<br>మూలాధారము నందు బుద్ధిని నిలుపుటచే త్వరగా అణిమాది సిద్ధులు - అను ఐశ్వర్యము లభించగలదు. |
| **2.** మననాత్ త్రాణనాత్ చ ఏవ<br>మత్ రూపస్య అవబోధనాత్,<br>'మంత్రమ్' ఇతి ఉచ్యతే, బ్రహ్మన్!<br>మత్ అధిష్ఠానతోఽపి వా। | హే బ్రహ్మన్!<br>**మంత్రము** → మననముచే రక్షిస్తుంది కాబట్టి, (మరియు) మత్ శివతత్త్వ స్వరూపము అవబోధము అగుచుండటం చేతను **'మంత్రము'** - అనబడుచున్నది. నేను మంత్రమునందు అధిష్ఠితుడనై ఉన్నాను. మననముతో కూడిన మంత్రమునకు వశుడను. |
| మూలత్వాత్ సర్వమన్త్రాణాం, మూలాధార సముద్భవాత్,<br>మూలస్వరూప లింగత్వాత్, "మూలమంత్ర" ఇతి స్మృతః।<br>సూక్ష్మత్వాత్ కారణత్వాచ్చ లయనాత్ గమనాత్ అపి,<br>లక్షణాత్ పరమేశస్య, "లింగమ్" ఇతి అభిధీయతే। | సర్వమంత్రములకు 'మూలము' అగుటచేతను, మూలాధారము నందు జనించుటచేతను, మూలస్వరూప లింగము కాబట్టి - **'మూలమంత్రము'** - అని అంటున్నారు.<br>**లింగము** : పరమాత్మతత్త్వము సూక్ష్మము, సర్వకారణము. సర్వము **నడిపించునది, లయింపజేయునది** కూడా! అట్టి పరమేశ్వర లక్షణములను 'లింగము' అని పిలుస్తున్నారు. |
| సన్నిధానాత్ సమస్తేషు, జంతుషు అపి చ సంతతమ్,<br>సూచకత్వాచ్చ రూపస్య 'సూత్రమ్' ఇతి అభిధీయతే। | **సూత్రము :** సమస్త జీవుల యందు ఎల్లప్పుడు సామీప్యత, సన్నిధానత్వము కలిగి ఉండటం చేతను, రూపమునకు సూచకముగా ఉండటంచేతను **"సూత్రము"** - అనబడుతోంది. |
| మహామాయా, మహాలక్ష్మీ,<br>మహాదేవీ, సరస్వతీ,<br>ఆధారశక్తిః అవ్యక్తా,<br>యయా విశ్వం ప్రవర్తతే,<br>సూక్ష్మాభా బిందురూపేణ<br>పీఠరూపేణ వర్తతే। | **బిందుపీఠము**<br>దేనిచేతనైతే ఈ విశ్వము ప్రవర్తమానమై ఉంటోందో,<br>- ఏది మహామాయ, మహాలక్ష్మి, మహాదేవీ, సరస్వతీ చతుర్ పీఠములు కలిగి ఉన్నదో,<br>- ఏది అవ్యక్తమగు ఆధారశక్తిగా ఉన్నదో,<br>- బిందురూపము, సూక్ష్మము అయి ఉన్నదో<br>అట్టి శక్తితత్త్వమే 'పీఠము' రూపము అయి ఈ విశ్వమును తనపై ధరించి ఉన్నది. |
| బిన్దుపీఠం వినిర్భిద్య<br>నాదలింగమ్ ఉపస్థితమ్।<br>ప్రాణేన ఉచ్చార్యతే, బ్రహ్మన్!<br>షణ్ముఖీ కరణేన చ॥ | హే సృష్టికర్తా! బ్రహ్మదేవా!<br>'బిందుపీఠము'ను ఛేదించుచూ నాదలింగము (The Emanation of Sound) ఉపస్థితమైయున్నది.<br>అట్టి నాదలింగము→ షణ్ముఖ (6 ముఖములు) కలిగిన కరణములతో, ప్రాణస్వరూపముగా ఉచ్చారణ కలిగి యున్నది. |
| **3.** గురూపదేశ మార్గేణ, సహ స ఏవ ప్రకాశతే।<br>'స్థూలం, సూక్ష్మం, పరం' చ ఇతి<br>త్రివిధం బ్రహ్మణో వపుః। | పరబ్రహ్మము గురూపదేశ మార్గముచే స్వయముగా ముముక్షువు పట్ల ప్రకాశమానమగుచున్నది.<br>పరబ్రహ్మము→ **(1) స్థూలము (2) సూక్ష్మము; (3) పరము** - అని త్రివిధ ప్రదర్శనములు కలిగి ఉంటోంది. |
| పంచ బ్రహ్మమయం రూపం, స్థూలం 'వైరాజమ్' ఉచ్యతే।<br>హిరణ్యగర్భం సూక్ష్మస్తు<br>నాదం బీజత్రయాత్మకమ్। | **(1) స్థూలము :** పంచ బ్రహ్మమయము, రూపసమన్వితము. స్థూల రూపము 'వైరాజము' (That being physically manifested) అని కూడా అంటారు.<br>**(2) సూక్ష్మము :** హిరణ్యగర్భము అని కూడా అంటారు. నాదస్వరూపం. బీజత్రయాత్మకము. |

**పరమ్ బ్రహ్మ। పరమ్ సత్యమ్।**
**సత్-చిత్- ఆనంద లక్షణమ్।**
**అప్రమేయమ్। అనిర్దేశ్యమ్।**
**అవాక్-మానస గోచరమ్।**
**శుద్ధం। సూక్ష్మం। నిరాకారం।**
**నిర్వికారం। నిరంజనమ్।**
**అనన్తమ్। అపరిచ్ఛేద్యమ్।**
**అనుపమమ్। అనామయమ్।**
**'ఆత్మమంత్ర' సదాభ్యాసాత్**
**పరతత్త్వం ప్రకాశతే।**

**(3) పరము :** స్థూల సూక్ష్మములకు ఆధారము. (నాటకంలో కనిపించే పాత్రకు, నటనకు పాత్రధారుడు ఆధారమైనట్లుగా),

- అదియే పరంబ్రహ్మము. పరమ సత్యము.
- సత్ (ఉనికి), చిత్ (ఎరుక) ఆనందము (అనుభూతి) అను లక్షణములు కలిగి ఉన్నట్టిది.
- దేనికీ సంబంధించినది కాదు. అప్రమేయము (మట్టితో కోతి బొమ్మ చేసినంతమాత్రం చేత మట్టి కోతిగా అవకపోవటం వంటిది).
- అనిర్దేశ్యము (Undefinable).
- వాక్కుకు, మనస్సుకు అందనిది.
- శుద్ధము; సూక్ష్మము; నిరాకారము నిర్వికారము, నిర్మలము (నిరంజనము).
- ఆద్యన్తరహితము.
- అపరిచ్ఛేద్యము (Unpartitionable)
- ఉపమానములతో చెప్పరానిది, అనుపమము.
- అనామయము. పరిధి లేనిది.

ఈ రీతిగా ఆత్మ మంత్రము (మననము)ను ఎల్లప్పుడూ అభ్యసించుటచే **పరతత్త్వము ప్రకాశించగలదు.**

---

**<u>సిద్ధి ద్వారే</u>**

**<u>తత్ అభివ్యక్తి చిహ్నాని</u>**
**<u>సిద్ధి ద్వారాణి మే శృణు।</u>**
**<u>దీపజ్వాల, ఇన్దు, ఖద్యోత, విద్యుత్ నక్షత్ర</u> భాస్వరాః**
**దృశ్యంతే సూక్ష్మరూపేణ సదా యుక్తస్య యోగినః।**

అట్టి పరబ్రహ్మము యొక్క అభివ్యక్తి చిహ్నములగు సిద్ధిద్వారముల గురించి వినండి.

యోగము అభ్యసించుచున్న యోగాభ్యాసికి

→ దీపజ్వాల; చంద్రబింబము,ఖద్యోతము (మిడుగురు పురుగు మెరుపులు); విద్యుత్ (తేజస్సు), నక్షత్రములు.. ఇవి సూక్ష్మరూపంగా హృదయాకాశంలో భాసిస్తూ ఉంటాయి.

---

**అణిమాదికమ్ ఐశ్వర్యమ్**
**అచిరాత్ తస్య జాయతే।**

అట్టి → ద్వీపజ్వాల, ఖద్యోతము, విద్యుత్తు, నక్షత్రములు - హృదయాకాశములో దర్శనమగుచున్న యోగాభ్యాసికి → (ఆతను కోరుకుంటే) అణిమ మొదలైన అష్టసిద్ధులు లభించగలవు.

---

**<u>నాస్తి నాదాత్ పరో మన్త్రో। న దేవః స్వాత్మనః పరః।</u>**
**<u>న అనుసన్ధేః పరా పూజా। నహి తృప్తేః పరం సుఖమ్।</u>**

## స్వాత్మ దేవుడు

**'నాదము'**నకు మించిన పరమంత్రము లేదు. **స్వాత్మకన్నా వేరైన దేవుడు లేడు.**

అట్టి ఆత్మతో **'అనుసంధానము'**నకు మించిన పూజ లేదు. **పరస్వరూపమునకు మించిన తృప్తి, సుఖము మరొకటి లేదు.**

---

**గోపనీయం ప్రయత్నేన సర్వదా సిద్ధిమ్ ఇచ్ఛతా।**
**మద్భక్త ఏతత్ విజ్ఞాయ, కృతకృత్యః సుఖీ భవేత్।**
**యస్య దేవే పరా భక్తిః, యథా దేవే తథా గురౌ।**
**తస్య ఏతే కథితా హి అర్థాః, ప్రకాశంతే 'మహాత్మనః'**

***<u>ఇతి॥</u>***

***<u>ఇతి ద్వితీయోఽ ధ్యాయః</u>***

సిద్ధిని సంపాదించుకోవాలనుకునేవాడు సర్వదా ప్రయత్నపూర్వకంగా స్వాత్మానుసంధానమును ఇష్టంగా ఉపాసించవలసినట్టిది (గోపనీయము).

ఎవ్వడైతే నా పట్ల భక్తి కలవాడై స్వస్వరూపాత్మోపాసనను తెలుసుకొని నిర్వర్తిస్తాడో, అట్టివాడు కృతకృత్యుడు. సర్వదా సుఖవంతుడు.

ఎవనికి→ దైవభక్తి ప్రవృద్ధము అగుచూ ఉంటుందో,

ఎవడు పరాభక్తి కలిగిఉంటాడో, గురువు పట్ల పరమాత్మతో సమానంగా ఉత్తమమైన శ్రద్ధ - ప్రణిపాతము కలిగి ఉంటాడో..,

అట్టి మహాత్మునికి మనము చెప్పుకొన్న మహత్ విశేషములన్నీ ప్రకాశించ గలవు.

**ఇతి రెండవ అధ్యాయము**

## తృతీయ (3వ) అధ్యాయము

## తృతీయ (3వ) అధ్యాయము-యోగసిద్ధి

**యోగ చిత్ సిద్ధికారణమ్**

**యోగమ్ అస్య చిత్ - ఆఖ్యాతమ్**
**యత్ సిద్ధీనాం చ కారణమ్,**
**యేన విజ్ఞాత మాత్రేణ జన్మ బంధాత్ ప్రముచ్యతే।**
**అక్షరం పరమో నాదః, "శబ్ద బ్రహ్మ" ఇతి కథ్యతే।**

హే బ్రహ్మభగవాన్! మోక్షము సిద్ధించటానికై 'యోగము' ఏవిధంగా కారణమగుచున్నదో చెప్పుకున్నాము.

దేనిని తెలుసుకున్నంత మాత్రం చేత ఈ జీవుడు జన్మ-జరా బంధముల నుండి విముక్తుడు (ప్రముచ్యుడు) అవుతాడో, అట్టి అక్షరము, పరము అగునాదమే- **'శబ్ద బ్రహ్మము'** - అని పిలువబడుచున్నది.

---

**మూలాధారగతా శక్తిః,**
**స్వాధారా బిన్దు రూపిణీ।**
**తస్యామ్ ఉత్పద్యతే నాదః**
**సూక్ష్మబీజా-దివాం అంకురః।**
**తాం పశ్యన్తీం విదుః విశ్వమ్**
**యయా పశ్యంతి యోగినః।**

అక్షరమగు ఆత్మయే ఆధారముగా అయి 'శక్తి' మొదట ప్రదర్శనమగుచూ 'మూలాధారము'గా చెప్పబడుతోంది. ఆత్మయే ఆధారముగా బయల్వెడలు శక్తియే మూలాధారశక్తి. సూక్ష్మబీజము నుండి అంకురము జనిస్తున్నట్లుగా ఆ మూలాధార బిందురూపము నుండి **నాదము** (Sound) జనిస్తోంది. (ఇది 'పర' అని ప్రసిద్ధము)

**"పశ్యన్తి"** : మూలాధారమునుండి స్వాభావికమై జనించుచున్న నాదము యొక్క తదనంతర ప్రదర్శనమే ఈ విశ్వము.

ఈ విధంగా దేనిచే యోగులు విశ్వమును స్వస్వరూపాత్మానంద స్వరూపంగా చూచుచున్నారో, అదియే **'పశ్యంతి'** అని విజ్ఞులు పిలుస్తున్నారు. విశ్వమును నాదరూపంగా దర్శించటం - పశ్యన్తీ.

---

**హృదయే వ్యజ్యతే ఘోషో**
**గర్జత పర్జన్య సన్నిభః।**
**తత్ర స్థితా, సురేశానః**
**'మధ్యమా' ఇతి అభిధీయతే॥**

**మధ్యమా :** ఓ సురేశ్వరా! హృదయము నందు వర్షపు శబ్దము వలె గర్జన ఘోష - యోగాభ్యాసముచేస్తూ ఉండగా వినబడుచున్నది. అట్టి హృదయ స్థానము నుండి ఏ వర్ష శబ్దము వినబడుచున్నదో, అది **'మధ్యమా'** అని చెప్పబడుచున్నది. నాదమును వినసొంపుగా చేయు వంపుసొంపులే మధ్యమము.

---

**2.** ప్రాణేన చ స్వరాఖ్యేన
ప్రథితా వైఖరీ పునః।
శాఖా పల్లవ రూపేణ
తాల్వాది స్థానఘట్టనాత్।
'అ' కారాది → 'క్ష' కార అన్తాని
అక్షరాణి సమీరయేత్।
అక్షరేభ్యః పదానిస్యుః, పదేభ్యో వాక్య సమ్భవః।

**వైఖరీ : 'స్వరము'** అనునదే ప్రాణరూపంగా **'వైఖరీ'**గా ప్రసిద్ధమైయున్నది. మూలాధారశక్తి (పరాశక్తి) వైఖరీ'గా శబ్దత్వము వహిస్తోంది. స్థానము → గొంతు.

ఆ మూలాధారశక్తి 'తాలు' (నాలుక) మొదలైన ఆయా స్థానములలో, వృక్షశాఖలు, ఉపశాఖలు విస్తరించు రీతిగా (శాఖాపల్లవరూపంగా) శబ్దమును జనింప జేస్తోంది. 'అ' మొదలుకొని 'క్ష' వరకు అక్షర శబ్దములన్నీ సమీకరిస్తోంది.

'అ-క్ష' అక్షర ఉచ్చారణల నుండి **శబ్దములు,** శబ్దముల నుండి **పదములు,** బయల్వెడలుచున్నాయి. పదముల నుండి **వాక్యములు** సంభవిస్తున్నాయి.

---

సర్వ వాక్యాత్మకా మన్త్రా
వేదశాస్త్రాణి కృత్స్నశః
పురాణాని చ కావ్యాని భాషాశ్చ
వివిధా అపి, సప్త స్వరాశ్చ గాథాశ్చ
సర్వే నాద సముద్భవాః।

మూలాధారశక్తి వైఖరీరూపంగా స్వరరూపంగాను, నాలుక గొంతు స్థానములలో కలిగించు ఘట్టనలచే 'అ' నుండి 'క్ష' వరకు శబ్దములుగాను, శబ్దములు పదములుగాను, పదములు వాక్యములుగాను అగుచుండగా, సర్వమంత్రములు, వేదములు, శాస్త్రములు, పురాణములు, కావ్యములు, వివిధ భాషలు, సప్త స్వరములు (స-రి-గ-మ-ప-ద-ని), గానములు.. ఇవన్నీ "నాదము" నుండి సముద్భవించినవి అగుచున్నాయి.

---

**3.** ఏషా సరస్వతీ దేవీ
సర్వభూత గుహాశ్రయా।
వాయునా వహ్ని యుక్తేన
ప్రేర్యమాణా శనైః శనైః,
తత్ వివర్త పదైః వాక్యైః
ఇత్యేవం వర్తతే సదా।

ఈవిధంగా పరాశక్తి (లేక) మూలాధారశక్తి 'స' 'రస' వతీ = శబ్దరసవతీ = సరస్వతీ = శబ్దము+అర్థము+భావన రూపిణిగా, సరస్వతీదేవి → సర్వజీవుల ("నోరు-హృదయము" అనే) గుహలను ఆశ్రయించి ఉన్నది.

నెమ్మది నెమ్మదిగా వాయువు - అగ్నిలతో కూడి ప్రేరణాశక్తి అయి ప్రకాశిస్తోంది.

ఆ సర్వతీశక్తియే **కుండలినీ దేవి, మూలధారశక్తి** కూడా! ఆశక్తి ఈ విధంగా నాదములుగా, శబ్దములుగా, అక్షరములుగా, పదములుగా, వాక్యములుగా వర్తించుచున్నది. వాక్యములే వేద-మంగళ శ్లోకములుగా సంప్రదర్శమగుచున్నాయి. శబ్దము, అర్థము కూడా నాదస్వరూపములే.

**య ఇమాం వైఖరీం శక్తిం, యోగీ స్వ-ఆత్మని పశ్యతి,**
**స వాక్ సిద్ధిమ్ అవాప్నోతి, సరస్వత్యాః ప్రసాదతః।**
**వేదశాస్త్ర పురాణానాం, స్వయంకర్తా భవిష్యతి।**

ఏ యోగి అయితే ఈ వైఖరీ అనబడే సరస్వతీ - **"మూలాధార - మూలశక్తి"**ని తన ఆత్మయందు ఆత్మగా చూచుచున్నాడో, అట్టివాడు సరస్వతీ ప్రసాదముగా **'వాక్‌సిద్ధి'**ని పొందుచున్నాడు. 'వాక్ స్వరూపము'ను సంతరించుకొను ప్రజ్ఞాసహితుడు - అగుచున్నాడు.

వేదశాస్త్ర పురాణలకు ఆతడు స్వయంకర్తగాను, వాటి వాటి గానములకు తన **స్వస్వరూపమే విషయమైనట్లుగా** లక్ష్యసిద్ధిని పొందుచున్నాడు.

---

**అక్షర సూత్రాత్మ**

**యత్ర బిన్దుశ్చ నాదశ్చ,**
**సోమ-సూర్య- అగ్ని - వాయవః**
**ఇన్ద్రియాణి చ సర్వాణి**
**లయం గచ్ఛన్తి, సువ్రత!**
**→ వాయువో యత్ర లీయంతే,**
**→ మనో యత్ర విలీయతే,**
**→ యం లబ్ధ్వా చ అపరం లాభం మన్యతే న అధికం తతః,**
**→ యస్మిం స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే,**
**→ యత్ర ఉపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,**
**→ యత్ర చ ఏవ ఆత్మనా ఆత్మానమ్ పశ్యన్**
**ఆత్మని తుష్యతి,**
**→ సుఖమ్ ఆత్యన్తికం యత్ తత్**
**"బుద్ధిగ్రాహ్యమ్, అతీంద్రియమ్",**
**→ ఏతత్ క్షర - క్షరాతీతమ్**
**'అనక్షరమ్' ఇతి ఈర్యతే,**
**→ క్షరః సర్వాణి భూతాని।**
**సూత్రాత్మా "అక్షరమ్" ఉచ్యతే।**

**క్షర అక్షరాతీత సూత్రాత్మ**

***ఓ సువ్రతా! బ్రహ్మదేవా! కేవలాత్మ (లేక) సూత్రాత్మ ఎట్టిదంటే....,***

- ఎక్కడ బిందువు, నాదము, సోమ- సూర్య- అగ్ని -వాయువులు, (చూపు-రుచి-వినికిడి - రుచి -స్పర్శ మొ॥న) సర్వేంద్రియములు తిరిగి పుట్టింటికి చేరినట్లుగా 'లయము' పొందుచున్నాయో,
- ప్రాణశక్తి రూపమగు వాయువు, ఆలోచనాశక్తి రూపమగు మనస్సు తిరిగి ఎద్దానిలో విలీనము పొందుచున్నాయో..,
- ఏది లభించిన తరువాత ఇక ఈ జీవునికి ఇంక పొందవలసిన దంటూ మరింకేదీ కించిత్తు కూడా అంతకుమించినదై శేషించి ఉండదో..,
- ఏ స్థితినైతే ఈ జీవుడు తన యందు సిద్ధించుకున్న తరువాత ఇక గొప్పదుఃఖ సందర్భములలో కూడా వేదన, దిగులు చెందడో..,
- ఎచ్చట చిత్తము సంయోగము చెందుతూ నిరుద్ధము (నిరోధము) పొంది ఉపరమిస్తుందో, (ఉప్పుగడ్డ నీళ్లలో జారినప్పుడు అద్దాని ఆకారమువలె) ఉపశమిస్తుందో, సశాంతిస్తుందో,
- ఎప్పుడైతే జీవాత్మ పరమాత్మ దర్శనముచే అఖండాత్మత్వము పొంది పరమానందిస్తుందో..,
- ఇంద్రియములకు సంబంధించనిది, ఇంద్రియాతీతమైనది, బుద్ధిచేతనే ఆస్వాదించబడునది అగు ఏ ఆత్యంతిక సుఖము స్వయముగా అనుక్షణికమై అనుభూతమౌతుందో,

**అదియే క్షర-అక్షరములకు కూడా అతీతమైన 'అనక్షరము' అనబడు స్వస్వరూపాత్మ!!**

ఓ బ్రహ్మదేవా! ఇక్కడి సర్వ పాంచభౌతికమైన దృశ్యమంతా సర్వ జీవ-భేదములన్నీ నశించబోవుచున్నాయి. (యత్ దృశ్యమ్ తత్ నశ్యమ్). **పూదండలోని దారము వలె సర్వజీవులలో ఏకస్వరూప-అంతర్యామి యగుదానిని "అక్షరము"-అని అంటారు. అది క్షరము కాదు. నశించదు.**

---

**4. అక్షరం పరమం బ్రహ్మ**
**నిర్విశేషం నిరంజనమ్।**
**అలక్షణమ్, అలక్ష్యం తత్।**
**(తత్) అప్రతర్క్యమ్, అనూపమమ్।**
**అపారపారమ్, అచ్ఛేద్యమ్।**
**అచిన్త్యమ్, అతినిర్మలమ్।**
**ఆధారం సర్వభూతానామ్।**
**అనాధారం, అనామయమ్।**
**అప్రమాణమ్, అనిర్దేశ్యమ్।**

**అట్టి అక్షరమగు పరబ్రహ్మము-సమస్తము లయించిన తరువాత కూడా** శేషించినదై ఉంటుంది. కాబట్టి → **నిర్విశేషము;**

ఎట్టి దోషములు అద్దానిని స్పృశించజాలవు కాబట్టి → **నిరంజనము**

కథలోని పాత్రల లక్షణములు కథా రచయితకు ఆపాదించలేని రీతిగా → **అలక్షణము.**

అద్దానికి మరొక అన్యమగు లక్ష్యము ఏదీ లేదు. కాబట్టి **తత్ - అలక్ష్యమ్**

తర్క - వితర్కములచే అనుభవమయ్యేది కాదు. **అప్రతర్క్యము.**

ఉపమానము(Copmarative example) లేనిది. **అనూపము.**

అంతు దొరకనిది. **అపారపారమ్**

ఛేదము పొందనిది. **అచ్ఛేద్యము.**

**అప్రమేయమ్, అతీన్ద్రియమ్।**
**అస్థూలమ్, అనణుః, (అ)హ్రస్వమ్।**
**అదీర్ఘమ్, అజమ్, అవ్యయమ్।**
**అశబ్ద స్పర్శ రూపః తత్,**
**అచక్షుః శ్రోత్ర నామకమ్।**
**సర్వజ్ఞం, సర్వగం, శాంతం॥**

**సర్వేషాం 'హృదయే' స్థితమ్।**

- చింతనలకు జననస్థానము. అందుచేత చింతనలకు అందనిది. **అచిన్త్యము.**
- దోషరహితమైనది. **అతినిర్మలము.**
- సర్వజీవులకు **ఆధారము.**
- అద్దానికి ఆధారము మరొకటి ఏదీ లేదు. **అనాధారము.**
- అద్దాని యందు అన్యమై మరొకటేదీ కించిత్ కూడా లేదు. **అనామయము.**
- ప్రమాణములు ఏవీ సరిపోవు. **అప్రమాణము.**
- దేనికీ సంబంధించినది కాదు. **అప్రమేయము.**
- **స్థూలము** కాదు. **సూక్ష్మము** కాదు
- జన్మరహితము **అజము.**
- శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ-చక్షు-శ్రోతములు కానట్టిది. **నిరవయవము.**
- నిర్వచించవీలు కాదు. **అనిర్దేశ్యము.**
- ఇంద్రియములకు విషయమే కాదు. **అతీంద్రియము**
- (అస్థూలమ్)। అణువు కూడా కాదు. చిన్నది కాదు. పెద్దది కూడా కాదు.
- వ్యయమనునది లేదు. **అవ్యయము.**
- ఆత్మ→ సర్వము ఎరిగి ఉన్నట్టిది. **సర్వజ్ఞము.**
- (కథారచయిత యొక్క భావనయే కథంతా నిండి ఉన్నట్లు, స్వప్నము తనదైనవాడు స్వప్నమంతా నిండి ఉన్నతీరుగా) ఆత్మ **సర్వగతము.**
- సర్వ హృదయములలో సర్వదా సంస్థితమై ప్రకాశించుచున్నట్టిది. **నిత్య ప్రకాశకము.**

---

**5. సుసంవేద్యం గురుమతాత్**
**సుదుర్బోధమ్ అచేతసామ్।**
**నిష్కళం। నిర్గుణం।, శాంతమ్,**
**నిర్వికారమ్। నిరాశ్రయమ్।**
**నిర్లేపకం। నిరాపాయం।**
**కూటస్థమ్। -అచలం। ధ్రువమ్**
**జ్యోతిషామపి తత్ జ్యోతిః।**
**తమః పారే ప్రతిష్ఠితమ్।**
**భావ అభావ వినిర్ముక్తం**
**భావనామాత్ర గోచరమ్।**
**భక్తి గమ్యం పరం తత్త్వమ్**
**అన్తర్లీనేన చేతసా।**
**భావనామాత్రమేవ**
**అత్ర కారణం, పద్మసంభవ!**

**ఓ పద్మసంభవా! బ్రహ్మాభగవన్! ఇంకా కూడా ఆత్మగురించి విను.**
గురువుల (ఆత్మానుభవజ్ఞుల)బోధచే ఆత్మ సులభముగా తెలియగలదు. బుద్ధికుశలత లేకపోతే అది తెలియటము బహుకష్టసాధ్యము. **సుదుర్బోధము.**
**స్వస్వరూపమే అయి ఉన్న పరస్వరూపము.**
కళంకరహితము. **నిష్కళము.**
ఒక రచయిత ఆతని రచనలోని ఏ పాత్ర యొక్క గుణములు కూడా - 'తనవి'గా కలిగి ఉండడు కదా! అట్లాగే ప్రపంచ రచనకు కారణమగుచూ కూడా- **ఆత్మ నిర్గుణము.**
**పరమశాంతము. నిర్వికారము. నిరాశ్రయము.**
ఆత్మ దేనిచేతనూ కప్పబడదు. **నిర్లేపము.**
అపాయము పొందునదికాదు. **నిరాపాయము.**
సర్వకాలములలోను, సర్వ అవస్థలలోను ఒకేతీరుగా ఉంటుంది. **కూటస్థము.**
ఒకచోట నుండి మరొకచోటికి కదలునది కాదు. **అచలము. ధృవము.**
ఆత్మజ్యోతిలన్నిటికీ కూడా **జ్యోతి.**
అంధకారమునకు ఆవల ప్రతిష్ఠితమైయున్నది. ఒకడు కళ్ళు మూసుకుంటే చీకటి. **ఆ చీకటిని కూడా చూచేదే ఆత్మ. (తమసః పరస్తాత్).**
ఆత్మ భావ-అభావముల నుండి విముక్తము. **అతీతము.**
ఆత్మనుభావనతోనే చూడగలము. **భావనామాత్రగోచరము.**
సర్వమునకు పరమైన అట్టితత్త్వము భక్తికి గోచరము. **భక్తిగమ్యము.**
బుద్ధిచే అంతర్లీనంగా తెలియవచ్చునది. **అంతర్లీనేన చేతసా!**
అద్దానిని అంతర్లీన భావన చేయటమే కారణముగా **కలిగియున్నది.**
మరొక కారణము కలిగిలేదు. **భావనామాత్రమేవ అత్ర కారణమ్!**

**6. యథా దేహాన్తర ప్రాప్తేః**
**కారణం భావనా నృణాన్,**
**విషయం ధ్యాయతః పుంసో,**
**విషయే రమతే మనః।**
**మామ్ అనుస్మరతః చిత్తం**
**మయ్యేవ అత్ర విలీయతే।**

ఈ జీవుడు ఈ దేహమును కలిగి ఉండటానికి, దీనిని వదలి మరొక దేహము పొందటానికి కూడా కారణము ఆతనియొక్క స్వకీయ భావనాపరంపరలే!
ఈ జీవుడు విషయములను గురించి ధ్యానము చేస్తూ ఉండగా, ఆతని మనస్సు సదా విషయములందే రమించటం జరుగుచున్నప్పుడు విషయములందే దేహముల రాకపోకలను అనుభవంగా పొందుచున్నాడు. ఆతని చిత్తము (సర్వతత్త్వ స్వరూపుడనగు) నన్నే తలచుచూ ఉండగా నాయందే ఈ జీవుని చిత్తము విలీనము పొందగలదు. 'నేను' అను నిశ్చల స్మరణమునందే 'నాది' అనబడు సంచలనమంతా విలీనము పొందుచున్నది.

---

**సర్వజ్ఞత్వం పరేశత్వం**
**సర్వ సంపూర్ణ శక్తితా,**
**అనన్త శక్తిమత్వన్చ**
**మత్ అనుస్మరణాత్ భవేత్।**

నన్ను స్మరించుచుండగా ఈ జీవుడు స్వయముగా శివస్వరూపుడు అగుచున్నాడు. అటువంటి స్వస్వరూపాత్మ గురించి ఎరిగినవాడు - సర్వజ్ఞత్వము, పర- ఈశ్వరత్వము, సర్వ సంపూర్ణ శక్తిత్వము, పొందగలడు. అనంతాత్మశక్తి సమన్వితుడు అగుచున్నాడయ్యా!

---

## చతుర్థో అధ్యాయము

## చతుర్థ అధ్యాయము

<u>**అయం ప్రపంచో బ్రహ్మైవాऽస్తి। న చ ఇతరమ్॥**</u>

**"ఓం"**

**1. చైతన్యస్య ఏకరూపత్వాత్**
**భేదో యుక్తో న కర్హిచిత్।**
**జీవత్వం చ తథా జ్ఞేయం**
**'రజ్జ్వాం సర్పగ్రహో' యథా।**

'చైతన్యము' సర్వదా ఏకరూపమే కానీ, అద్వాని యందు భేదము అయుక్తమే। యుక్తమేకాదు. (భేదము లేదు).

మరి అఖండ చైతన్యమునందు ఈ జీవాత్మ ఎవరు? త్రాడులో పాము అగుపడటం ఎటువంటిదో... జీవత్వముగా చైతన్యమే అజ్ఞాన దృష్టిచే చూడబడుచున్నది.

---

**రజ్జ్వు జ్ఞానాత్ తత్ క్షణేనైవ**
**యద్వత్ రజ్జుర్హి సర్పిణీ,**
**భాతి తద్వత్ చితిః సాక్షాత్**
**విశ్వాకారేణ కేవలా।**

ఒకడు ఒక త్రాడును చూచి క్షణం కాలంలో ఆ త్రాడును 'పాము' అనుకొని, మరుక్షణం అనేక వికారములు పొందుచున్నాడు కదా!

అదేవిధంగా సాక్షాత్ చిత్ స్వరూపమగు ఈ కనబడేదంతా అనేక భేదములతో కూడిన విశ్వాకారముగా క్షణములో కనబడటం జరుగుతోంది.

---

**ఉపాదానం ప్రపంచస్య**
**బ్రహ్మణో అన్యత్ న విద్యతే,**
**తస్మాత్ సర్వ ప్రపంచోऽయమ్**
**బ్రహ్మైవ అస్తి। - న చ ఇతరత్।**

ఈ ప్రపంచమునకు బ్రహ్మమునకు వేరైన ఉపాదాన కారణము మరింకేదీ లేదు. అందుచేత ఈ సర్వప్రపంచము బ్రహ్మమే అయి ఉన్నది. మరింకేదీ అయి ఉండలేదు.

ప్రపంచము పొందుచున్న ఈ జీవుడు కూడా బ్రహ్మమే! ఆ జీవుని తన అంశగా కలిగి ఉన్నది. బ్రహ్మము అనగా? - "వ్యాపించునది, వ్యాపింపజేయునది" అని శబ్దార్థం.

---

**2. వ్యాప్య-వ్యాపకతా మిథ్యా, సర్వమ్ ఆత్మేతి శాసనాత్।**
**ఇతి జ్ఞాతే పరే తత్త్వే, భేదస్య అవసరః కుతః?**

అయితే, "సర్వము ఆత్మయే" అను శాసనము (Thump-Rule) ను అనుసరించి "వ్యాపింపజేయునది - వ్యాపించునది".. అను వివరణా వ్యవహారమంతా మిథ్యయే! ఈ విధంగా పరతత్త్వము తెలుసుకున్న తరువాత ఇక "జీవుడు - శివుడు; విశ్వముగా వ్యాపించునది - విశ్వమును వ్యాపింపజేయునది" - అను భేదముతో అవసరమేముంటుంది? ఆ భేదమే లేనిదగుచున్నది.

---

**బ్రహ్మణః సర్వభూతాని, జాయన్తే పరమాత్మనః ।**
**తస్మాత్ "ఏతాని బ్రహ్మైవ భవంతి"**
**ఇతి విచిన్తయ।**

సర్వభూతజాలము 'పరమాత్మ' యగు బ్రహ్మమునందే బయల్వెడలు చున్నది. **"అందుచేత వివిధంగా కనిపిస్తున్న భూతజాలమంతా (సర్వజీవులు) అఖండమగు బ్రహ్మమే"** అనే విషయము విచిన్తనము చేయాలి.

---

**బ్రహ్మైవ సర్వనామాని, రూపాణి వివిధాని చ।**
**కర్మాణ్యపి సమగ్రాణి భాసన్తీవ - ఇతి భావయ!**

ఈ దృశ్యంగా కనిపిస్తున్న సర్వకర్మ వ్యవహారములు, సర్వ నామములు, సర్వ రూపములు **ఈఈ విధంగా కనిపిస్తున్నప్పటికీ సర్వదా ఏకమగు బ్రహ్మమే అయి ఉన్నది** - అని భావించబడుగాక! **ఇదియే సత్యము. అనునిత్యమైనట్టి వాస్తవము.**

| | |
|---|---|
| **సువర్ణాత్ జాయమానస్య<br>సువర్ణత్వన్-చ శాశ్వతమ్,<br>బ్రహ్మణో జాయమానస్య<br>బ్రహ్మత్వన్చ తథా భవేత్।** | బంగారము "గాజులు, గొలుసులు, ఉంగరములు, అరవంకెలు" మొదలైన అనేక ఆభరణములుగా కనిపిస్తున్నప్పటికీ వాటన్నిటిలో సువర్ణత్వమే సత్యము, శాశ్వతము కదా! అదేవిధంగా బ్రహ్మము నుండి బయల్వెడలుచున్న ఈ ప్రపంచమంతా కూడా 'బ్రహ్మత్వము' - అనునది సహజ స్వభావముగా కలిగియే ఉన్నది. -అన్యంగా అనిపించేదంతా సందర్భకల్పన మాత్రమే! ఊహించువానియొక్క ఊహాజనిత దృశ్యానుభవము వంటిదే! బ్రహ్మముయొక్క సమక్షములో 'నేను జీవుడను' - అనునది కల్పనామాత్రమే! |
| **3. స్వల్పమపి అన్తరం కృత్వా<br>జీవాత్మ పరమాత్మనోః,<br>యః తిష్ఠతి స మూఢాత్మా<br>భయం తస్యాపి భాషితమ్।** | అందుచేత హే బ్రహ్మభగవాన్!<br>(1) జీవాత్మ (2) పరమాత్మ - ఈ రెండింటిలో కొంచెము భేదము కల్పించుకొనినప్పటికీ కూడా, ఆతడు మూఢాత్ముడే అగుచున్నాడు. ఆతని పట్ల భయము ఉండనే ఉంటుంది. |
| **యత్ అజ్ఞానాత్ భవేత్ ద్వైతమ్<br>'ఇతరః' తత్ ప్రపశ్యతి,<br>ఆత్మత్వేన తదా సర్వం<br>న ఇతరః తత్ర చ అణ్వపి।** | ఏది అజ్ఞాన కారణంగా (లోకములు, లోకపాలకులు, దైవము మొదలైన) ఇతరమును ద్వైతముగా చూస్తున్నాడో, అదంతా కూడా ఆత్మగానే చూడబడునుగాక! ఆత్మకు వేరుగా తత్ - ఇతరమై అణువంత కూడా ఎక్కడా ఏదీ లేదు. |
| **అనుభూతోఽపి అయం లోకో<br>వ్యవహారక్షమోఽపి సన్,<br>అసత్‌రూపో,<br>యథా స్వప్న ఉత్తర క్షణ బాధితః।** | ఈ దృశ్యము, ఈ లోక వ్యవహారము - ఇదంతా కూడా ప్రత్యక్షంగా అనుభూతము అగుచూ ఉన్నప్పటికీ (లేక) వ్యవహారికమై కన్పట్టుచున్నప్పటికీ → ఇదంతా అసత్‌రూపమే!<br>నిదుర లేచిన మరుక్షణం స్వప్నదృశ్యమంతా అదృశ్యమగు రీతిగా, ఈ జగత్ దృశ్యమంతా కూడా<br>(1) దేహానంతరము (లేక) (2) ఆత్మజ్ఞానాంతరము బాధితమే అగుచున్నది. కల్పనంతా కల్పించువానియందే లయమును పొందుచున్నది. |
| **<u>స్వప్నే జాగరితం నాస్తి।</u><br><u>జాగరే స్వప్నతా నహి।</u><br><u>ద్వయమేవ లయే నాస్తి,</u><br><u>లయోఽపి హి అనయోః న చ।</u>** | → స్వప్నసమయంలో జాగ్రత్తు నాస్తి (లేనిది) అగుచున్నది.<br>→ జాగ్రత్తులో స్వప్నము నాస్తి. (లేనిది) అగుచున్నది.<br>→ లయ సమయంలో అవి రెండు లేకుండాపోతున్నాయి.<br>అందుచేత స్వప్న జాగ్రత్తులు రెండూ కూడా స్వతఃగా లేవు. (ఆత్మజ్ఞానముచే) **జీవాత్మ-పరమాత్మ అను రెండూ లేనివై ఏకత్వము పొంది, కేవలాత్మయే శేషిస్తోంది.** |
| **4. త్రయమేవ భవేత్ మిథ్యా<br>గుణత్రయ వినిర్మితమ్।<br>అస్య ద్రష్టా గుణాతీతో<br>నిత్యో హి ఏష చిదాత్మకః।** | 'గుణత్రయము' అని పిలువబడుచున్న సత్త్వ-రజో-తమోగుణములచే ఈ జగదనుభవము నిర్మితమౌతోంది. అయితే, త్రిగుణములు గుణాతీతాత్మ సమక్షంలో మిథ్యయే అయి ఉన్నాయి.<br>గుణాతీత దృష్టిచే అట్టి గుణాతీత చిదాత్మయే నిత్యము. |
| **యద్వత్ మృది ఘటభ్రాంతిః,<br>శుక్తౌ హి రజత స్థితిః,<br>తద్వత్ బ్రహ్మణి జీవత్వం<br>వీక్షమాణే వినశ్యతి।** | ఏవిధంగా అయితే, **మట్టి** దృష్ట్యా **'మట్టి కుండ'** అను దానిలో కుండ భ్రాంతి మాత్రమే అయి ఉన్నదో.., (మట్టికి వేరు కాదో),<br>ముత్యపు చిప్పలో 'వెండి' అనునది భ్రాంతి మాత్రమేనో,<br>.... అదేవిధంగా **బ్రహ్మము** నందు కనబడుచున్న **జీవత్వము భ్రమ మాత్రమే. బ్రహ్మజ్ఞానముచే జీవత్వము అనబడునది సమూలంగా వినశ్యమగుచున్నది.** |
| **యథా మృది 'ఘటో' నామ,<br>కనకే కుండలాభిధా,<br>శుక్తౌహి రజత ఖ్యాతిః<br>'జీవ' శబ్దః తథా పరే।** | → 'మట్టి కుండ'- అగుదానిలో 'కుండ' అనునది వలెను,<br>→ "బంగారపు కుండలము" - అనుదానిలో 'కుండలము' అనబడేవలెను,<br>→ "ముత్యపు చిప్పలో వెండి మెరపు" - అను దానిలో వెండి వలెను, బ్రహ్మము నందు జీవుడు అనబడునది లోక ప్రసిద్ధమై ఉంటోంది. (ఈ జీవుడు బ్రహ్మమునకు వేరు కాదు). |

**యథైవ వ్యోమ్ని నీలత్వం,**
**యథా నీరం మరుత్ స్థలే,**
**పురుషత్వం యథా స్థాణౌ,**
**తద్వత్ విశ్వం చిదాత్మని।**
**యథైవ శూన్యో వేతాళో,**
**గంధర్వాణాం పురం యథా,**
**యథా ఆకాశే ద్వి-చంద్రత్వం, -**
**తద్వత్ సత్యే జగత్ స్థితిః।**

ఆకాశంలో నీలత్వము వలెను, యండమావులలో నీటి తరంగముల వలెను,
చీకటిలో చూచిన బండరాయిలో దొంగ (పురుషుడు) కనబడినట్లు
**చిదాత్మయందు 'విశ్వము' అనునది 'ఉన్నది'గా అగుచున్నది.**
శూన్యములో భేతాళుడు (బాలునికి) స్ఫురించు తీరుగా,
(ఊహాకల్పనలో) గంధర్వనగరము వలెను,
(మెల్లకన్ను కలవానికి) ఆకాశంలో రెండవ చంద్రుడు కనిపించునట్లుగా..,
**ఈ జగత్తు సత్యమే అని అజ్ఞాన దృష్టికి అనిపించుచూ స్థితించుచున్నది.**

---

**యథా తరంగ కల్లోలైః,**
**జలమేవ స్ఫురతి అలమ్,**
**ఘటనామ్నా యథా పృథ్వీ,**
**పట నామ్నా హి తన్తవః,**
**జగత్ నామ్నా చిత్ ఆభాతి,**
**<u>సర్వం బ్రహ్మైవ కేవలమ్।</u>**

ఏవిధంగా అయితే, నిశ్చలజలంతో కల్లోలితంగా కనిపించే తరంగాలు ప్రదర్శితమై కనిపిస్తూ ఉన్నాయో,
మట్టియే 'ఘటము (కుండ)' అను పేరుతో ఏ విధంగా లోక ప్రసిద్ధమై ఉంటోందో...
ప్రత్తిధారవుపోగులే వంచ, ఉత్తరీయుము'' మొదలైనవిగా కనబడుచున్నాయో,
... చిత్‌యే, 'జగత్తు' అను పేరుతో చెప్పబడుచున్నది. సర్వము సర్వదా కేవలము **"బ్రహ్మమే"** - అయి ఉన్నది.

---

**5. యథా వన్ధ్యా సుతో నాస్తి,**
**యథా నాస్తి మరౌ జలమ్,**
**యథా నాస్తి నభో వృక్షః,**
**తథా నాస్తి జగత్ స్థితిః।**

గొడ్రాలికి రెండవ కుమారుడు ఉంటాడా?
మృగతృష్ణలో (ఎండమావులలో) నీరుంటుందా?
ఎక్కడైనా 'ఆకాశవృక్షము' అనునది ఉంటుందా? నీలాకాశంలో వృక్షము ఎట్లా? అట్లాగే **జగత్తుకు స్థితియే లేదు.**

---

**గృహ్యమాణే ఘటే యద్వత్**
**మృత్తికా భాతి వై బలాత్,**
**వీక్షమాణే ప్రపంచే తు**
**బ్రహ్మైవ ఆభాతి భాసురమ్।**

"మట్టికి వేరుగా కుండగా ఏమున్నది?" అని గ్రహించుటకై సిద్ధమగువానికి "అంతా మట్టియే! మట్టియే కుండ అయి ఉన్నది" - అని తెలియవస్తోంది కదా!
ఈ "ప్రంచముగా ఉన్నది ఏది?" అని పరిశీలించి చూస్తే, **ఇదంతా బ్రహ్మమే అయి భాసిస్తోంది.**

---

**సదైవ ఆత్మా విశుద్ధోఽస్మి హి,**
**అశుద్ధో భాతి వై సదా,**
**యథైవ ద్వివిధా రజ్జుః**
**జ్ఞానినో - అజ్ఞానినో అనిశమ్।**

నిత్య నిర్మలము, శుద్ధము అగు ఆత్మయే ఎప్పుడో ఒక సమయంలో అశుద్ధమైనదానివలె అగుపిస్తోంది,
జ్ఞానికి ఏది శుద్ధబ్రహ్మముగా, అజ్ఞానికి ఏది అశుద్ధబ్రహ్మముగా కనిపిస్తుందో,.. అది ఎటువంటిదంటే→ ఒకే త్రాడు- **తెలిసినవానికి త్రాడుగాను, తెలియనివానికి పాముగాను** అగుపించటం వంటిది.

---

**యథైవ మృణ్మయః కుమ్భః**
**తద్వత్ దేహోఽపి చిన్మయః**
**ఆత్మ-అనాత్మ వివేకో అయం**
**వృథైవ క్రియతే బుధైః।**

కుంభము (కుండ) సర్వదా మృణ్మయము (మట్టిచే మయము) అయినట్లే.
ఈ దేహము సదా చిన్మయమే! (అనగా, వాస్తవానికి ఈ దేహము మృణ్మయము కాదు).
'ఇది ఆత్మ- ఇది అనాత్మ' అనే వివేకముతో కూడిన విభజన బుధులచే చేయబడటము కూడా వృధాయే! ఎందుకంటే ఆత్మయే ఉన్నది. అనాత్మ అనునదే వస్తుతః లేదు. ఉన్నదాని నుండి 'లేనిది' విడదీసి విడమర్చి చెప్పుకోవలసిన పనేమున్నది?

**సర్పత్వేన యథా రజ్జూ,**
**రజతత్వేన శుక్తికా,**
**వినిర్ణీతా విమూఢేన**
**దేహత్వేన తథా ఆత్మతా॥**

**త్రాడు యొక్క రజ్జుత్వము (పాముగా కనిపించటము),**
**ముత్యపు చిప్పలో రజతత్వము (వెండి కనిపించటము),**
**నిర్ణయించబడుచున్న తీరుగా - మూఢునిచే ఆత్మ దేహరూప మగుచున్నట్లుగా నిర్ణయించుకోబడుచున్నది.**

ఘటత్వేన యథా పృథ్వీ,
జలత్వేన మరీచికా,
గృహత్వేన హి కాష్ఠాని,
ఖడ్గత్వేనైవ లోహతా,
**తద్వత్ ఆత్మని దేహత్వం**
**పశ్యతి ⟶ అజ్ఞానయోగతః।** ఇతి॥
ఇతి చతుర్థో అధ్యాయః॥

మట్టిలో కుండ ఉన్నట్లు,
మరీచిక (యండమావులలో)నీరు ఉన్నట్లు,
కొయ్య నిర్మిత గృహంలో కొయ్య (wood) ఇల్లుగా అగుచున్నట్లు,
ఇనుము ఖడ్గముగా అగుచున్నట్లు,
అజ్ఞాన యోగము చేత మాత్రమే ఆత్మయందు దేహత్వము (అజ్ఞానిచే) చూడబడుచున్నది. (అవన్నీ ఆవిధంగా అగుటయే లేదు. అట్లాగే ఆత్మ జీవుడుగా అవటమే లేదు).

**ఇతి చతుర్థోధ్యాయము**

---

## పంచమో అధ్యాయః

## పంచమో అధ్యాయః-యోగాభ్యాసము

ఓం॥

1. శ్రీశంకరౌవాచ:
ఓం। పునః యోగం ప్రవక్ష్యామి
గుహ్యం బ్రహ్మస్వరూపకమ్।
సమాహిత మనా భూత్వా
శృణు బ్రహ్మన్! యథాక్రమమ్।

**శ్రీశంకర భగవానులు** : హే బ్రహ్మన్! ఓ హిరణ్యగర్భా! చతుర్ముఖ బ్రహ్మభగన్! జగత్ పితామహా! మరల మనము బ్రహ్మస్వరూపకమగు 'యోగము' గురించి మరికొన్ని విశేషాలు చెప్పుకుంటున్నాము. వినండి.

ఇప్పుడు ఆయా యథాక్రమము (The sequential path)గా చెప్పుకుంటున్నాము. **'సర్వసమత్వ దర్శనము'** అనే గుణ విశేషముతో సమాహిత చిత్తులై వినండి.

---

దశ ద్వారపురం దేహమ్,
దశ నాడీ మహా పథమ్,
దశభిః వాయుభిః వ్యాప్తం,
దశేన్ద్రియ పరిచ్ఛదమ్,

**ఈ దేహము ఎటువంటిది?**

→ 10 ద్వారములు గల పురము - (2 కళ్లు; 2 చెవులు; 1 నోరు '2' ముక్కు పుటములు; గుదము; శిశ్నము; బ్రహ్మరంధ్రము)

→ దశ (10) నాడులతో కూడిన మహాపథము కలిగి ఉన్నది. (ఇడ; పింగళ; సుషుమ్న; (సుషుమ్న నుండి) అలంబుస, కుహూ నాడులు; (సుషుమ్నకు దక్షిణంగా) గల పింగళ, (మధ్యగా) పూస; పయశ్వని; సుషుమ్నకు (పశ్చిమంగా) సరస్వతీ; శంఖిణి; గాంధారి; హస్తి జిహ్వా; విశ్వదర → దశ(10) వాయువులతో వ్యాప్తమై యున్నది).

**దశ వాయువులు**

('5' ప్రాణములు = ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానములు

'5' ఉపప్రాణములు = నాగము; కృకరము, కూర్మము, ధనంజయము, దేవదత్తము).

→ దశ (10) ఇంద్రియములచే ఆచ్ఛాదితమై అతికించబడి ఉన్నది.

**జ్ఞానేంద్రియములు** = శ్రోత్రము (చెవులు) త్వక్కు (చర్మము); చక్షువులు (కళ్ళు); జిహ్వ (నోరు), ఘ్రానేంద్రియము (ముక్కు)

**కర్మేంద్రియములు** : వాక్ ఇంద్రియము; హస్తేంద్రియము; పాదములు; ఉపస్థ; పాయ్వుంద్రియము;

---

షడాధారాపవరకం,
షడన్వయ మహావనమ్,
చతుష్పీఠ సమాకీర్ణం,
చతురామ్నాయ దీపకం,
బిన్దు నాద మహాలింగం,
విష్ణు లక్ష్మీ నికేతనమ్।

**ఇంకా ఈ శరీరము...,**

→ షట్(6) ఆధారములు అనే మునుగు కలిగియున్నట్టిది (మూలాధారము; స్వాధిష్ఠానము; మణిపూరకము; అనాహతము; విశుద్ధము; ఆజ్ఞా);

→ షట్ (6) అన్వయములు కలిగిన మహావనము. (**చెప్పటము; వినటము; మాట్లాడటము, రుచిచూడటము; చూడటము; సమన్వయించుకోవటము**).

4 పీఠములచే సమాకీర్ణమైయున్నది (స్థూల; సూక్ష్మ; కారణ; మహాకారణ)

| | |
|---|---|
| **... దేహం విష్ణ్వాలయం ప్రోక్తం,**<br>**సిద్ధిదం సర్వ దేహినామ్॥** | 4 ఆమ్నాయములచే ఉద్దీపితమైయున్నది.<br>(వేదము; సంప్రదాయము; ఉపదేశము; పరిశీలన)<br>బిందు-నాదములచే మహాలింగస్వరూపము<br>విష్ణువు (ఉనికి) - లక్ష్మీ (జ్ఞానముల) సమేతము<br>సర్వ దేహులకు సిద్ధిని ప్రసాదించునదై, ఈ దేహమే "విష్ణ్వాలయము" అనబడుతోంది. |
| **గుద-మేఢ్రాన్తరాళస్థం, <u>మూలాధార త్రికోణకమ్</u>** △<br>**శివస్య జీవరూపస్య, స్థానం తద్ధి ప్రచక్షతే।**<br>**- యత్ర 'కుండలినీ' నామ 'పరాశక్తిః' ప్రతిష్ఠితా,**<br>**- యస్మాత్ ఉత్పద్యతే వాయుః,**<br>**- యస్మాత్ వహ్నిః ప్రవర్తతే,**<br>**- యస్మాత్ ఉత్పద్యతే హంసో,**<br>**- యస్మాత్ నాదః ప్రవర్తతే,**<br>**- యస్మిన్ విలీయతే హంసో,**<br>**- యస్మాత్ ఉత్పద్యతే మనః,**<br>**.. తత్ ఏతత్ కామ రూపాఖ్యం**<br>**పీఠం, కామఫలప్రదం,** | ***<u>ఇంకా ఈ దేహంలో షట్ చక్రాలు ఉన్నాయి.</u>***<br>**(1) <u>మూలాధారము</u> :**<br>గుదము - మేఢ్రముల అంతరముగా త్రికోణకము అగు **"మూలాధార చక్రము"**.. ఏర్పడియున్నది.<br>**"ఈ మూలాధారము జీవరూపుడుగా ఉన్న శివునికి స్థానము"** - అని చెప్పబడుచున్నది.<br>ఈ మూలాధారచక్రము ఎట్టిది?<br>→ ఎక్కడ 'కుండలినీ' అను పేరు గల పరాశక్తి ప్రతిష్ఠితమైయున్నదో,<br>→ ఎక్కడ వాయువు ఉత్పన్నమగుచున్నదో,<br>→ దేనివలన అగ్ని దేహములో ప్రవర్తనశీలమగుచున్నదో..,<br>→ దేనియందు 'హంస' (సోఽహమ్) రూప కదలిక ఉత్పన్నమగుచున్నదో,<br>→ దేనియందు 'నాదము' ప్రవర్తించుచున్నదో,<br>→ దేనియందు హంస (ఊపిరి)విలీనము పొందుచున్నదో..,<br>→ దేనియందు ఆలోచనారూపమగు మనస్సు ఉత్పన్నమగుచున్నదో..,<br>అదియే **'కామరూపము'** అని, **'కామఫలప్రదము'** అని చెప్పబడుచున్న **చక్రస్థానము.** |
| **స్వాధిష్ఠాన ఆహ్వాయం చక్రం**<br>**లింగం మూలం షడశ్రకమ్॥** | **(2) స్వాధిష్ఠాన చక్రము** : లింగ మూలమున ఉన్నది, 6 కోణములు గలది. |
| **2.** నాభిదేశే స్థితం చక్రం<br>దశారం <u>మణిపూరకం।</u> | **(3) మణిపూరకచక్రము** : నాభి (బొడ్డు) స్థానములో ఉన్నట్టిది. 10 రెక్కలు (కోణములు) కలిగినది. |
| ద్వాదశారం మహాచక్రం<br>హృదయే చ అపి <u>అనాహతమ్।</u><br>తదేతత్ <u>'పూర్ణగిరి'</u>-ఆఖ్యం<br>పీఠం, కమల సంభవ! | **(4) అనాహత చక్రము** : హృదయ స్థానమున ఉన్నట్టిది.<br>12 రెక్కలు (రేకులు) కలిగి ఉన్నట్టిది.<br>దీనిని **"పూర్ణ గిరిపీఠం"** అని కూడా అంటారు. |
| కంఠకూపే '<u>విశుద్ధాఖ్యం</u>', యత్ చక్రం షోడశాశ్రకమ్।<br>'పీఠం' <u>జాలంధరం</u>' నామ, తిష్ఠతి అత్ర, చతుర్ముఖ!<br>'<u>ఆజ్ఞా</u>' నామ భృవోః మధ్యే<br>ద్విదళన్ చక్రమ్ ఉత్తమమ్।<br>ఉద్యాణాఖ్యం మహాపీఠమ్<br>ఉపరిష్టాత్ ప్రతిష్ఠితమ్।<br>స్థానాని ఏతాని దేహేఽస్మిన్<br><u>శక్తిరూపం ప్రకాశతే।</u> | **(5) విశుద్ధ చక్రము** : కంఠమూలస్థానములో సంస్థితమైయున్నది. '16' రేకులతో ప్రకాశించుచున్నది.<br>ఓ చతుర్ముఖా! ఇక్కడ చతుర్ముఖము అయినట్టి **'జాలంధరము'** అనే పీఠము ప్రతిష్ఠితమైయున్నది.<br>**(6) ఆజ్ఞాచక్రము** : భ్రూమధ్య స్థానమున ఉన్నట్టిది. రెండు దళములు గల ఉత్తమ చక్రము ఉన్నది.<br>**ఉద్యాణ మహాపీఠము** : ఇది భ్రూమధ్యకు పైభాగంగా (Fore face) ప్రతిష్ఠితమై యున్నది.<br>**దేహమునందు ఇవన్నీ శక్తిరూపాలుగా ప్రకాశితము అగుచున్నాయి.** |

| | |
|---|---|
| **చతురశ్రా ధరణీ ఆదౌ**<br>**'బ్రహ్మా' తత్ర అధి దేవతా।** | **అధిదేవతా నిర్ణయము**<br>**ధరణీ (భూ)** : పంచభూతములలో మొదటిది. **చతురస్ర** మండలాకారము<br>**అధి దేవత = బ్రహ్మదేవుడు (బ్రహ్మ)** |
| **అర్ధ చంద్రాకృతి జలం**<br>**'విష్ణుః' తస్య అధి దేవతా।** | **జలము (ఆపః)**: ఆకృతి = **అర్ధచంద్రాకృతి** మండలాకారము. (Half Solid)<br>**అధి దేవత = విష్ణువు** |
| **త్రికోణ మండలం వహ్నౌ**<br>**'రుద్రః' తస్య అధి దేవతా।** | **అగ్ని (వహ్ని)** : **త్రికోణ**మండలాకారము<br>**అధిదేవత = రుద్రుడు.** |
| **వాయోః బింబస్తు షట్కోణమ్**<br>**సంకర్షో అత్ర అధి దేవతా।** | **వాయు బింబము : షట్కోణ** మండలాకారము.<br>**అధి దేవత = సంకర్షణుడు.** |
| **ఆకాశ మండలం వృత్తం**<br>**పరవస్తు అధి దేవతా।** | **ఆకాశము : వృత్త** మండలాకారము.<br>**అధి దేవత= పరదేవత; పరతత్త్వము। పరమాత్మ!** |
| **నాద రూపం భ్రువోః మధ్యే**<br>**మనసో మండలం విదుః।**<br>**'శాంభవ స్థానం' ఏతత్**<br>**తే వర్ణితం, పద్మసంభవ!** | **ఓ పద్మసంభవా!**<br>భ్రూమధ్య ఆకాశంలో నాదరూపమగు **'మనోమండలము'** ఉన్నది. ఇది గమనించ బడుగాక! అది 'శాంభవీ స్థానము' అని అభివర్ణితము అయి ఉన్నది. |
| **3. అతఃపరం ప్రవక్ష్యామి**<br>**నాడీ చక్రస్య నిర్ణయమ్।**<br>**మూలాధార త్రికోణస్థా**<br>**సుషుమ్నా ద్వాదశాన్తగా।**<br>**మూలార్ధఛిన్న వంశాభా**<br>**'బ్రహ్మనాడి' ఇతి సా స్మృతా।**<br>**ఇడా చ పింగళా చ ఏవ**<br>**తస్యాః పార్శ్వే ద్వయ స్థితే।**<br>**విలంబినామ్ అనుస్యూతే**<br>**నాసికాన్తమ్ ఉపాగతే।** | ఓ బ్రహ్మభగవాన్! ఇక మనము నాడీ చక్రముల నిర్ణయము గురించి చెప్పుకుంటున్నాము.<br>**నాడీ చక్రము**<br>త్రికోణాకారమగు మూలాధారము నుండి **'సుషుమ్న'** అను నాడి - ద్వాదశాంతగతమైన (బ్రహ్మకపాలము 12 అంగుళముల వరకు) విస్తరించినదై ఉన్నది.<br>→ మూలాధారంలో సుషమ్న సగము తెగ గొట్టబడిన వెదురుపుల్ల వలె ఉంటోంది. ఇది బ్రహ్మరంధ్రము వరకు విస్తరించి యున్నది. కాబట్టి **'బ్రహ్మనాడి'** అని పిలువబడుతోంది.<br>అట్టి సుషుమ్న నాడికి ఇరువైపులా (కుడివైపుగా) **పింగళనాడి,** (ఎడమవైపుగా) **ఇడనాడి** ఉన్నాయి.<br>ఈ పింగళనాడిని అనుసరిస్తూ మరొక నాడి నాశిక (ముక్కు) చివర (ముక్కుకు పైభాగము) వరకు విస్తరించి, **'విలంబిని'** అని పిలువబడుచున్నది. |
| **ఇడాయాం హేమరూపేణ**<br>**వాయుః హేమేన గచ్ఛతి।**<br>**పింగళాయాస్తు సూర్యాత్మా**<br>**యాతి దక్షిణ పార్శ్వతః।**<br>**'విళంబిని' ఇతి యా నాడీ**<br>**వ్యక్తా నాభౌ ప్రతిష్ఠితా।** | ఇడ హేమ (బంగారు) ఛాయ కలిగినదై, ఇద్దాని యందు వాయువు హేమరూపంగా సంచారము కలిగియున్నది.<br>ఇక పింగళానాడి సూర్యాత్మకమై సుషుమ్నకు కుడివైపుగా ఉన్నది.<br>**'విలంబినీ'** అని పిలువబడు నాడి వ్యక్తముగా నాభీ ప్రదేశము నందు ప్రతిష్ఠితమై యున్నది. |
| **తత్ర నాడ్యః సముత్పన్నాః**<br>**తిర్యక్-ఊర్ధ్వమ్ - అధోముఖాః।**<br>**తత్ 'నాభిచక్రం' ఇత్యుక్తం**<br>**కుక్కుటాండమివ స్థితమ్।** | అట్టి నాడి (బొడ్డు) ప్రదేశము నందు అనేక ఉప-నాడులు ఉత్పన్నమై అడ్డముగాను, పైకి, క్రిందకు విస్తరించినవై ఉన్నాయి.<br>అనేక నాడులు బయల్వెడలు నాభిస్థానము. కోడిగ్రుడ్డు ఆకారంగా ఉన్నదై, **'నాభిచక్రము'** అని పిలువబడుతోంది. |

| | |
|---|---|
| 'గాన్ధారీ' 'హస్తి జిహ్వా' చ, తస్మాత్ నేత్రద్వయం గతే<br>'పూషా' చ 'అలంబుసా' చ ఏవ, శ్రోత్ర ద్వయమ్ ఉపాగతే। | "గాంధారి" "హస్తిజిహ్వ" అను నాడులు నాభినుండి రెండు కళ్ల వరకు విస్తరించి ఉన్నాయి. 'పూషా', 'అలంబుసా' నాడులు చెవులలోని స్థానమును పొంది ఉన్నాయి. |
| 'శూరా' నామ మహానాడీ, తస్మాత్ భ్రూమధ్యమ్ ఆశ్రితా।<br>'విశ్వోదరీ' తు యా నాడీ, సా భుంక్తే అన్నం చతుర్విధమ్।<br>'సరస్వతీ' ఇతి యా నాడీ, సా జిహ్వాన్తం ప్రసర్పతి। | 'శూరా' అని పిలువబడే మరొక మహా నాడి (నాభి నుండి) భ్రూమధ్యస్థానము వరకు విస్తరించి ఉన్నది.<br>'విశ్వోదరి' అనే ఇంకొక నాడి నోటిలో ఉండి భక్ష్య - భోజ్య - లేహ్య-చోహ్య చతుర్విధములైన అన్నమును పచనము చేస్తోంది.<br>సరస్వతీ నాడి నాలుక చివరి వరకు ప్రసరించినదై ఉన్నది |
| 'రాకాహ్వయా' తు యా నాడీ<br>పీత్వా తు సలిలం క్షణాత్।<br>క్షుతమ్ ఉత్పాదయేత్ ఘ్రాణే,<br>శ్లేష్మాణం సఞ్చనోతి చ।<br>కణ్ఠ కూప-ఉద్భవా నాడీ<br>'శంఖిని' ఆఖ్యా అధోముఖీ,<br>అన్నసారం సమాదాయ మూర్ధ్ని సంచినుతే సదా। | 'రాకాహ్వయా' నాడి క్షణంలో నీటిని త్రాగటానికి ఉపయోగిస్తోంది.<br>ఈ నాడి ముక్కు నందు క్షతము (తుమ్ము) కలిగిస్తూ, శ్లేష్మజనకము అయి ఉంటోంది.<br>కంఠ కూపమున పుట్టిన నాడి 'శంఖిణి' అని పిలువబడుచూ, అధోముఖముగా ప్రవర్తన శీలమగుచున్నది.<br>ఆ శంఖినీ నాడి అన్నసారమును స్వీకరించి, సారరసమును మూర్ధ్నియందు ఎప్పుడూ కూడబెట్టుచున్నది. |
| **4.** నాభేః అధోగతాః తిస్రో నాడయస్స్యుః అధో ముఖాః।<br>మలం త్యజేత్ 'కుహూ' నాడీ।<br>మూత్రం ముఞ్చతి 'వారుణీ'।<br>చిత్రాఖ్యా సీవనీ నాడీ, శుక్ల మోచనకారిణీ।<br>'నాడీ చక్రం' ఇతిప్రోక్తమ్॥ | నాభికి క్రిందగా '3' నాడులు అదోముఖములై ఉన్నాయి.<br>'కుహూ' నాడి మలత్యాజ్యమును, 'వారుణీ' నాడి మూత్ర విసర్జనమును నిర్వర్తిస్తూ ఉన్నాయి.<br>'చిత్రఖ్యా' అనే సీవనీ నాడి శుక్ల విమోచనమునకు కారణమగుచున్నది.<br>ఇవన్నీ 'నాడీచక్రము'లో అమర్చబడినవై ఉన్నాయి. |
| బిందురూపమ్ అతఃశృణు। | **బిందురూపము-పంచాగ్న్యోపాసన**<br>బ్రహ్మ భగవాన్! ఇప్పుడు 'బిందురూపము' గురించి వినండి. |
| బిన్దు రూపం<br>**5.** 'స్థూలం', 'సూక్ష్మం' 'పరం' చ ఏతి<br>త్రివిధం బ్రహ్మణో వపుః<br>→ స్థూలం శుక్లాత్మకం బిన్దు।<br>→ సూక్ష్మం పంచాగ్ని రూపకమ్।<br>→ సోమాత్మకః పరః ప్రోక్తః<br>సదా సాక్షీ సదా అచ్యుతః॥ | **బిన్దు రూపవివరణ..**<br>బ్రహ్మము యొక్క శరీరములు మూడు విధములు..<br>స్థూల శరీరము → శుక్లాత్మకమైన బిందురూపము<br>సూక్ష్మ శరీరము → పంచాగ్నిరూపకము<br>పరశరీరము → సోమాత్మకము (ప్రకృతితో కూడినది)<br>ఇది సమస్తమునకు సాక్షి. సర్వదా చ్యుతిలేని అచ్యుతరూపము. |
| పాతాళానామ్ అధో భాగే<br>'కాలాగ్నిః యః ప్రతిష్ఠితః,<br>స 'మూలాగ్నిః' శరీరే - అస్మిన్,<br>యస్మాత్ నాదః ప్రజాయతే। | **పంచాగ్నులు**<br>బ్రహ్మము ఎల్లప్పుడు సాక్షి అయి, చ్యుతి ఏ మాత్రము లేనిదై ఉన్నది.<br>**(1) కాలాగ్ని - మాలాగ్ని** : అధోలోకములగు పాతాళములో ఏ కాలాగ్ని సంప్రతిష్టితమై యున్నదో, అదియే ఈ పాంచభౌతిక శరీరములో కూడా సంప్రతిష్ఠితమై యుండగా అది మాలాగ్ని అనబడుతోంది. అద్దాని నుండి 'నాదము' బయల్వెడలుచూ ఉన్నది. |
| 'బడబాగ్నిః' శరీర స్థో హి, అస్థి మధ్యే ప్రవర్తతే,<br>కాష్ఠ-పాషాణయోః వహ్నిహిః అస్థి మధ్య స్థితో యథా, | **(2) బడబాగ్ని - పార్థివము** : - కాష్టము (కొయ్య), పాషాణము (రాయి)లో ఏ విధంగా అగ్ని సంస్థితమై యున్నదో, అట్లాగే శరీర మధ్యగా అస్థికలలో (బొమికలలో) అగ్ని సంస్థితమై ప్రవర్తన శీలమగుచున్నది. |

| | |
|---|---|
| కాష్ఠ పాషాణజో వహ్నిః<br>'పార్థివో' గ్రహణం గతః।<br>అంతరిక్ష గతో – వహ్నిః<br>'వైద్యుతః', స్వాంతరాత్మకః। | కొయ్య- రాయిల నుండి జనిస్తున్న అగ్నిని **'పార్థివము'** అని అంటారు.<br>**(3) వైద్యుతాగ్ని - స్వ-అంతరాత్మకము** : అంతరిక్షములో ఉన్న అగ్ని → **వైద్యుతము (విద్యుత్-మెరుపు శరీరము).** ఇది స్వఅంతరాత్మకముగా కూడా దేహములో ఉన్నది. |
| నభస్థః సూర్యరూపోఽ అగ్నిః<br>'నాభి మండలమ్'→ ఆశ్రితః।<br>విషం వర్షతి సూర్యోఽ సౌ<br>స్రవతి అమృతమ్ ఉన్ముఖః। | **(4) సూర్యాగ్ని-అమృతవర్షిణి** : ఆకాశములోని సూర్యరూపముగా ఉన్న అగ్నియే - ఈ దేహములో నాభి మండలమును కూడా ఆశ్రయించి ఉన్నది. సూర్యుడు విషమును వర్షించు స్వభావము కలిగి యుండి కూడా, నాభి వద్ద ఉన్ముఖుడై అమృతమును వర్షించుచున్నారు. |
| తాలుమూలే స్థితః చంద్రః<br>సుధాం వర్షతి అధోముఖః।<br>భ్రూమధ్య నిలయో బిన్దుః<br>'శుద్ధ స్ఫటిక సన్నిభః', మహావిష్ణోశ్చ దేవస్య<br>తత్ 'సూక్ష్మం రూపం' ఉచ్యతే॥ | **(5) చంద్రమసాగ్ని - సుధాసారాభివర్షిణి** : తాలుమూలమున సంస్థితుడైన చంద్రుడు అదోముఖముగా సుధను వర్షించుచున్నారు.<br>భ్రూమధ్యలో **బిందువు** ఉన్నది. అది శుద్ధస్ఫటికము వలె ప్రకాశమానమైయున్నది. అట్టి భ్రూమధ్యమున గల బిందువు **"మహావిష్ణువు యొక్క సూక్ష్మరూపము"** అని చెప్పబడుచున్నది. |
| **6.** ఏతత్ పంచాగ్ని రూపం యో<br>భావయత్ బుద్ధిమాన్ ధియా,<br>తేన భుక్తం చ, పీతం చ<br>'హుతమ్' ఏవ। న సంశయః।<br>సుఖ సంసేవితం స్వప్నం<br>సు జీర్ణమ్ ఇతి భోజనమ్। | **స్థూలము → శుక్లాత్మకము; బిందురూపము**<br>**సూక్ష్మాగ్ని** = (1) నాదజనన స్థానమగు కాలాగ్ని = **"మూలాగ్ని"** (2) అస్థి (బొమికల) మధ్య గల **బడబాగ్ని / పార్థివాగ్ని** (3) అంతరిక్ష వైద్యుతాగ్ని, స్వాంతరాత్మాగ్ని (4) నాభి ప్రదేశంలో సూర్యరూపాగ్ని (5) తాలు మూలంలో చంద్రరూపాగ్ని - శరీరంలోని ఈ పంచాగ్నులను - తింటూ, త్రాగుతూ ఉన్నప్పుడు సమయములలో కూడా ఏ యోగాభ్యాసి అయితే బుద్ధిమంతుడై ధీశక్తితో → భావనాపూర్వకంగా ఉపాసిస్తూ ఉంటాడో, - ఆతని "తినటము, త్రాగము" కూడా **"యజ్ఞహుతము"**తో సమానం. సంశయము లేదు - స్వప్నము భోజనము సుఖమయమౌతాయి. |
| **యోగాభ్యాసము**<br>శరీర శుద్ధిం కృత్వా ఆదౌ,<br>'సుఖమాసనమ్' ఆస్థితః।<br>పాణస్య శోధయేత్ మార్గం,<br>రేచ పూరక కుంభకైః।<br>గుదం ఆకుంచ్య యత్నేన<br>మూలశక్తిం ప్రపూజయేత్। | **యోగాభ్యాసము**<br>ఆత్మతో సం-భావనా యోగము సిద్ధించటానికి ఈ జీవుడు యోగాభ్యాసమును ఆశ్రయించాలి.<br>**(1) శరీరశుద్ధి** : మొట్టమొదట శరీర శుద్ధి కావాలి. అందుకు నియమితమైన నిద్ర, తేలికగా అరిగే ఆహారము స్వీకరించనారంభించాలి.<br>**(2) సుఖాసనమ్:** శరీర శుద్ధిని అభ్యసిస్తూ ఇక దేహము అధిక కాలము.. ధ్యాన- యోగాభ్యాసములకు అనువుగా ఉండే సుఖాసనము స్వీకరించసాగాలి.<br>**(3) ప్రాణశోధనము** : 'ప్రాణ నిరోధము'నకు ప్రాణమును ఉపాసనా వస్తువుగా ఉపయోగించుకోవాలి. ప్రాణనియామకము ద్వారా బుద్ధిని పరిశుద్ధ పరచుకొనుటకై **ప్రాణశోధన విధానము లైనట్టి రేచక - పూరక - కుంభకములను అవలంబించాలి.** |
| నాభౌ లింగస్య మధ్యే తు<br>ఉద్యాణాఖ్యన్చ బన్ధయేత్।<br>ఉడ్డీయ యాతి తేనైవ<br>శక్తితః ఉద్యాణపీఠకమ్। | **కుండలినీ ఉపాసన** : గుద స్థానంలో ఇచ్ఛ - ప్రజ్ఞాశక్తుల రూపమగు కుండలినీ శక్తి సంప్రదర్శితమై యున్నది. అట్టి మూలాధారంలో ప్రక్షిప్తమైయున్న మూలశక్తిని) బాగుగా ఉపాసించాలి. ప్రపూజించాలి.<br>**ఉడ్డీయాణము** : (1) మూలాధారంలో ఉన్న కుండలినీ శక్తిని - ఉత్ |

| | |
|---|---|
| **కథం సంకోచయేత్ కించిత్**<br>**బన్ధో 'జాలంధరో' హి అయమ్॥**<br>**బంధయేత్ ఖేచరీ ముద్రాం**<br>**దృఢచిత్తః సమాహితః।**<br>**కపాల వివరే జిహ్వా**<br>**ప్రవిష్టా విపరీతగా।**<br>**భృవోః అంతర్గతా దృష్టిః**<br>**ముద్రా భవతి 'ఖేచరీ'।**<br>**ఖేచర్యా ముద్రితం యేన**<br>**వివరం 'లంబిక-ఊర్ధ్వతః'।** | -డీయాణము → ప్రయత్న పూర్వకంగా గుద - ఆకుంచన ద్వారా నాభి-లింగములను బంధించటము. శక్తిని మూలాధారం నుండి పైకి అభ్యాస బలముతో తెచ్చి లింగ-నాభిల మధ్య నిలిపి ఉంచటము.<br>(2) అట్టి స్వాధిష్ఠాన - మణిపూరకముల మధ్య "ఉడ్యాణపీఠము" → అని అంటారు.<br>**జాలంధరముద్ర** : ఇప్పుడిక గాలిని పైకి పీల్చుట ద్వారా కంఠమును సంకోచింపజేయాలి. ఇది జాలంధరముద్ర.<br>**ఖేచరీముద్ర** : (1) పళ్లు కలువకుండా నాలుకను దవడకు తాకించుచూ, క్రమంగా నాలుకను మడతగా దవడలో భాగమును స్పృశించి ధారణ చేయటం. (ఇట్టి అభ్యాసముచే నాలుక యొక్క చిట్టచివర) విపరీతంగా వెళ్లి కపాల కుహరము (క్రింద రంధ్రము)న ప్రవేశింపజేయుటము. (2) అప్పుడిక ధ్యాసను భ్రూమధ్య స్థానంలో నిలిపి ఉంచాలి. ఇదియే **ఖేచరీ ముద్ర**. పై వివరస్థానము ఖేచరీముద్రితం అవుతుంది. (కొండ నాలుకకు చివరగా ఉన్న రంధ్రమును మడచిన నాలుక చివరతో మూసి ఉంచి, ధ్యాసను భ్రూమధ్యలో నిలపటం ఖేచరీ ముద్ర). |
| న పీయూషం పతతి అగ్నౌ<br>న చ వాయుః ప్రధావతి।<br>న క్షుధా న తృషా నిద్రా<br>నైవ ఆలస్యం ప్రజాయతే।<br>న చ మృత్యుః భవేత్ తస్య<br>యో ముద్రాం వేత్తి ఖేచరీమ్। | **"అట్టి - నాలుకను మడచి, కొండనాలుకను స్పృశిస్తూ ఉంచి, ధ్యాసను భ్రూమధ్యలో ఏర్పరచి ఉంచటము"** అనే ఖేచరీ ముద్రాభ్యాసముచే (లేక) ఖేచరీముద్రచే (1) బ్రహ్మరంధ్రము నుండి స్రవిస్తున్న అమృతము అగ్నిలో పతనము పొందదు. (2) వాయుచలనము నిరోధించబడగలదు (3) ఆకలి - దప్పికలు, నిద్ర, బద్ధకము.. ఇవన్నీ వశంలో ఉంటాయి. ఆ యోగిని బాధించవు. (4) ఆత్మతో సంయోగానుభవము సిద్ధించగలదు.<br>ఖేచరీముద్రను ఎరిగి అభ్యసించువానికి 'మృత్యువు' అనునది 'లేనిదే' అగుచున్నది. మృత్యువుకు పరిమితము, విషయము కానట్టి స్వస్వరూపమును ఆస్వాదించువాడై ఉంటాడు. |
| తతః పూర్వాపరే వ్యోమ్ని<br>ద్వాదశాన్తే, 'అచ్యుతాత్మకే'।<br>ఉద్యాణ పీఠే నిర్ద్వన్ద్వే నిరాలమ్బే నిరఞ్జనే,<br>తతః పంకజ మధ్యస్థం<br>చంద్రమండల మధ్యగమ్,<br>నారాయణమ్ అనుధ్యాయేత్<br>స్రవన్తం అమృతం సదా॥ | (అమృతము స్రవించు బ్రహ్మరంధ్రమునకు) ఆవల 12 అంగుళముల చివర ఈవల-ఆవల గల పూర్వాపర ఆకాశముగా అచ్యుతాత్ముడు (ఆత్మభావన నుండి చ్యుతి లేనివాడు) అగుచున్నాడు. అది **నిరాలంబస్థానము.**<br>**'సహస్ర పద్మము'** అనబడే 12 అం॥ అంత్యస్థానమున ఉద్యాణ పీఠము అధిష్ఠించి (ఆశ్రయించి) యున్నది. చంద్రమండల మధ్యగతమైనది - అగు అట్టి నిరాలంబ-నిరంజన ఆత్మానారాయణుని ధ్యానించాలి. అట్టి ఆత్మానారాయణుని నుండియే అమృతము సదా స్రవించుచున్నది.<br>(చంద్రమండల మధ్యగతము = The Zone where from thought and inclimination commence) |
| **7.** భిద్యతే హృదయ గ్రన్థిః<br>ఛిద్యన్తే సర్వ సంశయాః,<br>క్షీయన్తే చ అస్య కర్మాణి<br>తస్మిన్ దృష్టే పరావరే॥ | పరము (ఆవల గల జీవుని స్వరూపమునకు) కూడా పరమై (పరాత్పరమై, సర్వాంతర్యామియై)యున్న అఖండ స్వస్వరూపాత్మ దర్శనముచే →<br>→ **సృష్టి - స్థితి - లయ సంబంధమైన హృదయగ్రంథులు ముడివీడతాయి.**<br>→ సర్వ సంశయములు సమసిపోతాయి.<br>→ సర్వ కర్మ బంధములు తెగిపోతాయి. |

| సిద్ధులు | యోగసిద్ధులు |
|---|---|
| అథ సిద్ధిం ప్రవక్ష్యామి<br>సుఖోపాయం, సురేశ్వర!<br>జితేంద్రియాణాం శాన్తానాం,<br>జిత శ్వాస విచేతసామ్,<br>నాదే మనోలయం<br>బ్రహ్మన్! దూరశ్రవణకారణమ్॥ | ఓ సురేశ్వరా! ఇప్పుడిక యోగ సిద్ధులు సిద్ధించటానికి సులభమైన ఉపాయముల గురించి చెప్పుకుంటున్నాము.<br>**దూరశ్రవణ సిద్ధి**<br>(1) ఇంద్రియములను జయించి ఉండటము (ఇంద్రియములకు సేవకుడు అవకుండా, ఇంద్రియ విషయములను ఉపకరణములుగా భావించి, వాటిని సరిఅయిన రీతిగా నియమించటము);<br>(2) పరమ శాంతముతో కూడిన స్వభావము కలిగి ఉండటము;<br>(3) శ్వాసపై నిఘా. శ్వాసను జయించి ఉండటము. శ్వాసను మౌనంగా ధ్యాసపూర్వకంగా గమనిస్తూ ఉండటము.<br>(4) నాదము నందు (నాదము జనిస్తున్న స్థానములో) మనస్సును లయింపజేయటము<br>ఈ అభ్యాసముల వలన దూరశ్రవణశక్తి సిద్ధిస్తోంది. దూరముగా వినిపించే శబ్దములను ఆ యోగి వినగలడు. |
| బిన్దౌ మనోలయం కృత్వా దూరదర్శనమ్ ఆప్నుయాత్॥<br>కాలాత్మని మనోలీనం త్రికాలజ్ఞాన కారణమ్॥<br>పర కాయ -మనో యోగః,<br>పరకాయ ప్రవేశ కృత్॥<br>అమృతం చింతయేత్ మూర్ధ్ని<br>క్షుత్-తృషా విషశాన్తయే॥<br>పృథివ్యాం ధారయేత్ చిత్తం<br>పాతాళ గమనం భవేత్॥<br>సలిలే ధారయేత్ చిత్తం<br>న అమ్భసా పరిభూయతే॥ | **దూరదర్శన సిద్ధి** : మనస్సు (త్రిపుటిస్థానంలో) బిందువు నందు లయం చేయు అభ్యాసముచే **'దూరదర్శన సిద్ధి'** లభించగలదు.<br>మనస్సున 'కాలాత్మ' యందు లయింపజేయుటచే - **త్రికాల జ్ఞానము** నకు కారణము కాగలదు. (కాలాత్మ = త్రికాలములు నా ఆత్మస్వరూపమేనని ఉపాసించటము)<br>పరకాయ (ఆత్మదేహ) - మనస్సులతో యోగము చేయుటచే "పరకాయ ప్రవేశసిద్ధి" → కలుగగలదు. కేవల స్వరూపమునందు ధ్యాస నిలుపుటచే పరకాయప్రవేశ సిద్ధి లభిస్తోంది.<br>మూర్ధ్ని (Upward part of Foreface) నందు అమృతస్వరూపమగు ఆత్మను (మార్పు చేర్పులు లేని స్వస్వరూపమును) చింతన చేయుటచే - ఆకలి, దప్పికలు, విషప్రభావములు సశాంతించగలవు.<br>**పాతాళ గమనము** : చిత్తమును పృథ్వి (భూమి)యందు ధారణ చేయుటచే పాతాళము ప్రవేశించు సిద్ధి లభిస్తోంది.<br>**జలస్తంభన విద్య** : చిత్తమును జలము యందు ధారణ చేయటం చేత జలము వలన హాని జరుగదు. |
| అగ్నౌ సన్ధానయేత్ చిత్తమ్ అగ్నినా దహ్యతే న సః॥<br>వాయౌ మనోలయం కుర్యాత్ ఆకాశ గమనం భవేత్॥<br>ఆకాశే ధారయేత్ చిత్తమ్<br>అణిమదికమ్ ఆప్నుయాత్ | అగ్నియందు చిత్తమును సంధానము చేసినప్పుడు అట్టివానిని అగ్ని దహించదు.<br>వాయువు నందు మనోలయము చేయుటచే **'ఆకాశ గమనము'** లభిస్తోంది.<br>చిత్తమును ఆకాశము (Vacant space) నందు ధారణ చేయుటచే **అణిమ** - మొదలైన **అష్టసిద్ధులు** లభిస్తున్నాయి. |
| 8. 'విరాట్' రూపే మనో యుంజన్<br>మహిమానమ్ అవాప్నుయాత్॥<br>చతుర్ముఖే మనో యుంజన్ జగత్ సృష్టికరో భవేత్॥<br>ఇన్ద్ర రూపిణిమ్ ఆత్మానం భావయన్ భోగవాన్ భవేత్॥<br>విష్ణురూపే మహాయోగీ పాలయేత్ అఖిలం జగత్॥<br>రుద్రరూపే మనో యుంజన్ సంహరత్యేవ తేజసా॥<br>నారాయణే మనోయుంజన్, నారాయణమయో భవేత్॥ | 'విరాట్' రూపము నందు మనస్సును ఏకాగ్రపరచి యుంచు యోగాభ్యాసముచే ఆ యోగి అనేక మహిమలు పొందగలడు. చతుర్ముఖుడగు సృష్టికర్త బ్రహ్మదేవుని యందు మనస్సును లగ్నము చేయు అభ్యాసముచే **"జగత్ సృష్టి నిర్మాణ శక్తి"** పొందగలడు.<br>"నేను ఇంద్రియములకు అధినేత అగు ఇంద్రుడను".. అను భావనతో కూడిన ఏకాగ్రతచే అట్టి అభ్యాసయోగి భోగవంతుడు కాగలడు.<br>విష్ణుతత్త్వము నందు సుదీర్ఘముగా భావన చేయుటచే అఖిల జగత్తును పాలించువాడగుచున్నాడు. (బుద్ధిని విష్ణుతత్త్వమునందు నిలిపి ఉంచటం).<br>యోగి రుద్రభగవానుని యందు మనస్సు నిలిపి అభ్యాసము చేయటం చేత జగత్ సంహార (ఉపసంహరణ) సామర్థ్యము పొందగలడు.<br>నారాయణుని యందు మనస్సును నిలిపి ఉంచుటచే, ఈ జగత్తంతా తానే అయి (లేక) నారాయణమయుడై విలసిల్లుచున్నాడు. |

వాసుదేవే మనో యుంజన్ సర్వసిద్ధిమ్ అవాప్నుయాత్।
యథా సంకల్పయేత్ యోగీ యోగయుక్తో జితేంద్రియః,
తథా తత్ తత్ అవాప్నోతి భావ ఏవ అత్రకారణమ్।

వాసుదేవునియందు మనస్సును నియమించి - ఏకాగ్రము చేయు యోగాభ్యాసి సర్వసిద్ధిని పొందుచున్నాడు. (సర్వ సిద్ధులు ఆశ్రయించగలవు)

యోగి యోగాభ్యాసములచే యోగయుక్తుడై, జితేంద్రియుడై ఏది సంకల్పముచేస్తే అదియే తానగుచున్నాడు. ఆతని భావనయే అందుకు కారణముగా అగుచున్నది. సమస్తమునకు 'భావన'యే కారణము.

---

గురుబ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవః సదా అచ్యుతః।
న గురోః అధికః కశ్చిత్ త్రిషులోకేషు విద్యతే।
దివ్య జ్ఞానోపదేష్టారం దేశికం పరమేశ్వరమ్,
పూజయేత్ పరయా భక్త్యా, తస్య జ్ఞాన ఫలం భవేత్।
యథా గురుః తథైవ ఈశో,
యథైవ ఈశః తథా గురుః।
పూజనీయో మహా భక్త్యా
న భేదో విద్యతే అనయోః।
న అద్వైత వాదం కుర్వీత
గురుణా సహ కుత్ర చిత్।

### గురుభక్తి - జ్ఞానఫలము

గురువే బ్రహ్మ। గురువే విష్ణువు। గురువే దైవము। ఆయనయే సదా అచ్యుతుడు। గురువుకన్నా అధికుడు మరొకడు త్రిలోకములలోను ఉండడు.

దివ్యజ్ఞాన- ఉపదేశము చేయు గురువును పరయాభక్తి (పరాభక్తి)తో ఎవ్వరు పూజిస్తారో, వారికి జ్ఞానఫలము తప్పక లభించగలదు.

గురువు ఎట్టివారో ఈశ్వరుడు అట్టివారు. ఈశ్వరుడు ఎట్టివారో, గురువు అట్టివారే! ఇరువురిని గొప్ప భక్తితో పూజించెదరుగుగాక! ఆ ఇరువురికి భేదము లేదు.

గురువుతో ఏ సమయంలో కూడా **"మీరు నేను అదే కదా!"**.. మొదలైన అద్వైతవాదములు చేయరాదు. "మీరు చెప్పకుంటే నాకు తెలిసేది కాదు కదా!" - అనే ప్రపత్తి కలిగి ఉండాలి.

---

**9.** అద్వైతం భావయేత్ భక్త్యా, గురోః దేవస్య చ ఆత్మనః।
యోగ శీర్షం మహాగుహ్యం, యో జానాతి మహామతిః,
న తస్య కించిత్ అజ్ఞాతమ్, త్రిషు లోకేషు విద్యతే।
న పుణ్య పాపే, న స్వస్థో,
న దుఃఖం, న పరాజయః,
న చ అస్తి పునరావృత్తిః -
అస్మిన్ సంసార మండలే।
సిద్ధౌ చిత్తం న కుర్వీత, చంచలత్వేన చేతసః,
తథాఽపి జ్ఞాత తత్త్వో
అసౌ ముక్తయేవ। న సంశయః।
ఇతి ఉపనిషత్

గురువు పట్ల, దైవము పట్ల భక్తి కలిగియుండాలి. పరమాత్మభావనతో భక్తి తత్పరతలు ప్రదర్శించాలి. గురువును పరమాత్మకు అద్వితీయుడుగా భావన చేయాలి.

యోగము యొక్క శీర్షము (పరాకాష్ఠ స్థితి) 'ఇట్టిది' అని వర్ణించి చెప్పలేము. ఏ మహామతి అట్టి యోగపరాకాష్ఠ స్థానమును చేరుతాడో అట్టివానికి త్రిలోకములలోను తెలియనిది ఏమీ ఉండదు.

యోగశీర్షము (పరాకాష్ఠ)చే స్వస్థుడైనవాడు →

- పుణ్యాపాపముల **ద్వంద్వమునకు అతీతుడౌతాడు.**
- ఆతని పట్ల **"దుఃఖ-పరాజయములు"- అనునవి 'లేనివే'** అగుచున్నాయి.
- ఆతడు **సంసార మండలముచే పునరావృత్తి** పొందడు.

చిత్తము చంచలమైన స్వభావము కలిగి ఉండటం స్వభావం కాబట్టి, సిద్ధులందు లక్ష్యము ఉంచరాదు.

**నిశ్చలత, 'చిత్' భావన** - చిత్తమునందు సిద్ధిస్తూ ఉండగా అట్టివాడు **తత్త్వజ్ఞాని** అయి, ఆతడు నిత్యముక్తుడే అవుతాడు. ఇందులో సంశయమే లేదు. ॥ఇతి ఉపనిషత్॥

---

## షష్ఠమ (6వ) అధ్యాయము

**1.** <u>బ్రహ్మోవాచ:</u>
ఉపాసనా ప్రకారం మే ప్రబ్రూహి, పరమేశ్వర!
యస్య విజ్ఞాన మాత్రేణ, ముక్తో భవతి సంసృతేః।
<u>శ్రీశంకరౌవాచ :</u>
ఉపాసనా ప్రకారం తే, రహస్యం శ్రుతి సారకమ్,
హిరణ్యగర్భ! వక్ష్యామి, శ్రుత్వా సమ్యక్ ఉపాసయ।
సుషుమ్నాయై, కుండలిన్యై, సుధాయై చన్ద్రమండలాత్,
మన-ఉన్మన్యైః నమస్తుభ్యం, మహాశక్త్యై చిదాత్మనే!

## (6 వ) అధ్యాయము

**బ్రహ్మదేవులవారు:** హే పరమేశ్వరా! దేనియొక్క విజ్ఞానమాత్రం చేత (తెలుసుకున్నంత మాత్రం చేత) ఈ జీవునికి **'సంసృతి'** నుండి (సంసారము నుండి) విముక్తి లభిస్తుందో, అందుకు సహకరించగల **"ఉపాసనా మార్గము"** గురించి దయతో చెప్పండి.

**శ్రీ శంకర భగవానుడు:** ఓ హిరణ్యగర్భా! బ్రహ్మభగవన్! రహస్యమగు శ్రుతి సారవర్ణిత - ఉపాసనాక్రమమును చెప్పుచున్నాను. శ్రోతలగు సమ్యక్ - ఉపాసకులు దీనిని ఉపాసించెదరుగాక!

సుషుమ్న, కుండలినీ, చంద్రమండల సుధ (అమృత స్రవంతికి), మనో ఉన్మనీ దేవతా రూపములుగా ఉన్న **"చిదాత్మరూప మహాశక్తి"**కి మునుముందుగా నమస్కరిస్తున్నాను.

**2.** శతంచ ఏకా చ హృదయస్య నాడ్యః।
తాసాం మూర్ధానమ్ అభినిస్సృతి ఏకా।
తయా ఊర్ధ్వమ్ ఆయన్ అమృతత్వమ్ ఏతి।

హృదయ స్థానము నుండి బయల్వెడలుచున్న 101 నాడులలో ఒక్క నాడి మాత్రమే మూర్ధస్థానమునకు విస్తరించి ఉన్నది. (అట్టి ఊర్ధ్వమును అనుసరించువాడు "శతంచ ఏక-ఏకైక ఊర్ధ్వగమనశీల నాడీ-సిద్ధుడు"
నియోగాభ్యాసముచే అట్టి ఊర్ధ్వ గమన ధర్మము గల ఏకైకనాడిని గుర్తించి, బుద్ధిని అద్దానిని అనుసరించుటను అభ్యసించువాడు - మార్పు చేర్పులచే పట్టుబడని ఆత్మాస్వాదనచే **'అమృతత్వము'**ను పొందుచున్నాడు.

---

విష్వన్ అన్యా ఉత్క్రమణే భవన్తి।
ఏకోత్తరం నాడి శతం
తాసాం మధ్యే 'పరా' స్మృతా।
సుషుమ్నాతు పరే లీనా
విరజా, బ్రహ్మరూపిణీ॥

ఇతర నాడులలో ప్రవేశించువాడు ఇంద్రియ విషయములచే బద్ధుడై మరల మరల దేహధారుడై విష్వక్ (ఇంద్రియ) విషయ పరంపరలో మగ్గుడగుచున్నాడు. (అదియే సుషుమ్ననాడి). విరజ, పరనాడి, బ్రహ్మనాడి మొదలైనవన్నీ అద్దానికి శాస్త్రీయమైన పేర్లు. ఏకైక ఊర్ధ్వగమన నాడి (101వది) ని 'పరానాడి' అని అంటారు. అట్టి సుషుమ్న నాడి - విరజము, బ్రహ్మరూపిణి. అది పరస్వరూపము నందు లీనమగుచున్నది.

---

<u>ఇడా</u> తిష్ఠతి వామేన। <u>పింగళా</u> దక్షిణేన తు।
తయోః మధ్యే పరం స్థానం
య స్తం వేద స వేదవిత్।

అట్టి (- బ్రహ్మరంధ్రము వరకు విస్తరించినదైయున్న) "సుషుమ్న"కు - వామేన (ఎడమవైపు) → "ఇడ", దక్షిణే (కుడివైపు) → 'పింగళ'నాడులు ఉంటాయి. ఆ రెండు నాడుల మధ్యగా సంస్థితమై, ప్రకాశమానమైయున్న 'పరం' స్థానమునకు 'సూటి' అయిన మార్గము అయి ఉన్న 'సుషుమ్న'ను ఎవ్వరు తెలుసుకుంటారో, వారే **వేదవిత్. తెలుసుకోవలసినది తెలుసుకున్నట్టివారు.**

---

ప్రాణం సంధారయేత్ అస్మిన్
నాసాభ్యన్తర చారిణః,
భూత్వా తత్రాయత ప్రాణః
శనైః ఏవ సమభ్యసేత్।

నాసాభ్యంతర చారిణి (ముక్కులోపల) సంచార ధర్మము నిర్వర్తిస్తున్నట్టిది -అగు పంచార ప్రదేశములో ప్రాణసంధారణ (వాయు కదలికలను నిశ్చలం చేసి కొంతసేపు ఉంచటము)ను అభ్యసించాలి. ప్రాణ నిశ్చలధారణను నెమ్మనెమ్మదిగా, ప్రశాంత చిత్తముతో సమభ్యసించాలి. అట్టి ప్రాణ నిశ్చలము క్రమంగా చిత్త చాంచల్యమును నిరోధించగలదు.

---

గుదస్య పృష్ఠభాగే అస్మిన్
వీణాదణ్డః స దేహ భృత్,
దీర్ఘా అస్థి - దేహ పర్యంతమ్
'బ్రహ్మనాడి' ఇతి కథ్యతే।

ఈ శరీరంతో గుదము (మలవిసర్జకావయవము)నకు వెనుకగా వీణాదండము (వంటి ఆకారముతో) (కుండలినీ శక్తి) ఉన్నది. అదియే ఈ దేహమును నిలుపుచున్నట్టి 'మూలశక్తి'. దీర్ఘమగు అస్థి (వెన్నెముక) మధ్య నుండి - దేహ పర్యంతము (నఖ-శిఖ పర్యంతము) ఆక్రమణము కలదై ఈ దేహమునందు గల నాడిని **'బ్రహ్మనాడి'** అని అంటారు.

---

తస్య అన్తే సుషిరగ్ం సూక్ష్మం
బ్రహ్మనాడి-ఇతి సూరిభిః।
ఇడా - పింగళయోః మధ్యే
సుషుమ్నా- సూర్యరూపిణీ।
సర్వం ప్రతిష్ఠితం తస్మిం తు
సర్వగం విశ్వతో ముఖమ్।

అట్టి బ్రహ్మనాడికి చిట్ట చివ్వరిగా (కపాలముయొక్క ఉపరిభాగంగా) 'సూక్ష్మము' అయినట్టి రంధ్రము ఉన్నది అదియే బ్రహ్మరంధ్రము (లేక) సుషిరగము - అని పిలువబడుచున్నది

ఇడ-పింగళల మధ్య గల "సుషుమ్న నాడి"- సూర్యరూపిణిగా ఉన్నది.

ఇది సర్వగము. సర్వత్రా విస్తరించియున్న శక్తిస్వరూపము. విశ్వతోముఖమైనదంతా ఆ సుషుమ్నయందు చివరగా (బ్రహ్మరంధ్రము వరకు) ప్రతిష్ఠితమైయున్నది. ఈ విశ్వమంతా సుషుమ్నయొక్క ముఖము.

---

తస్య మధ్య గతాః సూర్య-సోమ-
అగ్ని-పరమేశ్వరాః,
భూతలోకా, దిశః, క్షేత్రాః,
సముద్రాః పర్వతాః, శిలాః,
ద్వీపాశ్చ నిమ్నగా వేదాః
శాస్త్ర విద్యా కల అక్షరాః,
సర్వమంత్ర పురాణాని గుణాశ్చ
ఏతే చ సర్వశః।

సుషుమ్నయందు మధ్య గతులై (మధ్యగతమై) →
→ సూర్య-చంద్ర అగ్నిలు,
→ పరమేశ్వరుడు
→ ఈ భూతలోకములు, దిశలు, క్షేత్రములు, సముద్రములు, పర్వతములు, శిలలు, ద్వీపములు, నదులు, వేదములు, శాస్త్రములు, విద్యలు, కల్పనలు, కళలు,
→ అక్షరములు, స్వరములు, మంత్రములు, పురాణములు,
→ సత్త్వ రజో తమో గుణములు
ఇవన్నీ ఉన్నాయి. (సుషుమ్ననాడి- చివ్వర బ్రహ్మ రంధ్రము వరకు విస్తరించినవై ఉన్నాయి).

**బీజం బీజాత్మకః తేషాం, క్షేత్రజ్ఞః ప్రాణవాయవః**
**సుషుమ్న అంతర్గతం విశ్వం, తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్।**

అనగా, (1) బీజము (2) బీజాత్మకుడగు క్షేత్రజ్ఞుడు (3) ప్రాణవాయువులు - వీటితో కూడిన ఈ విశ్వమంతా 'సుషుమ్న' యందు అంతర్గతమై యున్నది. అద్దాని యందే సర్వము ప్రతిష్ఠితమైయున్నది.

---

**3. నానా నాడీ ప్రసవగ్ం సర్వభూతాన్తరాత్మని,**
**ఊర్ధ్వమూలమ్, అధః శాఖం, వాయుమార్గేణ సర్వగమ్।**
**ద్విసప్తతి సహస్రాణి (72000)**
**నాడ్యస్స్యుః వాయుగోచరాః,**

**సర్వభూతాంతరాత్మ** యందే నానా నాడుల ప్రవిస్తరణ, ప్రసరణ కలిగినవై ఉన్నాయి. ప్రాణవాయుతత్త్వము ఊర్ధ్వముగాను (బ్రహ్మరంధ్రము వరకు), శాఖలుగా శరీరమంతటనూ, వాయు ప్రసరణ మార్గములు రూపమై, సర్వగతంగా విస్తరించి ఉన్నది.

దేహములో వాయు సంచారము గల అట్టి నాడులు '72000' ఉన్నాయి.

---

**సర్వమార్గేణ సుషిరాః**
**తిర్యన్చః సుషిరాత్మకాః,**
**అధశ్చ-ఊర్ధ్వన్చ కుండల్యాః**
**సర్వద్వార నిరోధనాత్,**
**వాయునా సహజీవ-ఊర్ధ్వగామీ**
**మోక్షమ్ అవాప్నుయాత్।**

సర్వ మార్గములలోను సుషిరగములు (సూక్ష్మరంధ్రములు) ఉన్నాయి. సుషిరాత్మకమై (సూక్ష్మరంధ్రములు కలిగి ఉన్న) నాడులు దేహములలో అడ్డదిడ్డముగా ఉన్నాయి.

సుషమ్న యొక్క పైన-క్రింద గల సర్వ ద్వారములు (విషయలవైపుగా దారితీస్తున్న ద్వారములు) వాయు నిరోధముతో నిరోధించటం చేత అట్టి అభ్యాసము గల జీవుడు మోక్షము పొందగలడు.

---

**జ్ఞాత్వా సుషుమ్నాం తత్ భేదం**
**కృత్వా వాయున్చ మధ్యగమ్।**
**కృత్వా తు చ ఐన్దవ స్థానే**
**ఘ్రాణ రన్ధ్రే నిరోధయేత్।**

- సుషుమ్న నాడిని 'ఎరుక'లోకి తెచ్చుకొని..,
- దానిని భేదించి,
- వాయువును మధ్యగతంగా వెళ్ళునట్లు చేసి
- చంద్రస్థానమగు ఘ్రాణ రంధ్రమును నిరోధించాలి.

---

**ద్విసప్తతి సహస్రాణి (72000)**
**నాడీ ద్వారాని పంజరే,**
**సుషుమ్నా శాంభవీ శక్తిః।**
**శేషాస్తు అన్యే నిరర్థకాః॥**

72000 నాడీ (ప్రసరణ) ద్వారముల పంజరములో 'సుషుమ్న'యే - (బ్రహ్మనాడి అయి) బ్రహ్మ రంధ్ర ప్రవేశమునకు ద్వారమగుచున్నది. కాబట్టి - (అదియే) **'శాంభవీశక్తి'** అని అంటారు. **అది శివైక్యమునకు మార్గము.** ఇక తక్కిన నాడీ ద్వారములు ఇంద్రియ ప్రపంచము వైపుగా దారితీస్తున్నాయి కాబట్టి నిరర్థకము. ఎందుకంటే, పునః పునః జన్మ-కర్మలకు కారణము కాబట్టి.

---

**హృత్ లేఖే పరమానందే**
**తాలుమూలే వ్యవస్థితే,**
**అత ఊర్ధ్వం నిరోధే తు**
**మధ్యమం మధ్య మధ్యమమ్,**
**ఉచ్చారయేత్ పరాం శక్తిం**
**బ్రహ్మరంధ్ర నివాసినీమ్,**
**యది భ్రమర సృష్టిస్స్యాత్**
**సంసార భ్రమణం త్యజేత్।**

తాలు (దవడ) మూల-ఆకాశములో 'హృత్ లేఖ' యగు **పరమానందము** వ్యవస్థితమైయున్నది.

అట్టి తాలు మూలమునకు పై ప్రదేశంలో ప్రాణమును నిరోధించటంలో మధ్యమధ్యమమైన **'మధ్యమము'** అనుభవమగుచున్నది.

అట్టి మధ్యమము నుండి బ్రహ్మరంధ్రనివాసిని యగు పరాశక్తిని మనస్సుతో కేకవేస్తూ, ఆహ్వానిస్తూ, ఆరాధిస్తూ ఉచ్చారణ (పైకి నడపటం) చేయాలి. క్రమంగా భ్రమరము వలె సృష్టియందు వ్రాలుచున్న బుద్ధియొక్క సంసార భ్రమణమును త్యజించటము సుసాధ్యము.

---

**4. గమ-ఆగమస్థం, గమనాది శూన్యం**
**చిద్రూప దీపం, తిమిరాపహారమ్,**
**పశ్యామి తే సర్వజన - అన్తరస్థం,**
**నమామి హంసం**
**పరమాత్మ రూపం॥**

***పరమాత్మ ఎట్టివాడంటే....!***

→ రాక -పోకలలో (గమన-ఆగమనములలో) **అంతస్థుడైనవాడు.**

→ "ఒకచోట నుండి ఇంకొక చోటికి వెళ్ళటము" అనే ధర్మమే లేనట్టివాడు.

అట్టి పరమాత్మ రూపమును, **సర్వజనుల అన్తరస్థుడుగా** దర్శిస్తూ ఆ హంస (సోఽహమ్) స్వరూపునికి సదా నమస్కరిస్తున్నాను! సమస్తము 'తానే' అయినట్టి 'కేవలానంద అఖండాత్మ'యే నా ఉపాస్య వస్తువు.

| | |
|---|---|
| అనాహతస్య శబ్దస్య।<br>తస్య శబ్దస్య యో ధ్వనిః।<br>ధ్వనేః అంతర్గతం జ్యోతిః।<br>జ్యోతిషో అంతర్గతం మనః।<br>తన్మనో విలయం యాతి,<br>తద్విష్ణోః పరమం పదమ్।<br>కేచిత్ వదంతి చ 'ఆధారం'<br>'సుషుమ్నా', చ సరస్వతీ।<br>ఆధారాత్ జాయతే విశ్వం।<br>విశ్వం తత్రైవ లీయతే। | **ధ్వని-జ్యోతి-మనస్సు-పరమపదము**<br>వాయు స్థానమగు హృదయము నుండి, వెన్నముక మధ్యగా గల 'అనాహతము'లో శబ్దము జనిస్తోంది. ("నిశ్శబ్దమగు స్వస్వరూపము'' అనుధర్మముగల)<br>→ అట్టి అనాహతములో **ధ్వని**।<br>→ అట్టి ధ్వనిలో మధ్యలో **'జ్యోతి'**।<br>→ ఆ జ్యోతికి అంతర్గతమై ఆలోచనల రూపమగు **మనస్సు**।<br>**అట్టి భావనా రూప మనస్సు విలయము పొందినప్పుడు కేవలమై శేషించి ఉన్నట్టిదే విష్ణువు' అని చెప్పబడు పరమపదము**।<br>**"సుషుమ్న రూపమగు సరస్వతియే సర్వమునకు ఆధారము"** అని కొందరు సిద్ధాంతీకరించి చెప్పుచున్నారు. (ఆత్మయొక్క కేవల- శక్తిరూపమే సుషుమ్నగా ప్రసిద్ధము)<br>→ అట్టి 'సుషుమ్న అనబడు ఆధారము నుండియే ఈ విశ్వమంతా జనిస్తోంది.<br>→ ఈ విశ్వమే సుషుమ్న స్వరూపము.<br>→ ఈ విశ్వము తిరిగి సుషుమ్నయందే లీనమగుచున్నది. (ఆధారము, సుషుమ్న, సరస్వతిగా ఉపాసించబడుతోంది) |
| తస్మాత్ సర్వ ప్రయత్నేన<br>గురుపాదం సమాశ్రయేత్।<br>ఆధారశక్తి నిద్రాయం<br>విశ్వమ్ భవతి నిద్రయా।<br>తస్యాం శక్తి ప్రబోధేన<br>త్రైలోక్యం ప్రతిబుద్ధ్యతే। | (అట్టి విశ్వజనన - లయ స్థానమగు సుషుమ్న యొక్క స్వానుభవము కొరకై) ఆత్మానుభవము గల గురువు యొక్క పాదములను ఆశ్రయించాలి.<br>అట్టి ఆధార శక్తి నిద్రించటము జరుగుచున్నప్పుడు విశ్వము కూడా నిదురిస్తున్నదే అగుచున్నది.<br>ఆ ఆధార శక్తి ప్రబోధ సమన్వితమై ఉంటే, త్రిలోకములు పతిబుద్ధ్యము (Awakened / actively manifesting) అగుచున్నది. |
| ఆధారం యో విజానాతి<br>తమసః పరం అశ్నుతే,<br>తస్య విజ్ఞాన మాత్రేణ<br>నరః పాపైః ప్రముచ్యతే। | ఎవ్వరైతే 'ఆధారము' గురించి వివరంగా, సుస్పష్టంగా తెలుసుకుంటారో, వారు తమస్సుకు ఆవలి ఒడ్డు చేరుచున్నారు.<br>(1) మూలాధారశక్తి, (2) సుషుమ్నాంతర్గత శక్తి, (3) సుషుమ్నలో విశ్వజనన - లయములు, (4) సుషుమ్నతో మమేకత్వము - ఇది తెలుసుకున్నంత మాత్రం చేతనే ఈ నరుడు **సర్వపాపములనుండి, దోషముల నుండి విముక్తుడు కాగలడు.** |
| **5.** ఆధార చక్రమహసా<br>విద్యుత్ పుంజ సమప్రభా।<br>తథా ముక్తిః, న సందేహో<br>యది తుష్టః స్వయం గురుః। | ('సుషుమ్న' అనే) ఆధార చక్రము యొక్క తేజస్సు - మెరుపుతీగల సమూహం వెదజల్లు కాంతి పుంజముల వంటిది.<br>ఎవ్వరు సుషుమ్న-అను ఆధార చక్రము యొక్క తత్త్వము ఎరుగుచున్నారో, తుష్టి చెందుచున్నారో, → వారు ముక్తులే. స్వయంగురువులే. (ఆత్మైవహి గురుః ఇతి।) |
| ఆధార చక్రమహసా<br>పుణ్యపాపే నికృన్తయేత్।<br>ఆధార వాత రోధేన<br>లీయతే గగనాన్తరే। | మహత్తరమగు ఆధారచక్రము యొక్క అభ్యాససిద్ధిచే **"పుణ్య-పాపములు"** అనే ద్వంద్వ మోహము తొలగిపోతుంది.<br>వాయువు యొక్క నిరోధముచే (ప్రాణాయామాభ్యాసముచే) ఆధారము గగనము (ఆత్మాకాశము) యొక్క అంతరమున విలీనము అగుచున్నది. |
| ఆధార వాతరోధేన<br>శరీరం కమ్పతే యదా।<br>ఆధారవాత రోధేన<br>యోగీ నృత్యతి సర్వదా।<br>ఆధార వాత రోధేన<br>విశ్వం తత్రైవ దృశ్యతే। | వాయువు యొక్క నిరోధముచే యోగి ఆధారము నందు బుద్ధి నిలుపుటచే ఆ యోగి నటరాజ నృత్యము సలుపుచున్నాడు. ఆధార - వాత(వాయు) నిరోధముచే ఈ విశ్వము 'ఆధారము' నందే కనబడగలదు.<br>తానే ఆత్మస్వరూపుడుగా సమస్తమును ఆధార స్వరూపముతో వ్యక్తీకరిస్తున్నట్లు గ్రహించగలడు. సుషుమ్నయొక్క (కుంభకాభ్యాసపూర్వక) ధారణచే, "ఈ విశ్వమంతా నా తాండవమే" అనునది స్వానుభవమవ గలదు. |

సృష్టేః ఆధారమ్ ఆధారమ్।
ఆధారే సర్వదేవతాః।
ఆధారే సర్వవేదాశ్చ।
తస్మాత్ ఆధారం ఆశ్రయేత్।

(నిర్విషయాత్మయే సర్వాధారము. అదియే సుషుమ్న). ఈ సృష్టికి ఆధారము ఆధారచక్రమే!
ఆధార చక్రమునందు (సుషుమ్న యందు) - → సర్వ దేవతలు, సర్వ వేదములు, సంస్థితమై ఉన్నాయి. అందుచేత యోగులు యోగాభ్యాసము కొరకై ఆధార చక్రమును ఆశ్రయించి ఉండాలి.

---

ఆధార పశ్చిమే భాగే
త్రివేణీ సంగమో భవేత్।
తత్ర స్నాత్వా చ పీత్వా చ
నరః పాపాత్ ప్రముచ్యతే।

ఆధార చక్రమునకు పశ్చిమంగా త్రివేణీ సంగము (ద్రష్ట-దర్శన-దృశ్యముల ఏకరూపము) అగు ఆజ్ఞాచక్రము ఉన్నది. (భృకుటి). అట్టి త్రివేణీ సంగమునందు స్నానము చేయుటచే, జలము త్రాగుటచే ఈ జీవుడు సర్వపాపముల నుండి ముక్తి పొందుచున్నాడు.

---

ఆధారే పశ్చిమం లింగం,
'కవాటం' తత్ర విద్యతే।
తస్య ఉద్ఘాటన మాత్రేణ
ముచ్యతే భవ బన్ధనాత్।

ఆధార చక్రము (సుషుమ్న)కు పశ్చిమ భాగము లింగము, మోక్షము ద్వారము (కవాటము) అని చెప్పబడుతోంది. ఆ ద్వారమును ఊర్ధ్వముగా ఉద్ఘానం చేసినంత మాత్రం చేత (తెరిచినంత మాత్రంచేత) ఈ జీవుడు భవబంధములను త్రెంచివేయగలడు. (బ్రహ్మరంధ్రఛేదనము)

---

ఆధార పశ్చిమే భాగే
చంద్ర సూర్యౌ స్థిరౌ యది,
తత్ర తిష్ఠతి విశ్వేశో
ధ్యాత్వా బ్రహ్మమయో భవేత్।

ఆధార పశ్చిమ విభాగంలో సూర్య-చంద్రులు స్థిరస్వరూపులగుచున్నారు. (ఇడ-పింగళల ఏకత్వముచే) అక్కడ విశ్వేశ్వరుడు తిష్ఠితుడై ఉంటారు. అట్టి విశ్వేశ్వర ధ్యానముచే ఈ జీవుడు బ్రహ్మమయుడు అగుచున్నాడు.

---

ఆధార పశ్చిమే భాగే
మూర్తిః తిష్ఠతి సంజ్ఞయా।
షట్ చక్రాణి చ నిర్భిద్య
బ్రహ్మరంధ్రాత్ బహిర్గతమ్।

ఆధార చక్ర పశ్చిమంగా సంజ్ఞగా (ఈ జగత్తుగా మూర్తీభవించిన) మూర్తి సుతిష్ఠితులై ఉంటారు.
సుషుమ్నోపాసకుడు షట్ చక్రములను ఛేదించి బ్రహ్మరంధ్రము నుండి బహిర్గతులై (సహస్రారమునందు) ఊర్ధ్వగతుడై ప్రవేశించుచున్నాడు.

---

వామదక్షే నిరున్ధన్తి
ప్రవిశన్తి సుషుమ్నయా।
బ్రహ్మరంధ్రం ప్రవిశ్యాన్తః
తే యాన్తి పరమాం గతిమ్।

వామ-దక్షిణములను (ఎడమ-కుడి :: ఇడ-పింగళ) నిరోధించి ఆ యోగి 'సుషుమ్న'యందు ప్రవేశము పొందుచున్నాడు.
బ్రహ్మరంధ్రమున ప్రవేశించిన యోగి బ్రహ్మరంధ్రమును దాటివేసి 'పరము' (కేవలమగు ఆత్మస్వరూపము) యొక్క గతిని పొందుచున్నాడు.

---

**6.** సుషుమ్నాయాం యదా హంసస్తు
అథశ్చ ఊర్ధ్వం ప్రధావతి,
సుషుమ్నాయాం యదా ప్రాణం
భ్రామయేత్ యో నిరన్తరమ్,
సుషుమ్నాయం యదా ప్రాణః
స్థిరో భవతి ధీమాతామ్,
సుషుమ్నాయాం ప్రవేశేన
చంద్ర సూర్యౌ లయం గతౌ,
తదా సమరసం భావం
యో జానాతి స యోగవిత్।

ఏ యోగి పట్ల →

- సుషుమ్న యందు హంస ప్రాణోపాసన సమయములో సోऽహమ్ భావము ఎల్లప్పుడూ క్రిందికి పైకి (మూలాధారము నుండి సహస్రారము వరకు) (ఎరుకగా) వెళ్లి వస్తూ ఉంటుందో,
- ఎప్పుడైతే సుషుమ్న యొక్క యోని అంతరమునకు ప్రాణ సంచారము అనుభవమగుచున్నదో,
- ఏ ధీమంతుని బుద్ధి ప్రాణచలనమును ఆశ్రయించి సుషుమ్న యందు స్థిరముగా పొందుచున్నదో,
- ఎప్పుడైతే చంద్ర-సూర్యులు సుషుమ్నయందు (యోగాభ్యాసముచే) లయము పొందుచున్నారో,

**అప్పటి 'సమరస భావము'ను ఏ యోగి తెలుసుకొని ఉంటున్నాడో, ఆతడే యోగవేత్త.**

| | |
|---|---|
| సుషుమ్నాయాం యదా యస్య<br>మ్రియతే మనసో రయః,<br>సుషుమ్నాయాం యదా యోగీ<br>క్షణమేకం చ తిష్ఠతి,<br>సుషుమ్నాయాం యదా యోగీ<br>క్షణార్ధమపి తిష్ఠతి, సుషుమ్నాయం సదా యోగీ<br>సులగ్నో లవణాంబువత్,<br>సుషుమ్నాయాం యదా యోగీ<br>లీయతే క్షీరనీరవత్....<br>భిద్యతే చ తదా గ్రంథిః।<br>ఛిద్యన్తే సర్వ సంశయాః।<br>క్షీయన్తే, పరమాకాశే<br>తే యాన్తి పరమాం గతిమ్। | ❖ ఎవనిచే సుషుమ్న యొక్క అంతరమున మాత్రమే మనస్సు యొక్క వేగము లెక్కపెట్టబడుచున్నదో,<br>❖ ఎవని మనస్సు సుషుమ్నయందు లయము పొందినదగుచున్నదో,<br>❖ ఏ యోగి అయితే సుషుమ్నయందు ఒక్క క్షణకాలము తిష్ఠితుడై ఉంటాడో,<br>❖ ఉప్పుగడ్డ నీటిలో కరగిపోవు విధంగా ఎప్పుడైతే యోగి సుషుమ్నయందు సంలగ్నుడై, **<u>సుషుమ్నయే తానౌతాడో,</u>**<br>❖ పాలు - నీరు వలె (క్షీర-నీరన్యాయంగా) ఏ యోగి సుషుమ్నతో ఏకము అగుచున్నాడో,<br>→ అట్టి యోగి యొక్క హృదయ గ్రంథులన్నీ తెగిపోతాయి.<br>→ సర్వ సంశయములు వీగిపోతాయి.<br>సర్వము పరమాకాశమున క్షీణించినవై, ఆతడు **'పరమాగతి'**ని పొందుచున్నాడు. |
| **7.** గంగాయాం సాగరే స్నాత్వా,<br>నత్వాచ మణికర్ణికామ్,<br>మధ్యనాడీ విచారస్య<br>కలాం నార్హంతి షోడశీమ్,<br>శ్రీశైల దర్శనాత్ ముక్తిః<br>వారాణస్యాం మృతస్యచ,<br>కేదారోదక పానేన<br>మధ్యనాడీ ప్రదర్శనాత్,<br>అశ్వమేధ సహస్రాణి<br>వాజపేయ శతాని చ,<br>సుషుమ్నాధ్యాన యోగస్య<br>కలాం నార్హన్తి షోడశీమ్। | గంగలో మునగటము, సాగరంలో స్నానము చేయటము, మణికర్ణికకు నమస్కరించటము.. ఇవన్నీ కూడా **"మధ్య నాడీ విచారణ"** అనబడే సుషుమ్న యందు యోగాభ్యాసము నిర్వర్తించుటకు 16వ వంతుతో కూడా సమానము కాదు. (అర్హము కాదు)<br>- శ్రీశైల దర్శనము వలన ముక్తి,<br>- వారణాసిలో మరణించటము,<br>- కేదారములో ఉదకము త్రాగటము,<br>- వేయి అశ్వమేధ యాగములు,<br>- వంద వాజపేయ యజ్ఞములు,<br>ఇవన్నీ కూడా మధ్య నాడీ ప్రదర్శనా రూపము అగు సుషుమ్నా ధ్యాన యోగము యొక్క ప్రయోజనములో 16వ వంతు కూడా అవజాలవు. |
| సుషుమ్నాయాం సదా గోష్ఠీం<br>యః కశ్చిత్ కురుతే నరః,<br>స ముక్తః సర్వ పాపేభ్యో<br>నిశ్రేయసమ్ అవాప్నుయాత్। | ఏ నరుడైతే 'సుషుమ్న' యందు ఎల్లప్పుడూ గోష్ఠి (సంభాషించటం, యోచించటం, దృష్టి కలిగి యుండటం మొదలైనవి) కలిగి ఉంటాడో, ఆతడు అన్ని పాప-దోష దృష్టుల నుండి విముక్తి పొందినవాడై పరమ శ్రేయోస్థానము పొందగలడు. |
| సుషుమ్నైవ పరం తీర్థం।<br>సుషుమ్నైవ పరో జపః।<br>సుషుమ్నైవ పరం ధ్యానం।<br>సుషుమ్నైవ పరా గతిః। | సుషుమ్నయే మహత్తరమగు తీర్థము. సుషుమ్నయే గొప్ప జపము, గొప్ప ధ్యానము, గొప్ప 'గతి' కూడా అయి ఉన్నది. |
| అనేక యజ్ఞ దానాని, వ్రతాని,<br>నియమాః తథా,<br>సుషుమ్నా ధ్యాన లేశస్య<br>కలాం న అర్హన్తి షోడశీమ్॥ | అనేక యజ్ఞములు, దానములు, వ్రతములు, నియమములు - ఇవన్నీ కూడా..., సుషుమ్నా ధ్యానము (ఈ విశ్వమంతా ఎందులో జనించి, ఉండి లయిస్తోందో - అట్టి పరాశక్తి స్థానము) యొక్క ఒక చిన్న లేశము (Piece)లో 16వ వంతు ఫలముతో కూడా సమానము కాదు. |

| | |
|---|---|
| బ్రహ్మరంధ్రే మహాస్థానే<br>వర్తతే సతతం శివా।<br>చిచ్ఛక్తిః పరమాదేవీ<br>మధ్యమే సుప్రతిష్ఠితా॥ | సుషుమ్న మూలాధారము నుండి బ్రహ్మరంధ్ర మధ్య స్థానము వరకు చిచ్ఛక్తి రూపముగా పరమాదేవి అయి ప్రకాశమానమైయుండగా, (ప్రకృతి)<br>→ మహాస్థానమగు సుషుమ్నా ఊర్ధ్వ- బ్రహ్మరంధ్రము నందు మధ్యగా శివభగవానుడు, చిత్‌శక్తి, పరమాదేవి సుప్రతిష్ఠుతులై ఉన్నారు. (పురుషుడు) |
| మాయాశక్తిః లలాట అగ్రభాగే<br>వ్యోమామ్బుజే తథా।<br>నాదరూపా పరాశక్తిః<br>లలాటస్యా పరాంశకే।<br>బిందుమధ్యే చ జీవాత్మా<br>సూక్ష్మరూపేణ వర్తతే॥ | మాయాశక్తి (కల్పనా - భావనా - ఊహాశక్తి) → లలాటము యొక్క పైభాగంలో గల ఆకాశ పుష్పమున ప్రదర్శనమగుచున్నది.<br>"నాద రూప పరాశక్తి" → లలాటము యొక్క అపరాంశమున (క్రిందగా) ఉంటున్నది. (నాద జననస్థానం)<br>బిందు మధ్యగా జీవాత్మ (భావనా, ఊహ విభాగంలో 'అనుభవి'గా కల్పించబడిన ఆత్మాంశ), సూక్ష్మరూపముగా వర్తిస్తున్నారు. |
| **8.** హృదయే స్థూల రూపేణ<br>తను మధ్యే చ మధ్యమా,<br>ప్రాణ–అపాన వశో జీవో హి<br>అధశ్చ ఊర్ధ్వంచ ధావతి। | **ఇక ఈ జీవుని స్థూల రూపము**<br>శరీర మధ్య గల హృదయస్థానము నందు స్థూలరూపుడై ఉన్నాడు. ప్రాణ-అపానములకు వశుడై, ఈ భౌతిక దేహమునందు పైకి, క్రిందికి తిరుగాడుచున్నాడు. |
| వామ–దక్షిణ మార్గేణ<br>చన్చలత్వాత్ న దృశ్యతే। | కుడి -ఎడమల మార్గములలో (పింగళ - ఇడనాడులలో) అనుక్షణమూ తిరుగాడుచూ, ఎక్కడా ఒకచోట ఉండటము లేదు. ఒకచోట అంటూ అగుపించటమూ లేదు. |
| ఆక్షిప్తో భుజదండేన<br>యథా ఉచ్చలతి కందుకః,<br>ప్రాణ–అపాన సమాక్షిప్తః<br>తథా జీవో న విశ్రమేత్। | భుజదండముతో కొట్టబడి పైకి క్రిందికి ఎగిరిపడుతూ ఉండే పూలబంతి లాగా, ప్రాణ-అపానములచే సమాక్షిప్తము అయినవాడై (మోదించబడినవాడై) ఈ జీవుడు ఎక్కడా ఒకచోట విశ్రాంతిగా విశ్రమించినవాడై ఉండటం లేదు. |
| అపానః కర్షతి ప్రాణం<br>ప్రాణో అపానన్చ కర్షతి।<br>'హ' కారేణ బహిః యాతి<br>'స' కారేణ విశేత్ పునః। | అపానము ప్రాణమును ఆకర్షిస్తోంది. ప్రాణము అపానమును ఆకర్షించటం జరుగుతోంది. 'హ' కారముచే వాయువు (ప్రాణశక్తి) బయటకు వెళ్ళుతోంది. 'స'కారముచే వాయువు లోనికి వస్తోంది. (ఇది **సందర్భరూపము - కేవల స్వరూపముల మధ్యగా జరుగుచున్న అవిశ్రాంత విహారము**). (సో = కేవలము, హమ్ = సందర్భము) |
| 'హంస' 'హంస' ఇతి అముం<br>మన్త్రం జీవో జపతి సర్వదా!<br>తత్ విద్వాన్ అక్షరం నిత్యం<br>యో జానాతి స 'యోగవిత్'।<br>కంఠ ఊర్ధ్వే కుండలీ శక్తిః<br>ముక్తి రూపా చ యోగినామ్।<br>బన్ధనాయ చ మూఢానాం<br>యః తాం వేత్తి స యోగవిత్। | ఈ విధంగా ఈ జీవుడు 'హంస' 'హంస' మంత్రమును ఎల్లప్పుడూ (వాయువును వదలటము - పీల్చటము అను క్రియలచే) జపిస్తూ ఉన్నాడు.<br>ఏ విద్వాంసుడైతే, ప్రాణ-అపానములకు, 'హంస'కు **పరమార్థమై, ఆధారమైయున్న - 'సోఽహమ్'**ను తెలుసుకొని ఉంటున్నాడో ఆతడే యోగవేత్త! అక్షరము, నిత్యము అగు ఆత్మయే అది. అది తానే!<br>కంఠమునకు ఊర్ధ్వ భాగంగా ఉన్న కుండలినీ శక్తి యోగులకు 'ముక్తిరూపము'గా అనుభూతమగుచున్నది.<br>'యోగాభ్యాస ధ్యాస' లేనట్టి మూఢులకు అదియే బంధనముగా అగుచున్నది. అట్టి - కంఠ ఊర్ధ్వ మోక్షప్రదాయక కుండలినీ శక్తిని ఎరిగినవాడు యోగవేత్త. |
| 'భూర్భువస్వః' ఇమే లోకాః<br>చంద్ర–సూర్య–అగ్ని దేవతాః,<br>యాసు మాత్రాసు తిష్ఠన్తి<br>తత్ పరంజ్యోతిః 'ఓం' ఇతి॥ | ఎందులో అయితే, **భూ-భువర్-సువర్ త్రిలోకములు, చంద్ర-సూర్య-అగ్ని దేవతలు** - మాత్రలుగా సుతిష్ఠితులై ఉన్నారో, అదియే **'పరంజ్యోతి'** అగు **'ఓం'** - అను **శబ్ద సంజ్ఞకు పరమార్థము.** |

| | |
|---|---|
| త్రయః కాలాః, త్రయో దేవాః,<br>త్రయో లోకాః, త్రయః స్వరాః,<br>త్రయో వేదాః స్థితా యత్ర,<br>"తత్ పరంజ్యోతిః"<br>'ఓం' ఇతి। | భూత- వర్తమాన - భవిష్యత్ → **త్రికాలములు,**<br>భూ-భువర్-సువర్ → **త్రిలోకములు,**<br>ఉదాత్త (ఊర్ధ్వ) - అనుదాత్త (అధో) - మధ్యమ → **త్రిస్వరములు,**<br>ఋక్ - యజుర్ - సామ → **త్రివేదములు**<br>... ఇవన్నీ ఎందులో, ఎక్కడ సంస్థితమైయున్నాయో, అదియే **'ఓం'** అని పిలువబడు పరంజ్యోతి స్వరూపమగు **అఖండాత్మ! కేవలమగు స్వస్వరూపాత్మ!** |
| <u>చిత్తనిశ్చలత్వము</u><br>**9.** చిత్తే చలతి, సంసారో<br>(తత్) నిశ్చలం 'మోక్ష' ఉచ్యతే।<br>తస్మాత్ చిత్తం స్థిరీ కుర్యాత్ ప్రజ్ఞయా పరయా, విధే!<br>చిత్తం కారణం అర్థానామ్, తస్మిన్ సతి జగత్రయమ్।<br>తస్మిన్ క్షీణే జగత్ క్షీణం।<br>తత్ చికిత్స్యం ప్రయత్నతః॥ | చిత్తము యొక్క చాంచల్యానుభవమే సంసారము. చిత్తము యొక్క నిశ్చలత్వమే - 'మోక్షము' - అనబడుతోంది. ఓ విధిదేవా! బ్రహ్మదేవా! లోక పితామహా! గొప్ప ప్రజ్ఞా-ప్రయత్నములతో ఈ చిత్తరమును 'స్థిరము' చేయాలి. సర్వ అర్థములకు అనర్థములకు చిత్తమే కారణం. అందుచేత ఈ చిత్తము నందే త్రిలోకములు ఏర్పడి ఉన్నాయి.<br>చిత్తము క్షీణిస్తే, జగత్తులు క్షీణిస్తాయి. అందుచేత ఈ చిత్తమునకు ప్రయత్నపూర్వకంగా 'చికిత్స' చేసుకోవాలి. చిత్త నిశ్చలత్వమే యోగాభ్యాస మూలాధారము. |
| మనోఽహం గగనాకారమ్।<br>మనోఽహం సర్వతో ముఖమ్।<br>మనోఽహం సర్వమ్ ఆత్మా చ।<br><u>న(స) మనః కేవలః పరః।</u> | ఆకాశాకారమగు మనస్సు నేనే!<br>సర్వత్రాముఖములు కలిగిన మనస్సు నేనే!<br>మనస్సే ఆత్మ! మనస్సే సర్వము.<br>అయితే మనస్సు కేవలము కాదు. నాకు వేరైనది కాదు.<br>**అయితే మనస్సు బ్రహ్మమే కూడా!** |
| మనః కర్మాణి జాయన్తే<br>మనో లిప్యతి పాతకైః<br>మనశ్చేత్ ఉన్మనీ భూయాత్<br>న పుణ్యం। న చ పాతకమ్।<br>(ఉన్మనీ = తాను కదలక, ఆలోచనలను కదిలిస్తున్న మనో విభాగము) | మనస్సు నుండే కర్మలు (Functions, Acts) - అన్నీ పుట్టుచున్నాయి.<br>- మనస్సే దోషములచే, పాతకములచే పూయబడినదై ఉంటోంది.<br>- మనస్సు ఉన్మనీ స్థానము జేరితే (ఆలోచనలు ఆలోచనల జనన స్థానమును చేరినవై ఉంటే)-అప్పుడు ఇక పుణ్యము లేదు. పాపము లేదు. |
| మనసా మన ఆలోక్య, వృత్తి శూన్యం యదా భవేత్,<br>తతః పరం పరబ్రహ్మ, దృశ్యతే చ సుదుర్లభమ్। | ఎప్పుడైతే మనస్సు ప్రాపంచకవృత్తులను అధిగమించి, మనస్సుతో మనస్సే చూడబడుచున్నదో ఆపై సుదుర్లభమగు **"పరబ్రహ్మము"** దృశ్యమానమవగలదు. |
| **10.** <u>మనసా మన ఆలోక్య, ముక్తో భవతి యోగవిత్।</u><br>మనసా మన ఆలోక్య, ఉన్మన్యంతం సదా స్మరేత్।<br>మనసా మన ఆలోక్య, యోగనిష్ఠః సదా భవేత్।<br>మనసా మన ఆలోక్య, దృశ్యన్తే ప్రత్యయా దశ।<br>యదా ప్రత్యయాదృశ్యన్తే, తదా యోగీశ్వరో భవేత్।<br>బిన్దు నాద కలా జ్యోతిః<br>(అ)బిన్దు ధృవ తారకమ్।<br>శాంతం చ తత్ అతీతం చ<br>"పరం బ్రహ్మ" తత్ ఉచ్యతే॥ | మనస్సుతో మనస్సును దర్శించటం చేత (దృశ్యమును స్వకీయ మనో రూపముగా మననము కలిగి ఉండటం చేత), అట్టి యోగవేత్త స్వయముగా ముక్తుడు అగుచున్నాడు. (ఇది మనస్సుయొక్క సాక్షీ విభాగములతో ఈ జగన్నాటకములోని పాత్రధారునిగా (నటించు) మనస్సును చూస్తూ ఉండటము వంటిది).<br>"మనస్సుతో మనస్సును అవలోకనము" అనే ఉన్మనీత్వమును ఎల్లప్పుడూ స్మరిస్తూ ఉండాలి.<br>మనస్సుతో మనస్సును దర్శిస్తూ ఎల్లప్పుడూ అట్టి యోగనిష్ఠుడై ఉండాలి.<br>మనస్సుతో మనస్సును అవలోకనం చేస్తూ ఉండగా ఈ జగత్తుకు ప్రత్యయము, ఆధారము అగు "కేవలము" - అనుభూతమౌతోంది. (The Abosolute Comes into Experience). ఎప్పుడైతే ఈ దృశ్యమునకు ప్రత్యయమైయున్న ఆత్మ దృశ్యమానమౌతుందో, అట్టివాడు 'యోగీశ్వరుడు' అగుచున్నాడు.<br>బిందువు, నాదము, కల, జ్యోతి-ఇవన్నీ కూడా అబిందువు అగు ధృవమగు తారకములు. (తరింపజేయునవి). **శాంతమునకు కూడా ఆవల అతీతమై ఏ పరమ మౌన-ప్రశాంతము సంస్థితమైయున్నదో, అదియే <u>పరబ్రహ్మము.</u>** |

**హసతి, ఉల్లసతి ప్రీత్యా,**
**క్రీడతే, మోదతే తదా।**
**తనోతి జీవనం బుద్ధ్యా**
**(తే) బిభేతి సర్వతో భయాత్।**
**రోధతే బుద్ధ్యతే శోకే**
**ముహ్యతే న చ సమ్పదా।**
**కమ్పతే శత్రు కార్యేషు**
**కామేన రమతే హసన్।**
**స్మృత్వా కామరతం చిత్తం**
**విజానీయాత్ కళేబరే।**

**ఈ చిత్తము-**

ప్రీతిగా ఉంటుంది. నవ్వుతుంది. ఉల్లాసము పొందుతుంది. క్రీడిస్తుంది. మోదము పొందుతుంది.

బుద్ధితో 'జీవిస్తున్నవాడను' అనునదంతా పొందుతోంది.

- అనేక భయ-ఉద్వేగములతో భౌతికత్వమంతా అనుభవిస్తోంది.

బాధ, శోకముల బుద్ధి పొందుతోంది. రోదిస్తోంది.

శత్రువుల కార్యములకు కంపనములు పొందుచున్నది.

నవ్వుచూనే అనేక కామములందు (కోరికలందు, Expectations) రమించుచున్నది. స్మృతులచే కామరతమైన ఈ చిత్తము యొక్క శరీరమును తెలుసుకోవాలి. చిత్తమును నిరోధిస్తే 'చిత్' అనుభవమవగలదు.

---

**యత్ర దేశే వశేత్ వాయుః, చిత్తం తత్వసతి ధ్రువమ్।**
మనః చంద్రో। రవిః వాయుః।
దృష్టిః అగ్నిః ఉదాహృతః।
బిన్దు నాద కలా, బ్రహ్మన్!
విష్ణు బ్రహ్మ ఈశ దేవతాః। – సదా
నాద అనుసంధానాత్, సంక్షీణా వాసనా భవేత్।

ఏ ప్రదేశమున వాయువు (ప్రాణశక్తి) ఉండటం జరిగితే ఈ చిత్తము కూడా ధృవముగా అక్కడే ఉన్నదిగా అగుచున్నది.

మనస్సు (దేహములోని) చంద్రుడని, వాయువు 'రవి' అని, దృష్టి అగ్ని అని ఉదహరించబడుచున్నాయి.

హే బ్రహ్మన్! 'బిందువు' నందు, 'నాదము' నందు, 'కల'యందు, విష్ణు - బ్రహ్మ - ఈశ దేవతల పట్ల - భావన, ఉపాసలచేతను, నాదాను సంధానము చేతను **వాసనలు సంక్షీణము పొందగలవు.**

---

**11.** నిరంజనే విలీయేత
మరుత్ మనసి, పద్మజ!
యో వై <u>"నాదః"</u> స వై <u>"బిన్దుః"</u>
తద్వై <u>**'చిత్తం'**</u> ప్రకీర్తితమ్।
నాదో బిన్దుశ్చ చిత్తన్చ
త్రిభిరైక్యం ప్ర-సాధయేత్।

ఓ పద్మజా! యోగి పట్ల వాయువు - నిరంజనమగు (నిర్మలమగు) మనస్సు నందు, విలీనము పొందుచున్నది.

- ఏది **'నాదము'** అయి ఉన్నదో, అదియే **'బిందువు'** కూడా అయి ఉన్నది.

- అదియే **'చిత్తము'** అని కూడా ప్రకీర్తించబడుచున్నది.

నాదము, బిందువు, చిత్తము - ఈ మూడింటి యొక్క యోగ-ఐక్యత్వమును యోగి సంపాదించుకోవాలి సుమా!

---

మన ఏవ హి బిన్దుశ్చ
ఉత్పత్తి స్థితి కారణమ్।
మనసా ఉత్పద్యతే బిన్దుః
యథా క్షీరం ఘృతాత్మకమ్।
షట్ చక్రాణి పరిజ్ఞాత్వా
ప్రవిశేత్ సుఖ మణ్డలమ్।

మనస్సే బిందువు. సమస్తమునకు ఉత్పత్తికి, స్థితికి కారణము..

ఏవిధంగా పాలు ఘృతాత్మకమై (లోన నిండా నేయి కలిగినదై) ఉన్నదో, అట్లాగే మనస్సు నుండి బిందువు బయల్వెడలుతోంది.

యోగి (మూలాధారము, స్వాధిష్ఠాన, మణిపూరకము, అనాహతము విశుద్ధము, ఆజ్ఞా - అనబడే) షట్ చక్రములను ఎరుగుటచే సుఖమండలమును ప్రవేశించగలడు.

---

ప్రవిశేత్ వాయుం ఆకృష్య, తథైవ ఊర్ధ్వం నియోజయేత్।
వాయుం బిన్దుం తథా చక్రం, చిత్తం చ ఏవ సమభ్యసేత్।
సమాధిం ఏకేన సమమ్
అమృతం యాన్తి యోగినః।
యథా అగ్నిః దారు మధ్యస్థో
న ఉత్తిష్ఠేత్ మథనం వినా,
<u>వినా చ అభ్యాస యోగేన</u>
<u>జ్ఞాన దీపః తథా నహి।</u>

ప్రవేశింపజేసిన వాయువును ఆకర్షించి అద్దానినే ఊర్ధ్వముగా నియోగించాలి.

వాయువును, బిందువును, చక్రమును, చిత్తము సమరూపముగా సమభ్యసించాలి.

సమాధి నందు వాటిని సమము, ఏకము చేయుటచే యోగులు 'అమృతము'ను పొందగలరు. అనగా, మృత్యువు, దేహ దేహాంతరములు వారికి **అవిషయము** అగుచున్నాయి.

ఏ విధంగా అయితే కొయ్య యందు మధ్యగా ఉన్న అగ్ని మథనము లేకుండా ఉత్తిష్ఠత్వము పొందదో (బయట పడదో), ఆ విధంగానే అభ్యాసయోగము లేకపోతే జ్ఞానదీపము ఉత్తిష్ఠత్వము పొందదు.

| | |
|---|---|
| **ఘటమధ్యే యథా దీపో<br>బాహ్యే న ఏవ ప్రకాశతే,<br>భిన్నే తస్మిన్ ఘటే చ ఏవ<br>దీపే జ్వాలా చ భాసతే।<br>స్వ కాయం 'ఘటమ్' ఇత్యుక్తం।<br>యథా జీవోహి 'తత్' పదమ్,** | ఘటములో (కుండలో) వెలుగుచున్న దీపము, బాహ్యమున కనబడదు. కుండకు భిన్నమై దీపజ్వాల భాసిస్తోంది కదా! అట్లాగే, ఈ **'కాయము'** **'ఘటము'** అని చెప్పబడుతోంది. గురువాక్యమైనట్టి "తత్-త్వమ్" యొక్క పరమార్ధముచే → ఈ జీవుడే తత్‌పదము అధిరోహించినట్టి కేవల తత్ స్వరూపుడు. ఈ జీవుడు సర్వదా దేహమునకు వేరై ఆత్మజ్యోతి స్వరూపుడుగా వెలుగొందు చున్నాడు. |
| **గురువాక్య సమం భిన్నే<br>బ్రహ్మజ్ఞానం ప్రకాశతే।** | ఈ దేహమునకు భిన్నమై దేహి స్వరూపమగు తత్ పదాత్మ → **గురువాక్య తాత్పర్యముచే బ్రహ్మజ్ఞాన ప్రకాశమై లభిస్తోంది.** |
| **కర్ణధారం గురుం ప్రాప్య<br>'తత్' వాక్యం ప్లవవత్<br>దృఢమ్।** | పడవకు - ప్రజ్ఞ, సామర్ధ్యము గల కర్ణధారుడు (Boat Driver) ఉంటే, పడవ ప్రయాణం సుఖంగా, ప్రశాంతంగా హాయిగా సాగుతుంది కదా! గురువు, గురువాక్యములు - "నావను నడుపువాడు" - వంటివి.<br>**"తత్ త్వమ్** (నీ సహజ' స్వరూపము - ఆత్మయే") - అను భావన, **'సోఽహమ్'** అను **అనునిత్య స్వాభావికానుభవము** సిద్ధించటానికి గురువే మహత్ సామర్ధ్యము గల కర్ణధారుడు |
| **అభ్యాస వాసనా శక్త్యా<br>తరన్తి భవసాగరమ్।**<br><br>***<u>ఇతి కృష్ణయజుర్వేదాంతర్గత</u>***<br>***<u>యోగశిఖోపనిషత్ సమాప్తా</u>***<br>***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।</u>*** | **యోగాభ్యాస-జ్ఞానవాసనల శక్తిచే - ఈ జీవుడు భవసాగరమును తప్పక దాటివేయగలడు. నతు సందేహః। ఇందులో సందేహమే లేదు.**<br><br>***<u>ఇతి కృష్ణయజుర్వేదాంతర్గత</u>***<br>***<u>యోగశిఖోపనిషత్ సమాప్తము</u>***<br>***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।</u>*** |

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 23 యోగశిఖోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



## ప్రథమాధ్యాయము
## యోగ-జ్ఞాన సమన్వయము

ఒకానొక సందర్భములో **హిరణ్యగర్భుడు, కమల సంభవవుడు, లోక పితామహుడు, సృష్టికర్త** అగు బ్రహ్మదేవుడు → లోక కల్యాణమూర్తి, సర్వశుభంకరుడు, జగదీశ్వరుడు అగు **పరమశివుని** దర్శించారు. నమస్కృతులు సమర్పించారు.

**హిరణ్యగర్భుడు :** హే పరమశివ భగవాన్! లోకగురూ! అస్మత్ భక్తి యుక్తమగు ప్రణామములు స్వీకరించండి.

స్వామీ! నాచే సృష్టించబడుచున్న ఈ సర్వలోకములలో జీవులు 'సుఖ-దుఃఖములు' అనే **మాయాజాలములో చిక్కుకుని, దారి కానక చరిస్తున్నారు.** జన్మ-కర్మల పరంపరలతో ప్రయాణిస్తూ **అనేక మానసిక జాడ్యములలో చిక్కుకొని ఉంటున్నారు.** ఓ దేవాదిదేవా! వారి యొక్క ముక్తికి మార్గమేమిటి?

- **మాయాజాలము** నుండి **బంధవిముక్తి** ప్రసాదించగల సర్వసిద్ధికరమగు **మార్గము** ఏది?
- జన్మ-మృత్యు-జరా-వ్యాధి బాధలను ఉపశమింపజేయు సుఖప్రదమైయున్న త్రోవ ఏది?

హే శంకర భగవాన్! దయతో వివరించండి.

**మహేశ్వరుడు :** అవును! ఈ జీవుడు ఆయా **సందర్భ మాత్ర సంబంధమైన స్వీయకల్పిత ప్రకృతి స్వరూపములలో** తదాత్మ్యము చెందుచూ, అనేక ఉపాధులలో ప్రవేశ-నిష్క్రమణములను చేస్తూ ఉన్నాడు. ఏవేవో ఏక-అనేక మార్గముల వెంట వెళ్లటం జరుగుతూ ఉంటోందయ్యా! అనేక మార్గాన్వేషణములలో నిమగ్నుడు అవటం చేతనే తన యొక్క కేవలీస్వరూపమునకు సంబంధించిన **'<u>కైవల్యము</u>'** అనే పరమపదమును పొందలేకపోవుచున్నాడు. ఓ పద్మసంభవా! **ఈతడు సిద్ధిమార్గంలో ఏకాగ్రతగా ప్రయత్నశీలుడు కావాలి.** అట్లా కాకుండా, ఏకాగ్రత లేకుండా, నడుస్తూ ఉండటంచేతనే కైవల్యము లభించటం లేదు.

అట్టి మోక్షపదమును సిద్ధించుకోవటానికి **శాస్త్రజ్ఞానం ఒక్కటే సరిపోదు. యోగాభ్యాసము** తప్పక **కావాలి.** కొందరు శాస్త్రములను మాత్రమే ఆశ్రయిస్తూ **'తెలుసుకోవటం'** అనే సుదీర్ఘప్రయత్నంలో నిమగ్నమై ఉపాధులు గడుపుచూ ఉన్నారు. **"అనుకోవటము", "అనిపించటము"** అనే మార్గంలో అభ్యాసమును ఆశ్రయించకపోతే ఎట్లా? అట్టి **"ప్రజ్ఞ (తెలివి)"** (లేక) **'తెలుసుకోవాలి'** అనే ప్రయత్నంలో మోహితులై, శాస్త్రములకు పరిమితులై ఉండిపోతున్నారు. **ఆత్మ శాస్త్రములలో ఉన్నదా? లేదు.** మరెక్కడున్నది? **వాటిని పఠించే ఆ పాఠకునియందు సర్వదా స్వయం ప్రకాశరూపమై ఉన్నది. మరి ఆత్మ** శాస్త్రముల చేత ఎట్లా ప్రకాశించబడుతుంది చెప్పు?

**బ్రహ్మదేవుడు :** ఆత్మానుభూతి - శాస్త్రములలో లభించదంటారా? ప్రభూ!

**మహేశ్వరుడు (మహాదేవుడు) :** శాస్త్రములు ఆత్మ గురించి సూచిస్తున్నాయి. అభివర్ణిస్తున్నాయి. దారిచూపుచున్నాయి. అయితే ఆత్మ ఉన్నదెక్కడ? దర్శించుకోవలసినది, సాక్షాత్కారము పొందవలసినది ఎందులో? వినండి.

**"నిష్కళము, (కళంకరహితము), అత్యంత నిర్మలము, పరమ శాంతము, దృశ్య-దేహ-మనో-బుద్ధి-చిత్త-అహంకారాదులన్నిటికీ సర్వాతీతము, సర్వ విషయములకు మునుముందే ఉన్నట్టిదగుటచే నిర్విశేషము- నిరామయము.."** అగు 'తత్' శబ్దార్థమగు పరమాత్మయే **'జీవరూపము'** అనే అంశను స్వయముగా స్వీకరించుచున్నది. (It is like accepting a 'Role' in a Drama, or a Role in office - home - playground - group of Friends etc.). పరమాత్మ నుండి బయల్వెడలిన అంశరూపుడగు జీవుడే పుణ్య-పాప కర్మఫలములను అనుభవిస్తున్నాడు. **అంతమాత్రంచేత ఆత్మ తన యొక్క స్వరూప - స్వభావములు కోల్పోవుచున్నదా? లేదు. ఏ మాత్రమూ ఆత్మ పరిమితము అగుటలేదు. తనయొక్క స్వాభావికములగు అఖండత్వ, అప్రమేయత్వ, నిత్యత్వ, సత్యత్వములను యథారీతిగా కలిగియే ఉంటోంది.**

**బ్రహ్మభగవానుడు :** పరంధామా! శివభగవాన్! ఇప్పుడు రెండు విషయాలు నాకు చమత్కారంగా కనిపిస్తున్నాయి.

(1) పరమాత్మపదము నిత్యము అయినది కదా! మరి అట్టి పరమాత్మ ఏ విధంగా జీవాత్మత్వము, జీవాత్మపరిమిత సుఖ-దుఃఖ-జీవన్-మరణాది లక్షణములు- ఇవన్నీ ఆపాదించుకొని పొందుచుండటం జరుగుతోంది?

(2) తత్త్వాతీతమగు నిర్మలాత్మకు దోషములు ఎందుకు, వచ్చిపడుచున్నాయి? ఎందుకు అల్ప-అజ్ఞాన దశలు, అల్ప జన్మలు సందర్భమౌతున్నాయి?

హే మహాదేవా! ఈశ్వరా! ఈ విషయాలు దయతో-**కథయ!** వివరించి చెప్పండి.

**పరమశివుడు :** వస్తురహితము, నిర్మలము, శూన్యము (పదార్థరహితము) అగు ఆకాశమునందు వాయువు, వాయుతరంగాలు ప్రదర్శితమగుచూ బయల్వెడలుచున్నాయి కదా! ***(శూన్యంలో చలనములు).*** అట్లాగే, **సర్వభావములకు ఆవల భావనలకు ఆది రూపము, భావనారహిత రూపము, సర్వపదములకు మునుముందే ఉన్నట్టిది** (That which is prior to all positional aspects), **కేవలము** (Absolute) - అగు 'ఆత్మాకాశము'లో అహంకారము, ఆ అహంకారము నుండి **"నేను కర్మలను నిర్వర్తించువాడను కర్తృత్వము కలవాడను, కర్తను"** అను రూపంగా - **వ్యవహార సరళి** అంతా బయల్వెడలుతోంది. అట్టి **'అహమ్‌కృతమ్'** లేక **'అహంకారము'** - అనేక కల్పిత వస్తువులకు జనన స్థానమగుచున్నది.

→ భూ (Solid)-జల (Liquid)-అగ్ని (Heat)-వాయు (Vapour, movement) - ఆకాశ (Placement, space) రూపములగు పంచాత్మకములు, వాటి సమ్మేళనముల రూపమగు భౌతిక రూపములు, **దేహపిండములు.** (Materialistic Forms),

→ ఆలోచన (Thought)-తెలివి (Intelectual)-ఇష్టా యిష్టములు (Likings)-'నాది' అనే భావము గల భావనలు (Possessing) , వాటివాటిని తమ ప్రదర్శనములుగా కలిగియున్న మనో-బుద్ధి-చిత్త-అహంకారములు-**(అభూతంపిడములు**-Non materialistic Formations),

→ చర్మము, రక్తము, మాంసం, బొమికలు, మజ్జ, క్రొవ్వు-మొదలైన రూపములు గల ధాతువులు, వాటి వాటి **ధర్మ విశేషములు** (Functional Features),

→ సత్త్వము - రజము - తమము అని చెప్పబడుచున్న త్రిగుణములు, గుణాత్మకమైన విశేషపరంపరలు,

→ **ఇష్ట-అయిష్టములు,** వాటి వలన ఏర్పడే **సుఖ-దుఃఖములు** - ఇవన్నీ రూపము పొందుచున్నాయి.

## జీవభావము

వీటన్నిటితో కూడిన జీవభావము అంకురించుచున్నది. **"నేను జీవుడను. పరిమితుడను. బద్ధుడను. అల్పుడను. స్వల్పుడను, దోషుడను"..** మొదలైనవన్నీ **'జీవ-భావన' చుట్టూ అలుముకోసాగుచున్నాయి.** నిరాకారము అగు సముద్రజలంలో సాకారములగు తరంగములు బయలుదేరు విధంగా **అపరిమితము - మహత్తరము** అగు **'పరమాత్మ'** అనే మహాసముద్రంలో **'జీవాత్మలు'** అనే తరంగాలు బయల్వెడలుచున్నాయి. **ఆ జీవాత్మ** అనేక సుఖ-దుఃఖభావనలచే, ఆశయములచే, అనుభూతములచే నిబద్ధము అగుచున్నది.

ఈ విధంగా విశుద్ధుడగు పరమాత్మ పట్ల **'జీవబద్ధుడు'** అనే ఆపాదన (Attribution) చేయబడుతోంది. నాటకము జరుగుచుండగా, నాటకములోని పాత్ర యొక్క గుణములు, ధర్మములు నటుడిపై ఆరోపించి జనులు చూచువిధంగా, **అనంతుడగు పరమాత్మ యొక్క ఒక అంశ అగు ఈ జీవాత్మ ధర్మములు పరమాత్మపై ఆరోపించబడి, పరమాత్మను జీవాత్మగా చూస్తూ ఉండటము జరుగుతోంది.**

## జీవాత్మ దోషములు

**కామము :** లేనిదేదో కావాలి. వాళ్లు అట్లా ఉండాలి. వీళ్లు ఇట్లా ఉండకూడదు. ఇది ఇట్లా జరగాలి. అది అట్లా జరగకూడదు - మొదలైన అభినివేశములు (Wishes, expections, Desires, Anticipations, wants etc.)

**క్రోధము :** (ఆవేశపూరితమైన రాగ-ద్వేషములు. ఏదైనా ఒకే సందర్భముపై మూడుసార్లు కోపం వస్తే అది 'క్రోధము'గా చెప్పబడుతోంది).

**భయము :** "ఉన్నదేదో పోతుందేమో ! అనుకున్నవి జరుగవేమో! అనుకోని విపత్తులు వస్తాయేమో! నాది నాది కాకుండా పోతుందేమో! ఎవ్వరివలనన్నా నష్టం వస్తుందేమో!" మొదలైన అనేక ఉద్వేగతాపముల రూపము.

**ఇచ్ఛ :** కొందరంటే ఇష్టం. మరికొందరిపై అయిష్టం. ఏదో పొందాలనే తపన. ఏదైనా లేకపోతే బాధ. 'నాది' అనే భావన.

**మోహము :** కొన్ని పరిమిత విషయములను బద్ధుడై భ్రమించి ఉండటం. అసమగ్రమైన అవగాహన. లేనిది ఉన్నట్లుగాను, ఉన్నది లేనట్లుగాను దర్శించటము, స్పందించటము.

**లోభము :** 'నాది' అని దాచుకోవటము. ఇతరులతో పంచుకోవలసినది పంచుకోకపోవటము. ఉన్నది పోతుందేమోనన్న తపన. వస్తు- విషయ-బంధు జన విషయాలలో "నాకే / చెందినది" - అను ఉద్వేగము.

**మదము :** తనకు ఉన్న దానిని చూచి గర్వించటము. ఇతరులను చిన్నచూపు చూడటము. తనను తాను ప్రత్యేకమైనవాడిగా భావించటం.

**మాత్సర్యము :** ఇతరులను బాధించటము. హింసించటము. అవమానించటము. ఇతరులపై పగ, ద్వేషము, అసూయ.

**రజము :** "ఏదో చేయాలి! తిరగాలి! పొందాలి! కావాలి!" - అను రూపము గల పనిచేయాలనే వ్యసనము.

**జన్మ-మృత్యుశ్చ స్థితిగతులు : *"నేను పుట్టుచున్నాను. చచ్చుచున్నాను. పుట్టేవాడిని. చచ్చేవాడిని"*** - అను దేహసంబంధమైన వివశత్వము, విహ్వాలము.

**కార్పణ్యము :** "నా వారికి ఏమౌతుందో, ఏమో? ఎట్లాగో? ఏమో?".. అనే రంధి. బెంగ. మమకారము. జాలితో కూడిన వేదన-భయములు. ఎప్పుడేమౌతుందోననే అనుమానము. తనపై తానే జాలిపడటం "ఇక ఏం గతి?" అని ఆదుర్దా పడటం.

**శోకము :** బాధపడటం. ఈసురోమంటూ కూర్చుని ఉండటం. ఏవేవో జ్ఞాపము తెచ్చుకొని దుఃఖము, వేదన కలిగి ఉండటము.

**తన్ద్రా :** అలసత్వము. బద్ధకము. అశ్రద్ధ. అతినిద్ర.

**క్షుధా-తృషా :** ఆకలి-దప్పికలు. ఏదో తినాలని, వేదన పడటం. ఎల్లప్పుడు లేనిపోని వాటి కోసం ఆతృత.

**తృష్ణా :** అంతులేని కోరికలు. దాహము. పొందలేదనే వేదన.

**లజ్జా భయమ్ :** "నేనింతేనా? ఇంత తక్కువవాడినా? ఏం, వాళ్లు అంతటివారే! మరి నేను ఇదేమిటి?".. అని సిగ్గుపడటం. తనను తాను తక్కువ చెప్పుకోవటం. ఇతరులను చూచి భయపడే స్వభావం.

**దుఃఖమ్ :** ఏదో లేదనే వేదన. ఎప్పుడు బాధపడుచూ ఉండటం. ప్రతి దానికీ ఆదుర్దా (Worry) పొందటము.

**విషాదో :** దుఃఖ - అవమాన సంఘటనలను మననం చేస్తూ అసంతృప్తిగా ఉండటం.

**హర్షము :** వాటిని వీటిని చూచుకొని గొప్పగా భావించటం. అతి సంతోషము. సంపదలను, పాండిత్యము మొ॥ వాటిని చూచుకొని మురియటము.

**ఓ బ్రహ్మదేవా! ఇవన్నీ కూడా ఈ జీవుడు తన పట్ల తెచ్చిపెట్టుకొన్న దోషములు. ఎవ్వడు ఈఈ దోషముల నుండి విముక్తుడౌతాడో, ఆ జీవుడే 'శివుడు' అని చెప్పబడతాడు. జీవో శివః॥**

## స జీవో 'శివ' ఉచ్యతే।

**బ్రహ్మదేవుడు :** అవును. మీరు చెప్పుకొస్తున్న దోషములన్నీ ఈ జీవుడు కలిగి ఉంటున్నాడు. మరి ఆ దోషములు పోయేది ఎట్లా? ఈ జీవుడు నిర్మలుడు, దుఃఖరహితుడు అయ్యేది ఏతీరుగా? తన సహజానంద స్వరూపమును గమనించి ఎట్లా ఆనందించగలడు?

**పరమశివుడు :** హే బ్రహ్మ భగవాన్! ఈ జీవుని పట్ల పరిస్థితి దుఃఖభూయిష్టమై యున్నది కాబట్టి, అటువంటి (ఇప్పుడు మనము చెప్పుకొన్న) దోషముల నివారణ కొరకై ఈతడు ఉపాయము తప్పక ఆశ్రయించాల్సిందే! అట్టి ఉపాయముల గురించి చెప్పుకుందాము. అందుకు రెండు ఉపాయాలు.

**(1) జ్ఞానము** – శాస్త్ర సమాచారములు సంపాదించుకోవటము. ఆత్మ గురించి ఆత్మజ్ఞులు ఏమి చెప్పుచున్నారో విని, ఆకళింపు చేసుకోవటము (Getting wel-informed) . విచారణ – సత్సంగము, జిజ్ఞాస.

**(2) అభ్యాసము :** (Practising) యోగాభ్యాసము. (భక్తి-క్రియా-కర్మ-భావనా యోగాభ్యాసములు)

**బ్రహ్మదేవుడు :** జ్ఞానము – యోగ-అభ్యాసములలో ఏది సులభము? దేనివలన ఈ జీవుడు త్వరగా, తేలికగా **"నిర్మలమగు ఆత్మయే నేను"** – అనే అనుభవము సిద్ధించుకోగలడు? జ్ఞానము గొప్పదా? యోగాభ్యాసము గొప్పదా? ఏది తేలిక? దేనితో తక్కువ శ్రమతో **"ఆత్మానుభవి"** కాగలడు?

**పరమశివుడు :** కొందరు **"జ్ఞానమే శ్రేష్ఠము. జ్ఞానాదేవతు కైవల్యమ్॥ జ్ఞానము వలననే మోక్షము"**.... అని నొక్కివక్కాణించి చెప్తూతూ ఉన్నారు. **"ఇంక వేరే మార్గము లేదు. జ్ఞానమే ఉపాయం"**.. అని వారి ప్రగాఢమైన ఉద్దేశ్యము. "తెలుసుకోవటము వలననే మోక్షము" – అని సిద్ధాంతీకరిస్తున్నారు.

అయితే...,

ఒకడు గ్రంథముల నుండియో, గురువులు మొదలైనవారు 'ఆత్మ' గురించి చెప్తూతూ ఉండగానో, చదువుటచేతనో, వినుటచేతనో – తెలుసుకుంటూ ఉంటే సరిపోతుందా? ఆత్మ గురించి తెలుసుకొన్నది స్వయముగా తనకు **స్వాభావికంగాను, అనుక్షణికంగాను కారణాతీతంగాను అనిపించాలి కదా?** తనకు అనిపించకుండా తెలుసుకొని, విని, మాట్లాడగలిగినంత మాత్రంచేత ఏమి ప్రయోజనం? **యోగ హీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ఇహ భో?** ఆత్మ విషయం విని, తెలుసుకొని, (అటుపై) 'యోగసాధన'కు ఉపక్రమించకపోతే, అప్పుడు దృశ్యవిషయములతో బంధవిముక్తిరూపమగు మోక్షము ఎట్లా లభిస్తుంది, చెప్పండి? అందుచేత మరికొందరు **"యోగాభ్యాసము లేకుండా, కేవలము జ్ఞానము వలన సిద్ధి లభించదు"** – అని సిద్ధాంతీకరిస్తున్నారు. ఇది కాదనటానికి వీలు లేదు. **విన్నది అనుకోవాలి. అనుకున్నది అనిపించాలి. అనిపించటటానికి 'యోగాభ్యాసము' అత్యవసరమే!**

యోగాభ్యాసం నిర్వర్తిస్తూ – జ్ఞానముతో పనిలేదని అనగలమా? లేనేలేదు. 'యోగాభ్యాసము' మాత్రమే ఆశ్రయిస్తూ, ఆత్మజ్ఞానము పొందకపోతే **'మోక్షము కొరకు కర్మలు'** అను దానికి అంతుఎక్కడ? అందుచేత, **యోగోఽపి జ్ఞానహీనస్తు న మోక్ష క్షమో మోక్షకర్మణి!** యోగి జ్ఞానహీనుడైతే యోగాభ్యాసములకు ముగింపు ఎక్కడ? అంతు అనేదే ఉండదు.

## జ్ఞానం చ – యోగం చ

**అందుచేత..., తస్మాత్ జ్ఞానం చ యోగం చ ముముక్షుభిః దృఢమ్ అభ్యసేత్!** ముముక్షువు (1) జ్ఞానము (2) యోగము → ఈ రెండిటినీ కూడా ఒక్కసారే దృఢముగా అభ్యసించవలసిందే. పక్షి రెండు రెక్కలతో ఆకాశంలో విహరించు తీరుగా, ఈ జీవుడు జ్ఞాన-యోగముల సహాయం చేతనే మోక్షాకాశంలో విహరించగలడు.

## జ్ఞానైక సాధనం జ్ఞేయమ్!

**మొట్టమొదటిది జ్ఞానమే** అయి ఉన్నది. ఎందుకంటే జ్ఞేయము అయినట్టి **ఆత్మ తెలియబడేది జ్ఞానము చేతనే.** జ్ఞానమే ముఖ్యసాధనము. ఆత్మ **జ్ఞానస్వరూపమే** అయి ఉన్నది కదా! ఆత్మను 'అజ్ఞానము' ఆవరించి ఉండటం చేతనే ఆత్మానుభవము అనుభూతమవటం లేదు. **"అజ్ఞానము అనగా ఏమి? అద్దాని రూపమేమిటి?"** అని ముముక్షువు మొట్టమొదట సుదీర్ఘవిచారణకు ఉపక్రమించాలిసిందే.

- ఏది సందర్భమాత్ర **రూపము**?
- ఏది నిజ**రూపము**?

అని పరిశీలించి, అప్పుడు తన నిజరూపము ఏమిటో తెలుసుకొన్నప్పుడే **'కేవలము'** అయినట్టి **"కైవల్య-పరమపదము"**ను ఈజీవుడు సిద్ధించుకోగలుగుతాడు.

### 'ఆత్మమేవాఽహమ్' భావన నిర్ద్వంద్వంగా సంకోచ రహితంగా సిద్ధించేది ఎట్లా?

ఈ జీవుడు కామ-క్రోధ-భయ ఇత్యాది దోషములు తొలగినప్పుడే **కైవల్యము**ను సిద్ధింపజేసుకోగలడు. అటువంటి అనేక దోషములచే ఈతడు ఆవృతుడు (sorrounded) అయి ఉండగా, ఆత్మతత్త్వ సమాచారము సంపాదించుకొని మాత్రం ఏం లాభం? జ్ఞానమాత్రం చేత క్రోధము, భయము, ఆవేశము, ఆశ-నిరాశ-దురాశలు-**ఇవన్నీ తొలగిపోతాయా? లేదు.** మరి అట్టి సంసార దోషములను మొదలంట్లా తొలగించుకోవాలి కదా! **"ఇది మనస్సు. ఇవి మానసిక దోషములు, ఇది బుద్ధి. ఇవి బుద్ధి దోషములు"** – అని తెలుసుకుని కూడా, అవి తొలగనంత వరకు – తెలిసి మాత్రం ఏం ప్రయోజనము?

## విధి-నిషేధములు :

**"జ్ఞానము"** (తెలుసుకోవటము) అనునది దేని గురించి? ***(ముముక్షువు యొక్క) స్వస్వరూపము గురించే కదా?***

- 'స్వాత్మ' యొక్క రూపము - కేవల జ్ఞానరూపము. (That which is knowing all else. Is beyond knowing as well as beyond what is being known)
- స్వస్వరూపము సర్వదా పూర్ణము. సర్వము తానే అయినట్టిది. సర్వవ్యాపకము.
- కామక్రోధ - ఇత్యాది దోషములు కూడా స్వాత్మకు భిన్నము కాదు. అనగా, ఆత్మకు అవి భిన్నత్వము కలిగించలేవు. ఆత్మ సర్వదా **అఖండము. అప్రమేయము. నిత్యము. యథాతథము** కూడా.

ఈ విధంగా ఎప్పుడైతే ఈ జీవుడు **స్వస్వరూపాత్మ** యొక్క **ఔన్నత్యమును** తెలుసుకొని అనునిత్య-స్వానుభావముగా చేసుకుంటాడో, ఆ తరువాత, **పశ్చాత్ తస్య విధిః కిన్ను? నిషేధోఽపి కథం భవేత్?** ఆత్మ స్వరూప జ్ఞానము సిద్ధించుకున్న వానికి, ఇక ఆతడు- **"ఈ ఈ కర్మలు, సాధనలు నిర్వర్తించాలిసిందే!"** - అని విధి ఏముంటుంది. **"ఇదిగో! ఈఈ కర్మలు చేయకూడదు"** అనే **నిషేధము** మాత్రం ఏమి ఉంటుంది?

**నిత్యానిత్య వ్యవహారముల తత్త్వమేమిటో తెలిసికొనియున్న వివేకి- నిత్యముక్తుడు. యోగి - "ఆత్మగా నేను నిత్యముక్తుడను"** అని ఎరిగినవాడై ఉంటున్నాడు. **తత్పూర్ణుడు** గా తానే అగుచూ సర్వమునకు **స్ఫూర్తి రూపుడు**గా తనను తానే ఎరుగుచున్నాడు. సంసార భ్రమంతా తొలగిపోవుచున్నది. ఈ సంసారము నందు (లేక) జగత్ దృశ్యమునందు దోషములు ఉండవచ్చు (లేక) ఉండకపోవచ్చుగాక! ఆత్మకు ఏ దోషము అంటదు. మనస్సు దృశ్యములో ఇటూ అటూ తిరుగాడుచున్నది. **ఆత్మ ఎప్పుడూ కూడా తిరుగాడు ధర్మమే లేనట్టిది.** స్వప్నములో ఒకడు ఎక్కడికో వెళ్లి వచ్చినంత మాత్రం చేత ఆతడు అక్కడికి వెళ్లి వచ్చినట్లా? కాదుకదా! అట్లాగే ఆత్మకు **రాకపోకలు లేవు. సంసారిక దోషములు అంటజాలవు. సమస్తమునకు అప్రమేయము** కూడా.

⌘

**I. జీవాత్మగా → "స-కలము". దృశ్య సహితము. ద్రష్ట సహితము - 'కలినా స్ఫూర్తి రూపేణ సంసార భ్రమతాంగతమ్'**

[ **జీవాత్మ** → కల్పనచే స్ఫూర్తి రూపంగా సంసారము నందు అనేక భ్రమభావములతో తిరుగాడుచున్నది. అయితే, ఆకాశమువలె సర్వము తనయందే కలిగి యున్నది। ***గగనోపమమ్।***]

**II. పరమాత్మగా → నిష్కలము** దృశ్య-ద్రష్టల రహితము. కేవలము - నిర్మలము - సాక్షాత్ స్వరూపము. ఆత్మ సర్వదా పూర్ణము. కనుక ఉభయరూపములు సర్వదా కలిగియే ఉన్నది. అయ్యే ఉంటోంది.

**నిష్కళము, నిర్మలము, ఉత్పత్తి స్థితి సంహార సామర్థ్యము కలిగియున్న కేవలాత్మ** - *స-కలము, అయి, ఉత్పత్తి స్థితి సంహార వివర్జితము అగుచున్నది. ఆత్మ విద్యను మరల మరల త్యజించి సంసార మోహ సాగరంలో ఎట్లా పడుతోంది? ఎంతటి చమత్కారం?*

## జ్ఞాని - అజ్ఞాని - సంసారము

**'అజ్ఞాని'** ఏ విధంగా సుఖ-దుఃఖాది మోహ సంసారంలో పడుచున్నాడో, అదే తీరుగా **(ఆత్మ సమాచారము విని, తెలుసుకొని ఉన్న) 'జ్ఞాని'** కూడా ఆత్మ విచారణ చేస్తూ ఉన్నప్పటికీ, **వాసనల కారణంగా** సంసార పరిధుల నుండి బయల్వెడలలేకపోవుచున్నాడు. యోగాభ్యాసము లేకపోయినప్పుడు ఆత్మ సమాచారము లేని అజ్ఞాని, ఆత్మసమాచారము గల జ్ఞాని.... ఇరువురిలో సంసారబంధములు ఒకే తీరుగా ఉంటున్నాయి. ఇద్దరికీ తేడా లేదు. ఆత్మసమాచారము తెలిసినంతమాత్రం చేత (ఇదంతా ఆత్మయేకదా - అని తెలిసియున్నప్పటికీ) **పూర్వజన్మ-పునర్జన్మ సంస్కారాలు కారణంగా సంసారిక చేష్టలు మరల మరల వెంటనంటియే ఉంటున్నాయి.**

ఒక ఆత్మజ్ఞాన నిష్ఠకలవాడు - విరక్తుడు అయి కూడా, ధర్మజ్ఞుడు అయి ఉండి కూడా, ఇంద్రియములను జయిస్తూ ఉండి కూడా, 'యోగనిష్ఠ' లేకపోవటం చేత, మరల మరల ఇంద్రియ- ఇంద్రియ విషయ పరంపరలచే జయించి వేయబడుచూనే ఉంటున్నాడు. **"నేను ఇంద్రియములకు నియామకుడను. అంతేగాని,, బద్ధుడను** కాదు. **సర్వదా నిత్య నిర్మలము - సర్వము - అఖండము అగు ఆత్మ స్వరూపుడనే నేను!" -** అను అవగాహన స్థితి కేవలము జ్ఞాన సముపార్జనచే సిద్ధించేది కాదు. అందుకు యోగాభ్యాసము తప్పక అవసరము. శ్రవణము మాత్రమే సరిపోదు. మనన, నిదిధ్యాస, సమాధిస్థితులు సిద్ధింపచేసుకోవాలి, మరి!

ఈ దేహధారులు రెండు తీరులు అయి ఉంటున్నాయి.

**(1) "అపక్వా" :** ఆత్మ జ్ఞానము తెలుసుకొంటున్నవారు. కానీ, బుద్ధి యోగశుద్ధిచే పరిపక్వము కానట్టివారు. తెలుసుకొన్న ఆత్మజ్ఞానము ఇంకా స్వానుభవము కానట్టివారు.

**(2) 'పక్వా' :** జ్ఞానము యోగాభ్యాసముచే జ్ఞేయముగా (అనునిత్య – స్వానుభవముగా) తీర్చిదిద్దుకున్నవారు. **"మత్తః పరతరమ్ నా నాన్యత్ కించిదస్తి! అహమ్ సర్వస్య ప్రభావో"** – అని ఎరిగి), ఆస్వాదించువారు.

యోగాభ్యాసముచే – దేహములో యోగాగ్ని జనిస్తోంది. క్రమంగా ఆ యోగి పక్వుడు, అజడత్వముచే శోకరహితుడు (Win over all kinds of worries) - అగుచున్నాడు.

అపక్వుడో, 'జ్ఞేయుడు' (జ్ఞాన సమాచారము కలిగియున్నవాడు) అయినప్పటికీ జడత్వముచే పార్థివదేహము వలన దుఃఖములను పొందుచున్నాడు. ధ్యానస్థుడు అయి కూడా ఇంద్రియములకు వివశత్వము వదులుటలేదు. గాఢమైన ఇంద్రియ నియములు (ఉపవాసము, ఆహార నియమములు, వ్రతదీక్షలు మొ॥నవి) ఆశ్రయిస్తూ ఉన్నవాడై కూడా, బాహ్య (ఇంద్రియ) విషయములచే బాధింపబడుచూనే ఉన్నాడు. అయోగి యొక్క శరీరము శీత–ఉష్ణముల చేతను, సుఖ–దుఃఖములచేతను, ఆధి (మానసిక రుగ్మతలు) – వ్యాధి (శారీరక రోగములు) చేతను బాధింపబడుచున్నది. మానసికమైన, తదితర సాంఘికమైన ఆయా బాధించే సంగతి – సంబంధ – సందర్భములచేతను, ఇంకా అనేక అన్యమగు నానావిధ బాధల చేతను ఆతని చిత్తము సంక్షోభితము అగుచూనే ఉంటోంది. ప్రాణాపాయములు బాధిస్తూనే ఉంటున్నాయి. ఈ విధంగా జ్ఞాన సమాచారము కలిగి ఉన్నప్పటికీ ఆతని చిత్తము వందలాది దుఃఖ వ్యవహారములలో వ్యవహరిస్తూ, జీవించి ఉన్నంతకాలము అనేక సంక్షోభములు పొందుచూనే ఉన్నది.

ఇది ఇట్లా ఉండగా, ఈ భౌతిక దేహము నశించబోవు సందర్భము ఉండనే ఉన్నది కదా! అట్టి దేహావసాన సమయములో ఏమగుచున్నది?
**దేహావసాన సమయే చిత్తే యత్ యత్ విభావయేత్, తత్ తత్ ఏవ భవేత్ జీవ, ఇత్యేవం జన్మకారణమ్!**

దేహము అవసానము (The end) పొందుచున్న సమయానికి ఈ జీవుడు – ఏఏ గుణములు, లక్షణములు, స్వభావములతో కూడిన చిత్తము – కలవాడై ఉంటాడో,.. ఆ చిత్తమును అనుసరించియే పునః పునః జన్మలు పొందటము కొనసాగుతోంది. తదనంతర ఉపాధులు ఏఏ రీతులుగా ఉండబోవుచున్నాయో.. ఈ జీవునికి వర్తమానంలో ఊహకు అందటమే లేదు. **తస్మాత్ జ్ఞానం చ వైరాగ్యం జీవస్య కేవలం శ్రమః!** కాబట్టి యోగభ్యాసము లేకుండా కేవలము జ్ఞానము, వైరాగ్యము (విరాగము) సంపాదించి ఊరుకుందామని అనుకుంటే, అదంతా ఈ జీవునికి వృథా శ్రమయే – అవగల అవకాశమున్నది.

ఒక చీమ ఆహారం కోసము, దేహరక్షణ కోసము పరితాపాలు పొందుచూ ఒకాయన దేహముపై ప్రాకుచూ ఉండగా, ఆ స్పర్శకు స్పందించిన ఆయన చేతితో విదిలించగానే ఆ చీమ ఎటో పడిపోతూ ఉంటుంది కదా! అట్లాగే అనేక లోకసంబంధమైన 'విషయములలో మునిగితేలుచున్న ఈ మానవుడు ఆ విషయ వృశ్చికములచే (తేళ్లచే) బాధలు పొందుచూ, దేహపతనానంతరం ఏవేవో తెలియరాని ఉపాధులలోకి విసరివేయబడుచున్నాడే! అందుచేత మూఢత్వము, మూర్ఖత్వము వదలక, మిథ్యాతర్కములు (Logics that lead to some more illusions) కొనసాగిస్తూ జీవితము గడపువాని పట్ల, ఆయుష్షు, అవకాశములు వృథా అగుచున్నాయి. ఆత్మలాభమునకు అవకాశమున్న మానవ దేహము పొంది కూడా, ఆతడు 'ఆత్మ' గురించి స్వానుభవముగా ఎరుగక 'మూఢుడు' గానే దేహము వదలుచున్నాడు.

**ఎప్పుడైతే 'అహంకారము' – నశించినదిగా అగుచున్నదో, అట్టివానికి దేహభావము కూడా నశించుచున్నది.** యోగాభ్యాసముచే దేహమే **నశించిన వస్తువుగా** దర్శించువాని పట్ల ఇక దేహవ్యాధులు ఏమి చేస్తాయి? దేహమును భస్మమాత్రంగా, భస్మభూషితాంగములుగా చూచువానిని– శస్త్ర–జల–అగ్ని ఘాతములు కూడా బాధ కలిగించలేవు. ఏ "నేను – నాది" రూపమగు **'వ్యష్టి అహంకారము'** జన్మ–జన్మల సంకల్పరూప సంసారవృక్షమును ఆశ్రయించి అనేక దుఃఖపరంపరలను పొందుచున్నదో, అట్టి సంకుచిత (పరిమితాహంకారము) క్షీణించుచుండగా, క్రమంగా సర్వ శారీరక, మానసిక, బుద్ధి సంబంధమైన రుగ్మతలు నశించగలవు. ఎక్కడైనా కూడా, **కారణము** నశిస్తే, దానితో బాటే **కార్యము** కూడా నశిస్తుంది కదా? **కారణేన వినా కార్యం న కదాచన విద్యతే!** "శరీరము యొక్క ఉనికి (ఉన్నది– అను భావన) – అనే కారణమే నశించిన తరువాత 'శరీర బాధలు' అనుదానికి ఉనికి ఎక్కడుంటుంది? 'అహంకారము' నశిస్తే దేహము యొక్క ఉనికి, అది బాధించగలగటం కూడా స్వభావంగానే తోక ముడుస్తాయి.

హే బ్రహ్మ భగవాన్! అయోగికి ఈ శరీరము **సర్వ సంసార బంధములకు ముఖద్వారము** అగుచున్నది. యోగికో? ఇదే **భౌతిక దేహము సర్వసంసార బంధములు త్రెంచివేయుటకు మహత్తరమగు ఉపకరణం.** అందుచేత యోగ్యాభ్యాసం అత్యవసరం.

**శరీరేణ జితాః సర్వే, శరీరం యోగిభిః జితమ్॥ జీవులందరూ 'శరీరము' అనుదానిచే జయించివేయబడుచున్నారు. యోగి శరీరమునే జయించినవాడై ఉంటున్నాడు.**

శరీరమే జయించబడిన తరువాత, ఇక అట్టి యోగికి కర్మఫల సంబంధమైనట్టి సుఖ-దుఃఖములు ఎక్కడివి? అవి జాడలేనివిగా అగుచున్నాయి. ఎవ్వడైతే యోగాభ్యాస బలంచేత ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని, కామ-క్రోధములను జయించి తన చెప్పుచేతలలో ఉంచుకుంటాడో, **అట్టివాడు సర్వమును జయించివేసినట్లే.** ఇక ఆతనిని బాధించగల సత్తా దేనికి ఉంటుంది? దేనికీ ఉండదు. యోగబలము గలవానికి మరణం ఎక్కడిది? 'జన్మ' అనునదే ఆతని పట్ల లేని వస్తువగుచున్నది. **"నాకు దేహము వస్తూ పోతూ ఉండవచ్చు గాక! నేను దేహముతో పుట్టను. దేహముతో చావను"..** అనునది యోగబలం చేతనే "స్వకీయ సునిశ్చిత - అనుక్షణికానుభవము" అవుతోంది. **హరేన మృత ఏవా సౌ, మృతస్య మరణం కుతః!** ఆతడు యోగాగ్నిచే మరణమునే హరించి వేసి ఉంటాడు. ఇక ఆతనిపట్ల మరణం అనునది ఎక్కడుంటుంది?

**శ్లో॥ మరణం యత్ర సర్వేషాం, తత్రాసౌ పరిజీవతి!**
**యత్ర జీవతి మూఢస్తు తత్రాసౌ మృత ఏవ వై॥**

అజ్ఞాన-జీవులంతా ఎక్కడ **మరణానుభవము పొందుచున్నారో,** అక్కడ - జ్ఞానసమాచారమును యోగాభ్యాసముతో అనుభవముగా తీర్చిదిద్దుకొన్న యోగి, యోగ-జ్ఞానముల బలముచే ముక్తిని సిద్ధించుకున్నవాడై- జీవించియే ఉంటున్నాడు. ఎక్కడ అయోగులగు, అజ్ఞానులగు జీవులు **'మేము జీవిస్తున్నాము'** అను అనుభవముతో ఉంటున్నారో, అక్కడ వారు, **'సర్వదా ఆత్మ లేనిదే'** - అను దృష్టితో చూస్తూ ఉండటం చేత - **'మరణానుభవి'** (మరణించినవాడు)గా ఉంటున్నాడు. యోగాభ్యాసి క్రమంగా 'జీవన్ముక్తుడు' అయి, స్వచ్ఛుడై, సదా నిర్మలుడై స్వయం ప్రకాశమానుడై ఉంటున్నాడు. అట్టివాడికి ఎటువంటి కర్తవ్యములు ఉండవు. ఒకవేళ ఆయా ఏవేవో సందర్భములలో ఏవైనా క్రియలు నిర్వర్తిస్తూ ఉన్నప్పటికీ వాటి దోషములు ఆతనికి అంటవు. తాకవు. ఎందుకంటే ఆతడు **యోగాభ్యాస బలముచే అకర్తృత్వము, అభోక్తృత్వము వహించగలిగినవాడై ఉంటున్నాడు.**

తదితరులగు కొందరు జ్ఞాన సమాచారము తెలుసుకొనియుండి, సంభాషించగలిగి యుండి కూడా, యోగాభ్యాసముచే బుద్ధిని **నిశ్చలము, విషయాతీతము, కేవలము** చేసికొని యుండకపోతే, అటువంటప్పుడు పర్యవసానమేమిటి? వారు విషయముల పట్ల విరక్తులై ఉండికూడా, 'దేహము' చేత జయింపబడినవారై ఉండిపోవుచున్నారు. 'మాంస పిండము' అయి ఉండి, అనేక దోషములతో కూడినది అగు ఈ పాంచభౌతిక దేహమునకు దాసులైనట్టివారు - యోగాభ్యాసముతో ఈ దేహమును జయించినవారితో సమానము - కాగలరా? లేదు. 'అయోగి అగు జ్ఞాని పట్ల పుణ్య-పాప ద్వంద్వముల ఫలములను పొందటముకొరకై ఒక 'దేహము తరువాత మరొక దేహము' (అను రాకపోకలు) కొనసాగుతూనే ఉంటోంది. పుణ్యఫలము చేత ఎప్పుడైతే ఆత్మ-అనాత్మ సమాచార శీలుడగు జ్ఞాని యోగసిద్ధుని సామీప్యతను పొందుతాడో, అట్టి సిద్ధుడగు గురుదేవుని సామీప్య-సాంగత్యము చేత సిద్ధిని (సంసార శృంఖలముల నుండి విముక్తిని) పొందుచున్నాడు. యోగసిద్ధుని కృపచేత ఆతడు యోగి, తత్త్వజ్ఞాని కూడా అయి, 'సంసారము'ను నశింపజేసుకొనుచున్నాడు. ఇదియే ముముక్షువుకు క్షేమమగు, శుభమగు, శివభాషితమగు మార్గము. ఇక వేరే త్రోవలేదు.

ఈ విధంగా ఒకడు **జ్ఞాని** మాత్రమే అయినంత మాత్రం చేత సరిపోదు. **'యోగి'** కూడా కావాలి. అంతేకాదు. **'యోగాభ్యాసి'** అయినవాడు **'జ్ఞాని'** కూడా అయి ఉండాలి. **యోగసాధనచే సంయోగ-వియోగాతీత స్థితి సిద్ధించుకోవాలి. 'యోగి' అయినా కూడా సరిపోదు. ఆత్మజ్ఞాని కూడా కావాలి.**

**యోగేన రహితం జ్ఞానం న మోక్షాయ భవేత్, విధే! జ్ఞానేనైవ వినా యోగో న సిద్ధ్యతి కదాచన!** ఓ విధీ! బ్రహ్మదేవా! 'జ్ఞానము' కలిగియుండని యోగి గాని, యోగాభ్యాసమును ఆశ్రయించని జ్ఞానికాని - **'మోక్షము'** అను సిద్ధిని సిద్ధింపజేసుకోలేరు. అయితే వంద జన్మలలో జ్ఞానమును సంపాదించుకొన్నప్పటికీ చివరికి **యోగి** అయినప్పుడే (యోగాభ్యాసము చేతనే) విముక్తి పొంది, విముచ్యుడు (రిలీవుడు) కాగలుగుతాడు. జ్ఞానముతో బాటుగా యోగి అయినవానికి, యోగఫలంగా ఇక "జన్మ-మృత్యుపరంపరలు" అనే వ్యసనం నుండి (పునఃపునః జన్మల చక్రము నుండి) విడివడగలడు. **'తెలుసుకోవటము', 'అనుకోవటము'** అనునవి **జ్ఞాన-యోగములు** అయి ఉండగా, **'ఆత్మైపమ్యేవ సర్వత్రా'** - అని అనిపించటమే యోగ-జ్ఞానముల మధురఫలము. **"ఆత్మగా ఇదంతా సర్వదా నేనే!"..** అను **అకృత్రిమ - అనునిత్య స్వాభావానుభూతియే 'సిద్ధి'**గా చెప్పబడుతోంది.

# సూర్య-చంద్ర - ప్రాణ అపానములు

ఈ జీవుడు క్షణక్షణము (విశ్వమంతా నిండియున్నట్టి) వాయువును ముక్కుపుటముల ద్వారా పీల్చుచు-వదలుచున్నాడు. అట్టి వాయువు దేహములో ప్రవేశించి, ఆయా ధర్మములను నిర్వర్తించి, తిరిగి బయటకు వెడలుచున్నది.

**ప్రాణము :** లోనికి వచ్చుగాలి - ఉష్ణధర్మము (సూర్యతత్త్వము) - కలిగి ఉంటోంది.

**అపానము :** బయటకు పోవు గాలి - శీతల ధర్మము (చంద్రతత్త్వము) కలిగి ఉంటోంది.

అట్టి **"ప్రాణ-అపానములను ఏకము చేసి ధారణ చేయుటము"** - అనే అభ్యాసముచే దేహములోని సూర్యచంద్రులు (ఉష్ణ-శీతలములు) ఏకస్థితి పొందినవై ఉంటాయి. అటువంటి "సమాన యోగాభ్యాసము" వలన సప్తధాతువులచే వివిధములైన పరస్పర సానుకూల్య - వ్యతిరిక్త రసాయనిక చర్యలు సమరసత్వము పొందుచున్నాయి. భౌతిక శరీరములో - ప్రాణాపాన సమస్వముచే జనించిన **'యోగాగ్ని'**చే - దేహము సమతుల్యము (Wel Balanced) చేయబడుచున్నది. అటువంటి **'ప్రాణ - అపానముల సమస్థితి'** - అను యోగాభ్యాసముచే (యోగాగ్ని- అను ఉష్ణము కారణంగా) - దేహములోని ఛేత (పిత్త) - ఖాత (వాత).... మొదలైన వాటి యొక్క ఎక్కువ - తక్కువలు సరిచేయబడగలవు. వాటి దోషములు నివారింపబడుచుండగా, శరీరములో ఉన్న, శరీరములోకి ప్రవేశించయత్నించుచున్న వ్యాధులు, వాటి వాటి లక్షణములతో సహా సమసిపోతాయి.

అంతేకాదు.

**తత్ అసౌ పరమాకాశ రూపో దేహీ అవతిష్టతి!** ఆ ప్రాణయోగాభ్యాసముచేత ఆ దేహి పరమాకాశరూపము (The Original state of Al-pervading and Al-Beyond Absolute self) నందు అవతిష్ఠితుడు అగుచున్నాడు. **కిం పునః బహునా ఉక్తేన?** ఇన్ని మాటలు చెప్పుకోవటమెందుకు? ప్రాణ-అపానముల సమాన యోగమును అభ్యసిస్తున్న యోగికి **'మరణము'** అనునది ఉండదు. దేహముల రాకపోకలు ఆతనికి **"మెలకువ నుండి గాఢ నిద్ర, గాఢ నిద్ర నుండి మెలకువ"** - వంటివిగా అగుచున్నాయి. ఆతనికి స్వయముగా లోకములో కనిపిస్తున్న దేహిత్వము దగ్ధమయిపోయిన కర్పూరము వలె కనిపిస్తుంది. **దేహవత్ దృశ్యతే లోకే దగ్ధకర్పూరవత్ స్వయమ్!**

⌘

ఈ జీవునికి సంబంధించినవై రెండు ముఖ్యమైన వస్తువులు ఉన్నాయి. **(1) చిత్తము (2) ప్రాణము.** ఈ రెండూ కూడా జీవునియందు పరస్పరము అవినాభావ సంబంధము కలిగినవై ఉంటున్నాయి. **ప్రాణము శక్తిరూపము. చిత్తము ఇష్ట-యోచనా రూపము.**

అయోగి పట్ల ఈ చిత్త-ప్రాణములు ఈ జీవునికి స్వాధీనం కావటం లేదు. జన్మ-జన్మల దురభ్యాసములచే ఎటెటో పరుగులు తీస్తున్నాయి. ఇప్పుడు 'ప్రాణ-అపాన-సమత్వము'ను అభ్యసించుచున్నట్టి యోగాభ్యాసి విషయంలో - చిత్తము (లేక) మనస్సు **కాలుకు త్రాడుచే కట్టబడిన పక్షివలె** స్వాధీనమై ఉంటుంది. ఇతఃపూర్వం పిచ్చిపిచ్చిగా వందల వేల విషయములలో విహరిస్తున్న మనస్సు యోగాభ్యాసి పట్ల - ఆయా విచారములన్నీ (Worried wonderings) మానివేస్తోంది. ఇక ఆ మనస్సు ఆతనిని బాధించదు. **అణకువ గల సేవకునివలె సేవిస్తుంది.** కాబట్టి, అట్టి సంచార పరంపరలలో చంచలమై అనేక రుగ్మతలను అంతర్గతంగా కలిగి ఉంటున్నట్టి ఈ మనస్సును నిరోధించాలంటే, వశంలో ఉంచుకోవాలంటే **'ప్రాణధారణ'**యే ఉపాయం. ఇంక వేరే ఏదీ ఉపాయం లేదు. అనేక శాస్త్ర విషయములను తర్క - వితర్కము చేయటం చేతగాని, మంత్ర - తంత్ర భేషజములచేత గాని మనస్సు నిలకడ పొందదు. అందుకు సరియగు ఉపాయమును ఆశ్రయించాలి. హే బ్రహ్మాభగవాన్! విధీ! అట్టి మనో నిశ్చలసిద్ధికి ప్రాణోపాసనయే సులభమార్గం. అదికాక వేరు మార్గం లేదు.

మరొక్క విషయం.

**"నేను యోగాభ్యాసం చేస్తున్నాను. వారు చేయటం లేదు. అందుచేత, నేను అధికుణ్ణి"**... ఇటువంటి ఖండజ్ఞానమును కొనసాగిస్తూ 'యోగాభ్యాసము'ను చేసుకొంటూ పోతామంటే.. అదంతా కూడా క్లేశములను ఇంకా అధికం చేసుకోవటమే అవుతుంది. **'అఖండ జ్ఞానము - అఖండానుభవము'** - ఇవి ఆశయంగా (As the end objective) కలిగి ఉండకుండా, కేవలము 'యోగాభ్యాసము' నందే కాలము గడుపుతూ ఉంటామంటే, అది వృథాశ్రమయే! **యోగభ్యాస సమయంలో మోక్షోపాయం ఎరిగియే ఉండాలి.**

ఎవ్వడైనా, యోగాభ్యాసమునకు ఉపక్రమించకుండానే **"యోగులు ఆస్వాదిస్తున్న యోగస్థానము నాకు లభించాలి"...** అని అనుకుంటూ ఉంటే, .. అది **"కాల్చని (పచ్చి) కుండను చేతితో పట్టుకొని సాగరమును దాటివేస్తాను"** అని అనుకోవటము వంటిది.

ఏ యోగి యొక్క **ప్రాణ-అపానములు. సమత్వ యోగాభ్యాసముచే - ఆతడు జీవించి ఉండగానే, "పరస్పర విలీనము"** అను సమరసస్థితి పొందుచున్నదో, అట్టి యోగి యొక్క పిండము (జీవాత్మ) పతితము (Down fall) పొందదు. చిత్తము దోషములచే బాధించబడదు. నిర్మలమౌతుంది. అట్టి **నిర్మల చిత్తములో 'స్వాత్మజ్ఞానము' స్వయముగా ప్రకాశించగలదు.**

హే పద్మజా! "యోగాభ్యాసము"చే ఒక్క జన్మలోనే కూడా 'జ్ఞానసిద్ధి' లభించగలదయ్యా! ఈ జీవుడు సర్వ దుఃఖములను, రుగ్మతలను, వేదనలను జయించటానికై ఇప్పటికిప్పుడే **'యోగసాధన'**కు ఉపక్రమించాలి. ముముక్షువైనవాడు "నాకు బంధమే లేదు. సర్వదా కేవలమగు ఆత్మస్వరూపుడనే" - అనే **చిత్తప్రశామ్య-స్థితిని** సిద్ధించుకోవటానికై ప్రాణజయమే కర్తవ్యమై యున్నది. యోగాభ్యాసమునకు మించిన పుణ్యము, సుఖప్రదము, శివము, సూక్ష్మమైనది మరొక్కటేదీ లేదు.

**యోగము :** ఎట్టి ప్రయత్నముచే → ప్రాణ - అపానములు, ఉష్ణ-శీతల రూపములగు సూర్య-చంద్రమసములు, జీవాత్మ-పరమాత్మలు, తదితర సర్వ ద్వంద్వజాలములు (The fisher-Nets of all kinds of Dualites) **'ఏకత్వభావన'**లో కరిగిపోగలవో, అటువంటి **సంయోగ- వియోగాతీత స్థితికి సంపాదించుకోవటానికి చేయుప్రయత్నమే 'యోగము'-అని చెప్పబడుతోంది.**

ఓ బ్రహ్మభగవాన్! ఇప్పుడు లోక కల్యాణార్థమై, ముముక్షువుల సౌలభ్యము కొరకు - సర్వజ్ఞానములలో ఉత్తమోత్తమమైనది అని చెప్పబడు **'యోగశిఖ'** - అను పాఠ్యాంశము గురించి చెప్పుకుంటున్నాము.

## యోగశిఖ

**ముందుగా** - శాస్త్ర - గురు ప్రవచితమగు ఇష్టదైవ సంబంధమైన **'మంత్రము'**ను అభ్యసించటం ప్రారంభించాలి. ఆ విధంగా మంత్రోపాసన చేస్తూ ఉండగా, అట్టి **'అనుధ్యానము'** (లేక) **'అనుధ్యాస'** చేత శరీరములో ఒకానొక **మంద్రమైన నాదము** బయల్వెడలసాగుతుంది. ఇకప్పుడు ఆ ముముక్షువు ఇక ఉత్తరోత్తర యోగాభ్యాసమునకు ఉపక్రమించాలి.

**ఆసనము :** ఆసనం పద్మకం బధ్వా, (అథవా) యచ్చ అన్యపి రోచతే। పద్మాసనము ధరించటము సామాన్యముగా సానుకూల్యము. లేదా, ఇంకేదైనా తనకు సుఖము - స్థిరము కలిగించు ఆసనమును- దేహస్థితిని అనుసరించి - స్వీకరించవచ్చు.

**అభ్యాసము :**

- **నాసాగ్రే దృష్టిమ్ ఆరోప్య।** ముక్కుకు చివరగా (నాసాగ్రే) (ఆజ్ఞాచక్ర స్థానమునకు క్రిందగా) ధ్యాస (Concentration)ను నియమించాలి.
- **హస్తపాదౌ చ సంయతే।** చేతులను, కాళ్లను ఒక నియమానుసారంగా ధారణ చేయాలి.
- **మనః సర్వత్ర సంగ్రహ్య।** మనస్సును సర్వదృశ్య సంబంధమైన విషయముల నుండి విరమింపజేస్తూ వెనుకకు మరల్చాలి.
- **'ఓం' అను ఏకము-అక్షరము అగు శబ్ద-అర్థముల చింతనయందు మనస్సును నియమించాలి.**
- **ధ్యాయతే సతతం ప్రాజ్ఞో, హృత్ కృత్వా పరమేశ్వరమ్।** సర్వాంతర్యామి, సర్వ తత్త్వస్వరూపుడు-అగు పరమాత్మకు హృదయములో ధ్యానపూర్వకంగా ఆహ్వానము పలకాలి.
- ప్రాజ్ఞుడై అట్టి పరమాత్మను హృదయములో ఎల్లప్పుడు **ధ్యానము చేస్తూ ఉండాలి. ధ్యాసయే ధ్యానము.** సర్వాత్మకుని గురించిన చింతనయే ధ్యానము, ధ్యాస కూడా. ధ్యాసయే తపస్సు. అదియే భక్తి కూడా.

యోగి అయినవాడు ఈ పాంచభౌతిక శరీరముపై ధ్యాసము జయిస్తూ ఉండాలి.

| | | |
|---|---|---|
| 1 స్థంభము | - | వెన్నెముక |
| '9' ద్వారములు | - | కనులు, చెవులు, ముక్కుపుటములు, గుదము, శిశ్నము, బ్రహ్మరంధ్రము |
| '3' స్థూణములు | - | (ప్రతిమలు - కట్టెలు) - (రక్తము, మాంసము, క్రొవ్వు; జాగ్రత్ స్వప్న సుషుప్తులు; జన్మ-జరా-మరణములు) |
| '5'గురు దేవతలు | - | (పంచ ప్రాణములు; శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు; దృశ్యము, ద్రష్ట, జీవుడు, ఈశ్వరుడు, పరమాత్మ) |

ఇటువంటి అనేక వస్తువులతో కూడిన భౌతిక దేహముపై బుద్ధిమంతుడైనవాడు యోచనావేశమును కలిగి ఉండదు. **ఈదృశేతు శరీరేవా మతిమాన్ న ఉపలక్షయేత్!** అటువంటి "చీకటిగది" వంటి ఈదేహములో గల హృదయంలో - గదిలో దీపం వెలిగించు విధంగా **- ఆత్మజ్ఞాన దీపం వెలిగించాలి.** ఆదిత్య మండలాకారమైనట్టి (వేలాది కిరణములతో భౌతికమైనదంతా వెలుగుతో నింపుచుండుట వంటిది. - అగు) **యోగ-జ్ఞాన దీపము వెలిగించాలి.**

I. **దీప శిఖా తు యా మాత్రా, సా మాత్రా పరమేశ్వరే!** దీప శిఖ వలె దేహములో పరమేశ్వర జ్యోతి ఉంటుంది. యోగులు యోగాభ్యాసముచే సూర్యనాడిని ఛేదించి, అధిగమించి అట్టి పరమాత్మ-దీపశిఖను సమీపిస్తున్నారు. జ్యోతితో జ్యోతి ఏకమగువిధంగా ఆత్మతో ఆత్మను ఏకం చేస్తున్నారు.

II. ఇంటిలో దేవుడి గదిని పరిశుభ్రము చేయువిధంగా ఇడ-పింగళల మధ్యగా వెలుగు రూపమై అగ్నిశిఖగా ప్రకాశించుచున్న **'సుషుమ్ననాడి'** యొక్క ప్రవేశద్వారమును పరిశుభ్రపరచుకొనచున్నారు. **"శక్తి + బుద్ధి + చిత్త"** రూపమగు కుండలినీ దేవిని సుషుమ్న ద్వారా ఊర్ధ్వముఖము చేస్తూ, ఊర్ధ్వంగా నడిపిస్తూ కపాలమునకు జేర్చుచున్నారు.

II. కపాల సంపుటము వద్ద అమృతధారను త్రాగి ఊర్ధ్వముగా 'తత్పదము' యొక్క దర్శనము చేయుచున్నారు. 'జీవాత్మ'ను మార్పులేని పరమాత్మతో "మమేకము"గా నిశ్చల పరస్తున్నారు.

కపాల సంపుటమును చేరుచున్నప్పుడు, ఆ యోగి కొంత ఆలస్య – బద్ధకములను పొందుతున్నాడు. అయితే, త్రికాలములలో **'కపాల సంపుటములో ప్రవేశ'** అభ్యాసముచే క్రమంగా అటువంటి అడ్డంకులన్నీ తొలగుతాయి. పుణ్యసంపద యొక్క వృద్ధిచేత కపాల ప్రవేశము సులభతరమౌతోంది.

ఓ బ్రహ్మదేవా! **పరమ శివుడను, ఈ జీవునకు అనన్యుడను** అగునేను ఈ జీవుని సహస్రారస్థానములో సర్వదా తేజోమయుడనై వేంచేసినవాడనై ఉన్నాను. అనేక జన్మలలో నిర్వర్తించిన పుణ్యకార్యముల ఫలితంగా పాపదృష్టులు, పాపవృత్తులు సన్నగిలుచుండగా, ఆ యోగి సంసారభ్రమ నుండి బయల్వెడలి యోగసాధనచే (సహస్రారములో వేంచేసియున్న) నా **"మహత్‌స్థానము"**ను చేరుచున్నాడు.

ఓ పద్మసంభవా! ఇప్పుడు యోగాభ్యాసము యొక్క **లక్షణములను** వివరిస్తున్నాను. వినండి.

## యోగాభ్యాస లక్షణములు

ముముక్షువు మొట్టమొదట 'వాయుజయము'ను (To Bring Prana Movement under conscious control) సముపార్జించుకొనటానికి సంసిద్ధుడు కావాలి. అందుకుగాను ముందుగా గురువును ఆశ్రయించునుగాక! గురుముఖతః యోగ విధానమును **శ్రవణం** చేయాలి. తరువాత వారు చెప్పినట్లు 'అభ్యాసము'ను నిర్వర్తించాలి. గురువు చెప్పిన పాఠ్యాంశములను ఏకాగ్రతలతో విని, గురువుచే ప్రసాదించబడు జాగరూకత – మెలకువలను శ్రద్ధగా అర్థం చేసుకొని, సూక్ష్మదృష్టితో, మహదాశయముతో యోగాభ్యాసమునకు సంసిద్ధుడు కావాలి.

**యోగాభ్యాసాశయము :** (1) **అష్టధా కుండలీభూత్వా ఋజ్వీం కుర్యాత్తు కుండలీమ్।** 8 చుట్టలుగా చుట్టుకొని మూలాధారాకాశంలో కునుకులు తీయుచున్న కుండలినీ శక్తిని (ఉమాశక్తిని) "ప్రాణ-అపాన ఏకత్వము + దేహములోని ఉష్ణము"ల స్పర్శచే **నిదురలేపి,** (2) సుషుమ్న నాడి యందు ప్రవేశింపజేసి (3) ఋజుత్వముగా (Streight forwardness), శక్తి చాలనయుక్తితో ఊర్ధ్వముఖం చేయాలి. (4) సుషుమ్ననాడి ద్వారా మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక అనాహత, విశుద్ధ చక్రములను దాటిస్తూ – ఆజ్ఞాచక్రమునకు జేర్చాలి. (5) కుండలిని శక్తిని ఆజ్ఞాచక్రము ద్వారా కపాల స్థానమునకు చేర్చాలి. (6) కపాల ఊర్ధ్వమునగల బ్రహ్మరంధ్రమును ఛేదించి సహస్రార స్థానములో **'శివ-కుండలినీ ఐక్యము'** లేక **'శివైక్యము'** సిద్ధించుకోవాలి.

**బ్రహ్మదేవుడు :** అందుకు (యోగ) మార్గం ఏది?

**శంకర భగవానుడు :** వినండి

**(1) ఆసీనప్రదేశము :** యోగాభ్యాసమునకు కూర్చొనుటకై ఎన్నుకొనే ప్రదేశము (The place selected to take seating for the purpose of Yoga practice) పరిశుభ్రముగా ఉండాలి. 4 అం × 6 అం॥ వెడల్పు గల శుభ్ర వస్త్రము ఉపరిగా (పీట వంటి ఆసనముపై) పరచుకోవలి. ఆసనము బల్లపరుపుగా ఉండటము యోగాభ్యాసమునకు సానుకూల్యము.

(2) పాయువు స్థానమును ఆకుంచనము చేస్తు (బిగదీయుచూ) (మూలాధారంలో గల) కుండలినీ శక్తిని చాలనము చేయాలి (చలింపజేయాలి). **మృత్యువక్త్ర గత స్యాపి తస్య మృత్యుభయం కుతః?** కుండలినీశక్తిని చాలనము చేయు అభ్యాసముచే ఆ యోగి మృత్యుముఖములో ఉన్నప్పుడు కూడా మృత్యుభయమును పొందదు. **"నేను దేహముల రాకపోకలకు ఆనందరూప సాక్షిని"** అని గమనించువాడై ఉండగలడు. ఓ బ్రహ్మదేవా! అట్టి కుండలినీ చాలన విధానము గురించి మనము (ఇతఃపూర్వమే) సంభాషించుకొని ఉన్నాము. మరల చెప్పుకుంటున్నాము.

**ఆసనము** = ఎడమకాలి చీలమండలముతో ఆసనమును (గుదస్థానమును) నొక్కిఉంచి, పొట్టను ఎడమవైపుగా నిలిపిఉంచి హృదయమును 'గళము' వైపుగా (గొంతువైపుగా) లాగి ఉంచటము – **'వజ్రాసనము'** అనబడుతోంది.

అటువంటి **వజ్రాసనము** గాని, (లేదా) మరేదైనా సుఖాసనముగాని ధరించి, క్రిందకు ప్రయాణించుచున్న అపానవాయువును పైకి లాగటము – అను **ఊర్ధ్వచాలన-కుంభకము**ను రోజూ అభ్యసించాలి.

కుండలినీ శక్తి చాలనము

**కుండలిని శక్తి** = ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తి, **నిదురిస్తూ ఉండటము** = అనన్యమగు స్వస్వరూపమును ఏమరచి అన్యమగు ఇంద్రియ విషయములవైపు ప్రసరిస్తూ ఉండటం. ప్రాణ – అపాన సంయోగము (కదలికలను నిలిపి ఒక దానితో మరొకటి తాకించు) ప్రాణాయామము చేస్తూ, వాయుజ్వలనములో జనించిన అగ్నితో 'కుండలిని'ని ఎల్లప్పుడూ స్పృశిస్తూ, (క్రమంగా) అధోముఖము నుండి ఊర్ధ్వముఖము చేస్తూ ఉండాలి. అట్టి ఊర్ధ్వముఖ ప్రయత్నమే **"కుండలినీ చాలనము".**

1. మర్త్య-పాతాళ-స్వర్గ త్రిలోకవాసులను (సర్వులను) మోహింపజేయునది, దేహములో జీవశక్తి అయినట్టిది అగు-**కుండలినీ శక్తి**ని మూలాధారము వరకు విస్తరించియున్న 'సుషుమ్ననాడి' యొక్క ముఖద్వారములో ప్రవేశింపజేయాలి.

2. ఆ తరువాత సుషుమ్నయందలి చంద్రఖండము (చల్లటి ప్రదేశము)లో ప్రవేశింపజేయాలి.

3. వాయు – అగ్నిలతో కూడినదై, ప్రాణ-అపాన సంయోగ సాధనచే ఆ కుండలిని **బ్రహ్మగ్రంధి**ని ఛేదింపజేయాలి.

అటు తరువాత, ప్రాణ – అపాన సమత్వము (మరియు) అగ్నియు కలిసి బ్రహ్మగ్రంధి ఛేధించిన తరువాత విష్ణుగ్రంథిలో కుండలినీశక్తి ప్రవేశించి, అద్దానిని కూడా ఛేదించుచున్నది. రుద్రగ్రంథిలో ప్రవేశించుచున్నది. రుద్రగ్రంథిలో మరల మరల కుంభకముచే ప్రాణశక్తిని పూరించి

– సూర్య (ఉష్ణ) భేదమును

– ఉజ్జాయీ (శీతలిని) భేదమును

**గ్రంథి = భావన, నమ్మకము**
1. బ్రహ్మ గ్రంథి = "ఇదంతా సృష్టించబడుతోంది". (స్థానము = హృదయము)
2. విష్ణు గ్రంథి = "ఇదంతా స్థితించబడుతోంది". (స్థానము = కంఠము)
3. రుద్ర గ్రంథి = "ఇదంతా లయించబడుతోంది". (స్థానము = నుదురు)

అభ్యసించాలి. (అనగా శీతల-ఉష్ణములను కుంభకముతో కంఠాకాశములో ఏకరూపము చేయాలి). ఇక్కడికి 4 రకములగు కుంభకములు

(1) ప్రాణ-ఆయనముల సమత్వకుంభకము (భస్త్ర కుంభకము). (2) బ్రహ్మగ్రంథి కుంభకము (3) విష్ణు గ్రంథి కుంభకము (4) రుద్రగ్రంథి కుంభకములను యోగాభ్యాసం చేస్తూ ఉండెదరుగాక।

**భస్త్రీ కుంభకము** – కమ్మరి గొట్టము నుండి కొలిమి వైపు గాలి వదలి, వేగంగా పీల్చి మరల వేగంగా వదలురీతిగా చేయు వాయు అభ్యాసము. అది త్రిబంధకములను దాటిన **'కేవల ప్రాప్తి'** – కి కారణమగుచున్నది. (కేవల స్వస్వరూపానుభవము సిద్ధించుచున్నది).

## సూర్యభేద ప్రాణాయామాభ్యాసము

**ఏకాకినా సముపగమ్యస్య :** ఏకాకిగా ఏకాంత ప్రదేశము మ చేరి.., అల్పాహారి అయి, ధైర్యముతో కూడిన బుద్ధికలవాడై,

- "సంసారము రోగమును హరించు పరమౌషధము..",
- "ప్రాణము మొదలైన రూపము"- తానే అయి ఉన్నట్టిది,
- అమృతరూపము,
- పరమార్థ తత్త్వము, –

– అగు 'ఆత్మ'ను పరిభావించటమే 'కేవలప్రాప్తి'. అట్టి ఆశయముతో " కుడి ముక్కు రంధ్రము ద్వారా వాయువును పీల్చి, పింగళనాడిలో వాయుకుంభక-అభ్యాసము"- నకు ఉపక్రమించాలి.

అభ్యాసయోగి సూర్యనాడి (పింగళ)ని వాయువుతో నింపి, **విధి విధానానుసారంగా** కుంభకమును చేయుచు, చంద్రనాడి (ఇడ) ద్వారా రేచకమును (గాలిని వదలటమును) నిర్వర్తించాలి.

ఈ విధంగా **(1) సూర్యనాడిలో వాయు కుంభకము, (2) చంద్రనాడిలో రేచకము** చేయుచుండటంచేత క్రిమిదోషములు తొలగి ఉదరములోని అనేక రోగములు శమించగలవు. మరల మరల ఈ కార్యము చేయుటమును **'సూర్యభేదము'** అని పిలుస్తున్నారు.

## ఉజ్జయీ కుంభకము

నాడులలోకి (ఇడ–పింగళ–సుషుమ్నలలో) వాయువును పీల్చి 'కుండలిని' యొక్క ప్రక్కలందు నిలపాలి. తరువాత పొట్టలో వాయువును ధారణ (కుంభకము) చేయాలి. ఆ తరువాత ఇడనాడి ద్వారా గాలిని వదలాలి. (రేచకం చేయాలి). ఇది కంఠములోని కఫ దోషము తొలగించి శరీరాగ్నిని వృద్ధి చేస్తుంది. నాడీజలమును పోగొట్టుతుంది. ధాత గత దోషములు తొలగిస్తుంది. ఈ ఉజ్జయీ కుంభకమును నిలబడి, నడుస్తూ కూడా నిర్వర్తించవచ్చు.

## శీతలీకరణ ప్రాణాయామము

**ముఖేన వాయుం సంగృహ్య** → (1) పళ్ళు–పళ్ళు కలవకుండా, నోటితో గాలిని పీల్చి, పెదమలను అదిమి ఉంచి,

**ఘ్రాణ రంధ్రేణ రేచయేత్** → (2) ఒకసారి ఇడ – **ముక్కు యొక్క 'ఎడమపుట'**తోను మరొకసారి **'కుడి ముక్కుపుట'**తోను ఇంకొకసారి **రెండు ముక్కు పుటల**తోను గాని వదలటము. దీనివలన ఆకలి, దాహములు స్వాధీనంలో ఉంటాయి. ఆ యోగాభ్యాసిని ఆకలి – దప్పికలు బాధించవు.

శరీరములో చేరుచున్న చెడు పదార్థముల వలన, అవి ఆయా శరీర విభాగాలలో పేరుకుపోయి ఉండటం చేత, **వాత–పిత్త దోషములు** ఏర్పడుచున్నాయి. నోటిలో నిండుగా గాలిపీల్చి, (పొట్టయందు కుంభకము చేసి) రెండు ముక్కు పుటములతో వదలుచుండటం చేత అట్టి వాత–పిత్త దోషాలు తొలుగగలవు.

## భస్త్రీ కుంభక ప్రాణాయామము

ఒక లోహకారుడు (కంసాలి) గాలిని లోపలికి పీల్చి ధారణ చేసి, ఒక్కసారిగా తోలు తిత్తిలోనికి (లేక) ఏదైనా గొట్టము ద్వారా వేగంగా గాలిని వదలుచూ అగ్నిని రగిల్చుచున్నాడు కదా! ఆ విధంగా →

(1) రెండు ముక్కుపుటములలో గాలిని రేచకము చేసి,

(2) ఆ తరువాత రెండు ముక్కుపుటములతో పూరకముచేసి,

(3) గొంతును క్రిందకు కుచింపజేస్తూ, గాలిని రెండు స్థనములలో కుంభకము చేసి,

(4) క్రమంగా ఆ వాయువును సూర్యనాడి (పింగళ కుడివైపు నాడి)లో ప్రవేశింపజేయాలి.

(5) సూర్యనాడిలో (పింగళలో) కుంభకము చేయాలి. 'శ్రమ' అనిపించనంత వరకు ధారణ చేయాలి.

(6) అటు తరువాత, కంఠమును సంకోచింపజేస్తూ ఇడనాడి (ఎడమవైపు నాడి చంద్రనాడి) ద్వారా వాయువును రేచకం చేయాలి (వదలాలి).

ఇట్టి అభ్యాసము వాత–పిత్త–శ్లేష్మములను హరించివేయగలదు. శరీరమంతా సమముగా అగ్నిని వివర్ధనము (Wel-balanced Distribution) చేయగలదు. కుండలినిని ప్రబోధించగలదు. ముఖములోని దోషములను తొలగించి, తేజోవంతము చేయగలదు. మూలాధారము నుండి బ్రహ్మనాడి వరకు గల దోషములను తొలగించి, కుండలినీ ఊర్ధ్వగమనమును సుసుఖము చేయగలదు. యోగబంధనమును తేలిక చేయగలదు. బ్రహ్మ–విష్ణు–రుద్రగ్రంధుల ఛేదనము సులభతరమౌతుంది. అందుచేత, **విశేషైనైవ కర్తవ్యం భస్త్రాఖ్యం కుంభకం తు ఇదమ్!** యోగులకు **'భస్త్రకుంభకము'** మహత్తర అభ్యాస–ఉపాయము.

## బంధత్రయము

**పరమశివుడు :** ఓ హిరణ్యగర్భా! బ్రహ్మదేవా! ఇప్పుడిక మనము 'బంధత్రయము' గురించి సంభాషించుకుందాము.

**I. (1) బాహ్యముగా రేచకము (2) (అంతరముగా) పూరకము (3) (అంతరమున) కుంభకము (4) పునఃబాహ్యముగా రేచకము –**

**II. (i) సూర్యనాడీ కుంభక ప్రాణాయామము (ii) ఉజ్జాయీ కుంభక ప్రాణాయామము (iii) భస్త్రకుంభక ప్రాణాయామము (iv) ప్రాణ–అపాన సమానత్వ కుంభక ప్రాణాయామము.**

ఈ ఈ చతర్కుంభకముల నిత్యాభ్యాసముచే 'వాయుజయము' సంభవిస్తోంది. అట్టి అభ్యాసములు కొంతకాలము కొనసాగించిన తరువాత ఆ యోగాభ్యాసి ఇక క్రమంగా "బంధత్రయము"ను స్వీకరించాలి. అవి ఏమంటే...., **(1) మూల బంధము (2) ఉడ్డీయాణ బంధము (3) జాలంధర బంధము**. ఈ మూడింటి లక్షణములు వినండి.

## (1) మూలబంధము

- **గుదం పార్ష్ణ్యాతు సంపీడ్య** – గుదస్థానమును (ఎడమ) కాలి మడమ (Toe) తో త్రొక్కిపట్టి ఉంచి,
- **వాయుమ్ ఆకున్చయేత్ బలాత్** – వాయువును ఉద్దేశ్యపూర్వకంగా, శక్తియుతుడై ఆకున్చనముచేయాలి. (రేచక–పూరక–కుంభక–పునఃరేచకం చేయాలి)..
- **వారం వారం యథా చ ఊర్ధ్వం సమాయాతి సమీరణః :** – క్రిందకు ప్రవహించు స్వభావము కలిగియుండే అపానవాయువును – వెనుకకు మరల్చి ప్రాణ–అపానములను సమీకరించి, సమస్థితికి తెచ్చి (Bringing to one space point) కుంభకమును నిర్వర్తిస్తూ ఉండాలి. (కొందరికి **మణిపూరక ప్రదేశంలోను**, మరికొందరికి **అనాహత ప్రదేశములోను** ప్రాణ–అపాన సంయమన స్థితి అనుకూలం).

**'ఇదియే మూలబంధ కుంభకము'** అని అనబడుచున్నది.

ఇట్టి 'యోగాభ్యాసము'చే **ప్రాణ–అపానములు, నాద–బిన్దువులు** (మూలబంధనముచే) **ఏకస్థితి**కి తేబడతాయి. అట్టి ఏకస్థితి పొందబడుచూ ఉండగా, ఆ యోగి అతి త్వరగా ప్రాణములను జయించి 'యోగస్థితి' యొక్క పరాకాష్ఠను (సర్వజగత్ భావములను స్వవశం అగు సంస్థితిని) చేరుచున్నాడు. **న అత్ర సంశయః!**

ప్రాణ జయము = తాను ప్రాణేశ్వరుడై జగత్ దృశ్యమంతా, తదితర జీవులందరినీ – ప్రాణేశ్వరీ ప్రియ, సమరూపదర్శనముగా, (అనగా) విశ్వమంతా తన ప్రాణస్వరూపంగా అనిపిచటం. అప్పుడిక – (1) ఈ సమస్త జగద్దృశ్యము **నాదైన 'నేను'** (శివము) (2) **ఇదంతా నేనైన నేను** (శక్తి)ల 'స్వాభావిక ఏకత్వము' స్వానుభవము అవగలదు.

## (2) ఉడ్డీయాణ కుంభకము

**మొదటగా** .............. రేచకము – రెండు ముక్కు పుటలతో గాలిని వదలటము.

**రెండవ దశ** ................. ముక్కు – కుడి పుటను కుడి బొటనవ్రేలుతో మూయుటము

**మూడవ దశ** ................. ముక్కు యొక్క ఎడమ పుటతో గాలిని గుండెలోనికి పీల్చటము. ఇప్పుడు గుండె, రెండు భుజములు ఊర్ధ్వ ముఖముగా, వాయు సమేతంగా ధారణ చేయటము.

నాలుగవ దశ : **కుంభకాంతే – రేచకాదే కర్తవ్యస్తు ఉడ్డీయాణకః !**

కుంభకము (గాలిని నిశ్చల ధారణ చేయటం ముగిసిన తరువాత →




→ రేచకము యొక్క ప్రారంభమవబోవుచున్న ఆది స్థితిగా (రేచకము ఇంకనూ ప్రారంభం కానిస్థితి).

ఇది బిందురూపముగా కూడా అనుభవమవ గలదు.

ఆ మధ్య స్థానములో గాలి వదలీ – వదలని స్థానములో) నిశ్చలత్వము ధారణ చేయుటము **'ఉడ్డీయాణక–ప్రాణధారణ'** (లేక) **'ఉడ్డీయాణ బంధము'** అగుచున్నది.

### *అట్టి ఉడ్డీయాణక స్థానంలో ....,*

- కొందరు **జ్యోతి** (లేక) **వెలుగు**ను దర్శిస్తున్నారు.
- మరికొందరు – **దీపపు ఆకారము – పొగలేని అగ్ని**ని చూస్తూ ఉన్నారు.
- ఇంకొందరు – **ఇష్టదైవము** సుఖాశీనులైనట్లు అనుభూతి పొందుచున్నారు.
- ఇంకా కొందరు – **గురువు రూపము**ను, **గురు – పాద పద్మము**లను భావన చేయుచున్నారు.
- కొందరైతే–కేవలము, నిర్మలము, సర్వస్వము, సర్వగతము, అగ్న్యాత్మకము అగు **కేవల చైతన్యము**ను అనుభూత పరచుకొనుచున్నారు.

- మరికొందరు – ఈ**'విశ్వము'** అనబడు **విశ్వేశ్వర విన్యాసమును వినోదపరచుకొనుచున్నారు.**
- కొందరు – విశ్వ విన్యాసమును, **నాదమును, బిందువును** చూస్తూ, వింటూ ఉన్నారు.
- ఇంకొందరు – **కేవల మౌనమును;** **ప్రశాంతతను,** నిర్విషయ – **అనిర్వచనీయానందమును** పొందుచూ.... మనో వాక్కులచే అందనివారై ఉంటున్నారు. అవిషయులై ఆనందించుచున్నారు.

ఈ విధంగా ఆయా స్వకీయ – స్వానుకూల్యము, స్వ – అభ్యాస భావనాఫలము అగు విధానంగా **జగదతీత ఏక–అఖండ తత్త్వమును** ధారణ చేస్తున్నారు. మనో – బుద్ధులను నియమించి సముత్సాహ – కేవలానంద పూరితులై **'ఉడ్డీయాణము'**ను అభ్యాసం చేస్తూ ఉంటున్నారు. వారి స్వానుభవము అనిర్వచనీయమే. అయినప్పటికీ యోగసాధకులకు సూచనాపూర్వకంగా అనువర్తించి పైరీతిగా వర్ణిస్తూ ఉన్నాను.

***ఈ యోగసాధనకు 'ఉడ్డీయాణము' అని ఎందుకు అంటారు?*** *శబ్దార్థమేమిటి?*

బ్రహ్మభగవాన్! వినండి!

**బంధో యేన సుషుమ్నాయాం ప్రాణస్తు ఉడ్డీయతే యతః, తస్మాత్ 'ఉడ్డీయణ–ఆఖ్యో అయం'; యోగిభిః సముదాహృతః॥**

**"కుంభకాంతక** (End) – **రేచకాది** (Begining)"ల మధ్య నిశ్చల ప్రాణ – మనో – బుద్ధ్యోపాసనచే (ఉడ్డీయాన బంధముచే) – ఇడ–పింగళల మధ్య అగ్ని–జ్యోతిస్వరూపమై సరసర వెలుగొందుచున్న సుషుమ్నయందు ప్రాణశక్తి ప్రవేశించినదై, మూలాధారలలో గల కుండలినీ మహాశక్తిని ఊర్ధ్వముఖముగా చేసి (స్వభావంగానే, అప్రయత్నంగానే) నడిపిస్తుంది. **కాబట్టి ఉడ్డీయాణము** (An operation of upward - Travelling) **అనబడుచున్నది.**

ఈ విధంగా కుంభక – రేచక (ఉభయముల) ప్రారంభ స్థానము, ఆ రెండిటి **మధ్యస్థానము**నందు ఉడ్డీయాణక బంధమును కొంతకాలము గురుముఖతః అభ్యాసము చేస్తూ ఉండగా..., అప్పుడు ఆ యోగి **రేచక – పూరక – కుంభకముల అవసరము లేకుండానే ఉడ్డీయాణమును అవధరించగలడు.** అనగా బుద్ధిమాత్రం చేత ఉడ్డీయాణబంధమును అవధరించటము అను – **'స్వాభావికమగు సహజత్వము'** ఆతని పట్ల సంతరించుకోగలదు. అట్టివాడు అనేక లోకవ్యవహారములలో పాల్గొనుచూ, నిర్వర్తిస్తూ, చక్కదిద్దుతూచే, అదే సమయంలో (భుజస్కంధములను, హృదయమును ఊర్ధ్వధారణ చేస్తూ) – ఉడ్డీయాణ బంధమును అవధరించగలడు.

ఏ యోగి అయితే అతన్ద్రస్తుడై (బద్దకము, ఆలస్యము, అశ్రద్ధ, నిరుత్సాహములను దరిచేరనీయనివాడై) ఉడ్డీయాణ బంధమును – ఉత్సాహంగా, సాహసపూరితంగా, బుద్ధి–శక్తియుతంగా, పరాక్రమోపేతంగా అభ్యాసిస్తూ ఉంటాడో – అట్టివాడు వృద్ధుడవడు. వయసుచే వృద్ధుడై కూడా యువకుని వలె **బుద్ధ్యుత్సాహ, ఆనందములు పరవళ్లు త్రొక్కురీతిగా** – ఉంటాడు.

## నాభి స్థాన ప్రాణయోగాభ్యాసము

ఉడ్డీయాణ బంధ సహితంగా (లేక, రహితంగా కూడా) నాభిస్థానమునకు ఊర్ధ్వంగాగాని, అధోప్రదేశంగాని (లేక) ఆ రెండిటిని కూడుకొన్న స్థానంలోగాని – ఎవ్వడైతే ప్రయత్నతః కుంభక ప్రాణాయామమును నిర్వర్తిస్తూ ఉంటాడో.. అట్టివాడు ఆవిధంగా 6 నెలలు అభ్యసిస్తే.. మృత్యువును జయిస్తాడు. అనగా, **మార్పు–చేర్పులకు విషయమేగాని ఆత్మను ధారణను చేస్తూ మృత్యు–జన్మ–జీవన విశేషములకు అతీతత్వము, సాక్షిత్వము, అప్రమేయత్వములను బుద్ధితో సిద్ధించుకోగలడు.**

నాభిస్థాన–కుంభక యోగాభ్యాసికి ఈ విశ్వమంతా తన నాభికమలము నుండి బయల్వెడలిన విశ్వప్రజ్ఞ (బ్రహ్మ) యొక్క ప్రజ్ఞా ప్రదర్శనమై, ఆతనికి ఈ సమస్తము అత్యంత ఆప్యాయరూపమగుచున్నది.

## 3. జాలంధర బంధము

**పూరకము యొక్క చిట్టచివరి తరువాత** → **రేచకము ఇంకా ప్రారంభించనప్పుడు** – ఆ **మధ్య** గల స్థానంలో అభ్యాసించు బంధన స్థితిని **'జాలందర బంధము'** అని అంటారు. ఇందులో రెండు ప్రక్రియలు ఇమిడి ఉన్నాయి.

అవి **(1) కంఠమును సంకోచింపజేయుటము. (2) వాయు మార్గనిరోధనము.**

**కంఠమునందు ఆకుంచ్యము** చేసి (పూరక – కుంభకములను చేసి) **హృదయములో భావాతీత మౌనము**ను దృఢముగా ఇచ్ఛా పూర్వకంగా అవధరించటము – జాలంధర బంధము యొక్క అంతర్–సారము. ఇట్టి 'జాలంధరము' అనే అభ్యాసము అమృతత్వమును సిద్ధింపజేయగలదు.

కంఠమును సంకోచనము + కంఠంలో అకుంచనము నిర్వర్తిస్తూ ఉండగా, 'పశ్చిమతానము' (forcing from left) వలన ప్రాణశక్తి (సుషుమ్న ద్వారా) బ్రహ్మరంధ్రమును చేరుచున్నది.

యోగి వజ్రాసన సంస్థితుడై భస్త్రీ యోగాభ్యాసముచే (వేగముగా నోటితో గాలిని పీల్చి, ఒకసారి ముక్కు కుడి పుటతోను, రెండవసారి ఎడమ ముక్కు పుటతోను, వేగముగా ఆ గాలిని వదలటముచే).. కుండలినీ శక్తిని చాలనము చేయుచుండగా, ఆతని శక్తి బోధత్వము (Inspiration to move upward) పొందుచున్నది. అప్పుడు – కాలిన ఇనుపఖడ్డీ సమ్మెట దెబ్బకు తేలికగా విరుగుచుండునట్లుగా – ఆతని గ్రంథులు (బ్రహ్మ, విష్ణు, రుద్రగ్రంథులు) సులభంగా జాలంధర బంధము వలన జనించిన వేడి వాయువుచే త్రెంచివేయబడుచున్నాయి. నడుముపై ప్రాకు చీమ పైపైకి వెళ్ళుచుండువిధంగా కుండలినీ బ్రహ్మరంధ్రము వైపుగా (సుషుమ్న ద్వారా) ఎగబాకుచున్నది. సుషుమ్నయందు వాయుకుంభకమును అభ్యసించుచుండగా కుండలిని చీమవలె పైకి వెళ్లుచున్నది.

ఊర్ధ్వగామి యగు కుండలిని రుద్ర గ్రంథిని ఛేదించి, కపాల మండలమును ప్రవేశించి ఆక్రమించుకుంటోంది. అటుపై బ్రహ్మరంధ్రమును చేరుచున్నది. అక్కడి నుండి **'శివాత్మక – శివోఽహమ్'** స్థానమగు **సహస్రారమునందు ఇచ్ఛ – జ్ఞాన – క్రియా స్వరూపిణిగాను,** స్వానందస్వరూపిణిగాను అయి ప్రవేశించుచున్నది. అది పురుష-ప్రకృతుల శివ-శక్త్యైకానుభవము.

## ఇడ-సుషుమ్న పింగళల ఏకత్వము

యోగాభ్యాసం కొనసాగుచుండగా ఇడ-పింగళలు సుషుమ్నతో అభేదము పొందుచున్నాయి. అడ్డు గోడలు తొలగుచున్నాయి. అట్టి స్థితిలో **చంద్ర-సూర్యులను (ఇడ-పింగళలను) సమత్వము చేయు యోగ స్థితి** ప్రవర్తమానమగుచున్నది. ఆ యోగి గ్రంథిత్రయములను జయించి, దాటివేయుటచే సులభముగా త్రిగుణాతీతుడగుచున్నాడు. 'శివ-శక్తి' సమాయోగము (The unity of 'I' and 'My') పొందుచున్నాడు. 'పరమస్థితి'ని పొందుచున్నాడు. అప్పుడిక **"విశ్వమంతా నేనైన నేను"** – స్వాభావికమై, అప్రతిహతమై, ప్రయత్నముయొక్క ఆవశ్యకత లేనిదై.... **స్వయం ప్రకాశమగుచున్నది.**

## వజ్రనాళీ జయము

ఏనుగు తన తొండముతో జలమును పీల్చువిధంగా వజ్రనాళి (వెన్నెముక)లోని వాయువును సుషుమ్నలోనికి పీల్చి కుంభకముచేయుటము – **వజ్రనాళీజయము** అంటారు.

వజ్రనాళి (వెన్నెముక)లో 21 ప్రకాశమానమగు స్థానములు ఉన్నాయి.

ఆ 21 ప్రకాశక స్థానములు పూలదండలో పూలు గ్రుచ్చబడినరీతిగా ఉంటున్నాయి. అయితే – **"ఆ 21 ప్రకాశక స్థానములు 'సుషుమ్న' యందు మణులవలె గ్రుచ్చబడినవి'**– అని యోగికి స్వానుభవమగుచున్నది.

అట్టి సుషుమ్నయే ఈ విశ్వమంతా తన రూపముగా కలిగియున్నది. అందుచేత సుషుమ్నను **'విశ్వరూపిణి'** అని అంటారు. అట్టి **సుషుమ్న – ఈ జీవుని యొక్క మోక్షమార్గమునకు రాచబాట.** (As a path of all relief and salvation). **"విశ్వరూప యోగము సిద్ధించుటకు మహత్తరమగు ఉపకరణము"** – అని కూడా అనబడుతోంది.

## స్వాభావిక కుంభక దశ

కుంభకము పూరక-రేచకములతో ప్రాణయోగమును అభ్యసిస్తూ ఉండగా, క్రమంగా కొంతకాలానికి కుంభకము స్వాభావికమౌతుంది. అనగా, రేచక, పూరకముల అవస్యకత లేకుండానే, కుంభకము అనుక్షణికమౌతుంది. **యథైవ నిశ్చితః కాలః చంద్ర-సూర్య నిబంధనాత్** – ఏవిధంగా అయితే చంద్ర-సూర్యులను నిబంధనముచేస్తే కాలమే నిశ్చలము అవుతుందో, అట్లా కుంభకము ఉత్తమ అభ్యాసికి – **అపూర్య కుంభితో వాయుః బహిః నో యాతి సాధకే।** కుంభకము పొందిన వాయువు, ఇక ఆ కుంభకత్వమును వీడదు. ఇది **'స్వాభావిక కుంభక దశ' అని యోగులు ప్రశంసిస్తూ ఉంటారు.** అట్టి దశలో కాలపరిధులను దాటిపోయి ఆ యోగి కాలమునకు నిత్య సాక్షిత్వము సిద్ధించుకొనుచున్నాడు. ఇది **"ఆలోచనలన్నీ ఆలోచించు వానిలో లయమగు కేవల స్వసత్తా"-స్థితి.**

## ఆత్మీయ మనో మహదత్వము – జగత్ రూపమనోమాధుర్యము

మరల మరల 'పశ్చిమ ద్వార లక్షణము' (ఇడ మార్గంగా) పూరించబడిన వాయువు, ఆ పశ్చిమ ద్వారములలో కొంతకొంతగా కుంభకత్వము పొందుతూ ఉంటుంది. పశ్చిమ మార్గము పొందిన వాయువు, అట్టి పశ్చిమ మార్గంగా (గుండె, భుజములు, పొట్ట

మొదలైనచోట్ల) అన్ని అవయవములకు చేరుచున్నది.

- **రేచితంగా వాయువు క్షీణించటము,**
- **పూరకముచే వాయువు పెరుగుచుండటము** - జరుగుతూ ఉంటుంది.

ఇట్టి అభ్యాసముచే ఆ యోగికి తనయందు ఆలోచన (లేక, మనస్సు) ఎక్కడ జనిస్తోందో, ఆ **హృదయ కుహరస్థానము** అనుభవమౌతోంది. ఆతడు అభ్యాస పూర్వకంగా ఆ మనస్సును అద్దాని 'జనన స్థానము' నందే విలీనము చేయుచున్నాడు. మనస్సు ఆత్మయందు లీనమగుచుండగా ఆతడు నిరహంకారుడగుచున్నాడు. ముక్తుడు (Al - relieved), సుఖి అగుచున్నాడు. **"ఈ సమస్త జగత్తు నా మనో మాధుర్యమే"** - అను **"ఆత్మీయ మనో మహదత్వము"** నకు యోగాభ్యాసము కారణభూతమగుచున్నది.

యోగాభ్యాసము లేనివాడు పిండపాతుడు (మనస్సు దృశ్య విషయములలో చిక్కుకున్నట్టివాడు)గానే మిగిలిపోవుచున్నాడు.

## చిత్త లయమే ప్రాణలయము కూడా!

(1) చిత్తము (2) ప్రాణము (వాయు) ఈ రెండిటికి అవినాభావ సంబంధము ఉన్నది. చిత్తము లయిస్తే ప్రాణ చలనము నిరోధించ బడుచున్నది. అనగా ప్రాణ - సంయమనము జరుగగలదు. మనో చాంచల్యము ఉపశమించగలదు. యోగముచే మనోజయము, జ్ఞానము చేత చిత్తశుద్ధిలకై యత్నించనివాడు, (అట్టివాడు) శాస్త్రములు పఠించి మాత్రం ఏమి ప్రయోజనం? **స్వాత్మయొక్క అఖండత్వము, అప్రమేయత్వము, నిత్యత్వము, సత్యత్వము, దృశ్యాతీతత్వము, నిర్గుణత్వము, సకలత్వము, కేవల సాక్షీత్వము మొదలైన దివ్య లక్షణములను స్వానుభవంగా సిద్ధించుకునే ప్రయత్నము చేయనివాడు ఆత్మ గురించి విని, తెలిసి ఏమి ఉపయోగము?** ప్రతీతి ఏముంటుంది! ఆత్మయందు చిత్తమును లయింపజేయు ప్రయత్నము చేయనివానికి శాస్త్ర-శాస్త్రప్రతీతి-గురుపాఠ్యాంశములవలన ఏమి లాభం?

**"ఆత్మత్వము"** అవధరించుచున్నవానికి క్రొత్తగా శాస్త్రములతో, ప్రతీతితో, గురుబోధలతో పనేముంటుంది?

***చిత్త లయము తెలియనివానికి శాస్త్రములు తెలిసి ప్రయోజనం లేదు.***
***చిత్త లయము తెలిసినవానికి శాస్త్రములతో పనిలేదు.***

## యోగాభ్యాస ఔన్నత్యము

జలగ వంటికి పట్టుకొని నెమ్మది నెమ్మదిగా శరీరములోని రక్తమంతా తనవైపుగా లాగుకొని పీలుస్తూ ఉంటుంది చూచారా! అట్లాగే, బ్రహ్మనాడియందు అభ్యాస పూర్వకంగా కుండలినీ ఊర్ధ్వయానము.. చేయు యోగి విషయంలో - బ్రహ్మనాడి ధాతువులను తనవైపుగా ఆకర్షించుచున్నది.

సుఖాసనము స్వీకరిస్తూ....,

చతుర్విధములగు రేచక - పూరక - కుంభక- పునఃరేచక ప్రాణాభ్యాసములు నిర్వర్తిస్తూ,

త్రైబంధనములగు మూల-ఉడ్డీయాణ -జాలంధరములను, తదితర భస్త్రీ ఇత్యాది యోగాభ్యాసముల నిర్వర్తిస్తూ యోగి ఊర్ధ్వగతుడు (ఆత్మగతుడు) అగుచున్నాడు. శ్రద్ధతోను దైనందికంగాను అభ్యాసియై నిర్వర్తించు యోగి పట్ల చిత్తము క్రమంగా శమించగలదు. చిత్తము శమిస్తూ ఉండగా ఇక **"ఆత్మాహమ్ (లేక) చిదహమ్ (నేను కేవల చిత్ స్వరూపుడను) భావన"** - అనబడే బిందు స్థానము నుండి ఆతనికి పతనము ఉండదు. చిత్తము 'చిత్' నందు కరిగినదై మటుమాయమగుచున్నది. ఆ జీవుడు **'కేవల చిత్ స్వరూపుడు'** అయి, జగత్తులను లీలగా చూస్తూ ఉంటాడు.

## స్వాభావిక కుంభకము

'రేచక - పూరక - కుంభక -పునఃరేచక' ప్రాణాయామాభ్యాసము కొనసాగుచుండగా, తదనంతర దశలో (In the next stage) - రేచక పూరకములు అగత్యము లేకుండానే కుంభక రూపమగు వాయు స్థిరీకరణము (ప్రాణనిశ్చలత్వము) స్వాభావికమై (అప్రయత్నమై) సిద్ధించగలదు. అట్టి యోగి- అనేక లౌకిక క్రియలందు ఉండవలసి ఉన్నప్పటికీ - అను నిత్యమగు ప్రాణబంధము, ప్రాణ సమత్వము కొనసాగిస్తూ ఉండగలడు. **దేహములోని "మెడ-వక్ష స్థలము - పొట్ట-ముఖము - నుదురు-బ్రహ్మరంధ్రము" - మొదలైన ఆయా అనేక ప్రదేశములలో మార్చి మార్చి స్వాభావిక కుంభకమును ధారణ చేయగలడు.** "ఈ విశ్వమంతా మమాత్మానంద రూపమే"- అనునది స్వాభావిక బుద్ధి-కుంభకముయొక్క అంతిమాశయము, పరాకాష్ఠ కూడా! "నాలోని నేనైన నేనే ఇదంతా" - అనునది స్వాభావిక - కుంభకపరమార్థము.

యోగాభ్యాసము కొనసాగుచుండగా, అనేక నాదములు, జ్యోతి దర్శనము, నక్షత్ర – నక్షత్ర మండల దర్శనము.. ఇవన్నీ (యోగాభ్యాస సమయంలో) అనుభవముగుచూ వస్తాయి. నాదశ్రవణము, జ్యోతి దర్శనములచే యోగము ఏకాగ్రమగుచూ వస్తుంది. అట్టి యోగాభ్యాసి పట్ల

- కపాల స్థానములో గల చంద్రమండలము నుండి అమృతము స్రవించటము, అప్రమేయమగు స్వస్వరూపానుభూతి – ఇవన్నీ అనుభవమగుచూ ఉంటాయి.
  **అమృతము** = మార్పు–చేర్పులకు విషయమేకాని **స్వస్వరూపానుభవము.**
- క్రమంగా ఆకలి –దప్పికలు, మనస్సు యొక్క వేదన సంచారములు, దిగుళ్లు, అనిశ్చితత్వములు, బుద్ధి యొక్క విరహములు, చాంచల్యములు మొదలైన సాంసారిక దోషము కడిగివేయబడి, తొలగిపోతాయి.

అభ్యాసవశంగా – **స్వరూపే 'సత్ చిత్ ఆనన్దే స్థితిమ్' ఆప్నోతి కేవలమ్!** ఆ యోగి సత్‌చిత్ ఆనంద రూపమగు కేవలీ స్థితిని సముపార్జించుకొనుచున్నాడు.

**సత్** : జాగ్రత్ – స్వప్న–సుషుప్తులచే, దేహముల రాక – ఉనికి – పోకలచే చెక్కుదరని స్వకీయమగు **'నేను ఉన్నాను'** అను రూపమగు **నిత్యసత్ భావన.** (I never miss my own presence any where, any time)

**చిత్** : తెలుసుకొనబడు సర్వమునకు వేరైన 'కేవల ఎరుక' (Absolute knowing) స్థితి. "తెలియబడేదంతా నా "తెలివి" – యొక్క విస్తరణయే" …. అను కేవలీ స్థానము. (My own knowing is always getting extended as 'All that being known')

**ఆనందము** : 'సర్వము నా అనుభూతి రచనలోని అంతర్భాగము' – అను దర్శనము. ఒక కళాకారుడు తాను రచించిన కళాఖండమును చూచి ఆనందించుతీరుగా – విశ్వ సందర్శనము. ఒక నాటక రచయిత – ఆ నాటకమును ప్రదర్శిస్తున్నప్పుడు "ఈఈ పాత్రలన్నీ నా రచనా విశేషమే కదా!" – అనే తీరుగా – ఈ దృశ్య – జగత్ దర్శనము. (All this is my own art of enjoying)

**కేవలము** → సర్వమునకు వేరై, సర్వము తానే అయి ఉన్నట్టిది (ఆత్మ). ఆభరణంగా అగు స్వభావమే బంగారమునకు లేని తీరుగా – స్వస్వరూపానుభవంయొక్క సర్వదా యథాతథత్వము. (పరమాత్మ జీవుడుగా అగుటలేదు – అను అవగాహన)

ఓ సృష్టికర్తా! మహాప్రజ్ఞా దురంధరా! బ్రహ్మభగవాన్! మీ ప్రీతి కొరకై అట్టి యోగాభ్యాస దశల– లక్షణముల గురించి మనమిప్పుడు చెప్పుకుందాము.

## యోగాభ్యాస దశల లక్షణములు

**శివ భగవానుడు :** ఓ బ్రహ్మదేవా! యోగాభ్యాస లక్షణములు నాలుగు విధములుగా వర్ణించబడుచున్నాయి.

(1) మంత్రము (2) లయము (3) హఠయోగము (4) రాజయోగము.

ఈ నాలుగు కూడా **'మహాయోగము' యొక్క అంతర్ భూమికలు**. ఇప్పుడు ఈ నాలిగింటి గురించి వినండి.

### (1) మంత్రము:

ఈ భౌతిక దేహములో **'హం–స'** అను ప్రక్రియ అసంకల్పితంగాను, అనుక్షణికంగాను జరుగుతోంది.

**శ్లో॥ 'హ' కారేణ బహిర్యాతి। 'స' కారేణ విశేత్ పునః।**
**"హం స, హం స" – ఇతి మంత్రో అయం సర్వజీవైశ్చ జప్యతే॥**

సర్వ జీవుల పట్లా కూడా జీవిస్తూ ఉన్నంత కాలము

→ **'హ'** కారముచే వాయువు బయటకు వెళ్లటము – (సందర్భములలో ప్రవేశము)

→ **'స'** కారముచే వాయువు దేహములోనికి రావటము – ('సహజము'లోనికి మరలటము)

→ అనగా, "హంస – హంస, 'సో–హమ్'

అనబడు 'సోహమ్" అనుక్షణం జరుగుచూ ఉన్నది

ఇక యోగి విషయానికి వస్తే.., గురువాక్యానుసారంగా **"సోఽహమ్–అదియే నేను – సయేవ అహమ్– ఆత్మయే నేను – పరమగు పరమాత్మ నేనే"..** అను భావనతో కూడుకొనినదై ఉంటోంది. 'హం స' జపము ఇడ – పింగళనాడుల మధ్యగా ఉన్న – అగ్ని తేజోరూపమై కేవల ప్రకాశమై ఉంటోంది. ఆతనియందు వెలుగొందుచున్న **"సుషుమ్న"**యందు బుద్ధిపూర్వకంగా జరుగుతూ

ఉంటుంది. ఈ విధంగా **బుద్ధి పూర్వకంగా నిర్వర్తించు 'సోఽహమ్'ను 'మంత్రయోగము' అని పిలుస్తున్నారు.**

→ అదీ (తత్) నేనే! నీవు (త్వమ్)గా ఉన్నది నేనే! అహమ్ (జీవుడు)గా ఉన్నది నేనే!

→ జీవుడుగా ఉన్న నేను పరమాత్మనే!

→ పరమాత్మనైన నేను జీవుడను కూడా!

అనునదే సో → అహమ్ మంత్రము. **అట్టి యోగి పట్ల జీవుడు – బ్రహ్మము ఏకము, పరస్పర సానుకూల్యము అయి ఉంటాయి. ఒకదానితో మరొకటి వ్యతిరిక్తత కలిగి ఉండవు.**

## 2. హఠయోగము

**ప్రతీతిః మంత్రయోగాచ్చ జాయతే పశ్చిమే పథి।।** అటువంటి 'సోఽహమ్' మంత్రయోగముచే (నేను– నీవు ఆ పరమాత్మ నుండియే బయలుదేరుచున్నాము అను మననము, యోగభావనలచే) – పశ్చిమపథము (The path towards worldly scenario) ప్రతీతి (effective, potential, wel-overtaken) పొందుచున్నది. దేహములో చంద్రసూర్యుల దర్శనము అగుచున్నది. **'హ'కారేణతు సూర్యస్స్యాత్ 'స'కారేణ ఇన్దు ఉచ్యతే!**

**'హ'కారము** (out going prana or వాయువు) 'సూర్యుడు' అని చెప్పబడుతోంది.

**'స'కారము** (Incoming prana or వాయువు) 'చంద్రుడు' అని చెప్పబడుచున్నాయి.

**హఠము** = సూర్య–చంద్రమసో 'ఐక్యం' – **"హఠా"** ఇతి అభిధీ యతే!

సూర్య–చంద్రమసముల (లేక) బయటకు వెళ్ళు వాయువు యొక్క – లోనికి వచ్చు వాయువు యొక్క **ఐక్యము** సిద్ధింపజేయు అభ్యాసము **'హఠయోగము'** అని చెప్పబడుతోంది. ఇటువంటి ప్రణ–అపానముల (లేక) 'హ' – 'స"ల (లేక) సూర్య–చంద్రుల ఐక్యత – అను 'హఠయోగము'చే దేహ–మనస్సులలో జనిస్తూ ఉంటున్న సర్వదోషముల జాడ్యము తొలగిపోగలదు. అప్పుడు ఆ యోగికి "దృశ్యములో గల, విశ్వమంతా నిండియున్న తన యొక్క క్షేత్రజ్ఞత్వము స్వయముగా తనయందు అనుభవము కాగలదు. **అట్టి స్వకీయ క్షేత్రజ్ఞత్వము** పరమాత్మత్వముతో ఐక్యము పొందుచున్నది. అట్టి యోగి బాహ్య–అభ్యంత ఏకస్థితి యగు 'హంస' – యోగ ఏకీభూతుడు అగుచున్నాడు.

జగత్తుకు తనకు భేదము లేనివాడగుచున్నాడు.

→ లోనికి వచ్చు–బయటకుపోవు వాయువుల ఐక్యతచే **'ఒక దేహములోని నేను'** అనే పరిమితస్థితి రూపమగు జాడ్యము తొలగి

→ **పరమాత్మతో ఐక్యము** లభిస్తోంది. అట్టి సూర్య–చంద్రుల ఐక్యతచే జగద్విషముల అభిలాష రూపమగు చిత్తము పరమాత్మ భావనయందు – జలము నందు తరంగము వలె – విలీనము పొందగలదు.

## 3. లయ యోగము

ప్రాణ–అపానముల సమత్వ ధారణచే విశ్వ క్షేత్రజ్ఞత్వము సిద్ధించుచుండగా, ఈ **'జీవాత్మ భావన'** జీవపరిమితత్వమును త్యజించి, ఛేదించి–సర్వాంతర్యామి, సర్వతత్త్వ స్వరూపుడు అగు **పరమాత్మ** యందు (పరమాత్మ భావనయందు) **లయం** అయిపోవుచున్నది. యోగాభ్యాసము యొక్క అట్టి లయ స్థితినే **'లయయోగము'** – అని పిలుస్తున్నారు.

**పవనః స్థైర్యం ఆయాతి లయయోగ – ఉదయే సతి!** జీవాత్మత్వ వ్యవహారమంతా పరమాత్మతో ఐక్యము (నటుడు– పాత్రల వలె పరమాత్మతో ఏకత్వము) పొందుచుండగా, ప్రాణ దేహములో పవనము (ప్రాణశక్తి) – స్థైర్యము పొందుచున్నది. **లయాత్ సంప్రాప్యతే సౌఖ్యం స్వాత్మానందమ్ పరం పదమ్!**

- జలమునకు వేరుగా తరంగమునకు ఉనికి ఉన్నదా? లేదు.
- బంగారమునకు వేరుగా 'గాజు' అనుదానికి ఉనికి ఎక్కడిది?
- మట్టి బొమ్మలో మట్టికి వేరుగా బొమ్మ ఉంటుందా?
- నాటక రచయితకు వేరుగా పాత్రకు అస్థిత్వం ఉంటుందా?

ఉండవు. జలము, బంగారము, మట్టి, పాత్రధారణ సర్వదా యథాతథము కదా। అట్లాగే సర్వక్షేత్రములలోని (సర్వదేహములలోని) క్షేత్రజ్ఞత్వానికి వేరుగా వ్యష్టిగతమగు విశేషములకు స్వకీయమగు ఉనికి లేదు. – ఇదియే **లయయోగము.**

**"వ్యష్టిత్వము"** – అను ఉప్పుగడ్డ దొరలి, **"సమష్టిత్వము"** అనే సముద్రజలములో ప్రవేశించి, ఏకమై **"సర్వాత్మత్వము"** సంతరించుకోవటమే **"లయయోగము".**

## 4. రాజయోగము

ఈ దేహమే ఒక మహాక్షేత్రము. – ఇందులే దేవతాప్రజ్ఞలు, ఆసురీప్రజ్ఞలు, ఆత్మ స్వరూపుడగు జీవుడు, 64 కళాదేవతలు మొదలైనవన్నీ ఆయా కార్యక్రమములు యజ్ఞభావితులై నిర్వర్తిస్తున్నారు. చక్రవర్తి యొక్క అధికారములో "మంత్రులు, సేనానాయకులు" మొదలైనవారివలె **'పరమాత్మ' యొక్క వెలుగులో అవన్నీ వర్తిస్తున్నాయి.**

అటువంటి "యజ్ఞశాల" అనతగినట్టి ఈ శరీరము యొక్క యోని మధ్యగా (In the inner zone of central space of the physical body) - మంకెన పువ్వు వంటి 'రజోతత్త్వము' సంస్థితమై సంప్రవర్తితమైయున్నది. **రజో వసతి జంతూనాం దేవీ తత్త్వం సమావృతమ్!** ఈ రజోసంవృత్తమే (దేవీతత్త్వమే) ప్రకృతిగా, భావనగా, కళగా, సంకల్పముగా, ఊహగా–మొదలైనవన్నీగా దేహమునందు సంప్రదర్శనము అగుచున్నది.

**అట్టి 'రజోతత్త్వము' నందు బుద్ధిని నిలిపి ఏకాగ్రచిత్తంతో యోగాభ్యాసము చేయుటచే రాజయోగము సిద్ధించుచున్నది.**

అట్టి ప్రకృతితత్త్వోపాసనా ఫలమగు రాజయోగముచే ఆ యోగికి తాను కోరుకున్న 'అణిమ, గరిమ, మహిమ' ఇత్యాది సిద్ధులు లభిస్తున్నాయి. సిద్ధులు లభించురూపముగా రాజయోగము విరాజమానమగుచున్నది. అయితే అవన్నీ అల్పమైన విశేషాలు. రాజుగారు సభను తన అధికారముతో అంతటా నింపి ఉంచు తీరుగా **"ఈ జగద్దృశ్యమంతా నాయొక్క స్వరూప ప్రదర్శనయే"** – అను సందర్శనమే రాజయోగము. **"ఇదంతా నాలోని నేనైన నేను।"** – అను దృశ్యసంభావనయే రాజయోగము.

ఈ విధంగా – **"ప్రాణ అపానముల సమతస్థితి"** అను అభ్యాసము చేతనే (1) మంత్ర యోగము (2) హఠయోగము (3) లయ యోగము (4) రాజయోగము – అనబడు యోగచతుష్టయము సిద్ధించుచున్నది.



హే బ్రహ్మభగవాన్! ఈ విధంగా యోగచతుష్టయము గురించి సంక్షిప్తంగా ఇప్పుడు చెప్పుకున్నాము. ఈ ఇవన్నీ కూడా అభ్యాసము (By constant practice) చేతనే సిద్ధించగలవు. మరింకే విధంగానూ కాదు. ఈ 4 యోగముల అభ్యాసము చేత జీవునికి సిద్ధించనిది ఏదీ ఉండదు. **ఈ జీవుడు శివుడే అగుచున్నాడు.** అందుకు గాను ఈ జీవుడు మర్కటక్షీరన్యాయమును ఆశ్రయించవలసిందే! ఏ విధంగా తల్లికోతి చెట్లపై ఎగురుతూ ఉంటే, పిల్లకోతి తల్లి కోతి యొక్క మెడను ఆశ్రయించి ఉంటుందో, ఆ విధంగా ముముక్షువు యోగచతుష్టయమును తనకుతానే శ్రద్ధ – అనునిత్యాభ్యాసము – సర్వప్రయత్నములతో కూడి ఆశ్రయించాలి. ఈ విధంగా నెమ్మది నెమ్మదిగా (కానీ) దిన దినాభ్యాసంగా యోగచతుష్టయమును అభ్యసిస్తూ ఉండగా, ఈ జీవుడు ఈ వర్తమాన దేహముతోనే ఇక్కడే ముక్తిని పొందగలడు. **"ఆత్మగా నేను నిత్యముక్తుడను. జీవాత్మత్వము నా యొక్క అంశ. సూర్యకిరణము తాను ప్రసరించువస్తువుచే బంధింబడుతుందా? లేదు కదా! అట్లాగే నేను జీవాత్మత్వముచే పరిమితుడనుకాను! సర్వదా అపరిమితుడను"** – అను స్వానుభవమే **'ముక్తి'.**

## యోగాభ్యాసి పట్ల యోగసిద్ధికి ముందే వర్తమాన భౌతిక దేహము నశిస్తేనో?

ఒకవేళ ఒకడు శ్రద్ధ, పట్టుదల, లక్ష్యశుద్ధి కలిగి దైనందికంగా యోగాభ్యాసము చేస్తూ ఉన్నప్పటికీ కూడా **"ఆత్మ–యోగసిద్ధి"** లభించకయే ప్రకృతి సిద్ధమగు ఈ భౌతిక దేహము నేల కూలటం జరిగినపుడో? ఇంతా కష్టపడి నిర్వర్తించిన యోగాభ్యాసము వృథా అవుతుందా?

ఈ ప్రశ్నకు సమాధానం వినండి.

**శ్లో॥ యోగసిద్ధిం వినా దేహః ప్రమాదాత్ యది నశ్యతి,**
**పూర్వవాసనయా యుక్తః శరీరం చ అన్యథా ఆప్నుయాత్॥**
**తతః పుణ్యవశాత్ సిద్ధో గురుణా సహ సంగతః**
**పశ్చిమద్వార మార్గేణ జాయతే త్వరితం ఫలమ్॥**

యోగసిద్ధి పొందకుండానే ఏదైనా కారణంచేత కాలచమత్కారంగా అనుకోకుండా ఈ భౌతికదేహము నశించటం జరిగినా కూడా, ఆ యోగికి శుభమే జరుగుతుంది.

- ఆతని ఇతఃపూర్వపు జన్మల సంసారవాసనల స్థానంలో యోగాభ్యాస వాసనలు చేరి, అభ్యాసము ఎంతగా ఉంటే, అంతగా సంసార వాసనలను **బయటకు త్రోలివేస్తూ** ఉంటాయి.
- యోగాభ్యాస **'అభిరుచి', 'అభ్యాసము'** పట్ల **'తపన'** కారణంగా, ఆ యోగి **"యోగాభ్యాసమునకు సానుకూల్యము, యోగాభ్యాస సరంజామా లభించగలది"** – అగు మరొక ఉపాధిని పొందుచున్నాడు. ఆతని ఉత్తర ఉపాధి (The next body) యోగాభ్యాస ఉత్తరోత్తర గతికి సానుకూల్యమై ఉంటుంది. **అనగా ఆతని తదనంతర శరీరము సంసార వాసనలచే కాకుండా, యోగాభ్యాస వాసనలచే నిర్ణయించబడినది గా** అగుచున్నది.
- అట్టి నూతన శరీరముతో ఆ ముముక్షువు పుణ్యవశంగా.. యోగసిద్ధుడైన గురువుతో సమాగమము (Association with Yoga Sidha) లభించుచున్నది.
- ఆ అభ్యాసి గురువు యొక్క సామీప్యతకు అర్హుడగుచున్నాడు. గురువు చెప్పు యోగాభ్యాస సూచనలను ఆకళింపు చేసుకొనుచున్నవాడై పశ్చిమ ద్వారమార్గంగా త్వరితగతిని 'యోగసిద్ధి' అను ఫలమును పొందుచున్నాడు.

(**పశ్చిమద్వారమార్గము** = సాంసారిక ఉత్తరోత్తర జన్మలకు వ్యతిరిక్తమైనట్టిది.

**పశ్చిమద్వారం** → జ్ఞాన సమాచారముగా తెలుసుకొని, ఆ తెలుసుకొన్నది అనిపించే వరకు అనుకోవటానికి దారితీయు యోగమార్గము.

**తూర్పుద్వారం** → జ్ఞాన సంమాచారము వినటం).

## కాకమతము (లేక) గురుమతము

పూర్వ **జన్మకృత అభ్యాసాత్ సత్వరం ఫలం అశ్నుతే!** ఇతః పూర్వపు జన్మలలో చేసిన అభ్యాసము చేతనే ఒకనికి ఇప్పుడు జ్ఞాన-యోగ ఫలమగు 'ముక్తి' లేక 'మోక్షము' స్థాపితమౌతోంది. ఎవ్వడూ కూడా ప్రయత్నించకుండా ఏదీ పొందటం లేదు. 'ముక్తి' కూడా క్రితం జన్మల ప్రయత్నము చేతనే ఇప్పుడు లభించటం జరుగుతోంది. **"ప్రయత్నిస్తేనే ప్రయోజనము"** – అను సిద్ధాంతమును **'కాకమతము'** అని పిలుస్తున్నారు. "కాక.." = ఏదైతే పొందాలని అనుకుంటున్నావో అట్టి **యోగసిద్ధి** పొందటానికి ఉపాయము. యోగాభ్యాస యత్నములు.

తెలుసుకుంటే సరిపోదు. అనుకోవాలి. అనిపించాలి. అనుకోవాలంటే బుద్ధియొక్క సునిశ్చలత కావాలి. సునిశ్చలత కావాలంటే యోగాభ్యాసమే ఉపాయం. **నాస్తి కాకమత్ అన్యత్ అభ్యాసాఖ్యమ్ అతః పరమ్! 'అభ్యాసము చేయి'** అనునదే సర్వజ్ఞాన వాక్యముల సారము. అభ్యాసమునకు వేరుగా కాకమతము (జ్ఞాన వాక్యముల సూచన) మరింకేదీ అయి ఉండలేదు. **తేనైవ ప్రాప్యతే ముక్తిః, న అన్యథా శివభాషితమ్। "ఆత్మతో యోగము (కలయిక)"** అను అభ్యాసమే యోగాభ్యాసము. "ప్రాణ సంయమము, కుండలినీ ఊర్ధ్వయానము, గ్రంథి జయము, బ్రహ్మరంధ్రం – ఊర్ధ్వగమనము" మొదలైన ఉపాయములతో శాస్త్రములచే, గురువులచే బోధింపబడుచూ, మార్గదర్శకము చేయబడుచున్నాయి. దృశ్య-దేహ-ఇంద్రియ-మనో-బుద్ధి-చిత్త-అహంకారములతో ఏర్పడు యోగము (Relationship) ను అభ్యాసపూర్వకంగా దాటివేసి **'ఆత్మతో యోగము'** సిద్ధించుకోవాలి.

**జీవాత్మయొక్క 'కేవలస్వస్వరూపము'తో అనన్యత్వమే 'యోగము'.**

వీటినే **"యోగమార్గము, హఠయోగము, కాకమతము, పశ్చిమ మార్గము"** అని పిలుస్తున్నారు. ఇట్టి హఠయోగి (లేక) పశ్చిమమార్గము చేతనే ముక్తి ప్రాప్తించగలదు – అనునదే శివ భాషితము. శివ వాక్కు.

## కాష్ఠా సహజీవనము – లయ యోగము

ఈ జీవుడు తనయొక్క 'దేహిత్వము'ను ఏమరచి, – **"భౌతిక దేహమునకు నేను పరిమితుడను"** అను భావన యందు మునిగి తేలుచున్నాడు. భౌతికదేహముతో సాంగత్యము పొందుతూ అసంఖ్యాక ఉపాధి పరంపరల సంయోగమును-వియోగమును పొందుచున్నాడు. మార్పు చెందు వస్తువులతో సాంగత్యము ఈతని దుఃఖ పరంపరలను వృద్ధి చేసుకుంటూపోతున్నది. ఈవిధంగా ఈ జీవుడు **దృశ్యవ్యవహారములలో ఎక్కడో మునిగి, మరెక్కడో తేలుచున్నాడు.**

ఇప్పుడు ఉపాయమేమిటి? **హఠయోగ క్రమాత్ కాష్ఠా సహజీవ లయాదికమ్!** హఠయోగ క్రమము. [ ప్రాణ – అపానముల సమస్థితి – అను అభ్యాసయోగము (లేక) 'హఠయోగము'] చేతనే 'దేహముతో తాదాత్మ్యము' అనే రోగము కుదురగలదు. అట్టి 'పశ్చిమ

మార్గము' తప్పించి వేరే ఉపాయం లేదు. ఈ శరీరముల **"జనన-మనన - మరణముల"** మార్గంలో వచ్చిపడియున్న సంసార రోగము - మంత్ర-లయ-హఠ-రాజయోగములనబడే యోగచతుష్టయం చేతనే - **అదౌ రోగాః ప్రణస్యంతి పశ్చాత్ జాడ్యం శరీరజమ్।** → మొదలంట్లా తొలగగలదు. యోగ చతుష్టయము చేతనే కపాల ప్రదేశమున సంస్థితమైయున్న చంద్రమండలము నుండి అవిచ్ఛిన్నముగా **'అమృతత్వము'** అనబడే ఆత్మత్వము స్రవించగలదు.

**ప్రాణ-అపానముల (లేక) సూర్య-చంద్ర తత్త్వముల సమత్వయోగ ధారణాభ్యాసము చేత** →

- శరీరములోని ధాతువులు యోగాగ్ని చేత స్పృశించబడినవై, వాటి వాటి వికారములను త్యజించి, శరీరములో సమత్వము పొందసాగుతాయి. ధాతువుల అల్పత్వ-అధికత్వ దోషములు తొలగుతాయి.
- శరీరము సరళత్వము, సౌమ్యత్వము (మార్దవము) పొందటం జరుగుతుంది. (అనేక యోగశాస్త్ర సూచిత) శబ్దములు శరీరములో వినబడసాగుతాయి. అవి యోగసాధనములుగా మలచబడతాయి. ('ఉమ్', 'మమ్', 'ఓం', మొదలైనవి).
- శరీరములో పైత్య-జఠర రసముల అతివృష్టి, అనావృష్టి తొలగి, వాయువు (లేక ప్రాణశక్తి) యొక్క ప్రసరణము, సంచారము సుఖకరముగా అగుచున్నది. ఆ యోగికి ఆకాశ గమన సామర్థ్యం లభిస్తోంది. **జిత్వా వృష్ట్యాదికం జాడ్యం ఖేచరః స భవేత్ నరః।**
- ఆతడు వాయువేగమును సంతరించుకొనుచున్నాడు.
- ఈ దేహముల ముందు వెనుకలు ఎరిగినవాడగుచున్నాడు. సర్వజ్ఞుడగుచున్నాడు. తాను కోరుకున్న ఉత్తరోత్తర శరీరములను పొంది **'కామరూపి'** అగుచున్నాడు. **సర్వజ్ఞో అసౌ భవేత్ కామరూపః పవన వేగవాన్।**
- సిద్ధయోగి అయి మూడు లోకములలోను వినోదముగా, క్రీడా విశేషంగా సంచారములు చేయగల సామర్థ్యమును పొందుచున్నాడు. లోకములన్నీ ఆతనికి క్రీడాస్థలముల వలె, చక్రవర్తి యొక్క స్వీయ అంతఃపుర ఉద్యానవన సంచారమువలె అగుచున్నాయి.
- ఆతనికి లోకభావములన్నీ - కర్పూరము అగ్నిస్పర్శను పొందిన రీతిగా - జనిస్తూనే సమసిపోతున్నవగుచున్నాయి. ఆతనిలో కార్పణ్యము ఉండదు. ఇక కాఠిణ్యము ఏముంటుంది? ఏ మాత్రమూ ఉండదు.

  అట్టి యోగి యందు వ్యష్టిగతమైన అహంకారమంతా "వెలిగించిన మైనపు వత్తి".... వలె కరిగిపోతుంది. ఇక దేహకాఠిన్యం ఉండదు.

అట్టివాడు 'యోగీంద్రుడు' అయి -

→ సర్వకర్త (సర్వమునకు - మనోబుద్ధి చిత్త అహంకారములకు, వాటి వాటి వాటి విషయములకు తానే కర్తగా) అగుచున్నాడు.

→ సర్వ స్వతంత్రుడగుచున్నాడు. స్వాతంత్రుడుగా విరాజిల్లుచున్నాడు.

→ జీవన్ముకుడు (జీవితము ఒకవైపు కొనసాగుచుండగా, రెండవ వైపు **నిత్యముక్తుడు**) అగుచున్నాడు. **న అత్ర సంశయః! ఇందులో సంశయము లేదు.** జీవాత్మత్వపు **"నిత్య బద్ధత్వము"** → తన పరస్వరూపముయొక్క **"నిత్యముక్తత్వము"**నకు కించిత్ కూడా విఘాతము కలిగించజాలదు - అని ఎరిగి సంచరిస్తున్నాడు.

## ద్వివిధములైన సిద్ధులు

ఈ లోకంలో సిద్ధులు రెండు తీరులవై ఉంటున్నాయి.

**(1) కృత్రిమ-కల్పిత సిద్ధులు :** ఈ కల్పిత (Internationally intended, Matter related) సిద్ధులు - మంత్ర శాస్త్రము చెప్పుచున్నది. రససేవనము చేతను, ఓషధుల చేతను, క్రియాజాలము చేతను, మంత్ర-తంత్రముల చేతను- వాటి వాటి సాధనల వలన సిద్ధించేవి. ఇవన్నీ ఎదుటి వాని దృష్టిని ఆకర్షించటానికి సంబంధించినవి. ఎదుటివాని దృష్టిదోషములను, బలహీనతలను ఉపయోగించుకుని కల్పించబడేవి. అందుచేత ఈ సిద్ధులను **'కల్పిత సిద్ధులు'** అని పిలుస్తున్నారు.

ఇవి నిత్యములైనవి కావు. అనిత్యములు (They are confined to addressing certain assumptions, situations and pressumption of others). అల్పవీర్యములైనవి (Their potential is of lower state). ఇవన్నీ కూడా సాధనచే ఉద్భవిస్తూ ఉంటాయి. సాధన కొనసాగనప్పుడు కరిగిపోవటం ప్రారంభిస్తూ ఉంటాయి.

**(2) స్వాభావిక-అకల్పిత సిద్ధులు :** ఇవి- వాటి కొరకై లక్ష్యసాధన లేకపోయినప్పటికీ- సిద్ధించేవి. వాటికవే స్వయముగా యోగిని ఆశ్రయిస్తూ ఉంటాయి. ఇవి స్వాత్మయోగము (తనను, తదితరులను, ఆత్మతత్త్వస్వరూపులుగా సంభావించటము చేత), ఆత్మ-స్వాతంత్ర్యత

చేతను, ఈశ్వర ప్రియము చేతను యోగిని సమీపిస్తాయి. తదితర జీవుల పట్ల ఆత్మీయ భావన, అవ్యాజమైన ప్రేమ వలన స్వతః సిద్ధంగా కలుగుతూ ఉంటాయి. **"సర్వము ప్రియమగు పరమాత్మ స్వరూపమే"** – అని భావించి, సహజీవులను పరమాత్మ స్వరూపంగా దర్శించి ఉపాసించువారి పట్ల **"ఈతడు ప్రియమగు పరమాత్మ స్వరూపుడే!"**... అనే భావన తదితరులకు కలుగుతూ ఉంటుంది.

అట్టి సర్వజన శ్రేయోపూర్వకము, స్వాభావికము అగు ఆప్యాయతతో కూడిన యోగి పట్ల ఏర్పడు జనుల దివ్యభావములు **"స్వాభావికసిద్ధులు"**.

యోగి ఆత్మీయ భావనచే సర్వ భేదవాసనలను దాటివేయుచున్నాడు. చిరకాలము **'తత్ త్వమ్'** భావనను ఆశ్రయించినవాడై స్వభావంగానే **ఆకర్షణుడు, సిద్ధి పొందినవాడు,మహావీర్యుడు, సర్వులకు ఇష్టరూపుడు** అగుచున్నాడు. యోగాభ్యాస ప్రభావముచే సహజ సిద్ధయోగి అయి, సిద్ధులచే ఆశ్రయించబడుచున్నాడు. **అయితే, అట్టి మహాయోగి తన మహాయోగ సిద్ధులను రహస్యంగా ఆత్మజ్ఞాన–ఆత్మభావనల వెనుకగా దాచి ఉంచుతాడు.** "నేను ఈ ఈ సిద్ధులచే వారికంటే వీరికంటే గొప్పవాడను" – అను భావన – అభిప్రాయములకు, ప్రలాపములకు చోటివ్వడు. **తాస్తు గోప్యా మహాయోగాః పరమాత్మపదే అవ్యయే!** అవ్యయమగు పరమాత్మ పదము సిద్ధించుకోవటమే రహస్యమగు మహాపదము. అదియే సమస్త సిద్ధులసారము. **వినా కార్యం సదా గుప్తం యోగసిద్ధస్య లక్షణమ్!** దైనందికమైన లౌకిక కార్యక్రమములలో ప్రదర్శించకుండా ఎల్లప్పుడు సిద్ధులను దాచి ఉండటము **అకల్పిత యోగ–సిద్ధయోగి** యొక్క స్వాభావిక లక్షణము.

అట్టి ఆత్మసిద్ధ యోగి సర్వదా – **"సమస్తమునందు తనను, తనయందే సమస్తమును"** దర్శిస్తూ ఉంటాడు. ఏ విధంగా అయితే, ఆకాశము దేవతల రాకపోకలతోను, పక్షుల – విమానముల గమన ఆగమనములతోను, అనేక పధములు (మార్గములు) అంతర్నిర్మితమైయున్నదో, అట్లాగే అకల్పిత సిద్ధుడగు మహాయోగి – ఉన్నచోటే నానా తీర్థములు, నానా మోక్షమార్గములు ఆశ్రయించినవై ఉంటాయి. లాభాలాభ వివర్జితుడగు ఆయోగిని సుకర్మలు, సుక్షేత్రములు వెంటనంటి ఉంటాయి. సిద్ధజాలమంతా అట్టి ఆత్మభావనా సిద్ధయోగులు నడిచి వెళ్లుచున్న మార్గములో తమకు తామే వెంటనంటి ఉంటున్నాయి.

❑❑❑

ఒక ప్రావీణ్యము గల స్వర్ణకారుని వద్దకు చేరిన ఆభరణమును **"ఇది అసలైన–సిసలైన బంగారము అవునా? కాదా?"** అని పరీక్షించి, బంగారము అయితేనే ఆభరణముగా చేయటానికి సిద్ధుడౌతాడు కదా! అట్లాగే, ఆత్మతత్త్వము ఆశయముగా కలిగియున్న యోగి–సిద్ధులు తనను సమీపిస్తూ ఉన్నప్పుడు, – **"జీవన్ముక్తికి అవసరమా? కాదా?"** – అనునది పరిశీలించి, పరీక్షించి,.., జగత్తును ఆత్మగా ఉపాసించుటకు ఉపకరణము కానివాటిపట్ల ఉదాశీనుడై ఉంటాడు.

అయితే జీవన్ముక్తుని పట్ల – యోగమార్గములో సాత్వికగుణములు (ప్రేమ, ఆప్యాయత, కరుణ, దయ, దాక్షిణ్యము మొదలైనవి) స్వాభావికం అగుచూ ఉంటాయి. **"నాకు జరామరణములు స్వాభావికమే కావు. అవి ఆత్మస్వభావమునకు సంబంధించినవి అవజాలవు"** – అను నిశ్చల నిశ్చితత్త్వము కలవాడే **జీవన్ముక్తుడు.**

❑❑❑

**బ్రహ్మ భగవానుడు :** స్వామీ! ఈ జీవుడు దేహపంజరముల నుండి విడివడి, దేహభావ పరిమితముల నుండి **విముక్తుడు** అవటం ఎట్లా?

**పరమ శివ భగవానుడు : 'ముక్తి' అనునది బుద్ధికి సంబంధించినది మాత్రమే.** అంతేగాని, దేహముల రాక–పోకలకు సంబంధించినదే కాదు. **'మృత్యువు' అనునది భౌతిక శరీరమునకు, భౌతిక భావనకు సంబంధించినది మాత్రమే – అనునది సునిశ్చయమగుగాక।**

యోగ సాధన జరుగుచున్నప్పుడు ఆ యోగిని సమీపిస్తూ వచ్చే అణిమాది అష్టసిద్ధులు భౌతిక దేహపరమైనవి మాత్రమే. ముక్తియో? దేహాతీతమైనది. దేహపతనము ముక్తికి సూచనము కాదు. **దేహము పతనమైనంత మాత్రం చేత** (మనస్సు దేహానంతరం కూడా కొనసాగుచూనే ఉంటుంది. కనుక) **జీవుని యొక్క సంసార బంధనము తొలగుట లేదు.** హే పద్మజా! పశువులు, కుక్కుటములు (కోళ్ళు), కీటకములు మొదలైనవన్నీ కూడా మరణమును పొందుచున్నాయి కదా! మరణించిన మాత్రం చేత వాటికన్నిటికీ ముక్తి లభిస్తోందా? లేదు. **ప్రాణములు భౌతిక – దేహము నుండి బహిర్గతము అయినంత మాత్రం చేత చిత్తము యొక్క దేహచింతన, దేహత్వముతో అవినాభావత్వము తొలగునది కాదు.**

అందుచేత ఆ జీవుడు దేహత్వము, దృశ్యత్వము యొక్క ధ్యాసచే – జీవన్ముక్తత్వము సిద్ధించనంతవరకు – మరొక ప్రవాహ పతితమైన దేహము పొందటము అనివార్యం. కనుక దేహబంధనము ఎక్కడికీ పోనిదే – అగుచున్నది.

యోగాభ్యాసి విషయములో, ఆతడు దేహము యొక్క పరిధులను దాటివేస్తున్నాడు. **"దేహిత్వము (లేక) దేహ-ప్రాణములు నాకు ఆభరణములు"** - అను **దేహాతీతత్వము**, (లేక) **దేహసాక్షిత్వము** సిద్ధించుకొనుచున్నాడు. ఆతడు ప్రాణశక్తిని దేహిగా తనయందు కలిగి ఉండి, ఆ ప్రాణశక్తితో దేహమును నింపి ఉజ్జీనింపజేయువాడుగా తనను తాను ఎరుగుచున్నాడు. అనగా ప్రాణములు ఆతని నుండి ఎటూ వెళ్లటం లేదు. అందుచే ఆతడు దేహప్రవేశ-నిష్క్రమణములు తనపై, తన యొక్క ప్రాణములపై (స్వకీయమగు ప్రాణశక్తిపై) ఆపాదించుకోడు.

**న బహిః ప్రాణం ఆయాతి। పిణ్డస్య పతనం కుతః?** యోగసిద్ధుడగు జీవన్ముక్తుని అవగాహన విషయంలో ఆతని ప్రాణములు ఆతని యందే ఉన్నవగుచున్నాయిగానీ, బహిర్గతమై శరీరమునందో, మరొక చోటికో ప్రయాణమవటం లేదు. **"నేను నా ప్రాణశక్తితో ఉత్పత్తి - స్థితి-వృద్ధి - పతన శీలమగు ఈ శరీరమును వస్త్రమువలె ధరిస్తున్నాను. నా ప్రాణశక్తితో ఈ దేహము యొక్క అణువణువు నింపుచున్నాను. ఇది శిథిలమగుచున్నది. ఎప్పటిలాగానే నా ప్రాణములు (లేక శక్తి) నన్ను అనుసరించియే యథాతథమై ఉంటున్నాయి।"** - అని ఎరిగి ఉంటున్నాడు. అట్టి వానికి 'పిండ పతనము' - ఈ **శరీరము ఉన్నప్పుడూ లేదు. ఇది నశించినప్పుడూ లేదు.** ఆతనికి పిండపతనము స్వకీయ 'అంశ' విశేషమే అయి, అద్దానికి పరమై, పరమాత్మగా ప్రకాశమానుడగుచూ ఉంటున్నాడు.

యోగసిద్ధుడు జీవన్ముక్తుడై ప్రకాశించుచున్నాడు. దేహము ఉన్నప్పుడే **దేహము - దేహత్వములను జడసంబంధమైనవిగాను**, వాటి కావల గల కేవలత్వము ఆత్మ చైతన్యత్వముగాను యోగీశ్వరుడు **స్వానుభవము** చేసుకొనుచున్నాడు. అందుచేత.., **"కేవలుడుగా నాకు జడ శరీరముచే 'పిండ పాతము' అనునదే లేదు"** అను <u>కైవల్యస్థితిని</u> సిద్ధించుకొనుచున్నాడు.

యోగయుక్తుని దృష్టిలో **శరీరము యొక్క 'పతనము' ముక్తి కాదు. శరీరము యొక్క 'రాక' బంధమూ కాదు.**

**ముక్తి అనగా ఏమిటి? మరికొంత వివరిస్తున్నాను.**

**శ్లో॥ దేహే బ్రహ్మత్వమ్ ఆయాతే జలానాం సైన్ధవం యథా,**
**అనన్యతాం యదా యాతి, తదా <u>ముక్తః</u> స ఉచ్యతే॥**

ఒక సైంధవ లవణము గడ్డను (A piece of salt) నీటిలో వేసినప్పుడు, ఆ గడ్డ నీటిలో కరిగిపోవుచుండగా, అద్దాని ఆకారము, రంగు, రూపు, లవణత్వము ఇవన్నీ ఏమౌతున్నాయి? నీటిలో కరగిపోయి, నీటితో మమేకమగుచున్నాయి కదా! అట్లాగే, యోగాభ్యాసి యోగసిద్ధి పొందుచుండగా దేహము, దేహత్వము, స్వభావము, ప్రాణము, ప్రాణత్వము → ఇవన్నీ కూడా ఎప్పుడైతే **'బ్రహ్మత్వము'**తో **'అనన్యత్వము'** పొందుతాయో, అప్పుడు ఆతడు **"ముక్తుడు"** అని చెప్పబడుచున్నాడు. అనగా

**జీవునికి నిత్యానుభవమగుచున్న అన్యత్వమంతా (ఉప్పుగడ్డ జలమునందు వలె) జీవన్ముక్తునిపట్ల ఆత్మగా అనన్యత్వము సంతరించుకొన్నదై ఉంటోంది।**

ఒక చోట జలములో బుడగలు బయల్వెడలినవై కనిపిస్తున్నాయి.

నీటి బుడగలు జనించేది ఎందులో? జలములో! సంచరించేది ఎందులో? జలములో! లయించేది ఎందులో? జలములో! జలమునకు వేరుగా నీటి బుడగలు కనిపించవచ్చుగాక! కానీ అవన్నీ జలమునకు భిన్నమా? ఎన్నటికీ కాదు.

అట్లాగే..,

**జీవన్ముక్తుని స్వానుభవములో**-ఈ శరీరము, దేహత్వము, ఇంద్రియములు, వాటి వాటి అనుభవశీలమగు దృశ్య-అదిగా గల వస్తుజాలము, (ఇంద్రియములకు అనుభవమగుచున్నవి), అష్టసిద్ధులు, తదితర జీవులు - ఇవన్నీ కూడా తన యొక్క కేవలత్వము (లేక) పరబ్రహ్మత్వము (అనే జలము)లో బుడగల వంటివి. ఆతనికి తదితరమైనదంతా ఆత్మకు అనన్యభావనగా సిద్ధించుచున్నది. అట్టివాడే యోగసిద్ధుడు. **అనన్య చింతనచే అనన్యత్వము సిద్ధించటమే వాస్తవమైన సిద్ధి. అదియే సిద్ధపురుష లక్షణము.**

## దేహం దేవాలయమ్ ప్రోక్తమ్

చిత్తలయము గురించి ప్రయత్నించనివానికి ఈ దేహము, ఈ ఇంద్రియ విషయములు జాలమువలె (Like a Fisher Net) బంధమే అగుచున్నాయి. ఆతనికి దేహపతనము - (అనేక దృశ్య ధ్యాసలు కారణముగా) అనేక దుఃఖములకు (Many worries) - సందర్భముగా అగుచూ ఉన్నది. అనేక యోనులలో ప్రవేశ-నిష్క్రమణముల గతులకు 'ద్వారము - (Entrance gate) - అగుచున్నాయి.

ఇక, యోగాభ్యాసము స్వీకరించి, ఈ దేహమును **"యోగోపకరణముగా ఉపయోగించటము"** అను ప్రయత్నశీలునికి – ఈ దేహము "మహత్తరమగు, తరింపజేయగల" – అవకాశము, సందర్భము కూడా.

**దశ ద్వారపురం దేహమ్** – ఈ దేహము – (రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు ముక్కుపుటములు, నోరు, శిశ్నము, గుదము, బ్రహ్మరంధ్రము.. అనబడు) – 10 ద్వారములు (10 entrances or 10 quit points) .... కలిగియున్నది.

**దశ నాడీ– మహాపథమ్ :** (5) నాడులు ఇంకా (5) ఉపనాడులు కలిగి ఉన్నది. వాటన్నిటితో దేహములో అనేక రహదారులు ఏర్పడినవై ఉన్నాయి. (ఇడ; పింగళ; విళంబినీ; గాంధారి; పూష; అంబుష; శూర, విశ్వోదరీ; రాకాహ్వాయ; హస్తిజిహ్వా)

**దశభిః వాయుభిః వ్యాప్తమ్ :** (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనబడే) పంచప్రాణములతో, (నాగము, కూర్మము, కృకరము, ధనంజయము, దేవదత్తములనబడే) పంచ ఉపప్రాణములతో దేహము వ్యాప్తమైయున్నది.

**దశేన్ద్రియ పరిచ్ఛదమ్ :** (శ్రోత్ర (చెవులు)–త్వక్ (చర్మము)–చక్షుః (కళ్ళు)–జిహ్వా (నాలుక)–ఘ్రాణ (ముక్కులు) వాక్ (నోరు) – పాద (కాళ్ళు)–పాణి (చేతులు)–పాయువు (గుదము)–ఉపస్థ (గుహ్యము)–అనబడే)– 10 ఇంద్రియ పరిచ్ఛేదములు కలిగి ఉన్నట్టిది.

**షట్(6) ఆధారఅపవరకమ్ :** – (మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞా – అనబడే) '6' ఆధారములు కలిగి ఉన్నట్టిది.

**షట్ అన్వయ మహావనమ్ :** 6 అన్వయములు కలిగి ఉన్నట్టిది (దృశ్యము –దేహము – ఇంద్రియములు – మనస్సు – బుద్ధి–చిత్తము) (పంచభూతత్వములు + మనస్సు)

(అన్నమయ–ప్రాణమయ–మనోమయ–విజ్ఞానమయ–ఆనందమయకోశములు + జీవాత్మ) – ఈవిధములై '6' సంచార విశేషములు కలిగియున్న **మహావనము.**

**చతుఃపీఠ సమాకీర్ణం :** '4' పీఠములు కలిగియున్నట్టిది (స్థూల–సూక్ష్మ–కారణ–మహాకారణ. దేహములు) (మనో–బుద్ధి – చిత్త–అహంకారములు).

**చతుః ఆమ్నాయ దీపకమ్ :** నాలుగు వేద వాక్కులతో దీపించునది. (సోఽహమ్; తత్త్వమ్; త్వమేవాఽహమ్; అయమాత్మా బ్రహ్మ), ఋక్కులు, మంత్రములు, స్తోత్రములు, ఉపాసనలతో ప్రకాశించునది.

**బిందునాదమహాలింగమ్ :** – దృశ్యము – దేహము – దేహసాక్షి

– బిందువు–నాదము –మహాలింగము (pin point-sound-Absolute SELF) ఇవన్నీ కలిగి ఉన్నట్టిది.

**శివ–శక్తి నికేతనమ్ :** ఈ దేహమే శివ–శక్తులకు, (పురుష–ప్రకృతులకు; (I & my) – వేంచేసియున్న గృహము.

**శ్లో॥ దేహం శివాలయం (దేవాలయం) ప్రోక్తం, సిద్ధిదం సర్వదేహినామ్।**

సర్వ దేహుల యొక్క దేహము జీవన్ముక్తత్వము (లేక) మోక్షత్వము (లేక) విదేహముక్తత్వములను – సిద్ధింపజేయగలిగినదే. కాబట్టి ఈ దేహమే దేవాలయము. బాహ్య–అభ్యంతరములన్నీ, (దృశ్య దేహ మనో బుద్ధి చిత్త అహంకారములతో సహా) – **"దేవాలయ ప్రాంగణములు"**. ఈ దేహములోని **'దేహి'**యో?, దేహ దేవాలయములో వేంచేసియున్న **'దైవము'** (లేక) **'పరబ్రహ్మము'** (లేక) **'పరమాత్మ'**.

## కుండలినీ శక్తి

(1) **మూలాధార చక్రము:** ఈ శరీరములో "గుదము – మేఢ్రము (మేహనము, మూత్రవిసర్జనావయము)ల మధ్య అంతరమున (In the inner recess) △ త్రికోణాకారముగా **'మూలాధారచక్రము'** ప్రతిక్షేపించినదై ఉన్నది.

**ఈ మూలాధారచక్ర స్థానములో శివుడే జీవుడై వెలయుచున్నాడు** – అని తత్త్వజ్ఞులచే సవివరించబడుచున్నది. అటువంటి మూలాధారమునందు (మూలాకాశములో) **'కుండలిని'** అని పిలువబడే మహత్తరమగు మహాశక్తి (లేక) ప్రకృతి శక్తి స్వరూపిణి వేంచేసియున్నది. ఇది ఇచ్ఛా–జ్ఞాన–క్రియా శక్తి రూప **దేవీపీఠము.** దివ్యమగు **ప్రజ్ఞానంద స్వరూపశక్తి స్వరూపిణీ దేవి.**

## కుండలినీ దేవి

- **ఏ మహత్తర శక్తి నుండి** వాయువు సంచలన శక్తిని పొందినదై విశ్వమంతా ప్రసరణము కలిగియున్నదో.., **యస్మాత్ ఉత్పద్యతే వాయుః..,**
- **ఏ మహాదేవి నుండి** అగ్ని - ఉష్ణరూపమును పొందినదై శరీరములలో సంచరించుచూ, విశ్వమునందు దహనశక్తిని ప్రదర్శించుచూ, యజ్ఞమునందు సమర్పించు హవనములను దేవతలకు జేర్చు క్రియావిశేషము ప్రదర్శించుచున్నదో, - **యస్మాత్ వహ్నిః ప్రవర్తతే...,**
- ఏ మహాదేవీ వైభవమునుండి నాదము ఉత్పన్నమగుచున్నదో (The origin where sound is generating)-**యస్మాత్ నాదః ప్రవర్తతే..,**
- ఏ ఆదిదేవి నుండి **'నేను -నేను ఉన్నాను'** (Yes! I Exist) అను రూపము గల 'హంసో-సోఽహమ్' బయల్వెడలి ప్రవర్తన శీలమగుచున్నదో, **యస్మాత్ ఉత్పద్యతే హంసో,**
- "ఆలోచన"- ఎచ్చోట నుండి ఉత్పన్నమగుచున్నదో, ఏది మనస్సుకు జనన స్థానమగుచున్నదో.., **యస్మాత్ ఉత్పద్యతే మనః, తదేవ తత్ కామరూపాఖ్యం, పీఠం కామ ఫలప్రదమ్।** అదియే మూలాధావములో వేంచేసినదైయున్న **కామరూపాఖ్యపీఠం.** ఈ జగత్ వ్యవహారమంతా అద్దాని దృష్టాదృష్ట లీలయే! అది కామఫలప్రదమైయున్నది. అద్దాని ఇచ్ఛారూపమే ఈ జగత్తు. కనుక జగత్తు కామపీఠము-అనబడుతోంది. అదియే **కుండలినీశక్తి. కామేశ్వరీ స్థానము।**

**(2). స్వాధిష్ఠాన చక్రము :** ఇది లింగమూలమున స్థానము కలిగియున్నది. ఇది ⬡ '6' (షట్) కోణాకరమైయున్నది. **స్వాధిష్ఠానాహ్వయం చక్రం లింగమూలే షడశ్రకే।**

**(3). మణిపూరకచక్రము :** ◯ బొడ్డుచుట్టూ 10 రేకుల చక్రము వలె ప్రవర్తనమానమగుచున్నది. **నాభిదేశే స్థితం చక్రం దశారం మణిపూరకమ్॥**

**(4). అనాహత చక్రము :** హృదయభాగంగా సంస్థితమైయున్నది. 12 రేకుల ◯ మహాచక్రము. ఓ కమల సంభవా! దీనిని **'పూర్ణగిరి'** పీఠము - అని కూడా అంటారు. యోగులకు అనాహతముతో **"స్వయం సంపూర్ణత్వము"** - స్వానుభవమగుచున్నది. **ద్వాదశారం మహాచక్రం హృదయే చ అపి అనాహతమ్। తదే తత్ పూర్ణగిర్యాఖ్యమ్ పీఠమ్।**

**(5). విశుద్ధ చక్రము :** కంఠకూపస్థానములో ◯ షోడశ రేకులు కలిగియున్నట్టిది. ఓ సురేశ్వరా! అద్దానియందు **'జాలంధరపీఠము'** అనుపేరుతో ప్రసిద్ధము. రసతత్త్వము ప్రక్షిప్తమైయున్న స్థానము. **కంఠకూపే విశుద్ధాఖ్యం యత్ చక్రం షోడశాశ్రకమ్। పీఠం 'జాలంధరం' నామ తిష్ఠతి అత్ర॥**

**(6) ఆజ్ఞాచక్రము :** ఇది భ్రూమధ్యగా ఉన్నట్టిది. రెండు దళములు కలిగి ఉన్నట్టిది. ఉత్తమ స్థానము. **ఆజ్ఞా నామ భ్రువోర్మధ్యే ద్విదళన్ చక్రమ్ ఉత్తమమ్।**

**ఉద్యాణ మహాపీఠము :** ఇది ఆజ్ఞాచక్రమునకు ఉపరితలముగా (పైనగా) నుదురు నందు ఉన్నట్టిది. **ఉద్యాణాఖ్యం మహాపీఠమ్ ఉపరిష్ఠాత్ ప్రతిష్ఠితమ్।**

## పంచభూతములు - అధిదేవతలు

| | | |
|---|---|---|
| **ధరణి (భూ)** | : | చతురస్రాకారం. అధి దేవత → బ్రహ్మ. ▭ **చతురశ్రం ధరణి ఆదౌ। 'బ్రహ్మ' - తత్ర అధిదేవతా।** |
| **జలము** | : | అర్ధచంద్రాకృతి గలది అధిదేవత → విష్ణువు. ◡ **అర్ధచంద్రాకృతి జలం। విష్ణుః, తస్య అధిదేవతా।** |
| **వహ్ని (అగ్ని)** | : | త్రికోణ మండలము. అధి దేవత → రుద్రుడు. △ **త్రికోణ మండలం 'వహ్నీ'। రుద్రః తస్య అధిదేవతా।** |
| **వాయువు** | : | షట్ (6) కోణముల బింబాకారము. అధి దేవత → ఈశ్వరుడు. ⬡ **వాయోః బింబస్తు షట్కోణమ్। ఈశ్వరో అస్య అధిదేవతా।** |
| **ఆకాశమండలము** | : | వృత్తాకారము.. దేవత → సదాశివుడు. ◯ **ఆకాశమండలం వృత్తం। దేవతా అస్య సదాశివః।** |
| **మనో మండలము** | : | భ్రూమధ్యగా గల నాదరూపము. నాదమునకు, ఆలోచనలకు ఉత్పత్తి స్థానము. **నాదరూపం భ్రువోర్మధ్యే మనసో మండలం విదుః।** |

ఇతి ప్రథమోధ్యాయః

# 2వ అధ్యాయము

## "ఖేచరీ సమత్వయోగము" - "స్థూల-సూక్ష్మ-పరములు"

**బ్రహ్మదేవుడు / హిరణ్యగర్భుడు :** హేశంకర భగవాన్! దేనిని తెలుసుకొన్నంత మాత్రంచేతనే **'ఖేచరీ సమత్వము'** యోగికి సిద్ధిస్తూ ఉండగలదో, అట్టి యోగమహత్యము గురించి ఇంకా కొంత తెలుసుకోవాలని ఇచ్ఛగిస్తున్నాను. దయతో వివరించ ప్రార్థన.

**శంకర భగవానుడు :** హే ప్రియ సృష్టిరచనా మహాప్రాజ్ఞా! హిరణ్యగర్భా! ఏది ప్రయత్నపూర్వకంగా గోప్యము (రహస్యము)గా ఉంచవలసినట్టిదో అట్టి అతి రహస్యమగు **"ఖేచరీ సమత్వ"** యోగము గురించి చెప్పుచున్నాను. వినండి.

**ఈ విద్య గుహ్యాత్ గుహ్యతమమ్!** రహస్యములలో కెల్ల అత్యంత రహస్యమైనది. రహస్యంగా ఉంచాలి. ఎవ్వడైతే 12 సంవత్సరాల కాలము నిర్దోషముగా **శుశ్రూష** చేసి, (శూశ్రూషాం అప్రమాదతః) ఇంద్రియ నియమములచే **దాంతుడై,** బ్రహ్మమును ఎరుగుట - ఆచరించుట - మమేకమగుటపట్ల పూర్తి శ్రద్ధగల **'బ్రహ్మచారి'** అగుచున్నాడో, **- తస్మై వాచ్యం యథాతథ్యం।** - అట్టి వానికే యథాతథంగా ఈ ఖేచరీసమత్వయోగమును బోధించటము ఉచితము. అంతేగాని, పాండిత్య ప్రదర్శనము కొరకో, 'ధనము లభిస్తుంది కదా' - అనో, ధనలోభం చేతనో, ఒకడి యొక్క ధన-బల-పదవీ సంపదలకు భయపడియో, ఆశ్చర్యపడియో, ఈ విద్యను ప్రసాదించ (బోధించ)కూడదు. ఆ విధంగా తపో-శుశ్రూషు-బ్రహ్మతత్త్వ విద్యార్థిత్వ-మహదాశయములు గమనించకుండా.. ధన-కుల-అధికార-స్వపాండిత్య ప్రదర్శనల వంటి దృష్టులతో ఈ విద్యను బోధిస్తూ ఉంటే..

☞ ఆ చెప్పు గురువు విద్యను అనుష్ఠించినట్లూ కాదు.

☞ ఆ శిష్యుడు విద్యను పొంది విద్వాంసుడు విని, తెలుసుకొని కూడా, స్వానుభవముగా సిద్ధించుకోనూ లేదు.

## ఆత్మయోగము - ఆత్మతత్త్వము

ఈ ఖేచరీ సమత్వ రూపమగు **'యోగ-జ్ఞాన పూర్వక యోగవిద్య'** యొక్క మూలమంత్రము (లేక) మూలతత్త్వము ఎవడు గురువును శరణువేడి, గురుముఖతః నేర్చుకొంటాడో, ఆతడు మూలాధారము నుండి బయల్వెడలుచున్న 'శివ-శక్తి' తత్త్వమును, (మూలతత్త్వమును) ఎరిగిన వాడగుచున్నాడు. హే బ్రహ్మన్! అట్టి **మూలాధార-శివశక్తి సముత్థిత సమన్వయ మంత్రతత్త్వము**ను బోధించువక్త, తెలుసుకోవటానికి సిద్ధపడుశ్రోత కూడా దుర్లభమే! ఎక్కడోగాని ఉండరు.

మనం చెప్పుకొను మూలాధార విశేషము **"నాదలింగ- చిదాత్మక పీఠము"** అని కూడా పిలువబడుతోంది. అట్టి నాద లింగ-**మూలాధార మూలతత్త్వము, శివ-శక్తి ప్రకటిత స్థానము** (తత్త్వము) ఎరిగినంత మాత్రం చేత జీవులు జీవన్ముక్తులు కాగలరు. ఈ విద్య యొక్క **'తెలుసుకోవటము - ఉపాసన'**లచే ఆ యోగి **అణిమాది అష్టైశ్వర్యములు** పొందగలడు.

## మూలాధార మంత్ర - నాద - లింగ చిదాత్మక పీఠము

**మంత్రము :** హే బ్రహ్మన్! శివుడనగు నాయొక్క స్వరూప - తత్త్వములు మననము చేయుట కొరకై మంత్రము - మననాత్ త్రాయతే మంత్రము. పరమాత్మ యొక్క తాత్త్విక వైభవమును మననము చేయుటకే మంత్రము. మననమునకు మంత్రము ఉపకరణము. నేను మంత్రము నందు అధిష్ఠితుడనైయున్నాను. **మననాత్ త్రాణనాత్ చ ఏవ మత్ రూపస్య అవబోధనాత్, 'మంత్రమ్' - ఇతి ఉచ్యతే, బ్రహ్మన్! "మంత్రము నాయందు - నేను మంత్రము నందు"** ఉనికి కలిగి యున్నాము. **మత్ అధిష్ఠానతోపి వా!**

**మూలమంత్రము : మూలత్వాత్ సర్వమన్త్రాణాం, మూలాధార సముద్భవాత్, మూల స్వరూప లింగత్వాత్ - 'మూలమంత్ర' - ఇతి స్మృతః॥**

(1) సర్వ మంత్రములకు (మననములకు) ఆదిమూలము అయినట్టిది, జన్మ-కర్మలకు మునుముందే ఉన్న కేవలాత్మ సూచకము కాబట్టి,

(2) మూలాధారము నుండి జనించి బయల్వెడలునది కాబట్టి..,

***'మూల మంత్రము'*** అను పేరుతో ఆత్మయోగమును పిలుస్తున్నారు. **'మూలమంత్రము' అనునది సూచిస్తున్నది పరమాత్మనే।**

**లింగమ్** - నేను లింగ స్వరూపుడను. భక్తులు నన్ను లింగ స్వరూపముగా ఉపాసించుచూ, మూలతత్త్వమును చేరుచున్నారు.

**లింగము = సూక్ష్మత్వాత్, కారణత్వాచ్చ, లయనాత్ గమనాత్ అపి, లక్షణాత్ పరమేశస్య 'లింగమ్' ఇతి అభిధీయతే॥**

*లింగము **"కేవల-సహజస్వరూపము"** అయినట్టి పరమేశ్వర చిహ్నము.* పరమేశ్వరతత్త్వము అత్యంత సూక్ష్మమైనది. కారణములన్నిటికీ కారణమైనది (కారణకారణాత్) సర్వము బయల్వెడలి తిరిగి లయించేది కూడా. కాబట్టి, **అట్టి పరమేశ్వర లక్షణములను 'లింగము' అని పిలుస్తున్నారు.** ఈ విధంగా పరతత్త్వము - మంత్రరూపము, మూల మంత్రతత్త్వము లింగముగా సూచించబడుతోంది. **'లింగము' అని చెప్పబడుచున్నది, సూచించబడుచున్నది పరమాత్మనే!**

**సూత్రము : సన్నిధానాత్ సమస్తేషు జంతుషు అపి చ సంతతమ్, సూచకత్వాచ్చ రూపస్య 'సూత్రమ్' - ఇతి అభిధీయతే॥** ఇంకా, అట్టి పరబ్రహ్మతత్త్వము పూదండలో 'దారము'వలె సమస్త జీవుల హృదయములలో సర్వదా సన్నిధానము (Close placement) కలిగియున్నదై, సర్వత్రా వెలయునదై యుండుట చేతను, అద్దాని సూచకమే సర్వరూపము అఖండాత్మరూపము అయి ఉండుటచేతను, సర్వరూపాత్మకమై ఉండుటచేతను - పరతత్త్వమే **'సూత్రము'** - అను శబ్దముతో చెప్పబడుతోంది. **'సూత్రము' అను శబ్దార్థము సర్వాంతర్యామి యగు పరమాత్మయే!**

## బిందురూపేణ - పీఠరూపేణ

ఆధారశక్తి-మూలాధారమునందు బిందురూపంగా సంస్థితమై ప్రకృతిగా, మహామాయగా (Mesmerism), మహాలక్ష్మిగా (Knowledge), మహాదేవిగా (Divinity), సరస్వతీదేవిగా (will) ఉపాసించబడుచున్నది. **సూక్ష్మకాంతిచే బిందురూపము.** పీఠరూపంగా నర్తిస్తున్న శక్తి తత్త్వమే **'పీఠము'** అను శబ్దముగా చెప్పుకోబడి, ఉపాసించబడుతోంది.

**నాద లింగము: బిన్దుపీఠమ్ వినిర్భిద్య నాదలింగమ్ ఉపస్థితమ్॥** 'బిందు' అను పీఠమును ఛేదించుచూ నాదలింగము (The Expression of sound at its root) ఉపస్థితము (Wel -placed) అయి, సంప్రదర్శన శీలమై ఉంటున్నది. అట్టి నాదలింగము - షణ్ముఖములు (షట్‌చక్రములు) కలిగియుండి, ప్రాణస్వరూపముగా ఉచ్చారణ కలిగియున్నది.

నాదము యొక్క ఉచ్చారణయే → ప్రాణము!

నాదమునకు జనన స్థానము → ఆత్మాకాశము॥



**బ్రహ్మభగవానుడు :** హే జగదీశ్వరా! ఈ జీవునికి ఈతని కేవలాత్మ స్వస్వరూపము ప్రకాశమానమయ్యేది ఎట్లా? ఏ తీరుగా?

**శివభగవానుడు:** గురూపదేశమార్గంలోనే ఆత్మ ప్రకాశమానము కాగలదు. అట్టి స్వస్వరూప-సర్వస్వరూప అఖండబ్రహ్మము త్రివిధములైన (3) సంప్రదర్శనములు కలిగియున్నది.

**(1) స్థూలము (2) సూక్ష్మము (3) పరము**

**(1) స్థూలము :** పంచబ్రహ్మమయము (పంచభూతమయము) అయి, స్థూలముగా విరాజమానమైయున్నట్టిది. **"వైరాజము"** అని కూడా అంటారు. (All that being manifested physically).

**(2) సూక్ష్మము : భావనారూపము.** జాగ్రత్ - స్వప్న - సుషుప్తులనబడే **'3' బీజములు కలిగి యున్నట్టిది. బీజత్రయాత్మకము. హిరణ్యగర్భము** (సృష్టి సంపత్తి రూపము).

(1) **హిరణ్యగర్భము**-సృష్టి భావన॥
(2) **నాదము** - శబ్దరూపము - శబ్ద భావన॥
(3) **బీజము** - సర్వసృష్టిలకు బీజరూపమైనది - బీజభావన॥
(4) త్రిగుణముల రూపము.
(5) కల్పనా పురుషరూపము.
(6) "భావనా - అనుభూతి - జ్ఞప్తి"ల రూపము.

**(3) పరమ్ :** సర్వభావములకు, ఆవల **భావించువాని రూపము.** నాదములకు ఆవల **నాదములు-వినువాని రూపము.** సర్వబీజములకు ఆవల **కేవలసాక్షి.** అదియే పరాకాష్ఠ. అదియే **ఈ జీవుని వాస్తవ-సహజ స్వస్వరూపము.** అద్దాని విశేషములు వినండి.

## పరరూప లక్షణములు

**పరమ్ బ్రహ్మ :** అట్టి తత్త్వము సర్వమునకు పరమై, సర్వము తనకు అభిన్నమై, సర్వమునందు వేంచేసినదై యున్నది. కాబట్టి పరమ్ బ్రహ్మ! ఈ జీవునికి సంబంధించిన పరాకాష్ఠ రూపముకాబట్టి 'బ్రహ్మము'.

**పరమ్ సత్యమ్ :** తదితరమైనదంతా సాపేక్షసత్యము మాత్రమే (Relatively true). ఆత్మఒక్కటే పరమసత్యము. (Absolutely true). అట్టి పరము సర్వదా **"సహజము"** అయి ఉండగా, తదితరమైనదంతా **"సదర్భమాత్రము"**.

**సత్ చిత్ ఆనంద లక్షణమ్ :** అట్టి పరస్వరూపమగు **ఆత్మ, ఉనికి, ఎరుక, అనుభూతి** అను త్రిలక్షణములు కలిగియున్నట్టిది.

**అప్రమేయము :** దృశ్య-దేహ-మనో-బుద్ధి-చిత్త-అహంకార-జాగ్రత్-స్వప్న-సుషుప్తి మొదలైన వాటితో సంబంధమే లేనిది. "ఈ ఆభరణము నాదా? నీదా? ఎప్పుడు ఎవరి దగ్గర ఎట్లా కొన్నాము?".... మొదలైనవాటిలో బంగారు లోహమునకు ఏ సంబంధమూ లేదుకదా! ఆత్మకు (పరస్వరూపమునకు) సంగతి, సందర్భము సంఘటనలకు సంబంధించినదేదీ చెందినదై ఉండనే లేదు.

**అనిర్దేశ్యమ్ :** ఆత్మ పైన చెప్పిన దేనితోనూ పోల్చి, నిర్దేశ్యించి చెప్పబడజాలనిది. అద్దానిని నిర్దేశించునది మరొకటేదీ లేదు. **"పర స్వరూపమనగా ఇది మాత్రమే"** – అని ముగించి చెప్పజాలము. క్రోడీకరించలేము కూడా।

**అవాక్-మానస గోచరం :** వాక్కుకు (మాటలకు), మనస్సుకు (విషయమువలె ఆలోచనలకు) లభించునది కాదు. ఆలోచనలకు మునుముందే ఉండి ఆలోచనలకు జననస్థానమై యున్నట్టిది. బుద్ధిచే మాత్రమే గ్రహించబడేది. వాక్ – మనస్సులు ఎద్దానికి చెందినవో – అదియే 'ఆత్మ'. అదియే బ్రహ్మము. అదియే పరస్వరూపము..అదియే పరమాత్మ.

**శుద్ధమ్ :** మనోబుద్ధి చిత్త అహంకారముల దోషము ఆత్మకు అంటవు. ఒక స్థలములోని ఆయా వస్తు దోషములు ఆకాశమును (space) అంటవు కదా? **ఆత్మ నిత్య నిర్మలము. సర్వదా శుద్ధము.**

**సూక్ష్మమ్ :** ఆత్మ → ఆకాశము కంటే కూడా సూక్ష్మాతిసూక్ష్మము.

**నిరాకారమ్ :** సర్వ ఆకారములు అద్దానివే! అందుచేత ఆకారముచే పరిమితము కాదు. నిరాకారము. దేహమునకు ఆకారమున్నది దేహికి ఆకారమేమున్నది? నిరాకరమైనది కాబట్టి అపరిమితమై ఉంటుంది.

**నిర్వికారమ్ :** బుద్ధికి విమర్శనా వికారములు, చిత్తమునకు ఇష్టా-అయిష్ట వికారములు, మనస్సుకు రాజసిక- తామసిక ఆలోచనలు-మొదలైన ఆయా వికారములు ఉండవచ్చునుగాక। **ఆత్మకు ఎటువంటి వికారములు ఉండవు.** నాటకంలో పాత్రకు సంబంధించిన వికారములు నటునికి అంటవు కదా! రచయితకు చెందినవి కావు. దర్శకునివి కావు. ప్రేక్షకులకు ఆపాదించలేము. ఆత్మ ఈ సర్వ దేహములలో నాటకదీపము వంటిది. అసలే అంటవు.

**నిరంజనమ్ :** దృష్టి దోషములచే స్పృశించబడదు. వస్తు దోషము సూర్యకాంతికి అంటదు కదా।

**అనన్తము :** ఆత్మకు అది-అంతములు లేవు. దేహములచే, లోకములచే అన్తము పొందదు. (Infinite).

**అపరిచ్ఛేద్యమ్ :** నీవు – నేను – ద్రష్ట – దృశ్యము – దృక్ – జీవుడు – శివుడు → ఇత్యాదులుగా ఆత్మ ఏ క్షణంలోనూ **'పరిచ్ఛేదన'** పొందటమే లేదు.

**అనుపమమ్:** ఆత్మ యొక్క అనుభవమును ఒకడు మరొకరికి అందించటానికి ఏ **ఉపమానము** లేదు. చాలదు. ఆత్మకు ఉపమానమే లేదు. అయితే శాస్త్రములు ఉపమానముల సహాయముతో 'సూచన' అందిస్తున్నాయి.

**అనామయమ్ :** ఆత్మయందు ఆత్మకు అన్యమైనది ఎప్పుడూలేదు. ఎక్కడాలేదు.

హే బ్రహ్మ భగవాన్! **ఆత్మమంత్ర సదాభ్యాసాత్ పరతత్త్వం ప్రకాశతే!** అటువంటి లక్షణములతో విలక్షణమైయున్న **'ఆత్మమంత్రము'** యొక్క **సదా – అభ్యాసము చేతనే ఆత్మతత్త్వము** బుద్ధికి ప్రకాశమానమగుచున్నది.

## ఆత్మసిద్ధి ద్వారములు

**బ్రహ్మ దేవుడు :** పరమేశ్వరా! పరతత్త్వమునకు అభివ్యక్త చిహ్నములు (Indicative exhibitions of Al-present self) - అయినట్టి 'సిద్ధి'కి ద్వారములు (Entrance Door - openers) ఏమిటేమిటో వివరించమని వేడుకొంటున్నాడు.

**శ్రీ శివభగవానుడు :** హే బ్రహ్మభగవాన్! చెప్పుచున్నాను. వినండి. **ఉపాయము యోగాభ్యాసమే.** అట్టి యోగ ఏకాగ్రత పెంపొందుచుండగా,

**శ్లో॥ దీపజ్వాల ఇన్దు ఖద్యోత విద్యుత్ నక్షత్ర భాస్వరాః**
**దృశ్యంతే సూక్ష్మరూపేణ సదా యుక్తస్య యోగినః॥**

(1) ద్వీపజాల (2) చంద్రుడు (3) ఖద్యోతము (మిణుగుడు పురుగు యొక్క మెఱుపులు) (4) విద్యుత్తు (5) నక్షత్ర కాంతులు – ఇవన్నీ కూడా సదా యోగయుక్తుడైన (యోగాభ్యాసముచేయు) యోగికి కనిపిస్తూ ఉంటాయి. క్రమంగా ఆయోగికి అణిమ మొదలైన (అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ఈశిత్వ, వశిత్వ, ప్రాకామ్య, ఇచ్ఛా) అష్టసిద్ధులు, అష్ట ఐశ్వర్యములు, మహిమలు – ఇవన్నీ – **అచిరాత్ తస్య జాయతే** – ఆతని యందు ప్రవేశించసాగుతాయి.

**(1)** **నాస్తి నాదాత్ పరోమంత్రో** : →'నాదము' (ఓం శబ్దము; యోగాభ్యాసంలో రెండు చెవులు చూపుదు వ్రేళ్ళతో మూసుకున్నప్పుడు లోపలి ఉండి వినబడు శబ్దము)నకు మించిన మంత్రము ఎక్కడా లేదు. **'నాదము' జనిస్తున్న స్థానమును ఉపాసించు చుండటమును "నాదయోగోపాసన" – అనుచున్నారు.** నాదము జనిస్తున్నది 'బిందురూపము'గా వర్ణించబడు ఆత్మయందే.

**(2)** **న దేవః స్వాత్మనః పరః** → స్వకీయమగు "కేవల, పర ఆత్మ".. కు (కేవల స్వస్వరూపమునకు) మించిన దేవుడు వేరే ఎక్కడా లేడు. స్వస్వరూపాత్మయే బ్రహ్మ, విష్ణువు, శివుడు.. మొదలైన సర్వదేవతల 'సహజము – వాస్తవము – శాశ్వతము – అఖండము' అగు అసలైన రూపము. "స్వస్వరూపాత్మయే సర్వుల ఆత్మ స్వరూపము కూడా"– అనునదే **నిజమైన ఆత్మదేవోపాసన.**

**(3)** **న అనుసంధే పరః పూజా** →(అఖండము, సర్వము, అప్రమేయము, నిత్యము అగు) ఆత్మతో అనుసంధానమునకు మించిన పూజ మరింకేదీ లేదు. ఈ జగత్తులో 'నీవు'గా తదితర సమస్త దృశ్యముగా కనిపించేదంతా ఆత్మతో ఏకముచేయు 'పూజ' కంటే గొప్పది కాదు. 'వ్యష్టిత్వము'ను పాము కుబుసమువలె త్యజించి – "సమిష్టికి ఆవలగల కేవలమే నేను" తో మమేకమవటమే **"త్యాగేనైవతు కైవల్యమ్"** యొక్క గూడార్థము.

**(4)** **నహి తృప్తేః పర సుఖమ్** → తృప్తికి మించిన సుఖము లేదు.

**గోపనీయం ప్రయత్నేన సర్వదా సిద్ధమ్ ఇచ్ఛతా।** సిద్ధిని కోరుకొనువాడు పై నాలుగు సూత్రములను సర్వదా రహస్యముగాను, అత్యంత ఇష్టముగాను (ఇచ్ఛాపూర్వకంగా) సర్వదా అనుష్ఠిస్తూ – దాచుకొని ఉండును గాక!

ఓ హిరణ్యగర్భ మహాశయా! 'తత్ త్వమ్' అనునదే గురు వాక్యసారము అయి ఉన్నది.

**మద్భక్త ఏతత్ విజ్ఞాయ కృతకృత్యః సుఖీభవేత్।** ఎవ్వడైతే నాకు భక్తుడై పై విషయములను తెలుసుకొని ఉంటాడో, అట్టివాడు కృతకృత్యుడు, సుఖి అవగలడు. ఎవ్వరైతే....,

- దేవుని యందు ఎంత భక్తి కలదో,
- అంతటి భక్తిని ఆత్మయొక్క స్వాభావిక – ఔన్నత్యమును విశదపరస్తున్న **సత్–గురువు** నందు కలిగి ఉంటాడో... అట్టివాడు **"ఆత్మ స్వాభావికత్వము"** అనే మహార్థమును తప్పక సిద్ధించుకోగలడు. అట్టి జీవుడు దేహాత్మత్వము, వ్యష్టాత్మత్వములను అధిగమించి, సర్వాత్మకుడై 'మహాత్మత్వము' పునికిపుచ్చుకొనుచున్నాడు.

అట్టి వాని హృదయమునందు యోగాభ్యాసముచే అతి త్వరగా **(1) నాస్తి నాదాత్ పరోమన్త్రో (2) న దేవః స్వాత్మనః పరః (3) న అనుసంధే పరా పూజా (4) నహి తృప్తేః పరం సుఖమ్** – అను నాలుగు వాక్యముల ఆత్యంతికార్థము స్వయముగా సహజమై, అనునిత్యమై ప్రకాశించగలదు. ఆ మహాత్మునియందు

- (i) ఈ సర్వము ఉన్నది నాయందే।
- (ii) ఈ సర్వము నందు ఉన్నది నేనే।
- (iii) ఈ సర్వముగా ఉన్నది నేనే।
- (iv) 'అహమ్ (నేను)'గా ఉన్నది త్వమేవ। నీవే 'నేను'గా కూడా ఉన్నావు.
- (v) సమస్తము సర్వదా బ్రహ్మమే। – నేను – నీవు ఇత్యాది సమస్తము సర్వదా 'అఖండ బ్రహ్మమే'

అను పంచ పూరెక్కలు గల జ్ఞాన–విజ్ఞాన పుష్పము **ఇప్పుడే, ఇక్కడే స్వీయ హృదయాకాశమునందు** వికసించగలదు.

ఇదియే ఉపనిషత్ పరాకాష్ఠసారము.

# 3వ అధ్యాయము - పరా - పశ్యంతీ - మధ్యమా - వైఖరీ

ఏ యోగాభ్యాసమైతే **"ఆత్మమేవాఽహమ్, సోఽహమ్, తత్ త్వమ్"** అను అఖండాత్మ భావన సిద్ధించటానికి కారణమో, ఆ యోగమునకే **'చిత్'** అని మరొక పేరుగా కూడా చెప్పబడుతోంది. ఏది ఎరుగటచే ('చిత్ స్వాభావి' అగు) (లేక) (విజ్ఞానమాత్రము అగు) - ఈ జీవుడు **"నాకు మొదలే జన్మలు లేవు"...** అను అనుభవముచే జన్మబంధముల నుండి విముక్తుడగుచున్నాడో, - అదియే యోగము. **'యోగమ్' అస్య 'చిత్' ఆఖ్యాతం, యత్ సిద్ధీనాం చ కారణమ్। "ఎరుగబడేదంతా ద్రష్టయొక్క ఎరుక స్వరూపమే"** - అని ఎరిగి ఉండటమే 'సిద్ధి'కి కారణము.

## శబ్ద బ్రహ్మము

ఏ అక్షరము, పరము అగు బ్రహ్మము గురించి శబ్దములు, అర్థములు చెప్పబడుచున్నాయో, వినబడుచున్నాయో, ఏది ఎరిగినంత మాత్రం చేత ఈ జీవుడు జన్మబంధముల నుండి విడివడగలడో, అదియే **'శబ్దబ్రహ్మము'**గా చెప్పబడుతోంది.

## పర-బిందు-నాదోపాసన

**మూలాధారగతాః శక్తిః స్వాధారా బిందురూపిణీ।** ఆత్మయే ఆధారముగా కలిగియుండి, ఆత్మ నుండి బయల్వెడలుచూ ఆత్మకు వేరుకానిదే మూలాధారశక్తి. ఈ విశ్వమంతా తన ప్రదర్శనముగా కలిగియున్న **'ఆదిశక్తి'** (లేక) **'మూలశక్తి'** ఈ జీవుని దేహములో మూలాధార స్థానమునందు తనకు తానే ఆధారమై బిందు (●) రూపముగా వేంచేసియున్నది. ఒక సూక్ష్మమగు బీజమునుండి అంకురము బయల్వెడలువిధంగా ఆ **మూలాధారగతమై స్వాధారమై బిందురూపిణియై యున్న - మూలశక్తి** నుండి **'నాదము'** ఉత్పన్నమగుచున్నది. **తస్యాం ఉత్పద్యతే నాదః సూక్ష్మబీజా దివఅంకురః।** ఏ సూక్ష్మాతి సూక్ష్మ స్థానము నుండి భావన, భావన నుండి నాదము, నాదము నుండి శబ్దము బయల్వెడలుచున్నాయో - అద్దాని గమనికయే నాద-బిందోపాసన. ఆత్మ, మూలాధారశక్తి, నాదము - అన్యము, ఏకమేగాని వేరు వేరు కాదు. ఇదియే "పర" అనబడుతోంది.

## పశ్యంతీ

అట్టి అఖండ **'మూలాధారగత శక్తి'**గా ఈ విశ్వమును యోగులు **సర్వదా సందర్శిస్తున్నారు.** అనగా, ఈ విశ్వమంతా ఏకమగు శక్తి యొక్క దివ్యలీలా ప్రదర్శనమే! ఏ విజ్ఞానముచే ఈ విశ్వమంతా ఏకము-అఖండము అగు మూలశక్తికి అభిన్నంగా చూస్తున్నారో, అద్దానినే బ్రహ్మవిదులు- **'పశ్యంతి'** అను శబ్దముతో పిలుస్తున్నారు. **తాం పశ్యన్తీం విదుః విశ్వమ్ యయా పశ్యన్తి యోగినః।** యోగులకు ఈ కనబడేదంతా **స్వస్వరూపాత్మకు అభిన్నము.** ఎందుకంటే - **"స్వస్వరూపముగా వేంచేసినదై ఉన్నది - అట్టి మూలాధార శక్తియే"** - అనునది యోగులకు స్వాభావిక స్వానుభవము. **సమస్తము నేనైన నేనే (మరియు) సమస్తము నీవైన నీవే ఇదంతా!"** - అనునదే తత్త్వదర్శులు సిద్ధించుకొని ఉంటున్న ఆత్మసాక్షాత్కారము.

## మధ్యమా

**హృదయే వ్యజ్యతే - ఘోషో, గర్జ పర్జన్య సన్నిభః, తత్ర స్థితా సురేశానః మధ్యమ' ఇత్యభిదీయతే।** ఓ సుర నాయకా! బ్రహ్మ భగవాన్! హృదయము నుండి వర్షము పడుచున్నప్పటి 'ఘోష'వలె గర్జనఘోష ప్రదర్శనమగుచున్నది. అట్టి హృదయము నుండి ఏ వర్షశబ్దము వినబడుచున్నదో, అద్దానిని 'మధ్యమ' అని అంటారు. 'మధ్యమా' అను పేరుతో చెప్పబడు ఘోష శబ్దము - ప్రాణశక్తియొక్క దేహములో సంచారములే. అవి 'స్వరము' రూపముగా దేహములో జనిస్తున్నాయి. (రెండు చెవులు మూసుకొన్నప్పుడు వినబడగలదు).

## వైఖరీ

**ప్రాణేన చ స్వరాఖ్యేన ప్రథితా వైఖరీ పునః। శాఖాపల్లవ రూపేణ తాల్వాది (తాలు -ఆది) స్థాన ఘట్టనాత్। మూలాధార శక్తి ప్రాణశక్తిత్వము ద్వారా స్వరమును ప్రదర్శించటమును 'వైఖరీ' అంటున్నారు.** అటువంటి వైఖరీ శబ్దతత్త్వము తాలు (దవడ) యందు ప్రవేశించి వృక్ష శాఖ-ఉపశాఖల వలె అనేక శబ్దములు పలుకుచూ, శబ్దత్వము ప్రదర్శిస్తోంది. దవడ ప్రదేశములో ఒత్తిడి (Touch-pressure)ని (తన యొక్క ప్రాణ విన్యాసరూపముచే) కలిగించుచున్నది. అట్టి ఘట్టణ నుండి 'అ'కారముతో ప్రారంభమై 'క్ష'కారము వరకు శబ్దములు జనిస్తున్నాయి. ఆ శబ్దములే సశాస్త్రీయమై (అ నుండి క్ష వరకు) అక్షరములుగా అగుచున్నాయి.

→ **అక్షరము**ల నుండి **శబ్దము**లు,

→ శబ్దముల నుండి **పదము**లు,

→ పదముల నుండి **వాక్యము**లు,

.... ఇవన్నీ ఆత్మ యొక్క బుద్ధి (అవగాహన) శక్తిచే విస్తరించబడుచున్నాయి.

⌘ ఆ వాక్యముల నుండి **వాక్యాత్మకమగు మంత్రములు** బయల్వెడలుచున్నాయి. అవియే **ఋక్కులు** –

⌘ **వాక్ → మననము → ఉచ్చారణ – శబ్దము – మంత్రముల** నుండి **సర్వ వేదములు, సర్వ శాస్త్రములు, పురాణములు, కావ్యములు, వివిధ భాషలు, 'స-రి-గ-మ-ప-ద-ని'** అనబడు సప్తస్వరములు, **అనేక భావనలు** ప్రదర్శితములగు చున్నాయి. 'మోహన-గాంధారి-కల్యాణి' మొదలైన **– అనేక రాగ విన్యాసములు – ఏర్పడుచున్నాయి.**

**సర్వే నాద సముద్భవాః।** ఇవన్నీ కూడా – ఆత్మచే ఆక్రమించబడి, ఆత్మకు అభిన్నమైయున్నాయి. హృదయము నుండి బయల్వెడలిన 'నాదము' ప్రాణశక్తి సమన్వితమై – ప్రదర్శనమగుచున్నది. ఎక్కడి నుండి నాదము బయల్వెడలుచున్నదో, అదియే సరస్వతీ దేవీ స్థానమగు ఆత్మ! **నాదాత్మనీ సరస్వతీ। సత్ రసవతీ – ఇతి సరస్వతీ।**

## "సత్-రస-వతీ-దేవి!" = "సరస్వతీ"

***సదాత్మ నుండి నాదము రసస్వరూపంగా బయల్వెడలి తాలు స్థాన ఆకాశంలో ప్రవేశించి, తాలు స్థానమును ఉత్తేజపరచి, మధ్యమా-వైఖరీ నాదరూపములను సంతరించుకొని – వేద-పురాణ, శాస్త్ర.... ఇత్యాది బహుభాషాయుక్త విశేషమై ప్రదర్శనమగుచున్నది – ఇతి పునశ్చరణ.***

అటువంటి సత్ (స్వ) **రతీదేవి** యగు సరస్వతీ దేవి – **సత్ స్వరూపిణియై, స్వరస్వరూపిణియై, రతీ (జగత్తుగా రతించు) స్వరూపిణియై, దేవీస్వరూపిణియై** – సర్వ భూతముల (జీవుల) హృదయ గుహలో చైతన్య స్ఫూర్తిగా ఆశ్రయించి ఉన్నది. నోరు, దవడ,, హృదయములలో ప్రదర్శనమై యున్నది. నెమ్మది నెమ్మదిగా వాయు-అగ్నిలతో కూడుకొని ప్రేరణ శక్తి (Inspiring Energy)గా ప్రకాశించుచున్నది. మూలాధారంలో కుండలినీ శక్తిగా, హృదయంలో జగత్ కల్పనాశక్తిగా, శిరస్సులో మాయాశక్తిగా ప్రవర్తించుచూ, **బిందు – నాద – ఉచ్చారణ-అక్షర-శబ్ద-వాక్య-మంత్ర-వేదవాఙ్మయ-వేదాంత వాఙ్మయ-అనేక భాషా భావా స్వరూపిణియై విరాజిల్లుచున్నది.** ఆ దేవి యొక్క **వివర్తిత్వమే 'పద-వాక్య'..** ఇత్యాదిగా, సదా వాక్‌రూపిణిగా సంప్రదర్శితమౌతోంది.

అట్టి వైఖరీశక్తిని ఏ యోగి అయితే **"స్వీయ-ఆత్మయందే, ఆత్మకు అభిన్నంగా"** దర్శిస్తూ ఉంటాడో, అట్టివాడు

⌘ సరస్వతీ ప్రసాదముచే స్వవాక్ సిద్ధిని పొందుచున్నాడు.

⌘ వేద- శాస్త్ర – పురాణములను వాక్‌శుద్ధితో అంతరార్థములను గ్రహించగలడు. జగత్‌దృశ్యమును స్వయంకర్త అయి ఎరుగ గలడు.

## "క్షర- అక్షరాతీత అనక్షరీ- అక్షరీ దేవి

హే బ్రహ్మన్! ఆత్మయొక్క ఔన్నత్యము ఎట్టిదో ఇంకా మరికొంత వినండి.

⌘ **యత్ర బిన్దుశ్చ, నాదశ్చ సోమసూర్యాగ్ని వాయవః ఇంద్రియాణి చ సర్వాణి లయం గచ్ఛన్తి।** ఎక్కడైతే **బిందువు, నాదము, సోమ-సూర్య-అగ్ని, వాయువులు,** శబ్ద స్పర్శ- రూప – రస – గంధ – వాక్ – చలన- ధారణ – స్వీకరణ – విసర్జనలతో కూడిన సర్వేంద్రియములు **లయమును** పొందుచున్నాయో...,

⌘ **వాయువో యత్ర లీయంతే** – ప్రాణశక్తి చాలనమగు వాయువు ఎందులో తిరిగి లీనము పొందుచున్నదో..,

⌘ **మనో.. యత్ర విలీయతే,** – దేనినుండి 'ఆలోచన' (The thought) బయల్వెడలి, ప్రవర్తించుచూ, –(Just like a wave in ocean water) –తిరిగి లయించుచున్నదో, దేనియందు మనస్సు విలీనమగుచున్నదో,

⌘ **యం లబ్ధ్వాచ అపరం లాభం మన్యతే న అధికం తథా –** ఏదైతే లభించిన తరువాత, ఇక అంతకుమించిన లాభము 14 లోకములలో మరింకేదీ ఉండదో..,

⌘ **యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే,–** ఏ స్థితిలో ఈ జీవుడు గొప్ప గొప్పదైన దుఃఖ సంఘటనలకు కూడా ఏమాత్రము చలించడో,

⌘ ఏది దృశ్యములోని సుఖములన్నిటికంటే కూడా పరాకాష్ఠ సుఖమైయున్నదో, ఏది ఇంద్రియ సుఖములకు అతీతమైనదై, బుద్ధిచే సుఖముగా ఆస్వాదించబడుచున్నదై ఉన్నదో...,

అట్టిది మార్పు చెందే క్షరమునకు – ('నేను' రూపంగా) మార్పు చెందనిదానికి కూడా అతీతమై యున్నదే (అక్షరాదపి ఉత్తమః) 'ఆత్మ'గా చెప్పబడుతోంది. అదియే బ్రహ్మము 'అదియే నేను. అదియే నీవు'. ఈ పాంచభౌతిక దృశ్యమంతా 'నాశనము' వైపునకే అనుక్షణము ఎక్కుపెట్టబడియున్నది. కేవలము, పరము అగు ఆత్మయో? **క్షరము కాదు. అక్షరము కాదు.** అందుచేత **'అనక్షరము'** అని పిలువబడుతోంది. అది ప్రత్యక్షము కాదు. పరోక్షము కాదు. అందుచేత **'అపరోక్షము'** అని అనబడుచున్నది.

సర్వభూతజాలము ⟶ **క్షరము.** ఆ సూత్రాత్మ (పూదండలో దారము వంటిది) – **"అక్షరము"** అని చెప్పబడుతోంది.

## ఆత్మ స్వరూపము ఎట్టిది?

ఓ బ్రహ్మభగవాన్! అక్షర పరబ్రహ్మస్వరూపా! పరమానంద స్వరూపులగు ఓ తదితర శ్రోతలారా! అట్టి మీమీ సహజస్వరూపమగు పరబ్రహ్మము ఎట్టిదో, – మరికొంతగా వినండి! ఈ విధంగా ఎదుగుచూ, తద్విధంగా భావిస్తూ తత్ యొక్క స్వరూప-స్వభావములను అనునిత్యపరచుకొనెదరుగాక। "తదేవాహమ్"ను భావించటమే **'ఆత్మోపాసన'.**

- ఆత్మ క్షరము లేనిది. **అక్షరము।** (It is not subjected to factor of change)
- సర్వమునకు వేరై ఉన్నది. **పరము।** (Beyond all that being experienced)
- సర్వదేహములలో పరాకాష్ఠ అయి, మహత్తరము అయి ఉన్నట్టిది. **బ్రహ్మము।** (It is the finest and top most in all)
- అది విషయరహితం. **నిర్విశేషం।** (It has no relavence to worldly incidents. It does not contain events and contexts).
- దృశ్యము వలన దోషము పొందేది కాదు. **నిరంజనమ్।** (It is not affected by all that being seen. Is never poluted by anything)
- నవలలోని పాత్రల లక్షణములేవీ రచయితకు ఆపాదించలేము. ఆత్మ **అలక్షణమ్।** (It is beyond all characterstic features).
- 'ఇది' అని నిర్వచించి పొందలేము. **తత్ అలక్ష్యమ్।** (It is not like a target to be acheived. While you are already that, why need it be achieved)
- తర్కించి, వితర్కించి చెప్పలేము. **అతర్క్యము।** (It is beyond range of logical interpretation).
- దానికి సరిగా సరిపోయే ఉపమానము ఏదీ లేదు. **అనూపమమ్।** (No simile is sufficient to substantiate).
- అద్దానికి 'అంతు ఇది' అని చెప్పలేము. **అపారపారమ్।** (It does not end by anything).
- అద్దానిని జీవుడు-ఈశ్వరుడు మొదలైనవిగా ఎవ్వరూ ఛేదించలేరు. **అచ్ఛేద్యము।** (It cannot be bifurcated as individual self, collective self etc..).
- చిత్తమునకు విషయము కాదు. **అచిన్త్యమ్।** (It is not like a subject matter for thinking).
- దానికి (ఆత్మకు) ఏదోషములేదు. **అతినిర్మలమ్।** (It is pure by self. Impurities cannot be attributed).
- ప్రతి జీవునికి ఆధారము అదియే! ఆధారమ్ **సర్వభూతానామ్।** (It is the prima-facie base to all).
- అది దేనినీ ఆధారముగా కలిగియుండలేదు. **అనాధారమ్।** (It is beyond base).
- అది వస్తు నిర్మితము కాదు. **అనామయమ్।** (It is beyond matter).
- దానిని ప్రమాణములతో చెప్ప వీలు కాదు. **అప్రమాణమ్।** (All comparisions are ineffective to explain).
- అద్దానిని నిర్దేశించి 'ఇంతే' అని చెప్పలేము. **అనిర్దేశ్యమ్।** (It is unexplainable as "that's it").
- దేనికీ పట్టుబడేది కాదు. **అప్రమేయమ్।** (It is not relative. It is absolute by itself).
- ఇంద్రియములకు (నామరూప దృశ్యాత్మకములకు) విషయమే కాదు. **అతీంద్రియమ్।** (Beyond all sensations of sensory organs)

- అది స్థూలమగు విషయమేదీకాదు. **అస్థూలమ్।** (It is not like a solid matter).
- అది అణువు వంటిది కాదు. **అనణుః।** (It is not like an Atom).
- అది హ్రస్వము కాదు. దీర్ఘము కాదు. **అహ్రస్వమ్! అదీర్ఘమ్।** (It is neither short nor long).
- దానికి శరీరము వలె 'పుట్టుక' అను ధర్మమే లేదు – **అజమ్।** (It has no feature of Birth like this Mandane Physic)
- అది కాలముతో జనించేది కాదు. కాలముతో నశించేది కాదు. వ్యయమయ్యేది కాదు. **అవ్యయమ్।** (It is always as it is)
- సర్వ దేహములలో దేహిగా సర్వదా వేంచేసియుండి, సర్వమును ప్రవర్తింపజేయుచున్న పరమాత్మ (లేక) కేవలాత్మ  శబ్దము కాదు. స్పర్శ కాదు. (That which dwells in all equally as absolute form of self - It is not a 'Sound' or a 'Touch').
- చూపు, చెక్షువులు కాదు. చెవులు, వినికిడి కాదు. **అశబ్ద స్పర్శరూపః తత్, అచక్షుః శ్రోత్రనామకమ్।** (It is not becoming .seeing, Eyes, Ears, Hearing' etc.)
- ఇంకా కూడా ఆత్మ **సర్వజ్ఞము. సర్వగతము. పరమశాంతము।** (It is extending as 'knowing', 'being' and is peacefully present in all. It knows clearly what is now, what is before and what is beyond).

హే బ్రహ్మభగవాన్! అట్టి ఆత్మ **అఖండము, సర్వము, సర్వస్వము** కదా! అందుచేత **సర్వేషాం హృదయే స్థితమ్!**

ఆత్మ గురించి ఎవ్వరూ కూడా ఎక్కడికీ వెళ్లనక్కర్లేదు. ఎవ్వరినీ చూడనక్కర్లేదు. ఏ వ్రత–జప–ధ్యాన–యోగ ప్రయత్నములు చేయక్కర్లేదు. ఎందుకంటే..,

**ఆ పరమాత్మ ప్రతి ఒక్క జీవునికి సంబంధించి, -- ఆతని హృదయము నందే సంస్థితమై యున్నది.** తన వద్దే తనకు ఎదురుగా ఉన్న వస్తువు కోసం ఏ గృహస్థుడైనా ఊరులో ఇల్లిల్లూ వెతుకుతాడా? లేదు కదా! సమస్తమునకు అనన్యమై, అప్రమేయమై స్వ–హృదయ గుహయందు సర్వదా వేంచేసినదై ఉన్న 'ఆత్మ' కొరకై ఎక్కడో వెతకటమేమిటి?

బిడ్డను చంకనపెట్టుకుని, ఏ తల్లి అయినా "నా బిడ్డను చూడాలి. ఎక్కడికి వెళ్ళమంటారు?"– అని ప్రక్కింటివారిని ఆదుర్దాగా అడుగుతుందా? లేదే।

***ఆత్మ హృదయములోనే కారణకారణమై వేంచేసియుండి, బహిరంత స్థితమై కూడా ఉండి ఉండగా, ఆత్మకోసం వెతకటమేమిటి? ఎవ్వరెవ్వరినో అర్థించటమెందుకు?ఎవ్వరో వచ్చి ఉద్ధరిస్తారేమోనని దేవురించటమెందుకు?***

----

**బ్రహ్మభగవానుడు :** హే పరమానంద స్వరూపుడవగు పరమశివా! ఈజీవుడు తనయందే సర్వదా ఉపస్థితమై, సంప్రదర్శనమై సర్వకారణకారణమై వెలుగొందుచున్న **శివతత్త్వము** (లేక) **సోఽహమ్ శివః – శివోఽహమ్(లేక) కేవలాత్మమేవాఽహమ్'** → అనునది **అనునిత్యానుభవము అయ్యేది ఎట్లా?**

**పరమశివుడు :** అవును. ఇదీ ప్రశ్న. ఓ సృష్టికర్తా! సృష్టిమహత్ ప్రజ్ఞాదురంధరా! బ్రహ్మభగవాన్! మీరు అడిగిన **'అనునిత్య ఆత్మమేవాహమ్'** (లేక) **"చిదానందరూపం శివోఽహమ్ శివోఽహమ్"** – అనునది స్వానుభవంగా రూపుదిద్దుకోవటానికి సులభమగు ఒక ఉపాయం చెప్పుచున్నాను. వినండి.

## సుసంవేద్యం గురుమతామ్।

**"ఆత్మాఽహమ్"** అనుభవమును సిద్ధించుకొన్న **గురువు యొక్క బోధయే** అందుకు సులభోపాయము.

గురువు సూచించు "తత్–త్వమ్–(అదియే నీవయ్యా!) వాక్యార్థమును వినాలి. విని యోచించాలి. సమన్వయించుకోవాలి. **గురువును 'కోఽహమ్' అను పరిప్రశ్నతో సమీపించి, 'తత్ త్వమ్' బోధను విని, 'సోఽహమ్' అనబడు సర్వాత్మ– సర్వతత్త్వ– సహజ– కేవల–అనునిత్యమగు "ఆత్మాఽహమ్ భావన"ను సిద్ధింపజేసుకోవాలి.**

ప్రాపంచకమైన ఆశయములు, నమ్మకములు, వృధాభావములు, వెంటనంటియున్న బుద్ధి గల (ఆత్మ గురించిన అధ్యయనము లేని) అచేతసునికి – ఆత్మ భావన దుర్బోధకమే అగుచున్నది. అట్టివాడు ఆత్మ గురించి విని కూడా అనన్యత్వము సంపాదించుకోలేక పోవుచున్నాడు.

ఆత్మాభావన సిద్ధించటానికి కారణము ఏది అగుచున్నది? **ఆత్మభావనయే!**

***ఆత్మను అందరిలోను అందరుగాను భావించాలి.***

సర్వ దేహములలోని 'దేహి'గా ఉన్నది తానై, సర్వసాక్షిగా వేరై ఉంటున్న ఆత్మను అవ్యాజంగా (Unconditonally, Non-business like) దర్శించటమును అభ్యసించాలి.

అట్టి ఆత్మ →

→ **<u>నిష్కళంకమైనది.</u>** (దోషరహితం) జగద్దృష్టికి దేహ మనో బుద్ధి చిత్త అహంకారములకు సంబంధించిన దోషములు 'ఆత్మకు' చెందినవే కాదు.

→ **<u>నిర్గుణమైనది.</u>** నాటక పాత్రల గుణములు రచయితకు చెందినవి అగుచున్నాయా? లేదు. నాటకంలో నాయక-ప్రతినాయక పాత్రల గుణములు రచయితవిగాని, నటుడివిగాని, ప్రేక్షకుడివిగాని కావు కదా. సర్వానుభవములకు 'రచయిత' వంటి ఆత్మకు ఏ గుణదోషములు, స్వభావములు అంటజాలవు.

→ **<u>పరమ శాంతమైనది.</u>** అశాంతికి అద్దానియందు చోటేలేదు. జన్మ-జరా-మృత్యు-పునర్జన్మవ్యవహారములు ఆత్మయొక్క పరమశాంత స్వరూపమును ఏమీ చేయజాలవు.

→ **<u>నిర్వికారమైనది.</u>** వికారములు నాటకములోనివి గాని నటునివి కావు. ఆత్మకు వికారములు ఉండవు.

→ **నిరాశ్రయము.** - అది దేనినీ ఆశ్రయించదు. ఆత్మ సూర్యుని జీవాంశ కిరణము విషయములపై వాలినంత మాత్రం చేత - ఆత్మసూర్యుడు విషయములను ఆశ్రయించినట్లు కాదు.

→ **నిర్లేపకము** - అద్దానిని ఏదీ కూడా కప్పి ఉంచలేదు. **'మాయాబంధము, సంసారము'** మొదలైనవన్నీ ఆత్మకు ఆపాదించటము- దొంగిలించిన బంగారముపై 'దొంగతనము'ను ఆపాదించటము వంటిది. బంగారు లోహమునకు "ఎవ్వరిది? ఎక్కడిది?" - మొదలైన వాటితో సంబంధమేముంటుంది?

→ **నిరాపాయమ్** - ఆత్మకు అపాయమనునదే ఉండదు. ఆత్మకు అపాయము కలిగించగలిగినదేదీ లేదు.

→ **కూటస్థము** - ఈ లోకములు, లోకేశులు, లోకస్తులు, మొదలైనదంతా తన యొక్క గర్భమున కలిగియున్నట్టిది. ఆభరణములలో బంగారమువలె, తరంగములలో జలము వలె, మట్టిబొమ్మలో మట్టివలె సమస్తమునకు అంతరకారణమైయున్నట్టిది.

→ **అచలమ్** - ఆత్మ ఎటూ వెళ్ళటంలేదు. ఎటునుంచీ ఇక్కడికి రావటంలేదు. సర్వదా యథాస్థానములో యథాతథము.

→ **ధృవమ్** - తనయందు తానే సర్వదా ఉన్నట్టిది. పురికొస త్రాడును కట్టి కొండను కదల్చగలమా? ఈ మనస్సు మొదలైనవాటిచే ఆత్మయొక్క ధృవత్వము చెక్కు చెదరదు.

**ఇంకా కూడా..**

**<u>జ్యోతిషామపి తత్ జ్యోతిః :</u>** సర్వదేహులు జ్యోతులై ఉండగా, అయ్యది ఆ **జ్యోతులకే జ్యోతి - సర్వాత్మకము. పరంజ్యోతి.**

**<u>తమసః పారే ప్రతిష్ఠితమ్</u> :** కళ్లు మూసుకున్నప్పుడు చీకటి కనిపిస్తూ ఉంటుంది. ఆ చీకటిని కూడా చూచుచూ ఉన్నదే 'ఆత్మ'. అది సర్వ తమస్సులకు, అజ్ఞానమునకు ఆవల ఉన్నట్టిది. చీకటి కూడా దేనికి ఒక అనుభవ వస్తువుగా అగుచున్నదో - అదియే 'ఆత్మ'.

**<u>భావ - అభావ వినిర్ముక్తమ్</u> :** అద్దానిచే భావనలు జనిస్తున్నాయి. కవి నుండి కథ బయల్వెడలుతూ ఉండగా, ఆ కథలోని సంఘటనలచే కవి బద్ధుడా? కాదు. కథలోని భావ-అభావముల దృష్ట్యా రచయిత నిత్య వినిర్ముక్తుడు. అట్లాగే, పరమాత్మ నిత్య ముక్తుడు. అనగా, ఆత్మ సర్వదా ముక్త స్వరూపమే! **సహజమగు పరమాత్మకు** బంధము లేదు. **సందర్భమాత్రమగు జీవాత్మకు** ముక్తి ఉండదు. తదితరమైన జీవాత్మలు, జగత్తులు, గుణములు, జీవాత్మల పరస్పర సంబంధములు, శరీరానుభవములు - ఇవన్నీ **'భావన'**లోనివి. అవన్నీ **రావటం 'భావన'. పోవటమో 'అభావన'.** వాటన్నిటికీ వేరుగా **ఆత్మ నిత్యముక్తమైయున్నది.**

**<u>భావనామాత్ర గోచరమ్ :</u>** ఆత్మ దృశ్యములో ఒక వస్తువు కాదు. కనుక కంటికి కనబడేది, చెవులకు వినబడేది కాదు. ఇంద్రియములకు, మనస్సుకు విషయం కాదు. భాషకు అందదు. అయితే, ఆత్మ యొక్క అనుభవం అసాధ్యమా? కానే కాదు. అతి సులభం. ఎట్లా? ఈ జీవుడు 'దేహభావన'ను 'దృశ్యభావన'ను, వ్యష్టిభావనను దాటివేసి ఆపై **"సర్వాత్మభావన"**ను అభ్యసిస్తే, ఆ మరుక్షణమే అది భావనచే సులభసాధ్యము. **భావనా మాత్రం చేత క్షణంలో ఆత్మ గోచరమై, అనుభవమునకు సవిషయమై సిద్ధించగలదు.**

**భక్తిగమ్యమ్ :** పరాప్రేమ స్వరూపమగు భక్తిచే ఆత్మ భావనను తప్పక చేరవచ్చు. **"పరమాత్మ సర్వ జీవులలో సర్వ జీవులుగా ఉన్నారు"** - అనునదే **పరాప్రేమ.** దృశ్య వస్తువులపై గల ప్రేమను, జగత్ పాలకుడు - జగన్మోహనుడు అగు **'విష్ణుతత్త్వము'** (లేక)

**'శివచైతన్యము'**గా (లేక) **'ఆదిపరాశక్తి'**గా దర్శించు 'పరాప్రేమ'గా మలచినప్పుడు **పరమాత్మత్వము, పరబ్రహ్మత్వము ఈ జీవునికి ఇక్కడే ఇప్పుడే సిద్ధించగలదు.**

## "తత్ భావనా మాత్రేన అనుభవసిద్ధమ్!"

ఓ పద్మసంభవా!

> **భక్తి గమ్యం పరం తత్త్వం అంతర్లీనేన చేతసా!**
>
> **బాహ్య దృష్టులను, గుణ దృష్టులను ప్రక్కకు నెట్టి - అంతర్లీన దృష్టిచే (సర్వజీవులను ఆత్మ ప్రదర్శముగా, ఆత్మకు అభిన్నంగా), అంతర్లీన చేతసము (బుద్ధి)చే దర్శించుటచే తన యొక్క అఖండాత్మకమగు, నిత్యముక్తాత్మకమగు పరతత్త్వము తప్పక సిద్ధించగలదు. "తత్ త్వమ్" యొక్క అభ్యాసమే 'సోఽహమ్'నకు రాజమార్గము.**

అందుకు **'భావన'**యే ముఖ్యకారణము. **'అంతా విష్ణుతత్త్వమే'** – అని ఉపాసనాపూర్వకంగా, భక్తిపూర్వకంగా **అనుకూంటు ఉంటే,** తత్ భావనచే **అనిపించగలదు.** అనిపించిన అఖండాత్మతత్త్వమును – 'సోఽహమ్'-తత్త్వమ్'ల ఏకత్వము **సిద్ధించుకొనుచుండగా, ఈ జీవుడు తనకు తానే బ్రహ్మమై విరాజిల్లుచున్నాడు.**

## భావన - భావించువాడు

ఓ బ్రహ్మదేవ మహాశయా! శ్రీ సరస్వతీ వల్లభా! ఈ దేహముతో జీవునకు సంబంధము ఎట్లా ఏర్పడుతోంది? భావన చేతనే! ఈ ఇంద్రియములు, భావన చేతనే నిర్మితమై ప్రకటనమగుచున్నాయి. ఇంద్రియజగత్తు, స్వప్నజగత్తులు కూడా భావనచేతనే సిద్ధిస్తూ అనుభవమగుచున్నాయి. ఈ భౌతికదేహము యొక్క నాశనము కూడా **"నాకు దేహము వచ్చింది. ఇంతకాలముగా ఉంటోంది. ఇదిగో, ఇప్పుడు నశిస్తోంది"** – అనునదంతా భావన చేతనే సంఘటితమౌతోంది. **"ఇతః పూర్వపు నా దేహము నశించగా, ఇప్పుడిక ఈ మరొక దేహము నా పట్ల బయల్వెడలుతోంది"** అనబడు పునర్జన్మానుభవము కూడా భావన నుండియే జనించుచూ ప్రవర్తితమౌతోంది. దైనందికంగా కూడా, **"ఇప్పుడు నేను జాగ్రత్‌ను త్యజించి, క్రమంగా స్వప్నంలో ప్రవేశిస్తున్నాను. ఇంతదాకా పొందియున్న జాగ్రత్ సత్యంకాదు. ఇదిగో, ఈ స్వప్నదృశ్యము సత్యము"** అనునదంతా కూడా భావనా చమత్కారమే! ఈ విధంగా **'జీవమాత్రోఽహమ్'** అను పరిమితత్వమంతా కూడా ఈ జీవుని పట్ల స్వకీయ భావన చేతనే ఏర్పడుచున్నది. 'భావించబడేది' మార్పు చెందవచ్చునేమోగాని **'భావన' చేయు చైతన్యము అమృత స్వరూపమే!** మృతము కాదు. చెక్కు చెదరదు।

> **శ్లో॥ యథా దేహాన్తర ప్రాప్తేః కారణం భావనా నృణామ్**
> **విషయం ధ్యాయతః పుంసో, విషయే రమతే మనః ॥**

ఏది ఎట్లు భావన చేస్తూ ఉంటే, అది అట్లే సిద్ధిస్తూ ఉంటుంది. ఏ విధంగా అయితే దేహము యొక్క రాకపోకలు భావనావైచిత్ర్యమే అయి ఉన్నదో, అట్లాగే – **ఈ జీవుడు తాను తెచ్చిపెట్టుకున్న ఉపకరణములు మాత్రమే** (Mere instruments) – **అగు ఇంద్రియములకు అనుభవమగుచున్న విషయములను 'ధ్యానము' చేస్తూ ఉండగా, క్రమంగా ఈ మనస్సు-ఆత్మత్వమును ఎక్కడో దాచిపెట్టి ఇంద్రియ విషయములలో ప్రవేశించి, విషయములందే రమించనారంభిస్తోంది.** <u>**ఇదియే జగత్తు యొక్క ఉత్పత్తికి హేతువు.**</u>

**బ్రహ్మభగవానుడు :** అవును. **"మనస్సు ఇంద్రియ విషయములలో రమిస్తూ, తనకు జనన స్థానము - అగు ఆత్మను ఏమరచి ఉండటము"** – అనునది మీరు సెలవిచ్చినట్లుగా 'భావన' యొక్క ఫలముగా జీవుని పట్ల జరుగుచున్నది. ఫలితంగా ఈతడు అత్యంత దుఃఖితుడు, జన్మ-జరా-మరణ పరంపరా బద్ధుడు అగుచున్నాడు. హే మహేశ్వరా! సాంబశివా! సదాశివా! లోకకల్యాణమూర్తీ! ఇప్పుడు ఉపాయమేమిటి? దయచేసి మార్గదర్శనం ప్రసాదించండి.

**శివభగవానుడు : (యథా) విషయే ధ్యాయతః పుంసో, విషయే రమతే మనః।, (తథా) మామ్ అనుస్మరతః చిత్తం మయ్యేవ అత్ర విలీయతే!** ఏ విధంగా అయితే విషయములు ధ్యానిస్తూ ఉండగా, ఈ జీవుని మనస్సు విషయములందు రమిస్తూ ఉంటోందో....

*అదేరీతిగా.....,*

ఈ జీవుడు తన చిత్తమును **(సర్వతత్త్వాత్మకమ్, సాంబమ్, సర్వతత్త్వవిదూరకమ్, సర్వతత్త్వ స్వరూపం చ - అగు)** అస్మత్ **శివతత్త్వము** యొక్క **'అనుస్మరణ'** (Constant chanting in mind) యందు నియమించునుగాక! అట్లా నియమిస్తే ఆతని మనస్సు (లేక) చిత్తము నాయందే విలీనముకాగలదు. **ఈ జీవుడు శివుడు కాగలడు.** నన్ను అనుస్మరిస్తూ ఉండటంచేత..,

**సర్వజ్ఞత్వము** → ఈ జీవత్వము - ఈశ్వరత్వము- ఆత్మత్వములు ఆతనికి సువిశదమగుచున్నాయి.

**పరేశత్వమ్** → ఈ ద్రష్ట-దృశ్యములకు పరముగా గల ఈశత్వము (The sense that I my self am extending as this all) సుస్పష్టమవగలదు. **"ఇదంతాగా విస్తరించినవాడనై ఉండటము నా స్వభావము కదా!"** అను అనుక్షణిక - స్వాభావిక పరేశత్వము సిద్ధించగలదు.

**సర్వ సంపూర్ణశక్తితా** → జగత్తులు ఉత్పత్తి-స్థితి-ఉపసంహార సామర్థ్యమును పొందగలడు.

**అనన్త శక్తిమత్త్వన్చ** : అనంత శక్తిమంతుడు కాగలడు.

ఇవన్నీ **'శివా', 'ఓం నమఃశివాయ' 'సర్వమ్ శివమయమ్' "శివాత్ పరతరమ్ నాస్తి"** - ల అనుస్ఫురణచే సిద్ధించగలవు. **"చిదానందరూపమ్ శివోఽహమ్"** స్థానమును పుణికిపుచ్చుకోగలడు.

## 4వ అధ్యాయము - సర్పరజ్జు భ్రాంతి

**'ఓం' ఇతి ఏకమ్, అక్షరమ్!** ఈ జగత్తు, ఈ జగదనుభవము, ఈ జీవుడు - ఇవన్నీ కూడా ఏకము అక్షరము అగు ఆత్మచైతన్యమే! **చైతన్యస్య ఏకరూపత్వాత్, భేదోయుక్తో న కర్హిచిత్।** ఆత్మ చైతన్యము సర్వదా ఏకమే అయి ఉన్నది. అద్దాని యందు **ఇది జీవుడు. ఇవి జగదనుభవములు. ఇది జగత్తు. ఈతడు జ్ఞాని. ఆతడు కాదు. ఈతడు మనుష్యుడు. ఆతడు దేవత - ఇటువంటి భేద దృష్టి ఉచితమే కాదు.**

ఇక జీవుడు - జీవత్వము అంటారా? **జీవత్వం చ తథా జ్ఞేయం రజ్జ్వాం సర్పగ్రహో యథా॥** ఒకానొకడు ఒకచోట ఒక త్రాడును చూచి **"అయ్యబాబోయ్! ఇది ఎంతపెద్ద త్రాచు పాము?"** అని అనుకొని వికారములు పొందటం ఎటువంటిదో,- ఆత్మపట్ల 'జీవత్వము' అటువంటిదిగా తెలుసుకొబడునుగాక! త్రాడు నందు పాము మొదలే లేనివిధంగా, బ్రహ్మము నందు 'జీవుడు' అనునది మొదలే లేదు.

**రజ్జ్వజ్ఞానాత్ (రజ్జు-అజ్ఞానాత్) తత్ క్షణేనైవ యద్వత్ రజ్జుర్హి సర్పిణి,..** ఏ విధంగా అయితే త్రాడును చూడగానే త్రాడు గురించిన జ్ఞానము లేని కారణంగా "ఇది పాము" అను జ్ఞానము తత్‌క్షణమే ఏర్పడినది అగుచున్నదో,.. అదేవిధంగా....,

**- భాతి తద్వత్ చితిః సాక్షాత్ విశ్వాకారేణ కేవలా!**

చిత్ యొక్క (ఆత్మయొక్క) ఏమరపు కలిగిన మరుక్షణం, అట్టి కేవల చిత్‌తత్త్వము (In one's own absolute knowing) నందు ఈ విశ్వమునకు (లేక) దృశ్యమునకు సంబంధించిన ఆకారానుభవమంతా ఉదయిస్తోంది. **బ్రహ్మము అనన్యము కాబట్టి (బ్రహ్మమునకు వేరుగా ఏదీ లేదు కాబట్టి) - బ్రహ్మము నందు 'విశ్వము' అనబడునది ఉండటానికి ఉపాదాన కారణమంటూ ఏదీ లేనే లేదు. (త్రాడుయొక్క ఏమరుపే సర్పరూపము అయినట్లుగా) బ్రహ్మముయొక్క ఏమరుపే విశ్వరూపముగా అవుతోంది.**

అందుచేత - **తస్మాత్ సర్వ ప్రపంచో అయం బ్రహ్మైవ అస్తి! నచేతరత్। (న చ ఇతరత్!)** ఈ పాంచభౌతికంగా కనిపించే ప్రపంచమంతా కూడా సర్వదా బ్రహ్మమే అయి ఉన్నది. మరింకేదీ అయి ఉండలేదు.

**"అంతా ఆత్మయే"** - అనునది శాసనము (It is a thump-Rule). అందుచేత - **"ఇది వ్యాపింపజేయునది. అది వ్యాపింపబడినట్టిది. బ్రహ్మము ప్రపంచమంతా వ్యాపించినదై యున్నది' - ఇవన్నీ మిథ్యావచనములే!**

**"సర్వము బ్రహ్మమే"** అని సిద్ధాంతీకరించుకున్న తరువాత (లేక సర్వము శివమే, దేవీ తత్త్వమే, విష్ణుతత్త్వమే - అని నిర్ణయించుకొన్న తరువాత) - **ఇతి జ్ఞాతే పరేతత్త్వే భేదస్య అవసరః కుతః?** పరతత్త్వము పట్ల **"ఇది ఇహము, జీవుడు : అది పరము, పరమాత్మ"** అను భేదము యొక్క **అవసరం** ఏమున్నది?

బంగారము నుండి ఆభరణము వలె, జలము నుండి తరంగము వలె, సూర్యుని నుండి కిరణముల వలె 'పరమాత్మ' అనబడు తత్త్వము నుండి ఈ జగత్ దృశ్యములో అగుపిస్తున్న సర్వభూతజాలము బయల్వెడలుచున్నది.

అందుచేత, **తస్మాత్ ఏతాని బ్రహ్మైవ భవంతి - ఇతి విచిన్తయ।** "ఈ కనబడేదంతా సర్వదా బ్రహ్మమునందే, బ్రహ్మమునకు అభిన్నంగా ఏర్పడి ఉన్నది"- అని చింతన చేయబడును గాక! సర్వనామ వాచకములు, సమస్త సర్వనామములు, రూపములు.. ఇవన్నీ కూడా సర్వదా బ్రహ్మమే అయి ఉన్నాయి. **"సర్వ వ్యవహారములు, సర్వకర్మ విశేషములు - ఇవన్నీ కూడా సమగ్రంగా బ్రహ్మమునందే భాసిస్తున్నాయి"** అని 'భావన' చేయబడును గాక!

- బంగారముతో తయారుకాబడిన ఆభరణములన్నిటిలో బంగారమే శాశ్వతమైనది. ఆభరణము యొక్క నామ-రూపములు కాదు. **సువర్ణాత్ జాయ మానస్య సువర్ణత్వన్చ శాశ్వతమ్।**
- జలము నుండి బయల్వెడలిన తరంగములలో జలమే సత్యము. తరంగము యొక్క నామరూపములు కాదు. **(ఆపః సత్యమ్। న తరంగాది।)**
- బ్రహ్మము నుండి బయల్వెడలిన ఈ ప్రపంచము (విశ్వము) నందు 'బ్రహ్మము' మాత్రమే శాశ్వతము. బ్రహ్మత్వమే ఈ జగత్తు (ప్రపంచము) యొక్క స్వరూపము, స్వభావము కూడా! **(బ్రహ్మ సత్యమ్। జగత్ మిధ్యా।)**

## ద్వితీయాం భయం భవతి

**శ్లో॥ స్వల్పమపి అన్తరం కృత్వా జీవాత్మ పరమాత్మనోః**
**యః తిష్ఠతి స మూఢాత్మా, భయం తస్యాపి భాషితమ్॥**

ఏ మూఢాత్ముడైతే (The one who is foolish) **– "జీవాత్మ – పరమాత్మల మధ్య కొంచమైనా భేదమున్నది"–** అను భావనయందు తిష్ఠితుడై ఉంటాడో, ఆతని పట్ల **'భయము'** అనునది ఏర్పడియే ఉంటుంది. కొనసాగుచూనే ఉంటుంది.

అందుచే, (సర్ప రజ్జు భ్రాంతివలె) ఏది అజ్ఞానము చేత "ఇది ఆత్మకు వేరైనది. ద్వితీయమైనది" అని అనిపిస్తోందో, అదంతా కూడా భ్రాంతియే! **యత్ అజ్ఞానాత్ భవేత్ ద్వైతమ్ ఇతరత్ తత్ ప్రపశ్యతి** – "అదంతా ఆత్మయే! ఆత్మకు వేరై ఎక్కడా ఏదీ అణువంత కూడా లేదు" – అను భావనతో జ్ఞానోదయమును ఆశ్రయించాలి **– ఆత్మత్వేన తదా సర్వం నేతరత్ తత్ర చ అణ్వపి।**

**బ్రహ్మ దేవుడు :** కానీ, స్వామీ! ఈ జీవునకు జగత్తు, అట్టి జగద్దృశ్యములో అనేక భేదములు ఘనీభూతమై అనుభూతమగుచున్నాయే!

**శివ భగవానుడు :** అనుభూతమయినంతమాత్రం చేతగాని, ఈ జగత్తు వ్యవహారశీలమైనంత మాత్రం చేతగాని– ఇదంతా ఆత్మకు వేరుకాదు. వేరుగా చూస్తే – అసద్రూపమే! వాస్తవానికి లేనేలేదు. కానీ (అజ్ఞానదృష్టిచే) ఉన్నట్లు అనిపిస్తోంది. 'జ్ఞానము' అను ప్రకాశముచే, ఈ ప్రపంచము ఎందుకు వేరుగా లేదో ఈ జీవుడు గ్రహించగలడు. దృష్టాంతంగా →

(1) దూరంగా కొండ నునుపుగా కనిపిస్తుంది. దగ్గరకు వెళ్లితే? అక్కడ నునుపు (Plain appearence) ఉన్నదా? లేదు.

(2) ఒకడు కల కంటున్నాడు. ఆ కలలో అనేక వ్యవహారములు, సంబంధ – అనుబంధ–బాంధవ్యములు దర్శిస్తున్నాడు. ఆతని దృష్టిలో ఆ స్వప్న దృశ్యము అప్పటికి సత్యమే! (జాగ్రత్తు ఆ వర్తమానానికి ఆతని దృష్టిలో లేనే లేదు కదా!). ఇప్పుడు.., **అసద్రూపో యథా స్వప్న ఉత్తర క్షణ బాధితః** నిదుర లేవగానే స్వప్నము లేనిదగుచున్నది. స్వప్నసమయంలో 'స్వప్నము నిజమే' – అని అనుకున్నంత మాత్రం చేత,.... స్వప్నంలో కనిపించినది నిజమా? ఎట్లా అవుతుంది? మెలకువ రాగానే క్షణంలో స్వప్న దృశ్యమంతా మటుమాయ మౌతోందే మరి!

**స్వప్నే జాగరితం నాస్తి।** – స్వప్న సమయంలో జాగ్రత్తు 'లేనిది'గా అగుచున్నది.

**జాగరే స్వప్నతా నహి।** – జాగ్రత్ సందర్భములో 'స్వప్నము' లేనిదే అవుతోంది.

**ద్వయమేవ లయే నాస్తి।** – సుషుప్తి సందర్భములో జాగ్రత్ – స్వప్నములు రెండూ లయం పొంది, 'లేనివే' – అగుచున్నాయి.

**లయోపి హి అనయో న చ।** – 'లయము' అనునదీ లేదు. ఆత్మ నిత్య జాగరూకమై ఉండగా, తరంగం జలంలో లయం లాగా – జాగ్రత్ స్వప్న సుషుప్తులు నిత్య జాగరూకమగు చైతన్యాత్మయందు లయమగుచున్నాయి.

(3) తరంగము జలము కానిదెప్పుడు? జలము జలమునందే లయమౌతోంది. అంతా ఆత్మయే అయి ఉండగా, ఏది ఎందులో లయమౌతోంది? **లయము లేదు. జననము లేదు. తరంగమునకు ఆకారము ఉన్నంత మాత్రంచేత జలమునకు ఆకారము ఉన్నట్లా? కాదు కదా!**

## పరమాత్మ యందు జీవాత్మ లేదు. పరమాత్మ జీవాత్మగా అవటం లేదు.

ఈ విశ్వము, ఇక్కడి 14 లోకాలు – ఇదంతా కూడా 'సత్వ–రజో–తమో' అను '3' గుణములచే నిర్మితమైయున్నది. '3' పుల్లలను త్రికోణంగా అమర్చి త్రికోణము జనించినట్లు ఒకడు భావించవచ్చుగాక! ఆ మూడు పుల్లలను ప్రక్కకు నెట్టితే త్రికోణము ఎక్కడున్నది?

అట్లాగే, 'త్రికోణము నశించింది' - అని అంటామా? "ఇంతవరకు త్రికోణము నన్ను బంధించింది" - అని చెప్పుతామా? త్రిగుణాత్మకమైనదంతా ఒక కథలోని సంఘటనలు, కార్యములు, పర్యవసానముల వలె మిథ్యమే. ఆ త్రిగుణములకు ఆవల **"త్రిగుణములు తనవి"**- అయినట్టి ద్రష్ట **"అనుభవి-పర్యవేక్షకుడు - ఉపయోగించువాడు"**గా ఉన్నాడు. **అస్య ద్రష్టా గుణాతీతో, నిత్యోహి,.. ఏష చిదాత్మకః। ద్రష్ట గుణిగా కనబడుచూ ఉన్నప్పటికీ, గుణములకు మునుముందుగానే ఉన్నాడు.** గుణాతీతుడు. కాలమునకు సాక్షియై భూత-వర్తమాన- భవిష్యత్తులలో వెలయుచున్నాడు. కనుక **నిత్యుడు**. ఆతడే చిదాత్మ। **ఏష హి ఏవ చిదాత్మకః। ఈ దేహములోని 'అనుభవియే' చిదాత్మ। పరమాత్మ। పరతత్త్వ స్వరూపుడు।**

## ఈ ద్రష్ట చిదాత్మస్వరూపుడే!

**యథా మృది ఘట భ్రాంతిః**- మట్టితో తయారైన కుండయందు మట్టిని ఏమరచి 'కుండ'ను మాత్రమే ఏ విధంగా చూస్తూ ఉంటామో,

**(యద్వత్) శుక్తేహి రజత స్థితిః** - ఏ విధంగా ముత్యపు చిప్ప-లోని (Inner) భాగమును 'వెండి' అను భ్రమతో చూస్తామో (ఒకడు ముత్యపు చిప్పను చూపి- "వెండితో తయారైనది".. అని తెలియనివానిని భ్రమింపజేయగలడో),

ఆ విధంగా బ్రహ్మము నందు 'జీవుడు' - అనబడునది అనుభూతమౌతోంది. అయితే, **వీక్షమాణే వినశ్యతి** - ఏదేది ఇంద్రియములకు 'ఇది ఇట్లు ఉన్నదికదా!".. అని అనిపిస్తోందో, ఆ అనిపించేదంతా "మార్పుచెందుట, నశించుట" - అను స్వభావము కలిగి యున్నది.

| | | |
|---|---|---|
| మట్టికుండలో మట్టి | → | 'కుండ' అనే పేరుతో, |
| బంగారపు ఆభరణము | → | 'ఆభరణము' అను పేరుతో, |
| ముత్యపుచిప్ప | → | 'వెండి' అనే పేరుతో |

చెప్పబడు విధంగా 'జీవుడు' అను పేరుతో బ్రహ్మమే చెప్పుకోబడుతోంది. ఆకాశంలో నీలిరంగువలె, యండమావులలో నీరు కనబడినట్లు, ఒక బండరాయి చీకటిలో ఎవ్వరో వ్యక్తి నిలబడినట్లు అనిపించుతీరుగా, **ఆత్మయందు 'విశ్వము' అనబడునది కనిపించటము జరుగుతోంది.** శూన్యములో వేతాళుడు (భేతాళుడు) కనిపించినట్లు, (మాంత్రికుని కల్పనవంటి) గంధర్వ నగరము వలె, మెల్లకన్నువానికి ఆకాశంలో రెండవ చంద్రుడు అగుపించినట్లు, కల్లోలమైయున్న జలములో జలమే తరంగముగా అగుపిస్తున్నట్లు, ***ఆ విధంగా ఈ జగత్తు. సత్యముగా స్థితమైనట్లు అనిపిస్తోంది. "ఎప్పటికీ ఈ 'జగత్తు-నేను' ఇట్లాగే ఉంటాము"*** అని భ్రమింపజేస్తోంది.

జలమే తరంగములుగాను, మట్టియే ఘటముగాను, దారములే (అల్లబడుటచే) వస్త్రముగాను - కనిపిస్తున్నట్లు, చిత్‌యే - 'జగత్తు' అనుదానిగా ఆభాసించుచున్నది. (Is Refracting). **సర్వమ్ బ్రహ్మైవ కేవలమ్।** సర్వము సర్వదా కేవలము బ్రహ్మమేనయ్యా!

## జగత్ స్థితిః నాస్తి।

- ఒక వంధ్య (గొడ్రాలికి) రెండవ కుమారుడు ఉంటాడా?
- మరుభూమిలో (యడారిలోనియండమావులలో) నీరు ఉంటుందా?
- ఆకాశంలో కొండ, వృక్షము, వనము ఉంటాయా?

అట్లాగే, 'జగత్తు' అనబడేదానికి స్థితీ లేదు. 'గతీ' లేదు. ఆత్మకు వేరుగా, స్వతః సిద్ధమైన ఉనికియే లేదు.

"కుండలో మట్టి కాకుండా ఇంకేమైనా ఉన్నదా?" అని పరిశీలనగా వెతికితే మట్టి తప్పించి మరేమీ ఉండదు కదా! అట్లాగే - **వీక్షమాణే ప్రపంచే తు బ్రహ్మైవాభాతి భాసురమ్!** ఈ ప్రపంచము (The super combination of solid, liquid, vapour, Heat and placement)ను పరిశీలించిచూస్తే **"బ్రహ్మము యొక్క తేజస్సే ప్రపంచముగా భాసిస్తోంది"** - అని సుస్పష్టమగుచున్నది.

**బ్రహ్మ భగవానుడు :** స్వామీ! అజ్ఞానికి ఈ దృశ్యము తనతో విడదీయరాని బంధమే అగుచున్నదికదా!

**శివ భగవానుడు :** అవును. జీవులు రెండురకాలైన దృష్టులు కలిగి ఉంటున్నారు. **(1) సత్ (ఆత్మ) దృష్టి (2) అసత్ (అజ్ఞాన/అనాత్మ) దృష్టి.** శుద్ధమగు ఆత్మ అశుద్ధత్వము (uncelan perception) స్వీకరించినపుడు సంసార భ్రమలు రూపము దిద్దుకొనుచున్నాయి. రజ్జువు తెలిసిన వానికి త్రాడుగాను, తెలుసుకొనని వానికి 'పాము'గాను అగుపించు రీతిగా, **జ్ఞానికి ఈ జగత్తు స్వస్వరూపాత్మరూపంగాను, అజ్ఞానికి ఇదంతా ఎవరో తనను బంధించి ఉంచుటకై కల్పించినట్టిదిగాను అగుపిస్తోంది.**

→ కుండ అంతా 'మట్టియే' అయినట్లుగా ఈ దేహమంతా చిన్మయమే!

అంతా ఆత్మయే! ఆత్మయే అయి ఉండగా బుధులు ఏ ఆత్మ- అనాత్మ విభజనము చేస్తున్నారో అదంతా వృధాయే. పాముగా కనిపిస్తున్న త్రాడును "ఇంతవరకు, అంతవరకు త్రాడు" - అని విభజనము చేస్తామా? చేయము కదా! ఇది ముత్యపు చిప్ప-ఇది వెండి అని

విభాగిస్తామా? ఘటము – మట్టిని వేరు చేసి చూస్తామా? **దేహత్వము ఆత్మగానే దర్శించబడు గాక।** ఆత్మకు అన్యముగా దేహము లేదు. దేహియు లేదు.

కుండ – అంతా కూడా మట్టియే అయినట్లు, యండమావులలో జలత్వమున్నట్లు, గృహములో కాష్ఠమే (కొయ్య) ఉన్నట్లు – "ఆత్మత్వములో దేహత్వమున్నది" – అని అజ్ఞాన దృష్టికి అనిపిస్తోంది. అజ్ఞానికి ఆత్మ– జగత్తులు రెండుగా అగుపిస్తున్నాయి. జ్ఞానికి ఈ సమస్తము ఏకము, అఖండము కూడా.

## 5వ అధ్యాయము – దేహమ్ విష్ణ్వాలయమ్ ప్రోక్తమ్!

**బ్రహ్మ భగవాన్ :** హే శివదేవా! బ్రహ్మము – యోగముల గురించి పరస్పరంగా ఇంకా మరికొన్ని విశేషములు చెప్పండి. (Kindly explain from the dimension of mutuality of 'Brahmam & Yogam').

**శివ భగవానుడు :** అతి రహస్యమగు బ్రహ్మస్వరూప యోగము గురించి మరికొంతగా చెప్పుచున్నాను. సమాహితచిత్తులై వినండి.

## దేహమ్ విష్ణ్వాలయమ్ ప్రోక్తమ్।

ఈ దేహము..,

- 10 ద్వారములు గల పురము. ('2' కళ్ళు', '2' చెవులు, '1' నోరు, '2' ముక్కుపుటములు, గుదము, గుహ్యము, బ్రహ్మరంధ్రము.)
- '10' నాడులతోను, ఉపనాడులతో కూడా విస్తరించి ఉన్నట్టిది. అట్టి నాడులన్నీ శరీరములో అనేక పధములు (Paths) కలిగియున్నాయి.
- దశ వాయువులతో (ప్రాణ–ఉపప్రాణములతో) వ్యాప్తమైయున్నది.
- దశ ఇంద్రియములు ('5' కర్మేంద్రియములు, '5' జ్ఞానేంద్రియములు) కలిగి యున్నట్టిది.
- మూలాధారమునుండి షట్(6) ఆధారములు కలిగి యున్నట్టిది.
- షట్ (6) అన్వయములు కలిగి యున్నట్టి మహావనము వంటిది.
- 4 పీఠములతో సమాకీర్ణమైయున్నది.
- 4 వేదములచే దీపింపజేయబడుచున్నట్టిది.
- బిందువు, నాదము, మహాలింగములతో కూడుకొని ఉన్నట్టిది.
- విష్ణు – లక్ష్మీ (ఉనికి–జ్ఞానము) సంజ్ఞలు తనయందు కలిగి ఉన్నట్టిది

అట్టి ఈ శరీరము జీవులకు సిద్ధిని **ప్రసాదించుటకై సంసిద్ధత కలిగియున్నది.** అట్టి ఈ దేహమే (అందుచేత) **'విష్ణ్వాలయము'.** ఇంకా ఈ దేహము గురించి వినండి.

## దేహములు – చక్రస్థానములు

దేహములో ప్రకృతిచే ప్రతిక్షేపించబడిన శక్తి కేంద్రముల గురించి ఇప్పుడు ఉదహరించుకుంటున్నాము.

**(1) మూలాధార చక్రము :** – గుదము – మేఢ్రము (మగగురి) మధ్య స్థానమున ఉన్న శక్తి కేంద్రము. △ త్రికోణాకారము. "శివుడే ఇక్కడ జీవుడై వెలయుచున్నారు" అని చెప్పబడు స్థానము. ఈ స్థానములో **'కుండలిని'** అను పేరుతో పిలువబడే **పరాశక్తి** ప్రతిష్ఠితమై యున్నది.

– ఏ శక్తి నుండి వాయువు ఉత్పన్నమగుచున్నదో, ఏ శక్తి నుండి అగ్ని ప్రవర్తనశీలమగుచున్నదో, దేని నుండి నాదము బయల్వెడలుచున్నదో, ఎద్దాని నుండి హంస (ఉచ్ఛ్వాస – నిశ్వాసలు) ప్రవర్తిస్తున్నాయో, తిరిగి విలీనము పొందుచున్నాయో, ఎక్కడ ఆలోచన (మనస్సు) ఉత్పన్నమగుచున్నదో, అదియే **మూలధారశక్తి.** అది **'కామరూపపీఠము'** అని, అద్దానిని ఉపాసించువారు కోరుకొన్నవి పొందుతారు కాబట్టి – **కామఫలప్రదము** – అని పిలుస్తున్నారు.

**2. స్వాధిష్ఠానచక్రము :** లింగమూలమునకు పైస్థానముగా – ఆరు రేకులు కలిగినదై ఉన్నది.

**3. మణిపూరకచక్రము :** నాభి ప్రదేశములో సంస్థితమైయున్నది. 10 ఆరములు గల చక్రము.

**4. అనాహతమ్ :** 12 ఆరములు గల మహాచక్రము. హృదయస్థానమున ప్రవర్తమానమై ఉన్నట్టిది. ఓ కమల సంభవా! దీనిని **'పూర్ణగిరి పీఠము'** అని కూడా అంటారు.

**5. విశుద్ధ చక్రము :** కంఠ ప్రదేశమున ఏర్పడి ఉన్నట్టిది. '16' ఆరములు కలిగినట్టిది. దీనికి **"జాలంధర పీఠము"** అని కూడా పేరు. ఇక్కడ చతుర్ముఖ బ్రహ్మ వేంచేసియున్నారు.

**6. ఆజ్ఞాచక్రము :** భ్రూమధ్య స్థానములో ఉన్నట్టిది. రెండు ఉత్తమ దళములు కలిగియున్నట్టిది. ఈ స్థానము దేహములో 'శక్తిరూపము' (Power house)గా ప్రకాశించుచున్నది.

**7. ఉఢ్యాణ/మహాపీఠము :** ఆజ్ఞాచక్రమునకు ఉపరిభాగంగా (భ్రూమధ్యకు పైభాగంగా) 'ఉఢ్యాణపీఠము' అని పిలువబడే మహాపీఠము ఉన్నది. ఇది కూడా దేహంలో శక్తిస్థానమై ప్రవర్తిస్తోంది.

## పంచభూతములు – అధి దేవతా నిర్ణయము.

**(1) ధరణీ (భూ) :** చతురస్ర మండలాకారము కలిగి ఉన్నట్టిది. అధిదేవత = **బ్రహ్మ**

**(2) జలము :** అర్ధచంద్రాకృతి మాండలాకారము. అధిదేవత = **విష్ణువు**

**(3) వహ్ని (అగ్ని) :** త్రికోణమండలాకారము అధిదేవత = **రుద్రుడు**

**(4) వాయువు :** షట్ (6) కోణములు గల బింబమండలాకారము. అధిదేవత = **సంకర్షణుడు.**

**(5) ఆకాశము:** వృత్త మండలాకారము. అధిదేవత = **పరమాత్మ**

## శాంభవ స్థానము

భ్రూమధ్యములో నాదరూపము. మనో మండలము. ఈ స్థానము **'శాంభవస్థానము'** అని పిలువబడుతోంది.

## నాడీచక్ర నిర్ణయము

**పరమశివుడు :** ఓ బ్రహ్మభగవాన్! ఇక్కడ మనము నాడీచక్రముల స్థాన నిర్ణయము గురించి కూడా వివరించుకుందాము.

**సుషుమ్నానాడి :** ఈ నాడి – **త్రికోణాకారమగు మూలాధారము** నుండి ద్వాదశాంతగతమై (ద్వయమునకు చిట్టచివరగా) విస్తరించినదై ఉన్నది. సగమున వరకు విరుగగొట్టబడిన వెదురుపుల్ల ఆకారము కలిగి ఉంటోంది. ఇది 'మూర్ధ్నిస్థానము'ను ఛిన్నము చేసి **బ్రహ్మరంధ్రము** వరకు విస్తరించి ఉండటం ఏత **'బ్రహ్మనాడి'–** అని పిలుస్తున్నారు. ఆ సుషుమ్నానాడికి ఇరు పార్శ్వములలో ఇడ (ఎడమవైపు) – పింగళ (కుడివైపు) – నాడులు.

**ఇడ నాడి:** హేమ (బంగారు) రూపంగా ఉంటుంది. ఇందులో సంచరించువాయువు హేమ (బంగారు) రూపంగా కనబడుచున్నది. ఎడమవైపుగా ఉంటుంది. చంద్రాత్మకమైనది.

**పింగళనాడి :** సూర్యాత్మకమైనది. కుడివైపుగా ఉంటోంది.

**విళంబినీనాడి :** ఇది సుషుమ్నానాడిని అనుసరిస్తూ ముక్కుకు ఉపరిభాగము చివ్వరి వరకు విస్తరించియున్న నాడి. ఈ నాడి అభివ్యక్తమై నాభి ప్రదేశములో ప్రతిష్ఠితమై యున్నది.

నాభి స్థానము నుండి ఇంకా అనేక నాడులు బయల్వెడలుచున్నాయి. అవన్నీ పైకి – క్రిందికి – వెనుక నడుము వైపుగాను విస్తరించినవై ఉంటున్నాయి. ఈ విధంగా "నాభి చక్రము"గా – పిలువబడుచూ కోడిగ్రుడ్డు ఆకారముగా ఉంటున్నదై అనేక నాడులకు బయల్వెడలుస్థానము అయి ఉంటోంది.

**గాంధారి నాడి; హస్తి జిహ్వ నాడి :** ఈ రెండు నాడులు నాభి నుండి బయల్వెడలి రెండు కనుల – కంటిపాపల చివరి వరకు విస్తరించి ఉన్నాయి.

**పుషానాడి; అంబుసా నాడి :** చెవులలోని చివ్వరి భాగముల వరకు విస్తరించి ఉన్న నాడులు.

**శూరా నాడి :** నాభి స్థానము నుండి భ్రూమధ్య ప్రదేశము వరకు విస్తరించి ఉన్నట్టిది.

**విశ్వోదరీ నాడి :** నాలుకలోనికి చిలువలు - పలువలుగా విస్తరించి, ఈ జీవుడు (భక్ష్య-భోజ్య-లేహ్యా-చోహ్యాములనబడే) చతుర్విధ ఆహారములు భుజించటానికి సహకారికమగుచున్నది.

**సరస్వతి (సరత్వతి):** నాలుక చివ్వరి వరకు ప్రసరించి ఉన్నది.

**రాకాహ్వాయ నాడి :** ఈ నాడి - ఈజీవుడు క్షణాలలో నీరు త్రాగటానికి సహకరిస్తూ ఉంటున్న నాడి. ఇది ముక్కు ప్రదేశములో క్షతము (తుమ్ము)ను కలిగిస్తూ, శ్లేష్మమును కలిగిస్తూ - తొలగిస్తూ ఉంటున్నది.

**శంఖిణీ నాడి :** ఈ నాడి కంఠకూపములో ఉద్భవించినదై కంఠము నుండి అధోముఖము (క్రింద వైపుగా, Downwardly) క్రియాశీలకమై ఉంటున్నది. అన్నసారమును స్వీకరించి, అన్నతేజస్సును మూర్ధ్నిప్రదేశము (space in the foreface) నందు కూడబెట్టుచూ ఉన్నది.

**నాభి - అథోగత త్రి(స్రోనాడులు :** నాభి నుండి జనించి అధోగతంగా '3' నాడులు విస్తరించి ఉంటున్నాయి. అందులో **కుహూ** నాడి మలవిసర్జనకు, **వారుణీ** నాడి మూత్ర విసర్జనకు క్రియాశీలకమై ఉంటున్నాయి.

**చిత్ర-సీవనీ నాడి** - శుక్ల విమోచన కారకము అయి ఉంటోంది.

**ఇవన్నీ కలిపి "నాడీచక్రము" అని పిలువబడుచున్నాయి.**

## బిందు రూపము

**శివ భగవానుడు..** ఓ బ్రహ్మ దేవా! పద్మ సంభవా! **'బిందురూపము'** గురించి చెప్పుకుందాము. వినండి.

సృష్టికర్తయగు బ్రహ్మయొక్క హిరణ్యగర్భ ప్రదర్శనము '3' విధములగు శరీరములుగా (దేహములుగా) విభజించి చెప్పబడుచున్నది.

**(1) స్థూలము :** బిన్దురూపము. శుక్లాత్మకము.

**(2) సూక్ష్మము :** పంచాగ్ని రూపకము.

**(3) పరము :** సోమాత్మకము (స-ఉపాత్మకము). ప్రకృతితో కూడి ఉన్నది. ప్రకృతి తనదైనట్టిది. ఇది సదా సాక్షి అయి, తన స్థానము నుండి చ్యుతి పొందనిదై యున్నది.

ఏ **కాలాగ్ని** అధో భాగమగు పాతాళము నందు సంప్రతిష్ఠితమైయున్నదో, అదియే ఈ భౌతిక దేహమునందు **'మూలాగ్ని'**గా ప్రతిష్ఠితమైయున్నది. అట్టి మూలాగ్ని నుండి 'నాదము' జనిస్తోంది. శరీరములో అది బడబాగ్ని వంటిది. అదియే బొమికల మధ్యగా కూడా ఉన్నదగుచున్నది. కొయ్యలోను, రాయిలోను మధ్యగతమై వహ్ని (అగ్ని) ఉన్నట్లే - అస్థి (బొమికల) గతమై అగ్ని ఉన్నది.

**అగ్ని :** కాష్ట (కొయ్య) - పాషాణము (రాయి)లలో ఉన్న అగ్నిని **'పార్థివము'** అంటారు. అంతరిక్షములో అగ్ని (వహ్ని)ని - **'వైద్యుతము'** అంటున్నారు. ఈ వైద్యుతమే స్వ-అంతరాత్మగతమై (In one's own self) కూడా ఉన్నది.

**సూర్యుడు :** ఆకాశములో సూర్యగోళముగా ఉన్న అగ్నియే దేహములో నాభిమండలము (బొడ్డుచుట్టూ) ఆవరించినదై ఉన్నది. సూర్యుడు ఆకాశంలో విషమును (భీకరాగ్నిని) వర్షించు వారై ఉండి కూడా, నాభియందు ఉన్ముఖుడై అమృతమును వర్షింపజేయుచున్నారు. అందుచేత 'అమృతవర్షిణి' - అనబడుతోంది.

**చంద్రుడు :** తాలు మూలలో (దవడ అంతర్భాగంగా) అధోముఖుడై సుధ (మాధుర్యము)ను వర్షింపజేస్తున్నారు.

**బిందువు :** భ్రూమధ్యస్థానములో బిందువు స్థితి కలిగియున్నది. శుద్ధస్ఫటికము వలె ప్రకాశమానము, ఇది మహావిష్ణువు యొక్క సూక్ష్మరూపముగా అభివర్ణితము.

### పంచాగ్నులు

(1) నాదజనన స్థానమగు **కాలాగ్ని** - శరీరములో **మూలాగ్ని.**

(2) విశ్వములో **బడబాగ్ని** - బొమికలలో **పార్థివాగ్ని.**

(3) అంతరిక్షంలో **వైద్యుతాగ్ని - స్వాంతరాత్మాగ్ని.**

(4) **సూర్యరూపాగ్ని** - పింగళినాడి.

(5) **చంద్రరూపాగ్ని** - ఇడనాడి.

ఏ యోగి అయితే సర్వ ప్రాపంచక వ్యవహారములలో ఉంటూ ఉన్నప్పుడు - వేరుగా ఉన్నప్పుడు కూడా, తినుచున్నప్పుడు - త్రాగుచున్నప్పుడు కూడా పై పంచాగ్నులను ఆత్మాభావనతో ఏకం చేసి భావిస్తూ ఉంటాడో, ఆతడు ఆవు నెయ్యిని యజ్ఞములో హుతము చేసిన ఉత్తమ ప్రయోజనము పొందగలడు. ఇందులో సందేహమే లేదు! అంతేకాదు. ఇట్టి పంచాగ్నిహోత్ర అనుసంధానము అనునిత్యముగా చేయువాని స్వప్నము, భోజనము కూడా సుఖమయము, రుచికరము, సుఖకరము అవుతాయి. **సుఖ సంసేవితం స్వప్నం। సుజీర్ణమ్ ఇతి భోజనమ్॥**

# యోగాభ్యాసము

**శివ భగవానుడు :** ఓ బ్రహ్మదేవా! బుద్ధి యోగముచే ఆత్మత్వము సిద్ధించుకోవటానికి ఈ జీవుడు **భావనా యోగమును,** భావనాయోగము కొరకై **క్రియాయోగాభ్యాసమును** ఆశ్రయించాలి. అందుచేత క్రియా-యోగాభ్యాసము గురించిన కొన్ని విశేషాలు ఇక్కడ ఉదహరించుకొందాము.

**(I) శారీరక శుద్ధి :** ముముక్షువు మోక్ష లక్ష్యసిద్ధి కొరకై మొట్టమొదట శుద్ధిచే మహత్తరముగా ఉపయోగించగల ఉపకరణమగు ఈ శరీరమును సిద్ధం చేసుకోవాలి. మితాహారము, మితమగు నిద్ర, మితమగు వ్యవహారశీలత అభ్యసించును గాక! శరీరములో 'మనస్సు' అనే ఉపకరణము సహాయముతో ధైర్య-స్థైర్య-ఉత్సాహములను నింపి ఉంచుకోవాలి.

**(II) సుఖాసనము :** శారీరక శుద్ధితరువాత రెండవ ముఖ్యమైన మెట్టు **- సుఖాసనము.** అధిక కాలము శరీరమును శ్రమ అనిపించకుండా నిశ్చల-ధారణ చేయగల ఆసనమును అభ్యసించాలి. అందుకుగాను యోగశాస్త్రము సూచించు దేహానుకూలమైన ఏదో ఒక ఆసనము ఆయా ప్రదేశానుకూలతల దృష్టితో, గురుముఖతః ఎరిగి స్వీకరించాలి.

**(III) ప్రాణ మార్గ శోధనము :** ప్రాణశక్తిని ఉపాసనా వస్తువు వలె ఉపయోగించుకొనబడుగాక! అందుకుగాను.. (1) రేచకము (గాలిని వదలటం) (2) పూరకము (గాలిని లోనికి స్వీకరించటము) (3) కుంభకము {గాలిని కదలకుండా ధారణ (భీష్మింపజేయుటము)} - **(మరియు) ధ్యాసను భ్రూమధ్యమున ఆజ్ఞాచక్రము వద్ద నిలిపిఉంచటము.** (4) పునఃరేచకము - వీటిని అవలంబించాలి.

**(IV) కుండలినీ శక్తి ఉపాసన : గుదం ఆకుంచ్య యత్నేన మూలశక్తిం ప్రపూజయేత్।** గుద, స్థానమును ఆకుంచ్యతను అభ్యసిస్తూ (నెమ్మదిగా ధ్యాసచే కదల్చుచూ) - దృశ్య ధ్యాస అనే 'మత్తు'ను ఆశ్రయించియున్న ఇచ్ఛా జ్ఞాన ఉత్సాహశక్తి రూపమగు కుండలినిని ప్రపూజిస్తూ, **ఊర్ధ్వమార్గ ప్రయాణమునకు (బ్రహ్మరంధ్రము వైపుగా) సంసిద్ధపరచాలి.**

**(V) ఉడ్డీయాణ బంధనము :** 'మూలధారము' నందు విశ్వశక్తి స్వరూపిణి అయి ఉన్న కుండలినీ శక్తిని ఉడ్డీయాణబంధన అభ్యాసముచే ప్రాణ-అపాన కుంభకాభ్యాసయోగము ద్వారా ఊర్ధ్వమార్గంగా చేసి లింగ-నాభి మధ్య ఆకాశములో ధారణ చేయాలి. అనగా ఇచ్ఛా-ప్రజ్ఞాశక్తి రూపమగు కుండలినిని అభ్యాసబలంతో లింగ-నాభిల మధ్యగా నిలిపి ఉంచాలి. స్వాధిష్ఠాన - మణిపూరకముల మధ్య ప్రదేశమును **"ఉధ్యాణపీఠము"** - అని అంటారు.

**(VI) జాలంధర ముద్ర / జాలంధర బంధము :** ఇప్పుడిక ప్రాణ-అపాన సమత్వమును పైపైకి తెచ్చుచూ కంఠమును సంకోచించు ధారణ చేయాలి. ఇది **"జాలంధర బంధము"** అని పిలవబడుతోంది.

**(VII) ఖేచరీ ముద్ర :**

> **శ్లో॥ బంధయేత్ ఖేచరీ ముద్రాం దృఢ చిత్తః సమాహితః**
> **కపాల వివరే జిహ్వా ప్రవిష్టా విపరీతగా,**
> **భృవోః అంతర్గతాః దృష్టిః ముద్రా భవతి 'ఖేచరీ'।**
> **ఖేచర్యా ముద్రితం యేన వివరం లంచిక ఊర్ధ్వతః॥**

(i)
- ☞ నాలుకను దవడకు నెమ్మదిగా తాకించుచూ,
- ☞ పై- క్రింద పళ్లు కలువనీయకుండా ధారణ చేస్తూ
- ☞ క్రమంగా నాలుకను మడచుచూ,.. దవడ యొక్క లోభాగము వైపుగా కదల్చుటను అభ్యాసిస్తూ
- ☞ జిహ్వాను కొంచము - కొంచము విపరీతముగా దవడలో భాగవైపు నియమించుచూ,
- ☞ జిహ్వా యొక్క అంతిమ విభాగము లంబిక (కొండనాలుక) యొక్క. చివర గల రంధ్రమును తాకిస్తూ ధారణ చేయుటము

(ii) ధ్యాసను భ్రూమధ్యలో గల ఆకాశములో (In the space between Two Eye Brows) నిలిపి ఉంచటము

ఇది **ఖేచరీముద్ర.** ఆ విధంగా (1) నాలుకను మడచి, నాలుక యొక్క చివరచే కొండనాలుకయొక్క బాహ్య రంధ్రమును స్పృశించి ఉంచటము, (2) ధ్యాసను భ్రూమధ్యలో నిలిపి ఉంచము, అను రెండు ముఖ్యమైన క్రియావిశేషములతో కూడిన ఖేచరీముద్ర వలన → బ్రహ్మరంధ్రము నుండి స్రవించు 'అమృతము' – లంబిక నుండి (కొండ నాలుక నుండి) అగ్నిలోనికి పతనము కాకుండా ఉండగలదు. అనగా, లంబిక (బ్రహ్మరంధ్రము యొక్క ఈ చివర) – శిరో ఉపరిభాగమున గల కపాలకేంద్ర బిందు స్థానముల మధ్యగా అమృతధారగా దృశ్య విషయములలో స్రవించు ధర్మమును విడచి ఉంటుంది.

**ఇట్టి ఖేచరీముద్రను దీర్ఘకాల అభ్యాసముచే సిద్ధించుకొన్నవానికి →**

- వాయు చలనము శరీరమంతటా సుస్థిరీకరించబడినది అవగలదు.
- ఆకలి, దప్పిక, నిద్ర, మెలకువ – ఇవన్నీ స్వవశంలో ఉంటాయి. ఇవి ఆ యోగిని బాధించనివై, సుఖప్రదాతలై ఉంటాయి.
- ఖేచరీ ముద్ర యొక్క ఉత్తమ ప్రయోజనంగా – **న చ మృత్యుః భావేత్ తస్య యో ముద్రాం వేత్తి ఖేచరీమ్** – ఖేచరీముద్రను ఎరిగి అభ్యాసించువాడు మృత్యువు యొక్క పరిధులను అధిగమించుచున్నాడు. మృత్యువుకు సాక్షి అగుచున్నాడు. ఆతని పట్ల మృత్యువు – 'లేనిదే' అగుచున్నది. నిద్రపోతూ "అయ్యో! జాగ్రత్ చేజారుతోందే?" అని అనుకోడు కదా! అట్లాగే, భౌతిక దేహము నశించినంత మాత్రంచేత ఈ జీవుడు కోల్పోయేదేమీ లేదు.
- **తతః పూర్వాపరే వ్యోమ్ని ద్వాదశాంతే అచ్యుతాత్మకా!** అమృతమును స్రవించు బ్రహ్మరంధ్రమునకు ఈవల లంబిక (కొండనాలుక) వైపుగా, 12 అంగుళముల ప్రదేశము, – ఆవల శిరో (కపాల) ఉపరిభాగంగా 12 అంగులముల ప్రదేశము (ఆకాశము)"లో గల చైతన్యరూపుడగు అచ్యుతాత్ముడుగా ఆ యోగి అగుచున్నాడు. అనగా ఆత్మాஉహమ్ భావన నుండి చ్యుతిపొందని వాడై ప్రకాశించుచున్నాడు. పూర్వాపర ఆకాశమును ఆత్మ భావనచే నింపి ఉంచుచున్నాడు.

'సహస్రదళము' అనబడే అంతరమున (సహస్రారంలో వేంచేసియున్న సహస్రదళ మధ్యగా) పీఠము అలంకృతమైయున్నది. ఆ సహస్ర దళాంతర్గత మధ్య స్థానమున (పీఠమున) ఆత్మానారాయణుడు చక్రవర్తియై అధిష్ఠించి ఉన్నారు.

- సహస్ర దళాంతర్గత మధ్యస్థాన ఉధ్యాణపీఠ అధిష్టితుడు,
- నిరాలంబుడు, నిరంజనుడు,
- అమృత రసమును సదా స్రవింజేయువాడు అగు **ఆత్మానారాయణునినే సర్వదా ధ్యానించాలి. ఆ ఆత్మానారాయణుని పట్ల అనునిత్యమగు ధ్యాస కలిగి ఉండటమే ధ్యానము, తపస్సు కూడా!**

అట్టి 'పరమునకే పరము' – పరాత్‌పరము అఖండ **స్వస్వరూపము..** యొక్క – **తస్మిన్ దృష్టే పరా వరే** సర్వత్రా ఆత్మదర్శనముచే ఆ యోగి యొక్క దృష్టి – **'సృష్టి, స్థితి, లయ'** పరిమితములను దాటివేసినదై, **సమగ్రమై ఉండగలదు. ఆత్మదృష్టియొక్క నిశ్చలతచే –**

- **భిధ్యతే హృదయ గ్రంథిః** హృదయ గ్రథులన్నీ ముడివీడుతాయి.
- **ఛిద్యన్తే సర్వ సంశయాః** జీవాత్మ – పరమాత్మ, బంధ – ముక్తి, ఇహ – పర, కర్మ – అకర్మ సంబంధితమై ఏర్పడి ఉంటున్న సర్వ సంశయములు సమసిపోతాయి.
- **క్షీయన్తే చ అస్య కర్మాణి॥** కర్మలకు సంబంధించిన "చేయాలి! పొందాలి! చూడాలి" మొదలైన కర్మ సంబంధిత సంస్కారాలన్నీ క్షీణిస్తాయి. **కర్మలలో అకర్మను, అకర్మయందే సర్వకర్మలను దర్శించువాడై, కర్మ పరిధులకు పరిమితమే కానట్టి ఆత్మనే సర్వే సర్వత్ర సందర్శిస్తూ** ఉండగలడు.

## యోగాభ్యాస సిద్ధులు

**పరమ శివ భగవానుడు :** హే సురేశ్వరా! పద్మ సంభవా! బ్రహ్మభగవాన్! ఇప్పుడు సుఖోపాయములుగా లభించే యోగసిద్ధుల గురించి చెప్పుకుందాము. వినండి. ఇవన్నీ ఆయా స్థానములను సంప్రదర్శనారూపంగా మనస్సుతో భావించి, ఉపాసించటమునకు సంబంధించినవే సుమా!

***(1) నాదే – మనోలయమ్ – దూర శ్రవణ కారణమ్।*** *'నాదము'పై (మరియు) నాదము జనించు స్థానముపై మనస్సును, ఏకాగ్రంచేయటంచేత 'దూరశ్రవణము' అను సిద్ధి లంభించగలదు.*

– ఏ యోగి అయితే ఇంద్రియములకు తానుగా వశం కాకుండా, ఇంద్రియములను, ఇంద్రియ విషయములను తన యొక్క ఉపకరణములుగా భావన – అవగాహనలు కలవాడై, తాను 'ఉపయోగించువాడు'గా వేరై ఉంటూ, శాంతముగా ఉంటూ, ప్రశాంత మనస్కుడై,

– శ్వాసను ప్రాణాయామాభ్యాసముల ద్వారా తన స్వాధీనముగా చేసుకొను అభ్యాసముచే కొనసాగిస్తూ ఉంటాడో...,
**ఆ యోగికి దూరముగా ఎక్కడో ఉన్న శబ్దములను వినగలుగు "దూరశ్రవణము" అను యోగసిద్ధి లభిస్తోంది.**

***(2) బిందౌ మనోలయమ్-దూరదర్శనమ్।*** మనస్సును విషయరహితము చేసి, బిందువు (The point where from the thought begins) నందు ఏకాగ్రపరచి ఉంచు అభ్యాసము చేత – **దూరంగా ఎక్కడో ఉన్న దృశ్యమును తానున్న చోటి నుండే చూడగలడు. (బిందువు = ఈ దృశ్య జగత్తు బయల్వెడలుచున్న మూలా స్థానము).**

**(3) కాలాత్మని మనోలీనం – త్రికాలజ్ఞాన కారణమ్।** యోగి తన మనస్సును కాలమునకే సాక్షిగా నియమిస్తూ, **'కాలాత్మ'** యందు లీనము చేసి (సర్వము కాలముతో వచ్చి కాలముతో ఉండి, కాలముతో పోతున్నదను ఎరుకయందు మనస్సు లీనముచేయు యోగాభ్యాసముచే) – అది **'త్రికాలజ్ఞానము'**నకు కారణమగుచున్నది.

**(4) పరకాయ మనో యోగః పరకాయ ప్రవేశకృత్।** ఇతరుల మనో సంచలనములను, మనోరీతులను **"ఆత్మయొక్క విన్యాస చమత్కారము"**గా గమనించు యోగాభ్యాసముచే క్రమంగా ఆతనికి **పరకాయ ప్రవేశవిద్య** అలవడుచున్నది.

**(5) అమృతం చింతయేత్ మూర్ధ్ని క్షుత్-తృష్ణా-విష శాంతయే।** మృతము (మార్పు-చేర్పులు) లేని అమృతమగు ఆత్మను మూర్ధ్ని ప్రదేశము (In the space of fore-face) నందు భావన చేయు యోగాభ్యాసముచే ఆకలి-దప్పిక- విషశాన్తి కలుగగల సామర్థ్యము ఆ యోగి పొందుచున్నాడు. (అమృతము = జాగ్రత్, స్వప్న సుషుప్తులతో, త్రికాలములలో **'ఏకము-అఖండము'** అయి ఉన్న స్వస్వరూపము).

**(6) పృథివ్యా ధారయేత్ చిత్తం పాతాళగమనం భవేత్।** చిత్తమును పృథివి (భూమి) యందు నిలిపి ధారణాయోగము అభ్యసించు యోగికి **పాతాళగమన విద్య** లభిస్తోంది.

**(7) సలిలే ధారయేత్ చిత్తం న అంబసా పరిభూయతే।** జల తత్త్వమునందు చిత్తమును నిలిపి యోగమును అభ్యసిస్తూ ఉండటం చేత, అట్టి యోగికి **జలము వలన హాని ఉండదు.**

**(8) అగ్నౌ సంధానయేత్ చిత్తమ్ అగ్నినా దహ్యతే న సః।** అగ్నితో చిత్తమును అనుసంధానం చేస్తూ యోగాభ్యాసము చేయు యోగిని **అగ్ని దహించదు.**

**(9) వాయౌ మనోలయం కుర్యాత్ ఆకాశ గమనం భవేత్।** మనస్సును వాయువు నందు లగ్నం చేసి యోగాభ్యాసము చేయువాడు **'ఆకాశ గమన విద్య'**ను పొందగలుగుతాడు.

**(10) ఆకాశాత్ ధారయేత్ చిత్తం అణిమాదికమ్ అప్నుయాత్।** చిత్తమును 'ఆకాశము' నందు ధారణ చేసి యోగాభ్యాసం చేస్తూ ఉంటే **'అణిమ' (అణువంతగా అవగల) సిద్ధి** సిద్ధిస్తోంది.

**(11) విరాట్ రూపమునందు** మనస్సును నియమించు అభ్యాసము చేయుయోగికి – 'మహిమలు' లభిస్తాయి. "మహిమలు" కలవాడుగా అగుచున్నాడు. (అసామాన్యముగా కనిపించు విశేష శక్తి-సామర్థ్యములు సిద్ధించగలవు).

**(12) చతుర్ముఖ** బ్రహ్మయందు మనస్సును యోగాభ్యాసము చేయువాడు [సృష్టి-స్థితి-లయ-పునః సృష్టి రూపములను (అనగా) బ్రహ్మ యొక్క 4 ముఖములుగా ఉపాసించువాడు] – జగత్ సృష్టిని నిర్వర్తించగల సిద్ధిని పొందగలడు.

**(13) ఇంద్రుని** రూపమును ఆత్మగా భావన చేసి ఉపాసించువాడు సకలము భోగించగలుగుతాడు. ఇంద్రియ జగత్తంతా ఆతనికి భోగ్య వస్తువుగా అనుభూతమగుచున్నది.

(14) స్థితికారుడగు **విష్ణుదేవుని** ఉపాసించువాడు సకల లోకములను పాలించగలడు. ఒక చక్రవర్తి తన పాలనలోని సామ్రాజ్యమును దర్శించు తీరుగా 14 లోకములను దర్శించగలడు.

(15) **రుద్రరూపము** నందు మనోయోగము చేయువాడు **సంహారశక్తి తేజస్సు** కలిగినవాడై ఉంటున్నాడు. **సమస్తము తనయందు సర్వదా ఆత్మగా లయమై ఉండి ఉన్నట్లు దర్శించగలడు.**

(16) నారాయణుని యందు మనస్సు నిలుపువాడు తాను నారాయణమయుడై ప్రకాశించుచున్నాడు. **"పరమాత్మ మహాసముద్ర జలస్వరూపుడై ఉండగా, జీవులుగా మనమంతా తరంగ స్వరూపులము"** – అను అనుభూతి సిద్ధించుకోగలడు.

(17) వాసుదేవతత్త్వము నందు మనస్సు నియమించువాడు సర్వసిద్ధులను పొందగలడు. 'ఈ జగత్తంతా వాసుదేవుని వాసనా చమత్కారమే' అని గ్రహించువాడు, (వాసనాత్ వాసుదేవస్య వాసితంతే జగత్త్రయమ్, సర్వభూత నివాసోఽసి, శ్రీవాసుదేవ నమ్మోఽస్తుతే)... ఇదంతా వాసుదేవమయంగా గ్రహించి ఉపాసించువాడు సర్వము పొందగలడు. **"ఈ సమస్తము నాకు చెందినదే కదా!"** అను ఒక చక్రవర్తి వంటి, ఒక నాటక రచయిత వంటి భావనను సిద్ధించుకోగలడు.

## యథా సంకల్పయేత్, తథా భవేత్

ఓ బ్రహ్మ భగవాన్! ఈ జీవుడు దేనినైనా (దృశ్య బంధమైనా, జన్మ-కర్మలనైనా, యోగసిద్ధులనైనా, జన్మరాహిత్య రూపమగు మోక్షమైనా) పొందటానికి **కారణం ఏది?** ఎవ్వరు? జగత్తా? కాదు. లోకపాలకులమగు మన త్రిమూర్తులమా? కాదు? ఇంద్రాది త్రిలోకాధిపతులా? దిక్పాలకులా? లోకములా? మరొక రెవరన్నానా? ఎవ్వరూ కాదు. మరి?

**స్వకీయ కల్పన చేతనే (లేక) స్వకీయ సంకల్పములచేతనే ఏదైనా ఆరీతిగా పొందబడుతోంది! (యత్ భావమ్ - తదేవ భవతి)**

అయితే ఇంద్రియములకు, ఇంద్రియ విషయములకు వశుడై విషయాభ్యాసరతుడై యున్నంత వరకు ఈ జీవుని బుద్ధి **విషయములచేతనే సంబంధితము, బంధితము అయి ఉంటోంది. వివేకము కూడా విషయపరిమితమైయుంటోంది.** (బుద్ధిః కర్మానుసారిణీ).. విషయముల ఆశ్రయములే ఉత్తరోత్తర ఉపాధులు నిర్ణయిస్తూ ఉండగా ఈ జీవుడు బద్ధుడై ఉంటున్నాడు. పరతంత్రుడగుచున్నాడు. స్వతంత్రుడు కాలేకపోవుచున్నాడు. "నేను పరతంత్రుడను" - అనునదే **బంధము.** "స్వతంత్రుడను" - అనునదే **మోక్షము.**

ఇక *యోగాభ్యాసి విషయంలో....,*

**శ్లో॥ యథా సంకల్పయేత్ యోగీ, యోగయుక్తో జితేంద్రియః**
**తథా తత్ తత్ అవాప్నోఽతి! భావఏవ అత్ర కారణమ్॥**

(1) యోగాభ్యాసమును ఆశ్రయించటము,
(2) యోగ బలముతో ఇంద్రియములను జయించి ఉండటము.

ఈ రెండింటి వలన జీవుడు ఇంద్రియ విషయ ప్రవాహ పరంపరలను స్వయముగా జయించి, **"స్వతంత్రుడు"** అగుచున్నాడు. యోగి వర్తమాన -ఉత్తరోత్తర స్థితిగతుల పట్ల - యోగాభ్యాసబలం కారణంగా - స్వీయ **నిర్ణయాధికారత్వము**ను స్వభావంగా సంతరించుకొనుచున్నాడు.

యోగయుక్తుడై ఇంద్రియములను జయించిన యోగి - దేనిని ఎట్లు సంకల్పిస్తే, తాను అద్దానిని అట్లే పొందుచున్నాడు. అందుచేత ఈ జీవుడు నిద్రలేచి, బద్ధకమును త్యజించి **యోగాభ్యాసముచే యోగయుక్తుడు కావాలి.**

## గురు ఆశ్రయమ్

ముముక్షువైనవాడు యోగ-జ్ఞానముల **సముపార్జన, సంసిద్ధి** కొరకై గురువును ఆశ్రయించాలి. యోగమును గురుముఖతః ఎరిగినవాడై, శ్రద్ధగా అభ్యాసమును నిర్వర్తించాలి. అప్పుడు బుద్ధి **నిర్మలము, సునిశితము, విస్తారము** అగుచున్నది. తత్ప్రభావం చేత గురువు బోధించు ('తత్త్వమ్-సోఽహమ్' మొదలైన) మహావాక్యార్థములను **దైనందిక- అనుక్షణిక స్వానుభవం**గా తీర్చిదిద్దుకోగలడు. అందుచేత **గురువు పట్ల గురుబోధల పట్ల అచంచలమైన విశ్వాసము ఉండాలి.** ఆ విశ్వాసము సర్వసందేహములను తొలగించగలవు. **'వీర్యత్వము'**నకు దారితీయగలవు. **"తత్ త్వమ్ - అదియే నీవు"** అని బోధించు గురువాక్య శ్రవణ-మననములే **"సోఽహమ్"**నకు సుఖమయ సోపానములు. "విశ్వాసము లేని చోట ఏ విద్య సిద్ధించదు. "ఆత్మవిశ్వాసము' పటిష్టమవదు.

అందుచేత హే బ్రహ్మభగవాన్! యోగ - జ్ఞాన మార్గములలో 'గురువు' పట్ల భక్తి ప్రపత్తుల గురించి మరల మరల ముముక్షువులందరికీ గుర్తుచేస్తున్నాను. వినండి!

**శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవః సదా అచ్యుతః।**
**న గురోః అధికః కశ్చిత్ త్రిషులోకేషు విద్యతే॥**

**గురుదేవుడు** బ్రహ్మదేవునితో, విష్ణువుతో, సదాశివునితో సమానంగా భావించెదరు గాక. స్వస్వరూపమును ఎరుగు విధానమును, మార్గమును తెలియజేసి ఆత్మభావన - యోగసిద్ధిలకు సహకరించు వస్తువుములో మరొక్కటేదీ లేదు. అందుచేత గురువుపట్ల ముముక్షువు భక్తి-శ్రద్ధలు, ప్రణిపాతిత్వము సర్వదా కలిగియుండెదరుగాక! **గురువును బ్రహ్మభావనతో ఉపాసించెదరు గాక!**

**'దివ్య జ్ఞానము'** అనబడు **'ఆత్మతత్త్వజ్ఞానము'** ఉపదేశించు గురువును ఎవ్వరైతే పరమభక్తితో పూజిస్తూ ఉపాసిస్తూ ఉంటారో,.. అట్టివారికి **'జ్ఞానఫలము'** తప్పక సులభమై లభించగలదు.

- గురువు ఎంతటివాడో,.. ఈశ్వరుడు (ఇష్టదైవము) అంతటివాడు!
- ఈశ్వరుడు ఎంతటివాడో,.. గురువు అంతటివాడే!

ఈ గురువు - ఈశ్వరులను (i.e Teacher and subject) సమానంగా పూజనీయులుగా భావించాలి. పరమాత్మతో సమానంగా సేవించాలి. **గురువు-ఈశ్వరుల మధ్య భేదము కనిపించనంతటి పవిత్ర భావన కలిగి ఉండాలి. విద్యార్థులందరికీ ఇది అనుసరణీయము.**

గురువు దగ్గిర వినమ్రుడై శరణాగతుడై ఉండెదరుగాక! గురుముఖతః వినుచున్న విశేషములను శ్రద్ధాళులై ఆచరించాలి.

**న అద్వైతవాదం కుర్వీత గురుణా సహ కుత్ర చిత్।** గురువు వద్ద జీవాత్మ - పరమాత్మల ఏకస్వరూపమగు అద్వైతము నేర్చుకొనుచూనే, గురువుతో అద్వైత భావన ప్రదర్శించరాదు. అనగా **"నేను మీరూ ఒక్కటే కదా!"** .. అను అద్వైత భావన పలుకరాదు. **"శిష్యుడుగా నేను జీవుడను. గురువుగా ఈయన నా ఉపాసనా దైవమగు పరమాత్మస్వరూపము"** - అను భావన కలిగి ఉండాలి. భావనచే గురువుతోను, ఈశ్వరునితోను అఖండత్వం కలిగి ఉంటూనే, **"జీవాత్మ భావనచే నాకు గురువు, ఈశ్వరుడు సర్వదా పూజనీయులే"**.... అను భక్తి భావన తప్పక కలిగి ఉండాలి. **దేహముతో సేవకుడుగాను, మనస్సుతో ప్రపత్తుడుగాను ఉంటూనే బుద్ధితో ఈశ్వర భావనను సంతరించుకొంటూ, చిత్తమును అద్వైతము వైపుగా పరుగులు తీయించాలి.**

❒ ❒ ❒

**'యోగము' యొక్క శీర్షము (Final State, పరాకాష్ట) అఖండమగు ఆత్మతో అనన్యత్వమే!**

తెలుసుకోవటం → **జ్ఞానము।**
అనుభవమవటము → **యోగము।**

***జగత్తుతో సంయోగ-వియోగాతీతరూపమగు ఆత్మతో యోగమే 'యోగశీర్షము'.***

**శ్లో॥ యోగశీర్షం మహాగుహ్యం యో జానాతి మహామతిః,**
**న తస్య కించిత్ అజ్ఞాతమ్ త్రిషులోకేషు విద్యతే॥**

మహారహస్యమగు ఈ **"ఉపనిషత్ సంబోధక - ఆత్మాఽహమ్"** రూపమగు **యోగశీర్షమును** ఎవ్వడు తెలుసుకొంటాడో, అట్టి మహామతికి ఈ త్రిలోకములలో తెలియవలసింది మరింకొకటేదీ శేషించి ఉండదు. అట్టివాడు స్వస్థుడౌతాడు.. ఆతని స్వస్థత - ఆయా పుణ్యాపాప విశేషములచేతగాని, సుఖ-దుఃఖ సందర్భములచేతగాని - చెడునది కాదు.

అట్టి యోగశీర్ష సంస్థితునికి - ఈ సంసార మండలములో **'పునరావృత్తి పొందటము'** - అనే దోషము ఉండజాలదు. - ఈ చిత్తము - ప్రకృతి స్వభావం చేత చంచలత్వము కలిగి ఉండవచ్చు గాక! చిత్తము యొక్క ఊర్ధ్వభాగము కేవలము - సమస్తము అగు "అఖండాత్మ" యందు సంస్థితమై ఉండగలదు.

యోగ సిద్ధుని విషయంలో ఆత్మజ్ఞానము చెక్కుచెదరదు. **నిత్య బద్ధమగు** జీవాత్మత్వమునకు కేవలము సాక్షి అయి, పరమాత్మత్వముచే **నిత్యముక్తత్వము** సంతరించుకొనువాడు - ముక్తుడే! న సంశయః॥

ఇత్యుపనిషత్

# 6వ అధ్యాయము
# కుండలినీ - సుషుమ్నా దేవీ ఉపాసన

**బ్రహ్మ భగవానుడు :** హే పరమేశ్వరా! జగద్గురూ! యోగాభ్యాసము విషయమై (1) **'ఉపాసనాక్రమము'** గురించి, (2) ఎద్దానిని గురించి ఎరిగినంత మాత్రం చేతనే ఈ జీవుడు సంసృతి **(సంసారబంధము, దృశ్యతాదాత్మ్య దుఃఖ స్థితి) నుంచి విముక్తుడు కాగలడో,** ... అద్దాని గురించి దయతో వివరించమని అర్థిస్తున్నాను.

**శ్రీ శివ భగవానుడు :** హే హిరణ్యగర్భా! మహాప్రాజ్ఞా! శ్రుతుల 'సారము'గా చెప్పబడుచున్న అతి రహస్యమగు 'ఉపాసనా ప్రకారము' చెప్పుచున్నాను. యోగోపాసకులగువారి **"సమ్యక్ ఉపాసనా ప్రయోజనము"**ను దృష్టిలో పెట్టుకొని ఇది వివరించుకుంటున్నాము. శ్రోతలు ఇందలి విషయమును గ్రహిస్తూ ఉపాసన కొనసాగించెదరుగాక.

ముందుగా,

**శ్లో॥ సుషుమ్నాయై, కుండలిన్యై, సుధాయై చంద్రమండలాత్,**
**మన ఉన్మన్యైః నమస్తుభ్యం మహాశక్త్యై చిదాత్మనే॥**

ఏ మహాశక్తీదేవి అయితై సమస్త దేహములలోను, విశ్వములోను కూడా సుషుమ్నానాడీ మార్గ దేవతయై, ఇచ్ఛా జ్ఞాన సమన్వితమగు కుండలినీ శక్తి స్వరూపిణిగా ఆసనమును అలంకరించినదై, కపాలమున గల చంద్రమండలము నుండి స్రవించు అమృతానందమగు సుధాస్రావిణి అయి ఉన్నదో, అట్టి **చిదాత్మ మహాతత్త్వమునకు నేను అనునిత్యము నమస్కరిస్తున్నాను.**

(యోగాభ్యాసి మొట్టమొదటగా అట్టి **చిదాత్మదేవికి హృదయపూర్వకముగా నమస్కరించునుగాక!)**

## సుషుమ్నాంతర్గతం విశ్వం – తస్మిన్ సర్వమ్ ప్రతిష్ఠితమ్॥

హృదయస్థానము నుండి బయల్వెడలుతున్న 101 నాడులు– ఇంద్రియ రంధ్రములతో సహా–దేహమంతా విస్తరించినవై ఉంటున్నాయి. అయితే, వాటిల్లో ఒకానొక శక్తివంతమగు నాడి మాత్రము 'మూర్ధ్నిస్థానము'నకు (Towards Top portion of foreface) వెళ్ళుచున్నది. అదియే **"సుషుమ్న"**.

తక్కిన 100 నాడులలో ప్రవేశ–నిష్క్రమణములు చేయుజీవులు ఇంద్రియ–ఇంద్రియ విషయములలో నిబద్ధత్వము పొందుచున్నారు. వారికి మృతత్వము దైనందిక మగుచున్నది. మరల మరల దేహ–దేహాంతరములలో దారితెన్ను తెలియని బాటసారివలె ప్రయాణములు సలుపుచున్నారు.

ఇక ఊర్ధ్వముగా వెళ్ళుచున్న ఏకైక ఊర్ధ్వనాడిని (సుషుమ్నను) యోగాభ్యాసముతో అనుసరించి మూర్ధ్నిస్థానము (foreface) చేరు యోగి **'మృతము'ను అధిగమించి, అమృతత్వమును సంతరించుకొనుచున్నాడు.** బుద్ధితో నిర్మలశీలుడై మార్పుచేర్పులు లేని **అఖండాత్మత్వమును** పునికి పుచ్చుకొనుచున్నాడు.

అట్టి 101వ – ఏకైక ('ఊర్ధ్వగమనం' గల) నాడిని **'పరానాడి'** అని కూడా పిలుస్తున్నారు. ఈ జీవుని 'ఇహ–స్వరూపము పరిమితము నుండి పరస్వరూపము యొక్క అనుభవమునకు దారి తీయగలదు కాబట్టి 'పరానాడి' **'సుషుమ్ననాడి'యే → ఆ పరానాడి.** ఆ పరానాడియే **'విరజ', 'బ్రహ్మరూపిణి'** అని కూడా చెప్పబడుచున్నది. అది బ్రహ్మరంధ్రము వరకు విస్తరించినదైయున్నది.

**ఇడా తిష్ఠతి వామేన। పింగళా దక్షిణేన తు।** సుషుమ్న నాడికి– ఎడమవైపు 'ఇడ' నాడి, కుడివైపు 'పింగళ' నాడి ఏర్పడి ఉన్నాయి. ఇడ–పింగళ నాడుల మధ్య గల తేజో–అగ్ని రూపము అయినట్టిదే సుషుమ్ననాడి. అట్టి–మధ్యగా గల పరతత్త్వమును (లేక) పరంస్థానము ఎవ్వరు తెలుసుకుంటారో, **– తయోః మధ్యే పరంస్థానం యస్తం వేద స వేదవిత్। –** ఆతడే **వేదవేత్త.** తెలుసుకోవలసినది తెలుసుకొన్నట్టివాడు.

నాసాభ్యాంతర చారిణి (ముక్కులో అంతరముగా పంచారములు చేయుచున్నట్టిది) అగు వాయు (లేక) ప్రాణచలనములను ప్రాణ యోగాభ్యాసముచే నిరోధిస్తూ స్వవశం చేసుకోవటం **– శివసాయుద్యమునకు ఉపాయము.**

⌘ **గుదస్య పృష్ఠభాగే అస్మిన్ వీణాదణ్డః స దేహభృత్।** గుదము యొక పృష్ఠ (వెనుక) భాగంలో 'వీణాదండము– (కుండలిని) ఉన్నది. అదియే ఈ దేహమును నడపుచున్న 'మూలాధారశక్తి' (లేక) మూలశక్తి.

⌘ అస్థి (బొమిక) – దేహపర్యంతము అతిదీర్ఘముగా బ్రహ్మనాడి ఉన్నది. అట్టి బ్రహ్మనాడి యొక్క చిట్టచివర సూక్ష్మమగు రంధ్రమున్నది. ఆ రంధ్రమును విజ్ఞులు **'సుషిరగము'** అని పిలుస్తున్నారు. (అదియే బ్రహ్మనాడి).

⌘ **ఇడా–పింగళయోర్మధ్యే సుషమ్నా 'సూర్య రూపిణి'।** 'ఇడ–పింగళ' నాడుల మధ్య గల తేజోనిర్మిత సుషుమ్ననాడి 'సూర్యరూపిణి' అని కూడా అంటారు.

⌘ **సర్వం ప్రతిష్ఠితం తస్మిం తు సర్వగం, విశ్వతో ముఖమ్।** అట్టి సుషుమ్ననాడియే – ఈ **విశ్వమంతా తన ముఖముగా కలిగి ఉన్నది.** అట్టి సుషుమ్న (లేక) బ్రహ్మనాడియందు ఈ సర్వము ప్రతిష్ఠితమై యున్నది. అట్టి సుషుమ్నయందు మధ్యగతమై – (1) సూర్య (2) సోమ (చంద్ర) (3) అగ్ని (4) పరమేశ్వరులు స్థానము కలిగి ఉన్నారు. ఈ జీవులతో కూడిన భూతలోకములు, దిశలు, క్షేత్రములు, సముద్రములు, పర్వతములు, శిలలు, ద్వీపములు, నదులు, వేదములు, శాస్త్రములు, పురాణములు, త్రిగుణములు.. ఇవన్నీ – స్థానము కలిగినవైయున్నాయి. (Every thing is placed in 'sushumna')

⌘ దేహమంతా ఆక్రమించి సుషుమ్న ఉండి ఉన్నది.

⌘ ఈ విశ్వము, దీని విశేషాలన్నీ సుషుమ్నయందే నిక్షిప్తమై, స్థానము కలిగి ఉన్నాయి.

⌘ బీజము, బీజాత్మకుడగు క్షేత్రజ్ఞుడు (జీవుడు), ప్రాణవాయువులు, ఆయా తదితర సర్వవిశేషములతో కూడిన ఈ విశ్వము... ఇవన్నీ కూడా సుషుమ్నయందే అంతర్గతమైయున్నాయి. **తస్మిన్ సర్వమ్ ప్రతిష్ఠితమ్।**

**నానా నాడీ ప్రసవగ్ంం సర్వ భూతాంతరాత్మని।** ఈ నానా నాడులకు కారణము, ఉత్పత్తి స్థానము సర్వభూతాంతరాత్మయే! నాడులన్నీ కూడా మూలము ఉర్ధ్వముగా చైతన్య స్వరూపమగు ఆత్మయందు ఉండి, వాటి శాఖలు బయటకు శరీరమంతా విస్తరించి ఉన్నాయి. అట్టి నాడులన్నిటి యందు (ఆత్మ నుండి బయల్వెడలిన శక్తి రూపమగు) ప్రాణవాయువులు ప్రసరణ మార్గములు కలిగి ఉన్నాయి. ద్విసప్తతి సహస్రాణి నాడ్యస్సుః వాయు గోచరాః। ప్రసరణము (లేక ప్రాణ ప్రసరణము) 72000 నాడులలో ఏర్పడి ఉన్నది. అడ్డ-దిడ్డములుగా ప్రసరించియున్న నాడులన్నింటిలోని వాయు ప్రసరణ మార్గములన్ని చివరిగా సుషిరములు (నాడులలో చివర చిన్న రంధ్రములు) కలిగియున్నాయి.

## కుండలినీ యోగము :

> శ్లో॥ **అధశ్చ ఊర్ధ్వన్చ కుండల్యాః సర్వద్వార నిరోధనాత్**
> **వాయునా సహ జీవ ఊర్ధ్వగామీ మోక్షమ్ అవాప్నుయాత్।**

'కుండలిని'కి పైన-క్రిందగా ఉన్న సర్వద్వారములు నిరోధించబడి ఉన్నాయి. (అట్టి నిరోధము తొలగాలి) ప్రాణ-అపానముల సమత్వ ధారణాభ్యాసముచే యోగశక్తి జనిస్తోంది. అట్టి జనితమైన శక్తితో కుండలినీశక్తి ఊర్ధ్వగామి (moving upward) అగుచున్నది. **అట్టి కుండలినిని బ్రహ్మరంధ్రమును జేర్చు ఊర్ధ్వగమనయోగముచే ఈ జీవుడు యోగమార్గముగా మోక్షము సిద్ధించుకొనుచున్నాడు.**

***అందుకు ఉపాసనా మార్గము***

- శరీరములో క్రింద మూలాధారం నుండి పై బ్రహ్మరంధ్రం వరకు విస్తరించియున్న 'సుషుమ్న'ను తెలుసుకోవటము. 'అనుభవము' యొక్క పరిధి (Into range of experience) లోనికి తేవటము.
- ఆ సుషుమ్నను ఛేదించి, వాయువును సుషుమ్నకు మధ్యగతంగా (ప్రాణాయామ విధానంగా) ప్రవేశింపజేయుటము.
- అందుకుగాను చంద్రస్థానమగు ఘ్రూణ రంధ్రము నందు వాయువును నిరోధించటము.

72000 నాడులు నాడీ పంజరమువలె (పంజరములో సన్నటి ఇనుపతీగలు అల్లుకొని ఉన్న విధంగా) ఉన్నాయి. ఒక్క సుషుమ్ననాడి (బ్రహ్మనాడి) మాత్రమే కుండలినిని బ్రహ్మరంధ్రమునకు జేర్చి ఈ జీవుని సంసారము నుండి తరింపజేయ గలదు.

(కుండలిని= ఇచ్ఛ+జ్ఞాన+క్రియల సూక్ష్మశక్తిస్వరూపము). బ్రహ్మనాడి తప్ప తక్కిన నాడీ విస్తరణములన్నీ నిరర్ధకమే। ఎందుకంటే, తక్కిన నాడీ ప్రసరణములు ఇంద్రియ విషయముల వైపుగాను, దృశ్య ప్రపంచమువైపుగాను, ఎక్కుబెట్టబడి ఉన్నాయి. 14 లోకములలో రాక-పోకలుగా సంసారగతికి ద్వారములు అగుచున్నాయి.

కనుక కుండలినికి **'రాజమార్గము'** - సుషుమ్న మాత్రమే! సుషమ్న మాత్రమే యోగాభ్యాసిని **"కేవల స్వరూప తత్త్వము"** నకు జేర్చగలదు కాబట్టి **'శాంభవీశక్తి'**గా అభివర్ణించబడుతోంది.

**"మధ్యమ" యోగాభ్యాసము (మధ్య-మధ్యమ-యోగము) :** తాలు (దవడకు లో ప్రదేశంగా) ఆత్మ-పరమానంద స్థానము వ్యవస్థితమైయున్నది. అది 'హృత్‌లేఖ' అని పిలువబడుతోంది. అట్టి హృత్‌లేఖ యందు (కుంభక ప్రాణయోగాభ్యాసముచే) ప్రాణ నిరోధమును నిర్వర్తించటము **"మధ్యమ-మధ్యమ యోగము"** అని పిలుస్తున్నారు.

(1) యోగి 'మధ్యమ' ప్రాణ నిరోధయోగం అభ్యాసిస్తూ, (2) బ్రహ్మరంధ్రము (శిరస్సుకు ఉపరిభాగమున గల బ్రహ్మనాడి చివరగా (సుషుమ్న యొక్క చివరగా) గల రంధ్రము (సుషిరగమ్) నందు నివాసము కలిగి యున్న పరాశక్తిని ఆరాధిస్తూ, (3) ప్రణవమును ఉచ్ఛరించుటచే - **భ్రమరము వలె సృష్టియందు వ్రాలుచున్న చిత్తము యొక్క వ్యసన పూర్వక పరిభ్రమణములు నిరోధించబడగలవు.** అట్టి యోగాభ్యాసి యొక్క సంసార భ్రమలు తమకు తామే తొలగిపోగలవు. **మహత్తరమగు అట్టి 'పరాశక్తిదేవి'యే నేను సర్వదా ఉపాసిస్తున్న దైవీతత్త్వము (లేక) దివ్యతత్త్వము.**

## "నమామి హంసమ్। పరమాత్మ రూపమ్॥"

**బ్రహ్మదేవుడు :** స్వామీ! నాకు, సమస్త జీవులకు ఆరాధ్యులై ఉన్న మీరు కూడా ఉపాసిస్తూ ఉన్నారా? దేనిని ఉపాసిస్తూ ఉన్నారు?

**శివ భగవానుడు :** ఇప్పుడు నేను దాసానుదాసుడనై ఎవ్వరిని చూస్తూ ఉపాసిస్తున్నానో చెప్పుచున్నాను. వినండి.

> **శ్లో॥ గమాగమస్థం, గమనాది శూన్యం, చిద్రూప దీపం, తిమిరాపహారం,**
> **పశ్యామి తే సర్వజన అన్తరస్థం, నమామి హంసమ్। పరమాత్మ రూపమ్॥**

ఏ పరమాత్మ రూపము (తత్త్వము) అయితే –

- సర్వుల యొక్క సర్వము యొక్క రాక–పోకలు తనకు చెందినవే అయి ఉన్నదో.. **గమ–ఆగమస్థం,** ఈ జీవుల రాకపోకలు తనయందే కలిగి యున్నదో,
- ఏది **"ఎక్కడి నుండియో ఇక్కడికి రావటము – ఎక్కడికో ఇక్కడి నుండి పోవటము"**–అను ధర్మమే కించిత్ కూడా కలిగియుండలేదో, (స్వప్నములో ఒకడు ఒక ఊరిన ఉండి మరొక ఊరికి వెళ్లి వచ్చినప్పటికీ, ఆతడు ఏ ఊరికీ వెళ్లనివాడు–ఏ ఊరు నుండి రానివాడు అయి ఉన్నాడో)..,
- 'ఎరుక' (Known) అనునదే తన రూపమై యుండటం చేత **చిద్రూప–రూపుడో,**

  ఏ వెలుగును కించిత్ ఆశ్రయించినంత మాత్రంగానే హృదయములోని సర్వ సంసారాంధకారములు మొదలంట్లా తొలగి, హృదయమంతా చిద్రూపదీప తేజస్సుతో (కేవలచిత్ రూపంగా - Absolute knowing + knownగా) వెలుగొందగలదో,
- ఏ పరమాత్మ సర్వజీవుల హృదయాలలో "జ్యోతిర్జోతి–పరంజ్యోతి" స్వరూపుడై జ్వాజ్వల్యమానంగా వెలుగొందుచూ నాయొక్క మూడవ నేత్ర – జ్ఞాన దృష్టికి ఎల్లప్పుడూ దృశ్యమానమగుచున్నారో,

సర్వాత్మకుడగు ఆయనయే పరాశక్తి। దేవి। పరమాత్మ। పరబ్రహ్మము. అటువంటి **"హంసం – సోఽహమ్–హంసోఽహమ్"** అగు పరబ్రహ్మ భగవానునికి అనుక్షణికంగా నమస్కరిస్తూ ఉన్నాను. సర్వదా సర్వత్రా ఉపాసిస్తున్నాను. ఆ పరమాత్మను నాకు – ఈ సమస్తమునకు **'అనన్యము'**గా దర్శిస్తూ శివానందానుభూతుడను అగుచున్నాను.

## జ్యోతి – ఉపాసన – పరమపదము

- హృదయాకాశము అనాహత స్థానమైయున్నది.
- అటువంటి అనాహతాకాశము (Vacant space of inner heart) నుండి 'శబ్దము' (నిశ్శబ్దమగు నిర్విషయమునుండి సవిషయమగు 'శబ్దము')– జనిస్తోంది.
- ఆ ధ్వని యొక్క అంతర్గతంగా (మధ్యగా) 'జ్యోతి'.
- ఆ జ్యోతికి అంతర్గతమై 'మనస్సు'.
- అట్టి మనస్సు దేనిలో జనించి, ప్రదర్శనమగుచున్నదో,.. అది విష్ణు–పరమపదము.

**ఆలోచన ఎక్కడ జనిస్తోందో అదియే సర్వాత్మకము, సర్వతత్త్వ స్వరూపము అగు పరమాత్మ। విష్ణుస్థానము। అదియే నేను సర్వదా ఉపాసిస్తున్న స్థానము. <u>అదియే నేను।</u>**

## సుషుమ్నా సరస్వతీ!

కొందరు, **"సుషుమ్న యొక్క రూపము సరస్వతియే!"** అని వర్ణిస్తూ ఉపాసిస్తున్నారు.

= సత్–రత్–వతీ= సత్ స్వరూపిణి అయి రతించు దేవి.

**ఏ సత్‌స్వరూపిణి జగత్తుగా రతిస్తున్నదో..! – అట్టి 'సుషుమ్న' అను సరస్వతియే జగత్తుకు ఆధారం.**

విశ్వము, జనిస్తున్నది, ఆ సుషుమ్నయందే! విశ్వమంతా ఎందులో **అనుక్షణమూ లయిస్తూనే ఉన్నదో** అదియే ఆరాధ్యమగు ఆత్మ! **ఆత్మయే, సరస్వతి! ఆత్మయే సుషుమ్న! అట్టి జగత్ లయస్థానమగు సుషుమ్న యొక్క స్వానుభవము** కొరకై **యోగాభ్యాసమే** ఉపాయము. ప్రాణ–అపానముల సమరస భావనచే సత్–రతత్వము రసత్వము కొరకై గురువును ఆశ్రయించి యోగాభ్యాసము నిర్వర్తించాలి. యోగాభ్యాసముచే అన్యముగా అనుభవమగుచున్న సమస్తము కూడా – **ఆత్మయందు లయింపజేయబడగలదు.**

సుషుమ్నయే – సర్వమునకు సృష్టి – స్థితి లయరూప ఆధారశక్తి. సమస్తమునకు ఆధారము।

అట్టి అనన్య–స్వకీయాత్మ స్వరూపమగు **ఆధారశక్తి నిదురిస్తే** – విశ్వము నిద్రించుచున్నది అగుచున్నది. (విశ్వభావన నిద్రితమౌతుంది). అట్టి **ఆధార శక్తి ప్రబోధము పొందితే** – త్రిలోకములు ప్రతిబుద్ధ్యము అగుచున్నాయి. (బుద్ధికి గోచరించినవిగా అగుచున్నాయి). అటువంటి **సర్వాత్మకమగు ఆధారశక్తిని ఎవ్వరు తెలుసుకుంటారో,.. అట్టివారు అజ్ఞానాంధకారమును అధిగమించివేయగలరు.**

**'సుషుమ్న' రూపిణియగు ఆధారశక్తి గురించి తెలుసుకొన్నంత మాత్రం చేతనే ఈ జీవుడు సర్వ దోషముల నుండి విముక్తుడు కాగలడు.**

అట్టి ఆధారశక్తి – ఈ దేహముతో విద్యుత్ మెరుపుతీగలు వెదజల్లు కాంతి పుంజముల వంటి ప్రభలు వెదజల్లుచున్నట్టిది. ఎవ్వరు 'సుషుమ్న' అనబడు ఆధారచక్రము యొక్క ప్రదర్శనమును తాత్త్వికార్ధపూర్వకంగా తెలుసుకుంటారో, వారు ఈ జగత్ తత్త్వమును ఎరిగి **తుష్టిని పొందుచున్నారు. ముక్తులగుచున్నారు. స్వయం గురువులు అగుచున్నారు.** (ఆత్మైవహి గురుః). మహత్తరమగు ఆధారశక్తి యొక్క యోగాభ్యాస సిద్ధిచే పుణ్య–పాప–ఇత్యాది సర్వ ద్వంద్వ మోహములను యోగులు తొలగించుకొనుచున్నారు.

**ఆధార వాత రోధేన లీయతే గగనాన్తరే।** వాయువు వీచుచూ, వీచుచూ ఆధార గగనాంతరములో (ఆత్మాకాశములో) విలీనము పొందుచున్నది. ఈ శరీరము కూడా అట్టి ఆధారము నుండి బయల్వెడలు వాయుకదలికల చేతనే ప్రాణశక్తి సమన్వితంగా ప్రకంపనలు (కదలికలు) పొందుతోంది. **"ఆధారములో వాయువు యొక్క నిరోధము"** అనురూపంగా బుద్ధిని నిలుపుటచే ఆ యోగి నటరాజ నృత్యము సరదర్శించుచున్నాడు. **ఆధారవాత రోధేన దృశ్యం తత్రైవ దృశ్యతే।** ఆధారవాత నిరోధము చేతనే ఈ విశ్వము ఈ విధంగా అగుపిస్తోంది ఈ సృష్టికి ఆధారం ఆత్మయొక్క ఆధారశక్తియే! ఆధార చక్రమునందే సర్వదేవతలు, వేదములు సంస్థితమైయున్నాయి. **ఆధారే సర్వ వేదాశ్చ। అందుచే 'సుషుమ్న' అనబడు ఆధార చక్రమును యోగి ఉపాశ్రయించునుగాక! తస్మాత్ ఆధారమ్ ఆశ్రయేత్।**

## ఆధార పశ్చిమే భాగే త్రివేణీ సంగమో భవేత్

ఆధార చక్రము యొక్క (సుషుమ్న యొక్క) పశ్చిమభాగంలో ద్రష్ట–దర్శన–దృశ్యముల సంగము(ఏకత్వము) ఏర్పడి ఉంటోంది. అట్టి త్రివేణి సంగము నందు స్నానము చేయుటచేత, నీరుత్రాగుటచేత యోగి యొక్క సర్వపాపములు, దోషములు ప్రక్షాళనమగుచున్నాయి.

(పశ్చిమము – The external side of Self).

ఆధారము యొక్క పశ్చిమంగా జగత్తుగా మూర్తీభవించిన దృశ్యచమత్కారమంతా ప్రదర్శితమౌతోంది.

ఆధార పశ్చిమ లింగ కవాటము (జగత్ భేదభావనా రూపమగు) తెరచుకొన్న యోగియొక్క భవ బంధములు తెగిపోవుచున్నాయి.

సుషుమ్నోపాసకుడు క్రమంగా (మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా అనబడే) షట్చక్రములను భేదించివేసి, బ్రహ్మరంధ్రము నందు (యోగ–అభ్యాసబలముచే) కుండలినీశక్తిని జేర్చుచున్నాడు. **ఏ యోగి వామదక్షిణములను (ఇడ–పింగళనాడులను) నిరోధించి సుషుమ్నమందు ప్రకాశితుడై, బ్రహ్మరంధ్రము నందు (సుషుమ్న ద్వారా) ప్రవేశము పొందుచున్నాడో, అట్టి వాడు 'పరమాగతి' అనబడు ఆత్మసాక్షాత్కారము పొందుచున్నాడు.**

- ఏ యోగి పట్ల కుండలినీదేవి సుషుమ్నయందు హంస (సోఽహమ్) బ్రహ్మరంధ్రము (లేక) బ్రహ్మకపాలము వైపుగా ఊర్ధ్వముఖమై ఉంటోందో (ప్రాణా అపానముల సమత్వము సుషుమ్న యందు పైకి ఎగయుచూ ఉంటుందో),
- సుషుమ్న యొక్క – యోని అంతరమున ప్రాణశక్తి ప్రశాంతముగా సంచారము కలిగి ఉంటోందో,
- సుషుమ్న యందు ప్రాణము తనయొక్క చంచల స్వభావము వదలి స్థిరత్వము సంచరించుకుంటోందో,
- ఏ యోగి యొక్క సుషుమ్నయందు చంద్ర–సూర్యులు (ఇడ–పింగళనాడులు) లయత్వమును పొందుచున్నారో
- ఏ యోగి సర్వే సర్వత్రా సమరసమగు ఆత్మభావనను కించిత్ కూడా వీడనివాడై ఉంటాడో..., భిన్నత్వంగా కనిపిస్తున్న దృశ్యముయొక్క సమస్తములో 'ఏకత్వము' గమనించువాడై ఉంటాడో, –

## అట్టి వాడే యోగవేత్త!

- ఎవ్వని యొక్క సుషుమ్న నుండి ఆ యోగిచే తన మనోవేగము, మనోకదలికలు గమనించబడుచూ ఉన్నాయో,
- ఏ యోగి ఒక క్షణకాలమైనా సుషుమ్నయందు ప్రశాంతముగా సుతిష్ఠితుడై ఉంటాడో,
- ఒక ఉప్పుగడ్డ నీటిలో కలిసినప్పుడు అది నీటిలో కరిగిపోయి,–తన ఆకారాదులు త్యజించి–ఆ నీటితో ఏకమైపోవు విధానంగా
  – ఏ యోగి 'సుషుమ్న'యందు సులగ్నుడు అయిపోతూ ఉంటాడో,
  – క్షీర నీరముల వలె సుషుమ్నతో మమేకమైపోతాడో,

**అట్టి యోగి యొక్క (బ్రహ్మ–విష్ణు–రుద్ర) త్రిగ్రంథులు తెగిపోతాయి.** (సృష్టి "సృష్టించబడిది–పరిపోషించబడుతోంది– లయించబడుతోంది" అను భ్రమలతో నిర్మితమైన) **చిక్కుముళ్లు విడిపోతాయి.**

- స్వస్వరూపమునకు సంబంధించిన స్వీయకల్పిత సంశయములన్నీ తొలగిపోతాయి.
- సర్వము పరమాకాశమునందు కరిగిపోతాయి. **తే యాన్తి పరమాగతిమ్! ఆ యోగి పరమగతిని సిద్ధింపజేసుకుంటున్నాడు.**

# సుషమ్నా ధ్యానయోగము

**శివభగవానుడు**: ఓ బ్రహ్మదేవా! (1) సుషుమ్నయందు సర్వము దర్శించటము, (2) సుషుమ్నయందు కుంభక ప్రాణాయామము, (3) కుండలినీశక్తిని ప్రాణ-అపానహస్తములతో, అగ్ని సహాయంతో సుషుమ్నయందు ప్రవేశింపజేయుటము, (4) కుండలినీ శక్తిని బ్రహ్మరంధ్రము (సుషిరగము) వరకు ఊర్ధ్వముఖం చేయటము, (5) సుషుమ్నయందు ప్రాణనిరోధము, (6) సుషుమ్నయందు విష్ణుదర్శనం - సర్వదర్శనం- మొదలైన ఆయా విశేషాలన్నీ ఇప్పటిదాకా చెప్పుకున్నాము కదా! ఇప్పుడు **"మధ్యనాడీ, (సుషుమ్ననాడి) ప్రదర్శనములు"** అనబడు మహత్తర యోగాభ్యాస విశేషము గురించి చెప్పుకుందాము.

ఎంతటి మహత్తరమైనవంటే.., గంగాస్నానము; సముద్రస్నానము; మణికర్ణికకు నమస్కరించటము మొదలైనవన్నీ కూడా **'మధ్యనాడీవిచారణ'** అనే యోగాభ్యాసఫలములో 1/16వ వంతుకు కూడా సమానము కాదు.

**శ్రీశైల దర్శనాత్ ముక్తిః; వారణాస్యాం మృతస్యచ(మరణము); కేదారంలో ఉదకపానంవా...,** వేయి అశ్వమేధయాగములు; వంద వాజపేయ యజ్ఞములు; ఇవన్నీ **"సుషమ్నా ధ్యానయోగము"** యొక్క **ఆత్మతాదాత్మ్య ప్రయోజనము** లో 1/16వ వంతుకు కూడా సమానము కాదు.

సుషమ్న యొక్క గోష్ఠి (Chanting, speaking, adoring) - ఏ యోగాభ్యాసి నిర్వర్తిస్తాడో,... అట్టివాడు సర్వదోషముల నుండి తనను తాను శుద్ధి పరచుకొని, గొప్పశ్రేయస్సును పొందుచున్నాడు.

సుషుమ్నయే - పరమ పవిత్ర తీర్థము

సుషుమ్నయే - మహత్తరమగు జపము, అన్ని జపములలో గొప్పజపము.

సుషుమ్నయే - ధ్యానములలోకెల్ల గొప్ప ధ్యానము.

అనేక యజ్ఞములు, దానములు, వ్రతములు, నియమపాలనలు - ఇవన్నీ 'సుషమ్నాధ్యానము' యొక్క లవలేశములో 16వ వంతునకు కూడా సరితూగవు.

## జీవాత్మ




సుషమ్న → మూలాధారము నుండి బ్రహ్మరంధ్రము (సుషిరగ్ం) వరకు తేజోరూపమున, అగ్ని రూపమున వెలుగొందుచున్నది.

బ్రహ్మరంధ్రమహాస్థానములో → సతతము శివభగవానుడు వర్తిస్తూ ఉంటారు.

కపాల మధ్యభాగంలో (మధ్యమే) → చిచ్ఛక్తిరూపిణి యగు పరమాదేవి సుప్రతిష్ఠితయై ఉన్నారు.

లలాట - (foreface) అగ్రభాగంలో ఆకాశపద్మమునందు → మాయా శక్తి ఆకాశపద్మములో ఉన్నది.

లలాటమునకు క్రింద భాగంగా - అపరాంశగా నాదరూపంగా పరాశక్తి ప్రకాశమానమై ఉన్నది.

బిందుమధ్యగా భృకుటిలో బొట్టుపెట్టుకొను ప్రదేశములో- జీవాత్మ సూక్ష్మరూపాంశలతో వర్తిస్తున్నారు।

### జీవుని స్థూలరూపము

- హృదయములో స్థూలభావనారూపుడై (As sense of thought and feelings) జీవుడు ఉంటున్నాడు.
- (శరీరము మధ్యభాగంలో) బిందుమధ్యమున జీవాత్మ సూక్ష్మ రూపములో ప్రవర్తమానుడై ఉంటున్నాడు.

జీవుడు ఈ విధంగా హృదయాకాశములో స్థూలరూపుడై, తనువు యొక్క మధ్యగా **'మధ్యమా'**గా పిలువబడుచున్నాడు. ఈతడు ప్రాణ-అపానములకు వశుడై క్రిందికి-పైకి అవిశ్రాంతంగా దేహంలో తిరుగాడుచున్నాడు.

సుషుమ్న యొక్క ఎడమ-కుడి నాడీమార్గాలలో (ఇడ-పింగళలలో) అనుక్షణమూ తిరుగాడుచూ ఎక్కడా ఒకచోట నిలవటమే లేదు. భుజదండములచే ఎత్తి కొట్టబడుచూ ఉన్న పూబంతి (or like a Foot-Ball) ప్రాణ-అపానములచే ఎత్తెత్తి కొట్టబడుచూ ఈ జీవుడు ఎక్కడా ఒకచోట కించిత్ కూడా విశ్రాంతి లేనివాడై శ్రాంతి-శ్రమలను పొందుచూ వర్తిస్తున్నాడు. తన అశాంతిని దృశ్యముపై ఆపాదిస్తూ ఎప్పటికప్పుడు రోజులు గడుపుచున్నాడు. "ఒక విషయమును భావావేశపూర్వకంగా ఆశ్రయించటము - కామ లోభములు కలిగి ఉండటము - మరల మరొక విషయముపై వ్రాలటము-కామ లోభములు కొనసాగించటము" నిర్వర్తిస్తున్నాడు.

**అపానః కర్షతి ప్రాణః** → బయటకు వెళ్లు అపాన వాయువు లోనికి వస్తున్న వాయువును (ప్రాణమును) ఆకర్షిస్తోంది.

**ప్రాణో అపానస్చ కర్షతి** → లోనికి వస్తున్న వాయువు (ప్రాణము) - అపానమును (బయటకు వెళ్లుగాలిని) ఆకర్షిస్తోంది.

ప్రాణ-అపానముల పరస్పరాకర్షణల కారణంగా ప్రాణశక్తి సమన్వితుడైన ఈ జీవుడు అనిర్వచనీయమగు వేదన (An unexplainable worry)కి లోను అయి ఉంటున్నాడు.

'హ' కారముతో వాయువు బయటకువెళ్లుచున్నది. 'స' కారముతో లోనికి వచ్చుచున్నది. **(హకారేణ బహిఃయాతి! సకారేణ విశేత్ పునః)**




- ఈ జీవుడు 'హంస-హంస' మంత్రమును ఎల్లవేళలా జపిస్తూనే ఉంటున్నాడు.
- అట్టి ప్రాణ-అపానములకు ఆధారము "హంస-సోఽహమ్"?

  (**హం** = 'కేవలము' నుండి సందర్భములోనికి, **స** = సందర్భమునుండి 'కేవలము'లోనికి)

ఏ విద్వాంసుడైతే అక్షరము - అనునిత్యము అగు **'సోఽహమ్'**ను ఎరుగుచున్నాడో, ఆతడే **"యోగవిత్"!**

## యోగాభ్యాసి - పరంజ్యోతి

యోగి మూలాధారము నుండి కుండలినీ శక్తిని కంఠ ఊర్ధ్వమునకు బుద్ధిపూర్వకంగా ప్రాణ-అపాన నిరోధయోగాభ్యాసము యొక్క ప్రయత్నములో సుషుమ్ననాడి ద్వారా నడిపిస్తున్నాడు. కంఠ ఊర్ధ్వమునకు చేరిన కుండలినీ శక్తి యోగులకు ముక్తిదాయకముగా అగుచున్నది. మూఢులకు ఏ సంసారము **బంధమగుచున్నదో,** ఆ సంసారము (లేక) దృశ్యము యోగాభ్యాసికి **ముక్తికై 'ఉపకరణము'** అగుచున్నది.

భూః భువః సువః - త్రిమాత్రలు
చంద్ర సూర్య అగ్ని - త్రిదేవతలు

ఇవన్నీ ఎద్దాని యందు మాత్రలో (అంతర విభాగ చమత్కారములో) అదియే **'పరంజ్యోతి'!** అది 'ఓం' - అని వేద-శాస్త్ర-ఇతిహాసములచే పిలువబడుతోంది.

కాలములు - 3 → భూత వర్తమాన భవిష్యత్తులు;
దేవతలు - 3 → బ్రహ్మ- విష్ణు - మహేశ్వరులు; (సృష్టి-స్థితి-లయాభిమానులు)
లోకములు - 3 → స్వర్గ-మర్త్య-పాతాళములు; (కేవలసత్ భావన - వృష్టి భావన - పాదార్థిక భావన)
స్వరములు - 3 → ఉదాత్త- అనుదాత్త-మధ్యమములు;
వేదములు - 3 → ఋక్-యజుర్-సామములు;

ఇవన్నీ సర్వదా ఎందులో సంస్థితమై, అద్దానికి సర్వదా అనన్యమైయున్నాయో,.. అదియే 'ఓం' సంజ్ఞచే ఉద్దేశ్యించబడుచున్న **పరంజ్యోతి (లేక) పరమాత్మ (లేక) అఖండాత్మ!**

## సంసారము – మోక్షము

**బ్రహ్మదేవుడు :** స్వామీ! పరమశివా! బంధము ఏది? మోక్షము ఏదై ఉన్నది?

**పరమశివుడు :** చిత్తము చాంచల్యము కలిగియుంటున్నప్పుడు – అదియే **'సంసారము'** అని అనబడుచున్నది. **చిత్తే చలతి సంసారో!** చిత్తము నిశ్చలత్వము వహించినదై ఉంటే – అదియే **మోక్షము – నిశ్చలం 'మోక్ష' ఉచ్యతే॥**

అందుచేత ఓ బ్రహ్మభగవాన్! విధిదేవా! ఈ జీవుడు చిత్తమును ప్రజ్ఞ సాధనలతో 'పరము'నకు (The Absolute self beyond all this else) జేర్చాలి.

**చిత్తం కారణం అర్థానామ్।** సర్వ అర్థములకు, అనర్థములకు చిత్తమే కారణం. **తస్మిన్ సతి జగత్రయమ్!** ఈ మూడు లోకములుగా కనబడుచున్నట్టిది చిత్తమే. చిత్తమే ఇదంతా. చిత్తము క్షీణిస్తే ఆత్మకు అన్యభావనారూపమగు జగత్తు (జనించి–గతించేదంతా) క్షీణిస్తుంది. అందుచేత, ఈ చిత్తమునకు ప్రయత్నపూర్వకంగా చికిత్స చేయాలి. **(ఇహైవ నరకవ్యాధే చికిత్సాం న కరోతియః, గత్వా నిరౌషధ స్థానం స రుజః కిం కరిష్యతి?– యోగవాసిష్ఠము)** – చిత్తమునకు 'చికిత్సలు' అనే వసతులు గల మానవ జన్మలో చిత్తశోధనం చేసుకోకపోతే, మరెప్పటికి? ఎచ్చట? ఉపకరణములు ఉన్న స్థానములో (మానవ జన్మలో) బద్ధగించి, ఎటో ఉపకరణములు లభించని స్థానములకు వెళ్ళి ఈ జీవుడు ఏమి చేయగలడు?

## మనస్సు – ఉన్మనీ

**బ్రహ్మ భగవానుడు :** శివదేవాది దేవా! ఈ మనస్సు ఎటువంటిదో, దయచేసి వివరించండి.

**శివ భగవానుడు :**

**మనో అహమ్ గగనాకారమ్:** ఆకాశము వలె అనంతాకారము అగు మనస్సు అనుబడునది 'నేనే'! నేను అనన్యుడను! అందుచేత మనస్సు నాకు అన్యము కాదు!

**మనోఽహమ్ సర్వతోముఖమ్:** సర్వత్రా అసంఖ్యాక ముఖములుగల 'మనస్సు' అనునది నేనే!

**మనోఽహమ్ సర్వ ఆత్మా చ :** సర్వాత్మకమగు మనస్సు నేనే! మనస్సే ఈ అనంత జీవాత్మలుగా ప్రదర్శనమౌతోంది.

**న మనః కేవలం పరః! :** అయితే, నేను సర్వదా కేవలుడనై ఉండగా, మనస్సు కేవలము కాదు, (It is not absolute. It is merely relative). నేను పరమును (Iam always Beyond). కానీ **మనస్సు పరము కాదు. ఇహములోనిది మాత్రమే.** (అనగా)

'మనస్సు' అనబడునది మొదలే నాకు వేరుగా లేదు. ఈ జగత్తులో జరుగుచున్న కర్మవ్యవహారములన్నిటికీ (All functions) జనన స్థానము మనస్సే. మనస్సు అనేక దోషములచే కప్పబడినదై ఉంటోంది. అట్టి మనస్సు తనయొక్క జననస్థానము అగు ఆత్మను దర్శించుటచే – ఈ మనస్సు కాస్తా 'ఉన్మనీ' (Witness and silent operator of thought) స్థితిని పొందుచున్నది. మనస్సు ఉన్మనీ స్థానమగు ఆత్మలో ప్రవేశించిందా,.. ఇక 'పుణ్యము' అనునదీ లేదు. 'పాపము' అనునదీ లేదు.

## మనసా మన ఆలోక్య

ఒక నటుడు నాటకంలో ఒక పాత్రగా నటిస్తూ........,

| స్వగతమగు మనస్సు<br>**"సాక్షి"**<br>(కేవల మనస్సు)<br>(Acting thought) | పాత్రకు సంబంధించిన మనస్సు<br>**"పాత్రగా నటించటము"**<br>(నాటకములోని పాత్రకు సంబంధించిన మనస్సు)<br>(Role - concerned thought) |
|---|---|

ఈ రెండింటినీ విడివిడిగా ఉంచుకొనుచున్నాడు కదా!

అట్లాగే **"వృత్తి రహితమైన మనస్సు"**తో **"వృత్తిసహితమైన జగన్నాటకములోని మనస్సు"** ను సాక్షిగా సందర్శించుచున్నప్పుడు, అట్టి అభ్యాసముచే సుదుర్లభము – సర్వమునకు పరము అయినట్టి – **'తత్ పరబ్రహ్మము'** యొక్క సందర్శనము సిద్ధించగలదు. ఆత్మతో మమేకత్వము స్వానుభవమవగలదు.

**<u>ముక్తి : మనసా మన ఆలోక్య ముక్తో భవతి యోగవిత్!</u>**

యోగాభ్యాసముచే యోగవేత్త అయినట్టి యోగి- 'మనస్సుతో మనస్సును చూస్తూ ఉండటము' అను అభ్యాసముచే ముక్తిని పొందుచున్నాడు. (సాక్షీ భూతమైన 'మనస్సు' - సందర్భములలో పాల్గొనుచున్న మనస్సును సాక్షిగా దర్శించగలగటమే ముక్తి).
(ఒక తెలివైన నటుడు తాను వేరై ఉంటూ, తాను నటిస్తున్న పాత్రను తనకు వేరుగా చూస్తున్న తీరుగా)

- మనస్సుతో మనస్సును ఆలోకనం చేస్తూ - మనస్సుకు మునుముందే ఉన్న **'ఉన్మనీత్వము'**ను ధారణ చేయు అభ్యాసము నిర్వర్తించాలి. (With the Help of Fixed Thought, the Variable Part of the Thoughts be observed).
- మనస్సుతో మనస్సును గమనించటము (observing thoughts through 'Thought of self') - అను 'యోగనిష్ఠ' యందు సర్వదా ఉండటము అభ్యసించాలి.
- మనస్సుతో మనో ఆలోకనముచే- ఈ దృశ్యమునకు (జగత్తుకు) ప్రత్యయము, ఆధారము, కేవలము అగు ఆత్మ- (The Absolute) - **అనుభవము యొక్క పరిధిలో లభించుచున్నది.** దృశ్యమును చూస్తూనే, ఈ దృశ్యమునకు ఆధారముగా అంతర్లీనంగా ఉన్న ప్రత్యయస్వరూపమును [ప్రత్యక్ తత్త్వమగు ఆత్మను (లేక) స్వస్వరూపమును] దర్శించువాడు - **"యోగీశ్వరుడు"** అగుచున్నాడు.
- "బిందువు, నాదము, కల, జ్యోతి" - ఇవన్నీ అబిన్దుస్థానము చేరుటకు ధృవములగు సాధన సంపత్తులు. తరింపజేసే తారకములు.
- **ఇక పరబ్రహ్మమో?** 'శాంతము'నకు కూడా ఆవల అతీతమై, కేవల సాక్షిగా ఉన్నట్టిదే **'పరబ్రహ్మము'**గా పిలువబడుతోంది.

## చిత్త విన్యాసము

<u>ఈ చిత్తము కొంతసేపు నవ్వుతూ ఉంటుంది. ఉత్సాహంగా ఉంటుంది. క్రీడా వినోది అయి ఉంటుంది. సంతోషముతో గంతులు వేస్తూ ఉంటుంది.</u>

- నేను దేహముతో జీవిస్తూ, **"దేహమునకు మాత్రమే పరిమితుడనైన వాడను"**- అని పరిమితమైన దృష్టిని తెచ్చిపెట్టుకుంటోంది. అనేక భయ-ఉద్వేగములతో, ఉద్రేకములతో భౌతికత్వమంతా నెత్తిమీదకు తెచ్చిపెట్టకుని ఉంటోంది.
- బాధ-ఆదుర్దా-ఆవేదన-ఆశ-దురాశ-పేరాశలన్నీ ఒక్కసారిగానో, ఒకటి తర్వాత మరొకటిగానో పొందుతూ ఉంటోంది. రోదిస్తోంది. కారణం లేకుండా వేదన పొందుతోంది.
- శత్రువులను, వారి కార్యక్రమములను చూచి భయము, అసూయ, కోపము.. మొదలైనవన్నీ పొందుతోంది.

ఈ చిత్తము - ఒకవైపు నవ్వుతూ ఉంటూనే, మరొకవైపు కోరికలందు రమించుచూ, వాటి ఫలితములగు దుఃఖములన్నీ పొందుతోంది. అనేక ఆశయములు, అభిప్రాయములు, కోరికలను (Expectation) - అంతరంగంలో ఉద్రేకపూరితంగా కలిగి ఉంటోంది. ఈ విధంగా అనేక కామములు (Desires, expectations, etc.) తనయందు కలిగియుండి, క్షణక్షణము 'కామాతురత' కలిగి ఉంటోంది.

**ఓ బ్రహ్మదేవా!** ఒకడు శత్రువును జయించాలంటే, ఆ శత్రువు ఎట్టివాడో, ఎక్కడివాడో, ఎంతటివాడో ముందుగా తెలుసుకొని ఉంటాడు కదా! అట్లాగే, **చిత్తం విజానీయాత్ కళేబరే!** ఈ చిత్తశరీరము ఎట్టిదో ముందుగా తెలుసుకొని ఉండాలి. ఈ విషయమై ఒక ముఖ్యవిశేషమును వినండి.

## చిత్తము-ప్రాణము

ఏ ప్రదేశములో ప్రాణశక్తి వ్రాలుచున్నదో, అక్కడికి చిత్తము కూడా అప్పటికప్పుడే వచ్చి చేరుతుంది. ప్రాణమున్నచోటే చిత్తము కూడా ధృవముగా ఉనికి-వసతి పొందుచున్నది. అందుచేత **ప్రాణోపాసనచే చిత్తము వశమై ఉండగలదు.**

**"ఈ శరీరములో → మనస్సు చంద్రుడు! ప్రాణములే (వాయువే) "సూర్యుడు"। అగ్నియే వృష్టి"-** అని చెప్పబడుతోంది.

## వాయువు (ప్రాణము) - నిర్మల మనస్సులో లయం

హే బ్రహ్మన్! "విష్ణువు - బ్రహ్మ- ఈశ మొ॥న దేవతోపాసనతో బాటు యోగాభ్యాసముచే నాదానుసంధానము చేస్తూ ఉన్న యోగి పట్ల సర్వవాసనలు సంక్షీణము చెందుచున్నాయి.

**యోగి పట్ల - వాయువు (ప్రాణశక్తి) నిరంజనమగు (నిర్మలమగు) మనస్సు నందు విలీనము పొందుతోంది.**

## నాద-బిందు-చిత్తముల యోగ ఐక్యత్వము

ఓ బ్రహ్మదేవా! **యో వై నాదః స వై బిన్దుః, తద్వై చిత్తం ప్రకీర్తితమ్।** ఏది నాదమో - అదియే బిందువు. ఏది బిందువో, అదియే చిత్తముగా ప్రకీర్తింపబడుతోంది. యోగాభ్యాసముచే విజ్ఞుడగు యోగి - ఈ నాద, బింద, చిత్తముల ఏకత్వమును స్వభావసిద్ధంగా బుద్ధితో సముపార్జించుకొనుచున్నాడు.

**మనయేవ హి బిందుశ్చ!** మనస్సే బిందువుకు ఉత్పత్తి స్థితికారణము. ఏవిధంగా - పాల నుండి ఘృతము (నేయి) ఉత్పన్నమగుచున్నది కాబట్టి, పాలు ఘృతాత్మకమే (నేయితో కూడినదే) అయి ఉన్నదో, అట్లాగే **మనస్సు నుండి బిందువు బయల్వెడలుచున్నది.**

- బిందువు నాదమునకు జనన స్థానము.
- (ధ్యానములో కనబడే జ్యోతి, నక్షత్రములు.. ఇవన్నీ బిందురూపములే)!
- అట్లాగే బిందువే మనో జనన స్థానము. మనస్సు - బిందువు - నాదము ఏకరూపములే.

## షట్ చక్రములు - సుఖమండల ప్రవేశము

యోగి 'బ్రహ్మదండము' అగు వెన్నెముక యందు శక్తి కేంద్రములై యున్న - **మూలాధార చక్రము, స్వాధిష్ఠాన చక్రము, మణిపూరక చక్రము, అనాహత చక్రము, విశుద్ధ చక్రము, ఆజ్ఞాచక్రముల** స్థానములను ఎరుగుచూ సుఖమండలమగు **"ఆత్మతత్త్వానుభవము"** అను సహస్రారమునందు ప్రవేశము పొందుచున్నాడు.

**ప్రవిశేత్ వాయుం ఆకృష్య, తథైవ ఊర్ధ్వమ్ నియోజయేత్!** శరీరములో ప్రవేశించువాయువును (ప్రాణమును) ఆకర్షించి, అద్దానిని ఊర్ధ్వ మండలము (కపాల మండలము)లో నియోగించాలి. (నియమించాలి).

## ఏక సమయోపాసన

ఓ హిరణ్యగర్భా! యోగి అయినవాడు ఈ క్రిందివానిని ఒకేసారి అభ్యసిస్తూ అభ్యాసపరుడు అయి ఉండాలి.

(1) ప్రాణవాయువు (ప్రాణోపాసన) (2) బిన్దోపాసన (3) షట్ చక్రోపాసన (4) చిత్త చికిత్స. ఈ నాలుగింటిని ఒకేసారి సమభ్యసించాలి. సమాధియందు వాటిని సమము, ఏకము చేయుటచే యోగి అమృతత్వము పొందుచున్నాడు. **సర్వత్రా సమదర్శనమే** (లేక) **అఖండాత్మ** దర్శనమే **'సమాధి'.**

## వాసనలు తొలగించుకోవాలి-జ్ఞానజ్యోతి ప్రకాశమును దీప్తించుకోవాలి.

**పరమ శివుడు :** ఓ పద్మ సంభవా! భక్తజన కల్పవృక్షమా! సకల జన సమస్త ప్రదాతా! సృష్టికర్తా! బ్రహ్మభగవాన్! మన ఈ యోగ శిఖాధ్యయన సత్ విచారణను సమీక్షిస్తూ, సర్వజీవుల క్షేమమును దృష్టిలో పెట్టుకుని కొద్ది విషయాలు మరల ప్రస్తావించుకుందాము.

- **జీవోబ్రహ్మేతి-నా పరః।** ఈ **జీవుని సహజ స్వరూపము పరబ్రహ్మమే.** ఇందులో సందేహమే లేదు.
- అయితే **"నేను దేహిని. దేహసంబంధితుడను. దేహపరిమితుడను. ఇంద్రియములచే నిబద్ధుడను"** - అను కల్పనను లీలగా ప్రారంభించి, ఉపాధి పరంపరాభ్యాసముచేత దానినే సుస్థిరం చేసుకోవటం చేత ఈతడు **'సంసారము'** అను పంజరములో నిబద్ధుడై - సకల బంధనములు, పరిమితములు, దుఃఖములు తనపై తానే స్వయముగా ఆపాదించుకొన్నవాడై ఉంటున్నాడు.
- ప్రతి జీవుని యందు ఆత్మజ్ఞాన జ్యోతి (లేక) ప్రజ్ఞాజ్యోతి వెలుగుచూనే ఉన్నది. అయితే - **అజ్ఞానేన ఆవృతం -జ్ఞానం। జ్ఞాన దీపము- అజ్ఞానము అనే పొగ (లేక, మసి)చే ఆవరించబడి ఉన్నది.** జ్ఞానము యొక్క వెలుగు అనుభవమవటం లేదు. అంతటా అజ్ఞానముచే ఆవరించబడి, జీవుడు తిమిరం (చీకటిలో) సమరము (సంఘర్షణములు) పొందుచూ ఆయుష్షులను గడుపుచున్నాడు.

***అట్టి ఈ జీవుడు ఆత్మజ్యోతి-తత్త్వము సంతరించుకొని ఆత్మానందమును ఆస్వాదించటమే - సర్వ సాధనముల పరమోద్దేశ్యము.***

అందుకు మార్గమును మరొక్కసారి సమీక్షించుకుంటున్నాము.

**యథా అగ్నిః దారుమధ్యస్థో న ఉత్తిష్ఠేత్ మథనం వినా...**

కొయ్యలో అగ్ని దాగియే ఉన్నది. అయితే ఆ అగ్ని తనకు తానుగా బయల్వెడలుతుందా? లేదు. ఆ కొయ్య యొక్క రెండుచెక్కలు ఒరిపిడి చేత మాత్రమే ఉష్ణము(నిప్పురవ్వలుగా) బయల్వెడల గలదు. అట్లాగే..,

**వినా చ అభ్యాస యోగేన జ్ఞాన దీపః తథా నహి।**

**'అభ్యాసయోగము'** – (రేచక – పూరక– కుంభకములతో కూడిన ప్రాణాయామము, సుషుమ్నయందు చిత్త నిశ్చలరూపకుంభకము చేయటము, ఇచ్ఛ–క్రియా–జ్ఞాన విశ్వశక్తి రూపిణియగు కుండలినీ శక్తిదేనిని ప్రత్యుత్సాహపరచటము, బ్రహ్మనాళమగు సుషుమ్న ద్వారా బ్రహ్మ కపాలము వరకు ఊర్ధ్వగమనము మొదలైన అభ్యాసములు) ఆశ్రయించునుగాక.

జ్ఞాన దీపపు వెలుగు నలువైపులా ప్రసరించటము అను అభ్యాసము లేకపోతే ఆత్మజ్ఞాన దీపము మసగవేసి ఉండటమే – ఈ జీవుని పట్ల కొనసాగగలదు.

దేహము వేరు. ఆత్మజ్యోతి స్వరూపుడగు దేహివేరు. కుండలో దీపపు వెలుగే – కుండలోపల, కుండకు బయటకూ ప్రకాశమానమై ఉంటోంది. ఘటమునకు (కుండకు) వేరై ద్వీపజ్వాల భాసిస్తోంది కదా!

**స్వకాయం 'ఘటమ్' ఇత్యుక్తం** – ఈ భౌతిక దేహమే ఘటము (కుండ) అనబడుతోంది.



**– యథా జీవోహి తత్ పదమ్।**

ఈ దేహములో జీవుడే తత్ పదస్వరూపుడు. జీవుడే **'భౌతిక దేహము'** అనే కుండలో ఆత్మజ్యోతియై వెలుగొందుచూ, బాహ్య–అభ్యంతరములలో తనయొక్క వెలుగు– తేజస్సులను నింపి ఉంచుచున్నాడు.

(బాహ్య = ఇంద్రియములచే జగదనుభవము। **అభ్యంతరమ్** = మనో బుద్ధి అహంకారాదుల అనుభవము).

అట్టి ఈ "దేహమునకు – **దేహమహమ్– జీవోఽహమ్"** సంకుచిత భావనలు త్యజించబడుగాక. సముద్రంలో లయమయ్యే తరంగములవలె – జగద్భావములన్నీ **'ఆత్మాఽహమ్'** భావన యందు లయం అవటమే సర్వసంసార భ్రమలు తొలగు మార్గము.

**ఈ జీవుని పట్ల ఆత్మజ్యోతి వెలుగొందేది ఎట్లా?**

అందుకు ఒక్కటే ముఖ్యోపాయము. ఆత్మతత్త్వజ్ఞుడగు సద్గురువును సమీపించి, "కోఽహమ్" అని వినమ్రతతో ప్రశ్నించి, వారు చెప్పుచున్న 'తత్‌త్వమ్' బోధను స్వీకరించటమే। **గురువాక్య– సమం భిన్నే బ్రహ్మజ్ఞానం ప్రకాశతే।** గురువాక్యము అగు 'తత్‌త్వమ్' వాక్యార్థముచే సమరసమైయున్నట్టి, (మరియు) ఈ దృశ్యమునకు భిన్నమైయున్నట్టి ఆత్మజ్ఞానము ప్రకాశించగలదు.

- సంసారమనే సాగరంలో..,
- **'ఆత్మ జ్ఞానార్జన'** అనే 'బ్రహ్మచారి' అయి, 'బ్రహ్మచర్యత్వము' అనే పడవను అధిరోహించి,
- ఆ పడవను నడుపు 'కర్ణధారి' వంటి గురువును శరణువేడాలి.

  **"నేను అఖండాత్మనే"** అనే సత్ చిత్ ఆనంద అనుభవమును ఈ జీవుని బుద్ధి సిద్ధించుకోలేనపుడు గురు బుద్ధియే శరణ్యము. వేరే త్రోవ లేదు.
- అప్పుడు ఆ జీవుని ప్రయాణము ఆత్మానందము వైపుగా చక్కగా కొనసాగుతుంది.
- 'తత్‌త్వమ్' ప్లవము (పడవ) ద్వారా **(నీవుగా కనిపించేదంతా ఆ పరమాత్మయే – అను భావనను ధరించి), 'సోఽహమ్' – నేను సర్వదా కేవలమగు పరమాత్మ స్వరూపుడనే** – అను **"స్వయంజ్యోతీ– ఆత్మానంద స్థానము"**ను చేరాలి.

అట్టి జ్ఞానప్లవము (పడవకు) గురువే పడవను నడుపువాడు (కర్ణధారి).

(1) యోగాభ్యాసము (2) జ్ఞానవాసనలు

**ఈ రెండింటి సహాయముచే ఈ జీవుడు సంసార సాగరము నుండి తప్పక తరించగలడు.**

**అభ్యాస వాసనా శక్త్యా భవన్తి భవసాగరమ్॥ కాబట్టి ఓ జీవులారా! ఉత్తిష్ఠ! "ఆఁ! నేనింతే! ఎక్కడో మహానుభావులకే సాధ్యం!" ఈ ఈ పిరికితనము కట్టిబెట్టండి. "చిదానంద రూపమ్ శివోఽహమ్" అను ఆవలి వడ్డును చేరి, మా త్రిమూర్తులవలె ఆత్మానంద భరితులై ప్రకాశించటానికి ఇప్పుడే, ఇక్కడే నడుము కట్టండి.**

- **ఇంద్రియములను నియమించండి.**
- **వేదోపనిషత్తులు సూచిస్తున్న ప్రాణాయామము - ఆదిగా గల అభ్యాస యోగములకు ఉపక్రమించండి.**
- **సద్గురువులను శరణు వేడండి. వారు సూచిస్తున్న యోగ విధానములను శ్రద్ధగా విద్యార్థులై విని, అభ్యాసము చేయండి.**
- **జ్ఞాన సమాచారము ఏకాగ్రతతో కూడిన నిర్మలమైన, సునిశితమైన బుద్ధితో వినండి. బుద్ధిని విస్తారము చేసుకొని అవగాహనలను హృదయములో పదిలపరచుకోండి.**
- **స్వకీయ హృదయములోనే సర్వాంతర్యామి, సర్వతత్త్వ స్వరూపుడు అగు పరమాత్మను మీ ఇష్టదైవతత్త్వముగా దర్శిస్తూ - ఆరాధించండి.**
- **"ఈ కనబడే సమస్తము పరమాత్మయొక్క విస్తరణ చమత్కారమే" - అని అనిపించే వరకు 'అనుకోవటము'ను ఆశ్రయించి ఉండండి.**
- **క్రమంగా ఒకానొక శుభక్షణం నుండి "ఈ సమస్తము పరమాత్మ స్వరూపుడనగు నాయొక్క ప్రదర్శనానందమే" - అను 'బ్రహ్మసాక్షాత్కారము'ను సిద్ధించుకొనుటకు 'మానవజన్మ' అనే మహత్తరమైన అవకాశమును ఫలప్రదము చేసుకోండి. 'శివోఽహమ్'ను సముపార్జించుకోండి.**

**కేవల స్వరూపులై కైవల్యము పొందినవారవండి.**

**ఇతి శివగురు వాక్యమ్।**

***ఇతి యోగ శిఖోపనిషత్***
***ఓం శాంతిః। శాంతిః। శాంతిః।***

కృష్ణయజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 24 వరాహోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ శ్రీమత్ వరాహోపనిషత్ వేద్య అఖండ సుఖాకృతీ।
త్రిపాత్ నారాయణాఖ్యాంత రామచంద్రపదం భజే॥



శ్రీమత్ 'వరాహోపనిషత్'చే తెలియబడుచున్న పరమసత్యము అఖండ సుఖాకృతి అయినట్టిది. అట్టి త్రిపాత్-నారాయణ బోధకమగు 'శ్రీరామబ్రహ్మతత్త్వము'నకు నమస్కరిస్తున్నాము.

### ప్రథమోఽధ్యాయః

### 1వ అధ్యాయము

**01.** **అథ ఋభుర్వై మహామునిః,**
**దేవమానేన, ద్వాదశ వత్సర తపశ్చ ఆచార।**
**తత్ అవసానే వరాహరూపీ భగవాన్ ప్రాదురభూత్।**

'ఋభువు' అనే మహాముని 12 దేవమాన సంవత్సరములకాలము ఇష్టదైవమగు శ్రీవిష్ణు అవతారుడు-శ్రీమన్ ఆదివరాహమూర్తి గురించి తపస్సు చేశారు. చివరికి ఒకానొకరోజు శ్రీ వరాహమూర్తి స్వామి ప్రత్యక్షమైనారు.

---

<u>సహోవాచ :(భగవాన్ వరాహోవాచ)</u>
**ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ!**
**వరం వృణీష్వ - ఇతి॥**

**ఆదివరాహమూర్తి :** బిడ్డా ఋభూ! భక్తి - శ్రద్ధలతో కూడిన నీ తపస్సుకు మెచ్చానయ్యా! లే! ఉత్తిష్ఠ! నీకు ఇష్టమైన వరం ఏదైనా సరే, కోరుకో. ప్రసాదించటానికి సంసిద్ధుడనై ఉన్నాను.

---

**సోదతిష్ఠత్ (స ఉదతిష్ఠత్), తస్మై**
**నమస్కృత్య, ఉవాచ:**

భగవానుని ఆ వాక్యములు చెవినబడిన ఋభుఋషి లేచి నిలుచున్నారు. స్వామిని చూచి భక్తి పారవస్యంతో నమస్కరించారు.

---

**భగవన్!**
**కామిభిః యత్ యత్ కామితం**
**తత్ తత్ త్వత్ సకాశాత్ స్వప్నేఽపి న యాచే।**
**సమస్త వేద శాస్త్ర ఇతిహాస**
**పురాణాని, సమస్త విద్యాజాలాని,**
**బ్రహ్మాదయః సురాః సర్వే**
**త్వత్ రూపజ్ఞానాత్ ముక్తిమ్ ఆహురతః।**

**ఋభుమహర్షి :** భగవన్! పరమాత్మా! మీరు సర్వజ్ఞులు. ఈ దృశ్యములో ఏమేమి కోరుకొన్నాకూడా, అదంతా తమ **'సామీప్యత'**తో ఏమాత్రము సమానం కాదు. ప్రపంచంలో ఏదేది పొందినా అదంతా స్వప్న సదృశమే కదా! కనుక ఇష్ట దైవమగు మిమ్ములను లోకసంబంధమైనదేదీ కోరుకోను. కలలో కూడా యాచించను. సమస్త వేదములు, శాస్త్రములు, ఇతిహాసములు, పురాణములు, సమస్త విద్యలు మీ గురించే వివరిస్తున్నాయి. బ్రహ్మ మొదలైన సర్వదేవతలు మీ రూపజ్ఞానము పొంది 'ముక్తి'ని పొందాలని మాత్రమే కోరుకొనుచున్నారు కదా! నేను కూడా ఆ బాటలోనే నడుస్తాను.

---

**త్వత్ రూప ప్రతిపాదికాం**
**బ్రహ్మవిద్యాం బ్రూహి। ఇతి।**

కాబట్టి మీయొక్క రూప ప్రతిపాదితమగు **'బ్రహ్మవిద్య'**ను ప్రసాదించ వలసినదిగా మిమ్ములను వరం కోరుకొనుచున్నాను. అనుగ్రహించండి.

---

<u>సహో వాచ వరాహరూపీ, భగవాన్:</u>
**చతుర్విగ్ంశతి (24) తత్త్వాని**
**కేచిత్ ఇచ్ఛంతి వాదినః।**
**కేచిత్ షట్ త్రిగ్ంశత్ (36) తత్త్వాని।**
**కేచిత్ షట్ నవతీని (96) చ। (షణ్ణవతీని చ)।**

**భగవానుడగు శ్రీ వరాహమూర్తి**

ప్రియ ఋభూ! అవును. **"ఈ మాయా ప్రపంచంలో ఏదో పొందితేగాని దుఃఖము పోదు"** అనునదంతా అజ్ఞానముచేతనే ఈ జీవుడు భావిస్తున్నాడు. అఖండము, అప్రమేయము, నిత్యము, అమృతము అగు ఆత్మతత్త్వము (లేక) బ్రహ్మతత్త్వము యొక్క జ్ఞానము, తత్

| | |
|---|---|
| **తేషాం క్రమం ప్రవక్ష్యామి।**<br>**సావధాన మనాః శ్రుణు।** | అనన్యానుభవముల చేతనే సర్వసాంసారిక దుఃఖములు పరిష్కరించ బడగలవు. అట్టి ఆత్మ (లేక) బ్రహ్మముయొక్క అన్య కల్పనా రూపము (ప్రకృతి) కొందరు ఆత్మశాస్త్రవేత్తలచే → '26' తత్త్వాలుగా విభజించబడి ఆత్మజ్ఞానబోధ చేయబడుతోంది.<br>మరికొందరు గురువులచే - '36' తత్త్వములుగా వివరించబడుతోంది. ఇంకొందరు '96' తత్త్వములుగా చెప్పుచున్నారు.<br>ఓ ఋభూ! ఆయా విశేషములు క్రమము ఏమిటో, మునుముందుగా విశదీకరిస్తున్నాను. సావధాన మనస్కుడనై వినెదవు గాక! |
| **జ్ఞానేంద్రియాని పంచైవ**<br>**శ్రోత్ర త్వక్ లోచన ఆదయః। (5)**<br>**కర్మేంద్రియాణి పంచైవ**<br>**వాక్ పాణి అంఘ్రి ఆదయః క్రమాత్। (5)**<br>**ప్రాణాదయస్తు పంచైవ। (5)**<br>**పంచశబ్దాదయః తథా। (5)**<br>**మనో బుద్ధి అహంకారః చిత్తం చ**<br>**ఇతి చతుష్టయమ్। (4)**<br>**(5 + 5 + 5 + 5 + 4 = 24)** | I. **జ్ఞానేంద్రియ పంచకము (5)**<br>(1) శ్రోత్రేంద్రియము, (2) 'త్వక్' ఇంద్రియము, (3) చక్షురింద్రియము, (4) జిహ్వేంద్రియము, (5) ఘ్రాణేంద్రియము (వినికిడి, స్పర్శ, చూపు, రుచి, వాసన)<br>**II.కర్మేంద్రియపంచకము (5)**<br>(1) వాక్ ఇంద్రియము, (2) హస్తేంద్రియము, (3) పాదేంద్రియము, (4) ఉపస్థేంద్రియము, (5) పాయ్యుఇంద్రియము.<br>III. **ప్రాణ పంచకము (5)**<br>(1) ప్రాణము, (2) అపానము, (3) వ్యానము, (4) ఉదానము, (5) సమానము<br>IV. **ఇంద్రియ విషయ పంచకము (5)**<br>(అ) శబ్దము (ఆ) స్పర్శ (ఇ) రూపము (ఈ) రసము, (ఉ) గంధము<br>V. **అంతరంగ చతుష్టయము (4)**<br>(క) మనస్సు (గ) బుద్ధి (చ) చిత్తము) (జ) అహంకారము |
| **చతుర్వింశతి (24) తత్త్వాని**<br>**తాని బ్రహ్మవిదో విదుః** | ఈ విధంగా '24' తత్త్వములుగా బ్రహ్మవిదులచే గమనించబడి, తత్త్వ శాస్త్రీయంగా వివరించబడుతోంది. |
| **ఏతైః తత్త్వైః సమం**<br>**పంచీకృత భూతాని పంచ చ**<br>**పృథివీ ఆపః తథా తేజో**<br>**వాయుః ఆకాశ ఏవ చ। (5)** | వీటితోబాటుగా...<br>VI. **పంచీకృత భూతములు (5)**<br>(ఎ) పృథివి (Solid) (బి) ఆపః (జలము) (Liquid) (సి) తేజస్సు (అగ్ని)(Heat/Light) (డి) వాయువు(Vapour) (ఇ) ఆకాశము (Space). |
| **దేహ త్రయగ్ం**<br>**స్థూల సూక్ష్మ కారణాని**<br>**విదుః బుధాః (3)।** | VII. **దేహత్రయమ్ (3)**<br>(1) స్థూలదేహము (Matter) (2) సూక్ష్మ శరీరము (Thought & Feelings) (3) కారణశరీరము (Causation) అని బుధులు, గమనించి విడమర్చి చెప్పుచున్నారు. (ఆవలది 'కేవలాత్మ') |
| **అవస్థా త్రితయంచైవ**<br>**జాగ్రత్ స్వప్న సుషుప్తయః। (3)**<br>**ఆహత్య, తత్త్వ జాతానాం**<br>**షట్ త్రిగుంశత్ (36)**<br>**మునయో విదుః।** | VIII. **అవస్థాత్రయము**<br>(1) జాగ్రత్ అవస్థ (Awakened) (2) స్వప్నావస్థ (Dreamy) (3) సుషుప్త్యవస్థ (Dead Sleepy)<br>ఈ 35 + జీవాత్మ = 36 (+) ఈశ్వరుడు+పరమాత్మ = 36/38.... అని మునులు దర్శించుచున్నారు. |

| | |
|---|---|
| పూర్వోక్తైః తత్త్వజాతైస్తు<br>సమం తత్త్వాని యోజయేత్।<br>షట్ (6) భావ వికృతిశ్చ<br>అస్తి జాయతే వర్ధతేఽపి చ,<br>పరిణామం క్షయం నాశగ్ం<br>షట్ భావ వికృతిం విదుః। (6) | **IX. భౌతిక దేహమునకు సంబంధించిన-షట్ భావ వికృతములు**<br>ఇప్పటివరకు చెప్పినవే కాకుండా, తత్త్వ వివరణ కొరకై షట్ భావ వికారములు - (1) అస్తి (ఉనికి), (2) జాయతే (పుట్టుక), (3) వర్ధతే (పెరుగుదల), (4) పరిణమతే (పరిణామములు పొందటము (stage by stage changing factors) (5) క్షయము (క్షీణించటము),(6) నాశనము అనబడే షట్ వికారములు. **ఈ దేహములు ఆయా సర్వ వస్తువులు కలిగినదై ఉంటున్నది.** [6] |
| అశనా చ పిపాసా చ శోక<br>మోహౌ జరా మృతీ<br>ఏతే 'షట్ ఊర్మయః'<br>ప్రోక్తాః। (6) | **X. షట్ ఊర్ములు :** ఈ జీవుడు దేహము యొక్క సంబంధము కారణంగా (1) ఆకలి (2) దప్పిక (3) శోకము (Worry) (4) మోహము (Illusions, Misconceptions) (5) జర (Old Age) (6) మరణము (Death) అనే అనివార్యములను పొందుచున్నాడు. ఇవి **షడూర్ములు** అని అనబడు చున్నాయి. **[6]** |
| షట్ కోశాన్ అథ వచ్మి తే।<br>త్వక్ చ రక్తం మాగ్ంస<br>మేదో మజ్జా అస్థీని<br>నిబోధత। (6) | **XI. షట్ కోశములు :** శరీరములో '6' కోశములు (1) చర్మము, (2) రక్తము, (3) మాంసము, (4) మేదస్సు (క్రొవ్వు, వప, మెదడు) (5) మజ్జ (ఎముకలలోని నూనెవంటి, పొడివంటి పదార్థము) (6) బొమికలు (Bones) **[6]** |
| కామ క్రోధౌ లోభ మోహౌ<br>మదో మాత్సర్యమేవ చ<br>ఏతే అరి షట్కాః। (6)<br>(అరిషట్ వర్గము) | **XII. అరిషట్ వర్గము : (ఆరు శత్రువర్గములు)**<br>ఇవి జీవునికి ఆత్మానందమునకు, ఆత్మభావనలకు దూరం చేయుటచే 'శత్రువర్గములు'గా చెప్పబడుచున్నాయి. (1) కామము (Desires & Expectations) (2) క్రోధము (Retaining of Anger and sentiment of Revengefulness) (3) లోభము (Miserly) (4) మోహము (Illusion) (5) మదము (Being Proud) (6) మాత్సర్యము (ఇతరులకు బాధాకరంగా, తక్కువ చేసి వర్తించు స్వభావము (Sadism) **[6]** |
| **03.** విశ్వశ్చ తైజసః ప్రాజ్ఞ ఏవ చ<br>జీవ త్రయగ్ం। (3)<br>సత్త్వ రజః తమాగ్ంసి చ<br>గుణత్రయమ్। (3)<br>ప్రారబ్ధ ఆగామి ఆర్జితాని<br>(సంచితాని)<br>కర్మ త్రయమ్ ఇతీరితమ్। (3) | **XIII. స్వకీయ త్రి పురుష కారములు**<br>(1) విశ్వుడు (జాగ్రత్ అభిమాని, అనుభవి) (2) తేజసుడు (స్వప్నాభిమాని, స్వప్నానుభవి), (3) ప్రాజ్ఞుడు (సుషుప్త్యభిమాని, సుషుప్త్యనుభవి) [3]<br>**XIV. గుణత్రయము :** (1) సత్త్వగుణము, (2) రజోగుణము, (3) తమోగుణము [3]<br>**XV. కర్మ త్రయము :**<br>(1) **సంచితము :** ఇతఃపూర్వపు అనేక జన్మలలోని కర్మల ఫలముల, సంస్కారముల స్వభావముల, వాసనల సంచయము [3]<br>(2) **ప్రారబ్ధము :** వర్తమాన జన్మలో ఫలించటానికి నిర్దేశితమైన కర్మఫలములు, వాసనలు, సంస్కారములు<br>(3) **ఆగామి :** సంచితశేషము + వర్తమాన జన్మలోని కర్మఫలములు - వాసనలు, సంస్కారముల ఫలములు -ముందు జన్మకు వెంటవచ్చేవి.**(3)** |
| వచన ఆదాన గమన విసర్గ<br>ఆనంద పంచకమ్। (5)<br>సంకల్పో అధ్యవసాయశ్చ<br>అభిమానో అవధారణా, | **XVI. పంచ కర్మేంద్రియ విషయములు ఆనంద పంచకము**<br>వచనము (speaking) ; ఆదానము (Hands - functions) ; గమనము (walking); విసర్గ (Let out); ఆనందము **[5]**<br>**XVII. కల్పనాచతుష్టయము :** (1) సంకల్పము (2) అధ్యవసాయము (అభిప్రాయము) (3) అభిమానము (4) అవధారణ (Holding) **[4]** |

| | |
|---|---|
| **ముదితా కరుణా మైత్రీ<br>ఉపేక్షా చ చతుష్టయమ్।** | XVIII. **విషయ సంబంధ చతుష్టయము**<br>(1) ముదితము (సంతోషము పొందటం), (2) కరుణ (Kindness) (3) మైత్రి (4) ఉపేక్షించటము (Ignoring) |
| **దిక్, వాతా, అర్క, ప్రచేతో, అశ్వి,<br>వహ్ని, ఇంద్ర, ఉపేంద్ర, మృత్యుకాః,<br>తథా చంద్ర, చతుర్వక్త్రో,<br>రుద్రః, క్షేత్రజ్ఞ, ఈశ్వరాః<br>ఆహత్య తత్త్వజాతానాం** | XIX. ప్రకృతి **(బాహ్య జగత్) తత్త్వములు**<br>(1) దిక్కులు, (2) వాయువు), (3) అర్క(సూర్యుడు), (4) ప్రచేతుడు (వరుణుడు), (5) అశ్వినీదేవతలు, (6) అగ్ని, (7) ఇంద్రియాధినేత - ఇంద్రుడు, (8) ఉపేంద్రుడు, (9) మృత్యుదేవత, (10) చంద్రుడు, (11) చతుర్వక్త్రుడగు బ్రహ్మ, (12) రుద్రుడు, (13) క్షేత్రజ్ఞుడు (knower), (14) ఈశ్వరుడు. |
| **షణ్ణవత్ యస్తు (96)<br>కీర్తితాః।** | తత్వజ్ఞానులగు మహనీయులు ఈ (96) తత్త్వములను జీవుని సంబంధితమైనవిగా చెప్పుకొస్తున్నారు. |
| **పూర్వోక్త తత్త్వజాతానాం వై<br>లక్షణ్యమ్ అనామయమ్।<br>వరాహరూపిణం మాం<br>యే భజంతి మయి భక్తితః,<br>విముక్త అజ్ఞాన తత్కార్యా,<br>'జీవన్ముక్తా' భవంతి తే।** | ఎవ్వరైతే ఇప్పుడు చెప్పుకొన్న '96' తత్త్వములు ఎరిగియున్నవారై ఉంటారో, వారు '**అహమ్**' గురించి ఎరుగగలరు.<br>**నేను ఎట్టివాడను?**<br>❊ వీటన్నిటికంటే విలక్షణమైనట్టిది, సర్వ విషయములకు అతీతమైనట్టిది, నిర్విషయమైనట్టిది అగువాడను.<br>❊ ఈ కల్పితమగు వరాహ రూపమునకు సంప్రదర్శకుడను, కేవాలత్మరూపిని.<br>ఈవిధంగా ఎవ్వరైతే నన్ను భక్తితో భజిస్తారో, అట్టివారు అజ్ఞానమునుండి, అజ్ఞాన కార్య -కారణముల నుండి విముక్తులై జీవన్ముక్తులు - అగుచున్నారు. |
| **యే షణ్ణవతి (96) తత్త్వజ్ఞా, యత్ర-కుత్ర ఆశ్రమే రతాః,<br>జటీ ముండీ శిఖీవాఽపి ముచ్యతే,<br><u>న అత్ర సగ్ంశయః। ఇతి॥</u><br><u>*ఇతి ప్రథమోఽధ్యాయః॥*</u>** | ఈ విధంగా 96 తత్త్వములను ఎరిగి ఎవరు వాటన్నిటికీ ఆవల కేవలమగు నన్ను ఆశ్రయిస్తారో - అట్టివారు జటీ-జటాధారులైనా (లేక) ముండీ-శిఖధరించినవారైనా, (లేక) శిఖ ధరించనివారైనా సరే..., **ఏ 'ఆశ్రమములకు' సంబంధించనట్టి నన్ను ఎరిగినవారై, సంసార బంధములనుండి విముక్తులగుచున్నారు.** ఇందులో సందేహం లేదు.<br>***ఇతి ప్రథమోఽధ్యాయః॥*** |

# ద్వితీయ అధ్యాయః – ఆత్మ నిష్ఠ

| | |
|---|---|
| 01. ఋభుః నామ మహాయోగీ<br>క్రోడరూపం రమాపతిమ్, వరిష్ఠామ్! –<br>బ్రహ్మావిద్యాం త్వమ్ అధీహి, భగవన్! మమ।<br>ఏవగ్ంం సపృష్టో, భగవాన్<br>ప్రాహ భక్తార్తి భంజనః॥ | **మహాయోగియగు ఋభుమునీంద్రుడు :** (వరాహరూపుడగు రమాపతితో) : **"స్వామీ! భగవాన్! నాకు బ్రహ్మవిద్యను ఇంకా కూడా బోధించండి!..."** అని అడిగారు.<br>అప్పుడు భక్తుల ఆర్తిని తొలగించు స్వభావియగు శ్రీ ఆది వరాహమూర్తి ఇంకా ఇట్లా చెప్పసాగారు. |
| స్వవర్ణాశ్రమ ధర్మేణ, తపసా,<br>గురుతోషణాత్,<br>సాధనం ప్రభవేత్ పుగ్ంసాం<br>వైరాగ్యాది చతుష్టయమ్।<br>నిత్య – అనిత్య వివేకశ్చ,<br>ఇహ – ఆముత్ర విరాగతా,<br>'శమ' ఆది షట్క సంపత్తిః<br>ముముక్షా తాం తు సమభ్యసేత్॥ | **శ్రీ వరాహస్వామి :** బ్రహ్మచారి, గృహస్థ - వానప్రస్థ - సన్న్యాస ఆశ్రమములలో తానున్న ఆశ్రమ ధర్మమును చక్కగా నిర్వర్తించి, తపస్సు నిర్వర్తించి గురుసేవ చేస్తూ ఉండగా, అట్టి సాధనలచే ఈ జీవుడు వైరాగ్యము మొదలైన **"సాధనచతుష్టయము"** సిద్ధించుకోగలడు.<br>**సాధనచతుష్టయము**<br>(1) దృశ్య విషయములపట్ల, నామ రూపముల పట్ల రాగమును (Attachment) తొలగించుకొని విరాగి అవటము - **వైరాగ్యము.**<br>(2) ఏది నిత్యమో, ఏది అనిత్యమో గమనించు బుద్ధిని వృద్ధిపరచుకోవటము - **నిత్యానిత్య వివేకము.**<br>(3) ఇహ ఆముత్ర (ఊర్ధ్వలోక విషయముల పట్ల) రక్తిలేకపోవటము - **ఫలభోగ నిరసన. (మరియు) గురు ఆశ్రయము.**<br>(4) శమము (శాంతి), దమము (బాహ్యేంద్రియ నిగ్రహము) మొదలైనవి - **శమాది షట్క సంపత్తిలను** చక్కగా అభ్యసించటము. |
| ఏవం జితేంద్రియో భూత్వా<br>సర్వత్ర మమతా మతిమ్ విహాయ<br>సాక్షి చైతన్యే మయి కుర్యాత్ అహం మతిమ్॥ | ఇంద్రియములను, విషయభేదములను జయించును గాక. సర్వత్రా - "నేను దీనికి చెందినవాడను. ఇది నాకు చెందినది" అను మమకారమును వదిలి ఉండునుగాక! 'మమతామతి'ని అధిగమించి, 'అహం మతి'ని ఆశ్రయించును గాక! జితేంద్రియుడై, విషయములపట్ల, దృశ్యము పట్ల మమకారము, వదలి - తనయందలి సాక్షి చైత్య స్వరూపుడనైయున్న నాపట్ల 'అహం' మతిని (స్వామియే నాయందు నేను గా ఉన్నారు - అని జగదతీత నిర్మల బుద్ధిని) పెంపొందించుకొనును గాక. |
| దుర్లభం ప్రాప్య మానుష్యం,<br>తత్రాపి నర విగ్రహం,<br>బ్రాహ్మణ్యం చ మహా విష్ణోః<br>వేదాంత శ్రవణాదినా,<br>"అతివర్ణాశ్రమం రూపమ్,<br>సత్-చిత్-ఆనంద లక్షణమ్,<br>-యో న జానాతి, సో అవిద్వాన్<br>కదా ముక్తో భవిష్యతి? | ఓ ఋభూ!<br>❖ దుర్లభమగు మానవ జన్మను పొంది,<br>❖అందులో కూడా-ఇంద్రియము సమర్థముగా పనిచేయు 'నరవిగ్రహము' (పురుషకారము) పొంది, (సామర్థ్యము గల మానవ దేహము పొంది),<br>❖ఇంకా కూడా 'బ్రహ్మము' గురించిన పాఠ్యాంశములు గల అవకాశమైనట్టి 'బ్రాహ్మణ్యము'-అనే అవకాశము కలిగియుండి శాస్త్ర విద్వాంసుడై కూడా..., ఇప్పుడిక వేదాంతశ్రవణము (తెలుసుకొనుచున్నవానిని తెలుసుకోవటం, ఉపనిషత్ సాహిత్యము) మొదలైన అవకాశములను ఉపయోగించు కోకపోతే ఎట్లా?<br>వర్ణాశ్రమములకు అతీతమైనది (సంబంధించనిది), సత్ - చిత్ - ఆనంద లక్షణ సమన్వితమ్ అగు తనయందలి 'ఆత్మతత్త్వము' తెలుసుకోవటానికి ప్రయత్నించకపోతే ఈ జీవునికి ముక్తి లభించేది ఎట్లా? **అందుచేత జీవుడు ఆలోచించాలి. జీవితమును 'ముక్తి' కొరకై సద్వినియోగ పరచుకోవాలి.** |

**అహమేవ సుఖం,**
**న అన్యత్! అన్యచ్చేత్ నైవ**
**తత్ సుఖమ్।**

ఓ ఋభు మహాతపోధనా! **నేను సర్వజీవులలోను సమస్వరూపుడనై సర్వదా, సర్వత్రా సర్వముగా 'వేంచేసి'యే ఉన్నాను.** అట్టి కేవలమగు 'అహమ్' స్వరూపుడనైయున్న నన్ను ఆశ్రయించుటచేతనే - ఈ జీవుడు నిత్యమగు సుఖము పొందగలుగుతాడు. **అనన్యుడగు** నన్ను ఏమరిచి, అన్యమైన దేనిని ఆశ్రయించినా కూడా అది ఆతనికి సుఖముకాదు. అన్యమైన దేనిలోనూ సుఖము లేదు. **అనన్యుడనగు నన్ను ఆశ్రయించుటయే సుఖప్రదము.**

---

**అమదర్థం నహి ప్రేయో,**
**మదర్థం న స్వతః ప్రియమ్।**
**పర ప్రేమాస్పదతయా,**
**మా న భూవమ్ అహగ్ం సదా।**
**భూయాసమ్ ఇతి యో దృష్టః**
**సో௨హం విష్ణుః, మునీశ్వర!**

ఓ మునీశ్వరా! ఈ జీవునికి అంతరాత్మ స్వరూపుడనైన నన్ను పొందు ఆశయముతో కాకుండా, లౌకికమైన ప్రయోజనములకొరకై చేయు కర్మలు ప్రియమైనవి కావు. అవన్నీ అప్రియమైన ప్రయోజనములే అగుచున్నాయి.

**"వ్యష్టిగత అభీష్టములకు పరిమితుడనై, వాటి కొరకై నేను కర్మలు నిర్వర్తిస్తాను"** అని ఉద్దేశ్యించువానికి, ఆ కర్మల ఫలములు స్వతఃగా ప్రియము కాదు. వాస్తవానికి నేనే ఆతనియొక్క ప్రియ వస్తువును.

నేనే నీయందు పరప్రేమాస్పదుడను. అందుచేత వ్యష్టిగత అహంకారము నకు లోను అవకుండా ఆత్మగత దృష్టితో కర్మలు నిర్వర్తించెదవు గాక!

**'నాయందు నేనైన నేనే ఈ సర్వ జీవులు, ఈ సమస్త జగత్తూ కూడా'** అను **"సో௨హమ్ విష్ణుభావము"**ను ఆశ్రయించుచుండెదవు గాక!

---

**"న ప్రకాశో అహమ్!" ఇత్యుక్తిః**
**యత్ ప్రకాశైక బంధనా।**
**స్వప్రకాశం తమ్ ఆత్మానమ్।**
**అప్రకాశః కథం స్పృశేత్?**
**స్వయం భాతం నిరాధారం**
**యే జానంతి సునిశ్చితమ్,**
**తే హి విజ్ఞాన సంపన్నా,**
**ఇతి మే నిశ్చితా మతిః।**

'నాకు పరమాత్మ ప్రకాశకుడు అవటంలేదు' అని తలచుచున్నది ఎవరి గురించి? **స్వస్వరూపమగు ఆత్మగురించియే.** జీవాత్మ - జగత్తులతో సహా, పైన చెప్పుకొన్న '96' తత్త్వములను ప్రకాశింపజేయుచున్న **'ఆత్మప్రకాశము'**ను గమనించకపోవటమే - ఈ జీవునిపట్ల 'బంధము'గా అగుచున్నది.

ఈ జీవుని సహజ స్వరూపమగు 'ఆత్మ' సర్వదా స్వయంప్రకాశకమై యుండగా, ఆత్మయొక్క తేజస్సుచే వెలిగించబడుచూ, స్వయం ప్రకాశకములు కానట్టి - జ్ఞానేంద్రియ - కర్మేంద్రియ - శబ్దాది, విషయాది పంచకములు, అంతరింద్రియ చతుష్కము, పంచభూతములు, షట్ కోశములు, బాహ్యతత్త్వములు మొదలైనవి ఆత్మను ఎట్లా స్పృశిస్తాయి? (సూర్యకిరణములు పడుచున్న వస్తువులు సూర్యుని ప్రకాశింపజేయటమనే ప్రసక్తి ఎక్కడిది?)

**స్వయం ప్రకాశస్వరూపమైనది, దేనిపై ఆధారము కలిగియుండక నిరాధారమైనట్టిది** అగు సహజ - స్వస్వరూపాత్మ గురించి - సునిశ్చితంగా ఎరిగినవాడే **'విజ్ఞాన-సంపన్నుడు'** - అని నా నిశ్చయము.

---

**స్వపూర్ణాత్మాతిరేకేణ**
**జగత్-జీవ-ఈశ్వర ఆదయః**
**న సంతి। నాస్తి మాయా చ।**
**తేభ్యశ్చ అహం విలక్షణః॥**
**అజ్ఞానాంధ తమో రూపం**
**కర్మ, ధర్మ - ఆది లక్షణమ్**
**స్వయం ప్రకాశమ్ ఆత్మానం**
**నై వ మాం ప్రష్టుమ్ అర్హతి।**

**స్వయం పూర్ణాత్మ స్వరూపుడనైయున్న** నాకు వేరుగా జగత్తు లేదు. జీవుడు లేడు. ఈశ్వరుడు లేడు. మాయ లేదు. అయితే వాటన్నిటికీ నేను నేనుగా విలక్షణుడనై ఉన్నాను. (కథా రచయిత కథకు వేరుగా ఉన్నట్లు, కానీ కథ ఆతనికి అనన్యమైనట్లు, చిత్రలేఖనము చిత్రకారునికి వేరు కాకపోయినా, చిత్రకారుడు సర్వదా వేరే అయి ఉన్నట్లు) - నేను సర్వమునకు విలక్షణుడనై సర్వగతమమై ఉన్నాను.

కర్మ వ్యవహారములు, ధర్మ వ్యవహారములు పుణ్య - పాపములు మొదలైనవన్నీ కూడా అజ్ఞానాంధ తమోరూపములు. స్వయంప్రకాశుడగు సూర్యుని చీకటి ఆవరించగలదా? లేదు కదా! అట్లాడే స్వయంప్రకాశ - ఆత్మరూపుడనగు నన్ను కర్మ-ధర్మ-పుణ్య-పాప - ఇంద్రియ - జన్మ -జీవన-మరణ-ఈశ్వరాది వ్యవహారములు స్పృశించలేవు. కప్పి ఉంచ జాలవు. (అట్లాగే, నీ ఆత్మస్వరూపమును - అవేవి స్పృశించలేవు).

| | |
|---|---|
| సర్వసాక్షిణమ్ ఆత్మానం,<br>వర్ణాశ్రమ వివర్జితమ్।<br>బ్రహ్మరూపతయా పశ్యన్,<br>బ్రహ్మైవ భవతి స్వయమ్॥ | ఓ ఋభూ మహాశయా! ఈ జీవుడు "ఆత్మ స్వరూపమగు బ్రహ్మమే" అయి ఉన్నాడు. స్వస్వరూపమే అయి ఉన్న ఆత్మను -<br>❁ సర్వమునకు (96 తత్త్వములకు) **కేవల సాక్షిగాను,**<br>❁ వర్ణాశ్రమ ధర్మములచే **పరిమితము కానట్టిదిగాను,**<br>❁ **స్వయముగా కేవలమూ 'బ్రహ్మమే'** అయి ఉన్నట్లుగాను →<br>దర్శిస్తూ ఉండగా, **ఈ జీవుడు స్వయముగా 'బ్రహ్మమే'** అగుచున్నాడు. |
| భాసమానమ్ ఇదగ్ం సర్వం,<br>భాసరూపం పరం పదమ్।<br>పశ్యన్ వేదాన్త మానేన<br>సద్య ఏవ విముచ్యతే।<br>(సద్యోముక్తి) | ఈ దృశ్య మానమై కనిపిస్తున్న జగత్తులు, జీవుడు, ఇందలి 96 విశేషములు ఇవన్నీ **వెలిగించబడుచున్నట్టివి** (Passive). ఆత్మయొక్క వెలుగు (Enlightenment)లో కనిపించేవి.<br>పరమ పదమగు **ఆత్మయే సర్వమును వెలిగించు స్వయం ప్రకాశ స్వరూపము** (Active). వేదాన్తస్వరూపము. తెలుసుకుంటూ ఉన్నట్టి, ద్రష్టను కూడా నియమించునట్టి దృక్ స్వరూపము (స్వప్నము తనదైనవాడు స్వప్నమును - స్వప్నములోచూచు వానిని నియమించుతీరుగా)<br>ఈ సత్యమును వేదాంత శాస్త్ర ప్రమాణమును దర్శించుచున్నవాడు **'సద్యోముక్తుడు'. అనగా ఇప్పటికిప్పుడే ముక్తుడు.** |
| దేహాత్మజ్ఞానవద్ జ్ఞానం<br>దేహాత్మజ్ఞాన బాధకమ్,<br>ఆత్మన్యేవ భవేత్ యస్య<br>స న ఇచ్ఛన్నపి ముచ్యతే॥ | **'దేహమే నేను. ఈ దేహమునకు సంబంధించిన ఇంద్రియ విషయములచే నేను పరిమితుడను'-అనునదే దేహాత్మజ్ఞానము.** పరాత్మజ్ఞానముచే 'దేహాత్మజ్ఞానము' బాధించబడుతోంది. ఎవ్వడు 'నేను కేవలమగు ఆత్మను' అను భావన / ఎరుకను ఆశ్రయించి ఉంటాడో, అట్టివాడు తాను కోరనప్పటికీ - సర్వసంసార బంధములనుండి **విముచ్యుడు, విముక్తుడు** కాగలడు. **"నేను దేహిని. దేహమును కాను"** - అను అభ్యాసముచే ఈ జీవుడు ముక్తుడు కాగలడు. |
| సత్యజ్ఞానానంద పూర్ణ లక్షణం<br>తమసః పరమ్,<br>బ్రహ్మానందగ్ం సదా పశ్యన్,<br>కథం బధ్యేత కర్మణా? | ఆత్మ-పరిమిత జ్ఞానానంధకారమునకు ఆవల (ప్రాపంచక పరిమిత జ్ఞానమునకు ఆవల) సత్య **(ఉనికి) - జ్ఞాన (ఎరుక) - ఆనంద (అనుభూతి) - కేవల స్వరూపమై, పూర్ణలక్షణయుక్తమై** - యున్నది.<br>ఈ జగత్తును, నీవు-నేనులను కూడా బ్రహ్మానంద స్వరూపముగా ఎల్లప్పుడూ దర్శించు వాడు - ఇక కర్మ - కర్మ ఫలములకు బద్ధుడు ఎట్లా అవుతాడు? అవడు. |
| **02.** త్రిధామ సాక్షిణగ్ం<br>సత్య-జ్ఞాన-ఆనందాది లక్షణమ్,<br>త్వం-అహగ్ం శబ్దలక్ష్యార్థం<br>అసక్తగ్ం సర్వ దోషతః। | **జ్ఞానచక్షువులు:** ఆత్మ ఎటువంటిదంటే - 'జాగ్రత్ - స్వప్న - సుషుప్తులకు **కేవలము సాక్షి అయి ఉన్నట్టిది.** సత్య జ్ఞానానందము మొదలైనవి స్వభావ లక్షణములుగా కలిగి ఉన్నట్టిది. "త్వమ్-అహమ్" అను శబ్దముల "లక్ష్యార్థము" అయి ఉన్నట్టిది. మనో బుద్ధి-చిత్తముల దోషములచే స్పృశించబడక, దేనితోను సక్తత (Attachment) లేనట్టిది. నిర్మలమైనట్టిది. |
| సర్వగగ్ం సత్ - చిత్ ఆత్మానం<br>జ్ఞాన చక్షుః నిరీక్ష్యతే।<br>అజ్ఞాన చక్షుః న ఈక్షేత, భాస్వంతం<br>భానుమ్ అంధవత్॥ | సర్వత్ర విస్తరించి - అంతా తానే అయినట్టిది, 'ఆత్మ'యే ఈకనబడేదంతా! **"అట్టి ఆత్మయే నేను! నేనే ఇదంతా అయి (ఆభరణమునకు బంగారమువలే) వేరై ఉన్నాను"** అనునది **'జ్ఞానచక్షువులు'** కలవాడు దర్శించుచున్నాడు.<br>**అజ్ఞాన చక్షువులతో** ఈ జగత్తును చూచువాడు ఈ సమస్తమును ఆత్మగా దర్శించలేడు. గ్రుడ్డివాడు సూర్య తేజస్సును చూడగలడా? ఇదీ అంతే. |
| ప్రజ్ఞానమ్ ఏవ తత్‌బ్రహ్మ।<br><u>'సత్య' - 'ప్రజ్ఞాన'</u> లక్షణమ్। | **బ్రహ్మము అనగా ఏది?**<br>ఈ జీవుడు సత్ (ఉనికి), ప్రజ్ఞ (వరుక) కలిగియే ఉన్నాడు కదా! అట్టి సత్య-ప్రజ్ఞానలక్షణమగు, తెలియబడే అంతటికీ, విలక్షణమైన ప్రజ్ఞ (The Absolute Form of knowing)యే బ్రహ్మము. అంతేగాని బ్రహ్మము నీకంటే, నాకంటే వేరుగా ఎక్కడో లేదు. *("కేవలమగు తెలివి"యే బ్రహ్మము)* |

| | |
|---|---|
| ఏవం బ్రహ్మ పరిజ్ఞానాత్ ఏవ<br>**మర్త్యో అమృతో భవేత్।**<br>**తత్ 'బ్రహ్మానందమ్'**<br>**అద్వంద్వం, నిర్గుణమ్,**<br>**సత్య, (నిత్య) చిద్ఘనమ్**<br>**విదిత్వా 'స్వాత్మనో రూపం'**<br>**న బిభేతి కుతశ్చన।** | **అట్టి సత్య - ప్రజ్ఞాన లక్షణ కేవల స్వస్వరూపమగు** బ్రహ్మమును ఎవ్వడు ఇప్పుడే ఇక్కడే తెలుసుకొంటాడో, అట్టి మానవుడు (మర్త్యుడు) ఇప్పుడే ఇక్కడే అమృతస్వరూపుడు (మృతికి విషయమే కానివాడు) అగుచున్నాడు.<br>ఆనంద లక్షణ సమన్వితమగునదే బ్రహ్మము (బ్రహ్మానందము). వేరుగా కనిపించేదంతా తానే అయినట్టి అద్వంద్వము (అద్వితీయము). త్రిగుణములకు జననస్థానమైయుండి కూడా త్రిగుణాతీతమై గుణ రహితమై, నిర్గుణమై ఉన్నట్టిది. తదితరమైయున్నదంతా బ్రహ్మమునందు కల్పనామాత్రము, అసత్యము, అయి ఉండగా, బ్రహ్మము మాత్రమే సత్యము. ఈ దృశ్య వ్యవహారమంతా అనిత్యమైయుండగా (ఆత్మగా) తాను మాత్రమే నిత్యము. ఘనీభూత కేవల చిత్ (ఎరుక) స్వరూపము. **"బ్రహ్మము అనగా ఆత్మనగు నేనే, నా ఆత్మయే! ఇదంతా కూడా నాలోని నేనైన నేనే"** అని ఎరిగినవాడు, ఇక దేనికీ భయము పొందడు. |
| **చిన్మాత్రగ్ం సర్వగం నిత్యం**<br>**సంపూర్ణమ్ సుఖమ్ అవ్యయమ్**<br>**'సాక్షాత్ బ్రహ్మైవ।**<br>**న అన్యో అస్తి।'**<br>**ఇత్యేవం బ్రహ్మవిదాం స్థితిః॥** | బ్రహ్మమును ఎరిగిన బ్రహ్మవేత్త (లేక) బ్రహ్మవిదుడు → **"చిత్‌మాత్రము, సర్వగము, నిత్యము, సంపూర్ణము, సుఖప్రదము, అవ్యయము - అగు బ్రహ్మము మాత్రమే ఉన్నది. బ్రహ్మమున అన్యమై (వేరై) ఎక్కడా ఏదీ లేదు"** → అను భావన, అవగాహన, అనుభూతి, అనుభవముల యందు - **సంస్థితుడై ఉంటున్నాడు.** |
| **అజ్ఞస్య దుఃఖౌఘమయం,**<br>**జ్ఞస్య-ఆనందమయం జగత్।**<br>**అంధం భువనమ్ అంధస్య।**<br>**ప్రకాశంతు సుచక్షుషామ్॥** | ఆత్మ గురించి తెలియనివానికి ఈ దృశ్యమంతా అనేక దుఃఖములతో, దోషములతో అనుభవమవుతోంది. **బ్రహ్మమును ఎరిగిన విజ్ఞునికి** (ఆత్మజ్ఞానికి) ఇదే జగత్తు **నిత్య ఆనందమయమై** అనుభూతమౌతోంది.<br>ఎట్లాగంటే (దృష్టాంతంగా) - గుడ్డివానికి ఈ దృశ్యమంతా చీకటిమయం గాను, చక్కటి చూపుగలవానికి ప్రకాశవంతంగానూ కనబడుతీరుగా! |
| **అనంతే చిద్ఘనానందే**<br>**మయి వారాహరూపిణి**<br>**స్థితే అద్వితీయ భావస్యాత్**<br>**కో బంధః? కస్య ముచ్యతే?** | ఓ ఋభూ! నీవు నాయొక్క ఏ వారాహరూపము గురించి సుదీర్ఘంగా తపస్సు చేసి ఉన్నావో, **అట్టి అనంతము, చిద్ఘనానంద మయము** అగు వారాహ రూపము **నీవే అయి ఉన్నావు. నేనే నీవు! నీవు నేనే!** ఇప్పుడు చెప్పు. **బంధము అనగా ఏమి? బంధము ఎవరికి?** నీవు ఆత్మవే! ఆత్మకు బంధము లేదు. కనుక నీకు బంధమనునదే లేదు. ఈ జీవాత్మత్వము నీయొక్క 'కల్పిత-అంశ' - మాత్రమే. కల్పనకు బంధముండటమేమిటి? నాటకంలోని పాత్రకు బంధమేమి? మోక్షమేమి? |
| **స్వస్వరూపం తు చిన్మాత్రగ్ం**<br>**సర్వదా సర్వదేహినామ్,**<br>**నైవ దేహాది సంఘాతో**<br>**ఘటవత్ దృశి గోచరః।** | బ్రహ్మము అనగా నాయొక్క సర్వసాక్షియగు స్వస్వరూపమే! అట్టి చిన్మాత్రమగు (కేవల ఎరుక రూపమగు, ప్రకాశింపజేయు) స్వస్వరూపము సర్వదా **సర్వదేహి స్వరూపమైయున్నది. అట్టి స్వస్వరూపమునకు దేహములు మొదలైన వాటితో సంఘాతమే లేదు.** మట్టి నిరాకారమై యుండగా, మట్టితో కుండను తయారు చేసినంత మాత్రంచేత మట్టి కుండలతో సంఘాతము పొందినట్లు అవుతుందా? అవదు కదా! |
| **స్వాత్మనో అన్యతయా**<br>**భాతం,....చరాచరమ్**<br>**ఇదమ్ జగత్।**<br>**స్వాత్మమాత్ర తయా బుద్ధ్వా,**<br>**'తత్ అస్మి" ఇతి విభావయ।**<br>**స్వస్వరూపగ్ం స్వయం భుంక్తే**<br>**నాస్తి భోజ్యం పృథక్ స్వతః।** | స్వాత్మ (స్వకీయ ఆత్మ చైతన్యము) తనకు **తానే అనన్యమై కూడా,** ఈ చరాచర జగత్తును - **అన్యమైన దానివలే** వెలిగిస్తోంది. అనగా, ఈ చరాచర జగత్తుగా కనిపించేదంతా స్వాత్మకు వేరు కాదు. **కథలోని పాత్రల విన్యాసమంతా ఆ కథా రచయితకు వేరు కాదు కదా! కానీ, ఆ రచయిత సర్వదా వేరే కదా!)**<br>ఇదంతా స్వాత్మ మాత్రమే! అట్టి స్వాత్మగా ప్రకాశించునది, ప్రకాశింప బడునది కూడా నేనే! ఈ విధంగా **'ఈ దృశ్యజగత్తంతా స్వస్వరూపమే'** అని బుద్ధితో తెలుసుకుంటూ ఆస్వాదించు వానికి - ఇక తనకు వేరైన భోజ్యము (అనుభవించబడునది) ఎక్కడ ఉంటుంది? స్వతఃగా ఉండదు. భోగించబడునదంతా ఆత్మస్వరూపమే! ఆత్మ సర్వదా అనన్యము కదా! |

(పృథక్) అస్తిచేత్ అస్తితా రూపం
బ్రహ్మైవ అస్తిత్వ లక్షణమ్।
బ్రహ్మవిజ్ఞాన సంపన్నః, ప్రతీతమ్ అఖిలమ్ జగత్,
పశ్యన్ అపి, సదా నైవ పశ్యతి స్వాత్మానః పృథక్।

'ఉన్నది' - అని దేనినైనా అనుకోవటం జరిగితే ఆ ఉన్నదంతా ఆత్మయొక్క అస్తిత్వ లక్షణమే! ఓ ఋభూ! ఎప్పుడైతే ఈ జీవుడు బ్రహ్మవిజ్ఞాన సంపన్నుడౌతాడో, ఆ మరుక్షణం **"ఈ వేరు వేరుగా కనబడుచున్నదంతా స్వాత్మయే! అనేకంగా కనిపిస్తూ 'ఒక్కటి'గా అనిపిస్తూ, ఆ ఒక్కటి నేనే! మమాత్మయే!"**..... అనునది అకృత్రిమ స్వానుభవముగా కలిగి ఉంటున్నాడు.

---

**03.** మత్ స్వరూప పరిజ్ఞానాత్
కర్మభిః న స బధ్యతే।

ప్రియ ఋభూ! ఎప్పుడైతే నాయొక్క (లేక నీయొక్క) అఖండ - బ్రహ్మానంద స్వరూపము 'బాగుగా ఎరుగుట' జరిగిందో, ఇక ఆపై నీవు కర్మలకు ఏమాత్రము బద్ధుడవు కావు.

---

యః శరీర – ఇంద్రియాదిభ్యో
విహీనగ్ం సర్వసాక్షిణమ్,
పరమార్థైక విజ్ఞానగ్ం
సుఖాత్మానగ్ం స్వయం ప్రభమ్,
స్వస్వరూపతయా సర్వం
వేద స్వానుభవేన యః,
స ధీరః। సతు విజ్ఞేయః।
సోఽహమ్ తత్త్వం,
ఋభో! భవ।

ఎవ్వడైతే →
→ ఈ శరీరము, ఇంద్రియములు, ఇంద్రియ విషయములు, ఇంద్రియ దృశ్యము... వీటన్నిటికీ **'సర్వసాక్షి'** అయి
→ సర్వమునకు పరమార్థము (The Final Meaning) అగు ఏకైక విజ్ఞానస్వరూపుడై, స్వయం ప్రకాశకుడై,
స్వయం ప్రభతో, ఈ సమస్తమును పరమసుఖాత్మకమగు స్వస్వరూపముగా ఎరుగుచున్నాడో, స్వభాసిద్ధంగా స్వానుభవం పొందుచున్నాడో, ఆతడే **ధీరుడు.** తెలుసుకోవలసినది తెలుసుకున్నవాడు. కాబట్టి ఆతడే **'సవిజ్ఞేయుడు'**. ఓ ఋభూ! **అట్టి అఖండ సర్వస్వరూప పరమాత్మయే నేను! సోఽహమ్! 'నీవు'గా కనిపిస్తున్నదంతా అఖండ ప్రియాత్మయే! తత్త్వమ్'!** ఈవిధంగా అనుకుంటూ, అనుకుంటూ - **అదియే నీవగుము.**

---

అతః ప్రపంచానుభవః సదా
నహి। స్వరూప బోధానుభవః
సదా ఖలు।

అందుచేత ఓ ఋభు మహాశయా! ఈ పాంచభౌతికమైన **ప్రపంచమును ఎప్పుడూ ప్రపంచముగా చూడవద్దు.** ఈ దృశ్య జగత్తు పట్ల (స్వప్నము - స్వప్న ద్రష్టస్వరూపములవలె) **స్వస్వరూపానుభవిగా** అయి ఉండుము.

---

ఇతి ప్రపశ్యన్ పరిపూర్ణ వేదనో,
న బంధ ముక్తో।
న చ బద్ధ ఏవ తు।
స్వస్వరూపానుసంధానాత్
నృత్యం తగ్ం
సర్వసాక్షిణమ్।

నేనే నీవై ఉండుము! ఇట్టి పరిపూర్ణ స్వరూపము గురించి **1. వినటము, 2. ఎరుగుటము, 3. దర్శనము, 4. అదే నీవటములను - ఆశ్రయించి ఉండు.** అప్పుడిక బంధము లేదు. ముక్తియు లేదు. జీవాత్మత్వమంతా నీ అంశయే అయి ఉండగా, **'బద్ధుడు' ఎవరు?** ఎవరికి బద్ధుడు? నటునికి పాత్ర యొక్క బంధము తనదవదు కదా! **స్వస్వరూప - అనుసంధానుడవై, సర్వమునకు సాక్షివై, ఈ జగత్ వ్యవహారమంతా స్వకీయ నటరాజ - తాండవ నృత్యముగా నిర్వర్తించెదవుగాక!**

---

ముహూర్తం చింతయేత్ మాం యః,
సర్వబంధైః ప్రముచ్యతే।
సర్వభూత అంతరస్థాయ,
నిత్యముక్త చిదాత్మనే,
ప్రత్యక్ చైతన్య రూపాయ,
మహ్యా మేవ నమో నమః।

(అప్రమేయము, నిత్యము, సత్యము, అమృతము అగు) నాయొక్క కేవలానంద-అద్వయ స్వరూపమును ముహూర్త కాలము (12 క్షణముల కాలము) చింతనచేసిన మాత్రం చేతనే నీవు సర్వబంధములనుండి ప్రముచ్యుడవు కాగలవు.

సర్వజీవుల అంతస్థుడను, సర్వాంతర్యామిని, నిత్యముక్తుడను చిదాత్మను ప్రత్యక్ చైతన్యరూపుడను కూడా అగు **నా ఆత్మ స్వరూపమునకు నేను నమస్కరిస్తున్నాను.**

త్వం వా అహమస్మి భగవో
దేవతేహం వై త్వమసి।

హే భగవాన్! నీవే నేనై ఉన్నాను. అట్టి నేను సర్వదేవతా స్వరూపుడనై ఉన్నాను. అట్టి నేనుగా ఉన్నది నీవే. **ఈ సమస్తము నీయొక్క, నాయొక్క అఖండాత్మ సంప్రదర్శనా చమత్కారమే.**

**తుభ్యం మహ్యం అనంతాయ**
**మహ్యం తుభ్యం చిదాత్మనే।**
**నమో మహ్యం పరేశాయ**
**నమస్తుభ్యగ్ం శివాయ చ।**

**నీవే నేనై, అనంతుడనై, నేనే నీవై, చిదాత్మస్వరూపుడనై ఇరువురము అఖండ రూపులమే।** సర్వమునకు పరము, నియామకుడు పరేశ్వరుడు అయి ఉన్న **'మమాత్మ'కు నమస్కారము. నేనైయున్న పరమశివునికి నా నమస్కారము. నీవై ఉన్న పరమశివునికి నమస్కారము.**

---

**కిం కరోమి? క్వ గచ్ఛామి?**
**కిం గృహ్ణామి? త్యజామి కిం?**
**యత్ మయా పూరితం విశ్వం**
**మహాకల్పాంబునా యథా।**

ఈ విశ్వమంతా నేనై, ఆత్మస్వరూపుడనై మహాకల్పములన్నీ నిండియున్న నేను ఇంకా క్రొత్తగా ఏమి చేయాలి? సముద్రమంతా జలమయమై యుండగా సముద్ర జలమునకు మరొక చోటికి వెళ్ళటమనేది ఏముంటుంది? **తరంగం ఒకచోటి నుండి మరొక చోటికి వెళ్ళినా కూడా సముద్ర జలం ఎక్కడినుండి ఎక్కడికీ వెళ్ళదు కదా।** నేను స్వీకరించ వలసినదే ముంటుంది? త్యజించవలసినదేమి? **ఇదంతా సర్వదా ఆత్మ స్వరూపుడనగు నాచేతనే నిండియున్నది కదా! ఈ కనబడేదంతా నా కల్పనా తరంగములు. నేను సాగరస్వరూపుడను।**

---

**అంతః సంగమ్, బహిః సంగమ్,**
**ఆత్మసంగం చ యః త్యజేత్,**
**సర్వ సంగ నివృత్తాత్మా**
**స మామ్ ఏతి। న సగ్ంశయః॥**

అంతఃసంగము, బాహ్య సంగము, జీవాత్మత్వముతో సంగము ఎవ్వడైతే అధిగమించివేస్తాడో అట్టి సర్వసంగములు వదలిన జీవుడు శివుడే అగుచున్నాడు. ఆతడు ఆదివరాహమూర్తియగు నేనే అగుచున్నాను. సందేహం లేదు. **నేనే అతడు। ఆతడే నేను. (జ్ఞానీతు ఆత్మైవ మే మతమ్)**

---

**అహిః ఇవ జనయోగగ్ం**
**సర్వదా వర్జయేత్ యః,**
**కుణపమివ సునారీం**
**త్యక్త కామో విరాగీ,**
**విషమివ విషయాదీన్**
**మన్యమానో, దురాంతాన్ జగతి**
**పరమ హంసో వాసుదేవో అహమేవ॥**

**ఎవ్వడైతే....**

ఒక 'పాము' వలె జనులతో సంసర్గమును సర్వదా త్యజించినవాడై,
ఒక పీనుగ (శవము) వలె సుందర శరీరములపట్ల కామమును త్యజించి, విరాగి అయి, విషయములు మొదలైనవానిని విషమువలె చూచుచూ, జగత్తుతో మనోసంబంధములను దురభ్యాసంగా భావిస్తూ ఉంటాడో, అట్టివాడు **(సోఽహం పరమమ్ - ఈ సర్వమునకు పరమైన ఆత్మయే నేను - అను ఎరుకను అనుక్షణం చేసుకొన్న) పరమహంసయే!** అందరిలో వసించు వాసుదేవుడే! నేనే సర్వ దేహములలో వసించువాడను. **వాసుదేవుడను.** ఇటువంటి ఆత్మాఽహమ్ భావన కలవానికి - నాకు భేదమే లేదు.

---

**ఇదం సత్యం। ఇదం సత్యం।**
**సత్యమ్ ఏతత్ ఇహ ఉచ్యతే।**
**అహమ్ సత్యమ్ పరం బ్రహ్మ**
**మత్తః కించిత్ న విద్యతే॥**

ఇదంతా ఆత్మయే కాబట్టి సత్యమే। సత్యమే కాబట్టి నిత్యమే। ఆత్మయే ఇదంతాగా విస్తరించి ఉన్నది కదా। ఈ సమస్తముగా ప్రదర్శనమగు చున్నదంతా నేనే। ఆత్మయే। మమాత్మయే। నేను ఆత్మస్వరూపుడను. కనుక సర్వదా సత్యమే। **నిత్యమగు పరబ్రహ్మ స్వరూపుడను. అందుచేత ఎక్కడా ఏదీ నాకు వేరై లేదు. సత్యము కానిది లేదు.**

---

**<u>ఉపసమీపే యో వాసో</u>**
**<u>జీవాత్మ పరమాత్మనోః</u>**
**<u>ఉపవాసః స విజ్ఞేయో।</u>**
**<u>నతు కాయస్య శోషణమ్॥</u>**

**ఉపవాసము :** ఎవ్వరు జీవాత్మ-పరమాత్మల ఏకత్వము (అఖండత్వము)తో సామీప్యతను కలిగి ఉంటారో అట్టి ఏకత్వభావన, ఎరుకయే **ఉపవాసము.** అంతేగాని, ఆహారము స్వీకరించకుండా దేహమును శోషింపజేయుటము ఉపవాసము కాదు.

---

**కాయ శోషణ మాత్రేణ**
**కా తత్ర హి అవివేకినామ్?**
**వల్మీక తాడనాత్ ఏవ**
**మృతః కిన్ను మహోరగః?**

ఆహారము మానివేసి దేహమును శోషింపచేసినంతమాత్రముచేత ఆ అవివేకికి **'సోఽహమ్ అనుక్షణికబుద్ధి రూపమగు అనినిత్యానుభవం'** లభిస్తుందా? లేదు. పుట్టపై కర్రతో కొట్టినంత మాత్రం చేత పుట్టలోని పాము చస్తుందా? లేదు కదా! ఇదీ అంతే!

---

**'అస్తి బ్రహ్మ' ఇతి చేత్ వేద**
**'పరోక్షజ్ఞానమ్' ఏవ తత్।**
**'అహం బ్రహ్మ' ఇతి చేత్ వేద**
**'సాక్షాత్కారః' స ఉచ్యతే।**

'బ్రహ్మము ఉన్నది' అని తెలుసుకోవటము - అదంతా పరోక్షజ్ఞానము (Just like knowing as third person)

**" 'ఆ బ్రహ్మము' అనబడునది నేనే అయిఉన్నాను"** - అని తెలుసుకొంటేనే అది 'సాక్షాత్కారము' అనబడుచున్నది. ఆత్మగా ఆత్మను దర్శించటమే ఆత్మసాక్షాత్కారం. (స-అక్షాత్కారమ్)! (Knowing as First Person)

**04.** **యస్మిన్ కాలే స్వమాత్మానం, యోగీ జానాతి కేవలమ్,**
**తస్మాత్ కాలాత్ సమారభ్య, 'జీవన్ముక్తో' భవిత్యసౌ।**
**'అహమ్ బ్రహ్మ' ఇతి నియతం మోక్షహేతుః మహాత్మనామ్।**

ఏ సమయమందైతే యోగి కేవలమగు స్వస్వరూపమే అయి ఉన్న స్వాత్మయొక్క స్వాభావిక ఔన్నత్యమును ఎరిగినవాడౌతాడో, అప్పుడే ఆ యోగి జీవన్ముక్తుడు.

'అహమ్ బ్రహ్మోస్మి! నేనే బ్రహ్మమును' అను నియతియే (స్వకీయ నిర్ణయమే) - మహాత్ములచే మోక్షహేతువుగా చెప్పబడుచున్నది.

---

**ద్వేపదే బంధ మోక్షాయ-**
**'నిర్మమేతి!' 'మమేతి చ'।**
**మమేతి బధ్యతే జంతుః।**
**నిర్మమేతి విముచ్యతే।**

బంధ మోక్షములకు రెండు మార్గములు. (1) మమ (మమకారము) (2) నిర్మమ (మమకార రాహిత్యము - నిర్మమకారము).

"నాది - నాకు చెందినది' అను భావనచే ఈ జీవునికి **'బంధము'** ఏర్పడుచున్నది.

'నిర్మమ' (ఏదీ నాకు చెంది లేదు) అను భావముచే **బంధవిముక్తి** సిద్ధిస్తోంది.

---

**బాహ్యా చింతా న కర్తవ్యా,**
**తథైవ అంతర చింతికా,**
**సర్వ చింతాం సముత్సృజ్య, స్వస్థో భవ సదా, ఋభో!**
**సంకల్ప మాత్ర కలనేన జగత్ సమగ్రం।**
**సంకల్పమాత్ర కలనే హి జగత్ విలాసః।**

ఓ ఋభు మహాశయా! మునీశ్వరా! బాహ్య చింతనల కర్తృత్వము వదలివేయి. అట్లాగే క్రమంగా అంతర - చింతనలను కూడా వదలాలి. **సర్వచింతనలు మొదలంట్లా వదలినవాడవగుము. స్వస్థుడవగుము.**

సంకల్ప రూపంగానే (సంకల్పించుట చేతనే) **ఈ జగత్తు అంతా ఏర్పడినది అగుచున్నది. ఈ జగత్-విలాసమంతా స్వకీయ కల్పనా మాత్రమే!**

---

**సంకల్ప సూత్రం ఇదం ఉత్సృజ।**
**'నిర్వికల్పమ్' ఆశ్రిత్య**
**మామక పదగ్ం హృది భావయస్వ।।**

ఈ జగత్ విలాసమంతా సంకల్పములనుండే బయల్వెడలుతోంది. అందుచేత ఓ ప్రియమునీశ్వరా! 'సంకల్పించటము' అనే సూత్రపు త్రాడును వదలి 'నిర్వికల్పము'ను ఆశ్రయించు. హృదయమునందు నా స్థానమును భావన చేయి. **అట్టి స్వస్థానమునందు ఈ సర్వమును స్వకీయ 'కథాకల్పన' వలె దర్శించు.**

---

**మత్ చింతనం, మత్ కథనమ్,**
**అన్యోన్యం మత్ ప్రభాషణమ్,**
**మదేక పరమో భూత్వా**
**కాలం నయ, మహామతే!**

ఓ మహామతీ! ఆత్మానంద స్వరూపుడను, ప్రకృతిగా మూర్తీభవించిన అవతార మూర్తిని అగు నా గురించి చింతన, నా గురించిన కథనములు వినటము, నా గురించి ఒకరికొకరు సంభాషించుకోవటము, నన్నే పరము(Final State)గా, మహదాశయముగా కలిగియుండటము - ఈ విధంగా నిర్వర్తిస్తూ కాలమును గడుపుచుండెదవుగాక!

---

**చిత్ ఇహ అస్తి-ఇతి చిన్మాత్రం।**
**ఇదం చిన్మయమేవ చ।**
**చిత్ 'త్వమ్'। చిత్ 'అహమ్'।**
**ఏతే చ 'లోకాః' చిత్ - ఇతి భావయ।**
**రాగం నీరాగతాం నీత్వా**
**నిర్లేపో భవ సర్వదా।**

చిత్ ఇక్కడే ఉన్నది. ఇదంతా కూడా చిత్ స్వరూపమే అయి ఉన్నది. ఈ కనబడేదంతా చిన్మయమే! స్వకీయమగు 'ఎరుక' యొక్క విస్తరణ చమత్కారమే!

**"నీవు చిత్ స్వరూపుడవే! నేను చిత్ స్వరూపుడనే! ఈ లోకము చిత్ స్వరూపమే"** - అని భావించెదవుగాక!

పరిమిత రాగమును **త్యజించి సర్వత్రా అనురాగంగా రూపము దిద్దుకో.** సర్వదా సర్వత్రా నిర్లేపుడవు (విషయాతీతుడవు) అయి ఉండెదవు గాక!

---

**అజ్ఞాన జన్య 'కర్తృ' - ఆది**
**'కారకా' ఉత్పన్న కర్మణా,**
**శ్రుతి ఉత్పన్న**
**ఆత్మవిజ్ఞాన**
**ప్రదీపో బాధ్యతే కథమ్?**

ఆత్మ సర్వదా పరము అయి ఉన్నది. అది జ్ఞాన-అజ్ఞానములకు సంబంధితమై, పరిమితమై ఉండునది కాదు. కర్తృత్వ భోక్తృత్వములచే బాధించబడేది కాదు.

అజ్ఞానముచే జనించే కర్తృత్వ - కార్య - కారణముల వ్యవహారము - "శ్రుతులచే నిర్వచింపబడుచున్న ఆత్మ విజ్ఞాన ప్రదీపము"ను బాధించగలదా? లేదు. దీపమునకు వస్తు సంబంధము లేనట్లే ఆత్మకు కర్తృత్వ - భోక్తృత్వ-కార్యకారణ సంబంధమైనది లేదు. (తద్వారా పొందబడేది) కాదు. **ఆత్మ సర్వదా సిద్ధించినదే అయి ఉన్నది.**

**అనాత్మతాం పరిత్యజ్య**
**నిర్వికారో జగత్ స్థితౌ,**
**ఏకనిష్ఠతయా అంతస్థ**
**సంవిన్మాత్ర (సత్‌విత్‌మాత్ర) పరో భవ।**

మరి ఆత్మజ్ఞానానుభవానందమునకు ఉపాయం ఏమిటి? 'ఆత్మకు ఇది వేరు' అను అనాత్మత్వమును పరిత్యజించి జగత్తులో నిర్వికారముగా ఉంటూ, ఏకైక నిష్ఠ(The only objective, The only determination)తో సంవిన్మాత్రపరుడవగుము.

---

**ఘటాకాశ మఠాకాశౌ**
**మహాకాశే ప్రతిష్ఠితౌ,**
**ఏవం మయి చిదాకాశే**
**జీవ - ఈశౌ పరికల్పితౌ।**
**యా చ ప్రాక్ ఆత్మనో మాయా**
**తథా అంతేత చ తిరస్కృతా।**

ఆకాశము (Space) సర్వదా ఏకము, అఖండము అయినప్పటికీ లోకంలో...

ఇది కుండలోని ఆకాశము

ఇది గృహములోని ఆకాశము

ఇది గృహ బాహ్యాకాశము

ఇది మహాకాశము

ఈ విధంగా ప్రసిద్ధమైయున్నది కదా! అన్నీ కూడా మహాకాశంలో అంతర్లీనమే కదా! అట్లాగే నా చిదాకాశ స్వరూపము పట్ల - మాయకు మునుముందే 'ఆత్మ' ఉన్నది. ఆ మాయ చివరికి 'యా మా! లేనే లేనిది' అనురూపంగా తిరస్కరించబడుచున్నది. **"ఇది జీవుడు, ఇది ఈశ్వరుడు"** మొదలైనవన్నీ కేవలాత్మ పట్ల పరికల్పించ బడుచున్నాయి. అవన్నీ కూడా 'పరాత్మ'లో అంతర్లీనమయ్యే ఉన్నాయి.

---

**బ్రహ్మవాదిభిః ఉద్గీతా**
**సా మాయేతి వివేకతః।**
**మాయా తత్కార్య విలయే**
**న-ఈశ్వరత్వం, న-జీవతా।**

'బ్రహ్మము' గురించి ఎరిగియుండి ప్రసంగించు బ్రహ్మవాదులు - **'వివేకముచే మాయ సమసిపోగలదు, లేనిదిగా అవగలదు'** - అని గానం చేస్తున్నారు.

మాయ విలయము పొందితే, మాయా కార్యములు కూడా విలయము పొందుతాయి. అప్పుడిక 'జీవుడు' అనబడునది ఉండదు. 'ఈశ్వరుడు' అనబడునది లేనిది - అగుచున్నది. **అఖండాత్మయే శేషించినదగుచున్నది.**

---

**తతః శుద్ధః చిదేవా అహమ్**
**వ్యోమవత్ నిరుపాధికః।**
**జీవ-ఈశ్వరాది రూపేణ**
**చేతన-అచేతనాత్మకమ్,**
**ఈక్షణాది - ప్రవేశాంతా**
**సృష్టిః ఈశేన కల్పితా॥**

**ఈశ్వర భ్రాంతి కల్పితము:** సమస్తముగా ఆకాశమువలె 'ఉపాధి' రహితమగు శుద్ధ చిత్ స్వరూపమే నేనై ప్రకాశించుచున్నవాడనగుచున్నాను. ఉపాధి రహితుడను (నిరుపాధికుడను) అగు నేను **జీవ-ఈశ్వర రూపమును** ధారణ చేయుచున్నాను. చేతనాత్మకంగా (కదిలించునదిగా), - అచేనాత్మకంగా (కదిలించబడునది)గా అనేక ఈక్షణము (Perceptions)ల రూపముగా ధారణ చేస్తున్నాను. ఒక కవికి కవన రూపము వంటిదగు ఈశ్వరకల్పిత సృష్టియందు చైతన్యరూపుడనై ప్రవేశించుచున్నాను. అప్పుడు కూడా సమస్తమునకు ఆవల కేవలుడనై ఉన్నాను. ఈక్షణము (Begining of Perceptions) నుండి "బ్రహ్మమునందు ప్రవేశము" వరకు ఈశ్వర మాయా కల్పితము.

---

**జాగ్రత్ ఆది - విమోక్షాంతః**
**సగ్ంసారో జీవకల్పితః।**
**'త్రిణాచక' ఆది - యోగాంతా**
**ఈశ్వర భ్రాంతిమ్ ఆశ్రితాః।**
**లోకాయతాది → సాంఖ్యాంతా**
**జీవ విభ్రాంతిమ్ ఆశ్రితాః।**

**జీవ-కల్పిత భ్రాంతి:** జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు మొదలైనవన్నీ (జీవునికి) జీవకల్పితమై 'సంసారము' అనునది బయల్వెడలుతోంది. అట్టి సంసారము - త్రిణాచకయోగసిద్ధి (ప్రాణాయామాది యోగసిద్ధి) వరకు (అనగా) మోక్ష పర్యంతము ఈశ్వర కల్పిత భ్రాంతిని ఆశ్రయించి 'మోక్షము' వరకు కొనసాగుచున్నాయి.

లోకసంబంధములనుండి - సాంఖ్యయోగత్వము వరకు ఈశ్వరమాయను జీవభ్రాంతి ఆశ్రయించినదై విభ్రాంతి రూపంగా ప్రదర్శనమగుచున్నది.

---

**తస్మాత్ ముముక్షుభిః నైవ మతిః -**
**జీవ-ఈశ వాదయోః కార్యాః।**
**కింతు బ్రహ్మతత్త్వమ్**
**నిశ్చలేన విచార్యతామ్।**

అందుచేత మోక్షానందము కోరుకొను ముముక్షువు - 'జీవ' - ఈశ్వర' భేదవాదమంతా ఆవలబెట్టి, మనస్సును సర్వభేదముల నుండి ఈవలకు తెచ్చి, **'నిశ్చలత'**ను సంపాదించుకొని, **'బ్రహ్మతత్త్వము'** గురించియే ఏకాగ్రతగా విచారణ (Analysing) చేయాలి.

అద్వితీయ బ్రహ్మతత్త్వం
న జానంతి యథా-తథా,
భ్రాంతా ఏవ అఖిలాః, తేషాం క్వ ముక్తిః?
క్వ ఇహ వా సుఖమ్?
ఉత్తమ - అధమ భావశ్చేత్
తేషాగ్ంస్యాత్ అస్తి తేన కిమ్?

అద్వితీయము (విచారణ చేస్తున్నవానికి వేరైనది కానట్టిది) అగు బ్రహ్మతత్త్వమును ఎవ్వడైతే **ఉన్నది ఉన్నట్లుగా** (యథాతథంగా) ఎరుగడో, **తనయొక్క కేవలీతత్త్వ ధ్యానము**ను స్వీకరించడో, అట్టివానిపట్ల అన్యమగు వ్యవహారచర్య అంతా భ్రాంతియే అగుచున్నది. అట్టివానికి ముక్తి ఎక్కడిది? బంధము కొనసాగుచుండగా అట్టి అధ్యయనికి సుఖమెక్కడిది?

అన్యమునందు అధ్యయనము చేస్తూ కాలము గడుపు వారికి ఉత్తమ - అధమ భావములు ఉండి మాత్రం ఏమి ప్రయోజనము?

---

స్వప్నస్థ రాజ్య భిక్షాభ్యాం
ప్రబుద్ధః స్పృశ్యతే ఖలు?
అజ్ఞానే బుద్ధి విలయే
నిద్రా సా మన్యతే (భణ్యతే) బుధైః।

ఒకడు కలలో రాజు అయ్యాడు. లేక భిక్షకుడై వీధులలో తిరిగాడు - అనునవన్నీ తెల్లవారి లేచినతరువాత ఎందుకు పనికివస్తాయి? ఏమి ప్రయోజనము? అవన్నీ ఆ కల కనేవాడిని స్పృశించి ఉండవు కదా!

**'బుద్ధి అజ్ఞానమునందు మునిగి ఉన్నప్పుడు ఈ జీవుడు కల్పనలో గాఢనిద్రను పొందుచున్నాడు'** అని బుధులు చెప్పుచున్నారు.

---

విలీనా (అ)జ్ఞాన తత్కార్యే
మయి నిద్రా కథం భవేత్?
బుద్ధేః పూర్ణ వికాసోఽయం జాగరః పరికీర్త్యతే।
వికారాది విహీనత్వాత్ జాగరో మే న విద్యతే॥

ఆత్మభావనచే అజ్ఞానము, తత్-కార్యములు ఆత్మయందు లీనమగుచుండగా, ఇక నాకు జడస్థితియగు 'నిద్ర' అనునది ఏమున్నది? బుద్ధి పూర్తిగా వికసించినప్పుడు అది 'జాగ్రత్ స్థితి'గా పరికీర్తించ బడుతోంది. ఆత్మనగు నాకు ఏ వికారములు లేవు. అప్పుడిక నాకు జాగ్రత్ అనునది ఎక్కడున్నది? ఆత్మగా నాకు జాగ్రత్ దశ, స్వప్నదశ, గాఢనిద్రాదశ ఇవేవీ లేవు. అవన్నీ బుద్ధియొక్క వికారములు మాత్రమే. సకల కల్పనలకు సర్వదా నేను వేరై ఉన్నాను.

---

**05.** సూక్ష్మనాడీషు సంచారో, బుద్ధేః స్వప్నః ప్రజాయతే।
సంచార ధర్మ రహితే, మయి స్వప్నో న విద్యతే।

దేహములోని బుద్ధియొక్క సూక్ష్మనాడులలో సంచారముచే 'స్వప్నము' ఏర్పడుచున్నది. **ఆత్మగా ఒకచోట నుండి మరొక చోటికి సంచారములు చేయు ధర్మమే లేదు.** మరింక 'స్వప్నదశ' అనునది నాకు ఎక్కడున్నది? నా స్వప్నములో ఇంకొక చోటికి వేళ్ళుతూ ఉంటే నేను వెళ్ళినట్లు కాదు కదా!

---

సుషుప్తి కాలే సకలే విలీనే తమసావృతే,
స్వరూపం మహదానందం, భుంక్తే దృశ్య వివర్జితః।

సుషుప్తికాల సందర్భములో సకలము కూడా చీకటి (Ignorence, Non-knowning)చే ఆవృతమై, నాయందు విలీనమైపోవుచున్నది. అప్పుడు దృశ్యరహితుడనై స్వస్వరూప సంబంధమైన మహదానందమును (లేక) మౌనానందమును ఆస్వాదించుచున్నాను.

---

అవిశేషేణ సర్వం తు
యః పశ్యతి చిదన్వయాత్
స యేవ సాక్షాత్ విజ్ఞానీ।
స శివః। స హరిః। విధిః।

ఎవ్వడైతే సర్వమును సవిశేషంగా కాకుండా, అవిశేషంగా, చిత్ (స్వకీయమైన ఎరుకకు అనన్యంగా) దర్శించు దృష్టిని సంపాదించుకొనియే ఉంటాడో ఆతడే సాక్షాత్ విజ్ఞాని. ఆతడే శివుడు. ఆతడే హరి. ఆతడే విధి (బ్రహ్మదేవుడు).

---

దీర్ఘ స్వప్నమ్ ఇదం యత్ తత్
దీర్ఘం వా చిత్తవిభ్రమమ్।
దీర్ఘంవాపి మనో రాజ్యగ్ం
సగ్ంసారం దుఃఖసాగరమ్।

ఇక్కడి 'సంసారము' అనురూపంగా ఏది తారసబడుచున్నదో, అదంతా కూడా...
❊ ఒక సుదీర్ఘమైన స్వప్నమువంటిది. ❊ దీర్ఘమైన చిత్తవిభ్రమము.
❊ దీర్ఘమైన ఊహావ్యవహార రూప మనోరాజ్యము. ❊ ఈ సంసారము (దుఃఖ) సాగరమువంటిది.

---

<u>సుప్తేః ఉత్థాయ → సుప్త్యంతం</u>
<u>బ్రహ్మైకం ప్రవిచింత్యతామ్।</u>
ఆరోపితస్య జగతః - ప్రవిలాపనేన,
చిత్తం మదాత్మకతయా పరికల్పితం నః।
శత్రూన్ విహత్య గురుషట్క గణాన్, నిపాతాత్
గంధ ద్విపో భవతి కేవలమ్ అద్వితీయః॥

అందుచేత ఓ ఋభూ! **నిద్రలేచినది మొదలు, మరల నిద్రపోవునంత వరకు 'బ్రహ్మము'** గురించి మాత్రమే సర్వదా చింతన చేయాలి. ఆరోపితము మాత్రమే అయినట్టి ఈ జగత్ వ్యవహార- ప్రవిలాపనమంతా (A song sung) చిత్తమునందు నా రూపముగా పొందగా, ఆత్మేశ్వరుడ నగు నాయందు ఆ చిత్తము లీనము అగుచున్నది.

చిత్తము లయమొందుచుండగా గొప్ప శత్రువులగు కామక్రోధలోభమోహ మదమాత్సర్యములు జయించివేయబడతారు. గొప్ప శత్రువులను జయించి విశ్రాంతి తీసుకొంటున్న మత్తగజము వలె బుద్ధి ప్రశాంతత పొందుచున్నది. సర్వగంధములను జయించిన ఆత్మ **'కేవలము, అద్వితీయము'** అయి ప్రశాంతమగుచున్నది.

అద్య అస్తమేతు, వపుః
ఆ శశితారమ్ ఆస్తాం,
కస్తావతాపి మమ చిత్
వపుషో విశేషః?

ఈ భౌతిక శరీరము ఇప్పుడే అస్తమించవచ్చుగాక! లేదా ఆచంద్ర తారార్కము కొనసాగితే కొనసాగవచ్చును గాక! సర్వదా చిత్ స్వరూపుడ నగు నాకు నా సమక్షంలో తద్వారా పోయేదీ లేదు. వచ్చేది లేదు. నా చిత్ స్వరూపము పట్ల దృశ్య విశేషమంతా 'విశేషము' కాదు. 'విషయము' కాదు. అవిషయము కాదు.

---

కుంభే వినశ్యతి చిరం
సమవస్థితే వా, కుంభ – అంబరస్య
నహి కో అపి విశేషలేశః।

ఒకచోట ఒక కుంభము (కుండ) ఉన్నది. కుండకు లోపల ఆకాశం (కుంభాకాశము) బయట గృహాకాశం. (మఠాకాశము). ఆ బయట మహాకాశము. ఒకరోజు ఏదో కారణం చేత ఆ కుండ పగిలిపోయింది. అప్పుడు కుంభములోని ఆకాశమునకు ఏమి నష్టం? ఏమి లాభం? కుంభాకాశానికి ఏ విశేషమూ లేదు. బాహ్యాకాశానికి లేదు.

---

అహినిర్ల్వయినీ సర్ప నిర్మోకో
జీవ వర్జితః, వల్మీకే
పతితః తిష్ఠేత్తగ్ం
సర్పో న అభిమన్యతే।
ఏవగ్ం స్థూలం చ సూక్ష్మం చ
శరీరం న అభిమన్యతే।

పాము ఒక పుట్టలో కుబుసమును వదలి ఎటో బయటకు వెళ్ళింది. నిర్జీవమైన ఆ కుబుసము పట్ల ఆ పాముకు 'నా కుబుసము నాసొమ్ము కదా! ఏమౌతుందో ఏమో?' అనే అభిమానము కలిగి ఉంటుందా? ఉండదు. అట్లాగే 'ఆత్మ' గురించి తెలుసుకొని, ఆత్మత్వము సంతరించుకొన్న యోగి (లేక) ముముక్షువునకు ఇక ఈ **'స్థూల శరీరము'** గురించిగాని, భావకల్పనారూపమగు **సూక్ష్మశరీరము** గురించిగాని అభిమానము, అభినివేశము ఉండవు.

---

ప్రత్యక్ జ్ఞాన శిఖిధ్వస్తే
మిథ్యాజ్ఞాన సహేతుకే।
నేతి నేతీతి రూపత్వాత్
అశరీరో భవతి అయమ్। (భవత్యయమ్)।

సహేతుకమైన మిథ్యాజ్ఞానము గురించిన విచారణచే ప్రత్యక్‌జ్ఞానము అనే అగ్నిశిఖ (వ్యష్టిత్వ పరిమిత- సంబంధమైన జ్ఞానము) నశించిపోవుచుండగా, **'నేను ఇది కాదు. నేను ఇది కాదు'** అను రూపమగు పరిశీలనాత్మక దృష్టిచే **ఈ జీవుడు స్థూల శరీరి కాదు. సూక్ష్మశరీరి కాదు. స్వయముగా అశరీరుడై ప్రకాశించుచున్నాడు. కేవల స్వరూపుడై చెన్నొందుచున్నాడు.**

---

**06.** శాస్త్రేణ నశ్యేత్
పరమార్థ దృష్టిః।
కార్యక్షమం నశ్యతి చ
అపరోక్ష్యాత్।

శాస్త్రములు పరిశీలిస్తూ, పఠిస్తూ, అర్థం చేసుకుంటూ ఉండగా **'పరము వేరు - ఇహము వేరు'** అను (కేవలాత్మ) పట్లగల, అర్ధ మాత్రమే అగు దృష్టి (Half Hearted view / understanding) తొలగుతూ వస్తుంది. అపరోక్షము (ఆత్మ ఇంద్రియములకు ప్రత్యక్షమైనదీ కాదు. ఈ జీవునికి వేరుగా ఎక్కడో పరోక్షమైనదీ కాదు) అను దృష్టిచే - కార్య - కారణ - కర్తృత్వ పరిమిత భావాలు ప్రక్కకు పోతాయి!

---

ప్రారబ్ధ నాశాత్ ప్రతిభాన నాశ।
ఏవం త్రిధా నశ్యతి చ
ఆత్మ మాయా।

**"పరమాత్మ స్వరూపుడనగు నాకు నా అంశ అగు జీవాత్మకు సంబంధించిన ప్రారబ్ద - అగామి - సంచిత విషయములతో ఏమి సంబంధము?"** అను ప్రతిభాన నాశనము' వలన 'ప్రారబ్దము' అనునదంతా మొదలే రహితమైనదగుచున్నది. ఈ '3' విధములైన మార్గములలో ఆత్మను ఆవరించిన మాయ నశించగలదు.

---

బ్రహ్మత్వే యోజితే స్వస్మిన్
జీవ భావో న గచ్ఛతి।
అద్వైతే బోధితే తత్త్వే
వాసనా వినివర్తతే।

జీవునిపట్ల **'బ్రహ్మభావన'** జత చేసి దర్శించు **'తత్ త్వమ్ అసి' - అను తత్త్వదృష్టి'** చేత స్వస్వరూపము పట్ల **'నేను జీవుడను మాత్రమే'** అను భావన ఇక ప్రవర్తించదు.

**'ఈ జీవుడుగా కనిపిస్తున్నది అఖండరూపుడగు పరమాత్మయే! పర-ఇహ-జగత్-వాస్తవ రూపములు సర్వదా ఏకమగు పరమాత్మయే' -అను 'అద్వైతబోధిత తత్త్వము'చే సర్వ దృశ్య వాసనలు శమించగలవు.**

---

ఆరబ్ధ–అంతే (ఆరబ్ధాంతే) దేహ హానిః
మాయేతి క్షీయతే అఖిలా।

**'ఈ దేహముయొక్క ఉత్పత్తి, ఇందలి విభాగములగు ఇంద్రియములు, తద్వారా అనుభవమగు స్వసంకల్పిత ఇంద్రియ విషయములు - ఇవన్నీ మాయాకల్పనలు'** అను భావన అభ్యసిస్తూ ఉండగా, దేహభావన హాని పొందినదై, 'మాయ' అనబడునది లేనిదే అగుచున్నది. "ఆత్మ (లేక) బ్రహ్మము సర్వమునకు వేరై, కానీ సర్వమునకు ఆధారమై ఉన్నది" -

**అస్తి ఇత్యుక్తే జగత్ సర్వం**
**సద్రసం బ్రహ్మ తత్ భవేత్।**
**భాతి – ఇత్యుక్తే జగత్ సర్వం**
**భానం బ్రహ్మైవ కేవలమ్।**

"అస్తి" - (ఆత్మయొక్క ఉనికియే ఇదంతా - అని) అనుభావనను అనేకసార్లుగా భావన చేస్తూ ఉండగా అట్టి 'అస్తి'చే ఈ జగత్తంతా 'తత్(బ్రహ్మ। తత్ రసమ్।' అగుచున్నది.
**"భాతి" - "ఆత్మయొక్క వెలుగు విశేషమే ఈ జగత్తు ఆత్మయే జగత్తుగా భాసిస్తోంది"** - అను భావనా అభ్యాసముచే ఈ సర్వజగత్తు కేవలము బ్రహ్మముయొక్క వెలుగు (లేక) ఎరుక రూపంగా అనుభవమవగలదు.

---

**మరుభూమౌ జలగ్ం సర్వం**
**మరుభూమాత్రమేవ తత్।**
**జగత్రయమ్ ఇదం సర్వం**
**చిన్మాత్రం స్వవిచారతః।**

మరుభూమి (ఎడారి)లో సూర్యకిరణముల - వాయుతరంగముల మిశ్రమముచే జలము ఉన్నట్లే కనిపించురీతిగా, ఈ జగత్తు బ్రహ్మమునందు మరుభూమి (ఎడారి - యండమావులు) వంటిది. ఇక్కడి మర్త్య - పాతాళ - స్వర్గ త్రిలోకముల ప్రదర్శనమంతా ఆత్మయొక్క చిత్ (ఎరుక) మాత్రవిలాసమే! విచారణచే చిన్మాత్రమే అగుచున్నది.

---

**అజ్ఞానమేవ న కుతో జగతః ప్రసంగో?**
**జీవ–ఈశ దేశిక వికల్ప కథాతి దూరే?**
**ఏకాంత కేవల చిదేక రస స్వభావే,**
**<u>బ్రహ్మైవ కేవలమ్ అహమ్ పరిపూర్ణమస్మి!</u>**

సర్వదా ఏకాంతము(Alone), కేవలము(Absolute), చిదేకరస స్వభావము (Oneness of knowing is taking appearences of multiplicity) అగు బ్రహ్మమే - నేను. ఈ సమస్తము కేవలబ్రహ్మము, పరిపూర్ణము అయి ఉండగా, ఇక జగత్తు అనునది ఎక్కడున్నది? అదంతా అజ్ఞాన ప్రసంగ వ్యవహారమే! **జీవుడు - ఈశ్వరుడు మొదలైన కథనమంతా నాకు అతి దూరము. అదంతా వికల్పమాత్రమే!**

---

**బోధచంద్రమసి పూర్ణవిగ్రహే,**
**మోహ రాహుమ్ ఉషితాత్మ తేజసి,**
**స్నాన దాన యజనాదికాః**
**క్రియా, మోచనావధి**
**వృథైవ తిష్ఠతి।**

భూమిపై ఉండి సూర్యుని - చంద్రుని చూస్తూ ఉంటున్నప్పుడు ఒక సమయంలో రాహుకేతువులు అడ్డుకున్నట్లుగా కనిపించవచ్చుగాక! అంతమాత్రంచేత సూర్యచంద్రుల స్వతః తేజస్సు తరుగుతుందా! లేదు కదా! రాహు - కేతువుల రాకపోకలు నీడల కదలికవలె వృథా ప్రయాసయే కదా! - అట్లాగే స్వయముగానే పూర్ణబోధ విగ్రహమగు మమాత్మ స్వరూపమును అజ్ఞానము ఆవరించటమేమిటి? అది తొలగుటకై, స్నాన - దాన - యజన క్రియాదుల ఆవశ్యకత ఎక్కడిది? అవన్నీ అనునిత్యాత్మస్వరూపుడనగు నాపట్ల వృథా ప్రసంగమే!

---

**సలిలే సైంధవం యద్వత్**
**సామ్యం భవతి యోగతః,**
**తథా ఆత్మ మనసో**
**ఐక్యగ్ం '<u>సమాధిః</u>' ఇతి కథ్యతే।**

**సమాధి** : సైంధవ లవణము (ఉప్పుగడ్డ) సముద్రజలంలో వేసినప్పుడు, ఆ ఉప్పు గడ్డయొక్క ఆకారము, ఉప్పతనము - ఇవన్నీ ఏమౌతున్నాయి? సముద్రజలముతో సామ్యము (ఏకత్వము, సంయోగము) పొందుచున్నాయి. అట్లాగే ఈ మనస్సు సర్వమును ఆత్మగా దర్శించు అభ్యాసముచే మనస్సు (సముద్రజలంలో ఉప్పుగడ్డవలె) ఆత్మతో ఐక్యము పొందటమే 'సమాధి'గా చెప్పబడుచున్నది.

---

**దుర్లభో విషయ త్యాగో।**
**దుర్లభం తత్త్వదర్శనమ్।**
**దుర్లభా సహజావస్థా–**
**సద్గురోః కరుణాం వినా।।**

**సద్గురు కరుణ** : ఓ ఋభూ! ఏది ఎరిగిన తరువాత **'నేను అఖండమగు ఆత్మనే'** అను తత్త్వబోధను గురువు ప్రసాదిస్తున్నారో - అట్టి సద్గురువును ప్రణిపాతి అయి ముముక్షువు శరణు వేడాలయ్యా. సద్గురు కరుణలేకపోతే, విషయములను త్యజించటము, తత్త్వదర్శనము **'ఆత్మాఽహమ్'** అనబడు సహజావస్థ - ఇవి దుర్లభమైన విషయాలే సుమా!

---

**ఉత్పన్న శక్తి బోధస్య**
**త్యక్త నిశ్శేష కర్మణః,**
**యోగినః సహజావస్థా**
**స్వయమేవ ప్రకాశతే।**

సద్గురువు బోధిస్తూ ఉండగా ఆ ముముక్షువు ఆత్మశక్తి బోధ సంపన్నుడై **'కర్మలు నాకు గాని, నేను కర్మలకు గాని చెందిన వారము కాము'** అని ఎరుగుచూ, కర్మలను నిశ్శేషముగా త్యజించినవాడగుచున్నాడు. అట్టియోగి **'సహజావస్థ'**ను సిద్ధించుకొని **స్వస్వరూపాత్మగా** ప్రకాశించుచున్నాడు.

---

**రసస్య మనసశ్చైవ**
**చంచలత్వగ్ం స్వభావతః,**
**రసో బద్ధో మనోబద్ధం**
**కిం న సిద్ధ్యతి భూతలే?**

పాదరసమువలె (Like mercury)-ఈ మనస్సు రసస్వభావము (The Feature of experiencing) చేత - స్వభావతః అతి చంచలముగా సంచారములు నిర్వర్తిస్తోంది. అట్టి రసాస్వాదన (Experiencing)ను విషయముల నుండి విరమింపజేయాలి. **'ఆత్మరసాస్వాదన'** అను ఉపాయముచే రసబద్ధము, తద్వారా మనోబద్ధము సిద్ధిస్తున్నాయి. అట్టి వానికి ఈ భూమిపై సిద్ధించనిది ఏమి ఉంటుంది?

**మూర్ఛితో హరతి వ్యాధిం**
**మృతో జీవయతి స్వయమ్।**
**బద్ధః ఖేచరతాం ధత్తే**
**బ్రహ్మత్వగ్ం రస చేతసీ॥**

"బ్రహ్మమే నేను" అనబడు బ్రహ్మత్వరససిద్ధి చేత ఈ జీవుడు
- మూర్ఛితుడు అయి కూడా ఆ వ్యాధి నుండి విముక్తుడు కాగలడు.
- మరణించిన తరువాత కూడా స్వయంజీవితుడు కాగలడు.
- బద్ధుడై ఉండి కూడా పక్షివలె ఆకాశమున విహారములు చేయగలడు.

---

**ఇంద్రియాణాం మనో నాథో।**
**మనో నాథస్తు మారుతః।**
**మారుతస్య లయో నాథః।**
**తం నాథం లయం ఆశ్రయ॥**

ఇంద్రియములకు ప్రభువు (లేక) నాథుడు ఎవ్వరు? **మనస్సు.**
మరి మనస్సుకు నాథుడు? **ప్రాణశక్తి.**
ప్రాణములకు నాథుడు? **లయము. (ఆత్మయందు అంతర్లీనత్వము).**
అందుచేత **'లయము'** అనే నాథుని సర్వ ప్రయత్నములతో ఆశ్రయించాలి.

---

**నిశ్చేష్టో నిర్వికారశ్చ**
**లయో జీవతి యోగినామ్।**
**ఉచ్ఛిన్న సర్వ సంకల్పో**
**నిశ్శేష అశేష చేష్టితః।**
**స్వావగమ్యో లయః కోఽపి**
**మనసాం వాక్ అగోచరః।**

**'లయము'**ను ఉపాసించి, సిద్ధించుకున్న యోగి సర్వ కర్మలకు సంబంధించనివాడు అవటం చేత నిర్వికారుడై, లయయోగి అయి, ఈ భూమిపై జీవిస్తున్నాడు.

అట్టి లయయోగి - సర్వ సంకల్పములను వదలివేసినవాడై, సర్వచేష్టలను నిశ్శేషముగా మొదలంట్లా త్యజించి ఉన్నవాడై, స్వస్వరూపాత్మను ఆశ్రయించుటచే స్వావగమ్యుడై, **'ఈతడు ఇట్టివాడు' అనుకోవటానికి మనోవాక్కులకు అందనివాడై ఉంటున్నాడు. ఎందుకంటే, ఆతనికి ఈ సమస్తము స్వస్వరూపాత్మ స్వరూపమే!**

---

**పుంఖానుపుంఖ విషయ ఈక్షణ తత్పరోఽపి**
**బ్రహ్మావలోకన ధియం న జహాతి యోగీ,**
**సంగీత తాళ లయ వాద్య వశం గతాపి,**
**మౌళిస్థ కుంభ పరిరక్షణ ధీర్నటీవ॥**

అట్టి లయయోగిపట్ల విషయములు ఉండవా? ఉంటే ఉంటాయి. అయితే ఆతడు పుంఖానుపుంఖముగా (ఒక విషయం తరువాత వెనువెంటనే మరొకటి) విషయములను చూస్తూ తత్పరుడై (Deeply involved) ఉంటున్నప్పటికీ **'ఇదంతా సర్వదా కేవలమగు బ్రహ్మమే కదా!'** - అనబడు 'బ్రహ్మావలోకనము' అనే బుద్ధిని ఈషణ్మాత్రమూ వదలి ఉండడు. ఎట్లా (దృష్టాంతంగా) అంటే, ఉత్తమబుద్ధిశాలియగు ఒక నాట్యకారుడు నృత్యనటనను నిర్వర్తిస్తూ కూడా, సంగీత - తాళ - లయ - వాద్య-నృత్య వశంగా కాళ్ళు - చేతులు కదల్చుచున్నప్పటికీ, తలపై ధరించిన కుంభమును (పాత్రను, బిందెను, పళ్లెము , దీపములను) క్రిందపడిపోకుండా పరిరక్షించుకుంటూనే ఉంటాడు కదా! **యోగి ఎక్కడ ఏమి చేస్తూ ఉన్నా 'బ్రహ్మము' యొక్క భావనను వదలడు.**

---

**సర్వ చింతాం పరిత్యజ్య**
**సావధానేన చేతసా,**
**నాద ఏవ అనుసంధే యో**
**యోగ సామ్రాజ్యమ్**
**ఇచ్ఛతా ఇతి॥**

ఓ ఋభూ!
సర్వ అన్య చింతనలను వదలివేయి.
సావధానముతో కూడి బుద్ధితో (సావధానచిత్తుడవై) యోగాభ్యాసముచే (చెవులు వ్రేళ్ళతో మూసినప్పుడు వినబడు) నాదముతో అనుసంధానం చేయి.
అట్టి యోగి యోగ సామ్రాజ్యమునకు స్వకీయ ఇచ్ఛచే 'సామ్రాట్టు' అయి ప్రకాశించుచున్నాడు.

***ఇతి ద్వితీయ అధ్యాయః।***

***ఇతి ద్వితీయ అధ్యాయః।***

## తృతీయోऽధ్యాయము - తత్ సదా అహమ్ అనే 'మౌనము'

**01.** **నహి నానా స్వరూపంస్యాత్**
**ఏకం వస్తు కదాచన।**
**తస్మాత్ అఖండ ఏవ అస్మిన్।**
**మత్ - అన్యత్ న కించన।**
**దృశ్యతే శ్రూయతే యద్వత్**
**బ్రహ్మణో అన్యత్ న తత్ భవేత్।।**

ఏది సర్వదా ఏకవస్తువే అయిఉన్నదో, అది అనేక వస్తువులుగా ఎప్పుడూ అవదు. (బంగారము ఏకవస్తువే. అనేక ఆభరణములుగా అవటం కారణంగా బంగారము అనేకములుగా అవుతోందా? లేదు. ఎల్లప్పుడు ఏకమే).

అందుచేత అఖండాత్మ స్వరూపుడనగు నాకు అన్యముగా ఏదీ ఎక్కడా ఎప్పుడూ కించిత్‌గా కూడా లేదు. అవటం లేదు.

ఏదేది కనబడుతోందో, వినబడుతోందో - అదంతా ఏమాత్రము కూడా బ్రహ్మమునకు వేరుగా అగుటలేదు. స్వప్న చైతన్యము (ఊహా చమత్కారమునకు) వేరై స్వప్నములో ఏదీ లేదు కదా!

---

**నిత్యశుద్ధ, విముక్త, ఏకమ్,**
**అఖండానందమ్ అద్వయమ్।।**
**సత్యం జ్ఞానం అనంతమ్**
**యత్ "పరంబ్రహ్మ" అహమేవ తత్।**

ఏదైతే అన్నీ తానై, సర్వమునకు వేరుగా 'సాక్షి' అయి ఉన్నదో - అట్టి పరంబ్రహ్మము (సర్వమునకు పరము) నిత్యశుద్ధము. అది దేని చేతనూ బంధింపబడదు కాబట్టి నిత్యముక్తము. ఏకమే కాని అనేకము కాదు. అఖండము ఆనందస్వరూపము. అద్దానికి ద్వితీయమై ఏదీ లేదు కాబట్టి అద్వయము. బ్రహ్మము సర్వదా సత్య జ్ఞాన అనంతము. అట్టి పరబ్రహ్మమే నేను - అయి ఉన్నాను.

---

**ఆనంద రూపోऽహమ్ అఖండ బోధః।**
**పరాత్పరోऽహమ్ ఘనచిత్ ప్రకాశః।**
**మేఘా యథా వ్యోమ న చ స్పృశంతి,**
**సగ్ంసార దుఃఖాని, నమాం స్పృశంతి।**

అట్టి అఖండ - బోధ - ఆనంద స్వరూపుడను నేను.

పరమునకు ఆవల సర్వస్వరూపడను. కాబట్టి, పరాత్పరమును ఇంద్రియములకు కనిపించేదంతా నా ఘనీభూతమైనట్టి చిత్ ప్రకాశమే. ఆకాశంలో మేఘములు కనబడుచున్నంత మాత్రంచేత మేఘములు ఆకాశమును స్పృశించగలవా? లేదు. అట్లాగే సంసార దుఃఖ వ్యవహారము లన్నీ ఆత్మాకాశ స్వరూపుడనగు నన్ను ఎట్లా స్పృశిస్తాయి? స్పృశించలేవు.

---

**సర్వగ్ం సుఖం విద్ధి సుఖ-దుఃఖ నాశాత్,**
**సర్వం చ సద్రూపమ్, అసత్యనాశాత్।**

ఓ ఋభూ! దుఃఖములు తొలగుటానికి 'సర్వము ఆత్మసుఖమే' అని ఎరిగి ఉండటమే ఉపాయము. అప్పుడు 'అసత్తు'కు సంబంధిత సుఖ-దుఃఖ భావన నశించిపోవుచూ **'సర్వము సత్స్వరూపమే'**-అనునది భావనాభ్యాసముచే సిద్ధిస్తోంది. **"అంతా ఆత్మానందమే"**-అని ఆస్వాదించబడ గలదు.

---

**'చిత్' రూపమేవ**
**ప్రతిభాసయుక్తం।**
**తస్మాత్ అఖండం మమ**
**రూపమ్ ఏతత్।**

'చిత్' (ఎరుక / ఎరుకచే Enlightening చేయు) కేవల రూపమే ఈ అనేక రూపములతో కూడిన, మార్పు చేర్పులు పొందుచున్న జగత్తుగా (బింబము దర్పణంలో ప్రతిబింబించు తీరుగా) ప్రతిబింబిస్తోంది. కాబట్టి నా స్వస్వరూపము సర్వదా అఖండమైయున్నది.

---

**నహి జనిః మరణం,**
**గమన-ఆగమో,**
**న సమలం విమలం, న చ వేదనమ్।।**
**చిన్మయం హి సకలం విరాజతే**
**స్ఫుటతరం పరమస్య తు యోగినః।**
**సత్య చిద్ఘనం అఖండం,**
**అద్వయం, సర్వదృశ్య రహితం,**
**నిరామయమ్।।**

**తత్‌పదమ్ ఇతిమౌనమాశ్రయ్**

ఓ ఋభూ! ఆత్మానందరూపా! నేను చెప్పు విధంగా ఆత్మ(Absolute Self) గురించి భావన చేస్తూ ఉండెదవు గాక.

- ☞ ఆత్మస్వరూపుడనగు నాకు జనన - మరణములు లేవు. గమన - ఆగమనములు (రాక - పోకలు) లేవు.
- ☞ నాకు **దోషము, నిర్మలము** - ఈ రెండూ లేవు.
- ☞ దేని గురించీ వేదనము (తెలుసుకోవటం, తెలుసుకోకపోవటం అనునదీ లేదు)

పరమయోగులు దేనిని సర్వే - సర్వత్రా విరాజమానమై స్ఫుటతరంగా, సుస్పష్టంగా, నిర్ద్వంద్వంగా, నిస్సందేహంగా దర్శిస్తున్నారో...,

| | |
|---|---|
| తత్ సదాఽహమ్ ఇతి మౌనమ్ ఆశ్రయ॥<br>యత్ పదం విమలమ్<br>అద్వయగ్ం శివం<br>'తత్ సదా అహమ్' ఇతి-<br>మౌనమ్ ఆశ్రయ॥ | అటువంటి సత్యము, చిద్ఘనము, అఖండము, అద్వయము, సర్వదృశ్య రహితము, నిరామయము అగు **'తత్ బ్రహ్మమే నేనై యున్నాను'** ఇది గ్రహించి మౌనము వహించి ఉండుము. (ఇదియే మౌనవ్రతము). ఏ పదమైతే (The state of self) విమలము, అద్వయము, శివము అయి ఉన్నదో, అట్టి 'ఆత్మ' అనబడే పరబ్రహ్మమే సర్వదా నేనైయున్నాను - అను రూపమును ఆశ్రయించి ఉండుము (ఇదియే మౌనవ్యాఖ్య) |
| జన్మ - మృత్యు సుఖ - దుఃఖ వర్జితమ్,<br>జాతి నీతి కుల గోత్ర దూరగమ్,<br>చిత్ వివర్త జగతో అస్య కారణమ్<br>తత్ సదాఽహమ్ - ఇతి<br>మౌనమ్ ఆశ్రయ॥ | **ఏద్దానికైతే....,**<br>జన్మ-మృత్యు-సుఖ-దుఃఖములు మొదటి నుంచి కూడా లేనే లేవో, ఇక్కడి విశేషములై కనిపించే జాతి, నీతి, కుల, గోత్రములకు అత్యంత దూరమో,<br>ఏది ఈ జగత్తుకు అసలైన కారణము **చిత్-వివర్తము**, (స్వకీయమైన ఎరుకయొక్క యథాతథ కల్పిత పరిణామము) అయి ఉన్నదో,... అట్టి **'తత్'**యే నేను...అని గ్రహించినవాడవై **మౌనమును** (Grand Silence) **ఆశ్రయించి ఉండుము.** (ఇదియే మౌనధ్యానము) |
| పూర్ణమ్ అద్వయమ్, అఖండ చేతనమ్,<br>విశ్వభేద కలనాది వర్జితమ్,<br>అద్వితీయ పర సత్ చిదగ్ం శకం<br>తత్ సదాఽహమ్ ఇతి-మౌనమ్ ఆశ్రయ॥ | 'స్వయముగానే అద్వయమైనట్టిది, (సం)పూర్ణమైనది, సర్వచేతనములు తనవై అఖండమైయున్నట్టిది, విశ్వ భేద కలనములేమీ లేనట్టిది, పరమై - సత్ చిత్ లక్షణములచే, తనకు ద్వితీయమే లేనట్టిది, - **'అదియే సదా నేను'** అని గమనిస్తూ **మౌనమును ఆశ్రయించి ఉండుము** (ఇదియే మౌన తపస్సు) |
| **02.** కేనాపి అబాధితత్వేన<br>త్రికాలేఽపి ఏకరూపతః<br>విద్యమానత్వమ్ 'అస్తి',<br>(య)ఏతత్ సద్రూపత్వగ్ం సదా మమ। | ఏద్దైతే - దేని చేతనూ ఏమాత్రమూ బాధించబడక, భూత్ - వర్తమాన - భవిష్యత్తులలో సదా సర్వదా ఏక రూపమే అయి ఉన్నదో....<br>'అస్తి' (నేను ఉన్నాను)' అనురూపంగా సర్వ దేహములలోనూ సంప్రదర్శనమానమై యున్నదో, అటువంటి సద్రూపరూపమే నాయొక్క సదారూపము. (అట్టి సద్రూపమే నీవు సదా అయి ఉన్నావు కూడా!) |
| నిరుపాధిక నిత్యం యత్<br>సుప్తౌ సర్వసుఖాత్ పరమ్<br>సుఖరూపత్వమపి<br>ఏతత్ ఆనందత్వగ్ం సదా మమ॥ | ఏ ఆనందమైతే **ఉపాధికి సంబంధించనిదైయున్నదో**, నిత్యము - **అనునిత్యమో, పరమసుఖ స్వరూపమై యున్నదో,** అటువంటి ఆనందరూపమే నాయొక్క సదా - రూపము. |
| దినకర కిరణైర్హి శార్వరం తమో నిబిడతరం<br>ఝుడితి ప్రణాశమేతి।<br>ఘనతర భవ కారణం తమోయద్ధరి దిన కృత్<br>ప్రభయా న చ అంతరేణ।<br>మమ చరణ స్మరణేన పూజయా చ<br>స్వక తమసః పరిముచ్యతే హి జంతుః। | రాత్రిపూట కలిగిన 'నిబిడాంధకారము' సూర్యుని కిరణముల ప్రకాశముచేగానీ ఏమాత్రం తొలగదు కదా! అట్లాగే,<br>ఘనతరమైన భవ - కారణంగా ఏర్పడిన తమస్సు (ఈ దృశ్యము భవమే। - నిజంగానే ఉన్నది అను అజ్ఞాన తమస్సు) చేత అంతరంగములో ఏర్పడిన అజ్ఞాన నిబిడాంధకారము ఈ భౌతికమైన సూర్యకాంతిచే తొలగేది కాదు,.. మరి? నన్ను స్మరించటంచేత, పూజించటం చేత మాత్రమే - తమస్సు (అజ్ఞానంధకారము) నుండి ఈ జీవుడు విముక్తి పొందగలడు. |
| నహి మరణ ప్రభవ ప్రణాశ హేతుః<br>మమ చరణ స్మరణాదృతే అస్తి కించిత్।<br>ఆదరేణ యథా స్తౌతి<br>ధనవంతం ధనేచ్ఛయా,<br>తథా చేత్ విశ్వకర్తారం<br>కో న ముచ్యేత బంధనాత్? | ఇక్కడి జనన - మరణ - పునర్జన్మ కేతువుల వలన ఈ జీవునికి కలుగుచున్న దుఃఖపరంపరలు - నా చరణ స్మరణ - శరణా గతులచే ఇక శేషించినవై ఉండజాలవు. (ఇక మిగలవు)<br>ఒక ధనాశాపరుడు - తనను ధనవంతుని చేయు సంపదకొరకై ఎంతటి తీవ్రేచ్ఛతో స్తుతిస్తాడో, - ఆ విధంగా **విశ్వకర్తనగు నన్ను బంధవిముక్తికై తీవ్రేచ్ఛతో ఆశ్రయిస్తే, అట్టివాడు ఎందుకు బంధవిముక్తుడు కాడు?** తప్పక అవుతాడు. అనుమానం లేదు'. |

| | |
|---|---|
| **ఆదిత్య సన్నిధౌ లోకః**<br>**చేష్టతే స్వయమేవ తు**<br>**తథా మత్ సన్నిధానేవ**<br>**సమస్తం చేష్టతే జగత్।**<br>**శుక్తికాయాం యథా తారం**<br>**కల్పితం మాయయా తథా,**<br>**'మహత్' ఆది జగత్ మాయా**<br>**మయం మయ్యేవ కేవలమ్।** | **ఋభుమునీంద్రుడు** : స్వామీ! 'ఈ జగత్తుకు కారణకారణులు మీరే' - అని స్తుతించబడుచున్నారు కదా! మీరు 'అకారణులు' (దేనికీ కారణము కాదు) అని కూడా వర్ణించబడుచున్నారు. మీరు సకారణులా? అకారణులా?<br>**శ్రీ వరాహస్వామి** : సూర్యుని సన్నిధానంలో (వెలుతురుతో) జనులంతా వారి వారి పనులన్నీ నిర్వర్తించుకొంటూ ఉంటున్నారు కదా! అట్లాగే నాయొక్క సన్నిధానంలో ఈ సమస్త జగత్తు కూడా చేష్టత్వము పొందుచున్నది. సూర్యుని వెలుగులాగానే నేను దేనికీ కారణం కాదు.<br>'ముత్యపు చిప్పలో వెండి ఉన్నది' అని కొందరు చూడటము ఏ విధంగా కల్పితంగా సిద్ధిస్తోందో, అదే విధంగా మహత్తుతో సహా ఈ జగత్తంతా కేవలము నేనే అయి ఉండగా మాయచే నాకు వేరైన దానివలె దర్శించబడు చున్నది. నాయందు జగత్తు ఆపాదించబడి దర్శించబడుతోంది. |
| **చండాల దేహే, పశ్వాది, స్థావరే, బ్రహ్మ విగ్రహే**<br>**అన్యేషు తారతమ్యేన, స్థితేషు న తథా హి అహమ్॥** | ఒక అమానుష లక్షణములు కనిపించే చండాలుని దేహమునందు, పశువు మొదలైన సర్వజంతువులయందు, స్థావరములయందు, బ్రహ్మదేవుని యందు తదితర సర్వమునందు ఏమాత్రము తర-తమ భేదము, తారతమ్యము లేకుండా నేను సమముగా సంస్థితుడనై ఉన్నాను. |
| **వినష్ట దిక్ భ్రమస్యాపి**<br>**యథా పూర్వం విభాతి దిక్,**<br>**తథా విజ్ఞాన విధ్వస్తం**<br>**జగత్ మే భాతి తత్ నహి॥** | ఒకానొకడు ఎక్కడో తెలియనిచోట చిక్కుకున్న సందర్భములో **'నేను ఎక్కడున్నాను? ఏది ఎటువైపు ఉన్నది?'** అనే దిగ్భ్రమ తొలగిన మరుక్షణం, ఇక దిక్కులన్నీ యథాపూర్వంగా (ఇదివరకు ఎట్లా ఉంటే అట్లాగే) తెలిసిపోతుంది కదా! అదేవిధంగా స్వస్వరూపజ్ఞాన - విజ్ఞానములు వికసించగానే ఇకప్పుడు ఈ జగత్తు జగత్తుగా నాపట్ల భాసించదు. |
| **న దేహో, న ఇంద్రియ ప్రాణో।**<br>**న మనో బుద్ధి – అహంకృతిః।**<br>**న చిత్తం, నైవ మాయా చ।**<br>**న చ వ్యోమాదికం జగత్॥**<br>**న కర్తా, నైవ భోక్తా చ।**<br>**న చ భోజయితా తథా।**<br>**కేవలమ్ చిత్ సదానంద**<br>**బ్రహ్మైవాహమ్ జనార్దనః॥** | నేను దేహమును కాదు. ఇంద్రియములు, ప్రాణము కాదు. మనోబుద్ధి చిత్త అహంకారములూ కాదు. మాయ కూడా కాదు. ఈ ఆకాశ - వాయు - అగ్ని-జల-భూ...పంచభూతముల స్వరూపుడను కూడా కాదు. నేను దేనికీ కర్తనుకాదు. దేనిపట్లా భోక్తను కూడా కాదు। భోగింపబడువాడను కాను।<br>కేవల చిత్ - సదానంద స్వరూపమగు బ్రహ్మమే అయి ఉన్నాను. (సర్వజీవులను సంప్రదర్శనముగా కలిగియున్నాను కాబట్టి) - **జనార్దనుడను.** |
| **జలస్య చంచలాత్ ఏవ**<br>**చంచలత్వం యథా రవేః,**<br>**తథా అహంకార సంబంధాత్**<br>**ఏవం సంసార ఆత్మనః।** | ఓ ఋభూ! ఆత్మకు బంధముగాని, సంసార దోషముగాని లేనే లేదు. జలంలో తరంగములు కదలుచూ ఉండగా, జలములో ప్రతిబింబించే సూర్యబింబము కదలుచూ ఉన్నట్లు కనబడుచూ ఉంటుంది కదా! అట్లాగే 'అహంకారము'తో సంబంధము వలన ఆత్మకు సంసారబంధమంతా ఏర్పడుచున్నట్లు తోచుచున్నది. అయితే, నీళ్లలోని సూర్య ప్రతిబింబ కదలికలు సూర్యుని తాకుతాయా? లేదు కదా! అట్లాగే సంసారబంధము ఆత్మను స్పృశించదు. |
| **03. చిత్త మూలం హి సంసారాత్।**<br>**తత్ ప్రయత్నేన శోధయేత్।**<br>**హంత। చిత్త మహత్ తాయాం**<br>**కైషా విశ్వాసతా తవ?** | ఓ ఋభూ! సంసారమునకు మూలము చిత్తమే!<br>చిత్తమే సంసారము. అంతకుమించి సంసారమునకు వేరే రూపమేదీ లేదు. అందుచేత ఈ చిత్తమును మొదలంట్లా శోధించి, అద్దానితోగల దోషవిషయములన్నీ తొలగించి పరిశుభ్రపరచుకోవాలి.<br>బిడ్డలారా! సకల జనులారా! ఆహా! ఈ చిత్తము వ్రాలుచున్న విషయములపై మీకెంత విశ్వాసము? ఎంతటి మమకారము? ఈ రెండూ తొలగితే సంసారమెక్కడిది? దృశ్యములో చూస్తున్న వస్తువులవలెనే, ఆత్మయందు ధ్యాస ఎందుకు కుదరటం లేదు? మీరు చిత్తమును నమ్మినంతగా ఆత్మను నమ్మటం లేదెందుకు? |

| | |
|---|---|
| క్వ ధనాని మహీపానాం?<br>బ్రహ్మణః క్వ జగంతి వా?<br>ప్రాక్తనాని ప్రయాతాని<br>గతాః సర్గ పరంపరాః।<br>కోటయో బ్రహ్మణాం యాతా<br>భూపా నష్టాః పరాగవత్। | ఎక్కడి సంపదలు? ఎక్కడి రాజులు? ఎక్కడ బ్రహ్మ? ఎక్కడ తాను సృష్టించుకొన్న జగత్తులు? ఎన్నో సృష్టులు అసంఖ్యాకంగా ఇది వరకు బయలుదేరాయి. కాలగర్భంలో కలిసిపోయాయి.<br>కోట్లకొలది బ్రహ్మలే గతించిపోయారు. పూలతకు అనేక పుష్పములు, ఆ పుష్పములలో ఒక్కోదానికి సుగంధమువలె, కాలము అనే పూలతావనంలో లెక్కపెట్టజాలని సంఖ్యలో మహారాజులంతటివారు, చక్రవర్తులంతటివారు వస్తున్నారు. పోతున్నారు. |
| స చ అధ్యాత్మాభిమానోఽపి<br>విదుషోఽపి ఆసురత్వతః<br>విదుషోఽపి ఆసురత్వేస్యాత్<br>నిష్ఫలం తత్త్వ దర్శనమ్! | కొందరు ఆధ్యాత్మ విద్యపట్ల అభిమాని (Wet - interested) అయి ఉండి, ఆ విద్యపట్ల విదుషులు (Expert) అయి ఉండి కూడా ఆసురత్వము వదలలేకపోవుచున్నారే. (అహంకారము, దర్పము, క్రోధము, దుష్పూరమైన కామము మొదలైన లక్షణములుగల) ఆసుర సంపదను వదలకపోవటంచేత, ఆతని బ్రహ్మజ్ఞానమునకు సంబంధించిన శాస్త్రజ్ఞానమంతా బూడిదలో పోసిన పన్నీరువలె నిష్ఫలమే అగుచున్నది. |
| ఉత్పాద్యమానా రాగాద్యా, వివేక జ్ఞానవహ్నినా,<br>యథా తథైవ దహ్యంతే, కుతః తేషాం ప్రరోహణమ్? | ఎవ్వడైతే తనయందు బయల్వెడలుచున్నట్టి రాగ -ద్వేషములను బయలుదేరీ - బయలుదేరక ఉన్నప్పుడే మొదలంట్లా **'జ్ఞానాగ్ని'**తో దహించివేస్తాడో, అట్టివానికి 'పునరావృత్తి - ప్రరోహణ - పునర్జన్మ' అనే దోషాలు ఎక్కడ ఉంటాయి? ఉండవు. |
| స్వగుణ దోష విచారణ<br><u>యథా సునిపుణః సమ్యక్</u><br><u>పరదోష ఈక్షణ రతః,</u><br><u>తథా చేత్ నిపుణః స్వేషు</u><br><u>కో న ముచ్యేత బంధనాత్?</u> | **తనయొక్క గుణ దోష విచారణ**<br>ఒకానొకడు ఏ విధంగా అత్యంత నైపుణ్యంగా (సునిపుణుడై), తెలివిగా ఇతరుల దోషములను చూస్తూ, మాట్లాడుతూ ఉంటాడో, **అదే తెలివి - నైపుణ్యములతో, సమ్యక్ దృష్టములతో తన దోషములను గమనిస్తూ ఉంటే, అట్టివాడు ఎందుకు సంసారబంధములనుండి విముక్తుడు కాడు? తప్పక విముక్తుడౌతాడు.** |
| <u>సిద్ధులు</u><br>అనాత్మవిత్ అముక్తోపి<br>సిద్ధిజాలాని వాంఛతి,<br>ద్రవ్య మంత్ర క్రియా కాల<br>యుక్త్యా అప్నోతి,<br>మునీశర్వ! | <u>సిద్ధులు</u><br>**ఋభు** : హే భగవాన్! ఈ జీవుడు తపస్సు, యోగము ఇత్యాదుల ద్వారా ఆత్మజ్ఞాని (ఆత్మవేత్త అగుచుండగా, ఆతనిని సిద్ధులు కూడా సమీపిస్తాయి కదా)<br>**ఆదివరాహస్వామి** : ఓ మునీశ్వరా! ఆత్మజ్ఞానానికి సిద్ధులకు ఏ పరస్పరమైన సంబంధమూ లేదు. ఎందుకంటే,<br>ఒకడు అనాత్మవేత్త (ఆత్మజ్ఞాన రహితుడు) అముక్తుడు (విషయములకు బద్ధుడు) అయి ఉన్నప్పుడు కూడా, ఆతడు సిద్ధులు కావాలని కోరుకొంటూ ఉంటే, ద్రవ్య - మంత్ర - క్రియ - కాలయుక్తంగా అవి లభిస్తూ ఉంటాయి. |
| న ఆత్మజ్ఞస్య ఏష విషయ।<br>ఆత్మజ్ఞో హి ఆత్మమాత్రదృక్। | 'ఆత్మతత్త్వము' అనే మహదాశయము లేనట్టి అనాత్మజ్ఞులకు 'సిద్ధులు' మొదలైనవి గొప్ప విషయాలు. **ఆత్మజ్ఞునకో? ఆతనికి 'ఆత్మ దర్శనము' మాత్రమే విషయము, లక్ష్యము, ఆశయము, దృష్టి విధానము కూడా! ప్రాపంచకమైన సిద్ధుల గురించి ఆతనికి ధ్యాసయే ఉండదు.** |
| ఆత్మన్ ఆత్మని సంతృప్తో<br>న అవిద్యాం అనుధావతి। | అట్టివాడు ఆత్మతో ఆత్మను మాత్రమే దర్శిస్తూ సంతృప్తుడై ఉంటాడు. 'అవిద్య'యగు సిద్ధుల వంటి **దృశ్యాంతర్గత మాత్ర విశేషములకు** పరుగులు తీయడు. |

**యే కేచేన జగత్ భావాః**
**తాన్ 'అవిద్యామయాత్' విదుః।**
**కథం తేషు కిల ఆత్మజ్ఞః**
**త్యక్తా విద్యో నిమజ్జతి?**
**(త్యక్త అవిద్యో - నిమజ్జతి?)**

ఏఏ జగత్ భావములు (జగత్తులో కనిపించే సహజీవులపట్ల, వస్తువుల పట్ల భేదపూర్వకమైన భావనలు, అభి(ప్రాయములు, ఆవేశములు), హృదయంలో ఏర్పడినవై ఉంటున్నాయో, అవన్నీ కూడా **'అవిద్యామయములే కదా'** - అని ఎరిగి ఉండుము.

ఆత్మజ్ఞుడు స్వభావరీత్యా 'అవిద్య'ను వదలి 'విద్య' యగు ఆత్మయందే రమిస్తూ ఉంటాడు. అటువంటివాడు అవిద్యయే అగు లౌకిక సిద్ధులనే తెచ్చిపెట్టకొని వాటిలో మునుగాలనుకుంటాడా? లేదు.

---

**ద్రవ్య మంత్ర క్రియా కాల**
**యుక్తయః సాధుసిద్ధిదాః,**
**పరమాత్మ పదప్రాప్తౌ**
**న ఉపకుర్వన్తి కాశ్చన।**

ద్రవ్యము చేత, క్రియలచేత (యోగాభ్యాసములచేత), కాలమహిమ చేత (కాలం ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క సిద్ధిని ప్రకృతి క్రీడా వినోదంగా ఒక్కొక్కరికి ఇచ్చి మరల తీసివేసుకోవటం), కాలకృతంగా సాధనపరులను సిద్ధులు ఆశ్రయిస్తూ ఉంటాయి. అవన్నీ ఎక్కడా కూడా **'పరమాత్మ పదప్రాప్తి'**కి ఏమాత్రం ఉపయోగపడేవి కావు.

---

**సర్వేచ్ఛా కలనా శాంతా వా (తు)**
**ఆత్మలాభ ఉదయాభిదః।**
**స కథగ్ం సిద్ధి వాంఛాయాం?**
**కథమ్ అర్హతి అచిత్తకః? - ఇతి॥**

**"ఇతి తృతీయ అధ్యాయః"**

సర్వ ఇచ్ఛాభ్రమలు సశాంతించినప్పుడు మాత్రమే 'ఆత్మలాభము' అనేది ఉదయిస్తుంది.

"ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్తి అంతర్గతములన్నీ నేను వినోదముగా సిద్ధించుకొంటున్నవే" - అనురూపంగా (ఆత్మతత్త్వానుభవ) సిద్ధి కోరుకొనేవాడు లౌకిక సిద్ధులు ఎందుకు కోరుకుంటాడు? కోరుకోడు. ఆతడు చిత్తమును 'చిత్' యందు లయింపజేసే ప్రయత్నంలో మాత్రమే ఉంటాడు కదా?

చిత్తమే లేనివాడికి, 'చిత్తమే అఖర్లేదు' అనుకొనేవాడికి (అచిత్తకునికి) ఇక లౌకికమైన అణిమ - గరిమ - మహిమ - లఘిమ - ఈశిత్వ - వశిత్వ - ప్రాకామ్య - ఇచ్ఛాది సిద్ధులు వచ్చి ఏం చేసుకుంటాడు? లేనంతమాత్రం చేత నష్టమేమిటి? ఉంటే మాత్రం ఆత్మసమక్షంలో క్రొత్తగా వచ్చిపడేదేమున్నది?

**"ఇతి తృతీయ అధ్యాయః"**

# చతుర్థో అధ్యాయః - ఋభు-నిదాఘ సంవాదము

## 'ఋభూ - నిదాఘ - సంవాదము :: శరీరములు - భూమికలు - జీవన్ముక్తుడు'

| | |
|---|---|
| **01.** అథ ఋభుం భగవంతం<br>నిదాఘః ప్రపచ్ఛ:<br>"జీవన్ముక్తి లక్షణమ్<br>అనుబ్రూహి!" ...ఇతి॥ | పై విషయాలన్నీ భగవంతుడగు ఋభువు ఒకానొక సందర్భములో తనను ఆశ్రయించిన నిదాఘుడు అనే శిష్యునికి చెప్పుకుంటూ వస్తున్నారు.<br>**నిదాఘుడు** : హే భగవాన్! గురుదేవా! ఋభుమహర్షీ! దయామయా! జీవుడనగు నేను జీవన్ముక్తుడను కావాలి కదా? అందుచేత **'జీవన్ముక్తి లక్షణములు'** గురించి దయతో విశదీకరించండి. |
| తథేతి సహోవాచ (ఋభౌవాచ):<br>సప్తభూమిషు జీవన్ముక్తాః చత్వారః।<br>'శుభేచ్ఛా' ప్రథమా భూమికా భవతి।<br>'విచారణా' ద్వితీయా।<br>'తనుమానసీ' తృతీయా।<br>'సత్త్వాపత్తిః' తురీయా। (చతురీయా)।<br>'అసంసక్తిః' పఞ్చమీ।<br>'పదార్థ భావనా' షష్ఠీ।<br>'తురీయగా' సప్తమి। ఇతి॥ | **ఋభుమహర్షి (శిష్యుడగు నిదాఘునితో)**<br>ఓ ప్రియశిష్యా! సోఽహమ్ ఆత్మస్వరూపా! నిదాఘా! వినండి!<br>***జీవన్ముక్తి సిద్ధించటానికై - సప్త (7) భూమికలు***<br>(1) శుభేచ్ఛ (2) విచారణ (3) తనుమానస - ఈ '3' కూడా ఉపాసనా (లేక) ముముక్షు భూమికలు.<br>(4) సత్త్వాపత్తి, (5) అసంసక్తి , (6) పదార్థభావన, (7) తురీయగము ఇవి **అనుభవ భూమికలు.**<br>(జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయములనే 4 అవస్థలతో కూడిన ప్రణవస్వరూపుడగు ఈ జీవుని గురించి, ఆతని ఆత్మానుభవము కొరకై ఈ ఏడు **'జ్ఞానభూమికలు'** శాస్త్రములచే విశదీకరించబడుచున్నాయి). |
| ప్రణవాత్మికా భూమికా<br>'అ' కార, 'ఉ'కార, 'మ'కార అర్థమాత్రాత్మికా,<br>స్థూల సూక్ష్మ బీజ సాక్షి భేదేన<br>అకారాదయః చతుర్విధాః।<br>తత్ అవస్థా జాగ్రత్ స్వప్న సుషుప్తి<br>తురీయాః। | **'అ' కారాది చతుర్విధ (4) ప్రణవాత్మ భూమికలు**<br>(1) 'అ'కారాత్మికా (2) 'ఉ'కారాత్మికా (3) 'మ'కారాత్మికా (4) అర్థమాత్రాత్మికా<br>**'స్థూల' ఆది చతుర్విధ అవస్థలు**<br>(1) స్థూల (2) సూక్ష్మ (3) బీజ (4) సాక్షీ - భేదేన.<br>వాటి అవస్థలు (చతుర్విధ అవస్థలు).<br>(1) జాగ్రత్ (2) స్వప్న (3) సుషుప్తి (4) తురీయము. |
| 'అ' కార స్థూలాంశే 'జాగ్రత్' - విశ్వః।<br>సూక్ష్మాంశే తత్ తేజసో।<br>బీజాంశో తత్ ప్రాజ్ఞః<br>సాక్ష్యంశే తత్ తురీయః॥<br>(జాగ్రత్ → స్థూలము<br>స్వప్నము → సూక్ష్మము,<br>సుక్షిప్తి → బీజము,<br>తురీయము → సాక్షి) | **చతుర్విధ జాగ్రత్ పురుషులు**<br>I. **'అ'కార** → ప్రణవాంశ - **జాగ్రత్‌వస్థ** - ఆత్మాంశ → **'విశ్వుడు'**<br>**'ఉ'కార** → ప్రణవాంశ - **స్వప్న అవస్థ** - ఆత్మాంశ → **'తేజసుడు'**<br>**'మ'కార** → ప్రణవాంశ - **సుషుప్తి అవస్థ** - ఆత్మాంశ → **'ప్రాజ్ఞుడు'**<br>**అర్థమాత్ర** → ప్రణవాంశ - సాక్షి - ఆత్మాంశ →**'తురీయుడు'**<br>**ఈవిధంగా 'అ'కార స్థూలాంశ యందలి చతుర్విధ జాగ్రత్ పురుషులు**<br>'అ'కారస్థూలాంశగా → జాగ్రత్ విశ్వుడు<br>సూక్ష్మాంశగా → జాగ్రత్ తేజసుడు<br>బీజాంశగా → జాగ్రత్ ప్రాజ్ఞుడు<br>సాక్ష్యాంశగా → జాగ్రత్ తురీయుడు |
| 'ఉ'కార స్థూలాంశే స్వప్నః।<br>విశ్వః సూక్ష్మాంశే తత్ తేజసో।<br>బీజాంశే తత్ ప్రాజ్ఞః।<br>సాక్ష్యంశే, తత్ తురీయః॥ | **II. 'ఉ'కార స్థూలాంశ యందలి చతుర్విధ స్వప్న పురుషులు**<br>'ఉ'కార స్థూలాంశగా - స్వప్నవిశ్వుడు (స్వప్న స్థితి)<br>సూక్ష్మాంశగా - స్వప్నతేజసుడు (జాగ్రత్)<br>బీజాంశగా - స్వప్నప్రాజ్ఞుడు (గాఢ నిద్రాస్థితి)<br>సాక్ష్యంశగా - తత్ (స్వప్న) తురీయుడు (తురీయము) |

| | |
|---|---|
| (III) 'మ' కారః స్థూలాంశేషు సుప్తః। | III. **<u>'మ'కార స్థూలాంశయందలి చతుర్విధ సుప్త పురుషులు</u>** |
| విశ్వః సూక్ష్మాంశే। | మకార స్థూలాంశలో - సుషుప్తి - సుప్త విశ్వుడు |
| తత్ తేజసో బీజాంశే। | సూక్ష్మాంశలో - జాగ్రత్ - సుప్త తేజసుడు |
| తత్ ప్రాజ్ఞః। | బీజాంశలో - స్వప్నము - సుప్త ప్రాజ్ఞుడు |
| సాక్ష్యంశే తత్ తురీయః। | సాక్ష్యంశలో - తురీయము - సుప్త తురీయుడు |
| **02.** (IV) అర్ధమాత్రా స్థూలాంశే తురీయ। | IV. **<u>అర్ధమాత్ర స్థూలాంశయందలి చతుర్విధ అర్ధమాత్ర పురుషులు</u>** |
| విశ్వః సూక్ష్మాంశే। | అర్ధమాత్ర స్థూలాంశలో - తురీయ విశ్వుడు |
| తత్ తైజసో, బీజాంశే। | సూక్ష్మాంశలో - తురీయ తేజసుడు |
| తత్ ప్రాజ్ఞః సాక్ష్యంశే। | బీజాంశలో - తురీయ ప్రాజ్ఞుడు |
| తురీయ తురీయః॥ | సాక్ష్యాంశలో - తురీయ తురీయుడు |
| 'అ' కార తురీయాంశాః<br>ప్రథమ ద్వితీయ తృతీయ భూమికాః।<br>'ఉ' కార తురీయాంశా చతుర్థీ భూమికా।<br>'మ' కార తురీయాంశా పంచమీ!<br>అర్ధమాత్రా తురీయాంశా షష్ఠీ!<br>తత్ అతీతా సప్తమీ। | **ప్రణవాంశలు - సప్త భూమికలు**<br>'అ'కార తురీయాంశలో → ప్రథమ, ద్వితీయ, తృతీయ భూమికలు **(శుభేచ్ఛ, విచారణ, తనుమానస) భూమికలు.**<br>'ఉ'కార తురీయాంశలో → 4వ భూమిక - **సత్త్వాపత్తి।**<br>'మ'కార తురీయాంశలో → 5వ భూమిక - **అసంసక్తి।**<br>'అర్ధమాత్ర' తురీయాంశలో → 6వ భూమిక - **పదార్థభావనా।**<br><u>పై</u> వాటికి ఆవల - అతీతమై సప్తమీ భూమిక **తురీయగా।** |
| భూమి త్రయేషు విహరన్ -<br><u>'ముముక్షుః'</u> భవతి।<br>తురీయ భూమ్యాం విహరన్<br><u>'బ్రహ్మవిత్'</u> భవతి। | **ముముక్షువు** : ('శుభేచ్ఛ, విచారణ, తనుమానస' అనబడే) మొదటి '3' భూమికలలో విహారము చేయుచున్నవాడు **<u>'ముముక్షువు'</u>** అగుచున్నాడు.<br>**బ్రహ్మవిత్** : ('సత్త్వాపత్తి' అనబడే) '4'వ భూమికలో విహరించువాడు - **<u>'బ్రహ్మవిత్'</u>** అనబడుచున్నాడు. |
| పంచమ భూమ్యాం విహరన్<br><u>బ్రహ్మవిద్వరో</u> భవతి।<br>షష్ఠ భూమ్యాం విహరన్<br><u>బ్రహ్మవిద్వరీయాన్</u> భవతి।<br>సప్తమ భూమ్యాం విహరన్<br><u>బ్రహ్మవిద్వరిష్ఠో</u> భవతి।<br>తత్ర ఏతే శ్లోకా భవంతి। | **బ్రహ్మవిద్వరుడు** : ('అసంసక్తి' అనబడే) '5'వ భూమికలో విహరించుచున్నవాడు **<u>'బ్రహ్మవిద్వరుడు'</u>** అని చెప్పబడుచున్నాడు.<br>**బ్రహ్మవిత్ వరీయుడు** : ('పదార్థాభావన' అనబడు) '6'వ భూమికలో ప్రవేశించి విహారములు చేయుచున్నవాడు. **<u>'బ్రహ్మవిత్ వరీయుడు'</u>** అని పిలువబడుచున్నాడు. ('తురీయగము' అనబడే) '7వ' భూమికలో ప్రవేశించి విహరిస్తున్నవాడు.<br>**<u>తురీయాతీతుడు-'బ్రహ్మవిత్-వరిష్ఠుడు'</u>**గా నిర్వచించబడుచున్నాడు. |
| జ్ఞానభూమిః <u>'శుభేచ్ఛా'</u> స్యాత్<br>ప్రథమా సముదీరితా।<br><u>'విచారణా'</u> ద్వితీయా తు।<br>తృతీయా <u>'తనుమానసీ'</u>।<br><u>'సత్త్వాపత్తిః'</u> చతర్థీస్యాత్।<br>తతో <u>'అసంసక్తి'</u> నామికా।<br><u>'పదార్థ భావనా'</u> షష్ఠీ।<br>సప్తమీ <u>తుర్యగా</u> స్మృతా। | **ఈవిధంగా సప్త జ్ఞాన భూమికలు చెప్పబడుచున్నాయి.**<br>**'శుభేచ్ఛా, విచారణ, తనుమానసీ'** అనబడు మూడు **'జ్ఞాన విహార భూమికలు'**గా ఆత్మతత్త్వజ్ఞులచే గానము చేయబడుచున్నాయి.<br>(4) 'సత్త్వాపత్తి, (5) అసంసక్తి, (6) పదార్థా భావన, (7) తుర్యగము అనునవి **అనుభవ రూపమగు 'తుర్యగా విహార భూమికలు'** అగుచున్నాయి. |

| | |
|---|---|
| "స్థితః కిం మూఢఏవాస్మి?<br>ప్రేక్ష్యేఽహమ్ శాస్త్ర సజ్జనైః,<br>– వైరాగ్య పూర్వమ్ ఇచ్ఛా" – ఇతి॥<br>– 'శుభేచ్ఛా' ఇతి ఉచ్యతే బుధైః॥ | **(1) శుభేచ్ఛ** : 'ఇదేమిటిరా బాబూ! అశాశ్వతము, కాలబద్ధము అగు ఈ జీవితంలో ఇంద్రియ విషయ పరంపరలకు, ఇంద్రియ ప్రియములకు అపేక్షలకు వెచ్చిస్తూ, **'పంచేంద్రియములు'** అనే ఉపకరణములను క్రమంగా **వృథా చేసుకుంటున్నాను?** ఇకనుంచైనా శాస్త్రములను, సజ్జనులను ఆశ్రయించి, రాగమును త్యజిస్తూ (విరాగినై) - **శాశ్వతము, దేహానంతరము కూడా ఉత్తమ ప్రయోజనకరము అగు మార్గములను అన్వేషిస్తాను'** అను **వైరాగ్య పూర్వకమైన 'ఇచ్ఛ'ను** - బుధులు **'శుభేచ్ఛ'** - అని పిలుస్తున్నారు. |
| శాస్త్ర సజ్జన సంపర్క<br>వైరాగ్య అభ్యాసపూర్వకమ్<br>సదాచార ప్రవృత్తిర్యా<br>ప్రోచ్యతే సా 'విచారణా'॥ | **(2) విచారణా** : ఎప్పుడైతే వైరాగ్యముతో కూడిన 'శుభేచ్ఛ' ప్రారంభమైనదో, అది క్రమంగా తీవ్రతరమగుచుండగా, ఆ జీవుడు ప్రేమ-కరుణ ఓర్పు -దానము-ధర్మము-ఇటువంటి **సదాచారములపట్ల, శాస్త్ర - సజ్జనసంపర్క - వైరాగ్య** - ఇత్యాది కార్యక్రమముల పట్ల ప్రవృత్తుడగు చున్నాడు. ఇప్పుడాతడు క్రమంగా **'విచారణ'** - అను భూమికలో ప్రవేశించిన వాడగుచున్నాడు. పఠనము, శ్రవణము, అధ్యయనము ప్రారంభిస్తున్నాడు. |
| విచారణా శుభేచ్ఛాభ్యామ్<br>ఇంద్రియార్థేషు రక్తతా<br>యత్ర సా తనుతామ్ ఏతి<br>ప్రోచ్యతే 'తనుమానసీ'। | **(3) తనుమానసి** : విచారణ, శుభేచ్ఛల అభ్యాసముచే ఆ జీవునికి శబ్ద - స్పర్శ-రూప-రస-గంధరూపములగు ఇంద్రియ విషయములపట్ల 'అభినివేశము'- (Involvement, engagement) తనుతము (తగ్గటము) జరుగుచూ ఉండగా, ఆతడు **'తనుమానసీ భూమిక'** లో ప్రవేశించినట్లు చెప్పబడుచున్నాడు. |
| భూమికా త్రితయాభ్యాసాత్<br>చిత్తే అర్థనిరతేః వశాత్।<br>సత్త్వాత్మని స్థితే శుద్ధే<br>'సత్త్వాపత్తిః' ఉదాహృతా॥ | **(4) సత్త్వాపత్తి** : 'శుభేచ్ఛ - విచారణ - తనుమానసి' అను '3' భూమికలు అభ్యసిస్తూ ఉండగా ఆతని చిత్తము ఆతనికి వశము అగుచూ, ఇంద్రియార్థములనుండి వెనుకకు మరల సాగుతుంది. శుద్ధి అగుచూ సాత్త్వికత, దైవీగుణములు సంతరించుకోసాగుతుంది. చిత్తము సాత్త్విక శుద్ధి పొందుచుండగా, ఆ జీవుడు **'సత్త్వాపత్తి'** అనే నాలుగవ భూమికలో సంచరించువాడగుచున్నాడు. |
| దశా చతుష్టయాభ్యాసాత్<br>'అసంసర్గ' ఫలా తు యా।<br>రూఢసత్త్వ చమత్కారా<br>ప్రోక్తా 'అసంసక్తి' నామికా॥ | **(5) అసంసర్గ** పై నాలుగు అభ్యాసముల వలన క్రమంగా **'అసంసర్గ'** అను ప్రయోజనము సిద్ధిస్తోంది. **'సత్త్వ** (Positive, Divine) **భావనయందు ఆరూఢత్వము'** అనే చమత్కారము **'అసంసక్తి'** అను భూమికకు దారితీస్తోంది. దృశ్య విషయములపట్ల సత్యదృష్టి తొలగుచూ అనిత్యముగా ఎరిగి ఉండటము, వాటితో సర్గము (Attachment) లేకపోవటం **అసంసర్గము.** |
| **03.** భూమికా పంచకాభ్యాసాత్<br>స్వాత్మారామతయా భృశమ్<br>అభ్యంతరాణాం బాహ్యానాం<br>పదార్థానామ్ అభావనాత్, | **(6) పదార్థభావన** : 'శుభేచ్ఛ - విచారణ - తను మానసి - సత్త్వాపత్తి - అసంసర్గ' ....అనే అయిదు భూమికలు **'సాధనా ప్రదేశములు'** అగుచుండగా, ఇక ఈ జీవుడు 'స్వ-ఆత్మారాముడు' అగుచున్నాడు. 'ఆత్మ'యందు క్రమంగా అనుక్షణిక సంచారుడగుచున్నాడు. ఆత్మ మాత్రమే అతనికి 'పదార్థము' అగుచున్నది.<br>అట్టి స్థితిలో ఆ జీవుడు, (1) బాహ్యమున నామ-రూప-వస్తు-సంఘటన మొదలైన వ్యవహారములన్నీ, (2) అంతరమున కామ-క్రోధ-లోభ-మద-మాత్సర్య-ఇత్యాది అజ్ఞానజనిత భావాలన్నీ- 'అభావన' చేయటం ప్రారంభిస్తాడు. 'అభావన' అనే అగ్నితో విషయవాసనలను దగ్ధం చేయనారంభిస్తాడు. |
| పరప్రయుక్తేన చిరం<br>ప్రయత్నేన అవబోధనమ్,<br>'పదార్థభావనా' నామ<br>షష్ఠీ భవతి భూమికా॥ | 'ఇహము' (This side of self) ను అధిగమించి ఆవల గల పరస్వరూపము (లేక) 'పరమాత్మ'యొక్క భావన - అవబోధనలయందు ప్రయత్నశీలుడై ఉంటాడు. పరమును ఆశ్రయిస్తూ, ద్రష్ట - దృశ్యములకు ఆవలగల 'దృక్' స్వరూపధారి అగుచున్నప్పుడు 'పదార్థ - అభావన' అనబడు '6'వ భూమికలో హాయిగా సంచరించుచున్నాడు. (ఇది జగత్ పదార్థ అభావన-ఆత్మపద అర్థభావనా రూపము). |

**షట్ భూమికా చిరాభ్యాసాత్**
**భేదస్య అనుపలంభనాత్,**
**యత్ స్వభావైక నిష్ఠత్వం**
**సా జ్ఞేయా '<u>తుర్యగా గతిః</u>'।**

**(7) తుర్యగము :** (పైన చెప్పిన) '6' భూమికల సుదీర్ఘమైన అభ్యాసముచే, **సర్వభేద భావములు రహితమగుచూ, సహజము-అనునిత్యము అగు' స్వస్వభావ-నిష్ఠత్వము** సిద్ధించుటచే **తుర్యగా గతి** గా ఇది చెప్పబడుతోంది. **ఇది జీవుని స్వాభావిక స్థితి/స్థానం.** సర్వము స్వాత్మతో ఏకము అవటమే **తుర్యగము.**

---

**శుభేచ్ఛ - ఆది త్రయం భూమి**
**భేద - అభేదయుతం స్మృతమ్।**

**'శుభేచ్ఛ' 'విచారణ' 'తనుమానసి'** అనబడే మొట్టమొదటి '3' భూమికలు (1) భేదయుతము (2) అభేదయుతము - అని రెండు స్థితులుగా చెప్పబడుతోంది.

---

**యథావత్ వేద బుద్ధ్వా ఇదమ్**
**జగత్ జాగ్రతి దృశ్యతే**
**అద్వైతే స్థైర్యమ్ ఆయాతే**
**ద్వైతే చ ప్రశమం గతే।**

ఈ దృశ్యమానమగుచున్న జాగ్రత్ జగత్తు ఏ బుద్ధిచే తెలియబడుచున్నదో (Object being known) , అట్టి దృశ్య జగత్తు - వేరువేరుగా కనిపిస్తూ ఉన్నప్పటికీ, అద్వైత ఆత్మజ్ఞాన-అవగాహన-అనుభూతులచే-అతీత అఖండ దృష్టిగా ప్రతిఫలిస్తోంది. స్వప్నంలో కనిపించే వేరువేరైనవన్నీ స్వప్నము తనదైనవాడి స్వప్నచైతన్య ములో ఏకమగునట్లు -**అన్నీ ద్వైతములు ప్రశమనము పొందుచున్నాయి.**

---

**పశ్యంతి స్వప్నవత్ లోకం,**
**తుర్యభూమి సుయోగతః॥**

ద్వైతమంతా శాంతించగా, తురీయభూమికను చేరిన యోగి ఈ జాగ్రత్ దృశ్యమంతా స్వప్నంలో కనిపించే [(మెలకువరాగానే) అదృశ్యమవబోయే] **'స్వప్నదృశ్యము'**వలె (సుయోగత్వముచే) చూచుచున్నాడు.

---

**విచ్ఛిన్న శరదభ్రాంశ విలయం**
**ప్రవిలీయతే।**
**సత్త్వ అవశేష ఏవ అస్తే,**
**హే నిదాఘ! దృఢీకురు।**

ఆకాశంలో శరత్కాలంలో కనిపించే మేఘాలు విడిపోగానే, అప్పటివరకు ఆకాశంలో కనబడిన మేఘముల ఆకారమంతా ఏమౌతోంది? ఆకాశంలో లయమగుచున్నది కదా! ఓ పుణ్యచరితుడా! పాపరహితుడా! నిదాఘా! ఈ కనబడే జాగ్రత్ జగత్తు అంతా ఆత్మయందే కనిపిస్తూ తిరిగి 'కేవల సత్త'గానే అవశేషిస్తోంది. ఈ జగత్తు, ఇందలి సాకారత గురించి అటువంటి అనుభావనను దృఢీకరించుకో. ఇది **సత్త్వావశేషము.**

---

**పంచభూమిం సమారుహ్య**
**'<u>సుషుప్తిపద</u>' నామికామ్।**
**శాంతాశేష విశేషాంశః**
**తిష్ఠతి అద్వైత మాత్రకే॥**

ఈ జీవుడు - సుభేచ్ఛ, విచారణ, తనుమానస, సత్త్వాపత్తి, అసంసక్తి అనబడే మొదటి '5' భూమికలలో సంచరిస్తూ, 5వ భూమికలో ఉండగా, అది **'సుషుప్తి పదము'** వంటిదిగా చెప్పుతారు. ఎందుకంటే ఆ పంచభూమికలో లౌకిక విశేషాంశలు అన్నీ కూడా నిశ్శేషంగా సశాంతించిన వగుచున్నాయి. ఆ యోగి **'ఇదంతా సర్వదా మమకేవల ఆత్మస్వరూపమే'** అనబడు అద్వైత స్థితి - స్వాభావికానుభవములయందు క్రమక్రమంగా సుశిక్షితుడై, తిష్ఠితుడు అగుచున్నాడు.

---

**అంతర్ముఖతయా నిత్యం**
**బహిర్వృత్తిపరోఽపిసన్,**
**పరిశ్రాంతతయా నిత్యం**
**'నిద్రాలుః' ఇవ లక్ష్యతే।**

అట్టివాడు బహిర్వృత్తులు కలిగి ఉంటున్న సమయ, సందర్భములలో కూడా **సర్వదా అంతర్ముఖత్వమును కొనసాగిస్తూనే ఉంటాడు.** జాగ్రత్తులో వ్యవహరిస్తూనే, గాఢనిద్రలో ఉన్నవానివలె పరమశాంతుడై, ఊరట, విశ్రాంతిలను అనుభవిస్తున్నవాడై ఉంటాడు.

---

**కుర్వన్ అభ్యాసమ్ ఏతస్యాం**
**భూమ్యాం సమ్యక్ వివాసనః**
**సప్తమీ గూఢ సుప్త్యాఖ్యా**
**క్రమ ప్రాప్తా పురాతనీ॥**

'6'వ భూమికయగు పదార్థ - (అ)భావన యందు సమ్యక్ - సర్వత్రా సమభావనా నిరతుడై ఉండటము బాగుగా అభ్యాసము అవుతూ ఉంటుంది.

క్రమంగా సర్వమునకు **ఆది,** (జన్మ-కర్మలకంటే మునుముందైనది కాబట్టి) **పురాతనము, రహస్య సుప్తస్వరూపము అగు సప్తమ భూమిక** సిద్ధించినదగుచుచున్నది.

| | |
|---|---|
| యత్ర న <u>అసత్,</u> <u>న సత్</u> రూపో<br>నాహం, నాపి అనహం కృతిః,<br>కేవలం క్షీణమనన ఆస్తే<br>(అ)ద్వైతేఽతి నిర్భయః। | ఎక్కడైతే<br>- ఇది సత్తు, ఇది అసత్తు అనురూపముగా ఏదీ శేషించదో,<br>- ఏది 'అహమ్' కృత రూపముగా గాని, న - అహమ్ కృతమైగాని లేదో,<br>- మనస్సు క్షీణించినదై, ఈ జీవుడు కేవలీ స్వరూపుడై తనకు ద్వితీయమనునదేదీ ఎక్కడా కించిత్ కూడా లేనివాడగుచున్నాడో - అదియే ద్వైతము తొలగగా, దాటిపోయి అద్వైత నిర్భయుడు అగు స్థితి. |
| <u>శూన్యకుంభము</u><br>అంతశ్శూన్యో బహిః శూన్యః<br>శూన్యకుంభ ఇవ అంబరే।<br><u>పూర్ణకుంభము</u><br>అంతఃపూర్ణో బహిః పూర్ణః<br>పూర్ణకుంభ ఇవ ఆర్ణవే। | - ఒక ఖాళీగా ఉన్న కుండకు లోపల - బయటా కూడా శూన్యమే ఉన్న తీరుగా, ఎవ్వడు ఈ దేహము పట్ల ఈ సమస్త దృశ్యము పట్ల అంతఃశూన్యుడు - బహిఃశూన్యుడు (Nothing inside and nothing outside) అయినవాడై ఆకాశమువలె వెలయుచున్నాడో,<br>జలములో ముంచి ఉంచబడిన కుండ ఏ విధంగా లోపల జలముచే పూర్ణముగా, బయట అదే జలముచే పూర్ణముగా ఉన్న తీరుగా, ఏ యోగి దేహ - విశ్వములను లోన బయట ఆత్మచే పూర్ణముగా దర్శిస్తాడో **అదియే తురీయానుభవము.** |
| మా భవ గ్రాహభావాత్మా।<br>అగ్రాహకాత్మా చ మా భవ।। | అందుచేత ఓ నిదాఘా! ఈ దృశ్య జగత్తును అన్యముగా గ్రహించినవాడవు (Taker) అవవద్దు. గ్రహించనివాడవు (Non Taker) కూడా అవవద్దు. (గదిలోని దీపపు కాంతి ఏదీ గ్రహించదు, త్యజించదు కదా!) |
| భావనాం అఖిలాం త్యక్త్వా<br>యచ్ఛిష్టం (యత్ శిష్టం) తన్మయో భవ।<br>ద్రష్టృ దర్శన దృశ్యాని<br>త్యక్త్వా వాసనయా సహ<br>దర్శన ప్రథమ ఆభాసమ్<br>ఆత్మానం కేవలం భజ।। | **నిదాఘుడు** : స్వామీ! మరి నేను ఏదిగా ఉండాలి? గ్రాహ్య - త్యాజ్యరహితత్వమంటే ఏమిటి?<br>**ఋభు** : భావనలన్నీ దాటిపోయి త్యజించివేసి 'భావాతీతుడవు' అగుము. అభావిస్తూ ఉన్నప్పుడు కూడా ఏది శేషించియే ఉంటుందో, భావములకు ఆవల- ఈవల కూడా ఉన్నదో,- **అదియే నీవు అయి ఉండుము.** ద్రష్టృ - దర్శన - దృశ్యములను (The Perceiver The Perception and The Object) వాటి వాటి వాసనలతో సహా త్యజించి వేసి, వాటిని ఆత్మయొక్క ఆభాసగా (దర్పణంలోను, జలములోను ప్రతిబింబిస్తూ కనిపించే ఆకాశము వలె) చూడుము. **ఆత్మదర్పణంలో కనిపించే ఆభాసన వలె ఎరిగి కేవలము ఆత్మను మాత్రమే సేవించుము.** ఆత్మవై ఆత్మగా ఆత్మను దర్శిస్తూ సేవిస్తూ ఆస్వాదిస్తూ ఉండుము. |
| **జీవన్ముక్తుడు**<br>యథాస్థితమ్ ఇదమ్ యస్య<br>వ్యవహారవతోఽపి చ<br>అస్తంగతం స్థితం చిత్తం<br>స <u>'జీవన్ముక్త'</u> ఉచ్యతే। | **జీవన్ముక్తుడు**<br>ఇక్కడి యథాస్థితంగా ఎప్పుడు ఎక్కడ ఎట్లా వ్యవహరించాలో, అట్లా వ్యవహరిస్తూ ఉంటూనే.... (ఒక నటుడు తన సహజమగు -నాటకమునకు సంబంధించని వ్యక్తిగత రూపము సర్వదా నాటకమునకు వేరుగా కలిగి ఉంటున్న విధంగా)....,<br>**ఎవ్వడైతే అంతర హృదయాకాశంలో సహజమగు సంస్థితి (ఉనికి) కలిగి ఉండి, ఈ జగన్నాటకమును నాటకంగానే చూస్తాడో - ఆతడు జీవన్ముక్తుడు.** |
| **04.** న ఉదేతి, న అస్తమ ఆయాతి<br>సుఖ దుఃఖే మనః ప్రభా।<br>యథా ప్రాప్త స్థితిః యస్య<br>స <u>'జీవన్ముక్త'</u> ఉచ్యతే।। | ఎప్పుడు ఏఏ స్థితి గతులు ప్రపంచంలో పొందుతున్నప్పటికీ కూడా, ఎవడి మనస్సైతే ఇక్కడ సుఖ దుఃఖములలో ఉదయించక, అస్తమించక, (నాటకపాత్రవలె) సర్వదా సర్వమునకు వేరై ఉంటుందో, ఆతడు **జీవన్ముక్తుడు.** |

| | |
|---|---|
| యో జాగర్తి సుషుప్తిస్థో<br>యస్య జాగ్రత్ న విద్యతే<br>యస్య నిర్వాసనో బోధః<br>స 'జీవన్ముక్త' ఉచ్యతే। | ఎవ్వనికి యొక్క జాగ్రత్ వ్యవహారానుభవమంతా సుషుప్తి (గాఢనిద్ర)యందు ఉన్నవానివలె అవిషయమై, 'జాగ్రత్'గా (ఇంద్రియ విషయసమూహ సమన్వితంగా) అవకయే ఆతడు ఉంటాడో,<br>ఎవ్వని బోధ స్వరూపము (కేవలమగు **"చిత్ స్వరూపము"), "అన్యమును వెలిగించు** (Enlightening) **స్వరూపము"** అయి దృశ్య సంబంధమైన వాసనలు ఏమాత్రము లేనిదై ఉంటుందో, ఆతడే - జీవన్ముక్తుడు. |
| రాగ ద్వేష భయాదీనామ్<br>అనురూపం (మనురూపం) చరన్నపి,<br>యో అంతర్వ్యోమవత్ యత్యచ్ఛః<br>స 'జీవన్ముక్త' ఉచ్యతే। | ప్రాపంచకంగా చూస్తే (ఇహమునందు) రాగము - ద్వేషము - భయము మొదలైనవి సందర్భానుసారంగా ప్రదర్శిస్తూ ఉన్నప్పటికీ, అంతరమున శూన్యాకాశమువలె (పడవ నీళ్ళలో ఉన్నప్పటికీ, పడవలో నీళ్ళు ఉండని తీరుగా) - అత్యంత స్వచ్ఛముగా దృశ్య విషయరహితుడై ఉంటాడో, ఆతడు జీవన్ముక్తుడు. |
| యస్య నాహంకృతో భావో,<br>బద్ధిః యస్య న లిప్యతే,<br>కుర్వతో - అకుర్వతోవాపి<br>స 'జీవన్ముక్త' ఉచ్యతే॥ | ఒక రచయిత 'రచన' చేస్తూ "ఈ పాత్రల పరస్పర ప్రవర్తనలు నేనే నిర్వర్తిస్తున్నాను" - అని అనుకుంటూ వ్రాస్తాడా? లేదు. పాఠకుల అభిరుచిని దృష్టిలో పెట్టుకొని పాత్రలను, ఆ పాత్రల స్వభావములను కల్పన చేస్తూ, తాను వేరుగానే అయి ఉంటాడు. పాత్రగా అవడు. అట్లాగే **'ఈ ప్రపంచంలో ఏది నేను చేస్తున్నా, (లేక) చేయకున్నా కూడా దీనికంతటికీ నేను చేస్తున్న వాడిని కాదు. చేయని వాడిని కాదు'**...అను అవగాహనతో, అతని బుద్ధి దోష రహితమై (కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్య రహితమై) ఉంటుందో, అట్టివాడు - కర్మలు నిర్వర్తించినా, (లేక) నిర్వర్తించకున్నా కూడా సర్వదా - **'జీవన్ముక్తుడు'** అని చెప్పబడుతోంది. పాత్ర ఎట్లా రచించబడినా కూడా ఆ స్వభావము రచయితను స్పృశించదు కదా! |
| యస్మాన్ న ఉద్విజతో లోకో<br>లోకాత్ న ఉద్విజతే చ యః,<br>హర్ష - అమర్ష - భయ 'ఉన్ముక్తః'<br>స 'జీవన్ముక్త' ఉచ్యతే॥ | ఎవ్వడైతే,<br>- లోకములో (లేక) దృశ్యములో సందర్భములగుచున్న - వ్యక్తులతో, వస్తువులతో సంఘటన, సంబంధ, అనుబంధ, బాంధవ్య - ఇత్యాది వ్యవహారములు చూస్తూ కూడా అంతరంగమున ఏమాత్రము **ఉద్వేగము** (Becoming emotionaly related) **పొందడో,**<br>- తన వలన **సహజీవులకు ఉద్వేగము కలుగకుండా చూచుకుంటాడో,**<br>- సంతోష - దుఃఖ - భయములనుండి ఉత్ - ముక్తుడై (Always Beyond and always well relieved) అయి ఉంటాడో, అట్టివాడు 'జీవన్ముక్తుడు' అనబడుచున్నాడు. |
| యః సమస్త అర్థ జాలేషు<br>వ్యవహార్యపి శీతళః<br>పరార్థేషు ఇవ పూర్ణాత్మా<br>స జీవన్ముక్త ఉచ్యతే॥ | ఎవ్వడైతే, ఆయా ప్రాపంచకార్థములలో, వ్యవహార పరంపరలలో వ్యవహరిస్తూ ఉండి కూడా, మంచుగడ్డవలె ప్రశాంతంగా, చల్లగా (Very cool calm and pleasant inwardly) ఉంటూ పరమాత్మ - జీవాత్మ-జగత్తుల ఏకస్వరూపముచే పూర్ణాత్ముడై ఉంటాడో....ఆతడు జీవన్ముక్తుడు. |
| ప్రజహాతి యదా కామాన్<br>సర్వాం చిత్తగతాన్, మునే!<br>మయి సర్వాత్మకే తుష్టః<br>స 'జీవన్ముక్త' ఉచ్యతే॥ | ఓ నిదాఘ మునీశ్వరా! 'ఇది ఇట్లా ఉండాలి. అది ఆ విధంగా పరిణమించాలి. ఇది పోవాలి. అది పొందాలి'....ఇత్యాది చిత్తగతమైన సర్వకామములు (Expectations, Pre-requisites, Dependence on the concerned evantualities) మొదలంట్లా అంతర్గతంగా వదిలివేసి ఉంటాడో, తనయొక్క 'సర్వాత్మత్వము'ను ఎరిగి సంతుష్టుడై ఉంటాడో, ఆతడు జీవన్ముక్తుడు. అంతరమున ఎప్పుడు ఈ సమస్తముపట్ల మౌనము వహించి ఉంటాడో, ఆతడే **జీవన్ముక్తుడు.** |

| | |
|---|---|
| చైత్యవర్జిత చిన్మాత్రే<br>పదే పరమ పావనే<br>అక్షుబ్ధచిత్తో, విశ్రాంతః<br>స '<u>జీవన్ముక్త</u>' ఉచ్యతే। | కదలుచూ ఉన్న ఆలోచనలు, భావనలు, దేహములు, విషయములు' - అనబడే 'చైత్యము'ను ప్రక్కగాబెట్టి, వాటిని **కదల్చుచూ ఉన్నట్టి** పరమపావనము (పవిత్రము) అగు **'చిన్మాత్రపదము'**ను ఆశ్రయించి, ఎట్టి క్షుబ్దము(Disturbance, Distraction, perturbence, worry) లేనట్టి చిత్తములో పరమవిశ్రాంతుడై ఉండువాడే జీవన్ముక్తుడు. |
| ఇదం జగత్ అహం సోఽయం<br>దృశ్యజాతం అవాస్తవమ్,<br>యస్య చిత్తేన స్ఫురతి<br>స <u>జీవన్ముక్త</u> ఉచ్యతే। | **'ఈ జగత్తంతా కూడా సర్వదా ఎవ్వరి స్వరూపమై యున్నదో అదియే నేనై ఉన్నాను'** అని తనయొక్క నిత్యమగు **'సత్యరూపము'**ను ఎరిగి, ఎవరి చిత్తమునకైతే ఈ **దృశ్యజాతమంతా కలలోని దృశ్యమువలె స్వతఃగా అవాస్తవము (న తు సత్యమిహ అణ్వపి)** - అని సుస్పష్టముగా స్ఫురిస్తుందో, - ఆతడే జీవన్ముక్తుడు. |
| సత్ బ్రహ్మణి స్థిరే స్ఫారే<br>పూర్ణే విషయ వర్జితే ,<br>ఆచార్య శాస్త్ర మార్గేణ<br>ప్రవిశ్యాశు స్థిరో భవ। | ఓ నిదాఘ మహాశయా! ఆచార్యులు, శాస్త్రములు కూడా నీయొక్క - నాయొక్క **సత్ స్వరూపము, బ్రహ్మస్వరూపము, పూర్ణము, సర్వదా సుస్థిరము, స్ఫారము అయిఉన్న స్వకీయ-అనన్యరూపము** గురించి చెప్పుచున్నారు. 'అన్యము' అయినదంతా ఆత్మయొక్క స్వయం ప్రకాశకము సూచిస్తూ గుర్తుచేస్తున్నాయో-అవి విను. **గురువులు శాస్త్రములు చూపు వర్గంలో అట్టి ఆత్మస్వరూపంలో ప్రవేశించి సుస్థిరుడవయ్యెదవుగాక!** |
| శివో గురుః। శివో వేదః।<br>శివో దేవః। శివః ప్రభుః।<br>శివోఽస్మ్యహమ్। శివః సర్వమ్।<br>శివాత్ అన్యత్ న కించన।<br>(ఇతి శివతత్త్వజ్ఞానమ్)। | శివుడే సద్గురువు. శివుడే వేదము (తెలియపరచుగురువు, తెలియబడే దృశ్యజగత్తు - శివుడే). శివుడే దేవాది దేవుడు. శివుడే సర్వమునకు నియామకుడు, యజమాని (సొంతదారు) అగు ప్రభువు. **నాలోని నేనైన నేను శివుడే! సర్వము శివుడే! శివమయమే! శివునికి వేరై - ఎక్కడా ఏదీ కించిత్ కూడా లేదు. (కనుక నీవు శివుడవే. ఇదియే శివతత్త్వ జ్ఞానము).** |
| తమేవ ధీరో విజ్ఞాయ<br>ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః। | ఉత్తమ బుద్ధి గల ధీమంతుడు అట్టి శివతత్త్వము ఎట్టిదో తెలుసుకొని స్వకీయ ప్రజ్ఞచే బ్రహ్మభూతుడగు **'బ్రాహ్మణుడు'** అగుచున్నాడు. (బ్రాహ్మణముల హృదయము ఎరిగినవాడు బ్రాహ్మణుడు). |
| న అనుధ్యాయాత్ బహూన్ శబ్దాన్<br>వాచో విగ్లాపనం హి తత్। | ఓ నిదాఘా! పెద్దగా శబ్దజాలాన్ని అధ్యయనము చేసి కాలమును, సందర్భములను వృధా చేసుకోవటం కూడా ఉపాయం కాదయ్యా. అదంతా అధికంగా అవుతుంటే వాచా విగ్లాపనమే (వాచాదోషమే) అవుతుంది. |
| శుకో ముక్తో। వామదేవోఽపి ముక్తః।<br>తాభ్యాం వినా ముక్తి భాజో న సంతి।<br>శుకం మార్గం యే<br>అనుసరంతి ధీరాః<br>'సద్యోముక్తాః' తే భవంతి ఇహ లోకే। | **సద్యోముక్తి-క్రమముక్తి :: శుక మార్గ ముక్తి-వామదేవమార్గ ముక్తి**<br>శుకమహర్షి ముక్తుడు. వామ దేవుడు కూడా ముక్తుడే. వారిరువురి మార్గం కాకుండా వేరై వాచామార్గములో పోయి ఒకడు ముక్తి భాజుడుకాలేడు.<br>**సద్యోముక్తి - " ఎప్పుడూ కూడా నేను భౌతిక దేహపరిమితుడను కాను. ఈ విశ్వమంతా నా దేహమై, నేనే అయి ఉన్నాను"** అను శుకభగవానుని విదేహముక్తి మార్గమును ఏ ధీరుడైతే అనుసరిస్తాడో అట్టివాడు ఇప్పుడే, ఇక్కడే **సద్యోముక్తుడౌతాడు. 'సర్వలోకములు నాలోనే ఉన్నాయి.** నేనే సర్వము అయి ఉన్నాను' అనునది సద్యోముక్తి. (లోకములలోని నేను - నాలోని లోకముల అనన్యత్వము). |
| **05.** వామదేవం యే అనుసరంతి<br>నిత్యం మృత్వా జనిత్వా చ<br>పునః పునః తత్ తేవై లోకే "<u>క్రమముక్తా</u>"<br>భవంతి, యోగైః సాంఖ్యైః కర్మభిః సత్త్వయుక్తైః॥ | **క్రమముక్తి** - ఎవ్వరైతే క్రమక్రమంగా ముక్తిమార్గంలో ప్రవేశించి సాధనపరులై వామదేవుడు చెప్పుమార్గమును అనుసరిస్తారో, వారు మరల మరల అనునిత్యంగా జన్మ మరణములు పొందుతూ యోగ - సాంఖ్య - కర్మ మార్గములు ఆశ్రయిస్తూ ఉన్నవారై - చివరికి ముక్తి స్థానమును చేరుచున్నారు. ఇది **'క్రమముక్తి'** అని పిలువబడుతోంది. |

శుకశ్చ వామదేవశ్చ
ద్వే సృతీ దేవ నిర్మితే।
శుకో 'విహంగమః' ప్రోక్తో।
వామదేవః పిపీలికా॥

ఈ విధంగా

(1) శుకమార్గముక్తి (సద్యోముక్తి) - (విహంగ మార్గము)

(2) వామదేవమార్గముక్తి (క్రమముక్తి) - (పిపీలికా మార్గము)

అను **ఈ రెండుమార్గములు** శ్రుతులచే మనకు విశదీకరించి ప్రతిపాదిస్తూ చెప్పబడుచున్నాయి. ఇవి సృష్టిలోని చమత్కారంగా దైవీ నిర్మితము.

సద్యోముక్తి (లేక) శుకమార్గముక్తిని ఆకాశంలో పక్షివలె ఎగరటం **'విహంగమార్గము'** అని కూడా అంటూ ఉంటారు. క్రమముక్తి (లేక) వామదేవమార్గ ముక్తిని **పిపీలికామార్గము - చీమవలె ప్రయాణించటం'** అని పిలుస్తున్నారు.

---

అతత్ వ్యావృత్తిరూపేణ,
సాక్షాత్ విధిముఖేన వా,
మహావాక్య విచారేణ
సాంఖ్యయోగ సమాధినా,
విదిత్వా స్వాత్మనో రూపమ్
అసంప్రజ్ఞా సమాధితః
శుకమార్గేణ విరజాః
ప్రయాంతి పరమం పదమ్॥

ఆ 'పరతత్త్వము' పట్ల వ్యావృత్తి రూపములుగా సాధనములు చేస్తూ

- సాక్షాత్ విధి (వేదములు) సూచించు యజ్ఞ - యాగ - స్తుతి - ఉపాసనా క్రమములచేతగాని,
- **సోఽహమ్', 'తత్త్వమ్' 'అయమాత్మా బ్రహ్మ' 'అద్వితీయమ్ తత్ ఆత్మాహమ్'** ఇత్యాది మహావాక్యముల పరమార్థమును పునఃపునః విచారణ చేతగాని,
- 'మనో బుద్ధి - చిత్త - అహంకార, పంచకర్మేంద్రియ, జ్ఞానేంద్రియ విషయములు, పంచప్రాణ - జీవాత్మ - ఈశ్వర - పరమాత్మ - ఇత్యాది విశ్లేషణలతో కూడిన **సాంఖ్యయోగ శాస్త్ర పరిశీలనచేగాని**
- **తెలుసుకోవటం అనుకోవటం - అనిపించటం, అదే తానవటం** అనబడు **శ్రవణ - మనన - నిధిధ్యాస, సమాధిలచేగాని,**
- అసంప్రజ్ఞాసమాధి చేతగాని

**చిట్టచివరికి శుకమార్గ సద్యోముక్తిగా ఈ జీవుడు, పరమపదమును తప్పక పొందగలడు.**

---

'యమా' ఆది ఆసన జాయా
స హఠాభ్యాసాత్
పునః పునః,
విఘ్న బాహుళ్య సంజాత
అణిమాది వశాత్ ఇహ,
అలబ్ధ్వాఽపి ఫలం సమ్యక్
పునః భూత్వా మహాకులే,
పూర్వ వాసనయైవ అయం
యోగాభ్యాసం పునశ్చరన్।
అనేకజన్మ అభ్యాసేన
'వామదేవేన' వై పథా,
సోఽపి ముక్తిం సమాప్నోతి
తద్విష్ణోః పరమం పదమ్॥

యమము (ఇంద్రియ నిగ్రహము), నియమము (ఇంద్రియములను నియమించటము) ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, సమాధి మొదలైనవి మరల మరల **హఠపూర్వకంగా అభ్యసించటము చేత క్రమముక్తి తప్పక లభించగలదు.** అయితే అట్టి క్రమంలో విఘ్నాలు బాహుళ్యంగా కూడా ఉంటాయి. అటువంటి విఘ్నములలో ముఖ్యమైనవి. అణిమ - గరిమ - మహిమ - లఘిమ....ఇత్యాది అష్టసిద్ధులు తారసపడటము కూడా.

అటువంటి అడ్డంకులు (లేక) చ్యుతి (Hurdles or Distractions) వలన ఆత్మసిద్ధి / యోగసిద్ధి లభించకపోవటం జరిగితే? ('వామ దేవపథము' అను సిద్ధాంతమును (మార్గమును) అనుసరించి)- అట్టి యోగాభ్యాసి యోగసిద్ధిని పొందకయే దేహము ముగియటము జరగవచ్చు. అట్లా జరిగితే కూడా ఆతడు (ఆ యోగభ్రష్టుడు) నష్టపోడు.

సమ్యక్ సిద్ధి (సర్వసమస్వరూపాత్మానుభవం) కొరకై మరల మహనీయుల కులంలో జనిస్తున్నాడు. అక్కడ పూర్వ వాసనలు కారణంగా యోగాభ్యాసమును పునశ్చరణ చేసుకొని, ఇక అక్కడి నుండి యోగసాధన మొదలైనవి కొనసాగిస్తున్నాడు.

| | |
|---|---|
| **ద్వావిమా (ద్వా ఇమా) పథ పంథానౌ**<br>**బ్రహ్మప్రాప్తి కరౌ శివౌ।**<br>**సద్యోముక్తి ప్రదశ్చ – ఏకః।**<br>**క్రమ ముక్తి ప్రదః – పరః।**<br>**అత్ర కో మోహః? కో శోకః?**<br>**<u>ఏకత్వం అనుపశ్యతః॥</u>** | ఈ విధంగా వామదేవమార్గం (క్రమముక్తి)ని అనుసరించిన వాడు కూడా అనేక జన్మల అభ్యాసముచే **'విష్ణుపరమపదము'** అనే ముక్తిని పొందుచున్నాడు.<br>ఈ విధంగా రెండు మార్గములలోను శివస్థానము అను ముక్తి పదము ఈ జీవుడు పొందగలడు. రెండూ (క్రమముక్తి, సద్యోముక్తి) ఒకచోటికే చేరుస్తున్నాయి.<br>ఓయీ, నిదాఘా! ఓ సర్వజనులారా! అట్టి **ఉభయములగు సద్యోముక్తి - క్రమముక్తి మార్గములలో ఏదో ఒకటి ఆశ్రయించి ఉండండి.** లక్ష్యము సిద్ధించిన తరువాత ఇక శోకమెక్కడిది? మోహమెక్కడిది? అట్టివాడు సర్వత్రా ఏకత్వమే దర్శించుచున్నాడు. |
| **యస్య అనుభవపర్యంతా**<br>**బుద్ధిః తత్త్వే (సత్త్వే) ప్రవర్తతే**<br>**తత్ దృష్టి గోచరాః సర్వే**<br>**ముచ్యంతే సర్వ పాతకైః॥** | ఎవని బుద్ధి ఆత్మభావన సిద్ధించేవరకు, ఆత్మానుభవము అనుక్షణికమయ్యే వరకు సత్త్వమార్గములో (సత్త్వగుణాశ్రయముతో) ప్రయత్నశీలుడై ఉంటాడో, అట్టివాడు ఇక **తన దృష్టికి గోచరమయ్యేదంతా ఆత్మగా భావన సిద్ధించుకొన్నవాడై, సర్వదోషముల నుండి పాతకముల నుండి విముక్తుడు కాగలడు.** |
| **ఖేచరా భూచరాః సర్వే**<br>**బ్రహ్మవిత్ దృష్టిగోచరాః**<br>**సద్య ఏవ విముచ్యంతే**<br>**కోటి జన్మార్జితైః అఘైః। ఇతి॥** | ఎవ్వడు సర్వ ఖేచరులను (ఆకాశంలో సంచరించే దేవతలు మొదలైనవారిని), భూచరులను (సర్వమానవ - జంతు ఇత్యాదులను) ఆత్మజ్ఞాన దృష్టితో చూడటము చేస్తూ ఉంటాడో, సదా సర్వదా అభ్యసిస్తూ ఉంటాడో, - అట్టివాడు కోటి జన్మలలో నిర్వర్తించిన పాపకర్మల నుండి కూడా విముక్తుడై **'సద్యోముక్తుడు'** కాగలడు. |
| **ఇతి చతుర్థోఽధ్యాయః** | ***ఇతి 4వ అధ్యాయము*** |

# పంచమ అధ్యాయము – యోగాభ్యాస విధి – విధానములు

**01. అథ హి ఏనం ఋభుం**
**భగవంతం, నిదాఘః పప్రచ్ఛ :**
**'యోగాభ్యాస విధిమ్' అనుబ్రూహి – ఇతి౹౹**
**తథేతి సహో వాచ**
**పంచభూతాత్మకో దేహః, పంచమండల పూరితః౹**

**కాఠిణ్యం పృథివీం ఏకాం౹**
**పానీయం తత్ ద్రవాకృతిః౹**
**దీపనం చ భవేత్ తేజః౹**
**ప్రచారో వాయు లక్షణమ్౹**
**ఆకాశః సత్త్వతః సర్వం౹**
**జ్ఞాతవ్యో యోగమ్ ఇచ్ఛతా!**

**నిదాఘుడు** : హే సద్గురూ! ఋభు మహాత్మా! భగవాన్! ఇప్పుడిక **'యోగాభ్యాస విధి'** గురించి వివరించమని ప్రార్థిస్తున్నాను.

**ఋభుమహర్షి** : ఓ నిదాఘ – ఆత్మానంద స్వరూప మహాశయా! వినండి. ఈ భౌతికదేహము 'మట్టి-నీరు-అగ్ని-గాలి-ఆకాశము'-అనే పంచ భూతములతో తయారౌతోంది. ఇది పంచమండలములో పూరితమై యున్నది.

- కాఠిణ్యమైనదంతా **ఏక పృథివీతత్త్వము. ఘనతత్త్వము.**
- పానీయమై ఉన్నదంతా ద్రవాకృతి – **జలతత్త్వము.**
- దీపమురూపంగా వెలిగేదంతా తేజస్సు – **అగ్నితత్త్వము.**
- వాయువు అంతటా ప్రసరించియుండు లక్షణము కలిగియున్నది- **ప్రసరణతత్త్వము.**
- ఆకాశము సత్త్వ (ఉనికి) లక్షణముగా కలిగియున్నది. **(ప్రచారతత్త్వము)**



**యోగాభ్యాసమునకు ఉపక్రమించువాడు ఈ పంచభూతముల లక్షణము ఎరిగి, యోగభ్యాస శీలుడగును గాక!**

---

**షట్ శతాని అధికాని అత్ర**
**సహస్రాణి ఏక వింశతి (21600)**
**అహోరాత్రవహైః శ్వాసైః**
**వాయుమండల ఘాతతః౹**
**తత్ పృథ్వీమండలే క్షీణే**
**వలిరాయాతి దేహినామ్౹**

### ఉచ్ఛ్వాస నిశ్వాసలు

ఒక అహోరాత్రము (పగలు – రాత్రి కలిపి) 21600 శ్వాసలు వాయు మండలమును ఛేదిస్తూ (ఘాతతంగా) ఈ శరీరములో జరుగుచున్నది.
(కాలముచేత ఈ జీవునిపట్ల భౌతికదేహము జనించి, వృద్ధి చెంది, క్షయిస్తూ క్రమంగా నశించు స్వభావము కలిగియున్నది).
ఈ శరీరములో పృథ్వీమండలము (Solid Division) క్షీణించుచుండగా దేహమంతా ముడతలు కనిపించ ప్రారంభిస్తాయి.

---

**తద్వత్ ఆపోగణాపాయే**
**కేశాస్స్యుః పాండరాః క్రమాత్౹**
**తేజః క్షయే క్షుదా కాంతి నశ్యేతే౹**
**మారుతక్షయే వేపథుః సంభవేః,**
**నిత్యం నాభసేనైవ జీవతి౹**

అట్లాగే జలవిభాగము తగ్గుచుండగా వెంట్రుకలు నెరవటం (తెల్లబడటం) ప్రారంభిస్తాయి.
అగ్ని (తేజస్సు) తగ్గుతూ ఉంటే శరీరములో కాంతి తగ్గనారంభిస్తుంది. ఆకలి తగ్గిపోసాగుతుంది.
గాలి శక్తి శరీరంలో తగ్గుతూ ఉండగా, శరీరంలో అనేకచోట్ల వణుకు, (కంపనములు) ప్రారంభం కాగలవు.
అనునిత్యంగా ఆకాశముతోగల సంబంధము చేతనే ఈ దేహము జీవించటమును కొనసాగించ గలుగుతోంది.

---

**ఇత్థం భూతక్షయాత్ నిత్యం, జీవితం భూతధారణమ్౹**
**ఉడ్యాణం కురుతే యస్మాత్, అవిశ్రాంతం మహాఖగః౹**
**ఉడ్డియాణం తదేవస్యాత్ తత్ర 'బంధో' అభిధీయతే౹**
**ఉడ్డియాణో హి అసౌ బంధో 'మృత్యు మాతంగ కేసరీ'౹**
**తస్యముక్తిః తనోః కాయాత్, తస్య బంధో హి దుష్కరః౹**

ఈ దేహముపట్ల ఇటువంటి 'భూతక్షయము' అనే ధర్మము జరగటం – **'మరణము'** అగుచున్నది. భూతధారణము **'జీవితము'** అగుచున్నది.
అవిశ్రాంతంగా ఎగురుచూ ఉండే **'మహాఖగము'** అనబడు ప్రాణవాయు సంచాలనమును **"ప్రాణాయామయోగ సాధన"**తో నిశ్చలముచేయటమే కుంభక (ప్రాణాయామము) అగు 'ఉడ్డియాణ బంధము'.
అటువంటి ప్రాణాయామ కుంభకరూప 'ఉడ్డీయాణ బంధము' మృత్యువు అనే ఏనుగుకు సింహము వంటిది అగుచున్నది.
ఆ ఉడ్డియాణబంధము (యోగాభ్యాసము) వలన ఈ జీవుడు దేహబంధములనుండి విముక్తుడగుచున్నాడు. దుష్కరమగు **శరీరబంధము నుండి అతీతతత్త్వమును సాక్షిత్వమును అనుభవమునకు తెచ్చుకొనుచున్నాడు.**

| | |
|---|---|
| అగ్నౌతు చలితే కుక్షౌ<br>వేదనా జాయతే భృశమ్।<br>న కార్యా క్షుధితేనాపి<br>నాపి విణ్మూత్ర వేగినా। | జఠరాగ్ని పొట్టలో జ్వలిస్తున్నప్పుడు ఈ శరీరమునకు 'ఆకలి' అనే వేదక కలుగుతోంది.<br>'ఆకలి'గా ఉన్నప్పుడు యోగాభ్యాసము కుదరదు. మలమూత్ర వేగము సందర్భములలో యోగాభ్యాసము తగిన సమయం కాదు. |
| హితం మితంచ భోక్తవ్యం<br>స్తోకం స్తోకం అనేకధా।<br>మృదుమధ్యసు మంత్రేషు<br>క్రమాత్ మంత్రం లయం హతం।<br>లయ మంత్ర హఠా యోగా,<br>యోగో హి అష్టాంగ సంయుతః॥ | **యోగాభ్యాసియొక్క ఆహార నియమము :**<br>హితంగా ఉండేవి మితంగా భుజించాలి. కొంచము ఆహారము రోజులో ఎక్కువసార్లు తీసుకోవాలి.<br>**మంత్రము - అర్థము**<br>మంత్రమును మృదువుగా మననము చేస్తూ, క్రమంగా మంత్రమును లయం చేస్తూ మంత్రార్థభావనను ఆశ్రయించాలి. ఈ జగత్తును ఆత్మయందు లయింపజేయటమే **'లయమంత్ర - లయయోగము'**. అట్టి యోగమునకు అంగములు '8'. |
| యమశ్చ నియమశ్చైవ, తథా చ ఆసనమేవ చ।<br>ప్రాణాయామః తథా పశ్చాత్, ప్రత్యాహారః తథా పరమ్।<br>ధారణా చ తథా ధ్యానం, సమాధిశ్చ అష్టమో భవేత్॥ | **అష్టాంగ యోగములు**<br>(1) యమము (2) నియమము (3) ఆసనము (4) ప్రాణాయామము (5) ప్రత్యాహారము (6) ధారణ (7) ధ్యానము (8) సమాధి. |
| **02.** అహింసా సత్యమ్ అస్తేయం<br>బ్రహ్మచర్యమ్ దయ ఆర్జవమ్<br>క్షమా ధృతిః మితాహారః శౌంచం - చ<br>ఇతి 'యమా' దశ (10)। | **దశ (10) విధ యమములు**<br>(1) అహింస (2) సత్యము (3) అస్తేయము (తనది కానిది స్వీకరించకపోవటం) (4) బ్రహ్మచర్యము (5) దయ (6) ఆర్జవము (మనసా, వాచా, కర్మణా ఏకత్వము) (7) క్షమ (8) ధృతి (9) మితాహారము (10) శౌచము. ఇవి **'యామా దశ'**. |
| తపః సంతోషం ఆస్తిక్యం, దానం ఈశ్వరపూజనమ్<br>సిద్ధాన్తశ్రవణం చ ఏవ, హ్రీః మతిశ్చ జపో వ్రతం<br>ఏతే హి 'నియమాః' ప్రోక్తా<br>దశధైవ (10) మహామతే! | **దశవిధ నియమములు (10)**<br>(1) తపస్సు (2) సంతోషము (3) ఆస్తిక్యభావనలు (4) దానము (5) ఈశ్వరపూజనము (6) సిద్ధాంత శ్రవణము (7) హ్రీ (8) మతి (9) జపము (10) వ్రతము. |
| ఏకాదశ ఆసనానిస్యుః, చక్రాద్యా, మునిసత్తమ!<br>చక్రం పద్మాసనం కూర్మం, మయూరం కుక్కుటం తథా<br>వీరాసనం స్వస్థికం చ, భద్రం సింహాసనం తథా<br>ముక్తాసనం గోముఖం చ, కీర్తితం యోగవిత్తమైః॥ | **ఏకాదశ ఆసనములు**<br>(1) చక్రాసనము (2) పద్మాసనము (3) కూర్మాసనము (4) మయూరాసనము (5) కుక్కుటాసనము (6) వీరాసనము (7) స్వస్థికాసనము (8) భద్రాసనము (9) సింహాసనము (10) ముక్తాసనము (11) గోముఖాసనము |
| సవ్య ఊరు దక్షిణే గుల్ఫే,<br>దక్షిణం దక్షిణేతరే,<br>నిదధ్యాత్ ఋజుకాయస్తు,<br>'చక్రాసనం' ఇదం మతమ్। | **చక్రాసనము**<br>- ఎడమ తొడపై కుడి చీలమండలమును ఉంచి<br>- కుడి తొడపై ఎడమ చీలమందలమును ఉంచి,<br>- పృష్ఠము నుండి శిరో ఉపరిభాగములోని కొండ నాలుకకు సూటిగా పై శిరో ఊర్ధ్వభాగమునగల బ్రహ్మరంధ్రము వరకు శరీరమును నిటారుగా ధారణ చేసి యోగమునకు సిద్ధబడటము. ఇది **చక్రాసనము.** |
| పూరకః కుంభకః తద్వత్<br>రేచకః పూరకః పునః<br>ప్రాణాయామః స్వనాడీభిః<br>తస్మాత్ నాడీ ప్రచక్షతే॥ | **ప్రాణాయామము :** (1) పూరకము (గాలిలోనికి పీల్చటము)<br>(2) కుంభకము (ధారణ చేయటం)<br>(3) రేచకము (వదలటము)<br>(4) పునఃపూరకము (తిరిగి పూరించటం)<br>ప్రాణాయామాభ్యాసముచే ఆ అభ్యాసియొక్క సూక్ష్మనాడులు నిర్మలమగుచూ, ప్రత్యుత్సాహము పొందుచున్నాయి. |

| శరీరము | శరీరము |
|---|---|
| శరీరం సర్వజంతూనాం<br>షణ్ణవత్ (96) అంగులాత్మకమ్।<br>తత్ మధ్యే పాయుదేశాత్తు<br>ద్వయ-అంగులాత్ పరతః పరమ్<br>మేఢ్రదేశాత్। అధస్మాత్తు,<br>ద్వయ అంగులాత్ 'మధ్యమ్' ఉచ్యతే।<br>మేఢ్రాత్ నవ (9) అంగులాత్<br>ఊర్ధ్వం నాడీనామ్ 'కందమ్' ఉచ్యతే।<br>చతుర (4) అంగులమ్ ఉత్సేధం<br>చతుర (4) అంగులమ్ ఆయతమ్।<br>అండాకారం పరివృతం<br>మేదో మజ్జా అస్థి శోణితైః<br>తత్రైవ నాడీ చక్రం తు, ద్వాదశారం ప్రతిష్ఠితమ్। | ప్రాణులందరికీ (జీవులకు, మానవులకు)<br>(సామాన్యంగా) '96' అంగులముల పొడుగు (లేక) 96 బొటనవ్రేళ్ళ పరిణామము ఉంటుంది.<br>**మేఢ్రము** - అట్టి ఈ దేహము మధ్యలోగల 'పాయువు' (గుదము, ముడ్డి)నకు '2' అంగుళములకు పైవైపుగా మేఢ్రము. (పొత్తి కడుపునకు) '2' అంగుళములు క్రిందగా 'మధ్యప్రదేశము'. అట్టి 'మేఢ్రము'నకు 9 అంగులము ఊర్ధ్వంగా 'కందము'.<br>దానిపై నాడీ కందము<br>4 అంగుళముల ఎత్తు<br>4 అంగులముల విస్తారము (పొడవు)<br>అండాకారగము (కోడిగ్రుడ్డు ఆకారం) అగు ఈ నాడీకందమును - మేదస్సు (క్రొవ్వు, వప), మజ్జ (ఎముకలలో కనిపించే గుజ్జు), అస్థి (బొమికలు), శోణితము (రక్తము) మొదలైనవన్నీ పరివృతమై ఆవరించినవై (Round up and covering) **ద్వాదశార నాడీచక్రము** రూపుదిద్దుకొని ఉంటోంది. |
| శరీరం ధ్రియతే యేన<br>వర్తతే తత్ర కుండలీ। | శరీరధారణకు మూలాధార స్థానమై, మూలాధార చక్రాకాశములో 'కుండలిని' అనే **ఇచ్ఛా - ప్రజ్ఞా విశ్వధారిణీ** శక్తి వేంచేసినదై స్థానము కలిగియున్నది. |
| బ్రహ్మరంధ్రం సుషుమ్నాయా<br>వదనేన పిధాయ సా॥ | శరీరములో నాడీ కందము నుండి బయల్వెడలుచున్న తేజోపుంజములతో కూడి ఒక చేతనమగు శక్తినాడి - వెన్నెముక మధ్య నుండి, మెడ, పాలభాగములనుండి, కొండ నాలుకకు ఊర్ధ్వంగా శిరో కపాల భాగమునకు (తలడిప్పకు)పైనగల శరీరముయొక్క దశవ (పదవ) రంధ్రమును మూసి ఉంచుతోంది. ఆ మూసి ఉంచబడు రంధ్రము '**బ్రహ్మరంధ్రము**'. ఆవిధంగా (నాడీకందము నుండి) బ్రహ్మ రంధ్రము వరకు విస్తరించినదైయున్న అతిముఖ్య శక్తినాడి '**సుషుమ్న**'. |
| ఆలంబుసా సుషుమ్నాయా, కుహూః నాడీ వసతి అసౌ।<br>అనంతరార యుగ్మేతు, వారుణా చ, యశస్వినీ।<br>దక్షిణారే (కుడిగా) సుషుమ్నాయాః<br>పింగళావర్తతే క్రమాత్.<br>తత్ అంతరారయోః 'పూషా' వర్తతే చ 'పయస్వినీ'।<br>సుషుమ్నా పశ్చిమే చారే, స్థితా నాడీ 'సరస్వతీ'। | అట్టి 'సుషుమ్ననాడి'ని వెంటనంటినవై '**అలంబుస, కుహు**' అనే రెండు నాడులు ఉంటున్నాయి. లోపలి వైపుగా '**వారుణి**' '**యశశ్విని**' - అనే మరో రెండు నాడులు. దక్షిణంగా (కుడిగా) '**పింగళ**' అనే నాడి సుషుమ్ననాడిని వెంటనంటి ఉన్నది.<br>దానికి అంతరముగా '**పూషా**', '**పయస్వినీ**' అనుసరించి వర్తించుచున్నాయి.<br>సుషుమ్నకు పశ్చిమంగా ఆకు ఆకారంగా '**సరస్వతీనాడి**' స్థితి కలిగియున్నది. |
| **03.** శంఖినీచైవ 'గాంధారీ'<br>తదనంతరయోః స్థితే।<br>ఉత్తరే తు సుషుమ్నాయా<br>ఇడాఖ్యా నివసతి అసౌ।<br>అనంతరం 'హస్తిజిహ్వా'<br>తతో 'విశ్వోదరీ' స్థితా। | పై నాడులకు తదనంతరగా (పైపైగా) '**శంఖినీ**', '**గాంధారీ**' నాడులు.<br>సుషుమ్నకు 'ఉత్తరం'గా (ఎడమగా) '**ఇడా**' అనే పేరుగల నాడి ఉన్నది.<br>ఇడానాడికి అనంతరంగా (ప్రక్కగా) '**హస్తి జిహ్వ**' ,'**విశ్వోదరి**' నాడులు. |

| | |
|---|---|
| ప్రదక్షిణ క్రమేణైవ చక్రస్య<br>అరేషు నాడయః<br>వర్తన్తే ద్వాదశ హి ఏతా<br>ద్వాదశ అనిల వాహకాః।<br>పటవత్ సంస్థితా నాడీ<br>నానావర్ణాః సమీరితాః<br>పటమధ్యం తు యత్ స్థానం<br>'నాభిచక్రం' తత్ ఉచ్యతే॥ | ఈ అలంబుస - కుహూ - వారుణీ - యశశ్వినీ - పింగళ - పూస - యశశ్వినీ - సరస్వతీ - శంఖినీ - గాంధారీ - ఇడ - హస్తిజిహ్వా - అను పేర్లతో మనము చెప్పుకున్న '12' నాడులు **వాయువాహకములు** (Carriers of Prana Energy) అయి ఉన్నాయి. ప్రదక్షిణ క్రమంగా నాడీ చక్రముయొక్క ఆకులలో ప్రవర్తన శీలమై యున్నాయి. వస్త్రము ధరించుతీరుగా అనేక వర్ణములతో (రంగులతో) ఈ నాడీపటలము నాడీ కందమును ఆవరించి / సంస్థితమై యున్నాయి.<br>ఆ పటము మధ్యస్థానములో ఉన్నదే 'నాభీచక్రము' అని పిలువబడుతోంది. |
| నాదాధారా సమాఖ్యాతా, జ్వలంతీ నాదరూపిణీ,<br>పరరంధ్రా సుషుమ్నా చ, చత్వారో రత్నపూరితాః<br>కుండల్యా పిహితం శశ్వత్, బ్రహ్మరంధ్రస్య మధ్యమమ్॥<br>ఏవమేతాసు నాడీషు ధరంతి 'దశవాయవః'। | **కుండలినీ :** నాదరూపిణి అయి వెలుగుతూ, నాదమునకు ఆధారమై 'సుషుమ్న'కు పరరంధ్రమై, '4' రత్నముల పూరితమైయున్నది.<br>బ్రహ్మరంధ్రమును కుండలినీ శక్తి చే మూతవలె మూసి ఉంచబడుతోంది.<br>ఈ విధంగా నాడులచే దశవాయువులు ధరింపబడినవై ఉన్నాయి. |
| ఏవం నాడీ గతిం, వాయు గతిమ్<br>జ్ఞాత్వా విచక్షణః। | ఏ యోగి అయితే విజ్ఞాన విచక్షణలచే ఈ నాడీ గత వాయువుల సంచారములను ఎరిగినవాడై ఉంటాడో (Consciously), అట్టివాడు యోగాభ్యాసి అయి కేవలమగు ఆత్మ స్వరూపముతో ఏకత్వము సిద్ధించుకొనుచున్నాడు. **నాడీగతి - యోగ గతిలను ఎరుగుటకు యోగాభ్యాసమే ఉపాయము.** |
| సమగ్రీవ శిరః కాయః<br>సంవృతాస్యః సునిశ్చలః।<br>నాసాగ్రే చ ఏవ హృత్ మధ్యే<br>బిందు మధ్యే తురీయకమ్।<br>స్రవంతమ్ అమృతం పశ్యేత్<br>నేత్రాభ్యామ్ సుసమాహితః।<br>అపానం ముకుళీ కృత్య<br>పాయుం ఆకృష్య చ ఉన్ముఖమ్<br>ప్రణవేన సముత్థాప్య<br>'శ్రీ'బీజేన నివర్తయేత్॥ | - 'మెడ', శిరస్సు, కాయమును సమస్థితిగా నిట్టనిలువు ఆకారంగా ధరించి<br>- పళ్ళు కలువకుండా, పెదవులను ఒకచోటికి చేర్చి,<br>- శ్రద్ధ, సునిశ్చలత్వము (concentration) ఆశ్రయించినవాడై,<br>- (1) ముక్కుకు అగ్రభాగస్థానము (The Upper Point of nose) (2) హృదయ మధ్యగాను, (3) బిందు మధ్యగాను నేత్రములను చూపును సుమాహితము (Wel - fixed) చేసి,<br>- జాగ్రత్ - స్వప్న - సుషుప్తులను తనయొక్క తురీయస్థానమునుండి దర్శించుచూ, తురీయకరూపంలో స్రవించు 'అమృతము' (మార్పునకు విషయమేకానట్టి రూపము) దర్శించుచు,<br>అపానమును [బాహ్యముగ ప్రవహించు ప్రాణ (వాయు) ప్రసరణమును] ముకుళింపజేసి (లేక) ముడుచుకొనునట్లు చేసి,<br>- పాయువును (మలవిసర్జన ప్రదేశాకాశమును) ఉన్ముఖం(as upward facing)గా సమాకర్షించి,<br>- ప్రణవములో సముత్థాప్యం (Inspiring) చేస్తూ,<br>'శ్రీం' బీజముచే నివర్తింపజేయాలి. సమస్తమునకు బీజమైన 'ఆత్మ'ను 'శ్రీం' అక్షరోచ్ఛారణతో ఉపాసించాలి. |
| స్వాత్మానం చ శ్రియం ధ్యాయేత్<br>అమృతప్లావనం తతః,<br>కాలవంచనమ్ ఏతద్ధి<br>సర్వముఖ్యం ప్రచక్షతే॥ | శ్రియము (సర్వశ్రేయో - శుభప్రదము) అగు అమృతము స్రవించు తత్ ఆత్మనే ధ్యానించాలి. స్వస్వరూపమగు ఆత్మయే ధ్యాన వస్తువు.<br>ఇది కాలమునకు అతీతమైనది. **'సర్వముఖ్యము'.** |

| | |
|---|---|
| మనసా చింతితం కార్యం<br>మనసా యేన సిద్ధ్యతి,<br>జలే అగ్ని జ్వలనాత్<br>శాఖా పల్లవాని భవంతి హి॥<br>నాధన్యం జాగతం వాక్యం<br>విపరీతా భవేత్ క్రియా।<br>మార్గే బిందుం సమాబధ్య<br>వహ్నిం ప్రజ్వాల్య జీవనే,<br>శోషయిత్వా తు సలిలం<br>తేన కాయం దృఢం భవేత్। | అట్టివాడు (యోగశక్తిచే) మనస్సుతో చింతనము చేసిన ఏకార్యమైనా మనస్సుతోనే సిద్ధించుచున్నది. జలములో అగ్ని జ్వలితమై, ఆ అగ్ని శాఖోపశాఖలుగా అగుచున్నది. (మనస్సుతోనే మనస్సు సిద్ధిపొందు చున్నది). మనస్సుతో సిద్ధింపలేని లేదు.<br>జలములో అగ్ని జ్వలకమై శరీరము దృఢముగా అగుచున్నది. జలముతోనే బీజము వృక్షము అగుచున్నది.<br>యోగిపట్ల జాగరితమైన వాక్యము 'అధన్యము' కాదు. (చెప్పింది చెప్పినట్లు జరుగగలదు). క్రియలన్నీ విపరీతములుగా అవుతాయి.<br>సుషుమ్నయందు కుండలినీ శక్తి (ప్రయాణించు) మార్గమునందు 'బిందువు'ను సమాబంధనము చేసి,<br>(హృదయ స్థానంలో గల) 'జీవనము' నందు వహ్ని (అగ్నిని ప్రజ్వలింపజేసి), జీవాత్మత్వమును తేజోభావన చేసి,<br>సలిలము (జలము)ను శోషింపజేసి చేయు యోగాభ్యాసముచే ఆయోగియొక్క శరీరము దృఢముగా అగుచున్నది. |
| గుదయోని సమాయుక్త<br>ఆకుంచతి ఏకకాలతః<br>అపానమ్ ఊర్ధ్వగం కృత్వా<br>సమానేన నియోజయేత్॥ | (1) గుదయోనిని సమాయుక్తము చేయుటము (గట్టిగా బుద్ధి - శక్తితో ధారణ) (2) ఆకుంచనము (పైకి కదలించటము)<br>ఈ రెండూ ఏకకాలంలో నిర్వర్తిస్తూ అపానమును (Down moving prana Energy)ని ఊర్ధ్వగతంగా చేసి 'సమానప్రాణము' (Energy placed in all parts of the body equally) నందు నియమించాలి. |
| **04.** స్వాత్మానం చ శివం ధ్యాయేత్<br>అమృత ప్లావనం తతః।<br>బలం సమారభేత్ యోగీ<br>మధ్యమ ద్వార భాగతః। | **'నా ఆత్మ ఆ శివస్వరూపమే'** అనునదే క్రమంగా ధ్యానముయొక్క ముఖ్య లక్షణము. స్వాత్మను సమస్త జీవులలోని అంతరాత్మగా (శివస్వరూపముగా) ధ్యానము చేయుచుండగా అమృతప్లావనము (జన్మ - మృత్యువులకు అవిషయమగు ఆత్మభావన) స్రవించగలదు.<br>మధ్యమ (నడిమి) విభాగమునందు (అపాన-సప్రాణ ఏకత్వము అనే) యోగాభ్యాసముచే- యోగి ఆత్మతో యోగము సంకల్పించాలి. ఆతడు యోగబలవంతుడు కాగలడు |
| భావయేత్ ఊర్ధ్వగతి - అర్థం<br>ప్రాణ - అపాన సుయోగతః।<br>ఏష యోగపరో దేహే<br>సిద్ధి మార్గ ప్రకాశకః॥ | (కుండలినీ శక్తియొక్క) ఊర్ధ్వగతి కొరకై ప్రాణ-అపానముల సంయోగత్వమును భావబలయోగంతో అనువర్తింపజేయాలి.<br>ఇటువంటి యోగపరునిపట్ల (యోగాభ్యాసిపట్ల) సిద్ధిమార్గము ప్రకాశింపజేయగలదు. |
| యథైవ అపాంగతః సేతుః<br>ప్రవాహస్య నిరోధకః<br>తథా శరీరగాత్ ఛాయా<br>జ్ఞాతవ్యా యోగిభిః సదా।<br>సర్వాసామేవ నాడీనామ్ ఏష 'బంధః' ప్రకీర్తితః॥ | ఏవిధంగా అయితే వేగముగా ప్రవహించు జల ప్రవాహము సేతువు (ఆనకట్ట)చే నిరోధించబడుచున్నదో, ఆ విధంగా శరీరసంబంధమైన విషయములు (జగత్తు మొదలైనవి - **'ఇవి సత్యమే! నిత్యమే'** - అను భావన వెనుకకుమరలుచూ, ఇదంతా) ఛాయామాత్రంగా యోగికి అనుభవమగు చున్నది.<br>సర్వనాడులలో ప్రాణము సమానముగా ధారణ **'నాడీబంధము'** అనబడుచున్నది. |
| బంధస్య అస్య ప్రసాదేన<br>స్ఫుటీ భవతి దేవతా।<br>ఏవం చతుష్పథో బంధో<br>మార్గత్రయ నిరోధకః।<br>ఏకం వికాసయత్ మార్గం<br>యేన సిద్ధాః సుసంగతః॥ | 'నాడీబంధ అభ్యాసము' యొక్క ప్రసాదముచే దేవతలు ప్రసన్నులగు చున్నారు.<br>ఈ విధంగా ((1) పూరకము (2) కుంభకము (3) రేచకము (4) పునఃపూరకము అను రూపముగల చతుష్పథయోగసాధనచే మార్గత్రయము (ప్రాణ - అపాన - వ్యానములను) నిరోధకము అగుచున్నది.<br>ఏ ఏకైక మార్గములో సిద్ధులు సుసంగతులగుచున్నారు. వారి బుద్ధి వికసించి, వారియొక్క జీవాత్మ సర్వాత్మత్వము సంతరించుకోగలదు. వారియొక్క బుద్ధి **'నాడీ బంధనము'**చే వికాసము పొందగలదు. |

ఉదానం ఊర్ధ్వగం కృత్వా
ప్రాణేన సహ వేగతః
బంధోఽయం సర్వనాడీనామ్
ఊర్ధ్వం యాతి నిరోధకః॥

'ప్రాణాయామాభ్యాసముచే - **"నాడులలో ప్రసరించు ప్రాణశక్తిని నిశ్చలముగా ధారణచేయుకుంభకము"** - అనే నాడీ బంధన యోగాభ్యాసముచేస్తూ 'ఉదానప్రాణము'ను బుద్ధితో ఊర్ధ్వముగా నడుపుచుండగా, కుండలిని బ్రహ్మరంధ్రమును సమీపించుచున్నది. (మూతను తెరచినట్లు) బ్రహ్మరంధ్రపు మూతను తొలగించుటకై - కుండలిని **ఊర్ధ్వయానము** జరుగ గలదు.

---

అయం చ సంపుటో యోగో
మూలబంధోఽపి అయం మతః।
బంధత్రయమ్ అనేనైవ సిద్ధ్యతి అభ్యాస యోగతః॥

ఈ 'మూలబంధయోగము'ను 'సంపుటయోగము' అని కూడా అంటారు. ఎందుకంటే ఈ అభ్యాసముచే **(1) ప్రాణ (2) అపాన (3) వ్యాన** ప్రాణ ప్రసరణలను ఏకం చేస్తుంది. **(1) ద్రష్ట (2) దర్శన (3) దృశ్యములను** - ఆత్మతో సంపుటం చేస్తుంది. ఆత్మయొక్క ఏకము, అఖండములు అనుభవమవగలదు.

---

దివారాత్రం అవిచ్ఛిన్నం
యామే యామే యదా తదా
అనేన అభ్యాసయోగేన
వాయుః అభ్యసితో భవేత్।
వాయావభ్యసితో వహ్నిః
ప్రత్యహం వర్ధతే తనౌ॥

రాత్రి-పగలు, యామ-యామము (జామ జాముకు) 'మూలబంధ యోగము' అనే 'ప్రాణాయామాభ్యాసము'చే **మూలాధారములోగల కుండలినిని ఉదాన (బంధన) ప్రక్రియ ద్వారా సుషుమ్న ఊర్ధ్వగతిగా నడిపించి, శిరో ఉపరిభాగమునగల బ్రహ్మరంధ్రపు మూత తొలగించటము' అనే అభ్యాసముచే** వాయువు అభ్యాసితము (ప్రాణ శక్తి ఉత్తేజితము) అవుతుంది.

వాయువు (ప్రాణశక్తి) దేహమంతా సమత్వము పొందుచూ ఉత్తేజితము అగుచుండగా, దేహంలో సర్వత్రా తేజోరూపమగు అగ్ని ప్రజ్వలితము, దేదీప్యమానము అగుచూ వృద్ధి చెందసాగుతుంది.

---

వహ్నౌ వివర్ధమానే తు
సుఖమ్ అన్నాది జీర్యతే।
అన్నస్య పరిపాకేన రసవృద్ధిః ప్రజాయతే!
రసే వృద్ధిం గతే నిత్యం
వర్ధంతే ధాతవత్ తథా।

దేహంలో 'వహ్ని (అగ్ని)' సమత్వంచేత అట్టి 'తేజోవృద్ధి' వలన ఆహార పదార్థములు (భోజ్యములు) తేలికగా జీర్ణము కాసాగుతాయి.

శరీరంలో ప్రవేశించిన అన్నము (ఆహారము, భోజ్యము) పరిపాకము (త్వరగా జీర్ణము) అవటంచేత శరీరంలో 'రసవృద్ధి' బాగుగా జరుగగలదు.

'రసవృద్ధి' యొక్క చర్య వలన శరీరంలో ప్రకాశత్వము అధికమై ధాతువృద్ధి, ధాతునిర్మలత్వము జరుగగలదు.

---

ధాతూనాం వర్ధనేనైవ
ప్రబోధం వర్ధతే తనౌ।
దహ్యంతే సర్వ పాపాని
జన్మకోటి ఆర్జితాని చ।

ఎప్పుడైతే ధాతువులు నిర్దోషత్వము, సమవృద్ధి జరుగుతూ ఉంటుందో, అప్పుడు శరీరము, మనస్సు, బుద్ధి ప్రబోధనము (Positively, Inspired, Inclined) - వర్ధనము పొందసాగుతాయి. ఆత్మప్రబోధము వర్ధిల్లుతుంది.

ఎప్పుడైతే ఆత్మప్రబోధము వర్ధిల్లసాగుతుండదో, అప్పుడు జన్మ - జన్మాంతరములుగా సంపాదించుకొన్న పాపకర్మ ఫలములు, అల్పదృష్టులు మొదలంట్లా భస్మము కాసాగుతాయి.

---

గుద - మేఢ్రాంతరాళస్థం
మూలాధారమ్ త్రికోణకమ్।

గుదము - మేఢ్రముల మధ్యగా (పొత్తికడుపు క్రింద గుదముపై వైపుగా) 'మూలాధారము' అనే త్రికోణాకార స్థానము ఈ దేహములో ఉన్నది.

---

శివస్య బిందురూపస్య స్థానం తద్ధి ప్రకాశకమ్।
యత్ర 'కుండలినీ' నామ పరాశక్తిః ప్రతిష్ఠితా,
యస్మాత్ ఉత్పద్యతే వాయుః,
యస్మాత్ వహ్నిః ప్రవర్ధతే,
యస్మాత్ ఉత్పద్యతే బిందుః,
యస్మాత్ నాదః ప్రవర్ధతే,
యస్మాత్ ఉత్పద్యతే హంసో,
యస్మాత్ ఉత్పద్యతే మనః।

అట్టి మూలాధారచక్రము శివునియొక్క మహాప్రకాశమగు 'బిందురూపము'నకు స్థానము.

అట్టి మూలానామ శివప్రకాశక మహాబిందువు నందు- 'కుండలినీ' అనే పేరుతో చెప్పబడే 'పరాశక్తి' - ప్రతిష్ఠితమైయున్నది.

ఆ మూలాధారాంతర్గత శివ ప్రకాశక బిందువు నుండి వాయువు (ప్రాణశక్తి), అగ్ని ఉత్పన్నమై దేహమంతా విస్తరిస్తూ ప్రవర్ధమానమగు చున్నాయి.

**'బిందువు' ఉత్పన్నమగుచున్న చోటునుండే 'నాదము' కూడా జనించి ప్రవర్ధమానమగుచున్నది.**

అక్కడి నుండే హంస (జీవుడు), ఆ జీవునియొక్క మననశక్తి రూపమగు 'మనస్సు' కూడా ఉత్పాదకమై విశ్వమంతా విస్తరించినదై ఉంటున్నది.

**05.** మూలాధారాది షట్(6) చక్రం
'శక్తిస్థానమ్' ఉదీరితమ్।
కంఠాత్-ఉపరి మూర్ధాంతం
'శాంభవంస్థానమ్' ఉచ్యతే!



'మూలాధారము' నుండి బయల్వెడలి స్వాధిష్ఠానము → మణిపూరకము → అనాహతము→విశుద్ధము→ఆజ్ఞాచక్రములు స్థానముగాగల షట్ (6) చక్రస్థానములను కలిపి **'శక్తిస్థానము'** అని పిలుస్తున్నారు.

కంఠము నుండి ప్రారంభమై, ఊర్ధ్వంగా (పైపైపుగా) మూర్ధ్ని వరకు **'శాంభవీస్థానము'** - అని పిలువబడుతోంది.

---

నాడీనామ ఆశ్రయః పిండో।
నాద్యః ప్రాణస్య చ ఆశ్రయాః।
జీవస్య నిలయః ప్రాణో।
జీవో హంసస్య చ ఆశ్రయః।
హంసః శక్తేః అధిష్ఠానం
చరాచరమ్ ఇదగ్ంం జగత్।।

నాడులకు **'పిండము'** ఆశ్రయము.

నాడులు **'ప్రాణమునకు'** - ఆశ్రయము.

జీవునకు **'ప్రాణము'** - నిలయము (ఆశ్రయము).

హంసకు **'జీవుడు'** - ఆశ్రయము.

శక్తికి **'హంస'** - అధిష్ఠానము! (ఆశ్రయము).

**ఈ చరాచర జగత్తు - హంస స్వరూపము. (హంస = సోఽహమ్)**

---

నిర్వికల్పః, ప్రసన్నాత్మా
ప్రాణాయామమ్ సమభ్యసేత్।

అట్టి ఉత్తరోత్తర సారూప్యస్వస్థితి కొరకై యోగాభ్యాసి నిర్వికల్పుడై (సర్వజగత్ కల్పనలను వదలినవాడై, ప్రసన్నాత్ముడై ఉత్సాహ-ధైర్య-సాహస- మహదాశయములతో) **ప్రాణాయామమును శ్రద్ధగా, ప్రతిదినము అనేకసార్లు శ్రద్ధగా ఆచరించును (అభ్యసించును) గాక!**

---

సమ్యక్ బంధ త్రయస్థోఽపి
లక్ష్య - లక్షణ కారణమ్,
వేద్యం సముద్ధరేత్ నిత్యం
సత్య సంధాన మానసః।
రేచకం పూరకంచైవ
కుంభ మధ్యే నిరోధయేత్।

యోగి సమ్యక్ భావనతో బంధత్రయము ఆచరిస్తూనే, అంతటితో తృప్తిపడి ఊరుకోకూడదు. మనస్సును పరమసత్యమగు సర్వత్రా ఆత్మదర్శన - అనుసంధానమును చేస్తూ, ఆత్మయొక్క అప్రమేయత్వ - నిత్యత్వ - సత్యత్వ ధర్మములను బుద్ధితో ఎరుగుచూ, **జీవాత్మత్వమును సముద్ధరించి - పరమాత్మతో ఏకత్వమును సదా సిద్ధించుకోవాలి.** (అనుక్షణికం చేసుకోవాలి).

రేచక (గాలి వదలటం) - పూరకం (గాలి నింపటం)...అను ప్రక్రియ మధ్యగా **కుంభకముచే** ప్రాణమును నిరోధించాలి. వాయువును నిలిపి ఉంచటము అభ్యసించాలి.

---

దృశ్యమానే పరే లక్ష్యే
బ్రహ్మణి స్వయమ్ ఆశ్రితః
బాహ్యస్థ విషయం సర్వమ్
'రేచకః' సముదాహృతః।।

### పరమార్థములు

**రేచకము** : కేవలము 'గాలిని వదలటము' అని శరీర సంబంధంగా అర్థపరిమితము కాకూడదు. మరి? **'ఈ దృశ్యమానమై కనబడేదంతా స్వయముగా సర్వదా పరబ్రహ్మమే'** - అనే మనో మననము, బుద్ధి నిశ్చయములతో - **బాహ్యముగా కనిపించే సర్వ విషయములు భాహ్యముననే వదలి ఉండటము రేచకము.**

---

పూరకం శాస్త్ర విజ్ఞానం।
కుంభకమ్ స్వగతమ్ స్మృతమ్।
ఏవమ్ అభ్యాస చిత్తశ్చేత్
స ముక్తో। న అత్ర సంశయః।।

**పూరకము** : 'ఆత్మ' గురించి శాస్త్రములు చెప్పు విజ్ఞానమును సముపార్జించుకోవటమే పూరకము.

**కుంభకము** : ఆత్మను అంతరముగా దర్శిస్తూ, కేవలమగు ఆత్మయే తానై ఉండటము. "ఈ సమస్తము నేనైన నేను" అను అను భావనయే **కుంభకము.**

ఎవ్వడు ఈ విధములైన రేచక - పూరక -కుంభకములను చిత్తముతో అభ్యాసముగా కలిగి ఉంటాడో, ఆతడు ముక్తుడే. సందేహమే లేదు.

'కుంభకేన సదా ఆరోప్య
కుంభకేనైవ పూరయేత్'।
కుంభేన కుంభయేత్ కుంభమ్
తదంతస్థః పరం శివమ్।
పునరాస్ఫాలయేత్ అద్య (ఆస్ఫాలయే దద్య)
సుస్థిరం కంఠముద్రయా।

ఓ నిదాఘ మహాశయా!

ఎల్లప్పుడూ కూడా → కుంభకముతో కుంభకమును ఆరోపించి (భావించి, బుద్ధితో సమన్వయించుకొని) కుంభకములో సర్వమును పూరించి వేసి ఉండాలయ్యా! **"నాతో సహా మనందరము పరమాత్మ స్వరూపమే"** - అనే కుంభక కుంభకమును భావన చేయాలి.

కుంభముతో-**అంతరహృదయ అభ్రాంత మధ్య- హృదయాంతరంగుడగు, సర్వస్వరూపుడగు పరమశివుని - కుంభస్వరూపముగా కుంభకము చేయాలి. "నేనైన నేనుగా సందర్శించాలి".**

తిరిగి కంఠముద్రతో (పైన చెప్పుకొనియున్న 'శాంభవీముద్ర'తో) - పునః (మరల) శివభావన, శివస్వరూపములను ఆస్ఫాలనము చేయాలి. (పీఠముపై శివలింగము వలె కంఠముపైగల ముఖమును శివలింగముగా భావన చేయాలి)

---

వాయూనాం గతిమ్ ఆవృత్య
ధృత్వా పూరక కుంభకౌ,
సమహస్త యుగం భూమౌ
సమం పాదయుగం తథా,
వేధక క్రమ యోగేన
చతుష్పీఠం తు వాయునా,
ఆస్ఫాలయేత్ మహామేరుం
వాయువక్త్రే ప్రకోటిభిః।

**వేదక (మార్గ) త్రయయోగము (లేక) చతుష్పీఠయోగము**

- వాయువుయొక్క గతి (Its routine movement)ని త్రిప్పి వెనుకకు మరల్చి, (లేక) స్వా-అధీనములోకి తెచ్చుకుంటూ....
- వాయు పూరక - కుంభకములతో (Air inward pulling and holding) ధారణచేస్తూ....
- రెండు చేతులను భూమిపై సమముగా ఆనించి ఉంచుతూ
- అట్లాగే రెండు పాదములను కూడా సమంగా నేలపై ఆనించి ఉంచుచూ
- ఇటువంటి 'వేధకత్రయ - అభ్యాసము'తో
- వాయువుతో 'మహామేరువు' అనబడు వాయు వక్త్రమును (గాలిచే ముఖమును పూరించి) ధారణ చేయాలి. (ప్రాణతత్త్వమును ప్రాణ - అపాన - వ్యాన - సమానములను) ఆస్ఫాలనము (వణికించటము, ఒరిపిడి) చేయాలి. (వాయువును ముఖములో నిశ్చలంచేసి, మిగతా శరీరములో 'చాలనము' చేయాలి.

---

పుట ద్వయం సమాకృష్య
వాయుః స్ఫురతి సత్వరమ్।
సోమ సూర్య అగ్ని సంబంధాన్
జానీయాత్ అమృతాయ వై,
మేరు మధ్యగతా దేవాః
చరంతే మేరుచాలనాత్।।

పుట ద్వయమును (ప్రాణ - అపానములను) పరస్పర సమాకర్షణము చేయుచుండగా సత్వరము ప్రాణశక్తి అనుభవరూపంగా స్ఫురించసాగుతుంది.

మార్పు-చేర్పులు లేనట్టి **'అమృతము'**యొక్క అనునిత్యానుభవము కొరకై సోమ (చంద్ర / ఇడ) - సూర్య (పింగళ) - అగ్ని (పింగళ)....తత్త్వములను దేహములో గుర్తిస్తూ తెలుసుకొని ఉండాలి. భావించాలి. ఉపాసించాలి. **'మేరుచాలనము'** అను యోగాభ్యాసముచే మేరువును (వెన్నెముకను) చలింపజేయు చుండగా మేరుగతులైన దేవతలు కూడా కదులసాగుతారు.

---

అదౌ సంజాయతే క్షిప్రం
వేధో అస్య బ్రహ్మ గ్రంథితః।
బ్రహ్మ గ్రంథిం తతో భిత్వా
విష్ణు గ్రంథిం భినత్త్యసౌ।
విష్ణు గ్రంథిం తతో భిత్వా
రుద్ర గ్రంథిం భినత్త్యసౌ।

యోగాభ్యాసము కొనసాగుచుండగా వేధ (మార్గము) నిర్మితమై, (సుషుమ్నలో ప్రవేశించిన కుండలినీ దివ్యశక్తి ఊర్ధ్వగతమగుచుండగా) మొదట **బ్రహ్మగ్రంథి** ('ఈ సృష్టి ఎవ్వరో బాహ్యంగా ఉండి సృష్టించారు కదా!' అనే కల్పన) భేదనము పొందగలదు.

ఆ తరువాత కుండలినీ శక్తి కంఠ ప్రదేశము వరకు విస్తరించుచుండగా, 'ఈ సృష్టి సంరక్షించు అభిమానము' అనే విష్ణుగ్రంథి విభేదనమగు చున్నది. **విష్ణుగ్రంథి** భేదనము తరువాత (శాంభవీస్థానము చేరిన) కుండలినీశక్తి **రుద్రగ్రంథిని** కూడా భేదనము చేస్తోంది.

**06. రుద్రగ్రంథిం తతో భిత్వాత్,**
**ఛిత్వా మోహమలం తథా,**
**అనేక జన్మ సంస్కార**
**గురుదేవ ప్రసాదతః।**
**యోగాభ్యాసాత్ తతో వేధో**
**జాయతే తస్య యోగినః।**

ఆ విధంగా రుద్రగ్రంథి భేదమైన తరువాత, గురుదేవుల అనుగ్రహం సంపాదించుకొని 'మోహము (Illusion, Misconceptions, Distractions)' అనే అనేక జన్మార్జితమలమును (దోషమును) కడిగివేసుకోవాలి.

యోగాభ్యాసముచే యోగికి 'వేధ' (మోక్షస్థితికి, అఖండాత్మాఽహమ్ స్థానమునకు మార్గము)....సులభతరమవగలదు. (వేధము = మార్గము)

---

**ఇడా పింగళయోః మధ్యే**
**సుషుమ్నా నాడి మండలే**
**ముద్రా బంధ విశేషేణ**
**వాయుం ఊర్ధ్వం చ కారయేత్।**

'ఇడ'- 'పింగళ' నాడులకు మధ్యగా ఉన్నట్టి అగ్నితేజోరూపమగు 'సుషుమ్న' నాడి మండలము (Zone of Inner Recess of Sushumna) నందు (ప్రాణ-అపాన సమత్వముతోకూడిన) ముద్రాబంధన విశేషముతో వాయువును ఊర్ధ్వముఖంగా గమనము చేస్తూ రావాలి.

---

**హ్రస్వో దహతి పాపాని।**
**దీర్ఘో మోక్ష ప్రదాయకః।**
**ఆప్యాయనః ప్లుతోవాపి**
**త్రివిధ ఉచ్చారణేన తు,**
**<u>తైలధారమ్ ఇవ అ(వి)చ్ఛిన్నం,</u>**
**<u>దీర్ఘ ఘంటా నినాదవత్,</u>**
**అవాచ్యం ప్రణవస్య అగ్రం**
**యస్తం వేద స వేదవిత్॥**

ప్రాణాపానముల సమరస రూప హ్రస్వ (చిన్న) అభ్యాసము ('ఓం'ను హ్రస్వముగా ఉచ్చరిస్తూ ఉండగా అట్టి హ్రస్వప్రణవము) సర్వపాపములను దహించివేస్తుంది. దీర్ఘమైన ప్రాణోపాసన ప్రణవోచ్చారణ ఈ జీవునికి మోక్షప్రదము - అగుచున్నది. ప్రారంభంలో పాపాలు తొలగుతాయి. దీర్ఘ కాలం అభ్యాసిస్తే మోక్షమే లభించగలదు.
ప్రణవోచ్చారణలోని 'మ్మ్మ్' అనుప్లుతము, - ఆప్యాయమును విస్తరింపజేస్తుంది. ఇవి '3' విధముల ఉచ్చారణలు. (ప్లుతము - స్వరము)
(1) తైలధారవలె అవిచ్ఛినంగాను, (2) గంటయొక్క సుదీర్ఘ నినాదంగాను (3) ప్రణవముయొక్క చిట్టచివర అవాచ్యము (కేవల మౌనము) గాను రూపు దిద్దుకుంటుంది.

అట్టి ప్రణవోచ్చారణవిధి ఎరిగిన వాడు వేదవేత్త.

---

**హ్రస్వం బిందుగతమ్ దైర్ఘ్యం**
**బ్రహ్మరంధ్రగతం ప్లుతమ్।**
**ద్వాదశాంతగతం మంత్రం**
**ప్రసాదం మంత్ర సిద్ధయే॥**

మంత్రసిద్ధికై, పవిత్రతకొరకై ప్రణవమును - హ్రస్వముగాను బిందుగతంగాను, దీర్ఘగతంగాను చేస్తూ స్వరమును -అజ్ఞానచక్రము నుండి బ్రహ్మ రంధ్రము వరకు - ఆవలగల ద్వాదశాంతమువరకు ప్రవేశింపజేయాలి. ఈవిధమైన సాధనచే మంత్రసిద్ధిరూపంగా హృదయ పవిత్రత సిద్ధించుచున్నది.

---

**సర్వవిఘ్న హరశ్చ అయం**
**ప్రణవః సర్వదోష హా।**
**ఆరంభశ్చ ఘటశ్చైవ**
**తథా ప్రచయః (పరిచయః) తథా।**
**నిష్పత్తిశ్చేతి కథితాశ్చ తస్రః తస్య భూమికాః॥**

'ఓం'కార ప్రణవోచ్చారణోపాసన → సర్వ విఘ్నములను, సర్వ దోషములను హరించివేయగలదు.

**ప్రణవముయొక్క భూమికలు**

(1) ఆరంభము (2) ఘటము (3) పరిచయము (4) నిష్పత్తి

ఈ నాలుగు ప్రణవముయొక్క భూమికలు.

---

**<u>ఆరంభ భూమిక</u>**

**07. కరణత్రయ సంభూతమ్**
**బాహ్యం కర్మ పరిత్యజన్**
**అంతరం కర్మ కురుతే**
**యత్ర 'ఆరంభః' స ఉచ్యతే।**

**(1) ఆరంభ భూమిక :**

'మనస్సు - వాక్కు - కాయము' అనబడే 'కరణత్రయము'చే నిర్వర్తించబడు బాహ్యకర్మలన్నీ బాహ్యమునసే వదలివేసి (స్పర్శాన్ కృత్వా బహిర్ బాహ్యాన్, చక్షుః చ ఏవ అంతరో భృవే) అంతరంగమున 'కర్మ' నిర్వర్తించటమును **'ఆరంభ భూమిక'** - అని పిలుస్తారు. సమస్త కర్మలు అత్యవసరమైనంత వరకే పరిమితము చేస్తూ, వాటినికూడా 'సంగము' త్యజించి, "కర్తవ్యమితి' భావనతో పరమాత్మకు సమర్పించుచూ ఉండటము - "ఆరంభ భూమిక" అనబడుచున్నది.

| | |
|---|---|
| <u>ఘటా భూమిక</u><br>వాయుః పశ్చిమతో వేధం<br>కుర్వన్ ఆపూర్య సుస్థిరమ్<br>యత్ర తిష్ఠతి, సా ప్రోక్తా<br>ఘటాఖ్యా భూమికా బుధైః। | **(2) ఘటాఖ్య భూమిక** : వాయువును పశ్చిమముగా (ఇడలో) 'వేద' (Pull) చేయుచు, నింపి స్థిరముగా ధారణ చేసి ఉంచు స్థితిని - **'ఘటభూమిక'** - అని బుధులచే (విజ్ఞులచే) చెప్పబడుతోంది. (వాయుకుంభకము). |
| <u>ప్రచయ భూమిక</u><br>న స జీవో, న నిర్జీవః<br>కాయే తిష్ఠతి నిశ్చలమ్<br>యత్ర వాయుః స్థిరః<br>ఖే స్యాత్<br>సేయం ప్రచయ భూమికా। | **(3) ప్రచయా భూమిక** - ఎప్పుడైతే యోగి - సజీవుడు (బ్రతికియున్న వాడు) గాని, నిర్జీవుడు (మరణించినవాడు) గాని ఏ మాత్రము కానివాడై, నిశ్చల మనో శరీరయుతుడై ఉంటాడో, శరీరమున వాయువు స్వాభావికంగానే నిశ్చలమై, స్థిరత్వము పొందినదై యుంటుందో, దేహ-దృశ్యములకు అతీతమైన మనో స్థితిని సిద్ధించుకొని ఉంటాడో, - అట్టి యోగి **'ప్రచయభూమిక'**లో ఉన్నవాడగుచున్నాడు. |
| <u>నిష్పత్తి భూమిక</u><br>యత్ర ఆత్మనా సృష్టిలయౌ<br>జీవన్ముక్తి దశాంగతః<br>సహజః కురుతే యోగం<br>సేయం నిష్పత్తి భూమికా ఇతి॥ | **(4) నిష్పత్తి భూమిక** - ఎప్పుడైతే యోగియొక్క దృష్టి - అవగాహనలలో ఈ సమస్త సృష్టి కూడా స్వభావముగా, సహజంగా లయమై, **ఇదంతా సర్వదా ఆత్మకు అభిన్నమై ఉంటుందో, అట్టి సహజయోగస్థితి** పొంది, ఈ జీవుడు **'జీవన్ముక్తదశ'**కు చేరినవాడగుచున్నాడు. అట్టి జీవన్ముక్త స్థితిని **'నిష్పత్తి భూమిక'** అని పిలుస్తున్నారు. |
| ఏతత్ ఉపనిషదం యో అధీతే...<br>సో అగ్నిపూతో భవతి।<br>స వాయుపూతో భవతి।<br>సురాపానాత్ పూతో భవతి।<br>స్వర్ణస్తేయాత్ పూతో భవతి।<br>స <u>'జీవన్ముక్తో'</u> భవతి।<br>తదేతత్ ఋచ అభ్యుక్తమ్। | ఎవ్వరైతే ఈ వరాహోపనిషత్ ప్రవచించు తత్త్వమును - అధ్యయనం చేస్తారో, అట్టివారు....<br>- అగ్నివలె వాయువు వలె పవిత్రులౌతారు.<br>- సురాపానము, బంగారము దొంగిలించటము మొదలైన మహాపాపములనుండి విముక్తులై బుద్ధిని శుద్ధి చేసుకోగలరు.<br>అట్టివాడు జీవన్ముక్తుడగుచున్నాడు.<br>వేదములచే గానము చేయబడినదే ఈ ఉపనిషత్‌లో వివరించబడింది. |
| తద్విష్ణోః పరమమ్<br>పదగ్ం సదా పశ్యంతి సూరయః<br>దివీవ చక్షుః ఆతతమ్॥<br>తత్ విప్రాసో విపన్యవో<br>జాగృవాగ్ం సః సమింధతే<br>విష్ణోః యత్ పరమమ్ పదమ్॥<br><br>*ఇతి వరాహోపనిషత్*<br>*ఓం శాంతిః శాంతిః శాంతిః॥* | దివ్యమగు, పవిత్రమగు చక్షువులు (జ్ఞానమయమగు దృష్టి)ని సంపాదించుకొన్న సూరులగు ప్రాజ్ఞులు - **సర్వస్వరూపమగు, పరమమగు 'విష్ణుతత్త్వము'నే** అంతటా, అన్నిటా దర్శించుచున్నారు.<br>వేదాధ్యయనము చేసిన విప్రులు సర్వ అడ్డంకులు తొలగించుకొన్నవారై ఆత్మయందు సర్వదా జాగృతులై **పరమపదమగు విష్ణుతత్త్వము**నందు ప్రవేశించి **'సోఽహమ్ విష్ణుమ్'** సిద్ధించుకొనెదరు.<br><br>*ఇతి వరాహోపనిషత్ సమాప్తా॥*<br>*ఓం శాంతిః శాంతిః శాంతిః॥* |

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 24 వరాహోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**శ్రీమత్ 'శ్రీ వరాహోపనిషత్' రూపంగా శ్రీ ఆదివరాహ స్వామిచే, (మరియు) ఋభుమహర్షిచే ముముక్షుజనులకు సుస్పష్టపరచబడుచున్న 'అఖండ ఆత్మసుఖాకృతి' లేక 'త్రిపాద శ్రీమన్నారాయణాఖ్యానము' మా బుద్ధికి సువిదితమగు గాక! మాకు అనునిత్యము స్వానుభవమవటానికై శ్రీరామచంద్రమూర్తి యొక్క పాదపద్మములకు నమస్కరిస్తూ శరణువేడుచున్నాము.**

### 1. వివిధ తత్త్వములు – ఆవలగల పరమాత్మ

ఒకానొక సమయంలో మహామునీశ్వరుడగు ఋభువు ఇష్టదైవము, శ్రీమన్నారాయణావతారుడు అగు శ్రీ ఆదివరాహమూర్తియొక్క కరుణాకటక్షవీక్షణకొరకై భక్తి – శ్రద్ధ – ప్రపత్తులతో తపస్సు చేయనారంభించారు. 12 దేవమాన సంవత్సరములు కాలము ఆయన తపస్సు కొనసాగించారు.

ఒకానొక శుభవేళ – ఋభుమునీంద్రుని తపస్సుకు మెచ్చి సహస్ర శీర్షా పురుషుడు, కరుణాంతరంగుడు అగు శ్రీ ఆదివరాహమూర్తి ఋభువుయొక్క కనులకు ఎదురుగా సాకారుడై ప్రత్యక్షమైనారు. 'బిడ్డా! ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ!' అని మృదువుగా పలికారు. అప్పుడు ఋభువు పరమానందము పొందినవారై, లేచి నిలుచుని, స్వామికి సాంగ – సాయుధ – సపరివారసమేతంగా సుస్వాగతము పలికి, సుఖాశీనులను చేసి, స్వామి పాద పద్మములకు షోడషోపచారములతో పూజించి, త్రిపదక్షిణ నమస్కారములు సమర్పించారు.

⌘

**శ్రీ ఆదివరాహస్వామి :** వత్సా! ఋభూ! భక్తి శ్రద్ధలతో అత్యంత ప్రేమాస్పదంగా నీవు నిర్వర్తించిన తపస్సుకు నేను బహు సంతోషించానయ్యా! బిడ్డా! ఇక తపస్సు చాలించు. **వరం వృణీష్వ!** నీకు ఏమి వరంగా కావాలో కోరుకో. నీకు ప్రియమైనది ప్రసాదించటానికి సిద్ధంగా ఉన్నాను. నా యీ సృష్టిలో ఏపదమైనా తప్పక ఇస్తాను. కోరుకోవయ్యా!

అది విని ఋభువు స్వామికి భక్తి పారవశ్యంగా మరల నమస్కరించారు. ఇట్లా పలుకసాగారు.

**ఋభు మునీంద్రుడు :** హే భగవాన్! పరమాత్మా! శ్రీమన్ ఆదివరాహస్వామీ! సర్వజ్ఞులగు మీకు తెలియనిది ఏముంటుంది? **కామభిః యత్ యత్ కామితం, తత్ తత్ సకాశాత్ స్వప్నేఽపి, న యాచే।** మేము మీ సృష్టి కల్పనలో ఏదైనా కోరుకొన్నా కూడా, అదంతా స్వప్నసదృశ్యమే కదా! కలలో చూచినవి మెలకువ తరువాత మిగిలి ఉంటాయా? లేదు. మీ 'మహత్ దర్శనము' తరువాత ఇంక మేము పొందవలసినది ఏముంటుంది? సమస్తవేదములు ఇతిహాసములు, పురాణములు...ఇవన్నీ మిమ్ములను దర్శింపజేయుటయే లక్ష్యముగా కలిగి ఉన్నాయి. సమస్త విద్యలు మీ సందర్శనానందము నిమత్తమే ఉద్దేశ్యించబడినవై ఉంటున్నాయి. బ్రహ్మాది దేవతలంతా కూడా – మీ గురించిన 'రూపజ్ఞానము' చేతనే ముక్తిని పొందగలుగుచున్నారు. కనుక మావంటి మానవాకార భౌతిక దేహులకు మీరు కాక మరెవ్వరు దిక్కు?

అందుచేత మిమ్ములను దర్శించి పునీతుడనైన నేను ఈ 14 లోకాలలో ఏ ఒక్కటీ వరంగా కోరుకోవలసిన అగత్యమే నాకు కనిపించటం లేదు. హే జగద్గురూ! అనేక జన్మలుగా మనో వాక్ కాయములచే సంపాదించుకొన్న అజ్ఞాన వ్యాపక సంబంధమైన దృష్టులలో నిబద్ధుడనైయున్న నాకు మీరు నాకు మీ దర్శనము ప్రసాదించారు.

అయితే..., వేదములచే బ్రహ్మాది దేవతలచే మీ తత్త్వరూప ప్రదిపాదితమైనట్టి **'బ్రహ్మవిద్య'**ను మాత్రమే నాకు ప్రసాదించవలసినదిగా జగద్గురువులగు మిమ్ములను వేదుకొనుచున్నాను. తదితరమైనదంతా ఏది మీరు ఎట్లా ఉద్దేశిస్తే అట్లాగే అగుగాక! నాపై కరుణతో **'కోఽహమ్'** అను ప్రశ్నకు పరాకాష్ఠసమాధానమగు **'తత్త్వ విద్య'**ను వాత్సల్య హృదయులై నాకు బోధించ ప్రార్థన.

**శ్రీ ఆది వరాహస్వామి:** బిడ్డా! ఋభూ! నీవు **'బ్రహ్మవిద్య'**ను కోరుకోవటము నాకు మహదానందమును కలుగజేస్తోందయ్యా!

ఎందుకంటే ఈ 14 లోకముల సంబంధమైన మాయా దృశ్య ప్రపంచంలో ఏఏ స్థితి గతులు లభించినా, ఏఏ సంపద, అధికారము మొదలైనవి పొందినాకూడా, **– ఈ జీవుని హృదయములో పేరుకొనియున్న జన్మ – జన్మాంతరార్జితమైన దుఃఖము, వేదన** (Meloncholy and worry) పోవు. మరల మరల ఏదో రూపంగా చిగురిస్తూనే ఉంటాయి. అందుకు నీవన్నట్లుగా ఏకైక ఉపాయము – 'కోఽహమ్ – నేను ఎవ్వరు?' అను ప్రశ్నకు **తత్త్వజ్ఞులచే తత్త్వశాస్త్రవిధానంగా అందించబడుచున్న బ్రహ్మవిద్యయే. ఇందులో సందేహమే లేదు. అందుచేత తత్త్వశాస్త్రబోధ రూపమగు ఆయా కొన్ని విశేషాలు చెప్పుకుందాము.** శ్రద్ధగా వినెదవు గాక!



కొందరు తత్త్వజ్ఞులు **'ఈ జీవుడు ఎవ్వరు?'** అను ప్రశ్నకు సమాధానంగా '26' తత్త్వములుగా వివరిస్తున్నారు. మరికొందరు మహనీయులు '96'గా బోధిస్తున్నారు. ముందుగా ఈ విభజనకు సంబంధించిన కొన్ని కొన్ని వివరణలు విను.

**(1) జ్ఞానేంద్రియ పంచకము :** (1) శ్రోత్రేంద్రియము (చెవులు) (2) 'త్వక్' ఇంద్రియము (చర్మము) (3) చక్షురింద్రియము (కనులు) (4) జిహ్వేంద్రియము (నాలుక) (5) ఘ్రాణేంద్రియము (ముక్కు) – [5]

**(2) జ్ఞానేంద్రియ గుణములు (లేక) జ్ఞానేంద్రియ విషయపంచకము:** (1) శబ్దము (2) స్పర్శ (3) రూపము (4) రసము (5) గంధము

**వాటి భేదములు** (1) అక్షరము, నాదము (2) చల్ల దనము, ఉష్ణము, మృదువు, కఠినము (3) తెలుపు, ఎరుపు, అందమైనట్టి – కానట్టి రూపములు మొ॥వి (4) తీపి, పులుపు, చేదు, కారము, వగరు, ఉప్పు మొ॥వి (5) సువాసన, దుర్వాసన మొ॥వి [ మొత్తం 5]

**(3) కర్మేంద్రియ పంచకము** (i) 'వాక్' – ఇంద్రియము (ii) హస్త – ఇంద్రియము (iii) పాద – ఇంద్రియము, (iv) ఉపస్థ – ఇంద్రియము (v) పాయు – ఇంద్రియము – [5]

**కర్మేంద్రియ విషయ పంచకము :** (i) వచనము (ii) దానము (iii)గమనము (iv) ఆనందము (v) విసర్జనము – [5]

**(4) ప్రాణాది పంచకము :** (i) ప్రాణము, (ii) అపానము (iii) వ్యానము (iv) ఉదానము (v) సమానము – [5]

**(5) అంతరంగ చతుష్టము :** (i) మనస్సు (ఆలోచన) (ii) బుద్ధి (వివేచన, విశ్లేషణ శక్తి), (iii) చిత్తము (ఇష్ట – అయిష్టములు) (iv) అహంకారము (వ్యష్టిగతమైన 'నాది – నేను') – [4]

(జ్ఞానేంద్రియ (5) + కర్మేంద్రియ (5) + పంచప్రాణ (5) + శబ్దాది పంచక (5) + అంతరంగ చతుష్టయము (4) = 24 తత్త్వాలుగా కొందరు బ్రహ్మతత్త్వ వేత్తలు విభజించి చెప్పుచున్నారు)

**(6) పంచీకృత భూతములు** = (i) పృథివి (Hard Solid) (భూమి) (ii) ఆపః (జలము - liquid) (iii) తేజస్సు (light, heat) (iv) వాయువు (vapour) (v) ఆకాశము (Mutual Placement - spacing, space) – [5]

**(7) దేహత్రయము :** (i) స్థూల దేహము (Matter Related) (ii) సూక్ష్మదేహము (Thought, Feeling & Emotions related Body) (iii) కారణదేహము (సంస్కార (లేక) వాసనా దేహము)

(అ) **జీవుడు:** (The EXperiencer) (ఆ) అభ్యాసవశంగా నిర్మితమైన **స్వభావదేహం** – (By long habit through saries of bodies) - (ఇ) **పరమాత్మ** – [3]

**(8) అవస్థాత్రయము** (1) జాగ్రత్ అవస్థ (Awakened State) (2) స్వప్నావస్థ (Dreamy State) (3) సుషుప్త్యవస్థ (Dead Sleep State) – [3]

**(పైన చెప్పిన (24) అవస్థలకు + పంచభూతములు (5) + దేహత్రయము (3) + అవస్థాత్రయము (3) + వ్యష్టిగతమగు అహమ్ (నేను) – [36] అవస్థల విభాగంగా కొందరు ఆత్మ తత్త్వ విశ్లేషకులు విభాగిస్తున్నారు)**

ఇంకా కూడా **"తత్త్వమ్ (అది నీవే అను) బోధ"** కొరకై మరికొన్ని విశేషాలుగా విశ్లేషించబడుతోంది.

**(9) వికృత – షట్ భావములు :** (i) అస్తి (ఉనికి) (ii) జాయతే – దేహముతో పుట్టుక (iii) వర్ధతే – దేహసంబంధమైన ఎరుగుదల (iv) పరిణామము – కాలముచే జరుగు మార్పులు – బాల్య కౌమర యౌవన వార్ధక్యములు (v) క్షయము – తరుగుదల, శరీరములో ఆయా నడిపించే శక్తుల క్షీణత (vi) నాశనము (Distruction) – [6]

**(10) షట్ ఊర్ములు :** (i) నొప్పి. కలత కలుగజేయు భౌతిక దేహములో జనించే విశేషాలు (ii) ఆకలి (iii) దాహము (iv) శోకము (v) మోహము (పరిమితమైన పరిశీలనచే ఏర్పడు అవగాహనలు) (vi) జరా – [6]

**(11) షట్ భౌతిక వస్తుతత్త్వములు :** (i) చర్మము (ii) రక్తము (iii) మాంసము (iv) మేద (క్రొవ్వు, వప, మెదడు) (v) మజ్జ (ఎముకలలో నూనె వంటి పొడి) (vi) బొమికలు (Bones) – (6)

**(12) అరిషట్ వర్గములు (6) :**

(i) **కామము** – ఇంకా ఏదో కావాలి, పొందాలి, జరగాలి, తేవాలి...అప్పుడుగాని పొందవలసినది పొందినట్లు కాదు → అను రూపంగా ఉండే ఆశించే, కోరే ఆవేశము. (లేక) స్వభావము.

(ii) **క్రోధము :** కోప సంఘటనలను మరల మరల మరల గుర్తు చేసుకొని ద్వేషించు, దూషించు, తప్పులు పట్టుకొను, బాధించు అలవాటు. ఎక్కువగా తప్పులనే గుర్తుపెట్టుకొని తిరస్కారపూర్వకంగా సంభాషించు స్వభావము (Maintaining the habit of teasing, revenging, bothering, Fault Finding etc. Anger towards events, Incidents and persons)

(iii) **లోభము :** ఇతరులలో పంచుకోవలసినది దాచి దాచి, ఇతరుల విభాగము వారికి ఇవ్వకపోవటం. దాచుకోవటములో మమకారముతో కూడిన అభిరుచి (The Selfish sense of being miserly)

(iv) **మోహము :** అసమగ్రమైన సమాచారము, దృష్టి, అభిప్రాయములతో ఊహ – అపోహలు కలిగి యుండటము. పూర్ణసత్యమును పరిశీలించని దృష్టి (Illusions, Misconceptions, Non-examining of truth comprehensively). లేనిది కల్పించుకొని చూచు దృష్టి (సంబంధ–బాంధవ్యములు ఈ తీరైనవే).

(v) **మదము :** తనకు కలిగియున్నది, పొందినది, స్వకీయ పాండిత్యము, దేహబలము, రూపము, పేరు – ప్రతిష్ఠలు → ఇటువంటివి చెప్పుకుంటూ తదితరులకన్నా తన గొప్పతనము చూపి గర్వించటము, పటాటోపము. (Being Proud of ones own self)

(vi) **మాత్సర్యము :** తనయొక్క బల, దర్ప, పదవులతో ఇతరులను తక్కువ చేసి చూస్తూ – ఇతరులను బాధించటము. ఓర్వలేకపోవటం. ఇతరుల బాధలను చూచి సంతోషపడటం. (Teasing and troubling others. sadism). ఇతరులపై దురభిప్రాయములను వదలలేక పోవటము.

**(13) ఆత్మపురుషుని 'అంశ' పురుషకారములు (3)**

(1) విశ్వుడు – జాగ్రత్ 'అభిమాని'
(2) తేజసుడు – స్వప్నానుభవ 'అభిమాని'
(3) ప్రాజ్ఞుడు – గాఢనిద్రానుభవ 'అభిమాని'

***ఈ త్రిప్రదేశముల అభిమాన పురుషకారములకు బయల్వెడలు స్థానమగు మహాభిమానపురుషుడు – తురీయుడు. పరస్వరూపుడు। ఆవల ఉన్న స్వస్వరూపము।***

**(14) గుణత్రయము : (3)**

(i) **సత్వగుణము :** (Positive Qualities) – స్నేహము, దయ, ప్రేమ, ఐకమత్య భావనలు, దైవీగుణములు

(ii) **రజోగుణము :** ఏదో చేయాలి, వెళ్ళాలి, రావాలి, తిరగాలి, నిర్వర్తించాలి....ఇటువంటి కర్మలు చేయాలనే వ్యాపక గుణ స్వభావము (Avocation to do something, work-holic)

(iii) **తామసిక గుణము :** బద్ధకము. కోపము వంటి ఆవేశపూరిత భావపరంపరలు. భ్రమించటం. తపించటం. (Drowsy. Getting restricted to feelings and emotions without examining).

**(15) కర్మత్రయమము :**

(i) **సంచిత కర్మలు :** ఇతః పూర్వము జన్మ – జన్మలుగా నిర్వర్తించిన (మనో వాక్ కాయ సంబంధితమై **'ఫలప్రదము')** (Ready to give Fruits) అవటానికి సంసిద్ధమైయున్న **కర్మపరంపరలు** (Groups of Acts done with Body, thought, talk etc., that are emotionally waiting to take shape as eventualities). దేహి ఈ వర్తమాన దేహమునకు మునుముందే మూటలాగా కలిగియున్నట్టి కర్మ సంస్కారములు (లేక) కర్మ స్వభావములు (లేక) కర్మవాసనలను **'సంచిత కర్మలు'** అంటున్నారు.

(ii) **పారబ్ధ కర్మలు :** ఈ వర్తమాన దేహము ఈ జీవునికి ఒక సందర్భమువంటిది మాత్రమే! ఈ జీవునిపట్ల వర్తమాన దేహ సందర్భము కొరకై అనేక **జన్మల కర్మ వాసనలు, కర్మఫలప్రదములలో** 'కొన్ని' మాత్రమే ఫలదీకరణము అగుచున్నాయి. అట్టి వర్తమాన దేహముతో ఫలప్రదము అగుచున్న సంస్కారములు, కర్మఫలములు **'ప్రారబ్ధకర్మలు'**గా చెప్పబడుచున్నాయి. **'ప్రారబ్ధము' – అనుభవించక తప్పదు...అని చెప్పబడుతోంది.**

(iii) **ఆగామి కర్మలు : 'సంచితకర్మలు ప్రారబ్ధకర్మలు'** – ఇవి రెండూ వర్తమాన దేహముతో చేసిన శుభ – అశుభ కర్మలవలన కొంత కొంత మార్పు – చేర్పులు పొందగా, దేహపతనము అగుచున్నప్పుడు ఈ జీవుని వెంటనంటివచ్చే కర్మల సంస్కారములు (లేక) **దేహపతనానంతరం శేషించి ఉండు 'వాసనా సమూహములు'.**

**(16) ఆనంద పంచకము**

(i) వచనము – నోటికి సంబంధించన కర్మ విశేషములు (Talking).

(ii) ఆదానము – చేతులతో చేయు పనులు – చేతలు (Behaviour).

(iii) గమనము – కాళ్ళతో చేయు పనులు – నడకలు (నడతలు) (Wonderings / conducts).

(iv) విసర్గ – విసర్జన కర్మలు (Discarding / Leaving Aside).

(v) ఆనందము – శిశ్నమునకు సంబంధించినవి (శృంగార కర్మలు) (Sense of enjoying).

**(17) సంకల్పనా చతుష్టయము :** (i) **సంకల్పము** (Visualizing), (ii) **అధ్యవసాయము** (Opinions) (iii) **అభిమానము** (Fondness, interestedness) (iv ) **అవధారణ** (Remembering, Holding).

**(18) విషయ సంబంధ చతుష్టయం :** (i) **ముదితము** (మురిసిపోవటము, సంతోషము పొందటం) (ii) **కరుణ** (Being kind with certain things) (iii) **మైత్రీ** (స్నేహబంధము కలిగి ఉండటము) (iv) **ఉపేక్ష** (Maintaining as non concerned with certain things).

**(19) జగత్ సంబంధ విశేషములు :** దైవీ (దివ్య) ప్రజ్ఞలు) (అశరీర ప్రజ్ఞలు)

(i) **దిక్కులు** (Dimensions) (ii) **వాతా** (వాయువు) (iii) **అర్క** (సూర్యుడు) (iv) **వరుణుడు** (లేక) ప్రచేతుడు (జలముతో సంబంధములు) (v) **అశ్వినీ దేవతలు** (ఓషధ దేవతలు) (vi) **అగ్ని**, (vii) **ఇంద్రుడు** – ఇంద్రియాధినేత (viii) **ఉపేంద్రుడు** (ఇంద్రియశక్తులు) (ix) **మృత్యువు** (ఒక స్థితి నుండి మరొక స్థితికి గతి పొందటము) – యముడు (మృత్యువు) (x) **చంద్రుడు** – మనో అధిదేవత, భూమికి ఓషధతత్త్వప్రదాత (xi) **రుద్రుడు** – లయకారుడు. సర్వము ఎందులో లయిస్తుందో అట్టి లయ విశేషమునకు అధిదేవత (xii) **క్షేత్రజ్ఞుడు** – దృశ్య, దేహ, ఇంద్రియ, మనో – బుద్ధి – చిత్త – అలంకారములను 'ఇవి నావి' అని ఎరుగుచున్నట్టి కేవల ప్రజ్ఞ. ఇంద్రియ విషయములను ఎరుగుచున్నట్టి వాడు.

ఓ ఋభు మహర్షీ! ఈ మనము చెప్పుకొన్న '96' తత్త్వములు ఈ జీవునికి సంబంధించినవై, జీవుని ఆశ్రయించి ఉంటున్నాయి – అని తత్త్వవేత్తలు విశదీకరించి తత్త్వశాస్త్ర విశేషాలుగా చెప్పుచున్నారు.

అయితే **ఈ 96 విశేషాలకు విలక్షణుడనై, వాటన్నిటికీ అతీతుడనై, వాటికి ఆధారుడనై, కేవల సాక్షినై సర్వ జీవులలోను సర్వదా 'పరమాత్మ'గా సంస్థితుడనై ఉన్నాను.** ఈ విధంగా సర్వాకార – నిరాకార, – నిర్గుణ పరతత్త్వమై ఉండియే, నన్ను భజించు నీవంటి భక్తజనులకు ప్రియము కలుగజేయటానికై స్వకీయ మాయచే ఈ వరాహరూపము మొదలైనవి ధరించి **నామాయ యందు నేనే ప్రదర్శితుడను అగుచున్నాను.** ఎవ్వరైతే నాయొక్క మాయయందు విలసితమగుచున్న అవతార రూపములను భక్తి – శ్రద్ధలతో ఉపాసిస్తారో, భజిస్తారో – అట్టివారు అజ్ఞానము నుండి, అజ్ఞాన కార్యపరంపరలతో కూడిన సంసార చక్రమునుండి విముక్తులై

**'జీవన్ముక్తులు'** అగుచున్నారు. నాయొక్క పైన వివరించబడిన '96' తత్త్వములను చక్కగా పరిశీలించి, వాటిని ఆత్మయొక్క మాయావిభాగములోని అంతర్లీన – అనన్య చమత్కారములుగా ఎవ్వరు ఎరుగుచున్నారో వాటన్నిటికీ వేరుగా నిత్యప్రకాశకుడనైయున్న–వారివారి ఆత్మానంద స్వరూపుడనే అయి ఉన్న నన్ను తెలుసుకొనుచున్నారు. అట్టివారు →

- జటీ (జడలు ధరించిన) (సన్న్యాసి) అయినా,
- ముండీ – జుట్టును ముండనము చేయించుకొన్నవాడైనా,
- శిఖ, పిలక ధరించినవాడైనా,
- బ్రహ్మచారి – గృహస్థ – వానప్రస్థ – సన్న్యాస ఆశ్రమములలో ఏది ఆశ్రయించి ఉన్నవాడైనా, అట్టివాడు **సర్వ ఆశ్రమ బంధములనుండి విడివడినవాడై నన్నే చేరుచున్నాడు.**

***(జన్మ–కర్మ చ మే దివ్యం యేవం యో వేత్తి తత్త్వతః***
***త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి (ప్రాప్నోతి – భగవద్గీత)***

కనుక ఓ ఋభూ! ఈ 96 తత్త్వలను ఎరిగి, వాటికి ఆవల ఉన్న మమస్వరూపముతో భక్తి – జ్ఞాన – యోగ సమన్వితుడవై – మమేక మవటమే – నీవు అడిగిన **'బ్రహ్మ విద్య'** లేక **'తత్త్వ విద్య'** యొక్క అంతిమసారమయ్యా!

## ద్వితీయ అధ్యాయము – అనునిత్యమగు ఆత్మ నిష్ఠ

అప్పుడు ఋభువు భక్తితో – యోగీశ్వరుడు, క్రోడ (వరాహ) రూపమును స్వకీయ మాయచే భక్తులను అనుగ్రహించటానికి ధరించినట్టి వారు, శ్రీ రమాపతి అగు ఆది వరాహస్వామిని – ఈ విధంగా అడిగారు.

**స్వామీ! సర్వాత్మకా! సర్వకారణ కారణుడా! శ్రీమన్ వరాహస్వామీ!** మీరు వివరించి చెప్పిన 96 తత్త్వములచే జన్మ – జన్మాంతరములుగా సంసార జీవులమగు మేము కప్పబడి, తలమునకలై ఉన్నాము. పరము, దివ్యము – అగు మీ స్వరూపమును ఏ విధంగా చేరుకోగలమో, అట్టి **'బ్రహ్మవిద్యామార్గము'**ను నాకు బోధించమని విన్నపము చేస్తున్నాను. దయతో త్రోవచూపండి.

భక్తుల ఆర్తిని తొలగించు స్వభావముగల భగవానుడగు ఆదివరాహమూర్తి ప్రియభక్తుడగు ఋభువు అడిగినది విన్నారు. జీవుల స్వకల్పిత సంసార బంధముల కార్య–కారణ వ్యవహారమంతా ఎరిగినట్టి సర్వజ్ఞులు కదా! భక్తుడగు ఋభువు ప్రశ్నకు సంతోష పూర్వకంగా జగన్ – మోహనమగు చిరునవ్వు చిందిస్తూ....ఈ విధంగా **ప్రవచనము** చేయసాగారు.

### శ్రీ ఆది వరాహస్వామి

ఓ ఋభు మహాశయా! అల్పమైన ఆశలు, ఆశయముల వలననే ఈ జీవుడు – కేవలాత్మ స్వరూపుడే అయి ఉండి కూడా, ఇంద్రియ దృశ్యబద్ధుడై అనేక జన్మ మృత్యురూపమలగు సంసార బంధనములలో నిష్కారణంగా (అనవసరంగా) తనకు తానే చిక్కుకుంటున్నాడు. అందుచేత, **'అజ్ఞానముచే జనిస్తున్న బంధములనుండి విడివడి, నాయొక్క సర్వాతీతము – అఖండము – అప్రమేయము అగు 'ఆత్మ' యొక్క ఔన్నత్యమును ఎరిగి, ఆత్మానంద స్వరూపుడను కావాలి!'**...అను ఆశయమును ఆశ్రయించాలి. **'మహదాశయుడు'** కావాలి. అట్టి ఉత్తమ ఆశయముచే ఈ జీవుడు మొట్టమొదట **'ముముక్షువు'** అగుచున్నాడు. ఇక ఉపాయములు ఆశ్రయించాలి.

### సాధన చతుష్టయము

(1) తాను ఏ ఆశ్రమంలో ఉంటే ఆ ఆశ్రమమునకు సంబంధించిన (బ్రహ్మచారి – గృహస్థ – వానప్రస్థ – సన్న్యాస) ధర్మములను శ్రద్ధగా, భగవత్ – సమర్పణ భావముతో నిర్వర్తించును గాక.

(2) సర్వాత్మకుడగు పరమాత్మ గురించిన 'తపన' రూపమగు తపస్సుకు ఉపక్రమించును గాక.

(3) సేవక భావముతో గురుశుశ్రూషను అభ్యసించును గాక.

ఇట్టి ప్రయత్నములలో ఈ జీవుడు ముముక్షు మార్గములో ప్రయాణమును ప్రారంభించుచుండగా, ఈతడు వైరాగ్యము మొదలుగాగల **'సాధన చతుష్టయము'**లో క్రమ క్రమంగా ప్రవేశము పొందుచున్నాడు.

**సాధన చతుష్టయము**

**(1) నిత్య – అనిత్య వివేకము : "ఏది సందర్భముగా మాత్రమే సత్యము? ఏది సహజ సత్యము? ఏది నాకు సంబంధించి నిత్యము** (Permanently with me)? **ఏది అనిత్యము** (That which is just temporarily with me)?

ఉదా : నటించు కళ సత్యము / నిత్యము. ఒక నాటకంలో నేను నటించే పాత్ర అనిత్యము.

ఎదుటివాడు → బంధువుగా అనిత్యము. ఆత్మగా సత్యము

– నేను–తండ్రి; కొడుకును; భర్తను; భార్యను; – ఇత్యాది బంధువుగా, స్నేహితుడుగా, గుణిగా, మంచిగా, చెడుగా–ఇవన్నీగా సందర్భ పరిమితము మాత్రమే కాబట్టి అసత్యము. అనిత్యము.

**నేను ఆత్మగా నిత్యము. అనునిత్యము. జీవాత్మ – అనుభవి – జగదనుభవము మొదలైనవన్నీ సందర్భమాత్ర చమత్కారములు.**

ఇటువంటి నిత్య – అనిత్య వివేకముతో నిత్యమైనది బుద్ధికి సిద్ధించటానికి – నిత్యమైన ప్రయత్నముతో, అనిత్యమైన దానికి అనిత్యమగు (సందర్భమాత్రమగు ప్రయత్నములతో యత్నశీలమై ఉండటము) (Temporary approaches for the temporary things and permanent approach for The Permanent) – ఇది '**నిత్యానిత్యవివేకము**'గా చెప్పబడుతోంది. వివేకి అయినవాడు – అనిత్యమైనదంతా – నిత్యమగు **"ఆత్మభావనా సంసిద్ధి"** – కొరకై వినియోగించుచుండును గాక!

**2. ఇహ – అముత్ర ఫలభోగ విరాగము:** "ఇహలోకంలో 'పొందాలి' అనే రూపముగా అనిపిస్తున్న సంపదలపట్ల గాని, పరలోక స్వర్గసుఖ విశేషములపట్లగాని–**రాగము తొలగించుకొని**, వాటియొక్క నిత్య–అనిత్యము లేమిటో ఎరిగి, వాటిపట్ల 'ఏవి ఎట్లు ఉంటూ ఉన్నాయో అవి అట్లే ఉండుగాక! లేదా మరొకతీరుగా అయితే అగు గాక! ఆత్మ స్వభావుడనగు నేను అంతరంగా ఉభయ సందర్భములలోనూ వేదన పొందవలసిన అవసరం ఈషన్మాత్రం కూడా లేదు". – అనురూపముగల భావన – 'విరాగము'. **ఆత్మభావనచే విరాగము స్వాభావికము అగుచున్నది.**

**(3) శమాది షట్క (6) సంపత్తి:**

(i) **శమము** – కామక్రోధములు దరిరానీయకుండా 'శాంతి'ని వహించి ఉండటము. (మనో బుద్ధి చిత్తములను విషయముల వైపునుండి అతీతము చేయటము).

(ii) **దమము** – బాహ్య ఇంద్రియములను విషయములనుండి విరమింపజేయటము. సాధనమార్గంగా నియమించటము.

(iii) **తపస్సు** – పరమాత్మ గురించిన తపన.

(iv) **ధ్యానము** – 'సర్వము పరమాత్మ స్వరూపమే' అను ధ్యాస.

(v) **యోగాభ్యాసము** – ప్రాణాయామము, కుండలినీ సంచాలనము. (కుండలినీ రూప ఇచ్ఛా–జ్ఞాన–క్రియా శక్తిని సుషుమ్నానాడి ద్వారా బ్రహ్మరంధ్రమును ఛేదించి సహస్రారము ప్రవేశింపజేయటము).

(vi) **తితిక్ష** – ఓరిమి.

ఈ విధంగా సాధన సంపత్తిని పెంపొందించుకోవటము.

**(4) ముముక్షుత్వము :** మనస్సును, బుద్ధిని, చిత్తమును విషయములనుండి మరల్చి మోక్షమార్గములో నియమించాలనే ఆశయము.

**(సాధన చతుష్టయము – యోగవాసిష్ఠము)**

(1) **శమము :** ఇంద్రియములను విషయములనుండి, (లేక) అభిలాష – వేదనములనుండి 'శాంతము'ను స్వభావముగా కలిగి ఉండటము.

(2) **సాధుసంగము :** ఆత్మజ్ఞుల వద్ద **శ్రవణము**, ఆత్మ శాస్త్రముల **మననము. మహదాశయులతో సంభాషణము.**

(3) **విచారణ :** విన్నది మననము చేస్తూ విచారణ ద్వారా నిత్యానిత్య వివేకమును ఆశ్రయించటము.

(4) **సంతోషము :** తృప్తిగా, సంతోషముగా ఉండటము, సంతృప్తి, ఉత్సాహములను అలవాటు చేసుకొని ఉండటము.

ఓ ఋభూ! ఈ విధంగా స్వధర్మనిరతి, తపస్సు, గురుసేవ, శమాది సాధన చతుష్టయ సంపదను ముముక్షువు ఆశ్రయించాలి. క్రమంగా ఇంద్రియములను జయించి, భేదదృష్టులను త్యజిస్తూ, సర్వ మమకారములను సుదూరముగా వదలి, **"సాక్షి చైతన్య స్వరూపము"**ను ధారణచేస్తూ ఉండాలి. **సర్వదా సదాత్మకుడగు నాయందు బుద్ధిని నిలపటమును అభ్యాసము చేయాలి.**

బిడ్డా! (74 లక్షలు జీవరాసులలో) ఈ మానవజన్మ దుర్లభమైన సందర్భము. ఈ మనుష్యత్వము అనునది 'పరమాత్మత్వము' అనబడు **సంసిద్ధి** పొందుటకు మహత్తరమైన అవకాశంగా ఈ జీవుడు భావించాలయ్యా! పైగా, ఈ అవకాశము అనిర్దేశ్య – కాలబద్ధము (unknown - Time bound) సుమా!

**దుర్లభం ప్రాప్య మనుష్యం :** దుర్లభమగు మానవజన్మ లభించి,

**తత్రాపి నర విగ్రహం :** చక్కటి సమర్థ్యపూర్వకమగు అవయవములు పొందికూడా,

**బ్రహ్మణ్యంచ మహావిష్ణో :** మహావిష్ణు సంబంధమైన బ్రహ్మతత్త్వము శ్రవణం చేస్తూ చదువుచూ కూడా, వేదాంత శాస్త్రము లభ్యమగుచూ ఉండగా కూడా –

| | |
|---|---|
| → | వర్ణాశ్రమధర్మములకు అతీతమై యున్నట్టిది |
| → | సత్ – చిత్ – ఆనంద (ఉనికి – ఎరుక – అనుభూతి) లక్షణ సహజ లక్షణ సమన్వితము.., |

అగు **'పరబ్రహ్మము'**ను – అనునిత్యానుభవముగా పొందకపోతే మరి అట్టి విద్వాంసుడు ఇంకెప్పుడు ముక్తిని పొందేది?

సర్వ జీవులలో 'అహమ్'గా సమస్వరూపుడనై ప్రకాశించుచున్న నన్ను ఆశ్రయించుట చేతనే ఈ జీవుడు వాస్తవమగు సుఖమును పొందగలడు. ప్రతి జీవునికి అనన్యుడనైయున్న నన్ను ఏమరిచి, అన్యమగుదేనిని ఆశ్రయించినప్పటికీ అది శాశ్వత సుఖము కాదు. వాస్తవమగు ప్రశాంతత అయి ఉండదు.

ఓ మునీశ్వరా! ఈ జీవుడు అంతర్యామినగు నన్ను చేరుకొనాలనే **'మమేకమగు ఆశయము'**తో కాకుండా కర్మలు చేయటం, ఏవేవో లోక సంబంధమైన ప్రయోజనములు మాత్రమే ఉద్దేశ్యించటము – ఈతనికి **శ్రేయమగు ప్రియమును చేకూర్చదు.** లోకసంబంధమైన ఆశయములు, కర్మఫలములు – శాశ్వతమగు, వాస్తవమగు ప్రియమును చేకూర్చలేవు. **సర్వజీవులకు సర్వదా ఆత్మ – విష్ణుస్వరూపుడనగు నేనే! నేనే ఆత్యంతిక ప్రియమైనవాడను!** పరాప్రేమతో నన్ను నీయందు, సర్వజీవులయందు దర్శించవయ్యా! సర్వజీవులలో చూచుచున్నది – చూడబడుచున్నది నేనే! **ద్రష్ట – దర్శన – దృశ్య – దృక్ విష్ణు స్వరూపుడనై ప్రతిఒక్కరిలో ప్రకాశించుచున్నాను.**

బాహ్యంగా ప్రకాశించు '96' తత్త్వములలో నాకొరకై వెతికితే సులభముగా తెలియబడను సుమా! అందుచేత **"96 తత్త్వములను వెలిగించే తేజోస్వరూపము"**....అగు నా కేవలీ స్వరూపము యొక్క దర్శన ఉపాసనలచే **సోఽహమ్ విష్ణుస్వరూపుడవగుము.** అట్టి దృశ్య – దేహ – అంతరంగ – జాగ్రత్ – స్వప్న – సుషుప్త్యాదులను వెలిగించు స్వస్వరూప విష్ణాత్మస్వరూపమును ఎరుగకపోవటం చేతనే (వాస్తవమగు 'అహమ్' ప్రకాశక ఆత్మను గురించి సంవిజ్ఞాతము కొరవడుటచేతనే) – ఈ జీవుడు **'నేను బద్ధుడను'** అనుభావమునకు పరిమితుడు అగుచున్నాడు.

## ఆత్మను ఆత్మయే ప్రకాశింపజేయగలదు

**స్వప్రకాశం తమ్ ఆత్మానం అప్రకాశః కథమ్ స్పృశేత్?** ఆత్మ సర్వదా స్వయంప్రకాశము. అద్దానిని ప్రకాశింపజేయునదంటూ మరొకటేదీ లేదు. అటువంటప్పుడు, **స్వయం ప్రకాశకము కానట్టి, మరొకటిచే ప్రకాశింపజేస్తేనే ఉనికిని పొందునట్టి** మనో – బుద్ధి – చిత్త – అహంకారములు, ఇంద్రియ జగత్తు, జడదేహము' మొదలైనవి ఆత్మను ఎట్లా స్పృశిస్తాయి? స్పృశించనే లేవు. మరి, అవి ఆత్మను ఎట్లా ప్రకాశింపజేయగలవు?

**శ్లో॥ స్వయం భాతం నిరాధారం యే జానంతి సునిశ్చితమ్,**
**తేహి విజ్ఞాన సంపన్నా। ఇతి మే నిశ్చితా మతిః॥**

ఎవ్వరైతే ***స్వయంప్రకాశమై, సర్వమును తానే ప్రకాశింపజేయునదై, తాను దేనిపై ఆధారపడక నిరాధారము – అయి ఉన్న ఆత్మను తనయందే తెలుసుకుంటారో, దర్శిస్తారో ఆస్వాదిస్తారో, మమేకమౌతారో,... అట్టివారే విజ్ఞాన సంపన్నులు*** – అని నా నిశ్చితమగు అభిప్రాయము.

**ఋభువు :** స్వామీ! మీ తత్త్వము ఎట్టిది? ఈ జీవుడు (Individual form) మరియు ఈశ్వరుడు (One to whom a number of bodies belong, one who is operator of 'Body after Body') అనునవి ఎక్కడి నుండి బయల్వెడలుచున్నాయి? మీరే ఆ ఉభయముగా అగుచున్నారా? ఈ జగత్తుగా అగుచున్నది మీరేనా? ఒకవేళ ఈ జీవ – ఈశ్వర – జగత్ రూపాలుగా అగుచున్నది మీరే అయితే, ఈ ఈ రీతులుగా ఎందుకౌతున్నారు? **ఈ జీవుడు బ్రహ్మమే! మరింకేమీ కాదు. (జీవో బ్రహ్మేతి నా పరః)** – అని

మహావాక్యము కదా! పరబ్రహ్మ స్వరూపులై ఉండి ఎందుకు ఇవన్నీగా అగుచున్నారు? 'మాయ' మీ నుండి వేరైనదా? అది ఎందుకు ఎవరిచే కల్పించబడుతోంది?

**శ్రీ వరాహస్వామి :** ఓ ఋభూ! నీకు **జీవుడుగా, ఈశ్వరుడుగా, జగత్తుగా** కనిపిస్తూ-అనిస్తున్నదంతా కూడా అఖండ - అప్రమేయ - అనునిత్యమగు నాయొక్క పరబ్రహ్మస్వరూపమే! అట్టి నాయొక్క కేవలీస్వరూపమే అజ్ఞానదృష్టిచేత జీవ - ఈశ్వర - జగత్తులుగా అగుపిస్తోంది. ***బ్రహ్మమును బ్రహ్మమునకు వేరని భావించి, నామ రూపాత్మక భేద జగత్తుగా దర్శించటమే 'మాయ'.***

- బ్రహ్మమును బ్రహ్మముగా చూస్తే - **బ్రాహ్మీ దృష్టి।**
- బ్రహ్మమును అన్యముగా (జనిస్తూ-గతిస్తూ ఉండే జగద్విషయములుగా) చూస్తే - **మాయా దృష్టి।**

అనగా....

(1) జీవ ఈశ్వర జగత్తులుగా నీకు కనిపిస్తున్నది 'నాయొక్క (1) దేహము (2) జాగ్రత్ (3) స్వప్నము (4) సుషిప్తి (5) జీవుడు (6) ఈశ్వరుడులకు - **ఆవల గల సప్తమ - సహజరూపమగు బ్రహ్మమే'. అట్టి బ్రహ్మమే నీయొక్క వాస్తవ - సహజసిద్ధ రూపము కూడా.**

(2) బ్రహ్మము బ్రహ్మముగానే సర్వదా ఉన్నది. అది మరొకటేదీ అవటం లేదు. కల తనదైనవాడు కలలోని **'ద్రష్ట - కలలోని దృశ్యము'** అవకుండానే సర్వదా వేరుగానే ఉన్నాడు కదా! ఒక నటుని నటనాకౌశలము నాటకములోని పాత్రగా అవకుండా విడిగానే ఉన్నది కదా! కథా రచయిత కథవ్రాస్తూ, కథలోని పాత్రలుగాను, సందర్భములుగాను అగుచున్నాడా? లేదే!

అదేవిధంగా, - **స్వపూర్ణాత్మాతిరేకేణ 'జగత్ జీవ ఈశ్వర ఆదయః న సన్తి।** ఆభరణములన్నీ బంగారమే అయి ఉన్న తీరుగా నీచే దర్శించబడుచున్నదంతా నీ ఆత్మస్వరూపమే. ఈ సర్వము త్వమాత్మానందమే. "నాయొక్క పూర్ణాత్మత్వ చమత్కారము దృష్ట్యా - **'జీవుడు' అనబడునదిగాని, 'ఈశ్వరుడు' అనబడునదిగాని, 'జగత్తు' అనబడునదిగాని (స్వకీయ కల్పనచే కనిపిస్తున్నప్పటికీ) - వాస్తవానికి లేవు.** (లేక) స్వతఃగా స్వతంత్రించి ఉన్నవి కావు" - అని గమనిస్తూ, సునిశ్చితము చేసుకొనెదవు గాక!

ఇక నీవు అడిగిన మాయ గురించి వస్తే, "యా మా....ఏదైతే వస్తుతః లేదో!".... అని కదా శబ్దార్థం? కనుక 'మాయ' అనునది నాకు వేరుగా లేదు. ఒకవేళ ఉన్నదనుకుంటే అది కేవలాత్మస్వరూపులమగు నీయొక్క, నాయొక్క స్వకీయకల్పనా విభాగము మాత్రమే!

**తేభ్యశ్చ అహం విలక్షణః।** ఈ జీవ ఈశ్వర జగత్తులనబడే వాటికి వేరై, విలక్షణుడనై ఉన్నాను. ఒక బంగారు ఆభరణము - 'గాజుయా? గొలుసా? ఉంగరమా! వారిదా! వీరిదా? నాదా?'.... అను వివరములన్నిటికీ బంగారు లోహము సర్వదా వేరే కదా! అట్లాగే బ్రహ్మీ స్వరూపముగా గమనిస్తూ ఉన్నప్పుడు - నేను నీవు సర్వదా కూడా ఈ సమస్త దృశ్యమునకు వేరేగా విలక్షణులమై ఉన్నాము.

**ఋభువు :** స్వామీ! మీరు కర్మలకు సంబంధించినవారా? కాదా? ఏఏ ప్రయత్నములచే (లేక) కర్మలచే మీరు మాకు లభ్యమౌతారు? ఏఏ ధర్మములు మీరు లక్షణములుగా కలిగియున్నవారు? ఏఏ కర్మ-ధర్మములచే మేము మీ స్థానమును చేరుకోగలము?

**శ్రీ వరాహస్వామి :** ఓ ఋభూ! కర్మ ఉన్నదంటే, ఆ కర్మ నిర్వర్తించువాడు మునుముందుగా ఉండాలి కదా! ఇక ధర్మములంటావా? అవి కూడా **సృష్టికల్పనలోని సందర్భములకు** (Situations) **సంబంధించినవి.** పరమాత్మనగు నేను జన్మ - కర్మ - ధర్మములకంటే వేరై, మునుముందుగానే ఉన్నట్టి **'కేవలసత్' స్వరూపుడను.** ఇక ఈ 'కర్మ - ధర్మ - జన్మ - దృశ్య'....ఇత్యాదులతో ఆత్మనగు నాకు గల సంబంధములు ఎటువంటి వంటావా? విను.

**శ్లో।। అజ్ఞానాంధ తమో రూపం 'కర్మ, ధర్మ' ఆది లక్షణమ్।**

సూర్యకాంతికి, ఆ కాంతిలో కనబడేరూపములకు ఏమి సంబంధము? నాటక దీపమునకు, నాటకములోని పాత్రల గుణ - లక్షణములకు ఏమి ముడి? కర్మలు (Acts, Functions), ధర్మములు (Duties) మొదలైనవన్నీ అజ్ఞానముచేత మాత్రమే - 'ఉన్నాయి' అని అనిపిస్తున్నాయని గ్రహించు.

- వృత్తిరీత్యా కర్మలు, ధర్మములు,
- భార్య - భర్త - పిల్లలు - తల్లి తండ్రిలు మొదలైన సంబంధముల దృష్ట్యా కర్మలు, ధర్మములు.
- పితృదేవతలు, అతిథులు, భూతఋణముల దృష్ట్యా కర్మలు, ధర్మములు.

ఇవన్నీ దృశ్యజగత్తులో సందర్భానుచితంగా ఈ జీవుని వెంటనంటి ఉంటున్నాయి. అయితే జగత్తు కల్పన దృష్ట్యా? **కర్మలు, ధర్మములు మొదలైనవి కూడా కల్పనలోని విభాగములే.** జన్మ – ధర్మ – కర్మలు సందర్భ పరిమిత సత్యములేగాని, సహజసత్యములై ఉండలేదు. అందుచేత అవన్నీ **'అజ్ఞానము'** అనే రాత్రియందు చిమ్మ చీకటిలో కనిపించే రూపములు. **'అజ్ఞానాంధ తమోరూపము'** అని పరాకాష్ఠార్థంగా నిర్వచించి చెప్పబడుచున్నాయి. ఎందుకంటే,

**స్వయంప్రకాశం ఆత్మానం నై వ మాం ప్రష్టుమ్ అర్హతి'।** పరమాత్మనగు నేను మాత్రమే స్వయంప్రకాశకుడను. ఆత్మకు వేరైనదంతా అన్యప్రకాశకము. మరొకటి చేత ప్రకాశింపజేయబడునది. **మరి స్వయం ప్రకాశక ఆత్మ చైతన్యస్వరూపుడనగు నన్ను తదితరములైన మనో – బుద్ధి – జీవాత్మ – దృశ్యాదులు ఎట్లా అంటుతాయి**? వస్తుదోషాలు సూర్యకిరణములను అంటవు కదా! ఆకాశము (Place) – గృహముగా మారదు కదా! 'ఆభరణము బంగారమును సృష్టిస్తోంది!' – అని అంటామా? లేదుకదా! నన్ను సృష్టించునది మరొకటేదీ లేదు.

### *బ్రహ్మైవ భవతి స్వయమ్*

ఓ ఋభూ! **సర్వసాక్షిణమ్ ఆత్మానం, వర్ణాశ్రమవివర్జితమ్, బ్రహ్మరూపతయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయమ్।** (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య,శూద్ర) **సర్వ వర్ణములను,** (బ్రహ్మచర్య – గృహస్థ – వానప్రస్థ – సన్న్యాసాది) **సర్వ ఆశ్రమములను** దాటివేసిన దృష్టితో సర్వజీవులలో సాక్షిగా వేంచేసియున్న **ఆత్మను ఎవ్వరు గమనిస్తూ ఉంటారో, సర్వులను, సమస్తమును 'బ్రహ్మము'గా – ఎవ్వరు దర్శిస్తూ** ఉంటారో....అట్టి వారు **స్వయముగా బ్రహ్మమే అగుచున్నారు. బ్రహ్మైవ భవతి స్వయమ్।**

ఈ జీవాత్మ దృశ్యములతో కూడిన జగత్తంతా కూడా ఆత్మ తేజస్సుచే వెలిగించబడు చమత్కారముచే **భాసమానము.** పరమపదమగు పరబ్రహ్మము **– తేజోభాసరూపము.** తెలియబడుచున్నదంతటికీ తెలుసుకొను వేదాన్తరూపముగా వేరుగా ఉండి, **భాసించబడుచున్నదంతా ఆత్మయే** అయి ఉంటోంది. అట్టి అకారణ – స్వాభావిక – అనునిత్య సందర్శనము ఎవ్వరు కలిగియుంటారో, అట్టివారు **"సద్యోముక్తి సిద్ధులు"** అనబడుచున్నారు. వారిపట్ల ఇక సాధనములు, విశ్లేషణలు, భాష్యములు మొదలైనవన్నీ అగత్యము కావు. **'తెలియబడేది – తెలుసుకొనుచున్నది'** – ఉభయము పరబ్రహ్మస్వరూపముగా దర్శించువారికి, అట్టి దర్శనమే **ధ్యానము, యోగము, భక్తి, జ్ఞానముగా** అగుచున్నది.

**"ఈ దేహాత్మత్వమంతా పరబ్రహ్మము యొక్క లీలా – క్రీడా వినోదప్రదర్శనమే'** – అను భావన సుస్థిరపరచుకొనువానికి "దేహమే నేను" అనే సంకుచితమగు **'దేహాత్మభావన'** స్వయముగా మొదలంట్లా తొలగిపోవుచున్నది.

**ఆత్మన్యేవ భవేత్ యస్య, స న ఇచ్ఛన్నపి ముచ్యతే!** ఎవ్వరి భావన **'ఈ సర్వము పరబ్రహ్మస్వరూపమే'**... అను అవగాహనతో కూడి ఉంటుందో అట్టివాడు తనకు **తానుగా కోరుకోకపోయినప్పటికీ 'ముక్తుడు' అగుచున్నాడు.**

ఎవ్వడైతే అంతటా ఎల్లప్పుడూ సత్యజ్ఞానానంద పూర్ణ లక్షణము, అజ్ఞానంధకారమునకు ఆవల గల బ్రహ్మానందలక్షణము దర్శిస్తాడో, అట్టివాడు కర్మలచేత బద్ధుడయ్యే ప్రసక్తియే ఉండదు. **బ్రహ్మానందగ్ం సదా పశ్యన్ కథం బధ్యేత కర్మణా? సర్వత్రా బ్రహ్మమును దర్శించు వానికి కర్మబంధమే ఉండదు. కర్మలు నిర్వర్తించినా, నిర్వర్తించకున్నా ఆతని పట్ల ఒక్కటే అగుచున్నది.**

### జ్ఞానచక్షువులు

ఈ భౌతికమైన కళ్ళకు ఇక్కడ కనిపించేదంతా అనేకముగా తెలియబడవచ్చును గాక! కానీ జ్ఞానచక్షువులతో 'త్వమ్, అహమ్ (నీవు – నేను)' అనురూపంగా శబ్దార్థమై కనిపిస్తున్నదంతా **అఖండాత్మయే!** జాగ్రత్ – స్వప్న – సుషుప్తిలకు కేవల సాక్షి → **సత్యజ్ఞానానంద లక్షణ సమన్వితముగా అనిపించటమే – "జ్ఞానచక్షువులతో ఆత్మసందర్శనము (లేక) ఆత్మసాక్షాత్కారము".** సాంసారిక దృష్టిలో కనిపించే సర్వదోషములపట్ల ఆత్మదృష్టి (లేక) బ్రాహ్మీదృష్టిచే అనాసక్తుడై ఉండటమే జ్ఞాన చక్షు దృష్టి (*నిర్దోషం హి సమమ్ బ్రహ్మ తస్మాత్ బ్రహ్మణి తే స్థితాః।*).

సూర్యకాంతిలో వస్తువులన్నీ వెలుగుతూ ఉన్నప్పటికీ గ్రుడ్డివానికి ఆ వస్తువులు కనిపించవు కదా! సాంసారిక దృష్టిచే జ్ఞానచక్షువులు తెరువకపోవటం చేతనే సర్వమును వెలిగిస్తున్న స్వస్వరూపాత్మ అజ్ఞాన జీవునికి కనబడటం లేదు.

**ఋభుమహర్షి :** స్వామీ! కరుణామయుడవగు శ్రీ వరాహ భగవాన్! ఏది తెలుసుకొంటే సత్యజ్ఞానానంద లక్షణ సమన్వితమగు ఆత్మ తెలియబడగలదు?

**శ్రీ వరాహస్వామి :** బ్రహ్మమును తెలియబడే దానిలో వెతికితే అది దుర్లభము, దుస్సాధ్యమే మరి? **దేనిచే సర్వము తెలియబడుచున్నదో, తెలియబడే సర్వమునకు మునుముందే ఉన్నదో – అదియే బ్రహ్మము.** కేవలమగు ఎరుక **'ప్రజ్ఞానము'** అనబడుచున్నది. **ప్రజ్ఞానమేవ తత్ బ్రహ్మ, సత్య ప్రజ్ఞాన లక్షణమ్।** 'సత్' ఉన్నచోట ప్రజ్ఞ (ఎరుక) – స్వాభావికంగానే ఉండి తీరుతుంది. ప్రజ్ఞ 'సత్'ను లక్షణముగా కలిగి ఉంటుంది. **అట్టి కేవల ప్రజ్ఞానము (<u>"Knowing"</u>** - at its original form) **ను బ్రహ్మముగా సుస్పష్టముగా (సందేహరహితంగా) ఎరుగుటచే ఈ జీవుడు 'అమృతస్వరూపుడు' అగుచున్నాడు.**

***అదియే ఆత్మ! ఈ జీవుడు–అఖండము, అపరిమితము అగు ఆత్మ స్వరూపుడే గాని, 'జీవితము' అను సందర్భముచే పరిమితుడైనవాడు కాదు. అట్టి ఆత్మ ఇంకా ఎటువంటిది? విను.***

**అద్వంద్వము** → దేనికైతే ద్వితీయమనునదే లేదో,

**నిర్గుణమ్** → పాత్రల గుణములు నాటక రచయితకు సంబంధించినవి కాదు కదా! అట్లాగే ఎద్దానికైతే త్రిగుణముల వ్యవహారమును ఆపాదించలేమో,

**సత్యమ్** → సర్వదా **'సత్ (ఉనికి)'** – స్వరూపమై ఉన్నదో...,

**నిత్యమ్** → భూత వర్తమాన భవిష్యత్తులలో, జాగ్రత్ – స్వప్న – సుషుప్తి సందర్భములలో క్రితం జన్మ – ఈ జన్మ – తదుపరి జన్మ సందర్భములలో ఎల్లప్పుడూ వేరై ఉండియే ఉండుటచే **'నిత్యము'** – అయి ఉన్నదో....,

**చిద్ఘనమ్** → ఏది ఘనీభూతమైన **ఎరుక**(Enlightining)గా కేవల రూపమైయున్నదో ...,

**తత్ బ్రహ్మానందమ్ అద్వందమ్, నిర్గుణమ్ సత్య చిద్ఘనమ్ – విదిత్వా స్వాత్మనో రూపం –** అట్టి తనయొక్క **'స్వస్వరూపాత్మ'**ను ఎరిగినవాడు – **న బిభేతి కుతశ్చన** – ఇక **దేనికీ 'భయము' అనునది పొందదు.**

**అట్టి బ్రహ్మవేత్త** →

**"ఈ కనబడేదంతా అస్మత్ చిన్మాత్రముయొక్క (ఎరుకయొక్క) విస్తరణ చమత్కార బాహ్యరూపమే! చిన్మాత్ర స్వరూపమగు మమాత్మ పూర్ణమైనది। ఆత్మసుఖస్వరూపము। ఇక్కడ ఇదంతా సాక్షాత్ బ్రహ్మమే। → అను స్థితిని అనుక్షణికంగా కలిగి ఉంటున్నాడు.**

**ఓ ఋభూ!**

- అజ్ఞానికి ఈ జగత్తు అనేక బంధములతో దుఃఖములతో కూడినదై ఉంటోంది.
- ఆత్మజ్ఞానికో? ఇదంతా స్వకీయ ప్రజ్ఞానందమయమే కాని, మరింకేమీ కాదు. తానే తనయందు సంచరించు క్రీడా – లీలా వినోద ప్రదేశమగుచున్నది.

దృష్టాంతానికి – **అంధం భువనమ్ అంధస్య ప్రకాశం తు సుచక్షుసామ్।** గ్రుడ్డివానికి ఈ జగత్తు చీకటిమయంగాను, కళ్ళు చక్కగా పనిచేస్తున్న వానికి అనేక రూపముల సమాహారములవలె తెలియవస్తుంది కదా! ఇదీ అంతే. ఆత్మజ్ఞానికి ఈ **దృశ్య ప్రదర్శనమంతా స్వకీయ జ్యోతి స్వరూపమే!**

ఓ ఋభు మహదాశయా! వారాహ రూపంగా కనిపిస్తూనే నేను ఆద్యంతములు లేనివాడను (అనంతుడను), చిద్ఘానానందుడను కూడా! నీకు, ఈ సర్వమునకు **అద్వితీయుడనై ఉన్నాను.**

ఇక నీయొక్క బంధము గురించియా? **స్థితే అద్వితీయ భావస్యాత్ కో బంధః? కశ్య ముచ్యతే? నీవు నేనే అయి ఉండగా, నీవు ఆత్మవే అయి ఉండగా** – ఇక బంధమెవరి? ముక్తి ఎవరికి? నీయొక్క **జీవాత్మకా?** అది నాటకములోని పాత్రవలె **కల్పితమాత్రము.** నీయొక్క **పరమాత్మకా?** అది **నిత్యముక్తము!** నీవు నీ ఆత్మకు వేరుగా లేవు. నేను నీ ఆత్మకు వేరుగా లేను. 'మట్టికుండ' తయ్యారైన మట్టిని 'కుండ' అనే ఆకార ధర్మము ఉన్నదనగలమా? కుండ అనే ఆకారముచే మట్టి బంధించబడుతోందా? లేదే! మట్టితో పిడత, మూత, కుండ, గోడ మొదలైన అనేక ఆకారాలు తయారగుచున్నప్పటికీ 'మట్టికి ఆకారము కలదు' అని అనము కదా! అట్లాగే, **స్వస్వరూపం తు చిన్మాత్రగ్ం సర్వదా సర్వదేహినామ్, నైవ దేహాది సంఘాతో!** నీ **'చిన్మాత్రము'** (కేవలమగు ఎరుక) – అను **'స్వస్వరూపము'**నకు దేహము, దృశ్యము – మొదలైన వాటితో సంఘాతమే లేదు. **అట్టి ఆత్మ ఒక దృశ్యమువలె భౌతికమైన కనులకు కనిపించేది కాదు.** దేహమును కదిలించే 'నేను' అనే చైతన్యమునకు ఆకారమెక్కడిది?

కథలో కనిపించే ఆయా పాత్రలు, ఆ పాత్రల పరస్పర సంబంధములు రచయిత కల్పనే అయినప్పటికీ, 'రచయిత ఇటువంటివాడు' అని ఆ పాత్ర గుణములను ఆపాదించలేము కదా! అట్లాగే జీవాత్మ ధర్మములేవీ, (లేక) జగత్‌లోని విశేషములేవీ – ఆత్మకు అంటవు. ఆత్మను తాక లేవు. ఆత్మకు దేనితో సంఘాతము లేదు. అంతే కాదు. స్వాత్మకు 'అన్యము'వలె ఏదేది అభాసించుచున్నదో (Whatever reflecting like in a mirror), అట్టి ఈ చరాచర జగత్తు స్వాత్మ మాత్రమే. కలలో కనిపించే చర – అచరములన్నీ స్వప్నము తనదైనవాని స్వప్న చైతన్యరూప ఊహ అపోహలే కదా! అందుచేత, **"ఏది ఈ జగత్తుగా ప్రకాశమానమౌతోందో, అట్టి ఇదంతా నా ఆత్మయే"** అని గ్రహించు.

- ఇదంతా స్వాత్మయే! స్వాత్మవిభవమే!
- అట్టి స్వాత్మయే నా నిత్య, సత్య, వాస్తవ స్వరూపము!

**'ఈ దృశ్య జగత్తంతా నా యొక్క ఆత్మస్వరూపమే'!** అను ఆత్మసాక్షార దృష్టిని సిద్ధించుకున్నవానికి ఇక భోగింపబడునది – భోగించువాడు అనునవి వేరువేరైనవిగా ఉండవు. 'భోగించబడునది' అను రూపమైనదంతా స్వాత్మకు అనన్యమే అవుతుంది. ఏదేది 'ఉన్నది' అని అనిపిస్తూ ఉన్నదో, అదంతా ఆత్మయొక్క అస్థిత్వ రూపమే. బ్రహ్మము యొక్క అస్తిత్వ విశేషమే అది. **బ్రహ్మవిజ్ఞాన సంపన్నః ప్రతీతమ్ అఖిలమ్ జగత్, పశ్యన్నపి సదా నైన పశ్యతి స్వాత్మనః పృథక్!** ఈ ప్రతీతమై (ప్రసిద్ధమై) ఇంద్రియానుభవములుగా కనిపిస్తున్న అఖిల జగత్తు కూడా –**"స్వస్వరూప బ్రహ్మము"**గానే బ్రహ్మజ్ఞాని చూస్తున్నాడు. అంతేగాని, వేరుగా చూడటము లేదు.

ఓ ఋభూ! **మత్ స్వరూప పరిజ్ఞానాత్ కర్మభిః న స బద్ధ్యతే। పరబ్రహ్మ స్వరూపుడనగు నాయొక్క తత్త్వస్వరూపము ఎవడు పరిజ్ఞాతుడై (బాగుగా ఎరిగినవాడై) ఉంటాడో, అట్టివానిని కర్మలు బంధించజాలవు.** కర్మలు ఉండాలంటే వాటిని నిర్వర్తించేవాడు ఉండాలి కదా!

జన్మలకన్నా కర్మలకన్నా మునుముందే ఉండి ఉన్నదే ఆత్మ! అట్టి ఆత్మయొక్క ఒక అంశవంటివాడు ఈ జీవుడు. తరంగాలన్నీ జలమే ధర్మముగా కలిగియున్నది కదా! ఈ జీవుడు ఆత్మ కాని క్షణమే లేదు. మరి అట్టి ఆత్మస్వరూపుడు – సందర్భమాత్ర జగన్నాటక పాత్ర వంటి 'జీవుడు' అనే 'అంశ'చే బద్ధుడెట్లా అవుతాడు? సూర్యకిరణము సూర్యుణ్ణి బంధించగలదా? కలలోని విషయాలు బయటకువచ్చి ఆ కల తనదైనవానిని త్రాళ్ళతో బంధించగలవా? అట్లాగే ఆత్మకు ఎప్పుడూ బంధము లేదు.

ఎవ్వడైతే...

- 'శరీరము, ఇంద్రియముల–ఇంద్రియ విషయముల'చే పరిమితుడు కాడో, **వాటికి తాను కేవలము 'సాక్షి'** అని సుస్పష్టముగా, అకృత్రిమంగా, నిత్యానుభవంగా సర్వదా ఎరిగి ఉంటాడో...,
- స్వయంప్రకాశకుడై పరమార్థ స్వరూపమును చూస్తూ, **ఆత్మచే ఆత్మయందు ఆత్మసుఖానుభవుడో,**
- సర్వము **స్వస్వరూపముయొక్క స్వకీయమగు స్వానుభవముగా** ఎరిగి ఉంటాడో,
- **"స్వప్నమంతా నా భావనాను భవమే! నాకు అన్యము కాదు**. అట్లాగే జాగ్రత్‌లో కూడా **ఈ ఇంద్రియ విషయప్రపంచము స్వానుభూతి చమత్కారమే!"– అని దర్శిస్తూ ఉంటాడో,**

ఆతడే **ధీరుడు!** ఆతడే **సవిజ్ఞేయుడు!** తెలుసుకోవలసినది తెలుసుకున్నవాడు! ఓ ఋభూ! నేను ఆత్మనే! సో౽హమ్! తత్ త్వమ్! నీవు అదియే! ఆత్మకానివాడు లేడు. ఆత్మకానిదీ ఏదీ లేదు.

ఇది గ్రహించి, **సర్వజీవులను ఆత్మకు అనన్యంగా, నీ స్వస్వరూప–స్వానుభవ–స్వకీయాత్మానంద సంప్రదర్శనముగా సర్వదా దర్శించు.**

ప్రపంచమును పాంచభౌతికమాత్రంగా చూడవద్దు, **స్వస్వరూప బోధానుభవంగా సందర్శించు**. ఈ విధమైన పరిపూర్ణమైన ఎరుకచే దర్శించువానికి ఇక బంధమెక్కడిది? బంధమే లేనప్పుడు 'ముక్తి' ఎవరికి? **ఇతి ప్రపశ్యన్ పరిపూర్ణ వేదనో, న బంధ ముక్తో। న చ బద్ధ ఏవ తు।** అట్టి **"ఆత్మజ్ఞాన విజ్ఞాని"** → స్వస్వరూపాను సంధానమును అనునిత్యము చేసుకొని, సర్వమునకు సాక్షియై, ఆత్మ యొక్క **తాండవ నృత్యముగా** → జగత్తును ఆస్వాదిస్తున్నాడు.

ఒక ముహూర్తకాలము (12 క్షణముల కాలము) **"నాయొక్క ఆత్మతత్త్వమేమిటి? స్వభావమేమిటి"** అను ప్రశ్నయొక్క పరమవాస్తమగు సమాధానకరమగు – **"స్వస్వరూపాత్మ ధారణ"** చేత ఈ జీవుడు సర్వబంధములనుండి విముక్తుడు కాగలడు.

**<u>'ఆత్మాఽహమ్' అను పరమ సత్యమును ధారణచేయువాడు ఎట్లా గానం చేస్తాడో, అది విను.</u>**

- నేను ఈ శరీరము – జీవుడు ఇత్యాదులచే **పరిమితుడనైనవాడిని కానే కాను.**
- సర్వమును **'ఎరుక'** (ప్రజ్ఞ) అను స్వకీయ విన్యాసముచే వెలిగించు **చిదాత్మ స్వరూపుడను.**
- నేను దేనిచేతనూ, దేనికీ బద్ధుడను కాను. ఈ దేహ మనో – బుద్ధి – అహంకారములకు వేరైన **కేవల సాక్షిని.** నాకు బంధమనునదే లేదు. **నిత్యముక్తుడను.**
- ఏ విధంగా – ఒక నాటక రచయిత నాటకములోని పాత్రలన్నిటికీ అంతరాత్ముడో, ఒక చిత్రకారుడు తాను రచించిన అనేక చిత్రములలోని ఆకారములన్నిటికీ అంతర్గతుడో, ఒక కల కనేవాడు తన కలలో కనిపించిన రూపనామములన్నిటికీ అంతర్యామియో, **నేను ఆ తీరుగా, అదే విధంగా–ఈ సర్వభూతజాలముల అంతర్యామిని. సర్వ భూత – అంతస్థుడను.**
- ఆలోచన, భావన మొదలైనవాటిని కదల్చువాడను. వాటికి వేరైనవాడను. కదిల్చేవాడు తాను కదిల్చే అన్నిటికీ వేరై ఉంటాడు కదా! **నేను ప్రత్యక్ చైతన్య రూపుడను.**

| **నాకు ఆత్మగా అన్యమైనదే లేనప్పుడు నేను ఎవరికి నమస్కరించాలి? ఆత్మనగు నాకు ఆత్మ అయిన నేను (నాకు నేనే) నమస్కరించుచున్నాను. మహ్యామేవ నమో నమః** |
|---|

ఓ ఋభు మహర్షీ!

| | | |
|---|---|---|
| **త్వం వా అహమస్మి** | – | 'నీవు'గా ఉన్నది నేనేనయ్యా! నాకు నీవు వేరు కానే కాదు. |
| **అహమస్మి సర్వ దేవతా** | – | సర్వదేవతల రూపముగా ఉన్నది 'నేనే'! |
| **అహం వై త్వమసి** | – ' | నేను'గా ఉన్నది నీవే! నేను నీవు కూడా అనంతస్వరూపులము. **'అనంతము'**– అన్నప్పుడు రెండవది ఉండదు కదా! నేను నీవు కూడా **ఏకైక చిదాత్మస్వరూపులమే.** |

పరేశ్వరుడనైయున్న, శివస్వరూపుడనై యున్న నాకు నేను నమస్కరించుకొనుచున్నాను. **(నమస్కృతమహమ్ సోఽహమ్)॥**

మహాసముద్ర తరంగములన్నీ సముద్ర జలముతో నిండియున్న తీరుగా ఈ సమస్తము మమాత్మస్వరూపముచే నింపివేయబడినదై యున్నది.

అంతటా నా స్వరూపముచే నిండియుండగా ఇక నేను చేయవలసినదేమున్నది! ఎక్కడికి వెళ్ళాలి? ఏది స్వీకరించాలి? ఏది త్యజించాలి? **సర్వదా సర్వమైయున్న ఆత్మయే నేనై ఉన్నాను.** *<u>ఇంతకు మించి వేరే వ్యవహారమే లేదు.</u>*

# సంగ త్యాజ్యము

**ఋభువు:** ఈ జీవుడు స్వతఃగా ఆత్మానంద స్వరూపుడే కదా! మరి అట్టి ఆత్మకు 'జీవాత్మత్వము, బంధత్వము'...అనునవి ఎట్లా సంక్రమించుచున్నాయి? ఎందుకు ఏర్పడుచున్నాయి?

**శ్రీ వరాహమూర్తి :** ఓ ఋభూ! ఈ జీవునికి 'సంగము (Relatedness Presumed)' వలననే బంధము – సంబంధము కల్పితమై ఉంటున్నాయి. ఆకాశమును మేఘములు కప్పు విధంగా స్వస్వరూపాత్మానందానుభవమును – జగత్ భావావేశమేఘములు కప్పి ఉంచుతున్నాయి. అందుచేత, 'అఖండాత్మానుభవము' అను మహదాశయముగా

*అంతః సంగము* (Attachments inside – ఆలోచనా పూర్వకం)

*బహిః సంగము* (Attachment outside బాహ్యవస్తు సంబంధమైనది)

*జీవాత్మ సంగము* – జీవాత్మతో సంబంధము

ఈ మూడిటిని దాటివేసినవాడవై ఉండు.

(ఈ విధంగా) ఎవ్వడైతే సర్వసంగములనుండి **నివృత్తుడౌతాడో,** అట్టివాడు **విష్ణురూపుడే. అస్మత్ రూపుడే!** నేనే అగుచున్నాడు! ఇందులో సందేహమే లేదు.

***ఎవ్వడైతే.... ఆత్మ దృష్టిచే,***

→ ఒక 'పాము' వలె జనులతో సంసర్గము (Association, లోకసంబంధమై లాభ – నష్ట – కష్ట వ్యవహారములే సరళి)కి సర్వదా **సుదూరుడై...,**

→ ఒక 'శవము' వలె సర్వకామములుకు (కోరికలకు) సంత్యక్తుడై, (వదలినవాడై), **విరాగి అయి...,**

→ సర్వ ఇంద్రియ విషయసంబంధమైన లోక సమాచారముల వ్యవహారమును **'విషము'తో సమానంగా చూస్తూ....**

→ దుష్టప్రవర్తనలను అల్పజన్మలకు దారిచూపే దుష్ట మార్గముగా గమనిస్తూ ఉంటాడో,

.... అట్టివాడు – **'సోఽహమ్ పరమమమ్'** అనబడు **'పరమహంస'**గా, సర్వజీవుల ప్రదర్శనములు తనవే అయినట్టి **వాసుదేవునిగా (వాసనాత్ వాసుదేవస్య వాసితంతే జగత్రయమ్, సర్వభూత నివాసోఽసి వాసుదేవ)** అగుచున్నాడు.

అట్టివాడు అఖండాత్ముడగు నా స్వరూపమే। నేనే।

**ఇంకొక విషయం –**

- ఈ జగత్తు పరమసత్యమే. ఎందుకంటే, పరమాత్మకు వేరుగా ఎక్కడా ఏదీ లేదు. అందుచే 'ఇహము' రూపముగా పరముయొక్క ప్రదర్శనావిన్యాసమే. అందుచేత ఈ కనిపించేది సత్యమే! **ఇహమ్ సత్యమ్, ఇహమ్ సత్యమ్ సత్యమ్ ఏతత్ ఇహ ఉచ్యతే।** బ్రహ్మమే ఇహము. కాబట్టి బ్రహ్మమువలెనే ఇది నిత్య సత్యమే!
- నేనే బ్రహ్మమును! నేనే సత్యమును। పరబ్రహ్మమును। నాకు వేరైనదంటూ ఎక్కడా ఏదీ లేదు.

***ఈ ఉభయముల సమన్వయమే యోగము.***

**ఋభువు :** మహాత్మా! పరమాత్మా! 'జీవాత్మ భావన'లో మునిగి తేలుచూ, మాయొక్క 'వరాహతత్త్వము'ను మేము స్వానుభవముగా సిద్ధించుకోలేక పోవుచున్నాము. ఎట్టి 'ఉపవాసము' మొదలైన ప్రయత్నములచే మేము మాయను దాటివేసి, మాయొక్క అభిన్నమగు విష్ణుతత్త్వమును నిత్యానుభవముగా పొందగలము? మీ యొక్క అఖండ అప్రమేయ తత్త్వముతో మేము ఎట్లా మమేకవగలము?

**శ్రీ వరాహస్వామి : ఉపవాసమే అందుకు ఉపాయము.** ఉపవాసము అనగా?

> **శ్లో॥ ఉపసమీపే యో వాసో జీవాత్మ – పరమాత్మనో**
> **"ఉపవాసః" స విజ్ఞేయో। న తు కాయస్య శోషణమ్ ॥**

ఓ ఋభూ!! **'ఉపవాసము'** అనగా ఏమి? భోజనము చేయకుండా ఒక రోజో, రెండు రోజులో ఉండటమా? అది కానే కాదు. **ఉప** = దగ్గిరగా. **వాసము** = వసించటము. దేనికి దగ్గిరగా వసించటం? **"ఈ జీవాత్మయే పరమాత్మ"** అను సత్‌భావనను సమీపించి ఉండటము.

అంతేగాని, **న తు కాయస్య శోషణమ్।** అన్నము తినకుండా రోజంతా ఉండటము, ఈ దేహమును శోషింపజేయటము ఉపవాసము కాదు. **కాయ శోషేణ మాత్రేణ కా తత్ర అవివేకినామ్?** దేహమును ఆహారము లేకుండా ఎండగట్టినంత మాత్రంచేత తత్ విష్ణు పదము లభిస్తుందా? లేదు. భోజనం మానివేస్తే ఆత్మతత్త్వభావన సిద్ధిస్తుందని అనుకోవటము అవివేకమే. **వల్మీక తాడనాత్ ఏవ మృతః కిన్ను మహోరగః?** ఒకడు పుట్టలోని పెద్ద త్రాచుపామును చంపటానికి పుట్టపై కర్రతో తాడించి ఏమిలాభము? అంతమాత్రము చేత, పుట్టలోని భయంకరమైన పాము చావనట్లే, ఆహారము తీసుకోనంతమాత్రంచేత పరమాత్మ లభించదు.

## మరి ఆత్మసాక్షాత్కారము లభించేది ఎట్లా?

శాస్త్రములు పరిశీలించాలి. సద్గురువును ఆశ్రయించి **'తత్ త్వమేవ'** అను **పరమ విశేష శ్రవణము**ను చేయాలి. తెలుసుకోవాలి. అనుకుంటూ ఉండాలి (స్మరించాలి). అనిపించేంత వరకు, అదే తానుగా అనుభవమయ్యేవరకు సాధనలు ఆశ్రయించ వలసిందే.

- **'అస్తి బ్రహ్మము'** – 'బ్రహ్మము కలదు' – అనునది **పరోక్షజ్ఞానము** మాత్రమే!
- **'నేనే బ్రహ్మమును'** అని నిస్సందేహంగా తెలుసుకొన్నప్పుడు అది **'సాక్షాత్కారము'** లేక **'అపరోక్షజ్ఞానము'** అగుచున్నది.

## జీవన్ముక్తుడు

ఎప్పుడైతే ఈ జీవుడు యోగి అయి, **స్వాత్మయొక్క స్వాభావికమైన ఔన్నత్యమును సర్వాత్మకం గాను, సర్వజీవుల ఆత్మను మమాత్మకం** గాను ఎరుగుచున్నాడో,... ఆ మరుక్షణం ఆతడు **'జీవన్ముక్తుడు'** అగుచున్నాడు. అట్టి మహాత్మునకు **'అహమ్ బ్రహ్మ'** అను **జ్ఞాన-విజ్ఞానములే** మోక్ష హేతువు. ఆతనికి మోక్షహేతువులుగా ప్రత్యేకం భక్తి-జ్ఞాన-క్రియా యోగాభ్యాసముల ఆవశ్యకత ఇక ఉండదు. ఆత్మగా తనను-తదితరులను నిస్సందేహుడై సందర్శించటమే ఆతనిపట్ల భక్తి-జ్ఞాన-యోగ-వైరాగ్యముల అభ్యాసము, అంతిమ ఫలము కూడా అగుచున్నాయి. ఆ తదనంతరము అవి ఆతనిపట్ల స్వాభావికములు అవుతాయి.

## బంధము - మోక్షము

**ద్వే పదే బంధ మోక్షాయ। నిర్మమేతి, మమేతి చ।**

**బంధము** = **'నాది' (మమేతి)** .... అనునదే బంధము. **మమేతి బధ్యతే జంతుః।** 'నాది' అను భావనచే జీవుడు బద్ధుడుగా అగుచున్నాడు.

**మోక్షము** = **'న మమ - నిర్మమేతి'** - నాది అనునది ఈ పాదార్థిక జగత్తులో ఏదీ లేదు - అనునదే **మోక్షము.**

***'నాది కాదు' అనుకుంటే మోక్షము। 'నాది' అనుకుంటే బంధము.***

**ఓ ఋభూ! బాహ్యచింతా న కర్తవ్యా!** బాహ్య చింతనలన్నీ సందర్భ పరిమితముగా చేసివేయుచూ, బాహ్యముననే వదలి ఉంచబడును గాక! పడవ నీళ్ళలో ఉన్నప్పటికీ పడవలోనికి నీళ్ళు రానీయము కదా! అట్లాగే బాహ్య విషయముల 'చింతన'కు అంతరంగమున చోటు ఇవ్వకుండెదవు గాక! **తథైవ అంతర చింతకా।** అంతర విషయములగు ఆలోచన, తెలివి, ఇష్టము, మమత్వము మొదలైనవి కూడా చింతన (Chanting) చేయకుండెదవు గాక!

సర్వ చింతనలు పూర్తిగా వదిలి, స్వస్థుడవై ప్రశాంతముగా, హాయిగా ఉండటమును అభ్యాసపూర్వకముగా నిర్వర్తిస్తూ ఉండుము.

**ఋభువు**: స్వామీ! వరాహ భగవన్! **కేవలాత్మయే సహజస్వరూపము**గా గల ఈ **జీవుడు** ఎందుచేత ఈ **దృశ్యపరంపరలచే పరిమితత్వమునకు నిబద్ధుడై** ఉపాధులలో సుదీర్ఘంగా కాలము గడపుచున్నాడు?

**శ్రీ ఆదివరాహస్వామి**: ఈ ప్రశ్నకు సమాధానం ఇతఃపూర్వం చెప్పుకున్నాం. అయినా మరల విను. అన్నిటికీ కారణము ధ్యాసలచే నిర్మితమైన సంకల్పమే - అనునదే సమాధానము.

❋ **స్వకీయ సంకల్పమాత్ర కలనయే** (కల్పనయే) ఈ **సమస్త జగదనుభవము** కూడా.

❋ ***ఈ జగత్ విలాసమంతా కేవలము సంకల్పనామాత్రమే.***

❋ **'సంకల్పనా సూత్రము'**నకు గ్రుచ్చబడిన పూదండ వంటిది ఇదంతా! సంకల్పములనుండే ఇదంతా జనిస్తోంది. సంకల్పములలోనే కనబడుచూ, అనుభవమౌతోంది. **'సంకల్పము' అనునది ఆత్మనుండి ప్రదర్శితమై, ఆత్మయందే ఉండి, ఆత్మయందే లయిస్తోంది.**

❋ ఒక దారముతో నిర్మితమైన పొడవైన పూదండ యొక్క దారమును త్రెంచితే పూలన్నీ జలజలా రాలిపోతాయి కదా! అట్లాగే **'నిర్వికల్పము'**ను (కల్పన / భావనా రహితత్వము, కేవల మనోతత్త్వమును) ఆశ్రయించుచూ, అఖండము, అప్రమేయము అగు నాయొక్క సర్వాత్మక - స్వరూపమును హృదయమున భావన చేయి.

**హే మహామతీ!**

❋ నాయొక్క అవతార కథనమును అన్యోన్యము సంభాషించుకొనుచూ ఉండగా **'సంకల్పత్యాజ్యము'** యొక్క అభ్యాసము సులభము కాగలదు.

❋ **"అంతరాత్మ, సర్వాత్మ"** అగు నన్నే పరమలక్ష్యముగా, మహదాశయముగా కలవాడవై కాలమును వెచ్చించుచుండుము.

**'పరమాత్మ భావన'** అనగా?

- *'నేను'.... అనునది చిత్ స్వరూపమే!* *('I' is coming out of 'knowing' or 'Enlightenment').*
- ***'నీవు'.... అనునది కూడా చిత్ స్వరూపమే!***
- ***ఈ ఇంద్రియములకు విషయములై కనిపిస్తున్న లోకమంతా చిత్ స్వరూపమే!***

ఇట్టి భావనను ఆశ్రయించి, అంతరంగములోని **'రాగము'ను 'విరాగము'**గా చేసివేయి. సర్వదా నిర్లేపుడవై (విషయరహితుడవై) ఉండుము.

**ఋభువు :** మమాత్మానంద స్వరూపా! ప్రియ వరాహ భగవానుడా! **'నేను దీనికి కర్తను। దానికి భోక్తను'** అనునదంతా మమ్ములను పట్టి జాడ్యమువలె పీడిస్తూ ఉన్నది. ఇట్టి మనో - బుద్ధి సంబంధమైన దోషములు తొలిగేది ఎట్లా?

**శ్రీ వరాహస్వామి :** ఈ జీవుడు ప్రకృతి యొక్క ప్రేరణచే (Inspiration given by the a running Drama to the respective Role Players regarding the Role - Playing) కర్మలు చేస్తూ ఉండగా...

**"- నేను కారకుడను! ఇది కారణము! అది ప్రయోజనము.**

**- నేను కర్తను, నేను భోక్తను!"**

.....మొదలైనవన్నీ రూపుదిద్దుకొనుచున్నాయి. ఇట్టి కారక - కర్తృత్వ - భోక్తృత్వ భావనా సంస్కారములే **'సంసారము'** అని అనబడుతోంది. ఇవన్నీ **'అజ్ఞానము'** అనే చీకటిలో కనబడే **భ్రమాకారములు** వంటివి. చీకటి గదిలో దీపము వెలిగించగానే అన్ని వస్తువుల యొక్క యథార్థమగు ఉనికి, ఆకారములు, స్థానములు సుస్పష్టముగా తెలిసిపోతాయి కదా! శ్రుతులచే (వేదాంగములగు ఉపనిషత్తులచే) ఆత్మవిజ్ఞానము (Knowledge of one's own / every body's "Absolute Indivisible self") - అనే దీపపు 'ప్రజ్ఞా-వెలుగు'లో **"వస్తు భావన, కర్తృత్వ - భోక్తృత్వ - కారక -కారణ - ప్రయోజన"** భావములన్నీ బాధింపబడక ఏమి చేస్తాయి?

ఓ ప్రియభక్తా! ఋభూ! ఆత్మకు 'అన్యము (Something quite different)' - అని అనిపించేదంతా 'అనాత్మ' అని పిలువబడుచున్నది. అటువంటి అనాత్మకమైనదంతా మొదలంట్లా పరిత్యజించివేస్తూ **'సర్వము ఆత్మకు అనన్యము'** అను **సమున్నతమగు భావనను** మాత్రమే ఆశ్రయించుము. ఏకైక నిష్ఠ కలిగియుండుము. అంతర దర్శనము (Looking at the actual basis for everything in you as well as in everybody including **Devine Energy Beings** like Devathaas) కలిగిన దృష్టితో అంతస్థుడవై ఉండుము. కేవలమగు **'ఉనికి - ఎరుక - అనుభూతి'** రూపములగు సత్ - చిత్ ఆనందమాత్రుడవై ఉండుము. **సంవిత్ పరోభవ!**

## చిదాకాశము

ఏ దీపము ఎక్కడెక్కడ ఉండి ఏమేమి (ఆ దీపపు) వెలుగునందు కలిగి ఉన్నప్పటికీ అన్ని దీపములలోని 'అగ్నితేజస్సు' ఒక్కటే కదా! వెలుగు ఏకమేగానీ ఎప్పుడూ కూడా దేశ - కాలముల కారణంగా కానీ, (లేక) వెలుగులో కనిపించే వివిధ వస్తుజాలము కారణంగా కానీ **అనేకము అగుట లేదు కదా!**

ఒక జల్లెడ (చిల్లులుగల బియ్యము చెరగు తడికపాత్ర లేక రేకు పళ్లెము వంటిది) ద్వారా అనేక కిరణ పుంజములు ఎదురుగా గోడపై పడుచున్నప్పటికీ,....వెలుగు సర్వదా ఒక్కటే కదా.

కుండలోని ఆకాశము = **ఘటాకాశము.**

ఇంటిలోని ఆకాశము = **మఠాకాశము.**

ఇంటి బయట ఆకాశము = **మహాకాశము.**

ఈ త్రి ఆకాశములు '3'గా చెప్పబడుచున్నప్పటికీ ఆకాశము సర్వదా **(1) ఏకము (2) అఖండము (3) ప్రత్యేకము (4) అప్రమేయము** కదా!

అట్లాగే చిదాకాశము కూడా।

**(1) జీవుడు** → (ఒక దేహమునకు సంబంధించిన వ్యష్టిగత 'నేను')

**(2) ఈశ్వరుడు** → ఇతః పూర్వపు - ఇప్పటి - ముందు ముందటి అనేక దేహములకు సంబంధించిన 'నేను'

ఈ జీవ - ఈశ్వరులనబడేవి - **'అఖండ చిదాకాశము'** నందు **'పరికల్పితము'** (Attribution by mind) అయి ఉన్నాయి.

# మాయ

ఆత్మజ్ఞానమునకు మునుముందుగా 'మాయ' ఉండవచ్చుగాక! ఆత్మను ఎరిగిన తరువాత ఆద్యంతమూ మాయ స్వతఃగా ఏమాత్రము మొదలే లేనిదిగా (యా మా – ఏదైతే మొదలే లేనిదో) అగుచున్నది.

**బ్రహ్మతత్త్వజ్ఞులు** – వివేకముచే **సర్వత్ర సమస్వరూపమై విరాజిల్లుచున్న బ్రహ్మతత్త్వమునే** దర్శించుచున్నారు. 'మాయ' అనునది ఆత్మచే ఒకానొకప్పుడు స్వకీయమగు 'ఊహ' (Visualization) వలె బయలుదేరుచున్నది. సముద్ర జలములోని ఒక తరంగమువలె బయల్వెడలి తిరిగి బయల్వెడలిన స్థానమునందే (ఆత్మయందు) విలయమగుచున్నది.

నేను అట్టి **శుద్ధచిత్ స్వరూపుడను।** ఆకాశమువలె **ఉపాధి రహితుడను।** అట్టి నేను నా యొక్క స్వాభావిక చమత్కారముచే చేతన – అచేతనాత్మకమైనట్టి జీవ – ఈశ్వర రూపముతో "వీక్షణము(perceiving)"ను ఆశ్రయించుచున్నాను. అట్టి నాయొక్క ఈశ్వర రూపముచే 'సృష్టి' అనబడునదంతగా పరికల్పితము అగుచున్నది. **సృష్టిని ఆస్వాదించు నా అంశయే ఈ జీవుడు. అనగా, ఈ జీవుడు పరమాత్మనగు నాకు ఏ క్షణమందూ అన్యము కానే కాదు.**

అట్టి జీవుడు 'జాగ్రత్' మొదలుగా 'సంసారబంధము' నందు చిక్కుకొన్నవాడగుచున్నాడు. అటువంటి జీవకల్పితమగు భ్రాంతి (దృశ్యములో నేను చిక్కుకున్నాను. నేను దృశ్యముచే బద్ధుడను) – అనునదంతా 'త్రిణాచక' ఇటువంటి యోగాభ్యాసములచే, భక్తిమార్గములచే మోక్షము సిద్ధించేవరకు – కొనసాగుచూనే ఉంటుంది. లోక సంబంధములతో ఆరంభమై – సాంఖ్యయోగాంతము (ఆత్మజ్ఞాన సిద్ధి) వరకు ఈశ్వరునికి (ద్రష్టకు) 'జీవభ్రాంతి'గా కొనసాగుచూనే ఉంటుంది.

జీవ–ఈశ్వరులు రెండూ భ్రాంతి జనితములే! అందుచేత, ముముక్షువు జీవ – ఈశ్వరవాద – ప్రతివాద భేదమంతా విడచి, ఆ రెండిటికీ ఆవల సంస్థితమై యున్న **బ్రహ్మతత్త్వమునందే నిశ్చలత్వము కొరకు విచారణచేయటము ఉచితము.** ఎవ్వడైతే 'నేను–నీవు' మొదలైన వాటన్నిటికీ సర్వదా అద్వితీయమగు 'బ్రహ్మతత్త్వము'ను యథాతథంగా ఎరుగడో, అట్టివానిపట్ల భ్రాంతి కొనసాగుచూనే ఉంటుంది. భ్రాంతి ఉండనే ఉండగా, ఆ జీవునికి 'ముక్తి' ఎక్కడిది? భ్రాంతి కొనసాగుతున్నంతకాలం ఇక్కడ సుఖమెక్కడుంటుంది? సర్వత్ర సమస్త రూపమైయున్న బ్రహ్మమును **'వీరేమో ఉత్తములు – వారు తక్కువవారు – ఇంకా వారు వారు అధములు'** అను దృష్టులతో చూస్తే, అటువంటప్పుడు ఇక బ్రహ్మము గురించి విని, తెలిసి, సంబోధించి, ఎవరెవరికో బోధించి మాత్రం ఏమి ప్రయోజనం? **'నేను ఆత్మ జ్ఞానిని. ఆతడు కాదు. నాకు ఆత్మగురించి తెలుసు. వారికి అంతగా తెలియదు. ఆయన ఒకాయనకు ఇంకా తెలుసు'**.... మొదలైనవన్నీ ఈ జీవుని సహజ స్వరూపమగు ఆత్మకు సంబంధమే లేదు. ఒకడు స్వప్నంలో భిక్షకుడు అయితే ఏమున్నది? రాజ్యాధికారి అయితే మాత్రం ఏమున్నది? స్వప్నమునుండి నిదురలేచి ప్రబుద్ధుడైన తరువాత రాత్రి కలలోని విషయాలు స్పృశిస్తాయా? లేదు కదా! **స్వప్నస్య రాజ్య, భిక్షాభ్యాం ప్రబుద్ధః స్పృశ్యతే ఖలు**? ఒక భిక్షకుడు రాత్రి (కలలో) తాను ఒక మహారాజు అయినట్లు కలకన్నాడు. తెల్లవారింది. మెలకువ వచ్చింది. లేచాడు. "నేను ఒక మహారాజును కదా? ఇక భిక్షాటనతో పనేమున్నది?" అని ఊరుకుంటున్నాడా? లేదు. లేవగానే, "ఈ రోజు భిక్షాటన ఎటువైపు?" అనియే తలచుచున్నాడు కదా! (ఒక రాజు తాను భిక్షకుడు అయినట్లు కల కనటము కూడా ఇటువంటిదే).

అందుచేత నీవు ఆత్మయొక్క 'నిత్యత్వము, కేవలత్వము'లను గ్రహించినవాడవై ఉండు. అంతేగాని, **'నేనింకా జ్ఞానినైతేనేగాని 'ఆత్మత్వము' సిద్ధించదు కదా! ఇంకా చాలా చూడాలి! నేర్వాలి! చదవాలి! చేయాలి' – అను భావాలన్నీ దూరంగా నెట్టివేయి.** ఈ విధంగా **'ఆత్మమేవాహమ్ గానము'**ను ఎలుగెత్తి, చేతులెత్తి ప్రకటించుము. ఎందుకంటే (భిక్షకుని భిక్షాటనవలె) నీ పట్ల ఆత్మత్వము సహజము. ఆత్మకు అన్యమైనదంతా (భిక్షకుడు కలలో మహారాజు అవటమువలె) – **"కల్పిత సందర్భము మాత్రమే".**

## ఆత్మనగు నా పట్ల నిద్రా – జాగ్రత్ – స్వప్నములు అవిషయములు।

***ఆత్మగా నాకు జడమగు 'నిద్ర' అనే అవస్థయే లేదు***. ఎందుచేతనంటే.....***'అజ్ఞానము చేత బుద్ధి లయించటం జరగటమే గాఢనిద్ర'***....అని బుధులు అంటూ ఉంటారు. అయితే నాయొక్క **"కేవల – నిర్మల – అద్వితీయ ఆత్మత్వము"** – ఒక సందర్భములో ఉండి, మరొక సందర్భములోకి ఎక్కడికో పోయి, ఇంకొక సందర్భమునకు తిరిగి వచ్చేది కాదు. సర్వదా ఆత్మ చైతన్య స్వరూపుడనై ఉండగా, అజ్ఞానముచే బుద్ధి విలీనమవటం, నిద్రలో ఆత్మను కోల్పోవటం....ఇటువంటివేమీ లేనేలేవు. **విలీనా జ్ఞాన తత్కార్యే మయి నిద్రా కథం భవేత్? జ్ఞాన–అజ్ఞానములనబడేవి కార్యక్రమముల రూపములుగా నానుండి బయల్వెడలి నాయందే లయిస్తున్నాయి. అంతేకాని, నేను గాఢనిద్రయందు లయమవటమనే** ప్రసక్తి ఎక్కడిది?

**ఆత్మకు జాగ్రత్ కూడా విషయమై ఉండదు!**

**బుద్ధేః పూర్ణ వికాసోఽయం 'జాగరః' పరికీర్త్యతే।** 'బుద్ధి నిద్రాణత్వము లేనిదై, పూర్ణ వికాసమును సంతరించుకొని ఉన్నప్పుడు, అదియే – జాగ్రత్ అని పరికీర్తించబడుతోంది. అయితే.... **వికారాది విహీనత్వాత్ జాగరో మే న విద్యతే।**

- ఆత్మకు 'బుద్ధి' అనే వికారమే లేదు.
- నేను సర్వదా ఆత్మ స్వరూపుడను.
- అందుచేత నాకు బుద్ధి – వికారములే లేవు.

అనగా, **నాకు 'జాగ్రత్' అనబడు ఒకానొక నాకు వేరైన సందర్భమేదీ నాకు ఎప్పుడూ లేదు. ఒకవేళ్ళ 'జాగ్రత్' అనేది ఉంటే, అది 'బుద్ధియొక్క వికాస చమత్కారము' మాత్రమే! నా స్వరూపముయొక్క 'మార్పుగా' కాదు.**

**ఆత్మనగు నాకు స్వప్న వికారము కూడా లేదు**

**సూక్ష్మనాడీషు సంచారో బుద్ధేః స్వప్నః ప్రజాయతే।** బుద్ధి సూక్ష్మనాడులలో సంచారము చేస్తూ ఉన్నప్పుడు అట్టి సందర్భమగుచున్న అనుభూతి (లేక) అనుభవమును 'స్వప్నము' అని పిలుస్తున్నారు. అయితే, **సంచార ధర్మ రహితే, మయి స్వప్నో న విద్యతే।** ఆత్మ సర్వత్రా సర్వమై వెలయుచున్నది కదా! **'నేను సర్వదా ఆత్మస్వరూపుడనే'** – అనునది వేద – వేదాంత శాస్త్రములు **('తత్త్వమ్' 'జీవోబ్రహ్మేతి నా పరః'** మొదలైన) మహావాక్యములను సునిశ్చితంగా ప్రకటిస్తూ ఉన్నాయి కదా! ఆత్మకు ఒకచోటి నుండి మరొక చోటికి వచ్చి – వెళ్ళు ధర్మమే కలిగి లేదు. మరప్పుడు ఆత్మనగు నాకు **"సూక్ష్మనాడీ సంచారము వలన సిద్ధించే స్వప్నావస్థ"** – అనునది ఎక్కడ? కనుక నా పట్ల **'స్వప్నదశ'** – అనునదేమీ లేదు.

## ఆనందమే నా స్వరూపము

సుషుప్తి (గాఢనిద్ర) సమయములో సకలము (ఇంద్రియ కల్పన అంతా) విలీనమై పోవుచున్నది. **'అన్యము' అనునదే లేకుండా పోతోంది.** అప్పుడు జాగ్రత్ లేదు. స్వప్నము లేదు. జాగ్రత్‌లో అనుభవములన్నిటికీ కారణమగుచున్న ఇంద్రియములు ఉపయోగించబడక ఉన్నాయి. వాటి వాటి విషయములేవీ – సుషుప్తిలో లేవు. అట్లాగే ఈ జీవుడు సూక్ష్మనాడులలో బుద్ధితో సంచరించే వ్యవహారమంతా కూడా (స్వప్న వ్యవహారమంతా కూడా) సుషుప్తిలో (అంతరముననే మరింకెక్కడో) దాచివేయబడుచున్నది. దూరంగా ఉంచి వేయబడుచున్నది. అట్టి సుషుప్తి సమయంలో సకలము (జాగ్రత్ – స్వప్న వ్యవహారములను ఆశ్రయించే ఉపకరణములు, విషయములు – ఇవన్నీ) స్వస్వరూపమునందు విలీనము అగుచున్నాయి. అప్పుడు ఈ జీవుడు **– దృశ్య వివర్జితః –** దృశ్యవివర్జితుడై (దృశ్యమనునదే లేనివాడై) **'స్వస్వరూప మహదానందము'**ను **'భుంక్తే'** – అనుభవించుచున్నాడు.

అనగా? "ఏ ఆనందముకొరకై ఈ జీవుడు జాగ్రత్‌లోను, స్వప్నములోను మనస్సుతో వెతికి వెతికి వేసారి, అలసిపోవుచున్నాడో, **అట్టి మహదానందము (లేక) ఆత్మానందము తనయందే వేచి ఉండగా ఈతడు ఎక్కడెక్కడో వెతకుచున్నాడు,** – బిడ్డను చంకన పెట్టుకొని తల్లి బిడ్డ కోసం వెతుకు తీరుగా!" – అని తత్త్వజ్ఞులచే సిద్ధాంతీకరించబడుతోంది.

ఓ ఋభూ! ఎవ్వడైతే ఈ కనబడే దృశ్యమంతా 'అనేక విశేష సముదాయములు కదా!'.... అనే రూపముగల 'సవిశేషము'గా కాకుండా

**'ఆహాఁ! ఈ కనబడేదంతా నాయొక్క చిత్ అనబడే ఎరుకయే. నా ఎరుక యొక్క విస్తరణమే ఈ అనేక తీరులైన 'ఎరుగబడే విశేషాలు కదా!' అను 'చిత్ అన్వయదృష్టి'తో చూస్తాడో.... సయేవ సాక్షాత్ విజ్ఞానీ! ఆతడే –**

**సాక్షాత్ జ్ఞానమును అనుభవముగా మలచుకొన్నట్టి విజ్ఞాని! ఆతడే శివుడు! ఆతడే హరి! ఆతడే విధి (బ్రహ్మ).**

❋

**ఈ సంసారము ఎటువంటిది?** ఈ ప్రశ్నకు సమాధానం విను.

- ఇదంతా అతిదీర్ఘమైన (దేహ – దేహాంతర వ్యవహార సరళితో కూడిన) స్వప్నము వంటిది.
- సుదీర్ఘమైన చిత్త విభ్రమము (An experience of prolonged Illusion).
- ఒక దీర్ఘమైన పెద్ద నవలా రచయిత రాత్రింబవళ్లు నవలారచన యందు నిమగ్నమై రోజులు – రోజులు గడుపు తీరుగా – సుదీర్ఘమైన మనోరాజ్యము (A long extended thought operation).

**ఒక రచయిత ఒక నవలను ముగించి, మరొక 'కథారచనను ప్రారంభించు రీతిగా ఈ జీవుడు జన్మ-జన్మాంతరములు పొందుచున్నాడు. ఈ సంసారము గొప్ప సుదీర్ఘ అజ్ఞానజనిత దుఃఖసాగరము** (A Ocean of worries).

అందుచేత ఓ మహదాశయా! ప్రియ ఋభూ! **సుప్తేః ఉత్థాయ – సుప్త్యంతం బ్రహ్మైకం ప్రవిచింత్యతామ్।** నిదురలేచిన క్షణము నుండి మరల నిద్రపోవుచున్న క్షణము వరకు **'బ్రహ్మతత్త్వము'** అను ఏకైక వస్తువు గురించియే విచారణ చేస్తూ ఉండాలయ్యా! ఇక ఈ 'జగత్తు' విషయమంటావా? ఇదంతా ఆత్మ స్వరూపముపై ఆపాదితము(Just attributed on the state of self by "one's own self"). అట్టి ఆరోపితమై కనిపించే దృశ్య వ్యవహారమంతా **'కేవలాత్మానంద స్వస్వరూపుడను'** అగు నాయందు లయము చేయి. ఏకము చేయి. చిత్తము నాయందు లయమగుచున్న మరుక్షణం **పరికల్పతమైనదంతా ఆత్మకు అభిన్నమై, 'అన్యము' అయినదంతా లేనిదిగా అగుచున్నది.**

చిత్తము లయము అగుచూ ఉండటానికి గొప్పశత్రువులగు అరిషట్ వర్గము (కామ – క్రోధ – లోభ – మోహ – మద – మాత్సర్య వర్గము)లపై యుద్ధము ప్రకటించి జయించనారంభించాలి. శత్రువులందరినీ పారద్రోలి ఒక ప్రశాంత స్థానములో విశ్రాంతి తీసుకుంటున్న ఏనుగువలె, అరిషట్‌వర్గమును జయించి, బ్రహ్మముగురించి తెలుసుకున్న యోగి **'ఆత్మతో అద్వితీయత్వము'** అనుస్థానములో పరమ విశ్రాంతిని అనుభవించుచున్నాడు. అట్టివాడు ఈ భౌతిక దేహమును చూచి చిరునవ్వు చిందిస్తూ..."**అద్య అస్తమేతువపుః** → ఓ **భౌతిక శరీరమా!** నీవు ఇప్పుడే అస్తమిస్తే కూడా నాకేమీ అభ్యంతరం లేదు. ఎందుకంటే, నీవు ఎల్లప్పుడు నాపట్ల అస్తమించిన వస్తువే అయి ఉన్నావు!" – **అను దృష్టితో చూస్తూ ఉంటున్నాడు.**

**ఆ శశితారమాస్తాం!** కాదూ? ఓ శరీరమా! నీవు ఆచంద్రార్కం వర్ధిల్లుచూనే ఉంటావా? అది కూడా సరియే! నాకేమీ అభ్యంతరము లేదు.

**కస్త్వావతాపి మమ చిత్ వపుషో విశేషః?** సర్వదా 'కేవల చిత్' స్వరూపుడునగు నాకు సంబంధించి ఏమి విశేషం? ఏమీ లేదు. నాకు ఈ శరీరము నశించటం చేతగాని, సుదీర్ఘకాలము కొనసాగుటచేత గాని ఏదీ రాదు. ఏదీ పోదు. నేను సర్వదా చిత్ (ఎరుక– Absolute knowing) స్వరూపుడనే! నటనా కళ ప్రదర్శనం దృష్ట్యా ఒక పాత్రగా నటించినంతమాత్రం చేత 'కళ' (The Art of acting) గా యథాతథంగానే ఉంటుంది గాని, పాత్రలో ప్రవేశించి, పాత్రతో ముగియదు కదా! (The Art of acting does not end merely because the Actor's role ended in one Drama).

-----

ఒకచోట ఒక కుండ ఉన్నది. ఆ కుడలో ఆకాశము ఉన్నది. ఏదో కారణం చేత ఆ కుండ కాస్తా పగిలిపోతే, అంతవరకూ ***కుండలోగల ఆకాశమునకు వచ్చేదేమున్నది? పోయేదేమున్నది?***

ఇక ఈ జీవునికి సంబంధించిన జగత్ విశేషముల సంగతేమిటంటావా? 'శరీరమునకు అతీతత్త్వము', లేక **'కేవల శరీరిత్వము'** ధారణి చేస్తున్నప్పుడు మొదలే లేనివగుచున్నాయి? ఏ విధంగా పాము పుట్టలో కుబుసమును విడచి బయటకు వచ్చిన తరువాత, ఆ కుబుసము గురించి కించిత్ కూడా యోచించదో, ఎట్టి అభిమానమును కుబుసముపట్ల కలిగియుండదో,....ఆ తీరుగా **'నేనే బ్రహ్మమును కదా!'** ....అని ఎరిగిన తరువాత ఈ జీవుడు తనయొక్క స్థూల – సూక్ష్మ శరీరముల పట్ల ఏమాత్రము అభిమానము కలిగియుండడు. **'ఇవన్నీ అక్కడ ఉన్నాయా! ఇక్కడ ఉన్నాయా? ఎంతకాలం ఉంటాయి?'** – కూడా అర్థరహితమైన విశేషాలు అయి ఉంటాయి. **ఏవగ్ం స్థూల సూక్ష్మం చ శరీరమ్ న అభిమన్యతే!**

సహేతుకమైన పరిశీలన చేసినప్పుడు (Logically examined) ప్రత్యజ్ఞాన పరాకాష్ఠచే 'జగత్తు' ఆత్మకు భిన్నమైనది – అను రూపముగల మిథ్యాజ్ఞానమంతా మొదలంట్లా తొలగిపోతుంది. అప్పుడు ఈ జీవుడు **'నేను ఇది కాదు కదా! నేను ఇది కాదు కదా! 'నేతి – నేతి'** అను వాక్యానుభవంచేత తత్ – రూపంగా **'నేను దేహరహితుడను'** అనబడు అశరీరత్వము సంతరించుకొంటున్నాడు. ఆతనిపట్ల మనో బుద్ధి చిత్త అహంకారముల వంటివి కూడా చిన్న చిన్న ఆభరణములవంటివి అగుచున్నాయి. జగత్తో? స్వకీయ కల్పిత సంచార ఉద్యానవనమగుచున్నది.

(1) 'పరమార్థ దృష్టి'చే [(లేక) 'ఈ కనబడే జీవులంతా మమాత్మానంద స్వరూపులే, నేను, నీవు, త్రిలోకవాసులు, త్రిలోకములు – అంతా ఆత్మయొక్క అనన్య – విన్యాసము'...అను దృష్టిచే] శాస్త్ర విషయాలు, చర్చలు, వాదోపవాదములు, నిర్వచనములు భేదములు – ఇవన్నీ సుస్పష్టమై, అనుభవము అంకురించసాగుతుంది. **స్వానుభవమే మన ఈ సంభాషణలయొక్క అంతిమలక్ష్యము.**

(2) ఆత్మ ప్రత్యక్షము కాదు. పరోక్షము కాదు. ఇంద్రియములకు దృశ్య విషయము కాదు – మరెక్కడో ఉన్నది కాదు. – **నాలోని జగత్తుకు, జగదనుభవికి రెండిటికీ ఏది సాక్షియో అదియే ఆత్మ.**

అందుచేత ఆత్మ **'అపరోక్షము'**గాను, ఆత్మజ్ఞానమును **'అపరరోక్ష జ్ఞానము'**గా పిలుస్తున్నారు. అట్టి అపరోక్ష జ్ఞానముచే 'కార్య – కారణ – కర్తృత్వ' – భ్రమలన్నీ తొలగిపోతాయి.

'ఈ జగత్తు సత్యమే' అనే దృఢభావన కలిగినవారికి, 'కర్మలు – కర్మఫలములు ఉన్నాయి'...అను నమ్మికతో ఉన్నవారికి మాత్రమే 'సంచిత–ఆగామి–ప్రారబ్ధ' కర్మల గురించి చెప్పబడుతోంది.

**కర్మలు** = అభిరుచి – ఆవేశములను జోడించుచూ దేహముతోను, మనస్సుతోను, బుద్ధితోను నిర్వర్తిస్తూ వస్తున్న **క్రియా వ్యవహారములు, వాటి ఫలములపట్ల నమ్మికలు.**

**సంచితము** = వర్తమాన జన్మకు ముందునుండి పేరుకొనియున్న ఫలప్రదములవటానికి సిద్ధము కాగల అనేక కర్మ వ్యవహారములు

**ప్రారబ్ధము** = ఈ జన్మలో సందర్భానుసారంగా ఫలప్రదము అగుకర్మలు.

**ఆగామి** = ఈ జన్మలో నిర్వర్తించిన కర్మలు + ఇతః పూర్వం 'సంచితము'లో ఇంకా శేషించి...ముందు జన్మకు వెంటనంటివచ్చేవి.

ఈ సంచిత ప్రారబ్ధ ఆగామి కర్మ వ్యవహారములన్నీ కూడా – ఈ దృశ్యము 'సత్యము' అనుకున్నప్పుడు మాత్రమే సత్యమువలె అనిపిస్తాయి. **'ఇదంతా కూడా స్వప్నమువలె మొదలే కల్పన'**...అని ఎరిగినవారుతనో? 'ఈ జగత్తు ప్రతి భాస (something that appears in a mirror వంటిది' – అని సుస్పష్టమౌతోంది. అట్టివారిపట్ల సంచిత ఆగామి ప్రారబ్ద కర్మ వ్యవహారములన్నీ మొదలే లేనివగుచున్నాయి.

***ఈ విధంగా మాయా స్వరూపములగు శాస్త్రవాసనలు, కార్యక్రమవాసనలు, కర్మవాసనలు ఆత్మజ్ఞానముచే తొలగి, నిర్మలాకాశము వలె ఆత్మ ఈ జీవునికి స్వానుభవము అవగలదు.***

తనయొక్క బ్రహ్మత్వము సుస్పష్టమైన తరువాత 'జీవత్వము' అను దాని గురించి ఇక ఈతడు వెతకడు. 'జీవుడు' అనబడుదానితో తన్మయుడు కాదు. సూర్యుడు 'నాయొక్క ఒకానొక కిరణము ఎక్కడికి వెళ్ళింది?' అని వెతుకుతాడా? **ఆత్మజ్ఞునికి జీవాత్మత్వము తనయొక్క ఒక అంశ వంటిది మాత్రమే అగుచున్నది.**

**వాసనలు :** అనేక జన్మల కర్మవ్యవహారములు కారణంగా ఘాటుగా వెంటవచ్చే **'వాసనలు**(Tendencies)' **'ఆత్మకు – ఈ జీవుడు, జీవునకు అనుభవమయ్యే దృశ్యము వేరు కాదు. అభిన్నమే'** – అను అద్వైతానుభవం చేత (అద్వైతబోధజ్ఞానముచేత) **నశించిపోగలవు.**

**అస్తి: 'ఉనికి' అను బ్రహ్మముయొక్క లక్షణమునకు సంబంధించిన** అద్వైత సిద్ధి చేత ఈ భౌతికదేహముతో ఏర్పడిన కల్పనా సంబంధమంతా 'మాయ'గా తెలియబడగలదు. ఆ విధంగా తెలియుచుండగా ఈ దేహము యొక్క 'మొదలు – మధ్య – చివర' కూడా మొదలే లేనివౌతాయి. 'మాయ' అంతా కూడా క్షీణించిపోగలదు. **"ఈ దేహము, ఇందలి ఇంద్రియములు, ఆ ఇంద్రియములవలన కనిపించే దృశ్య పరంపరలు, ఆ దృశ్య పరంపరలవలన అనుభవమయ్యే సుఖదుఃఖములు – ఇవన్నీ మాయయే!"** → అని తెలియుచుండగా, ఇవన్నీ **'బ్రహ్మము'** అను **సత్‌రసము నందు విలీనమైపోతున్నాయి.**

**భాతి : ఆత్మయొక్క వెలిగించు విశేషము.**

ఏ వెలుగులో ఈ జగత్తంతా కనిపిస్తోందో, తెలియబడుతోందో, అదియే 'ఆత్మ'. అట్టి ఆత్మయొక్క వెలుగులో ఆత్మకు అభిన్నమై, కానీ అజ్ఞానదృష్టికి భిన్నమైనట్లు కనిపించేదే 'జగత్తు'. **ఆత్మయొక్క తెలుసుకొనే తెలివి రూపమే జగత్తు. (భాతి = ఎరుక అను వెలుగు)**

మరుభూమి (ఎడారి)లో (ఎండమావులలో) మృగతృష్ణలో జలంగా, జలతరంగాలుగా కనిపించేదంతా మరుభూమియే కదా! అట్లాగే స్వకీయ విచారణచే ఈ త్రిలోకముల వ్యవహారమంతా **చిన్మాత్ర (ఆత్మ తన ఎరుకచే వెలిగించే) స్వరూపమే.**

సర్వదా ఏకాంతుడను (ఆత్మగా ఏకము అయినట్టివాడను). కేవలుడను (The Absolute) కేవల చిదేక రసమయుడను (The Flower of Awareness) అగు **'పరిపూర్ణ పరబ్రహ్మమే'** నేను సర్వదా అయి ఉండగా –

→ ఈ 'జగత్తు' అనబడేదంతా అజ్ఞానవిశేష ప్రదర్శనమే కాక మరింకేమిటి?

→ జీవుడు – ఈశ్వరుడు (The Individual "I" (and) The "I" that is placed in all) అనే భేదమంతా 'వికల్పము' (Illusion, Misconception) కాక మరింకేమిటి?

భూమిపై జనులకు – సూర్యచంద్రగ్రహణములు, రాహుకేతువుల విన్యాసమువలన కనిపించవచ్చుగాక! వాస్తవానికి సూర్యుడు సర్వదా స్వయం – తేజోరూపుడు, చంద్రుడు సర్వదా పూర్ణ చంద్రుడు అయి ఉన్నారు కదా! అట్టి స్వయంప్రకాశక సదాశివాత్మక – నిత్యప్రకాశమగు ఆత్మ సర్వదా సిద్ధించినదైయుండగా, అద్దానికొరకు స్నాన, దాన, యజ్ఞ, క్రియ, మొదలైన విమోచన కర్మలతో పని ఏమి? అవన్నీ 'ఆత్మసిద్ధికొరకు' అని తలచటం వృథాప్రయాసయే.

## సమాధి

ఏ విధంగా అయితే సైంధవం (లవణం) నీటిలో ఉంచినప్పుడు, అది కరిగిపోయి తన నామ రూపముల ఉనికినంతా కోల్పోవుచున్నదో,..... ఆ విధంగా **'మనస్సు ఆత్మతో ఏకత్వము'** పొందుచుండగా, మనస్సు తన నామ రూపములు కోల్పోయి ఆత్మగా శేషిస్తోంది. **మనస్సుకు సర్వము ఆత్మగా అనుభూతమవటమే మనోలయము. మనస్సు ఆత్మయందు ఏకత్వము పొందటమే సమాధి.**

## సద్గురు కరుణ

ఓ ఋభూ! 'ముముక్షువు (మోక్షము ఆశయముగా కలవాడు) – బ్రహ్మతత్త్వమును ఎరిగిన తత్త్వజ్ఞానియగు గురుసత్తముని ఆశ్రయించాలయ్యా! ఆయన **'తత్ త్వమ్'** అని నిరూపణపూర్వకంగా బోధిస్తున్నారు.

1. విషయములను త్యజించటము.
2. తత్త్వదర్శనము.
3. ఆత్మసంబంధమైన సహజావస్థ.

**ఈ మూడు కూడా సద్గురు కరుణ, బోధ లేనిదే దుర్లభం సుమా!** గురుబోధచే ఉత్పన్నమైన ఆత్మభావనాశక్తిచే 'నేను కర్తను భోక్తను' అను భావనకు సంబంధించిన కర్మవ్యవహారమంతా ఎప్పుడైతే త్యజిస్తాడో, అట్టియోగి **'స్వయమ్ ఆత్మగా', బ్రహ్మము**గా ప్రకాశించుచున్నాడు. **సర్వమునందు ఆత్మను, ఆత్మయందే సర్వమును వీక్షించుచున్నాడు.**

ఈ మనస్సు–ఇంద్రియవిషయ రసాస్వాదనయందు పగలు–రాత్రి కూడా అనుబంధముతో తెంపు లేకుండా నిమగ్నమై ఉంటోంది. అయితే ఈ దృశ్య విషయములు అతి చంచలములు. అనుక్షణం మార్పు చెందుతూ ఉంటాయి. **అంతేకాదు.** జాగ్రత్‌లో కనిపించినవి స్వప్నదశలో కనిపించవు. స్వప్నదశలో కనిపించేవి సుషుప్తిలో ఉండవు. మనస్సు తాను పట్టుకొన్న విషయములతోనే తానూ మార్పు – చేర్పులు పొందుతూ అతిచంచలమై ఉంటోంది. అట్టి 'విషయరసముల ఆస్వాదన' నుండి విరమింపజేసి, 'అనునిత్యము, నిశ్చలత్వము' అనునవి తన స్వభావముగా కలిగినట్టి **'ఆత్మరసాస్వాదన'**కు మనస్సును సంసిద్ధము చేయాలి. అనగా – "ఈ కనబడే సర్వజీవులు, ఈ ఇంద్రియ దృశ్యములు – ఇవన్నీ నిశ్చల జలమువలె నిశ్చలమైన ఆత్మయందు ఆత్మకు అభిన్నమై, (మరియు) జలంలో తరంగాలవలె – చంచలములుగా కూడా కనిపిస్తున్నాయి" – అను మననమునందు మనస్సును నియమించాలి. ఎప్పుడైతే మనస్సును 'ఆత్మరసాస్వాదన' యందు ఈ జీవుడు నియమించి **'మనోబద్ధము'**ను సిద్ధించుకుంటాడో....అట్టి వానికి అసాధ్యం అనేదే లేదు. **రసో బద్ధో మనో బద్ధం, కి న సిద్ధ్యతి భూతలే?** ఆత్మానందునికి సర్వము సుసాధ్యమే!

**'బ్రహ్మమే నేను! ఈ సర్వము బ్రహ్మమే। కనుక ఈ సర్వము నేనే'** అనురూపముగల 'బ్రహ్మత్వము' అనే 'రససిద్ధి' పొందినవాడు –

- మూర్ఛరోగము కలవాడు ( ఆ మూర్ఛరోగమునకు 'ఔషధము' వంటి ఆత్మరసముచే) – అట్టి మూర్ఛరోగమునుండి విముక్తుడు అవటముతో సమానుడు.
- అట్టివాడు మృతించి కూడా జీవిస్తున్నవాడే! చచ్చి కూడా బ్రతికి ఉన్నవాడే అగుచున్నాడు (మరిష్యామి కిమ్ ఉచ్యతే? భవిష్యామి కినమోచ్యతే?). 'చస్తాను' అనడు. **'చావు తరవాత కూడా నేను ఉంటాను'** – అని అంటాడు.
- బద్ధుడై ఉండి కూడా ఆకాశంలో పక్షిలాగా జగత్తులలో విహారములు చేయువాడై ఉంటాడు.

❑❑❑

**ఋభువు :** స్వామీ! ఏ ఇంద్రియములను జీవులమగు మేము అనేక శుభకార్యముల ఫలముగా కష్టపడి, దివ్యప్రజ్ఞలగు దేవతలచే ప్రసాదింపబడి పొందామో, ఆ ఇంద్రియములు వ్రాలుచున్న విషయములే మాకు బంధనమగుచున్నాయి. ఇంద్రియములను విషయములనుండి వెనుకకు మరల్చటము ఎట్లా?

**శ్రీ వరాహస్వామి :** బిడ్డా! విను, చెప్పుతాను. ఈ విషయములకు యజమాని ఎవరు? – ఇంద్రియములు. **ఇంద్రియములకు నాథుడు ఎవరు?** <u>ఇంద్రియాణాం మనో నాథః।</u> **"మనస్సే"।**

**మనస్సుకు 'నాథుడు' (లేక) నియామకుడెవ్వరు? మనో నాథస్తు మారుతః।** మనస్సుకు వాయువు (లేక) ప్రాణశక్తి నాథుడు.

**ప్రాణశక్తికి ప్రాణనాథుడు (లేక) పాణేశ్వరుడు ఎవరు**? లయస్థానమగు 'లయుడు' అనబడు శివుడు! ఆత్మయే ఆ శివస్వరూపం. అట్టి సర్వమునకు నాథుడు అగు 'లయము'ను ఆశ్రయించవయ్యా! అట్టి **'సర్వమును ఆత్మయందు లయింపజేయటము'**...అనబడే లయమును సిద్ధించుకొన్న యోగి,

→ సర్వ చేష్టలు తన పట్ల రహితము చేసుకొన్నవాడై, **నిశ్చేష్టుడై,**

→ సర్వ వికారములను అధిగమించినవాడై, **- నిర్వికారుడై ఉంటున్నాడు.**

నీవు సర్వ సంకల్పములను వదలివేసి, నిశ్శేష - అశేష చేష్టితుడవై, ఇతరుల మనో వాక్కులకు తెలియజాలని వాడవై సర్వము లయింపజేసి **'స్వావగమ్యుడవు'** అయి ఉండుము.

**ఋభువు :** మహాత్మా! ఈ విషయాలను వదలేది ఎట్లా? వీటికి దూరంగా వెళ్ళేది ఎట్లా?

**ఆదివరాహస్వామి :** నాయనా! ఈ జగన్నాటకములో నీవు నిర్వర్తించవలసిన పాత్ర నిర్వర్తిస్తూనే వేరుగా (ఆత్మగా) ఉండుము. గొప్పనటునివలె నీ నటనాచాతుర్యమును (కళను) ప్రదర్శిస్తూనే స్వస్వరూపమును విడిగా (ధారణ చేయువాడవై) ఎరిగియున్నవాడవై ఉండుము. నాటక రచయిత నాటకములోని పాత్రలన్నీ తన స్వకీయ కల్పనగా చూచుతీరుగా, ఈ జాగ్రత్ విశేషాలన్నీ స్వీయరచనవలె చూస్తూ ఉండు.

**శ్లో॥ పుంఖానుపుంఖ విషయ ఈ(వీ)క్షణ తత్పరోఽపి,**
**బ్రహ్మావలోకన ధియం న జహాతి యోగీ॥**

యోగి అయినవాడు, అనుక్షణము విషయములను వీక్షణ (Perception)లో చాలా తీవ్రంగా (very busily)తత్పురుడై ఉన్నప్పటికీ కూడా → **'ఇదంతా సర్వదా పరబ్రహ్మస్వరూపమే'** అను **'బుద్ధి'**ని (ధిషణమును) **కించిత్ కూడా వీడకయే ఉంటున్నాడు.** అదియే సంయోగ వియోగాతీత నిశ్చల-యోగస్థితి.

**సంగీత తాళ లయ వాద్య వశంగతాపి,**
**మౌళి స్థ కుంభ పరిరక్షణ ధీర్నటీవ॥**

రంగస్థలముపై నృత్యము చేస్తున్న ఒక నృత్యకళాకారుడు సూత్రధారుని నాట్యాంగముయొక్క సంగీత-తాళ-లయముల ప్రకారము నృత్య వశంగతుడై కాళ్ళు, చేతులు, కళ్ళు, కనుబొమ్మలు కదలుస్తూ ఉంటూనే, 'శిరస్సుపై ధారణ చేసిన కుంభము (పాత్ర)' - పడిపోకుండా చూచుకుంటాడు కదా!

అట్టి తెలివైన నటునివలె, నీవు **'ఇదంతా బ్రహ్మముగా దర్శించటము'**....అనే స్వభావమును పరిరక్షించుకోవాలి. దృశ్యవ్యవహారములలో ఎప్పుడు ఎట్లా ఉండవలసివచ్చినప్పటికీ **'బాహ్మీదృష్టి'** వీడనేవద్దు. ఈ సమస్తము సర్వదా **'పరబ్రహ్మముయొక్క ప్రదర్శనారూపమే'** - అయి ఉండగా, మనము **'బ్రాహ్మీదృష్టి'**ని ఎప్పుడైనా సరే - వీడవలసిన అవసరమేమున్నది?

*ఓ ఋభూ!*

- అన్ని తదితరమైన (అన్యమైన చింతనలు) **పరిత్యజించివేయి.**
- బ్రహ్మముగా దర్శించుటయందు **సావధాన చిత్తుడవై ఉండు.**
- 'యోగ సామ్రాజ్యము' నందు **ఇష్టముగా ప్రవేశించుము.**
- **అంతరనాదముతో అనుసంధానము** కలిగియుండుము.
- **యోగముచే ఆత్మతో సంయోగము సిద్ధించుకొని ఉండెదవుగాక!**

ఇతి ద్వితీయోఽధ్యాయము

## 3వ అధ్యాయము - 'తత్ సదానన్దమ్ అహమేవ' - ఇతి మౌనమ్

ఓ ఋభూ! నీవు బ్రహ్మమే అయి ఉన్నావు. ఇందులో సందేహించవలసినది ఏమాత్రమూ లేదు! ఇది వేద వాక్యం। మహనీయుల స్వానుభవ వాక్యం। **"బ్రహ్మమే నేను"** - అని అనుకోవటానికి - ఎవ్వరైనా సరే - వెనుకాడవలసిన పనేమున్నది?

బ్రహ్మము - నానా స్వరూపములు తానే అయి ఉన్నప్పటికీ సర్వదా 'ఏకవస్తువు'గానే ఉన్నది....అట్టి అఖండమగు ఆత్మయందు 'నీవు - నేను' అను భేదమెక్కడ ఉంటుంది? ఉండదు. అంతే కాదు. **ఆత్మ అద్వితీయము! 'నేను'గా ఉన్నది ఆత్మయే! తస్మాత్ అఖండ ఏవాస్మి, మత్ అన్యత్ న కించన॥**

- ఆత్మ నాకు వేరైన వస్తువు కాదు. ఆత్మయే ఈ దేహములో మహత్తర పరాకాష్ఠ వస్తువు కాబట్టి – 'బ్రహ్మము' అనికూడా అభివర్ణించబడుతోంది. (లేక) ప్రశంసించబడుతోంది.
- ఈ నా కళ్ళకు కనబడేది, చెవులకు వినబడేది, **ఇదంతా కూడా బ్రహ్మమునకు వేరు కాదు. బ్రహ్మము ఈ దృశ్య జగత్తుకు వేరు కాదు. ఈ దృశ్య జగత్తు ఆత్మకు వేరు కాదు. ఆత్మ బ్రహ్మమునకు వేరు కాదు.**

## 'నేను' అనునది ఎవరు?

ఏ ఆత్మ అయితే....

❋ భూత వర్తమాన భవిష్యత్తులలో, జాగ్రత్ – స్వప్న సుషుప్తి దశలలో, క్రితం దేహం – వర్తమాన దేహం – భవిష్యత్ దేహము సందర్భములలో యథాతథము కాబట్టి **'నిత్యము'** అయిఉన్నదో,

❋ ఆకాశమువలె –దృశ్య – ఇంద్రియ – మనో – బుద్ధి – చిత్త – అహంకార – ఈశ్వర – జన్మ – జన్మాంతర సర్వ విశేషములచే వాటి–వాటి దోషములచే స్పృశించబడదు కాబట్టి **'శుద్ధమో',**

❋ దేని చేతనూ బంధించబడదు కాబట్టి **నిత్యముక్తమో,**

❋ 'నేను – నీవు – దేవతలు – మానవులు – జంతువులు'...ఇత్యాది వేరు వేరుగా అగుచుండుటయే లేదు కాబట్టి సర్వదా **ఏకమే** అయి ఉన్నదో,

❋ అద్దానికి వేరుగా ఏదీ లేదు కాబట్టి **'అఖండానంద రూపమో',**

❋ **సత్య** (ఉనికి / సత్), **జ్ఞాన** (ఎరుక) **అనంత** (దృశ్య – దేహ విశేషాలచే పరిమితము కాదు) కాబట్టి **అప్రమేయమో,**

❋ ఏది సర్వమునకు **'పరము, శ్రేష్ఠము'** అవటంచేత **పరబ్రహ్మమో.....,**

***అట్టి పరబ్రహ్మమే నేను అయి ఉన్నాను। అహమస్మి తత్।***

❋

ఓ ఋభు మహాశయా!

ఇంకా కూడా నీలోని, నాలోని, సర్వజీవులలోని 'నేను' అనునది ఎంతటిదో చెప్పుచున్నాను. విను.

❋ **'ఎరుగుచూ ఉన్నది – ఎరుగబడుచున్నది'** ఈ రెండిటి ఏకరూపము. **'బోధరూపము'** అనబడుతోంది. నేను అట్టి **'అఖండబోధరూపుడను'.**

❋ ద్వితీయమైనది (something different) ఉంటే భయము, దుఃఖము ఉండక తప్పదు. రెండు వస్తువులుంటే ఒకటి రెండవ దానిని 'పరిమితము' (Limited) చేస్తుంది. నేను **ద్వితీయమనునదే లేనట్టి ఆత్మను కాబట్టి అద్వయుడను। అద్వితీయుడను। ఏక – అఖండానంద రూపుడను।** సర్వదా మూర్తీభవించిన **అఖండాత్మ తేజోస్వరూపుడను।**

❋ ఈ దేహమునకు, దృశ్యమునకు, దేహికి కూడా పరము (Beyond) అయి ఉన్నవాడను. అట్టి **'పరము'** కూడా నానుండి బయల్వెడలిన ఒక అంశమాత్రమే! కనుక **నేను పరమునకే పరమైనవాడను. పరాత్ పరుడను.**

❋ ఈ సర్వము ప్రకాశింపజేయువాడను (That which makes all else as that being KNOWN). ఘనీభూత 'చిత్ (ఎరుక)' అను ప్రకాశ స్వరూపుడను. **ఎరుకకే ఎరుకరూపుడను! ఎరుగుచున్న – ఎరుగబడుచున్న ఉభయములకు కేవల 'ఎరుక'నై ఉన్నవాడను.**

నేను ఏది ఎట్లా తెలుసుకొంటే, అది అట్లా తెలియబడుచూ ఉండగా,....అట్టి తెలుసుకోబడుచున్న దానిచే తెలుసుకొంటూ ఉన్న మహాకర్త అగు నేను బద్ధుడను, పరిమితుడను అవుతానా? అవనే అవను. **ఆకాశములో మేఘములు ఆకాశము** (Space)**ను స్పృశించగలవా?ఆకాశమును బంధించగలవా? లేదు కదా!**

అట్లాగే,

> **మేఘాయథా వ్యోమ న చ స్పృశంతి,**
> **సంసార దుఃఖాని న మాం స్పృశంతి।**

ఆకాశమును మేఘములు స్పృశించలేనట్లే ఆత్మాకాశ స్వరూపుడనగు నన్ను **'సంసారము'** అనునది ఏమాత్రము స్పృశించజాలదు. నన్ను స్పృశించని దృశ్యానుభవరూపమగు సంసారము నన్ను ఎట్లా దుఃఖితునిగా చేస్తుంది? చేయజాలదు. **ఇక బంధమును కలిగించగలిగే ప్రసక్తియే లేదు.**

కనుక ఓ ప్రియ ఋభూ! **'ఈ దృశ్యము నాకు సంసారబంధము'**...అని అనుకోకూడదు సుమా! వాస్తవానికి, **'ఆత్మస్వరూపుడనగు నాకు ఈ దృశ్యమంతా స్వకీయ లీలా, క్రీడా, ఆనంద విశేషమే!'....అని భావన చేయి. 'ఇదంతా నా ఆత్మానంద స్వరూపమే! సుఖ స్వరూపమే!' – అని గ్రహించు. అట్టి పరమసత్యమును 'మననము' చేస్తూ ఉండు.**

❧ ❧ ❧

**ఋభువు:** ఈ జీవుడిని – **'నేను బద్ధుడను. ఈ వ్యవహారములు నాకు ఆదుర్దా, భయము కలుగజేస్తున్నాయి! ఎట్లారా? ఉపాయ మేమిటి?'**.....అనేది బాధిస్తూనే ఉన్నది. **ఇది మొదలంట్లా తొలగు సులభోపాయం ఏది?**

**శ్రీ వరాహస్వామి:** ఓ ఋభూ! ఆ విషయమే మనము చెప్పుకుంటూ వస్తున్నాము కదా! ఈ జీవుని దుఃఖములు మొదలంట్లా తొలగాలంటే ఏకైక ఉపాయము – **ఈ సర్వమును సద్రూపమగు ఆత్మగా దర్శించటము** మాత్రమే. **'అసత్‌భావము' తొలగిస్తే ఇదంతా సర్వదా సత్ – స్వరూపమే!**

| ఉనికి (Presence, Entity) నుండి బయల్వెడలిన **'స్వకీయమగు ఎరుక' (లేక) చిత్ యొక్క విస్తారణా వినోద రూపమే ఇదంతా!** అందుచేత సత్ చిత్ రూపుడనగు నేను సర్వదా అఖండరూపుడను. నా అఖండరూపమే ఇదంతా! |
|---|

ఇట్టి స్వభావ సిద్ధిమగు జ్ఞానము చేత ఈ జనులు పరస్పరంగా చెప్పుకుంటూ వస్తున్న **సర్వ దుఃఖములు పటాపంచలౌతాయి.**

ఈ జీవుడు **సందర్భవశంగా 'జీవుడు'గా** కనబడుచున్నప్పటికీ, **సహజముగా ఆత్మస్వరూపుడే!** ఆత్మకు జనన – మరణాలు లేవు. రాక – పోకలు లేవు. మలము, నిర్మలము మొదలైనవి కూడా లేవు. 'తెలుసుకోబడేది' అను వేదనము కూడా ఆత్మకు వేరుగా లేదు.

**"స్వకీయ–చిన్మయ తత్త్వమే** (Enlightening Feature of Absolute Self) **సర్వే సర్వత్రా తెలియబడే సర్వమును నిండి, నిబిడీకృతమై స్ఫుటతరమగుచున్నది"**–అని పరమయోగులు దర్శించుచున్నారు. **తెలియబడేదంతా ఆత్మయే। తెలుసుకొనుచున్నవాడు కూడా ఆత్మయే। ఆ ఉభయములకు ఆవల, అమృత స్వరూపమైయున్నది కూడా ఆత్మయే। ఆత్మ సర్వదా అఖండము, అప్రమేయము అనునిత్యము కూడా। అట్టి స్వస్వరూపాత్మయే బ్రహ్మము.**

❧ ❧ ❧

### తత్ సదా అహమ్ మౌనమ్ ఆశ్రయ.....!

ఓ ఋభూ! ఈ జగత్ పట్ల మౌనము వహించి 'మౌనివి (లేక) మునివి' అగుము. కేవల మౌన నిశ్శబ్ద స్వస్వరూపమును అధిరోహించి ఇదంతా దర్శించుము.

**ఋభు:** భగవాన్! 'ముని'గా ఎప్పుడు అగుచున్నాము?

**శ్రీ వరాహస్వామి:**

❖ ఏ పదము లేక స్థానము అత్యంత నిర్మలమో, అద్వయము – అద్వితీయమో, పరమశివమో, శుభప్రదమో, – **తత్ సదాఽహమ్** – అట్టి **'ఆత్మయే నేను'** అను **'మౌనముద్ర'**ను ఆశ్రయించటమే – మునివై ఉండటము.

❖ ఏది జన్మ – మృత్యు – దుఃఖ రహితమో, జాతి – నీతి – కుల – గోత్రములకు ఏమాత్రము సంబంధించినది కాదో, ఏ 'చిత్‌తత్త్వము' యొక్క వివర్త రూపము (బంగారము యొక్క ఆభరణరూపములె) జగదృశ్యముగా, త్వమ్‌గా కూడా అగుటకు కారణమో, అట్టి **తత్‌స్వరూపమే నేను....** అని మౌనమును అంతరముగా ఆశ్రయించెదవు గాక!

❖ **"ఏదిపూర్ణమో, అద్వయమో, అఖండమో, సర్వమును కదల్చుచూ ఉన్నది కాబట్టి చేతనమో, విశ్వము తానే అయి ఉండి కూడా ఎద్దానికి విశ్వభేదములన్నీ సంబంధించినవి కావో, అద్వితీయ – పర (ఆవలగల) – సత్‌చిత్ స్వరూపమో, అదియే సర్వదా నేను కదా!" – అను మౌనధారణము వహించి ఉండటమే 'మునీశ్వరత్వము'.**

<u>**అంతేగాని, కేవలము కొన్ని రోజులు మాట్లాడకుండా ఉండుటు – మౌనము కాదు.**</u>

ఓ నిదాఘా!

### 'నీవు'గా కనిపిస్తున్నది కూడా సర్వదా ఆ తత్ స్వరూపమే!

❖ ఏదైతే దృశ్య–దేహ–మనో–బుద్ధ్యాదులచే కించిత్ కూడా స్పృశించబడటం లేదో, త్రికాలములలో సర్వదా ఏకరూపమై ఉన్నదో, అట్టి **'తత్‌బ్రహ్మమే' – 'నీవు'గా** కనబడుచున్నది. నీయందలి ఆ సద్రూపమే నేనయ్యా! నిత్యము – అఖండము – అప్రమేయము అగు నేనే నీవు। నీవుగా ఉన్నది నేనే।

❖ ఏది **ఉపాధిరహితమో** (శరీరము ఇత్యాదులు దానికి, మొదలే లేవో), ఏది సుప్త **(గాఢనిద్రా) మౌనస్వరూపమో, 'ఏది సుఖరూపము'** అయి ఉండి కూడా **'సర్వసుఖాత్ పరము'** అయి ఉన్నదో, అట్టి **తత్ ఆనందస్వరూపమే నాయొక్క నీయొక్క ప్రతి జీవునియొక్క వాస్తవ – సహజ రూపము। అట్టి మహత్తరమగు స్వస్వరూపాత్మయొక్క సహజమగు ఔన్నత్యమేమిటో అధ్యయనము చేయకుండా, స్వానుభవముగా సిద్ధించుకోకుండా, ఎక్కడెక్కడో తిరిగి తిరిగి, వేసారితే** ఏమి ప్రయోజనము? **"నీలోనే సర్వదా వేంచేసియున్న పరమాత్మను ఎక్కడెక్కడో వెతకటమెందుకు?**

### అజ్ఞానాంధకారం తొలగేది ఎట్లా?

సూర్యుడు తన సహస్రకిరణాలతో ఉదయించగానే భూమిపై గాఢాంధకారము తొలగిపోయి, సర్వము సుస్పష్టముగా అగుచున్నది. అయితే హృదయంలో ఘనీభూతమైన **'భవము' (ఈ భేద దృశ్యము నిజమే అను ఘనీభూత భావన)** అను అంధకారము భౌతికమైన సూర్య కిరణములచే తొలిగేది కాదు.

### శరణాగతి యోగము

అందుచేత ఓ ఋభూ! నన్ను శరణువేడు. నాయొక్క కర – చరణ స్మరణ చేత, నన్ను పూజించటం చేత ఈ జీవుడు **స్వకీయ కల్పితమైన తమస్సు** (Darkness / Ignorence) **నుండి తప్పక విముక్తుడు కాగలడు.** నాయొక్క చరణ కమల స్మరణ – శరణా గతి మొదలైన వాటి చేత ఇక్కడి జనన – మరణ – పునర్జన్మల సంబంధమై హేతువుల వలన ప్రాప్తిస్తున్న సుఖ – దుఃఖములన్నీ మొదలంట్లా తొలగిపోగలవు.

| ఒకడు ధనేచ్ఛచే ధార్మికుడైన ధనికుని ఆశ్రయించి ధనమును పొందురీతిగా–విశ్వాత్మకుడైన, విశ్వకర్త అయిన నన్ను శరణు వేడితే, అట్టివాడు బంధములనుండి విముక్తి ఎందుకు పొందడు? తప్పక పొందుతాడు. |
|---|

**ఋభువు :** హే మహాత్మా! భగవాన్! ఈ చరాచర సృష్టియొక్క ప్రవర్తనములకు, కదలికలకు, చేష్టలకు కారణం ఎవ్వరు? కేవల – పరమాత్మ స్వరూపులగుమీరా? లేక, ప్రకృతికి భోక్తగా అగుచున్న జీవుడా? ప్రకృతియా? మరెవ్వరన్నానా?

**శ్రీ ఆదివరాహస్వామి :** నేను సర్వదా గుణాతీతుడను, కేవలుడను, సాక్షిని కదా! అందుచేత జగత్ దృశ్యములకు కారణము పరబ్రహ్మస్వరూపుడనగు నేను ఎట్లా అవుతాను? అవనే అవను। నాటకములోని సంఘటనలకు నాటకదీపము యొక్క వెలుగు కారణమెట్లా అవుతుంది?

సూర్యుని కాంతిలో లోకులు తమ కార్యక్రమములు నిర్వహించుకుంటున్నారు. అయినా కూడా, సూర్యకిరణములకు ఆయా జనుల కార్యక్రమములతోగాని, వారివారి పరస్పర ఐకమత్య – విభేదాలతోగాని ఏమాత్రం కర్తృత్వ భోక్తృత్వములు లేవు కదా! **'తథా మత్ సన్నిధానేన సమస్తం చేష్టతే జగత్।** కేవల చిదానంద స్వరూపుడనగు **నాయొక్క సన్నిధానమాత్రం చేతనే ఈ 'జగత్తు' అనబడేదంతా చేష్టితము అగుచున్నది.** ఏ విధంగా మాయచేత ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్లే అనిపిస్తూ, అజ్ఞానంచేత ఆరోపించబడుతోందో,.... అదే విధంగా

| **కేవలుడనగు నా పట్ల మహత్తు, అహంకారము, జీవుడు, బంధము, మోక్షము, శివుడు, విష్ణువు...మొదలైనవన్నీ కల్పించబడి పొందబడుచున్నాయి. ఇదంతా నాకు 'స్వయంకల్పిత–అసంకల్పిత' లీలా వినోదము మాత్రమే!** |
|---|

నేను సర్వత్రా సమస్వరూపుడగు ఆత్మగా నిత్య ప్రకాశమానుడనై ఉన్నాను.

- అనేక క్రూర కృత్యములు చేసే చండాలుని దేహమునందు,
- పశువు మొదలైన జంతుజాలమునందు,
- స్థావరములయందు (కదలని చెట్లు, రాళ్ళు మొదలైన వాటియందు),
- ఈ సృష్టి అంతటికీ కర్త, యజమాని, అభిమాని, నిగ్రహ – అనుగ్రహ ప్రదాతయగు బ్రహ్మదేవుని యందు,
- తదితర సమస్త నామవాచకములందు, సర్వనామరూపములందు – తారతమ్యము (ఎక్కువ – తక్కువ) అనేవే లేకుండా, **అవన్నీగా** ఉన్నది నేనే! **(ఆ బ్రహ్మాది – పిపీలి కాంత తనుషుః ప్రోక్తా జగత్ సాక్షిణః!)** – బ్రహ్మము నుండి కీటకము వరకు సాక్షినై వెలుగొందుచున్నది నేనే!

ఒకానొకడు మత్తుగా నిదురిస్తూ తాను ఎక్కడున్నాడో, ఏ స్థలములో (లేక) స్థానములో ఉన్నాడో తెలియకపోవచ్చు. కానీ మెలకువ రాగానే తాను ఎక్కడున్నదీ తెలిసిపోతుంది కదా!

అట్లాగే 'నేను ఆత్మను' అని తెలిసిపోగానే దిక్భ్రమలన్నీ తొలగుతాయి.

భూ-సూర్య ఇత్యాది స్థానముల సంబంధమే లేని ఆత్మ - దిక్కుల మధ్య ఉన్నదనటం భ్రమయే। దిక్కులన్నీ (స్వప్నములో వలె) ఆత్మయందే కల్పితమై ఉన్నాయి.

**'స్వస్వరూపాత్మ'** గురించి తెలిసిన మరుక్షణం ఇక అట్టి జీవునిపట్ల జగత్తు అనేది భాసించదు. **జగత్తు ఆత్మగానే భాసిస్తుంది.**

ఓ ఋభూ! స్వప్నము తొలగగానే స్వప్నములో కనిపించినవన్నీ, స్వయముగా 'లేనివే' అగుచున్నాయి కదా! అట్లాగే

- జనార్ధనుడును (ఈ జీవులన్నీ నా స్వరూపముగా కలవాడను) అగు నేను కేవల చినానంద మాత్రుడనై, సర్వే-సర్వత్రా సత్‌స్వరూపుడనై వెలుగొందుచున్నాను.

ఇక అన్యమైనదేదీ స్వతఃగా లేదు.

- దేహముగాని, ఇంద్రియములుగాని, మనోబుద్ధి చిత్త అహంకారములుగాని, చిత్తముగాని, మాయగాని, ఈ ఆకాశాదులతో కూడిన పాంచభౌతిక దృశ్య జగత్తుగాని.....

ఇవన్నీ వాస్తవానికి ఆత్మకు అన్యమై లేవు. **ఆత్మ తప్పితే మరింకేదీ ఎక్కడా ఏమాత్రము లేదు.**

**ఆత్మకు వేరుగా ఇక్కడ కర్త లేదు. భోక్త లేదు. భోగింపబడునదీ లేదు.**

జలంలో చంచలమై కనిపిస్తున్న సూర్య ప్రతిబింబము యొక్క చంచలత్వములతో ఆకాశములో కనిపించే సూర్యునికి ఏమి సంబంధము? అట్లాగే ఇక్కడి 'ప్రతిబింబిత - జీవానుభవములు' అగు 'అహంకారము' మొదలైన జీవుని సంసారమంతా ఆత్మకు ఏమాత్రము సంబంధించి లేదు. ఆత్మయొక్క చిదాకాశరూపము **"పరమాత్మ"**। ఆత్మయొక్క ప్రకృతియందు ప్రతిబింబిత రూపమే **"జీవాత్మ"**।

## చిత్తమే 'సంసారము'నకు మూలము।

ఈ దృశ్యములోని సంఘటనలు, రూపనామములు, సందర్భములు మొదలైనవాటితో ఈ జీవుడు ఇష్ట అయిష్టరూపమైన **'అవినాభావసంబంధము'ను స్వకీయమైన అభ్యాస - కల్పనలచే** పెంపొందించుకొని ఉంటున్నాడు. అట్టి **సంబంధమే 'సంసారము'** అనబడుతోంది. అట్టి అభ్యాసముల సమ్మేళనమే చిత్తముయొక్క రూపము.

**చిత్త మూలం హి సంసారాత్.** జీవుని స్వకీయ భావనా - అభ్యాస రూపమగు చిత్తమే సంసారమునకు మూలము (Raw-Material). (చిత్తము = దృశ్యవిషయముల ఏర్పడిన ఇష్టము. ప్రియము మొదలైన ఆవేశములతో కూడిన **'ధ్యాస').**

**తత్ ప్రయత్నేన శోధయేత్.** అట్టి చిత్తమును ప్రయత్నపూర్వకంగా శోధించాలి. అది వదిలివేసి దృశ్యప్రపంచంలో కొన్ని వస్తువులు మొదలైనవి వదలి ఉన్నంత మాత్రంచేత 'సంసారము' తొలగదు. **వస్తు జాతమునకు సంసార కారణమును ఆపాదించి ఏం ప్రయోజనం?**

బిడ్డా! ఋభు మహాశయా! సకల శ్రోతలారా! ఈ చిత్తము దేనిదేనిపై వ్రాలుచూ బంధము కల్పించుకొనుచున్నదో మీరంతా ముందుగా గమనించండి! విషయములు అనునిత్యము మార్పుచెందు స్వభావము కలిగి ఉండగా, వాటిపై ఎట్లా విశ్వాసము కలిగి ఉంటారు? అదంతా మరింత చిత్తచాంచల్యము కలిగించక ఏమి చేస్తుంది?

ఈ కాలగతిని చూస్తున్నారా? ఎక్కడి రాజులు? ఎక్కడి వారివారి సంపదలు? ఇవన్నీ ఎటు నుంచి వస్తున్నాయి? ఎటు పోతున్నాయి! ఏమి అసంఖ్యాక సృష్టి సమూహములు? ఎంతగా అసంఖ్యాక బ్రహ్మలు? ఇవన్నీ అసంఖ్యాకంగా జనిస్తున్నాయి. మరల ఎప్పుడో కాలగర్భంలో కలిసిపోతున్నాయి. పూదోటలో అనేక పుష్పము జనించి, వికసించి నేలరాలుచున్న తీరుగా...అనేక కోటానుకోట్ల బ్రహ్మలు, కోటానుకోట్ల బ్రహ్మాండములు ఇంతకు ముందు అసంఖ్యాకంగా కనిపించాయి, వికశించాయి, గతించాయి. మరల జనిస్తున్నాయి. మరల గతిస్తున్నాయి. కాలగతి అనిర్వచనీయం! మహాశ్చర్యకరం! అప్రతిహతం!

ఓ ఋభూ! నీవు 'ఆధ్యాత్మ విద్య' లేక ఆత్మవిద్య పట్ల అభిమానము కలిగియున్నావు. వేదాంత విద్య పట్ల విదుషుడవు కూడా! అట్టి విదుషత్వము కలిగి ఉండి, **'అహంకారము, అరిషట్‌వర్గము'** మొదలైన ఆసురీసంపత్తిని తప్పక త్యజించాలి. **ఆత్మ గురించిన విదుషత్వమంతా భేదదృష్టిని వదలనివానిపట్ల బూడిదలో పోసిన పన్నీరే అగుచున్నది!**

ఈ సంసార జీవుడు తనయందు దృశ్యముపట్ల రాగ - ద్వేషములు పొడముచూ ఉన్నప్పుడే, మొదటే గమనించి, వాటిని 'జ్ఞనాగ్ని'తో దగ్ధం చేసివేయునుగాక! ఇక అతనికి అప్పుడు **'పునరావృత్తి'** అనే దోషమే ఉండదు.

**శ్లో॥ యథా సునిపుణః సమ్యక్ పరదోష ఈక్షణే రతః,**
**తథా చేత్ నిపుణః స్వేషు కో న ముచ్యేత్ బంధనాత్?**

**ఇతరుల తప్పులు ఎంతటి ప్రావీణ్యంతో, నైపుణ్యంతో చూస్తూ ఉన్నాడో, అట్టి 'ప్రావీణ్యత - నిపుణత' తో తన తప్పులను, సంసార దృష్టులు గుర్తించి, తొలగించటానికి నియోగిస్తే, ఈ జీవుడు సంసార బంధములనుండి విముక్తుడు ఎందుకు కాడు? తనతప్పులు ఎరిగి ఉపాయములు ఆశ్రయించువాడు ముక్తిమార్గంలో వేగవంతుడౌతాడు. (కుర్యాత్ నరాన్ స్వగుణదోష విచారణాని-యోగవాసిష్ఠము)**

## సిద్ధులు - ఆత్మజ్ఞాని

**ఋభువు :** స్వామీ! ఈ జీవుడు యోగాభ్యాసము మొదలైన అనుసరణము వలన అటు సిద్ధులు, ఇటు మోక్షము కూడా పొందగలడు కదా!

**ఆదివరాహమూర్తి :** ఓ మునీశ్వరా! సిద్ధులకు, ఆత్మభావనారూపమగు మోక్షమునకు ఏమి సంబంధం? సంబంధమే లేదు. ఒకనికి ఆత్మతత్త్వ జ్ఞాన - ఆత్మానందములు లక్ష్యము కానప్పుడు కూడా - ఎవ్వరైనాసరే, అణిమ-గరిమ-లఘిమ- మహిమ- ఈశిత్వ-వశిత్వ-ప్రాకామ్య-ఇచ్ఛాసిద్ధిలు కోరుకొంటూ ఉంటే, ఆతనికి ద్రవ్య - మంత్ర - క్రియా - కాలయుక్తంగా అష్టసిద్ధులుగాని, వాటిలో కొన్నికొన్ని గాని లభించ గలవు. అటువంటి సిద్ధులన్నీ కూడా -

- అనాత్మజ్ఞునికే గొప్ప విషయాలుగా కనిపిస్తాయి.
- ఆత్మజ్ఞునికి 'ఆత్మదృష్టి' తప్పించి మరేదీ అతని దృష్టిలో విశేషమే కాదు.
- ఆత్మచేత ఆత్మ యందు సంతుష్టుడై 'అవిద్య'తో సంబంధములేనివాడై - మౌనంగా, అతీతంగా, నిశ్చింతగా, ఆనందంగా చూస్తూ ఉంటాడు (ఉపద్రష్టా).

ఏఏ జగత్ భావములు → (ఇష్ట-అయిష్టాలుగా, సుఖ-దుఃఖాలుగా, పరస్పర సంబంధ-బాంధవ్యములుగా, లింగ-జ్ఞాన ఇత్యాది) భేదములతో కూడుకొని-కనిపిస్తూ ఉన్నాయో, **అదంతా కూడా 'అవిద్య'యే.** ఆత్మజ్ఞాని అవిద్యను త్యజించే ప్రయత్నములలో ఉంటాడేగాని, వాటియందు మునిగి తేలుతూ ఉండాలనుకొంటాడా? లేదు. ద్రవ్యము (certain matter related things) చేతను, యోగాభ్యాసము మొదలైన క్రియా విశేషములచేతను, యుక్తి-తపస్సుల చేతను ఏఏ సిద్ధులు ఆ యోగికి తారసబడుతూ ఉంటాయో, అవన్నీ కూడా **'పరమాత్మ పదప్రాప్తి'**కి ఉపకరించేవి ఏమీకావు. అందుచేత బ్రహ్మజ్ఞానాధ్యయునులగు ఉత్తములు తమకు తారసబడే సిద్ధులను లోకకళ్యాణము కొరకే ఉపయోగిస్తారు. **ఉత్తముడగు రాజు తన అధికారములను ప్రజల క్షేమము కొరకే ఉపయోగిస్తాడు కదా!**

ఆత్మలాభము కోరుకొనేవాడు చిత్తమును లయింపజేసే ప్రయత్నములలో ఉంటాడు. అష్ట సిద్ధులో? చిత్తముయొక్క ప్రవృత్తులు అధికమవటానికి కారణమయ్యేవి మాత్రమే! చిత్తము లయిస్తూ ఉండగా, చిత్తముయొక్క ఉపకరణములతో పని ఏముంటుంది? చిత్తము లయించకపోతే సిద్ధుల వలన క్రొత్తగా ఆత్మానుభవానికి ఏమి ఉపకారము? లాభమేముంటుంది? వాటియొక్క పర్యవసానము - "బంధమును కొనసాగించటమే" - అగుచున్నది కదా!

## 4వ అధ్యాయము - ఋభు నిదాఘ సంవాదము

### సప్తజ్ఞాన భూమికలు - జీవన్ముక్తి లక్షణములు

ఒక సందర్భములో నిదాఘుడు అనే ముని మోక్షేచ్ఛ పొందినవాడై, జ్ఞానసిద్ధి కొరకు తన సద్గురువగు ఋభుమహర్షిని సమీపించారు. భక్తితో గురుపాదాలకు సాష్టాంగదండ ప్రణామములు సమర్పించారు.

**నిదాఘుడు :** హే గురుదేవా! సద్గురూ! నాపై దయతో నాకు జీవన్ముక్తుని **విశేష లక్షణముల గురించి** చెప్పమని అర్థిస్తున్నాను.

**శ్రీ వరాహస్వామి :** జీవన్ముక్తునికి సంబంధించి (I) సప్త - (7) జ్ఞానమార్గ భూమికలు (II) చతుః- (4) ప్రణవాత్మకమైన భూమికలు - యోగగురువులచే వివరించి చెప్పబడుచున్నాయి. ఆయా విశేషాలు ఇప్పుడు మనము చెప్పుకుంటున్నాము. వినండి.

**చతుర్విధ ప్రణవాత్మిక భూమికలు - చతుర్విధ అవస్థలు**

| చతుర్ (4) ప్రణవాత్మిక భూమికలు | అంశభేదములు | అవస్థా భేదములు | పురుషకారములు |
|---|---|---|---|
| (1) 'అ'కారము | స్థూలాంశ | జాగ్రత్ అవస్థ | విశ్వుడు |
| (2) 'ఉ'కారము | సూక్ష్మాంశ | స్వప్నావస్థ | తేజసుడు |
| (3) 'మ'కారము | బీజాంశ | సుషుప్త్యవస్థ | ప్రాజ్ఞుడు |
| (4) అర్ధమాత్ర | సాక్షి అంశ | తురీరాయావస్థ | తురీయసాక్షి |

***'అ'కారము యొక్క***

| | | | | |
|---|---|---|---|---|
| స్థూలాంశము | → | జాగ్రత్ | → | విశ్వము |
| సూక్ష్మాంశము | → | స్వప్నము | → | తేజసము |
| బీజాంశము | → | సుషుప్తి | → | ప్రాజ్ఞము |
| **సాక్ష్యంశము** | → | **సాక్షి** | → | **తురీయము** |

***'ఉ'కారము యొక్క***

| | | |
|---|---|---|
| స్థూలాంశము | → | స్వప్నము |
| సూక్ష్మాంశము | → | విశ్వుడు (జాగ్రత్) |
| బీజాంశము | → | ప్రాజ్ఞుడు |
| **సాక్ష్యంశము** | → | **తురీయము** |

***'మ'కారము యొక్క***

| | | |
|---|---|---|
| స్థూలాంశము | → | సుషుప్తి |
| సూక్ష్మాంశము | → | జాగ్రత్ |
| బీజాంశము | → | స్వప్నము |
| **సాక్ష్యంశము** | → | **తురీయము** |

***అర్ధమాత్ర యొక్క***

| | | |
|---|---|---|
| స్థూలాంశము | → | తురీయము |
| సూక్ష్మాంశము | → | తేజసుడు (స్వప్నము) |
| బీజాంశము | → | ప్రాజ్ఞుడు |
| **సాక్ష్యాంశము** | → | **తురీయుడు** |

**సప్త జ్ఞాన భూమికలు :** (1) శుభేచ్ఛ (2) విచారణ (3) తనుమానస (4) సత్త్వాపత్తి (5) అసంసక్తి (6) పదార్థభావన (7) తురీయగము ఇవి సప్త జ్ఞాన భూమికలు

***'అ'కార జాగ్రత్ –తురీయాంశ భూమికలు*** → మొదటి మూడు భూమికలు **(1) శుభేచ్ఛ (2) విచారణ (3) తనుమానస**

***'ఉ'కార స్వప్న – తురీయాంశ భూమికలు*** → 4వ భూమిక **'సత్త్వాపత్తి'**

***'మ'కార సుషుప్తి– తురీయాంశ భూమికలు*** → 5వ భూమిక – **అసంసక్తి**

***అర్ధమాత్రా తురీయాంశా భూమిక*** → 6వ భూమిక **పదార్థభావనా (పదార్థాభావన)**

***అర్ధమాత్రా అతీతా (కేవలా)*** → 7వ భూమిక **'తురీయగము'**

- **ముముక్షువు:** భూమిత్రయ విహరన్ (శుభేచ్ఛ, విచారణ, తనుమానసలో ప్రవేశించువాడు) – **'ముముక్షువు' అగుచున్నాడు.**
- **బ్రహ్మవిత్ :** తురీయ (4వ) భూమ్యా విహరన్ – 'సత్త్వాపత్తి'లో ప్రవేశించినవాడు – **'బ్రహ్మవిత్' (బ్రహ్మముగురించి తెలుసుకొన్నవాడు) అగుచున్నాడు**
- **బ్రహ్మవిద్వరుడు:** పంచమ భూమ్యాం విహరన్ –'అసంసక్తి' భూమికలో ప్రవేశించినవాడు – **'బ్రహ్మవిద్వరుడు' అని పిలువబడుచున్నాడు**
- **బ్రహ్మవిత్ వరేణ్యుడు:** షష్ఠమ (6వ) భూమ్యాం విహరన్ – పదార్థ – అభావన భూమికలో ప్రవేశించినవాడు – **'బ్రహ్మవిత్‌వరేణ్యుడు'గా చెప్పబడుచున్నాడు.**
- **బ్రహ్మవిత్ వరిష్ఠుడు:** సప్తవ (7వ) భూమ్యా విహరన్– తురీయగ భూమికలో ప్రవేశించువాడు – **'బ్రహ్మవిత్ వరిష్ఠుడు' అగుచున్నాడు.**

మొదటి మూడు భూమికలు : {(1) శుభేచ్ఛ (2) విచారణ (3) తను మానస} **'జ్ఞానభూమికలు'** అనబడుచున్నాయి. అయితే తెలుసుకుంటే సరిపోతుందా! ఆత్మ గురించి తెలుసుకున్నది అనుక్షణికానుభవం కావాలి కదా! అందుచేత – (4) సత్త్వాపత్తి (5) అసంసక్తి (6) పదార్థభావన (7) తుర్యగము ఈ నాలుగు కూడా **యోగ (లేక) తుర్యగా విహార భూమికలు** – అని పిలువబడుచున్నాయి.

**నిదాఘుడు :** స్వామీ! ఋభు భగవాన్! సద్గురూ! మీరు చెప్పిన **'సప్తభూమికలు'** గురించి మరికొంత విశేషంగా వివరించమని అర్థిస్తున్నాను.

**ఋభు మహర్షి :** సప్త (7) భూమికల గురించి సమీక్షిస్తూ సంక్షిప్తంగా చెప్పుకుంటున్నాము. ప్రియ తపోధనా! నిదాఘా! వినండి.

# I. జ్ఞాన భూమికలు

## 1. శుభేచ్ఛా భూమిక

**"స్థితః కిం మూఢ ఏవ అస్మిన్?** ఇదేమిటిరా బాబూ! దృశ్యప్రపంచంలో ఏదో పొందాలి, చేయాలి, కావాలి, దాచాలి...ఇటువంటి అల్పాశయములలో బుద్ధిని నిలిపి రోజులు గడుపుచున్నానే! **"జీవించటము"** అనే అవకాశం యొక్క ఆశయం ఇదా? మూఢుడనై నా గురించి నేను తెలుసుకోవటం (ఆత్మగురించి), ఆత్మగా అనుకోవటం, ఆత్మగా అనిపించటం, నేనే ఇదంతా (ఆత్మస్వరూపుడుగా) అయి ఉండటము .... ఇటువంటి ఆయా మార్గములకు ఆత్మజ్ఞులు దారిచూపుచున్నారే! కాబట్టి ఇక శాస్త్రములను, సజ్జనులను ఆశ్రయిస్తాను. ఈ ప్రాపంచక విషయాలపట్ల అనురాగమును దరిజేరనీయక, విరాగినై వైరాగ్యపూర్వకంగా జీవితమును తీర్చిదిద్దుకుంటాను".

ఈ విధమైన శాశ్వతమగు, (దేహానంతరము కూడా ఉత్తమ ప్రయోజనకరము అగు) మార్గములను ఆశ్రయించుచుండటమును 'శుభేచ్ఛ' అని పిలుస్తున్నారు. **దృశ్య విషయములపట్ల వైరాగ్యము పెంపొందించుకోవటమే - శుభేచ్ఛయొక్క ముఖ్య లక్షణము.**

దృశ్యములో కనిపించేవన్నీ అశాశ్వతమని, దుఃఖ మిశ్రితమని గమనించి, దృశ్యమును దాటి గమనించాలనుకోవటమే శుభేచ్ఛ.

## 2. విచారణా భూమిక

'శుభేచ్ఛ' దృఢమగుచుండగా ముముక్షువు ఆత్మతత్త్వమును గుర్తు చేసే **సచ్ఛాస్త్రములను** పరిశీలించ ప్రారంభిస్తున్నాడు. క్రమంగా ఆత్మతత్త్వజ్ఞులగు **మహనీయులను ఆశ్రయించటమును** అధికం చేసుకొనుచున్నాడు. **అభ్యాసపూర్వకం వైరాగ్యమును ఆశ్రయించుచున్నాడు. తనయొక్క రాగమును గమనించుచూ, త్యజించుటకు ఉద్యుక్తుడగుచున్నాడు.**

<u>వైరాగ్యము</u>

1). **"హే పరమాత్మా! 'నావి' అనిపించేవన్నీ వాస్తవానికి నీవే కదా!"** అని అనుకోసాగటం.

2). జగత్తులోని విషయములకు సంబంధించిన అభిమానములను త్యజించి ఉండటము.

3). పరమాత్మయొక్క ఆరాధనను ప్రియంగా నిర్వర్తించటం.

4). మనో-బుద్ధులలోని దృశ్య పరిమిత భావావేశములను పరిత్యజించటము.

మొదలైనవి **"వైరాగ్యముయొక్క అంగములు"** - అనబడుచున్నాయి.

ఇక ఆతడు దురాచారములనుండి వెనుకకు మరలి, **అద్వేష్టా సర్వభూతానాం, మైత్రః - కరుణ నిర్మమో, నిరహంకారము, సమత్వము, క్షమ, దానము, ధర్మము** మొదలైన సదాచారములను ప్రవృద్ధి చేసుకొంటున్నాడు. జ్ఞాన విషయములు వైపు శ్రవణ - మననములను అధికం చేసుకొంటున్నాడు. ఇది **'విచారణ'** భూమికా విహారము.

## 3. తను మానసా భూమిక

'శుభేచ్ఛ, విచారణ'ల అభ్యాసముచే క్రమంగా ఈ జీవునికి శబ్ద - స్పర్శ - రూప - రస - గంధముల సంబంధమైన విషయముల పట్ల అభినివేశము (Emotional Involvement) తగ్గ సాగుచున్నది. దేహమునకు సంబంధించిన మమకారములు, అహంకారములు జయిస్తూ **'మానసిక దేహము'** (స్థూలమునుండి సూక్ష్మము) వైపుగా ప్రయాణించుచున్నాడు. **ఇది తనుమానస భూమికా ప్రవేశము అగుచున్నది.** ఆతనికి మనస్సు స్వాధీనము కాసాగుచున్నది. ఆలోచనా రూపమగు మనస్సును నిరోధించటము, నియమించటము, స్వాధీనము చేసుకోవటము ప్రారంభిస్తున్నాడు.

ఈ '3' భూమికలు **జ్ఞాన భూమికలు** (తెలుసుకోవటం)గా చెప్పబడుచున్నాయి. మనస్సు ఇంద్రియార్థములనుండి వెనుకకుమరలుచూ, చిత్తము వశము కాసాగుచున్నది.

# II. యోగ/తుర్యగా విహార భూమికలు

## 4. సత్త్వాపత్తి భూమిక

శుభేచ్ఛ, విచారణ, తనుమానసల సుదీర్ఘమైన అభ్యాసముచే చిత్తము విషయముల నుండి వెనుకకు మరలుచు, సునిశితము – పవిత్రము – విస్తారము కాసాగుచున్నాయి. 'సత్ వస్తువు' అగు ఆత్మను ఆశ్రయించసాగుతుంది. చిత్తము శుద్ధమగుచు, **'సత్త్వాత్మ'** యందు స్థితిని పొందుచూ ఉండు భూమికను **'సత్త్వాపత్తి'** – అని పిలుస్తున్నారు. సాత్త్వికమైన ప్రేమ, దయ, కరుణ, ఆప్యాయత మొదలైనవి ఈ భూమికలో ప్రవృద్ధము, స్వాభావికము కాసాగుతాయి. సహజీవులలో ఆత్మను దర్శించటము, అందరినీ పరమాత్మ స్వరూపులుగా భావించటము ప్రారంభిస్తున్నాడు.

## 5. అసంసర్గ భూమిక (లేక) అసంసక్తి భూమిక

'శుభేచ్ఛ, విచారణ, తను మానస, సత్త్వాపత్తి' అనే '4' భూమికలు అభ్యాసముచే క్రమంగా 'అసంసర్గ' అను ఉత్తమ ప్రయోజనముగల ఐదవ భూమికలో ముముక్షువు ప్రవేశము పొందుచున్నాడు. 'ఆత్మభావన' లేక ఆత్మతో సంసక్తి భావనయందు ఆరూఢత్వము – 'అసంసక్త' అను భూమిక అగుచున్నది.

- నేను దేహమును కాదు. **'దేహి'**ని. ఎందుకంటే నేను కదల్చుటచేతనే దేహము కదులుతోంది. నేను చైతన్య స్వరూపుడను. ఈ శరీరము జడము.
- దేహము నాకు వస్త్రము వంటిది. ఇది నేను **ధారణ** చేస్తున్నట్టిది.
- ఆత్మనగు నేను జాగ్రత్ పరిమితుడనుకాను. తదితర స్వప్న–సుషుప్తి–తురీయములకు కూడా పరిమితుడను కాను.
- జాగ్రత్ స్వప్న సుషుప్తులకు ఆవల గల తురీయమునకు కూడా సాక్షిని.

ఈ విధంగా ఎరుగుచు సర్వ దృశ్య విషయములపట్లగల సంసర్గము (Attachment, Relatedness)ను పాము కుబుసమువలె విడచివేయుచున్నాడు. జగద్విషయములన్నీ ఇక ఆతనిపట్ల 'అవిషయములు' అవసాగుచున్నాయి. అతని దృష్టి, ధ్యాస పరమాత్మగా దర్శనమునందు సునిశ్చితమవసాగుచున్నాయి.

**"ఈ ప్రాపంచిక విషయములు నాయందు లేవు. నేను వీటియందు లేను. నాటకములో 'పాత్ర' (Role) పొందుచున్న కష్ట – సుఖములు పాత్రధారుడు పొందడు కదా! నాటకములోని పాత్రగా నాటకరంగము (Stage) పై రాకపోకలు తన నటనా చాతుర్యమునకు ప్రారంభ – ముగింపులు కాదు కదా! అట్లాగే ఈ జగన్నాటకములో జీవాత్మగా ఉన్నంత మాత్రంచేత ఈ భౌతికదేహము నాకు ప్రారంభము కాదు. ముగింపు కాదు. ఇది నాకు సందర్భ మాత్రమే".**

ఇది గ్రహించి ఈ ఇంద్రియములకు దృశ్యరూపంగా కనిపించేదంతా, వాటి వాటి ప్రదర్శనములను నాటకీయభావనతో దర్శించువాడు **'అసంసక్తుడు' (లేక) అసంసర్గభావనలో ప్రవేశించినవాడు** గా చెప్పబడుచున్నాడు.

## 6. పదార్థ భావనా భూమిక

**భూమికా పంచకాభ్యాసాత్ స్వాత్మా రామ తయా భృశమ్...., అభ్యంతరాణాం, బాహ్యానాం పదార్థానామ్ అభావనాత్।।** **'శుభేచ్ఛ, విచక్షణ, తనుమానస, సత్త్వాపత్తి, అసంసర్గ'** – అను 5 భూమికలు సాధన స్థానములు అగుచుండగా క్రమంగా ఈ జీవుడు 'ఆత్మ' అను పదార్థానుభవమును సమీపిస్తున్నాడు. స్వ – ఆత్మారాముడై – **"బంగారంలో ఆభరణమున్నట్లు, కథా రచయితలో కథా రచనా చమత్కారమంతా ఉన్నట్లు, జలములో తరంగములు ఉన్నట్లు, ఈ జగత్ దృశ్యమంతా ఆత్మనగు నాయందే ప్రదర్శనమగుచున్నది"**.... అను భావనను నిశ్చలం చేసుకొనుచున్నాడు. తనయొక్క బాహ్య – అభ్యంతరములతో (outer side as well as inner side) ఆత్మకు భిన్నమై మరొక పదార్థమే లేనట్లు గమనిస్తున్నాడు.

☞ పదార్థము – **శక్తి రూపము।**

☞ శక్తి – **శక్తిమంతుని రూపము।**

☞ శక్తిమంతుడు – **ఆత్మరూపము। కనుక సమస్తము ఆత్మస్వరూపమే।**

స్వప్నంలో వస్తు జాలమంతా స్వప్న చైతన్యరూపమే అయినట్లు – ఈ జగత్తంతా **ఆత్మచైతన్య ఆనంద ప్రదర్శనమే।**

- సర్వము **పరమాత్మయొక్క సంప్రదర్శనమే।**
- నేను – నీవు అనునదంతా **ఆత్మారామ విన్యాసమే।**

- కనుక నేను **ఆత్మానందరూపుడను।**
- అనగా ఇదంతా నీవు – ఆతడు – ఈతడుతో సహా – **స్వాత్మారామమే।**

ఈ విధంగా భావన చేయుచున్నాడు.

చిరకాలంగా ఇహంలో కనిపించే సహజీవులను **'పరస్వరూపం'**గా (ఆత్మస్వరూపులుగా) దర్శిస్తూ **'పరమాత్మయే ఈ సర్వ రూపములుగా ప్రదర్శనమగుచున్నారు' – అను అభ్యాసముచే నామరూపాత్మకమైనదంతా అధిగమించుచున్నాడు.** ఆతని పట్ల పదార్థ – అభావనము యొక్క అవబోధనము (అనుభవము) స్వభావసిద్ధమగుచున్నది. ఈ విధంగా ఈతడు **'పదార్థభావన'** భూమికయందు సంస్థితుడగుచున్నాడు. ఇది **"భౌతికపదార్థ అభావన– ఆత్మ పదార్థ భావన"** – అను రెండు అభ్యాసములతో కూడిన స్థితి కాబట్టి "పదార్థభావన" అనబడుచున్నది.

## 7. తుర్యగా భూమిక

పైన మనం చెప్పుకొన్న '6' భూమికల చిరకాల అభ్యాసము అవలంబనము చేత – సర్వ భేద దృష్టులు అనుపలంభనము (లేకుండా పోవటం) జరుగుతోంది.

(1) **"జాగ్రత్ స్వప్న సుషుప్తులు నాయొక్క స్వయం కల్పిత లీలా వినోద విహార భూములు కదా!"** – అను అనుభవము, ఆశ్రయించువాడు **"తుర్యగా భూమిక"**లో ప్రకాశించినవాడుగా చెప్పబడుచున్నాడు.

(2) **'సకల భూతజాలము తానే'** అగుచున్నాడు.

(3) **సకలమునకు సాక్షిగా వేరై కూడా** ఉంటున్నాడు.

(4) **"ఈ సమస్తము నేనే। నాయందే। నావలననే"** – అను కేవలరూప కైవల్యానుభూతి సిద్ధించుకొనుచున్నాడు.

ఎవ్వరు తమ **ఆత్మయందే ఈ సర్వమును, సర్వమునందు తనయొక్క ఆత్మయే** స్వభావంగా దర్శించుచున్నాడో అది 'తుర్యగ గతి' అని పిలుస్తున్నారు. 'తుర్యగా భూమిక'లో ప్రకాశించినవానికి – తనకు అన్యమైనదంతా స్వకీయ, స్వయం కల్పిత వినోద ప్రదర్శనమే – అగుచున్నది. అయ్యది **'తురీయానందము'**గా చెప్పబడుచున్నది.

### భేద – అభేదయుతములు

(1) శుభేచ్ఛ (2) విచారణ (3) తనుమానస

ఈ '3' భూమికలు (1) భేదయుతము (2) అభేదయుతము – అని రెండు విధములుగా ఉంటోంది.

**భేదయుతము :** 'ఎరుక' గల బుద్ధిచే (వేదబుద్ధ్యా) ఈ జాగ్రత్ జగత్తు అంతా దృశ్య మానమౌతోందో, అట్టి ఇదంతా ఆత్మనగు నాకు ద్వితీయము. ఇదంతా అనేక భేదములు కలిగియున్న దృష్టి భేదయుతము (లేక) ద్వైత దృష్టి (భిన్నత్వ దర్శనము).

**అభేదయుతము :** ఈ జాగ్రత్ దృశ్య ప్రపంచమంతా నవలలో కథా గమనంలాగా నాటకంగా నడుస్తున్న వ్యవహారంగా గమనించటము. "ఇదంతా ఆత్మకు అభేదము – అను భిన్నత్వంలో ఏకత్వ దర్శనము (అభేదయుతము).

ఈ జగత్తులోని సర్వనామ –రూపములను, సంఘటనలను, సందర్భములను కలలోని వ్యవహారములుగా చూస్తూ ఉండటము తుర్యగము. **పశ్యంతి స్వప్నవత్ లోకం తుర్య భూమి సుయోగతః।** తురీయ భూమికను సంచారస్థలంగా కలిగి ఉంటూ అఖండాత్మతో సంయోగము సిద్ధించుకున్నవాడై – **'ఇదంతా కేవలము స్వకీయ స్వప్న సదృశము'**...అను భావనతో చూస్తున్నాడు.

శరదృతువులో ఆకాశంలో కనిపించే దట్టమైన మేఘాలు విచ్ఛిన్నమగుతాయి కదా! అప్పటివరకు ఏ ఆకాశ స్థానమును మేఘములు ఆక్రమించుకొని ఉన్నాయో – అదంతా కూడా – మేఘాలు తొలగిన తరువాత – (ఆమేఘములచే ఆక్రమించబడిన) ఆకాశ స్థానము ఏమౌతుంది? మహాకాశంలోనే ఉంటుంది కదా, ఓ నిదాఘా! అభేద దృష్టిచే సమస్త ద్వైతము అద్వైతమునందు (భావనచే) విలీనము పొందినదిగా అగుచున్నది. **తుర్యగునికి ఈ సమస్తము నిర్విషయమగు స్వస్వరూపాత్మగా అనుక్షణం స్వానుభవమౌతోంది.**

'సత్' స్వరూపమగు ఆత్మాకాశమునందు తుర్యగుడు స్వస్వరూపమును ఏకం చేసి తనను తాను **'సర్వాంతర్యామి – సర్వ తత్త్వ స్వరూపుడు'**గా గమనిస్తున్నవాడై, భౌమానందమును ఆస్వాదించుచున్నాడు.

అందుచేత ఓ నిదాఘా! నీవు కేవలము – అఖండము అగు అఖండాత్మాకాశమును స్వస్వరూపంగా భావించటము సుదృఢము చేసుకో. సర్వ ద్వైతములను అద్వైతమునందు విలీనము చేసివేయి.

## నిద్రాళు యోగము (లేక) సుషుప్తి యోగము

ఈ జీవుడు మొదటి నాలుగు భూమికలగు 'శుభేచ్ఛ, విచారణ,తనుమానస, సత్త్వాపత్తి, అసంసక్తి'....లలో సాధన పూర్వకంగా సంచరిస్తూ ఆపై 5వ భూమిక అగు **'అసంసక్తి'** భూమికలో ప్రవేశించుచున్నాడు కదా! అటువంటి పంచమభూమికయగు అసంసక్తిభూమికలో సంచారములు చేస్తున్నప్పుడు – అది **'సుషుప్తి పదము'** అని పిలుస్తున్నారు. పరమశాంతమును అవధరిస్తూ, అద్వితీయుడై (ఆత్మగా తనకు ద్వితీయమేలేని భావనచే) – **'అద్వైత విశేషాంశ'** యందు ఆతడు సుతిష్ఠితుడు అగుచున్నాడు. "జగత్ విషయములు, భేదములు మొదలే లేవు" – అను అంతర – దర్శనమే నిద్రాళుత్వము.

అట్టివాడు బహిర్, వృత్తులను ప్రదర్శించవలసి వస్తూ ఉన్నప్పటికీ, సర్వ సమయ – సందర్భములలో అంతర్ముఖుడై ఉంటాడు. ఆత్మనే సర్వే సర్వత్రా దర్శించుచూ, 'మమేకము' అయి ఉంటున్నాడు. 'జాగ్రత్తు'లో వ్యవహరిస్తూనే 'గాఢనిద్ర'లో ఉన్నవానివలె సమస్తమునకు అతీతుడై ఉంటున్నాడు. పరమవిశ్రాంతియుతుడై ఉంటున్నాడు. ఇట్టి స్థితిని **'సుషుప్తి యోగము'**గా పిలువబడుతోంది. ఆతనికి బంధువులు, తదితరులు కూడా అభేదమగు అఖండాత్మగా దృశ్యమానమగుచున్నారు.

6వది అగు పదార్థ–భావనా భూమికయందు సర్వవాసనలు జయించి వేసి **'సమ్యక్ స్థితి'** (All Equality experience)ని పొందుచున్నాడు.

**ఇక 7వ భూమికలో అత్యంత గూఢము (రహస్యము), జన్మ – కర్మలకంటే మునుముందే ఉన్న పురాతనమగు స్వస్వరూపమును ఆస్వాదించుచున్నాడు. అట్టి 'కైవల్యము' అనబడే సర్వాత్మస్థితి అనిర్వచనీయం. వర్ణనలకు అతీతమగు స్వానుభవము.**

⌘ ఎక్కడ అసత్ గాని, సత్ గాని ఉండి ఉండదో....,

⌘ అహంకారమనిగాని, అనహంకారమని చెప్పలేమో....,

⌘ **అంతశ్శూన్యో బహిశ్శూన్యోః శూన్య కుంభ ఇవ అంబరే।** ఆకాశమువలె అంతరమున శూన్యస్వరూపమో, బాహ్యమునకూడా శూన్యమో, సర్వము శూన్యము (లేనిది)గా అగుచున్నదో..., కుండలో బయట లోపల ఆకాశమే ఉన్నతీరుగా సర్వ దేహములలో **లోపల–బయట ఆత్మాకాశమే కనబడగలదో,**

⌘ **అంతః పూర్ణో బహిః పూర్ణః పూర్ణ కుంభ ఇవ ఆర్ణవే।** సముద్రము వలె ఏది అంతర్‌పూర్ణము (మరియు) బహిర్ పూర్ణమో, సర్వము పూర్ణముగా అనుభవమగుచున్నదో..., నీటిలో మునిగిన కుండ, లోపల–బయట జలము కలిగి ఉండుతీరుగా, **సమస్తము ఆత్మయొక్క ఉనికిచే పూర్ణమో...,**

అట్టి స్వాత్మారామరూపుడవై ఉండుము. **మా భవ గ్రాహ భావాత్మా గ్రాహకాత్మా చ మా భవ।** భావములను గ్రహించవద్దు. త్యజించనూ వద్దు. భావనలన్నీ అధిగమించినవాడవై, అప్పటికే ఏది శేషించుచున్నదో – అట్టి భావనలకు మునుముందే ఉన్న కేవలీ తత్త్వముతో మమేకమై ఉండుము. **"నేను సమస్త భావనలకు మునుముందే ఉన్నట్టి కేవలీస్వరూపుడను"** అను స్వాభావికానుభవమే **"కైవల్యము".**

(1) ద్రష్ట (Perceiver) (2) దర్శనము (3) దృశ్యము ఈ మూడింటిని వాటి వాటి వాసనలు(Tendencies) తో సహా పరిత్యజించి వేసి, **దర్శనమునకు మొదలే ఉండి, దర్శనము రూపంగా కూడా (అద్దంలో ప్రతిబింబమువలె) ఉన్న కేవలమగు ఆత్మను, నీయందు నాయందు, సర్వ సహ జనులయందు దర్శిస్తూ ఉపాసించుము.** జలములో ప్రతిబింబ దృశ్యమువలె ఆత్మయందు ఈ సర్వము దర్శించుము. **సర్వము ఆత్మగా సేవిస్తూ ఉండు. జీవిస్తూనే సర్వమునకు అతీతుడనై, జీవన్ముక్తుడనై విరాజిల్లుము.**

## జీవన్ముక్తుడు

**నిదాఘుడు :** జీవన్ముక్తుని యొక్క విశేష లక్షణములను, మాయొక్క మార్గదర్శనము కొరకై వివరించండి.

**ఋభువు :** జీవన్ముక్తుని యొక్క కొన్ని స్వభావ లక్షణములను మన మన మార్గ దర్శనము యొక్క గుర్తు కొరకై, అనుసరణము కొరకై వివరించి చెప్పుకొందాము. వినండి. **"జీవితము' – అను సందర్భము, సంఘటనచే నేను బద్ధుడను కాను, పరిమితుడను కాను"** అను నిశ్చలమైన సందర్భాతీత అవగాహన కలవాడే **'జీవన్ముక్తుడు'.**

ఓ నిదాఘా! ఈ లక్షణములను ప్రతిజీవుడు (బ్రహ్మచారి, గృహస్త, వానప్రస్థ, సన్యాస – ఇత్యాది) ఏ ఆశ్రమంలో ఉన్నా కూడా అనుసరించి, స్వాభావికం చేసుకొనుచుండగా క్రమంగా జీవన్ముక్తుడై ప్రకాశించగలడు.

## యథాస్థితమ్।

❖ ఒక నటుడు తాను నటిస్తున్న పాత్రకు తగినవిధంగా పరస్పర సంబంధములు, సుఖ – దుఃఖములు, గుణములు, స్వభావములు కలిగియున్నట్లు నటిస్తూ ఉన్నప్పటికీ – అవన్నీ బాహ్యానికి నాటకరంగముపై కళాత్మకంగా ప్రదర్శిస్తాడు. అంతవరకే! ఆ సంబంధములు, ఆ సుఖదుఃఖములు, ఆ గుణములు, ఆ స్వభావములు – తనయందు కలిగి ఉంటాడా? లేదు కదా!

- ❖ ఒక కథా రచయిత తాను కథలో రచించుచున్న పాత్రల గుణములు తనవిగా కలిగి ఉంటాడా? అది జరుగదు కదా!
- ❖ పడవ నీళ్ళలో తేలుచూ ఉన్నప్పటికీ పడవలోకి నీళ్ళు రావు కదా! **అట్లాగే,**

**యథా స్థితమ్ ఇదమ్ యస్య వ్యవహారవతోఽపి చ, అస్తంగతం స్థితం చిత్తం, స 'జీవన్ముక్త' ఉచ్యతే॥**

ఎవ్వడైతే క్షణక్షణము అనేక వ్యవహారములు నిర్వర్తిస్తూ, నిర్వహిస్తూ ఉన్నప్పటికీ అంతర హృదయాకాశంలో స్వభావతః అతీతంగా సర్వదా యథాతథంగా ఉండి ఉంటాడో – అట్టివాడు **'జీవన్ముక్తుడు'** అని పిలువబడుచున్నాడు.

## యథా ప్రాప్తమ్।

**న–ఉదేతి న – అస్తమాయాతి సుఖ దుఃఖే మనః ప్రభా, యథా ప్రాప్త స్థితిః యస్య –** ఎప్పుడు ఎక్కడ ఏఏ స్థితి గతులు పొందటం జరుగుచున్నా కూడా, ఎవ్వరి మనసైతే ఇక్కడి సుఖ – దుఃఖ సంఘటనలలో ఉదయించక, అస్తమించక ఉంటుందో, యథాప్రాప్త స్థితులచే పొంగక – కృంగక ఉంటుందో, అట్టి మనస్సు గలవాడు – **స 'సజీవన్ముక్త' ఉచ్యతే।** 'జీవన్ముక్తుడు' అని అనబడుచున్నాడు.

## నిర్వాసనా – సుషుప్తుడు।

గాఢ నిద్రలో ఉన్నవాడు ఈ ప్రపంచములోని ఏవిషయములోను 'కించిత్' కూడా సంబంధము లేనివాడై ఉంటాడు కదా! **యో జాగర్తి సుషుప్తి స్థో యస్య జాగ్రత్ న విద్యతే, యస్య నిర్వాసనో బోధః, స 'జీవన్ముక్త' ఉచ్యతే।** ఎవ్వడి జాగ్రత్ అనుభవమంతా ఆతనిపట్ల సుషుప్తితో సమానమై ఉంటుందో, (అనగా) జాగ్రత్‌లో ఎటువంటి వాసనలు (పుణ్య – పాప – ఇష్ట – అయిష్ట – త్యాజ్య – స్వీకార – కష్ట – సుఖ – ఇత్యాది భావనాపరంపరలు) కలిగి ఉండకయే ప్రవర్తిస్తాడో...., అట్టివాడు **జీవన్ముక్తుడు.** ***ఆతని జాగ్రత్తు సుషుప్తితో సమానమై ఉంటుంది. "ఈ జాగ్రత్‌కు ఆవల సర్వదా కేవల సాక్షిని" – అను అవగాహనయందు నిశ్చలుడై, నిశ్చయుడై ఉంటాడో, అదియే "జీవన్ముక్తి". ఆతడు ఒక పాఠకుని వలెనే ఉంటాడేగాని, తాను చదివే నవలలో (దృశ్యములో) ఒక పాత్రగా అవడు.***

## అంతర్ – స్వచ్ఛత – రాగద్వేషభయాతీతమ్।

**రాగ ద్వేష భయాదీనామ్ అనురూపం చరన్నపి, యో అంతః వ్యోమవత్ స్వచ్ఛం।** ఎవ్వడు జీవితములోని ఆయా సందర్భములలో అనురాగము, అయిష్టత, ద్వేషము, భయము మొదలైనవి తత్ సందర్భానుసారంగా ప్రదర్శిస్తూ కూడా, అంతరంగములో సర్వదా ఆకాశమువలె స్వచ్ఛత కలిగినవాడై ఉంటాడో, ఆతడే జీవన్ముక్తుడు – **స జీవన్ముక్త ఉచ్యతే॥**

## అకర్తృత్వ – నిర్మలబుద్ధి।

**యస్య నాహం కృతో భావో, బుద్ధిః యస్య న లిప్యతే।** ఎవ్వడైతే తాను ఏదేది చేయుచున్నప్పటికీ (లేక) చేయకపోవుచున్నప్పటికీ **(కుర్వతో – అకుర్వతోవాఽపి)** – 'నేను చేయుచున్నాను. (లేక) చేయలేకపోవుచున్నాను' – అనురూపముగా ఏర్పడే కర్తృత్వము త్యజించి ఉంటాడో, ఆతని బుద్ధి మహత్తరమగు అవగాహనతో (ఆత్మబుద్ధిగా) నిర్మలమై, సర్వాతీతమై ఉంటుందో **అట్టివాడు జీవన్ముక్తుడు.**

## ఉద్విగ్న రాహిత్యము।

**యస్మాత్ న ఉద్విజతో లోకో, లోకాత్ న ఉద్విజతే చ యః।** ఎవ్వడు ఈ లోక వ్యవహారములను చూచి **సంతోష దుఃఖ భయ ఉద్వేశ్యములను** పొందక, ఇతరులను చూచి తాను ఉద్విగ్నత (వెఱపు, చింత) చెందక, తనవలన ఇతరులకు ఉద్విగ్నత కలుగనీయక ఉంటాడో...ఆతడు జీవన్ముక్తుడు. **హర్ష–ఆమర్ష–భయోః ముక్తః – స జీవన్ముక్త।**

## అర్ధజాలములలో ప్రశాంతత।

**యః సమస్త అర్థ జాలేషు వ్యవహార్యపి శీతళః, పరార్థేషు ఇవ పూర్ణాత్మా।** ఎవ్వడైతే ఆయా అనేక ఇంద్రియార్థ విషయములైనట్టి – శబ్ద స్పర్శ రూప రస గంధ విషయములలో వ్యవహరిస్తూ ఉంటూ కూడా, వాటికి సంబంధించిన ప్రియ – అప్రియములు కలిగి ఉండడో, పదార్థముల మధ్యగా వ్యవహరిస్తూ తనయొక్క **'పూర్ణాత్మత్వము'**ను కించిత్ కూడా వీడనివాడై ఉంటాడో – ఆతడు జీవన్ముక్తుడుగా చెప్పబడుచున్నాడు.

## సర్వాత్మకే తుష్టః।

**ప్రజహాతి యదా, కామాన్ సర్వాం చిత్త గతాన్, మునే! మయి సర్వాత్మకే తుష్టః।** ఓ మునీశ్వరా! చిత్తములో రూపుదిద్దుకొనే సర్వ కామములను (All Desires, Expectations, Preconceived Notions, Pre-requistes etc.,) మొదలంట్లా అంతరమున త్యజించి, ఆ చిత్తమును సర్వాత్మకుడనైన నాయందు ప్రతిక్షేపించి పరమానందమును, తృప్తిని పొంది ఉంటాడో, అట్టివాడు **జీవన్ముకుడు.**

## కేవల చిన్మాత్రమ్।

**చైత్య వర్జిత చిన్మాత్రే పదే పరమ పావనే, అక్షుబ్ధ చిత్తో విశ్రాంతః।** ఈ మనస్సును కదిలించే 'చైత్యము'ను వదలి **కేవల చిన్మాత్రమును** ఆశ్రయించువాడు; తెలియబడేది వదలి; **'కేవల తెలివి'**ని (Absolute knowing) ధారణ చేయువాడు; కదలికలన్నీ త్యజించి **'కదిలించే కేవల చిత్'**ను స్వస్వరూపముగా ఆస్వాదించు అభ్యాసి. చిత్తములోని సర్వదురభ్యాసములు, సర్వ సంశయములు బయటకు వెడలగొట్టి అక్షుబ్ధ (undistracted, unperturbed) చిత్తమును ధరించువాడు – అట్టి నిర్విషయ కేవల చిత్తముతో పరమ విశ్రాంతి సర్వదా సొంతము చేసుకొని ఉన్నవాడు– **జీవన్ముక్తుడు.** **(చైత్యము = ఇంద్రియములకు తెలియబడేది. దృశ్య విషయములు)**

## ఈ జగత్తు స్వప్నమువలె అవాస్తవం

ఈ జగత్తు, ఈ జగత్తులో వేరువేరైన విశేషాలుగా కనిపించే నీవు – నేను మొదలైనవి, ఆయా స్వభావాలు... వీటన్నిటితో కూడి కనిపిస్తున్న ఈ దృశ్యజాతమంతా కూడా కథలోని అరణ్యం, స్వప్నంలోని భవనము, ఊహలోని సుందరి (ఊహాసుందరి) వలె అవాస్తవం. ఎవరి చిత్తము ఇదంతా స్వప్నసదృశంగా దర్శిస్తూ, స్వప్నంవలె మాత్రమే ఎవరి చిత్తమునకు స్ఫురిస్తూ ఉంటుందో, అట్టి చిత్తము కలవాడు జీవన్ముక్తుడు. **ఇదం జగత్ అహమ్ సోఽయమ్–దృశ్య జాతమ్ అవాస్తవమ్,–యస్య చిత్తేన స్ఫురతి–స జీవన్ముక్తః॥**

ఓ నిదాఘా! ఈ విధంగా మనము జీవన్ముక్తుని లక్షణముల గురించి చెప్పుకున్నాము. నీవు ఆచార్యులు చెప్పుచున్న తత్ – త్వమ్ (You are always that and not merely this)ను శ్రద్ధగా శ్రవణం చేయి. శాస్త్రములు పరిశీలించి ఈ విషయం సుస్పష్టం చేసుకో. **సత్ బ్రహ్మణి స్థిరే స్ఫారే పూర్ణే విషయ వర్జితే, ఆచార్య శాస్త్ర మార్గేణ ప్రవిశ్యాశు స్థిరో భవ!** అత్యంత సుస్థిరము, సర్వదా ఏర్పడిన స్ఫారము, పూర్ణము, సర్వ విషయములకు అతీతము అగు **'సత్‌బ్రహ్మము'** నందు నీ చిత్త – మనస్సులను ప్రవేశింపజేయి. ఆత్మస్వరూపముచే సశాంతుడవగుము. **మానవుడుగా జన్మించిన అవకాశము సద్వినియోగము అవటము ఇదియే.**

## సర్వం శివమయమ్

నాయనా! నిదాఘా! ఇదంతా శివమయం! శివాత్ పరతరమ్ నాస్తి! శివునికి వేరుగా అన్యమైనది ఏదీ ఎక్కడా లేదు.

శివుడే శివతత్త్వమును బోధిస్తూ 'జీవో శివః', 'తత్‌త్వమ్' అను మహత్ వాక్యములను నిరూపించు గురువు. అట్టి గురువే శివుడు।

- శివుడే వేదము–వేదస్వరూపుడు–వేద పురుషుడు కూడా! తెలియబడేదంతా శివస్వరూపమే। తెలుసుకుంటున్నవాడూ శివుడే!
- శివుడే ఈ శరీర నిర్మాణ – దివ్యప్రజ్ఞాస్వరూపులగు దేవతలు. శివుడే దేవదేవుడు।
- సర్వమునకు ప్రభువు, అధినేత, నియామకుడు, ఈశ్వరుడు శివుడే।
- నేను నీవు శివస్వరూపులమే।
- సర్వము శివుడే! శివమే! **శివాత్ అన్యత్ న కించన!** శివునికి వేరైనదంటూ ఎక్కడా ఏదీ లేదు।

అట్టి శివతత్త్వమును ఎరిగిన ధీరుడు ('ధీ'శక్తి లేక బుద్ధికుశలత కలవాడు) శివజ్ఞానముచే బ్రహ్మమును ఎరిగిన 'బ్రాహ్మణుడు' అగుచున్నాడు. **'శివోఽహమ్'** – స్వానుభవమును పుణికిపుచ్చుకొనుచున్నాడు.

## బ్రహ్మము – బ్రాహ్మణ – ముక్తి

**నిదాఘుడు :** బ్రహ్మమును ఎరిగి, బ్రహ్మమునే దర్శిస్తూ బ్రహ్మమే తానగుచున్న 'బ్రాహ్మణ' శబ్దము గురించి మరికొంత వివరించండి. ముక్తికి మార్గములు ఏమో కూడా దయచేసి చెప్పండి.

**ఋభు మహర్షి :** బిడ్డా! నిదాఘా! బ్రహ్మమును తెలియజేయుటకై బ్రహ్మజ్ఞులు మనకు శబ్దజాలమును ఉపయోగించి బోధిస్తున్నారు. వాస్తవానికి ఒక్కమాటలో చెప్పాలంటే, **'నేను'** అను దానియొక్క వాస్తవమగు ఇహ –పర – పరాత్పర – తత్త్వమే ఇదంతా। **ఇక్కడ ఒక సూచన.**

**న అనుధ్యాయాత్ బహూన్ శబ్దాన్।** మహనీయులెందరో వేరువేరు సాంఘిక స్థితులలో అవాక్‌మానసగోచరమగు ఆత్మతత్త్వముగురించి చెప్పటానికి అనేక శబ్దములు ఉపయోగించారు. ఈ విధంగా సాంఖ్యయోగ పూర్వకంగా, ప్రాణోపాసనాపూర్వకంగా, జ్ఞానయోగపూర్వకంగా అనేక శబ్దములన్నీ వాడబడ్డాయి. **అనేకానిచ శాస్త్రాని। కల్పాయుః। విఘ్నకోటయః।** అనేక శాస్త్రాలు। అనేక శబ్దాలు. కాని ఆయుష్షు స్వల్పము. ఇక్కడే, ఇప్పుడే ఆత్మతో అనన్యత్వము సిద్ధించుకోవాలి మరి। అందుచేత **శబ్దజాలమును అధికంగా చర్చిస్తూ, వాటి అర్థములపట్ల వేరువేరు అభిప్రాయములను చర్చించుచూ కాలం వృథా చేసుకోవటం ఉచితం కాదు.** ఇంకొక విషయం కూడా. **వాచో విగ్లాపనం హి తత్!** అధికంగా మాట్లాడుకుంటూ ఉండటము ఆత్మానుభవమునకు విగ్లాపనమే అగుచున్నది.

# ముక్తికి రెండు మార్గములు

ఇక నీవడిగిన ముక్తి మార్గముల గురించి చెప్పుకుందాము. ముక్తికి మార్గములు రెండు

**(1) శుకమార్గముక్తి (సద్యోముక్తి) – విహంగ మార్గము (2) వామదేవ మార్గముక్తి (క్రమముక్తి) – పిపీలికా మార్గము**

ముక్తిమార్గములు ఈ రెండే! మూడవది లేదు.

**శుకమార్గ ముక్తి :** దీనిని 'సద్యోముక్తి' అని కూడా అంటారు. (Direct ముక్తి). ఆకాశంలో పక్షి ఏ బంధము లేకుండా హాయిగా విహరించురీతిగా బ్రహ్మాకాశములో విహారముచేయు యుక్తితో కూడిన ముక్తి కాబట్టి **'విహంగముక్తి'** అని కూడా అంటారు. ఇట్టి యోగి....,

→ పరతత్త్వము పట్ల వ్యావృత్తి, తీవ్రేచ్ఛను పొందటముచేతను,

→ ఆత్మజ్ఞులగు గురువుల పట్లగల భక్తి శ్రద్ధల వలన, సేవించుచుండుట వలనను,

→ విధి ముఖ్యంగా (విధివిధానంగా) వేదములు సూచిస్తున్న మార్గంలో యజ్ఞ – యాగ – స్తుతి – ఉపాసనలచే బుద్ధి నిర్మలము, సునిశితము, సవిస్తారము అవటం చేతను, నిర్వృత్తిమార్గంగా బ్రహ్మలోకం జేరి బ్రహ్మదేవునిచే ఉపదేశించబడటంచేతను,

→ **వేదసారములగు 'తత్ – త్వమ్ అసి', 'అయమాత్మా బ్రహ్మ', 'బ్రహ్మ సత్యమ్ – జగత్ మిథ్య', 'సోయమాత్మా బ్రహ్మ', 'శివాత్ పరతరమ్ నాస్తి', 'సోఽహమ్', 'అహమ్ త్వమేవ'** మొదలైన మహావాక్యముల పరమార్థము (Finest Meaning) – అంతరార్థము(Inner meaning) లను గురుముఖతః విని, అర్థం చేసుకొని, మననము చేయుచు తనను తాను ఆత్మకు అనన్యంగా అనుభూతపరచుకోవటంచేతను,

→ సాంఖ్యయోగ మార్గంగా చెప్పబడిన పంచభూత, జ్ఞానేంద్రియ – కర్మేంద్రియ – వాటి వాటి విషయ, అంతరంగ చతుష్టయ, జీవాత్మ – ఈశ్వర – పరమాత్మల నిర్వచనములను గురుముఖతః విని ఆకళింపుజేసుకొని పరమసత్యమును స్వస్వరూపముతో ఏకము చేసి ఉండటము చేతను,

→ శ్రవణ (వినటం లేక తెలుసుకోవటం) – మనన (తనకు తానుగా అనుకోవటం) – నిదిధ్యాస (తనకు అనిపించటం) – సమాధి (అదే తానవటం) అనే శ్రవణాది చతుర్విధ ప్రయాణ పరాకాష్ఠ చేతను,

పై 'ఒకటి' 'రెండు' (లేక) కొన్ని (లేక) అన్నిమార్గముల అంతిమ ప్రయోజనంగా

- *'ఆత్మ' గురించి అధ్యయనము చేయటము.*
- *స్వాత్మరూపుడై, అన్యమంతా తనయందు, తననే అన్యమునందు దర్శించటము.*
- *సర్వభూతస్థమ్ ఆత్మానమ్ – నేను సర్వజీవులలో నిత్యోదితుడనై ఉన్నాను – అను సందర్శనము.*
- ***సర్వభూతాని చ ఆత్మని**–నాయందే పిపీలికాది బ్రహ్మపర్యంతము–(రచయితలో కథ, పాత్రలు ఉన్నట్లు)–ఉన్నది అను మహత్ భావన.*

ఇటువంటి స్వాభావిక – అనుక్షణిక నిశ్చల – నిశ్చిత బుద్ధి స్థితి – **శుక విముక్తి మార్గము, 'ఇప్పుడే ఇక్కడే ఇది ముక్తి!'** అని ఎరిగి, ఇప్పటికిప్పుడే 'ఆత్మ'తో అద్వితీయమై ఉండటమును **'సద్యోముక్తి'** లేక **'శుకముక్తి మార్గము'** – అని అనబడుచున్నది. "తత్ – త్వమ్ – నీవు సర్వదా బ్రహ్మమే అయి ఉన్నావు" – అను వేద వాక్యముపట్ల పూర్ణ విశ్వాసమే సద్యోముక్తి.

**వామదేవమార్గముక్తి :** ఇది క్రమముక్తి (Step by step and then afterwards Mukthi). ఎవ్వరైతే యోగాభ్యాసములు విచారణమార్గము, కర్మయోగమార్గము ప్రారంభించి 'ముక్తి'ని ఆశయముగా కలిగి ప్రయత్నశీలురై ఉంటారో,

'ముక్తి అనేది ఇప్పుడు ఇక్కడ లభించేది కాదు. అనేక ప్రయత్నముల తరువాత ఎప్పుడో లభించివలసినదే' – అను అభిప్రాయముతో ముక్తికొరకై అభ్యాసశీలురై ఉంటారో,

అట్టివారు **వాసుదేవ మార్గములో (లేక) క్రమముక్తి మార్గంలో ఉన్నట్లు.** దీనినే **"పిపీలికా మార్గము"** (చీమ మధురమైన పదార్థము వైపుగా వెళ్ళుచుండుటమువంటిది) – అని అంటారు. ఈ వామదేవమార్గములో – యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము మొదలైన అష్టాంగ యోగములతోను, పీఠ – అభ్యాసములతోను కూడినవై ఉంటాయి.

ఈ యోగ మార్గములో (1) విఘ్నము (Hurdles) (2) ప్రత్యవాయువు (Side effects) ఉంటాయి.

**(1) విఘ్నములు :** అనేక విఘ్నాలు కలుగుతూ ఉండి 'అభిక్రమనాశనము'నకు కారణమౌతూ ఉంటాయి. లక్ష్యము చేరకముందే కలుగు విఘ్నములవలన (1) విరమించటం (2) మరల కొంతకాలం తరువాత కొనసాగించటం (3)మరల విరమించటం (4) మరల కొంతకాలానికి కొనసాగించటం – జరుగుతూ ఉంటుంది.

అయితే ఎవ్వరైతే అష్టాంగ యోగాలను పట్టుదలతో ఆశ్రయించి శ్రద్ధ – దైనందినకాభ్యాసము (Concentration and Regular Practice) వదలరో, అట్టివారు **అతి త్వరగా 'శుకమార్గముక్తి'లో ప్రవేశించుచున్నారు.**

సర్వదా సత్యమే జయిస్తుంది. **సత్యమేవ జయతే। న అనృతః।** లౌకికములైన వాహనము నడుపు విద్యవంటివి వలెనే ఇవి కూడా బద్ధగించక, వెనుకాడక, భయపడక, శ్రద్ధ తగ్గించక నియమానుసారం కొనసాగిస్తూ ఉండగా, **ఈ జీవుడు విఘ్నములను తప్పక జయించగలడు.**

**(2) విపరీత విశేషాలు (ప్రత్యవాయువు) :** యమము, నియమము, ఇత్యాది అష్టాంగ యోగములు అభ్యసిస్తూ ఉండగా ఆ యోగాభ్యాసికి 'అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ఈశిత్వ, వశిత్వ, ప్రాకామ్య, ఇచ్ఛా' అనబడు అష్టసిద్ధులు ఆశ్రయిస్తూ ఉంటాయి. అవి సమీపిస్తున్నప్పుడు, 'ఓహో! నేను తదితరులకంటే కొంత ప్రత్యేకత గలవాడిని, కొంత అధికంగా సాధించియున్నవాడిని కదా! ఈ శక్తుల వలన నన్ను జనులలో ప్రత్యేకమైనవాడిగా గుర్తించబడెదరు గాక!'...అను భావనలచే కప్పబడి ఉండు అవకాశము ఉంటూ ఉంటోంది.

**సర్వే సర్వత్రా సమమగు ఆత్మభావన (లేక) సమాధి స్థితి –** పొందక, **ప్రత్యవాయుత్వము** (sidelined) ఆ యోగాభ్యాసులు కొంత పొందుతూ ఉంటారు.

**నిదాఘుడు :** స్వామీ! ప్రాణాయామ ప్రత్యాహార మొదలైన యోగాభ్యాస మార్గంలో **'అఖండ –నిర్విశేష–సర్వ–సహజ ఆత్మా౽హమ్'** అను ఆత్మాసాక్షాత్కారస్థితి కష్టమని తమ ఉద్దేశ్యమా?

**ఋభు మహర్షి :** కాదు! అట్టి 'వామదేవ మార్గము' లేక 'క్రమముక్తి మార్గము'లో వచ్చిపోగల విఘ్నములు, నిరోధములు, ప్రక్కబాటల అవకాశముల గురించి కూడా ఇక్కడ ఉదహరించుకుంటున్నాము. అంతవరకే. మనము చెప్పుకొన్న సద్యోముక్తి, క్రమముక్తి – ఈ రెండు కూడా చివరికి ముక్తి స్థానము వైపుగానే ఎక్కుబెట్టబడియే ఉంటాయి.

**నిదాఘుడు :** మరి యోగాభ్యాసి యోగాభ్యాస – మార్గమధ్యంగా తారసబడిన (1) ధ్యాస విఘ్నములవలన, (2) అణిమాది అష్టసిద్ధుల భౌతిక లౌకిక భావనల వలన(Materially special feeling comparatively with others)....ఈ రెండిటివలన లక్ష్యశుద్ధి కోల్పోయి, ఆత్మసాక్షాత్కార సిద్ధి పొందలేకపోతాడంటారా?

**ఋభువు :** ఊహూ! యోగమార్గము కళ్యాణప్రదమే గాని, అశుభప్రదము కాదు. అరిషట్‌వర్గాలు (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు) అశుభ మార్గములు. యోగమార్గమో! మహత్తరమగు శుభప్రదమార్గము. ఇక విఘ్నములు (Failure of concentration) ప్రత్యవాయువులగు అష్టయోగసిద్ధుల మొదలైనవాటి గురించి ఏమిటంటారా? వినండి.

పై విఘ్నముల వలన, (లేక) చాంచల్యములవలన ఒక్క ఉపాధితోనే – **'పరబ్రహ్మత్వము'** (లేక) **'లోకములన్నీ నాయందు నాకు అభిన్నమై ఉన్నాయి! నేను అందరియందు ఆత్మస్వరూపుడుగా సర్వదా వెలుగొందుచున్నాను'** – అను **'ఆత్మజ్యోతిస్వరూప కేవలానుభవము'** సిద్ధించక పోవచ్చునేమో! సమాధి స్థితి చేరలేకపోవచ్చునేమో! అయితే కూడా నష్టం లేదు. ఎందుకంటే... '8' అంగములు గల అష్టాంగ యోగాభ్యాసము ప్రారంభించిన యోగాభ్యాసి ఒక వేళ విఘ్నములవలన అభ్యాసము కొనసాగకపోయినప్పటికీ, యోగాభ్యాసవాసనలు – రుచి మరిగిన పులివలె – **అభిరుచి రూపంగా ఆతనిలో దాగియే ఉంటాయి.** మరల అదే జన్మలో కొంతకాలము తరువాతనో, (లేక) తదనంతరపు ఉపాధి సందర్భములోనో **'యోగాభ్యాస సంస్కారము'** తిరిగి ప్రవర్తించ ప్రారంభిస్తుంది. క్రితంసారి ఎట్టి అభ్యున్నతస్థితి పొందాడో, అట్టి స్థానము నుండి మరల యోగాభ్యాసము కొనసాగించుచూ ఉంటాడు. యోగాభ్యాసము యొక్క ఉత్తరోత్తర స్థితులలో అట్టివాడు **మహాయోగుల కులములో జన్మలు పొందుతాడు.**

అనగా? ఉత్తరోత్తర ఆ యోగాభ్యాసి – శ్రద్ధ, పట్టుదల గల వాతావరణము పొందుతాడు. ఉత్తమమార్గదర్శకులగు గురువులను సమీపిస్తాడు. యోగ మహాశయులకు ఇష్టుడౌతాడు. మహనీయులచే దారి చూపబడుతాడు. మహత్ శాస్త్రముల ఉద్దేశ్యమును బుద్ధితో గ్రహించసాగుతాడు.

పూర్వయోగాభ్యాసము పునశ్చరణ చేసుకుంటూ యోగములో ముందుకు సాగుతూ ఉంటాడు. ఈ విధంగా అనేక జన్మలు యోగాభ్యాస – విఘ్న – పునఃయోగాభ్యాస ప్రయత్నములచే అభ్యాసము వృద్ధి అగుచూ, మార్గదర్శకుల ఆదరణ, అనుగ్రహములను పొందుచూ **'సర్వాత్మత్వము'** అను పరాకాష్ఠ స్థితి పొందుచున్నాడు.

కాబట్టి వామదేవమార్గము (లేక) క్రమముక్తి పథము కూడా – సద్యోముక్తి స్థానమునకే జేర్చుచున్నది.

సద్యోముక్తుడూ - ముక్తుడే!
క్రమముక్తుడూ - ముక్తస్థానము పొందు మార్గములో ముందుకు వెళ్ళుచున్నవాడే!

అట్టి పరమపదమగు విష్ణుస్థానము ఉభయులు చక్కగా చేరుచున్నారు. **అనేక జన్మ అభ్యాసేన వామదేవేన వై పథా, సో - అపి ముక్తిం సమాప్నోతి - తద్విష్ణోః పరమం పదమ్‌। "ఈ సమస్తము పరమాత్మయొక్క నివాస స్థానమే! ఈ సమస్త జీవుల వివిధ సంస్కారములన్నీ సర్వాత్మకుడగు వాసుదేవుని లీలా వినోద ఆనంద చమత్కారమే" అను సందర్శనమే - "వాసుదేవపదము" లేక "విష్ణుపదము".**

ఈ విధంగా బ్రహ్మ ప్రాప్తి రూప శివ పదమునకు **(1) సద్యోముక్తి** - (ఈ క్షణమే అన్నీ తానై, తనయందే ఈ సర్వము అనన్యంగా చూచుస్థితి) **(2) క్రమముక్తి** - (జగత్ సంస్కారాలను ఒకటొక్కటిగా దాటివేస్తూ క్రమక్రమంగా **"ఆత్మాఽహమ్ సంస్కారము"** అను నిత్య - నిస్సందేహరూపంగా సిద్ధింపజేసుకోవటం) - అనే రెండు విశేషములు ఈ జీవునిపట్ల సర్వదా సంసిద్ధమై ఉన్నాయి.

ముక్తి (లేక) సిద్ధి పొందిన తరువాత ఇక మోహమెక్కడిది? (Where is Illusion)? శోకమెక్కడిది? (Where is worry)? **అత్ర కోమోహః? కో శోకః? ఏకత్వమ్ అనుపశ్యతః।** తన ఆత్మయొక్క **తత్త్వము, ఔన్నత్యము** స్వానుభవము అయిన తరువాత సర్వభ్రమలు వాటికవే తొలగుతాయి. ఏకత్వమే సర్వత్రా అనుభవము కాగలదు. **(సత్యమేవ జయతే।)**

| ఇక | జీవాత్మ | - | పరమాత్మ | - | జగత్తు |
|---|---|---|---|---|---|
| | జన్మ | - | మరణము | - | పునర్జన్మ |
| | లోకేశులు | - | లోకములు | - | లోకస్థులు |
| | బంధము | - | సాధనలు | - | మోక్షము |
| | ఇహము | - | పరము | - | పరాత్పరము |
| | జాగ్రత్ | - | స్వప్నము | - | సుషుప్తి |
| | పుణ్యులు | - | పుణ్యకార్యములు | - | పుణ్యము |
| | పాపులు | - | పాపకార్యములు | - | పాపము |

మొదలైన దృశ్యచమత్కార వ్యవహారాలన్నీ **తాను రచించి, తానే ఆస్వాదిస్తున్న కథలోని కథన చమత్కారములై, కథా వినోదముగా ఏకత్వము పొందుతారు.**

కనుక ఓ నిదాఘా! ఓ తదిత శిష్యులారా! శ్రోతలారా! ఈ సద్యోముక్తి - క్రమముక్తిలలో ఏదో ఒకటి ఆశ్రయించండి. కాదూ, రెండూ ఒక్కసారే ఆశ్రయించండి. మీ ఇష్టం! చివరికి అనేకముగా కనిపించేదానిలో అంతర్లీనమైయున్న **'ఏకత్వము'**ను దర్శించటమును సిద్ధించుకోండి. **అదియే ముక్తి. అదియే మోక్షము కూడా!**

ఎవ్వడైతే....

ఆత్మానుభవము సిద్ధించేవరకూ (లేక) ఈ సర్వము తన ఆత్మగా నిస్సందేహంగా భావించగలిగే వరకూ...

బుద్ధిని **'యోగాభ్యాసము'** అనే సాత్త్విక మార్గములో - శ్రమించి అయినాసరే - నియమించి ఉంచుతాడో...,

అట్టివాడు దృష్టికి గోచరించే దృశ్యమంతా దాటివేస్తాడు. సర్వదోషములనుండి, అల్పదృష్టుల నుండి విముక్తుడగుచున్నాడు.

**తత్ దృష్టిః గోచరాః సర్వే ముచ్యన్తే సర్వపాతకైః।** ఆతడు చూపుచేతనే తదితరులను సర్వదోషములనుండి తరింపజేయగలడు కూడా! ఆతని దృష్టికి భూచరులు (భూమిపై సంచరిస్తూ కనిపిస్తున్న సర్వజీవులు), ఆకాశంలో సంచారములు చేసే దేవలోకములలోని దివ్యప్రజ్ఞ స్వరూపులు, పాతాళాది లోకములలో సంచరించే భౌతిక జీవులు **'పరబ్రహ్మ స్వరూపమే!'** అగుచున్నారు.

**బ్రహ్మవేత్త దృష్టికి అంతా బ్రహ్మమే! సద్య ఏవ విముచ్యంతే కోటి జన్మార్జితైః అఘైః - ఇతి॥**

అట్టి సద్యోముక్తుడు ఇప్పుడే, ఇక్కడే బ్రాహ్మీస్వరూపుడై, బ్రహ్మానుభవముచే కోటి జన్మలలోని పాపములను కూడా భస్మము చేసివేస్తాడు.

- భస్మభూషితాంగుడై
- చంద్రశేఖరుడై
- ఫాలనేత్ర - శూల ధారుడై, శంకరుడై
- ఆత్మసామగానములచే ఆనందించువాడై,

పరమశివానంద స్వరూపుడై సర్వే సర్వత్రా సర్వము నందు సర్వదా సంప్రకాశమానుడై ఏర్పడి ఉంటున్నాడు! **"చిదానంద రూపమ్-శివోఽహమ్"** - స్థానమును సిద్ధించుకొంటున్నాడు.

# 5వ అధ్యాయము - యోగాభ్యాసవిధి

**నిదాఘుడు:** హే ఋభుమహాశయా! భగవాన్! గురుదేవా! 'యోగాభ్యాస విధి-విధానము' గురించిన విశేషములు దయచేసి బోధించండి.

**ఋభుమహర్షి :** యోగాభ్యాసం గురించి కొన్ని విషయాలు చెప్పుకొంటున్నాము. వినండి.

## భౌతిక దేహము

మొట్టమొదటగా ఈ భౌతికదేహము గురించి విచారణ చేస్తున్నాము. ఇది పంచభూతాత్మకమైనది. అనగా ఐదు మండలములచే పూరించబడి నిర్మితము అవుతోంది. 'మట్టి - నీరు - అగ్ని - గాలి - ఆకాశము' అను '5' వేరు వేరు ధర్మములుగల పదార్థములచే తయారగుచున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| **(1) కాఠిన్యం పృథివీం ఏకాం** | - | కాఠిన్యము (Solid) | - | పృథివీ లక్షణము. |
| **(2) పానీయం తత్ ద్రవాకృతిః** | - | పానీయము (Liquid) | - | ద్రవము ఆకారము. |
| **(3) దీపనంచ భవేత్ తేజః** | - | వెలిగించునది (Light) | - | తేజస్సు (అగ్ని). |
| **(4) ప్రచారో వాయు లక్షణమ్** | - | ప్రసరణము (Air) | - | వాయు లక్షణము. |
| **(5) ఆకాశః సత్వతః** | - | అన్నిటా (Presence) | - | ఆకాశ లక్షణము. |

యోగాభ్యాసమునకు సంసిద్ధపడువాడు ముందుగా ఈ పృథివీ - ద్రవ - తేజో - వాయు - ఆకాశముల (Solid, Liquid, Heat, Vapour, Space) లక్షణములను, (అవి పూరించుటచే జరుగుచున్న శరీరము మొదలుగా) సర్వ వస్తు నిర్మాణముల తీరును తెలుసుకొని ఉండునుగాక. ఇది భౌతికదేహ (పాంచభౌతిక) చమత్కారము గమనిస్తున్నవాడై ఉండు గాక!

## వాయు సంచలనము

ఇట్టి భౌతిక శరీరములో ఊపిరి పీల్చటము-విడవటము అనే ఒకానొక ప్రక్రియ ఎల్లప్పుడు చేతనరూపమై జరుగుతోంది. పగలు - రాత్రి కలిపి చూస్తే ఒకరోజుకు '21,600' సార్లు 'వాయుమండల ఘాతుకము' (Shock touch of air) రూపముగా ఊపిరి ప్రవర్తిస్తోంది. అట్టి ఊపిరి ఏ 'శక్తి'తో ఈ విధంగా ప్రవర్తనశీలమగుచున్నదో - అట్టి 'శక్తి'ని **'ప్రాణశక్తి'** అని అంటున్నారు.

## దేహి

ఈ దేహమును ధరించువాడు, ధారణ చేయువాడు (లేక) దేహము కలవాడు → **'దేహి'** అనబడుచున్నాడు. ఆ దేహినే **"జీవితమును పొందుచున్నట్టి జీవుడు, జీవాభిమాని"** అని కూడా చెప్పుకొంటున్నాము. అట్టి ఈ శరీరి (లేక) జీవుని పట్ల → దేహము జీవితము రూపంగా ఒకప్పుడు జనించి, వృద్ధిచెంది మరొకప్పటికి నశించుచున్నది. దేహము వృద్ధి చెందుచున్నప్పుడు ఈ దేహములో పృథివీమండలము (Solid Zone) కూడా వృద్ధి చెందుతోంది. పృథివీతత్త్వము(Solidity) క్షీణిస్తూ ఉండగా క్రమంగా శరీరము ముడుతలు పడసాగుతుంది.

అట్లాగే శరీరములో జలతత్త్వము క్షీణిస్తూ ఉండగా వెంట్రుకలు నెఱవటం (తెల్లబడటం) ప్రారంభమగుచున్నది. అగ్ని (లేక) తేజస్సు తరుగుచున్నప్పుడు - **తేజః క్షయే క్షుదా, కాంతిః నశ్యతే** - ఆకలి తగ్గసాగుతుంది. కాంతి క్షీణించసాగుతుంది. వాయుచలనము యొక్క వేగము తరుగుచుండగా శరీరములోని అనేక ప్రదేశములలో వణుకు (Shivaring) ప్రారంభమౌతుంది. కంపనములు కనిపించసాగుతాయి. ఆకాశముతో సంబంధము త్రెగుచుండగా ఒక రోజు ఈ శరీరమే నశిస్తుంది. ఈ విధంగా **పంచభూతములచే ఈ భౌతిక శరీరము పరిరక్షించబడుచు, పర్యవేక్షించబడుచూ, వాటి ఉపసంహారముచే శరీరమే నశించిపోవుచున్నది.** పంచభూతములు వాటి వాటి స్వస్థానములు చేరుచున్నాయి. ఈ విధంగా భూతధారణ - భూతక్షయము రూపంగా శరీరము నిర్మితమవటము, కొనసాగించటము, నశించటము కూడా జరుగుచూ ఉన్నది.

## ఉడ్డియాణం

ఇటువంటి ఆయా కొన్నిపాళ్ళ పంచభూములచే ఆకారము పొందుచున్న ఈ భౌతిక శరీరములో **ఒకానొక మహత్తరశక్తి వాయువును సంచాలనము చేయుచుండుటచే ఈ భౌతికదేహము క్రియాశీలకమై ఉంటోంది.** ఆకాశంలో తన ఇష్టము వచ్చిన రీతిగా సంచరించు పెద్ద పక్షి (మహాఖగము) వలె ప్రాణశక్తి శరీరముతో అవిశ్రాంతంగా సంచాలనము చేయుచున్నది. అట్టి ప్రాణ సంచలనమును యోగ సాధనలచే నిశ్చలము చేసియుంచటమును (కుంభక ప్రాణాయామమును), ఊర్ధ్వముఖము చేయటము - **'ఉడ్డియాణబంధము'** అని అంటున్నారు. **ఉడ్డీయాణో హి అసౌ బంధో, మృత్యు మాతంగ కేసరీ।** అట్టి **'ఉడ్డియాణబంధము'** అనబడు **'కుంభక ప్రాణాయామము'**

– మృత్యువు అనే ఏనుగుకు సింహనాదము వంటిది. ప్రాణాయామాభ్యాసముచే, ఈ జీవుడు నశించే స్వభావము కలిగినట్టి ఈ పాంచభౌతిక దేహమునకు వేరైన **'ముక్తి తనువు'**ను సిద్ధింపజేసుకుంటున్నాడు. సర్వబంధములనుండి విముక్తుడగుచున్నాడు. అట్టి భౌతిక దేహమును సంబంధించక, **ప్రజ్ఞ (లేక) బుద్ధికి మాత్రమే అనుభూతమగు నిత్యముక్త స్వస్వరూపమే – ముక్తిదేహము!**

❖

**నిదాఘుడు :** యోగాభ్యాసమునకు సంబంధించిన సరిఅయిన సమయము జాగరూకతలు, యోగము నిర్వర్తించు విధానము గురించి ఇంకనూ కొంత వివరించండి.

**ఋభువు :** ముందుగా కొన్ని సూచనలు :

ఒకడికి బాగా ఆకలి వేస్తూ ఉన్నప్పుడు, యోగం గురించి ఆలోచనలు వస్తాయా? రావు. ఆహారం గురించే ఆలోచనలు వస్తాయి. **అగ్నౌతు చలితే కుక్షౌ వేదనా జాయతే భృశమ్।**

అదేవిధంగా మలమూత్రముల విసర్జించాలనే వేదలో ఉన్నప్పుడు కూడా యోగం గురించిన ఆలోచనలు రావు కదా! **న కార్యా క్షుధితే నాపి, నాపి విణ్మూత్ర వేగినా!** కాబట్టి పొట్టలో జఠరాగ్ని జ్వలిస్తున్నప్పుడు, మల – మూత్ర విసర్జనల వేదన ఉన్నప్పుడు తప్పితే, ఇక తక్కిన సమయములన్నీ యోగాభ్యాసమునకు అర్హమే.

యోగాభ్యాసానికి 'ఆహారము' సానుకూల్యమై ఉండాలి. **'హితం మితం చ భోక్తవ్యం స్తోకం స్తోకం కథా అవే'!**

శరీరానికి హితమైనవి స్వీకరించబడును గాక. సాత్వికాహారము ఉచితము. మితముగా భుజించాలి. కొంచము కొంచముగా రోజులో ఎక్కువసార్లు భోజనము స్వీకరించటం యోగాభ్యాసానికి సానుకూల్యము.

**మంత్ర ఉచ్చారణ :** ఇష్టదైవ మంత్రమును మృదువుగా, **మధురముగా ఉచ్చరిస్తూ ఉండాలి. అర్థ – పరమార్థములను కూడా గురుముఖతః తెలుసుకొని, అర్థమున భావన చేస్తూ పలకాలి. (1) మంత్రాక్షరముపై, (2) మంత్రనాదముపై, (3) మంత్ర దేవతపై, (4) మంత్రార్థముపై, (5) తనపై – 'గురి'** (faith) **తో మంత్రోపాసన చేయాలి.**

క్రమంగా హఠంగా మంత్రోచ్చారణను అర్థభావనయందు లయింపజేయాలి. అర్థమును మాత్రమే అర్థయుక్తంగా భావన చేయాలి. అర్థమును కేవలమగు స్వస్వరూపమునందు **'లయం'** చేయాలి. లయ మంత్ర హఠమే యోగము. **శబ్దముయొక్క అవసరం లేకుండానే మంత్రముయొక్క మహదార్థభావన – ఉత్తరోత్తర దశ.**

## అష్టాంగ యోగములు

**యోగము** = ఆత్మతో **సంయోగము. ఏకత్వము అనన్యత్వము.** అట్టి 'యోగము' అను కార్యక్రమమునకు అంగములు – '8'.

**(1) యమము (2) నియమము (3) ఆసనము (4) ప్రాణాయామము (5) ప్రత్యాహారము (6) ధారణ (7) ధ్యానము (8) సమాధి**

**యమము – 10 అంగములు (దృశ్యము నుండి ధ్యాసను వెనుకకు మరల్చటము)**

(1) అహింస = వాక్ – మనో – కాయములతో సహజీవులను బాధించకుండటం. తనవలన తదితరులకు సానుకూల్యత కలిగించటం. (పరోపకారార్థమ్ ఇదమ్ శరీరమ్)

(2) సత్యమ్ = సత్యవస్తువగు ఆత్మ జ్ఞానము పట్ల (యమ్ సత్) – ధ్యాస, లక్ష్యశుద్ధి.

(3) అస్తేయం = తనది కానిది ఆశించకుండటము. దొంగిలించే స్వభావమును దగ్గరకు రానీయకపోవటము.

(4) బ్రహ్మచర్యము = బ్రహ్మమును ఎరుగుటయందు విద్యార్థిత్వము కలిగియుండి, ఆచార్యులను ఆశ్రయించటము.

(5) దయ = తదితరులకు సహాయకుడై తాను చేయగలిగింది చేయాలనే భావన. ఇతరులపట్ల దయ, ప్రేమ, స్నేహభావము కలిగి ఉండటము.

(6) ఆర్జవము = కుటిలముగా ఉండకపోవటం. అనుకున్నదే చెప్పటం. చెప్పినదే చేయటం.

(7) క్షమ = తాను తన ఇష్ట దైవము నుండి ఏ విధంగా క్షమించమని వేడుకొంటాడో, ఆ రీతిగా ఇతరుల పట్ల క్షమించు గుణము, స్వభావముగా కలిగి ఉండటము.

(8) ధృతి = పిరికితనమును వదలటము. **'జన్మ – జరా మరణాదులకు విషయమే కానట్టి ఆత్మయే నేను కదా!'** అను శాస్త్ర సంబంధిత సత్యమును దృష్టిలో పెట్టుకొని, సర్వదా ధైర్యము వహించి ఉండటము.

(9) మితాహారము = ఇంద్రియములను మితముగా లోకములో, ఉపయోగించటం. అతిగా ప్రాపంచక విషయములవైపు ఉద్దేశ్యించక పోవటం. మితముగా భుజించటం.

(10) శౌచము = శుచి అయిన సాత్త్విక భావాలు కలిగియుండటం (Opimistic about others and about live events. Positive approach)

ఇవి 'యమ – దశకము' అనబడుచున్నాయి.

**II నియమ – దశకము (ఇంద్రియములను నియమించటము)**

(1) తపస్సు : తపస్సుయొక్క అభ్యాసముచే చిత్తము పరిశుద్ధమౌతుంది. పరమాత్మ కొరకై, బ్రహ్మజ్ఞానముల కొరకై తపనయే తపస్సు. ఇంద్రియములను భక్తి–జ్ఞాన–వైరాగ్యములందు నియమించటమే తపస్సు.

(2) సంతోషము : మానవజన్మ లభించినందుకు, బంధు–మిత్ర – ఇత్యాదులు ప్రసాదించినందుకు పరమాత్మ పట్ల సంతోషము ప్రకటించుచుండటము. సంతోషము ఒక అలవాటు. అసంతృప్తి ఒక దురలవాటు.

(3) ఆస్తిత్వము : ఈ దేహమును పరిపోషించుచు, పరిరక్షించుచున్న దివ్యమగు ప్రకృతి రచయితయగు పరమాత్మ యొక్క ఉనికిని జ్ఞాపకము పెట్టుకొని ఉండటము. ఈ దేహము పరిరక్షించబడటములో దివ్యశక్తి స్వరూపులగు దేవతల సహకారమును గమనిస్తూ, కృతజ్ఞులై ఉండటము.

(4) దానము : తనకు పరమాత్మ ప్రసాదించిన దానిలో కొంతభాగము తిరిగి పరమాత్మకు సమర్పించటము. తదితరుల కొరకై విభాగించి ఉద్దేశ్యించటము. దానము చేయుటలో ఉత్సాహము. **'ఇతరులకు నేనేమి మంచి చేయగలను'** – అనే సప్రయత్నపూర్వకమైన తపన.

(5) ఈశ్వర పూజనమ్ : చూపు–వినికిడి–పలకటము మొదలైన అన్ని ఇంద్రియ వ్యవహారములను ఈశ్వరారాధనకై ఉద్దేశ్యించటము.

(6) సిద్ధాన్తశ్రవణము : **తత్త్వమ్, సోఽహమ్, 'త్వమ్ శివేతి'** ఇత్యాది మహావాక్యముల అర్థములను, ఆత్మ తత్త్వ సిద్ధాంతములను శ్రవణం చేయటం. మననము చేస్తూ, ఏమరువకపోవటము.

(7) హ్రీ : పెద్దల, పూజ్యుల, విజ్ఞుల సమక్షంలో 'నేనెంతటివాడిని?' – అనే సిగ్గును స్వభావముగా కలిగి ఉండటము.

(8) మతి : అవివేకమును విడనాడి, వివేచనతో అర్థము చేసుకొనటము. (వివేచయంతి విబుధః, వివదన్తి అవివేకినః!)

(9) జపము : భగవన్నామ జపము. భజన.

(10) వ్రతం : శాస్త్రములు సూచించే వ్రతములు, నియమమలు గౌరవించటం.

ఇవి **'నియమ దశకము'** అనబడుచున్నది.

**III ఆసనము :** ధ్యానము చేయునప్పుడు శరీరమునకు సానుకూల్యముగా 'కూర్చొను విధానము' – ఆసనము. అతిదీర్ఘ కాలము ఇబ్బంది లేకుండా, నిశ్చలముగా, సులువుగా ఉండునదే **సుఖాసనము**. కొన్ని శాస్త్ర ప్రవచితమైన ఆసనములు, యోగవేత్తలచే బోధితమై ఆసన విశేషయములు లోకప్రసిద్ధమై ఉన్నాయి.

(1) చక్రాసనము (2) పద్మాసనము (3) కూర్మాసనము (4) మయూరాసనము (5) కుక్కుటాసనము (6) వీరాసనము (7) స్వస్థికాసనము (8) భద్రాసనము (9) సింహాసనము (10) ముక్తాసనము (11) గోముఖాసనము

**చక్రాసనము – సవ్య ఊరు దక్షిణే గుల్ఫే దక్షిణం దక్షిణేతరే, నిదధ్యాత్ ఋజుకాయస్తు – 'చక్రాసనం' – ఇదం మతమ్॥**

- ఎడమ తొడపై కుడి చీల మండలమును ఆన్చి,
- కుడి తొడపై ఎడమ చీలమండలమును ఆన్చి,
- పృష్ఠభాగమును, నడుమును, మెడను, తలను నిఠారుగా ధారణ చేసి,
- కొండ నాలుకకు సూటిగా శిరో ఉపరిభాగమునగల బ్రహ్మరంధ్ర స్థానము వరకు నిట్టనిలువుగా ధారణ చేస్తూ యోగాభ్యాసము నిర్వర్తించటము, (మరియు) ధ్యాసను త్రిపుటిలో నిపిలి ఉంచటము.

(తదితర ఆసనముల గురించి వేరు ఉపనిషత్తులలో సవివరంగా చెప్పబడినది)

# బ్రహ్మనాడీ స్పర్శ - శివైక్యోపాసన

***ప్రాణాయామము అను యోగాభ్యాసముచే***

'కుండలిని' అను శరీరములోని మూలాధార ప్రదేశములో నిదురిస్తున్న శక్తిని యోగాగ్నిచే ఉత్తిష్ఠింపజేసి (Waking up, inspiring and keeping the same actively as moving),

సుషుమ్న అను వెన్నెముకలోని తేజోనాడి ద్వారా చక్రములను, గ్రంథులను దాటించి,

సుషుమ్నయొక్క చివ్వరగా, కపాలము యొక్క ఊర్ధ్వప్రదేశమున (కొండ నాలుకకు ఊర్ధ్వంగా, సూటిగా-కపాలమునకు ఊర్ధ్వముగా గల 'సుషిరము' - అనబడు దేహములోని 10వ రంధ్రమును (బ్రహ్మరంధ్రమును) సమీపింపజేసి,

**కుండలినీ స్పర్శచే** చివరగా మూసికొనియన్న సూక్ష్మ (సుషిరగ) రంధ్రమును (లేక) బ్రహ్మరంధ్రమును తెరిపింపజేయటము.

- ఈ జీవుడు 'బ్రహ్మసృష్టి' అను కల్పన నుండి బయల్వెడలి -
- (కొండ నాలుకకు ఉపరిగా శిరో (కపాల) స్థానమునందు బిందురూపముగాను), బ్రహ్మరంధ్రమునకు ఊర్ధ్వముగా గల **విశ్వజనన - విశ్వరహిత సహస్రార - స్థానము** నందు ప్రవేశింపజేసి,
- అక్కడి సర్వ - తత్త్వాత్మకుడు, అంబ (ప్రకృతితో) కూడుకొన్నవాడు, సర్వతత్త్వవిదూరుడు, సర్వతత్త్వస్వరూపుడు అగు శివ పరబ్రహ్మముతో ఈ జీవుడు - సముద్ర జలములో ప్రవేశించిన ఉప్పుబొమ్మవలె - **'శివసాయుజ్యము'**ను పొందటము.
- తానే శివుడవటము. తానే అఖండాత్మ స్వరూపుడవటము.

**ఇది శివసంయోగ ప్రాణాయామ మార్గముగా యోగజ్ఞులగు బ్రహ్మతత్త్వజ్ఞులచే విశదీకరించబడుచున్న యోగామార్గము.**

ఇందులోని కొన్ని విశేషాలు ఇప్పుడిక మనము చెప్పుకోబోవుచున్నాము.

## IV. అష్టాంగ యోగములలో 4వది అగు ప్రాణాయామము

ప్రాణాయామ యోగాభ్యాసముతో ప్రాణములను కదిలించు మూలశక్తిని (ప్రాణతత్త్వమును) ఉపాసించు మార్గము ఈ విధంగా ఉన్నది.

**శ్లో॥ పూరకః కుంభకః తద్వత్ రేచకః పూరకః పునః**
**ప్రాణాయామః స్వనాడీభిః తస్మాత్ నాడీ ప్రచక్షతే॥**

ప్రాణాయామము 4 ప్రక్రియలతో కూడుకొని యున్నది.

**(1) పూరకము** → కుడి ముక్కు పుటమును కుడి బొటనవ్రేలుతో మూసి ఉంచి, ఎడమ ముక్కుపుటతో లోనికి గాలిని పీల్చి గుండెను వాయువుతో పూరించటము.

**(2) కుంభకము** → ఎడమముక్కు పుటను కుడిచేతి 'అనామిక- కనిష్ఠిక' అనబడు కుడిచేతి చివరిరెండు వ్రేళ్ళతో మూసి ఉంచి వాయువును (i) **భౌతికముగా గుండెనిండా** (ii) **సంకల్పముచే శరీరమంతా** - నిశ్చలము చేసి దీర్ఘంగా ధారణ చేయటము.

**(3) రేచకము** → లోనికి పీల్చిన గాలిని కుంభక ధారణానంతరము కుడిముక్కుపుట ద్వారా నెమ్మదిగా, పూర్తిగా బాహ్యమునకు వదలటము

**(4) పునఃపూరకము** → కొంతసేపు గుండెను గాలి లేని విధంగా ధారణ చేసి తిరిగి రెండు పుటముల ద్వారా గాలి పీల్చటము

రెండవమారు పై 4 పూరక - కుంభక - రేచక - పునఃపూరకములను ఎడమ ముక్కు పుట మూయుట - కుడి ముక్కుపుటము ద్వారా పీల్చుట - తిరిగి ఎడమముక్కు పుటము ద్వారా వదలటము - కుడిచేతి చివరి రెండు వ్రేళ్ళను - కుడి బొటనవ్రేలును ఉపయోగించి పైవిధంగానే నిర్వర్తించటము - ఇది **ప్రాణాయామ ప్రక్రియ** - అనబడుతోంది.

అటువంటి ప్రాణాయామాభ్యాసమును రోజుకు 4 సార్లు (క్రమంగా ఎక్కువసార్లు) నిర్వర్తిస్తూ ఉండగా ఆ యోగాభ్యాసి యొక్క నాడులన్నీ ఉత్తేజము, ప్రత్యుత్సాహము పొందుతాయి.

**నాడుల గురించిన మరికొన్ని ప్రత్యేక విశేషాలు**

**శరీరం సర్వ జంతూనాం షట్‌నవత్ (96") – అంగులాత్మకమ్।** సర్వజీవులకు వారివారి 'శరీరము యొక్క పరిమాణము' వారి బొటనవ్రేలు పరిమాణమునకు '96' బొటనవ్రేళ్ళంత ఉండటం జరుగుతోంది.

అట్టి ఈ భౌతిక శరీరములో మధ్యగా – **(తన్మధ్యే),**

**పాయుదేశాత్తు ద్వాంగులాత్ పరతః।** గుదస్థానము 2 అంగుళములపై వైపుగా,

**పరమ్ మేఢ్రదేశాత్ అధస్మాత్తు ద్వయ అంగులాత్।** మేఢ్రమునకు (లింగాంగమునకు (లేక) పొత్తి కడుపుకు 2 అంగులములు క్రిందుగా **మధ్య ప్రదేశము** అని అంటారు.

# నాడీకందము

**మేఢ్రాత్ నవ (9) అంగులాత్ ఊర్ధ్వం "నాడీనాం కందమ్" ఉచ్యతే।** అట్టి మేఢ్రము (పొత్తికడుపు మధ్య) నుండి 9 అంగుళములు ఊర్ధ్వంగా (పొట్టవైపుగా) **'నాడీకందము'** ఉన్నది. ఈ నాడీకందము 4 అంగుళముల ఎత్తు, 4 అంగుళముల విస్తారము (పొడవు) కలిగి ⬭ అండము (గ్రుడ్డు) ఆకారంగా ఉంటుంది. ఈ నాడీకందము చుట్టు మేదస్సు (క్రొవ్వు), మజ్జ (నూనె పదార్థము వంటిది), బొమికలు, రక్తము మొదలైన ధాతువులన్నీ పరివృతమై (చుట్టుకొని) ఆవరించి ఉంటున్నాయి. **తత్రైవ నాడీ చక్రం తు ద్వాదశారం ప్రతిష్ఠితమ్।** అట్టి నాడీ కందములో 12 (ఆకులవంటి) రేకులు (ఆరములు) ప్రతిష్ఠితమై ఉన్నాయి.

# కుండలినీ శక్తి

**శరీరం ధ్రియతే యేన, (యేన) వర్తతే తత్ర 'కుండలీ।'**

- దేనిచేత (ఏ శక్తి, సంకల్పములచేత) ఈ శరీరము – ధ్రియమాణేన – ధరించబడుచున్నదో, భరించబడుచున్నదో,
- ఏ శక్తి చేత జడమగు ఈ 'దేహము' అనే వస్తువు వర్తించగలుగుచున్నదో ...అదియే **'కుండలినీశక్తి'.**

ఈ శరీరము మొట్టమొదట ధరిస్తూ ఉన్నప్పటి ప్రారంభ శక్తి స్థానమే **"మూలాధారము".** కుండలినీశక్తీ దేవి – శరీరము ధరించబడుచోట – మూల ప్రదేశంలో ప్రకృతిసిద్ధంగా వేంచేసి ఉండటం వలన 'మూలాధారి' అని కూడా పిలుస్తారు. (మూలాధారే హుతవహ కళా విసృతా భూర్భువస్సువః – మూలాధారమునందు వేంచేసియున్న 'కళా స్వరూపి' అగు కుండలినీ శక్తి దేవియే భూ–భువర్–సువర్ లోకములుగా విస్తరించి యున్నది).

# సుషుమ్ననాడి

శరీరములోని నాడీ కందమునుండి అనేక నాడులు, ఉపనాడులు బయలుదేరి శరీరములోని మూలమూలలకు విస్తరించి, ఈ శరీరములో అనేక వ్యవహారములు జరుగుచూ ఉండటానికి కారణభూతమౌతున్నాయి.

**నాడీకందము** (Electrical Energy Transformer వంటిది)
**నాడులు** (Electoric Energy Travelling - Electrical wires వంటివి)
**కుండలిని** (Electricity energy వంటిది)

ఆ విధంగా శరీరములోని నాడీ కందమునుండి బయల్వెడలుచున్న అనేక నాడులలో ఒకానొక తేజోపుంజములతో కూడిన నాడి. అదిఅగ్ని – చేతనమగునాడి. ఆ నాడి **వెన్నెముక మధ్య నుండి మెడ, ఫాల భాగములను దాటి – కపాల ఊర్ధ్వమున మూసివేయబడియున్న బ్రహ్మరంధ్రము వరకు విస్తరించియున్నది.** ఇది **'సుషుమ్ననాడి'** అని యోగశాస్త్రముచే పిలువబడుచున్నది. బ్రహ్మరంధ్రం **సుషుమ్నాయా వదనే పిధాయసా!** ఈ 'సుషమ్న'నాడి తనయొక్క ఊర్ధ్వముఖముచేత శిరస్సుకు ఉపరిప్రదేశములో బిందురూపమున గల **'బ్రహ్మరంధ్రము'**ను మూసివేసినదై ఉంటోంది.

సుషుమ్ననాడిని వెంటనంటినవై **'అలంబుస', 'కుహు'** నాడులు.

- లోపలివైపుగా **'వారుణి', 'యశశ్విని'** నాడులు.
- కుడివైపుగా (దక్షిణం)గా **'పింగళ'** నాడి.
- దానికి తదనంతరంగా **'పూషా' 'పయశ్వనీ'** నాడులు.
- సుషుమ్నకు పశ్చిమంగా **'సరస్వతీ'** నాడి.

- దానిని అనుసరించి **'శంఖినీ','గాంధారీ'** నాడులు.
- సుషుమ్నకు ఉత్తరంగా **'ఇడ'** నాడి – **ఉత్తరే తు సుషుమ్నాయా ఇడాఖ్యా నివసత్యసౌ।**
- అద్దానిని అనుసరిస్తూ **'హస్తిజిహ్వా, విశ్వోదరీ'** నాడులు.

ఈ ఈ మొదలైన నాడులన్నీ ఉన్నాయి.

ఈవిధంగా **అలంబుస-కుహు-వారుణీ-యశశ్వినీ-పింగళ-పూస-యశశ్వినీ- సరస్వతి-శంఖినీ-గాంధారీ-ఇడ-హస్తిజిహ్వా**...ఈ 12 ముఖ్య నాడులు శరీరములోని అనేకచోట్లకు వాయువాహకములు (Carrier of Air- Pranasakthi). ఇవన్నీ నాడీ కంద చక్రము యొక్క ఆకులలో (ఆకులలో ఈనెలవలె) విస్తరించి ఉన్నాయి. పురుషుడు వస్త్రము ధరించురీతిగా ఈ నాడులన్నీ నాడీ కందముచే ధరించబడుచున్నట్లుగా ఉంటున్నాయి. ఈనాడీ పటము మధ్యగా ఉన్నదే **'నాభీచక్రము'**గా యోగశాస్త్ర ప్రసిద్ధము.

## కుండలినీ శక్తి – మరికొన్ని విశేషాలు

ఈ కుండలినీ శక్తి ఇచ్ఛ – జ్ఞాన – ప్రజ్ఞా స్వరూపిణీదేవి. 'విశ్వస్వరూపిణి' కూడా. తనయందు నాదము ధారణగా కలిగియున్నట్టిది. 'నాదరూపిణి'గా ప్రకాశిస్తూ ఉన్నట్టిది.

సుషుమ్ననాడిని **'పరనాడి'** అని కూడా అంటారు. ఇది పరరంధ్రము (బ్రహ్మరంధ్రము) వరకు విస్తరించి ఉన్నది. ఈ సుషుమ్న నాలుగు రత్నములచే పూరింపబడి ఉన్నది. (4 చక్రములతో ప్రకాశమానమై ఉంటోంది). ఈ సుషుమ్నయే **బ్రహ్మరంధ్రమును (సుషిరిగమును)** మూసి ఉంచుతోంది.

ఈ నాడులన్నీ (పంచ ప్రాణ – పంచ ఉపప్రాణ) దశ వాయువులచే పూరింపబడి ఉంటున్నాయి.

**యోగాభ్యాస విచక్షణులు** (Experts) – (1) నాడీగతి (2) దశవాయుగతులను (3) ఎరిగినవారై, సాక్షీభూతంగా బుద్ధితో గమనిస్తూ ఉంటున్నారు.

## యోగభ్యాస విధి – విధానము

I. **యోగ విధి :** యోగాభ్యాసరతుడైన యోగి

- **శుచి** అయిన **ప్రశాంతమగు ప్రదేశమును** ఎన్నుకొని,
- చక్కటి ఎత్తుగా, పరిశుభ్రముగా ఉన్న ఆసనము స్వీకరించటానికి సానుకూలమైన స్థలంలో
- సుఖాసనము స్వీకరించాలి. (ఎవరికి ఏ ఆసనముయొక్క ధారణ ఎక్కువ సమయము సానుకూలమౌతుందో, అదియే ఆతనికి 'సుఖాసనము').

అప్పుడిక

II. **సమగ్రీవ శిరః కాయః** – మెడను, శిరస్సును, కాయమును నిలువుగా సునిశ్చలముగా నిలిపి,

- చూపును ఊర్ధ్వముగా సు-సమాహితము చేసి (Wel fixedగా చేసి)

III. నాసాగ్రంలోను (ముక్కుకు పై భాగం – ఆజ్ఞా చక్రస్థానం లోను) హృదయ స్థానములోను బిందువులను గుర్తించును గాక!

IV. అట్టి బిందువుల మధ్య నుండి స్రవించి **'జాగ్రత్ స్వప్న సుషుప్తుల సాక్షీస్వరూపము'** అగు 'తురీయము' నందు **'అమృతత్వము'** (The Changeless self) దర్శించుచూ ఉందునుగాక!

ఇంకా...

- అపానము శరీరమునుండి బాహ్యమునకు ప్రయాణించు వాయువు. అట్టి అపానవాయువును ముకుళింపజేసి, 'పాయువు (విసర్జనాశయము) స్థానమునుండి పైపైకి సమాకర్షణము చేస్తూ,
- 'ఓం' కారోచ్చారణ (ప్రణవము)తో అపానమును ఉత్థాప్యనము చేయటం (ఉత్-ఆప్యనము=పైకి లాగుటం)
- బీజము (మూలాధారము నందు) అపానమును (బయటకుపోవు గాలిని) ధారణ చేయటము – **శ్రీ బీజేన నివర్తయేత్!**

మరికొంత ఊర్ధ్వంగా 'ప్రాణము'తో (లోనికి వచ్చుచున్న గాలితో) ఏకము చేయు ధారణ. జన్మలకు – **కర్మలకు మునుముందే ఉండి ఉన్నట్టి, మార్పు చేర్పులకు విషయమే కానట్టి అమృతస్వరూపమగు, సర్వశ్రేయములకు ఆలవాలమగు (శ్రియమ్) "స్వాత్మ"**ను ధ్యానిస్తూ ఈవిధమైన యోగాభ్యాసము నిర్వర్తించును గాక! అట్టి స్వస్వరూపాత్మ కాలముచే పరిమితము కాదు. ఎందుకంటే స్వాత్మ

త్రికాలములలో ఏకరూపము, యథాతథము, సర్వము కూడా అయి ఉన్నది. ఆత్మకు వేరుగా ఏదైనా ఉంటే అది మిథ్యయే. అందుచేత **'ఆత్మ సర్వమునకు ఆవల అత్యంత ముఖ్యమైనది'** అని, ('బ్రహ్మము' అని) ఆత్మజ్ఞులు ఎలుగెత్తి చెప్పుచున్నారు.

**కుండలినీ యోగాభ్యాసము** = ప్రాణ-అపానముల ఏకధారణచే జనించు అగ్నితో మూలాధారములోని కుండలినీ శక్తిని నిదురలేపి, సుషుమ్న నాడిలో ప్రకాసింపజేసి బ్రహ్మరంధ్రమును సమీపింపజేయటము.

కుండలినీశక్తితో బ్రహ్మరంధ్రము యొక్క ముఖద్వారము తెరచు యోగాభ్యాసికి సమస్తము సుసాధ్యమే అవగలదు.

ఎవ్వడు **అఖండము, ఏకము, సర్వము** అగు ఆత్మతో **"అదియే నేను! సోఽహమ్"** అను స్వాభావిక - నిశ్చలబుద్ధిని అనుక్షణికంగా సిద్ధింపజేసుకొని ఉంటాడో →

- అట్టి వానికి త్రిలోకములలోను అసాధ్యము అనేది ఉండదు.
- అట్టి వాడి మనస్సు ఆత్మతో ఏకత్వము పొంది ఉంటుంది. అట్టి మహామనస్సుతో ఆతడు ఏది మనస్సుతో సంకల్పిస్తే అది అట్లే సిద్ధించగలదు. ఆతడు సత్యమగు ఆత్మభావనచే **'సత్యసంకల్పుడు'** అగుచున్నాడు.
- ఆతడు **సంకల్పిస్తే** జలములో అగ్ని ఉదయించగలదు. ఆతడు **'ఇది ఇట్లే సత్యము' అని సంకల్పించినంతమాత్రంచేత** అగ్నిలో చెట్లు చిగురిస్తాయి.
- ఆతడు జాగరితంగా (జగత్తుకు సంబంధించినదిగా) ఏది ఎట్లు తలస్తే అది అట్లే అవగలదు
- ఆతడు చేసే పనులు, మాట్లాడే మాటలు - అన్నీ అత్యంత-శుభప్రదమైన ప్రభావము కలిగినవై ఉంటాయి. **అలౌకికానుభూతి రూపమై ఉంటాయి.**

## ప్రాణాయామ యోగాగ్ని

**మార్గే బిన్దుం సమాబధ్య** → శరీరములో స్వతంత్రముగా ప్రాణ - అపాన మార్గములను (The Inward coming Air and the outward going Air as a routine in the usual course) బిందువు వద్ద సమముగా బంధించి (By binding them both at one point) → కుంభకప్రాణాయామము నిర్వర్తిస్తూ...,

**వహ్నిం ప్రాజ్వాల్య జీవనే** → జీవశక్తి స్వరూపమగు అగ్నిని ప్రజ్వలింపజేసి...,

**శోషయిత్వాతు సలిలం** = దేహములో అనేకచోట్ల పేరుకొనియున్న 'జలతత్త్వము'ను శోషింపజేసి (చెమట మొదలైనవాటిచే అధిక జలమును దేహమునుండి బయల్వెడలుచుండగా),

అట్టి **'ప్రాణ-అపాన సమత్వ- <u>అగ్ని జనిత యోగము - సలిలశోషణము</u>'** లచే ఈ దేహము ఎంతో దృఢతరమౌతుంది.

ఈ విధంగా ప్రాణాయామము అభ్యసిస్తూ ఉండగా శరీరంలో ప్రాణ - అపానములు **'కుంభకము'** సమయంలో సమత్వము పొందుతూ, దేహంలో తేజస్సు (అగ్ని) వృద్ధి అగుచున్నది. దేహము తేజోమయమౌతుంది. చెమట అధికంగా ప్రదర్శనమౌతుంది. అట్టి విశేషములచే **దేహము ఉత్సాహ-బల-ఆరోగ్య సమన్వితము కూడా అవుతూ వస్తుంది.**

## అపాన ఊర్ధ్వయానము

యోగాభ్యాసంలో మరొక ప్రత్యేకత గల యోగసాధన గురించి మనము ఇప్పుడు చెప్పుకుంటున్నాము.

(1) గుద యోని వద్ద ధ్యాస (concentration)ను నిలిపి ఉంచటము.

(2) బయటకు ప్రవహించు ధర్మమును నిర్వర్తిస్తున్న వాయువును (అపానప్రాణమును) వెనుక మరల్చు 'అకుంచన-అభ్యాసము'. ఈ రెండూ ఒకే సమయంలో నిర్వర్తించటము.

(3) అటు తరువాత **అపానమును** → దేహమంతా సమముగా ఏర్పడియున్న సమాన ప్రాణతత్త్వమునందు నిశ్చలముగా చేసి ఉంచటము. **ఇది కుంభక ప్రాణాయామము**నకు సంబంధించిన **అంతర్లీన స్వాభావిక ప్రక్రియ.**

## ధ్యానము

**నిదాఘుడు :** స్వామీ! మీరు చెప్పిన కుంభక ప్రాణాయామాభ్యాసముతో సంబంధము కలిగియున్న **(1) ప్రాణాయామ యోగాగ్ని (2) అపాన ఊర్ధ్వ యానము**....ఈరెండూ మాకు అభ్యాసము కొరకై సులభతరమైన సూచనలు. ప్రాణాయామాభ్యాసము కొరకై చాలా ఉపకరణమైన విశేషాలు. అయితే గురువర్యా! **'ప్రాణాయామము - ధ్యానము' ఈ రెండూ బండికి రెండు చక్రముల వంటివని,**

**పక్షి రెండు రెక్కలనూ ఉపయోగిస్తున్న తీరుగా, – ఈ రెండూ ఒకేసారి నిర్వర్తిస్తూ ఉండాలని యోగ గురువుల వద్ద మేము ఎరుగుచూ వస్తున్నాము. ఇప్పుడు నా ప్రశ్న ఏమిటంటే,**

**'ప్రాణాయామయోగము'** అభ్యసిస్తూనే, **'ధ్యానము'**ను చేయాలా? చేయాలంటే, దేనిగురించి చేయాలి? ఏ రీతిగా చేయాలి? దయచేసి వివరించండి.

**ఋభుమహర్షి : ఔను (1) ప్రాణాయామ యోగాభ్యాసము (2) ధ్యానము** ....ఈ రెండూ ఒక్కసారే తప్పకుండా సాధనయొక్క 'అంతర్భాగం'గా 'సాధన' అను ద్విచక్రవాహనం యొక్క రెండు చక్రములుగా సర్వదా కలిగి ఉండాలి.

***అట్లాగే మూడవదగు 'విచారణ'ను వదలకూడదు.***

## ధ్యానించవలసిన వస్తువు

**స్వాత్మానం చ శ్రియం ధ్యాయేత్, అమృతప్లావనం తతః! తనయొక్క ఆత్మయే జాగ్రత్ – స్వప్న – సుషుప్తులకు జనన స్థానంగా, అందలి సర్వమునకు అభిన్నంగా, సర్వులకు కూడా అంతర్యామిగా భావించి,** అట్టి **'స్వాత్మ'**నే (The Absolute witness self of one's own SELF) **ఉపాసించవలసిన వస్తువుగా స్వీకరించబడు గాక!**

**నిదాఘుడు :** ప్రాణ – అపానముల సమత్వయోగాభ్యాసమునకు శరీరంలో అన్నిటికంటే శ్రేష్ఠమైన చోటు ఏది?

**ఋభువు :** దేహములోని మధ్యమభాగంలో (నడిమి భాగమందు – అనాహత చక్రస్థాన పరిసరములందు) ప్రాణ – అపానములను నిలపటమనే – **ఏకరూప – కుంభ కాభ్యాసము'నకు అధికంగా సానుకూల్య స్థానము.**

**'ప్రాణ–అపాన సంయోగము'** అనే అభ్యాసముచే ప్రాణ–అపానములు సయోధ్యత పొందుచున్నాయి. క్రమంగా 'శిల్పియొక్క చేతిలోని **ముఖ్య ఉపకరణములగు** 'ఉలి–సుత్తి–శిలలవలె, గొప్ప **చిత్రలేఖకుని** చేతిలోని 'కుంచె–రంగులు–గోడవలె, ఒక **గొప్ప రచయిత** యొక్క కథకు సంబంధించిన 'కథ–పాత్రలు–కథనము వలె – యోగాభ్యాసికి **'ప్రాణము–అపానము–అగ్ని'**...ఈ మూడు తన అధీనములోని ఉపకరణములవలె అగుచున్నాయి. 'భావము' అనునది **'కళా నిపుణతగల చేయి'** వలె అగుచున్నది.

## మధ్యమ ద్వార – అంతర్గత ప్రాణాయామం

నాడీ కందము చుట్టూ చుట్టుకొని యున్నట్టి నాడుల ప్రదక్షణక్రమంగా ఏర్పడిన నాడీ చక్ర మధ్య ద్వార విభాగంలో – **మధ్యమ ద్వార భాగతః,** (మధ్యగా) ఏర్పడి ఉన్నాయి. యోగాభ్యాసి ప్రాణ అపానసమత్వ అభ్యాసం చేస్తూ **'యోగబలము'** పొందుచున్నాడు.

మూలాధారములో గల ఇచ్ఛా–జ్ఞాన–క్రియా–ప్రజ్ఞా రూపముతో విరాజిల్లు 'కుండలినీశక్తి'ని గురుముఖతః మూలాధారములో గమనిస్తున్నాడు. అట్టి కుండలినీ శక్తి నిద్రాముద్ర వహించి ఉన్నది. కుండలిని నిదురించటం అనగా?

- కుండలినీ శక్తి శరీరమంతా విస్తరించి సర్వరక్ష దేవతగా ఒకవైపు రక్షణ ధర్మమును నిర్వర్తిస్తూనే ఉన్నది **(నిద్రాముద్రం నిఖిల జగతీమ్ రక్షణే జాగరూకామ్).**
- అయితే, రెండవవైపు **ధ్యాసతో ఇంద్రియ బాహ్య విషయముల గురించి ఇచ్ఛా జ్ఞాన క్రియా ప్రజ్ఞలను నియోగిస్తోంది.**

తన జనన స్థానమగు **'స్వస్వరూపాత్మ'**ను ఏమరుస్తోంది.

అట్టి ఏమరుపునే **"కుండలినీదేవి నిదురిస్తోంది. 'ఆత్మాఽహమ్' స్వానుభవము వైపుగా కుండలినీ శక్తిని ప్రయాణింపజేయాలి"** – **అని యోగభాషగా చెప్పబడుతోంది.**

## కుండలినియొక్క ఊర్ధ్వగతి – సిద్ధిమార్గము

**భావయేత్ ఊర్ధ్వగతిః అర్థం – ప్రాణ అపాన సుయోగతః।** నాడీమండలములోని నాడుల చుట్టలవలన ఏర్పడిన 'నాభిచక్రము'లో ప్రాణ అపానముల సమయోగము అభ్యసిస్తూ ఉండగా 'అగ్ని' తోడగుచున్నది. అట్టి **ప్రాణ – అపాన – అగ్నుల కలయిక** ఉపకరణముగా అగుచున్నది. యోగి అట్టి త్రిమూర్తుల ఉపకరణములచే ఏర్పడిన 'భావనాబలమి'చే 'కుండలినిని 'సుషుమ్న'నాడి ద్వారా ఊర్ధ్వగతి (Moving path upwordly)కి తెచ్చుచున్నాడు. **ఏష యోగ పరో దేహే 'సిద్ధి మార్గ' ప్రకాశకః।** అట్టి ఉత్తముడగు యోగి – ఇహమార్గమగు పాంచభౌతిక దృశ్యజాలమును అధిగమించి – **'పరమార్గము'**ను తన దేహమునందు సిద్ధించుకొనుచున్నాడు. అనగా 'పరమార్గము' – సిద్ధిమార్గముగా ఈ దేహములో ఆ యోగికి ప్రకాశమానమగుచున్నది.

## అట్టి పరయోగి యొక్క తదనంతరానుభవం-నాడీబంధము।

ఏ విధంగా అయితే - **అపాంగతః సేతుః ప్రవాహస్య నిరోధకః** - పల్లపు ప్రదేశంవైపు సరస్సులోని జలము వేగముగా ప్రవహిస్తూ ఉండగా, ఒక **'ఆనకట్ట'** ఆ ప్రవాహమును నిరోధించి జలమును వెనుకకు మరలేటట్లు చేస్తున్నదో...., అట్లాగే **ప్రాణయోగాభ్యాసి యొక్క బుద్ధి దృశ్య విషయములనుండి వెనుకకు మరలుచున్నది.**

**"ఈ శారీక (లేక) భౌతిక సంబంధమై ప్రాప్తిస్తున్న 'శబ్ద స్పర్శ రూప రస గంధ' విషయములు, వాటి యొక్క అనుభవి** (Experiences) **అగు 'జీవుడు' అనబడువాడు ఛాయవంటివి అగుచున్నాయి. ఈ రెండూ కూడా 'రహదారిలో నడుస్తున్నవాడు - ఆతని ఛాయ' వంటివి"** → అని ఆ యోగికి నిస్సందేహ - అనునిత్య స్వానుభవము రూపుదిద్దుకుంటోంది. **తథా శరీరగాత్ ఛాయా జ్ఞాతవ్యా యోగి భిః సదా!** ఆ యోగి - 'శరీరిత్వము' అనబడేదంతా **తనయొక్క ఛాయా మాత్రంగా** - అనుకుంటూ ఉండగా, అన్ని సందర్భ సమయములందు **'అనిపించటం'** సిద్ధిస్తోంది. అప్పుడు ఆతని శరీరములోని - ఇడ, పింగళ, సుషుమ్న, అలంబుస, కుహు, వారుణి, యశశ్విని, పూష, పయస్వని, శంఖిని, గాంధారి, హస్తిజిహ్వ, విశ్వోదరి - మొదలైన నాడులన్నీ వాటి వాటి ఉపనాడులతో సహా సామ్యత్వము (Purity, Divinity, Enlightenment, Positivity, Thrillingly active) పొందుతాయి. ఇదియే 'నాడీబంధ సిద్ధి' - అని కీర్తించబడుతోంది.

ఇటువంటి నాడీబంధ - అభ్యాసమువలన **'దేహి - దేహము'**లందు ఒకానొక అనిర్వచనీయమైన **'ప్రసాదము (పవిత్రత)'** లతో రూపుదిద్దుకుంటోంది. అట్టి యోగి త్రిమూర్తులగు బ్రహ్మ - విష్ణు - మహేశ్వరుల (The Incharge Divinities Viz., Creater, Maintainer and Withdrawer) తత్త్వముగా **సుస్పష్టముగా, స్వా-అనన్యముగా** సంతరించుకోసాగుచున్నాయి.

ఈ విధంగా "చతుష్పథబంధము" (Packing with the help of Four Practices) అగు **'పూరక, కుంభక, రేచక, పునః పూరక** అభ్యాసములు)చే →

**మార్గత్రయము** (ద్రష్ట-దర్శన-దృశ్యములు, అనుభవి-అనుభవము-అనుభవించబడినవి, దృశ్య-జీవ-ఈశ్వరులు, ఆలోచించువాడు-ఆలోచన-ఆలోచించబడినవి మొదలైనవి) సమరసత్వము పొందుచున్నాయి.

ఒకే ఒక్క మార్గం శేషించినదై ఉంటోంది. **ఏకం వికాశయత్ మార్గః।**

అట్టి తనలో వికసించిన ఏకైక మార్గము (Streight forward lone path)లో నడుచున్న ఆ యోగాభ్యాసి సర్వము సుంగతమై - **(ఏన సిద్ధాః సుంగతః)** - ఉంటోంది. **బుద్ధి వికసించినదై ఆ యోగి జీవాత్మ - ఈశ్వరాత్మ - దృశ్యాత్మల ఏకత్వము సిద్ధించుకొన్నవాడై, 'సర్వాత్మకుడు'గా రూపము పొందుచున్నాడు.** ఆ సంసిద్ధుడు **'సిద్ధుడు'**గా అగుచున్నాడు. **సిద్ధుడుగా పిలువబడుచున్నాడు.** సిద్ధించుకోవలసినది సిద్ధించుకున్నవాడు కాబట్టి సిద్ధుడు.

**"జాగ్రత్ స్వప్న సుషుప్తులు నా చేతనే లీలావినోదంగా సిద్ధపరచుకోబడుచున్నాయి"** - అను ఎరుకగలవారే. **'సిద్ధపురుషుడు'**గా అభివర్ణించబడుచున్నాడు. (అంతేగా అష్టసిద్ధులు కలవాడని కాదు).

## ఊర్ధ్వయానము - మూలబంధ యోగము

**'ప్రాణాయామాభ్యాసము'** చే నాడులలో చిందరవందరగా ప్రవహిస్తున్న నాడీ శక్తి **నిశ్చలము అవుతోంది. 'కుంభకయోగధారణ'యే నాడీబంధ యోగాభ్యాసము.** అట్టి అభ్యాసముచే కంఠములో చేరియున్న వాయురూపమగు ఉదానప్రాణము ఊర్ధ్వముగా ప్రయాణించసాగుతుంది. నాడులు ప్రాణాయామముచే శుద్ధపడుచున్నాయికాబట్టి, ఉదానము బ్రహ్మకపాలమును సుఖముగా (అడ్డులు లేకుండా without interuptions) చేరుచున్నది.

అప్పుడు ఓ సీసా మూతను తొలగించు రీతిగా ఉదానప్రాణము బ్రహ్మరంధ్రమును మూసి ఉన్న మూతను తొలగించుటకై ఊర్ధ్వయానము (upwordly moving) చేస్తూ, కపాల ఊర్ధ్వభాగమున అగ్నిశిఖారత్నమువలె ప్రకాశించుచున్న బ్రహ్మరంధ్రమును చేరుకొనుచున్నది. ఇది **'మూలబంధ యోగము'** అనబడుచున్నది.

## మూలబంధయోగము - సంపుటీకరణ యోగము

ఇప్పుడు మనం చెప్పుకొన 'మూలబంధయోగ' యోగాభ్యాస విశేషాలను 'సంపుటీకరణయోగము' అని కూడా పిలుస్తూ ఉంటారు. ('త్రిపుటీయోగము' అని కూడా ఇతరచోట్ల చెప్పబడుతోంది). ఎందుకంటే ఈ **మూలబంధయోగవిద్య -**

- ప్రాణ – అపానములను సమానములో ఏకం చేస్తోంది. **సంపుటీకరిస్తోంది.**
- ద్రష్ట – దర్శన – దృశ్యములను **ఆత్మగా ఆత్మలో ఆత్మచే ఏకం చేస్తోంది.**
- బద్ధుడు – బంధనము – బంధించు విషయాలన్నిటినీ బంధరహితమగు కేవల స్వరూపమునందు **ఛాయామాత్రంగా చేసివేస్తోంది.**

అందుచేత ఓ నిదాఘా! రాత్రనక, పగలనక, ఒకసారి తరువాత మరొకసారిగా, 'ఉదయం – మధ్యాహ్నం – సాయంకాలం – రాత్రి సమయాలు' అనే ఊసు లేకుండా,....

"ప్రాణాయామాభ్యాసముచే మూలాధారంలోగల **కుండలినీ శక్తి దేవిని ఉదాన ఊర్ధ్వగత విధానం**గా (కంఠంలోని ప్రాణశక్తిని ఊర్ధ్వంగా విస్తరింపజేయువిధంగా) కపాలమునకు ఉపరిభాగంగా, (కొండనాలుకకు సూటిగా)గల బ్రహ్మరంధ్రమును మూత తెరవటం.

– ప్రజ్ఞను సహస్రారంలోప్రవేశింపజేసి సహస్ర శీర్ష పురుషుడగు పరమశివ తత్త్వముతో ఏకం చేయటం"

– అనే యోగాభ్యాసమును క్షణికం నుండి అనుక్షణికం చేస్తూ వాయు అభ్యాసనము కొనసాగించాలయ్యా!

ప్రాణాయోగాభ్యాసముచే ప్రాణశక్తి శరీరమంతా సమస్వరూపమై విరాజిల్లుతోంది.

**ప్రాణశక్తి ప్రసరణ ఒడిదుడుకులవలననే దేహములో వ్యాధులు సంభవిస్తున్నాయి.**

**శ్లో॥ వహ్నౌ వివర్ధమానే తు సుఖమ్ అన్నాది జీర్యతే।**
**అన్నస్య పరిపాకేన రసవృద్ధిః ప్రజాయతే।**
**రసే వృద్ధిం గతే నిత్యం వర్ధంతే భాతవత్ తథా।**
**ధాతూనాం వర్ధనే నైవ ప్రబోధం వర్ధతే తనౌ॥**

ప్రాణ సంయమము (దేహమంతా సమరసంగా ప్రాణశక్తిని అభ్యాసపూర్వకంగా ధారణ చేయటంచేత) **దీర్ఘాయుష్షు,** ఉత్సాహభరితమైన **బుద్ధి,** వ్యాకులతలు లేని **మనస్సు,** ప్రసన్నతతో కూడిన **చిత్తము,** ఆరోగ్యమైన **ఇంద్రియములు,** సుఖకరమైన **దేహము** లభిస్తున్నాయి. దేహంలో అగ్ని (Heat) సమత్వము కలిగి ఉండటంచేత తేజోవృద్ధి, ఆహారము తేలికగా జీర్ణమవటము, శరీరములో ప్రవేశించిన అన్నము త్వరగా పరిపాకమవటము, రసవృద్ధి – ఇవన్నీ బాగుగా జరుగగలవు. **అన్నస్య పరిపాకేన రసవృద్ధిః ప్రజాయతే।** రసవృద్ధి యొక్క శుభచర్యలవలన శరీరము ప్రకాశమానము(Enlightening)గా ఉంటుంది. ధాతువులు నిర్మలమౌతాయి. ధాతువులు సమవృద్ధి, నిర్మలత్వము పొందుచూ ఉండగా అప్పుడిక శరీరము, మనస్సు, బుద్ధి – ఇవన్నీ ప్రబోధము పొందటానికి (To be positively receptive, inspired, incliningly active) శుభప్రదంగా సంసిద్ధమౌతాయి.

యోగాభ్యాసముచే కోటి జన్మల పాపాలు కూడా – (ఒక్క నిప్పుకణం అసంఖ్యాక కట్టెలు భస్మము చేయువిధంగా) – భస్మీభూతమౌతాయి. ప్రక్షాళణం అవుతాయి.

## శరీర – మూలాధార చక్ర ప్రాసస్త్యం

ప్రకృతి నిర్మితమైన ఈ భౌతిక దేహములో గుదము – మేఢ్రముల (మల బహిష్కరణస్థానం – లింగస్థానం) మధ్యగా విశ్వమంతా నిండియున్న మహత్తరశక్తి ప్రక్షిప్తమై ఉంటోంది. ఇదియే "మూధార '∆' త్రికోణరూప చక్రము". అట్టి మూలాధారము యొక్క ఔన్నత్యమేమిటో చెప్పుకొంటున్నాము.

ఈ మూలాధారము నందు ⟶

⟶ అనంతశక్తియుతుడు, సర్వశుభంకరుడు అగు **పరమశివుని (సాంబశివుని) మహాప్రకాశరూపమగు ('•') బిందువు** ఉన్నది. అందుచే 'బిందుస్థానము' అయి ఉన్నది.

మరల విను

- ఈ విశ్వమంతా ప్రకాశింపజేయు **కేవల శివశక్తి స్థానము** – మూలాధారము.
- ఈ మూలాధారాకాశంలో (ప్రదేశంలో) 'కుండలిని' అనే పేరుతో పిలువబడే విశ్వ – విశ్వాంతర్గతమైన **'పరాశక్తి'** ప్రతిష్ఠితమైయున్నది.
- ఇది వాయు జనన స్థానము, వాయుచలన కారకమగు **చైతన్యశక్తి.**
- **తేజస్సు** (అగ్ని)కి **సముత్పన్నస్థానము.** విశ్వములో అగ్ని ఈ **'విశ్వకుండలిని'** నుండే బయల్వెడలుచున్నది.

- ఇందులోనే **'బిందువు'** ఉత్పన్నమై, విశ్వమునకు అధిష్ఠానమై విరాజిల్లుతోంది.
- హంస (సోఽహమ్) అగు జీవ – బ్రహ్మైక్య అఖండతత్త్వము, 'శక్తిమంతుడు–శక్తిల' అభేదవిశేషము ఇక్కడ సంప్రదర్శనమైయున్నాయి.
- ఈ మూలాధారమునుండే **'ఆలోచనాశక్తి' బయల్వెడలుచున్నది.** ఇందుగల **కుండలినీశక్తియే మనో ఉత్పాతక స్థానము.**

ఇంకా ఈ శరీరంలో **నాడులు, నాడీకందము, జీవుడు,హంస, ఈ శరీరము యొక్క బాహ్యమున ఈ చరాచర సృష్టి**–ఇవన్నీ కల్పించబడినవై ఉన్నాయి.

**శక్తి స్థానము :** 'మూలాధారము' నుండి → స్వాధిష్ఠాన – మణిపూరక – అనాహత – విశుద్ధ → 'ఆజ్ఞా' చక్రము వరకు గల స్థానమును వరకు – వెన్నెముకకు అంతర్గత శక్తి స్థానము.

**శాంభవ స్థానము :** కంఠము పైనుండి – మూర్ధము (Fore face) యొక్కఅంతము (ఆవల) వరకు గల స్థానము.



నాడులన్నిటికీ ... నాడీపిండము (లేక) నాదీ మండలము ఆశ్రయము (నివాసగృహము).

ప్రాణమునకు ... నాడులు ఆశ్రయము.

జీవమునకు ... ప్రాణము నిలయము. ఆశ్రయము.

హంస (గాలి, ముక్కు ద్వారా పీల్చుట – వదులుట) లేక జీవుడు ..... జీవమునకు ఆశ్రయం.

శక్తి (The Energy) .... హంసకు అధిష్ఠానము.

ఈ చరాచర జగత్తంతా శక్తియొక్క ప్రదర్శనా చమత్కారమే!

ఈ విధంగా ఉత్తరోత్తర 'సారూప్యస్థితులు' పొందటానికి – సర్వ కల్పనా వ్యవహారములను ప్రక్కకు పెట్టి, – సర్వ దృశ్య సంబంధమైన అసంతృప్తులను త్యజించి వేసి, ప్రసన్నాత్ముడై, **'ప్రాణాయామము'ను చక్కగా అభ్యసించాలి.**

ఒకవైపు **'బంధత్రయము'**తో కూడిన **ప్రాణాయామము**ను ఆచరిస్తూనే, రెండవవైపు **బ్రహ్మజ్ఞానము గురించి సమాచారమును విచారణ చేస్తూ ఉండాలి.**

ఓ నిదాఘా! ఈ దృశ్యములోని లక్ష్య (Objectives) – లక్షణ (Features) కారణ (Causation) విశేషములను సమ్యక్ భావనతో దర్శిస్తూ, అట్టి మనస్సును క్రమముగా సత్యము వైపు అనుసంధానము చేయాలి. ఎల్లప్పుడు ఆత్మవైపు నడిపిస్తూ, **మనస్సును దృశ్యభావావేశముల నుండి సముద్ధరించాలి.**

## చిత్త ప్రాణాయామము

**చిత్తమేవ హి సంసారః!** ఈ చిత్తమే సంసారము. అందుచేత వాయు సంబంధమైన ప్రాణాయామము క్రమక్రమంగా **'చిత్త ప్రాణాయామము'**గా రూపుదిద్దుకోవాలి. అది ప్రాణాయామాభ్యాసముయొక్క ముఖ్యాశయము.

చిత్తము (లేక) మనస్సుతో

(1) నిర్వి కల్పమును [ఆలోచనలను నిరోధిస్తూ ఆలోచించువాని కేవల రూపమును (The Thinker sans thoughts)] ధారణ చేసి ఉండటము.

(2) సర్వదా 'ప్రసన్నత' (సంతోషము, ఉత్సాహము కలిగి ఉండటము).

అను అభ్యాసము – **'చిత్తప్రాణాయామము'** అగుచున్నది. చిత్తమును సమరసస్థితిని అభ్యసింపజేయాలి. **లక్ష్య – లక్షణకారణములతో కూడి స్థూల – సూక్ష్మ – కారణ దేహబంధములనుండి (లేక) బాహ్యములనుండి సమ్యక్ భావనతో చిత్తమును సముద్ధరించాలి.** సత్యము యొక్క అనుసంధానముచే **'వేద్యము (తెలియబడునది)' అగుచున్న సమస్తమును ఆత్మగా దర్శించటమే చిత్తసముద్ధరణ.**

**చిత్త లయస్థితియే నిజమైన ప్రాణాయామము.** వాయు ప్రాణాయామముచే చిత్తము నిశ్చల స్థితిని పొందగలదు. అటు తరువాత క్రమంగా రేచక – పూరకముల మధ్యగా కుంభక స్థానమునందు చిత్తము లయించగలదు. చిత్తము 'చిత్ తత్త్వము'ను సంతరించుకొని, మౌనము వహించినదై ఆత్మయందు ఏకత్వము పొందగలదు.

**'చిత్తలయము' ప్రాణాయామము యొక్క ముఖ్యాశయము. అంతేగాని, కేవలము ప్రాణ నిశ్చలము మాత్రమే కానేకాదు.**

## అంతరంగ త్రి-ప్రాణబంధములు-"చిత్త యామము"

**చిత్త – 'రేచకము' : "ఈ ఎదురుగా దృశ్యమానమై కనిపించేదంతా స్వయముగా సర్వదా పరబ్రహ్మమే"** అను దృష్టితో బాహ్యవిషయాలన్నీ ఆత్మకు అభిన్నంగా చూస్తూ, అందుకు భిన్నమైన భేదదృష్టులను మనస్సులోనుండి బయటకు త్రోసివేయటం– **మనో రేచకము.**

**చిత్త – పూరకము :** చిత్తమును ఆత్మశాస్త్ర విశేషాలతో నింపి, హృదయ గతం చేసుకోవటం – **చిత్తపూరకము.**

**చిత్త – కుంభకము :** అత్యంత ప్రియమైనదిగా చిత్తముతో సర్వత్రా ఆత్మను దర్శించుచూ ఉండటమే – చిత్త కుంభకము. **"ఆత్మ అనగా జాగ్రత్ – స్వప్న సుషుప్తుల సాక్షి అగు స్వస్వరూపమే"...అను నిశ్చిత సందర్శనము. "త్వమ్" గా కనిపిస్తున్న సమస్తము సర్వదా అపరిచ్ఛిన్నమగు ఆత్మకు అభిన్నము – అను తత్త్వ భావనయే "చిత్త కుంభకము".**

(అనగా) సమస్త సహజీవులను ప్రియాతి ప్రియమగు ఆత్మగా భావన చేయటమే చిత్ ఆశ్రయ స్వరూపమగు చిత్త కుంభకము.

ఎవ్వరు చిత్తముతో పై **'బంధత్రయము'**ను (చిత్త–రేచక–పూరక–కుంభకములు) అభ్యసిస్తారో అట్టి వారు ముక్తులే అగుచున్నారు. సందేహం లేదు.

## కుంభక – కుంభక శివదర్శనం

**కుంభకేన సదా ఆరోప్య కుంభకేనైవ పూరయేత్। కుంభేన కుంభయేత్ కుంభం తత్ అన్తస్థః పరం శివమ్॥**

***చంచల చిత్తముపై నిశ్చల చిత్తమును ఆరోపించి నిశ్చల చిత్తముతో పూరించాలి.*** (అనగా) **'నిశ్చల చిత్'యే చంచలము కల్పించుకొని చిత్తముగా ప్రదర్శనమగుచున్నది – అను అవగాహనను సునిశ్చితం చేసుకోవాలి.**

నిశ్చల – కుంభక ప్రాణాయామము (స్వభావకుంభకము)తో కుంభకమును కుంభకము చేసి తత్ – అంతస్థుడగు పరమశివ (ఆవలగల స్వస్వరూప / సహజ నిత్య స్వరూప) దర్శనం చేయటము **"కుంభక శివ దర్శనము"**గా అనబడుతోంది. **"నేను – నీవు – జగద్దృశ్యముతో సహా సర్వదా శివమయమే"** – అను దర్శనమే **'శివదర్శనము'!**

## కంఠముద్రా యోగము

**'కంఠమునందు కుంభక ప్రాణాయోగాభ్యాసము'** – అనబడు కంఠముద్రను ధరించటమును **"కంఠకుంభకము"** – అని పిలుస్తున్నారు.

కంఠమును నిఠారుగా నిలిపి, కంఠమునుండి – శిరో ఉపరిభాగము వరకు శివలింగ భావన చేసి, ముఖమునందు **'సర్వతత్త్వాత్మకుడు, స–అంబుడు, సర్వతత్త్వస్వరూపుడు, సర్వతత్త్వ విదూరుడు'** అగు పరమశివుని నిశ్చలచిత్తుడై ధ్యానము చేయు అభ్యాసము "కంఠముద్రాయోగము" అనబడుతోంది.

ఇట్టి ఉపాసనలో – **సర్వాత్మకుడగు శివసాన్నిధ్యమును సర్వతోముఖంగా– సర్వముఖములలో చూస్తూ ఈ విశ్వమంతా శివ తాండవంగా దర్శిస్తూ....'శివోఽహమ్' భావము సంతరించుకోవటము** – 'కుంభక కుంభక శివోఽహమ్'నకు మార్గముగా చెప్పబడుతోంది.

## వేదకక్రమ యోగము (లేక) చతుష్పీఠ యోగము

శ్లో॥ **వాయూనాం గతిం ఆవృత్య ధృత్వా పూరక కుంభకౌ,**
**సమహస్తయుగం భూమౌ, సమం పాదయుగం తథా,**
**వేధక క్రమయోగేన చతుష్పీఠం తు వాయునా।**

- దేహములో 'వాయువు' యొక్క గతి (Path of Travel) గమనిస్తూ, అద్దానిని ధారణచేస్తూ,
- వెనుకకు మరల్చుచూ, పూరక – కుంభకములలో ధారణ చేస్తూ,
- రెండు కాళ్ళను నేలపై సమస్థితిలో ఉంచి, రెండు చేతులను సమముగా నేలకు తాకించి ఉంచుచూ,

చేయు యోగాభ్యాసమును **'వేదకక్రమ యోగము'** అని అంటారు.

ఇట్టి ఆసనములో వాయువును ముఖముగా ధారణ చేసి, ప్రాణ – అపాన – వ్యాన – ఉదానములను **చతుష్పీఠం** (నాలుగు కాళ్ళ పీటవలె) శరీరములో ధారణ చేయటం జరుగుతోంది.

**శ్లో॥ ఆస్ఫాలయేత్ మహామేరుం వాయువక్త్రే ప్రకోటిభిః, పుటద్వయం సమాకృష్య వాయుః స్ఫురతి సత్వరమ్॥**

వాయు వక్త్రం (Face of Air)తో ఆస్ఫాలనము చేస్తూ వాయువుకు ఆవలగల 'ప్రాణశక్తి'ని గమనిస్తూ ఉపాసించటం **వేదక త్రయయోగము**

**(లేక) చతుష్పీఠయోగము** యొక్క అంతర్లీన సంవిధానము.

ఇట్టి ఆస్ఫాలనము **'మహా మేరు ఆస్ఫాలనము'** అని కూడా అంటారు. ఇది అనేక జన్మలుగా మహా మేరు పర్వతమువలె పేరుకొనియున్న కుకర్మల – అల్పదృష్టుల కొండలను మొదలంట్లా పెకలించి దూరముగా విసిరివేయగలదు.

పుట ద్వయము యొక్క (ప్రాణ – అపానముల) సమీకృష్యము (ఏకము చేయుట)చేత వాయుచలనము అనుభూతమౌతుంది.

చంద్ర – సూర్య – అగ్ని (ఇడ – పింగళ – సుషుమ్న నాడుల)సంబంధమైన జ్ఞానముచే మేరు మధ్యగతమగు మహాశక్తి (వాయువును కదలించు మూలశక్తి) అనుభవమవగలదు.

## వేధమార్గము – గ్రంథిభేదము

'ప్రాణాయామ యోగాభ్యాసము' చే బ్రహ్మగ్రంథికి మార్గము (వేధ మార్గము) ఎరుగబడుతోంది. కుండలినీశక్తి సుషుమ్నలో ప్రవేశించి ఊర్ధ్వమునకు సంసిద్ధమై, వేధ (మార్గము) నందు ప్రకాశించుచూ, **'ఊర్ధ్వగమనము'** పొందుచుండగా → గ్రంథి భేదనము జరుగుచున్నది.

**బ్రహ్మగ్రంథి భేదనము :** మొట్టమొదట కుండలినీశక్తి **'బ్రహ్మగ్రంథి'**ని ఛేదించుచున్నది. 'ఈ కనబడేదంతా నిజంగానే మరొకరెవ్వరిచేతనే సృష్టించబడి, సత్యము అయి ఉన్నది' – అనే భ్రమ వీడటమే బ్రహ్మగ్రంథి ఛేదనము. **'సృష్టి అభిమానము'** – తొలగుతుంది.

**విష్ణుగ్రంథి భేదనము :** ఆ తరువాత **కుండలినీశక్తి** ఊర్ధ్వంగా **సుషుమ్న తేజోనాడిలో** ప్రయాణించుచు **"ఈ సృష్టి అనంతకాలము నా పట్ల స్థితించబడియే ఉన్నది. కొనసాగుతోంది. దాటుటకు శక్యము కాదు. (కొనసాగించు అభిమానము)"** అనే భ్రమను తొలగుటచే విష్ణుగ్రంథి భేదనము అగుచున్నది. **"ఈ దృశ్యమునకు నాకు అవినాభావ సంబంధము సర్వదా ఉన్నది" – అనే కొనసాగింపు ఉపశమించగలదు.**

**రుద్రగ్రంథి బేధనము :** ఆ తరువాత **'ఈ జగత్తు లయము పొందింపజేయు అభిమానమునకు సంబంధించిన చిక్కుముడి' వీడుతుంది.**

**'మొదలే లేనిది సృష్టించబడటమేమిటి? స్థితించబడటమేమిటి? మరొకప్పుడు లయము కావలసి ఉండటమేమిటి?'** అను అతీతస్థానము 'ప్రాణాయామాభ్యాసము'చే సిద్ధించుచున్నది. ఇదియే త్రిగంథి భేదనముగా చెప్పబడుతోంది. **"సమస్త దృశ్యము సర్వదా నాయొక్క ఆత్మస్వరూప ప్రదర్శనమే"** – అను నిశ్చయానుభవమే **"లయము"** – యొక్క శబ్దార్థము.

ఈ విధంగా ఈ జీవుడు 'ప్రాణాయామ' ఇత్యాది అభ్యాసముల బలము చేత బ్రహ్మ – విష్ణు – రుద్ర గ్రంథులు భేదనము చేయుచుండగా మోహభావనలు, మోహదృష్టులు, మోహ ఆశలు, మోహకర్మలు, మోహజ్ఞానము...మొదలుగా గల మోహ మలమంతా ఛేదించివేయబడుతోంది. అదే సమయంలో గురుదేవులు చెప్పు **'తత్ త్వమ్ – అదేనయ్యా నువ్వు!'** – అనబడే తత్త్వవాక్యాలు (మోహము సన్నగిల్లుచున్న) బుద్ధిలో ప్రవేశించి ప్రవృద్ధం కాసాగుతాయి. యోగాభ్యాసముచే ఆ యోగి **'ఆత్మ'తో మమేకత్వము పొందుచున్నాడు. 'ఆత్మనగు నాకు ఈ జగత్తంతా అభిన్నము'...అను మహత్తరావగాహన, అకుంఠితానుభవము** స్వభావసిద్ధమై సిద్ధిస్తున్నాయి. అదియే సమస్త యోగ–జ్ఞాన–భక్తి యోగాభ్యాసముల పరాకాష్ఠ సిద్ధి.

## సుషుమ్నలో హ్రస్వ – దీర్ఘ 'ఓం'కార ప్రయోజనములు

ఎడమవైపు 'ఇడ' – కుడివైపు 'పింగళ' నాడుల మధ్యగల 'సుషుమ్న నాడి' అనే మహత్ తేజోవాడిని గుర్తించి, ఆ తేజో నాడిలో విశ్వకల్పనలను ఆరోపిస్తూ...కుంభక ప్రాణాయామము అభ్యసించబడుగాక! వాయువు క్రమంగా (కుండలినీశక్తితో సహా) ఊర్ధ్వముఖంగా నడిపించబడుగాక! ఇక్కడ హ్రస్వమగు ఓంకారమును ('ఓం' అని) అభ్యసించటం చేత సర్వభేద భావములు, పాపదృష్టులు, దుష్టకర్మాభ్యాసములు తొలగిపోసాగుతాయి.

– దీర్ఘమగు 'ఓఓఓ....మ్మ్మ్.....'లేక

(1) 'అ'కారొచ్ఛారణ (2) 'ఉ'కారోచ్ఛారణన (3) 'మ'కారోచ్ఛారణ (4) 'మ్'...అను అర్ధమాత (5) మౌనములో శబ్దమును లయింపజేయటము అనబడు 5 విధముల వేరు వేరైన శబ్దోచ్ఛారణా – ఓంకారోపాసనచే ఈ యోగాభ్యాసికి మోక్షము సిద్ధించగలదు. **'నేను జన్మకర్మల పరిమితుడను కాను! 'నన్ను'ని బద్ధుని చేయుచ్చుదేదీ లేదు. నాకు అనన్యమై ఏదీ లేదు' అన్యమే లేని వానికి బంధము ఎక్కడిది?** – అను స్వాభావికానుభవం అనుక్షణికమవటమే **'మోక్షము'.**

ప్రణవోచ్ఛారణలోని 4వ అంకమగు 'మ్మ్....' అనుప్లుతమును '3' రకములైన ఉచ్ఛారణగా యోగులు నిర్వర్తించుచున్నారు.

(1) అవిచ్ఛిన్నంగా తైలధారవలె 'మ్‌మ్' అని పలకటం (ఓంకారోచ్ఛరణ దీర్ఘంగా పలకటం).
(2) దీర్ఘ ఘంటా నినాదమువలెను (ఘంటా నినాదభావన).
(3) శబ్దరహితమగు ప్రణవాగ్రము (కేవల సాక్షీ భావన). చిట్టచివ్వర **కేవల మౌనము**
ఈ మూడు ఎవ్వరు తెలుసుకొంటారో వారు **విదిత వేద్యులు. వేదవేద్యులు.**
→ తెలుసుకోవలసినది తెలుసుకొన్నవారు
→ తెలియబడుచున్నదంతటియొక్క వాస్తవ స్వరూపమేమిటో ఎరిగినవారు.

# మంత్రసిద్ధి

**'ఓం'** కార మంత్రసిద్ధి కొరకై, **'ఓం'** కార పవిత్రమగు ఆత్మత్త్వము సిద్ధించటానికై ప్రణవమును (1) హ్రస్వముగాను (2) దీర్ఘముగాను (3) బిందుగతంగాను (4) దీర్ఘగతంగాను చేస్తూ... 'స్వరము'ను కంఠము నుండి 'ఆజ్ఞాచకము' (భ్రూమధ్య – బిందు ఆకాశంలో) ప్రవేశింపజేయుచున్నారు. అక్కడ మౌనమునందు ప్రశమింపజేస్తున్నారు.

– ప్లుతమ్ (మ్‌మ్)...ను బ్రహ్మరంధ్రములో క్రమంగా ప్రవేశింపజేస్తున్నారు. నదీ జలము సముద్రంలో కలియువిధంగా – మంత్రమును బ్రహ్మరంధ్రమునకు ఊర్ధ్వంగా గల 12 అంగుళముల ప్రదేశములో భావన చేస్తున్నారు. ఆపై అంతగతము (Taking beyond) కూడా చేస్తున్నారు.

**ఈ విధంగా 'ఓం'కారసంజ్ఞయగు ప్రణవమును ఉపాశించాలయ్యా!**

ఓంకార ప్రణవోచ్చారణ – సర్వ విఘ్నములను, సర్వదోషములను హరిస్తుంది.

బ్రహ్మరంధ్రములోంచి సహస్రార ప్రవేశము =– లోకాలన్నీ నాలోను ఉన్నాయి. (కల నాలో ఉన్నట్లు – **పరమాత్మత్వము**)
– లోకాలలో నేను ఉన్నాను. (కలలో నేను ఉన్నట్లు – **జీవాత్మత్వము**)

**"ఈ సమస్తము నాలో ఉన్నది। ఈ సమస్తములో నేను ఉన్నాను। అఖండమగు నేనే ఇదంతా కూడా!**
**ఈ జీవ – బ్రహ్మైక్యము నాకు స్వాభావికము"** అను నిశ్చితానుభవమే **ఓంకార మంత్రసిద్ధి।**

# ప్రణవము యొక్క భూమికలు

<u>**(1) ఆరంభము (2) ఘటము (3) ప్రచయము (4) నిష్పత్తి**</u>

**(1) ఆరంభ భూమిక :** ఈ జీవుడు బాహ్య ప్రపంచంలో మనస్సులోను, వాక్కులోను, కాయము (భౌతిక దేహము)తోను ఆయా అనేక కర్మలు నిర్వర్తిస్తున్నాడు కదా! ఈ విధమైన –

**శ్లో।। కరణత్రయ సంభూతమ్ బాహ్యం కర్మ పరిత్యజన్,**
**అంతరం కర్మ కురుతే యత్ర, <u>'ఆరంభః'</u> స ఉద్యతే**

బాహ్య విషయములతో ఏర్పడుచున్న బాహ్య విషయములన్నీ బాహ్యముననే వదలివేసి ఉండటము అంతరమున ఆత్మతత్త్వజ్ఞాన – ఆత్మానుభవములపట్ల మాత్రమే మనో – వాక్ – కాయములను నియమించటము – **ఇది ఆరంభ భూమిక!**

**(2) ఘట భూమిక : శ్లో।। వాయుః పశ్చిమతో వేధం, కుర్వన్ ఆపూర్య సుస్థిరమ్,**
**యత్ర తిష్ఠతి, సా ప్రోక్తా 'ఘటాఖ్యా' భూమికా బుధైః।।**

వాయువును పశ్చిమంగాగల త్రినాడులలో నిలిపి, స్థిరం చేస్తూ 'కుంభకము' నిర్వర్తించుచూ, కుండలినీ శక్తిని సుషుమ్నద్వారా మార్గమును కల్పిస్తూ బ్రహ్మరంధ్రము దాటించటము – **ఘటభూమిక.**

**3. ప్రచయ భూమిక : శ్లో।। న స జీవో, న నిర్జీవః – కాయే తిష్ఠతి నిశ్చలమ్**
**యత్ర వాయుః స్థిరః ఖేః స్యాత్ సేయం 'ప్రచయ' భూమికా।।**

ఎప్పుడైతే యోగాభ్యాసి –
→ సజీవుడు – నిర్జీవుడు రెండు కానివాడై (బ్రతికియున్నవాడు కాదు, చచ్చినవాడు కాదు),
→ శరీరమును ఒక బాహ్య వస్తువువలె చూస్తూ అందులో సజీవము – నిర్జీవము కలిగి యుండడో,
→ ఆకాశంలో నిశ్చలవాయువు వలె ఆత్మాకాశమునందు స్థితి కలిగి ఉంటాడో,

*( ఉదా : ఒకడు ఒక కలముతో వ్రాస్తూ ఉంటే అందులో లేనివాడు, కదల్చుచూ అందులో ఉన్నవాడు కూడా అగుతాడు కదా! కానీ, ఆ రెండు అవకుండానే తాను సర్వదా వేరే కదా)'*

అట్టివాడు స్థానము పొందిన భూమిక – "ప్రచయ భూమిక" – అనబడుతోంది.

ఎక్కడ ఆకాశంలో వాయువు స్థిరత్వము పొందినదిగా ధారణ చేయబడుచున్నదో అది **'ప్రచయభూమిక'** అగుచున్నది.

**(4) నిష్పత్తి భూమిక : శ్లో॥ యత్ర ఆత్మనా సృష్టి లయౌ, జీవన్ముక్తి దశాంగతః**
**సహజః కురుతే యోగం, సేయం 'నిష్పత్తి భూమికా" – ఇతి॥**

ఎప్పుడైతే ఈ దృశ్య వ్యవహారమంతా పిపీలికాది బ్రహ్మ పర్యంతము సమస్తము స్వభావతః ఆత్మమయంగా, ఆత్మరూపంగా కనిపిస్తూ, అనిపిస్తూ ఉంటోందో,

- ఆత్మయందే సర్వముగాను,
- ఈ సర్వమునందు ఆత్మగాను
- ఆత్మయే ఈ సర్వముగాను

ఆ యోగాభ్యాసి చూస్తూ ఉంటాడో, **ఆతడే జీవన్ముక్తుడు.**

అట్టి అభ్యాసముచే ఈ యోగి **'నిష్పత్తి'** భూమికతో ప్రవేశించినవాడగుచున్నాడు.

# ఫలశ్రుతి

ఎవ్వరైతే ఈ వరాహోపనిషత్ అధ్యయనం చేస్తారో, పవిత్రమగు ఆత్మదృష్టిని సంతరించుకుంటూ ఉంటారో....

– వారు అగ్ని – వాయువు వలె **పరమ ప్రకాశమానులు నిర్మల స్వభావులు అగుచున్నారు.**

– సురాపానము, బంగారమును దొంగిలించటము మొదలైన సర్వ దోషముల నుండి విముక్తులై **పరమ పవిత్రులగుచున్నారు.**

– అట్టి వాడు **జీవన్ముడగుచున్నాడు.**

**ఈ సత్యమే వేదములలోని** ఋక్కులచే, మంత్రములచే, గానములచే, వర్ణనములచే (4 వేదములలో) **ఎలుగెత్తి ప్రకటించబడుచున్నది.**

పవిత్రమగు దివ్యచక్షువులు యోగాభ్యాసముచే సముపార్జించుకొన్న సూరులు – సర్వే సర్వత్రా సర్వదా స్వస్వరూప విష్ణుతత్త్వమునే దర్శించుచూ సర్వదా పునీతులై ఉంటున్నారు. ఈ కనబడే సమస్తమును – స్వస్వరూపమే అయి ఉన్న విష్ణుతత్త్వమునకు అభిన్నంగా ఆస్వాదించుచున్నారు.

**స్వస్వరూపము –**

**అన్యముగా నిశ్శేషించినదై,**
**విష్ణుతత్త్వముగా అనన్యమై,**
**అట్టివారు విష్ణు స్వరూపులగుచున్నారు.**

వారు సర్వ నిరోధములను, అడ్డంకులను తొలగించుకొన్నవారై, వేద హృదయమును ఎరిగిన వారగుచున్నారు.

ఈ ఉపనిషత్ అధ్యయనము చేసి, పరమార్థమును గ్రహించిన విప్రులు –

→ వేదాధ్యయనము చేసిన ప్రయోజనము పొంది,

→ ఆత్మయందు సదా అనునిత్యంగా, అనుక్షణికంగా జాగృతులై,

→ ఆ పరమపదమగు విష్ణుతత్త్వమునందు ప్రవేశించి,

→ "సోఽహమ్ విష్ణుమ్'

**స్థానమును పుణికిపుచ్చుకొనుచున్నారు.**

ఇతి వరాహోపనిషత్
ఓం శాంతిః శాంతిః శాంతిః

కృష్ణ యజుర్వేదాంతర్గత

# 25 శారీరకోపనిషత్

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ తత్త్వ గ్రామ–ఉపాయ సిద్ధం, పరతత్త్వ స్వరూపకమ్,
శారీరోపనిషద్వేద్యమ్, శ్రీరామ బ్రహ్మ మే గతిః॥



పరతత్త్వ స్వరూపమగు తత్త్వ జ్ఞానము పొందటానికై, తత్త్వ స్థానము చేరటానికై, మహత్తరమగు ఈ 'శరీరము' అను ఉత్తమ సాధనోపాయము గురించి ఎరగటానికి, ఆత్మారాముడగు శ్రీరామ బ్రహ్మమే గతి – అని స్తుతించుచున్నాను.

ఓం

1. అథ అతః, 'పృథివి' ఆది మహాభూతానాగ్ం సమవాయగ్ం శరీరం॥
యత్ కఠినం సా 'పృథివీ'॥
యత్ ద్రవం తత్ 'ఆపో'।
యత్ ఉష్ణమ్ తత్ 'తేజో'।
యత్ సంచరతి స 'వాయుః'।
యత్ సుషిరమ్ తత్ 'ఆకాశమ్'॥

'ఓం'! పరమార్థ స్వరూపుడగు పరమాత్మకు నమస్కరిస్తూ ....,

(**"దేహము దేహికి ఐహిక మోహము"** అను బోధ వాక్యమును దృష్టిలో పెట్టుకొని) - ఇప్పుడు పాంచ భౌతిక విశేషములతో కూడిన భౌతిక శరీర యొక్క రూపము గురించి విచారణ చేసుకొనెదము గాక!

పృథివి మొదలైన **మహాభూతముల సమ్మేళనమే** - ఈ శరీరము

ఇందులో

కఠినమైనదంతా → పృథివి (Solid)

ద్రవరూపమైనదంతా → ఆపః। జలము। (Liquid)

ఏది ఉష్ణమో → అది తేజస్సు (Light/Heat)

ఏది సంచరించు ప్రదర్శనమో → అది వాయువు (Vapour)

ఏది రంధ్రము (ఖాళీ) రూపంగా ఉన్నదో సుషిరమో (బెజ్జమో) → అదియే ఆకాశము (Space)

---

2. 'శ్రోత్ర' ఆదీని జ్ఞానేంద్రియాణి॥
శ్రోతమ్ ఆకాశే। వాయౌ త్వక్।
అగ్నౌ చక్షుః। అప్సు జిహ్వా।
పృథివ్యాం ఘ్రాణమ్। ఇతి॥

### పంచ జ్ఞానేంద్రియములు

శ్రోత్రము మొదలైనవి జ్ఞానేంద్రియములు (**శ్రోత్రేంద్రియము, త్వక్ ఇంద్రియము, చక్షు రింద్రియములు, జిహ్వేంద్రియము, ఘ్రాణేంద్రియము). అవి క్రమంగా పంచభూతముల అంశలు.**

| అంశ | | ఎద్దానియొక్క అంశ |
|---|---|---|
| శ్రోత్రమ్ - (వినికిడియే) | - | **ఆకాశము** (Hearing from space) |
| త్వక్ - (స్పర్శ) | - | **వాయువు** (Touch from Air/Vapour) |
| చక్షువులు - (చూపు) | - | **అగ్ని** (Seeing from Fire/Light) |
| జిహ్వ - (రుచి) | - | **అప్పు (జలము)** (Taste from Water) |
| ముక్కు - (వాసన) | - | **పృథివి** (Smell from the solid) |

అయి ఉన్నాయి

| | | |
|---|---|---|
| **3.** | **ఏవమ్ ఇంద్రియాణామ్ యథా క్రమేణ**<br>**శబ్ద స్పర్శ రూప రస గంధాశ్చ।**<br>**ఏతే విషయాః,**<br>**పృథివీ ఆది మహాభూతేషు**<br>**క్రమేణ ఉత్పన్నాః॥** | **<u>పంచ జ్ఞానేంద్రియ విషయములు</u>**<br>శ్రోత్ర-త్వక్ - చక్షు - జిహ్వా - ఘ్రాణములగు (చెవులు, చర్మము, కళ్ళు, నోరు, ముక్కు) ఇంద్రియముల యొక్క విషయములు వరుసగా - **శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములు** అయి ఉన్నాయి.<br>ఈవిధముగా పృథివి మొదలైన పంచ మహాభూతములనుండి శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములు క్రమంగా (Serially), వరుసగా (Respectively) ఉత్పన్నమౌతున్నాయి. |
| **4.** | **వాక్ పాణి పాద పాయు ఉపస్థ ఆఖ్యాని**<br>**'కర్మ – ఇంద్రియాణి' (కర్మేంద్రియాణి) ॥** | **<u>పంచ కర్మేంద్రియములు</u>**<br>**వాక్కు** (నోరు), **చేతులు, పాదములు, పాయువు** (మల విసర్జనేంద్రియము), **ఉపస్థ** (మూత్ర విసర్జనేంద్రియము). |
| **5.** | **తేషామ్ క్రమేణ వచన ఆదాన గమన**<br>**విసర్గ ఆనన్దాః చ (ఆనన్దాశ్చ)**<br>**ఏతే "విషయాః"॥** | **<u>పంచ కర్మేంద్రియ విషయములు (క్రమంగా/వరుసగా)</u>**<br>వచనము (Speaking) (వాక్కునుండి)<br>ఆదానము (Giving) (చేతులనుండి)<br>గమనము (Walking) (పాదములనుండి)<br>విసర్గము (విసర్జనము) (Leaving) (పాయువు నుండి)<br>ఆనందము (Enjoy) (ఉపస్థ నుండి) |
| **6.** | **పృథివి ఆది మహాభూతేషు**<br>**క్రమేణ ఉత్పన్నాః** | ఈ పంచకర్మేంద్రియములు - విషయములు కూడా - పృథివి మొదలై పంచమహాభూతములు క్రమంగా ఉత్పన్నమగుచున్నాయి. |
| **7.** | **మనో బుద్ధిః అహంకారః**<br>**చిత్తమ్ ఇతి →**<br>**<u>"అంతఃకరణ చతుష్టయమ్"</u>॥** | **<u>అంతఃకరణ చతుష్టయమ్</u>**<br>**(1) మనస్సు** - ఆలోచన (Thought)<br>**(2) బుద్ధి** - విశ్లేషణ (Logic)<br>**(3) అహంకారము** - "నేను కర్తను - భోక్తను" ... అను భావన చేయు ప్రజ్ఞ.<br>**(4) చిత్తము** - ఇష్టము (Liking) |
| **8.** | **తేషాం క్రమేణ సంకల్ప – వికల్ప,**<br>**అధ్యవసాయ, అభిమాన,**<br>**అవధారణా స్వరూపాశ్చ (స్వరూపాః చ)**<br>**ఏతే విషయాః॥** | **<u>అంతఃకరణ చతుష్టయ విషయములు</u>**<br>**మనస్సు**కు విషయము - సంకల్ప వికల్పములు<br>**బుద్ధిః** విషయము - నిర్ణయములను నిర్వర్తించటం<br>**అహంకారము**నకు విషయము - అభిమానము<br>**చిత్తము**నకు విషయము - స్వరూపములపట్ల అవధారణ చేయటము-విషయము- ఇష్టపడటము |
| **9.** | **మనః స్థానం → గళ–అన్తం।**<br>**బుద్ధేః → వదనమ్।**<br>**అహంకారస్య → హృదయమ్।**<br>**చిత్తస్య → నాభిః॥ – ఇతి॥** | **<u>అంతఃకరణ చతుష్టయముయొక్క-శరీరములో-నివాస స్థానములు</u>**<br>మనస్సుకు - గళము (గొంతు) యొక్క చిట్టచివరగా(ఆవలగా)<br>బుద్ధికి - వదనము<br>అహంకారమునకు - హృదయము<br>చిత్తమునకు - నాభి (బొడ్డు)<br>**సంస్థిత స్థానములు** |

| | |
|---|---|
| **10. అస్థి చర్మ నాడీ రోమ మాగ్ంసాః చ ఇతి పృథివీ అంశాః॥** | **పృథివి యొక్క అంశలు**<br>ఎముకలు, చర్మము, నరములు, రోమములు (వెంట్రుకలు), మాంసము |
| **11. మూత్ర శ్లేష్మ రక్త శుక్ల స్వేదా అబంశాః (అప్-అంశాః)॥** | **జలముయొక్క అంశలు**<br>మూత్రము, శ్లేష్మము, రక్తము, శుక్లము, స్వేదము (చెమట) |
| **12. క్షుత్ తృష్ణ అలస్య మోహ మైధునాని అగ్నేః (అంశా) ॥** | **అగ్ని యొక్క అంశలు**<br>ఆకలి, దాహము, సోమరితనము (బద్ధకము), మోహము, మైధునము (శృంగార భావములు, దృశ్యములో సుఖమునకై వెతుకుచూ ఉండటము). |
| **13. ప్రచారణ విలేఖన స్థూల అక్షి ఉన్మేష నిమేష ఆది వాయోః (అంశా) ॥** | **వాయువు యొక్క అంశలు**<br>ప్రసరణము / కదలికలు (Extending / Movements)<br>విలేఖనము (Experience of forms / భావ తరంగాలు)<br>స్థూలంగా కనిపించే కనులు తెరవటం, మూయటము మొదలైనవి. |
| **14. కామ క్రోధ లోభ మోహ భయాని ఆకాశస్య (అంశా)॥** | **ఆకాశము యొక్క అంశలు**<br>- 'ఏదో కావాలి' - అనే 'కామ స్వభావము'.<br>- కోపము దీర్ఘంగా కొనసాగించటం చేత రూపు దిద్దుకునే 'క్రోధము'.<br>- లోభము (Miserly).<br>- మోహము (Illusions, Mis-conceptions).<br>- భయము |
| **15. శబ్ద స్పర్శ రూప రస గన్ధాః పృథివీ గుణాః॥** | **పృథివి యొక్క గుణములు -** 1. శబ్దము 2. స్పర్శ 3. రూపము 4. రసము 5. గన్ధము |
| **16. శబ్ద స్పర్శ రూప రసాః చ అపాం గుణాః॥** | **జలము యొక్క గుణములు-** 1. శబ్దము 2. స్పర్శ 3. రూపము 4. రసము |
| **17. శబ్ద స్పర్శ రూపాణి అగ్ని గుణాః॥** | **అగ్నియొక్క గుణములు -** 1. శబ్దము 2. స్పర్శ 3. రూపము |
| **18. శబ్ద స్పర్శాః ఇతి వాయు గుణౌ॥** | **వాయువుయొక్క గుణము** 1. శబ్దము 2. స్పర్శ |
| **19. శబ్దః ఏక ఆకాశస్య ॥** | **ఆకాశముయొక్క గుణములు** 'శబ్దము' మాత్రమే |
| **20. సాత్త్విక రాజస తామస లక్షణాని త్రయో గుణాః॥** | **త్రిగుణ లక్షణములు**<br>1. సాత్త్విక గుణము 2. రాజస గుణము 3. తామస గుణము |
| **21. అహింసా సత్యమ్ అస్తేయ బ్రహ్మచర్యా అపరిగ్రహః అక్రోధో గురు శుశ్రూషా శౌచమ్ సంతోష ఆర్జవమ్ అమానిత్వం అదంభిత్వమ్ ఆస్తికత్వమ్ అహింసతా - ఏతే సర్వ గుణా జ్ఞేయాః, సాత్త్వికస్య విశేషతః॥** | **సాత్త్విక గుణ విశేషములు**<br>■ అహింస → ఇతరులను బాధకలిగించకుండటము.<br>■ సత్యము → ఉన్నది (సత్)ను ఆశ్రయించటం. అసత్‌ను గమనించి ఉండటము.<br>■ అస్తేయము → ఇతరులది దొంగిలించకుండటము.<br>■ బ్రహ్మచర్యము → బ్రహ్మజ్ఞానమును ఆశ్రయించటము, బ్రహ్మ విద్యార్జనము.<br>■ అపరిగ్రహము → నటుడు తాను నటించు నాటకములోని పాత్రకు చెందినవి తనవిగా భావించడు కదా! అట్లాగే జగత్తులోనివి స్వీకరించకపోవటం. |

- అక్రోధము → ఎవ్వరిపైనా కోపము కొనసాగించకుండటం. పగతీర్చు కోవాలనే స్వభావము లేకుండటము
- గురు శుశ్రూష → గురువును సేవించు స్వభావము. తనను తాను నేర్చుకొనువానిగా భావించటం, గురు భక్తి.
- శౌచము → శుచి అయిన భావాలు. ఇతరులలో మంచిని గమనించు శుచి అయిన దృష్టి.
- సంతోషము → కలిగియున్న దాని పట్ల కృతజ్ఞతా పూర్వక తృప్తి. 'చాలు' - అను భావన.
- ఆర్జవమ్ → కుటిలత్వం లేకపోవటం. త్రికరణశుద్ధి.
- అమానిత్వము → ఇతరులతో తనకున్న గుణములకంటే ఉత్తమమైనవి చూడటం.
- అదంభిత్వము → లేని గొప్పలు చెప్పుకోకపోవటం
- అహింసత → బాధ కలిగించకపోవటం

ఇవన్నీ కూడా **"సాత్త్విక గుణ విశేషములు"**గా తెలుసుకొనబడును గాక!

---

**22. అహం కర్తాఽస్మి। అహం భోక్తాఽస్మి।**
**అహం వక్తా। అభిమానవాన్।**
**– ఏతే గుణాః 'రాజసస్య'**
**ప్రోచ్యన్తే బహ్మవిత్తమైః॥**

**రాజస గుణ విశేషములు**

- నేనే కర్తను! నేనే భోక్తను!
- నేను చెప్పేవాడిని - అందరూ వినాలి!
- ఇది నా అభిమానము!

ఇవన్నీ బ్రహ్మవేత్తలచే - **రాజస గుణ విశేషములు**గా చెప్పబడుచున్నాయి.

---

**23. నిద్ర అలస్యే మోహ**
**రాగౌ మైథునం చౌర్యం**
**ఏవ చ, ఏతే గుణాః**
**తామసస్య ప్రోచ్యన్తే**
**బ్రహ్మ వాదిభిః॥**

**తామస గుణ విశేషములు**

- అతి నిద్ర, సోమరితనము.
- సత్యమును సమగ్రంగా పరిశీలించని ఉద్వేగము. అవగాహనా రహిత రూపమగు మోహము.
- రాగము.
- మైధునము (వస్తువులతో కలయిక / మమేకత్వము).
- దొంగబుద్ధి (చౌర్యము).

మొదలైనవన్నీ **"తామస గుణ విశేషములు"** - అని బ్రహ్మవాదులచే గుర్తు చెప్పబడుచున్నాయి.

---

**24. ఊర్ధ్వే "సాత్త్వికో"।**
**మధ్యే "రాజసో"।**
**అధస్తాత్ "తామసః"। ఇతి॥**

**త్రిగుణ ఫలములు**

సాత్త్విక గుణముచే - ఊర్ధ్వగతులు / లోకములు
రాజస గుణముచే - మధ్యస్థితులు / మధ్యలోకములు
తామస గుణముచే - అధమ లోకములు / స్థానములు
**ఈ జీవుడు పొందుచున్నాడు.**

---

**25. సమ్యక్ జ్ఞానగ్ం "స్వాతికం"।**
**ధర్మజ్ఞానగ్ం "రాజసం"।**
**"తిమిర – అన్థం తామసం"। ఇతి॥**

**త్రిగుణ సంబంధ జ్ఞానములు**

సర్వత్ర సమరస భావనారూపమగు సమ్యక్ జ్ఞానము - **సాత్త్వికము.**
ధర్మములకు సంబంధించిన జ్ఞానము - **రాజసికము.**
అజ్ఞానముచే పెంపొందు చీకటి, గ్రుడ్డితనము - **తామసము.**

**26.** జాగ్రత్ స్వప్నః సుషుప్తిః
తురీయమ్ ఇతి చ -చతుర్విధ అవస్థాః॥

**చతుర్విధ అవస్థలు**
1. జాగ్రత్ 2. స్వప్నము 3. సుషుప్తి 4. తురీయము (చతురీయము)

---

**27.** జ్ఞాన-ఇంద్రియ, కర్మ-ఇంద్రియ
అంతఃకరణ-చతుష్టయం
చతుర్దశ కరణ యుక్తం "జాగ్రత్"॥

**జాగ్రత్ అవస్థ**
పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, అంతఃకరణ చతుష్టము. 5 + 5 + 4. ఈ 14 కరణయుక్తమై ఉండటము - **"జాగ్రదవస్థ". (అంతఃకరణము= మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము)**

---

**28.** అన్తఃకరణ చతుష్టయైః ఏవ సంయుక్తః "స్వప్నః"॥

అంతఃకరణ చతుష్టయం అయినట్టి మనో-బుద్ధి-చిత్త-అహంకారములు మాత్రమే కలిగియున్న అవస్థ - **"స్వప్నావస్థ"**.

---

**29.** చిత్త ఏక కరణా "సుషుప్తిః॥

చిత్తము అన్యత్వమును త్యజించి ఏకీకరణమై ఉండటము - **"సుషుప్త్యవస్థ"**.

---

**30.** కేవల జీవ యుక్తమ్ ఏవ "తురీయమ్"। ఇతి॥

జీవుని కేవలత్వము (ఈతడు కేవలయుక్తుడై యున్న స్థితి - Absolute himself) **"తురీయము"**

---

**31.** ఉన్మీలిత-నిమీలిత, మధ్యస్థ జీవ -
పరమాత్మనోః మధ్యే జీవాత్మా "క్షేత్రజ్ఞః"
ఇతి విజ్ఞాయతే॥

కనులు తెరవటం - మూయటం - ఈ రెండిటి మధ్యలో సంస్థితుడై ఉన్నవాడు - **"జీవుడు"**
జీవాత్మ - పరమాత్మల మధ్యగా ఉన్న జీవాత్మ స్వరూపము **'క్షేత్రజ్ఞుడు'** - అని తెలుసుకొనబడు గాక!

---

**32.** బుద్ధిః - కర్మేంద్రియ (11)
ప్రాణ పంచకైః (5)
మనసా ధియా (2)
శరీరగ్ం సప్త దశభిః (17)
సూక్ష్మం - తత్ 'లింగమ్' ఉచ్యతే॥

**సూక్ష్మ దేహము / లింగ శరీరము**

**జ్ఞానేంద్రియములు** - 5 (బుద్ధేంద్రియములు)
**కర్మేంద్రియములు** - 5
**ప్రాణములు** - 5 (పంచ ప్రాణములు)
— 15

**16. మనస్సు 17. బుద్ధి.**
ఈ 17 కలిపి **"సూక్ష్మ శరీరము" , (లేక) "లింగ శరీరము"** అని అంటారు.

---

**33.** మనో బుద్ధిః అహంకారః
ఖ, అనిల, అగ్ని, జలాని
భూః - ఏతాః "ప్రకృతః" యస్తు
"అష్టౌ" - వికారాః షోడశ అపరే।
శ్రోత్రమ్ త్వక్, చక్షుషీ, జిహ్వా
ఘ్రాణం చ ఏవ తు
పంచమమ్ (5),
పాయుః ఉపస్థౌ కరౌ పాదౌ వాక్ చ ఏవ
దశమీ (5+5) మతా॥
శబ్దః స్పర్శః చ రూపం చ రసో గంధః (5)

**ప్రకృతి**- మనస్సు, బుద్ధి, అహంకారము, పంచ భూతములు (ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి)

ఈ '8' కూడా **"అష్టవిధ ప్రకృతి"** - అయి ఉన్నది. వాటి వికారములతో కలిపి '16' - ఇవి **'అపరా ప్రకృతి'**గా చెప్పబడుచున్నాయి.

శ్రోత్రము (చెవులు), చర్మము, చక్షువులు, జిహ్వ (నాలుక), ఘ్రాణము - ఇవి ఐదు జ్ఞానేంద్రియములు (5).

పాయువు, ఉపస్థ, చేతులు, కాళ్ళు, వాక్ -ఇవి ఐదు కర్మేంద్రియములు (5).

ఈ '10' కూడా దశ-ఇంద్రియములు (పంచ జ్ఞాన - పంచ కర్మ ఇంద్రియములు).

శబ్ద స్పర్శ రూప రస గంధములు - ఇవి ఇంద్రియ విషయములు. (ఇవన్నీ '15' తత్త్వములు.)

---

తథా ఏవ చ త్రయో వింశతిః (23)
ఏతాని తత్త్వాని ప్రకృతాని తు॥
చతుర్వింశతిః (24) అవ్యక్తమ్।
ప్రధానం "పురుషః పర"॥
*ఇతి శారీరకోపనిషత్ ॥*

పైన చెప్పిన అష్ట ప్రకృతులు (8) పంచదశ ఇంద్రియ విశేషములు (15) **ఇవన్నీ కలిపి ప్రకృతియొక్క '23' తత్త్వములు.**

24వది - అవ్యక్తము. (23 తత్త్వములు వ్యక్తీకరిస్తున్నట్టిది).

వీటి అన్నిటికీ వేరై 'పురుషుడు' వేరుగాను, అన్నిటికంటే ప్రాధాన్యము గలవాడుగాను ఉండి ఉన్నాడు. ఆయనయే **'పరమపురుషుడు'**.

***ఇతి శారీరకోపనిషత్***

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 25 శారీరకోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**"ఓం"** 'సర్వాంతర్యామి, సర్వతత్త్వ స్వరూపుడు' అగు 'ఓం'కార పరమార్థ పరమపురుష భగవానునికి నమస్కరిస్తూ....!



ఇప్పుడు మనము సర్వాంగ సుందరంగా మనకు ప్రకృతిచే ప్రసాదించబడిన ఈ 'శరీరము' గురించి వివరించుకొనుచున్నాము. ఎందుకంటే,

- శరీరమును గురించి ఎరగటమనేది జీవుని మహదాశయమునకు మహత్తరమైన ఉపాయము. **ఈ శరీరమే మోక్షమును ప్రసాదించగల సాధనము.**
- ఈ శరీరముయొక్క తత్త్వము, ఉపకరణత్వము పరిశీలించక, పరమపురుషత్వము గురించి అధ్యయనము చేయకుండా, ఇంద్రియ విషయములకు పరిమితుడై జీవితము గడుపు వానికి, **ఈ శరీరమే అనేక సంసార బంధములను తెచ్చిపెట్టగలదు. ఈ శరీరమే బంధము.**

'శరీరము' గురించి ఎరిగిన వారికి **ఈ దేహము దేవాలయము. యజ్ఞశాల.** ఎరుగని వారికి ఇది అనేక బంధనముల, ప్రతిబంధనముల నిలయము. చెఱసాల. అందుచేత ఈ దేహ నిర్మాణ తత్త్వము గురించిన విచారణ ముముక్షువునకు ఆధ్యాత్మికమైన "అవసరము" అయి ఉన్నది. **(దేహమ్ దేవాలయమ్ ప్రోక్తః। జీవోప్రోక్తః దేవో సనాతనః।)**



**పృథివీ ఆది మహాభూతానాగ్ం :** ఈ శరీరము పృథివీ (Solid Matter) మొదలైన మహాభూతముల సంయోగము, సమ్మేళనము (An artistic mix-up of materials) అయి ఉన్నది. కొన్ని పుల్లల అమరికచే ఆయా ( ⬡ △ ▭ ) ఆకారములు రూపుదిద్దుకొను విధంగా పంచతత్త్వములచే (లేక మూల పదార్థముల సాకార సారూప్య అమరికచే) ఈ భౌతిక దేహము – అమరిక పొందినట్టిదై యున్నది.

ఈ దేహములో....

- కఠిన విభాగము (All that is solid - bones etc.,) **'పృథివి'।**
- ద్రవ విభాగము (All that is liquid - Blood, Urine etc.,) **'ఆపో'।**
- ఉష్ణ విభాగము (Heat Factor) **'అగ్ని'** / **'తేజస్సు'।**
- సంచరించు స్వభావమై ఏది ప్రదర్శనమగుచున్నదో...అది **'వాయువు'।**
- ఏది సుషిరము రూపంగా ఒకదానికి మరొక దానికి ఖాళీ ప్రదేశంగా, రంధ్రముగా ఉన్నదో...అది **'ఆకాశము'।**

అట్టి పంచ మహాభూతములు తమయొక్క పంచకళలను ఈ దేహములో ప్రదర్శించుచున్నాయి.

**జ్ఞానేంద్రియములైనట్టి**

| | | |
|---|---|---|
| శ్రోత్రము (చెవులు) | - | ఆకాశధర్మము |
| త్వక్కు (చర్మము) | - | వాయుధర్మము |
| చక్షువులు (కళ్ళు) | - | అగ్ని ధర్మము |
| జిహ్వ (నాలుక - రుచి) | - | జల ధర్మము |
| ముక్కు | - | పృథివీ ధర్మము. |

ఈ విధంగా పంచ మహాభూతముల ధర్మములు జ్ఞానేంద్రియములుగా ప్రదర్శనమై యున్నాయి. అట్టి పంచేంద్రియముల నుండి (ఆకాశ-వాయు-అగ్ని-జల-భూ నుండి) విషయములు బయల్వెడలుచున్నాయి.

శబ్ద | స్పర్శ | రూప | రస | గంధము

అను **పంచజ్ఞానేంద్రియ విషయములు** కల్పితమై, బాహ్యమున అనుభవములను - అనుభవించే ఈ శరీరి పట్ల కల్పితమౌతున్నాయి.

అట్లాగే

వాక్ | పాణి | పాదములు | పాయువు | ఉపస్థ

అను పంచ కర్మేంద్రియములనుండి విషయములు పొందబడుచున్నాయి.

| వచనము | ఆదానము | గమనము | విసర్జనము | ఆనందము |
|---|---|---|---|---|
| Talking | Giving | Walking | Leaving | Enjoying |

కర్మేంద్రియములు ఈఈ విషయములను ప్రదర్శించుచున్నాయి.

మహాభూతములనుండే శరీరము, జ్ఞానేంద్రియములు, జ్ఞానేంద్రియ విషయములు, కర్మేంద్రియములు, కర్మేంద్రియ విషయములు - ఇవన్నీ బయల్వెడలుచున్నాయి. మహాభూతములో? **కేవల స్వరూపుడగు ఆత్మభగవానుని శక్తి ప్రదర్శన రూపములే!**

## అంతఃకరణ చతుష్టయం

ఇంతవరకు చెప్పుకున్నవి బహిర్ విశేషములు. బహిర్ - కరణములు. (Outer part of the body). ఇవికాక ఈ శరీరములో 'అంతఃకరణ' (Zone of Inner Functionary) ఉన్నది. ఇది 4 విభాగములుగా విభజించి చెప్పబడుచున్నది.

***అంతఃకరణ చతుష్టయం***

| | | |
|---|---|---|
| (1) ఆలోచనలు, భావనా విభాగము | - | **మనస్సు** |
| (2) విశ్లేషణ - విచక్షణ చేయు విభాగము | - | **బుద్ధి** |
| (3) కర్తృత్వ - భోక్తృత్వ భావనా విభాగము | - | **అహంకారము** |
| (4) ఇష్టము - ప్రియము కలిగియుండు భావనా విభాగము | - | **చిత్తము** |

***అంతఃకరణ చతుష్టయము యొక్క బాహ్య ప్రదర్శనా విషయములు*** (Releated aspects)

**మనస్సుకు** విషయములు → **సంకల్ప - వికల్పము** (Thoughts / Assumptions - their withdrawl).

**బుద్ధికి** విషయములు → **అధ్యవసాయములు** (Learnings and analysing of matters events etc.,).

**అహంకారమునకు** విషయము → **అభిమానము** (Sense of Individual Self. Sense of Belongingness).

**చిత్తమునకు** విషయము → **అవధారణ** (Avocation. Holding the thought. Intrestedness in matters, scenary, contexts etc.,)

***అంతఃకరణ చతుష్టయము యొక్క శరీరములోని స్థానములు***

మనస్సుకు ముఖ్యస్థానము – **గళాన్తమ్ (గొంతుకు ఉపరిభాగము)**

బుద్ధికి ముఖ్యస్థానము – **వదనము (ముఖము)**

అహంకారమునకు ముఖ్యస్థానము – **హృదయము**

చిత్తమునకు ముఖ్యస్థానము – **నాభి (బొడ్డు ప్రదేశము).**

ఇవన్నీ **శరీరములో ప్రాముఖ్య – సంస్థిత స్థానములై ఉన్నాయి.**

## శరీరములో పంచమహాభూతముల అంశలు

**శారీరక 'పృథివీ' గత అంశలు :** ఎముకలు, చర్మము, నరములు, నాడీ మండలము, రోమము (వెంట్రుకలు), మాంసము మొ॥వి.

**శారీరక 'జల' (అప్) గత అంశలు :** మూత్రము, శ్లేష్మము, రక్తము, శుక్లము, స్వేదము (చెమట) మొ॥వి.

**శారీరక 'అగ్ని' గత అంశలు :** ఆకలి, దాహము, సోమరితనము (బద్ధకము), మోహము, మైధునము (శృంగార భావములు), వస్తు – నామ – రూపాదులతో ఇచ్ఛావేశములు మొ॥వి.

**శారీరక 'వాయు' గత అంశలు :** కదలికలు, ప్రసరణములు, విలేఖనములు (గీతలకు సంబంధించినవి), కనురెప్పల మూత – తెరుచుకోవటములు మొ॥వి.

**శారీరక 'ఆకాశ' గత అంశలు :** కామము (ఏదో పొందాలనే, కావాలనే వృత్తి విశేషములు), (కోపము వచ్చినప్పుడు దానిని వదలక, కొనసాగించుటచే ఏర్పడు) **క్రోధము.**

– 'నాది, నాకే ఉండాలి' అనే **లోభగుణము**. వస్తువులపట్ల, విషయములపట్ల – **"నాకే చెందినవి"** – అనే వ్యష్టి భావన.

– ఊహ–అపోహల ప్రభావమునకు వశమై, వివేక దృష్టిని పదునుచేయని స్థితియగు **'మోహము'**. (Illusionary misconceptions) మొ॥వి.

## పంచ మహాభూతములు శరీరములో ప్రదర్శించు గుణములు (Characteristic Features)

**'పృథివీ' సంబంధమైన గుణములు 5 :** (1) శబ్దము, (2) స్పర్శ, (3) రూపము, (4) రసము, (5) గంధము.

**'అప్పు' (జలము యొక్క గుణములు) 4 :** (1) శబ్దము, (2) స్పర్శ, (3) రూపము, (4) రసము.

**'అగ్ని' యొక్క గుణములు 3 : (1)** శబ్దము, (2) స్పర్శ, (3) రూపము

**వాయువు యొక్క గుణములు 2 : (1)** శబ్దము, (2) స్పర్శ)

**ఆకాశము యొక్క గుణము 1 :** శబ్దము మాత్రమే!

## శరీరము – త్రిగుణములు

ఇంకా ఈ శరీరములో త్రిగుణములు (శరీరిచే) ప్రదర్శితమగుచున్నాయి. (1) సాత్వికగుణము, (2) రాజసగుణము, (3) తామసగుణము.

## త్రిగుణములయొక్క లక్షణములు

***(1) సాత్వికగుణ లక్షణములు***

- **అహింస :** మనో – వాక్ – కాయములచే తదితర జీవులను హింసించకుండటము. బాధించకుండటం. తదితర జనుల – జీవుల పట్ల కరుణ, కారుణ్యము, దయ, ప్రేమ.
- **సత్యము :** యమ్ సత్, తమేవ సమాశ్రయమ్! ఏది నిత్యమో అద్దానిని ఆశ్రయించి ఉండటము. సందర్భములకు ఆవల చెక్కుచెదరక, **'సత్'**ను అనుభూతపరచుకుంటూ ఉండటము. **అసత్తును అసత్తుగా, సత్తును సత్తుగా దర్శించటము.**

- **అస్తేయము :** 'ఇతరులకు చెందింది తానే పొందాలి, దొంగిలించాలి' అను వృత్తులు లేనివాడై ఉండటము.
- **అపరిగ్రహము :** ఇతరుల నుండి ఏదో పొందాలనే ఆశ, (పరిగ్రహించాలనే) ధ్యాస – లేకపోవటం. "నాది. నాకు చెందినది. నాకు సంబంధించినది" – అను భావన లేకుండటము.
- **అక్రోధో :** ఎవ్వరిపైనా 'అసూయ, దురధికారము, పగ, పగతీర్చుకొను ఆవేశము, కోపావేశము మొ॥ వాటితో కూడిన **క్రోధము – ఉండకపోవటము.**
- **గురుశుశ్రూష :** గురువును భక్తి శ్రద్ధలతో సేవిస్తూ, **దైవముతో సమానముగా భావించు అభ్యాసము.** గురువు బోధించు **పరమసత్యమును ఆకళింపు చేసుకొని, హృదయస్థం చేసుకునే ప్రయత్నము.**
- **శౌచము :** శుచి అయిన ప్రవర్తన, భావములు, అభిప్రాయములు కలిగియుండటము. (Purity of thinking). ఇతరుల పట్ల దుష్ట – ద్వేష భావాలు ఉండకపోవటము. ప్రేమ దయ దాక్షిణ్యము వంటి శ్రేయోదాయకమగు సంభావముల అనువర్తనము, అభ్యాసము. ఇతరులపై చెడు భావములు. దురభిప్రాయములు మనస్సులో **పేరుకోకపోవటము. ఇతరులను అర్థంచేసుకునే ప్రయత్నము.**
- **సంతోషము :** అసంతృప్తి లేకపోవటము. లభించిన వాటి గురించి 'సంతృప్తి' కలిగియుండటము (ప్రాప్తంబగు లేశమైన పదివేలనుచున్, తృప్తింజెందని మనుజుడు సప్త ద్వీపములకైన చక్కంబడునే? – పోతనామాత్యుల వారిభాగవతము). కొంచెము లభించినా సంతోషము పొందటము. **సంతోషంగా ఉండే అలవాటు.**
- **ఆర్జవమ్ :** కుటిల భావాలు లేకపోవటం. పైకి ఒకటి, లోన మరొకటి – భావనలు కలిగి ఉండకపోవటము. చెప్పేది ఒకటి, తలచేది మరొకటి, చేసేది ఇంకొకటి కాకపోవటము. **మనసా – వాచా – కర్మణా త్రికరణశుద్ధి.**
- **అమానిత్వము :** ఇతరులలో గల గొప్ప విషయములను దర్శించు స్వభావము. తనను తాను ఎక్కువ చేసుకోకపోవటము. **'ఆత్మస్తుతి, పరనింద' కలిగి ఉండకపోవటము.**
- **అదంభిత్వము :** ఇతరులను తక్కువ చేసి చూడకపోవటము. 'నా గొప్పలు వినండి! మీ గురించి నాకు చెప్పకండి!'...అను ప్రదర్శనా స్వభావము, ఇతరులు తనను 'గొప్ప' అనుకోవాలనే ప్రయత్నశీలత్వము – ఇటువంటివి **లేకపోవటము.**
- **ఆస్తికత్వము :** ఈ దేహమును, తదితర ప్రాప్తములను ప్రసాదించుచున్న 'భగవత్ శక్తి' యొక్క ఉనికి పట్ల **'అస్తి – పరమాత్మ ఉన్నారు. లేకుంటే ఇవన్నీ ఎట్లా లభిస్తాయి' – అనే ఆస్తికత్వ అంగీకారస్వభావము.** కృతజ్ఞత. భక్తితత్పరత.
- **అహింసతా :** ఇతరులను నిందించు, బాధించి ఆనందించు, హింసించు భావనలు ఉండక పోవటము. అకారణ కోపము, బాధించే స్వభావం లేకుండటము.

**ఏతే సర్వ గుణా జ్ఞేయాః సాత్వికస్య విశేషతః।** ఇవన్నీ వృద్ధి అగుచుండటం – సత్వ గుణ లక్షణములు.

## 2. రాజస గుణ విశేష లక్షణములు

**అహం కర్తాఽస్మి। అహం భోక్తాఽస్మి। అహం వక్తా। అభిమానవాన్।**

- ఇదంతా నా వలననే జరుగుతోంది. నేనే చేస్తున్నాను. దీనికంతటికీ కర్తను నేనే, **అహమ్ కర్తాఽస్మి!**
- ఇదంతా నాచేత పొందబడుచున్నాయి. ఇవన్నీ నా కొరకే ఉన్నాయి. నాకు చెందినవే అయి ఉన్నాయి. ఇక్కడి సుఖ దుఃఖాలకు నేను భోక్తను. **అహమ్ భోక్తాఽస్మి!**
- నేను చెప్పేవాడిని! అందరూ వినాలి! అంతే! చెప్పినట్లు చేయాలి! ఇతరుల చెప్పితే నా అంతటివాడు చేయవలసిన పనిలేదు. **అహమ్ వక్తాఽస్మి!**
- నేను గొప్ప అభిమానము గల వాడిని. నన్ను ఎవ్వరైనా ఏమన్నా అంటే చాలా బాధ. **అభిమానవాన్!** ఇతరులు నన్ను అభిమానించాలి. నేను ఇతరులను లెక్కబెట్టను. లెక్కచేయనవసరం నాకు లేదు. నేను అభిమానించబడనప్పుడు అది నాకు దుఃఖమే మరి!

**ఏతే గుణా రాజసస్య ప్రోచ్యన్తే–బ్రహ్మవిత్తమైః॥ ఇటువంటి *గుణ విశేషములన్నీ* రాజసగుణ *లక్షణములు–అని బ్రహ్మవేత్తల నిర్ణయము.***

# 3. తామసగుణ విశేష లక్షణములు

- **అతి నిద్ర**: రోజులో ఎక్కువసేపు నిదురించటము. బ్రాహ్మీ ముహూర్తము (తె. 4-7)ను నిద్రలో వృధా చేసుకోవటము.
- **ఆలస్యము**: బద్ధకము. సోమరితనము. నెమ్మదితనము.
- **మోహము**: ఊహ, అపోహలు - స్వకీయ విచక్షణను కప్పివేసి ఉంచడటము.
- **రాగము**: బంధువులు, గృహములు,పేరు - ప్రతిష్ఠలు వీటన్నిటిపట్ల - **'ఇవి నాకు చెందినవి. నేను వీటికి చెందినవాడను. వీరు నాకు రక్షకులు. నేను వీరికి రక్షకుడను'** అను భావనాపరంపరావేశములు.
- **మైధునము**: వస్తువులతో, విషయములతో సంబంధ - బాంధవ్యములపట్ల అవినాభావ పూర్వక ఆవేశము. కామావేశము.
- **చౌర్యము**: ఇతరుల సొమ్ములను దొంగిలించాలనే స్వభావము.

***ఏతే గుణాః తామసస్య ప్రోచ్యన్తే బ్రహ్మవాదిభిః। ఇవన్నీ తామసగుణ విశేషములుగా బ్రహ్మవాదులు సూచిస్తున్నారు.***

-----

సాత్విక గుణ విశేషములను అధికం చేసుకోవటం చేత ఈ జీవుడు జ్ఞాన - యోగ - కర్మ మార్గములలో ఊర్ధ్వస్థితులు పొందుచున్నాడు. రాజసిక గుణ విశేషములచేత మధ్యలోనే తిరుగాడుచున్నాడు. తామసిక గుణవిశేషములచే అధోగతులు పొందుచున్నాడు. (సాత్విక గుణములచే దేవతా జన్మలను, రాజసిక గుణములచే మానవజన్మను, తామసిక గుణములచే జంతు స్థితి - గతులను పొందుచున్నాడు).

**సమ్యక్ జ్ఞానగ్ం-సాత్వికమ్।** సాత్విక గుణ ఆధిక్యతచే - సర్వత్ర సమస్వరూపుడగు పరమాత్మయొక్క (సమం సర్వేసుభూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ - అనురూపముగల) **సమ్యక్ జ్ఞానము** వృద్ధి చెందుతోంది.

**ధర్మ జ్ఞానగ్ం - రాజసమ్।** రాజసిక గుణముల ఆధిక్యతచే-ధర్మము, చేయవలసినవి, చేయకూడనివి (Dos & Dont's)..... ఇవన్నీ ఆలోచనచేయు జ్ఞాని అయి ఉంటున్నాడు. ధర్మాధర్మ విచక్షణ చేయటము రాజస గుణ స్వభావము.

**తిమిరాన్ధం - తామసమ్ ఇతి।** తామసగుణ - ఆధిక్యతచే, ఈ జీవుడు ఆవేశకావేశములు పొందుచున్నాడు. అజ్ఞానాంధకారము తాండవిస్తున్న స్థానములు చేరుచున్నాడు. మరల మరల జ్ఞానజ్యోతి లభించని చీకటి దేహ పట్టణములలో ప్రవేశ - నిష్క్రమణములను పొందుచున్నాడు. తామసగుణము - గ్రుడ్డివాడు చీకట్లో తారసలాడుచుండటము వంటిది. ఆత్మ గురించిన ఏమరపు.

## చతుర్విధ అవస్థలు

ఇంకా కూడా....

ఈ శరీరమును స్వీకరించిన శరీరి - 4 విధములైన అవస్థలలో (ఒక్కొక్కసారి ఒక్కొక్క అవస్థలో) అవస్థితుడై ఉంటున్నాడు.

**(1) జాగ్రదవస్థ, (2) స్వప్నావస్థ, (3) సుషుప్త్యవస్థ, (4) తురీయము** (చతురీయము - నాలుగవది) వీటిగురించి (సంక్షిప్తంగా) చెప్పుకుంటున్నాము.

**(1) జాగ్రత్ అవస్థ:** **జ్ఞానేంద్రియ (పంచక), కర్మేంద్రియ (పంచక), అంతఃకరణ చతుష్టయమ్-చతుర్దశ (14) కరణ యుక్తం - "జాగ్రత్"॥**

'శ్రోత్ర - త్వక్ - చక్షు - జిహ్వ - ఆఘ్రాణము' అగు **పంచ జ్ఞానేంద్రియములు** (+)

'వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థలనే **పంచకర్మేంద్రియములు** (+)

మనోబుద్ధి - చిత్త - అహంకారములనే **అంతఃకరణ చతుష్టయము.**

ఈ 14 కరణములు కలిగియుండి, సంవర్తనము (Participating) చేయు శరీరి యొక్క అనుభవ సందర్భము **'జాగ్రత్'** అయి ఉన్నది.

**(2) స్వప్నావస్థ : అంతఃకరణ చతుష్టయైరేవ సంయుక్తః - 'స్వప్నః'।** జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ప్రక్కకు పెట్టి, కేవలము అంతఃకరణ చతుష్టయము మాత్రమే (మనోబుద్ధి చిత్త అహంకారములు మాత్రమే) ప్రవర్తించుచున్నప్పటి - ఈ శరీరియొక్క సంస్థితి (లేక) సందర్భము - **స్వప్నము.**

**(3) సుషుప్త్యవస్థ – చిత్త – ఏకకరణా "సుషుప్తిః"!** పైన చెప్పుకొన్న జాగ్రత్ – స్వప్న సంబంధమైన జ్ఞానేంద్రియ పంచక – కర్మేంద్రియపంచక – అంతఃకరణ చతుష్టయ – చతుర్దశ (14) విశేషములు మౌనము వహించిన జడస్థితి – సుషుప్త్యవస్థ.

చిత్తమునకు పై 14 కూడా ఉపకరణములు (Instruments). వాటిని వాడుకొనుచూ, చిత్తము జాగ్రత్ – స్వప్నములను కల్పించుకొని అనుభవ పరంపరలను కొనసాగిస్తోంది. అయితే, జాగ్రత్ స్వప్నములకు వేరైన నిశ్శబ్దమగు–గాఢనిద్రావస్థలో (లేక) మరొక మౌనరూపమగు సందర్భములో చిత్తము – **ఉపకరణ అన్యత్వము ప్రక్కనబెట్టి – ఏకత్వము పొందినదై ఉంటోంది.** అట్టి స్థితి (లేక) అవస్థలో చిత్తమునకు జాగ్రత్ లేదు. స్వప్నములేదు. విషయములన్నీ చిత్తము (అనే పెట్టె)లో దాచి ఉంచి, జడమును ఆశ్రయించు స్థితియే **'సుషుప్తి'.**

ఒకడు రెండు పెద్ద కార్యక్రమములలో మునిగి తేలుచూ మధ్య మధ్యలో 'విరామము' ఆస్వాదించు స్థితి వంటిది – సుషుప్తి. సుషుప్తిలో కర్మేంద్రియములు పనిచేయుట లేదు. జ్ఞానేంద్రియములు కూడా ప్రవర్తించటం లేదు. అంతఃకరణము మౌనము వహించి ఉంటోంది. చిత్తము ఏకత్వము పొంది ఉంటోంది. సుషుప్త్యవస్థలో జాగ్రత్–స్వప్న విశేషాలు లేకుండాపోయినాయా? లేదు. ఉన్నాయి. అయితే "మౌనము" వహించినవై ఉన్నాయి.

మరికొంత సమయము తరువాత ఆ చిత్తము కరణములను స్వీకరించగానే (Immediately after it takes up the instruments) - ఆ మరుక్షణం జాగ్రత్‌యో, స్వప్నమో శరీరికి ఎదురుగా వచ్చి నిలుచుని, ఆతని **అంశగా ప్రవేశము** పొంది, ఆతనిచే ఆస్వాదించబడుతోంది. సుషుప్త పురుషుడు–సుషుప్తిని ప్రక్కననెట్టి, తననుండి జాగ్రత్ పురుషునో (లేక) స్వప్నపురుషునో అనుభవంగా ఆహ్వానించుచున్నాడు. **సుషుప్తిలో ఉన్నవానిపట్ల 14 కరణములు, వాటివాటి విషయానుభవములు దాచిపెట్టబడినవై ఉంటున్నాయి.** చిత్తము మౌనము వహించినంతసేపు అవి పనిచేయవు. చిత్తము కరణములు స్వీకరించటానికి ఉద్యుక్తమవగానే తగుదనమ్మా – అని **జాగ్రత్, స్వప్నములు** వచ్చి చేరుచున్నాయి.

**(4) తురీయము :** 14 కరణములు చిత్తమునకు ఉపకరణము అగుచుండగా, ఆచిత్తము **<u>చైతన్యస్ఫూర్తి</u> రూపుడగు శరీరికి (జీవునికి)** – తాను ఉపయోగించు కరణము (ఉపకరణము – ఉపయోగించబడు వస్తువువంటిది) అగుచున్నది. అనగా శరీరికి (one who is using the physical body) జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియ పంచకము, అంతఃకరణ చతుష్టయము – చిత్తము – ఇవన్నీ తాను ఉపయోగించు వస్తువులు. 14 కరణములు లేనప్పుడు కూడా (ఉపయోగించబడనప్పుడు కూడా) చిత్తము ఉన్నది. (చిత్తము శరీరికి ఉపకరణము కాబట్టి). **చిత్తమును పక్కకు పెట్టినప్పుడు కూడా శరీరి ఉన్నాడు.** శరీరము లేనప్పుడు కూడా ఉండి ఉన్న జీవుడు ఎవరు? **<u>చైతన్యస్ఫూర్తి స్వరూపుడగు ఈ 'జీవుడు' స్వతఃగా సర్వదా కేవలాత్మయే!</u>**

**కేవల జీవయుక్తమేవ <u>తురీయమ్ ఇతి।</u> <u>చైతన్య స్ఫూర్తి</u> – 'జీవితము' అనే అభిమానము కలిగియున్నప్పుడు – 'జీవుడు'. అట్టి <u>అభిమానమునకు సాక్షి అయి మాత్రమే ఉంటే? కేవలుడు.</u>**

**ఈ జీవుడు మొట్టమొదట కేవలుడు.**

- శరీరమును ఆశ్రయించినప్పుడు – **శరీరి.**
- చిత్తము మాత్రమే ద్వితీయముగా (ఉపకరణంగా) కలిగి ఉన్నప్పుడు – **సుషుప్తియుతుడు.**
- చిత్తముతోబాటు అంతఃకరణ చతుష్టయము ను కూడా ఉపకరణంగా కలిగియున్నప్పుడు – **స్వప్నద్రష్ట.**
- చిత్తము, అంతఃకరణములతో బాటుగా జ్ఞానేంద్రియ – కర్మేంద్రియములు కూడా ప్రదర్శనపూర్వకంగా కలిగి ఉన్నప్పుడు – **జాగ్రత్ ద్రష్ట.**

**<u>తురీయుడు</u>**: మూడు అవస్థలగు జాగ్రత్–స్వప్న సుషుప్తులను తనకు సంచారభూమికలుగా తానే కల్పించుకొని, ప్రవేశించి వాటిలో సంచరించువాడు.

**ఆత్మయే మహాపురుషుడు.**

**ఆయననుండి బయల్వెడలుచున్న చతుర్విధ పురుషకారములే జాగ్రత్–స్వప్న–సుషుప్తి తురీయములు.**

# 'క్షేత్రజ్ఞుడు'

జీవాత్మ కేవలుడై (తురీయుడై) యుండియే (1) చిత్తమును ఉపకరణంగా స్వీకరించి **సుషుప్త్యవస్థను,** (2) అంతఃకరణమును కూడా స్వీకరించి **స్వప్నావస్థను,** (3) 'జ్ఞాన-కర్మ' పంచ-పంచేంద్రియములను కూడా స్వీకరించి **జాగ్రత్ అవస్థను** పొందటము (లేక) ఆస్వాదించటము జరుగుతోందని అనుకున్నాము కదా! అట్టి జీవాత్మ మరొక దేనికైనా ఉపకరణమా? అవును! ఈ 'జీవాత్మత్వము'ను తన **కరణము** లేక **ఉపకరణము**గా కలిగియున్నవేరై ఉన్నవాడు - **'పరమాత్మ'**. **ఆయనయే "క్షేత్రజ్ఞుడు". పరమాత్మగా ఈ జీవుడు సర్వాంతర్యామి.**

ప్రతి ఒక్క జీవుడు సర్వదా అఖండమగు పరమాత్మ స్వరూపుడే! **సర్వ దేహములలోని క్షేత్రజ్ఞుడే పరమాత్మ।**

పరమ్ = ఆవల

పరమాత్మ → సహజ కేవలుడు

జీవాత్మ → సందర్భ రూపుడు

పరమాత్మ **ఎరుక (knowing) చిత్** → నుండి 'జీవాత్మ' గా జలమునుండి తరంగమువలె బయల్వెడలుచున్నాడు.

పరమాత్మయొక్క **"ఎరుగుట / చిత్** (consciousness)" నుండి జీవాత్మ కల్పించబడుచున్నది.

ఎరుగటయే → కన్నులు తెరవటం వంటిది

ఎరుక మౌనం వహిస్తే → కన్నులు మూయటం వంటిది.

**శ్లో॥ ఉన్మీలిత నిమీలిత మధ్యస్థ జీవ - పరమాత్మనోః -**

**మధ్యే, జీవాత్మా "క్షేత్రజ్ఞః" ఇతి విజ్ఞాయతే॥**

**పరమాత్మ** యొక్క **నిమీలితము** కనులు **మూయటం - జీవాత్మ।**

**పరమాత్మ** యొక్క **ఉన్మీలిత** - కనులు **తెరవటం - కేవలాత్మ।**

**ఈ నిమీలిత - ఉన్మీలితముల మధ్యగాను, ఆవల - ఈవల కూడా 'ఎరుక'** సర్వదా ఏర్పడినదై ఉన్నది.

అట్టి కేవలమగు ఎరుకయే **ఎరుగుచున్న వాడుగా (లేక) 'క్షేత్రజ్ఞుడు'** గా ప్రదర్శనమగుచున్నాడు - అనునది శాస్త్ర ప్రసిద్ధమైయున్నది.

❊ పరమాత్మ - జీవాత్మల మధ్య గలదే 'క్షేత్రజ్ఞుడు' అని పిలువబడుచున్నది.

❊ క్షేత్రజ్ఞుడు - ఎరుగుచున్నట్టివాడు

❊ అట్టి క్షేత్రజ్ఞునికి ఆవల పరమాత్మ (పరమ్) - ఈవల జీవాత్మ (ఇహమ్)

❊ ఒక నాట్య కళాకారుడు ఒక నాటకములో ఒక 'పాత్ర' వహించటము వంటిది. **పాత్రధారుడు పరమాత్మ. పాత్రయో? జీవాత్మ.**

| క్షేత్రము = పొలము / శరీరము (అన్యము) |
|---|
| క్షేత్రజ్ఞుడు = తెలుసుకొనే స్వభావి (అనన్యము. కేవలము). |

## సూక్ష్మ శరీరము (లేక) లింగ శరీరము

**బుద్ధి, కర్మేంద్రియ, ప్రాణ - పంచకైః (3 x 5), మనసాధియా, శరీరగ్ం సప్తదశభిః (17) సూక్ష్మం తత్ "లింగమ్" ఉచ్యతే॥** ఈ స్థూల (భౌతిక) శరీరముకాక, ఈ జీవుడు తనకు సంబంధించి మరొక శరీరము సూక్ష్మశరీరము కలిగి ఉన్నాడు. (5) పంచ జ్ఞానేంద్రియములు (5) పంచకర్మేంద్రియములు (5) పంచ ప్రాణములు (పాన అవాన వ్యాన ఉదాన సానములు)

5 + 5 + 5 = 15

(16) మనస్సు (Thought Factor) (17) బుద్ధి (Intelectual Factor)

ఈ 17 కూడా **'సూక్ష్మ శరీరము'** లేక **'లింగ శరీరము'** యొక్క స్వీయకల్పనా సూక్ష్మాంగములు.

అనేక పూర్వానుభవములు / జ్ఞాపకములు దాగినవైయున్న స్థానము **"సూక్ష్మ శరీరము"** లేక **"లింగ శరీరము"** అని చెప్పబడుతోంది.

## అష్ట విధప్రకృతి

**మనస్సు బుద్ధి అహంకారము (+) ఖం** (ఆకాశము) **– అనిల** (వాయు) **– అగ్ని జల భూః** (3 + 5) – ఇవి **'అష్టవిధ ప్రకృతి'** గా చెప్పబడుచున్నాయి.

**షోడశ (16) తత్త్వములు**: 1. చెవులు 2. చర్మము 3. కన్నులు 4. నాలుక 5. ముక్కు 6. గుదము 7. ఉపస్థ 8. చేతులు 9. కాళ్లు 10. వాక్కు 11. శబ్దము 12. స్పర్శ 13. రూపము 14. రసము 15. గంధము 16. అనుభవి

ఇవి **షోడశ (16) తత్త్వములు**గా వర్ణించి చెప్పబడుచున్నాయి.

## ప్రకృతి తత్త్వములు

శ్రోత్రము – త్వక్ – చక్షు – జిహ్వా – ఆఘ్రాణ (5) **– పంచ జ్ఞానేంద్రియములు**

పాయు – ఉపస్థ – కరే – పాదే – వాక్చైవ (5) **– పంచ కర్మేంద్రియములు**

శబ్ద – స్పర్శ – రూప – రస – గంధములు (5) **– పంచ విషయములు**

అష్టవిధ ప్రకృతి – (పంచభూతములు, మనో బుద్ధి చిత్తములు) (8).

ఈ '23' కలిపి ప్రకృతి తత్త్వములు. ప్రకృతికి చెందినవి. 'ప్రకృతి' శబ్దార్థములు.

## పురుషుడు

ఈ చెప్పుకున్న '23' తత్త్వాలు ప్రకృతి స్వరూప విభాగములు. వీటికి వేరై మహత్తరమై, వీటన్నిటికీ ఉత్పత్తి స్థానమై **'పురుషుడు'** ఉన్నాడు. **ఆతని లీలా – క్రీడా వినోదమే ఇదంతా.**

– అన్నిటికీ **సాక్షి! అన్నీ ఏర్పడుచూ ఉన్న స్థానము। అన్నిటియొక్క లయస్థానము।**

అన్నిటికీ ఆవల ఉన్నవాడు। జీవాత్మత్వ–క్షేత్రజ్ఞత్వములకు కూడా పరమైయున్నట్టి **ఆ కేవల–స్వస్వరూప అనంతమూర్తియే పరమాత్మ!**

ఆయన మూర్తిత్వ చమత్కారమే అష్ట విధ (8), పంచదశ విధ (5), త్రయోవింశతి (23) విధ ప్రకృతి విభాగమంతా కూడా!

ఆయన సత్యము! నిత్యము! అనునిత్యము!

**అట్టి పరమ పురుషుడే ఉపాస్య వస్తువు।**

**ఈ జీవుని వాస్తవ సహజ రూపము, స్వభావము కూడా అట్టి 'పరమ పురుషుడే।**

**ఈ జీవుడు పరమాత్మ కాని క్షణమే లేదు.**

ఇతి శారీరకోపనిషత్

ఓం శాంతిః। శాంతిః। శాంతిః।

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 26 శుక రహస్యోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ 'ప్రజ్ఞాన' - ఆది మహావాక్య రహస్య ఆది కళేబరమ్
వికలేవర కైవల్యం త్రిపాద్ 'రామపదం' భజే॥



'ప్రజ్ఞానం బ్రహ్మ' మొదలైన మహావాక్యముల రహస్య రూపము, వాచ్యార్థము, లక్ష్యార్థములను ఎరిగినవారమై కలనము తొలగి ఆది స్వరూపానుభవమగు కైవల్యము (కేవలీస్వరూపము) సిద్ధించుకోవటానికై త్రివిక్రమావ తారుడగు శ్రీరామచంద్రమూర్తిని భజించుచున్నాము.

ఓం

'ఓం' ప్రణవ - మంగళాచరణ పూర్వకంగా -

**1.** అథ అతో "రహస్యోపనిషదం"
వ్యాఖ్యాస్యామో।

ఇప్పుడు ఇక మనము (శుకమహర్షియొక్క) ఆత్మతో సామీప్య రహస్యము గురించి వ్యాఖ్యానించుకుంటున్నాము.

---

దేవర్షయో బ్రహ్మాణం సంపూజ్య,
ప్రణిపత్య, పప్రచ్ఛుః।
భగవన్। అస్మాకం
రహస్య ఉపనిషదం బ్రూహి। ఇతి॥

(నారదుడు మొదలైన) దేవర్షులు ఒకరోజు సృష్టికర్తయగు బ్రహ్మదేవుని దర్శనార్థమై బ్రహ్మలోకం వచ్చారు. జగద్గురువగు బ్రహ్మదేవుని భక్తితో పూజించి, ప్రణిపాతులై ఇట్లు ప్రశ్నించసాగారు.

భగవన్! తండ్రీ! బ్రహ్మదేవా! మాకు ఇప్పుడు విదేహముక్తుడగు శ్రీ శుక మహర్షి యొక్క ఆత్మజ్ఞాన విశేష వివరాణాత్మకమగు "శ్రీ శుక రహస్య ఉపనిషత్" - విషయము గురించి బోధించండి - అని అర్థిస్తున్నాము.

---

<u>సో అబ్రవీత్</u>
పురా వ్యాసో, మహాతేజాః,
సర్వవేద తపో నిధిః
ప్రణిపత్య శివం సాంబం
కృతాంజలిః ఉవాచ హ॥

**బ్రహ్మ భగవానుడు** : నారదాది దేవర్షులారా! చెప్పుచున్నాను. వినండి.

పూర్వము ఒక సందర్భంలో మహాతేజో సంపన్నుడు, సర్వవేద పారంగతుడు, తపోనిధి అగు వేదవ్యాస మహర్షి భగవానుడగు సాంబశివుని సమీపించి, కృతాంజలుడై నమస్కరించి, వారిని ఇట్లా అర్థించారు.

---

**2.** <u>శ్రీ వేదవ్యాస ఉవాచ:</u>
దేవ దేవ! మహాప్రాజ్ఞ!
పాశచ్ఛేద దృఢవ్రత!
శుకస్య మమ పుత్రస్య
వేద సంస్కార కర్మణి॥

**శ్రీ వేదవ్యాస మహర్షి** : హే దేవతలకే దేవుడైన దేవదేవా! మహాప్రాజ్ఞా! "జీవుల సంసార పాశములను ఛేదించివేయుట - అను వ్యాజమునందు దృఢవ్రతులగు స్వామీ! నా కుమారుడగు శుకుని 'వేద సంస్కార కర్మ' అగు బ్రహ్మోపదేశ సమయము సమీపించింది.

---

**3.** బ్రహ్మోపదేశకాలో అయం
ఇదానీం సముపస్థితః।
బ్రహ్మోపదేశః కర్తవ్యో
భవతా ఆద్య-జగద్గురో!

హే జగద్గురూ! లోకగురూ! ఆది గురూ! దేవాది దేవా! మీ చేతననే నా కుమారుడైనట్టి శుకునకు బ్రహ్మోపదేశము నిర్వర్తించబడుటకై మిమ్ములను ప్రార్థన చేస్తున్నాను. అర్థిస్తున్నాను.

| | |
|---|---|
| **4.** ఈశ్వర ఉవాచ:<br>మయా ఉపదిష్టే కైవల్యే<br>సాక్షాత్ బ్రహ్మణి శాశ్వతే।<br>విహాయ పుత్రో నిర్వేదాత్<br>ప్రకాశం యాస్యతి స్వయమ్॥ | **ఈశ్వర భగవానుడు** : హే వేదవ్యాస మహర్షీ! అట్లాగే! **సాక్షాత్ "శాశ్వత బ్రహ్మము"** అను కైవల్యము గురించి బ్రహ్మోపదేశము చేస్తాను. అయితే, అప్పుడేమౌతుందో తెలుసుకదా! నీ పుత్రుడు ఇక- తండ్రి, కొడుకు మొ॥న సర్వ సంసార సంబంధములను దాటివేసి, నీ సన్నిధిలోనే స్వయమాత్మ **ప్రకాశ** సుసంపన్నుడు కాగలడు కదా! సరియేనా మరి? |
| **5.** శ్రీ వేదవ్యాస ఉవాచ:<br>యథా తథా వా భవతు హి ఉపనయన కర్మణి।<br>ఉపదిష్టే మమ సుతే బ్రహ్మణి త్వత్ ప్రసాదతః॥<br>**6.** సర్వజ్ఞో భవతు క్షిప్రం మమ పుత్రో, మహేశ్వర!<br>తవ ప్రసాద సంపన్నో, లభేత్ ముక్తిం చతుర్విధామ్। | **వేదవ్యాసులవారు** : తండ్రీ! పరమశివా! కరుణామూర్తీ! దయతో నా కుమారునికి మీరు ఉపనయన కర్మ సందర్భంగా జ్ఞానబోధ ప్రసాదించండి. నా కుమారుడు మీచే బ్రహ్మతత్త్వము ఉపనయన కర్మ ద్వారా ఉపదేశించబడును గాక! మీ ప్రసాదముచేత, అనుగ్రహముచేత నా కుమారుడు త్వరగా సర్వజ్ఞుడై సారూప్య, సామీప్య, సాలోక్య, సాయుజ్య - 'చతుర్విధ' ముక్తిని పొందటము నాకు సంతోషమే! అటు తరువాత ఏది ఎట్లా అయినప్పటికీ నాకు ఆనందమే! హే మహేశ్వరా! ఈతడు నన్ను విడచి వెళ్ళినా సరే! |
| **7.** తత్ శ్రుత్వా వ్యాస వచనం<br>సర్వ దేవర్షి సంసది, ఉపదేష్టుం<br>స్థితః శంభుః, సాంబో దివ్యాసనే ముదా॥ | వేదవ్యాసుని సమాధానము విని శంభు భగవానుడు సంతోషించారు. ఆ సాంబశివులవారు శుకునికి ఉపదేష్టగా సంతోషంగా సుఖాశీనులైనారు. దేవర్షులు కూడా సమావేశమైయున్న సభలో బ్రహ్మోపదేశము ప్రసాదించారు. సవివరంగా బ్రహ్మము గురించి బోధించండి. |
| **8.** కృతకృత్యః శుకః తత్ర<br>సమాగత్య సుభక్తిమాన్।<br>తస్మాత్ స ప్రణవం లబ్ధ్వా<br>పునః ఇతి అబ్రవీత్ శివమ్। | పరమశివుని నుండి ఉపనయన సంస్కార - బ్రహ్మోపదేశము పొంది శుకుడు ధన్యుడైనాడు. భక్తితో ప్రణవ మంత్రార్థమును ఎరిగినాడు. శివభగవానుని సమీపించి భక్తితో త్రిప్రదక్షిణ నమస్కారములు సమర్పించి ఈవిధంగా స్తుతించారు. |
| **9.** శ్రీ శుక ఉవాచ:<br>దేవాది దేవ! సర్వజ్ఞ! సత్-చిత్-ఆనంద లక్షణ।<br>ఉమా రమణ। భూతేశ। ప్రసీద కరుణానిధే। | **శ్రీ శుకులవారు** : హే పరమశివా! దేవాది దేవా! సర్వజ్ఞా! సచ్చిదానంద స్వరూపా! ఉమారమణా! భూతేశ! స్వామీ! నా ఈ సాష్టాంగ దండ ప్రణామము స్వీకరించండి! ఓ కరుణానిధీ! నా పట్ల దయతో ప్రసన్నులవండి. |
| **10.** ఉపదిష్టం పరంబ్రహ్మ<br>ప్రణవ-అంతర్గతమ్, పరమ్।<br>'తత్ త్వమ్ అసి।'<br>ఆది వాక్యానాం ప్రజ్ఞాదీనాం విశేషతః॥ | మహాత్మా! పరబ్రహ్మము గురించి చెప్పారు. 'అ'కార - 'ఉ'కార - 'మ'కారములు విశేషములుగా కలిగిన ప్రణవము (ఓం) గురించిన (Finest Meaning) పరమార్థమును వివరించి యున్నారు.<br>'తత్త్వమసి' మొదలైన మహావాక్యముల తాత్త్వికార్థము, వాటికి సంబంధించిన విశేషాలు, 'ప్రజ్ఞానం బ్రహ్మ' ఇత్యాది గూఢార్థములు మీరు బోధించగా తెలుసుకున్నాను. |
| **11.** శ్రోతుమ్ ఇచ్ఛామి తత్త్వేన<br>(షట్ (6) అంగాని) యథాక్రమమ్।<br>వక్తవ్యాని రహస్యాని<br>కృపయా ఆద్య, సదాశివ! | అయితే ప్రభూ! ఇంకా కూడా 'బ్రహ్మోపదేశము'లో ఉదహరించబడిన 'షట్ (6) అంగములు', వాటి యథాక్రమార్థమును మీనుంచి వినాలని అభిలాషపడుచున్నాను. ఓ సదాశివా! ఇంకనూ నేను వినుటకు అర్హమైయున్న రహస్యములగు బ్రహ్మజ్ఞాన తత్త్వార్థములు నాకు బోధించమని వేడుకొనుచున్నాను. 'తత్త్వమసి' యొక్క షడంగన్యాసము వివరించండి. |
| **12.** శ్రీ సదాశివ ఉవాచ:<br>సాధు సాధు। మహాప్రాజ్ఞ!<br>శుక! జ్ఞాననిధే! మునే!<br>ప్రష్టవ్యం తు త్వయా పృష్టం<br>రహస్యం వేదగర్భితమ్॥ | **శ్రీ సదాశివ భగవానుడు** : ఓ శుకదేవా! మహాప్రాజ్ఞా! సాధువులకే సాధూ! మునీశ్వరా! జ్ఞాననిధీ! నీవు అడిగిన విషయం నాకు చాలా సంతోషం కలుగజేస్తోందయ్యా! వేద గర్భితమైన పరమ రహస్యము గురించియే నీవు అడుగుచున్నావు. 'తత్త్వమసి' యొక్క అనుభవము సిద్ధించటానికై ఉపాయమైయున్న వేదాంతమార్గమైయున్న షడంగన్యాసము చెప్పుచున్నాను. |

**13.** 'రహస్యోపనిషత్' నామ్నా
స 'షడంగమ్' ఇహ ఉచ్యతే,
యస్య విజ్ఞాన మాత్రేణ
మోక్షః సాక్షాత్। న సంశయః॥

నీవు వినాలని కోరుకున్న 'షడంగము' రహస్యోపనిషత్ అని పిలువబడుచున్నది. అట్టి షడంగ రహస్యోపనిషత్ తెలుసుకొన్న మాత్రం చేతనే జీవునకు సాక్షాత్ మోక్షము లభించగలదు. ఇందులో సందేహం లేదు. **"నీవు"** అను రూపంలో ఎదురుగా కనిపిస్తూ ఉన్నదంతా 'తత్ పరమాత్మయే' అను స్వానుభవము స్వాభావికము కాగలదు.

---

**14.** అంగహీనాని వాక్యాని
గురోః న ఉపదేశేత్ పునః ।
స షట్ (6) అంగాని ఉపదిశేత్
మహావాక్యాని కృత్స్నశః॥

1. ఋషి 2. ఛందస్సు 3. దేవత 4. బీజము 5. శక్తి 6. కీలకము - అనబడే ఆరు అంగములు లేకుండా ఉన్నట్టి వాక్యములు సద్గురువులు **ఉపదేశించరు. ఉపదేశించరాదు.** ఏ మంత్రమైనా '6' అంగములతో పూర్తిగా కూర్చియే ఉపదేశిస్తారు. అట్లాగే, మహావాక్యములను కూడా గురువు షడంగయుక్తంగా ఉపదేశించాలి. శిష్యుడు ఉపాసించాలి. అప్పుడే ఉత్తమోత్తమ ప్రయోజనం.

---

**15.** చతుః (4) నామపి వేదానాం యథా 'ఉపనిషత్' శిరః,
ఇయం 'రహస్యోపనిషత్', తథా ఉపనిషిదామ్ శిరః॥

4 వేదములకు వాటిలోని ఉపనిషత్తులే శిరస్సు వంటివి, సారము అయి ఉన్నాయికదా! అట్లాగే ఈ మనం చెప్పుకొంటున్న 'రహస్యోపనిషత్తు' - ఉపనిషత్తులన్నిటికీ శిరస్సు వంటిది, సారము అయి ఉన్నది.

---

**16.** రహస్య – ఉపనిషత్ బ్రహ్మ ధ్యాతం
యేన విపశ్చితా,
తీర్థైః, మంత్రైః, శ్రుతైః, జప్యైః
తస్య కిం పుణ్య హేతుభిః?

ఏ విపశ్చిత్తులు (విశేషణ పశ్చితః-ప్రాజ్ఞులు, దార్శనికులు, సారాసారములు ఎరిగినవారు) అయితే ఈ రహస్యోపనిషత్ ప్రతిపాదిస్తున్న ధ్యాన వస్తువగు పరబ్రహ్మము యొక్క ధ్యానవిధిని అనుసరించువారై ఉంటారో, వారికి ఇక తీర్థ, మంత్ర, శ్రుత (వినికిడి, వేదమంత్ర పారాయణ), జపముల వంటి పుణ్య హేతువులతో పని ఏముంటుంది? **బ్రహ్మజ్ఞాన ఫలము అన్నిటియొక్క ఆత్యంతిక ప్రయోజనం.**

---

**17.** వాక్యార్థస్య విచారేణ,
యత్ ఆప్నోతి శరత్ శతమ్,
ఏకవార జపేనైవ ఋష్యాది ధ్యాన తశ్చ యత్॥

100 సంవత్సరముల ఆయుర్దాయం గడపి అనేక సార్లుగా 'సోహమ్' (తీర్థ - మంత్ర శ్రుతుల) పారాయణ - జపములు చేసిన ప్రయోజనము - **ఋష్యాది షడంగములతో సహా, ఒక్కసారి షడంగన్యాసంగా మహావాక్యార్థ ఉపాసన విచారణచే** మానవునకు కలుగగలదు.

---

**18.** <u>అస్య 'శ్రీమహావాక్య' మహామంత్రస్య,</u>
'హంస' ఋషిః।
'అవ్యక్త గాయత్రీ' ఛందః।
'పరమ హంసో' దేవతా।
'హం' బీజం। 'సః' శక్తిః।
'సోఽహమ్' కీలకం।
మమ 'పరమహంస' ప్రీత్యర్థే,
'మహావాక్య జపే' వినియోగః।

**షడంగ పూర్వక వివరణ :** ఇప్పుడు ఇక 'శ్రీ మహావాక్య' మహామంత్ర జపారంభము:

| | | |
|---|---|---|
| **హంస** | - | ఋషి |
| **అవ్యక్త గాయత్రి** | - | ఛందస్సు |
| **పరమహంస** | - | దేవత |
| **హం** | - | బీజమ్ |
| **సః** (పరమాత్మ) | - | శక్తి |
| **సోఽహమ్** | - | కీలకమ్ |

'పరమహంస'ల ప్రీతికొరకై సోఽహమ్ పరమమ్ సిద్ధికొరకై- **'మహావాక్య'** జపము జపించటము ప్రారంభిస్తున్నాము.

---

<u>'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ'</u>
అంగుష్ఠాభ్యాం నమః।
<u>'నిత్యానందో బ్రహ్మ'</u>
తర్జనీభ్యాగ్ం స్వాహా।
<u>'నిత్యానంద మయం బ్రహ్మ'</u>
మధ్యమాభ్యాం వషట్।
'యోవై భూమా'
అనామికాభ్యాం హుం।

**కరన్యాసము**

1. **"సత్య జ్ఞానమనంతం బ్రహ్మ"** అను అర్థమును బొటనవ్రేలునందు దేవతారూపంగా ఆహ్వానించి నమస్కరిస్తున్నాను.

2. **"నిత్యానందో బ్రహ్మ"** అను అర్థమును చూపుడు వ్రేలునందు దేవతాహ్వానము (స్వాహా) పలుకుచున్నాను.

3. **"నిత్యానందమయం బ్రహ్మ'** - మధ్యమ వ్రేలులో(గా) దేవతల హవిస్సు సమర్పణ శబ్దమగు 'వషట్' ఆహ్వానము పలుకుచున్నాను.

<u>'యోవై భూమాధిపతిః'</u>
**కనిష్ఠికాభ్యాం వౌషట్।**
<u>'ఏకమేవ - అద్వితీయం బ్రహ్మ'</u>
**కరతలకర పృష్ఠాభ్యాం ఫట్।**

4. **'యోవై భూమా'** ఉంగరపు వ్రేలులో(గా) ఆహ్వాన శబ్దమగు 'హుం' తో సుస్వాగతిస్తూ ఆసన సమర్పణ చేస్తున్నాను.

5. **'యోవై భూమాధిపతిః'** ను కనిష్ఠ వ్రేలులోనికి (గా) ఆహ్వానిస్తూ సమస్తమునకు అధిపతిగా భావిస్తున్నాను.

6. **'ఏకమేవాద్వితీయా బ్రహ్మ'**ను చేతి వ్రేళ్ళముందు వెనుక - 'సమస్తము' అయిన దేవిగా ఏకము, అద్వితీయము అగు బ్రహ్మమును ఉపాసిస్తున్నాను.

---

<u>'సత్యం జ్ఞానమ్ అనంతమ్ బ్రహ్మ'</u>
**హృదయాయ నమః।**
<u>'నిత్యానందో బ్రహ్మ'</u> **శిరసే స్వాహా।**
<u>'నిత్యానందమయం బ్రహ్మ'</u>
**శిఖాయై వషట్।**
<u>'యోవై భూమా'</u> **కవచాయ 'హుం'।**
<u>'యోవై భూమాధిపతిః'</u>
**నేత్ర త్రయాయ వౌషట్।**
<u>'ఏకమేవ అద్వితీయం బ్రహ్మ'</u>
**అస్త్రాయ ఫట్।**
**'భూర్భువస్సువరోమ్' ఇతి (భూ భువః సువః ఓం) దిగ్బంధః।**

**అంగన్యాసము**

1. **"సత్య జ్ఞానమనంతం బ్రహ్మ"** గా హృదయములోనికి ఆహ్వానం పలికి నమస్కరిస్తున్నాము.

2. **"నిత్యానందో బ్రహ్మ"** గా శిరస్సునందు దేవతాహ్వానము.

3. **'నిత్యానందమయం బ్రహ్మ'** - వషట్కారంగా శిఖయందు యోగోపాసన.

4. **'యోవై భూమా'** గా (ఇంద్రియ) కవచ స్వరూపముగా స్థిరోభవము.

5. **'యోవై భూమాధి పతిః'** త్రినేత్రధారుడగు యజ్ఞపురుషునికి 'వౌషట్'

6. **'ఏకమేవా ద్వితీయా బ్రహ్మ'** ను అనేకత్వము తొలగిస్తూ శిరస్సును చుట్టి ఉండు శబ్ద బ్రహ్మోచ్చారణ.

భూః - భువః - సువర్లోకముల స్వరూపుడుగా పరమాత్మను బుద్ధి కొరకై దిగ్బంధనము చేస్తున్నాను. (Unity of Matter, Thought and Devine Self)

---

<u>ధ్యానం</u>

> నిత్యానందం। పరమ సుఖమ్। కేవలం జ్ఞానమూర్తిం।
> విశ్వాతీతం। గగన సదృశం। 'తత్ త్వమ్ అసి' ఆది లక్ష్యం।
> ఏకం నిత్యం విమలం అచలం సర్వ 'ధీ' సాక్షిభూతం।
> భావాతీతం త్రిగుణ రహితం
> సద్గురుం తన్నమామి [తత్ (తన్) నమామి] ॥

**'సత్' (ఉనికి) స్వరూప గురువు (మహత్తరమగు ఆత్మ) ధ్యానం**

(భూత - వర్తమాన - భవిష్యతులను తన ఆనందము కొరకై కల్పించుకొనువాడు కాబట్టి) - **నిత్యానందులు.**

- పరము (ఆవల)గా ప్రకాశించుచున్న **ఆత్మ సుఖ ప్రదాత,**

- జ్ఞేయములకు (తెలియబడే అన్నిటికి) మునుముందుగా మూర్తీభవించుటచే **కేవలం-జ్ఞానమూర్తి,**

- ఈ విశ్వమునకు అతీతుడై (అత్యతిష్ఠత్ దశాంగులమ్) ఉండుటచే **విశ్వాతీతులు.**

- ఆకాశమువలె అనంతుడు, **విషయాతీతులు.**

- నీవుగా కనిపించేది అదియే, 'తత్త్వమసి' - ఇత్యాది **మహావాక్యములు లక్ష్యముగా** కలిగి ఉన్నవారు.

- ఏక స్వరూపుడు, నిత్యుడు, నిర్మలుడు, సర్వుల బుద్ధికి సాక్షీభూతుడైనవారు.

భావమునకు అతీతమై, మునుముందే ఉండి, భావమునకు 'పుట్టినిల్లు' అయినట్టిది, త్రిగుణరహితము అయినట్టిది అగు తత్ సత్ ఆనంద సద్గురువులు సర్వదేహములలో దేహిగా పరాకాష్ఠయగు సత్-ఆనంద స్వరూపులు అగు పరమాత్మకు నమస్కరించుచున్నాను.

**19.** అథ మహావాక్యాని చత్వారి (4)।

యథా...,

| |
|---|
| (1) ఓం ప్రజ్ఞానం బ్రహ్మ। |
| (2) ఓం అహం బ్రహ్మాస్మి। |
| (3) ఓం తత్ త్వమ్ అసి। |
| (4) ఓం అయమ్ ఆత్మా బ్రహ్మ। |

'తత్త్వమసి' ఇతి అభేదవాచకం

ఇదం యే జపంతి,

తే శివసాయుజ్య ముక్తిభాజో భవంతి।

**ఇప్పుడిక చతుర్ (4) మహావాక్యములు**

1. **ప్రజ్ఞయే బ్రహ్మము.** ఏ తెలివిచే (లేక) ప్రజ్ఞచే తదితరమైనదంతా తెలియ బడుచున్నదో-అట్టి **కేవలముగు 'ప్రజ్ఞ' బ్రహ్మమే! అదియే 'ఓం'.**

2. ఏదైతే జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు ఆధారంగా 'నేను-నేను-నేను' రూపముగా ప్రకాశమానమై యున్నదో, **అట్టి 'నేను' బ్రహ్మమే! అదియే 'ఓం'!**

3. **'నీవు'**గా ఏది కనిపిస్తూ, అనిపిస్తూ ఉన్నదో, **అదంతా తత్ బ్రహ్మమే! అదియే 'ఓం'! నీవుగా కనబడుచున్నది బ్రహ్మమే!**

4. **ఈ జీవుడు బ్రహ్మమే.** ఏది నాకు సంబంధించిన 'జీవాత్మ'గా దృశ్యానుభవం పొందుచున్నదో, అట్టి **'జీవుడు' అనబడునది బ్రహ్మమే! అదియే 'ఓం'.**

ఎవ్వరైతే సర్వభేదములను దాటి జయించి - "నీవుగా కనిపిస్తున్నది నా ఉపాసనా తత్త్వమగు పరబ్రహ్మము యొక్క ప్రత్యక్ష రూపమే" - అను మనన జపము జపిస్తూ ఉంటారో (అనుకుంటూ, అనుకుంటూ ఉంటారో), అట్టివాడు శివసాయుజ్యము (శివోఽహమ్ స్థానము) పొంది, సర్వ బంధములనుండి విముక్తుడై ముక్తిభాజుడగుచున్నాడు. స్వయముగా 'త్వమ్'తో అనన్యుడు అగుచున్నాడు. 'అహమ్ బ్రహ్మ'ను స్వాభావికంగా సిద్ధించుకుంటున్నాడు.

---

<u>'తత్' పద మహా మంత్రస్య,</u>

'హంస' ఋషిః।

'అవ్యక్త గాయత్రీ' ఛందః।

'పరమ హంసో' దేవతా।

'హం' బీజం। 'సః' శక్తిః।

'సోఽహమ్' కీలకమ్

మమ 'సాయుజ్య ముక్తిః' అర్థే (సాయుజ్య ముక్త్యర్థే)

జపే వినియోగః।

## 'తత్' పద మహా మంత్రము

*("తత్త్వమసి" మహావాక్యములో 'తత్' పదము)*

ఈ 'తత్ పద' మహా మంత్రమునకు

| | | |
|---|---|---|
| ఋషి | - | **హంస. (సోఽహమ్)** |
| ఛందస్సు | - | **అవ్యక్త గాయత్రి.** |
| దేవత | - | **పరమహంస (సోఽహమ్ పరమమ్)** |
| బీజము | - | **హమ్ (అహమ్-'సమస్తము నేనైన నేను')** |
| శక్తిః | - | **సః (అన్ని నేనులు నేనైన నేను)** |
| కీలకము | - | **సోఽహమ్ 'నేను'గా ఉన్నది పరమాత్మయే!** |

ఈ భావములన్నీ **'తత్'**పద జపమునందు వినియోగమగుచుండును గాక!

---

**20.** తత్పురుషాయ అం।। (అంగుష్ఠాభ్యాం) నమః।

ఈశానాయా త।। (తర్జనీభ్యాగ్ం) స్వాహా।

అఘోరాయ మధ్య।। (మధ్యమాభ్యాం) వషట్।

సద్యోజాతాయ అనా।। (అనిమికాభ్యాం) హుం।

వామ దేవాయ క।। (కనిష్ఠికాభ్యాం) వౌషట్।

తత్పురుష ఈశాన అఘోర సద్యోజాత

వామ దేవేభ్యోః నమః కర।। (కరతల కర పృష్ఠాభ్యాం) ఫట్।

<u>ఏవం హృదయాది న్యాసః।</u>

'భూర్భువస్సువరోమ్' (భూః భువః సువః ఓం)

ఇతి దిగ్బంధః।

**"తత్పురుషాయ"** - అంగుష్ఠాభ్యాం నమః।

**"ఈశానాయ"** - తర్జనీభ్యాం స్వాహా।

**"అఘోరాయ"** - మధ్యమాభ్యాం వషట్।

**"సద్యోజాతాయ"** - అనాహతాభ్యాం హుం।

**"వామదేవాయ"** - కనిష్ఠికాభ్యాం వౌషట్।

**"తత్పురుష ఈశాన అఘోర సద్యోజాత వామదేవేభ్యో నమః - కరతలకరపృష్ఠాభ్యాం నమః - అస్త్రాయ 'ఫట్'**

పై వాటిచే హృదయాది (హృదయాయ నమః... మొ॥) న్యాసము

భూ-భువర్-సువర్ త్రిలోకములను లోకేశ్వరియగు ఆత్మ దేవీ ఉపాసనా విశేషంగా దిక్-బంధము.

**(ఉపాస్య దేవదేవి -** స్థూల సూక్ష్మ కారణ ప్రదర్శనములు తనవైయున్న ఆది-పరా శక్తి స్వరూప-స్వస్వరూపి। సర్వస్వరూపి)

## ధ్యానం – "తత్" పదము

జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యాత్ అతీతమ్,
శుద్ధం బుద్ధం ముక్తమపి అవ్యయం చ,
సత్యం జ్ఞానం సత్–చిత్– ఆనంద రూపమ్,
ధ్యాయేదేవం (ధ్యాయేత్ ఏవం) తత్ మహోభ్రాజ మానమ్॥

**ధ్యానం**

**"తెలివి, తెలుసుకొనుచున్నట్టిది, తెలియబడునది"** (Knowledge, Knower, that being known) - ఈ మూడింటికి అతీతమైనవాడు, పరమశుద్ధుడు, బుద్ధి తనదైనవాడు, నిత్యముక్తుడు, అవ్యయుడు, సత్యజ్ఞాన స్వరూపుడు, సత్-చిత్-ఆనంద ప్రత్యక్షుడు, తనయొక్క మహోరూపముచే సర్వే సర్వత్రా సర్వముగా విభ్రాజమానుడు అగు **తత్ పరమాత్మ దేవదేవుని** ధ్యానించుచున్నాను.

---

## "త్వం" పదము

**21.** 'త్వం' పద మహా మంత్రస్య।
'విష్ణుః' ఋషిః।
'గాయత్రీ' ఛందః।
'పరమాత్మా' దేవతా।
'ఐం' బీజం । 'క్లీం' శక్తిః।
'సౌః' కీలకం।
మమ ముక్త్యర్థే జపే వినియోగః।
వాసుదేవాయ – అం॥ (అంగుష్ఠాభ్యాం) నమః।
సంకర్షణాయ – త॥ (తర్జనీభ్యాం) స్వాహా।
ప్రద్యుమ్నాయ – మధ్య॥ (మధ్యమాభ్యాం) వషట్।
అనిరుద్ధాయ – అ॥ (అనామికాభ్యాం) హుం।
వాసుదేవాయ – కని॥ (కనిష్ఠికాభ్యాం) వౌషట్।
సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్న
అనిరుద్ధేభ్యః – కర॥ (కరతలకర పృష్ఠాభ్యాం) ఫట్।
(ఏవం హృదయాది న్యాసః।)
'భూర్భువస్సువరోమ్' – ఇతి దిగ్బంధః।

**'త్వం' పద మహా మంత్రము**
**('తత్త్వమసి' మహావాక్యములో 'త్వం' పదము)**

| | | |
|---|---|---|
| మహామంత్రము | - | **త్వం పదము।** |
| ఋషి | - | **విష్ణుభగవానుడు** |
| ఛందస్సు | - | **గాయత్రీ** |
| దేవత | - | **పరమాత్మా** |
| బీజము | - | **"ఐం"** |
| శక్తిః | - | **"క్లీం"** |
| కీలకము | - | **"సౌః"** |

నాయొక్క సంసారబంధ విముక్తి కొరకై భావనచేసి వినియోగించు చున్నాను.
**"వాసుదేవాయ"** - అంగుష్ఠాభ్యాం **నమః।**
**"సంకర్షణాయ"** - తర్జనీభ్యాం **స్వాహా।**
**"ప్రద్యుమ్నాయ"** - మధ్యమాభ్యాం **వషట్।**
**"అనిరుద్ధాయ"** - అనామికాభ్యాం **హుం।**
**"వాసుదేవాయ"** - కనిష్ఠికాయ **వౌషట్।**
**సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్న అనిరుద్ధేభ్యః-కరతల కరపృష్ఠాభ్యాం నమః**
(పై 'కరన్యాసము' తరువాత హృదయన్యాసము.)

---

## ధ్యానమ్ – "త్వం" పదము

జీవత్వం సర్వభూతానాం,
సర్వత్ర అఖండ విగ్రహమ్।
చిత్త–అహంకారయం తారం
జీవాఖ్యం 'త్వం' పదం భజే॥

**ధ్యానము**

- సర్వజీవుల జీవనత్వ స్వరూపుడు,
- అఖండ విగ్రహుడు అయి, సర్వత్రా ప్రత్యక్షమై యున్నవాడు,
- చిత్త - అహంకారములను స్వసంకల్పితంగా కల్పన చేసి నియమించుచున్నట్టివాడు,
- 'జీవుడు' గా స్వీయ తత్త్వమునే సంప్రదర్శించువాడు - అగు 'త్వం' పరమ పురుష స్వరూపుని పదమును భజించుచున్నాను.

---

## "అసి"

'అసి' పద మహామంత్రస్య। 'మనః' ఋషిః।
'గాయత్రీ' ఛందః। 'అర్ధనారీశ్వరో' దేవతా।
'అవ్యక్తాదిః' బీజమ్। 'నృసింహః' శక్తిః।
'పరమాత్మా' కీలకమ్।
జీవ బ్రహ్మైక్యార్థే (జీవ–బ్రహ్మ ఐక్యార్థే) జపే వినియోగః।

**'అసి' పద మహా మంత్రము**
**('తత్త్వమసి' మహావాక్యములో 'అసి' పదము)**

| | | |
|---|---|---|
| మహామంత్రము | - | **అసి (అయి ఉన్నావు)** |
| ఋషి | - | **మనస్సు / మనువు** |
| ఛందస్సు | - | **గాయత్రీ** |
| దేవత | - | **అర్ధనారీశ్వరి** |
| బీజము | - | **అవ్యక్తము** |
| శక్తి | - | **నృసింహుడు** |
| కీలకము | - | **పరమాత్మ** |

జీవ-బ్రహ్మముల ఏకత్వ/ఐక్యత కొరకై జప వినియోగమును ఉద్దేశ్యిస్తున్నాను. జీవాత్మను బ్రహ్మమునకు అనన్యముగా ఉపాసించుచున్నాను.

| | |
|---|---|
| పృథ్వీద్వ్యణుకాయ – అం॥ (అంగుష్ఠాభ్యాం) నమః। | **"పృధ్వి (భూమి) అణుకాయ"** - అంగుష్ఠాభ్యాం **నమః।** |
| అబ్ధ్యః (తు) అణు కాయ – త॥ (తర్జనీభ్యాం) స్వాహా। | **"అబ్ద్య (జల) అణుకాయ"** - తర్జినీభ్యాం **స్వాహా।** |
| తేజోః (తు) అణు కాయ – మధ్య॥ (మధ్యమభ్యాం) వషట్। | **"తేజో (అగ్ని) అణుకాయ"** - మధ్యమాభ్యాం **వషట్।** |
| వాయుః (తు) అణు కాయ–అనా॥ (అనామికాభ్యాం) హుం। | **"వాయు" అణుకాయ** - అనామికాభ్యాం **హుం।** |
| ఆకాశ తు అణు కాయ – కని॥ (కనిష్ఠకాభ్యాం) వౌషట్। | **"ఆకాశము" అణుకాయ** - కనిష్ఠికాభ్యాం **వౌషట్।** |
| పృథివిః – ఆపః – తేజో – వాయుః – ఆకాశాత్ అణు కేభ్యో నమః। | **(పంచభూతములను తన ఏక అణు శరీరముగా కలిగియున్న పరమాత్మకు నమస్కారము)** |
| కర ॥ (కరతల కరపుష్ఠాభ్యాం) ఫట్। (ఏవం హృదయాది న్యాసః) | పృథివి - జల - అగ్ని - వాయు - ఆకాశముల అణు స్వరూపమునకు నమస్కరిస్తూ |
| 'భూర్భువస్సువరోమ్' ఇతి దిగ్భంధః। | కరతల కర పృష్ఠాభ్యాం నమః। భూ - భువర్- సువర్ త్రిలోకములను పరమాత్మరూపముగా దిగ్బంధనము చేయుచున్నాను. |

**<u>ధ్యానమ్ – "అసి"</u>**

> జీవో బ్రహ్మేతి వాక్యార్థమ్
> యావత్ అస్తి మనః స్థితిః,
> ఐక్యం తత్త్వం లయే కుర్వన్
> ధ్యాయేత్ 'అసి' పదం సదా!

ఏవం మహా వాక్య షట్ (6) అంగాని ఉక్తాని॥

**"ఈ జీవుడు బ్రహ్మమే! బ్రహ్మమే జీవుని వలె అజ్ఞాన దృష్టికి అనిపిస్తోంది"** - అను వాక్యార్థము స్వాభావసిద్ధంగా అనిపించే 'మనో సిద్ధి' (అకృత్రిమంగా బుద్ధికి నిశ్చయము) లభించే వరకు - **"జీవ బ్రహ్మైక్యము"** అను లయ తత్త్వరూపమగు 'అసి' - అగు పదమును నిరంతరము ధ్యానించుచున్నాను.

**ఈవిధంగా మహావాక్యముల షట్ (6) అంగముల ఉపాసన ఆత్మజ్ఞులచే చెప్పబడుచున్నది.**

అథ 'రహస్యోపనిషత్' విభాగశో
వాక్యార్థ శ్లోకాః ప్రోచ్యంతే।

> యేన ఈక్షతే, శృణోతి ఇదం,
> జిఘ్రతి, వ్యాకరోతి చ,
> స్వాదు – అస్వాదు విజానాతి
> తత్ '<u>ప్రజ్ఞానమ్</u>' ఉదీరితమ్॥

ఇక 'రహస్యోపనిషత్' లోని తరువాత విభాగంగా వాక్యార్థములు చెప్పు శ్లోకములు చెప్పుకుంటున్నాము.

### (1) ప్రజ్ఞానం

1. **ప్రజ్ఞానము**=ఈ జీవుడు దేనిచేత (వలన) చూస్తున్నాడో, వినుచున్నాడో, వాసన చూస్తున్నాడో, (ఆలోచనలచే) విస్తరిస్తున్నాడో, వ్యవహరిస్తున్నాడో విభజన చేస్తున్నాడో - అదియే '**ప్రజ్ఞానము**' అను శబ్దముతో ఉద్దేశ్యించ బడుతోంది. అట్టి ప్రజ్ఞానము బ్రహ్మమే. **ప్రజ్ఞానమే బ్రహ్మము.**

**22.** చతుర్ముఖ – ఇంద్ర – దేవేషు,
మనుష్య అశ్వ గవాదిషు
చైతన్యమ్ ఏకమ్ బ్రహ్మ
అతః 'ప్రజ్ఞానం బ్రహ్మ' మయ్యపి।

### (2) ప్రజ్ఞానం బ్రహ్మ (అహమస్మి)

ఈ సృష్టికి కర్తయగు చతుర్ముఖ బ్రహ్మయందు, త్రిలోకాధిపతియగు ఇంద్రుని యందు, సృష్టిని నిర్మించి నడిపించు అభౌతిక రూపులగు దేవతలయందు, భౌతికరూపులగు మనుష్యులందు, గుర్రములు, పశువులు మొదలైన సర్వజంతు, కీటక, వృక్షజాలమునందు ఏ చైతన్యము ఏకరూపమై ప్రకాశించుచున్నదో, **ఆ అఖండ చైతన్యమే బ్రహ్మము.** ప్రజ్ఞానము కూడా బ్రహ్మమే! నాయందలి ప్రజ్ఞ బ్రహ్మమే! నేను ప్రజ్ఞాన స్వరూప బ్రహ్మమే అయి ఉన్నాను. బ్రహ్మము నుండి పురుగు వరకు జగదనుభవమంతటికీ 'సాక్షి' అయి ఉన్నదే 'నేను'.

పరిపూర్ణః పరాత్మ
అస్మిన్ దేహే విద్యాధికారిణి,
బుద్ధేః సాక్షితయా స్థిత్వా
స్ఫురన్ 'అహమ్' ఇతి ఈర్యతే।

### (3) అహమ్

ఆత్మ జ్ఞాన సాధనకు మహత్తరంగా ఉపయుక్తమగుచున్న ఈ భౌతిక దేహమునంతా ఆక్రమించి '**నేను**'ను, స్ఫురింపజేస్తూ ఉన్నదో, బుద్ధికి సాక్షిగా ప్రత్యక్షమైయున్నదో, అదియే - పరిపూర్ణము (Complete by itself), పరాత్మ (That which is beyond all) అగు - 'అహమ్', **అహమ్ బ్రహ్మాస్మి!**

స్వతః పూర్ణః పరాత్మ అత్ర
'బ్రహ్మ' – శబ్దేన వర్ణితః॥

**(4) బ్రహ్మము** – ఏది స్వతః సిద్ధమో (It exists by itself), పూర్ణమో(Complete by itself), జీవ-జగత్తులను కలుపుకుని సంపూర్ణమై యున్నదో, బుద్ధికి సాక్షియో, సర్వమై, పూర్ణమైయున్నదో అదియే **'బ్రహ్మము'** అను శబ్దముతో అభివర్ణించబడుతోంది.

---

'అస్మి' ఇతి ఐక్య పరామర్శః,
తేన 'బ్రహ్మ' భవామి అహమ్।
ఏకమేవ అద్వితీయం సత్
నామ రూప వివర్జితమ్,
సృష్టేః పురాధునాపి అస్య
తాద్రూప్యం 'తత్' ఇతి ఈర్యతే।

**(5) అస్మి** – **'అహం బ్రహ్మాస్మి'** అను మహావాక్యములో **'అస్మి'** - జీవ-బ్రహ్మముల ఐక్యము (ఏకత్వము) తెలుపుచున్నది. అట్టి పరామర్శచే "అహమ్-నేను" - "బ్రహ్మమే" అయి ఉన్నాను - అనునది నిరూపితము.

ఏదైతే 'సృష్టి' అను అనుభవమంతటికీ మునుముందే ఏకము-అద్వితీయము అయి, నామ రూప వివర్జితమై (నామ రూపములే లేనిదై) - 'సత్' (కేవలమగు ఉనికి)గా ఉండి ఉన్నదో, అది (అస్య) 'తత్' పదముగా చెప్పబడుచున్నది. అద్దాని స్వానుభవమే, అద్దాని సర్వత్రా సందర్శనమే 'తత్‌పదము'. (**బ్రహ్మమే నా స్వాభావిక స్వరూపము**).

---

**23.** శ్రోతుః దేహ-ఇంద్రియాతీతం
వస్తు అత్ర 'త్వం' పద ఈరితమ్।
ఏకతా గ్రాహ్యతే 'అసి' ఇతి।
తత్ ఐక్యమ్ అనుభూయతామ్।
స్వప్రకాశ-అపరోక్షత్వమ్
'అయమ్' ఇతి ఉక్తితో మతమ్।

**(3) తత్ త్వమ్ అసి**

**త్వమ్** - 'నీవు'ను చూస్తున్నప్పుడు ఏ వస్తుతత్త్వము శబ్ద స్పర్శ రూప రస గంధములకు, దేహ-ఇంద్రియములకు **'అతీతం'**గా ఉన్నదో అదియే (మహావాక్యములోని) **'త్వమ్'** యొక్క పరమార్థము, అర్థము.

**అసి** - ఏకమగు బ్రహ్మముగా గ్రహిస్తూ ఉంటే ('నీవు'గా కనిపిస్తున్నదంతా సర్వదా ఏకమగు బ్రహ్మమే - అని అనుకుంటూ ఉంటే) - **'అసి'** అనురూపము గల జీవ-బ్రహ్మైక్యము అనుభూతమగుచున్నది.

**(4) అయమాత్మా బ్రహ్మ**

**అయమ్** - ఆత్మ స్వయం ప్రకాశము. ప్రత్యక్ష - పరోక్షములకు వేరైన అపరోక్షము (ఎదురుగా వస్తువు కాదు. ఎక్కడో ఉన్నది కాదు) - అను అర్థము చెప్పబడుతోంది. అట్టి ఈ జీవాత్మ బ్రహ్మమే.

---

అహంకారాది-దేహాంతం (అహంకార ఆది-దేహ అంతమ్)
'ప్రత్యగాత్మా' ఇతి గీయతే।
దృశ్యమానస్య సర్వస్య
'జగతస్సత్త్వమ్' (జగతః సత్త్వమ్) ఈర్యతే।
'బ్రహ్మ' శబ్దేన తత్ బ్రహ్మ
స్వప్రకాశ ఆత్మ రూపకమ్॥

అనాత్మ దృష్టేః అవివేక నిద్రామ్,
'అహమ్-మమ' స్వప్నగతిం గతోఽహమ్।
స్వరూప సూర్యే అభ్యుదితే స్ఫుటోక్తేః,
గురోః మహావాక్యపదైః ప్రబుద్ధః॥

**ప్రత్యగాత్మ** - అహంకారము మొదలుగా గలిగినది, ఈ స్థూల దేహము చివ్వరిగా కలిగి ఉన్నదియే ప్రత్యగాత్మ. దృశ్యమానమగు సర్వ దృశ్య జగత్తుగా ఉనికి 'స్వరూపిణి' - అని చెప్పబడుతోంది ప్రత్యగాత్మ.

**తత్** - స్వయం ప్రకాశకము, సర్వమునకు ఆత్మరూపకము - అయినట్టిదే 'తత్' అనబడు బ్రహ్మము.

**ప్రబుద్ధము** - జగత్తును 'ఆత్మదృష్టి'తో కాకుండా ఆత్మకు వేరైన దృష్టితో చూస్తూ 'నాది-నేను' అను స్వప్నలోకంలో విహరిస్తూ ఉన్నాను.

**వివేకము** - గురువుయొక్క మహావాక్యములు (**తత్ త్వమ్, సోఽహమ్, జీవో బ్రహ్మేతి నాపరః**-ఇత్యాది వాక్యముల) ప్రభావముచే స్వస్వరూప సూర్యుడు ఉదయిస్తూ ఉండగా చీకటి రాత్రి తొలగి భళ్ళున తెల్లవారు చున్నది. **ప్రబుద్ధుడగుచున్నాను.** ఈ సమస్తమును **నాలోని నేనైన నేనుగా పరమానంద దర్శనము చేస్తున్నాను.**

---

**24.** వాచ్యం లక్ష్యమ్ ఇతి
ద్విధ అర్థసరణీ।
వాచ్యస్య హి 'త్వం' పదే।
వాచ్యమ్ భౌతికమ్ ఇంద్రియాదిరపి,

'త్వం' పదముల అర్థములు రెండు తీరులైనవి. (1) వాచ్యార్థము (2) లక్ష్యార్థము.

**'త్వం' యొక్క** -

**వాచ్యార్థము** : పాంచభౌతికమైన కాళ్ళు-చేతులు కలిగిన దేహము, ఇంద్రియములు, అంతరింద్రియములు లౌకిక విశేషములు మొ॥వి.

| | |
|---|---|
| యత్ లక్ష్యం 'త్వం' అర్థశ్చ 'సః'।<br>వాచ్యం తత్ పదమ్ ఈశతాకృతమ్<br>అతిర్లక్ష్యం తు (ఆకృతమతిర్లక్ష్యం తు)<br><u>సత్ చిత్ సుఖ ఆనంద బ్రహ్మ</u><br>తదర్థ ఏష చ, తయోః<br>ఐక్యం త్వ అసి - ఇదమ్ పదమ్॥<br>'<u>త్వమ్</u>' ఇతి '<u>తత్</u>' ఇతి<br>కార్యే-కారణే 'సత్' ఉపాధౌ<br>ద్వితయమ్ ఇతరథా ఏకం<br>**"సత్-చిత్-ఆనందరూపమ్"॥** | **లక్ష్యార్థము : పరమ లక్ష్యము.** ఈశ్వరసంబంధమగు **'తత్'** పదము.<br>**సత్ - చిత్ - సుఖ ఆనంద బ్రహ్మము.**<br>తత్ తాత్త్వికార్థము.<br>**"తత్ - త్వమ్ - అసి".**<br>అదియే నీవు అయి ఉన్నావు. పరబ్రహ్మమే నీవు" .<br>అసి = తత్ త్వమ్‌ల కలయిక.<br>త్వమ్ = నీవు. తత్ = అది. ఈ రెండూ అభేదమే అయి ఉండి కూడా - కార్యకారణ రూప ఉపాధి వలన వేరువేరైనట్లు అగుపిస్తోంది. ఆ రెంటి కార్య-కారణ భేదం విచారణచే తొలగిస్తే (లేక) తిరస్కరిస్తే - అద్వితీయ సచ్చిదానంద బ్రహ్మమే అఖండమై, అద్వితీయమై యున్నది - అని అనుభవమవగలదు. |
| ఉభయ వచన హేతూ, దేశ-కాలౌ చ హిత్వా,<br>జగతి భవతి సోఽయమ్, దేవదత్తో యథా 'ఏకః'।<br>కార్య-ఉపాధిః అయం <u>జీవః</u>॥<br>కారణ-ఉపాధిః <u>ఈశ్వరః</u>॥<br>కార్య-కారణతాం హిత్వా<br>పూర్ణబోధో అవశిష్యతే। | 'దేవదత్తుడు' అనువాడు ఒక్కడే అయినప్పటి దేశ-కాలములచే (ఆ ఊరి వాడు, ఆ ఊరిలో ఉన్నాడు. ఆతడు బాలుడు, యువకుడు, ముదుసలి వాడు మొదలైనవిగా) భేదముగా చెప్పబడుచున్నాడు. తాత, తండ్రి, కొడుకు, మిత్రుడు మొదలైన భేదమదృష్టులచే చూడబడుచున్నాడు.<br>కార్య ఉపాధిగా - ఈ జీవుడు, కారణ ఉపాధిగా - ఈశ్వరుడు, కార్య-కారణములను తిరస్కరించి, దూరంగా వదలివేస్తే, అప్పుడు 'నీవు' అనువాడు (దేవదత్తుడు) - **పూర్ణబోధ స్వరూపుడు**గానే శేషిస్తున్నాడు. |
| శ్రవణం తు గురోః పూర్వం।<br>మననం తదనంతరమ్।<br>నిదిధ్యాసనమ్ ఇతి ఏతత్<br>పూర్ణబోధస్య కారణమ్।<br>అన్యవిద్యా పరిజ్ఞానమ్<br>అవశ్యం నశ్వరం భవేత్। | ముందుగా **'కోఽహమ్ - నేను ఎవ్వరు?'** అను పరిప్రశ్నతో, ప్రణిపాతి అయి సద్గురువును ఆశ్రయిస్తే, ఆయన - **'తత్ త్వమ్ అసి'** మహా వాక్యార్థమును బోధిస్తున్నారు. ఇది **శ్రవణం.** గురువాక్య మహావాక్యార్థాన్ని గ్రహించి ముముక్షువు స్వయముగా తన స్వరూపము గురించి ఏకాంత విచారణ చేయాలి. ఇది **మననము.** ఈవిధంగా శ్రవణ - మననములు చేసిన తరువాత అదియే తానుగా **అనిపించాలి.** ఇది **నిదిధ్యాస.** ఆపై "ఈ సమస్తము నేనైన నేను" - అనునది సమదర్శన రూపమగు **సమాధి.** ఇది పూర్ణబోధకు కారణము అగుచున్నది. అప్పుడిక అన్యములగు అవిద్యా పరిజ్ఞానమంతా అవశ్యము తమకు తామే నశించగలవు. **"ఈ సమస్తము నేనైన నేనే నేను"** అనియే సిద్ధిస్తోంది. |
| బ్రహ్మవిద్యా పరిజ్ఞానమ్<br>బ్రహ్మ ప్రాప్తి కరం స్థితమ్।<br>మహావాక్యాని ఉపదిశేత్<br>స షట్ (6) అంగాని దేశికః,<br>కేవలం నహి వాక్యాని<br>బ్రహ్మణో వచనం యథా। | "బ్రహ్మము" గురించిన పరిజ్ఞానముచే బ్రాహ్మీస్థితియందు ఈ జీవుడు సంస్థితుడగుచున్నాడు. బ్రహ్మమే తానై వెలయుచున్నాడు. (బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి).<br>మహా వాక్యములు ఉపదేశించు సందర్భములో కేవలము "తత్త్వమ్, సోఽహమ్, అయమాత్మా బ్రహ్మ, జీవో బ్రహ్మేతి నా పరః"...... మొదలైనవి పలికి ఊరుకోరాదు.<br>షట్ (6) మహామంత్రోపాసనను అభ్యసింపజేస్తూ - షడంగములు కలిపి గురువు బోధించాలి. బుద్ధిని శుద్ధి చేసుకుంటేగాని మహావాక్యములు పరమార్థ పూర్వకంగా హృదయములో వికసించవు. |
| <u>(పునః) ఈశ్వర ఉవాచ</u><br>ఏవమ్ ఉక్త్వా మునిశ్రేష్ఠ, రహస్యోపనిషత్, శుక!<br>మయా పిత్రా అనునీతేన<br>వ్యాసేన బ్రహ్మవాదినా॥ | **ఇంకా ఈశ్వరుడగు పరమ శివులవారు ఈవిధంగా ఉపదేశించసాగారు.**<br>ఓ శుక మునీంద్రా! మునిశ్రేష్ఠా! మీ పితృదేవులవారు శ్రీ వేదవ్యాస మహర్షి కోరిన ప్రకారము, బ్రహ్మవాదులగు ఆయన సంతోషము కొరకై రహస్యోపనిషత్ నీకు ఇప్పటి వరకు బోధించటం జరిగింది. |

**తతో 'బ్రహ్మ' ఉపదిష్టం వై**
**సత్-చిత్-ఆనంద లక్షణమ్**
**జీవన్ముక్తః సదా ధ్యాయన్**
**నిత్యః త్వం విహరిష్యసి।**

**యో వేద - ఆదౌ స్వరః ప్రోక్తో,**
**వేదాంతే చ ప్రతిష్ఠితః,**
**తస్య ప్రకృతి లీనస్య**
**యః 'పరః' స మహేశ్వరః॥**

ఈవిధంగా బ్రహ్మోపదేశముగా సత్-చిత్-ఆనంద లక్షణమగు బ్రహ్మతత్త్వము విన్నావు కదా! నీకు బోధించిన బ్రహ్మ తత్త్వమును ధ్యానిస్తూ, తత్-ధ్యాసతో జీవన్ముక్తుడవై ఈ లోకమున విహరించుము.

- ఏదైతే వేదములలో ఆదియందు స్వరయుక్తంగా చెప్పబడినదో,
- వేదాంతముగా (తెలుసుకొనువానిని తెలుసుకొనటంగా), వేద శిరస్సుగా, ఆత్మశాస్త్రంగా ప్రతిష్ఠితమై యున్నదో,
- అట్టి పరమాత్మయందే జనించి, 'ప్రకృతి' తిరిగి పరమాత్మయందే లీనము అగుచున్నది.

ఏది శబ్ద బ్రహ్మమగు ఓంకారమునకు, ప్రకృతికి పరమై చిట్ట చివ్వరిగా శేషించియున్నదో, సర్వము 'తానే' (తత్) అయి ఉన్నదో అదియే **"మహేశ్వరుడు" "పరమాత్మ"** అని గ్రహించు. **తత్ త్వమేవ।** అదియే నీవు.

---

**25. ఉపదిష్టః శివేన ఇతి**
**జగత్ తన్మయతాం గతః,**
**ఉత్థాయ - ప్రణిపత్య ఈశం,**
**త్యక్తాశేష పరిగ్రహః॥**
**పరబ్రహ్మపయో రాశౌ**
**ప్లవన్ ఇవ యయౌ తదా।**

ఈ రీతిగా శ్రీ శుక మునీంద్రుడు పరమ శివునిచే బోధింపబడినారు. అనన్యముగా కనిపిస్తున్న జగత్తును అనన్యమగు ఆత్మతో ఏకత్వమును ప్రస్ఫుటించుకొన్నారు. ఆసనమునుండి లేచి సర్వతత్త్వ స్వరూపుడగు ఈశ్వరునకు ప్రణిపాత సాష్టాంగ నమస్కారము సమర్పించారు. సర్వ పరిగ్రహణములను అప్పటికప్పుడే త్యజించివేసారు. అభిమానములన్నీ వదలివేసారు. (పరబ్రహ్మనంద) సాగర జలంలో పడవపై వెళ్ళువారు లాగా అక్కడినుండి పరివ్రాజకుడై బయల్వెడలారు.

---

**ప్రవ్రజతం తమ్ ఆలోక్య**
**కృష్ణ ద్వైపాయనో మునిః,**
**అనువ్రజన్ నా జుహావ**
**పుత్ర, విశ్లేష కాతరః।**
**ప్రతినేదుః తదా సర్వే**
**జగత్ స్థావర జంగమమ్॥**

అప్పటికప్పుడే సన్న్యసించి నడచి వెళ్ళుచున్న పరమ వైరాగ్యమూర్తియగు కుమారుడు శుకునిచూచి వ్యాసమహర్షి వేదన చెందినవారై "పుత్రా! ఓ కుమారా! ఓ కుమారా!" అని ఎలుగెత్తి పిలువసాగారు.

అప్పుడు సర్వ స్థావర-జంగమములు "ఓయ్" అని బదులు పలికాయి.

---

**తత్ శృత్వా సకలాకారం**
**వ్యాసః సత్యవతీ సుతః,**
**పుత్రేణ సహితః ప్రీత్యా**
**పరానందమ్ ఉపేయివాన్॥**

అప్పుడు సత్యవతీ పుత్రుడగు వేదవ్యాస మహర్షి

**"ఆహా! ఇప్పుడు నా కుమారుడు సర్వాత్మకుడు, అఖండాత్ముడు, కేవలుడు అయి వెలుగొందుచున్నాడు కదా! ఎంతటి సంతోషకరమైన విషయము!"**

అని పరమానందము పొందారు.

---

**యో రహస్యోపనిషదమ్**
**అధీతే గురు-అనుగ్రహాత్,**
**సర్వ పాప వినిర్ముక్తః।**
**సాక్షాత్ కైవల్యమ్ అశ్నుతే।**
**సాక్షాత్ కైవల్యమ్ అశ్నుత- ఇతి॥ ఉపనిషత్॥**

***<u>ఇతి కృష్ణ యజుర్వేదాంతర్గత శుకరహస్యోపనిషత్</u>***
***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః।</u>***

## <u>ఫలశ్రుతి</u>

ఎవ్వరు ఈ రహస్యోపనిషత్‌ను గురు అనుగ్రహం పొంది అధ్యయనము చేస్తాడో అట్టివాడు సర్వ దోషములనుండి వినిర్ముక్తుడై సాక్షాత్ కైవల్యమును పొందుచున్నాడు. ముమ్మాటికీ కైవల్యమును సిద్ధించుకొన గలడు.

***<u>ఇతి శుక రహస్యోపనిషత్</u>***
***<u>ఓం! శాంతిః। శాంతిః। శాంతిః।</u>***

**కృష్ణ యజుర్వేదాంతర్గత**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 26 శుక రహస్యోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



'ఓంకార' ప్రణవస్వరూపుడగు పరమాత్మకు నమస్కరిస్తూ, ఇప్పుడు మనము **'రహస్యోపనిషత్'** విశేషములను వ్యాఖ్యానించుకుంటున్నాము.

నారదమహర్షి మొదలైన దేవర్షులు, మహర్షులు, మునిజనులు కొందరు బ్రహ్మలోకమునకు వచ్చారు. సృష్టికర్త, సర్వాత్మకుడు అగు చతుర్ముఖ బ్రహ్మను దర్శించారు. ప్రణిపాతులై ఈ విధంగా అభ్యర్థనము చేయసాగారు.

***భగవన్! మాకు 'రహస్యోపనిషత్' అని మునిజనులుచే సంభాషించుకోబడే 'రహస్యోపనిషత్' హృదయమును దయతో వివరించండి.***

**చతుర్ముఖ బ్రహ్మ :** అస్మత్ మానసపుత్రులగు నారద, సనక, సనందనాది మునివరులారా! సమస్త దేవర్షి, మహర్షి, మునివరేణ్యులారా! ఈ రహస్యోపనిషత్ గురించి ఒక సందర్భంలో పరమ శివ భగవానుడు ప్రవచించటం జరిగింది. ఆ విషయం మనం ఇప్పుడు సంభాషించుకుందాము. మీరందరూ శ్రద్ధగా వినండి.

---

## శుకమహర్షి – జన్మ వృత్తాంతం

***(దేవీ భాగవతము)***

**శ్రీ వేదవ్యాసుడు।** శ్రీ వసిష్ఠ మహర్షి వంశజుడు। పరాశరాత్మజుడు। (మత్స్యగంధి, యోజనగంధి నామధేయి అగు) సత్యవతీ పుత్రుడు। సద్యోగర్భజనితుడు।

### వారే కృష్ణద్వైపాయనుడు!

చుట్టూ నీరు ఉన్నచోట (ద్వీపము) నందు (పరాశర – సత్యవతులకు సద్యోజాతుడై) జన్మించారు కాబట్టి **ద్వైపాయనుడు.** నల్లగా ఉంటారు కాబట్టి 'కృష్ణ'. ఈ విధంగా కృష్ణద్వైపాయన నామ లోక ప్రసిద్ధులు. శ్రీవిష్ణు భగవాన్ అవతారులు.

### ఆయనయే వేదవ్యాసులు

వేదములను ఋక్ – యజుర్ – సామ – అథర్వణములుగా విభజించారు. ఇంకా 1180 శాఖలుగా విభజించి, 1180 ఉపనిషత్తులు ప్రక్షిప్తం చేసినవారు. సుమంత, జైమిని, పైల, వైశంపాయన, అసిత, దేవలుడు మొదలైనవారు వ్యాసశిష్యులు. 1180 ఉపనిషత్తులలో మరల వ్యాసుల వారే **108 ఉపనిషత్తులు** అతి ముఖ్యమైనవిగా ప్రవచనం చేసారు. ఇంకా కూడా, కలియుగంలో మోక్షప్రాప్తికై జనులకు మార్గమును చూపి వేద, పురాణ, ఇతిహాస, ఉప పురాణములు ప్రసాదించిన మార్గదర్శి. ఆయన ఆవిధంగా లోకాలకు ప్రాతఃస్మరణీయులు అయ్యారు. ఉపనిషత్ వాఙ్మయములోని శబ్దములను నిర్వచిస్తూ **'బ్రహ్మసూత్రములు'** ప్రసాదించారు. మహాభారతంలో మధ్యగా యుద్ధపర్వములో 'ఉపనిషత్' సారముగా శ్రీకృష్ణార్జున సంవాదరూపము 'శ్రీమద్భగవద్గీత'ను '700' శ్లోకములలో అందించారు. ఈవిధంగా ప్రాతః స్మరణీయులు. నమస్కరించినంత మాత్రంచేత జ్ఞాన ప్రదాత.

అట్టి వేదవ్యాసమహర్షి ఒకానొక రోజు యజ్ఞ నిర్వహణకై అరణిలో (యజ్ఞము కొరకు నిప్పు పుట్టించే కొయ్యలో) అగ్ని కొరకై మథనము చేస్తూ యాదృచ్ఛికంగా ఆకాశంలోకి దృష్టి సారించారు. ఆ సమయంలో ఆకాశంలో విహరిస్తున్న 'ఘృతాచి' అనే అప్సరస ఆ మహర్షికి కనిపించింది. విధివశంగా, ఘృతాచిని చూచిన వ్యాసమహర్షి హృదయమంతా కామావేశముతో నిండిపోయింది. అది గమనించి, ఘృతాచి అప్సరసాధర్మంగా మహర్షిని ఆనందింపజేసే యత్నంలో సమీపించసాగింది. తనను సమీపిస్తున్న ఘృతాచి సౌందర్యమునకు పరవశుడై వ్యాసమహర్షి మరింత కామావేశము పొందసాగారు. అప్పుడు వ్యాసులవారు తన అంతరమున ఈవిధముగా ఆలోచించ సాగారు.

**శ్రీ వ్యాస మహర్షి (తనలో):** 'ఇదేమిటి? ఈ కామ వికారము నన్ను ఆవహిస్తున్న దేమిటి?

ఒకప్పుడు ఊర్వసి పురూరవ చక్రవర్తులు కామమోహితులై కొంతకాలం దంపతులైనారు.

పురూరవుడు చక్రవర్తిగా వంశపారంపర్యములైనట్టి యజ్ఞ – రాజ ధర్మాలన్నీ విడచిపెట్ట ఊర్వశీ సాంగత్యంలో ఉండిపోయారు.

ఆ తరువాత కొంతకాలానికి ఇంద్రుని ఆజ్ఞానుసారం ఊర్వసి పురూరవుని విడచి స్వర్గమునకు వెళ్ళవలసి వచ్చింది.

అప్పుడైనా ఆయన చక్రవర్తి ధర్మము స్వీకరించాడా? లేదు. కామమోహితుడై, విలపిస్తూ దేశదేశాలు తిరుగాడసాగారు.

కురుక్షేత్రంలో ఊర్వశి పురూవ చక్రవర్తికి దర్శనమిచ్చి, – **'ఇంత అమాయకుడివేమయ్యా! మేము దేవదాసీలము. ఏ ఒక్కరికి చెందినవారము కాదు. మమ్ములను విశ్వసించి నీ స్వధర్మములన్నీ విడచిపెట్టమని ఎవరు చెప్పారు? వెళ్లండి. నన్ను మరచిపొండి. జన్మయొక్క సార్ధకతకై, మోక్షమార్గమును అనుసరించండి'** – అని బోధించింది.

ఇప్పుడు నేను ఈ ఘృతాచిని చూచి కామమోహితుడను అయి 'కామము' యొక్క వలలో పడటమంటే, పతనమేకదా!

– అని ఊర్వసి – పురూరవుల సంఘటను శ్రీ వ్యాసమహర్షి తలచుకొన్నారు. ఘృతాచి దైవప్రేరణచే కామమోహిత అయి వ్యాసులవారిని ఇంకా ఇంకా సమీపించసాగింది. వ్యాసులవారు మరింత కామ వికారం పొందసాగారు. అయితే ఘృతాచి మాత్రం, **"ఈ మహాతపశ్శాలి శపిస్తే నాగతి ఏమిటి? దుర్గతియే కదా!"**....అని భయపడసాగింది. వెంటనే వ్యాసమహర్షి దృష్టిని మరల్చడానికి 'చిలుక'గా మారి అక్కడే సంచరించసాగింది. వ్యాసమహర్షి ఘృతాచి యొక్క అప్సరసా సౌందర్యమును గుర్తు చేసుకొంటూ ఆ చిలుకను కామావేశముతో చూస్తూ ఉండసాగారు. ఆయన సర్వాంగాలు కామవశమైనాయి. గొప్ప ధైర్యంతో చిక్కబట్టుకున్నప్పటికీ ఆయన తనను తాను నిలువరించుకోలేకపోయారు. హృదయమంతా **"ఘృతాచీ'! ఘృతాచీ"!** అను పేరు ప్రతిధ్వనించసాగింది. అప్పుడు అగ్ని మథనపు వేగము పెరిగింది.

***వీర్య స్కలనలం అయింది. అరణి (కొయ్య)లో పడింది. చిలకడం కొనసాగింది.***

ఆ అరణిలోంచి ఒక మగబిడ్డ జనించాడు. 'ఎందుకిలా జరిగింది?'....అని కొద్ది క్షణములు యోచించారు. అంతకుముందు **"నీకు నిర్వికల్ప సమాధి నిష్ఠుడు, మహాప్రాజ్ఞుడు, లోక కళ్యాణమూర్తి యగు పుత్రుడు కలుగుతాడు"**– అని పరమశివుని వరం ఇవ్వటము అప్పుడు జ్ఞాపకమొచ్చింది. ఆ అరణిలో జన్మించిన పిల్లవాడు అచ్చు వ్యాసుని రూపురేఖలే కలిగి ఉన్నాడు. **'ఆహా! అరణీగర్భ సంభూతుడు, మహా తేజస్వి అగు పుత్రుడు నాకు కలిగాడు కదా!'**....అని వ్యాసులవారు ఎంతో సంతోషించారు.

అప్పుడు ఆ పిల్లవానిని మహర్షి గంగాజలంలో స్నానం చేయించారు. వెంటనే జాతక కర్మలు నిర్వర్తించారు.

- ఆకాశం నుండి పుష్పవృష్టి కురిసింది.
- దేవతలు దుందుభులు మ్రోగించారు.
- గంధర్వులు వేంచేసి ఆ ప్రదేశంలో తంత్రీ కొడుకులను స్తుతిస్తూ గానం చేశారు.

ఘృతాచి చిలుక రూపము దాల్చిన సంఘటన చేత ఆ పిల్లవానికి **'శుకుడు'** అని పేరు పెట్టబడింది.

ఆ పిల్లవాడి తపస్సు కొరకై ఆకాశము నుండి దండ కమండలువులు, కృష్ణా జినము (జింక చర్మము) ఆవిర్భవించాయి.

***ఈ ఈ విశేషాలు 'దేవీ భాగవతము' నుండి మనము చెప్పుకుంటున్నాము. ఇక మనము తిరిగి రహస్యోపనిషత్‌లో ప్రవేశిస్తున్నాము.***

పురాణ ప్రవక్త, మహాతేజోసంపన్నులు, సర్వవేద తపోనిధి అగు మహర్షివేద వ్యాసులవారు ఒక సమయంలో ప్రియపుత్రుడగు శుకునికి వేదసంస్కార కర్మయగు **'ఉపనయనము'**ను (బ్రహ్మోపదేశ సంస్కారము అని కూడా అంటారు) – జరిపించదలచారు. అందు నిమిత్తమై కైలాసానికి వెళ్లి పరమశివుని దర్శించి, ఇట్లు ప్రార్థన చేయసాగారు.

**శ్రీ వేదవ్యాసమహర్షి :** దేవతలకు **కూడా** దైవము అయినట్టి ఓ దేవదేవా! మహాదేవా! దేవతలకంటే మునుముందే ఉన్న దేవాది దేవా! మహాప్రాజ్ఞా! జీవుల సంసార పాశములను, వారు నమస్కరించినంత మాత్రం చేతనే – ఛేదించి వేయుట యందు దృఢవ్రతులైన స్వామీ! మీరు జగద్గురువులు. నా ప్రియకుమారుడగు చిరంజీవి శుకునికి వేదసంస్కార కర్మ అయినట్టి **'బ్రహ్మోపదేశము'** అనబడు **'ఉపనయన సంస్కారము'**నకు సమయము ఆసన్నమైనది. **లోక శుభంకరులగు మీ చేతనే నా కుమారునికి బ్రహ్మోపదేశము చేయబడటానికై అభ్యర్థన చేస్తున్నాను"** – అని విన్నపము సమర్పించుకొనుచున్నారు. **"దయతో అనుగ్రహించండి"** – అని ప్రార్థించారు.

**ఈశ్వరుడు :** నాయనా! వ్యాసమహర్షీ! నీ అభ్యర్థనను నేను నిరభ్యంతరంగా అంగీకరిస్తున్నాను. అయితే, దాని పర్యవసానము గురించి తెలుసుకదా? నాచే బ్రహ్మోపదేశము పొందటం చేత నీ కుమారుడు చిరంజీవి శుకుడు సర్వ సంసార వేదనలను మొదలంట్లా త్యజించినవాడు కాగలడు.

**'కేవలీ స్వరూపసిద్ధి'** అనే కైవల్యమును సిద్ధించుకోగలడు. నశ్వరములైన వాటినన్నిటినీ దాటివేసి సాక్షాత్ పరబ్రహ్మత్వమును పుణికి పుచ్చుకోగలడు.

అప్పుడేమి కానున్నది? **'తండ్రీ కొడుకుల అనుబంధము'** మొదలైన సంసారబంధములన్నీ పాము కుబుసము వలే త్యజించివేసి, నీ కుమారుడు సర్వాత్మత్వమునందు సునిశ్చితుడు, సుస్థితుడు అయి వెలుగొందగలడు. అందుకు నీవు సంసిద్ధుడవేనా? నీకు ఇష్టమేనా మరి?

**శ్రీ వేదవ్యాసుడు :** అట్లాగా స్వామీ? ఈ ఉపనయన సమయంలో తమ ప్రసాదముచే నా కుమారుడగు శుకుడు బ్రహ్మోపదేశము పొందినవాడై సాక్షాత్ బ్రహ్మమే స్వరూపముగా పొందినవాడైతే, నాకు అంతకన్నా కావలసినది ఏముంటుంది? అటుపై ఏది ఎట్లా పరిణమించి ఉండబోయినప్పటికీ, నాకు సంతోషమే. హే మహేశ్వరా!

- మీ బోధ విన్న తర్వాత దృశ్య–దేహ–జీవ–ఈశ్వర–పరబ్రహ్మ తత్త్వములను ఎరుగుటచే **'సర్వజ్ఞుడు'**గా అవటము,
- తమ ప్రసాదముచే **'సారూప్య – సాలోక్య – సామీప్య – సాయుజ్య'** – **'చతుర్విధ ముక్తి'ని పొందినవాడవటము,**
- బ్రహ్మజ్ఞానము పొంది, బ్రహ్మవేత్త అయి, **స్వయంప్రకాశకమైనట్టి స్వయం పరబ్రహ్మమై** వెలుగొందటము... **ఇవన్నీ నాకు ఇష్టమే.**

నన్ను విడచి వెళ్ళినా నాకు సమ్మతమే! కనుక మీరు వేంచేసి ఉపనయన సంస్కార సందర్భములో నా కుమారునకు బ్రహ్మోపదేశమును అనుగ్రహించుటకై హృదయపూర్వక సుస్వాగతము పలుకుచున్నాను'. తండ్రీ! దయా సాగరా! అనుగ్రహించండి!

**వ్యాసమహర్షి చెప్పిన పలుకులు విని భగవానుడు సాంబశివులవారు ఎంతో సంతోషించారు.**

❖

- సదాశివులవారు (ఉపదేష్టగా – బోధకుడై దివ్యాసనమున) గురుస్థానంలో ఎత్తైనచోట ఉపవిష్టులైనారు.
- శుకుడు బ్రహ్మతత్త్వోపాసకుడై, బోధితుడై విద్యార్థి స్థానములో ఆశీనుడైనాడు.
- తదితర బ్రహ్మోపాసకులగు శ్రోతలు, దేవర్షులు, దేవతలు, భక్తులు మొదలైనవారు ఉచిత స్థానములను అలంకరించారు. బ్రహ్మర్షులు, దేవర్షులు, గురుస్థానము అలంకరించిన మహనీయులు మొ॥వారు ఎందరో అక్కడ సమావేశమైనారు.

**పరబ్రహ్మోపాసనము, బ్రహ్మోపదేశము, ఉపనయన అంతరార్థము, ద్విజత్వము, సంసారము, బంధమోక్షములు** మొ॥న వాటి గురించి స్వామి ప్రవచించిన విశేషములను శ్రద్ధగా విని శుకుడు, తదితర శ్రోతలు లక్ష్యశుద్ధిని పొందుచూ **'ఓం'కార ప్రణవ అంతరార్థమును** గ్రహించినవారై ఆత్మ సంతృప్తులు కాసాగారు.

అప్పుడు శుకుడు లేచి, నిలుచుని, ముకుళిత హస్తములతో భక్తి ప్రపన్నమనోవిలాసుడై స్వామిని సమీపించారు. త్రిప్రదక్షిణములు చేసి, సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించారు. మరల ఆ శుకుడు సాంబశివస్వామికి ప్రణతి పూర్వకంగా ఇట్లు విన్నవించుకోసాగారు.

**శ్రీశుకుడు :** హే ఆత్మానంద స్వరూపా! సర్వజ్ఞా! సచ్చిదానంద రూపా! ఉమారమణా! భూతేశా! హే కరుణానిధే! ప్రసీద! నా పట్ల ప్రసన్నుడవయ్యెదరు గాక స్వామీ!

- ప్రణవస్వరూపము
- ప్రణవ – వాచ్యార్థమగు పరబ్రహ్మము
- **'తత్త్వమ్ అసి', 'ప్రజ్ఞానం బ్రహ్మ'** మొదలైన మహావాక్యముల అంతరార్థము...

ఇవన్నీ సవివరంగా, దృష్టాంత, విశ్లేషణ పూర్వకంగా, ఛిన్న – సంశయంగా విశదీకరించారు. చాలా కృతజ్ఞుడను. నా వంటి అల్పజ్ఞుడిని విజ్ఞుడిగా తీర్చిదిద్దిన మీ వివరణములు ఔన్నత్యమును మాటలలో వర్ణించలేను. కృతజ్ఞతలు తెలుపుకోవటానికి నా ఈ దేహ – మనో – బుద్ధి – చిత్త – అహంకారములు ఏమాత్రము సరిపోవు. **చేతులెత్తి మీకు నమస్కరిస్తున్నాను. శంభో! లోకగురో! నమో నమో నమో నమః॥**

**శివభగవానుడు :** బిడ్డా! శుకా! శ్రద్ధాళుడవై విన్నావు. నాకు ఆనందము కలిగించావు. ఇంకేమైనా తెలుసుకోవాలని అనుకుంటున్నావా? నిరభ్యంతరంగా అడుగవచ్చునయ్యా!

**శ్రీ శుకుడు : శ్రోతుమ్ ఇచ్ఛామి తత్త్వేన షడంగాని యథాక్రమమ్!** హే సదాశివా! మహావాక్యముల గురించి మరికొంత వినటానికి కుతూహలుడనై ఉన్నాను. మహావాక్యముల షడంగములు [షట్(6) అంగములు] వాటి వాటి రహస్యములను – రహస్యార్థములను ఎరిగిన మహామహనీయులుగా మిమ్ములను వేదవేదాంగములు సన్నుతిస్తూ ఉంటాయి. అట్టి మహావాక్య షడంగముల గురించి విశదీకరించవలసినదిగా నా విన్నపము.

**శ్రీ సదాశివుడు :** బిడ్డా! జ్ఞాన నిధీ! మునీశ్వరా! మహాప్రాజ్ఞా! శుకా! నీవు అడిగిన ప్రశ్న సాధవులచే మెచ్చుకోబడేది. సముచితము. **సమస్త వేదములలో మర్మగర్భితమైయున్నట్టి రహస్యము.** అందరూ తెలుసుకోవలసినది. సకల ఉపనిషత్ రహస్యమగు విషయమును ఇప్పుడు షడంగములతో కూర్చి చెప్పుచున్నాను. ఇది తెలుసుకొన్నంత మాత్రం చేతనే సాక్షాత్ ముక్తి (లేక) సద్యోముక్తి లభించగలదు. (క్రమముక్తి కన్నా స్వాభావికమైనది పొందబడగలదు). సాక్షాత్ మోక్షము పొందగలదు. ఇందులో సందేహమే లేదు. మహావాక్యములను బోధించేటప్పుడు సద్గురువు – శిష్యునికి వాటిని షడంగములతో జేర్చి మాత్రమే ఉపదేశించాలి–అనేది వేదహృదయము. అప్పుడే మహావాక్యబోధ సంపూర్ణమౌతుంది. ఏమంత్రమైనా కూడా **గురువు** షడంగములతో ఉపదేశిస్తేనే, **శిష్యుడు** షడంగములతో ఉపాసిస్తేనే పూర్ణమగు ప్రయోజనం. త్వరగాను, నిండుగాను ఫలము లభిస్తుంది. ఇది చతుర్వేదముల, వేదశిరస్సులగు ఉపనిషత్తుల ప్రవచనము కూడా!

**షడంగములు :** (1) ఋషి, (2) ఛందస్సు (3) దేవత (4) బీజము (5) శక్తి (6) కీలకము

షడంగ పూర్వక మహావాక్యోపాస చెప్పుచుండటం చేత ఈ రహస్యోపనిషత్తు సర్వ ఉపనిషత్తుల శిరస్సు వంటిదిగా చెప్పబడుచున్నది.

**హే విపశ్చిత్! (విశేషేణ పశ్చిత్) ప్రాజ్ఞుడా! సత్యద్రష్టా!** ఈ రహస్యోపనిషత్ సూచించు షడంగ ధ్యాన – ఉపాసనా మార్గంగా మహావాక్యోపాసన – ప్రతిపాదకమగు బ్రహ్మతత్త్వమును ఎరిగి, అనుక్షణిక భావనాసిద్ధి పొందుచున్నాడో, అట్టి వానికి ఇక వేరే తీర్థయాత్రలతోను, మంత్రోపాసనా విధులతోను, వేదపఠణములతోను, జప తప హోమములతోను క్రొత్తగా వచ్చే పుణ్యమేముంటుంది? బ్రహ్మమును – **ఆత్మాఽహమ్** గా ఎరిగిన వానికి బాహ్యవస్తువులతో నిర్వహించే పుణ్యఫలములతో పని ఏమి? ఆత్మ గురించిన వాక్యార్థములు (దృశ్యము, దేహము, ఇంద్రియములు, ఇంద్రియార్థములు, మనస్సు,బుద్ధి, చిత్తము, అహంకారము, జాగ్రత్, స్వప్నము, సుషుప్తి...ఇటువంటి వాక్యార్థములను) ఎరుగుచుండగా ఏ అంతిమ ప్రయోజనం (లేక) ఫలము (The state of one's own self) లభిస్తుందో, అదంతా కూడా....

→ **ఏకవార జపేనైవ ఋష్యాది ధ్యానతశ్చ యత్,**
**"ఋషి, ఛందో, దేవతా, బీజం, శక్తి", కీలకమ్॥**

షడంగ పూర్వకంగా ఆత్మను ధ్యానం చేస్తూ (ధ్యాస అంతా **"సర్వము ఆత్మమయము"** అను స్థానమునందు నిలుపుతూ) 'మహావాక్య జపము'ను రోజుకు ఒక్కసారి చేయుట చేతనే అతి త్వరగా సిద్ధి **లభించగలదు.**

క్రమంగా ధ్యాసతో కూడిన నిరంతరాభ్యాసికి కలుగు ప్రయోజనము వర్ణనాతీతము. **'శివోఽహమ్'** స్వాభావికము అగుచున్నది.

# బ్రహ్మము - మహావాక్యమంత్రములు

**I. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ!**

బ్రహ్మము ప్రతి జీవునియందు '3' ముఖ్య లక్షణములతో ప్రదర్శితమై యున్నది.

(i) **సత్యమ్ బ్రహ్మ :** యమ్ సత్! 'నేను ఉన్నాను. (I am Present) - అను **"మూల 'సత్' తత్త్వము"**. ఈ జీవుడు ఉనికి కలిగి యుండి జాగ్రత్ స్వప్న సుషుప్తులను భావన చేసి, వాటికి "ఉన్నవి" అను 'సత్'ను తోడుగా చేసి రూపము కలిగిస్తున్నాడు. రచయితను ఆశ్రయించి రచనలు, రచనలలోని పరస్పర వ్యక్తి ఉండుతీరుగా, జాగ్రత్ స్వప్న సుషుప్తులు, జన్మ జన్మాంతరములు - ఇవన్నీ కూడా జీవుని 'కేవల సత్' (The Absolute Quality of) ను ఆశ్రయించి ఉన్నాయి. **బ్రహ్మము కేవల సత్ స్వరూపమై యుండుటచే సత్-అనునది బ్రహ్మమే అయి ఉన్నది. ఈ కనబడేదంతా 'సత్' యొక్క ప్రదర్శనమే! సత్‌యే మూలాధారముగా కలిగియున్నది. అయితే సత్ సర్వదా యథాతథము.** అనగా, ఈ జీవుడు 'సత్'గా సర్వదా యథాతథుడు. ఎప్పటికీ **'ఉనికి'** కలిగి ఉండునట్టివాడు.

**(2) 'జ్ఞానమ్' బ్రహ్మ :** తెలుసుకునేవాడుంటేనే కదా 'తెలియబడేది' అనునది ఉంటుంది! స్వప్నములో తెలుసుకొనేవాడే (one who is knowing) - "తెలియబడేదంతా (As that being known)" స్వయంగా **ధారణ చేసి**, ఎప్పటికప్పుడు పొందుచున్నాడు కదా! జాగ్రత్ కూడా ద్రష్టయొక్క స్వయం ధారణా స్వరూపమే। **ద్రష్టకు దృశ్యము అన్యము కాదు. అన్యులచే నిర్మితము కాదు.**

**'తెలుసుకొనుచున్నవాడు'+'తెలియబడేది'** కలిపి జ్ఞానము. **ఈ దృశ్యమంతా ఆత్మయొక్క చిదానంద (లేక) జ్ఞానానంద స్వరూపమే। బ్రహ్మమే। అదియే చిత్। ఈ 'జగత్తు' అనబడేదంతా సత్‌స్వరూపాత్మయొక్క చిదానంద సంప్రదర్శనమే।**

**(3) అనన్తమ్ బ్రహ్మ :** ఈ జీవుడు దేహము, ఆలోచన, బుద్ధి, చిత్తము, అహంకారము, త్రిగుణములు మొదలైనవాటితో కూడుకొని ఉండవచ్చునుగాక! కాని తాను స్వయముగా బ్రహ్మస్వరూపుడవటంచేత, ఆత్మగా వాటి వేటిచేత కూడా పరిమితుడు కాడు. కనుక **బ్రహ్మము అనన్తమ్।** తాను బ్రహ్మమే। **ఈ జీవుడు సదాశివ బ్రహ్మమే।**

**II. నిత్యానందమ్ బ్రహ్మ :** బ్రహ్మముచే జీవాత్మ - జగత్తులుగా పొందబడుచున్నదంతా స్వయం - అనుభూతి స్వరూపమే। కల్పనానంద చమత్కృతియే। స్వస్వరూపమగు ఆత్మ నిత్యానందమైయున్నది. అట్టి ఆనందము యొక్క కించిత్ బాహ్య-రూపంగా ఈ దృశ్య జగత్-దేహ - ఇంద్రియ - మనో - బుద్ధి - చిత్త - అహంకారములుగా బయల్వెడలి, ఆనందమునందే లయిస్తున్నాయి.

**III. నిత్యానందమయో బ్రహ్మ : ఆనందమయో బ్రహ్మ।** బ్రహ్మము నిత్యానందముతో మయమై ఉన్నది. అద్దాని ఆనందస్ఫురణా విశేషాలే లోక-లోకాంతరములు, వాటియందు సంచారములు కూడా।

**IV. యోవై భూమాధిపతి :** ఎద్దానికి అన్యమైనదంతా **"అద్దాని వైభవము, అద్దాని భౌమాధిపత్యమునకు చెందినదే"** అయి ఉన్నదో... అదియే బ్రహ్మము. బ్రహ్మమే 'జీవుడు' అను స్వకీయ సంపదావిశేషమును కల్పించుకొని, స్వానుభవ విశేషమగు జగత్‌ను (మార్పుచెందే, జనించి-గతించే, క్షరధర్మముగల విశేషమును) కల్పన చేసుకొనుచున్నది. **బ్రహ్మముయొక్క వైభవమే ఈ కనబడేదంతా కూడా।**

**V. ఏకమేవాద్వితీయం బ్రహ్మ :** ఈ జీవుని నిత్యసత్యరూపమగు బ్రహ్మమునకు ద్వితీయము లేదు. జీవునితో సహా ఈ సమస్తము సర్వదా ఏకమే అయి ఉన్నది. దర్పణంలో కనిపించే వేరు వేరు వస్తువులన్నీ, దర్పణముయొక్క ప్రతిబింబ విశేష ఏక - అద్వితీయ రూపమే కదా! అట్లాగే **'జీవాత్మ, జగత్తు మొదలైనవన్నీ బ్రహ్మము' అనే దర్పణాంతర్గత ప్రతిబింబిత విశేషము మాత్రమే.** కనుక, బ్రహ్మము ***ఏకము। అద్వితీయము కూడా।***

## ప్రథమ షడంగన్యాసము - "తత్" పదము - "తత్" పురుషాయ

**అస్య శ్రీ మహావాక్యమంత్రస్య।**

(1) ఋషి = హంస (సోఽహమ్)

(2) ఛందస్సు = అవ్యక్త గాయత్రి. ఏది సర్వమును 'వ్యక్తీకరించటము' అను గానమును ప్రదర్శిస్తూ ఉన్నదో, తాను అవ్యక్తమైయున్నదో అదియే అవ్యక్త గాయత్రీ' ఛందస్సు.

(3) దేవత = పరమహంస। సోఽహమ్ పరమమ్। ఆ పరమమే 'నేను' సర్వదా అయి ఉన్నాను।

(4) బీజము = హంసలోని 'హం' 'నేను' అను జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు తనవైన నేను **(నాలోని నేనైన నేను)**
హంసలోని సః = తత్ **(అందరిలోని నేనైన నేను)**

(5) శక్తి = 'అన్యము'గా ప్రదర్శనా చమత్కృతి.

(6) కీలకము – సోఽహమ్...ఈ దేహములో స్ఫురించే 'నేను' యే **'అందరిలోని నేనైన నేను'.**

**మమ పరమహంస ప్రీత్యర్థే, మహావాక్య జపే వినియోగః॥**

నాయొక్క నాలోని సర్వాంతర్యామి, సర్వమునకు పరమైన – పరమహంస ప్రీతికొరకు పై 'ఋషి – దేవత – బీజము – శక్తి – కీలకము'లను – షడంగములుగా అభ్యసిస్తూ ఉపాసన స్వీకరించాలి.

| | **కరన్యాసమ్** | **అంగన్యాసమ్** |
|---|---|---|
| **సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ** | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః। |
| **నిత్యానందో బ్రహ్మ** | తర్జనీభ్యాగ్ం స్వాహా | శిరసే స్వాహా। |
| **నిత్యానందమయం బ్రహ్మ** | మధ్యమాభ్యాం వషట్ | శిఖాయ వషట్। |
| **యోవై భూమా** | అనామికాభ్యాం హుం | కవచాయ హుం। |
| **యోవై భూమాధిపతిః** | కనిష్ఠికాభ్యాం వౌషట్। | నేత్రత్రయాయ వౌషట్। |
| **ఏకమ్‌వాద్వితీయం బ్రహ్మ** | కరతల కరపృష్ఠాభ్యాం ఫట్। | అస్త్రాయ ఫట్। |

**భూర్భువస్సువరోమ్** (భూ భూవర్ సువర్ లోకములను, త్రిలోకాంతర సర్వవిశేషములను) మమాత్మానంద స్వరూపంగా 'దిగ్బంధనము' చేయుచున్నాను. **మమాత్మానంద స్వరూపే ఇతి దగ్బంధః॥**

**శ్లో॥ నిత్యానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం,**
**విశ్వాతీతం గగన సదృశం "తత్త్వమసి" – ఆది లక్ష్యం,**
**ఏకం నిత్యం విమలం అచలం సర్వ 'ధీ' సాక్షిభూతం,**
**భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం 'తత్' నమామి॥ (తన్నమామి)॥**

**తత్ గురుః। ఆత్మయేవ హి గురుః।** నిత్యానంద స్వరూపుడు, పరమ (సమస్తమునకు ఆవలగల కేవల స్వరూప) సుఖప్రదాత, జగత్తుగా మూర్తీభవిస్తూ ఉన్న కేవలజ్ఞాన స్వరూపుడు, ఈ సమస్త విశ్వమునకు అతీతుడు, **"తత్ త్వమేవ – అదియే నీవు"** – మొదలైన మహావాక్యముల నిరూపణయే లక్ష్యముగా కలవాడు, ఏకము అయినవాడు (అనేకముగా కానివాడు), నిత్యుడు, మలరహితుడు, అచలుడు, సమస్త జీవుల బుద్ధికి 'సాక్షి' అయినట్టివాడు, భావములకు మునుముందే ఉన్నవాడు, త్రిగుణములకు సంబంధించనివాడు అగు **"ఆత్మ గురువు"**కు నమస్కారము.

## చత్వారి (4) మహావాక్యములు

ఇప్పుడు...చత్వారి (4) మహావాక్యాని.....

**(1) ఓం ప్రజ్ఞానం బ్రహ్మ :** ఏ తెలివిచే జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు, జన్మ – జన్మాంతరములు, తదితర త్రిలోక జీవులు తెలియబడటం జరుగుతుందో....అట్టి 'ప్రజ్ఞ'యే బ్రహ్మము. ప్రజ్ఞానమ్ = తెలుసుకొనేది + తెలియబడేది. **అట్టి ప్రజ్ఞానము బ్రహ్మము!** (జ్ఞ = తెలియబడటము, ప్రజ్ఞ = తెలివి, కేవలమగు ఎరుక)

**(2) ఓం అహం బ్రహ్మాస్మి :** ఏ 'నేను' అనునది దృశ్యమును, దేహమును, జాగ్రత్ – స్వప్న – సుషుప్తులను, తదితర అన్యమైనదానినంతటినీ చూస్తూ ఉన్నదో, పొందుతూ ఉన్నదో, నాలోను – సర్వులలోనూ వేంచేసి సర్వమునకు వేరై ఉన్నదో, **అట్టి నేనైన నేనే బ్రహ్మము.** 'నేను' అను దానిని తదితరమైన దృశ్యవ్యవహారము – అంతటికీ వేరుగా చేసి చూస్తే, అట్టి "కేవల నేనే (Absolute)" బ్రహ్మము!

**(3) తత్ త్వమ్ అసి :** 'నీవు' అనునది దేహభేదములతో, త్రిగుణభేదములతో, పంచభూతాత్మికమై, వ్యష్టిగత మనోబుద్ధి చిత్త అహంకార భేదములతో కనిపిస్తోంది. అయితే అవన్నీ కూడా 'నీవు'కు అన్యమైన 'నీవి' గాని, **'నీవు' కావు.** అట్టి తదితరమైనవన్నీ నా దృష్టి నుండి ప్రక్కకు పెట్టి చూస్తే ఏ **'నీవు'** శేషిస్తోందో...అది బ్రహ్మమే! **అదియే బ్రహ్మము!** అనేకములగు 'నీవు'లుగా కనిపిస్తున్నదంతా – అగ్ని, వాయువు,జలము, మొదలైనవి అనేకచోట్ల కనిపిస్తూ ఏకమే అయిన తీరుగా – **ఏకము, అక్షరమున అగు బ్రహ్మమే!**

ఈవిధంగా, **తత్ త్వమ్ అసి!** నీవు బ్రహ్మమే అయి ఉన్నావు. అనేకముగా కనిపిస్తూ **ఏకమే అయి ఉన్న సత్ చిత్ ఆనంద బ్రహ్మమే నీవు!** – ఇట్టి దైనందిక – అనుక్షణిక దర్శనమే ('నీవు' ను బ్రహ్మముగా భావించటమే) **తత్త్వ విద్య.**

ఒక 'నీవు' నకు మరొక 'నీవు'నకు కనిపించే భేదమంతా మనోకల్పితము మాత్రమే. అదియే **'సంసారము'.**

**(4) అయమాత్మా బ్రహ్మ :** ఒక నాటకంలో పాత్రగా (As a role in a drama) నటిస్తూ కనిపిస్తున్నది నటుడేకదా! నటుడు వేరేచోట, పాత్రధారుడు (జరుగుచున్న) నాటకంలోను ఉన్నారా? లేదు. 'పాత్రధారుడు + పాత్రధారణ' ఈ రెండు "తత్‌బ్రహ్మము + జీవుడు" లతో అన్వయ–సమమైనట్టివే!

✠ పాత్రధారుడు పాత్రగా అయినాడా? లేదు. **బ్రహ్మము జీవుడుగా అగుటలేదు.**

✠ మరి పాత్రగా కనిపిస్తున్నది పాత్రధారుడే కదా? **బ్రహ్మమే జీవుడుగా కనిపిస్తున్నది.**

✠ పాత్రయొక్క ధర్మములు పాత్రధారుడివా? లేదు. నాటకములోనివి. బ్రహ్మము జీవుడిగా కనిపిస్తున్నప్పటికీ, జగన్నాటకంలో గుణసహితంగా కనిపిస్తున్నప్పటికీ, **ఈ జీవుడు గుణరహితమగు బ్రహ్మమే!**

✠ నాటకంలోని పాత్ర వాస్తవానికి ఉన్నదా? లేదు. **నాటకమే కల్పన.** ఇక పాత్ర మాత్రం కల్పన కాదా? **కల్పనయే!**

జగన్నాటకంలో **'జీవుడు'**గా కనిపించేదంతా కల్పనయే! 'కల్పన'ను ప్రక్కగా పెడితే, **'జీవుడు'గా కనిపించేది బ్రహ్మమే.**

**అయమాత్మా బ్రహ్మ!** జీవుడుగా ఉన్న నేను బ్రహ్మమే! అందరూ అఖండ బ్రహ్మమే!

ఈ నాలుగు వాక్యముల మహత్తరార్థనమును ఎంతెంత వరకైతే భావనాయుక్తంగా, అవగాహనతో ముముక్షువు జపిస్తూ ఉంటాడో, ఎంతవరకు 'తత్త్వమసి' అభేదవాచకము (I am not different from you, you are not different from me)ను మననము చేస్తూ ఉంటాడో అట్టి భావనా పరిపక్వత, సుస్థిరతచే **'శివసాయుజ్యము'** (శివోఽహమ్ భావము) అను 'ముక్తి'కి దరిచేరుచున్నాడు.

**'ఓం తత్ బ్రహ్మ' – మహామంత్రము – ప్రథమ షడంగన్యాసము – "తత్"**

**'హంస'** – ఋషి। **'అవ్యక్తో'** (హృదయాతర్గత మౌనవ్యాఖ్యా) – **గాయత్రీ ఛందస్సు।**

**'పరమహంసో'** దేవత। **'హం'** – బీజమ్।

**'సః'** – శక్తిః। **'సోఽహమ్'** – కీలకము!

**మమ 'సాయజ్య ముక్తి' అర్థే వినియోగః॥**

నాయొక్క 'సాయుజ్య ముక్తి' అను ప్రయోజనము కొరకై (అర్థపూర్వకంగా) వినియోగము చేయుచున్నాను–ఇది **"వినియోగము"!**

| మంత్రము | కరన్యాసము | అంగన్యాసము |
|---|---|---|
| తత్పురుషాయ | (అం) అంగుష్ఠాభ్యాం నమః। | హృదయాయ నమః। |
| ఈశానాయ | (త) తర్జనీభ్యాం స్వాహా। | శిరసే స్వాహా। |
| అఘోరాయ | (మ) మధ్యమాభ్యాం వషట్। | శిఖయై వషట్ |
| సద్యోజాతాయ | (అ) అనామికాభ్యాం హుం। | కవచాయ 'హుం'। |
| వామదేవాయ | (క) కనిష్ఠికాభ్యాం వౌషట్। | నేత్రత్రయాయ 'వౌషట్' |
| తత్పురుష ఈశాన అఘోర సద్యోజాత వామదేవేభ్యః | (కర) కరలతల కరపృష్ఠాయ ఫట్। | అస్త్రాయ 'ఫట్'। |

**భూర్భువస్సువరో (భూ–భువర్ – సువర్‌లోక–లోకాంతర విశేషములన్నీ) – ఇతి – తత్ – బ్రహ్మ – అని దిగ్బంధనము చేయుచున్నాను – ఇతి దిగ్బంధః॥**

**ధ్యానము – జ్ఞానం జ్ఞేయం జ్ఞాన గమ్యాత్ అతీతం,**
**శుద్ధం బుద్ధం ముక్తమపి అవ్యయం చ,**
**సత్యం జ్ఞానం సచ్చిదానంద రూపం,**
**ధ్యాయేత్ ఏవం 'తత్' మహో భ్రాజమానమ్॥**

## ద్వితీయ (రెండవ) షడంగ న్యాసము – 'త్వం' పదము

<u>'త్వం' పద మహామంత్రమునకు – (ద్వితీయ) షడంగ న్యాసము – త్వం పద మహామంత్రస్య</u>

**విష్ణువు** – ఋషి! **గాయత్రీ** ఛందస్సు।
**పరమాత్మా** – దేవాతా। **'ఐం'** బీజమ్।
**'క్లీం'** – శక్తిః। **'సౌః'** కీలకమ్।

**మమ ముక్త్యర్థే జపే వినియోగః।**

నాయొక్క 'ముక్తి'ని ఉద్దేశించి జపవినియోగము చేయుచున్నాను.

| <u>నామము</u> | <u>కరన్యాసము</u> | <u>అంగన్యాసము</u> |
|---|---|---|
| వాసుదేవాయ | (అం) అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| సంకర్షణాయ | (త) తర్జనీభ్యాం స్వాహా। | శిరసే స్వాహా। |
| ప్రద్యుమ్నాయ | (మ) మధ్యమాభ్యాం వషట్। | శిఖయాయ వషట్। |
| అనిరుద్ధాయ | (అ) అనామికాభ్యాం హుం। | కవచాయ 'హుం'। |
| వాసుదేవాయ పురుషోత్తమాయ | (క) కనిష్ఠికాభ్యాం వౌషట్। | నేత్రత్రయాయ వౌషట్। |
| సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్న అనిరుద్ధేభ్యః | (కర) కరతలకర పృష్ఠాభ్యాం ఫట్ | అస్త్రాయ ఫట్। |

***భూః భు స్సువరోమ్ ఇతి దిగ్బంధః (త్రిలోకములలోని సర్వ విషయములన్నీ త్వమ్ నందు ఏకము చేసి దిగ్బంధనము చేయుచున్నాను.***

**ధ్యానము – జీవత్వం సర్వభూతానాం, సర్వత్ర అఖండ విగ్రహమ్,**
**చిత్త – అహంకారయం తారం, జీవాఖ్యం 'త్వం' పదం భజే।।**

## 3వ (తృతీయ) షడంగన్యాసము 'అసి' పద మహామంత్రస్య

**'అసి' (అయి ఉన్నావు) – అను పద మహామంత్రమునకు**

**మనస్సు** – ఋషి। **గాయత్రీ** ఛందస్సు।
**అర్ధనారీశ్వరో** దేవతా। **అవ్యక్తాది** బీజమ్।
**నృశింహః** – శక్తిః। **పరమాత్మా** కీలకమ్।

***'జీవ బ్రహ్మైక్యము' కొరకై వినియోగము***

| <u>నామము</u> | <u>కరన్యాసము</u> | <u>అంగన్యాసము</u> |
|---|---|---|
| పృథ్వీతు అణుకాయ | (అం) అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| అబ్ద్వ్యణుకాయ | (త) తర్జనీ భ్యాం స్వాహా। | శిరసే స్వాహా। |
| తేజోః అణుకాయ | (మ) మధ్యమాభ్యాం వషట్। | శిఖయాయ – వషట్। |
| వాయుద్వ్యణుకాయ | (అ) అనాహతాభ్యాం 'హుం'। | కవచాయ 'హుం'। |
| ఆకాశాద్వ్యణుకాయ | (క) కనిష్ఠికాభ్యాం వౌషట్। | నేత్రత్రయాయ వౌషట్। |
| పృథ్వి–ఆపః–తేజో–వాయు– ఆకాశాత్ అణుకేభ్యో | (కర) కరతలకర పృష్ఠాభ్యాం ఫట్ | అస్త్రాయ ఫట్। |

'అసి' అను జీవబ్రహ్మైక్యమునందు – భూ – భువః సువః త్రిలోకములు ఐక్యము చేసి దిగ్బంధనము చేయుచున్నాను. **భూర్భువస్సువః – ఇతి దిగ్బంధః।** లోకములన్నీ తత్ స్వరూపమే।

**ధ్యానము :**

**శ్లో॥ 'జీవో బ్రహ్మేతి' వాక్యార్థం యావత్ అస్థి మనస్థితిః**
**ఐక్యం తత్త్వం లయే కుర్వన్ ధ్యాయేత్ 'అసి' పదం సదా॥**

**ఈ మనస్సు – 'జీవుడుగా ఉన్నది బ్రహ్మమే'** అను వాక్యార్థము యొక్క స్వావలంబనమును, ఎప్పటికి సంపూర్తిగా, స్వభావంగా **పొందుచున్నదో,** అట్టి నిశ్చయ స్థితి మనస్సుకు లభించే వరకు 'అసి' (అవును. 'త్వమ్' అనునది తత్ అయియే ఉన్నది)…అను లయ స్థానమును ధ్యానముచేసి **'అసి పదము'** సదా పొందెదవు గాక!

## వాక్యార్థ వివరణ

ఈ విధంగా మహావాక్య షడంగములు చెప్పుకున్నాము. ఇప్పుడిక – రహస్యోపనిషత్ విభాగమైనట్టి వాక్యార్థ శ్లోకములు (లేక వాక్యార్థగానము) గురించి చెప్పుకుంటున్నాము. ఓ ప్రియ శుకబాలకా! తదితర ప్రియ ఆత్మానంద స్వరూపులగు శ్రోతలారా! వినండి.

## ప్రజ్ఞానమ్ బ్రహ్మ!

**ప్రజ్ఞానము = యేన ఈక్షతే, శృణోతి ఇదం, జిఘ్రతి, వ్యాకరోతి చ, స్వాదు అస్వాదు విజానాతి తత్ 'ప్రజ్ఞానమ్' ఉదీరితమ్।** దేనిచేత ఈ జీవుడు జీవిస్తున్నాడో, వింటున్నాడో, వాసన చూస్తున్నాడో, (స్వప్నంలో స్వప్నద్రష్ట యొక్క స్వభావన విస్తరించినట్లుగా) విస్తరిస్తున్నాడో, "ఇది మంచి – ఇది చెడ్డ, ఇది రుచికరము – ఇది కాదు, ఇది బాగు – ఇది కాదు" – అని ఎరుగుచున్నాడో, అట్టి – **'ప్రజ్ఞానమే బ్రహ్మము'. 'ప్రజ్ఞానము'** అను శబ్దముయొక్క **పరమార్థము. –**

**శ్లో॥ చతుర్ముఖ ఇంద్ర దేవేషు, మనుష్య అశ్వ గవాదిషు**
**చైతన్యమేకం బ్రహ్మేతః 'ప్రజ్ఞానం బ్రహ్మ' మయ్యపి (ఉచ్యతే)॥**

సృష్టికర్తయగు చతుర్ముఖ బ్రహ్మయందు, తదితర సర్వ దేవతల యందు, మనుష్యులందు, గుర్రములందు, గొర్రెలయందు, ఆవులయందు **సర్వ జీవులయందు** ప్రకాశమానమగుచున్న **'ప్రజ్ఞ'** ఏకమేగాని **అనేకము కాదు.** ఒకే చైతన్యము అందరిలోను వెలుగొందుచున్నది. అదియే బ్రహ్మము. ఏ 'ప్రజ్ఞ (లేక) ఎరుక' అను చైతన్యము నాయందు వెలుగొందుచున్నదో, అదియే బ్రహ్మమే! నాయొక్క ప్రజ్ఞాన రూపమే ఇదంతా। **పరిపూర్ణః పరాత్మా అస్మిన్ దేహే విద్యాధికారిణీ, బుద్ధేః సాక్షితయా స్థిత్వా స్ఫురన్ 'అహమ్' ఇతి ఈర్యతే – పరిపూర్ణ పరాత్మయేవ!**

***నా ఈ దేహములో ఏదైతే***

*– తెలుసుకొనబడుచున్నవాటికన్నిటికి అధికారిణి అయి,*

*– బుద్ధికి కేవల సాక్షియై*

*ఉన్నదో, 'నేను' అని నాయందు కలిగి ఉంటుందో, అది **పరిపూర్ణ పరాత్మయే!** ఎందుకంటే ఆత్మసర్వదా అనన్యము కదా!*

ఈ నాయందు **'స్వతః పూర్ణ పరాత్మ'**యే వేదములందు **'బ్రహ్మము'** అను శబ్దముతో అభివర్ణించబడుతోంది.

**అహమ్ = పరబ్రహ్మమేవ! అహమస్మి పరంబ్రహ్మ!**

**'అస్మి'** = ఈ పదముచే 'సోఽహమస్మి' – **నేను సర్వదా బ్రహ్మమునే అయి ఉన్నాను** – అను అర్థము చెప్పుచున్నది. **జీవబ్రహ్మ – ఐక్యమునకు సంజ్ఞయే – 'అస్మి' అను శబ్దార్థము. అందుచేత 'నేను ఎవరు?'** అని పరిశీలిస్తూపోతే **'నేను సర్వదా బ్రహ్మమే! అహమ్ బ్రహ్మాస్మి'** అనునది కృతనిశ్చయమగుచున్నది.

## – తత్ –

**'తత్‌బ్రహ్మమేవాఽస్మి' అను మహావాక్యములో 'తత్' అనగా?**

ఏది ఏకము, అద్వితీయము అగుచూ, సర్వము అద్దానికి అభిన్నమో – అదియే **తత్! 'తత్'కు అన్యము లేదు.** కాబట్టి (అనన్యము కనుక) **నేను తత్స్వరూపుడనే!** తత్ పద స్వరూపుడునగు నాకు **అన్యమై** అనిపించేదంతా **స్వకీయ కల్పనా చమత్కారమే।**

**తత్ – త్వమ్ అసి**

**ఏకమేవ – అద్వితీయసన్, నామరూప వివర్జితం సృష్టేః పురాధునాపి అస్య తాదృక్ "త్వమ్ తత్" ఇతి అభిధీయతే! ఏ ఏకము – అద్వితీయము, నామరూప వివర్జితము (రహితము) అగు బ్రహ్మము** సృష్టికి మునుముందే ఉండి ఉన్నదో, అదియే **'త్వమ్'** రూపమున, **తత్** రూపమున (ఉభయముగా కూడా) వెలుగొందుచున్నదని ఆత్మ-విచారణచే సుస్పష్టమగుచున్నది.

**త్వమ్ = నీవు. 'నీవు'** అనునది భౌతికదేహమునకు, ఇంద్రియములకు పరిమితమైనది కాదు. వాటన్నిటికంటే **అతీతమైన పదము** అయినట్టిదే **'తత్ త్వమ్ అసి'** మహావాక్యములోని 'త్వమ్' పదముచే చెప్పబడుతోంది. **ఏకతా గుహ్యతే 'అసి' ఇతి తత్ ఐక్యమ్ అనుభూయతామ్।** 'అసి' అను శబ్దముచే – **'త్వమ్'**గా ఉన్నది **'తత్' పరబ్రహ్మమ్।** –అను ఐక్యము ఎలుగెత్తి / చేతులెత్తి ప్రకటించబడుచున్నది.

## 'అయమ్ ఆత్మా బ్రహ్మ'

ఈ మహావాక్యములో **అయమ్** = స్వప్రకాశమైనది, (ప్రత్యక్ష – పరోక్షములకు వేరైన) అపరోక్షము అగు పరమాత్మయే 'త్వం' రూప **'జీవాత్మ'** అని సిద్ధాంతీకరించబడుచున్నది. "జీవాత్మగా ప్రదర్శనము అగుచున్నది బ్రహ్మమే" – అనునది 'అయమ్' శబ్దముచే చూపబడుచున్నది.

**ప్రత్యగాత్మ: అహంకార–ఆది–దేహాంతం ప్రత్యగాత్మా ఇతి గాయతే!** 'అహంకారము'తో ఆరంభించినదై, స్థూలదేహము చివరిగా (ఆవల వరకు) గలిగినదంతా **'ప్రత్యగాత్మ'**గా చెప్పబడుతోంది. అద్దానికి అధిష్ఠానము **'తత్'**యే! తత్‌యేవ–ప్రత్యగాత్మగా కూడా ఉన్నది.

**ప్రత్యగాత్మ = దేహికి–దేహమునకు ఈవల–ఆవల సమస్త దృశ్యము తనకు అనన్యముగా కలిగి ఉన్నట్టిది.**

**జగత్ = దృశ్యమానస్య సర్వస్య జగతః తత్త్వమ్ ఈర్యతే।** అనుక్షణము జనించు – గతించు విశేషములు కలిగిన ఈ సర్వ దృశ్య మానమైనదంతా **'జగత్తు'**గా చెప్పబడుతోంది.

ప్రత్యగాత్మకు, జగత్తుకు అధిష్ఠానము (Basic material by which formed) **'తత్'** అయి ఉన్నది. **తదేవ జగత్!**

## బ్రహ్మము

ఆత్మ స్వయం ప్రకాశకము. తదితరమైనదంతా స్వయం ప్రకాశమగు ఆత్మయందు కల్పనాజనితము. ఆత్మ తేజస్సు యొక్క సంప్రదర్శనా చమత్కారము. మట్టితో 'కోతి' బొమ్మ వేసినప్పుడు, మట్టి అధిష్ఠానము. కోతియో–కల్పన. మట్టియందు కోతి లేదు. కోతి మట్టియే అయి ఉన్నది. బ్రహ్మము తదితరంగా కాకుండానే, అనాత్మదృష్టిచే 'అహమ్', మమ–ఇంద్రియ జగత్ దృశ్యముల రూపంగా 'అన్యము' వలె అగుపిస్తున్నాయి. అవన్నీ ఆత్మరూపమే అయి ఉండికూడా, ఆత్మయందు అవేవీ లేవు. **(ఆత్మయే బ్రహ్మము).**

## అవివేక నిద్ర

**అనాత్మదృష్టేః అవివేక నిద్రా। అహం–మమ స్వప్నగతిం గతోఽహమ్। "అనాత్మ దృష్టి"** అనే అవివేక నిద్రలోని స్వప్నంలో **'నేను–నాది'** అనునవి స్వప్నాంతర్గత కల్పిత విశేషములవంటివై ఉంటున్నాయి. ఆహా! అనాత్మదృష్టి కారణంగా స్వప్నవిషయాలవంటి 'అహం..మమ' విశేషాలను పట్టుకొని ఉంటూ ఉండగా, ఈ జీవునిపట్ల **ఎన్నో జన్మలు** అవివేక దృష్టిచే **"ఒక స్వప్నము తరువాత మరొక స్వప్నము" వలె గడచి పోతున్నాయి.** సంగతి–సందర్భ–సంబంధ–అనుబంధ–బాంధవ్యములు తెంపులేకుండా వచ్చి పోతూ ఉండగా స్వస్వరూపమును గుర్తు పెట్టుకోక పోవటమే **అవివేక నిద్ర.** స్వప్నములో ఉంటూ, "ఈ స్వప్నమంతా నాదికదా" – అను ఏమరుపే – అందుకు దృష్టాంతము.

## జ్ఞానము అను మెళుకువ

**స్వరూప సూర్య అభ్యుదితే స్ఫుట ఉక్తే, గురోః మహావాక్యపదైః ప్రబుద్ధః।** స్వస్వరూపము (కేవలాత్మా మమస్వరూపము) అనే సూర్యుడు ఉదయించగానే అజ్ఞాననిద్ర తొలగిపోతోంది. గురు మహావాక్యములైనట్టి **'తత్ త్వమ్ అసి! అయమ్ ఆత్మా బ్రహ్మ! జీవోబ్రహ్మేతి నాపరః। సోఽహమ్। త్వమేవాఽహమ్'** ఇత్యాది మహావాక్యముల మహార్థము హృదయమునందు ఉదయించుచూ ఉండగా – చీకట్లో కనిపించే భ్రమాకారములగు 'అహము–మమ' ఇత్యాది భ్రమలు మొదలంట్లా తొలగిపోతున్నాయి. **ఈ జీవుడు ప్రబుద్ధుడు అగుచున్నాడు.**

## 'త్వం – నీవు' అను దానికి అర్థమేమిటి?

**'త్వం' పదమునకు** (అనగా 'నీవు' అని అంటున్నప్పుడు) వేరు–వేరైన అర్థములు ఉన్నాయి. (1) వాచ్యార్థము (2) లక్ష్యార్థము

**'త్వం' వాచ్యార్థము =** వాచ్యార్థనమును దృష్టిలో పెట్టుకొని అంటున్నప్పుడు **'నీవు!'** అనగా పాంచభౌతిక శరీరము, ఇంద్రియములు, నామ–రూపములు, గుణములు, స్వభావములు, లోకసంబంధమైన విద్య, అవిద్య, సంపదలు, ఆపదలు – ఈ ఈ మొదలైనవి.

**'త్వం' వ్యక్యార్థము =** 'త్వం' వ్యక్త–సంబందార్థము – అనగా, నీకు–స్థితికి–నాకు గల సంబంధము. నీయొక్క నాయొక్క వ్యక్తీకరణ చమత్కారము.

**త్వం లక్ష్యార్థము =** 'నీవు' అనగా పరమ లక్ష్యమే అయి ఉన్న **సచ్చిదానంద స్వరూపమే! "మీ ఉంగరము నాకు ఇవ్వండి" – అన్నప్పుడు "బంగారము మాత్రమే ఉంచుకొని ఉంగరము మాత్రం ఇవ్వండి" – అని కాదు కదా!**

**'తత్' పదము యొక్క ఈశ్వర వాచ్యార్థము :** అనేక ఉపాధులకు సంబంధించిన 'నేను అనబడు **ఈశ్వరుడు.** 'మాయ'ను ఉపాధిగా కలవాడు. గుణములకు, దేహ – దేహాంతరములకు **కర్త. కృతమతిః** – కర్తృత్వ భావన కలవాడు.

**'తత్' పదముయొక్క లక్ష్యార్థము : *సచ్చిదానంద పరబ్రహ్మమే!***

**'త్వమ్' యొక్క 'తత్' యొక్క లక్ష్యార్థము** = **సత్ – చిత్ – ఆనంద పరబ్రహ్మమే!** అందుచేత 'తత్ – త్వమ్ – అసి' అన్నప్పుడు లక్ష్యార్థము దృష్ట్యా **'త్వమ్ – తత్'లు ఏకమే గాని వేరు వేరైనవి కావు. సచ్చిదానంద సుఖ బ్రహ్మ – 'తత్' అర్థం ఏష చ తయో ఐక్యం త్వ – అసి – ఇదమ్ పదమ్।** లక్ష్యార్థమును ఆశ్రయించుటచే **"తత్ – త్వమ్ – అసి – ఇదమ్ పదము"** సిద్ధించుచున్నది. వాటి కలయికయే తత్ సంబంధమైన యోగము. అదియే సమాధి కూడా!

'త్వమ్' అనునది (జీవాత్మ, ఈశ్వరుడు) ఈ రెండు కూడా కార్య కారణముల భేద దృష్టిచే (దృష్టులుగా) ఏర్పడినవై ఉంటున్నాయి. కార్యఉపాధి – కారణ ఉపాధి (The cause & Effect aspect) తిరిస్కరించటం (లేక) ప్రక్కకు పెట్టటం జరిగితే, అప్పుడు **సచ్చిదానంద – అఖండరూపమే శేషించుచున్నది.** కార్య – కారణముల వలన ఏఏ భేదములు కనిపిస్తూ ఉన్నాయో, అవన్నీ కూడా **సందర్భ సత్యములు** (Incidental Truth in a visualised frame by virtue of Gender (male & female), Possession (Poor & Rich), Body (weak or strong), Country (This country man & That country man) etc.,) మాత్రమే!

'సహజసత్యము' దృష్ట్యా జీవ–ఈశ్వర, జ్ఞాన–అజ్ఞాన, మంచి–చెడు – ఇత్యాది ద్వంద్వములు **'వాస్తవానికి లేనివి'** గాను, కానీ **సందర్భమును అంగీకరిస్తే మాత్రం ఉన్నవి** గాను – అగుచున్నాయి. దృష్టాంతానికి దేవదత్తుడు అనేవాడు ఉన్నాడు.

- ఏ ఊరివాడు? ఏ దేశము వాడు?.... దేశమునకు సంబంధించినది (Related to place)
- ఏ వయసువాడు? (బాల్యయౌవ్వన వార్థక్యములను అనుసరించి (Age related)
- నీకు ఏ విధమైన బంధువు? (కొడుకా? తండ్రియా?) (Inter Personal)
- ఏ రంగు వాడు? (రంగు, రూపు రేఖలను అనుసరించి) (Colour of Skin)
- ఏ కాలమువాడు? (కాలసంబంధమైనది) (Time related)
- ఏ ఎత్తువాడు? (పొట్టివాడా? పొడుగువాడా?) (Physic related)
- ఎందులో పండితుడు? (చదువును అనుసరించి) (Knowledge related).

పై వేరువేరులు ఏది ఎట్లా ఉన్నా 'దేవదత్తుడు' అనబడువాడు ఒక్కడే కాని చిన్నప్పుడు ఒక దేవదత్తుడు, వృద్ధాప్యంలో మరొక దేవదత్తుడు ఉండడు కదా! దేవదత్తుడు – ఒకడికి తండ్రి. మరొకరికి కొడుకు. ఇంకొకరికి భర్త. మరొకరికి బావ. ఏఏ సంబంధములున్నా **దేవదత్తుడు – స్వతఃగా ఆయా సంబంధములను అనుసరించి వేరువేరైనవాడు అగుట లేదు.** అట్లాగే ఆత్మ – దేహములచే, మనో బుద్ధి చిత్త అహంకారములచే, సర్వ తదితర భేదములచే **అన్యత్వము పొందదు. ఆత్మ సర్వదా ఏకము, అక్షరము, నిర్మలము, నిత్యము కూడా!**

సర్వ కార్య కారణములను, సంబంధములను ప్రక్కకు పెట్టితే, ఈజీవుడు **తత్ స్వరూపుడే! పరమాత్మ యొక్క సంప్రదర్శనా స్వరూపుడే!**

కార్య – కారణ సంబంధముల చేతనే కార్యోపాధి సంబంధింతుడై "జీవుడు" – అనుభవుడగుచున్నాడు. కారణోపాధిచే ఈతడు ఈశ్వరుడే! (జీవుడు = ఒక నాటకంలో నటుడు. ఈశ్వరుడు = అనేక నాటకములలో నటిస్తున్న నటుడు)

జీవునికి శరీరము ఉపాధి! ఈశ్వరునికి మాయ ఉపాధి!

(దృష్టాంతంగా – నాటకంలోని నటించే నాటక కథా సందర్భమునకు → నాటకపాత్ర ఉపాధి. నటునికి 'నటన' ఉపాధి. కథలోని పాత్రకు కథ ఉపాధి! కథారచయితకు – నాటకము ఉపాధి. ఈశ్వరునికి జీవుడు ఉపాధి).

**బ్రహ్మము ఉపాధి రహితము!** ఈ జీవుడు బ్రహ్మమే! కార్యకారణముల ఉపాధులను తొలగించి చూచిన మరుక్షణం **పూర్ణబోధ స్వరూపమే.** (knowing as absolute and complete state) అవశిష్యము (శేషించినది) అగుచున్నది. ఈ జీవుడు పూర్ణబోధానంద స్వరూపుడే! సహజీవులపట్ల అట్టి దర్శనమే **'నిర్వికల్ప సమాధి'** యొక్క ఏకైక లక్షణము. అదియే అందుకు సోపానము కదా.

ఈ జీవుడు కార్యకారణ కల్పనా సంబంధములను, సందర్భమాత్ర పరిమిత సత్యములను అధిగమించిన కేవలీదృష్టిచే కేవలమగు అఖండాత్మయే! ఆత్మ తత్త్వజ్ఞునికి ఆత్మ దృష్టిచే తత్త్వాత్మత్వము స్వానుభవమగుచున్నది. అట్టి అనుక్షణిక పూర్ణబోధానుభవానందమునకు ఉపాయమేమిటి? – ఉపాయములేమిటో చెప్పుకుందాము.

## కేవలబోధ స్వరూప – స్వస్వరూపానుభవమునకు ఉపాయాలు

**(1) శ్రవణం :** మొట్టమొదట మహావాక్యముల "తత్–త్వమ్–అసి। ప్రజ్ఞానం–బ్రహ్మ। అయమ్–ఆత్మ బ్రహ్మ। శబ్దములను విడివిడిగా 'షడంగ యుక్తంగా రహస్యోపనిషత్ విధానంగా స్వానుభవ సిద్ధి కొరకు అభ్యాసము చేసెదరు గాక! **'ఈ దృశ్యముతో నేను కలిగియున్న దృష్టి దోషములేమిటి? సత్యము ఎట్టిది?** 'సోఽహమ్, తత్త్వమ్' ఇత్యాది మహావాక్యముల **రహస్యార్థమేమిటి? 'నేను ఎరుగవలసినదేమిటి?** – అను **లక్ష్యశుద్ధిని** పెంపొందించుకోవాలి. **ముముక్షు వ్యవహారి కావాలి.** అందుకుగాను (1) ఇంద్రియ నిగ్రహ నియామక రూప 'శమము' (2) లౌకికంగా లభించువాటితో సంతోషము (3) విచారణ (Analysis) (4) సాధు జనులతో సత్సంగములను ఆశ్రయిస్తూ క్రమంగా గురోపదేశమునకు అర్హత సంపాదించుకోవాలి.

**సద్గురు సామీప్యత :** ఇప్పుడిక ఆత్మజ్ఞానము కొరకై **"తత్త్వదర్శి – (నీవు బ్రహ్మమే అని ఎరిగిన) తత్త్వవేత్త – విద్యావేత్త"** యగు సద్గురువును సమీపించాలి.

**శ్రవణము :** మహావాక్య రహస్యార్థములను శ్రవణం చేయాలి. వినాలి. వినటము, చదవటము, మాట్లాడుకోవటము, వ్రాయటము మొదలైనవన్నీ **"తెలుసుకోవటము (లేక) శ్రవణము"** లోనివే! క్రమంగా సంశయములన్నీ ఛిన్నమయ్యే వరకు గురుముఖతః వినాలి. శాస్త్రములు పరిశీలించాలి. పరస్పరం చెప్పుకోవాలి. బోధించుకోవాలి.

**మననము :** ఏ మహావాక్య రహస్యార్థము (లేక) తత్త్వార్థము వినుచున్నామో, ఆ వినినదంతా ఆయా సర్వ లోక సంబంధమైన సందర్భములలోను (గుర్తు తెచ్చుకొని) **'అనుకుంటూ ఉండటము'** అనే మననము చేయాలి. 'త్వమ్'గా (నీవుగా) కనిపిస్తున్న వాచ్యార్థమును అధిగమించి, లక్ష్యార్థమును సాధించటం అభ్యసిస్తూ ఉండాలి. పరాప్రేమ, త్యాగము, అమానిత్యాది జ్ఞాన సంపత్తి సముపార్జించుకోవాలి.

- ❒ **"అద్వేష్టా సర్వభూతానాం" – ఇత్యాది భక్తి సంపత్తి।**
- ❒ **"అభయం, సత్త్వసంశుద్ధి" – ఇత్యాది దైవీ సంపత్తి।**
- ❒ **"న ద్వేష్టి సంప్రవృత్తాని, న నివృత్తాని కాంక్షతి, ఉదాసీనవత్ ఆసీనో"** – మొదలైన గుణాతీత అభ్యాస సంపత్తి।
- ❒ **"ఓ పరమాత్మా! ఈ సమస్తము నీదే కదా!"** – అను సర్వసమర్పణా సంపత్తి।

మొదలైన ప్రయత్నములను వృద్ధి చేసుకోవాలి. (ఉపనిషత్ సారమగు భగవద్గీత మొదలైన) తత్త్వశాస్త్ర విభాగములను, 'తత్త్వమసి' చెప్పు గురుబోధలను మననం చేయాలి అనుకుంటూ ఉండాలి.

**నిదిధ్యాస :** గురువు వద్ద శ్రవణం చేసినది, మననం చేస్తూ ఉండగా, – మననము చేసినది **'అనిపించటము'** ప్రారంభమైతే అది 'నిదిధ్యాస' యొక్క ప్రారంభం. **నిర్హేతుకంగా, అనునిత్యంగా అనిపించే వరకు శ్రవణ మననములు కొనసాగించవలసిందే!**

**ఈ విధంగా (1) శ్రవణం తు గురోః పూర్వం (2) మననం తదనంతరం (3) నిదిధ్యానమ్ – ఇతి ఏతత్ పూర్ణభోధస్య కారణమ్**

'శ్రవణ – మనన – నిదిధ్యాస – ఈ మూడు పూర్ణబోధకు కారణమగుచున్నాయి.

**(1) తెలుసుకోవటం (శ్రవణం) (2) అనుకోవటం (మననం) (3) అనిపించటం (నిదిధ్యాస) (4) అదే తానవటం (సమాధి).**

**ఇకతదితర లోక సంబంధమైన విద్యలకు వద్దాము.**

**శ్లో॥ అన్యవిద్యా పరిజ్ఞానమ్ అవశ్యం నశ్వరం భవేత్।**
**బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం స్థితమ్॥**

బిడ్డా, శుకా! తదితర శ్రోతలారా! **'బ్రహ్మవిద్య'** అను స్వస్వరూప అవగాహన-అనుసంధానరూపమగు ఆత్మ విద్య యొక్క పరిజ్ఞానముచే **బ్రహ్మ ప్రాప్తి** లభిస్తోంది. బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి. బ్రహ్మమును ఎరుగుటచే ఈ జీవుడు బ్రహ్మమే అగుచున్నాడు. అట్టి ప్రయోజనము శాశ్వతమైనది, స్థిరమైనది కూడా. ఇక బ్రహ్మ విద్యకు అన్యమైన (తదితర) విద్యల గురించి చెప్పాలంటే....

వాటి వాటి ప్రయోజనములన్నీ అనుభవ కాలంలో **కాలగతిచే నశించబోవుచున్నాయి.** కనుక, **నశ్వరము.** అవశ్యము నశిస్తాయి. అవి సుస్థిర విద్యలు కావు. **ఉన్న సత్యము** ఇది.

అందుచేత, బిడ్డలారా! శ్రోతలారా! ఏది స్థిరమైన, శాశ్వతమైన ప్రయోజనమో, అందుకు మాత్రమే సర్వ అవకాశములను వినియోగించుకొని **'సోఽహమ్ పరమమ్'** స్థానమును పొందుటకు సర్వదా సంప్రయత్నశీలురై ఉండెదరుగాక! **శివోఽహమ్** అనబడు శివానంద సిద్ధికై ఉపక్రమించెదరు గాక! సర్వకాల సర్వావస్థలలో **"తత్ పద ప్రాప్తి"** కొరకై మహదాశయులై ఉండండి.

## గురువులకు సూచన

**మహావాక్యములు :** శిష్యులకు బోధించుచున్న గురువులారా! మీరు కేవలము మహావాక్యముల బోధ మాత్రమే వినిపించి ఊరుకోకండి. **మరి? "తత్", "త్వమ్", "అసి" - మొదలైన ప్రతి శబ్దమునకు విడివిడిగా షడంగములతోబాటుగా శిష్యునికి ఉపదేశించండి.** బ్రాహ్మీవచనములను ధ్యాన-యోగాభ్యాసములతో ఏకంచేసి చెప్పుటచే శిష్యుడు శ్రవణముతో ఆగకుండా, మనన నిదిధ్యాసలకు మార్గం చూపువారు కాగలరు. అప్పుడే శిష్యుడు 'సమాధి'యందు ప్రవేశించగలడు. సర్వే **సర్వత్రా సర్వదా ఈ సమస్తము స్వస్వరూప దర్శనముగా స్వానుభవమవటమే సమాధి.**

**ఈశ్వరుడు :** ఓ శుకదేవా! తదితర మునిశ్రేష్ఠులారా! గురు జనులారా! మహావాక్యభావనా సాధకమగు నాచే చెప్పబడిన **'రహస్యోపనిషత్'** అందరూ శ్రద్ధగా విన్నారుకదా.

ఓ శుకదేవా! బ్రహ్మవాదులు, బ్రహ్మ సూత్ర రచయిత అగు మీ తండ్రిగారు శ్రీ వ్యాసమహర్షి యొక్క అభ్యర్థనను విని, ఆయనపై గల అవ్యాజమైన ప్రేమచే నీకు, ఈ సభలోని తదితర మునిశ్రేష్ఠులకు **షడంగముల మహావాక్య మంత్రోపాసన, అంగన్యాస - కరన్యాసములు, మహావాక్య తత్త్వార్థము చెప్పటం జరిగింది.**

*ఇదియే సచ్చిదానంద లక్షణాలతో కూడిన **'బ్రహ్మోపదేశము'** అనబడు **'వేదసంస్కారము'** (లేక) **ఉపనయనజ్ఞానోపాసనా ఘట్టము.***

ఓ శుకా! ఈ రహస్యోపనిషత్‌లోని విశేషములను ఎవ్వరైతే సదా ధ్యానము చేయుచూ షడంగోపాసనను అభ్యసిస్తూ ఉంటారో అట్టివారు ఇక్కడే జీవన్ముక్తులుకాగలరు.

నీవు శ్రద్ధగా శ్రవణ - మనన - నిదిధ్యాసలు నిర్వర్తించెదవు గాక! తద్వారా సమాధిని సిద్ధించుకొనెదవు గాక! అప్పుడు బ్రహ్మమునందే 'సదా విహారి'వి కాగలవు.

ఇంకొక సూచన. అందరూ శ్రద్ధగా వినండి

**శ్లో॥ యో వేదాదౌ స్వరః ప్రోక్తో, వేదాంతే చ ప్రతిష్ఠితః-**
**తస్య ప్రకృతి లీనస్య యః పరః, - స "మహేశ్వరః"॥**

ఏది శ్రవణ - మనన - నిదిధ్యాసల రూపంగా ఆత్మశాస్త్ర విశేషాలుగాను, 'ఓం'కార శబ్ద బ్రహ్మముగాను,

⌘ వేదములలో ప్రథమంగా స్వరప్రోక్తంగా పరమపురుష స్తోత్రగానంగాను (ఋక్కులుగాను), ఉపాసనా విధులుగాను (యజుర్విధులతోను), విధి విధాన పూర్వకంగాను, సామగానంగాను, అథర్వణ దర్శనంగాను చెప్పబడుచున్నదో,

⌘ ఏ 'బ్రహ్మము' మహావాక్య సమేతంగా వర్ణాత్మక - వివరణాత్మకంగా తత్త్వవేత్తలగు మహనీయులచే గానము చేయబడుచున్నదో,

⌘ ఏ వాక్యార్థము 'వేద శిరస్సు' అగు ఉపనిషత్తులలో ప్రతిష్ఠితమై యున్నదో,

అవన్నీ కూడా **'బ్రహ్మమే తానైన స్థితి'**యందు **'ప్రకృతి విలీనము'** పొందుచున్నాయి. అనగా వాటన్నిటియొక్క అంతిమ ప్రయోజనము - "ఈ సమస్తము బ్రహ్మమే! నేనే బ్రహ్మమును" - అను నిత్యోదితి స్వస్థితియే। **(సర్వం కర్మాఖిలం జ్ఞానే పరిసమాప్యతే।)**

**"భక్తి-జ్ఞాన-క్రియా యోగ - కర్మయోగ - సమర్పణాయోగ" .... సమన్వయ ప్రయత్నములచే ఈ జీవుడే స్వయముగా శివుడై, సర్వభూతములు తానై, సర్వసాక్షిగా వేరై, సర్వకారణకారణుడుగా వెలుగొందుచున్నాడు.**

**సర్వమునకు పరమై మహేశ్వరత్వమును సంతరించుకొనుచున్నాడు.**

⌘ ⌘ ⌘

ఈ విధంగా ఉపనయన దీక్షలో ఉన్న శుకదేవుడు - (వైదిక సంస్కారముల సందర్భమైన 'బ్రహ్మోపదేశము' సమయములో) శివ భగవానుని నుండి మహావాక్య మనన - వాక్యార్థ విచారణ షడంగన్యాసపూర్వకంగా 'ఉపదేశము' పొందారు.

కూర్చుని ఉన్నచోటు నుండి లేచి శివభగవానుడు ఆశీనుడైయున్న ఉన్నతాసనమును సమీపించారు. రెండు అరచేతులు ముకుళించి నమస్కరిస్తూ **'గురవే సర్వలోకానామ్! భిషజే భవరోగిణామ్! నిధయే సర్వవిద్యానమ్!'** అని స్తుతిస్తూ స్వామికి త్రిప్రదక్షిణములు చేశారు. సాంబశివ భగవానుని పాదములు రెండు చేతులు మునివ్రేళ్ళతోను, అరచేతులతోను స్పృశించుచూ '3' సార్లు కళ్ళకు అద్దుకున్నారు. శివపరమాత్మ పాదపద్మములకు సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించారు.

ఆ శుకుడు సమస్త పరిగ్రహణములను అప్పటికప్పుడే మనో - వాచా - కర్మణా పరిత్యజించివేశారు.

**పరమశివులవారు మనోహరమైన, లోకములన్నిటినీ సమ్మోహింపజేయు చిరునవ్వుతో ఇదంతా గమనిస్తూ, అంతర్ధానమయ్యారు.**

అక్కడికి వేంచేసి సమావేశములో పాల్గొనుచున్న వ్యాసమహర్షి, తదితర మహర్షులు, మునీశ్వరులు, మునులు శుకుని ప్రవర్తనన ఆశ్చర్యచకితులై చూస్తూ ఉన్నారు.

శుకుడు నిరభిమాని అయి, అక్కడి సమస్తమును పరిత్యజించి, ప్రవ్రజంతుడై (పరివ్రాజకుడై) అక్కడ నుండి బయల్వెడలసాగారు.

మూర్తీభవించిన వైరాగ్యముతో కూడిన వాడై నడచి వెళ్ళుచున్న కుమారుని చూచిన వ్యాసమహర్షి **"అయ్యో! లోకమే తెలియని నా కుమారునికి ఎక్కడైనా ఏదైనా బాధ కలుగవచ్చునేమో!"** అని భయకంపితుడు కాసాగారు.

*"ఓహో కుమారా! శుకా! ప్రియకుమారా! అరణి సంభవా! ఆగవయ్యా! కుమారా! నా పిలుపు వింటున్నావా? బదులు పలుకవయ్యా!"*

అని కేకలు వేస్తూ శుకుడు వెళ్ళుచున్న వైపుగా అడుగులు వేయసాగారు. ఈలోగా ఆ వ్యాసమహర్షి యొక్క 'బిడ్డా! శుకా'! అను పిలుపులకు సమాధానంగా - **ప్రతినేదుః తదా సర్వే జగత్ స్థావర జంగమాః**।.....అక్కడి స్థావర జంగములు **'ఓయ్'**...అని ప్రతి సమాధానమును ఒక్కసారిగా ప్రతిధ్వనించసాగాయి.

**శ్లో॥ తత్ శృత్వా సకలాకారం వ్యాసః సత్యవతీసుతః,**
**పుత్రేణ సహితః ప్రీత్యా పరానందమ్ ఉపేయవాన్॥**

సత్యవతీ పుత్రుడగు వ్యాసుడు **'ఓయ్'** అని వృక్ష - జంతు దేహ సమూహముల నుంచి వస్తున్న ప్రతిధ్వని సమాధానమును మరల మరల విన్నారు. మరల పిలిచారు. మరల విన్నారు. ఆశ్చర్య - ఆనందములు పొందారు. ఈ విధంగా అనుకోసాగారు.

"'ఆహా! భగవానుడగు పరమశివుని రహస్యోపనిషత్ ప్రవచనమును విని నా కుమారుడు అరణీజాతుడగు చిరంజీవి శుకుడు **దేహాతీతత్వమును అధిగమించాడు. విశ్వాత్మత్వమును సంతరించుకొని సర్వాత్ముడై, అఖండాత్మ స్వరూప - స్వభావుడై** వెలుగొందుచున్నాడు కదా! అందుచేతనే 'శుకా!' అను నా పిలుపుకు స్థావర జంగమములన్నీ 'ఓయ్!' అని ప్రతిధ్వనిస్తున్నాయి.

**"ఎంతటి సంతోష ఆనందకరమైన విశేషము!"** అని తలచి కృష్ణద్వైపాయన - వేదవ్యాసమహర్షి పరమానందమును పొందారు.

⌘

ఎవ్వరైతే గురు అనుగ్రహము పొందినవారై ఈ 'రహస్యోపనిషత్'ను అధ్యయనము చేస్తారో, అట్టివారు సర్వపాపముల నుండి వినిర్ముక్తులవగలరు. **'కేవలీ ఆత్మానుభవము'**ను సిద్ధించుకొనగలరు. **కైవల్యమును** ప్రాప్తించుకొనగలరు. అనగా **"నేను సర్వదా కేవలమగు ఆత్మనే। అన్యమైనదంతా సర్వదా మమాత్మానంద స్వరూపమే!"** - అని గ్రహించి, దర్శిస్తూ ఆత్మానందమునందు ఓలలాడుచుండ గలరు.

*ఇతి శుకరహస్యోపనిషత్*
*ఓం శాంతిః శాంతిః శాంతిః*

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 27 శ్వేతాశ్వతరోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ ఓం-సహనావవతు। సహనౌ భునక్తు।
సహవీర్యం కరవావహై।
తేజస్వినావధీవమస్తు।
మా విద్విషావహై। ఓం శాంతిః। శాంతిః। శాంతిః।



గురు శిష్యులమగు మా ఇరువురిని
- ❖ ఆ పరమాత్మ సంరక్షించును గాక! పరిపోషించును గాక!
- ❖ ఇరువురము సామర్థ్యము కలవారము అగుదుము గాక!
- ❖ పరస్పరము ద్వేషించుకోక, ప్రేమించుకొనెదము గాక!
- ❖ మన పట్ల త్రివిధ తాపములు సశాంతించును గాక!

## ప్రథమో అధ్యాయః - కిం జ్ఞేయమ్?

ఓం

1. బ్రహ్మవాదినో వదన్తి।
కిం కారణమ్ బ్రహ్మ?
కుతః స్మజాతా?
జీవా (నా)మ కేన?
క్వ చ సం ప్రతిష్ఠితా?
అధిష్ఠితాః కేన సుఖేతరేషు వర్తామహే-
బ్రహ్మ విదో వ్యవస్థామ్?

కొందరు మహనీయులు ఒకానొకచోట సమావేశమైనారు. కొన్ని ముఖ్యమైన ప్రశ్నలను పరిశీలించి, శ్రీ శ్వేతాశ్వతర మహర్షి ప్రవచనములు వింటూ - అధ్యయనము చేయనారంభించిరి.

- ఈ ప్రపంచము సృష్టించబడటానికి ఏమి కారణం? ఎవరు కారణము? బ్రహ్మయా? బ్రహ్మమా? బ్రహ్మము అనగానేమి?
- ఇదంతా ఎందుకు, ఎవరిచేత కల్పించబడుతోంది? ఇదంతా ఎవరి స్మృతి? ఎవరి అనుభూతి?
- ఈ జీవుడు ఎవరు? ఎవరిచేత దేనివలన జన్మిస్తున్నాడు? ఎవరి శక్తిచే చరిస్తున్నాడు? మనమెవరము?
- ఎవరి వలన మనమంతా జీవించగలుగుచున్నాము? ఈ జగత్తుకు మును-ముందుగా మనమంతా ఎక్కడ ఉండి సంప్రతిష్ఠులమై ఉన్నాము? ఇప్పుడు ఎక్కడ ఉన్నాము! ప్రళయంలో ఎక్కడ ఉంటాము? అనగా జగత్తు లేనప్పుడు మనమెక్కడ ఉంటున్నాం? జగత్తులు లేకపోతే కూడా మనము ఉంటామా? ఇప్పుడు జీవులకు ఈ సుఖ-దుఃఖాలన్నీ కల్పిస్తున్నది ఎవరు?

బ్రహ్మము ఎరిగినవారు బ్రహ్మాండములను అధిగమించినవారు కదా! వారు ఎక్కడ వ్యవస్థితులై ఉంటారు? ఎక్కడ సుఖంగా వర్తిస్తూ ఉంటారు? బ్రహ్మాండమునందా? బ్రహ్మమునందా? మరప్పుడు అజ్ఞానులు ఉండేది ఎక్కడ? ఈ ప్రపంచమంతా ఎట్లా ఏర్పడుతోంది?

---

2. కాలః। స్వభావో। నియతిః। య (యా) దృచ్ఛా।
భూతాని। యోనిః। పురుష - ఇతి చింత్యమ్।
సంయోగ, యేషాత్ న తు ఆత్మభావాత్।
ఆత్మా అపి అనీశః
సుఖ-దుఃఖ హేతోః॥

**వివిధ సిద్ధాంతాలు**

**కాలవేత్తలు**: ఈ ప్రపంచమంతా **కాలముచే జనించి, కాలముచే నశిస్తోంది. అంతా కాల కల్పిత చమత్కారమే! - కాబట్టి కాలమే కారణమా?**

**లోకాయతుకులు**: 'స్వభావము' (Nature) చేతనే అంతా కలుగుతోంది. ఇంతలోనే నశిస్తోంది. ఇదంతా లోకరీతియే। స్వభావోస్తు ప్రవర్తతే। -స్వభావము కారణమా?

**నియతివాదులు**: నియతి (Destiny) అనే ఒకానొక మహత్తర శక్తిచే ఇదందా ఇట్లా నియమించబడుతోంది. నేను - నీవు మొదలైనవన్నీ కూడా, ఆ నియతియొక్క కల్పనయే. (నియతి = Destiny)

**మీమాంసవాదులు**: కర్మఫలంగానే ఈ సమస్తము ఇట్లా ఏర్పడుతోంది. జన్మలు, స్థితులు, గతులు - ఇదంతా స్వకీయ కర్మల ప్రభావమే! కనుక కర్మలు కారణమా?

**యాదృచ్ఛ వాదులు / నిరీశ్వరవాదులు**: అంతా అకారణం. యాదృచ్ఛికంగా ఇదంతా ఇట్లా ఏర్పడి ఉంటోంది. యాదృచ్ఛికంగానే నశిస్తోంది. ఇందులో ఎవ్వరి ప్రమేయము లేదు. కనుక ఇదంతా యాదృచ్ఛికమా?

**జగత్ నిత్యత్వవాదులు / పంచభూతవాదులు** : భూమి-జలము-అగ్ని-వాయువు-ఆకాశముచే ఇదంతా నిర్మించబడి ఇక ఆపై ప్రవర్తిస్తోంది. అవి ఎప్పటికీ జగత్తులను నిర్మిస్తూ, నశింపజేస్తూనే ఉంటాయి. కాబట్టి ఈ జగత్తు ఇట్లాగే శాశ్వతమా?

**ప్రకృతివాదులు** : ఇదంతా ప్రకృతియొక్క యోనియందు (గర్భమునందు) రూపుదిద్దుకుంటోంది. అన్నిటికి ప్రకృతియే కారణము. కాబట్టి కారణము ప్రకృతియేనా?

**పురుష/దైవీ వాదులు**: అచింత్యుడగు 'పురుషుడు' (దేవుడు) ఉన్నారు. ఆయన హిరణ్యగర్భుడై జీవులను సృష్టిస్తున్నారు. కనుక పురుషుడు కారణమా?

**నిరీశ్వరవాదులు**: స్త్రీ-పురుషుల శృంగార సంయోగముచే ఈ జీవుడు పుట్టుచున్నాడు. కనుక వారి శృంగారము కారణమా?

ఇవన్నీ కావు. **ఆత్మయొక్క భావనయే ఇదంతా! సుఖ దుఖ హేతువగు జీవాత్మ కూడా ఆత్మవినోద భావనయే. ఆత్మ కేవలము. నిత్య సత్యము.**

---

**బ్రహ్మవేత్తలు**

**3. తే ధ్యాన యోగాత్ అనుగతా అపశ్యన్**
**దేవాత్మశక్తిగ్ం స్వగుణైః నిగూఢామ్,**
**యః కారణాని నిఖిలాని తాని**
**కాలాత్మ యుక్తాని అధితిష్ఠతి ఏకః॥**

మహనీయులు ధ్యానయోగముచే, "ఏకము- అఖండము అగు పరమాత్మ యొక్క నిగూఢము-త్రిగుణరూపము అగు **దైవీ కల్పిత స్వదివ్య శక్తియందు** భ్రమాత్మకంగా కనిపిస్తున్న మాయయే ఇదంతా! కాల స్వరూపుడగు పరమాత్మ స్వకీయ మాయచే జీవాత్మను కల్పించుకుంటున్నారు. స్వీయ కల్పనాశక్తి యగు మాయచే తనయందు తానే లీలా వినోదముగా **జగత్తును కూడా భావనచేసికొని జీవాత్మగా ఆస్వాదిస్తున్నారు"** అది దర్శించి గానం చేయసాగారు.

---

**4. తమ్ ఏక నేమిం,**
**త్రివృతగ్ం షోడశాంతగ్ం।**
**శతార్ధ ఆరం(50), విగ్ంశతి (20) ప్రత్యరాభిః।**
**అష్టకైః (8) షడ్భిః(6), విశ్వరూపైక పాశమ్।**
**త్రిమార్గ భేదమ్ ద్వి నిమిత్తైక మోహమ్॥**

**ఆ పరమాత్మను** గురించి ఏవిధంగా అధ్యయనులగు తత్త్వవేత్తలు దర్శిస్తూ చెప్పుచున్నారో - అదంతా ఈవిధంగా చెప్పుకోసాగారు.

1. పరమాత్మ సర్వదా **ఏకమే** అయి ఉన్నారు.
2. **'కార్య-కారణావస్థ'** అనే బండి చక్రమునకు ఇరుసు వంటి వారు. (ఇరుసు చక్రమును త్రిప్పుతోంది. కానీ బండి చక్రమే ఇరుసును త్రిప్పుచున్నట్లు అగుపిస్తుంది).
3. త్రిగుణాత్మకమైన ప్రకృతిచే ఆవరించబడినట్లు కనిపించుచుకూడా, వాస్తవానికి పరమాత్మ త్రిగుణాతీతులు.
4. 16 విశేషములు, 50 ఆకులు (అరములు) 20 ప్రత్యరములు గల బండి చక్రము కలవానిగా స్వయం ప్రదర్శితులు.
5. '6', '8' తత్త్వ విశేషాలు గల 'విశ్వరూపము' అనే ప్రదర్శనము పాశముగా కలవారు.
6. త్రిమార్గములలో (జాగ్రత్-స్వప్న-సుషుప్తులలో) క్రీడగా సంచరించువారు.
7. రెండు (నిమిత్త-ఉపాదాన) కారణములతో కనబడుచున్నవారు.
8. మోహ పరవశునిగా ప్రదర్శనమగుచున్నారు. జీవాత్మగా అయినట్లు భ్రమింపజేస్తున్నారు.

**అని ఆత్మసాక్షాత్కార-సిద్ధులు దర్శించుచున్నారు. అట్టి విశేషములతో కూడిన 'ఆత్మ'యే ఈ జీవుని నిజ-వాస్తవ-సహజ-సత్య స్వరూపము.**

**5. పంచ స్రోతో అంబుం**
**పంచ యోని - ఉగ్ర వక్రాం**
**పంచ ప్రాణ - ఊర్మిం**
**పంచ బుద్ధ్యాది మూలామ్,**
**పంచ ఆవర్తామ్**
**పంచ దుఃఖౌగ వేగామ్**
**పంచాశత్ (50) భేదామ్**
**పంచ పర్వామ్ అధీమః॥**

**'పరమాత్మ' అనే నదిని...,**

- పంచేంద్రియములే (కనులు, చెవులు, నోరు, ముక్కు, చర్మము) ప్రవాహముల రూపంగాను,
- యోని (జన్మస్థానము) రూపములగు పంచ మహాభూతములే ఉగ్రతరంగాలుగాను,
- పంచ ప్రాణములే అలలుగాను (ప్రాణ - అపాన - వ్యాన - ఉదాన-సమానములు),
- అంతరంగములోని బుద్ధి **(దేహ మనో బుద్ధి చిత్త అహంకారములు)** -ఇత్యాది పంచ వస్తువులే ఆదిమూలమైన ఐదు ఆవర్తములుగాను **(ఆది-సృష్టి-స్థితి-వృద్ధి-లయ-పునః ఉద్భవ బుద్ధులు కెరటములుగా)**
- శబ్దము మొదలైన పంచ దుఃఖ విషయములే (శబ్ద స్పర్శ రూప రస గంధములు) సుడిగుండములుగాను,
- 50 రకములగు (తమోమోహ) భేదములు ప్రదర్శించునది గాను,
- 5 రకముల క్లేశములు కలదిగాను,

**ధ్యానించుచున్నాము!** ఇవన్నీ ఏకము-అఖండము అగు పరమాత్మ అనే నదిలోని అంతర్విశేషాలే!

---

**6. సర్వా జీవే సర్వ సంస్థే బృహంతే,**
**అస్మిన్ హగ్ం సో భ్రామ్యతే బ్రహ్మచక్రే**
**పృథక్ ఆత్మానమ్ ప్రేరితారమ్ చ మత్వా**
**జుష్టః తతః, తేన అమృతత్వమేతి॥**

- సర్వజీవులకు, సర్వమునకు **సంస్థానము, జీవము** కూడా అయినట్టిది...,
- బృహత్తరమైనది,
- సర్వజీవులకు **లయ స్థానము** కూడా అయినట్టిది..., **మహత్తరమైనది,**
- **కార్య కారణ** చమత్కారము ప్రదర్శించు**నది, సమస్తమునకు ప్రేరణ రూపము.**

అగు **బ్రహ్మచక్రము**లో నివసించుచున్న ఈ జీవుడు తనకుతానే **అనాత్మరూపములగు దేహ సంబంధమైన సంఘాతములను** ప్రేరేపించుకొని, పక్షి-జంతు-మానవ-దేవతాది అనేక ఉపాధులలో సంచారాలు సలుపుచున్నాడు. తనయొక్క **అమృత-జీవ-బ్రహ్మైక్య స్వరూపమును** ఏమరచినవాడై అనేక దుఃఖములు అనుభవిస్తున్నాడు.

---

**7. ఉద్గీతమ్ ఏతత్ పరమం తు బ్రహ్మ**
**తస్మిగ్ం త్రయగ్ం స్వప్రతిష్ఠ అక్షరం చ।**
**అత్ర అంతరం వేదవిదో విదిత్వా**
**లీనా బ్రహ్మణి తత్పరా యోని ముక్తాః॥**

ఎప్పుడో- **"నేను దేహపరిమితుడను. బద్ధుడను. జీవాత్మను"** - అనే నిదుర నుండి మెలకువ పొంది, లేచుచున్నాడు. సామవేద గాన గీత స్వరూపము, పరము, అక్షరము అగు బ్రహ్మమును ఉపాసించటం ప్రారంభిస్తున్నాడు.

**"ఆహా! భోగించువాడు, భోగించబడు దృశ్యము, భోగము... ఈ మూడూ కూడా నా సహజ రూపమగు బ్రహ్మముయొక్క గర్భమునందే ప్రతిష్ఠితమై ఉన్నాయి కదా!" అనునది - బ్రహ్మవిద్యా సముపార్జనచే** తెలుసుకుంటున్నాడు. అట్టి వేద - వేదాంత వేద్యమును తెలుసుకొని, జన్మ-కర్మల నుండి విముక్తుడై బ్రహ్మమునందు తత్పరుడగుచున్నాడు.

---

**8. సంయుక్తమ్ ఏతత్ క్షరమ్-అక్షరం చ**
**వ్యక్త అవ్యక్తం భరతే విశ్వమ్ ఈశః,**
**అనీశశ్చ ఆత్మా బధ్యతే భోక్తృ భావాత్**
**జ్ఞాత్వా దేవమ్ ముచ్యతే సర్వపాశైః॥**
**(జ్ఞాత్వాత్ ఏవమ్ ముచ్యతే సర్వపాశైః)**

**ఈశ్వరుడు** - క్షర-అక్షరములను వ్యక్త-అవ్యక్తములను ఒకచోటికి తెచ్చి, ఆ రెండిటిని భరించుచు - ఈ సమిష్ఠి రూప విశ్వ స్వప్నమును అనుభవించుచున్నాడు.

**"తాను దర్శించేదంతా - తనకు తానే దృశ్యముగా విస్తరించి ఉండటం"** -అనే తన యొక్క **ఈశ్వరత్వమును ఏమరచిన** పరమాత్మ..., స్వకీయ కల్పనా చమత్కారమగు భోక్తృభావన యందు, **అను-భావన**యందు నిమగ్నమై ఉంటున్నారు. **అనీశత్వ భావనచే బద్ధుడగు చున్నాడు.** తనయొక్క కారణ కారణ స్వరూపమును, ఈశత్వ భావనను ఎరిగినప్పుడు ఈ జీవుడు **సర్వపాశముల నుండి విముక్తుడగుచున్నాడు.**

| | |
|---|---|
| **9. జ్ఞ-అజ్ఞౌ ద్వాః అజా ఈశ-అనీశాః।<br>అజా హి ఏకా భోక్తృ-భోగ్యార్థయుక్తా,<br>అనంతశ్చ ఆత్మా విశ్వరూపో హి అకర్తా<br>త్రయం యదా విందతే బ్రహ్మమ్ ఏతత్॥** | ఈశ్వరుడు .... సర్వజ్ఞుడు.<br>జీవుడో .... అల్పజ్ఞుడు.<br>ఈ ఇద్దరు కూడా<br>భోక్తృ → భోగ్య → యుక్తులే!<br>ఈ జీవుడు - ఈశ్వరుడు కూడా జన్మ వికారములు లేనివారే!<br>**"భోక్త-భోగము-భోగించబడునది"**.... అనునవిగా ఏదైతే 'తనవి'గా కలిగియుండి ఆ మూడిటిని ఆస్వాదిస్తోందో..., **అదియే బ్రహ్మము.**<br>అనంతాత్మ - విశ్వరూపము -అకర్త - ఈ మూడు బ్రహ్మముయొక్క విశేషణములు. స్వాభావిక లక్షణములు. |
| **10. క్షరం, ప్రధానమ్ అమృత అక్షరగ్ం హరః<br>క్షరాత్మా నావీశతే దేవ ఏకః<br>తస్య అభిధ్యానాత్ యోజనా తత్త్వ వాదాత్<br>భూయశ్చ అంతే విశ్వ మాయా నివృత్తిః॥** | **క్షరము** - అనగా మార్పు చెందునది. **'ప్రధానము', 'మాయ'** అని కూడా అంటారు.<br>**అక్షరము** - మార్పు చెందనిది. అమృతము. తదితరమును మార్పు చెందింపజేస్తూ కూడా, తాను మార్పు చెందదు.<br>**హరుడు** - అవిద్యను హరించువాడు. సర్వమును నియమించువాడు. **తత్త్వస్వరూపుడు** - పరమాత్మ.<br>క్షర-అక్షరములకు ఆవల ఉన్నట్టి ఆ తత్ స్వరూప పరమాత్మను తత్త్వవేత్తలు ప్రవచిస్తున్నారు. అట్టి పర (ఆవల) బ్రహ్మమును ఎరిగినప్పుడు విశ్వమాయ నివృత్తి అగుచున్నది. |
| **11. జ్ఞాత్వాత్ ఏవగ్ం (జ్ఞాత్వాదేవగ్ం) సర్వపాశ అపహానిః।<br>క్షీణైః, క్లేశైః జన్మ-మృత్యుః ప్రహాణిః।<br>తస్య అభిధ్యానాత్ తృతీయమ్ దేహ భేదే<br>విశ్వైశ్వర్యమ్ కేవల ఆప్తకామః॥** | సర్వ జీవుల సహజ స్వరూపమయి, క్షరాక్షరములకు ఆవల సర్వదా ప్రకాశించుచున్నట్టి - **పరమాత్మ స్వరూపము**ను ఎరిగిన తరువాత...,<br>- సర్వ పాశములు (బంధములు) నశిస్తాయి.<br>- జనన-మరణ రూప క్లేశములన్నీ క్షీణిస్తాయి.<br>అట్టి జీవ-ఈశ్వరులకు ఆవల తృతీయుడై (మూడవవాడై) వెలుగొందు పరమాత్మను ఎవడు ధ్యానిస్తాడో... అట్టివాడు **'నేను దేహమును'** అనే భౌతిక దేహబంధత్వమును అధిగమించి వేస్తున్నాడు. **విశ్వమంతా తన ఐశ్వర్యముగా దర్శిస్తున్నాడు. ఆప్తకాముడగుచున్నాడు.** |
| **12. ఏతత్ జ్ఞేయం నిత్యమేవ ఆత్మ సగ్గ్‌స్థం<br>న అతః పరమ్ వేదితవ్యగ్ం హి కించిత్।<br>భోక్తా భోగ్యమ్ ప్రేరితారమ్ చ మత్వా<br>సర్వమ్ ప్రోక్తమ్ త్రివిధమ్ బ్రహ్మమ్ ఏతత్॥** | తనయందే అనునిత్యముగా సంస్థితుడై సర్వమును (జీవ-ఈశ్వర చమత్కారములను) ప్రకాశింపజేయుచున్న **పరమాత్మయే తెలుసుకొనవలసిన వాడు.** ఇక అంతకు మించి వేరుగా తెలుసుకొనవలసినది ఏదీ కించిత్ కూడా లేదు.<br>- భోక్త అయినట్టి ఈ జీవుడు.<br>- భోగ్యవస్తువై, ఈ ఎదురుగా గల ప్రపంచము.<br>- ఆ రెండిటికి ప్రేరకుడగు ఈశ్వరుడు.<br>ఈ మూడు వేరు వేరుగా కనిపిస్తున్నప్పటికీ, బ్రహ్మమే ఈ మూడుగా అజ్ఞానదృష్టికి కనిపిస్తోంది. జ్ఞానముచే ఈ మూడు **"ఏకము-అఖండము అగు బ్రహ్మమే"** - అని తెలియవస్తోంది. |

| | |
|---|---|
| **13. వహ్నేః యథా యోనిగతస్య మూర్తిః<br>న దృశ్యతే, నైవ చ లింగనాశః<br>స భూయ ఏవ ఇంధన యోని గృహ్యః<br>తద్వా ఉభయం వై ప్రణవేన దేహే॥** | రెండు కొయ్య చెక్కలను (కట్టెలను) ఒరిపిడి చేస్తే (అరణి) అగ్ని పుడుతోంది. అనగా? అగ్ని కట్టెలలో దాగి ఉన్నది.<br>కట్టెలను కళ్ళతో చూస్తే అందులో అగ్ని ఉన్నట్లుగా గాని, ఆ కట్టెలలో అగ్ని ధర్మాలుగాని అగుపించవు. ఈవిధంగా ఇంధనములలో అగ్ని దాగి ఉన్నట్లు, ఈ దేహమునందు పరమాత్మ తన అనంత చిదానంద-సర్వకారణ, స్వకారణ తత్త్వసమన్వితులై తనయొక్క అనంతశక్తిని ప్రదర్శించక, మౌనముగా ఉన్నారు. అంతరమున దాగి ఉన్న అట్టి దివ్యమగు పరమాత్మను - **"ప్రణవోపాసన"** అనే జీవ-ఈశ్వరభావ కట్టెల ఒరిపిడిచే ప్రజ్వలింపజేయాలి! (కర్తవ్యమ్ దైవమాహ్నికమ్). |
| **14. స్వదేహమ్ అరణిం కృత్వా<br>ప్రణవమ్ చ ఉత్తర-అరణిమ్<br>ధ్యాన నిర్మథన-అభ్యాసాత్<br>దేవం పశ్యేత్ నిగూఢవత్॥** | అంతరాత్మయై సర్వదా రహస్యంగా హృదయంలో ప్రకాశిస్తున్న ఆ పరమాత్మను దర్శించాలి. ఎట్లా?<br>❋ ఈ **దేహము**ను (సాధనముగా) క్రింద కొయ్యగాను,<br>❋ **ప్రణవము**ను పై కొయ్యగాను (ఉత్తర ఆరణిగాను) - చేసి,<br>❋ **ధ్యానము** - అనే అభ్యాస రూపమై నిర్మథనము (ఒరిపిడి)తో హృదయములోనే దర్శించాలి! |
| **15. తిలేషు తైలమ్, దధినీవ సర్పిః,<br>ఆపః స్రోతః, స్వరణీషు చ అగ్నిః<br>ఏవమ్ ఆత్మ ఆత్మని జాయతే అసౌ<br>సత్యేన ఏనం తపసా యో అనుపశ్యతి॥** | ➢ నువ్వులలో నూనె ఉన్నది. అయితే గానుగ ఆడితేనే లభిస్తుంది.<br>➢ పెరుగులో నేయి ఉన్నది. చిలికి వెన్న తీసి కాచితేనే పొందబడుతుంది.<br>➢ ఆకారం కలిగియున్న తరంగాలలో నిరాకారమగు జలమున్నది. వివేకము చేతనే ఇది గమనించగలం!<br>➢ అరణి (కొయ్య)లో అగ్ని దాగి ఉన్నది. ఒరిపిడి చేతనే అది బహిర్గతమై కాంతిని - వేడిని ప్రసాదించగలదు.<br>(అరణి = యజ్ఞవిధానంలో మధించి నిప్పును పుట్టించే కొయ్య)<br>అట్లాగే 1) సందర్భమాత్ర సత్యమును అధిగమించి స్వాభావికమగు శాశ్వత సత్యమును ఆశ్రయించటం 2) తపన రూపమైన **తపస్సు**.... ఈ రెండింటి చేతనే **హృదయాంతరంగుడగు పరమాత్మను దర్శించి**, ఈ సర్వము **పరమాత్మ స్వరూపంగా ఈ జీవుడు చూడగలుగుతాడు.** |
| **16. సర్వ వ్యాపినమ్ ఆత్మానమ్<br>క్షీరే సర్పిరివ అర్పితమ్<br>ఆత్మవిద్యా తపో మూలం,<br>తత్ బ్రహ్మోపనిషత్ పరమ్॥<br>తత్ బ్రహ్మోపనిషత్ పరమ్ ॥ఇతి॥** | **స్వస్వరూపము - సహజరూపము - సర్వసాక్షి అగు ఆత్మ**<br>- పాలలో వెన్నవలె **జాగ్రత్-స్వప్న-సుషుప్తి దృశ్యములందు అంతటా సమస్తమును** వ్యాపించి ఉన్నట్టిది. అటువంటి ఆత్మ గురించిన విద్య - తపస్సుచే తనే (తద్విషయమై తపన రూపమగు తపనపూర్వకమైన, ప్రయత్నము చేతనే) లభిస్తోంది. **ఆ పరమగు పరబ్రహ్మమే సర్వదా సామీప్యమును పొందవలసిన శాశ్వత వస్తువు!**<br>**ఆత్మకు అన్యంగా ఏది పొందితే ఏమి లాభం? ఎంత వరకు లాభం?**<br>***ఇతి ఉపనిషత్!*** |

## ద్వితీయోధ్యాయః (బ్రహ్మవాదుల సంభాషణము)

**1.** **ఓం। యుంజానః ప్రథమమ్**
**మనః తత్త్వాయ సవితా ధియః**
**అగ్నే - జ్యోతిః నిచాయ్య**
**పృధివ్యా అధ్యాభరత్॥**

**2.** **యుక్తేన మనసా వయం**
**దేవస్య సవితుః సవే**
**సువర్గే యాయ శక్త్యా।**

మొట్టమొదటగా - ఈ మనస్సును ఉత్తమమైన బుద్ధితో ఇంద్రియ విషయముల నుండి ఉపశమింపజేస్తూ....,

సంవిత్ (సత్ + విత్) స్వరూపుడు, 'ఓం'కార స్వరూపుడు అగు పరమాత్మయందు..., నియమించాలి. అందుకొరకై అగ్ని - జ్యోతిల ఉపాసనచే భౌతిక తత్త్వమును అధిగమించే నిత్యోపాసనలో నిమగ్నమయి ఉంటున్నాము.

అట్టి సవిత్రు (సత్-విత్-బుత్) దేవతయగు పరమాత్మయందు మనో లగ్నము చేసే నిమిత్తమై, సత్సంగ పూర్వకంగా సువర్గము (ఆత్మజ్ఞులను) ఆశ్రయించటానికి మేము ప్రయత్నశీలురమగుచున్నాము.

---

**3.** **యుక్త్వాయ మనసా దేవాన్ సువర్యతో ధియా దివమ్,**
**బృహత్ జ్యోతిః కరిష్యతః సవితా ప్రసువాతి తాన్॥**

ఆ సవిత్రు దేవత వాత్సల్యముతో మనస్సును పరమాత్మయందు ఏకాగ్రము చేసే బుద్ధిని మాకు ప్రసాదించును గాక! అందుకొరకై బృహత్ జ్యోతిని (జ్యోతిర్జ్యోతి-స్వయం జ్యోతిని) దర్శింపజేసి అనుగ్రహించును గాక!

---

**4.** **యుంజతే మన, ఉత యుంజతే ధియో విప్రా,**
**విప్రస్య బృహతో విపశ్చితః।**
**విహోత్రాదధే వయునా విదేక**
**ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః॥**

వేద విప్రులు - మహనీయులు, బృహత్ అగు బ్రహ్మమును దర్శించు ఆశయము గల వారై తమయొక్క చిత్తమును బ్రహ్మ దర్శనమునందే నిలుపుచూ ఏకాగ్రం చేస్తున్నారు. 'సవిత్రు' అను శబ్దముచే చెప్పబడువాడు, బృహత్ స్వరూపుడు అగు పరమాత్మను విపశ్చితులు (విశేష దార్శనికులు) సందర్శిస్తున్నారు. **"సర్వ వ్యాపకుడు, సర్వే సర్వత్రా పరివేష్టించియున్నవాడు, మహితాత్ముడు అగు పరమాత్మయే ఈ సమస్తము"** - అని వివేకముచే ఎరుగుచున్నారు.

---

**5.** **యుజే వాం (యుంజేవాం) బ్రహ్మపూర్వ్యమ్**
**నమోభిర్వి శ్లోకాయన్తి పథ్యేవ సూరేః**
**<u>శృణ్వన్తు విశ్వే। అమృతస్య పుత్రా!</u>**
**<u>ఆయే ధామాని దివ్యాని తస్థుః॥</u>**

మేము దేవతలకు - సృష్టికర్తకు కూడా మునుముందే ఉన్నట్టి పరమాత్మను స్తుతిస్తూ నమస్కరిస్తున్నాము. తత్త్వవేత్తలగు, విజ్ఞులగు **సూరులు-వైతాళికులై, మమ్ములను నిదురలేపుచున్నారు.**

ఓ అమృతస్వరూపులారా! ఆ "దివ్యమగు ఆత్మ" అను దివ్య ధామమును చేరుటకై ఆత్మతత్త్వ గానమును వినిపిస్తున్నాము. వినండి. మనస్సును నిలపండి.

---

**6.** **అగ్నిః యత్రా <u>అభిమథ్యతే,</u>**
**వాయుః యత్రా <u>అభియుంజతే,</u>**
**సోమో యత్రా <u>అతిరిచ్యతే,</u>**
**తత్ర సంజాయతే మనః॥**

ఓ మనో బుద్ధులారా!

మీయొక్క ఉత్పత్తి స్థానము ఏది? ఆత్మయే। అగ్ని ఏ తేజో తత్త్వమునందు వెలుగొందుచున్నదో, వాయువు ఎద్దానిచే ప్రేరితమై చలిస్తోందో, ఏది చంద్ర లోకమును అధిగమించినదై ఉన్నదో... అట్టి ఆత్మనుండి ఆత్మకు భిన్నంగా ఉన్నట్లుగా - మనస్సు జనిస్తోంది. (వాస్తవానికి మనస్సు ఆత్మకు అభిన్నమే అయి ఉన్నది).

---

**7.** **సవిత్రా పసవేన జుషే**
**తత్ బ్రహ్మ పూర్వ్యమ్**
**తత్ర యోనిం కృణవసే సహితే**
**పూర్వమ్ అక్షివత్॥**

కారణకారణుడు, సవిత్రు (సత్-విత్) రూపుడు, సృష్టి-సృష్టికర్తల కంటే కూడా పురాతనుడు అగు దృక్స్వరూప పరబ్రహ్మమును సేవించు చున్నాము. ఈ జన్మ-కర్మల రూపమగు సంసారము నుండి విముక్తిని పొందటానికి - **"సృష్టికే యోని (జన్మ స్థానము) అగు పరబ్రహ్మమును ధ్యానించటం, ఉపాసించటం, ఎరగటము"** - తప్పితే వేరు మార్గమే లేదు.

**8. త్రిః ఉన్నతగ్ంం (త్రిరున్నతగ్ంం) స్థాప్య**
**సమం శరీరమ్, హృది**
**ఇంద్రియాణి మనసా సంనివేశ్య।**
**బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్**
**స్రోతాంసి సర్వాణి భయావహాని॥**

అట్టి పరబ్రహ్మమును ధ్యానించటానికి మార్గము? యోగధారణ! అది ఎట్లా? శిరస్సు-కంఠము-శరీరము... ఈ మూడిటినీ కూడా సమానముగాను, నిలువుగాను, నిశ్చలముగాను నిలపాలి.

- ఇంద్రియములను, ఇంద్రియ విషయముల మననరూపమగు మనస్సును 'హృదయము'నందు స్థాపించాలి. (నా హృదయమునందే అవన్నీ ఉన్నాయి కదా... అనే భావనను ఆశ్రయించటమే హృదయమునందు స్థాపించటం).

బ్రహ్మముగా ఈ సర్వమును భావించాలి. సంసార సముద్రములో గల భయావహమగు జనన-మరణ తరంగాలను దాటివేయాలి.

---

**9. ప్రాణాన్ ప్రపీడ్యే హ స యుక్త చేష్టః**
**క్షీణే ప్రాణే నాసికయా ఉచ్ఛ్వసీత,**
**దుష్టాశ్వయుక్తమ్ ఇవ వాహమేనమ్**
**విద్వాన్ మనో ధారయేత్ అప్రమత్తః॥**

ఒక రథికుడు రథం అధిరోహించాడు. రథసారధి రథమును నడుపుతూ ఉన్నాడు. రథం అడ్డ-దిడ్డంగా, బహు ప్రమాదయుక్తంగా పోతోంది. "ఏమిటిరా ఇది?" అని తెలివితో అంతా రథికుడు పరిశీలించాడు. "ఆహా! ఈ గుర్రములు పెంకివి. చెడ్డవి. చెప్పినమాట వినక ఇష్టం వచ్చినట్లు రథమును లాగుచున్నాయి" అని గమనించాడు. ఇక, గట్టి కళ్లెములతో గుర్రములను అదుపు పెట్టి, శ్రద్ధ వివేకములతో వశం చేసుకొని రథం నడిపి గమ్యం చేర్చనారంభించాడు. ఆ రీతిగా.... యుక్తాహార - విహార - ప్రాణ యోగాభ్యాసములతో ఈ ప్రాణములను నిరోధించి, ప్రాణాయామముతో ప్రాణ కదలికలను వశం చేసుకోవాలి. అట్టి ప్రాణయామ రూప అభ్యాసముతో అప్రమత్తతగా మనస్సును వశం చేసుకొని **'ఆత్మభావన'** యందు ధారణ చేయాలి. నిలపాలి. అనగా **"సమస్తము ఆత్మ ప్రదర్శనమే"** అనునది స్వానుభవమే సిద్ధించుకోవాలి. ('మనస్సు' అనే దుష్ట- అశ్వమును శ్వేతాశ్వతరం చేయాలి).

---

**10. సమే శుచౌ శర్కరా వహ్ని వాలుకా**
**వివర్జితే శబ్ద జలాశ్రయాదిభిః**
**మనో-అనుకూలేన తు చక్షు పీడనే**
**గుహా నివాత ఆశ్రయణే ప్రయోజయేత్॥**

**ప్రాణాయామము:** ఆత్మతత్త్వ ధ్యానము కొరకై యోగాభ్యాసము కొనసాగించటానికి ప్రదేశముయొక్క సానుకూల్యత సహకారి కారణము. **యోగము అభ్యసించే ప్రదేశము.**

- ఎత్తుపల్లాలు లేనిదై,
- పరిశుభ్రంగా ఉన్నదై,
- గులకరాళ్ళు - అగ్ని - యిసుక లేనట్టి (ఊడ్చిన) ప్రదేశమై,
- జలాశయధ్వనులు, వీధి ధ్వనులు వినబడనట్టివై,
- మనస్సుకు అనుకూలంగా అనిపించేదై,
- ఏకాంతంగా ఉండి,
- పెనుగాలులు వీచనిదై -

***ఉండటము అధిక ప్రయోజనకరము.***

---

**11. నీహార ధూమ అర్క అనల అనిలానామ్**
**ఖద్యోత విద్యుత్ స్ఫటిక శశీనామ్**
**ఏతాని రూపాణి పురస్సరాణి**
**బ్రహ్మణి అభివ్యక్తికరాణి యోగే॥**

యోగాభ్యాసం చేస్తూ ఉండగా చిత్త వృత్తి - అనుభూతులయొక్క దశలు ఏ రీతిగా ఉంటాయి?

- మొట్టమొదట అంతా చల్లగాను, మంచు ప్రదేశమువలెను,
- తరువాత నీటిలోంచి - మంచు పొగవలె,
- క్రమంగా అగ్నివలె ఉష్ణత్వము, వెచ్చదనము,
- ఆ తరువాత మెఱుపు తీగల కాంతివలెను,
- అటుపై స్ఫటికమును చూస్తున్న అనుభవమువంటిదిగా,
- అక్కడినుండి పున్నమి వెన్నెల కాంతివంటి అనుభూతిగాను,

.... ఇటువంటివి బ్రహ్మ భావనకు అభివ్యక్తములు. **"యోగసిద్ధి ప్రవృద్ధమౌతోంది"**.... అని అనుకోవటానికి గుర్తులు. సంజ్ఞలు.

| | |
|---|---|
| **12. పృథ్వ్యః - అప్ - తేజో - అనిల - ఖే**<br>**సముత్థితే పంచాత్మకే**<br>**యోగ గుణే ప్రవృత్తే।**<br>**న తస్య రోగో, న జరా,**<br>**న మృత్యుః ప్రాప్తస్య**<br>**యోగాగ్నిమయమ్ శరీరమ్।** | ఈ జడమగు భౌతిక దేహము **భూమి, జలము, అగ్ని/తేజస్సు, వాయువు, ఆకాశము** .... అనే పంచ భూతములతో తయారైనది. యోగాభ్యాసము శ్రద్ధగా కొనసాగిస్తూ ఉండగా, ఈ జడ దేహము యోగాగ్నిచే నింపబడుచూ, యోగశక్తిచే ఉత్తేజితమౌతుంది. యోగాభ్యాసము చేయువాని దేహము యోగాగ్నిమయమై దూదిపింజమువలె తేలికగా అగుచూ ఉంటుంది. అట్టి యోగికి రోగము, వార్ధక్యము, మృత్యువు... ఇవి బాధించవు. |
| **13. లఘుత్వం, ఆరోగ్యం, అలోలుపత్వం,**<br>**వర్ణప్రసాదం, స్వరసౌష్ఠవం చ,**<br>**గంధః శుభో మూత్ర-పురీషం అల్పమ్,**<br>**యోగ ప్రవృత్తిం ప్రథమాం వదంతి॥** | యోగాభ్యాసము యొక్క ప్రభావంచేత మొదటగా శరీరము మృదువుగాను, తేలికగాను, ఆరోగ్యవంతంగాను, లౌకికమైన ఆశలకు ఆకర్షణలకు లోనుకానట్టిదిగాను, ప్రకాశమానముగాను అగుచున్నది. శరీర సౌష్ఠవం వృద్ధి చెందుతోంది. కంఠధ్వని స్పష్టత పొందుతుంది. దేహమంతా సుగంధముతో వ్యాపిస్తుంది. సమీపించినవారికి కూడా యోగుల యొక్క దేహ సుగంధము అనుభవమౌతూ ఉంటుంది. మూత్రము. పురీషము అల్పమై దుర్గంధరహితమౌతాయి. ఇవి యోగాభ్యాసమునందు ప్రవృత్తమగువారిలో మొట్టమొదట కనిపించు **సులక్షణములు.** |
| **14. యథైవ బింబం, మృదయోపలిప్తం**<br>**తేజోమయమ్, భ్రాజతే తత్సుధాంతమ్,**<br>**తద్వా ఆత్మ తత్త్వమ్ ప్రసమ్ ఈక్ష్య దేహీ**<br>**ఏకః కృతార్థో భవతే వీతశోకః॥** | వెండి-బంగారు-పంచలోహ విగ్రహాలు మకిలిగా ఉన్నప్పుడు ఇల్లాలు ఏం చేస్తుంది? కచ్చిక-మట్టి మొదలైన వాటితో పూసి, రాపిడి చేసి నిర్మల జలంతో కడిగి పరిశుభ్రం చేస్తుంది. అట్లా చేసినప్పుడు ఆ విగ్రహాలు తళతళ మెరుస్తూ పవిత్రంగా అగుచున్నాయి కదా!<br><br>అట్లాగే, ప్రాణయామము, ధారణ, మంత్రోపాసన - ఇత్యాది యోగసాధనలచే హృదయం నిర్మలమౌతోంది. ఆ యోగి (దేహి) ఆత్మ సందర్శనం చేసినవాడై అద్వితీయుడు, కృతార్థుడు, శోక వివర్జితుడు అగుచున్నాడు. |
| **15. యదా ఆత్మతత్త్వేన తు బ్రహ్మతత్త్వం దీపోపమే**<br>**న ఇహ యుక్తః ప్రపశ్యేత్,**<br>**అజమ్, ధ్రువగ్ం, సర్వ తత్త్వైః విశుద్ధమ్**<br>**జ్ఞాత్వా దేవమ్ ముచ్యతే సర్వ పాశైః।** | యోగాభ్యాస ప్రభావంచేత ఆ యోగియొక్క అంతఃకరణము బ్రహ్మతత్త్వము నందు క్రమంగా లీనమై, నిశ్చల దీపంవలె ప్రకాశిస్తుంది. ఆతడు ఆత్మస్వరూపుడై ప్రకాశిస్తూ **'యుక్తుడు'** అని పిలువబడుచున్నాడు.<br><br>ఆ యుక్తుడు క్రమక్రమంగా జన్మరహితము, ధృవము, సర్వతత్త్వ స్వరూపము. విశుద్ధము అగు **ఆత్మ భగవానుని స్వస్వరూపముగా తెలుసుకొన్నవాడై, సర్వపాశముల నుండి విముక్తుడగుచున్నాడు.** |
| **16. ఏష హి దేవః ప్రదిశో అనుసర్వాః**<br>**పూర్వోహి జాతః స ఉ గర్భే అంతః।**<br>**స ఏవ జాతః, స జనిష్యమాణః**<br>**ప్రత్యఙ్ జనాం తిష్ఠతి సర్వతో ముఖః॥** | (యోగసాధనచే అనుభవమగు చున్నట్టి) ఆ పరమాత్మ...., సర్వ దిక్కులా-ఉప దిక్కులా వ్యాపించియున్నవారు. ఈ జీవునియొక్క జన్మలన్నిటికీ మునుముందే, జన్మలకు కర్మలకు ఈవల-ఆవల ప్రకాశించుచున్నట్టివారు.<br><br>ఆ ఆత్మ భగవానుడే, **సర్వమును జనింపజేస్తూ, సర్వముగా జనించుచున్నవారు కూడా!** సర్వ జీవుల స్వరూపుడై, సర్వులకు సర్వమునకు వేరై అన్ని వైపులా ఆనంద-తేజోమూర్తియై విలసిల్లుచున్నారు. అందరికి అభిముఖుడుగా విశ్వతోముఖంగా ఉన్నారు. |
| **17. యో దేవో అగ్నౌ, యో అప్సు,**<br>**యో విశ్వం, భువనమ్ అవివేశ,**<br>**య ఓషధీషు, యో వనస్పతిషు,**<br>**తస్మై దేవాయ నమో నమః॥** | ఏ **ఆత్మ దేవుడైతే** అగ్నియందు, జలమునందు, విశ్వమంతా, భూమియందు, భూమిలో పరివేష్టితమైన ఓషధుల-వనస్పతుల రూపంగాను **సర్వతోముఖుడై, సర్వస్వరూపుడై** వేంచేసి యున్నారో - అట్టి **స్వస్వరూపుడు-సర్వస్వరూపుడు, దేవదేవుడు** అగు పరమాత్మకు **నమో నమః। నమో వాక్కములు! నమస్కారము!** |

## తృతీయోధ్యాయః - ఏకో హి రుద్రో। న ద్వితీయాస్థు।

ఓం।

**1. య ఏకో జాలవాన్ ఈశత ఈశనీభిః।**
**సర్వాన్ లోకాన్ ఈశత ఈశనీభిః।**
**య ఏవ ఏక ఇహ ఉద్భవే - సంభవే చ**
**య ఏతత్ విదుః అమృతాః తే భవంతి॥**

అఖండము-ఏకము అగు పరమాత్మ మాయా విష్టుడై తన విశ్వశక్తితో
- సర్వమును నియమించువారు,
- నియమించబడుచున్నవారు కూడా అగుచు...

**ఈ సర్వలోకములను వ్యాపింపజేస్తూ, సర్వలోకములుగా వ్యాపించి ఉన్న వారగుచున్నారు.**

ఆయనే.... ఇదంతాగా
- ఉద్భవించుచున్నవారు!
- ఉద్భవింపజేయుచున్నవారు కూడా!

అట్టి పరమాత్మను ఎరిగినప్పుడు ఆ యోగి (జీవుడు) **అమృత స్వరూపుడు** అగుచున్నాడు. జన్మ - జరా - మృత్యు పరిధులను దాటివేసిన వాడగుచున్నాడు.

---

**2. ఏకో హి రుద్రో, న ద్వితీయాయ తస్థుః**
**యః ఇమామ్ లోకాన్ ఈశత ఈశనీభిః।**
**ప్రత్యఙ్ జనాం తిష్ఠతి (ఈ) సంచుకో చ**
**అంతకాలే సగ్ంసృజ్య విశ్వా భువనాని గోపాః॥**

రుద్రభగవానుడు ఒక్కడే! ఆయనకు ద్వితీయమనునది ఎక్కడా ఏదీ లేదు. ఆయనయే స్వశక్తిచే దృశ్యమంతా విస్తరింపజేస్తూనే దృశ్యస్వరూపుడై కూడా ఉన్నారు. నియమించువారు, నియమించబడునది కూడా ఆయనయే! అంతేకాదు. అందరిలోను **ప్రత్యక్ ఆత్మ స్వరూపుడై** ఉన్నారు. ఇదంతా పరిపోషిస్తూ, ప్రళయ కాలమునందు అంతా తనయందు విలీనము చేసివేసుకుంటున్నారు.

---

**3. విశ్వతః చక్షుః, ఉత విశ్వతో ముఖో,**
**విశ్వతో బాహుః ఉత విశ్వః పాత్,**
**సం బాహుభ్యాం గ(ద)మతి సంపత త్రైః,**
**తత్రైః ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః॥**

పరమాత్మయగు ఆ రుద్రభగవానుడు ఆకాశము-భూమి-అంతరాళమును సృష్టిస్తూ **సర్వత్ర ద్రష్టయై దర్శిస్తున్నారు.** దృశ్యములు కూడా ఆయనయే! అంతటా **ముఖములు కలవాడు. ఏక స్వరూపుడై** కూడా అనేక **రూపములతో** ప్రకాశిస్తున్నారు. అనేక బాహువులు కలిగి, అనేకములుగా పాదములు కలిగి, అనేక సమావేశములు కల్పిస్తున్నారు. ఆ బాహువులతో **అనేక సేవా కార్యక్రమములు** నిర్వర్తిస్తూ, ఆకాశము-భూమి-జీవులుగా అగుచూ కూడా.... **సర్వదా ఏక - అఖండ - అక్షర స్వరూపుడు!**

---

**4. యో దేవానామ్ ప్రభవశ్చ-ఉద్భవశ్చ,**
**విశ్వాధిపో, రుద్రో, మహర్షిః।**
**హిరణ్యగర్భమ్ జనయామాస పూర్వగ్ం**
**స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు॥**

ఏ పరమాత్మ సమస్త దేవతా సంపదలను **ప్రభవింపజేస్తూ** ఉన్నారో, సకల దేవతలకు **ఆదికారణులో,** ఈ విశ్వమునకు ఆవల ఉండి సర్వమును **పరిపాలిస్తున్నారో,** రుద్రుడుగా **సృష్టి-స్థితి-లయములను నిర్వర్తిస్తున్నారో,** మహర్షిగా సర్వజ్ఞుడై పరమసత్యమగు **బ్రహ్మమును గానం చేస్తూ** ఉన్నారో, హిరణ్యగర్భుడై, సృష్టికి పూర్వమే ఉండి, **సర్వమును సృష్టిస్తున్నారో, అట్టి రుద్రభగవానుడు మాకు శుభమగు నిర్మల బుద్ధిని ప్రసాదించుదురు గాక!**

---

**5. యాతే రుద్ర శివా తనూః**
**అఘోరా-అపాప కాశినీ,**
**తయా నః తనువా శంతమయా**
**గిరిశంత! అభిచాకశీ హి॥**

హే రుద్రభగవాన్! మంగళకరము - శివము అగు మీ దేహము సూక్ష్మాతి సూక్ష్మము. స్మరించినంత మాత్రముచేత మాయొక్క పాప బుద్ధులను తొలగించి పవిత్ర బుద్ధిని ప్రసాదించునట్టిది. సుఖము-శాంతము-ఆనందము-కైవల్యము ప్రసాదించునట్టిది. ఓ పర్వతరాజా! రక్షించండి. అల్పబుద్ధుల నుండి మమ్ము కాపాడండి!

**6. యామిషుం గిరిశంత హస్తే (వి) బిభర్ష్యస్తవే,**
**శివాం గిరిత్రతాం కురు మా హిగ్ంసీః పురుషం జగత్॥**

పర్వతవాసివై (కొండమీద నిలుచున్న విలుకాడివై) మమ్ములను రక్షించటానికి చేతిలో ధనస్సు ధరించి ఉన్నారు. ఆ మీ బాణములను మంగళప్రదములుగా చేసి మమ్ములను రక్షించండి. మమ్ములను ఈ దృశ్య-జగత్తు బాధించకుండా, దీనిని మాపట్ల ప్రశాంత-సుఖమయంగా చేయండి!

---

**7. తతః పరం బ్రహ్మ, పరం బృహంతమ్,**
**యథా నికాయం సర్వ భూతేషు గూఢమ్,**
**విశ్వస్యైకం (విశ్వస్య ఏకం) పరివేష్టితారమ్,**
**ఈశమ్ తం జ్ఞాత్వా అమృతా భవంతి॥**

ఆ **పరబ్రహ్మమూర్తి** - ఈ విశ్వముకంటే **మహత్తరము-ప్రత్యేకము** అయినవారు. సర్వజీవాత్మలలోను **అంతర్యామి**గా వ్యాపించి ఉన్నవారు. సర్వత్రా స్వస్తి స్వరూపులుగా ఈ విశ్వమంతా తనయొక్క బృహత్-ఏకరూపము నందు లీనమొనర్చుకొని, పరివేష్ఠించి ఉన్నవారు. సర్వ నియామకులు, పర్యవేక్షకులు అగు ఆ మహాదేవుని ఎవరు (భక్తి-యోగ-ధ్యాన-సర్వ సమర్పణ మార్గాలలో) తెలుసుకొంటారో, వారు మృత్యు పరిధులను అధిగమించి అమృత స్వరూపులు అగుచున్నారు. (మహనీయుల - సద్గురువుల మహత్తరమగు ఆత్మతత్త్వ జ్ఞాన బోధామృత ప్రభావంచేత) స్వయమమృత స్వస్వరూపులుగా సందర్శనమగుచున్నారు.

---

**8. వేద అహమ్ ఏతమ్ పురుషమ్ మహాన్తమ్,**
**ఆదిత్య వర్ణమ్, తమసః పరస్తాత్।**
**తమ్ ఏవ విదిత్వా అతి మృత్యుమ్ ఏతి।**
**న అన్యః పంథా విద్యతే అయనాయ।**

".... ఆదిత్య (ఆది-తత్-యత్-సర్వమునకు మొదలే, సర్వమునకు ఆవల ఉన్నట్టి) జగత్ ప్రదర్శన స్వరూపుడగు **ఆదిత్యవర్ణులు,** అజ్ఞానమనే తమస్సుకు పరమై ప్రకాశించువారు, **తమ్ మహత్ పురుషమ్** - ఆ మహత్ స్వరూపుడు" అగు ఆత్మపురుషుని (పరమపురుషుని) మేము తెలుసుకొనుచున్నాము. ఎవ్వరిని తెలుసుకొన్న తరువాత మృత్యువు యొక్క పరిధి నుండి దాటిపోతామో అది తెలుసుకొంటున్నాము. **మృత్యువును అధిగమించటానికి ఆత్మను ఎరుగుటయే మార్గము. అందుకు వేరే త్రోవలేదు.**

---

**9. యస్మాత్ పరమ్–న అపరమ్(న) అస్తి కించిత్,**
**యస్మాత్ న అణీయో, న జ్యాయో అస్తి కశ్చిత్,**
**వృక్ష ఇవ స్తబ్ధో, దివి తిష్ఠతి ఏకః**
**తేన ఇదమ్ పూర్ణమ్ పురుషేణ సర్వమ్॥**

ఎవ్వరైతే (ఈవల - ఆవల తానే అయి ఉండటంచేత) పరము-అపరము లేనివాడయి ఉన్నారో,

- ఎవ్వరి సమక్షంలో అయితే అణువుగాని - అతి పెద్ద వస్తువు గాని తనకు వేరై లేదో...,

- ఎవ్వరైతే జగత్ క్రీడా విషయములను **తనకు తానే కల్పించుకొని ఆస్వాదిస్తూ,** తాను వాస్తవానికి సర్వమునకు ఆవల వృక్షమువలె **స్తబ్దుడై ఉన్నారో - అట్టి పరమాత్మ చేతనే ఇదంతా పూర్ణమై ఉన్నది!**

---

**10. తతో యత్ ఉత్తర తరమ్**
**తత్ అరూపమ్, అనామయమ్,**
**య ఏతత్ విదుః అమృతాః తే భవంతి।**
**అథ ఇతరే దుఃఖమేవ అపి యంతి॥**

ఎవ్వరైతే... ఈ జగత్ దృశ్యములో కనిపించే కార్యకారణములతో సహా-సర్వమునకు వేరై ఉన్నారో, సర్వరూపములు తానే అయి, తాను మాత్రం రూపరహితుడో..., నామ రూపరహితుడో... **అట్టి పరమాత్మను తెలుసుకుంటే అట్టివాడు జనన-మరణ రహితుడు, అమృత స్వరూపుడు** అగుచున్నాడు.

***ఇక ఇతరములైనవి ఎన్ని తెలుసుకున్నప్పటికీ దుఃఖము తొలిగేది కాదు! ఏమీ లాభం లేదు। ఉండదు।***

---

**11. సర్వ ఆనన శిరో గ్రీవః**
**సర్వభూత గుహ ఆశయః**
**సర్వ వ్యాపీ స భగవానగ్ం**
**తస్మాత్ సర్వగతః శివః॥**

ఆ పరమాత్మ ఈ సమస్త ముఖములు, శిరస్సులు, కంఠములు తానే అయి ఉన్నట్టివారు.

- సర్వ జీవుల హృదయ గుహలలో సర్వదా నివసిస్తున్నట్టివారు.
- సర్వమునందు వ్యాపించి ఉన్నట్టివారు.
- సర్వమును మంగళప్రదము చేస్తున్న సర్వగత స్వరూపులు.

***నా హృదయ గుహలో సత్యమై, నిత్యమై, సర్వదా వేంచేసి ఉన్నారు. ఆ పరమశివునికి, సదాశివునికి నమస్కరిస్తున్నాం!***

**12. మహాన్ ప్రభుర్వై పురుషః**
**సత్త్వస్య ఏష ప్రవర్తకః,**
**సు నిర్మలామ్ ఇమామ్ ప్రాప్తిమ్**
**ఈశానో జ్యోతిః అవ్యయః**

ఆ సర్వాంతర్యామి, సర్వగతుడు అగు ఆ పరమశివుడు...,

- జగత్ దృశ్యములో ప్రత్యక్షమగుచున్న ఈ జీవునియందు వేంచేసియున్న **మహత్తర వస్తువు. మహాన్ స్వరూపుడు.**
- సర్వమునకు **ప్రభువు** (నియామకుడు, యజమాని, సొంతదారు).
- ఈ సమస్త లోకములు **తనయొక్క పురుషకారమే** అయి ఉన్నవారు.
- **'ఉనికి'** అనే కేవల సత్ స్వరూపుడు. ఆయనకు వేరైనదంతా ఆయన యొక్క కల్పితమే అయినట్టివాడు.
- సమస్తమును ప్రవర్తింపజేయువాడు. **ప్రేరణ** స్వరూపుడు.
- **నిత్య నిర్మలుడు.** అంతా పొందుతూ కూడా నిర్మలత్వమే సహజ రూపముగా కలవాడు.
- సర్వత్రా, అంతటా తానే విస్తరించి ఉన్నట్టి **ఈశానుడు.**
- స్వయం-జ్యోతి స్వరూపుడు.
- మార్పు-చేర్పులకు ఆవలివాడు. అవ్యయుడు.

---

**13. అంగుష్ఠమాత్రః పురుషో అంతరాత్మా**
**సదా జనానాగ్ం హృదయే సన్నివిష్టః।**
**హృదామ్ అన్వీశో మనసా అభిక్లప్తో**
**య ఏతత్ విదుః అమృతాః తే భవంతి॥**

అటువంటి బొటనువేలు (అంగుష్ఠ) మాత్రుడగు పరమపురుషుడు ఎక్కడున్నారు? సర్వ జీవుల హృదయ గుహలలో సర్వదా ప్రత్యుత్సాహ రూపంగా వేంచేసి యున్నారు. హృదయంలో పొగలేని అగ్నివలె తేజోమయుడై విరాజిల్లుచూ, **'మనస్సు' అనే పళ్లెముచే మూయబడి ఉన్నారు.** ఎవ్వరు తమ హృదయంలో ప్రకాశిస్తున్న ఆ ఆత్మభగవానుని బుద్ధితో తెలుసుకుంటారో..., అట్టివారు **అమృతస్వరూపులు అగుచున్నారు.**

---

**14. సహస్రశీర్షా పురుషః**
**సహస్రాక్షః సహస్ర పాత్।**
**స భూమిమ్ విశ్వతో వృత్వా**
**అత్యతిష్ఠతి దశాంగులమ్॥**

ఆ ఆత్మభగవానుడు వేలాది శిరస్సులతోను, కళ్ళతోను, పాదములతోను విరాజిల్లుచూ, ఈ భూమితో సహా విశ్వమంతా దశ దిశలా వ్యాపించి, ఇదంతా తనయందు ఉన్నవారై-దీనిని అధిగమించి కూడా 10 అంగులముల పర్యంతము ఉన్నారు. **(ఆత్మ పురుషుడనగు నేను - నాకు కనబడే విశ్వమంతా నిండి ఉండి, ఇదంతా అధిగమించిన వాడనై ఉన్నాను. ఇతి సోఽహమ్).**

---

**15. పురుష ఏవ ఇదగ్ం సర్వమ్**
**యత్ భూతమ్, యచ్చ భవ్యమ్।**
**ఉత-అమృతత్వస్య ఈశానో**
**యత్ అన్నే నాతిరోహతి॥**

ఇప్పుడు ఉన్నది, ఇతఃపూర్వము ఉన్నది, ఇకముందు విశ్వ స్వరూపముగా ఉండబోయేది... అంతా ఆ పరమపురుషుడే! ఆయనకు వేరై ఎక్కడా ఏదీ లేదు. ఆయన అన్నము రూపముగా (ఆహారముగా) ఇంద్రియములకు అనుభవమగు విషయములను ప్రేరేపిస్తున్నారు.

ఇదంతా జనిస్తూ లయించుచూ తిరిగి పరబ్రహ్మ స్వరూపముగానే అగుచున్నది. ఇదంతా కూడా ఆ అమృత స్వరూపుడగు ఈశానుడే! ఆయన నుండే! ఆయన యందే! ఆయనగానే! **ఇది బుద్ధి గ్రహిస్తే ఇక సంసారములోనికి తిరోగమనం ఉండదు.**

---

**16. సర్వతః పాణి-పాదమ్ తత్।**
**సర్వతో అక్షి-శిరో-ముఖమ్।**
**సర్వతః శృతిమత్ లోకే**
**సర్వమ్ ఆవృత్య తిష్ఠతి॥**

ఆ పరమ పురుషుడే సర్వుల యొక్క చేతులు - చేతలు, పాదములు-నడకలు. ఆయన సర్వత్రా నేత్రములు, శిరస్సులు, ముఖములు, చెవులు (వినికిడి) కలిగి యుండి సర్వమునందు ఆక్రమించుకొని సర్వముగా ఉన్నారు. (కథకు కథారచయిత లాగా!).

---

**17. సర్వేంద్రియ గుణాభాసగ్ం।**
**సర్వేంద్రియ వివర్జితమ్।**
**సర్వస్య ప్రభుమ్ ఈశానగ్ం।**
**సర్వస్య శరణగ్ం సుహృత్॥**

ఆ పరమాత్మయే దేహములలో సర్వ - ఇంద్రియ - గుణములను ప్రకాశింపజేయుచు, వాటికి సంబంధించక....., వేరై ఉన్నారు. అవన్నీ లేనివారై ఉన్నారు. కానీ, సర్వ దేహముల ఇంద్రియములుగాను, త్రిగుణములుగాను భాసిస్తున్నది - ఆయనయే! "అయినా కూడా, ఆయన భావాతీతుడు. భావములన్నిటికీ మునుముందే ఉన్నవారు.

సర్వమునకు ప్రభువుగాను, సర్వమునందు విస్తరించి ఉన్నవారుగాను, సర్వజీవులకు శరణాగతి స్థానముగాను, సహృదయులై సర్వులను కరుణిస్తూ సర్వము ప్రసాదించుచున్నవారుగాను, ఆ ఆత్మభగవానుని అర్థం చేసుకుంటూ తత్త్వార్థ మననము చేస్తూ ఉపాసించాలి.

**18. నవద్వారే పురే దేహీ**
**హంసో లేలాయతే బహిః**
**వశీ సర్వస్య లోకస్య**
**స్థావరస్య - చరస్య చ॥**

ఆత్మ భగవానుడు నవ ద్వారములతో కూడిన ఈ దేహములో అణువణువు 'సోఽహమ్' భావనచే ('నేను' అను భావనచే) నిండి ఉన్నారు. అంతేనా? లేదు. బాహ్యమంతా కూడా..., **"హమ్ సో-సోఽ హమ్-నేను - నేను"**... అను తత్త్వమై అంతటా అన్నిటా నిండి ఉన్నారు. ఈ స్థావర- జంగమాత్మకమగు జాగరూకమైనదంతా తనయొక్క వశమునందు కలిగియుండి, ఎట్లు భావిస్తే, ఆ రీతిగా అనుభూతి పొందుచూ ఆయన వేంచేసి ఉన్నారు.

---

**19. అపాణి పాదో జవనో గ్రహీత,**
**ఆపశ్యత అచక్షుః సః శృణోతి-అకర్ణః**
**స వేత్తి వేద్యం, న చ తస్య అస్తి వేత్తా।**
**తమ్ ఆహుః అగ్ర్యం పురుషమ్ - మహాన్తమ్॥**

- ఆయనకు చేతులు లేవు. కానీ అన్నీ స్వీకరిస్తున్నారు!
- పాదములు లేవు. కానీ అంతటా సంచరిస్తున్నారు.
- కనులు లేవు. కానీ అంతా చూస్తున్నది ఆయనే!
- చెవులు లేవు. కానీ అంతా వింటున్నది ఆయనయే!
- ఆయన తెలియబడేవారు కాదు. కానీ అంతా తెలుసుకుంటూ ఉన్నది ఆయనయే! ఇదంతా ఆయన రచనయే।

స్వస్వరూపుడగు ఆత్మ దేవుని **అగ్రగణ్యుడగు మహత్తర-పరమ పురుషునిగా దర్శిస్తూ ఉపాసించుచున్నాము.**

---

**20. అణోః అణీయాన్, మహతో మహీయాన్,**
**ఆత్మా గుహాయాం నిహితో అస్య జంతోః**
**తమ్ అక్రతుం పశ్యతి వీతశోకో**
**ధాతుః ప్రసాదాత్ మహిమానమ్ ఈశమ్॥**

- సూక్ష్మాతి సూక్ష్మమగు పరమాణువు కంటే కూడా ఎంతగానో **సూక్ష్మాతిసూక్ష్ముడు.**
- మహత్తరమగు కొండ-భూమి-గాలి-అగ్ని-జలము-ఆకాశములకంటే మహత్తరమైనవాడు.
- ఆ ఆత్మ పురుషుడు ఈ జీవులందరి హృదయ గుహలలోనే పరమ ప్రశాంతుడై దాగి ఉన్నారు.

సామాన్య దృష్టికి పంచభూతములు, దేహము, మనో-బుద్ధి-చిత్త-అహంకారములు కనిపిస్తున్నాయి. కర్మలకు సంబంధించనివాడు, పురాణ పురుషుడు, మహా మహితాత్ముడు, ఈశ్వరుడు అగు ఆ ఆత్మదేవుని (సర్వము ఆత్మ భగవానుని ప్రదర్శనముగా) దర్శించువాడు - సర్వశోకములను త్యజించి దుఃఖరహితుడగుచున్నాడు. **(తరతి శోకమ్ ఆత్మవిత్)।**

---

**21. వేదాహమ్ ఏతమ్ అజరమ్ పురాణమ్,**
**సర్వాత్మానగ్ం, సర్వగతమ్ విభుత్వాత్,**
**జన్మ నిరోధమ్ ప్రవదంతి యస్య**
**బ్రహ్మవాదినో హి ప్రవదన్తి నిత్యమ్॥**

**ఇతి తృతీయోఽధ్యాయః**

మహనీయులగు బ్రహ్మతత్త్వజ్ఞులు అనునిత్యంగా **"సర్వాత్ముడు-సర్వగతుడు-విభుడు-జన్మకర్మల నుండి పునీతము చేయువాడు"** - అగు ఏ పరబ్రహ్మము గురించి ఈవిధంగా ఎలుగెత్తి చెప్పుచున్నారో, అట్టి జరామరణములకు ఆవల సర్వదా ప్రకాశిస్తున్న పురాణ పురుషుడే ఈ జగత్ రూపంగా వెలుగొందుచున్నాడని మేము (బహ్మవేత్తల అనుభవానుసారంగా) తెలుసుకొంటున్నాము.

ఇదంతా బ్రహ్మముగా తెలుసుకొంటూ దర్శిస్తున్నాము. దర్శిస్తూ జగదీశ్వర స్వరూపంగా ఈ జగత్తును ఉపాసిస్తున్నాము. **బ్రహ్మమే మేమగుచున్నాము. తద్బ్రహ్మమహమేవ।**

**ఇతి తృతీయోఽధ్యాయః**

## చతుర్థోఽధ్యాయః - ఏకో ఇదమ్।

ఓం

**1. య ఏకో అవర్ణో బహుధా శక్తియోగాత్**
**వర్ణాన్ అనేకాన్, నిహితార్థో దధాతి**
**విచ ఏతి చ అంతే విశ్వమ్ ఆదౌ స దేవాః**
**స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు॥**

ఏక స్వరూపుడు, అవర్ణుడు (వర్గభేద రహితుడు), స్వతఃగా **వేరు జీవజాతులు** అనే భేదమే కించిత్ కూడా లేనివారు - అగు పరమాత్మ తనయొక్క శక్తియోగ చమత్కారముచేత జీవజాతి భేదములన్నీ కల్పించుచున్నారు. అపేక్ష లేకుండానే నానా జీవజాతిని-వస్తు ధర్మాలను రచించుచూ, పరిరక్షిస్తున్నారు. చివరికి తనయొక్క జాతి భేద రహిత స్వస్వరూపమునందు సర్వ వస్తు-జాతి భేదములను లయింపజేసు కుంటున్నారు. నిత్య ప్రకాశ స్వరూపుడు, సృష్టి-స్థితి-లయకారుడు అగు **ఆ పరమాత్మ మాకు శుభము - శోభాయమానము అగు బుద్ధిని ప్రసాదించి, మమ్ములను సర్వ భ్రమలనుండి పరిరక్షించుదురు గాక!**

---

**2. తదేవ అగ్నిః। తత్ ఆదిత్యః।**
**తత్ వాయుః। తదు చంద్రమాః।**
**తదేవ శుక్రమ్। అమృతమ్ తత్ బ్రహ్మ।**
**తత్ ఆపః। స ప్రజాపతిః॥**

**సృష్టి-స్థితి-లయ కారకుడగు ఆ పరమాత్మయే...,**

- అగ్ని స్వరూపుడై సర్వము జీవమయము - తేజోమయము చేస్తున్నారు.
- ఆయనయే **యతః ఆది** - ఆదిస్వరూపుడగు **ఆదిత్యుడు.** సర్వజీవులకు త్రాణయగు **సూర్యుడు.**
- ఆయన 'శుక్రమ్' - **పరమశుద్ధ స్వరూపుడు. కేవలుడై సర్వ జీవుల స్వస్వరూపంగా వెలుగొందుచున్నారు.**
- మార్పు చేర్పులు లేనట్టి **అమృతస్వరూపుడు.**
- ప్రతి జీవునికి సంబంధించినట్టి **'బ్రహ్మము'** అని చెప్పబడుచున్న **అత్యుత్తమ వస్తువు.**
- ఆయనయే జీవాధారమగు **జలము. రసస్వరూపుడు.**
- ఆయనయే సృష్టికర్తయగు **ప్రజాపతి.**

---

**3. త్వగ్ం స్త్రీ, త్వమ్ పుమాన్ అసి।**
**త్వమ్ కుమార ఉతవా కుమారీ।**
**త్వమ్ జీర్ణో దండేన వంచసి।**
**త్వమ్ జాతో భవసి సర్వతోముఖః॥**

ఓ పరమాత్మా! పరబ్రహ్మమా! నమో నమో నమో నమః।

- ఈ స్త్రీ-పురుష-పుత్ర-పుత్రికా రూపములుగా మాకు కనిపిస్తున్నది మీరే స్వామీ!
- అప్పుడే పుట్టిన బిడ్డ-పిల్లవాడు-యువకుడు-మధ్య వయసువాడు-ముసలివాడు కూడా మీరే! వంగిన నడుముతో జీర్ణ కర్రను చేబూని నడుస్తున్నది కూడా మీరే!
- అన్నివైపులా అన్ని రూపములుగా జనిస్తున్నది మీరే! మీ నుండే సర్వ లోకములు బయలుదేరుచున్నాయి. మేమంతా మీరే అయి ఉన్నాము.

---

**4. నీలః పతంగో, హరితో లోహితాక్షః।**
**స ఉద్గర్భ ఋతవః సముద్రాః।**
**అనాదిమత్వమ్ విభుత్వ ఏన వర్తసే**
**యతో జాతాని భువనాని విశ్వా॥**

- నీలి ఇత్యాది రంగుల కనులతో మెరుస్తున్న తుమ్మెద మీరే!
- ఎర్రని కన్నులు, ఆకుపచ్చ రంగు రెక్కలు గల చిలక రూపము మీరే!
- మేఘములలోని ఇంద్ర ధనస్సు, వసంత-గ్రీష్మ ఆదిగా గల ఋతువులు, సముద్రము... ఇవన్నీ మీ తత్త్వములే!
- మీరు ఆద్యంత రహిత స్వరూపులు. అందుచేత ఇవన్నీగా వర్తిస్తూ కూడా, దీనికంతటికీ విడిగా **విభు స్వరూపులై ప్రవర్తిస్తున్నారు.** ఎందులోనించి భూమి-విశ్వము బయల్వెడలుచున్నాయో అదియే మీరు! జలము నుండి తరంగములవలె - 'నేను-నీవు'తో సహా - ఈ సమస్తము మీనుండే బయల్వెడలుచున్నది.

**5. అజామ్ ఏకాగ్ం లోహిత శుక్ల-కృష్ణామ్**
**బహ్వీః ప్రజాః సృజమానాగ్ం సరూపామ్**
**అజో హి ఏకో జుషమాణో అనుశేతే**
**జహాతి ఏనాం భుక్త భోగామ్ అజో అన్యః॥**

ఆ దేవాదిదేవుడు - తాను జన్మరహితము, ఏకము-అరూపము అయి ఉన్నారు. పరస్వరూపుడగు ఆత్మ భగవానుడు తనయొక్క కల్పనా చమత్కారముచే సరూపము, ఇహరూపము అగు విజ్ఞాన-అజ్ఞానములతో కూడిన శుక్ల (తెలుపు) - కృష్ణ (నలుపు) జీవసమూహములను సృజియించుకుంటూ వినోదిస్తున్నారు. **ఏకము, జన్మ రహితము అగు తత్త్వమే - అనేకము, జన్మ సహితము అగు జీవాత్మల వ్యవహార రూపంగా ప్రదర్శనమౌతోంది.** తనయొక్క అనుభవము- అనుభూతి రూపమగు సృష్టినంతా కల్పించుకొంటూ, తాను సర్వదా యథాతథమై, అన్యము-పరము అయి (స్వప్న ద్రష్టవలె) వెలుగొందుచున్నది.

---

**6. ద్వా సుపర్ణా సయుజా సఖాయా**
**సమానం వృక్షమ్ పరిషస్వజాతే।**
**తయోః అన్యః పిప్పలగ్ం స్వాద్వత్,**
**అనశ్నన్ అన్యో అభిచాకశీతి॥**

ఈవిధంగా పరబ్రహ్మమే జీవాత్మ, పరమాత్మలుగా (ఈశ్వరుడుగా) ప్రకాశితమగుచున్నది.

(ఈ దేహము-అనే) వృక్షముపై రెండు పక్షులు నివసిస్తున్నాయి. అవి అన్యోన్య స్నేహభావముచే ఒక దానిని మరొకటి వదలక (వ్యాఖ్యాన స్వరూపము) ఉంటున్నాయి.

- ఒక పక్షి **అనుభూతి - అనుభవము** అనే ఫలములను ఆస్వాదిస్తూ కొమ్మలపై వ్రాలుతోంది. ఎగురుతోంది. కుప్పి గంతులు వేస్తోంది కూడా.
- ఇక రెండవ పక్షియో, **దేనినీ అనుభవించకయే** అంతాకూడా కేవలము **సాక్షీభూతంగా** చూస్తూ ఉన్నది. (మౌన స్వరూపము).

---

**7. సమానే వృక్షే పురుషో నిమగ్నో**
**అనీశయా శోచతి ముహ్యమానః।**
**జుష్టమ్ యదా పశ్యతి అన్యమ్ ఈశమస్య**
**మహిమానమ్ ఇతి వీతశోకః॥**

'జీవపురుషుడు' - అనబడే పక్షి ఆయా స్వీయకల్పితమగు అనుభూతములలో నిమగ్నమై, వాటిచే మోహించబడుచున్నది. తనయొక్క ఈశ్వరత్వమును **(తానే తన ఈ కల్పనకు కారణమై, కల్పనరూపంగా ఉంటున్నాననే విషయం)** పూర్తిగా ఏమరచి, **అనీశుడై** అనేక దుఃఖాలు పొందుచున్నది.

ఈ జీవపురుష నామధేయుడగు పక్షి, **"తన సంబంధితుడే 'ఈశ్వర పురుషుడు"** అను - (చెట్టుపై మౌనంగా చూస్తూ ఉన్న) రెండవ పక్షియొక్క **మహిమ** ఏమిటో **తెలుసుకొన్నప్పుడు**, ఆ జీవాత్మ పక్షియొక్క దుఃఖాలన్నీ తొలగుచున్నాయి. **ఏమరచినప్పుడో?** దుఃఖాలు కొనసాగుచున్నాయి.

---

**8. ఋచో అక్షరే పరమే వ్యోమని**
**యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః,**
**యః తత్ న వేద, కిం ఋచా కరిష్యతి?**
**య ఇత్ తత్ విదుః త ఇమే సమానతే॥**

ఈశ్వర స్వరూపుడగు పరమాత్మ **పరమసత్యము. అక్షరుడు. పరాకాశ స్వరూపుడు.** దేవతలంతా అట్టి కేవలసాక్షి - అప్రమేయుడు అగు ఈశ్వరునినే ఆశ్రయించి ఉంటున్నారు. అట్టి పరమాత్మను తెలుసుకోకుండా వేదపాఠములుగాని, మరింకేదైనా గాని-ఏమి తెలుసుకొని ఏమి ప్రయోజనం? ఆ ఆత్మ ప్రభువును తెలుసుకుంటే ఇక తెలుసుకోవలసిన దేముంటుంది? సమస్తము తెలిసినట్లే అగుచున్నది. ఆయన గురించి తెలియకపోతే ఏమీ తెలియనట్లే!

---

**9. ఛందాగ్ంసి యజ్ఞాః క్రతవో వ్రతాని**
**భూతం-భవ్యం యత్ చ వేదా వదంతి।**
**అస్మాత్ మాయీ సృజతే విశ్వమేతత్**
**తస్మిగ్ంశ్చ, అన్యో మాయయా సన్నిరుద్ధః॥**

ఆ అక్షర పరబ్రహ్మమునుండియే చతుర్వేదములు, యజ్ఞములు, క్రతువులు, వ్రతములు, భూత-వర్తమాన-భవిష్యత్ కాలములు, ఈ తెలియబడుచున్న సర్వము జనిస్తున్నాయి. ఆ అక్షరుడే ఈ విశ్వమంతా తనయొక్క మాయాశక్తిచే సృష్టించుకొనుచున్నారు. ఈ విశ్వమంతా ఆ పరమాత్మయొక్క మాయయే గాని, మరింకేమీ కాదని గమనించబడు గాక! ఇదంతా కూడా "సత్" నుండి బయల్వెడలుచున్న 'నిరుద్ధమే'। (విశేషమే)!

**10.** మాయాంతు ప్రకృతిమ్ విద్యాత్
మాయినంతు మహేశ్వరమ్।
తస్య అవయవ భూతైస్తు
వ్యాప్తగ్ం సర్వమ్ ఇదమ్ జగత్॥

మాయయే ప్రకృతి స్వరూపము. ఈ మాయ ఎవరిదో...., ఆతడే మహేశ్వరుడు- సర్వ స్వరూపుడగు ఆ పరమేశ్వరుని మాయా కల్పితమగు అవయవముల చేతనే ఈ జగత్తంతా వ్యాప్తమైయున్నది.

ఏకమగు పరమాత్మయే ఈ సకల యోనులయందు వేంచేసి ఉన్నారు. ఇదంతా ఆయనయందే మరొకప్పుడు సంచయనము అగుచున్నది.

---

**11.** యో యోనిం-యోనిం అధితిష్ఠతి ఏకో,
యస్మిన్‌ను ఇదగ్ం సంచవిచైతి సర్వమ్,
తమ్ ఈశానమ్ వరదం దేవమ్ ఈఢ్యమ్
నిచాయ ఇమాగ్ం శాంతిమ్ అత్యంతమ్ ఏతి॥

అట్టి సర్వముగా విస్తరించియున్న **ఈశానుడు,** సర్వులకు సర్వమును ప్రసాదిస్తున్నట్టి **వరదుడు,** దేవాదిదేవుడు అగు ఆ **ఈశ్వర దర్శనముచే ఈ జీవాత్మ పరమశాంతిని పొందుచున్నాడు.**

---

**12.** యో దేవానామ్ ప్రభవశ్చ-ఉద్భవశ్చ,
విశ్వాధిపో రుద్రో మహర్షిః,
హిరణ్యగర్భమ్ పశ్యతి జాయమానగ్ం,
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు॥

ఏ దేవాది దేవుడు దేవతల ఉత్పత్తి-ప్రభవములకు కారణభూతులో, ఈ విశ్వమును అధిగమించి ఉన్నారో, ఆరుద్రుడు మహర్షులకు మునుముందే ఉన్నారో, ఈ సృష్టికి ప్రారంభంలో సృష్టికర్త రూపధారియై సృష్టికర్తను సృష్టించినవాడగుచున్నారో - అట్టి **ఆ పరమేశ్వరుడు మాకు శుభ ప్రదమగు నిర్మల బుద్ధిని ప్రసాదించును గాక!**

---

**13.** యో దేవానామ్ అధిపో యస్మిన్ లోకా అధిశ్రితాః,
య ఈశే అస్య ద్విపదః - చతుష్పదః
కస్మై దేవాయ హవిషా విధేమ॥

- ఏ ఆత్మ దేవుడు దేవతలకు కూడా అధిపతి అయి ఉన్నారో,
- ఎవరియందైతే ఈ లోకములన్నీ అధిష్ఠితమై, అలంకరించబడినవై ఉన్నాయో....,
- ఏ ఈశ్వరుడు రెండుకాళ్ళ మానవులకు, నాలుగుకాళ్ళ జంతువులకు నియామకుడో....,

**అట్టి ఆ పరంధామునకు హవిస్సులు సమర్పించుకుంటున్నాము.**

---

**14.** సూక్ష్మాతి సూక్ష్మమ్, కలిలస్య మధ్యే
విశ్వస్య స్రష్టారమ్ తమ్ అనేక రూపమ్॥
విశ్వస్య ఏకమ్ పరివేష్టితారమ్
జ్ఞాత్వా శివమ్ శాంతిమ్ అత్యంతమ్ ఏతి॥

ఆ ఆత్మభగవానుడు ఈ లోకాలన్నీ ఆక్రమించి సూక్ష్మాతి సూక్ష్మమై ఉన్నట్టివాడు। తానే అనేక రూపములను ధరిస్తూ, ఈ విశ్వమంతా సృష్టించుచున్నట్టి వాడు।

కలిల ( ఎవ్వరూ ప్రవేశించజాలని) స్థానమందు ఉన్నవారు.

ఈ విశ్వమంతా తానే అయినట్టి ఏకస్వరూపుడు! విశ్వమంతా యథా తథ రూపుడై విస్తరించి పరివేష్టించుచూ ఉన్నవారు!

అట్టి పరమాత్మ సర్వశుభములు ప్రసాదించువారు. అట్టి శివమయ భగవానుని తెలుసుకున్నంత మాత్రం చేతనే ఆత్యంతికమైన శుభము-శాంతి ఈ జీవునకు ప్రాప్తించగలదు. తెలుసుకున్నంత మాత్రంచేత ఈజీవుడు శివుడే అవుతున్నాడు.

---

**15.** స ఏవ కాలో, భువనస్య గోప్తా,
విశ్వాధిపః సర్వభూతేషు గూఢః
యస్మిన్ ఉక్తా బ్రహ్మర్షయో దేవతాశ్చ
తమేవమ్ జ్ఞాత్వా మృత్యు పాశామ్ శ్ఛినత్తి॥

ఆయనయే **కాలస్వరూపుడు.** ఈ భూమండలమంతా ఆయనయొక్క సంరక్షణచేతనే నిలచియున్నది. **సర్వ రక్షకుడు.** ఈ విశ్వమునకు **అధిపతి.** సర్వజీవుల హృదయములలో **అంతర్యామి.** సమస్త దేహములలో **రహస్యముగా దాగి ఉన్నట్టివారు.** దేవతలు, బ్రహ్మర్షులు ఆయనకు స్తోత్రములు సమర్పించుచున్నారు. అట్టి పరమాత్మను ఎరిగినప్పుడు ఈ జీవుని మృత్యుపాశములు తెగిపోతున్నాయి. **అట్టి జీవుడు అమృత స్వరూపుడు అగుచున్నాడు. మృత్యువుచే మార్పు-చేర్పులు పొందని తన రూపము ఆస్వాదించుచున్నాడు.**

---

**16.** ఘృతాత్ పరమ్ మండమివ అతి సూక్ష్మమ్
జ్ఞాత్వా శివగ్ం సర్వభూతేషు గూఢమ్,
విశ్వస్తి ఐక్యమ్ పరివేష్టితారమ్
జ్ఞాత్వాత్ ఏవమ్ (జ్ఞాత్వా దేవం) ముచ్యతే సర్వ పాశైః॥

పెరుగులో నేయి వలె అందరిలో సూక్ష్మముగా రహస్యముగా దాగి ఉన్నవాడు. విశ్వమంతా ఏక స్వరూపుడై పరివేష్టించి యున్నట్టి సర్వశుభంకరుడు. అట్టి పరమశివ స్వరూపుడగు దేవదేవుని ఎరిగినప్పుడు సర్వపాశముల నుండి మనము ముక్తిని పొందుచున్నాము!

**17. ఏష దేవో విశ్వకర్మా మహాత్మా**
**సదా జనానాగ్ం హృదయే సన్నివిష్టః**
**హృదా మనీషా మనసా అభిక్లప్తో**
**య ఏతత్ విదుః అమృతాః తే భవంతి॥**

ఆ ఆత్మ భగవానుడే ఈ విశ్వమంతా నిర్మించిన విశ్వకర్మ.

సర్వజీవులలోను జీవాత్మగా వెలయుచూ, పరమాత్మ స్వరూపుడై ఉన్నవారు. సర్వజీవుల హృదయ విహారి. సర్వాత్మకుడు కాబట్టి మహాత్ముడు.

ఆయనను మనయొక్క నిర్మలమైన మనస్సుతో, సునిశితమైన బుద్ధితో - హృదయమునందే దర్శించవలసినట్టివారు.

ఎవ్వరు పరమాత్మను ఈ రీతిగా తెలుసుకొంటారో, **వారు అమృతమగు ఆత్మ స్వరూపులై ప్రకాశించుచున్నారు.**

---

**18. యదా తమ్ అస్తన్ న దివా న రాత్రిః,**
**న సత్ న చ అసత్। (శివ ఏవ కేవలః) ।**
**– అసంచ్ఛిన ఏవ కేవలః॥**
**తత్ అక్షరమ్ తత్ సవితుః వరేణ్యమ్**
**ప్రజ్ఞా చ తస్మాత్ ప్రసృతా పురాణీ॥**

అట్టి అంతర్యామి-స్వస్వరూపుడు-సర్మాత్మకుడు అగు పరమశివ దర్శనం ఎప్పుడు అయితే ఇకప్పుడు

- ❊ పగలు లేదు. రాత్రి లేదు.
- ❊ ఆ కేవలీ స్వరూపము సమక్షంలో సత్తులేదు. అసత్తు లేదు.
- ❊ శివ స్వరూపము. కేవలము స్వస్వరూపమే అది. జీవాత్మ పరిధి దాటివేసినట్టిది.
- ❊ ఆయన జీవుడు, ఈశ్వరుడు, ఇత్యాదులుగా భిన్నమగుటయే లేదు.
- ❊ అది అక్షరము. క్షరము లేనిది. సత్ + విత్ = సంవిత్ స్వరూపము.
- ❊ అందరియొక్క వరేణ్యము (ఆరాధ్య వస్తువు). అందరు ఆయనవైపే చూస్తున్నారు.
- ❊ **'ప్రజ్ఞానం బ్రహ్మ'** అనే వేద వాక్యార్థమై పూర్వాత్ పూర్వముగా, పురాణ పురుషుడుగా స్తోత్రము చేయబడుచున్నది **ఆయనయే!**

---

**19. న ఏనమ్ ఊర్ధ్వమ్, న తిర్యంచమ్,**
**న మధ్యే పరిజగ్రభత్।**
**న తస్య ప్రతిమ అస్తి**
**యస్య నామ మహత్ యశః॥**

ఆ పరమాత్మకు ఊర్ధ్వంగా గాని, అధోభాగం గాని, మధ్యలోగాని మరింకేమీ లేదు. అంతా ఆయనయే! మహత్తరమై, సర్వత్రా ప్రకాశస్వరూపమైయున్న అద్దానికి సంజ్ఞగా, గుర్తుగా, ప్రతిమారూపమై ఏదీ లేదు. ఆయనకు ఆయనయే సాటి. సమస్తము ఆయనయే అయి ఉండగా, ఆయనను దేనితో సాటిచేయగలం? దేనితో పోల్చి చెప్పుకోగలం?

---

**20. న సంధృశే తిష్ఠతి రూపమస్య।**
**న చక్షుషా పశ్యతి కశ్చన ఏనమ్।**
**హృదా హృదిస్థమ్ మనసా**
**య ఏనమేవమ్ విదుః**
**అమృతాః తే భవంతి॥**

ఆత్మ - నామ రూపాత్మకమైనది కాదు. ఇంద్రియములకు విషయమైనట్టిది కాదు. భౌతికమైన కళ్ళకు కనిపించేది కాదు.

హృదయంలో హృదయస్థుడై ఉన్న ఆత్మభగవానుని మనస్సుతో ఎవ్వరు తెలుసుకొంటారో, వారు **తత్ అమృతరూపులై విలసిల్లుచున్నారు.**

---

**21. అజాతో, జాత ఇత్యేవమ్**
**కశ్చిత్ భీరుః ప్రపద్యతే,**
**రుద్ర యత్ తే దక్షిణమ్ ముఖమ్**
**తే నమాం (తేనమాం) పాహి నిత్యమ్॥**

ఆయనకు జన్మయే లేదు. **సంసారము పట్ల భీతి చేతనే కొందరు ఆయనకు జన్మలు ఆపాదించి జన్మించినవానివలె భావించి నామ రూప ఉపాధి - ఆత్మకంగా స్తోత్రం చేస్తున్నారు.**

అట్టి పరాత్పరుడు, దక్షిణామూర్తి రూపుడగు రుద్రభగవానునకు నమస్కారము. మా మనో బుద్ధులు సంసారములో లయమవకుండా ఆ సర్వాత్మకుడగు శివభగవానుడు సంరక్షించెదరు గాక!

---

**22. మానస్తోకే తనయే ।**
**మాన ఆయుషి। మానో గోషు।**
**మానో అశ్వేషుః ఈరిషః।**
**వీరాన్మానో రుద్రభామితో**
**అవధీః హవిష్మంతః**
**సదమిత్వా హవామహే॥**

ఓ సర్వాంతర్యామీ! సర్వ తత్త్వ స్వరూపా! రుద్రభగవాన్!

- మా ఆయుష్షుకు, సంతానమునకు, మనస్సులకు, మా పశు సంపదలకు హాని-ఆపదలు కలుగకుండా సంరక్షించెదరు గాక! మా వీర్యత్వమును కాపాడెదరు గాక!

రుద్రాణీ అమ్మవారితో రుద్రభూమిలో కూడుకొన్న మీకు మేము హవిస్సులను సమర్పించుకొనుచున్నాము.

**"మమ్ములను సర్వదా అజ్ఞానము నుండి రక్షించెదరు గాక!"** అని ప్రార్థించుచున్నాము!

## పంచమోధ్యాయః - ద్వే "విద్యే-అవిద్యే"

**1. ఓం। ద్వే అక్షరే బ్రహ్మపరే తు అనంతే**
**విద్యా-అవిద్యే నిహితే యత్ర గూఢే।**
**క్షరం తు అవిద్యా హి। అమృతం తు విద్యా।**
**విద్యా-అవిద్యే ఈశతే అస్తు సో అన్యః॥**

ఆ ఏకమగు పరబ్రహ్మమునందు రెండు విశేషాలు - అక్షరమై, అనంతరూపమై ఎల్లప్పుడు ఉండి ఉంటున్నాయి.

1. అవిద్య 2. విద్య

ఈ రెండు నాశరహితములు! అపరిచ్ఛిన్నములు! నిగూఢంగా ఉన్నాయి.

**మార్పు చెందేది** = క్షరము - **అవిద్య - మృతము.**

**మార్పు చెందనిది** = అక్షరము - **విద్య - అమృతము.**

ఈ విద్య-అవిద్యలయొక్క నియామకుడై ఈశ్వరుడు వేరుగా ఉన్నారు. ఆ రెండిటికీ కేవలము సాక్షి అయి ఉన్నారు.

---

**2. యో అయోనిమ్-యోనిమ్ అధితిష్ఠతి ఏకో**
**విశ్వాని రూపాణి యోనీశ్చ సర్వాః,**
**ఋషిమ్ ప్రసూతమ్ కపిలమ్ యః**
**తమ్ అగ్రే, జ్ఞానైః బిభర్తి**
**జాయమానం చ పశ్యేత్॥**

ఈ పంచభూతములు, జీవులు వీటినన్నిటియందు అధిష్ఠించినదై ఏ పరమాత్మరూపమున్నదో...., **ఏది జన్మ రహితము కాబట్టి అయోనియో, ఈ సర్వ విశ్వ జీవులకు యోని (జన్మస్థానము) అయి ఉన్నదో...,**

- ఏ పరమాత్మ ఋషులకు, కపిలవర్ణుడు - సర్వజ్ఞుడు అగు హిరణ్యగర్భునకు కూడా **ఆయన మునుముందే ఉన్నారో...,** ఇదంతా సృష్టించిన తరువాత దీనినంతా భరించువాడు కూడా అయి ఉన్నారో.... **అట్టి పరమాత్మను జ్ఞానులు సర్వదా ఉపాసించుచున్నారు.**

---

**3. ఏకైకం జాలమ్ బహుధా వికుర్వన్**
**యస్మిన్ క్షేత్రే సగ్ంహరతి ఏష దేవః।**
**భూయః సృష్ట్వా పథయః తథేశః**
**సర్వాధిపత్యమ్ కురుతే మహాత్మా॥**

మహా మహితాత్ముడగు ఆత్మ భగవానుడు అనేక లక్షల జీవరాసులను సృష్టించుచున్నారు. సర్వ క్షేత్రములలో క్షేత్రజ్ఞుడై వెలయుచు, సృష్టి సంహార నిర్వాహకుడై ఉంటూ, ఇంతలోనే మరల మరల సృష్టిస్తూ, **సృష్టి-స్థితి-లయములు** - అనే క్రీడా వినోద తతంగాలకు ఆధిపత్యము వహిస్తున్నారు.

---

**4. సర్వా దిశ ఊర్ధ్వమ్-అధశ్చ-తిర్యక్,**
**ప్రకాశయన్ భ్రాజతే యత్ న నద్వాన్ (యద్వనద్వాన్)।**
**ఏవగ్ం స దేవో భగవాన్ వరేణ్యో**
**యోని స్వభావన్ అధితిష్ఠతి ఏకః॥**

సూర్యుడు తన ప్రకాశముచే పైన-క్రింద-వెనుక-ముందు కాంతివంతము చేస్తూ వెలుగుతో నింపివేస్తున్న విధంగా....,

శ్రేష్ఠాతి శ్రేష్ఠుడు అగు ఆ ఆత్మ దేవుడు ఏక స్వరూపుడే అయి ఉండి, స్వభావపూర్వకంగా సర్వ యోనులందు వెలుగుచూ, సర్వజీవుల హృదయాలను, ద్రష్ట-దర్శన-దృశ్యములను ప్రజ్ఞామయం చేసి వేస్తున్నారు.

---

**5. యచ్చ స్వభావమ్ పచతి విశ్వయోనిః**
**పాచ్యాగ్ంశ్చ సర్వాన్ పరిణామయే ద్యః**
**సర్వమ్ ఏతత్ విశ్వమ్ అధితిష్ఠతి ఏకో**
**గుణాగ్ంశ్చ సర్వాన్ వినియోజయేద్యః॥**

ఎవ్వరియొక్క స్వభావ (ప్రకృతి) చమత్కారముచే విశ్వయొక్క ఉత్పత్తి-పరిణామములు జరుగుచున్నాయో, ఈ విశ్వమంతా ఎవరియొక్క అధిష్ఠానము అయి ఉన్నదో, **ఆయనయే త్రిగుణముల నియామకుడు। పంచభూతముల అనుసంధానకర్త।** ఆయన నియోజించటం చేతనే విశ్వము ప్రదర్శితమగుచున్నది. ఈ దృశ్యమంతా ఒక కథ। ఆయన పాఠకుల ఆనందము కొరకై వ్రాస్తున్న కథారచయిత।

---

**6. తత్ వేద గుహ్యా-ఉపనిషత్సు గూఢమ్**
**తత్ బ్రహ్మ వేదతే బ్రహ్మయోనిమ్**
**యే పూర్వమ్ దేవా-ఋషయశ్చ**
**తత్ విదుః తే తన్మయా**
**అమృతావై బభూవుః॥**

ఆ పరమాత్మయే ఉపనిషత్తులచే విశదీకరించబడుచున్న విధంగా జీవుల గుహ్యాతి గుహ్యమగు సహజ స్వరూపం! వేద ప్రమాణమగు బ్రహ్మస్థానము. దేవతలకు, సత్యద్రష్టలగు ఋషులకు మునుముందే ఉన్నట్టి అట్టి తత్ వస్తువును - ఎరిగి ఈ జీవుడు **"అహమస్మి తత్ - నేను అదే"....** అని గ్రహించినవాడై **అమృతస్వరూపుడుగా ప్రకాశించు చున్నాడు.**

| | |
|---|---|
| **7. గుణాన్వయో యః ఫల కర్మ కర్తా।<br>కృతస్య తస్యైవ స చ ఉపభోక్తా।<br>స విశ్వరూపః త్రిగుణః త్రివర్త్మా<br>విశ్వాధిపః సంచరతి స్వకర్మభిః॥** | ఈ జీవుడు స్వతఃగా విశ్వరూపుడు. త్రిగుణములకు కల్పించుకొను వినోది. విశ్వమునకు ఆత్మగా ఆవలివాడు. ఇట్లు అయినప్పటికీ కూడా ఈ జీవాత్మ త్రిగుణములను ఆశ్రయించినవాడై కర్మలు నిర్వర్తించు కర్తృత్వము-కర్మఫలములకు భోక్తృత్వము అనుక్షణికంగా వహిస్తున్నాడు. ఇహ - పరలోకాలలో సంచారములు చేస్తున్నాడు. త్రిగుణబద్ధుడై ఉంటున్నాడు. ఆయననే 'జీవాత్మ'గా, ఈసమస్తము ఆస్వాదిస్తున్నారు కదా!<br>పరమాత్మయో? విశ్వరూపుడై, త్రిగుణములకు ఆవల ఉండి, జాగ్రత్-స్వప్న-సుషుప్తులను లీలా వినోద సంచార స్థలములుగా చేసుకొన్నవాడై ఉంటున్నారు. ఈ ఇరువురు ఏక రూపులే! |
| **8. అంగుష్ఠమాత్రో, రవితుల్య రూపః<br>సంకల్ప - అహంకార సమన్వితో యః<br>బుద్ధేః గుణేన, ఆత్మ గుణేన చ ఏవ<br>ఆరాగ్ర మాత్రో హి అపరోఽపి దృష్టః॥** | అంగుష్ఠ మాత్రుడగు పరమ పురుషుడు-సూర్యునివలె స్వయం ప్రకాశకుడు. సంకల్ప అహంకారములు **తాను కాక, తనవై, తాను వేరుగా** ఉన్నట్టివాడు.<br>బుద్ధి ఆతనిది. కాబట్టి బుద్ధియొక్క లక్షణములకంటే విలక్షణుడు. దేహ లక్షణములైనట్టి జన్మ-బాల్య-యౌవన-వార్ధక్య మరణ ధర్మములకు పరమైనవాడు.<br>ఈవిధంగా జీవాత్మ-పరమాత్మ ధర్మాలు వేరు వేరై కూడా ఇద్దరు ఇనుప శీలల వలె కలిసియే ఉంటున్నారు. అయితే ఆత్మ సర్వదా అద్వితీయమే గాని, ద్వితీయము కలిగి లేదు. |
| **9. వాలాగ్ర శత-భాగస్య, శతధా కల్పితస్య చ<br>భాగో జీవః స విజ్ఞేయః<br>స చ అనంత్యాయ కల్పతే॥** | ఈ జీవాత్మ వాస్తవానికి ఒక వెంట్రుకయొక్క చిట్టచివ్వరి కొనభాగము నూరవ వంతు విభాగముయొక్క నూరవవంతు భాగముకంటే కూడా అత్యంత సూక్ష్మాతి సూక్ష్ముడు. వాస్తవానికి అనంత రూపమగు పరమాత్మయే ఈతడు. ఇది తెలుసుకొన్నప్పుడు **ఈ జీవుడు తనయొక్క అనంతత్వమును దర్శించి బ్రహ్మానంద భరితుడగుచున్నాడు.** |
| **10. నైవ స్త్రీ, న పుమాన్ ఏషః<br>నైవ చ అయం నపుంసకః<br>యత్ యత్ శరీరమ్ ఆదత్తే<br>తేన తేన సయుజ్యతే॥** | ఈ జీవాత్మయొక్క వాస్తవ స్వస్వరూపము స్త్రీ కాదు. పురుషుడు కాదు. ఈయన **ఏ శరీరము శరీరిగా ఆశ్రయిస్తే, అది తానైనట్లు** కొద్దిసేపు భావించి తన్మయుడవటం మాత్రమే ఇక్కడ జరుగుతోంది. అజ్ఞాన దృష్టికి దేహ స్వరూపుడివలె అనిపిస్తోంది. అది అవాస్తవ దృష్టియే. దేహికి ఈ దేహత్వము, భౌతిక దేహము ఐహికమగు 'మోహము' మాత్రమే! |
| **11. సంకల్పన-స్పర్శన దృష్టి మోహైః<br>గ్రాస అంబు వృష్ట్యా చ<br>ఆత్మ వివృద్ధ జన్మ కర్మానుగ<br>అస్య అనుక్రమేణ దేహీ<br>స్థానేషు రూపాణి అభి సంప్రపద్యతే॥** | పరమాత్మయొక్క స్వకీయ మాయాశక్తిచే-అనన్యమైన కల్పనానుగతంగా రూపుదిద్దుకొన్న ఈ జీవాత్మ....,- **సంకల్పము-స్పర్శన- దృష్టి-రస-గంధ భావ పరంపరలచే మోహితుడై జల తరంగమువలె అనేక ఉపాధులలో నిమగ్నమగుచున్నాడు. జన్మ, కర్మలు, కర్మల వలన పునః జన్మ, పునఃజన్మము వలన మరల కర్మలు-ఈవిధంగా కొనసాగుతోంది.**<br>దేహి (దేహ ధారణ చేయుచున్నవాడై) దేహమును ఆశ్రయించి అన్న పానాదులు స్వీకరిస్తూ శరీరమును ప్రవృద్ధపరచుకొనుచున్నాడు. అది శిధిలమైన తరువాత మరొక దేహం। కర్మల సంబంధమైన పుణ్య-పాపానుసారంగా ఈ జీవుడు(ఆత్మగా తానున్న చోటే ఉండియే) అనేక ఆకారములగు స్థావర-జంగమ దేహములను పొందుచున్నాడు. |
| **12. స్థూలాని-సూక్ష్మాని బహూని చ ఏవ<br>రూపాణి దేహీ స్వగుణైః వృణోతి<br>క్రియా గుణైః - ఆత్మ గుణైశ్చ తేషామ్<br>సంయోగ హేతుః అపరోఽపి దృష్టః॥** | తన సత్త్వ-రజో-తమో గుణానుసారంగా, స్వకీయ సంస్కారములను అనుసరించి అనేక దేహరూపములను ఆశ్రయించుచున్నాడు. స్థూల-సూక్ష్మ గుణ సమన్వితుడై కనబడుచున్నాడు. జన్మ-కర్మ- మరణముల మధ్య చిక్కుకొన్నవానివలె అగుచున్నాడు. అపరాదృష్టిచే - అనేకసార్లు, అనేకచోట్ల, అనేక విధములైన సంయోగ-వియోగములకు బద్ధుడు అగుచున్నాడు. |

**13. అనాది-అనంతమ్ కలిలస్య మధ్యే**
**విశ్వస్య స్రష్టారమ్ తమ్ అనేక రూపమ్**
**విశ్వస్య ఏకమ్ పరివేష్టితారమ్**
**జ్ఞాత్వాత్ ఏవమ్ (జ్ఞాత్వాదేవం) ముచ్యతే సర్వపాశైః॥**

"అయ్యో! నేను ఈ జన్మ-కర్మలను దాటలేకపోవుచున్నానే! కలిలస్య మధ్యే - దోషముల కల్పనలలో చిక్కుకొని ఉన్నానే" - అని భావిస్తున్నాడు. వాస్తవానికి ఈ జీవాత్మ దేహములచేతగాని, ఇంద్రియ విషయములచేత గాని బద్ధుడు కాడు. వాటియందు చిక్కుకున్న పిట్టవంటి వాడు కానే కాదు. ఈతడు ఆద్యంత రహితుడు. ఈ మాయా మయ సంసార సాగరమునకు తానే సృష్టికర్త. అనేక రూపములను తనకు తానే కల్పించుకొనుచున్నట్టి వాడు. సర్వవ్యాపి. ఏక స్వరూపుడై విశ్వమంతా నిండి ఉండి, అట్టి స్వయం కల్పిత విశ్వమునందు సంచారములు చేయుచున్నవాడు. తానే అంతటా ఉండి, అన్నీ తానే అయి, అంతా అనుభవించుచున్నట్టివాడు. **అట్టి తనయొక్క సహజరూపమగు మహదాత్మను ఎప్పుడు గ్రహిస్తాడో అప్పుడు ఈతడు సర్వ పాశముల నుండి విముక్తుడగుచున్నాడు.**

---

**14. భావ గ్రాహ్యమ్, అనీడాఖ్యమ్**
**భావ-అభావ కరగ్ం శివమ్,**
**కలా సర్గ కరమ్ దేవమ్**
**యే విదుః తే జహుః తనుమ్॥**

ఎవ్వడైతే "నేను ఈ భౌతిక దేహమునకు మాత్రమే సంబంధించిన వాడిని కదా...!" ... అనే దేహాభిమానము వదలి...,

- 'భావన' అనే ప్రక్రియ నాచే ప్రారంభవకముందే-నేను **ఉన్నట్టి వాడను.**
- భావములు నాచే స్వీకరించబడుచూ ఉంటాయి. వదల బడుచూ ఉంటాయి.
- భావాభావములకు ఉత్పత్తి స్థానమగు శివానంద స్వరూపుడను...,
- కలన (కల్పన), సర్గము - నాయొక్క ఆత్మ విన్యాసములే -

... అని గ్రహిస్తాడో, ఈ దేహమును తానుగా ధరించి-త్యజించే వస్త్రము వంటిదిగా భావిస్తూ సర్వ దేహ జనిత భావములను తనకు వేరైనవిగా చూస్తాడో..., (షోడశ కళా సమన్వితుడగు) ఆత్మగా తనను తాను భావిస్తాడో... ఆతడు బంధ విముక్తుడే! ఆతడు దేహస్థితిని అధిగమించి వేస్తున్నాడు. "దేహి" స్థానమును ఆస్వాదిస్తున్నాడు.

---

## షష్ఠోఽధ్యాయః

ఓం॥

**1. 'స్వభావమ్' - ఏకే కవయో వదంతి।**
**'కాలమ్' - తథా అన్యే**
**తథా అన్యే పరిముహ్యమానాః।**
**దేవస్య ఏష్య మహిమాతు లోకే**
**యేన ఇదమ్ భ్రామ్య తే బ్రహ్మ చక్రమ్॥**

<u>*బ్రహ్మవాదులు తమ సంవాదమును విశ్వము-జీవాత్మ-ఈశ్వరుడు.... విషయాల గురించి ఇట్లా కొనసాగించసాగారు.*</u>

"ఈ అనంత విశ్వ సృష్టికి కారణమేమిటి? ఎవ్వరు?" అనే ప్రశ్నకు మరల మనం వద్దాం.

**'స్వభావము'** - అని కొందరు పండితుల అభిప్రాయము.

కాదు - **'కాలము'** అని మరి కొందరంటున్నారు.

ఇట్లా వేరు వేరైన పరిముహ్యమానమైన అభిప్రాయాలు ఉండవచ్చు గాక. **ఈ విశ్వము ఆత్మయొక్క మహిమయే - దీపపు కాంతిలో వస్తు ఆకారములు కనిపిస్తున్నట్లుగా!** భ్రమకు కూడా బ్రహ్మచక్రమే కారణం!

---

**2. యేన ఆవృతమ్ నిత్యమ్ ఇదగ్ం హి సర్వమ్**
**జ్ఞః, కాలకాలో, గుణీ, సర్వవిద్యః,**
**తేన ఈశితమ్ కర్మ వివర్తతే ఇహ**
**<u>పృథ్వీ-ఆపః - తేజో అనిల-ఖాని చింత్యమ్॥</u>**

ఈ విశ్వమంతా కూడా ఎవ్వనిచే ఆవృతము (ఆవరించబడినదై, కప్పబడినదై) ఉన్నదో, అట్టి పరమాత్మ:-

- కేవల జ్ఞాన స్వరూపుడు
- కాలమును కూడా నియమించునట్టివాడు
- త్రిగుణములకు ఆవల 'గుణి' స్వరూపుడు.
- సర్వజ్ఞుడు.

<u>**ఆయన యొక్క ఆలోచనా చమత్కారములే క్రియాశీలకమై**</u> - పంచభూతములు, శుభాశుభ కర్మలు, అవి నిర్వర్తించే ఈ పాంచభౌతిక దేహాలు, కర్మఫలములు, జీవుని జన్మ జన్మాంతరములుగా - వివర్తమౌతున్నాయి.

**3. తత్ కర్మ కృత్వా వినివృత్య భూయః**
**తత్త్వస్య తత్త్వేన సమేత్య యోగమ్**
**ఏకేన - ద్వాభ్యామ్ - త్రిభిః - అష్టభిర్వా**
**కాలేన చ ఆత్మగుణైశ్చ సూక్ష్మైః॥**

పరమాత్మ భగవానుడు తనయొక్క ఒకానొక 'అంశ' అగు క్రియా విశేషమును...,

**ఏకేన** ..... ఏక స్వరూపుడుగాను,

**ద్వాభ్యామ్** ..... జీవ-ఈశ్వరులు గాను,

**త్రిభిః** ...... త్రిగుణములు గాను,

**అష్టభిర్వా** ... పంచభూతములు మనస్సు బుద్ధి అహంభావన అనబడే అష్టవిధ ప్రకృతిగాను,

**కాలేన చ** .... కాల స్వరూపముగాను

విస్తరింపజేస్తూ ఉన్నారు. మరల ఈ తతంగమంతా నిర్వర్తిస్తున్న తనయొక్క **'కర్మ ప్రవృత్తి యోగము'** అనే అంశను - నివృత్తింపజేస్తున్నారు. అప్పుడిక **తనయొక్క జగత్ తత్త్వమును ఆత్మతత్త్వమునందు ఏకము-సంయోగము చేసివేస్తున్నారు.**

**'జీవాత్మ'గా అయి, ఈ జగత్తును ఆస్వాదిస్తున్నారు. కానీ, అఖండాత్మగా సర్వదా యథాతథుడు.**

---

**4. ఆరభ్య కర్మాణి గుణాన్వితాని**
**భావాగ్ంశ్చ సర్వాని వినియోజయేద్యః**
**తేషామ్ అభావే కృతకర్మ నాశః**
**కర్మక్షయే యాతి స తత్త్వతో అన్యః॥**

**అందుచేత కర్మబద్ధులమైయున్న మనం ఇప్పుడు ఏం చేయాలి?**

ఈ కర్మబంధములను త్రెంచి మోక్షభాగులం కావాలి. ఎట్లా?

సర్వభావాలు మొట్టమొదటే సర్వాత్మకుడగు పరమాత్మయందు నియమించుకొని, ఇక అటుపై మనం ప్రారంభించుచున్న త్రిగుణాత్మకములైన సర్వ కర్మలను పరమాత్మకు సమర్పిస్తూ, జగద్దృశ్యమును పరమాత్మ రూపంగా భావన చేయటమును ఆశయంగా కలిగి నిర్వర్తించాలి. ఇదియే **"అభావనా సహిత కర్మకృత్యములు"** అగుచున్నది. ఈవిధంగా, **దృశ్య అభావన-పరమాత్మ భావనా కృతంగా కర్మలు నిర్వర్తించుచుండగా కర్మ బంధాలు తొలగిపోతాయి. కృతాకృత కర్మలకు వేరై ఉన్నట్టి ఆత్మతత్త్వము నందు ప్రవేశము లభించ గలదు.**

---

**5. ఆదిః స సంయోగ నిమిత్త హేతుః**
**పరః త్రికాలాత్ అకలోఽపి దృష్టః**
**తమ్ విశ్వరూపమ్ భవ భూతమ్ ఈడ్యమ్**
**దేవమ్, స్వచిత్తస్థమ్ ఉపాస్య పూర్వమ్॥**

ఆ పరమాత్మ...,

**ఆదిః** - మొట్టమొదటే ఉన్నట్టివారు (ఏకేన).

**సంయోగః** - ద్వితీయమగు జగత్తును కల్పించుకొని సంయోగము పొందుచున్నవారు (ద్వాభ్యామ్).

**నిమిత్తహేతుః** - జగత్తుకు మూలకారణుడు. నిమిత్త కారణులు. జగత్తుగా నిమిత్త కారణులు. పరమాత్మగా ఉపాదాన కారణులు. దృష్టాంతము "కృష్ణుడు మధురముగా మురళీగానము వినిపించిరి" మురళీ = నిమిత్త కారణము, కృష్ణుడు = ఉపాదాన కారణము.

**పరః త్రికాలాత్** - త్రికాలములకు ఆవల ఉన్నట్టివాడు.

**అకలోఽపి దృష్టః** - దృశ్య రహితుడై ఉంటూనే తన కల్పనకు ద్రష్టగా ఉన్నవారు. కల్పనారహితులే అయినప్పటికీ, జగత్‌కల్పనా దృష్టులన్నీ ఆయనవే.

**విశ్వరూపమ్** - ఈ విశ్వమంతా తన రూపముగా కలవారు.

**భవభూతమ్** - పంచభూతములకు కర్త.

**ఈడ్యమ్ దేవమ్** - స్తోత్రములకు అర్హుడు.

**పూర్వమ్** - దేవతలకు కూడా పూర్వమే ఉన్నవారు.

**ఆయనను "నా హృదయమునందే ఉన్నారు కదా!" .... అను భావనతో చిత్తముతో ఉపాసించెదము గాక! హృదయములోనే ఆయనను గమనించి ఆరాధించెదము గాక!**

**6. స వృక్ష కాలాకృతిభిః పరో అన్యో
యస్మాత్ ప్రపంచః పరివర్తతే అయమ్,
ధర్మావహమ్ పాపనుదమ్ భగేశమ్
జ్ఞాత్వా ఆత్మస్థమ్ అమృతమ్ విశ్వధామ॥**

ఏ పరమపురుషుడైతే....,

- 'దృశ్యముతో పెట్టుకున్న సంబంధము' అనే **సంసార వృక్షమునకు,** - కాలమునకు కూడా **"పరము"** - (అన్యము) అయి ఉన్నారో....,
- ఎవరి వలన ఈ కనబడుచున్న ప్రపంచమంతా పరివర్తనశీలమై ఉనికిని కొనసాగిస్తోందో....,

అట్టి ఆ పరమాత్మను

.... ధర్మ రక్షకునిగాను,
.... పాప- అల్ప దృష్టులను తొలగించువానిగాను,
.... స్వహృదయ నివాసిగాను,
.... **<u>అమృత స్వరూపుడుగాను</u>**
(మరణానంతరము కూడా వెంటనంటి ఉండువాడుగాను),
.... **<u>ఈ విశ్వమునకు ఆధారుడుగాను,</u>**

**మనము తెలుసుకొన్నప్పుడు మనమే పరబ్రహ్మ స్వరూపులమై ప్రకాశిస్తున్నాము.**

---

**7. తమ్ ఈశ్వరాణామ్ పరమమ్ మహేశ్వరమ్
తం దేవతానాం పరమం చ దైవతమ్।
పతిం పతీనామ్, పరమం పరస్తాత్
విదామ దేవమ్ భువనేశమ్ ఈడ్యమ్॥**

**మన ఉపాసనకు అర్హము-పరమ సత్యము అగు ఆ పరమాత్మ ఎట్టివారు?**

- ఆయన జీవ-ఈశ్వరులకంటే పరము (ఆవల)గా ఉన్నట్టి మహేశ్వరుడు.
- దేవతలకు ఆవల (పరమై) ఉన్నట్టి దేవ దేవుడు.
- ఆయన పతికే పతి. ప్రజాపతి.
- పరమునకే పరము అయినట్టి పరాత్పరుడు. శ్రేష్ఠమునకే శ్రేష్ఠమైన వాడు. ఈ సమస్త లోకములకు ఈశుడు.
- దేవతలచే స్తుతించబడి సమస్తము ప్రసాదించువారు. జ్యోతికే జ్యోతి.
- తన భావావేశమునందే ఈ సమస్తము సిద్ధింపజేసుకొంటూ కూడా, భావాతీతుడు.

---

**8. న తస్య కార్యమ్, కరణం చ విద్యతే।
న తత్ సమశ్చ, అభ్యధికశ్చ దృశ్యతే।
పరా అస్య శక్తిః వివిధైవ శ్రూయతే,
స్వాభావికీ జ్ఞానబల క్రియా చ॥**

విద్వాంసులు ఈ రీతిగా ఆత్మ భగవానుని గానం చేస్తున్నారు.

- ఆయనకు - కరణ (ఇంద్రియ) - కార్య-కారణ-కర్తృత్వాలు లేవు.
- పరమాత్మకు సమానమైనదేదీ లేదు. ఇక అధికమైనదేది ఉంటుంది?
- ఆయనకు చెందిన పరాశక్తియే వివిధ రూపములుగా అగుచు, ఈ జగత్తులోని **నానాత్వంగా** తెలియవస్తోంది, వినవస్తోంది, కనబడుతోంది.
- ఆయన శక్తి స్వాభావికమైనది. జ్ఞాన క్రియా సమన్వితమైనది.

---

**9. న తస్య కశ్చిత్ పతిః అస్తి లోకే।
న చ ఈశితా, నైవ చ తస్య లింగమ్।
న కారణమ్ కరణాధిప అధిపో,
న (స) చ అస్య కశ్చిత్ జనితా, న చ అధిపః॥**

- ప్రభువులకే ప్రభువగు ఆ సర్వాంతర్యామి పరమాత్మకు మరొక నియామకుడెవ్వరూ లేరు. ఆయనయే సమస్తమునకు పతి.
- అంతటా వేంచేసి ఉన్న ఆయన కొరకై వెళ్ళవలసిన చోటు మరేదీ లేదు. వెతక వలసిన పని లేదు.
- నిరాకారుడగు ఆయన స్త్రీ-పుం-నపుంసకాది లింగ రహితుడు. "ఆకారము ఇది" - అనునదేదీ లేనివాడు.
- ఆయన కారణ రహితుడు. ఆయనకు కారణాధిపుడై మరొక అధిపుడు లేడు. కార్య-కారణ-కారణాధిప రహితుడు.
- ఆయనను జనింపజేసేవాడు గాని, అధిపుడు గాని ఆయనకు లేరు.

**ఆయన జనింపజేయునది ఏదీ లేదు. నిష్క్రియుడు. అట్టి సర్వస్వరూప ఆత్మ భగవానునే మనం ఉపాసిస్తున్నాము. ఉపాసించాలి.**

**10. యః తంతునాభ ఇవ తంతుభిః**
**ప్రధానజైః స్వభావతః,**
**దేవ ఏకః సమావృణోత్**
**స నో దధాతు బ్రహ్మ అవ్యయమ్॥**

ఒక సాలెపురుగు తన నుండి తానే దారములను బహిర్గతం చేస్తూ, ఆ సాలె చక్రములో తానే క్రీడగా విహరిస్తూ ఉంటుంది. సంచారము చేస్తూ ఉంటుంది. అట్లాగే, పరమాత్మ తన యొక్క ప్రప్రథమ ప్రధాన రూపమగు **'స్వభావము'** నుండి బయల్వెడలుచున్న **విశ్వతంతువులచే కప్పబడినవాడి వలె ఉంటున్నారు.** అట్టి ఏక స్వరూప దేవాది దేవుడగు ఆత్మ భగవానుడు మాకు అవ్యయమగు **'బ్రహ్మోహమ్'** స్థానమును ప్రసాదించు గాక!

---

**11. ఏకో దేవః సర్వభూతేషు గూఢః**
**సర్వ వ్యాపీ, సర్వభూతాంతరాత్మా**
**కర్మాధ్యక్షః – సర్వభూతాధివాసః**
**సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥**

ఏకము-ఏకాత్మ స్వరూపుడు అగు పరమాత్మ సర్వుల హృదయములలో రహస్యముగా (లౌకిక దృష్టికి బట్టబయలు కాకుండా) వేంచేసినవారై ఉన్నారు. దాగి ఉన్నారు.

- (స్వప్న ద్రష్టయే స్వప్నమంతా నిండి ఉన్నట్లుగా) ఆయన **సర్వవ్యాపి.** సర్వముగా వ్యాపించి ఉన్నట్టివారు.
- సర్వజీవులయొక్క **అంతరాత్మ స్వరూపులు.**
- సర్వకర్మలకు **అధ్యక్షుడు.** ఆయన సంకల్పములే సర్వ కర్మ రూపాలుగా, సమస్త ప్రదర్శనములుగా సిద్ధిస్తున్నాయి.
- సర్వభూతజాలములందు **సర్వదా నివసిస్తున్నవారు. సర్వభూతాధి వాసులు.**
- సర్వకర్మలకు - సర్వ హృదయ విశేషములకు - సర్వ కార్యక్రమములకు **కేవలసాక్షి.**
- బుద్ధికి కూడా **సాక్షి.**
- **కేవలుడు. నిర్గుణుడు కూడా!**

---

**12. ఏకో వశీ నిష్క్రియాణాం, బహూనామ్**
**ఏకగ్ం బీజం (రూపం) బహుధా యః కరోతి,**
**తమ్ ఆత్మస్థమ్ యే అనుపశ్యంతి ధీరాః**
**తేషాగ్ం సుఖమ్ శాశ్వతమ్। నేతరేషామ్ (న-ఇతరేషామ్)॥**

నిష్క్రియుడు - ఏకరూపుడు అగు పరమాత్మ ఏక స్వరూపుడైయ్యే ఉండి, **తనను తాను అనేక రూపములుగా ప్రదర్శించుకొనుచున్నారు.** ఏకరూపుడై యుండి, అనేక రూపములుగా ప్రదర్శితుడు అగుచున్న ఆ పరమాత్మను ఎవరు **తమయందే గమనించి గుర్తించి, దర్శించి మమేకమగుచున్నారో..., వారియొక్క సుఖమే శాశ్వతము, తదితరులది శాశ్వతమైన సుఖము కాదు.** (విషయముల నుండి, ద్వితీయమునుండి లభించే సుఖము అశాశ్వతము, దుఃఖ మిశ్రితము కూడా!).

---

**13. నిత్యో (అ)నిత్యానామ్, చేతనః చేతనానామ్,**
**ఏకో బహూనామ్ యో విదధాతి కామాన్,**
**తత్ కారణగ్ం సాంఖ్యయోగ అది-గమ్యమ్।**
**జ్ఞాత్వాత్ ఏవమ్ (జ్ఞాత్వా దేవం) ముచ్యతే సర్వపాశైః॥**

ఏదైతే అనిత్యమైన దేహాలలో గుణములతో అంతర్లీనంగా నిత్యమై యున్నదో..., నిత్యుడగు జీవునిలో సర్వదా నిత్యముగా, ప్రకాశమానమో,

- కదిలే వస్తువులలో కదిలించుచున్నదై ఉన్నదో...,
- అనేక రూపములుగా తన ఇచ్ఛచే తాను (ఏకమే అయి ఉండియే) - ధరిస్తున్నదో, సమస్త జీవులకు 'ఇచ్ఛ ప్రదాత' అయి విరాజిల్లుచున్నదో (కామేశ్వరీ కామేశ్వర స్వరూపమో)
- కారణములన్నిటికీ ఆదికారణమైయున్నదో,
- ఎద్దాని గురించైతే - విశ్లేషణ-విచారణ రూపమైన సాంఖ్యయోగులు (తదితర ద్వైత-అద్వైత-విశిష్టాద్వైత ఇత్యాది సిద్ధాంతాలన్నీ) ఆత్యంతికమైనదిగా ప్రతిపాదించటం జరుగుతోందో...

**అట్టి పరబ్రహ్మ తత్త్వమును ఎరిగినప్పుడు సర్వబంధములు తెగిపోతాయి.**

అనగా, అట్టి ఆత్మదేవుని గురించి ఎరుగుటచేత మాత్రమే - ఇక్కడి సంసార బంధములన్నీ పటాపంచలు కాగలవు.

**14. న తత్ర సూర్యో భాతి।**
**న చంద్ర–తారకమ్।**
**న ఇమా విద్యుతో భాంతి,**
**కుతో అయమ్ అగ్నిః?**
**తమేవ భాంతమ్ అనుభాతి సర్వగ్ం।**
**తస్య భాసా సర్వమిదమ్ విభాతి॥**

ఆత్మ - ఇక్కడి భౌతికమగు సూర్యకాంతిలో కనబడే ఒక వస్తువు వంటిది కాదు.

- చంద్ర-నక్షత్ర కాంతిలో కనబడేదేది, కనుగొన కలిగినది కాదు.
- జ్యోతియొక్క వెలుగు వంటిది కాదు. ఇక అది అగ్ని-వెలుగు కాదని వేరే చెప్పాలా?
- ఆత్మ ప్రకాశించటం చేతనే, తత్ప్రాకాశ విశేషాలుగా-సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, జ్యోతి..., ఇవన్నీ కూడా ఆత్మచైతన్యము నుండి వెలుగునుపొంది ప్రకాశమును ప్రదర్శించుచున్నాయి.

---

**15. ఏకోహగ్ం సో భువనస్య అస్య మధ్యే,**
**స ఏవ అగ్నిః సలిలే సన్నివిష్టః।**
**తమేవమ్ విదిత్వా అతిమృత్యుమ్ ఏతి।**
**న అన్యః పంథా విద్యతే అయనాయ॥**

ఈ భూనభోంతరాలలో వెలుగొందుచూ దహించుచున్న అగ్ని వలె ఆయన సర్వ దేహములలో వేంచేసి, సర్వమును వెలిగిస్తున్నారు.

- ఆయన గురించియే మనము అందరమూ తెలుసుకోవలసింది.

అట్టి ఆత్మ భగవానుని తెలుసుకొని మాత్రమే **"నేను మృత్యువుచే బద్ధుడనుగాను. దేహానంతరము కూడా ఉంటాను కదా!"** ... అనే విషయం గ్రహించి మృత్యు పరిధులను దాటిపోగలుగుచున్నాము.

**మృత్యువును అధిగమించటానికై ఆత్మతత్త్వ జ్ఞానము మించినది వేరే ఏ పంథా (మార్గము) లేనే లేదు. వేరే విధానము లేదు.**

---

**16. <u>స విశ్వకృత్। విశ్వవిత్।</u>**
**<u>ఆత్మయోనిః। జ్ఞః।</u>**
**<u>కాల కాలో। గుణీ। సర్వ విద్యః।</u>**
ప్రధాన క్షేత్రజ్ఞ పతిః। గుణేశః
సగ్ంసార మోక్ష స్థితి బంధహేతుః॥

ఆ పరమపురుషుడు...,

- ఈ విశ్వమునకు **కర్త.**
- ఈ విశ్వమును **ఎరుగుచున్నవాడు.**
- జీవాత్మలందరికీ **ఉత్పత్తి స్థానమము.**
- **జ్ఞానస్వరూపుడు.**
- కాలమును కూడా నియమించు **కాలఃకాలుడు.**
- **త్రిగుణములు తనవైనవాడు.**
- సర్వమును **ఎరిగినవాడు** (యః విత్ విద్యః).
- ప్రధాన క్షేత్రజ్ఞుడగు సృష్టికర్తకు పతి. క్షేత్రజ్ఞత్వమునకు **యజమాని.**
- త్రిగుణములకు ప్రభువు.
- సంసారము జనించటానికి, స్థితికి, విముక్తికి కారణుడు. బంధహేతువు. బంధ విముక్తిని ప్రసాదించువాడు కూడా.

---

**17. స తన్మయో హి అమృత ఈశ సంస్థో,**
జ్ఞః సర్వగో భువనస్య అస్య గోప్తా,
య ఈశే అస్య జగతో నిత్యమేవ।
న అన్యో హేతుః విద్యత ఈశనాయ॥

- **అట్టి అమృత స్వరూపుడు అగు ఈశుని ఉనికిచే ఈ విశ్వమంతా తన్మయమైయున్నది.**
- ఆ ఆత్మ భగవానుడు కేవల జ్ఞాస్వరూపుడై **అంతటా విస్తరించి ఉన్నవారు. సర్వగతుడు.**
- ఈ సమస్త భూమండల **పరిపాలకుడు.**
- సర్వత్రా తానే విస్తరించినవాడై ఉండటంచేత - ఈ జగత్తుకు **ఈశ్వరుడు - నిత్యుడు.**

**కాబట్టి ఆత్మయే ఈ జగత్తుకు హేతువు. ఆ ఈశ్వరునికి వేరుగా మరొకరెవరూ కారణమై ఉండలేదు. స్వయం కారణుడు। కారణ కారణుడు। అకారణుడు।**

**18. యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్,**
**యో వై వేదాగ్ంశ్చ ప్రహిణోతి తస్మై,**
**తగ్ం హ దేవమ్ ఆత్మబుద్ధి ప్రకాశమ్**
**ముముక్షుర్వై శరణమహమ్ ప్రపద్యే॥**

ఏ పరమాత్మ సృష్టికి ముందు సృష్టికర్తను సృష్టించి విధి- వేదములను ఉపదేశించారో, అట్టి ఆత్మ భగవానుడు మాయందు ఆత్మ బుద్ధిని ప్రసాదింపజేయును గాక! మా యందే ఉన్నట్టి ఆ పరమాత్మ సుస్పష్టమగుటకు గాను ముముక్షువులమై (మోక్షేచ్ఛ కలవారమై) సద్గురువులను, ఆ ఆత్మదేవుని శరణు వేడుచున్నాము.

---

**19. నిష్కలమ్, నిష్క్రియగ్ం, శాంతమ్,**
**నిరవద్యమ్, నిరంజనమ్।**
**అమృతస్య పరగ్ం సేతుం,**
**దగ్ధ ఇంధనమివ అనలమ్॥**

- నిష్కలంకుడు (దోషరహితుడు, నిత్య నిర్మలుడు),
- కర్మలకు అతీతుడైనవాడవటంచేత నిష్క్రియుడు,
- పరమశాంత స్వరూపుడు,
- నిరవద్యుడు,
- నిరంజనుడు (దోష-వికార రహితుడు)...., (అనింద్యుడు-నిర్లేపుడు),
- అమృతత్వమును సముపార్జించుకోవటానికై వంతెనవంటివాడు,
- మండుచున్న అగ్నివలె తేజోరూపుడు -

**అగు పరమాత్మను శరణువేడుచున్నాము.**

---

**20. యదా చర్మవత్ ఆకాశమ్**
**వేష్టయిష్యంతి మానవాః,**
**తదా శివమ్ (దేవమ్) అవిజ్ఞాయ**
**దుఃఖస్య అంతో (న) భవిష్యతి॥**
**(స విజ్ఞాయ దుఃఖస్య అంతో అవశ్యమ్ భవిష్యతి)**

ఆకాశమంతా చుట్టుచుట్టి వస్త్రము వలె ధరించటం ఎవ్వరివల్లనైనా అవుతుందా? లేదు కదా!

అట్లాగే ఆత్మ శివ భగవానుని తెలుసుకోనంత కాలము జగత్ దృశ్యముతో ఏర్పడిన సంబంధ రూపమగు సంసార దుఃఖము, భయము తొలగనే తొలదు. కొనసాగుచూనే ఉంటాయి. తెలుసుకుంటే తప్పక తొలగుతుంది.

---

**21. తపః ప్రభావాత్ దేవ ప్రసాదాచ్చ**
**బ్రహ్మహ శ్వేతాశ్వతరో అథ విద్వాన్**
**అత్యాశ్రమిభ్యః పరమమ్ పవిత్రమ్**
**ప్రో వాచ సమ్యక్ ఋషి సంఘ జుష్టమ్॥**

**శ్వేతశ్వతర మహర్షిభ్యోం శ్వేతాశ్వతర నమః॥**

**శ్రీ గురుభ్యోనమః॥**

- కర్మ-భక్తి-యోగాదులతో కూడిన తపస్సు యొక్క ప్రభావము చేతను,

- సర్వాత్మకుడగు పరమశివ భగవానుని అనుగ్రహముచేత, నిష్ణాతుడు, పండితుడు అగు - శ్వేతాశ్వతర మహర్షి బ్రహ్మ జ్ఞానమునందు విద్వాంసుడై లోక కల్యాణార్థమై ప్రప్రథమంగా **మాకు బోధించిన పరమాత్మ తత్త్వ** విశేషములే ఈ **శ్వేతాశ్వతరోపనిషత్.** ఋషిగణము పలికిన పరమ పవిత్రమగు పరబ్రహ్మతత్త్వమునే శ్రీశ్వేతాశ్వతర మహర్షి యతి సంఘమునకు బోధించారు. అదియే ఆశ్రమ వాసులగు మనము ఇప్పుడు చెప్పుకున్నాము. **శ్వేతాశ్వతర మహర్షిభ్యోం నమః॥**

---

**22. వేదాంతే పరమమ్ గుహ్యమ్**
**పురా కల్ప ప్రచోదితమ్।**
**న అప్రశాన్తాయ దాతవ్యమ్-**
**న (దాతవ్యమ్) అపుత్రాయ శిష్యాయ వై పునః॥**

తెలియబడడేది ఎవ్వరు తెలుసుకుంటున్నారో, ఆ తెలుసుకొనే ఆయన యొక్క తత్త్వమేమిటో విశదీకరించేదే **వేదాంతశాస్త్రము.**

అట్టి వేదాంత శాస్త్రముచే చెప్పబడుచున్నట్టిది, ప్రతిపాదించబడుచున్న పరమ సత్యము అయినట్టిది - మనము చెప్పుకున్నాము.

ఇది పరమ రహస్యమైనది, రహస్యములలో కెల్ల రహస్యము.

పూర్వకల్పములందు కూడా ప్రబోధించబడినట్టిది అయిన ఈ ఆత్మతత్త్వ శాస్త్ర విశేషాలను బోధించటానికి ఇంద్రియ విషయములపట్ల, జగత్ విశేషములపట్ల, జగత్ విశేషములపట్ల కొంత ప్రశాంతత సంపాదించుకొన్నవాడే అర్హుడు. తితిక్షా సంపన్నుడై, జగత్ విషయాకర్షణలను త్యజించుచున్నవాడే ఇందుకు తగినవాడు.

అట్టి ప్రశాంతత సంపాదించుకోనప్పుడు, అట్టివాడు కొడుకు అయినా, శిష్యుడైనా కూడా ఈ ఉపనిషత్‌తత్త్వమును బోధించటానికి అర్హుడు కాడు. గురు శుశ్రూష, పితృభక్తి కలవానికే ఉత్తమ అర్హత.

**23. యస్య దేవే పరాభక్తిః**
**యథా దేవే తథా గురౌ।**
**తస్మైతే కథితా హి అర్థాః**
**ప్రకాశంతే మహాత్మనః**
**ప్రకాశంతే మహాత్మన**
**ఇత్యుపనిషత్**

- ఎవడు పరమాత్మకు భక్తుడై ఉంటాడో,

- గురువుపట్ల దైవ భావముతో భక్తి-ప్రపత్తులు కలిగి ఉంటాడో...,

అట్టి దైవభక్తి - గురుభక్తి కలవానికి మనము విరించుకొన్న ఈ ఆత్మబోధ- ఆతడు వింటూ ఉండగానే అనుభవమునకు రాగలదు. అట్టివాని సునిశిత-నిర్మల-విస్తార బుద్ధికి ఆత్మసామీప్యము సిద్ధించగలదు. **'ఆత్మాహమ్'** అనునది తప్పక అనుభూతమౌతుంది. మహాత్మత్వము, స్వ-అనుభూతమై ఇప్పుడే ఇక్కడే సిద్ధించ గలదు.

---

**24. బ్రహ్మవాదినో వదన్తి సప్తదశ (17)।**
**యుంజానః షోడశ (16)।**
**య ఏకో జాలవాన్ ఏకవిగ్ం శతిః (21)।**
**య ఏకోవర్ణో ద్వావిగ్ం శతిః (22)।**
**ద్వే అక్షరే చతుర్దశ (14)।**
**స్వభావమ్ ఏకే ।**
**త్రయోవిగ్ంశతిః (23)**
**ఆహత్య త్రయోదశాధికం శతమ్ (113)**
**(17+16+21+22+14+23 = 113)**

***ఇతి శ్వేతాశ్వరోపనిషత్***
***ఓం శాంతిః। శాంతిః శాంతిః।।***

బ్రహ్మజ్ఞులు ఈ ఉపనిషత్ విశేషములను సప్తదశ (17) ఆత్మమహా విద్యగా చెప్పుకొస్తున్నారు. (17)

ఇంకా 16, షోడశ మహావిద్యగా అభివర్ణిస్తూ ఉంటారు. (16)

ఇంకా 21 తత్త్వ విశేషాలతో కూడినది గాను, ఇంకా మరికొందరు (21)

ఇంకా 22 తత్త్వములలోని ఏకత్వమును ప్రవచించు సూత్రతత్త్వ ప్రవచనముగాను, చెప్పుకొంటున్నారు. (22)

చతుర్దశభువనముల అక్షర - క్షరతత్త్వమును బోధించునదిగా కొందరు పండితులు ఉపాసిస్తున్నారు. (14)

మరికొందరు 23 తత్త్వములలో, అనుస్యూతమైన (ఒక్కటిగా కూర్చబడిన) ఏకత్వము చెప్పు శాస్త్రముగా ఉపాసిస్తున్నారు. (23)

**(17+16+21+22+14+23 = 113)**

113 విభజనలు గల మాయను జయించే ఉపాయముగా ప్రవచిస్తున్నారు.

***ఇతి శ్వేతాశ్వరోపనిషత్***
***ఓం శాంతిః। శాంతిః శాంతిః।।***

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

27

# శ్వేతాశ్వతరోపనిషత్

(దుష్టాశ్వరూపమగు మనస్సును శ్వేతాశ్వతరంగా తీర్చిదిద్దటం)

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



## ప్రథమాధ్యాయః-బ్రహ్మవాదుల సంభాషణము-ఒక శిష్యుని విశ్లేషణము

ఓం! శ్రీ శ్వేతాశ్వర మునీంద్రులు మహా ప్రజ్ఞావంతులు. గురుముఖతః బ్రహ్మతత్త్వము గురించి వింటూ, **వేద-వేదాంగ, వేదాంత, వేదాంత-వేద్య** విద్యా సారవిషయాలు వివేక విజ్ఞాన దృష్టితో బహుకాలం పరిశీలించినట్టివారు. స్వకీయ **విచారణ, వివేచనలను మరల-మరల ఆశ్రయిస్తూ సత్సంగములలో పాల్గొనుచూ బ్రహ్మతత్త్వజ్ఞాన - జ్ఞేయములను సముపార్జించుకొన్న మహామహనీయులు.** బ్రహ్మతత్త్వజ్ఞులగు మహర్షి.

అట్టి శ్వేతాశ్వతర మునివర్యుల ఆత్మ ప్రవచన - ప్రబోధములను శ్రవణం చేస్తూ, ఆత్మ తత్త్వోపాసకులై అధ్యయనముచేస్తున్న ఆయన శిష్యులు వేద వేదాంత విద్యాతత్పరులై ఉండేవారు. ఏదో సందర్భంలో ఒకసారి ఒకచోట సమావేశమైనారు.

మహనీయులు, విజ్ఞులు, ఆత్మజ్ఞాన నిత్యోపాసకులు ఎక్కడైనా ఏదైనా సందర్భంగా కలిస్తే లోక సంబంధమైన జనుల పరస్పర వ్యవహారికమైన విషయాలు చెప్పుకుంటారా? లేదు. వారు ఆత్మతత్త్వజ్ఞానమే ఆశయముగా కలిగియుండి.... సంభాషించుకొంటారు కదా! ఆ శిష్యులు కూడా సత్సంగపూర్వకంగా సమావేశమై శ్రీ శ్వేతాశ్వతర మహర్షియొక్క బోధలను ఈవిధంగా మననము చేసుకోసాగారు.

### శ్వేతాశ్వతర మహర్షి శిష్య బృందము - తాత్త్విక ప్రశ్నల పరిశీలన

బ్రహ్మతత్త్వజ్ఞానానందమే జీవిత మహదాశయముగా కలిగి ఉండినట్టి మహామహనీయులు, సద్గురువులు అగు శ్రీ శ్వేతాశ్వతర మహర్షి కొన్ని ముఖ్యమైన ప్రశ్నలను పరిశీలించవలసినదిగా నిద్రలేపుతూ, గుర్తు చేస్తూ ఉన్నారు కదా! ఆ ప్రశ్నలేమిటో ఇప్పుడు చెప్పుకొని, తత్ సంబంధిత సమాధానములను, విశేషములను వివరించుకొందాం.

- **కిం కారణమ్ బ్రహ్మ?** బ్రహ్మము దేని దేనికి కారణముగా అగుచున్నది? ఏది తాను కారణముగా కలిగియున్నది?
- **కుతః స్మృతిః జాతం?** ఈ దృశ్యమంతా ఎందులో ఉన్నది? ఒక వేళ ఇది 'స్మృతి' రూపమైతే, ఆ స్మృతి ఎందులోంచి బయల్వెడలుతోంది? ఈ విశ్వము ఎవ్వరియొక్క స్మృతి? (స్మృతి = జ్ఞాపకము, స్వ-అనుభూతి).
- **జీవామ కేన? (జీవా నామ కేన?)** జీవులమగు మనమంతా ఎవరిచేత సృజింపబడుచున్నాము? దేని వలన మనమంతా జీవించగలుగుచున్నాము?
- **క్వచ సంప్రతిష్ఠితా?** ఈ సృష్టికి ముందు, ఈ సృష్టిలో మనం ప్రవేశించకముందు మనమంతా ఎందులో ప్రతిష్ఠితులమై ఉన్నాము? ఇప్పుడు ఎందులో ప్రతిష్ఠితులమై ఉంటున్నాము? ముందు ముందు ఎక్కడ ఉంటాము? మరణము తరువాత ఎక్కడ (లోక) ఎందులో ఉండబోవుచున్నాము? ప్రళయానంతరము మన ఉనికి ఎక్కడ? ఈ జగత్తు ఎక్కడికి పోబోవుచున్నది?
- **అధిష్ఠితాః కేన సుఖేతరేషు వర్తామహే?** ఎవ్వరి సంకల్పము - అధికారమును అనుసరించి మనము సుఖదుఃఖములను పొందుతూ వర్తిస్తున్నాం? ఎందుకు పొందుచున్నాము? సుఖముగానే ఉండాలంటే అది ఎట్లా?

***మొట్టమొదటగా ఈ జగత్ సృష్టికి మూలకారణము ఏమిటి? ఎవరు?***

**(1) "కాలమే"** (TIME): ....అని **కాలవాదులు** అంటున్నారు. వారి ఉద్దేశ్యంలో **"ఇదంతా కాలమహిమ మాత్రమే". కాలముచే వస్తోంది। కాలముచే తనే లయిస్తోంది. ఈ జగత్తుకు ఇంకెవ్వరూ కారణం కాదు!...."** మరి ఆ కాలమును నియమిస్తున్న వారెవ్వరు? **"కాలః కాలుడు'** (కాలమునే నియమిస్తున్నవారు) ఎవ్వరైనా ఉన్నారా?

**(2) "స్వభావో"** (NATURALITY): (లోకాయతులు మొ॥న వారు) **"ఈ జగత్తు స్వభావం చేత జనిస్తోంది, ప్రవర్తిస్తోంది"** అని అంటూ ఉంటారు. **స్వభావమే ఇదంతా!** మరి అట్లా అయితే, **జగత్తును జనింపజేస్తున్న స్వభావము ఎవరిది? ఎవరిచేత, ఎవరి స్వభావంగా ఏర్పడినదగుచున్నది?** స్వభావము ఎవ్వరిదీ అవకుండానే, తనకుతానే ప్రవర్తనశీలము కాగలదా?

**(3) "నియతి"** (DESTINY): ఒకానొక నియామక శక్తి ఇదంతా నియమించి జగత్తును ప్రదర్శనమగుచున్నట్లుగా చేస్తోంది-అని అంటూ ఉంటారు (నియతివాదులు). ఆ నియతిని, "ఇట్లా నియమించాలి!" **అని నియమించుచున్న వారెవరు?** నియమించువారు, నిర్దేశించువారు లేకుండానే నియమములచే తనే జగత్తు ప్రదర్శించబడగలదా?

**(4) 'యదృచ్ఛ'** (JUST ACCIDENTAL) **:** ఒక **కుండను ఒక కర్రతో పగులగొట్టినప్పుడు ఒక్కొక్క కుండముక్క ఒక్కో ఆకారంగా ఉంటుంది.** ఏ కుండ పెంకు ఏ ఆకారంలో ఉన్నదో....ఆయా వివిధ ఆకారాలకి కారణం? ఏ కారణములేదు. అందుచేత యాదృచ్ఛికం. ఈ సృష్టికి కారణమంటూ ఏదీ లేదు. అట్లాగే ఈ జగత్తు యాదృచ్ఛికంగా ఏర్పడి ఉంటోంది. ఏదీ కారణం కాదు" (నిరీశ్వరవాదులు) అంటున్నారు. అప్పుడు **ఇక మనకు ఏర్పడుచున్న సుఖ దుఃఖాలు కూడా యాదృచ్ఛికమనే** (Without being intended by any body) **అనుకోవాలా?** ఇదంతా యాదృచ్ఛికమైనది మాత్రమే అయితే, ఇది మనకు ఎందుకు వ్యవహారశీలమై అగుపిస్తోంది?

**(4) భూతాని :** "ఈ జగత్తు పంచభూతములైనటువంటి భూమి (Solid), జలము (liquid), అగ్ని (heat), వాయువు (vapour vibration), ఆకాశము (place - స్థలము - స్థానము) - ఈ ఐదు పంచభూతముల సమ్మేళనము. రకరకాల పాళ్లతో (In different quantities) సంయోగ వియోగములచే ఈ కనపడే స్థావర జంగమరూపాలన్నీ ఏర్పడుచున్నాయి. నశిస్తున్నాయి. ఇంతకుమించి ఇక్కడగాని - మరెక్కడగాని, ఏదీ లేదు. ఇది ఎప్పటికీ ఇంతే జరుగుతుంది. **(జగత్ నిత్యత్వ వాదులు).**

"**భావాలు, అభిప్రాయాలు, ఆశయాలు, సుఖఃదుఖాలు ఎట్లా పొందబడుచున్నాయి? వాటికి పంచభూతాలే కారణమా?"** అంటే, 'నేను' అనేదే లేదా? (లేక) 'నేను' అనునది పంచభూతముల కలయికచే ఏర్పడి, అవి విడిపోగానే లేకుండా పోతోందా? - ఇవన్నీ ప్రశ్నలు అగుచున్నాయి.

**(5) యోని:** "ప్రకృతి తన గర్భమునందు ఈ దృశ్య జగత్తంతా కలిగినదై ఉంటోంది" అని కొందరి అభిప్రాయం. దేనియొక్క ప్రకృతి? దేనియొక్క యోని (లేక) గర్భమునందు ఇదంతా ఏర్పడినదై ఉంటోంది?

**(6) పురుష ఇతి చింత్యమ్ :** ఈ జీవునియొక్క స్వీయ చింతనా పురుషకారమే ఈ జగదనుభవం అని కొందరు యోగుల అభిప్రాయం. ఈ జీవుని చిత్తానుసారమే ఇదంతా ప్రాప్తిస్తున్నప్పుడు, మరి ఈ జీవుడెవరు? వాస్తవరూపమేమిటి?

**(7) సంయోగ :** స్త్రీ పురుష సంయోగము జగత్తుకు జీవుల దేహాలకుకారణము అని మరికొందరి భావన! మరి ఈ భౌతిక దేహము ఎవరి ప్రజ్ఞచేత ఈ రూపుదిద్దుకొంటోంది? 'నేను' అనునది ఎక్కడి నుండి వస్తోంది?

బిడ్డల మనస్తత్త్వాలకు కర్త ఎవరు? తల్లితండ్రులా?

ఇవన్నీ అసలైన కారణములని అనటానికి వీలులేదు. ఎందుకంటే అవి 'నేను' అను ఉచ్ఛారణను నిర్వర్తిస్తూ **'నేను' అను అనుభవజ్ఞుని రూపమున ఉన్న 'ఆత్మ గురించి విశ్లేషించటం లేదు.** సుఖదుఃఖాలు ఎందుకు వస్తున్నాయో, ఎవ్వరి యొక్క తత్త్వముగాను, అనుభవజ్ఞుని రూపంగాను ఇదంతా ఉన్నదో వివరించటం లేదు. "నేను ఇది" అని నిస్సందేహంగా వివరించలేక పోతున్నాయని అనక తప్పదు.

## ఉపనిషత్ వాణి

***వేదాంతులు : ఇదంతా ఆత్మయొక్క భావనా వైచిత్ర్యమే। ఆత్మయే స్వీయకల్పితమగు జగత్ భావనయందు స్వయముగా ప్రవేశించి ఆస్వాదిస్తూ ఉండగా, ఎప్పుడో తన ఈశ్వరత్వమును ఏమరచుచున్నది. (స్వప్నంలో జరుగుచున్న తీరుగా) భావనాజనిత జగత్తులో తన్మయమగుచు తన ఈశ్వరత్వమును (తన కల్పనే కాబట్టి తానే జగత్ భావములకు యజమానినని) మరచిపోయి, సుఖ దుఃఖములు అనుభవిస్తోంది. తన ఈశ్వరత్వము ఎరుగటం జరిగిందా, - ఇక సుఖదుఃఖ ద్వంద్వములను అధిగమించినదై సహజమగు ఆత్మత్వమును సంతరించుకుంటోంది. ఇది వేదాంతశాస్త్ర వివరణ!***

బ్రహ్మవేత్తలు (బ్రహ్మము గురించి పరిశోధించువారు) ఈ విశ్వము, ఈ దృశ్య జగత్తు ఏమై ఉన్నది – అనే విషయం పరీక్షించి :-

→ ఇదంతా పరమాత్మయొక్క మాయాకల్పన। మాయా ప్రదర్శన విశేషమే। మాయా వినోదమే।

→ అట్టి పరమాత్మ.......సమస్త కల్పనాశక్తి సంపన్నుడు. అనంతగుణ సాగరుడు. నిగూఢముగా స్వగుణములు కలవాడై జగత్ **ప్రదర్శన, దర్శన, ఆస్వాదములను** మాయా ఉపాధితో నిర్వర్తిస్తున్నారు.

→ ఈ 'జీవుడు' – అనునది కూడా పరమాత్మయొక్క **స్వకీయ ప్రదర్శనమే।**

ఆ పరమాత్మ యొక్క నిగూఢమగు మాయా శక్తి రూప త్రిగుణ చమత్కారమే **"విశ్వము (లేక) జగత్తు"** – అని ధ్యానము ద్వారా గమనించుచున్నారు. ఆ రీతిగా గానం చేస్తున్నారు.

*అనేకములుగా కనిపించుచున్న ఈ విశ్వమునకు అద్వితీయుడు, కాలస్వరూపుడు, లీలావినోదియగు పరమాత్మయే కారణము. ఆయన ద్రష్ట-దర్శన-దృశ్య త్రిపుటీ స్వరూపుడై సర్వమునకు వేరుగా ఉండియే జగదనుభవమునందు ప్రకాశించుచున్నారు. అనువర్తిస్తున్నారు. ఆస్వాదించుచున్నారు. అందులో బద్ధుడుగా కూడా అగుపించుచున్నారు. వాస్తవానికి నిత్యముక్తుడే! (దృష్టాంతము: కల తనదైనవాడు – కల). కాబట్టి ఈ జీవుడుగా కనిపిస్తున్నది పరమాత్మయొక్క విభవమే।*

***సత్యద్రష్టలగు మహనీయులు–కేవలము, సమస్తమునకు ఆవల (పరము) అగు పరమాత్మను ఏవిధంగా దర్శిస్తున్నారంటే...,***

**ఏకము :** అనేకముగా కనిపిస్తున్నప్పటికీ ఏకమే అయినట్టివారుగాను....,

**నేమిమ్ :** బండి చక్రము నందు మధ్యగాగల నేమి (ఇరుసు) తన చుట్టూ చక్రమంతటినీ త్రిప్పుకొంటున్నట్లు – ఈ విశ్వమంతటినీ తన చుట్టూ పరిభ్రమింపజేసుకుంటున్న వారుగాను...,

**త్రివృతగ్ం :** సత్త్వ – రజో – తమో త్రిగుణములచే ఆవరించబడి ఉన్నవారిగాను, (లేక) జాగ్రత్ – స్వప్న – సుషుప్తులనబడే త్రిదశలను తనయొక్క '3' విధములైన 'వృత్తులు'గా కలవారుగాను...,

**షోడశాంతగ్ం :** 16 కళలకు ఆవల గల కళాకారునిగాను (ఆ షోడశకళలు తనవైనవాడుగాను), అనగా పంచ 15 ఇంద్రియ – ఇంద్రియ విషయములకు, పంచప్రాణములకు, అంతఃకరణ చతుష్టయమునకు, జీవ–ఈశ్వర రూపములకు ఆవల ప్రకాశించు తేజోరూపుడుగాను,

**శతార్ధారమ్:** నేమికి చక్రములోని రేఖలవలె '50' ఆకులు ప్రదర్శించువారుగాను (పంచ – పంచ → **'భూత' – 'ప్రాణ' – 'ఉపప్రాణ' – "కర్మేంద్రియ", "జ్ఞానేంద్రియ" – ("ఇంద్రియ విషయ")** ఇత్యాదులు కలవారుగాను,

**విగ్ంశతి వ్యాత్యరాభి :** '20' ఉపరేఖలు కలిగి ఉన్నట్టివారు గాను.

**అష్టకైః (8) – షట్భిః (6) విశ్వరూప ఏక పాశకం :** 6–8 తత్త్వములతో – త్రాళ్ళతో కూడి విశ్వరూప కల్పన – అనే పాశము (బంధము) కలిగి ఉన్నట్టి వారుగాను, (పంచేంద్రియములు + అంతఃకరణము / మనో బుద్ధి చిత్తములు)

**త్రిమార్గభేదం** – ధర్మ – అర్థ – కామములచే '3' మార్గములు కలిగియున్న వారుగాను...,

**ద్వినిమిత్తమ్ :** పుణ్య – పాపకర్మలు అనే రెండూ నిమిత్త కారణములుగా కలిగి ఉన్నట్టి వారుగాను,

**ఏక మోహమ్ :** (కల్పన–ఊహ–భావన రూపమగు) మోహముతో కూడి ఉన్నవారిగాను,

**ఆ పరమాత్మను దర్శించుచున్నారు.!** సమస్తమునకు ఆవల సాక్షిగా తేజోమూర్తులై నిత్యోదితంగా సమస్త దేహములలో సర్వదా వెలుగొందుచున్నటిదిగాను – ఆత్మను ఉపాసిస్తున్నారు. అట్టి మార్గంగా **'సోఽహమ్'** భావమును సిద్ధించుకొంటున్నారు.

## *పరమాత్మ ఒక నదీస్వరూపమని దృష్టాంతంగా అనుకుంటే*

→ **పంచస్రోతో అంబుమ్ :** పంచేంద్రియములనే తరంగాలకు (వాటి వాటి విషయాలకు కూడా) ఆత్మభగవానుడే జలస్వరూపుడై ఉన్నారు.

→ **పంచ యోనిః ఉగ్రవక్రాం :** స్థూలము, ద్రవము, ఉష్ణము, స్పందము, స్థానము అనబడు 5 (ఐదు) – వక్రగతులకు ఉత్పత్తి స్థానము (యోని) అయి ఉన్నారు. ఉగ్రమైన ముఖములు (Appearences). కలిగి ఉన్నారు.

→ **పంచప్రాణ ఊర్మిమ్ :** ప్రాణ – ఆపాన – వ్యాన – ఉదాన – సమానములను పంచ ప్రాణ చలన రూపములైన అలలకు స్పందన రూపమగు **మూలప్రాణశక్తి** (లేక) **మూల చైతన్య రూపము. కదిలించేవారుగా ఉన్నారు.**

→ **పంచబుద్ధ్య – ఆది మూలమ్ :** దేహము – మనస్సు – బుద్ధి – చిత్తము – అహంకారము అను '5' తెలియబడే రూపములకు (లేక) స్వభావములకు **ఆదిస్థానము (ప్రారంభస్థానము)** అయి ఉన్నారు.

→ **పంచ ఆవర్తామ్ – పంచ దుఃఖౌఘ వేగామ్ :** జన్మ – మరణ – **ఆధిదైవిక – అధి భౌతిక – అధి ఆత్మిక** పంచ దుఃఖములకు, దుర్భావన – దుర్‌హేళన – దూషణ – దుర్ పరిగ్రహణ – ద్రోహచింతన అనబడే పంచ అఘములకు వెనుకగా వేగరూపముగా ఉన్నట్టి చేతన చమత్కారము.

→ **పంచాశత్ భేదం :** ఆకలి – దప్పిక – రుచి – స్పర్శ – రూప....అశనములను కలిగించుచున్నవారు.

→ **పంచపర్వామ్ :** శిశు–బాల్య–కౌమార–యౌవన–వార్ధక్య దశలను (పర్వములను) కల్పన చేసుకొని ఆస్వాదించుచున్నట్టివారు.

***అట్టి లక్షణ, విలక్షణునిగా పరమాత్మను ధ్యానించాలి. సర్వమునకు కారణ కారణంగా పరబ్రహ్మమును భావిస్తూ ఉపాసించాలి.***

**ఇంకా ఆత్మ ఎట్టిది? ఏమని నిర్వర్తిస్తోంది? అను విషయమై ఆత్మగా దర్శించేమార్గంలో....**

**సర్వాజీవే :** "సర్వజీవుల యొక్క జీవనరూపము ఆత్మయే" – అను సందర్శనముతో,

**సర్వసంస్థే :** సర్వులయందు, సర్వమునందును సర్వదా సంస్థితమై (ఏర్పడియున్నదై) ఉన్నట్టిదిగాను,

**బృహత్ :** అన్నింటికంటే మహత్తరమైనట్టిదిగాను **దర్శించాలి.**

ఈ జీవుడు వాస్తవానికి **ఆత్మ స్వరూపుడే! స్వతఃగా బ్రహ్మచైతన్యమే!**

- సర్వజీవ స్వరూపము
- సర్వత్రా ఉన్నట్టిది,
- బృహత్తరము

***<u>అగు బ్రహ్మముకు అనన్యుడే। అన్యము కాదు। బ్రహ్మము జీవునకు అన్యము కాదు।</u>***

ఏమైతేనేం? ఈ జీవుడు, బ్రహ్మచక్రములో నివసిస్తూనే, ఈ **దేహము ఇంద్రియ విషయములు** మొదలైన ఆయా వ్యవహారములలో చిక్కుకొని, వివిధరకములైన మనుష్య – జంతు దేవతాది స్వభావములను ప్రేరేపించుకొనుచు, అసంఖ్యాకములైన ఉపాధులలో సంచారాలు సలుపుచున్నాడు.

**అట్టి సందర్భంలో తనయొక్క సహజము, అమృతతుల్య జీవ బ్రహ్మైక్య స్వభావము – అగు స్వస్వరూపమును ఏమరిచి ఉంటున్నాడు.**

ఫలితంగా అనేక సుఖ దుఃఖములను అనుభవించటం సుదీర్ఘంగా కొనసాగిస్తున్నాడు. అనగా....

**'బ్రహ్మమే నేను'** అనునది ఏమరచి (స్వకీయ కల్పనారూపమగు) బ్రహ్మ చక్రములో ప్రవేశించి **జన్మకర్మ భావ పరంపరలలో పరిభ్రమిస్తున్నాడు.**

(ఉదాహరణకు / దృష్టాంతానికి : ఒకడు 'నేను జాగృత్‌లో ఇది కదా!.....అనునది ఏమరచి, స్వీయ రచన అగు స్వప్నములో ప్రవేశించి, స్వప్నదృశ్యములో తదాత్మ్యము చెందుతూ భయము – దుఃఖము – సుఖము – వేదన మొ॥నవన్నీ పొందుచున్నతీరుగా) **ఈ జీవుడు తనయొక్క అమృతస్వరూపమును పరిశీలించటమే లేదు.**

**ఎప్పుడో ఒకానొకప్పుడు –**

ఏకారణంగానో **"నేను దేహబద్ధుడనా? జీవాత్మ పరిమితుడనా? జన్మ – కర్మలచే దొర్లించబడు జడ వస్తువునా? లేక, ఇంతకుమించిన సత్యము నాకు సంబంధించినదై, ఏమైనా ఉన్నదా?"** అనే మీమాంస ఈ జీవునిలో బయలుదేరుతోంది. ఇక ముముక్షువు అయి, నిదురలేవటం ప్రారంభిస్తున్నాడు. బ్రహ్మము గురించిన విద్యార్థి అగుచున్నాడు.

☞ సామవేద గానస్వరూపమగు ఉద్గీతము,

☞ సర్వమునకు పరమై ఆవల ఉన్నట్టిది,

☞ సర్వులలో సర్వ శ్రేష్ఠమై **'పరబ్రహ్మము'** అని చెప్పబడుచున్నట్టిది,

☞ భోక్త (Experimear) – ప్రేరణ (Inspiration) – భోగ్యము (That being experienced) అను త్రిపుటికి స్థానమైనట్టిది,

☞ తనయందుతానే సర్వదా ఏర్పడినదై, ప్రతిష్ఠితమై ఉన్నట్టిది....

☞ మార్పు – చేర్పులు లేక 'అక్షరము' అయినట్టిది....,

**అగు తనయొక్క అమృత స్వరూపమువైపుగా జ్ఞానచక్షువులు తెరచి, దృష్టిని సారిస్తున్నాడు.** వేదవిదులచే ఉద్గీతము (గానము) చేయబడుచున్న పరబ్రహ్మము గురించి ఎరుగుచున్నాడు. ఎరిగి బుద్ధిని నిలుపుచున్నాడు. ఇట్టి పరమునకు కూడా ఆవల ఉన్నట్టి **'పరాత్ పరము'** అనే యోనియందు ప్రవేశించి, ఇక జన్మ కర్మలనుండి విముక్తుడు అగుచున్నాడు. కేవలము బ్రహ్మతత్పరుడై, ఈ జగత్తునందు క్రీడా వినోదివలె, దేని చేతను స్పృశించబడనివాడై, ఆత్మోద్యానవన సంచారి అగుచూ ఆనందంగా విహరిస్తున్నాడు.

# జీవ - ఈశ్వరులు

**జీవుడు - "వ్యక్తము, అవ్యక్తము"** - అను రెండు భావతత్త్వాలను, **"క్షరము, అక్షరము"** అను రెండు **చమత్కార ప్రదర్శనములను** ఒకచోటికి తెచ్చుకొని ఆరెండిటిని భరిస్తూ, **'విశ్వము'** అనే స్వప్నమును ఆస్వాదించుచున్నాడు.

**నేనే దీనికంతటికీ (వ్యక్తావ్యక్తములకు) రచయితను కదా** (I am the Author of those two twins) - అనే విషయమై ఏమరుస్తున్నారు.

"నేను భోక్తను. (I am merely a recepient). ఇవన్నీ నాచే భోగించబడుచున్నాయి. (These are all being experienced by me) ఇట్టి భావనలు కారణంగా **స్వకీయ కల్పనా, భావనా చమత్కారములచే** తానే నిబద్ధుడై ఉంటున్నాడు. ఈ విధంగా ఈ జీవునికి సంసారమంతా ప్రాప్తిస్తూ అనేక ఉపాధులు, స్థితిగతుల రూపంగా ఆతనిపట్ల సంప్రదర్శితమౌతోంది. ఇదంతా అనేక దుఃఖ పరిణామాలకు కారణమగుచున్నది. మరి అటువంటి స్వీయ కల్పిత దుఃఖబంధములు తొలగటానికి దారి ఏది? **ఈశ్వర దర్శనమే।**

ఎప్పుడైతే "క్షర - అక్షరములకు, వ్యక్తి - అవ్యక్తములకు **సాక్షి, కారణుడు** అగు ఈశ్వరుని సందర్శనముచే అనీశ్వరత్వము తొలగుతుందో, అప్పుడు ఆ జీవుడు **సర్వ ఉపాధుల రాకపోకలకు ఆవల గల ఈశ్వరత్వ జ్ఞానానందముచే స్పృశించబడుచున్నాడు. జీవుడుగా వర్తమానంలో** పొందుచున్నట్టి సర్వబంధముల (From Bondage of physical Body and limitation to the physical appearance) నుండి విముక్తుడు (RELIEVED) అగుచున్నాడు. "అనేక దేహపరంపరా నాటకములలో అనేక పాత్రలుగా నటించగల కళాత్మకుడను. మరి "ఒక నాటకములో ఒకపాత్ర" వంటి ఈ వర్తమాన దేహము-దృశ్యములచే ఎట్లా బంధించబడతాను?" - అని గమనిస్తున్నాడు.

# ఈశ్వరుడు

**ఈశ్వరుడు** - సర్వజ్ఞుడు. అన్నీ తెలిసినవాడు. (అన్నీ అంటే....ఎక్కడ ఏమి జరుగుతోందో, ఎప్పుడు ఏం జరుగుతోందో తెలిసినవాడు - అని కాదు. మరి?) ఈ దేహముల రాక పోకలు - ఇవన్నీ ఆవల ఉండి చూస్తూ ఉన్నట్టివాడు. జన్మ-మృత్యువుకు ఈవల-ఆవల స్థితిగతులు ఏమిటో, ఎట్టివో...ఈ తతంగమంతా తాను వేరుగా ఉండి, వేరుగా ఎరుగుచూ ఉన్నవాడు. **సాక్షి స్వరూపుడు.**

జీవుడో, ఒక దేహము జనించిన తరువాత, దేహ సంబంధమైన శబ్ద - స్పర్శ - రూప - రస - గంధ విశేషాలు మాత్రమే ఎరిగి ఉంటున్నవాడు. వాటికి తాను పరిమితుడై ఉన్నట్లుగా భావించువాడు. తన శరీరమే తనకు పరిధిగా అనుకొనుచున్నవాడు.

**ఈ జీవ - ఈశ్వరులు ఇద్దరు జన్మరహితులే!** కలలో ఉండి కలను ఆస్వాదించే నేను కలతో జనించను కదా! అట్లాగే జన్మ నాదైన నేను-"జన్మ"లో జనించను.

ఈ విధంగా జీవ - ఈశ్వరులు జన్మలకు వేరే అయి ఉన్నవారేగాని జన్మాంతర్గతులై, జన్మలోని అంతర్విభాగస్వరూపులు కాదు. ఈ ఇరువురు భోగించువాడు - భోగించబడునది అనే ఉభయార్థములు (Both Functions) కలవారే! **ఇరువురు మాయచే గోచరించేవారే!**

# పరబ్రహ్మము - బ్రహ్మజ్ఞానము

**ఈ ద్రష్ట-దర్శన-దృశ్యములను స్వకీయ కల్పనగా కలిగి ఉన్నట్టిదే పరబ్రహ్మము.** అట్టి (ఈ జీవునియొక్క) **పరబ్రహ్మ స్వరూపము ఎటువంటిది?**

- ☞ అనంత స్వరూపమైయున్నది। దేహములచేతగాని, దృశ్య పరంపరలచేత గాని పరిమితము కాదు।
- ☞ జీవ-ఈశ్వరులు అద్దాని మాయా ప్రకృతి యొక్క ప్రదర్శనలే।
- ☞ కేవల - ఆత్మస్వరూపమై విరాజిల్లుచున్నట్టిది।
- ☞ **విశ్వరూపో....** ఈ విశ్వమంతా తనయొక్క రూపముగా కలిగియున్నట్టిది।
- ☞ **మాయి :** ఈ మాయ తనదై ఉన్నట్టిది।
- ☞ **అకర్త। అభోక్త।**

అట్టి పరమాత్మ అనంతునిగాను, విశ్వరూపునిగాను, అకర్త - అభోక్తగాను, త్రిపుటిని కల్పించుకొనే క్రీడావినోదిగాను, సర్వుల సహజానంద స్వరూపముగాను....ఎవరు తెలుసుకొంటున్నారో.... **వారు పరబ్రహ్మ స్వరూపులే! యదా విందతే బ్రహ్మమేతత్।।**

**క్షరము :** జీవుని ఇంద్రియములకు అనుభవమయ్యేదంతా – నశించబోవు స్వభావము కలిగి ఉన్నట్టిది. 'మార్పు చెందటం' అనివార్యమై యున్నట్టిది. 'ప్రధానము, మాయ' అని కూడా చెప్పబడునది.

**అక్షరము / అమృతము :** పరమాత్మయో? అక్షరుడు. క్షరమును హరించువాడవటంచేత 'హరుడు'. అవిద్యను హరించువాడు కనుక కూడా హరుడు. అనేకత్వమంతా హరించి ఏకస్వరూపుడై ప్రకాశించుచున్నవాడు కాబట్టి హరుడు. అమృతస్వరూపుడగు ఆ హరుని ధ్యానించటం చేతను, మరల మరల ఉపాసించటం చేతను, శివతత్త్వచింతన – శివ తత్త్వార్థ దర్శనము చేతను **భూయః శాంతే విశ్వ మాయా నివృత్తిః** – ఈ విశ్వమాయా నివృత్తి అయి , తిరిగి ఈ జీవుడు పరమశాంతిని పొందుచున్నాడు. అనగా, **'జీవోఽహమ్'** కాస్తా **'శివోఽహమ్'**.... గా సహజమై రూపుదిద్దుకుంటోంది.

**జ్ఞాత్వా దేవగ్ం సర్వ పాశాపహానిః** – అట్టి అక్షర బ్రహ్మ భగవానుని తెలుసుకోగానే సర్వ దృశ్యపాశములు తెగిపోతున్నాయి.

**క్షీనైః క్లేశైః జన్మ – మృత్యు ప్రహాణిః** – అట్టి తత్త్వజ్ఞానము సర్వక్లేశములను క్షీణింపజేయగలదు. జన్మ మృత్యు బాధలను ఉపశమింపజేయుచున్నది.

జీవ – ఈశ్వరులకు వేరైయున్న పరమాత్మ తత్త్వమును (మూడవ తత్త్వమును) తెలుసుకొన్నప్పుడు 'ఈ భౌతిక దేహము నాకు బంధమగుచున్నది' అను రూపంగా ఉంటున్న దేహబంధమునుండి విడివడి, పొందవలసినది పొందినవాడు (ఆప్తకాముడు) అగుచున్నాడు. **పరబ్రహ్మస్వరూపుడే అగుచున్నాడు.**

ఓ మిత్రులారా ! మనమంతా కూడా...., **ఏతత్ జ్ఞేయమ్ నిత్యమేవ ఆత్మస్థగ్ంస్థం।** మనలోనే సర్వదా వేంచేసి, సంస్థితుడైయున్న ఆ జీవ – ఈశ్వర కళా విశేష స్వరూపుడగు 'పరమాత్మ'యే మనము సర్వదా తెలుసుకుంటూ ఉండవలసిన వస్తువు. అంతకుమించి తెలుసుకోవలసినదంటూ మరింకేదీ లేనే లేదు. అదొక్కటే పట్టుకోవాలి. **మిగతావన్నీ పట్టుకొన్నా కూడా, వదలియే ఉండాలి!**

**అయితే...,**

→ భోక్త (Feelar, Experiencer) అయినట్టి ఈ జీవుడు,

→ ఈతడు ఆస్వాదిస్తున్న ఈ దృశ్యజగత్తు, విశ్వము

→ ఆ రెండిటికీ సంధానమగు పరస్వరూపుడుగా ఉన్న ఈశ్వరుడు (లేక) ప్రేరకుడు (The inspirar).

**ఈ మూడూ కూడా అజ్ఞాన దృష్టి చేతమాత్రమే వేరు వేరైనట్లుగా కనిపిస్తున్నాయి.**

మనలో ఏకస్వరూపుడు – నిష్క్రియుడు అగు పరమాత్మయే జీవ – దృశ్య – ఈశ్వరులుగా కనిపిస్తున్నారు. కవియొక్క రచనా చమత్కారమే నవలంతా అయి ఉన్నతీరుగా, –బ్రహ్మమే ఈ సర్వము అయి ఉన్నది. మనయొక్క స్వరూప–స్వభావాలు బ్రహ్మమే! మనము అఖండము – అప్రమేయము అగు బ్రహ్మమే అయి ఉన్నాము.

## పరమాత్మను ఎక్కడ దర్శించగలము?

అరణి (కొయ్య చెక్కలు)లో అగ్ని దాగి ఉండి, వాటిని ఒకదానితో మరొకటి ఒరిపిడి కలిగించినప్పుడు ఆ అగ్ని నిప్పు కణముల రూపంలో (యజ్ఞ యాగాలలో మొట్టమొదట అగ్నిని జనింపజేసే ప్రక్రియలో) బయల్వెడలుతోంది. ఆ కొయ్యలను విడిగా ఎక్కడైనా చూచినప్పుడు వాటియందు అగ్ని కళ్ళకు కనబడదు కదా!

కొయ్యలో అగ్నియొక్క స్వరూపము (తేజస్సు) గాని, అగ్నియొక్క గుణములు (తగులబెట్టం మొ॥వి) గాని, (ఆ కొయ్యచెక్కను కంటితో చూచినప్పుడు) ఏవిధంగా అయితే, కనిపించవో,..... కంటికి కనబడకపోయినా కూడా ఆ అగ్నికి లింగ నాశనము లేదో....,

ఆ విధంగానే.....,

**పరమాత్మ–ప్రకాశకము, సర్వాంతర్యామిత్వము, అప్రమేయము, నిత్యత్వము – ఇత్యాది కలిగియే ఉండి, ప్రతి దేహమునందు సర్వదా వెలుగొందుచూనే ఉన్నారు.** అయితే అప్రయత్నశీలుడై ఉన్నప్పుడు – ఆ దేహికి (ఇంద్రియ విషయములవలె) – (కొయ్యలో దాగిన అగ్నిలాగానే) – అనుభవమవటం లేదు.

**'ప్రణవము యొక్క ఉపాసన'** అనే అభ్యాసరూప ఒరిపిడిచే, ఘాతముచే, మధనముచే – **ఆత్మస్వరూపము** ఆ దేహికి **దేహమునందే అనుభూతము అవుతోంది.** అనగా తనయొక్క సర్వ నియామకము – అనంత చిదాకాశ స్వరూపము అగు ఆత్మయొక్క అనుభవము తనయందే కలుగుతోంది. కాబట్టి, **ఈ జీవుడే ఈశ్వరుడు అభావనారూప – అరణిచే ఆత్మాగ్నిని ప్రజల్వింపచేయాలి.**

- ఈ ప్రకృతికి చెందినది – ప్రకృతి ప్రసాదితము అగు ఈ భౌతిక దేహోపకరణమును – క్రింది అరణి (క్రింది కొయ్య)గాను.... (ఈ దేహమును సాధన వస్తువుగాను)

- మనస్సుతో **ప్రణవమును** (అకార – ఉకార – మకారములను, జాగ్రత్ – స్వప్న – సుషుప్తుల **సాక్షి,** జీవ – దృశ్య – ఈశ్వర భావముల ఆవలగల **ఆత్మ పురుషుడు**, ప్రకృతి – పురుష కారముల ఆవల **పురుషోత్తముడు** – అనే భావన) **ఉత్తరారణి** (క్రింద కొయ్య) గాను,
- ధ్యాస, – ధ్యానము (ఇదంతా శివానంద తత్త్వమే అను భావన)....అను అభ్యాసమును నిర్మథనరూపంగాను (కొయ్య – కొయ్యలను రాపిడి చేసే విధిగాను...) [ధ్యానము = ఏకాగ్రత + అనుస్మరణ Concentration and repeatedly chanting the idea etc.,] నిర్వర్తించుచూ, **ఈ జీవుడు తనయందు గూఢముగా దాగియున్న పరమాత్మతత్త్వమును ప్రజ్వలింపజేసుకోవాలి. వెలికి తీయాలి.**

**దృష్టాంతంగా...,**

- నువ్వులలో నూనె ఉంటుందా? ఎందుకు ఉండదు? తప్పక ఉంటుంది. మరి నువ్వులను చూచినప్పుడు నూనెయొక్క రూపముగాని, లక్షణాలు గాని లభిస్తాయా? లేదు. నువ్వులను గానుగ ఆడితే....అప్పుడు రూప – గుణ – లక్షణాలతో సహా నువ్వులనూనె లభిస్తోంది. అట్లాగే ఆత్మోపాసనారూపమగు ప్రణవధ్యానముచే పరమాత్మ ఈ జీవునికి తనయందే లభిస్తున్నారు.
- పాలలో నేయి (Ghee) ఉన్నదా? ఉన్నది. నెయ్యి లభించేది పాలలోంచే కదా! మరి ఎట్లా లభిస్తుంది? పాలు కాచి, తోడు వేసి, ఆ తరువాత పెరుగును చిలికి వెన్న తీసి మరల కాస్తే....అప్పుడు నేయి లభిస్తుంది. అట్లాగే, సాధనచే తనయందలి పరమాత్మ అనుభవము కాగలదు.
- **తరంగము జలము కోసము వెతకటం ఎటువంటిదో, ఈ జీవుడు పరమాత్మకోసం వెతకటం అటువంటిది.** తరంగాలలోనే జలమున్నట్లు, తరంగము జలమునకు అభిన్నమైనట్లు, ఈ జీవాత్మయందు (లేదా, ఈ దేహమునందు) పరమాత్మ సర్వదా వేంచేసి ఉన్నారు.

(పై దృష్టాంతాలవలె) **దేహమునందే పరమాత్మ నిగురుకప్పిన నిప్పువలె** దాగి ఉన్నారు. మనయందే మనము అట్టి పరమాత్మను దర్శించాలి.

- అసత్యమును అధిగమించి సత్యమునే బుద్ధితో ఆశ్రయిస్తూ ఉండటము. (బుద్ధితో సర్వము పరమాత్మగా భావన చేయటము) **(అసతోమా సద్గమయ),**
- ఆత్మదర్శనము నిమిత్తమై బుద్ధిని నిర్మలం చేసుకొను రూపమైన తపన (లేక) తపస్సు.

ఈ రెండిటి సహాయంతో హృదయాంతరంగుడగు పరమాత్మను, బుద్ధిమంతులు సర్వదా దర్శిస్తున్నారు. మనము అట్టి పరమాత్మభావనను సముపార్జించుకొనెదముగాక!

**ఒక పాత్రలోని పాలలో వెన్న ఎక్కడ ఉన్నది? పాలకు క్రిందగానా? పై పాలలోనా? ఉత్తరమువైపు పాలలోనా? దక్షిణమువైపు పాలలోనా? లేదు, లేదు! వెన్న పాలలో అంతటా ఉన్నది.**

అట్లాగే.....

మనయొక్క మహదాశయ విషయమగు – **స్వస్వరూప పరమాత్మ.....:-**

- బాహ్యమునగల ఈ విశ్వమునందు (ఇంద్రియములచే పొందబడుచున్న జగద్దృశ్యమునందు),
- అంతరంగమున గల మనోబుద్ధి చిత్త అహంకారములందును,

**అంతటా, అన్నిటా, సమస్తము తానే అయి వెలయుచున్నారు.**

అట్టి పరబ్రహ్మము గురించియే ఉపనిషత్ మనకు **"నీయందుగల ఇదియే పరమాత్మ"** అని చూపుచున్నది. **(తత్త్వమసీతి।)** ఇక చూడటమో...మనవంతు! విద్యార్థులమై మనము ఆత్మ విద్యను ఆత్మానుభవము పొందుటకొరకై అభ్యసిస్తూ ఉండెదముగాక!

## ద్వితీయోధ్యాయః–యోగాభ్యాసము–చిత్తయోగ స్థితులు–రెండవ శిష్యుని విశ్లేషణము

మునుముందుగా ఉత్తమము – సుతీక్షణము – విస్తారము అగు బుద్ధితో ఈ మనస్సును ఇంద్రియ విషయముల నుండి విరమింపజేయుచు, ఉపశమింపజేస్తూ రావాలి.

'ఓం' సజ్ఞార్థము అయినవాడు, సంవిత్ స్వరూపుడు **(సత్ + విత్ – (ఉనికి + ఎరుక); సత్‌విత్; సవిత్/ సంవిత్; (విరమింపజేయటము = 'ఇది' ఆత్మకు వేరైనది" అను భేదము వదలి, 'ఆత్మ భావనతో దృశ్యమును దర్శించటము).**

సత్ + విత్ + ఋత్ (సత్యము) = సవితృ స్వరూపుడు అగు పరమాత్మ యందు మనస్సును నియమించాలి.

**"ఈ గుణప్రదర్శనలు - రూపనామాలు పరమాత్మతత్త్వ ప్రదర్శనమే। కాబట్టి, సవితృరూపమే! ఓంకారమే!"** - అను పవిత్ర బుద్ధి, ఇంద్రియ దృష్ట్యతీత భావనయే - ఇక్కడ మనము చెప్పుకొనే **'మనస్సును నియమించటము'** అనునది.

ఈ మార్గములో మనస్సును నియమించే ఉపాయములు - నిత్యోపాసనా శాస్త్రీయ విధానములైనట్టి

- **అగ్న్యోపాసన, ధ్యానోపాసన, జ్యోతి ఉపాసన, ప్రాణోపాసన, దైవోపాసన, సత్కర్మోపాసన** మొదలైనవి.

ఇట్టి అభ్యాసములచే భూతతత్వమును శుద్ధి చేసుకోవాలి. **మనస్సును** - కళ్ళకు భౌతికంగా కనిపిస్తూన్న నామ రూపాత్మకమైనదానిని, త్రిగుణ సంబంధమైన సమస్తమును - **అధిగమింపజేయాలి**. అనగా, మనస్సును విషయములనుండి దాటించాలి. విషయము విషయములుగా కాకుండా "ఇదంతా కూడా **'పరబ్రహ్మము'** అనే కథారచయిత యొక్క కథా కథన చమత్కారమే" - అని అనిపించాలి. ఈ విధంగా మనము సంవిత్ సర్వరూపమగు **బ్రహ్మ తత్త్వము**పై మనస్సు **నిలుపుటకొరకై** మహనీయులతో **సత్సంగము, ధ్యానముల** సాయముతో **ఏకాగ్రతను** ఆశ్రయిస్తూ ప్రయత్నశీలురము అయ్యెదముగాక!

ఒకడు ధ్యానము - తపస్సు - యజ్ఞము - మొ॥వాటిచే మనస్సును, బుద్ధిని "అందరిలో, అందరుగా ఉన్నవాడు - వేదస్వరూపుడు - అందరినీ ప్రేరేపించువాడు" ...అగు పరమాత్మయందు నిలుపుతూ, రాగా అట్టివాడు **'విప్రుడు'** అని అనిపించుకుంటున్నాడు. వేదమును ఈ తీరుగా శాస్త్రమును అభ్యసించి 'విప్రుడు' అగుచున్నాడు.

విప్రుడు శాస్త్రార్థముల ఎరిగినవాడై **బృహత్ స్వరూపమగు బ్రహ్మమును స్వానుభవముగా పొందుచూ 'బ్రాహ్మణుడు'** అగుచున్నారు. **చిత్తము బ్రహ్మమునందు నిశ్చలమగుచుండుటచే బ్రాహ్మణత్వము సిద్ధిస్తోంది.**

***సర్వత్రా వ్యాపించియున్నవాడు, 'సవితృ' శబ్దముచే పలుకబడుచున్నవాడు, దేవతలకే దేవుడు అగు అట్టి పరబ్రహ్మముపట్ల యజ్ఞభావితులమై ఎల్లప్పుడు బ్రహ్మజ్ఞులు చూపిన మార్గములో స్తోత్రములు చేసెదము గాక! నిష్ఠ కలిగి ఉండెదము గాక!***

**పూర్వాత్ పూర్వ ప్రకాశమానము,** సమస్తమునకు **ప్రకాశకము** అగు పరబ్రహ్మమునకు మనము **భక్తి ప్రపత్తులతో నమస్కరించుచున్నాము. శ్లోకాయన్తి।** గానము చేయుచున్నాము. సూరులగు **ఆత్మజ్ఞుల మార్గమే** మనము నడిచే **సన్మార్గ పథము. బ్రహ్మపథమే** మనము ఆశ్రయించవలసినట్టిది. ఆ పరమేశ్వరుని వైపుగా అమృత స్వరూపులగు (సృష్టికర్త అగు) బ్రహ్మ - మొదలైన దేవతలు మన ప్రార్థనలను ఆలకించి, మనకు మార్గదర్శకులు అయ్యెదరు గాక!

***ఓ మనో-బుద్ధులారా!***

రండి! మావెంట నడవండి. మిమ్ములను పరబ్రహ్మోపాసనయందు నియమించుచున్నాము. ఆ దివ్యమైన పరంధామమును చేరుటలో మీరు మాకు సహాయకులై మా వెంట వచ్చెదరు గాక!

***ఓ మనస్సా!***

→ ఎక్కడ అగ్నిని ఆహ్వానించి మేము క్రతువులు, ఉపాసనలు నిర్వర్తిస్తున్నామో....

→ ఎక్కడ ప్రాణోపాసనాదులతో వాయుదేవుని ద్వారా పరమాత్మ యొక్క ఉపాసనకు ఉపక్రమిస్తున్నామో...,

→ ఎక్కడ సోమో (యజ్ఞ) నిష్ఠులమై యజ్ఞపురుషుని మేము ఆరాధిస్తున్నామో....,

అక్కడనే నీవు నిలచి ఉండెదవుగాక! జగత్ విషయరూప మనస్సుతో మేము క్రతు - యజ్ఞ - తపో - ధ్యాన - యోగములతో పరమాత్మను ఉపాసిస్తున్నాము. తత్ప్రయోజనముగా పరమాత్మ సంబంధితమైన మనస్సు మాపట్ల వికసించును గాక! మా బుద్ధి పరమాత్మ ప్రాంగణము చేరుటకై ప్రేరేపితమగును గాక!

----

ఈ మనస్సు - బుద్ధి ఎక్కడి నుండి జనిస్తున్నాయి? అగ్ని ఏ తేజో తత్త్వమునందు వెలుగొందుచున్నదో, వాయువు ఎద్దానిచే ప్రేరితమై చరిస్తోందో, ఏది చంద్రలోకమునకు ఆవల ఉండి (ఔషధ రూప ప్రశాంత) చంద్రలోకమునకు జనించే స్థానమైయున్నదో.... **అట్టి పరబ్రహ్మమే మనో బుద్ధుల ఉత్పత్తి స్థానము కూడా!**

ఓ మనో బుద్ధులారా! బ్రహ్మజ్ఞులు చూపించే ఆత్మ సందర్శన మార్గములో మీరు మా వెంటనంటి నడువటం మీకు స్వభావమే అయి ఉన్నది. కనుక **కృత్రిమమగు ఇంద్రియ విషయ మననమునుండి విరమించుచూ, స్వాభావికమగు ఆత్మయందు రమించుటకై** సహకారి కారణములవండి.

**సత్ - విత్ - ఋత్** (సవితృ) రూపుడు, సృష్టికర్తయగు బ్రహ్మకు కూడా **ఆది కారణుడు**, సృష్టి కంటే మునుముందే ఉన్నట్టి **పురాతనుడు** అగు పరమాత్మను మనో బుద్ధి చిత్తహంకార యుక్తంగా సేవించినప్పుడు మాత్రమే - ఈ సంసార బంధములనుండి

మనము **విముక్తులము** కాగలము. ఈ సర్వము ఆయనగా దర్శించటమే – మనము అనుసరించు మార్గము. అట్టి పరబ్రహ్మోపాసన కొరకై సద్గురువులు యోగేశ్వరులగు మహనీయులు మనకు **ధ్యానమార్గము** సూచించుచున్నారు.

## ధ్యానము

→ ధ్యానము చేయడానికై చక్కటి ప్రదేశమును ఎన్నుకొని,

→ సుఖాసనా శీలురమై, (శరీరము అనుకూలమై దీర్ఘకాలము నిశ్చలముగా ఉండగల ఆసనమును స్వీకరించి),

→ శిరస్సు – కంఠము – శరీరము.....ఈ మూడింటినీ కూడా నిలువుగాను, నిశ్చలముగాను ధారణచేస్తూ,

→ **ఇంద్రియములను – ఇంద్రియార్థములందు, ఇంద్రియార్థములను,** ఇంద్రియ విషయములను **మనస్సునందు,** మనస్సును **హృదయస్థానమునందు** నిలిపి,

→ ఈ సర్వమును బ్రహ్మముగా భావన చేస్తూ,

→ **"బ్రహ్మభావన"** అనే ఓడ సహాయంతో జనన – మరణ రూప తరంగములతో అనేక భయములను కలుగజేస్తున్న సంసార రూపసముద్రమును మనము **దాటివేయాలి.**

***'మనస్సు' అనే దుష్టాశ్వాన్ని (దుష్ట అభ్యాసములు గల గుర్రమును) సదభ్యాసములచే కడిగి 'శ్వేతాశ్వము' (నిర్మలమైన తెల్లటిగుర్రం)గా తీర్చిదిద్దుకోవాలి.***

## తెలివైన రథికుడు

'జీవుడు' అనే రథికుడు 'దేహము' అనే రథాన్ని అధిరోహించి, ఇక గమ్యము వైపుగా సాగిపోతున్నాడు. అయితే రథం ఆనందమయమైన 'పరమాత్మ' వైపుగా కాకుండా, దుఃఖప్రదమగు ఇంద్రియ విషయ పరంపరల వైపుగా పరుగులు తీస్తోంది. ఫలితం? **బంధములు తెచ్చిపెట్టుకుంటోంది.**

అప్పుడు ఆ రథికుడు పరిశీలించాలి... విషయమేమిటిరా? అని!

***"–ఆహాఁ! ఈ గుర్రాలు (ఇంద్రియాలు) మొండివి. సారధి (బుద్ధి) బలహీనుడు. ఆతనిని కూడా తప్పుత్రోవ అవి పట్టిస్తున్నాయి. సారధి చేతిలోని కళ్ళాలు (మనస్సు) బలహీనమైనవి. ఆశయాలు (చిత్తము) అల్పమైనవి"*** – అని గమనించి, ఇక వాటిని సరిచేయుటయందు ప్రయత్నశీలుడు అవ్వాలి కదా!

**అట్లాగే, మనము ఆవిధముగా నేర్పుగల రథికులమై,** దేహిగా ఈ దేహమనే రథమును సరియైనమార్గంలో ఉత్తమమైన మనోబుద్ధి – చిత్తములతో ఆత్మభావనవైపుగా ఉపయోగించుకోవాలి. శాస్త్రములు – గురువులు సూచించే ఉపాయాలు ఆశ్రయిస్తూ ఆత్మావగాహన – ఆత్మభావన వైపుగా అవగాహనను మరలించాలి.

- యుక్తము (wel disciplined) అగు ఆహార – విహారములతో (యుక్తాహార విహారస్య),
- మనస్సును ఇంద్రియ విషయసమూహముల నుండి నిరోధిస్తూ,
- ప్రాణ – అపానముల కదలికలను వశంచేసుకోవటానికై కొరకై ప్రాణాయామమును అభ్యసిస్తూ.....
- అప్రమత్తులమై మనస్సును సర్వత్రా ఆత్మభావనయందు ధారణ చేస్తూ

హృదయస్థుడగు పరమాత్మయందు ధ్యాసను నిశ్చలమగునట్లుగా నిలుపుతూ, మన మన సాధనలు కొనసాగించెదము గాక! ఆత్మభగవానునిలో ఏకత్వము, అనన్యత్వము కొరకై ఆత్మతత్త్వధ్యానమునకు ఉపక్రమించెదము గాక!

## ప్రాణాయామాభ్యాసము

(సాధనపూర్వకంగా) ప్రాణ – అపానముల కదలికల నిరోధ – సమత్వ అభ్యాసమే–**ప్రాణాయామము**. నాసిక నుండి గాలి పీల్చి, నాశికపై భ్రూమధ్యగా నిశ్చలం చేస్తూ, అట్టి సాధనచే మనస్సును విషయములనుండి నిరోధించి ఆత్మవైపుగా మహనీయులు మరల్చుచున్నారు. మనము కూడా అప్రమత్తతతో అట్టి ధారణను దైనందికంగా ఆశ్రయించెదము గాక!

**1) ప్రాణాయామము 2) ఇంద్రియ విషయముల నుండి విరమించటము 3) ఆత్మయందు నియమించటము**–అనే **మూడు** ప్రక్రియలతో కూడిన ధ్యానసహితమైన ప్రాణోపాసనయొక్క సానుకూల్యత కొరకై కొన్ని పరిసర సంబంధమైన జాగరూకలు కూడా అవసరం.

## ప్రదేశము

- ఎత్తు పల్లాలు లేనిదై ఉండాలి.
- పరిశుభ్రంగా తీర్చిదిద్దుకోవాలి.
- గులకరాళ్లు, బురద, ఇసుక, దుమ్ము, ధూళి లేకుండా శుభ్రముగా చేసుకోవాలి.
- జలాశయ ధ్వనులు, డబడబ శబ్దములు, జంతువుల కేకలు....ఇటువంటివి బిగ్గరగా వినబడని స్థలమై ఉండాలి.
- పరిసరములు మనస్సును రంజింపజేయుతీరుగా ఉండాలి. గురువుల-ఇష్ట దేవతల ప్రతిమలు, పటములతో అలంకరించబడినవై, ప్రశాంతము ప్రసాదించేవిగా ఉండుగాక!
- ఆ ప్రదేశము పెనుగాలి వీచనిదై ఉండును గాక! ఏకాంతమునకు సానుకూలమై ఉండును గాక! మనస్సును రంజింపజేస్తూ అనుద్వేగమును, ప్రశాంతత కలిగించునదై ఉండాలి.

### యోగాభ్యాసము చేస్తూ ఉండగా ప్రవృద్ధమగు చిత్తయోగ స్థితులు

- మొట్టమొదట శరీరముయొక్క లోపల బయట కూడా మంచువలె చల్లగా (coldness) అనిపించటం ప్రారంభిస్తుంది. (విషయముల ఉపసంహరణ)
- క్రమంగా పొగ - వెచ్చతనము (అగ్ని దగ్గరలో ఉన్నట్లుగా) అనుభూతం కాగలదు. (ఉత్సాహము)
- తరువాత చుట్టూ జలప్రవాహం ఉన్నట్లు అనిపించగలదు. (పరమాత్మయొక్క ఉనికి)
- అటు తరువాత అంతటా ఆకాశము, ఆ ఆకాశములో మెఱుపుల ప్రకాశము అనుభూతమవుతుంది. (తేజోరూపము)
- అటుపై తెల్లటి స్పటికము వలె కనిపిస్తుంది (సాత్వికత)
- ఆపై పున్నమినాటి చంద్రకాంతి వలె ఈ దృశ్యము పరమ ప్రశాంతముగాను, మనోహరంగాను, మధురముగాను గోచరమవుతూ వస్తుంది (ఆనందము)

..... ఇవన్నీ బ్రహ్మమును క్రమక్రమంగా అభివ్యక్తీకరించు సంజ్ఞలు. ఇట్టి గుర్తులు...యోగమును సిద్ధింపజేయు యత్నములు సఫలమగుచున్నట్లు, క్రమంగా బ్రహ్మప్రాప్తికి సమీపమగుచున్నట్లు భావిస్తూ ఉండెదము గాక.

### భౌతికదేహంలో యోగాగ్ని ప్రభావం

ఈ భౌతిక దేహము - (1) పృథివి (solid) - (2) ఆపః (liquid)- (3) తేజో (Heat) - (4) వాయువు (స్పందన) (5) ఆకాశము (placing) - లతో కూడిన - ఒక జడవస్తువే అయి ఉన్నది. ప్రకృతిచే ప్రసాదించబడిన ప్రాణశక్తి ఇద్దానిని ఉత్తేజపరుస్తూ, సత్-చిత్ స్వరూపుడగు జీవునికి నివాసయోగ్యముగా అగుచున్నది. అయితే ఈ దేహము జడమే అయి ఉండినప్పటికీ, యోగులు యోగసాధనలు నిర్వర్తిస్తూ ఉండగా పవిత్రమగు యోగాగ్ని ఈ దేహములో ప్రత్యక్షమై వృద్ధి చెందసాగుతుంది. యోగ అభ్యాసము యొక్క ప్రవృత్తిచే దేహము దూదిపింజమువలె తేలికగా, ఉత్సాహముతో కూడిన కదలికలు కలిగినదగుచున్నది. **నైరాశ్యము తొలగుచూ, ఏకాగ్రత వృద్ధి చెందసాగుతుంది.**

ప్రాణాయామాభ్యాసముచే యోగాగ్నిమయమైన శరీరము కలవానిపట్ల మృత్యుభయము, జరా భయము, రోగభయము తొలగుతాయి. శరీరము తేలికగాను, మృదువుగాను, ఆరోగ్యవంతముగా అగుచున్నది. **మనస్సు** - లౌకికమైన ఆశ, నిరాశ, పేరాశలను అధిగమించుచున్నది. బుద్ధి - ఇంద్రియ లోలుపత్వమును, దృశ్య ఆకర్షణలను జయించివేయుచు, ప్రకాశమానముగా అగుచున్నది. **భౌతికదేహము** పుష్టిగా సౌష్ఠవము పొందుచున్నది. కంఠధ్వనిలో **సుస్పష్టత, నిర్దుష్టిత, సుశబ్దత, గాంభీర్యత, మధురనాదము** పెంపొందుతూ ఉంటాయి. "యోగాభ్యాసి" యొక్క శబ్దోచ్చారణను వింటున్నప్పుడు అనిర్వచనీయమగు ఆనందము, ఉత్సాహము, ప్రేరణ సహజంగానే కలుగుతూ ఉంటాయి.

యోగుల శరీరము సుగంధమును వెదజల్లుచున్నదై ఉంటుంది. మూత్రము - పురీషము - చెమట తక్కువ అగుచూ వస్తాయి. అవి దుర్గంధ రహితము అగుచూ ఉంటాయి.

**ఇవన్నీ యోగాభ్యాసం ప్రారంభించినవారి స్వాభావిక లక్షణాలుగా యోగశాస్త్రముచే పేర్కొనబడుచున్నాయి. అందుచేత మనమంతా శ్రద్ధగా, దైనందికంగా, భయము-విషాదము-బద్ధకము వదలివేసి సర్వదా ప్రాణాయోగాభ్యాసనిరతులమై ఉండెదము గాక!**

ఇంటి ఇల్లాలు ఇంటిలోని వెండి - రాగి - బంగారు - పంచలోహ విగ్రహాలు మకిలి పట్టినప్పుడు ఏంచేస్తున్నారు? కచ్చిక, మట్టి మొదలైనవాటిని పూసి, రాపిడి చేసి, తోమి, ఆ తరువాత నిర్మలమైన జలముతో పరిశుభ్రం చేస్తున్నారు. అప్పుడు ఆ విగ్రహాలు పవిత్రము - శుభ్రము అయి తళతళ మెరుస్తూ ఉంటాయి.

అదేరీతిగా ప్రాణాయామము-ధారణ-మంత్రోచ్చారణ-ఇత్యాది ప్రయత్నములచే శ్రద్ధాభక్తులతో కూడిన యోగి యొక్క మనో - బుద్ధులు పవిత్రతను, పరిశుభ్రతను, నిర్మలతను సంతరించుకో సాగుతాయి. ఆ యోగి క్రమంగా ఆత్మసందర్శనం చేత **అద్వితీయుడు, కృతార్థుడు, శోకవర్జితుడు, స్వస్వరూపాత్మానంద భరితుడు** అయి బ్రహ్మానందమునందు ఓలలాడుచున్నాడు.

యోగాభ్యాసము యొక్క ప్రభావంచేత యోగియొక్క అంతఃకరణములో బ్రహ్మతత్త్వము స్వయముగా ప్రకాశిస్తున్నది. **(తత్ స్వయం యోగ సంసిద్ధః కాలేన ఆత్మని విందతి).** క్రమంగా బుద్ధి నిశ్చలము - నిర్మలము అగుచూ **ఆత్మతత్త్వము**నందు లీనమగుచున్నది. ఆ యోగి ఆత్మస్వరూపియై ప్రకాశిస్తూ **'యుక్తుడు'** అని పిలువబడుచున్నాడు. ఇంకా ఆపై (యోగాభ్యాస విశేషం చేత) ఆతడు - **అజము, ధృవము, సర్వతత్త్వస్వరూపము, విశుద్ధము, దివ్యము** - అగు ఆత్మను ఎరిగి, సర్వ మానసిక దోషములనుండి విముక్తుడగుచు **మోక్షరూపమగు ఆత్మాకాశ స్వరూపుడై విహరిస్తున్నాడు. కేవల సర్వాత్మానందస్వరూపుడై, నాలుగు దిక్కులలోను - నాలుగు ఉప దిక్కులలోను, క్రింద - పైనా, 14 లోకాలలోను నిండినవాడగుచున్నాడు. సర్వదా సర్వమునకు అతీతుడై, కేవలసాక్షీభూతుడై** సర్వమును ఆస్వాదిస్తూ ఉంటాడు. సమస్తమునందు స్వస్వరూపాత్మను, స్వస్వరూపాత్మయందే సమస్తమును దర్శించుచూ ఆ యోగయుక్తుడు ఆత్మానంద భరితుడై ఉంటున్నాడు. ఇహమును, పరమును సుఖప్రదంగా సమన్వయించుకొని ఉంటాడు.

జన్మల కన్న మునుముందే గల **'తత్'** స్వరూపుడౌతాడు. జన్మలు వస్తూ, పోతూ ఉన్నప్పుడు, జన్మల రాక పోకలు సశాంతించినప్పుడు కూడా ఏకరూపుడై అఖండానందస్వరూపుడై, చిద్విలాసుడై విరాజిల్లుచున్నాడు. **"నేనే అన్ని చోట్లా అన్ని రూపములుగా జనిస్తున్నాను. అన్ని రూపములుగా అంతటా ఉన్నది నేనే! నాది కానిదిగాని, నేను కానిది ఎక్కడా ఏదీ లేదు"...అనే ఆత్మాఽహమ్ తత్త్వాన్ని స్వభావసిద్ధంగా ఆస్వాదిస్తున్నాడు.**

**సర్వత్రా సర్వమై సర్వతోముఖుడై, సర్వమునకు వేరై ప్రకాశించుచున్నాడు.**



*ఏ ఆత్మ భగవానుడైతే...,*

| | |
|---|---|
| అగ్నియందు | తేజోరూపుడై, |
| జలమునందు | రసస్వరూపుడై, |
| విశ్వమంతా | విశ్వాంతర్గతుడై, |
| భువనమంతా | భౌమానందరూపుడై, |
| భూమియందు | ఓషధీస్వరూపుడై, |
| వృక్షలతలయందు | వనస్పతి స్వరూపుడై, |

సర్వముతానై, సర్వమునకు సాక్షి అయి సమస్త జీవుల సహజస్వస్వరూపుడై, సర్వమునకు పరుడై ఉన్నారో....

**అట్టి పరమపురుషునికి, దేవాది దేవునికి నమో నమో నమో నమః॥** ఏదేది 'నాది-నాది' అని మనకు అనిపిస్తున్నదో, అదంతా కూడా, "సమస్తము ఆ పరమ పురుషునిదే" అను సమర్పణ అభ్యాసించుచుండగా, మనము పరమపురుషుడే అగుచున్నాము.

## తృతీయోఽధ్యాయః - ఏకో రుద్రో। - 3వ శిష్యుని విశ్లేషణము

**శ్వేతాశ్వతరమహర్షి** :

ఏకము - అఖండము అగు ఆ పరమాత్మ మాయాకల్పనయందు సముత్సాహి అయి, మాయావిష్టుడై, తనయొక్క విశ్వకల్పనాశక్తితో....

- ఈ సర్వమును నియమించువారు (The creator),
- నియమించబడుచునట్టి ఈ సమస్తము (The created)

..... ఈ ఉభయముతానే అయి బాలాలీలావినోదము సలుపుచున్నాడు.

- ఈ సర్వమును వ్యాపింపజేస్తున్నది ఆయనయే।
- ఈ సర్వముగా వ్యాపించుచున్నదీ కూడా ఆయనయే।

ఆత్మభగవానుడే....

- ఉద్భవింపజేయుచున్న వాడు (ఈశ్వరుడు),
- ఉద్భవించుచున్న అనుభవుడు (జీవుడు),
- ఉద్భవించబడుచున్నది (ప్రకృతి) కూడా!

ఎవ్వరైతే **సర్వస్వరూపుడు – స్వస్వరూపుడు** కూడా అయి ఉన్నారో,... అట్టి పరబ్రహ్మము గురించి ఎవ్వరైతే యోగానుభవ పూర్వకంగా తెలుసుకొనుచున్నారో,....వారు **మృత్యువు యొక్క పరిధులు అధిగమించి (జన్మచే ఏదో పొందుచున్నాను – మృత్యువుతో ఏదో కోల్పోవుచున్నాను అనే భ్రమను తొలగించుకున్నవారై)** అమృతత్త్వమును సంతరించుకొనుచున్నారు.

❖ ❖ ❖

సర్వాంతర్యామియగు భగవానుడగు రుద్రుడు ఒక్కరే! ఆ ఒక్కడే ఈశ్వరుడు – జీవుడు – జగత్ దృశ్యరూపములుగా (త్రిమూర్తి స్వరూపుడై) అంతటా సర్వదా వేంచేసియున్నారు. నేను – నీవు – అతడు – అది – ఇది – పురుషుడు – ప్రకృతి....ఇత్యాదులు ఆయనకు వేరుగా లేవు. ఏకము – సర్వము అగు ఆ రుద్రభగవానుడే సమస్తము అయిఉన్నారు. అందుచేత **భగవానుడగు రుద్రుడు అద్వితీయుడు.** ఆయనకు ద్వితీయ మనునది లేనేలేదు. సర్వము ఆయనయే! **శివాత్ పరతరమ్** నాస్తి. ఆయనయే అంతటా **విస్తరించి, సమస్త జీవులలోను సర్వస్వరూపుడై ఉన్నారు. విస్తరింపజేసేది – విస్తరించియున్నది – ఆస్వాదించుచున్నది – ఆస్వాదించబడుచున్నది కూడా! నియమించుచున్నది – నియమించబడుచున్నది కూడా ఆయనే!**

అందరిలోను, అందరుగాను ప్రత్యగాత్మరూపులై వెలుగొందుచున్నదీ ఆయనే. **ఆయన తనయొక్క మాయాశక్తి (లేక) కల్పనాకళా విశేషముచే** చతుర్దశ భువనములతో కూడి ఈ విశ్వమును తనయందు తానే వినోదియై **సృష్టిస్తున్నారు. స్థితింపజేస్తున్నారు. పరిపోషిస్తున్నారు. లయింపజేస్తున్నారు. పునః సృష్టించుచున్నారు.** ప్రళయకాలములో తనయందు ఈ సర్వమును లీనము చేసుకుంటున్నారు. కాలస్వరూపుడై **సృష్టి-స్థితి-లయములు నిర్వర్తిస్తూనే**, "అకర్తయై, పరమై" ఉంటున్నారు.

ఆ రుద్రభగవానుడు ఒక్కడే! ఏకమే అయి అనేకముగా (అజ్ఞానమున్నంతవరకు) అనిపిస్తున్నారు. ఆయన తన నుండి ఆకాశము– భూమి– అంతరాళము (In between space)లను సృష్టించుకొని సర్వత్రా ద్రష్టయై వీక్షిస్తున్నారు. ద్రష్ట–దృశ్యము–దర్శనము....తానే అయి సర్వత్రా చక్షువులు కలిగి ఉన్నారు. దృష్టాంతానికి ఒకడు నిదురించి తనయందు తానే స్వప్నదృశ్యమును కల్పించుకొని ఆస్వాదిస్తూ ఉన్నప్పుడు

- స్వప్నమంతా **తనయందే!**
- స్వప్నము **తనదే!**
- స్వప్నాంతర్గత **ద్రష్ట తానే!**
- **స్వప్న దృశ్యమంతా** తానే తన స్వప్న చైతన్యము స్వరూపముచే నింపి ఉంచటము.
- స్వప్నమునకు తాను **సర్వదా వేరే!**
- **స్వప్నము లేకున్నా కూడా తాను ఉండియే ఉంటున్నవారు –**

...అగుచున్నాడు కదా! స్వప్నంలో స్వప్న ద్రష్టకు వేరైనదేమున్నది? తాను స్వప్నములోని ఏదో ఒక రూపము అవటమెక్కడున్నది.

అట్లాగే **"పరమాత్మ స్వరూపుడనగు నేను జాగ్రత్ – స్వప్న – సుషుప్తులను, ద్రష్ట – దర్శన – దృశ్యములను కల్పించుకొంటూ, సర్వమునకు వేరై (ప్రత్యక్ ఆత్మ స్వరూపుడనై) ఉన్నానుకదా!" అనునది సద్గురుబోధానుసారము (మరియు) తత్త్వశాస్త్ర మహావాక్యానుసారము** గ్రహించెదముగాక!

(స్వప్నంలో కనిపించే వ్యక్తులందరూ **– స్వప్నము తనదైనవానియొక్క భావనా స్వరూపులే** అయి, వారందరు ఆతనికి అభిన్నస్వరూపులు అయినరీతిగా),... **పరమాత్మయే సర్వే సర్వత్రా అన్నివైపులా ముఖములు కలిగినవారై ఉన్నారు.** అంతటా బాహువులు (వేరువేరైన (Functioning), పాదములు (wandering) కలిగి అనేక రూపములుగా అగుచున్నారు. అనేకములైన వేరు వేరు సమావేశములను (Multi-Associations and verieties of relationships in the unity) నిర్వర్తిస్తున్నారు. మట్టి ఒక్కటే అయినప్పటికి (సంక్రాంతి బొమ్మల కొలువులో) అనేక రీతులైన వేరు వేరు బొమ్మల సమూహాలుగా కనిపిస్తున్నట్లు – **పరమాత్మయే ఈ దృశ్యమంతా కలిగి ఉంటున్నారు.** ఆయన తనయొక్క 'ఉభయబాహువుల శక్తి సామర్థ్యముచే – ఆకాశము, భూమి, మానవుడు మొదలైనవాటిని, ఇంకా సర్వ జీవరాసులను జనింపజేస్తున్నారు.

*ఏ కారణకారణుడగు పరమాత్మ –*

- **సర్వదేవతా స్వరూపముగా** ప్రభవిస్తున్నారో,
- దేవతలకు **ఆదికారణుడో,**

- **దేవతలకు సర్వశక్తి - సంపద - పరిపాలన** ప్రభావములను ప్రసాదిస్తున్నారో,
- **విశ్వాధిపో**...ఈ విశ్వమునకు ఆవల సాక్షీభూతుడై ఉండి ఈ విశ్వమంతా పరిపాలిస్తున్నారో.....,
- **రుద్రుడై సృష్టి - స్థితి - లయములను** పర్యవేక్షిస్తున్నారో.....,
- (మహత్ + ఋత్ + ఈష = మహర్షి) మహత్తరమగు **"ఆత్మైవేద్యేవ సర్వత్రా"** అను ప్రజ్ఞగల **మహర్షుల రూపము ధరించి, పరమసత్యము గురించి విశ్వమంతా వినిపించేరీతిగా** గానం చేస్తున్నారో....,
- హిరణ్యగర్భుడై ఈ విశ్వములోని పదార్థములను, వాటి - వాటి ధర్మములను, జీవరాసులను, జీవన స్రవంతులను, సృష్టినంతటినీ కల్పనా చమత్కారంగా సృష్టిస్తున్నారో..., సృష్టికి పూర్వమే ఉండి, సృష్టిని భావించి, సంకల్పించి, ఇదంతా నడుపుచున్నారో...,

అట్టి ఆత్మ భగవానుడు మనకు నిర్మల బుద్ధిని ప్రసాదించి, అల్ప భౌతిక దర్శనమునుండి రక్షించి, **ఆత్మదర్శనము** అను శుభదృష్టిని ప్రసాదించెదరు గాక!

**హే పరమపురుషా! పరంధామా!**

**సర్వాత్మకుడవు, సర్వతత్త్వ స్వరూపుడవు, సర్వతత్త్వ విదూరుడవు** అగు హే రుద్రభగవాన్! శివము - మంగళకరము అగు మీ విశ్వశరీరము మా భౌతికమైన - అల్పమైన కళ్లకు, దృష్టికి స్థూలముగా కనిపిస్తున్నప్పటికి కూడా మీరు **అఘోరస్వరూపులు!** సూక్ష్మాతి సూక్ష్మమగు, సర్వాధారమగు, సర్వులలోని ప్రేరణమగు - **చిత్ చైతన్యానంద దేహులు.**

**అపా ప్రకాశినీ! 'దోషములు' అణే చీకట్లను తొలగించు ప్రకాశస్వరూపా!** మీయొక్క విశ్వకళా స్వరూపము - శోభాయమానము అగు శివానంద స్వరూపమును కించిత్ స్మరించినంత మాత్రంచేతనే మీరు మాయొక్క అల్పబుద్ధులను పాపదృష్టులను తొలగించి మమ్ములను పవిత్రులను, పునీతులను చేయుచున్నారు. పర్వతనివాసియగు ఓ రుద్ర దేవా! అల్పజ్ఞులమై సంసారలంపటములో చిక్కియున్న మాపై మీ అమృతవీక్షణములను ప్రసరింపజేయండి! సుఖ-శాంతి - ఆనంద కైవల్యములను-**అభిచాకశీహి।** -మాపై కరుణతో మాకు ప్రసాదించెదరుగాక! ఆత్మభావనామృతమును అందించెదరుగాక! మీరు పర్వతవాసియై, హస్తములలో శివధనస్సును, శంఖమును, డమరుకమును ధరించి ఎందుకు సంచరిస్తున్నారు? అనేక ఉపాధులుగా దృశ్యమును వాస్తవమైనదిగా నమ్మి, తత్ఫలితంగా భవబంధముల రూపంగా అనేక దుఃఖములను పొందుచూ దిక్కుతోచక 'పాహి', 'పాహి' అని అర్థిస్తున్న మమ్ములను రక్షించటం కోసమే కదా! మీ కరుణా కటాక్ష వీక్షణచే....మమ్ము మా సంసారభావాలు, దృష్టులు ఇక మమ్ము బాధించకుండును గాక! మాపట్ల ఇదంతా శివము-శాంతము-ఆత్మానందప్రదము అగు గాక! ఈ జగత్తు పరమ పురుషుడగు రుద్ర భగవానుని సంప్రదర్శనారూపమై అనుభూతమగును గాక!

❁ ❁ ❁

**శ్లో॥ తతః పరంబ్రహ్మ పరం బృహంతం, యథా నికాయం సర్వభూతేషు గూఢం,**
**విశ్వస్య ఏకం పరివేష్టితారమ్, ఈశం - తం జ్ఞాత్వా అమృతా భవంతి॥**

ఆ పరంబ్రహ్మమూర్తి....

- ఈ **విశ్వ రూపుడై ఉండియే**....ఈ విశ్వముకంటే పరము (ప్రత్యేకము, మహత్తరము) అయి, **పరబ్రహ్మము** అయి ఉన్నారు.
- ఒక నటునియొక్క 'పాత్రధారణకు' సంబంధించని వ్యక్తిగతమగు **ఆవల రూపమువలె సర్వదా పరమై ఉన్నవారు.**
- సమస్తమును అధిగమించు, **బృహత్తరమై సర్వత్రా విస్తరించి** ఉన్నారు.
- సర్వదా ఈ సమస్తమును తనయందు **లీనము చేసుకొని** యున్నారు.
- సర్వ జీవులలోను **'అంతర్యామి'** అయి వ్యాపించి, సర్వము సర్వదా తానే అయి ఉన్నారు. అందుచేత మాలోని ప్రతి ఒక్కరికి అనన్యులు.
- ఈ విశ్వమంతా తన ఏకరూపముయొక్క ఒక 'అంశ'గా కలిగి ఉండి సర్వమును నియమించుచు, పర్యవేష్టించుచున్నారు.
- సర్వనియామకుడై **ఈశ్వరుడుగా, పర్యవేక్షకుడుగా, ప్రేక్షకుడుగా** కూడా - వ్యాపించి ఉన్నవారు. సమస్తమునందు సర్వదా వర్తించుచున్నారు.

*అట్టి రుద్రభగవానుని, మహాదేవుని ఎవ్వరైతే.... పైవిధంగా ఎరుగుచున్నారో, అట్టివారు మృత్యువు (మార్పు) యొక్క పరిధులను దాటి, అమృతులగుచున్నారు.*

స్వస్వరూపాత్మ భగవానుని,

- సర్వదేవతా స్వరూపుడుగా....,
- విశ్వ స్వరూపుడుగా....,
- విశ్వభర్త - హర్తగా....,
- సర్వాంతర్యామిగా.....,
- స్వహృదయాంతర్గతునిగా....,
- సర్వ స్వరూపునిగా.....,
- స్వస్వరూపునిగా.....,

భక్తి - జ్ఞాన - యోగ - వైరాగ్య మార్గాల కలగలపుగా అధ్యయనముచేస్తూ **తెలుసుకొంటారో,**...వారు **ఇప్పుడే, ఇక్కడే అమృతస్వరూపులు అగుచున్నారు!**

(మన సద్గురువులు శ్రీ శ్వేతాశ్వతర మహర్షి వంటి) బ్రహ్మజ్ఞుల, తత్త్వజ్ఞుల, విదితవేద్యుల బోధలు విన్న.... మనము **బ్రహ్మతత్త్వమును ఎరుగుచున్నాము. బృహత్తరమగు స్వస్వరూపమును సర్వత్రా గమనిస్తూ నిత్యానందులమగుచున్నాము.**

> **శ్లో॥ వేదాహమ్ ఏతం పురుషం మహాన్తమ్, ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్,**
> **తమేవ విదిత్వా, 'అతి మృత్యుమ్' ఏతి। న అన్యః పంథా విద్యతే అయనాయ॥**

→ ఆది + తత్ + యత్ = **ఆదిత్య।** ఎవ్వరైతే సర్వమునకు ఆదిస్వరూపులై ఉన్నారో....(సర్వ కిరణములు జీవులైతే, పరమాత్మ సూర్యభగవానుడు వంటి) అట్టి ఆదిత్యుడై, ఆదిత్యవర్ణుడై, నిత్యస్వయం ప్రకాశకుడై,

→ ఎదురుగా పాంచ భౌతికంగా అనిపించే దృశ్యము - అనే అజ్ఞాన చీకటికి ఆవల స్వయం ప్రకాశస్వరూపుడై, సమస్తమునకు ప్రకాశకుడై....., మనలోనే - అంధకారమునకు ఆవల, ఆ అంధకారమును చూస్తూ ఉన్నవారై ఉన్నారో,

మహత్తరము-మహిమాన్వితములతో కూడిన ఏ **పరమ పురుషుడు** సర్వత్రా ప్రకాశమానులై ఉన్నారో,.....ఆ ఆత్మ భగవానుని గురించి **సద్గురు బోధల సహాయంతో మనము తెలుసుకుంటున్నాము.**

ఆయనను తెలుసుకొని మనము మృత్యుపరిధులను దాటివేస్తున్నాము. **"దేహములు రావచ్చు - పోవచ్చు గాక! మనము ఆ రాక పోకలకు సంబంధించిన వారిమే కాము! అవి ఆత్మస్వరూపులమగు మనకు సంబంధించినవి కావు"**.....అని గ్రహించినవారమై మృత్యువును దాటివేసిన వారము అగుచున్నాము. జన్మ-జీవన్-జరా-మృత్యువులకు సాక్షీభూతులమై, చెదరని చిరునవ్వుతో వీక్షించుచున్నాము.

ఆత్మ గురించి ఎరుగుటయే మృత్యువును అధిగమించటము. అమృతస్వరూపులం అవటము. మృత్యువును దాటి వేయటానికి ఉపనిషత్ వాణి - గురువాక్యముల - వేద మహావాక్యార్థములు అగు **'ఆత్మైయేవాస్మ్యహమ్'** అను జ్ఞానము - అనుక్షణిక సుస్థిరానుభవము సంపాదించుకోవటమే ! అది తప్పించి, వేరే త్రోవలేదు!

**అమృతత్వము** = దేహ మనో చిత్త అహంకారములకు సంబంధించినవై కనిపిస్తున్న మార్పు-చేర్పుల పరిధిలచే స్పృశించబడని కేవల స్వస్వరూపానుభవము.

**యస్మాత్ పరం నాపరమ్ అస్తి కించిత్।** ఎద్దానికైతే **"పరమైనది (ఆవల) - అపరమైనది (ఈవల)"** అంటూ వేరుగా ఏదీ లేదో, అంతా **ఆత్మస్వరూపమే, ఆత్మ ప్రదర్శనమే** కాబట్టి ఆత్మకు ఆవల - ఈవల మరేమీ లేనట్టిదై ఉన్నదో...,

**(యస్మాత్) న అణీయో - న జాయో అస్తి కశ్చిత్** సూక్ష్మాతిసూక్ష్మమై ఉన్నది కాబట్టి, ఏ ఆత్మ వస్తువు కంటే సూక్ష్మమైనది మరింకేదీ లేదో, ఈ స్థూలముగా కనిపించేదంతా కూడా అద్దాని కల్పనయే కాబట్టి, అద్దాని కంటే మరేదీ **స్థూలము అయి ఉండదో...,**

**వృక్ష ఇవ స్తబ్దో।** ఏది వృక్షమువలె దేహముల - గుణముల రాకపోకల, వర్తన - అవర్తనముల సందర్భములలో కూడా యథాస్థానంలో ఉన్నచోటే (ఎటూ కదలక) యథాతథమై ఉంటోందో....,

**దివి తిష్ఠతి ఏకః** - భూతాకాశము వలెనే ఏ ఆత్మాకాశము సర్వదా ఏకము, అఖండము అయి ఉంటోందో,

అట్టి పరమపురుషునిచే ఈ సర్వము పూర్ణమైయున్నది। **తేన ఇదమ్ పూర్ణమ్ పురుషేణ సర్వము** (All this is filled up by, as well as made up of that absolute SELF - PARAMA PURUSHA)। **ఆ పూర్ణ పురుషుడే - నేను। నీవు। సమస్త జీవులు। దేవతలు। లోకములు। సమస్తము కూడా। అట్టి పరమపురుష నిత్య సందర్శనమే ఆత్మజ్ఞానము, ఆత్మోపాసన, ఆత్మసాక్షాత్కారము కూడా!**

**శ్లో॥ తతో యత్ ఉత్తర తరం, తత్ అరూపం అనామయమ్**
**య ఏతత్ విదుః అమృతాః తే భవంతి॥**

ఏ పరమపురుషుడైతే...,

- ఈ దృశ్యములో కనిపించే కార్య – కారణ – కర్తృత్వములతో సహా ఈ సర్వమునకు **ఆవల, సర్వదా వేరై, సమస్తమును ప్రకాశింపజేయువారై** ఉన్నారో....
- రూపములన్నీ తనవే అయి కూడా **రూపరహితులై** ఉన్నారో....
- ఈ విశ్వమంతా తనయందే కలిగి ఉండి కూడా, తనయందు ఏదీ లేనివాడై, **అనామయుడై** ఉన్నారో....

ఎవ్వరు అట్టి పరబ్రహ్మమును తెలుసుకుంటున్నారో... **అట్టి వారు ఆ అమృతస్వరూపమే అగుచున్నారు.**

**అథ ఇతరే దుఃఖమేవ అపి యంతి॥ తదితరమైనది ఏది ఎంతగా ఎంతవరకు తెలుసుకున్నప్పటికీ దుఃఖము తొలగదు. శాశ్వతమైన సుఖము లభించదు.** వాస్తవానికి తదితరమైనదంతా దుఃఖప్రదమేగాని, సుఖప్రదము కాదు.

- **సర్వ ఆనన శిరో గ్రీవః** ఈ సర్వ ముఖములు, శిరస్సులు, కంఠములు ఆ పరమపురుషునివే....!
- **సర్వభూత గుహాశయః** సర్వ హృదయ గుహలను నిండి ఉండి, సర్వజీవుల ఆశయములుగా నాటకీయ ప్రదర్శించుచున్నది మహారచయిత అగు ఆ పరమపురుషుడే!
- **సర్వవ్యాపీ స భగవాన్।** (నాటకంలోని సర్వపాత్రల స్వభావములు, ఆశయములు నాటకరచయితవే కదా!) ఈ సర్వము పరమాత్మయొక్క సూత్రధారిత్వమే. అందుచేత ఆయనయే సర్వగతుడగు శివ భగవానుడు। **సర్వగతశ్శివః॥**
- **మహాన్ ప్రభుర్వై పురుషః** సర్వపురుషకారములు స్వీయ ప్రదర్శనమే అయి ఉన్న మహాపురుషుడు! జగద్దృశ్యమంతా ఆయన ప్రవర్తనా చమత్కారమే।
- **ప్రభుః** సర్వమునకు నియామకుడు! నిర్ణయ కర్త! పరిపాలించుచున్నట్టివాడు। ప్రభువు।
- **పురుషః** సర్వజీవులలోని క్రియా విశేషుడు! ఈ సమస్త లోకములు తనయొక్క పురుషకారమే అయి ఉన్నవాడు.
- **సత్త్వస్యః** కేవల 'సత్' స్వరూపుడు. ఆయనయే 'ఉనికి' (సత్) కలవాడు. తదితరమైనదంతా కేవలము కల్పనయే.
- **ప్రవర్తకః** ఇదంతా ఆయనయొక్క సంచారము–సంచలనము అయి ఉన్నవారు. ఈ విశ్వమును ప్రవర్తింపజేయువారు – **సర్వస్య ఏష ప్రవర్తకః!**
- **సునిర్మలా।** సునిర్మలుడు. ఆయనను కర్మ–జన్మ దోషములు స్పృశించనే లేవు.
- **ఈశానో** – అంతటా విస్తరించి యున్నట్టి ఈశానుడు.
- **జ్యోతి స్వరూపులు। జ్యోతికే జ్యోతి। స్వయం జ్యోతి స్వరూపులు।**
- **ఆత్మజ్యోతి స్వరూపులు. మార్పు–చేర్పుల పరిధులకు అతీతులు. అవ్యయులు।**

ఆయనను ఉపాసించువాడు అట్టి శివస్వరూపుడే అగుచున్నాడు. ఆయనను స్వస్వరూపుడుగా దర్శించటమే మహదాశయము.

**శ్లో॥ అంగుష్ఠ మాత్రః పురుషో అంతరాత్మా, సదా జనానాగ్ంం హృదయే సన్నివిష్టః**
**హృదా మన్వీశో మనసా అభిక్లప్తో, య ఏతత్ విదుః, 'అమృతా' తే భవంతి॥**

స్వహృదయంలోనే అంగుష్ఠ (బొటనవేలు పరిమాణంగల) ప్రేరకుడు – తేజోమయుడుగా ప్రకాశిస్తున్న ఆ పరమపురుషుడే – సర్వజీవుల హృదయగుహలో – సర్వదా ప్రకాశమానుడై ఉన్నారు. పొగలేని అగ్నివలె తన చిత్ప్రకాశమును అంతటా వెదజల్లుచున్నారు. 'మనస్సు' అనే పళ్లెముచే మూయబడి ఉన్నారు. **ఆ పళ్లెము చివరల నుంచి ప్రసరించే కాంతియే విశ్వరూపముగా అభివ్యక్తమగుచున్నది.**

ఎవ్వరైతే తమ హృదయమునందే ప్రకాశించుచున్న ఆత్మభగవానుని బుద్ధితో గ్రహిస్తూ ఉంటారో, వారే **మోక్షస్వరూపులు। అమృతస్వరూపులు। ఆత్మానందాను భవులు।**

**హృదయంలో సర్వాత్మకుడగు పరమాత్మ అంగుష్ఠమాత్రుడై వసించుచు తనయందు తానే బ్రహ్మాండ దృశ్యమంతా కల్పించుకొని ఆస్వాదించటమునుగా గమనించటమే 'యోగ దర్శనం'! 'ఆత్మదర్శనం!' (అంగుష్ఠ = యోగముద్రలలో బొటనవ్రేలును నిలువుగా ధారణ చేయటము – 'తత్' – పరమాత్మకు సంజ్ఞ।) చూపుడు వ్రేలు 'త్వమ్'కు సంజ్ఞ. క్రింద మూడు వ్రేళ్లు సత్వ–రజో–తమో గుణములకు సంజ్ఞ.**

**ఆ పరమపురుషుడు...**

**శ్లో॥ సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్**
**స భూమిం విశ్వతో వృత్వా, అత్యతిష్ఠతి దశాంగులమ్॥**

- వేలాది శిరస్సులతో - ఆలోచనలతో,
- వేలాది చక్షువులతో - దృష్టులతో,
- వేలాది పాదములతో - నడకలతో,

ఈ భూమి - విశ్వములందు అంతటా, దశదిశలా వ్యాపించియుండి (ఈ భౌతిక విశ్వమంతా కూడా (2) అంగుళములనుకొంటే) దీనికి ఇంకా కూడా దశ (10) అంగుళములుగా అతిక్రమించి ఉన్నారు. (1 అంగుళము = 1 అడుగులో 12వ భాగము).

- ఒక 'అడుగు' (one feet) లో -మార్పు చెందు ఈ విశ్వమంతా 2 అంగుళములుగా ఇమిడి ఉండగా, పరమాత్మ ఇంకా ఆవల పది అంగుళములుగా మార్పు చెందని రూపముతో విస్తరించి ఉన్నారు. (దేహి దేహమును దాటి మనో, బుద్ధి, చిత్త, అహంకార, ఈశ్వరులుగా గుణత్రయంగా, జీవ-ఈశ్వరులుగా విస్తరించి ఉన్నది).
- అనగా, నా ఆత్మ యందు ఈ విశ్వమంతా 2 అంగుళములతో ఇమిడి ఉండగా, నేను ఈ విశ్వమునకు ఆవల ఆత్మస్వరూపుడనై విస్తరించి ఉన్నాను.
- స్వప్నద్రష్ట స్వప్నములోని సర్వ రూపములు తానే అయి, స్వప్నమంతా తానే ఆక్రమించియుండి, స్వప్నమునకు ఆవల విస్తరించి ఉన్న రీతిగా మమాత్మ ఈ సర్వమును అధిగమించినదై ఉన్నది.

**పరమపురుషుడు**: ఈ సమస్తము ఏ పరమాత్మయొక్క పురుషకారమో, ఆయనయే **పరమ పురుషుడు.**

ఇప్పుడు విశ్వరూపంగా (వర్తమానంలో) ఉన్నది, ఇతఃపూర్వ (భూతకాలము)లో ఉండి ఉన్నది. భవిష్యత్‌లో విశ్వరూపంగా ఉండబోవుచున్నది కూడా- ఇదంతా కూడా పరమ పురుషుడే! **పురుష ఏవ ఇదగ్ం సర్వం, యత్ భూతం, యచ్చ భవ్యం। ఆయనకు వేరై**-ఇప్పుడుగాని, ఇతఃపూర్వముగాని, ఇకముందుగాని - **ఏదీ లేదు.** ఈ విశ్వము జనించుచున్నది ఆ పరబ్రహ్మమునందే! ఉన్నది పరబ్రహ్మమునందే! లయించబోయేది కూడా పరబ్రహ్మమునందే! ఇదంతా..., **ఉత అమృతత్వస్య ఈశానో, యదన్నేనా తిరోహతి।**

ఆయన నుండే! ఆయనగానే! ఇదంతా అయి ఉన్నది ఆయనే! పరబ్రహ్మ స్వరూపుడగు ఈశానుడే! నేను-నీవు-దృశ్యము....అంతా స్వతఃగా సర్వదా పరబ్రహ్మమే! ఒక గొప్ప రచనలో రచయితచేత కానట్టిది ఏముంటుంది? ఆయన రచనలో ఆయనకు బాహ్యామైనదేముంటుంది? ఆయనను అన్నముగా (అనుభవముగా) సిద్ధించుకొన్నవాడు తిరిగి 'అన్యము'నకు తిరోధానము పొందడు.

- సర్వ చేతులు - చేతలు ఆయనవే! - **సర్వతః - పాణి।**
- సర్వ పాదములు - నడకలు ఆయనకు చెందినవే! - **పాదం తత్।**
- సర్వ నేత్రములు - వేరు వేరైన సర్వ దృష్టులు, ద్రష్టలు ఆయన యొక్క భావనాచమత్కారమే! - **సర్వతో అక్షి।**
- సర్వ శిరస్సులు - ఆలోచనలు ఆయనకు చెందినవే! - **శిరో।**
- సర్వముఖములు - ఆయన సంప్రదర్శనములే! - **ముఖమ్।**
- అందరి చెవులు ఆయనవే అయి ఉండి, అంతా వినుచూ ఉన్నది ఆయనే. - **సర్వతః శ్రుతమత్।**
- లోకములన్నీ ఆవరించి, అన్నిటా అంతటా, అన్నీగా ఆ పరమాత్మయే తిష్ఠించుకొని ఉన్నారు. - **లోకే-సర్వమ్ ఆవృత్య తిష్ఠతి।**

సర్వత్రా చేతులు, కాళ్ళు, కళ్ళు, శిరస్సులు, ముఖములు, చెవులు కలిగిఉండి సర్వత్రా వేంచేసి, ఆవరించి ఉండి, సర్వ దేహములలో అణువణువు వ్యాపించి, -

- పంచ కర్మేంద్రియములందు,
- పంచ జ్ఞానేంద్రియములందు,
- వాటి వాటివిషయములందు,
- త్రిగుణములయందు,

ఉండి, **అవన్నీగా ఆ ఆత్మభగవానుడే భాసిస్తున్నారు. సర్వేంద్రియ గుణాభాసగ్ం।**

⌘ కంటిలో చూపుగా – ద్రష్టగా – దృశ్యముగా,

⌘ చెవులలో వినికిడిగా – శ్రోతగా – శబ్దముగా,

⌘ చర్మములో స్పర్శగా – స్పృశించువాడుగా – స్పృశవిశేషములుగా,

⌘ నాలుకలో రుచిగా – రసజ్ఞునిగా – తినుచున్న పదార్థములలో 'రుచి'గా,

⌘ ముక్కులో సువాసనగా – సువాసనాస్వాదిగా – పుష్పములుగా –

**అభాసించుచున్నది ఆ పరమాత్మయే!**

**సర్వేంద్రియ వివర్జితమ్।** ఇంద్రియార్థములుగా **ఉండి,** అవన్నీ **లేనివాడై,** వాటికి **సంబంధించనివాడై** ఆ పరమాత్మ **ప్రకాశించుచున్నారు. రచయిత తాను రచించిన నాటకములోని కొన్ని పాత్రలకు చెందినవాడు కాదు కదా! అట్లాగే పరమాత్మ–స్వీయ రచన అగు జగన్నాటకమునకు సంబంధించకయే ఉన్నారు.**

ఈ సర్వమునకు ఆయనయే నియామకుడు. **ప్రభువు.** సర్వులకు సర్వశుభములు కలుగజేస్తున్న **సుహృత్!** సర్వులకు సర్వము తన కరుణచే ప్రసాదించుచు, సర్వులకు **శరణాగతి అయి ఉన్నవారు!**

**ఈ విధంగా స్వస్వరూపుడగు ఆత్మభగవానుని మనస్సుతో వీక్షిస్తూ, బుద్ధితో గ్రహించుచుండెదము గాక!**

⌘ ⌘ ⌘

ఈ దేహి '9' ద్వారములు కలిగిన ఈ జడదేహమును చైతన్యపరచువాడై **'హంసో – సోఽహమ్'**....అను **'నేను'** భావనతో అంతరమునందే కాకుండా, బాహ్యమున కూడా ప్రకాశించుచున్నారు. **ఎరుక** అనుభావనతో సర్వము **ఎరుగుచున్నారు**. అట్టి దేహి చైతన్యమే స్థావర జంగమాత్మకమగు ఈ లోకముల రూపము కూడా!

ఈ జీవుడు వాస్తవానికి 'సోఽహమ్'లో **– సః పరమాత్మ వాచ్య సహజస్వరూపుడే** – అయి ఉండి కూడా, స్వీయ కల్పనకు అభిన్నమగు స్థావర – జంగమాత్మకమగు దృశ్యమునకు వశుడై పంజరములో చిక్కుకున్న పక్షివలె....

**"నేను ఈ జగద్దృశ్యమునందు ఏదో కారణం చేత చిక్కుకొన్నాను. ఇక్కడి సంఘటన – సంబంధ – అనుబంధ బాంధవ్య–సంపద–ఆపదలకు వశుడనై ఈ దేహబంధము నేను అనుభవించవలసి వస్తోంది కదా!"** అని తలచటం ప్రారంభిస్తున్నాడు.

– **"నేను నిత్యబద్ధుడను కదా"**.....అను భావనచే **"బంధము",**

– **"నేను నిత్యముక్తుడను. సోఽహమ్"** అను భావనచే **"ముక్తి"** – లభిస్తూ ఉన్నాయి.

ఈ దేహియొక్క సహజస్వస్వరూపము ఆత్మయే! **అట్టి పరమాత్మకు –**

**అపాణీ :** చేతులు లేవు. కానీ, ఈ జీవుల చేతులు – చేతలు ఆయనకు చెందినవే! కానీ ఆయనకు ఆపాదించలేము. సర్వము స్వీకరిస్తున్నది ఆయనే। కానీ ఏమీ స్వీకరించరు. పాత్రల చేతలన్నీ నాటక రచయితవే అయి ఉండి కూడా, ఆయనకు పాత్రయొక్క గ్రాహ్య–త్యాజ్యములు ఆపాదించలేము కదా!

**అపాదౌ :** పాదములు లేవు. అంతా తానే అయి ఉండగా ఎక్కడికి వెళ్తారు? ఆయనకు ఇక పాదము లెక్కడుంటాయి? అయితే ఈ సర్వజీవుల పాదములు – నడకలు, నడతలు **అన్నీ ఆ పరమాత్మవే!**

– స్వప్నంలో కనిపించే జనుల కదలికలన్నీ కూడా, స్వప్నములోని 'నేను–అహమ్' తో సహా స్వప్నము ఎవరివో– ఆ యొక్క స్వప్న ద్రష్టవేకదా!

ఈ విధంగా దృశ్యమంతా సంచారములుగా కలిగి ఉన్నారు.

**పశ్యతి–అచక్షుః :** ఆయనకు కనులు లేవు. కానీ అన్నీ చక్షువుల ద్వారా అంతటా చూస్తున్నది ఆత్మభగవానుడే! **అన్ని కళ్ళు ఆయనవే!** ఈ విశ్వములోని వేరువేరైన దృష్టులన్నీ ఆయనవే। (పాత్రల యొక్క వారివారి దృష్టులన్నీ రచయిత చేత కల్పించబడినవే కదా!)

**స శృణోతి అకర్ణః :** ఆయనకు చెవులు లేవు. కానీ, సర్వుల చెవులన్నీ తనవే అయి, సర్వశబ్ద – సంభాషణలను వినుచున్నది ఆయనే!

**న వేత్తి వేద్యమ్ :** ఆ పరమాత్మ తెలియబడువాడు కాదు. కానీ, **అందరిలో ఉండి అన్నీ తెలుసుకొంటున్నది ఆయనయే!** ఆయనయొక్క చిదానందమే సర్వ జీవులలో **ఎరుక** (knowing)గా ఉండి, **సర్వము ఎరుగుచున్నదై ఉన్నది.**

ఈ రీతిగా **తెలియబడేవాడు కాకపోయినప్పటికీ అన్నీ తెలుసుకుంటున్నవారై ఉంటున్నారు.**

**న చ తస్య అస్తి వేత్తా :** ఆయన అంతా తెలుసుకుంటూ ఉంటారు గాని, ఆయనను తెలుసుకుంటున్నవాడు ఎవ్వడూలేడు. ఆయన **తెలియబడేవారు కాదు.** ఆయన 'తెలియబడేవాడు'గా అవ్వాలంటే ఆయనకు వేరుగా తెలుసుకుంటున్నవాడు మరొకడు ఉండాలికదా! **తెలుసుకొనేదీ - తెలియబడేదీ ఆయనయే! "ఆత్మను నేను తెలుసుకోవాలి" -** అని ఎవరు అనుకుంటున్నాడో....... **ఆతడే ఆ ఆత్మ అయి ఉండగా....ఆత్మను ఎట్లా ఎవ్వడు మాత్రం తెలుసుకొంటాడు?**

కళ్ళతో ఎదురుగా ఉన్నవన్నీ చూడవచ్చునేమో! **ఆ కళ్ళతో 'చూచువాడిని'** (user of those physical eyes) **చూడగలమా?**

చెవులతో బాహ్యవిషయాలు వినగలం. అంతేగాని ఈ చెవులతో **'వినుచున్నవానిని'** శ్రవణ విషయంగా **వినగలమా?** లేదు.

**అట్లాగే తెలుసుకొనుచున్నవాడే ఆత్మస్వరూపుడై ఉండగా, ఆతడు ఆత్మను వేరైన వస్తువువలెనో, విషయము వలెనో తెలుసుకోలేడు కదా!**

అయితే అట్టి ఆత్మ భగవానుడు నిర్మలమైన బుద్ధికి తెలియబడగలదు. **'వేదాంతశాస్త్రం - తత్త్వ శాస్త్రం - ఉపనిషత్తులు చెప్పుచున్నది నా గురించే। నాయొక్క జీవాత్మత్వము ఎందులోంచి వస్తోందో....అట్టి నా యొక్క (అవల...ఉన్న) పరమాత్మత్వము గురించే కదా!'**....అని బుద్ధికి అనుభవమునకు రాగలదు.

అట్టి - సర్వమునకు ఆవల జ్యోతి స్వరూపుడై వెలుగొందు మనందరి స్వస్వరూపాత్మయే....

- అన్నిటికీ ఆవల....**తమ్ అగ్ర్యం** అన్ని దేహాలలోను ఈ విశ్వమునందు **అత్యంత ఉత్కృష్టము. శ్రేష్ఠము - సమున్నతము** అగు వస్తువు అయి ఉన్నది.
- ఆయనే పరమపురుషుడు. **మహాన్తమ్ పురుషమ్॥**
- **అణోః అణీయామ్।** ఆయన పరమాణువు కంటే కూడా సూక్ష్మాతిసూక్ష్మం!
- **మహతో మహీయాన్। -** మహత్తరమగు సర్వ వస్తువుల కంటే కూడా మహత్తరమైనవాడు. ఆయనయందు అనేక కోటి బ్రహ్మాండములు ప్రదర్శనమగుచూ కూడా, అవన్నీ ఆయనలోని కించిత్ స్థానమును కూడా నింపి ఉంచలేవు. అద్దములో ప్రతిబింబించే దృశ్యము అద్దమును ఆక్రమిస్తోందా? లేదే!

అట్లా అయి ఉండి కూడా, ఆ ఆత్మ సర్వజీవులలోను, హృదయ గుహలో దాగి ఉన్నది. సామాన్య దృష్టికి పాంచభౌతిక దృశ్యాలు, గుణాలు కనిపిస్తున్నాయి. మనో - బుద్ధి - చిత్త - అహంకారాలు అంతరంగమున దృశ్యమానమవుతున్నాయి. సర్వప్రాణులలోను సంస్థితుడై, కర్మలకు - జన్మలకు సంబంధించని ఆ పరమపురుషుని మహిమ ఏమిటో, ఎట్టిదో ఎవరు తెలుసుకోగలరు? ఆత్మను ఎవరు తెలుసుకోగలరు? సమస్తమును, ఆదుర్దాలను, శోకములను అధిగమించిన నిర్మలబుద్ధిని సంపాదించుకొన్నవారు మాత్రమే బుద్ధితో తెలుసుకొనుచున్నారు. దర్శిస్తున్నారు. **ఆత్మయే ఆత్మను ఎరుగగలదు।**

అట్టి ఎరుకచే...,

పురుషుడు   పురుషోత్తముడై<br>
మానవుడు   మాధవుడై<br>
జీవాత్మ పరమాత్మ అయి ప్రకాశించుచున్నాడు!

అట్టి పరమ పురుషుని (పురుషమ్ మహాన్తమ్)

**అజరం :** భౌతిక దేహ ధర్మాలు అయినట్టి జన్మ - జరా - మరణములకు సంబంధించనివానిగాను.....,

**పురాణం :** జన్మకర్మలకు మునుముందే ఉండి ఉన్నవానిగాను, వాటికి సంబంధించక కేవల సాక్షిగాను, దేహముల రాక పోకలప్పుడు కూడా యథాతథంగా ఉన్నవానిగాను...., (పురా నవమ్),

**సర్వాత్మానగ్ం :** (స్వప్నంలో కనిపిస్తూ కదలుచున్న వారందరు స్వప్నద్రష్ట యొక్క హృదయాంతర్గత స్వరూపులే అయినట్లుగా) నాయొక్క - నీయొక్క - మనందరియొక్క అఖండాత్మ స్వరూపునిగాను....,

**సర్వగతమ్** - సర్వములోను, సర్వముగాను విస్తరించి ఉన్నవానిగాను,

**విభుత్వమ్** - జాగ్రత్ - స్వప్న - సుషుప్తి ఇత్యాదులన్నిటికీ, సర్వ లోకములకు నియామకుడు - విభువుగాను,

**నిత్యమ్** - నిత్య-సత్యము అయి ఉన్నవానిగాను,

**వేదోపనిషత్తులు అభివర్ణిస్తున్నాయి. ఎలుగెత్తి గానం చేస్తున్నాయి.**

**ఆ పరమాత్మ, పరబ్రహ్మమును ఎరిగిన బ్రహ్మవాదులగు మహనీయులు మనకు మనయొక్క జన్మ – కర్మబంధముల విముక్తికొరకై మనమీద వాత్సల్యముతో, కరుణతో అనునిత్యంగా గానం చేస్తూ, బ్రహ్మగీతిని వినిపిస్తున్నారు!**

**మనము శ్రద్ధభక్తులతో ఆత్మశ్రేయస్సు కొరకై విని, ఎరిగెదము గాక!**

**సర్వ ప్రయత్నములతో స్వానుభవంగా సిద్ధించుకొనెదము గాక!**

## చతుర్థోఽధ్యాయః – జీవ-ఈశ్వర-పరమాత్మాఽహమ్-4వ శిష్యుని విశ్లేషణము

ఓం

స్వతఃగానే ఏకస్వరూపుడు, జీవజాతి భేదరహితుడు అగు ఆ పరమాత్మ – తనయొక్క కల్పనా, మాయా శక్తిచేత బహుత్వమును **క్రీడా – లీలా వినోదార్థమై** స్వకీయ చమత్కారంగా ప్రేరేపించుకొనుచున్నారు. అనేక భేదములతోకూడిన జీవజాతులను కల్పించుకొని ఆస్వాదిస్తున్నారు. తాను అపేక్షారహితుడై ఉండియే అనేక వస్తు జాతి ధర్మ భేదములను కల్పించుకొని, క్రీడిస్తూ ఎప్పుడో ఈ సర్వమును తనయందు లయింపజేసుకుంటున్నారు. ఈ విశ్వముయొక్క సృష్టి – స్థితి – లయకారకుడగు పరమాత్మ మనకందరికి శుభము – శోభాయమానము – మహదాశయయుక్తము అయిన **బుద్ధిని** ప్రసాదించి, **మనలను సర్వ సంసారభ్రమల నుండి సంరక్షించుదురు గాక!**

సర్వ కల్పనాకారకుడగు ఆ పరమాత్మయే.....,

**తదేవమ్ అగ్నిః** : అగ్ని – జ్యోతి స్వరూపుడై ఈ సర్వమును జీవన్మయముగాను, తేజోవంతముగాను చేస్తూ, ఈ సర్వమును ప్రకాశింపజేయుచున్నారు. ఉష్ణస్వరూపులై సర్వ దేహములలో ప్రవేసించి, వాటిని సంరక్షిస్తున్నారు.

**తత్ ఆదిత్యః : (యత్ ఆదిః తత్ ఆదిత్యః!)** ఏదైతే సర్వమునకు మునుముందే ఉన్నదో, అదియే ఆదిత్యరూపం. ఆ పరమాత్మయే ఆదియందు సత్ – చిత్ – చైతన్యస్వరూపుడై ఉన్నారు. ఇప్పటికీ, ఎప్పటికీ యథాతథుడై ఉన్నారు! ఆయనయే ఆకాశంలో సూర్యుడై ప్రకాశించుచున్నారు.

**తత్ వాయుః :** ఆయనయే బాహ్య – అభ్యంతరములలో స్పందన రూపముగా, ప్రాణస్వరూపుడుగా సంచరించుచున్న వాయుదేవుడు!

**తదు చంద్రమా :** చల్లటి కాంతులు వెదజల్లుచూ ఓజోశక్తిచే భూమికి ఔషధతత్త్వమును ప్రసరింపజేయుచున్న చంద్రుడుగా ఉన్నది ఆ ఆత్మభగవానుడే!

**తదేవ శుక్రమ్ (శుభ్రుడు):** ఆయన సర్వదా మంగళ స్వరూపుడు. నిత్య నిర్మలుడు. పరిశుద్ధుడు. దేహ–జన్మ–కర్మ–గుణ దోషములకు ఆవలివాడు. నాటక దీపపు కాంతిలో నాటకం జరుగుచున్నప్పటికీ, నాటకంలోని మంచి – చెడు పాత్రలు నాటక దీపానికి తాకవుకదా! **ఆత్మ సర్వదా పరము,** పరిశుద్ధము కూడా!

**తత్ అమృతమ్ :** ఆయన అమృతస్వరూపుడు. జన్మ – మృత్యువులకు సంబంధించక, కేవల సాక్షియై ఉన్నట్టివారు. మార్పులు చేర్పులు లేనట్టివారు.

**తత్ ఆపః :** ఆయన ఆపః (జల) స్వరూపుడై, సర్వజీవులకు జీవనత్రాణ అయి ఉన్నారు. జలస్వరూపులై పదార్థములందు, దేహములందు వెలయుచున్నారు. దేహములకు 'త్రాణ' అగుచున్నారు.

**తత్ బ్రహ్మ :** ఆ స్వస్వరూపుడగు పరమ పురుషుడే – **పరబ్రహ్మము.**

**తత్ ప్రజాపతిః :** ఆయనయే సృష్టికర్తయగు ప్రజాపతి. **బ్రహ్మదేవుడు.**

***మమాత్మానంద స్వరూపుడవగు ఓ పరమ పురుషా! పరమాత్మా! త్వగ్ం స్త్రీ। త్వం పుమాన్ అసి। త్వం కుమార, ఉతవా కుమారీ।***

- మీరే స్త్రీగాను, పురుషుడుగాను, కుమారిగాను, కుమారుడుగాను ఉన్నారు.
- వృద్ధుడుగా కనిపిస్తూ చేతికర్రతో రహదారిలో అడుగులు వేస్తూ నడుస్తున్నది కూడా మీరే! **త్వం జీర్ణో దండేన వంచసి।**
- అన్నివైపులా జనిస్తున్నది మీరే! అన్నివైపులా అనేక ముఖములతో సంచారములు చేస్తున్నదంతా **మీయొక్క విహారములే! దేహాలతో మరణిస్తున్నది కూడా మీరే! పునః జనిస్తూ ఉన్నదీ మీరే!** జన్మ–జీవన్–మరణ–పునర్జన్మల వ్యవహారమంతా మీ లీలా, క్రీడా, కల్పనా, వినోద చమత్కారములే!

- గర్భస్థ శిశువుగా, అప్పుడే పుట్టిన శిశువుగా, పసిబాలుడుగా, కుమారుడుగా, యౌవనుడుగా, ముసలివాడుగా, జన్మ - మృత్యువులు పొందుచున్నవానిగా - కనిపిస్తున్నదంతా మీరే! స్వేచ్ఛగా స్వకీయమాయచే వివిధ రూపములుగా మాయొక్క అజ్ఞాన దృష్టికి కనబడుచున్నదంతా...మీరే!
- జ్ఞాని - అజ్ఞాని అనబడుచున్నదంతా మీ ప్రదర్శనా చమత్కారమే!

*ఓ దేవాదిదేవా! వివిధ రూపములతో ఇక్కడ కనిపిస్తున్నదంతా మీరే! కళ్ళకు కనిపించకుండానే, సృష్టి వ్యవహారమునందు పాల్గొనుచున్న దివ్య-దేవతా మహా ప్రజ్ఞలు కూడా మీరే!*

- నీలిరంగు కళ్ళతో మిరమిర మెరుస్తూ తుమ్మెదగా గాలిలో ఎగురుచున్నది...,
- రంగు రంగు రెక్కలతో వయ్యారముగా అక్కడ - ఇక్కడ శీతాకోక చిలకగా వ్రాలుచున్నది...,
- ఎర్రని కన్నులు - ఆకుపచ్చని రెక్కలు లేత ఎరుపు ముక్కుతో...సీ..శీ...సీ...పలుకులు పలుకుచూ గోడలపై, చెట్లపై చిలకగా కనిపిస్తున్నది....,
- మేఘములు క్రమ్ముచుండగా ఇంద్ర ధనస్సులోని వెలుగు....,
- వసంత - గ్రీష్మ - శశిర - శరద్రువుతులలో వేరు వేరు రూపములతో, రంగుల మేళవింపులతో, రకరకాల శబ్దములతో ప్రకృతిగా కనిపిస్తున్న స్వరూప విన్యాసము....**ఇవన్నీ మీరే। మీయొక్క వినోద విన్యాసమే!**
- సప్తసముద్రములు మీయొక్క ఆశ్చర్యకర నిశ్వాసమే!
- పండు-ఆకు-పూవు-తీగె-కాయ-పిందెలలో-ఒక్కొక్కటి ఒక్కొక్క రూపములో కనిపించే అందమంతా మీ సౌందర్యమే!
- మీరు మొదలు చివర లేనట్టివారు. ఆద్యంతరహితులు। **అనాది మత్।**
- సర్వమున మీ ఆజ్ఞానువర్తనమే. **విభుత్వేన వర్తసే।** మీరే విభువు.
- **యత్ జాతాని విశ్వా।** ఈ భూమి ఈ విశ్వముగా జనిస్తున్నది మీరే! మీ సంకల్పమే! మీ స్వరూపమే! మీరు విశ్వస్వరూపులు! విశ్వాతీతులు!
- సర్వ వ్యాపకులు ! సర్వ వస్తు శూన్యులు కూడా!
- పుట్టుకయే లేని మీరు సర్వదా ఏక స్వరూపులై ఉండి కూడా, మీ అఖండ-ఏక స్వరూపమునుండి నల్లనివారిని, తెల్లనివారిని ఎర్రనివారిని, సాత్త్విక స్వభావులను, రాజసిక స్వభావులను, తామసిక స్వభావులను సృష్టించుచున్నారు. విజ్ఞానులు - అజ్ఞానులు అగు సర్వ జీవులను, సరూపులుగా-అరూపులుగా కూడా సృష్టించుచున్నదీ మీరే! సర్వరూపములు అయి ఉన్నది కూడా మీరే! సృష్టిలోని జ్ఞానము - విజ్ఞానము - అజ్ఞానము - తెలివి - మూర్ఖత్వము అన్నీ కూడా ఒక నాటక రచయితయొక్క కథా రచనలోవలె.....అన్నీ మీవే! మీరే!

  **నాది అని నేను అనుకునేదంతా నీదే! అందుచేత నీవే నేను - నేనే నీవు.**
- ఈ జీవాత్మలకు అనుభవమగుచున్న వ్యవహారమంతా కూడా ఏకము - జన్మరహితము అగు మీనుండి అనేకము - జన్మ సహితము అగు అనుభూతి రూపంగా, సృష్టికల్పనా చమత్కారంగా బయల్వెడలటము మీ క్రీడ, మీయొక్క క్రీడ, లీలయే!

జలమునందు తరంగమువలె సృష్టిని మీ నుండి సృష్టించుకొని, ఆస్వాదించి తిరిగి జన్మరహితులగు మీయందే లయింపజేసుకుంటున్నారు! **సర్వమునకు సర్వదా వేరుగానే ఉండి ఉంటున్నారు.** స్వప్నద్రష్టకు స్వప్నము ఎట్టిదో, విశ్వేశ్వరులగు మీకు విశ్వము అట్టిది! **మేమంతా కూడా మీకు అభిన్నమైనట్టి భిన్న భిన్న స్వరూపులము! మీయొక్క అభిన్నము నుండి బయల్వెడలిన భిన్న భిన్న కిరణ స్వరూపులమే!**



## దేహ వృక్షము - రెండు పక్షులు

***(పిప్పల (రావి) వృక్షము)***

ఒక వృక్షము రెండు పక్షులు,<br>
క్రింద కొమ్మలమీద పైన - **జీవాత్మ**<br>
చిటారుకొమ్మ మీద - **ఈశ్వరుడు**

| ఈ జీవాత్మ-ఈశ్వరులు (నాటకములోని పాత్ర-పాత్రధారుని నటనా కౌశలమువలె) ఒకరినొకరు పట్టుకోరు. విడువరు. |
|---|

దేహము అనే గొప్ప వృక్షముపై పరమాత్మయొక్క స్వాభావిక రూపములగు (లేక) లీలా వినోద కల్పనా రూపములగు రెండు పక్షులు (జీవుడు – ఈశ్వరుడు) వ్రాలి, కాలమును గడుపుచున్నాయి. ఆరెండిటినీ పరమాత్మయే ప్రకాశింపచేయుచున్నారు. ఒకటి కొమ్మకొమ్మలపై వ్రాలుతోంది. మరొకటి చిటారు కొమ్మపైన (అనగా, సహస్రారములో) మౌనంగా, ప్రశాంతంగా కూర్చుని ఉన్నది. ఆ రెండు పక్షులు విడరాని బంధముతో, అన్యోన్యంగా అత్యంత స్నేహభావంతో ఒకదానితో మరొకటి ఎంతగానో **సంబంధించినవై, సహజీవత్వమును కొనసాగిస్తున్నాయి. అందులో**

**క్రింద పక్షి (జీవుడు) :** అనుభూతి – అనుభవము అనే పిప్పల (రావి) ఫలములను ఆస్వాదిస్తూ కొమ్మ – కొమ్మపై గెంతుతోంది. వ్రాలుతోంది. ఎగురుతోంది. ఇంద్రియ విషయానుభవములలో నిమగ్నమై ఉన్నది. (నాటకములోని 'పాత్ర'కు సంబంధించిన స్వరూప స్వభావముల వంటివి).

**పై పక్షి (ఈశ్వరుడు) :** దేనినీ స్వీకరించక, అనుభవించక సర్వమునకు కేవలము 'సాక్షి' అయి ప్రశాంతంగా, అతీతంగా ఉండి అంతా వీక్షిస్తోంది. సాక్షీభూతంగా, ఇంద్రియ విషయాలకు, భావాలకు – అన్నిటికీ ఆవల ఉండి ఉన్నది. ఈ భౌతిక దేహముల రాకపోకలను కూడా కేవలం సాక్షిగా, మౌనంగా చూస్తూ ఉన్నది. (నటుని **'నటనా కౌశలము'** వంటిది).

## జీవుడు

ఆ రెండు పక్షులలో జీవాత్మ పక్షి – **"నేను ఈ దేహమునకు, కర్మ – అకర్మలకు, పుణ్య – పాపములకు సంబంధించినవాడను! జన్మ – మృత్యువుల మధ్య బద్ధుడను. ఇంతవరకే నేను..."** అని అనుకుంటూ ఉన్నాడు.

**"ఎవ్వరో ఎప్పుడో సృష్టించిన సృష్టిలో నేను ఇట్లా పిట్టవలె చిక్కుకున్నాను. నా గతి ఏమిటి? ఇంతేనా?"....** అనే బంధ భావనలో కుములుచున్నది. ఒక చమత్కారం ఏమిటంటే...., ఈ జీవుడు తనను తాను సమగ్రముగా ఎరుగుటయే లేదు. **"నాయొక్క జాగ్రత్‌కు (నా స్వప్నంలాగానే) రచయితను నేనే కదా! అంతా నిండి ఉన్న వాడిని కదా! ఇదంతా నాయొక్క ఈశ్వర స్వరూప మహిమయే కదా!"** అనే విషయము ఆతని దృష్టిలో ఏమాత్రము లేదు. అటువంటిదే జాగ్రత్ కూడా. తనదైన 'ఈశ్వరత్వము'ను ఏమరచి, అనీశుడై శోకగ్రస్తుడై ఉంటున్నాడు.

**కల కంటున్నవాడు – "కలనాదే కదా!" అనునది దృష్టిలో ఉండక, కలలో బంధమును పొందునట్లే, "జాగ్రత్ నాదే" అని ఏమరచి జాగ్రత్‌లో బంధము – బానిసత్వము అనుభవిస్తున్నాడు.**

## ఈశ్వరుడు

ఎప్పుడో, ఎన్నడో ఆ జీవాత్మపక్షి **ఆత్మ శాస్త్ర పాఠ్యాంశములను, సద్గురు బోధనలను, సోఽహమ్–తత్త్వమ్–జీవోబ్రహ్మేతి నాఽపరః** ఇత్యాది మహావాక్యముల విచారణ ఉపక్రమిస్తోంది.

ఈ జీవుడు తనకు తోడై ఉన్న యజమాని, నియామకుడు, సహజ సహచరుడు, స్వస్వరూపి అగు **'ఈశ్వరుడు'**....అను (ఈ దేహములోని) ఆ **రెండవ పక్షిని** సందర్శించుచున్నది. **పశ్యతి అన్యమ్ ఈశమ్ అస్య మహిమానమ్ ఇతి వీత శోకః।** ఈశ్వరుని మహిమ ఏమిటో, ఎట్టివాడో గ్రహించుచుండగా, జీవాత్మ పక్షియొక్క సర్వవేదనలు, దుఃఖములు స్వభావపూర్వకంగా తొలగిపోతున్నాయి. **"ఓహో! అప్రమేయమగు ఆత్మస్వరూపుడనగు నా కల్పనయే ఈ జీవ – ఈశ్వరత్వము కూడా"** అని గమనించి వినోదించనారంభిస్తున్నాడు. ఈ జీవ – ఈశ్వరులు ఉభయము **ఆత్మజ్యోతి యొక్క దివ్యకాంతి పుంజములే!**

## పరమాత్మ

- ఋగ్వేదము నందలి ఋక్కులచే, సామవేదములోని సామములచే ఎలుగెత్తి గానము చేయబడుచున్నవారు,
- అక్షరుడు (క్షరము – నాశనము అనునది లేనట్టివాడు),
- పరమాకాశ స్వరూపుడు.....

అగు **పరమాత్మ**ను లోకపాలకులగు దేవతలు కూడా సదా – సర్వదా ఆశ్రయించినవారై ఈ **"జగత్తులను పాలించటము"** అను కార్యక్రమమును నిర్వర్తిస్తున్నారు! అట్టి **'పరమాత్మ'**నే ఆత్మతత్త్వజ్ఞానుల పాఠ్యాంశములను శ్రుతం చేసినట్టి మనము కూడా సర్వదా ఆశ్రయిస్తూ ఇప్పుడు సంభాషించుకుంటున్నాము.

**యః తత్ న వేద, కిమ్ ఋచా కరిష్యతి?** అట్టి పరమాత్మను ఆశ్రయించకుండా, ఊరికే ఋగ్వేద మంత్రములను మొ॥వాటిని ఉదాత్త-అనుదాత్త స్వరములను పెదిమలతో ఉచ్ఛరించి "మేము వేదజ్ఞులము" అని అనుకున్నంత మాత్రాంచేత ఏమి ప్రయోజనం? వేదములను పలుకుచూ కూడా తెలుసుకోవలసినది (ఆత్మను) తెలుసుకోకపోవటమే అగుచున్నది.

**సర్వతత్త్వ స్వరూపుడు, స్వస్వరూపుడు అగు పరమాత్మను తెలుసుకొని మాత్రమే మనము కృతార్థులము కాగలము! ఆయనను నాకు, నీకు, ఈ సమస్తమునకు – అనన్యుడుగా ఎఱగాలి సుమా!**

ఆ అక్షర పరబ్రహ్మము అగు పరమాత్మనుండియే,

- ఋక్-యజుర్-సామ-అథర్వణ చతుర్వేదములు,
- యజ్ఞములు, యాగములు, క్రతువులు, వ్రతములు,
- కాలచమత్కారములగు భూత – వర్తమాన – భవిష్యత్తులు,
- **యత్ వేదా**....ఇంద్రియములకు తెలియబడుచున్న ఈ సమస్తము –

**ఇవన్నీ కూడా బయల్వెడలుచున్నాయి.**

1. భౌతికదేహమును తన ఉపాధిగా కలిగియున్న **ఈ జీవుడు,**
2. 'మాయ' యే తన ఉపాధిగా కలిగియున్న **ఈశ్వరుడు,**
3. ఎదురుగా గల ఈ **విశ్వము**....,

ఇదంతాగా కూడా **అక్షరుడగు పరబ్రహ్మమే తన అనిర్వచనీయ మాయా శక్తిచే ఆయావిధములుగా విజృంభించుచున్నది.** ఇదంతా ఆయనకు అద్వితీయమే. అట్లు అయి ఉండి కూడా, వేరుగా ఉన్నట్లుగా ఆయనయే సంబంధమును స్వభావంగా కల్పించుకొని, (మరొకవైపుగా) సాక్షియై దర్శిస్తున్నారు. **ఈ విశ్వమంతా ఆ పరమాత్మయొక్క మాయా లీలా విలాసమే। మరింకేమీ కాదు।**

**మాయాంతు ప్రకృతిం విద్ధి। మాయినంతు మహేశ్వరః॥**

- ఈ ప్రకృతియే **మాయ.**
- ఈ మాయ ఎవరిదో,.....ఆతడే మహేశ్వరుడు **(మాయి).**

**తస్య అవయవ భూతైస్తు వ్యాప్తగ్ం సర్వమిదమ్ జగత్॥**

ఆ మహేశ్వరుని మాయా కల్పితములైనట్టి స్వీయ అవయవములచేతనే నవరసరముల రూపంగా ఈ ఎదురుగా మనకు కనిపిస్తున్న జగత్తంతా వ్యాప్తమైయున్నది.

ఏకము – అఖండము అగు ఆ మహేశ్వరుడే :-

- సమస్త జీవుల బాహ్య – అభ్యంతర రూపము।
- మూల ప్రకృతి।
- అవాంతర ప్రకృతులు।
- మాయ।
- పంచభూతములు, వాటి వాటి వివిధ సమ్మేళన రూపములు, ధర్మములు, త్రిగుణములు..... కూడా!

వీటన్నింటితో కూడుకొన్నవాడై, యోని – యోని యందును, సర్వ ఉపాధులయందును **'అంతర్యామి'** అయి అధిష్ఠించి (Having occupied the entirety) ఉన్నారు.

ఇవన్నీ ఆయనయందే మాయగా (వేరుగా లేకపోయినప్పటికీ – వేరుగా ఉన్నట్లుగా – మా యా – యా మా) అగుపిస్తున్నవగుచున్నాయి.

ప్రళయకాలములో ఇవన్నీ ఆ మహేశ్వరుని యందే లయించుచున్నాయి. కథ కథారచయితలోనే ఉండి, ఆయనచేతనే బహిర్గతము చేయబడుచూ, ఆయన చేతనే ముగించబడుచున్నవిధంగా...., విశ్వేశ్వరుడే విశ్వకల్పనను కలిగియుండి, మరల ఎప్పుడో విరమించుచున్నారు.

మరల సృష్టికాలంలో అవన్నీ కూడా ఆయా నానా రూప-నామములతో బయల్వెడలుచూ, ఆ మహేశ్వరునియొక్క విశ్వరూపములో అంతర్విభాగంగా మాయాకల్పిత చమత్కారములై ప్రదర్శనమగుచున్నాయి.

అట్టి ఈశానుడు, సర్వమును ప్రసాదించుచున్న సర్వవరదుడు, దేవదేవుడు, స్తోత్రార్హుడు, మహేశ్వరుడు అగు ఈశ్వరుని (పరమాత్మ)ను సందర్శించి, ఆయనతో మమేకమై, **'బ్రహ్మైవాహమస్మి'** భావనను ఆశ్రయించినవారమై పరమశాంతిని పొందెదము గాక!

❋❋❋

**శ్లో॥ యో దేవానాం ప్రభవశ్చ, ఉద్భవశ్చ, విశ్వాధిపో, రుద్రో, మహర్షిః హిరణ్యగర్భం**
**పశ్యతి జాయమానగ్ం, స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు॥**

ఏ దేవదేవుడైతే...., (లేక) ఏ సర్వాత్మకుడగు ఆత్మభగవానుడైతే...,

- దేవతల రూపముగా ప్రభవిస్తూ, ఉద్భవించువాడై, లోకములన్నీ పరిపాలిస్తున్నారో, దేవతలకే జననస్థానమై ఉన్నారో....,
- ఈ విశ్వమంతా నిండి ఉండి, విశ్వమును అధిగమించి ఉన్నారో....,
- రుద్రుడై సృష్టి – స్థితి లయములను పర్యవేక్షిస్తున్నారో....,
- మహత్ ఋతమో, పరమసత్యమై ఉన్నారో..., ఋషి అయి పరమసత్యమును ప్రవచించువారో...,
- సృష్టికి ముందు సృష్టికర్తను సృష్టించుచున్నారో..,
- ఎవ్వరికి సృష్టి – సృష్టికర్త అభిన్నమై ఉన్నాయో....,

**స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు॥** అట్టి పరమేశ్వరుడు,.. **శుభ–శాంతి–సహజానందప్రదమగు ఆత్మబుద్ధిని, మనకు ప్రసాదించునుగాక!**

- **యో దేవానాం అధిపో...,** ఏ పరంధాముడు దేవతలకు కూడా అధిపతియో....,
- **యస్మిన్ లోకా అధిశ్రితాః,** ఏ లోకేశ్వరునియందైతే ఈ లోకములన్నీ ఆశ్రయము కలిగినవై ఉన్నాయో,
- **య ఈశే అస్య ద్విపదశ్చ, చతుష్పదః,** ఏ సర్వేశ్వరుడైతే రెండు పాదములుగల మనుష్యులను, నాలుగు పాదముల జంతువులను, తదితర సర్వ జీవులను సృష్టించి – క్రీడావినోది అయి నియమించుచున్నారో, సర్వనియామకుడో....,

**కస్మై దేవాయ హవిషా విధేమ॥** అట్టి మనందరియొక్క స్వామికి యజ్ఞపూర్వకమైన సర్వకర్మలను హవిస్సులుగా సమర్పించుచున్నాము. **'ఇంద్రియ విషయములు'** అనబడే పురోడశము మొ॥న ద్రవ్యములతో సపర్యలు అర్పిస్తున్నాము. ఓ దేవ దేవా! మా ఈ ఇంద్రియ మనో బుద్ధులు మీకు చెందినవే! మేమో... మీకు అభిన్నులము! ఇక తదితరము గురించి ఎక్కువగా చెప్పవలసినది ఏమున్నది?

- సూక్ష్మాతి సూక్ష్ముడు అయి జగత్తంతా మధ్యగా వెలయుచున్నట్టి వారు..., – **సూక్ష్మాతి సూక్ష్మమ్, కలిలస్యమధ్యే॥**
- ఈ విశ్వ రచనకు రచయిత (The Author of this creation), – **విశ్వస్య స్రష్టారం॥**
- అనేక రూపములో ధరిస్తూ, ఈ సర్వ రూపములు తానే అయి ఉన్నవారు..., **తమ్ అనేక రూపం॥**
- ఈ విశ్వమంతా తన ఏకరూపమై ఈ సర్వమును సర్వదా పరివేష్టించుచున్నవారు, – రూపరహితులు. **విశ్వస్య ఏకం॥ పరివేష్టితారం॥**

అగు ఆ శివస్వరూప పరమాత్మని తెలుసుకొన్నప్పుడు ఈ జీవాత్మ పరమ శాంతిని పొందుచున్నాడు. సర్వశుభములు సంపాదించు కొనుచున్నాడు. **– జ్ఞాత్వా శివం శాంతిం అత్యంతం ఏతి॥**

***ఆ శివానంద భగవానుడే....,***

- కాలస్వరూపులు। భూత వర్తమాన భవిష్యత్తులు ఆయనకు అల్పాహారములు।
- 14 లోకాలలోని సర్వజీవరాసులను అభయహస్తులై సంరక్షిస్తున్నట్టివారు।
- ఈ విశ్వమును పరిపాలిస్తున్నట్టివారు।
- సర్వ ప్రాణులలో సర్వదా రహస్యముగా దాగిఉన్నవారు। నిగూఢరూపులు।
- బ్రహ్మర్షులకు, మహర్షులకు, దేవతలకు ధ్యానవస్తువులైనవారు। **దేవదేవుడు। దేవాది దేవుడు।**

**తమేవమ్ జ్ఞాత్వా మృత్యు పాశామ్ ఛ్చినత్తి॥**

ఆయనను ఎక్కడో – ఏమో – ఎవ్వరో....తెలుసుకొన్న జీవుడు శివస్వరూపుడై మృత్యుపాశములను ఛేదించివేస్తున్నాడు. ఆయనను ఆరాధిస్తూ ఉండగా, **ఆయన మనయందే నిత్యానంద స్వరూపులై సందర్శనమును ప్రదర్శించుచున్నారు.**

❋ ❋ ❋

## అట్టి ఆ పరమాత్మ ఉన్నదెక్కడ? ఆయన స్థానమేది?

**ఘృతాత్ పరమ్ మండమివ :** మీగడలో ఆ మీగడ కంటే వేరైన 'నేయి' అతి సూక్ష్మముగా ఉండి ఉన్నది కదా! అదే విధంగా సర్వప్రాణులలోను ఆ శివభగవానుడు గూఢముగా ఉండి ఉన్నారని – సూక్ష్మ దృష్టిచే మాత్రమే తెలియవచ్చుచున్నది. అతి సూక్ష్మంగా ఈ విశ్వమంతా ఆయనయే పరివేష్టితులై ఉన్నారు. **అట్టి దేవదేవుని ఎరుగుచుండగా సర్వపాశముల నుండి మనము విముక్తులమగుచున్నాము.**

**విశ్వకర్మ** (The Worker of the universe), **మహాత్ముడు** అగు ఆత్మభగవానుడు సర్వ దేహముల నిర్మాణకర్తయై వెలయుచున్నారు. సర్వజనుల హృదయములను తన తేజస్సుచే నింపివేస్తున్నారు। సర్వుల హృదయవిహారి। ఆయనను నిర్మలమైన మనస్సుతో పరిశుద్ధమగు బుద్ధితో స్వహృదయంలోనే దర్శించాలి. ఇది ఎవరు గ్రహించి ఉంటారో, వారు ఈ విశ్వమును తమ హృదయములోని పరమాత్మయొక్క మాయా విలాసంగా గ్రహించి అమృతస్వరూపులగుచున్నారు.

ఎప్పుడు ఆ సర్వాంతర్యామి, సర్వము తనయందే కలిగిఉన్నట్టి అధిష్ఠానము యొక్క దర్శనము సిద్ధిస్తుందో...., అట్టి ఆ స్థితి ఎటువంటిది?

- ఇక అది పగలు కాదు. రాత్రి కాదు. రేపు గాదు. నిన్న గాదు. నేడు కాదు.
- ఆ పరమాత్మ సందర్శనముచే **సత్ – అసత్తులు చర్చ ఉండదు.**
- ఆయన **కేవలీస్వరూపుడై** వెలుగొందుతూ నాయొక్క, సమస్త సహజీవులయొక్క అంతర్–హృదయుడై, బాహ్య సంప్రదర్శుడై తెలియవస్తారు.
- ఆయనయే **అక్షరస్వరూపుడు.**
- ఆయన సవితుః (సత్ + విత్, ఉనికి + ఎరుక) గా వరేణ్యుడుగా (నిత్యస్తోత్రార్హుడుగా), సర్వమును తన 'ఎరుక' అనే అగ్ని తేజస్సులచే వెలిగించువాడుగా అనుభూతమౌతాడు.
- సర్వ – స్వరూపుడుగ అనంతకాలంగా అంతటా విస్తరించి ఉన్నవాడు (ప్రసృతా పురాణీ).

ఆయనయే స్తోత్రము చేయవలసిన వస్తువు. వరేణ్యుడు। పురాణ పురుషుడు। పురాణవేత్త। సర్వదేహాలకంటే మునుముందే ఉన్నట్టివారు। **'ప్రజ్ఞానమ్ బ్రహ్మ'** అను వేదమహావాక్యార్థము యొక్క అనుభవ స్వరూపమై ఉన్నవారు! ఒక పెద్ద వస్తువు ఒకచోట ఉన్నప్పుడు "ఆ వస్తువు ఎట్టిది? ఏమై ఉన్నది? ఏ పదార్థముతో తయారయ్యింది?'...అని తెలుసుకోవటానికి ఆ పెద్ద వస్తువును పైనుండీ క్రిందనుండీ, వెనుకనుండీ, ముందు నుండీ.... నిలబడి పరిశీలించి "ఇది ఇట్టిది" అని ఒక నిర్ణయానికి రాగలము. కానీ ఆత్మయో? అద్దానికి ఊర్ధ్వ – అధో – వెనుక – ముందు దిక్కులనుండి పరిశీలించి తెలుసుకొనవలసిన వస్తువు కాదు. అంతటా అదియే అయి ఉండగా,... అద్దానిని లౌకికంగా పరీక్షించటమెట్లా?

> ***ఎవరు అద్దానిని "ఎట్టిది?" అని పరిశీలించటానికి సంసిద్ధులగుచున్నారో...., అది ఆ పరిశీలన చేయుచున్న స్వాభావికమగు స్వస్వరూపమే – అయి ఉన్నది. అట్టివాడు తనయొక్క వ్యష్టిగతమైనదంతా సమర్పించివేసి, "అదియే నేను కదా! సోఽహమ్। – అని బ్రహ్మానందభరితుడగుచున్నాడు.***

**వేదమహావాక్యములు, శాస్త్ర విశ్లేషణములు, గురు అనుభవములే అద్దానికి ప్రమాణము. స్వవిచారణయే అద్దాని విద్యార్జన!**

**న తస్య ప్రతిమ అస్తి యస్య నామ మహత్ యశః॥**

ఏదైతే మహత్తరమైన యశస్సు – కీర్తి కలిగి యున్నదో, అట్టి పరమాత్మ **"ఇది। ఇదియే।"** అని చెప్పటానికి సరిపోయే సంజ్ఞలుగాని, ప్రమాణములుగాని లేవు. అద్దాని వంటిది, ప్రతిమగా (వేరుగా) వర్ణించగలిగినది మరొక్కటి ఎక్కడా లేదు. అన్ని రూపాలు ఆత్మవే అయి ఉండగా, ఆత్మయొక్క రూపము 'ఇది ఇట్టిది' అని ఏమి చెప్పగలం?

అద్దానిని ఒక ఆకారమునకు (లేక) ప్రతిమకు పరిమితం చేయలేము. ప్రతిమలు అందుకు కల్పిత సంజ్ఞలు మాత్రమే।

**న సందృశే తిష్ఠతి రూపమస్య।**

అది దృశ్య జగత్తులో కనిపించే ఏ రూపమూ కాదు. భౌతికమైన కళ్ళతో అద్దానిని ఎవ్వరూ చూచివచ్చి మనకు **'ఇది'** అని చెప్పగలిగేది కాదు.

**హృదా హృదిస్థమ్ మనసా య ఏనమేవమ్ విదుః అమృతాః తే భవంతి।**

(హిరణ్యకశ్యపుడు విష్ణులోకంతో సహా అన్ని లోకాలు వెతికి వెతికి, తన హృదయంలోనే వేంచేసి ఉన్న విష్ణు భగవానుని గుర్తించక తన హృదయమునందు పరిశీలించక...... 'విష్ణువే లేదు'... అని అనటం ప్రారంభించిన తీరుగా) **ఆత్మ భగవానుడు ఇంద్రియ గోచరుడు కాదు.**

హృదయమునందే హృదయస్థుడై ఇంద్రియములను, ఇంద్రియ జగత్తులను వెలిగించుచున్న దివ్యచైతన్యమూర్తి! విశ్వమూగా మూర్తీభవించినవాడు.

అందుచేత **ఆ ఆత్మదేవుని మనస్సుతో ఎవ్వరు తమ హృదయమునందే దర్శిస్తారో..., అట్టివారు ఆయనను తెలుసుకొని తత్ అమృత స్వరూపులై విరాజిల్లుచున్నారు.**

ఆయనకు జన్మయే లేదు. జన్మయే లేని పరమాత్మకు పౌరాణికులు జన్మలు కల్పించి, ఆపాదించి సంసారారణ్యమునందు భీరువులై భయ ఉద్వేగములకు లోను అయినట్టి అజ్ఞుల కొరకై, వారి సముద్ధరణ కొరకై – ప్రథమ పాఠ్యాంశములుగా కల్పనచేసి చెప్పుకొస్తున్నారు.

**అజాతో, 'జాత' – ఇతి ఏవం కశ్చిత్ భీరుః ప్రపద్యతే॥ జన్మలే లేని ఆ పరమాత్మకు జన్మలు కల్పించి భీరువులు (సంసార భయము కలవారు) స్తోత్రములు చేస్తున్నారు. విజ్ఞులు జన్మ రహితునిగా గమనిస్తూ స్తుతిస్తున్నారు. అట్టి దక్షిణ ముఖుడగు రుద్ర భగవానుడు మనలను ఇంద్రియ దృష్టులనుండి కాపాడి, ఉద్ధరించి జ్ఞానదృష్టి – ఆత్మదృష్టి ప్రసాదించెదరు గాక!**

మన స్తోత్రములను స్వీకరించి మనలను **అజ్ఞాన నిబిడాంధకారము** నుండి **వెలుతురు వైపుగా** నడిపించెదరు గాక!

| దక్షిణముఖుడు | దక్షిణామూర్తి |
|---|---|

జ్ఞాననేత్రములను, దివ్య దృష్టిని, ఆత్మైవమ్యేవ సర్వత్రా – భావనను ప్రసాదించటానికై ప్రత్యుత్సాహంతో, కరుణతో మనవైపు ముఖము త్రిప్పి ఉన్నవారు.

⌘

ఓ ఆత్మేశ్వరా! సర్వాంతర్యామీ! సర్వతత్త్వ స్వరూపా! పరమపురుషా! దక్షిణామూర్తీ!

⌘ అనుగ్రహస్వరూపులగు మీరు మాకు, మా సహజీవులందరికీ కష్టములు తొలగించి, సుఖములను, వృద్ధిని ప్రసాదించెదరుగాక!

⌘ మా ప్రకృతి సంపదకు, గోసంపదకు అశ్వసంపదకు ఆపదలు రాకుండా మమ్ములను సంరక్షించెదరుగాక!

⌘ ఆయురారోగ్య ఐశ్వర్యములు సర్వజీవులకు ప్రసాదిస్తూ, దుఃఖములు పోగొట్టి, ఆత్మజ్ఞానానందమువైపుగా మమ్ములను నడిపించెదరు గాక!

⌘ అజ్ఞానము – భయము – దుఃఖము – అల్పభావములనుండి కాపాడి వీర్యవంతులుగా మమ్ము తీర్చిదిద్దెదరుగాక!

మిమ్ములను మేము ప్రార్థనలు చేసి బుద్ధిని పవిత్రం చేసుకుంటున్నాం. యజ్ఞ–హోమ హవిస్సులను, స్వధర్మ హవిస్సులను, స్తోత్ర హవిస్సులను మీకు భక్తితో సమర్పించుకొనుచున్నాము. **జగదంబతో రుద్రభూమిలో సంచరిస్తున్న మీ పాద పద్మములకు మాయొక్క సర్వకర్మఫలములను భక్తి – జ్ఞాన – యోగ – శరణాగతి పుష్పములుగా సమర్పించుకుంటున్నాం.**

మాయొక్క అజ్ఞాన దృష్టులను శుద్ధపరచి, విజ్ఞాన దృష్టిని ప్రసాదిస్తూ, మమ్ములను ఆత్మదృష్టివైపు మరలిస్తూ సముద్ధరించవలసిందిగా ప్రార్థిస్తున్నాము। వేడుకొంటున్నాము। నుతులు సమర్పిస్తున్నాము.

## పంచమోఽధ్యాయః – ఆత్మైవహి ఇదమ్ సర్వమ్। – 5వ శిష్యుని విశ్లేషణము

ఏకము, అక్షరము, అనంతము అగు **పరబ్రహ్మమునందు అనాదిగా** రెండు చమత్కారమైన విశేషాలు నిగూఢంగా దాగి ఉంటున్నాయి.

(1) అవిద్య (2) విద్య

ఈ రెండు కూడా ఆత్మవలెనే అనంతత్వము, అపరిచ్ఛిన్నత్వము సంచరించుకొనియే ఉంటున్నాయి.

**అవిద్య : క్షరంతు అవిద్యా హి।** మార్పు చెందునది – **అవిద్య।**

**విద్య : అమృతంతు విద్యా!** అమృతస్వరూపమైనది. మార్పు – చేర్పులు లేనట్టి విషయమును గురించిన జ్ఞానము – **విద్య।**

ఈ రెండిటి యొక్క నియామకుడగు ఈశ్వరుడు – రెండింటికీ వేరుగా **సాక్షి** అయి **అప్రమేయ స్వరూపుడై** ఉన్నారు! ఆయన **విద్య – అవిద్యలకు పరమై ఉండటంచే 'పరమాత్మ'** అని చెప్పబడుచున్నారు. ఆయన **ఏకరూపుడే అయి ఉండి, వేరు వేరు దేహాలలో వేరువేరుగా కనిపిస్తూ ఉన్నారు – బంగారము ఒక్కటే అయి ఉండి వేరు వేరు ఆభరణములుగా కనిపిస్తున్న తీరుగా!**

ఆయనయే ఈ విశ్వమునకు, ఇందలి సర్వ జీవరాసులకు యోనిస్థానము (జన్మస్థానము) అయి ఉన్నారు.

# పరమాత్మ

- సత్యమును ప్రకటించు ఋషులకు కూడా మునుముందే పరమ సత్యమగు పరమాత్మ కేవలమైయే ఉన్నారు. ఋషులు సత్యమును దర్శించి గానంచేస్తూ ఉన్నారు. **(అహం ఆదిర్హి దేవానాం, మహర్షీణాం చ)**
- సృష్టికర్త, హిరణ్యగర్భనామధేయుడు, సర్వము ఎరిగియున్నవారు, కపిలవర్ణుడు అగు బ్రహ్మదేవుడికి కూడా ముందే ఉన్నవారు। సృష్టికర్తకు ఆయన సృష్టికర్త। (సృష్టియొక్క భావనకు మునుముందే 'నేను' – ఉన్నది).
- ఈ సృష్టినంతా భరిస్తున్నది, ఆహారము ప్రసాదిస్తూ పరిపోషించుచున్నదికూడా ఆ **ఆత్మభగవానుడే!**

అట్టి మహత్తరము, సర్వము కంటే విశిష్టము అయిన పరమాత్మను ఆత్మజ్ఞానులు సదా ఉపాసించుచున్నారు. **అందరిలోను గల ఆ పరమాత్మను సర్వదా దర్శించుచూ, ఆరాధిస్తున్నారు.** మనము ఆ మహనీయులగు ఆత్మజ్ఞుల మార్గమును అనుసరించెదము గాక! ఆత్మభగవానుడు తనయొక్క మాయాశక్తిచే, తనయందు వేరువేరైన (84 లక్షల) విధములైన జీవజాతులను సృష్టించుచున్నారు. అట్టి సర్వజీవుల దేహములందు తానే 'క్షేత్రజ్ఞుడు' అయి వెలయుచున్నారు.

- సృష్టిస్తున్నారు. సృష్టిరూపులై ప్రదర్శనమగుచున్నారు.
- పరిపోషిస్తున్నారు. పరిపోషించబడేదంతా 'తానే' అయి ఉన్నారు।
- తనయందు లయం చేసుకుంటున్నారు. **'జగద్దృశ్యము స్వస్వరూపాత్మకు అభిన్నము'** అను భావనయే **'లయము'।**
- మరల ఎప్పుడో క్రీడాభిలాషిగా సృష్టిస్తున్నాను. మనో కల్పనయొక్క ప్రారంభమే **'సృష్టి'।**

ఈ విశ్వ సృష్టి – స్థితి – లయలకు అధిపతియై సర్వము నిర్వర్తిస్తూనే ఆ పరమాత్మ – తాను మాత్రం **నిర్వికారుడు, అప్రమేయుడు, పరుడు, నిర్విషయుడు** అయి ఉన్నారు. సర్వము ప్రకాశింపజేస్తూనే సూర్యకాంతి దేనికీ సంబంధించనిదే అయి, ఏదీ స్వీకరించక ఉంటున్నరీతిగా **పరమాత్మ సర్వకారణుడు, కారణరహితుడుగా...** **ప్రదర్శనమగుచున్నారు.**

- **సర్వభూతములను తానే అయి**
- **సర్వసాక్షిగా వేరై**
- **సర్వదా కేవల స్వరూపుడై**

'అకర్త'గా..... ప్రకాశిస్తున్నారు. ఇహ స్వరూపుడుగా 'కర్త'। పరస్వరూపుడుగా అకర్త। ఇహ స్వరూపుడుగా 'భోక్త'। పరస్వరూపుడుగా 'అభోక్త'. ఈవిధంగా ఉభయమై ఆనందిస్తూ ఉన్నారు.

* * *

సూర్యుడు ప్రకాశిస్తూ ఉంటే ఆ తేజస్సు అన్నివైపులా ప్రసరిస్తూ, చీకట్లను పాలద్రోలి కాంతివంతముగా చేయుచున్నది కదా! అదే రీతిగా **ఆత్మభగవానుడు ఏకస్వరూపుడై** ఉండి, విశ్వమంతా దశదిశలలోను, సర్వజీవరాసులలో **వెలుగొందుచున్నారు. ప్రతి దేహియొక్క ద్రష్ట – దర్శన – దృశ్యములను** ప్రకాశింపజేయుచున్నారు. ఆ పరమాత్మ యొక్క స్వభావమే **'ప్రకృతి'** రూపము సంతరించుకొనుచున్నదై...,

- ఈ విశ్వము యొక్క ఉత్పత్తి – స్థితి – పరిణామము – ఉపశమనములను ప్రదర్శిస్తోంది.
- ఈ జగత్తంతా తన అధిష్ఠానముగా (స్వకీయప్రదర్శనముగా) కలిగినదైయున్నది.

అట్టి స్వభావమే 'అధ్యాత్మము' అని పిలువబడుతోంది **(స్వభావో 'అధ్యాత్మ' ఉచ్యతే।)**

ఆయనయొక్క ప్రదర్శనమే **"మాయ, ప్రకృతి, రతి, కామ"** అను శబ్దములుగా కూడా చెప్పబడుతోంది.

**ఆయనయే పంచభూతముల యొక్క అనుసంధానకర్త. పదార్థములు, వాటి వాటి ధర్మములకు మూలకారకుడు. ఆయన నియోజించుటచేతనే** (At his proclaimation) **ఈ విశ్వము చేతనత్వము పొందినదై ఇట్లు ప్రవర్తించటం జరుగుతోంది!**

**ఉపనిషత్తులచే విశదీకరించబడుచు, ఎలుగెత్తి చాటబడుచూ, ప్రతి జీవునిలో రహస్యముగా దాగి వున్న తత్త్వముగా, సత్యముగా ఉన్నది ఆ పరమాత్మయే! ప్రతి జీవునియొక్క గుహ్యాతిగుహ్యమైన (రహస్యములలోకెల్లా రహస్యమైనట్టి) సహజరూపము ఆయనయే!**

- వేదములే ప్రమాణము అయి ఉన్నట్టిది...,
- వేద మహావాక్యార్థమైనట్టిది....,
- సత్యద్రష్టలగు ఋషులకు, దేవతలకు మునుముందే ఉన్నట్టిది...., **ఆ పరబ్రహ్మమే!**

అట్టి పరబ్రహ్మమును **'సోఽహమ్, తత్త్వమ్'**గా తెలుసుకొని ఈ జీవుడు తత్ స్వరూపుడై అమృతస్వరూపముగా ప్రకాశించుచున్నాడు! **నాలో నేనై కనిపించే పురుషకారము – ఆ పరమపురుషుని ప్రదర్శనమే।**

**ఆయన నాకు అనన్యుడు। నేను ఆయనకు అనన్యుడను।**

**ఇతి పరమాత్మ॥**

## జీవాత్మ

పరమాత్మయొక్క స్వీయ కల్పితాంశయే అగు ఈ జీవాత్మ....,

- **గుణాన్వయో యః।** ప్రకృతిలోని సత్త్వ – రజో – తమో గుణములను ఆశ్రయించినవాడై.....,
- **ఫల కర్మ కర్తా, కృతస్య।** కర్మలను నిర్వర్తిస్తూ...., **కర్తృత్వము వహిస్తూ,**
- **తస్యైవ స చ ఉపభోక్తా।** ఆ కర్మలకు – కర్మఫలములకు కర్తృత్వ భోకృత్త్వములు వహిస్తూ....,
- అనుక్షణికంగా కర్మ–కర్మఫలముల 'ధ్యాస' వృద్ధి చెందుచుండగా, పర్యవసానముగా **సుఖ–దుఃఖ అనుభవములు కలిగి ఉంటూ,**
- **త్రిగుణబద్ధుడై...,**

**14 లోకాలలో అసంఖ్యాక ఉపాధులలో రాకపోకలు సుదీర్ఘకాలంగా కొనసాగిస్తున్నాడు.** వచ్చిన చోటు నుండి బయల్వెడలుచున్నాడు. ఎప్పుడో బయలుదేరినచోటికే వచ్చుచున్నాడు. ప్రతిచోటు ఆతనికి కేంద్రబిందువే అగుచున్నది.

## ఈశ్వరుడు

ఇక ఈశ్వరుడో? త్రిగుణములకు, దేహముల రాక పోకలకు, సర్వసందర్భములకు సాక్షియై ఉంటున్నాడు. జాగ్రత్ – స్వప్న – సుషుప్తులకు కూడా సంబంధించనివాడై మౌనంగా చూస్తూ ఉన్నారు. విశ్వరూపుడై, ఈ విశ్వమును అధిగమించినవారై ఉంటున్నారు. జీవాత్మత్వమును **ఒక నాటకములోని పాత్రవంటిది** గాను, ఈశ్వరత్వము ఆ నటుని **'నటనా కౌశలము'** వంటిదిగాను – దృష్టాంతపూర్వకంగా వివరించబడుతోంది.

ఒక చమత్కారం

**ఈ జీవాత్మ తనకే చెందిన ఈశ్వరత్వమును సందర్శించటమే లేదు. సందర్శించిన మరుక్షణం సర్వ దుఃఖములు బంధములు తొలగగలవు.**

## అకర్త–కర్త :: అభోక్త–భోక్త

> **శ్లో॥ అంగుష్ఠమాత్రో రవితుల్యరూపః, సంకల్ప అహంకార సమన్వితో యః**
> **బుద్ధేర్గుణేన ఆత్మగుణేనచైవ ఆరాగ్రమాత్రో హి అపరోఽపి దృష్టః॥**

సర్వుల హృదయాలలోను ఆ చైతన్యపురుషుడు అంగుష్ఠమాత్రుడై, సూర్యునివలె స్వయం ప్రకాశకుడై, సంకల్ప–అహంకారములను కల్పించుకొనుచున్నవాడై, (అయినప్పటికీ) వాటికి సంబంధించనివాడై – వేరుగా (పరమ్) ఉన్నారు. సర్వకల్పనలను కల్పించుకొంటూ అకర్తగానే ఉంటూనే వినోదిస్తున్నారు. జీవాత్మగా బుద్ధిని, గుణములను కల్పించుకొని వాటిల్లో చక్రభ్రమణమును పొందుచున్నారు.

ఈ జీవాత్మ వాస్తవానికి – ఒక వెంట్రుకయొక్క చిట్టచివరి భాగము యొక్క నూరవవంతు (1/100)లో నూరవ వంతు కంటే కూడా (1/100 x 1/100) అత్యంత సూక్ష్మాతి సూక్ష్మ స్వరూపుడు! పరదృష్టిచే పరమాత్మయే అయి ఉండి, అపర దృష్టిచే 'జీవాత్మ'గా అగుపిస్తూ, **"బద్ధునివలె"** చూడబడుచున్నాడు.

వస్తుతః ఈ జీవుడు పరమాత్మ స్వరూపుడే గాని మరింకేమీ అయి ఉండలేదు కదా! **జీవో శివః!** ఇది తెలుసుకొన్నవారమై మనము మనయొక్క శివత్వమును **ఉపాసించి, దర్శించి, ప్రవేశించి, తన్మయులమై** బ్రహ్మానంద భరితులము అయ్యెదముగాక!

**ఆ పరమ పురుషుడు (లేక) పరమాత్మ ఎట్టివాడు? – మరికొంత అభివర్ణించుకుందాము।**

**<u>నైవ</u> స్త్రీ, న పుమాన్ ఏష, <u>నైవ</u> చ అయం నపుంసకః।** ఆ ఆత్మదేవుడు స్త్రీయా? పురుషుడా? నపుంసకుడా? ఇవేమీ ఏమాత్రము కానేకాదు!

అయితే...,

- **స్త్రీ దేహము ఆశ్రయించి** స్త్రీగాను,
- **పురుషదేహము ఆశ్రయించి** పురుషుడుగాను,
- **నపుంసక దేహము ఆశ్రయించి** నపుంసకుడుగాను
- **దేవతా దేహము ఆశ్రయించి** దేవతగాను,
- **జంతు దేహము ఆశ్రయించి** జంతువుగాను,

అగుచున్నది ఆ ఆత్మదేవుడే! అట్లా అగుచున్నప్పటికీ **ఆయన సర్వదా యథాతథుడే।** ఒకడు ఒక నాటకంలో ఒక పాత్రగా నటిస్తూ...,

- తాను స్వతఃగా ఏదై ఉన్నాడో...అది కోల్పోవుచున్నాడా? లేదు!
- పాత్రగా నాటకరంగముపై కనిపిస్తున్నది ఎవరు? ఆ నటుడే?
- నాటక పాత్ర యొక్క గుణములు వస్త్రధారణ, సంబంధములు మొ॥నవి నటుడివా? కాదు.

నాటక పాత్ర కల్పితమే అయినట్లు, ఈశ్వరుని సమక్షంలో జీవాత్మ నాటక పాత్రవలె కల్పితముగా, దృష్టము (కనిపించేది) అగుచున్నది. ఈ జీవాత్మ పరిమితునివలె అగుపిస్తూ ఉన్నప్పటికీ, వాస్తవానికి సర్వదా **పరమాత్మ స్వరూపుడే! అనంతుడే!**

*అట్టి జీవాత్మ కూడా*

- అనాది। అనంతుడు। ఆద్యంతరహితుడు। **(ప్రకృతిం, పురుషంచైవ విద్ధి అనాదీ ఉభావపి)।**
- జీవాత్మ వాస్తవానికి ఇంద్రియ బద్ధుడు కాడు।
- తానే మాయా సంసారమునకు సృష్టికర్త. **తాను పొందుచున్న అవస్థలకు తానే రచయిత, దర్శకుడు, నటుడు, ప్రేక్షకుడు, విమర్శకుడు కూడా।** మరొకరెవరో కాదు।
- మాయలో ఉన్నవాడే - మాయా రచయిత కూడా! మాయా రచయితగా **'మాయి'** అనబడుచున్నాడు.
- అనేక రూపములు కలిగి ఉండినట్టి విశ్వస్రష్ట కూడా। (అజ్ఞాన దృష్టికి) **ఈ 'జీవుడు' రూపముగా కనిపిస్తున్నది పరమాత్మయే।**
- సర్వ వ్యాపి అయి ఉండువాడు। స్వప్న ద్రష్టయొక్క ఉపద్రష్టా చైతన్యమే స్వప్నమంతా వ్యాపించి ఉంటునట్లు, ఈ జీవుని ఉపద్రష్ట (సాక్షీ) చైతన్యమే జాగ్రత్ అంతటా వ్యాపించినదై ఉన్నది.
- తాను కల్పించుకొను విశ్వములకు తానే పర్యవేక్షకుడు కూడా!

**ఈ విధంగా జీవాత్మ పరమాత్మల సమాన ధర్మములను ఎవ్వరు గ్రహిస్తారో, వారు సంసార పాశములనుండి విముక్తుడు అగుచున్నట్లే. ఈ జీవుడు తానే పరమాత్మనని తెలుసుకోగానే బంధములన్నీ తెగిపోతున్నాయి. ఇంతకు మించి బంధము తొలగటానికి వేరే ఉపాయమే లేదు.**

ఎవ్వడైతే...

"నేను ఈ దేహమునకు పరిమితుడను మాత్రమే కదా! ఈ దేహము నాకు సంబంధించినది. దీనికి నేను సంబంధించినవాడను'..... అనే దేహాభిమానము మొదలంట్లా వదలివేసి, ఇక ఆపై -

- "జాగ్రత్‌లో తటస్తిస్తున్న "నేను" అను భావనలకు మునుముందే ఉన్నట్టి భావాతీతుడను. త్రిగుణరహిత కేవల చైతన్య స్వరూపుడను. భావములను నియమించు ఆత్మ స్వరూపుడను. సృష్టికర్తను. భావములకు ప్రభవించు స్థానమును.
- భావములు నాచే స్వీకరించబడుతూ ఉంటాయి. వదలబడుచూ ఉంటాయి. అయినప్పటికీ కూడా, భావములకు బద్ధుడను కాను. భావములచే పరిమితుడను కాను. భావములపై ఆధార పడువాడను కాను.
- భావ - అభావములకు ఉత్పత్తి స్థానమగు **శివానంద స్వరూపుడను!**"

....అని గ్రహిస్తాడో **- అదియే భావాతీత ధ్యానము.**

***"ఈ దేహము - మాయ - సంసారము - బంధము - ఇవన్నీ కూడా - నేను ధరించి, కొంత సమయం ఉంచుకొని, ఆపై ఎప్పుడో విడిచిపెట్టే వస్త్రము వంటివి మాత్రమే!"***

- అని గమనిస్తూ ఉంటాడో.... అదియే త్రిగుణాతీత దర్శనము.

దేహ - భావాదులతో సహా ఈ సర్వము తనకు వేరైనవిగా చూస్తాడో..., (మరియు) సమస్తము తన **'అనుభూతి'** అను **ఆనందము** యొక్క విస్తరణ రూపమే... అని గమనిస్తూ ఉంటాడో, - అదియే దేహాతీతము.

**"అహమస్మి తత్ ఆత్మ దేవః"** అని తెలుసుకొనినవాడై, ఈ దేహాదులను మనస్సుతో త్యజించినవాడై ఉంటాడో...., అదియే మనో-అతీతము. దేహాతీతము.

**ఆతడికి ఇక బంధమెక్కడిది? సర్వదా ముక్తుడే!** ఆతనిపట్ల "మోక్షము ఎట్లా లభిస్తుంది?" అనే ప్రశ్న ఇక ఉండదు. దాని సమాధానముయొక్క ఆవశ్యకత కూడా శేషించదు.

## షష్ఠోఽధ్యాయః – తమ్ ఆత్మస్థమ్ – సద్గురు విశ్లేషణము

***అటు తరువాత బ్రహ్మవాది అగు శ్వేతాశ్వతరమహర్షి తన యొక్క ప్రియశిష్యులకు ఈవిధంగా మరికొన్ని విశేషాలు బోధించసాగారు.***

**శ్వేతాశ్వతర మహర్షి:** మమాత్మానంద స్వరూపులగు ప్రియశిష్యులారా! బిడ్డలారా! మమోపాసనా దివ్య స్వరూపులారా!

- ఈ విశ్వము / దృశ్యము / ప్రకృతి ఎట్లా జనించింది?
- జీవాత్మ – ఈశ్వరుడు – పరమాత్మ...అను విషయమై ఇంకేమి వివరాలు?

అనే విషయం గురించి మరికొన్ని విశేషాలు ఈ విధంగా సత్సంగరూపంగా సంభాషించుకొంటున్నాము. వినండి.

**"ఈ ఎదురుగా కనిపిస్తున్న అనంత విశ్వసృష్టికి ఏది కారణమైయున్నది?"** అను విషయం గురించి వేరు వేరు వక్తలు చెప్పుచున్న విశేషాలు మరికొంత వివేక దృష్టితో వినండి.

## స్వభావవాదులు

**"ఈ దృశ్యమునకు కారణము స్వభావము. ఇదంతా స్వభావరీత్యా** (In its natural course) **ఈ విధంగా వస్తువులు, దేహాలు, పదార్థాలు, పంచభూతాలు....ఇవన్నీ ఏర్పడుచున్నాయి. కొంత కాలానికి నశిస్తున్నాయి. దీనిని ఎవరూ సృష్టించటంలేదు"**....అని స్వభావవాదుల అభిప్రాయము. అయితే ఇక్కడ "ఈ జీవాత్మ ఎవరు? స్వభావము అనునది ఎవరిది? ఎవ్వరిదీ కాకుంటే ఎందుకు ఇట్లా స్వభావము కలిగి ఉంటోంది?"....అనే ప్రశ్నలు ఉండిపోతున్నాయి. కనుక ఇది **'అనాత్మవాదము'** అని అనబడుతోంది.

## 'కాల'వాదులు

**"ఇదంతా కాలమే సృష్టిస్తోంది! కాలమే నశింపజేస్తోంది"** అనునది వీరి అభిప్రాయము. అప్పుడు, "కాలమును నియమించువారెవ్వరైనా ఉన్నారా? ఎందుకు కాలము ఇట్లా సృష్టిస్తోంది?" అనే ప్రశ్నలు అట్లాగే ఉంటున్నాయి. మరి–కాలము కృతమా? స్వయం కృతమా? వీటికి సమాధానము లేదు కాబట్టి, – ఇది పరిమితవాదముగా చూడబడుతోంది.

----

ఇట్లా ఎన్నెన్నో పరిముహ్యము(Illusion) తో కూడిన విశ్వకారణవాదములు చెప్పబడుచున్నాయి.. ఇక ఇప్పుడు మనం ఉపనిషత్ వాఙ్మయము చెప్పునది, బ్రహ్మవేత్తలగు ఆత్మజ్ఞుల వాక్కులను దృష్టిలో పెట్టుకొని ఈ విషయమై వివరించుకుందాము.

- **ఈ జీవుడు సర్వదా ఆత్మస్వరూపుడే। సదాశివుడే।**
- **ఆత్మ అద్వితీయమై ఉండటంచేత, ఈ జీవుడు ఆత్మకంటే వేరుగా మరెక్కడినుండో ఇక్కడికి రావటములేదు. ఇక్కడి నుండి మరెక్కడికో వెళ్ళటమూ లేదు.**
- ఈ విశ్వము ఆత్మయొక్క మహిమయే. **(మహిమానం తవేదమ్)।**
- దీపపు కాంతిలో వస్తువుల ఆకారాలు కనిపిస్తున్న విధంగా **ఆత్మయొక్క తేజస్సుతో ఈ విశ్వము సాకారమై కనబడుతోంది!**
- బ్రహ్మమే స్వరూపముగాగల ఈ జీవుడు భ్రామ్య మానము (Illusionary misconception) అగు బ్రహ్మచక్రములో ప్రవేశించి అన్యమును లీలగా ఆశ్రయించుచున్నాడు. "నేను జీవుడను. పరిమితుడను" అని (బుద్ధియొక్క కల్పనా విశేషములచేత) తలచుచున్నాడు. మరల ఎప్పుడో బ్రహ్మజ్ఞానముచే **"నేను బ్రహ్మమే"** అని తిరిగి ఎరుగుచున్నాడు.

బ్రహ్మము జీవుడుగా అవరోహణము – జీవుడు బ్రహ్మముగా ఆరోహణము **ఇదియే బ్రహ్మచక్రము! ఏమరపు – జ్ఞాపకముల చమత్కారము। క్రీడా వినోదము।**

వాస్తవానికి ఈ జగత్తంతా సర్వదా పరమాత్మ స్వరూపమే అయి ఉండి, పరమాత్మ చేతనే ఆవరించబడినదై ఉన్నది.

**(1) జ్ఞః :** పరమాత్మ కేవల జ్ఞాన స్వరూపుడు. ముందుగా 'తెలుసుకోవటం' అను ఆత్మ చైతన్యశక్తి ప్రవర్తమానమైనతరువాతనే తెలియదుచున్నదంతా అనన్యంగా బయల్వెడలుతోంది.

తెలియబడటం ప్రారంభం కాకముందే ఉన్న తెలివి → **జ్ఞః, కేవల చిత్। నిర్మల చిత్। పరమాత్మ।**

(2) ఆ 'తెలివి'ని ఉపయోగించుచూ తెలియబడునది కల్పించుకొనువాడు → **ఈశ్వరుడు.**

(3) తెలియబడుదానిలో ప్రవేశించి **"నేను ఇందులో చిక్కుకుని, ఈ తెలియబడు దానితో సంబంధితుడను, బంధితుడను అయినాను"** అని తలచువాడు → **జీవుడు. ఈ ముగ్గురు ఒక్కటే। త్రిమూర్తులను ధరించటం జరుగుతోంది.**

అనగా, ఈ మూడు కూడా (కేవల చిత్-ఈశ్వరుడు-జీవుడు) పరమాత్మయందే, పరమాత్మ చేతనే, పరమాత్మకు అభిన్నమైనవై ఉండగా, పరమాత్మ - యథాతథుడు (చేతి కదలికలు దేహివే అయి, దేహి కదలకయేఉన్న తీరుగా) - అయిఉంటున్నారు.

ఈ విధంగా పరమాత్మయే జ్ఞః (జ్ఞాన) స్వరూపుడు ప్రజ్ఞాస్వరూపుడు (ప్రజ్ఞానమ్ బ్రహ్మ). **ఆయన సర్వజ్ఞుడు. సర్వము ఎరిగినవాడు.**

**కాలః కాలో:** ఈ దేహాలు, జగత్తులు, బ్రహ్మాండములు కాలముచే నియమించబడి, కాలముచే జనించి, కాలముచే పరిపోషించబడి, కాలముచే మ్రింగివేయబడుచున్నాయి. మార్పు చెందుచున్న ఈ సర్వమునకు కాలమే కర్త అగుచున్నది. అయితే, పరమాత్మయే లీలగా **కాలమును నియమించువారు. కాలమునకు ఆవల ఉన్నవారు.** భూత-వర్తమాన-భవిష్యత్‌లచేత గాని,వాటిల్లో సర్వ విశేషములచేత గాని **మార్పు చెందనివారు.** అందుచేత **కాలమునకే కాలమైనట్టివారు. కాలఃకాలుడు।** *(కాలఃకాలః ప్రసన్నానామ్, కాలః కిన్ను కరిష్యతి?)*

అట్టి **"మహాకాలుడు"** అను బిరుదుగల రుద్ర-శివ భగవానుని తెలుసుకొన్న తరువాత **కాలబద్ధత, నిబద్ధత** ఆత్మను ఏమిచేయగలదు?

**గుణీ :** గుణములు తనవైనవాడు పరమాత్మ. ఆయన తనయొక్క మాయాశక్తిచే సత్వ-రజో-తమో గుణములను తన ఇచ్ఛానుసారంగా ప్రదర్శించువారు. అంతేగాని గుణముల మధ్య ఉన్నవారు కాదు. గుణబద్ధులు కాదు। గుణములకు పరమాత్మ ఆధారము. అంతేగాని, పరమాత్మ గుణములపై ఆధారుడు కానేకాదు.

**సర్వవిద్యః :** ఈ దేహముల రాకపోకలు, జీవాత్మ కల్పనలు, లోక కల్పనలు, బంధ - మోక్షములు - ఇవన్నీ ఎరిగియే ఉండి, సర్వసాక్షి అయి ఉన్నవారు. సర్వజ్ఞుడు. ఆ ఆత్మభగవానుని నుండి బయల్వెడలిన భావనా చమత్కారములు ఆయనవలననే - శుభాశుభ కర్మలరూపంగాను, జగత్తు రూపంగాను వివర్తము (Emanating /Emerging from out of) అగుచున్నాయి. వాటి వివర్తనా ప్రదర్శనములే ఇక్కడి పంచభూతములు, వాటి వాటి ధర్మములు, పాంచభౌతిక దేహములు కూడా! జన్మలు - జన్మాంతరములు ఆ ఆత్మయొక్క ఈశ్వర చమత్కార సంబంధమైన వివర్తము(Derived)లే।

ఆ ఆత్మభగవానుడు తనయొక్క ఒకానొక మహత్తరమగు 'క్రియాంశ' నుండి...,

**ఏకేన** ....ఏకస్వరూపుడుగాను, పరమాత్మ స్వరూపుడుగాను - సర్వదా ఏకమే అయి ఉన్నారు.

**ద్వాభ్యామ్** .....ఆ ఏకము నుండి జీవుడు - ఈశ్వరుడు అని మనం చెప్పుకుంటున్న ద్విత్వము - ప్రదర్శనమౌతోంది.

**త్రిభిః** .......అట్టి ద్విత్వమును ప్రదర్శించటానికై త్రిగుణములు (లేక) పరమాత్మ - ఈశ్వరుడు - జీవుడుగా విస్తరించినవగుచున్నాయి.

**అష్టభిర్వా** .....వీటన్నిటి సంప్రదర్శనముకొరకై అష్టవిధ ప్రకృతి (పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము) ప్రదర్శితమౌతోంది.

**ఇవన్నీ విర్తము** (Deduced) **అగుచున్నాయి.**

కర్మసాక్షి అగు ఆ ఆత్మభగవానుడు ఈ జగత్ తతంగమంతా వీటన్నిటిలో కొనసాగిస్తూ, మరల ఎప్పుడో....తాను ప్రదర్శిస్తూ వస్తున్న **'కర్మ ప్రవృత్తి యోగము'**ను ఉపశమింపజేస్తూ, **'నివృత్తి యోగము'**ను ఆశ్రయిస్తున్నారు. చిన్నపిల్లవాడు వినోదంగా కొంతసేపు ఆడుకొని, ఆ ఆటలు ఆపి, ఇంటికి చేరువిధంగా ఇదంతా జరుగుచున్నది. ఆ ఆత్మదేవుడు తన అంశయగు జగత్‌తత్త్వమును ఏకము. అఖండము అగు ఆత్మస్వరూపమునందు సంయోగము చేసివేస్తున్నారు. **ఆత్మ - ఈశ్వరుడు - జీవుడు - దృశ్యము ఇవన్నీ ఏకము - అఖండము అగు స్వస్వరూపంగా ఆస్వాదిస్తున్నారు. ఇదియే 'బ్రహ్మచక్రము' అని కూడా అంటారు.**

---

మిత్రులారా! మనం సర్వ కర్మ శృంఖలములను త్రెంచుకొని మోక్షిభాగి కావటానికై, ఈ 'జన్మ' అనే అవకాశమును సద్వినియోగం చేసుకోవాలి. అందుకొరకై - ఉత్తమ కార్యక్రమములను ఆశ్రయించెదముగాక! క్రియా యోగము, ధ్యానము, స్వధర్మ పూర్వక కర్మయోగము, భక్తియోగము దైవీ గుణాశ్రయము మొదలైనవన్నీ అందుకు ఉపాయములు.

- మన భావాలను మొట్టమొదట సర్వాత్మకుడగు **ఆత్మభగవానునియందు నియమించుకొంటూ,** (సాధన చతుష్టయమును శమము (ఇంద్రియ నిగ్రహము), విచారణ, సంతోషము, సత్సంగములను ఆశ్రయిస్తూ),
- మనం నిర్వర్తించే సర్వకర్మలను, త్రిగుణములను **ఆ పరమాత్మకు సమర్పిస్తూ** (All my functions and qualities are in my service to the Alpervading Universal SELF)
- పరమాత్మ భావనను ప్రవృద్ధపరచుకుంటూ ఉండెదముగాక! (I am that in which all else is taking form and dissolving).

భావాతీతమును (లేక) అభావమును ఆశ్రయిస్తూ కర్మలు నిర్వర్తించుచుండగా **'కృతకర్మ నాశనము'** జరుగగలదు. మనం చేస్తున్న కర్మలు మన దృష్టిలో అవిషయములవగలవు. "కర్మలచే నేను బద్ధుడను అగువాడను కాను".... అను అతీత దృష్టి జనించి, క్రమంగా ప్రవృద్ధము కాగలదు.

**కర్మ అభావ – ఆత్మ భావనల** కర్మలు నిర్వర్తిస్తూ ఉండగా కర్మబంధాలు వాటికవే తొలగిపోతాయి. కర్మ బంధములు తొలగటానికై వేరే మరొక ప్రయత్నము (Another different programme) తో అగత్యముండదు.

అప్పుడు కృత – అకృత (చేస్తున్నట్టి – చేయనట్టి) కర్మలకు వేరైనట్టి ఆత్మతత్త్వమునందు మనము ప్రవేశించగలము! **ఆత్మగా ప్రకాశించగలము!**

## కిం తత్ పరమమ్?

### తత్ పరమాత్మ ఎట్టివాడంటే....

**ఆదిః :** సర్వమునకు మొట్టమొదటే ఉన్నట్టివారు. (నాయొక్క ఆది–పరాశక్తి స్వరూపము).

**సంయోగాత్ :** ఆయన తనకు ద్వితీయమువలె కనిపించే జగత్తును స్వకీయ క్రీడావినోదముగా తానే కల్పించుకొని **సంయోగము** పొందుచున్నారు. ఆయనయొక్క **"సంయోగ భావనచే"** జగత్తు (జనిస్తూ గతిస్తూ మధ్యలో కనిపిస్తున్నట్టి దృశ్య వ్యవహారము) – ఉన్నట్లు, **'వియోగభావన'**చే **'మొదలే లేనిది'** అగుచున్నది.

**నిమిత్త హేతుః :** సర్వమునకు నిమిత్తహేతువై ఉన్నారు. (ఉదా : ఒక పని జరుగుచున్నప్పుడు చేతులు – ఉపాదానకారణం! ఆ చేతులు ఉపయోగించువాడు నిమిత్త కారణం).

**పరమ్ :** ఈ సర్వమునకు పరమై, అప్రమేయుడై, అసంబంధితుడై ఉన్నట్టివారు. (పరమ్ = ఆవల, ఇహమ్ = ఈవల)

**త్రికాలాత్ పరమ్ :** మూడుకాలములకు ఆవలి వారు. భూత–వర్తమాన–భవిష్యత్తులలోని నాయొక్క యథాతథ కేవలీ స్వరూపుడు.

**అకలోఽపి దృష్టః :** తన కలము (కల్పన)కు తానే ద్రష్టయై తిలకించునట్టివారు. తన కల్పనకు తానే 'భోక్త' అయి, సంబంధితుడు అగుచూ, 'బంధము'ను అనుభవముగా పొందుచున్నవాడు.

**తమ్ విశ్వరూపమ్ :** తన కల్పనయే అయి ఉన్న ఈ విశ్వమంతా తన రూపముగా కలవాడు. **(సమస్తము నేనైన నేను).**

**భవ భూతమ్ :** పంచభూత స్వరూపుడు (ఈ పాంచభౌతిక దృశ్యమంతా 'తానే' అయి ఉన్న వాడు. ఈ భౌతికంగా ఏర్పడినదై (భవమై) ఉన్నదంతా ఆయన యొక్క సంప్రదర్శనా చమత్కారమే.

**ఈడ్యమ్ దేవమ్ :** స్తోత్రార్హుడైన దేవాదిదేవుడు! ఆ ఆత్మ భగవానుడే దేవతలచేత కూడా సదా స్తుతించబడుచున్నాడు.

**స్వచిత్తస్థమ్ :** ప్రతి ఒక్క జీవుని యొక్క **స్వకీయ చిత్తము** నందే సర్వదా వేంచేసి ఉన్నవారు. ("The Absolute Self" that is dwelling in one's own Zone of INTEREST)

**ఉపాస్య పూర్వమ్ :** మన పూర్వీకులచే కూడా ఉపాసించబడియున్నవారు. మహర్షులకు, దేవతలకు కూడా ఉపాస్య వస్తువై ఉన్నవారు!

**సవృక్షః :** వృక్షమువలె సమస్తము ప్రసాదించువారు. ఎటూ కదలనివారు.

**సవృక్ష – కాలాకృతిభిః పరో – అన్యో :** ఈ దృశ్యముతో పెట్టుకొనియున్న **"అజ్ఞాన సంబంధము"** అనే సంసార వృక్షమునకు – కాలమునకు కూడా పరము – అన్యము అయినట్టివారు!

**యస్మాత్ అయమ్ ప్రపంచమ్ పరివర్తతే :** ఎవనియందైతే ఈ పరివర్తన (Changing Factor) శీలమైయున్న ప్రపంచమంతా ఏర్పడినదై ఉన్నదో...అట్టి పరమాత్మను ఉపాసించుచున్నాము. ఆరాధిస్తున్నాము. ఆయన – **తాను ఏమాత్రము మార్పు చెందకయే, సమస్తమైన మార్పు–చేర్పులకు ఆలవాలము అగుచున్నట్టివారు.**

ఆయనను...,

- ధర్మరక్షకునిగాను, దుష్ట శిక్షకుడిగాను,
- మనయొక్క పాప – అల్ప దృష్టుల నుండి మనలను సముద్ధరించువారు గాను,
- **భగేశమ్** – మనయొక్క కర్మ బంధములను భస్మము చేయువారు గాను,

తెలుసుకొని, ఆయనను ఆత్మస్థునిగా, మనయందే సర్వదా ఉన్నవారిగా దర్శిస్తూ ఉండగా, ఇక మనము

- **పరబ్రహ్మ స్వరూపులమై,**
- **అమృతరూపులమై,**
- ఈ విశ్వమంతా మన ధామముగా (House) గమనిస్తున్నవారమై ప్రకాశించుచుండగలము.

***మనము ఉపాసించుచున్నట్టి ఆ సర్వాత్మకుడగు పరమాత్మ.....,***

- అంతటా నిండి ఉండి, విస్తరించియుండి సర్వమును నియమించుచున్న **ఈశ్వరుడు.**
- సర్వ దేహములలో మహత్తరమైన వస్తువై, జీవ – ఈశ్వరులకు పరమై ప్రకాశిస్తున్న **ఆత్మభగవానుడు।**
- దేవతలకే నియామకుడైనట్టి దేవాది దేవుడు। **తమ్ దేవతానాంచ పరమంచ దైవతమ్।** దేవతలకు కూడా స్తుతించువస్తువై, ఉపాస్య వస్తువై ఉన్నవారు। **సమస్త జీవుల స్వస్వరూపాత్మ దేవుడై సర్వత్రా వెలయుచున్నారు.**
- విశ్వపతికే పతి అయి, భరించువారిని కూడా భరించువాడై ఉన్నవారు. భువనేశ్వరుడై, భువనములన్నీ రక్షిస్తున్నవారు. **అట్టి ఆత్మ భగవానుని జగత్‌రూపముగా గమనిస్తూ, ఆ ఆత్మదేవునిగా స్తుతించెదముగాక! ఆరాధించెదముగాక!**

**ఈ జగత్తంతా ఆయనయొక్క ప్రత్యక్ష–ఆనంద స్వరూపమే। మరింకేమీ కాదు.**

అట్టి పరమపురుషునకు,

- **కార్య – కారణ – కర్తృత్వములు లేవు.**
- ఇంద్రియములకు గాని – ఇంద్రియ విషయములకుగాని పట్టుబడనివారు. ఎందుకంటే ఆయన వాటికి సంబంధించినవారు కాదు. అప్రమేయములు. వస్త్రము ధరించినవాడు వస్త్రముగా అవడు కదా! ఆయన సర్వదా సమస్తమునకు పరస్వరూపులు।

ఈ జీవునికి సంబంధించి సహజరూపమే అయి ఉన్న – ఆయనకు సమానమైన మరొక వస్తువే లేదు! **ఇక మించినదంటూ మరేమీ లేదని చెప్పవలసిన పనేమున్నది?**

ఆయనయొక్క పరాశక్తియే ఈ ఈ విధములైన దేవ – మనుష్య – తిర్యక్ జీవలోకములుగా, (14 లోకములుగా) మనోబుద్ధి చిత్త అహంకారములుగా, తదితరమైన ఈ ఆకాశ భూమ్యాదులుగా విలసిల్లుచున్నది.

**ఆయనకు శక్తి మరొకరు ఇచ్చేది కాదు. స్వాభావికమైనది.** ఇచ్ఛా – క్రియా – జ్ఞాన సంపన్నుడు ఆయన! అవియే ఈ జగత్ దృశ్యము యొక్క మూలపదార్థములు. మూలప్రకృతి. ఆయనకు లోకాలలో మరొక పతి లేడు. ఆయనయే సర్వలోకములు. సర్వము నియమించే ఆయనకు మరొక నియామకుడు లేడు. **సర్వనియామకుడు! నియామక రహితుడు!**

- నిరాకారుడగు ఆయనకు స్త్రీ–పురుష–నపుంసక–జడ–చేతన భేదములు లేవు. ఆయన అవన్నీ అగుచూ, ఏదీ కానట్టివారు. కవి. పురాణుడు. అనుశాసితారుడు.
- ఆయన కారణరహితుడు. ఆయనకు **"ఇది కారణము"** – అనునది ఏమీ లేదు. అకారణుడు. మరొకరెవ్వరూ ఆయనకు కారణమైలేడు. కాబట్టి ఆయన స్వభావమైనట్టి ప్రకృత్తి –జగత్తులు – జీవుడు – బంధము – మోక్షము. మొదలైనదంతా కూడా అకారణము.

**కారణాలన్నిటికీ కారణుడైన అకారణుడు ఆయన! ఆయన దేని – దేనికి కారణమో...అదంతా...ఆయనవలెనే అకారణం.** ఆయన నుండి వేరే ఏదీ జనించటమూ లేదు! వేరుగా ఉన్నదీ లేదు! లయించటమూ లేదు! **అట్టి పరమాత్మనే, పరబ్రహ్మమునే, పరమపురుషునే మనము ఉపాసించి, ఆయనకు అనన్యమగుచున్నాము. పరమాత్మస్వరూపులమై ప్రకాశిస్తున్నాము.**

**మనము ఆయనకాని క్షణమే లేదు. ఆయన మనము కాని క్షణమూ లేదు.**

---

ఒక సాలె పురుగు...

- తన నుండి తానే లాలాజలమును దారముల రూపంగా బయల్వెడలుచుండగా...,
- ఆ దారములు సాలెదారపుచక్రములుగా తెరరూపంగా ఏర్పడి...,
- ఆ సాలెదారపు చక్రములో సాలె పురుగు విలాసముగా విహరిస్తున్నట్లుగా...,

అవ్యయమగు బ్రహ్మము బ్రహ్మాండము అనే గొప్ప సాలెచక్రము వంటి దానిని నిర్మించుకొని...అందులో వినోదంగా విహరిస్తూ సంచారము చేస్తోంది.

**అట్టి ఆత్మస్వరూప మహాపురుషుడు మనకు అవ్యయమగు బ్రహ్మజ్ఞాన – స్థాన – అనుభవములను ప్రసాదించెదరుగాక!**

**శ్లో॥ ఏకో దేవః సర్వభూతేషు గూఢః, సర్వవ్యాపీ సర్వభూత – అంతరాత్మా।**
**కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥**

సర్వజీవుల అంతరాత్మగా ఏకస్వరూపుడగు ఆ పరమాత్మయే, దేవాది దేవుడై వేంచేసి వసించుచున్నారు. అంతర్యామియై అందరిలో, అందరుగా – దాగి ఉన్నారు. ఆయన

- **సర్వవ్యాపకుడు!**
- సర్వకర్మలకు **అధ్యక్షుడు!**
- సర్వులలోని **కేవలసాక్షి!**
- సర్వులయొక్క **అంతరాత్మ।**
- సర్వజీవులలో **అధివాసుడు। అధినాధుడు। అధి దైవము।**
- గుణములకు **ఆధారమై, నిర్గుణుడై ఉన్నవారు।**

ఆయన నిష్క్రియుడయి ఉండి కూడా అనేక జీవులలో మనో – బుద్ధి – చిత్త – అహంకార స్వరూపుడై సర్వమును నిర్వర్తింపజేస్తున్నారు. ఏకరూపియే అయి, అనేక రూపములుగా కనిపిస్తున్నారు.

**తమ్ ఆత్మస్థమ్ యే అనుపశ్యంతి ధీరాః,**
**తేషాగ్ం సుఖమ్ శాశ్వతమ్। నేతరేషామ్। (న ఇతరేషామ్)।**

ఎవ్వరైతే అట్టి ఆ పరమాత్మను తమయందే

- కేవల సాక్షిగా
- మహాకర్తగా
- అప్రమేయుడుగా,
- విశ్వరూపుడుగా

ఇంకా ఇంతవరకు చెప్పుకున్న ఆయా సర్వవిశేషసమన్వితునిగా దర్శిస్తారో..., అట్టివారు శాశ్వత సుఖమును పొంది, ఆస్వాదించుచున్నారు. తదితరుల సుఖము శాశ్వతము కాదు! కాలబద్ధము. దుఃఖమిశ్రితము. సందర్భ పరిమితము.

పరమాత్మయొక్క ప్రదర్శనయే–ఇక్కడి వక్త, శ్రోత, తదితరులు కూడా! ఈ సత్యము ఎఱుగుచున్నప్పుడు ఇక మనకు బంధమెక్కడిది? మోక్షము ఎందుకు?

**నిత్యో–అనిత్యానామ్ :** అనిత్యమైన దేహాదులలో ఎవ్వరైతే నిత్యుడై వేంచేసి ఉన్నారో...,

**చేతనః చేతనానామ్ :** దేహము, మనస్సు, బుద్ధి మొ॥న వాటితో సహా కదిలే సర్వ వస్తువులకు **'కదిలించేవాడు'**గా ఉన్నారో....,

**ఏకో బహూనామ్ :** అనేకములుగా కనిపిస్తూ సర్వదా ఏకమే అయి ఉన్నారో....,

**యో విదధాతి కామాన్ :** సర్వజీవుల వాంఛితార్థములను ప్రసాదించుచున్న వారై ఉన్నారో...,

**తత్ కారణగ్ం :** కారణాలన్నిటికీ కారణమైయున్నారో...,

**సాంఖ్యయోగాది గమ్యమ్ : "కిం తత్? కిం సత్? అది ఏమైయున్నది?"** అను విచారణలచే చివరికి తెలియవచ్చువారై ఉన్నారో...,

**అట్టి స్వస్వరూప పరమపురుషుని, ఆత్మభగవానుని తెలుసుకొనగానే సర్వపాశములు లేనివైపోతాయి. సర్వబంధములు బంధము కలిగించనివగుచున్నాయి.**

❖

సూర్యకిరణములు ప్రసరించటముచే విశ్వములోని వస్తువులు భాసించి కళ్లకు కనిపిస్తూ ఉంటాయి. ఆత్మదేవునియొక్క ప్రజ్ఞా–ప్రదర్శనమే ఈ భౌతిక ప్రపంచం. అయితే ఆత్మ ఈ భౌతిక సూర్యకిరణములచే భాసించేది కాదు.

- అట్లాగే చంద్రుని – నక్షత్రముల కిరణములచే, ఆ వెలుగులో కనిపించేది కూడా లేదు.
- విద్యుత్ కిరణములతో, మెఱుపుల వెలుగులలో కూడా భాసించేది కాదు. ఇక అగ్ని యొక్క వెలుగులో కనిపించేది కూడా కానట్లే కదా!

మరి?

**తమేవ భాంతమ్ అనుభాతి సర్వగ్ం।**
**తస్య భాసా, సర్వమిదం విభాతి ॥**

ఆ ఆత్మభగవానుడు ఈ సూర్య – చంద్ర – నక్షత్ర – విద్యుత్ – అగ్ని...ఇత్యాది తేజోమయ పదార్థములన్నీ తనయొక్క తేజస్సుచే తేజోమయం చేయటంచేత అవి వెలుగొందుచున్నాయి. ఆయన వెలుగులో ఇవన్నీ సాకారంగా కనిపిస్తున్నాయి. **వెలుగుచున్న దీపపు**

***కాంతియే దర్పణంతో వెలుగుగా కనబడుచున్న రీతిగా। సూర్య-చంద్ర-నక్షత్ర-విద్యుత్తులలో కనబడే సాకారమంతా ఆత్మభగవానుని 'అనుభావన'చే అనుభవమగుచున్నది మాత్రమే!***

గది మధ్యలో దీపం వెలుగుచూ ఉంటే గదిలో (10) వైపులా కాంతివంతమై, అక్కడి వస్తువులు, ఆకారాలు...మొదలైనవన్నీ కనిపిస్తున్నాయి కదా! అట్లాగే, ఈ విశ్వమునందు మధ్యగా ఆత్మజ్యోతి వెలుగుచున్నది కాబట్టి ఈ విశ్వము, ఈ లోకములు, ఈ దేహములు మొదలైనవన్నీ కూడా **తేజోమయము, స్పందనశక్తి మయము, ప్రత్యుత్సాహమయము** పొందినవై ఉంటున్నాయి. ఆయన అగ్నిస్వరూపుడై, జలస్వరూపుడై, తేజోరూపుడై, రసస్వరూపుడై అన్నిటా వేంచేసి ఉన్నారు.

> **తమేవమ్ విదిత్వా అతి మృత్యుమ్ ఏతి!**
> **న అన్యః పంథా విద్యతే అయనాయ॥**

అట్టి పరబ్రహ్మమును, పరమాత్మను **"నాయందుగల ఈతడే। ఈతనియందే ఈ సమస్తము"।** అని తెలుసుకొన్నప్పుడు మాత్రమే 'మృత్యువు' అను పరిధిని దాటగలం. **అందుకు మరొక మార్గమే లేదు.**

ఆ ఆత్మ భగవానుడే....

**(స) విశ్వకృత్** – ఈ విశ్వమునకు కర్త। (He is the worker of the Universe).

**విశ్వవిత్** – ఇదంతా విశ్వముగా ఎరుగుచున్నది ఆయనయే। (He is the Knower).

**ఆత్మయోనిః** – జీవులందరి ఉత్పత్తి స్థానము కూడా ఆత్మభగవానుడే। (He is the place of begining and place of birth of all).

**జ్ఞః** – కేవల జ్ఞానస్వరూపుడు (The Absolute form of Knowing).

**కాలకాలో:** కాలమును నియమించువారు. కాలమునకే కాలమైనవారు. (The origin and generating point of Factor of Time).

**జ్ఞః సర్వగో :** భూత – వర్తమాన – భవిష్యత్తులను, దేహముయొక్క ఆవల – ఈవల, జాగ్రత్ – స్వప్న సుషుప్తుల చమత్కారమును... అంతా ఎరిగి ఉన్నవారు. సర్వజ్ఞుడు.

(జాగ్రత్‌నకో, స్వప్నమునకో, సుషుప్తికో **పరిమితమైనట్టి ఈ ఎరుక** కలవాడు – (కించిజ్ఞుడు) ఈ జీవుడు)

**గుణీ – సర్వవిద్యః (యః సర్వవిత్):** త్రిగుణములు తనవైనవాడు. ఇహ-పరములు నిర్దుష్టముగా, అన్నీ తెలుసుకుంటూ ఉన్నవాడు. ఈ విశ్వమంతా కూడా అట్టి అమృతానంద స్వరూపుడగు పరమేశ్వరుని ఉనికిచే సర్వే సర్వత్రా నిండినదై ఉన్నది.

ఆయనయే తన జ్ఞానశక్తిచే ఈ భూమండలమంతా సంరక్షణ చేస్తున్నారు. సర్వగతుడు. సర్వముగా విస్తరించి ఉన్నారు. ఈ జగత్తు **అనిత్యము.** (లేక) **కల్పన. అనిత్యమైన సమస్తమునకు నిత్యమగు ఆత్మభగవానుడే 'అంతర్లీనుడు'.**

- ఈ జగత్తు ఎవ్వరియందు ప్రకాశిస్తోందో, అట్టి ఈశ్వరుడు **నిత్యుడు.**
- ఈ జగత్ కల్పనకు కర్త హేతువు **అత్మ భగవానుడే!**

ఆయనకు వేరైన హేతువు ఈ జగత్తుకు లేదు. **పరమాత్మయే సర్వమునకు కారణము। కారణ కారణము కూడా। ఆయనయొక్క వినోద సంకల్ప చమత్కారమే ఇదంతా!**

***ఏ పరమాత్మ అయితే.....,***

- సృష్టికర్తయగు బ్రహ్మదేవుని తనయొక్క సంకల్పంగా సృజియించారో...,
- సృష్టించి, **'తెలియబడునది'** అనురూపంగా వేదములను ప్రసాదించారో....,

ఆయనకు సంబంధించిన ఆత్మబుద్ధి ప్రకాశము కొరకై మనము ముముక్షువులమై **ఆత్మజ్ఞులగు సద్గురువులను, ఆత్మభగవానుని** శరణువేడుచున్నాము.

- నిష్కలంకుడు – నిత్యనిర్మలుడు – నిత్యోదితుడు...,
- కర్మలకు అతీతుడు – సాక్షి అయి ఉండటంచేత నిష్క్రియుడు...,
- పరమశాంత స్వరూపుడు...,
- నిరవద్యుడు (వేరు విభాగములుగా అవనివాడు)...,
- నిరంజనుడు – (దోషములు, వికారములు ఏమాత్రము లేనట్టివాడు)...,
- అమృతరూపమగు పరస్థానమునకు సేతువు (crossing bridge) వంటివాడు....,

అగు ఆ ఆత్మభగవానుని మేము శరణువేడుచున్నాము.

ఏ విధంగా అయితే....**చర్మవత్ ఆకాశమ్ వేష్టయిష్యంతి మానవాః....** మానవుడు తనకు కనబడే ఆకాశమంతా చాపలా చుట్టి వస్త్రమువలె (ఒక పంచెవలె) చుట్టి ధరించటం కుదురుతుందా? కుదరదు కదా!

**తదా శివమ్ అవిజ్ఞాయ దుఃఖస్య అంతో భవిష్యతి?**

ఆ రీతిగా...,

శివస్వరూపుడగు ఆత్మభగవానుని ఎరగనంతవరకు ఆనంద వస్త్రమును ధరించలేడు. ఈ జీవునిపట్ల దుఃఖపరంపరలు తొలగవు.

ఈవిధంగా, విద్వాంసుడు, బ్రహ్మజ్ఞుడు, తత్త్వవేత్త, సద్గురువు అగు శ్రీ శ్వేతాశ్వతర మునీంద్రులవారు ప్రసాదించిన జ్ఞానబోధను వారి శిష్య - ప్రశిష్యులు మననపూర్వకంగా ఈ **శ్వేతాశ్వ తరోపనిషత్**గా సంభాషించుకొన్నారు. సత్సంగ పూర్వకంగా చెప్పుకున్నారు.

ఇందలి విషయము - **చతుర్విధ ఆశ్రమ వాసులకు పరమ పవిత్రమగు ఆత్మతత్త్వ విచారణ** అయి ఉన్నది. ఋషిపుంగవులచే చెప్పబడు సమ్యక్‌వచన రూపము అయి ఉన్నది!

**వేదాంతము :** ఈ తెలియబడేదంతా ఎవరు తెలుసుకుంటున్నారో ఆ తెలుసుకుంటున్న వానిగురించి తెలియజెప్పు శాస్త్రము.

శేతాశ్వతర మునీంద్రుల అంతేవాసులు (శిష్యులు) శ్వేతాశ్వతరోపనిషత్ విషయముల రూపంగా **పరమము, అతి ముఖ్యము, రహస్యము, ఇతఃపూర్వమే మహనీయ ప్రవచితము** - అగు **ఈ వేదాంత శాస్త్రసార విశేషాలు జీవుని తప్పక సముద్ధరించగలవు.**

**శిష్యులు :** అందరము విన్నాము కదా! ఇది జనులకు దుఃఖము తొలగించే ఔషధము కాబట్టి, మనమంతా, ఎవ్వరము ఎక్కడుంటే, అక్కడ జనులకు ఇందలి విశేషాలు మరల మరల వివరణగా బోధిస్తూ మననము చేసెదము గాక! అయితే,

పరమ పవిత్రమైన ఇందలి విషయం మనము క్రోధము - ఆవేశము - లోభము - మాత్సర్యము - ఇటువంటి దుష్టగుణములను ఆశ్రయిస్తూ.... అప్రశాంతంగా ఉండే వారికి చెప్పకూడదు. అట్టి దురహంకారి, ఆవేశపరుడు - స్వీయ శిష్యుడైనా సరే, సొంతకుమారుడైనా సరే - బోధించటానికి అర్హుడు కాదు.

తపస్సు ధ్యానములచే బుద్ధి నిర్మలం చేసుకుంటూ భక్తి - వైరాగ్యములచే మనస్సును పవిత్రం చేసుకొంటున్న వారికి, శుశ్రూష భావము కలవారికి ఈ ఉపనిషత్ విశేషాలు....,

- మముక్షు సాధనములు,
- మోక్ష మార్గము - కూడా అగుచున్నాయి.

**"దుష్ట అభ్యాసములు, దురభిప్రాయము, మదమాత్సర్యములు విరమించాలి"....** అనే నిర్ణయము కలిగి, అందుకు ప్రయత్నశీలురై ఉన్నవారు ఇది వినటానికి తప్పక **అర్హులు.** అవి విరమించే ప్రయత్నమునకు సిద్ధపడనివారు **అనర్హులు.**

**శ్లో॥ యస్య దేవే పరాభక్తిః, యథా దేవే తథా గురౌ**
**తస్య ఏతే కథితా హి అర్థా ప్రకాశంతే మహాత్మనః।**
**ప్రకాశంతే మహాత్మనః ఇతి॥**

## ఎవ్వరైతే....,

**పరాభక్తి :** పరమాత్మపట్ల పరాభక్తి సమన్వితులై ఉంటారో... **(సా తు అస్మిన్ పరమ ప్రేమ రూపా చ),**

**గురుశుశ్రూష :** గురువును భగవత్ స్వరూపముగా పూజిస్తూ, గురుసేవకులై గురుభక్తి కలిగి ఉంటారో..., పరిప్రశ్నలతో గురుముఖతః బ్రహ్మతత్త్వమును అభ్యసించువారై ఉంటారో...,

అట్టి వారంతా ఇందలి పరమార్థమును బోధించబడటానికి అర్హులు. **అట్టివారు సమీపించి అడిగినప్పుడు తప్పక మనము బోధించెదముగాక!**

ఇందలి ఆత్మ తత్త్వ విశేషము వినుచుండగా, అట్టి అధ్యయనుడు **జీవాత్మ పరిమితత్త్వమును, జీవాత్మత్వమును** అధిగమించి **సర్వతత్త్వాత్మత్వమును, మహాత్మత్వము**ను తప్పక సంతరించుకోగలడు.

**"సోఽహమ్" భావమును అర్థం చేసుకోగలడు! 'తత్త్వమ్'తో ఏకము చేసివేయగలడు. స్వాభావికంగా అనుక్షణికముగా తీర్చిదిద్దుకోగలడు.**

కేవలసాక్షి, స్రష్ట, భర్త, భోక్త, జీవ – ఈశ్వర స్వరూపుడు, ఈ విశ్వముయొక్క బాహ్య – అభ్యంతరస్వరూపుడు, సర్వము తానే అయి – సర్వమునకు అప్రమేయముడు అగు **పరమాత్మయే** నా యొక్క సహజరూపము। **అదియే నీవు। తత్‌త్వమ్। అదియే నేను। సోఽహమ్।**

– నా స్వరూపము పరమాత్మకు చెందినదే।

– **"పరమాత్మ యొక్క లీలా – క్రీడా వినోదములోని ఒక విశేషమే నేను – నాకు కనిపిస్తున్న సర్వదేహులు – దేహములు కూడా"** – అను మహాత్మత్వము మన బుద్ధికి ఈ ఉపనిషత్ శ్రవణముచే, అధ్యయనముచే ప్రకాశమానము కాగలదు.

బ్రహ్మతత్త్వోపాసకులము, "సర్వము బ్రహ్మమే అని ప్రకటించు.... **(సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ। అయమాత్మా బ్రహ్మ। జీవో బ్రహ్మేతి నాపర ఇతి। తత్ త్వమ్। త్వమేవాఽహమ్। తత్ త్వమ్ శివేతి। శివాత్ పరతరమ్ నాస్తి। కేవలో శివమితి। విశ్వమ్ విష్ణుః। ఇత్యాది)** వేద మహావాక్యములను బ్రహ్మవాదులమై ఉపాసిస్తున్నాము.

***సద్గురువులగు శ్వేతాశ్వతర మహర్షి బోధించిన ఆత్మస్వరూప జ్ఞానసారము మనకు సర్వదా మార్గదర్శకమగు గాక!***

ఆ బ్రహ్మము – పరమపురుషుని గురించి చెప్పు మహనీయులే బ్రహ్మవాదులు। బ్రాహ్మణులు।

**బ్రహ్మవాదులు :** బ్రహ్మమే కర్మేంద్రియ పంచకము – జ్ఞానేంద్రియ పంచకము – పంచప్రాణములు, జీవుడు – ఈశ్వరుడుగా అను 17 తత్త్వములుగా ప్రదర్శితమగుచున్నట్లుగా సిద్ధాంతీకరించుచున్నారు. ఆత్మభగవానుడు షోడశ కళాస్వరూపుడుగా అభివర్ణించబడుచున్నారు.

| | |
|---|---|
| | (17) సప్త తత్త్వములుగా, (16) యుంజానములుగా, |
| ఏకతత్త్వమ్ । | (21) చమత్కారములుగా। |
| ఏకవర్ణమ్ । | (22) వర్ణ సమ్మేళనముగా। |
| 'శివ' – ద్వి అక్షరే.... | (2) ద్వి–అక్షరుడుగా, (14) చమత్కారములుగా అగుచున్నాడు. |
| ఒకే పరమాత్మ । | (23) స్వభావములుగా। |

ఈవిధంగా (113) పదర్శనములకు ఆవలగా వేంచేసియున్న భగవానునికి నమస్కారము।

**వివిధ ఆత్మ ద్రష్టలచే ప్రవచించబడే ఏకస్వరూపుడగు ఆ పరమాత్మ సర్వలోక వాసులకు శుభములు ప్రసాదించుగాక!**

-----

*ఇతి శ్వేతాశ్వతరోపనిషత్*
*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 28 శ్రీ సరస్వతీరహస్యోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ ప్రతియోగి వినిర్ముక్త బ్రహ్మవిద్యైక గోచరమ్
అఖండ నిర్వికల్పం తత్ రామచంద్రపదం భజే॥



ప్రతియోగి (Opposite Arguments) వినుర్ముక్తము, (అంతరంగములో ఆత్మోన్నత్యము పట్ల అజ్ఞాన వీచికలను తొలగించునది), బ్రహ్మవిద్యచే మాత్రమే దర్శించగలిగేది, అఖండ నిర్వికల్ప స్వభావయుతము - అగు "శ్రీరామ చంద్రపదము"ను ఉపాసిస్తున్నాము.

ఓం మహద్భ్యో ఋషిభ్యోన్నమః।
ఓం భగవంతమ్ శ్రీ అశ్వలాయన ఋషిభ్యో నమో నమో నమో నమః
ఓం శ్రీ భరద్వాజ ఋషిభ్యో నమో నమో నమో నమః
ఓం శ్రీ అత్రి ఋషిభ్యో నమో నమో నమో నమః
ఓం శ్రీ మధుచ్ఛంద ఋషిభ్యో నమో నమో నమో నమః
ఓం శ్రీ ఉచత్థ్య పుత్రో దీర్ఘతమా ఋషిభ్యో నమో నమో నమో నమః
ఓం శ్రీ భార్గవ ఋషిభ్యో నమో నమో నమో నమః
ఓం శ్రీ బృహస్పతి ఋషిభ్యో నమో నమో నమో నమః
ఓం శ్రీ గృత్సమద ఋషిభ్యో నమో నమో నమో నమః

ఓం

సర్వము - అఖండము - నిత్యము అగు 'ఓం'కార సంజ్ఞార్థతత్త్వమునకు నమస్కరిస్తున్నాము.

**01.** ఋషయో హ వై భగవంతమ్
అశ్వలాయనమ్ సంపూజ్య పప్రచ్ఛుః :-
"కేన ఉపాయేన తత్ జ్ఞానమ్,
తత్ పదార్థావభాసకమ్?
యత్ ఉపాసన యా తత్త్వమ్
జానాసి? భగవన్! వద।"

ఒకానొక సందర్భములో కొందరు ఋషులు మహనీయుడగు అశ్వలాయన మహర్షి ఆశ్రమానికి వచ్చారు. ఆ మహర్షిని దర్శించారు. వారిని పూజించారు. ఆ తరువాత, వారంతా సుఖాశీనులై అశ్వలాయన మహర్షిని ఈవిధంగా పరిప్రశ్నించసాగారు.

స్వామీ! మహర్షి వరేణ్యా! అశ్వలాయన భగవన్! మీరు పరతత్త్వమును పూర్ణముగా ఎరిగి పరమానందాస్వాదులై ఉన్నారని లోక ప్రసిద్ధము. ఏ ఉపాయంచేత, దేనిని ఉపాసించినవారై ఈ సర్వ జగత్ పదార్థములుగా ప్రతిబింబిస్తున్న పరతత్త్వమును తెలుసుకొని ఆస్వాదిస్తున్నారు? దయతో మాకు కూడా ఆ ఉపాయమును, ఉపాసనావిధిని బోధించండి.

---

భగవన్ అశ్వలాయనౌవాచ:
సరస్వతీ దశ శ్లోక్యా, స ఋచా
బీజ మిశ్రయా,
స్తుత్వా జప్త్వా పరాం సిద్ధిమ్ అలభం
ముని పుంగవాః!

**భగవంతుడగు అశ్వలాయన ఋషి:** **'ఋషి పుంగవులారా! బీజాక్షరములచే** నిర్మితమై, సంపుటితమై, **ఋక్కులరూపముగా** విరచించబడి, వర్ణితమైయున్న **"సరస్వతీ దశ శ్లోకీ"**ని జపించసాగాను. ఓ మహనీయులారా! అట్టి సరస్వతీ దశశ్లోక స్తుతి-జపములచే కష్ట సాధ్యమని చెప్పబడే **పరాంసిద్ధి** అగు **"పరాత్మాహమ్-పరతత్త్వమ్"**లను ఆస్వాదించ గలుగుచూ ఉన్నాను.

ఋషయ ఊచుః :-
కథం సారస్వత ప్రాప్తిః?
కేన ధ్యానేన, సువ్రత!
మహా సరస్వతీ యేన తుష్టా భగవతీ? వద।

**ఋషి పుంగవులు:** అట్లాగా స్వామీ! హే సువ్రతా! అయితే మరి అటువంటి సరస్వతీ కరుణా కటాక్ష-వీక్షణ రూపమగు **సారస్వత (సా-రస్వత) ప్రాప్తి** ఎట్లా కలుగగలదు? ఏవిధంగా ఏ వ్రతము ఆచరించాలి? ఎవ్వాని గురించి ఎట్లా ధ్యానించాలి? ఏ వ్రత-ధ్యానములచే భగవతియగు ఆ మహా సరస్వతీదేవి తృప్తి పొంది సారస్వతమును ప్రసాదించగలదు? దయతో వివరించండి.

---

సహోవాచ అశ్వలాయనః :-
అస్య శ్రీ "సరస్వతీ దశ శ్లోకీ"
మహామంత్రస్య, అహమ్-అశ్వలాయన ఋషిః।
'అనుష్టుప్' ఛందః।
శ్రీ వాగీశ్వరీ దేవతా। యత్ 'వాక్' ఇతి బీజమ్।
'దేవీం వాచమ్' ఇతి శక్తిః,
'ప్రణో దేవీ' ఇతి కీలకమ్,
వినియోగః తత్ ప్రీత్యర్థే।
శ్రద్ధా మేధా ప్రజ్ఞా ధారణా వాగ్దేవతా
మహాసరస్వతీ ఇతి ఏతైః అంగన్యాసః।

**అశ్వలాయన మహర్షి :** ఋషీశ్వరులారా! వినండి!

అట్టి **"సరస్వతీ దశ శ్లోకీ"** మహా మంత్రమునకు 'నేను' సరస్వతీ భక్తుడగు అశ్వలాయనుడను - ఋషిని-ఈవిధంగా అనుష్టిస్తున్నాను.

**'అనుష్టుప్'** ... ఈ 'దశశ్లోకీ' యొక్క ఛందస్సు.

**ఈ 'సరస్వతీ దశశ్లోకీ'కి**

| | | |
|---|---|---|
| దేవత | → | **శ్రీ వాగీశ్వరి!** |
| వాక్కు | → | **బీజము!** |
| దేవీం వాచమ | → | **ఇతి శక్తి!** |
| ప్రణో దేవీ | → | **ఇతి కీలకము** |

.... ఇవి ఆ దేవి ప్రీతి పొందటానికి వినియోగము చేయుచున్నాను.

**'శ్రద్ధ' - 'మేధ' - 'ప్రజ్ఞ' - 'ధారణ' - 'వాగ్దేవతా' - 'మహాసరస్వతి'** ... ఈ ఆరు నామములతో మొట్టమొదట అంగన్యాసము, కరన్యాసము చేయాలి.

శ్లో॥ నీహార హార ఘనసార సుధాకరాభామ్,
కల్యానదాం కనక చంపక దామ భూషామ్,
ఉత్తుంగ పీన కుచ కుంభ మనోహరాంగీమ్,
వాణీం నమామి మనసా వచసాం విభూత్యై॥

మంచువలె తెల్లటి రతనాల హారము, పచ్చ కర్పూరము, పూర్ణచంద్రులను దీపించుచున్నది, లోక కల్యాణము ప్రసాదించునది, బంగారు చంపకములను అలంకరించుకున్నది, ఉత్తుంగ-పీన కుచములతో మనోహరముగా ప్రకాశించునది అగు జగన్మాత వాణీ దేవికి-నాకు వాక్ విభూతిగా ప్రసాదించుటకొర్కై మనసా-వాచా నమస్కరించు చున్నాను.

---

"ఓం ప్రణో దేవీ"
ఇతి అస్య మంత్రస్య।
భరద్వాజ ఋషిః।
గాయత్రీ ఛందః।
శ్రీ సరస్వతీ దేవతా। ప్రణవేన
బీజః శక్తిః కీలకమ్।
ఇష్టార్థే వినియోగః।
మంత్రేణ న్యాసః।

**"ఓం ప్రణో దేవీ నమః"** అను సరస్వతీ మాతను మననము చేయు మంత్రమునకు -

| | | |
|---|---|---|
| ఋషి | - | **భరద్వాజ మహర్షి** |
| ఛందస్సు | - | **గాయత్రీ** |
| దేవత | - | **శ్రీ సరస్వతీ దేవి** |
| ప్రణవము | - | **బీజాత్మశక్తి కీలకము (ఓం)** |

ఇష్టార్థములు ప్రసాదించుటకై వినియోగమగు గాక!

**"ఓం ప్రణో దేవీ" నమః।"**

**అంగన్యాసము - కర న్యాసము**

(1)శ్లో॥ యా వేదాంతార్థ తత్త్వైక స్వరూపా పరమార్థతః,
నామ-రూపాత్మనా వ్యక్తా, సా మాం పాతు సరస్వతీ॥

ఏ దేవి అయితే పరమార్థముగా చూచినప్పుడు (తెలుసుకొనుచున్నవాని గురించి తెలియజేయు) వేదాంతార్థ-తత్త్వైక స్వరూపిణియో, కేవల 'తత్' స్వరూపిణి, ఏకాత్మరూపిణి అయి కూడా, నామరూపాత్మకంగా కూడా వ్యక్తమగుచున్నదో - **అట్టి సరస్వతీమాత నన్ను రక్షించును గాక!**

ఓం ప్రణోదేవీ సరస్వతీ
వాజేభిః వాజినీవతీ
ధీనామ్ అవిత్ర్యవతు॥

'ఓం' - ప్రణవ స్వరూపిణియగు సరస్వతి - **వాక్ స్వరూపిణి, వాక్కుచే జనించునది కూడా!** అట్టి వాజేభి-వాజినీవతి... అగు సరస్వతీదేవి మాకు ఉత్తమ ధీశక్తిని ప్రసాదించి రక్షించును గాక! మాయొక్క బుద్ధికి రక్షకురాలై ఉండును గాక! సునిశితముగా తీర్చిదిద్దును గాక!

**3. 'ఆ నో దివ' ఇతి మంత్రస్య।**
**అత్రి ఋషిః। 'త్రిష్టుప్' ఛందః।**
**సరస్వతీ దేవతా।**
**'హ్రీం' ఇతి బీజ। శక్తి। కీలకమ్।**
**ఇష్టార్థే వినియోగః।**
**మంత్రేణ న్యాసః।**

**2. యా సాంగ-ఉపాంగ వేదేషు**
**చతుర్ష్వ - ఏకైవ గీయతే,**
**అద్వైతా బ్రహ్మణః శక్తిః**
**సా మాం పాతు సరస్వతీ।**

**'హ్రీం' ఆ నో దివో బృహతః పర్వతాదా**
**సరస్వతీ యజత ఆగంతు (యజ్ఞతా గంతు) యజ్ఞమ్,**
**'హవమ్' దేవీ జుజుషాణా ఘృతాచీ**
**శగ్మాన్ నో వాచమ్**
**ఉశతీ శృణోతు।**

**"ఆనోదివ (సంగీత స్రవంతిగా/గంగా స్రవంతిగా) వాక్ ప్రసాదిని"**

| | | |
|---|---|---|
| ఇతి | - | **మంత్రము** |
| అత్రి | - | **ఋషి** |
| త్రిష్టుప్ | - | **ఛందస్సు** |
| దేవత | - | **సరస్వతి** |
| హ్రీం | - | **బీజశక్తి** |
| శక్తిః | - | **కీలకమ్** |

ఇష్టార్థములు పొందుటకు - వినియోగము.

**"ఓం। ఆనోదివ నమః"** - అంగ-కర న్యాసము చేయవలెను.

ఏ దేవత అయితే 4 వేదముల సాంగ-ఉపాంగములలో **ఏకస్వరూపిణి**గా గానము చేయబడుచున్నదో, స్వస్వరూపమునకు ద్వితీయము కానట్టి పరబ్రహ్మ శక్తియై ప్రతి ఒక్కరిలోను సర్వదా వేంచేసియే ఉన్నదో...., అట్టి సరస్వతీ దేవి మమ్ములను ఎల్లప్పుడు రక్షించుచుండును గాక!

'హ్రీం' - మహత్తరము - సువిశాలము అగు బ్రహ్మలోకమునుండి, పర్వత శిఖరములనుండి ఆ సరస్వతీ దేవి మా ఈ యజ్ఞకార్యము దిగ్విజయము చేయుటకై వేంచేయును గాక!

మా ఈ హవమును (హోమము చేయుచున్న దానిని) స్వీకరించును గాక! ఘృతము (నేయి)ను స్వీకరించి మాకు ఆత్మసుఖము ప్రసాదించును గాక! మాకు 'వాక్‌శక్తి'ని ప్రసాదించుచున్న ఆ సరస్వతీదేవి మా ఈ స్తోత్రములను వాత్సల్యముతో వినుచుండును గాక!

---

**శ్లో॥ 'పావకాన' ఇతి మంత్రస్య।**
**మధుచ్ఛంద ఋషిః**
**గాయత్రీ ఛందః। సరస్వతీ దేవతా**
**'శ్రీం' ఇతి బీజ। శక్తి। కీలకమ్।**
**ఇష్టార్థే వినియోగః। మంత్రేణ న్యాసః।**

**3. యా వర్ణ పద వాక్యార్థ స్వరూపేణైవ వర్తతే।**
**అనాది నిధన అనంతా, సా మాం పాతు సరస్వతీ।**

**'శ్రీం' పావకానః సరస్వతీ।**
**వాజేభిః వాజినీవతీ।**
**యజ్ఞం వష్టు ధియా వసుః॥**

**"పావకాన" - పవిత్రముగా చేయు**

"పావకాన" .... ఇతి మంత్రము

| | | |
|---|---|---|
| మధుచ్ఛందా | - | **ఋషి** |
| గాయత్రీ | - | **ఛందస్సు** |
| సరస్వతీ | - | **దేవత** |
| శ్రీం | - | **ఇతి బీజశక్తి** |
| శక్తిః | - | **కీలకమ్** |

**'ఓం పావకానః నమః' - అంగ - కర న్యాసము.**

ఏ దేవి అయితే వర్ణములకు, పదములకు, వాక్యములకు, వాటివాటి అర్థ స్వరూపిణియై వర్తించుచున్నదో, అనాది నిధన అనంతమో (ఆది - సమాప్తి - అనంతము) కూడా అయి ఉన్నదో, ఆద్యంతములు లేనట్టిదో - అట్టి శ్రీ సరస్వతీ దేవి మమ్ములను రక్షించును గాక!

**"శ్రీం"**-అన్న స్వరూపిణియై, అగ్నిరూపిణి అయి, అన్నమును ప్రసాదించునదై సర్వము పవిత్రముగా తీర్చిదిద్దు ఆ సరస్వతీ దేవి మా యజ్ఞ కార్యక్రమములను, హవిస్సులను స్వీకరించి, మాకు సర్వ సంపదలు ప్రసాదించును గాక! 'వాజినీవతి' అగు ఆ తల్లి మాకు వాజినము (బలము, శౌర్యము) ప్రసాదించును గాక!

"చోదయిత్రీ" ఇతి మంత్రస్య।
మధుచ్ఛంద ఋషిః।
గాయత్రీ ఛందః।
సరస్వతీ దేవతా।
'బ్లూమ్' ఇతి బీజ। శక్తి। కీలకమ్।
మంత్రేణ న్యాసః।

4. అధ్యాత్మమ్, అధిదైవం చ,
దేవానామ్ సమ్యక్ – ఈశ్వరీ।
ప్రత్యగాః తే వదంతీ యా
సా మాం పాతు సరస్వతీ। "బ్లూం"

**"చోదయిత్రీ" - ప్రేరేపించు-వెలిగించు-నడిపించు దేవి**

| | | |
|---|---|---|
| చోదయిత్రీ | - | **మంత్రము** |
| మధుచ్ఛందనుడు | - | **ఋషి** |
| గాయత్రీ | - | **ఛందస్సు** |
| సరస్వతీ | - | **దేవతా** |
| 'బ్లూమ్' | - | **ఇతి బీజశక్తి, కీలకము** |

***"ఓం బ్లూం చోదయిత్రీ నమః" మంత్రముతో అంగన్యాసము - కర న్యాసము***

సర్వ జీవాత్మలకు, సర్వ దేవతలకు ప్రేరణ అయి, పరాత్మ స్వరూపిణియై, సర్వము తనయందు ధరించునదైయున్నది. దేవతలకు కూడా సమ్యక్ స్వరూపిణి, ఈశ్వరి, ప్రత్యగ్ రూపిణి అయి ఉన్నది. **సర్వమునకు వేరై - 'సర్వము' తానే అని చెప్పబడుచున్నది.** ఏ దేవి అయితే సర్వశబ్దములు - ఉచ్ఛారణలు తానే అయి ఉన్నదో, అట్టి సరస్వతి 'బ్లూం' బీజోచ్ఛారణతో ఉపాసించు మమ్ము రక్షించు గాక!

---

4. 'చోదయిత్రీ' సూనృతానామ్
చేతంతీ సుమతీనామ్।
యజ్ఞం దధే సరస్వతీ।
'మహో అర్ణ' – ఇతి మంత్రస్య।
మధుచ్ఛందా ఋషిః।
"గాయత్రీ" ఛందః।
"సరస్వతీ" దేవతా
'సౌః' ఇతి బీజ। శక్తి। కీలకమ్।
ఇష్టార్థే వినియోగః।
మంత్రేణ న్యాసః।

5. అంతర్యామ్యాత్మనా విశ్వం
త్రైలోక్యం యా నియచ్ఛతి,
రుద్ర–ఆదిత్యాది రూపస్థా
యస్యామ్ ఆవేశ్యతాం పునః,
ధ్యాయంతి సర్వరూప ఏకా
సా మాం పాతు సరస్వతీ।

సూనృత-సత్యవాక్కును ప్రేరేపించునది, ఉత్తమ సుమతి (బుద్ధి)ని కలిగించునది అగు సరస్వతీ దేవియే ఈ జగత్ యజ్ఞధారిణి! యజ్ఞ పురుష స్వరూపిణి. ఆ తల్లి మా ప్రజ్ఞలను ముందుకు నడుపును గాక!

**'మహో అర్ణ' - తేజో స్వరూపి (జీవులందరు తరంగములు - ఆ దేవి సముద్రము). (అర్ణము = జలము, ప్రవాహము).**

| | | |
|---|---|---|
| మహో అర్ణ | - | ఇతి మంత్రము |
| మధుచ్ఛందుడు | - | ఋషి |
| గాయత్రీ | - | ఛందస్సు |
| సరస్వతీ | - | దేవత |

**సౌః**

**'సౌః'** - ఇతి బీజశక్తి కీలకము, బీజాక్షర నాద శబ్దము ఇష్టార్థములు పొందుటకై వినియోగము.

***'ఓం సౌః మహో అర్ణ నమః' మంత్రముతో అంగన్యాసము - కర న్యాసము***

ఏ దేవదేవి అయితే ఈ విశ్వమంతటికీ 'అంతర్యామి' అయి త్రిలోకములను నియమించుచున్నదో, రుద్రుడు-ఆదిత్యుడు మొదలుగా గల దేవతలందరూ ఏ దేవియొక్క బాహ్యావిభవముగా ఆవేశించి ఉన్నారో, వారంతా ఏదేవిని దర్శిస్తూ మరల-మరల ధ్యానిస్తున్నారో, సర్వస్వరూపిణిగా ఉపాసిస్తూ- సేవిస్తున్నారో...., తరంగములన్నిటిలో జలమువలె ఏ దేవి జీవులందరి అంతరహృదయ నివాసియో, - అట్టి శ్రీ సరస్వతీదేవి మమ్ములను (అజ్ఞాన మార్గముల నుండి) రక్షించును గాక!

---

'సౌః' – మహో అర్ణః సరస్వతీ।
ప్రచేతయతి కేతునా।
ధియో విశ్వా విరాజతి।

**సౌః**

**"సౌః"** బీజశబ్దముగా మాచే ఉపాసించబడుచున్న శ్రీ సరస్వతీదేవి బుద్ధి స్వరూపిణియై, సముద్రంలో జలంవలె విశ్వమంతా నిండి ఉండి, సర్వజీవుల బుద్ధులందు విరాజిల్లుచున్నది. సంకల్ప-వికల్పములను సర్వత్రా చేయుచున్నది. సమస్తమునకు కారణ కారణము. ఈ సమస్త విశ్వముగా విరాజిల్లుచున్న ఆ సరస్వతీదేవికి 'సౌ' శబ్దార్థపూర్వక నమస్కారము.

**"ఐం।"**

**<u>'చత్వారి వాక్'</u> ఇతి మంత్రస్య।**
**ఉచథ్య పుత్రో, దీర్ఘతమా ఋషిః।**
**త్రిష్టుప్ ఛందః। సరస్వతీ దేవతా।**
**'ఐం' - ఇతి బీజ। శక్తి। కీలకమ్।**
**మంత్రేణ న్యాసః**

**6. యా ప్రత్యక్ - దృష్టిభిః జీవైః**
**వ్యజ్యమాన - అనుభూయతే,**
**వ్యాపినీ జ్ఞప్తిరూప ఏకా, సా మాం పాతు సరస్వతీ॥**

**"ఐం।"**

**చత్వారి వాక్ (అనుభూతి, వ్యాపిని, జ్ఞప్తి, ఏక రూపిణి)**

**(సోఽహమ్। తత్త్వమ్। జీవో బ్రహ్మేతి నాపరః। సర్వం ఖల్విదం బ్రహ్మ॥)**

| | | |
|---|---|---|
| 'చత్వారి వాక్' | - | **ఇతి మంత్రము** |
| ఉచథ్య పుత్రుడగు దీర్ఘతముడు | - | **ఋషి** |
| త్రిష్టుప్ | - | **ఛందస్సు** |
| సరస్వతీ | - | **దేవత** |

**'ఐం' ఇతి బీజశక్తి। కీలకము।**

***'ఓం 'ఐం' చత్వారివాక్ నమః' మంత్రముతో అంగన్యాసము - కరన్యాసము.***

ఏ దేవాది దేవి 'ప్రత్యక్ దృష్టి'చే సమస్త జీవులుగా వ్యావహారికమగుచున్నట్లు జీవబుద్ధికి అనుభూత మగుచున్నదో, జగత్ వ్యావహారికమై ఉన్నదో, సర్వవ్యాపిని, జ్ఞప్తిరూపిణి, ఏకస్వరూపిణి కూడా అయి ఉన్నదో, అట్టి శ్రీ సరస్వతీదేవి మమ్ములను సదా రక్షించును గాక!

---

**'ఐం' - చత్వారి వాక్ - పరిమితా పదాని**
**తాని విదుః బ్రాహ్మణా యే మనీషిణః**
**గుహా త్రీణి నిహితా నేంగయంతి**
**తురీయం వాచో మనుష్యా వదంతి।**

**<u>'యత్ వాక్ వదంతీ'</u> - ఇతి మంత్రస్య।**
**భార్గవ ఋషిః। త్రిష్టుప్ ఛందః। సరస్వతీ దేవతా।**
**'క్లీం' ఇతి బీజ। శక్తిః। కీలకం। మంత్రేణ న్యాసః॥**

**7. నామ-జాత్యాదిభిః భేదైః అష్టధా యా వికల్పితా**
**నిర్వికల్పాత్మనా వ్యక్తా సా మాం పాతు సరస్వతీ।**

**"ఐం" (పర-పశ్యంతి-మధ్యమ-వైఖరి)**

'ఐం' - బీజాక్షర శబ్దము - **పర-పశ్యంతి-మధ్యమ-వైఖరి** అను నాలుగు రీతులైన ప్రదర్శితములగుచున్నది - అని బుద్ధిమంతులగు బ్రహ్మజ్ఞులు.... ఎరిగియే ఉంటున్నారు. 'పర-పశ్యంతి-మధ్యమ' ... అనునవి హృదయ గుహలో దాగి ఉంటున్నాయి. అందుకే బుద్ధిమంతులు మాత్రమే దర్శిస్తున్నారు. ('వైఖరీ'-అనబడు)నాలుగవది మానవులు వాక్కుగా పలుకుచున్నారు.

**యత్‌వాగ్వదంతీ**

| | | |
|---|---|---|
| <u>"యత్ వాక్ వదంతీ"</u> | - | **ఇతి మంత్రము** |
| భార్గవ మునీశ్వరుడు | - | **ఋషి** |
| త్రిష్టుప్ | - | **ఛందస్సు** |
| సరస్వతీ | - | **దేవతా** |

**'క్లీం' ... బీజ శక్తి కీలకము।**

***'ఓం 'క్లీం' యత్ వాగ్వదంతీ నమః'..... అంగన్యాస-కరన్యాసము.***

ఏ దేవదేవి అయితే - జన్మము- నామము - రూపము - జాతి - కులము - గోత్రము - ఆహారము - ప్రదేశముల సంబంధమైనట్టి ఎనిమిది విధములైన కల్పిత భేదములచే (అజ్ఞాన దృష్టిచే) చూడబడుచున్నదో, స్వతఃగా అవ్యక్తమగు నిర్వికల్పాత్మగానే సర్వదా సర్వత్రా వేంచేసినదై ఉన్నదో..., ఆ సరస్వతీ దేవి మమ్ములను రక్షించును గాక!

---

**'క్లీం' - యత్ వాక్ వదంతి అవిచేతనాని**
**రాష్ట్రీ, దేవానాం నిషసాద మంద్రా**
**చతస్ర ఊర్జం (య) దుదుహే పయాంసి**
**క్వస్విత్ అస్యాః పరమం జగామ॥**

**"క్లీం"**

ఏ దేవదేవి యొక్క మహిమచే అచేతనము, జడము అగు కంఠపు ప్రేగులు - వాయువు మొదలైనవి దేహ విభాగములలో దివ్య దేవతాతత్త్వములు కలసి గొప్ప <u>నిషాద-మంద్ర, పర-పస్యంతి-మధ్యమ-వైఖరీలతో</u> కూడిన శబ్ద సౌందర్యమంతా ఈ పాంచభౌతిక జడదేహము నుండి వెలువడుచున్నదో, అట్టి సరస్వతీదేవి ఎక్కడో బ్రహ్మలోకంలోనే ఉన్నదా? కాదు, అంతటా ఉన్నది. నిండు కుండలోని నీరువలె ఈ దేహమంతా, ఈ దృశ్యమంతా నిండి ఉన్నది. ఆ తల్లి ఉపాసన చేతనే 'పరము'లో ప్రవేశించగలము.

5. "దేవీం వాచమ్" ఇతి మంత్రస్య।
భార్గవ ఋషిః। త్రిష్టుప్ ఛందః।
సరస్వతీ దేవతా।
"సౌః" ఇతి బీజ। శక్తి। కీలకమ్।
మంత్రేణ న్యాసః॥

**"దేవీవాచమ్"**

**ఈ దృశ్య జగత్‌రూప బ్రహ్మాండాలన్నీ దేవీవాక్ వైభవ స్వరూపమే!**

| | | |
|---|---|---|
| దేవీ వాచమ్ | - | **ఇతి మంత్రము** |
| భార్గవముని | - | **ఋషి** |
| త్రిష్టుప్ | - | **ఛందస్సు** |
| సరస్వతీ | - | **దేవతా** |

**సౌః - బీజము, శక్తి, కీలకము।**

***'ఓం। సౌః। దేవీ వాచమ్ నమః' మంత్రము యొక్క అంగన్యాస - కరన్యాసము.***

8. వ్యక్త అవ్యక్త గిరః సర్వే
వేద ఆద్యా వ్యాహరంతి యాం
సర్వకామ దుఘా ధేనుః
సా మాం పాతు సరస్వతీ॥

వేదములన్నీ కూడా వ్యక్త-అవ్యక్త వాక్ - అర్థ - ఉపాసన రూపములుగా ఏ దేవి గురించి ఎలుగెత్తి గానము చేయుచున్నవో, ఏ దేవియొక్క ఉపాసన కామధేనువై మాకు సకలము ప్రసాదించగలదో, అట్టి సరస్వతి మమ్ములను సదా రక్షించును గాక! 'తెలివి' మాకు మొదట కలుగటానికి ఆ దేవియే చైతన్య రూపిణి।

---

"సౌః" - దేవీం వాచ మజనయంత దేవాః
తామ్ విశ్వరూపాః పశవో వదంతి।
సా నో మంద్రేషమ్ ఊర్జం
దుహానా ధేనుః వాక్
అస్మాన్ ఉపసుష్టుతైతు॥

**సౌః**

**"సౌః"**। దేవతలు వాక్ యజ్ఞ గుండము నుండి వాగ్దేవతను జనింప జేయగా ఆ వాక్‌దేవీ వైభవ శబ్దములను పశువులవంటి విశ్వములోని జీవులు పలుకుచుండటము జరుగుతోంది.
మంత్రము - అన్నము - బలము తననుండి పాలవలె ప్రసాదించు ఆ వాక్‌దేవతా ధేనువు మమ్మ చేరి, వాత్సల్యముగా ఆవుదూడలవంటి మమ్ములను స్వీకరించును గాక!

---

'ఉతత్వ' ఇతి మంత్రస్య
బృహస్పతి ఋషిః। త్రిష్టుప్ ఛందః।
సరస్వతీ దేవతా।
'సం' ఇతి బీజ। శక్తి। కీలకమ్। మంత్రేణ న్యాసః

**ఉతత్వ-ఉద్ధరించునది, బంధము తొలగించునది!**

| | | |
|---|---|---|
| 'ఉతత్వ' | - | ఇతి మంత్రము |
| బృహస్పతి | - | **ఋషి** |
| త్రిష్టుప్ | - | **ఛందస్సు** |
| శ్రీ సరస్వతీ | - | **దేవత** |

**"సం"**

**'సం' .... బీజ శక్తి కీలకము**

***'ఓం। 'సం'। ఉతత్వ నమః' మంత్రముతో అంగన్యాసము - కరన్యాసము***

9. యాం విదిత్వ అఖిలం బంధం
నిర్మథ్య అఖిల వర్త్మనా
యోగీ యాతి పరం స్థానం
సా మాం పాతు సరస్వతీ॥

ఏ దేవీతత్త్వ రహస్యమును తెలుసుకొన్నవారై పరమయోగులు సకలమార్గముల రహస్యమును ఎరిగి, సర్వ సంసార శృంఖలములను, బంధములను త్రెంచి వేసుకొని, **'పరము'** అగు స్థానమును సముపార్జించుకొనుచున్నారో, అట్టి సరస్వతీదేవి మమ్ములను రక్షించును గాక!

---

'సం' - ఉత త్వః పశ్యన్ నద్ర దర్శ
వాచమ్। ఉత త్వః శృణ్వన్
న శృణోతి ఏనామ్।
ఉతోత్వస్మై (ఉతో తవత్ అస్మై) తన్వా 'అం' విసస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః।

**"సం" "ఉత త్వః"**

ఏ దేవీతత్త్వమైతే చూస్తూ కూడా చూడలేకపోతున్నామో, - 'వాక్కు'గా వింటూ కూడా వినని వారమై ఉండిపోతున్నామో,
ఆ దేవి-దయతో మాయొక్క ఈఈ 'ప్రార్థన' - 'ఉపాసన'లను ప్రేమగా స్వీకరించినదై తన తత్త్వస్వరూపమును సంవిశదపరచును గాక! పతి ఇంటి ఇల్లాలికి విశేషములను విశదపరచు రీతిగా, మాకు తన బ్రహ్మతత్త్వమును సంతోషముగా సుస్పష్టపరచును గాక! పిల్లలకు తల్లి సరిచేసి సర్ది చెప్పు రీతిగా మాకు బోధించును గాక!

6. **'అంబితమ' ఇతి మంత్రస్య। గృత్స్నమద ఋషిః।**
**అనుష్టుప్ ఛందః। సరస్వతీ దేవతా ।**
**'ఐం' ఇతి బీజ। శక్తి। కీలకమ్। మంత్రేణ న్యాసః।**

**అంబితమ**

| | | |
|---|---|---|
| 'అంబితమ' | - | **ఇతి మంత్రము** |
| గృత్స్నమదుడు | - | **ఋషి** |
| అనుష్టుప్ | - | **ఛందస్సు** |
| సరస్వతీ | - | **దేవతా** |

**'ఐం' - ఇతి బీజ శక్తి కీలకము.**

***'ఓం। 'ఐం' అంబితమ నమః'-మంత్రముతో అంగన్యాసము- కరన్యాసము***

**10. నామరూపాత్మకమ్ సర్వమ్**
**యస్యాం ఆవేశ్యతాం పునః**
**ధ్యాయంతి బ్రహ్మరూప ఏకా**
**సా మాం పాతు సరస్వతీ।**

నామ-రూపాత్మకమైన ఇదంతా కూడా ఏ దేవాది దేవి చేత సాకార రూపముగా ఆదేశించబడినదై ఉన్నదో, తిరిగి ఏ దేవిని సదా ఇదంతా ధ్యానించుచున్నదో, అట్టి **అఖండ-ఏకైక బ్రహ్మరూపిణి**యగు శ్రీ సరస్వతీదేవి మమ్ములను రక్షించును గాక!

**'ఐం' - అంబితమే, నదీతమే**
**దేవితమే సరస్వతి।**
**అప్రశస్తా ఇవ స్మసి**
**ప్రశస్తిమ్ అంబ న స్కృధి।**

**శ్లో॥ చతుర్ముఖ ముఖాంభోజ వన హంసవధూః, మమ-**
**మానసే రమతాం నిత్యమ్ సర్వశుక్లా సరస్వతీ॥**

ఓ జగదంబా! అంబితమే! నదీ దేవతా స్వరూపిణీ! దేవీ! శ్రీ సరస్వతీ జగన్మాతా! అంబా! మాయందు అప్రశస్తమును (సంకుచితత్వమును) పోగొట్టుము. ప్రశస్తత్వమును ఆవిష్కరించుటకై మీకు నమస్కరిస్తున్నామమ్మా! చతుర్ముఖుని (బ్రహ్మదేవుని) ముఖము అనే అంభోజవనములో (సరస్సులో) విహరించు ఓ పరమహంసా! హంసరూపిణీ! తెల్లటి ప్రకాశముతో సర్వశుక్లవై, **నా మానస సరోవరమున సదా రమించవలసినదిగా నీకు విజ్ఞాపనములు చేస్తున్నామమ్మా!** అట్టి సరస్వతీదేవి కరుణను ప్రసరించును గాక!

---

**శ్లో॥ నమస్తే శారదే దేవి। కాశ్మీర పుర వాసిని।**
**త్వామ్ అహమ్ ప్రార్థయే నిత్యమ్, విద్యా దానం చ దేహి మే।**

ఓ శారదాదేవీ! కాశ్మీరపురవాసినీ! నీకు నమస్కారమమ్మా! నాకు విద్యను బిక్షగా ఇచ్చుటకొరకై నిన్ను నిత్యమూ ప్రార్థన చేయుచున్నాను.

**అక్షసూత్ర అంకుశ ధరా। పాశ పుస్తక ధారణీ।**
**ముక్తాహార సమాయుక్తా। వాచి తిష్ఠతు మే సదా।**

జపమాల చేత ధరించిన మాతా! అంకుశమును ధరించినదానా! పాశ-పుస్తకములు ధరించిన జననీ! ముత్యాలహారమును అలంకరించు కొన్న తల్లీ! నీవు ఎల్లప్పుడు నా వాక్కునందు ఉండవలసినదిగా ప్రార్థన.

**కంబుకంఠీసు తామ్రోష్ఠీ। సర్వాభరణ భూషితా।**
**మహా సరస్వతీ దేవీ। జిహ్వాగ్రే సన్నివేశ్యతామ్।**

నెమలి వంటి కంఠము కలిగి, ఎర్రని పెదిమలతో, సర్వ ఆభరణ భూషిత అయి ఉన్నట్టి శ్రీ మహా సరస్వతీదేవి - నా నాలుక చివర ఎల్లప్పుడు సన్నివేశ్యమై, నెలకొని ఉండు గాక!

**యా శ్రద్ధా ధారణా మేధా వాగ్దేవీ విధి వల్లభా।**
**భక్త జిహ్వాగ్ర సదనా। శమాది గుణదాయినీ।**

ఆ దేవి శ్రద్ధా - ధారణా - మేధాస్వరూపిణి। వాగ్దేవి। సృష్టికర్తయగు బ్రహ్మ దేవుని ప్రియ వల్లభి! భక్తులంటే ఆ సరస్వతీదేవికి ఎంత ఇష్టమో। భక్తులకు శమ-దమాది ఉత్తమగుణములను ప్రసాదిస్తూ వారి జిహ్వాకు చివర గృహము కలిగి ఉంటున్నది కదా।

**నమామి యామినీనాథ రేఖాలంకృత కుంతలామ్।**
**భవానీమ్ భవ సంతాప నిర్వాపణ సుధా నదీమ్।**

చంద్ర రేఖలచే అలంకృతమైన కుంతలములు కలది, భవాని, భవ (సంసార) సంతాపములన్నీ కడిగి హృదయమును మధురము చేయు అమృత నదీ స్వరూపిణియగు సరస్వతీ దేవికి ఇవే మా నమస్కృతులు!

**యః కవిత్వం నిరాతంకమ్ భుక్తీ-ముక్తీ చ వాంఛతి,**
**సో అభ్యర్చ్య ఏనాం దశశ్లోక్యా నిత్యం స్తౌతి సరస్వతీమ్।**
**తస్యైవమ్ స్తువతో నిత్యమ్ సమభ్యర్చ్య సరస్వతీమ్।**

ఎవ్వరైతే నిరాతంకము అగు కవిత్వము, భుక్తి, ముక్తి కోరుకుంటారో, అట్టివారు ఎవ్వరైనా సరే, సరస్వతీ దేవిని దశశ్లోకములతో నిత్యము స్తుతించుటచే... తప్పక ఇహమందు సమృద్ధి, పరమందు ముక్తి పొందగలరు. వారు నిత్యము **సరస్వతీ సమర్భ్యర్చన చే ఆ సరస్వతీదేవి అనుగ్రహము** ను అతిత్వరగా పొందుచున్నారు.

**భక్తి శ్రద్ధ అభియుక్తస్య, షాణ్మాసాత్ ప్రత్యయో భవేత్,**
**తతః ప్రవర్తతే వాణీ స్వేచ్ఛయా లలితాక్షరా।**
**గద్య పద్యాత్మకైః శబ్దైః అప్రమేయైః వివక్షితైః**
**అశ్రుతో బుధ్యతే గ్రంథః, ప్రాయః సారస్వతః కవిః॥**

ఎవ్వరైతే జగజ్జనని - జగత్ స్వరూపిణియగు శ్రీ సరస్వతీదేవిని '6' నెలలు శ్రద్ధగా ఈ దశశ్లోకీ పూర్వకంగా ఉపాసిస్తారో, వారిలో ఉత్తమమైన **ఆత్మ విశ్వాసము** రూపుదిద్దుకోగలదు. వారియందు లలితాక్షరములతో కూడిన వాణి స్వేచ్ఛాశబ్ద ప్రదర్శిని అయి ఉండగలదు. వారిలో గద్య-పద్య సాహిత్యము, అప్రమేయము అగు పరమాత్మ సంబంధమైన **పరిభాష** వివక్షితమై (బోధ) రూపమై ప్రకాశించగలదు. వారికి **ఇప్పటి వరకు చదువని గ్రంథములలోని విశేషములు** కూడా కరతలామలకమై, శ్రేష్ఠులై, తత్త్వజ్ఞులు కాగలరు. చిన్నతనంలోనే **సారస్వత కవి** కాగలరు.

---

**7.** <u>**ఇత్యేవం నిశ్చయం విప్రాః,**</u>
<u>**సాహోవాచ సరస్వతీ**</u>**:-**
**"ఆత్మవిద్యా మయా లబ్ధా బ్రహ్మణైవ సనాతనీ।**
**బ్రహ్మత్వం మే సదా నిత్యమ్ సచ్చిదానంద రూపతః।**
**ప్రకృతిత్వం తతః సృష్టం సత్త్వాది గుణ సామ్యతః।**
**సత్యేవ ఆభాతి చిచ్ఛాయా దర్పణే ప్రతిబింబవత్।**
**తేన చిత్-ప్రతిబింబేన త్రివిధా భాతి సా పునః।**
**ప్రకృతిః అవచ్ఛిన్నతయా పురుషత్వం పునశ్చ మే।**

ఇటువంటి నిశ్చయమును జగన్మాతయగు సరస్వతీదేవి విని తనకు తానే ప్రకటించుటకై ప్రత్యక్షమైనది.

**శ్రీ సరస్వతీదేవి:** నాచే ఆత్మ విద్యను పొందినవాడై ఈ జీవుడు సనాతనమగు బ్రహ్మమును సిద్ధించుకొని **"బ్రాహ్మణుడు"** కాగలడు. వ్యష్టి - సమిష్టులను అధిగమించగలడు. (సనాతనము = జన్మ-కర్మల కంటే మునుముందే వేంచేసి యున్న సత్-స్వస్థి స్థితి।)

**చిత్-ఆనంద రూపమగు పరబ్రహ్మమే నా అనునిత్య సత్య స్వరూపమై ఉన్నది.**

**నాచేతనే సత్వ-రజో-తమో గుణ సామ్యత్వముల రూపమగు ప్రకృతి సృష్టించబడుచున్నది.**

దర్పణములో వాస్తవానికి దృశ్యము అనునది లేకపోయినప్పటికీ **ప్రతిబింబ న్యాయము**చే అగుపిస్తున్నట్లుగా, సత్యమగు నేనే **చిత్-ఛాయా రూపమగు ప్రకృతిగా** కనిపిస్తున్నది నేనే। **"త్రిగుణ రూప ప్రకృతి"** రూపినై త్రిలోకముల సృష్టిగా **నాకు నేనై** భాసిస్తున్నాను. ప్రకృతి అవిచ్ఛిన్నమై ఉండగానే **ప్రకృతి-పురుషులుగా** కూడా తిరిగి అగుచున్నాను. **నా నుండి వేరే అవకుండానే ఆ వేరైనవన్నీ నేనే అగుచున్నాను!** నేను సర్వదా అవిచ్ఛిన్న స్వరూపిణినే।

---

**శుద్ధ సత్త్వ ప్రధానాయాం మాయాయాం బింబితో హి అజః**
**సత్త్వప్రధానా ప్రకృతిః మాయేతి ప్రతిపాద్యతే।**
**సా మాయా స్వ-వశ ఉపాధి సర్వజ్ఞస్య ఈశ్వరస్య హి।**
**వశ్య <u>మాయత్వం ఏకత్వం సర్వజ్ఞత్వం</u> చ తస్య తు।**
**సాత్వికత్వాత్ సమష్టిత్వాత్ సాక్షిత్వాత్ జగతామ్ అపి।**
**జగత్ కర్తుమ్ - అకర్తుం వా చ, అన్యథా కర్తుమ్ ఈశతే**
**యః స '<u>ఈశ్వర</u>' ఇత్యుక్తః**
**'సర్వజ్ఞత్వ' ఆదిభిః గుణైః।**

నాయొక్క శుద్ధ సత్వ ప్రధానమగు మాయ (నవలా రచయితయొక్క - రచన చేయాలి అనే గుణములకు ముందున్న భావన వంటిది) నుండి 'సృష్టికర్త' అగు 'అజుడు' - జనించుచున్నాడు. సత్వ ప్రధానమగు నా ప్రకృతియే 'మాయ' ... అని వేదాంత-తత్త్వ శాస్త్రముచే ప్రతిపాదించ బడుతోంది.

(జీవునకు ఈ దేహము ఉపాధి అయిన తీరుగా) 'సర్వజ్ఞుడు' అయి ఉండటం చేత ఈశ్వరునికి **'మాయ'** స్వ-వశములోని ఉపాధి. అట్టి ఈశ్వరుడు '3' లక్షణములు కలిగి ఉంటున్నాడు. (1) వశ్య-మాయత్వము (2) ఏకత్వము (3) సర్వజ్ఞత్వము.

ఈశ్వరుడు (ఒక నవలా రచయిత నవలా రచనకు ముందుగా ఉన్న ఊహా శక్తి రూపమువలె) శుద్ధ సాత్వికుడు అయి ఉన్నాడు. ఆతడు (1) శుద్ధ సాత్వికుడు (2) సమష్టి రూపుడు (3) జగత్సాక్షి కూడా! ఈ మూడు విలక్షణ-లక్షణ విశేషముల కారణంగా.... అట్టి ఈశ్వరుడు (1) జగత్తుకు కర్త కాలగడు (2) అకర్త కాగలడు. (3) జగత్తును మరొక రీతిగా చేసివేయగలడు... కూడా! అయితే ఈ మూడూ కూడా నేనే!

జీవుడేమో (నాటకములోని ఒకపాత్ర వలె) కించిజ్ఞుడు. ఇక ఈశ్వరుడో, కళాకారునివలె **సర్వజ్ఞుడు-సమిష్టి భావకుడు - సాక్షి కూడా!** కాబట్టే **ఈశ్వరుడు** అనబడుచున్నాడు.

**శక్తి ద్వయం హి మాయా యా 'విక్షేప', 'ఆవృతి' రూపకమ్,**
**విక్షేప శక్తిః లింగాది, బ్రహ్మాండాంతమ్ జగత్ సృజేత్।**
**అంతర దృక్-దృశ్య యోః భేదం। బహిశ్చ బ్రహ్మ సర్గయోః,**
**ఆవృణోతి అపరాశక్తిః సా సంసారస్య కారణమ్।**
**సాక్షిణః పురతో భాతమ్ లింగ దేహేన సంయుతమ్।**

ఇక మాయ గురించి చెప్పుకుందాము. అద్దానికి '2' శక్తులున్నాయి. (1) విక్షేప శక్తి. (2) ఆవృతి శక్తి. (ఆవరించు/ఆవరణ శక్తి).

**మాయయొక్క విక్షేప శక్తి** - (ఒక నవలా రచయిత నవలలో అనేక వేరు వేరైన స్వభావములు గల పాత్రలను కల్పించు విధముగా)... లింగ భేదములతో కూడిన అనేక జగత్ రూప బ్రహ్మాండములను మాయ సృజించగలదు.

**మాయయొక్క ఆవరణ ఆకర్షణ శక్తి : లోపల** దృక్-దృశ్యముల భేదమును, **వెలుపల**- సృష్టికర్తయగు బ్రహ్మ - సృష్టిల భేదమును ఏది ఆవరించి ఉన్నదో..., అది **"ఆవరణ శక్తి"**. అదియే **'అపరాశక్తి'** అని కూడా చెప్పబడుచున్నది. అట్టి ఆవరణ (లేక) అపరాశక్తియే **"సంసారము"** అను దానికంతటికీ కారణమైయున్నది. ఆ **ఆవరణ - అపరాశక్తి లింగ (గుణ) దేహముతో కూడినదై, సాక్షియొక్క సమక్షములోనే భాసిస్తోంది.**

---

**'చితిః-ఛాయా' సమావేశాత్ జీవస్స్యాత్ వ్యావహారికః।**
**అస్య జీవత్వమ్ ఆరోపాత్ సాక్షిణ్యపి అవభాసతే।**
**ఆవృతౌతు వినష్టాయామ్ భేదే భాతే ప్రయాతి తత్।**
**తథా సర్గ - బ్రహ్మణోశ్చ భేదమ్ ఆవృత్య తిష్ఠతి।**
**యా శక్తిః తత్ వశాత్ బ్రహ్మ వికృతత్వేన భాసతే।**
**అత్రాపి ఆవృతి నాశేన విభాతి బ్రహ్మ-సర్గయోః।**
**భేదః తయో వికారస్స్యాత్ సర్గే - న బ్రహ్మణి క్వచిత్॥**

**జీవుడు** = చిత్ + ఛాయ (సహజ + సందర్భ, బింబము + ప్రతిబింబము)...ల సమావేశముచేత **'జీవుడు'** అని వ్యవహరించబడుచున్నాడు.

జీవుడు (లేక) జీవత్వములయొక్క చిత్-ఛాయా ఆరోపనచేత- కేవలసాక్షియే అవభాసించుచున్నాడు. "దర్పణంలో ముఖం చూస్తూ ఈ దర్పణంలో నా ముఖము ఉన్నది" - అనుకొనటమే మాయ.

ఆవృతత్వమును వినష్టమయిందా (తొలగిందా) అప్పుడు చిత్-ఛాయ భేదము తొలగుచున్నది.

చితి-ఛాయల భేదమువంటిదే సర్గము (సృష్టి) - సృష్టికర్త ((బ్రహ్మ)ల భేదము కూడా! ఆవరణ దోషము చేతనే భేదము ఉంటోంది.

వాస్తవానికి బ్రహ్మము-సర్గము (సృష్టి) అని వేరుగా రెండు లేవు. **బ్రహ్మమే సృష్టి. సృష్టియే బ్రహ్మము.** తత్ బ్రహ్మము యొక్క స్వీయ వికృతి రూపమై ఏ శక్తి భాసిస్తోందో, అది **బ్రహ్మమే.** అట్టి శక్తియొక్క అవగాహనకు సంబంధించిన ఆవృతి నాశనముచే బ్రహ్మ - సర్గ భేదము తొలగిపోయి సర్గ (సంసార) వికారములు లేనివిగా అగుచున్నాయి. **అనగా ఏకమగు బ్రహ్మమే శేషించినదై సృష్టి భేదమే లేకుంటోంది.** ఏ క్షణంలోను **బ్రహ్మము-శక్తి-అనబడు రెండు లేవు. ఏకమే ఉన్నది. దృష్టియే సృష్టి. దృష్టియొక్క సర్వసమత్వమే ఆత్మభావనయొక్క ఆవిష్కరణ.**

---

**8.** **'అస్తి' 'భాతి' 'ప్రియం' 'రూపమ్' 'నామ' చేత్ అంశ -పంచకమ్।**
**ఆద్య త్రయమ్ (అస్తి-భాతి-ప్రియం) బ్రహ్మరూపమ్।**
**జగద్రూపమ్ తతో ద్వయమ్ (రూపమ్-నామమ్)।**
**ఉపేక్ష్య నామరూపే ద్వే**
**సత్-చిత్-ఆనంద తత్పరః**
**సమాధిం సర్వదా కుర్యాత్**
**హృదయేవ, అథవా బహిః॥**

ఇక్కడ '5' మాత్రమే ఉన్నాయి. 1. ఆస్తి (ఉనికి) 2. భాతి ((ప్రకాశకములు, తెలియబడటటం, తెలియుట) 3. ప్రియము (ఆనందించటము) 4. నామము 5. రూపము. ఈ ఐదు కూడా బ్రహ్మముయొక్క అంశలు. (అంశ పంచకము). ఇందులో **అస్తి-భాసి-ప్రియము** - ఇవి మూడు నిశ్చలమగు బ్రహ్మము యొక్క 'అంశలు'. **నామము-రూపము** - ఈ రెండూ మార్పు చేర్పులు చెందు 'జగత్తు' (జనించుచూ, గతించుచూ మధ్యలో కనిపించే చమత్కారము) యొక్క అంశలు. చంచల బ్రహ్మరూపములు. ఓ బిడ్డలారా! మీరు మీ అంతరమునందు, బాహ్య దృశ్య జగత్తునందు కూడా,

- నామ-రూప అంశలను ఉపేక్షిస్తూ
- సత్-చిత్-ఆనంద అంశలను మాత్రమే ఆశ్రయిస్తూ :-

ఎల్లప్పుడూ అట్టి సమాధియందు సర్వదా నిష్ఠా తత్పరులై ఉండండి.
**సత్-చిత్-ఆనంద అంశలను సర్వదా ఆశ్రయిస్తూ నామ-రూప అంశలను సందర్భ పరిమితములుగాను, సందర్భము లేకుంటే అవీ లేనివిగాను... దర్శించుచుండటమే సమాధి అభ్యాసము.**
అట్టి అభ్యాసము హృదయములోను - బాహ్యములోను నిర్వర్తించండి.

"సవికల్పో", "నిర్వికల్పః" సమాధిః ద్వివిధో హృది।
'దృశ్య' 'శబ్ద' అను భేదేన
సవికల్పః పునః ద్విధా।
కామాది యాః చిత్తగా దృశ్యాః
తత్ సాక్షితు ఏన చేతనమ్
ధ్యాయేత్ దృశ్య-అనువిద్ధోఽయం
'సమాధిః సవికల్పకః'।
"అసంగ సత్-చిత్-ఆనందః
స్వ-ప్రభో, ద్వైత వర్జితః-
'అస్మి' ఇతి శబ్ద విద్ధో - అయం
సమాధిః సవికల్పకః।

## సమాధి

హృదయములో నిర్వర్తించి (అభ్యసించు) సమాధి రెండువిధములైనవి.
**1. సవికల్పము 2. నిర్వికల్పము.**

## 1. సవికల్ప సమాధి

అట్టి సవికల్ప సమాధి తిరిగి రెండువిధములుగా ఆశ్రయించబడుతోంది. 1. దృశ్య భేద 2. శబ్దభేద. చిత్తములో ఏఏ 'కామము' (కోరిక) ఇత్యాదులుగా ఉన్నాయో, అవియే దృశ్యముగా అనుభవమగుచున్నాయి. ఏదేదైతే చూడబడుచున్నదో అది ఆ ప్రక్కగా పెట్టి ఇక ఆ **'చూచువాడు'** అగు సాక్షిని గమనించండి. దృశ్యము జడము. సాక్షియో? చేతనము (చూచువాడు, కదల్చువాడు). జడమగు దృశ్యమును వదలి, చేతనుడగు సాక్షి (ద్రష్ట)ను ఎప్పటికప్పుడు తెరపి లేకుండా ధ్యానిస్తూ ఉండటమే **'సవికల్ప సమాధి'.**

**"ఆలోచనలలో ఉండటము" నుండి ఈవలకు వచ్చి, ఆలోచించువానిని గమనిస్తూ ఉండటమే - సమాధి అభ్యాసము.**

అట్లు చేతనుడగు 'సాక్షి'. స్వరూపమును (సత్-చిత్-ఆనంద లక్షణుడుగా) ధ్యానిస్తూ ఉండగా, "నేను-అను శబ్దార్థమును - అసంగము (దేనిచేతా సంగము లేనిది). సత్-చిత్-ఆనంద స్వరూపము, తనకు తానే నియామకము. మరొకరెవరో నన్ను నియమించటము లేదు"- అని గ్రహిస్తున్నాడు. ఈవిధంగా 'అహమ్' స్వరూపమును అసంగము, సచ్చిదానందము, స్వయం ప్రభువు.... అని గ్రహిస్తూ ఉండువానిని **సవికల్ప సమాధి నిష్ఠుడు - అనబడుచున్నాడు.**

---

స్వానుభూతి రస ఆవేశాత్
'దృశ్య' శబ్ద అన పేక్షితః।
నిర్వికల్ప సమాధిస్యాత్
నివాత స్థిత దీపవత్॥
హృదివా, బాహ్య దేశే అపి,
యస్మిన్ కస్మింశ్చ వస్తుని,
సమాధిః ఆదృక్ (సమాధిరాత్ దృక్) - సన్మాత్రా
నామరూప పృథక్ కృతిః।
స్తబ్ధీభావో, రసాస్వాదాత్
తృతీయః పూర్వవత్ మతః॥
ఏతైః సమాధిభిః షడ్భిః (6)
నయేత్ కాలం నిరంతరమ్॥

## 2. నిర్వికల్ప సమాధి

**'స్వస్వరూపానుభూతి'** యొక్క ప్రియాతి ప్రియమగు కేవల ఆత్మయొక్క ఆపేక్ష (ఇష్టము)చేత, ఇక దృశ్యము - దృశ్యములోని శబ్ద స్పర్శాది విషయములు కావాలనే కోరిక కించిత్ కూడా కలుగక (ఒక నటుడు పాత్రయొక్క సంబంధ బాంధవ్యములపట్ల అపేక్ష లేకయే నటించు తీరుగా)- గాలి కదలని చోటుగల నిశ్చల దీపమువలె **'స్వస్వరూపానుభవ శీలుడై ఉండటము'**... అను స్థితిని **'నిర్వికల్ప సమాధి స్థితి'** అని అంటారు.

## 3. స్తబ్ధీభావ-రసాస్వాద సమాధి

హృదయమునందు, బాహ్యమునందు కూడా ఏదో ఒక్క వస్తువుపై (గురువు-ఇష్టదైవము ఇటువంటి ఒక్కటే దానిపై) ఏకాగ్రరూపమైన సమాధిని అభ్యసించి,

- వేరు వేరైన రూపాత్మకమైనదంతా స్తబ్ద భావములో లయింపజేసివేసి,

- రసాస్వాదనను ద్రష్ట-దృశ్యముల కావల మునుముందుగానే ఉన్న 'దృక్'తో ఏకం చేసి ఉంచటం.

బిడ్డలారా! ఈవిధంగా

| | |
|---|---|
| 1. సవికల్ప సమాధి | 1. హృదయంలోను |
| 2. నిర్వికల్ప సమాధి | 2. బాహ్యములోను |
| 3. ఏకవస్తు సమాధి | 3 x 2 = 6 |

ఈ ఆరు సమాధులలో ఏదో ఒకటి నిరంతరము ఆశ్రయిస్తూ కాలమును గడుపుతూ ఉండటము మీకు శ్రేయోదాయకము. ఉచితము. లేదా అన్నిటినీ మిశ్రమం చేసి అభ్యసించండి. ఎప్పటికి ఏది ప్రస్తుతమో, అది అభ్యాసిస్తూ, క్రమంగా 'కేవలమగు దృక్' భావనను సర్వే సర్వత్రా సర్వదా నిశ్చలం చేసుకోండి.

**దేహాభిమానే గళితే విజ్ఞాతే పరమాత్మని,**
**యత్ర యత్ర మనో యాతి**
**తత్ర తత్ర పరామృతమ్।**

**దేహాభిమానము: "ఈ దేహమునకు ముందే ఉన్నాను. తరువాత కూడా ఉంటాను"** - అనునది ఏమరచి, **"ఈ దేహముచేత నేను పరిమితుడను. ఈ దేహము చేతనే నాకు ఉనికి"** .... అను అభిమానమే-దేహాభిమానము.

ఓ ప్రియ బిడ్డలారా! పై (6) విధములైన సమాధుల అభ్యాసము సహాయంతో దేహాభిమానము తొలగిపోవుచుండగా, మీ పరస్వరూపమగు పరమాత్మత్వము విషయమై తెలుసుకొనుచున్నవారై (విజ్ఞాతులై) ఎప్పుడు ఉంటారో, అప్పుడిక బంధము లేదు. మనోవైకల్యము ఉండదు. అప్పుడు మీ మనస్సు ఎక్కడెక్కడికి వెళ్ళినాకూడా, అక్కడక్కడ పరామృతమునే పొందుచున్నది.

---

**భిద్యతే హృదయ గ్రంథిః,**
**ఛిద్యంతే సర్వ సంశయాః,**
**క్షీయంతే చ అస్య కర్మాణి**
**తస్మిన్ దృష్టే పరావరే।**

ఎప్పుడైతే పరావర (పరతత్త్వ, పరమాత్మత్వ) - సమున్నత దృష్టిని మీరు సంపాదించుకుంటారో..., అప్పుడిక హృదయములోని (దృశ్యము-జీవుడు-ఈశ్వరుడు-జన్మ-కర్మ.... ఇవన్నీ ఉన్నాయి - అను రూపమైన) **సర్వ చిక్కుముడులు వీడిపోతాయి.**

సర్వ కర్మ బంధములు వాటికవే త్రెగిపోతాయి (నటుడికి పాత్ర సంబంధమైన కర్మలు - బంధుత్వములు - గుణములు తనవి కానివిధంగా) - అట్టివాడు జగన్నాటకంలో పాత్రధారుడై స్వస్వరూపము యొక్క స్వానుభూతిని వీడక ఉంటాడు.

---

**మయి జీవత్వమ్-ఈశత్వమ్ కల్పితమ్।**
**<u>వస్తుతో నహి।</u>**

| **ఇతి యస్తు విజానాతి స ముక్తో॥** |
|---|
| **న అత్ర సంశయః॥** |

***ఇతి సరస్వతీ రహస్యోపనిషత్***
***ఓం శాంతిః శాంతిః శాంతిః***

***ప్రియమైన శ్రోతలారా! భక్తజనులారా! తదితర సర్వజీవులారా!***

**చివ్వరిగా, అంతిమ వాక్యరూపంగా చెప్పుచున్నాను. ఈ మాట వినండి.**

| **"నాయొక్క జీవత్వము - ఈశ్వరత్వము".... ఈ రెండూ కూడా నాపట్ల కేవలము స్వయం కల్పితము మాత్రమే!** |
|---|
| **వస్తుతః జీవుడు లేడు. ఈశ్వరుడు లేడు. అస్మత్ ఆత్మానంద స్వరూపమే ఇదంతా.** |

నేను ఈ రెండిటికి పరమైనట్టి వాస్తవ స్వరూపమును. సత్ స్వరూపమును.

తదితరమైనదంతా కల్పితము.

ఈ విషయము ఎవ్వరు గ్రహిస్తారో, తెలుసుకుంటారో,.... అట్టివాడు నిత్యముక్తుడే!

అఖండ అప్రమేయ ఆత్మానంద స్వరూపుడే!

నాయనలారా! ఇందులో సందేహించవలసిన పనేలేదు.

***ఇతి సరస్వతీ రహస్యోపనిషత్***
***ఓం శాంతిః శాంతిః శాంతిః***

**కృష్ణ యజుర్వేదాంతర్గత**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 28 శ్రీ సరస్వతీరహస్యోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**ఓంకారార్థము, సత్యము, నిత్యము, అమృత స్వరూపము, పరమ వాత్సల్యరూపము – అయి ఉన్న శ్రీ సరస్వతీ జగన్మాతకు భక్తి – జ్ఞాన – యోగ పూర్వకముగా ఆత్మప్రదక్షిణ నమస్కారము।**



ఒకానొక సందర్భములో కొందరు ఋషిపుంగవులు తత్త్వజ్ఞానార్థులై శ్రీ అశ్వలాయన మహర్షి తపస్సు చేస్తున్న ఆశ్రమానికి వచ్చారు. మహర్షిని దర్శించారు. భక్తి – ప్రపత్తులతో వారి పాదపద్మములకు సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించారు. తాము తెచ్చిన పుష్ప ఫలాదులను ప్రేమపూర్వకంగా సమర్పించారు. ఆ తరువాత వారంతాకూడా ఆ ఆశ్రమములోగల ఒక ప్రశాంత స్థలములో సుఖాసీనులైనారు.



**ఋషి పుంగవులు :** హే మహర్షి వరేణ్యా! అశ్వలాయనా! తమరు దేవీసిద్ధిని పొంది, అట్టి దేవీ ఉపాసనచే దేవీ సంబోధితులై పరతత్త్వజ్ఞాన సంపన్నులైనారని ఋషి గణములు చెప్పుకుంటూ ఉంటారు. పరమానంద మానసులగు మిమ్ములను దర్శించుటచే ధన్యులమైనాము. మిమ్ములను శరణు వేడుచూ తత్త్వజ్ఞానాశ్రయులమై, మేము తెలుసుకోవలసిన ఒక విషయం తెలుసుకొనదలచాము.

***ఏ ఉపాసనచే ఏఏ ఉపాయములతో మీరు పరతత్త్వమును ప్రసన్నం చేసుకొన్నారు? ఏ విధంగా ఈ జగత్ పదార్థములన్నీ ప్రతిబింబిస్తున్నట్టి అపరములని తెలుసుకొని, బ్రహ్మతత్పరులై ఉంటున్నారు? మేము ఏ మార్గములో తత్త్వవిషయమై బోధితులము కాగలము? దయతో వివరించండి.***

**అశ్వలాయన మహర్షి :** బ్రహ్మజ్ఞులగు ఋషి పుంగవులారా! అవును. నేను – **బీజాక్షరములతో నిర్మితమై, ఋషి సత్తములచే సంపుటితమైనట్టి ఋక్కులచే గానము చేయబడుచు 'సరస్వతీ దశశ్లోకీ'** ధ్యానమును ఆశ్రయించాను. అట్టి ధ్యానము స్తుతి – జపముచే – మంగళప్రదాయని, లోకమాత, కరుణామయి అగు శ్రీ సరస్వతీదేవి ప్రేమచే పరతత్త్వ జ్ఞాన విశేషాలు నాకు బోధించింది. ఆ తల్లి వాత్సల్యముచేతనే కృతకృత్యుడను అయ్యాను. నన్ను నేను సుస్పష్టముగా ఎఱిగి, ఆస్వాదిస్తూ ఉన్నాను.

**ఋషి పుంగవులు :** అట్లాగా స్వామీ! అయితే, మరి అటువంటి శ్రీ సరస్వతీ కరుణారస వీక్షణారూపమగు సారస్వత (సా–రసత్వత) మార్గ మోక్ష స్థితి లభించటానికి మార్గమేమిటి? హే సువ్రతా! ఏ ధ్యానముచే మాకు అది సుసాధ్యమవుతుంది? **కథం సారస్వత ప్రాప్తిః, కేన ధ్యానేన? సువ్రత!** ఏ విధి విధానంగా భగవతియగు మహాసరస్వతీదేవి సంతోషించినదై మాకు ఆత్మ జ్ఞానమును ప్రసాదించగలదు? దయతో వివరించండి. **మహా సరస్వతీ యేన తుష్టా భగవతీ, వద।**

**శ్రీ అశ్వలాయనమహర్షి :** పరమ పవిత్ర హృదయులారా! ఋషి పుంగవులారా! చెప్పుచున్నాను, వినండి. నేను **"శ్రీ సరస్వతీ దశశ్లోకీ"** అను మహనీయులగు మహర్షుల **"దేవతా – ఋషి – ఛందోబద్ధ – బీజ శక్తి కీలక"** మహామంత్రమును ఎల్లప్పుడూ ధారణ – మనన – ఉపాసనలను నిర్వర్తిస్తూ శ్రీ మహాసరస్వతీదేవియొక్క వాత్సల్యమునకు పాత్రుడనగుచూ వస్తున్నాను. తల్లి దయ ఉంటే మనకు తక్కువేముంటుంది చెప్పండి?

| మంత్రము<br>"సరస్వతీ దశ శ్లోకో" | ఋషిః<br>అహమ్ అశ్వలాయన ఋషిః | చందస్సు<br>అనుష్టుప్ | దేవతా<br>వాగేశ్వరీ | ఇతి బీజమ్ శక్తి కీలకమ్<br>యత్‌వాక్ |
|---|---|---|---|---|
| (1) ఓం "ప్రణోదేవీ" | భరద్వాజ ఋషిః | గాయత్రీ | శ్రీ సరస్వతీ దేవతా | ప్రణవేన |
| (2) "ఆ నో దివ" | అత్రి | త్రిష్టుప్ | శ్రీ సరస్వతీ దేవతా | హ్రీం |
| (3) "పావకాన" | మధుచ్ఛందా ఋషిః | గాయత్రీ | శ్రీ సరస్వతీ దేవతా | శ్రీం |
| (4) "చోదయత్రీ" | మధుచ్ఛందా ఋషిః | గాయత్రీ | శ్రీ సరస్వతీ దేవతా | బ్లూమ్ |
| (5) "మహో అర్ణ" | మధుచ్ఛందా ఋషిః | గాయత్రీ | శ్రీ సరస్వతీ దేవతా | సౌః |
| (6) "చత్వారి వాక్" | ఉచత్థ్యపుత్రో దీర్ఘతమా ఋషిః | త్రిష్టుప్ | శ్రీ సరస్వతీ దేవతా | ఐం |
| (7) "యత్ వాక్ వదంతీ" | భార్గవ ఋషిః | త్రిష్టుప్ | శ్రీ సరస్వతీ దేవతా | క్లీం |
| (8) "దేవీం వాచమ" | భార్గవ ఋషిః | త్రిష్టుప్ | శ్రీ సరస్వతీ దేవతా | సౌః |
| (9) "ఉత త్వా" | బృహస్పతి ఋషిః | త్రిష్టుప్ | శ్రీ సరస్వతీ దేవతా | సం |
| (10) "అంబితమ" | గృత్నమద ఋషిః | అనుష్టుప్ | శ్రీ సరస్వతీ దేవతా | ఐం |

**శ్లో॥** **అస్యశ్రీ సరస్వతీ 'దశ శ్లోకీ' స ఋచా బీజమిశ్ర యా**
**స్తుత్వా జప్త్వా పరామ్ సిద్ధిమ్ సులభమ్, మునిపుంగవాః।**

**శ్లో॥** **నీహార హార ఘనసార సుధాకరాభాం**
**కల్యాణదాం కనక చంపక దామ భూషామ్**
**ఉత్తుంగ పీన కుచకుంభ మనోహరాంగీం**
**వాణీం నమామి మనసా వచసాం విభూత్యై॥**

**1. శ్లో॥ యా వేదాంతార్థ తత్త్వైక స్వరూపా పరమార్థతః**
**నామరూపాత్మనా (అ)వ్యక్తా సామాం పాతు సరస్వతీ॥**
**"ఓం" ప్రణోదేవీ సరస్వతీ వాజేభిః వాజినీవతీ।**
**ధీనామ్ అవిత్ర్యవతు॥**

**2. శ్లో॥ యా సాంగ-ఉపాంగ వేదేషు చతుర్ష్వ (చతుర్ధ్వ) ఏకైవ గీయతే**
**అద్వైతా బ్రహ్మణః శక్తిః సామాం పాతు సరస్వతీ।**
**"హ్రీం" ఆ నో దివో బృహతః పర్వతాదా సరస్వతీ**
**యజత ఆగంతు యజ్ఞమ్, హవం దేవీ జుజుషాణా**
**ఘృతీచీ శగ్మాన్ నో వాచమ్ ఉశతీ శృణోతు॥**

**3. శ్లో॥ యా వర్ణ పదవాక్యార్థ స్వరూపేణైవ వర్తతే**
**అనాది నిధన అనంతా సా మాం పాతు సరస్వతీ।**
**"శ్రీం" పావకానః సరస్వతీ వాజేభిః వాజినీవతీ।**
**యజ్ఞం వష్టు ధియా వసుః॥**

**4. శ్లో॥ అధ్యాత్మమ్ అధిదైవం చ దేవానాం సమ్యక్ ఈశ్వరీ**
**ప్రత్యగాస్తే వదంతీ యా, సా మాం పాతు సరస్వతీ॥**
**"బ్లూం"। చోదయత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనామ్**
**యజ్ఞం దధే సరస్వతీ॥**

**5. శ్లో॥ అంతర్యామి ఆత్మనా విశ్వం త్రైలోక్యం యా నియచ్ఛతి,**
**రుద్ర - ఆదిత్యాది రూపస్థా యస్యాం ఆవేశ్యతాం పునః,**
**ధ్యాయంతి సర్వ రూపైకా సా మాం పాతు సరస్వతీ॥**
**సౌః మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా**
**ధియో విశ్వా విరాజతి॥**

6. శ్లో॥ యా 'ప్రత్యక్' దృష్టిభిః జీవైః వ్యజ్యమాన – అనుభూయతే
వ్యాపినీ జ్ఞప్తి రూపైకా సా మాం పాతు సరస్వతీ॥
"ఐం" చత్వారి వాక్ పరిమితా పదాని తాని విదుః బ్రాహ్మణా యే మనీషిణః,
గుహాత్రీణి నిహితా నేంగయంతి
తురీయం వాచో మనుష్యా వదంతి॥

7. శ్లో॥ నామ జాత్యాదిభిః భేదైః అష్టధా యా వికల్పితా
నిర్వికల్పాత్మనా (అ)వ్యక్తా సా మాం పాతు సరస్వతీ॥
"క్లీం" యత్ వాక్ వదంతి అవిచేతనాని రాష్ట్రీ
దేవానాం నిషసాద మంద్రా
చతస్ర ఊర్జం దుదుహే పయాంసి క్వస్విత్
అస్యాః పరమం జగామ।

8. శ్లో॥ వ్యక్తావ్యక్త గిరః సర్వే వేదాద్యా వ్యాహరంతి యామ్
సర్వకామ దుఘా ధేనుః సా మాం పాతు సరస్వతీ।
"సౌః" దేవీం వాచమ జనయంత దేవాః
తాం విశ్వరూపాః పశవో వదంతి,
సా నో మంద్రేషు మూర్జం దుహానా ధేనుః
"వాక్" అస్మాన్ ఉపసుష్టుతైతు।

9. శ్లో॥ యాం విదిత్వ అఖిలం బంధం నిర్మథ్యాఖిల వర్త్మనా
యోగీ యాతి పరం స్థానం సా మాం పాతు సరస్వతీ।
"సం" – ఉత త్వః పశ్యన్ న ద దర్శ వాచమ్ ఉతత్వః
శృణ్వన్, న శృణోతి ఏనామ్, ఉతో తు అస్మై తన్వా
అం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః।

10. శ్లో॥ నామ రూపాత్మకం సర్వం యస్యాం ఆవేశ్యతాం పునః
ధ్యాయంతి బ్రహ్మరూపైకా సా మాం పాతు సరస్వతీ॥
"ఐం" – అంబితమే నదీతమే దేవితమే సరస్వతి,
అప్రశస్తా ఇవ స్మసి ప్రసస్తిమ్ అంబ న స్కృధి॥

## స్తుతి

శ్లో॥ చతుర్ముఖ ముఖాంభోజ వన హంసవధూః మమ
మనసే రమతాం నిత్యం సర్వ శుక్లా సరస్వతీ

---

శ్లో॥ నమస్తే శారదా దేవి। కాశ్మీరపురవాసిని।
త్వామ్ అహం ప్రార్థయే నిత్యం। విద్యాదానం చ దేహిమే।

శ్లో॥ అక్షసూత్ర అంకుశధరా। పాశపుస్తక ధారిణీ।
ముక్తాహార సమాయుక్తా। వాచి తిష్ఠతు మే సదా।
కంబు కంఠీ సు తామ్రోష్ఠీ। సర్వాభరణ భూషితా।
మహా సరస్వతీ దేవీ, జిహ్వాగ్రే సన్నివేశ్యతామ్॥

శ్లో॥ యా శ్రద్ధా ధారణా మేధా, వాగ్దేవీ। విధి వల్లభా।
భక్త జిహ్వాగ్ర సదనా। శమాది గుణదాయినీ।
నమామి యామినీనాథ రేఖాలంకృత కుంతలామ్।
భవానీం। భవసంతాప నిర్వాపణ సుధా నదీమ్।

**శ్లో॥ యః కవిత్వం నిరాంతకం భుక్తీ ముక్తీ చ వాంఛతి,**
**సో అభర్చ్య ఏనాం దశశ్లోక్యా నిత్యం సౌతి, సరస్వతీమ్॥**
**తస్య ఏవం స్తువతో నిత్యం సమభ్యర్చ్య సరస్వతీమ్।**
**భక్తి శ్రద్ధ అభియుక్తస్య షణ్మాసాత్ ప్రత్యయో భవేత్॥**
**తతః ప్రవర్తతే వాణీ స్వేచ్ఛయా లలితాక్షరా**
**గద్య పద్యాత్మకైః శబ్దైః అప్రమేయైః వివక్షితైః**
**అశ్రుతో బుధ్యతే గ్రంథః ప్రాయః సారస్వతః కవిః**

**శ్రీ అశ్వలాయన మహర్షి :** ఓ మహావివేకవంతులగు ఋషి పుంగవులారా! శ్రీ సరస్వతీ దేవిని తమ భక్తి – యోగ – జ్ఞాన – వైరాగ్య అభ్యాసములచే హృదయమునందు దర్శించినట్టి మహనీయులు బీజాక్షర సంపుటిచే ఉచ్చరిస్తూ గానము చేసినట్టి **"శ్రీ సరస్వతీ దశశ్లోకీ మహామంత్రము"**ను భక్తితో సేవించి ఆ జగజ్జనని యొక్క వాత్సల్యమును, కరుణను పొందుచూ తత్త్వజ్ఞానమును పొందుచున్నవాడనగుచున్నాను. అటువంటి నేను నిత్యము ఆశ్రయిస్తున్న ధ్యానోపాసనా విధి, స్తోత్ర విశేషములను మీరు కోరారు కాబట్టి చెప్పుకుంటున్నాము. ఆ శ్రీ సరస్వతిదేవి అమృతవీక్షణ మనందరిపైన వర్షించును గాక. ఆ అమ్మ ప్రత్యక్షమై తత్త్వవీక్షణ మనపై ప్రసరించాలనే లోకకల్యాణ – లోకశ్రేయస్సులను ఉద్దేశ్యించి వివరిస్తున్నాను. దయచేసి వినండి.

**అస్య "శ్రీ సరస్వతీ దశశ్లోకీ" మహా మంత్రస్య। అహమ్ అశ్వలాయన ఋషిః। 'అనుష్టుప్' ఛందః। శ్రీ వాగీశ్వరీ దేవతా। 'యత్ వాక్' ఇతి బీజమ్। 'దేవీం వాచమ్' – ఇతి శక్తిః। 'ప్రణోదేవీ' – ఇతి కీలకమ్। వినియోగః తత్ ప్రీత్యర్థే। శ్రద్ధా మేధా ప్రజ్ఞా ధారణా వాక్ దేవతా మహా సరస్వతీ – ఇతి ఏతైః అంగన్యాసః॥**

ఈ 'సరస్వతీ దశశ్లోకీ' స్తోత్రమును అశ్వలాయన నామధేయుడనగు నేను ఋషిని। ఛందస్సు అనుష్టుప్ శ్రీ వాగీశ్వరీ **సరస్వతీ అమ్మవారే** దేవత। **'యత్ వాక్'** అనునది బీజము. **"దేవీ వాచం** – దేవి పలుకులు నాకు లభించుగాక"....అనునది శక్తి। ఆ వాగీశ్వరి ప్రీతిని పొందినదై, తన హృదయమును విశదపరచుటకై – ఈ 'దశశ్లోకా' యొక్క **వినియోగము.**

(1) శ్రద్ధ (2) మేధ (3) ప్రజ్ఞ (4) ధారణ (5) వాగ్దేవతా (6) మహాసరస్వతీ.... వీటితో **అంగన్యాసము, కరన్యాసము నిర్వర్తిస్తున్నాము.**

# శ్రీ సరస్వతీ స్తోత్రము

**శ్లో॥ నీహార హార ఘనసార సుధాకరాభాం**
**కల్యాణదాం కనక చంపక దామ భూషామ్**
**ఉత్తుంగ పీన కుచ కుంభ మనోహరాంగీం**
**వాణీం నమామి మనసా వచసాం విభూత్యై॥**

మంచువంటి **తెల్లటి రంగుతో** ప్రకాశించుచూ, తళతళ **మెరుస్తున్న ముత్యాహారము ధరించి,** పచ్చ కర్పూరము వంటి – పూర్ణచంద్రునివంటి **ముఖముతో దేదీప్యమానముగా వెలుగుచూ, భావనా మాత్రము చేత సర్వశుభములు** ప్రసాదించుచూ, బంగారు సంపంగి **పుష్పమాలికను ధరించినదై,** ఎత్తైన పీన కుచ కుంభములతో (పాలిండ్లతో) **మాతృవాత్సల్య అయి** ఉన్నది. సుమనోహరమైన అంగములు గలిగియున్నట్టి ఆ తల్లి నాయొక్క వాక్ విభూతిని స్వీకరించి ఆస్వాదించును గాక! చక్కటి వచనములను పలికించవలసినదిగా మనసా – వాచా – కర్మణా నమస్కరిస్తున్నాను.

---

## 1. ఓం ఓం ప్రణోదేవీ నమః।

**ఓం "ప్రణో దేవీ" ఇతి అస్య మంత్రస్య। భారద్వాజ ఋషిః। గాయత్రీ ఛందః।**
**శ్రీ సరస్వతీ దేవతా। ప్రణవేన బీజ శక్తి కీలకమ్। ఇష్టార్థే వినియోగః॥**

**శ్లో॥ యా వేదాంతార్థ తత్త్వైక స్వరూపా పరమార్థతః**
**నామరూపాత్మనా (అ)వ్యక్తా సామాం పాతు సరస్వతీ॥**
**"ఓం" ప్రణోదేవీ సరస్వతీ వాజేభిః వాజినీవతీ।**
**ధీనామ్ అవిత్ర్యవతు॥**

ఏ దేవాదిదేవి పరమార్థంగా, వేదాంతార్థతత్త్వైక స్వరూపముగా...,

- పరమార్థంగా....'సర్వమునకు ఆవలగల స్వస్వరూప కేవలసాక్షి" అయినదై,
- వేదాంతార్థ..... (తెలుసుకొనువానిని ఆవల ఉండి తెలుసుకొంటున్నట్టి) స్వరూపార్థంగా...,
- తత్త్వైక.... 'త్వమ్' (నీవు) రూపముగా ఉన్న సర్వ సర్వనామముల ఏకస్వరూపంగా....,

..... ***ఉండి, సర్వ నామ రూపములుగా వ్యక్తమగుచూ ఉన్నదో... అట్టి సరస్వతీదేవి మనలను రక్షించుచుండును గాక!***

'ప్రణో' – 'అన్న' (That being consumed, experienced) స్వరూపదేవి, వాక్ స్వరూపిణి, వాక్ పరిపాలన చేయుతల్లి అగు శ్రీ సరస్వతీదేవి మా బుద్ధులను పవిత్రము చేస్తూ, బుద్ధిని నిర్మలము – సునిశితము – విస్తారము – దివ్యము చేయుచుండును గాక!

---

## 2. ఓం 'హ్రీం' అనో దివ నమః।

**ఓం 'అ నో దివ' ఇతి మంత్రస్య। అత్రి ఋషిః। త్రిష్టుప్ ఛందః।**
**సరస్వతీ దేవతా। "హ్రీం" ఇతి బీజ శక్తి కీలకం। ఇష్టార్థే వినియోగః॥**

**శ్లో॥ యా సాంగ–ఉపాంగ వేదేషు చతుర్ష్వ (చతుర్ధ్వ) ఏకైవ గీయతే**
**అద్వైతా బ్రహ్మణః శక్తిః సామాం పాతు సరస్వతీ।**
**"హ్రీం" ఆ నో దివో బృహతః పర్వతాదా సరస్వతీ**
**యజత ఆగంతు యజ్ఞమ్, హవం దేవీ జుజుషాణా**
**ఘృతాచీ శగ్మాన్ నో వాచమ్ ఉశతీ శృణోతు॥**

ఏ దేవీతత్త్వము అయితే 4 వేదములచేతను, వాటి సాంగ ఉపాంగములచేతను సర్వదా గానము చేయబడుచున్నదో (4 వేదముల సంహిత – బ్రాహ్మణ – ఆరణ్యక ఉపనిషత్తులు ఒకచోటికి చేరి ఏ తత్త్వమును ఎలుగెత్తి పొగుడుచూ పలుకుచున్నాయో), ఏ దేవి **స్వస్వరూపము**నకు వేరు కానిదైనట్టి బ్రాహ్మీశక్తియో, అట్టి ఓ సరస్వతీ దేవీ! మమ్ములను సర్వదా మాతృదేవి అయి రక్షించును గాక! హే మాతా! మహత్తరము – బృహత్తరము అగు బ్రహ్మ లోకమునుండి, పర్వత శిఖర ఉపరిభాగములనుండి – (జీవితము అను) యజ్ఞమునకు సంసిద్ధులమగుచున్న మేమున్న చోటికి మీరు విచ్చేయండి. ఓ సరస్వతీ మాతా! మా యొక్క **జీవిత యజ్ఞమును** (మరియు) వేదవిహితమైన **యజ్ఞయాగ క్రియలను** దిగ్విజయము చేయండి.

మేము యజ్ఞములో సమర్పించు హవనములను (హోమములో సమర్పించు ఘృతము (నేయి) మొదలైనవానిని) యజ్ఞపురుష స్వరూపిణి అయి శ్రీ సరస్వతీదేవి స్వీకరించును గాక! మేము యజ్ఞభావముతో చేయు సర్వ కర్మలను – విద్యుక్త ధర్మములను – ఉపాసనా క్రియలను హవిస్సు (ఘృతము) రూపముగా స్వీకరిస్తూ తృప్తిని పొందినదై, మమ్ములను రక్షించెదరు గాక!

---

## 3. ఓం 'శ్రీం' పావకాన నమః

**ఓం "పావకాన" ఇతి మంత్రస్య। మధుచ్ఛంద ఋషిః। గాయత్రీ ఛందః।**
**సరస్వతీ దేవతా। "శ్రీం" ఇతి బీజశక్తి కీలకమ్। మంత్రేణ న్యాసః॥**

**శ్లో॥ యా వర్ణ పదవాక్యార్థ స్వరూపేణైవ వర్తతే**
**అనాది నిధన అనంతా సా మాం పాతు సరస్వతీ।**
**"శ్రీం" పావకానః సరస్వతీ వాజేభిర్వాజినీవతీ।**
**యజ్ఞం వష్టు ధియా వసుః॥**

మాకు వాక్కును ప్రసాదించిన వాక్‌దేవత మా స్తోత్ర వాక్యములు వినునుగాక! విని, స్వీకరించి ఒకతల్లి తన చిన్న పిల్లవాని మాటలను విని ఆనందించి రక్షించుచున్న తీరుగా మా పట్ల వాత్సల్యము చూపును గాక! తల్లివలె విద్యా బుద్ధులను నేర్పుచు, సరిదిద్దుచూ సన్మార్గమునందు నడిపించునుగాక! ఏ దేవి – వర్ణ (Discriptive sentence), వాక్యార్థ (Meaning of a sentence) స్వరూపియై వర్తించుచున్నదో, అనాది నిధన (A source with infinite energy) అయి ఉన్నదో, ఆద్యంతరహిత స్వరూపిణియో..., అట్టి శ్రీ సరస్వతీదేవి మనలకు ఎల్లప్పుడు సర్వదా తోడు అగుచుండును గాక!

'శ్రీం'! వాక్ స్వరూపిణి – వాక్ ప్రసాదిని, సిరి – శ్రియ స్వరూపిణి అగు ఆ శ్రీదేవీ సరస్వతి మా యజ్ఞహవిస్సులను స్వీకరించి మాకు బుద్ధి సంపద ప్రసాదించునుగాక! వివేకవంతులుగా తీర్చిదిద్దునుగాక!

## 4. ఓం। 'బ్లూం' చోదయత్రీ నమః।

**ఓం "చోదయత్రి" ఇతి మంత్రస్య। మధుచ్ఛంద ఋషిః। గాయత్రీ ఛందః।**
**సరస్వతీ దేవతా। "బ్లూం" ఇతి బీజ శక్తి కీలకమ్। మంత్రేణ న్యాసః॥**

**శ్లో॥ అధ్యాత్మమ్ అధిదైవం చ దేవానాం సమ్యక్ ఈశ్వరీ**
**ప్రత్యగాస్తే వదంతీ యా, సా మాం పాతు సరస్వతీ॥**
**"బ్లూం" చోదయత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనామ్**
**యజ్ఞం దధే సరస్వతీ॥**

ఏ వాణి సర్వజీవుల ఆత్మస్వరూపిణి అగుటచే **ఆధ్యాత్మముగాను**, సర్వదేవతాస్వరూణి అగుటచే **అధిదైవముగాను**, దేవతలకే ఆది – జన్మస్థానమగుటచే **దేవదేవిగాను**, సర్వజీవులలో స్వ-స్వరూపిణియై సమముగా విస్తరించి ఉండటంచేత **సమ్యక్ ఈశ్వరిగాను,** సర్వమునకు సాక్షిగా వేరుగా ఉండటంచేత **ప్రత్యక్ రూపిణి**గాను తత్త్వము ఎరిగిన విజ్ఞులచే అభివర్ణించబడుచున్నదో,...అట్టి శ్రీ సరస్వతీదేవి మమ్ములను (అజ్ఞాన భావముల నుండి) కాపాడునుగాక! మాయందు అసత్యత్వమంతా ఊడ్చివేసి, సత్యవాక్కులను ప్రేరేపించునట్టిది, ఉత్తమమగు సునిశిత – విస్తార – నిర్మల – పవిత్రబుద్ధులను తీర్చిదిద్దు చేతన స్వరూపిణియు, యజ్ఞరూపిణియు అగు ఆ సరస్వతీదేవి మమ్ములను యజ్ఞ నిష్ఠులుగా తీర్చిదిద్దును గాక!

## 5. ఓం। 'సౌః' మహో అర్ణ నమః।

**ఓం "మహో అర్ణ" ఇతి మంత్రస్య। మధుచ్ఛంద ఋషిః। గాయత్రీ ఛందః।**
**సరస్వతీ దేవతా। "సౌః" ఇతి బీజ శక్తి కీలకమ్। ఇష్టార్థే వినియోగః। మంత్రేణ న్యాసః॥**

**శ్లో॥ అంతర్యామి ఆత్మనా విశ్వం త్రైలోక్యం యా నియచ్ఛతి,**
**రుద్ర – ఆదిత్యాది రూపస్థా యస్యాం ఆవేశ్యతాం పునః,**
**ధ్యాయంతి సర్వ రూపైకా సా మాం పాతు సరస్వతీ॥**
**సౌః మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా ధియో విశ్వా విరాజతి॥**

ఏ దేవదేవి ఈ విశ్వంమతటికీ అంతర్యామి, విశ్వరూపిణి అయి, ఈ స్వర్గ – భూ – పాతాళ త్రిలోకములను, లోకపాలకులను, లోకాంతర్గత జీవప్రజ్ఞలను నియమించుచున్నదో..., రుద్రుడు, ఆదిత్యుడు మొదలైన సృష్టి శక్తి సంపన్నులగు దేవతలంతా కూడా ఏ దేవియందు తమ రూప నామములతో అంతర్గతులై ఉన్నారో, వారు శ్రీదేవిని ధ్యానము చేసి తిరిగి ఏ తత్త్వరూపముతో ఏకమగుచున్నారో.., అట్టి **"స్వస్వరూపిణి – సర్వస్వరూపిణి"** కూడా అయినట్టి శ్రీ సరస్వతీదేవి మా ధ్యాసలను తనవైపు త్రిప్పుకొనును గాక! మమ్ములను దృశ్యబంధ సంకుచిత భావాలనుండి పరిరక్షించునుగాక!

**<u>'సౌః'</u>** మహాతేజోరూపముతో జడమగు దేహ – మనో – బుద్ధి – చిత్త – అహంకారములను ప్రచేతనముగా చేయుచున్నట్టిది. ఇచ్ఛా జ్ఞాన క్రియా రూప (కుండలినీ) సంజ్ఞ అయి యోగులకు ఆజ్ఞా, సహస్రారస్థానములలో దర్శనము ప్రసాదిస్తోంది. ఏ దేవి సర్వజీవుల బుద్ధులందు జ్యోతిస్వరూపంగా ప్రకాశమానము అయి ఉత్తేజపరచుచున్నదో .... అట్టి **"సౌః"** స్వరూపిణికి నమస్కారము.

## 6. ఓం। 'ఐం' చత్వారి వాక్ నమః।

**ఓం "చత్వారి వాక్" ఇతి మంత్రస్య। ఉచథ్య పుత్రో దీర్ఘ తమా ఋషిః। 'త్రిష్టుప్' ఛందః।**
**సరస్వతీ దేవతా। "ఐం" ఇతి బీజ శక్తి కీలకమ్। మంత్రేణ న్యాసః॥**

**శ్లో॥ యా'ప్రత్యక్' దృష్టిభిః జీవైః వ్యజ్యమాన – అనుభూయతే**
**వ్యాపినీ జ్ఞప్తి రూపైకా సా మాం పాతు సరస్వతీ॥**
**"ఐం" చత్వారి వాక్ పరిమితా పదాని తాని విదుః బ్రాహ్మణా యే మనీషిణః,**
**గుహా త్రీణి నిహితా నేంగయంతి తురీయం వాచో మనుష్యా వదంతి॥**

ఏ విజ్ఞుడగు జీవుడైతే ఈ నామ రూపాత్మక వ్యవహారిక జగత్ దృశ్యమునకు ఆధారమై, పరమై, అప్రమేయమై, మార్పు చేర్పులకు లోను కానట్టిదగు తత్త్వమును మననముచేయుచున్నాడో, ఏ సర్వవ్యాపిని, జ్ఞప్తిరూపిణియగు దేవాదిదేవిగా తనకు అనుభూతమగుచున్నదో అతడే ధన్యుడు. జీవునియందు ప్రత్యక్ (జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు వేరైన) రూపంగా, వ్యాజ్యమానంగా (వ్యావహారికంగా) ఉంటూ, 'జ్ఞప్తి' రూపంగా 'ఐం' సంజ్ఞచే వేంచేసియున్నదో..,
**అట్టి శ్రీ సరస్వతీజగన్మాత మనలను సర్వదా వాత్సల్యముతో కాపాడునుగాక! సంరక్షించునుగాక!**

## చత్వారి వాక్ పరిమితా పదాని

| | | | | |
|---|---|---|---|---|
| (1) | పర | తురీయ | పరమేశ్వరుడు | అక్షరము |
| (2) | పశ్యంతీ | సుషుప్తి | ఈశ్వరుడు | శబ్దము |
| (3) | మధ్యమ | స్వప్న | జీవుడు | వాక్యము |
| (4) | వైఖరీ | జాగ్రత్ | ప్రకృతి | అర్థము |

ఉత్తమ బుద్ధితో పరిశీలించనప్పుడు 'వైఖరీ' (దృశ్యతత్త్వము అగు ప్రకృతి) మాత్రమే జీవుల ఇంద్రియములకు విషయమై ప్రాప్తిస్తోంది. శ్రీ సరస్వతీ దేవిని 'ఉపాసిస్తూ ఉన్న ధన్యునికి పర, పశ్యంతి, మధ్యమ - ఈ నాలుగిటి తత్త్వము సుస్పష్టము కాగలదు.

బ్రహ్మమును విని, తెలుసుకొని, ఉపాసించి, మమేకమైనట్టి బ్రాహ్మణులు ఈ నాలుగు పదములను ఎరిగినవారై, నాలుగవదగు **తురీయమును** మిగిలిన మూడు పదములలోను (జాగ్రత్ - స్వప్న - సుషుప్తులలో నిండి ఉన్న దానిగా) గమనిస్తున్నారు. బ్రహ్మజ్ఞులు - ఆ తురీయము (చతురీయము)నకు సాక్షిగా ఉన్నదానిని 'ఐం' (ఐదవది)గా వర్ణిస్తూ, ఆ 'ఐం' శబ్ద స్వరూపమే సరస్వతీతత్త్వముగా ఎరిగినవారై ఉపాసన చేస్తున్నారు. గానం చేస్తూ, **మార్గాన్వేషకులగు మనందరికీ ఎలుగెత్తి తెలియజేయుచున్నారు.**

ఏ ఏకము - అఖండము అగు దేవేశి, ఆయా భేదములచే-ఎనిమిది విధములుగా (అష్టవిధ అపరా ప్రకృతిగా-పంచభూతములు, మనో - బుద్ధి - చిత్తములుగా) - వికల్పించబడుచున్నదో, (Being attributed and divisioned),

ఏ దేవీ తత్త్వము వాస్తవానికి సర్వకల్పనలకు ఆవల వేంచేసియున్నదో,....,

అట్టి శ్రీ సరస్వతీ దేవి మనలను సర్వదా అజ్ఞానదృష్టి నుండి విజ్ఞాన దృష్టికి నడిపించుచూ, కాపాడునుగాక! ఏ విధంగా కథారచయిత కథలో లేడో, కానీ-కథ ఆయన కల్పననుంచే వస్తూ ఉన్నదో.., కథకు ఆవల సర్వ కల్పనలకు సంబంధించనివాడో...శ్రీ సరస్వతీదేవి ఆ తీరుగా నిర్వికల్పము, అవ్యక్తము, వ్యక్తము కూడా! అట్టి నిర్వికల్ప - అవ్యక్త (సర్వము వ్యక్తీకరించుచూ తాను వ్యక్తములోని విభాగము కానట్టి) జగజ్జననీ! మమ్ములను సర్వదా వెంటనంటి ఉండి, అపమార్గములనుండి కాపాడవమ్మా!

## 7. ఓం। 'క్లీం' యత్ వాక్ వదంతి నమః।

**ఓం "యద్వాగ్వదంతి" ఇతి మంత్రస్య। భార్గవ ఋషిః। 'త్రిష్టుప్' ఛందః।**
**సరస్వతీ దేవతా। "క్లీం" ఇతి బీజ శక్తి కీలకమ్। మంత్రేణ న్యాసః॥**

**శ్లో॥ నామజాత్యాదిభిః భేదైః అష్టధా యా వికల్పితా**
**నిర్వికల్పాత్మనా (అ)వ్యక్తా సా మాం పాతు సరస్వతీ॥**
**"క్లీం" యత్ వాక్ వదంతి అవిచేతనాని రాష్ట్రీ**
**దేవానాం నిషసాద మంద్రా**
**చతస్ర ఊర్జం దుదుహే పయాంసి క్వస్విత్**
**అస్యాః పరమం జగామ।**

క్లీం - ఏ దేవత యొక్క చైతన్య మహిమచే అచేతనము - జడము అగు కంఠనరముల నుండి వాయవు మొదలైన (చేతన రూపులగు) దేవతల క్రియలచే గొప్ప నిషాద - మంద్రరూపముగా పర - పశ్యంతి - మధ్యమ - వైఖరీ నాలుగు పదవిన్యాసములతో కూడిన శబ్ద సౌందర్యమంతా వెలువడుచున్నదో,... అట్టి సరస్వతీదేవి శబ్ద-శబ్దార్థములుగా కూడా వెలయుచున్నది. ఎక్కడికి వెళ్ళి ఆ తల్లిని దర్శించాలి? బ్రహ్మలోకమా? కాదు! ఆ దేవీ చైతన్యమే సర్వదేహాలలోని స్వరపేటికలలోను, దేహములందు అంతటా చేతన రూపమై వేంచేసి ఉన్నది. శబ్ద-అర్థ-పరమార్థ రూపిణి అయి మనకు సాక్షాత్కరిస్తోంది. అట్టి సర్వలోకనివాసినియగు చైతన్యరూపిణికి నమస్కారములు సమర్పిస్తున్నాము!

## 8. ఓం। 'సౌః'। దేవీ వాచమ్ నమః।

**ఓం। "దేవీ వాచమ" ఇతి మంత్రస్య। భార్గవ ఋషిః। 'త్రిష్టుప్' ఛందః।**
**సరస్వతీ దేవతా। "సౌః" ఇతి బీజ శక్తి కీలకమ్। మంత్రేణ న్యాసః॥**

**శ్లో॥ వ్యక్త–అవ్యక్త గిరిః సర్వే వేద ఆద్యా వ్యాహరంతి యామ్**
**సర్వకామ దుఘా ధేనుః సా మాం పాతు సరస్వతీ।**
**"సౌః" దేవీం వాచమ్ అజనయంత దేవాః**
**తాం విశ్వరూపాః పశవో వదంతి,**
**సా నో మంద్రేషమ్ ఊర్జం దుహానా ధేనుః**
**"వాక్" అస్మాన్ ఉపసుష్టుతైతు।**

ఆ దేవి వ్యక్త–అవ్యక్త స్వరూపిణి. సర్వవేదముల వ్యక్త శబ్దములను, రహస్యార్థరూపమగు అవ్యక్తతత్త్వముగానూ కూడా ఏ దేవత గురించి చెప్పుచున్నాయో,... సర్వకామములు ప్రసాదించు కామధేనువు అగు ఆ సరస్వతీదేవి మనలకు ఎల్లవేళలా దిక్కయి, వెలుగై దారి చూపును గాక!

**'సౌః'**....లోక శ్రేయోభిలాష ప్రవృత్తులగు దివ్యశక్తి స్వరూప దేవతలు **'చిదగ్నిగుండము'** నుండి వాగ్దేవతా శబ్దచైతన్యమును జనింపజేయుచున్నారు. విశ్వములోనివారగు పశువులు (జీవులు) ఆ వాక్కును 'అ'కారాది – 'క్ష'కారాంత శబ్దములచే నిర్మితమైన పలుకుల రూపమున పలుకుచున్నారు. అట్టి వాణీ కామధేనువుచే ప్రసాదితమగు మంత్రము, బ్రహ్మ తత్త్వస్వరూపమగు 'అన్నమ్'....అగు వేదాంత వాఙ్మయ శబ్దజాలము సర్వదా మా వాక్కును చేరినదై ఉండునుగాక! (అన్నమ్ = బ్రహ్మము)

---

## 9. ఓం। 'సం'। ఉత త్వ నమః।

**ఓం "ఉత త్వ" ఇతి మంత్రస్య। బృహస్పతిః ఋషిః। 'త్రిష్టుప్' ఛందః।**
**సరస్వతీ దేవతా। "సం" ఇతి బీజ శక్తి కీలకమ్। మంత్రేణ న్యాసః॥**

**శ్లో॥ యాం విదిత్వ అఖిలం బంధం నిర్మథ్యాఖిల వర్త్మనా**
**యోగీ యాతి పరం స్థానం సా మాం పాతు సరస్వతీ।**
**"సం" – ఉత త్వః పశ్యన్ నద దర్శ వాచమ్,**
**ఉత త్వ శృణ్వన్ న శృణోతి ఏనామ్, ఉతో తు అస్మై తన్వా**
**అం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః।**

ఏ దేవీ తత్త్వమును తెలుసుకొనుటచే యోగి అన్ని మార్గములలోని బంధములన్నీ త్రెంచివేసి, ఏ పరస్థానమును చేరుచున్నాడో, అట్టి కేవలము – దివ్యము అగు పరత్మానంద స్వరూప స్థాన దేవతయగు శ్రీ సరస్వతీదేవి మాపై కరుణ, వాత్సల్యము ప్రసరింపజేసి కాపాడునుగాక! అక్కునకు జేర్చుకొనునుగాక!

ఏదేవి కరుణించకపోతే,

- ఈ దృశ్యజగత్తంతా ఆ దేవీ స్వరూపమై ఉండి కూడా....జగత్తు మాత్రమే చూడగలంగాని దేవీ స్వరూపంగా చూడలేమో,
- శబ్దములన్నీ వాక్‌దేవతా రూపిణి స్వరూపమే అయినప్పటికీ మాటలను వినగలముగాని, వాటికి ఆధారమైన వాగ్దేవతను దర్శించలేమో....,

ఆ వాగ్దేవత – తీయ తీయటి మాటలతో సంతోషింపజేయు పతివలె – మా వాక్కును చేరి ఉండునుగాక! ఆ దేవి మా ప్రార్థనను, మాయొక్క ఉపాసనా శబ్దజాలార్థములను ప్రేమాస్పదయై స్వీకరించునుగాక! అట్లు స్వీకరించి, అతి రహస్యమగు తన సర్వాత్మతత్త్వమును గురువై విశదపరచునుగాక! బ్రహ్మతత్త్వమును మా బుద్ధికి సుస్పష్టపరచును గాక! ఆ తల్లి ప్రత్యక్షమై బోధించును గాక।

## 10. ఓం। 'ఐం'। అంబితమ నమః।

**ఓం "అంబితమ" ఇతి మంత్రస్య। గృత్స్నమద ఋషిః। 'అనుష్టుప్' ఛందః।**
**సరస్వతీ దేవతా। "ఐం" ఇతి బీజ శక్తి కీలకమ్। మంత్రేణ న్యాసః॥**

**శ్లో॥ నామ రూపాత్మకం సర్వం యస్యాం ఆవేశ్యతాం పునః**
**ధ్యాయంతి బ్రహ్మరూపైకా సా మాం పాతు సరస్వతీ॥**
**"ఐం" - అంబితమే నదీతమే దేవితమే సరస్వతి,**
**అప్రశస్తా ఇవ స్మసి ప్రసస్తిమ్ అంబ న స్కృధి॥**

నామ రూపాత్మకంగా కనిపిస్తూ వస్తున్నట్టి ఈ సమస్త జగత్తును **ఏ దేవత సర్వదా ఆవేశ్య ఇయి (ఆవేశించినదై) ఉన్నదో....**, ఇదంతా **బ్రహ్మము రూపముగానే ఎవరిచేత తెలియజేయబడుచున్నదో....**, అట్టి జగద్గురువు, ప్రేమమూర్తి, మాతృవాత్సల్య స్వరూపిణి, బ్రహ్మము అగు శ్రీ సరస్వతీదేవి మనకు సర్వదా రక్షకురాలై, బోధకురాలై, దిశానిర్దేశకురాలై మనలను నడుపునుగాక!

అమ్మా! జగదంబా! నీవే మమ్ములను పవిత్రము చేయు నదీ దేవతవు. ఓ దేవదేవీ! శ్రీ సరస్వతీ జగజ్జననీ! అంబా! మాపై కరుణ ప్రవహింపజేయుము. మాలోని అప్రశస్తమును (సంకుచితత్వమును) తొలగించి **'పరబ్రహ్మతత్త్వ జ్ఞానకాంతి'** అనే ప్రశస్తత్వమును ఆవిష్కరించవమ్మా! అందులకై మీకు చేతులెత్తి మ్రొక్కుచున్నాము.

---

### స్తుతి

**చతుర్ముఖ ముఖాంభోజ వన హంసవధూః మమ**
**మనసే రమతాం నిత్యం, సర్వ శుక్లా సరస్వతీ॥**

ఓ చతుర్ముఖ బ్రహ్మయొక్క 'ముఖములు' అనే పద్మపుష్పములుగల సరస్సునందు సంచరించు ఓ పరమహంస స్వరూపిణీ! ఓ సరస్వతీ దేవీ! తెల్లటి ప్రకాశముతో దీపించు తల్లీ! **మమ మానసే రమతాం నిత్యమ్!** నా మనోసరోవరములలో నిత్యము రమించవమ్మా! నీ ప్రేమాస్పద తెల్లని కాంతి పుంజములతో మా హృదయసరోవరములోగల చీకటిని పారద్రోలివేయి!

**శ్లో॥ నమస్తే శారదా దేవి। కాశ్మీరపురవాసిని।**
**త్వామ్ అహం ప్రార్థయే నిత్యం। విద్యాదానం చ దేహి మే।**
**అక్షసూత్ర అంకుశధరా। పాశ పుస్తక ధారిణీ।**
**ముక్తాహార సమాయుక్తా। వాచి తిష్ఠతు మే సదా।**
**కంబు కంఠీ సు తామ్రోష్ఠీ। సర్వాభరణ భూషితా।**
**మహా సరస్వతీ దేవీ, జిహ్వాగ్రే సన్నివేశ్యతామ్॥**

**శ్లో॥ యా శ్రద్ధా ధారణా మేధా, వాగ్దేవీ। విధి వల్లభా।**
**భక్త జిహ్వాగ్ర సదనా। శమాదిగుణ దాయినీ।**
**నమామి యామినీనాథ రేఖాలంకృత కుంతలామ్।**
**భవానీం। భవసంతాప నిర్వాపణ సుధా నదీమ్।**
**యః కవిత్వం నిరాంతకం భుక్తీ ముక్తీ చ వాంఛతి,**
**సో అభ్యర్చ్య ఏనాం దశశ్లోక్య నిత్యం స్తౌతి, సరస్వతీమ్॥**
**తస్య ఏవం స్తువతో నిత్యం సమభ్యర్చ్య సరస్వతీమ్।**
**భక్తి శ్రద్ధాభియుక్తస్య షాణ్మాసాత్ ప్రత్యయో భవేత్॥**
**తతః ప్రవర్తతే వాణీ స్వేచ్ఛయా లలితాక్షరా।**
**గద్య పద్యాత్మకైః శబ్దైః అప్రమేయైః వివక్షితైః (విపక్షితైః)**
**అశ్రుతో బుధ్యతే గ్రంథః ప్రాయః సారస్వతః కవిః॥**

ఓ శారదా దేవీ! కాశ్మీరపు వాసినీ! నమస్తే। నమస్తే। నమో నమః। నిన్ను ఎల్లప్పుడు జగత్ రూపిణిగా భావిస్తూ, ప్రార్థిస్తూ మాయొక్క సర్వకర్మలు సమర్పిస్తున్నాము. 'అజ్ఞానము' అనే పేదరికములో మ్రగ్గుతూ ఉన్న మేము మిమ్ములను జ్ఞానభిక్ష అర్థిస్తున్నాము! మాకు ఆత్మవిద్యను, దైవీ సంపదా అభ్యాసములను భిక్షగా ప్రసాదించు! **విద్యా దానం చ దేహి మే!**

ఒక చేతిలో రుద్రాక్ష జపమాలను, అంకుశమును, మరొక చేతితో పుస్తకమును ధరించినట్టి దేవీ! ముత్యాలహారము ధరించిన జననీ! నీవు ఎల్లప్పుడు నా వాక్కునందు నివసించమని ఆహ్వానము పలుకుచున్నాము. నెమలి కంఠము గలదానా! ఎఱ్ఱటి పెదిమలతో శోభిల్లు జననీ! సర్వ ఆభరణములు అలంకరించి ఉన్నదానా! హే మహాసరస్వతీ దేవీ! దయతో, కరుణతో, వాత్సల్యముతో నన్ను ఉద్ధరించటానికి, సర్వలోకములకు శుభ శాంతి ఐశ్వర్య ఆనందములు కలుగజేయటానికి నా నాలుకపై నివసించవలసినదిగా, సన్నివేశ్యమై ఉండవలసినదిగా నా ప్రార్థన, అభ్యర్థన!

ఏ దేవి అయితే

- శ్రద్ధ – మేధ – ధారణలను ప్రసాదించు దివ్యచైతన్య స్వరూపిణియో,
- వాక్కుకు దేవతయో, చైతన్య స్వరూపిణి ఆయి తల్లివలె మాటలను పలికించుచున్నదో,
- సృష్టికర్తయగు బ్రహ్మ దేవుని పట్టమహిషియో, సమస్త సృష్టికి శ్రీదేవియో,
- స్వభావం చేతనే భక్తుల నాలుక చివర ఎల్లప్పుడు ప్రేమాస్పదమగు భక్తి – జ్ఞాన – యోగ – విజ్ఞాన శబ్దముల, భావముల రూపముగా వికాసమును కలిగించుచున్నదో,
- చేతులెత్తి నమస్కరించినంతమాత్రముచేత శమము – దమము మొదలైన దివ్యగుణములను ప్రసాదించుచున్నదో....

అట్టి సరస్వతీ దేవికి నమస్కారము. చంద్రరేఖలుగల కుంతలములను ధరించినట్టి భవానీ! భావనా స్వరూపిణీ! (ఈ జగత్తు నిజంగానే జగత్తుగా ఉన్నది ...అనే) భావ బంధ సంబంధమైన సంతాపములను తొలగించు భావాతీత స్వరూపిణీ! అమృత నదీస్వరూపిణీ! భవ సంతాప నిర్వాపణ సుధానదీం। శ్రీ సరస్వతీ దేవీ! నమస్కారము! నమామి! నమోనమః! నమస్తే! నమస్కరోమి!



ఎవ్వరైతే నిరాతంకమైన కవిత్వమును, సమృద్ధమగు భుక్తిని, అనునిత్యము–స్వాభావికము అను ముక్తిని కోరుకుంటారో, అట్టివారికి ఈ దశ శ్లోక పాఠము చక్కటి దివ్యమైన మార్గము. దశ శ్లోకములను తాత్పర్యార్థ సహితముగా నిత్యము పఠిస్తూ ఉండగా, శ్రీ సరస్వతీదేవి యొక్క కరుణారసమును పొందగలరు.

ఈ విధంగా ఎవరు దశశ్లోకీ సరస్వతిని భక్తి – శ్రద్ధ తాత్పర్యపూర్వకంగాను, మహత్మ్యపూర్వకంగాను ఉపాసిస్తారో, వారికి ఆరు (6) నెలల్లో అనిర్వచనీయమైన **'ఆత్మవిశ్వాసము'** తనకు తానై మనస్సునందు వికసించగలదు. లలితాక్షరములతో కూడిన 'వాణి' స్వేచ్ఛగా హృదయమునందు, కంఠమునందు ప్రకాశమానమవగలదు. సాంస్కృతికములు, ఒక పక్షమునకు పరిమితము కానివి, సంస్కారయుక్తములు, వివేకియుక్తములు అగు గద్య – పద్యములు తమకు తామే హృదయమునందు ప్రవేశించి ఆతని పెదమల నుండి జాలువారగలవు. తాను చదువని, వినని గ్రంథములలోని సారవిశేషాలు కూడా...ఆతనియందు స్రవంతి వలె బయల్వెడగలవు. **ఆతడు సారస్వత యుక్తుడగుచున్నాడు.** అందరిలో శ్రేష్ఠుడు (కవి) అగుచున్నాడు.

---

ఈ విధంగా దశశ్లోకీ తత్త్వార్థ మహిమను శ్రీ అశ్వలాయన మహర్షి వివరించగా శ్రోతలగు ఋషి పుంగవులు పులకిత శరీరులైనారు. భక్తి పారవశ్యముతో శ్రీ సరస్వతీదేవిని నామ–రూపాత్మకంగాను, సచ్చిదానంద తత్త్వముగాను దశశ్లోకీవిధ విధానంగా స్తోత్రం చేస్తూ గానం చేయ సాగారు. వారి భక్తి పారవశ్యతకు సంతోషించినదై, జగన్మాతయగు శ్రీ సరస్వతీదేవి అక్కడ ప్రత్యక్షమైనది. అక్కడి భక్తజనులందరినీ అవ్యాజమైన ప్రేమతో, మధురాతిమధురమైన చిరునవ్వుతో పలకరించింది.

---

## జగన్మాతౌవాచ :

ఓ బిడ్డలారా! ఋషి పుంగవులారా! విప్రవర్యులారా! గురు–శిష్య జనులారా! అస్మత్ వాత్సల్య – ఆనంద స్వరూపులారా! ఈ అశ్వలాయనమహర్షి చెప్పుతూ వస్తున్న శ్రీ సరస్వతీ దశశ్లోకీ శబ్ద – అర్థ – ప్రతిపాదనమంతా **పరమ సత్యము!**

తనయొక్క విహిత కర్మలను నాకు సమర్పిస్తూ భక్తి శ్రద్ధలతో అర్చించిన జీవుడు నాచే **'ఆత్మ విద్య'**ను పొందినవాడై, సమస్త జన్మ–కర్మలకు మునుముందే స్వస్వరూపమై ఉన్న **సనాతన స్వరూపమగు 'బ్రహ్మము'**గా సంతరించుకొనగలడు. వ్యష్టి – సమిష్టి ధర్మములను అధిగమించి సనాతనమగు ఆత్మస్వరూపియై, **'సనాతన ధర్మి'** అయి ప్రకాశించగలడు. బ్రహ్మతత్త్వమును ఎరిగిన **'బ్రాహ్మణుడు'**గా విరాజిల్లగలడు. ఇతి మంగళాశాసనమ్।

**సత్–చిత్–ఆనంద రూపమగు పరబ్రహ్మమే నా నిత్య–సత్య–వాస్తవరూపము. నా <u>చేతనే</u> ఈ ఎదురుగా మీకు కనిపిస్తున్న సత్వ – రజో – తమో గుణ, నామ రూపాత్మక సామ్యరూపమగు 'ప్రకృతి' – క్రీడా వినోదరూపంగా – సృష్టించబడుచున్నది.**

దర్పణము(Mirror) లో దృశ్యము కనిపించవచ్చుగాక! **"దర్పణములో నా ముఖము చిక్కుకొని ఉన్నది కదా!"** అని తలచి ఎవ్వడైనా

తన ముఖము కొరకై దర్పణమునకు ముందు – వెనుక (లేక) దర్పణములో వెతుకుతాడా? లేదు కదా! దర్పణములో దృశ్యము లేకపోయినప్పటికీ, 'ప్రతిబింబ న్యాయము' చే మాత్రమే అగుపిస్తోంది కదా! అట్టిదే ఈ జగత్ దృశ్యము సుమా! ఇదంతా **మనో దర్పణంలో కనిపించే ప్రతిబింబ మాత్రము.**

అయితే,

దర్పణములో ఒకడు తన ముఖము తానే చూచుకొనుచున్న తీరుగా, ఆ ముఖము తనదే అయినట్లుగా,

- నిత్యసత్యమగు నేనే ప్రకృతి రూపిణిని కూడా!
- నాకు నేనే త్రిగుణరూపమగు సృష్టిగా వినోదినై భాసిస్తున్నాను. ఈ విధంగా సృష్టితో ప్రదర్శనమగుచున్న సత్త్వ–రజో–తమో గుణములు నా భావనా చమత్కృతులే! నవలలో కనిపించే పాత్రల యొక్క గుణాలన్నీ నవలా రచయితయొక్క ఊహా చమత్కారాలే కదా! ఈ సమస్త జగత్–దృశ్యము నాయొక్క సంప్రదర్శనా చమత్కారమే! నాకు ఏదీ ఎక్కడా వేరైనది కాదు.

ప్రకృతినీ నేనే! ఆ ప్రకృతిని ఆస్వాదించుచున్న పురుషుడను కూడా నేనే! (I am the Experiences as well as Experiencer).

వాస్తవానికి ప్రకృతి – పురుషుడు (Experiences and Experiencer, Perceptions and Perceiver, Feelings and Feeler) వేరు వేరు కాదు. అందుచేత, ఏకస్వరూపిణగు నేను అనేకమును కల్పించుకుంటూ మరల ఇంతలోనే ఎప్పుడో ఆ అనేకమును నా 'ఏకము' నందు యథాతథంగా లయింపజేసుకుంటూ ఉంటాను. జలమునకు తరంగము వేరుకాని తీరుగా, బంగారమునకు ఆభరణము వేరుకానివిధంగా – ఈ సమస్త దృశ్యము నాకు వేరుకాదు. ఇదంతా నాయొక్క తేజోరూపమే!

ఒక కథా రచయిత 'ఇప్పుడు నేను ఒక కథ వ్రాయాలి'....అనే ఆలోచన పొందుతీరుగా మొట్టమొదట నాయందు **'సృష్టి అనే లీలను కల్పించాలి'**....అనే **'శుద్ధ సత్త్వ ప్రధానాంశ'** బయల్వెడలుతోంది. అంతకు ముందో! నేను నేనే అయి ఉండి ఉన్నాను. నా నుండి సృష్టి సత్త్వభావన....ప్రథమతరంగంగా బయల్వెడలుతోంది. అట్టి ప్రథమభావన నుండి సృష్టి సంకల్ప భావికుడగు అజుడు (బ్రహ్మదేవుడు) బయల్వెడలుచున్నారు. నానుండి సృష్టికర్త – సృష్టి భావన – సృష్ట్యనుభవి – సృష్టి చతుర్ముఖములుగా బయల్వెడలుచున్నాయి.

ఇంకా, నా నుండి **'ఈశ్వరుడు, జీవుడు'** అను రెండు విశేషాలు మాయ చేత బయల్వెడలుచున్నాయి.

ఈశ్వరుడు 'ఈ మాయ నాది కదా!'...అనే ఎరుక కలిగి ఉండటం చేత, ఆతడు సర్వజ్ఞత్వము కలిగి ఉంటున్నాడు. మాయ ఆతని స్వవశకములోని (own control) **ఉపాధి.** (Instrument under Eswara's use).

| | | |
|---|---|---|
| మాయ | = | Vehicle. వాహనము. |
| ఈశ్వరుడు | = | Driver. చోదకుడు. |

***ఇక జీవుడో? ఆతనికి ఈ భౌతిక శరీరమే ఉపాధి. దేహ చోదకుడు. అయితే, 'నేను మాయలో చిక్కుకున్నాను' అను రూపముతో కూడిన కించిజ్ఞుడు.***

నాయొక్క సత్త్వ ప్రధానమగు ప్రకృతియే 'మాయ' అను పేరుతో వేదాంత శాస్త్రము (తత్త్వశాస్త్రము)చే పిలువబడుచున్నది. అదియే కల్పన, ఊహ, భావన, మనస్సు మొదలైన పేర్లతో శాస్త్ర ప్రసిద్ధము.

యా మా – నాకు వేరుగా వాస్తవానికి లేకపోయినప్పటికీ, నాకు ద్వితీయమైనదిగా అనిపించుటమే మాయ.

నాయొక్క ఈశ్వరోపాధి మూడు (3) విలక్షణ – లక్షణములు కలిగి ఉన్నది.

(1) **వశ్య మాయత్వము** (మాయ తన వశమై ఉండటము)

(2) **ఏకత్వము** (తన కల్పనయొక్క రూపము తానే అయి ఉండటము)

(3) **సర్వజ్ఞత్వము** (తాను–తన ఉపాధుల ఉత్పత్తి, స్థితి లయములు–ఇవన్నీ తనకు వేరుగా ఎరిగి ఉండి, సాక్షియై దర్శిస్తూ ఉండటము)

అట్టి ఈశ్వరుడు అనేక నవలలను రచయించు గొప్ప రచయితవలె ఒక్కోసారి ఒక్కొక్క ఊహాపరంపరత్వము (Serial of thought) స్వీకరించుచు, ఆ సర్వమునకు సర్వదా వేరై ఉన్నాడు. నవలలోని ఏ పాత్ర యొక్క లక్షణాలు నవలా రచయితకు ఆపాదించలేముకదా! దృష్టాంతంగా.....

- ఈ ఒక నవలలో తన్మయమై వ్రాస్తూపోతున్న సందర్భముల– జీవుడు – జగదనుభవము.
- అనేక నవలలు వ్రాయు నవలా రచయితగా ఈశ్వరుడు – మాయకు కర్త (మాయి).

ఇంకా కూడా మరికొన్ని ఈశ్వరత్వమును సంబంధించిన విశేషాలు:

(1) శుద్ధ సాత్త్వికత్వము

(2) సమిష్టి రూపత్వము

(3) జగత్ సాక్షి

ఇట్టి విశేషాలు కారణంగా... ఈశ్వరుడు **కర్తుంవా, అకర్తుంవా చ, అన్యధా కర్తుమ్ ఈశతే।**

(1) జగత్తుకు కర్త కాగలడు.

(2) జగత్తుకు అకర్త అయి ఉండగలడు.

(3) జగత్తును మరొకరీతిగా చేసివేయగలడు.

(నవలా రచయిత కథను ఎట్లా అయినా మలుపు త్రిప్పగలడు – అను విధంగా, ఒక నటుడు తనకు ఒక నాటకంలో తనకు ఇష్టమైతే నటించగలడు. లేదా, తనకు ఇష్టము లేకుంటే ఆనాటకంలో నటించడు–అనుతీరుగా)

జీవుడు ఒక నాటకము (జగన్నాటకము)లోని ఒక పాత్ర – ఆ పాత్రయొక్క లక్షణములతో మమేకమగుచుండగా, ఇక ఈశ్వరుడో?

- సర్వజ్ఞుడు (అనేక పాత్రలను నిర్వర్తించుటమును ఎరిగి ఉంటున్నవాడు).
- సమిష్టి భావకుడు.
- కేవల సాక్షి.

ఈ ఈ లక్షణముల చేతనే **'ఈశ్వరుడు'** అని పిలవబడుచున్నాడు. నేనే జీవుడను। నేనే ఈశ్వరుడను కూడా। నేను పరాత్–పరమును।

# మాయ

ఈశ్వరుడు 'ఊహ'ను కల్పించుకొని, ఆ ఊహలో తన ఈశ్వరత్వమును ఏమరచి, అందులో తానే ఒక పాత్రధారి అయి ఆ ఊహలో అనేక ఉప – ఊహలతో తన్మయమై ఉండటమును **'మాయ'** అని చెప్పుచున్నారు. అట్టి నా మాయ – రెండు (2) శక్తుల రూపముగా ప్రదర్శితమగుచున్నది.

## జీవుని దృష్ట్యా చూస్తే...,

**(1) జీవ – విక్షేప శక్తి** (Constantly distracting from one idea to another, from one fondness to another etc.,)

**(2) జీవ – (ఆవరణ) ఆవృత శక్తి :** ఒక విశేషమును ఆవరించి ఉండి, ఆ విషయముతోను, సందర్భముతోను సంఘటనతోను, సంబంధముతోను మమేకమై ఉండటము. "నా పరిధి ఇంత మాత్రమే" – అని అనుకుంటూ ఉండటము.

(i) **ఆవరించటం**. ఒక విషయమును తాను ఆవరించినవాడై ఉండి **'నేను ఇంతే, ఇంతవరకే!'** అని తలచటం తానుకొన్ని విషయములను ఆవరించి పరిమితమవటం. ప్రాపంచక ఆశయములనే గట్టిగా పట్టుకొని కాలమును గడుపుతూ ఉండటము.

(ii) **ఆవరించబడి ఉండటం.** కొన్ని దృశ్య విషయాలచే ఆవరించబడి (Having been covered), ఆతని జ్ఞానము అంతకు మించి చూడటానికి సిద్ధపడకపోవడం (Confining in between some beliefs, informations, situations etc., and not prepared to examine, beyond worldly scenario).

## ఈశ్వరమాయ దృష్ట్యా చూస్తే....,

**ఈశ్వర మాయయొక్క విక్షేపశక్తి: విక్షేపశక్తి లింగాది బ్రహ్మాండాంతమ్ జగత్ సృజేత్।** లింగము (అంతరంగము) – అను మూల ప్రకృతి నుండి బ్రహ్మాండము వరకు ఉన్నది ఈశ్వర విక్షేపణ శక్తి। ఒక నవలా రచయిత అనేక కథా – కథనములు కలిగిన వేరువేరైన నవలలను, ఆ నవలలలోని ప్రతి ఒక్కదానిలో వేరువేరైన స్వభావములు కలిగిన పాత్రలను కల్పించగలడు, ఆ పాత్రలను మధ్యమధ్యలో ముగించగలడు కూడా కదా! అట్లాగే నాయొక్క ఈశ్వర సంబంధిత మాయ నుండి లింగ (గుణ)భేదములతో కూడిన బ్రహ్మాండములు ఒకటి తరువాత మరొకటి బయల్వెడలుచూ ఉంటాయి. అదియే ఈశ్వర విక్షేపశక్తి. **లింగ స్వరూపము (మూల / కేవల స్వరూపము) నుండి – బ్రహ్మాండానుభవము వరకు సమస్తము ఈశ్వర మాయయే!**

**ఈశ్వర మాయయొక్క ఆవరణశక్తి :** ఈ ఆవరణశక్తి అంతరమున బాహ్యమున భేదము అనుభూతమగునట్లు చేయుచుండటము.

**అంతర్ – దృక్ – దృశ్య యో భేదం :** అంతరముగా దృక్ – దృశ్యము (చూచువాడు – చూడబడునది) ఈ రెండిటిని వేరు వేరుగా సంబంధమే లేనివైనట్లు చూచుచుండటము. అంతరమున గల మనో బుద్ధి చిత్త అహంకారములు, త్రిగుణములు, దృక్–దృశ్య–దర్శన సంస్కారములు – ఇవన్నీ ఈశ్వర – ఆవరణశక్తి మాయా రూపములే!

**బహిశ్చ బ్రహ్మ–సర్గయోః :** బాహ్యమున బ్రహ్మము – సర్గములను (సంసారమును) వేరు వేరైనట్లు చూపుతోంది. "ఇది నాకు బంధము. ఇది నాకు మోక్షము" – అను కల్పనలు.

సమస్త భేద దృష్టులు – బ్రహ్మముపట్ల భేద కల్పనలు – ఇవన్నీ బహిర్గత ఆవరణశక్తి రూపములే.

ఏదైతే ఆత్మతత్త్వమును ఆవరించి ఉన్నదో అద్దానిని **ఆవృతశక్తి** (లేక) **ఆవరణశక్తి** అంటున్నాము. అదియే నాయొక్క 'అపరాశక్తి' అని కూడా చెప్పబడుతోంది. అట్టి ఆవృతశక్తి (లేక) అపరాశక్తియే **'సంసారము'** అనబడుదానికంతటికీ కారణము అయి ఉన్నది. అయితే ఆవరణ – అపరాశక్తి లింగ (గుణ) భేదములతో భాసిస్తున్నప్పటికీ, స్వతఃగా జడమై, అద్దాని **'సాక్షి'ని, 'చైతన్య స్వరూపిణి'**ని అగు నాయొక్క సమక్షములో మాత్రమే భాసిస్తోంది. అనగా ఆత్మచైతన్యము యొక్క సమక్షములోనే లింగభేదరూపమగు అపరాశక్తి చైతన్యము పొంది ప్రవర్తించుచున్నది. స్వతఃగా చూస్తే అది జడము. కేవలమగు ఆత్మ మాత్రమే చైతన్యము.

ఆవరణ – విక్షేపరూప, జీవ – ఈశ్వర "మాయ" యొక్క ముఖ్య లక్షణములు: **1. నాచే స్వయం కల్పితము 2. స్వతఃగా చూస్తే అసత్తు. 3. క్రీడా – లీలా – వినోద రూపము 4. ఆత్మతత్త్వ స్వరూపిణినగు నాకు 'అనన్యము'. కేవలమగు ఆత్మనగు నాకు ఈ నాలుగు కూడా మాయా కల్పిత చతుర్ముఖములు.**

## జీవుడు

***మరి ఈ 'జీవుడు' అనగా ఎవ్వరు? ఎక్కడ నుండి వచ్చాడు? ఈ ప్రయాణము ఎటు?*** ఈ విషయము వివరిస్తున్నాను. వినండి.

చిత్ + ఛాయా
బింబము + ప్రతిబింబము
సహజము – సందర్భము

ల సమావేశమే 'జీవుడు'. **"ఛాయా పురుషుడు"** అనగా? వెలుగు ఆవల నీడయేగాని వేరైన ఉనికి అని కాదు. సహజ పురుషునికి (Original person) ఉనికి ఉన్నదిగాని ఛాయాపురుషునికి (Reflecting form) ఉనికి ఎక్కడిది? (అట్లాగే) ఎవరు జలమునకు ఈవలనే ఉండి, జలములోని ప్రతిబింబము తనదై ఉన్నాడో...ఆతనికి మాత్రమే ఉనికి ఉన్నది. అయితే, జలములోని ప్రతిబింబ రూపము (Feflecting form) నకు జలమునకు ఈవల గల బింబము కంటే (పురుషునికంటే) వేరైన ఉనికి ఉంటుందా? లేదుకదా! కాబట్టి,

శ్లో॥ **చితిః ఛాయాత్ సమావేశాత్ జీవస్యాత్ వ్యావహారికః।**
**అస్య జీవత్వమ్ ఆరోపాత్ సాక్షిణ్యపి అవభాసతే॥**

చిత్–ఛాయ (Original Form + Reflection) ల సమావేశమును వ్యావహారికంగా 'జీవుడు' అని పిలుస్తున్నాం. అనగా, నేను **కేవలసాక్షిని.** అట్టి నాయొక్క కేవల సాక్షిత్వము యథాతథమై ఉండగా, అద్దానియందు బంగారమునందు ఆభరణముల వ్యవహారమువలె, చిత్ – ఛాయా ఆరోపణత్వము రూపంగా **జీవుడు – జీవత్వము (ఈశ్వరుడు)**... ఈ రెండు అవభాసిస్తున్నాయి. (Just like reflection in water or mirror)

జలములో జలమే ఉన్నది గాని, ప్రతిబింబ వస్తువు వాస్తవానికి లేదు. ఒకడు జలములో తన ముఖము చూస్తున్నప్పటికీ, ఆతని ముఖము జలములో లేదు కదా! అట్లాగే నా యందు సర్వదా నేనే ఉన్నాను. నాకు వేరై జీవుడు లేదు. జగత్తు లేదు. 'త్వమ్' లేదు. 'అహమ్' లేదు. 'ఈశ్వరుడు' లేదు.

చైతన్యశక్తి యొక్క **'విషయములను ఆశ్రయించి ఉండటం'** అనే ఆవృతత్వము చేత జీవుడు – ఈశ్వరుడు – జగత్తులు .... నామరూపాత్మకంగా ప్రతిబింబిస్తున్నాయి. ఈ జగత్‌లో కనబడే అనేక భేదవిషయాలన్నీ 'ఆవృతత్వము' అనే మాయశక్తి చేతనే కల్పితమగుచున్నాయి. **ఆవృతౌతు వినష్టాయాం భేదే భాతే ప్రయాతి తత్।** అట్టి ఆవృతత్వము తొలగిందా...చిత్–ఛాయా–భేదమంతా (జీవ– ఈశ్వర – జీవానుభవభేదమంతా) తొలగిపోగలదు. అట్టి ఆది శేష్యమగు నేనే **'పరమాత్మ'** అను పేరుతో పిలువబడుతోంది.

చిత్–ఛాయ (బింబ–ప్రతిబింబ) భేదము వంటిదే సర్గము–బ్రహ్మము (సృష్టించబడినది–సృష్టికర్త)ల యొక్క భేదము కూడా! **తథా సర్గ బ్రహ్మణోశ్చ భేదమ్ ఆవృత్య తిష్ఠతి।** మాయ యొక్క ఆవృత్య శక్తి చమత్కారము చేతనే ద్రష్ట–దృశ్యము **'వేరువేరైనవి వలే'** అగుపిస్తున్నాయి.

వాస్తవానికి బ్రహ్మము – సర్గము (సృష్టికర్త – సృష్టి) అనునవి రెండూ వేరువేరుగా లేవు. **బ్రహ్మమే సృష్టి! సృష్టి బ్రహ్మమే అయి ఉన్నది.** బ్రహ్మముయొక్క **'స్వీయవికృతి'** రూపముగా ఏ శక్తి భాసిస్తోందో, అద్దాని స్వీయశక్తి చేత ఆవరణము (ఆవృతము) నశింపజేయబడుచున్నప్పుడు బ్రహ్మము – సర్గముల భేదము తొలగిపోవుచున్నది. అప్పుడు 'సర్గము' లేక 'సంసారము' అనే వికారము **'మొదలే లేనిది'**గా అగుచున్నది. ఏకమగు బ్రహ్మమే సర్వదా శేషించినదై ఉంటోంది. **'సృష్టి', 'జీవుడు', 'ఈశ్వరుడు'....ఇటువంటివేవీ కూడా బ్రహ్మమునందుగాని, బ్రహ్మమునకు వేరుగా కానీ...లేవు'** – అను నిశ్చల నిశ్చయము స్వానుభవంగా ఆరూఢమగుచున్నది. **"దృశ్యము లయించటము" – అనగా ఇక్కడ ఏదో నశించటము కాదు. దృశ్యము పరమాత్మ స్వరూపిణినగు నాకు అనన్యముగా స్వాభావికంగాను, కృతనిశ్చయంగాను, అచ్యుతముగాను అనిపించటము।**

✣

బ్రహ్మము సర్వదా యథాతథమై ఉండగా...అద్దానిగురించి బోధించటానికి సిద్ధమగుచున్న ఆధ్యాత్మశాస్త్ర (ప్రవచనములు) – **బ్రహ్మముయొక్క పంచ – అంశలు** (Five Artistic Appeareneces) కల్పించి, తత్త్వమును విశదీకరిస్తున్నాయి.

**(1) అస్థి** (ఉనికి A sense of 'I am' - I Exist).

**(2) భాతి** (**ప్రకాశము** – The feature of Enlightenment / function of knowing).

**(3) ప్రియము** (ఆనందోత్సాహము Keeping entertained and enjoying).

**ఆద్య త్రయమ్ బ్రహ్మరూపమ్।** ఈ మొదటి మూడూ కూడా నిశ్చలమగు బ్రహ్మముయొక్క మార్పుపొందనట్టి అంశలు.

**(4) నామము (5) రూపము– జగద్రూపమ్ తతో ద్వయమ్।** ఈ రెండు మార్పు చెందు స్వభావముగల **జగత్‌దృశ్య** సంబంధమైన **అంశలు. అస్థి భాతి ప్రియములు నాయొక్క సహజ రూపము. నామ రూపములో, కల్పితము (లేక) ఆపాదితము.**

**(జగత్ = జనిస్తూ, గతిస్తూనే మధ్యకాలంలో ఉన్నట్లే కనిపిస్తున్నట్టిది).**

## బాహ్య – అభ్యంతర సమాధి – ఉపాసన

**శ్లో॥ ఉపేక్ష్య నామ – రూపే ద్వే సత్–చిత్–ఆనంద తత్పరః**
**సమాధిం సర్వదా కుర్యాత్ 'హృదయే'వ – అథవా 'బహిః'।**

ఓ బిడ్డలారా! సర్వదా వేంచేసిఉన్న పరస్వరూపిణిగా నా గురించి గురువులు చెప్పుచున్నది విని, అర్థము చేసుకోండి. మీరు నాకు ఎందుకు అనన్యమో గమనించండి. జీవ–ఈశ్వర తత్త్వములు జనించు స్థానమగు **పరమాత్మతత్త్వము** చేరటానికి ఒకేసారి ఆశ్రయించవలసిన **రెండు ఉపాయాలు** మీకు ఇప్పుడు సూచిస్తున్నాను. వినండి.

1. **దృశ్య ఉపేక్షిత్వము –** జగత్ దృశ్య సంబంధమై, కాలముతో జనించి కాలముతో నశించు స్వభావము కలిగినట్టి నామరూపములను ఉపేక్షించి ఉండటము.
2. **ఆత్మతత్పరత్వము –** ఈ జగత్తు యొక్క, మీ సహజీవుల యొక్క, మీ యొక్క, నాయొక్క **సత్ – చిత్ – ఆనంద తత్త్వమునందే తత్పరులై ఉండటము.**

పై రెండు ప్రక్రియలతో కూడిన **సమాధి అభ్యాసమును** నిరంతరము బుద్ధితో నిర్వర్తిస్తూ ఉండండి. అట్టి అభ్యాసమును (1) ఇంద్రియములకు విషయమగుచున్న బాహ్యమునందును (2) మనో–బుద్ధి–చిత్త–అహంకారములతో కూడిన **అంతరమునందు కూడా** నిర్వర్తించువారై ఉండండి.

సత్–చిత్–ఆనంద అంశలనే సర్వదా ఆశ్రయిస్తూ ఇక నామ–రూప అంశలను,

- సందర్భ పరిమితమైనవిగాను (Merely Incidental / Incident related).
- సందర్భమును దాటి చూస్తే–అవి లేనట్టివిగాను (If seen beyond incident, Form and Name, donot infact exist).

గాచూడండి. నామ – రూపములు స్వతఃగా ఉండినట్టివి కావు. 'ఉన్నాయోమే' అని –అనుకోవటంచేతనే ఉంటున్నాయి.

**ఇటువంటి దృష్టి – అవగాహనలను ఆశ్రయించి ప్రవృద్ధము చేసుకోండి.**

# ద్వివిధ సమాధి తీరులు

**సవికల్పో నిర్వికల్పః సమాధిః ద్వివిధో హృది।**

**(1) సవికల్ప సమాధి (2) నిర్వికల్ప సమాధి** – అనునవి హృదయములో రూపు దిద్దుకొను రెండువిధములైన సమాధులు.

**(1) సవికల్ప సమాధి** (External) : **దృశ్య శబ్దాను భేదేన సవికల్పః పునః ద్విధా।** దృశ్యము – శబ్దముల భేదము చేత ఈ సవికల్ప సమాధి రెండు తీరులైనవి.

ఈ చిత్తము ఏఏ కామములను (కోరికలను) కలిగి ఉన్నదో, ఆ తీరుగానే దృశ్యమును చూడటం జరుగుతోంది. అనగా, చిత్తములో ఉన్నదే దృశ్యముగా అనుభవమగుచున్నది. చిత్తములో లేనిదేదీ దృశ్యముగా ఫలదీకరించ జాలదు.

- 1. ఏదేది చూడబడుచున్నదో,....అది పరబ్రహ్మముగా భావనచేయటము.
- 2. చూచువానిని గమనించుచూ ఆ చూచువానినే పరబ్రహ్మముగా భావనచేయటము.

ఈ రెండూ సవికల్ప సమాధి యొక్క రెండు అంగములు.

ఈ దృశ్యము **'జడము'**. ద్రష్టయో **'చైతన్యము'**.

జడమగు 'దృశ్యము'ను వదలి, చేతనుడగు 'సాక్షి'ని ఎప్పటికప్పుడు – ఎడతెరపి లేకుండా ధ్యానిస్తూ ఉండటమే **'సవికల్పసమాధి'**.

ఈ విధముగా చేతనుడు, సత్‌చిత్ ఆనంద లక్షణుడు, జగత్ విషయములగు నామ-రూపములకు విలక్షణుడు అగు **'సాక్షి'**ని దర్శిస్తూ – వినుచూ – ధ్యానిస్తూ ఉండగా..., అప్పుడు **'నేను'** అను శబ్దముయొక్క **కల్పితార్థము** క్రమంగా వైతొలగుచూ, **వాస్తవార్థము** అవగతము అగుచున్నది. అనుభూతమగుచున్నది. అనుక్షణికభావనముగా రూపుదిద్దుకొనుచున్నది.

- 'నేను' దృశ్యములో దేనికీ సంబంధించని అసంగ స్వరూపుడను. అంతేగాని దృశ్యములో ఒక వస్తువు వంటివాడిని కాను.
- సత్-ఆనంద స్వరూపుడను. అంతేగాని ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లేనివాడను కాను.
- చిత్-ఆనంద స్వరూపుడను. కేవలమగు నాయొక్క **ఎరుక ఎరుగబడేదానిచే-బోధించబడేది కాదు. మరి? ఎరుగబడే సమస్తముగా విస్తరించి ఉన్నట్టిది.**
- ప్రకృతి-స్వభావములకు నేనే **నియామకుడును.**
- **నన్ను నేనే నియమించుకొనుచున్నవాడను.** అంతేగాని, **నన్ను నియమించు మరొకటేదీ లేదు.**

అని మీరు గ్రహించగలరు. ఈ విధంగా 'అహమ్' స్వరూపమును **<u>'అసంగము, సచ్చిదానందరూపము, స్వయం ప్రభువు'</u>** అని గ్రహిస్తూ ఉండటమును **'సవికల్పసమాధి'** అని పిలుచుచున్నారు.

**(2) నిర్వికల్ప సమాధి** (Internal): సవికల్ప సమాధియొక్క ప్రియరూప కేవలాపేక్ష (constant liking) చేత, ఇక క్రమంగా దృశ్యముగాని, దృశ్యములో ఉన్నట్టి శబ్ద – స్పర్శ రూప-రస-గంధ-సంబంధ-అనుబంధ ఇత్యాది సర్వ విషయములపట్ల గాని, విశేషములపట్లగాని – **'కావాలి! పొందాలి! లేకుంటే ఎట్లాగ?'** అనే రుచి కించిత్ కూడా రూపుదిద్దుకోనట్టి స్థితియే 'నిర్వికల్పసమాధిస్థితి'.

దృష్టాంతానికి...,

నటుడు నాటకంలో నటిస్తూ, **"పాత్రగా నాకు నాటకంలో ఉండగా, నాటకము నుండి ఇంకా ఇది – అది లభించాలి"**....అని అపేక్ష ఉంటుందా? పాత్ర ఏదైనా పొందితే తాను పొందునదేమున్నది? ఆ పాత్ర ఏదైనా (నాటకంలో) కోల్పోతే, లభించకపోతే, తనకు లాభించనిది ఏముంటుంది? (1) **'నిశ్చలదీపము వలె 'నేను'** అను స్వస్వరూపబ్రహ్మముగా నిత్యానుభవశీలిగా ఉండటము, (2) జగత్-దృశ్యములు దేహములు...ఇవన్నీ ఆ స్వస్వరూపజ్యోతి వెలుగులో కనిపించు వస్తు సముదాయము వంటిది అయి ఉండటము'....ఇది **'నిర్వికల్పసమాధి'.**

వెలుగులో వస్తువులు రంగు – రూపు కదలికలతో కనిపిస్తాయిగాని, వస్తువులు ఆ వెలుగును మరొకటిగా చేయలేవు కదా! **'నాయొక్క ఆత్మ తేజస్సులో దేహాలు, దేహాంతర విశేషాలు, దృశ్య జగత్తులు నామరూపాత్మకమై అగుపిస్తూ ఉంటాయి. వాటన్నిటిచే ఆత్మ తేజస్సు పెరగదు. తరగదు'**....అను ఎరుకయే నిర్వికల్పానుభవము.

అట్టివాడు 'నిర్వికల్పసమాధిస్థితుడు' అగుచున్నాడు. తాను తేజోరూపుడై, తదితరమైనదంతా తనచే వెలిగించునున్నట్టిదిగా దర్శిస్తున్నాడు. **'అహం జ్యోతిః మమ జ్యోతి ప్రకాశకమ్ ఇదమ్ సర్వమ్'** ... అను పరాకాష్ఠ భావనయందు సునిశ్చలుడై ఉన్నవాడే **"నిర్వికల్ప సమాధి నిష్ఠుడు". ఆతనికి ఈ జగద్దృశ్యమంతా స్వకీయ తేజో విభవముగా స్వానుభవమగుచున్నది.**

ఇక మూడవదగు మరొక సమాధి గురించి కూడా బ్రహ్మానందతత్పరులగు మహనీయులు వర్ణించి చెప్పుచూ ఉంటారు. అది కూడా సందర్భోచితంగా సూచిస్తున్నాను. వినండి.

## 3వది – స్తబ్ధీభావ – రసాస్వాద సమాధి

ఇది పూర్ణ సమాధి స్థితికి ఒక మెట్టు వంటిది. హృదయమున – బాహ్యమున కూడా ఏదో ఒక వస్తువుపై (గురువు – ఇష్టదైవము....ఇటువంటి వేరైనా ఒక్కదానిపై) ఏకాగ్రతారూపమైనట్టి సమాధిని అభ్యసిస్తూ....

– ఇక్కడి వేరు వేరైనట్లుగా కనిపించేదంతా (నామరూపాత్మకమైనదంతా) **స్థబ్ద భావమునందు** లయింపజేస్తూ.....

ద్రష్ట – దృశ్యములకు ఆధారముగా ఆవలము మునుముందుగానే ఉన్నట్టి **'దృక్'తో దృష్టిని ఏకము చేసి ఉంచటమును 'స్తబ్ధీభావరసాస్వాద సమాధి'** అని అంటారు.

***(దృష్టాంతంగా – "అంతా రామమయం। కృష్ణమయం। విష్ణుమయం। శివమయం। ఇత్యాది ఏదో ఒక కేవల భావనం ఇది. క్రమంగా ఈ సమస్తము నా చేతననే మయమైయున్నది" – అని సిద్ధించగలదు).***

ఈ విధంగా (1) సవికల్ప (2) నిర్వికల్ప (3) స్తబ్ధీభావ – I. బాహ్యమున II. అంతరమున 3 x 2 – '6' విధములైన సమాధులను ఎప్పుడు ఎక్కడ – ఎంతెంతవరకు అవకాశము ఉన్నదో, అంతంతవరకు మీచే అభ్యసించబడుచుండునుగాక!

ఓ ప్రియబిడ్డలారా! ఈ దేహికి దేహము ఇహంలో మోహము కలిగిస్తూ ఉన్నది. అందుచేతనే ఈతడు **'నేను దేహపరిమితుడను! నాకు సంబంధించిన వివరములన్నీ ఈ దృశ్య జగత్తుకు మాత్రమే పరిమితము'** ...అని స్వస్వరూపమునకు సంబంధించి ఒకానొక సంకుచిత భావమునకు చోటు యిస్తున్నాడు. ఎప్పుడైతే మీరు ఈ 'దేహాభిమానము'ను దాటివేస్తారో, **ఆ మరుక్షణమే మీయొక్క పరమగు పరమాత్మస్వరూపమును ఎరుగగలరు, ఆస్వాదించగలరు, తదేకమవగలరు.**

ఎప్పుడు మీకు మీయొక్క అఖండ – అప్రమేయ పరమాత్మత్వము స్వానుభవమగుచున్నదో, ఇక అప్పటి నుండి మీ మనస్సు దేనిపై వ్రాలితే, అదంతా కూడా అమృతప్రాయము, ఆత్మానందమయము అవగలదు.

ఎప్పుడైతే అట్టి **'పరావర దృష్టి'** ని మీరు సముపార్జించుకుంటారో...

> **శ్లో॥ భిద్యతే హృదయగ్రంథిః చిద్యంతే సర్వసంశయాః**
> **క్షీయంతే చ అస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరావరే!**

అప్పుడిక హృదయములో జన్మ – జన్మాంతరముల నుండి వెంటనంటి వస్తున్న దృశ్య – జీవ – ఈశ్వర – దేహ – జన్మ – కర్మ – బాంధవ్య సంబంధమైన – సర్వ చిక్కుముడులు (హృదయగ్రంథులు) తమకు తామే **వీడిపోతాయి. విడివడతాయి.**

- సర్వ కర్మ బంధములు వాటికవే **త్రెగిపోతాయి.**
- నటుడికి పాత్ర సంబంధమైన గుణ సందర్భ బంధములు తనవి కాని విధంగా **వీగిపోతాయి.**

## ముక్తి

ప్రియపుత్రులారా! చివ్వరిగా ఒక ముఖ్య విషయము సిద్ధాంతీకరించుచున్నాను. చక్కగా విని, మీ పరస్వరూపము గురించి సుస్పష్టపరచుకొనెదరుగాక! వినండి.

**మయి జీవత్వం – ఈశత్వం కల్పితమ్। వస్తు తో నహి!**

నాకు జీవత్వము – ఈశ్వరత్వము...ఈ రెండూ కూడా లీలావినోదంగా నాయొక్క స్వకీయ కల్పితములు మాత్రమే.

**(జీవత్వము = ఒక దేహమునకు సంబంధించిన నేను". ఈశ్వరత్వము – అనేక దేహములు కల్పించుకొనుచున్నట్టి "నేను")**

**అవి వస్తుతః లేవు. ఇదియే మీపట్ల సత్యము కూడా।**

> **జీవ–ఈశ్వరత్వములు – కల్పనచే ఏర్పడి, వికల్పనచే తొలగుచున్నాయి.**
> **ఇతి యస్తు విజానాతి సముక్తో। న అత్ర సంశయః॥**
> ఇది ఎప్పుడైతే, ఎవరైనా సరే, గ్రహిస్తారో....వారు ముక్తస్వరూపులే!
> **ఇంతకుమించి వేరుగా బంధము లేదు. ముక్తి లేదు.**

*ఇతి శ్రీ సరస్వతీ రహస్యోపనిషత్*
*ఓం శాంతిః శాంతిః శాంతిః*

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 29 శ్రీ సర్వసారోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ సర్వసారం నిరాలంబం రహస్యం వజ్రసూచికమ్,
తేజో నాద ధ్యాన విద్యా యోగతత్త్వ-ఆత్మబోధకమ్!

ఈ సర్వసారోపనిషత్-'సర్వము' యొక్క సారమైయున్నది. స్వా-తంత్ర స్వరూపము అగు నిరాలంబము గురించి వివరించు చున్నది. పరమ రహస్యమైనది. వజ్రసూచిక వలె సాక్షాత్ తత్త్వము గురించి చెప్పుకొస్తున్నది. తేజో-నాద-ధ్యాన విద్యా ప్రతిపాదకము. యోగ తత్త్వమును బోధించుచున్నది. ఇక శ్రవణ, అధ్యయనము చేద్దాము.

"ఓం"

'ఓం' అను ఏక-అక్షర పరబ్రహ్మము నకు నమస్కరిస్తూ..

**01.** కథం బంధః? కథం మోక్షః?
కా విద్యా? కా అవిద్యా చ-ఇతి?
జాగ్రత్ స్వప్న సుషుప్తిః
తురీయం చ కథమ్?
అన్నమయ ప్రాణమయ మనోమయ
విజ్ఞానమయ ఆనందమయ కోశాః కథమ్?
కర్తా జీవః పంచవర్గః
క్షేత్రజ్ఞః సాక్షీ కూటస్థో
అంతర్యామి ఇతీ చ కథమ్?
ప్రత్యగాత్మా పరమాత్మా
మాయా చ ఇతి కథమ్?
కిం బ్రహ్మ? కతి పదార్థాః?
కా మాయా చ? ఇతి॥

**తపోధనుడు, సునిశితబుద్ధి సమన్వితుడు అగు శిష్యుల (12) ప్రశ్నలు:**
(1) **బంధము** ఎటువంటిది? (2) **మోక్షము** అనగా ఏమి?
(3) ఏది **విద్య?** (4) ఏది **అవిద్య?**
(5) **జాగ్రత్, స్వప్న, సుషుప్తి,, తురీయముల** స్వరూప-స్వభావములు ఎటువంటివి?
(6) **అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ-** పంచకోశములు ఏమేమి అయి ఉన్నాయి?
(7) **కర్త; జీవుడు; పంచవర్గము; క్షేత్రజ్ఞుడు; సాక్షి; కూటస్థుడు; అంతర్యామి** - ఈ ఈ పేర్లతో దేనిదేనిని ఉద్దేశ్యిస్తున్నారు?
(8) **ప్రతగాత్మ** అనగా ఎవరు? (9) **పరమాత్మ** అనగా? **మాయ**-అనగా ఏమి?
(10) **బ్రహ్మము** అనగా ఏది?
(11) **'పదార్థము'** అనగా ఏమి? ఎన్ని విధములు
(12) **'మాయ'** ఎక్కడిది? ఎవరిది?

---

**2.** బంధమోక్షములు:
ఆత్మేశ్వర జీవో..
అనాత్మనాం దేహాదీనామ్
ఆత్మత్వేన అభిమన్యతే,
సో అభిమాన ఆత్మనో "బంధః"॥
తత్ నివృత్తిః - "మోక్షః"॥

స్వయముగా 'ఆత్మేశ్వరుడే' అయిఉన్నట్టి ఈ జీవుడు - జీవాత్మ, ఈశ్వరుడు, దేహము, ఇంద్రియములు, దృశ్య విషయములు మొదలైనవాటి పట్ల - "అవియే తాను [ఆత్మ (లేక) "నేను" అయినట్లు] అభిమానించు చున్నాడు. అట్టి **ఆత్మకు అన్యమగు తదితర కల్పితమాత్ర విషయముల వట్ల గల ఆగని అభిమానమే బంధము.** ఈ జీవుడు అట్టి స్వాభిమానముల నుండి నివృత్తుడు (Completely non-bounded, relieved, non-avocative) అయితే, అదియే **"మోక్షము"**

---

అవిద్య:
యా తత్ అభిమానం కారయతి
సా హి "అవిద్యా"!
సో అభిమానో యయా
నివర్తతే సా 'విద్యా'॥

**అవిద్య** : అటువంటి **శరీరాభిమానము, దృశ్యాభిమానముల** కారణంగా ఆత్మ, ఈశ్వర-జీవ-దృశ్యములు వేరువేరనుకొనే దృష్టికి కారణములుగా అగుచున్నాయో - అదియే **"అవిద్య". దృశ్యముపట్ల గల 'మమ' రూప అభిమానమునకు కారణమయేదంతా 'అవిద్య'.**

**విద్య** : ఏఏ ప్రయత్నములు - భేదములకు సంబంధించిన అభిమానము యొక్క నివృత్తికి కారణమౌతూ ఉంటున్నాయో అదియే **"విద్య".**

| | |
|---|---|
| **జాగరణము (జాగ్రత్):**<br>'మన' - ఆది చతుర్దశ (14) కరణైః<br>పుష్కలైః ఆదిత్యాది అనుగ్రహీతైః<br>శబ్దాదీన్ విషయాన్ స్థూలాన్<br>యదా ఉపలభతే, తదా ఆత్మనో "జాగరణమ్"॥ | **జాగ్రత్ :** మనస్సు మొదలైన 14 కరణములు (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, పంచకర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు) - ఇవన్నీ స్ఫూర్తి- పుష్కలత్వము పొంది వాటి వాటి విషయములను స్వీకరించినవై, శబ్ద -స్పర్శ- రూపరస-గంధములను బాహ్యంగా ఉపలబ్దము (పొందుచూ) ఉండటమే- **ఆత్మ యొక్క జాగరణము.** ఇంద్రియములను ఉపయోగిస్తున్నప్పటి మనస్సుయొక్క బాహ్య విషయానుభవమే - **జాగ్రత్.** |
| **స్వప్నం**<br>**3.** తత్ వాసనా సహితైః చతుర్దశ కరణైః<br>శబ్దాది అభావేఽపి, వాసనామయాం శబ్దాదీం<br>తాత్కాలికానామ్ యదా ఉపలభతే<br>తత్ ఆత్మనః "స్వప్నం"। | **స్వప్నము :** వాసనా సహితమైనట్టి ఆ 14 ఇంద్రియములు మరొకప్పుడు శబ్ద-స్పర్శ-రూప-రస గంధములను బాహ్యత్వము పొందనివి అగుచున్నాయి. అయితే, వాసనామయములైన శబ్దస్పర్శ రూప-రస గంధములను తాత్కాలికంగా ఊహామాత్రంగా పొందటం జరుగుచూ ఉన్నప్పుడు (అభిమానము కొనసాగుచూ, బాహ్యాభిమానము తొలగి అంతరాభిమానము ప్రారంభమైనప్పుడు) - **అది ఆత్మయొక్క 'స్వప్నము'.** విషయముల అంతర భావనయే **స్వప్నము.** |
| **సుషుప్తి**<br>చతుర్దశ(14) కరణ ఉపరమాత్<br>విశేష విజ్ఞాన అభావాత్ యదా శబ్దాదీన్<br>న ఉపలభతే, తదా ఆత్మనః "సుషుప్తమ్"। | **సుషుప్తి :** 14 కరణములు పూర్తిగా ఉపరమించినవై (Having been completely withdrawn) - తనకు 'అన్యము' అనబడు విశేష విజ్ఞానమంతా అభావించబడుచూ, శబ్దస్పర్శ రూప రసగంధములు తమయొక్క 'కారణము'లో ప్రవేశించినవై, పూర్తిగా **వాసనా సంబంధమైన మౌనము** వహించినప్పుడు- అది **ఆత్మ యొక్క సుషుప్తి.** |
| **తురీయం**<br>**4.** అవస్థాత్రయ భావ-అభావ<br>సాక్షీ, స్వయం భావరహితం,<br>నైరంతర్యం చైతన్యం<br>యదా, తదా (తత్) "తురీయం చైతన్యమ్"<br>ఇతి ఉచ్యతే॥ | **తురీయ చైతన్యము**<br>ఎప్పుడైతే ఆత్మ- జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు సంబంధించిన భావ సమూహములకు కేవల సాక్షిత్వము వహించినదై ఉంటూ, భావరహిత మగుచు, అంతరంగ చతుష్టయము (మనోబుద్ధి చిత్త అహంకారములను) తన యందు తన ఉపకరణమాత్రంగాను, తాను నిర్విషయంగాను చేసుకొన్నదై ఉంటుందో, **కేవల చైతన్యత్వము అవధరించినదై** ఉంటోందో - అప్పుడు ఆత్మ **"తురీయ చైతన్యము"**గా చెప్పుకోబడుతోంది. |
| **అన్నమయ కోశము**<br>అన్న కార్యాణాం కోశానాం<br>సమూహో "అన్నమయః కోశ" ఇతి ఉచ్యతే॥<br>**ప్రాణమయ కోశము**<br>ప్రాణాది చతుర్దశ వాయుభేదా (దశవాయుభేదా)<br>అన్నమయకోశే యదా<br>వర్తన్తే, తదా "ప్రాణమయ కోశః" ఇతి ఉచ్యతే॥ | **అన్నమయ కోశము :** 'ఆహారము' చేత నిర్మితమైన ఈ భౌతిక దేహదృష్టిచే పరిమితత్వము, మూఢత్వము కలిగియుండు స్థితి- **'అన్నమయకోశము'** అనబడుచున్నది. అన్నమయ కార్యముల సమూహములు అన్నమయ కోశము.<br>**ప్రాణమయ కోశము:** (ప్రాణ-అపాన-ఉదాన-సమాన-సప్రాణములనే) పంచప్రాణములు, (నాగ-కూర్మ-కృకర-దేవదత్త-దనంజయములనే) పంచ ఉప - ప్రాణములు- మనో-బుద్ధి-చిత్త-అహంకారములకు కదలిక కలిగించు ప్రేరణ వాయువులు - అన్నమయ కోశములో (శక్తిస్వరూపమై) వర్తిస్తూ ఉన్నప్పుడు అది **'ప్రాణమయకోశము'** - అని చెప్పబడుతోంది. |
| **మనోమయ కోశము**<br>**5.** ఏతత్ కోశద్వయ సంసక్తం, 'మన' ఆది చతుర్దశ కరణైః<br>ఆత్మా - శబ్దాది విషయ సంకల్పాదీన్<br>ధర్మాని యదా కరోతి,<br>తదా "మనోమయః కోశ"<br>ఇతి ఉచ్యతే॥ | **మనోమయ కోశము :** అన్నమయ-ప్రాణామయ - రెండు కోశములతో కూడుకొన్న ఆత్మ (జీవాత్మ) మనస్సు మొదలైన 14 కరణములతో శబ్దస్పర్శ రూప రస గంధ-విషయములను "సంకల్పించటము" అను 'ధర్మము' (Characteristic feature/function)ను నిర్వర్తిస్తూ ఉన్నప్పుడు, అది **'మనోమయ కోశము'** అని పిలువబడుతోంది. భావనచేయు (లేక) సంకల్పించు (లేక) ఆలోచించు ధర్మము - **మనోమయకోశ రూపము.** |

**విజ్ఞానమయకోశము:**

**ఏతత్ కోశత్రయ, విశిష్ట – అంతఃకరణే–సంసక్తం,**
**తద్గత విశేష ధ్యాన–మననాది వృత్తయో, యదా ఉత్పద్యంతే,**
**సంసక్తం తద్గత విశేషజ్ఞో యదా భావతే (భాసతే)**
**తదా "విజ్ఞానమయః కోశ" ఇతి ఉచ్యతే।**
**(– విశిష్ట – అంతఃకరణే, తత్‌గత విశేష ధ్యాన –**
**మనన ఆది వృత్తయో యత్ ఉత్పద్యంతే–తత్ విజ్ఞానమయ కోశః।)**

**విజ్ఞానమయకోశము** :ఆత్మ (జీవాత్మ) - అన్నమయ- ప్రాణమయ - మనోమయ త్రికోశములను వెంటబెట్టుకొని, వాటి యందలి విశేషములను ఎరుక (Knowing Awareness)చే 'ఎరుగుట' అను విశేష-జ్ఞాతత్వమును భావిస్తూ ఉన్నప్పుడు - అది **'విజ్ఞానమయకోశము"**గా అభివర్ణించ బడుతోంది. వాటి గురించి ధ్యాస, ధ్యాసవృత్తులు - విజ్ఞానమయకోశము. ఎరుగుట, నిర్ణయించుట - ఇవి విజ్ఞానమయకోశ ముఖ్య ధర్మములు.

---

**ఆనందమయకోశము:**

**6.** ఏతత్ కోశ చతుష్టయ కారణ జ్ఞాన సంసక్తం (సంపృక్తం), స్వకారణ-
**జ్ఞానం స్వరూప సుఖే వటధానాసు వటవృక్ష ఇవ,**
**వటకణికాయమ్ (వటవృక్ష) ఇవ, వృక్షో యదా వర్తతే,**
**తత్ "ఆనన్దమయః కోశ" ఇతి ఉచ్యతే।**
**కోశా ఉపాధి (ఏతా) ఉపహిత ఏవ**
**'ఆత్మాకోశ' ఇతి ఉపచర్యతే।**

**ఆనన్దమయకోశము** : ఆత్మ - అన్నమయ + ప్రాణమయ + మనోమయ + విజ్ఞానమయ కోశములను కలిగియున్నదై (వెంటనంటి ఉన్నదై) - వాటినన్నిటినీ కూడా ఒక మర్రి (వట) వృక్షపు బీజములో వటవృక్ష ధర్మములన్నీ కలిగియున్న తీరుగా - (ఆ నాలిగిటి యొక్క కారణ జ్ఞానమును) తనయందు అణిగి ఉన్నప్పుడు **"ఆనందమయకోశము"**గా చెప్పుకోబడుచున్నది.

ఆత్మాకోశ : సమస్తకోశములు దేనికి ఉపాధి మాత్రమో అదియే ఆత్మ।

---

**సుఖదుఃఖములు:**

**సుఖదుఃఖ బుద్ధ్య, ఆశ్రయా**
**తత్‌తత్ ఇచ్ఛయా 'దేహాన్తః కృతిమత్ కర్తా।**
**శ్రేయో అన్తః కర్తా**
**యదా తదా – ఇష్టవిషయే బుద్ధిః "సుఖబుద్ధిః"।**
**'ఇష్టం ఇతి వృత్తిః సుఖ బుద్ధిః।**
**అనిష్ట విషయే బుద్ధిః "దుఃఖబుద్ధిః"॥**
**('అనిష్టం' ఇతి వృత్తిః దుఃఖబుద్ధిః॥)**

**సుఖదుఃఖములు** : ఆత్మ తన యొక్క బుద్ధిచే సుఖ-దుఃఖ సంబంధమైన కర్తృత్వము - భోక్తృత్వము కలిగియున్నప్పుడు, బుద్ధితో సుఖ-దుఃఖముల పట్ల ప్రియమైన భావన కలిగి ఉన్నప్పుడు - ఇష్ట విషయములచే సుఖబుద్ధి, -అనిష్ట విషయములచే దుఃఖబుద్ధి కలిగి ఉంటోంది.

బుద్ధి యొక్క ఇష్ట-అయిష్ట భావములే సుఖ-దుఃఖముల అంతఃకర్త. (వాటికి సాక్షియే ఆత్మ). అనగా సుఖ దుఃఖములు స్వకీయ బుద్ధి నిర్వచనములే గాని, బాహ్య సంగతి, సందర్భనములు కారణం కాదు.

---

**జీవ ఉపహిత:**

**శబ్ద స్పర్శ రూప రస**
**గంధాః సుఖ–దుఃఖ హేతవః।**
**పుణ్య–పాప కర్మానుసారీ భూత్వా,**
**– ప్రాప్త శరీర సంయోగమ్,**
**–అప్రాప్త శరీర సంయోగమ్ ఇవ**
**కుర్వాణో యదా దృశ్యతే, తదా 'ఉపహిత జీవ'**
**ఇతి ఉచ్యతే। కుర్వాణః (ప్రాణధ్యాసీ జీవః॥)**

**జీవుడు** : ఆత్మ ఎప్పుడైతే - శబ్ద స్పర్శ రూపరస గంధములను సుఖదుఃఖహేతువులుగా భావన చేస్తూ కర్మ - కర్మఫలములను అనుసరించుచూ - ప్రాప్తించిన శరీరముతో సంయోగము, (జాగ్రత్) 'ప్రాప్తించని శరీర సంయోగము' (స్వప్నము) భావించుచూ, కర్మలు చేయుట యందు మునిగి తేలుచున్నట్లు కనబడుచున్నదో, అదియే ''జీవత్వము పొందిన జీవుడు''-అని (ఆత్మయే) వివరించుకో బడుచున్నది.- **దేహాత్మ బుద్ధి కలవాడు జీవుడు.** దేహముతో, జీవించటముతో అవినాభావత్వము, అభిమానము కలిగియున్నప్పుడు **"ఉపహిత జీవుడు"** అనబడుచున్నాడు.

---

**మన ఆదిశ్చ, ప్రాణాదిశ్చ, సత్త్వాదిశ్చ, భూతాదిశ్చ,**
**పుణ్యాదిశ్చ ఏతే పంచవర్గాః ఇతి।**
**ఏషాం, పంచవర్గాణాం ధర్మీ భూతాత్మా**
**జ్ఞానాదృతేన, అజ్ఞానేన దృశ్యతి।**
**జ్ఞానేన వినశ్యతి।**

**పంచవర్గములు** : (1) **అంతరంగ చతుష్టయమగు మనోబుద్ధి చిత్తా అహంకారములు, వాటిపట్ల గల ఇచ్ఛలు.** (2) ప్రాణ -అపాన-వ్యాన-ఉదాన-సమానములనబడే **పంచప్రాణములు.** (3) సత్త్వ రజో తమములనబడే **త్రిగుణములు** (4) భూమి-జలము-అగ్ని-వాయువు-ఆకాశము అనబడే **పంచభూతములు** (5) పుణ్యాపాపద్వయం - ఈ ఐదు **"పంచవర్గములు"**. ఇవి జ్ఞానాజ్ఞాన సమన్వితమై ఉంటూ, ఆత్మజ్ఞానముచే **'లేనివే'** అగుచున్నాయి.

---

**హృదయగ్రంథి:**

**ఆత్మ సన్నిధౌ నిత్యత్వేన ప్రతీయతేచా, ప్రతీయమాన,**
**మూలావిద్యేతు ఆత్మా ఉపాధిః**
**యస్తదేవ 'లింగశరీరం' బీజగ్ం**
**– "హృత్‌గ్రంథిః" ఉచ్యతే।**

**హృత్ గ్రంథి** : ఏదైతే →
- పంచవర్గములను **తన ధర్మము**గా కలిగియుంటున్నదై,
- జ్ఞాన దర్శనముచే (లేక) **జ్ఞానధారణచే** నశించుపోవు స్వభావము కలిగియున్నట్టిదై,
- **ఆత్మకు సమీపముగా** ఉండటం చేత 'నిత్యము' అయినదానివలె కనబడుచూ, ఆత్మకు 'ఉపాధి'గా చెప్పబడునది అగుచున్నదో - దానినే **"లింగశరీరము"** అని, **"హృదయగ్రంథి"** అని పిలుస్తున్నారు.

క్షేత్రజ్ఞుడు: తత్ర యత్ ప్రకాశతే చైతన్యం
స "క్షేత్రజ్ఞ" ఇతి ఉచ్యతే।
(తత్ ప్రతి ఫలం
చైతన్యం యత్ ప్రకాశతే, స "క్షేత్రజ్ఞః")

**క్షేత్రజ్ఞుడు** : అట్టి హృదయ గ్రంథి యందు ప్రకాశమానమగుచున్నట్టి (That which is present like light) చైతన్యమును- **'క్షేత్రజ్ఞుడు'**- అని పలుకుచున్నారు. సమస్తమును చేతనముగా చేయునది 'చైతన్యము'. చైతన్యస్వరూపుడై సమస్తము ఎరుగుచూ తనయొక్క ఎరుకచే నింపి ఉంచువాడు, నింపుచున్నవాడు **'క్షేత్రజ్ఞుడు'. ఎరుగుట - తనదైనవాడు క్షేత్రజ్ఞుడు.**

---

సాక్షి: జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయానామ్, యత్ న
ఆవిర్భావ తిరోభావ (జాతా) జ్ఞాతా,
స్వయమ్ తత్ ఆవిర్భావ సహితః,
స్వయమ్ ఆవిర్భావ – తిరోభావ రహితః,
స్వయం జ్యోతిః, (చేతనో) "సాక్షీ" – ఇతి ఉచ్యతే।

**స్వయం జ్యోతి। సాక్షి:**

(1) జ్ఞాత- (తెలుసుకుంటూ ఉన్నవాడు - the knower), (2). జ్ఞానము (తెలుసుకోవటం, knowing), (3). తెలియబడునది (All that being known)" - ఈ మూడిటి రాక- పోకలు ఎవరి చేత ఎరుగబడుచు, అవన్నీ తనవే అయి ఉండి కూడా, తాను మాత్రం రాక-పోకలు (ఆవిర్భావ-తిరోభావములు) లేనిదై ఉన్నదో అద్దానిని. **"స్వయంజ్యోతి" అని 'సాక్షి'** అని చెప్పుచున్నారు.

కూటస్థుడు: బ్రహ్మాది పిపీలికాంత పర్యన్తం సర్వప్రాణి బుద్ధిషు
అవశిష్ట తయో ఉపలంభ్యమానః, సర్వప్రాణబుద్ధి సాక్షిః,
సర్వప్రాణి బుద్ధిస్థో యదా, తదా "కూటస్థ" ఇతి ఉచ్యతే॥
సర్వప్రాణ బుద్ధి సాక్షిః అధిష్ఠాన ఆత్మా,
అస్తి, భాసతే చ స కూటస్థః॥

**కూటస్థము** : "సృష్టికర్త" అయినట్టి బ్రహ్మదేవుడు మొదలుకొని ఒక పురుగువరకు సర్వప్రాణుల బుద్ధికి **'సాక్షి'** అయి ఉన్నట్టి తత్త్వము- ఏది తానైయున్నదో, సర్వ ప్రాణుల బుద్ధియందు ప్రకాశమానమై యున్నదో,-అట్టి ఆత్మజ్యోతి స్వరూపమును **"కూటస్థము"**-అని పిలుస్తున్నారు.

---

7. అంతర్యామి: కూటస్థో (కూటస్థ–ఆది) ఉపహిత భేదానామ్
స్వరూపలాభ (భే) హేతుర్భూత్వా, మణిగణే సూత్రమివ,
సర్వక్షేత్రేషు యత్ అనుస్యూతత్వేన యదా,
యదా అనుస్యూత అంతర్యామియన్
(సో) యదా ప్రకాశతే హి ఆత్మా
తదా "అంతర్యామి" ఇతి ఉచ్యతే।

**అంతర్యామి** : దృశ్యము నుండి - కూటస్థుడు వరకు గల సర్వ భేదములను (స్వస్వరూప భావన/ప్రాప్తి చేత) - సూత్రములోని దారమువలె సర్వక్షేత్రములలో (దేహములలో) అనుస్యూతంగా (అంతర దారమువలె) అంతరంగా - ప్రకాశిస్తూ ఉన్న (విస్తరించియున్న) భావము కలిగి యుండునప్పుడు-ఆత్మయే **"అంతర్యామి"**గా నిర్వచించబడుచున్నది.

ప్రత్యగాత్మ: సో అంతర్యామీ...,
సత్యం జ్ఞానం అనన్తమ్
ఆనన్దగమ్, (సర్వశరీర)– సర్వ – ఉపాధి వినిర్ముక్తమ్।
కటక మకుటాది ఉపాధి రహిత, సువర్ణ ఘనవత్
విజ్ఞాన – ఘన చిన్మాత్ర స్వభావాత్మా,
సభావం ఆత్మ చైతన్యం బ్రహ్మయత్ అవభాసతే,
ఆత్మ యదా భాసతే, తత్ అవిద్యా ఉపాధికమ్–
తదా 'త్వమ్' పదార్థః, సః ప్రత్యగాత్మా॥

**ప్రత్యగాత్మ.: అట్టి అంతర్యామి-:**

→ సత్యజ్ఞాన అనంత ఆనంద స్వరూపంగా 'కేవలము' (The Absolute) అయి ఉన్నది.

→ సర్వ ఉపాధులకు నిబద్ధము కానిదై, వేరై, వినిర్ముక్తమైయున్నది.

→ ఆభరణములుగా ఉండి కూడా ఆభరణ సంబంధమైన ఆకారములకు సంబంధించని 'బంగారు లోహము వలె,

సర్వము అయిఉంటూనే సర్వమునకు వేరై యున్నది.

అట్టి విజ్ఞాన-చిత్‌మాత్ర స్వభావాత్మ ఈ జీవునికి స్వానుభవమై, భాసిస్తూ ఉన్నప్పుడు, 'నీవు', 'ఆతడు', 'అది' కూడా తానే అయిఉన్నదగుచున్నది. అదియే **"ప్రత్యగాత్మ"** గా పలుకబడుచున్నది.

---

8. సత్యం జ్ఞానం అనంతం ఆనందం బ్రహ్మ।
సర్వజ్ఞత్వాది ఉపేతం, మాయోపాధికం,
తత్ పదార్థః పరమాత్మా।
సత్యమ్ → అవినాశి।
'అవినాశి' నామ:
దేశ కాల వస్తు నిమిత్తేషు
వినశ్యత్సు, యత్ న వినశ్యతి– తత్ "అవినాశి"॥

**"సత్యం। జ్ఞానమ్। అనంతమ్। ఆనందమ్। సర్వజ్ఞత్వము।"**

-ఇవన్నీ కూడా కేవలాత్మ (లేక) బ్రహ్మము యొక్క స్వాభావిక లక్షణములు. ఆత్మకు మాయయే ఉపాధి.

**సత్యమ్** : దేనికి - నశించటమనే అనుధర్మమే లేదో, అట్టిది.

**అవినాశి అనగా** : దేశ (Place factor), కాల (Time factor), వస్తు (factor of matter), నిమిత్త (Inter-related cause & effects factor) -ఇవన్నీ నశించినప్పటికీ ఏది **వినాశనము పొందక**, ఎప్పటి అట్లే ఉండి ఉంటోందో, అది **'అవినాశి'. ఆత్మ సర్వదా సత్యము, అవినాశి కూడా!**

| | |
|---|---|
| **9.** జ్ఞానం నామ:<br>ఉత్పత్తి – వినాశన రహితం। నైరన్తర్యం।<br>చైతన్యం – 'జ్ఞానమ్' ఇతి ఉచ్యతే। | **జ్ఞానము** : దేనికైతే ఈ తెలియబడుచున్న సమస్తమునకు సంబంధించినట్టి ఉత్పత్తి, వినాశనములనునవి ఏమాత్రము లేవో, ఎద్దానికి 'లోన -బయట' అనునవి ఉండవో,... అట్టి బాహ్యాభ్యంతర స్థితచైతన్యమును **'జ్ఞానము'** అంటున్నాము. ఇదికూడా 'సత్' వలె కేవలాత్మయొక్క స్వాభావికలక్షణము. |
| అనన్తమ్ నామ:<br>మృత్ వికారేషు మృదివ,<br>స్వర్ణవికారేషు స్వర్ణమివ,<br>తంతు వికారేషు తంతురివ,<br>అవ్యక్త – ఆది సృష్టి ప్రపంచేషు పూర్ణం,<br>వ్యాపకం, చైతన్యం, "అనన్తమ్" ఇతి ఉచ్యతే। | **అనన్తమ్** : మట్టికుండకు మొదలు - మధ్య - చివర (పగిలిన తరువాత కూడా) 'మట్టి'యే స్వభావముగా కలిగియున్న విధముగా, 'ఆభరణము' అను వికారము బంగారమునకు లేని తీరుగా, దారముల 'ఒకానొక అమరిక' అను వికారమే వస్త్రమగుచున్నట్లు<br>అవ్యక్తము నుండి - ఈ సృష్టిరూప ప్రపంచము వరకు ఏ చైతన్యము పూర్ణమై, సర్వవ్యాపకమైయున్నదో.. అట్టి లక్షణము **'అనన్తము'**-గా పిలువబడుతోంది. |
| **10.** ఆనందం నామ:<br>సుఖచైతన్య స్వరూపో, అపరిమిత ఆనన్ద సముద్రో,<br>అవశిష్ట సుఖ స్వరూపశ్చ 'ఆనంద' ఇతి ఉచ్యతే। | **ఆనన్దము** : కేవలమగు 'చైతన్యము'తో అనుసంధానమే ఆనందము. అప్రయత్నంగా, స్వాభావికంగా సిద్ధించు స్వయంచైతన్య స్వరూపము సంతరించుకోవటమే అది. అట్టి చైతన్యత్వము అపరిమితము, స్వాభావికము, అవ్యవహారికము అగు ఆనందసముద్రము నందు సుఖరూపముతో అవశిష్టుడై ఉండటము-ఆనందముగా చెప్పబడుచున్నది. |
| **11** పరమాత్మ నామ:<br>ఏతత్ వస్తు చతుష్టయం యస్య లక్షణం<br>దేశ–కాల–వస్తు–నిమిత్తేషు<br>అవ్యభిచారీ తత్ పదార్థః<br>"పరమాత్మ" అతి ఉచ్యతే॥ | **పరమాత్మ** : దేశ-కాల-వస్తు-నిమిత్తములు (Place, Time, Matter, Reason) అను నాలుగిటి యొక్క విశిష్ట లక్షణ విశేషములు తన ప్రదర్శనముగా కలిగి యున్నట్టిది. ఆ నాలిగిటికి ఆవల ఉన్నట్టిది. ఏదైతే స్వస్వరూపము నుండి చ్యుతి పొందక 'అవ్యభిచారి' (Non - displaced) - అయి ఉన్నట్టిది. అది **'పరమాత్మ'** అను శబ్దముచే తాత్పర్యపరచ బడుచున్నది. |
| **12** పరబ్రహ్మ నామ:<br>'త్వం' పదార్థాత్ ఔపాధికాత్।<br>'తత్' పదార్థాత్ ఔపాధిక భేదాత్<br>విలక్షణమ్। ఆకాశవత్ సూక్ష్మమ్।<br>కేవల సత్తామాత్ర స్వభావమ్,।<br>"పరబ్రహ్మ" ఇతి ఉచ్యతే॥ | (అంతేకాకుండా), ఏది 'నీవు' (మధ్యమ పురుష)గా ఉపాధి సహితంగా (ఔపాధికంగా) అగుపిస్తోందో, ఏది 'తత్' పదార్థ ఔపాధిక రూపంగా కనిపిస్తోందో- ఆ రెండింటి భేదములకంటే **పరబ్రహ్మము** - విలక్షణమైనది. పంచభూతములలోని 'ఆకాశము' వలె అత్యంత సూక్ష్మమైనది. కేవల సత్తామాత్రము (Mere - Absolute Existence form) అయినట్టిదే 'పరబ్రహ్మము' అని శాస్త్రీయము చేయబడుచున్నది. |
| **13** మాయా నామ:<br>అనాది–అన్తవతి। ప్రమాణ–అప్రమాణ సాధారణాత్–<br>న సతీ। న అసతీ।<br>న సత్–అసతీ। స్వయమధికా। వికార రహితా।<br>నిరూప్యమాణా సత్–ఇతర లక్షణ శూన్యా<br>సా 'మాయా' ఇతి ఉచ్యతే॥ | **మాయా:** ఆది-అంతము అనునది లేనట్టిది. 'ఇది మాయ' అని ప్రమాణపూర్వకంగా స్పష్టీకరించి చెప్పనూలేము. అది సర్వత్రా వ్యావహారికమే కాబట్టి సాధారణమైనదేగాని, **అసాధారణం కాదు.** 'మాయ' ఉన్నదనీ అనవచ్చు. 'యా మా-అది లేదు' అని చెప్పవచ్చు. అది స్వయముగా ఆధిక్యత పొందుచున్నట్టిది. మరొకరు ఈ జీవునకు కల్పించటం లేదు. అద్దానికి ఏ వికారములూ లేవు. అది ఇతరమైనది (మరొకరి కల్పన) అనటానికి లక్షణము లేనిది. **మాయ ఇట్టి విలక్షణమైనది - అని చెప్పుకోబడుచున్నది. నాటకములో పాత్రల-భార్య-భర్త సంబంధము ఉన్నట్లా? లేనట్లా? ఉండీ లేనట్లా? ఈ జగత్తు కూడా అంతే!** |
| **14.** అజ్ఞానం నామ:<br>తుచ్ఛాపి అసతీ, కాలత్రయేఽపి,<br>పామరాణాం వాస్తవీ చ।<br>సత్త్వ బుద్ధిః లౌకికానాం–<br>'ఇదమ్ ఇత్థమ్' ఇతి (ఇదమిత్థమితి)–<br>అనిర్వచనీయా, వక్తుమ్ న శక్యతే। | **అజ్ఞానము** : అజ్ఞానము **"తుచ్ఛము, త్రికాలములలోను లేనిది"** - అయినప్పటికీ కూడా, పామరదృష్టికి "అజ్ఞానము ఘనీభూతమైఉన్నది" - అనియే అనిపిస్తోంది. సాత్త్విక (సత్త్వ) బుద్ధి కలవారికి 'లోకదృష్టి' (లౌకిక దృష్టి)యే అజ్ఞానముగా భావించబడుతోంది. "ఇది ఇట్టిది" అని చెప్పటానికి వీలుకానిది. అనిర్వచనీయమ్! ఒకడు ఒక కథ చదువుతూ ఆనందిస్తూ ఉంటే, - అది అజ్ఞానమనుకోవలా? అక్కడ అజ్ఞానము ఉన్నట్లా? లేనట్లా? |

## మరికొంత విశేషార్థములు

**15. పరమాత్మా।**

సత్యం జ్ఞానమ్ అనంతమ్
ఆనందగ్ం సర్వజ్ఞత్వాది ఉపేతం,
మాయా-ఉపాధికం
తత్ పదార్థః - 'పరమాత్మా'!

## మరికొన్ని విశేషార్థములు

**పరమాత్మ: (సత్-యతేతి సత్యమ్।)**

**సత్యము, జ్ఞానము, ఆనందము, అనంతము, సర్వజ్ఞత్వము-** ఇత్యాది **మహత్ లక్షణములతో** కూడుకొని ఉన్నది. 'మాయ'ను ఉపాధిగా కలిగియున్నట్టిది. 'తత్'గా చెప్పబడుచున్నది. **ఈ జీవుని సహజ రూపమై ఉన్నట్టిది- "పరమాత్మ"। అదియే 'తత్'। (తత్ త్వమ్ అసి।)**

---

**బ్రహ్మమ్**

సర్వ ఉపాధి విముక్తం, నిర్విశేష చిన్మాత్రం
సత్-అద్వైత ఆనందమయం 'బ్రహ్మ' ।

**బ్రహ్మము**

- సర్వ ఉపాధి - విముక్తమైనట్టిది (That which is not bound by any physical holding)
- సర్వ విశేషములకు మునుముందే ఉండి ఉండటం చేత నిర్విశేషమైనది.
- కేవల స్వరూపమై సర్వమును వెలిగించుచున్నట్టిది (That which enlightens all else) కాబట్టి **'చిన్మాత్రము'.**
- నా-నీ-మనందరియొక్క వాస్తవ స్వరూపమే అయి ఉన్నట్టిది - **'బ్రహ్మము'.**

---

**ఔపాధికము। అవినాశి।**

తద్ధి (తత్ విద్ధి) 'త్వం' పదార్థ ఔపాధికాత్,

అట్టి తత్ బ్రహ్మము 'త్వమ్' (నీవు)ను ఉపాధిగా ఆశ్రయించుచూ, లీలావినోది అయి ఉన్నది. బ్రహ్మము యొక్క ఔపాధికత్వ చమత్కారమే జగత్ కల్పన.

---

**అవినాశి**

'తత్' పదార్థాశ్చ ఔపాధిక బేధాత్-
విలక్షణమ్। అభేదమ్ ।
అధిష్ఠానత్వ-ఉపలక్షితం।
శుద్ధం। పారమార్థికం। సత్తామాత్రమ్
"అవినాశి।"

**అవినాశి**

'త్వమ్' - 'తత్' (నీవు - ఆత్మ) అనునవి ఔపాధిక ఆత్మయొక్క ఉపాధి కల్పనా సంబంధ భేదములే.

**పరమాత్మ ఆ రెండింటికీ విలక్షణమై యున్నట్టిది.**

- (బంగారము ఆభరణమగు విధంగా) అధిష్ఠానత్వము ఉపలక్షితముగా కలిగియున్నట్టిది.
- **"పరమశుద్ధము, పారమార్థికము, కేవల సత్తామాత్రము"** - అయినట్టిది **"అవినాశి"**

---

## విశేషార్థములు

**16.** కిం సత్యమ్?

కిం తత్ సత్యమ్ ఇతి?
'సత్' ఇతి, 'శ్రౌత పతి' - ఇతి లక్ష్యం 'సత్యమ్'।
అసత్-ఇతి అవాచ్యం సత్యమ్।
త్రికాలాబాధ్యం (త్రికాల-అబాధ్యం) సత్యమ్।
- త్రికాల అనుస్యూతం సత్యమ్।
- యత్ అస్తి - తత్ సత్యమ్।
- ఏకమేవాద్వితీయం (ఏకమేవ-అద్వితీయం) సత్యమ్।
- సజాతి విజాతి భేద రహితం సత్యం।
- సర్వకల్పన అధిష్ఠానం వా సత్యమ్।
- అవినాశికమ్ ఇతి॥
- దేశ-కాల-వస్తు-నిమిత్తాషు వినశ్యత్సు,
"యత్ న వినశ్యతి" - ఇతీతి॥ (-సత్యమ్।)

## విశేషార్థములు

**సత్** : ఏది సత్యమైయున్నది?

- ఏదైతే సత్ (ఉనికి)" అను రూపంగా ఆత్మజ్ఞులచే నిర్ణయించబడుచు, 'శ్రుతులు' ప్రమాణముగా కలిగియున్నట్టిదో అది **'సత్'.**
- ఏది ఎరిగిన తరువాత **'అసత్' అనునది అవాచ్యము** అగుచున్నదో (చెప్పటానికి శేషించి ఉండదో) అది 'సత్'.
- భూత - వర్తమాన-భవిష్యత్‌లచే కించిత్ కూడా మార్పు చెందనిది (అబాధ్యమ్) సత్యము.
- త్రికాలములలో, అంతర్లీనమై, అనుస్యూతమై ఏర్పడి ఉన్నది సత్యము.
- ఏకమే అయి, (స్వస్వరూపమునకు) అద్వితీయమైనది సత్యము.
- సజాతి - విజాతి విభేదరహితమైనది సత్యము.
- సర్వకల్పనలకు అధిష్ఠానమైయున్నది 'సత్యము'.

**అందుచేత సత్యము అవినాశనమైనది.**

ఈ ఎదురుగా ఉండే దేశ, కాల, వస్తు, నిమిత్తములు 'వినాశము' అను ధర్మము కలిగియున్నాయి. దేనికి 'వినాశనము' అనే ధర్మమే లేదో, అన్ని అన్యవినాశనములకూ కేవల సాక్షి అయి చెన్నొందుతోందో,

**అదియే ఆత్మ। అదియే సత్। అదియే సత్యమ్।**

| కిం జ్ఞానమ్? | జ్ఞానము అనగా? |
|---|---|
| కిం జ్ఞానమ్ ఇతి? స్వప్రకాశం జ్ఞానమ్। స్వ ప్రకాశం జ్ఞానమ్। సర్వ ప్రకాశం జ్ఞానమ్। నిరావరణ చిన్మాత్రం జ్ఞానమ్। అనాది - అనంతమ్ నిరంతరమ్ అవృత్తి- సాక్షి చైతన్యమేవ జ్ఞానమ్। | ఆత్మయొక్క స్వయం ప్రకాశ విశేషమే జ్ఞానము. ఆత్మయొక్క సర్వమును (మనో బుద్ధి చిత్త అహంకార-జీవాత్మ - ఈశ్వర-దృశ్య.. ఇత్యాది సర్వమును) ప్రకాశింపజేయు విలక్షణ లక్షణమే జ్ఞానము. ఆవరణములు (Limitations) లేనట్టి కేవలచిత్ (ఎరుక, వెలిగించు) యే జ్ఞానరూపము. ఆత్మనగు నాకు ఎట్టి ఆవరణములు లేవు - అనునదే జ్ఞానము. ఆద్యంతరహితము, నిరంతరమైనది (అనునిత్యము), వృత్తి (Avocation)కి ఆవల (అద్దానికి జననస్థానమైయున్న) అవృత్తి, సాక్షి చైతన్యము గురించిన సమాచారమే → **జ్ఞానము.** |
| **17.** కిమ్ అనన్తమ్? | **అనన్తమ్ : ఆత్మ అనన్త** (Infinite) **స్వభావమైనది.** |
| కిం 'అనన్తమ్' - ఇతి? ఉత్పత్తి-వినాశ రహితమ్ అనన్తమ్। షట్ (చ (6)) భావ (షడ్భావ) వికార రహితమ్-అనన్తమ్। సర్వోపాధి వినిర్ముక్తమ్ - అనన్తమ్। మృత్ వికారేషు మృత్ ఇవ, స్వర్ణ వికారేషు స్వర్ణమివ, తంతు వికారేషు తంతురివ- అవ్యక్తాది సృష్టి ప్రపంచేషు వ్యాప్య పూర్ణమ్, అవినాశి చైతన్యమ్ 'అనన్తమ్'! | ⚔ ఉత్పత్తి - వినాశన ధర్మము లేనట్టిది. కాబట్టి- **"అనన్తమైనది ఆత్మ"!**<br>⚔ **ఉత్పత్తి కామము - ఉత్పత్తి - పెరుగుదల - తరుగుదల - వినాశనము - పునరుత్పత్తి స్వభావము** - అను షట్ (6) భావ వికారములు లేనట్టిది - **అనన్తము.**<br>⚔ దృశ్య-స్థూల - ఇంద్రియ సూక్ష్మ-కారణ-మహాకారణ ఉపాధులకు పరిమితము కానిది, వాటిచే నిబద్ధము కానిది 'అనన్తము'.<br>⚔ మట్టియే మట్టికుండ (మృత్-పిండము)గా అగుచున్నప్పటికీ, "కుండ యొక్క పొడవు - వెడల్పు - చుట్టూ కొలతలు" - అనే వికారములు మట్టికి లేవు.<br>⚔ బంగారమే ఆభరణములుగా అగుచున్నప్పటికీ "గాజు- ఉంగరము-గొలుసు-ఇది వారివి, వీరివి కాదు- ఇత్యాది వికారములుగా అవటము" అనే ధర్మము బంగారమునకు లేదు.<br>⚔ దారమే "అంగవస్త్రము - చొక్క - ధోవతి" మొదలైనవిగా అగుచున్నప్పటికీ దారమునకు **వస్త్ర ఇత్యాది ఆకారములు** అనే వికారములు ఆపాదించలేము.<br>**అట్లాగే,** అనన్తమగు చైతన్యమే - అవ్యక్తము మొదలుకొని ఈశ్వర, జీవ, మనో, బుద్ధి, చిత్త, అహంకార, దృశ్య, జడవస్తువులతో సహా అగుచూ ఉన్నప్పటికీ, ఆయా వికారములన్నీ అనన్తమగు 'ఆత్మ'కు లేవు. ఆత్మ అనన్తము। |
| కిం 'ఆనన్దమ్' ఇతి? | **ఆనన్దమ్ :** |
| అంభసామ్ అర్ణవ ఇవ సుఖ చేతనానామ్ అధిష్ఠానమ్, నిత్యశుద్ధ - అఖండ అద్వైత - చిదానంద - ఏకరసమ్ 'ఆనన్దమ్'। | సముద్ర తరంగములకు సముద్ర జలమే అధిష్ఠానము. సుఖ-చేతనములకు ఆనందమే అధిష్ఠానము.<br>**ఆనన్దము** : నిత్య శుద్ధము, అఖండము, అద్వైతము అగుచిదానంద ఏకరసమే **ఆనన్దము. "నేను ఆత్మను"-అనునది స్వాభావికానంద స్థానము.** |
| **18.** కతి పదార్థా? | **పదార్థము అనగా?** |
| అథ కతి పదార్థా ఇతి? సత్-అసత్-మిథ్యా చ ఇతి త్రయః। సదేవ తత్ర బ్రహ్మ। అసత్ తుచ్ఛం। జగత్ కల్పితం బ్రహ్మణి- - అసత్యం। మిథ్యా। | **పదార్థములు '3' విధములు** : (1) సత్ (2) అసత్ (3) మిథ్య<br>**సత్తు** → బ్రహ్మమే ఇక్కడ సత్।<br>**అసత్తు** → కల్పితమైనది. స్వయముగా చూస్తే లేనట్టిది కాబట్టి తుచ్ఛము.<br>**మిథ్య** → బ్రహ్మము పట్ల ఆరోపించి చూచుచుండగా కనబడు జగత్తు. వాస్తవానికి బ్రహ్మమునకు వేరుగా జగత్తు లేదు. కానీ వేరుగా ఉన్నట్లుగా **భావించబడి, భావించబడు విధంగా పొందబడుచున్నట్టిది.**<br>**(యత్ భావం, తత్ భవతి। తదేవ భావం, తత్ భవతి।)** |

బ్రహ్మము – ఆత్మ – అనాత్మ

**బ్రహ్మైవ ఆత్మా – జ్ఞేయః।**
**బ్రహ్మజ్ఞానం సమూలాన్, ఆత్మవివర్తకం**
**సత్ బ్రహ్మణి విలీయతే॥**
**అనాత్మా తు సజీవో 'వియత్' ఆది ప్రపంచః।**
**అనాత్మమూలం మాయా।**
**సా చ బ్రహ్మణి ఆకాశే మేఘాదిరివ దృశ్యతే।**

**"ఆత్మ బ్రహ్మమే అయి ఉన్నది"** - ('I' am Brchamam) అనునది పరమసత్యము. అది తెలియబడేది కాదు. తెలుసుకొంటున్నదే అది. కల్పనయొక్క ధారణచే ఆత్మనుండి వివర్తమయిన (అవ్యక్త జీవాత్మ, జాగ్రత్ స్వప్న సుషుప్తులు మొదలైనవన్నీ కూడా) తిరిగి మరొకప్పుడు ఆత్మయందే (లేక) బ్రహ్మమునందే విలీనమయిన వగుచున్నాయి. జీవుడు మొదలుకాని- ఆకాశము మొదలైన - ప్రపంచమంతా కూడా మాయయే! ఆత్మకు అన్యమైన అనాత్మ అంతా మాయయే। ఆకాశములో మేఘములు ఆవరించి, ఉండుతీరుగా, బ్రహ్మాకాశము నందు జగత్తులు, జీవులు, స్వభావములు ఆవరించినవై కనిపిస్తున్నాయి.

---

**22.** మాయా

**మాయా నామ: అనాది–అంతవతీ। (న ఆది అంతవతీ)**
**ప్రమాణ– అప్రమాణ – సాధారణా।**
**న సతీ। న అసతీ। న సత్–అసతీ।**
**అనిర్వాచ్య అధిష్ఠాన ఏవ।**
**అవిద్యమాన, అంతర్వాణి।**
**వికల్ప నిరూప్యమాణోః చ।**
**అవచ వ్యవహార భేదవతీ।**
**–యా న విద్యతే వస్తుతః, స 'మాయా'।**

**మాయ**

మాయ ⟶ **'అనాది'** అయినట్టిది. దానికి **'అంతము'** లేదు.

ప్రమాణ - అప్రమాణములకు పొత్తైనది, విషయమైనది కాదు.

- అది ఉన్నదీ కాదు, లేనిదీ కాదు. సత్తు కాదు, అసత్తు కూడా కాదు.
- ఆ ఉభయధర్మ సంబంధమైనదీ కాదు. ఉండీ లేనిది కాదు.
- మాయ 'ఇట్టిది' అని నిర్వచించి చెప్పజాలము. అద్దాని అధిష్ఠానము **'ఇది'** అని అనలేము. "కల్పన"యొక్క రూపము ఏమని చెప్పగలం?
- అది హృదయమునందే భ్రమగా కనబడుతోంది కాబట్టి అవిద్యామానము. **అంతర్వాణి యొక్క వికల్పము**గా ఆత్మజ్ఞులచే ప్రవచనము చేయబడుతోంది.
- "ఇది ఇట్టిది" అని నిర్వచించి చెప్పలేని వ్యవహార భేదత్వముతో కూడుకొని ఉన్నది.
- **వస్తుతః ఏదైతే లేదో, అదియే మాయ ("యా మా-సా మాయా।")**

---

**తత్ స్వరూపమ్ అజ్ఞానమ్।**
**తదేవ మూల ప్రకృతిః।**
**గుణసామ్యమ్।**
**అవిద్యేతి ఆద్య అనేక ఆకారా**
**'జగత్' ఆకారేణ పరిణతా।**
**తత్ ఏవం బ్రహ్మ**
**విజానాతి, అనుభవతి చ॥**
**తత్ర ఏతే శ్లోకాః॥**

"మాయ యొక్క వాస్తవ స్వరూపము ఏమిటి?" - అని పరిశోధిస్తే, **"అజ్ఞానమే!"** - అని తెలియవచ్చుచున్నది.

అదియే మూలప్రకృతి (The Root Zone Area of swabhavam, prakruthi). త్రిగుణములగు **సత్త్వ రజో తమో గుణ మిశ్రమమే మాయ.** మొట్టమొదట **'అవిద్య'**గా బయల్వెడలి, అనేక **ఆకార - వికారములు** పొంది, చివరికి **'జగత్'** ఆకారంగా పరిణమించినదగుచున్నది.

అయితే, **'మాయ'** బ్రహ్మమే గాని, బ్రహ్మమునకు వేరుకాదు. **బ్రహ్మము అనన్యము కదా!** అందుచేత మాయను పరిశీలిస్తే బ్రహ్మముగానే శేషించుచూ (తెలియబడుచూ), స్వానుభవం కాగలదు - అని ఋషిగానం.

---

**కోఽ హమ్? సోఽ హమ్।**

**19** **నైవం భవామి అహం దేహః।**
**న ఇంద్రియాణి దశైవతు।**
**–న బుద్ధిః – మన – ఈశశ్చ।**
**–న అహంకారః తథైవ చ।**
**అప్రాణో హి అమనాః శుభ్రో।**
**బుద్ధ్యాదీనాం హి సర్వదా ।**
**సాక్షి–అహమ్, సర్వదా నిత్యః।**
**చిన్మాత్రోఽ హమ్, న సంశయః॥**

## నేను ఎవరు? అదే నేను।

నేను ఏక్షణంలోను ఈ భౌతిక దేహముగా గాని, ఇందులోగల పంచ కర్మేంద్రియ-పంచ జ్ఞానేంద్రియములుగా గాని అవటం లేదు.

- నిర్ణయించు ధర్మమును నిర్వర్తించు **'బుద్ధి'గా** గాని, ఆలోచనలు జనించు **మనస్సు**గాగాని, అనేక వైపులుగా విస్తరించు **ఈశ్వరుడుగా** గాని, **'నేను-నాది'** అనుభావనారూపిగా అయిఉన్న **'అహంకారము'**గా గాని అగుటయే లేదు.

- **ప్రాణశక్తిరూపుడనుకాను। మనోరహితుడను। నిత్యపరిశుద్ధుడను।**

**- బుద్ధికి - మనస్సుకు, చిత్తమునకు, అహంకారమునకు** కేవలసాక్షిని. సర్వమును వెలిగింపజేయు నిత్య చిన్మాత్రుడను. ఇందులో సంశయమే లేదు. అవన్నీ నా ప్రదర్శనలే అయి ఉండి కూడా, అవేవీగా నేను అవటమే లేదు. (నాటకములో నటుని ముఖకవళికలు నటుని స్వరూపము కాదు కదా!)

**న అహమ్ కర్తా। నైవ భోక్తా!**
**ప్రకృతేః సాక్షి రూపకః।**
**మత్ సాన్నిధ్యాత్ ప్రవర్తంతే**
**దేహాది యా 'అజడా' ఇవ।**

(నాటకంలో నేను నటిస్తున్న పాత్రయొక్క చర్యలకు నేను కర్తను కాదు, భోక్తను కాదు) అట్లాగే, - సర్వదా కేవలాత్మ స్వరూపుడనగు నేను దేనికీ కర్తను కాదు. దేనికీ భోక్తను కాదు. అవి రెండూ ప్రకృతికి (జగన్నాటకమునకు) సంబంధించినవి. మరి నేనో? ప్రకృతికి (లేక) జగన్నాటకమునకు సాక్షిరూపుడను.

ఈ దేహము స్వయముగా జడవస్తువే (మరొకటి కదలిస్తేగాని ప్రవర్తించజాలనట్టిది) అయినప్పటికీ, చైతన్యస్వరూపుడనగు నా యొక్క సాన్నిధ్యం చేత అది అజడముగా (చేతనమువలె) అగుపిస్తోంది.

---

**స్థాణుః నిత్యః సదానందః**
**శుద్ధో జ్ఞానమయో అమలః,**
**ఆత్మాహమ్ సర్వభూతానామ్,**
**విభుః, సాక్షీ - న సంశయః।**
**బ్రహ్మైవాహమ్, సర్వవేదాన్త వేద్యమ్।**
**నాహమ్ వేద్యమ్ వ్యోమ, వాతాది రూపమ్।।**

(కలలో ఒకడు ఒకచోటి నుండి మరొక చోటికి వెళ్లినా కూడా, ఆ కల తనదైనవాడు ఎక్కడినుండీ ఎక్కడికీ వెళ్లని విధంగా) → ఆత్మనగు నేను ఎచ్చట నుండి ఇక్కడి రావటం లేదు. ఇక్కడి నుండి ఎక్కడికీ వెళ్లటం లేదు. **స్థాణువును. ఎప్పటికీ ఉండేవాడిని. నిత్యుడను.** ఈ జన్మ-కర్మల ప్రహసనమంతా నాకు వినోదము! **సదానందుడను.** దేహ-మనో-బుద్ధుల దోషములు నాకు. అంటవు. **నిత్యశుద్ధుడను. కేవల జ్ఞాన స్వరూపుడను. అమలుడను.**

సర్వభూతజాలముల **ఆత్మస్వరూపుడను.** సర్వనియామకుడను కాబట్టి **విభుడను.** సర్వమునకు **సాక్షిని.** సందేహమే లేదు.

సర్వవేదాంతముల (ఉపనిషత్తుల) ప్రతిపాదకములచే తెలియచెప్పబడుచున్న **బ్రహ్మమే నేను. తెలుసుకొంటున్నవాడినే నేనై ఉన్నాను.** ఆకాశ - వాయు - అగ్ని - జల - భూరూపముల ద్వారా గాని, మనో బుద్ధి చిత్త అహంకారము ద్వారా గాని తెలియబడేవాడిని కాను.

---

**రూపం నాహమ్। (న అహమ్)।**
**నామ నాహమ్। న కర్మ।**
**బ్రహ్మైవ అహగ్ం**
**సత్-చిత్ -ఆనంద రూపమ్।**
**నాహమ్ దేహో**
**జన్మ మృత్యూ కుతో మే?**
**నాహం ప్రాణః। క్షుత్-పిపాసే కుతో మే?**
**నాహం చేతః। శోక మోహౌ కుతో మే?**
**నాహం కర్తా! బంధ మోక్షౌ కుతో మే?**

***<u>ఇతి సర్వసారోపనిషత్</u>***
***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।</u>***

ఈ భౌతిక రూపముగాని, నామముగాని, కర్మవ్యవహారములుగాని నేను కాదు.

సత్ చిత్ ఆనంద రూపము, కేవలము అగు **బ్రహ్మమే నేను।**

నేను ఈ భౌతిక దేహము ఏ మాత్రం కాదు. కాబట్టి నాకు జన్మ-మృత్యువులు ఎక్కడివి? అవేమీ లేనట్టివాడను.

ప్రాణమును కాదు. నాకిక ఆకలి దప్పికలు ఎక్కడివి?

నేను చిత్తమును కాదు. మరి శోక-మోహములు నాకెక్కడివి?

**నేను దేనికీ కర్తను కాదు.** ఇక బంధ-మోక్షములు నాకెక్కడివి?

***<u>ఇతి సర్వసారోపనిషత్</u>***
***<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।</u>***

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 29 శ్రీ సర్వసారోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

అనేక బంధములకు దుఃఖములకు సాకారము, దేహాదేహాంతరములుగా సుదీర్ఘమై వెంటనంటి వస్తున్నది - అగు **"సంసార వికలము"** నుండి తరింపజేయగల శ్రీరామచంద్రమూర్తి పాదపద్మములను శరణు వేడుచున్నాను.

శ్లో॥ సర్వసారం నిరాలంబం రహస్యం వజ్రసూచికమ్,
తేజో నాద ధ్యాన విద్యా యోగతత్త్వ ఆత్మ బోధకమ్॥

***ఈ "సర్వ సారోపనిషత్" - సర్వ వేదోపనిషత్తుల సారము అయి ఉన్నది. నిత్యస్వాతంత్ర్య సమన్వితమగు ఈ జీవునియొక్క రహస్య - సావలంబ-నిజరూపము గురించి ఎలుగెత్తి గానం చేయుచూ గుర్తు చేస్తున్నది. పరమ రహస్యమైనట్టిది. వజ్ర సూచికవలె సాక్షాత్ స్వస్వరూపతత్త్వము గురించి విశదీకరించుచున్నది. బిందు తేజో నాద ధ్యాన విద్యావిశేషముల అంతిమ లక్ష్యమును సుస్పష్టపరచుచున్నది. ఆత్మతో సంయోగతత్త్వమును బోధించుచున్నది.***

భక్తి జ్ఞానయోగ సాధన సంపత్తి గల శిష్యుడు బ్రహ్మతత్త్వమును అనునిత్యము చేసుకొన్న తత్త్వదర్శి అగు సద్గురువును సమీపించి, ప్రణిపాతుడై 'ఆత్మశాస్త్రము' గురించి పరిప్రశ్నించనారంభించుచున్నారు.

❖ ❖ ❖

**శిష్యుడు** : హే బ్రహ్మజ్ఞా! తత్త్వజ్ఞా! సద్గురువరేణ్యా! సర్వము సర్వదా 'ఆత్మ'గా (లేక) 'బ్రహ్మము'గా స్వానుభవం అవాలనే దీక్షతో మిమ్ములను సందేహ నివృత్తి కొరకై పరిప్రశ్నించుచున్నాను. అమృతతుల్యమగు మీయొక్క కరుణతో నన్ను సందేహ నివృత్తునిగా తీర్చిదిద్దవలసినదిగా అభ్యర్థిస్తున్నాను. దయతో నా సందేహములను ఆలకించండి. నివృత్తి చేయండి.

***"ఓం" కారస్వరూపమగు - (ఇతి) ఏకము- అక్షరము- అనన్యము అగు పరబ్రహ్మమునకు నమస్కరిస్తూ!***

- **కథం బంధః?** బంధము అనగా ఏమి? ఎవరికి? ఎందుకు?
- **కథం మోక్షః?** మోక్షము అనగా?
- **కా విద్యా? కా అవిద్యా చ ఇతి?** విద్య అనగా ఏమి? **అవిద్య** అనగా?
- జాగ్రత్ స్వప్నసుషుప్తి తురీయములు-ఎటువంటివి? ఏ తీరైనవి?
  అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ-పంచకోశములు-అని వేటిగురించి చెప్పబడుచున్నాయి?
- **'కర్త', 'జీవుడు', 'పంచవర్గము', 'క్షేత్రజ్ఞుడు', 'సాక్షి', 'కూటస్థుడు', 'అంతర్యామి'** - అనగా ఏమి? ఎవరు?
- **'ప్రత్యగాత్మ', 'పరమాత్మ', 'మాయ'** - అని దేనిదేనిని పిలువటం జరుగుతోంది?
- **కిం 'బ్రహ్మ'? కతి 'పదార్థా'? కా 'మాయా' చ? "బ్రహ్మము, పదార్థము, మాయ"** - అనగా ఏవేవి?
- **'నేను' ఎవరు? నాకు ఈ జగత్తుకు, దేహమునకు, సర్వజీవులకు గల పరస్పర సంబంధము వాస్తవానికి ఏమై ఉన్నది?**

ఈఈ విశేషములను [**'వేదాంతశాస్త్రము' దృష్ట్యా (లేక) అధ్యాత్మశాస్త్రము దృష్ట్యా**] ప్రవచించవలసినదిగా మిమ్ములను ప్రార్థిస్తున్నాను.

**సద్గురువు :** బిడ్డా! ఆత్మబంధూ! స్వయమాత్మానంద స్వరూపా! నీవు నాముందు ఉంచినవన్నీ కూడా తత్త్వదర్శకములు, **రహస్యములలోకెల్లా రహస్యము.** ఈ జీవుని సహజ రూపమగు 'బ్రహ్మము'నకు సంబంధించిన **పరిప్రశ్నలు.** ఈ జీవులు తప్పక **అధ్యయనము** చేయాలి. సరి అయిన సమాధానమును సముపార్జించుకోవాలి కూడా. శాస్త్ర ప్రవచనముల సహాయంతో స్వానుభవపూర్వకంగా అఖండస్వరూపుడగు ఆత్మభగవానుని అనుగ్రహము కొరకై సేవించుచూ చెప్పుకుందాము. శ్రద్ధగా విను.

**బంధము : దేహాదీనామ్ ఆత్మత్వేన అభిమన్యతే – సో అభిమాన ఆత్మనో బంధః।** స్వయముగా, సహజముగా **'ఆత్మేశ్వరుడే'** అయి ఉన్న ఈ జీవుడు 'అనాత్మ' అనతగినట్టి ఈ దేహము, ఈ దృశ్యములో తారసబడే సంబంధములు మొదలై వాటి పట్ల ఆత్మత్వముగా అభిమానమును అనేక జన్మలుగా పెంపొందించుకొన్నవాడై ఉంటున్నాడు. ఆత్మయొక్క 'అన్యము'నకు సంబంధించిన అభిమానముతో కూడిన భావనలే  ఈ జీవునికి 'బంధము'. ఆత్మతో అనన్యదర్శనమే "బంధ–విముక్తి".

**మోక్షము : దేహాదీనామ్ ఆత్మత్వేన అభిమన్యతే – తత్ నివృత్తిః మోక్షః।** అటువంటి కల్పితములగు దృశ్య విషయముల పట్ల గల 'అభిమానము' – ఉపసంహరించబడి, నివృత్తి పొందినప్పటి స్థితియే 'మోక్షము'. ఎప్పుడైతే ఈ జీవుడు **"నేను ఈ దేహ, దృశ్య విషయములచే నిబద్ధుడను అయ్యే ప్రసక్తి మొదలే లేదు"** – అని గ్రహించి, సమస్త బాహ్యవిషయములపట్ల మౌనస్వరూపుడై ఉండియే వ్యవహరిస్తూ ఉంటాడో, అప్పుడిక ఈతడు **మోక్షస్వరూపుడే! "ఆత్మ స్వరూపుడనగు నాకు బంధము ఏమాత్రము ఉండజాలదు" –** అను నిశ్చితావగాహనయే మోక్షము.

**అవిద్య : యా దేహాదీనామ్ ఆత్మత్వేన తత్ అభిమానం కారయతి – సా హి "అవిద్యా"।** ఏఏ అభ్యాసములు దృశ్యాభిమానమును ప్రవృద్ధపరచటానికి కారకములు అవుతూ ఉంటాయో, వాటికి సంబంధించిన ప్రవృత్తులు, అభ్యాసములు **'అవిద్య'** అనుబడుచున్నాయి.

**విద్య: సో అభిమానో యామా నివర్తతే। సా 'విద్యా'।** అట్టి దృశ్యాభిమానమునకు సంబంధించిన వృత్తులు ఏఏ (జ్ఞాన–యోగ–భక్తి) అభ్యాసములచే నివృత్తమగుచూ ఉంటాయో – అది **'విద్య'.**

**జాగ్రత్ :** (I) అంతఃకరణ **చతుష్టయం** (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము (4), (II) పంచ (5) కర్మేంద్రియములు (III) పంచ (5) జ్ఞానేంద్రియములు – ఈ 14 కరణములను ఉపయోగించి స్థూలములగు శబ్ద–స్పర్శ–రూప–రస–గంధముల అనుభవములను బాహ్య విషయములుగా ఆత్మ స్వకీయ భావనచే పొందుచూ ఉన్నప్పుడు అది **'జాగ్రత్'.** అగుచున్నది. అనగా, ఆత్మ 14 కరణములను ఉపయోగిస్తూ శబ్ద స్పర్శాది విషయములను బాహ్యమున స్థూలముగా 'అనుగ్రహీతము' అను క్రియయందు నిమగ్నమై యుండటమే **– జాగ్రత్।** ఇంద్రియ విషయములచే నిర్మితమగుచున్న దృశ్యముయొక్క అనుభూతులలో రతించటమే 'జాగ్రత్' (జాగ–రత్).

**మన–ఆదిచతుర్దశ (4) కరణైః పుష్కలైః ఆదిత్యాది అనుగ్రహీతైః, శబ్దాది విషయాన్ స్థూలాన్ యదా ఉపలభతే, తత్ ఆత్మనో 'జాగరణమ్।**

## 'ఆత్మ యొక్క జాగ్రత్'

### 14 – కరణములు

| ఇంద్రియములు | ఇంద్రియ గోళకములు | ఇంద్రియ విషయములు |
|---|---|---|
| **కర్మేంద్రియములు** | | |
| వాగింద్రియము | నోరు | వచనము |
| పాణీంద్రియము | చేతులు | ఆదానము |
| పాదేంద్రియము | కాళ్ళు | గమనము |
| పాయు–ఇంద్రియము | గుదము | విసర్జనము |
| ఉపస్థేంద్రియము | గుహ్యము | ఆనందము |
| **జ్ఞానేంద్రియములు** | | |
| శ్రోత్రేంద్రియము | చెవులు | శబ్దము |
| త్వగింద్రియము | చర్మము | స్పర్శ |
| చక్షురింద్రియము | కళ్ళు | రూపము |
| జిహ్వేంద్రిము | నాలుక | రసము |
| ఘ్రాణేంద్రియము | ముక్కు | గంధము |

| అంతఃకరణ చతుష్టయము | క్రియారూపము | అనుభూతి |
|---|---|---|
| మనస్సు | ఆలోచన, భావన | ఆలోచించబడుచున్న, భావించబడుచున్న, విశేషాలు/విషయములు |
| బుద్ధి | తెలివి. విశ్లేషణ, విచక్షణ | తెలియబడు, విచక్షించబడు విషయములు |
| చిత్తము | ఇష్టము. అభిమానము. | ఇష్టపడు/అయిష్టబడు అభిమానించబడు/అభిమానించబడని విశేషములు/విషయములు |
| అహంకారము | 'నేను' అను భావన | 'నావి' అని భావించబడునవి |

**14 కరణ ధర్మములు (లేక) క్రియలు + ఊహ, అపోహకలగలపుగా "జాగ్రత్" నిర్మితము అవుతోంది. వాటి వాటి పట్ల "ఇవియే / నేను" – అను అభిమానరూపమే 'జాగ్రత్' అయి ప్రాప్తిస్తోంది.**

## ఆత్మయొక్క స్వప్నము

ఆ విధంగా 14 కరణములు స్థూలములగు శబ్దము – స్పర్శ మొదలైన విషయములను భావనచే జాగ్రత్‌రూప–అనుభవముగా పొందుచూ, ఒక సమయము నందు అలసిపోయి, ఈ జీవుడు బాహ్య విషయ స్వీకరణముల పట్ల బాహ్యముగా **'భావించటము'** యొక్క **"విరామము"**ను ఆశ్రయించుచున్నాడు.

అయితే విషయములలో నియోగించబడిన 14 కరణములను ఈ జీవుడు బాహ్యముగా ఉపయోగించటము విరమించినప్పటికీ, ((లేక) ఈతడు భావించటమును ఆపివేసి **'అభావన'**ను ఆశ్రయించి ఉన్నప్పటికీ),, వాసనా సహితమైన 14 ఇంద్రియములు (Indrias that tend to be avocative) సంబంధించిన సంస్కారములు కారణంగా (because of tendency or habit) శబ్దాది విషయములను 'ఊహ'యందు కల్పించుకొని దృశ్య వ్యవహారములను పొందుచూ ఉంటున్నాడు. అనగా, బాహ్య విషయములు లేకుండానే ఊహామాత్రంగా విషయానుభవములను కల్పనగా పొందటము జరుగుతోంది. "స్వయంకృతమగు ఊహ–అపోహలు + అంతరంగములోని వాసనలు (లేక) సంస్కారములు" – ఇవి తాత్కాలికమగు స్వప్నదృశ్యానుభవమునకు కారణములగుచున్నాయి. **తత్ వాసనా సహితైః చతుర్దశ (14) కరణైః, శబ్దాది అభావే௨పి, వాసనామయాం శబ్దాదీం తాత్కాలికాన్ యదా ఉపలభతే, – తత్ ఆత్మనః స్వప్నమ్।**

(ఇది ఎట్లా అంటే, ఒకడు ఒక దారమునకు (లేక) పురికొస త్రాడుకు ఆటబొమ్మను కట్టి, చేతితో అటూ ఇటూ ఊపుతూ, కొంత సేపైన తరువాత చేతిని కదల్చటం ఆపివేసినప్పటికీ, ఆ త్రాడుకు (లేక) దారమునకు వ్రేలాడుతూ ఉన్న ఆట బొమ్మ అటూ ఇటూ కదలుచూ ఉండటము వంటిది).

ఈ విధంగా బాహ్య శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములను భావించటము ఆపివేసినప్పటికీ 14 కరణములు– వాసనలు (Tendencies) కారణంగా శబ్ద–స్పర్శ–రూపాదులను బాహ్య వస్తు రహితంగా (ఊహామాత్రంగా) పొందటము కొనసాగిస్తూ ఉన్న సందర్భము **– "ఆత్మానః స్వప్నమ్। ఆత్మయొక్క స్వప్నస్థితి"** – అగుచున్నది.

## ఆత్మయొక్క సుషుప్తి

**చతుర్దశ (14) కరణ ఉపరమాత్, విశేష విజ్ఞాన అభావాత్, యదా శబ్దాదీన్ న ఉపలభతే, తత్ ఆత్మనః సుషుప్తమ్।** ఈ జీవుడు అన్య–విశేషముల రూపములగు జాగ్రత్ స్వప్నవిజ్ఞానమంతా 'అభావన'చే పూర్తిగా ఉపసంహరించి, దాచిపెట్టినప్పటి స్థితి. 14 కరణములు కూడా శబ్ద–స్పర్శాది విషయములను ఏ మాత్రమూ పొందనప్పుడు **(న ఉపలభతే)–తత్ ఆత్మనః సుషుప్తిః।** అది ఆత్మ యొక్క సుషుప్తి. భావనలకు విశ్రాంతి ఇచ్చినప్పటి జడస్థితియొక్క అనుభవమే **"సుషుప్తి".**

## ఆత్మయొక్క తురీయము

- **అవస్థాత్రయ సాక్షీ।** ఏదైతే జాగ్రత్ స్వప్న సుషుప్త అవస్థలకు కేవలము 'సాక్షి' అయి చూస్తూ, వాటిని తన సంచార స్థానములుగా కలిగియున్నదో..., తనయొక్క అనురూపములుగాను, తన ప్రేరణా చమత్కారములుగాను ప్రదర్శించుచున్నదో,
- **భావాభావ సాక్షీ। స్వయం భావ రహితం।** భావములకు ఆవల భావరహితమైయున్నదో, భావతీత స్వరూపమో,
- **నైరంతర్యం చైతన్యం** – నిరంతము కేవల చైతన్యరూపమైయున్నదో, (అనగా) **తాను కదలక 'కదల్చువాడు'** అయి ఉన్నదో,
- (జాగ్రత్–స్వప్న–సుషుప్తులనబడే) త్రి–అవస్థల సందర్భములో సర్వదా యథాతథమై, ఎప్పటివలనే కార్య–కారణాతీత స్వరూపమైయుంటోందో..., **యదా, – తదా తత్ తురీయం చైతన్యం ఇతి ఉచ్యతే।**

**అదియే ఆత్మ యొక్క తురీయ చైతన్య స్వరూపము.**

# పంచకోశములు

**(1) అన్నమయకోశము** (Zone of matter): పంచభూతములచే నిర్మితమగుచూ, 'అన్నము'ను కారణముగా కలిగి రూపుదిద్దుకొంటున్న కార్యముల సమూహములన్నీ కలిపి – **'అన్నమయకోశము'** అని పిలుస్తున్నారు. **అన్న కార్యాణాం, కోశానాం సమూహో – అన్నమయకోశః।** ఈ భౌతికంగా కనిపించే శరీరము 'అన్నము'చే నిర్మితమౌతోంది కాబట్టి – ఇది ఆత్మయొక్క 'అన్నమయ కోశము'. **ఇంద్రియములు, (మరియు) ఇంద్రియానుభవముల సమన్వయము కూడా 'అన్నమయకోశము'లో అంతరభాగమే.**

**(2) ప్రాణమయకోశము** (Zone of Energy): **ప్రాణాది దశవాయవో అన్నమయకోశే యదా వర్తంతే తదా 'ప్రాణమయకోశా'।**వాయు (ప్రాణ) పంచకములు : **ప్రాణము; అపానము; వ్యానము; ఉదానము; సమానము; (5)**

**ఉపవాయు(ప్రాణ)పంచకములు : నాగము; కూర్మము; కృకరము; ధనంజయము; దేవదత్తము (5)**

**వాటి వలన ఏర్పడు చర్యలు : సువచన/దుర్వచన; దానపరిగ్రహణ; గమన/ఆగమన; విషయానందముల చర్యలు (4) – ఇదంతా 'ప్రాణమయకోశము'. (మనో బుద్ధి చిత్త అహంకారములకు కదలిక కలిగించు ప్రేరణ వాయువులు (4) – ఇది మరొక నిర్వచనము).**

ఒకే వాయువు ఆయా (14 విధములైన) ప్రకంపనములు, చర్యలు ఈ అన్నమయ కోశమునందు నిర్వర్తిస్తున్నాయి. అట్టి 'ప్రాణము' యొక్క అన్నమయకోశములోని వర్తనములన్నీ కలిపి – **'ప్రాణమయకోశము'**గా పిలువబడుచున్నది. ప్రాణమయకోశచర్యలు (లేక) కార్యములకు కారణము సర్వచైతన్యస్వరూపమగు ఆత్మయే! అందుచేత **"ఆత్మయొక్క ప్రాణమయకోశము"** – అని గ్రహించబడుతోంది.

**(3) మనోమయ కోశము** (Zone of Thought) **:** తన యొక్క అన్నమయ–ప్రాణమయ కోశములతో కూడినదై (కలుపుకొని) ఆత్మ(జీవాత్మ) □ శబ్ద స్పర్శ రూప రస గంధవచన ఆదాన గమన విసర్జన ఆనంద విషయములను తన యొక్క 'సంకల్పించటము' అను ధర్మము (Function/Feature) ద్వారా పొందుచూ ఉన్నప్పుడు, – అది **"ఆత్మ యొక్క మనోమయ కోశము"** అగుచున్నది.

**(4) విజ్ఞానమయ కోశము** (Zone of Wisdom): **విశిష్టాంతః కరణే, తద్గత విశేష ధ్యాన, మననాది వృత్తయో యదా ఉత్పద్యంతే, తదా విజ్ఞానమయకోశే।** ఎప్పుడైతే ఆత్మ తన యొక్క అన్నమయ–ప్రాణమయ–మనోమయ 'త్రి'కోశములను కలుపుకొని, అంతఃకరణముచే ధరించినదై, **"విశేషములను తెలుసుకోవటము"** – అనబడే విశేషత్వమును భావించుచున్నదో, అది **"ఆత్మ యొక్క విజ్ఞానమయ కోశము"** అని చెప్పబడుతోంది.

**(5) ఆనందమయకోశము**(Zone of Enjoying) **: ఏతత్ కోశ చతుష్టయ కారణ అజ్ఞాన సంపృక్తం స్వకారణ జ్ఞానం స్వరూపసుఖే యదా వర్తతే తత్ – ఆనందమయకోశ।** అన్నమయ–ప్రాణమయ–మనోమయ–విజ్ఞానమయములగు '4' కోశములను ఒకచోట జేర్చి, సంపృక్తము చేసుకొని (కలుపుకొని) ఆత్మ– తనకు తానే (స్వకారణంగా) – (లీల, క్రీడ, సరదా రూపమగు) –అజ్ఞానమును కల్పించుకొని వినోదించుచూ ఉన్నది. ఒక మర్రి విత్తనములో (వట విత్తనంలో) వట వృక్షపు ధర్మములన్నీ కలిగియుండురీతిగా– ఈ 14 లోకముల సంచార వినోదమును అజ్ఞానపూర్వకంగా ఆత్మ తన యందు కలిగియుంటూ, వాటి యందు, తనను తాను ఏ మరచి తిరుగాడుచున్నది.

ఒకడు స్వప్నభూమి (Field of dream)ని కల్పించుకొని, **"ఇదంతా నా యొక్క స్వప్నకల్పనయే"** అనునది ఏమరచి, ఆ స్వప్నమునందు అజ్ఞానపూర్వక – **స్వకల్పితవినోదముగా తిరుగాడు చుండటమే** – (ఆత్మయొక్క 14 లోకముల స్వకల్పముల అంతరంగ సంచారమునకు) దృష్టాంతము. ఈ విధంగా స్వకల్పన యందు స్వకల్పనా వినోదియై ఆత్మ నిర్వర్తిస్తున్న **భావనాంతర్గత సంచారమును 'ఆత్మ యొక్క ఆనందమయకోశము'** అని పిలుస్తున్నారు.

> పంచకోశములను **'ఉపాధి'**గా – కలిగియుండు ఆత్మ యొక్క స్వకీయ – ఉపహిత(By its own involvemant) విశేషమును **'ఆత్మకోశము'** – అని అంటారు. అదియే **"హృదయము"** కూడా.

# సుఖ–దుఃఖములు

ఆత్మ–తనయొక్క 'బుద్ధి' అను ఉపకరణమును ఉపయోగిస్తూ ఆ బుద్ధియందు 'సుఖ–దుఃఖ భావ విభాగము'ను కల్పించుకొంటోంది. అట్టి సుఖ–దుఃఖబుద్ధియే "శ్రేయము–శ్రేయముకానిది, దేహము–దేహాంతరములు"– మొ॥న అన్నిటికీ 'కర్త' అగుచున్నది.

అట్టి బుద్ధి....

- వేటివేటిని **'ఇవి నాకు ఇష్టము'** అని భావన చేస్తూ ఉంటోందో, అవి పొందుచున్నప్పుడు అవన్నీ ఆత్మకు 'సుఖకరములు'గా అనిపించుచున్నాయి.
- వేటివేటిని "ఇవి నాకు అయిష్టము" అని ఆత్మ భావనచేస్తూ ఉన్నదో, అవి పొందుచున్న సందర్భములో "ఇవి నాకు దుఃఖకరములు" అను భావనచే అవన్నీ ఆత్మకు **'దుఃఖములు'**గా అనుభవమగుచూ ఉన్నాయి. (లేక) అనుభూతమగుచున్నాయి.

## ఉపహిత–జీవుడు

ఆత్మ తనకు తానై శబ్ద-స్పర్శ-రూప రస-గంధానుభవములను పొందుటమును భావన చేస్తోంది. వాటిని సుఖ-దుఃఖములుగా పొందుటకై అభినివేశముతో కూడిన **'అంశ'**ను సంభావించుకొనుచున్నది.

ఏ ఆత్మయొక్క 'అంశ' అయితే పుణ్య, పాపకర్మ పరంపరలను ఆశ్రయించినదై, వాటివాటి కర్మఫలములుగా ప్రాప్తించిన-ప్రాప్తించని శరీరములతో సంయోగ-వియోగములను పొందుచూ కనబడుచున్నదో, అట్టి సందర్భమును **"ఆత్మయొక్క ఉపహిత జీవత్వము"** అని చెప్పుచున్నారు. అదియే 'జీవాత్మ చమత్కారము'. ఆత్మయొక్క **"ప్రియత్వము"**నకు సంబంధించిన ఘనీభూతరూపమే **'ప్రాణము'.**

అట్టి ప్రాణముల పట్ల అధ్యాసియే (ధ్యాస కలిగి ఉండటముచే) – 'జీవుడు'గా పిలువబడుచున్నాడు. అనగా **"నేను జీవితము - అను సందర్భమునకు పరిమితుడను"** అను భావనను ఆశ్రయించినప్పుడు – ఆత్మయే 'జీవుడు' – అను పేరుతో పిలువబడుతోంది.

## పంచవర్గములు

**మన ఆదిశ్చ, ప్రాణ ఆదిశ్చ, సత్త్వాదిశ్చ, భూతాదిశ్చ, పుణ్యాదిశ్చ ఏతే పంచవర్గాః॥**

I. **'మన' ఆదిశ్చ' :** – మనో-బుద్ధి-చిత్త-అహంకారము అనబడే ***అంతరంగ చతుష్టయము.***

II. **ప్రాణాదిశ్చ : 'ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమానములు'**. అనబడే పంచ ముఖ్య ప్రాణములు; **నాగ, కూర్మ, కృకర, దనంజయ దేవదత్తములు** అనబడే పంచముఖ్య ఉపప్రాణములు; తదితర శరీరాంతర్గత వాయుధర్మములు.

III. **సత్త్వాదిశ్చ :** సర్వకల్పనలకు మూలపదార్థములు (Raw-material) అయినటువంటి ***సత్త్వ, రజో తమో – 'త్రిగుణములు'.***

IV. **భూతాదిశ్చ :** భూమి (Solid), జలము (Liquid), అగ్ని (Heat, Light), వాయువు (Vapour), ఆకాశము (Spacing Timing) – అనబడు ***"పంచభూతములు".***

V. **పుణ్యాది :** పుణ్య-పాప ద్వంద్వములు.

వీటిని ***'పంచ వర్గములు'*** – అని అంటున్నారు. ఈ పంచవర్గములు కలిపి, ఆత్మయొక్క "లింగశరీరము" – అని (తత్త్వశాస్త్రముచే) చెప్పబడుచున్నది.

## లింగశరీరము – హృత్ గ్రంథి

ఆత్మ-అటువంటి 'పంచవర్గములను' ఏ **అంశ**తో ధారణ చేస్తోందో, అది **లింగశరీరము**. అట్టి లింగశరీరము ప్రవర్తించుచున్న ప్రదేశమును **'హృత్‌గ్రంథి'** అనుపేరుతో చెప్పుచున్నారు. అయితే ఏ ఆత్మయొక్క ఒకానొక కల్పిత విభాగములనకు **'పంచవర్గము'** → ధర్మము (Characteristic feature) అయి ఉంటోందో, ... అదంతా కూడా ఆత్మ-తన స్వస్వరూపజ్ఞానముతో చేయు లీలా-ధారణయే. జ్ఞానామృతముచే వాస్తవానికి (స్వకీయ కలనయే కాబట్టి) – **'లేనివే'** అగుచున్నాయి. ఆత్మజ్ఞానముచే పంచవర్గము (కథలోని కల్పనవలె) 'వినాశనము' చెందు ధర్మము కలిగియున్నాయి. అనగా, **స్వకీయ కల్పిత మాత్రములే** – అను భావనతో ఆత్మజ్ఞానిచే ఆస్వాదించబడుచున్నాయి.

ఈ జీవునికి భౌతిక శరీరము ఉపాధి అయి ఉన్న తీరుగా, **"హృత్ గ్రంథి, లింగ శరీరము"** ఆత్మకు ఉపాధి వంటివి అని వర్ణించబడుతోంది.

ఏ ధారణచే ఆత్మ 14 లోకములను పొందటము, వాటియందు సంచారములు చేయుటము జరుగుతోందో అది "లింగ శరీరము". అద్దాని స్థానము హృదయాకాశము. అనగా 14 లోకములలో వన సంచారము చేస్తున్న ఈ జీవునియొక్క హృదయములోనే – ఆ 14 లోకములు స్వకీయ కల్పితములై ప్రదర్శనమగుచున్నాయి.

## క్షేత్రజ్ఞుడు

ఏ చైతన్యము (That which causes all kinds of movements) అయితే ప్రకాశకరూపమై (That which is enlightening all) పంచవర్గములందు, లింగశరీరము నందు, హృదయాకాశము నందు ప్రతిబింబిస్తోందో (That which reflects), – అట్టి ఆత్మ యొక్క **"చైతన్య ప్రకాశ-ప్రతిఫల ప్రతిబింబత్వము"**ను **'క్షేత్రజ్ఞుడు'**-అని అంటున్నారు.

## స్వయంజ్యోతి–సాక్షీ

**జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయానామ్ ఆవిర్భావ తిరోభావ జ్ఞాతా, స్వయమ్ తత్ ఆవిర్భావ సహితః, స్వయమ్ ఆవిర్భావ – తిరోభావ రహితః, స్వయం జ్యోతిః, (చేతనో) "సాక్షీ"॥** ఈ దృశ్యము-**జ్ఞాతృ** (తెలుసుకొనుచున్నవాడు), **జ్ఞేయ** (తెలియబడుచున్నది), **జ్ఞానములు** (తెలుసుకోవటం) – అను త్రిపుటిచే నిర్మితమై ఉంటోంది. ఆ మూడూ కూడా 'ఆత్మ' అను జ్యోతియొక్క వెలుగులుచే కనబడుచున్నాయి.

- ఏదైతే ఈ జ్ఞాతృ జ్ఞేయ జ్ఞానముల - రాక- పోకలను (ఆవిర్భావ-తిరోభావములను) - జ్ఞాతా.. ఎరుగుచూ ఉన్నదో,
- ఆ ఆవిర్భావ-తిరోభావములను తన 'వెలుగు' (జ్యోతి) స్వరూపముగా కలిగియున్నదో,
- తాను ఏ మాత్రమూ కూడా ఆవిర్భావ- తిరోభావములు 'లేకయే' ఉన్నదో

**అదియే స్వయంజ్యోతి!** వెలుగుచున్న దీపమును చూపటానికి మరొకదీపం అవసరం లేనట్లే, ఆత్మయొక్క 'స్వయంజ్యోతిత్వము'ను చూపటానికి మరొక జ్యోతి (దీపము) యొక్క అవసరం లేదు. **ఈ జీవుడు స్వయముగా ఆత్మానంద జ్యోతి స్వరూపుడే!**

సర్వమును - మౌనముగా, ప్రశాంతముగా, ఆనందముగా, స్వకీయచిద్విలాసముగా దర్శిస్తూ, సర్వమునకు పరమైయున్న ఆత్మయొక్క కేవలీతత్త్వమును **'సాక్షి'** అనే పేరుతో పిలుస్తున్నారు. **ఈ జీవునియందు 'సాక్షిత్వము' అను విభాగము (లేక) స్థితి సర్వదా యథాతథము.**

## కూటస్థము

**బ్రహ్మాది-పిపీలికాంత పర్యంతం సర్వ ప్రాణి బుద్ధిషు అవశిష్టతయా ఉపలంభమానః, సర్వ ప్రాణ బుద్ధి సాక్షి అధిష్ఠాన ఆత్మా అస్తి-భాసతే యదా, తదా కూటస్థః॥** ఈ కనబడే 14 లోకములు తన యొక్క కల్పనా చాతుర్యమై దర్శించుచున్న సృష్టికర్తయగు **బ్రహ్మదేవుని నుండి** → ఆహార నిద్రా-మైధున-సంతాన రక్షణలలో తలమునకలైయున్న **ఒక చిన్న పురుగువరకు** - సర్వ ప్రాణుల బుద్ధికి ఏది "కేవలసాక్షి" అయి చెన్నొందుతోందో, సర్వప్రాణుల మనో- బుద్ధులలో **'ఎరుక'** అను రూపముగా సర్వదా వెలుగొందుచున్నదో, సర్వజీవుల బుద్ధులందు సర్వదా వేంచేసినదైయున్నదో, అదియే **కూటస్థము. (యా బ్రహ్మాది పిపీలికాది తనుషః ప్రోక్తా జగత్ సాక్షిణః - సైవాహమ్ - మనీషాపంచకము = శ్రీ శంకర భగవత్ పాదులవారు)**

- సర్వ ప్రాణుల బుద్ధికి సాక్షి,
- ఆభరణములకు బంగారమువలె సర్వ జీవుల యొక్క అధిష్ఠానము,
- సర్వులయందు అస్తి (ఉనికి) - భాతి (ఎరుక, వెలుగు) ప్రియముల రూపముగా

  ఏది ఏర్పడియున్నదో - **అదియే కూటస్థాత్మ!**

## అంతర్యామి

**కూటస్థాం ఉపహిత భేదానామ్ స్వరూపలాభే హేతుర్భూత్వా, మణిగణే సూత్రమివ, సర్వక్షేత్రేషు యత్ అనుస్యూతత్వేన యదా ప్రకాశతే హి ఆత్మా తదా "అంతర్యామి"॥** ఎప్పుడైతే ఆత్మ తన యొక్క "స్వస్వరూపలాభము" అను సిద్ధిచే - 'కూటస్థము' మొదలు, సర్వ తదితర భేదములందును - పూదండలోని దారము వలె - తనను తాను అనుస్యూతముగా, (సూత్రపుదారముగా) దర్శిస్తూ, ప్రకాశించుచూ, స్వానుభవము పొందుచున్నదో, అప్పుడు అది **"ఆత్మ యొక్క అంతర్యామిత్వము"**గా కీర్తించబడుచున్నది.

- దృశ్యములోని **'నేను',**
- జాగ్రత్ - స్వప్న-సుషుప్తులలోని **'నేను'.**
- దేహ-దేహాంతరములలోని ఈశ్వర సంబంధమైన **'నేను'**

మొదలైనవన్నీ దాటిపోయి,

- **నాటకములోని పాత్రలన్నిటికీ** రచయిత యొక్క రచనా కళావిశేషమే అనుస్యూతమై (ఎడతెగనిది, ఒక్కటిగా కూర్చబడినది, గ్రుచ్చబడినదిగా) ఉన్నట్లుగా,
- స్వప్నము తనదైన వానికి-స్వప్నములో కనిపించే వ్యక్తులందరు-ఆతని స్వప్నదర్శనా ద్రష్టత్వమునకు అనుస్యూతమై ఉన్నట్లు,
- గొర్రెల గుంపులోని గొర్రెలన్నిటికీ గొర్రెల కాపరి యొక్క 'కాపలా' లేక 'రక్షణ' - అనుస్యూతమై ఉన్నట్లు,
- ఒక కళాకారుడు చిత్రించిన రూపములన్నిటిలో ఆ కళాకారుని కళావిన్యాసమే అనుస్యూతమైయున్నట్లు -

*ఆత్మ ఎప్పుడైతే ఈ సర్వమునందు తనను తాను అనుస్యూతముగా దర్శిస్తుందో..,*

- ❖ మత్తః పర తరమ్ న అన్యత్ కించిదస్తి ధనంజయ! మయి సర్వమ్ ఇదమ్ ప్రోతమ్ సూత్రే మణిగణా ఇవ।
- ❖ మయా తతమ్ ఇదమ్ సర్వమ్ జాగత్ అవ్యక్తమూర్తినా! మస్థాని సర్వ భూతాని!
- ❖ అహం సర్వస్యప్రభవో - **గీతాచార్య వాక్యములు.**

అప్పుడు - **"ఇది ఆత్మ యొక్క అంతర్యామిత్వము"** - అని సిద్ధాంతీకరించబడుతోంది.

## ప్రత్యగాత్మ

**సత్యం జ్ఞానం అనందగ్ం, ఆననం, సర్వ-ఉపాధి వినిర్ముక్తం, కటక-మకుటాది ఉపాధి రహితం, సువర్ణ ఘనత్ విజ్ఞాన ఘన చిన్మాత్ర స్వభావమ్, ఆత్మచైతన్యం 'బ్రహ్మ' - యత్ అవభాసతే, తత్ అవిద్యా-ఉపాధికం, 'త్వం' పదార్థః స "ప్రత్యగాత్మ"॥** ఎప్పుడైతే ఆత్మ తనను తాను..,

⌘ సత్యమ్ (కేవలమగు ఉనికి), జ్ఞానమ్ (కేవలమైన ఎరుక), అనన్తమ్ (అన్యమైన దేని చేతనూ పరిమితము కానట్టిది), ఆనందమ్ (సర్వమును స్వకీయలీలా-క్రీడా- వినోద కల్పనగా దర్శించునట్టిది)గా స్వభావసిద్ధమైన అనునిత్య స్వానుభవము కలిగియుంటుందో,

⌘ స్థూల - సూక్ష్మ-కారణ-మహాకారణ సంబంధితమైన సర్వ ఉపాధులకు, వాటివాటి అంతర-అన్యోపాధులకు వేరై, అవన్నీ, 'తానే' కూడా అయి సర్వదా వినిర్ముక్తమై ఉంటుందో,

⌘ (1) బంగారమునకు ఆభరణత్వ పరిమితి లేనట్లు, (2) దారమునకు (చొక్కా, పంచ మొదలైన) వస్త్రముల ధర్మము లేనట్లు, కానీ అవన్నీ (1.బంగారమే, 2.దారమే) అయి ఉన్నట్లు **"ఇదంతా నేనే!"** **"ఇదేమీ నేను కాదు"** అను పరాకాష్ఠ భావన పుణికి పుచ్చుకుని ఉంటుందో..,

⌘ కేవలం ఘనీభూత విజ్ఞానాత్మగా, కేవల చిత్‌మాత్రంగా (వస్తువుల ఆకారములను వెలిగించు సూర్యకాంతి-ఆయా వస్తువుల ఆకారములను పొందని విధంగా) ప్రకాశమానమై ఉంటుందో,

⌘ 'త్వమ్' అనునది అవిద్యచే వేరుగా, విద్యచే స్వయం స్వస్వరూపమునకు వేరుకానట్లుగా(అనన్యముగా) గమనించుచున్నదై ఉంటుందో,

**అట్టి ఆత్మ యొక్క స్వానుభవము "ప్రత్యగాత్మ" అని స్తోత్రము చేయబడుచున్నది.**

## అవినాశి

ఈ దృశ్యములో నామరూపాత్మకమై, భౌతికమై ఏదేది కనిపిస్తోందో, ఇదంతా కూడా 'వినాశనము' - అనే ధర్మము కలిగి ఉన్నది. ఏదైతే సత్యము, జ్ఞానము, అనంతము అయి ఉన్నదో, అదియే ఈ జీవుని సహజ, వాస్తవ, అనునిత్య రూపము. అద్దానికి మార్పు-చేర్పులు లేవు. కాలబద్ధము కాదు. కాబట్టి **అవినాశి.** ఏదైతే (మరియు) దేనిచేత ఈ సమస్తముగా విస్తరించినదై ఉన్నదో, అట్టి ఆత్మ అవినాశి. (అవినాశితు తత్ విద్ధి - ఏన సర్వమిదమ్ తతమ్ - భగవద్గీత)

ఏ స్వస్వరూపమైతే →

అన్యములగు **దేశ** (place) **కాల** (Time) **వస్తు** (Matter) **నిమిత్త** (Causation)ములన్నీ జనిస్తూ, నశిస్తూ ఉన్నప్పటికీ, **తాను మాత్రం కించిత్ కూడా 'వినాశనము' అనునది పొందుట లేదో అట్టి ఈ జీవుని యొక్క స్వస్వరూపమే అవినాశి.**

## 'సత్యమ్' నామ? 'అవినాశి' నామ?

ఏది త్రికాలములో, జాగ్రత్-స్వప్న-సుషుప్తి త్రిదశలలో, జన్మ-జన్మాంతరములలో, దేహ-దేహాంతరములలో, దేహస్థితి-దేహరహిత సర్వ సందర్భములలో తన **"సత్(ఉనికి)"** అను ధర్మము వదలక, కలిగియే ఉంటోందో, వినాశన ధర్మము లేనట్టిదో - అట్టి ఆత్మ (Absolute I) - సత్యము.**"యమ్ సత్ - ఇతి సత్యమ్"**

**అవినాశి: దేశకాల వస్తు నిమిత్తేషు వినశ్యత్సు, యత్ న వినశ్యతి - తత్ 'అవినాశి'।** దేశకాల వస్తు నిమిత్తములు నశిస్తున్నప్పటికీ, తాను నశించటములేదో - అదియే 'అవినాశి'।

## "జ్ఞానమ్ - నామ"?

దేనికైతే అద్దాని అన్తరమున **"ఉత్పత్తి స్థితి వినాశనములు"** - అను విశేషములే లేవో, (ఒక పుస్తకము చదువు తెలివి-పుస్తకముతో ప్రారంభమై, పుస్తకము చదువటం ముగియగానే తొలగిపోదుకదా! అట్లాగే) ఏదేది ఎంతెంతవరకు తెలుసుకున్నప్పటికీ, **'తెలుసుకోవటము'** అనునది తరుగదో, పెరుగదో, - అదియే (సత్య-జ్ఞాన-ఆనందములలోని) **"జ్ఞానము".**

## అనన్తమ్ - నామ?

⌘ మట్టి కుండ నిండా నిరాకారమగు మట్టియే ఉన్నట్లు, మట్టి యొక్క సాకారమునకు సంబంధించిన విశేలక్షణమే/వికారమే **'కుండ'** అయినట్లుగా,

⌘ బంగారు ఆభరణమంతా బంగారముతో నిండినట్లుగా, బంగారము యొక్క వికారమే **'ఆభరణము'** అయిఉన్నట్లుగా,

⌘ దారముల వికారరూపమే **వస్త్రము** అయినట్లు, - **ఆత్మ అనన్తమై కూడా. మార్పుచెందు సమస్తములో అంతర్లీనమైయున్నది.**

ఇక్కడి అవ్యక్త, ఆది సృష్టి, ప్రపంచములు ఇవన్నీ ఏ వ్యాపక చైతన్యముచే విస్తరించబడి, ఇవి అద్దాని వికారమే అయి ఉన్నాయో, అదియే **అనన్తము.** ఇక్కడి బాహ్యారంగ, అంతరంగములచే ఏది అంతము పొందటము లేదో - అది **"అనన్తము".**

## ఆనందో - నామ?

**సుఖ చైతన్య స్వరూపో, అపరిమిత - ఆనంద సముద్రో, అవశిష్ట సుఖ స్వరూపశ్చ - "ఆనందః।।** కేవలమగు అఖండాత్మస్వరూపముతో స్వస్వరూప ఏకత్వ-అనన్యత్వములను సిద్ధించుకొన్నప్పుడు, అట్టి స్థితిలో - ఆత్మ ఆస్వాదించు నిర్విషయ-అకారణ-అవశిష్ట సుఖ స్వరూపమే - (సత్, చిత్, ఆనందములలోని) - **'ఆనందము'** యొక్క స్వరూపము.

## పరమాత్మా– నామ?

**ఏతత్ వస్తు చతుష్టయం యస్య లక్షణం, దేశ కాల వస్తు నిమిత్తేషు అవ్యభిచారీ, తత్ పదార్థః “పరమాత్మా”॥**
ఏదైతే దేశ–కాల–వస్తు– నిమిత్తములు అనబడు **నాలుగు** – తనకు ఆభరణములుగా తనకు వేరైనవిగా దర్శించుచూ, – తన యొక్క కేవలీ స్వరూపము నుండి ఏ మాత్రము ‘చ్యుతి (Distraction, Displacement)' పొందటమే లేదో, అట్టి – ఆత్మ యొక్క **అవ్యభిచార–తత్ పదార్థ స్వానుభవమే ‘పరమాత్మ’**గా గానము చేయబడుతోంది. *(దృష్టాంతము; నటునియొక్క స్వస్వరూపము – పరమాత్మకు దృష్టాంతము. నాటకములో అంతర్గతంగా పాత్రయొక్క ప్రవర్తనాశీలము – జీవాత్మకు దృష్టాంతము)*

## పరబ్రహ్మమ్–నామ?

**‘త్వం’ పదార్థాత్ ఔపాధికాత్ – “తత్” పదార్థ ఆది ఔపాధిక భేదాత్ విలక్షణమ్। ఆకాశవత్ సూక్ష్మం, కేవల సత్తామాత్ర స్వభావం – “పరబ్రహ్మ”॥**

- ‘త్వమ్’ (నీవు) → అను ఉపాధిసంబంధమైన లక్షణమునకు, – మరియు
- తత్ (అది) → అను ఔపాధికాధార లక్షణమునకు, – కూడా

(ఈ రెండింటికీ) విలక్షణమై, ఈ రెండిటి అభేదస్థానమై, **ఆకాశమువలె అత్యంత సూక్ష్మత్వమును, కేవల సత్తామాత్రమును** – ఆత్మ సంతరించుకొనుచున్నపుడు అట్టి ఆత్మయొక్క జీవ–బ్రహ్మైక్య అఖండరూపభావము **“పరబ్రహ్మము”** – అనబడుచున్నది.

## మాయా–నామ?

- ‘మాయ’ అనునది– **అనాద్యంతవతీ**– ఆది–అంత–అంతరములు ‘ఇవి’ అనునవేవీ లేనట్టిది.
- ప్రమాణ పూర్వకంగా చెప్పుకోనూవచ్చు. ప్రమాణములతో నిర్వచించనూ లేము. **ప్రమాణ–అప్రమాణ సాధారిణా।**
- **న సతీ। న అసతీ। న సదసతీ।** మాయ ఉన్నది; లేనిదీ కూడా। సత్తు, అసత్తు కూడా? ఉండి లేనిది, లేకయే ఉన్నది కూడా।

✎ నాటకంలో పాత్రల పరంపర (భార్య – భర్త – కొడుకు – తండ్రి.. ఇత్యాది) సంబంధాలు ఉన్నాయా? ఉన్నాయి. లేవని ఎట్లా అంటాం?

✎ వాస్తవంగా ఉన్నాయా? నాటకమే కల్పన. ఇక పరస్పర సంబంధాలు కల్పనయే కదా! కల్పన ‘ఉన్నది’ ఎట్లా అవుతుంది? లేనివే కూడా!

✎ ఈ జగన్నాటకములోని పరస్పర సంబంధాలు కూడా అటువంటివే! జగత్ దృష్ట్యా ఉన్నాయి. ‘వాస్తవము’గా చూస్తే, లేనివి. మాయ ఉన్నట్లుగా ఉన్నప్పటికీ, ‘యా మా’ – ఏది లేదో అదియే మాయ!

- మాయ స్వయముగానే ఆత్మయందు ఆధిక్యత పొందుచున్నది. ఆత్మకు వేరైన మరొకరెవరూ వృద్ధి చేయుచున్నట్టిది కాదు. కాబట్టి **స్వయమధికా!**
- స్వయముగా ఎట్టి వికారము లేనట్టిది. మాయ జీవుని బంధించదు. జీవుడే ఆత్మను ఏమరచినప్పుడు, అప్పటి అట్టి స్థితియే మాయ.
- **‘మాయ ఎటువంటిది?’** అని పరిశీలించబోతే **నిరూపణకు దొరకదు. “ఒకనికి ఒక క్రీడ పట్ల (లేక) ఒక సంఘటన పట్ల ప్రీతి ఎందుకు? అప్రీతి ఎందుకు?”**–అను దానికి కారణం ఏముంటుంది? ఒకవేళ ఏదైనా కారణము ఉంటే, అదీ మాయయే! అందుకని **లక్షణ శూన్యమైనది – మాయ.**

## అజ్ఞానమ్ నామ?

**అజ్ఞానం తుచ్ఛాపి, అసతీ, కాలత్రయేఽపి, పామరాణాం వాస్తవీ చ।** అఖండము, సత్యము, నిత్యము, సర్వము అగు ‘ఆత్మ’ను ఏమరచినట్టి సందర్భములో – ఈ జీవుని “జగత్ – దేహ–వృష్టి” భావనలను **‘అజ్ఞానము’** అని అంటున్నారు.

**‘అజ్ఞానము’** వలన ఏర్పడి, అనుభవమగుచున్నదంతా వాస్తవ దృష్టిచే **తుచ్ఛమే** అయినప్పటికీ, **అసత్తే** (వాస్తవానికి లేనిదే) అయినప్పటికీ, (ఒకప్పుడు ఒకతీరుగా, మరొకప్పుడు మరొక తీరుగా అనుభవమగుటచే) – త్రికాలబద్ధమే అయనప్పటికీ, ఆత్మతత్త్వము అనుభవమయ్యే వరకు **“అజ్ఞానము ఉన్నది। పోవాలి।”** అనునదే సిద్ధిస్తూ ఉంటోంది.

**సత్త్వ బుద్ధిః లౌకికానామ్....,**

లౌకికమైన (లోక సంబంధమైన) సత్త్వబుద్ధికి ఇది ఇటువంటిది **(ఇదమిత్థమ్)** – అని నిర్వచించి చెప్పవీలుకానిది. అనిర్వచీనయము.

**వక్తుమ్ న శక్యతే!** మాటలకు అందనిది – **మాయ.**

ప్రియ పరబ్రహ్మానంద స్వరూపా! ప్రియశిష్యా! ఇప్పుడు మనము చెప్పుకొన్న వాటిలో కొన్ని కొన్ని విశేషార్థములు మరికొంత సుస్పష్టత కొరకై, మరికొంతగా వివరించి చెప్పుకొందాము. శ్రద్ధగా వినిదెవు గాక!

# మరికొన్ని విశేషార్ధములు

## పరమాత్మ

**సత్య జ్ఞాన, అనన్త ఆనంద స్వరూపమ్!** సత్యము, జ్ఞానము, ఆనందము, అనంతత్వము లక్షణములుగా కలిగి ఉన్నట్టిది. దేహముల మునుముందు – తరువాత తరువాత కూడా ఉన్నట్టిది. 'సర్వజ్ఞత్వము' అనే లక్షణము వెంటనంటి ఉన్నట్టిది.

**<u>తత్</u> :** ఈ జీవుని సహజరూపమే– 'తత్' అను శబ్దముచే చెప్పబడుచున్నట్టిది. అది కేవలము, సహజము, సర్వదా యథా తథముకూడా!

**<u>త్వమ్:</u>** ఈ జగత్తులో కనిపించే 'జీవుడు' అనునది – అనేక నాటకములలో నటించే ఒక నటుని యొక్క ఒకానొక నాటకములోని ఒక పాత్రలాగా – **సందర్భ సత్యము మాత్రమే.** కల్పితము, అసహజము, మార్పు–చేర్పులకులోను అగుచున్నట్టిది.

## బ్రహ్మము సత్యము – అవినాశి

బ్రహ్మము సర్వ ఉపాధులకు వినిర్ముక్తము. (Not bound by any physical form).

- సర్వ విశేషములకు మునుముందే ఉన్నట్టిది. నిర్విశేషము. లోక సంబంధమైన విశేషములకు ఏమాత్రము సంబంధించనిది.
- సర్వమునకు వెలిగిస్తూ ఉన్నట్టిది.
- **నా యొక్క సత్–అద్వైత – ఆనందమయ స్వరూపమే బ్రహ్మము. "నేను", "నీవు", "జగత్తు" మొదలైనదంతా బ్రహ్మమునకు అనన్యము. బ్రహ్మమే తత్। బ్రహ్మమే 'త్వమ్' కూడా।**

'త్వమ్' అనునది బ్రహ్మమునకు లీలామానుష వేషధారణము వంటిది. ఉపాధి వంటిది. స్వీయకల్పనా వైశిష్ట్యములోని అంతర్విభాగము.

**మూల ప్రకృతి:** స్వభావము. బ్రహ్మమే **మూల ప్రకృతి రూపముగా** (దర్పణములోని ప్రతిబింబమువలె) ప్రదర్శనము అగుచున్నది.

**అవినాశి :** బ్రహ్మము "త్వమ్ (నీవు) – తత్ (అది)" – అను రెండింటికీ విలక్షణమై ....

- సర్వమునకు అధిష్ఠానమై (తానే సర్వమునకు మూలస్వరూపము అయి),
- **పరమశుద్ధము, పారమార్థికము** (The finest meaning of every thing else), **కేవల సత్తామాత్రము** (Absloute presence) అయి ఉన్నది.

మార్పు–చేర్పులు లేక, వినాశన ధర్మము లేనిదై **వెలుగొందుటచే "అవినాశి"। అదియే 'ఆత్మ'!**

## ఆత్మ సత్యమ్। ఆత్మయే బ్రహ్మము।

***కిం సత్యమ్?***

- **'సత్' ఇతి శ్రౌత ప్రతీతి సత్యమ్।** ఏదైతే నిత్యసత్యమై ఉన్నట్టిదని, శ్రుతుల ప్రమాణంగా 'సత్'గాను ఆత్మజ్ఞులచే నిర్ణయించి చెప్పబడుచున్నదో.., అది సత్యము.
- **'అసత్' ఇతి అవాచ్యం సత్యమ్।** దేనిని ఎరిగిన తరువాత **'అసత్' అనునది ఉనికిని మొదలంట్లా కోల్పోవుచున్నదో..., అది సత్యము.**
- **త్రికాలాబాధ్యం సత్యమ్।** ఏది త్రికాలములలో **ఏకరీతిగా ఉండటం చేత త్రికాలాబాధ్యమో – అది సత్యము।**
- ఏది జాగ్రత్–స్వప్న – సుషుప్తులలో **ఏకరూపమై, పరమైయున్నదో – అది సత్యము.**
- ఏది త్రికాలములలో పూదండలోని దారము వలె **అనుస్యూతమో,** (పూదండలోని దారము వంటిదో) – **అది సత్యము.**

**ఏది 'అస్తి' (Being) యో అది సత్యము। సజాతి – విజాతి భేదరహితమైనది సత్యము। సర్వకల్పనలకు అధిష్ఠానము, దేశ కాల వస్తువులు నశించినా శేషించి ఉండేది సత్యము. దేశ–కాల–వస్తు–నిమిత్తాషు వినశ్యత్సు, యత్ న వినశ్యతి–ఇతి సత్యమ్।**

## కిం జ్ఞానమ్?

తెలియబడే సమస్తమునకు ఆవల ఉండి, సమస్తము 'తెలుసుకుంటూ ఉన్నట్టిది"–**జ్ఞానము.** స్వయం ప్రకాశకమైనది. సర్వమును ప్రకాశింప జేయునది జ్ఞానము. ఎరుకయే జ్ఞానము. విషయములకు, దృశ్యములకు సంబంధించిన ఏ ఆవరణలు (Limitation, end liner) లేనిది. అనాద్యంతము. **నిరంతర–వృత్తి రహిత–సాక్షి చైతన్యమే–జ్ఞానము.** (వృత్తి సహితమైనప్పుడు అది 'ద్రష్ట'గా ప్రదర్శనమగుచున్నది). **స్వప్రకాశకమ్। సర్వ ప్రకాశకమ్। నిరాకరణ చిన్మాత్రం। అనాద్యంతం। నిరంతరమ్–అవృత్తి। సాక్షి చైతన్యమ్– ఇతి జ్ఞానమ్।**

## అనంతము

**అనన్తా నామ। మృత్ వికారేషు మృత్ ఇవ, స్వర్ణ వికారేషు 'స్వర్ణం' ఇవ, తంతు వికారేషు 'తంతు' ఇవ అవయక్త ఆది – సృష్టి ప్రపంచేషు పూర్ణమ్, వ్యాపకమ్, చైతన్యమ్, అనన్తమ్ – ఇతి ఉచ్యతే।**

**ఆత్మ లేక బ్రహ్మము అనన్తమైనది!**

**ఇంకా ఆత్మ ఎట్టిదంటే:**

- **ఉత్పత్తి వినాశన రహితము;** (ఉత్పత్తి కామము – ఉత్పత్తి – పెరుగుట – తరగటం – వినాశనము – పునరుత్పత్తి అనే) షట్ (6) భావములకు సంబంధించనిది.
- సర్వ ఉపాధులకు సంబంధించనిది, **"మట్టి, బంగారము, దారము" లకు (తదనంతర) "బొమ్మ– ఆభరణము – వస్త్రము"** వికారములు మొదలే లేని తీరుగా, **జగత్తు, జీవుడు, దేహముల రాకపోకలు మొదలైన వికారములు మొదలే లేనట్టిది.**
- **అవ్యక్తము మొదలుకొని – సృష్టి (ప్రపంచము) వరకు** తానే స్వస్వరూపముచే నింపి ఉంచునట్టిది.
- బ్రహ్మము పూర్ణము. సర్వవ్యాపకము. అట్టి చైతన్యమునకే 'అనంతము' అను మరొక లక్షణ నామము.

## ఆనందమ్

తరంగమునకు జలము వలె సర్వమునకు తానే అధిష్ఠానమై, **నిత్య – శుద్ధ – అఖండ – అప్రమేయ– చిదానంద – ఏకరసమే** ఆత్మానందము! అవ్యాజము అయినట్టి ఆత్మానందము నుండియే తరంగమువలె దృశ్యము బయల్వెడలుతోంది. నటునియొక్క 'నటించాలి' అనే ఉత్సాహమునుండే నవరసములు బయలుదేరుచున్నట్లు, ఆత్మానందమునుండే సమస్త అనుభవములు ప్రదర్శనమగుచున్నాయి.

## పదార్థము – సత్ – అసత్ మిథ్యలుగా త్రివిధములు

**పదార్థము సత్:** పదార్థము ఉనికి ఉను ధరము కలిగి యున్నది. 'ఉనికి' కలిగియున్నదే బ్రహ్మము. (న అభావో విద్యతే సతౌ।) సత్‌కు 'లేకపోవటము" అనేదే లేదు।

'సత్'కు జాగ్రత్ – స్వప్న–సుషుప్తులప్పుడుగాని, జన్మ–జన్మాంతరములు సందర్భములో గాని, జగత్తులకు మునుముందేగాని, జగత్తులు ప్రదర్శనమగుచున్నప్పుడు గాని – జగత్తులు నశించిన తరువాతగాని **'లేకపోవటము'** అనే ధర్మమే లేదు.

బ్రహ్మమే (లేక) సత్‌యే వాస్తవ స్వరూపముగా గల ఈ జీవుడు **ఒకప్పుడు ఉండువాడు – మరొకప్పుడు లేనివాడు కాదు. (న జాయతే, (న) మ్రియతేవా కదాచిత్).**

కనుక ప్రియశిష్యా! **"బ్రహ్మముగా (లేక) ఆత్మగా నేను నిత్యసత్ స్వరూపుడను"** అని, నీ యొక్క కేవల సత్ స్వరూపము గురించి ఎరుగుచున్నవాడవై ఉండుము.

**పదార్థము – 'అసత్':** వ్యావహారికంగా పదార్థమును దర్శించటము–అసత్। సందర్భంగా చూస్తే 'ఉన్నట్లుగా' వ్యవహారికంగా అనిపించవచ్చు గాక! కానీ, వేరు వేరు దృష్టులకు 'వేరువేరు' గా అనిపించటము సత్।

**ఉదాహరణకు** ఇక్కడ పరస్పరంగా కనిపించే భార్య – భర్త; తండ్రి – కొడుకు; గురువు – శిష్యుడు; అప్రియము – ప్రియవస్తువు → ఇవన్నీ బహుదూరపు బాటసారులకు – 'జగత్తు' అనే కించిత్ 'విశ్రాంతి స్థలము'లో కొద్దిసేపు తారసబడుచున్నట్టివి. మరల ఎవరికి వారే వారి వారి వేరువేరైన గమ్యస్థానముల వైపుగా బయల్వెడలటానికై విడిపోయే సంబంధాలే। అందుచేత, జగత్ దృష్ట్యా సత్యమని అనిపించినా – **వస్తుతః అసత్తే!**

→ నాటకంలోని పాత్రల పరస్పర సంబంధములు – ఒకనికి ఆతని పాత్రముగియగానే – **అసత్తే కదా!**

## పదార్థము–మిథ్య

- **"ఈ జగత్తు ఉన్నది"** అని తలచి, **నమ్మి ఉంటే ఇది 'భయము', 'భవము' అవుతుంది. అప్పుడు ఇది "భవబంధము" – అవుతోంది.**
- **"ఈ జగత్తు జగన్నాటకము మాత్రమే! కనుక వాస్తవానికి లేదు" – అని ఎరిగియే ఇందులో జీవించువానికి? – ఇది 'అభయము, అభవము', అభావము అగుచున్నది. అట్టివానికి భవబంధము (భావబంధము) ఎక్కడిది?**

అందుచేత – **"బ్రహ్మసత్యమ్ ! జగత్ మిథ్య।"** అని ఎరుగుటచే జగత్తు బ్రహ్మమే అగుచున్నది. ఒకడు ఒక నవల చదువుచున్నప్పుడు 'రచన' రచయిత యొక్క కల్పన యే కదా – అని జ్ఞప్తియందు ఉంటే దుఃఖము, భయము కలిగించదు. లేదా, 'నిజమే' అనే భావనగల వానికి దుఃఖ, భయాలు కలుగుతాయి.

**జగత్ మిథ్యా! బ్రహ్మ సత్యమ్! ఇత్యేవ సత్యమ్!** 'జగత్తు కల్పనయే' – అను జ్ఞప్తి కలవానికి ఇక్కడ దుఃఖము, భయము ఇక ఉండవు. పదార్థము యొక్క "సత్–అసత్" – మిథ్యలను ఏకకాలంలో యుక్తియుక్తముగా ఎఱిగిన వాడే – బ్రహ్మమును ఎఱిగినవాడు।

## బ్రహ్మము – ఆత్మ –అనాత్మ

- **బ్రహ్మమే ఆత్మగా** ప్రదర్శనమగుచున్నది.
- **'ఆత్మ' బ్రహ్మమే** అయి ఉన్నది.

- **బ్రహ్మజ్ఞానము** = ఈ జీవాత్మ – జగత్తులు, ద్రష్ట – దృశ్యములు మొదలైనవి బ్రహ్మము నుండి – దర్పణంలో వస్తు జాలము వలె బయల్వెడలి, – తిరిగి సత్– బ్రహ్మమునందే విలీనమగుచున్నాయి. అంతేకాదు. సర్వదా బ్రహ్మమునకు అభిన్నమైయున్నాయి.
- జగత్ భావన ఆత్మ నుండి బయల్వెడలి, తిరిగి ఆత్మయందే విలీనమగుచున్నది.
- అయితే అద్దములో ఏ వస్తువు ప్రవేశించనూ లేదు. నిష్క్రమించనూ లేదు. అట్లాగే బ్రహ్మమునందు జగత్తు లేదు.

అందుచేత ఆత్మకు వేరుగా జగత్తు లేదు. ఊహించువానికి వేరుగా ఊహ ఉండదు కదా! ఈ ఆకాశాది పంచభూతముల ప్రదర్శనమంతా మాయయే. ఆత్మ నుండి బయల్వెడలినవే! ***(ఆత్మాత్ ఆకాశమ్।)*** కనుక ఆత్మకు భిన్నమైనవి కావు. ఇదంతా ఆత్మతో ఏకమేగాని అనేకము కాదు. అన్యముకాదు. అన్యముగా అనిపించటమే మాయ। **బ్రహ్మముగా అనిపించటమే సత్యము।**

'అనాత్మ' అనేది ఎక్కడైనా ఉంటే అది మాయయే (యా మా – వాస్తవానికి లేనిదే). నిర్మలాకాశము కనబడక, మేఘావృతమైతే ఆకాశము కనబడకపోవచ్చు గాక! అయితే ఆకాశము లేకుండా పోతుందా? లేదు కదా!

అట్లాగే;

ఈ 'జగత్తు' (లేక జగత్ అనుభవము, జీవాత్మ భావనలతో కూడిన మాయ) – ఆత్మాకాశమును కప్పి ఉంచలేదు. ఎందుకంటే మేఘములు కొద్ది ప్రదేశమును ఆక్రమించి ఉండగలవు – ***ఆకాశమో? అనన్తము. అట్లాగే,*** జగత్– జాగ్రత్‌భావన– జగత్ భావికుడు (జీవాత్మ)లు కాల దేశ సందర్భ పరిమితములు. ***ఆత్మాకాశమో? అనన్తము। అప్రమేయము। నిత్యము। సత్యము। ఈ జీవుడు అట్టి అఖండ – ఆత్మాకాశ స్వరూపుడే! ఆత్మను జగత్తులు, జన్మలు మొ॥వి బంధించగలిగే ప్రసక్తియే లేదు.***

## మాయ ఎటువంటిది?

**అనాద్యంతవతీ।** మొదలు – మధ్య – చివర అనునవి లేనిది. దృష్టాంతాలకు దొరకనిది. ఉన్నదని అనలేము. లేదని అనలేము. మాటలకు అందనిది. అద్దాని అధిష్ఠానము (దేనితో తయారైనదో) చెప్పలేము. అవిద్యారూప అంతర్వాణి–వికల్పరూపమైనది. 'ఇది' అని చెప్పుటకు, నిర్వచించుటకు వీలులేదు. (భేద దృష్టిచే 'ఇది' అని సమగ్రంగా చెప్పజాలము).

**వస్తుతః ఏ మాత్రం లేనట్టిది మాయ!**

- *అజ్ఞానమే అద్దాని స్వరూపము।*
- *అదియే 'మూల ప్రకృతి' కూడా।*
- *త్రిగుణముల సామ్యరూపము కూడా అదే।*
- *"అవిద్యారూపము" – అని కూడా చెప్పబడుచున్నది।*
- అనేకమైన ఆకారముల సమన్వితము.

మాయకు ఆధారమైన 'తత్' స్వస్వరూపమును ఎరుగుటచే, అనుభవముచే 'మాయ'కు – 'మొదలే లేదు' – అనునదే సిద్ధిస్తోంది. **"ఆత్మ సర్వదా అనన్యము"** అని స్వానుభవమగుచున్నది.

## ఇత్యహమ్ – 'ఇది నేను' – శ్లోకాః

**గురవర్యులు :** ప్రియ శిష్యా! స్వయమాత్మానంద స్వరూపా! ఆత్మతత్త్వము ఎరిగిన మహనీయుల గానము ఏమిటో చెప్పుచున్నాను.

## బ్రహ్మము యొక్క స్థితి (The song of "Self") – నాహమ్ ఇతి।

నేను ఏక్షణంలో కూడా ఈ **'భౌతికదేహము'** అయి ఉండలేదు, అయి ఉండుట లేదు, అయి ఉండబోను. **నైవం భవామి అహం దేహే!**

- ఈ "చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు" – అగు పంచేంద్రియగోళములుగాని,
- "శ్రోత్ర (చెవులు)–త్వక్ (చర్మము)–చక్షు (కళ్ళు)–జిహ్వ (నాలుక)–ఘ్రాణ" (ముక్కు)– అగు **పంచజ్ఞానేంద్రియములు** గాని,
- "నోరు – చేతులు –కాళ్లు – గుదము– గుహ్యము" అయినట్టి **పంచ కర్మేంద్రియ గోళకములు** గాని,
- "వాక్ పాణి – పాద – పాయు – ఉపస్థ"లనబడు **పంచ కర్మేంద్రియములు** గాని
- "శబ్దము – స్పర్శ–రూప–రస–గంధములనబడే" **పంచజ్ఞానేంద్రియ విషయములు** గాని,
- వచన ఆదాన గమన విసర్జన ఆనందములనబడే **పంచ కర్మేంద్రియ విషయములు** గాని – **నేను కాదు।**

**న ఇంద్రియాణి దశైవతు. వాటికి నేను వేరు అయి ఉన్నాను.**

- నిర్ణయములు నిర్వర్తించు **బుద్ధి,** ఆలోచనలు చేయు **మనస్సు,** జాగ్రత్ స్వప్నసుషుప్తులలోను, జన్మజన్మాంతరములోను విస్తరించి యున్న **ఈశ్వరుడు – ఇవన్నీ 'నేను' అయి ఉండలేదు.**

- జాగ్రత్ అహంకారము స్వప్నములో లేదు. స్వప్న అహంకారము సుషుప్తిలో ప్రవర్తితమవటం లేదు కానీ ఆ మూడు సందర్భములలో నేను ఉన్నాను. కనుక, **'అహంకారము'** కూడా నేను కాను.
- పంచ ప్రాణములు గాని, మనస్సుగాని నేను కాదు.

  ఆత్మగా ప్రాణ–మనో (ఆలోచనలకు) ఆవలివాడను. మనో రహితుడను కూడా. బుద్ధి మొదలైనవాటికి సర్వదా వేరైనవాడను. **అప్రాణో అమానాః శుభ్రో। బుద్ధ్యాదీనాం హి సర్వదా, సాక్ష్యహమ్ సర్వదా నిత్యః చిన్మాత్రోఽహమ్! న సంశయః।** శరీరము, ప్రాణము, మనస్సు, బుద్ధి,మొదలైనవాటికి **సర్వదా నిత్యమగు సాక్షిని.** సూర్యకాంతిలో ఆయా వస్తువులు సాకారమై కనిపిస్తున్నట్లు, వాటిని వెలిగించు చిన్మాత్ర స్వరూపుడను. కాంతి వలన వస్తువులు వెలుగుతో కనబడతాయి. కాంతి వస్తువులపై ఆధారపడి ఉండదు కదా! ప్రాణ మనో బుద్ధి మొదలైనవాటికి వేరైన తేజో–**చైతన్య చిన్మాత్ర స్వరూపుడను.** ఇందులో సందేహమే లేదు!
- నాటకంలో ఒక పాత్రగా నటించేడప్పుడు ఆ పాత్ర యొక్క కర్తృత్వ – భోక్తృత్వాలు నావిగా అవుతాయా? కావు కదా! అట్లాగే, ఈ జగన్నాటకంలో మనోబుద్ధి చిత్త అహంకారాలతో పాత్ర వహిస్తూ ఉన్నప్పుడు కూడా నేను 'జగత్తు' అనే నాటకంలో దేనికీ కర్తను కాను. భోక్తను కాను. జగన్నాటకంలోని ఈ వర్తమాన – **'జీవుడు'** అను పాత్రకు – **నేను సాక్షిని. ప్రకృతికి** (స్వభావమునకు) సాక్షిరూపుడను. **నాహమ్ కర్తా, నైవ భోక్తా, ప్రకృతే సాక్షిరూపకః।**

## కోఽహమ్? సోఽహమ్?

**కేవల చైతన్య స్వరూపుడనగు నా యొక్క సాన్నిధ్యం చేత మాత్రమే ఈ 'దేహము' మొదలైనవి అజడములై (స్వయంగా చైతన్యములయినట్లు) ప్రవర్తిస్తున్నాయి. మత్ సాన్నిధ్యాత్ ప్రవర్తంతే దేహాత్ యా అజడా ఇవ।**

- నవలలో నాయకుడు ఒక చోటనుండి మరొక చోటికి వెళ్లుచూ ఉంటే, ఆ నవలా రచయిత ఆ విధంగా మరొక చోటికి వెళ్లుచున్నట్లా? కాదుకదా! ఆ నవలా సంఘటన సందర్భంలో రచయిత స్థాణువు వలె ఎక్కడికీ వెళ్లక, ఉన్నచోటే ఉంటాడు కదా! అట్లాగే నేను సర్వదా స్థాణువునై, నిత్యుడనై యధాతథంగా ఉండి ఉండగా, ఈ దేహదేహాంతరములు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు నాయొక్క కల్పనా వైభవము నందు కనబడుచున్నవై ఉన్నాయి. ఇదంతా నా వినోదమే! కనుక, **"సదానందుడను".** తెలియబడుగానికి మునుందే ఉన్న **'తెలివి'** (ఎరుక/చిత్) స్వరూపుడను. **కేవలము, నిర్మలము అగు శుద్ధ జ్ఞానానంద స్వరూపుడను. స్థాణుః నిత్యః సదానందః శుద్ధో, జ్ఞానమయో అమలః।**
- 'సర్వ జీవుల ఆత్మ'యే నా వాస్తవ స్వరూపము. సర్వజీవులను నియమించునది, సర్వజీవులుగా విస్తరించి ఉన్నది, సర్వజీవులకు కేవల సాక్షిని నేనే. సంశయమే లేదు. **ఆత్మాహమ్ సర్వభూతానామ్ విభుః సాక్షీ న సంశయః।**
- సర్వ వేదాంత శాస్త్ర రూపములగు ఉపనిషత్–ద్రష్టలు దేనిని 'బ్రహ్మము' అంటున్నారో, అట్టి బ్రహ్మమే నేను. **బ్రహ్మైవాఽహమ్, సర్వవేదాంత వేద్యమ్!** వేదాంత శాస్త్రసిద్ధాంతములన్నీ నా యొక్క **బ్రాహ్మీస్వరూపము** గురించే అయి ఉన్నాయి.
- ఆకాశము – వాయువుల వలె నేను తెలియబడువాడను కాను. సర్వము తెలుసుకొనుచూ ఉన్న **కేవల జ్ఞాన–కేవల చిత్** స్వరూపుడను. **నాహమ్ వేద్యమ్ వ్యోమ వాతాది రూపమ్।** వైద పురుషుడను। సమస్తము తెలుసుకొనుచున్న 'తెలివి–చిత్' స్వరూపుడను. అంతేగాని, తెలియబడే వాటిలో ఒక 'వస్తువు' వంటివాడను కాను.
- ఈ నామ రూపములు నేను కాను. ఏ మాత్రమూ కర్మలకు సంబంధించినవాడనే కాను. **సచ్చిదానంద రూప పరబ్రహ్మమే సర్వదా అయి ఉన్నాను.** సదాశివ బ్రహ్మమును.

**నాహమ్ దేహో। బంధ మోక్షో కుతో మే? నేను దేహమే కానప్పుడు నాకు "బంధము" అనే ప్రసక్తి ఎక్కడిది? బంధమే లేనప్పుడు మోక్షమెక్కడిది?**

ఒకడు ఒక వస్త్రమును ధరిస్తే, ఆ వస్త్రము ఆతడు అవుతాడా? **కాదు.** ఒకడు ఒక వాహనమును నడుపుతూ ఉంటే, ఆ వాహనము అతను అగుచున్నాడా? **అవటమే లేదు.** ఒకడు ఒక దృశ్యమును చూస్తూ ఉంటే, ఆ దృశ్యముగా **ఆతడు మారిపోతాడా? మారిపోడు.** ఈ దేహము నేను ధరించు వస్త్రము వంటిది. నేను నడుపు వాహనము వంటిది. నేను కళ్లతో చూస్తున్న దృశ్యములోని ఒక వస్తువు వంటిది. **నేను దేహమును కాను.**

ఈ దేహమును ఉపయోగిస్తూ, దీనిని కదలునట్లుగా, సచేతనముగా చేయుచున్న దివ్యమగు చైతన్యమూర్తిని. చైతన్యస్ఫూర్తిని. దీనిని ఉపకరణముగా ఉపయోగిస్తున్న **'దేహి'**ని. ఉపయోగించువాడు –ఉపయోగించబడు వస్తువు సర్వదా వేరే కదా! ఆటగాడు ఆటకొరకై ఆట వస్తువు (say, a cricket Bat)ను ఉపయోగిస్తూ ఉన్నప్పటికీ ఆటగాడు ఆట వస్తువుగా (As a cricket Bat) అవటం లేదు కదా!

- **నాహమ్ దేహో।** నేను ఈ దేహముగా అగుటయే లేదు. **సర్వదా అఖండాత్మ స్వరూపుడను। ఆద్యంత రహితుడను। జన్మ–మృత్యుః కుతో మే?** మరి దేహ ధర్మములు అయినటువంటి జన్మ–జరా–మృత్యువులు నావి ఎట్లా అవుతాయి?
- దేహము దేహికి ఉపాధి. దేహియో, ఆత్మకు ఉపాధి. దేహముయొక్క ధర్మములను దేహికి గాని, 'దేహి'ని ఉపాధిగా కలిగియున్న ఆత్మకుగాని ఆపాదించి దర్శించటము – **ఎటువంటిదంటే :-**

- వస్త్రము చిరిగితే వస్త్ర ధారి చిరిగిపోతాడు।
- వాహనము చెడితే వాహనము నడుపువాడు చెడిపోతాడు।
- దృశ్యము మారితే ద్రష్ట ఆ మార్పు పొందుతాడు।
- కదిలే వస్తువు చేతి నుండి జారిపడటం చేత, చేయి జారిపోతుంది. ఆ కదిల్చే వ్యక్తి కూడా జారిపడిపోతాడు!
- అచేతనము (జడము) అగు కర్ర విరగగానే ఆ కర్రను అంతసేపూ పట్టుకున్న సచేతనుడు కూడా విరిగిపోతాడు.

అని చెప్పటము వంటిది. అది ఎంత అర్థరహితమో,

**"ఈ దేహములో నేను జన్మిస్తున్నాను. దేహముతో మరణిస్తున్నాను"** – అని నా గురించి నేను గాని, మరొకరుగాని తలచటము అంతగానూ **అర్థరహితము.**

నేను మరొకరి గురించి అట్లా అనుకోవటం కూడా అంతే **అర్థరహితము.**

ఈ జగత్తును, ఈ దృశ్య భావములను, ఈ ఇంద్రియములను, ఈ ఇంద్రియార్థములను కదల్చు (లేక) ఉపయోగించు "చైతన్య స్ఫూర్తి" (లేక) **"కేవల జ్ఞాన"** స్వరూపుడనగు నాకు ఈ దేహ ధర్మములైనట్టి జన్మ – మృత్యువులు ఎట్లా ఆపాదించబడలగవు? **జన్మ మృత్యుః కుతో మే?** ఉండవు. ఉండజాలవు. మరి?

**నాయొక్క పూర్ణత్వము సర్వదా యథాతథమై ఉండగా, ఒకానొక కించిత్ విభాగమునందు చంచలరూప చమత్కారమంతా చోటు కలిగి ఉంటోంది.**

**కనుక ప్రియ శిష్యా! ఆత్మదేవా!**

- **దేహే జాతే న జాతోఽసి!** దేహముతో నీవు పుట్టువాడవు కావు.
- **దేహే నష్టే న నశ్యసి!** దేహముతో నశించువాడవుకావు.
- **త్వమాత్మా అకలంకాత్మ।** నీ ఆత్మ దోషము. పొందనిది.
- **దేహస్తవ న కశ్చన।** నీవు ఎప్పుడూ కూడా దేహముగా అవటం లేదు.

– *(యోగవాసిష్ఠము)*

ఏ ఒక్క జీవుడు దేహముగా అవటానికి వీలే లేదు. అవడు. అవజాలడు. ఎందుకంటే ఆత్మ సర్వదా నిత్యము, అప్రమేయము కదా! ఈ జీవుడు సర్వదా సహజముగా ఆత్మ స్వరూపుడేగాని, **మరింకేదీ ఆతని కేవల–శాశ్వత స్వాభాకం కాదు.**

## నాహమ్ ప్రాణో।

- నాకు ఈ దేహమున్నంత వరకూ ఈ దేహము యొక్క నఖ–శిఖ పర్యంతరము నాయొక్క ప్రాణశక్తితో సంచాలనము చేస్తూ ఉన్నాను. మరొకప్పుడెప్పుడో ఈ దేహము నుండి **నా ప్రాణశక్తిని నేనే ఉపసంహరించుచున్నాను.** అయితే నేను ప్రాణ స్వరూపుడనా? కాదు. **ప్రాణము నా యొక్క శక్తిరూపము మాత్రమే!** మరి నేనో? **ప్రాణేశ్వరుడను। ప్రాణమునకు విభువును।**
- శక్తి వేరు. ఆ శక్తి కలవాడు వేరు–కదా। అయినా కూడా, శక్తి శక్తిమంతునికి శక్తి అభిన్నము. కనుక నేను శివ–శక్తి ఐక్య రూపుడను. చిత్రలేఖన 'కళ' వేరు. ఆ 'కళ' తన దైనవాడు వేరు వేరేకదా। కథా రచనా శైలివేరు. ఆ శైలి తనదైనవాడు వేరు కదా।

**ఆకలి – దప్పికలు ప్రాణముల ధర్మములు.**

**ఆ ప్రాణములు నావైన నేను ప్రాణధర్మములకు సంబంధ–పరిమితుడను కాను. ప్రాణములు నాయొక్క అంతర్‌శక్తి చమత్కారము.**

**నాహమ్ ప్రాణః। క్షుత్ పిపాసే కుతోమే?** నేను ప్రాణ స్వరూపుడను కాను. ప్రాణములు కూడా దేహము వలెనే జడమే। ఆ ప్రాణములను కూడా స్ఫూర్తిని ఇచ్చు, చేతన పరచు **చైతన్యాత్మ స్వరూపుడను.**

శరీరము యొక్క కండబలము నేను కానట్లే, పంచప్రాణములు కూడా నేను కాదు. **కనుక క్షుత్–పిపాసలగు ప్రాణ ధర్మములు కేవలాత్మ స్వరూపుడనగు నా యొక్క ధర్మములు** (Features) **కావు. శరీరముయొక్క ఆకారము 'శరీరి' యొక్క ధర్మము అని అనలేము కదా! ఇదీ అంతే।**

## నాహమ్ చేతో!

- ఈ చిత్తము అనేక విషయములపై, సంగతులపై సంఘటనలపై, సందర్భములపై, సంబంధములపై, అనుబంధములపై, బాంధవ్యములపై వ్రాలుచూ, ... "ఇవి ఇష్టం! ఇవి అయిష్టం"... అనే స్ఫూర్తిని కలిగి ఉంటోంది. అయితే..,

**'ఇష్టము' నాది. అంతేగాని నేను ఇష్టము – స్వరూపుడను కాను.** నేనుంటే 'ఇష్టము' అనేది, **'అయిష్టము'** అనేది ఉంటాయి. అవి ఉన్నప్పుడు, లేనప్పుడు కూడా నేను ఉంటాను. కనుక ఇష్టము (లేక) చిత్తము, మరియు **నాచే చేతనము చేయబడుచున్న** మనస్సు మొదలైనవి–ఇవన్నీ కూడా

నా స్వరూపము కాదు. నా వాస్తవ స్వభావము కాదు. అవన్నీ నాపట్ల సందర్భానుచితమైన ఆరోపితములు మాత్రమే!
కనుక,
నేను చిత్తమును కాను. కనుక చిత్తము యొక్క ధర్మములైనటువంటి..,
- శోకము, దుఃఖము, ఆదుర్దా, వేదన, రోదన మొదలైనవి,
- మోహము (Illusion) కలిగియుండి ప్రవర్తించటము,

మొదలైనవన్నీ **చిత్తమునకు ఆవల కేవలాత్మానంద స్వరూపుడను – అగు నా ఆత్మ ధర్మములు (లేక) నా ధర్మములు ఎట్లా అవుతాయి? అవవు. నాహమ్ చేతః। శోక మోహౌ కుతో మే?**

## నాహమ్ కర్తా

- ఒకడు ఒక నాటకంలో ఒక పాత్రగా నటిస్తూ ఉంటే, ఆ పాత్రగా నిర్వర్తించేవన్నీ, **పాత్రధారుడు నిర్వర్తించేవి** అవుతాయా? అవవు కదా? అట్లాగే జగన్నాటకంలో 'జీవుడు' అను పాత్ర **యొక్క కర్తృత్వ-అకర్తృత్వాలు నావి ఎట్లా అవుతాయి**? నేను (నటుని సహజ స్వస్వరూపమువలె) – సర్వదా కేవలాత్మ స్వరూపుడను! **నాహమ్ కర్తా!** నేను దేనికీ **ఆత్మగా కర్తను కాదు. భోక్తను కాదు.** నాటకంలో నాయక పాత్ర యొక్క ప్రవర్తనలు ఎవరివి **నటుడివా**? కావు. పోనీ, **రచయితవా!** అస్సలు కాదు. లేక, **ప్రేక్షకులవా!** అదీ ఏ మాత్రం కాదు. కాక, నాటక రంగానివా? అదీ కాదు. మరి? ఎవ్వరివీ కాదు. **నాటక కల్పనా చమత్కారములు**. అంతే। అదంతా ప్రేక్షకుల, నటుల, దర్శకుల, రచయితల వినోద చమత్కారము మాత్రమే!

**అట్లాగే, ఈ జగన్నాటక దృశ్యము కూడా! నాయొక్క 'జీవాత్మ' కూడా జగన్నాటకములోని పాత్రధారి మాత్రమే।**

## బంధ మోక్షో కుతో మే?

సర్వదా ఆత్మస్వరూపుడను, **"చిదానంద రూపమ్ – శివోఽహమ్, శివోఽహమ్"** – అయి ఉన్న నేను జగన్నాటకములోని అంతర్గత పాత్ర యగు 'జీవుడు'గా – పిలువబడువాడు నిర్వర్తించు నా పాత్రకు – కర్తను కాను. భోక్తము కాను. కర్మలకు సంబంధించనివాడను. **నాహమ్ కర్తా!**

నాకు కర్మలే లేనప్పుడు, నేను కర్మలకు సంబంధించినవాడినే కానప్పుడు నాకు బంధమెక్కడిది? మోక్షమెక్కడిది?

> *__బంధ మోక్షో కుతోమే__? జీవాత్మగా – జగన్నాటకానుసారంగా 'ముక్తి' ఏముంటుంది? అది జగన్నాటకానికి సర్వదా బద్ధమే అయి ఉంటుంది. కనుక సందర్భపరిమితమగు జీవాత్మగా 'ముక్తి' అనే ప్రసక్తియే ఉండదు. __'నాటకంలో నేను నా పాత్రకు ముక్తిని కలిగించాలి!'__ – అనే వ్యవహారము ఎక్కడిది?*
>
> *జగన్నాటకానికి, జీవాత్మత్వమునకు ఆవల గల __నా ఆత్మస్వరూపము నిత్యముక్తము.__ నిత్యముక్తమైనదానికి ఇప్పుడు క్రొత్తగా 'మోక్షము' కలిగించే వ్యవహారమేముంటుంది? కనుక నాకు బంధము లేదు. మోక్షము లేదు.*

*__నైవం భవామి అహం దేహే న ఇంద్రియాణి దశైవ తు। న బుద్ధిః మన ఈశశ్చ। న అహంకారః తథైవ చ। అ ప్రాణో హి। అ మనాః శుభ్రో, బుద్ధ్యాదీనాం హి సర్వదా। 'సాక్షి' అహమ్ సర్వదా। నిత్యః। చిన్మాత్రోహమ్, న సంశయః। నాహం కర్తా। నైవ భోక్తా, ప్రకృతేః 'సాక్షి' రూపకః। మత్ సాన్నిధ్యాత్ ప్రవర్తంతే దేహాది యా అజడా ఇవ। స్థాణుః నిత్యః। సదానందః। శుద్ధో జ్ఞానమయో అమలః। ఆత్మాహమ్ సర్వభూతానామ్, విభుః సాక్షీ, న సంశయః। బ్రహ్మైవాహగ్ం, సర్వవేదాంత-వేద్యమ్। నాహం వేద్యం – వ్యోమ వాతాది రూపమ్। రూపం నాహం (న-అహమ్)। నామ నాహం। న కర్మ। బ్రహ్మైవాహగ్ం సచ్చిదానంద రూపం। నాహం దేహో। జన్మ మృత్యూ కుతో మే? నాహం ప్రాణః। క్షుత్ పిపాసే కుతో మే? నాహం చేతః। శోక మోహౌ కుతో మే? నాహం కర్తా। బన్ధ మోక్షౌ కుతో మే? – ఇతి ఉపనిషత్।।__*

**ఇతి సర్వసారోపనిషత్**

*ఓం శాంతిః। శాంతిః। శాంతిః।*

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 30 స్కందోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ యత్ర అసంభిన్నతాం యాతి,
స్వాతిరిక్త భిదాతతిః।
సంవిన్మాత్రం పరంబ్రహ్మ,
తత్ "స్వమాత్రం" విజృంభతే ॥



స్వస్వరూపమునకు వేరుగా కనిపించేదంతా సత్-అభిన్నత్వము నందు లయించగా, అప్పటికీ శేషించు **సత్-చిత్‌మాత్ర పరబ్రహ్మమే స్వస్వరూపమై** సర్వత్రా విజృంభణము కలిగి ఉన్నదగుచున్నది.

ఓం

**1.** అచ్యుతోఽస్మి మహాదేవ!
తవ కారుణ్య లేశతః।
విజ్ఞాన ఘనఏవాఽస్మి।
శివోఽస్మి। కిమ్ అతః పరమ్?

గురుదేవా! నృశింహ భగవన్! మీరు బోధించిన ఆత్మజ్ఞానముచేత పవిత్రుడనైనాను. మీయొక్క బోధానుగ్రహంచేత ధన్యుడను. ఇప్పుడు నాగురించే నాకు గల ఆత్మానుభూతిని మీకు విశదీకరించుకొని ఆనందిస్తున్నాను స్వామీ! వినండి.

హే మహాదేవా! నేను ఆత్మ స్వరూపమునుండి ఎప్పుడూ కూడా (సర్వదా) చ్యుతి లేనివాడనే. అచ్యుతుడను. ఇది మీ యొక్క లవలేశపు కారుణ్యముచే, మీ బోధానుసారం తెలుసుకున్నాను. స్వామీ! నేను **జీవమాత్రుడను కాను. కేవల శివస్వరూపుడను!** విజ్ఞాన ఘన (కేవల విజ్ఞాన) స్వరూపుడను! శివుడనై యున్నాను. ఇంతకు మించి నాగురించి **మరొకటేముంటుంది?**

---

**2.** న నిజం నిజవత్ భాతి
అంతఃకరణ జృంభణాత్।
అంతఃకరణ నాశేన
సంవిత్ (సత్-చిత్) మాత్ర స్థితో హరిః।
సంవిత్ మాత్ర స్థితశ్చ అహమ్,
అజోఽస్మి। కిమ్ అతః పరమ్?

మీ బోధామృతము విినిన తరువాత "నేను అచ్యుతుడను, విజ్ఞాన ఘన స్వరూపుడను, శివానంద స్వరూపుడనై ఉన్నాను" అని ఇప్పుడు ఒప్పుకుంటున్నాను. అయితే ఇదివరకు అది నేను కాదా? అదియే! కానీ ఇంతకుముందు అంతఃకరణముయొక్క విజృంభవశంగా **నిజమైనది నిజంగా భాసించనే లేదు. నిజం కానిది నిజంవలె భాసించింది.** ఇప్పుడో, మీరు కరుణామూర్తులై ప్రసాదించిన బోధచే, అంతఃకరణము నశించుటచే - హరి 'సత్' - 'చిత్' మాత్ర స్థితుడని, అజుడు (సృష్టికర్త) కూడా అదియేనని, నేను కూడా అదేవిధంగా సత్-చిత్ మాత్ర స్థితుడనని, హరి-అజుడు-నేను కూడా జన్మ రహితులమని తెలిసిపోతోంది. ఇంతకుమించి, వేరైనదేముంది? తెలుసుకోవలసినది ఏమున్నది? హరియందు నేను, నాయందు హరి పరస్పరము పూర్ణమైయున్నాము.

---

**3.** వ్యతిరిక్తం జడం సర్వం
స్వప్నవత్ చ వినశ్యతి।
చిత్ జడానాం తు యో ద్రష్టా
సో అచ్యుతో, జ్ఞాన విగ్రహః।

సంవిత్ మాత్రమగు ఆత్మకు వేరుగా ఏదైతే "కనిపించినది, అనిపించినది" గా ఉంటుందో అదంతా కూడా - మెలకువ వచ్చినప్పటి (గడచిన) కలలోని దృశ్యమువలె - పూర్తిగా వినాశమగుచున్నది. అయితే "ఇది చిత్, ఇది జడము" - అని నాలో ఉండే ఏ ద్రష్ట అయితే చూచుచూ ఉన్నాడో, ఆ కేవల జ్ఞాన విగ్రహుడు - సర్వదా తన కేవల ద్రష్టత్వము నుండి చ్యుతి పొందటము లేదు. అనగా నేను ఆత్మగా సర్వదా అచ్యుతుడను.

---

**4.** సఏవ హి మహాదేవః। స ఏవ హి మహా హరిః।
స ఏవ జ్యోతిషాం జ్యోతిః। స ఏవ పరమేశ్వరః।

ఆ నాలోని చ్యుతి పొందని (అచ్యుతుడైనట్టి) నేనైన నేనే - మహాదేవుడగు శివుడు. ఆ 'నేనే' మహత్-తత్త్వుడగు హరి కూడా! ఆ కేవలాత్మయే జ్యోతిలన్నిటికీ జ్యోతి అయినట్టి 'పరంజ్యోతి'. ఆయనయే పరమేశ్వరుడు. నాలో 'నేను'గా ఉన్నది - సర్వ దేహములలో 'నేను'గా ప్రదర్శనమగుచున్న ఆ పరమేశ్వరుడే!

**5.** **స ఏవ హి పరంబ్రహ్మ।**
**తత్ బ్రహ్మ-అహమ్। న సంశయః।**
**జీవః శివః। శివో జీవః।**
**స జీవః కేవలః శివః॥**

ఆయనయే పరంబ్రహ్మము అయి ఉన్నారు. ఆ బ్రహ్మమే నేను. తదితరమైనదంతా సందర్భ పరిమిత కల్పనా మాత్రమే. శాశ్వతమగు సహజ సత్యము కాదు. నేను సర్వదా బ్రహ్మమునే! ఇందులో సంశయమే లేదు. **ఈ జీవుడుగా కనిపిస్తున్నది శివుడే! శివుడే జీవుడుగా ఉన్నాడు. అందుచేత ఈ జీవుడు సర్వదా కేవలుడగు శివుడే!** ఒకడు-నాటకంలో పాత్రగా కనిపిస్తున్నప్పటికీ, పాత్రధారుడుగా పాత్రను వేరు కానిదెప్పుడు?

---

**6.** **తుషేణ బద్ధో వ్రీహిః స్యాత్**
**తుషా అభావేతు తణ్డులః।**
**ఏవమ్ బద్ధః తథా జీవః**
**కర్మనాశే సదాశివః॥**

వడ్లు బియ్యము ఒక్కటెలా అవుతాయి? అవవు కాని, ఊక విభాగంతో కూడా అది వడ్ల గింజయే. ఊక తొలగిస్తేనో? బియ్యపు గింజ. అంతేగాని వడ్లగింజకు బియ్యపు గింజ వేరు కాదు. ఈ జీవునిలో 'ఆత్మ' ఎక్కడున్నది? వడ్లపు పొరలో అంతరంగా బియ్యపు గింజవలె, జీవ స్వభావముయొక్క అంతరమున వేంచేసినదై ఉన్నది.

**"నేను కర్మలచే బద్ధుడను"** - అని అనుకొనుచున్నవాడు 'జీవుడు'గా అనబడుచున్నాడు. **'కర్మలచే బద్ధముకాని స్వరూపుడను'** అను ఎరుకచే, (కర్మల అభావముచే) నేను సదాశివుడను. (జీవుడుగా ఉన్న సందర్భము నందు, జీవత్వమును (లేక) కర్మల పరిధులను అధిగమించినప్పుడు కూడా) - ఎల్లప్పుడూ 'నేను' శివ స్వరూపుడనే. (నటుని సహజ స్వరూపము సర్వదా నాటకమునకు వేరై ఉండుతీరుగా). సదా శివుడనే।

---

**7.** **పాశ బద్ధః సదా జీవః**
**పాశముక్తః సదా శివః।**
**శివాయ విష్ణు రూపాయ,**
**శివ రూపాయ విష్ణవే।**

జన్మ కర్మల పాశములకు బద్ధుడై ఉన్నప్పుడు శివుడే జీవుడు.

**'బద్ధుడను కాను'** అని గమనిస్తున్నప్పుడు ఈ జీవుడే - శివుడు.

ఆశ, మోహముచే ఈ జీవునిపట్ల పాశములు. శివ భక్తుడు ఆశా-పాశబద్ధుడు కానప్పుడు - శివుడే! విష్ణు భక్తుడు పాశబద్ధుడు కానప్పుడు విష్ణువై! శివుడే విష్ణు రూపముగా ఉన్నారు. విష్ణువే శివరూపుడై ఉన్నారు.

---

**8.** **శివస్య హృదయం విష్ణుః**
**విష్ణుశ్చ హృదయగ్‍ం శివః।**
**యథా శివమయో విష్ణుః**
**ఏవం విష్ణుమయః శివః॥**

శివునియొక్క హృదయము విష్ణువే। విష్ణువు యొక్క హృదయాంతర్గతుడు శివుడే కూడా। ఏవిధంగా విష్ణువు శివమయుడై ఉన్నారో, అదేవిధంగా శివుడు విష్ణుమయుడై ఉన్నారు. (శివుడుగా విష్ణువుగా ఉపాసించబడేది - ఏకము, అఖండము అగు ఆత్మయే।)

---

**9.** **యథా అన్తరం న పస్యామి**
**తథా మే స్వస్తిః ఆయుషి।**
**యథా అన్తరం న భేదాస్యుః**
**శివ కేశవయోః తథా॥**

ఎప్పుడైతే విష్ణుతత్త్వమునకు శివతత్త్వమునకు భేదమే కనిపించదో, అప్పుడు నాయొక్క ఆయుష్షు (జీవితము) స్వస్తి పొందుచున్నది.

ఎవ్వరికి శివ-కేశవ భేదము ఏమాత్రము అనిపించదో, కనిపించదో - ఆతడే అభేదమగు ఆత్మను అనుభూతపరచుకోవటానికి అర్హుడు.

---

**10.** **దేహో దేవాలయః ప్రోక్తో,**
**జీవో దేవః సదాశివః।**
**త్యజేత్ అజ్ఞాన నిర్మాల్యం,**
**'సో౽హమ్' భావేన పూజయేత్।**

స్వామీ! నృశింహా!

"ఈ దేహము బంధము కదా!"- అని అజ్ఞాన దశలో అనిపించేది. మీరు బోధించిన ఆత్మ జ్ఞానము వినిన తరువాత ఇప్పుడేమి అనిపిస్తోందో చెప్పుతాను. వినండి. **ఈ దేహమే దేవాలయము. ఇందులో దేహియే (లేక జీవుడే) దైవము.** సదాశివుడు. దేవుడనబడేవాడు మరింకెక్కడో లేదు. అట్టి దేహములో ఈ జీవుడు - **"అజ్ఞానము"** అను నిర్మాల్యమును తొలగించుకొని **'సో౽హమ్'** భావముతో స్వస్వరూప సదాశివుని పూజించును గాక!

**11.** **అభేద దర్శనం జ్ఞానం।**
**ధ్యానం నిర్విషయం మనః।**
**స్నానం మనోమల త్యాగః।**
**శౌచం ఇంద్రియ నిగ్రహః।**
**బ్రహ్మామృతం పిబేత్,**
**భైక్షం ఆచరేత్ దేహ రక్షణే।**

**జ్ఞానము** - సర్వజీవులలోను సర్వదా సమస్వరూపమై వేంచేసియున్న పరమాత్మను అభేదంగా దర్శించటమే **జ్ఞానము.** (సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్)।

**ధ్యానము** - మనస్సును విషయముల వైపు నుండి ఉపసంహరించి కేవలము - నిర్విషయము చేసుకొని ఉండటమే **ధ్యానము.** (అనేకముగా కనిపిస్తున్నదానిలో ఏకమగు ఆత్మయొక్క ధ్యాస, మననములే ధ్యానము).

**స్నానం** - మనస్సులో కు-సంస్కారరూపాలుగా పేరుకొనియున్న కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్య - దోష వర్గములను త్యజిస్తూ ఉండటమే **స్నానము.**

**శౌచము** - ఇంద్రియములను నిగ్రహించి, నియమించి ఉంచటమే 'శౌచము'. (అంతేగాని బాహ్యమైన మడి, ఆచారములు కాదు).

ఇది గ్రహించి దేహ రక్షణ కొరకై భిక్షాటణం చేస్తూ, సదా 'బ్రహ్మభావన' అను అమృతమును త్రాగుచూ ఉండాలి.

---

**12.** **వసేత్ ఏకాన్తికో భూత్వా చ,**
**'ఏకాన్తే ద్వైత వర్జితే'।**
**ఇత్యేవమ్ ఆచరేత్ ధీమాన్**
**స ఏవం ముక్తిమ్ అప్నుయాత్॥**

ఏకాన్తముగా వసిస్తూ కాలము గడపాలి. ఏకాన్తము అనగా? "ఇదంతా పరమాత్మ స్వరూపమే'' అను ఎరుక - అనుభూతులే ఏకాంతము. **ద్వైతమును వర్జించి ఉండటమే ఏకాంతము.** ఏకము, అఖండము అగు ఆత్మను సర్వే సర్వత్రా దర్శించటమే ఏకాంతము.
**ఇట్టి ఆచరణ గల ధీమంతుడు ఇక్కడే ముక్తిని పొందుచున్నాడు.**

---

**13.** **శ్రీమత్ పరమ ధామ్నే**
**స్వస్తి చిరాయుష**
**'ఓం' నమ ఇతి॥**

శ్రీమత్ పరమధామ్నము (అఖండ అద్వితీయ ఆత్మత్వము) సంతరించుకొని స్వస్తిని, మరణము లేని చిరాయువును పొందటము - అను స్థితిని పొందెదను గాక! 'న'కారము - 'మ'కారము నందు (పర-ఇహములందు) 'స్వస్తి' పొందును గాక! ఇదంతా 'నమ' - పరమాత్మ - జీవాత్మల ఏకరూపమే!

---

**14.** **విరించి నారాయణ శంకరాత్మకం,**
**నృసింహ! దేవేశ! తవ ప్రసాదతః,**
**"అచిన్త్యమ్। అవ్యక్తమ్।**
**అనన్తమ్। అవ్యయమ్।**
**దేవాత్మకమ్ బ్రహ్మ నిజమ్" - విజానతే।**

హే లక్ష్మీ నృసింహ స్వామీ! దేవదేవేశా! విరించి-నారాయణ-శంకరాత్మకా! మీరు బోధించిన ఆత్మతత్త్వ పాఠ్యాంశములను విని నేను..., అచిన్త్యము, అవ్యక్తము, అనన్తము, అవ్యయము, సర్వ దేవాత్మకము అగు పరబ్రహ్మము యొక్క **నిజ స్వరూపమును, అద్దానితో నాయొక్క అనన్య స్వరూపమును** తెలుసుకొనుచున్నానయ్యా!

---

**15.** **తద్విష్ణోః పరమం పదగ్ం**
**సదా పశ్యన్తి సూరయః**
**దివీవ చక్షుః ఆతతమ్।**
**తత్ విప్రా సో విపన్యవో**
**జాగృవాం సః సమిన్ధతే,**
**విష్ణోః యత్ పరమమ్ పదమ్॥**

**ఇతి ఏవం నిర్వాణానుశాసనమ్॥**
**వేదాను శాసనమ్॥**

**ఇతి స్కందోపనిషత్ సమాప్తమ్**
**ఓం శాంతిః। శాంతిః। శాంతిః।**

దృశ్యపరిమితత్వముపై విజయమును సిద్ధించుకొన్న సూరులు తత్ విష్ణు పరమపదమునే ఎల్లప్పుడు సర్వత్రా దర్శించుచున్నారు. (అంతేగాని, అది ఏదో లోకమునకు వెళ్ళి ఎప్పటికో పొందవలసినదిగా విష్ణు పరమపదము గురించి తలచరు). కంటి నుండి బయల్వెడలిన చూపు ఆకాశమంతా ఆక్రమించుచున్నట్లు, విష్ణుతత్త్వము సర్వత్రా నిండి ఉన్నది.
దివ్యమైన చక్షువులను పొంది సర్వమును విష్ణుతత్త్వముగా దర్శిస్తూ, విప్రులు (వేదహృదయము ఎరిగినవారు) అజ్ఞాన పరిధులను దాటి ఉంటున్నారు. ఎల్లప్పుడు జ్ఞాన నేత్రములను తెరచుకొనియున్న వారై పరమపదమగు విష్ణుతత్త్వమును ఇప్పుడే ఇక్కడే సర్వత్రా సర్వదా సందర్శించుచూ పరమానంద భరితులై ఉంటున్నారు. అట్టి మహనీయులే మాకు అనుసరణీయులు.
**ఇదియే నిర్వాణానురూప అనుశాసనము.**
**వేదానుశాసనము. వేదముల అంతిమ సిద్ధాంతరూప ప్రవచనము.**

**ఇతి స్కందోపనిషత్ సమాప్తమ్**

**ఓం శాంతిః। శాంతిః। శాంతిః।**

**కృష్ణ యజుర్వేదాంతర్గత**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 30 స్కందోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**శ్లో॥ యత్ర అసంభిన్నతాం యాతి స్వ-అతిరిక్త భిదా తతిః**
**సంవిత్ (సత్‌విత్) మాత్రం పరబ్రహ్మ తత్ 'స్వమాత్రం' విజృంభతే॥**

ఎక్కడైతే భిన్నమగు (నాకు వేరైన) అసత్తు, స్వస్వరూపమునకు అతిరిక్తమై (వేరై) కనిపిస్తోందో, అదంతా కూడా **'స్వస్వరూపమే'**. (అనగా) సత్ - విత్ (ఉనికి - ఎరుక) రూపమగు పరబ్రహ్మమే - ఆయా రూపములుగా (జలమే తరంగముల రూపంగాను, బంగారమే ఆభరణములుగాను విజృంభించుతీరుగా) **విజృంభించుచున్నది. స్వస్వరూపమునకు వేరుగా ఏదీ లేదు.** ఎక్కడా లేదు. ఎప్పుడూ లేదు. అట్టి పరబ్రహ్మమునకు, సర్వాంతర్యామికి, సర్వతత్త్వ స్వరూపునికి నమస్కారము.

---

లోకపితలగు పార్వతీ - పరమేశ్వరుల ప్రియతనయుడు, స్కాందపురాణ ప్రసిద్ధుడు- కుమారస్వామి, కార్తికేయుడు, మహాసేనుడు, షడాననుడు, షణ్ముఖుడు ఇత్యాది) బహునామాలంకృతుడు శ్రీ స్కందభగవానుడు.

ఒక సందర్భములో శివభగవానుడు వివరించి చెప్పుచున్న **'ఈ జీవుడే బ్రహ్మము'** అను మహార్థపూర్వకమగు జీవబ్రహ్మైక్య పరిభాషణమును శ్రద్ధగా అందరూ విన్నారు. అక్కడివారందరూ మహదానందము పొందుచుండగా, స్కందుడు మాత్రం - **'జీవుడనగు నేను పరమాత్మను అవుతానా? ఎట్లా? అనేక జీవసంబంధిత సంస్కారాలు తొలగినప్పుడు కదా, పరబ్రహ్మ స్వరూపుడనయ్యేది!'** అని తలుస్తూ **ఆత్మతత్త్వ శ్రవణానందము**ను పొందవలసినంతగా పొందటములేదు. స్కందుని డోలాయమాన చిత్తమునందు **'జీవశ్శివః'** భావము సరిపడునంతగా అంకురించక పోవటమును ముఖకవళికలనుబట్టి సర్వాత్మకుడగు సాంబశివులవారు గమనించారు. స్కందుని దగ్గరకు పిలిచారు.

**పరమశివుడు :** బిడ్డా! స్కందా! యోగముచే **కర్మల అతీతత్వము,** జ్ఞానముచే **ఛిన్న సంశయము** ఉద్దేశ్యమైయున్నది. **'ఈ జీవుడు స్వయముగా శివస్వరూపుడేనా?'** అని విషయములో నీవు ఇంకనూ సందేహనివృత్తుడువు కావలసి ఉన్నట్లుగా నాకు అనిపిస్తోంది. అందుచేత నీవు తపస్సుకు ఉపక్రమించు. నీ ఇష్ట దైవము, సర్వాంతర్యామి అగు శ్రీ లక్ష్మీ నృశింహస్వామిని ఉపాసించు. ఆ శ్రీమన్నారాయణుని కరుణచే సందేహ నివృత్తుడవు కాగలవు. ఆయన సర్వజ్ఞుడు. నిన్ను సంసార భ్రమలనుండి తమ బోధచే సముద్ధరించగలరు.

స్కందుడు ఆ మాటలు విన్నారు. వెంటనే లేచి నిలుచున్నారు. మాతాపితలగు పార్వతీపరమేశ్వరుల పాదపద్మములకు సాష్టాంగదండ ప్రణామములు సమర్పించారు. వారి అనుజ్ఞను పొందినవారై ఒక ఏకాంత ప్రదేశములో ఆసీనులై, **శ్రీమన్నారాయణుని అవతారమగు శ్రీ నృశింహస్వామిని భక్తి - జ్ఞాన - వైరాగ్య - ప్రపత్తులతో ఉపాసించసాగారు.**

కొంతకాలం గడచింది. ఒకానొక రోజు దివ్యతేజో విలాసుడు, ఆర్త త్రాణపరాయణుడు, **చిద్విలాస లీలావేషధారుడు** – అగు శ్రీ నృశింహ స్వామి ప్రత్యక్షమైనారు. వేదనారాయణుడగు ఆ స్వామి యొక్క దర్శనముచే పులకాంకితుడై, స్తోత్రములు సమర్పించి, స్కందుడు బ్రహ్మతత్త్వజ్ఞానము బోధించమని అర్థించారు. అట్టి అభ్యర్థనను విని శ్రీ లక్ష్మీ నృసింహస్వామి ఆనందభరితులు అయ్యారు.

❖

అప్పుడు స్వామి పూసగ్రుచ్చినట్లు

- పరబ్రహ్మమునుండి లీలా వినోదచమత్కారంగా బయల్వెడలుచున్న స్వకీయ ప్రకృతి చమత్కారము।
- ద్రష్ట – దృశ్యముల ఆవిర్భావము. ఆత్మతో వాటియొక్క అనన్యత్వము।
- దేహ – దేహాంతరముల చమత్కారము। ఆత్మయొక్క కేవలీ–అప్రమేయత్వము।
- జీవబ్రహ్మైక్య తత్త్వము। ఆత్మయొక్క అఖండ జ్యోతి స్వరూపము।

ఇవన్నీ సవివరంగా తేటతెల్లపరచారు. స్కందుడు ఇష్టదైవమగు నృశింహస్వామి చెప్పినదంతా విన్నారు. **పరమానందము పొందారు. పరబ్రహ్మముయొక్క అనన్య తత్త్వముతో మమేకత్వము సిద్ధించుకున్నారు.** శ్రీ లక్ష్మీనృశింహస్వామి ఇంకా ఇట్లా అనసాగారు.

❖

**శ్రీ నృశింహస్వామి :** ప్రియభక్తా! స్కందా! నీవు అడుగుచుండగా నేను బోధించిన వేదసారమగు **'తత్త్వమ్'** జ్ఞానవిశేషములన్నీ శ్రద్ధగా విన్నావు కదా! ఇప్పుడు నీవు శివతత్త్వము గురించి, విష్ణుతత్త్వము గురించి ఏవిధంగా సమన్వయించుకుని హృదయాంతర్గతము చేసుకున్నావో...అది వివరించి చెప్పు. వింటాను.

❖

**శ్రీ స్కందుడు :** హే మహాదేవా! నృశింహభగవన్! ఏ **సర్వాత్మకమగు పరబ్రహ్మతత్త్వమును 'ఓం' అను 'ఏకము – అక్షరము'** అగు శబ్దముతో **వేద – వేదాంగములు గానము చేయుచున్నాయో,** అట్టి కేవలీ స్వరూపమునందు మమేకమై ఉంటున్నాను. ఇదంతా మీ కృపా కటాక్షము చేతనే తెలుసుకున్నాను. సద్గురువరేణ్యులై నన్ను మీరు మీ బోధామృతముచే సంస్కరించుచుండగా, నాయందే నేను, నన్ను గురించిన **నిర్వివాద–పరాకాష్ఠ సత్యము**ను గమనించి, ఆస్వాదిస్తున్నాను.

నన్ను నేను స్వయం సత్ స్వరూపుడుగాను, **కేవల విజ్ఞాన ఘనుడనుగాను, ఘనీభూతమైన 'ఎరుక'చే కేవలచిత్ స్వరూపుడుగాను, శివస్వరూపుడనుగాను** గమనించుచున్నాను. ఇంతకుమించి కావలసినదేమున్నది?

ఇంతకు పూర్వము – **నిజము కానిదంతా కూడా – నిజమువలె భాసించటం జరుగుతూ వచ్చినది. న నిజమ్, నిజవత్ భాతి!** అందుకు కారణమేమిటి? **అంతఃకరణ జృంభణాత్।** నాయొక్క అంతకరణ విభాగములగు మనోబుద్ధి చిత్త అహంకారములయొక్క దృశ్య సంబంధమైన విజృంభణయే! అట్టి అంతఃకరణము జయించబడగా, సంవిత్ స్వరూపుడగు **'హరి'**గా శేషించుచున్నాను. అనగా, మనోబుద్ధి చిత్త అహంకారూప అంతఃకరణమును వదలివేసినప్పుడు (లేక) దాటివేసినప్పుడు సంవితమాత్రుడనై శేషించుచున్నాను.

**సంవిత్** = కేవలమగు సత్ + కేవలమగు విత్ = ఉనికి + ఎరుక వెంటనంటియున్న కేవలాత్మ స్వరూపుడను.

నా స్వస్వరూపమును గురించిన – కేవలమైన సత్ (ఉనికి) మరియు కేవలమగు ఎరుకల గమనికచే అప్పుడు ఇక నేను కూడా హరివలె, అజుడు (బ్రహ్మదేవుని) వలె–జనన మరణ రహితుడను! ఆత్మగా కర్మలకు కర్మఫలములకు అసంబంధితుడను. ఆత్మకు వేరై మరింకేముంటుంది? **కిమ్ అతః పరమ్**?

**వ్యతిరిక్తం జడం సర్వం స్వప్నవత్ చ వినశ్యతి!** రాత్రి కలలో కనిపించని స్వప్న సంఘటనలు, సందర్భములు, సంగతులు, సంబంధములు, అనుబంధములు మొదలైనవన్నీ తెల్లవారి మెలకువరాగానే ఏమౌతున్నాయి? క్షణంలో మటుమాయమై **'మొదలే లేనివి'** అగుచున్నాయి కదా! **"అవన్నీ ఎక్కడ జరిగినాయి? ఎప్పుడు జరిగినాయి? ఎందుకు జరిగినాయి?"** మొదలైన ప్రశ్నలకు సమాధానమేముంటుంది? వస్తుతః లేనిదానికి ఉనికి ఎక్కడిది? అట్లాగే **ఆత్మ చైతన్యమునకు అన్యమై (వేరై) కనబడుచున్నదంతా స్వయముగా చూస్తే జడము (స్వతఃగా లేనిది) మాత్రమే!** ఈ దృశ్యము స్వతఃగా ఉన్నది కాదు. ఆత్మయొక్క భావనచే, కించిత్ ఏమరపు జోడగుచుండగా – తనకు తానే ఉన్నట్లు అగుపించునట్టిది.

చిత్ (ఎరుగుచున్నది) – జడము (ఎరుగబడుచున్నవి) – ఈ రెండూ కూడా 'ఏ ద్రష్ట'చే ఎరుగబడుచున్నాయో, అట్టి కేవల జ్ఞానవిగ్రహుడు ఆత్మ నుంచి చ్యుతిపొందువాడే కాదు. **అచ్యుతుడు. అట్టి సర్వజీవులలోని కేవల ద్రష్టయే మహాదేవుడగు శంకరుడు. ఆయనయే హరి. ఆయనయే బ్రహ్మ. ఆయనయే జ్యోతులన్నిటికీ జ్యోతిస్వరూపుడు.** వెలిగించబడువాటన్నిటికీ జ్యోతిస్వరూపుడు. ఎరుగబడుచున్న అంతటికీ ఆధారమై ఉన్నవాడు.

ఆయనయే నాటకములోని, నటుని యొక్క సహజ స్వస్వరూపము వలే **పరమేశ్వరుడు.** (పరమ్ = ఆవల, ఈశ్వరుడు = సర్వత్రా విస్తరించి ఉన్నవాడు).

ఆయనయే ఈవలకు అంతటికీ ఆధారమైయున్న ఆవలగల **పరంబ్రహ్మము. పరంధాముడు. పరమాత్ముడు. పరమేశ్వరుడు. పరానంద శాశ్వత స్వరూపుడు.**

గురుదేవా! నృశింహభగవాన్!

**తద్బ్రహ్మాహమ్। న సంశయః।** అట్టి పరబ్రహ్మమే నేనై ఉన్నాను. ఇందులో కించిత్ కూడా సందేహము లేదు.

**జీవశ్శివః శివోజీవః స జీవః కేవల శ్శివః।** తరంగము జలమే కదా! ఆభరణము బంగారమే కదా! పాత్రగా కనిపించేది పాత్రధారుడే కదా! మట్టి బొమ్మగా కనిపించేది మట్టియే కదా! శిల్పము శిలయే అయిఉన్నది కదా! సర్పరజ్జు భ్రాంతిలో కనిపించేదంతా రజ్జువుయే కదా! (పాములాగా కనిపిస్తున్నది త్రాడుయే కదా!).

అదే తీరుగా....,

- **ఈ జీవుడు** (Individual self) **గా కనిపిస్తున్నది. సర్వాంతర్యామి, సర్వతత్త్వ స్వరూపుడు, సర్వాంతర్గతుడు. సర్వసంప్రదర్శనుడు, సరతత్త్వ విదూరుడు, అగు 'శివుడే'** (That 'self' of the universe) **అయి ఉన్నాడు.**
- **శివుడే జీవుడుగా కనిపిస్తున్నారు.**

## వడ్లగింజలో బియ్యపుగింజ

**తుషేణ బద్ధో వీహ్రిః స్యాత్। తుషా అభావే తు తణ్డులః।** 'ధాన్యము వేరు. బియ్యము వేరు'గా కనిపిస్తూ ఉండవచ్చుగాక! ఊక (పొట్టుపొర)చే కప్పి ఉన్నప్పుడు 'ధాన్యపుగింజ' అని అంటాము. ఊక (పొర)ను తొలగిస్తే 'బియ్యపు గింజ' అని పిలుస్తాము కదా!

అదే విధంగా, **ఏవం బద్ధః తథా జీవః। 'జన్మ – కర్మ – సంబంధం – అనుబంధ...ఇత్యాదులచే నేను బద్ధుడను కదా!'** అని తలచుచున్నప్పుడు అట్టి వానిని 'జీవుడు' అని పిలుస్తున్నాము.

ఎవ్వడైనా 'అయ్యా! **నేను జన్మలకంటే, మునుముందే విడిగా ఉన్నాను. ఎప్పటికీ 'వేరే' అయి ఉన్నాను. నేను ఉంటేనే జన్మలు. నేను ఉంటేనే కర్మలు. అనగా నేను జన్మలకు కర్మలకు ఆధారుడునై సర్వదా ఉన్నాను. అందుచేత కర్మలచే నేను బద్ధుడను ఎట్లా అవుతాను. కాను'** అని తలచినప్పుడో? ఆ విధంగా నిర్ద్వంద్వంగా ఎరిగి ఉన్నప్పుడో? కర్మ నాశే సదాశివః। ఎవరి దృష్టిలో కర్మలు, కర్మబంధములు మొదటే సందర్భ కల్పన మాత్రములై, స్వతఃగా **'లేనివి'**గా అగుచున్నాయో, అప్పుడు ఆతడే **'సదా శివుడు'. ఆతడు శివస్వరూపుడే!**

## పాశ బద్ధః సదా జీవః

ఎవ్వడు తనను గురించి తాను – **"జన్మ – కర్మ – పునర్జన్మ – సంబంధ – అనుబంధ – బాంధవ్య – జాగ్రత్ వ్యావహారిక' – ఇత్యాది 'విషయములు'** అనే **త్రాళ్లచే బద్ధుడను. పరిమితుడను. సత్వ – రజో – తమోగుణములు, ఈ జగత్ దృశ్యము మొదలైనవాటిచే నిబద్ధుడను"** – అని అనుకుంటూ ఉన్నాడో....ఆతడు సదా జీవుడే!

ఏ జీవుడైతే,..

## పాశముక్తః సదా శివః

- **స్వకీయ కల్పన:** జన్మలు, కర్మలు ఇవన్నీ కూడా ఆత్మస్వరూపుడనగు **నా సమక్షములో నా చేతనే** నాయొక్క **క్రీడావినోదంగా,** నాయొక్క **కల్పనా / ఊహా / భావనా విభాగంలో** కనిపిస్తున్న **స్వయం కల్పిత విశేషములు.**
- **స్వప్న దృష్టాంతము:** స్వప్నము తనదైనవాడు స్వప్నములోని విశేషములచే సంబంధితుడై కొనసాగుచున్నాడా? లేదు. స్వప్నము తనదైన వానిని – ఆ స్వప్నములోని కొన్ని సంఘటనలు బయటకువచ్చి బంధిస్తాయా? లేనే లేదు.

- **బంగారము – ఆభరణము దృష్టాంతము :** 'ఆభరణము' అనునది బంగారమును బంధిస్తోందా? అది జరుగుటయే లేదు! "గొలుసుయొక్క గుండ్రటి ఆకారము బంగారమును తనలో బంధిస్తోంది" – అని అంటామా? అనము.
- **నటుడు – పాత్ర దృష్టాంతము :** ఒకడు ఒక నాటకంలో ఒక పాత్రగా నటిస్తున్నంత మాత్రం చేత 'ఆ పాత్ర ఆతనిని బంధిస్తోంది?' అని ఎవ్వరైనా అంటారా? అనరు!
- **జలము – తరంగము దృష్టాంతము :** ఒక తరంగము జలమును బంధిస్తోంది అని చెప్పుతామా? చెప్పము!
- **సూర్యుడు కిరణము దృష్టాంతము :** సూర్యకిరణాలు ఒక గోపురముపై ప్రసరిస్తూ ఉన్నప్పుడు ఆ గోపురము సూర్యుడిని బంధిస్తోంది – అని ప్రకటిస్తామా? ప్రకటించము.
- **సూర్యుడు – ప్రతిబింబము దృష్టాంతము** : సూర్యుడు ఒక తటాకములో ప్రతిబింబిస్తున్నప్పుడు, ఆ సూర్యప్రతిబింబము తటాక జలతరంగములు కారణంగా కదులుచున్నది కాబట్టి **'సూర్యుడు నీటిలో కదలుచున్నాడు'** అను వాక్యము **సత్యమా? లేదు. అది సత్య దూరమైన మాట.**

అట్లాగే ఏ జీవుడైతే **"జీవుడుగా కనిపిస్తున్నంత మాత్రము చేత నాకు గాని, మరొక జీవునికిగాని – (ఆత్మస్వరూపము దృష్ట్యా) – బంధము మొదలేలేదు. అఖండాత్మయే నేను, నీవు, త్రిమూర్తులు, త్రిలోకజీవులు కూడా!"** అను అసంశయ దృష్టితో ప్రశాంతశీలుడై చూస్తూ ఉంటాడో **పాశముక్తః సదా శివః।** అట్టి పాశముక్తుడు ఎల్లప్పుడూ శివుడే! ఎవరి దృష్టిలో తనకు, తదితరులకు కూడా **'బంధము ఎప్పుడూ లేదు'** అను ఎరుకచే సునిశ్చితుడు (సునిశ్చయుడు) అయి ఉంటాడో, ఆతడు 'జీవుడు' అనిపించుకోడు. మరి?

## "సదాశివుడే!"

**శ్రీ నృశింహస్వామి :** ప్రియ స్కందా! షణ్ముఖా! మురుగా! గౌరీపుత్రా! పావన చరితా! నేను బోధించిన ఆత్మతత్త్వ విశేషములపట్ల నీయొక్క **'అవగాహన'** నాకు పరమానందమును కలుగజేస్తోందయ్యా! నీవు చెప్పినదంతా నీపట్ల, ప్రతిఒక్క జీవుని పట్ల **అక్షరసత్యము. వేదోపనిషత్ ప్రవచనసారము. ఉన్న నిజము.** బాగు. బాగు. అయితే నేను మరొక ప్రశ్న వేస్తున్నాను. నీ సమాధానమేమిటో వివరించు.

నీ పితృదేవులు, సర్వశుభంకరులు, లోకకళ్యాణమూర్తియగు శివభగవానుని సూచనను అనుసరించి నా కొరకై భక్తి– తపస్సులను సమర్పించి, నావద్ద బ్రహ్మతత్త్వము గురించి శ్రవణం చేస్తూ వస్తున్నావు కదా! ఇక, **పరమసత్యము** గురించి **ఉన్నది ఉన్నట్లుగా చెప్పు.**

> **శివతత్త్వము ఎట్టిది? విష్ణుతత్త్వము ఏమై ఉన్నది?** ఈ రెండింటిలో ఏఏ సమాన –అసమాన–ప్రత్యేక విశేషాలు నీకు కనిపిస్తున్నాయి? వాటి వాటి సారూప్య, సాపేక్షతలు ఎటువంటివి? సమన్వయించియో, విభేదించియో చెప్పయ్యా! వింటాను.

**శ్రీ స్కందుడు :** హే భగవాన్! శ్రీ నృశింహదేవాదిదేవా! మీరు ప్రవచించిన ఆత్మబోధ వినటంచేత పునీతుడనైన నేను, మీరు నన్ను పరీక్షిస్తున్న విధంగా **విష్ణు–శివ తత్త్వ సాపేక్షత–సారూప్యత"** ల గురించి నాకు అనిపిస్తూ ఉన్నది. చెప్పుచున్నాను. దయతో వినండి.

**శివాయ విష్ణురూపాయ :** శివుడు కేవలాత్మ అయితే, విష్ణువు ఆ శివుని ప్రత్యక్షరూపము.

**శివరూపాయ విష్ణవే :** విష్ణువే శివ స్వరూపుడై వెలయుచున్నారు. విష్ణువు కేవలాత్ముడైతే, ఆతని ప్రత్యక్ష రూపము – శివుడు.

**శివస్య హృదయం విష్ణుః :** శివునియొక్క హృదయము (కేవలీ స్వరూపము ప్రదర్శనమగు స్థానము) విష్ణువే!

**విష్ణుశ్చ హృదయం శివః :** విష్ణువు యొక్క హృదయము శివతత్త్వమే!

**యథా శివమయో విష్ణుః :** ఏ విధంగా అయితే విష్ణువు శివమయమై ఉన్నారో, విష్ణువుచే పరిపోషించబడు ఈ విశ్వము శివమయమై ఉన్నదో…,

**ఏవం విష్ణుమయం శివః :** ఆ రీతిగానే శివుడు విష్ణుమయమైయున్నారు. ఈ విశ్వము విష్ణుమయమై యున్నది.

**శివస్వరూపమంతా విష్ణువే! విష్ణు స్వరూపమంతా శివుడే!**

శివ – కేశవులు అభేద, అఖండ, అప్రమేయ, అనునిత్య ఆత్మానంద స్వరూపులే! ఆ ఇరువురికి కించిత్ కూడా భేదము లేదు. శివ – కేశవులకు ఎంతవరకు అభేదముగా నాకు సందర్శనమగుచున్నదో, అంతవరకు ఆ తీరుగా నా ఈ ఆయుష్షు పవిత్రమై, పరమస్వస్తిని, పరమానందమును పొందుచున్నాను. **యథా అన్తరం న పశ్యామి, తథా మే స్వస్తిః ఆయుషి।** భేదమును దర్శిస్తున్నంతసేపు ఆయుష్షు, సాధనలు వృధాయే.

హే గురువరేణ్యా! ప్రహ్లాదవరదా! శ్రీ లక్ష్మీనృశింహస్వామీ! సద్గురువై ఈ మీ శిష్య పరమాణువును అడిగిన శివ – విష్ణు తత్త్వ సాపేక్షలగురించి నా సమగ్రము, సంక్షిప్తము అగు సమాధానము వినండి.

– శివ – కేశవులకు భేదమే లేదు.

– భేద దర్శనము అస్వస్తత.

– అభేదదర్శనము స్వస్తి. ఆయుష్షు పవిత్రము. ఆత్మతత్త్వజ్ఞానమునకు, ఆత్మ దర్శనమునకు, ఆత్మానుభవమునకు అడ్డంకులు లేనట్లు.

**శ్రీ నృశింహస్వామి :** బిడ్డా! కార్తికేయా! నీవు పరమసత్యమును సుస్పష్టీకరించి నాకు ఇంకా అధికంగా ప్రియశిష్యుడవగుచున్నావు. నీవు చెప్పినది నిజము. సత్యము. పరమ ప్రస్ఫుటము.

ఇప్పుడు ఇంకొక ప్రశ్న.

**ఈ దేహధారియగు జీవునికి – ప్రకృతిలో కనిపిస్తున్న ఆతని భౌతిక దేహమునకు గల పరస్పర సంబంధము ఎట్టిది? ఈ జీవుడు ఎవరిని పూజించటముచేత అది పరాకాష్ఠ అయిన పూజ అగుచున్నది? నీవు నా బోధచే గ్రహించినది ప్రస్ఫుటిస్తూ వివరించు.**

**శ్రీ స్కందుడు :** మహాత్మా! విష్ణు భగవాన్! కరుణామయుడగు లక్ష్మీ నృశింహమూర్తీ! విశ్వముగా మూర్తీభవించిన విశ్వాంతర్యామీ! విశ్వకరా విశ్వదూరా! విశ్వాత్మకా! విశ్వ స్వరూపా! అవిశ్వుడా! శాశ్వతుడా! అజుడా!

మీరు ఆజ్ఞాపించినట్లుగా (1) జీవుడు, (2) భౌతిక దేహము, (3) దేవునియొక్క అత్యావశ్యక ఉపాసనల గురించి సమాధానముగా వినమ్రుడనై చెప్పుకొనుచున్నాను. వినండి.

**దేహో 'దేవాలయః' ప్రోక్తో :** ఈ దేహమే 'దేవాలయము' అని వేద–ఉపనిషత్తుల హృదయము. (ఆగమ శాస్త్రము దేవాలయమును దేహ నిర్మాణమును అనుసరించియే నిర్మాణ విధానమును సశాస్త్రీకరించున్నది).

**జీవో దేవః సదాశివః :** ఈ దేహములో వేంచేసియున్న జీవుడు ఎవ్వరు? సదాశివుడే! **"ఒకడు జ్ఞానియా, అజ్ఞానియా?"** – అనే ప్రశ్న, ఆ ప్రశ్నకు సమాధానము కూడా బుద్ధి పరిమితమైన విశేషమే. ప్రతి దేహములోను – **"బుద్ధికి ఆవల వేంచేసి ఉండి (సత్) బుద్ధిని, తదితరమైన చిత్త – అహంకార – దృశ్య మాన జగత్తులను ప్రకాశింపజేయుచున్న ఈ జీవుడు సహజంగా ఎవ్వరు?"** – అని గమనిస్తే **సదాశివుడే! సర్వకాల – సర్వావస్థలయందు ఈ జీవుడు శివస్వరూపుడే!**

అయితే ఈ జీవుడు దేహములో ఉపకరణములుగా ఉన్నట్టి ఇంద్రియములకు సంబంధితమైన విషయములలో చిక్కుకొని **తనయొక్క సదాశివత్వమును ఏమరచినవాడై తిరుగాడుచున్నాడు.**

అందుచేత ఈ జీవుడు తనయొక్క సహజమగు (ఆత్మలో) అనన్యత్వమును తిరిగి స్వానుభవముగా చేసుకోవటానికై....

**త్యజేత్ అజ్ఞాన నిర్మాల్యం :** ఏ విధంగా అర్చకాచార్యులవారు దేవాలయంలోని గర్భగుడిలో నిర్మాల్యమును తొలగించి మూలవిగ్రహము సాలంకృతం చేస్తారో, ఆ విధంగా జీవులమగు మేము తత్త్వజ్ఞులగు సద్గురువుల బోధచే 'అజ్ఞానము' అనే నిర్మాల్యమును మా హృదయ – గర్భగుడి నుండి తొలగించి వేసి పరిశుభ్రపరచుకొనెదము గాక! సర్వాత్మకుడగు శివుని సర్వదా సర్వత్రా అవిరోధంగా, అవిరామంగా, అనుక్షణికంగా దర్శించటమే – అజ్ఞాన నైర్మాల్య విసర్జనము.

**సోఽహమ్ భావేన పూజయేత్ :** ఈ జీవుడు తన హృదయాకాశమున సర్వదా వేంచేసియున్న సర్వాత్మకుడగు, జగత్ ప్రదర్శనా వినోదియగు పరమాత్మను మనసా, వాచా, కర్మణా.... "సోఽహమ్" భావనతో ఆరాధించాలి (లేక) పూజించాలి. **"నాయొక్క పరస్వరూపమే సహజ సత్యము. ఇక ఇహముగా కనిపించేది మనో కల్పితము. "నీవు" మొదలైనవి కూడా అట్టిదే" – అనునదే సోఽహమ్ భావ పుష్పము.**

⌘ 'స్వామీ! నేనుగా ఉన్నది నీవేనయ్యా!
⌘ 'నాది' అని అనిపించేదంతా నీదే!
⌘ 'నీకు వేరుగా నేనున్నాను' అనే అహంకార మాలిన్యమును తొలగించివేస్తున్నాను.
⌘ పీలికాది బ్రహ్మపర్యంతము 'నేను, నేను - నాది నాది'గా ఉన్నదంతా నీవే!
⌘ నీవే, నేను! నేనే నీవు!
⌘ నీవే ఈ సర్వజీవులుగా ఉన్నావు.

***నేనే నీవు, నీవే నేను కాబట్టి నేనే ఈ సర్వ జీవులలో, సర్వజీవులుగా, సర్వజగత్తులో, సర్వజగత్తుగా ఉన్నాను కూడా।***

అను **'సోఽహమ్'** భావము అనే పుష్పమాలతో **స్వస్వరూపాత్మ భగవానుని అలంకరించాలి.**

నేను ఎవ్వరివ్వరితో మాట్లాడుచున్నానో, చూస్తున్నానో, ఎవ్వరెవ్వరి గురించి వినుచున్నానో, నాకు తెలిసినవారంతా, తెలియనివారంతా **'సదాశివస్వరూపులే!'** అను **భావనా పుష్పములతో** స్వస్వరూపుడగు అఖండాత్మ భగవానుని **ప్రేమ, ఆత్మ - భావనావేశములను జోడించి నిత్యము పూజించాలి.**

**శ్రీలక్ష్మీ నృశింహ స్వామి :** వత్సా! స్కందా! నీ సమాధానము అమోఘము. నాకు బ్రహ్మానందము కలుగుజేస్తోందయ్యా! నిన్ను మెచ్చుకొంటున్నాను.

ఇప్పుడింకా చెప్పు.

**'జ్ఞానము', 'ధ్యానము', 'స్నానము', 'పానీయస్వీకారము' 'రక్షణ', 'ఏకాంతవాసము' 'ముక్తి'.** - ఈ ఈ విషయాల గురించి నీ అవగాహనను వివరించు.

**స్కందుడు :**

**జ్ఞానం :** లౌకికమైన జ్ఞానముగాని, శాస్త్రజ్ఞానముగాని నిజమైన జ్ఞానము కాదు. మరి? **అభేద దర్శనం జ్ఞానం.**

**("సమం సర్వేషుభూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్" రూపమగు) జ్ఞానదృష్టియే - అభేద దర్శనము).**

**'ఏకము, అక్షరము అగు పరమాత్మయే ఇన్ని రూపాలలో, ఇన్ని రూపాలుగా కూడా ఉన్నారు'** అని అనిపించేవరకు అనుకుంటూ ఉండటమే జ్ఞానము.

- **అనుకోవటం** = "మననము, సాధన".
- **అనిపించటం** = "నిదిధ్యాస, సిద్ధి".
- **అదియే నేనై ఉండటము** = "సమాధి".

**ధ్యానము :** మనస్సును ఇంద్రియ విషయములనుండి వెనుకకు మరల్చి 'మౌనము' అవధరింపజేయటమే ధ్యానము. **ధ్యానం నిర్విషయం మనః।** క్రమంగా అనేక విషయ పరంపరలలో పాల్గొనుచున్న మనస్సును నిశ్చల మనస్సుతో (ఉన్మనితో) సర్వ సందర్భములలో చేతిలో ధరించిన ఉపకరణమువలె - ధారణ చేసి ఉంచటము - ధ్యానము యొక్క లక్ష్యశుద్ధి లక్షణము. **విషయములలో ఉంటూ కూడా నిర్విషయుడనై ఉండటమే 'ధ్యానము'.**

**స్నానము :** ఈ మనస్సు అభ్యాసవశం చేత విషయములలో మునిగి తేలటము, ఇష్ట - అయిష్టములతో కూడి ఉండటము జరుగుతోంది. ఫలితంగా అనేక దృశ్య విషయాకర్షణలకు, సుఖ దుఃఖపరంపరలకు 'లోను' అయి ఉండటం జరుగుతోంది. బుద్ధి - అరిషట్ వర్గములకు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములకు - వాటి వాటి వర్గములతోసహా, క్రమ్ముకొనబడినదై ఉంటోంది. **'స్నానం' మనోమల త్యాగః :** అట్టి మనో దోషములను మనస్సు నుండి తొలగించుకొనటమే **'స్నానము'.** అంతేగాని జలస్నానము నిజమైన (ఆధ్యాత్మికమైన) స్నానము కాదు.

**శౌచము :** ఇంద్రియముల ప్రవర్తనా విశేషములకు తాను 'దాసుడు' అగుటచే, అది అనేక **అజ్ఞానభూమికలకు, అంధకార బంధురస్థానములకు,** (విజ్ఞానము యొక్క అధ్యయనమునకు అవకాశములు స్వల్పమైయున్న) **అల్ప ఉపాధులకు** త్రోవచేయుచు, నడిపించుచున్నాయి. ఇప్పుడు జీవులమగు మేము 'ఇంద్రియములు' అను **గోవులను పాలించు గోపాలురము కావాలి.** అంతేగాని,

ఇంద్రియములకు, ఇంద్రియ విషయములకు సేవకులుగా ఉండిపోరాదు. ఇంద్రియములను నిగ్రహించి వశం చేసుకోవాలి. వాటిని ప్రత్యాహారమార్గముగా కర్మయోగ – భక్తి యోగ – జ్ఞాన యోగ – క్రియా యోగ మార్గములలో నియమించాలి. ఆ విధంగా ఇంద్రియములను నియమించటమే **'శౌచము'. శౌచమ్ ఇంద్రియ నిగ్రహః।**

**భైక్షమాచరేత్ దేహరక్షణే :** భిక్షకులమై ఈ దేహ సంరక్షణార్థం ఆహారము పొందాలి. తినటానికి బ్రతకకూడదు. బ్రతకటానికి మాత్రమే తినాలి. **ఆహారము** – దేహరక్షణ కొరకు, **దేహరక్షణ** – ప్రాణములుదేహములో కలిగి ఉండటానికి (ప్రాణరక్షణ) కొరకు, **ప్రాణరక్షణ** ఆత్మజ్ఞానము కొరకు, **ఆత్మజ్ఞానము పునఃదేహ పరంపరల ప్రవాహమును నిరోధించటానికి** అయి ఉండు గాక!

**బ్రహ్మామృతం పిబేత్ :** (దేహే జాతే న జతోఽసి। దేహే నష్టే న నశ్యతి...అను సిద్ధాంతమును అనుసరించి) 'నేను దేహముతో ప్రారంభము కాను. దేహనాశనముతో ముగియను' అని గ్రహించెదము గాక! **'బ్రహ్మాహమస్మి' – 'నేను బ్రహ్మము'** అని ఎరుగుచూ, మార్పు – చేర్పుల పరిధియగు మృత్యువును అధిగమించి **'అమృతత్వము'**ను సంచరించుకొనెదము గాక! **'బ్రహ్మము'** అనే అమృతమును త్రాగి బ్రాహ్మీదృష్టిచే **'బ్రహ్మమే నేను'** అను అమృతతుల్యమగు స్థానమును పొంది ఉండెదము గాక!

## ఏకాన్తవాసము

ఎవ్వడైతే.... **'ఈ కనబడే సమస్తము శివతత్త్వమే। నేను జీవుడుగా ఈ జగత్తును శివస్వరూపంగా ఎరుగుచూ ఉపాసన చేయుచున్నాను'** అను అభేదభావనోపాసన చేస్తూ ఉంటాడో, ఆతడు **'ఏకాన్త వాసి'** అగుచున్నాడు. **సర్వ ద్వైతములను వదలివేయటమే ఏకాన్తము.** అట్టి ఏకాన్త వాసులమై మేము ఉండెదము గాక! **"శివాత్ పరతరం నాస్తి"। అను భావముయొక్క మననమే పరమాత్మతో ఏకాంత సేవ.**

**అనేకంగా ఇక్కడ కనిపిస్తూ ఉన్నప్పటికీ, 'ఏకము'గా అనిపించటమే "ఏకాంతవాసము".**

ఈ విధంగా స్నాన – ధ్యాన – శౌచ – భైక్ష – బ్రహ్మామృతపాన, ద్వైత వర్జిత ఏకాంత వాసములను – ఏ ధీమంతుడైతే (తెలివిగలవాడైతే) ఆచరణగా కలిగియుంటాడో, అట్టివాడు **'ముక్తుడు'** అగుచున్నాడు. **ఆతడు 'పరమధామ్నము'ను జేరి పరమాత్మత్వమును సంతరించుకొనుచున్నాడు.**

**అట్టి శ్రీమత్ పరమ ధామ్నమును చేరి ఆయుష్షును పరమ పవిత్రము చేసుకొని స్వస్తిని పొందిన మహనీయులకు నమస్కరించుచున్నాను.**

ఓ లక్ష్మీ నరశింహా! దేవదేవేశా! విరించి నారాయణ శంకరాత్మా! మీ యొక్క భోధామృతమును గ్రోలిన నేను 'అచిన్త్యము, అవ్యక్తము, అనన్తము, అవ్యయము, దివ్యము–అగు **నిజ బ్రాహ్మీస్వరూపము**నందు ప్రవేశితుడనై, **పరమపదమును (లేక) విష్ణు పదమును** సంతరించుకొనుచున్నానయ్యా! **కృతజ్ఞోస్మి। తవ నామస్మరణం-భవరోగ హరణమ్। తవ పాద దర్శనమ్-సర్వ పాప నాశనమ్।। నమో నమః।।**

❖

**దివీవ చక్షురాతమ్** -- కంటి రంధ్రము నుండి బయల్వెడలిన చూపుశక్తి ఆకాశమంతా నిండియున్న విధంగా, **అజ్ఞానమును జయించిన సూరులు – సర్వే సర్వత్రా సదా విష్ణుపదమునే దర్శించుచున్నారు.**

**తత్ విప్రా సో విపన్యవో, జాగృవాంసః సమింధతే, విష్ణోః యత్ 'పరమం పదమ్'।।** ఆ విష్ణువు యొక్క 'పరమ పదము' విప్రులు (ఆత్మజ్ఞానులు) సర్వదా దర్శిస్తున్నారు. ఆరాధిస్తున్నారు. సదా ఆత్మభావనయందు మేల్కొని ఉంటున్నట్టి జ్ఞానదృష్టి, జ్ఞాన నేత్రములుగల వేదజ్ఞులకు నమస్కారములు.

**వేద హృదయమును ఎరిగియున్న విప్రులు ఆ విష్ణు పదమునే సదా స్తుతిస్తున్నారు. క్రమంగా అద్దానితో మమేకమగుచున్నారు.**

❖

**ఇత్యేవం నిర్వాణానుశాసనమ్।** ఇదియే మోక్ష శాస్త్రము ప్రకటించి **నిర్వాణము యొక్క అనుశాసనము.**

**ఇత్యేవం వేదానుశాసనమ్।** ఇదియే చతుర్వేదములు అనుశాసన పూర్వకంగా ఎలుగెత్తి గానము చేయుచున్నాయి.

**ఇతి స్కందోపనిషత్**

***ఓం శాంతిః। శాంతిః। శాంతిః।***

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 31 రుద్రహృదయోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ యత్ బ్రహ్మ 'రుద్రహృదయ మహావిద్యా' ప్రకాశితమ్
తత్ 'బ్రహ్మమాత్ర-అవస్థాన' పదవీమ్ అధునా భజే॥



ఏ బ్రహ్మము అయితే 'రుద్ర హృదయ మహావిద్య'గా ప్రకాశితము అగుచున్నదో, అట్టి బ్రహ్మమాత్రము యొక్క అవస్థాన (అధిష్ఠాన) పదవిని (లేక) స్థానమును సేవించుచున్నాను. భజించుచున్నాను.

ఓం

**01.** హృదయం కుండలీ
భస్మ రుద్రాక్షగణ దర్శనమ్।
తార సారం మహావాక్యం
పంచ బ్రహ్మాగ్నిహోత్రకమ్॥

ఏకము అక్షరము అగు 'ఓం' సంజ్ఞార్థ పరబ్రహ్మమును హృదయమునందే దర్శించటము-భస్మభూషితాంగుడగు **"రుద్రాక్ష గణ దర్శనము"**.

పరమాత్మను హృదయములో దర్శించటమే ఈ జీవుడు తరించు తారసారము. అదియే **'సోఽహమ్' తత్త్వమ్ అసి, త్వమేవాఽహమ్, 'అయమాత్మా బ్రహ్మ', 'తదేవ ఇదమ్ సర్వమ్'** మహావాక్యసారం. దృశ్య - మనో - బుద్ధి - చిత్త - అహంకార **పంచాగ్నిహోత్రకము.**

---

ప్రణమ్య శిరసా పాదౌ
శుకో వ్యాసమ్ ఉవాచ హ॥

అట్టి పరబ్రహ్మతత్త్వమును మరికొంత సుస్పష్టముగా, నిర్దుష్టముగా ఎరుగుటకై శ్రీ శుకమహర్షి ఒకరోజు పితృదేవులగు భగవాన్ వ్యాసమహర్షిని సమీపించారు. వారి పాదములను శిరస్సుతో స్పృశిస్తూ ప్రణామములు సమర్పించారు. ఈ విధంగా అడుగసాగారు.

---

కో దేవః సర్వ వేదేషు?
కస్మిన్ దేవాశ్చ సర్వశః?
కస్య శుశ్రూషణాత్ నిత్యం
ప్రీతా దేవా భవంతి మే?
తస్య తత్ వచనగ్ం
శ్రుత్వా ప్రత్యువాచ
పితా శుక్రమ్।

**శుకుడు** :తండ్రీ! వేదవ్యాసభగవాన్! నాపైదయతో కొన్ని విషయముల గురించి అనుగ్రహభాషణము ప్రసాదించవేడుకొనుచున్నాను.

(1) మీరు విభాగించి ప్రసాదించిన - 4 వేదములలో (తెలియబడుచున్న అంతటిలో) అంతర్లీనుడై వేంచేసి, స్తుతించబడుచున్న దేవాది దేవుడు ఎవ్వరు?

(2) దేవతలంతా ఏ దేవదేవునియందు నిత్యనివాసులై ఉంటున్నారు?

(3) ఎవ్వరి శుశ్రూష (సేవించుట)చే దేవతలు కూడా ప్రీతి పొందగలరు?

శ్రీ శుకుని ఈ ప్రశ్నలను ఆలకించిన వారి పితృదేవులగు భగవాన్ శ్రీ వేదవ్యాసమహర్షి - ఈ విధంగా సమాధానము ప్రసాదించసాగారు.

---

**02.** సర్వ దేవాత్మకో రుద్రః।
సర్వే దేవా శివాత్మకాః।
రుద్రస్య దక్షిణే పార్శ్వే రవిః।
బ్రహ్మా త్రయో అగ్నయః।
వామపార్శ్వే ఉమాదేవీ।
విష్ణుః సోమో అపి తే త్రయః॥

ప్రియ శుకా! విను, రుద్రుడే సర్వదేవాత్మకుడు. సర్వదేవతలను ఆత్మస్వరూపముగా కలిగియున్నవారు. సర్వ దేవతలు శివాత్మస్వరూపులే! సమస్తము శివాత్మకమే। భిన్నమైనదేదీ లేదు.

అట్టి రుద్ర దేవదేవునికి :

దక్షిణము (కుడి) వైపుగా (పార్శ్వంగా) రవి, బ్రహ్మ,'త్రి' అగ్నులు (దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని, అహవనీయాగ్ని) స్థానముగా కలిగి ఉన్నారు.

వామపార్శ్వంగా (ఎడమవైపుగా) ఉమాదేవి, విష్ణుదేవుడు, సోముడు (చంద్రుడు) - ముగ్గురు వేంచేసి యున్నారు.

ఒకవైపు పురుషుడు మరొకవైపు ప్రకృతి. తాను మాత్రం నిర్విషయుడు.

| | |
|---|---|
| **యా ఉమా సా స్వయం విష్ణుః।**<br>**యో విష్ణుః స హి చంద్రమాః।**<br>**యే నమస్యంతి గోవిందం,**<br>**తే నమస్యంతి శంకరమ్।**<br>**యే అర్చయంతి హరిం భక్త్యా,**<br>**తే అర్చయంతి వృషధ్వజమ్।**<br>**యే ద్విషంతి విరూపాక్షం,**<br>**తే ద్విషంతి జనార్దనమ్।** | ఎవ్వరైతే ఉమ (అ+ఉ+మలోని **'ఉమ'** (లేక) **ప్రకృతి స్వరూపిణి**) అయి ఉన్నారో, **వారే స్వయముగా విష్ణుదేవుడు.** విష్ణువే చంద్రుని (సోముని) రూపుడు కూడా.సమస్తము రుద్రుడే। కనుక విష్ణువుగా ఉన్నది రుద్రుడే। రుద్రుడుగా ఉన్నది విష్ణువే।<br>ఎవరు గోవిందునికి నమస్కరించుచున్నారో, వారు శంకరునికి భక్తితో నమస్కరిస్తున్నట్లే.<br>ఎవరు భక్తితో 'హరి'ని అర్చించుచున్నారో, వారు వృషభధ్వజుడగు శంకరుని భక్తితో అర్చించుచున్నట్లే.<br>ఎవరు విరూపాక్షుని (శివుని) ద్వేషిస్తున్నారో, వారు జనార్దనుని (విష్ణువు)ను ద్వేషించుచున్నట్లే అగుచున్నది. |
| **యే రుద్రం న అభిజానంతి,**<br>**తే న జానంతి కేశవమ్!** | ఎవరు రుద్రుని గురించి (రుద్రతత్త్వమును) సరిగ్గా తెలుసుకొని ఉండరో, వారికి కేశవతత్త్వము కూడా ఏమాత్రము తెలియనట్లే. (విష్ణుతత్త్వమును ఎరిగినవారికి, శివతత్త్వము తెలిసినట్లే।) |
| **రుద్రాత్ ప్రవర్తతే బీజం।**<br>**బీజ యోనిః జనార్దనః।**<br>**యో రుద్రః సః స్వయం బ్రహ్మా।**<br>**యో బ్రహ్మా స హుతాశనః।**<br>**బ్రహ్మా – విష్ణుమయో రుద్రః।**<br>**అగ్నీ సోమాత్మకం జగత్।**<br>**'పుం' లింగగ్ం సర్వం ఈశానాం,**<br>**'స్త్రీ' లింగం భగవతి ఉమా॥** | రుద్రుని వలన (ఈ జగత్ ఉత్పత్తి సంబంధమైన) బీజము (origin) ప్రవర్తించుచుండగా, అట్టి బీజమునకు యోని స్థానము (where it is situated, placed) జనార్దనుడు.<br>ఎవ్వరైతే రుద్రరూపుడై యున్నారో, ఆయనయే స్వయముగా (సృష్టికర్త, ప్రజాపతియగు) బ్రహ్మదేవుడుగా అయి ఉన్నారు. ఎవరు బ్రహ్మయో ఆయనయే అగ్నిదేవుడు.<br>రుద్రుడు → బ్రహ్మ, విష్ణుమయుడు. ఈ జగత్తు - అగ్ని - సోమాత్మక మైనది. (It is combination of Heat and cool). ఈ జగత్తు రుద్రస్వరూపమే! రుద్రప్రత్యక్ష రూపమే! రుద్రుడు-జగత్తు అభిన్నులు. ఎందుకంటే రుద్రునికి అన్యమై ఎక్కడా ఏదీ లేదు కదా!<br>ఈ జగత్తులోని పుంలింగము (Male Feature) అంతా ఈశ్వరుడు అయితే, స్త్రీలింగమంతా (Female feature) భగవతియగు ఉమయే! (ఈ రెండింటి అభేదమగు 'లింగము' - రుద్రుడు) |
| **ఉమా రుద్రాత్మికాః సర్వాః,**<br>**ప్రజాః స్థావర జంగమాః।**<br>**వ్యక్తగ్ం సర్వం ఉమారూపమ్।**<br>**అవ్యక్తం తు మహేశ్వరమ్॥** | ఈ ప్రజలంతా (జీవులంతా), ఇక్కడి స్థావర - జంగములన్నీ స్త్రీ పురుష సంయోగమే. ఉమా- రుద్రాత్మికమే! స్వభావి + స్వభావమే! గుణి + గుణములే!<br>**వ్యక్తమై** కనిపిస్తున్నదంతా ఉమారూపము. **అవ్యక్తమై** ఉన్నదంతా మహేశ్వరరూపమే! (**వ్యక్తావ్యక్తములు** అభేదరూపమైనవి.) |
| **03. ఉమా శంకరయో యోగః**<br>**స యోగో 'విష్ణుః' ఉచ్యతే,**<br>**యస్తు తస్మై 'నమస్కారం'**<br>**కుర్యాత్ భక్తి సమన్వితః॥** | ఏదైతే ఉమా-శంకర (స్త్రీ-పురుష) సంయోగమైయున్నదో, ఆ యోగమునకే వ్యక్తా వ్యక్త స్వరూపమ్-'విష్ణుః' అను పేరు ('విష్ణుయోగము' అని కూడా అంటారు) ఎవరు విష్ణువుకు దోసిలియొగ్గి భక్తితో నమస్కరిస్తూ ఉన్నారో, ఆ నమస్కారము ఉమా-శంకర యోగమునకే అగుచున్నది. |
| **'ఆత్మానం' 'పరమాత్మానం'**<br>**'అంతరాత్మానం' ఏవ చ**<br>**జ్ఞాత్వా త్రివిధం ఆత్మానమ్,**<br>**పరమాత్మానమ్ ఆశ్రయేత్॥** | ఆత్మ మూడు విధములుగా ఎరుగబడుచున్నది. (1) జీవాత్మ (2) అంతరాత్మ (3) పరమాత్మ. ఈ మూడింటి తత్త్వమును తెలుసుకొని, **జీవాత్మ - అంతరాత్మలను దాటి, ఆవలగల 'పరమాత్మ'ను ఆశ్రయించాలి.**<br>(జీవాత్మ: వ్యష్టిగతము. అంతరాత్మ = 'అనేక దేహములు తనవి. అయి ఉన్న 'ఈశ్వరుడు'<br>పరమాత్మ = 'దేహి' అవటానికి మునుముందే ఉన్న పరస్వరూపము కేవల స్వరూపము). |

**అంతరాత్మా భవేత్ బ్రహ్మా**
**పరమాత్మా మహేశ్వరః**
**సర్వేషామ్ ఏవ భూతానాం**
**'విష్ణుః' ఆత్మా సనాతనః॥**

అంతరాత్మ → బ్రహ్మదేవుడు (సృష్ట్యభిమాని)
పరమాత్మ → మహేశ్వరుడు (కేవలుడు)
సమస్త జీవులు విష్ణువు యొక్క ఆత్మస్వరూపులే। సర్వజీవుల భావములకు, జన్మకర్మలకు మునుముందే ఉన్నట్టి ఆత్మయే విష్ణురూపము. ఆయనయే సనాతనుడు. అనేకమునకు మునుముందే ఉన్న ఏకస్వరూపమే 'విష్ణువు'. కనుక 'సనాతనుడు'.

---

**అస్య త్రైలోక్య వృక్షస్య,**
**భూమౌ విటప శాఖినః॥**
**అగ్రం మధ్యం తథా మూలం**
**విష్ణు బ్రహ్మ మహేశ్వరాః॥**
**కార్యం విష్ణుః క్రియా బ్రహ్మా**
**కారణం తు మహేశ్వరః**

'త్రిలోకములు' అనబడే వృక్షము భూమిపై కొమ్మలుగా విస్తరించినదై యున్నది (భూమి = భావనయొక్క భౌతికరూపము)
ఈ సృష్టి (లేక సంసార) వృక్షమునకు : -
అగ్రభాగాన → విష్ణువు।
మధ్యగా → బ్రహ్మ।
మూలమున → మహేశ్వరుడు।
కార్యము → విష్ణువు। (The Functioner Function)
క్రియ → బ్రహ్మ। (The Executant of Acts))
కారణము → మహేశ్వరుడు। (The Root cause Both)

---

<u>ప్రయోజనార్థం రుద్రేణ</u>
<u>మూర్తిః ఏకా - త్రిధా స్థితా।</u>
**ధర్మో రుద్రో। జగత్ విష్ణుః।**
**సర్వ జ్ఞానం పితామహః॥**

**లోక కల్పన - పరిపోషణ ఉపసంహారణ** (creating, maintaining and with-drawing) కొరకై -(రుద్ర పరమాత్మ 'సర్వదా ఏకమే' అయినప్పటికీ) త్రి(3) విధములుగా ప్రదర్శనము అగుచుండటం జరుగుతోంది.
- కథను ఊహించటం, రచించటం, ముగించటం ఈ మూడూ వేరువేరుగా ఉన్నా కూడా, రచయిత ఎల్లప్పుడూ ఒక్కడే (అయినట్లు).
☞ ధర్మము (The creative function) రుద్రుడు.
☞ జగత్తు (The creative scenario) విష్ణువు.
☞ ఇందలి సమస్త జ్ఞానము (knowing) పితామహుడగు బ్రహ్మ.

---

**శ్రీ రుద్ర రుద్ర రుద్రేతి**
**యః తమ్ బ్రూయాత్ విచక్షణః॥**
**కీర్తనాత్ సర్వదేవస్య,**
**సర్వ పాపైః ప్రముచ్యతే॥**

**'శ్రీ రుద్ర రుద్ర రుద్ర'** అని ఏ విచక్షణాశీలుడైతే సృష్టి - స్థితి - లయ అభిమానులను, కర్తలను భావన చేసి సర్వదేవతలను, సర్వ సహజీవులను, కీర్తిస్తూ ఉంటాడో, అట్టివాడు సర్వపాపములనుండి విముక్తుడు అగుచున్నాడు. ఎవ్వరు ఏ పేరుతో ఎవ్వరిని కీర్తిస్తున్నా కూడా, పరమాత్మ సర్వదా ఒక్కడే।

---

**రుద్రో నర, ఉమా నారీ।**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రో బ్రహ్మ, ఉమా వాణీ।**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రో విష్ణుః ఉమా లక్ష్మీ।**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రః సూర్య, ఉమా ఛాయా।**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రః సోమ, ఉమా తారా।**
**తస్మై తస్యై నమో నమః॥**

☞ **రుద్రుడే నరుడు (పురుషుడు. భావన తనదైనవాడు. స్వభావి) ఉమయే - నారి** (ప్రకృతి, భావన, స్వభావము), స్వామికి, మాతకు నమో నమః। నర-నారీస్వరూపములకు రుద్రో-ఉమా ఉపాసనా నమస్కారములు.
☞ ఏ రుద్రుడైతే బ్రహ్మయో, ఏ 'ఉమ' అయితే వాణియో - అట్టి రుద్రునికి, రుద్రాణికి నమస్కరించుచున్నాను. బ్రహ్మ-వాణీలకు నమోనమః
☞ రుద్రుడే విష్ణువు. ఉమయే లక్ష్మి. ఆ స్వామికి, ఆ అమ్మకు మరల మరల నమస్కారములు. విష్ణు-లక్ష్మీ తత్త్వములకు వందనములు.
☞ రుద్రుడే సూర్యుడు. ఉమయే ఛాయ. రుద్ర - ఉమా స్వరూపములగు సూర్య - ఛాయాదేవిలకు ప్రణామములు. నమస్కరిస్తున్నాము.
☞ రుద్రుడే సోముడు (చంద్రుడు). ఉమయే తార. శ్రీ రుద్ర - ఉమల చంద్ర తారా అంశలకు నమస్కారము.

**04. రుద్రో దివా, ఉమా రాత్రిః।**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రో యజ్ఞ, ఉమా వేదిః।**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రో వహ్నిః ఉమా స్వాహా।**
**తస్మై తస్యై నమో నమః॥**

☞ రుద్రుడే పగలు. ఉమయే రాత్రి. పగలు - రాత్రులను రుద్రా - ఉమా - ఉపాసా పూర్వకముగా దర్శిస్తూ నమోవాక్కములు.

☞ రుద్రుడే యజ్ఞము. ఉమయే యజ్ఞవేదిక. యజ్ఞ - యజ్ఞవేదికలకు రుద్ర - ఉమా భావనాయోగ నమస్కారము.

☞ రుద్రుడే అగ్ని. ఉమయే స్వాహాదేవి. అట్టి అగ్ని - స్వాహాదేవిలకు నమో నమః

---

**రుద్రో వేద, ఉమా శాస్త్రం।**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రో వృక్ష, ఉమా వల్లీ।**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రో గంధ, ఉమా పుష్పం।**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రో అర్ధ, అక్షరః సోమా॥ (స-ఉమా)**
**తస్మై తస్యై నమో నమః॥**
**రుద్రో లింగం, ఉమా పీఠం।**
**తస్మై తస్యై నమో నమః॥**
**సర్వ దేవాత్మకగ్ం రుద్రం**
**నమస్కుర్యాత్ పృథక్ పృథక్।**

☞ రుద్రుడు వేదము. ఉమ శాస్త్రము. అట్టి వేద-శాస్త్రములకు నమస్కృతులు.

☞ రుద్రుడు వృక్షము. ఉమా - వల్లీ (పూతీగ). (లేదా భూమి)
అట్టి వృక్ష - పూతీగలకు (లేక భూమికి) నమస్కారము.

☞ రుద్రుడు పుష్పసువాసన. ఉమ పుష్పము. అట్టి సువాసన - పుష్పములకు రుద్ర - ఉమా ఉపాసనపూర్వక నమస్కారము.

☞ రుద్రుడు అర్థము (The meaning). ఉమ అక్షరము (The word). అట్టి అర్థ - శబ్దములకు రుద్ర - ఉమా భావనా నమస్కారము.

☞ రుద్రుడు లింగము. ఉమ పీఠము. అట్టి లింగ-పీఠములకు రుద్ర-ఉమా (అహమ్ - ఓం) భావనా - నమస్కారము.

'సర్వ దేవతల ఆత్మస్వరూపుడు రుద్రుడే' అని ఎరిగి సర్మాత్మకుడగు రుద్రునికి మరల మరల ఎల్లప్పుడు నమస్కరిస్తూ ఉన్నాము.

పునః పునః నమో నమః॥

---

**ఏభిః మంత్ర పదైః - ఏవ**
**నమస్యామి ఈశ - పార్వతీ।**
**యత్ర తత్ర భవేత్ స అర్థమ్**
**ఇమం మంత్రమ్ ఉదీరయేత్**
**బ్రహ్మహా, జలమధ్యేతు**
**సర్వ పాపైః ప్రముచ్యతే।**

మనము చెప్పుకున్న 'తస్మై తస్యై' మంత్ర వాక్యములతో ఈశ్వరునికి పార్వతికి సదా నేను నమస్కరించుచున్నాను.

ఎక్కడెక్కడ అనుభవరూపమగు స + అర్థము ఉంటే అక్కడక్కడ ఈ మంత్రమును బుద్ధి మనస్సులతో ఎలుగెత్తి అర్థ-మనన పూర్వకంగా గానం చేస్తూ చెప్పుకోవాలి.

జలము మధ్య స్నానం చేయుచున్నతీరుగా 'బ్రహ్మము' అనే జలమధ్యగా ఉండి ఈ మంత్రమును చెప్పుకొనెదముగాక।

అట్టి మననశీలుడు సర్వ పాపములనుండి విముక్తుడు కాగలడు.

---

**సర్వాధిష్ఠానమ్ అద్వంద్వం**
**పరంబ్రహ్మ సనాతమ్।**
**సత్ - చిత్ - ఆనంద రూపం తత్**
**అవాక్ - మానస గోచరమ్।**
**తస్మిన్ సువిదితే,**
**సర్వం విజ్ఞాతగ్ంస్యాత్**
**ఇదగ్ం, శుక!**

ఓ ప్రియకుమారా! శుకా! ఈ దృశ్యములో జన్మ జన్మాంతరములుగా సంచరిస్తూ ఈ ఇంద్రియ జగత్తులలో ఎంతగా వెతికినప్పటికీ కేవలమగు రుద్రతత్త్వము తెలియజాలదు. కథా రచయిత కథలో కనిపిస్తాడా? లేదు కదా! మరి ఏమి చేయాలి? రుద్రతత్త్వము (ఆభరణమునకు బంగారమువలె తరంగమునకు జలమువలె, నవలకు నవలా రచయితవలె) ఈ కనబడే 14 లోకసంబంధమై సర్వమునకు అధిష్ఠానము. అద్దానికి ద్వితీయమైనది ఎక్కడా ఏదీ లేనట్టిది. సనాతనమగు పరబ్రహ్మతత్త్వమే రుద్రతత్త్వము. అట్టి బ్రహ్మతత్త్వము జన్మ కర్మ వ్యవహారరూపములకు మునుముందే ఉన్నది. కాబట్టి సనాతనము. అవాక్ - మానస గోచరము. అట్టి బ్రహ్మము (లేక) పరబ్రహ్మతత్త్వము (లేక) పరమాత్మను చక్కగా ఎరిగినప్పుడు - ఇక ఈ సంసారరూపదృశ్యమంతా కూడా - ఏది ఏమిటో తెలిసిపోగలదు. "రుద్రతత్త్వమునకు వేరై సంసారము లేదు. బంధము లేదు" - అను (సోఽహమ్) స్వానుభవమవగలదు.

**తత్ ఆత్మకత్వాత్ సర్వస్య।**
**తస్మాత్ భిన్నం నహి క్వచిత్॥**
**ద్వే విద్యే వేదితవ్య ఏహి।**
**పరాచైవ – అపరాచ తే॥**

అట్టి పరబ్రహ్మమే (ఆ రుద్ర పరమాత్మయే) మనందరియొక్క మరియు సర్వజీవులయొక్క సర్వాత్మకమగు ఆత్మస్వరూపము. ఆయనకు భిన్నమనునది ఎక్కడా ఏదీ లేదు. **శివాత్ పరతరమ్** నాస్తి. (అనగా) మనమంతా శివానంద స్వరూపులమే।

ఓ శుకా! (వేద) విద్య రెండు విధములైనవి. అవి తెలుసుకొని ఉండెదవు గాక. (1)పరావిద్య (2) అపరావిద్య.

---

**తత్ర అపరా తు విద్యా ఏషా – ఋగ్వేదో**
**యజురేవ చ, సామవేదః,**
**తథా అథర్వవేదః।**
**శిక్షా, మనీశ్వర!**
**కల్పో వ్యాకరణం చ ఏవ**
**నిరుక్తం ఛంద ఏవ చ।**
**జ్యోతిషం చ**
**తథా అనాత్మ విషయా**
**అపి బుద్ధయః॥**

**ఇహవిద్య / అపరావిద్య** = **I.** ఋక్ - యజుర్ - సామ - అథర్వణ చతుర్వేదములు. వాటి అంతర్గత విధి విధానములు.

**II.** వేదాంగములైనట్టి (షట్ అంగములైనట్టి)

**(1). శిక్ష** (కర్త పాణిని) = బోధన. (The Training)

**(2) కల్పము** = న్యాయశాస్త్రము. వ్రత కల్పశాస్త్రము. నిబంధనముల నిశ్చయములు. పద్ధతులు. కాలనిర్ణయము (వేయి యుగములు మొ॥నవి). అట్లాగే తదితర అనాత్మ విషయ శాస్త్రములు (ఆత్మగురించి చెప్పనట్టి శాస్త్రములు (The Physics, Chemistry, Mathematics Etc)

**(3) వ్యాకరణము** (పాణిని) = శబ్ద శాస్త్రము, వాక్య విభజన

**(4) ఛందస్సు** (పింగలముని) = అర్థనిర్వచనము. అలంకార శాస్త్రము. శబ్దముల శాస్త్రీయత.

**(5) నిరుక్తము** (యాస్కముని) = పదముల అవయవార్ధ వివరణ. పరమార్థ విశ్లేషణము. శబ్ద - వాక్య ఉత్పత్తులు.

**(6) జ్యోతిష్యము** (ఆదిత్యుడు) = సూర్య - తదితర గ్రహ, నక్షత్ర గమనములను, కాల ప్రమాణములను సూచించు శాస్త్రము. 'స్థూలము'లో అంతర్గతమయి ఉండే భౌతికశక్తి తత్త్వములు.

ఇదంతా **"అపరా విద్య"** - అని చెప్పబడుతోంది.

---

**05.** అథ ఏషా పరమా విద్యా
**యయ 'ఆత్మా' పరమాక్షరమ్–**
**యత్ తత్ అద్రేశ్యం, అగ్రాహ్యం,**
**అగోత్రగం, రూపవర్జితమ్।**
**అచక్షుః–శ్రోతమ్,**
**అత్యర్థం తత్ అపాణి–**
**పాదం తథా।**
**నిత్యం, విభుగం, సర్వగతగం**
**సుసూక్ష్మం చ, తత్ అవ్యయమ్॥**

### పరమావిద్య (లేక) పరా విద్య

ఏ విద్య అయితే ఈ జీవాత్మత్వమునకు, ఇంద్రియ దృశ్య వ్యవహారమునకు పరమై, అక్షరమై యున్న 'ఆత్మ' గురించిన విద్యయో, అదియే '**పరావిద్య**'. ఏ విద్య అయితే :-

- దేశ కాలములకు సంబంధించనిదై అద్రేశ్యమైయున్నదో,
- అగోత్రా : గోత్ర - జాతి సంబంధమైనదిగాని, రూప సంబంధమైనది గాని- కానట్టిదో,
- అగ్రాహ్యా - ఇంద్రియములకు విషయము కానట్టిదో,
- ఆత్యంతికమైన అర్థమై యున్నదో,
- ఇంద్రియములకు, ఇంద్రియార్థములకు, ఇంద్రియ విషయములకు సంబంధించనిదో,
- కాళ్లతో నడచి వెళ్ళవలసినది కాదో,
- ఒకచోటే ఉన్నట్టిది కాదో..., మరొకచోట ఎక్కడో చేతులకు అందునది కాదో,
- నిత్యమో, సర్వ నియామకమగు విభుస్వరూపమో,
- సర్వత్రా విస్తరించినదై ఉన్నదో, అవ్యయమో,
- అత్యంత సూక్ష్మమో **'అదియే ఆత్మ'!**

అట్టి (స్వస్వరూపమగు) ఆత్మ గురించి చెప్పునదే **'పరావిద్య'**.

---

**తత్ భూతయోనిం పశ్యంతి**
**ధీరా ఆత్మానమ్ ఆత్మని।**

ఉత్తమబుద్ధిగల ధీశాలురు సర్వభూతజాలమునకు ఉత్పత్తి (ప్రారంభ) స్థానమగు ఆత్మను-(తమ) ఆత్మయందే - (అనగా) తమయొక్క అంతరముగానే అనుక్షణికంగా, అనునిత్యంగా సందర్శించుచున్నారు. ఆత్మస్వాభావికులై ఆత్మస్వభావులై ఉంటున్నారు. ఆత్మయందే ఆత్మగా జగద్దృశ్యమును చూస్తున్నారు.

**యః సర్వజ్ఞః, సర్వ విద్యో (సర్వ విదో),**
**యస్య జ్ఞానమయం తపః,**
**తస్మాత్ అత్ర సరూపేణ**
**జాయతే జగదావళిః।**

ఎవ్వరైతే ఈ దేహము-దేహిల పూర్వ - వర్తమాన - తదనంతర స్థితులన్నీ ఎరిగి ఉండుటచే సర్వజ్ఞుడో, ఎదురుగాగల దృశ్యతత్త్వము ఏమిటో - ఎరిగియున్నవాడో, ఎవని గురించిన తపన (తపస్సు) జ్ఞానమయమో - ఆయన నుండియే ఈ సరూపాత్మకమైన (నామ రూపాత్మకమైన) జగత్తు అంతా బయల్వెడలు చున్నది.

---

**సత్యవత్ భాతి తత్ సర్వగ్ం**
**“రజ్జు సర్పవత్” ఆస్థితమ్।**
**తత్ ఏతత్ అక్షరగ్ం సత్యం**
**తత్ విజ్ఞాయ విముచ్యతే।**

ఇదంతా సత్యస్వరూపుడగు రుద్రభగవానుని యందు రజ్జుసర్పభ్రాంతి వలే సత్యములాగా ఉండి, ‘నిజము’వలె ప్రకాశమానమగుచున్నది.

ఓ మునీశ్వరా! శుకా! **రుద్ర స్వరూపమగు ఆత్మ**మాత్రమే అక్షర - సత్యము. అద్దానిని ఎరుగుటచే ఈ జీవుని సర్వ బంధములు తెగిపోతాయి.

---

**జ్ఞానాత్ ఏవహి సగ్ంసార వినాశో,**
**నైవ (న ఏవ) కర్మణా।**
**శ్రోత్రియం బ్రహ్మనిష్ఠగ్ం**
**స్వగురుం గచ్ఛేత్ యథావిధి।**
**గురుః తస్మై పరాం విద్యాం**
**దద్యాత్ బ్రహ్మాత్మ బోధినీమ్।**

‘ఆత్మజ్ఞానము’ చేత మాత్రమే (అఖండాత్మ౽హమ్‌జ్ఞానముచేత మాత్రమే) ఈ సంసార బంధమంతా వీగిపోగలదు. అంతేగాని కర్మలచేత సంసార బంధము తొలగదు.

అటువంటి **స్వయమాత్మా - బ్రహ్మవిద్య లేక ‘తత్త్వవిద్య, సో౽హమ్ విద్య’** యొక్క అనుభవసిద్ధికొరకై శ్రుతుల హృదయమును ఎరిగినట్టి శోత్రియుడు, బ్రహ్మతత్త్వమునందు నిష్ఠాపరుడు అగు సత్ గురువును యథావిధిగా ఆశ్రయించాలి.

---

**06. గుహాయాం నిహితగ్ం సాక్షాత్**
**అక్షరం వేదచేత్ నరః,**
**ఛిత్త్వా అవిద్యా మహా గ్రన్థిగ్ం,**
**శివం గచ్ఛేత్ సనాతనమ్।**

గురువు-శిష్యుని అర్హతను అనుసరించి ఆతని ఆత్మగురించి సువిదపరచు తత్‌బ్రహ్మమగు ‘పరావిద్య’ను బోధించునుగాక!

ఆ విధంగా సద్గురువు వద్ద ‘ఆత్మజ్ఞానము’ గురించిన శ్రవణము తరువాత ఆ శిష్యుని స్వకీయ మనన, నిధిధ్యాస సమాధిలచే (అనుకోవటం, అనిపించటం, అదే తానవటం చేత) స్వహృదయములోనే పరమాత్మను దర్శించుచున్నాడు. హృదయము నందే సాక్షాత్కరించునదైనట్టి అక్షరమగు స్వస్వరూపమును సర్వస్వరూపంగా ఎరుగుచున్నాడు. అవిద్యా మహాగ్రంథులు విచ్ఛిన్నమై, సనాతనమగు శివ స్వరూపమును సంతరించుకొనుచున్నాడు.

---

**తత్ ఏతత్ అమృతగ్ం సత్యం**
**తత్ బోధవ్యం ముముక్షుభిః।**

ముముక్షువులంతా అట్టి అక్షరమగు, అమృతతుల్యమగు సత్యమును ఎరుగుటకే నిత్యము ప్రయత్నశీలురై ఉండాలి. అట్టి అర్హుడగు ముముక్షువుకు గురువు ‘ఆత్మ’ గురించి బోధించునుగాక।

---

**‘ధనుః తారగ్ం। శరో హి ఆత్మా।**
**‘బ్రహ్మ’ - తత్ లక్ష్యమ్’ - ఉచ్యతే।।**
**అప్రమత్తేన వేద్ధవ్యగ్ం**
**శరవత్ తన్మయో భవేత్।**

తారము (చూపు (దృష్టి) perception) → ధనుస్సు
శరము → జీవాత్మత్వము
లక్ష్యము → సర్వాత్మకమగు పరబ్రహ్మము

విలుకాడు లక్ష్యమువైపు బాణమును విడచి లక్ష్యమును భేదించు విధంగా ముముక్షువు అప్రమత్తుడై, జీవాత్మను పరమాత్మత్వమునందు ప్రవేశింపజేయుచు, తన్మయుడు అగునుగాక।

---

**లక్ష్యగ్ం సర్వగతం చ ఏవ**
**శరః సర్వగతో ముఖః।**
**వేద్ధా సర్వగతశ్చైవ**
**శివలక్ష్యం। న సగ్ంశయః।**

లక్ష్యము → సర్వగతమగు స్వస్వరూపాత్మయే।
శరము → పరిమితరూపము - ‘సర్వగతమువైపు సంధించబడుచున్న ‘జీవాత్మహమ్’ లేక ‘దేహాత్మహమ్’ స్వరూపము.

తెలియబడునది - సర్వగతము. ‘చిదానందరూపమ్, శివో౽హమ్, శివో౽హమ్!’

**మహదాశయము: ఈ జీవుడు శివుడవటమే! నరుడు నారాయణుడు అవటమే!** అది స్వస్వరూపమునకు సంబంధించిన నిస్సందేహ స్థితి/స్థానము. ఈ జీవుని పట్ల సర్వదా ఏర్పడియున్న ‘పరమసత్యము’.

**న తత్ర చంద్ర – అర్క వపుః**
**ప్రకాశతే। న వాంతి వాతాః। సకలా దేవతాశ్చ।**
**స ఏష దేవః కృతభావభూతః।**
**స్వయం విశుద్ధో విరజః ప్రకాశతే॥**
**ద్వౌ సుపర్ణౌ శరీరే అస్మిన్**
**"జీవ, ఈశ" ఆఖ్యౌ సహ స్థితౌ।**
**తయోః జీవః ఫలం భుక్తే కర్మణో।**
**న మహేశ్వరః॥**
**కేవలగ్ం సాక్షిరూపేణ**
**వినా భోగం మహేశ్వరః॥**

అట్టి పరబ్రహ్మ స్వయమాత్మా స్థానమునందు, ఈ భౌతిక ఆకాశంలో కనిపించి సూర్యచంద్రులు ప్రకాశించరు. వాయు ప్రసరణములు, సకల దేవతలు - ఇవన్నీ ఉండవు. అవన్నీ స్వస్వరూపాత్మ-భగవానుని కిరణ చమత్కారములుగా తెలియవస్తాయి.

అట్టి ఆత్మ భగవానుడు సర్వభావములకు ఉత్పత్తి స్థానము కాబట్టి **కృతభావభూతుడు.** స్వయముగా విశుద్ధుడు. నిరంజనుడైనట్టి స్వరూపుడు. ఈ జీవుని దేహములో (నీ దేహములో నా దేహములో కూడా) భౌతికదేహమునకు వేరై రెండు పక్షులు ఉన్నాయి. అవి కలిసియే జడదేహమునకు 'జీవనత్వము'ను ప్రసాదిస్తున్నాయి. ఆ రెండు పక్షులు:

(1) (కర్మ) ఫలములను ఆస్వాదిస్తున్నది పక్షి → **'జీవుడు'**

(2) కేవల సాక్షి మాత్రుడై భోగించక (without experiencing) చూస్తూ ఉన్నట్టి పక్షి → **'మహేశ్వరుడు' (లేక) ఈశ్వరుడు**

---

**ప్రకాశతే స్వయం భేదః**
**కల్పితో మాయయా తయోః।**

ఆ రెండూ వేరైన రూపులు కాదు. ఏకరూపులే. అయితే **'స్వకీయమగు మాయాకల్పన'**యే ఆ రెండింటికి మధ్య 'భేదము'. భావనా-కల్పనగా ఏర్పడినదై ఉన్నదే **మాయ.**

---

**ఘటాకాశ మఠాకాశౌ**
**యథా ఆకాశ ప్రభేదతః**
**కల్పితౌ పరమౌ జీవ**
**శివ రూపేణ కల్పితౌ।**

కుండలోని ఆకాశము - మఠము (ఇల్లు)లోని ఆకాశము వేరువేరా? కాదు. కాని ఒకదానిని ఘటాకాశమని, మరొకదానిని మఠాకాశమని, సర్వత్రా ఉన్న దానిని **'మహాకాశము'** అని పిలుస్తున్నాం. అట్లాగే మహాకాశము వంటి 'పరమాకాశము' లో 'ఇది జీవుడు, ఇది శివుడు' అనునది కల్పితమై దర్శించబడుతోంది. "ఆవల-ఈవల, పరమాత్మ-జీవాత్మ" మొదలైనవన్నీ ఆత్మాకాశములో కేవలము కల్పితము.

---

**తత్త్వతశ్చ శివః సాక్షాత్**
**చిత్ – జీవశ్చ స్వతః సదా!**
**చిత్ చిదాకారతో భిన్నా**
**న భిన్నా చిత్త్వ హానితః॥**

తత్త్వార్థంగా పరిశీలిస్తే సాక్షాత్ శివుడే స్వయముగా సర్వదా చిత్ జీవుడుగా పరిమితమైన ఎరుకతో కూడి కనిపిస్తున్నాడు. (The original Consciousness is appearing in a context as contextual Consciousness).

అఖండ చిత్ ఒకానొక చోట పరిమితమైన 'ఎరుక'గా ఉన్నంతమాత్రంచేత కేవలమైన ఎరుకకు వచ్చే లోటేమీ లేదు. చిత్తు - చిదాకార భిన్నత్వము వలన కేవల చిత్ యథాతథము కాకపోదు. బంగారమునకు ఆభరణాకారము వలన వచ్చే లోటేమున్నది? ఆభరణము బంగారము కాకుండా పోతోందా?

---

**చితిశ్చేత్ న చిదాకారా**
**భిద్యతే జడరూపతః**
**భిద్యతే చేత్ జడో భేదః**
**చిత్ ఏకా సర్వదా ఖలు॥**

'చిత్' (ఎరుక) ఎప్పుడూ స్వయముగా చేతనాస్వరూపమే. ఎరుగబడేది-(చిదాకారము)గా అవదు. జడరూపము పొందదు. ("The knowing is always intutive and never takes this form of what is being known")

జడ భేదమును ఖండించుకుంటూపోతే, తెలియబడే (జడమైనది) అంతా కూడా చిత్ స్వరూపమునకు (ఎరుకకు) భిన్నమైనది కాదు. **ఎరుకయొక్క ఏకరూపములే (1) తెలుసుకొనునది, (2) తెలియబడునది కూడా!**

---

**07. తర్కతశ్చ ప్రమాణాచ్చ**
**చిత్ ఏకత్వ వ్యవస్థితే।**
**'చిత్ ఏకత్వ' పరిజ్ఞానే**
**న శోచతి। న ముహ్యతి।**
**'అద్వైతం పరమానందగ్ం**
**శివం' – యాతితు కేవలమ్।**

గురువు చెప్పుచున్న తర్కము(logic) చే, శాస్త్రముల ప్రమాణములచే- **"తెలుసుకొనుచున్నవాడు. తెలియబడునది తెలివి"**ల ఏకత్వమే। - (చిత్ ఏకత్వముగా) సర్వత్రా సర్వదా వ్యవస్థితమగుచున్నది. చిత్ ఏకత్వమును బాగుగా తెలుసుకున్నవాడు దేనికీ శోకించడు. దేనికీ మోహము చెందడు. జీవ-శివత్వముల ఏక రూపము అగు 'కేవల శివతత్త్వము'ను పుణికిపుచ్చు కొనుచున్నాడు. పరమానందరూపమగు అద్వైత స్థానమును అనుక్షణికం చేసుకుంటున్నాడు.

| | |
|---|---|
| "అధిష్ఠానగ్ం సమస్తస్య<br>జగతః సత్య చిద్ఘనమ్,<br>అహమస్మి!" ఇతి నిశ్చిత్య<br>వీత శోకో భవేత్ మునిః। | ఓ మునీ! శుకా!<br>"కేవల శివస్వరూడునగు నేను సమస్త జగత్తుకు (కథకు రచయితవలె, ఆభరణమునకు బంగారమువలె) అధిష్ఠాన స్వరూపుడను. 'సత్' ఘనీభూత రూపుడను"-అని నీవు ఎప్పుడైతే సర్వభేదములపట్ల - **మౌనము, అతీతత్వము వహించుచూ సునిశ్చితుడవై ఉంటావో,** అప్పుడు **శోకరహితుడవు** కాగలవు. (All worries naturally vanish) |
| స్వ శరీరే స్వయం జ్యోతిః<br>స్వరూపగ్ం సర్వసాక్షిణమ్<br>క్షీణదోషాః ప్రపశ్యంతి<br>నేతరే (న-ఇతరే) మాయయ ఆవృతాః। | ఎవ్వరైతే మనస్సు బుద్ధి - చిత్తములను ఆశ్రయించి ఉన్న దోషదృష్టులను పరిశుభ్రపరచుకొంటున్నారో, తత్త్వదృష్టిని ఆశ్రయిస్తారో, వారు స్వశరీమునందే - **స్వయం జ్యోతి స్వరూపము, సర్వసాక్షి** అగు **ఆత్మను దర్శించుచున్నారు.** ఎవ్వరు దోషదృష్టులను జయించరో, వారు మాయచే కప్పబడినవారై స్వాత్మ సందర్శనమును సిద్ధించుకోలేకపోవుచున్నారు. |
| ఏవగ్ం రూపపరిజ్ఞానం<br>యస్యాస్తి (యస్య అస్తి) పరయోగినః<br>కుత్ర చిత్ గమనం నాస్తి<br>తస్య సంపూర్ణ రూపిణః॥ | అట్టి స్వస్వరూప పరిజ్ఞానమును సిద్ధించుకొన్న పరమయోగి - ఇక ఆత్మతత్త్వము కొరకై - మరెక్కడికీ వెళ్లవలసిన పనియేలేదు. తనయొక్క ఇహ పర స్వరూపములచే పరిపూర్ణుడై **'సంపూర్ణరూపి'**గా అగుచున్నాడు. దృశ్యమంతటినీ తనకు అనన్యముగా ఆస్వాదించుచున్నాడు. అనన్యముగా సమన్వయించుకుంటున్నాడు. |
| ఆకాశమ్ ఏకగ్ం సంపూర్ణం<br>కుత్ర చిత్ నైవ గచ్ఛతి,<br>తద్వత్ స్వాత్మ పరిజ్ఞానీ<br>కుత్ర చిత్ నైవ గచ్ఛతి॥ | ఆకాశము (spare) అంతటా వేంచేసియుండగా అట్టి ఆకాశము **"ఒకచోట నుండి మరొకచోటికి వెళ్ళటము"** అనే ప్రసక్తియే ఉండదు కదా! ఆ విధంగానే ఆత్మను ఎరిగినట్టి పరిజ్ఞానికి దేహ దేహాంతరముల దృష్ట్యాగాని, త్రికాలముల దృష్ట్యాగాని, జాగ్రత్ స్వప్నముల దృష్ట్యాగాని **'ఒకచోట నుండి ఇక్కడికి రావటము, ఇక్కడి నుండి మరెక్కడికో పోవటము'** అను ప్రసక్తియే లేదు. ఆత్మగా ఈ జీవుడు సర్వదా సర్వత్రా యథాతథస్వరూపుడు - అయియే ఉన్నాడు. |
| స యో హవై తత్<br>'పరమం బ్రహ్మ',<br>యో వేద వై మునిః,<br>బ్రహ్మైవ భవతి స్వస్థః -<br>'సత్ చిత్ ఆనంద మాత్రక'<br>ఇతి రుద్ర హృదయోపనిషత్<br>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥ | ఏ పరమాత్మను మునులు, ఋషులు తమ తపస్సుచే గమనించి జనులందరికీ ఎలుగెత్తి 'త్వమ్‌తదేవ' అని గానము చేసి చెప్పుచున్నారో, అది శ్రవణము చేయు బ్రహ్మజ్ఞాని - తానే 'బ్రహ్మము' అయి స్వస్థత చెందుచున్నాడు.<br>**సత్ చిత్ ఆనంద మాత్రక- బ్రహ్మైవ భవతి స్వస్థః॥**<br>ఇతి రుద్ర హృదయోపనిషత్<br>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥ |

**కృష్ణ యజుర్వేదాంతర్గత**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 31 రుద్రహృదయోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



స్వస్వరూప - సర్వస్వరూప పరబ్రహ్మము **'రుద్ర హృదయ మహావిద్య'**గా బ్రహ్మసూత్రములచే, పురాణములచే ఉపనిషత్తులచే ప్రసాదించబడుచున్నది. **'బ్రహ్మమాత్ర అవస్థానము'**గా సర్వత్రా వెలయుచు, స్వ - అనన్యమగుచున్న **రుద్రభగవానునికి** నమస్కరించుచున్నాను. **చిదానంద రూపమ్। శివోఽహమ్! శివోఽహమ్!**

రుద్ర భగవత్ దర్శనము = హృదయకుండలినీ దర్శనము.

రుద్రాక్ష దర్శనమ్ = **హృదయమునందు సర్వమును 'రుద్రప్రత్యక్ష స్వరూపం'**గా దర్శించటము.

**సర్వాత్మకుడగు పరమాత్మను హృదయమునందు దర్శించటమే సంసారము నుండి తరించు ఉపాయము. 'తత్ త్వమసి', 'అహమ్ బ్రహ్మాస్మి' 'సోఽహమ్', 'అయమాత్మా బ్రహ్మ', 'జీవోబ్రహ్మైతి నాఽపరః'.** ఇత్యాది మహావాక్యముల పరమార్థమే తారసారము. (దృశ్య - దేహ - జీవ - ఈశ్వర పరబ్రహ్మము అనబడే) **పంచాగ్నిహోత్ర - రుద్రాత్మకుడగు - పరమాత్మ** యొక్క పాదపద్మములకు సాష్టాంగ దండ ప్రణామములు సమర్పిస్తున్నాను.

శ్రీ వ్యాసమహర్షి కుమారుడగు శ్రీశుకుడు ఏకాంతముగా తపస్సు ఆచరిస్తూ ఉన్నారు. ఒకానొకరోజు, బుద్ధిని మరింత **సునిశితముగాను, నిర్మలముగాను, విస్తారముగాను** ఆత్మ **సందర్శనోత్సాహ సమన్వితముగాను** తీర్చిదిద్దుకున్నారు. అట్టి సమయంలో ఆయనకు: -

- **'హృదయకుండలీ భస్మ రుద్రాక్షగణ సందర్శన యోగము'** - గురించి,
- **జగత్తును ఆత్మ తత్త్వముగా సందర్శనయోగమునకు సంబంధించిన అభ్యాసము గురించి,**
- "తరింపజేయు వేదమహావాక్యములగు **"తత్ త్వమ్ అసి** - అఖండమగు శివానందస్వరూపుడవే నీవు"... అను అవగాహన గురించి, **'సోఽహమ్ అస్మి'** గురించి..., (మరియు)

**ఇంకా కూడా ఏవో సందేహాలు కొన్ని తనయందు పొడచూపుచుండటమును గమనించారు.**

**'జ్ఞానస్సంఛిన్న సంశయః'** అను ఆర్య వ్యాఖ్యానుసారం తనలోని సంశయములను తొలగించుకో నిశ్చయించారు.

తపస్సు చాలించి, తపోవనము నుండి బయల్వెడలారు. **తనకు ప్రియమైనవారు, వేదోపనిషత్ సంస్కర్త, మానవాళి క్షేమం కోరి భాగవతాది అష్టాదశ పురాణ ప్రవక్త, బ్రహ్మసూత్ర రచయిత, లోకకళ్యాణమూర్తి, కలిదోష భిషజుడు, సాక్షాత్ నారాయణావతారముగా మునిలోకములో శ్లాఘించబడువారు** - అగు **శ్రీ వ్యాసమహర్షి**ని సమీపించారు. పితృదేవులు, గురుదేవులు అగు శ్రీ వ్యాసమహర్షి పాదపద్మములు స్పృశించి, భక్తితో కళ్ళకద్దుకొని, ప్రణామములు సమర్పించారు.

**శ్రీ శుకదేవులు :** భగవన్! పితృదేవా! అస్మత్ సద్గురూ! తండ్రీ! ఇప్పుడు మీవద్ద కొన్ని ప్రశ్నలకు సమాధానములు శ్రవణం చేయటానికై మిమ్ములను వినమ్రుడనై వేడుకుంటున్నాను.

(1) **కో దేవః సర్వ వేదేషు?** సర్వ వేద వాఙ్మయములో ఏ స్వామి వేదవేద్యుడుగా, దేవదేవుడుగా స్తుతించబడుచున్నారు?

(2) దేవతలందరు ఏ పరంధామునియందు నిత్యనివాసులై ఉంటున్నారు? **కస్మిన్ దేవాశ్చ సర్వశః?**

(3) **కస్య శుశ్రూషణాత్ నిత్యం ప్రీతా దేవా భవంతి మే?** ఎవనికి నేను శుశ్రూష చేయటంచేత దేవతలందరు నాపట్ల అనునిత్యముగా ప్రీతిపొందగలరు?

ఈ ప్రశ్నలు విన్న శ్రీవ్యాసమహర్షి శ్రీ శుకుల వారికి ఈ విధంగా బోధించసాగారు.

**శ్రీ వేదవ్యాసులవారు :** ఓ తపోధనా! ప్రియపుత్రకా! శుకా! విను. 4 వేదములు కూడా

| **సర్వదేవాత్మకోరుద్రః** – 'సర్వదేవతల ఆత్మస్వరూపుడు రుద్రుడు'। |
|---|
| **సర్వేదేవాః శివాత్మకః** – దేవతలందరు శివాత్మ స్వరూపులే। |

అని మంత్రముగ్ధంగా ఉచ్ఛైస్వరముతో గానము చేస్తున్నాయయ్యా! శివుడే–సర్వాత్మకుడు. సర్వతత్త్వస్వరూపుడు. ఉమా (ప్రకృతి) సహితుడు. మనందరియొక్క ఆత్మేశ్వరుడు, ఆత్మస్వరూపుడు రుద్రభగవానుడే।

రుద్రునికి – **కుడివైపు**గా → సూర్యుడు, బ్రహ్మ, త్రి–అగ్నులు (దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని, ఆహవనీయాగ్ని)।
**ఎడమవైపు**గా → ఉమాదేవి, విష్ణువు, సోముడు. (చంద్రుడు).

ఈ విధంగా 'యజ్ఞ యాగ' విధానములలో సాంగ – సవాహన – సాయుధ – సభక్త జన సమేతంగా ఆహ్వాన – స్తుతి – ఉపాసనలు (విశ్వజిత్, అశ్వమేధాది యజ్ఞవిధులు) అభివర్ణించుచున్నాయి. వేదవాఙ్మయములో అనేకచోట్ల ఇట్టి దేవతాహ్వానలాంఛనముల గురించి చెప్పబడటం జరుగుతోంది. ఇంకా ఈ రీతిగా అంతరార్థము ఉద్దేశ్యించబడుతోంది.

**యా 'ఉమా' – సా స్వయం విష్ణుః।** ఓంకారములో **'అ'**కారము శివుడుగా, **'ఉమ'** ప్రకృతిగా చెప్పబడుతోంది. ఈ విధంగా ఏ మూలప్రకృతి తత్త్వాన్ని **'ఉమ'** అని పిలుస్తున్నారో, **ఆ ఉమాదేవి స్వయముగా విష్ణువే!**

**యో విష్ణుః సహి చంద్రమా!** ఎవ్వరైతే విష్ణువో, వారే స్వయముగా చంద్రమసుడు (మనో అధిష్ఠాన దేవత) అయి ఉన్నారు.

- ఈ విధంగా ఉమ – బ్రహ్మ – విష్ణు – చంద్ర – ఇంద్రాది దేవతలు శివునికి అభిన్నులు. అనన్యులు.
- ఈ జీవులంతా శివస్వరూపులే।
- వారి వారి స్వభావములన్నీ ఉమాస్వరూపం।
- **శివాత్ పరతరమ్ నాస్తి।** శివునికివేరుగా ఎక్కడా ఏదీ లేదు।
- ఆబ్రహ్మాది పిపీలికము వరకు మనమంతా, సర్వకాలములలోను సర్వదా శివస్వరూపులమే।

ఇంకొక ముఖ్య విషయం. ఇక్కడ గమనించాలి.

**యే నమస్యంతి గోవిందం, తే నమస్యంతి శంకరమ్।** ఎవ్వరు గోవిందునికి నమస్కరిస్తున్నారో, వారు శంకరునికి నమస్కరించినవారే అగుచున్నారు. ఎవరు హరిని భక్తిపూర్వకంగా అర్చిస్తున్నారో వారు వృషభధ్వజుడగు హరుని అర్చించుచున్నవారే। **(శివాయ విష్ణురూపాయ! శివరూపాయ విష్ణవే! శివస్య హృదయం విష్ణుః। విష్ణుశ్చ హృదయగ్ం శివః। – స్కందోపనిషత్)।**

**యే ద్విషంతి విరూపాక్షం, తే ద్విషంతి జనార్దనమ్।** ఎవ్వరు విరూపాక్షుని (శివుని) ద్వేషిస్తూ ఉంటారో, వారు జనార్దనుని (విష్ణువుని) ద్వేషిస్తున్నట్లే అవుతుంది.

**'రుద్రుడు అనగా ఎవ్వరు?'** అను ప్రశ్నకు సరి అయిన సమాధానము ఎవ్వరు ఎరుగరో, అట్టివారు – **ఏమే రుద్రం నాభి జానంతి, తే నజానంతి కేశవమ్।** వారు కేశవునికూడా తెలియనివారే. **(యథా అంతరమ్ న పశ్యామి, తథా మే స్వస్తిః ఆయుషి।)**

**రుద్రాత్ ప్రవర్తతే బీజమ్।** రుద్రుని నుండియే ఈ 'జగత్' అను బీజము ప్రవర్తమానమగుచున్నది. **బీజ యోనిః జనార్దనః।** అట్టి జగత్ బీజమునకు యోని (స్థానము, కారణము) జనార్దనుడే!

**యో రుద్రః సః స్వయం బ్రహ్మ।** ఎవరు రుద్రుడుగా సంప్రదర్శనమగుచున్నారో, వారే స్వయముగా సృష్టికర్తయగు 'బ్రహ్మ' కూడా అయి ఉన్నారు. **యో బ్రహ్మా స హుతాశనః।।** ఎవరు బ్రహ్మగా అయి ఉన్నారో, వారే అగ్నిదేవుడు కూడా!

- **బ్రహ్మ విష్ణుమయో - రుద్రః** రుద్రుడు → బ్రహ్మ, విష్ణుమయుడు (ఆభరణమునందు బంగారమువలె) అయి ఉన్నారు.
- **అగ్నీ సోమాత్మకం జగత్।** - ఈ జగత్తో? అగ్ని-సోమాత్మకము (ఉష్ణశీతల సమన్వయము. పురుషుడు - ప్రకృతిల సమావేశము).

జగత్తులో కనిపించే పుంలింగము - ఈశ్వరుడు. స్త్రీ లింగము - భగవతి అగు 'ఉమ'. (పుంలింగం =Doer; స్త్రీలింగం= Doings) (స్త్రీ =సత్+రతీ॥)

ఈ జగత్తులో కనిపించే జీవులు, స్థావర - జంగములు (Non movings and movings) ఉభయము కూడా **ఉమా-రుద్రాత్మకములే!**

**వ్యక్తముగా కనిపించేదంతా ఉమ. వ్యక్తీకరిస్తూ, అవ్యక్తమైయున్నది - మహేశ్వరుడు!**

| | |
|---|---|
| **శరీరి = శివుడు।** | **శరీరము = ఉమ।** |
| **పురుషుడు = శివుడు।** | **స్వభావము / ప్రకృతి = ఉమ।** |
| **కదిలించువాడు = రుద్రుడు।** | **కదిలించటము / కదులుచున్న సమస్తము = ఉమ।** |
| **చూచువాడు = రుద్రుడు।** | **చూడబడుచున్న సమస్తము, చూపు = ఉమ।** |

## "నమః"-నమస్కారము

నః = అందరిలోని నేనైన 'నేను'.

మః = వ్యష్టిలోని 'నేను'। 'ప్రకృతి' తెలియబడునది. ఉమ।

నమః = పురుషుడు+ ప్రకృతి, నేను + నాది.

కదల్చువాడు + కదలునది, తెలుసుకొనువాడు + తెలియబడునది

భావికుడు + భావన, చూచువాడు + చూడబడునది

ఊహించువాడు + ఊహ.

ఈ రెండింటి సంయోగ ఏకత్వమును సూచించు శబ్దమే **"నమః"**।

**'నమస్కారము':** నకార - మకారములు తనవైన పరమశివ - శివా! నమస్కారము! **'పై ద్వంద్వములు సంయోగ - ఏకత్వము'** యొక్క ధారణ, ఉపాసన, సందర్శనములే 'నమస్కారము'।

## విష్ణు శబ్దార్థము

ఓ శుకా! ఇప్పుడు 'విష్ణువు' అను శబ్దతత్త్వ నిర్వచనము విను.

**ఉమా శంకరయో యోగః స యోగో 'విష్ణుః' ఉచ్యతే। 'విష్ణు'** శబ్దమునకు అర్థము - ఉమాశంకర సంయోగ అభేదత్వమే! అందుచేత **'విష్ణవే నమః'** అని నమస్కరించుచున్నప్పుడు - తెలుసుకొనుచున్న **'శివతత్త్వము'** మరియు తెలియబడుచున్న **'ఉమా తత్త్వము'**ల ఏకత్వమునకే నమస్కరిస్తున్నామని గ్రహించి ఉండాలి. అట్లాగే, **'ఉమా నమస్కారము - విష్ణు నమస్కారమే అగుచున్నది'** **సర్వ నమస్కారములు ఆత్మ నమస్కారములే!**

**శ్లో॥ ఆత్మానమ్, పరమాత్మానమ్, అంతరాత్మానమ్ ఏవచ,**
**జ్ఞాత్వా త్రివిధమ్ ఆత్మానమ్ 'పరమాత్మనమ్' ఆశ్రయేత్॥**

ఓ ప్రియకుమారా! ఉత్తమ తపస్వీ! శుకా! 'ఆత్మ'! - అన్నదానిని '3' రకములుగా ఎరిగి ఉండెదవు గాక!

**(1) ఆత్మ** = జీవాత్మ. దేహము + దృశ్యము + **దేహి = దేహముగా, జీవాత్మగా** నేనైన **'నేను".**

**(2) అంతరాత్మ:** జాగ్రత్ స్వప్న సుషుప్తుల, జన్మ - జన్మాంతరముల అంతర్లీనమైయున్నట్టిది **అంతరాత్మ. జాగ్రత్-స్వప్న-సుషుప్తులు నావైన నేను। జన్మ - జన్మాంతరములు** నావైన **'నేను'.**

**(3) పరమాత్మ:** జీవాత్మ - జగత్తులను 'స్వీయకల్పన'గా కలిగి ఉండి, వినోదించుచున్నవాడు. లోకములు, లోకేశులు, లోకస్థులు. తనయందు తానే స్వకీయ మాయా విశేషములుగా కలిగి ఉండి, తాను కేవల సాక్షియై, కారణకారణమై వెలుగొందుచూ ఉన్న సహజ స్వస్వరూపము. **సమస్త జీవులకు, సమస్త జగత్తుకు ఆత్మగా** నేనైన **నేను। కారణకారణమై వెలుగొందుచూ ఉన్న స్వస్వరూపము. సమస్తము** నేనైన **'నేను'.**

ఈ విధంగా స్వస్వరూపాత్మను '3' రీతులుగా ఎరిగి ఉండి, "సమస్తము నేనే అయిఉన్నట్టి **'నేను'** - అను **'పరమాత్మత్వము'**ను ఆశ్రయించినవాడవై ఉండుము. అట్టి ఆశ్రయమే నిర్వికల్ప సమాధి. తక్కిన రెండిటిని అధిగమించి, 3వ దానిని మననము చేయువాడవై ఉండుము.

**అంతరాత్మ: అంతరాత్మా భవేత్ బ్రహ్మా!** అంతరాత్మయే - బ్రహ్మదేవుడు (సృష్టికర్త)గా అగుచున్నది. అనగా, సృష్ట్యభిమాని అయి, మనో, బుద్ధి, చిత్త, అహంకార - ధర్మములన్నీ సృష్టియందు 'సంకల్పన'గా కల్పన చేస్తున్నారు.

**పరమాత్మ: పరమాత్మా మహేశ్వరః।** సృష్టికి ఆవల, (నటుని యొక్క పాత్రకు ఆవలగల సహజరూపమువలె) సర్వమునకు పరమై ఉన్నట్టి తత్త్వము-**పరమాత్మ.** సమస్తమునకు ఆవల-కేవల స్వరూపమై (ఆభరణమునకు బంగారమువలె) యున్న నేనైన నేనే- నేను.

**విష్ణువు: సర్వేషాం ఏవ భూతానాం విష్ణుః ఆత్మా సనాతనః।** జన్మ - జగత్తులకు మునుముందే ఉన్న ప్రతి ఒక్క జీవునియొక్క సనాతనమగు ఆత్మయే విష్ణువు. సర్వ జీవులు తానే అయి, సమస్తమునకు సాక్షిగా వేరై కూడా ఉన్నట్టి స్వస్వరూపతత్త్వమే **"విష్ణుతత్త్వము"।**

## త్రైలోక్య వృక్షము

***(ఊర్ధ్వ మూలమ్ - అధః శాఖః। కొమ్మలు క్రిందగా - మూలము పైపైన)***

**అస్య త్రైలోక్య వృక్షస్య భూమౌ విటపి శాఖినః।** ఒక మహావృక్షము ఉన్నది. అద్దాని కొమ్మలు క్రిందగాను, మూలముపైన ఉన్నది. అదియే **'త్రైలోక్య వృక్షము'** లేక **'సంసార వృక్షము'.**

**ఈ స్వర్గ - మర్త్య - పాతాళ త్రైలోక్య వృక్షమునకు** - క్రిందగా భూమి (భూలోకము) - భౌతికరూపంగా కనిపిస్తున్నదంతా ఆ వృక్షము యొక్క విస్తరణ.

***ఈ వట వృక్షమునకు - అగ్రం మధ్యం తథా మూలం - "విష్ణు బ్రహ్మ మహేశ్వరః॥***

**అగ్రము** - విష్ణువు। **మధ్య** - బ్రహ్మ। **మూలము** - మహేశ్వరుడు.

**ఈ త్రైలోక్య రచనా - కల్పనా చమత్కారమంతటికీ...** కార్యము = **విష్ణువు,** క్రియ (కర్తృత్వము) = **బ్రహ్మ,** కారణము = **మహేశ్వరుడు.** ఇదంతా రుద్ర చమత్కారమే. ఒకే రుద్ర మూర్తిత్వము (మనోకల్పనచే) కార్య - క్రియా - కారణములుగా అనుభూతమగుచున్నది.

అనగా, కార్య-కారణ-కర్తృత్వములకు కారణ కారణము - **"ఏకము-అఖండము"** అగు **"ఆత్మతత్త్వమే।"** సృష్టి ప్రయోజనమునకై రుద్రుడే మూడు రూపములు దాల్చుచున్నారు.

***దీనికంతటికీ : ధర్మో రుద్రో। జగత్ విష్ణుః। సర్వజ్ఞానం పితామహః।***

| | | |
|---|---|---|
| ధర్మము (Feature) | - | రుద్రుడు |
| జగత్తు (The changing Factor) | - | విష్ణువు |
| సర్వజ్ఞానము | - | పితామహుడగు బ్రహ్మ |

విచక్షణులగు తత్త్వజ్ఞులు ఈ మూడింటిని ఏక స్వరూపంగా గ్రహించుచున్నారు.

## 'శ్రీ రుద్ర రుద్ర రుద్రేతి'

అను మంత్రము సూచిస్తూ భిన్నత్వంలో ఏకత్వమును దర్శిస్తూ మహనీయులు మనకు ఏక-అఖండ తత్త్వమగు ఆత్మగురించి విశదీకరిస్తున్నారు.

బ్రహ్మ - విష్ణు - మహేశ్వరులు,

సృష్టి - స్థితి - లయములు,

ద్రష్ట - దర్శన - దృశ్యములు,

భావించువాడు - భావన - భావించబడునవి,

ఊహించువాడు-ఊహ-ఊహించబడునది-**సర్వము కేవల రుద్రతత్త్వమే! విష్ణుతత్త్వ చమత్కారమే। బ్రహ్మ చైతన్యమే! అఖండమే!**

ఈ విధంగా అఖండాత్మతత్త్వముగా - ఎవ్వరెవ్వరు ఏ ఏ దేవతను ఉపాసిస్తూ ఉంటే ఆ దేవతను ఆ విధంగా ఉపాసించటంచేత, ఆ ఉపాసకుడు సర్వ పాపములనుండి, దోష దృష్టులనుండి విడివడుచున్నాడు. - **కీర్తనాత్ సర్వదేవస్య సర్వపాపైః ప్రముచ్యతే॥**

## 'రుద్రో ఉమా ఇదమ్ సర్వమ్ ప్రోతమ్।'

| | |
|---|---|
| **రుద్రో నర - ఉమా నారీ। తస్మై తస్యై నమో నమః॥** | రుద్రుడే పురుషుడు. ఉమయే స్త్రీ. ఇరువురికి నమస్కారము॥ |
| **రుద్రో బ్రహ్మా - ఉమా వాణీ। తస్మై తస్యై నమో నమః॥** | రుద్రుడే బ్రహ్మ, ఉమయే సరస్వతి। ఉభయులకు నమో వాక్యములు.॥ |
| **రుద్రో విష్ణుః - ఉమా లక్ష్మీ। తస్మై తస్యై నమో నమః॥** | రుద్రుడే విష్ణువు। ఉమయే లక్ష్మి॥ |
| **రుద్రః సూర్యః - ఉమా ఛాయా। తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే సూర్యుడు। ఉమయే ఛాయ॥ |
| **రుద్రః సోమః - ఉమా తారా। తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే చంద్రుడు। ఉమయే తార॥ |
| **రుద్రో దివా - ఉమా రాత్రిః। తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే పగలు। ఉమయే రాత్రి॥ |
| **రుద్రో యజ్ఞ - ఉమా వేది। తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే యజ్ఞము। ఉమయే వేదిక॥ |
| **రుద్రో వహ్నిః - ఉమా స్వాహా। తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే అగ్ని। ఉమయే స్వాహాదేవి॥ |
| **రుద్రో వేదః - ఉమా శాస్త్రమ్। తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే వేదము। ఉమయే శాస్త్రము॥ |
| **రుద్రో వృక్ష - ఉమా వల్లీ। తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే వృక్షము। ఉమయే పూతీగ॥ |
| **రుద్రో గంధ - ఉమా పుష్పమ్। తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే సువాసన। ఉమయే పుష్పము॥ |
| **రుద్రో అర్థ - అక్షరః సోమా! తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే అర్థము (meaning). స-ఉమయే అక్షరము (word). |
| **రుద్రో లింగమ్ - ఉమా పీఠం। తస్మై తస్యై నమోనమః॥** | రుద్రుడే లింగము। ఉమయే పీఠము॥ |

**సర్వ దేవాత్మకగ్ం రుద్రం నమస్కుర్యాత్ పృథక్ పృథక్॥** ఏ దేవతకు నమస్కరించినా కూడా, సర్వదేవాత్మకుడగు రుద్రునికి మరల మరల నమస్కరించుచున్నట్లే.

**ఏభిః మంత్ర పదైః ఏవ నమస్యామి ఈశ - పార్వతీ॥** ఈ మంత్ర - పదములతో ఈశ్వరునికి పార్వతీదేవికి నమస్కరిస్తున్నాను.

**వారికి వారికి నమో నమః నమస్కారము।**

> శ్లో॥ **యత్ర యత్ర భవేత్ స-అర్థమ్, ఇమమ్ మంత్రమ్ ఉదీరయేత్।**
> **బ్రహ్మహా, జల మధ్యే తు, సర్వపాపైః ప్రముచ్యతే॥**

ఓ శుకా! ముముక్షు ఎక్కడెక్కడ ఏఏ స్థితిలో ఉన్నా కూడా ఈ మంత్రమును దీనిపై అంతరార్థమును సర్వదా దేహ-మనో-బుద్ధులతో 'మననము' చేస్తూ ఉండగా, (అట్లాగే) జలమధ్యగా (స్నానం చేస్తూ) ఉచ్చరిస్తూ ఉండగా కూడా అట్టివాడు బ్రహ్మహత్య మొదలైన సర్వ పాపములనుండి కూడా విముక్తుడు, నిష్కృతుడు కాగలడు. బుద్ధి మనస్సు క్రమంగా నిర్మలము కాగలవు. సర్వత్రా సర్వము కూడా శివ - పార్వతుల ప్రకృతి-పురుషుల నాట్య - విన్యాసముగా **అనునిత్యానుభవము, అనుక్షణికానుభూతము** కాగలదు. 'బ్రహ్మము' అనే మహాసముద్రములో అలలవంటివే ఈ బ్రహ్మాండములు.

సర్వము రుద్ర స్వరూపమే। సర్వమునకు అధిష్ఠానము రుద్రుడే! రుద్రుడే పరబ్రహ్మము! అట్టి పరబ్రహ్మము **అద్వంద్వము. అద్వితీయము. ఆయనకు ద్వితీయమేదీ లేదు. నేను, నీవు, ఈ సర్వజీవులు పరబ్రహ్మ స్వరూపులమే!**

అందుచేత, **సత్ చిత్ ఆనంద స్వరూపము, అవాక్ - మానసగోచరము** అగు **'పరబ్రహ్మము'**ను ఎరిగిన మరుక్షణం ఈ సర్వము సువిదితమే (wel = known, wel - understood) అగుచున్నది.

ఆ పరబ్రహ్మమే ఈ జగత్తులన్నిటికీ 'ఆత్మ'. అందుచేత రుద్ర పరబ్రహ్మమునకు వేరై ఎక్కడా ఏదీ లేదు. అట్టి పరబ్రహ్మము ఇంద్రియ విషయరూపమగు ఈ దృశ్య జగత్తులో కనిపించేది కాదు. ఈ 14 లోకముల కల్పనకు ఆవల నీ స్వస్వరూపంగా దర్శించవలసిందే! నీవే రుద్రుడవు. ఎరుగుచున్నవాడు రుద్రుడే! **నా రుద్రో రుద్ర మర్చతి।** రుద్రుడే రుద్రుని ఎరుగుచున్నాడు. రుద్రుడే రుద్రుని అర్చించుచున్నాడు.

# ద్వే (2) విద్యా

**'ద్వే (2)' విద్యే వేదితవ్యే। ఏ హి। 'పరా' చ ఏవ "అపరా" చ తే।**

ఓ మునీశ్వరా! శుకా!

(వేద) విద్య (The learning) అనునది రెండు విధములైనవి. (1) అపరా విద్య, (2) పరా విద్య.

**<u>అపరావిద్య</u> :** దేహము, దృశ్యములకు సంబంధించిన విద్య. దృశ్య-ఆస్వాదన, సాధన సంపత్తి – మొదలైన వాటికి సంబంధించినది.

**(1) చతుర్వేదములు :** ఋక్, యజుర్ సామ అథ్వర్వణ. ఋక్కులు, యజ్ఞములు, గానములు, అధ్యయనములు.

**(2) వేదాంతర్గత షడంగములు (6)**

**శిక్ష :** బోధనా విధానము (రచయిత – **పాణిని**).

**వ్యాకరణము :** శబ్దార్థ శాస్త్రము, వాక్య విభజన, పదముల సూత్రీకరణము (రచయిత – **పాణిని**).

**ఛందస్సు :** పద్య లక్షణ శాస్త్రము **(పింగళముని).**

**నిరుక్తము :** శబ్దార్థ నిర్వచనములు, పదముల అవయవార్థ వివరణలు, అలంకార శాస్త్రము **(యాస్కముని).**

**జ్యోతిష్యము:** సూర్య-చంద్ర కదలికలు, నక్షత్ర గమనములు, గ్రహణ వివరణములు, ప్రకృతి, కాల ప్రమాణము సూచించు శాస్త్రము.

**కల్పము :** వ్రత కల్పములు, న్యాయశాస్త్రము, నిబంధనములు, నిశ్చయములు, పద్ధతులు, యుగ – మహాయుగ నిర్ణయములు. యుగ ధర్మములు. మనువుల చరిత్ర మొదలైనవి.

ఇవన్నీ ద్రష్ట యొక్క 'కేవల స్వరూపము' గురించి కాదు కాబట్టి 'అపరావిద్య' అనబడుచున్నవి. 'పరమాత్మ' గురించి కాదు కాబట్టి ['అన్యము (వేరు)' అనురూపముగలవి కాబట్టి] **అన్యవిద్య.** అట్లాగే Physics, Chemistry, Mathematics, Psychology, managerial Science. Biology, Zoology, Etc. All they explain the external. Hence - కనుక అపరావిద్యయే।)

## పరావిద్య (లేక) పరమా విద్య – ఆత్మ విద్య :: 'దేహి–ద్రష్ట' – గురించిన విద్య.

ఈ దేహమునకు ఆవలగా ప్రవర్తించుచూ, ఈవలిదగు ఈ భౌతిక దేహమును కదలించే జీవుని స్వకీయ **'చైతన్య రూపము'** (The one who is using and moving the body) **గురించి చెప్పే విద్య.** కేవలమగు **నేను** గురించి వివరించే విద్య. దృశ్యమునకు, దేహమునకు, దేహికి పరమై, సర్వదా యథాతథమై ఉండటంచేత అక్షరమైయున్న 'ఆత్మ' గురించిన విద్య. **ఈ జీవుని జాగ్రత్ స్వప్న సుషుప్తులకు వేరైన, "కేవలమగు సాక్షి" గురించి కాబట్టి – "పరా (Beyond) విద్య".**

## ఆత్మ యొక్క (లేక బ్రహ్మము యొక్క) విలక్షణ లక్షణములు

**అద్రేశ్యము-అకాలము :** ఆత్మ దేశ – కాల పరిమితమైనది కాదు. కాల సంబంధమైనది కాదు. దేశ కాల కల్పనలకు ఆవల **సర్వవ్యవహారములను ప్రకాశింపజేయునదై ఉన్నట్టిది.**

**అగ్రాహ్యమ్ :** జగత్తులో కనిపించే వస్తువుల వలె – ఇంద్రియములకు, మనస్సుకు 'విషయము'గా గ్రహించవీలులేనిది. బుద్ధికి కూడా జననస్థానముగా గమనించబడేది. దృశ్య సంబంధమైన బుద్ధిని మౌనంగా తీర్చిదిద్దుకొనుచుండగా, – **ఆత్మకే ఆత్మగా** తెలియబడునది. (మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వము)

**అగోత్రగ్ం, రూప వివర్జితమ్:** ఆత్మ-గోత్రము, జాతి, మత, రూప సంబంధమైనది కాదు. నామ రూపాత్మకము కాదు. సాంఘికములైనవన్నీ (జగత్ దృశ్యము యొక్క) క్రీడా విశేషాలు అగుచుండగా, పరమగు ఆత్మ – **స్వకీయ-జగత్ కల్పనా-లీలా క్రీడా వినోది.** (The one which is visualizing and then enjoying).

**అచక్షుః శ్రోత్రం, అపాణిపాదమ్ :** అది పంచ జ్ఞానేంద్రియములకు, పంచ కర్మేంద్రియములకు, వాటి వాటి వ్యావహారిక ధర్మములకు, విషయములకు సంబంధించినది కాదు. వస్త్రము – అద్దానిని ధరించువాని రూపముగా అవుతుందా? కాదు కదా! ఆత్మ సర్వేంద్రియముల నియామకమైనది. దేహములను, ఇంద్రియ విషయములను కదల్చునది. ఇంద్రియ విషయములన్నీ ఆత్మకు తాను రచించి తానే ఆనందిస్తున్న కథ, నవల, చిత్రలేఖనములు వంటిది.

**నిత్యమ్ :** త్రికాలములలో యథాతథము.

**సత్యమ్ :** జాగ్రత్ స్వప్న సుషుప్తులకు, దేహ దేహాంతరములకు, జన్మ – జన్మాంతరములకు, జన్మల వ్యవహారములకంతటికీ కూడా మునుముందే ఉన్నట్టి 'కేవలసత్' (The Absolute Presence) స్వరూపము. సర్వదా వెంటనంటి ఉండేది. ఆత్మ **సత్‌స్వరూపమై** ఉండటంచేతనే అన్యమైనదంతా ఉనికిని పొందుచున్నది. బిడ్డా! శుకా! ఉత్తమ ఆశయ సంసిద్ధుడా! నీవు ఆ **'కేవల సత్'** యే అయి ఉన్నావయ్యా! **త్వమేవ రుద్రో! త్వమేవ ఉమా! త్వమేవ సర్వమ్!** నీవులేనిది ఎప్పుడూ లేదు. ఎప్పటికీ ఉంటావు. నిత్యుడవు. సర్వదా సత్–చిత్–ఆనంద స్వరూపుడవు!

**విభుగ్ం :** ఆత్మ సర్వమునకు నియమించునది. ఈ సర్వము తనయొక్క విభవముగా కలిగియున్నట్టిది. సర్వమునకు యజమాని.

**సర్వగతగ్ం :** సర్వమునందు, సర్వముగా విస్తరించియున్నట్టిది. విశ్వమునందు కాంతివలె, దేహమునందు 'నేను' వలె సర్వగతం.

**సుసూక్ష్మమ్ :** ఆకాశముకంటే అత్యంత సూక్ష్మమైనది. భౌతికాశము సూక్ష్మముగా దృశ్యమంతా నిండి ఉన్నట్లు, **ఆత్మ సర్వత్రా స్థూల–సూక్ష్మ–చిదాకాశరూపమై వెలయుచున్నది.**

**అవ్యయమ్ :** నవలా రచయిత యొక్క **రచనా కళా విన్యాసము** – ఆతడు రచించుచున్న నవల చివరికి వచ్చినంతమాత్రం చేత – కళ (The Art of writing) ముగియటము జరగదు కదా! ఒక కళాకారుడు ఒక చిత్రమును చిత్రించటం పూర్తి అయినంత మాత్రం చేత ఆతనియందలి **చిత్రకళ** ముగియదు కదా! ఒకడు ఒక భాషలో సుదీర్ఘమైన కావ్యము **రచించటం** పూర్తి అయినంతమాత్రం చేత ఆ భాషలోని అక్షరములు తరగవు, పెరగవు కదా! **అట్లాగే ఆత్మ కూడా సర్వదా జగత్తుల రాక – పోకలచే తరుగదు, పెరుగదు. దేహములచే ఏదీ పొందదు. కోల్పోదు. కనుక అవ్యయము!**

***నిర్మలము, సునిశితము, విస్తారము, ప్రశాంతము అయినట్టి బుద్ధిగల ధీమంతులు – తమయందే అట్టి ఆత్మను దర్శించుచున్నారు. సర్వజీవులు బయల్వెడలుచున్న 'భూతయోని (జనన) స్థానమును ఎరుగుచున్నారు. సర్వమును స్వస్వరూపమునుండి బయల్వడలుచున్న కల్పనా చమత్కారంగా సందర్శించుచున్నారు.***

- ఎవ్వడైతే భూత – వర్తమాన – భవిష్యత్తులను తనయొక్క 'ఎరుక' అను విన్యాసముచే నింపివేస్తూ ఉండటంచేత **సర్వజ్ఞుడో..,**
- సర్వమును తాను ఎరుగుచున్న రీతిగానే తనకు తెలియబడుచూ ఉండుటచే (యత్ జ్ఞాతే, తదేవజాయతి। యత్ భావయతే, తదేవ భవతి। యత్ భావమ్ తత్ భవతి।) 'సర్వవిదుడు' అయి ఉన్నాడో...,
- ఏది ఎరిగిన మరుక్షణం తపస్సు (తపన) జ్ఞానమయం అయి ఉంటుందో.

అట్టి ఆత్మతత్త్వము **అరూపమే** అయినప్పటికీ, అద్దానినుండి **ఈ *సరూప జగత్ దృశ్య వ్యవహారములన్నీ*** బయల్వెడలుచున్నాయి.

నిరాకారమగు జలము నుండి సాకారమగు తరంగములు బయల్వెడలి, తిరిగి నిరాకార జలమునందే లయమొందుచున్న రీతిగా... **నిర్విషయ పరబ్రహ్మము** నుండి **సవిషయ జగత్ వ్యవహారమంతా** బయల్వెడలి, తిరిగి అట్టి స్వాత్మ పరబ్రహ్మమునందే – స్వప్నములోని విశేషములవలె – లయము పొందుచున్నది. స్వాత్మ సర్వదా **యథాతథమై** ఉంటోంది.

**శ్రీశుకుడు :** తండ్రీ! ఘనీభూతమై కనిపిస్తున్న ఈ జగత్తు సత్యమా? అసత్యమా? ఉన్నదా? లేనట్టిదా?

**శ్రీ వ్యాసభగవానుడు :** ఈ జీవునికి అనుభవమగుచున్న దృశ్య జగత్తు స్వకీయభావనా వైభవమే! కనుక స్వతఃగా ఉన్నది కాదు. ఎవ్వరు దేనిని ఏ రీతిగా భావిస్తే, అది ఆ రీతిగా అనుభవమగుచున్నది. కాబట్టి – **'కల్పన' (లేక) 'భావన'**గా నిర్వచించబడుచున్నది. **దృష్టిని బట్టి సృష్టి** ఉండి ఉంటున్నప్పుడు ఇద్దానికి ఇత్థమిత్థమైన సత్యము ఏముంటుంది? **దృష్టియే సృష్టి.**

అయితే స్వకీయ భావనచే నిర్మితమగుచున్న ఈ జగద్దృశ్యమంతా **'సత్యమువలెనే'** (ఆత్మసామీప్యతచే) భాసిస్తోంది.

ఒకడు త్రాడును చూచి పాము అని అనుకుంటూ ఉంటే, అక్కడ పాము ఉన్నట్లు అవుతుందా? అవదు. కానీ, పాముగా భావించినవానికి 'పామే' అని అనిపిస్తుంది, కనిపిస్తుంది కూడా. ఆతనికి అది సత్యమే అవుతుంది. అట్లాగే ఈ 'జగత్తు' అనబడునది – త్రాడు యందు పాము కనబడటం, ఎలాగో – అటువంటిదే.

మొదలే లేని ఈ జగద్దృశ్యము ఆత్మ సమాచారము సముపార్జించని అజ్ఞానికి **'భవబంధము' లేక 'సంసారబంధరూపము'** అగుచున్నది. **తత్ ఏతత్ అక్షరగ్ం సత్యమ్, తత్ విజ్ఞాయ విముచ్యతే!** (1) అక్షరము, సత్యము అగు **ఆత్మను సత్యము**గా, (2) జగదనుభవము **అసత్తుగా–భావనగా–ఊహగా–స్వీయకల్పనగా ఎరిగినప్పుడు** – (త్రాడులోచూచిన పాము, త్రాడుగా ఎరుగగానే మటుమాయమైనట్లుగా) – ఆ ఆత్మవిజ్ఞానికి జగత్ బంధము స్వయముగా మొదలంట్లా తొలగిపోయినదే అగుచున్నది.

అయితే బిడ్డా! శుకా! ముముక్షువులందరి దృష్టికి ఒక ముఖ్యమైన విషయము తెస్తున్నాను.

**జ్ఞానాత్ ఏవ హి సగ్ంసార వినాశో। నైవ కర్మణా।**

ఆత్మజ్ఞానము చేతనే సంసారబంధము విడివడగలదు. **ఆత్మ** గురించి **తెలుసుకొంటేనే,** అంతా **తెలిసిపోతుంది.** అట్లా కాకుండా, ఆత్మజ్ఞానమును ప్రక్కకుపెట్టి, కేవలము **'కర్మలను' ఆశ్రయిస్తూ మాత్రమే ఉంటాము** – అను నిర్ణయము కలవానిపట్ల సంసారబంధములు, సంసార భ్రమలు తొలగవు.

మరి జ్ఞానము లభించేది ఎట్లా? ఆత్మ జ్ఞానులమై, ఆత్మపట్ల జన్మజన్మలుగా వెంటనంటి వస్తున్న భ్రమలు తొలగాలి. **అందుకు ముఖ్యమైన ఉపాయము చెప్పుచున్నాను. విను.**

## సద్గురు శుశ్రూషయే అందుకు మహత్తరమగు ఉపాయము।

అందుచేత సంసార దుఃఖమునుండి తరించాలనే మహదాశయముగల ముముక్షువు – **'శ్రుతి హృదయమును ఎరిగిన శ్రోత్రియుడు, 'త్వమ్ తత్ అసి' అను రుద్ర హృదయమును నిరూపించగల బ్రహ్మనిష్ఠుడు** – అగు **గురువును ఆశ్రయించాలి.** ఆత్మతత్త్వము గురించి శ్రవణం చేయాలి. **శ్రోత్రియం బ్రహ్మనిష్ఠగ్ం స్వగురుం గచ్ఛేత్ యథా విధి।**

## సద్గురువుయొక్క విధి

శ్రద్ధ – ఆసక్తి – తపస్సు – గురుభక్తిగల శిష్యుడు సమీపించినప్పుడు, ఆ సద్గురువు **'బ్రహ్మాత్మబోధిని – అహమ్ బ్రహ్మాస్మి'** అగు **పరావిద్య**ను తప్పక సవివరంగా, నిర్ద్వంద్వంగా, సర్వసందేహములు నివృత్తమయ్యేటట్లుగా బోధించాలి. అందుకు కావలసిన మనన, నిదిధ్యాస, సమాధులకు కావలసిన సాధన – భావన మొదలైనవి మార్గదర్శకం సూచించాలి.

**గురుః తస్మై పరాం విద్యాం దద్యాత్ బ్రహ్మాత్మ బోధినీమ్।**

❖

ఏ జీవుడైతే తన హృదయగుహయందే తేజో–జ్ఞాన–జ్యోతి రూపమై వెలుగొందుచున్న (లేక సర్వమును ప్రకాశింపజేయుచున్న) అక్షరుడగు రుద్రపరమాత్మయొక్క ఉనికిని తెలుసుకొని, దర్శించి మమేకమౌతాడో, ఆతడు {('సృష్టి ఉన్నది' అను) **బ్రహ్మగ్రంథి,** (సృష్టి కొనసాగుచున్నది అను), **విష్ణుగ్రంథి** ('సృష్టిలయము కావాలి' అనే) **రుద్ర గ్రంథి** అనబడే} మహాగ్రంధులను ఛేదించినవాడై – సనాతనుడగు శివతత్త్వమునందు ప్రవేశించగలడు. 'తత్‌తో –మమేకము' అగుచున్నాడు. **ఈ జీవుని అమృత స్వరూపమగు శివతత్త్వమే సత్యము. అట్టి శివోఽహమ్ తత్త్వమ్** ముముక్షువు యొక్క బోధవ్యమైన (తెలుసుకోవలసియున్న) **స్వస్థానము.**

| | | |
|---|---|---|
| తారము (దృష్టి) | – | **శరము** |
| పరబ్రహ్మము | – | **లక్ష్యము** |

అని మోక్ష శాస్త్రవేత్తలచే సూచించబడుతోంది. ఈ జీవుడు అత్యంత అప్రమత్తతతో **'ఆత్మజ్ఞానము'**నకు సంసిద్ధుడై, ప్రయత్నశీలుడై, లక్ష్యమును భేదించి జీవాత్మను అధిగమించి అఖండ – కేవల – అమృత – సాక్షీ రూపమగు పరబ్రహ్మత్వముతో (లేక) రుద్రహృదయముతో **'సోఽహమ్ భావనతో మమేకము'** అవ్వాలి.

| | | |
|---|---|---|
| లక్ష్యము | – | సర్వగతమైన స్వస్వరూపము। |
| శరము | – | సర్వగతమువైపు ఉన్ముఖత్వము (Being directed)। |
| తెలుసుకోవలసినది (వేద్ధవ్యగ్ం) | – | సర్వగ్ం – సర్వగతత్వము |
| లక్ష్యము | – | శివతత్త్వము। |

**జ్ఞాన సాధనచే ఈ జీవుడే శివుడై ప్రకాశించుచున్నాడు.** ఇందులో సందేహము ఏమాత్రం లేదు.

అట్టి పరబ్రహ్మముయొక్క సంప్రకాశస్థానమునందు (ఆత్మాకాశమునందు) – ఇక్కడి భౌతికాకాశములో కనిపించే సూర్యచంద్రుల ఉదయాస్తమయములకు, భౌతిక ప్రకాశములకు, పాంచభౌతికమగు అగ్నియొక్క కాంతి ప్రజ్వలనములకు స్థానము లేదు. వాయువు అక్కడ చలనము కలిగినదై ప్రదర్శనమవదు. దేవతలు, మానవులు – మొదలైన భేదములు ఆత్మయందు లేవు.

ఇవన్నీ **అన్యములు.**

ఆత్మయో, **అనన్యము.** అట్టి ఆత్మభగవానుడు – **"సర్వ భావములు బయల్వెడలి, ఉండి, లయించు"** – స్థానము. భావములలో ఆయన లేరు. ఆయననుండి భావాలు జనిస్తున్నాయి. కనుక **కృతభావభూతుడు.** స్వయంభావుడు. స్వయం భవుడు. నిత్యవిశుద్ధుడు. దోషరహితుడు. కాబట్టి **విరజుడు.** ఆయనయే **ఆత్మభగవానుడుగా స్వయం ప్రకాశకుడై అన్యమైనదంతా ప్రకాశింపజేయుచున్నారు.**

# దేహవృక్షము - జీవాత్మ - పరమాత్మ పక్షులు

ఈ 'దేహము' అనే వృక్షముపై ఇద్దరు చైతన్యమూర్తులు పక్షులవలె వ్రాలి దేహములో నివాసము కలిగి ఉంటున్నారు. ఈ రెండు **కలిసియే ఉండి,** జడమగు దేహమునకు చైతన్యత్వమును ప్రసాదిస్తున్నారు.

**(1) జీవాత్మ :** కర్మఫలములను ఆస్వాదిస్తూ ఉన్నట్టిది.

**(2) మహేశ్వరుడు :** కేవలము సాక్షిగా ఉంటూ ఉన్నది. కర్మఫలములు ఏమాత్రము భోగించటమే లేదు. ప్రశాంత-పూర్ణత్వ-సమత్వభావములు కలిగి ఉంటోంది.

ఈ రెండూ ఏకరూపమేగాని, వేరు వేరు కానప్పటికీ మాయావరణ కారణంగా ఒకటి **కర్మఫలభోగి అని**, రెండవది **కేవల సాక్షి** అని ఆత్మ తత్త్వ జ్ఞానసిద్ధి కొరకై విడదీసి చెప్పబడుతోంది. కల్పితమగు మాయావరణచే రెండుపక్షులవలే కన్పిస్తున్నాయి. జీవుడు సాక్షి చైతన్యమును ఆత్మజ్ఞానముచే సమీపించిన మరుక్షణం **"ఏకమే, పరస్పరము అద్వితీయమే"** అగుచున్నాయి.



## జీవ - బ్రహ్మైక్యము

ఒక గృహము (మఠము). ఆ గృహంలో **ఆకాశము** (space).
ఆ గృహములో ఒక కుండ (ఘటము). ఆ కుండలో ఆకాశము (space)
ఆ గృహము బయట 'ఆకాశము' (బాహ్యాకాశము).

ఆకాశము (space/place) సర్వదా ఏకమే అయినప్పటికీ, మాటవరసకు :-

- ఇది **ఘటాకాశము** (Space in the Pot).
- ఇది **మఠాకాశము** (Space in the house).
- ఇది **బాహ్యాకాశము** (Space out side the house). **(మహాకాశము)**

అని పిలుస్తున్నాం. ఆ పేర్లన్నీ ఆకాశమునకు కల్పితములు మాత్రమే. అట్లాగే పరమార్థముగా చూచినప్పుడు, →

- 'జీవుడు' అనునది శివరూపమునకు కల్పితము,
- తత్త్వతః సాక్షాత్ శివుడే స్వయముగా సర్వదా 'జీవుడు'గా (అజ్ఞాన దృష్టికి) కనిపిస్తున్నారు.

"ఎరుగుచున్నవాడు - ఎరుగబడుచున్నది" (The knower and that being konwer)లను విశ్లేషించగా ఎరుక అనునదే నిత్యమై సిద్ధిస్తోంది. ఎరుగబడేదిగా కల్పనచే విస్తరించినదై కనిపించుచున్నప్పటికీ, 'ఎరుక'కు లోటేముంటుంది? చిత్ → చిదాకారముగా (వెలిగించబడేదిగా, తెలియబడేదిగా) కనిపించుచున్నప్పటికీ, ఆత్మయొక్క చిత్ తత్త్వమునకు కలిగే హాని ఏమీ లేదు. చిత్ అనన్యము. జడరూపముగా కనిపించేదంతా (All that being experienced - Passive Voice) ఆత్మతత్త్వజ్ఞాన పరిశీలనచే - **చైతన్యముయొక్క ప్రదర్శనమే!** జడమును భేదించిచూస్తే **'చిత్ చైతన్యము'** యొక్క రూపముగానే శేషించుచున్నది.

కలలో కనిపించే శిల్పము జడము కాదు. స్వప్న చైతన్యరూపమే। నవలలో వర్ణించబడే కొండ జడము కాదు. రచయితయొక్క రచనా చైతన్య రూపమే.

అన్నములో చైతన్యమున్నది కాబట్టి, శరీరములో ప్రవేశించి జీర్ణమై దేహమును జీవింపజేస్తోంది.

ఈ విధంగా తర్కము (Logic) చేతను, శాస్త్ర ప్రమాణముచేతనూ, మహావాక్యపరమార్థము చేతను **'చిత్ ఏకత్వ వ్యవస్థితి'** (లేక) చిత్ (Enlightenment) **యొక్క ఏకత్వము -** సర్వే సర్వత్రా వ్యవస్థితమైయుంటోంది.

**ఇక 'జడము' అనబడునది ఎక్కడున్నది?**

ఈ విధంగా - **చిత్ ఏకత్వ పరిజ్ఞాతే న శోచతి, న ముహ్యతి।** ఎవ్వడైతే 'చిత్ - ఏకరసరూపము' గురించి పరిజ్ఞాత (wel-knowing) అయి ఉంటాడో, అట్టివాడు ఇక దేనికీ శోకించడు. దేనినీ చూచీ మోహము పొందడు. అట్టివాడు అద్వైత పరమానంద రూపమగు **'కేవల శివత్వము'**ను పొందినవాడై ఉంటున్నాడు. ఈ సమస్త జగత్తుకు అధిష్ఠానము (By what it is all made up of) సత్యమగు - (సత్‌స్వరూపమగు) ఆత్మయే! **అట్టి సత్ స్వరూపమగు చిద్ఘన స్వరూపమే నేను** (I am this form of entire existence factor).

**'నేను సర్వదా ఆత్మనే'** అను నిశ్చయముచే సమస్తమునకు అనన్యత్వమును మనో బుద్ధి చిత్త సమేతంగా స్వీకరించుము. ఆత్మకు అన్యమైనదంతా ఆమూలాగ్రము నిస్సందేహముగా త్యజించి ఉండుము. అట్టి అన్యమైనదానిపట్ల అంతరంగమున 'మౌనము' వహించిన ముని వీతశోకుడు (Relieved of all worries) అగుచున్నాడు. ఆత్మానందమునందు సునిశ్చలుడు, సునిశ్చితుడు అగుచున్నాడు.

**'అహమాత్మ!' 'అహమాత్మ!'** అని ప్రశాంతతో కూడిన పరమానందమయుడగుచున్నాడు. **"ఈ జగద్దృశ్యమునకు అంతరమున, ఈవల, ఆవల కూడా మమాత్మయే విస్తరించి యున్నది"** – అనునది ఆత్మతత్త్వజ్ఞుని స్వాభావికానుభవము.

**శ్లో॥ స్వశరీరే స్వయం జ్యోతిః స్వరూపగ్ం, సర్వసాక్షిణమ్, క్షీణదోషాః ప్రపశ్యంతి॥**

ఏ ధీరుడైతే తనయొక్క మనో – బుద్ధి – చిత్తములలో ఏర్పడినవైయున్న దోషములను, దోషదృష్టులను (కర్మయోగ – క్రియాయోగ – భక్తియోగ – జ్ఞానయోగ – సర్వ సమర్పణయోగ – శరణాగతి యోగముల) ఉత్తమ ప్రయత్నములచే మొదలంట్లా తొలగించుకొని యుంటాడో, అట్టివాడు **'స్వయంజ్యోతిస్వరూపము, సర్వసాక్షిణము, సర్వ స్వరూపము'** అగు పరబ్రహ్మ చైతన్యమును **స్వశరీరమునందే ప్రత్యక్షము చేసుకొనుచున్నాడు.**

అట్లు పరిశుభ్రమగు అంతరంగము లేనివాడు మాయ చేత ఆవృతుడై ఉండుటచే పరమాత్మను మరెక్కడా సిద్ధించుకోలేడు. **నేతరే – మాయయావృతాః॥**

అట్టి **పరమాత్మయోగము** కొరకై (లేక) **ఆత్మభావనా సంపూర్ణయోగ సిద్ధికై ఒకడు ఎక్కడికి వెళ్లాలి? ఎక్కడికో వెళ్ళవలసిన అవసరం లేదు. మరొక లోకమునకో, ఇంకొక ఆశ్రమమునకో వెళ్ళి పొందవలసినట్టిది కాదు. ఇప్పుడు కాకుండా, మరింకెప్పటికో, ఎన్నటికో పొందవలసినది కూడా కాదు.**

స్వకీయ–బుద్ధియందు గల దోషములు తొలగించుకొని ఇప్పుడే, ఇక్కడే ఆత్మరూప పరిజ్ఞానముచే **తనయందు తానే పొందవలసి ఉన్నట్టిది – ఆత్మానుభవం.**

దృష్టాంతానికి...,

అంతటా విస్తరించియున్న అఖండము – ఏకము అగు ఆకాశము తనను తాను పొందటానికి ఎక్కడికి వెళ్ళాలి? ఎన్నటికో పొందవలసి అగత్యమేముంటుంది? అట్లాగే, సహజముగా పరతత్త్వము తానే అయి ఉన్న ముముక్షువు తనయొక్క **పరతత్త్వము (లేక) బాహ్యీస్థితి (లేక) పరబ్రహ్మత్వము** సిద్ధించుకోవటానికి, ఎక్కడికి వెళ్లాలి? సర్వత్రగము, (సర్వత్ర గమనము కలిగి యున్నట్టిది), కేవలము అగు ఆత్మతత్త్వముగా స్వా౽నుభూతము చేసుకోవటానికి మరొక చోటికి వెళ్ళటమనే ప్రసక్తి ఎక్కడిది?

ఇప్పుడే ఇక్కడే **ఆత్మతో ఆత్మయందే ఆత్మను** దర్శించాలి.

**సయో హ వై తత్ పరమం బ్రహ్మ, యో వేద వై మునిః, బ్రహ్మైవ భవతి స్వస్థః, సత్ చిత్ ఆనంద మాత్రకః॥**

ఎవ్వడు తత్ పరబ్రహ్మ తత్త్వమును తెలుసుకొంటాడో, అట్టి మౌని స్వస్థుడగుచున్నాడు. అటు తరువాత సత్ చిత్ ఆనందరూపమగు బ్రహ్మమే తానగుచున్నాడు.



వ్యాసమహర్షి ప్రవచించిన బ్రహ్మతత్త్వమును శ్రవణం చేసి శుకమహర్షి 'ఆత్మానందము' నందు నిశ్చలుడు, సుస్థిరుడు అయ్యారు.

**ఇతి రుద్రహృదయోపనిషత్**

*ఓం శాంతిః శాంతిః శాంతిః*

కృష్ణ యజుర్వేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 32 క్షురికోపనిషత్

## (క్షురిక = కత్తి)

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ కైవల్యనాడిక అంతస్థ పరాభూమి నివాసినమ్
క్షురికోపనిషత్ యోగ భాసురం రామమ్ ఆశ్రయే॥



కైవల్యనాడీ అంతర్గతుడు, పరాస్థానము నివాసముగా కలవాడు, క్షురికోపనిషత్ ప్రవచిత యోగమును హృదయము నందు ప్రకాశింపజేయువాడు / ప్రకాశమానుడు అగు శ్రీరామచంద్రమూర్తిని ఎల్లప్పుడు ఆశ్రయించుచున్నాము.

ఓం

**1. క్షురికాం సం ప్రవక్ష్యామి
ధారణాం యోగ సిద్ధయే
యాం ప్రాప్య న పునర్జన్మ
యోగయుక్తస్య జాయతే॥**

'ఓం'కార స్వరూప పరబ్రహ్మమును స్మరిస్తున్నాము.

ఏ యోగము యొక్క ధారణ వలన యోగసిద్ధిని పొందిన తరువాత, అట్టి సిద్ధియొక్క ప్రాప్తిచే ఆ యోగయుక్తునికి పునః జన్మ ఉండదో, అట్టి 'క్షురికయోగ ధారణ' గురించి ఇప్పుడు మనము వివరించి చెప్పుకొను చున్నాము. (క్షురిక = కత్తి /చురకత్తి /మంగలి కత్తి)

---

**2. వేద తత్త్వార్థ విహితం
యథోక్తం హి, స్వయంభువా।
నిశ్శబ్దం దేశమ్ ఆస్థాయ,
తత్ర 'ఆసనం' అవస్థితః॥**

మొట్టమొదట వేదతత్త్వార్థమునకు సానుకూలము, విహితమగు ఈ యోగము (పరమేశ్వరునిచే) స్వయంభువు అగు బ్రహ్మదేవులవారికి ఉపదేశించబడింది.

**పరమేశ్వరుడు:** ఓ స్వయంభువా! బ్రహ్మదేవా! యోగాభ్యాసి మొట్టమొదట జనసంచారము లేని నిశ్శబ్దమైన ప్రదేశమును ఎన్నుకొని అవస్థితుడై ఉండాలి. ఆ చోట ఆసీనుడై (ఆసనమును ఆశ్రయించి) యోగాభ్యాసమునకు సంసిద్ధుడు అగునుగాక!

---

**3. కూర్మో అంగానీవ సంహృత్య
మనో హృది నిరుధ్య చ,
మాత్రా ద్వాదశ (12) యోగేన
ప్రణవేన శనైః శనైః॥**

తాబేలు తన అంగములను సందర్భానులననుసరించి ప్రమాదము శంకించినప్పుడు వెనుకకు తీసుకోవటం, సానుకూలంగా ఉన్నప్పుడు బయటకు విస్తరింపజేసి చక్కగా ఉపయోగించుకోవటం చేస్తూ ఉంటుంది కదా!

అట్లాగే యోగాభ్యాసి '12' మాత్రల కాలము పూరక యోగాభ్యాసమును ప్రారంభించి ప్రణవోపాసన నిర్వర్తించును గాక! ఇంద్రియములను ఏ విషయములలో నియమించాలో ఏ విషయముల నుండి ఉపసంహరించాలో - గ్రహించి వివేచనతో నిర్ణయము చేసుకొని, వాటిని జయించి, తత్త్వజ్ఞాన-అనుభవముల మార్గమునకు ఈ ఇంద్రియములను మరల్చాలి.

---

**4. పూరయేత్ సర్వం ఆత్మానగ్ం
సర్వ ద్వారం నిరుధ్య చ
ఉరో ముఖ కటిగ్రీవం
కించిత్ హృదయమ్ ఉన్నతమ్॥**

దేహముయొక్క నవ ద్వారములను నిరోధించుచూ, ముఖము-కటి (మొల)- గ్రీవము (మెడ)లను నిలువుగాను, హృదయమును ఉన్నతము (ఎత్తు)గాను ధారణ చేస్తూ పూరక - కుంభకములను (గాలి నింపటం ధారణ చేయటం) నిర్వర్తించాలి.

| | | |
|---|---|---|
| **5.** | **ప్రాణాం తు సంధారయే తస్మిన్**<br>**నాస - అభ్యంతర చారిణః**<br>**భూత్వా తత్ర ఆయత ప్రాణః**<br>**శనైః ఉచ్ఛ్వాసమ్ ఉచ్ఛ్వసేత్॥** | నాసిక (ముక్కు)లో స్వతంత్రంగా సంచారములు చేస్తున్న వాయువును (1) (ఇడనాడిలో) పూరించటము, (2) నవద్వారములను మూసి ఉంచి శిరస్సునందు, ముఖమునందు ధారణ చేస్తూ కుంభకము, (3) (పింగళనాడి ద్వారా) రేచకము (గాలిని వదలటము) అను ప్రాణాయామా భ్యాసమును నిర్వర్తించాలి. నెమ్మదిగా ఉచ్ఛ్వాసమును తన ఆధీనములో కలిగి ఉంటూ ఉచ్ఛ్వసించాలి. నెమ్మదిగా గాలిని పీల్చి (కుంభక - రేచకములు) అభ్యసించాలి. |
| **6.** | **స్థిరమ్ ఆత్మ దృఢం కృత్వా**<br>**అంగుష్ఠేన సమాహితః**<br>**ద్వే గుల్ఫేతు ప్రకుర్వీత**<br>**జంఘేచైవ త్రయః త్రయః॥** | యోగి స్థిరమైన (తన శరీరము స్థిరముగా ధారణ చేయుటకు తనకు సానుకూలమైన) ఆసనమును ధరించాలి. (1) కుడి బొటనవ్రేలుతో కుడి నాసికా రంధ్రమును మూసి, వాయువును లోనికి ఎడమ నాసికారంధ్రము ద్వారా ఇడనాడిలో పూరకము చేసి, (2) కుడి అనామిక - కనిష్ఠికలతో (ఉంగరపు వ్రేలు, చిటికిన వ్రేలులతో) ఎడమ నాసికా రంధ్రమును మూసి వుంచి (48 మాత్రల కాలము - చిటికెల కాలము) కుంభకము చేసి, (3) అటు తరువాత (24 మాత్రలకాలము) వాయువును కుడిముక్కు రంధ్రము ద్వారా వదలాలి.<br>ఆతరువాత పింగళానాడితో ప్రాణాయామము ఈ విధంగా **గుల్ఫమునందు** (చీల మండలమునందు), **జంఘము** (కాలిపిక్క) యందు మూడు మూడుసార్లు వాయువును నిలిపి ఆత్మయొక్క ధ్యాసతో ప్రాణయామం చేయాలి. |
| **7.** | **ద్వే జానునీ తథా ఊరూ,**<br>**ద్వేగుదే, శిశ్నే త్రయః త్రయః**<br>**పాయోః ఆయతనం తత్ర**<br>**నాభిదేశే సమాశ్రయేత్॥** | ఇకప్పుడు దృష్టి - మనస్సు - ప్రాణములతో రెండు **మోకాళ్ళ స్థానము**లో ధ్యాసను నిలుపుతూ 3 - 3 సార్లు ద్వియీ ప్రాణాయామము చేయాలి. అటు తరువాత గుదస్థానము (పాయువు మలవిసర్జనా ప్రదేశము) నందు, శిశ్నము (మగ గురి) ప్రదేశమునందు వాయువును నింపుతూ ధ్యాసను ఉంచి 3 - 3 సార్లు ఇడా-పింగళా ప్రాణాయామము చేయాలి. అటుపై **పాయువు చుట్టూ** దృష్టి - మనస్సు - ప్రాణముల ఉపకరణము (మరియు) ధ్యాసలతో చుట్టి వచ్చి, ఆ మూడిటితోను నాభి ప్రదేశమును సమాశ్రయించి ప్రాణాయామ ప్రక్రియతో వాయు కుంభకమును (మణిపూరకస్థానమగు) నాభివద్ద నిర్వర్తించాలి, |
| **8.** | **తత్ర నాడీ సుషుమ్నా తు**<br>**నాడీభిః దశభిః వృతా,**<br>**తత్ర రక్తా చ పీతా చ**<br>**కృష్ణా తామ్రా విలోహితా॥** | ఈ (మణిపూరక చక్రస్థానమగు) నాడీ ప్రదేశములో సుషుమ్న అనే బ్రహ్మనాడి. ఇది (నాడీకందము నుండి) శిరస్సుకు ఉపరితల ప్రదేశము వరకు విస్తరించి ఉండటం చేత **'బ్రహ్మనాడి'** అని పిలుస్తారు. ఇంకా దశ (10) ముఖ్యనాడులు ఇక్కడ ప్రారంభమగుచూ ఉన్నాయి. ఈ ప్రదేశమే నాడీకందము (కందగడ్డవలె ముద్ద). ఈ నాడీ కందము నుండి అనేక సూక్ష్మనాడులు, ఉపనాడులు బయల్వెడలుచున్నాయి. అవన్నీ రక్త (ఎరుపు) వర్ణంగాను, పీత (పసుపు వర్ణము)గాను, కృష్ణ (నలుపు)గాను, తామ్ర (రాగి) వర్ణముగాను, విలోహితం (నీలం) గాను మెరయుచున్నాయి, |
| **9.** | **అతి సూక్ష్మా చ తన్వీ చ**<br>**శుక్లాం నాడీం సమాశ్రయేత్**<br>**తత్ర సంచారయేత్ ప్రాణాన్**<br>**ఊర్ణ నాభీవ తంతునా॥** | అట్టి నాడీ ప్రదేశములో అత్యంత సూక్ష్మము, సన్నము అగు **'శుక్లనాడి** (సుషుమ్న నాడి, బ్రహ్మనాడి) అనబడు ఇడ - పింగళ నాడుల మధ్యగల **సూర్యప్రకాశ సమాన్వితమగు నాడిని** సమాశ్రయించాలి. సాలెపురుగు తనచుట్టూ దారములను చుట్టుకొని ఉండు రీతిగా, ఈ సుషుమ్నను **ప్రాణశక్తి ఆశ్రయించి ఉన్నది. మనస్సు, ప్రాణము, దృష్టులు కలుపుకొని ఆశ్రయించి ఉండు కుంభక ప్రాణాయామమును ధ్యానమార్గంగా అభ్యసించాలి.** |

**10.** **తతో రక్తోత్పలా భాసగ్ం**
**హృదయ ఆయతనం మహత్**
**దహరం పుండరీకం తత్**
**వేద అంతేషు (వేదాంతేషు) నిగద్యతే॥**

ఇప్పుడిక అనాహత ప్రదేశ నాడీకందము నుండి ప్రాణోపాసన ద్వారా మనో ప్రాణదృష్టులను
**- ఎర్రటి కలువ పూవు వలే భాసిస్తున్నది**
**- అన్ని నాడుల కంటే మహత్తరమైనది**
- అగు అనాహత స్థానములో గల **హృదయములో ప్రకాశింపజేయాలి.** (మణిపూరక ఆకాశమునుండి అనాహత స్థానము).

దహరాకాశము (హృదయాకాశము), పుండరీక (తెల్ల తామర ఆకాశము గలది) అగు అనాహత (హృదయ) స్థానములో ప్రాణాయామమును అభ్యసిస్తూ ప్రాణ - మనో దృష్టులతో క్రమంగా హృదయ స్థానమును దాటి విశుద్ధ చక్ర స్థానము (కంఠ స్థానము)ను చేర్చాలి.

---

**11.** **తత్ భిత్వా కంఠం ఆయాతి,**
**తాం నాడీం పూరయేత్ ఇతి।**
**మనసస్తు పరం గుహ్యగ్ం**
**సుతీక్ష్ణం బుద్ధి నిర్మలమ్।**

ఆ విధంగా హృదయాకాశమును కూడా ఛేదించి, ఇక ఇప్పుడు, (అనాహత చక్రమును అధిగమించి) మనో - ప్రాణ - దృష్టులను (ప్రాణాయామము - సహజకుంభకముల అభ్యాసముచే) విశుద్ధ చక్రస్థానమగు కంఠ ప్రదేశమునకు జేర్చి, అక్కడ ప్రాణాయామము అభ్యసించాలి. అక్కడి నాడులను ప్రాణశక్తితో పూరించాలి. నిర్మలమైన మనస్సు, సుతీక్ష్ణమైన బుద్ధి, పవిత్రమైన దృష్టులతో 'విశుద్ధము' నుండి బ్రహ్మరంధ్రము, (మరియు) సహస్రారముల వరకు ధ్యాసను నిండుగా నింపి ఉంచాలి.

---

**12.** **పాదస్య ఉపరి యత్ మర్మ –**
**తత్ 'రూపం నామ' చింతయేత్।**
**మనో ధారేణ తీక్ష్ణేన**
**యోగమ్ ఆశ్రిత్య నిత్యశః॥**

సుతీక్ష్ణమైన మనో - బుద్ధి - చిత్తముల యోగ (సంయోగ - వియోగాతీత ప్రశాంత స్థితి) ధారణమును అనునిత్యముగా ఆశ్రయిస్తూ ఉండాలి. 4 పాదముల ఆవల రూపం (తురీయాతీతము) ధారణ చేయాలి. బ్రహ్మ రంధ్రము నుండి కాలి బొటన వ్రేలు వరకు (From Head to Toe) పరమాత్మను (Eg. An actor remembering - what he is originally - while playing a particular role) (అనగా)-తన యొక్క సర్వ సహజీవులయొక్క **'కేవలతత్'** రూపమును అనుక్షణికంగా, సర్వకాల, సర్వావస్థలయందు **చింతన చేయాలి.**
బుద్ధి - మనస్సులను నియమిస్తూ జ్ఞప్తితో కూడిన మననమును నిర్వర్తిస్తూ ఉండాలి.

---

**13.** **'ఇంద్ర వజ్రమ్' ఇతి ప్రోక్తం**
**మర్మ జంఘానుకృంతనమ్,**
**తత్ ధ్యాన బలయోగేన**
**ధారణాభిః నికృన్తయేత్॥**

ఈ మనం చెప్పుకున్న (1) ప్రాణాయామ (2) వివిధ స్థానయోగ (3) తత్ రూప నామ చింతన - అనేక అన్యభావనలకు సంబంధించిన మర్మావయవములను (Secreat Bolckades of illusionary ignorences) - తెగనరకుచున్నది. కాబట్టి **'ఇంద్ర వజ్రమ్** - ఇంద్రుని వజ్రాయుధము' అని వర్ణించబడుచున్నది. అట్టి యోగముచే స్వస్వరూప భిన్నమై ప్రాప్తిస్తున్న దృశ్య రూప భ్రమాత్మక ధారణలు (అల్పదృష్టులన్నీ) ఖండించబడుచున్నాయి.

---

**14.** **ఊర్వోః మధ్యేతు సంస్థాప్య**
**మర్మ ప్రాణ విమోచనమ్**
**చతుః అభ్యస్య యోగేన**
**ఛిందేత్ అనభిశంకితః॥**

అటువంటి కేవలీ ఆత్మ యోగ సిద్ధి లభించటానికై **ఆయా అడ్డంకులను యుద్ధవీరునివలే ఎదుర్కొని జయించాలి.**
అందుకు ఒక యోగోపాయము. ఊరువుల (తొడల) మధ్యగా ప్రాణశక్తిని (కుంభక ప్రాణాయామము - సహజ కుంభకముల ద్వారా) సంస్థాపించి, తత్ భావనచే మర్మ ప్రాణములకు (దృశ్య విషయత్వములవైపు ప్రయాణించు ఇష్టములను) సమనస్క ప్రాణయోగముచే విమోచనము (Relief) కలిగించాలి. రోజుకు 4 సార్లు (ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం, రాత్రి) అభ్యసించటం చేత (యోగధారణచే) సర్వ శంకలు ఛిద్రమౌతాయి.

| | |
|---|---|
| **15. తతః కంఠాంతరే యోగీ<br>సమూహేత్ నాడి సంచయమ్,<br>ఏకోత్తరం నాడిశతం (101)<br>తాసాం మధ్యే పరాః స్మృతా (పరాస్థితా)॥** | విశుద్ధ చక్రస్థానములో (కంఠ ప్రదేశములో) యోగాభ్యాసము చేయుచున్నప్పుడు '101' నాడుల సమూహములు దేహములోని వివిధ ప్రదేశముల వైపుగా అమరిక కలిగినవై అనుభూతమౌతాయి. ఆ 101 నాడులలో **ఊర్ధ్వముగా బ్రహ్మరంధ్రము వైపుగా** నియమితమైన ఒకే ఒక్క నాడి - **సుషుమ్ననాడి, 'పరానాడి'** అని అంటారు. ఇది అన్నిటికంటే శ్రేష్ఠమైన నాడి. ఇది యోగి తనయొక్క మనో బుద్ధి దృష్టులను ముఖ్యముగా నిలుపవలసియున్న నాడి. |
| **16. సుషుమ్నా తు పరే లీనా<br>విరజా బ్రహ్మ రూపిణీ।<br>ఇడా తిష్ఠతి వామేన (ఎడమ)<br>పింగళా దక్షిణేన తు (కుడి)॥** | ఈ సుషుమ్న సహస్రారములోగల **పరాశక్తిదేవి**తో లీనము పొందినది కాబట్టి **'విరజ'** (దోష రహిత నిర్మలనాడి), **'బ్రహ్మరూపిణి'** అయి ఉన్నది. (నాడీకందము నుండి కంఠస్థానము వరకు) ఎడమవైపు ఇడ నాడి, కుడివైపు పింగళ నాడి ఏర్పడినవై, (అక్కడి నుండి ఆజ్ఞాచక్ర స్థానము వరకు విస్తరించి) - ప్రసరణము, ప్రభావము కలిగియున్నాయి. |
| **17. తయోః మధ్యే పరం స్థానగ్ం<br>యస్తంవేద (యః తమ్ వేద), స <u>వేదవిత్</u>।<br>ద్వా సప్తతి సహస్రాణి (72,000)<br>ప్రతినాడీషు తై తిలమ్॥<br>18. ఛిద్యతే ధ్యానయోగేన।<br>సుషుమ్న ఏకా న భిద్యతే।<br>యోగనిర్మల సారేణ<br>క్షురేణ అనల వర్చసా॥** | అట్టి ఇడ - పింగళ నాడుల మధ్య ఏ **బ్రహ్మనాడి** - కేవల తేజో ప్రజ్ఞా సమన్వితమై ప్రకాశించుచున్నదో **అట్టి సుషుమ్నను ఎరిగినవాడే వేదవేత్త.** తెలుసుకొనవలసినది తెలుసుకొనుచున్నాడు.<br>దేహంలో '72000' నాడీ-ఉపనాడులు. 100 నాడీ సమూహములు జీవశక్తిని (ప్రాణశక్తిని) దేహమంతా విస్తరింపజేస్తున్నాయి. **'ధ్యానయోగము'** అనే కత్తిచే 100 నాడుల ప్రాణప్రవాహము ప్రాణయోగాభ్యాసిపట్ల నిరోధించబడు చున్నాయి. (వశమై ఉంటున్నాయి).<br>ఒక్క సుషుమ్ననాడి బ్రహ్మనాడి మాత్రము ఛేదించబడదు. నిరోధింపబడ జాలదు.<br>యోగాభ్యాసము యొక్క జలముగా అగ్నివలె తేజోమానమగు సుషుమ్న స్వానుభవము కాగలదు. క్షవరపు కత్తివలె అగ్ని తేజస్సుతో కూడిన సుషుమ్నానుభవముచే తదితర నాడులలో ఆ యోగాభ్యాసి ధ్యాస యొక్క ప్రయాణవేగము సన్నగిల్లగలదు. |
| **19. ఛిందేత్, నాడీ శతం ధీరః<br>ప్రభావాత్ ఇహ జన్మని,<br>జాతీ పుష్ప సమం యోగీ<br>యదా పశ్యతి <u>తైతిలమ్</u>॥<br>(<u>తైతిలము</u> = ఒక కరణముగా।<br>(As a Functional Hand)** | ధీరుడైనవాడు 100 నాడుల ప్రాణప్రవాహ వేగమును (ప్రియభావవేగము) ఛిద్రం చేసి సుషుమ్ననాడియందు దృక్ మనో ప్రాణములతో అభ్యాస పూర్వకంగా ప్రకాశించుచున్నాడు. **జాతీపుష్ప - సుగంధముల** అవినాభావము వలే (ఒక్కటే అగు తీరుగా) - బ్రహ్మరంధ్రమును దాటి సహస్రార ప్రవేశి అయి, ఆ యోగి ఆత్మతో ఏకత్వము, అనన్యత్వము సిద్ధించుకొనుచున్నాడు. |
| **20. ఏవం శుభ - అశుభైః భావైః<br>స నాడీనాం విభావయేత్।<br>తత్ భావితాః ప్రపద్యంతే<br>పునర్జన్మ వివర్జితాః।** | 101 నాడులలో సుషుమ్ననాడి తప్ప, తక్కిన 100 నాడులు శుభ - అశుభ భావములతో కూడిన గమన ఆగమనములు (Goings & Comings) కలిగి ఉంటున్నాయి. పునర్జన్మకు హేతువులు అగుచున్నాయి. 101వ నాడి అగు సుషుమ్నను ఉపాసించుయోగి తక్కిన 100 నాడుల నాడీ ప్రవాహవేగమును జయించి పునర్జన్మ రాహిత్యము పొందుచున్నాడు. |
| **21. తపో విజిత చిత్తస్తు<br>నిశ్శబ్దం దేశమ్ ఆస్థితః,<br>నిస్సంగః సాంగ యోగజ్ఞో<br>నిరపేక్షః శనైః శనైః** | ప్రాణయోగాభ్యాసి అగు యోగి...,<br>→ తపస్సుచే చిత్తమును జయించినవాడై.<br>→ సంగములన్నీ జయించి - నిస్సంగుడై,<br>→ యోగాంగమును ఎరిగినవాడై.<br>→ నెమ్మది నెమ్మదిగా అపేక్షలన్నీ దాటిపోయి, జయించి నిరపేక్షుడై, నిశ్శబ్దమగు స్థానమును చేరి ఉంటున్నాడు. |

**22. పాశాగ్ంం ఛిత్వా యథాహగ్ంసో**
**నిర్విశంకం ఖం ఉత్సతేత్ (ఉత్పతేత్)।**
**ఛిన్న పాశః తథా జీవః**
**సంసారం తరతే సదా॥**

→ నిర్విషయము, నిష్ప్రపంచము అగు మౌనస్థానమును అంతరంగమున ధరించినవాడై.

→ సర్వ సంసార పాశములను హృదయమునుండి తొలగించుకొన్నవాడై,

→ కట్టు విప్పుకొన్న హంస హాయిగా ఆకాశంలో విహరించునట్లుగా ఆత్మాకాశంలో విహరిస్తూ

సర్వ సంసార బంధములనుండి సదా పాశవిముక్తుడై తరించుచున్నాడు.

---

**23. యథా నిర్వాణ కాలేతు**
**దీపో దగ్ధ్వా లయం వ్రజేత్,**
**తథా సర్వాణి కర్మాణి**
**యోగీ దగ్ధ్వా లయం వ్రజేత్॥**

ఏవిధంగా అయితే వెలుగుచున్న దీపము నిర్వాణకాలంలో కాలటం అయిపోయి దీపపు వత్తి మొదలైన వాటినన్నిటినీ కాల్చివేసి విశ్వాగ్నిలో ప్రవేశిస్తోందో, అదే విధంగా **యోగాభ్యాసముచే యోగసిద్ధిని పొందిన యోగి సర్వకర్మ వ్యవహారములను దగ్ధము చేసి వేసి, 'అఖండాత్మ'యందు 'లయము' పొంది, తానే విశ్వాత్మకుడుగా అగుచున్నాడు.**

---

**24. ప్రాణాయామ సుతీక్ష్ణేన**
**మాత్రా ధారేణ యోగవిత్,**
**వైరాగ్య ఉపల ఘృష్టేన**
**ఛిత్వా తంతూః న బధ్యతే॥**

యోగవేత్త సుతీక్ష్ణమైన ప్రాణాయామ అభ్యాసమునకు ఉపక్రమించి, మాత్రల (పూరక 12 మాత్రలు, కుంభక 32 మాత్రలు, రేచక - 24 మాత్రలు) ధారణను అభ్యసించి, 'వైరాగ్యము' అనే పదునైన ఖడ్గమును సంపాదించుకొని సర్వ సంసార తంతువులను త్రెంచి వేయుచున్నాడు. **బంధ విముక్తుడగుచున్నాడు.**

---

**25. అమృతత్వం సమాప్నోతి**
**యదా కామాత్ ప్రముచ్యతే**
**సర్వ ఈషణా వినిర్ముక్తః**
**ఛిత్వా తంతుం, న బధ్యతే॥**
**ఛిత్వా తంతుం న బధ్యత ఇతి॥**

***ఇతి క్షురికోపనిషత్***
***ఓం శాంతిః శాంతిః శాంతిః॥***

ఎప్పుడైతే యోగి దృశ్యమునకు సంబంధించిన సర్వ కామముల (Desires, wishes and expectations pertaining to material scenario) నుండి ప్రముచ్యుడు (Relieved, left them all aside) అగుచున్నాడో, (ధనేషణ మొదలైన) సర్వ ఈషణములనుండి విముక్తుడౌతాడో.

అప్పుడు అతడు సర్వ సంసార తంతువులను (బంధములను) త్రెంచివేసినవాడై ప్రకాశిస్తున్నాడు.

బంధ రహితుడగుచున్నాడు.

ఆతనిని బంధించగలిగినది ఈ జగత్తులో ఏదీ ఉండజాలదు.

***ఇతి క్షురికోపనిషత్***
***ఓం శాంతిః శాంతిః శాంతిః॥***

**కృష్ణ యజుర్వేదాంతర్గత**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 32 క్షురికోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



**'కైవల్యనాడి'**యగు సుషుమ్నయందు ప్రకాశమానుడై ఉన్నవాడు, జీవునికి స్వకీయ సాక్షి స్వరూపమగు **పరభూమిక** యందు నిత్యనివాసి, ఈ **'క్షురికోపనిషత్'**చే విశదీకరించి సూచించబడుచున్న యోగాభ్యాసమునకు పరమప్రయోజనము అగు **'ఆత్మానందతత్త్వము'**ను భాసింపజేయు ఆత్మారాముడగు **శ్రీరామచంద్రమూర్తి స్వామిని ఆశ్రయించుచున్నాము.**

వేదతత్త్వార్థసారమగు ఈ క్షురికోపనిషత్ హృదయమును ఒకప్పుడు సర్వాంతర్యామి, సర్వతత్త్వ స్వరూపుడు అగు పరమేశ్వరునిచే సృష్టికర్తయగు బ్రహ్మదేవునికి బోధించటం జరిగింది. అదియే ఇప్పుడు యోగాభ్యాస విధి విధాన పూర్వకంగా మనము చెప్పుకుంటున్నాము.

– – –

ఒక సందర్భంలో బ్రహ్మదేవుల వారు శివ భగవానుని సమీపించి **"ఈ జీవుడు సమస్త దుఃఖముల నుండి ఉద్ధారణ పొందు మార్గము"** గురించి బోధించటానికై అభ్యర్థించారు.

**శివభగవానుడు :** 'ఓం' (అని మంగళాశాసనము చేయుచూ)...:

**ఓ సృష్టి కర్తా! బ్రహ్మభగవాన్! స్వయంభువా! వినండి.** ఏదైతే **'ధారణాయోగసిద్ధి'** అయి ఉన్నదో, అట్టి (పదునైన మంగలి కత్తి వలె)– సంసారబంధములను త్రెంచు **యోగాభ్యాసరూప 'చురకత్తి'** (మరియు) **యోగతత్త్వముల** గురించి ఇప్పుడు మనము చెప్పుకొంటున్నాము. వినండి. అట్టి యోగాభ్యాస ఫలమగు యోగసిద్ధి యొక్క ప్రాప్తిచే **ఆ యోగయుక్తుడు ఇక పునర్జన్మ రహితుడై ప్రకాశించగలడు.**

----

**వేదమ్ :** "తెలియబడునది" – అని శబ్దార్థము. **తెలియబడునదంతా** కూడా **తెలుసుకొనువానికి అభిన్నము.**

ఇది తెలుసుకొనుచున్నవాడు వేదాంతుడు. తెలియబడు దానికి ఆవల 'తెలుసుకొనుచూ' ఉన్నవాడు. **'అఖండాత్మ'కు అభిన్నమగువాడు. ఇదియే చతుర్వేద అంతరార్థ సారము.**

**తత్త్వార్థ సారము :** 'తత్ త్వమేవ'। **"నీవు తత్ ఆత్మ స్వరూపుడవే"** అనునది మహావాక్యము. ఎదురుగా కనబడు 'నీవు'ను పరమాత్మకు అనన్యము – అను దృష్టియొక్క అభ్యాసముచే **'సోఽహమ్'** సిద్ధించగలదు.

వేద–తత్త్వార్థ జ్ఞానముచే ఈ జీవుడు పునః శివత్వము సంతరించుకోగలడు. అయితే, యోగాభ్యాసము లేనిదే జ్ఞానము–**అనునిత్యము, స్వానుభవము, సందేహరహితము (నిస్సందేహరూపము)** అవదు. **అందుచేత, ముముక్షువు బుద్ధిని నిర్మలము, సునిశితము చేయటానికై జ్ఞానముతో బాటుగా యోగాభ్యాసమునకై ఉపక్రమించాలి. ఆ రెండూ ఒకే సమయములో అభ్యసించాలి. అవి రెండూ 'మోక్ష' మార్గములో ప్రయాణించటానికి ఉపకరించు వాహనమునకు రెండు బండి చక్రములవంటివి.**

యోగాభ్యాసమునకు సంసిద్ధుడగుచున్న యోగాభ్యాసి మొట్టమొదట **నిశ్శబ్ద దేశం ఆస్థాయ।** లోక సంబంధమైన వ్యవహారములు, విశేషములు, సంగతులు, జనులతో పరస్పర 'సానుకూల్య ప్రాతికూల్యములైన సంబంధ అనుబంధ బాంధవ్యములు – ఇవన్నీ దరిచేరనట్టి **'నిశ్శబ్ద ఏకాంతప్రదేశము'**ను ఎన్నుకోవాలి.

**తత్ర ఆసనం అవస్థితః।** తనకు ఇష్టముగా ఉండే చక్కటి చోటును ఎన్నుకోవాలి. పద్మాసనము ధారణ చేయునుగాక. (లేక) తన శరీరమునకు (నొప్పి అనిపించకుండా) సానుకూల్యముగాను, **నిశ్చలంగా ఎక్కువసేపు ఉండగల** ఆసనం – ఏదైనా సరే, **సుఖాసనం** ఎన్నుకొని అవధరించాలి.

**ప్రత్యాహారము :** హే బ్రహ్మ భగవాన్! ఈ జీవుడు ఈ **స్వస్వరూపజ్ఞానార్థి** అయి (లేక) **మోక్షార్థియై** అయి అఖండాత్మత్వమును సిద్ధించుకోవటానికై ఇంద్రియములను ముముక్షు మార్గంలో నియమించాలి.

ముముక్షువు (లేక) యోగాభ్యాసిని – (ఆత్మతత్త్వసిద్ధియొక్క సాధన కొరకై సుఖాసీనుడై కళ్లు మూసుకోగానే) – ప్రారంభంలో అనేక జన్మల అభిరుచి – అభ్యాసముల సంస్కార సంబంధమైన (కారణదేహసంబంధమైన) **భావావేశములు చుట్టుముట్టటం ప్రారంభిస్తాయి.** ఆత్మజ్ఞాన సమాచారము ఎంతగా సంపాదించి ఉన్నప్పటికీ, ఈ మనస్సుకు సంబంధించిన ఇంతకు ముందటి విషయముల అలవాటు చేత బలవత్తరంగా రూపుదిద్దుకున్న పుణ్య **పాపసంబంధమైన సంస్కారములు** ఆగక, **పేట్రేగసాగుతాయి**. వాటిని ఎదుర్కొని ఈ జీవుడు **జయించాలి.** ద్వంద్వాతీతమగు "ఆత్మాహమ్" భావనను సంతరించుకోవాలి.

**స్వయంభువు (బ్రహ్మదేవుడు) :** స్వామీ! ఈశ్వరా! అవును. నా సృష్టిలోని నా బిడ్డలగు ఈ జీవులు ఆయా ఉపాధి పరంపరలలో ఆర్జించుకొన్న సంస్కారములచేతనే పక్షి – మృగ – మానవ – దేవత – తిర్యక్...ఆది అనేక దేహపరంపరల పరిధులను అతిక్రమించలేకపోతున్నారు. దయతో **ఉపాయములు, అభ్యాసములు, నియమములు, యోగాభ్యాసవిధానము** – ఇవన్నీ విశదీకరించండి.

## విషయముల నుండి ఉపసంహారము

**పరమేశ్వరుడు : కూర్మో అంగానీవ, సంహృత్య,** తాబేలు ఆహారము కోసము బయల్వెడలి నడచి వెళ్ళుచూ ఉండగా, ఏదైనా **ప్రమాద సంకేతము** పొడచూపగానే ఏమి చేస్తుంది? తన శరీర భాగములను వెనుకకు మరల్చి చిప్ప (డిప్ప) భాగమును మాత్రమే బయటకు కలిగి ఉండి, కదలక ఉండి పోతుంది. అప్పుడు ఒక ఏనుగు వచ్చి త్రొక్కినా తన చిప్ప (తాబేటి వీపుపైగల పెంకు)లో దాగిన తాబేలుకు ఏమి హాని ఉండదు. మరల ప్రమాద సంకేతము తొలగగానే ఆ తాబేలు ఆహారము కొరకై అంగములను బయటకు చాచి కదలసాగుతుంది. **అట్లాగే :-**

- **సంహృత్య మనో హృది నిరుధ్యచ।** ఇంద్రియ విషయపరంపరలపై వ్రాలుచున్న మనస్సును వెనుకకు మరల్చటము.
- వెనుకకు మరలిన మనస్సును (భక్తుడు గర్భగుడిలో ప్రవేశించి దైవముపై బుద్ధి పెట్టి ఉపాసన చేయు రీతిగా) **'హృదయము'**లో ప్రవేశింపజేసి, **హృదయములోనే వేంచేసియున్న సర్వాంతర్యామియగు పరమాత్మను దర్శించటానికి** ఉపక్రమించాలి.
- అందుకుగాను, నిర్మలము, సునిశితము, విస్తారముగా బుద్ధిని సంస్కరించుకోవాలి. సత్యదృష్టిచే పరిపూర్ణమగునట్లు తనను తాను సంసిద్ధము చేయాలి.

## యోగాభ్యాసము

**పూరకము :** తాబేలు తన అవయవములను లోనికి తీసుకొనేవిధంగా యోగాభ్యాసి గాలిని **ముక్కుపుటముల ద్వారా (12 మాత్రల కాలము) మెల్లమెల్లగా లోనికి తెచ్చుకొను యోగాభ్యాసము.**

**మాత్ర : చిటిక కాలము. సూది మొనను వస్త్రములో గ్రుచ్చి తీసివేయునంతకాలము. ('సెకను'కాలమని భావించవచ్చు).**

పూరక ప్రారంభ క్షణములనుండి శరీరములోగల నవ ద్వారములను ('2' కళ్లు, '2 ' చెవులు, '2' ముక్కు పుటములు, నోరు, శిశ్నము, గుదములను) సంకల్ప – ప్రాణ యోగము సహాయంతో వాయు ప్రసరణమును భావాత్మికంగా నిరోధించి ఉంచాలి.

**కుంభకము :** ముక్కు ద్వారా లోనికి పీల్చిన వాయువును (36 మాత్రల కాలము) **ధారణ** చేయాలి. అట్టి సమయంలో **ముఖమును, మొల (కటి ప్రదేశము)ను, గ్రీవమును (మెడను)** నిటారుగాను, హృదయమును ఉన్నతము (ఎత్తు)గాను ధారణ చేయాలి.

**రేచకము :** పూరకము ద్వారా స్వీకరించబడిన వాయువును కుంభక ధారణ చేసిన తరువాత ఇక నెమ్మదిగా (24 మాత్రల కాలము) వదలాలి. అదియే **'రేచకము'.**

ముక్కులో స్వతంత్రముగా ఉచ్ఛ్వాస నిశ్వాసముల రూపంగా సంచారము చేయుచున్న ప్రాణవాయువులను

(1) బాహ్యమునకు రేచకము (12 మాత్రలు) (2) పూరకము (12 మాత్రలు)

(3) కుంభకము (36 మాత్రలు) (4) పునఃరేచకము (24 మాత్రలు)

ఇది ప్రాణాయామ అభ్యాస విధానము. అట్టి 'ప్రాణాయామాభ్యాసము'చే ప్రాణశక్తిని స్వావలంబనము (Self control) చేసుకోవాలి. ఉచ్ఛ్వాసమును క్రమవిధానంగా నెమ్మదిగా ఉచ్ఛ్వసించాలి.

దృఢముగా స్థిరమైన ఆసనముతో దేహమును ధారణ చేసి, **ప్రాణాయామ విధిగా దేహమును 'స్వస్వరూపాత్మ'తో పూరించి ఉంచు అభ్యాసమునకు** ఉపక్రమించాలి.

## ఇడా పూరకము

(1) ముందుగా రెండు ముక్కు పుటములతో గాలిని బయటకు వదలుచూ **బాహ్య రేచకం** నిర్వర్తించి,

(2) కుడి బొటనవ్రేలుతో **కుడివైపు ముక్కుపుటమును (రంధ్రమును) సున్నితంగా మూసి** ఉంచాలి.

(3) ఎడమవైపు ముక్కు పుటతో 12 మాత్రల కాలము **ఇడనాడిలోనికి గాలిని పీల్చాలి.**

(4) రెండు భుజములను, మెడను,ముఖమును నిఠారుగా ధరించి, గుండెలో వాయువుతో నిలుపుతూ 36 మాత్రల కాలము వాయువును **కుంభకము** చేయాలి.

(5) నవ ద్వారములు కుంభక సమయంలో **బుద్ధితో** స్థిరముగా, మూసి ఉంచాలి.

(6) అటు తరువాత కుడి బొటనవ్రేలును కుడి ముక్కు పుటమునుండి నెమ్మదిగా తొలగిస్తూ వాయువును రేచకము చేయాలి.

***ఆ తరువాత***

## పింగళీ పూరకము

(1) ముందుగా (పైన చెప్పినట్లు) బాహ్య రేచకము, (Leaving the Air out) రెండు ముక్కు పుటముల ద్వారా నిర్వర్తించాలి.

(2) అప్పుడు ఎడమ ముక్కు పుటను మూసి ఉంచాలి.

(3) కుడి ముక్కు పుటతో గాలిని పీల్చి పింగళ నాడియందు వాయువును పూరకము చేసి (నింపి) ఉంచాలి.

(4) కుంభకమును యథావిధిగా నిర్వర్తించి వాయువును నిలిపి ఉంచాలి.

(5) నవరంధ్రములను (నవద్వారములను) ధారణ రూపంగా బిగించి ఉంచాలి.

(6) ఎడమ ముక్కు పుటమును నెమ్మదిగా తెరచుచు గాలిని బయటకు వదలాలి. (కాలనియమము-పైవిధంగానే).

***ఇవి ప్రాణాయామము యొక్క 12 దశలుగా చెప్పబడుచున్నాయి.***

## దేహముయొక్క వివిధ ప్రదేశములలో వాయువును పూరించి, ప్రాణాయామ కుంభకమును నిర్వర్తించటము

పై విధంగా ప్రాణాయామమును నిర్వర్తించుచూ దేహములోని ఆయా వివిధ ప్రదేశములలో **'దృష్టి - మనో - ప్రాణములను'** నిలుపుతూ, **సహజస్వస్వరూపముతో నింపుచూ** కుంభకమును నిర్వర్తించాలి. ఉభయ ముక్కు రంధ్రముల ద్వారా చేయు వేరువేరు పూరకములతో దేహములోని ఆయా ప్రదేశములతో కుంభకము నిర్వర్తించాలి. అదే సమయం దృశ్య విషయ త్యాగరూపమగు ప్రత్యాహారం చేయాలి. (3 + 3 సార్లు నిర్వర్తించాలి). (భ్రూమధ్యలో ధ్యాస నిలపటము - అందుకు ఉపాయము).

ఒకస్థానము తరువాత మరొకచోట ధ్యాసను ధారణ చేయవలసిన స్థానములు.

(1) పాద - అంగుష్ఠములు → రెండు కాళ్ల బొటనవ్రేళ్ల ప్రదేశములు).

(2) గుల్ఫే - ద్వే → రెండు చీలమండల ప్రదేశములు.

(3) జంఘే ద్వే → రెండు కాళ్ల పిక్కల ప్రదేశములు.

(4) ద్వే జానునీ → రెండు మోకాళ్ల ప్రదేశములు.

(5) ఊరూ ద్వే → రెండు తొడల ప్రదేశములు.

(6) గుదే → గుద ప్రదేశము (మూలాధార ఆకాశము).

(7) శిశ్నే → శిశ్న ప్రదేశము (మూత్రవిసర్జకావయవము).

(8) పాయువు → విసర్జనావయవము (గుదమునకు కించిత్ ఊర్ధ్వ ప్రదేశము. స్వాధిష్ఠాన ప్రదేశము).

కుంభక సమయంలో నిశ్చింత కొరకై, మనోనిశ్చలము కొరకై గురువునుగాని, ఇష్ట దైవమునుగాని, ఓంకారమునుగాని ధ్యానం చేస్తూ ఉండవచ్చును. ఆయా ప్రదేశములలో సాకారమును (గురు పాదపద్మములు, ఇష్ట దైవము మొదలైన వాటిలో ఏదో ఒకటి) ధ్యానించటముచే ప్రాణాయామ ప్రక్రియ సుఖవంతము కాగలదు.

పై ప్రదేశములలో ప్రాణాయామ ధారణ, కుంభకములతో **మనస్సు - ప్రాణ - దృష్టులను ఏకంగా** చేసి నిలుపుచూ ఉండాలి. పాయువునుచుట్టి అక్కడి నుండి నాభిప్రదేశము (మణిపూరకములో) బుద్ధిని ఒక సమయ నియమంగా (Duly following certain timing) కుంభకం చేయాలి. ఇప్పటివరకు చెప్పిన (1) పాదబొటనవ్రేళ్ళు, (2) చీలమండలములు, (3) కాళ్ళ పిక్కలు, (4) మోకాళు ్ళ, (5) తొడలు, (6) గుదము, (7) శిశ్నము, (8) పాయువు ప్రదేశములలో ఇడ - పింగళ ప్రాణాయామములతో (2 రేచకములు + 2 కుంభకములు + '2' పూరకములతో) ప్రారంభంలో ఒకసారి, కొన్ని రోజుల అభ్యాసము తరువాత రెండుసార్లుగాని, **మూడుసార్లుగాని నిర్వర్తించెదరుగాక।** (కుంభక సమయంలో) నాభి ప్రదేశంలో బుద్ధితో ప్రాణ - దృష్టి - మనస్సు (ధ్యాస)లను నిలిపెదరుగాక।

## నాభి ప్రదేశ ఆశ్రయము (లేక) మణిపూరక ఆకాశ ఆశ్రయము

**పాయోః ఆయతనం తత్ర నాభిదేశే సమాశ్రయేత్।** ఇప్పుడిక మణిపూరక ప్రదేశములో ధ్యాసను (బుద్ధిని) నిలిపి, దృష్టి - ప్రాణ - మనస్సులను నాభి ప్రదేశములో నిలుపుతూ ద్విపద ప్రాణాయామము (ఒకసారి ఇడ లోనికి, తరువాత పింగళలోనికి గాలి పీల్చి) చేయాలి. **మణిపూరక స్థానమును జయించే వరకు ప్రాణాయామాభ్యాసమును యోగులు నిర్వర్తించుచున్నారు**.

**జయించటము అనగా?** (1) స్వాభావికంగా, అప్రయత్నంగా ఆ ప్రదేశములో దృష్టి మనో ప్రాణములను నిలిపి, ప్రత్యాహారపూర్వకంగా పరమాత్మ గురించిన మననము చేయగలగటం. (2) స్వభావకుంభకం సిద్ధించటము. (రేచక-పూరకముల అవసరము లేకుండానే 'ధ్యాస'ను నిశ్చలము చేయుటద్వారా ఆయాచోట్ల ప్రాణమును నిశ్చలము చేయటము)

## నాడులు

ఈ మణిపూరక ప్రదేశంలో (నాభి ప్రదేశంలో)గల 'నాడీకందము' నందు ఇడ, పింగళ మొదలైన నాడులతో కూడుకొని 'సుషుమ్న' నాడి ఉన్నది. ఈ సుషుమ్న శిరస్సుయొక్క ఉపరితలంలోగల బ్రహ్మరంధ్రము వరకు విస్తరించి ఉండుటచేత **'బ్రహ్మనాడి'** అని అంటారు. ఇంకా ఈ నాభి ప్రదేశంలో ఎరుపు, పసుపురంగు, నలుపు, రాగిరంగు, నీలము, తెలుపు విశిష్టతలతో కూడిన సూక్ష్మ నాడులు అనేకం ఉన్నాయి. ఈ నాభి కందము నుండి 72,000 నాడులు, ఉపనాడులు బయల్వెడలి శరీరముయొక్క మూలమూలలా వ్యాపించినవై ఉంటున్నాయి. వాటినన్నిటినీ ఒక సాలెపురుగు తన దారములను చూచుకొను విధంగా భావన చేస్తూ, అతి ముఖ్యమైన 'సుషుమ్ననాడీ మార్గము'లో మనో ప్రాణ దృష్టులను యోగులు నిలుపుచున్నారు.

## హృదయకమల స్థాన ప్రవేశము

క్రమంగా నాభి ప్రదేశము తరువాత హృదయ కమలంలో దృష్టి-ధ్యాస-ప్రాణశక్తులను నిలుపుతూ **ప్రాణాయామాభ్యాసము** నిర్వర్తించబడుగాక। ఈ హృదయ కమలము వికసించిన ఎఱ్ఱ కలువ పుష్పము వలే ప్రకాశము కలిగినదై ఉంటోంది. సర్వనాడులను చైతన్యపరచు ముఖ్యమైన ప్రదేశము - అని 'హృదయము'నకు శబ్దార్ధము. **తతో రక్తోత్పలా భాసగ్ం హృదయ ఆయతనం మహత్।**

## కంఠస్థాన (విశుద్ధ చక్రాకాశ) ప్రవేశము

**తత్ భిత్వా కంఠం ఆయాతి, తాం నాడీం పూరయేత్ ఇతి।** హృదయస్థానములో ధ్యాసను నిలుపుచూ కొంత కాలము ప్రాణయోగాభ్యాసమును అభ్యసించిన తరువాత, ఆ స్థానమును జయించి క్రమంగా విశుద్ధ చక్రస్థానమగు కంఠ ప్రదేశమునకు దృష్టి - మనో - ప్రాణధ్యాసలను ప్రవేశింపజేసి ప్రాణాయామము కొనసాగించెదరు గాక!

కాలి బొటనవ్రేలు నుండి విశుద్ధ చక్రస్థానము వరకు, దైనందికంగా మనో - ప్రాణములను, దృష్టిని నిలుపుచూ విశుద్ధ చక్ర ప్రదేశమునందు నిలుపుచున్నారు. విశుద్ధములో స్వాభావిక కుంభకము సిద్ధించే వరకు అభ్యాసమును కొనసాగించుచున్నారు. **పూరక-కుంభక-రేచక పూర్వకంగా, ఇడా-పింగళాంతస్థంగా కొనసాగించాలి.**

## ఆజ్ఞా చక్రస్థాన త్రిపుటీ పూరణము

ఆ తరువాత విశుద్ధ స్థానమును జయించి, దృష్టిని ఆ రెండు కనుబొమ్మల మధ్య లోతు ప్రదేశమునగల ఆజ్ఞాచక్ర ప్రదేశమునకు జేర్చి, **ప్రాణాయామము** నిర్వర్తిస్తూ ఉండాలి. ఈ ఆజ్ఞాచక్రము ఇంద్రియములను, ఇంద్రియార్థములను, ఇంద్రియ విషయములను దాటి వేసినట్టి (లేక) జయించి వేసినట్టు **యోగస్థానము.** త్రిపుటియగు (1) 'చూచుచున్నట్టివాడు (The perceiver) (2) చూడటము (Perceiving) (3) చూడబడుచున్నది (object) (అట్లాగే వినువాడు,వినటము, వినబడునవి) సంగమము (Associated) పొంది ఏకరూపముగా దర్శించగల యోగస్థానము కాబట్టి **'త్రిపుటి'** అని కూడా అంటారు. ఈ విధంగా ప్రాణయోగాభ్యాసము సహాయంతో ఆజ్ఞా చక్ర ప్రదేశమును 'స్వస్వరూపాత్మ' యొక్క **సహజానందముతో** నింపివేసి, **ఇంద్రియాతీతమగు జీవాత్మత్వమును** మననము చేయుచుండాలి.

## బ్రహ్మరంధ్రము వరకు

క్రమంగా ఈ ఆజ్ఞా – చక్రస్థానమును కూడా జయించి, ఆత్మతత్త్వముతో ఆజ్ఞాచక్ర ప్రదేశమునుండి బ్రహ్మరంధ్రము వరకు గల ప్రదేశమును ఆత్మ భావనాపూర్వకంగా నింపివేయాలి. (Let the space between 'Agna chakra' and Brahma Randhram be filled up and held with 'Absolute sense of self'. (అనగా) ఆజ్ఞాచక్రములో స్వాభావిక కుంభకము సిద్ధించిన తరువాత, ఇక శిరస్సులో 'కుంభకము' అభ్యసించాలి.

## సహస్రార ప్రవేశము

ఆజ్ఞా చక్ర – బ్రహ్మ రంధ్రముల మధ్యగల ఆకాశమును జయించి (లేక, స్వాభావికకుంభకము సిద్ధించుకటని దాటిపోయి) యోగవేత్త క్రమంగా బ్రహ్మరంధ్రము ద్వారా సహస్రారమున ప్రవేశించుచున్నాడు. ఆజ్ఞాచక్రమునుండి బ్రహ్మరంధ్రమునుండి 12 అంగులముల స్థానము వరకు ఆత్మభావనతో పూరించుచున్నాడు.

ఇంతవరకు **'దేహములో నేనున్నాను'** అను జీవుని స్థితి నుండి ఆ యోగాభ్యాసి **'దేహము నాలో ఉన్నది'** అను పరస్థానము నందు దృష్టి, ప్రాణశక్తి, ధ్యాసలను నిలుపుచూ, సహస్రారమునందు తన ఉనికిని స్వభావ సిద్ధముగా గమనించుచున్నాడు. **'జగత్తులలో నేను'** లేక **'లోకములలో నేను'** అను స్థితి నుండి **'నాయందు ఈ జగత్తు. నాయందు లోకములు'**...అను **లోకములకే అంతర్గత స్థానము** అగుచున్నాడు. **జగత్తులలో నేను (జీవాత్మ) – నాలో జగత్తులు (పరమాత్మ) – అను ఉభయముల అఖండత్వము, ఆ రెండిటికీ వేరైన కేవలత్వము... ఈ మూడిటి స్వాభావిక కుంభకము** అభ్యసించుచున్నాడు.

ఇది 'స్వప్నములో నేను'ను అధిగమించి 'స్వప్నము నాయందు కదా!' అను స్వయమాత్మా సమవగాహనా స్థానము.

**పాదస్య ఉపరియత్ మర్మ తత్ రూపమ్, తత్ రూపం నామ చింతయేత్।** 'ఈ దృశ్యము, దేహము, విశ్వము, విరాట్ అనబడే '4' పాదములను దాటి వేయగా, ఆవలగల **తత్ రూప – తత్ పరమాత్మ యొక్క "తదేక చింతన" చేయాలి.** ఈ జాగ్రత్ – స్వప్న – సుషుప్తి – తురీయ చతుష్పాదములకు ఆవల కేవలమై, వాటికి ఆధారమై, ఆ నాలిగిటిని తనయందు ప్రశాంతంగా, లీలావినోదంగా కలిగియున్నదైయున్న అఖండ అప్రమేయ కేవల చైతన్యాత్మను చింతనచేస్తూ ఉండుగాక! అట్టి **'సర్వము' అయిన పరమాత్మకు తనను అభిన్నంగా** భావన చేస్తూ ఉండాలి. **'సోఽహమ్'** భావనయందు సంయోగ యోగమును ఆశ్రయించాలి. **మనోధారణేన తీక్ష్ణేన యోగమ్ ఆశ్రిత్య నిత్యశః** – తీక్షణమైన మనోధారణచే నిత్యుడు, కేవలుడు, సర్వుడు అగు **'పరబ్రహ్మమేవాహమ్'** భావనలో ప్రవేశించాలి. **'ఈ అనేకముగా కనిపిస్తూ ఏకమే అయి ఉన్న పూదండలోని దారము వంటి పరమాత్మ స్వరూపుడనే నేను కదా!'** అనే ఆత్మ తృప్తిని యోగి సిద్ధించుకొనును గాక!

**'ఈ సర్వము నేనే అయి, ఈ సర్వమునకు సాక్షినై, ఈ సర్వమునకు పరమై సర్వదా సర్వత్రా వెలయుచున్నాను'.** అను **మనోధారణాయోగమును అనునిత్యముగా అభ్యాసము చేయటము యోగాభ్యాసము యొక్క ఉత్తరోత్తర స్థితి.**



ఈ విధంగా (1) పూరక, కుంభక, రేచక – ఇడా – పింగళా రేచక ప్రాణాయామము (2) కాలి బొటనవ్రేలు నుండి **శివరస్థానమగు సహస్రారము** వరకు వివిధ ప్రదేశములలో ప్రాణయోగధారణచే మనో – ప్రాణ – దృష్టులను ప్రవేశింపజేయటము (4) దృశ్య –

దేహి - దేహ - విరాట్ విశ్వములకు ఆవలగల కేవలమగు పరమాత్మ (పరమ్ = ఆవల) పట్ల మనోధారణ యోగము- వీటిని యోగాభ్యాసి యోగాభ్యాసపూర్వకంగా అభ్యసించునుగాక!

ఇట్టి ఆత్మ ధ్యానముతో కూడిన యోగాభ్యాసముచే - పర్వతములను నరికివేయు వజ్రాయుధమువలె - సాంసారిక ధ్యాసలన్నీ ఖండించి వేయబడతాయి. అనన్యమగు ధారణ స్వాభావికమౌతుంది. **"ఇంద్ర వజ్రమ్" ఇతి ప్రోక్తం మర్మ జంఘాను కృంతనమ్।** ఈ యోగాభ్యాసము శరీరములోని మర్మజంఝములను (గ్రంథులను) మొదలంట్లా త్రెంచి వేస్తుంది కాబట్టి **'ఇంద్ర వజ్రము'** అంటారు. అట్టి స్వాభావికత్వము కొరకై...(1) ఉరువుల (తొడల) మధ్యగా దృష్టిని నిలిపి, ప్రాణశక్తిని ఆరోపించి, (2) మర్మములందు పరిమితము, సంబంధితము అయి ఉన్న ప్రాణశక్తిని బయల్వెడలదీస్తూ, పైన చెప్పిన **'చాతుర్యోగముల అభ్యాసము'** చే ఊర్ధ్వగమనము చేయించాలి. అప్పుడిక సర్వ సంసార బంధములు తెగిపోగలవు. అన్ని అభిశంకలు తొలగిపోతాయి.

**ప్రాణాయామాభ్యాసము చేయటానికి సూచించిన సమయములు**:

సర్వకాలములు తగిన సమయమే. అయితే అభ్యాసులకు ప్రారంభంలో కాలనియమము ఈ విధంగా సూచించబడుతోంది.

| | |
|---|---|
| ప్రాతః కాలము బ్రహ్మ ముహూర్తము | 4 AM to 6 AM |
| మధ్యాహ్న కాలము | 11 AM to 01 PM |
| సాయం సంధ్యాకాలము | 4 PM to 6 PM |
| రాత్రి కాలము | 8 Pm to 10 PM |

ప్రాతఃకాలం నుండి రాత్రి కాలము వరకు రోజుకు 4 పర్యాయములు - కాలిబొటనవ్రేలు స్థానము మొదలుకొని - శిరస్సుపైగల సహస్రారము చివరి వరకు ఆయా (పైన చెప్పబడిన) స్థానములలో **ప్రాణాయామ కుంభకము** అభ్యాసము చేయునుగాక।

**'ఇంద్రవ్యజ యోగాభ్యాసము'** నందు మనో-దృష్టి-ప్రాణములను నియమించాలి.

'తత్' రూపనామ చింతనతో కూడుకొన్న **అహమ్ - త్వమ్**లతో సహా **అఖండమైయున్న పరమాత్మను** ఆరాధిస్తూ ఉండాలి.

క్రమంగా సమస్త దృశ్యమును **'తత్ రూప పరమాత్మ స్వరూపము'**గా భావనచేయును గాక!

దృష్టిని **తత్ భావన**తో పవిత్రము చేసుకోవాలి.

ప్రాణశక్తిని వశం చేసుకొని తద్వారా మనస్సును తత్ భావనతో నింపివేయాలి. (అనగా) అనేకము పట్ల వ్యవహరిస్తున్న 'ఇచ్ఛాశక్తి'ని 'ఏకము-అఖండము' అగు ఆత్మకు నివేదనము చేయాలి.

## బ్రహ్మరూపిణియగు బ్రహ్మనాడి (లేక) సుషుమ్న (లేక) పరానాడి

కంఠ ప్రదేశములో (విశుద్ధ చక్ర ప్రదేశములో) 101 నాడులు సంచయము కలిగి ప్రవర్తన శీలమై ఉన్నది. వాటన్నిటికి మధ్యగా గల ఒక ముఖ్య నాడి - **'స్థిరనాడి'** అని **'సుషుమ్న'** అని, **'బ్రహ్మనాడి'** అని పిలవబడుచూ ఉన్నది.

ఇది శిరస్సు యొక్క ఉపరితలమునగల 'సుషిరగము' అను రంధ్రమువరకు (బ్రహ్మరంధ్రము వరకు) విస్తరించి యుండటంచేత **'సుషుమ్న'** అంటున్నారు.

ఇది దేహమునుండి బ్రహ్మము వరకు (**జీవుని** నుండి - ఏకము, అక్షరము అగు **పరమాత్మ** వరకు) సూక్ష్మరూపంగా సూత్రభూతమై యుండటం చేత **'పరానాడి'** అని కూడా అంటారు.

పరబ్రహ్మమునందు లీనమై ఉండటంచేత, **'బ్రహ్మరూపిణి'** అని కూడా చెప్పబడుతోంది.

రజోగుణ - తమోగుణ రహితమై, శుద్ధ సత్త్వగుణ సమన్వితమై, నిర్మల ప్రకాశవంతమైయున్న నాడి కాబట్టి **'విరజ'** అని కూడా అనబడుతోంది. **ఈ సుషుమ్న నాడికి :-**

- వామ (ఎడమ) వైపుగా 'ఇడ' నాడి.
- దక్షిణ (కుడి) వైపుగా 'పింగళ' నాడి.

ఇడ పింగళ నాడుల మధ్యగల సుషుమ్నానాడియందు శ్రేష్ఠమైనట్టి **'బ్రహ్మస్థానము' లేక 'పరంస్థానము' ఉన్నది. తయో ర్మధ్యే పరం స్థానగ్ం। యస్తం వేద స వేదవిత్।** అట్టి సుషుమ్నను, అందలి బ్రహ్మీ స్థానమును ఎరిగినవాడు **'వేదవిత్'** (తెలుసుకొనవలసినది తెలుసుకున్నవాడు) అగుచున్నాడు.

శరీరములో 72000 నాడులు (మరియు) ఉపనాడులు. ఆ నాడులన్నిటిలో ప్రాణశక్తి స్వభావముగా స్థానము కలిగి, ప్రసరించుచున్నదై ఉంటోంది. ప్రతి నాడి – ఉపనాడి యందు తైతిలము (ఒక కరణము, Functional Hand) ఉన్నది. అటువంటి నాడీ గతమైనటువంటి ప్రాణప్రసరణము **యోగ నిర్మలసారము** (యోగముచే సిద్ధించిన నిర్మలమైన సారస్థితి) అనే కత్తి (Sharp Knife)చే భేదించబడగలదు. నిరోధించబడగలదు.

**ఛిద్యతే ధ్యాన యోగేన। సుషుమ్న ఏకా న ఛిద్యతే।** యోగాభ్యాసముచే '100' నాడులు నిరోధించబడ గలవు. కానీ 101వది అగు ఒక్క సుషుమ్నయొక్క ప్రాణ ప్రసరణము మాత్రమే ఏమాత్రము నిరోధించబడదు.

**'యోగనిర్మలసారము'** (The Energy essence of yoga Abhyaasa) **అనే కత్తిచే తక్కిన నాడులు క్షురకము (కత్తిరించటం, జయించటము) జరుగగా అగ్ని యొక్క తేజస్సుచే వెలుగొందుచున్న సుషుమ్న అనుభవమునకు రాగలదు.**

అట్టి సుషుమ్నయందు **దృష్టి – ప్రాణ – చిత్తము (ఇష్టము)**లను (లేక) మనస్సులను నియమించి, యోగాభ్యాసము చేయాలి. ఏవిధంగా అయితే **"జాతి పుష్పము (జాజికాయ చెట్టు పుష్పం)–అద్దానియొక్క సువాసన"** వేరువేరు కానివై ఉంటాయో, ఆ విధంగా 'సుషుమ్న' యందు దృష్టి – మనస్సు – ప్రాణములను ఏకం చేసి, బ్రహ్మీస్థానము – బ్రహ్మమును దర్శించాలి. (అనగా) మనో ప్రాణ దృష్టుల ప్రసరణమును (తైతిలమును) ఉపకరణములుగా దర్శిస్తూ బ్రాహ్మీ స్థానమును ఆశ్రయించాలి.

**'సుషుమ్నానాడి'** తప్ప తక్కిన నాడులన్నీ కూడా శుభ – అశుభ భావనలతో కూడిన అనేక రాకపోకలు కలిగి ఉన్నాయి. (ఉదా : దృష్టి, వినికిడి, స్పర్శ, రుచి, వాసనలను ప్రసరింపజేయునాడులన్నీ ఇష్ట – అయిష్టములతో కూడిన ప్రాణశక్తి ప్రసరణలతో కూడినవై ఉంటున్నాయి). **అట్టి తన్మాత్రల ఇష్టాఇష్టములన్నీ కూడా ఈ జీవుని పట్ల పునర్జన్మ హేతువులై ప్రవర్తిస్తూ ఉంటున్నాయి.** వాటినన్నిటినీ అభావించినవాడై, **వాటివాటి భావములను దాటిన**వాడై, వాటిని లెక్కచేయనివాడై, యోగి సుషుమ్నను ఆశ్రయించటంచేత, అట్టి సుషుమ్నానాడీ అంతర్గత ధ్యాస – దృష్టులు ఆ యోగిపట్ల **'మోక్షప్రదము'** అగుచున్నాయి.

ఏ యోగి అయితే....,

- **తపోవిజిత చిత్తస్తుడై –** తపోయోగము, ప్రాణయోగాభ్యాసముచే చిత్తము (ఇంద్రియ విషయములపట్ల ఇష్టమునకు సంబంధించిన ఆవేశము)ను జయించినవాడై,
- శబ్ద స్పర్శ రూప రస గంధాధి విషయములను **నిశ్శబ్దము చేసివేస్తూ,**
- ఇంద్రియ ద్వారములను **నిగ్రహించుచూ,**
- ప్రత్యాహారముగా ఆత్మభావనయొక్క సాధనములందు **నియమించుచూ,**
- **ఏకాంత వాసుడై** (పరమాత్మను సహజీవులకు అనన్యముగా చూచువాడై) (It is not merely Physical experience. It is way of looking at others, other things and events),
- **నిశ్శబ్దం దేశమ్ ఆశ్రితః –** నిశ్శబ్దమైన ప్రదేశమును ఆశ్రయించినవాడై, (సమస్త లౌకిక సంబంధములను దాటివేసినవాడై),
- **నిస్సంగః –** సమస్త సంగములను (All-Attachments) హృదయ కుహరమునందు రహితము చేసుకున్నవాడై,
- **సాంగ యోగజ్ఞో –** యోగముయొక్క వివిధ అంగములను (Step by step) ఎరిగినవాడై,
- **నిరపేక్షః శనైః శనైః –** సర్వ విషయములపట్ల అపేక్షను (Inquisitiveness / deep expectation / strong desire) కొంచెం కొంచెం రహితము చేసుకొన్నవాడై, (నాటకములో నటించువాడికి నాటకములోని విషయములతో 'సంగము' – లేని తీరుగా) నిరపేక్షుడై,
- **పాశాగ్ం ఛిత్వా –** సర్వ పాశములను (Bondosis) త్రెంచి వేసుకొనినవాడు అగుచున్నాడు.

**యథా హఙ్ంసో నిర్విశంకం ఖమ్ ఉత్పతేత్** - ఏ విధంగా కుట్టు త్రాళ్లను త్రెంచుకొన్న హంస ఆకాశంలో హాయిగా, శంకా రహితంగా ఎగురుచూ విహారములు చేస్తూ ఉంటుందో...- **ఛిన్న పాశః తథా జీవః సంసారం తారతే సదా'** - ఆ విధంగా యోగి కూడా దృశ్య పాశములనుండి విముక్తుడై, సంసారమునుండి తరించినవాడై - **ఆత్మాకాశమునందు 'అహమ్ బ్రహ్మాస్మి' భావనతో హాయిగా విహరించుచున్నాడు.**

ఏ విధంగా అయితే వెలుగుచున్న దీపము క్రమంగా నూనె ఇంకిపోగా చివరికి వత్తిని కూడా కాల్చి మసి చేసి వేస్తోందో, ఆ విధంగా **యథా నిర్వాణ కాలేతు దీపో దగ్ధ్వా లయం వ్రజేత్, తథా సర్వాణి కర్మాణి యోగీ దగ్ధ్వా లయం వ్రజేత్।** యోగి యోగము యొక్క అంతిమ స్థితియందు (అంతిమ ఫలప్రాప్తిచే) సర్వకర్మబంధములను మొదలంట్లా భస్మము చేసివేస్తున్నాడు. **'స్వస్వరూపము, సహజరూపము'** అగు **'ఆత్మాహమ్'** నందు **'జీవాత్మాహమ్'**ను కరిగించివేయుచున్నాడు.

(నీళ్లలో కరిగిన మంచుగడ్డవలె) నామరూపాత్మకమైనదంతా ఆత్మయందు ఏకము చేసి వేయుచున్నాడు. మాత్రధారణ (పూరకము - 12 మాత్రలు, కుంభకము - 36 మాత్రలు, రేచకము - 24 మాత్రలు)తో కూడిన ప్రాణాయామ (ప్రాణయోగ) అభ్యాసముచే యోగవేత్త 'వైరాగ్యము' అను గండశిలపై జ్ఞానఖడ్గమును పదునుబెట్టి, సర్వ సాంసారిక త్రాళ్లను (తంతువులను) త్రెంచివేసి సర్వే సర్వత్రా సర్వదా **'బంధరహితుడు'** అగుచున్నాడు.

**శ్లో॥ అమృతత్వం సమాప్నోతి యదా కామాత్ ప్రముచ్యతే,**
**సర్వ ఈషణామ్ వినిర్ముక్తః ఛిత్వా తంతుం న బధ్యతే॥**

ఎవ్వడు ఈ దృశ్యము పట్ల,

- ఇది ఇట్లే ఉండాలి. వారు ఇట్లా ఉండకూడదు।
- ఇది పొందాలి. అది తొలగాలి।
- ఏదో పొందాలి. చేయాలి।
- ఇంకేదో తొలగాలి. కావాలి।
- ఇప్పుడు కాదు. ఇది కాదు. అప్పుడు అది వస్తుంది.

......ఈఈ రూపములను దాల్చుచున్న సర్వ కామములు (wishes, expectations, desires, passions etc) మొదలంట్లా యోగాగ్నితో దగ్ధం చేసి వేస్తూ, యోగబలముతో తొలగించివేసుకొని ఉంటాడో...
అట్టివాడు

**ఛిత్వా తంతుం న బధ్యతే।**
**ఛిత్వా తంతుం న బధ్యత। - ఇతి॥**

సర్వ బంధములను తెగగ్రొట్టి బంధరహితుడగుచున్నాడు.

ఎవరి దృష్టిలో తనపట్ల సంసార బంధము అంతరమున మొదలంట్లా తొలగినదై ఉంటోందో...**'తదేవ మోక్షమ్'।**

**"నాకు బంధము అనునది మొదలే లేదు" - అనునదే మోక్షము।**

ఇతి క్షురికోపనిషత్ సమాప్తా
ఓం శాంతిః శాంతిః శాంతిః

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 1 అవ్యక్తోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

ఓం ఉగ్రం వీరం మహా విష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్।
నృసింహ భీషణమ్ భద్రం మృత్యుర్మృత్యుమ్ నమామ్యహమ్॥

శ్లో॥ స్వాజ్ఞాన (స్వ-అజ్ఞాన) అసురరాట్ గ్రాస, స్వజ్ఞాన నర కేసరీ,
ప్రతియోగి వినిర్ముక్తం, బ్రహ్మమాత్రం కరోతు మామ్॥



స్వకీయ స్వస్వరూప అజ్ఞానము అను అసురుని చీల్చివేయువారు, ద్వైతవాదముల నుండి విముక్తి కలిగించువారు, స్వస్వరూప జ్ఞానానందులు అగు శ్రీ లక్ష్మీ నృసింహ స్వామిని బ్రహ్మజ్ఞానము కొరకై శరణువేడుచున్నాము.

ఓం।

"ఓం" ప్రణవస్వరూపుడగు పరమాత్మను ఉపాసిస్తూ,

| | |
|---|---|
| **1.** పురా కిలా ఇదం న కించన ఆసీత్। న ద్యౌః। న అంతరిక్షం। న పృథివీ। కేవల జ్యోతీరూపమ్। అనాది – అనన్తమ్। అనణ్వ స్థూల రూపమ్, అరూపమ్। రూపవత్ అవిజ్ఞేయమ్। జ్ఞానరూపమ్ – ఆనందమయమ్ ఆసీత్। | ఈ అనేక భేదములతో కూడి ఎదురుగా కనిపిస్తున్న దృశ్యజగత్తు మొట్టమొదట లేనేలేదు. సృష్టికిపూర్వము దివ్యమగు దేవలోకము లేదు. అంతరిక్షము లేదు. పృథివీ లేదు. మునుముందుగా మరి ఏమున్నది? - కేవల తేజో (జ్యోతి) స్వరూపము, ఆది-అన్తము లేనట్టిది. సూక్ష్మము గాని-స్థూలము గాని కానట్టిది. అపురూపమైనది. రూపాత్మకముగా తెలియబడనట్టిది. కేవల జ్ఞానానందరూపము అగు 'కేవలాత్మ' మాత్రమే। (Merely Absolute Self is present) సర్వ లక్షణములకు విలక్షణము, వేరు, కేవలము అయిన 'నేనైన నేను' మాత్రమే ఉన్నది. 'నాది అనునది' అంటూ ఏదీ లేదు. ఇవన్నీ మన 'కేవలాత్మ' యొక్క జన్మల మునుముందటి స్వాభావిక లక్షణములు. |
| తత్ అన్యత్ తత్ ద్వేధా (2) ఆభూత్। | అద్దానికి 'అన్యము' అనునది ఎప్పుడూ లేదు! అట్టి ఏకము - అనన్యము అగు ఆత్మ **రెండు విధములుగా** ప్రదర్శనమవసాగుచున్నది. |
| 'హరితమ్' ఏకమ్। 'రక్తమ్' అపరమ్। | (1) హరితము (ఆకుపచ్చనిది) - (మాయారూపము). (Feelings) (మాయా = కల్పన; ఊహ; భావన; యోచన; అనుభూతి). (2) ఎర్రనిది (రక్తవర్ణము)-(మాయి, పురుషరూపము (లేక) పురుషకారము). (Feeler). (**పురుష** = కల్పించువాడు; ఊహించువాడు; భావించువాడు; యోచించువాడు; అనుభూతి తనదైనవాడు. మాయ = కల్పన) |
| తత్ర యత్ 'రక్తం', తత్ పుంసోరూపమ్ అభూత్। యత్ హరితమ్, తత్ మాయయాః। తౌ సమాగచ్ఛతః, తయోః వీర్యమేవమ్ అనందత్। తత్ అవర్ధత। | అట్టి (1) పురుషుడు (పురుషకారము-మాయ) (2) కల్పనారూపమగు "మాయ" రెండూ కల్పనచే రూపుదిద్దుకోసాగాయి. ఆ రెండిటి సమావేశముచే వీర్యము (క్రియాశక్తి) రూపుదాల్చి వృద్ధి చెందసాగాయి. |
| తత్ అండమ్ అభూత్ హైమమ్। తత్ పరిణమమానమ్ అభూత్॥ | ఆ వీర్యము (క్రియాచైతన్యము). అ + హమ్ = అహమ్ రూప-హైమ (బంగారు) అండముగా (గ్రుడ్డుగా) అయి పరిణామము (Change Factor) స్వీకరించసాగింది. (నిష్క్రియమగు ఆత్మనుండి సక్రియము + పరిణామము ప్రదర్శనమవసాగుచుండటం జరుగుతోంది. (హైమ = మహైవ = నాకే చెందినది) |

| | |
|---|---|
| **2. తతః పరమేష్ఠీ వ్యజాయత।**<br>**సో అభిజిజ్ఞాసత –**<br>**"కిం మే కులమ్?**<br>**కిం మే కృత్యమ్?" – ఇతి।**<br>**తం హ వాక్ అదృశ్యమాన**<br>**అభ్యువాచ:**<br>**"భో!భో! ప్రజాపతే!**<br>**త్వమ్ అవ్యక్తాత్ ఉత్పన్నోఽసి।**<br>**వ్యక్తమ్ తే కృత్యమ్।" ఇతి।** | అట్టి 'కేవలము + క్రియావిశేషము + పరిణామము'ల సమాగమముచేత రూపముపొందిన అండము నుండి సృష్టిచేయు **కర్తృత్వాభిమానియగు** పరమేష్ఠి (సృష్టికర్త । బ్రహ్మ) జనించారు.<br>అట్టి కల్పనకు సంబంధించిన - అభిమానముతో కూడిన పరమేష్ఠి (కర్తృత్వాభిమాని) ఈవిధంగా **అభి-జిజ్ఞాస** (గొప్ప జిజ్ఞాస) పొందసాగారు.<br>- నేను ఎవరై ఉన్నాను? నేను ఏ కులము (స్వభావము) వాడను?<br>- ఎందుకు, ఎక్కడి నుండి జనించాను?<br>- నేను ఏమి చేయాలి - కిమ్ మే కృత్యమ్?<br>అప్పుడు అదృశ్యవాణి (అదృశ్యవాక్కు)....ఇట్లా వినిపించింది.<br>ఓ...ఓ..... ప్రజాపతీ! నీవు 'అనేకులు' అనే కల్పనకు అధిపతివి. అవ్యక్తము నుండి పుట్టావు. అవ్యక్తము (లేక) అదృశ్యమే నీ స్వభావము. వ్యక్తము (వ్యక్తీకరణము)-నీవు చేయవలసిన పని. కనుక 'వ్యక్తీకరణము' అనబడే సృష్టిని నిర్వర్తించు. |
| **"కిం అవ్యక్తమ్?యస్మాత్ అహమ్ ఆసిషమ్?"**<br>**కిం తత్ వ్యక్తం, యత్ (యన్) మే కృత్యమ్? ఇతి।** | **ప్రజాపతి** : ఓహో! అవ్యక్తము నుండి నేను జనించానా? అట్టి అవ్యక్తము అనగా ఏమి? ఎట్టిది? నేను వక్తీకరించవలసిన వ్యక్తము ఏమిటి? ఎట్టిది? ఎందుకు? ఎవరి కొరకు? ఎవరి గురించి? |
| **<u>సా అబ్రవీత్</u>**<br>**"అవిజ్ఞేయం హి తత్, సౌమ్య!**<br>**తేజో యత్ అవిజ్ఞేయం, తత్ అవ్యక్తమ్।**<br>**తత్ చేత్ జ్ఞాస్యసి, మా అవగచ్ఛేతి।** | **అదృశ్యవాక్కు(లేక) వాణి** : ఓ సౌమ్యా! బిడ్డా! ఏది తెలియబడజాలని తేజోరూపమో - అదియే **అవ్యక్తము.** 'తెలుసుకోవటము' అనుదానికి మునుముందే ఉన్న నీ రూపమే అవ్యక్తము.<br>అట్టి తెలియబడజాలనితత్త్వము చేత - ఏది తెలుసుకోబడుచున్నదో అదియే **వ్యక్తము.** అట్టి అవ్యక్తము తెలుసుకోవటానికై నన్ను ('నేను'ను) తెలిసికొనుము. 'అవ్యక్తము' తెలియాలంటే 'నేను' ఏమిటో తెలుసుకోవాలి. |
| **<u>సహోవాచ :</u>**<br>**కై షా (క ఏషా) త్వమ్**<br>**బ్రహ్మవాక్ యత్ అసి?**<br>**శంసాత్మానమ్। – ఇతి।**<br>**<u>సా తు అబ్రవీత్ :</u>**<br>**తపసామా విజ్ఞాసస్వ! – ఇతి।।**<br>**సహస్రం స బ్రహ్మచర్యమ్**<br>**– అధ్యువాస। – అధ్యువాస।।** | **ప్రజాపతి :** ఓహో! నన్ను (నేనైననీవును / నీవైన నేనును) తెలుసుకోవాలా? 'నీవు' ఎవరు? అశరీరవాక్కుగా బ్రహ్మవాక్కుగా వినబడుచున్న నీవు ఎవరని నేను తెలుసుకోవాలి? 'శం' - శబ్దముగా వినబడు ఆత్మవగు మిమ్ములను ఎట్లా తెలుసుకోవాలి.<br>అదృశ్యవాక్కు / అశరీరవాణి : నన్ను తెలుసుకోవటానికై ఉపాయం తపనరూపమగు తపస్సే. కనుక తపస్సు చేసి నేనెవ్వరో తెలుసుకో!<br>**అప్పుడు 'ప్రజాపతి' అని సంబోధించబడిన ప్రప్రథమ ప్రజ్ఞాస్వరూప పురుషుడు వేయివత్సరములు "బ్రహ్మము అనగా ఏమిటి?"- అనుబ్రహ్మచర్య నిష్ఠతో తపస్సు చేశారు. 'నేను' అనబడు బ్రహ్మము గురించి సుదీర్ఘంగా 'అధ్యయనుడు' అయ్యారు.** |
| **3. అథ అపశ్యత్ ఋచమ్**<br>**అనుష్టుభీం పరమాం విద్యామ్,**<br>**యస్య అంగాని అన్యే మంత్రాః,**<br>**యత్ర బ్రహ్మ ప్రతిష్ఠితమ్।**<br>**విశ్వేదేవాః ప్రతిష్ఠితాః,**<br>**– యః తామ్ న వేద, (యస్తాం న వేద)**<br>**కిమ్ అన్యైః వేదైః కరిష్యతి?** | అప్పుడు వెయ్యేళ్ళ బ్రహ్మచర్యముతో కూడిన తపన (లేక) తపస్సుకు ప్రయోజనంగా- **అనుష్టుప్ ఛందస్సుతోగల పరమమగు విద్య (లేక) పరావిద్యను "ఋక్" గాన మంత్ర రూపముగా కనుగొన్నారు (లేక) దర్శించారు (అపశ్యన్).**<br>అట్టి సర్వోత్పత్తి స్థానమే (మంత్రమే) ప్రథమ ఋక్ - ప్రణవము. ('ఓం').<br>అన్యమంత్రములన్నీ ఏ "**ప్రథమ ఋక్ - ప్రణవము - ఓం సంజ్ఞ**" నకు అంగములుగా, ఎద్దానియందు ప్రప్రథమ సృష్టికర్తృత్వాభిమానియగు బ్రహ్మచే గమనించబడినాయో, సర్వదేవతలు కూడా అట్టి ఎద్దానిలో ప్రతిష్ఠితులై ఉన్నారో - అట్టి **కేవలీ తత్త్వమును** తెలుసుకోకుండా, **అన్యములైనవి ఎన్ని తెలుసుకొని ఏమి ప్రయోజనము?** తెలియబడేది ఎంత తెలిసి ఏమి లాభం? **తెలుసుకొనువానిని** తెలుసుకోవాలి. |

| | |
|---|---|
| **తాం విదిత్వా స చ<br>రక్తం జిజ్ఞాసయామాస।<br>తామ్ ఏవమ్ అనూచానాం<br>గాయన్ నాసిష్ట।<br>సహస్రం సమా ఆద్యంత నిహిత<br>'ఓం' కారేణ పదాని అగాయత్।<br>సహస్రసమాః తథైవ అక్షరశః।** | అట్టి కేవలమును తెలుసుకొనుచున్న ప్రజాపతి "తెలుసుకోవటము"అనే క్రియారూపమగు రక్తము (రజో కేవలీ గుణము) నందు జిజ్ఞాస (Inquisitiveness) పూర్వకంగా ఉంటూ-రక్తమైనది (రజోరూపంగా ఉన్నది ఏమిటి") అని తెలుసుకునే జిజ్ఞాస కొనసాగించారు. అనుచానముగా (అనుకరణముగా, భృత్యునివలె) గానంచేస్తూ ఉండి పోయారు.<br>సహస్రసమంగా ఆద్యంత పూర్వకంగా 'ఓం' కార పదమును వేయి దివ్య వత్సరములుగానం చేస్తూ ఉండిపోయారు. సహస్ర సమంగా (వేయిసార్లు) "ఓం" అను శబ్దముతో - క్షరము కానిది, సర్వాతీతము, అనునిత్యము, కేవలము - అగు తత్త్వమును ఉపాసించసాగారు. |
| **తతో జ్యోతిర్మయం, శ్రియాలింగితమ్।<br>సుపర్ణ రథమ్। శేష ఫణ - ఆచ్ఛాదిత మౌళిమ్।<br>మృగ ముఖమ్। నర వపుషం।<br>శశి సూర్య హవ్యవాహనాత్మక నయనత్రయమ్।<br>తతః ప్రజాపతిః ప్రణిపాత, "నమో నమః" ॥ఇతి॥<br>తథైవ అర్చాథ। తమస్తౌత్।** | అప్పుడు ఆ ప్రజాపతికి ఎదురుగా ఒక దివ్యతేజోరూపము సాకారమై కనిపించింది. ఆ రూపము...<br>**-జ్యోతిర్మయము. దివ్యతేజస్సుతో వెలుగొందుచున్నట్టిది; 'శ్రీదేవి' అగు (శక్తి-ప్రకృతిరూప) లక్ష్మీదేవిచే ఆలింగనము చేసుకొనబడినట్టిది; సుపర్ణుని (గరుడుని) రథముగా అధిరోహించబడినట్టిది; ఆదిశేషుని వేయి పడగలచే ఆచ్ఛాదితమైన శిరస్సు కలిగియున్నట్టిది; మృగముఖము - నరశరీరముకలిగి నృసింహరూపము గలది; చంద్ర - సూర్య - అగ్నులను నయనములుగా కలిగి ఉన్నట్టిది.**<br>అప్పుడు ప్రజాపతి తపస్సువిరమించి, లేచి ఆ దివ్యరూపమునకు సాష్టాంగనమస్కృతులు "నమో నమః" అని ఉచ్ఛరిస్తూ సమర్పించారు. అర్చించారు. స్తుతులు సమర్పించారు. |
| **4. 'ఉగ్రమ్' ఇతి ఆహ ఉగ్రః।<br>ఖలువా ఏషః మృగరూపత్వాత్।<br>'వీరమ్' ఇతి ఆహ వీరోవా, ఏష వీర్యవత్త్వాత్॥** | ప్రజాపతియొక్క నృసింహస్తుతి॥<br>మృగరూపులై ఉగ్రరూపంగా కనిపిస్తూ ఉండటంచేత **"ఉగ్రమ్"!** అని, నాతో సహా ఈ సమస్తము మీ సామర్థ్యమే అయి, వీర్యవంతులై కనిపిస్తూ ఉండటంచేత **"వీరమ్"!** - అని సంస్తుతించుచున్నాను. |
| **'మహావిష్ణుమ్' ఇతి అహ, మహతాం వా<br>అయం మహాన్ రోదసీ వ్యాప్య స్థితః।<br>'జ్వలంతమ్' ఇతి ఆహ<br>జ్వలన్ ఇవ ఖలు అసావత్ స్థితః।<br>"సర్వతోముఖమ్" ఇతి ఆహ,<br>సర్వతః ఖలు అయం ముఖవాన్<br>విశ్వరూపత్వాత్।** | సమస్తముయొక్క 'నేనైన నేను" కాబట్టి - మహత్ స్వరూప సంపన్నులు. సర్వత్రా ఆక్రమించుకొన్న స్వరూపము కలవారు. మహత్ ఆదిస్వరూపులు, సమస్తమునకు జననస్థానము అయి ఉన్నారు. మీరు మహాన్‌తత్త్వస్వరూపులై భూమి - ఆకాశములలో అంతటా వ్యాపించి సంస్థితమైయుండటంచేత - ఈ మీ దివ్యరూపమును 'మహావిష్ణుమ్' అని అభివర్ణితము.<br>సర్వత్రా వ్యాప్తులై ఆసావత్ స్థితులై, మీ తేజస్సుతో సర్వమును వెలిగించుచుండటంచేత - జ్వలన్ ఇవ ఖలు **'జ్వలంతమ్'** అని ప్రస్తుతి.<br>సర్వత్రా మీయొక్క ముఖమే అయి, విశ్వమంతా మీ ప్రదర్శమగు చుండటంచేత "సర్వతోముఖమ్" - అని స్తుతించుచున్నాను. |
| **'నృసింహమ్' ఇతి ఆహ,<br>యథా యజురేవ ఏతత్। (యజురేవైతత్)<br>'భీషణమ్' ఇతి ఆహ,<br>భీషా వా అస్మాత్ ఆదిత్య ఉదేతి॥** | అన్నివైపులా భీకరరూపములు - సందర్శనములు కలిగి ఉండటంచేత **"నృసింహమ్"** అని యజుర్వేద వాక్కు (యజుస్వరం)తో సన్నుతి. సమస్త తరంగాలలో శ్రేష్ఠమగు జలము వలె (నార=జలము) సర్వశ్రేష్ఠులు. (నారసింహమ్).<br>సర్వత్రా ముఖములలో వేంచేసి ప్రకాశమానుడైయున్న మీ కేవల దివ్య చైతన్యమూర్తికి భయపడియే → **సూర్యుడు ఆకాశంలో కాల నిర్ణయాత్మకంగా ఉదయించుచున్నారు.** |

| | |
|---|---|
| **భీతః చంద్రమా।**<br>**భీతో వాయుః వాతి।**<br>**భీతో అగ్నిః దహతి।**<br>**భీతః పర్జన్యో వర్షతి।**<br>**<u>'భద్రమ్'</u> ఇతి ఆహ,**<br>**భద్రః ఖలు వయం।**<br>**శ్రియా జుష్టః।** | మీ మూర్తీభవించిన దివ్య చైతన్య చమత్కృతికి భయపడియే చంద్రుడు ఆకాశములో ప్రకాశించుచు నలువైపులా ఓషధులను వెదజల్లుచున్నారు.<br>- మీకు భీతిల్లియే వాయువు వీచుచున్నది. అగ్ని వస్తువులను దహించుచున్నది. వర్షదేవతాభిమానిఅగు పర్జన్యుడు వర్షమును కురిపించుచున్నారు. అందుచేత **"భీషణమ్"** అని వర్ణన.<br>ఈ విధంగా, సర్వజగత్ రక్షక వ్యవహారశీలతను గమనిస్తూ తేజోమయరూపులగు మీకు **"భద్రమ్"** - అని అభివాదము. 'క్షేమము'ను ప్రసాదిస్తూ భద్రరూపులగుచున్నారు. |
| **<u>"మృత్యోః మృత్యుః"</u> ఇతి ఆహ,**<br>**మృత్యోర్వా అయం మృత్యుః (మృత్యోర్మృత్యుం)।**<br>**అమృతత్త్వం।**<br>**'ప్రజానామ్ అన్నాదానాం (అన్నాదం)।**<br>**'నమామి' – ఇతి ఆహ,**<br>**యథా యజుః ఏవైతత్।**<br>**<u>'అహమ్'</u> ఇతి ఆహ,**<br>**యథా యజుః ఏవై తత్॥** | సర్వజగత్ సంపదలకు మీరే ప్రదాత. జగత్ విశేషములన్నీ, సమస్తము కూడా మీనుండియే బయల్వెడలుచున్నది. మిమ్ములను ఆశ్రయించి ఉన్నాయి. ఇది గమనించి **"శ్రియాజుష్టమ్"** అని స్తోత్రం.<br>సర్వమార్పు - చేర్పుల కారణ - కారణుడై వ్యవహరించటము చేతను, సర్వ మార్పులను తమయొక్క అమృతతత్త్వముచే నింపివేయటం చేతను - 'మృత్యోర్వా అయం మృత్యుః - మృత్యోర్మృత్యుః అమృత స్వరూపమ్" అని గానం చేస్తున్నాను. సర్వజీవరాసులకు ఇంద్రియములను, ఆ ఇంద్రియము లకు 'విషయములు' అనే ఆహారము ప్రసాదించుచుండటం చేత **"ప్రజానామ్, అన్నదానం - నమామి"** అని యజుర్వేద గానపూర్వకంగా నమస్కారము. సమస్తము మీ నుండియే జనించుచుండటంచేత "యః జుః ఉ" - యజుర్వేదులు. |
| **5. <u>అథ భగవాన్ తమ్ అబ్రవీత్:</u>**<br>**ప్రజాపతే (హే)! ప్రీతోఽహం।**<br>**కిం తవ ఈప్సితం తత్ ఆశంసేతి।** | ఆ ప్రజాపతియొక్క సంస్తుతిలకు సంతోషించి భగవానుడు ఈ విధంగా పలికారు:-<br>హే ప్రజాపతీ! నీయొక్క "ఓం। ఈం। హం। ఉగ్రమ్। వీరమ్। మహావిష్ణుమ్। జ్వలంతమ్ సర్వతోముఖమ్। నృసింహ। భీషణమ్। భద్రమ్। మృతుర్మృత్యుమ్। నమామ్యహమ్" అని పలుకుచున్నట్టి మననార్థ-మంత్రస్తుతికి నేను ప్రీతి పొందానయ్యా! నీ ఈప్సితమేమిటో అడుగు. సంతోషంగా ప్రసాదిస్తాను. |
| **<u>స హోవాచ :</u>**<br>**భగవన్! అవ్యక్తాత్ ఉత్పన్నోఽస్మి,**<br>**వ్యక్తం మమ కృత్యమ్ ఇతి పురా శ్రావి।**<br>**తత్ర అవ్యక్తం భవాన్ – ఇత్యజ్ఞాయి। (ఇతి అజ్ఞాయ)।**<br>**వ్యక్తం మే కథయ!" – ఇతి॥** | ప్రజాపతి → ఇట్లు అభ్యర్థించసాగారు.<br>హే భగవాన్! "నేను ఎక్కడి నుంచి పుట్టాను?" అనే ప్రశ్న నాయందు ఉదయించింది. నేను సమాలోచన చేసే ప్రయత్నంలో ఉండగా, **"అవ్యక్తము నుండి నీవు పుట్టావు. వ్యక్తమును వ్యక్తీకరించటమే నీ పని"** - అని అదృశ్యవాణి నాకు వినిపించింది. ఆ అశరీరవాణి, సూచనను అనుసరించి తపస్సు చేశాను. మీరు ఇప్పుడు నా అనుభూతికి ప్రత్యక్షమైనారు. అందుచేత **"మీరే అవ్యక్తము"** అనునది నాకు తెలియవచ్చింది. మరి వ్యక్తము అంటే ఏమిటి? ఏవిధంగా? దయచేసి తెలియజేయండి. |
| **<u>భగవాన్ ఉవాచ</u>**<br>**వ్యక్తం వై విశ్వం చరాచరాత్మకమ్।**<br>**యద్వ్యజ్యతే తత్ వ్యక్తస్య–**<br>**'వ్యక్తత్వమ్' – ఇతి।** | **<u>శ్రీభగవాన్</u>** : చరాచరాత్మకమైన విశ్వమే 'వ్యక్తము'. ఏదైతే ప్రదర్శనమై (Manifestaion), ఏది "అనుభవము-అనుభూతి"ల రూపంగా సుస్పష్టము కాగలదో - అదియే **వ్యక్తము.** <u>వ్యజ్యతే వ్యక్తస్య వ్యక్తత్వమ్।</u> వ్యక్తీకరించబడి, వ్యక్తమగుచున్నదే అభివ్యక్తము. కనుక (నాక్రీడా - లీలా వినోదంగా) మీరు వ్యక్తీకరణమును నిర్వర్తించండి. జగత్ సృష్టిని నిర్వర్తించండి. |

<u>సహోవాచ : (ప్రజాపతిః ఉవాచ)</u>
న శక్నోమి జగత్ స్రష్టుమ్
ఉపాయం మే కథయ–ఇతి॥

**ప్రజాపతి** : అవ్యక్తమునుండి బయల్వెడలిన నేను మీ ఉద్దేశ్యానుసారంగా వ్యక్తీకరణ రూపమగు జగత్ సృష్టి ని నిర్మించటానికి సంసిద్ధుడనై ఉన్నాను. మీ ఆజ్ఞప్రకారం అట్లాగే చేస్తాను. అయితే అది నావలన అవటమెట్లా? దయతో ఉపాయమును బోధించండి.

---

<u>తమ్ ఉవాచ పురుషః</u>
ప్రజాపతే! శృణు!
సృష్టేః ఉపాయం పరమం, యం విదిత్వా
సర్వం జ్ఞాస్యసి। సర్వత్ర శక్య (క్ష్య)సి।
సర్వం కరిష్యసి।
మయి అగ్నౌ స్వాత్మానం 'హవిః ధ్యాత్వా,
తయైవ అనుష్టుభ్ – అర్చా।
ధ్యాన యజ్ఞో అయమేవ।
ఏతత్ వై మహోపనిషత్,
దేవానాం గుహ్యమ్।
న హ వా ఏతస్య
సామ్నాన్ అర్చాన,
యజుష అర్థోనువిద్యతే।
య ఇమాంన్, వేద స సర్వాన్ కామాన్
అవాప్య, సర్వాన్ లోకాన్ జిత్వా
మామేవ అభ్యుపైతి।
న చ పునరావర్తతే,
య ఏవం వేద। ఇతి॥

**పరమపురుషుడగు భగవానుడు** : హే ప్రజాపతీ! అయితే, సృష్టికల్పనకు పరమోపాయమేమిటో చెపుతాను, వినండి. ఇది శ్రద్ధగా వింటే సర్వము ఎరిగినవారై, సర్వశక్తిమంతులై. సర్వమును నిర్వర్తించగలరు.

నాయొక్క (విష్ణుతత్త్వము అనే) అగ్నియందు స్వస్వరూపమగు 'స్వాత్మ'ను హవిస్సుగా ధ్యానము చేయండి. స్వాత్మనే 'అనుష్టుప్ ఋుక్'గా అర్చనకు ఉపక్రమించండి. అదియే ధ్యానయజ్ఞము.

ఇది దేవతలకు కూడా రహస్యమై యున్నట్టి మహోపనిషత్.

అట్టి "స్వాత్మహవిస్సు" స్వరూప, **"మహోపనిషత్"** రూప - **"స్వస్వరూప ధ్యానయజ్ఞము"** - ఋుగ్వేద ఋుక్కులచేగాని, యజుర్వేద యజ్ఞ కార్యములచేగాని, సామవేద గానములచేగాని సిద్ధించగలిగేది కాదు. నేను చెప్పుచున్న స్వస్వరూప జీవాత్మ సమర్పిత రూపమగు యజ్ఞమును ఎరిగినప్పుడు, అనుక్షణికంగా నిర్వర్తిస్తూ ఉన్నప్పుడు,

→ సమస్త కోరికలు తీరగలవు.
→ సర్వలోకములు జయించబడగలవు.
→ నన్నే పొందటము జరుగగలదు.
→ మరల పునరావర్తదోషము ఉండదు.

(వేదములలో చెప్పిన భౌతిక ఉపకరణములతో చేసే యజ్ఞఫలము కాలబద్ధమైనది. పైగా, యజమానికి పునరావర్తదోషము తొలగదు. స్వస్వరూపమును సమస్తము అయి ఉన్న పరమాత్మతో ఏకము - అనన్యము చేయుటయే వాస్తవమైన యజ్ఞము, (ప్రాణాయామము కూడా). వ్యష్టిగతమైన 'నేను' పట్ల 'సమష్ఠగత నేనుకు చెందినదే కదా!" అను ధారణయే **"స్వాత్మానమ్ హవిర్యజ్ఞము"**.

(ఇది చెప్పి విష్ణుభగవానుడు అంతర్ధానమైనారు)

---

**6.** ప్రజాపతిః తం యజ్ఞాయ
వసీయాంసమ్ ఆత్మానం మన్యమానో
మనోయజ్ఞేన ఏజే।

**మానసిక యాగం**

అప్పుడు ప్రజాపతి జీవాత్మను యజ్ఞకర్తగా, పరమాత్మను యజ్ఞపురుషునిగా భావన చేసి మనోయజ్ఞము చేయటానికి సంసిద్ధులైనారు. మానసిక యాగం ప్రారంభించారు.

---

స ప్రణవయా తయైవ అర్చా
హవిః ధ్యాత్వా 'ఆత్మానమ్ ఆత్మని'
అగ్నౌ జుహుయాత్।
సర్వమ్ అజానత్। సర్వత్రా శకత్। సర్వమ్ అకరోత్।

"ఓం" - అనే ప్రణవ ఋుక్కుతో, (జీవ) ఆత్మస్వరూపము (స్వాత్మను) హవిస్సుగా ధ్యానము చేయుచూ <u>(పరమ) 'ఆత్మ'</u> అనే అగ్నియందు <u>(జీవ) ఆత్మను</u> హోమము చేయనారంభించారు.

అప్పుడు ప్రజాపతి సర్వము ఎరిగినవారై, సర్వత్రా శక్తిమంతులై, సర్వ సృష్టిక్రియా సామర్థ్యమును సముపార్జించుకొన్నవారయ్యారు.

---

య ఏవం విద్వాన్ ఇమం 'ధ్యానయజ్ఞమ్'
అనుతిష్ఠేత్, <u>సర్వజ్ఞో</u>, <u>అనంత శక్తిః</u>,
<u>సర్వకర్తా</u> భవతి।
స సర్వాన్ లోకాన్ జిత్వా
బ్రహ్మ పరం ప్రాప్నోతి।

జగద్గురువగు నృసింహస్వామిచే బోధించబడినవారై, ప్రజాపతి నిర్వర్తించిన ధ్యానయజ్ఞమును ఏ వివేకి అనుష్ఠించుచూ ఉంటాడో, అట్టివాడు తెలుసుకోవలసినది తెలుసుకొన్నవాడై "సర్వజ్ఞుడు" కాగలడు. సర్వశక్తిమంతుడగుచున్నాడు. సర్వమునకు తానే 'కర్త'గా ఎరుగుచున్నాడు. అట్టివాడు సర్వలోకములను జయించి, పరంబ్రహ్మపదమును పొందగలడు. స్వాత్మను సమస్తము - అయి ఉన్న కేవలీ ఆత్మ స్వరూపముగా దర్శించి, ఆత్మానందమును సిద్ధించుకోగలడు.

| | |
|---|---|
| అథ ప్రజాపతిః లోకాన్ సిసృక్షమాణః, తస్యా ఏవ విద్యాయా,<br>యాని త్రింశత్ (30) అక్షరాణి, తేభ్యః త్రీన్ లోకాన్।<br>అథ ద్వేద్వే అక్షరే తాభ్యామ్ ఉభయతో దధార।<br>తస్యా ఏవ అర్చో ద్వాత్రింశద్భిః (32)<br>అక్షరైః తాం దేవాః నిర్మమే॥ | అప్పుడిక ప్రజాపతి లోకములను సృష్టించటము ప్రారంభించారు. "సృష్టివిద్య"-కు సంబంధించిన 30 అక్షరములనుండి (From) (constant / unchanging Functions / Factors) 3 లోకములను సంకల్పించారు. వాటికి రెండు రెండు అక్షరములను అటు ఇటు చేర్చారు. 32 అక్షరముల బుక్కు నుండి దేవతలను పరికల్పించారు. (32 అక్షరములు ఒక బుక్కుగా రచించబడింది) |
| సర్వైః ఏవ స ఇంద్రో అభవత్।<br>తస్మాత్ ఇంద్రో దేవానామ్ అధికో అభవత్।<br>య ఏవం వేద, సమానానామ్ అధికో భవేత్। | అందరు దేవతలకు, త్రిలోకములకు పాలకుడుగా, ఇంద్రియ నియామకుడుగా ఇంద్రుని స్థానమునుకల్పించారు. ఇంద్రుడు సర్వదేవతలకు పాలకుడైనారు. ఎవ్వరైతే ఈ తత్త్వవిశేషమును (తత్త్వతః) తెలుసుకుంటాడో, అట్టివాడు సరిసమానులలో అధికుడు అగుచున్నాడు. |
| తస్యా ఏకాదశభిః పాదైః, ఏకాదశ రుద్రాః నిర్మమే।<br>తస్యా ఏకాదశభిః - ఏకాదశ ఆదిత్యాన్<br>నిర్మమే। సర్వైః ఏవ, స విష్ణుః - అభవత్।<br>తస్మాత్ విష్ణుః ఆదిత్యానామ్ అధికో అభవత్।<br>య ఏవంవేద, సమానానామ్ అధికో భవేత్॥ | తన సృష్టికళ యొక్క 11 పాదముల నుండి ఏకాదశ రుద్రులను నిర్మించారు. ఆ 11 రుద్రుల నుండి 11 మంది ఆదిత్యులను కూడా సంకల్పించారు. అందరిలోకి విష్ణువు మొదటివాడు. అందుచేత విష్ణువు ఆదిత్యులలోకెల్లా అధికుడు అయినారు. ఇది తత్త్వార్థకంగా తెలుసుకొన్న వాడు - సమానులలో అధికుడుగా అగుచున్నాడు. |
| 7. స చతుర్భిః చతుర్భిః అక్షరైః<br>అష్టౌ వసూన్ అజనయత్। (అష్ట వసువులు)<br>స తస్యా ఆద్యైః ద్వాదశభిః (12)<br>అక్షరైః బ్రాహ్మణమ్ అజనయత్। | ఆయన పలికిన 32 అక్షరములలో (32 మార్పులు చేర్పులు లేని కేవలతత్త్వములలో) 'నాలుగేసి-నాలుగేసి' → అక్షరములనుండి 'అష్ట వసువులు' కల్పించబడ్డారు.<br>మొదట '12' అక్షరముల నుండి బ్రహ్మమును స్తుతించుచూ, బ్రహ్మమునందు నిష్ఠ కలిగి, బ్రహ్మతత్త్వజ్ఞానాభిమానముతో కూడిన బ్రాహ్మణులు సృజించబడ్డారు. |
| దశభిః దశభిః విట్ క్షత్రే।<br>తస్మాత్ బ్రాహ్మణో ముఖ్యోభవతి।<br>ఏవం తన్ముఖ్యో భవతి,<br>య ఏవంవేద,<br>తూష్ణీం 'శూద్రమ్' అజనయత్।<br>తస్మాత్ శూద్రో నిర్విద్యో అభవత్। | పది-పది-అక్షరముల నుండి కార్యసామర్థ్యాభిమానులు, కార్యఫల అభిమానులు (లేక) అభిముఖులు అగు క్షత్రియులు వైశ్యులు సృజించ బడ్డారు. బ్రహ్మజ్ఞానాభిమాన ఆధిక్యత కలిగినట్టి బ్రాహ్మణ లక్షణులు (జీవాత్మ-పరమాత్మ- జ్ఞానసంబంధమైన) రెండు అక్షరముల ఆధిక్యతచే శ్రేష్ఠులైనారు. బ్రహ్మతత్త్వాభిమానులు (1) కార్య సామర్థ్యాభిమానులకంటే (మరియు) (2) ఫలాభిలాషుల కంటే కూడా - శ్రేష్ఠులు - (జీవాత్మ - పరమాత్మల జ్ఞానం జోడించబడటముచేత). ఇంద్రియాభిమానులగు ఇంద్రియాను భవములకు పరిమితులు అగు జీవులు శూద్రులుగా చెప్పబడుచున్నారు. ఇంద్రియానుభవములకు పరిమితులగువారు తూష్ణీకరించబడుతారు. ఇంద్రియాభిమానులకంటే కార్యదక్షాభిమానులు (క్షత్రియులు) శ్రేష్ఠులు. ఫలాభిమానులకంటే, (వైశ్యులు) కంటే, కార్యదక్షాభిమానులకంటే సర్వత్రా సమదర్శులగు (జీవాత్మ-పరమాత్మ-జ్ఞానము జోడించు) బ్రహ్మతత్త్వ జ్ఞానాభిమానులగు జీవులు శ్రేష్ఠులు - అగుచున్నారు. |
| న వా ఇదం దివా, న నక్తమ్ ఆసీత్ అవ్యావృత(త్ర)మ్।<br>స ప్రజాపతిః అనుష్టుభాభ్యామ్,<br>అర్ధర్చాభ్యామ్ 'అహోరాత్రాః' అకల్పయత్। | అవ్యావృతమగు కేవలీ విష్ణుతత్త్వము సమక్షములో ఇది పగలు, ఇది రాత్రి అనునవి లేవు. అయితే సృష్టి రచనా చమత్కారము కొరకై అనుష్టుప్ ఛందో - గానపూర్వకంగా అర్చనకు ఉపక్రమించి రాత్రింబవళ్లను -(Night & Day) కల్పించారు. |
| తతో వ్యైచ్ఛత్వ్యైవాస్మాత్ ఉచ్ఛతి।<br>అథో తమ ఏవ అపహతే<br>'ఋగ్వేదమ్' అస్యా ఆద్యాత్ పాదాత్ అకల్పయత్। | ఈ విధంగా (జ్ఞాన - అజ్ఞాన రూపములగు) పగలు - రాత్రులను విడదీసి కల్పించి, ఇక తమస్సు (అజ్ఞానాంధకారము)ను తొలగించగల మార్గములను కూడా సృష్టిలో ప్రవేశింపజేశారు. |

**'యజుః' ద్వితీయాత్। 'సామ' తృతీయాత్।**
**'అథర్వ - అంగిరసః' చతుర్థాత్।**
**యత్ 'అష్టాక్షర(8)పదా' తేన 'గాయత్రీ'।**
**యత్ 'ఏకాదశ(11)పదా' తేన 'త్రిష్టుప్'।**
**యత్ చతుష్పదా (4), తేన 'జగతీ'।**
**యత్ ద్వాత్రింశత్ (32) అక్షరా తేనామ్ 'అనుష్టుభ్'।**
**నవా ఏవ(9) సర్వాణి ఛందాంసి।**
**య ఇమాని సర్వాణి ఛందాంసి వేద,**
**సర్వం జగత్ ఆనుష్టుభ ఏవ**
**ఉత్పన్నమ్, అనుష్టుభి ప్రతిష్ఠితమ్।**
**ప్రతితిష్ఠతి యశ్చ ఏవం వేద॥**

ఆ ప్రజాపతి ప్రథమపాదముగా (ఋక్కుల ప్రాధాన్యమగు) ఋగ్వేదమును, రెండవపాదముగా (యజ్ఞ యాగ మంత్ర-తంత్ర సూక్తులతో కూడిన) యజుర్వేదమును, మూడవపాదముగా (గానములతో స్తుతులతో కూడిన) సామవేదమును, నాలుగవ పాదముగా (ప్రకృతి ఉపాసనలతో కూడిన) అథర్వ అంగీరస (వేదము)ను ఉచ్చరించారు. ఇంకా కూడా... అష్ట (8) అక్షర - పదములుగల గాయత్రీ ఛందస్సును, ఏకాదశ (11) అక్షర పదముగల త్రిష్టుప్ ఛందస్సును, చతుః (4) అక్షర - పదములుగల జగతీ ఛందస్సును, ద్వాత్రింశత్ (32) అక్షర - పదములు గల 'అనుష్టుప్' ఛందస్సును, ఇంకా కూడా (9) అక్షరములతో అనేక తదితర ఛందస్సులను **సంకల్పించి సృష్టియందు ప్రతిక్షేపించారు.** ఈ విధమైన సర్వవిధములైన అక్షర- పద సంయుతమైన సర్వఛందోబద్ధములను సృష్టియందు సంకల్పము చేశారు.

"సర్వజగత్తు' 'అనుష్టుభ్' నందు ప్రతిష్ఠితము. ఇది అభ్యాసి అయిన ఎరిగినవాడు, "సర్వము ఆత్మయందే ప్రతితిష్ఠితము" అని ఎరుగుచున్నాడు.

---

**8. అథ యదా ప్రజాః సృష్టా న జాయంతే**
**ప్రజాపతిః। "కథన్ను ఇమాః ప్రజాః**
**సృజేయమ్?" ఇతి చింతయన్।**
**'ఉగ్రమ్' ఇతి ఇమామ్ ఋచం**
**గాతుమ్ ఉపాక్రామత్।**

అప్పుడు ప్రజాపతికి 'ప్రజలను సృష్టించేది ఎట్లా?' - అనునది ఆలోచించారు. "జీవులసృష్టి ఎట్లాగూ?" - అని చింతన చేస్తూ, **"ఉగ్రం వీరం మహావిష్ణుం, జ్వలంతం సర్వతో ముఖమ్। నృసింహ భీషణమ్ భద్రమ్। మృత్యుర్మృత్యుమ్ నమామ్యహమ్"**.... అను ఋక్కును గానము చేయ ఉపక్రమించారు. (32 అక్షరముల మంత్రము)

---

**తతః ప్రథమాత్ పాదాత్**
**'ఉగ్ర' రూపో దేవః ప్రాదుః అభూత్।**
**ఏకః శ్యామః। పురతో రక్తః, పినాకీ స్త్రీ-పుంస రూపః॥**
**తం విభజ్య, స్త్రీ షు। తస్య స్త్రీ రూపం,**
**పుంసి చ పుం రూపం వ్యధాత్।**

అప్పుడు "ప్రథమపాదము" (స్టెప్-1) అగు 'ఉగ్రమ్' నుండి ఉగ్రరూపుడగు దేవుడు (రుద్రుడు) ఉద్భవించారు. ఏకస్వరూపుడు, శ్యామలా (నల్లని) వర్ణుడు, మరొకవైపుగా చూస్తే ఎర్రనివాడు,పినాకుడు (మట్టిరూపుడు), స్త్రీ -పురుషరూపుడు బుద్ధికి అగుపించారు. ప్రజాపతి ఆ పరతత్త్వ స్వరూపుని స్త్రీ విభాగమును 'స్త్రీలు' గాను, పురుష విభాగమును 'పురుషులు'గాను విభజించి స్త్రీ - పురుషులను సృజియించసాగారు. (పురుషకార-ప్రకృతి విభాగములు)

---

**(సః) ఉభాభ్యామ్ అంశాభ్యాం సర్వం ఆదిష్టః।**
**తతః ప్రజాః ప్రజాయంతే।**
**య ఏవం వేద, ప్రజాపతేః**
**సోఽపి 'త్ర్యంబక' ఇమామ్ ఋచం ఉద్గాయన్**
**ఉద్గ్రథిత జటాకలాపః**
**ప్రత్యక్ జ్యోతిషి ఆత్మన్యేవ రన్తారమ్ ఇతి।**

రెండు అంశలను సృష్టికొరకై నిర్మితముచేసి సృష్టిలో ప్రవేశింపజేశారు. ఈ విధంగా ప్రజాపతి సృష్టిలీలను కొనసాగించసాగారు. ఈ కనబడేదంతా ప్రజాపతియొక్క ఆత్మయందు కల్పనా చమత్కారమే. "ఎవ్వరైతే ఈ సృష్టి చమత్కారమును ఆది నారాయణ ప్రసాదిత చైతన్య చమత్కారముగాను, జటాకలాపము పైకి ముడికట్టుకొన్న త్ర్యంబకుని యందు - ఆత్మజ్యోతిరూప కాంతి పుంజముగాను ఎరుగుచున్నాడో, ఆతడు ఆత్మయే అయి ఆత్మయందేరమించగలడు" - అని నియమబద్ధము (ప్రజాపతి) చేశారు.

---

**ఇంద్రోవై కిల దేవానామ్ అనుజావర ఆసీత్।**
**తం ప్రజాపతిః అబ్రవీత్।**
**గచ్ఛ దేవానాం అధిపతిః భవ - ఇతి।**
**సః (సో) అగచ్ఛతం, (అగచ్ఛత్తం) దేవా ఊచుః :-**
**"అనుజావరో అసి త్వమ్ అస్మాకమ్, కుతః తవ ఆధిపత్యమ్?" ఇతి।**

ఆ తరువాత దివ్యతత్త్వములగు (అశరీర శక్తిరూపులగు) దేవతలను సృష్టించారు. దేవతల సృష్టి తరువాత, **దేవతలకు నాయకుడుగా ఇంద్రుని** ప్రజాపతి నియామకం చేశారు. అయితే, దేవతలు ఇంద్రునితో ఇట్లు పలికారు. " ఓ ఇంద్ర దేవా! మీరు ఇప్పుడు వచ్చారు. మేము ముందుగానే వచ్చి ఉన్నాము. మామీద మీ ఆధిపత్యము ఏమిటి?" -

---

**స ప్రజాపతిమ్ అభ్యేతి ఉవాచ।**
**"ఏవం దేవా ఊచుః**
**అనుజావరస్య కుతః -**
**తవ ఆధిపత్యమ్?" - ఇతి।**

అది విని ఇంద్రుడు ప్రజాపతిని సమీపించి, "మీరు దేవతలపై ఆధిపత్యము - అనే బాధ్యత నిర్వర్తించవలసినదిగా నియమించారు. కానీ, 'నీకన్నా ముందునుంచే మేముండగా మాపై మీ ఆధిపత్యమేమిటి?' - అని నన్ను దేవతలు ప్రశ్నిస్తున్నారు. ఏమి చేయమన్నారో ఆజ్ఞాపించండి" - అని పలికారు.

తం ప్రజాపతిః ఇంద్రం
త్రి-కలశైః అమృత పూర్ణైః
'ఆనుష్టుభ్'
అభిమంత్రితైః అభిషిచ్య,
తం సుదర్శనేన దక్షిణతోర రక్ష,
పాంచజన్యేన వామతో
ద్వయేనైవ
సురక్షితో అభవత్॥

అప్పుడు ప్రజాపతి → ఇంద్రుని అమృతముతో నిండిన '3' కలశములతో అభిమంత్రించారు. '3' లోకములకు అధిపతిగా అభిషేకించారు.

- 'విష్ణు అలంకారములయినట్టి - సుదర్శన చక్రము మీకు కుడివైపుగాను, పాంచజన్యము మీకు ఎడమవైపుగాను మీ అధికారమునకు రక్షణగా ఉండుగాక। - రెండువైపులా సుదర్శన - పాంచజన్యములచే రక్షితులై ఉంటూ త్రిలోకములను పాలించు బాధ్యతను నిర్వర్తించుము'' - అని దీవించారు.

ఈవిధంగా "త్రిలోకములు, దేవతలు, త్రిలోకపాలకుడగు ఇంద్రుడు" - మొదలైనదంతా సృష్టి వినోదము' అనే కార్యక్రమ నిర్వహణకై నియమితమైనది.

---

**9.** రౌక్మే ఫలకే సూర్యవర్చసి
మంత్రం అనుష్టుభమ్ విన్యస్య
తదస్య కంఠే ప్రత్యముంచత్।
తతః సుదుర్నిరీక్ష్యో భవత్।

ఇంకా కూడా ప్రజాపతి ఇంద్రుని సమీపించి...,

సూర్య తేజస్సుతో, వర్చస్సుతో ప్రకాశించే బంగారు ఫలకముపై 'అనుష్టుభ్' మంత్రమును వ్రాసి, ఆ ఫలకముతో కూడిన దండను ఇంద్రునికి పూదండవలె వేశారు.

అట్టి తేజస్సు చేత ఇంద్రుడు తేరిపార చూచుటకు వీలు లేనంతగా దుర్నిరీక్షుడుగా అయ్యారు.

---

తస్మై విద్యామ్ 'ఆనుష్టుభీం' ప్రాదాత్।
తతో దేవాః తమ్ ఆధిపత్యాయ
అనుమేనిరే। స స్వరాట్ అభూత్।

ఇంద్రునికి 'అనుష్టుప్' విద్యను ఉపదేశించారు కూడా. అప్పుడు దేవతలు ఇంద్రుని త్రిలోకాధిపత్యమును అంగీకరించారు. ఆయన 'స్వరాట్' అయ్యారు.

---

య ఏవం వేద, 'స్వరాట్' భవేత్।
సో అమన్యత - పృథివీమ్ అపి
కథమ్ అపాం-జయేయమ? ఇతి।
స ప్రజాపతిమ్ ఉపాధావత్।
తస్మాత్ ప్రజాపతిః కమఠాకారమ్
ఇంద్ర నాగ భుజగేంద్ర ఆధారం
భద్రాసనం ప్రాదాత్।

ఎవ్వడైతే కేవల తేజోమయము, అందులోంచి సృష్ట్యభిమానుడగు ప్రజాపతి, ఆ ప్రజాపతిచే కల్పించబడిన దేవతలు - జీవులతో కూడిన త్రిలోకములు, ప్రజాపతిచే నియమితమైన త్రిలోకాధిపతితత్త్వము - గురించి ఎరుగుతాడో, అట్టివాడు 'స్వరాట్' అగుచున్నాడు.

అప్పుడు ఇంద్రుడు, "నేను ఈ పృథివిని, జలమును జయించటము, పరిపాలించటము ఎట్లా నిర్వర్తించాలి?'' - అని ఆలోచించసాగారు. ఆయన ప్రజాపతిని సమీపించి "నేను ఎట్లా పరిపాలించగలనో ఆజ్ఞాపించండి!'' ...అని అడిగారు.

అప్పుడు ప్రజాపతి తాబేలు ఆకృతి కలిగియున్నట్టిది, ఇంద్రమణి - నాగ - భుజగేంద్రము (ఆదిశేషుని అంశ)లను ఆధారముగా కలిగి ఉన్నట్టిది అగు "భద్రాసనము''ను ప్రసాదించారు.

---

స పృథివీమ్ అభ్యజయత్।
తతః స ఉభయోః లోకయోః
అధిపతిః అభూత్।
య ఉభయో లోకయోః
అధిపతిః భవతి,
స పృథివీం జయతి।
యో వా అప్రతిష్ఠితం శిథిలం
భ్రాతృవ్యేభ్యః
పరమాత్మానం మన్యతే॥

అప్పుడు ఇంద్రుడు భూమిని ఆక్రమించి జయించివేశారు.

ఊర్ధ్వ - అధో - మధ్య త్రిలోకములకు అధిపతి అయినాయి.

ఎవ్వడైతే - సర్వత్రా సర్వదా ప్రకాశమానమై వేంచేసి ఉన్నట్టిది, సంప్రతిష్ఠితము అగు "పరమాత్మయొక్క సంప్రకాశకరూపము''గా - ఈ అప్రతిష్ఠ శిథిలస్వభావ భూ-ఆకాశాదులతో కూడిన ఈ సమస్తమును మననము చేస్తాడో అట్టివాడు పృథివీజయమును పొందుచున్నాడు.

సృష్టితత్త్వమును ఈ విధంగా ఎరిగినవాడు తాను పృథివీ తత్త్వమునకు పరిమితుడు కాక అధిగమించివేయగలడు. పరతత్త్వమునందు ప్రవేశించగలడు.

| | |
|---|---|
| **స ఏతమ్ ఆసీనమ్ అథితిష్ఠేత్।**<br>**ప్రతిష్ఠితో శిథిలో**<br>**భ్రాతృవ్యేభ్యో వసీయాత్ భవతి –**<br>**యశ్చ ఏవం వేద। యశ్చ ఏవం వేద॥** | ఎవ్వడు ఆత్మను శిథిలము అగుచున్నదానిగాను, అప్రతిష్ఠితముగాను భావన చేస్తాడో ఆతడు భ్రాతములచే (జగత్ ప్రదర్శనములతోబాటు) శిధిలత్వమును అనుభవముగా పొందుచున్నాడు. ఎవ్వడైతే పరబ్రహ్మము యొక్క ఇహ - పర చమత్కార తత్త్వమును నిత్యము సంప్రతిష్ఠిమైనదిగా ఎరుగుచున్నాడో,....అట్టివాడు<br>- కూర్చున్నచోటన ఉండియే బ్రహ్మతత్త్వమునందు ఆసీనుడు కాగలడు.<br>- దృశ్య శిథిలత్వమునకు అతీతుడై, సర్వమును అధీనమునందు కలవాడై పరబ్రహ్మమునందు సుప్రతిష్ఠితుడు కాగలడు. |
| **10.** **య ఇమాం విద్యాం అధీతే**<br>❖ **స సర్వాన్ వేదాన్ అధీతే।**<br>❖ **స సర్వైః క్రతుభిః యజతే।**<br>❖ **స సర్వ తీర్థేషు స్నాతి।**<br>❖ **స మహాపాతక –ఉపపాతకైః ప్రముచ్యతే।** | ఎవ్వరైతే అవ్యక్తముయొక్క వ్యక్తీకరణ చమత్కార సంబంధమైన ఆత్మవిద్యను అధ్యయనము చేస్తాడో....అట్టివాడు →<br>❖ సర్వవేదములను అధ్యయనము చేసిన ప్రయోజనము పొందుచున్నాడు.<br>❖ సర్వక్రతువులు నిర్వర్తించిన ఫలితము లభిస్తుంది.<br>❖ సర్వతీర్థములలో స్నానం చేసిన పవిత్రత సిద్ధిస్తుంది.<br>❖ ఆత్మవిద్యను అధ్యయనము చేసి స్వస్వరూపముయొక్క ఆత్మైనత్వము ఏమిటో ఎరిగినవాడు ఆతని ఇతఃపూర్వపు మహాపాతక ఉపపాతకముల నుండి వినిర్ముక్తుడు అగుచున్నాడు. నిత్యనిర్మల ఆత్మానంద స్వరూపుడై విరాజిల్లగలడు. |
| ❑ **స బ్రహ్మవర్చసం మహత్ ఆప్నుయాత్।**<br>❑ **ఆ బ్రహ్మణః పూర్వాన్ – ఆకల్పాత్ చ,**<br>**ఉత్తరాంశ్చ వంశ్యాన్ పునీతే।**<br>❑ **నైనమ్ 'అపస్మార' ఆదయో రోగా ఆదిధేయుః।**<br>❑ **స యక్షాః స ప్రేత పిశాచా అప్యేనం స్పృష్ట్వా, దృష్ట్వా, శ్రుత్వా వా పాపినః పుణ్యాన్ లోకాన్ అవాప్నుయుః।** | - మహత్తరమైన బ్రహ్మవర్చస్సు పొందుచున్నాడు.<br>- బ్రహ్మమొదలుకొని పూర్వాపర వంశములు పునీతమగుచున్నాయి.<br>- 'అపస్మారము' మొదలైన మానసిక - శారీరక ఆధి - వ్యాధులు ఆతనిని ఆక్రమించవు.<br>యక్ష-ప్రేత-పిశాచములు కూడా అట్టి ఆత్మజ్ఞానతత్పరుని స్పృశించినా, చూచినా, ఆతని నోటి నుండి ఆత్మ సమాచారము వినినా కూడా,....వారి వారి పాపములులేమైనా ఉంటే, అవన్నీ తొలగి - పుణ్యలోకములు పొంది సుఖించగలరు. |
| ⌘ **చింతిత మాత్రాత్ అస్య**<br>**సర్వే అర్థాః సిద్ధ్యేయుః।**<br>⌘ **పితరమ్ అవైనం సర్వే మన్యంతే।**<br>⌘ **రాజానశ్చ అస్య ఆదేశికారిణో భవంతి।**<br>⌘ **న చ ఆచార్య వ్యతిరిక్తం శ్రేయాంసం దృష్ట్వా నమస్కుర్యాత్।** | అట్టి ఆత్మతత్త్వ - సోఽహమ్ అనుభవి - చింతించినంత మాత్రంచేతనే సర్వ అర్థములు సిద్ధించగలవు.<br>అట్టివానిని జనులు తమ తండ్రిగా భావనగా చూస్తూ ఉంటారు.<br>రాజ్యమును పాలించేవారు కూడా అట్టివానిని తమను ఆదేశించువానిగా భావిస్తూ ఉంటారు.<br>ఆత్మతత్త్వజ్ఞులగు ఆచార్యుల తత్త్వజ్ఞానవాక్యములకు వ్యతిరిక్తమైన శ్రేయస్సు గురించి పలుకువారు నమస్కరించుటకు అర్హులు కారు. |
| ⁂ **న చ అస్మాత్ ఉపావరోహేత్।**<br>⁂ **జీవన్ముక్తశ్చ భవతి।**<br>⁂ **దేహాంతే తమసః పరంధామ ప్రాప్నుయాత్।**<br>⁂ **యత్ర విరాట్ నృసింహో అవభాసతే, తత్ర ఖలు ఉపాసతే।** | అట్టి ఆత్మజ్ఞులగు మహనీయులు కంటే ఎత్తైన స్థానంలో కూర్చుని సంభాషించరాదు. వారిని ఎత్తైన స్థానంలో ఆసీనులను చేసి భక్తి - ప్రపత్తులతో సంభాషించాలి.<br>ఎవ్వరైతే ....ఈ 'అవ్యక్తోపనిషత్' చెప్పు (1) "అవ్యక్త" (2) వ్యక్తీకరణ (ప్రజ్ఞా-కర్తృత్వాభిమాన) ప్రజాపతి (3) వ్యక్తీకరణరూప-ప్రజాసృష్టి-స్థితి - లయముల చమత్కారమును) ఎరుగుచున్నాడో....అట్టివాడు జీవన్ముక్తుడవగలడు. దేహాంతము-పరంధామమును ప్రాప్తించు కొనుచున్నాడు. |

**తత్ స్వరూప ధ్యానపరా**
**మునయ ఆకల్ప-అంతే**
**తస్మిన్ ఏవ ఆత్మని లీయంతే।**
**న చ పునరావర్తంతే।**

ఏ స్థానమునుండైతే విరాట్ రూపుడగు నృశింహస్వామి అవభాసించుచున్నారో, అట్టి స్థానమును - ఉపాసకుడగు బ్రహ్మవిద్యా అధ్యయని - చేరుకొనగలడు.

'తత్' అనబడు విష్ణుతత్త్వము (లేక) నృశింహతత్త్వమును ఎరిగినవాడు - సర్వ కల్పనలకు ఆవలగల - తత్ ఆత్మ తత్త్వము నందే లీనమై ఉంటున్నాడు. పునరావృత్తికి సంబంధించిన దోషము ఆతడు పొందదు.

---

**న చ ఇమాం విద్యామ్**
**అశ్రద్ధదానాయ బ్రూయాత్,**
**న అసూయావతే, న అనూచానాయ,**
**న అవిష్ణుభక్తాయ, న అనృతినే,**
**న అతపసే, న అదాంతాయ,**
**న అశాంతాయ, న అదీక్షితాయ,**
**న అధర్మశీలాయ**
**న హింసకాయ,**
**న అబ్రహ్మచారిణ॥**

***<u>ఇతి అవ్యక్తోపనిషత్ సమాప్తా</u>***

***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః</u>***

**<u>ఈ అవ్యక్తోపనిషత్ ఆత్మవిద్యను</u>**

→ శ్రద్ధ లేనట్టివానికి,

→ అసూయను వదలనివానికి,

→ గురు, శాస్త్ర సంప్రదాయముల పట్ల గౌరవము లేనివానికి,

→ విష్ణుభక్తుడు (దైవభక్తుడు) కానివానికి,

→ సత్య దృష్టిలేని వానికి, అసత్యము పట్ల (ఇంద్రియ విషయ పరంపరల పట్ల) నమ్మిక వదలనివానికి,

- ఆత్మజ్ఞాన - ఆత్మాఽహమ్ భావనలకొరకై తపనతో కూడిన తపస్సు యొక్క అభ్యాసము లేనివానికి,

- ఎప్పుడూ ప్రాపంచిక సంగతి - సందర్భ - సంబంధములపై అశాంతితో కూడిన ధ్యాసలు కలవానికి,

- దీక్ష, పట్టుదల లేనివానికి,

- స్వధర్మ నిరతి లేనివానికి, అధర్మశీలము కలవానికి,

- ఇతరులను బాధించు హింసా స్వభావము వదలనివానికి,

- బ్రహ్మ విద్యపట్ల ఆచార తత్పరత (Studentship) లేనట్టి అబ్రహ్మచారికి **బోధించకపోవటమే ఉచితము.**

***<u>ఇతి అవ్యక్తోపనిషత్ సమాప్తము</u>***

***<u>ఓం శాంతిః శాంతిః శాంతిః</u>***

**సామవేదాంతర్గత**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 1 అవ్యక్తోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

ఓం ఉగ్రం వీరం మహా విష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్। (16)
నృసింహ భీషణమ్ భద్రం మృత్యుర్మృత్యుమ్ నమామ్యహమ్॥ (16)

ద్వాత్రింశతి (32) అక్షర నృసింహ మంత్రము



బ్రహ్మజ్ఞానము, బ్రహ్మతత్త్వానుభవము సిద్ధించటానికై →
- స్వయంకల్పిత స్వస్వరూప - అజ్ఞానము అనే హిరణ్యకశిపుని (అసురుని) గోళ్ళతో చీల్చివేయునది,
- ద్వైత వాదోపవాదములనుండి విముక్తిని ప్రసాదించునది,
- స్వస్వరూపానందమును ప్రసాదించునది -

అగు **నరకేశరీ (నృసింహ)** భగవానుని **భక్తి - ప్రపత్తులతో శరణువేడుచున్నాను.**

మొట్టమొదటగా (At its basic begining) - ఈ ఇంద్రియములకు అనుభవముగా అగుచున్న భౌతిక - దృశ్య జగత్తుగాని, దీని నిర్మాణమునకు ఆధారంగా ఉన్న అశరీర - దివ్య ప్రజ్ఞల నివాసస్థానమగు దివ్య (దేవతా) లోకములుగాని, ఆకాశము - పృథివి మొదలైనవిగాని లేవు. మరి మొట్టమొదట ఉన్నదేది?

***జ్యోతిస్వరూపము (తేజోరూపము), అనాది - అనంతము అయినట్టిది, అణు-స్థూలరూపము కానట్టిది, నామరూపాత్మకము కానట్టిది, జ్ఞానానందమయము - అగు కేవల పరబ్రహ్మతత్త్వము మాత్రమే సర్వత్రా ప్రకాశమానమై యున్నది.***

**ఇవన్నీ మనలోని ప్రతి ఒక్కరి - జన్మ, కర్మలకంటే మునుముందే ఉన్న - కేవలాత్మయొక్క స్వాభావిక లక్షణములు.**

అది జీవులందరి **కేవలీ - స్వయంప్రకాశ ఆత్మానంద స్వరూపము.** అద్దానికి ద్వితీయమనునది ఎప్పుడూ లేదు.

అట్టి అవ్యక్తము, ఏకము, సర్వదా (ఈ జీవుని సహజ స్వరూపమునకు) అనన్యము → అగు కేవలాత్మ స్వకీయ లీలా - మాయా వినోదంగా రెండు రూపములు వ్యక్తీకరించుకొనుచున్నది.

**(1) మాయారూపము** → ఏకము, హరితము (ఆకుపచ్చనిది).

**(2) పురుషకారరూపము** → పురుషరూపము (క్రియా నిర్వహణ రూపము. క్రియాభిమాని) రక్తవర్ణము.

అట్టి **(1)** మాయ (లేక) కల్పన (లేక) ఊహ (మరియు) **(2)** పురుషుడు (లేక) మాయి (లేక) కల్పించువాడు (లేక) ఊహించువాడు - ఈరెండూ ఒకదానితో మరొకటి కలిసి ఏకమగుచున్నాయి. ఆ రెండింటి సమావేశముచే క్రియాశీలమగు వీర్యత్వము (Executionship) ఆవిర్భవిస్తోంది. అట్టి వీర్యము (క్రియాచైతన్యము)- అహమ్ (అ+హమ్) రూప (హైమ - మహిమరూప) అండముగా అగుచు, **పరిణామము (The Factor of Change)** అను స్వభావమును స్వీకరించుచున్నది. **నిష్క్రియమగు** కేవలాత్మనుండి **సక్రియము, పరిణామయుతము** - ఉభయము ఏకమై **సంప్రదర్శనమగుచున్నాయి.**

అట్టి సక్రియము, – పరిణామయుతము అగు వీర్యము నుండి సృష్టికల్పనకు సంబంధించిన కర్తృత్వాభిమానియగు ప్రజ్ఞ బయల్వెడలుతోంది. అట్టి ప్రజ్ఞయే సృష్టికర్తయగు బ్రహ్మ (లేక) హిరణ్యగర్భుడు– అని (పౌరాణికంగా) వ్యవహారనామము.

అట్టి కల్పనాభిమానియగు పరమేష్ఠి (లేక) బ్రహ్మదేవుడు ఈ విధంగా అభి – జిజ్ఞాస (Deep Inquisitiveness) పొందసాగారు.

→ **కిం మే కులమ్? నేను దేనికి సంబంధించినవాడిని?**

→ **ఇప్పుడు నేను చేయవలసినదేమిటి? కిం మే కృత్యమ్?**

ఈ విధంగా తీవ్రంగా యోచన చేస్తూ ఉండగా ఒక <u>అదృశ్యవాక్కు</u> ఈ విధంగా పలుకసాగింది.

**(1) హే ప్రజాపతీ! త్వమ్ అవ్యక్తాత్ ఉత్పన్నోఽసి। నీవు 'అవ్యక్తము'** (Un-manifestive Absolute) **నుండియే జనించి బయల్వెడలుచున్నావయ్యా! కనుక నీవు 'అవ్యక్తము'నకు చెందినవాడవే సుమా!**

**(2) వ్యక్తం తే కృత్యమితి। వ్యక్తము** (Manifestation) **ను నిర్వర్తించటమే నీయొక్క విద్యుక్త కార్యక్రమము.**

**ప్రజాపతి :** ఓహో! అవ్యక్తము నుండే నేను జనించుచున్నానా? సంతోషము. **కిం అవ్యక్తమ్?** 'అవ్యక్తము' అనగా ఏమి? **యస్మాత్ అహమ్ ఆసిషమ్? కిం తత్ వ్యక్తమ్, యత మే కృత్యమ్?** నేను వ్యక్తీకరించవలసిన 'వ్యక్తము' ఏమై ఉన్నది.

**అదృశ్య వాక్కు :** బిడ్డా! సౌమ్యా! ఏదైతే సర్వమును వ్యక్తీకరించు సామర్థ్యమును తనయందు కలిగియుండి, తాను మాత్రము సర్వదా అప్రదర్శనరూపముగా (అవ్యక్తముగా) ఉండి ఉన్నదో, – అదియే **'అవ్యక్తము'**. ఏది తేజోమయమై, సర్వమును తనయొక్క తేజస్సుచే వెలిగించుచున్నదో అదియే **అవ్యక్తము.** తాను 'తెలియబడనిది' అయి, తదితరమును తనయొక్క 'తెలివి' యందు 'తెలియబడుచున్నట్టిది'గా కలిగియున్నదో – అదియే అవ్యక్తము.

→ తెలియబడేది 'వ్యక్తము'! (That being known)

→ తెలుసుకొనుచున్నట్టిది (లేక) తెలివి – అవ్యక్తము. (The knowner)

**దృష్టాంతంగా :** నటనకు సంబంధించిన కళ – <u>'అవ్యక్తము'.</u> పాత్రధారుడు రంగస్థలముపై ప్రదర్శించేది – <u>'వ్యక్తము'.</u> అయితే, అట్టి అవ్యక్తము ఎట్టిదో తెలుసుకోవటానికై ముందుగా **నన్ను** ('నేను'ను) తెలుసుకో.

**ప్రజాపతి :** ఓహో! ముందుగా మిమ్ములను (నేనైన నీవును, నీవైన నేనును) గురించి తెలుసుకోవాలా? అశరీరవాక్కుగా వినబడుచున్న మిమ్ము ఏమని తెలుసుకోవాలి? **'శం'** శబ్దముగా వినికిడికి అనుభూతమగుచున్న మిమ్ములను ఎట్లా తెలుసుకోవటము?

**అదృశ్యవాక్కు : తపసా విజిజ్ఞాసస్వ।** నన్ను తెలుసుకోవటానికి మార్గము తపస్సే. కనుక తపస్సు చేసి తెలుసుకో।

అప్పుడు "ప్రజాపతి" – (అని అవ్యక్తమగు 'ఆకాశవాణి' వాక్కుచే పిలువబడిన ప్రప్రథమపురుషుడు), **"అవ్యక్తబ్రహ్మము అనగా ఏమి?"** అనునది స్వానుభవము అవటానికై వేయి దివ్యవత్సరములు బ్రహ్మనిష్ఠతో తపస్సు చేశారు. వేయి బ్రహ్మవత్సరముల తపసానంతరము 'పరతత్త్వము' యొక్క అవగాహనను – అనుష్టుప్ఛందోరూప ఋక్ గాన స్వరూపంగా దర్శించారు. స్వానుభవముగా చేసుకున్నారు. **అట్టి ప్రథమఋక్ శ్రవణముగా 'ఓం' అను ప్రణవమై విరాజిల్లసాగింది.** అందుచేత తరువాత ప్రవచించబడిన మంత్రములన్నీ కూడా ప్రథమ ఋక్ – ప్రణవమగు 'ఓం' కారముతో ప్రారంభము కాసాగాయి. అనన్యమగు ఆత్మయొక్క **అ**–కార **ఉ**–కార **మ**–కార కేవలీ స్వస్వరూపమును సూచించు ఓంకారమును తెలుసుకోకుండా పరమాత్మను అన్యుడుగా (Something different from me / at some distance from me – అను రీతిగా) మాత్రమే ఉపాసించటానికి ఉపక్రమిస్తే ప్రయోజనం ఏమున్నది?

**యస్య అంగాని అన్యే మంత్రాః** – ఏ అఖండాత్మతత్త్వమగు 'ఓం' కారమునుకు సర్వ తదితర మనన–రూప మంత్రములు అంగములు అయి ఉన్నాయో...

**యత్ర బ్రహ్మప్రతిష్ఠితమ్** – ఎద్దానియందు పరమార్థముగా పరబ్రహ్మతత్త్వము ప్రతిష్ఠితమైయున్నదో....,

**యత్ర విశ్వే దేవాః ప్రతిష్ఠాః** – ఎద్దానియందు లౌకిక – అలౌకిక దివ్యప్రజ్ఞారూపులగు విశ్వేదేవతలంతా ప్రతిష్ఠితమై ఉన్నారో...,

అట్టి 'ఆత్మ' యొక్క జ్ఞాన – విజ్ఞానములే (స్వానుభవమే) అన్నిమంత్రముల ప్రయోజనము.

ఆవిధంగా కేవలుడగు పరమాత్మగురించి స్వానుభవ – స్వస్వరూపముగా ఎరిగిన ప్రజాపతి **"తెలియబడునదంతా (అనురక్తమైనది)... ఎట్లా నిర్మించటము?"** అని యోచిస్తూ, అనుచానమైన (అనుసరణపూర్వక, ఉపాసనా విధాన) ఋక్కును గానం చేస్తూ ఉండిపోయారు. 'ఓం' కారమును ప్రతి అక్షరము (అ నుండి క్ష వరకు) ఆది → అంతములలో ఉంచి ఋక్కుల పదములను పాడసాగారు. వేయి

వత్సరములు గడచాయి. వేయిసార్లు అక్షరోపాసన చేశారు. క్షరము కాని తత్త్వమును ఉపాసించారు. అనుచరణము (Following up) నిర్వర్తించారు.

**అప్పుడు ఆ ప్రజాపతికి ఎదురుగా దివ్యమగు తేజోరూపము సాకారమై కనిపించసాగింది.**

– జ్యోతిర్మయము; శ్రీదేవిచే ఆలింగనము చేయబడినట్టిది; సుపర్ణ (గరుడు) వాహన (రథ) – అధితిష్ఠితము; ఆదిశేషుని వేయిపడగలను ఆచ్ఛాదనముగా శిరస్సుపై కలిగి ఉన్నట్టిది; సింహముఖము – నరదేహము ధరించి, చంద్ర సూర్య అగ్ని త్రినేత్ర సమన్వితము అగు నారసింహస్వామి యొక్క సాకారరూపము ప్రత్యక్షమైనది.

అట్టి చిత్ర విచిత్ర సాకారరూపమునకు ప్రజాపతి **"నమో నమః"**– అని పలుకుచూ సాష్టాంగ దండప్రణామములు సమర్పించి, ఆ ఎదురుగా ప్రత్యక్షమైన దివ్యరూపమును విధాత ఈ విధంగా స్తుతించసాగారు.

## శ్రీమన్నారసింహ స్తుతి

హే వ్యక్తమై కనిపిస్తున్న దివ్య – **కేవలానంద స్వరూపీ!** మీకు నమస్కారము. నాకు కనబడుతూ **అర్చనరూపము** ప్రసాదిస్తున్న మీకు కృతాంజలుడను.

**ఉగ్రం వీరం మహా విష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్।**
**నృసింహ భీషణమ్ భద్రం మృత్యుర్మృత్యుమ్ నమామ్యహమ్॥**

**ఉగ్రమ్ :** సింహ ముఖులై ఉగ్రముగా, ప్రచండముగా, పరమ ఉత్తేజితులై కనిపిస్తున్నారు కనుక 'ఉగ్రమ్' అని స్తుతి – **"ఖలువా ఏష మృగరూపత్వాత్"।**

**వీరమ్ :** సమస్తము మీ వీర్యత్వము చేతనే విరాజిల్లుచున్నది కనుక 'వీర్యమ్' అని సంస్తుతి – **"వీరమ్ ఇతి ఆహ వీరోవా – ఏష వీర్యవత్వాత్"।**

**మహావిష్ణుమ్ :** మహత్ స్వరూపులై, భూమ్యాకాశములన్నీ నింపివేసి, సర్వమూ తమరై (All present and All Pervading) అగుపిస్తున్నారు. కాబట్టి – **మహావిష్ణుమ్ ఇత్యాహ, మహతాం వా, అయమ్ మహాన్ రోదసీ వ్యాప్య స్థితః॥**

**జ్వలంతమ్ :** మీ తేజస్సు సర్వత్రా విస్తరించి సర్వమును వెలిగిస్తూ ఉండటం చేత, సర్వము మీ 'వెలుగు'యే అయి ఉండటం చేత – **జ్వలంతమ్ ఇతి ఆహ, జ్వలన్ ఇవ ఖలు అసావవత్ స్థితః॥** సమస్తము మీ 'ఎరుక' యొక్క విన్యాస – సంప్రకాశమే కాబట్టి జ్వలంత (వెలిగించు) స్వరూపులగుచున్నారు. 'ఎరుక' అను తేజస్సులో సమస్తమును వెలిగించుచుండటమే ఈ విశ్వము యొక్క రూపము.

**సర్వతోముఖమ్ :** సమస్తము మీ ముఖమే. 10 దిక్కులలో అనంత ముఖములతో వెలయుచున్నారు. **'సర్వతోముఖః' ఇతి ఆహ। సర్వతః ఖలు అయం ముఖవాన్ విశ్వరూపత్వాత్। వేలాది ముఖములతో విరాజిల్లుచున్నారు.**

**'నృసింహమ్':** "యజ్–యజ్రేవ" స్వరంతో సింహ–నర ముఖులై కనిపిస్తున్నారు. **'నృసింహమ్'–ఇతి ఆహ, యథా యజురేవ ఏతత్।**

**భీషణమ్ :** మిమ్ములను చూచి భయముచేత మీ కనుసైగలు ప్రకాశించటంచేత సమస్తము ప్రవర్తమానమౌతోంది. **భీషణమ్ ఇతి ఆహ, భీషా వా అస్మాత్ ఆదిత్య ఉదేతి।** మీ భయము చేతనే సూర్యుడు ఆకాశంలో స్వయం ప్రకాశకుడై సంచరిస్తున్నారు. అట్లాగే చంద్రుడు మీ భయముచే ఓషధ ప్రదాతగా అయి వర్తిస్తున్నారు. మీపట్ల, భయముచే వాయువు వీచుచున్నది. **భీతః చంద్రమా, భీతో వాయుః వాతి, భీతో అగ్నిః దహతి। భీతః పర్జన్యో వర్షతి.** మీకు భయపడి అగ్ని దహిస్తోంది, వర్షము వర్షిస్తోంది.

**భద్రమ్ :** మీరే సర్వజగత్ – సమస్త సంరక్షకులు. మీ రక్షణలోనే సర్వము ప్రదర్శితమౌతోంది. **భద్రమ్ ఇతి ఆహ, భద్రః ఖలు వయమ్।**

**శ్రియా జుష్టమ్ :** సర్వ సంపదలు మీచేతనే ప్రసాదితము. సర్వము మిమ్ములనే ఆశ్రయించుటచే శ్రేయస్సు కలిగించునవై ఉన్నాయి.

**మృత్యోర్మృత్యుః :** మార్పు – చేర్పులన్నిటికి ఆధారాలు మీరే। కారణ కారణులు. అమృతప్రదాత. **మృత్యోః మృత్యుః। అమృత స్వరూపమ్ త్వమ్।** మృత్యువుకే మృత్యువు. మృత్యువుకే 'సాక్షి' అయి ఉన్న స్వస్వరూపముయొక్క జ్ఞానప్రదాత।

**ప్రజానామ్ అన్నదానమ్ :** సర్వులకు ఆహార స్వరూపులై మిమ్ములను మీరే సమర్పిస్తూ పరిపోషకులగుచున్నారు. ఇంద్రియములకు **"అనుభవిత దృశ్యము"** రూపంగా ఇద్రియాహారస్వరూపులు. 'అన్నాదమ్' అయి ఉన్నారు.

**అహమ్ ఇతి :** సర్వే సర్వత్రా 'అహమ్' స్వరూపులై ద్రష్ట – దర్శన – దృశ్యములను ఆస్వాదిస్తున్నారు.

అట్టి మీ కేవల నిత్యానందతత్త్వమునకు నమస్కరిస్తున్నాను. సమస్త జీవులలో 'నేను'గా ఉన్నది మీరే। తత్త్వమ్। సోఽహమ్

| ఉగ్రం వీరం మహావిష్ణుమ్ జ్వలంతమ్ సర్వతో ముఖమ్। నృసింహ భీషణమ్ భద్రమ్। మృత్యుర్మృత్యుం నమామ్యహమ్॥ |
|---|

– ఈ విధంగా యజుస్వరంతో యజుర్వేద స్తుతులతో ప్రజాపతి గానం చేశారు. దివ్యతేజోమూర్తులగు నృశింహభగవానుడు చిరునవ్వుతో ఇట్లు పలుకసాగారు.

⌘

**భగవాన్ మహావిష్ణు నృసింహస్వామి :** హే ప్రజాపతీ! బిడ్డా! నీ **"ఉగ్రం వీరం..."** స్తుతికి సంప్రీతుడనయ్యాను. నీకు ఈప్సితమైనది ఏమిటో అడుగు. సంతోషంగా ప్రసాదిస్తాను.

**ప్రజాపతి :** హే భగవాన్। అవ్యక్తమునుండి జనించి నేను వ్యక్తీకరణమును నిర్వర్తించవలసినదిగా మీయొక్క అశరీరవాణిచే ఆజ్ఞాపించబడినాను. **"అవ్యక్తము ఎట్టిది?"** అనే జిజ్ఞాసతో తపస్సు ఆచరించాను. అవ్యక్త స్వరూపులైనట్టి మీరు నా తపోఫలంగా ఈవిధంగా చిత్ర–విచిత్ర వ్యక్తీకరణమై సాక్షాత్కరించారు. సాకారరూపంగా దర్శనము ఇచ్చారు. స్వామీ! నేను **'వ్యక్తీకరణము'** చేయవలసినది దేనిని? ఏరీతిగా? ఎందుకు? – దయతో ఆజ్ఞాపించండి.

**భగవానుడు :** మీరు వ్యక్తీకరించవలసినది → **"చర–అచరాత్మకమగు విశ్వము।" యత్ వ్యజ్యతే తత్ వ్యక్తస్య – 'వ్యక్తత్వమ్' ఇతి।** ఏదైతే 'అనుభూతి–అనుభవము'గా వ్యక్తీకరణమౌతుందో, అదియే వ్యక్తము. నాయొక్క క్రీడా–లీలా వినోదంగా అనుభవి – అనుభవము – అనుభూతము (The Experiencer, The Experiencing and The object of Experience) – అను మూడిటి సమావేశమే మీరు నిర్వర్తించవలసిన వ్యక్తీకరణము.

**ప్రజాపతి :** హే పరమాత్మా। మీరు చెప్పిన మూడిటి సమావేశరూపమగు జగత్తును ఎట్లా సృష్టించాలో నాకు సామర్థ్యమగుట లేదు. చేతగావటంలేదు. అందుకు ఉపాయము ఏమిటో చెప్పి నన్ను సృష్టికర్తగా రూపొందించండి.

**పరమపురుష భగవానుడు :** ఓ ప్రజాపతీ! ఏది తెలుసుకోవటం చేత సర్వము తెలియగలదో, సర్వశక్తిమంతులు కాగలరో, సర్వము నిర్వర్తించు సామర్థ్యము సిద్ధించగలదో – అట్టి పరమోత్కృష్టమగు **"సృష్టి సంకల్పనా విద్య"**ను చెప్పుచున్నాను. వినండి.

(1) **మునుముందుగా....** ఆయా విశేషణములతో ధ్యానించినట్టి నాయొక్క విశ్వమూర్తిత్వము, – **సాకార** (మరియు) **నిరాకార** స్వరూపముగా భావిస్తూ నన్ను ధ్యానించండి. ధ్యాసను ప్రవృద్ధి పరచుకొండి. ఏకాగ్రత సంతరించుకొనుచుండెదరు గాక.

(2) **క్రమంగా, "అట్టి ధ్యానవస్తువు నాయొక్క ఆత్మస్వరూపమే"** అను బుద్ధితో నన్ను కేవలస్వస్వరూపంగా భావన చేయండి.

(3) **అప్పుడిక...,** సర్వత్రా ఏర్పడినదైయున్న **"అహమ్ విష్ణుమ్"** అను అగ్నియందు **'జీవాత్మత్వము'**ను హవిస్సుగా సమర్పిస్తూ....,

(4) **ఇక ఆపై...,** మీరు ఇతఃపూర్వము గానము చేసినట్టి "అనుష్టుబ్ ఛందోబుక్కులు"తో అర్చించండి. దృశ్య–జీవ–ఈశ్వర తత్త్వములను పరతత్త్వముతో ఏకార్చన చేయండి.

**అయమేవ జ్ఞాన యజ్ఞో।** ఈ రీతిగా **'జ్ఞాన యజ్ఞమ్'** నిర్వర్తించండి.

⌘

మనము చెప్పుకుంటున్న విష్ణు–ప్రజాపతి సంవాద రూపమగు **'మహోపనిషత్'**–దేవతలకు కూడా అతి రహస్యమైయున్న విధి– విధానము.

ఇటువంటి **"సర్వతత్త్వ స్వరూపమునందు ధ్యానపూర్వకంగా వ్యష్టిహంకారమును హవిస్సుగా సమర్పించు - ఆత్మజ్ఞాన యజ్ఞము"** – అనునది ఋగ్వేద–సామవేద–యజుర్వేద మంత్ర (శాస్త్ర) పాండిత్యముతో ఒనగూడేది కాదు.

**"హే పరాత్మా! నాది అనిపించేదంతా వాస్తవానికి సర్వదా నీదే।" అను సర్వము ఆత్మార్పణము చేయు శ్రద్ధ – అవగాహన–ధ్యానయోగము"చేతనే సానుకూల్యము. సుసాధ్యము. "నేను" అను వ్యష్ఠిని "సర్వాంతర్యామియగు నేను"కు హవిస్సుగా సమర్పించటమే "ధ్యానయజ్ఞము" లేక "యోగయజ్ఞము".**

**భగవానుడు ఇంకా ఇట్లా చెప్పటం కొనసాగించారు.**

**య ఇమామ్ వేద →**

ఎవ్వరైతే ఇట్టి **వ్యక్తిగతమైన 'నేను'**ను **"సర్వగతమగు నేను"** – అనబడు (జాగ్రత్, స్వప్న–సుషుప్తి సాక్షిరూప) విష్ణుతత్త్వమునందు భక్తి–ధ్యాన–యోగ–జ్ఞానపూర్వకంగా సమర్పించటమును ఎరిగి నిర్వర్తిస్తూ ఉంటారో....,

- ✠ అట్టివారు కోరుకున్నవన్నీ తమకు తామే సిద్ధించగలవు.
- ✠ అట్టివాడు లోకములన్నీ జయించి, వాటినన్నిటినీ దాటివేసి, అలౌకిక స్వరూపుడనగు నన్నుచేరగలడు.
- ✠ లోకాంతర్గతమైన ప్రయోజనములు ఉద్దేశ్యించువానికై.....వేదవిధులతో కూడిన యజ్ఞములు నిర్వర్తించి ఊర్ధ్వలోకములు సిద్ధించుకొన్నప్పటికీ **పునరావృత్తిదోషము అనివార్యము.** అట్లా కాకుంటే, **"సర్వసమర్పణపూర్వక-అహమ్-సమర్పణారూప"** ఆత్మోపాసనచే - పునరావృత్తిదోషమును పొందడు.

అప్పుడు ప్రజాపతి నృసింహరూపముగా ప్రత్యక్షమైన విష్ణుభగవానుని **"స్వాత్మపరత్వ ధ్యానము"** యొక్క బోధనా ప్రభావంచేత సమర్థతను పొంది **'సృష్టికార్యము'**నకు ఉపక్రమించారు. 'అక్షరము' అయి ఉండినట్టి '30' అక్షరములను ఒక్కొక్కటిగా ధ్యానిస్తూ స్వర్గ-మర్త్య-పాతాళ త్రిలోకములను 'ఓం' అను అక్షరమును జేర్చి (ఓం అం ఓం। ఓం ఆం ఓం-ఇత్యాదిగా) 32 అక్షరములను ఏక ఋక్కుగా రచించారు.

ముందుగా ప్రజాపతి-తనయొక్క "భావన,అనుభూతి,రచనా" కళను సిద్ధింపజేయటానికై అశరీరులగు దివ్యప్రజ్ఞలను (శబ్ద స్పర్శాది ఇంద్రియార్థ అభిమానులను శక్తి తత్త్వములను) సంకల్పించి **నియామకం** చేశారు. వారంతా లోకముల భౌతిక-అంతరబాహ్యముల నిర్మాణసామర్థ్యము (ప్రజాపతిచే) ప్రసాదించబడ్డారు.

అప్పుడు....**'ఈ త్రిలోకములకు ఒక అధినాయకుడుఉండాలి కదా!'-** అని యోచించి త్రిలోకపాలనాబాధ్యత నిర్వర్తించటానికై **త్రిలోకపాలనా-అభిమాన-విశేష ప్రజ్ఞ**తో కూడినట్టి ఇంద్ర దేవుని కల్పించి నియమించారు. ఆయన సర్వదేవతలలో శ్రేష్ఠుడుగాను, అధికుడుగాను ప్రకాశమానుడైనారు.

**ఈ సృష్టి కల్పనా చమత్కారక్రమమును ఎరిగినవాడు, సమానులందరిలో అధికుడై ప్రకాశించగలడు.** ఇంకా కూడా →
-***"ఇంద్రియములకు తారసబడుచున్నదంతా నాయొక్క కల్పనాపురుషుడగు ప్రజాపతిచే నియమితుడైన ఇంద్రియాధినేత త్రిలోకాధినేత అగు ఇంద్రుని ఇంద్రజాలమే"*** అని ఎరుగగలడు. **"సమానామ్-అధికోభవేత్!"** సర్వసమత్వము (మరియు) సర్వము కంటే అధికమైన ఆత్మత్వమును ఆస్వాదించగలడు. **కేవలత్వము సంతరించుకోగలడు.**

✠

ప్రజాపతిచే సృష్టికొరకై గానము చేయబడిన **'ఋక్కు' యొక్క (లేక) ప్రజాపతియొక్క ఏకాదశపాదముల** (11 స్టెప్స్)చే ఏకాదశరుద్రులుగా సముత్తేజింపబడ్డారు.

ద్వాదశ (ఏకాదశ + కేవలము) = ఆదిత్యులను కల్పన చేశారు.

(ద్వాదశాదిత్యుల పురాణనామములు = ధాత, మిత్రుడు, ఆర్యముడు, శక్రుడు, పూషుడు, సవిత, తృష్ణ, విష్ణువు, ఇంద్రుడు మొ॥వారు.

అయితే అవ్యక్తస్వరూప-కేవలుడగు విష్ణు సంప్రదర్శనమే ఇదంతా కూడా. **సర్వైః ఏవ స విష్ణుః అభవత్।** ఆయనయే మొట్టమొదటి ఆత్మస్వరూపుడు కనుక **'ఆదిత్యుడు'** అనబడుచున్నాడు. అందుచేత విష్ణువే ఆదిత్యుడుగా **ప్రప్రథముడు.**

**అట్టి సమస్త అనుభవములకు మునుముందుగానే ఉండి ఉండి, సర్వముగా విస్తరించుచున్న స్వస్వరూపాత్ముడగు ఆదిత్యనామ విష్ణుతత్త్వమును ఎరిగినవాడు సమానులందరిలో 'అధికుడు'గా గుర్తించబడుచున్నాడు.**

ఇంకా

**అష్టవసువులు** = '4' + '4' అక్షరములనుండి అష్ట-వస్తువులు కల్పించబడ్డారు. (వారి పౌరాణికనామములు : అవుడు; ధ్రువుడు; సోముడు; అథర్వుడు; అనిలుడు; ప్రత్యుషుడు; అనలుడు; ప్రభాసుడు).

**(1) బ్రాహ్మణములు :** బ్రహ్మమును స్తుతించు బ్రాహ్మణములు మొదటి '12' అక్షరముల నుండి బయల్వెడలాయి. బ్రాహ్మణములను స్తుతించువారు (పారాయణము చేయువారు) బ్రాహ్మణులు. 'సోఽహమ్' భావనచే ఈ జీవుడు 'బ్రాహ్మణుడు' అగుచున్నాడు. (బ్రహ్మణి యతేతి బ్రాహ్మణః। ఇదమ్త్వమ్ బ్రహ్మమేవ భావయేతి బ్రాహ్మణః।)

**(2) క్షత్రే :** '10' '10' అక్షరములనుండి క్రియా సామర్థ్యము (లేక) ప్రజ్ఞలు బయల్వెడలువారు. భక్తి-జ్ఞాన-వైరాగ్య-యోగాభ్యాసములచే సంపద పెంపొందించుకొనుచున్నవారు - క్షత్రియులు.

'12-12' అక్షరములచేత నిర్మితమైన బ్రహ్మతత్త్వజ్ఞులగువారే కార్య-సాధనా నిర్వహణా సామర్థ్యాభిమానులకంటే (క్షాత్ర-అభిమానులకంటే) అధికులు - అగుచున్నారు.

**(3) వైశ్యులు : క్షత్రియ సంకల్ప - నిర్ణయములను కార్యరూపముగా నిర్వర్తించువారు. ఇది ఎరుగుటచే - ఆయావారున్నచోట 'ముఖ్యులు'గా అగుచున్నారు.**

**(4) శూద్రః :** ఇంద్రియానుభవములందు **'అభిమానమునకు పరిమితులగువారిని శూద్రులు'** అని, తూష్ణీగుణ స్వభావులని అనబడుచున్నారు. 'ఆత్మవిద్య' పట్ల నిర్విద్యులై ఉండువారు శూద్రులు. (ఇవన్నీ బుద్ధి సంబంధమైన విభాగములేగాని, జన్మసంబంధమైనవి, సాంఘిక సంబంధమైనవి కావు).

ఇవన్నీ సృష్టి కార్యక్రమములో వివిధ లీలా వినోద విశేషములు.

- ❐ ఆత్మవిద్యను ఎరిగి సర్వత్ర ఆత్మదర్శనము సిద్ధించుకొనువారు - 'బ్రాహ్మణులు'.
- ❐ ఆత్మవిద్యకై సాధన సంపత్తిని పెంపొందించుకొనుమార్గములో ఉన్నవారు-క్షత్రియులు.
- ❐ సాధనములపట్ల శ్రద్ధ - ఆసక్తులు కలవారు - వైశ్యులు!
- ❐ ఆత్మ విద్యపట్ల తూష్ణీభావముకలవారై, నిర్విద్యాపరులై, ఇంద్రియానుభవముల కొరకై కాలము వెచ్చిస్తున్నవారు - శూద్రులు.

**ఈ ఈ బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్ర స్వభావులంతా ప్రజాపతి సృష్టిలోని కల్పనా చమత్కారములే.**
**(జన్మనాజాయతే శూద్రః। కర్మణా జాయతే ద్విజః।)**

✠ ✠

ఇప్పటివరకు సృష్టించబడినట్టి అవ్యావృత-విస్తరణ సృష్టిలో 'రాత్రి-పగలు' అనునవి లేకుండినవి. ఇప్పుడిక ప్రజాపతి అనుష్టుభ్ ఛందో-ఋక్‌గాన ప్రభావముతో అహోరాత్రములు (Day and Night) కల్పించారు.

అజ్ఞానరూపమగు రాత్రి, సుజ్ఞానరూపమగు పగలు - ప్రజాప్రతి సృష్టికల్పనా-అంతర్గత విశేషములే.

ఈ విధంగా సృష్టిలో అజ్ఞానము కూడా కల్పించబడింది. **"జబ్బు కల్పించబడినప్పుడు, ఆ జబ్బుయొక్క ఉపశమనమునకు మందు (ఔషధము) కూడా కల్పించబడాలికదా!"** - అని యోచించిన ప్రజాపతి అజ్ఞానము తొలగించుకోవటానికై మార్గములను కూడా (లీలావినోదంగా) కల్పించసాగారు. భక్తి-జ్ఞాన-యోగ-యజ్ఞ-ఇత్యాది సాధనా పరికరములన్నీ నిర్మించారు. తత్త్వమార్గాణ్వేషకులకు మార్గదర్శకంగా ఋతము (ఆత్మను) సేవించు ఋక్కులను సృష్టిలో ప్రతిష్ఠించారు. ఇవి త్రిలోకజీవులకు మార్గదర్శకములు (Like Path Finders) అగుచున్నాయి.

ఈ విధంగా **ఆత్మతత్త్వ మార్గదర్శకము, తత్త్వనిర్ణయ వాఙ్మయరూపము గా ఋక్కులకు** →

| | | |
|---|---|---|
| మొదటి పాదము | - | ఋగ్వేదము |
| రెండవ పాదము | - | యజుర్వేదము |
| మూడవ పాదము | - | సామవేదము |
| నాలుగవ పాదము | - | అధర్వణవేదము లేక అధర్వ అంగీరసము |

'8' అక్షరముల (అష్టాక్షర) పదరూపంగా - **గాయత్రీ ఛందస్సు,**

11 (ఏకాదశ) అక్షరముల పదరూపంగా - **త్రిష్టుప్ ఛందస్సు.**

4 (చతుః) అక్షరముల పదరూపంగా - **జగతీ ఛందస్సు,**

32 (ద్వాత్రింశత్) అక్షరముల పదరూపంగా - **అనుష్టుప్ ఛందస్సు,**

'9' (నవా) అక్షరముల - పదరూపంగా - సర్వ తదితర ఛందస్సులు

....ఇవన్నీ వేదమంత్ర వాఙ్మయమునందు సిద్ధాంతీకరణ (లేక) వ్యాకరణ విధానములుగా శబ్దజాలము కొరకై సంకల్పించబడ్డాయి. ఎవ్వడైతే 'ఛందోబద్ధ' వేదమంత్ర విధానమును పై విశేషములతో ఎరుగుచున్నాడో, అట్టివాడు →

- సర్వ జగత్తు అనుష్టుప్ ఛందస్సు నుండియే ఉత్పన్నమగుచున్నదని....
- సర్వ జగత్తు అనుష్టుప్ ఛందస్సునందే ప్రతిష్ఠితమైయున్నదని....

తెలుసుకొనుచున్నవాడై...

→ నేను అనుష్టుప్ ఛందస్సు నుండి జనించి, 'అనుష్టుప్' (అక్షరము) నందే ప్రతిష్ఠితమైయున్నాను.

→ ఆత్మయందే సర్వదా ప్రతిష్ఠితుడను – **అని తనను గురించి తాను ఎరుగుచున్నాడు.**

✠

అప్పుడు ప్రజాపతి ఇట్లా యోచించసాగారు. "సరే! ఇప్పటివరకు '30'+'2'– నాదస్వరూప అక్షరములను, శబ్ద–స్పర్శ–రూప–రసగంధ అభిమాన తత్త్వులగు దివ్యదేవతా (అశరీర) ప్రజ్ఞలను, వారికి అధినాయకుడుగా ఇంద్రుని, ఆ ఇంద్రుడు పరిపాలన కొనసాగించటానికై ఋక్–యజుర్–సామ–వేదములను, వాటియందలి వాఙ్మయ విధి–విధానములను, ఛందోబద్ధంగా గాయత్రీ, త్రిష్టుప్, జగతీ, అనుష్టుప్‌లను ప్రవర్తింపజేసాను.

నవా ఛందస్సులను కల్పించి – సృష్టియందు ప్రకాశింపజేసాను.

ఇప్పుడిక ఏమి సృష్టించాలి? వీటన్నిటినీ అనుభవముగా పొందు జీవాత్మప్రజ్ఞారూపమగు ప్రజలను సృష్టించాలి. ఎట్లా?"

ప్రజలను (The Experiencers) ఎట్లా సృష్టించాలో వెంటనే తట్టనేలేదు. **అథ యదా ప్రజా సృష్టా న జాయంతే। "కథన్ను ఇమాః ప్రజాః సృజేయమ్? - ఇతి ప్రజాపతిః - చింతయన్।** – ప్రజలను సృష్టించేది ఎట్లా? – అని యోచించసాగారు. వెంటనే 'ఉగ్రమ్....' మహామంత్రమును ఇతఃపూర్వమువలెనే పెద్ద గొంతుకతో ఉచ్చరించసాగారు.

**ఉగ్రమ్ వీరమ్ మహావిష్ణుమ్ జ్వలంతమ్ సర్వతోముఖమ్।**
**నృసింహమ్ భీషణమ్ భద్రమ్ మృత్యుర్మృత్యుమ్ నమామ్యహమ్॥**

అని గానం చేయసాగారు.

అప్పుడు ప్రథమపాదము – 'ఉగ్రమ్'....నాదము నుండి ఉగ్రరూపుడగు దేవదేవుడు సాకారుడై ఆవిర్భవించారు.

– (ఏకస్వరూపుడు) ఒకవైపునుండి శ్యామలా (నల్లటి) వర్ణుడు ; మరొకవైపుగా రక్తపురంగు ఎర్రనివాడు ; మట్టితో చేసిన ఆకారమువలె ఉన్నట్టివాడు. స్త్రీ–పురుష ఏకరూపుడై ఉన్నారు.
– ఆయన స్త్రీ విభాగం నుండి స్త్రీలు, పురుషవిభాగం నుండి పురుషులు మూలపదార్థరూపంగా రూపుదిద్దుకోసాగారు.
– ప్రజాపతి అట్టి స్త్రీ – పురుష విభాగముల నుండి స్త్రీ – పురుషుల సృష్టిని నిర్వర్తించసాగారు.

ఈ విధంగా ఎరిగినవాడు – ఋక్కులను గానం చేస్తూ, జటా కలాపమును ధరించి, ప్రత్యక్ష జ్యోతిషి స్వరూపుడై 'ఆత్మ' యందే సర్వదా రమించువాడగు శివ భగవానుని తత్త్వజ్ఞానము పొందగలడు.

✠

అప్పుడు ప్రజాపతి తాను సృష్టించిన ఇంద్రుని దగ్గరకు పిలిచారు. **"ఓ ఇంద్రా! నీవు దివ్యప్రజ్ఞా అశరీరస్వరూపులగు దేవతలు ఉండే దేవలోకములో ప్రవేశించు. దేవతలకు అధిపతివై త్రిలోకపాలనను నిర్వర్తించెదవుగాక!"** - అని ఆజ్ఞాపించారు. వెనువెంటనే దేవలోకంలో ప్రవేశించిన ఇంద్రుడు తనయొక్క అధిపతిత్వమును ప్రకటించారు. అప్పుడు దివ్యలోకంలోని ఇతఃపూర్వమే ఉన్నట్టి దేవతలు → **(శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ ప్రజ్ఞాదివ్యులు). "అదెట్లా? మేము మునుముందే ఉండి ఉన్నాము కదా? మాపై మీరెట్లా ఆధిపత్యం చెలాయిస్తారు?"** అని గుసగుసలాడసాగారు. అది గమనించిన ఇంద్రుడు తిరిగి బ్రహ్మదేవుని (ప్రజాపతిని) సమీపించారు.

**ఇంద్రుడు:** హే భగవాన్! బ్రహ్మదేవా! సర్వతత్త్వప్రదాతా! చరాచర సృష్టికర్తా! మీరు నన్ను దేవతల కార్యక్రమములపై నాయకత్వపు బాధ్యతలను నిర్వర్తించవలసినదిగా అనుగ్రహించారు. అయితే, దేవలోకములో మీచే ముందుగా సృష్టించబడిన దివ్యప్రజ్ఞస్వరూపులగు (శబ్దస్పర్శాది) అధి దేవతలు, "అది ఎట్లా? మేము మునుముందే ఉన్నాము. మీరెట్లా ఆధిపత్యం వహిస్తారు?"...అని ప్రశ్నించటం జరుగుతోంది. నేనేమి చేయాలో దయతో ఆజ్ఞాపించండి।

అప్పుడు ప్రజాపతి ఇంద్రునికి

– 'అనుష్టుప్' ఋక్కుతో అభిమంత్రితమైనట్టివి,
– అమృతముతో పూర్ణమైనట్టివి.

అగు '3' కలశముల అమృతజలంతో ఇంద్రుని అభిషేకించారు. కుడివైపు **'సుదర్శనచక్రము'**ను, ఎడమవైపు **'పాంచజన్యము'**ను రక్షణగా ప్రసాదించారు.

ఈ విధంగా కుడి–ఎడమలుగా సుదర్శన–పాంచజన్యములచే రక్షితులై 'త్రిలోకపాలన' అను బాధ్యతను స్వీకరించారు. ఇంద్రుడు, దేవతలు సృష్టివినోద కార్యక్రమమును 'స్వధర్మనిష్ఠ'తో కూడిన భావనల సముదాయముచే పర్యవేక్షించసాగారు.

అటు తరువాత ప్రజాపతి ఇంద్రుని సమీపించారు. ఇంద్రుడు బాధ్యతాస్వీకారి అగుచూ భక్తితో ప్రజాపతికి సాష్టాంగదండ ప్రణామములు సమర్పించారు. అప్పుడు ప్రజాపతి సూర్యతేజస్సు – వర్చస్సుతో ప్రకాశించుచూ, అనుష్టుప్ ఛందస్సుతో 'ఋక్' మంత్రము వ్రాయబడిన ఫలకముతో కూడిన 'రక్ష రేకుల దండ"ను ఇంద్రుని మెడలో అలంకరించారు. అనుష్టుప్ మంత్రమును ఉపదేశించారు. అప్పుడు ఇంద్రుడు మహాప్రకాశవంతుడు, దుర్నిరీక్షణుడు అయ్యారు. అప్పుడు దేవతలు ఇంద్రుని ఆధిపత్యము అంగీకరించారు. ఆయన **'స్వరాట్'** అను బిరుదాంకితులు అయ్యారు.

అట్టి ఇంద్రుని స్వరాట్‌తత్త్వమును ఎరిగినప్పుడు అట్టి జీవుడు 'స్వరాట్' అవగలడు.

ఇప్పుడు ఇక ఇంద్రుడు **'పరిపాలించటము'** అనే బాధ్యతను నిర్వర్తించటానికి సంసిద్ధులైనారు. **"మొట్టమొదగా భూమిని, జలమును వశం చేసుకోవాలి. లేకుంటే సృష్టిని పరిపాలించటం కుదరదుకదా!"** అని తలచారు. కాని ఎట్లా ఆ ఉభయములను జయించాలో తెలియలేదు. వెనువెంటనే ప్రజాపతిని సమీపించారు.

> *"హే స్వామీ! ప్రజాపతీ! నేను మీ ఆజ్ఞానుసారము త్రిలోక పరిపాలనను ప్రారంభం చేస్తున్నాను. అశరీరప్రజ్ఞలగు దేవతలు నన్ను పరిపాలకుడుగా అంగీకరించారు కూడా. అయితే మరొక సమస్య వచ్చి పడింది. సాకారమగు పృథివి – జలములను నేను జయించటమెట్లా? మీరే నన్ను అందుకు సమర్థుని చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాను".*

– అని ప్రజాపతిని త్రికరణశుద్ధిగా శరణువేడారు. అప్పుడు ప్రజాపతి :-

> *"ఓ త్రిలోకనాయకా! ఇంద్రదేవా! ఇదిగో! కమఠ (తాబేలు) ఆకృతి కలిగియున్నట్టిది, ఇంద్రమణితో అలంకరించబడినట్టిది, భుజగేంద్రుని (కాలసర్పమును) ఆధారముగా కలిగి ఉన్నట్టిది అగు "భద్రాసనము" నీకు ప్రసాదిస్తున్నాను. దీనిపై ఆసీనుడవై త్రిలోకములను పాలించు. నిరాకారులగు దేవతా ప్రజ్ఞలను, సాకారమగు పృథివి మొదలైనవాటిని పరిపాలించు –అధికార సామర్థ్యము నీకు లభించునుగాక! అందుకుగాను (అట్టి సామర్థ్యము కొరకై) – **"ఆత్మస్వరూపుడనగు నాకు ఈ సమస్త పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, త్రిలోకములు, అస్మత్‌శరీరమే"** అను భావనను ఉపాసించు. అప్పుడు – **శరీరి శరీరమంతా ఆక్రమించి పరిపాలిస్తున్న తీరుగా – నీవు త్రిలోకములపై ఆధిపత్యము** వహిస్తూ పరిపాలించ గాక!*

ప్రజాపతి ప్రసాదించిన ఇంద్రసింహాసనమును అధిష్ఠించిన ఇంద్రుడు భౌతిక జగత్తును (భుమి – ఆకాశములను) జయించి, పరిపాలన కొరకై వశము చేసుకొన్నారు. "ఈ పంచభూతములు, త్రిలోకములు ఆత్మ దృష్ట్యా నాకు అనన్యము. నేనే భూమిరూపంగా, జలము రూపంగా, అగ్నిరూపంగా, వాయు రూపంగా, ఆకాశరూపంగా, త్రిలోకముల రూపంగా – వాటన్నిటికీ శరీరినై వర్తించువాడను" – అను ఆత్మభావనచే సృష్టిలోని భూమి, జలము మొదలైనవన్నీ ఆయనకు వశమైనాయి.



ఎవ్వడైతే "ఈ ఊర్ధ్వ అథోస్వరూపమైనదంతా కూడా – సంప్రతిష్ఠితము (సర్వత్ర ప్రతిష్ఠితము), అశిధిలము (తరుగు–పెరుగు లేనట్టిది), సర్వత్రా వ్యాపకము) అయినట్టి పరమాత్మయొక్క **"సోఽహమ్"** భావన చేతనే (ఉపాసనచేతనే) అప్రతిష్ఠితము, శిథిల స్వభావయుతము అగు పృథివి, జలము మొదలైన పంచభూతములను, **దివ్యమగు దేవతల కార్యక్రమములను పరిపాలించు యోగ్యత లభించగలదు"** – అని గ్రహించి ఉంటాడో, **అట్టి పరమాత్మోపాసకుడు త్రిలోకాధిపత్యము పొందగలడు.**

ఈ సర్వము పరమాత్మకు చెందినదేనని,పరమాత్మ సంబంధితమైనదేనని, పరమాత్మకు వేరుగా చూస్తే ఇదంతా లేనట్టిదని, శిధిలమైనట్టిదని గ్రహించినవాడు **పృథివిని** జయించగలడు. "నేను భౌతిక రూపమాత్రుడను" – అను సంకుచిత భావమును అధిగమించగలడు."ఈ సమస్త దృశ్యము ఆత్మయే అను అభ్యాసముచే దృశ్యముపై ఆధిపత్యము సిద్ధించుకోగలడు.

ఎవ్వడైతే 'ఇహమ్'గా కనిపించేదంతా పరమాత్మయొక్క ప్రత్యక్షరూపముగా దర్శించు అభ్యాసమును ఆశ్రయిస్తాడో, అట్టివాడు...

- కూర్చున్నచోట ఉండియే బ్రహ్మతత్త్వమే తానై, బ్రహ్మతత్త్వము నందు సుఖాశీనుడు కాగలడు.
- దృశ్య–అదృశ్యతత్త్వములను ఎరిగినవాడై, దృశ్య శిథిలత్వముచే పరిమితి పొందదు. అట్లా కాకుండా, ఈ దృశ్యమును భౌతిక దృష్టితో మాత్రమే చూస్తూ ఉంటే, అట్టివాడు భౌతిక వస్తువులవలె శిథిలత్వమునే పర్యవసానముగా పొందుచున్నాడు.

## ॥ఫలశృతి॥

ఎవ్వరైతే, ఈ **'అవ్యక్తము యొక్క వక్తీకరణ విద్య'** గురించి ఎరుగుచున్నాడో....

⌘ అట్టివాడు **సర్వవేదములను అధ్యయనము** చేసి, **సారమును గ్రహించినవానితో సమానుడగుచున్నాడు.**

⌘ **సర్వక్రతువులను** నిర్వర్తించిన ఉత్తమ ప్రయోజనము పొందుచున్నాడు.

⌘ **సర్వతీర్థములలో** స్నానము చేసిన పుణ్యము పొందినవాడితో సమానము.

⌘ సర్వ మహాపాతక – ఉపపాతకము దోషములనుండి **పునీతుడు అవగలడు.**

⌘ మహత్తరమగు **'బ్రహ్మవర్చస్సు'తో ప్రకాశించగలడు.**

⌘ అట్టి బ్రహ్మజ్ఞాని యొక్క ఇతఃపూర్వపు (మరియు) భవిష్యత్ **వంశములు పునీతము** కాగలవు.

⌘ అట్టివాడు **'అపస్మార'** బుద్ధి, **'అకుశలత్వము'** మొదలైన **మానసిక దోషములకు లోబడడు.**

⌘ అట్టి ఆత్మత్త్వమును స్వానుభవముగా సిద్ధించుకొన్న బ్రహ్మజ్ఞానిని దర్శించునప్పుడు యక్ష–ప్రేత–పిశాచ స్వభావులగు జీవులు కూడా **పునీతులు కాగలరు.** అట్టి మహనీయుని స్పృశించటంచేత, చూడటంచేత, ఆయన చెప్పునది వినినంత మాత్రంచేతనే **పాపి కూడా పరిశుద్ధుడై పుణ్యలోకములను పొందగలడు.**

⌘ అట్టి **బ్రహ్మజ్ఞాని గురించి** చింతన చేసిన మాత్రం చేత సర్వ **శుభార్థములు చేకూరగలవు.**

⌘ సర్వత్రా ఆత్మదర్శనము చేయు మహనీయుడు సర్వులకు తండ్రివలె సంరక్షకుడు అయి కనిపిస్తాడు.

⌘ **రాజ్యపాలన చేయువారు** కూడా అట్టి ఆత్మజ్ఞాని యొక్క వాక్యములకు ఆనందిస్తూ ఆత్మబంధువులై ఉండగలరు.

ఆత్మతత్త్వజ్ఞులగు సమదర్శుల ఆత్మీయవాక్యములను పూర్తిగా వినకుండా, వ్యతిరేకించి సంకుచిత దృష్టితో మాట్లాడువారు నమస్కారమునకు అర్హులు కారు.

సర్వత్రా ఆత్మగా భావిస్తూ, **ఈ దృశ్యమును ఆత్మతత్త్వముగా దర్శించువారు జీవన్ముక్తులగుచున్నారు.** వారు ఈ దేహ పరిమిత పరిధులను, అజ్ఞానాంధకారమును అధిగమించి **'పరంధామము'**ను ప్రాప్తించుకొనుచున్నారు.

ఈవిశ్వమంతా విరాట్ రూప నృశింహస్వరూపముగా ఉపాసించువాడు, విరాట్ – ఆత్మధ్యానపరాయణుడు అగుచూ క్రమంగా సర్వాతీతుడై, **ఆత్మయందే విలీనుడగుచున్నాడు.** అట్టివాడు మరల పునరావృత్తి (తిరిగి భౌతిక, వ్యష్టిపరిమిత దృష్టికి) తిరిగిరాడు. **సర్వత్ర సర్వదా** ఆత్మదృష్టియందే సుఖాశీనుడై ఉంటాడు. ఆత్మానందము సిద్ధించుకోగలడు.

⌘

*అవ్యక్తాత్మవిద్యను (ఈ వ్యక్తావ్యాక్త ఆత్మతత్త్వమును) బోధించుటకు...*

శ్రద్ధలేనివాడు; అసూయను వదలనివాడు; సదాచారము పట్ల తిరస్కారభావము కలవాడు; దురాచారపరుడు; విష్ణుభక్తి లేనివాడు; అసత్యములు వెనుకాడకుండా పలుకువాడు; తపస్సు అభ్యసించనివాడు; ఇంద్రియ నిగ్రహము లేనివాడు; అశాంతి స్వభావుడు; దీక్ష – పట్టుదల లేనివాడు; అధర్మశీలుడు; స్వధర్మమును ఉపాసించనివాడు; పరులను బాధించి హింసాస్వభావి, 'బ్రహ్మము' గురించి అధ్యయనమునందు అభిరుచి లేనివాడు **అర్హుడు కాదు.**

అట్టి దోషములు తొలగించుకొను యత్నశీలుడు – గురుముఖతః శ్రవణమునకు, అధ్యయనమునకు తప్పకుండా అర్హుడే!

**ఇతి అవ్యక్తోపనిషత్**

*ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ॥*

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 2 ఆరుణికోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ ఆరుణికాఖ్య ఉపనిషత్ ఖ్యాతం
సభ్యాసినో అమతాః
యత్ ప్రబోధాత్ యాతి ముక్తిం,
తత్ రామబ్రహ్మ మే గతిః



"పరమాత్మ అన్యుడు" - అని చెప్పు మతములను, వాదోపవాదములను వదలి, ఈ 'ఆరుణికోపనిషత్'చే గుర్తు చేయబడుచున్న "అఖండ- రామబ్రహ్మతత్త్వము"ను అభ్యసించటము, అధ్యయనము చేయటము-ముక్తికి ఉత్తమమగు మార్గము. అనన్యుడగు ఆత్మారామ బ్రహ్మమే (శ్రీరామబ్రహ్మమే) తానవటము - అంతిమ లక్ష్యము. జీవులందరికి అదియే ఉత్తమగతి.

## ప్రథమః ఖండః

1. ఓం
ఆరుణిః ప్రాజాపత్యః
ప్రజాపతేః లోకమ్ జగామ।
<u>తం గత్వ ఉవాచ :</u>
"కేన, భగవన్! కర్మాణి
అశేషతో విసృజామి?" ఇతి॥

ఓంకార స్వరూపుడగు పరమాత్మకు నమస్కరిస్తూ!

ఒకానొక సందర్భములో ప్రజాపతి కుమారుడు, మహాప్రజ్ఞావంతుడు అగు ఆరుణిముని ప్రజాపతి లోకము వెళ్ళి తన తండ్రి, సృష్టికర్తయగు ప్రజాపతిని సందర్శించారు.

ఆరుణిముని : హే భగవన్! పితృదేవా! లోకాల సృష్టికర్తయగు ప్రజాపతీ! త్యాగేనైవతు కైవల్యమ్ - అన్నీ త్యజిస్తేనే కైవల్యము - అని ముక్తపురుషులగు మహనీయులు సూచిస్తున్నారు కదా! మరి, కర్మలను అశేషంగా మొదలంట్లా త్యజించటం ఎట్లా? నాకు బోధించండి!

---

2. <u>తం హ ఉవాచ ప్రజాపతిః :</u>
తవ పుత్రాన్, భ్రాతౄన్, బంధ్వ - ఆదీం, శిఖామ్,
యజ్ఞోపవీతమ్, యాగం చ
సూత్రం చ, స్వాధ్యాయం చ
<u>భూలోక - భువర్లోక - సువర్లోక - మహర్లోక -</u>
<u>జనోలోక - తపోలోక - సత్యలోకం చ,</u>
<u>అతల - వితల - సుతల - పాతాళ</u>
<u>రసాతల - తలాతల - మహాతల</u>
బ్రహ్మాండం చ విసృజేత్॥

శ్రీ ప్రజాపతి : అవును ప్రియపుత్రా! నీవు పుత్రులను, సోదరులను, 'బంధువులు మిత్రులు, శత్రువులు' మొ॥వాటిని, శిఖను, యజ్ఞోపవీతమును, యాగములను, వేదశాస్త్రములను, వేద పఠనములను, భూ-భువర్-సువర్- మహర్-జనో-తపో-సత్య...ఏడు <u>ఊర్ధ్వలోకములను,</u> అతల-వితల-సుతల- పాతాళ-రసాల-తలాతల-మహాతల <u>అధోలోకములను,</u> ఈ సర్వబ్రహ్మాండమును పరబ్రహ్మసాక్షాత్కారమునకై - త్యజించివేయి. (అన్నీ త్యజించివేయగా, అప్పటికీ ఏ నీ స్వరూపము నీకు అనన్యమై శేషించియే ఉంటుందో, అదియే నీ స్వాభావిక - వాస్తవ ఆత్మస్వరూపము)

---

3. దండమ్, ఆచ్ఛాదనమ్,
కౌపీనంచ పరిగ్రహేత్।
శేషమ్ విసృజేత్।
శేషమ్ విసృజేత్ ॥ఇతి॥

సన్న్యాసుల ఉపకరణములయినటువంటి దండము, ఏదో ఒక దేహాచ్ఛాదనము గోచి, ఇటువంటి దేహమునకు అత్యవసరమైనవి మాత్రమే కలిగి ఉండు.

మిగతావన్నీ వదలివేయి. వదలటానికి ఉపాయం - <u>వదలి ఉండటమే!</u> వదలటమును కూడా వదలివేయి। మనస్సుతో సమస్తము త్యజించి ఉండు. మనస్సుతో సమస్తము త్యజించి ఉండు.

# ద్వితీయః ఖండః

**1. గృహస్థో బ్రహ్మచారీ వానప్రస్థో వా లౌకికాగ్నీన్ ఉదరాగ్నౌ సమారోపయేత్॥**

ఒకడు గృహస్థుడు కావచ్చు. బ్రహ్మచారి కావచ్చు. లేక, వానప్రస్థుడు కావచ్చు గాక!

ఆతడు లోక ప్రయోజనప్రదములగు (లౌకిక ఫలప్రదమైన) అగ్నికార్యములను సర్వజీవుల జీవనాధారము అయినట్టి 'జఠరాగ్ని'యందు సమారోపితం చేయాలి. ఈ దేహములో నేను చేయు జఠర- అగ్న్యోపాసన సర్వశరీరధారియగు జఠరాగ్ని దేవుడు స్వీకరించుగాక! లోక కళ్యాణమగుగాక - అని సంకల్పించివేయి.

---

**2. గాయత్రీమ్ చ 'స్వ-వాక్' అగ్నౌ సా మారోపయేత్।**

**3. ఉపవీతమ్ భూమా అప్సు వా విసృజేత్।**

**4. కుటీచరో బ్రహ్మచారీ కుటుంబమ్ విసృజేత్।**

**5. పాత్రం విసృజేత్।**

**6. పవిత్రమ్ విసృజేత్।**

**7. దండాన్ లోకాని విసృజేత్ ఇతి॥**

⌘ గాయత్రీ మంత్ర జపకర్మను 'స్వ-వాక్' (Own expressive energy of sound) అనే అగ్నిని సమారోపించి సమర్పించు. (ఉచ్చారణ పెదిమలతోను చేయకుండా, మనో శక్తితో మంత్ర మననము చేయటం)

⌘ ఉపవీతము (దంధ్యమును) "భూమి - జలము"...లయందు త్యజించివేయి. ( 3 పోగులు దేనికి గుర్తుయో, అట్టి - '3' అవస్థలు ధారణ చేయు 'నేను' ధారణచేయుటము).

⌘ కుటీచరుడు, బ్రహ్మచారి కూడా కుటుంబసంబంధములను మనస్సుచే త్యజించివేయునుగాక। ఫలితమును త్యజించును గాక!

⌘ వానప్రస్థుడు, సన్న్యాసి - కూడా పాత్రల మమకారము విడచివేయాలి.

⌘ భిక్షకుడైతే భిక్షపాత్రను కూడా విడవాలి. వస్త్రములను కూడా విడచిపెట్టాలి.

లౌకికమైన త్రి-దండమును కూడా లోకానికి విడచివేయాలి. (వాటిపట్ల ఏర్పడే 'మమ'కారము విడువాలి).

---

**(స)హోవాచ॥**

**8. అత ఊర్ధ్వమ్ అమంత్రవత్ ఆచరేత్।**

**9. ఊర్ధ్వగమనమ్ విసృజేత్।**

**10. ఔషధవత్ అశనమ్ ఆచరేత్।**

ఇకప్పుడు, 'అమంత్రత్వము' (మంత్ర సంబంధమైన నియమ త్యాగం) ఆచరించుము. మంత్ర - తంత్రాదులకు సంబంధించిన నియమములన్నీ కూడా ఆకాశమునకు సమర్పించి, మంత్ర - తంత్ర నియమరహితుడవగుదువుగాక!

ఊర్ధ్వలోకములు పొందటానికి శాస్త్రములు చెప్పే యజ్ఞయాగాది కర్మలను, క్రతువులను కూడా పరిత్యజించినవాడవై ఉండు.

నాలుకను, రుచులను జయించాలి. కేవలము జీవించటానికి మాత్రమే ఔషధమువలె ఆహారము తీసుకోవాలి. జీవించటంకోసం ఆహారము. అంతేగాని, ఆహారము కొరకు జీవించరాదు.

---

**11. త్రి సంధ్య - ఆదౌ స్నానమ్ ఆచరేత్।**

**12. సంధిమ్ సమాధావ ఆత్మని ఆచరేత్।**

**13. సర్వేషు వేదేషు ఆరణ్యకమ్ ఆవర్తయేత్। ఉపనిషదమ్ ఆవర్తయేత్। ఉపనిషదమ్ ఆవర్తయేత్ ॥ఇతి॥**

⌘ త్రిసంధ్యలకు ముందే ఉన్న కేవలమగు ఆత్మయందు స్నానం చేయాలి. ("ప్రాపంచిక విషయములను అంతరంగమునుండి రహితం చేయటం..." అనే ఆనందజలధిలో స్నానము చేయాలి).

⌘ సంధ్యా వందన కర్మను 'సమాధి'రూపమగు ఆత్మయందు ఆచరించాలి. సమస్తమును ఆత్మయందు సమాధానపరచివేయి. (సంధ్య = సంధి = ఆలోచనకు - ఆలోచనకు మధ్యగల స్వస్థానము)

⌘ సర్వవేదములలోని ఆరణ్యకములను పఠించు చుండెదవుగాక! (అరణ్యకము = ఉపాసన, జ్ఞాన విభాగము).

⌘ ఉపనిషత్ చూపిస్తున్న పరమార్థమును హృదయస్థము చేసుకొంటూ ఆత్మ ధ్యానమును అనువర్తించెదవు గాక! బాహ్యమున - అంతరమున కూడా ఆత్మగా ఆత్మయందు ఆత్మోపాసనగా చేసివేయి. ఆత్మతో ఆత్మను ఉపాసించు.

# తృతీయః ఖండః

**1. ఖలు "అహమ్ బ్రహ్మ" –**
**సూచనాత్ సూత్రమ్।**
**"బ్రహ్మసూత్రమ్ అహమేవ" – విద్వాన్–**
**త్రివృత్ సూత్రమ్ త్యజేత్–**
**విద్వాన్ య ఏవమ్ వేద।**
**"సన్న్యస్తమ్ మయా**
**సన్న్యస్తమ్ మయా।**
**సన్న్యస్తమ్ మయా।"**
**ఇతి త్రిః ఉక్త్వా......**
**అభయమ్ సర్వభూతేభ్యో**
**మత్తః సర్వమ్ ప్రవర్తతే ॥ ఇతి॥**

'ఓ ఆరుణీ! ప్రియపుత్రా! ఎట్లా త్యజించాలి' అని నీవు అడిగావు. ఏది త్యజించాలో చెప్పాను. అయితే, త్యజించటమెందుకు? ఒక పరమ **సత్యము కొరకు**, అది చెప్పుచున్నాను. విను.

'బ్రహ్మము' అను శబ్దము ఏ అర్థము కొరకై చెప్పబడుచున్నదో అది 'నేనే'! ఈ దృశ్యము 'తెలియబడుచున్నది' – కదా! దీనిని తెలుసుకొనుచున్నవాడో? 'నేను'. అట్టి 'నేను' గురించే 'బ్రహ్మము' అనునది సూచనగా సూచించబడుచున్నది. అయితే, నాకు సంబంధించి "తెలుసుకున్నవాడు – తెలివి – తెలియబడుచున్నది" – ఈ మూడిటిని దాటిచూడగా, "నేను'ను తెలుసుకొనే నేను"..యే "దృక్" రూపమైనది. అదియే బ్రహ్మము. "ద్రష్ట – దృశ్యము – దర్శనముల రూపంగా ఉన్నది నేనే"....అని తెలుసుకోవటమే బ్రహ్మమును ఎరుగట. అట్లు ఎరిగి, భౌతికమగు త్రిసూత్రమును వదలి ఉండు.

"మయా సన్న్యస్తమ్"....అని ముమ్మారుగా ద్రష్ట – దర్శన – దృశ్యములను అధిగమించి "అభయస్వరూపుడను. బ్రహ్మమే సహజరూపముగాగల నేను ఈ సర్వము, ఈ సర్వజీవులుగా కూడా అయి ఉన్నాను. నా చేతనే సర్వము ప్రవర్తించుచున్నది"....అని గమనించటమే ...బ్రహ్మతత్త్వానుభవము. త్యజించటమును కూడా త్యజించు. సర్వము నీవే అయి ఉండగా ఇక త్యజించవలసినది, సన్న్యసించవలసినది ఏమున్నది? (బంగారము ఆభరణమును త్యజించటమేమిటి? జలము తరంగమును త్యజించమెక్కడిది!)

---

**2. సఖా మా గోపా**
**యోజః సఖా,**
**యో అసి ఇంద్రస్య వజ్రోసి వా**
**వృర్త్రఘ్నః**
**శర్మ మే భవ,**
**యత్ పాపమ్**
**తత్ నివారయేతి॥**

నేను ధారణ చేస్తున్న "ద్రష్ట – దర్శన – దృశ్య"రూపమగు త్రిదండమా! నీవు నాకు ఇంత వరకు అనన్యమగు ప్రియసఖుడవు.

ఓ త్రిదండమా! నీవు నాకు శుభప్రదమై ఉండుము! సన్న్యాసినై త్రిదండమగు ద్రష్ట – దర్శన – దృశ్యములను దాటి ఉండి, బ్రహ్మమే స్వరూపముగా కలవాడనై, ఆ మూడిటిని త్రిదండముగా ధారణ చేసినవాడనై ఉండెదనుగాక!" – అను ధారణ చేయి.

శర్మ మే భవ : సమస్త జనులకు నేను ఆత్మగా (బ్రహ్మముగా) అభయ ప్రదాతను అగుదునుగాక! సర్వము నాకు ప్రియమే। ఇష్టమే। బ్రహ్మమునకు 'సంజ్ఞ' అగు ఈ బ్రహ్మదండము నాయొక్క పాప వృత్తులను నివారింపజేయును గాక!

---

**3. అనేన మంత్రేణ కృతమ్**
**వైణవమ్, దండమ్, కౌపీనమ్ పరిగ్రహేత్।**
**ఔషధవత్ అశనమ్ ఆచరేత్।**
**ఔషధవత్ అశనమ్ ప్రాశ్నీయాత్।**
**యథా లాభమ్ అశ్నీయాత్।**

**"ఖల్వహమ్ బ్రహ్మ"** "నేను బ్రహ్మమే అయి ఉన్నాను" అను మంత్రము పఠిస్తూ – కుడిచేతో దండము చేబూనాలి! కౌపీనమును కూడా బ్రహ్మమును – జపిస్తూ ధరించాలి.

ఔషధము (Medicine) వలె అన్నమును భుజించాలి.

ఏ ఆహారము లభిస్తే అదియే 'ఆకలి' అనే జబ్బుకు ఔషధంవలె (Light Medicine) స్వీకరించాలి. "నేను ఇది తినాలి! అది తినను"...ఇత్యాదులు కలిగి ఉండకూడదు. లభించిన సాత్వికహారమును ప్రియముగా స్వీకరించాలి.

---

**4. బ్రహ్మచర్యమ్ అహింసాం చ**
**అపరిగ్రహం చ,**
**సత్యం చ యత్నేన**
**హే రక్షత। హే రక్షత। హే రక్షత। ఇతి॥**

ఓ జనులారా! (1) బ్రహ్మచర్యము (బ్రహ్మమే ఇదంతా అను భావనతో కూడి చరించటం)- (2) ఇతరులకు బాధ కలిగించటకపోవటం (అహింస) (3) ఏదీ కూడా స్వీకరించని బుద్ధి (అపరిగ్రహము)-ఈ మూడు ఏదోవిధంగా జాగరూకులై సముపార్జించుకోండి. అవి రక్షాకవచము.

సత్యమును ఆశ్రయించి ఉండటం – కొరకే శాస్త్ర నియమాలు,

హే పరబ్రహ్మమా! రక్షించండి! అల్ప – స్వల్ప సాంసారిక భావాల నుండి కాపాడండి! బ్రహ్మజ్ఞానమే రక్ష రేకు.

# చతుర్థః ఖండః

**1. అథ అతః**
**పరమహంస పరివ్రాజికానామ్**
**ఆసన – శయనాదికం భూమౌ।**
**బ్రహ్మచారిణామ్**
**మృత్–పాత్రమ్, అలాబు పాత్రమ్**
**దారు పాత్రమ్,**
**వేణు పాత్రమ్ వా ।**
**యతీనామ్ –**
**కామ – క్రోధ – హర్ష – రోష – లోభ**
**– మోహ – మద – మాత్సర్య – దంభ – దర్ప –**
**ఇచ్ఛ – అసూయా**
**మమత్వ – అహంకారాదీనామ్ అపి పరిత్యజేత్।**

ఓ ఆరుణీ!

ఇంతమాత్రమే కాదు. పరమహంస - పరివ్రాజక ధర్మముల గురించి ఇంకా కొన్ని విశేషాలు ఇప్పుడు చెప్పుకుంటున్నాం.

భూమిమీదనే కూర్చోవటం, పడుకోవటం నిర్వర్తించటము. నేలపైనే ఆసన - శయనములు మొ॥వి కలిగి ఉండు.

**బ్రహ్మచారులు - యతులు**

మట్టిపాత్రగాని, సొరకాయ బుర్రపాత్రగాని, దారువు (కొయ్య) పాత్రగాని, వేణుపాత్రగాని ఉపయోగించుకోవాలి.

<u>సాధకులు వదలవలసినవి</u>

(1) ఏదో కావాలి. ఇంకా పొందాలి - అనే **కామము.**

(2) "వారి వీరి సంగతి చూడాలి. హానిచేయాలి." మొదలుగాగల కోప, కసి, **క్రోధమును.**

(3) లౌకిక సందర్భ, సంఘటన, సంబంధములపట్ల **హర్షము.**

(4) "వారు నన్ను అట్లా అన్నారే? ఇట్లా చూచారే!" - అనే **రోషము.**

(5) "నాది - నేను దాచుకోవాలి ఎవ్వరికీ ఇవ్వను" - అనే **లోభము.**

(6) "ఈ దృశ్యము నిజము, శాశ్వతము" - అనే **మోహము.**

(7) "ఇవి ఎట్లాగైనా సరే పొందాలిసిందే" - అనే **మదము, కోరిక.**

(8) "వీరిని నేను ఎట్లాగైనా బాధించాలి" - అనే **మాత్సర్యము.**

(9) "వీరంతా అల్పులు, నేను గొప్ప. గొప్పగా కనబడాలి" - అనే **దంభ దర్పములు.**

(10) "ఇవన్నీ పొందవలసిన వస్తువులు - నాకు ఇష్టం కాబట్టి" - అనే **ఇచ్ఛ.**

(11) "వారు బాగుపడకూడదు" - అనే **అసూయ.**

(12) "ఇవన్నీ నావే కదా" - అనే **మమకారము.**

(13) "నా అంత గొప్ప ఎవరూ లేరు" అనే **అహంకారమును**

**మొదలైనవన్నీ మొదలంట్లా యతి అవగోరువాడు త్యజించి ఉండాలి!**

---

**2. వర్షాసు ధ్రువశీలో,**
**అష్టౌ మాస్య ఏకాకీ**
**యతి శ్చరేత్**
**ద్వావేవ ఆచరేత్।**
**ద్వావేవ ఆచరేత్ ॥ఇతి॥**

యతి - ఇంకా వర్షాకాలంలో చాతుర్మాసశీలుడై ఉండాలి. ఆ నాలుగు నెలలు <u>ఒక్కచోటే</u>, నలుగురుతో కలసి - సత్సంగము మొదలైనవి నిర్వర్తించాలి. (లేదా) కనీసము రెండు నెలలన్నా ఒక్కచోటే గడపాలి. (ద్వైమాస్యము)

మిగతా '8' నెలలు ఏకాకిగా, ఒకేచోట ఉండకుండా సంచారాలు చేస్తూ ఉండాలి. ఈ విధంగా 'చోటు'కు సంబంధించిన మమకారము త్యజించి ఉండాలి.

# పంచమః ఖండః

1. స ఖలు వేదార్థమ్ యో విద్వాన్,
స ఉపనయనాత్ ఊర్థ్వమ్
ఏతాని ప్రాగ్వా త్యజేత్।।

ఉపనయనము కొరకై గురువు దగ్గర వేదార్థములను అర్థం చేసుకొనినవాడు అగుదువుగాక। (ఉపనయనము = అనేకముగా కనిపిస్తున్న దానిలో ఏకము ఆత్మగా అనిపించు దృష్టి Unity is the Diversity) (బ్రాహ్మీదృష్టి).

2. పితరం, పుత్రమ్, అగ్నిః, ఉపవీతం,
కర్మ, కళత్రం చ అన్యత్ అపి
ఇహ యతయో హి భిక్షార్థమ్
గ్రామమ్ ప్రవిశంతి, -
పాణిపాత్రమ్ ఉదర పాత్రం వా।।

ఉపనయన సంస్కారము తరువాత నిజస్వరూపమగు బ్రహ్మమును మాత్రమే ఆశ్రయించిన వాడవై ఉండెదవుగాక! ఇతఃపూర్వపు సర్వ "గుణ-సంబంధ-స్వభావములను" త్యజించినవాడై ఉండుము.

సన్న్యాసాశ్రమము స్వీకరించువాడు.

- తండ్రిని, కొడుకులను, లౌకికాగ్నిని ఉపవీతము (యజ్ఞోపవీతమును) (జందియము, జందెము, జంధ్యము)ను, వైదిక లౌకిక కర్మలను, ఇల్లు - ఆరామ- సంపద - ఆస్తిపాస్తులను త్యజించాలి.

యతులు - చేతిలో భిక్షపాత్రను ధరించి భిక్ష కొరకై గ్రామ గ్రామములు ప్రవేశించి తిరుగుతారు. "ఈ పొట్టయే నాకు భిక్షపాత్ర" అని భావిస్తూ ఉంటారు. పొట్టను చేతధరించిన భిక్షకపాత్రగా భావన చేస్తారు.

---

3. ఓం హి। ఓం హి। ఓం హి। ఇతి
ఏతత్ ఉపనిషదమ్ విన్యసేత్।
4. ఖలు ఏతత్ ఉపనిషదమ్ విద్వాన్
య ఏవమ్ వేద।

ఈ కనబడేదంతా ఓంకారమే। (ఈ జగత్తు ఈజీవులు, ఈ ద్రష్ట, ఈ దృశ్యము...ఓంకారమే) అనే ఉపనిషత్ అర్థమును భావిస్తూ, సర్వమును "అస్మత్ ఓంకార రూపదేహముయొక్క అభిన్నమగు అంతర్విభాగమే" అని భావించాలి.

ఎవడైతే సర్వము ఓంకారముగా భావిస్తూ, తాను ఓంకారస్వరూపుడనేనని ఎరిగి ఉంటాడో....ఆతడే విద్వాంసుడు.

---

5. పాలాశం బైల్వ
మౌదుంబరమ్
అశ్వత్థమ్ దండమ్
మౌంజీమ్, మేఖలామ్
యజ్ఞోపవీతం చ త్యక్త్వా శూరో
య ఏవం వేద।।

**ఆ యతి....**

మోదుగ - బిల్వ - రావి - మేడి కర్రతో చేసిన దండమును, కృష్ణాజినమును, (ముంజగడ్డిని పేని తయారుచేసుకొన్న మొలత్రాడును), యజ్ఞోపవీతమును కూడా త్యజించి....

→ సాధించవలసినది సిద్ధించిన తరువాత సాధనములను త్యజించు తీరుగా, అన్నీ తనయందు ఏకం చేసుకొను ఆత్మనే ఎరుగుచున్నాడు. ఆత్మత్వము వహించి అన్నీ త్యజిస్తున్నాడు. మౌని అయి విరాజిల్లుచున్నాడు. శూరుడై యజ్ఞోపవీత ధారణ నియమును కూడా త్యజించినవాడై (అతీతుడై) ఉంటున్నాడు.

---

6. తద్విష్ణోః పరమమ్ పదగ్ం
సదా పశ్యంతి సూరయః
దివీవ చక్షుః ఆతతమ్
తత్ విప్రా సో విపన్యవో
జాగృవాగ్ం సః సమింధతే
విష్ణోః యత్ పరమమ్ పదమ్।। ఇతి।।

పరమపదమగు విష్ణువునే అట్టి శూరులు సదా, సర్వదా, సర్వత్రా సందర్శిస్తున్నారు. దివ్యచక్షువులతో దర్శించి విష్ణుసాయుజ్యము పొందుచున్నారు.

ఎవ్వరైతే మాయానిద్ర నుండి జాగృతులై, కామ - క్రోధ రహితులై, నిర్మల హృదయులై ఉంటారో-అట్టివారు నిర్మల పదము అగు విష్ణుదేవుని అంతటా అన్నీగా దర్శించగలరు. **ఆయనయే అందరికీ చేరవలసిన పరాకాష్ఠ!** ఆయనయే నీవు. ఆయనయే నేను. ఆయనయే ఈ జగత్తు.

---

7. ఏవమ్ నిర్వాణ -అనుశాసనమ్।
వేద-అనుశాసనమ్।
వేదానుశాసనమితి।।

ఇది మోక్షశాస్త్రము (నిర్వాణశాస్త్రము) యొక్క - వేదములు చూపిస్తున్న - సశాస్త్రీయ సూచితమైన మార్గము। వేదానుశాసనమ్ । నిర్వాణానుశాసనమ్।

**ఇతి ఉపనిషత్**
**ఆరుణికోపనిషత్**

**ఇతి - ఆరుణికోపనిషత్**
**ఓం శాంతిః శాంతిః శాంతిః**

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 2 ఆరుణికోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



## శాంతి పాఠమ్

ఓం

ఆప్యాయన్తు మమ అంగాని,

వాక్ - ప్రాణః - చక్షుః - శ్రోత్రమ్,

అథో బలమ్ - ఇంద్రియాణి చ సర్వాని।

సర్వం బ్రహ్మోపనిషదమ్।

మా అహమ్ బ్రహ్మ నిరాకుర్యామ్।

మా మా బ్రహ్మ నిరాకరోత్।

అనిరాకరణమ్ అస్తు।

అనిరాకరణం మే అస్తు।

తత్ ఆత్మని, నిరతేయ

ఉపనిషత్సు ధర్మాః

తే మయి సన్తు।

తే మయి సన్తు।

ఓం శాంతిః శాంతిః శాంతిః

వేదములలో అంతర్విభాగమైయున్న ఉపనిషత్తులు ప్రతిపాదిస్తున్న పరబ్రహ్మతత్త్వముయొక్క హృదయస్థము కొరకై ఆ పరమాత్మ నాయొక్క అంగములను, వాక్కును, పంచప్రాణములను, కనులను, కనబడువాటిని, చెవులను, వినుచున్నవాటిని, (ఇంకా కూడా) బలమును, పట్టుదలను, తదితర ఇంద్రియములన్నిటినీ - మృదుమధురముగా, ఆప్యాయముగా తీర్చిదిద్ది పరిరక్షించునుగాక। పరిపోషించునుగాక - అని ఉపాసిస్తున్నాను.

- నాయొక్క అల్ప సాధనలను, అల్పమైన తెలివితేటలను, అల్పకర్మలను 'తల్లి'వలె పరదేవత క్షమించునుగాక!

ఆ బ్రహ్మము నన్ను నిరాకరించకుండునుగాక!

- నేను ప్రాపంచిక దృష్టులలోను, అభిప్రాయములలోను ఇరుక్కొని, బద్ధగించకుండెదనుగాక। బ్రహ్మమునకు సంబంధించిన సమాచారమును నిరాకరించకుండెదనుగాక।

బ్రహ్మతత్త్వమునకు నా పట్ల ఎల్లప్పుడు ఆదరణయే కలిగి ఉండునుగాక! నేను బ్రహ్మముపట్ల నిరంతరము. ఆదరణయే కలిగి ఉండెదను గాక!

ఉపనిషత్ ప్రబోధిస్తున్న బ్రహ్మముయొక్క ధర్మములు నా హృదయమందు సుస్థిరమై ప్రకాశించునుగాక!

నా జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు అనన్యత్వమును త్యజించి
అనన్యమగు బ్రహ్మభావనారూపము సంతరించుకొనుగాక!

## ప్రథమః ఖండః

'ఓం' సర్వాత్మకుడు – సర్వతత్త్వస్వరూపుడు – సర్వతత్త్వ విదూరుడు అగు **"ఓంకార సంజ్ఞాస్వరూప పరమాత్మ"**కు నమస్కరించుచున్నాము.

ఒకానొక సందర్భములో....,

ప్రజాపతి కుమారుడు, మహాప్రజ్ఞావంతుడు, లోక కళ్యాణ మహదాశయుడు...అగు **శ్రీ ఆరుణి మునీంద్రులవారు** బ్రహ్మలోకము సందర్శించటం జరిగింది. పితృదేవులగు ప్రజాపతిని సమీపించి త్రిప్రదక్షిణములు – సాష్టాంగదండ ప్రణామములు సమర్పించారు.

**ఆరుణి మునీంద్రుడు :** హే భగవన్! పితృదేవా! సృష్టి స్థితి లయకారకా! ప్రజాపతీ! సద్గురు వరేణ్యులగు మిమ్ములను అస్మత్ ధర్మ–సందేహములను తొలగించుకోవటానికి సదవకాశము ప్రసాదించప్రార్థన.

**'త్యాగేనైవతు కైవల్యమ్' – "సర్వము త్యజించటం చేతనే కైవల్యము లభించగలదు"** అని ముక్తపురుషులగు మహానుభావులయొక్క (మరియు) వేదవాఙ్మయము యొక్క ఆప్తవాక్యము కదా! మరి సర్వకర్మలను మొదలంట్లా, అశేషంగా త్యజించే తీరు ఏది? ఏ విధంగా?...ఇది నాకు దయతో బోధించండి.

**శ్రీ ప్రజాపతి** : అవును నాయనా! త్యాగే నైవత్ కైవల్యమ్। 'త్యజించటము' చేతనే ఈ జీవునికి కైవల్యము లభిస్తోంది. వేరే త్రోవ లేదు. 'నాది' – అనునదే సంసార బంధము. (నాటకములోని నటుని క్రియలు పాత్రధారునికి చెందని తీరుగా) **'నాది కాదు'**....అని ఎరుగుటచేత, త్యజించి ఉండటంచేత బంధవిముక్తి జరుగగలదు. అందుచేత నీవు చెప్పినట్లు, **కర్మాణి అశేషతో విస్పృజామీతి** – కర్మలన్నీ అశేషంగా వదలి ఉండటమే ఉపాయము. నీయొక్క పుత్రులను, సోదరులను, తదితర బంధువులు – మిత్రులు – అయిన వాళ్ళు – కానివాళ్ళు – ఇష్టమైనవాళ్లు – అయిష్టమైన వాళ్లు, ఇవన్నీ కూడా **వదలి వేసినవాడవై ఉండెదవుగాక!** అనగా వారి నందరినీ **స్వస్వరూపాత్మగా సందర్శించెదవు గాక!** నాటకములో పాత్రధారుడు బంధువులను కలిగి ఉండి కూడా **"వీరు నా బంధువులు కాదు"** అని ఎరిగియే ఉంటాడు కదా!

అంతేకాదు!

**శిఖను, యజ్ఞోపవీతమును, "యజ్ఞ – యాగములు నిర్వర్తించకపోతే ఎట్లా?" అనురూపముగల ఆదుర్దా – ఆవేశ – ఆశయాలను, వేదమంత్ర పఠనములను** కూడా **అకర్త – అభోక్త** భావనాసమన్వితుడవై వదలి ఉండెదవు గాక!

ఈ సృష్టిలో కనిపిస్తున్న

- **భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనోలోక, తపోలోక, సత్యలోక**.... నామములతో ప్రసిద్ధమైయున్న **ఊర్ధ్వసప్తలోకములను....,**
- **అతల – వితల – సుతల – పాతాళ – రసాతల – తలాతల – మహాతల**...పేర్లుగల **అధోసప్త లోకములను,**

....ఈ 14 లోకములతో కూడిన బ్రహ్మాండమునంతా విడిచిపెట్టియే చరిస్తూ ఉండు. "అవన్నీ నాయందు లేవు. నేను వాటియందు లేను" – అను "అసంగ, అతీత" భావనను మననము చేస్తూ ఉండు.

ఎందుకంటే, ఈ జీవుడు బహుదూరపు బాటసారియై, ఈ 14 లోకాలలో అనేక ఉపాధులు పొంది పొంది, వాటివాటి సంబంధితమైన అనేక సంస్కారపరంపరలు అంతరంగమున పేర్చుకొని ఉన్నాడు కాబట్టి, వాటిని ఇప్పుడు వదిలించుకోవాలి. ఈ 14 లోక సంగతులను, సమాచారములను భ్రమ మాత్రంగా అర్థం చేసుకొని.... వాటిని బుద్ధితో వదలినవాడై **'బంధవిముక్తి'**ని **ఆశయముగా కలవాడై ఉండటము సముచితము, అత్యవసరము కూడా!**

లోకమర్యాద కొరకు మాత్రమే – ఒక్క (1) త్రిదండము, (2) అచ్ఛాదనము, (3) కౌపీనము.... ఈ మూడు మాత్రమే కలిగియుండి, ఇక – **శేషమ్ విసృజేత్ – శేషమ్ విసృజేత్**...మిగతా శేషించినదంతా **'నాది కాదు'** అని ఎరిగియే (వదలినవాడవై) ఉండుము.

## ద్వితీయః ఖండః

**ఆరుణి మునీంద్రుడు** : తండ్రీ! మీరు చెప్పిన, **'వదలివేసి ఉండు'**....అనే మాట – ఒక్క సన్న్యాసికి మాత్రమే వర్తిస్తుందా? లేక గృహస్థ – బ్రహ్మచారి – వానప్రస్థ ఆశ్రమవాసులకు కూడానా? మరి లోక విషయాలను త్యజించే పద్ధతి, మార్గము ఏమిటి? విధానమేది? అది ఎట్లా సాధ్యం?

**శ్రీ ప్రజాపతి** : ఒకడు బ్రహ్మచారి కావచ్చు, గృహస్థుడు కావచ్చును, వానప్రస్థుడు కావచ్చును, సన్న్యాసి కావచ్చును గాక! **'సర్వము**

**త్యజించి ఉండటం'** అనునదే మార్గము. **దృశ్యమును దృశ్యముగా త్యజించి ఆత్మభావనతో సందర్శించటమే ఉపాయము.** అదియే అసలైన సన్న్యాసము. అంతేగాని అది (చతుర్విధ) ఆశ్రమ సంబంధమైనది కాదు.

**లోకిగ్నీన్ ఉదరాగ్నౌ సమారోపయేత్ :** లోక సంబంధమైన యాగ - అగ్ని - అగ్ని కార్య సంబంధమైన అగ్నిని **"సర్వదేహాలలో వేంచేసి ఆహారమును రసతత్త్వముగా మార్చే జఠరాగ్ని"...కి సమారోపించబడుగాక!**

**"ఈ బాహ్యాగ్ని - సర్వజీవరక్షకుడు, సర్వాంతర్యామియగు పరమాత్మయొక్క జఠరాగ్ని తత్త్వమే। కనుక పరమాత్మస్వరూపమే"**...అను భావముతో నీవు నిర్వర్తిస్తున్న అగ్నికార్యములన్నీ సమర్పించబడుగాక! (అహమ్ వైశ్వానరో భూత్వా ప్రాణినామ్ దేహమాశ్రితః, ప్రాణాపాన సమాయుక్తమ్ పచామి - అన్నమ్ చతుర్విధమ్ - గీతాచార్యులు)

**గాయత్రీమ్ చ స్వ-వాక్ అగ్నౌ సమారోపయేత్ :**

> **"ఏ వరేణ్యుడగు సవితృ (సత్ - విత్ - ఋత్) పరమాత్మ ఈ భూ - భువర్ - సువర్...మొదలైన సర్వలోకాలను తన చైతన్యస్ఫూర్తితో ఉత్తేజింపజేస్తున్నారో, వెలిగిస్తున్నారో....అట్టి భర్గోదేవుడు (సూర్యభగవానుడు) నా బుద్ధిని ప్రేరేపించు గాక!"**

- అను మంత్రోపాసనను, వాక్ అగ్నికి నా మంత్రఫలముగా సమర్పిస్తున్నాను" - అని భావించు. ఈ విధంగా గాయత్రీ మంత్రజప ఫలమును స్వ-వాక్ అగ్నికి సమర్పించటమగుచున్నది. "ఆ పరమాత్మ నాయందు వాక్ శక్తి స్వరూపుడై ప్రకాశించుచున్నారు కదా!" .....అని భావించటమే, అట్టి సమర్పణ. **"సర్వ శబ్దములు భర్గోదేవ సంప్రదర్శనలే"**....అని భావించటమే - సమర్పించటము అయి ఉన్నది. (పెదిమలు కదలకుండా గాయత్రీ మంత్రోచ్చారణ చేయటము, పరమార్థమును భావన చేయటము - ఇది కూడా **వాక్ అగ్నికి ఆహుతి సమర్పణ**)

**ఉపవీతమ్ భూమావా - అప్సువా విసృజేత్ :** ఏ ఉపవీతమును బ్రహ్మసూత్రముగా ధరించి, "బ్రహ్మమే నేను - అహం బ్రహ్మాస్మి...అని చెప్పటానికే నేను ధరిస్తున్నాను"...అని భావిస్తున్నావో, అట్టి "అహమేవ తత్ బ్రహ్మ" భావనను సుస్థిరం చేసుకో. ఇక భౌతికమైన ప్రత్తితో నిర్మితమైన ఉపవీతముతో (బ్రాహ్మీ భావము సుస్థిరపడినవానికి) వేరుగా పని ఏమున్నది? కనుక ఈ భౌతికమైన యజ్ఞోపవీతము లోకానుకూలముకొరకు ధరించినప్పటికీ, **"ఇద్దానిని నేను భూదేవతకు, అగ్ని దేవునికి సమర్పించుచున్నాను"** అని భావించు. అద్దానిని భూమియొక్క, అగ్నియొక్క మహిమరూపంగా భావించు.

ఈ విధంగా ఉపవీతమును భూమి - అగ్ని - ఉపాసనా పూర్వకంగా త్యజించినవాడవై ఉండు. **"స్వతఃగా భూ - అగ్ని స్వరూపమగు ఓ ఉపవీతమా! నీకు నమస్కారము"**.....అని ఉపాసించు.

**కుటీచరో, బ్రహ్మచారీ - కుటుంబం విసృజేత్ :** (ఒక కుటీరములో నివసించు సన్న్యాసి = కుటీచరుడు)

ఆశ్రమ వ్యవస్థలో ఉండే కుటీరుడుగా గాని, బ్రహ్మచారిగా గాని ఉంటే తల్లి - తండ్రి - భార్య - పిల్లలు. ఇటువంటి సర్వసంబంధములు మొదలే త్యజించిఉండు. అనగా, **"భార్య, తల్లిదండ్రుల, పిల్లల, తదితర సర్వ బంధువుల, సంబంధీకుల, అసంబంధీకుల రూపముగా ఉన్నది - ఓ పరబ్రహ్మమా! మీరే కదా!"** అని భావిస్తూ, వారి - వారితో సంబంధములను, వారి వారి పట్ల ధర్మములు బ్రహ్మోపాసనగా తీర్చిదిద్దుకోవాలి! భావించాలి!

**పాత్రం విసృజేత్ :** భిక్షుకుడివి - సన్న్యాసివి అయి 'పాత్ర'ను కూడా విసర్జించివేయి. చేతిలో ధరించిన భిక్షకపాత్రను **"ఇది బ్రహ్మముతో మమేకత్వము కొరకై ధ్యాన - ఉపాసనా - సాధన వస్తువు కదా"** - అని భావించటమే - త్యజించటము ("ఈ జగత్తులో నా పాత్ర భగవత్ సంకల్పమే"....అనునదియే పాత్ర త్యాజ్యము). (జగత్తులోని మన పాత్రను (Our Role) జగజ్జనినికి సమర్పణగా నిర్వర్తించటము - పాత్రను విసృజించటముగా చెప్పబడుతోంది)

**పవిత్రం విసృజేత్ :** పితృకార్యములు మొదలైన ఆయా సందర్భములలో 'పవిత్రము' రూపముగా (సంజ్ఞగా) ఉంగరపు వ్రేలుతో ధరించే దర్భ ఉంగరమును కూడా త్యజించి ఉండుము. సన్న్యాసాలంకారములగు కాషాయ వస్త్రములు, విభూతి, కుంకుమ వంటి అలంకార ప్రదర్శనములు కూడా త్యజించినవాడవగుదువు గాక! **"ఇవన్నీ పరమాత్మతత్త్వ సంజ్ఞలు. కనుక పరమాత్మాలంకారములేగాని, నావికావు!"**... అని భావించు. వాటివాటి గూడార్థములను (ఉద్ధరిణ, పంచపాత్ర, పవిత్రము, ఉత్తరీయము, పంచి... మొదలైన) ఉపాసనా ఉపకరణముల అంతరార్థమును ధారణ చేయి. బాహ్యరూపములను వదలి ఉండి.

**దండాన్ లోకాన్ విసృజేత్। :**

తులసి దండలు, రుద్రాక్ష దండలు, పూదండలు.... ఇటువంటివి వదలి ఉండు. కర్ర సంబంధమైన త్రిదండమును కూడా వదలి ఉండు. (**రుద్రాక్ష** = సర్వము ఆత్మయందు లయము చేయు దృష్టి; **పూదండ** = జగద్దృశ్యమును మాలవలె అలంకారముగా

భావన; **త్రిదండము** = త్రిగుణములు, త్రికాలములు, త్రి-అవస్థలు ఉపకరణములుగా భావించటము. అట్టి **'అంతరార్థభావన'**ను ధారణ చేయటము.

**ఆరుణి మునీంద్రులు** : స్వామీ! పితృదేవా! హే ప్రజాపతీ! ఆ విధంగా మీరు చెప్పినట్లు త్యజిస్తూ.....ఇక ఆశ్రయించవలసినది దేనిని? ఏఏ నియమ - విధానములు కలిగి ఉండాలి?

**శ్రీ ప్రజాపతి**: ఇక, భౌతికమైన మంత్ర నియమాలు త్యజించియే, మంత్ర - మంత్రార్థముల (వాటి వాటి అంతరార్థముల) ఉపాసనగా అత్యంత జాగరూకుడవై అనుసరించాలి. **ఊర్ధ్వమ్ అమంత్రవత్ ఆచరేత్.** పైకి మననరూప - మంత్రోపాసనా ఔన్నత్యాలు కలవానివలె కనబడుచూనే,.... మనస్సును నియమించు. ఇష్టదైవ తత్త్వముగురించిన మననపరుడై ఉండాలి. **పైపై భేషజాలు త్యజించి ఉండి...., లోన ఉపాసన కొనసాగించు.** అట్లాగే, **ఊర్ధ్వగమనమ్ విసృజేత్।** "ఊర్ధ్వలోకాలు పొందాలి. స్వర్గ - ఇత్యాది సుఖలోకాలు చేరెదనుగాక"...అనే ఆశయములనన్నిటినీ త్యజించినవాడవై ఉండు! "సమస్తము పరమాత్మయే అయి ఉండగా, ఆయన కొరకై ఎక్కడికి వెళ్ళాలి? ఎప్పటికో చూడటమేమిటీ? - అనే ఆత్మదర్శనము అభ్యాసము చేయి.

**ఆహారము** : 'ఆకలి' అనే వ్యాధియొక్క ఉపశమనము కొరకు మాత్రమే ఔషధము (Medicine) వలె ఆహారమును స్వీకరించాలి. **ఔషధవత్ అశనమ్ ఆచరేత్!** అంతేగాని "నాకు ఇది ఇష్టము. అదియే ఇంకా తినాలి"....ఇటువంటి రుచి - ఇష్టములకు ఆహారము విషయమై వశుడవై ఉండరాదు. 'ఇంద్రియములకు రుచి కదా' అనే రూపంగా పరుగులు తీస్తూ, ఆత్మభావన నుండి 'చ్యుతి'ని ఆహ్వానించవద్దు.

## త్రిసంధ్య ఆదౌ స్నానమ్ ఆచరేత్ :

త్రివేణీ సంగమస్థానమగు....

- గంగా-యమునా - సరస్వతుల లయస్థానము (లేక) భృకుటి మధ్య - నాశికా ఊర్ధ్వ బిందు స్థానమగు "ఆజ్ఞాచక్ర" బిందు స్థానములో ప్రవేశించి పరబ్రహ్మమును ఉపాసించు.
- అట్టి ద్రష్ట - దర్శనము - దృశ్యముల లయ స్థానమే త్రిసంధ్య స్థానము. అట్టి **సంధ్యోపాసన చేయుచుండెదవుగాక!**
- భావము - భావముల మధ్య భావనారహితమగు, నిర్విషయ స్థానమగు "సంధ్యా స్థానము"లో ద్రష్ట - దర్శన - దృశ్య భేదభావముల పరిశుభ్రము కొరకై స్నానము ఆచరిస్తూ ఉండు.

గృహస్థులు, బ్రహ్మచారులు ప్రాతః - మధ్యాహ్న - సాయంత్ర సంధ్యా సమయాలలో ఉపాసనలకొరకై స్నానం నిర్వర్తిస్తారు కదా! **సంధిం సమాధావ ఆత్మని ఆచరేత్! "ఇక్కడి ద్రష్ట (నేను) - దర్శనము (నాచూపు) - దృశ్యము (నాకు ఇంద్రియములకు అనుభూతమై తారసబడుచున్నది)....ఈ మూడూ ఆత్మస్వరూపమే!"**....అను త్రివేణీ సంధి స్థానములో ఆత్మోపాసకుడవై జగత్ విషయములపట్ల మౌనము వహించి ఉండు. ఆత్మ భావనా ఏకాగ్రతతో కూడిన సమాధి అభ్యాసము (లేక) ధారణను ఆచరిస్తూ ఉండెదవుగాక। "ఆత్మయే సమస్త జగత్తుగా, సకల జీవులుగా ప్రదర్శనమగుచున్నది" అనునదే **"సంధి సమాధాన ఆచరణము".**

**సర్వేషు వేదేషు ఆరణ్యకమ్ ఆవర్తయేత్! ఉపనిషదమ్ ఆవర్తయేత్।**

- వేదముల చివరగా 'వేదాంతము'గా చెప్పబడుచు,
- పరమాత్మయొక్క అతి సామీప్య ప్రవచనార్థములు, అనుభవరూపములు, ఆత్మతత్త్వమును ఆశ్రయించాలి. తపస్సుచే ఎరిగినట్టి బ్రహ్మజ్ఞుల బ్రహ్మముయొక్క అభివర్ణనములను, మార్గదర్శకములు అగు ఆరణ్యకములను, ఉపనిషత్తులను పరిశీలించాలి. ఎల్లప్పుడు పఠించాలి। అర్థం చేసుకోవాలి। తదర్థమును ఆచరించాలి। వాటియొక్క మహదార్థమును మనోగతం కావాలి. అట్టి దృష్టిని పావనము, నిశ్చలము చేసుకొంటూ, జగత్తును దర్శించాలి.

## తృతీయః ఖండః - ఆత్మారాధన

ఇక...,

**ఖలు అహమ్ బ్రహ్మ** → నేను బ్రహ్మమునే (స్వతఃగా, సహజముగా) అయి ఉన్నాను (సందర్భముగా జీవాత్మను కూడా)।

**సూచనాత్ సూత్రమ్** → బ్రహ్మముయొక్క తత్త్వమును సూచించునది సూత్రము.

**బ్రహ్మసూత్రమ్** → 'నేను బ్రహ్మమునే' అని సూచిస్తున్నదే సూత్రము.

**అహమేవ విద్వాన్** → ఇదంతా కూడా **"తెలుసుకొనబడునది + తెలుసుకొనువాడు"**... ఈ రెండింటి **సమావేశమే।**

తెలుసుకొనుచున్న నేను బ్రహ్మమే! బ్రహ్మమే స్వరూపముగల నాయందే 'తెలియబడునది', అనే సూత్రము ఉండిఉన్నది.

**అస్మత్ బ్రహ్మసూత్రధారణయే ఈ జగత్తు!**

ఈ విధంగా **ఎరుగుట - ధారణ** చేసి ఉండటమే **'బ్రహ్మసూత్రధారణ'**! (1) తెలుసుకొను నేను (2) తెలివి (3) తెలియబడునది.... ఈ మూడూ కూడా అఖండబ్రహ్మమే! ఇటువంటి **'నేనే బ్రహ్మమును! ఇదంతా బ్రహ్మమగు నేనే"**.... అను ధారణను ప్రవృద్ధం చేసుకుంటూ,.... ఇక ఈ 'త్రివృత్' భౌతికసూత్రమును వదలివేయాలి! మనస్సుతో త్యజించియే ఉండాలి. 'ఉపవీతము'ను **'బ్రాహ్మీభావనా సంజ్ఞ'**గా ఉద్దేశించాలి.

బ్రహ్మమునకు వేరుగా అనిపించేది బ్రహ్మమునందు లయం చేస్తూ రావాలి. అన్యమంతా 'అనన్యము' అగు ఆత్మయందు లయింపజేయువాడు (లేక) ఆత్మకు అనన్యముగా (ఆత్మకు వేరుకానట్లు, సర్వము ఆత్మయే - బ్రహ్మమే అయి ఉన్నట్లు)... దర్శించువాడే **విద్వాంసుడు.**

**త్యజేత్ విద్వాన్, అన్య - ఏవమ్ వేద!** జగత్తును జగత్తుగా త్యజించి, బ్రహ్మముగా దర్శించు అనన్య భావనా సంపద గలవాడే విద్వాంసుడు. ఎరుగవలసినది ఎరిగినవాడు.

"సన్యస్తం మయా। సన్యస్తం మయా। సన్యస్తం మయా।"

(మయా-నాయొక్క; సత్-న్యస్తం = సత్ చమత్కార భావనయే)

**"ఈ దృశ్యము - జగత్తు - విశ్వము.... ఇదంతా కూడా సత్ స్వరూపుడనగు నాయొక్క స్వరూప ధారణ - భావనయే!"**..... అని త్రి సమయములందు, త్రి లోకములందు, త్రి అవస్థలయందు, త్రి సంధ్యలయందు, (భూత-వర్తమాన-భవిష్యత్ కాలములను, పాతాళ - భూ - స్వర్గలోకములను, జాగృత్ స్వప్న - సుషుప్తులను, ప్రాతః - మధ్యాహ్న - సాయం సంధ్యా స్థానములందు).... ధారణ చేయాలి. ఇదియే **"సూత్ర యజ్ఞోపవీతధారణ", "త్రిసంధ్యోపాసన"** కూడా!

**అంతా బ్రహ్మమే। నేను బ్రహ్మమును। నాకు వేరుగా ద్రష్ట - దృశ్యము - దర్శనములనబడేవి లేవు. నాకు వేరుగా నేను - నీవు - ఆతడు... అనునవి లేవు. కర్త - కర్మ - క్రియ లేవు! తత్ - త్వమ్ - అహమ్ రూపమంతా బ్రహ్మమే।**

నాయొక్క బ్రాహ్మీ తత్త్వము చేతనే అవన్నీ ఉన్నట్లుగా నాచే కల్పించబడి, ఆస్వాదించబడుచున్నాయి.

ఈ సర్వము నేనే! ఈ సర్వమునకు సాక్షినై వేరే కూడా నేనే!

**ఉభయం మయ్యేతి** → జీవాత్మను - పరమాత్మను, ఇహస్వరూపమును - పరస్వరూపమును నేనే!

**మత్తః సర్వమ్ ప్రవర్తతే** → నా వలననే ఈ సర్వము ఈ రీతిగా ప్రవర్తితమగుచున్నది..... అనునదే సత్-న్యాసము (లేక) సన్న్యాసము.

**ఆత్మయే ఆరాధనా వస్తువు। ఆత్మయే ఆరాధన। ఆత్మయే ఆరాధించుచున్నవాడు।**

ఇదియే త్రిసూత్ర సన్న్యాసము. అంతేగాని, దూది నిర్మిత జంధ్యమును (యజ్ఞోపవీతము)ను సన్న్యసించినంత మాత్రంచేత అది 'మయా సన్యస్తస్థితి' కాదు సుమా! కాషాయ వస్త్రధారణ సన్న్యాసమునకు అభ్యాసవిధానమేకాని, వాస్తవమైన సన్న్యాసము కాదు. ఆ **"మయా సన్న్యాసీ"** భావన ఆశ్రయించు యోగి ఇంకా కూడా ఇట్లా భావన - నిర్ద్వంద్వమగు అవగాహన కలిగి ఉంటున్నాడు.

**ఓ బ్రహ్మదండమా! త్రిదండమా!**

- నీవు నాకు **శాస్త్రములు - మహనీయులు చూపు మార్గములో సహకరించే సాధనోపకరణములకు 'సంజ్ఞ'వు.** నీకు నమస్కరిస్తున్నాను.
- **సఖా మా గోపా సఖా యో అసి।** ఓ దండమా! నీవు నా బ్రాహ్మీతత్త్వభావన కొరకై నేను చేయు సాధన మార్గములలో సాధనరూపుడవు। ప్రియ బ్రహ్మదండమా! నేను నిన్ను చేతిలో ధరించి సంసార భావాలు నన్నుజేరకుండా దుష్ట జంతువులను త్రోలినట్లు - **నీ సహాయంతో - అల్ప-సంకుచిత-దుష్ట భావములను త్రోలివేయగలుగుచున్నాను.**

*అందుచేత ఓ దండమా! నీవు నాకు సఖుడవు! మిత్రుడవు సుమా!*

**శ్లో॥ సఖా మా గోపా, యోజః సఖా, యో అసీ ఇంద్ర స్య వజ్రోఽసి**
**వార్త్రఘ్న శర్మ మే భవ। యత్ పాపమ్ తన్నివారయేతి॥**

- అట్టి ఆత్మభావముల రక్షకుడుగా నిన్ను నేను స్వీకరిస్తున్నాను. నీవు నాకు ఇంద్రుని చేతిలోని వజ్రాయుధమువలె అయి,- నన్ను దుష్ప్రవృత్తులనుండి, కోప- తాపములనుండి నన్ను రక్షించెదవు గాక! ఓ దండమా! ఇంద్రవజ్రాయుధము వృత్రాసురుని నిరోధించినట్లు నన్ను అల్ప - పాప - దోష - బద్ధక - ద్రోహ వృత్తుల నుండి ఎల్లప్పుడూ కాపాడు!

పైన చెప్పిన "సఖమా..." మంత్రమును చదువుచూ మంత్రార్థమును భావన చేస్తూ

– దండము, కౌపీనము (వస్త్రము, గోచి) ధరించుము. వాటిని భౌతికంగా త్యజించియే ఉండుము.

**– ఔషధవత్ అశనం ప్రాశ్నీయత్।** ఔషధమువలె (ఆరోగ్యము కొరకై మింగే మందువలె) ఆహారము స్వీకరించాలి. ఏది ఆహారంగా ప్రాప్తిస్తే **"మహాప్రసాదం। అన్నపూర్ణ దేవత ఈ దేహోపకరణమును సంరక్షించునుగాక!"**...అని భావించి భుజించాలి.

**"బ్రహ్మమునందే నేను బ్రహ్మమునై చరిస్తున్నాను"**...అనే నిర్మల–ఉత్తమబుద్ధి–కొరకై, (బ్రహ్మచర్యము–కొరకై)–బ్రహ్మమును ఉపాసించాలి.

**అహింసాం చ। అపరిగ్రహం చ।** → అహింస–**"ఎవ్వరికీ బాధ కలిగించకుండెదనుగాక! అంతా బ్రహ్మమే అయి ఉండటంచేత ఎవరికి ఏ బాధ కలిగించినా కూడా...అది నన్ను నేను బాధించుకోవటము వంటిదే కదా!"** – అను స్వాత్మ – తత్త్వ భావన కలిగియుండు. సర్వదా దేనినీ పొందనివాడవై ఉండు. 'ఇది నాది' అని దేనినీ పరిగ్రహించకుండెదవు.

**– సత్యం చ యత్నేన**→ అసత్యమును – సందర్భ మాత్ర సత్యమును అతిక్రమించినవాడవై, **"అఖండము – సహజము – నిత్యము అగు పరమ సత్యము కొరకే సర్వకర్మలు – కార్యక్రమములు, ధారణలు ఉద్దేశ్యించెదనుగాక!"**....అని నీవు నిర్ణయించుకో!

-----

ఓ జనులారా! స్వస్వరూప పరబ్రహ్మ సాక్షాత్కారమునకై ఉపాయాలు చెప్పుచున్నాను...వినండి.

**బ్రహ్మ చర్యం చ....!**

మీరు బ్రహ్మచర్యమును ఆచరించండి.

- ఈ సర్వము బ్రహ్మమే!
- నాయొక్క సహజరూపము బ్రహ్మమే!
- నాకు తారసపడుచున్న సర్వజీవుల సహజరూపము కూడా సర్వదా బ్రహ్మమే!
- ఈ విశ్వము బ్రహ్మమే

**బ్రహ్మమే సహజస్వరూపముగా కలిగియున్న నేను – బ్రహ్మమే స్వరూపముగాగల ఈ విశ్వజగత్తునందు, బ్రహ్మమే స్వరూపముగా కలిగినట్టి సహజీవులతో కూడి – బ్రహ్మమునందు సంచరిస్తూ ఉన్నాను.**

అను అవగాహనా జీవనమే **"బ్రహ్మచర్యము".**

**మరల చెప్పుచున్నాను -**

**అహింసా చ :!** అహింసా స్వభావులై, అహింసను వ్రతముగా స్వీకరించి ఉండండి. **"సర్వము పరబ్రహ్మమే కనుక, ఎవరినైనా మనో – వాచా – కర్మణా బాధించటము నన్ను నేను బాధించుకోవటమే గదా!"** – అనునది దృష్టిలో కలిగి ఉన్నవారు తత్త్వశాస్త్రార్థమును (త్వమ్–తత్ అసి) అభ్యసించి బ్రహ్మభావమునకు అర్హులు కాగలరు.

**అపరిగ్రహం చ** : "ఈ జగత్తులో ఏదీ నాది కాదు. అంతా పరమాత్మదే! పరమాత్మ దేహము ప్రసాదించుటచే ఈ దేహము ఆయనదే! ఆహారము పరబ్రహ్మ ప్రసాదితము. అట్లాగే సర్వవస్తువులు కూడా (బడికి వెళ్ళిన బాలుడు చదువుకోవటానికి, విజ్ఞుడవటానికే తరగతి గది, కుర్చీ, బెంచీలు ఉపయోగించుకోవాలి. అంతేగాని పాఠశాలలో ఏదీ ఆతనిది కాదు కదా!)" – నావికావు – అనునది **"అపరిగ్రహము".**

ఈ జీవుడు సృష్టిలో విద్యార్థియే! **విశ్వమే విద్యాలయం!** ఇది విశ్వవిద్యాలయము(This Universe is 'University'). అందుచేత ఏదీ పరిగ్రహించనివారై 'నాది' 'నాది'... అని భావించక, సర్వము పొందండి. ఆస్వాదించండి. (తేన–త్యక్తేన భుంజీదా)! అపరిగ్రహులై ఉండండి.

**సత్యం చ** : ఈ ఇంద్రియ దృశ్య వ్యవహారమంతా కూడా సందర్భముచే మాత్రమే సత్యము. భావనచే మాత్రమే సత్యము. మనో కల్పితములగు సంబంధ – అనుబంధ – బాంధవ్య – ఆశ – అభిప్రాయములచే మాత్రమే సత్యము. కల్పన....అయిన దానినంతా అధిగమించండి. వాస్తవమగు ఆత్మను మాత్రమే పరిగ్రహించండి.

గురు – శాస్త్ర పాఠ్యాంశ పారాయణులై **అసత్తును** అధిగమించి **పరమ సత్యమునే** ఆశ్రయించండి!

**యత్నేన** : (శరణాగతి యోగము) : పరబ్రహ్మ సాక్షాత్కారమునకై సర్వదా ప్రయత్నశీలురై ఉండండి. సర్వాత్మకుడగు పరమాత్మను **హే రక్షత! హే రక్షత! హే రక్షత!** – అని శరణువేడండి! మీరు అప్పుడు తప్పక స్వయముగా బ్రాహ్మీ స్వరూపులై ప్రకాశించగలరు.

## చతుర్థః ఖండః

**శ్రీ ప్రజాపతి** : ఓ ప్రియపుత్రా! ఆరుణీ! ఈ విధంగా **'ఆత్మాహమ్'** అను భావన – అనుభూతి – ఆస్వాదన కొరకై – మహదాశయముకొరకై... అల్పాశయ సంబంధమై ఇహ విషయాలు త్యజించాలి – అని అనుకొన్నాము కదా! భౌతిక – మనో సంబంధములైన పుత్ర – మిత్ర కళత్రాది దృశ్య విషయములతో ఏర్పడుచున్న దేహ సంబంధములను, లోకములతో ఏర్పడుచున్న బాంధవ్యములను, దండము – కమండలము – ఆశ్రమములు – గృహములు మొదలైన ఆయా (గృహస్థాది ఆశ్రమ) సాధన వస్తువులతో ఏర్పడే అనుబంధములు దాటివేయి. అవన్నీ లోకానికే వదలి ఉండు. దేహము కొరకు ఆహారమును తీసుకుంటూ, దేహము – మనస్సు – జగత్తుల సంధి స్థానమును (సంధ్యాస్థానమును) ఉపాసిస్తూ, ఈ జగత్ దృష్టులను జయించి, ఆత్మ దృష్టిని – భావనలను పెంపొందించుకొనెదవుగాక ....**అని సమీక్షించి చెప్పుకొనుచున్నాము.**

(1) బ్రహ్మచర్యము (2) అహింస (3) అపరిగ్రహము (4) సత్యాశ్రయము – అను నాలుగు స్థంభాలు గల గృహంలో వసించు.

ఈ విధంగా **"ఏది ఏ రీతిగా ఎందుకొరకు–ఎంతవరకు త్యజించి ఉండాలి? ఏది ఏ రూపముగా ఎట్లా ఆశ్రయించి ఉపాసించాలి?"**... అని గ్రహించిన వారై ఎందరో మహనీయులు ఉన్నారు. వారంతా పరమహంసలై, పరివ్రాజకులై **ఈ ఈ దేహాలను జగత్తులను త్రోవలో కనిపించే స్వల్ప విషయాలుగా చూస్తూ వీటికి ఆద్యంతమూ అతీతులై ఉంటున్నారు.** అట్టి పరమహంసలకు ఇదంతా బంధముగా కాకుండా, క్రీడా వినోదమాత్రంగా ప్రదర్శితమౌతోంది. ఇదియే నీవు అడిగిన **దృశ్య త్యాగము – కర్మ త్యాగము** యొక్క పరిపక్వరూపము.

⌘

**శ్రీ ఆరుణి మునీంద్రులు** : తండ్రీ! పరస్వరూపమగు ఆత్మయందే రమిస్తూ, ఇహమంతా ఆత్మయందు లయింపజేసి దర్శించు పరమహంసల గురించి కూడా దయచేసి సూచించి చెప్పవలసినదిగా ప్రార్థిస్తున్నాము.

**శ్రీ ప్రజాపతి** : సరే! ఇప్పుడు మన సంవాదము యొక్క సారవాక్యములుగా ఉత్తమాచరణులగు **'పరమహంస పరివ్రాజకులు'** గురించి సూచనగా చెప్పుకుందాము.

**శబ్దార్థము** : పరమహంస = సోఽహమ్ పరమ్ = జన్మ–కర్మలకు ఆవల పరమైయున్న కేవలాత్మయే నేను.

**ఆసన శయనాదికం భూమౌ** : ఈ భూమి అంతా వారు కూర్చునే – పరుండే స్థానముగా భావిస్తారు. ఒక స్థానము – ఒక ప్రదేశమునకు పరిమితులవరు. ఇదంతా **బహుదూరపు బాటసారులవలె పరివ్రాజకులై** చూస్తూ ఉంటారు.

**బ్రహ్మచారిణామ్** – "నేను నీవు, ఇది – అది...అంతా బ్రహ్మమే" అనే భావనయందు, భావనతో, భావికులై సంచరిస్తూ ఉంటారు. "బ్రహ్మతత్త్వము"నందే ఆచరణ, అవగాహన, అనుభూతి కలిగి ఉంటారు.

**యతీనామ్** : ("యతః సర్వాని భూతాని ప్రతిభాంతి – స్థితానిచ – తదహమ్"....) ఇదంతా ఎందులో ప్రతిబింబిస్తూ, స్థానముగా కలిగినదై ఉన్నదో....అట్టి **పరబ్రహ్మముతో మమేకమై ఉంటారు. యతులై ఉంటారు.**

**మృత్ పాత్రమ్ - అలాబు పాత్రమ్ - దారు పాత్రమ్ - వేణుపాత్రం వా** : ఈ దేహమును, లోకసంబంధమైన జీవితమును (దేహమును) – మట్టి పాత్ర, సొరకాయ పాత్ర, దారువు పాత్ర, వేణు పాత్రగా భావించి జ్ఞానదర్శకులతో సంచరిస్తూ **ఆత్మజ్ఞానానంద భిక్షాటకులై** ఉంటారు.

**కామ - క్రోధ - హర్ష - రోష - లోభ - మోహ - మద - మాత్సర్య - దంభ - దర్ప - ఇచ్ఛ - మమత్వ - అహంకారము మొదలైనవాటిని** – పరిత్యజించి ఉంటారు. ఇవన్నీ అజ్ఞానరూపములుగా, బంధకారకములుగా గమనించినవారై పరిత్యజిస్తేనే....పరతత్త్వము బోధపడి, ఒకడు **'పరమహంసత్వము'**ను సముపార్జించుకోగలడు.

యతులు చాతుర్మాస్యవ్రతులై వర్షాకాలపు '4' మాసములు ఒక్కచోటనే ఉండి తత్త్వార్థ జ్ఞానోపాసన, వేదాంత సాహిత్య ఉపాసన నిర్వర్తిస్తున్నారు. (లేదా) రెండు మాసముల కాలము ద్విమాస్యవ్రతులై ఉంటారు.

తక్కిన '8' నెలలు లోకసంచారులై ఒక్కరుగా గాని, ఇద్దరుగాగాని అనేక ప్రదేశ – అనుగతులై ఉంటున్నారు. తత్త్వార్థజ్ఞానచక్షువులతో – దృష్టులతో కూడి సంచరిస్తున్నారు. జీవ – బ్రహ్మైక్యానుభవ ఉపాసకులై లోకసంచారాలు చేస్తున్నారయ్యా! అట్టి వారికి – ఈ లోకములలో సంచారమంతా **"తమయందు తాము"** సంచారరూపమగు **"ఆత్మయందు ఆత్మసంచారము"** – అగుచూ ఉన్నది.

## పంచమః ఖండః ఓం హి। ఓం హి। ఓం హి॥

- మొట్టమొదట వేదార్థమును – ఆత్మతత్త్వ జ్ఞానమును సముపార్జించుకోవాలి!
- ఊర్ధ్వదృష్టిని, ఆత్మదర్శన పవిత్ర బుద్ధిని క్రమంగా పెంపొందించుకుంటూ – **ఏతాని ప్రాక్వా త్యజేత్**....సర్వ ఇతఃపూర్వపు జగత్ విషయాలు త్యజించి వేస్తూ ఉండాలి. (Unlearning of impressions pertaining past to worldly events)

- **సో ఉపనయనాత్ ఏతాని త్యజేత్**
- సర్వ ప్రాపంచక విశేషాలను అధిగమించు విజ్ఞానదృష్టి ప్రవృద్ధపరచుకొనునుగాక! **'ఆత్మసామీప్యత'** యొక్క సహాయముతో **'జగత్‌సామీప్యత'**ను అధిగమించాలి. జగత్తును జగత్తుగా కాకుండా **"అస్మత్ ఆత్మ – స్వరూపమే"** – ఇతి భావయేత్ సదా!" – అభ్యాసము చేయాలి।

**పితరం-పుత్రమ్-అగ్నిమ్-ఉపవీతమ్-కర్మ-కళత్రమ్ అన్యదపి ఇహ యతయో** – కుటుంబ సంబంధములు, ఉపవీతము ఇత్యాది సాధన వస్తువుల సంబంధము, తదితర సర్వలౌకిక సంబంధములను అధిగమించి వేయి. ఆత్మదృష్టియందు లయింపజేసివేయాలి। సమస్త సంబంధములను **"ఆత్మసంబంధము, అహమాత్మా-పరమాత్మా భావన"** యందు కరిగించివేస్తూ ఉండు. ప్రయత్నశీలుడై **'యతివి అగుము'! యతయో ఇతి యతిః।**

**యత యో హి భిక్షార్థమ్ - గ్రామమ్ ప్రవిశంతి పాణి పాత్రమ్ ఉదరపాత్రం వా!** ఉభయ హస్తములను కర్మ యోగ – కర్మ ఫల సమర్పణపరంగా "పాణిపాత్ర – రెండు చేతులు తెరచి జత చేయటం"....గా, జ్ఞానభిక్షాపాత్రగా ధారణ చేస్తూ, ఉదరమే (పొట్టయే) జ్ఞాన భిక్షస్వీకార స్థానంగాను దర్శించు.

**ఓం హి! ఓం హి! ఓం హి!**

**ఇదంతా ఓంకారమే! సర్వజీవులు ఓంకార స్వరూపులే! నేను ఓంకార స్వరూపుడనే! సమస్త వాక్ జాతమూ ఓంకారమే!**

అను ఉపనిషత్ గానరూపమగు దృఢభావనను హృదయమునందు పరిపుష్టం చేసుకొంటూ, తత్ప్రయోజనము కొరకే – చాతుర్మాస్యము – (4 నెలల వర్షాకాలము), చాతుర్మాసానంతర తదితర '2/3' సంవత్సరకాలము – (8 నెలలు కూడా) జ్ఞానాన్వేషణాశీలురు అయి ఉండెదరుగాక!

ఆత్మస్వరూపమును ఎరుగుచు

**ఖలు తత్ ఉపనిషదమ్ విద్వాన్ య ఏవం వేద।**

ఉపనిషత్ ప్రబోధమగు బ్రహ్మతత్త్వమును, అర్థము చేసుకొని, విద్వాంసుడై **'ఆత్మాహమ్' త్వమును, బ్రాహ్మీ స్వరూపతత్త్వమును** బుద్ధియందు, హృదయమునందు నిలుపుకోవాలి సుమా!

ఆత్మజ్ఞానము సముపార్జించుకుంటూ.....

- మోదుగ–బిల్వ–రావి– మేడి కర్రతో చేసిన దండమును, కృష్ణాజినమును, ఎండుగడ్డితో నేసిన మొలత్రాడును కూడా త్యజించి.....
- దేని చేతను కంపించనివాడవగుము. **"అకంపితుడవు"** అయి ఉండుము.

⌘ ⌘

మనము చెప్పుకొన్న ఈ ఉపనిషత్ వాణిని ఎవరు తెలుసుకుంటారో (య ఏవం వేద)....

**తద్విష్ణో పరమం పదం సదా పస్యంతి సూరయః దివీవ చక్షుః ఆతతమ్।**
**తత్ విప్రా సో విపన్యవో జాగృవాం సః సమింధతే, విష్ణోః యత్ పరమమ్ పదమ్।।**

ఈ జగత్ విషయములన్నీ బుద్ధితో త్యజించుచూ, ఆత్మభావనతో నింపివేస్తూ ఏ పరమమగు విష్ణు (అంతటా – అన్నీగా విస్తరించియున్న ఆత్మ) స్థానమును మహనీయులు చేరుచున్నారో....

ఇక్కడి జగత్ విషయములన్నీ బుద్ధితో త్యజించి ఆత్మభావనతో నింపి...సూరులు, దివ్యమైన దృష్టితో సర్వము – సర్వత్ర **విష్ణుతత్త్వముగా** చూస్తూ, **విష్ణుస్వరూపులగుచున్నారో – వారు మాత్రమే జాగ్రత్తులు.** తక్కినవారు **నిద్రాపరవశులే.**

ఆత్మభావనయందు నిదుర లేచినవారై అట్టి విప్రులు (వేద – వేదాంత తత్త్వవిదులు) పవిత్రమగు ఆ పరమపదమగు విష్ణుత్వము స్పష్టముగా పలుకుచూ, చూస్తూ, ఆస్వాదిస్తూ తరిస్తున్నారు. ఇప్పుడే ఇక్కడే విష్ణుత్వమును సంతరించుకొనుచున్నారు.

వేద–పురాణ–ఇతిహస–ఉపనిషత్ ఇత్యాది సమస్త వాఙ్మయములలోను విష్ణుపదధ్యానము – ప్రబోధయే గమనించినవారై ఉంటున్నారు,

*ఇది నిర్వాణ అనుశాసనము. మోక్షశాస్త్రము యొక్క ప్రవచనము।*
*వేదాను శాసనము। వేదములచే అనుశాసనంగా ఎలుగెత్తి గానం చేయబడుచున్న వేదాంత తత్త్వము।*

**ఇతి ఆరుణికోపనిషత్**

*ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ॥*

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 3 కేనోపనిషత్

## (తలవకారోపనిషత్)

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

కేన = దేనియొక్క / ఎవరియొక్క
ఈషితమ్ = ఇష్టము, ప్రేమ, కోరిక, వేగము, ఉత్సాహముచే ఇదంతా ప్రదర్శనమౌతోందో
ఉపనిషత్ : అద్దాని సామీప్యంగా సుఖాసనము.



ఇక్కడి సృష్టి, స్థితి, లయము, జన్మ, కర్మ, బంధము, మోక్షము, సుఖము, దుఃఖము, లోకసంచారములు, సంసారములు, విముక్తి మొ॥నవి - ఇవన్నీ కూడా ఎవరి ఇష్టం చేత ఏర్పడుచున్నాయి? స్వస్వరూపుడగు ఆత్మభగవానుని ఇష్టము, వినోదము, క్రీడ, లీలానందము, బాలానందము చేతనే।

## శాంతి పాఠము → (నౌ ఉభయః గురు - శిష్యే)

ఓం॥సహనావవతు (నౌ అవతు)।
సహ నౌ భునక్తు।
సహ వీర్యం కరవావహై।
తేజస్వినావధీతమస్తు।
(తేజస్వి నౌ అధీతమ్ అస్తు)
మా విద్విషావహై।
ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥

ఆ పరతత్త్వము... (గురు-శిష్యులుగా) మన ఇద్దరిని రక్షించునుగాక! మన ఇద్దరిని పరిపోషించునుగాక! మనిద్దరము వీర్య - ఉద్యమ - సముత్సాహవంతులమై పరిశ్రమించెదముగాక!

మన స్వాధ్యాయము - అధ్యయనము తేజోవంతముగా విరాజిల్లునుగాక!

మనము పరస్పరము ("శిష్యునికి వినటం చేత కాదు"- అని), "గురువుకు చెప్పటం చేత కాదు"- అని - ఇత్యాది భావాలతో) ద్వేషించుకొనకుండెదము గాక। ఒకరిపై ఒకరము ఆత్మభావన కలిగి ఉండెదము గాక।

ఓం। మనయొక్క
(ఆధ్యాత్మిక → శారీరకమైన
ఆధిదైవిక→ అశరీర-అరూప ప్రకృతికి ప్రజ్ఞలగు దేవతా చర్యల సంబంధమైన
అధిభౌతిక → నామరూపాత్మక ప్రకృతి సంబంధమైన
భావనలన్నీ → భావాతీతమగు ఆత్మయందు శాంతించినవై ఉండునుగాక!

---

ఓం
అప్యాయన్తు మమాంగాని,
వాక్ - ప్రాణః - చక్షుః - శ్రోత్రమ్
అథో బలమ్ - ఇంద్రియాణి చ సర్వాణి।
సర్వం బ్రహ్మ ఉపనిషదం।
మ అహం బ్రహ్మ నిరాకుర్యాం।
మా మా బ్రహ్మ నిరాకరోత్ (అస్తు)।
అనిరాకరణమస్తు। అనిరాకరణం మే అస్తు।
తత్ ఆత్మని నిరతేయ ఉపనిషత్సు ధర్మాః
తే మయి సన్తు। తే మయి సన్తు।
ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥

ఓంకార రూపమగు బ్రాహ్మీభావనచే ఆప్యాయముగా - నా అంగములు ప్రత్యుత్సాహమగు గాక! ఈ నా మాట-ప్రాణములు - చూపు - వినికిడి శక్తి - సర్వ ఇంద్రియములు బ్రహ్మతత్త్వముయొక్క అధ్యయమునకై సంసిద్ధము అగునుగాక!

అవన్నీ ఉపనిషత్తులచే ప్రబోధించబడుచున్న బ్రహ్మమును గ్రహించుటకు సహకారికమగునుగాక! నేను బ్రహ్మముపట్ల అనిరాకరణుడనై ఉండెదను గాక! బ్రహ్మము నాపట్ల అనిరాకరణమై ఉండును గాక! నా పట్ల బ్రహ్మము అనిరాకరణమే అగును గాక!

ఆత్మశాస్త్రమునందు శ్రద్ధగల నాయందు నా పట్ల ఉపనిషత్తులచే ప్రబోధించబడుచున్న ఆ **ఆత్మతత్త్వ ధర్మము** ప్రసిద్ధముగా రూపుదిద్దుకొనునుగాక!

**ఓం శాంతిః।శాంతిః। శాంతిః॥**

# ప్రథమ ఖండము

(శిష్యస్య ప్రశ్న:)

1 ఓం। కేన ఈషితం
పతతి, ప్రేషితం మనః?
కేన ప్రాణః ప్రథమః
ప్రైతి యుక్తః?
కేన ఈషితాం
వాచమ్ ఇమాం వదన్తి?
చక్షుః శ్రోతం క ఉ దేవో యునక్తి?

కేన = దేనియొక్క; ఈషితమ్ = ప్రేమ, ఇష్టము, కోరిక, వేగము - ఇచ్చు చేత.... ఈ మనస్సు ప్రేరేపింపబడినదై, ఆయా విషయములవైపుగా పంపబడినదై (విషయములలో) పతితమవుతోంది? వ్రాలుచున్నది? పడుచున్నది?

ఎవనిచేత యుక్తమై-(నియోగించబడినదై) ముఖ్యము - ప్రథమము అగు ప్రాణ శక్తి ఈ దేహమునందు, విశ్వమునందు కూడా - సంచారములు సలుపుచున్నది? ఆయా సమస్త వ్యవహారములు నిర్వర్తిస్తోంది?

దేనియొక్క ఇచ్ఛానుసారంగా నోరు వాక్యాలు పలుకుతోంది? ఈ కళ్ళు - చెవులు ఏ దివ్యతత్త్వము సహాయంచేత చూస్తున్నాయి? వింటున్నాయి? శక్తి చెవులదా? కళ్ళదా? ప్రాణములదా? మనస్సుదా? జీవునిదా? దృశ్యజగత్తుదా? మరింకెవరిదన్నానా?

---

2 (ఆచార్య ప్రవచనము:)
శ్రోతస్య శ్రోత్రం,
మనసో మనో యత్,
వాచో హ వాచమ్,
స ఉ ప్రాణస్య ప్రాణః,
చక్షుషః చక్షుః,
అతిముచ్య ధీరాః -
ప్రేత్య అస్మాత్ లోకాత్
అమృతా భవన్తి॥

యత్-ఏదైతే.... చెవికే చెవి అయి ఉన్నదో.... (వినటమును వినుచున్నట్టిదో), మనస్సు-ఆలోచనకే ఆలోచన అయి ఉంటోందో.... (ఆలోచన తనదైనది), వాక్కుకే వాక్స్వరూపమై చెన్నొందుతోందో...(మాటలు తనవైనవి) ప్రాణములకే ప్రాణేశ్వరుడు అయి ఉన్నాడో... (ప్రాణశక్తి తనదైనది) (చూపులను చూస్తూ) కళ్ళకే కళ్ళు అయి ఉన్నదో.... (చూడటము తనదైనది) -

అది "ఆత్మ"యే అయి ఉన్నది. అట్టి ఆధారతత్త్వమగు ఆత్మనే దర్శిస్తూ ఉన్నట్టి సూక్ష్మబుద్ధి, ధీశక్తిగల ధీరులు - ఈ ఇంద్రియాలకు అనుభవమగుచున్న లోకములన్నీ దాటవేసినవారై, అధిగమించినవారై...., (దేహత్వమునుండి దేహిత్వము సంతరించుకొని)....అమృతస్వరూపము సంతరించుకొంటున్నారు.

---

3 న తత్ర చక్షుః గచ్ఛతి।
న వాక్ గచ్ఛతి।
నో మనః।
న విద్మో - న విజానీయో(మో)
యథా ఏతత్ అనుశిష్యాత్?

(ఏద్దానికైతే మనోవాక్ ప్రాణ తదితర ఇంద్రియములన్నీ ఉపకరణములో, మనస్సుకు మనస్సు - వాక్కుకు వాక్కు మొ॥వి అయి ఉన్నదో...అట్టి చైతన్యాత్మ గురించి) అక్కడికి ఈ చూపు ప్రసరించలేదు. కళ్లు చూడలేవు. వాక్కు చెప్పలేదు.

ఈ మనస్సు కూడా అందుకోలేదు. పట్టుకోలేదు. బుద్ధి అద్దానిది. అందుచేత బుద్ధి కూడా నిర్ణయం చేయలేదు. అది తెలియబడేదేదీ కాదు. తెలుసుకొనుచున్నదే అది.

సర్వము ఎరుగుచున్నదాని గురించి, అద్దాని (ఎరుక యొక్క) కళావిశేషమైనట్టి 'ఎరుగుట' అను ఉపకరణముతో ఎరగటం ఎట్లా? శిష్యునికి చూపటం ఎట్లా?

---

అన్యత్ ఏవ తత్ విదితాత్
అథో అవిదితాత్ అధి।
ఇతి శుశ్రుమ పూర్వేషాం
యేనః తత్ వ్యాచచక్షిరే॥

సర్వకారణమైనట్టి ఆత్మ : తెలియబడే సర్వము కంటే ఆవల ఉన్నది. దృశ్యములోని సమస్తమునకు భిన్నమైనది! వేదాన్తమ్। తెలియబడేదానికి ఆవల సంస్థితమై ఉన్నది. అంతేకాదు. తెలియబడకపోవటానికి కూడా ఆవలయే అయ్యిది! 'తెలిసీ - తెలియనిదానికి కూడా తెలుసుకొనుచున్నదాని రూపంగా అతీతస్థానంలో ఉన్నట్టిది' అని అద్దానిని తెలుసుకొని అనుభూతం చేసుకొన్నట్టి మహనీయులు, (ఆత్మజ్ఞులగు) పూర్వమహాశయులు ఇతఃపూర్వమే చెప్పగా మేము వింటూ వస్తున్నాము!

**4 యత్ వాచా అనభ్యుదితం,**
**యేన వాక్ అభ్యుద్యతే,**
**తత్ ఏవ 'బ్రహ్మ' త్వం విద్ధి।**
**న ఇదం, యత్ ఇదమ్ ఉపాసతే॥**
**(నేదం యదిదముపాసతే।)**

అది (పరతత్త్వాత్మ) ఎట్టిదంటే...**అది వాక్కు చేత (మాటలచే) ప్రకటించబడేది కాదు.** ఎందుకంటే, వాక్కు అర్ధానిచేతనే ప్రకటించబడుచున్నది. వాక్కు అర్ధానియొక్క విన్యాసము.

**వాక్కు ఎద్దానిదో - ....అది బ్రహ్మముగా నీచే తెలుసుకొనబడునుగాక!** అంతేగాని,.....

ఇక్కడ జగత్ దృశ్యములో ఏది వాడుకచే నామరూపాత్మకంగా (శబ్దీకరిస్తూ) ఉపాసిస్తూ ఉన్నామో, అది (ఆత్మతత్త్వము) కాదు. (ఆత్మయొక్క లీలా ప్రదర్శన మాత్రమే తదితరమైనదంతా).

---

**5 యత్ మనసా న మనుతే,**
**యేన ఆహుః మనో మతమ్,**
**తత్ ఏవ 'బ్రహ్మ' త్వం విద్ధి।**
**న ఇదం యత్ ఇదమ్ ఉపాసతే!**

ఏదైతే మనస్సుచే గ్రహించబడునదేదీ కాదో...,
దేని చేత **మనస్సు తెలియబడుచున్నదో...**
ఏది మనస్సును కూడా సాక్షిగా ఎరుగుచూ ఉన్నదో....
అది బ్రహ్మముగా నీవు తెలుసుకొనెదవుగాక!
అంతేగాని, ఇక్కడ మనస్సుకు తోచేది, మనస్సు ఉపాసిస్తున్నది అది కాదు. మనస్సును కూడా ఎరుగుచున్నట్టిది అది। ఆలోచనకు ఆవిర్భావ - తిరోభావస్థానమే అయ్యది. ఆలోచనలన్నీ తనదైనట్టిదే - బ్రహ్మము.

---

**6 యత్ చక్షుసా న పశ్యతి**
**యేన చక్షూగ్ంషి పశ్యతి,**
**తదేవ (తత్ ఏవ) బ్రహ్మ త్వం విద్ధి।**
**న ఇదం యత్ ఇదమ్ ఉపాసతే॥**

ఏదైతే కళ్ళకు కనిపించేది కాదో, ...**దేనిచేత కళ్ళు చూస్తూ ఉన్నాయో, ఏది కళ్ళను ఉపయోగించి చూస్తూ ఉన్నదో - అదియే బ్రహ్మముగా నీవు గమనించెదవు గాక! సందర్శించెదవుగాక! ఎరిగెదవుగాక।**

అంతేగాని, కళ్ళకు కనబడేదేదీ పూర్ణబ్రహ్మము కాదు. కళ్ళతో చూస్తూ ఉపాసించుచున్నదేదీ - ఏ ఒక్కటీ అది కాదు. చూడటము ఎద్దాని కళయో అదీ 'ఆత్మ'.

---

**7 యత్ శ్రోత్రేణ న శ్రుణోతి,**
**యేన శోత్రమ్ ఇదం శ్రుతమ్,**
**తత్ ఏవ 'బ్రహ్మ' త్వం విద్ధి।**
**న ఇదమ్ యత్ ఇదమ్ ఉపాసతే॥**

ఏదైతే చెవులచే వినబడుచున్నదేదీ కాదో...,

ఏది చెవుల ద్వారా వినుచున్నదో, ఏదైతే చెవులనుఉపయోగించు చున్నదో....అది **'బ్రహ్మము'** అని నీవు గ్రహించు.

అంతేగాని...చెవులకు వినబడేదేదీకాదు. చెవులతో విని ఉపాసించబడేదేదీ కూడా ....అది కాదు!

---

**8 యత్ ప్రాణేన న ప్రాణితి,**
**యేన ప్రాణః ప్రణీయతే,**
**తత్ ఏవ 'బ్రహ్మ' త్వం విద్ధి।**
**న ఇదమ్ యత్ ఇదం**
**ఉపాసతే॥**

ఏదైతే ప్రాణములచే (ప్రాణశక్తిచే) జీవింపజేయబడుతోందో, ప్రాణశక్తిచే కదల్చబడుతోందో,...అది బ్రహ్మముకాదు.

దేనిచేత ప్రాణములు "జీవన శక్తి - చలనశక్తి" ప్రదర్శించటం జరుగుతోందో, .... అదియే బ్రహ్మముగా నీచే తెలుసుకొనబడుగాక!

అంతేగాని, ఇక్కడ (ప్రాణములచే కదల్చబడేది) ఏదీ బ్రహ్మముయొక్క సమగ్రార్థము కాదు. ప్రాణముల రూపంగా ఉపాసించబడేదేదీ అది కాదు!

---

## ద్వితీయ ఖండము

**1 యది మన్యసే 'సువేద' ఇతి,**
**దభ్రమ్ ఏవ అపి**
**నూనం త్వం వేత్థ**
**బ్రహ్మణో రూపమ్।**

## ద్వితీయ ఖండము

ఒకవేళ "బ్రహ్మముయొక్క రూపము నాకు బాగా తెలుసునులే!"... అని అనుకుంటున్నట్లైతే, అప్పుడు నీవు కొంచమే తెలుసుకొన్నట్లు సుమా! నిశ్చయంగా నీవు బ్రహ్మముయొక్క రూపమును కొంతే గమనించినట్లు! ఏది ఈ సమస్తమును తెలుసుకుంటూ ఉన్నదో...అదియే **'బ్రహ్మము'**. సమస్తము తెలుసుకుంటూ ఉన్నది బ్రహ్మము. అంతేగాని అది జగత్తులో తెలియబడుచున్న ఏదో నామ-రూపాత్మకమైనది కాదు. అది తెలియబడేదేదీ కాదు. తెలుసుకుంటూ ఉన్నట్టిదే అది।

| మూలము | వివరణ |
|---|---|
| **యదస్య త్వం, యదస్య చ దేవేషు**<br>**అథ ను మీమాంస్యమ్ ఏవ**<br>**తే మన్యే విదితమ్॥** | - ఒక వేళ మనము ఏదైనా ఒక దేవతారూపంగా ఆ బ్రహ్మమును భావిస్తామా? అప్పుడు మనము నీవు కొంతయే బ్రహ్మము గురించి ఎరుగుచున్నట్లు!<br>- మన ఆ ఇష్టదైవముయొక్క వాస్తవరూపము ఏమిటో స్తుతిస్తూ విచారణ (మీమాంస) చేస్తున్నప్పుడో?.... మనము బ్రహ్మమును ఎరుగుచున్న మార్గములో ఉన్నట్లు!<br>**"ఆ మీమాంసచేయుచున్న నీవే బ్రహ్మము-తత్త్వమసి"** - అనునదే సమగ్రము. |
| **2 న అహమ్ మన్యే 'సువేద' ఇతి।**<br>**నో 'న వేద' ఇతి। వేద చ।**<br>**యో నః తత్ వేద**<br>**తత్ వేద నో,**<br>**న వేద ఇతి వేద చ॥** | నేను "బ్రహ్మమును బాగుగా తెలుసుకున్నాను" ...అని నేను అనుకోవటము లేదు. "తెలుసుకోవటము" ద్వారా తెలుసుకుంటున్న వానిని ఎట్లా తెలుసుకోగలం?<br>అట్లని "నాకు తెలియదు" అనునది కూడా అనను. నాకు అది తెలియక పోలేదు కూడా। అది మనందరికి తెలిసినదే। తెలియనిది కాదు। నాలోని **'తెలుసుకుంటూ ఉన్న నేను' - నాకు తెలియకపోవటమేమిటి? "నాకు బ్రహ్మము గురించి తెలియదు"** అని పలికేవానిచే బ్రహ్మము తెలియ బడియే (తెలుసుకొనబడియే) ఉన్నది! తనకు తాను తెలుసు కదా! |
| **3. యస్య అమతం తస్య మతం।**<br>**మతం యస్య న వేద సః।**<br>**అవిజ్ఞాతం విజానతామ్।**<br>**విజ్ఞాతమ్ అవిజానతామ్।** | (ఆ బ్రహ్మముయొక్క చమత్కారం వినండి!)<br>ఎవ్వనికి **'బ్రహ్మము గురించి నాకు తెలియదు'** అని అనుకుంటున్నాడో, ఆతనికి బ్రహ్మము తెలిసియే(తెలియబడియే) ఉన్నది. ఎవ్వడు 'బ్రహ్మము గురించి తెలుసును" అని అంటాడో, ఆతనికి తెలియబడకయే ఉన్నది.<br>**తెలిసినవారికి అది తెలియనిది. (అది తెలుసుకుంటున్న వానికి అన్యము ఏమాత్రము కాదు కాబట్టి.)**<br>**తెలియనివారికి అది తెలిసినదే అయి ఉన్నది. (తానే అది కదా!).** |
| **4 ప్రతిబోధ విదితమ్ మతమ్**<br>**అమృతత్వం హి విన్దతే।**<br>**ఆత్మనా విన్దతే వీర్యమ్**<br>**విద్యయా విన్దతే అమృతమ్॥** | ఆత్మజ్ఞుడగు మహనీయునిచే (సద్గురువుచే) బోధించబడుచుండగా బ్రహ్మము తెలియబడగలదనునది నిస్సందేహము.<br>అట్టి ఆత్మస్వరూపముయొక్క ఎరుకకు సంబంధించిన స్ఫూర్తిచే నిశ్చయముగా <u>అమృతత్వము</u> పొందగలము.<br>ఆత్మభావనచే వీర్యము, స్థైర్యము పొందగలము! "దేహముచే పరిమితము కాము" - అని నిశ్చయము పొందగలము.<br>ఆత్మవిద్యచే **"నేను దేహముయొక్క రాకపోకలకు సంబంధించినవాడిని కాను"**...అను అమృతత్వము సంతరించుకోగలము! |
| **5 ఇహ చేత్ అవేదీత్ -**<br>**అథ 'సత్యమ్' అస్తి।**<br>**న చేత్ ఇహ అవేదీత్**<br>**మహతీ వినష్టిః।** | ఇక్కడే ఇప్పుడే (ఈ దేహము ఉన్నప్పుడే) బ్రహ్మము గురించి (ఆత్మతత్త్వముగురించి) ఎరుగుచుండగా. ఆ తదనంతరము సత్యమునందు ప్రతిష్ఠితులము కాగలము.<br>ఒకవేళ - అశ్రద్ధ , దృశ్యావేశములను ఆశ్రయించి కాలము గడుపుతూ బ్రహ్మతత్త్వము తెలుసుకోకపోతేనో? (అసత్యములో ప్రయాణిస్తూ) గొప్ప నష్టము పొందుతాము. |
| **భూతేషు భూతేషు విచింత్య ధీరాః।**<br>**ప్రేత్య అస్మాన్ లోకాత్**<br>**అమృతా భవన్తి॥** | ధీరులగువారు సమస్త ప్రాణికోట్లలో ఆ బ్రహ్మమునే దర్శిస్తున్నారు.<br>కనుక (ఉత్తమ - సునిశితమైన - విస్తారమైన - సాత్వికమైన) బుద్ధితో ధీరులమై, ఈ లోక సంబంధమై (లౌకికమైన) ధ్యాసలను దాటివేసి **అమృతత్త్వముతో సారూప్యము** పొందెదము గాక!<br><u>"ఈ సమస్తము సర్వదా సర్వత్రా బ్రహ్మమే అయి ఉన్నది"</u> - అను ఎరుకచే మృత్యువుయొక్క పరిధులను దాటివేయుచున్నాము. |

## తృతీయ ఖండము

## తృతీయ ఖండము

1 బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే,
తస్య హ బ్రహ్మణో విజయే దేవా అమహీయన్త।
త ఐక్షన్త, "అస్మాకమ్ ఏవ
అయం విజయో।
అస్మాకమ్ ఏవ అయం మహిమా"। ఇతి॥

పరబ్రహ్మముయొక్క కల్పనాచమత్కారంగా ఒకానొక సందర్భములో దేవతలకు, దానవులకు మధ్య గొప్ప సంగ్రామం (యుద్ధం) జరిగింది. అప్పుడు బ్రహ్మము దేవతల కొరకై జయమును ప్రసాదించటం జరిగింది. (ఒక నవలలో ఒకరు గెలిచి, మరొకరు ఓడిపోవుతీరుగా).

విధివశాత్ (పరమాత్మచే) అనుగ్రహించబడిన విజయమును చూచుకొని దేవతలు ఉప్పొంగిపోయారు!

వారు అనుకున్నారు కదా....,

"ఆహా! ఇదంతా మా విజయమే కదా! మేమే గెలిచాము। వీర్యవంతులము కాబట్టి గెలిచాము. కనుక ఇదంతా మా మహిమ. మా సామర్థ్యము కాక, మరింకేమిటి?" అట్టి భావనతో గర్వించసాగారు.

---

2 తత్ హ ఏషామ్ విజజ్ఞే
తేభ్యో హ ప్రాదుః బభూవ।
తత్ న వ్యజానంత
"కిమ్ ఇదమ్ యక్షమ్?" ఇతి॥

అప్పుడు వారియొక్క (ఆ దేవతలయొక్క) విజయ గర్వమును గమనించినదై పరతత్త్వము ఒకానొక భీకర రూపముతో వారికి అంతదూరంలో ఆవిర్భవించింది.

ఆ దేవతలకు ఆ భీకర రూపి ఎవ్వరో తెలియలేదు?

''ఈ అద్భుతశక్తి అయిన యక్షరూపము ఎవ్వరిదై ఉంటుంది?'' ఈతడు ఎవ్వరై ఉంటారు?''.... అని చూడసాగారు. మీమాంస పడసాగారు.

---

3 తే అగ్నిమ్ అబ్రువన్,
"జాతవేద! ఏతత్ విజానీ హి : -
కిమ్ ఏతత్ యక్షమ్? ఇతి।"
(అగ్నిః అబ్రువన్) "తథ"। ఇతి॥

ఆ దేవతలు అగ్నిదేవునితో :-

"ఓ జాతవేదా! జనించినదంతా ఎరిగియున్న దేవా! ఈ యక్షరూపశక్తి ఏమిటి? తెలుసుకోండి!" అని అగ్నిదేవుని అడిగారు.

అగ్నిదేవుడు, "అలాగే! తప్పనిసరిగా!" అని పలికారు.

---

4 తత్ అభ్య ద్రవత్! తమ్ అభ్యవదత్ -
"కో అసి?" ఇతి।
"అగ్నిర్వా అహమస్మి" ఇతి।
అబ్రవీత్ - :
"జాతవేదా వా అహమ్ అస్మి" ఇతి।

అగ్నిదేవుడు ఆ భీకర -అద్భుత యక్షి శక్తి రూపిణి వద్దకు వెనువెంటనే వెళ్ళి ఎదురుగా నిలుచున్నారు.

ఆ యక్ష పురుషుడు, అగ్నిదేవుని చూచి, "ఎవరివయ్యా నీవు?'' - అని ప్రశ్నించారు.?

అగ్ని : నేను అగ్నిదేవుడను. నన్ను 'జాతవేదుడు' అని కూడా పిలుస్తూ ఉంటారు జనించిన సమస్తము ఎరిగినవాడను.

అప్పుడు యక్షరూపి అడిగారు కదా....,

---

5 తస్మిన్ "త్వయి కిం వీర్యమ్?" ఇతి॥
(అగ్నిదేవో వాచ)
"అపి ఇదగ్ం సర్వమ్
దహేయమ్ యత్ ఇదమ్ పృథివ్యామ్" ఇతి

యక్షశక్తి : అయ్యా! నీ శక్తి ఏమిటి? ఏరీతిగా వీర్యవంతుడవు?

అగ్నిదేవుడు : నేనా? ఈ భూమి మీద ఏదేదైనా సరే, ఎంతటిదైనా సరే,...అదంతా కూడా క్షణంలో నేను దహించి వేయగలను. పుట్టిన దేనినైనా వేదన కలిగించి భస్మము చేయగలను. జాతవేదుడను।

---

6 తస్మై తృణం నిదధావ - ఏతత్ దహేత।
తత్ ఉపప్రేయాయ సర్వజవేన।
తత్ న శశాక దగ్ధుమ్।
స తత ఏవ నివవృతే న ఏతత్
అశకం విజ్ఞాతుం యత్ ఏతత్
యక్షమ్। ఇతి॥

యక్షశక్తి : అవునా? అట్లాగా? ఏదీ! ఇది కాల్చు! చూద్దాం।

అని ఒక గడ్డిపోచ అగ్ని దేవునికి ఎదురుగా పడవేసింది!

అగ్నిదేవుడు ఆ గడ్డిపోచను సమీపించారు. తన సర్వశక్తిని ప్రయోగించి కూడా ఆ గడ్డిపరికను దగ్ధము చేయలేకపోయారు!

ఆయన అక్కడినుండి వెనుకకు మరలి దేవతలతో...

"దేవతలారా! క్షమించండి. ఈ యక్షరూపము ఎవ్వరు, ఎట్టిది అనేది తెలుసుకోవటం నావల్ల కాలేదు"... అని తెలిపారు.

**7** **అథ వాయుమ్ అబ్రువన్**
**"వాయవ! ఏతత్**
**విజానీ హి కిమ్ ఏతత్**
**యక్షమ్?" ఇతి। "తథ"। ఇతి॥**

అప్పుడు వాయువుతో (దేవతలు) :-
**"ఓ వాయుదేవా! ఈ యక్షశక్తి ఏదై ఉన్నదో, ఎవ్వరి శక్తియో, పోనీ - మీరు తెలుసుకొనిరండి"**....అని పలుకగా...
వాయుదేవుడు **"సరే! అట్లాగే తెలుసుకొనివస్తాను!"** అన్నారు.

---

**(వాయో)**
**8** **తత్ అభ్యద్రవత్।**
**(శక్తిః....)**
**తమ్ అభ్యవదత్ "కో అసి?" ఇతి।**
**"వాయుర్వా అహమ్ అస్మి"। ఇతి అబ్రవీత్ ః**
**మాతరిశ్వా వా అహమస్మి" - ఇతి**

వాయుదేవుడు ఆ యక్షశక్తి వద్దకు వెనువెంటనే పరుగు తీస్తూ వెళ్ళారు.
ఆ భీకర యక్షశక్తి ఇట్లా అడిగింది, **"నీవెవ్వరివయ్యా బాబూ?"**
(వాయుదేవుడు)
"నేనా? (కనబడటంలేదా?)
వాయుదేవుడిని కదా! ఆకాశమంతా అన్నిచోట్లా సంచరించే వాడగుటచే **"మాతరిశ్వుడు"** అను బిరుదు కలవాడను.

---

**9** **(యక్షిణి శక్తిః ఉవాచ)**
**"తస్మిం త్వయి కిమ్ వీర్యమ్?" ఇతి।**
**(వాయుర్వాచ)**
**"పీదం సర్వమ్ ఆదదీయ**
**యత్ ఇదమ్ పృథివ్యామ్" ...ఇతి॥**

**యక్షశక్తి** : అట్లాగా! ఏదీ నీ వీర్యశక్తి ఎటువంటిదో చెప్పు!
**వాయుదేవుడు** : నేను ఈ భూమిమీద ఏదేది ఉన్నదో, అదంతా కూడా పీల్చి వేయగలను. ఆకాశంలోకి విసిరివేయగలను. పర్వతములను కూడా పెకలించి, కావాలంటే, సముద్ర మధ్యలోకి విసరగలను.

---

**10** **తస్మై తృణం నిదధావ**
**ఏతత్, "ఆదత్స్వ" ఇతి।**
**తత్ ఉప ప్రేమాయ సర్వజవేన।**
**తత్ న శశాక ఆదాతుం।**
**స తత ఏవ నివవృతే**
**"న ఏతత్ అశక్తం**
**విజ్ఞాతుం యత్ ఏతత్ యక్షమ్" ఇతి.**

అప్పుడు ఆ అద్భుత యక్షశక్తి, "ఊఁహూ!" అంటూ ఒక గడ్డిపోచను ముందుంచి, **"ఏదీ! దీనిని గాలిలోకి లేపు"** అన్నది.
వాయుదేవుడు → ఆ గడ్డి పరకను సమీపించారు. తనయొక్క సర్వశక్తిని ఉపయోగించి కూడా కదల్చటానికి, గాలిలో లేపటానికి శక్తుడు కాలేకపోయాడు. వల్ల కానే లేదు.
ఆయన కూడా సిగ్గుపడుతూ మరలిపోయి దేవతలతో,....
**"ఆ యక్షశక్తి ఎవ్వరో - ఏమిటో నేను కూడా తెలుసుకోలేకపోయాను"....** అని దేవతలకు చెప్పారు.

---

**11** **అథ ఇంద్రమ్ (దేవతానామ్)**
**అబ్రువన్ :**
**"మఘవన్! ఏతత్ విజానీహి**
**కిమ్ ఏతత్ యక్షమ్?" ఇతి। "తథ" - ఇతి।**
**తత్ అభ్యద్రవత్। తస్మాత్ తిరోదధే॥**

అప్పుడు దేవతలు ఇంద్రుని ఈ విధంగా ప్రార్థించారు.
"ఓ మఘవన్! మేఘ నియామకా! సర్వసంపదాధిపతీ! త్రిలోకపూజ్యుడవు, త్రిలోక సంపదాధిపతివికదా!
ఈ యక్షశక్తి ఏమై ఉన్నదో....మీరు తెలుసుకోండి" - అని
ఇంద్రుడు "అట్లాగే!" అంటూ వెంటనే బయలుదేరి ఆ యక్షశక్తి ఎదురుగా నిలిచారు. "ఎవ్వరై ఉంటారు?" అని కించిత్ ఆశ్చర్యంగా ఇంద్రుడు చూస్తూ ఉండగా, ఆ యక్షశక్తి అదృశ్యమైపోయింది.

---

**12** **స తస్మిన్ ఏవ ఆకాశే స్త్రియమ్**
**ఆజగామ।**
**బహు శోభమానామ్,**
**ఉమామ్। హైమవతీమ్।**
**తాం హోవాచ :**
**"కిమ్ ఏతత్ యక్షమ్?" ఇతి॥**

ఇంద్రులవారు "ఏమిటిది?" అని అనుకుంటూ ఉండగా ఆకాశంలో ఒక స్త్రీ రూపం ప్రత్యక్షమై కనిపించింది.
ఆ తల్లి బహు శోభాయమానంగా - తేజోమయంగా - ధగధగ కాంతులతో మహత్-ప్రకాశంగా కనిపించారు।
ఆమె జగన్మాత ఉమాదేవిగా, హైమావతిగా, పార్వతిగా, దర్శించిన ఇంద్రుడు "హే ఉమాదేవీ! హైమవతీ! జగన్మాతా! నమో నమః ఇప్పటిదాకా ఇక్కడ భీకరంగా ఏదో యక్షశక్తి కనిపించిందమ్మా! ఎవ్వరై ఉంటారు?" - అని అడిగారు.

| **చతుర్థ ఖండము** | **చతుర్థ ఖండము** |
|---|---|
| **1** **సా 'బ్రహ్మ"-ఇతి హ ఉవాచ,<br>"బ్రహ్మణో వా ఏతత్ విజయే।<br>మహీయధ్వమ్" ఇతి;<br>తతో హ ఏవ<br>విదాంచకార 'బ్రహ్మ' ఇతి।** | అమ్మవారు : "బిడ్డా! నీకు కనిపించిన ఆ యక్షస్వరూపము బ్రహ్మమే నాయనా!<br>పరబ్రహ్మమే సర్వకారణ - కారణము అని మరిచావా? మీరు రాక్షసులపై విజయంపొందటం బ్రహ్మము యొక్క లీలావిశేషమే. ఆ పరబ్రహ్మమే జగత్ కథా రచయిత కదా! **"మేము గెలిచాం"** అని గర్విస్తున్నారేం? అంతా మీ గొప్పతనమేనని అనుకున్నారా ఏమి? బ్రహ్మమే ఈ జగత్ నాటకమునకు సూత్రదారి, పాత్రధారి, దర్శకుడు, వినోదియగు ప్రేక్షకుడు కూడా!<br>అప్పుడు ఇంద్రుడు<br>**"ఆహా! ఇదంతా బ్రహ్మమే! సర్వము బ్రహ్మమే"**। - అని, తెలుసుకున్న వారయ్యారు! |
| **2** **తస్మాత్ వా ఏతే దేవా అతితరామ ఇవ -<br>అన్యాన్ దేవాన్, యత్ అగ్నిః - వాయుః<br>ఇంద్రః - తేహి ఏనత్ నేదిష్ఠమ్<br>పస్పర్శుః తే హి ఏనత్ ప్రథమో<br>విదాంచకార 'బ్రహ్మ' - ఇతి॥** | అందుచేత ఆ అగ్ని - వాయు - ఇంద్రదేవతలు అన్యదేవతలకంటే -(బ్రహ్మము యొక్క సామీప్య దర్శనముచే) - అధికాధికులైనారు.<br>అత్యంత సన్నిహితమైన పరతత్త్వమును ప్రప్రథమముగా స్పర్శించిన వారు కదా! |
| **3** **తస్మాత్ వా ఇంద్రో అతితరామ ఇవ<br>అన్యాన్ దేవాన్;<br>స హి ఏనత్ నేదిష్ఠమ్<br>పస్పర్శ, స హి ఏనత్<br>ప్రథమో విదాం చకార 'బ్రహ్మ'-ఇతి॥** | ఇంద్రదేవుడు అన్య దేవతలను అధిగమించినవారైనారు.<br>బ్రహ్మమును ఆయన అతి సమీపంగా దర్శించి పరతత్త్వ స్పర్శానుభవులైనారు. 'సర్వము బ్రహ్మమే' అని గమనించినవారైనారు.<br>(నాటకములోని ఒక పాత్రకు సంబంధించిన సంఘటనలు ఆ పాత్రధారునిపై ఆపాదిస్తామా? రచయితవి కదా!) ఈ జగత్ సంఘటనలన్నీ పరమాత్మ విరచితం. స్వస్వరూప పరబ్రహ్మముయొక్క వినోదము. |
| **4** **తస్య ఏష ఆదేశో<br>యదేతత్ (యత్ ఏతత్) విద్యుతో<br>అవ్యద్యుతదాత్ ఆ ఉ 3<br>ఇతీతి న్యమీమిషదా 3(అ-ఉ) ఇతి అధిదైవతమ్॥** | ఆ బ్రహ్మముయొక్క ఆదేశము చేతనే, అహో! మెఱుపు మెరుస్తోంది!<br>జీవులు కనురెప్పల కదలికలు కూడా అద్దాని రచనా క్రియా విశేషమే। ఈ ప్రకృతి, ప్రకృతి దేవతలు- ఇదంతా ఆ పరమాత్మయొక్క అధిదైవత్వముయొక్క ప్రదర్శనావిన్యాసమే। ఆత్మజ్యోతి యొక్క వెలుగే। ఆత్మశక్తి ప్రదర్శనమే। |
| **5** **అథ అధ్యాత్మమ్<br>యత్ ఏతత్ గచ్ఛతి ఇవ చ<br>మనో అనేన చ<br>ఏతత్ ఉపస్మరతి<br>అభీక్ష్ణం సంకల్పః॥** | ఇక, ఆత్మయందు ఇదంతా బ్రహ్మముయొక్క - అధ్యాత్మ్య- అభివ్యక్తీకరణము దృష్ట్యా మనము చూచినప్పుడు....<br>పరబ్రహ్మము వలననే మనస్సు ఇద్దానిని (ఈ ప్రపంచమును) తెలుసుకొంటోంది. నడిపిస్తోంది. జ్ఞాపకరూపంగా కలిగి ఉంటోంది. ఆత్మయొక్క (బ్రహ్మముయొక్క) 'మనస్సు' అనే ఉపకరణమే ప్రపంచమును ఊహిస్తోంది. సంకల్పిస్తోంది. సంకల్పములను విరమిస్తోంది. |
| **6** **తద్ధ (తత్ హ) తద్వనం నామ<br>తత్ వనమ్ ఇతి ఉపాసితవ్యమ్,<br>స య ఏతత్ ఏవమ్ వేదా అభి హి ఏనమ్<br>సర్వాని భూతాని సంవాంఛంతి॥** | ఈ జగత్తు, జీవులు - ఇదంతా బ్రహ్మముయొక్క స్వకీయ ఉద్యానవనసంచారము. ఇదంతా బ్రహ్మముయొక్క వనము (This is all the Garden of Divinity - బ్రహ్మము)....అని ఉపాసించవలసినది. ఇది దేవతలు మరచారు.<br>ఆ పరబ్రహ్మమును ఈ సమస్త - దృశ్య స్వరూప విన్యాసుడుగా ఎవ్వరు తెలుసుకుంటారో, సర్వ సహజీవులను బ్రహ్మము యొక్క సంప్రదర్శనంగా వీక్షిస్తూ ఉంటారో...<br>తదితరజీవులు అట్టి వానిని ఆప్యాయతగా చూస్తారు. సామీప్యత కోరుకుంటూ ఉంటారు. ఆతడు అందరికీ ప్రియుడౌతాడు. |

**(శిష్యుడు)**

**7 ఉపనిషదమ్ భో బ్రూహి। ఇతి॥**

**(గురువు)**

**ఉక్తా త ఉపనిషద్**

**బ్రాహ్మీం వావ**

**త ఉపనిషత్ అబ్రూమ్॥ ఇతి॥**

**శిష్యుడు :**

స్వామీ! నాకిప్పుడు ఇక ఉపనిషత్ చెప్పండి. ఉపనిషత్ వాణి వినిపించండి

**గురువు :**

నాయనా! నీకు ఉపనిషత్ వాణియే చెప్పబడిందయ్యా! మనం చెప్పుకున్నదంతా బ్రహ్మమునకు సంబంధించినదే కదా! నీకు నాచే బోధించబడింది ఉపనిషత్తే!

---

**8 తస్యై తపో – దమః కర్మ ఇతి ప్రతిష్ఠా**

**వేదాః సర్వాంగాని**

**సత్యమ్ ఆయతనమ్॥**

తపస్సు - దమము - కర్మ బ్రహ్మమునందే ప్రతిష్ఠితము. అవన్నీ బ్రాహ్మీదృష్టియొక్క సిద్ధికై సాధనలు కూడా.

వేదమునకు, వేదమహావాక్యములకు నివాసస్థానము పరమసత్యమగు బ్రహ్మమే। సమస్తమునకు కారణ కారణము, ఆధారము, ఆధేయము బ్రహ్మమే।

---

**9 యో వా ఏతామ్ ఏవమ్ వేద**

**అపహత్య పాప్మానమ్**

**అనన్తే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి।**

**– ప్రతితిష్ఠతి**

**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

**ఓం సహ నావవతు। సహ నౌ భునక్తు।**

**సహ వీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు।**

**మా విద్విషావహై।**

**ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥**

(యో వై) ఎవ్వరైతే (ఉపనిషత్ పాఠ్యాంశమగు) పరబ్రహ్మము గురించి "సర్వము బ్రహ్మమే కర్తృత్వమంతా బ్రహ్మ సంబంధమే" అనురూపంగా తెలుసుకుంటారో, అట్టి వారు సర్వ పాపభావముల నుండి, నిరుత్సాహముల నుండి విముక్తులగుచున్నారు.

అనంతమైన, అత్యున్నతమైన స్వర్గలోకమును కూడా దాటివేసి, బ్రహ్మలోకమునందు ప్రతితిష్ఠతులగుచున్నారు. బ్రహ్మమునందు స్థానము పొందుచున్నారు.

బ్రహ్మప్రతిష్ఠులై ప్రకాశిస్తున్నారు। బ్రహ్మమే అగుచున్నారు।

**ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥**

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 3 కేనోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



### శాంతి పాఠము - 1

మన ఇరువురికి అనన్యము, అమృతము అగు ఆ **పరబ్రహ్మము** (లేక) **- పరతత్త్వము**...గురు శిష్యులమగు → మన ఇరువురిని సదా **పరిరక్షించునుగాక! సదా పరిపోషించునుగాక!**

మన ఇద్దరము కూడా **వీర్యవంతులము, సముత్సాహవంతులము ఉద్యమవంతులము అయి మన సహజరూపమగు పరబ్రహ్మతత్త్వముయొక్క అనుగ్రహము - అనుభవము కొరకై** శ్రద్ధగా **పరిశ్రమించెదముగాక!**

మన ఈ **అధ్యయనము - స్వాధ్యాయము** మన ఇరువురి పట్ల, (మరియు) తదితర అధ్యయనులపట్ల తేజోవంతమై విరాజిల్లునుగాక!

"నేను బాగా చెప్పుచున్నాను. శిష్యుడికి అర్థం కావటం లేదు! నేను బాగా వింటున్నాను. మా గురువుకు చెప్పటం కుదరటం లేదు!" - ఇటువంటి పరస్పరమైన దురవగాహన - ద్వేషములు మనమధ్య ఏర్పడక, బలహీనభావములు మటుమాయమగును గాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః॥

మనయొక్క - ఆధ్యాత్మిక = భౌతిక సంబంధమైన ....,
ఆధి దైవిక = అశరీర - అరూప ప్రజ్ఞలకు సంబంధించిన.... దేవతాయత్తములైన,
ఆధి భౌతిక = నామరూపాత్మక ప్రకృతి సంబంధములైన పరిమిత భావనలు

**ఆత్మభావనయందు సశాంతించినవై ఉండును గాక!**

### శాంతి పాఠము - 2

'ఓం'కార సంజ్ఞారూపమగు బ్రహ్మమును ధ్యానిస్తూ, అన్వయించుకొని - స్ఫూర్తిపొందుచూ - అనుభూత పరచుకొనుచున్న మార్గములో....

→ నా ఈ దేహాంగములు **ఆప్యాయత** (Lovelyness) సంతరించుకొనునుగాక!

→ ఈ నా వాక్కు, ప్రాణములు, దృష్టి, వినికిడి, శక్తి, ఈ సర్వ ఇంద్రియములు - ఇవన్నీ కూడా **ఆత్మభావన - అనుభూతులకై సహకరించుటకు సంసిద్ధమగును గాక!**

→ అవన్నీ కూడా ఉపనిషత్ వాఙ్మయముచే వివరించబడుచున్న **బ్రహ్మతత్త్వమును** గ్రహించటానికి, వివేచన సామర్థ్యము (Logical ability) కొరకు సహకరించునుగాక।

→ ఆత్మజ్ఞుల సుస్పష్టానుభవమగు బ్రహ్మము పట్ల **'అనిరాకరణము'** కలిగి ఉండెదను గాక! నిరాకరణము నాయందు లేకుండునుగాక.

→ ఆ పరబ్రహ్మము కూడా నా పట్ల **'అనిరాకరణము'నే కలిగి ఉండును గాక! అనుగ్రహించును గాక।**

→ **నాపట్ల బ్రహ్మము యొక్క అనిరాకరణమే ప్రకటనమగుచు ప్రకాశించును** గాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః॥

# ప్రథమ ఖండము

**శిష్య ఉవాచ: శిష్య ప్రశ్న**

స్వామీ! మహాత్మా! బ్రహ్మజ్ఞా! సద్గురూ!

**వ్యష్టిగా** → ఈ దేహములో జ్ఞానేంద్రియములు – కర్మేంద్రియములు, మనస్సు, ప్రాణశక్తి (అట్లాగే)

**సమష్టిగా** → విశ్వములో వాటి వాటియొక్క సమిష్టితత్త్వములు కనిపిస్తున్నాయి కదా!

**ఇవన్నీ వాటి వాటికవే ఏర్పడి ప్రవర్తిస్తున్నాయని నాకు అనిపించటం లేదు.** వాటన్నిటికీ మరింకేదో ఆధారమై, ప్రేరణమై, వాటి ఉత్పత్తికి ప్రజ్ఞారూపమై ఏదో ఉండి ఉండాలని తోచుచున్నది. అట్టి మూలాధారము, ఆదికారణము అగునది ఏది? దయచేసి బోధించవలసినదిగా శరణువేడుకొనుచున్నాను!

→ ఈ మనస్సు ఎల్లప్పుడు ఏవేవో విషయాలపై ప్రసరిస్తోంది కదా! అట్టి ఈ మనస్సును కదల్చుచున్నది, ప్రేరేపించునది ఏది? (లేక) ఈ మనస్సు తనకు తానే కదలుచున్నదా?

→ ఏ తత్త్వముచే నియోగించబడినదై (యుక్తమై) దేహమునకు ప్రథమము – అతిముఖ్యము అయినట్టి 'ప్రాణశక్తి' ఈ భౌతిక దేహమునందు, (అదేరీతిగా) ఈ విశ్వమంతా – సంచారములు (ప్రయతి) సలుపుతోంది? (లేక) ప్రాణశక్తి తనకు తానే దేహములో ప్రవేశించి ఈ రక్తమాంసమయ రూపమును జీవింపజేస్తోందా?

ఏ దివ్యతత్త్వముయొక్క సహాయంచేత – అద్దాని.... ఇచ్ఛానుసారంగా **(ఇష్టమును అనుసరించి)** :

- ఈ నోరు వాక్యాలు పలుకుతోంది? పలుకగలుగుతోంది?
- చెవులు శబ్దములను వింటోంది? వినగలుగుతోంది?
- ఈ కళ్ళు దృశ్య విషయములను చూస్తోంది? చూడగలుగుతోంది?

(లేక) – ఈ నోరు, చెవులు, కళ్లు – తమకు తామే పలకటము, వినటము, చూడటము నిర్వర్తించగలుగుచున్నాయా?

దయయుంచి వివరించండి!

**(ఆచార్యోవాచ : ఆచార్యవర్యులు చెప్పుచున్నారు)**

నాయనా! ఇప్పుడు సరిఅయిన విశ్లేషణమే అడుగుచున్నావయ్యా!

ఏదైతే...,

- ఈ చెవులకు – వింటున్న రూపంగా – చెవికే చెవి అయి ఉన్నదో...., **(చెవితో వింటోందో),**
- ఆలోచనలు చేస్తున్న మనస్సుకే మనోరూపమై ఉన్నదో...., **(ఆలోచనలు చేస్తూ ఉన్నదో),**
- వాక్కుకు ప్రేరణ రూపమై, వాక్కుకే వాక్‌రూపమై చెన్నొందుతోందో..., **(మాటలను నోటితో పలికిస్తోందో)**
- ప్రాణములను దేహములోను – విశ్వమంతా కూడా నియమిస్తూ, శక్తి స్వరూపమగు ప్రాణములకే "ఈశ్వరుడు – ప్రాణేశ్వరుడు, అయి, ప్రాణశక్తి తనదై, ప్రాణములకు సొంతదారు" అయి ఉన్నదో... **(తనదైన ప్రాణశక్తిని ప్రదర్శిస్తోందో),**
- చూపులను నియమిస్తూ, చూస్తూ, కళ్ళకే కళ్ళు అయి ఉన్నదో....(దృష్టికి దృక్‌రూపమై ఉన్నదో),

**అట్టి స్వస్వరూప – సర్వస్వరూప ఆత్మయే నీవు అడిగినట్టి అన్నిటికీ ప్రేరణరూపం!**

ఆత్మయొక్క ప్రత్యుత్సాహము చేతనే ఈ దేహములో జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు చేతనమగుచున్నాయి. అవి స్వతఃగా చేతనములు కావు. ధీశక్తి, సూక్ష్మబుద్ధిగల ధీరుడు – ఇక్కడ ఇంద్రియములను, మనస్సును, ఆ మనస్సు చూస్తూ ఉన్న లోకములను, లోక దృశ్యములను అధిగమించినవాడై, **దేహత్వము నుండి దేహిత్వము సంతరించుకుంటున్నాడు.** ఇంద్రియ – మనో – బుద్ధులను ఆత్మవిన్యాసంగా దర్శిస్తూ...., **అమృత స్వరూపుడగుచున్నాడు. మార్పు చేర్పులు లేని కేవలాత్మత్వము సంతరించుకొనియే లీలావినోదంగా దృశ్యమునందు పాల్గొనుచున్నాడు.**

ఈ మనో– వాక్– ప్రాణముల ప్రదర్శన → ఏ ఆత్మ చైతన్యముయొక్క స్వకీయ ప్రదర్శనా చమత్కారమో– అట్టి బ్రహ్మమును :-

- ఈ భౌతికమైన కళ్లు చూడజాలవు. చూపు ప్రసరించలేదు. చూపును తన దర్శనశక్తిగా వెలిగించునది అయ్యది కదా! కళ్లు వస్తువులను చూడగలవుగాని, **చూస్తూ ఉన్నవానిని అవి** చూడలేవు.
- ఈ వాక్కు బ్రహ్మమును వర్ణించలేదు. వాక్కును బ్రహ్మమే ప్రదర్శించుచున్నది. వాక్కుకే వాక్కు! వాక్కు ఆత్మయొక్క కళాత్మక ప్రదర్శనమే। అంతేగాని, వాక్కుకే ఆధారమైన చైతన్యమును పలుకలేదు. నోరు బాహ్య విషయములు మాట్లాడగలదుగాని, ఆ మాట్లాడేవానిని తన మాటలచే **ప్రకటించలేదు.**
- మనస్సు అద్దానిని అందుకోలేదు. ఈ మనస్సు ఆ పరతత్త్వము యొక్క భావనారూపము. బ్రహ్మము మనస్సుకే మనస్సు! ఆలోచనలకు ఆవల – ఆలోచించువాని (The Thinker) రూపమును ఆలోచనలు ఆలోచించలేవు. అన్యములైన వాటి గురించి మాత్రమే మనస్సు ఆలోచనలు చేయగలదు.
- ఆత్మను బుద్ధి కూడా గ్రహించలేదు. బుద్ధి అద్దానిది కదా! అందుచేత బుద్ధితో "ఆత్మ ఇట్టిదే!"....అని నిర్ణయించలేము. బుద్ధి ఎవ్వరిదై యున్నదో అద్దానిని బుద్ధి గ్రహించలేదు."బుద్ధియే తనదైన వాని గురించి"–ఈ బుద్ధి నిర్వచించి, నిర్ణయించి **'ఇంతే'** అని ఎట్లా ప్రకటించగలదు?

సర్వము ఎరుగుచున్న అద్దానిని, **అద్దానియొక్క ఉపకరణమగు 'ఎరుక'ను** ఉపయోగించి (పరబ్రహ్మమును) ఎరుగుట ఎట్లా?

సర్వకారణములకు మూలకారణమైన ఆత్మ: –

→ ఈ తెలియబడుచున్న సర్వమునకు ఆవల – పరమై, పరమాత్మ స్వరూపమై ఉన్నది. తెలియబడేదానికి భిన్నమై ఉన్నది. అయితే, **తెలియబడేదంతా ఆ బ్రహ్మముయొక్క విన్యాసమే। స్వకీయ సంప్రదర్శనమే।**

→ **'మాకు తెలియదు'** అనురూపంగా తెలియబడకపోవటానికి కూడా ఆవల, **"తెలియటానికి–తెలియకపోవటానికి"** కూడా ఆధారమై ఉన్నది ఆ పరతత్త్వమే! పరమేష్ఠియే!

→ తెలిసీ – తెలియని దానిని ఆ రూపంగా తెలుసుకొనుచున్నది కూడా – ఆ బ్రహ్మమే! పరబ్రహ్మమే!

అందుచేత తెలుస్తున్న దానికి భిన్నము। తెలియనిదానికి అతీతము। సాక్షి। **అయితే, ఆత్మకు తెలియబడేదంతా ఆత్మకు అనన్యమే।**

→ తెలిసినవారు – తెలియనివారు కూడా సందర్భరూపంగా వేరువేరు భావ – అభిప్రాయ – గుణసమన్వితులు అయి ఉన్నట్లు కనిపిస్తున్నప్పటికీ .... **సహజముగా బ్రహ్మమే** స్వరూపముగా కలిగి ఉన్నారు. అనగా, **తెలిసినవారు – తెలియనివారు కూడా బ్రహ్మముయొక్క వ్యక్తీకరణమే!**

ఓ స్నేహితుడా! అద్దానిని తెలుసుకున్నట్టి, – అనుభూతము చేసుకున్నట్టి పూర్వ మహాశయులు, తత్త్వజ్ఞులు – ఈ విధంగా బ్రహ్మము గురించి చెప్పుచుండగా మేము విన్నాము.

మనస్సుయొక్క తార్కికశక్తి ఆత్మను ఏమరచి → **దృశ్యతాదాత్మ్యము, ఇంద్రియ విషయ సమ్మిళితము,** అయి ఉంటున్నప్పుడు... (బ్రహ్మమును ఏమరచిన సందర్భములలో) – **శాస్త్ర ప్రవచనములు, సద్గురు అనుభవవాక్యములు** ఆత్మగురించిన జ్ఞానమునకు ప్రమాణములుగా అగుచున్నాయి. ఈ జీవునికి తత్త్వజ్ఞానము అత్యవసరమౌతోంది.

**వేద = తెలియబడేది. అంతము తెలియబడేదానికి ఆవలగల "తెలుసుకొనుచున్నట్టివాడు" తెలియబడేదంతటికీ ఆవల – తెలుసుకొనుచున్నట్టిదే (వేదాంత స్వరూపమే) అది।**

గురువాక్యములు మననం చేసుకుంటూ మరొక్కసారి వేదాంత శాస్త్ర ప్రవచనములు చెప్పుచున్నాను! విను!

మనందరి కేవలీరూపమగు బ్రహ్మము లేక పరస్వరూపము (పరతత్త్వ స్వరూపము; ఆత్మస్వరూపము; (బ్రహ్మము) ; –

- **వాక్కుచే ప్రకటించబడేది కాదు.** వాక్కుయే అద్దానిచే ప్రకటించబడుతోంది.
- కానీ అద్దాని గురించి చెప్పుకోవాలంటే వాక్కునే మనము ఉపయోగించక తప్పదు కదా! అందుచేత తత్త్వ శాస్త్రములు, తత్త్వజ్ఞులగు గురువులు –వాక్కు, వాక్యములను ఉపయోగించియే 'ఆత్మ' గురించి బోధిస్తున్నారు.
- ఏది వాక్కును ప్రదర్శిస్తోందో...**అదీ బ్రహ్మము!** – అని గ్రహించబడుగాక! అంతేగాని...వాక్కుకు విషయమైనది, వాక్కుతో ఉపాసించేది బ్రహ్మము కాదు సుమా!

(వాక్కుతో ఉపాసించబడేది **బ్రహ్మముయొక్క అవగాహన – అనుభూతులకు** సాధన – ఉపకరణము మాత్రమే।)

–ఇష్టదైవోపాసన ఆర్తుడై – జిజ్ఞాసువు అయిమాత్రమే నిర్వర్తిస్తూ ఉంటే అది బ్రహ్మోపాసన కాదు.

అయితే, ఇష్ట దైవమే **"సర్వరూపములు తానై–సర్వసాక్షిగా వేరై"** అనురూపంగా ఉపాసించబడుచూ... స్వకీయత్వము కూడా ఇష్టదైవమునకు చెందినదిగా ఉపాసించబడుచుండగా, ఇక ఆపై అది క్రమంగా **పరబ్రహ్మోపాసన** అయి **'శివోఽ హమ్'**గా రూపుదిద్దుకొంటోంది.

**దేనికి తనయొక్క శబ్ధశక్తిచే ఇక్కడి ప్రదర్శనరూపమగు వాక్కు ఒక ఉపకరణమో, అదీ బ్రహ్మము.** (That for which sound is an usage instrument)

<u>మనస్సు - ఆలోచనలు - ఆలోచించబడుచున్నవి :</u>

- ఈ మనస్సు **దేనిచే గ్రహించబడుతోందో, ఎద్దానికి చెందినదై ఉన్నదో**... అదీ **'బ్రహ్మము'**... అని తెలుసుకొనబడుగాక! అంతేగాని... ఈ మనస్సు – **దేనినైతే గ్రహిస్తోందో... అది బ్రహ్మము కాదు.**
- అనేక అభిప్రాయములు – అభిరుచులతో మనస్సుచే ఏది ఆశ్రయిస్తోందో అది బ్రహ్మముయొక్క పూర్ణార్థము కాదని తెలుసుకొనబడుగాక!

ఈ దృశ్య ప్రపంచాన్ని మనస్సు గ్రహిస్తోంది కదా! విషయముల – వస్తువుల ప్రతిబింబ మాత్ర బాహ్యరూపములను (The Reflection of Incidents and matters) మనస్సు ఇంద్రియములద్వారా గ్రహించి ఆత్మయొక్క సమక్షములో నిలుపుతోంది. ఆత్మ యొక్క అంశ జీవలోకములో ప్రకాశించినదై జీవాత్మగా... **తన బుద్ధియొక్క ఒక విభాగము సహాయంతో ఆ సమాచారమునకు అర్థమును, చిత్తము సహాయంతో అనుభూతిని ఆపాదిస్తోంది.** అప్పుడు అది జగదనుభవంగా ఆత్మయొక్క అంశచే స్వీకరించబడి, జగత్ దృశ్యముగా ప్రసిద్ధి పొందినదౌతోంది.

- మనస్సు యొక్క **సమాచారసేకరణ విభాగము ఆత్మచే స్వయం కల్పితము.**
- ఈ **మనస్సు దేనిచే నియమించబడుతోందో, (లేక) దేనియొక్క క్రీడా వినోదమునకు ఆటవస్తువు వంటిదో అది మనము ఉపాసించవలసిన అసలైన తత్త్వమగు 'ఆత్మ'.**

***దేనికి ఈ మనస్సు ఒక ఉపకరణముగా అగుచున్నదో...అదీ బ్రహ్మము*** (That to which the thought is an instrument)

<u>**చక్షువులు – చూపు – చూడబడుచున్నవి (దృష్టి) :**</u>

- ఈ కళ్ళు దేనిని చూస్తున్నాయో....(దృశ్యములో ఒక విశేషము), అది బ్రహ్మము (లేక) ఆత్మ కాదు.
- **ఈ కళ్ళతో <u>ఏది చూస్తూ ఉన్నదో</u>...అదీ ఆత్మ।**

కళ్ళకు కనిపించేది, అట్టి కనిపించేదేదో – అద్దానిపట్ల నిర్వర్తించే ఉపాసన – బ్రహ్మోపాసన కాదు. అనగా...,దృష్టిచే దృశ్యముగా కనిపిస్తూ **ఏదైతే ఉపాసించబడుచున్నదో.... అది బ్రహ్మము కాదు.**

**...ఆ దృష్టి – ద్రష్ట ఎద్దానిదో...అదీ బ్రహ్మము।** (That for which perception and perceiver are instruments)

<u>**చెవులు – వినికిడి – వినబడుచూ ఉన్నవి :**</u>

- **ఏదైతే చెవులకు విషయములై వినబడుచూ, ఉపాసించబడుచూ ఉన్నదో, అది బ్రహ్మము కాదు.**
- <u>ఏది చెవులను ఉపయోగించుకుంటూ, వినుచూ ఉన్నదో...అది బ్రహ్మము.</u> వినికిడిని వినియోగించు **తత్త్వము బ్రహ్మత్వము** – అని గమనించబడుగాక!
- **అంతేగాని, చెవులతో వింటూ ఉపాసించబడుచున్నది ఏదో, అది (బ్రహ్మము) కాదయ్యా!**

ఏది తనయొక్క వినికిడిశక్తిచే చెవులను ఉపకరణంగా ఉపయోగించుకుంటోందో...అదీ 'బ్రహ్మము' (That for which Listening and the Ears are mere instruments)

<u>**ప్రాణములు – ప్రాణశక్తి :: చలనము – చలనశక్తి :**</u>

- మనము ఏ ప్రాణశక్తిచే ఊపిరి పీలుస్తున్నామో, దేహాంతర్గతంగాను, దేహబాహ్యమున ఏ శక్తిచే కదల్చుచున్నామో...అది బ్రహ్మము కాదు.
- అట్టి ప్రాణశక్తి <u>ఎవ్వరిదో</u>, ఎద్దాని <u>ఉపకరణమో</u>, ఎవ్వరిచే <u>నియమించబడుచున్నదో, వినియోగించబడుచున్నదో</u> **– అట్టి ప్రాణేశ్వర నియామకుడే బ్రహ్మము (లేక) ఆత్మ.**

అంతేగాని....,

– జనులు పూజిస్తున్న ప్రాణశక్తియొక్క బాహ్యరూపముగాని, ప్రాణశక్తిచే ఉపాసించబడేవి (బింబము – నాదము – వెలుగు మొ॥విగాని) బ్రహ్మము కాదు. అవన్నీ ఉపాసనా సాధనములు! ప్రాణోపాసనయొక్క ఉత్తరోత్తర సాధన స్థితులు <u>ప్రాణశక్తిని ఉపయోగిస్తూ</u> **– "ఆ ఉపాసిస్తున్నవాడే బ్రహ్మము"**....అని తెలుసుకో! <u>[That by whome the Prana Energy is being adored is "Brahmam"]</u>

ఈ మన ఇంద్రియములు ఆయా కార్యములు...నిర్వర్తించటానికి అవసరమగుచున్న ప్రజ్ఞ ఎవరిదో, ఎవ్వరివలన సామర్థ్యము పొందుచూ ఉన్నాయో, అట్టి మూలచైతన్యమగు స్వస్వరూపాత్మసత్తయే బ్రహ్మముగా గ్రహించబడుగాక! అర్థము చేసుకోబడుగాక! గమనించబడుగాక!

ఆత్మయే → జగత్ ద్రష్టకు – ఆ ద్రష్ట యొక్క దృశ్యానుభవములకు కేవల **సాక్షి – నియామకుడు – ప్రేరకుడు** కూడా!

అయితే....

స్వప్న ద్రష్టయే.... స్వప్నాంతర్గత ద్రష్టగా, స్వప్న దృశ్యముగా ప్రదర్శితుడగుచున్నతీరుగా, మనో – ఇంద్రియ – బుద్ధి – చిత్తాదుల ద్రష్టయే,

....ఆ అన్ని రూపములుగా చెన్నొందుచూ,

....వాటి వాటి విషయపరంపరలుగా ప్రకాశించటం జరుగుతోంది.

అందుచేత,.....సమస్తము ఎద్దాని సంప్రదర్శనమో (That the Expression of which all this) - <u>అదియే ఆత్మ॥</u>

***= అన్యముగా కనిపిస్తూ, అనిపిస్తూ ఉన్నటువంటి ఈ సమస్తము కూడా ఆత్మ చేతనే! ఆత్మ స్వరూపమే!*** ఆత్మయే జాగ్రత్ ద్రష్ట అయి జాగ్రత్ దృశ్యానుభవమంతా తనకొరకై తానే కల్పన చేసుకొని ఆస్వాదించటం జరుగుతోంది. ఆత్మయే – జాగ్రత్‌కు, స్వప్నమునకు, సుషుప్తికి, జన్మ – జన్మాంతరములకు – ద్రష్ట, దర్శనము, దృశ్యములకు కూడా <u>కారణ–కారణము.</u>

# ద్వితీయ ఖండము - బ్రహ్మము యొక్క ఎరుక

## (అవిజ్ఞాతం – విజ్ఞాతం)

**ఆచార్యులవారు:** ప్రియవత్సా! ఏది స్వకీయ–ఇంద్రియ–మనో–బుద్ధి–చిత్త–అహంకారములనబడే ఉపకరణముల ద్వారా స్వీయ భావనా పరంపరల విన్యాసముగా 'జాగ్రత్ దృశ్యము'ను ఎరుగుచున్నదో, ఆ <u>**ఎరుకను కల్పించుకొనుచున్న స్వస్వరూపాత్మయే బ్రహ్మము తెలియబడేదంతా – తెలుసుకొనుచూ ఉన్న ఆత్మకు ఏ స్థితియందు అన్యము కాదు.**</u>

అట్టి స్వకీయమగుఅద్వితీయ బ్రహ్మమును ఎరుగునది ఎట్లా? ఒకవేళ **"బ్రహ్మము (ఈ దృశ్యములో) ఇట్టిదైయున్నదని నాకు తెలిసింది"**...అని నీవు (ఏవైనా రూప నామాల దృష్ట్యా) అనుకుంటున్నట్లైతే,...**అప్పుడు బ్రహ్మము గురించి తెలియనట్లే.**

ఒకవేళ నీవు **"(బ్రహ్మ – విష్ణు – రుద్ర – ఇత్యాది) ఏదైనా ఒక్క దేవతా రూపము మాత్రమే బ్రహ్మము"** అని భావన చేస్తున్నావనుకో.... అప్పుడు నీవు బ్రహ్మము గురించి స్వల్పంగా మాత్రమే గమనిస్తున్నట్లు!

అట్లా కాకుండా.....

**నీ ఇష్టదేవతయే ఈ సర్వ జగత్ రూపములుగా కనిపిస్తూ, ఇదంతా ఒక్కటిగా అనిపించటం ప్రారంభము అయిందా,**....అప్పుడిక నీవు బ్రహ్మమును దర్శించు మార్గములో అడుగులు వేస్తున్నట్లే! శివతత్ త్వమ్। నీవే శివుడవు। విష్ణుతత్త్వమ్। నీవే విష్ణువు।

Step 1 : (1) నేను భక్తుడను, ఆ పరమాత్మ ఎక్కడో (వైకుంఠంలోనో, కైలాసంలోనో మణిద్వీపములోనో) ఉన్నారు.

Step 2 : (2) ఆ మహావిష్ణువు(లేక) శివుడు (లేక) దేవి నాకు కనబడే <u>అందరిలో</u> ఉన్నారు.

Step 3 : (3) పరమాత్మ అందరుగాను, సమస్తము అయి ఉన్నారు.

Step 4 : (4) నేనుగా అనిపించేది – అగుపించేది ఆ పరమాత్మయే! నాదంతా ఆయనదే। ఆయనయే।

Step 5 : (5) నేనే ఇదంతా! (బ్రహ్మానుభవం) **(అహం బ్రహ్మోస్మి। త్వం బ్రహ్మ। ఇదం బ్రహ్మ। ఇదమ్ అహమేవ।** – ఇదియే అనన్యోపాసన. అనన్యచింతన.

**"నేను బ్రహ్మమును బాగుగా తెలుసుకున్నాను"** ...అని నేను **అనుకోవటము లేదయ్యా!** అది తెలియబడేది కాదు। అంతేకాదు....

**"బ్రహ్మము నాకు తెలియదు"....అని కూడా నేను అనటము లేదు.** ఎందుకంటావా...బ్రహ్మము నాకు తెలియకపోవటమనేది లేదు. నాలో "తెలుసుకొనుచున్నవాడు" – నాకు తెలియకుండా ఎట్లా ఉంటాడు? అది నీకు – నాకు మనందరికీ తెలిసినదే! మనందరిలో అది తెలియనివారెవ్వరూ లేరు! మనమంతా స్వస్వరూపము – సహజరూపము దృష్ట్యా చూస్తే 'బ్రహ్మమే' – అయి ఉన్నాము కదా! మనమంతా మన అపరిమితత్వము – అప్రమేయత్వము తెలియనిదేమీ కాదు! బ్రహ్మము గురించి అందరికీ తెలిసినదే। **ఆబాల గోప విదిత।**

"నాకు బ్రహ్మము గురించి ఏమీ తెలియదు" అని మనలో ఎవ్వరైనా అంటారేమో! వారిని దృష్టిలో పెట్టుకొని చెప్పుచున్నాను. ఆ **తెలియదనుకునేవారందరిచే బ్రహ్మము తెలియబడియే ఉన్నది.** ఎందుకంటే...

- జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు, దేహములు, సంబంధములు నావి. "నేను ఒక దేహమును, జీవుడను"....అని అనుకొనుచున్నప్పటికీ,
- **"ఇవన్నీ ఉన్నప్పుడు లేనప్పుడు నేను నేనే! నేను ఉన్నాను కాబట్టియే నాకు వేరుగా ఇవన్నీ నాచే కల్పనమగుచున్నాయి"**....అని ఎవరికి తెలియదు? తెలిసియే ఉన్నది. అవన్నీ ఉన్నప్పుడు – లేనప్పటి స్వస్వరూపము బ్రహ్మమే! ఈ విధంగా ప్రతి ఒక్కరు **స్వతః స్వభావ సిద్ధముగా బ్రహ్మమే అయి ఉన్నారు!** అందుచేత 'బ్రహ్మము నాకు తెలియదు' అనుకొనువాడు (తనకు తాను తెలుసుకాబట్టి) – బ్రహ్మమును ఎఱిగియే ఉన్నాడు.

చమత్కారంగా చెప్పుకోవాలంటే...

ఈ విధంగా...బ్రహ్మము....

| | |
|---|---|
| **అవిజ్ఞాతం విజానతామ్** ⟶ | తెలిసినవారికి అది తెలియనిదే అగుచున్నది! |
| **విజ్ఞాతం అవిజానతామ్** ⟶ | తెలియనివారికి అది తెలిసినదే అయి ఉన్నది! |

**శిష్యుడు : –** గురువర్యా! అట్టి బ్రహ్మము నాకు అనుభవమై సిద్ధించగలదా? ఏవిధంగా అనుభవమవగలదు?

**ఆచార్యులవారు :**

నాయనా! ఆత్మజ్ఞులు, బ్రహ్మజ్ఞులు అగు మహనీయులచే బోధించబడుచుండగా...స్వవిచారణచే అది తప్పక తెలియబడగలదని కూడా గ్రహించు. వారి బోధలు శ్రద్ధగా వినటంచేత రూపుదిద్దుకోగల 'స్ఫూర్తి' (Sense of Enlightenment) చే నిశ్చయముగా అమృతత్త్వమును పొందగలవయ్యా! స్వానుభవము చేతనే ఈ వాక్యము చెప్పబడుచున్నది సుమా! ఇందులో ఈషన్మాత్రము అనుమానమే లేదు.

ఆత్మవేత్తల ప్రవచనముల ప్రభావముచే నీకు నీవుగా, నీ బుద్ధి సునిశితము, విస్తారము అగుచుండగా, – **'అహమ్ ఆత్మ'** భావన రూపుదిద్దుకోగలదు. అట్టి ఆత్మభావనచే **"నేను దేహబద్ధుడను"** అను అల్పత్వమును పాము కుబుసమువలె త్యజించినవాడవై, వీర్యము, – స్థైర్యము పొందగలవు.

ఆత్మవిద్యచే

- "నేను దేహబద్ధుడను కాను. సందర్భబద్ధుడనుకాను. దృశ్యబద్ధుడను కాను. జన్మ–కర్మలచే బద్ధుడను కాను"
- "ఈ దేహము యొక్క బాల్య – యౌవన – వార్ధక్య – జరామరణ జగన్నాటక సంఘటనలకు సంబంధితుడను కాదు.
- అవన్నీ నాకు సంబంధించినవి కావు.
- దేహ ధర్మములైన రాక – పోకల (పుట్టుక – చావుల)చే నేను పరిమితుడను కాదు.

***నేను సర్వదా అపరిమితమగు ఆత్మస్వరూపుడను"–అను అవగాహన పెంపొందగలదు. తత్ఫలితముగా అమృతత్వము సంతరించుకొంటావు!***

ఓ ప్రియమహదాశయా! బిడ్డా! ప్రియశిష్యా!

**శ్రద్ధావాన్ తత్ ప్రతిష్ఠిమ్ ప్రాప్యసి।** ఇప్పుడే - ఇక్కడే - ఈ దేహమున్నప్పుడే నీవు **ఆత్మతత్త్వమగు బ్రహ్మమును గురించి ఎరుగుట** జరిగిందా....**సత్యమునందు ఇప్పుడు ప్రతిష్ఠితుడవవు కాగలవు.**

ఆత్మజ్ఞానముచే జన్మకర్మములకు ఆవలి ఒడ్డు జేరినవాడవై బంధ విముక్తుడవగుచున్నావు. **'లోకములలో నేను'**ను అధిగమించి, సర్వమునకు కేవల సాక్షివై **"నాయందే స్వప్నమువలె ఈ లోకములన్నీ భావనా మాత్రమై ఉన్నాయి"**...అను స్థానమును అలంకరించగలవు.

అశ్రద్ధ దానాః - అప్రాప్యవాన్। ఒకవేళ, అశ్రద్ధచే-బ్రహ్మతత్త్వమును ఇప్పుడే తెలుసుకోకపోతేనో?...అసత్యమునందు అనేక ప్రయాసలతో కూడిన ప్రయాణములు కొనసాగించవలసి వస్తుందయ్యా! **మహతీ వినష్టి।** గొప్ప నష్టము పొందగలవు-అని ఆప్తులమై గుర్తు చేస్తున్నాము.

ధీరుడు, ఉత్తమ బుద్ధిగలవాడు, **ఈ సమస్త ప్రాణికోట్లయందు బ్రహ్మమును, సమస్త ప్రాణికోట్లను - బ్రహ్మమునందు దర్శిస్తున్నాడు.**

**సునిశితము, ఉత్తమము, విస్తారము** అగు బుద్ధిని ఇప్పుడే సముపార్జించుకో! అట్టి పరమ సాత్వికమైన బుద్ధితో లోక సంబంధమైన ధ్యాసలను, భావాలను, అభిప్రాయములను, అనుబంధములను జయించివేసినవాడవై ఉండు.

అట్టివాడు అమృతత్వ స్వరూపము పొందుచున్నాడయ్యా! జన్మ - మృత్యువులకు కేవల సాక్షియై జన్మ - జీవన్ - మృత్యువులను, ఈ ఇక్కడి మొత్తము తతంగమును, సమస్త దృశ్యమును తనయొక్క **స్వస్వరూప - చిద్విలాసంగా** క్రీడావినోది అయి **ఆస్వాదిస్తున్నాడు.**

ఆత్మానంద స్వరూపుడై, ఈ అన్యముగా కనిపించే సమస్తమును హాయిగా, ప్రశాంతముగా, లీలగా, ఆనందముగా, మౌనంగా చూస్తూ ఉంటున్నాడు.

# తృతీయ ఖండము - బ్రహ్మమే కారణకారణము

**ఆచార్యులు :** ఆత్మతత్త్వమే అన్నిటికీ కారణము (మరియు) కార్యము (Cause as well as effect) కూడా. **తదితరమైనదంతా ఆత్మయొక్క సమక్షంలో ఆత్మచే కల్పించబడి, ఆత్మచేతనే ఆస్వాదించబడే లీలా వినోదమే!** మరి సుఖదుఃఖాలు ఎందుకున్నాయంటావా?

- ఒకడు తన వినోదముకొరకై తనకు తానే స్వప్నమును కల్పించుకొని, ఆ స్వప్నములో సుఖ-దుఃఖ-భయ-ఉద్వేగాలు అనుభవిస్తున్నాడా, లేదా? ఆతని స్వప్నాంతర్గత విశేషాలు మరెవ్వరో బయటనుండి కల్పించటంలేదు కదా! జీవుడు ఆత్మస్వరూపుడై ఉండి కూడా, **ఆ రీతిగా సుఖ - దుఃఖ మిశ్రమంగా ద్రష్ట - దృశ్యత్వములను ఇక్కడ పొందుచున్నాడు.**
- ఒకడు వినోద-విలాసంగా ఒక కథ చదువుచూ, (లేక) ఒక నాటకం చూస్తూ అందులోని సుఖ-దుఃఖ-భయ-ఉద్వేగాలు తనవైనట్లుగా పొందుచున్నాడా, లేదా? **సహజముగా ఆత్మస్వరూపుడగు ఈ జీవుని జగదనుభవము అతీరైనదే!**

ఆత్మయొక్క "మహాకర్తృత్వము - మహాభోక్తృత్వము"ను గమనించక, జగత్‌స్వప్నములో తారసబడే ఆత్మజ్ఞానవిషయమై పరిశీలనలేని సందర్భములలో ఈ జీవుడు **"నేను ఈ ఈ సంఘటనలచే దుఃఖిని. సుఖిని. దేహమునకు, బంధువులు మొదలైనవాటికి చెందినవాడిని"**...అను రూపముగల భావనలను ఆశ్రయించి, క్రమంగా అట్టి భావనలచే తనపై పరిమితత్వమును ఆపాదించుకుంటున్నాడు. "కల" తనదైనవాడు - కలలో కనిపించిన బంధువులకు "చెందినవాడు" అవుతాడా? అవడు కదా! ఈ జాగ్రత్ తనదైనవాడి - జాగ్రత్‌లోని "బంధ-సంబంధములు" అట్టివే।

బ్రహ్మము యొక్క (లేక) ఆత్మ యొక్క ఔన్నత్యమేమిటో గ్రహించాడా, ఈ జగత్ సంఘటనల నాటకీయత్వము గమనిస్తూనే, **ఆత్మౌన్నత్యము యొక్క గమనిక, ఆస్వాదనల** నుండి **<u>చ్యుతి పొందడు.</u>** (Will not get distracted from "SENSE OF SELF)

ఆత్మయొక్క సర్వప్రదర్శనారూపమగు మహత్ శక్తిని, బ్రహ్మముయొక్క తత్త్వమును తెలుసుకొని - ఏమరువని విజ్ఞుడు **"నేను గెలిచాను! ఓడాను! పాపిని! పుణ్యుడిని! స్వర్గలోకవాసిని! మర్త్యలోకవాసిని! పాతాళలోకవాసిని! కర్మబద్ధుడను! సుఖిని! దుఃఖిని"**....ఇటువంటి **న్యూనభావాలు స్వభావసిద్ధంగా పరిత్యజిస్తున్నాడు.**

ప్రియశిష్యులారా! ఈ విషయమును గుర్తు చేస్తూ ఇతఃపూర్వము జరిగియున్న ఇతిహాసవర్ణితమైన ఒక సంఘటనను ఇప్పుడు చెప్పుచున్నాను. వినండి.



ఒకానొకప్పుడు ఒక సందర్భములో దేవతలకు, దానవులకు మధ్య గొప్ప సంగ్రామం జరిగింది. దేవతలు, విష్ణుభగవానుని భక్తి ప్రపత్తులతో శరణువేడసాగారు. ఎట్టకేలకు (చివరికి) ఆ యుద్ధములో పరమాత్మయొక్క సంకల్పానుసారంగా (దైవేచ్ఛచే) విజయము దేవతలను వరించింది. (It is one scene at one point in the **"Story of the World"**)

విజయదుందుభులు మ్రోగిస్తూ దేవతలంతా ఒకచోట సమావేశమైనారు. లోకసృష్టి కథా కల్పనా రూపంగా పరమాత్మ (పరబ్రహ్మము) ప్రసాదించిన విజయమును చూచుకొని ఆ దేవతలంతా ఎంతగానో ఆనందము పొందారు. వారిలో వారు ఒకరి నొకరు అభినందించుకున్నారు. ఆ సభయొక్క కార్యకర్తలు అనేక బహుమతులు ప్రకటిస్తూ, ఇవ్వసాగారు. ఉప్పొంగిపోతూ ఇక, క్రమంగా ఆ దేవతలంతా **"ఆహాఁ! మనము ఎంతో సమర్థులము కాకపోతే ఈనాడు అసురులపై ఈ దిగ్విజయము ప్రాప్తించేది కాదు కదా!"** అని అనుకుంటూ మురిసిపోసాగారు. ఇక ఆపై వారు దానవులపై గెలిచినందుకు ఎవరికి వారే కొంచం కొంచంగా గర్వించసాగారు. వారంతా అసలు విషయం ఏదో మరచిపోయారు.

**అస్మాకం ఏవ అయమ్ విజయో! అస్మాకం ఏవ అయమ్ మహిమ। - ఇతి।**

**మేము కదా, గెలిచింది! మరి ఇదంతా మా సామర్థ్యము, మా మహిమయే కదా! ఎవ్వరైనా కాదనగలరా?"** అని మరింత మరింత గర్వించసాగారు. కొంచము సేపైన తరువాత "మావలన" - అంటే "మావలన" అని అంటూ వారిలో వారు వాదించుకోసాగారు. పరబ్రహ్మము అది చూచి పిల్లలగోలవలె చూచి చిరునవ్వు చిందించారు!

అప్పుడు ఆ పరమాత్మ **"ఈ దేవతలకు బ్రహ్మతత్త్వము యొక్క మహిమను గుర్తు చేయాలి"** - అని సంకల్పించారు. **గర్వము క్షేమము కాదు కదా మరి!**

❖

ఆ దేవతలు విజయోత్సాహాలతో ఉప్పొంగిపోతున్న తరుణంలో, వారు సమావేశమైయున్న స్థానానికి సమీపంగా ఒక భీకరమైన మహాపర్వతమంత యక్షిణీశక్తిరూపము ప్రత్యక్షమై,......ఆ పరిసరాలలో బిగ్గరగా నవ్వుతూ సంచారాలు చేయసాగింది.

దేవతలంతా ఆ యక్షిణీరూపముయొక్క సంచారాలు చూచారు. ఆ బీభత్సమైన రూపి (శక్తి) ఎవ్వరో వారెవ్వరికీ ఏమాత్రము తెలియనే రాలేదు. **"భీకరంగా నవ్వుతూ, కేకలు వేస్తూ సంచరిస్తున్న ఈ అద్భుతశక్తి ఎవ్వరా?"**....అని చూడసాగారు. "ఇది రాక్షసుల మాయ కాదు కదా?" అని సందేహించసాగారు. ఎంతసేపటికీ ఏమీ అర్థమే కావటము లేదు.

అప్పుడు దేవతలంతా కలసి అగ్నిదేవుని సమీపించి, "ఓ జాతవేదా! ఈ దృశ్యముయొక్క ఉత్పత్తి రహస్యమును ఎరిగినవారు మీరు, జనించినదంతా దహించగలిగిన స్వామీ! అగ్నిదేవా! మీరు దయచేసి వెళ్ళి మీ సామర్థ్యమును ఉపయోగించి ఆ అద్భుతమైన శక్తి ఎవ్వరో, ఎవ్వరికి చెందినదో....తెలుసుకుని రండి!"....అని కోరారు.

అగ్నిదేవుడు, **"ఓ! అట్లాగే! ఇప్పుడే వెళ్ళి ఆ శక్తి ఏమిటో - ఎవరిదో తెలుసుకొని అవసరమైతే వశం చేసుకొని, - మరీ, వచ్చి మీకు తెలియజేస్తాను"**...అని పలికి వెంటనే ఆ మహాద్భుతశక్తి ఉన్న ప్రదేశము చేరారు.

**యక్ష మహాశక్తి : (పకపకాబిగ్గరగా నవ్వుతూనే)** ఓహో! ఎవరయ్యా నీవు! ఇటువచ్చావేం?

**అగ్నిదేవుడు :** నేను అగ్నిని, జాతవేదుడు అని నన్ను పిలుస్తారు.

**యక్షిణి :** అయితే ఏమిటంట?

**అగ్నిదేవుడు :**

→ నేను జనించిన దానిని దేనినైనా సరే దహిస్తూ ఉంటాను. భస్మము చేయగలను.

→ నన్ను సర్వజ్ఞుడనిగా భావించి జాతవేద నామధేయం నాకు ఇవ్వబడింది.

→ **వేదతత్త్వము** (తెలియబడే దానియొక్క తాత్త్విక రహస్యము) తెలిసియున్నవాడను. అందుచేత కూడా, జాతవేదుడను.

→ అన్ని దేహాలలో అందరి మనోబుద్ధి చర్యలను **అతిసామీప్యము**గా ఉండి **అంతయు ఎరుగుచూ** ఉంటున్నవాడను.

→ దేహరక్షణా విధానము నానుండే పుట్టినది. దేహాలన్నీ నశించకుండా ఉండటము నాకారణంగానే,

→ యజ్ఞ - యాగములకు ప్రారంభకుడనై హవిస్సులను దేవతలకు జారవేసే **హవ్యవాహనుడను.**

**యక్ష శక్తి :** అది సరేనయ్యా! నీ వీర్య ప్రతాపాలు ఏమిటో అది చెప్పు.

**అగ్నిదేవుడు** : అదాఁ? చెప్పాను కదా! అయినా వినండి. నేను తలిస్తే భూమిపై ఉనికిగల దేనినైనా కూడా దహించవేయగల సామర్థ్యము కలవాడను. నన్నెదిరించి ఈ భూమిపై ఏ ఒక్క వస్తువు నిలువలేదు. వస్తువులన్నీ ఒకానొకప్పుడు నాయందు ప్రవేశించి భస్మమగుచూనే ఉంటాయి. అంతా తెలిసినవాడిని కనుక జాతవేద బిరుదాంకితుడను గదా!

– ఆగ్నేయాస్త్ర రూపుడనై లక్ష్యమును క్షణాలలో దహించగలను.

**మహాయక్షశక్తి** : ఓహో! బాగుబాగు. అది సరే. ఇదిగో! ఈ గడ్డిపోచను ఇక్కడ పెడుచున్నాను. దీనిని భస్మము చేయి, చూద్దాం।

అప్పుడు అగ్నిదేవుడు, ...**"ఓస్! ఇంతేకదా"** అని పలికి ఆ గడ్డిపోచను స్పృశించారు. అది చెక్కుచెదరలేదు. క్రమక్రమంగా తనయొక్క తేజస్సుతో కూడిన ఉష్ణశక్తినంతా ఒకచోటికి తెచ్చి ఆ గడ్డిపోచపై ప్రయోగించారు. అయినా లాభం లేకపోయింది. ఆ గడ్డిపోచకు ఇసుమంత కూడా హాని కలుగలేదు. ఇంక ఏమి – చేయాలో తోచలేదు.

వెంటనే అగ్ని దేవుడు వెనుతిరిగారు. దేవతలు ఉన్న స్థానమును చేరి, **"ఓ దేవతలారా! ఆ అద్భుత – అపురూప యక్షశక్తి ఎటువంటిదో, ఎవరిదో, ఆయన ఎవ్వరో నేను కనిపెట్టలేకపోయాను. నా శక్తి అంతా కూడా యక్షుడు నాకు చూపించిన ఒక గడ్డి పోచను కూడా దహించనే లేకపోయింది".** ఆ శక్తి ముందు నా శక్తి సూర్యునిముందు దివిటీవలె అయింది" – అని తెలియజేశారు.

ఆ దేవతలు "ఏమి చేయాలి?" అని ప్రశ్నించుకొన్నారు. అప్పుడు వాయుదేవుని సమీపించి, **"ఓ మహత్తర శక్తి సమన్వితుడా! వాయుదేవా! మీరు ఆకాశమంతా సంచరిస్తూ ఉంటారు కదా! మీరు దయచేసి వెళ్ళండి. భీకర హర్షధ్వానాలు చేస్తున్న ఆ అద్భుత యక్షశక్తి ఎవ్వరో, ఎవ్వరిదో తెలుసుకొని మాకు తెలియజేయండి"**...అని అడిగారు.

వాయుదేవుడు, **"ఓం! తప్పకుండా. మీరు అడిగినట్లు వెళ్ళి ఆ అద్భుత మహాశక్తి ఏమిటో, ఎవ్వరో ఎందుకు పెద్దగా నవ్వుతూ సంచరిస్తోందో కనుక్కుని వస్తాను"** అని అన్నారు. అంటూనే వెంటనే వాయుతరంగ స్వరూపంగా ఉరకలు వేస్తూ బయల్వెడలారు. ఆ మహాశక్తికి ఎదురుగా నిలుచున్నారు.

**మహాద్భుతయక్షరూపి** : నీవెవ్వరివయ్యా బాబూ?

**వాయుదేవుడు** : నేనా? నేను వాయుదేవుడను! ఆకాశములో, అంతటా ఒక్కసారిగా ఆక్రమించి సంచారములు చేస్తూ ఉంటాను. అందుచేత నన్ను 'మాతరిశ్వుడు' – అని పిలుస్తూ ఉంటారు.

- ఆకాశములో వృద్ధి పొందువాడను. సర్వ దేహములలో ప్రవేశించి అణువణువునందు ప్రసరిస్తూ సర్వ దేహములను శక్తివంతము చేస్తూ ఉంటాను.
- జీవుల మనో చాంచల్యములను ఎరిగినవాడను.
- ఆశ్రయించి ఏకాగ్రతతో ఉపాసిస్తూ ఉన్నవారికి మనో నిశ్చలతకు సహకరించువాడను. ఈ ఈ కారణాలచేత మాతరిశ్వ సార్థకనామధేయుడను. సర్వదా సర్వులకు సహకరించువాడను, మహాశక్తిసంపన్నుడను.

**యక్షరూపి** : అవన్నీ సరేనయ్యా! నీయొక్క శక్తి సామర్థ్యముల గురించి మాట్లాడు! అవి ఎట్టివో వివరించు! వింటాను!

**వాయుదేవుడు** : నా సామర్థ్యము గురించా? చెప్పుతూనే ఉన్నాను కదా!

నేను భూమిపై ఏ వస్తువునైనా – ఎంతటి వస్తువునైనా నా వాయుశక్తిచే పెకలించి భూమిమీద నుండి ఆకాశములోనికి ఎగురునట్లు చేయగలను. విసరివేయగలను. నా చేతులతో సముద్రపు అలలను, కొండలను, 14 లోకములను, మహాపర్వతములను కూడా ఊపివేయగలను. లేపివేయగలను.

వాయువ్యాస్త్ర స్వరూపుడనై ఏదైనా సరే బంతిలాగా ఆకాశములోనికి ఎగురవేయు శక్తి సమన్వితుడను.

**యక్షరూపమహాశక్తి** : ఓహో! అంత గొప్పవాడివా? చాలా సంతోషము. అయితే, ఒక్క పని నిర్వర్తించు. ఇదిగో, ఈ గడ్డి పోచను చూస్తున్నావు కదా! దీనిని పైకి లేపు. తదితర విషయాలు ఆ తరువాత!



వాయుదేవుడు 'అట్లాగే' అని పలికారు. ఆ గడ్డి పరకను సమీపించారు. అది గాలి వాటుకు లేవనే లేదు. క్రమక్రమంగా ఉద్ధృత శక్తినంతా ఉపయోగించినా కూడా, ఆ గడ్డిపరక కించిత్ కూడా కదలలేదు. ఇక చేసేది లేక, వెనుకకు మరలి దేవతలున్న చోటికి వచ్చి, **"ఓ దేవతలారా! క్షమోస్మి. ఆ మహత్తర దివ్యశక్తి గురించి ఏ వివరమూ కూడా తెలుసుకోలేకపోయాను! అశక్తుడనై వెనుకకు రాక తప్పింది కాదు!"** అని పలికారు.



అప్పుడు దేవతలంతా త్రిలోక నాయకుడు త్రిలోక పూజ్యుడు అగు ఇంద్ర దేవుని సమీపించారు.

"హే ఇంద్ర దేవా! మఘవన్! మీరు త్రిలోకాలకు ఆరాధ్యులు. మహా సంపదవంతులు. త్రిలోకాధిపతులు, ఈ పని మీవలననే కావాలి! **ఆ భీకర - అద్భుత మహాశక్తి ఏమి అయి ఉన్నదో మీరు దయచేసి తెలుసుకోవలసినదిగా మా విన్నపము".**

**"అట్లాగే"** అంటూ ఇంద్రదేవుడు జగన్మాతయగు పరమేశ్వరికి నమస్కరించుకుంటూ, త్వరత్వరగా వెనువెంటనే బయల్వెడలి ఆ యక్షశక్తిని సమీపించారు. వినమ్రతతో కనులు మూసుకొని జగన్మాతయగు ఆదిశక్తికి నమస్కరించారు. కనులు తెరచి "ఏమిటి ఇది!" అని భక్తిశ్రద్ధ సమన్వితులై కించిత్ పరిశీలనగా చూడబోతూ ఉండగానే.... ఆ అద్భుత యక్షశక్తి కాస్తా అంతర్ధానమై పోయింది!

ఇంద్ర దేవుడు ఆశ్చర్యంగా ఆకాశంలో ఎనిమిది దిక్కులలోను, పైకి, క్రిందికి పరిశీలనగా చూస్తూ ఉండగా... - ఆకాశంలో - ఇతఃపూర్వము యక్షశక్తి ఉండటం జరిగిన ప్రదేశంలో....వేనవేలకాంతులతో విరాజిల్లుతూ **ఒక స్త్రీ మూర్తి** ప్రత్యక్షమై కనిపించారు.

ఆ తల్లి యొక్క కాంతిపుంజము బహుశోభాయమానంగా ఆకాశంలోని చీకట్లన్నీ పటాపంచలు చేసివేస్తున్నాయి. "బహుప్రకాశమానముగా కనిపిస్తున్న ఈ స్త్రీ మూర్తి ఎవరై ఉంటారు?" అని **వివేచనాదృష్టి**తో కనిపిస్తున్న ఆ స్త్రీ మూర్తి జగజ్జనని, లోకమాత, లోకేశ్వరి, ప్రకృతి స్వరూపిణియగు **ఉమ, హైమవతీ దేవి** గా ఇంద్రదేవుడు గుర్తించారు. ఆ జగన్మాతకు సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించాడు. పాదపద్మములను నుదురుతో స్పృశిస్తూ... **"జగదేకమాతా! గౌరీ!"** అని అనేక స్తుతులు సమర్పించి వినమ్రులై నిలుచున్నారు.

ఆ జగజ్జనని హైమవతి వాత్సల్య దిక్కులతో చిరునవ్వులు చిందిస్తూ ఇంద్రునిపై అమృత కిరణములను ప్రసరింపజేసింది. ఇంద్రదేవుడు అమ్మయొక్క చిరునవ్వు చిరువెన్నెలలో ప్రత్యుత్సాహులయ్యారు.

**ఇంద్రదేవుడు** : అమ్మా! జననీ! హే ఉమా! హైమవతీ! - మా నుతులు స్వీకరించి మమ్ములను సముద్ధరిస్తున్న మాతే!

కొద్ది క్షణముల ముందు ఇక్కడ ఒక భీకరమైన యక్షశక్తి ఏదో కనిపించింది. అది ఎవ్వరు? ఏమిటి? ఎవ్వరిచేత? ఏ కారణంచేత ప్రత్యక్షమైనది? మేము తెలుసుకోవటానికి అశక్తులమయ్యాము. ఆ యక్షశక్తి ఏమిటో, ఎవ్వరో, ఎవ్వరిదో, ఎందుకో మాకు తెలియజేయి! గురువువై మార్గము చూపించమ్మా! ఆది దైత్యుల మాయ శక్తియా? దానవ కులగురువు శ్రీ శుక్రాచార్యులవారి కల్పనా శక్తియా? మరింకేదైనానా? దయతో వివరించమ్మా! రక్షించు! పాహిమాం! రక్షమాం!

## చతుర్ధ ఖండము - సమస్తము బ్రహ్మమే

**శ్రీ ఉమాదేవి** : బిడ్డా! ఇంద్రదేవా! మీరు ఇంతకుముందు ఇక్కడ చూచినది పరబ్రహ్మముయొక్క లీల! బ్రహ్మమే మీకు మహత్తర యక్షరూప అద్భుతశక్తిగా కనిపించటం జరిగింది! ఇదంతా పరమాత్మయొక్క మహత్తరమగు మాయావిరచనయే।

అయితే...

నిర్గుణ - నిరాకార - సర్వతత్త్వ స్వరూపమగు బ్రహ్మము ఈ రీతిగా సగుణమై యక్షరూపముగా ఎందుకు కనిపించిందని అనుకుంటున్నావా?

అయితే...విను!

నాయనా! సర్వము బ్రహ్మమే! **ఈ త్రికాల సర్వలోక సృష్టికి, ఇందులోని సర్వ సంఘటనలకు కారణకారణము పరబ్రహ్మముయొక్క లీలావినోదరూపమగు సంకల్ప చమత్కారమే! ఆ బ్రహ్మముయొక్క ఊహ, కల్పన, వినోదమే నేను కూడా।**

అట్టి బ్రహ్మమే సర్వసామర్థ్యము (చదరంగము ఆటలో పావులకు ఇవ్వబడిన సామర్థ్యమువలె) మీ అందరికి సామర్థ్యము ప్రసాదించి ఈ జగత్ చమత్కార కల్పనను ఆ పరబ్రహ్మమే వినోదిస్తోంది కదా! అదంతా మీరు మరచారా ఏమిటి?

లేకపోతే....

**"ఈ దానవులపై ఈరోజు విజయం పొందటము మా మహిమయే! మా సామర్థ్యమే!"** అని గర్వము పొందసాగారా, ఏమి?

వెంటనే ఇంద్రుడు, జగజ్జనని గురునమస్కారము సమర్పించారు.

**ఇంద్రదేవుడు** : అవునమ్మా! **సర్వము బ్రహ్మమే! సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ! నేహ నానాస్తి కించన!**

పరమాత్మయొక్క లీలావినోదమే ఇదంతా! "మేము దేనికైనా సమర్థులమే" - అని ఇప్పుడు కొంచము గర్వించినమాట నిజమే. అయితే, ఆ సామర్థ్యము సదాశివబ్రహ్మముయొక్క సంకల్ప చమత్కారమే. అట్టి బ్రహ్మముయొక్క ఔన్నత్యమునకు నమస్కరిస్తున్నాము.

మా శక్తి మాది కాదు. పరబ్రహ్మముది. సర్వాంతర్యామి అగు శివమహత్‌శక్తిది. అట్టి బ్రహ్మముయొక్క కల్పనాశక్తిని ఏమరచి, "మాదే ఈ విజయము" – అని భ్రమించినందులకు క్షంతవ్యులము, నాటకంలోని ఒక పాత్రధారుడు "నాటకములో సందర్భమయిన విజయము నాదే।" – అని అనటము వంటిదే మా గర్వము.

అట్టి బ్రహ్మము మమ్ములను క్షమించుగాక! రక్షించునుగాక! ఈ విజయము విషయమై కృతజ్ఞతాంజలులు!

సాంబ సదాశివాయ నమో నమో నమో నమః।

ప్రకృతితో కూడుకొన్న పరబ్రహ్మమునకు నమఃసుమాంజలులు.

⌘

**ఆచార్యులవారు :**

ఓ ప్రియశిష్యా! పరబ్రహ్మస్వరూపా!

ఆ రీతిగా అగ్ని – వాయు – ఇంద్రదేవతలు ప్రప్రథమముగా బ్రహ్మమును అతి సామీప్యముగా ఉపనిషతులై స్పర్శించి, సందర్శించినవారై పునీతులైనారు. తదితర దేవతలకంటే బ్రహ్మదర్శనము విషయములో అధికాధికులైనారు. ఇంద్ర దేవుడు అత్యంత సామీప్యతగా పరమాత్మను (బ్రహ్మమును) దర్శించుటచేత, ఆరాధించుట చేత అన్య దేవతల కంటే అధికులుగా స్తుతించబడ్డారు.

దేవతలంతా ఆత్మభావనాపూర్వకంగా పరస్పరానుభవముతో పులకితులు, అతి పవిత్రులు, పరమపూజ్యులు అయినారు.

**"సర్వము బ్రహ్మమే కదా!"** అని గమనిస్తూ, త్రిజగత్తులను దర్శిస్తూ అటుపై ఇక త్రిలోకములను పరిపాలించసాగారు!

⌘

**ఆచార్యులు :** తత్త్వస్వరూపుడవగు వత్సా! శ్రద్ధగా విన్నావు కదా! ఆ పరతత్త్వమగు బ్రహ్మముయొక్క ఆ దేశమును అనుసరించియే....

- మెరుపుయొక్క **మెరుపులు ప్రదర్శితమౌతున్నాయి!**
- జ్యోతులలో **జ్యోతిత్వము ప్రకాశమానమౌతోంది!**
- పరబ్రహ్మముయొక్క మహిమ చేతనే ఈ భూలోక జీవుల **కనురెప్పలు మూసుకుంటున్నాయి. తెరుచుకుంటున్నాయి.**
- ప్రకృతి శక్తులన్నీ ఆ **బ్రహ్మము యొక్క వ్యక్తీకరణ చమత్కారమే!**
- ఇదంతా (ఈ కనబడే దృశ్యమంతా) ఆత్మయందే ఆత్మచేత అభివ్యక్తరూపమై ప్రకాశిస్తోందయ్యా। నవలలోని కల్పనలన్నీ నవలా రచయితవే అయిన తీరుగా – **ఈ సమస్తము ఆత్మయొక్క స్వకీయ కల్పనయే!**
- ఆత్మ యొక్క **చేతనశక్తి** చేతనే ఈ **మనస్సు ప్రపంచ రూపానుభవమును పొందటం జరుగుతోంది!**
- మనస్సు జగత్ దృశ్యమును తెలుసుకొంటున్నది ఆత్మయొక్క ప్రత్యుత్సాహ ప్రేరణ (లేక) చైతన్యశక్తి చేతనే।
- బ్రహ్మముయొక్క స్వకీయ స్మరణమే (స్వకీయ కల్పనా సందర్శనమే) ఈ ద్రష్ట – దృశ్యములు, దేహి – దేహములు కూడా।
- **బ్రహ్మమే – మనస్సు ద్వారా దృశ్యము యొక్క కల్పన – జ్ఞాపకము – అనుభూతు**లకు రూపం ప్రసాదిస్తోంది. సముద్రంలో తరంగాలు లాగా ఆత్మయందే అనుభూతులు స్పందనరూపంగా బయల్వెడలి, లయిస్తున్నాయి.
- ఆత్మయే 'భావన' అనే వాహనమును అధిరోహించి ఈ అద్వితీయ ప్రపంచమును తన ఊహగా పొందుతోంది. తనయందు ఈ ప్రపంచమును సంకల్పిస్తోంది. పరిపోషిస్తోంది. లయింపజేసుకొంటోంది. పునః పునః సంకల్పిస్తోంది.

నాయనా!

- ఈ జగత్తు – ఈ జీవులు – ఈ అనుభవములు...ఇదంతా కూడా బ్రహ్మముయొక్క **స్వకీయ నిర్మిత ఉద్యాన వన సంచారమే!** క్రీడా – లీలా చమత్కృతియే!
- ఈ కనబడేదంతా బ్రహ్మవనమే! (This is all the palyful Garden of divinity).

ఆ బ్రహ్మమును ఎవ్వరైతే ఈ దృశ్యరూప విన్యాసుడు గాను, స్వస్వరూపమునకు అనన్యుడుగాను తెలుసుకుంటూ – దర్శిస్తూ, ధారణ చేస్తూ ఉంటారో, **"సర్వజీవులలో బ్రహ్మమును, బ్రహ్మమే సర్వజీవుల స్వరూపముగాను"** మననపూర్వకంగా వీక్షిస్తూ ఉంటారో....

- **అట్టివారికి సర్వజీవులు ప్రేమాస్పదులౌతున్నాయి।**
- **అట్టి వారు సర్వజీవులకు ప్రేమాస్పదులౌతున్నారు।**

**శిష్యుడు:** స్వామీ! సద్గురూ! ఇప్పుడు మీరు నాకు మహత్తరమై బ్రహ్మసంబంధమైన నిత్యము, పరము, అమృతరూపము అగు సత్యమును ప్రకటిస్తూ బోధించారు. మహదానందము. ఇక ఇప్పుడు 'ఉపనిషత్'ల యొక్క విశేషములు బోధించ ప్రార్థన.

**ఆచార్యులవారు :**

బిడ్డా! వత్సా! ఇప్పుడు ఇంతవరకు మనము చెప్పుకొన్నది ఉపనిషత్ వాణియే. నీవు వింటూ వస్తున్నదంతా ఉపనిషత్‌యే! మనము చెప్పుకున్న బ్రహ్మము గురించే ఉపనిషత్ ప్రకటిస్తున్నది। (ఈ జీవుని యొక్క బ్రహ్మతత్త్వమే ఇదంతా బ్రహ్మమే – సర్వజీవుల అనుక్షణిక – సహజరూపము. బ్రహ్మము అవాక్ మానసగోచరము కూడా. మనము ఇప్పుడు చెప్పుకొన్నదే ఉపనిషత్ ప్రతిపాదిత 'బ్రహ్మము' అని మన ఇరువురము మననము చేసుకొనెదముగాక! అయినా నీవు అడిగినదానికి ప్రత్యుత్తరంగా కొన్ని విషయాలు విను.

ఏ ఉపనిషత్ పరమార్థము మనము చెప్పుకున్నామో....అట్టి బ్రహ్మతత్త్వమునకు మార్గము, స్థానము, పాదములు ఎక్కడయ్యా అంటే...., విను.

- <u>తపస్సు</u> – పరమాత్మ గురించిన తపన.
- <u>దమము</u> – ఇంద్రియ నిగ్రహము.
- <u>కర్మయోగము</u> (విద్యుక్త ధర్మములను పరమాత్మకు పుష్పములుగా సమర్పించటం).
- చతుర్వేదముల అధ్యయనము. దేవతా ఉపాసనలు. యజ్ఞ-యాగములు

వేద మహావాక్యములగు <u>**– తత్త్వమ్ – సోఽహమ్ – జీవోబ్రహ్మేతి నాపరః – అయమాత్మా బ్రహ్మ సర్వమ్ ఖల్విదం – బ్రహ్మ ఇత్యాది మహా వాక్యార్థములకు నివాసస్థానము పరమసత్యమగు బ్రహ్మమే!**</u>

⌘

యోవై... ఎవ్వరైతే...,

- "అకర్తయగు పరబ్రహ్మమే" సర్వకర్తృత్వములకు ఆదికారణుడు।
- కేవలుడగు పరబ్రహ్మమే – సర్వకర్తృత్వములకు, భోక్తృత్వములకు కారణ – కారణము।
- కర్తృత్వ – భోక్తృత్వమంతా బ్రహ్మముయొక్క భావనా చమత్కృతియే।
- సర్వరూపములలో – సర్వరూపములుగా, సర్వభావములలో – సర్వభావములుగా బ్రహ్మమే సర్వదా యథాతథముగా సంప్రదర్శన మగుచున్నది, –

అని అనుకుంటూ, క్రమంగా తెలుసుకుంటూ – ఉంటారో, అట్టివారు "సమస్తము బ్రహ్మమే। అహమ్ బ్రహ్మాస్మి। తత్త్వమసి" మహావాక్యముల పరమార్థమును స్వాభావికము చేసుకొనగలరు. అట్టివారు **– సర్వ పాప భావముల నుండి...,సర్వ దోషములనుండి....., విడివడుచున్నవారగుచున్నారు. సర్వబంధములనుండి విముక్తులగుచున్నారు!**

అనంతము, అత్యున్నతమైనది అగు సువర్ణ జనులతో కూడిన బ్రహ్మలోకమునందు వారు సు-ప్రతిష్ఠితులగుచున్నారు।

బ్రహ్మమునందు నివసిస్తూ, బ్రహ్మమునే సర్వత్రా దర్శిస్తూ, **బ్రహ్మమే అగుచున్నారు.**

**ఇతి కేనోపనిషత్**

***ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ॥***

**సామవేదాంతర్గత**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 4 కుండికోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

**శ్లో॥ కుండికోపనిషత్ ఖ్యాత**
**పరివ్రాజక సంతతిః**
**యత్ర విశ్రాంతిమ్ అగమత్,**
**తత్ రామపదమ్ ఆశ్రయే॥**



ఈ కుండికోపనిషత్ పలుకుచున్న మహత్ తత్త్వమును ఎరిగియున్నట్టి పరివ్రాజకమన్యులు ఎచ్చట పరమ విశ్రాంతిని ఆస్వాదిస్తున్నారో, - అట్టి శ్రీరామచంద్ర ఆత్మారామ పాదపద్మములను ఆశ్రయించుచున్నాను.

**ఓం।**

**1. బ్రహ్మచర్య - ఆశ్రమే క్షీణే (భిన్నే)**
**గురుశుశ్రూషణే రతః।**
**వేదాన్ అధీత్య అనుజ్ఞాత,**
**ఉచ్యతే "గురుణాశ్రమీ"।**

బ్రహ్మచర్యాశ్రమము: 5వ సంవత్సరంలో ప్రవేశించిన బాలునికి తల్లిదండ్రులు 'ఉపనయన' సంస్కారమును నిర్వర్తింపజేసి ద్విజము (ద్వితీయజన్మ)గా చెప్పబడు బ్రహ్మమును అధ్యయనము చేయు 'బ్రహ్మచర్యము'నందు ప్రవేశింప జేస్తున్నారు. ఆ బ్రహ్మచారి గురువును ఆశ్రయిస్తున్నాడు. 'గురుశుశ్రూష' నిర్వర్తిస్తూ, వేద - వేదాంగ-ఉపనిషత్తులను అధ్యయనము చేస్తున్నాడు. వేదవిద్యను అభ్యసిస్తూ, కొంతకాలమునకు విద్యాపారంగతుడు అగుచున్నాడు. సరి అయిన సమయంలో ఈవిధంగా గురువుచే అనుజ్ఞాతుడు (ఆజ్ఞాపించబడువాడు) అగుచున్నాడు. అట్టివాడు 'గురుణాశ్రమి' అగుచున్నాడు.

**దారమ్ ఆహృత్య సదృశమ్**
**అగ్నిమ్ ఆధాయ శక్తితః,**
**బ్రాహ్మీమ్ ఇష్టిం యజేత్**
**తాసామ్ అహోరాత్రేణ నిర్వపేత్।**

**గురువు** : నాయనా! ఇప్పటివరకూ గురు - ఆశ్రమివి అయి వేదవిద్యను అభ్యసించావు. ఇప్పుడు ఇక ఈ బ్రహ్మచర్యము నుండి గృహస్థాశ్రమమును స్వీకరించుటకై అనుజ్ఞ ఇస్తున్నాను. వివాహము చేసుకో. శక్తికొలది అగ్నికార్యము (దైనందికమైన నిత్య - అగ్నికార్యములు, నైమిత్తకములైనటువంటివి మొ॥వి), యజ్ఞ-యాగములు లోకకళ్యాణము కొరకు, ఆత్మోద్ధరణ కొరకు ఉద్దేశ్యించి నిర్వర్తించు. బ్రహ్మమును అధ్యయనం చేస్తూ జగద్దృశ్యమును బ్రాహ్మీదృష్టితో ఉపాసించు. 'ఇష్టము'ను (లేక) పరబ్రహ్మోపాసనను అహోరాత్రము అనుక్షణికం చేసుకో. "ఆత్మాహమ్ - (ఆత్మ)తత్త్వమ్" - అనుష్ఠానమును అహోరాత్రంగా నిర్వపముచేయి. (నిర్వర్తించు). (మానసిక సదాశివోపాసనను సిద్ధించుకో).

**సం విభజ్య సుతాన్ అర్థే**
**గ్రామ్య కామాన్ - విసృజ్య చ,**
**సంచరన్ వన మార్గేణ**
**శుచౌ దేశే పరిభ్రమన్॥**

గృహస్థాశ్రమము : గృహస్థుడుగా స్వధర్మ నిరతుడవై, సంపదలను పరిపోషించుకో. గృహములను, ధనమును (అర్ధ - కామ పురుషార్థములను) ధర్మయుతంగా, సంఘసేవాభావ సమన్వితంగా సముపార్జించు. సంతానమును పొంది, వారిని లోక-దైవానుకూలురుగా తీర్చిదిద్దు. అటుపై గృహస్థాశ్రమమునకు ముగింపు పలికి, వానప్రస్థాశ్రమమునకు సంసిద్ధుడవగుము. సంపదలను సంతానమునకు (సుతులకు) పంచి, అప్పజెప్పివేయి. సర్వలోక సంబంధమైన వ్యవహారములను ముగించివేయి. త్యజించివేయి. వానప్రస్థుడవై వనమార్గమును ఆశ్రయించి 'శుచి' అయిన ప్రదేశములకు సంచారమును పరిమితము చేసుకొనెదవుగాక!

| | |
|---|---|
| **వాయుభక్షో, అంబుభక్షో వా**<br>**విహితాన్నో ఉత్తరైః ఫలైః**<br>**(విహితైః) కందమూలకైః**<br>**స్వశరీరే సమాపి (సమారోపః)**<br>**అథ పృథివ్యాం**<br>**న అశ్రుపాతయేత్॥** | **వానప్రస్థాశ్రమం:** వాయుభక్షణం, జలభక్షణం చేస్తూ, శరీరమునకు విహితమైన ఫలములను (Fruits) గాని, కందమూలములనుగాని దేహరక్షణకొరకు మాత్రమే స్వీకరించుచూ 'అభ్యాసి' - అయి ఉండెదవుగాక। (Just eat to live and to practise). జీవితమును మోక్షమార్గమునందు మాత్రమే నియమించాలి. ఇక ప్రాపంచకమైన దేనిగురించీ కించిత్ కూడా వేదన పడకూడదు. దేనికీ దుఃఖించకూడదు సుమా। (Leave all worries of the world at its core) |
| **2.** **సహ తేనైవ పురుషః**<br>**కథం 'సన్న్యస్త' ఉచ్యతే?**<br>**స నామధేయో యస్మింస్తు**<br>**కథం సన్న్యస్త ఉచ్యతే?**<br>**తస్మాత్ ఫల విశుద్ధాంగీ**<br>**సన్న్యాసం సంహితాత్మనామ్।**<br>**అగ్నివర్ణం వినిష్క్రమ్య,**<br>**'వానప్రస్థం' ప్రపద్యతే।** | కాషాయ వస్త్రములు ధరించినంత మాత్రం చేతనే 'సన్న్యస్తుడు' అవుతాడా? "నేను సన్న్యాసిని" అని పేరు మార్చుకున్నంత మాత్రముచేతనే 'సన్న్యాసి' అయిపోతాడా? లేదు. 'సత్'ను **న్యాసము** చేయుటచే మాత్రమే, అనగా, బ్రహ్మమును దృష్టియందు సుస్పష్టపరచుకొంటేనే 'సన్న్యాసి' అవగలడు. అందుకొరకై వానప్రస్థాశ్రమము ఆశ్రయించబడుతోంది.<br>సర్వకర్మఫలములను పరమాత్మకు సమర్పించివేసి, విశుద్ధమైన ఇంద్రియ నియామకము కలవాడై, సర్వసమదృష్టిచే సంహితాత్ముడవటముచేతనే "సత్-న్యాసి" (సన్న్యాసి) కాగలడు.<br>'గృహస్థాశ్రమము'లోని నియమములగు అగ్నికార్యములనుండి నిష్క్రమించి, లౌకిక-సాంఘిక నియమములను పరిత్యజించువాడు **'వానప్రస్థుడు'.** |
| **లోకవత్ భార్యయాసక్తో వనం గచ్ఛతి సంయతః।**<br>**సంత్యాక్త్వా సంసృతి సుఖమ్**<br>**అనుతిష్ఠతి కిం ముదా?**<br>**కిం వా దుఃఖమ్ అనుస్మృత్య**<br>**భోగాం త్యజతి చ ఉచ్ఛ్రితాన్।** | 'వానప్రస్థాశ్రమము' నుండి సన్న్యాసాశ్రమమునకు దారిచేసుకోవాలి.<br>అట్లాకాకుండా 'లోకజీవనం'లాగా 'భార్యా' సంతానముయొక్క ఆర్థిక వ్యవహారములు మొ॥ వాటి పట్ల ఆసక్తి వదలకుండా వనప్రవేశం (వానప్రస్థం) చేసి లోక వ్యవహారముల వ్యసనమును విడవకుంటే ఏమిలాభం? బాహ్య సంసృతిని మనస్సుతో వదలకుండా, గృహస్థాశ్రమం లోని, దుఃఖములకు (కష్టములకు) భయపడి భోగములు త్యజించి ప్రయోజనమేమిటి? (అది రాజసిక, తామసిక వైరాగ్యము మాత్రమే). |
| **గర్భవాస భయాత్ భీతః శీతోష్ణాభ్యాం తథైవ చ।**<br>**గుహ్యం ప్రవేష్టుమ్ ఇచ్ఛామి**<br>**పరంమ్పదమ్ అనామయమ్ ఇతి।**<br>**సన్న్యస్య అగ్నిం అపునరావర్తనం**<br>**యన్ మృత్యుః జాయమ్ ఆవహమ్ ఇతి॥** | **మహదాశయము : ఏ విధమైన 'మహదాశయము' కలిగి ఉండాలి?**<br>"జన్మ-మరణ పునర్జన్మ పరంపరల పునరావృత్తి దోషము జయించటానికి, జన్మరాహిత్యము సిద్ధించుకోవటానికి అతిరహస్యమగు కేవల స్వస్వరూపాత్మ యందు ప్రవేశించెదనుగాక! గర్భవాస నరకమునకు, దేహము పొందే శీతోష్ణ బాధలకు భీతిల్లినవాడనై అనామయమగు పరమపదము అనబడు స్వస్థానమును ఆశ్రయిస్తాను" అను ఆశయం కలిగి ఉండాలి.<br>"సన్న్యాసయోగమును ఆశ్రయించువాడనై... అట్టియోగాగ్నిచే పునర్జన్మలు' అనే మృత్యురూప కట్టెలను భస్మము చేసి వేసి 'పునరావృత్తిరహితమగు స్వస్థానము చేరెదనుగాక" - అను పరమాశయము కలిగి ఉండాలి. |
| **అథ అధ్యాత్మ మంత్రాన్-జపేత్।**<br>**దీక్షాం ఉపేయాత్।**<br>**కాషాయవాసాః, కక్ష ఉపస్థ లోమాని వర్జయేత్,**<br>**ఊర్ధ్వబాహుః విముక్తమార్గో భవతి॥** | ఇక ఆత్మతత్త్వోపాసనారూపమగు 'అధ్యాత్మమంత్రము'ను జపించు దీక్షను స్వీకరించటమే సన్న్యాసయోగము. (అధ్యాత్మ = నా దేహమనందు, ఈ కనబడే సమస్త దేహములలోను సమముగా వేంచేసియుండి, సమస్తమును ఆక్రమించుకొనియున్న 'కేవలాత్మ'.)<br>కాషాయ వస్త్రములను ధరించటము, చంకల - ఉపస్థరోమ త్యాజ్యము చేయునుగాక। చేతులు పైకి ఎత్తినవాడై విముక్తమార్గమును ఆశ్రయించునుగాక। |

3. అనికేతః చరేత్ భిక్షాశీ,
నిదిధ్యాసనం దధ్యాత్
పవిత్రం ధారయేత్ జంతు
జంతు సంరక్షణార్థమ్।

**"సమస్తము పరమాత్మకు చెందినదేగాని నాకు చెందినదై ఏదీ లేదు. 'నాది' అనునది త్యాజ్యము. నాకు ఇల్లు లేదు- వాకిలీ లేదు"-** అనురూపముగల త్యాజ్యభావనతో గృహ సంబంధములన్నీ త్యజించి, అనికేతుడై, భిక్షాటనమును ఆశ్రయిస్తూ, ....ఆత్మభావనను ఆశ్రయించి శ్రవణ-మనన ఫలమును సిద్ధించుకొనుచూ, క్రమంగా "సర్వము అఖండాత్మ సంప్రదర్శనమేనని అనిపించటము" అను నిదిధ్యాసను సిద్ధించుకోవాలి.

- జంతువులనుండి రక్షణకొరకు మాత్రమే పవిత్రమును (దర్భ-నార వస్త్రములను) ధారణ చేయుచుండునుగాక।

**కుండికా త్యాగి :** "నామరూపాత్మకంగా కనిపిస్తున్న" అధిష్ఠానమగు మట్టిని ఆశ్రయించటము" కుండికము (కుండ) మొదలైనవి వదలటము. 'అధిష్ఠానమగు మట్టిని ఆశ్రయించటము' గురించి ఈ విధంగా గానము

---

కుండికాం చమసం శిక్యం, త్రివిష్టపమ్ ఉపానహౌ
శీతా-ఉపఘాతినీం కన్థాం, కౌపీన-ఆచ్ఛాదనం తథా।
పవిత్రం స్నాన శాటీన్చ
ఉత్తరాసంగమేవ చ,
అన్యచ్చ అపేక్ష్యతే కించిత్
సర్వం తత్ వర్జయేత్ యతిః।

కుండికము (కుండ)ను, చమసమును (పాత్రను), శిక్యము (ఉట్టి)ను, త్రివిష్టపమును (త్రిలోకములకు సంజ్ఞయగు మూడుముఖముల పాత్రను), చెప్పులను, చలి బొంతను, కౌపీన (గోచీ) ఆచ్ఛాదనమును, పవిత్రమును, స్నానశాటీ (వస్త్ర పాత్రలు)ను, ఉత్తరీయ వస్త్రమును - వాటికి సంబంధించిన సర్వ నియమ-నిష్ఠ-అపేక్షలను యతి మానసికంగా త్యజించినవాడై ఉంటాడు. వస్త్రధారణ ఇత్యాది నియమముల పరిధులను అధిగమించినవాడై ఉంటాడు. మహత్తరమగు ఆత్మతత్త్వాన్వేషణయే ఆశయముగా కలిగి ఉండి, అతిశయములను త్యజించి ఉంటాడు.

---

నదీ పులినశాయీ స్యాత్ దేవాగారేషు బాహ్యతః,
న-అత్యర్థం సుఖదుఃఖాభ్యాం శరీరమ్ ఉపతాపయేత్।
స్నానం పానం తథా శౌచమ్, అద్భిః పూతాభిః ఆచరేత్।
స్తూయమానో న తుష్యేత। నిందితో న శపేత్ పరాన్।

నదీతీరములలోను, దేవాలయ ప్రాంగణములోను, ఆరు బయట కూడా పరుండుటకు సంసిద్ధుడై ఉంటాడు. అయితే ఈ భౌతిక దేహమును అధిక సుఖ దుఃఖములచే బాధించరాదు. ఉపతాపము కలిగించరాదు.

స్నానము, పానము, శౌచము, ధ్యానము పవిత్ర జలములున్నచోటయే ధ్యానమును నిర్వర్తించాలి.

నిందా-స్తుతులకు కుంగరాదు, పొంగరాదు ఎవ్వరినీ నిందించనూ కూడదు. శపించనూ రాదు.

---

భిక్షాది వైదలమ్ పాత్రం స్నానద్రవ్యం అవారితమ్।
ఏతాం వృత్తిం ఉపాసీత, యత-ఇంద్రియో జపేత్ సదా।
"విశ్వాయమ్ అనుసంయోగమ్"
మనసా భావయేత్ సుధీః।

భిక్షపాత్ర, స్నానవస్త్రములు, తదితర 'చెంబు' మొదలైన దైనందిక ఉపకరణములు కలిగి ఉండటము కూడా దేహయాత్రకొరకు మాత్రమే. అయితే వాటిని కూడా ఉపకరణములుగా కలిగి ఉండి, ఇంద్రియములను పరమాత్మోపాసనయందు మాత్రమే నియమిస్తూ జపము నిర్వర్తిస్తూ ఉండాలి.

"ఈ విశ్వము విశ్వేశ్వరరూపమే" అను అనుసంధానముతో సర్వమును బుద్ధితోను మనసా వాచా ఆత్మభావన కలిగి ఉండాలి. మనో-బుద్ధులను ఆత్మోపాసనయందు నియమించాలి.

---

ఆకాశాత్ వాయుః। వాయోః జ్యోతిః।
జ్యోతిష ఆపో। అద్భ్యః పృథివీ।
ఏషామ్ భూతానాం బ్రహ్మ ప్రపద్యే
"<u>అజరమ్। అమరమ్। అక్షరమ్। అవ్యయమ్</u>"-ప్రపద్యే।।

"ఆకాశమునుండి వాయువు, వాయువు నుండి జ్యోతి (అగ్ని), జ్యోతి నుండి జలము, జలము నుండి పృథివి జనిస్తున్నాయి. అయితే ఆకాశమో? అజరము, అక్షరము, అవ్యయము అగు ఆత్మనుండి జనిస్తోంది కదా।" - అనే ఉపాసన, భావన, ప్రార్థన కలిగి ఉండాలి. "అట్టి అవ్యయమగు ఆత్మయే నా సహజ స్వరూపము। అదియే ఈ సమస్తము కదా!" - అను మంత్రభావననే మననం చేయాలి. "నానుంచే ఈ సమస్తము। ఈ సమస్తమునందు నేను!" అను మార్గంగా బ్రహ్మమును ఉపాసించాలి.

**నాలోమాయ**

**4. మయి అఖణ్ణ సుఖ- అంభోధౌ**
**బహుధా విశ్వవీచయః,**
**ఉత్పద్యంతే, విలీయన్తే**
**మాయా మారుత విభ్రమాత్।**

(ఏవిధంగా అయితే ప్రతిరోజు స్వప్నములు కల్పనగా స్వప్నద్రష్టయందు బయల్వెడలి, ప్రదర్శనమయి, లయిస్తూ ఉన్నాయో, అట్లాగే) నాయొక్క అఖండ - పరమానంద ఆత్మ సముద్రంలో 'విశ్వములు' అనే తరంగములు ఉత్పత్తి అయి, ప్రదర్శనమయి, లయిస్తూ ఉంటున్నాయి. అయితే, అవన్నీ మాయలో (In a magic play) వాయు విభ్రమములు వంటివి మాత్రమే! అనగా ఆత్మస్వరూపుడనగునాయందు విశ్వముల ఉత్పత్తి - లయములు కథారచయితలో వచ్చి మాయే కథా సంబంధమైన ఊహలు వంటివి - అను గమనికను నిశ్చలం చేసుకోవాలి. కథకు కథారచయిత "వేరు" అయినట్లు, నేను సమస్తమునకు (ఆత్మగా) "వేరు" అయి ఉంటున్నాను.

---

**న మే దేహా। న సంబంధో।**
**మేఘేనేవ విహాయసః।**
**అతః కుతో మే తత్ ధర్మా -**
**జాగ్రత్ స్వప్న సుషుప్తిషు?**

ఆకాశంలో మేఘముల వీచికలు కనబడవచ్చుగాక! కానీ ఆకాశమునకు మేఘములతో సంబంధమేముంటుంది? అట్లాగా ఆత్మాకాశస్వరూపుడనగు నాకు ఈ దేహములు వాస్తవరూపము కాదు. నాయందు దేహములు లేవు. దేహసంబంధములు లేవు.

"జాగ్రత్, స్వప్న, సుషుప్తులు" - (కథారచయితలోని కథా రచన విశేషాలవలె, ఆకాశంలో మేఘముల ఆకారములవలె) కల్పనామాత్రములు మాత్రమే. వాటికి నేను వేరైనవాడను. వాటికి ఆధారుడను. కాబట్టి జాగ్రత్ - స్వప్న - సుషుప్త అంతర్గత విశేషాలు అఖండాత్మాకాశ స్వరూపుడనగు నాయొక్క ధర్మములు (Functions) ఎట్లా అవుతాయి? అవజాలవు. (ఆభరణంగా అవటము బంగారముయొక్క సహజ ధర్మము కాదు కదా)। వాటి వలన నాకు బంధమెక్కడిది?

---

<u>**ఆత్మగా నేను...**</u>

**ఆకాశవత్ కల్ప విదూరగో అహమ్।**
**ఆదిత్యవత్ భాస్య (బాహ్య) విలక్షణోఽహమ్।**
**ఆహార్యవత్ నిత్య వినిశ్చలోఽహమ్।**
**అంభోధివత్ పార వివర్జితోఽహమ్।**

ఆత్మస్వరూపుడుగా నేను ఎట్టివాడను? ఆకాశమువలె సర్వ నామ - రూపాత్మకమైన కల్పనలకు విదూరుడను. వేరైనవాడను.

→ సూర్యకాంతి ప్రసరిస్తూ ఉన్న ఆయా వస్తువులకు సూర్యుడు వేరైన రీతిగా నేను ఆత్మప్రకాశ స్వరూపుడను. ఈ జగత్తులు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు అట్టి ప్రకాశములో కనిపించే వస్తువుల వంటివి. నేనో? విలక్షణుడను. (నాటకరంగమును వెలిగించే నాటక దీపము వంటివాడను)

→ ఆభరణమునందలి బంగారమువలె వినిశ్చలుడను.

→ పర్వతముపైగల చెట్లు గాలికి కదులుతాయి. గాలి వీచికలకు పర్వతము కదలదు కదా! పర్వతమువలె నిత్య - నిశ్చల స్వరూపుడను.

→ సముద్రమువలె అంతము (అడ్డు) లేనివాడను.

---

<u>**అహమ్ నారాయణో**</u>

**నారాయణోఽహమ్। నరకాన్తకోఽహమ్।**
**పురాంతకోఽహమ్, పురుషోఽహమ్ ఈశః।**
**అఖండ భోధోఽహమ్ అశేష సాక్షీ**
**నిరీశ్వరోఽహమ్ నిరహన్చ నిర్మమః।**

→ తరంగములవలన జలము ఉత్పత్తి, వినాశనము పొందదుగదా! ఆ తీరుగా నేను <u>నారాయణుడను</u> (నారము = జలము). <u>నరకాన్తకుడను.</u> తరంగములకు ఆవలివాడను. 'నేను నరుడును' అను భావనకు ఆవల - భావములన్నీ జనిస్తున్న ఆత్మస్వరూపుడను. నరాకాన్తకుడగు కృష్ణచైతన్యానంద స్వరూపుడను.

→ దేహపురములకు ఆవలగల, దేహములకు పరిమితుడనుకానట్టి 'దేహి' స్వరూపుడను. <u>పురాన్తకుడను.</u>

- నాచే పొందబడేదంతటికీ నేనే పురుషకారుడను. <u>పురాణపురుషుడను.</u> స్వప్నమంతా అనుభవముగా పొందబడుచున్న సమస్తమునకు నేనే <u>ఈశ్వరుడను. నేనే నిర్మాతను. నేనే ప్రేక్షకుడను.</u>

- 'ఎరుక' (knowledge) అనునది నానుండి బయల్వెడలుచుండగా, అది ఎరుగ బడువాటిచే ముగియదుకదా! కనుక అఖండబోధ స్వరూపుడను! అనిరీశ్వరుడను. నిరహంకారుడను. మమకారరహితుడను.

- దృశ్యము కంతటికీ నిర్విశేషసాక్షిని. వికల్పనలేవీ లేనట్టి నిర్వికల్పుడను. ఈ విధంగా మమాత్మతత్త్వము గురించి (శాస్త్రములచే, ఆత్మజ్ఞులచే) గానము చేయబడుతోంది. విశదీకరించబడుతోంది.

**తత్ అభ్యాసేన, ప్రాణ-అపానౌ సంయమ్య,**
**తత్ర శ్లోకాభవంతి।**
**వృషణ అపానయోః మధ్యే**
**పాణీ ఆస్థాయ సంశ్రయేత్।**
**సన్దశ్య శనకైః జిహ్వాం**
**యవమాత్రే వినిర్గతామ్,**

అట్టి అఖండాత్మాహమ్ భావన సిద్ధించుటకై యోగాభ్యాసములు చెప్పబడుచున్నాయి.
- ప్రాణ, అపాన సంయమ అభ్యాసముచేస్తూ, ప్రాణాయామము అభ్యాసము చేయాలి. ఇంకా ఇట్లా చెప్పబడుతోంది.
వృషణ - అపానముల మధ్య చేతులను తాకించిఉంచటము.
- నాలిక చాచి, చాచిన నాలికను కొంచెము మెల్లగా నొక్కిపట్టి ఉంచటము (ఖేచరీముద్ర). మొదలైనవన్నీ ఆత్మనిశ్చలతకొరకై యోగాభ్యాసములు.

---

**మాషమాత్రాం తథా దృష్టిం,**
**శ్రోత్రే స్థాప్య తథా భువి,**
**శ్రవణే నాసికే గన్ధా**
**యతః స్వం న చ సంశ్రయేత్।**

- దృష్టిలో కొంతభాగము - మినపగింజంతగా - చెవులలోను, భూమిపైన నిలిపి ఉంచి, మిగతా దృష్టిని-చెవులతో వినబడుచున్నవాటిని, నాసికకు వాసనగా పొందబడువాటిని కళ్ళకు కనబడుచున్నవాటిని - ఆత్మదృష్టిగా నియమించాలి. (Must be appointed). అనగా వాటిని ఆత్మకు అన్యమైన దృష్టితో స్పృశించకూడదు. ఆత్మప్రదర్శనముగా భావించాలి.

---

**అథ "శైవం పదం" యత్ర -**
**తత్బ్రహ్మ, బ్రహ్మతత్ పరమ్।**
**తత్ అభ్యాసేన లభ్యేత**
**పూర్వ జన్మార్జితాత్మనామ్,**
**సంభూతైః వాయు సంశ్రావైః (వ్యైః)**
**హృదయం-'తప' ఉచ్యతే॥**

ఇప్పుడిక, సర్వము శివమయముగా, శివతత్త్వముగా, శివా-అనన్యముగా దర్శించాలి. అదియే "<u>శైవం పదము</u>" (లేక) "<u>శివతత్త్వ దర్శనము</u>".

'శివుడు' అనగా బ్రహ్మమే! శివపదము ఏదియో, అదియే "తత్‌పరమ్‌బ్రహ్మ" దర్శనము. అట్టి సర్వము <u>శివతత్త్వముగా</u> (లేక) <u>బ్రహ్మముగా</u> అనునిత్యస్వాభావిక సందర్శనము అనేక జన్మలలో ఆర్జించిన జ్ఞాన, యోగాభ్యాసముల ఫలముచేతనే సిద్ధించుచున్నది. హృదయములో అట్టి 'ఓం'కార నినాదమును వినటము, వాయునిరోధము, ఆత్మగా సర్వము సందర్శనము - ఇదియే 'తపస్సు' - అనబడుతోంది. (హృదయతపస్సు)

---

**5. ఊర్ధ్వం ప్రపద్యతే దేహాత్**
**భిత్త్వా మూర్ధానమ్ అవ్యయమ్।**
**స్వదేహస్య తు మూర్ధానం**
**యే ప్రాప్య పరమాం గతిమ్,**
**భూయః తే న నివర్తంతే**
**పరావరవిదో జనాః।**
**న సాక్షిణం సాక్ష్యధర్మాః**
**సంస్పృశంతి విలక్షణమ్॥**

- ప్రాణ - అపానముల సంయోగాభ్యాసముచే జనించిన ఉష్ణముతో ఇచ్ఛాజ్ఞానక్రియారూపమై 'మట్టిముద్దవలె నిద్రాణమైయున్న కుండలినీశక్తి'ని నిద్రలేపి, ప్రత్యుత్సాహపరచి - సుషుమ్న నాడియందు ప్రవేశింపజేసి, ఊర్ధ్వత్వము పొందింపజేసి,

- యోగాభ్యాసులు క్రమంగా మూర్ధస్థానమునకు జేర్చి (Placing in Fore face),

యోగాభ్యాసులు క్రమంగా - మూర్ధస్థానము నుండి బ్రహ్మరంధ్రమును ఛేదించి శిరో ఊర్ధ్వ-సహస్రారమునకు జేర్చుచున్నారు.

ఇదియే 'పరమాంగతి'. అట్టివారు తిరిగి భౌతిక స్థితిగతులకు దిగిరారు. ఆత్మభావననుండి క్రిందికి దిగరు. వారు పరావరవిదులు. పరతత్త్వమును ఎరిగినవారు.

అట్టి కేవలుడగు ఆత్మస్వరూప విలక్షణుని సాక్షి - సాక్షి ధర్మములు (జీవుడు - జగత్ అనుభవము అనునవి) స్పృశించజాలవు.

---

**అవికారమ్ ఉదాసీనం**
**గృహధర్మాః - ప్రదీపవత్।**
**జలేవాపి స్థలేవాపి**
**లుఠత్వ ఏష జడాత్మకః॥**

గదిలో దీపము వెలుగుచుండగా, ఆ వెలుతురులో కనిపించే వస్తువుల / గృహోపకరణ ధర్మములు దీపపు వెలుగును స్పృశిస్తాయా? లేదు కదా!

'ఈ భౌతిక దేహము జలంలో ఉన్నా, స్థలంలో ఉన్నా కూడా ఈ దేహముయొక్క, జీవాత్మయొక్క జడధర్మములు నిత్యచైతన్యాత్మ స్వరూపుడనగు నన్ను స్పృశించజాలవు" అని ఆత్మజ్ఞుడు ఎరిగినవాడై, సర్వదా తనయొక్క కేవలీస్వరూపమును ఆస్వాదించువాడై ఉంటున్నాడు.

దృష్టిని దృశ్యమునుండి → నిశ్చలము, అప్రమేయము, సమస్తము అయి ఉన్న ఆత్మవైపుగా త్రోసుకుపోవుచున్నాడు. జడమునుండి చైతన్యము వైపుగా జరుపుకుపోవుచున్నాడు (లుఠము).

న అహమ్ విలిప్యే తత్ ధర్మైః,
ఘటధర్మైః నభో యథా।
నిష్క్రియోఽస్మి అవికారోఽస్మి
నిష్కళోఽస్మి, నిరాకృతిః।
నిర్వికల్పోఽస్మి నిత్యోఽస్మి
నిరాలంబోఽస్మి నిర్ద్వయః।

ఒకచోట ఒక ఘటము (లేక) కుండికము (కుండి - Pot made up of Mud) ఉన్నది. ఆ కుండి యొక్క "గుండ్రటి -శంఖు - నలుచదరపు" ఆకారధర్మములు ఆ కుండి ఉన్న చోటు (లేక) ఆకాశమును స్పృశిస్తాయా? లేదు కదా! అట్లాగే దేహ - మనో - బుద్ధి ఇత్యాది ధర్మములచే నేను స్పృశించబడను. దోషము పొందను.

→ సదాశివుడను, అఖండాత్మ స్వభావుడను,

→ క్రియలకు సంబంధితుడను, బద్ధుడను కాను. **నిష్క్రియుడను.**

→ శరీరము మొదలైన పాంచభౌతిక వస్తువుల వలె సాకారుడను కాను. **నిరాకారుడను. నిరాకృతుడను.**

→ ఎట్టి గుణ దోషములు నాకు ఆపాదించబడజాలవు. **అవికారుడను.**

→ సర్వ సంకల్ప (Ideation) వికల్పము (Withdrawl of Idia)లకు మునుముందే వాటికన్నిటికీ ఆధారుడను. **నిర్వికల్పుడను.**

→ కాలఃకాలుడను. కాలనియామకుడను. (త్రికాలములలో ఏకస్వరూపుడనై ఉన్నవాడను. కనుక **నిత్యుడను.**

→ నాకు అన్యమైన దేనిపైనా ఆధారపడిలేను. నాకు నేనే ఆధారుడను. నిరాధారుడను. **నిరాలంబుడను.** ఆలంబనా రహితుడను. దేని ఆవశ్యకత లేనివాడను.

→ నాకు ద్వితీయమైనదేదీ ఎక్కడా లేదు. **నిర్ద్వంద్వుడను.**

---

సర్వాత్మకోఽహమ్। సర్వోఽహమ్।
సర్వాతీతోఽహమ్ అద్వయః।
కేవలాఖండ బోధోఽహమ్।
స్వానందోఽహం నిరంతరః।
స్వమేవ సర్వతః పశ్యన్
మన్యమానః స్వమద్వయమ్
స్వానందమ్ అనుభుంజానో
నిర్వికల్పో భవామి అహమ్।

- నా ఆత్మ ఒక శరీరమునకు పరిమితమైనది కాదు. సర్వుల ఆత్మగా వెలుగొందుచున్నట్టిది. అందుచేత నేను సర్వాత్మకుడను.

- ఈ సర్వముగా కనిపిస్తున్నది నేనే! సర్వుడను.

- ఈ సర్వమునకు అతీతుడను. సర్వత్రా సమస్వరూపుడను. అద్వయుడను.

- సర్వము ఎరుగుచున్నట్టి కేవలబోధ స్వరూపుడను. అనేకము ఎరుగుటచే అనేకముగా అగుటలేదు. కేవల - అఖండ ఏక బోధస్వరూపుడను. ఇదంతా నా యొక్క ఆత్మానందప్రదర్శనమే. సర్వదా స్వానంద స్వరూపుడను.

స్వయముగా సర్వత్రా దృష్టులు కలిగియుండి సర్వత్రా సర్వమును దర్శించుచూ, స్వయముగా సర్వదృష్టులకు అద్వయుడుగా, అనన్యుడుగా ఏర్పడి ఉన్నవాడను.

ఈ జన్మలు, కర్మలు మొదలై సమస్త వ్యవహారము కూడా స్వానందముగా ఆస్వాదిస్తూ సర్వదా నిర్వికల్పుడైన, సర్వత్రా సంప్రకాశకుడనై ఉన్నవాడను.

---

గచ్ఛం తిష్ఠన్, ఉపవిశన్,
శయానో వా, అన్యథాపి వా,
యథేచ్ఛయా వసేత్ విద్వాన్
<u>ఆత్మారామః</u>
సదా మునిః॥

<u>ఇత్యుపనిషత్</u>
<u>కుండికోపనిషత్ సమాప్తా</u>

ఆత్మారాముడగు అట్టి ఎరుకగల ముని ఎక్కడకు వెళ్ళుచున్నప్పటికీ, ఎక్కడ కూర్చుని ఉన్నప్పటికీ, విశ్రాంతి పొందుచున్నప్పటికీ శయనిస్తున్నప్పటికీ, మరింక ఏవిధంగా ఉన్నప్పటికీ, యథేచ్ఛగా ఉంటూనే ఆత్మయందు రమిస్తూ ఉంటాడు. సందర్భములవశంగా 'తదితరము'గా ఉన్నదంతా ఆత్మయందే ఆత్మగా దర్శిస్తూనే, 'అన్యము' అనునదే లేనివాడై ఉంటాడు. 'మౌనము'ను కలిగి ఉండి ఆత్మానందమును సదా ఆస్వాదిస్తున్నాడు. (మౌనము = ఏది ఎట్లా ఉన్నప్పటికీ నాయొక్క ఆత్మతత్త్వమునకు లోటు లేదు - అను స్వాభావిక సునిశ్చయత్వము = తత్‌భావనా మౌనమేవ ముని ధర్మమ్॥)

<u>ఇతి కుండికోపనిషత్</u>

<u>ఓం శాంతిః శాంతిః శాంతిః</u>

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 4 కుండికోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



ఈ 'మానవజన్మ' మహత్తరమైన 'సదవకాశము'గా విజ్ఞులచే ఎలుగెత్తి గానము చేయబడుచూ గుర్తు చెప్పబడుతోంది. 5వ సంవత్సరములో ప్రవేశించిన బిడ్డ – ఇక "ద్విజుడు – ద్వితీయజన్మ"–అనబడు (బ్రహ్మతత్త్వ అధ్యయన జిజ్ఞాసకొరకై) **'బ్రహ్మచర్య – ఆశ్రమము'** స్వీకరించును గాక. సద్గురువును ఆశ్రయించి 'లోకసేవ' కొరకై **లోకసంబంధవిద్యను,** (మరియు) ఆత్మతత్త్వజ్ఞానము కొరకై **ఆధ్యాత్మ శాస్త్రమును** అధ్యయనము చేయాలి. ఈ విధంగా 'విద్యార్థి దశ' పూర్తయ్యేవరకు గురుశుశ్రూష చేస్తూ **'గురు–ఆశ్రమీ'** అయి ఉండునుగాక। వేద హృదయమును, సద్గురు ప్రవచన పరమార్థమును అభ్యసించునుగాక!

విద్యాభ్యాసము ముగిసిన తరువాత, ఆపై సరియగు సమయములో సద్గురువు శిష్యుని పిలిచి, ఈ విధంగా సంబోధిస్తున్నారు.



## సద్గురు అభిభాషణము

**గురువు (శిష్యునితో) :** బిడ్డా! శిష్యా! వేద–వేదాంతములను అధ్యయనము చేసావు. ఇప్పటికి నావద్ద నీ విద్యా–అధ్యయనము పూర్తి అయినది. ఇక నీవు నీ ఇంటికి వెల్లవచ్చు. **నీకు గృహస్థాశ్రమము స్వీకరించటానికి అనుజ్ఞ ఇస్తున్నాను.** అప్పుడు కూడా మన ఆశ్రమములో నేర్చిన **"అగ్ని కార్యము"** మొదలైన దైనందిక ఉపాసనలు కొనసాగించు. మాతృ–పితృ దేవతలపట్ల, తదితర కుటుంబసభ్యుల పట్ల, సహజనులపట్ల నీవు **విద్యుక్త ధర్మములను సమర్పణభావంతో** నిర్వర్తించు. సముత్సాహవంతుడవై ఉత్తరోత్తర ఆశ్రమ ధర్మములను తగిన సమయములో స్వీకరించు. ఇహ – ఆముత్ర ఉత్తమ పవిత్ర ప్రయోజనములను సిద్ధించుకొనెదవుగాక.



## గృహస్థాశ్రమము

ఆ విధంగా **"గురుణాశ్రమీ"** అనబడు బ్రహ్మతత్త్వ అధ్యయనముతో కూడిన **"బ్రహ్మచర్యాశ్రమము"**ను ముగించుకొని ఆ విద్యార్థి తిరిగి ఇంటికి చేరుకున్నాక, తాను గురువుచే బోధించబడిన 'అగ్నికార్యము, సంధ్యావందనము' దైనందిక అనుష్ఠానము నైమిత్తికమగు కర్మలు (పరవడిరోజులలో పూజలు మొదలైనవి) యధాశక్తిగా నిర్వర్తిస్తూ జీవనోపాధిని ఆశ్రయిస్తూ ఉండునుగాక. పెద్దల నిర్ణయానుసారము వివాహము చేసుకొనును గాక. "ఆత్మోద్ధరణ"యే పరమలక్ష్యముగా కలిగియుండి గృహస్థాశ్రమధర్మములగు ధర్మ–అర్ధ–కామములు, దానము, పెద్దలసేవ, తత్త్వాధ్యయనము, బ్రహ్మజ్ఞానము వినటము, బోధించటము, భక్తి, యోగాభ్యాసము...ఇత్యాదులు శ్రద్ధగా చేయుచుండునుగాక. **"జగత్–దృశ్యమును ఆత్మభావనతో ఉపాసించటము"**...ను **అనునిత్యము** చేసుకొనుచుండునుగాక. 'ఇష్టము' అనబడు అగ్నియజ్ఞము, ఆత్మయజ్ఞము (అహమ్ బ్రహ్మాఽస్మి, తత్త్వమ్, అయమాత్మా బ్రహ్మ మొదలైన మహావాక్యార్థములను లోకకళ్యాణభావనతో) అనుష్ఠించుచుండునుగాక! **"నూతులు త్రవ్వించటము" మొ॥న 'పూర్తములు' అనబడు సాంఘిక సేవా కార్యక్రమములు నిర్వర్తించునుగాక. వంశపారంపర్య సంపదలు**ను, న్యాయార్జిత–దైవార్పిత–భూతార్పిత సమన్వితమగు సంపదలు

వృద్ధి చేయునుగాక. సంతానమును పొంది ఈశ్వర భావనతో లోకానుకూల్యంగా వారిని తీర్చిదిద్దునుగాక. 'దైవభక్తి, యోగాభ్యాసము, విద్యార్జనము' నేర్పించుచూ సంతానమును యజ్ఞభావముగా పెంచునుగాక! జీవితమంతా కూడా బ్రహ్మము గురించిన అధ్యయనము నిర్వర్తిస్తూ బ్రాహ్మీభావనను - **స్వాభావికము, అనునిత్యము** చేసుకొనునుగాక.

## వానప్రస్థాశ్రమము

ఈ విధంగా ఇష్టా (యాగ, యజ్ఞములను)-పూర్త (లోకోపకరణములు) నిర్వర్తిస్తూ గృహస్థాశ్రమమును నిర్వహిస్తూ, సరి అయిన సమయ - సందర్భములలో లోకసంబంధమైన బాధ్యతలను సంతానమునకు అప్పజెప్పి **'వానప్రస్థాశ్రమము'**నకు ఉపక్రమించును గాక.

- తనకు సంబంధించిన సంపదలను సంతానమునకు పంచి వేసి,
- సర్వ లోక సంబంధమైన ఆశయములను విడచివేసి,
- శేషించిన జీవితమును పూర్తిగా ఆధ్యాత్మిక మార్గమునందు వెచ్చించుటకై సంసిద్ధుడగునుగాక.
- అందుకొరకై వనములలో (సాంఘిక వాతావరణమునకు సుదూరంగా) ఏదైనా ఏకాంత (సాధనమునకు సానుకూల్య) ప్రదేశమును ఎన్నుకొనును గాక. ఈ విధంగా **వానప్రస్థాశ్రమము** స్వీకరించునుగాక.
- శరీర రక్షణ కొరకు మాత్రమే ఉద్దేశ్యిస్తూ సులభంగా పరిసరములలో లభించేది, సాత్వికము అగు ఆహారము స్వీకరించుచుండునుగాక! కందమూల ఫలములను, వాయు-జలభక్షణ ఇటువంటి నియమములు, నిష్ఠలు ఆచరించునుగాక!
- ఇక లోక సంబంధమైన సర్వచింతనలను (ఆత్మజ్ఞానముపట్ల ఏర్పడు) ఇష్టముతో త్యజించి, తనశరీరమును పృథివీభావనతో దర్శిస్తూ (మట్టి-రాయి వలె భావిస్తూ) **మోక్షమార్గములగు యోగాభ్యాసము, జ్ఞానాధ్యయనము** మొదలైన వాటికి పరిమితుడై ఉండునుగాక.
- ఇంద్రియానందములన్నిటికీ మొదలంట్లా ముగింపు పలికి, దేహేంద్రియములను ఉపకరణభావంతో నియమించునుగాక.

## సన్న్యాసయోగము

ఇప్పుడిక సన్న్యాసయోగము గురించి చెప్పుకుందాము. **సహ తేనైవ పురుషః కథం సన్న్యస్త ఉచ్యతే?** **'సన్న్యస్తుడు' అని ఎవరిని అంటాము**? కేవలము ఇంద్రియములను కందమూలఫలముల ఆహారముతోను, వనప్రదేశ విహార నివాసములతోను నియమించినంత మాత్రముచేత సన్న్యాసయోగము సిద్ధిస్తుందా? **స నామధేయో యుస్మింస్తు** కథం? **'సన్న్యాసి'** అనే పేరుచేత పిలువబడిన మాత్రం చేత సన్న్యాసయోగము లభిస్తుందా? లేదు. మరి?

**- తస్మాత్ ఫల విశుద్ధాంగీ సన్న్యాసమ్ సంహితాత్మనామ్।** సర్వలోకసంబంధమైన భేదములను త్యజించి సర్వత్రా సమస్వరూపమైయున్న అచంచలమగు 'ఆత్మదృష్టి' (లేక, భౌమా దృష్టి) చే సత్ + న్యాస = సన్న్యాసి - అవాలి.

ఈ విధంగా (1) గృహస్థాశ్రమములోని నియముల వ్యాజము. (2) ఏకాంత వనప్రదేశ ప్రవేశము (3) యోగసాధనలచే **వానప్రస్థము** సిద్ధిస్తోంది. సర్వత్రా **"సత్-దర్శన స్వాభావికము"**చే **సన్న్యాసము** పరిపూర్ణమగుచున్నది.

## మహదాశయుడు / మహాశయుడు

గృహస్థాశ్రమములో భార్య - పిల్లలు, సంపదలు...ఇవన్నీ సుఖరూపమువలె సామాన్యముగా జనులచే చూడబడుచున్నాయి. అయితే మహదాశయుడు వాటిని స్వల్పాశయములు (లేక) సందర్భమాత్రములుగా గమనిస్తున్నాడు.

- అట్టివాడు "ఈ సాంసారిక సుఖములతో సంతోషపడి పరిమితమై ఉండటమనేది ఉత్తరోత్తర గతులకు శుభప్రదము కాజాలదు" - అని గ్రహించి ఉత్తమాశయము కొరకై ఉద్యమిస్తున్నాడు.
- అనివార్యంగా తాను చేయవలసివస్తున్న లోకసంబంధమైన (మరియు) పారలౌకికార్థములైన కర్మలన్నీ పూజాపుష్పములుగాను, ఉపాసనా - ఉపాయములుగాను భావన చేస్తున్నాడు.
- సరి అయిన సమయములో సాంసారిక సుఖములకు ముగింపు పలికి, భార్యతో కూడా (లేక వంటరిగానో) వానప్రస్థుడగుచున్నాడు.
- క్రమంగా సర్వభోగవాసనలు జయించటానికి ఉపక్రమిస్తున్నాడు.

- "పునర్జన్మ' అనే గర్భవాసము, శీతోష్ణ సుఖదుఃఖముల చర్విత చర్వణమైన ప్రవాహపతితములకు, పునఃపునఃజన్మల ప్రహసనమునకు అంతు ఎక్కడ?... ఇదంతా ఎంత కాలము? ఈ రీతిగా అసంఖ్యాక జన్మ జరా మరణ దశలను పొందుతూనే ఉండాలా? ఇక చాలు..."

అని నిర్ణయించుకొని **"అనామయము-అతిరహస్యము'** అగు **ఆత్మస్థానము**ను చేరెదరుగాక! **గుహ్యం ప్రవేష్టుమ్ ఇచ్ఛామి పరంపదమ్ అనామయమ్ - ఇతి।"**-అని నిర్ణయించుకొనుచున్నాడు. **సన్న్యాసయోగము (లేక) సన్న్యాస ఆశ్రమము స్వీకరించుచున్నాడు.**

"సన్న్యాసము (సత్‌ను ఉపాసించటము)" – అనే అగ్నిచే పునరావృత్తి దోషరూపమగు మృత్యువుయొక్క పరిధిని అధిగమించుటయందు ప్రయత్నశీలుడగుచున్నాడు. **సన్న్యాసాగ్నిమ్ అపునరావర్తనం యన్మృత్యుర్జాయమ్ ఆవహమితి॥**

అందుకు మార్గము ⟶ సన్న్యాస ఆశ్రమ నియమనిష్ఠ. **"ఇదంతా నాదికాదు. నేను దీనికి సంబంధించిన వాడిని కాదు"** అనుఅవగాహన.

**అధ్యాత్మ మంత్రాన్ జపేత్।** ఇక అతడు ఆత్మయొక్క కేవలత్వమును, ఆవిష్కరత్వమును, అఖండత్వమును, అప్రమేయత్వమును, నిత్యత్వమును, సత్యత్వమును జపించునుగాక! (ఆధ్యాత్మమ్ = ఈ దేహమును, సమస్త దృశ్యమును ధారణచేయుచున్న **స్వస్వరూపాత్మయొక్కభావన**)

**(సన్న్యాస) దీక్షామ్ ఉపేయాత్ :** అనేక భేదములతో కూడిన జగత్తును – జగత్తుగా కాకుండా – **ఆత్మగా ఈ మస్తమును దర్శించు దీక్ష**కు ఉపక్రమించునుగాక। **"సర్వము స్వస్వరూపమునకు అభిన్నము కదా"** – అను కైవల్యానుభవమువైపు దృష్టి సారించునుగాక।

## సన్న్యాస విధులు :

**కాషాయ వాసాః :** బాహ్య – అభ్యంతరముల పరిశుద్ధతను ఉద్దేశ్యించి కాషాయ వస్త్రధారణను స్వీకరించుచున్నాడు.

**కక్షా-ఉపస్థ లోమాని వర్జయేత్ :** చంకల – ఉపస్థరోమములు త్యజించుచున్నాడు.

**ఊర్ధ్వబాహుః విముక్త మార్గోభవతి :** పైకెత్తి ఉంచిన చేతులతో – మోక్షమార్గమును అభ్యసించువాడై ఉంటున్నాడు.

**అనికేతః చరేత్ నిదిధ్యాసనమ్ దద్యాత్ :** గృహసంబంధమైన సర్వ విషయములను మొదలంట్లా మానసికంగా త్యజించివేయుచున్నాడు. ధ్యాసను సమస్తమునకు మూలాధారమగు ఆత్మగా ఈ సమస్తమును దర్శించుటయందు ఉద్యుక్తుడగుచున్నాడు.

**శ్రవణము** – బ్రహ్మతత్త్వము గురించి గురు / శాస్త్రముల ఆశ్రయముచే అధ్యయనము చేయటమును తీవ్రము చేసుకొంటున్నాడు. సత్సంగమును ఆశ్రయిస్తున్నాడు. ఆత్మజ్ఞులగు వారిని సమీపించి శ్రవణము చేస్తున్నాడు.

**మననము** – సర్వము **"బ్రహ్మముగా అనుకోవటము"**ను ఆశ్రయిస్తూ, క్రమంగా **"బ్రహ్మముగా అనిపించటము"** అనే రూపముగల **"నిదిధ్యాస"**ను సిద్ధింపజేసుకొనుచున్నాడు.

ఈ స్థితిలో జంతు (లేక) దేహపరిమిత భావములను అధిగమించుటకొరకై మహనీయుల చరిత్రలను, అవతారమూర్తుల దివ్యగుణములను పారాయణం చేస్తూ పవిత్ర భావములను కలిగి ఉంటున్నాడు. దీనిని గురించి ఇంకా ఈ విధంగా 'శ్లోకములు" చెప్పబడుచున్నాయి.

అట్టి సన్న్యాసాభ్యాసి – కుండికము (కుండీ), చమకము (చెంబు), త్రివిష్టపము (త్రిలోకసంజ్ఞయగు మూడు ముఖములపాత్ర-పిలక), కాలిచెప్పులు, బొంత వస్త్రము, శాటినీ వస్త్రము (పైపంచ), గోచి మొదలైన సర్వధారణములపై మోజును (గ్రాహ్య త్యాజ్య పట్టుదలలను) త్యజించినవాడై ఉంటున్నాడు. పవిత్రము (దర్భాసనము), స్నానవస్త్రములు, ఉత్తరీయము మొదలైన సర్వధారణలందు కించిత్ అపేక్షకూడా లేనివాడై సర్వము త్యజించి 'యతి' అయి ఉంటున్నాడు. ఇల్లు వదలుచున్నాడు. నదీతీరములో, దేవతాప్రాంగణములో – శయనించే (నిద్రపోయే) చోటులుగా కలిగి ఉంటున్నాడు. భౌతిక శరీరమును సుఖ- దుఃఖ స్పర్శధ్యాసలను లేనట్టిదిగా మలచుకొనుచున్నాడు. స్నానము, పానము, శుచిత్వము – ఇవన్నీ పవిత్రజలము (ఉదాహరణ ⟶ **నదీజలము**)... లభించే చోట మాత్రమే నిర్వర్తిస్తున్నాడు.

దృశ్యపరిధులను దాటి ఆత్మభావనను మననము చేస్తూ 'యతి' అగుచున్నాడు. అట్టి యతి జనుల స్తుతిచే పొంగడు. నిందలకు క్రుంగడు. ఇతరుల తప్పులను మాట్లాడడు. ఎవ్వరినీ దూషించడు. శపించడు. **స్తూయమానో న తుష్యేత। నిందితో న శపేత్ పరాన్।**

భిక్షకొరకు, స్నాన – పానములకొరకు **పాత్రను,** దేహరక్షణకొరకు వస్త్రమును మాత్రము – (అనివార్యమగు వస్తువులను మాత్రమే) ఉంచుకొని, తదితరమైనవన్నీ త్యజించివేసి ఉంటాడు. **"సర్వము సర్వదా బ్రహ్మమే! ఆత్మనగు నాకు సర్వము అనన్యము"** అను రూపముగల భావనలను ఆశ్రయిస్తూ, ఇంద్రియములవలన కలుగుచున్న విషయ-భేద దృష్టులన్నీ సన్న్యాసాగ్నిచే దగ్ధము చేస్తూ

ఉంటాడు. శరీముతోను, మనస్సుతోను అభ్యాసయోగమును ఆశ్రయిస్తూ, పరమాత్మతత్త్వమును జపిస్తూ,-**విశ్వ అయమ్ అనుసంయోగాత్ మనసా భావయేత్ సుధీః।** ఈ విశ్వమును విశ్వేశ్వరుని ప్రత్యక్షరూపంగా భావించుటయందు మనోభావనను నియమిస్తూ బుద్ధితో సర్వము పరమాత్మ స్వరూపంగా దర్శిస్తూ - ఆరాధించుటయందు వృత్తిని, అవగాహనలను, పెంపొందించుకొంటూ ఉంటున్నాడు. విశ్వమును భేదదృష్టితో చూడక, భేదములందు మునగక, విశ్వమును విశ్వేశ్వరోపాసనతో **'సమదర్శి'** అయి దర్శిస్తూ ఉంటాడు.

**యతియొక్క జగత్ సందర్శనము**

| | | |
|---|---|---|
| ఆత్మనుండి | → | ఆకాశము |
| ఆకాశము నుండి | → | వాయువు |
| వాయువు నుండి | → | జ్యోతి / అగ్ని |
| జ్యోతి నుండి | → | జలము |
| జలము నుండి | → | భూమి |

సర్వభౌతిక దేహములు ఆకాశ - వాయు - జ్యోతి - జలము - పృథివి అనబడే పంచభూతముల - సంమిశ్రమముయొక్క - ఆవిష్కరణము (The Formation of Mix - up) మాత్రమే. అనగా అనేక జీవరాసుల చమత్కారములతో కూడిన **ఈ సమస్త దృశ్య జగత్తు ఆత్మయొక్క సంప్రదర్శనా - విశేషమే.** జీవులంతా సహజముగా బ్రహ్మమే స్వ-స్వరూపముగా కలిగి ఉన్నారు. ఇక దృశ్యజగత్తులో సందర్భమగుచున్నదంతా కేవలము కల్పనామాత్రమే.

అట్టి ప్రతి ఒక్క జీవుని యొక్క, నాయొక్క **అనునిత్య-సహజస్వరూపమగు - ఆత్మ యొక్క లక్షణములు ఎట్టివి?**

**అజరమ్, అమరమ్** - జనన మరణములు లేనట్టిది.

**అక్షరమ్ - అవ్యయమ్** - ఆత్మకు క్షీణించటము అనే క్షరధర్మము లేదు. సర్వదా అవ్యయము. తరుగదు. పెరుగదు.

**అట్టి ఆత్మయే నా స్వరూపము। అదియే నీవు కూడా।**

## మమాత్మానంద స్వరూప నిర్ణయము

మం॥ శ్లో॥ మయి అఖండ సుఖాంభోధౌ బహుధా విశ్వవీచయః
ఉత్పద్యతే, విలీయంతే - మాయామారుత విభ్రమాత్॥

**"సముద్రము - తరంగాలు - దృష్టాంతము" :**

సముద్రంలో తరంగాలు బయల్వెడలి, సముద్ర జలంలో సంచారములు చేసి తిరిగి సముద్రజలంలో లయము అవుతూ ఉంటాయి కదా!

**"వాయువు-వాయుతరంగాలు"-దృష్టాంతము:** వాయువునందు వాయుతరంగాలు బయల్వెడలి వాయువునందు విలీనమగుతూ ఉంటాయి కదా!

**నాయొక్క అఖండ - సుఖస్వరూప - కేవల ఆత్మసాగరంలో - 'విశ్వములు' అనే మాయా (కల్పనా) వీచికలు బయల్వెడలి, ఆత్మయందే ఉనికి కలిగిఉండి...తిరిగి ఆత్మయందే లయమగుచున్నాయి.**

ఒక కథారచయిత యొక్క కల్పనా చైతన్యము నుండి కథాగమనమంతా బయలుదేరి, చివరికి ఆ కథావిన్యాసమంతా కథా రచయితయందు విలీనమగు తీరుగా,.... **నానుండి స్వకీయమాయచే దేహ - దేహాంతర చమత్కృతులతో కూడిన విశ్వకథాగమనములు బయల్వెడలి, తిరిగి మమాత్మయందే విలీనము అగుచున్నాయి.**

**విశ్వము ఆత్మకు అభిన్నము** : వాయు వీచికలు వాయువే అయినట్లు, సముద్ర తరంగములన్నీ సముద్రజలమునకు అభిన్నమే అయినట్లు, కథా విశేషములన్నీ ఆ రచయితయొక్క ఊహలకు అభిన్నమే అయిఉండువిధంగా,

నా ఆత్మనుండి సంప్రదర్శనమగుచున్న ఈ విశ్వ విశ్వాంతరళములు మమాత్మకు కించిత్ కూడా భిన్నము కాదు. సర్వదా అభిన్నము.

ఆత్మ సర్వదా ఏకమేగాని అనేకము కాదు। అఖండమే గాని ఖండము కాదు.

### ఆకాశము : మేఘములు :: ఆత్మ : జగత్తులు

**న మే దేహా, న సంబంధో - మేఘేనేవ విహాయసః :** ఆకాశంలో మేఘములు సంచరిస్తూ ఉన్నప్పటికీ ఆకాశమునకు మేఘములతో సంబంధమే లేదు కదా! **'ఆకాశము మేఘములను ధరించినది'** అని కూడా అనలేము. మేఘములు ఉన్నా (లేక) లేకున్నా ఆకాశము

సర్వదా యథాతథము కదా। అట్లాగే ఆత్మాకాశస్వరూపుడనగు నాకు ఈ దేహములతోగాని, ఈ దేహముల ద్వారా దర్శించబడే ఇంద్రియ విషయ జగత్ – దృశ్యములతోగాని కించిత్ కూడా **సంబంధము లేనేలేదు. మొదలేలేదు. ఇప్పటికీ లేదు. ఎప్పటికీ లేదు.**

**అతః కుతో మే తత్ ధర్మా – జాగ్రత్ స్వప్న సుషుప్తిషు?** "ఆకాశంలో మేఘములు సంచరిస్తూ ఉంటే, ఆకాశము మేఘముల ఆకారము పొందుచున్నది" అని ఎవ్వరైనా అనగలరా? లేదు. ఆకాశము (Space) నకు ఆకారమే లేదు. మేఘములు ఆకార – ధర్మములు ఆకాశమునకు ఆరోపించవీలు కాదు.

అట్లాగే...., జాగ్రత్ – స్వప్న – సుషుప్తులలోని ఆయా విశేషములు, అనుభూతులు, అనుభవములు, సందర్భములు, సంబంధములు, అనుబంధములు, బాంధవ్యములు – మొదలైనవన్నీ **ఆత్మాకాశానంద స్వరూపుడనగు నన్ను స్పృశించవు.**

ఆత్మనగు నేను ఆయా సందర్భములలోనికి జారిపడువాడను కాను. (I don't quit from what I am and I do not happen to slip into situations, relationships, contexts etc).

వాస్తవానికి అవన్నీ కూడా నాయొక్క ఆత్మ తేజస్సుచేతనే సాకారంగా ప్రదర్శనమగుచున్నాయి.

## ఆత్మ సర్వదా యథాతథము

జాగ్రత్ స్వప్న సుషుప్తులలోని విశేషములన్నీ నాకు – కథా రచయితయొక్క కథారచనా అంతర్గత సంఘటనల వంటివి మాత్రమే.

సూర్యకాంతిలో ఒక వస్తువు కనిపిస్తూ ఉంటే, సూర్యకాంతి ఆ వస్తువుయొక్క ఆకారము సంతరించుకున్నట్లుగా అవుతుందా? అవనే అవదు. అట్లాగే ఆకాశమువలె, సూర్యకాంతివలె ఈ దృశ్యజగత్తుకు సర్వదా విలక్షణుడను.

కొండపైగల చెట్లు గాలికి అటూ ఇటూ ఊగుచుండవచ్చుగాక! కొండ కదలుతుందా? కదలదుకదా! అట్లాగే, ఈ మనస్సు, అద్దాని ఆశ్రయములు అగు విషయములు కదలుచున్నప్పటికీ, కొండవంటి మమాత్మకు ఎటువంటి చలనస్వభావము లేదు.

కలలో ఒకడు ఒక ప్రదేశమునుండి మరొక సుదూరప్రదేశము వెళ్ళి వచ్చినప్పటికీ జాగ్రత్ దృష్ట్యా వెళ్ళనివాడే అగుచున్నాడు కదా! అట్లాగే సర్వదా కేవలాత్మాకాశ స్వరూపుడనగు నేను జాగ్రత్ – స్వప్న – సుషుప్తులలోనికి గాని, దేహముల లోనికి గాని, లోకములలోనికి గాని, వెళ్ళువాడనుగాను. తిరిగివచ్చువాడను కాను. సర్వదా యథాతథుడనై యథాతథంగా ఆత్మప్రకాశ ప్రదర్శనుడనై ఉన్నాను. (I am always as 'Blossoming SELF - unaffected by events and eventualities of this scinario including Birth and Death)

## ఆత్మయే అయి ఉన్న 'నేను'

**ఆకాశము వలె** – సమస్త సాకార – పాంచభౌతిక కల్పనలు లేనట్టివాడను.

**ఆదిత్యునివలె (సూర్యునివలె)** – వెలిగించబడు (వెలుగులో కనబడు) సర్వ వస్తువుల కంటే (దృశ్యముకంటె) విలక్షణమైనవాడను.

కొండవలె సర్వదా నిశ్చలుడను. కొండపైగల చెట్లు గాలికి కదులుతాయిగాని, కొండ గాలికి కదలదు కదా! కించిత్ కూడా **చ్యుతిలేనివాడను. అచ్యుతుడను.**

**సముద్రజలమువలె** – 'అంతు' అనునదే లేనివాడను. (తరంగములచే సముద్రము ఆది – అంతము పొందదుకదా) (I am Infinite and endless). పంచభూతములచేగాని, కాలము, ఆకాశము, అంతరంగ చతుష్టయము మొదలైన వాటిచేతగాని పరిమితుడనుకాను.

❈

నేను 'జీవుడు' అనబడుదానిచే పరిమితుడను కాను. **నారాయణోఽహమ్। నరకాన్తకోఽహమ్।**

తరంగములచే జలము పరిమితము కాని విధంగా నేను నారాయణుడను. 'నరుడు' (జీవుడు) అనబడు జగన్నాటక 'పాత్ర'కు ఆవల ఉన్నట్టివాడను. నరకాసుర సంహారియగు శ్రీకృష్ణ చైతన్య – నిత్యానందస్వరూపుడను.

'నరుడు, జీవజాతి మొదలైన సమస్త "ఆవరణ–విభాగ–ఆపాదనలకు" ఆవలివాడను (I am beyond all zoological & Biological Discriptions / Bifuncations / Attributions. ఈ దేహమునకు 'దేహి'గా ఆవలివాడను. దేహ–పురములచే సంకుచితుడను అవను. **పురాంతకుడను.** ఈశ్వర స్వరూపుడనై సర్వత్రా విస్తరించి ఉన్నట్టి పురుషుడను. (I am the worker / Functioner beyond all works / Functions)

**అఖండబోధోఽహమ్।** నాయొక్క 'ఎరుక' అను 'బోధ' (They Feature / Quality of 'knowing') :-

(1) ఎరుగుచుండు **వస్తువుకు పరిమితమైనది కాదు.**

(2) **ఎరుగబడేదంతా 'ఎరుక'** యొక్క స్వకీయ విస్తార ప్రదర్శనారూపమే.

నాకు వేరైనదంటూ ఏదీ లేనట్టి ఈ సమస్తమునకు **సాక్షిని** (A mere witness by being beyond) కూడా! **అశేష సాక్షీ నిరీశ్వరోऽహమ్।** నన్ను సాక్షిగా నియమించునది నేనే! నన్ను నియమించు మరొకటేదీ ఎక్కడా లేదు. నాయందు నేనే నాకు అభిన్న జగత్తుగా విస్తరించి ఉన్నాను.

**'నేను'** అను నాయొక్క భావనకు **మునుముందే నేను ఉన్నాను.**

'అహం' భావనకు ముందుగానే, ఆ భావనకు పురుషకారుడనై ఉన్నవాడిని. **'నిరహమ్'** స్వరూపుడను.

నాకు అన్యమైనదేదీ లేదు. కనుక 'నాది' అనునది నాకు వేరై ఎక్కడా లేదు. కనుక **నిర్మమ స్వరూపుడను.**

## అభ్యాస యోగము :

ఇంకా కూడా ఈవిధంగా గానం చేయబడుతోంది.

**"అహమ్ అఖండ – అప్రమేయ – నిత్య – సత్య ఆత్మస్వరూపమస్మి"** అను సత్ – భావనాసిద్ధి కొరకై, పరిమితమైన వ్యష్టిభావనను జయించుటకై **"ప్రాణ–అపానసంయమము"** 'అభ్యాసము'గా చెప్పబడుతోంది. **లోనికి ప్రవేశించు ప్రాణవాయువును, బహిర్గతమగుచుండు అపానవాయువును సమస్థానము నకు జేర్చి ధారణచేయు కుంభకరూప – అభ్యాసమగు 'ప్రాణాయామము'**చే మనస్సు చంచలత్వము వీడగలదు. బుద్ధి నిర్మలత్వము, ఏకాగ్రత సంచరించుకోగలవు.

**- వృషణ - అపానయోః మధ్యే పాణీ ఆస్థాయ సంశ్రయేత్,** → వృషణ – అపానముల మధ్యగా చేతులతో అదిమి ఉంచి,

**- సన్దశ్య శనకైః జిహ్వాం యావమాత్రే వినిర్గతాం,** → కొంచము బయటకు వచ్చిన నాలుకను వెనుకకు మడచి ఉంచి (ఖేచరీముద్ర),

**మాష మాత్రాం తథా దృష్టిం శ్రోత్రే స్థాప్య, తథా భువి** → దృష్టిని మినపగింజ మాత్రంగా (మాష మాత్రంగా) చెవులయందు, భూమియందు నిలిపి,

**- శ్రవణే నాసికే గన్ధా యతః స్వ న చ సంశ్రయేత్,** → శబ్ద స్పర్శ రూప రస గంధ – పంచేంద్రియ విషయములపట్ల "నేను వీటిచే పరిమితుడను" అను సంశ్రయమును అధిగమించినవాడై ఉంటాడు.

వ్యష్టిగతమగు 'జీవుడు' అను పరిమితధ్యాసను దాటివేసి **సమష్టి – సర్వగతమగు 'శివతత్త్వజ్ఞానము'**నందు ప్రవేశించు సాధనలయందు నిమగ్నుడై ఉంటాడు.

**"అహమ్ త్వమ్ తత్ "శివేతి"** : – ఈ దృశ్యము – ద్రష్ట – దర్శనము , సర్వ సహజీవులు కూడా శివమయమే కదా!" – అనునదే శివతత్త్వోపాసన. **"శివభగవానుడే సర్వరూపులుగా ఉన్నారు"** అను దర్శనమే **శివతత్త్వదర్శనము. అథ శైవం పదం యత్ర తత్ బ్రహ్మ। బ్రహ్మ తత్ పరమ్।** దేనిని 'శివము' అంటున్నామో, అద్దాని తత్త్వార్థము బ్రహ్మమే। తత్ పరబ్రహ్మమే। అట్టి శివతత్త్వము, జ్ఞానముచే **ఎరుగబడినదిగాను, "ప్రాణయోగాభ్యాసము", "మననము"** ఇత్యాదులచే **అనుక్షణిక స్వానుభవము**గా తీర్చిదిద్దబడిదిగాను అగుచున్నది.

## ప్రాణయోగాభ్యాసము

- ప్రాణ అపానములు పరస్పరము స్పృశించి నిశ్చలము అవధరించుచూ, ప్రాణ–అపానముల పరస్పర స్పర్శరూప ప్రాణయామాభ్యాసము వలన జనించు అగ్నిచే మూలాధారమునందు **బుద్ధి – మనస్సులను ప్రవేశింపజేసి,**
- మూలాధారమున దృశ్యతాదాత్మ్యరూపంగా (ఆత్మ యొక్క ఏమరుపురూపంగా) కునుకులు తీయుచున్న **ఇచ్ఛా–జ్ఞాన క్రియాత్మకమగు "<u>కుండలినీశక్తి</u>"ని నిదురలేపి,**
- అట్టి కుండలినీశక్తిని ఇడ–పింగళనాడుల మధ్యగా శక్తిరూపంగా ప్రకాశించు **సుషుమ్నానాడియందు ప్రవేశింపజేసి,**
- శిరో ఊర్ధ్వభాగములోని బ్రహ్మరంధ్రము వరకు విస్తరించియున్న 'సుషుమ్న' నాడిద్వారా స్వాధిష్ఠాన–మణిపూరక–విశుద్ధ **చక్రస్థానములను దాటించి,** ఆజ్ఞాచక్రమునందు (యోగులు) **ప్రవేశింపజేయుచున్నారు.**

అటుతరువాత...

**ఊర్ధ్వం ప్రపద్యతే దేహాత్ భిత్వా మూర్ధానమ్ అవ్యయమ్।** – ఆజ్ఞా చక్రమునుండి యోగాభ్యాసి కుండలినీశక్తి సమేతుడై మూర్ధము ( Foreface) నుండి శిరస్సు (బ్రహ్మరంధ్రమును) స్పృశించి, భేదించి, సర్వాత్మకుడగు పరమాత్మయొక్క విశేష సంప్రదర్శనస్థానమగు శిరో – ఊర్ధ్వస్థానము (సహస్రారము) నందు సంస్థితుడు అగుచున్నాడు.

## పరావరవిదులు – పరమాంగతి

– నేను "ఈ దేహములో 'దేహాత్మ'గాను, (అదే సమయములో All at the same time – నాలో దేహము ఉండటంచేత) 'పరాత్మ'గా కూడా ఉండి ఉన్నాను. లోకములలో నేను ఉన్నాను. లోకములన్నీ నాలోను (స్వకీయ భావనామాత్రంగా) ఉన్నాయి.

⌘ లోకములలో 'నేను' = జీవాత్మను। (స్వప్నములోని 'నేను' వంటిది)।

⌘ నాలో లోకములు = పరాత్మను। (నాలో స్వప్నము ఉన్నతీరుగా)।

⌘ జీవాత్మగా – సందర్భ మాత్ర సత్యము కాబట్టి **'వ్యయుడను'**. మార్పుచెందు విభాగుడను. (పాదో అస్య విశ్వాభూతాని)

⌘ పరాత్మగా – కేవలాత్మ స్వరూపుడను కాబట్టి **అవ్యయుడను**. మార్పు చెందనిది (త్రిపాదస్య అమృతం దివి)

⌘ జీవాత్మగా – పరాత్మోపాసకుడను.

⌘ పరాత్మగా – జీవాత్మ నియామకుడను.

స్వస్వరూపముయొక్క – "మార్పు చెందు '4'వ వంతు – 'మార్పుచెందని మిగతా '3' వంతుల విభాగము"లు సమన్వయమే **"విభాగయోగము"**

అట్టి, స్వాభావిక అనునిత్య అవగాహనతో కూడి **"స్వస్వరూపాత్మాజ్ఞాన సమన్విత ఆస్వాదన"** యే "పరమాగతి"।

**స్వదేహస్య తు మూర్ధానం యే ప్రాప్య పరమాంగతిమ్ భూయః తే న నివర్తంతే పరావరవిదో జనాః।** ఆ విధంగా మూర్ధస్థానమును దాటి **"జగత్తులో నేను – నాలో జగత్తుల సమన్వయస్థానము"**... అనబడు సహస్రారము (శిరో ఊర్ధ్వస్థానము) సిద్ధించుకొన్నయోగి పరమాగతిని సిద్ధించుకొనుచున్నాడు. అట్టివాని పరమాంగతి ఇక పునరావర్త దోషము లేనట్టిది అగుచున్నది.

**సర్వసాక్షిణమ్ :** – అట్టివాడు సర్వమునకు 'సాక్షి' అయి, విలక్షణుడై, **పరము (ఆవల)**గా ప్రకాశించుచుచుండగలడు. **న సాక్షిణమ్ సాక్షి ధర్మమ్ సంస్పృశంతి విలక్షణమ్** – అట్టి "సాక్షి – సాక్షిధర్మము" సిద్ధించుకొన్నయోగి యొక్క **"కేవలసాక్షిత్వము"** – జగత్‌వ్యవహారమార్పు చేర్పులచే ఏమాత్రము స్పృశించబడదు. **'ఈ దేహముల రాకపోకలకు, వాటివాటి అంతర్గత విశేషములకు పట్టుబడక, సమస్తమునకు విలక్షణుడై ఉంటాడు.**

గృహధర్మాః ప్రదీపవత్ అవికారమ్ – ఉదాసీనమ్। ఒక ఇంటిలో వస్తువులు దీపపుకాంతిలో అస్తవ్యస్తంగా కనబడుతూ ఉన్నాయి. వస్తువులు అస్తవ్యస్తంగా ఉండటానికి, ఆ గదిలో దీపపు వెలుగు కారణమా! కాదు. అయితే, దీపపు వెలుగులో మాత్రమే వస్తువులు చూడగలుగుచున్నాము. అంతవరకే. ఆ వస్తువుల ఆకారములు మొదలైనవాటి కర్తృత్వము దీపపుకాంతికి ఆపాదించలేము.

ఆత్మయొక్క వెలుగులో (జ్యోతిస్వరూపంలో/ కాంతిలో) సాకారయుక్తమైన దృశ్య–దేహ–మనో–చిత్త–అహంకార–త్రిగుణ–దేహి–దేహ వ్యవహారములన్నీ అనేక వికారములతోను, ప్రవర్తనలతోను కనిపించవచ్చుగాక। వాటివాటి ఆకారవికారాదులు ఆత్మను స్పృశించవు. **ఆత్మ సర్వదా అవికారము, ఉదాసీనము కూడా.**

**సర్వదా చైతన్య స్వరూపుడను : ఇదమ్ జడాత్మాకమ్। అహమ్ చైతన్యాత్మకమ్।** ఈ దేహము, మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారము మొదలైనవన్నీ స్వతంత్రంగా ప్రవర్తించేవి కావు. కనుక ఇవన్నీ జడాత్మకమైనవి (Passive). **వీటిని కదిలించే (చేతనము చేస్తు) చైతన్య స్వరూపుడను నేనే (Active)।**

**నిత్యనిర్మలుడను : జలేవాపి, స్థలేవాపి లురతు ఏష జడాత్మకః। నాఽహం విలిప్యేతే తత్ ధర్మైః – ఘటధర్మైః నభో యథా।** ఈ భౌతికదేహము, ఆలోచన (మనస్సు), చిత్తము (ఇష్టము) మొదలైనవి ఎక్కడైనా (వస్తు – విషయ సంబంధములు కలిగి) దొర్లుతూ ఉండవచ్చును గాక! అవన్నీ చైతన్యస్వరూపుడనగు నాయొక్క చేతన చమత్కారంచేత ప్రవర్తన శీలత్వము సంతరించుకుంటున్నాయి. **వాటివాటి ధర్మములు అస్మత్ కేవల చైతన్యతత్త్వమును తాకలేవు. దోషమును కలిగించజాలవు.**

**సర్వదా అస్పృశ్యుడను.** ఒకచోట కొన్ని 'కుండలు' ఉన్నాయి. ఆయా కుండల యొక్క బాగున్న ఆకారములు, బాగోలేని ఆకారములు, వాటి క్రొత్తతనము, పాతదనము, వాటియొక్క గట్టితనము, మెత్తటితనము, వాటి పగుళ్ళు, గీతలు **మొదలైనవాటితో 'ఆకాశము'** (Space)**నకు సంబంధమేమైనా ఉన్నదా? ఆకాశము సర్వదా అప్రమేయము, అస్పృశ్యము** కదా! అట్లాగే ఆత్మయొక్క చైతన్యముచే చేతనమువలె కనిపించే జన్మ–కర్మ–దేహ–దేహాంతర–త్రిగుణ వ్యవహార దోషములేవీ ఆత్మరూపుడనైఉన్న నన్ను తాకజాలవు. ఆత్మయొక్క (మమాత్మ స్వరూపము యొక్క) **"నిర్మలత్వ–అఖండత్వ–అప్రమేయత్వ–నిత్యత్వ–సత్యత్వ"** మొదలైన ఇత్యాది మహత్ ధర్మములకు వచ్చే లోటు ఏమాత్రం ఉండజాలదు. ఇదియే **ఆత్మజ్ఞానము. కుండికోపనిషత్ సారము.**

**నిష్క్రియో௨స్మి** : నాటక దీపము ఏవిధంగా కర్తృత్వ-భోక్తృత్వరహితమో, ఆకాశము ఏ తీరుగా క్రియా వ్యవహారరహితమో, ఆత్మనగు నేను సదా **నిష్క్రియుడను.** నాటకములో ఒక పాత్ర అనేక క్రియలు నిర్వర్తిస్తూ ఉన్నప్పటికీ, "అవన్నీ రచయిత చేస్తూ ఉన్న క్రియలు" - అని ఆపాదించముకదా। "జన్మలు, జన్మాంతరములు" మొదలైనవి జరుగుచూ ఉన్నప్పుడు కూడా, - ఆత్మగా నేను సర్వదా నిష్క్రియుడను.

**అవికారో௨స్మి** : పుట్టుక, ఎదుగుదల, వార్ధక్యము, తరుగుదల, వినాశనములు మొదలైనవి **శారీరక వికారములు.**

"నేను"కు మార్పు, చేర్పులు ఉండవు. ఆత్మగా నేను వికారములేవీ లేనివాడను.

- ⌘ జన్మ-పునర్జన్మ-జన్మాంతరములు మొదలైనవి **జీవాత్మవికారములు.**
- ⌘ ఆలోచించటం, ఆలోచించకపోవటము **మనోవికారములు.**
- ⌘ తెలిసినవి, తెలియనివి మొదలైనవి, **బుద్ధియొక్క వికారములు.**
- ⌘ ఇష్ట, అయిష్టములు మొ॥వి, **చిత్తముయొక్కవికారములు.**
- ⌘ మాన-అవమానములు మొదలైనవి **అహంకారముయొక్క వికారములు.**

ఇవన్నీ కూడా నాకు సంబంధించిన వికారములే కావు **ఆత్మగా నేను సర్వదా అవికారుడను.**

**నిష్కళో௨స్మి**: ఆత్మస్వరూపుడనగు నాకు జన్మ - కర్మ - లోక వ్యవహారములకు సంబంధించిన ఏ కళంకము అంటదు. ఆపాదించబడజాలదు. ఎల్లప్పుడూ నిష్కళంకుడను. అట్టి నిష్కళంకాత్మయే నాయొక్క (మరియు) తదితర సమస్త జీవులయొక్క (ఇంకా) ఈ జగదృశ్యముయొక్క వాస్తవరూపము. కేవలమగు నా 'దేహి' స్వరూపము జన్మ-కర్మల సంబంధమైన ఏ దోషమూ ఎప్పుడూ పొందదు.

**నిరాకృతిః** : ఈ భౌతిక దేహమునకు "ఇది ఆకృతి। ఇది జాతి। ఇది ఆశ్రమము। ఇది కులము। ఇది మతము।'....మొదలైనవి ఉండవచ్చుగాక। మరి ఈ దేహమును ఆభరణమువలె ధరించి, దీనిని కదల్చుచున్న 'దేహి'కి? ఆత్మగా ఆకారపరిమితుడను కాను. నిరాకృతుడను. నిరాకారుడును. 'నేను'కు గాని, 'భావన'కు గాని 'ఇది' అనబడే ఆకారమెక్కడిది?

**నిర్వికల్పో௨స్మిః** : సంకల్పములకు (సంకల్పించువాడుగా) మునుముందే ఉన్నట్టివాడను. సర్వదా నా ఆత్మస్వరూపము సంకల్ప (Thinking about some thing) – వికల్ప (Withdrawl of thinking from that something) – ములకు వేరై ఉండగా, నేను **నిర్వికల్పుడను.**

నిత్యో௨స్మిః : కాలము సందర్భములకు సంబంధించినది. మరి నేనో? సందర్భములకు మూలపురుషకారమును. త్రికాలాబాధ్యుడను. Indivisible and unpartitionable by Time Factor Viz., The Past, The Present and The Future) నిత్యుడను.

"ఇతఃపూర్వము, ఇప్పుడు, ఇకముందు" కూడా 'నేను' అనేది 'నేను'గానే ఉంటుందిగాని, మరొకటిగా అవదు.

**నిరాలంబో௨స్మి** : కేవలాత్మగా నేను స్వయంకృతుడను. స్వయం సంకల్పుడను. మనోబుద్ధి చిత్త అహంకారాలు నానుండి 'ఉనికి'ని పొందుచున్నాయి. అంతేగాని నేను దేహాదులపై ఆధారపడి ఉండువాడనుకాను. ఆలంబనముయొక్క ఆవశ్యకత లేనివాడను. **నిరాలంబుడను. దేహము ఉన్నా, లేకున్నా కూడా నాకు నేనైయున్న స్వావలాత్మానంద స్వరూపుడను.**

**నిర్ద్వయో௨హమ్।** : నాయొక్క కల్పనా - ఊహా - భావనా రూప ప్రకృతి నాకు వేరైనదికాదు. "కోపము తనదైనవానికంటే 'కోపము'నకు వేరుగా ఉనికి లేని తీరుగా, నాకు ద్వితీయమై ఎక్కడా ఏదీ లేదు. అద్వితీయుడను. అద్వయుడను. కలలో ఏది ఎక్కడ ఎట్లా కనిపించినప్పటికీ, కలలో కనిపించే సమస్తము కల తనదైనవానికి భిన్నము కాదు కదా! నాచే అన్యరూపమగు దృశ్యవ్యవహారముగా చూడబడేవంతా మమాత్మ కంటే అన్యము ఏమాత్రము అయిఉండలేదు.

**సర్వాత్మకో௨హమ్। సర్వో௨హమ్।** : - **"మమాత్మా సర్వ భూతాత్మ"**- అనునది వేదమహావాక్యము. 'ఆత్మ'గా నేను ఒక్క శరీరమునకు పరిమితుడనైనవాడను కాను. సాకారములగు అసంఖ్యాక తరంగములన్నిటిలో ఒకే నిరాకార జలముయొక్క ప్రదర్శనమే కదా! అట్లాగే **"అఖండ, అప్రమేయ, నిత్య-నిర్మల" ఆత్మయొక్క ప్రదర్శనమే - ఈ అనేక జీవుల సంప్రదర్శనము.** ఒక తరంగములోని జలమే సర్వే సర్వత్రా అన్ని తరంగములలోను, తరంగముల మధ్యగాను (నిస్తరంగముగా) వెలయుచున్నట్లుగా, **ఆత్మస్వరూపుడనగు నేనే సర్వ సహజీవులయందు కూడా ఆత్మస్వరూపుడనై వెలయుచున్నాను.** కథలోని సంఘటనలన్నీ **"కథారచయిత యొక్క ఊహా, కల్పనా చైతన్య చమత్కారమే"** అయినట్లుగా నాకు **అన్యమై** కనిపించేదంతా అనన్యతత్త్వస్వరూపుడనగు **నాకు అనన్యమే।** కనుక

ఇదంతా నేనే। నా భావనయే। ఊహయే. మమ చైతన్యస్వరూపమే! నేను సర్వదా సర్వాత్మకుడను। **సర్వ బాహ్య – అభ్యంతర స్వరూపుడను కూడా.**

**సర్వాతీతోఽహమ్** : నాటక రచయిత – నాటకములోని పాత్రలయొక్క సమస్త పరస్పర సానుకూల్య – ప్రాతికూల్య సంబంధ – అనుబంధ–బాంధవ్యములకు, పాండిత్య విశేషములకు, త్రిగుణవిశేషములకు – సర్వదా అతీతుడైనవాడే కదా! ఏపాత్రయొక్క ఏ ఒక్క గుణము కూడా రచయితకు ఆపాదించలేము. నేను నాచే స్వకీయ రచనగా ఆస్వాదించబడు దృశ్య వ్యవహారమునకు అతీతుడను. చిత్రలేఖనమునకు ఆ చిత్రకళాకారుడు వేరే. అంతేగానీ, చిత్రలేఖనము (Piece of Art) లోని ఆయా లక్షణములు (ముఖము పెద్దది, చిన్నది – మొదలైనవి) – ఆ చిత్రలేఖకుని (Artist) లక్షణములు కాదు కదా! (The contents in a piece of Art are not the qualities of the Artist). (న చ మస్థాని భూతాని।). నాయందు లోకములు లేవు. మరింకేమీ లేదు.

<u>అద్వయః</u>

> **("మృత్పిండమేకమ్ - బహుభాండరూపమ్। సువర్ణమేకమ్ - బహుభూషణాఢ్యమ్।**
> **గోక్షీరమేకమ్ - బహువర్ణ ధేనుమ్। శరీరమేకమ్ - పరమాత్మమేకమ్।"** – అను శ్లోకము గానము చేయుతీరుగా)

ఆత్మ ఏ జీవునికి వేరైనది కాదు. ఏ జీవుడూ అద్దానికి ద్వితీయము కాదు. ఆత్మ అద్వయము. మరి నేను నీవు మొదలైనవి ఆత్మకానిది ఎప్పుడు? ఎప్పుడూ లేదు.

**ఆత్మ కానిది ఏదీ లేదు. ఆత్మ మరొకటేదీగా అవటమూ లేదు.** అందుచేత ఆత్మయే అయి ఉన్న నేను అద్వయుడను.

**కేవలానందరూపోఽహమ్** : ఒకాయనకు కథ (లేక) నవల (లేక) నాటకము రచించి, ఆ నాటకము జరుగుచూ ఉండగా చూస్తూ ఉంటే…ఆనందము పొందుచూ ఉండటం జరుగుతుంది కదా! తాను రచించిన ఆ నాటకం జరుగుతూ ఉండగా – ఆయా దుఃఖ సంఘటన సందర్భములో నవ్వుచున్నట్లుగా, బాధ కలిగే సంఘటనలప్పుడు బాధను ముఖమును ధారణ చేస్తూ ఉండవచ్చు. ఎందుకు? అదంతా ఆతని నాటక వ్యవహారమును ఆనందించే తీరు.

నేనూ అంతే!

**మనో–బుద్ధి–చిత్త–అహంకారములు నేను నా ఆనందముకొరకు కల్పించుకొనుచున్నాను. జాగ్రత్ స్వప్న సుషుప్తులు నాయొక్క భావనాపురుషకారములే.**

> జాగ్రత్ అనుభవము కొరకు → **'విశ్వుడు'** అను పురుషకారమును,
>
> స్వప్నానుభవము కొరకు → **'తేజశుడు'** – అను పురుషకారమును,
>
> సుషుప్తానుభవము కొరకు → **'ప్రాజ్ఞుడు'** అను పురుషకారమును,

జన్మ – జన్మాంతరముల ప్రహసనము కొరకు – **'ఈశ్వర'** అను పురుషకారమును
(కథారచయిత కథలను రచించుకొను తీరుగా)….నా పరమపురుషత్వము నుండి కల్పించుకొనుచున్నాను.

స్వప్న–జాగ్రత్–సుషుప్త–జన్మ–జన్మాంతర అనుభవ పరంపరలన్నీ నా వినోదముకొరకు నేనే కల్పన చేసుకొని ఆనందిస్తున్నాను. **ఆత్మనగు నా కల్పనయే ఇదంతా! ఇదంతా నా వినోదము। సరదా। లీల। క్రీడ। స్వకీయ ఆస్వాదన।** అందుచేత నేను సర్వదా **ఆనందస్వరూపుడనే। కేవలానంద విన్యాసుడనే।**

**స్వానందోఽహమ్** నిరంతరః – నాకు నేనే నిరంతరము 'ఊహ' 'భావన' 'ఆలోచన' 'అనుభూతి' 'అనుభవాస్వాదన'లను కల్పించుకొని, వాటియందు నేనే ప్రత్యక్షమై ఉంటున్నాను. (అనగా) <u>నాయందు</u> నేనే సంకల్పించుకొని ఆనందిస్తున్నాను. (రమయతేతి రామః)। నాయందు నేనే జగత్ కల్పనా రూపమంతా కల్పించుకొని నాకు అనన్యమగు ఆ 'కల్పన' (లేక) ఊహ (లేక) భావన (లేక) ఆలోచన (లేక) అనుభూతి (లేక) అనుభవాస్వాదనల యందు రమించుచున్నాను. (I am a wondering Monk in the Zone of my our thoughts and Feelings)

నాయందు నేను రమించటమే ఈ జాగ్రత్ – స్వప్న – సుషుప్తి – జన్మ జన్మాంతర భావనా పరంపరలంతా. నిరంతరము నాయందు నేనే ఆయా అనేక రీతులుగా రమిస్తూ ఉండటంచేత – **స్వానందుడను.** ఒకడు కథను వ్రాయాలనుకొని, ఊహచే కథనము కల్పించుకోసాగించటము వంటిదే ఈ నాయొక్క ఈఈ జగదనుభవ పరంపరలన్నీ కూడా!

**"స్వమేవ సర్వతః పశ్యన్, న అన్యమానః।** కేవల స్వరూపుడగు నేను (1) **జగత్ అనుభవి, (2)జగత్ అనుభవవిధానము** (3) అనుభవసిద్ధిరూపమగు దేహముల రాక - పోకలతో కూడిన **జగత్ దృశ్యము** - ఈ త్రిమూర్తిత్వములను కల్పించుకొనుచున్న **త్రిమూర్తుడను। త్రిమూర్తిస్వరూపుడను।** ఏకమే అయి ఉండి **'త్రి' (3)** రూపముల ధారణ చేయు చమత్కారిని. అందుచేత

జగత్ రూపముగా మూర్తీభవించుచున్నది నేనే। (I am talking the form of that being percieved)

నాకు నేనే సర్వము నాయందు దర్శించుకొనువాడను కూడా। నేనే। (I myself am the perceiver of all such perceiptions)

నేను ఈ జగత్తుకు వేరు కాదు. ఈ జగత్తు నాకు వేరుకాదు. **జగత్తు - జగదీశ్వరుడు - నేను ఏకస్వరూపులమే!** నాకు వేఱై అన్యముగా ఏదీ లేదు. **న అన్యమానః**

**స్వయమద్వయమ్** : మఱొకరిచేత (లేక) కొన్ని సాధనా కార్యక్రమముల అనంతరము అద్వితీయత్వము పొందవలసినవాడనుకాను.

- స్వయముగానే అద్వితీయుడను

సర్వము అఖండాత్మస్వరూపమే। నేను అఖండాత్మ స్వరూపుడను। అఖండాత్మ నాకు వేరు కాదు. నేను అద్దానికి వేరు కాదు. **అహమ్ బ్రహ్మాస్మి। స్వయమద్వితీయమస్మి।**

**స్వానందమ్ అనుభుంజానో నిర్వికల్పో భవామి అహమ్।** నాకు అనుభవముగా సిద్ధించుచున్నదంతా స్వస్వరూపాత్మయే। స్వకీయ కేవలీ స్వరూపమునే జన్మ-కర్మల కల్పనా విశేషరూపమైనట్టి జగత్ దృశ్యముగా కల్పించుకొని అనుభవిస్తున్నాను. ఆస్వాదిస్తున్నాను.

ఈ సమస్తము నేనే అయినప్పటికీ, ఇదంతా నా కల్పనా విశేషమే అయి ఉండి కూడా - **కల్పించువాడిగా** వేరుగానే ఉన్నాను. కథారచయిత కథకువేరుగానే ఉండి ఉన్నట్లు, శిల్పమునకు శిలత్వము శిల్పి - శిలత్వములు వేరు వేరే అయి ఉన్నట్లు, స్వప్నమునకు స్వప్నద్రష్ట వేరే అయి ఉన్నతీరుగా - భావన - ఆలోచన - అనుభూతి - అనుభవము రూపమగు నాయొక్క ప్రకృతి (**ప్రకాశ-కృత్-తిరో**గమన) చమత్కారమునకు పురుషుడుగా, కేవలుడుగా వేఱై ఉన్నాను. కల్పనలను కల్పించువాడను. అంతేకానీ, కల్పనలోనివాడను కానే కాను. సమస్త కల్పనలకు కారణభూతుడనగువాడను. వాటికన్నిటికీ అతీతుడనగు **"పరమపురుషుడను"** కల్పనారహిత నిర్వికల్పస్వరూపుడను.



ఈవిధంగా - ఆత్మతత్త్వమును ఎరిగినట్టి, అట్టి తత్త్వమును అనుక్షణికముగా తీర్చిదిద్దుకున్నట్టి - **"ఆత్మతత్త్వజ్ఞని / తత్త్వవేత్త"** యొక్క "స్వాభావికానుభవము" గురించి మనము చెప్పుకున్నాము.

**గచ్ఛం తిష్ఠన్, ఉపవిశన్, శయనో వా, అన్యథాపి వా, యథేచ్ఛయా వసేత్ విద్వాన్, - "ఆత్మారామః సదా మునిః"॥** - అట్టి బ్రహ్మజ్ఞుడు ఎక్కడికి వెళ్ళినా, ఏ చోట కూర్చుని ఉన్నా, ఏ ప్రదేశంలో విశ్రాంతి తీసుకుంటూ ఉన్నా, నిదురిస్తూ ఉన్నా, మరి ఇంకా ఏమేమి చేస్తూ ఉన్నా కూడా, ఏదేది చేయకపోతూ ఉన్నప్పటికీ, (పైన చెప్పుకున్న) (1) 'అహమాత్మా సంభావన **(2) తత్త్వమ్ దర్శనమ్, (3) సర్వమ్ ఖలు ఇదమ్ బ్రహ్మ సమాశ్రమము,** ఈ మూడిటిని కించిత్ కూడా వదలడు.

→ అన్యము పట్ల మౌనము వహించినవాడై, ముని అయి,

→ ఆత్మారాముడై, స్వయమ్ పరమానంద పరబ్రహ్మమై,

**అనునిత్య అచ్యుత కేవలానంద స్వరూపుడై సర్వత్రా వెలయుచున్నాడు.**

**ఇతి కుండికోపనిషత్ సమాప్తా**

*ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ॥*

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 5 జాబాల్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## జాబాలి - పైప్పలాద సంవాదరూప జాబాలోపనిషత్
## (పశువులు - పశుపతి)

శ్లో॥ జాబాల్యుపనిషత్ వేద్య పరతత్త్వ స్వరూపకమ్
పారమ్ ఐశ్వర్య విభవమ్ రామచంద్ర పదం భజే॥

ఈ జాబాల్యుపనిషత్‌చే తెలియబడు పారమైశ్వర్య విభవమగు - అగు స్వస్వరూప పరతత్త్వము స్వానుభవ మగుటకై "శ్రీరామ బ్రహ్మము, ఆత్మారాముడు, రామానంద సాగరుడు"గా వర్ణించబడుచున్న శ్రీరామచంద్రమూర్తి పాదపద్మములను భజించుచున్నాను.

ఓం।

**1. అథ హి ఏనం భగవంతం
జాబాలిం పైప్పలాదిః
ప్రపచ్ఛ :
"భగవన్! మే బ్రూహి
పరమ తత్త్వ రహస్యమ్।
కిం తత్త్వం?
కో జీవః?
కః పశుః?
క ఈశానః?
కో మోక్షోపాయ? ఇతి॥**

**పైప్పలాద మహర్షి :** హే భగవాన్। జాబాలి సద్గురూ। నమో నమః। దయతో నాకు పరకాష్ఠ అగు "తత్త్వ రహస్యము" - గురించి బోధించ ప్రార్థన

'తత్త్వమ్' అనగా ఏమి?

ఈ జీవుడు ఎవ్వడు? ఎక్కడివాడు?

'పశువు' అని ఎవరిని అంటాము? 'పశుపతి' అనగా?

'ఈశానుడు' అనగా ఎవ్వరు?

'మోక్షము' సిద్ధించటానికి 'ఉపాయము' ఏది?

ఈ ఈ విషయాలు దయచేసి విశదీకరించండి.

---

**2. <u>స తం హో వాచ</u> (జాబాలౌ వాచ)
<u>"సాధుపృష్టం। సర్వం నివేదయామి
యథా జ్ఞాతమ్"</u> - ఇతి।
<u>పునః</u> సః తమ్ ఉవాచ। (పైప్పలాదౌ వాచ)
<u>"కుతః త్వయా జ్ఞాతమ్?"</u> ఇతి।
పునః సః తముఉవాచ। (జాబాలౌ వాచ)
<u>"షడాననాత్।"</u> ఇతి॥**

**జాబిలిమహర్షి :** బిడ్డా! పిప్పలాద మహర్షి ప్రియకుమారా। పైప్పలాదా। మంచి ప్రశ్నలే వేశావయ్యా। నేను ఏ విధంగా ఆయా నీవు అడిగిన విశేషాలు శ్రవణం చేసి (విని) తెలుసుకొనియున్నానో, అవన్నీ నీకు వివరిస్తాను. శ్రద్ధగా వినిదెవుగాక.

**పైప్పలాదుడు :** స్వామీ! జాబాలి మహానుభావా! మీరు ఎవ్వరినుండి ఎట్లా తెలుసుకొనియున్నారో....అది కూడా ముందుగా చెప్పండి.

**జాబాలి భగవానుడు :** నేను తాత్త్విక రహస్యములను నా గురువరేణ్యులు, షడాననుడు, శివపుత్రుడు-అగు శ్రీమన్ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి నుండి, (కార్తికేయుని నుండి) తెలుసుకున్నాను. (భక్త జనప్రియ పంకజ లోచన బాలసుబ్రహ్మణ్యం।)

---

**<u>పునః సః తమువాచ।</u> (పైప్పలాదౌ వాచ)
"తేన అథ కుతో జ్ఞాతమ్?" ఇతి।
<u>పునః సః తమువాచ</u> (జాబాలౌ వాచ)
<u>"తేన ఈశానాత్।"</u> ఇతి॥**

**పైప్పలాదుడు :** ఓహో! అట్లాగా? అయితే ఆ షణ్ముఖులవారు ఎవరి నుండి తెలుసుకోవటం జరిగింది?

**జాబాలి :** మత్ ప్రియ గురువులవారు శ్రీ షణ్ముఖుడు వారి పితృదేవులగు ఈశ్వరుడగు - శివభగవానుని నుండి - విని ఉండటము జరిగింది.

<u>**పునః సః తమువాచ।**</u> (ప్పైప్పలాదౌ వాచ)
<u>**"కథం తస్మాత్ తేన జ్ఞాతమ్?"**</u> **ఇతి॥**
<u>**పునః సః తమువాచ।**</u> **(జాబాలౌ వాచ)**
<u>**"తత్ ఉపాసనాత్"**</u> **– ఇతి॥**

**పైప్పలాదుడు :** ఆ ఈశానులవారి నుండి ఆయా విశేషాలు ఎట్లా షణ్ముఖస్వామి తెలుసుకోవటం జరిగింది?
**జాబాలి మహర్షి :** అస్మత్ గురుదేవులగు షణ్ముఖ భగవానుడు 'ఈశ్వరోపాసన'చే ఈశ్వరుని మెప్పించి ఆయా మనం చెప్పుకోబోయే విశేషాలు విని, తెలుసుకోవటం జరిగింది. (ఉపాసన నుండి గురు అనుగ్రహం. తద్వారా **జ్ఞానము**)

---

<u>**పునః సః తమువాచ।**</u> (ప్పైప్పలాదౌ వాచ)
**భగవన్! కృపయా మే రహస్యం**
**సర్వం నివేదయ। ఇతి॥**
**స తేన పృష్టః సర్వం**
**నివేదయామాస తత్త్వమ్।**
**పశుపతిః అహంకారావిష్టః**
**సంసారీ జీవః – స ఏవ 'పశుః'।**
**సర్వజ్ఞః పంచకృత్య సంపన్న**
**సర్వేశ్వర ఈశః 'పశుపతిః'।**

**పైప్పలాదుడు :** స్వామీ! భగవాన్! జాబాలి మహర్షీ! ఆయా తాత్త్విక రహస్య విశేషములు నాకు కూడా బోధించమని అభ్యర్థన.
**జాబాలి :** "మీరు కోరిన, నేను వినియున్న 'తత్త్వము' గురించి చెప్పుచున్నాను. ఇక వినండి"- అని వినిపించసాగారు.

ఈ జీవుడు వాస్తవానికి <u>అహంకారమునకు మునుముందే సత్‌స్వరూపుడు.</u> **అహంకారమునకు కూడా నియామకుడు. ఇంద్రియములు అనే పశువుల పాలకుడు.** పశుపతి. అట్టి పశుపతి - "నేను - నాది-అది-ఇది"....అను భావనతో కూడిన (వ్యష్టి) అహంకారపూరితుడైనప్పుడు **'సంసారజీవుడు'** అయి కనిపిస్తున్నాడు. ఈ విధంగా ఈ **జీవుడే 'పశువు'**.

**కించిజ్ఞుడు:** ఈ జీవుడు వర్తమాన ఉపాధికి సంబంధించిన పరిమిత - సంకుచిత 'దృష్టి' కలిగియుండి, "ఆవల-ఈవల" గురించి పరిశీలనాత్మకుడై ఉండటములేదు. అందుచేత **'కించిజ్ఞుడు'**గా అగుపిస్తున్నాడు.

**సర్వజ్ఞుడు :** "ఈ దేహముల పరంపరలన్నీ నాయొక్క ఉపకరణములు. దేహము యొక్క పుట్టుక, వృద్ధి, హాని, దేహముల వ్యవహారము నుండి తిరోభావము - మరొక - తిరిగి దేహమును స్వీకరించటము - ఇదంతా నాయొక్క స్వకీయ లీలా క్రీడాకల్పన. నేను సర్వమునకు ఈశ్వరుడను, సర్వముగా విస్తరించి ఉన్నవాడను. ఒక కవి రచించునవలలకు, వాటిలోని పాత్రలకు - ఆ కవికి గల సంబంధమే, నాకు తదితర దేహములకు ఉన్న సంబంధము" - **అని గమనించువాడు పశుపతి.**

---

<u>పైప్పలాదౌ వాచ</u>
**"కే పశవ?" – ఇతి**
**పునః సః తమువాచ। (జాబాలౌ వాచ) :**
**జీవాః 'పశవ' ఉక్తాః।**
**తత్ పతిత్వాత్ పశుపతిః।**

**పైప్పలాదుడు :** లోకంలో "పశుపతి - పశువులు" అనేవి చూస్తూ ఉంటాము. ఆధ్యాత్మ వాఙ్మయంలో కూడా। 'పశువులు - పశుపతి' అనే శబ్దాలు ఉపయోగిస్తున్నాము. **ఇక్కడ పశువు ఎవరు? పశుపతి ఎవరు?** మరికొంతగా వివరించండి.
**జాబాల మహర్షి :** మరల చెప్పుచున్నాను. జీవులే - పశువులు. ఈ జీవాత్మలకు యజమానియే పశుపతి. అనగా, ఈ జీవుడు -
దేహాత్మగా → **పశువు.**
దేహముల వ్యవహారమంతా పాలించువాడుగా-పశుపతి.

---

<u>సః పునః తమ్ హ ఉవాచ :</u> (ప్పైప్పలాదౌ వాచ)
**కథం జీవాః** <u>పశవ?</u> **ఇతి।**
**కథం** <u>తత్ పతి?</u> **ఇతి।**
<u>**సః తము వాచ**</u> **(ప్పైప్పలాదౌ వాచ)**
**యథా తృణ అశినో వివేక హీనాః**
**పర ప్రేష్యాః**
**'కృషి' ఆది కర్మసు**
**నియుక్తాః సకల దుఃఖసహాః**
**స్వ–స్వామి బధ్యమానా గవ–ఆదయః పశవః।**

**పైప్పలాదుడు :** జీవుడు → పశువుగా ఎట్లా అగుచున్నారు?
ఆ పశువులకు పతిగా - ఈశ్వరుడు ఎట్లా అగుచున్నారు? దీని యొక్క "అధ్యాత్మశాస్త్ర హృదయము"? ఏమిటి?
<u>పైప్పలాదుడు</u> : పశువులు గడ్డిని మేస్తూ, వివేకము లేనివై, ఇతరులచే ప్రేరేపించబడుచూ బండిని లాగటము, పొలము దున్నటము మొదలైన కృషి కర్మలయందు (ఇతరులచే) నియుక్తము అగుచూ ఉంటాయి. యజమాని చెప్పుచేతలలో ఉంటూ, బంధము అనుభవిస్తూ నానా దుఃఖములు అనుభవిస్తూ ఉంటాయి కదా!

అట్లాగే, ఈ జీవులు కూడా ఇంద్రియ విషయములను అనుభవిస్తూ, ఆత్మానాత్మ-నిత్యానిత్య వివేకము లేనివారై, కర్మదేవతల ప్రేరణచే కర్మబద్ధులై, జగత్ పురుషుని యాజమాన్యంలో శరీర పరంపరబద్ధులై ఉంటున్నారు. ఆయా అనేక దుఃఖములు అనుభవిస్తూ ఉంటున్న సందర్భము దృష్ట్యా - **"ఈ జీవుడు పశువు"** అని అనబడుచున్నాడు. **ఆత్మజ్ఞానరాహిత్యమే అందుకు కారణం.**

**యథా తత్ స్వామిన ఇవ**
**సర్వజ్ఞ ఈశః పశుపతిః॥**
**(పైప్పలాదౌ వాచ)**
**- తత్ జ్ఞానం కేనఉపాయేన జాయతే?**
**<u>పునః సః తమువాచ</u> (జాబాలౌ వాచ)**
**విభూతి ధారణాత్ ఏవ।**

**ఈశ్వరుడు** → "ఈజీవాత్మత్వమునకు యజమానినేగాని జీవాత్మత్వము నా స్వరూపము కాదు, స్వభావము కాదు'-అని గమనించినవాడై, దేహ - దేహాంతరముల పట్ల, అంతరంగ చతుష్టయముపట్ల స్వామిత్వము వహించినవాడు సర్వజ్ఞుడు, ఈశుడు, పశుపతి. ఈ జీవుడు తనయొక్క పశుపతిత్వ సంబంధమైన జ్ఞానము, నిశ్చలానుభవము సంపాదించుకోవాలి మరి।
**పైప్పలాదుడు:** అట్టి పశుపతి జ్ఞానము (లేక) ఆత్మజ్ఞానము లభించేది ఎట్లా?
**జాబాలమహర్షి** : విభూతిధారణయోగము అందుకు మార్గదర్శకముగా చెప్పబడుతోంది.

---

**<u>పైప్పలాదౌ వాచ</u>**
**- తత్ ప్రకారః కథమ్? - ఇతి।**
**- కుత్ర కుత్ర ధార్యమ్?**

**పైప్పలాదుడు** : అట్టి విభూతి ధారణకు విధానమేమిటి? ఏవిధంగా విభూతి (భస్మము)ను ధరించాలి. (చితాభస్మధారణగా ఈ సమస్త జాగ్రత్ - స్వప్న - సుషుప్తులను అలంకరించుకొనేవిధానమెట్టిది?)

---

**<u>పునః సః తమువాచ</u> (జాబాలౌ వాచ)**
**"సద్యోజాతాది" పంచ బ్రహ్మ మంత్రైః**
**భస్మ - సంగృహ్య**
**<u>"అగ్నిః - ఇతి భస్మ"</u>**
**ఇతి అనేన అభిమంత్ర్య,**

**జాబాలమహర్షి :**

- సద్యోజాతం...
- వామదేవం...
- తత్ పురుషం...
- అఘోరం...
- ఈశానం...

పంచబ్రహ్మ మంత్రములను చదువుచూ భస్మమును చేతిలోనికి స్వీకరించాలి.

**"అగ్నిరితిభస్మ। వాయురితిభస్మ। వ్యోమేతి భస్మ"**... ఈ మంత్రముతో అభిమంత్రించాలి.

---

**<u>"మాన స్తోక"</u>**
**ఇతి - సముధృత్య,**
**జలేన - సంసృజ్య,**
**"త్ర్యాయుషమ్" - ఇతి**
**శిరో లలాట వక్షః స్కంధేషు ఇతి తిసృభిః**
**త్ర్యాయుషైః త్రయంబకైః, తిస్రో రేఖాః ప్రకుర్వీత।**
**వ్రతమ్ ఏతత్ శాంభవం,**
**సర్వేషు వేదేషు వేదవాదిభిః ఉక్తం భవతి।**
**తత్ సమాచరేత్ ముముక్షుః న పునర్భవాయ॥**

**'మానస్తోకే తనయే'**....అను మంత్రములో నీటితో భస్మమును తడుపాలి.
**"త్ర్యాయుషమ్ జమదగ్నే" "త్ర్యంబకం యజామహే సుగంధం పుష్టివర్ధనమ్"** - మంత్రము చదువుచూ శిరో - లలాటముపై, వక్ష స్థలముపై, భుజములపై త్రివిభూది రేఖలు ధారణ చేయాలి. ఇది **"శాంభవ వ్రతము"** - అని ప్రసిద్ధమైయున్నది.

వేదవాదులు ఈ రీతిగా వేదవాఙ్మయమును అధ్యయనము చేస్తున్నప్పుడు, అనుష్ఠించుచున్నప్పుడు ఈ శాంభవ వ్రతము ఆచరించు నియమమును పాటించుచున్నారు. ముముక్షువులు జన్మరాహిత్యముకొరకై ఆచరణగా విభూతిధారణా-శాంభవీ వ్రతమును ఆచరించుచుండెదరు గాక.

---

**04. <u>అథ సనత్కుమారః ప్రమాణం పృచ్ఛతి।</u>**
**త్రిపుండ్ర ధారణస్య,**
**త్రిధా రేఖా, ఆ లలాటాత్ - ఆ చక్షుషో, ఆ భ్రువోః మధ్యశ్చ।**
**<u>యా అస్య ప్రథమా రేఖా → సా</u>**
**- గార్హపత్యశ్చ।**
**- 'అ' కారో,**
**- రజో।**
**- భూర్లోకః।**
**- స్వాత్మా।**
**- క్రియాశక్తి।**
**- ఋగ్వేదః।**
**- ప్రాతః సవనం।**
**- ప్రజాపతిః దేవో దేవతా। ఇతి॥**

ఈ విభూతి ధారణ గురించి బ్రహ్మ మానసపుత్రులగు సనత్కుమారుల వారు చెప్పియున్న విభూతి ధారణ యొక్క పరమార్థము గురించి శాస్త్రములచే ఈ విధంగా చెప్పబడుచున్నది.

- **త్రిపుండ్ర ధారణమును** మూడు రేఖలుగా లలాటముపై రెండు కనుల, కొలకుల వరకు, భ్రూమధ్యగా ధారణ చేయబడును గాక. ఆ '3' రేఖలను ఈ విధంగా మహనీయులగు సనత్కుమారులవారు విశ్లేషించి చెప్పుచున్నారు.

**ప్రథమరేఖ :** → యజ్ఞములోని గార్హపత్యాగ్నికి, 'ఓం' కార త్రిఅక్షరముల లోని <u>'అ'కార వ్యాహృతికి,</u> త్రిగుణములలోని సృష్టి సంకల్ప జననరూపమగు <u>**'రజో'**</u> గుణమునకు, త్రిలోకములలోని <u>**భూలోకమునకు,**</u> (Matter కు) <u>కేవలమగు స్వాత్మకు, క్రియాశక్తి రూపమునకు, ప్రాతఃసవనము (ప్రాతః ఉపాసనకు),</u> విశ్వకల్పనా పర్యవేక్షకుడగు ప్రజాపతి దేవతకు (బ్రహ్మకు) ప్రతీక। సంజ్ఞ। <u>"పరమాత్మగా ఇవన్నీ నాకు 'ధారణ' అయి ఉన్నాయి."</u> - అనునది అంతరార్థము. మననము కలిగి ఉండవలసిన మహదార్థము.

**యా అస్య ద్వితీయా రేఖా → సా**
- **దక్షిణాగ్నిః।**
- **'ఉ' కారః।**
- **సత్త్వమ్।**
- **అంతరిక్షమ్।**
- **అంతరాత్మా చ।**
- **ఇచ్ఛా శక్తిః।**
- **యజుర్వేదో।**

**మాధ్యం దినం సవనం**
- **విష్ణుర్దేవో దేవతా। ఇతి।।**

**ద్వితీయరేఖ:** యజ్ఞాగ్నులలో ద్వితీయమైనదగు 'దక్షిణాగ్ని'కి, 'ఓం'కార వ్యాహృతులో ద్వితీయమైనదగు **'ఉ'** కారమునకు, త్రిగుణములలో సత్త్వగుణమునకు, అంతరిక్షమునకు, అంతరాత్మకు ఇచ్ఛాశక్తికి, యజుర్వేదమునకు మధ్యాహ్నదైనందిక సవనమునకు, **(ఉపాసనకు)** విష్ణుదేవునకు - ప్రతీక. విభూతి ధారణ చేస్తూ పై విశేషములను ఆత్మపరంగా భావనచేస్తూ మననము చేసెదరు గాక।

---

యా అస్య తృతీయా రేఖా → సా
- ఆహవనీయో।
- 'మ' కారః।
- తమో।
- 'ద్యౌః' లోకః।
- పరమాత్మా।
- జ్ఞానశక్తిః।
- సామవేదః।
- తృతీయ సవనం।
- మహాదేవో దేవతా। ఇతి।।

**తృతీయరేఖ:** యజ్ఞములోని అహవనీయాగ్నికి, 'ఓం'కారములో తృతీయ వ్యాహృతి అగు **'మ'కారమునకు,** త్రిగుణములలోని **తమోగుణమునకు,** తేజోమయ **ద్యులోకమునకు** (దేవతా లోకమునకు), {(స్వాత్మ-జీవుడు), అంతరాత్మ - (ఈశ్వరుడు), పరమాత్మ (కేవల సాక్షి)లలో} **పరమాత్మకు,** (ఇచ్ఛా-క్రియా-జ్ఞానశక్తులలో) **జ్ఞానశక్తికి,** (ఋక్-యజుర్- సామవేదములలో) **సామవేదమునకు, తృతీయ సవనమునకు,** (ఉపాసనకు) **మహాదేవ దేవతకు** ప్రతీక (లేక) సంజ్ఞ.

| స్వస్వరూపమగు పరమాత్మకు ఇవన్నీ అలంకారమాత్రములు |
|---|

---

త్రిపుండ్రం భస్మనా కరోతి యో
విద్వాన్, బ్రహ్మచారీ,గృహీ
వానప్రస్థో, యతిర్వా
స మహాపాతక ఉపపాతకేభ్యః
పూతో భవతి।
స సర్వాన్ వేదాన్ అధీతో భవతి।
స సర్వాన్ దేవాన్ ధ్యాతో భవతి।
స సర్వేషు తీర్థేషు స్నాతో భవతి।
సకల రుద్రమంత్ర జాపీ భవతి।।
న స పునరావర్తతే।
న స పునరావర్తత। ఇతి

= ఓం సత్యమి త్యుపనిషత్ =

***ఓం ఇతి జాబాలోపనిషత్***
***ఓం శాంతిః। శాంతిః। శాంతిః।***

విద్వాంసుడు అయినా, కాకపోయినా, - (మరియు) బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని వానప్రస్థుడుగాని, యతిగాని, అయతిగాని, ఏ ఆశ్రమంలో ఉన్నా కూడా - పైన చెప్పిన పరమార్థములను మననం చేస్తూ విభూతిధారణను ఆత్మాఽహమ్ భావనాశ్రయుడై నిర్వర్తిస్తూ ఉంటాడో...

- అట్టివాడు మహాపాతక - ఉపపాతకముల నుండి పునీతుడు కాగలడు.
- వేదములన్నీ అధ్యయనము చేసిన వానితో సమానుడగుచున్నాడు.
- సర్వ దేవతల తత్త్వమును ధ్యానించిన వానితో సమానము.
- సర్వ పుణ్యతీర్థములలో స్నానము చేసిన వానితో సమానము.
- రుద్ర మంత్రములను ఆమూలాగ్రం అసంఖ్యాకంగా జపించిన ప్రయోజనము పొందుచున్నాడు. అట్టివానిచే ఇక ఆపై "ఈ దేహము నుండి ఆ దేహము, ఈ లోకములోనుండి ఆలోకము లోనికి"....అనే అనివార్య పునరావర్తనము....(అనే దోషము) - జయించబడగలదు. "నేను పుట్టువాడను - చచ్చువాడను. ఇదంతా నాపట్ల అనివార్యము" - అనే మానసిక జాడ్యము తొలగిపోతుంది. **ఓం సత్యమ్ ఇతి ఉపనిషత్।**

***ఓం ఇతి జాబాలోపనిషత్***
***ఓం శాంతిః। శాంతిః। శాంతిః।***

**సామవేదాంతర్గత**

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 5 జాబాల్యుపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము



బ్రహ్మజ్ఞుడు, తత్త్వజ్ఞుడు అగు పిప్పలాదమహర్షియొక్క కుమారుడు పైప్పలాదముని ఒక సందర్భములో **"తత్త్వజ్ఞానాభిలాషి"** అయి గురుదేవులగు **జాబాలి మహర్షి** ఆశ్రమానికి వెళ్లారు. భక్తి – ప్రపత్తులతో సాష్టాంగదండ ప్రణామములు సమర్పించారు. భగవానుడగు జాబాలి పైప్పలాదుని సాదరంగా ఆహ్వానించి చిరునవ్వుతో కుశల ప్రశ్నలు వేయసాగారు.

**జాబాలి మహర్షి** : బిడ్డా। పైప్పలాదా। మహనీయులగు మీ పితృదేవులు పిప్పలాద మహర్షివారికి నా హృదయపూర్వక నమస్కారము. నీవు కుశలమే కదా? మీ తండ్రిగారు నీకు నియమించిన ఆధ్యాత్మికమార్గమగు భక్తి-జ్ఞాన-యోగ-ధ్యానాత్మకమైన అభ్యాసములు శ్రద్ధగా కొనసాగుచున్నాయి కదా? ఇంకా ఏమి విశేషాలు? నీ ఈ రాకకు కారణం?

**పైప్పలాదుడు** : హే భగవన్। అస్మత్ గురువర్యా। జాబాలమహర్షీ! మీయొక్క ఆశీర్వాదబలంచేత సమస్తము సకుశలమే. నేనిప్పుడు తత్త్వజ్ఞానార్థినై మీవద్ద పరమతత్త్వరహస్యముల గురించి శ్రవణం చేయాలని వచ్చి, మిమ్ములను శరణువేడుచున్నాను. తత్త్వశాస్త్రరహస్యమును నాకు ఉపదేశించ ప్రార్థన. **బ్రూహి పరమ తత్త్వ రహస్యమ్।**

- 'తత్త్వమ్' – అను శాస్త్రము ముఖ్యంగా చెప్పే సారాంశమేమిటి? ఆ శబ్దార్థమేమిటి? **కిం తత్త్వమ్?**
- ఈ 'జీవుడు' అనబడువాడు ఎచ్చటివాడు? ఎక్కడినుండి బయల్వెడలి, ఈ దృశ్యములో ప్రత్యక్షమై కనిపిస్తున్నాడు. **కో జీవః?**
- పరమాత్మయగు పరమశివభగవానునికి **"పాశుపత్యుపాసన"** నిర్వర్తిస్తూ ఉంటాముకదా! ఆ పాశుపత్యుపాసనా విధానము గురించిన విశేషమును మీవద్ద అభ్యసించటానికి సముత్సాహితుడను అగుచున్నాను.

  'పశువు' ఎవరు? పశుపతి ఎవరు?

  'ఈశానుడు' అనగా ఎవరు?
- **"ఈ మానవజన్మ ఉత్కృష్టమైనదని, 'మోక్షము'ను సిద్ధించుకోవటానికి మహత్తరమైన అవకాశము"** – అని తత్త్వజ్ఞుల యొక్క తత్త్వశాస్త్రము యొక్క మహత్-వాక్యము కదా! అట్టి **'మోక్షము'**ను మేము సిద్ధింపజేసుకొనేది ఎట్లా? అందుకు మేము అనుసరించవలసిన ఉపాయమేమిటి?

ఈ ఈ విశేషాలన్నీ దయతో వివరించవలసినదిగా నా అభ్యర్థన.

**జాబాలి మహర్షి** : సంతోషమయ్యా! తత్త్వజ్ఞానవిశేషాలు వినటానికి వచ్చినందుకు నీకు అభినందనలు. **నేను ఏ విధంగా శ్రవణం చేసి (విని), తెలుసుకోవటం జరిగిందో**....ఆయా విశేషాలన్నీ నీకు చెప్పుతాను. **సర్వం నివేదయామి, యథా జ్ఞాతమ్ ఇతి?**

**పైప్పలాదుడు** : ఓహో। మీరే స్వయముగా మహాతపోసంపన్నులుగా మునిలోకంలో సుప్రసిద్ధులు. మహర్షులుగా కీర్తింపబడువారు.

అట్టి మీరు – "విని ఉన్నట్టి, నేర్చుకొని ఉన్నట్టి విశేషాలు చెప్పుతాను" – అని అంటున్నారే! మీరు ఎవరిచే బోధింపబడి, విని, తెలుసుకొన్న విశేషాలు చెప్పబోవుచున్నారు? **కుతః త్వయా జ్ఞాతమ్?**

**జాబాలి మహర్షి** : నాయనా! నేను లోక గురువులగు శివపుత్రుడు షడాననులవారు తత్త్వజ్ఞానము బోధించగా విని తెలుసుకోవటం జరిగింది. **షడాననా ఇతి।** (కార్తికేయా! కరుణాసాగర! శ్రీ స్వామినాధా వడివేలా! దానశరణ్య వడివేలా! నమో నమః॥)

**పైప్పలాదుడు** : అట్లాగా మహనీయా? అయితే ఆ షణ్ముఖులగు సుబ్రహ్మణ్యస్వామి (లేక) స్వామి కార్తికేయులవారు ఎవరి నుండి తత్త్వజ్ఞానము తెలుసుకోవటం జరిగింది?

**జాబాలి మహర్షి** : ఆ షణ్ముఖస్వామి – తత్త్వజ్ఞానమును తమ పితృదేవులు, జగత్ పిత అగు పరమేశ్వరుని నుండి తాను శ్రవణం చేసినట్లుగా చెప్పటం జరిగింది. **ఈశానాత్ ఇతి।**

**పైప్పలాదుడు** : ఆ షణ్ముఖుడు ఈశానుని నుండి ఎట్లా తత్త్వరహస్యములు వినటము, తెలుసుకోవటం సాధ్యపడింది? **కథం తస్మాత్ తేన జ్ఞాతం?**

**జాబాలి మహర్షి** : ఓ అదా! ఈ త్రిజగత్తులలో ఎవ్వరైనా మహత్తరమగు తత్త్వజ్ఞానము తెలుసుకోవాలనుకుంటే, అందుకు ఉపాయం ఒక్కటే. అది **"ఉపాసన"**. షణ్ముఖస్వామి ఈశ్వరుని ఉపాసించి, వారిని ప్రసన్నులుగా చేసుకొన్నారు, పరిప్రశ్నించి **"త్వమ్‌గా కనబడునది తత్‌యే। పరమాత్మయే సకలరూపములలో, సకల దేహములలో దేహిగా ఉన్నారు"** అనబడు **తత్త్వజ్ఞానమునకు** ముందుగా అర్హులైనారు. అటు తరువాత శివభగవానుని నుండి తాము శ్రవణం చేయటం జరిగిందని వారు చెప్పి ఉన్నారు. **తత్ 'ఉపాసనాత్' ఇతి।**

**పైప్పలాదుడు** : హే గురువరేణ్యా। భగవాన్। జాబాలి మహర్షీ! ఇటువంటి ప్రశ్నలు వేసినందుకు నన్ను క్షమించండి. స్వాభావికమై అన్యవిశేష జిజ్ఞాసదోషంచేత ప్రశ్నించానేమో. ఇప్పుడు మిమ్ములను సద్గురురూపంగా ఉపాసిస్తున్నాను. నాపై కృపతో తత్త్వశాస్త్ర రహస్యమును నాకు విశదీకరించండి. **భగవన్। కృపయా మే రహస్యం సర్వం నివేదయేతి।**

**జాబాలి మహర్షి :** బిడ్డా। ఇప్పుడిక తత్త్వ రహస్యమును వివరించుకుందాము. 'పశుపతి' అను శబ్దార్థమేమిటో చెప్పుకుంటున్నాము. శ్రద్ధగా విను.

**"జీవుడు-భౌతికదేహము"** ఈ రెండూ నీకు ఎదురుగా కనిపిస్తున్నాయి కదా! ఇక్కడ మూడు విషయాలు బుద్ధితో గమనించు –

(1) ఇంద్రియములు – **ఇంద్రియ విషయములు** (శబ్ద స్పర్శరూప రసగంధములు)

(2) ఆ ఇంద్రియములకు, ఇంద్రియార్థములకు పరిమితుడు, బద్ధుడు అయి ఉన్నవాడు **జీవుడు.**

(3) ఆ ఇంద్రియములకు పతి (లేక) నియామకుడు **ఈశ్వరుడు.**

ఈ మూడు ప్రతి ఒక్క జీవునిపట్ల స్వాభావికమై ఉన్నాయి. ఇంద్రియములకు ఎవ్వరు పతియో, ఆయనయే **పశుపతి.** కథారచనకొరకై ఒకానొకడు తననుండి (1) కథారచయిత (The Writer) (2) కథా విశేషములు (Story details) కల్పించుకొంటున్న తీరుగా పశుపతి తననుండి అహంకారము (Sense of Individual Experience)ను కల్పన చేసుకొంటున్నారు.

| Individual Sense of ego | → | Experiencing | → | Objects of Experience. |
|---|---|---|---|---|
| వ్యష్టిగత అనుభవి | → | అనుభవము | → | అనుభవించబడు విశేషములు |

ఇవన్నీ ఎవరినుండి (ఏ కేవల స్వరూపమునుండి) ప్రకటనమగుచూ, ప్రదర్శనమగుచున్నాయో... ఆయనయే **'పశుపతి'**.

ఈ జీవుడు → "దేహము – నేను"...అను భావనకు **"నేను పరిమితుడను"**.... అను వ్యసనమును అభ్యాసవశంగా ఆశ్రయించినప్పుడు – పశుపతియే **"సంసారి, జీవుడు"** అనబడుచున్నాడు. **పశుపతిః అహంకారావిష్టః సంసారీ; జీవః సయేవ।** – **'పశువు'** అను శబ్దముయొక్క అర్థమునకు సంబంధించిన ఉద్దేశ్యము – ఇంద్రియములు.

– ఈ జీవుడే – వ్యష్టి అహంకార పరిమితుడై, దృశ్య వ్యసన రూపపరిమిత దృష్టిచే సంసారి అయి ఉన్నప్పుడు **"పశువు"-గా చెప్పుకోబడుచున్నాడు. సయేవ పశుః।**

"ఈ దేహ-ఇంద్రియ జగద్దృశ్యములు నాయొక్క క్రీడా – లీలా వినోదములు. 'జీవాత్మ' అనబడు పశువుకు అధికారిని. నియామకుడను".

(I am the one who created the Experiencer of all else for the sake of my pleasure) – అను భావనచే **ఈ జీవుడే శివుడుగా, పశుపతిగా పిలువబడుచున్నాడు.**

- **జీవుడు కించిజ్ఞుడు.**
- **ఇక ఈశ్వరుడో?** నటుడు తాను నటించే అనేక పాత్రలకు వేరుగా ఉండు తీరుగా – **ఈశ్వరుడు దేహధారణకు మునుముందే ఉన్నట్టివాడు.** దేహధారణమునకు ఆవల – ఈవల ఎరిగినవాడు. దేహముయొక్క పుట్టుక – వృద్ధి – హాని – తిరోభావము – అనుగ్రహము (Birth, growth, Decay, Withdrawl and according) అను పంచకృత్యములను నిర్వర్తిస్తూఉంటాడు. సర్వమునకు ఈశ్వరత్వము (All pervading) వహించి ఉంటున్నట్టివాడు.
- ఈశ్వరుడే సమస్త భావములకు యజమాని. అంతటా విస్తరించి ఉన్నవాడు. <u>"సర్వేశ్వరుడు"</u>
- 'జీవుడు' అనబడు పశువుకు పతి. నియామకుడు.

**జీవుడు(పశువు)** = సందర్భ పరిమిత పురుషకారము యొక్క సంజ్ఞ.

**ఈశ్వరుడు (పశుపతి)** = ఆయా వివిధ పురుషకారములు తనవై, తాను వేరై, వాటికి తాను యజమాని – <u>**పశుపతి.**</u>

(The person whose personality is differently appearing in different contexts while he himself is always "AS HE IS")

<u>**పైప్పలాదుడు**</u> : 'పశువు' అనగా ఎవ్వరు? మరొక్కసారి వివరించండి. **కే పశవః?**

**జాబాలి మహర్షి**: మరల చెప్పుచున్నాను. వినండి. "నేను దేహమునకు, ఇంద్రియములకు, ఇంద్రియ విషయములకు బద్ధుడను" అని తలచినప్పుడు, ఈ "జీవుడు" పశువుగా చెప్పబడుచున్నాడు. ఈ 'జీవుడు' ఆత్మయొక్క వ్యక్తిరూప నియామకమే. అట్టి 'ఆత్మ'యే సమస్తము నియమించుచున్న 'పశుపతి'.

<u>**పైప్పలాదుడు**</u> : ఈ జీవుడు, పశువు, పశుపతి కూడానా? ఆశ్చర్యం! జీవుడు 'పశువు' ఎట్లా అవుతాడు. అట్టి జీవునికి ఆతడే పతి ఏవిధంగా? ఇంకా కొంత వివరించి చెప్పండి.

<u>**పైప్పలాదుడు**</u> : <u>ఈ జీవుడు</u> :-

- **యథాతృణాసినో** → 'ఇంద్రియ విషయములు' అనే గడ్డిపరకలను (శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములను) ఆసాదిస్తూ – 'నేను ఇంతవరకే' అను భావన కలిగి ఉంటూ ఉన్నాడు.
- **వివేకహీనః** → జాగ్రత్–స్వప్న – సుషుప్తులకు కేవలసాక్షి అగు తన ఆత్మయొక్క ఔన్నత్యమును ఎరుగక, ఏమరచి, అవివేకి అయి ఇంద్రియ జగత్తులో సంచారములు చేస్తున్నాడు.
- **జ్ఞాన విహీనః** – ఆత్మజ్ఞాన విహీనుడై ఇంద్రియములకు తారసబడేదే 'సత్యము' అను భావనలలో మునిగి తేలుచున్నాడు.
- **కృషి ఆది కర్మసు** → "ఏదో చేయాలి। చూడాలి। వినాలి। స్పర్శించాలి। వేచిచూడాలి।" అని రంధితో 'కృషి' అనే వ్యసనమును వదలలేనివాడై, రజోగుణాత్మకుడై కాలము గడుపుచున్నాడు.
- **సకల దుఃఖ సహాః** → "నేను దుఃఖిని. పాపిని. అల్పుడను. స్వల్పుడను. బద్ధుడను. గుణహీనుడను. బలహీనుడను" ...ఇటువంటి అనేక దుఃఖ– అల్ప స్వకీయ భావనలతో, అవగాహనలతో కూడుకొన్నవాడై – ఉంటున్నాడు.
- **స్వ-స్వామి బధ్యమానాః** → వీరికి నేను యజమానిని. వారు నాకు యజమానులు. వీరు నేననుకున్నట్లుగా ఉండరు. బాధగా ఉంటోంది. వారు నాకు యజమాని. కర్మకొద్దీ నేను వారి యాజమాన్యములో ఉండిపోకతప్పదు... → ఇత్యాది స్వ–స్వామి సంబంధములచే బద్ధుడగుచున్నాడు.

***ఇవన్నీ పశులక్షణములే! సందర్భ సత్యములలో తనను గమనించుకొనుచు, స్వకీయ–స్వాభావికమగు సహజ తత్త్వమును ఏమరచి ఉండుటచే (తాను అప్రమేయమగు ఆత్మగా గమనించకపోవటం చేత) – ఈ జీవుడు 'పశువు'....అని అభివర్ణించబడుచున్నాడు.***

**ఈశ్వరుడు** :-

**ఏవిధంగా అయితే** – పశువుయొక్క యజమాని పశువును

→ ఎట్లా కట్టి ఉంచాలి?
→ ఎప్పుడు మేత వేయాలి?

→ ఎప్పుడు పొలములో పనిచేయించాలి?

→ ఏ విధంగా బండి లాగించాలి?

.... మొదలైనవన్నీ ఎరిగి, పశువును ఉపయోగించటము ఎరిగి ఉంటాడో,....అట్లానే,

**ఈశ్వరుడు** సర్వజ్ఞుడై ఇంద్రియములను ఉపకరణముగా ఉపయోగించువాడై, నిత్యనిర్మలుడై – దేహములకు, ఇంద్రియములకు, ఇంద్రియ విషయములకు – **పరిమితుడు కానివాడై ఉంటాడు.**

**"<u>ఇంద్రియములు, ఇంద్రియ విషయములు, వాటి ఆస్వాదకుడు</u> – ఈ మూడు నాయొక్క యాజమాన్యములోనివి"** – అని గ్రహించి ఉంటాడు.

***"ఈ దేహము, ఇంద్రియములు, దృశ్య విషయములు నాకొరకై నేను నియమించుకొనుచు, మరొకప్పుడు ఉపశమింపజేయుచున్న – "<u>యజ్ఞ పరికరములు</u>" వంటివి మాత్రమే" – అను స్వాభావికమైన ఎరుక, ఆస్వాదనలు ఈశ్వరలక్షణము.***

❊ ❊ ❊

**<u>పైప్పలాదుడు</u> :** స్వామీ! మేము **పశుత్వము**ను అధిగమించి **పశుపతిత్వము (లేక) శివత్వము** సంతరించుకునేది ఏవిధంగా? పరతత్త్వజ్ఞానము సంపాదించటము, అఖండాత్మకు సంబంధించిన కేవలానుభవులమై ఉండుటము ఎట్లా? **తత్త్వ జ్ఞానసిద్ధి** కొరకై మేము ఏ ఉపాయమును ఆశ్రయించాలి? **తత్ జ్ఞానం కేన ఉపాయేన జాయతే?** దేహవ్యవహార పరిమితత్వముచే ఆవు మొదలైన జంతువులవలె పశుప్రాయులమై, ఇంద్రియ విషయానుభవబద్ధులమై యున్న మేము పశుపతిని ఆశ్రయించి, **'శివోఽహమ్'** స్థానము సిద్ధించుకోవటము ఎట్లా? "అహమ్ పశుపతిః। న (ఇంద్రియ) పశుః। న ఇంద్రియ దాసః" – అనునది ఎట్లా సముపార్జించుకోవాలి?

**జాబాలి మహర్షి** : "ఈ జీవాత్మత్వ, ఇంద్రియాత్మత్వ, జగదాత్మత్వములు నాయొక్క **ఈశ్వరాత్మ** లేక **శివతత్త్వము** (శివోఽహమ్) యొక్క ధారణా – అలంకారము" – అనునదే **"త్రిపుంఢ్రధారణా, భస్మవిభూతిధారణా"** యోగము. అట్టి ధారణచే **"కేవల ఈశ్వరత్వ భావనాయోగము"** సిద్ధించగలదు. అట్టి **"భస్మవిభూతి ధారణావ్రతము"** మహనీయులచే సూచించబడియున్నది. **<u>యథాతత్ స్వామిన ఇవ "సర్వజ్ఞ ఈశః పశుపతిః విభూతి ధారణోపాయేన"</u> జాయతే।** ఈశ్వరత్వ సంబంధమైన అట్టి విభూతి ధారణవ్రతము **'శాంభవీ వ్రతము'** అని కూడా శివప్రోక్తమై యున్నది.

**<u>పైప్పలాదుడు</u> :** అట్టి **"భస్మవిభూతి ధారణావ్రతము" (లేక) "శాంభవీవ్రతము", (లేక) త్రిపుండధారణవ్రతము** యొక్క విధానము ఎట్టిది? వాటియొక్క మహిమ, అంతరార్థములగురించి కూడా దయతో వివరించండి. అట్టి విభూతిధారణ సందర్భములో పరబ్రహ్మముయొక్క జగత్ ధారణాతత్త్వార్థమును ఉటంకించుచున్న అభిమంత్రణ శ్లోకములు కూడా కరుణతో వివరించండి.

**జాబాలి మహర్షి : "పంచబ్రహ్మ మంత్రములు"** – అందుకొరకై తత్త్వవేత్తలచే గానముగా అందించబడ్డాయి. అంతరార్థ – అవగాహనపూర్వకంగా బుద్ధి–మనో–వాక్కులు ఏకం చేస్తూ వాటిని పఠించాలి. పఠిస్తూ" **"త్రిరేఖా భస్మవిభూతిధారణ"**ను నిర్వర్తించటము ఉత్తమ ప్రయోజన ప్రసాదితంగా పూజ్యులు, తత్త్వదర్శులు అగు సద్గురువులచే సూచించబడుతోంది. అట్టి విభూతిధారణ ప్రకారము ఏమిటో, ఎక్కడెక్కడ విభూతిని ధరించాలో ఆయా విశేషాలు వినండి.

# పంచబ్రహ్మ మంత్రములు

**"సద్యోజాత।। అగ్నిరితి భస్మ ।। మానస్తోక ।। త్రాయుషమ్।। త్ర్యంబకం।।"**

**(1) ఓం।। సద్యోజాతం ప్రపద్యామి। సద్యోజాతాయవై నమో నమః।**
**భవే భవేన అతిభవే భవస్వమామ్। భవోద్భవాయ నమః (భవ ఉద్భవాయ నమః)**

"సద్యోజాతుని స్తుతిస్తున్నాను. నమో నమః। నన్ను జన – మరణ – పునఃజన్మల అవస్థ నుండి దాటించి, 'అమృతత్వము'నకు జేర్చండి. దేహ–దేహాంతర స్థితులకు మూలకారకుడగు భవోద్భవునికి నమస్కారము".

*ఈ విశ్వముయొక్క జనన స్థానము 'సత్'యే అట్టి "సత్" అను (జ్యోతి) స్వరూపమును స్తుతించుచున్నాను. 'సత్' నుండి ఏది దృశ్యజగత్తురూపంగా బయల్వెడలుచూ కూడా. 'సత్'యే అయి ఉన్నదో, అట్టి జగత్ కల్పనా చమత్కారమునకు కూడా నమస్కారము. **<u>"ఉనికికే ఉనికి"</u>** అయినట్టి **అతిభావమగు కేవలాత్మ** నాకు అనునిత్యానుభవమై సిద్ధించునుగాక। నాపట్ల ప్రకటితమై వెల్లివిరియునుగాక. భవము (కేవలమగు ఆత్మసత్తాకు) భవ – ఉద్భవ రూపమగు లీలా – క్రీడా వినోదమే ఈ*

*జగత్తు. ఉద్భవమగు మాయా జగత్తుకు (భవ - ఉద్భవములకు) నమస్కరించుచున్నాను"* - **అని భస్మమునకు నమస్కరించెదరుగాక!**

**(2) ఓం॥ అగ్నిరితి భస్మ॥ వాయురితి భస్మ॥ జలమితి భస్మ॥ వ్యోమేతి భస్మ॥**
**దేవా భస్మ॥ ఋషయో భస్మ॥ సర్వగ్‌ం హవా ఏతత్ ఇదం భస్మీభూతం పావనం నమామి॥**

*జ్యోతిస్వరూపమగు 'కేవలాత్మ' నుండియే పంచభూతములు బయల్వెడలి తిరిగి జ్యోతిస్వరూపసారమందు లయమును పొందుచున్నాయి. ఇదంతా పరమాత్మయొక్క ప్రజ్ఞా ప్రదర్శనమే. తిరిగి సమస్తము ప్రజ్ఞయందు భస్మమై నిర్విషయమగుచున్నది. అందుచేత -* ***అగ్ని, జలము, ఆకాశము - ఇవన్నీ భస్మమే సహజరూపముగా కలిగి ఉన్నాయి.*** *దేవతలు కూడా ఆత్మ భగవానుని విభూతి అలంకారమే. ఆత్మ చితా భస్మ - విభూతి స్వరూపులే. ఋషులు కూడా ఆత్మ భస్మ (నిర్విషయ) స్వరూపులే! పరమాత్మయొక్క భస్మ - విభూతులే సమస్తము కూడా! అందుచేత* ***సమస్తము పవిత్రమగు భస్మమే.*** *అట్టి* ***భస్మమునకు అంతర్ - హృదయ పవిత్రత కొరకై నమస్కారము.***

ఈ మంత్రములతో విభూతిని భావనాపూర్వకంగా అభిమంత్రిస్తూ అరచేతిలోకి తీసుకోవాలి.

**(3) ఓం॥ మాన స్తోకే తనయే॥ మాన ఆయుషి॥ మానో గోషు॥ మానో అశ్వేషుః॥ ఈరిషః**
**వీరాన్ మానో॥ రుద్రభామితో అవధీః హవిష్మంతో నమసా విధేమతే॥**

*హే రుద్ర భగవాన్! మా సంతానమును రక్షించండి. మాకు పవిత్ర కార్యక్రమములతో కూడిన ఆయుష్షును ప్రసాదించండి. మా గోవులకు గుర్రములకు, మాలోని కార్యక్రమ సమర్థులగు వీరులకు రక్షకులై ఉండండి. ఓ రుద్రభూమిపై సంచరించు స్వామీ! మమ్ము బుద్ధిమంతులుగా తీర్చిదిద్దండి. మేము సమర్పించు హవిస్సులను, నమస్కారములను, విధేయతలను స్వీకరించండి. మమ్ములను కాపాడండి.*

పై రెండు మంత్రములతో భస్మవిభూతిని జలముతో తడపాలి.

**(4) ఓం॥ త్రి-ఆయుషమ్ జమదగ్నే॥ కశ్యపస్య త్రి-ఆయుషమ్॥**

*జమదగ్ని మహర్షుల, కశ్యప ప్రజాపతుల కరుణాకటాక్షవీక్షణచే మా జాగ్రత్ - స్వప్న-సుషుప్తుల ఆయుష్షులు పవిత్రమగునుగాక.*

**(5) ఓం॥ త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్॥**
**ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోః ముక్షీయ మ అమృతాత్॥**

*(భూతాకాశ - చిత్తాకాశ - చిదాకాశ) త్రి ఆకాశస్వరూపుడు, సుగంధములను వెదజల్లువాడు, పరిపుష్టిని వృద్ధి చేయువాడు అగు రుద్రుని ఆరాధిస్తున్నాము. దోసపండును తొడిమనుండి వేరుచేయనంత సులభంగా, సుకుమారంగా మమ్ములను 'మృత్యువు' నుండి వేరుచేయండి. అమృతత్వమును సిద్ధింపజేయండి!*

ఈ విధంగా భస్మమును నీటితో సంప్రోక్షించి, ఆ విభూతిని **"ఈ సమస్తము - కేవలాత్మ - అంతరాత్మ - పరమాత్మ స్వరూపుడనగు నాకు విభూతి రూప అలంకారములే"**..... అను మననమును నిర్వర్తిస్తూ చూపుడువ్రేలు - మధ్యవ్రేలు - అనామిక వ్రేలు"లతో మూడు మూడు రేఖలను →

**శిరో** - శిరస్సుపై నుదురు ఉపరిగాను (లేక), **లలాట** - లలాటము (Foreface) పై
**స్కంధేషు** - భుజముల ఉపరిభాగముపై

**"త్రీ ఆయుషైః॥ త్ర్యంబకైః॥ త్రిస్రో రేఖా॥"** (త్రికాలములను, త్రి ఆకాశములను, త్రిరేఖలుగా) అని పలుకుచు పరమాత్మను మననం చేస్తూ ధారణ చేయాలి.

ఇట్టి **'ఆత్మాఽహమ్'- ఇదమ్ మమ భస్మ విభూతిః** భావనా పూర్వకంగా తాను అలంకరించుకొన్న త్రిరేఖావిభూతి ధారణ ఒక దైనందికమైన **వ్రతము**గా ఆచరించబడు గాక! దీనిని 'శాంభవీ వ్రతము' అని, 'శైవ వ్రతము' అని కూడా అంటారు.

**సర్వేవేదేషు :** తెలియబడేదంతా భస్మవిభూతిగా మనస్సుతో ధారణ చేయుచూ ఉండుటచే సమస్తము ఆత్మభావానాయుక్తముగా అగుచున్నది. ఈ విధమైన సమాచరణ కలిగిన ముముక్షువు - **న పునః భవాయ!** జన్మ - కర్మలకు ఆవలగల **శాశ్వతానందరూపమునే** అనుక్షణికంగా, స్వాభావికంగా ఆస్వాదిస్తూ ఉంటాడు. అంతేగాని, "దృశ్యమునందు కనిపించే జీవాత్మత్వము యొక్క పరిధికి బద్ధుడను. జన్మకర్మలచే పరిమితుడను. సంకుచితుడను"-అనే కల్పనకు ఇక చోటు ఇవ్వడు.

త్రిపుండ్ర ధారణ, త్రిరేరేఖా ధారణ లలాటమంతా కనుకొలకు చివరివరకు, భ్రూమధ్యస్థానమును కలుపుతూ అలంకరించుకోవాలి.

ఓ పైప్పలాదా! అట్టి త్రిరేఖలకు అంతరార్థము బ్రహ్మ మానసపుత్రులగు అస్మత్ గురుదేవులు శ్రీసనత్కుమారులవారు సవివరంగా చెప్పియున్న వాక్యములను ఇప్పుడు మీకు చెప్పుచున్నాను. వినండి.

భస్మవిభూతిని '3' రేఖలుగా ధారణ చేయటము "త్రిపుండ్రధారణము" అని అంటారు. అట్టి త్రిపుండ్రధారణ నుదుటిపై ఈ చివరనుండి ఆ చివరవరకు కనులచివ్వరగా విస్తరింపజేస్తూ ధారణ చేస్తారని అనుకున్నాం కదా! అట్టి ధారణలోని '3' రేఖల అంతర్లీన ఉ ద్దేశ్యార్థము ఈ విధంగా చెప్పబడుతోంది.

## సంజ్ఞార్థములు



**ప్రథమరేఖ** → యజ్ఞవిధులలోని — **గార్హపత్యాగ్ని.**

త్ర్యక్షర 'ఓం' కారములో — **'అ'కారము (కేవలము). మొదటి వ్యాహృతి.**

త్రిగుణములలో — **రజోగుణము**

త్రిలోకములలో — **భూర్లోలోకము** (Zone of Matter)

స్వాత్మ-అంతరాత్మ-పరమాత్మలలో — **స్వాత్మ (బాహ్య జగత్ సంబంధమైన 'నేను')**

క్రియ - ఇచ్ఛా - జ్ఞానములలో — **క్రియాశక్తి.**

ఋక్ - యజుర్ - సామవేదములలో — **ఋగ్వేద ఋక్కులు. ఋత్** (పరమ సత్య ప్రవచనం)

దినములో — **ప్రాతఃకాల ఉపాసన (ప్రాతఃసవనము)** - ఉదయము చేయు ఉపాసన (The Morning Prayer)

దేవత — **ప్రజాపతి। సృష్టికర్త అగు బ్రహ్మదేవులవారు.**

---

**ద్వితీయరేఖ** → యజ్ఞవిధులలో — **దక్షిణాగ్ని**

'ఓం'కార త్ర్యక్షరములలో - **'ఉ'కారము (ప్రకృతి / అనుభవము / స్వభావము)**

త్రిగుణములలో - **సత్వగుణము**

త్రిలోకములలో - **అంతరిక్ష లోకము / భువర్లోకము** (Zone of thought and Feelings)

త్రి ఆత్మలలో - **అంతరాత్మ (అంతరంగ సంబంధమైన 'నేను')**

క్రియ - ఇచ్ఛా - జ్ఞానములలో- **ఇచ్ఛాశక్తి**

వేదములలో - రెండవదగు **యజుర్వేదము**

దినములో - మధ్యాహ్న సమయము **మధ్యాహ్నోపాసన**

దేవత - **విష్ణు భగవానుడు.**

| | | |
|---|---|---|
| **తృతీయరేఖ**→ | యజ్ఞవిధులలో - | అహవనీయాగ్ని |
| | ప్రణవము (ఓం)లో- | మూడవదగు 'మ' కారము. మూడవ వ్యాహృతి. వష్ఠి-అహంకారము. |
| | త్రిగుణములలో - | తమోగుణము |
| | త్రిలోకములలో - | ద్యు(ద్యౌ)లోకము. అశరీర సృష్ట్యభిమానులగు **దేవతలు నివసించులోకము. దివ్యలోకము** (Zone of Diversity) |
| | స్వాత్మ - అంతరాత్మ - పరమాత్మలలో- | **పరమాత్మ** |
| | క్రియా-ఇచ్ఛా-జ్ఞానశక్తులలో - | **జ్ఞానశక్తి** |
| | త్రైవిద్య/త్రై వేదములలో - | **సామవేదము** |
| | తృతీయసవనం - | **సాయంకాలము / రాత్రి - ఉపాసనలు** |
| | అధి దేవుడు - | **మహాదేవుడు** |

త్రివిభూతిరేఖాధారణ చేస్తూ, **'నేను అఖండము, నిత్యము, సత్యము, అప్రమేయము అగు ఆత్మను'** అను **భావనతో** త్రిరేఖలను **పైవిధమైన భావనను** అనునిత్యంగా పరిపోషించుకుంటూ - ఈ **జగత్తునందు చరిస్తూ ఉండటమే** - విభూతి యోగము. **శాంభవీ విద్య. శాంభవీ వ్రతము. శైవీ వ్రతము. శివ వ్రతము.**

## అంతరార్థములు

→ భస్మవిభూతిధారణ। భస్మభూషితాంగ శివత్వము।

→ శాంభవీ విద్య।

→ అన్యముగా కనిపించేదంతా అఖండ - అప్రమేయ స్వస్వరూపాలంకారముగా (అనన్యముగా) దర్శించు ఆత్మవిద్య.

→ అనన్యుడై అన్యమును ఆస్వాదించు భౌమా విద్య.

ఈఈ అర్థములను ఉపాసిస్తూ త్రిపుండ్ర భస్మధారణ నిర్వర్తించువాడు ధన్యుడు. అట్టివాడు వేద విద్యా విద్వాంసుడు అయినా, అవకపోయినా - **వేద హృదయమును ఎరిగినవాడు అగుచున్నాడు.** ఆతడు బ్రహ్మచారి, గృహస్త, వానప్రస్థ, సన్న్యాస - ఇత్యాది ఏ ఆశ్రమములో ఉన్నప్పటికీ కూడా, - తాను కేవలాత్మ స్వరూపుడై ఈ జీవాత్మ - జగదనుభవ - జాగ్రత్ స్వప్న సుషుప్తులను తనకు త్రిపుండ్రాలంకారముగా ధరించువాడగుచున్నాడు. ఈ దృశ్యజగత్తును తన ఆభరణములవలె కలిగి ఉంటున్నాడు.

అట్టి భస్మ విభూతి ధారణాభ్యాసి →

- సమస్త మహాపాతక - ఉప పాతకములనుండి **పునీతుడు** అగుచున్నాడు.
- **చతుర్వేదముల** అంతరార్థమును **అధ్యయనము** చేసినవానితో **సమానుడు.**
- **సర్వదేవతలను** ధ్యానించినవాడగుచున్నాడు.
- సర్వ **పుణ్యతీర్థములలో స్నానము** చేసిన మానసిక పవిత్రత ప్రాప్తించగలదు.
- సకల **రుద్రమంత్రములు జపించిన** ఫలితము పొందుచున్నాడు.

అట్టివానికి జన్మ - జన్మాంతర - పునర్జన్మ దోషములతో కూడిన పునరావృత్తి దోషము స్పృశించజాలదు. "నేను దేహముతో పుట్టువాడను. దేహముతో చచ్చువాడను" - అనే భ్రమ తొలగుతుంది.

**న స పునరావర్తతే।**

**న స పునరావర్తత - ఇతి। ఓం।**

అతడు తనయొక్క కేవలాత్మక స్వయంప్రకాశక స్వభావమునుండి చ్యుతి పొందదు. క్రిందికి దిగదు.

**ఇతి జాబాల పైప్పలాద సంవాదరూపక జాబాల్యుపనిషత్**
**ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ॥**

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 6 దర్శనోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ "యమ" – ఆది అష్టాంగ యోగేద్ధం (యోగా ఇద్ధం)
బ్రహ్మమాత్ర ప్రబోధితః
యోగినో యత్ పదం యాంతి,
తత్ "కైవల్య పదం" భజే॥



"కేవల బ్రహ్మము" గురించిన ప్రబోధమును సుసంపన్నము చేసుకొనటానికై ఏ "యమము-నియమము-ఆసనము- ప్రాణాయామము- ప్రత్యాహారము- ధారణ- ధ్యానము - సమాధి" అనబడే అష్ట (8) అంగముల సహాయంతో ప్రబోధితులై, యోగులు దేనిని ఆశ్రయిస్తూ ఉన్నారో, అట్టి వారి యొక్క పరమాశయమగు "కైవల్యపదమును" ఉపాసించుచున్నాము.

### ప్రథమ ఖండము

### అష్టాంగయోగములు

1. ఓం। దత్తాత్రేయో మహాయోగీ
భగవాన్ భూతభావనః,
చతుర్భుజో మహావిష్ణుః
యోగ సామ్రాజ్య దీక్షితః॥

చతుర్భుజులగు మహావిష్ణు అవతారులు, (ఏ వెలుగులో లోకములన్నీ కనిపిస్తూ ఉన్నాయో - అట్టి) తేజోరూపులగు భగవానుడు, ఈ సమస్త భూత జగత్తును తనయొక్క భావనామాత్రముగా కలిగియున్నవారు, యోగసామ్రాజ్య దీక్షా సంపన్నులు - అగు శ్రీ దత్తాత్రేయ మహాయోగిన్, అవధూతన్ నమో నమః॥ శ్రీ గురుదత్తాత్రేయ నమః జై గురుదత్తా!

---

తస్య శిష్యో మునివరః
సాంకృతిః నామ భక్తివాన్।
ప్రపచ్ఛ గురుం ఏకాంతే
ప్రాంజలిః వినయాన్వితః :-

శ్రీ దత్తాత్రేయ మహాయోగి యొక్క శిష్యులు - శ్రీ సాంకృతి మునివరులు. వారు భక్తి సంపన్నులు. యోగాభ్యా నిరతులు. అట్టి సాంకృతి మునివరులు ఒకరోజు ఏకాంతంగా దత్తాత్రేయ జగద్గురు, సద్గురు వరేణ్యుల వారిని సమీపించి, నమస్కరించి వినయ విధేయతలతో ఈ విధంగా ప్రశ్నించారు.

---

"భగవన్! బ్రూహి మే యోగం సాష్టాంగం,
స ప్రపంచకమ్
యేన విజ్ఞాత మాత్రేణ జీవన్ ముక్తో
భవామి అహమ్॥

"హే భగవన్! జగద్గురూ! అస్మత్ సద్గురుదేవా! దత్తాత్రేయ అవధూత మహాశయా! ఏది తెలుసుకొన్నంత మాత్రం చేత నేను జీవన్ముక్తుడను కాగలనో, అట్టి సువిస్తారమైన సప్రపంచకమైన "అష్టాంగ యోగములు" గురించి, ఈ ప్రపంచము యొక్క వాస్తవ రూపము గురించి బోధించ వలసినదిగా మిమ్ములను ప్రార్థిస్తున్నాను. అర్థిస్తున్నాను. శరణు వేడుచున్నాను.

---

2. దత్తాత్రేయ అవధూత ఉవాచ :-సాంకృతే!
శృణు, వక్ష్యామి యోగం స-అష్టాంగ దర్శనమ్।
యమశ్చ, నియమశ్చ ఏవ
తథా ఏవ ఆసనం ఏవ చ, ప్రాణాయామః,
తథా, బ్రహ్మన్! ప్రత్యాహారః తతః పరమ్
ధారణా చ తథా ధ్యానం, సమాధిః చ అష్టమం, మునే!

**జగద్గురు అవధూత - త్రిమూర్త్యవతార - కరుణామయ శ్రీదత్తాత్రేయుల వారు :**

హే బ్రహ్మన్! స్వయం పరబ్రహ్మ-ఆనందస్వరూపా! సాంకృతిమునీ! మీరు కోరినట్లు "అష్టాంగయోగ దర్శనము"ను వివరించి చెప్పుచున్నాను. వినండి. యోగాభ్యాసమునకు అంగములు 8. (I) యమము, (II) నియమము, (III) ఆసనము, (IV) ప్రాణాయామము, (V) ప్రత్యాహారము, (VI) ధారణ, (VII) ధ్యానము, (VIII) సమాధి

| I. యమా దశ<br>అహింసా, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, దయ, ఆర్జవమ్,<br>క్షమా, ధృతిః, మితాహారః శౌచం చ<br>ఇతి "యమా దశ"॥ | యమాదశ (10): యమాంగ యోగము యొక్క (10) ఉపాంగముల గురించి వినండి.<br>(1) అహింస, (2) సత్యము, (3) అస్తేయము, (4) బ్రహ్మచర్యము, (5) దయ, (6) ఆర్జవము, (7) క్షమ, (8) ధృతి, (9) మితాహారము, (10) శౌచము |
|---|---|
| (1) అహింస :-<br>వేద ఉక్తేన ప్రకారేణ వినా సత్యం,<br>తపోధన ! కాయేన మనసా వాచా<br>హింసా(స) "హింసా"। న చ। అన్యథా। | (1) అహింస : హే తపోధనా! వేదములచే నియమించబడిన సందర్భములు కాకుండా, సత్యమార్గమును వదలి, మరింకేవిధంగానైనా కాయముచేతగాని, మనస్సుచేతగాని, వాక్కుచేతగాని, సహజీవులకు బాధ కలిగించడమే హింస. ఇది లోకరీతి (లోకదృష్టి) |
| (వైదాంతికార్థము) →<br>"ఆత్మా సర్వగతో అచ్ఛేద్యో<br>న గ్రాహ్య ఇతి యా మతిః,<br>సా చ "అహింసా పరా" ప్రోక్తా,<br>మునే। వేదాంత వేధిభిః॥ | పారమార్థికంగా : "పరమాత్మ నాకు కనబడుచున్న సమస్త దేహములలో సర్వగతుడై ఉన్నారు. ఆయన వేరువేరుగా అవటములేదు. అచ్ఛేద్యుడు, మనోవాక్కులకు అందనివారు (అగ్రాహ్యుడు). సర్వాత్మకుడుగు ఆయన నాకు సర్వరూపములుగా ఆత్మీయుడై ప్రియమై ఉన్నారు" అను బుద్ధిని ఎల్లప్పుడు కలిగి యుండి, దర్శించటము పరాకాష్ఠయగు 'అహింస' - - అని వేదాంత వేద్యులచే సూత్రీకరించబడుతోందయ్యా! |
| (2) సత్యం :-<br>చక్షుః ఆది ఇంద్రియైః దృష్టం, శ్రుతం<br>ఘ్రాణం, మునీశ్వర! తస్యైవ ఉక్తిః<br>భవేత్ సత్యం। విప్ర! తత్ న అన్యథా భవేత్॥<br>"సర్వం సత్యం పరంబ్రహ్మ। న చ అన్యత్"। ఇతి యా మతిః,<br>తత్ చ సత్యం పరం ప్రోక్తం, వేదాంత జ్ఞాన పారగైః॥ | (2) సత్యము : మునీశ్వరా! విప్రోత్తమా! ఈ కనులు మొదలైన ఇంద్రియములకు ఏదైతే కనిపిస్తోందో, వినిపిస్తోందో, వాసన చూడబడుచున్నదో, అదంతా కూడా లౌకికమైన ఉక్తికి 'సత్యము' అని, కళ్లకు కనబడనిదేమో - సత్యము కాదు - అని లోక రీతి. యుక్తితో కూడిన బుద్ధితో ఉన్నది ఉన్నట్లు దర్శించటమే సత్యము.<br>**పరమార్థము:** వేదాంత శాస్త్రపారగులచే - ఏ రీతిగా "పరబ్రహ్మమే సహజ - శాశ్వత సత్యము. తదితరమైనదిగా అన్పించటమనేదంతా సందర్భమాత్ర సత్యము" అని సిద్ధాంతీకరించబడుచున్నదో, అట్టి బుద్ధియొక్క విచారణయే సత్యము. "ఇదంతా పరబ్రహ్మస్వరూపమే"-అనునది సత్యము. అటువంటి మతి (బుద్ధి) కలిగి ఉండటమే 'సత్యము'గా చెప్పబడుతోంది. |
| (3) అస్తేయం :-<br>అన్యదీయే తృణే రత్నే,<br>కాంచనే మౌక్తికే - అపి చ,<br>మనసా వినివృత్తిః యా, తత్ 'అస్తేయం' విదుః బుధాః।<br>ఆత్మని - అనాత్మ భావేన వ్యవహార వివర్జితమ్,<br>యత్ తత్ అస్తేయం ఇతి ఉక్తం<br>ఆత్మవిద్భిః, మహామతే! | **(3) అస్తేయము (దొంగబుద్ధి లేకుండటం)** : తనది కానట్టిదేదైనా కూడా - గడ్డియందు, రత్నమునందు, బంగారమునందు, ముత్యమునందైనా కూడా - అద్దాని పట్ల మనస్సులో కించిత్ కూడా ఆశ లేకుండుటమే 'అస్తేయము' అని బుధుల (విజ్ఞుల) నిర్వచనము. ఇది లోకరీతి.<br>పారమార్థికంగా : ఆత్మయందు ఆత్మభావన లేకుండటము, ఆత్మ విచారణను (తత్త్వవిచారణను) ఏమరచి ఉండటమే 'స్తేయము' (దొంగబుద్ధి); "ఆత్మ విద్య, ఆత్మభావన" అభ్యాసముగా కలిగి ఉండటమే 'అస్తేయము' అని మహామతులగు ఆత్మతత్త్వజ్ఞులు చెప్పుచున్నారు. సమస్తము పరమాత్మకు చెందినదిగా భావించటమే 'అస్తేయము'. 'సమస్తము ఆత్మయే' అను భావనను ఆశ్రయించి అన్యమగు అనాత్మభావన త్యజించి ఉండటము. |
| (4) బ్రహ్మచర్యము:-<br>లోక సంబంధమైన అర్థము<br>3. కాయేన మనసా వాచా స్త్రీణాం<br>పరి వివర్జనమ్, ఋతౌ భార్యాం తదా,<br>తస్య బ్రహ్మచర్యం తత్ ఉచ్యతే॥<br>బ్రహ్మ భావే మనశ్చ ఆరం (ఆచరం) బ్రహ్మచర్యం,<br>పరంతప! | (4) బ్రహ్మచర్యము: ఓ పరంతపా! మనసా వాచా కర్మణా స్త్రీ - పురుష శృంగార (బాహ్య) సంబంధములను కలిగి ఉండకపోవటం, ఋతుకూల శాస్త్ర నియమానుసారము జీవిత భాగస్వామితో మాత్రమే శృంగారము - ఇది 'బ్రహ్మచర్యము'గా (లోకరీతిగా) చెప్పబడుతోంది.<br>ఆధ్యాత్మికోద్దేశ్యము: బ్రహ్మచర్యము అనగా....<br>మనస్సును అనునిత్యముగా 'బ్రహ్మభావన' యందు నియమించటమే "బ్రహ్మచర్యము". బ్రహ్మమునందు ఆచరణయే (బ్రహ్మభావన యందు మనస్సు ఆచరణ కలిగి ఉండటమే) - బ్రహ్మచర్యము. |

| | |
|---|---|
| **(5) దయ :-**<br>స్వ-ఆత్మవత్ సర్వభూతేషు కాయేన మనసా గిరా,<br>అనుజ్ఞాయా దయా, స ఏవ ప్రోక్తా వేదాంతవేదిభిః। | **(5) దయ**- ఇతరులపట్ల స్వాభావికమైన ప్రేమ, కరుణ కలిగి ఉండటము. సర్వజీవులను తనయందు తాను వలె, తనకు అయినవారి యందు వలె, "నావంటివారేకదా"...అను భావనను త్రికరణ శుద్ధిగా (మనసా, వాచా, కర్మణా) కలిగియుండటమును 'దయ' అని వేదాంత విదుల ఆప్తవాక్యము. తన ఆప్తస్వరూపమును తాను వలె తదితరులను కూడా (తన ఆత్మగా) దర్శించటమే దయ. స్వస్వరూపాత్మయే సర్వత్రా విస్తరించి ఉన్న తత్-భావన. |
| **(6) ఆర్జవము :-**<br>పుత్రే మిత్రే కళత్రే చ రిపౌ స్వ-ఆత్మని సంతతమ్,<br>ఏకరూపం, మునే! యత్ తత్ "ఆర్జవం" ప్రోచ్యతే మయా! | **(6) ఆర్జవము** - పుత్ర - మిత్ర - కళత్ర - శత్రు మొదలైన సర్వజనులందు "నావారు - కాని వారు" అనే భేదము లేకుండా, సమభావనను కలిగియుండి, స్వాత్మవలె ఆత్మదర్శనము చేయుటము - ఆర్జవము. "అందరు నావంటివారే నావారే" అను భావనయే ఆర్జవము. |
| **(7) క్షమ :-**<br>కాయేన మనసా వాచా శత్రుభిః పరిపీడితే,<br>బుద్ధి క్షోభ నివృత్తిః యా, 'క్షమా' సా, మునిపుంగవ! | **(7) క్షమ** - ఓ మునిపుంగవా! శత్రువులచేత తన మనో-వాక్- కాయములు పరిపీడించుచున్నప్పుడు కూడా, బుద్ధి నిర్మలముగా 'ఆత్మభావన'ను వీడకపోవటము "క్షమ"! ఓర్పు, క్షమించు గుణము కలిగి ఉండటము. |
| **(8) ధృతి :-**<br>"వేదాత్ ఏవ వినిర్మోక్షః<br>సంసారస్య, న చ అన్యథా", - ఇతి విజ్ఞాన<br>నిష్పత్తిః "ధృతిః" ప్రోక్తా హి వైదికైః॥ | **(8) ధృతి** - సంసార దోషము భయ - దుఃఖ జనకము. అందుకు ఉపాయం దృశ్య ప్రపంచంలో ఏదో లభించటము కానేకాదు. వేద - ఉపనిషత్ సేవ - అధ్యయనములే సంసార జ్వరమునకు "ఔషధము" - అని ఎరిగి వైదికమైన ఉపాయములను ఆశ్రయించటమే "ధృతి". ఈ దృశ్యము యొక్క వాస్తవ స్వరూపమేమిటో - ఎరుగు ప్రయత్నము 'ధృతి'. |
| "అహం ఆత్మా। న చ అన్యోఽస్మి" - ఇతి<br>ఏవం అప్రచ్యుతా మతిః। | "నేను సర్వదా ఆత్మస్వరూపుడను. ఆత్మకు అన్యమైనదంతా కల్పన, అదేదీ నేను అయి ఉండలేదు" అను చ్యుతి లేని బుద్ధి కలిగి ఉండటము - "అప్రచ్యుత ధృత మతి". (SELF in all and as ALL) |
| **(9) మితాహారము:-**<br>అల్పమృష్ట అశనాభ్యాం చ, "చతుర్థ అంశ అవశేషకమ్"<br>తస్మాత్ యోగ అనుగుణ్యేచ భోజనం<br>"మితభోజనమ్"॥ | **(9) మితాహారము**- (1) అల్పాహారి అయి, "2 వంతులు స్థూలాహారము, నాలుగవ వంతు జలము, శేషించిన నాలుగవవంతు"-"ఖాళీ" అను సూత్రముచే **"చతుర్థాంశ-అవశేషకము"** పాటించటము. (2) 'యోగాభ్యాసము'నకు అనుకూలమై, కారము, ఉప్పు, ఆమ్లము తక్కువగాను, సాత్వికమగు పాలు మొ॥వి అధికముగాను స్వీకరించటము - మితాహారము. |
| **(10) శౌచము:-**<br>స్వ దేహ మల నిర్మోక్షో మృత్, జలాభ్యాం, మహామునే!<br>యత్, తత్ శౌచం భవేత్ బాహ్యం<br>మానసం మననం విదుః। "అహం శుద్ధ" -<br>ఇతి జ్ఞానం "శౌచం" ఆహుః మనీషిణః॥ | **(10) శౌచము** - ఓ మహామునీ! ఈ జీవుడు ఏవిధంగా అయితే భౌతికదేహమునకు అంటిన ధూళి - మట్టిని వదిలించుకోవటానికి శుభ్రమగు జలముతో ప్రతిరోజు పరిశుభ్రము చేసుకొంటున్నాడో....<br>అదే విధంగా- విషయముల గురించిన బాహ్యమననము వలన మనస్సుకు అంటిన మలమును తొలగించుకోవటానికి "అహం-తత్" జ్ఞానము అగు **"శుద్ధాత్మ జ్ఞానము"** ఆశ్రయించాలి। ఇదియే శౌచము. |
| అత్యంత మలినో 'దేహో'। 'దేహీ' చ<br>అత్యంత నిర్మలః। ఉభయోః అంతరం<br>జ్ఞాత్వా, కస్య శౌచం విధీయతే? | అయితే....<br>ఈ 'దేహము' అత్యంత మలిన భూయిష్టమైనది. 'దేహి'యో? అత్యంత నిర్మలుడు. మరి దోషము తొలగించేది దేనికి? "దేహము మాత్రమే నేను" - అను మననరూపమగు మనస్సుకే. ఎప్పుడైతే మనస్సు నిర్మలమై, ఈ జీవుని బుద్ధి "దేహము వేరు - దేహి వేరు" అనునది గ్రహిస్తుందో...ఇక ఆపై 'శుచి'కి సంబంధించిన కార్యక్రమములు ఎవ్వరికి? |
| జ్ఞాన శౌచం పరిత్యజ్య, బాహ్యే<br>యో రమతే నరః, స మూఢః<br>కాంచనం త్యక్త్వా, లోష్టం గృహ్ణాతి - సువ్రత!!<br>జ్ఞాన - అమృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః। | జనులు దేహశుభ్రత కొరకై ఎల్లప్పుడు ప్రయత్నశీలురౌతున్నారు. దుఃఖము (Worry) తొలగుచున్నదా? లేదు. ఏ నరుడైతే అజ్ఞాన నిర్మూలన రూపమగు 'జ్ఞానశౌచము'నకు ప్రయత్నించకుండా, కేవలము 'బాహ్యశుచి' గురించియే నిమగ్నుడౌతాడో...అట్టివాడు బంగారమును వదలి మట్టిగడ్డను పట్టుకోవటము వంటిది. జ్ఞానశౌచముచే యోగి జ్ఞానామృతమును సిద్ధింపచేసుకొన్నవాడై 'కృతకృత్యుడు' అగుచున్నాడు. |

న చ అస్తి కించిత్ కర్తవ్యం।
అస్తి చేత్, న స తత్త్వవిత్।
లోకత్రయే అపి కర్తవ్యం కించిత్
నాస్తి ఆత్మ వేదివామ్।
తస్మాత్ - సర్వ ప్రయత్నేన, మునే! అహింస
ఆది సాధనైః, -
ఆత్మానమ్ "అక్షరం బ్రహ్మ"
విద్ధి, జ్ఞానాత్ తు వేదనాత్। ఇతి॥

నాటకంలో నటిస్తున్న నటునికి "దీనికి నేను కర్తను. దీనికి భోక్తను" అనునదేమీ ఉండదు కదా! తత్త్వవేత్త స్వకీయ దేహ వ్యవహారములతో సహా ఈ సమస్తమును 'జగన్నాటకము'గా దర్శిస్తూ ఉంటారు.

తత్త్వవేత్తకు కర్తవ్య భోక్తవ్యాలు ఉండవు. ఒకవేళ 'నేను కర్తను', 'నేను భోక్తను' అనునదేదైనా ఉండి ఉంటే, అట్టివాడు "తత్త్వవేత్త" అని అనిపించుకోడు.

ఆత్మజ్ఞాని "త్రిలోకమును నాటకీయ సంప్రదర్శనముగా ఎరిగి ఉండటం చేత - ఆతనికి త్రిలోకములలో కర్తవ్యమంటూ ఏదీ ఉండదు. అందుచేత సర్వ ప్రయత్నములచే అహింస మొదలైన 'యమాదశ'ను అభ్యసించాలి. తత్ఫలితంగా అకర్తృత్వ - ఆత్మభావన సిద్ధించగలదు.

**"స్వస్వరూపమగు ఆత్మ 'అక్షరము'. అదియే బ్రహ్మము. తదితరంగా తెలియబడేదంతా క్షరము, మృతము. మార్పు చెందునది" - అని గమనించుచుండెదరుగాక!**

---

## ద్వితీయ ఖండము

1 ఓం। తపః, సంతోషం, అస్తిక్యం, దానమ్, ఈశ్వరపూజనమ్,
సిద్ధాంతశ్రవణం, చ ఏవ హ్రీః, మతిః చ (మతిశ్చ)
జపో, వ్రతమ్। ఏతే చ నియమాః (దశ-10)
ప్రోక్తాః। తాని వక్ష్యామి క్రమాత్। శృణు!

## ద్వితీయ ఖండము

**నియమము :** (1) తపస్సు, (2) సంతోషము, (3) అస్తిక్యము, (4) దానము, (5) ఈశ్వరపూజనము, (6) సిద్దాంత శ్రవణము, (7) హ్రీ (లజ్జ), (8) మతి, (9) జపము, (10) వ్రతము

ఈ '10' నియమము యొక్క అంగములు. వీటిని వివరించుకుందాము.

---

(i) తపస్సు : వేద ఉక్తేన ప్రకారేణ కృత్ చ
'చాంద్రాయణ' ఆదిభిః, శరీర
శోషణం యత్ తత్ "తప" ఇతి ఇచ్యతే బుధైః॥
"కోవా మోక్షః? కథం తేన సంసారం
ప్రతిపన్నవాన్?" - ఇతి ఆలోచనం
అర్థజ్ఞాః "తపః" శంసంతి పండితాః॥

**(i) తపస్సు :** వేదములు ప్రవచించి నియమించు 'చాంద్రాయణము' (తిథి-వార ఉపవాసములు, పవిత్రక్షేత్ర దర్శనములు, తదితర నియమ-నిష్ఠలు మొదలైన విధములుగా శరీరమును శోషింపజేయటమును బుధులు 'తపస్సు' అని చెప్పుచున్నారు.

"మోక్షము" : అనగా ఏమి? దేనిచేత సంసారము కలుగుచున్నది? ఏ మార్గాన్వేషణ, సాధన, ధారణలచే తొలగుతుంది?" ఇటువంటి ఆలోచన, విచారణ, అర్థజ్ఞానము - ఇదియే 'తపస్సు' - అని నిత్యానిత్యా వివేకులగు పండితుల అభిప్రాయము.

---

(ii) సంతోషము : యదృచ్ఛా లాభతో నిత్యం
ప్రీతిః యా జాయతే నృణామ్,
తత్ "సంతోషం" విదుః ప్రాజ్ఞాః
పరిజ్ఞాన ఏక తత్పరాః॥
బ్రహ్మ - ఆది లోక పర్యంతాత్
విరక్త్యా యత్ లభేత్ ప్రియమ్,
సర్వత్ర విగత స్నేహః
"సంతోషం" పరమం విదుః॥

**(ii) సంతోషము :** ఏది ఎంతవరకు యాదృచ్ఛికంగా (అప్రయత్నంగా, ముందుగా కోరుకోకుండానే) లభిస్తే, దానితో అనునిత్యము ప్రీతి పొందుతూ (well satisfied) ఉండటమే సంతోషము - అనబడుచున్నది. ఇది ప్రాజ్ఞులగు పరిజ్ఞాన తత్పరుల ప్రవచనము.

బ్రహ్మలోకమునుండి పాతాళలోకము వరకు సర్వత్రా విరక్తి చేతను, సర్వత్రా విరాగ-విగత స్నేహము చేతను - ఏర్పడే సంతోషమే "పరమ సంతోషము" - అని విజ్ఞుల, ప్రాజ్ఞుల, విదుషుల అభిప్రాయము.

---

(iii) ఆస్తిక్యము : శ్రౌతే స్మార్తే చ విశ్వాసో యత్
తదా "అస్తిక్యం" ఉచ్యతే।

**(iii) ఆస్తిక్యము :** శ్రుతులలో (వేదములో) చెప్పబడిన సంధ్యా వందనము మొదలైన శ్రౌతములందు, పితృకార్యములగు స్మార్తము మొదలైన శాస్త్రీయ కర్మల పట్ల విశ్వాసమే ఆస్తిక్యము.

---

(iv) దానము : న్యాయ ఆర్జిత ధనం శ్రాంతేః
శ్రద్ధయా వైదికే జనే, అన్యద్వా యత్ ప్రదీయంతే
తత్ "దానం" ప్రోచ్యతే మయా॥

**(iv) దానము :** శ్రమించి సంపాదించినది, న్యాయార్జితము - అయినట్టి ధనమును వైదిక జనులకు, తదితరులకు సమర్పించటమే దానము.

**(v) ఈశ్వర పూజనము :**

రాగాది అపేతం హృదయమ్
వాక్ దుష్ట, అనృతాదినా,
హింసా ఆది – రహితం కర్మ
యత్, తత్ "ఈశ్వర పూజనమ్"॥

**(v) ఈశ్వర పూజనము :**

- రాగము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము మొదలైనవి లేని హృదయము. స్వాభావికమైన ఆప్యాయతతో కూడిన హృదయస్పందనము,

- దుష్టము, దూషణము లేనట్టి వాక్కు (అనుద్వేగకరం వాక్యమ్, సత్యమ్, ప్రియం, హితమ్, స్వాధ్యాయం అభ్యాసనమ్ - చ)

- ఇతరులను బాధించనట్టి, హింసించనట్టి కర్మ నిర్వహణము.

ఇవన్నీ ఈశ్వర పూజనము.

---

**(vi) వేదాంత శ్రవణము :**

సత్యం జ్ఞానం అనంతం చ
పరానందం పరం ధ్రువమ్,
ప్రత్యక్ ఇతి అవగంతవ్యం
వేదాంతశ్రవణం బుధైః।

**(vi) వేదాంత శ్రవణము / సిద్ధాంత శ్రవణము :**

సత్య-జ్ఞాన-అనంత స్వరూపము, పరానందము, పరము, ధ్రువము అగు ప్రత్యాగాత్మ యొక్క శ్రవణ-మనన-అధ్యయనములు అవగాహనలు- **"వేదాంత శ్రవణము".**

---

**(vii) హ్రీః!** వేద లౌకిక మార్గేషు
కుత్సితం కర్మ యత్ భవేత్,
తస్మిన్ భవతి యా లజ్జా,
"హ్రీ"ః సైవ (సఏవ) ఇతి ప్రకీర్తితా॥

**(vii) హ్రీః:** వేదము చెప్పు కర్మలకు, లోక శ్రేయమగు కర్మలకు- వ్యతిరేకమగు కర్మల పట్ల, దుష్ట-దుర్మార్గ-కుత్సిత కర్మలపట్ల - **"చేయకూడదు కదా!"** అను అనుసరణమే 'లజ్జ' (లేక) 'హ్రీ'గా చెప్పబడుచున్నది.

---

**(viii) మతి :** వైదికేషు చ సర్వేషు
శ్రద్ధాయా సా "మతిః" భవేత్॥

**(ix) జపము :** గురుణా చ ఉపదిష్టో అపి
తత్ర సంబంధ వర్జితః
వేద ఉక్తేన ఏవ మార్గేణ
మంత్ర అభ్యాసో "జపః" స్మృతః॥
కల్ప సూత్రే, తథా వేదే,
ధర్మ శాస్త్రే పురాణకే,
ఇతిహాసే చ వృత్తిః యా
స జపః ప్రోచ్యతే మయా॥

**(viii) మతి :** వైదికములైన ఆచార, వ్యవహారములపట్ల, ఉపాసనా, అభ్యాసముల పట్ల శ్రద్ధ కలిగి ఉండటమే 'మతి' అగుచున్నది. ఏది ఎట్లా ఎందుకు , ఎంతవరకు ఎప్పుడు ఏ తీరుగా చేయాలో, గ్రహించాలో, త్యజించాలో అది ఎరిగి ఉండటమే 'మతి'.

**(ix) జపము**-వేదోక్తముగా అయి ఉన్నట్టిదిగాని, గురువుచే ఉపదేశించ బడినది గాని-అయిన మార్గములో **'మంత్రము'** యొక్క అభ్యాసమే జపము. (మనుస్మృతి, పారాశర్య స్మృతి మొదలైన) కల్పసూత్రములపట్ల, పురాణ ప్రవచన విశేషముల గురించి, ఇతిహాసముల గురించి- వేదోక్తంగా "పఠించాలి, అధ్యయనము చేయాలి" అనురూపముగల ముముక్షువు యొక్క వృత్తియే ఆధ్యాత్మికమైన 'జపము' - అగుచున్నది.

---

జపస్తు ద్వి విధః ప్రోక్తో :–
"వాచకో" "మానసః" తథా॥
వాచికా ఉపాంశుః ఉచ్చైః –:
ద్వివిధః పరికీర్తితః। మానసో మనన
ధ్యానభేదాత్ ద్వైవిధ్యం ఆశ్రితః
ఉచ్చైః జపాత్ ఉపాంశుశ్చ సహస్ర గుణ ఉచ్యతే॥

**(x) వ్రతము, జపము, శ్రద్ధాభక్తులతో చేయు నియమము → "వ్రతము":**-జపము రెండు విధములైనవి. (1) వాచకము (2) మానసికము

**వాచక జపము** (రెండు విధములు) 1. రహస్యముగా చేయు జపము (Closely within), 2. ఉచ్ఛ స్వరముతో ఎలుగెత్తి పలకటము. (Loudly, Spenly)

**మానస జపము** - రెండు రీతులు. (1) మననము (2) ధ్యానము

పదిమందికి తెలిసేటట్లుగా, గట్టిగా ఎలుగెత్తి చేయు జపము కంటే కూడా 'రహస్యము'గా చేయు జపము వేయిరెట్లు అధికమైనది.

---

మానసశ్చ తథా ఉపాంశో
సహస్రగుణ ఉచ్యతే।
ఉచ్చైః జపశ్చ సర్వేషాం
యథోక్త ఫలదో భవేత్।

రహస్య జపము కంటే కూడా మానసిక జపము ఇంకా వెయ్యిరెట్లు ఉత్తమము. కొంతమంది కలిసి ఎలుగెత్తి (భజనగా) చేయునది ఉత్తమోత్తమము. (గురువు వద్ద శిష్యులు నేర్చుకొనుచున్నప్పుడు) పెద్దగా పలుకుతూ చెప్పుకున్న మంత్రము యథోక్తమైన (చెప్పబడిన ఉత్తమ) ఫలము ప్రసాదించగలదు.

---

నీచైః శ్రోత్రేణ చేత్
మంత్రః శ్రుతశ్చేత్
నిష్ఫలం, భవేత్। ఇతి॥

సరిగ్గా వినకుండా, దైనందికము (కాలనియమము - Regularity) పాటించకుండా చేయు మంత్రము నిష్ఫలము కాగలదు. చిన్నగా విని -చిన్నగా (poorly attentive) నేర్చుకొను మంత్రము నిష్ఫలము కాగలదు. ఉత్తమ ప్రయోజనము లభించదు.

| తృతీయ ఖండము | తృతీయ ఖండము |
|---|---|
| 1 స్వస్తికం గోముఖం పద్మం వీరం సింహాసనం తథా। భద్రం ముక్తాసనం చ ఏవ, మయూరాసనం ఏవ చ, సుఖాసన సమాఖ్యం చ నవమం, ముని పుంగవ। | **ఆసనము**<br>ఓ సాంకృతి మునిపుంగవా! ఇప్పటివరకు మనము యమము, నియమముల గురించి చెప్పుకున్నాము. ఇప్పుడిక "ఆసనము" గురించి వివరించుకుందాము. ముఖ్యముగా '9' ఆసనములు (1) స్వస్తిక, (2) గోముఖ, (3) పద్మ, (4) వీర, (5) సింహ, (6) భద్ర, (7) ముక్త, (8) మయూర, (9) సుఖ.. |
| 1. స్వస్తికాసనము :<br>జాను ఊర్వోః అంతరే కృత్వా సమ్యక్ పాదతలే ఉభే, సమగ్రీవ శిరః కాయః "స్వస్తికం" నిత్యం అభ్యసేత్। | **(1) స్వస్తికాసనము** : రెండు మోకాళ్ళను మడచి పాదముల చివరలను పిక్కలను తొడల మధ్యగా ఆనించి ఉంచి, రెండు పాదముల చివరలను సమస్థితిలో ఉంచి కంఠమును శిరస్సును నిఠారుగా ధారణ చేయటము- ''స్వస్తికము''.ఈ స్వస్తికాసనమును యోగాభ్యాసి నిత్యము అభ్యసించవచ్చును. |
| 2. గోముఖాసనము :<br>సవ్యే దక్షిణ గుల్ఫంతు పృష్ఠ పార్శ్వే నియోజయేత్, దక్షిణే అపి తథా సవ్యం "గోముఖం" తత్ ప్రచక్షతే। | **(2) గోముఖాసనము** : ఎడమవైపు పృష్ఠ పార్శ్వమునకు కుడి చీలమండలమును, కుడివైపు పృష్ఠ పార్శ్వమును ఎడమ చీలిమండలమును తాకిస్తూ ధారణ చేయటము - ఇది గోముఖాసనము. |
| 3. పద్మాసనము :<br>అంగుష్ఠ అవధి గృహ్ణీయాత్ హస్తా భ్యాం వ్యుత్క్రమేణ తు, ఊర్వోః ఉపరి, విప్రేంద్ర! కృత్వా పాదతలద్వయమ్, "పద్మాసనం" భవేత్, ప్రాజ్ఞ! సర్వరోగ భయాపహమ్॥ | **(3) పద్మాసనము** : ఓ ప్రాజ్ఞా! రెండు తొడలపై రెండు పాదములను ఇటు అటుగా ఉత్క్రమణముగా (పైకి లేపి) ఉంచి రెండు కాళ్ళ బొటనవ్రేళ్ళను రెండు చేతులతో పట్టుకొని ఉండటము. ఇది పద్మాసనము. ఈ పద్మాసనము సర్వ రోగ భయములను తొలగించివేయగలదు. |
| (4) వీరాసనము :<br>దక్షిణేతర పాదం తు దక్షిణ ఊరుణి విన్యసేత్, ఋజుకాయః సమాసీనో "వీరాసనమ్" ఉదాహృతమ్, | **(4) వీరాసనము** : ఎడమ పాదము (దక్షిణేతర పాదము)ను (చీలి మండలమును) కుడి తొడపై (దక్షిణోరుణి) పై ఉంచి, శరీరమును కొంచెము వంచి ధారణ చేయుటము - వీరాసనము. |
| (5)సింహాసనము :<br>పార్శ్వ పాదౌ చ పాణిభ్యాం దృఢం బధ్వా సునిశ్చలమ్, (సింహాసనం?) భవేత్ ఏతత్ విషరోగ వినాశనమ్॥ | **(5) సింహాసనము** : రెండు పాదముల పార్శ్వములను (Both side ends) రెండు చేతులతో దృఢముగా పట్టుకొని నిశ్చలముగా ఉండటము - (సింహాసనము?). ఇది విషరోగములను బాగుగా నశింపజేయగలదు. |
| (6) భద్రాసనము :<br>నిపీడ్య సీవనీం సూక్ష్మాం దక్షిణ ఇతర గుల్ఫతః, వామం యామ్యేన గుల్ఫేన ("భద్రాసనామ్"?) ఇదం భవేత్॥<br>(7) ముక్తాసనము :<br>మేఢ్రాత్ ఉపరి నిక్షిప్య సవ్యం గుల్ఫం తత ఉపరి, గుల్ఫాంతరం చ సంక్షిప్య "ముక్తాసనం" ఇదం, మునే!, | **(6) భద్రాసనము** : కుడి, చీల మండలముతో ఎడమ సీవనీ ప్రదేశమును, ఎడమ చీలి మండలముతో కుడి సీవనీ ప్రదేశమును తాకించటమే ('భద్రాసనము'?).<br>**ముక్తాసనము** : ఎడమ గుల్ఫము (మడమ)ను మేఢ్ర (గుదస్థానము) పై తాకి ఉంచి, రెండవ మడమను ముడిచి ఉంచటము. |
| (8) మయూరాసనము :<br>కూర్పరాగ్రే మునిశ్రేష్ఠ! నిక్షిపేత్ నాభి పార్శ్వయోః, భూమ్యాం పాణితలద్వంద్వం నిక్షిప్య ఏకాగ్ర మానసః, సమున్నత శిరః పాదో దండవత్ వ్యోమ్ని సంస్థితః "మయూర" ఆసనం ఏతత్స్యాత్ సర్వ పాప ప్రణాశనమ్। | **మయూరాసనము** : ఓ మునిశ్రేష్ఠా!<br>- బొడ్డుకు (నాభికి) ప్రక్కలుగా మోచేతి చివర్లను ఆనించి,<br>- భూమిపై రెండు అరచేతులను ఆనించి,<br>- పాదములు, శిరస్సు ఎత్తిపట్టి ఉంచి,<br>- మనస్సు ఏకాగ్రం చేసి, (ఆజ్ఞాచక్రముతో) ధారణ చేయుచుండటము 'మయూరాసనము'.<br>ఈ మయూరాసనము సర్వపాపములను ప్రశమింపజేయగలదు. |
| (9) సుఖాసనము :<br>యేన కేన ప్రకారేణ సుఖం ధైర్యం చ జాయతే, తత్ "సుఖాసనం" ఇతి ఉక్తమ శక్తః తత్ సమాశ్రయేత్। | సుఖాసనము : ఏదో ఒక రీతిలో సుఖాసనము. ఏవిధంగా అయితే ధైర్యము - ఉత్సాహము కలుగుతాయో, ఓపిక కొనసాగుతుందో, అట్టి దేహానుకూలమైన ఆసనము (పద్మ - మయూర ఇత్యాది ఆసనము)లను శ్రమము సుఖాసనము. అద్దానిని సమాశ్రయించవచ్చు. శరీరమునకు దీర్ఘకాలము ధారణ చేయటానికి సానుకూల్యమైనదే - 'సుఖాసనము'. |

ఆసనం విజితం యేన,
జితం తేన జగత్రయమ్॥
అనేన విధినా యుక్తః
ప్రాణాయామం సదా కుర్వితి॥

'స్వాభావికంగా సుదీర్ఘకాలము ఆసనము ధరించి ధ్యానించటము సుఖప్రదమనిపించటమే ఆసన జయము. ఆసన జయముచే త్రిజగత్తులు జయించినట్లే. సానుకూలమగు ఆసనము ధరించి ప్రాణాయామము నిర్వర్తించాలి. (ఆసన వివరములు 'త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్'లో కూడా చెప్పబడ్డాయి).

## చతుర్థ ఖండము

1. శరీరం తావత్ ఏవస్యాత్ షణ్ణవత్ (96")
అంగులాత్మకమ్। దేహ మధ్యే
శిఖి స్థానం తప్త జంబూనద ప్రభమ్।
త్రికోణం మనుజానాం తు సత్యం ఉక్తం హి, సాంకృతే!
గుదాత్తు ద్వ(య) (2) అంగులాత్ ఊర్ధ్వం -
మేఢ్రాత్తు ద్వి (య) (2) అంగులాత్ అథః,
దేహమధ్యం విజానీ హి మనుష్యాణాం హి, సాంకృతే!

## చతుర్థ ఖండము

ఓ సాంకృతి మహాశయా!

ఈ భౌతిక శరీరము '96' అంగుళముల ప్రమాణము. అట్టి ఈ దేహము మధ్యగా సర్వదేహములలో 'శిఖిస్థానము' (Central Zone). ఇది జంబూఫలము (నేరేడుపండు) రంగులో ప్రకాశమానమై ఉంటుంది. మానవులలో అది త్రికోణ ఆకారంలో ఉంటుంది. (అంగులము = బొటనవ్రేలు కణుపు నుండి పైవరకు-అనికూడా అర్థము).

గుదస్థానమునకు 2 అంగుళములు పై వైపుగాను, మేఢ్రమునకు (పొత్తికడుపుకు) 2 అంగుళముల క్రిందుగాను దేహమధ్యగా మానవులలో ఈ శిఖిస్థానము ఉంటుంది.

---

కంద స్థానం, మునిశ్రేష్ఠ! మూలాధారం
నవ (9) అంగులమ్, చతుః (4) అంగులం, ఆయామ
విస్తారం, మునిపుంగవ!, కుక్కుట
అండవత్ ఆకారం భూషితం తు
త్వక్ ఆదిభిః తత్ మధ్యే 'నాభిః'
ఇతి ఉక్తం యోగజ్ఞైః, మునిపుంగవ!
కంద మధ్య స్థితా నాడీ "సుషుమ్న"
ఇతి ప్రకీర్తితా, - తిష్ఠంతి పరితః తస్య
నాడయో, మునిపుంగవ!

ఓ మునిశ్రేష్ఠా! ఇంకా వినండి.

మూలాధారము నుండి కందస్థానము + 9 అంగుళముల పొడవు, 4 అంగుళముల వెడల్పుగా ఏర్పడి ఉంటుంది. ఇది చర్మము మొదలైన వాటితో కప్పబడిన కోడి గ్రుడ్డువలె ఉంటుంది. (కందము = ఆవు మూపురమువలె ఉంటుంది కనుక - ఈ పేరు)

- దాని మధ్యలో నాభిస్థానము

ఓ ముని పుంగవా!

కందమునకు మధ్య (central point) నుండి 'సుషుమ్న' అని ప్రకీర్తించబడు నాడి బయల్వెడలుచున్నది. శరీరములోని అన్ని నాడులకు ఇది ముఖ్యము - శ్రేష్ఠము అయినట్టి నాడి.

---

ద్విసప్తతి సహస్రాణి 72000। - తాసాం ముఖ్యాః చతుర్దశ (14)
సుషుమ్నా పింగళా తద్వత్
ఇడా చైవ సరస్వతీ, పూషాచ వరుణా చ ఏవ,
హస్తిజిహ్వా, యశస్వినీ, ఆలంబుసా
కుహూః చ ఏవ విశ్వోదరీ తపస్వినీ,
శంఖినీ చ ఏవ గాన్ధారా ఇతి ముఖ్యాః చతుర్దశ (14) ॥

కందము నుండి బయల్వెడలుచున్న 72000 నాడులలో 14 నాడులు అతి ముఖ్యమైనవి.

1. సుషుమ్న, 2. పింగళ, 3. ఇడ, 4. సరస్వతి, 5. పూష, 6. వరుణ, 7. హస్తిజిహ్వ, 8. యశస్విని, 9. అలంబుస, 10. కుహు, 11. విశ్వోదరి, 12. తపస్విని, 13. శంఖిని, 14. గాంధార (గాంధారి).

---

అసాం ముఖ్యతమాః తిస్రః(3)।
తిసృషు ఏకః (1) ఉత్తమోత్తమా। "బ్రహ్మనాడి"
ఇతి సా ప్రోక్తా మునే! వేదాంతవేదిభిః॥

ఈ 14 నాడులలో అతి ముఖ్యమైనవి మూడు.

(1) సుషుమ్న, (2) ఇడ, (3) పింగళ. ఈ మూడింటిలో అత్యంత ప్రాముఖ్యమైనది - సుషుమ్ననాడి. ఇది శిరస్సుపైగల బ్రహ్మరంధ్రమువరకు విస్తరించి ఉండటంచేత "బ్రహ్మనాడి" అని వేదాంతవేత్తలచే పిలువబడుతోంది.

---

పృష్ఠ మధ్య స్థితేన అస్థ్నా
వీణా దండేన, సువ్రత!
సహ మస్తక పర్యంతం - సుషుమ్నా సంప్రతిష్ఠితా।

ఓ సువ్రతా!

ఈ సుషుమ్ననాడి - పృష్ఠ మధ్యగా (వీపు మధ్యగా) వెన్నెముక వెంట వీణా దండము వలె ఉంటోంది.

మస్తకము (Foreface) వరకు సుషుమ్ననాడి ఆక్రమించుకొనినదై ఉన్నది.

**నాభికందాత్ అధః స్థానం**
**కుండల్యాత్ ద్వి (ద్వయ) (2) అంగులం మునే!**
**<u>"అష్టప్రకృతి"</u> రూపా సా <u>కుండలీ</u> మునిసత్తమ!**

ఓ మునిసత్తమా!

నాభికందమునకు క్రింద స్థానములో చెవికుండలీఆకారంగా 2 అంగుళముల విస్తీర్ణముగా అష్టవిధప్రకృతి (సూక్ష్మపంచ భూత-మనో-బుద్ధి-చిత్తములు) రూపంగా ఒక మహత్తర శక్తి స్థానము కలిగి యున్నది. అదియే 'కుండలినీ శక్తి'.

---

**2. యథావత్ వాయు చేష్టాం చ**
**జల–అన్నాదీని నిత్యశః**
**పరితః కంద పార్శ్వేషు నిరుధ్య ఏవ సదా స్థితా॥**
**స్వముఖేన సమావేష్ట్య బ్రహ్మరంధ్ర ముఖం, మునే!**
**సుషుమ్నాయా <u>ఇడా</u> సవ్యే।**
**దక్షిణే <u>పింగళా</u> స్థితా॥**

కందమునకు ప్రక్కగా (పార్శ్వంగా) వాయుచేష్టలు, జల-అన్నములు మొదలైనవి ఏర్పడి ఉండి, కందముయొక్క అన్నివైపులా నిరోధించి (కప్పుకొని) ఉంటున్నాయి.

ఓ మునీ! సుషుమ్ననాడి తనయొక్క ముఖముతో శిరస్సుయొక్క ఊర్ధ్వ ప్రదేశంలో గల బ్రహ్మరంధ్ర ముఖమును చుట్టి కప్పి ఉంటోంది.

సుషుమ్నకు ఎడమవైపుగా ఇడనాడి, కుడివైపుగా పింగళనాడి ఉండి ఉంటున్నాయి.

---

**సరస్వతీ కుహూశ్చ ఏవ సుషుమ్నా**
**పార్శ్వయోః స్థితే। <u>గాంధారే హస్తిజిహ్వే చ</u>**
**ఇడాయాః పృష్ఠ పూర్వయోః।**

సరస్వతీ నాడి, కహూనాడి సుషుమ్ననాడికి ఇరుప్రక్కలగా ఉంటున్నాయి.

గాంధారి, హస్తిజిహ్వ - అని పిలువబడుచున్ననాడులు ఇడానాడికి ముందు, వెనుకగా ఏర్పడినవై ఉన్నాయి.

---

**పూషా యశస్వినీచైవ పింగళా పృష్ఠ పూర్వయోః।**
**కుహోశ్చ హస్తిజిహ్వాయా**
**మధ్యే విశ్వోదరీ స్థితా। యశస్విన్యాః**
**కుహోః మధ్యే <u>వరుణా</u> సుప్రతిష్ఠితా॥**
**పూషాయాశ్చ – సరస్వత్యా మధ్యే**
**ప్రోక్తా <u>యశస్వినీ।</u> గాంధారాయాః సరస్వత్యా**
**మధ్యే ప్రోక్తా చ శంఖినీ। <u>అలంబుసా</u> స్థితా**
**పాయు పర్యంతం కంద మధ్యగా॥**

పూష, యశశ్వినీ నాడులు పింగళకు ముందు - వెనుకలుగా ఉంటున్నాయి. కుహూనాడి, హస్తిజిహ్వ నాడులకుమధ్యగా విశ్వోదరీ నాడి ఉన్నది. యశశ్విని - కుహు నాడులకుమధ్యగా వరుణనాడి ప్రతిష్ఠితము అయి ఉన్నది.

పూష - సరస్వతి నాడుల మధ్య యశస్వినీ నాడి. గాంధారి - సరస్వతీ నాడుల మధ్య శంఖినీ నాడి. అలంబుసనాడి కందమునకు మధ్యగతమై పాయువు (మలమూత్రవిసర్జన స్థానము) వరకు విస్తరించి ఉన్నది.

---

**(కంద) పూర్వభాగే సుషుమ్నాయా రాకాయాః**
**సంస్థితా కుహూః। అధశ్చ–ఊర్ధ్వం**
**స్థితా నాడీ యామ్య నాసాంతం ఇష్యతే**
**ఇడా తు సవ్య నాసాంతం సంస్థితా, ముని పుంగవ!**
**యశస్వినీ చ వామస్య పాదఅంగుష్ఠాంతమ్ ఇష్యతే।**

కందభాగములో సుషుమ్న తాకుచూ కుహునాడి ఉన్నది. ఈ కుహునాడి పైపైన కుడి ముక్కుపుటం చిట్టచివరి వరకు విస్తారితమై యున్నది.

ఇడనాడి ముక్కు చివరి ఎడమ ముక్కు పుట చివరి వరకు విస్తరించినదై ఉన్నది. యశస్వినీనాడి ఎడమకాలు బొటనవేలు (వామస్య పాదాంగుష్ఠాంతమ్) విస్తరించి ఉన్నది.

---

**పూషా వామాక్షి పర్యంతా, పింగళాయాస్తు పృష్ఠతః।**
**పయస్వినీ చ యామ్యస్య కర్ణాంతం**
**ప్రోచ్యతే బుధైః। సరస్వతీ తథా చ**
**ఊర్ధ్వగా జిహ్వాంతం (సం) స్థితా, మునే!**

పూషానాడి - పింగళకువెనుకగా - ఎడమకంటి చిట్ట చివరి వరకు ఏర్పడి ఉన్నది. పయస్వినీనాడి (ఎడమ) చెవియొక్క చివరివరకు వ్యాపించి ఉన్నదని యోగవేత్తల గమనిక.

సరస్వతీనాడి ఊర్ధ్వంగా నాలుక చివ్వరి వరకు విస్తరించి ఉన్నది.

---

**హస్తిజిహ్వా తథా సవ్య పాదాంగుష్ఠాంతమ్ ఇష్యతే।**
**శంఖినీ నామ యా నాడీ సవ్య కర్ణాంతమ్ ఇష్యతే।**
**గాంధారా సవ్య నేత్రాంతా ప్రోక్తా, వేదాంత**
**వేదిభిః। విశ్వోదరాభిదా నాడీ**
**కందమధ్యే వ్యవస్థితా॥**

హస్తజిహ్వ సవ్య (కుడి) పాదపు బొటన వ్రేలు వరకు విస్తరించి ఉన్నది. శంఖినీ నాడి కుడి చెవి చివ్వరివరకు స్థానము కలిగి యున్నది.

గాంధారీనాడి ఎడమ కన్ను కొలకుల వరకు ఉన్నదని వేదజ్ఞుల సందర్శనానుభవము. విశ్వోధరనాడి కందప్రదేశము మధ్యగా వ్యవస్థితమై ఉన్నది.

3. <u>ప్రాణో-అపానః తథా వ్యానః సమాన ఉదాన ఏవ చ,</u>
నాగః కూర్మ కృకరో దేవదత్తో ధనంజయః, -
ఏతే నాడీషు సర్వాసు చరంతి దశ వాయవః।
తేషు "ప్రాణ" ఆదయః పంచ ముఖ్యాః పంచసు, సువ్రత!

ఓ సువ్రతా! మునీశ్వరా!
<u>పంచప్రాణములు</u> = ప్రాణ-అపాన వ్యాన - సమాన - ఉదానములు.
<u>పంచ ఉపప్రాణములు</u> = నాగ - కూర్మ - కృకర - దేవదత్త - ధనంజయ
ఈ పది వాయుచలనములు నాడులన్నిటిలో చరిస్తూ ఉంటున్నాయి. వీటిలో ముఖ్యమైనవి (పైన చెప్పిన) మొదటి పంచప్రాణములు

---

ప్రాణ సంజ్ఞః, తథా ఆపానః పూజ్యః,
"ప్రాణః" తయోః మునే! ఆస్య నాసికయోః
మధ్యే నాభి మధ్యే తథా హృది -
ప్రాణసంజ్ఞో అనిలో నిత్యం వర్తతే, మునిసత్తమ!
అపానో వర్తతే నిత్యం -
గుద మేఢ్ర ఊరు జానుషు।
ఉదరే సకలే కట్యాం
నాభౌ జంఘే చ, సువ్రత! వ్యానః
శ్రోత్ర - అక్షి మధ్యే చ కుకుద్భ్యాం గుల్ఫయోః అపి॥

అట్టి పంచ ప్రాణములలో
(1) ప్రాణ, (2) అపానములు అత్యంత పూజ్యములు. యోగాభ్యాసమునకు ముఖ్య పరికరములు.
'ప్రాణము' మరికొంత ఆత్యంతికంగా పూజ్యము. అట్టి ప్రాణవాయువు నాశికామధ్య (ముక్కుకు మధ్య)గాను, హృదయమధ్యగాను ఎల్లప్పుడు సంచరించుచూ ఉన్నది.
అపానవాయువు → గుదము, మేఢ్రము (పొత్తికడుపు), తొడలు, జానువులు (మోకాళ్ళు) యందు సంచారము కలిగి ఉంటోంది.
వ్యానము : దేహమంతా సంచారము చేస్తోంది. పొట్టయందు, కటి ప్రదేశమునందు, నాభి (బొడ్డు)యందు, జంఘముల (పిక్కల)యందు, చెవులలోను కళ్ళలోను, మూపులయందు చీలమండలమునందు అంతటా సంచారము కలిగియున్నది.

---

ప్రాణస్థానే గళే చ ఏవ వర్తతే, మునిపుంగవ!
ఉదాన సంజ్ఞో విజ్ఞేయః పాదయోః హస్తయోః అపి॥
సమానః సర్వ దేహేషు వ్యాప్య తిష్ఠతి అసంశయః।
నాగాది వాయవః పంచ త్వక్ అస్థి-ఆదిషు సంస్థితాః॥
నిశ్వాస ఉచ్ఛ్వాసక ఆసాశ్చ ప్రాణకర్మ హి, సాంకృతే।
"అపాన" ఆఖ్యస్య వాయోస్తు విణ్మూత్రాది విసర్జనమ్॥

**ఉదానప్రాణము** - కంఠము నందు, పాదములయందు, చేతులయందు ముఖ్య సంచారస్థానములు కలిగియున్నది.
**సమానపానము** - దేహమంతటా వ్యాపించి సంస్థితమైయున్నది.
నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము - అను పంచ ఉపప్రాణవాయువులు చర్మము, బొమికలు మొదలైనచోట్ల సంచార ప్రదేశముగా కలిగి ఉంటున్నాయి.
ఓ సాంకృతి మునీంద్రా! వాటి వాటి ధర్మముల గురించి వినండి.
**ప్రాణవాయు ధర్మములు** : ఉచ్ఛ్వాస - నిశ్వాస (ఊరి పీల్చుట - వదలుట)
**అపానవాయువు నిర్వర్తించు ధర్మములు** : మలమూత్ర విసర్జన కర్మలు.

---

<u>'సమానః'</u> సర్వ సామీప్యం కరోతి ముని పుంగవ!
ఉదాన ఊర్ధ్వ గమనం కరోతి ఏవ। న సంశయః॥
వ్యానో వివాదకృత్ ప్రోక్తో మునే! - వేదాంత వేదిభిః।
ఉద్గారాది గుణః ప్రోక్తో, నాగాఖ్యస్య మహామునే!
ధనంజయస్య శోభాది కర్మ ప్రోక్తం హి,
సాంకృతే! 'నిమీలన' ఆది కూర్మస్య
క్షుథా తు కృకరస్య చ॥
దేవదత్తస్య, విప్రేంద్ర! తంద్రీ కర్మ ప్రకీర్తితమ్॥

ఓ మునిపుంగవా!
**సమానవాయువు** : శరీరములోని వివిధ భాగములను వాటివాటి ధర్మములను ఒకదానికి మరొకటి సమీప్యము, పరస్పర సంబంధితము చేస్తున్నది.
**ఉదానము** : ప్రాణవాయువుల ఊర్ధ్వగమనములను నిర్వర్తించుచున్నది.
**వ్యానవాయువు** : శరీరభాగములను, వాటి వాటి ధర్మములను విడివిడిగా ఉంచుచున్నది. ఒకదానికి మరొకటి అవిరోధముగా సమవర్తింపజేస్తోంది.
**నాగము** : అవసరములు లేని / అవసరము తీరిన వాయువులను, పదార్థములను బయటకు త్రోయుచున్నది.
**ధనంజయ ఉపప్రాణము** : శరీరమును ఉత్తేతిజముగాను, శోభాయమానముగాను ఉంచుచున్నది.
**కూర్మము** : కనులు మూయుటకు, తెరచుటకు కారణమగుచున్నది.
**కృకరము** : ఆకలి - దప్పికల వ్యవహారము నిర్వర్తిస్తోంది.
ఓ విప్రేంద్రా!
**దేవదత్తము** : తంద్రీ (అలసట, కునికిపాట్లు) ధర్మమును ఇంద్రియముల విశ్రాంతిని పర్యవేక్షిస్తోంది.

**సుషుమ్నాయాః శివో దేవ। ఇడాయా దేవతా**
**హరిః। పింగళాయా విరించిః స్యాత్। సరస్వత్యా**
**విరాట్, మునే। పూషా "ధీః" దేవతా ప్రోక్తా।**
**వరుణా వాయుదేవతా। హస్తిజిహ్వా అభిదాయాస్తు**
**వరుణో దేవతా భవేత్॥**
**యశస్విన్యా మునిశ్రేష్ఠ! భగవాన్ భాస్కరః తథా**
**అలంబుసా యా అంబాత్మా వరుణః పరికీర్తితః॥**
**కుహోః క్షుత్ దేవతా ప్రోక్తా। గాంధారీ చంద్ర**
**దేవతా। శంఖిన్యాః చంద్రమాః తత్‌వత్**
**పయస్విన్యాః ప్రజాపతిః॥**
**విశ్వోదర అభిధాయ అస్తు భగవాన్**
**పావకః పతిః। ఇడాయాం చంద్రమా**
**నిత్యం చరతి ఏవ, మహామునే!**

| **నాడి** | | **అధి దేవత** |
|---|---|---|
| సుషుమ్ననాడికికి | - | శివుడు |
| ఇడనాడికి | - | హరి |
| పింగళనాడికి | - | బ్రహ్మదేవుడు |
| సరస్వతినాడికి | - | విరాట్టు |
| పూషనాడికి | - | బుద్ధిదేవత (బృహస్పతి) |
| వరుణనాడికి | - | వాయుదేవుడు |
| యశస్వినీనాడికి | - | భగవానుడగు భాస్కరుడు |

ఆలంబుసకి-జగజ్జనని అగు 'అంబ' అంబాత్మయగు వరుణుడు.

| | | |
|---|---|---|
| కుహూనాడికి | - | క్షుత్‌దేవత (వైశ్వానరుడు) |
| గాంధారీనాడికి | - | చంద్రుడు |
| ప్రయస్వినీనాడికి | - | ప్రజాపతి |

ఇంకా కూడా....
విశ్వోదరికి - పావకుడు - (అగ్నిదేవుడు)
ఇడనాడికి - చంద్రుడు / చంద్రమసదేవత

ఈ విధంగా ఆయానాడులలో వ్యక్తీకరణమగుచున్న దివ్యప్రజ్ఞలగు దేవతామూర్తులుగా యోగాభ్యాస సందర్భంగా ఉపాసించబడుచున్నారు. ఆయా దివ్యతత్త్వములకు ఈ విధంగా యోగవేత్తలు గుర్తించి ఉపాసనను సూచిస్తున్నారు.

---

**పింగళాయాం రవిః తద్వత్, మునే!**
**వేదవిదాంవర! పింగళాయా ఇడాయాం తు**
**వాయోః సంక్రమణం తు యత్,**
**తత్ "ఉత్తరాయణం" ప్రోక్తం, మునే!**
**వేదాంత వేదిభిః॥**

మునీ! వేదవిదాంవర!

పింగళయందు రవి (సూర్యుడు) ఎల్లప్పుడు సంచారము చేస్తూ ఉంటారు. (సూర్యుడు = ప్రజ్ఞ / చైతన్యస్ఫూర్తి)

**ఉత్తరాయణము** : 'పింగళ' నుండి 'ఇడ'కు వాయు సంక్రమణము - 'ఉత్తరాయణము' అని అనబడుతోంది.

---

**ఇడాయాః పింగళా**
**యాంతు ప్రాణ సంక్రమణం, మునే!**
**"దక్షిణాయనం" ఇతి ఉక్తం పింగళాయాం ఇతి శ్రుతిః॥**

**దక్షిణాయనము** : ఇడ నుండి పింగళకు ప్రాణ సంక్రమణము "దక్షిణాయనము" అని వేదజ్ఞుల చేతను, శ్రుతుల చేతను చెప్పబడుతోంది.

**(సంక్రమణము** = వాయువు ఒకచోట "రేచకము" అయి, రెండవచోట "పూరకము" అవటము)

---

4 **ఇడా పింగళయోః సంధిం యదా**
**ప్రాణః సమాగతః, "అమావాస్యా" తదా**
**ప్రోక్తా దేహే। దేహభృతాంవర!**

**అమావాస్య** : దేహభృత పండితులలో శ్రేష్ఠుడా!

ప్రాణశక్తి ఇడ-పింగళల మధ్యగల 'సంధి' ప్రదేశములలో సమాగతమైనప్పుడు-అది "అమావాస్య" అనబడుచున్నది. అట్టి సందర్భములలో ఇడ - పింగళములలో వాయువు శోచనము (vacation) జరుగుతోంది.

---

**మూలాధారం యదా ప్రాణః ప్రవిష్టః,**
**పండితోత్తమ! తత్ "ఆద్యం విషువమ్"**
**ప్రోక్తం తాపసైః! తాపసోత్తమ!**

**ఆదివిషువము** : ఓ తాపసోత్తమా!

ప్రాణశక్తి మూలాధారములో ప్రవేశించినప్పుడు అది "ఆదివిషువము" అని పండితోత్తములచే పిలువబడుతోంది. (విషువము=సంధ్యా సమయము. చీకటి-వెలుతురు రహితమగు స్థానము)

---

**ప్రాణ సంజ్ఞో, మునిశ్రేష్ఠ! మూర్ధానం**
**ప్రావిశత్ యదా, తత్ "అంత్యం విషువం"**
**ప్రోక్తం తాపసైః, తత్త్వ చింతకైః॥**

**అంత్యవిషువము** : ప్రాణశక్తి మూర్ధము (foreface)లో ప్రవేశించినప్పుడు అది "అంత్యవిషువము" అని యోగశాస్త్రకోవిదులు అంటున్నారు.

(ఇడ, పింగళనాడులు రేచకము (Airlessness) పొందగా, మూర్ధములో కుంభకము (Airful) జరుగు సందర్భము).

నిశ్వాస ఉచ్ఛ్వాసనం సర్వం మాసానాం
సంక్రమో (సంక్రమణో) భవేత్। ఇడాయా కుండలీస్థానం
యదా ప్రాణః సమాగతః,
"సోమగ్రహణం" ఇతి ఉక్తం తదా, తత్త్వవిదాం వర!

ఉచ్ఛ్వాస - నిచ్ఛ్వాసులు ఈ దేహములోని మాస సంక్రమణములు.
ఓ తత్త్వావిదాంవరా!
ఇడ నుండి ప్రాణశక్తి కుండలినీ శక్తిని సమీపించటము, చేరటము "చంద్రగ్రహణము" అని తత్త్వవిదులచే అనబడుచున్నది.

---

యదా పింగళయా ప్రాణః కుండలి స్థానమ్
ఆగతః, తదా తదా భవేత్ "సూర్యగ్రహణం"
మునిపుంగవ!
'శ్రీ' పర్వతం శిరఃస్థానే। కేదారంతు లలాటకే।

ప్రాణము పింగళనాడి నుండి కుండలినిని చేరటము "సూర్యగ్రహణము".
శిరస్సు - శ్రీ పర్వతస్థానము. (హిమాలయము)
లలాటస్థానము - 'కేదారము'
అనబడు పుణ్యతీర్థము.

---

వారణాసీ, మహాప్రాజ్ఞ! భ్రువోః-ఘ్రాణస్య మధ్యమే।
కురుక్షేత్రం కుచస్థానే।
ప్రయాగం హృత్ సరోరుహే।।
చిదంబరం తు హృత్ మధ్యే। ఆధారే కమలాలయమ్!
ఆత్మతీర్థం సముత్సృజ్య
బహిః తీర్థానియో వ్రజేత్, -
"కరస్థం, స మహారత్నం త్యక్త్వా కాచం"
విమార్గ తే।।

హే మహాప్రాజ్ఞా! మహనీయులగు యోగవేత్తలు ఈ శరీరములోనే పుణ్య తీర్థములు సందర్శించి ఉపాసిస్తూ ఉంటున్నారు.
రెండుకనుబొమ్మల మధ్యగల భ్రూమధ్యస్థానమే వారణాసి.
కుచ స్థానము - కురుక్షేత్రము
హృదయపద్మము - ప్రయాగ
హృదయమధ్యయ్ - చిదంబరము.
ఆధారచక్రస్థానము - కమలాలయము
ఈ విధంగా ఈ దేహమే పుణ్యక్షేత్రములు ప్రత్యక్షమైయున్న స్థానము.
ఎవ్వడైతే 'ఈ శరీర' క్షేత్రము అను ఆత్మతీర్థమును వదలి బాహ్యమున దూరదూరంగా ఉన్న తీర్థ స్థలములను మాత్రమే ఆశ్రయిస్తాడో, అట్టివాడు చేతిలోని ఒకమహారత్నమును వదలి గాజుపూసలకై వెతకటంతో సమానము.

---

"భావతీర్థం పరం తీర్థం
ప్రమాణం సర్వ కర్మసు।।
అన్యథా ఆలింగ్యతే కాంతా,
అన్యథా ఆలింగ్యతే సుతా।

సమస్తము 'భావము' యొక్క ఔన్నత్యమే. భావనా చమత్కారమే అగు భావతీర్థమే పరమ (గొప్పదగు) తీర్థము. అదియే సర్వకర్మలపట్ల ప్రమాణము.
**ఇదంతా భావనాజగత్తే గాని భౌతికమాత్ర వస్తు జగత్తు కాదు. దృష్టాంతానికి - ఆలింగనము ఒకేతీరైనప్పటికీ, భార్యతో ఆలింగనము, కూతురుతో ఆలింగనము భావముచే వేరు వేరైనవికదా! 'భావించటము' అనునదే జగదనుభవము. మరింకొకటేదీ కాదు.**

---

తీర్థాని తోయ పూర్ణాని।
దేవాన్ కాష్ఠాది నిర్మితాన్।
యోగినో న ప్రపద్యంతే
స్వ-ఆత్మ ప్రత్యయ కారణాత్।।

ఆత్మతత్త్వము స్వానుభవమగుచుండగా అట్టి యోగికి - తీర్థములన్నీ ఒకే జలముతో నిండియున్నవిగా అనిపిస్తాయి.
-దేవతా విగ్రహములన్నీ కొయ్య విగ్రహమాత్రములుగాను, స్వాత్మయే (స్వశరీరమ్) సమస్త పుణ్యక్షేత్రములకు తీర్థములకు నిలయముగాను భావిస్తాడు. ఆత్మయే పరమాత్మ కదా! ప్రత్యగాత్మతో తృప్తి కలిగి ఉంటాడు. స్వాత్మయే జాగ్రత్ - స్వప్న - సుషుప్తుల సాక్షి అగు ప్రత్యగాత్మ।

---

5. బహిః తీర్థాత్ పరం తీర్థం అంతః
తీర్థం, మహామునే! ఆత్మతీర్థం మహా
తీర్థం। అన్యతీర్థం నిరర్థకమ్।।

ఓ మహామునీ! బాహ్యతీర్థములకన్నా (ఈ దేహముయొక్క) అంతర్ తీర్థములు పరము, మహత్తరము కూడా. బాహ్యతీర్థములన్నీ అంతర్-తీర్థప్రతీకలు। అంతరతీర్థములను పట్టించుకోకుండా బాహ్య తీర్థములకొరకై మాత్రమే పరుగులు తీయుటము నిరర్థకము.

---

చిత్తం అంతర్గతం దుష్టం తీర్థస్నానైః
న శుద్ధ్యతి। శతశో అపి జలైః, ధౌతం,
సురాభాండం ఇవ అశుచిః।

-ఆత్మ తీర్థము అనగా - (స్వశరీరములో ఆత్మస్థాన సందర్శనమే) సుమా! సురాభాండమును (కల్లు / సారా గల కుండను) బయట వందసార్లు కడిగితే మాత్రం అది శుచి అవుతుందా? (లోపని అశుచి పోతుందా?) లేదు. అట్లాగే శరీరముతో తీర్థ స్నానములు చేసినంతమాత్రం చేత కూడా చిత్తము అంతర్గతంగా శుద్ధికాదు. శరీరములోని తీర్థములలో యోగాభ్యాసపూర్వకంగా బుద్ధితో మనస్సును ఆత్మసందర్శన-ఆనంద జలధిలో స్నానం చేయించాలి.

| | |
|---|---|
| విషువాయన కాలేషు<br>గ్రహణే చ అంతరే సదా,<br>వారాణాసి – ఆదికే స్థానే స్నాత్వా శుద్ధో భవేత్ నరః (కిం?)। | (పైన చెప్పినట్లుగా ఈ స్వశరీరములో వేంచేసియున్న కాల-తీర్థములైనట్టి)<br>- విషువాయన కాలములలోను (ఉదయ-సాయంకాల సంధ్యా సమయములలో), గ్రహణ సమయంలోను, ఆయన (ఉత్తరాయణ, దక్షిణాయన) పుణ్యకాలములలో - స్నానము చేయుటంచేత ఈ మానవుడు ఆత్మశుద్ధుడు కాగలడు. |
| జ్ఞానయోగ పరాణాం తు<br>పాదప్రక్షాళితం జలమ్,<br>భావశుద్ధ్యర్థం అజ్ఞానాం<br>తత్ తీర్థం। మునిపుంగవ! | అయితే, వాస్తవానికి స్నానము చేయవలసిన అసలైన తీర్థము - ఆత్మయోగా పారాయణులున్న చోటే. వారి భావనా జలమే స్నానము చేయవలసిన జలము.<br>ఓ మునిపుంగవా! అజ్ఞానులకు ఆత్మజ్ఞానుల ఆత్మతత్త్వ ఉపదేశవాక్యములే కాళ్ళు కడిగే నీళ్ళు. భావశుద్ధియే పరిశుద్ధత. అందుచేత ఆత్మ జ్ఞానులే తీర్థస్థానములు. వారిజ్ఞానవైభవ - వాక్యములే బుద్ధిని పరిశుభ్రపరచు జలముగా గ్రహించండి। |
| తీర్థే, దానే, జపే, యజ్ఞే, కాష్ఠే, పాషాణకే సదా,<br>శివం పశ్యతి మూఢాత్మా!<br>శివే దేహే ప్రతిష్ఠితే॥ | ఓ మునిశ్రేష్ఠా! సర్వాత్మకుడగు శివుడు సర్వదా ఈ దేహమునందే సుప్రతిష్ఠితుడై ఉండగా, అది గమనించకుండా బాహ్యమున తీర్థ - దాన-జప - యజ్ఞ - కాష్ఠ-పాషాణ-దైవప్రతిమలను మాత్రమే ఆశ్రయించువాడు తెలివి తక్కువవాడే! అట్టివాడు మూఢాత్ముడే అగుచున్నాడు. |
| అంతస్థం మాం పరిత్యజ్య బహిష్ఠం యస్తు సేవతే,<br>హస్త స్థం పిండం ఉత్సృజ్య లిహేత్ కూర్పరం ఆత్మనః॥<br>(కూర్పరము = మోచేయి, మోకాలు<br>లిహేత్ = నాకటము) | సర్వదా హృదయాంతస్థుడై 'కేవలాత్మాహమ్' (Absolute-I) రూపమున ఉన్న శివ భగవానుని గుర్తించక, బాహ్యమున తీర్థములు మొదలైనవి సేవించువాడు - చేతిలోని మధురమగు రసాన్నమును వదలి, చెమటపట్టిన తన మోచేతి వెంట కొంచెముగా కారే చుక్కలను నాకటంతో సమానం. |
| శివం ఆత్మని పశ్యంతి<br>ప్రతిమాసు న యోగినః।<br>అజ్ఞానాం భావన అర్థాయ (భావనార్థాయ)<br>ప్రతిమాః పరికల్పితాః ॥ | ఓ సాంకృతి మునీంద్రా!<br>యోగపుంగవులు తనయందు, సమస్త జీవులయందు వేంచేసియున్న (సర్వాత్మకుడగు) శివుని తమయందే దర్శిస్తూ ఉంటారు. అంతేగాని ప్రతిమయందో, మరెక్కడో కాదు.<br>మరి ప్రతిమలు ఎందుకు కల్పించబడ్డాయి? ఎందుకంటే, అజ్ఞానుల భావ పరిశుద్ధికొరకై మార్గదర్శకంగా సర్వజనులకు ఆత్మీయులగు (దివ్యతత్త్వజ్ఞులగు) మహనీయులచే మార్గదర్శకంగా పరికల్పించబడ్డాయి. ప్రతిమలు అజ్ఞాన చీకటి దశలో అందించబడిన చేతికర్రవంటిది మాత్రమే। |
| అపూర్వం అపరం బ్రహ్మ<br>స్వ- ఆత్మానం సత్యం అద్వయమ్,<br>ప్రజ్ఞాన ఘనం ఆనందం<br>యః పశ్యతి – స పశ్యతి॥ | ❖ అపూర్వము (ఇప్పటికిప్పుడే ఉన్నది. అంతేగాని పూర్వమెప్పుడో మాత్రమే ఉన్నది కాదు).<br>❖ అపరము (తనకు వేరుకానట్టిది)<br>❖ బ్రహ్మము (మహత్తరము)<br>❖ స్వస్వరూపాత్మ రూపము, సత్యము, అద్వితీయము<br>❖ ఘనీభూతము. కేవల ప్రజ్ఞాస్వరూపము<br>అగు పరతత్త్వమును స్వశరీరమునందు దర్శించువాడే సరియగు దర్శనము కలవాడు. |
| నాడీపుంజం సదా సారం<br>నర భావం, మహామునే!<br>సమ్ ఉత్సృజ్య– "ఆత్మన ఆత్మానం అహమ్"<br>ఇతి అవధారయ॥ | ఓ మహామునీ! నాడీ సముదాయము ఎల్లప్పుడు అసారమే। అది 'నేను శరీరమును' అను భావనచే "నరములే నేను" అను నరభావము వదలదు. (ప్రాణాయామము మొ॥ వాటిచే నరభావము కొంత శోషించియే ఉంటుంది).<br>అట్టి భౌతిక భావనను మొదలంట్లా విడచివేసి ఆత్మతో ఆత్మను దర్శిస్తూ "ఆత్మాహమ్" భావనను అవధారణ చేయాలిసుమా। |

అశరీరం శరీరేషు, మహాంతం, విభుం, ఈశ్వరమ్,
ఆనందం, అక్షరం, సాక్షాత్ మత్వా ధీరో న శోచతి॥
విభేద జనకే జ్ఞానే నష్టే జ్ఞాన
బలాత్, మునే! ఆత్మనో-బ్రహ్మణో భేదం
అనంతం కిం కరిష్యతి?

సమస్తము 'తానే' అయి ఉన్న పరమాత్మ **సకలజీవుల స్వస్వరూపమై వెలుగొందుచున్నారు.** స్వస్వరూపమగు ఆత్మ ఈ భౌతికశరీరములో ప్రత్యక్షముగా కనిపిస్తూ ఉన్నప్పటికీ, శరీరముగా అగుటలేదు. ఆత్మ ఈ భౌతికశరీరముకంటే కూడా మహత్తరమైనది. అట్టి పరబ్రహ్మమే సమస్తమునకు విభువు. (నియమించునట్టిది). ఈ సమస్తము సర్వత్రా విస్తరించి ఉండుటచే ఈశ్వర వైభవము. అలౌకిక ఆనందస్వరూపము. మార్పుచేర్పులు లేనట్టిది కాబట్టి అక్షరము. అట్టి ఆత్మను సాక్షాత్‌స్వరూపముగా ఎరిగిన ధీరుడు ఇక దేనికీ శోకించడు. జ్ఞాననేత్రమునకు ఈ సమస్తము ఆత్మగా అనిపిస్తూనే ఉంటుంది.

ఓ మునీశ్వరా! ఆత్మజ్ఞానబలముతో విభేదజనకమైన అజ్ఞానరూప భేద-జ్ఞానమును తొలగించుకో. నీవు అనంత ఆత్మజ్ఞానస్వరూపుడవై ఉండనే ఉన్నావు. ఈ మనస్సుకు కనిపించే భేదములు నీ అఖండాత్మ స్వరూపమును ఏమి చేయగలవు? ఎందుకంటే, ఆత్మకు సంబంధించినవే కావు. అనంతమగు ఆత్మకు పరిమితమగు మనో-దేహములు హాని కలిగించ జాలవు.

## పంచమ ఖండము (నాడీశుద్ధి)

సాంకృతౌ వాచ

1 సమ్యక్ కథయ మే, బ్రహ్మన్! నాడీశుద్ధిం
సమాసతః, యయా శుద్ధ్యా సదా
ధ్యాయన్ జీవన్ముక్తో భవామి అహమ్।

అవధూతౌ వాచ

సాంకృతే! శృణు, వక్ష్యామి, నాడీ శుద్ధిం సమాసతః ।
విధ్యుక్త (విధి యుక్త), కర్మసంయుక్తః-కామసంకల్ప వర్జితః,
'యమా' ఆది అష్టాంగ సంయుక్తః, శాంతః,
సత్యపరాయణః, స్వ-ఆత్మని అవస్థితః
సమ్యక్ జ్ఞానిభిశ్చ సుశిక్షితః॥

పర్వత - అగ్రే, నదీతీరే, బిల్వమూలే, వనే అథవా,
మనోరమే శుచౌదేశే
మఠంకృత్వా సమాహితః,
ఆరభ్య చ ఆసనం। పశ్చాత్
ప్రాక్ ముఖో ఉఙ్ముఖోపిఽవా,
సమగ్రీవ శిరః కాయః
సంవృత అస్య సునిశ్చలః,

## పంచమ ఖండము (నాడీశుద్ధి)

సాంకృతముని : హే బ్రహ్మన్! శ్రీదత్తాత్రేయ భగవన్! నేను నాడీ శుద్ధిని ఎట్లా పొందగలనో, అట్టి శుద్ధిచే కలుగు ధ్యానముచే జీవన్ముక్తుడను ఎట్లా కాగలనో-అట్టి సమ్యక్ (యోగ) మార్గము గురించి చెప్పమని ప్రార్థన.

శ్రీదత్తాత్రేయ అవధూత : ఓ సాంకృతి మునీశ్వరా? 'నాడీశుద్ధి' గురించి సంగ్రహముగా (In Brief) చెప్పుచున్నాను. వినండి.

- విధ్యుక్తమైన (తనకు నియమితమైన) కర్మలను చక్కగా నిర్వర్తించుచూ,

- ఈ దృశ్యములో ఏదో కావాలి. పొందాలి. అనే కామ సంకల్పములను త్యజించి,

- "యమము, నియమము, ఆసనము, ప్రాణాయణము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి" - అనబడు అష్టాంగయోగములను అభ్యసిస్తూ

- శాంత మనస్కుడై, సత్యపరాయణుడై (అసత్తును అసత్తుగా దర్శించు మననము - దృష్టి - భావన - అవగాహనకలవాడై)

- సమ్యక్ జ్ఞానులగు సద్గురువుచే సుశిక్షితుడై ఈ జీవుడు సమ్యక్‌జ్ఞానము బోధింపబడునుగాక. పర్వతముయొక్క పై ప్రదేశంలో గాని, నదీ తీరంలోగాని, బిల్వ వృక్ష (రావిచెట్టు) మూలంలోగాని, వనములోగాని - ఒక శుచి అయిన ప్రదేశంలో మఠం నిర్మించుకోవాలి.

(లేదా) ఎక్కడైనా సరే, మనస్సుకు రమింపజేసేది అగుగాక! మనస్సులోనే కూడా అగుగాక.

మనస్సుకు సానుకూల్యంగా ఉండాలి.

తరువాత - తూర్పుదిక్కుగా గాని, ఉత్తర దిక్కుగాన గాని ముఖములో ఆసనము వేసుకొని కూర్చోవాలి. కంఠమును, శిరస్సు సమముగా ఉండేవిధంగా ధారణ చేయాలి. నిశ్చలముగా నిలపాలి. యోగాభ్యాసమునకు ఉపక్రమించాలి.

నా సాగ్రే శశభృత్ బింబే। బిందుమధ్యే తురీయకమ్।
స్రవంతం అమృతం పశ్యేత్, నేత్రాభ్యాం సు సమాహితః॥
ఇడయా ప్రాణం ఆకృష్య,
పూరయిత్వా ఉదర స్థితమ్,
తతో అగ్నిం దేహ మధ్యస్థం
ధ్యాయన్ జ్వాలావలీయుతమ్।

- ముక్కుకు ఊపిరిగా (ఆజ్ఞాచక్ర ఊర్ధ్వాకాశంలో) చంద్రబింబమును, ఆ చంద్రబింబము మధ్య బిందుమధ్యగా అమృతమును స్రవించు తురీయకమును (జాగ్రత్ - స్వప్న - సుషుప్తి కర్తృత్వము వహిస్తున్న సాక్షిని) - రెండు కనులను ఏకం చేసి అంతర్ - దృష్టితో భావించాలి.

ఇడానాడితో ప్రాణశక్తిని (వాయువును) ఆకర్షించి ఉదరస్థానంలో (పొట్టలో) వాయుకుంభకము నిర్వర్తించి దేహమధ్యలో ప్రకాశించుచున్న జ్వాలాయుతమైన అగ్నిని (తేజస్సును) ధ్యానము చేయాలి.

బిందునాద సమాయుక్తం అగ్నిబీజం విచింతయేత్।
పశ్చాత్ విరేచయేత్ సమ్యక్
ప్రాణం పింగళయా బుధః॥
పునః పింగళయా ఆపూర్యం, వహ్నిబీజం
అనుస్మరేత్। పునః విరేచయేత్ ధీమాన్
ఇడయైవ శనైః శనైః॥

బిందు (point of Athma) - నాద సమాయుక్తమైనట్టి అగ్నిబీజమును చింతన చేస్తూ ఉండాలి.

ఆ తరువాత కుడివైపుగా గల <u>"పింగళనాడి"</u> నుండి రేచకంగా గాలిని వదలాలి. కుంభకము చేయబడిన వాయువును సమ్యక్ భావనతో రేచకము చేయాలి. ఈ విధంగా బుద్ధిని, మనస్సును సాధన వస్తువులుగా చేసుకొని వాయువును వదలటము - స్వీకరించటము - కుంభకము - రేచకము చేయాలి. అటు తరువాత పింగళనాడి ద్వారాపీల్చి వాయుపూరకము, ఇడలో కుంభకము చేయాలి. కుంభక సమయంలో అగ్ని బీజము (తేజోకణమును) స్మరించుచూ ఇడతో మెల్లమెల్లగా రేచకము చేయాలి.

---

త్రి చతుః వాసరం వా, అథ త్రిచతుః
వారం ఏవ చ, షట్ కృత్వా విచరేత్
నిత్యం – రహస్యేవం త్రిసంధిషు॥
నాడీశుద్ధిం అవాప్నోతి పృథక్ చిహ్నా
ఉపలక్షితః, శరీర లఘుతా దీప్తిః వహ్నేః జాఠరవర్తినః,

ఈ విధంగా 3-4 రోజులు రోజుకు 3-4 సార్లు ద్వి-పూరక కుంబక రేచకములను (3×2=6) త్రిసంధ్యలలోను - రహస్యముగా - నిర్వర్తించాలి. పూరక - రేచక - కుంభకముల మధ్యగల 'త్రిసంధిస్థానము' 'లయస్థానము' గమనించి, మనస్సును ఏకాగ్రం చేసి ఉపాసించాలి.
**- ఇట్టి త్రిసంధ్యా-షట్ విశేష ప్రాణాయామము యొక్క కొన్ని చిహ్నములు**
-నాడీ చక్రములోని దోషములు పోయి, పరిశుభ్రమగుచున్నది.
- శరీరము తేలికగాను దీప్తివంతముగాను అగుచున్నది.
- జఠరాగ్ని ప్రదీప్తమై ప్రవర్తించగలదు.

---

'నాద' అభివ్యక్తిః– ఇతి ఏతత్ చిహ్నం
తత్ సిద్ధిసూచకమ్। యావత్ ఏతాని
సంపశ్యేత్ తావత్ ఏవం సమాచరేత్॥

నాదము అభివ్యక్తము అగుచున్నట్టి ''నాదజనస్థానము''బుద్ధికి అనుభవమే- 'అభ్యాససిద్ధి'కి సూచన. మరింతగా సుస్పష్టము, స్వాభావికము అగునంతవరకు పైవిధంగా (1) ఇడా కుంభక- (2) పింగళా కుంభక ప్రాణాయామమును పైన చెప్పిన విధంగా సమాచరించాలి.

---

అథవా–ఏతత్ పరత్యజ్య, స్వ–ఆత్మశుద్ధిం సమాచరేత్।
ఆత్మా శుద్ధః సదా నిత్యః
సుఖరూపః స్వయం ప్రభః॥
<u>అజ్ఞానాత్ మలినో భాతి।</u>
<u>జ్ఞానాత్ శుద్ధో విభాతి అయమ్॥</u>
అజ్ఞాన మల పంకం యః
క్షాళయేత్ జ్ఞానతో యతః,
స ఏవ సర్వదా శుద్ధో।
న అన్య కర్మరతో హి సః। ఇతి॥

అదేవిధంగా ప్రాణాయామము నిర్వర్తిస్తూనే ఆత్మయొక్క నిత్యశుద్ధత్వమును గమనికగా మననం చేయాలి.

ఆత్మ సర్వదా శుద్ధమైనది. నిత్యసుఖరూపమైనది. స్వయంప్రకాశకము.
అజ్ఞానము చేత నిత్యశుద్ధమగు ఆత్మ మలినములచే కప్పబడినట్లు అగుపిస్తోంది. ప్రాణాయామయోగధారణచే అజ్ఞాన మలినమును తొలగించుకొన్నవాడు. - ఆత్మానుభవుడగుచున్నాడు. ఆత్మయే తానై ప్రకాశిస్తున్నాడు. ఎవ్వడైతే (కర్మల సందర్భముగా మనస్సుకు తాకుచున్న) **'అజ్ఞానము'** అనే 'బురద'ను **'జ్ఞానము'** అనే జలముతో ప్రక్షాళనము చేయు ప్రయత్నమును (సత్కర్మల ద్వారా) చేయుచున్నాడో, అట్టివాడు సర్వదా శుద్ధుడే.

కర్మల ద్వారా దోషములను ప్రక్షాళనము చేయు ఉద్దేశ్యము (objective) లేకుండా కర్మరతుడైనవాడు, శుద్ధుడు కాలేడు. {(అనగా) కర్మఫల త్యాగి అయి, ఆత్మ శుద్ధి కొరకై కర్మలు నిర్వర్తించునుగాక}.

---

## షష్ఠమ ఖండము (ప్రాణాయామము)

1 ప్రాణాయామ క్రమం వక్ష్యే, సాంకృతే! శృణు సాదరమ్।
ప్రాణాయామ ఇతి ప్రోక్తో।
<u>"రేచ – పూరక – కుంభకైః"।</u>
వర్ణత్రయాత్మకాః ప్రోక్తా, రేచ పూరక కుంభకాః।
స ఏష "ప్రణవః" ప్రోక్తః
ప్రాణాయామస్తు తన్మయః॥
ఇడయా వాయుం ఆకృష్య
పూరయిత్వా ఉదరస్థితమ్।

## షష్ఠమ ఖండము (ప్రాణాయామము)

దత్తాత్రేయ అవధూత : ప్రియసాంకృతి మునీశ్వరా! ప్రాణాయామక్రమము గురించి చెప్పుకుంటున్నాము. ఇంకా మరికొంత వివరిస్తాను. సాదరంగా వినండి.

(1) రేచకము (2) పూరకము (3) కుంభకము - ఈ మూడు కలిపి ప్రాణాయామము. ఈ మూడిటిని 'వర్ణత్రయము' అని కూడా అంటారు.

**అట్టి వర్ణత్రయ సమన్విత ప్రాణాయామమునందు తన్మయమైయున్నట్టి అంతర్లీనతత్త్వమే 'ప్రణవము' - అనబడుచున్నది.**

### ప్రాణాయామము - ప్రణవము

**(1)** పూరకము: ఎడమ ముక్కు రంధ్రము (పుటము) ద్వారా గాలిని 'ఇడ' నాడిలో నెమ్మదిగా పీల్చటము.
16 మాత్రల కాలము గాలి పీల్చాలి. <u>**'అ'**కారమును స్మరిస్తూ నిర్వర్తించాలి.</u>

**శనైః షోడశభిః(16) మాత్రైః 'అ' కారం తత్ర**
**సంస్మరేత్। పూరితం ధారయేత్ పశ్చాత్**
**చతుః షష్ట్యాతు (64) మాత్రయా॥**
**'ఉ' కార మూర్తిం అత్ర అపి, సంస్మరన్ ప్రణవం జపేత్।**
**యావత్ వా శక్యతే, తావత్ ధారయేత్ జపతత్పరః।**
**పూరితం రేచయేత్ పశ్చాత్ 'మ' కారేణ**
**అనిలం బుధః, శనైః పింగళయా తత్ర**
**ద్వాత్రింశత్ (32) మాత్రయా పునః॥**

**(2) కుంభకము:** పీల్చిన వాయువున 'ధారణ'
'64' మాత్రల కాలము
'ఉ'కారమూర్తియగు ప్రణవమును సంస్మరించాలి.

ఎంతసేపు వాయువును కుంభకముగా నిలుపగలమో అంతకాలము 'ఉ' కార జప తత్పరుడై ఉంటూ, **కుంభక ధారణ** చేయాలి. క్రమంగా 64 మాత్రలకాలము కనీసముగా కుంభకమును సిద్ధించుకోవాలి. కుంభక సమయంలో - ప్రాణకదలికలకు అంతర్లీనము, ఆధారము అయి ఉన్న - 'ప్రణవము' అని పిలువబడే 'ప్రాణశక్తి'ని గమనిస్తూ ఉపాసించాలి.

**(3) రేచకము:** పూరితం చేసిన వాయువును రేచకము చేయాలి. అనగా పింగళనాడిద్వారా 32 మాత్రల కాలము 'మ' కారమును స్మరిస్తూ వాయువును వదలాలి.

---

**ప్రాణయామో భవేత్ ఏషః।**
**తతః చ ఏవం సమభ్యసేత్॥**
**పునః పింగళయా పూర్య మాత్రైః షోడశభిః (16)**
**తథా, 'అ' కార మూర్తిం అత్ర అపి స్మరేత్**
**ఏకాగ్ర మానసః॥**

ఇది ఒక ప్రాణాయామము. ఈ విధంగా 'అ-ఉ-మ' ప్రణవ స్మరణతో కూడి పూరక - కుంభక - రేచక త్రివర్ణ ప్రాణాయామమును చక్కగా, శ్రద్ధగా నిర్వర్తించాలి. ప్రాణేశ్వరీ (లేక) ప్రాణశక్తి రూపమగు ప్రణవమును (కదలికల వెనుకగల కదలనీ శక్తిని) ఉపాసించాలి.

ఇడా కుంభకం అయిన తరువాత ఇక 'పింగళాకుంభకము' కుడి ముక్కుపుటము ద్వారా వాయువును 16మాత్రల కాలము పూరించి 'అ'కారమూర్తిని ఏకాగ్రముగా స్మరించాలి.

---

**ధారయేత్ పూరితం విద్వాన్ ప్రణవం**
**సం జపత్ వశీ। 'ఉ' కార మూర్తిం సంధ్యాయన్**
**చతుః షష్ట్యాతు (64) మాత్రయా।**
**'మ' కారం తు స్మరన్ పశ్చాత్,**
**రేచయేత్ ఇడయా అనిలమ్।**
**ఏవం ఏవ పునః కుర్యాత్ ఇడయ అపూర్య**
**బుద్ధిమాన్। ఏవం సమభ్యసేత్**
**నిత్యం ప్రాణాయామం, మునీశ్వర!**

ఆ తరువాత ఉకారమూర్తిని ధ్యానిస్తూ 64 మాత్రలకాలము ప్రాణ - అపానముల మధ్యగా సంధ్య స్థానమునందు ప్రాణాపాన సమస్వరూపధారణ చేయాలి. అప్పుడు 'మ'కారమూర్తిని స్మరిస్తూ ఇడనాడి ద్వారా వాయువును '32' మాత్రల కాలము రేచకము చేయాలి.

ఓ మునీశ్వరా! బుద్ధిమాన్!

ఈ విధంగా

(1) ఇడయా పూరక - పింగళలలో కుంభక - పింగళా నుండి రేచకము

(2) పింగళయా పూరక - ఇడలో కుంభక - ఇడ నుండి రేచకము

అను ప్రాణాయామమును అభ్యాసముగా చేయాలి.

---

**ఏవం అభ్యాసతో నిత్యం**
**షట్ (6) మాసాత్ జ్ఞానవాన్ భవేత్।**
**వత్సరాత్ బ్రహ్మ విద్వాన్స్యాత్।**
**తస్మాత్ నిత్యం సమభ్యసేత్॥**

ఈ విధంగా నిత్యము ప్రాణాయామము '6' మాసములు నిర్వర్తిస్తూ ఉండగా, ఆ యోగాభ్యాసి జ్ఞానవంతుడు అగుచున్నాడు.

సంవత్సరకాలమునకు అట్టి యోగాభ్యాసి బ్రహ్మవేత్త అగుచున్నాడు. అందుచేత ఇట్టి ప్రాణాయామమును నిత్యము శ్రద్ధగా అభ్యాసము చేయాలి.

---

**2. యోగాభ్యాస రతో నిత్యం, స్వధర్మ**
**నిరతశ్చ యః, ప్రాణసంయమనేన**
**ఏవ జ్ఞానాత్ ముక్తో భవిష్యతి॥**
**బాహ్యాత్ ఆపూరణం వాయోః, ఉదరే**
**పూరకోఽపి సః,**
**సంపూర్ణ కుంభవత్ వాయోః**
**ధారణం కుంభకో భవేత్॥**
**బహిః విరేచనం వాయోః**
**ఉదరాత్ రేచకః స్మృతః॥**

ఎవ్వరైతే (1) యోగాభ్యాసపరుడు (2) స్వధర్మనిరతుడు అయి ఉంటాడో, అట్టివాడు ఆత్మజ్ఞాని అయి 'ముక్తుడు' అగుచున్నాడు. **"నాకు 'బంధము' మొదలే లేదు"** - అను బుద్ధియొక్క గ్రహింపు స్వాభావికం అవగలదు.

**పూరకము:** బయటనుండి గాలిని లోనికి పూల్చటమును 'పూరకము' అంటారు. (పూరకము = నింపటము)

**కుంభకము:** ఆ పీల్చిన గాలిని నిండు కుండవలె ఉదరమునందు ధారణ చేయటమును 'కుంభకము' అంటున్నారు. (కుంభకము = నిండు కుండలో నీరువలె నిలిపి ఉంచటము)

**రేచకము:** ఉదరము నుండి వాయువును బయటకు విరేచనము చేయటమును 'రేచకము' అని పిలుస్తున్నారు. (రేచకము = వదలటము - విరేచనము)

ప్రస్వేద జనకో యస్తు
ప్రాణాయామేషు సో అధమః।
కంపనం మధ్యమం విద్యాత్।
ఉత్థానం చ ఉత్తమం విదుః।
పూర్వ పూర్వం ప్రకుర్వీత యావత్ ఉత్థాన సంభవః॥
సంభవతి ఉత్తమే ప్రాజ్ఞః ప్రాణాయామే సుఖీ భవేత్॥

ప్రాణాయామ - అభ్యాసము చేస్తూ ఉండగా :-

ప్రారంభస్థితిలో (Initial Stage) (అధమము) → అధికాధికంగా చెమట కలుగుచూ ఉండటము

ద్వితీయస్థితిలో (మధ్యమ) (Second Stage) → కంపనము కలుగుచూ ఉండటము.

ఉత్తమస్థితిలో (At Third Stage) → ఉత్థానము (శరీరముపైకి లేవటం) జరుగగలదు. అనగా శరీరము అతి తేలికైన వస్తువుగా అనుభూతమవ గలదు.

---

ప్రాణాయామేన చిత్తం తు శుద్ధం భవతి, సువ్రత!
చిత్తే శుద్ధే శుచిః సాక్షాత్
ప్రత్యక్ జ్యోతిః వ్యవస్థితః॥
ప్రాణ చిత్తేన సంయుక్తః పరమాత్మని తిష్ఠతి।

ఒక్కొక్క స్థితిని పొందుచూ అట్టి ఉత్తమమగు ఉత్థానస్థితి సిద్ధించేవరకు ప్రాణాయామమును అభ్యసించువాడు సుఖవంతుడు కాగలడు.

ఓ సువ్రతా! సాంకృతి మునీంద్రా! ప్రాణాయామాభ్యాసము చేత ముందుగా చిత్తములోని కామ - క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్య ఇత్యాది దోషములు తొలగి చిత్తశుద్ధి లభిస్తుంది. చిత్తము శుద్ధము అగుచుండగా ఆ యోగి **"ప్రత్యక్ జ్యోతి (లేక) కేవల తేజస్సు (లేక) చిత్తరహిత చిత్"** యందు వ్యవస్థితుడు అగుచున్నాడు.

---

ప్రాణాయామపరస్య అస్య పురుషస్య మహాత్మనః,
దేహశ్చ ఉత్తిష్ఠతే। తేన కించిత్
జ్ఞానాత్ విముక్తతా॥
రేచకం పూరకం ముక్త్వా కుంభకం
నిత్యం అభ్యసేత్॥

ప్రాణము (శక్తి) చిత్తము (ఇష్టము)తో కూడి (కేవలము - సమస్తము అయి ఉన్న, సమస్తమునకు ఆవలగల) పరమాత్మయందు స్థానము పొందుచున్నది. (Getting placed in one's own Absolute All perveding SELF)

ప్రాణాయామ పరుడైన యోగికి క్రమముగా "జాగ్రత్ స్వప్న సుషుప్తులు, జన్మ జన్మాంతరములు, ఇవన్నీ నాయొక్క పురుషకార చమత్కారమే" అను అవగాహనతో కూడిన మహత్‌పురుషత్వము (లేక) పరమ పురుషత్వము సిద్ధించగలదు. యోగాభ్యాసము చేస్తూ ఉన్నప్పుడు, కించిత్ ఆత్మజ్ఞానముచే దేహముతో ఏర్పడియున్న మనోబంధము తొలగుచున్నది. కించిత్‌గా జ్ఞానము - శ్రవణం చేసినంత మాత్రంచేత కూడా 'విముక్తుడు' అగుచున్నాడు.

క్రమంగా రేచక పూరకముల అవసరము లేకుండానే కుంభక ప్రాణాయామమును అభ్యాసము చేయాలి. (స్వాభావిక కుంభకము)

---

సర్వపాప వినిర్ముక్తః
"సమ్యక్ జ్ఞానం" అవాప్నుయాత్॥
మనోజవత్వం ఆప్నోతి పలితాది చ నశ్యతి।
ప్రాణాయామ ఏక నిష్ఠస్య
న కించిదపి దుర్లభమ్॥

అట్టి యోగాభ్యాసి సర్వపాప దృష్టుల నుండి, అల్పసాంసారిక భావములనుండి విముక్తుడు అగుచున్నాడు. సర్వత్రా సమమగు ఆత్మయొక్క సందర్శనము చేస్తూ 'సమ్యక్‌జ్ఞాని' అగుచున్నాడు.

మనస్సును దాటివేసినట్టి "మనోసాక్షిత్వము" (The witnessing to the Experiencing) సిద్ధించగలదు. **పలిత (వృద్ధ స్త్రీ) లక్షణములైనట్టి** తలనెరవటము, చర్మపు ముడతలు మొదలైన వార్ధక్య లక్షణములు ప్రవర్తించవు. ప్రాణాయామాభ్యాసమునందు నిష్ఠకలవానికి అసాధ్యమనునది ఏదీ ఉండదు.

---

3. తస్మాత్ సర్వ ప్రయత్నేన
ప్రాణాయామాన్ సమభ్యసేత్॥
(అథ) వినియోగాన్ ప్రవక్ష్యామి
ప్రాణాయామస్య, సువ్రత!
సంధ్యయోః బ్రహ్మకాలేపి, మధ్యాహ్నేవా।

అందుచేత సాంకృతి సువ్రతా! యతివర్యా! సర్వ ప్రయత్నములతో ప్రాణాయామము అభ్యసించటము శ్రేయస్కరము.

ఈ ప్రాణాయామము యొక్క - "ఎప్పుడెప్పుడు, ఎక్కడెక్కడ చెయ్యాలి" - ఇటువంటి వినియోగముల గురించి (Regarding practices) చెప్పుచున్నాను, వినండి.

(ఉదయ - సాయంత్ర) ఉభయ సంధ్యా సమయములందు, బ్రాహ్మీ ముహూర్త సమయము (4 Am to 6 AM) లందు, మధ్యాహ్న సమయములంద నిర్వర్తించబడునుగాక।

| | |
|---|---|
| అథవా సదా – బాహ్యం ప్రాణం<br>సమాకృష్య పూరయిత్వ ఉదరేణ చ।<br>నాసాగ్రే నాభి మధ్యే చ,<br>పాద అంగుష్ఠే చ ధారయేత్,<br>సర్వరోగ వినిర్ముక్తో<br>జీవేత్ వర్ష శతం నరః॥ | **ఉదా : సహజ ప్రాణాయామ రూపంగా (పూరక-రేచకములు లేకుండానే) అన్ని సమయములందు**<br>- ప్రాణమును బాహ్యమునుండి సమాకర్షించి,<br>- ఉదరము (పొట్ట)యందు వాయువును పూరించి (పూరకము చేసి), (ఉదర కుంభకము),<br>- ముక్కుకు అగ్రభాగంలోను (రెండు కనుబొమ్మల మధ్యగాను), (నాసాగ్ర కుంభకము)<br>- నాభి (బొడ్డు) మధ్యప్రదేశములోను, (నాభిప్రదేశకుంభకము)<br>- పాద అంగుష్ఠములలోను ధారణ (కుంభకము) నిర్వర్తిస్తూ ఉంటే, (పాద-అంగుష్ఠ కుంభకము)<br>ఇది సర్వరోగముల నుండి విముక్తి కలిగించగలదు. ఆయోగి శత సంవత్సర దీర్ఘాయుష్కుడు కాగలడు. |
| నాసాగ్ర ధారణాత్ వా అపి జితో<br>భవతి, సువ్రత! సర్వరోగ నివృత్తిస్స్యాత్<br>నాభి మధ్యే తు ధారణాత్।<br>శరీర లఘుతా, విప్ర!<br>పాద అంగుష్ఠ నిరోధనాత్। | -నాసాగ్ర (ఆజ్ఞాచక్రాకాశ)ము నందు (కుంభక) ప్రాణధారణచే సమస్తమును జయించి వేయు సామర్థ్యము పొందగలడు.<br>- నాభి మధ్య ప్రదేశములో కుంభక- ప్రాణధారణచే సర్వరోగములు నివృత్తి పొందగలవు.<br>ఓ విప్రుడా!<br>- పాదములవద్ద బొటనవ్రేలుల వద్ద కుంభక -ధారణచే శరీరము తేలిక అగుచున్నది. |
| జిహ్వయా వాయుం ఆకృష్య<br>యః పిబేత్ సతతం నరః,<br>శ్రమదాహ వినిర్ముక్తో<br>యోగీ నీరోగతామి యాత్। | **జిహ్వ-వాయు ఆకర్షణ యోగాభ్యాసము**<br>జిహ్వతో వాయువును, ఆకర్షించి నోటితో త్రాగి వాయు కుంభక ధారణ చేస్తూ ఉండే యోగాభ్యాసముచే - అట్టి యోగి అలసట, దాహములనుండి వినిర్ముక్తుడై ఆరోగ్యవంతుడగుచున్నాడు. |
| జిహ్వయా వాయుం ఆకృష్య,<br>జిహ్వా మూలే నిరోధయేత్, పిబేత్ అమృతం<br>అవ్యగ్రం, – సకలం సుఖం ఆప్నుయాత్।<br>ఇడయా వాయుం ఆకృష్య<br>భృవోః మధ్యే నిరోధయేత్ యః పిబేత్<br>అమృతం శుద్ధం, వ్యాధిభిః ముచ్యతే హి సః॥ | **జిహ్వ బంధన - అమృతపాన యోగము**<br>నాలుకతో వాయువును సమాకర్షించి, నాలుకయొక్క మూలస్థానము నందు, నిరోధనము చేయాలి. (వాయువును కుంభించి ఉంచి, సర్వ చింతనలను త్యజించి (కొండనాలుక స్థానము నుండి స్రవించు) అమృతమును గ్రోలాలి. అవ్యగ్రమైన అమృతమును (The change less sense of self) గ్రోలు యోగాభ్యాసముచే అట్టిజీవుడు సకల వ్యాధులనుండి విముక్తుడు కాగలడు. సుఖవంతుడగుచున్నాడు.<br>**భ్రూమధ్యాకాశ కుంభకము :** ఇడా నాడిద్వారా భ్రూమధ్యాకాశమునకు వాయువును (Space between two Eye Brow) ఆకర్షించి, అమృతపానము (Experiencing Changeless Self) చేయువాడు సర్వవ్యాధివిముక్తుడు అగుచున్నాడు. |
| ఇడయా, వేద తత్త్వజ్ఞ! తథా<br>పింగళయైవ చ, నాభౌ<br>నిరోధయేత్। తేన వ్యాధిభిః ముచ్యతే నరః॥ | **నాభీ ప్రదేశ కుంభకము :** (1) ఇడలోనికి (ఎడమవైపు ముక్కుపుటము ద్వారా) వాయువును పూరించి నాభి వద్ద నిరోధించి ధారణ చేయటము. (2) కుడి ముక్కుపుటము ద్వారా రేచకము. (3) ఆ తరువాత పింగళ లోనికి (కుడిపుటముద్వారా) వాయువును పూరించి నాభి ప్రదేశంలో నిరోధించటము. (4) ఎడమ ముక్కుపుటము ద్వారా రేచకము.<br>ఇట్టి నాభీ కుంభకము చేత కూడా **దేహములోని సర్వవ్యాధులు తొలుగ గలవు.** |
| మాస మాత్రం త్రి సంధ్యాయాం<br>జిహ్వయ ఆరోప్య మారుతమ్,<br>అమృతం చ పిబేత్ నాభౌ<br>మందం మందం నిరోధయేత్।<br>వాతజా పిత్తజా దోషా నశ్యంతి ఏవ<br>న సంశయః॥ | ఒక నెలరోజులు ఉదయ మధ్యాహ్న - సాయంత్ర సంధ్యలందు నాలుకతో గాలిని ఆరోపించి అమృతపానము చేస్తూ (లాలాజలము మ్రింగుచూ), **(రసపానము - మార్పుచేర్పులు లేని ఆత్మాభావనమును జోడించటము),** మెల్లమెల్లగా నాభివద్ద వాయు నిరోధము (వాయు కుంభకము / సహజ కుంభకము) అభ్యాసము చేస్తూ ఉండటం చేత వాత దోషములు (వాయువు యొక్క శరీరములోని ప్రసరణము సమయములో ఏర్పడు అపక్రమ దోషములు), పైత్య రస సంబంధమైన దోషములు నశించగలవు. ఇందులో సందేహము లేదు. |

| | |
|---|---|
| నాసాభ్యాం వాయుం ఆకృష్య, నేత్ర ద్వంద్వే<br>విరోధయేత్। నేత్రరోగా వినశ్యంతి।<br>తథా శ్రోత్ర నిరోధనాత్ శ్రోత్ర రోగా వినశ్యతి॥<br>తథా వాయుం సమారోప్య ధారయేత్<br>శిరసి స్థితమ్, శిరో రోగా వినశ్యంతి।<br>సత్యం ఉక్తం హి। సాంకృతే! | **నేత్ర - శ్రోత్ర - శిరో వాయునిరోధ - కుంభకము**<br>(ప్రాణాయామము అభ్యాసము చేస్తూ ఆయా ప్రదేశములలో స్వాభావిక కుంభకము)<br>ముక్కుపుటములతో గాలిని సమాకర్షించి<br>- రెండు కళ్ళలోను వాయు నిరోధనము (సహజ కుంభకము) చేయటము.<br>- అట్లాగే చెవులలోను నిరోధనము చేయటము.<br>ఈ తీరైన నేత్ర శ్రోత్ర స్వాభావిక కుంభకముచే నేత్రములలోని, దోషములు, చెవులలోని దోషములు సమసిపోగలవు.<br>అదే విధంగా ముక్కుతో గాలిని ఆకర్షించి శిరస్సులో వాయుధారణ చేయటంచేత శిరోప్రదేశంలో ఏర్పడే వాయు ప్రసరణముల అధిక అల్పసంబంధమైన దోషములు తప్పక తొలగగలవు. ఇది సత్యము. |
| **4.** "స్వస్తిక" ఆసనమ్ ఆస్థాయ<br>సమాహిత మానాః తథా,<br>అపానం ఊర్ధ్వం ఉత్థాప్య ప్రణవేన శనైః శనైః<br>హస్తాభ్యాం ధారయేత్ సమ్యక్<br>కర్మాది కరణాని చ॥ అంగుష్ఠాభ్యాం, మునే!<br>శ్రోత్రే, తర్జనీభ్యాం తు చక్షుషీ।<br>నాసాపుట అవధానాభ్యాం<br>ప్రచ్ఛాద్య కరణాని వై! ఆనంద ఆవిర్భవో యావత్<br>తావత్ మూర్ధని ధారణాత్॥ | **శిరో అంతర్గత కుంభకము - సంసార విచ్ఛిత్తి**<br>- మనస్సును సమాహితము (ప్రశాంతము, నిర్విషయము) చేసి,<br>- 'స్వస్తికాసనము' ధరించి,<br>- 'ప్రణవము' పలుకుచు (ఓం),<br>బాహ్య ప్రసరణ స్వభావముగల అపానమును గుదస్థానము నుండి మెల్లమెల్లగా ఊర్ధ్వమునకు ఉత్థాపనము చేస్తూ (లాగుచూ),<br>బొటనవేళ్ళతో రెండు చెవులను, చూపుడు వేలులతో కళ్ళను, ముక్కుపుటములను మధ్యవేళ్ళతోను నొక్కి ఉంచి, సంతోషంగా ఉన్నంతసేపు (ఇబ్బంది కలుగనంత సమయము) మూర్ధము (Fore-face) యందు వాయుధారణ (స్వాభావిక కుంభకము) చేయటమును **"మూర్ధస్థానకుంభకము"** - అంటారు. |
| ప్రాణః ప్రయాత్యనైవ ఏవ బ్రహ్మరంధ్రం,<br>మహామునే! బ్రహ్మరంధ్రం గతే వాయౌ<br>నాదశ్చ ('నాదః' చ) ఉత్పద్యతే, అనఘ! | ఓ మహామునీ! అనఘా!<br>(బొటనవ్రేళ్ళతో చెవులను చూపుడు వ్రేలులతో రెండు కళ్ళను, మధ్య వ్రేలులతో రెండు ముక్కుపుటములను మూసి ఉంచి) - ఆ విధంగా మూర్ధము (Fore face) నందు వాయుధారణ చేతనయినంతసేపు చేయట చేత) - ప్రాణవాయువు బ్రహ్మరంధ్రమును క్రమంగా చేరగలదు. శిరస్సుయొక్క ఉపరిభాగమగు బ్రహ్మరంధ్రము (బ్రహ్మమార్గము) చేరగానే (ఉకార) 'నాదము' జనిస్తూ ఉంటుంది. (ఉమ్... నాదము) |
| శంఖ ధ్వని నిభశ్చ ఆదౌ।<br>మధ్యే మేఘధ్వనిః యథా। శిరోమధ్యగతే<br>వాయౌ, గిరిప్రస్రవణం యథా। | మొదట 'శంఖము' ఊదుచున్నప్పటి శంఖ ధ్వని, ఆ తరువాత మేఘముల ఘర్షణచే ఏర్పడే (పిడుగు సమయములో ఏర్పడే) మేఘగర్జన ధ్వని వినబడుచూ ఉంటుంది. ప్రాణవాయువు శిరస్సుకు మధ్యగతంగా అగుచున్నప్పుడు గాలి కొండను వేగంగా తాకుచున్నట్టి ధ్వని వినబడసాగుతుంది. |
| పశ్చాత్ ప్రీతో, మహాప్రాజ్ఞ! సాక్షాత్<br>ఆత్మ ఉన్ముఖో భవేత్। పునః తత్<br>జ్ఞాన నిష్పత్తిః యోగాత్ సంసార నిహ్నుతిః। | ఆ తరువాత యోగి ప్రీతిగా, సుఖముగా, ఆనందభావనా సమన్వితంగా, దృశ్యమునుండి వెనుకకు మరలి 'ఆత్మోన్ముఖుడు' అగుచున్నాడు. అప్పుడు ఇక ఆత్మజ్ఞానము స్వాభావికమగుచుండగా, అట్టి యోగాభ్యాసముచే సంసారము నిహ్నుతము (విముక్తి, ప్రాయశ్చిత్తము, విచ్ఛిత్తి) అగుచున్నది. |

| | |
|---|---|
| దక్షిణేతర గుల్ఫేన సీవనీం పీడయేత్ స్థిరామ్।<br>సవ్య ఇతరేణ గుల్ఫేన పీడయేత్ బుద్ధిమాన్ నరః॥<br>జాన్వో రథస్థితాం సంధిం స్మృత్వాత్ఏవం<br>త్రియంబకమ్, వినాయకం చ సంస్మృత్య,<br>తథా వాక్ ఈశ్వరీం, పునః, లింగనాళాత్<br>సమాకృష్య వాయుం అప్యగ్రతో, మునే! | లింగనాళకుంభకము: (1) ఎడమకాలి చీలమండలముతో సీవని (గుద స్థానమునకు కించిత్ పైనగా) నొక్కి స్థిరముగా ఉంచటము, (2) కుడికాలి మడమతో పిక్కలకు క్రిందగా సంధి యందు నొక్కి ఉంచటము, (3) త్రయంబకుడగు శివ భగవానుని స్మరించటము. (4) జానువులను (మోకాళ్ళను) నిలువుగా దగ్గరగా - సూటిగా ధారణ చేస్తూ మూలాధార - అధిదేవతయగు వినాయకుని స్మరించటము. (5) వాగీశ్వరుడగు బ్రహ్మదేవుని (లేక, వాగీశ్వరియగు సరస్వతీదేవిని) స్మరిస్తూ లింగనాళమునందు వాయువును సమాకృష్యము (ప్రోగుచేయటము) చేసి పైకి ఆకర్షించటము. |
| ప్రణవేన నియుక్తేన బిందుయుక్తేన, బుద్ధిమాన్!<br>మూలాధారస్య విప్రేంద్ర! మధ్యే తంతు నిరోధయేత్।<br>నిరుధ్య వాయునా దీప్తో<br>వహ్ని రూహతి కుండలీమ్।<br>పునః సుషుమ్నయా వాయుః వహ్నినా సహ గచ్ఛతి।<br>ఏవం అభ్యసతః, తస్య జితో వాయుః భవేత్ భృశమ్। | అట్టి బుద్ధిమంతుడగు యోగి ఇంకా బుద్ధిని నియుక్తము (ఏకాగ్రము) చేస్తూ ప్రణవముతో బిందుయుక్తంగా మూలాధార మధ్య ప్రదేశమునందు వాయు నిరోధము నిర్వర్తించునుగాక. ఓ విప్రేంద్రా!<br>అప్పుడు జనించే యోగాగ్నితో  కుండలిని నిదురలేచుచున్నది.<br>వాయు - అగ్నిలతో కూడి కుండలిని సుషుమ్నయందు ప్రవేశించుచున్నది. అప్పుడిక అట్టి అభ్యాసము కొనసాగుచుండగా వాయువు జయించబడి బుద్ధికి వశమగుచున్నది. |
| ప్రస్వేదః ప్రథమః పశ్చాత్, కంపనం, మునిపుంగవ।<br>ఉత్థానం చ శరీరస్య చిహ్నం ఏతత్ జితే అనిలే।<br>ఏవమ్ అభ్యసతః తస్య మూలరోగో వినస్యతి।<br>భగందరం చ నష్టంస్యాత్ సర్వరోగాశ్చ। సాంకృతే! | (1) మొదట అత్యధికమైన చెమట, (2) తరువాత కంపనము, (3) ఆ తరువాత శరీరము తేలిక అయి పైకి లేవటము - ఇవన్నీ "వాయువు జయించబడుచున్నది" అను దానికి చిహ్నములు. ఉత్తరోత్తర స్థితులు (Stage after stage towards achieving the ultimate)<br>ఇట్టి అభ్యాసము చేత మూలరోగము తొలగిపోతుంది. భగంధరము (కడుపులో మంట మొదలైనవి) సమసిపోతాయి. ఇట్టి అభ్యాసము సర్వరోగములకు నివారణము. |
| పాతకాని చ నశ్యంతి క్షుద్రాణి చ, మహాంతి చ।<br>నష్టే పాపే విశుద్ధం స్యాత్ చిత్తదర్పణం అద్భుతమ్।<br>పునః బ్రహ్మాది భోగేభ్యో వైరాగ్యం జాయతే హృది॥<br>విరక్తస్య తు సంసారాత్ జ్ఞానం కైవల్య<br>సాధనమ్। తేన పాపాపహానిః స్యాత్<br>జ్ఞాత్వా దేవం సదాశివమ్॥ | **ప్రాణయోగాభ్యాసముచే :**<br>సమస్త క్షుద్రమైన మహాపాతములు నశించగలవు. పాప సంస్కారములు, అభ్యాసములు, వాసనలు రహితము అగుచుండగా, "చిత్తము" - అనే దర్పణము నిర్మలమై అత్యద్భుతముగా ప్రకాశమానమవగలదు.<br>అప్పుడిక బ్రహ్మలోకము నుండి పాతాళము వరకు గల సర్వభోగముల పట్ల హృదయములో వైరాగ్యము (Non attachment) స్వాభావికము కాగలదు.<br>'సంసారము' అనే అనురక్తిరూపమైన మనోజాడ్యము తొలగి కైవల్యము సిద్ధించటానికి ఆత్మజ్ఞానమే సాధనము.<br>హృదయము నిర్మలమవటానికి యోగము జ్ఞానసాధనము.<br>తద్వారా సమస్త దోషములు తొలగి 'సదాశివోఽహమ్' అనునది అనుభవమవగలదు. |
| 5. జ్ఞానామృతరసో యేన సకృత్ ఆస్వాదితో భవేత్,<br>స సర్వకార్యం ఉత్సృజ్య తత్రఏవ పరిధావతి।<br>జ్ఞానస్వరూపమ్ ఏవ ఆహుః జగత్ ఏతత్<br>విచక్షణాః, అర్థ స్వరూపం అజ్ఞానాత్<br>పశ్యంతి అన్యే కుదృష్టయః॥ | ఎవ్వడైతే ఆత్మజ్ఞానామృతరసమును చక్కగా ఆస్వాదించటం ప్రారంభిస్తాడో , అట్టివాడు సమస్త కార్యక్రమములను (రజోభావములను) విడచి "ఆత్మయేవాఽహమ్" - స్థానమును సిద్ధించుకుంటున్నాడు.  తత్ స్థానమునందు అతిత్వరగా నిశ్చలుడగుచున్నాడు.<br>విచక్షుణులగు బ్రహ్మజ్ఞానుల ఉద్దేశ్యముప్రకారము - ఈ సమస్త జగత్తు, - ఈ జగద్దృశ్యము జ్ఞానస్వరూపమే. స్వకీయ జ్ఞానానందమయమే. పరమార్థస్వరూపమే.<br>ఇక తక్కినవారు (ఆత్మజ్ఞానదృష్టి లేనట్టివారు) తమయొక్క అజ్ఞానభావనచేత ఈ దృశ్య జగత్తు ఇహార్థరూపంగా (కుదృష్టిచే) మాత్రమే చూస్తున్నారు. అనేక భేదములతో, బంధ-దుఃఖ వృత్తులతో, - జనన మనన వ్యావహారికమై వారికి ప్రాప్తిస్తోంది. |

ఆత్మస్వరూప విజ్ఞానాత్ అజ్ఞానస్య పరిక్షయః।
క్షీణే అజ్ఞానే, మహాప్రాజ్ఞ!
రాగాదీనాం పరిక్షయః।
రాగాది అసంభవే, ప్రాజ్ఞ! పుణ్యపాప
విమర్దనమ్। తయోః నాశే శరీరేణ
న పునః సంప్రయుజ్యతే। ఇతి।।

"రాగము(attachment)" అను జన్మజన్మార్జిత సంస్కారములు (లేక) వాసనలవలననే అజ్ఞానము పరిఢవిల్లి ప్రవర్తమానమౌతోంది. అట్టి అనేక బంధములకు, దుఃఖములకు కారణమగుచున్న అజ్ఞానము - ఆత్మస్వరూప విజ్ఞానము చేతనే తొలగిపోగలదు. ఓ మహాప్రాజ్ఞా! అజ్ఞానము క్షీణించగా, ఇక "రాగ ద్వేష మోహ మాత్సర్య" మొదలైన దోషములు వాటికవే తొలగుతాయి.

హే ప్రాజ్ఞా! రాగద్వేషములు తొలగితే పుణ్యపాప ద్వంద్వములు కూడా విమర్ధనమౌతాయి. (మసి అయిపోతాయి). అట్టి జీవుడు ఈ భౌతిక దేహముతో ఇక తాదాత్మ్యము చెందడు. ఆతనికి ఈ వర్తమాన జన్మ కూడా "మొదలే లేనిది" అగుచున్నది. తనను తాను అమృతమగు ఆత్మస్వరూపుడుగా గమనిస్తున్నాడు.
ఇక పునర్జన్మ గురించి ప్రసక్తి ఎక్కడిది?

## సప్తమ ఖండము (ప్రత్యాహారము)

1 అథ అతః సంప్రవక్ష్యామి "ప్రత్యాహారం",
మహామునే!
ఇంద్రియాణాం విచరతాం
విషయేషు స్వభావతః।
బలాత్ ఆహరణం తేషాం "ప్రత్యాహారః"
స ఉచ్యతే।

## సప్తమ ఖండము (ప్రత్యాహారము)

ఓ మహామునీ! సాంకృతిమహాశయా!

కాబట్టి ఇక ఇప్పుడు "ప్రత్యాహారము" గురించి కొన్ని విశేషాలు చెప్పుచున్నాను, వినండి.

ఈ ఇంద్రియములు - విషయములవైపుగా ప్రసరించటము, వాటి నుండి సుఖ - దుఃఖ భూయిష్టమైన సమాచారము అవి జీవునికి అందించటము - స్వభావముగా కలిగి ఉన్నాయి.

అట్టి ఇంద్రియములను దృశ్య విషయములనుండి వెనుకకు మరల్చటము - అనునదే "ప్రత్యాహారము".

యత్ పశ్యతి తు తత్ సర్వం
బ్రహ్మ పశ్యేః సమాహితః
ప్రత్యాహారో భవేత్ ఏష బ్రహ్మవిద్భిః
పురోదితః। యద్యత్ శుద్ధం - అశుద్ధం వా
కరోతి ఆమరణాంతికమ్,
తత్ సర్వం బ్రహ్మణే కుర్యాత్, "ప్రత్యాహారః" స
ఉచ్యతే। అథవా, నిత్య కర్మాణి బ్రహ్మ - ఆరాధన బుద్ధితః
కామ్యాని చ తథా కుర్యాత్ ప్రత్యాహారః స ఉచ్యతే।

"ఏదేది కనబడుచూ ఉన్నదో, అట్టి ఇదంతా ఈ జగత్తుకు మునుముందే ఉండి ఉన్నట్టి బ్రహ్మమే. బ్రహ్మమునకు అన్యము కాదు. - అని బ్రహ్మవేత్తల ప్రవచనము. ఇట్టి సమన్వయమే ప్రత్యాహారము.

ఒక పని శుద్ధమైనా (లేక) అశుద్ధమైనా కూడా, అది బ్రహ్మమును ఉద్దేశ్యించి 'బ్రహ్మోపాసన'గా ఆమరణాంతము (Including birth and Death) నిర్వర్తిస్తూ ఉంటే, అది "ప్రత్యాహారము" అనియే అనబడుచున్నది.

(లేక) బ్రహ్మమును ఆరాధించాలనే బుద్ధితో నిత్యకర్మలుగాని, కామ్య కర్మలుగాని నిర్వర్తిస్తూ ఉంటే, అది ప్రత్యాహారమే!

అథవా, వాయుం ఆకృష్య స్థానాత్
స్థానం నిరోధయేత్।
దంతమూలాత్ తథా కంఠే,
కంఠాత్ ఉరసి మారుతమ్।
ఉరో దేశాత్ సమాకృష్య
నాభీదేశే నిరోధయేత్।।

**ప్రత్యాహార పండితుల మరొక నిర్ణయము**

- వాయువును ముక్కుపుటముల ద్వారా (లేక) నోరు ద్వారా ఆకర్షించి ఆ శరీరములో ఒక్కొక్క స్థానములో నిరోధించటము (కుంభకము చేయటము)

- దంత మూలము నుండి కంఠమునకు, కంఠము నుండి ఉరసి (రొమ్ములు)లో, భుజములలో, భుజముల నుండి నాభి ప్రదేశము వరకు వాయువును సమాకర్షించి నిరోధించటము. - "ప్రత్యాహారము". అనగా బుద్ధి - మనస్సులను రెండు చేతులుగా చేసుకొని దేహములోని ఆయా ప్రదేశములలో 'స్వాభావిక కుంభకము' నిర్వర్తిస్తూ ఉండటము - ప్రత్యాహారము।

**2. నాభి దేశాత్ సమాకృష్య కుండల్యాం తు**
**నిరోధయేత్। కుండలీ దేశతో విద్వాన్**
**మూలాధారే నిరోధయేత్। అథ అపానాత్ కటి ద్వంద్వే**
**తథా ఉరౌ చ సు మధ్యమే, తస్మాత్ జానుద్వయే**
**జంఘే, పాద అంగుష్ఠే-నిరోధయేత్।**

<u>దేహములోని వివిధ విభాగములలో కుంభక ప్రాణాయామాభ్యాసము</u>
నాభి ప్రదేశములో వాయువును సమాకృష్యము (సమాకర్షణ) చేసి కుండలిని యందు నిరోధించటము.

కుండలినీ ప్రదేశమునుండి మూలాధారమునందు వాయునిరోధనము చేయటము.

అపానము నిర్వర్తిస్తూ , అపానము నుండి కటి (మొలత్రాడు ప్రదేశము) అక్కడినుండి తొడలయందు, తరువాత మోకాళ్ళయందు, అక్కడ నుండి కాలిపిక్కలయందు, ఆ తరువాత పాదములయందు, అటు తరువాత కాలి బొటనవ్రేళ్ళయందు వాయు నిరోధనము, (లేక) స్వభావకుంభక ప్రాణాయామాభ్యాసము - **“ప్రత్యాహారము”**.

---

**“ప్రత్యాహారో” అయం ఉక్తస్తు,**
**ప్రత్యాహార పరైః పరా। ఏవం అభ్యాసయుక్తస్య**
**పురుషస్య మహాత్మనః,**
**సర్వపాపాని నశ్యంతి భవరోగశ్చ సువ్రత!**

- ఇది పరము (ఉత్కృష్టము, విశేషము) అయినట్టి **ప్రత్యాహారము.** ఎందుకంటే మనో బుద్ధుల నియామకమునకు సంబంధించినది.

ఓ సువ్రతా! ఇట్టి విశేష ప్రత్యాహారముచే భవరోగమునకు సంబంధించిన సర్వ పాపములు నశిస్తాయి. ఆతడు 'మహాత్ముడు' అగుచున్నాడు.

---

**నాసాభ్యాం వాయుం ఆకృష్య నిశ్చలః స్వస్తిక ఆసనః,**
**పూరయేత్ అనిలం విద్వాన్ ఆపాద తలమస్తకమ్॥**

స్వస్తి కాసనము ధరించి ముక్కుతో వాయువున ఆకృష్యము చేసి (ఆకర్షించి), యోగవిద్య నేర్చిన విద్వాంసుడు అభ్యాసపూర్వకంగా గోరు నుండి తలపై గల వెంట్రుకల వరకు ఆపాదతలమస్తకము వాయువును పూరించటము సిద్ధించుకోగలడు.

---

**పశ్చాత్ <u>పాదద్వయే</u> తద్వత్, <u>మూలాధారే</u>**
**తథాఏవ చ, <u>నాభికందే</u> చ <u>హృత్ మధ్యే</u>**
**<u>కంఠమూలే</u> చ <u>తాలుకే</u>।**

అట్టి వాయువును

- ఉభయపాదములలోను
- ములాధార ప్రదేశములోను,
- నాభి కింద ప్రదేశములోను
- హృదయాకాశమునందు,
- కంఠమూలమునందు (బొడ్డుకు క్రిందగల మాంసఖండము నందు),

---

**<u>భ్రువోః మధ్యే, లలాటే</u> చ, తథా**
**<u>మూర్ధని</u> ధారయేత్।**
**దేహేతు ఆత్మ మతిం విద్వాన్**
**సమాకృష్య సమాహితః,**
**ఆత్మన్ ఆత్మని నిర్ద్వంద్వే నిర్వికల్పే**
**నిరోధయేత్।**
**(ఇతి) <u>ప్రత్యాహారః</u> సమాఖ్యాతః <u>సాక్షాత్</u>**
**వేదాంత వేదిభిః। (సాక్షాత్ప్రత్యాహారము)।**
**ఏవం అభ్యసతః తస్య,**
**న కించిత్ అపి దుర్లభం। ఇతి॥**

- భ్రూ - మధ్య ప్రదేశములోను,
- లలాటమునందు,
- ముఖో - ఉపరి మూర్ధ ప్రదేశమునందు,

ఒకచోటు తరువాత మరోచోటు యోగాభ్యాసపూర్వకమైన ధారణచేస్తూ (ప్రాణాయామ విధాన కుంభకము (లేదా) స్వాభావిక కుంభకము) ఉండటము కూడా - <u>**ప్రత్యాహారము.**</u>

యోగ విద్వాంసుడైనవాడు ఒకవైపు తన-తదితరుల దేహములను కళ్ళతో చూస్తూనే,...సమాహితుడై వాయువును సమాకర్షించి - జీవాత్మను నిర్ద్వంద్వము, నిర్వికల్పము అగు పరమాత్మయందు నిరోధనము (అనన్యభావనచే ఏకము) చేయు చున్నాడు. దేహముపట్ల ఆత్మబుద్ధిని త్యజించి వేస్తున్నాడు. ఇతరులకు మార్గదర్శి అగుచున్నాడు.

ఇదియే ఉత్తమోత్తమగు 'ప్రత్యాహారము' అని వేదాంతవేద్యులచే ప్రకటించబడుచున్నది. ఈ విధంగా అభ్యసించటము దుర్లభమేమీ కాదు. తప్పక సాధ్యమే. న తు దుర్లభం। న కించిదపి దుర్లభమ్।

## అష్టమ ఖండము (ధారణ)

అష్టమ ఖండము (ధారణ)

1 అథ అతః సంప్రవక్ష్యామి
"ధారణాః పంచ", సువ్రత!
దేహమధ్యగతే వ్యోమ్ని
బాహ్య ఆకాశస్తు ధారయేత్।

ఓ సువ్రతా! సాంకృతీ! ఇప్పుడు ఇక **"ధారణాపంచకము"** గురించి వివరించుకుంటున్నాము. వినండి.

**ఆకాశాత్మధారణ** : బాహ్యమునగల ఆకాశము (space) దేహమునందు మధ్యగతమైయున్న ఆకాశమును ఏకరూపంగా భావన చేస్తూ ఉండటము. అనగా, దేహగతాకాశమే విశ్వగత - ఆకాశమని, విశ్వ గతాకాశమే దేహగతమై యున్నదని భావన కలిగి ఉండటము. ఇదియే అఖండాకాశధారణము.

---

ప్రాణే బాహ్య అనిలం తద్వత్
జ్వలనే చ అగ్నిం ఔదరే।
తోయం తోయాంశకే భూమిం
భూమిభాగే, మహామునే!

**అగ్న్యాత్మధారణ** : బాహ్యమున జ్వలిస్తూ ఉండే అగ్నియే ఉదరములో (పొట్టలో) జఠరాగ్ని రూపముగా ఉన్నదను భావన, ఉపాసన. అఖండ **అగ్నిధారణ.**

**వాయోపాసన** : వ్యష్టిగతమైన నా ప్రాణము విశ్వగతమైన 'విశ్వప్రాణము' లేక సప్రాణముయొక్క అఖండ ప్రదర్శనా చమత్కారమే - అని ఉపాసించటము. - **అఖండవాయుధారణ.**

**తోయ ఉపాసన** : 'విశ్వజలతత్త్వమే ఈ నా దేహములోని ద్రవపదార్థముల ప్రదర్శనము - అని భావించటం. **అఖండతోయధారణ.**

**భూమిఉపాసన** : జగత్తులోని భౌతిక ధర్మమే నా దేహమునందు భౌతిక వస్తురూపమై (As matter)గా యున్నదను ఉపాసన. **అఖండభూధారణ.**

---

'హ-య-ర-వ-ల' క ఆరాఖ్యాం మంత్రం
ఉచ్చారయేత్ క్రమాత్। 'ధారణ' ఏషా
పరా ప్రోక్తా, సర్వపాప విశోధినీ॥
'జాను'-అంతం (జాన్వంతం) పృథివీ హి అంశో హి।
'అపాం' పాయు - అంశం ఉచ్యతే।
'హృదయాంశః' తథా అగ్ని - అంశో।
'భ్రూమధ్యాంశో' అనిల అంశకః।
ఆకాశ-అంశః తథా, ప్రాజ్ఞ!
'మూర్ధాంశః' పరికీర్తితః ।

అట్టి విశ్వతత్త్వమును

హ = ఆకాశ    య = వాయు    ర = అగ్ని
వ = ద్రవ    ల = స్థూల

అను బీజాక్షరములను "హ-య-ర-వ-ల...."ఉచ్చారణచే ధారణ చేస్తూ వ్యష్టిగతమైనదంతా విశ్వగతమైన తత్త్వముతో ఏకము చేయుటయే 'పరా ఉపాసన'. ఇది సర్వపాపములను శోధించి శుభ్రము చేయగలదు.

భ్రూమధ్య నుండి - మూర్ధము వరకు ఆకాశ అంశ ।
హృదయము నుండి - భ్రూమధ్య వరకు అనిల (వాయు) అంశ।
పాయువు నుండి - హృదయము వరకు అగ్ని - అంశ
జానువుల నుండి-పాయువు (విసర్జకావయము) వరకు అపాంశ (జలాంశ)
పాదముల నుండి - జానువులు (మోకాళ్ళు) వరకు పృథివీ అంశ
అని ప్రాజ్ఞులచే పరికీర్తించబడుచూ, ఉపాసించబడుచున్నది.

---

బ్రహ్మాణం పృథివీ భాగే।
విష్ణు తోయాంశకే తథా।
అగ్ని అంశే చ మహేశానం,
ఈశ్వరం చ అనిల అంశకే । ఆకాశ అంశే, -
మహాప్రజ్ఞ! ధారేయేత్తు సదాశివమ్॥

హే మహాప్రాజ్ఞా! 'ధారణపంచకము'లో అంతర విధానంగా "పంచ అధి - దేవతా ధారణ" ఎట్లా చేయాలో వినండి.

| | | |
|---|---|---|
| బ్రహ్మదేవుని | - | పృథివీ భాగమునందు, |
| విష్ణుదేవుని | - | జలాంశయందు, |
| మహేశ్వరుని | - | అగ్ని అంశయందు |
| ఈశ్వరుని | - | వాయు అంశయందు |
| సదాశివుని | - | ఆకాశ అంశయందు |

ఆయా అంశలుగా భావిస్తూ ధారణ చేయబడుగాక। ఆయా దేవతల అంశలుగా ఉపాసించబడుగాక।

అథవా, తవ వక్ష్యామి, ధారణాం,
మునిపుంగవ!
పురుషే సర్వశాస్తారం
బోధ ఆనందమయం శివమ్,
ధారయేత్ బుద్ధిమాన్ నిత్యం సర్వపాప విశుద్ధయే॥

నియామకః తత్

మరొకటైన ధారణా విధానము చెప్పుచున్నాను 'మునిపుంగవా! వినండి. ''సర్వమ్ శాసయతేది ఇతి శాస్తారమ్'' - అనబడు సర్వశాస్త (నియమకుడు), బోధానందమయుడు (సమస్తమును తనయొక్క ఎరుకయందు ఎరుకచే కల్పించుకొని ఆనందించువాడు) - అగు శివభగవానుని (శివతత్త్వమును) ధారణ చేయుదురుగాక! అట్టి బుద్ధిమంతుడు సర్వపాప దోషములనుండి విశుద్ధుడు కాగలడు.

---

బ్రహ్మ ఆది-కార్యరూపాణి
స్వే స్వేసంహృత్య కారణే,
సర్వకారణం, అవ్యక్తం, అనిరూప్యం
అచేతనమ్,
సాక్షాత్ ఆత్మని సంపూర్ణే ధారయేత్
ప్రణవే నరః।
ఇంద్రియాణి సమాహృత్య
మనసః ఆత్మని యోజయేత్। ఇతి॥

ఇంకొకతీరైన 'ధారణ' :: కారణ కారణః నియామతఃతత్

సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు (మరియు) సమస్త సృష్టి...మొదలైనవన్నీ కూడా **"కార్య"** (Workmanship) రూపంగా భావించుచూ,
అట్టి సమస్తమునకు **కారణ రూపుడు** అయి ఉన్నవారు అవ్యక్తుడు. కేవలుడు, ఆయన రూపరహితుడు. నిరూపణకు దొరకనివాడు. సమస్తరూపములు తానే అయినవాడు. కదలికలు - రాకపోకలు లేనివాడుగుటచే అచేతనుడు. అట్టి ఆత్మ భగవానునియందు (లేక-ఆత్మయందు) 'ప్రణవము' యొక్క శబ్దార్థభావనను చేర్చుటము **'ధారణ'**। స్వస్వరూపముతో సహా ఈ సమస్తము అనన్యుడగు ఆత్మభగవానుని లీలాప్రదర్శనముగా దర్శించటము - 'ధారణ'।
"ఈ జగత్తంతా కార్యము - ఆ పరమాత్మయే కారణకారణము" - అని భావించి ఉపాసించటము - **ధారణ।**
ఇంద్రియులన్నీ విషయములతో సహా మనస్సు ద్వారా ఆత్మయందు నియమించటము. ఆత్మగా మనస్సుచే సర్వదా సర్వత్రా అవిచ్ఛిన్నంగా ఈ సమస్తమును సందర్శించటము (నవలు చదువుచూ అందులోని పాత్రలను నవలారచయితయొక్క కవితా కల్పనగా ఎరిగి ఉండురీతిగా) సమస్తము ఆత్మయందు దర్శించటము - ఇది ధారణ।

---

## నవమ ఖండము (ధ్యానము)

**1. సోఽహమ్:**

**అథ అతః సంప్రవక్ష్యామి "ధ్యానం" సంసార నాశనమ్।
ఋతం సత్యం పరం బ్రహ్మ సర్వ సంసార భేషజమ్,
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపం మహేశ్వరమ్ -
సోఽహమ్ - ఇతి ఆదరేణ ఏవ
ధ్యాయేత్ యోగీశ్వరేశ్వరమ్॥**

## నవమ ఖండము (ధ్యానము) సోఽహమ్ పరమమ్।

ఓ సాంకృతి యోగీశ్వరా!
'సంసారము' అనబడే పాంచభౌతిక దృశ్యముతో శబ్దస్పర్శ రూపరసగంధ పాశముల రూపంగా ఏర్పడియున్న సంబంధరూప 'బంధము' తొలగేది ఎట్లా? ఇందుకు ఏ 'ధ్యానము' ఉపకరించగలదో, అట్టి 'ధ్యాసరూప ధ్యానము' గురించి (దేనిని ధ్యాన విషయముగా కలిగి ఉండటం చేత సంసార దోషము తొలగగలదో) - అది చెప్పుచున్నాను.
ఋక్కులచే గానము చేయబడుచు, ఋషులకు స్వానుభవమగుచున్న **ఋతము** - అగు ఆత్మయే ధ్యానవస్తువు।
- ఏది పరమ **సత్యమై** ఉన్నదో,
- సమస్తమునకు ఆవల **'పరము'**గా ప్రకాశమానమైయున్నదో,
- **'పరంబ్రహ్మము'**గా సన్నుతించబడుతోందో,
- సంసార **రోగమునకు ఔషధమో,**
- ఆవల ప్రకాశమానుడై ఉండటంచేత **ఊర్ధ్వరేతసుడో,**
- సర్వము తన రూపము అయినట్టి వాడో, సర్వము యొక్క వాస్తవ రూపము చూడగలుగు కన్నులు దృష్టి గల **విరూపాక్షుడో**, నామ రూపములకు ఆవలివాడో,
- యోగ **యోగీశ్వరేశ్వరుడో - అట్టి పరతత్త్వమే నేనై ఉన్నాను.**
**"సోఽహమ్"**....అని ధ్యానించాలి. **'తత్ త్వ మేవ'** అని 'నీవు'ను దర్శించుచుండుము.

అహమస్మి తత్:
**అథవా సత్యం ఈశానం జ్ఞానం ఆనందం**
**అద్వయమ్, అత్యర్థం, అచలం, నిత్యం,**
**ఆది మధ్యాంత వర్జితమ్,**
**తథా స్థూలమ్, అనాకాశమ్,**
**అసంస్పృశ్యం, అచాక్షుషమ్**
**న రసం, న చ గంధ అఖ్యమ్, అప్రమేయమ్,**
**అనూపమమ్, ఆత్మానం సచ్చిదానందం**
**అనంతం బ్రహ్మ, సువ్రత! :-**
**అహాస్మి - ఇతి అభిధ్యాయేత్,**
**ధ్యేయ-అతీతం విముక్తయే॥**
**ఏవం అభ్యాస యుక్తస్య పురుషస్య**
**మహాత్మనః, క్రమాత్ వేదాంత విజ్ఞానం**
**విజాయేత। న సంశయః। ఇతి॥**

సచ్చిదానంద పరబ్రహ్మమ్ అహమేవ

**లేక (ఇంకా కూడా)**: సత్యస్వరూపుడు, సర్వముగా విస్తరించి ఉన్నట్టి 'ఈశానుడు', ఈ సమస్తము స్వస్వరూపముగా కల్పించుకొని, దర్శించుచూ ఆనందించు జ్ఞానానందమయుడు, భూత-చిత్తాకాశములకు వేరైన చిదాకాశస్వరూపుడు, స్పర్శ-చూపు రూప - రస - గంధములకు విషయమేకానట్టి నిర్విషయ స్వరూపుడు, నిశ్చలుడు, అగు 'సచ్చిదానంద పరబ్రహ్మము'' ధ్యాన విషయముకావాలి.

**''అట్టి పరబ్రహ్మము నేనే।'' ''నేను''గా ఉన్నది పరబ్రహ్మమే। అహమస్మిబ్రహ్మమ్।''** - అని ధ్యానము చేస్తూ ఉండగా అట్టివాడు ధ్యాని ధ్యేయాతీతమగు విముక్తి పొందుచున్నాడు.

''ఇటువంటి సోఽహమ్ - తత్త్వమ్ - త్వమేవాఽహమ్'' అధ్యాసయుక్తుడగువాడు మహాన్‌పురుషుడు (సమస్తము నాయొక్క పురుషకారమే అను అవగాహన అనుభవపరుడు) అగుచున్నాడు.

జీవుడు ఈవిధమైన అధ్యాసచే క్రమంగా సోఽహమ్ వేదాంత విజ్ఞాన స్థానము సిద్ధించుకోవాలయ్యా! ఇదియే జీవిత మహోదాశయము.

అత్రన సందేహః! ఇందులో అనుమానము లేదు.

---

## దశమ ఖండము (సమాధి-స్వానుభవము)

1 **అథ అతః సంప్రవక్ష్యామి**
**''సమాధిం'', భవ నాశనమ్। సమాధిః**
**సం విత్ ఉత్పత్తిః పరజీవ ఏకతాం ప్రతి।**
**నిత్యః సర్వగతో హి ఆత్మా, కూటస్థో**
**దోషవర్జితః, ఏకః సన్ భిద్యతే**
**భ్రాంత్యా మాయయా న స్వరూపతః।**

## దశమ ఖండము (సమాధి-స్వానుభవము)

ఓ సాంకృతీ! ఇప్పుడు భవరోగమునకు దివ్యౌషధమగు **''సమాధి''** యొక్క వివరణను చెప్పుకుంటున్నాము. వినండి.

ఈ జీవుని జగత్ వ్యవహారమంతా (జగత్) - నాటకములోని పాత్రవంటిది. ఇక్కడి-పర-ఇహముల ఉత్పత్తి స్థానము ఆత్మయే। అట్టి పరమాత్మ కూటస్థుడై, ఆత్మయందు నిత్యగతుడై, సర్వగతుడై విషయవర్జితుడై ఉన్నాడు. అట్టి సత్- విత్ పరమసత్యమునందు అభ్యాసమే ''సమాధి''. 'మాయ'కు సంబంధించిన భ్రాంతి తొలగినదై, **స్వరూపతః జగత్తు అనబడే అన్యత్వమే లేదని గ్రహించటమే 'సమాధి'**. సర్వవేదనలకు అట్టి సమాధి స్థానమే ఉపాయము.

---

**తస్మాత్ అద్వైతమ్ ఏవ అస్తి। న ప్రపంచో,**
**న సంసృతిః। యథా ఆకాశో ఘటాకాశో**
**మఠాకాశ - ఇతి ఈరితః,**
**తథా భ్రాన్తైః ద్విధా ప్రోక్తా హి ఆత్మా :-**
**జీవ, ఈశ్వర ఆత్మనా॥**

ఆకాశము (Space) ఏకమే అయినప్పటికీ - ఇది ఇల్లు ఉన్న స్థలము. ఇది కుండ ఉన్న స్థలము - అనే భేదమును కల్పించుకొని చూస్తూ ఉంటాము కదా! అట్లాగే 'పరమాత్మ - జీవాత్మ - దృశ్యజగత్తు' అనునవి వేరువేరుగా లేవు. ప్రపంచము లేదు. దానితో ఏర్పడు సంసృతి అనబడునది లేదు. జీవ-ఈశ్వర ఏక స్వరూపమగు అద్వైతమే సత్‌స్వరూపమై యున్నది.

''మహాకాశము - మఠాకాశము - ఘటాకాశము''ల వలె భ్రాంతి చేతనే జీవాత్మ - దృశ్య జగత్తు - పరమాత్మలు వేరువేరు విధములుగా అగుబడటం (లేక) అనిపించటం జరుగుతోంది.

---

**న అహం దేహో। న చ ప్రాణో।**
**న ఇంద్రియాణి। మనో నహి।**
**సదా సాక్షి స్వరూపత్వాత్**
**శివ ఏవ అస్మి కేవలః।**
**ఇతి ధీర్యా మునిశ్రేష్ఠ!**
**సా ''సామాధిః'' ఇహ ఉచ్యతే॥**

**నేను సర్వదా కేవలమగు ఆత్మస్వరూపుడనే. అంతేగాని నేను ఈ భౌతిక దేహముగా గాని, ప్రాణములుగా గాని, పంచేంద్రియములుగా గాని, మనస్సుగా గాని అగుటయే లేదు.**

**నేను ఈ బాహ్య దృశ్యమునకు, భౌతిక దేహమునకు, మనోబుద్ధి చిత్త అహంకారాలకు సర్వదా కేవల సాక్షి స్వరూపుడను. అందుచేత కేవల శివానంద స్వరూపుడనే!**

ఓ మునిశ్రేష్ఠా! ఇట్టి బుద్ధి యొక్క నిశ్చలమగు స్థితియే సమాధి. (A state of Non-distracting decesion of ones own all - present self)

| | |
|---|---|
| సోऽహమ్ బ్రహ్మ। న సంసారీ। న మత్తో అన్యః కదాచన। యథా ఫేన తరంగ – ఆది సముద్రాత్ ఉత్థితం పునః, సముద్రే లీయతే, తద్వత్ జగత్ మయి అనులీయతే। తస్మాత్ మనః పృథక్ వాస్తి। జగన్మాయా చ నాస్తి హి॥ | **సమాధి సంస్థితుని అవగాహన**<br>"నేను 'సంసారి'ని ఏమాత్రమూ ఏ క్షణము కూడా అయి ఉండనేలేదు. పరబ్రహ్మమే సర్వదా నేనై ఉన్నాను. బ్రహ్మమునకు అన్యము ఏ క్షణమందును కాను." - అను సునిశ్చయమే సమాధి.<br>ఫేనము (నురుగు), తరంగములు...ఇవన్నీ సముద్ర జలము నుండి జనించి, జలములోనే ఉండి, తిరిగి సముద్రజలములోనే లీనము అవటం లేదా? అట్లాగే అఖండ-అప్రమేయ-అక్షర ఆత్మ స్వరూపుడనగు నానుండే జగత్తు అనబడునది ప్రదర్శనమౌతోంది, నాయందే విలీనమౌతోంది. అందుచేత మనస్సుగాని, మాయగాని, జగత్తుగాని నాకు వేరైన ఉనికి కలిగిలేవు. |
| యస్య ఏవం పరమాత్మా అయం ప్రత్యక్ భూతః ప్రకాశితః, స తు యాతి స పుం భావం స్వయం సాక్షాత్ పరామృతమ్॥ | ఎవ్వరికైతే పరమాత్మ ఈ విధంగా ప్రత్యక్ భూతుడై (విషయ రహిత కేవల స్వరూపమై) ప్రకాశమానమౌతారో, అట్టి వానిచే - సాక్షాత్ పదము - అమృతము అగు పరమ పురుషకారము పొందబడుచున్నది. ఈ సమస్తము నా చేతనే। నాయందే। నావలననే। నేనే" అను అనుక్షణికాను - భూతము సిద్ధపురుషత్వము. "అహమేవ కారణకారణ పరమాత్మన్" - అనునది అనుక్షణికంగా, అవ్యాజముగా సునిశ్చితమౌతుంది. ఆతడు స్వయం సాక్షాత్ పరామృతుడు - అగుచున్నాడు. |
| యదా మనసి చైతన్యం భాతి సర్వత్ర గం సదా, యోగినో అవ్యవధానేన, తదా సంపద్యతే స్వయమ్॥ | ఎవ్వని మనస్సుకైతే సర్వే సర్వత్రా ఆత్మచైతన్యమే ఈ సమస్తముగా భాసించుచూ అనుభూతమగుచున్నదో, అట్టివానికి అవ్యవధానంగా, అవ్యాజంగా సమస్తము స్వయముగా స్వస్వరూపమై, ప్రాప్తించినదగుచూ ఉంటుంది. అట్టి యోగి సమస్తము తానే అయి ఆస్వాదిస్తున్నాడు. |
| <u>యదా సర్వాణి భూతాని స్వాత్మన్యేవ హి పస్యతి, సర్వ భూతేషు చ ఆత్మానం బ్రహ్మ సంపద్యతే తదా॥</u> | ఎవ్వడైతే సర్వభూతజాలమునందు స్వస్వరూపాత్మను, స్వస్వరూపాత్మ యందే సర్వభూతజాలమును స్వాభావికంగా దర్శించుచూ ఉంటాడో - అప్పుడు అట్టివాడు అప్పటికప్పుడే బ్రహ్మ సంపద్యమును (లేక) బ్రహ్మ సాక్షాత్కారము పొందుచున్నాడు. |
| యదా సర్వాణి భూతాని సమాధిస్థో న పశ్యతి, ఏకీ భూతః పరేణ అసౌ తదా భవతి కేవలః॥ | ఎవ్వడైతే సమాధిస్థితుడై సర్వత్రా సమదర్శన బలముచేత అన్యముగాని, భూతజాలముగాని ఏమాత్రము - భేదదృష్టితో (స్వాభావికంగానే) చూడనివాడై ఉంటాడో, ఏకీభూతపరుడై సమస్తము స్వస్వరూపానందముగా దర్శిస్తూ ఉంటాడో....అట్టివాడు కేవలత్వము సిద్ధించుకొని "కైవల్యము" పొందుచున్నాడు. |
| **2.** యదా పశ్యతి చ ఆత్మానం కేవలం పరమార్థతః, మాయా మాత్రం జగత్ కృత్స్నం, తదా భవతి నిర్వృతిః॥ | ఎవ్వడైతే<br>- తనను తాను కేవలునిగా పరమార్థముగా చూచుచున్నాడో<br>- 'త్వమ్' అనబడు 'నీవు'ను కూడా కేవల - పరమార్థమగు బ్రహ్మముగా దర్శించుచున్నాడో, అట్టివాడు అవ్యాజమగు, నిర్వృతమగు (కల్పనారహితమగు) ఆత్మానందము పొందుచున్నాడు. |
| ఏవం ఉక్త్వా స భగవాన్ దత్తాత్రేయో మహామునిః, సాంకృతిః స్వస్వరూపేణ సుఖం ఆస్తేతి నిర్భయ। ఇతి॥<br><u>ఇతి దర్శనోపనిషత్ సమాప్తా।</u><br><u>*ఓం శాంతిః శాంతిః శాంతిః॥*</u> | భగవానుడగు శ్రీదత్తాత్రేయ అవధూత ఈ రీతిగా పలికిన ఆత్మజ్ఞాన - బోధవాక్యములను సాంకృతి ముని భక్తి - శ్రద్ధ - బుద్ధి - ప్రపత్తులతో విన్నారు.<br>స్వస్వరూపమునందు నిశ్చలులై నిర్భయులైనారు.<br><u>***ఇతి దర్శనోపనిషత్।***</u><br><u>***ఓం శాంతిః శాంతిః। శాంతిః ॥***</u> |

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 6 దర్శనోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

**శ్లో॥ యమాది అష్టాంగయోగేద్ధం బ్రహ్మమాత్ర ప్రబోధితః**
**యోగినో యత్ పదం యాంతి, తత్ 'కైవల్యపదం' భజే॥**



*శ్రీ దత్తాత్రేయ అవధూత జగద్గురవే నమో నమః।*
*శ్రీ సాంకృతి మునీశ్వరాయ నమః॥*

యోగపుంగవులు యోగాభ్యాసపరాకాష్ఠచే, **(యమ-నియమ-ఆసన-ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన-ధారణ-సమాధి)** అష్టాంగయోగ అభ్యాసముచే - మహత్తరమగు అంతిమ సత్ఫలితము పొందుచున్నారో, ఏ పదమును స్వాభావికరూపంగా సిద్ధించుకొనుచున్నారో..., అట్టి **కైవల్యపదము కొరకై ఆత్మతత్త్వజ్ఞులగు శ్రీ దత్తాత్రేయ అవధూతను శరణువేడుచున్నాము.**

⁂ ⁂ ⁂

**"ఓం"**

**శ్రీ అవధూత దత్తాత్రేయులవారికి** నమస్కరిస్తున్నాము. వారు **యోగయోగీశ్వర - మహాయోగి.** సమస్తమును చైతన్యపరచు **కేవలతత్త్వ** భగవానుడు. ఈ భౌతిక ప్రపంచమంతా భావనారూపముగా గుర్తెరిగినవారగుటచే **భూతభావనులు.** జాగ్రత్ - స్వప్న - సుషుప్తి తురీయములను స్వయంకల్పిత క్రియావిశేషములుగా దర్శించువారు కాబట్టి **చతుర్భుజులగు మహావిష్ణుస్వరూపులు. యోగసామ్రాజ్యమునకు చక్రవర్తి.** భక్తిగా నమస్కరించినంత మాత్రముచేతనే ఎట్టివారికైనా ఆత్మజ్ఞానబోధను ప్రసాదించువారు కాబట్టి **జగద్గురువులు.**

అట్టి పరానంద స్వరూపులగు శ్రీ దత్తాత్రేయ స్వామిని జ్ఞానభిక్షకై శరణు వేడుచున్నాము. వారిని శిష్యులై సేవించువారిలో ఒకరు శ్రీ సాంకృతి ముని. ఆయన గురుసేవతో భక్తిసంపదను సిద్ధించుకుని, దత్తాత్రేయులవారికి ప్రియశిష్యులైనారు.

**ఒకరోజు...**

శ్రీ దత్తాత్రేయ స్వామి ప్రశాంతముగా ఆత్మానందానుభవులై ఒక ఏకాంత ప్రదేశములో ఆసీనులై ఉన్నారు. అప్పుడు సాంకృతిముని రెండు చేతులు జోడించి, ప్రాంజలి ఘటిస్తూ, హృదయపూర్వకంగా నమస్కరిస్తూ భక్తి-ప్రపత్తి-వినయములతో జగద్గురువును సమీపించారు. త్రిప్రదక్షిణములు చేసి సాష్టాంగదండ ప్రణామములు సమర్పించారు. ఎంతో సంతోషించిన శ్రీదత్తాత్రేయులవారు ప్రియశిష్యునికి స్వాగతం పలికి ప్రక్కనే కూర్చోబెట్టుకున్నారు.

**శ్రీదత్తాత్రేయస్వామి :** ప్రియ సాంకృతి మునీంద్రా! రావయ్యా! ఏమిటి విశేషం? ఏమి శ్రవణం చేయాలని అభిలషిస్తున్నావో అడుగవయ్యా!

**సాంకృతిముని :** స్వామీ! అస్మత్ సద్గురూ! నమో నమః! హే భగవన్! సంప్రపంచకమైన (ఈ ప్రపంచము సాధనవస్తువుగా అవగల) అష్టాంగయోగముల గురించి అంతరార్థపూర్వకంగా తమ ముఖతః వినాలని మిమ్ములను వేడుకొంటున్నాను. ఎట్టి విశేషము తెలుసుకున్నంతమాత్రంచేత నేను జీవన్ముక్తుడను కాగలనో, అట్టి (అష్టాంగ) యోగవిశేషాలు నాకు దయతో బోధించండి - **యేన విజ్ఞానమాత్రేణ జీవన్ముక్తో భవామి అహమ్!!**

**శ్రీదత్తాత్రేయ జగద్గురువు** : ప్రియపరబ్రహ్మస్వరూపా! సాంకృతి మహాశయా! అట్లాగే, నీవు కోరుచున్నట్లు **'అష్టాంగ యోగ దర్శనము'** గురించి చెప్పుకొందాము. వినండి.

**యోగము యొక్క అష్ట (8) అంగములు : (1) యమము (ఇంద్రియములను విషయములనుండి వెనుకకు మరల్చటము) (2) నియమము (ఇంద్రియములను నియమించటము) (3) ఆసనము (4) ప్రాణాయామము (5) (తత్‌పరమైన) ప్రత్యాహారము (6) (పరమునకు సంబంధించిన) ధారణ (7) (ఆత్మ సందర్శన ధ్యాసరూపమగు) ధ్యానము (8) సమాధి.**

ఇవి యోగాభ్యాసము యొక్క '8' అంగములుగా శాస్త్రీయమై ఉన్నాయి. ఆత్మతత్త్వజ్ఞులు, తత్త్వదర్శులు, తత్త్వప్రాజ్ఞులు అగు మహనీయులచే శాస్త్రముల రూపముగా అనేకవిధములుగా ఎలుగెత్తి గానము చేయబడుచున్నాయి.

## అష్టాంగయోగములలో మొదటిది : "యమము"

**యమా-దశః (10) యమయోగాంగముయొక్క దశ (10) ఉపాంగములు**

| | | | | |
|---|---|---|---|---|
| (1) అహింస | (2) సత్యము | (3) అస్తేయము | (4) బ్రహ్మచర్యము | (5) దయ |
| (6) ఆర్జవము | (7) క్షమ | (8) ధృతి | (9) మితాహారము | (10) శౌచము |

ఇతి యమా దశ॥

(యమము = ఇంద్రియ-విషయ తాదాత్మ్యము నుండి బుద్ధిని ఉపసంహరించు ప్రయత్నములు.

ఓ తపోధనా! అట్టి 'యమము' అనే అంగము యొక్క దశ (10) ఉపాంగముల గురించి ఇప్పుడు వివరించుకుందాము.

**(1) అహింస** : **వేదము చెప్పియున్న** సందర్భములను తప్పించి, (అట్లానే) **సత్యమును ఆశ్రయించు ప్రయత్నము**లో తప్పించి - తదితర **సర్వసందర్భములలో** - కాయము (శరీరము) తోగాని, మనస్సు (ఆలోచనల)తోగాని, వాక్కుతోగాని ఇతరులను హింసించటము (లేక) బాధించటమును 'హింస' అని అంటారు. అద్దానికి అన్యథా (The opposite) అయినది **'అహింస'!** అని లోకరీతి. 'అహింస'ను ఓర్పుగా అభ్యసించటము - మొదటి ఉపాంగము.

అయితే ఓ మునీ! వేదవేదాంత వేద్యులగు మహనీయుల స్వానుభవపూర్వకమగు అభిప్రాయము ప్రకారము 'అహింస' అనగా ఏమిటో వినండి.

**శ్లో॥ "ఆత్మా సర్వగతో, అచ్ఛేద్యో, న గ్రాహ్య"-ఇతి యా మతిః,**
**సా చ 'అహింసా పరా' ప్రోక్తా మునే! వేదాంత వేదిభిః॥**

"ఆత్మ సర్వదా సర్వగతము (All present and All extended). అది **"జీవాత్మ-పరమాత్మ"**గా గాని, **'నేను-నీవు'ల రూపమగు అనేక జీవులుగా గాని ఛేద్యము** (Bifurcated) **అగుట లేదు. ఆత్మ ఆఛేద్యము అని, 'అఖండము" - అని ఎవ్వని బుద్ధి - తత్త్వభావనగా కలిగి ఉంటుందో, అదియే** 'అహింస'. అందుకు అనన్యమైనది హింస.

**(2) సత్యము : చక్షురాది ఇంద్రియైః దృష్టం, శ్రుతం, ఘ్రాణం - మునీశ్వర! తస్యైవ ఉక్తిః భవేత్ సత్యం, విప్ర! తత్ న అన్యథా భవేత్॥**

లోకరీతి ప్రకారము "ఈ కళ్లు, చెవులు, ముక్కు, చర్మము మొదలైన ఇంద్రియములకు ఏది కనబడుతోందో, వినబడుతోందో, వాసన చూడబడుతోందో అది మాత్రమే ఉక్తికి (Logically speaking) సత్యము. ఇందుకు వేరైన సత్యమేదీ లేదు" - అని (పరిమితదృష్టిచే) అనుకోబడుతోంది. అయితే వేదాంత (తెలుసుకొనుచున్నవానిగురించిన విజ్ఞానము సంపాదించుకొన్న) పారగుల (EXPERTS) యొక్క అభిప్రాయమో?

**శ్లో॥ సర్వం సత్యం పరబ్రహ్మ। న చ అన్యత్ - ఇతి యా మతిః**
**తత్ చ సత్యం పరం ప్రోక్తం - వేదాంత జ్ఞాన పారగైః॥**

"ఈ ఇంద్రియములకు కనిపిస్తున్న **దృశ్యము,** ఇద్దానిని దర్శించుచున్న **ద్రష్ట,** అట్టి ద్రష్టకు సాక్షి అగు **దృక్**... ఈ సమస్తము పరబ్రహ్మస్వరూపమే! బ్రహ్మమునకు కించిత్ కూడా అన్యము కాదు. కనుక **ఈ జీవుడు స్వతఃగా పరబ్రహ్మమే। సందర్భంగా కనిపించేది అపాదితము** (Attributively visualized) **మాత్రమే"** - అను పరమసత్యమును (వేదాంత పారగులు) ఎలుగెత్తి గానం చేస్తున్నారు. బుద్ధికి ఆరీతిగా అనుభవమగుచున్నదే సత్యము. ఎక్కడైనా ఏదైనా **"పరబ్రహ్మమునకు ఇది వేరైనది కదా!"** - అని అనిపిస్తూ ఉంటే.... **అది అసత్యము.** (లేక) కల్పనామాత్రము.

**(3) అస్తేయము :**

> **శ్లో॥ అన్యదీ యే తృణే రత్నే కాంచనే మౌక్తికేపి చ,**
> **మనసా వినివృత్తిర్యా, తత్ 'అస్తేయం' విదుః బుధాః॥**

**బుధుల దృష్టిలో** → ఇతరులకు చెందిన ఒక గడ్డి పరకగాని, రత్నమునుగాని, బంగారమునుగాని - మౌక్తికము (ముత్యము)గాని - వీటన్నిటిపట్ల ఎవ్వరైతే "తీసివేసుకుందాము" - అనే వృత్తిని దగ్గరకు రానీయరో.....అట్టి వారియొక్క స్వాభావిక వినివృత్తియే "అస్తేయము". అయితే ఇది లౌకమైన అర్థము. (స్తేయము = దొంగతనము). అనగా, దొంగతనము చేయకుండటమే అస్తేయము అని వ్యావహారిక నిర్వచనము. అయితే ఓ మహామతీ! తత్త్వశాస్త్రము చెప్పు పరమార్థము వినండి.

**ఆత్మవేత్తల ప్రవచనము : ఆత్మని ఆనాత్మభావేన వ్యవహార వివర్జితమ్ యత్, తత్ - 'అస్తేయమ్' ఇత్యుక్తమ్ ఆత్మవిద్భిః, మహామతే!**

ఒక నాటకము యొక్క కథాగమనము బాగుండటము , బాగుండకపోవటము - అనేవి నాటక దీపము(Light focussed on the stage) పై ఆపాదించము కదా! అట్లాగే **అనాత్మకమగు భేద వ్యవహారములపట్ల "ఇది ఆత్మధర్మము" అని ఆత్మపై ఆపాదించకపోవటమే "అస్తేయము".** ఆత్మకు గుణములను, సందర్భములను, సంగతులను, మార్పు - చేర్పులను, స్థితి - గతులను, జీవాత్మ - పరమాత్మ భేదములను....మొదలైనవి ఆపాదించి సాంసారిక దృష్టితో నమ్మిక కలిగి ఉండటమే **'స్తేయము'** లేక **'దొంగతనము'** - అని శాస్త్రీయమైన పరమార్థము.

**(4) బ్రహ్మచర్యము :**

> **శ్లో॥ కాయేన మనసా వాచా స్త్రీణాం పరివర్జితమ్**
> **ఋతౌ భార్యాం తదా తస్య 'బ్రహ్మచర్యం' తత్ ఉచ్యతే॥**

ఋతుమతి అయిన జీవితభాగస్వామితో తప్ప, మరింకెప్పుడైనా మనసా వాచా కర్మణా (పర) స్త్రీ సంగమము వర్జించి ఉండటము బ్రహ్మచర్యము - ఇది వ్యావహారికమైన అర్థము.

ఓ పరంతపా! (పరతత్త్వము కొరకై తపన - తపస్సు కలవాడా!)! ఇంద్రియజయము సిద్ధించుకొన్న సాంకృతి మునీంద్రా! **బ్రహ్మభావే మనశ్చ అరం "బ్రహ్మచర్యం", పరంతప! బ్రహ్మభావన యందు మనస్సు నిలకడ కలిగియుండే ప్రయత్నమే బ్రహ్మచర్యము.**

**(5) దయ :**

> **శ్లో॥ స్వ-ఆత్మవత్ సర్వభూతేషు కాయేన మనసా గిరా**
> **అనుజ్ఞాయా దయా, స ఏవ ప్రోక్తా వేదాంత వేదిభిః॥**

సర్వసహజీవులను - తనను తానువలె - దర్శించటమే దయ. **"నాకు నేను ఎంత ప్రియమో, సర్వజీవులు నాకు అంతే ప్రియమగుగాక!"** - అను భావనయే దయ. **సర్వత్రా ఆత్మభావనతో అంగీకారబుద్ధి కలిగి ఉండటమే "దయ"** - అని వేదాంత శాస్త్ర బోధ."యోగాభ్యాసికి అందరూ నావాళ్ళే। ప్రియమగు ఆత్మస్వరూపులే - అని అనిపించటమే యోగసాధన।

**(6) ఆర్జవము :**

> **పుత్రే, మిత్రే, కళత్రే చ, రిపౌ-స్వాత్మని సంతతమ్, ఏక రూపమ్. యత్, తత్ "ఆర్జవమ్" పోచ్యతే మయా।**

<u>'నావారు'</u> అనుకున్న వారిపట్ల, **"వేరైనవారు"** అని తలచిన చోట కూడా - ఒకే భావన కలిగి ఉండటమే ఆర్జవము. **"నాయొక్క పుత్ర మిత్ర కళాత్రాదులపట్ల ఎంతగా ప్రేమ, ఓర్పు కలిగి ఉంటామో, (శత్రువులు, మొదలైన) తదితరుల పట్ల కూడా అంతే ప్రేమ ఓర్పు కలిగి ఉండటము" - అను ప్రయత్నశీలత్వమే 'ఆర్జవము"!**

**(7) క్షమ :**

> **కాయేన మనసా వాచా శత్రుభిః పరిపీడితే**
> **బుద్ధి క్షోభ నివృత్తిః యా 'క్షమా', సా, మునిపుంగవ!**

ఓ మునిశ్రేష్ఠా! సుఖ-దుఃఖ, సంపద - ఆపద, మాన - అవమాన, శత్రు - మిత్ర సంఘటన సందర్భములు వచ్చి పోతూ ఉన్నప్పుడు కూడా ఎవరి బుద్ధి క్షోభ చెందక, సమభావన వదలకయే ఉంటుందో, అట్టి బుద్ధి సముపార్జనయే **'క్షమ'**. **భేదదృష్టిని** త్యజిస్తూ, **'ఆత్మదృష్టి'** వైపుగా దృష్టి సారించటమే - క్షమ.

**(8). ధృతి :**

> **"వేదాత్ – ఏవ వినిర్మోక్షః సంసారస్య,**
> **న చ అన్యథా" – ఇతి విజ్ఞాన నిష్పత్తిః 'ధృతిః' ప్రోక్తా హి వైదికైః॥**

**"ఆత్మ గురించిన జ్ఞానము (ఎరుక) చేతనే సంసార దోషము నుండి విముక్తి పొందగలము. వేరేత్రోవలేదు"** అను విజ్ఞానరూప నిష్పత్తి (నిర్ణయము) **'ధృతి'** అని వేదతత్త్వజ్ఞులగు వైదికుల పాఠ్యాంశము. తెలుసుకుంటేనే బంధము వీడుతుంది. (ఆత్మగురించి) తెలుసుకోనంతవరకు ఈ జీవునికి బంధము అనివార్యము. **"అహమాత్మా। న చ అన్యోస్మి"** – ఇత్యేవం అప్రచ్యుతా మతిః। - "నేను ఆత్మను. అన్యము కాదు" – అను చ్యుతి (Distraction) లేనట్టి మతి (Mindful) యే – ధృతి.

**9. మితాహారము :**

(1) పొట్టలో నాలుగవవంతు ఖాళీగా ఉండు విధంగా ఆహారమును తగినంతగా మాత్రమే తీసుకోవటము, (2) యోగాభ్యాసమునకు అనుకూలంగా సాత్వికమైన పదార్థములైనట్టి పాలు మొదలైనవి అధికంగా తీసుకోవటము (3) యోగ సేవనమునకు సాధనయుక్తంగా న్యాయార్జితము, దైవార్పితము అయిన ఆహారము భుజించటము – ఇది **'మితాహారము'** అనబడుతోంది.

ఆహారము స్వీకరిస్తున్నప్పుడు – **"పొట్టలో రెండువంతులు ఘనాహారము (ద్వే భాగే పూరయేత్ అన్నం), నాలుగవ వంతు జలము, శేషించినది ఖాళీగా ఉంచాలి"** అనునది **మితాహారసూత్రము.**

**10. శౌచము :**

ఓ మహామునీ! ఈ భౌతిక దేహము శుభ్రముగా ఉండటానికై దీనిని మృత్తికజలముతో (మట్టి, సబ్బు నీరు మొదలైనవాటితో) స్నానము చేయిస్తున్నాము. మంచిదే. అయితే, అటువంటి శౌచము మనస్సుకు కూడా నిర్వర్తిస్తూ ఉండాలి కదా! (1) అవతార పురుషుల, భక్తి యోగ జ్ఞాన సిద్ధ పురుషుల కథలు, (2) వారి దృష్టాంతంగా గుణాభ్యాసములు (3) యోగాభ్యాసము – మొదలైనవి మనస్సుకు స్నానము. **"నాయొక్క ఆత్మస్వరూపము నిత్య శుద్ధము – నిత్య ముక్తము కదా!"** అనునది బుద్ధికి స్నానము వంటిది.

**ఇక్కడ ఒక చమత్కారము.** ప్రతి వ్యక్తి **దేహి + దేహము** ల సమావేశ స్వరూపుడే. : –

**అత్యంత మలినో దేహో** – ఈ దేహము అత్యంత మలినభూయిష్టమైనది. దీనికి శౌచము (శుచి) అనేది ఎక్కడిది?

**దేహీ చ అత్యంత నిర్మలః ।** ఈ దేహమును ఉపయోగిస్తూ ఉన్న దేహి యో? "నిత్య నిర్మలుడు"।

ఈ దేహి–దేహముల భేదములు తెలుసుకొన్న తరువాత ఇక శౌచము యొక్క విధి దేనికి? దేహమునకా? దేహికా?

ఓ సువ్రతా! సాంకృతి ఆత్మానందా! మరొక్క విషయము కూడా శౌచము సంబంధితమై ఇక్కడ గుర్తుచేసుకుందాము.

ఇంద్రియ మనోబుద్ధులతో అనేక జన్మల సందర్భములలో ప్రోగుచేసుకున్న దృశ్యసంబంధమైన దురవగాహనాపూర్వక ఆవేశములు, సంస్కారములు, వాసనలు గండ శిలలవలె రూపుదిద్దుకుని ఉంటున్నాయి. అవి ఆత్మజ్ఞానానుభవమునకు అడ్డుగోడలగుచున్నాయి.

> శ్లో॥ **జ్ఞాన శౌచం పరిత్యజ్య, బాహ్యే యో రమతే నరః,**
> **స మూఢం కాంచనం త్యక్త్వా లోష్టం గృహ్ణాతి, సువ్రత!**

ఓ సువ్రతా! ఆత్మాజ్ఞానమును ఆవరించి ఉన్న అజ్ఞానమును తొలగించు జ్ఞాన–శౌచమును వదలి, కేవలము బాహ్యశౌచము పాటించే ప్రయత్నములచే ఏమి లాభం? అట్టివాడు బంగారమును ప్రక్కకునెట్టి, మట్టిగడ్డలను ఏరుకు తెచ్చుకొనే మూఢునితో సమానము. కర్తవ్యాకర్తములు ఎరిగి, ఆత్మజ్ఞానామృతమును సంపాదించుకొని సంతృప్తుడగుచున్న యోగి కృతకృత్యుడు. అట్టి తత్త్వవేత్తకు **"ఇంకా ఇది నిర్వర్తించాలి"** అను కర్తవ్యాకర్తవ్యములు ఏవీ ఉండవు. **లోకత్రయేఽపి కర్తవ్యం కించిత్ నాస్తి ఆత్మవేదినామ్।** ఆత్మతత్త్వము ఎరిగిన మహనీయునికి ఈ మర్త్య – పాతాళ – స్వర్గ త్రిలోకములలో 'చేయవలసినదే' అనుబడు కర్తవ్యము కించిత్ కూడా ఏదీ ఉండదు. (ప్రకృత్యైవ చ కర్మాణి – అను భావనను కలిగి ఉంటాడు).

అందుచేత ఓ మునీ! "అహింస" మొదలైన యమ–సాధనలు సర్వప్రయత్నములతో ఆశ్రయించాలయ్యా! జ్ఞాన–యోగాది ప్రయత్నముల చేతనే "ఏకము – అక్షరము" అగు బ్రహ్మమును తెలుసుకొనగలవు. అట్టి పరబ్రహ్మము స్వాభావికము, అనుక్షణికము అగుచుండగా, ఇక ఆపై విధి – నిషేధములు, కర్తవ్య అకర్తవ్యములు తమకు తామే మొదలంట్లా శమించగలవు.

# ద్వితీయ ఖండము

## అష్టాంగయోగములో రెండవదగు "నియమము"

*నియమము = నియమించుకొని నిర్వర్తించవలసినవి*

**"నియమము" అను యోగాంగము యొక్క ఉపాంగములు :**

(1) తపస్సు (2) సంతోషము (3) ఆస్తిక్యము (4) దానము (5) ఈశ్వరపూజనము (6) సిద్ధాంతశ్రవణము (7) హ్రీ–మహనీయుల సద్గుణములు గమనిస్తూ, స్వకీయ లోపములను గుర్తించటము) (8) మతి, (9) జపము, (10) వ్రతము

**(1) తపస్సు :**

**శ్లో॥ వేదోక్తేన ప్రకారేణ కృత్ చ చాంద్రాయణాదిభిః**
**శరీర శోషణం యత్, తత్ '<u>తప</u>' ఇతి ఉచ్యతే బుధైః॥**

"వేదోక్తంగా చాంద్రాయణ వ్రతము మొదలైనవి నిర్వర్తిస్తూ శరీరమును శోషింపజేయటము"ను తపస్సు అని బుధుల వచనము. (చాంద్రాయణము = ఈఈ రోజులలో ఉపవాసము, ఈఈ రోజులలో / సమయములలో గుడికి వెళ్ళాలి. ఈఈ నెలలో తీర్థస్థానము... మొదలైన తిథుల నియమములు పాటించటం).

**శ్లో॥ "కోవా మోక్షః? కథం తేన సంసారం ప్రతిపన్నవాన్?"**
**ఇతి ఆలోచనమ్ అర్థజ్ఞాః "తపః" శంసంతి పండితాః॥**

**"ఈ మానవజన్మయొక్క మహదాశయము మోక్షము సంపాదించటము"** అని పెద్దలచే సిద్ధాంతీకరించబడుచున్నది. **"నాకు బంధము ఉండజాలదు"** – అను అవగాహనారూపమగు <u>మోక్షము గురించిన పరిశీలన,</u> తద్వారా <u>సంసార బంధముల ఛేదనము–ఇదియే తపస్సు</u> – అని నిత్యానిత్యవివేకులగు పండితుల ప్రబోధము.

**(2) సంతోషము:**

**యదృచ్ఛాలాభతో నిత్యం ప్రీతిః యా జాయతే నృణామ్,**
**తత్ "సంతోషమ్" విదుః ప్రాజ్ఞాః, పరిజ్ఞానైక తత్పరాః॥**

పరిజ్ఞానమే – మహదాశయముగల (తత్పరులగు) పాజ్ఞుల దృష్టిలో – యాదృచ్ఛికంగా లభిస్తున్న దానితో అనునిత్యము ప్రీతి – సంతృప్తి కలిగి ఉండటమే – **'సంతోషము'** అనబడు నియమాంగము యొక్క – ఉపాంగము.

(ii) **పరమ సంతోషము :** బ్రహ్మలోకమునుండి భూలోకము వరకు ఏదేది ప్రియంగా కనిపిస్తూ, లభిస్తూ ఉంటుందో అట్టి సమస్త విశేషాలపట్ల స్నేహ–సంతోషములకు అతీతులై దర్శించగలటము **పరమ సంతోష స్వభావము.**

**3. ఆస్తిక్యం :**

**శ్రౌతే స్మార్తే చ విశ్వాసో యత్, తదా "ఆస్తిక్యమ్" ఉచ్యతే।**

శ్రుతులు చెప్పిన ప్రాతః సంధ్యావందనము మొదలై **'నిత్యకర్మలు'**, కొన్ని పరవడి దినములలో నిర్వర్తించవలసినదిగా చెప్పబడే నిమిత్త సంబంధమైనట్టి **<u>"నైమిత్తిక కర్మలు"</u>**, పితృ దేవతా సంబంధమైన (మరియు) వంశపారంపర్య సంబంధమైన **<u>వైదికకర్మలు</u>** –ఇవి నన్ను సంసారబంధములనుండి ఉద్ధరించగలవు. మోక్షమార్గమునకు దారి చూపగలవు" – అను విశ్వాసము కలిగియుండటమును **'ఆస్తిక్యము'.**

**4. దానము :**

**శ్లో॥ న్యాయార్జిత ధనం శ్రాంతేః శ్రద్ధయా వైదికే జనే,**
**అన్యద్వా యత్ ప్రదీయంతే, తత్ 'దానం' ప్రోచ్యతే మయా॥**

శ్రమించి న్యాయార్జితంగా సంపాదించిన ధనమును వైదికోపాసనగలవారికి, అర్హులగు సాత్త్వికజనులకు, అవసరార్థం అర్థించినవారికి సమర్పణ భావముతో శ్రద్ధగా ఇవ్వటము – <u>దానము</u> .

**5. ఈశ్వర పూజనమ్ :**

**శ్లో॥ రాగాది యత్ అపేతం హృదయం, వాక్–దుష్టా, అనృతాదినా,**
**హింస–ఆది రహితం కర్మయత్, తత్ "ఈశ్వర పూజనమ్"॥**

రాగము (attachment) మొదలైనవి లేకుండా, నిర్మల హృదయముతో హృదయపూర్వకంగా, "దుష్ట భావములు, దుష్టవాక్కులు, అనృతము (అబద్ధములు), ఇతరులను హింసించటం మొదలైనవి లేకుండా – 'కర్మలు' నిర్వర్తించటమే 'ఈశ్వరపూజనము'. చేస్తున్న

సమస్త కర్మలు (ఈశ్వరార్పితమ్ – న ఇచ్ఛ యాకృతమ్ – చిత్త శోధకమ్ – ముక్తి సాధకమ్ అను) పవిత్ర భావములతో పరమాత్మకు సమర్పిస్తామో... **అవన్నీ ఈశ్వరపూజనము అగుచున్నాయి.**

**6. సిద్ధాంత శ్రవణము / వేదాంత శ్రవణము :**

**శ్లో॥ <u>సత్యం జ్ఞానం అనంతం చ, పరానందం పరం ధృవమ్</u>**
**<u>'ప్రత్యక్'</u> – ఇతి అవగంతవ్యం వేదాంతం శ్రవణం బుధైః॥**

సత్యము, జ్ఞానస్వరూపము, అనంతము, పరానందము, సమస్తమునకు పరము, ధృవము అగు ప్రత్యక్ (కేవల) వస్తువగు ఆత్మగురించి తెలుసుకోవాలనే శ్రవణమే **"వేదాంతశ్రవణము".**

**7. లజ్జ :**

**శ్లో॥ వేద లౌకిక మార్గేషు కుత్సితం కర్మ యత్ భవేత్,**
**తస్మిన్ భవతి యా లజ్జా 'హ్రీః' సైవేతి ప్రకీర్తితా॥**

వేదములకు, లోకశ్రేయస్సుకు సానుకూల్యమగు మార్గములనే అనుసరించాలి. మరియు, లోకధర్మ మార్గములకు ప్రతికూల్యమైన కర్మలయందు, ఇతరులను బాధించు – మోసగించు కుత్సిత (చెడు, దుష్టభావసమన్విత) కర్మలపట్ల వ్యతిరిక్తత కలిగి ఉండాలి. ఆ తీరుగా నిర్వృత్తి (Non-Avocative) ఏర్పడి ఉండటమే 'హ్రీ' (లేక) సిగ్గుపడటము. **స్వకీయమగు గుణదోషములను గమనించి ,జయించు యత్నము – 'హ్రీ' – అనబడుతోంది.**

**8. మతి : <u>వైదికేషు</u> చ సర్వేషు శ్రద్ధా యా, సా 'మతిః' భవేత్॥**

<u>వైదికమైన</u> (శాస్త్రప్రవచితమైన), లోకకళ్యాణపూర్వకమై కర్మలయందు శ్రద్ధకలిగి ఉండటమే **'మతి'.**

**9. జపము :**

**శ్లో॥ గురుణా చ ఉపదిష్టోఽపి తత్ర సంబంధ వర్జితః**
**వేదోక్తేనైవ మార్గేణ మంత్ర – అభ్యాసో 'జపః' స్మృతః॥**

గురూపదేశమైనట్టి (లేదా) వేదములలో చెప్పిన విధంగా (వేదోక్తమైన మార్గంగా) ... మంత్రమును అభ్యాసము చేస్తూ ఉంటే...అది **'జపము'** అని చెప్పబడుతోంది.

కల్పసూత్రవిధానములందు, వేదాధ్యయనమునందు ధర్మశాస్త్రమునందు, పురాణములందు, ఇతిహాసములందు **"శ్రవణ-పారాయణ-అధ్యయన"** వృత్తి కలిగిఉండటమే జపము.




- **ఉచ్చైః జపాత్ ఉపాంశుశ్చ సహస్ర గుణ ఉచ్యతే॥** బిగ్గరైన గొంతుకతో జపము చేయటము కన్నా కూడా రహస్యముగా చేయు జపము వేయి రెట్లు అధికమైనది.
- **మానసశ్చ తథా ఉపాంశ సహస్రగుణ ఉచ్యతే॥** మనస్సుతో చేసే జపము వాక్-జపము కంటేకూడా వేయి రెట్లు ప్రభావితము/ప్రయోజనకరము.
- **ఉచ్చైః జపశ్చ సర్వేషాం యథోక్త ఫలదో భవేత్॥** కొందరు కలసి బిగ్గరగా జపము చేయటము ఇంకా కూడా ఉత్తమ ఫలము ప్రసాదించగలదు.
- **శ్రోత్రేణ చేత్ మంత్రః శ్రుతశ్చేత్ నిష్ఫలా భవేత్॥** ఇతరులు వినాలనే ఉద్దేశ్యముతో జపము చేస్తే, అట్లా వినిపించటము నిష్ఫలము అవగలదు.

**10. వ్రతము:** శాస్త్రములచే ఉపాసనగా చెప్పబడుచున్న ఆయా నియమములతో కూడిన వ్రతము. {(వ-రతము = వషట్ కారుడగు పరమాత్మయందు మాత్రమే రతించటము. (ఉదా : గోపికా స్త్రీలు)} **<u>ఈ 10 'నియమదశ' అనబడుచున్నాయి.</u>**

# 3. ఆసనము

ఓం

**శ్రీ దత్తాత్రేయస్వామి :**

ఓ మునిపుంగవా! సాంకృతి మునీంద్రా! ముఖ్యముగా '9' ఆసనములు (ప్రసిద్ధముగా) చెప్పబడుచున్నాయి.

| | | | | |
|---|---|---|---|---|
| (1) స్వస్తికాసనము | (2) గోముఖాసనము | (3) పద్మాసనము | (4) వీరాసనము | (5) సింహాసనము |
| (6) భద్రాసనము | (7) ముక్తాసనము | (8) మయూరాసనము | (9) సుఖాసనము | |

**(1) స్వస్తికాసనము : జాను ఊర్వోః అంతరే కృత్వా సమ్యక్ పాదతలే ఉభే, సమగ్రీవ శిరః కాయః - ఇతి "స్వస్తికాసనమ్"॥**

- రెండు రెండు పాదముల తలములను (మడమలను) పిక్కలను తొడల మధ్యగా ఆనించి ఉంచటము
- మెడను, శిరస్సును, శరీరమును నిఠారుగా ధారణ చేయటము. **ఈ రెండు ప్రక్రియలు కలిపి 'స్వస్తికాసనము' అనబడుతోంది.** ఇది నిత్యము అభ్యసించతగినది.

**(2) గోముఖాసనము: సవ్యే దక్షిణ గుల్ఫంతు పృష్ఠ పార్శ్వే నియోజయేత్ - దక్షిణేఽపి, తథా సవ్యం - "గోముఖం" తత్ ప్రచక్షతే॥**

ఎడమ పృష్ఠ పార్శ్వమునందు కుడి చీలమండలమును, కుడి పృష్ఠ పార్శ్వము నందు ఎడమ చీలమండలమును ప్రవేశింపజేసి ఉంచటము **- <u>గోముఖాసనము.</u>**

**(3) పద్మాసనము: అంగుష్ఠౌ అధి గృహ్ణీయాత్ హస్తాభ్యాం వ్యుత్క్రమేణ తు, ఊర్వో ఉపరి కృత్వా పాదతల ద్వయమ్ - "పద్మాసనం" భవేత్ - (ఇదమ్) సర్వరోగ భయాపహమ్॥**

రెండు తొడలపైనా రెండు పాదములను - (ఎడమ పాదము కుడిగా, కుడిపాదము ఎడమగా) - బొటనవ్రేళ్ళను ఉత్క్రమణముగా (పైకి లేచురీతిగా) ఉంచి, రెండు కాళ్ళ బొటనవ్రేళ్ళను చేతులతో పట్టుకోవటము - **పద్మాసనము.** ఓ విప్రేంద్రా! ప్రాజ్ఞా! ఈ ఆసనము సర్వరోగముల భయములనుండి విముక్తికరము.

**(4) వీరాసనము : దక్షిణా ఇతర పాదం తు దక్షిణా ఊరుణి విన్యసేత్, - ఋజు కాయః సమ-ఆసీనో - "వీరాసనమ్" ఉదాహృతమ్॥**

ఎడమ పాదమును కుడి తొడపై వేసి, శరీరమును నిఠారుగా ధారణ చేసి, దేహమును సమస్థితికి తెచ్చి సమముగా ఆసీనుడై ఉండటము **వీరాసనము.**

**(5) సింహాసనము :** మోకాళ్ళ వరకు మడచి తొడలు తాకించి ఉంచి, ముఖమును ఊర్ధ్వధారణ చేసి మోచేతులు చాపి ఉంచటము.

**(6) భద్రాసనము :పార్శ్వ పాదౌ చ పాణిభ్యాం దృఢం బధ్వా సునిశ్చలమ్ 'భద్రాసనమ్' భవేత్॥ - <u>ఏతత్ విషరోగ వినాశనమ్॥</u>**

సుఖాసీనుడై, పాదముల పార్శ్వ (ప్రక్క) భాగమును చేతులతో దృఢముగా పట్టుకొని కదలికలు లేక ఉండటము **భద్రాసనము.** ఇది విషరోగములన్నిటినీ నశింపజేయగలదు.

**(7) ముక్తాసనమ్ : మేఢ్రాత్ ఉపరి నిక్షిప్య - సవ్యం గుల్ఫం తత్ ఉపరి, గుల్ఫాంతరం చ సంక్షిప్య - "ముక్తాసనమ్"।**

ఓ మునీశ్వరా! సవ్య (ఎడమకాలి) చీలమండలమును మేఢ్రము (పొత్తికడుపు క్రిందగా) నిక్షిప్యము చేసి (నొక్కిపట్టి ఉంచి), రెండవ మడమను మడిచి ఉంచటము - **ముక్తాసనము.**

**(8) మయూరాసనము : కూర్పర అగ్రే నిక్షిపేత్ నాభి పార్శ్వయోః, భూమ్యాం పాణితల ద్వంద్వం నిక్షిప్య ఏకాగ్రమానసః - సమున్నత శిరః పాదో దండవత్ వ్యోమ్ని సంస్థితః - మయూరాసనమ్। - ఏతత్ స్యాత్ సర్వ పాప ప్రణాశనమ్॥**

- నాభిప్రక్కగా మోచేతి చివరి భాగములను తాకించి ఉంచటము.
- ఏకాగ్రాచిత్తుడై....భూమిపై రెండు అరచేతులను తాకిండి ఉంచటము.
- శిరస్సును పాదములను పైకి గాలిలోకి ఎత్తి ఉంచటము. నెమలి వలే శిరస్సును ముందువైపుగా ధారణ చేయటము.

ఇది **మయూరాసనము.** ఈ ఆసనము యొక్క ఆభ్యాసముచే ఈ జీవునియొక్క సర్వపాపకర్మఫలములు శమించగలవు.

**(9) సుఖాసనము :** పైన చెప్పబడిన 8 యోగాసనములలో ఒకటిగాని, లేదా ఆయా ఇంకా అనేక ఆసనములలోని కొన్ని విశేషములుగాని క్రోడీకరించి (ఎవరికి వారికే) **"ఏకాగ్రతకు, దీర్ఘకాలము కదలక ఉండటానికి సానుకూల్యమైనది"** అను ఆసనమును యోగాభ్యాసి ఎన్నుకోవచ్చు. ఆ విధంగా యోగి తన శరీరమునకు, అభిరుచికి, దీర్ఘకాలము యోగాభ్యాసమునకు సానుకూల్యమగు ఆసనముయొక్క ఎంపికా విధిని **'సుఖాసనము'** అంటారు.

యోగి తనకు సానుకూల్యమైన ఆసనము ఎన్నుకొని, సుఖముగా ఆసీనుడై, ధ్యాన-యోగాభ్యాసములను చేసుకోగలుగుచూ ఉండగలగటమును **'ఆసనజయము'** అని పిలుస్తారు. (ఆసనముల గురించి ఆయా మరికొన్ని విశేషములు శుక్లవేద-అంతర్గతమైన 'త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్'లో వివరించబడ్డాయి.

సర్వశక్తులు - యుక్తులు ఉపయోగించి యోగాభ్యాసి ముందుగా సుఖాసనమును సిద్ధించుకోవాలి.

**ఆసనం విజితం యేన జితం తేన జగత్త్రయమ్॥** సానుకూల్యమగు (లేదా) శాస్త్రీయమగు ఆసనమును స్వాభావికంగా సిద్ధించుకోవటమే అతి ముఖ్యమగు ప్రారంభసిద్ధి. **ఆసన విజయము సంపాదించుకొన్నాడా, ఇక ఆ పై, ఆ యోగి త్రిలోకములను జయించగలడు.**

ఓ సాంకృతి మహాశయా! ఈ విధంగా ఆయా విధానంగా ఆసన జయము సంపాదించిన యుక్తుడు ఇక **'ప్రాణాయామము'** అనబడు **యోగాభ్యాసమునకు** ఉపక్రమించునుగాక! - **అనేన విధినా యుక్తః 'ప్రాణాయామం' సదా కుర్వీత॥**

## 4వ ఖండము
## శరీర నిర్మాణము - నాడుల అమరికలు

**శ్రీ దత్తాత్రేయ అవధూత:** ఓ సాంకృతి మునీంద్రా! ఇక ఇప్పుడు పంచభూతముల అమరికచే నిర్మితమై కనిపిస్తున్న ఈ **"భౌతిక శరీరము"** గురించి కొన్ని విశేషాలు చెప్పుకుందాము. సృష్టికర్త యొక్క సంకల్పానుసారం మహత్ కళాత్మకంగా ప్రకృతిచే ఈ భౌతిక శరీరము నిర్మితమౌతోంది. అట్టి ఈ శరీరము ప్రవర్తమానమవటానికి గాను, ఇందులో విశిష్టమైన అనేక విశేషాలు అత్యంతాశ్చర్యకరంగా ప్రదర్శనమగుచూ ఉన్నాయి.

(చేతియొక్క బొటనవ్రేలు-అడ్డరేఖ నుండి పై విభాగముతో కొలిస్తే) 96 అంగుళములంతగా ఈ భౌతిక దేహము పొడవు. **శరీరం తావత్ ఏవ స్యాత్ షట్ నవ (96) అంగులాత్మకమ్!**

**శిఖిస్థానము (Central Zone):** దేహములన్నిటిలో 'శిఖి' అనేది దేహ కేంద్రీకృత స్థానము మధ్యగా ఏర్పడినదై ఉంటోంది.

ఈ మేలిమి బంగారము వంటి ప్రకాశముగల శిఖిస్థానము (శక్తి కేంద్రీకృతస్థానము) మానవులలో $\Delta$ త్రికోణాకారముగా సత్యద్రష్టలచే (శారీరకతత్త్వవేత్తలచే) గమనించబడి శాస్త్రముల రూపంగా ప్రకటించబడుతోంది.




గుదస్థానమునకు రెండు అంగుళములకు పైవైపుగా, మేఢ్రము (పొత్తికడుపు)నకు రెండు అంగుళములు క్రిందవైపుగా మనుష్యులలో దేహమధ్యగా ఈ శిఖిస్థానము ఏర్పడి ఉంటోంది. ఇద్దానిలో 9 అంగుళముల పొడవు, 4 అంగుళముల వెడల్పుగల **కందస్థానము.** ఇది శరీరమునకు మూలాధారము. ఈ కందము త్వక్కు (చర్మము) మొదలైనవాటితో కప్పబడి కోడిగ్రుడ్డు ఆకారము కలిగి ఉంటోంది. అట్టి కందమునకు మధ్యగా కేంద్ర స్థానము, 'నాభి' యోగజ్ఞులచే స్వానుభవముగా దర్శించబడుతోంది.

ఓ యోగపుంగవా! అట్టి కందమునకు మధ్యగా ఒక ప్రముఖమైన నాడి - "సుషుమ్ననాడి" అని పరికీర్తించ బడుతోంది. దానిచుట్టూ (కంద స్థానమునుండి) 72000 నాడీ - ఉపనాడులు బయల్వెడలి శరీరములో మారుమూలల వరకు పూతీగలవలె విస్తరించి ఉంటున్నాయి.

అట్టినాడులలో ముఖ్యమైనవి '14'.

(1) సుషుమ్న (2) పింగళ (3) ఇడ, (4) సరస్వతి, (5) పూష, (6) వరుణ, (7) హస్తిజిహ్వ (8) యశస్విని, (9) అలంబుస, (10) కుహూ, (11) విశ్వోదరి, (12) తపస్విని, (13) శంఖిని, (14) గాంధారి

ఈ 14 నాడులలో అత్యంత శ్రేష్ఠమైనవి, ముఖ్యమైనవిగా '3' నాడులు - (1) సుషుమ్న, (2) ఇడ, (3) పింగళ.

## సుషుమ్న

శ్లో॥ ఆసాం ముఖ్యతమాః త్రిస్రః॥
తిసృషు ఏక ఉత్తమోత్తమా। 'బ్రహ్మనాడీ' సా ప్రోక్తా॥

ఓ మునీశ్వరా! ఈ త్రినాడులలో కూడా ఇంకా అత్యంత ప్రాముఖ్యమైనది. **"సుషుమ్ననాడి".** బ్రహ్మరంధ్రమువరకు విస్తరించి ఉండటంచేత, బ్రహ్మవేత్తలచే (లేక వేదాంతవేదులచే) "బ్రహ్మనాడి" అని కూడా పిలువబడుతోంది. ఇది వీణాదండమువలె ఉండి కందముయొక్క కేంద్రీకృత విభాగము నుండి పృష్ఠము (వీపు Back Bone)కు మధ్యగా విస్తరించి, అటుపై మస్తకము (ముఖ ఉపరి భాగము - Fore-Face వరకు) విస్తరించి ఉన్నది.

**"పృష్ఠమధ్య స్థితేవ అస్థ్నా వీణాదండేన, గుహ మస్తక పర్యంతం సుషుమ్నా సుప్రతిష్ఠితా॥"**

**కుండలిని** : నాభికందమునకు 2 అంగుళములు క్రిందగా 'కుండలినీ స్థానము' ఉన్నది. అది అష్టప్రకృతి రూపమై యున్నది.

కందము చుట్టూ నిత్యము వాయువు యొక్క చేష్టలచే జలము, తిన్న పదార్థాములు త్రాగిన జలము నిరోధము పొందుతూ ఉంటాయి. సుషుమ్న కందమునుండి బయల్వెడలుచున్న సుషుమ్ననాడి (లేక) బ్రహ్మనాడి - చిట్టచివర శిరస్సుకు ఉపరిభాగమున గల బ్రహ్మరంధ్రము వరకు విస్తరించి, చిట్టచివర - చుట్టచుట్టుకొనియున్న ఆకారముగా ఏర్పడి ఉంటోంది.

**సుషుమ్ననాడికి**

| | | |
|---|---|---|
| ఎడమవైపుగా | → | ఇడా నాడి। |
| కుడివైపుగా | → | పింగళనాడి। |
| పార్శ్వముగా (ప్రక్కగా) | → | సరస్వతీ, కుహునాడులు। |
| ఇడా నాడికి ముందు వెనుకలుగా | → | గాంధారీ, హస్తిజిహ్వ నాడులు। |
| పింగళకు వెనుక ముందుగా | → | పూషా, యశస్వినీ నాడులు। |
| కుహూ - హస్తిజిహ్వలకు మధ్యలో | → | విశ్వోదరీ నాడి। |
| యశస్విని - కుహూలకు మధ్యగా | → | వరుణ నాడి। |
| పూష-సరస్వతీలకు మధ్యగా | → | యశస్విని నాడి। |
| గాంధారీ - సరస్వతీలకు మధ్యగా | → | శంఖినీ నాడి। |
| కందమధ్య నుండి - పాయువు వరకు | → | అలంబుస నాడి। |

సుషుమ్నయొక్క ముందు భాగంలో → కుహునాడి. ఈనాడి క్రిందకు - పైకి క్రమంగా ముక్కుచివరి వరకు విస్తరించి యున్నది. పైకి క్రిందకూ ఉన్న నాడులన్నీ కూడా శరీరము మూలమూలలా (ఆకులోని ఈనెలవలే) వ్యాపించి ఉన్నాయి. **ఈ నాడులన్నీ వాటి వాటి రూపురేఖలననుసరించి పేర్లు పెట్టబడ్డాయి.**

| | | |
|---|---|---|
| ఇడానాడి | → | ఎడమవైపు ముక్కు చివరి వరకు ప్రసరించి ఉన్నది। |
| యశస్వినీనాడి | → | పాదముల బొటనవ్రేలు చివరి వరకు। |
| పూషా | → | 'పిగళ'కు వెనుకగా ఎడమ కంటివరకు విస్తరించి ఉంటోంది। |
| యశస్వినీ | → | కుడిచెవి ఆసాంతము వరకు। |
| సరస్వతీ | → | ఊర్ధ్వముగా నాలుక చిట్టచివరి వరకు। |
| హస్తిజిహ్వా | → | కుడి పాద అంగుష్ఠము (బొటనవ్రేలు) చివరి వరకు। |
| శంఖినీనాడి | → | కుడిచెవి - శ్రవణ స్థానము చివరి వరకు। |
| గాంధారీ నాడి | → | ఎడమకన్ను చిట్టచివరి వరకు। (కంటిపాప మధ్యస్థానము వరకు) |
| విశ్వోదర | → | కంద మధ్యప్రదేశములోనికి |

ఈఈ విధములుగా విస్తరించి ఉన్నాయి.

# సర్వనాడులలో ప్రాణ ప్రసరణము

నాడులన్నిటిలో పంచప్రాణములు, పంచ ఉపప్రాణములు సంచారములు కలిగినవై ఉంటున్నాయి.

**I పంచప్రాణములు** → ప్రాణ–అపాన–వ్యాన–సమాన–ఉదానములు.

**II పంచ ఉపప్రాణములు** → నాగ–కూర్మ–కృకర–దేవదత్త–ధనంజయములు.

– ఈ పదిటిలో పంచప్రాణములు (I) ముఖ్యమైనవి.

– అట్టి పంచప్రాణములలో కూడా ప్రాణ–అపానవాయువులు అతిముఖ్యము. ఎందుకంటే, వీటియొక్క ప్రాణ ప్రదర్శనము (లేక) క్రియా ప్రదర్శనము – **యోగులకు పూజింపతగినవి** కాబట్టి. **వాయుజయమునకు ఇవి సహకారి కారణములు.**

# వాయు ప్రసరణ ముఖ్య స్థానములు

<u>ప్రాణము</u> → **ఆస్య నాసికయోర్మధ్యే నాభి మధ్యే తథా హృది–ప్రాణసంజ్ఞో అనిలో నిత్యం వర్తతే।** నాసిక (ముక్కు) మధ్యప్రదేశములోను, **నాభి** మధ్యప్రదేశములోను, **హృదయ**మధ్యగాను ముఖ్య ప్రదర్శనము కలిగి, నిత్యము అగ్నిరూపముగా వర్తనము కలిగి ఉంటున్నది. ఇది దశ ప్రాణములలో **పూజ్యాతి పూజ్యము.**

**అపానవాయు ప్రసరణము : అపానో వర్తతే నిత్యం గుద మేఢ్ర ఊరు జానుషు। ఉదరే సకలే కట్యాం, నాభే జంఘేచ।** గుదమునుండి మేఢ్రము (పొత్తికడుపు) ఊరువులు, **జానువులయందు** (మోకాళ్ళయందు), **జంఘములలో** (పిక్కలలో), **కటి** (మొల) ప్రదేశములలోను, **బొడ్డు** (నాభి) స్థానములోను అపానవాయువు నిత్యము సంచారము కలిగి ఉంటున్నది.

**వ్యానవాయు ప్రసరణము : వ్యానః శ్రోత్ర – అక్ష మధ్యే చ, కుకుద్భ్యాం గుల్ఫయోరపి, ప్రాణస్థానే గళే చ ఏవ వర్తతే।** రెండు కనుల మధ్య ప్రదేశమునందు, పిరుదులలోను, గుల్ఫములయందు (చీలమండలములయందు), కంఠమునందు సంచలనము కలిగియుంటోంది.

**ఉదానవాయు ప్రసరణము : ఉదానసంజ్ఞో విజ్ఞేయః పాదయోః హస్తయోరపి।** పాదములయందు చేతులయందు వ్యానవాయువు ముఖ్య ప్రదర్శనము (లేక) సంచలనము కలిగి ఉంటోంది.

**సమానప్రాణము : సమానః సర్వ దేహేషు వ్యాప్య తిష్ఠతి।** దేహమంతటా సమస్త ప్రదేశములలో వ్యాపించి అణువణువూ స్థానములు పొందుచూ ఉంటోంది.

*ఇక **నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము** అనబడు పంచ ఉపప్రాణములు చర్మమునందు, అస్థిల (బొమికల) యందు, ఇంకా ఆయా ప్రదేశములలో సంచారములు కలిగి ఉన్నాయి.*

***ఉచ్ఛ్వాస నిశ్వాసలు*** → పంచప్రాణములలో మొదటిది అగు **'ప్రాణము'** యొక్క ధర్మము. (Function).

***మలమూత్ర – మొదలైన విసర్జనములు*** → **అపానము యొక్క ధర్మములు**

***శరీరములోని ఆయా వేరు వేరు విభాగములన్నీ పరస్పర సామీప్యత** (Inter-Relationship) **ఏర్పరచటము*** → **సమాన ప్రాణముయొక్క ధర్మము**

***ఊర్ధ్వగమనము (రక్తము మొదలైనవాటి ప్రసరణములు)*** → **ఉదాన ప్రాణముయొక్క ధర్మము**

***ఆయా విభాగములు కలిసిపోకుండా వివాద పరిరక్షణము*** → **వ్యానప్రాణము** నిర్వర్తిస్తోంది

ఈ విధంగా వేదాంత వేదులు అధ్యయనము చేసినవారై, వివరిస్తున్నారు.

ఓ మహామునీ! ఇంకా కూడా, పంచ ఉపప్రాణముల ధర్మముల (Functions) గురించి యోగవేత్తలచే ఏ తీరుగా గమనించి చెప్పబడుతోందో – అది వినండి.

**నాగ ఉపప్రాణము (ఉద్గారాది గుణఃప్రోక్తో)** – దేహములో వాయువుయొక్క సంచలనముల అడ్డులను తొలగించటము అందుకొరకై, కక్కు, త్రేణుపు – ఇత్యాదుల నిర్వహణ.

**కూర్మము (నిమీలనాది)** → కనులుమూయు, తెరియు ప్రక్రియలను <u>నిర్వర్తించటము.</u>

**కృకరము (క్షుధా తు)** → ఆకలి దప్పికలను <u>పర్యవేక్షించటము.</u>

**దేవదత్తము (తంద్రీ కర్మ)** → ప్రేగుల వ్యవహారమును, నాడీ సంచలనమును <u>నిర్వర్తించటము</u>

**ధనంజయము (శోభాది కర్మ)** → దేహముయొక్క శోభ, ప్రత్యుత్సాహములను <u>పాలన చేస్తూ ఉండటము.</u>

## ॥నాడులు - దేవతాంశలు॥

ఈ దేహములో దేవతాంశలను సుషుమ్న, ఇడ, పింగళ మొదలైన నాడుల ప్రదర్శనారూపములుగా యోగాధ్యయనులు ఉపాసన చేస్తున్నారు.

- సుషుమ్న → **శివ దేవాంశ.**
- ఇడను → దేవతాంశ - **'హరి'.**
- పింగళను → **విరించి.** సరస్వతి నాడి - "విరాట్టు"
- పూస → బుద్ధి (బృహస్పతి).
- వరుణ → వాయువు (వాయుదేవుడు).
- హస్తిజహ్వా → వరుణదేవుడు.
- యశస్విని → భగవానుడగు భాస్కరుడు.
- అలంబుస → అంబాత్మ అయిన వరుణుడు.
- కుహు → క్షుత్‌దేవత (అన్నపూర్ణ-వైశ్వానరుడు).
- గాంధారి → చంద్ర దేవత.
- శంఖిని → చంద్రమస (ఔషధ-తేజో విభావములు)
- యశస్విని → ప్రజాపతి.
- విశ్వోదర → భగవాన్ అగ్నిదేవుడు.

ఈ విధమైన దివ్యతత్త్వముల దేవతారాధనచే ఆయా నాడులతో సహా నాడీమండలమంతా స్వానుభవముగా అవగలవు. ఆయా నాడులకు 'పతులు'గా, దివ్య తేజస్సులుగా - ఆయా దేవతలు వర్ణించబడుచున్నారు.

**ఓ మహామునీ! ఇంకా వినండి.**

ఇడా నాడియందు - చంద్రమా సంచారము

పింగళనాడి యందు - రవి (సూర్య) సంచారము

తేజోవిభవములై జరుగుచున్నది. వాయువు ఇడ నుండి సుషుమ్నకు, సుషుమ్ననుండి పింగళకు, పింగళ నుండి సుషుమ్నను, సుషుమ్న నుండి కపాలమునకు - ఒకచోటును విడిచి మరొక చోటికి - ప్రయాణము చేస్తోంది. ఇదంతా వాయు సంక్రమణములుగా అభివర్ణితము.

## వాయు సంక్రమణము = ఉత్తరాయణ - దక్షిణాయణములు

ఇడయందు చంద్రుడు (చంద్రాంశ), పింగళయందు సూర్యుడు (సూర్యాంశ) సంచారములు కలిగియున్నాయని అనుకున్నాము కదా! వాయువు...

ఇడ నుండి (ఖాళీ చేసి) → పింగళకు, పింగళ నుండి (ఖాళీ చేసి) → ఇడకు

వాయువు ప్రవేశమును 'ప్రాణసంక్రమణము' అనబడుతోంది. ఇడ - పింగళలకు మధ్య ప్రాణశక్తి నిలచినప్పుడు - 'అమావాస్య' అనబడుతోంది. **(సంక్రమణము = వాయువు ఒక చోటును ఖాళీ చేసి మరొకచోటును ఆక్రమించటము.)**

**(1) ఉత్తరాయణ వాయు సంక్రమణము : పింగళాయా ఇడాయాం తు వాయోః సంక్రమణం తు యత్, తత్ "ఉత్తరాయణమ్" ప్రోక్తమ్, మునే! వేదాంతవేదిభిః॥** పింగళనాడిని ఖాళీ చేసి వాయువు 'ఇడ' నాడిని నింపి ఉండటము - **"ఉత్తరాయణ వాయు సంక్రమణము"** అనబడుచున్నది.

అనగా.... (వాయువు పింగళను వదలి ఇడలో ప్రవేశము పొందుచున్నప్పుడు)

{సంక్రమణము ఒకచోటును వదలి మరొక చోటికి ప్రవేశము పొందటము....అది "ఉత్తరాయణము" అనబడుచున్నది.}

**(2) దక్షిణాయణము : ఇడాయాః పింగళాయాం తు ప్రాణసంక్రమణం దక్షిణాయనమ్ - పింగళాయామ్॥** : ఇడనాడి నుండి పింగళనాడిలోనికి ప్రాణసంక్రమణము జరుగుచున్నప్పుడు అది పింగళనాడికి **"దక్షిణాయనము"** అగుచున్నది.

**(3) అమావాస్య : ఇడా పింగళయో సంధిః యదా ప్రాణః సమాగతః, అమావాస్యా తదా ప్రోక్తా దేహే॥**

ప్రాణప్రసరణము (వాయు ప్రసరణము) ఇడ – పింగళనాడుల సంధి (In between space) యందు సమాగతమైనప్పుడు అది – **దేహములో ఏర్పడే అమావాస్య** – అనబడుతోంది. అనగా ప్రాణశక్తి →
ఇడనాడి నుండి బయల్వెడలి → ఇంకనూ పింగళయందు ఆ ప్రాణశక్తి ప్రవేశించి ఉండనప్పుడు
పింగళనుండి బయల్వెడలి → ఇడయందు ఇంకను, ప్రవేశించియుడనప్పుడు
మధ్యగత సంస్థతము – → **'అమావాస్య'** అని యోగ పరిభాషగా అనబడుచున్నది.

## ప్రాణ సంక్రమణము – మరికొన్ని విశేషాలు

**శ్రీ దత్తాత్రేయ జగద్గురువు :** ఓ పండితోత్తమా! సాంకృతి మహాశయా! 'ప్రాణప్రసరణము'ను అనుసరిస్తూ ప్రాణతత్త్వప్రాజ్ఞులు ఏవిధంగా సూర్య–చంద్రమాసములను ఉత్తరాయణ – దక్షిణాయణములను, ఇండా–పింగళ సంధిరూప అమావాస్య సంఘటనలను గమనిస్తూ ప్రాణోపాసన చేస్తారో, ఆయా కొన్ని విశేషాలు ఇప్పటిదాకా చెప్పుకున్నాము కదా! ఇప్పుడు మరికొన్ని విశేషాలు వివరించుకుంటున్నాము. శ్రద్ధగా వినండి.

## విషవత్తు కాలము

**(విషవత్తు = రేయి పగలు సమవత్ స్థితిని చేరుకాలము)**

**ఆద్యం విషువము (లేక) విషవత్తు: మూలాధారం యదా ప్రాణః ప్రవిష్టః, తత్ "ఆద్యం విషువమ్" ప్రోక్తం తాపసైః॥** ఓ పండితోత్తమా! ఎప్పుడైతే ప్రాణము (వాయుప్రసరణము/ప్రాణశక్తి) మూలాధారములో ప్రవేశము పొందుచున్నదో అట్టి క్రియను 'ఆద్య విషువము' అని తాపసులు పిలుస్తున్నారు. (ఇది దేహ సంచలన ప్రారంభము కూడా).

**అంత్యం విషువము : ప్రాణసంజ్ఞో మూర్ధానం ప్రావిశత్ యదా, తత్ 'అంత్యం విషువమ్' ప్రోక్తం తాపసైః తత్త్వ చింతకైః॥** తత్త్వ చింతనాపరులగు తాపసులు ఇంకా – ఇట్లా చెప్పుచున్నారు. ప్రాణశక్తి (లేక వాయు ప్రసరణము) మూర్ధమునందు (ముఖము యొక్క శిఖరాకాశమునందు ForeFace) ప్రవేశము పొందినప్పుడు అది **"అంత్యవిషువము"** (ఇది ఊర్ధ్వయోగ మార్గము).

**మాస సంక్రమణము : నిశ్వాస** (గాలిని లోపలికి పీల్చటము – **ఉచ్ఛ్వాస** (ఊపిరిని బయటకు వదలటము) – ఈ సమస్తము కూడా 'మాస సంక్రమణము' (ఒక మాసము నుండి మరొకమాసములో ప్రవేశము)

**చంద్రగ్రహణము : ఇడాయా కుండలీ స్థానం యదా ప్రాణః సమాగతః (తదా) 'సోమ గ్రహణం' ఇత్యుక్తమ్॥** ఓ తత్త్వవిదాంవరా! ఇడానాడిలో కుంభకము జరుగుచుండగా, అట్టి ప్రాణ (వాయు) ప్రసరణము కుండలినీ శక్తిలో ప్రవేశము పొందటమును (సమాగతము) 'చంద్రగ్రహణము' అని తత్త్వవేత్తలచే పిలువబడుతోంది.

**సూర్యగ్రహణము: యదా పింగళయా ప్రాణః కుండలిస్థానం ఆగతః, తదా తదా భవేత్ సూర్యగ్రహణమ్॥** ఓ సాంకృతి మునిపుంగవా! పింగళ నాడిలో నిండియున్న (కుంభకము అయి ఉన్న) వాయువు (ప్రాణము) → కుండలీస్థానముతో సమాగతము (getting Associated) అగుచున్నప్పుడు – అది 'సూర్యగ్రహణము'.

# దేహక్షేత్రము

## దేహములో సర్వతీర్థములు

మహాప్రాజ్ఞా! ఓ సాంకృతి మహాశయా! ఈ 'దేహము' అనే **"పరమాత్మ వేంచేసియున్న పవిత్రక్షేత్రము"**లోనే పవిత్రమగు తీర్థములన్నీ స్థానము కలిగియే ఉన్నాయి – అని యోగులు అనునిత్యంగా సందర్శనము చేస్తున్నారు. బాహ్యతీర్థములు – దేహాంతర్గత తీర్థముల సంజ్ఞలు మాత్రమే!

- శిరస్థానములో → శ్రీ పర్వతము (హిమాలయపర్వతము).
- లలాటము (నుదురు)లో → కేదారేశ్వర పుణ్యక్షేత్రమును.
- భ్రూస్థానము – ముక్కుకు పైగా → వారణాసి.
- కుచస్థానములో → కురుక్షేత్రము.
- హృత్ సరోరుహము (హృదయపద్మములో) → ప్రయాగ.
- హృదయ మధ్యప్రదేశంలో → చిదంబరము.
- ఆధారములో (మూలాధారంలో) → కమలాలయము (లక్ష్మీ ఆలయము – శ్రీరంగము)

## ఆత్మ తీర్థము

ఈ విధంగా ఈ శరీరము ఆత్మభగవానుడు వేంచేసి సర్వత్రా ప్రకాశమానమైయున్నారు. అందుచేతనే యోగశాస్త్రములో ఈ శరీరమును **"క్షేత్రము"** అని పిలుస్తున్నారు. ప్రాణశక్తి విశేషంగా ప్రవర్తమానమైయుండి దేహములోని ఆయా ప్రదేశములే – యోగులు దృష్టిలో పుణ్యతీర్థములు.

> **శ్లో॥ ఆత్మతీర్థం సముత్సృజ్య, బహిః తీర్థాని యో వ్రజేత్,**
> **కరస్థం స మహారత్నం త్యక్త్వా, కాచం విమార్గతే॥**

ఎవ్వడైతే "ఆత్మతీర్థము"ను ఈ దేహమునందు సందర్శించకుండా, బాహ్యమునగల తీర్థములకొరకై మాత్రమే పరుగులు తీస్తూ ఉంటాడో, (లేక) "నేను తీర్థయాత్రలు చేయలేకపోతున్నానే?" అని దిగులుపడుతూ ఉంటాడో....అట్టివాడు

***ఎక్కడో గాజుపూస గురించి విని, అద్దానికొరకై పరుగులు తీస్తూ, చేతిలోని మహారత్నమును (ధగధగాయమానమగు రత్నమాలను) చేజార్చుకున్నవాడు – అగుచున్నాడు.***

## భావన

**అన్నిటికీ మూలము భావనయే!** భావనయే **బంధము.** భావనయే **సాధన.** భావనయే **మోక్షము** కూడా. **"ఏ కర్మ చేస్తున్నాము?"** – అను దానినిబట్టి **బంధము**గాని, **మోక్షము**గాని ఉండవు. **"ఏ భావనతో అట్టి కర్మను నిర్వర్తించుచున్నాము"** – అన్నదానిని అనుసరించి సంసారమో (లేక) మోక్షమో రూపము పొందుచున్నాయి.

భావనచేతనే ఈ దేహములో యోగులు సర్వతీర్థములు దర్శిస్తూ ఉపాసన చేయుచున్నారు. తీర్థోపాసనా ఫలమును సిద్ధించుకొనుచున్నారు. **"సమస్తము భావనాభేద చమత్కారమే"** అని మనము ఆరూఢ పరచుకోవటానికి ఒక దృష్టాంతము చెప్పుతాను. వినండి.

**ఆలింగనము** ఒక్కటే అయినప్పటికీ భార్యను ఆలింగనము చేసుకొనుచున్నప్పుడు, కుమార్తెను ఆలింగనము చేసుకొనుచున్నప్పుడు భావనలు వేరు వేరే కదా! **అన్యథా ఆలింగ్యతే కాంతా, అన్యథా ఆలింగ్యతే సుతా॥**

***"భావనాసిద్ధి"ని సముపార్జించుకొన్న యోగవరేణ్యులు తమయందు, సర్వసహజీవులయందు అఖండమగు ఆత్మను దర్శించుచూ, ఉపాసించుచూ ఆత్మభావనను అప్రతిహతంగా సిద్ధించుకుంటున్నారు. తామే సర్వాత్మక స్వరూపులై, స్వయం – దర్శనా భావనా ఔన్నత్యంగా ప్రకాశించుచున్నారు. (ఇది దర్శనోపనిషత్ సారము).***

ఇక..., **తీర్థాని తోయపూర్ణాని। దేవాన్ కాష్ఠాని నిర్మితాన్। యోగినో న ప్రపద్యంతే స్వాత్మ ప్రత్యయ కారణాత్॥** తీర్థములన్నీ నదులన్నీ ఒకే జలమయముగాను, దేవతా విగ్రహములన్నీ – కాష్ఠము (కొయ్య) మొదలైనవాటిచే నిర్మితముగాను దర్శిస్తున్నారు. అట్టి **అవధూతలు** (లేక) **పరమహంసలు "స్వస్వరూపాత్మ సర్వదా అప్రమేయము, నిర్మలము, కేవలము, సమస్తము"** అని గమనిస్తూ, స్వాత్మానే ప్రత్యాగాత్మగా (అధ్యాత్మగా) ఉపాసన చేయుచున్నారు. వారు – తీర్థయాత్రలు, పుణ్యనదీ స్నానములు, దేవతా విగ్రహములు, దర్శనములు మొదలైనవాటితో ప్రత్యేకమైన ప్రయోజనమేమీ గమనించటము లేదు. **ఆత్మ భావన చేతనే సమస్తమును అంతర్గతంగా సంసిద్ధింపజేసుకొంటూ– దర్శనము చేయుచున్నారు.**

**బహిః తీర్థాత్ "పరం తీర్థం" – అంతస్తీర్థం మహామునే!** అంతరమునగల ఆత్మతీర్థము బాహ్యతీర్థములకంటే పరము (మహత్తరము –Extremely devine). ఆత్మతీర్థమే మహాతీర్థము. **అన్యతీర్థములు నిరర్థకమే** (External wondering is futile). ఎందుకంటారా? **చిత్తమ్ అంతర్గతం దుష్టం తీర్థస్నానైః న శుధ్యతి।** చిత్తములో అంతర్గతమైన "కామము, క్రోధము, లోభము, మదము, మాత్సర్యము, చాంచల్యము, అసత్‌దర్శనము, దురవగాహనలు"...మొదలైన చిత్త దోషములు తీర్థస్నానం చేసినంతమాత్రంచేత తొలగుతాయా? చిత్తశుద్ధి లభిస్తుందా? లేదు. కొంచము విరామము లభించగలదు – అని మాత్రమే అనవచ్చు. కల్లు కుండను వందసార్లు నీటిలో ముంచి లేపితే మాత్రం కుండలోని కల్లు వాసన పోతుందా? పోదు. శుచి అవదు. మరి? అంతరముగా పరిశుద్ధం చేయాలి. అట్లాగే, ఈ చిత్తభాండము కూడా. బాహ్యమున కడిగి తుడిచినంతమాత్రం చేత సరిపోదు. **చిత్తము యోగాభ్యాసములచే (మరియు) ఆత్మజ్ఞానము/ దర్శనముల చేతనే పరిశుభ్రమవగలదు.**

ఓ మునిపుంగవా!

- దేహములోని (అంతరములోని) విషువద్దినము, ఆయన కాలము, అమావాస్య, చంద్రగ్రహణము, సూర్యగ్రహణములను యోగాభ్యాసముచే గమనించుచూ,
- దేహమునందేగల వారణాసి మొదలైన పవిత్ర క్షేత్రముల – తీర్థములలో భావనాపూర్వకంగా దర్శించి, స్నానము చేయటమే సముచితము.

**అప్పుడు ఆ అభ్యాసి ఆత్మయందే ఆత్మచే ఆత్మత్వము సంతరించుకోగలడు. అఖండాత్మానంద స్వరూపుడై విరాజిల్లగలడు.**

*ఓ మునిపుంగవా! ఇంకా కూడా వినండి!*

**శ్లో॥ జ్ఞానయోగపరానాం తు పాదప్రక్షాళితం జలమ్**
**భావశుద్ధ్యర్థం అజ్ఞానాం, తత్ తీర్థమ్॥ మునిపుంగవ!**

ఆత్మజ్ఞాన సంపన్నులగు (తత్త్వవేత్తలగు) మహనీయుల పాదములు కడిగినప్పటి భావశుద్ధి రూపమగు పాదప్రక్షాళణా రూప తీర్థము లభించగలదయ్యా! అయ్యది జన్మజన్మలుగా బుద్ధియందు పేరుకొనియున్న అజ్ఞాన మాలిన్యమును తొలగించగలదు.

**ఎంతటి చమత్కారము!** శివుడు స్వదేహమునందే, కేవల అఖండ ఆనందస్వరూపుడై వేంచేసి ఉండగా, అట్టి **స్వస్వరూప – పరతత్త్వము**ను దర్శించు యత్నము చేయకుండా ఉంటే ఎట్లా? మూఢత్వముచేత మాత్రమే – తీర్థముల, దానము, జపము, యజ్ఞము, కాష్ఠము, పాషాణములయందు శివదర్శనము చేయాలని – అజ్ఞానముచే యత్నించుచున్నారు. స్వస్వరూపాత్మయందు, స్వస్వరూపాత్మగా దర్శనము చేయువాడే **ఆత్మదర్శి** (మరియు) **తత్త్వదర్శి** – (లేక) **శివతత్త్వదర్శి.**

ఓ మునీశ్వరా! నేను సర్వజీవుల హృదయాంతర్గతుడనై సర్వదా ప్రకాశించుచున్నాను. భావనలకు ఆవల భావనారాయణుడనై, శివానంద స్వరూపుడనై వెలయుచున్నాను. **అంతస్థ్సం మాం పరిత్యజ్య బహిష్ఠం యస్తు సేవతే, హస్తస్థం పిండమ్ ఉత్సృజ్య లిహేత్ కూర్పరమ్ ఆత్మనః॥** ఒకానొకనికి బాగుగా ఆకలి వేస్తోంది. చేతిలో మధురమైన ఆహారపు ముద్ద ఉన్నది. "ఆఁ! ఇది నా చేతిలో ముద్దయే కదా!" – అని అనుకుంటూ తనయొక్క మోచేతిని శ్రమతో ఎత్తి, చేతివెంటగా కారుతున్న కించిత్ ద్రవము కోసం శ్రమిస్తూ ఉంటే ఆకలి తీరుతుందా? అట్టివాడు తెలివితక్కువవాడే కదా!

అట్లాగే,

దివ్యస్వరూపుడుగా అంతస్థుడనై, ఈ జీవునికి అనన్యుడనై ఉన్న నన్ను ఏమరచి – బయట ఎక్కడో ఏదో తీర్థంలో దైవదర్శనము చేయాలని పరుగులు తీస్తే ప్రయోజనం ఏముంటుంది? అది మార్గాన్వేషణయేగాని **'మహదాశయసిద్ధి'** అనిపించుకోదు.

**సాంకృతి మునీశ్వరుడు :** అయితే యోగపుంగవులు ప్రతిమలో దర్శించరా?

## ఆత్మదర్శనము

**శ్రీదత్తాత్రేయ భగవాన్ :** అవునయ్యా! "ప్రతిమమాత్రమే శివుడు" – అను పరిమిత దృష్టితో దర్శించరు. యోగులు శివాత్మను స్వహృదయమునందు **సర్వతత్త్వాత్మకునిగాను, సర్వతత్త్వస్వరూపుడుగాను** దర్శిస్తారు. అంతేగాని శివుని "ప్రతిమ మాత్రమే" – అను దృష్టితో చూడరు. ఇందులో సందేహమే లేదు.

**సాంకృతి మునీంద్రుడు :** మరట్లా అయితే వేద – వేదాంగములు సాధకులకొరకై ప్రతిమా – ఉపాసన (దేవాలయములు మొదలైనవి), షోడశ సేవా పూజలు ఎందుచేత విధిస్తున్నాయి?

**శ్రీదత్తాత్రేయ భగవాన్ :** ఓఁ! అదా? **అజ్ఞానం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః॥**

అజ్ఞానులు ఆత్మభావన సముపార్జించుకోవటానికై ఉద్దేశ్యించి సాధన దశలో శాస్త్రములు, గురువర్యులు సాధకుల కొరకై 'ప్రతిమ'ను పరికల్పన చేసి త్రోవచూపుచున్నారు. **అద్దానియొక్క ముఖ్యాశయము, అంతిమాశయము ఆత్మతత్త్వభావనయే. సందేహమే లేదు.**

అందుచేత ఓ మహామునీ!

మనము నాడీ విశేషాలు, యోగాభ్యాసములు, ప్రాణసంచలన గమనికలు మొదలైనవన్నీ చెప్పుకున్నాము కదా! ఒక ముఖ్యమైన విషయము మీ దృష్టిలో నుండి తొలగకుండా చూచుకోండి.

శ్లో॥ నాడీ పుజం సదా సారం నర భావం, మహామునే!
సముత్సృజ్య **"ఆత్మన ఆత్మానమ్ అహమ్" ఇతి అవధారయ!**

హే మహామునీ! నాడీపుంజమంతా (నాడీసముదాయమంతా) నిస్సారము. అందులో నరభావమే (నరములకు సంబంధించినదే) ఇమిడి ఉన్నది. నారాయణభావము కాదు. అందుచేత సాధన చేస్తూనే, అద్దానిని వదలినవాడవై ఉండు. ఆత్మచేత **"ఆత్మయే నేను" అనే సుదృఢమైన, అచంచలమైన, అచ్యుతమైన ఆత్మభావనను** అనుక్షణికము చేసుకొనే యత్నములో **నాడీయోగాభ్యాసమును ఉపకరణరూపంగా** భావించి ఉండండి.

పరమాత్మ ఎట్టివాడు? **అశరీరం శరీరేషు మహాంతమ్। విభుమ్। ఈశ్వరమ్।** ఆయన అశరీరుడై అయినప్పటికీ, సర్వశరీరములతో **వ్యవస్థితులై** ఉన్నారు. సమస్తమునకు **విభువు (నియామకుడు).** మహత్-ఆనంద-అప్రమేయ - కేవల-**అనన్యస్వరూపుడు.** సమస్తముగా విస్తరించి ఉన్నవారు కాబట్టి **"ఈశ్వరుడు". ఆనందస్వరూపుడు.** మార్పు-చేర్పులు లేవు కాబట్టి **"అక్షరుడు".** అట్టి స్వస్వరూప ఆత్మభగవానుని **'సోఽహమ్', 'తత్త్వమ్'** రూపముగా బుద్ధిచే సిద్ధించుకున్న ఆత్మజ్ఞుడు ఇక దేనికీ శోకించడు. చింతించడు. అటువంటి ఏకాక్షరస్వరూపమగు ఆత్మజ్ఞానముచే - భేదములు కల్పన చేసి ప్రదర్శించుచున్న అజ్ఞానము తొలగిపోయిందా, ఇక బ్రహ్మమునందు ఏదైనా భేదము ఒకప్పుడు సందర్భ పరిమితమై కనిపించటము జరిగినా కూడా...అది ఆత్మసాక్షాత్కార సిద్ధుడవగు నిన్ను ఏమీ చేయజాలదు. 'త్వమ్'ను 'తత్' (బ్రహ్మము)గా దర్శించు స్థానము నుండి ఇక నీవు చ్యుతి పొందవు.

## 5వ ఖండము : నాడీ శుద్ధి

**సాంకృతి మునీంద్రుడు :** హే భగవాన్! దత్తాత్రేయా! లోకగురూ! నేను జీవన్ముక్తుడను అవటానికై **'నాడీశుద్ధి'** అను విశేషము గురించి సంగ్రహంగానైనా వివరించమని నా అభ్యర్థన.

**దత్తాత్రేయ భగవాన్ :** ఓ సాంకృతి యతీంద్రా! నాడీశుద్ధి గురించి సంగ్రహంగా మీరు కోరినట్లు చెప్పుచున్నాను. వినండి.

### తురీయ సందర్శనం

**(1) కర్మఫల త్యాగము :** శాస్త్రము చేతగాని, సంఘము చేతగాని, కుటుంబ వ్యవస్థానుసారంగాగాని, పూజ్యులగు పెద్దలచేతగాని, విధివశంగాగాని, ఏవిధంగానైనా సరే **- తనకు విధించబడిన ధర్మములను చక్కగా నిర్వర్తించబడుగాక.**

- అట్టి స్వధర్మమును కామసంకల్పము లేకుండా నిష్కామయోగబుద్ధితో నిర్వర్తించటము **కర్మయోగము. "ఇట్టి కర్మఫలత్యాగము"** తురీయ సందర్శనమునకు మొదట అతిముఖ్యమైన అడుగు (First important step). కర్మలు వదలటము కర్మ సన్న్యాసము కాదు. కర్మఫలములను సర్వాంతర్యామియగు పరమాత్మకు సమర్పించటమే **కర్మయోగము** (మరియు) **కర్మరాహిత్యము కూడా.**

**(2) యోగం - సాష్టాంగదర్శనమ్ :** - **"యమము, నియమము ఆసనజయము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి"**...అను అష్టాంగయోగములను నిర్వర్తిస్తూ ఉండెదరు గాక. ఇవన్నీ ఒకే సమయములో నిర్వర్తించు వివేకము కలిగి ఉండండి.

**(3) శాంతము :** కోపము, ఆవేశము, తప్పులెన్నటము, పరనింద, లోకములో తారసబడే సంబంధములగురించి ఆవేదనలు, అనుబంధ బాంధవ్యములు గురించి ఆరాటము - మొదలైనవన్నీ మనోదురభ్యాసముగా గమనిస్తూ **"శాంతముగా ఉండటము"**ను మనస్సుతో అభ్యాసము చేయాలి.

**(4) సత్యపరాయణము :** "నాకు సంబంధించినట్టి ఏది సత్తు (సత్యము) ఏది సందర్భమాత్రము (లేక) **పరికల్పితము? ఏది నిత్యము?** ఏది **అనిత్యము?** ఏది **'ఇహము'** ? ఏది **'పరము'? -** అను విభాగము చేసి 'సత్' స్వరూప - స్వభావమును అభ్యాసపూర్వకంగా విడదీసి ఆశ్రయించుచూ ఉండాలి.

**(5) స్వాత్మని అవస్థితము :** ఇక్కడ దేహానుభవములగుచూ ఉన్నట్టి తనయొక్క దృశ్య - దేహ - మనో - బుద్ధి - చిత్త - అహంకారములకు ఆవల సాక్షి అయి, సమస్తమునకు ఆధారమైయున్న 'స్వాత్మ'ను గమనిస్తూ అద్దానియందు సర్వకాల - సర్వఅవస్థలయందు "అవస్థితము (Placement of the Wisdome as well as interest in one's own Absolute Self)ను అభ్యాసము చేస్తూ ఉండటము.

**(6) సమ్యక్జ్ఞాన సుశిక్షతత్వము:** 'ఏకము - అక్షరము' అగు ఆత్మయే అనేక రూపములువలె (అజ్ఞానముచే) అగుపిస్తోంది, అనిపిస్తోంది. భేదదృష్టియే సంసారము. **"అనేకముగా కనిపిస్తూ ఉన్నప్పటికీ, ఏకముగా అనిపించటము"** అను ఆశయము వైపుగా ఆత్మజ్ఞానము

(లేక) సమ్యక్ జ్ఞానము కొరకు సుశిక్షితము (WelTrainerd) అగుచుండటమే ముఖ్యాశయము. అందుకు శ్రవణము, మననము అధ్యయనము అవసరము. 'గురు ఆశ్రయము' ద్వారా అభ్యాసము చేయటము అత్యావశ్యకం.

**(7) శుచి అయిన ప్రదేశమును ఎన్నుకోవటము :** పర్వతముయొక్క ఒక ఎత్తైన ప్రదేశమునుగాని, ఏదైనా నదీతీరమునుగాని, బిల్వ వృక్షము (మారేడు చెట్టు) వంటి ఏదైనా వృక్షమూలమునగాని, వనములోగాని - ఏకాంత ప్రదేశమును ఎన్నుకోవటము శుభప్రదము. ధ్యానముచేస్తూ ఉన్నప్పుడు ఆటంకములు ఉండని ప్రదేశమును సిద్ధము చేసుకోవటము - ఆవశ్యకము.

**(8) అథవా మనోరమే శుచే దేశే మఠం కృత్వా।** (లేదా) మనస్సుకు ప్రియముగా ఉండే శుచి అయిన ప్రదేశములో ధ్యానమందిరమును సిద్ధము చేసుకోవాలి.

**(9) ఆసనము** : ఈ విధమై సంసిద్ధత తరువాత ఇక అట్టి శుచి అయిన, మనస్సుకు ప్రియమైన ప్రదేశములో **"ఆసనము"**ను ధారణ చేస్తూ ఉండాలి. తూర్పువైపుగాగాని, ఉత్తరమువైపుగా గాని ధ్యానము కొరకై ఆశీనుడై సుఖాసనము స్వీకరిస్తూ ఉండాలి. **ఆరభ్య ఆసనం పశ్చాత్, ప్రాఙ్ముఖో (ఉ)దఙ్ముఖో౽పివా (ఉత్తరముఖోపివా)।।**

**(10) దేహ నిశ్చల ధారణ** : ఇక యోగాభ్యాసమునకై శరీర ధారణ చేయాలి. **సమగ్రీవ శిరః కాయః సంవృతాస్యః సునిశ్చలః -** పద్మాసనమో, మరేదైనా సుఖాసనమో ధరించి, మెడ - శిరస్సు దేహములను నిఠారుగా నిశ్చలముగా ఉండేటట్లు ధారణ చేయాలి.

**(11) ధ్యానము: నాసాగ్రే శశభృత్ బింబే, బింబమధ్యే 'తురీయకమ్'** - ముక్కుకు ఉపరిభాగమున ఆజ్ఞాచక్రమును స్పృశించు స్థానమునందు చంద్రబింబమును దర్శనము చేయాలి. ఆ చంద్రబింబము మధ్యగా **"జాగ్రత్ - స్వప్న - తురీయములకు ఈశ్వరుడు, సాక్షి, ప్రవేశ నిష్క్రమణశీలుడు, సమస్తమునకు సొంతదారుడు"** అగు తురీయము (లేక తురీయ పురుషుని) దర్శనము చేయునుగాక।

**(12) అమృతాశ్రయము** : మార్పు చెందేది మృతము. స్వస్వరూపమో (లేక ఆత్మయో)? **మార్పు చెందనిది.** ఆత్మదర్శనమే అమృతదర్శనము. **స్రవంతమ్ అమృతం పశ్యేత్ నేత్రాభ్యాం సు-సమాహితః।।** అమృతము (A Factor beyond any kind of, any bit of change) సమాహితుడై నేత్రములతో (అంతర్దృష్టిచే) దర్శించుచూ ఉండునుగాక।

**(13) ఉదరజ్వాలావళీ అగ్నిధ్యానము:**

(i) **ఇడయా వాయుమ్ ఆకృష్యము (లాగివశము చేసుకోవటము): ఇడయా ప్రాణమ్ ఆకృష్య పూరయిత్వా ఉదరస్థితమ్, తతో అగ్నిం దేహ మధ్యస్థం ధ్యాయన్ జ్వాలావళీయుతమ్, బిందు నాద సమాయుక్తమ్ అగ్నిబీజమ్ విచింతయేత్।।** ఎడమ ముక్కు పుటముద్వారా వాయువును లాగి వశము చేసుకొని, ఇడనాడిలోను, పొట్టయందు వాయువును కుంభకము చేసి, దేహమధ్యలోగల ఉదరము (పొట్ట)లో బిందు-నాద సమన్వితముగా అగ్నిబీజమును (అగ్నికణమును) తేజోయుతంగా భావన చేసి ధ్యానము చేయాలి. ఆ తరువాత పింగళనాడి ద్వారా నెమ్మది నెమ్మదిగా రేచకము (వాయువును వదలటము) చేయాలి.

(ii) **పింగళా వాయుమ్ ఆకృష్యము :** ఆ తరువాత పింగళనాడి ద్వారా గాలిని సమాకర్షించి పింగళలోను, పొట్టయందు కుంభకం చేసి 'ఇడ' ద్వారా రేచకం చేస్తూ పైవిధముగానే నిర్వర్తించాలి. ఈ విధంగా శ్రద్ధగా చేయాలి. ఏకాంత ప్రదేశంలో త్రిసంధ్యలలోను ఇడ పింగళ వాయు ఆకృష్యమును 2×3=6 సార్లు రోజూ చేస్తూ ఉండాలి. అప్పుడు నాడులన్నీ కూడా వాటియొక్క వేరువేరు లక్షణములతో గుర్తించబడతాయి. క్రమంగా **'నాడీశుద్ధి'** జరుగగలదు.

అట్టి యోగాభ్యాసముచే - శరీరము తేలికగా అనిపించుచూ, దీప్తివంతము కాగలదు. జఠరాగ్ని వృద్ధి పొందగలదు. నాదము అభివ్యక్తము కాగలదు. ఇవన్నీ పైనచెప్పిన యోగాభ్యాసము యొక్క యోగసిద్ధికి సూచకములు. ఈ చిహ్నములు సుస్పష్టము అయ్యేవరకు పైవిధంగా యోగాభ్యాసము కొనసాగించాలి. అటువంటి చిహ్నాలు సంప్రదర్శనము అయిన తరువాత ఇక **"ఆత్మశుద్ధి"**ని చక్కగా ఆచరించాలి.

**సాంకృతి ముని:** మహాత్మా! ఆత్మ నిత్యశుద్ధము-అని చెప్పబడుచున్నది కదా! ఇక 'ఆత్మశుద్ధి' అనుదానితో అగత్యము క్రొత్తగా ఉంటుందా?

**శ్రీదత్తాత్రేయ భగవానుడు : నిజమే! ఆత్మ శుద్ధః సదా నిత్యః సుఖరూపః స్వయం ప్రభః।** సమస్త జీవులయొక్క స్వస్వరూపాత్మ ఎల్లప్పుడు శుద్ధము. త్రికాలములలో నిత్యము. పరమ సుఖరూపము. స్వయంజ్యోతి స్వరూపము. ఇది నిస్సందేహము. అయితే 'అజ్ఞానము' చేత ఆత్మ మలినము పొందినట్లు అనిపించటము జరుగుతోంది. జ్ఞానముచే శుద్ధమై ఎరుకగా ప్రకాశించుచున్నది. ఎవరియొక్క జ్ఞానయత్నములచే అజ్ఞానమలకంపము క్షాళనము (cleaning just like dust - covered mirror) అగుచున్నదో, అట్టివాడు కర్మసహితుడై ఉన్నప్పుడు, కూడా శుద్ధుడే అయి ఉండగలడు. కర్మలకు సంబంధించిన ఏ దోషము ఆతనిని తాకదు. కర్మలు నిర్వర్తిస్తూ కూడా అకర్మిష్టుడై ఉండగలడు.

# 6వ ఖండము - ప్రాణాయామము (అష్టాంగయోగములలో నాలుగవది)

**శ్రీదత్తాత్రేయ భగవాన్ :** ఓ సాంకృతి మహానుభావా! ఇప్పుడు మనము 'ప్రాణాయామ క్రమము" గురించి మరికొన్ని విశేషాలు చెప్పుకుందాము. **(1) రేచకము (2) పూరకము (3) కుంభకము** - ఈ మూడు కలిపి **'ప్రాణాయామము'** అని **'వర్ణత్రయాత్మకము'** అని పిలువబడుతోంది. అదియే **'ప్రణవము'** అని కూడా ప్రాణాయామ తత్పరులచే అనబడుతోంది. (ప్రణవము = 'ఓం'కారము; పరమాత్మ; కేవలము; మూలము; ఆది - మొదలైన అర్థములు)

**(I) ఇడాపూరక - ఉదరకుంభక-పింగళరేచక ప్రాణాయామము** : ఇడనాడిలో వాయువును ఆకృష్యము (ధారణ) చేసి, ఉదరములో పూరకము చేయటము. 16 మాత్రలు కాలము **'అ'** కారమూర్తిగా స్మరిస్తూ ప్రణవమును ధ్యానిస్తూ పూరకము నెమ్మదిగా నిర్వర్తించాలి.

ఆ విధంగా పూరించి ఉదరములో 64 మాత్రల కాలము కుంభకము చేయాలి. **'ఉ'** కారమూర్తిగా ప్రణవమును భజిస్తూ కుంభకధారణ చేయాలి. కుంభకము చేయుచూ, ఎంతసేపు ధారణ చేయగలడో అంతసేపు చేయాలి.

ఈ విధంగా పూరకము, కుంభకము అయిన తరువాత **'మ'** కారమును ధ్యానిస్తూ నెమ్మదిగా 32 మాత్రల కాలము - రేచకమును పింగళానాడి ద్వారా నిర్వర్తించాలి.

**(II) పింగళాపూరక - ఉదర కుంభక - ఇడారేచక ప్రాణాయామము :** (కుడి ముక్కుపుటము ద్వారా) పింగళనాడిలో 16 మాత్రలకాలము పొట్టలో పూరించి **'అ'**కారమూర్తిని ఏకాగ్రమైన మనస్సుతో ధ్యానిస్తూ, ఆ తరువాత **'ఉ'**కారమూర్తిని ధ్యానిస్తూ '64' మాత్రల కాలము **కుంభకము** చేయాలి. అటుపై **'మ'**కార ప్రణవధ్యానము నిర్వర్తిస్తూ ఇడానాడి ద్వారా రేచకము (గాలిని వదలటము) చేయాలి.

**పునః పునః పై రెండు రీతులుగా ప్రాణాయామము అభ్యసించబడుగాక.**

ఓ మునీశ్వరా! ఈ విధంగా నిత్యము అభ్యాసము చేస్తూ ఉండగా '6' నెలల కాలములో ఆత్మజ్ఞానము జనించగలదు. సంవత్సరకాలము అభ్యాసించుటచే **బ్రహ్మతత్త్వజ్ఞుడు, బ్రాహ్మీభూతుడు** విద్వాంసుడు అగుచున్నాడు.

ఉత్తమమైన ప్రయోజనమును ప్రసాదించు ఇట్టి ప్రాణాభ్యాసమును యోగాభ్యాసి తప్పక నిత్యము అభ్యసించాలి. ఎవ్వడైతే యోగాభ్యాసరహితుడై ఉంటూ, తనకు నియామకమైనట్టి స్వధర్మమును శ్రద్ధగా నిర్వహిస్తూ ఉంటాడో, క్రమంగా ఆతనియందు ప్రాణసంయమ ప్రభావము చేత జనించు జ్ఞానముచే **"నాకు మొదలే బంధము లేదు. ఉండజాలదు కూడా!"** - అను ముక్తస్థితిని సిద్ధించుకోగలదు.

బాహ్యమునుండి వాయువును ఆకర్షించి ఉదరమున నింపి ఉంచటము **పూరకము.** ఉదరము నందు వాయువును నింపి కుండలో గాలి వలె నిశ్చలము చేయటము - **కుంభకము**. ఉదరము నుండి బయటకు వాయువును విరేచనము (Leaving/ Vacating) చేయటము **రేచకము.**

**ప్రాణాయామాభ్యాసము చేస్తూ ఉండగా**

**ప్రథమదశలో** → ప్రస్వేదనము (బాగుగా చెమట) బహిర్గతమౌతూ ఉంటుంది. ఇది "ప్రాణాయామ {ప్రప్రథమ (లేక) అధమ)} దశ" అనబడుతోంది.

**ద్వితీయ (లేక) మధ్య దశలో** → శరీరములో కంపనము (వణుకు) జనిస్తూ ఉంటుంది.

**తృతీయ ఉత్తమ దశలో** → శరీరము ఉత్థానము (పైకి లేవటము) జరుగుచూ ఉంటుంది. ఉత్తరోత్తరస్థితి లభించేవరకు పూర్వదశ కొనసాగుచూ ఉంటుంది. తృతీయ ఉత్తమ ప్రాణాయామ దశలో ఆ ప్రాణాయామాభ్యాసి శరీరము తేలికగా అగుచూ, ఆతడు అనిర్వచనీయ సుఖమును పొందుచూ ఉండగలడు.

**సాంకృతి ముని :** స్వామీ! అసలు ప్రాణాయామ యోగాభ్యాసము యొక్క అంతిమాశయము ఏమిటి?

**దత్తాత్రేయ అవధూత భగవాన్ :** ఓ సువ్రతా! **ప్రాణాయామేన చిత్తం తు శుద్ధం భవతి।** ప్రాణాయామ - అభ్యాసముచే చిత్తము శుద్ధము అగుచున్నది. ఆ విధంగా చిత్తము నిర్మలమగుచుండగా ఆ అభ్యాసికి **"ప్రత్యక్ జ్యోతి (కేవల తేజస్సు)"** యొక్క దర్శనము కాగలదు. అప్పుడిక, **ప్రాణ చిత్తేన సంయుక్తః పరమాత్మని తిష్ఠతి॥** - ప్రాణము చిత్తముతో కూడినదై పరమాత్మ (సర్వసాక్షి, సమస్త స్వరూపము అగు కేవల స్వస్వరూపము) నందు నిశ్చలత్వము పొందటము జరుగుచున్నది.

**ప్రాణాయామ యోగము యొక్క మహత్తర ప్రయోజనము**

**శ్లో॥ ప్రాణాయామపరస్య అస్య పురుషస్య మహాత్మనః**
**దేహశ్చ ఉత్తిష్ఠతే। తేన కించిత్ జ్ఞానాత్ విముక్తతా॥**

ప్రాణాయామాభ్యాసము చేయుచున్న పురుషుని దేహము ఉత్తిష్ఠత (Awakened/upward lift) పొందుచున్నది. అట్టివాడు మహాత్ముడు అగుచూ, సమస్తమును తనయొక్క పురుషకారమునందు దర్శించుచున్నాడు. ఇక, కించిత్ **జ్ఞానశ్రవణము** (లేక) **అధ్యయనము** చేతనే సర్వ సాంసారిక బంధములనుండి విముక్తుడు అగుచున్నాడు. ప్రాణాయామ యోగాభ్యాసము చేస్తూ ఆ యోగాభ్యాసి 'ఉత్తర దశ'కు చేరుచున్నాడు.

**ప్రాణాయామ యోగాభ్యాస ఉత్తర దశ**

రేచకము -కుంభకము - పూరకముల అభ్యాసము చేస్తూ ఉన్న యోగి ఉత్తరోత్తర దశలో - రేచక - పూరకముల ఆవశ్యకత లేకుండానే దేహములో

- ఉదరమునందు, హృదయమునందు,
- శరీరములోని వేరు వేరు ప్రదేశములందు,
- శరీరమునందు అంతటా,
- తదితర సహజీవులయొక్క బాధ కలిగించు శరీరములోని ప్రదేశమునందు / విభాగములందు,

**స్వాభావిక (రేచపూరకరహిత) కుంభకము ("క్రమక్రమసాధన"**చే) నిర్వర్తించగలడు. కాలవ్యవధి లేకుండానే క్షణకాలంలో కుంభకా ధారణ చేయగలడు.

**రేచకం పూరకం ముక్త్వా, కుంభకమ్ నిత్యమ్ అభ్యసేత్॥** రేచక పూరక కుంభకముల అభ్యాసము కొనసాగుచుండగా అట్టి అభ్యాస ప్రయోజనంగా రేచక్ - పూరకములు నిర్వర్తించవలసిన అగత్యము లేకుండానే ధారణ చేయటము **స్వాభావ కుంభకము.** అది మహత్తరమైన ప్రయోజనకరము. అట్టివాడు సర్వ శారీరక - మానసిక - బుద్ధి సంబంధమైన రుగ్మతలనుండి అతిత్వరగా వినిర్ముక్తుడు కాగలడు. మనస్సును జయించివేయగలడు. అట్టివాడు ఇక దృశ్య లంపటములో (సంసారములో) మునగడు. సర్వకాల సర్వావస్థలయందు, సర్వస్థితిగతులయందు **"కేవలాత్మాఽహమ్'** స్థానమును **అనుక్షణికంగా, అనునిత్యముగా** సిద్ధించుకోగలడు.

అట్టి యోగి సహజీవుల యోగ-జ్ఞాన సాధనములకు కూడా ఎంతగానో సహకరించగలడు.

**ప్రాణాయామైక నిష్ఠస్య న కించిదపి దుర్లభమ్॥** ఏకాగ్రతతో కూడిన ప్రాణాయామ నిష్ఠ కలవానికి 'అసాధ్యము' అనునదే ఉండదు. ఉండజాలదు.

అందుచేత...ఓ సాంకృతి యతీశ్వరా! సర్వప్రయత్నములచే ప్రాణాయామమును చక్కగా, శ్రద్ధగా, దైనందికంగా తప్పక అభ్యసించటము ముముక్షువుకు శుభప్రదము.

## ప్రాణాయామ వినియోగము

**సాంకృతి ముని** : హే భగవాన్! దత్తాత్రేయస్వామి! ప్రాణాయామ అభ్యాసమునకు రోజులో ఏ సమయము అధిక ఫలప్రదమో దయతో సూచించండి.

**శ్రీ దత్తాత్రేయ స్వామి :** సర్వకాల సర్వావస్థలు ప్రాణాయామమునకు తగిన సమయమే. అయితే **'నియమము'** అనేది అభ్యాసికి ఏకాగ్రతకై సానుకూల్యము కాబట్టి కొన్ని శాస్త్ర నిర్దేశ్యములను చెప్పుతాను.

- ఉదయ - మధ్యాహ్న - సాయంత్ర సంధ్యా సమయములు.
- బ్రాహ్మీ ముహూర్త సమయములు (4 to 6 Am & PM)
- నిదురకు ముందుగాను
- ఉదయము మధ్యాహ్నము సాయంకాలము రాత్రి
  (6 AM 12 Noon 6 PM 10 PM)
- పవిత్రమగు తీర్థప్రదేశములను, ఆశ్రమములను సందర్శించు సందర్భములలోను.

**ఈఈ సమయములలో (లేక) తీరిక దొరికినప్పుడల్లా...**

❖ ప్రాణమును ఇడ - పింగళనాడులలోకి సమాకర్షించి పూరించటము.
❖ ఉదరములో పూరించటము

❖ ముక్కుకు అగ్రభాగములోను (రెండు కనుబొమ్మల మధ్య-క్రిందగాను), నాభి (బొడ్డు) మధ్యగాను, పాదముల అంగుష్ఠములలో (బొటనవ్రేలులలో) ప్రాణధారణ చేయటము. లేదా – స్వాభావ కుంభకము యొక్క చరణము.

ఈ రీతిగా ధారణ చేయబడునుగాక। ఈ విధంగా ఆయా ప్రదేశములలో ప్రాణధారచే అట్టి అభ్యాసి సర్వరోగములనుండి విముక్తుడు కాగలడు. శతవర్ష – ఆయుష్మంతుడు కాగలడు. బుద్ధి నిర్మలము, సునిశితము, విస్తారము, ఏకాగ్రము కాగలదు.

- నాసాగ్రము (ముక్కుకు పై ప్రదేశములలో కనుబొమ్మల మధ్యగా – బొట్టు పెట్టుకొనుచోట) ధారణచే సర్వ సందర్భములలో దిగ్విజయుడు కాగలడు.
- నాభి మధ్యప్రదేశములో 'ధారణ' చేత సర్వరోగములు తొలగిపోగలవు.
- పాదముల బొటనవ్రేలులలో ప్రాణ నిరోధము (స్వాభావకుంభకము) చేత శరీరము తేలికగా అయి, ప్రత్యుత్సాహము అనుభవము కాగలదు.

- నాలుకతో వాయువును ఆకృష్యము చేసి (లోనికి పీల్చి, వశము చేసుకొని) త్రాగుచూ (గుటకలు వేస్తూ) ఉండు అనునిత్య అభ్యాసముచే అట్టి రోగి అలసట, దాహములనుండి వినిర్ముక్తుడై, ఆరోగ్యవంతుడు కాగలడు.
- నాలుకతో వాయువును ఆకృష్యము చేసి, జిహ్వ (నాలుక) యొక్క మూలస్థానము నందు (కంఠమునందు) వాయు నిరోధము చేయు అభ్యాసముచే 'అమృతము' (changelessness) గ్రోలుచూ సకల సుఖములు పొందగలడు. సుఖజీవనుడు కాగలడు.
- ఇడానాడితో వాయువును సమాకర్షించి (ఆకృష్యము చేసి) భ్రూమధ్యస్థానములో నిరోధము చేయు అభ్యాసము చేస్తూ, అమృతమును (కేవలాత్మానందభావనను) గ్రోలుచూ అభ్యాసము చేయు యోగి శుద్ధుడై సర్వవ్యాధులనుండి విముక్తుడు అగుచున్నాడు.
- ఇడ – పింగళలలో వాయువును (ప్రాణమును) ఆకృష్యము చేసి (ఆకర్షించి, పూరకం చేసి), నాభి (బొడ్డు) ప్రదేశములో నిరోధము చేయటముచేత ప్రాణాంతకమైన వ్యాధులుకూడా సమసిపోగలవు. ఆ అభ్యాసి ఆరోగ్యవంతుడు కాగలడు.
- ఒక నెలరోజులు ఉదయ – మధ్యాహ్న – సాయం సంధ్యా సమయములలోను – వాయువును నోటితో ఆకృష్యము చేసి (ఆకర్షించి, ప్రియముగా పీల్చి) అమృతపానము (మాధుర్యము, ఆత్మానందానుభావన) చేయువాడు శరీరములో వాత (వాయుసంబంధమైన) – పిత్త (రససంబంధమైన) దోషములను నశింపజేసుకోగలడు. **ఇత్యేవ న సంశయః।**
- ముక్కుతో గాలిని సమాకర్షించి, రెండు కళ్ళలోను వాయునిరోధనము చేయు అభ్యాసము చేత నేత్రరోగములు ఉపశమిస్తాయి. అట్లాగే చెవులలో నిరోధనము చేత చెవులోని దోషాలు తొలగుతాయి. శిరస్సు నందు వాయుధారణ చేస్తూ ఉంటే శిరస్సులోని (తలనొప్పి, పార్శ్వం నొప్పి, మతిమరపు వంటి మొదలైన) అనేక దోషములు, లోపములు ఉపశమిస్తాయి.

## యోగాభ్యాసము

**శ్రీ దత్తాత్రేయ భగవానుడు** : ఓ సాంకృతి మహదాశయా! ఇప్పుడు కొన్ని యోగాభ్యాసముల గురించి నిర్వర్తించు విధి విధానములను – యోగాభ్యాసుల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని సూచనలుగా చెప్పుచున్నాను. వినండి.

- సమాహిత (ప్రశాంత, విషయ భావనా రహిత) మనస్సుతో,
- స్వస్తి కాసనమును (రెండు పాద తలములను మోకాళ్ళపైన పిక్కల తొడల మధ్యగా ఆనించి ఉంచి, కంఠమును శిరస్సును శరీరమును "సమము"గా, నిటారుగా ధారణ చేయటము స్వస్తికాసనము. **జానుర్వో అంతరే కృత్వా సమ్యక్ పాదతలే ఉభే సమగ్రీవ శిరః కాయః "స్వస్తికమ్")** – ధారణ చేసి (లేదా, సుఖాసనము స్వీకరించును గాక)।
- ప్రణవమును ఉచ్ఛరిస్తూ నెమ్మది నెమ్మదిగా అపానమును (మూలాధారము వైపుగా పయనిస్తూ ఉన్నట్టి ప్రాణ శక్తిని) ఊర్ధ్వముగా ఉత్థాప్యము చేస్తూ (పైకిలాగుచూ),
- రెండు చేతులతో కర్మేంద్రియములను ఈ క్రింది విధంగా కప్పి ఉంచి ధారణచేయుదురుగాక!
  - రెండు బొటన వ్రేళ్ళతో రెండు చెవులను.,
  - చూపుడు వ్రేళ్ళతో రెండు కళ్ళను
  - మధ్య వ్రేళ్ళతో రెండు ముక్కుపుటములను కప్పి ఉంచి,

**తలయందు ప్రాణ నిరోధమును అభ్యసించెదరుగాక।**

ఇట్టి కర్మేంద్రియములను చేతివ్రేళ్ళతో మూసి, శిరస్సునందు ప్రాణధారణ (మూర్ధమునందు ధారణ)చే ప్రాణశక్తి బ్రహ్మరంధ్రమును పొందుచున్నది.

ప్రాణః ప్రయాత్యనేనైవ బ్రహ్మరంధ్రం! బ్రహ్మరంధ్రం గతే వాయౌ నాదశ్చ ఉత్పద్యతే। ప్రాణశక్తి (వాయువు) శిరస్సునకు ఉపరిగా గల బ్రహ్మరంధ్రమును స్పృశించగానే నాదము పుట్టుచున్నది.

| **ముందుగా శంఖధ్వని। మధ్యలో మేఘగర్జన ధ్వని। ఆ తరువాత శిరస్సు మధ్యగతంగా వాయువు వలన సెలయేటి ధ్వని। (లేక) కొండను వాయువు స్పృశించినప్పటి ధ్వని ("షీ"....ఈలధ్వని) వినబడతాయి.** |
|---|

ఓ మహాప్రాజ్ఞా! అప్పుడిక చిత్తము క్రమంగా ఒకానొక మాధుర్యము సంతరించుకొనుచూ సాక్షాత్ ఆత్మోన్ముఖము అగుచున్నది. యోగాభ్యాసము జ్ఞానాభ్యాసరూపముగా స్వయముగా సరియగు సమయంలో సంతరించుకొనుచున్నది. యోగాభ్యాసము, బుద్ధి నిర్మలత ప్రసాదిస్తూ సంసార దోషము నుండి ఈ జీవుని తరింపజేయుచున్నది. అట్టి యోగి జన్మ-కర్మ వినిర్ముక్తుడగుచున్నాడు. ఉత్తరోత్తర జన్మలపట్ల సర్వ స్వాతంత్ర్యుడు అగుచున్నాడు.



## కుండలినీశక్తి - సుషుమ్ననాడీ ప్రవేశము - బ్రహ్మరంధ్రసంచాలనము

**మూలాధారములో వాయు నిరోధము :** ఎడమ చీలమండలముతో సీవని (తొడవెనుక ఊర్ధ్వభాగమును) నొక్కి ఉంచి, కుడి చీలమండలముతో రెండవ సీవనిని నొక్కి ఉంచి, పిక్కలకు క్రింద గల సంధి భాగమును నొక్కి ఉంచాలి.

దేవదేవుడగా త్ర్యంబకుని (శివుని), వినాయకుని స్మరించి, శ్రీ సరస్వతీ దేవిని ఉపాసిస్తూ లింగనాళమునుండి వాయువును వాయువుతో సమాకర్షించి (లింగము యొక్క క్రింద మాంస భాగమునుండి ముందుకు సమాకృష్యముచేసి, పైకి తెచ్చి) నియుక్తము - బిందుయుక్తము అగు ప్రణవముతో వాయువును మూలాధారములో నిరోధించాలి. ఈ విధంగా వాయు నిరోధములవలన జనించు అగ్ని మూలాధారములోగల కుండలినిని నిదురలేపుతుంది.

ప్రాణయోగాభ్యాసి - ఆ అగ్ని **కుండలినిని సుషుమ్ననాడిలో ప్రవేశింపజేసి,** వాయు నిరోధక్రమముచే ఊర్ధ్వపథములో నడిపిస్తూ ఆజ్ఞాచక్రము, బ్రహ్మరంధ్రము వరకు కొనిపోవుచున్నాడు. ఈ విధమైన అభ్యాసముచే ఆ యోగికి ప్రాణశక్తి స్వవశము అగుచున్నది. వాయువుపై ఆతనికి నియంత్రణ (Conscious control) కలుగుచున్నది. ప్రాణశక్తి స్వవశమై ఉంటుంది.

మొట్టమొదట ప్రస్వేదనము (చెమట), తరువాత కంపనము, ఆ తరువాత ఉత్థాన శరీరము (అనగా) శరీరము తేలిక అయి పైకి లేవటము - అనునవి యోగాభ్యాస సందర్భములోని పరిణామములు. **"వాయుజయము సిద్ధించినది"** - అనటానికి గుర్తు (సంజ్ఞ) లేక చిహ్నము శరీరముయొక్క ఉత్థాన (Raising up) సిద్ధియే. (శరీరము దూదిపింజమువలె తేలిక అయి, గాలిలో లేచుచున్న అనుభూతి - ఉత్థానస్థితి)

### వాయునిరోధ ప్రయోజనములు

ఇద్దాని అభ్యాసముచే మూలరోగములన్నీ తొలగిపోగలవు. కడుపులో మంట వంటి దోషములు తొలగుతాయి. ఓ సాంకృతీ! ఈ అభ్యాసము సర్వరోగనివారిణి అయి ఉన్నది. సర్వపాతకములు నశిస్తాయి. చిత్త దర్పణము మహాద్భుతమైన ప్రకాశముతో తేజరిల్లగలదు. మనస్సుకు బ్రహ్మలోకము వరకు తారసపడుచూ ఉండే ఏవేవో భోగములు అనుభవించాలనే దేశ ద్రిమ్మరితనము తొలగుతుంది.

హృదయములో సాత్విక వైరాగ్యము స్వభావసిద్ధమై అంకురించగలదు. **క్షుద్రమైన మహాపాతక దోషములు తొలగి హృదయము నిర్మలమై ఆత్మభావనా సౌరభముతో నిండి ఉండగలదు.**

**కైవల్య సిద్ధి: (1) సంసారముపట్ల విరక్తి (2) అధ్యాత్మ-విచారణలచే ఆత్మజ్ఞానసముపార్జన-ఈ రెండూ కైవల్యమునకు సాధనములు.**

**విరక్తస్య తు సంసారాత్ జ్ఞానం కైవల్య సాధనమ్। సంసారముపట్ల విరక్తిచేతనే జ్ఞానము జనించగలదు.** ఆత్మజ్ఞానముచే సందర్భ పరిమితత్వము వీగిపోయి కేవలమగు స్వస్వరూపము స్వానుభవము అవగలదు. **ఈ విధంగా కైవల్యము సిద్ధించగలదు.**

### ఆత్మదృష్టి

ఒక్కసారి ఆత్మజ్ఞానామృత రసము ఈ జీవుడు ఆస్వాదించటము జరిగిందా,..ఇక అట్టి ఆత్మతత్త్వామృత రసమును గ్రోలువాడు సర్వ తదితర కార్యవ్యవహారములను అధిగమించివేసి ఆత్మయందే జగత్తును పదర్శిస్తున్నాడు. ఆత్మతత్త్వమునే సర్వదా అమృత మాధుర్యముగా గ్రోలుచున్నాడు. **ఈ ఇంద్రియములకు తారసబడే సమస్తమును ఆత్మతత్త్వ స్వరూపముగా** చూస్తూ, అట్టి ఆత్మతో మమేకమగుచున్నాడు.

**'జ్ఞానస్వరూపమేవ' అహుః జగత్ ఏతత్ - విచక్షణః॥ "ఈ జగత్తు ఇంద్రియములకు భౌతికంగా - ఆకాశము మొదలైన పంచభూత సమ్మేళనముగా అగుపిస్తూ ఉన్నప్పటికీ, వాస్తవానికి ఇదంతా కూడా జ్ఞానానంద స్వరూపమే!"** అని ఆత్మజ్ఞులు ఎలుగెత్తి గానము చేస్తున్నారు.

## అల్పదృష్టి

ఇక అల్ప–కుదృష్టులగు అజ్ఞానుల దృష్టిలోనో?....ఇదంతా అనేక విషయ పరంపరలతో కూడిన అర్ధస్వరూపము (It is a scenary of multiple meanings) గా అనిపిస్తూ ఉన్నది. **అర్థస్వరూపమ్ అజ్ఞానాత్ పశ్యంతి అన్యే కుదృష్టయః॥**

**"ఆత్మస్వరూప విజ్ఞానము"** చేత అజ్ఞానము తప్పక నశించిపోగలదు. అజ్ఞానము క్షీణిస్తూ ఉంటే, అద్దానితోబాటే రాగద్వేషములు, ఆశ నిరాశ పేరాశలు, కామక్రోధ లోభములు, మద మాత్సర్యములు – ఇవన్నీ తమకు తామే క్షీణించిపోతాయి. **రాగాది అసంభవే, ప్రాజ్ఞ! పుణ్య పాప విమర్దనమ్।** రాగాదులు సంభవించటం మానివేస్తే, ఓ ప్రాజ్ఞా! ఇక పుణ్యపాప ద్వంద్వ మోహములు శేషించవు. అప్పుడిక అట్టి యోగి "శరీరము"తో తాదాత్మ్యము చెందడు. **తయోః నాశే శరీరేణ న పునః సంప్రయుజ్యత ఇతి। "శరీరి"**గా ఆత్మానుభవమునందు నిస్సందేహిగా ప్రవేశించి సుప్రతిష్ఠుడు కాగలడు. **"ఈ శరీరములో నేను బద్ధుడను" – అను భావనయే జనించదు.** అట్టి వానికి ఈ శరీరము 'సర్వదా నశించినదే'– అగుచున్నది.

# 7వ ఖండము – ప్రత్యాహారము – అష్టాంగ యోగములలో ఐదవది

**శ్రీ దత్తాత్రేయ స్వామి** : ఓ మహామునీ! మహాప్రాజ్ఞా! సాంకృతి మహాశయా! ఇప్పుడిక మనము **"ప్రత్యాహారము"** యొక్క వివిధ అంగముల గురించి చెప్పుకుందాము.

**<u>(1) ఇంద్రియ విషయ ఉపశమే ప్రత్యాహారము:</u>**

ఈ ఇంద్రియములు స్వాభావికంగా ఆయా విషయాలపై వ్రాలటమును అభ్యాసముగా కలిగి ఉండటము జరుగుతోంది. అటువంటి ఈ ఇంద్రియములు ప్రాపంచక విషయములపై వ్రాలకుండా నిరోధించు ఉపాయమే **"ప్రత్యాహారము".**

**<u>బ్రహ్మమే కర్త। బ్రహ్మమే భోక్త। బ్రహ్మమే ఇదంతా।</u>**

**"సర్వం ఖలు ఇదం బ్రహ్మ"–భావనయే "ప్రత్యాహారము"**

– **"ఏదేది ఇంద్రియములకు ఎదురుగా అనుభవమగుచూ ఉన్నదో,....అట్టి ఈ సమస్తము బ్రహ్మమే"** అని ఏ సమాహితమైన బుద్ధితో దర్శించబడుచున్నదో....అయ్యదియే **"ప్రత్యాహారము"** – అని బ్రహ్మవిత్ వరేణ్యుల ప్రవచనము.

**"యేదేది ఈ దృశ్యజగత్తులో నాచేతగాని – మరొకరి చేతగాని నిర్వర్తించబడుచున్నదో....అట్టిదంతా కూడా (శుద్ధమైనా, అశుద్ధమైనా కూడా) బ్రహ్మముచేతనే నిర్వర్తించబడుచూ, బ్రహ్మమే అయిఉన్నది"** – అను అనునిత్యమగు సందర్శనాభ్యాసమే **నాహంకర్తాప్రత్యాహారము.**

**కర్మఫల సమర్పాణా ప్రత్యాహారము:–**

**అథవా : శ్లో॥ నిత్యకర్మాణి బ్రహ్మారాధన బుద్ధితః కామ్యాని చ**
**తథా కుర్యాత్ "ప్రత్యాహారః" స ఉచ్యతే॥**

ఈ జీవుడు కర్మలు చేస్తూనే ఉంటున్నాడు. అవి అనేక రీతులు.

(1) **విద్యుక్త (ధర్మములు) కర్మలు** : తాను చేయుటకై శాస్త్రములచే, సంఘముచే, సహజీవుల శ్రేయస్సుకొరకై విధించబడేవి.

(2) **నిత్య కర్మలు** : ప్రతిరోజు దైవోపాసనగా, వంశ ఆచారంగా నియమించబడినవి. అవి వ్యవహారికమైనవి కావచ్చు, దైవోపాసనా సంబంధమైనవి కావచ్చు.

(3) **<u>నైమిత్తిక కర్మలు</u>** : పరవడి, పండుగ మొదలైన ఆయా అనుకున్న, అనుకోని సందర్భములలో నిర్వర్తించవలసినవి. ఇవి కూడా వ్యావహారికం కావచ్చు (లేదా) దైవోపాసన సంబంధము కావచ్చు.

(4) **త్రిగుణప్రేరితమైన సాత్త్విక, రాజసిక, తామసిక కర్మలు స్వాభావికములు. సందర్భోచిత – అనుచితములు.**

(5) **అభ్యాసవశంగాను, లౌకికానందము కొరకు చేయు కర్మలు.**

ఆయా మొదలైన ఏదో కారణంచేత **ఈ జీవునిపట్ల కర్మలు చేయటము అనివార్యము.** అందులో కొన్ని కొందరికి అంగీకారయోగ్యము. మరికొందరికి తిరస్కారయోగ్యములు. కొన్ని వ్యక్తిగతమైనవి. మరికొన్ని సంఘ – సంస్థా గతమైనవి. మరికొన్ని అభ్యాసవశంగా చేయబడునవి. ఇంకొన్ని ఎవ్వరికి ప్రయోజనమో చెప్పజాలనివి.

ఒక నాటకములో నటించే నటుడు తనయొక్క నటనా ప్రదర్శనమంతా

– రచయిత కథాగతంగా – ఏ ఉద్దేశ్యముతో కల్పించాడో, ఆ ఉద్దేశ్యము నెరవేరు తీరుగా,

–	ప్రేక్షకులకు అభిరుచి కలిగించే రీతిగా,

–	సహనటులకు సానుకూల్యమైనదిగా,

–	కళాకారుడుగా సంతృప్తి పొందుటకుగాను – **ఉద్దేశ్యిస్తాడు కదా!**

అట్లాగే ఎవ్వరైతే సమస్త కర్మలను "నాహమ్‌కర్తా" భావనతో

–	పరబ్రహ్మముయొక్క ఉపాసనగా భావించి,

–	పరబ్రహ్మము యొక్క ఇచ్ఛానుసారముగా, "పరబ్రహ్మము చేతనే"॥ అను అకర్తృత్వ భావనతో, సమస్త కర్మలు సమర్పణగా "బ్రహ్మమును ఆరాధిస్తున్నాను" అను బుద్ధితో నిర్వర్తిస్తూ ఉంటారో, అది – **కర్మఫలసమర్పణా ప్రత్యాహారమే.**

## (4) స్థానాత్ – స్థానాత్ వాయునిరోధ ప్రాణయోగాభ్యాస ప్రత్యాహారము

**శ్లో॥ (అథవా) వాయుమ్ ఆకృష్య స్థానాత్ స్థానమ్ నిరోధయేత్।**
**దంతమూలాత్ తథా కంఠే, కంఠాత్ ఉరసి మారుతమ్।**
**ఉరో దేశాత్ – సమాకృష్య నాభిదేశ నిరోధయేత్॥**

వాయువును ఆకృష్యము చేసి (ఇష్టముగా ఆకర్షించి) దేహమునందు ఒక్కొక్కస్థానములోను, (ఒక స్థానము తరువాత మరొక స్థానమునందు) నిరోధము చేస్తూ, మనస్సును స్వాధీనము – స్వస్వరూపాత్మాధీనము చేయు అభ్యాసము – **ప్రాణనిరోధ ప్రత్యాహారము।**

***ప్రాణములను నిరోధించు కుంభకయాన ప్రక్రియ యోగాభ్యాసము (ప్రాణ–అపాన కుంభకంగాగాని, (లేక) స్వాభావ కుంభకంగా గాని)***

→	దంతమూలములందు, కొండనాలిక ప్రదేశమునందు నిరోధము చేయటము,

→	అక్కడినుండి సమాకర్షించి → కంఠమునందు ప్రవేశింపజేయటము, అక్కడి నుండి భుజ స్కంధములలో నిలపటము,

→	భుజముల నుండి ఆకర్షించి → వక్షస్థలములో ప్రవేశింపజేయటము,

→	వక్షస్థలము నుండి మరల్చి → నాభి ప్రదేశమునకు జేర్చటము.

→	నాభి నుండి సమాకృష్యము చేసి → కుండలినీస్థానమునకు జేర్చటము.

ఈ రీతిగా సమాకర్షిస్తూ నిరోధించుచూ ఉండాలి. ఇంకా కూడా,

– నాభి ప్రదేశము నుండి వాయువును ఆకర్షించి 'కుండలిని' యందు ప్రవేశింపజేసి, కుండలినియందు నిరోధించటము. కుండలిని నుండి సమాకర్షించి మూలాధార చక్రములో ప్రవేశింపజేసి అచ్చట నిరోధనము చేయటము.

మూలాధారమునందు వాయువు బహిర్గతమయ్యే స్వభావము నుండి సమాకర్షించి, అట్టి అపానమును కటిద్వంద్వము (నడుము–పిరుదులు)యందు, తొడలయందు, పిక్కలలోను మోకాళ్ళలోను, కాలి బొటనవ్రేళ్ళయందు నిరోధనము చేయటము.

**ప్రత్యాహారో అయం ఉక్తస్తు ప్రత్యాహారపరైః పరా॥** ఇటువంటి యోగాభ్యాస–ప్రత్యాహారము ఉత్కృష్టమైన, పరాకాష్ఠార్థమైన "ప్రత్యాహారము" – అని ప్రత్యాహారయోగపండితుల అభివర్ణనము.

ఇటువంటి ప్రత్యాహార పూర్వక యోగాభ్యాసము నిర్వర్తించు పురుషులు 'మహాత్ములు' అని చెప్పబడుచున్నారు. ఓ సువ్రతా! ఇట్టి దోష అభ్యాసముచే ఆ యోగాభ్యాసియొక్క భవరోగము ఉపశమిస్తుంది. సర్వపాపదోషములు – తొలగుతాయి.

## (5) ఆపాదతల మస్తక ప్రాణధారణా ప్రత్యాహారము

**శ్లో॥	నాసాభ్యాం వాయుం ఆకృష్య నిశ్చలః స్వస్తికాసనః,**
**పూరయేత్ అనిలం విద్వాన్ ఆపాదతల మస్తకమ్।**
**పశ్చాత్ పాదద్వయే, తద్వత్ మూలాధారే తథైవ చ**
**నాభికందే చ హృత్ మధ్యే, కంఠమూలేచ తాలుకే**
**భ్రువోర్మధ్యే లలాటే చ, తథా మూర్ధని ధారయేత్॥**

–	స్వస్తికాసనము (లేక పద్మాసనము, లేక సుఖాసనము) ధారణ చేసి, దేహనిశ్చలత్వమును సిద్ధింపజేసుకొని,

–	నాసాపుటములతో (రెండు ముక్క రంధ్రములతో) వాయువును ఆకృష్యము చేసి (సమాకర్షణము చేసి).

–	వాయువును పాదములచిట్టచివర నుండి శిరస్సుయొక్క ఉపరిభాగము వరకు (మస్తక–బ్రహ్మరంధ్రములతో సహా)

–ప్రాణశక్తిని లేక **ఇచ్ఛాశక్తిని** పూరించి కొంతసేపు **ధారణ** చేయాలి. అనగా ధ్యాసను నిలపాలి.

– అటు తరువాత.....

- రెండు పాదములయందు పూరించాలి.
- తరువాత మూలాధారమునందు.
- ఆ తరువాత నాభి కందము (మాంసమయప్రదేశము) నందు.
- హృదయ మధ్యగాను.
- కంఠమూలమునందు.
- తరువాత తాలువు (దవుడ) యందు.
- భ్రూమధ్య ప్రదేశమునందు.
- అటుపై లలాటము (నుదురు, పాపటబొట్టు ప్రదేశము) నందు.
- మూర్ధము (శిరోశిఖరము) నందు.

ఈ విధంగా ప్రాణశక్తిని (లేక) ముక్కుద్వారా ఆకృష్యము (Inward Pulling) చేసియున్న వాయువును ధారణ చేయాలి. ఇది **"ధారణాయోగ ప్రత్యాహారము"**

ఇందులో బుద్ధిని నిలపటమే ప్రాధాన్యము కాబట్టి – **"ధారణాప్రత్యాహారము"** అను విశేషముగా చెప్పబడుతోంది.

## (6) ఆత్మాన్ ఆత్మనిరోధ ప్రత్యాహారము

**శ్లో॥ ఆత్మన్ ఆత్మని నిర్ద్వంద్వే నిర్వికల్పే నిరోధయేత్।**
**"ప్రత్యాహారః" సమాఖ్యాతః సాక్షాత్ వేదాంతవేదిభిః॥**

"ఈ దేహ స్వభావమునుండి, దృశ్య స్వభావము నుండి ధ్యాసను వెనుకకు మరల్చి → **ద్వంద్వాతీతము, సర్వకల్పములకు ఆవలగా ప్రకాశించుచున్న నిర్వికల్పము** అగు → **అఖండ–అప్రమేయ–నిత్య–కేవల–పరమ సత్యమగు స్వస్వరూపాత్మ**యందు ధ్యాసను నిలిపి ఉంచటమే **"సాక్షాత్ ప్రత్యాహారము". "తదితరమైన ప్రత్యాహార విశేషాలన్నీ సాక్షాత్‌ప్రత్యాహారస్థానమునకు మార్గదర్శకములు"** – అని వేదాంతవేద్యులగు బ్రహ్మజ్ఞులు ఆప్యాయముగా సిద్ధాంతీకరించుచున్నారు.

**సాంకృతి ముని : హే యోగయోగీశ్వరా! పరమగురూ! వేదాంతవిద్యావరేణ్యా! గురుదత్తాత్రేయ భగవాన్!** జీవాత్మను సర్వాత్మత్వమునందు ప్రతిక్షేపించే **"సాక్షాత్ ప్రత్యాహారము"** అతికొద్దిమందికే సాధ్యము కదా? అది మీవంటి అవధూతలకు మాత్రమే అనుభవైక వేద్యము. మరి మావంటి వారి గతి ఏమిటి?

**భగవాన్ దత్తాత్రేయ:** నీవు అంటున్నది ఏమాత్రము వాస్తవము కానేకాదు. అభ్యాసముచే ఎవ్వరికైనా సులభ సాధ్యమే. తత్త్వమ్ భావనతో ('నీవు'గా కనిపిస్తున్నది పరమాత్మగా భావన – మననము చేయుటచేత) **కేవలము, సమస్తము** అగు **స్వస్వరూపాత్మ** అనుభవమవగలదు. **ఏవమ్ అభ్యాసతః తస్య న కించిత్ అపి దుర్లభమితి॥** అనుకుంటూ ఉంటే అనిపించగలదు. అభ్యాసము చేస్తున్న వారికి 'ఇది అసాధ్యము' – అనే ప్రసక్తియే లేదు.

## 8వ ఖండము–"ధారణ" (INTIGRATION OF UNIT IN THE UNITY) అష్టాంగయోగములలో ఆరవది

**శ్రీదత్తాత్రేయ భగవాన్** : ఓ మహామునీ! సాంకృతి మహాశయా! ఇప్పుడు **"ధారణా పంచ"** (5 ధారణలు) గురించి చెప్పుకుందాము. అట్టి సాధనలో భాగమగు బీజాక్షరోపాసన కూడా విను.

**(1) ఆకాశధారణ : దేహమధ్యగతే వ్యోమ్ని బాహ్యాకాశస్తు ధారయేత్।** ఈ దేహము యొక్క మధ్యగల ఆకాశమును **"బాహ్యాకాశములో అంతర్విభాగమే – "కుండలోని ఆకాశము మహాకాశమునకు అభిన్నము అయి ఉన్న తీరుగా"**.....అను ధారణ**(బీజాక్షరము "హ") (దివ్యాధిదేవత – సదాశివుడు)**

**(2) అనిల (వాయు) ధారణ :** ప్రాణేబాహ్య అనిలంతద్యత్। దేహములోని వాయు (ప్రాణము) బాహ్యమున కనిపించే వాయువునకు (ప్రాణమునకు)–విశ్వమంతా గల వాయువుతో ఏకరూపముగా భావనచేసి ధారణ చేయటం **(బీజాక్షరము "య") (దివ్యాధిదేవత – ఈశ్వరుడు)**

**(3) అగ్నిధారణ :** జ్వలనేచ అగ్నిం ఔదరే। దేహములోని అగ్నిని విశ్వములోని అగ్నితత్త్వముయొక్క ప్రదర్శనగా ధారణ చేయటము **(బీజాక్షరము–"ర") (దివ్యాధిదేవత = మహేశుడు).**

**(4) జలధారణ : తోయం తోయాంశకే।** దేహములో కనిపిస్తున్న జలము విశ్వములోని ద్రవధర్మము కలిగియున్న విశ్వ జలము యొక్క అంశగా ధారణ **(బీజాక్షరము "వ") – (దివ్యాధిదేవత = విష్ణువు)**

**(5) భూధారణ : భూమిం భూమి భాగే।** శరీరములో భౌతికంగా అగుపించేదంతా జగత్తులో స్థూలంగా కనిపించే భౌతికవిభాగముగా ధారణ. **(బీజాక్షరము –"ల") (దివ్యాధిదేవత – బ్రహ్మ)**

ఈ విధంగా "హ–య–ర–వ–ల" అను అక్షరములతో పంచధారణల **ఆరాఖ్యము (భావనోచ్చారణ)**తో క్రమవిధానంగా **మననరూప మంత్రోచ్చారణ** నిర్వర్తించబడటము – **ధారణాపంచకయోగాభ్యాసము.**

ఈ విధమైన **శరీరములోని పంచభూతములను– విశ్వములోని (మహా)పంచభూతములతో** ఏకము చేయు ధారణచే అట్టి సాధన సర్వపాప – విశోధని (Cleaner) అగుచున్నది. అట్టి అభ్యాసము **'విశ్వధారణాయోగము'** అని కూడా అనబడుచున్నది.

## దేహముయొక్క విభాగములలలో పంచభూత భావనా ధారణ

**(1) జాన్వంతం పృథివీ అంశో : –**
పాదముల నుండి మోకాళ్ల వరకు : – పృథివీ అంశ.

**(2) అపాం పాయు అంశో :**
మోకాళ్ల నుండి వాయువు (విసర్జకావయవము) వరకు : – <u>అపాం(జల) అంశ.</u>

**(3) హృదయాంశః అగ్న్యంశో :**
పాయువు నుండి హృదయము వరకు : – అగ్న్యంశ.

**(4) భ్రూమధ్యాంశో అనిలాంశకః – వాయుఅంశో:**
హృదయము నుండి – భ్రూమధ్యవరకు (కనుబొమ్మల స్థానము వరకు) – వాయు అంశ

**(5) ఆకాంశంశః – తథా మూర్ధంశో:**
భ్రూమధ్య నుండి – శిరస్సు వరకు ఆకాశాంశను.

**ఈ విధంగా ధారణ చేయు మార్గమును ప్రాజ్ఞులు 'యోగాభ్యాసము'గా మార్గదర్శనము చేయుచున్నారు.**
ఇది పంచభూత భావనా ధారణ।

### పంచ–అధిదేవతా ఉపాసన

| | |
|---|---|
| పృథివీభాగే | బ్రహ్మ. |
| తోయాంశకే జలాంశకే | విష్ణువు. |
| అగ్న్యంశే | మహేశుడు. |
| అనిలాంశే | ఈశ్వరుడు. |
| ఆకాశాంశే | సదాశివుడు........... అని యోగతత్త్వజ్ఞులు ధారణ చేయుచున్నారు. |

### సాక్షాత్ ఆత్మతత్త్వధారణ

ఓ మునిపుంగవా! మరొక విధానమగు 'ధారణ' గురించి చెప్పుచున్నాను. వినండి :-

***పరమాత్మ సర్వతత్త్వ స్వరూపుడు. సమస్తమును శాసించువారు. శాస్త. బోధానందమయుడు. (అనగా) ఈ సమస్తము తనయొక్క పురుషకారముగా కలిగియున్నవారు.***

***అట్టి సర్వాంతర్యామియగు పరమశివ భగవానుని సర్వదోష నివృత్తికొరకై బుద్ధిమంతులై ధారణ చేయుచున్నారు.***

*బ్రహ్మమొదలుకొని ఈ సంధృశ్యమగుచున్న లోకాలోకముల వ్యవహారమంతా కూడా **'కార్యరూపము'** అగుచుండగా, అట్టికార్యము 'పరమాత్మ' అను కారణమునందు (తరంగము జలమునందువలే) ఉపసంహారమగుచున్నది. **సర్వకారణకారణము, అవ్యక్తము, అనిరూప్యము** (నిరూపించి చూపుటకు విషయము కానిది), **అచేతనము** (సర్వము కదలించుచు తానుమాత్రం ఏమాత్రము కదలిక లేనట్టిది) – అగు **"సాక్షాత్ ఆత్మ"**ను ప్రణవపూర్వకంగా ధారణ చేయటము – **సాక్షాత్ధారణ।***

ఇంద్రియములన్నీ మనస్సుచే సమాహరించబడి, అప్పుడు శేషించిన మనస్సును ఆత్మయందు యోజనము (నియమితము) చేస్తూ సమస్తమును స్వస్వరూపాత్మకు అనన్యముగా ధారణ చేయటము **<u>"పరాకాష్ఠధారణ".</u>**

## 9వ ఖండము - ధ్యానము - అష్టాంగయోగములలో ఏడవది

**శ్రీదత్తాత్రేయ భగవానుడు :** ఓ మునీశ్వరా! ఇక మనము 'సంసారము' అను దోషమును నశింపజేయగల **'ధ్యానము'** గురించి కొన్ని విశేషాలు చెప్పుకుందాము.

**"సోఽహమ్"** (అదియే నేను).... అనునదే సర్వసాధనలయొక్క అంతిమ ఉద్దేశ్యము (లేక) ప్రయోజనము (లేక) అనునిత్యస్వాభావిక భావనాసిద్ధి. ఏ పరమాత్మ అయితే

| | |
|---|---|
| **ఋతము** | *(ఆత్మవేత్తల స్వానుభవమైనట్టిదో),* |
| **సత్యము** | *(అప్రతిహతమైన ఉనికిచే ప్రకాశిస్తోందో),* |
| **పరంబ్రహ్మము** | *(సమస్తమునకు ఆవల బ్రహ్మమై ఏర్పడి ఉన్నదో),* |
| **ఊర్ధ్వరేతము** | *(ఊర్ధ్వముగా జగత్తుల రూపంగా ప్రకాశమానమైయున్నదో),* |
| **విరూపాక్షము** | *(కనబడుచున్న సమస్తమునకు వాస్తవరూపమైయున్నదో, విశేషరూపమై యున్నదో)* |
| **విశ్వరూపమ్** | *(ఈ విశ్వముగా రూపము ప్రదర్శిస్తోందో)* |
| **మహేశ్వరమ్** | *(సమస్తముగా విస్తరించి ఉన్నట్టిదో....)* |

**"అట్టి పరబ్రహ్మమే నేను"** - అను యోగయోగీశ్వరత్వ ధ్యానమే - ముఖ్యధ్యానము. సమస్త తదితర 'అన్య' ధ్యానములకంటే కూడా 'అనన్య' రూపమగు "అఖండాత్మమేవాఽహమ్" అనునది పరాకాష్ఠ - అయిఉన్నది. ముక్తికొరకై...., <u>**"సత్యము; ఈశానము; జ్ఞానానందమయము; అద్వయము; పరమార్థము; అచలము; నిత్యము; ఆదిమధ్యాంతరహితము"**</u> - అగు పరమాత్మయే ధ్యానవస్తువు.

**స్థూలుడు;** ఆకాశమునకు ఆవల అనాకాశుడగు **ఆత్మాకాశుడు; స్పర్శింపబడజాలనివాడు** <u>(స్పర్శకు అవిషయుడు)</u>; కళ్ళకు **దృశ్య విషయము కానట్టివాడు,** రసగంధములకు **అవిషయుడు;** ఎట్టి విషయాలకు సంబంధించనివాడు కాబట్టి **అప్రేయముడు; అనూపము** (ఉపమానములచే నిర్దేశింపబడజాలనివాడు); **సత్-చిత్-ఆనందస్వరూపుడు; అనంతుడు - అగు ఆత్మయే నేను! నేను అది కాని క్షణమే లేదు"** అను ధ్యానముతో సమస్త ధ్యేయ వస్తువులకు అతీతత్వము ప్రాప్తించుచుండగా, **అట్టి ధ్యానముచే ఈ జీవుడు విముక్తుడు కాగలడు. "అదియే నీవు కూడా।" అను తత్త్వ దృష్టిచే మాత్రమే 'సోఽహమ్' స్వానుభవము పూర్ణము కాగలదు.**

అట్టి అభ్యాసయుక్తుడగు పురుషుడు **'మహాత్ముడు'** అనబడుచున్నాడు. అతనియందు **"తెలుసుకొనుచున్నవానిని → తెలుసుకొనుచున్నవాడు"** (The knower of the knower) అయి ఉన్న వేదాంత విజ్ఞానము స్వయముగా వికసించుచున్నది. **అత్ర న సంశయః ఇతి॥**

## 10వ ఖండము - సమాధి - అష్టాంగ యోగములలో ఎనిమిదవది

**శ్రీదత్తాత్రేయ అవధూత :** ఇప్పుడు భవదోషనాశనకరమగు **'సమాధి'** గురించి కొన్ని విశేషాలు చెప్పుకుంటున్నాము.

సంవిత్ (సత్+ఎరుక) స్వరూపుడే అయి ఉన్న ఈ జీవుని గురించి రెండు రూపములు (అధ్యాత్మశాస్త్రముచే) అభివర్ణించబడుచున్నాయి.

**(1) ఇహరూపము** → జీవాత్మ, **సందర్భమాత్రసత్యము.** (అనేక నాటకములలలో నటిస్తున్న ఒక మహానటునియొక్క ఒక నాటకములోని ఆతడు నటిస్తున్న పాత్రవలె) **ఈ జీవుని "జగత్ అంతర్గత"రూపము. స్వప్నము కనువానియొక్క స్వప్నములోని రూపము వంటిది. దేహసంబంధిత, జగత్ సంబంధిత రూపము.**

**(2) పరరూపము** → సమస్తమునకు ఆవలగల **సహజరూపము. కేవల సత్యము.** నటనా కౌశలము గల నటుని పాత్రకు వేరైన సహజ-కళా స్వరూపము. జగద్దర్శనమంతా తనయందే ఏర్పడి ఉన్నట్టి <u>ఆవల (పర) రూపము.</u> స్వప్నము తనదైన వానిరూపము - వంటిది. సమస్తమునకు 'సాక్షి'యగు అమృతస్వరూపము. దేహమునకు, జగత్తుకు సంబంధించని - "దేహి" - స్వరూపము.

**"సమాధి"** అనగా అట్టి ఇహ-పరరూపముల అభేదత్వ-ఏకత్వ-అఖండత్వ అనుభవము.

**"ఆత్మ"** సర్వదా నిత్యమైనది (That which is 'as it is' beyond Time i.e., Beyond Past, Present & Future). ఒక నవలా రచయిత వ్రాసి నవలలోని పాత్రలన్నీ ఆతని ఊహచమత్కారమే అయి ఉండి, ఆతని రచనా నేత్రములకు అన్యము కాదుకదా! ఆత్మకు జగత్తు వేరు కాదు. ఆత్మ సర్వగతము (Extending as all else while remaining constant). అంతేకాదు సమస్తమును తనయందు "అంతర్గతము". సర్వదా ఈ సమస్తమును తనయొక్క <u>**"స్వకీయ విన్యాసము"**</u>గా కలిగి ఉండటముచేత **కూటస్థము.** (ఉదా: ఒక కథకు, ఆ కథలోని ఆయా సంఘటనలకు రచయితయే కూటస్థుడు. పరేశ్వరుడు. అంతర్గతుడు.

ఆత్మ జాగ్రత్ స్వప్న సుషుప్తులలోని ఆయా విశేషములు, సంఘటనలు - సంగతులు - చేత దోషము పొందదు. సంచిత - ఆగామి - ప్రారబ్ధకర్మలచేతగాని, జన్మజన్మాంతర ప్రహసనములచేతగాని స్పృశించబడదు. అందుచేత సర్వదా అప్రతిహతము. అవ్యాజపూర్వకము. **దోషవర్జితము.**

ఈ జీవుని సహజస్వరూపమగు ఆత్మ సర్వదా ఏకమే. స్వరూపతః ఎట్టి మార్పు - చేర్పులు పొందనప్పటికీ భ్రాంతిచే మాయకు వశమైనట్లు (అజ్ఞానదృష్టికి) అగుపిస్తోంది.

వాస్తవానికి **"జీవాత్మ-పరమాత్మ"** అనబడు రెండు లేవు. **ఏకో సత్।** అనన్యత్వమే - సర్వదా సర్వత్రా విస్తరించి, వాస్తవమై ఏర్పడినదై ఉన్నది. పరాత్మకు ద్వితీయమే లేదు. బంధము లేదు. మరి బంధము ఎవరికి? జీవాత్మకా? **"నా కలలో ఒకడు కనపించాడు. ఆతనికి బంధము ఉన్నది"** - అని అనటము ఎటువంటిదో, **"జీవాత్మకు బంధమున్నది"** - అను మాట అట్టిది.

**తస్మాత్ అద్వైతమేవ అస్తి।** అందుచేత **అద్వైతమే సత్‌స్వరూపమై సర్వదా వెలయుచున్నది.** ఇక ఇక్కడ **ప్రపంచము అనునది గాని** (స్వప్న దృశ్యమువంటిది అగుటచే) , **సంసృతి (కల్పనావిన్యాసము) అనునది** గాని, **స్వతఃగా లేవు.** వాస్తవానికి ఉండజాలవు. ఆత్మయే సర్వదా సర్వత్రా సమస్తమై ఉండగా, అనాత్మ దృష్టిచే అన్యమువలె భ్రమింపబడుచున్నది. **అనన్యమే సర్వదా సత్యము.**

**అఖండాత్మాకాశము**

ఆకాశము (space) సర్వత్రా ఏర్పడినదై ఉన్నదికదా!

ఆకాశము (స్థలము) సర్వత్రా 'ఏకమే' అయినప్పటికీ కూడా, **ఇది కుండలోని ఆకాశము (స్థలము). ఇది మఠములోని ఆకాశము** - అది మఠము బయట ఆకాశము - అని వ్యవహారీత్యా స్థలము గురించి చెప్పుకోబడుచున్నది. అంతమాత్రంచేత 'ఈ ఊరు...ఆ ఇల్లు - ఈ మఠము - ఈ దేశము - ఆ రాష్ట్రము" మొదలైనవన్నీ 'స్థలము (ఆకాశము)" అను దానికి ఏమైనా భేదము కలిగించగలవా? లేదు. భూ-జల-వాయు-అగ్ని-ఆకాశములకు దేశదేశాంతరభేదమేముంటుంది?

అట్లాగే **తథా భ్రాన్తైః ద్విధా ప్రోక్తా హి ఆత్మా, జీవ-ఈశ్వరాత్మనా॥** అఖండమగు స్థలమునకు (ఆకాశమునకు) కుండలోని స్థలము. ఇంటిలోని స్థలము అను భేదము వాస్తవము కానట్లే, (కల్పితము మాత్రమే అయినట్లే) - ఏకమగు ఆత్మయే మూడు పేర్లుగా (లేక) రీతులుగా అనుకోబడుచున్నది. (1) జీవాత్మ (2) ఈశ్వరాత్మ (3) పరాత్మ. ఆత్మ ఎప్పుడూ ఒక్కటే. **"జీవాత్మ- ఈశ్వరాత్మ", "నీవు -నేను" "వారు - వీరు"** అను ఆయా ద్వంద్వములుగా (రెండుతీరులుగా) దర్శించటము భ్రాంతిచేత మాత్రమే. **అది లౌకిక దృష్టియేకాని, పారమార్థదృష్టికాదు.**

ఓ మునిశ్రేష్ఠా!

- "నేను ఈ భౌతికదేహమును కాను. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ప్రాణము - మొదలైనవేవీ కాను.
- నేను సర్వదా కేవలసాక్షి స్వరూపుడను. **కేవల శివస్వరూపుడను।**

ఇట్టి **"బుద్ధి"** సునిశ్చితము, అచ్యుతము, అనుక్షణికము, స్వాభావికము అయి ఉండటమే "సమాధి" అను (అష్టాంగములలోని చివ్వరిదిగా) చెప్పబడుచున్నవి.

## కోఽహమ్ - నేను ఎవ్వరు?

**నేను బ్రహ్మమునే।** అంతేగాని సంసారము (దృశ్యము)చే బంధించబడు "సంసారి"ని కాదు. **సోఽహం బ్రహ్మ। న సంసారీ॥** బ్రహ్మము గురించి ఎరిగినప్పుడు - ఎరగనప్పుడు కూడా దేహము, ఉన్నప్పుడు - లేనప్పుడు కూడా **ఏ సమయమందు నేను బ్రహ్మము కాని క్షణమే లేదు. బ్రహ్మము నాకు అన్యము కాదు. బ్రహ్మమునకు నేను అన్యము కాదు.**

**ఇక ఈ జగత్తు గురించియా? యథా ఫేన తరంగాది సముద్రాత్ ఉత్థితం, పునః సముద్రే లీయతే, తద్వత్ జగత్ మయి అనులీయతే॥** సముద్రజలంలో తరంగాలు, బుడగలు, నురుగు మొదలైనవి బయల్వెడలి, జలమునందే ప్రదర్శనమై, తిరిగి సముద్ర జలములోనే లయమగుచున్నాయి కదా! అదే తీరుగా ఈ 'జగత్తు' అనబడునది నానుండే, (భావనారూపంగా) బయల్వెడలి, నాయందే 'స్థితి'ని కలిగియున్నదై, తిరిగి నాయందే (జలంలో తరంగంలాగా) లయము పొందుచున్నది.

జలములో జలమే ఉండిఉండగా, ఇది "జలతరంగము, ఇది బుడగ" - మొదలైనవిధాలుగా అనబడుతోంది. అట్లాగే, 'మనస్సు' అనునది నాకు వేరుగా లేదు. జగత్తు స్వతఃగా లేదు. 'జగత్‌లయము' - అనునదీ లేదు. **తత్ పరబ్రహ్మోఽహమస్మి కేవలమ్॥**

సమస్తము సర్వదా ఏదై ఉన్నదో, అదియే ఎల్లప్పుడు నేను 'అయి ఉన్నాను'.

‘ **శ్లో॥ యస్య ఏవం పరమాత్మా అయం ప్రత్యక్ భూతః ప్రకాశితః,**

**స తు యాతి స పుం భావం స్వయం సాక్షాత్ పరామృతమ్॥**

ఎవ్వడైతే సర్వత్రా ఏర్పడినదైయున్న ఆత్మచైతన్యమును పై విధముగా భావన చేయుచున్నాడో, అట్టివాడు పరమపురుషరూపమగు పరామృతము (The Beyond; The Deathless, The changeless)ను పొందుచున్నాడు. ఇహ-పరములు తనయందు అంతర్గత స్వాభావికమగుచూ ఉండగా, ఆతడు పరాత్పరుడుగా ప్రకాశించుచున్నాడు.

ఎప్పుడైతే ఈ మనస్సు కారణంగా మాత్రమే సర్వగతమగు చైతన్యమే ఈ సమస్తముగా భాసిస్తోందని గమనిస్తాడో, అట్టియోగి - పెద్ద వ్యవధి లేకుండానే - **బ్రహ్మమును స్వాభావికానుభవంగా తనకు అనన్యంగా సిద్ధించుకోగలడు.**

**శ్లో॥ యదా సర్వాణి భూతాని స్వ-ఆత్మన్యేవ హి పశ్యతి,**

**సర్వభూతేషు చ ఆత్మానం, బ్రహ్మసంపద్యతే తదా॥**

ఎప్పుడైతే ఈ జీవుడు సర్వ తదితర భూతజాలమును తనయొక్క ఆత్మయందే దర్శిస్తాడో, (అట్లాగే) సర్వభూతజాలమునందు తన ఆత్మను దర్శిస్తాడో, అప్పుడిక అట్టి యోగి **బ్రహ్మతత్త్వమును స్వాభావికంగా ఇప్పుడే ఇక్కడే అనుభూతపరచుకోగలడు. “నాయొక్క ‘నేను’ అనునది దేహపరిమితము కాదు. వ్యష్టిపరిమితము కూడా కానే కాదు. ఈ సమస్తము నేనైన నేనే ‘నేను’** అనునదే బ్రాహ్మీభావన.

ఎప్పుడైతే అఖండమగు ఆత్మ తప్పించి, ఇక ‘వేరు వేరైన జీవులు” అనునది కించిత్ కూడా దర్శించడో, ఏకమగు - అఖండమగు పరతత్త్వమే సర్వత్రా దర్శిస్తాడో, ఆతడు **తనయొక్క కేవలీ స్వస్వరూపము దర్శించినవాడై కైవల్యము పొందగలడు.**

### ఇత్యేవ సారం దర్శనోపనిషత్

ఎవ్వడు

= తనను తాను పరమార్థతః కేవలమగు ఆత్మస్వరూపునిగా చూస్తూ ఉంటాడో

= ఈ జగత్తుని స్వప్న దృశ్యమువలె మాయామాత్రముగా గమనిస్తూ ఉంటాడో....

= ఈ కనబడే సమస్త జీవులను ఆత్మయందు ఆత్మగా దర్శిస్తూ ఉంటాడో, **అట్టివాడు సర్వ అన్యవృత్తులనుండి నిర్వృతుడై, కేవలమగు పరమానందాత్మగా శేషించినవాడై ఉండగలడు.**

**లీలా-క్రీడా-వినోద విశేషములుగా,** ఈ కల్పిత కథా కథనములాగా ఈ దృశ్యజగత్తును గ్రహించగలడు (భావించగలడు). ఈ సమస్తము ‘తానే’ అయి పరమానందభరితుడై ఉండగలడు.

### ఇదియే బ్రాహ్మీ సందర్శనము

ఈ విధంగా శ్రీదత్తాత్రేయులవారు ప్రియశిష్యుడగు సాంకృతి మునీంద్రునికి పరతత్త్వము గురించి విశదీకరించారు.

సద్గురువగు శ్రీ దత్తాత్రేయులవారి వద్ద శ్రద్ధగా ఆత్మ విద్యా శ్రవణం చేసిన సాంకృతి యతీంద్రుడు : -

**- స్వస్వరూపమునందు నిశ్చలుడై,**

**- అభయ ప్రదమగు ఆత్మానందమునందు పరమసుఖానుభవులయ్యారు.**

ఇతి దర్శనోపనిషత్ ।

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః ॥

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 7 మహోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## (యోగ వాసిష్ఠ మహాగ్రంథసారము)

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ యత్(యన్)-మహా ఉపనిషత్ (మహోపనిషత్)
వేద్యం చిత్ ఆకాశతయా (చిదాకాశతయా) స్థితమ్,
పరమ అద్వైత సామ్రాజ్యం,
తత్ రామబ్రహ్మ మే గతిః॥

ఏదైతే చిదాకాశస్థానమైయున్నదో, పరమ - అద్వైత సామ్రాజ్యమో, అది ఈ మహోపనిషత్ అధ్యయనముచే తెలియబడగలదు. అట్టి ఆత్మారామ బ్రహ్మమే నేను చేరవలసిన స్వస్థానము. అట్టి స్వాత్మారామబ్రహ్మము ను ఉపాసించుచున్నాను.

### ప్రథమ (1)వ అధ్యాయము - ఏకో నారాయణో।

**1.** అథ అతో మహోపనిషదం వ్యాఖ్యాస్యామ్యః ।
తదాహుః ఏకో హ వై నారాయణ ఆసీత్ ॥
న బ్రహ్మా న ఈశానో న ఆపో ।
న అగ్నీ షోమౌ । నే ఇమే ద్యావా, పృథివీ।
న నక్షత్రాణి । న సూర్యో ।
న చంద్రమాః।
స ఏకాకీ రమతే।

ఇక ఇప్పుడు మహత్ (మహో) ఆత్మసామీప్యమును (ఉపనిషదమును) వ్యాఖ్యానించుకొనుచున్నాము.

ఈ దృశ్యమానమగుచున్న సమస్తమునకు మునుముందుగా "ఏకో నారాయణ" తత్త్వమే ఉండి ఉన్నది. అట్టి కేవల నారాయణతత్త్వము (లేక) ఆదినారాయణ పరమపురుషుడు ఏకస్వరూపుడుగా ఉండగా మొట్టమొదట సృష్టికర్తయగు బ్రహ్మలేరు. సృష్టిరూపముగా విస్తరించు ఈశానుడు లేరు. అగ్ని, వాయువు, జలము, పృథివి, ఆకాశము లేవు. నక్షత్ర - సూర్య - చంద్ర మండలములు లేవు. అట్టి ఏకాకి అగు నారాయణుడు మాత్రమే ఉన్నారు. ఆయన - **"నా వైభవములో నేను ఎందుకు రమించరాదు? రమించాలి కదా!"** - అని భావించారు.

---

తస్య ధ్యానాంతస్థస్య "యజ్ఞః-స్తోమమ్" (యజ్ఞస్తోమమ్) ఉచ్యతే ।
తస్మిన్ పురుషాః చతుర్దశ జాయంతే।
ఏకా కన్యా। దశ ఇంద్రియాణి ।
మన ఏకాదశం। తేజో ద్వాదశం।
అహంకారః త్రయోదశః। ప్రాణః చతుర్దశ।
ఆత్మా పంచదశీ, బుద్ధిః

అట్టి నిర్విషయ కేవల నారాయణుడు తనలో తానే ధ్యానముచే "స్తోమము' (మనో) యజ్ఞము నిర్వర్తించపూనుకొన్నారు. ఇదియే **'యజ్ఞస్తోమము'** అని శాస్త్రీయంగా చెప్పబడుతోంది. (యజ్ఞస్తో-ఉమ).

అట్టి కేవలుడు - ఏకాకియగు పరమ పురుషుని నుండి 14 పురుషకారములు, ఒక కన్య బయల్వెడలసాగారు. (కన్య= స్వభావము)

(10) ఇంద్రియములు. (వినికిడి - స్పర్శ - చూపు - రుచి - వాసన - జ్ఞానేంద్రియములు - వాక్కు - పట్టుకొనుట - నడచుట - పాయువు - ఉపస్థ - రూపకర్మేంద్రియములు) (11) తేజోరూపమగు మనస్సు (12) 'అహం (నేను)' - కారము (13) ప్రాణశక్తి (14). అనుభవి అగు ఆత్మ (జీవాత్మ). ఆపై (15) తెలివి (లేక) బుద్ధి.

---

భూతాని, పంచ తన్మాత్రాణి, పంచ మహా భూతాని చ।
స ఏకః పంచ వింశతిః **(25)** పురుషః।
తత్ పురుషం పురుషో నివేశ్యన ।
అస్య ప్రధానసంవత్సరా జాయంతే ।
సంవత్సరాత్ అధిజాయంతే॥

ఇవికాక శబ్ద స్పర్శరూప రసగంధ (పంచ) భూతతతన్మాత్రలు (భూ-జల-అగ్ని-వాయు-ఆకాశ) పంచ మహాభూతములు -25 తత్త్వములతో కూడిన (విరాట్) పురుషుడు జనించారు. అట్టి సృష్టి కల్పనా విరాట్ పురుషుని నుండి (పై వాటికంటే వేరైన) కాల ప్రధాన పురుషకారము, 'సంవత్సర' ఇత్యాది రూపముగల **"కాలము"** జనించినాయి.

అథ పునరేవ నారాయణః సో
అన్యత్ కామో। మనసా ధ్యాయత ।
తస్య ధ్యానాంతస్థస్య లలాటాత్ త్ర్యక్షః
శూలపాణిః పురుషో జాయతే॥

(ఆది-నిర్మల-ఏకోస్వరూపుడు. ఈ జీవుని సహజ కేవల స్వరూపుడు-అగు) ఆ శ్రీమన్నారాయణుడు - "ఇంకా ఏదో కల్పించుకోవాలి" - అని పునః కోరుకొన్నవారై, మనస్సుతో ధ్యానము కొనసాగించారు.

ధ్యాన నిమగ్నుడైయున్న ఆ నారాయణుని లలాటమునుండి త్రినేత్రుడు శూలపాణి అగు అనేక పురుషకార విశేషములతో కూడిన- ఒక (పురుషాకారవిశేషములతో కూడిన) పురుషుడు జనించారు.

---

బిభ్రత్ శ్రియం యశః సత్యం,
బ్రహ్మచర్యం తపో వైరాగ్యం,
మన ఐశ్వర్యం స ప్రణవా వ్యాహృతయః,
ఋుక్-యజుః-సామ-అథర్వ-అంగిరసః
సర్వాణి ఛందాంసి - తాని అంగే
సమాశ్రితాని। తస్మాత్ ఈశానో
మహాదేవో। మహాదేవః॥

మహాతేజముతో ప్రకాశమానమగుచున్న ఆ మహత్ పురుషునియందు - అంగములుగా (వస్త్రములుగా) శ్రియము (లోకరక్షణ, శ్రేయోప్రదము, ప్రేమ), యశస్సు, సత్యము, (బ్రహ్మము గురించిన, ఆచరణ - అనుభూతి రూపమగు) బ్రహ్మచర్యము, (సర్వమును సాక్షిగా చూస్తూ ఆనందించు గుణమగు) వైరాగ్యము, కేవలమగు మనస్సు (మనోఉపకరణము), ('అహమ్' రూపమగు) ఐశ్వర్యము, ప్రణవముతో కూడిన వ్యాహృతులు (అకార - ఉకార-మకారములు, జాగ్రత్-స్వప్న-సుషుప్తి కల్పనా వినోద సృజనాత్మకత), భగవత్ తత్త్వ వర్ణనల రూపమగు ఋక్కులతో కూడిన ఋుగ్వేదము, యజ్ఞోపాసనలతో కూడిన యజుర్వేదము, స్తుతులతో కూడిన సామవేదము, (ప్రకృతి తత్త్వము విశదీకరించు) అథర్వణ వేదము అంగీరసము, (గాయత్రీ-త్రిష్టుప్ ఇత్యాది) ఛందస్సులు - ఇవన్నీ ప్రకాశమానమైనాయి. అందుచేతనే ఆయన 'ఈశానుడు, మహాదేవుడు' మొదలైన పేర్లుగా చెప్పబడుచున్నారు.

---

అథ పునరేవ నారాయణః
సో అన్యత్ కామో మనసా ధ్యాయత...।
తస్య ధ్యాన అంతస్థస్య లలాటాత్ స్వేదో
అపతత్తా। ఇమాః ప్రతతా ఆపః।
తత్ తేజో హిరణ్మయం అండం।
తత్ర బ్రహ్మా చతుర్ముఖో-అజాయత।
సో అధ్యాయత్ - పూర్వాభిముఖో
భూత్వా "భూః" ఇతి వ్యాహృతిః।
గాయత్రం ఛందః । ఋుగ్వేదో । అగ్నిః దేవతా॥

ఆ ఆది నారాయణుడు "ఇంకా ఏమైనా నాకు ఉండాలి" - అని మనస్సులో ధ్యానం చేయసాగారు.

అద్వితీయుడగు ఆయన ద్వితీయ కల్పనయందు ఉత్సాహియై తపనరూపమగు తపస్సుయందు నిమగ్నుడై ఉండగా, ఆయన లలాటస్థానము నుండి "స్వేదము (చెమట) జనించింది. ఆ స్వేదమే ఇచ్చట సర్వత్రా ఆపః (జలతత్త్వము)" రూపుదిద్దుకొన్నది. ఆ ఉదకమునుండి బంగారు కాంతులను వెదజల్లుచూ అండము (బ్రహ్మాండము) జనించింది. అద్దానినుండి (సృష్టిరచనకు అభిమానుడు, సృష్టి క్రియాశీలుడు అగు) చతుర్ముఖ బ్రహ్మ జనించారు.

ఆ బ్రహ్మ పూర్వాభిముఖుడై (సృష్టికి ఆది వైపుగా ఉన్ముఖుడై) తపస్సు చేస్తుండగా 'భూః' అనే వ్యాహృతి, గాయత్రీ ఛందస్సు, ఋుగ్వేదము, అగ్నిదేవత జనించారు.

---

పశ్చిమాభిముఖో భూత్వా "భువః" ఇతి
వ్యాహృతిః। త్రైష్టుభం ఛందో, యజుర్వేదో।
వాయుః దేవతా।

ఆ సృష్టికర్త పశ్చిమాభిముఖంగా {సృష్టికల్పన వైపుగా, నిర్విషయ పరమాత్మకు ఎదురు (opposite దిశగా)} - 'భువః' వ్యాహృతి, తిష్టుభ్ ఛందస్సు, (యజ్ఞ - యాగ క్రతు విధానములతో కూడిన) యజుర్వేదము, వాయుదేవత ఆయనకు రెండవ ముఖము నుండి జనించాయి.

---

ఉత్తరాభిముఖో భూత్వా "స్వః" ఇతి వ్యాహృతిః।
జాగృతం ఛందః । సామ వేదః । సూర్యో దేవతా ।

ఉత్తరముగా అభిముఖమైన ముఖముగా - "స్వః" వ్యాహృతి, జగతీ ఛందస్సు, (దివ్యగానములుతో కూడిన) సామవేదము, (సమస్తమును వెలుగుచే ప్రకాశింపజేయు) సూర్య దేవత (3వ ముఖముగా) ప్రదర్శనమైనాయి.

---

దక్షిణాభిముఖో భూత్వా 'మహః' ఇతి వ్యాహృతిః।
ఆనుష్టుభం ఛందో। అథర్వవేదః । సోమో దేవతా ।

దక్షిణాభిముఖముగా "మహః" వ్యాహృతి, అనుష్టుభ్ ఛందస్సు, అథర్వ వేదము, సోమ (చంద్ర) దేవత వ్యక్తీకరణమయ్యాయి.

సహస్ర శీర్షం దేవం। సహస్రాక్షం విశ్వశంభువమ్।
విశ్వతః పరమం నిత్యం।

ఆ విధంగా చతుర్ముఖ ప్రదర్శనతో కూడిన సృష్టికర్తృత్వాభిమానియగు బ్రహ్మదేవుడు మరల ధ్యానము చేయసాగారు. ఆయన హృదయాకాశము నందు సమస్తమునకు బాహ్య-అభ్యంతరముగా ఆది స్వరూపుడగు నారాయణ తేజో - ప్రజ్ఞా - ఆనంద కేవల విభవము ప్రదర్శనమైనది.

ఆ నారాయణుడు :- వేలాది శిరస్సులు, భావనలు, ఆలోచనలు తనవే అయిన దివ్యపురుషుడు।

- వేలాది కళ్ళు - దృష్టులతో వెలుగొందువారు।
- విశ్వమంతటికీ సుఖప్రదాత। ఆనంద ప్రదాత। కళ్యాణ ప్రదాత।
- విశ్వమునకు అతీతమై, పరమై ప్రకాశించువారు।
- త్రికాలములకు సాక్షిగా నిత్యుడు.।

---

విశ్వం నారాయణగ్ం హరిమ్।
విశ్వ మే వేదం, పురుషః
తత్ విశ్వం ఉపజీవతి॥

- ఈ విశ్వమంతా తనయొక్క శరీరముగా కలిగి, తానే అయిఉన్నవారు।
- తన స్వరూపముగా చూస్తున్నవారు. ఈ సమస్తమును తన యొక్క పురుషకారముగా ఎరుగుచున్నట్టి వారు। స్వకీయమైన ఎరుక(knowing)యే విశ్వముయొక్క రూపముగా కలవారు। తన 'ఎరుక' నుండే ఎరుక రూపంగా బయల్వెడలుచున్న,
- ఈ విశ్వమునకు ప్రాణస్వరూపులై అణువణువు ఉజ్జీవింపచేయువారు।

---

పతిం విశ్వేశ్వరం దేవం సముద్ర-ఏకం
విశ్వరూపిణమ్ । పద్మకోశ ప్రతీకాశగ్ం।
లంబత్యా కోశ సన్నిభమ్। హృదయం చ అపి
అథోముఖమ్। సంతత్యై సీత్కరాభిశ్చ।
తస్యమధ్యే మహాన్ అర్చిః।
విశ్వార్చిః। విశ్వతోముఖమ్ ।

- ఈ విశ్వమునకు పతి। ఈ విశ్వముగా విస్తరించి ఉండటంచేత విశ్వేశ్వర దివ్యస్వరూపులు - దేవత। దేవాది దేవుడు।
- ఈ విశ్వమునకు సముద్రమునకు సముద్రజలమువలె-ఏకస్వరూపమై ఉన్నవారు. ఈ సమస్తము ఆయన హృదయమే। ఈ సమస్తమునందు ఆయనయే హృదయస్థుడు.

హృదయము :-

"అధోముఖముగా [క్రిందివైపుగా ఉన్న పద్మపు మొగ్గ"వలెను, పద్మకోశము (Inner Recess of padma Flower) వలెను] సమస్త జీవులలో అంతరముగా హృదయము (ఆలోచభావన - అనుభూతి జనించుస్థానము) (అధోముఖముగా (వ్రేలాడుచూ) ఉన్నది. అద్దానియందు సీత్కరాభిలు (అనేక నరములు) పరస్పరం కలిసిపోయి ఉన్నాయి. "సీ‹‹‹" - ధ్వని (జీవుడు జీవించి ఉన్నంతవరకు) జనిస్తూ ఉన్న స్థానము.

---

తస్య మధ్యే వహ్నిశిఖా
అణియ ఊర్ధ్వా వ్యవస్థితా।
తస్యాః శిఖాయా మధ్యే పురుషః -
పరమాత్మా వ్యవస్థితః । స బ్రహ్మ ।
స ఈశానః । స ఇంద్రః।
సో అక్షరః, పరమః స్వరాట్ ।
<u>ఇతి మహోపనిషత్</u>
<u>'నారాయణతత్త్వమ్'</u>
<u>నామ ప్రథమోధ్యాయః</u>

అట్టి హృదయముయొక్క మధ్యగల ఆకాశము (space) లో ఊర్ధ్వంగా "అగ్ని" - నలువైపులా తేజోవంతమై ప్రకాశించుచున్నది. అతి సూక్ష్మ దీప శిఖవలె వ్యవస్థితమైయున్నది.

అద్దాని 'శిఖ' యొక్క మధ్యభాగములో సమస్తమునకు పరమైయున్న పరమాత్మ ప్రకాశమానుడై తేజోవిభవలతో ప్రదర్శనమగుచున్నారు. ఆయనయే సృష్టికర్తయగు బ్రహ్మ। ఆయనయే ఈ సమస్తముగా విస్తరించియున్న ఈశ్వరుడు.

ఆయనయే ఇంద్రియములకు అధిపతియగు ఇంద్రుడు.

సమస్తమునకు పరాకాష్ఠకాబట్టి 'పరము' అనబడుచున్నారు. 'పరమపురుషుడు' - అయి ఉన్నవారు.

ఆయనయే సమస్త జీవుల స్వస్వరూపుడై వెలుగొందుచున్నారు కాబట్టి 'స్వరాట్'. ఆయనకు అన్యము లేదు। మనందరికీ ఆయన అన్యుడు కాదు। అనన్యో నారాయణా।

<u>ఇతి నారాయణతత్త్వమ్ నామ</u>
<u>ప్రథమ అధ్యాయము</u>

# ద్వితీయోధ్యాయం (జనక-శుక సంవాదము)

ఓం॥

1. శుకో నామ మహాతేజాః।
స్వరూప-ఆనంద తత్పరః।
జాత మాత్రేణ మునిరాట్ ।
యత్ సత్యం తత్ అవాప్తవాన్॥
తేన అసౌ స్వ-వివేకేన
స్వయమేవ మహా మనాః ప్రవిచార్య,
చిరం సాధుః, స్వ ఆత్మనిశ్చయమ్ అప్నుయాత్ ॥

'శుకుడు' అనే మహానుభావుడు. మహాతేజో-స్వరూపానంద తత్పరుడు. పరమార్థమగు బ్రహ్మజ్ఞాన సంపన్నుడు.

జన్మతఃగానే మహామునీశ్వరుడు. ఏది పరమసత్యమో, అద్దానిని పుడుతూనే సముపార్జించుకొన్నట్టివారు.

ఆయన తనయొక్క వివేకము (Intelectual common sense)చే తనకుతానే స్వయముగా తన మనస్సుతో 'విచారణ' చేసి "ఆత్మ అనగా ఇది కదా!" - అని సునిశ్చయులు అయ్యారు. ఆత్మతత్త్వము ఏమిటో సిద్ధింపజేసుకున్నారు.

---

అనాఖ్యత్వాత్, అగమ్యత్వాత్
మనః షష్ఠేంద్రియ స్థితేః,
చిత్ మాత్రం ఏవం ఆత్మాణుః
ఆకాశాత్ అపి సూక్ష్మకః॥

**శ్రీ శుక ఏకాంత - అంతర్ విచారణ॥**

వాక్కుతో 'ఇది' అని పరిధులను నిర్ణయించి చెప్పలేము కాబట్టి ఆత్మ అనాఖ్యము. అది సర్వత్ర వేంచేసినదై ఉండటం చేత, ఒకచోట నుండి బయలుదేరి మరొకచోటికి చేరేది కాదు. అచలము. పంచేంద్రియములకు ఆరవదగు మనస్సుకు లభించే విషయము కాదు కాబట్టి "అగమ్యము". కేవల చిత్ (ఎరుక) మాత్రము. ఆకాశము మొదలైనవాటి కంటే సూక్ష్మాతిసూక్ష్మము కాబట్టి అణుమాత్రము.

---

2. చిత్ అణోః పరమస్య అంతః
కోటి బ్రహ్మాండ రేణవః। ఉత్పత్తి స్థితిం
అభ్యేత్య, లీయంతే శక్తి పర్యయాత్।
ఆకాశం బాహ్యశూన్యత్వాత్,
అనాకాశం తు చిత్త్వతః।
న కించిత్ యత్ అనిర్దేశ్యం
వస్తు సత్త ఏతి కించన ॥

పరమసూక్ష్మరూపమగు ఆత్మాణువునందు (లేక) ఆ చిద్వస్తువునందు అనంతకోటి బ్రహ్మాండ రేణువులు అద్దానిశక్తిచే అనుక్షణం ఉత్పత్తి - స్థితి - లయములు పొందుచున్నాయి.

బాహ్యమున వస్తురహిత శూన్యము కాబట్టి అద్దానికి 'చిదాకాశము' అని పేరు. అది వస్తు రహితము. వస్తువు వలె నిర్దేశించి చెప్పజాలము కాబట్టి అనిర్దేశ్యము. ('బంగారములో ఆభరణములు ఉన్నాయి' - అని అనము కదా! అట్లాగే ఆత్మయందు జగత్తులు లేవు).

---

చేతనో అసౌ ప్రకాశత్వాత్
వేద్య అభావాత్ శిలోపమః ।
స్వాత్మని వ్యోమని స్వచ్ఛే
జగత్ ఉన్మేష చిత్రకృత్ ।
తత్ భాస మాత్రం ఇదం విశ్వం
ఇతి నస్యాత్ తతః పృథక్ ॥

సమస్తమును కదిలించుచూ, ప్రకాశింపజేయునట్టిది. అది 'తెలుసుకొనుట' అను ధర్మమునకు వేరైనది. శిలవలె నిశ్చలము. విజ్ఞాన ఘనమై, శిలాసదృశము.

స్వాత్మాకాశము యొక్క మధ్యగా స్వచ్ఛప్రదేశంలో 'జగత్తులు' అనే చిత్రపటములను చిత్రీకరించుకొనుచున్నది.

నిర్మలము - శూన్యము - నిర్విషయము అగు ఆత్మ తనయందు తానే చిత్రకారునివలె, కలకంటున్న వానివలె భావనామాత్రంగా జగత్తులను కల్పించుకోవటము, లయింపజేయటము లీలావినోదంగా నిర్వర్తిస్తోంది.

---

జగత్ భేదో - అపి తత్ భాసమ్-ఇతి-
భేదో - అపి తన్మయః।
సర్వగః, సర్వ సంబంధో గత్య భావాన్, న గచ్ఛతి ।
నాస్తి అసావాశ్రయా భావాత్,
సద్రూపత్వాత్ తథా అస్తి చ॥

జగత్ భేదములన్నీ అద్దాని భావనా భేదములే। అద్దాని చమత్కృతియే ఈ భావనా భేద జగత్ - దృశ్యము. ఈ సమస్త జగత్తు ఆత్మచే తన్మయము.

సర్వసంబంధములు కలిగియున్నదై, సర్వభావముల వెంట వెళ్ళుచూ, సర్వవ్యాపకమై యున్నది. అయినప్పటికీ అద్దానికి ఎట్టి 'గమనము' అనునది లేనే లేదు.

అద్దానికి దేశ - జాతి - గుణ - క్రియ భేదములు ఏమాత్రము కూడా లేనేలేవు. త్రికాలములచే అబాధ్యమై, యథాతథమై సర్వదా అస్తిత్వము కలిగినదై ఉన్నది. ఆత్మకు 'లేమి' లేదు.

అన్యము అనబడే సమస్త సంబంధములకు 'ఉనికి' మొదలే లేదు.

| | |
|---|---|
| **3.** విజ్ఞానం, ఆనందం బ్రహ్మ<br>రాతేర్దాతుః పరాయణమ్॥<br>సర్వ సంకల్ప సన్యాసః చేతనా యాః పరిగ్రహః।<br>జాగ్రతః ప్రత్యయా భావం<br>యస్య ఆహుః ప్రత్యయం బుధాః । | అది 'తెలుసుకోవటము' అను 'కేవల విజ్ఞానము'. అట్టి కేవల విజ్ఞానమే (కేవలమగు తెలివియే) బ్రహ్మము. త్యాగనిరతులగువారికి అట్టి బ్రహ్మము గురించిన పారాయణమే పరమాగతి - అగుచున్నది.<br>సర్వసంకల్పములు సన్యసించగా శేషించు అట్టి కేవల చైతన్యమే వారిచే పరిగ్రహించబడుచున్నది.<br>అది భావాతీతము. అభావ-భావనా ప్రత్యక్‌రూపము. భావములకు ఆవల అభావస్థానమునందు జాగరూకానుభవము. ప్రత్యక్ భావనారూపముగా (ప్రత్యగాత్మగా) బుధులచే చెప్పబడుతోంది. అది వృత్తిరహిత జ్ఞానానందము. |
| యత్ సంకోచ - వికాసాభ్యాం జగత్<br>ప్రళయ సృష్టయః, నిష్ఠా వేదాంత<br>వాక్యానాం అథ వాచామ్ అగోచరః॥ | ఈ జగత్తు యొక్క ఉత్పత్తి - వినాశనము (లేక ఉత్పత్తి ప్రళయములు) ఆత్మయొక్క 'వృత్తిజ్ఞానము'నకు సంబంధించిన వికాస - సంకోచములు మాత్రమే. అట్టి **నిష్ఠ-మహావాక్యార్థసారము** వాక్కు - మనస్సులకు అగోచరము. |
| "అహం సత్ చిత్ పరానంద<br>బ్రహ్మైవాస్మి॥ న చ ఇతరః॥"-<br>-స్వయైవ సూక్ష్మయా బుద్ధ్యా సర్వం విజ్ఞాతవాన్ శుకః॥ | "నేను ఎవ్వరు?" అను ప్రశ్నకు సమాధానము - సత్-చిత్-ఆనంద బ్రహ్మమే అయి ఉన్నాను. మరింకొకటేదీ కాదు. ఇది వేదాంత వాక్య మహార్థ సారము" అని శుకుడు గమనించారు.<br>శుకుడు ఆత్మగురించిన విషయములన్నీ కూడా స్వయముగా సూక్ష్మబుద్ధితో స్వయముగానే ఎరుగగలిగారు. |
| స్వయం ప్రాప్తే పరే వస్తుని<br>అవిశ్రాంత మనాః స్థితః, "ఇదం<br>వస్తు" - ఇతి విశ్వాసం న అసావత్<br>ఆత్మని ఉపాయయౌ। | ఈ విధంగా పరమ వస్తువును స్వయముగా సిద్ధించుకొన్నప్పటికీ కూడా ఆయనయొక్క మనస్సు ఆత్మానుభవమునందు శమించనేలేదు. అవిశ్రాంతి యందే స్థితించినదై ఉన్నది.<br>"ఇదియే పరమ వస్తువు" అనే ఉపాయమునందు విశ్వాసము పూర్తిగా పొందనేలేదు. ఎరిగినది అనునిత్యానుభవముగా సిద్ధించలేదు. |
| కేవలం విరామ అస్య చేతో విషయ చాపలమ్।<br>భోగేభ్యః భూరి భంగేభ్యో<br>ధారాభ్య ఇవ చాతకః<br>ఏకదా సో, అమల ప్రజ్ఞో<br>మేరావ ఏకాంత సంస్థితమ్,<br>పప్రచ్ఛ పితరం భక్త్యా<br>శ్రీకృష్ణద్వైపాయనం మునిమ్॥ | అయితే ఆయనయొక్క బుద్ధి విషయ చాపల్యమునుండి విరామము పొందింది. మేఘధార నుండి చాతక పక్షి బయటకురానివిధంగా ఆయా భోగములనుండి, విషయచపలత్వము నుండి ఆయన విశ్రాంతి పొందారు. కానీ ఆ విశ్రాంతి అవ్యాజము, అనుక్షణికము కాలేదు.<br>మేరుపర్వతము మీద ఒంటరిగా ఏకాంతములో ధ్యానమునందు రోజులు గడుపుచూ ఉన్న ఆ శుకబ్రహ్మ - ఒకానొకరోజు పితృదేవులగు శ్రీ వ్యాసమహర్షిని భక్తి - ప్రపత్తులతో దర్శించారు. తండ్రితో ఈ విధంగా సంభాషించసాగారు. |
| <u>శుకౌవాచ</u> :-<br>**4.** సంసార ఆడంబరం ఇదం కథం<br>అభ్యుత్థితం, మునే? కథం, చ ప్రశమం యాతి?<br>కియత్? కస్య? కదా?- వద। | **శుకబ్రహ్మ** :- హే పితృదేవా! మునీశ్వరా! ఆత్మసర్వదా కేవలానంద స్వరూపముకదా! అటువంటప్పుడు ఈ సంసారాడంబరమంతా ఎట్లా ఆత్మయందు బయల్వెడలుతోంది? ఈ సంసార దోషము ఏవిధంగా, ఎట్లా ఎటువంటి వారికి శమించగలదో - దయచేసి వివరించండి. |
| ఏవం పృష్టేన మునినా వ్యాసేన<br>అఖిలం ఆత్మజే, <u>యథావత్ అఖిలం</u><br><u>ప్రోక్తం వక్తవ్యం విదిత ఆత్మనా</u>। | ఈ విధంగా అడుగగా, శ్రీ వ్యాసమునీంద్రులు "ఆత్మయందు సంసారము జనించటము" అనే విశేషమంతా కూడా యథాతథంగా (ఉన్నది ఉన్నట్లుగా) విశదీకరించి చెప్పారు. ఆత్మగురించి విశ్లేషించి వివరించారు. |
| అజ్ఞాసిషం పూర్వం ఏవమ్ అహమ్<br>-ఇతి అథ తత్ పితుః స శుకః<br>స్వకయా బుద్ధ్యా, న వాక్యం బహు మన్యతే॥ | అంతా సవిస్తరంగా విన్నట్టి శుకమహర్షి "ఈ విశేషమంతా నేను స్వబుద్ధితో గ్రహించినట్టిదే కదా!" - అని తలచుచు, ఆ వాక్యలన్నీ కొత్తగా జ్ఞానము లభించేవిగా అనుకోలేదు. ప్రత్యేక విశేషంగా భావించలేదు. తెలిసినవేగా అనిపించాయి. |

| | |
|---|---|
| వ్యాసో అపి భగవాన్ బుద్ధ్వా<br>పుత్ర అభిప్రాయం ఈదృశమ్,<br>ప్రత్యు వాచ పునః పుత్రం।<br>"న అహం జానామి తత్త్వతః।<br>జనకో నామ భూపాలో విద్యతే మిథిలాపురే॥<br>యథావత్ వేత్తి అసౌ వేద్యం,<br>తస్మాత్ సర్వం అవాప్స్యసి॥" | వ్యాసమహర్షులవారు కుమారునియొక్క తూష్ణీభావపూర్వక అభిప్రాయము గమనించి ఇట్లా మరల చెప్పసాగారు.<br>వ్యాసమహర్షి:- ప్రియకుమారా! నాకు తెలిసినదంతా వివరించి చెప్పాను. నాకు తత్త్వతః ఇంత మాత్రమే తెలుసు.<br>మిథిలానగర రాజు 'జనకుడు' అనే ఆయన ఉన్నారు. ఆయన నాకంటే కూడా తత్త్వమును స్వానుభవం చేసుకొని, అధికముగా ఎరిగి ఉన్నారు. వారు యథాపూర్వకంగా వివరించి చెప్పగలరు. వారివద్దకు వెళ్ళు. శ్రద్ధగా శ్రవణం చేసి ఆత్మజ్ఞానం గురించిన పూర్తి విశేషం తెలుసుకో. |
| పిత్రేతి ఉక్తః శుకః, ప్రాయాత్<br>సుమేరోః వసుధాతలమ్ – విదేహ నగరీం<br>ప్రాప్య జనకేన అభిపాలితామ్।<br>ఆవేదితోఽసౌ యాష్టీకైః<br>జనకాయ మహాత్మనే। –<br>"ద్వారి వ్యాస సుతో,<br>రాజన్! శుకో అత్ర స్థితవాన్"–ఇతి॥ | ఈ విధంగా తండ్రిగారు శ్రీ వ్యాసమహర్షి సూచించగా, అప్పటికప్పుడే శుకముని అక్కడి సుమేరుపర్వత ప్రదేశమునుండి బయలుదేరి భూమిపైకి వచ్చారు. జనకమహారాజు పరిపాలిస్తున్న 'విదేహ' అనే జనక మహారాజుచే పాలించబడుచున్న నగరమునకు వచ్చారు.<br>శుకమహర్షితో సంభాషించిన ద్వారపాలకుడు, జనకమహారాజును సమీపించి - 'మహారాజా! భగవానుడగు వ్యాసమహర్షి కుమారుడు శుకమహర్షి తమ దర్శనమునకై రాజద్వారము వద్ద వేచి ఉన్నారు' - అని తెలియజేశారు. |
| **5.** జిజ్ఞాసార్థం శుకస్య, అసావాః తామేవేతి అవజ్ఞయా ।<br>ఉక్త్వా బభూవ జనకః తూష్ణీం, సప్తదినాని అథ,<br>తతః ప్రవేశయామాస జనకః శుకం<br>అంకణే, తత్రాహాని స సప్తైవ<br>తథైవ అవత్ ఉన్మనాః, తతః<br>ప్రవేశయామాస జనకోః అంతఃపురాజిరే।<br>రాజా న దృశ్యతే తావత్ ఇతి సప్త దినాని తమ్। | "ఈతని జిజ్ఞాస తగినంతగా తీవ్రమైనదా? కాదా?" - అని పరీక్ష చేసే ఉద్దేశ్యముతో - "సరే! అట్లాగే ఉండనీయండి" - అని పలికి 7 రోజుల వరకు పట్టించుకోలేదు. తూష్ణీభావము వహించారు. "అన్యథా వ్యవహారాలలో ఉన్నారు" అని మాత్రమే కబురంపారు.<br>7 రోజుల తరువాత శుకుడు రాజ ప్రాంగణములో ప్రవేశించారు. అయినప్పటికీ 'మరొక '7' రోజుల వరకు జనకమహారాజు దర్శనము కుదరదు' అని మాత్రము వ్యాసకుమారునికి తెలియజేయబడింది. |
| తత్ర ఉన్మదాభిః కాంతాభిః<br>భోజనైః భోగసంచయైః । జనకో<br>లాలయామాస శుకం శశి నిభాననమ్।<br>తే భోగాః తాని భోజ్యాని వ్యాసపుత్రస్య<br>తత్ మనః, నాజహ్రుః మంద పవనో–<br>బద్ధపీఠమివ అచలమ్। కేవలం సుసమః<br>స్వచ్ఛో మౌనీ, ముదిత మానసః ।<br>సంపూర్ణ ఇవ శీతాంశుః అతిష్ఠత్ అమలః శుకః॥ | అయితే అంతఃపురంలో ప్రవేశము పొందిన శుకయోగి- 7 రోజులు ఉన్మత్తునివలె తిరుగాడిన తరువాత ఆయనకు సకల రాచమర్యాదలు అందించబడినాయి. మన్మధమత్తులగు వారకాంతల సేవలు, రుచికరమైన ఆహారపదార్థములు - పూర్ణచంద్రుని సౌందర్యమును పుణికిపుచ్చుకొన్న శుకమహర్షికి అందించబడినాయి.<br>మలయమారుతము యొక్క పిల్లగాలులు కొండను కదల్చగలవా? అట్లాగే శుకదేవుడు కూడా కేవల -సుమస్కుడై, స్వచ్ఛ స్వభావుడై, సంతోషము వదలని అంతరాంగుడై, ప్రసన్నహృదయుడై ఆయా అందించబడిన భోగములపట్ల మౌనము వహించి ఉన్నారు. పున్నమిరోజు కనిపించే పూర్ణచంద్రునివలె ప్రశాంత - నిర్మల - ఆనందస్వరూపులై ఉండసాగారు. |
| **6.** పరిజ్ఞాత స్వభావం, తం శుకం<br>స జనకో నృపః, ఆనీయ ముదిత<br>ఆత్మానమ్ అవలోక్య న నామ హ ।<br>"నిశ్శేషిత జగత్కార్యః । ప్రాప్త<br>అఖిల మనోరథః । కిం ఈప్సితం తవ?"<br>– ఇతి ఆహ, కృత స్వాగతమ్ ఆహ తమ్॥ | జనకమహారాజు శుకుని స్వభావము బాగుగా తెలుసుకున్నవారై, సంతోషము పొందారు. స్వయముగా వెళ్ళి అంతఃపురమునకు తీసుకొనివచ్చారు. నమస్కరించారు. స్వాగతము పలికారు.<br>ఓ శుకదేవా! సుస్వాగతం! మీకు ఈ లోకాలలో చేయవలసిన కార్యములంటూ ఏమీ లేనట్టి ఆత్మానుభవులయ్యారు. కార్య-కారణ-కర్తృత్వాలను అధిగమించారు. ఆత్మాసాక్షాత్కారము పొందిన మీరు సకల మనోరథములు నెరవేరినవారయ్యారు. మరి ఇంక మీరు ఏం కోరుకొని వచ్చారు?"<br>'దయచేసి చెప్పండి' - అంటూ స్వాగతవచనాలు పలికారు. |

శుకః పప్రచ్ఛః (శుక ఉవాచ) :
"సంసారాడంబరం ఇదం కథం
అభ్యుత్థితం గురో? కథం ప్రశమమ్
ఆయాతి? యథావత్ కథయాశు మే।"
యథావత్ అఖిలం ప్రోక్తం జనకేన
మహాత్మనా, తదేవ యత్
పురాప్రోక్తం తస్య పిత్రా మహాధియా।

**శుకమహర్షి** : గురుదేవా! ఈ సంసారాడంబరము ఎచ్చట నుండి బయల్వెడలుతోంది? ఎట్లా ఉపశమిస్తోంది? ఆ యథాక్రమమంతా దయతో నాకు వివరించి చెప్పండి.

అప్పుడు మహాత్ముడగు శ్రీ జనకమహారాజు యథాక్రమమంతా సమస్తము - ఉన్నది ఉన్నట్లుగా, ఇతః పూర్వమే శాస్త్రములలో చెప్పబడినదంతా వివరించి చెప్పారు. అదంతా కూడా శ్రీ శుకుని దృష్టిలో మహాధీమంతులగు శ్రీ వ్యాసులవారు వివరించినట్లే ఉన్నది.

---

(శ్రీ శుక ఉవాచ।)
స్వయమేవ మయా
పూర్వం అభిజ్ఞాతం విశేషతః।
ఏతత్ ఏవ హి పృష్టేన పిత్రా మే సముదాహృతమ్ ।

**శ్రీ శుకమహర్షి**: ఓ గురువర్యా! జనక మహారాజా! మీరు వివరించి చెప్పిన ఆయా విశేషాలన్నీ ఇతఃపూర్వం మేరు శిఖరంపై ఏకాంతంగా తపస్సు చేస్తూ ఉండగానే బాగా తెలుసుకొన్నాను. అభిజ్ఞాతుడనయ్యాను.

అవే విశేషాలు మా నాన్నగారిని అడిగినప్పుడు ఆయన కూడా సవివరణగా చెప్పటం జరిగింది.

---

భవత అపి ఏష ఏవ అర్థః కథితో। వాగ్విదాం వర !
ఏష ఏవహి వాక్యార్థః శాస్త్రేషు పరిదృశ్యతే ।
మనో వికల్ప సంజాతం, తత్ వికల్ప
పరిక్షయాత్, క్షీయతే దగ్ధ సంసారో
నిస్సార - ఇతి నిశ్చితః ॥

ఓ మహావక్తా! వాగ్విదాం వర! మీచేత కూడా అదే అర్థము ఇప్పుడు శాస్త్ర - దృష్టాంత పూర్వకంగా చెప్పబడింది కూడా. మీరు, మా నాన్నగారు చెప్పిన మహార్థమే శాస్త్రములలో కనిపిస్తూ ఉన్నది.

**ఈ 'సంసారము' అనునదంతా 'మనోవికల్పము' వలన పుట్టుతోంది. అట్టి మనో వికల్పము నశిస్తే (లేక పరి-క్షయిస్తే) సంసారము, అద్దాని వికారములు, అది కల్పిస్తున్నబంధములతో సహా దగ్ధమై నశించగలదు. (లేక) క్షీణించగలదు (లేక) రహితమైపోగలదు.**

అందుచేత 'సంసారము' అనుబడుదానికి - మనోవికల్పము లేకుంటే - ఉనికియే లేదు. అది స్వతఃగా చూస్తే 'నిస్సారము' అని చెప్పబడుతోంది.

---

7. తత్ కిమ్ ఏతత్, మహాభాగ!
సత్యం బ్రూహి మమ అచలమ్ ॥
త్వత్తో విశ్రమం ఆప్నోమి చేతసా భ్రమతా జగత్ ।
శ్రీ జనక ఉవాచ :
శృణు తావత్
ఇదానీం త్వం కథ్యమానం ఇదం మయా
శ్రీ శుక। జ్ఞాన విస్తారం బుద్ధి
సారాంతర అంతరమ్, యత్ విజ్ఞానాత్
పుమాన్ తు సద్యో జీవన్ముక్తత్వం ఆప్నుయాత్।

హే గురు భగవాన్! ఓ మహాభాగా! అదంతా ఏమిటి? ఎట్లా? ఎందువలన? ఏ రీతిగా? మార్పు చేర్పులు లేనట్టి నాయొక్క వాస్తవమగు పరమసత్యము ఏమిటో నాకు చెప్పండి. కేవలమగు ఆత్మస్వరూపమునకు సంసార దోషము ఎట్లా అంటుతోంది?

మీయొక్క ఆత్మబోధచేత నాయొక్క బుద్ధి జగత్ భ్రమను వీడి, ఇక అనునిత్యమగు ఆత్మానుభవమునందు విశ్రాంతపొందెదెట్లా? వివరించండి.

శ్రీ జనకమహారాజు : అదంతా కూడా ఇప్పుడు సవివరణగా, విశ్లేషపూర్వకంగా - సారాంశముగా, అంతరాంతరమున - "నాకు స్వానుభవమగుచున్నది." చెప్పుచున్నాను. నేను వివరిస్తున్న ఈఈ విశేషాలు విని, అర్థం చేసుకుంటే చాలు, సద్యో జీవన్ముక్తి (ఇప్పటికిప్పుడేముక్తి) లభించగలదు.

---

"దృశ్యం నాస్తి" ఇతి బోధేన
మనసో దృశ్యమార్జనమ్, సంపన్నంచేత్
తదుత్పన్నా పరా నిర్వాణ నిర్వృతిః।

"దృశ్యము కళ్ళకు కనబడుచూ ఉన్నప్పటికీ, ఇది వాస్తవానికి మొదలేలేదు" ఇట్టి బోధ (Messege / Learning / Addressing) చేత మనస్సులో దృశ్య జాడ్యము తొలగిందా, ఆ మరుక్షణం నిర్వృతి (Sans distraction) రూపమగు 'పరాస్థానము' (లేక) 'నిర్వాణము' అనబడు మోక్షము సిద్ధించగలదు.

---

అశేషేణ పరిత్యాగో
వాసనాయాం య ఉత్తమః, "మోక్ష" ఇతి
ఉచ్యతే సద్భిః । స ఏవ విమల క్రమః ॥

అట్టి పరా - నిర్వాణ - మోక్షస్థానము సిద్ధించేది ఎట్లా? దృశ్యమునకు - సంబంధించిన వాసనలను నిర్దిష్టంగా పరిత్యజించటంచేతనే (లేక) పరిత్యాగముచేతనే. కనుక "వాసనల మలమును తొలగించి మనస్సును ధ్యానము మొ॥వాటిచే నిర్మలం చేసుకోండి" అని మహనీయులు విమలక్రమమును (The procedure of purifying) చెప్పుచున్నారు.

| | |
|---|---|
| యే శుద్ధ వాసనా భూయో<br>న జన్మ-అనర్థ భాగినః। జ్ఞాత జ్ఞేయాస్త<br>ఉచ్యంతే జీవన్ముక్తా మహాధియః।<br>పదార్థ భావనా దార్ఢ్యం "బంధ" ఇతి<br>అభిధీయతే । వాసనాతానవం,<br>బ్రహ్మన్! - "మోక్ష" ఇతి అభిధీయతే ॥ | ఈ విధంగా వాసనలు రెండు రకములు (1) శుద్ధ వాసనలు (2) మలిన వాసనలు.<br>శుద్ధవాసనల అనగా? - అనేకముగా కనిపిస్తూ కూడా ఏకముగా అనిపించగల కర్మ-జ్ఞానాభ్యాసములు. అవి ఎవ్వరు నిర్వర్తిస్తూ ఉంటారో, అట్టివారే "జీవన్ముక్తులు" అని, విదిత వేద్యుల / జ్ఞానజ్ఞేయుల (తెలుసుకోవలసినది తెలుసుకొనియున్న పండితులు) చే చెప్పబడుచూ ఉన్నారు.<br>- పదార్థముల గురించిన దృఢమైన వస్తుభావనయే 'బంధము' అనబడుతోంది.<br>- దృశ్యపదార్థములపట్ల వాసనా క్షయమే మోక్షము<br>(The Decreasing of Tendencies and placing them towards "SELF" is MOKSHAM) |
| **8. జీవన్ముక్తుడు**<br>తపః ప్రభృతినా యస్మై<br>హేతునైవ వినా పునః, భోగా<br>ఇహ న రోచంతే స "జీవనుక్త" ఉచ్యతే ॥ | **జీవన్ముక్తుడు - అనగా ఎవ్వరు?**<br>ఓ శుకమహాశయా! 'జీవన్ముక్తుడు' అనగా ఎవ్వరో, జీవన్ముక్తుని లక్షణములు ఏవిధంగా ఉంటాయో - ముముక్షువుల అభ్యాసము కొరకై - చెప్పుచున్నాను.<br>ఎవ్వరికైతే అప్రయత్నపూర్వకంగానో, స్వాభావికంగానో - (తపస్సు) మొదలైన వాటి అవసరము / అగత్యము లేకుండానే) - ఈ దృశ్యజగత్తులో తారసబడే ఇంద్రియభోగములు "అనుభవించాలి. కావాలి. రుచి అయినవి" - అని అనిపించవో - ఆతడే జీవన్ముక్తుడు. |
| ఆపతత్‌సు యథాకాలం<br>సుఖ దుఃఖేషు అనారతః, న హృష్యతి -<br>గ్లాయతి యః, స 'జీవన్ముక్త' ఉచ్యతే ॥<br>హర్ష-అమర్ష భయ-క్రోధ, కామ-కార్పణ్య దృష్టిభిః,<br>న పరామృశ్యతే యో అంతః, సః జీవన్ముక్త ఉచ్యతే। | ఆయా కాలములలో (యథాకాలంగా) వస్తూపోతూ ఉండే ఆపద - సంపదల పట్ల , సుఖ దుఃఖములపట్ల ఎవ్వరైతే సంతోషముగాని, దుఃఖముగాని పొందరో, అతడే "జీవన్ముక్తుడు".<br>ఎవరి "అంతఃకరణము" (అనే కొండ)ను సంతోషము, దుఃఖము, భయము, క్రోధము, కామము, కార్పణ్యము (బెంగపడటము) మొదలైన దృష్టులు స్పృశించజాలవో, స్పృశించినా కూడా ప్రవేశించజాలవో ఆతడే జీవన్ముక్తుడు. |
| అహంకారమయీం త్యక్త్వా,<br>వాసనాం లీలయైవ యః, తిష్ఠతి ధ్యేయ సంత్యాగీ,<br>స జీవన్ముక్త ఉచ్యతే ॥<br>ఈప్సిత-అనీప్సితేన స్థో<br>యస్య అంతర వృత్తి దృష్టిషు,<br>సుషుప్తి వత్ యత్ చరతి, స జీవన్ముక్త ఉచ్యతే॥ | ఎవ్వరైతే అహంకార మమకారములతో కూడిన వాసనలను త్యజించి వేసి, దృశ్య ధ్యేయములను త్యాగము చేసి, లీలా వినోదంగా దృశ్యమునందు విహరిస్తూ ఉంటారో, ఆతడే జీవన్ముక్తుడు.<br>ఎవ్వరైతే "అంతర్ముఖ దృష్టి"చే దృశ్యముపట్ల ఇష్టముల - అయిష్టములకు సంబంధించిన దృష్టులను త్యజించి, జాగ్రత్తులో కూడా సుషుప్తిలో ఉన్నవానివలె - సంచరిస్తూ ఉంటాడో ఆతడే జీవన్ముక్తుడు. |
| అధ్యాత్మరతిః ఆసీనః,<br>పూర్ణః పావన మానసః,<br>ప్రాప్త అనుత్తమ విశ్రాంతిః<br>న కించిత్ ఇహ వాంఛతి,<br>యో జీవతి గత స్నేహః,<br>స జీవన్ముక్త ఉచ్యతే. | ఈ దృశ్యమానమగుచూ ఉన్న (కనబడుచూ - వినబడుచూ ఉన్న) సమస్తము ఆత్మయందు దర్శించటమే - అధ్యాత్మధ్యానము (లేక) అధ్యాత్మయోగము (లేక) అధ్యాత్మ సందర్శనము.<br>ఎవ్వడైతే అట్టి అధ్యాత్మమునందు రతిస్తూ, ఆత్మయందే, పూర్ణభావనతో, పవిత్రమగు ఆత్మభావనా మనస్కుడై, ఆత్మయందే పరమ విశ్రాంతిని పొందుచూ ఉంటాడో,<br>ఇక్కడ ఏ కించిత్తూ కూడా కోరుకోవటము లేదో,<br>- దేనిపట్లా ఏమాత్రము స్నేహబంధము (Sense of Dependence) కలిగి ఉండటము లేదో, అట్టి ప్రశాంత - విశ్రాంతి లక్షణసమన్వితుడే - జీవన్ముక్తుడు. సమస్తమును ఆత్మగా, ఆత్మనే చూస్తూ, ఇక అన్యదృష్టి లేనివాడు- జీవన్ముక్తుడు. |

| | |
|---|---|
| **9.** సంవేద్యేన హృదాకాశే మనాగపి న లిప్యతే,<br>యస్య అసావ జడా సంవిత్<br>స జీవన్ముక్త ఉచ్యతే॥<br>రాగ ద్వేషౌ సుఖం దుఃఖం ధార్మాధర్మౌ ఫలాఫలే,<br>యః కరోతి అనపేక్ష్య ఏవ, స జీవన్ముక్త ఉచ్యతే ॥ | ఆకాశమునకు వస్తువుల దోషములు అంటుతాయా? లేదుకదా. ఆ విధంగానే, ఎవ్వరియొక్క హృదయాకాశము తెలియబడుచూ ఉన్న (సంవేద్యమగుచున్న) ఆయా వస్తు - సంఘటన - సహజీవులు మొదలైనవాటిచే కించిత్ కూడా దోషము పొందదో - వారే **జీవన్ముక్తులు.**<br>ఎవ్వరు రాగ-ద్వేష, సుఖ-దుఃఖ, ధర్మ-అధర్మ, ఫల-అఫలముల వ్యవహారశీలముల పట్ల అపేక్షలేకుండానే (unattracted) నిర్వర్తించువారై ఉంటారో - వారే **జీవన్ముక్తులు** |
| మౌనవాన్ నిరహంభావో, నిర్మానో<br>ముక్త మత్సరః, యః కరోతి గత<br>ఉద్వేగః, సః జీవన్ముక్త ఉచ్యతే॥<br>సర్వత్ర విగత స్నేహో, యః సాక్షివత్ అవస్థితః<br>నిరిచ్ఛో వర్తతే కార్యే, స జీవన్ముక్త ఉచ్యతే॥ | ఎవ్వరైతే సమస్త ప్రాపంచక విశేషముల - సందర్భములపట్ల మౌనము వహించినవారై, "నేను కర్తను" - అను అహంకారము లేనివారై మాన-మద-మాత్సర్యములు మొదలంట్లా జయించివేసినవారై ఉద్వేగ రహితులై ఉంటారో - వారే **జీవన్ముక్తులు.**<br>సర్వత్రా స్నేహబంధభావరహితులై, సాక్షీభూతంగా ఉంటూనే ఇచ్ఛారహితంగా ఆయా విధాయకములగు కార్యములను నిర్వర్తిస్తూ ఉంటారో - వారే **జీవన్ముక్తులు.** |
| యేన ధర్మం అధర్మం చ, మనో మననమీహితమ్,<br>సర్వం అంతః పరిత్యక్తం, స జీవన్ముక్త ఉచ్యతే॥<br>యావతీ దృశ్యకలనా సకలేయం విలోక్యతే,<br>సా యేన సుష్ఠు సంత్యక్తా, స జీవన్ముక్త ఉచ్యతే॥<br>కట్వ ఆమ్ల లవణం తిక్తం అమృష్టం<br>మృష్టం ఏవ చ, సమమేవ చ యో<br>భుంక్తే, స జీవన్ముక్త ఉచ్యతే॥ | ధర్మా ధర్మములను, వ్యావహారికమైన సమస్త మనోసంకల్పములను పరిత్యజించి, హృదయంలో మననరూపముగా కలిగి ఉండనివాడు **జీవన్ముక్తుడు.**<br>తనయొక్క 'సమ్యక్' (సర్వసమఆత్మ) దృష్టిచే దృశ్యమును చూస్తూ సర్వభేదములను పరిత్యజించి ఉంటాడో ఆతడే **జీవన్ముక్తుడు.**<br>ఎవ్వడైతే షట్ (6) రుచులు అయినట్టి - కారము, పులుపు, ఉప్పు, చేదు, రుచి - అరుచి వీటినన్నిటిని సమభావముతో భుజించు దృష్టిని పెంపొందించుకొని ఉంటాడో - ఆతడే **జీవన్ముక్తుడు.** |
| జరా మరణ ఆపచ్చ, రాజ్యం దారిద్ర్యం<br>ఏవ చ, 'రమ్యం' ఇతి ఏవ (ఇత్యేవ) యో భుంక్తే,<br>స జీవన్ముక్త ఉచ్యతే॥ | బాల్య - యౌవన - వార్ధక్యములు (ముసలితనము), జీవితము - మరణములను, రాజ్యప్రాప్తి - దారిద్ర్య ప్రాప్తులను "ఇవన్నీ మంచిదే । రమ్యమే।" - అను దృష్టితో ఆస్వాదిస్తాడో ఆతడే **"జీవన్ముక్తుడు".** |
| **10.** ధర్మ అధర్మౌ సుఖం దుఃఖం<br>తథా మరణ జన్మనీ, ధియా యేన<br>సు సంత్యక్తం, స జీవన్ముక్త ఉచ్యతే॥<br>ఉద్వేగ ఆనంద రహితః<br>సమయా స్వచ్ఛయా ధియా,<br>న శోచతి, న చ ఉదేతి, స జీవన్ముక్త ఉచ్యతే॥ | ఇక్కడి ధర్మ - అధర్మ వ్యవహారములు, జీవన్ - మరణములు మొదలైనవాటినన్నిటినీ కూడా బుద్ధి కుశలతతో (లేక) బుద్ధి నిశ్చలతతో మొదలంట్లా సంత్యజించినవాడై ఉండువాడే **జీవన్ముక్తుడు**<br>ఉద్వేగ-ఆనందములను దరిజేరనీయనివాడై, స్వచ్ఛము - సమత్వములతో కూడిన బుద్ధితో (With Logic and With Purity of Perception of all pervading Unity) - దేని గురించీ కూడా ఆదుర్దా పొందక, క్రుంగక, దేనికీ బద్ధుడు కాకుండువాడు - **జీవన్ముక్తుడు.** |
| సర్వఇచ్ఛా సకలాః శంకాః<br>సర్వ ఈహాః సర్వ నిశ్చయాః, ధియా<br>యేన పరిత్యక్తాః, స జీవన్ముక్త ఉచ్యతే॥ | సమస్తమైన కోరికలను, శంకలను (అనుమానములను), సర్వ మమకారములను బుద్ధియొక్క నిశ్చయముతో పరిత్యజించువాడే జీవన్ముక్తుడు. |
| జన్మ స్థితి వినాశేషు<br>స ఉదయ – అస్తమయేషు చ, సమమేవ<br>మనో యస్య, స జీవన్ముక్త ఉచ్యతే॥<br>న కించన ద్వేష్టి, తథా న కించిత్ అపి కాంక్షతి, | ఎవ్వని మననరూపమగు మనస్సు → జన్మ - స్థితి - వినాశన సందర్భములలోను, (తన ఉదయ అస్తమయములందు సూర్యునివలె) - సమత్వము ఏమాత్రము వీడకయే ఉంటుందో - ఆతడు జీవన్ముక్తుడు.<br>ఎవ్వడైతే దేనినీ కూడా ఏ కించిత్ కూడా ద్వేషించడో, దేనినీ ఏ కించిత్ కూడా కాంక్షించడో (కోరుకోడో), ప్రకృతి సిద్ధంగా (In its natural course) |

భుంక్తే యః ప్రకృతాన్ భోగాన్,
స జీవన్ముక్త ఉచ్యతే ॥

ఏఏ భోగములు స్వాభావికంగా ఎంతవరకు లభిస్తే, వాటినే అత్యాశ-కాంక్ష -ద్వేషములు లేకుండా ఆస్వాదిస్తూ ఉంటాడో, ఆతడే జీవన్ముక్తుడు.

శాంత సంసార కలనః, కలావాన్ అపి నిష్కళః
యః స చిత్తోఽపి నిశ్చిత్తః, స జీవన్ముక్త ఉచ్యతే ॥

ఎవ్వడైతే అనేక సంసార కలనములు పొందుచున్నప్పటికీ పరమశాంతము స్వాభావికంగా వహించి ఉంటాడో, చిత్తము ఉండి కూడా చిత్తరహిత చిత్ - రూపుడై ఉంటాడో - ఆతడే జీవన్ముక్తుడు.

---

యః సమస్త అర్ధజాలేషు వ్యవహార్యపి-
నిస్పృహః, పదార్థేషు ఇవ పూర్ణాత్మా
స జీవన్ముక్త ఉచ్యతే॥

ఎవ్వడు ఈ ఎదురుగా ఇంద్రియములను అర్థపూర్వకంగా కనిపించే సమస్త అర్థజాలములందు (Groups of Different Dimensions and Meanings) వ్యవహరిస్తూనే అంతరమున నిస్పృహుడై, విషయ - వ్యవహార రహితుడై సమస్తమునకు సర్వదా అతీతుడై ఉంటాడో, పదార్థముల అనుభవము సందర్భములలో కూడా పూర్ణాత్ముడై ప్రకాశిస్తూ ఉంటాడో ఆతడు - జీవన్ముక్తుడు.

---

## విదేహముక్తి

**11.** జీవన్ముక్త పదం త్యక్త్వా స్వదేహే
కాలసాత్కృతే, విశత్యదేహ - ముక్తత్వం
పవనో అస్పందతాం ఇవ ॥

**విదేహముక్తి**

గాలి యొక్క తరంగములు గాలితో ఏకమగు విధంగా, ఈ జీవుడు జీవన్ముక్తుడై (జీవించి ఉంటూనే నిత్యముక్తత్వము అభ్యసిస్తూ) - ఆ 'జీవన్ముక్తపదము'ను అధిగమించి కాలక్రమేణ 'విదేహముక్తత్వము' అను కైవల్య స్థానములో ప్రవేశము పొందుచున్నాడు.

---

విదేహ ముక్తో న ఉదేతి। న అస్తమేతి।
న శామ్యతి । న సత్ । న అసత్ । న దూరస్థో ।
న చ అహం । న చ నేతరః ।

అట్టి విదేహముక్తుడు ''కేవాలాత్మాఽహమ్'' అనుభూతిని సిద్ధించుకుంటాడు. ఆతడు ఉదయించడు. అస్తమించడు. శమించడు. ఇక్కడ నుండి బయల్వెడలడు. ఎచ్చటినుండో ఇక్కడికి రాడు.

**ఇంకా విదేహముక్తస్థితి ఎట్టిది?**

విదేహముక్తునకు అనుభవమగుచున్న ద్రష్ట - దృశ్య సహిత కేవల స్వరూపము 'సత్' కాదు. అసత్ కాదు. ఉండి లేనిది (సదసత్) కాదు. అది 'నేను' కాదు. మరొకరు కాదు.

---

తతః స్తిమిత గంభీరం న తేజో। న తమః తతమ్।
అనాఖ్యమ్। అనభివ్యక్తం। సత్ కించిత్ అవశిష్యతే ॥
న శూన్యం । న అపి చ ఆకారి। న దృశ్యం।
న అపి దర్శనమ్ । న చ భూత పదార్థౌఘః।
సదసంతతయా స్థితమ్ ।
కిమపి అవ్యపదేశ ఆత్మా, పూర్ణాత్-
పూర్ణతర - ఆకృతిః । న సత్। న అసత్। న సదసత్।
న అభావో । భావనం న చ॥

విదేహముక్తుని స్వస్వరూపానుభవము - స్థిమితము, గంభీరము సంతరించుకొన్నట్టిది. నిర్వచించి చెప్పరానిది. (అనాఖ్యము). అది తేజస్సుకాదు. చీకటి కాదు. అభివ్యక్తము అయినది కాదు. అయితే ఈ అభివ్యక్తిమంతా అద్దాని కించిత్ ప్రదర్శనమే. 'ఉనికి'గా కించిత్ అవశేష్యమై ప్రకటనమగుచూ ఉంటోంది.

అది శూన్యము కాదు. సాకారి కాదు. దృశ్య - దర్శనములు కాదు. భౌతిక పదార్థం కాదు, సర్వదా సత్ స్వరూపము సంతరించుకున్నట్టిది. అనంతరూపములుగా సంస్థితమై ఉన్నట్టిది.

---

చిన్మాత్రం। చైత్య రహితం।
అనంతం। అజరం శివమ్।
అనాది మధ్య పర్యంతం, యత్ అనాది నిరామయమ్।
ద్రష్టృ దర్శన దృశ్యానాం
మధ్యే యత్ దర్శనం స్మృతమ్। న అత,
పరతరం కించిత్ నిశ్చయో అస్తి అపరో, మునే!

"ఇది!" అని చెప్పజాలనిది. పూర్ణమునకే పూర్ణస్వరూపము. సత్-అసత్-సదసత్-భావ-అభావముల రూపము కానట్టిది.

కదలికలే లేనట్టి 'కేవలచిత్' స్వరూపము. అనుభవమైనదేదీ తనకు వేరుగా లేనట్టిది. అనంతమైనది. జరామరణములకు సంబంధించినది కాదు. పరమ సుఖ-శుభప్రదమైనది. ఆది, మధ్య, అంతములుగా విస్తరిస్తూనే, ఆదిమధ్యాంతరహితము.

ఓ మునీశ్వరా! శుకదేవా! ద్రష్ట - దర్శన - దృశ్యములనబడే త్రిపుటిల మధ్యగా కించిత్ దర్శనము అగుచున్నట్టిది. అట్టి కేవల చిన్మయవిదేహముక్తి స్వరూపమునకు ఆవల మరింకేమీ కించిత్ కూడా శేషించి లేనట్టిది. 'అది నాకు అనన్యము' అను భావన సుస్థిరపరచుకోవయ్యా.

---

స్వయమేవ త్వయా జ్ఞాతం । గురతశ్చ పునః శ్రుతమ్ ।
<u>స్వ సంకల్ప వశాత్ బద్ధో । నిస్సంకల్పాత్ విముచ్యతే ॥</u>

ఓ శుకదేవా! అట్టి మనందరి అఖండ అప్రమేయత్మ గురించి నీవు స్వయముగా స్వకీయ విచారణచే తెలుసుకొనియే ఉన్నావు. అటు తరువాత మరల గురుదేవులగు మీ తండ్రి శ్రీ వ్యాసమహర్షి చెప్పగా విన్నావు. ఒక్క విషయం గుర్తుపెట్టుకో. స్వకీయ సంకల్పము చేతనే బంధము. నిస్సంకల్పముచే ముక్తి.

12. తేన స్వయం త్వయా జ్ఞాతం
జ్ఞేయం యస్య మహాత్మనః, భోగేభ్యో హి
అరతిః జాతా, దృశ్యాద్వా సకలాత్ ఇహ॥

మహాత్ములగు ఆత్మతత్త్వజ్ఞులు ఏది తెలుసుకోవాలి అని ఎలుగెత్తి చెప్పుచున్నారో, - అట్టి "స్వస్వరూపాత్మమేవాహమ్" గురించి జ్ఞాతవ్యముగా మీకు మీరే తెలుసుకొనే ఉన్నారు. అందుచేతనే సమస్త దృశ్యసంబంధమైన ఆయా ఇహభోగములన్నీ మీకు రతించటానికి ఏమాత్రము అర్హమైనవికావని, ఆత్మయే రమించవలసిన వస్తువని - ప్రవర్తన రూపంగా నిరూపించుకున్నారు.

---

ప్రాప్తం ప్రాప్తవ్యమ్ అఖిలం
భవతా పూర్ణచేతసా, స్వరూపే
తపసి, బ్రహ్మన్! ముక్తఃత్వమ్।
భ్రాంతిం ఉత్సృజ ॥

మీయొక్క వివేచన సంతరించుకున్నట్టి బుద్ధితో ప్రాప్తించుకోవలసినది ప్రాప్తించుకొన్నారు. తపస్సుచే స్వస్వరూపము సిద్ధంచుకొనియే ఉన్నారు. హే బ్రహ్మన్! మీరు ముక్తులే. అందుచేత **"బంధము ఉన్నది"** అనే భ్రాంతిని నిస్సందేహంగా త్యజించండి.

---

అతి బాహ్యం, తదా అబాహ్యమ్,
అంతర అభ్యంతరం ధియః, శుక !
పశ్యన్ న పశ్యేత్ త్వం, సాక్షీ సంపూర్ణ కేవలః ॥

హే శుకదేవా! బాహ్యముగా కనబడే సమస్తమును అతిక్రమించివేయండి. బుద్ధితో అంతరాంతరమై ప్రకాశిస్తున్న ఆత్మనే దర్శించండి. దృశ్యవ్యవహారములను చూస్తూనే చూడనివారై, పూర్ణులై, కేవలసాక్షియై విహరించండి.

---

విశ్రామ శుకః తూష్ణీం స్వస్థే
పరమ వస్తుని, వీత శోక భయ ఆయాసో
నిరీహః ఛిన్న సంశయః ।

ఈ విధంగా జనకమహారాజు నుండి శ్రవణం చేసిన శ్రీ శుకుడు మనోబుద్ధులకు సంబంధించిన సర్వశ్రమలు తూష్ణీకరించినవారైనారు. సమస్త శోకములను (All worries) భయములను (All Fears) ఆయాసములను (Inclinatory emotions) వదలివేశారు. సర్వసందేహములను ఛిన్నం చేసి, ప్రాపంచికమైన భావనలు, అనుమానములు కోరికలు - త్యజించి, ఆత్మానందులైనారు.

శ్రీ జనకమహారాజు నిర్ద్వంద్వంగా స్వస్వరూపాత్మ గురించి ప్రకటించిన స్వాత్మానుభవము శ్రవణము చేసి, శుకమునీంద్రులవారు **"ఆత్మతత్త్వ-ప్రశాంతానుభవి"** అయ్యారు.

---

జగామ శిఖరం మేరోః సమాధి అర్థమ్ అఖండితమ్।
తత్ర వర్ష సహస్రాణి నిర్వికల్ప సమాధినా,
దేశే స్థిత్వా శశామఅసే హి ఆత్మని అస్నేహ దీపవత్॥

గురుదేవుడగు శ్రీ జనకమహారాజుకు సాష్టాంగదండ ప్రణామములు ఆచరించి, సెలవు తీసుకొని తిరిగి మేరుపర్వత శిఖరం చేరారు. వేయి సంవత్సరములు నిర్వికల్ప సమాధియందు గడిపారు. నూనె అయిపోయిన దీపమువలె ఆత్మయందు ఆయన మనస్సు సశాంతించినదై, విశ్రాంతిని పొందసాగింది.

---

వ్యపగత కలనా కళంక, శుద్ధః
స్వయం అమల ఆత్మని, పావనే పదే
అసౌ, సలిల కణ ఇవ అంబుధౌ,
మహాత్మా విగళిత వాసనం ఏకతాం జగామ॥

జలకణము సముద్ర జలములో ప్రవేశించి ఆ సముద్రజలముతో ఏకమై పోవు రీతిగా శ్రీ శుకదేవుడు జీవాత్మత్వమును సర్వాత్మత్వముతో ఏకత్వము చేసివేశారు. నిర్వాసనాస్థితి (A state of 'Nil' Tendenceies) పొందారు. సర్వ అన్య సంకల్ప దోషములను పరిశుభ్రపరచుకొన్న వారయ్యారు. స్వయముగా నిర్మలమగు ఆత్మపదమును అధిష్ఠించారు. ఏకమగు మహాత్మ స్వరూపులైనారు.

(మహాత్ముడు = ఈ సమస్తము నాలోనే ఉన్నది. ఈ సమస్తములో, ఈ సమస్తముగా ఉన్నది నేనే!" - అని భావనాసమన్వితుడు.)

<u>ఇతి శుకవిశ్రాంతి మహోపనిషత్</u>

<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>

**<u>ఇతి శుక విశ్రాంతి - మహోపనిషత్</u>**

**<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః॥</u>**

# తృతీయోధ్యాయః - ఋభు నిదాఘ సంవాదము

| | |
|---|---|
| 1. నిదాఘో నామ మునిరాట్ । ప్రాప్త విద్యశ్చ బాలకః ।<br>విహృతః తీర్థయాత్రార్థం పిత్ర అనుజ్ఞాతవాన్ స్వయమ్ । | ఋభు మహర్షికుమారుడు నిదాఘుడు - అనే మునివరాట్(మునీశ్వరుడు). ఆయన బాల్యంలోనే విద్యను పూర్తి చేసుకొన్నారు. తండ్రి అనుజ్ఞను తీసుకొని ఇక స్వయముగా తీర్థయాత్రలకు బయలుదేరారు. |
| స అర్ధ త్రికోటి (3 1/2 కోట్లు) తీర్థేషు స్నాత్వా,<br>గృహమ్ ఉపాగతః ।<br>స్వ ఉదంతం కథయామాస<br>ఋభుం నత్వా మహాయశాః । స అర్ధ త్రికోటి తీర్థేషు<br>స్నాన పుణ్య ప్రభావతః, ప్రాదుర్భూతో<br>మనసి మే విచారః సో అయం ఈదృశః । | 3 1/2 కోట్ల తీర్థములలో స్నానములు చేసి తీర్థయాత్రలు ముగించుకొని తిరిగి ఇంటికి జేరారు. తండ్రిని సమీపించి నమస్కరించాడు, మహాశయుడు (గొప్ప ఆశయము కలవాడై), ఆ నిదాఘుడు తన తీర్థయాత్రానుభవమంతా రంగరించి ఈ విధంగా వివరించి చెప్ప ప్రారంభించారు.<br>నిదాఘుడు : హేపితృదేవా! గురుతుల్యా! ఋభు మహర్షీ! నమో నమః। నేను ప్రపంచమంతా తిరిగి 3 1/2 కోట్ల తీర్థములలో మునిగి వచ్చాను. అట్టి తీర్థస్నానముల పుణ్య ప్రభావము చేత నా మనస్సునందు ఒకానొక జ్ఞాన విచారణ జనించటం ప్రారంభమయింది. |
| జాయతే మ్రియతే లోకో, మ్రియతే జననాయ చ ।<br>అస్థిరాః సర్వ ఏవ ఇమే సచరాచర చేష్టితాః।<br>సర్వ ఆపదాం పదం పాపా భావా విభవ భూమయః। | ఈ జీవుడు దృశ్య జగత్తులో ఎందుకు పుట్టుచున్నట్లు? ఎందుకు మరణిస్తున్నట్లు? ఈతడు మరణించే నిమిత్తమై పుట్టుచున్నాడు. మరల జన్మించే నిమిత్తంగా మరణిస్తూ ఉన్నాడు.<br>ఇక్కడి చరాచర జీవులందరి చేష్టలు (క్రియలు) అస్థిరములే. ఇక్కడి భావనా వ్యవహార పరంపరలన్నీ పాప - విభవ భూములలోకి దారితీసేవే కదా! |
| అయః శలాకా సదృశాః<br>పరస్పర అ సంగినః । శ్లిష్యంతే<br>కేవలాభావా మనః కల్పనయా అనయా । | ఇక్కడి జీవుల బంధు సంబంధమైన పరస్పరానుబంధాలన్నీ కూడా - ఇనుపరింగులవంటివే! ఈ జీవులు ఒకరికొకరు సంబంధించినవారే కారు. ఇవన్నీ మనో కల్పనచే బయల్వెడలి, మరల కల్పనారాహిత్యముచే నశించిపోవుచున్నాయి. |
| భావేషు అరతిః ఆయాతా పథికస్య మరుష్వివ।।<br>శామ్యతి ఇదం కథం దుఃఖం<br>ఇతి తప్తో ఽ స్మి చేతసా. | ఒక బాటసారి మరుభూములలో ఎడారి భూములలో నడచి నడచి, అలసిపోయి కూడా చివరికి ఏమీ లభించనివాడై ఉంటాడు కదా! ఈ మరుభూమి వంటి దృశ్యములో ఏదో పొందాలనే ఉద్దేశ్యముతో ఎంతో శ్రమించి 'జీవితము' అనే ఎడారిలో సుదీర్ఘ ప్రయాణములు చేస్తూ ఉన్నప్పటికీ, ఈ జీవుడు అలసి, సొలసి - చివరికి ఏమీ పొందకయే ఉన్నాడు.<br>**"ఈ అశాశ్వత జగత్తులోని సందర్భములతో, సంఘటనలతో, సహ జీవులతో నేను వృద్ధి చేసుకొనియున్న సాంసారిక దుఃఖము నాపట్ల తొలగేది ఎట్లా?"**<br>అని నా చిత్తము ఎంతగానో పరితాపము పొంద ప్రారంభించింది. |
| 2. చింతా నిచయ చక్రాణి<br>న ఆనందాయ ధనాని మే।<br>సంప్రసూత కళత్రాణి<br>గృహాణి, ఉగ్ర ఆపదామ్ ఇవ ।<br>ఇయం అస్మిం స్థితో దారాః<br>సంసారే పరిపేలవా। | అనేక చింతల (Series of worries) చట్రములో చిక్కుకుపోయి ఉన్న నేను, ఇక్కడి ధనము మొదలైన సంపదలచే ఏమాత్రము ఆనందము పొందలేనని గమనిస్తున్నాను. అందుచేత, ధనార్జనయే ఆశయముగా తలచి ఈ జీవితమును వృధా చేయ తలచుకోవటం లేదు.<br>ఇక్కడి స్త్రీలు, సంపదలు, ఇళ్లు మొదలైన సంబంధములన్నీ కూడా చివరికి ఉగ్రమైన, అతి భయంకరమైన ఆపదలకే దారితీస్తూ ఉన్నట్లు నాకు కనిపిస్తున్నాయి.<br>ఇక్కడి భార్యాభర్తల, పిల్ల - జెల్ల సంబంధాలు, తదితర సమస్త సాంసారిక సంబంధాలు - ఇవన్నీ అత్యంత పేలవమైనవి. నిస్సారమైనవి - అని నాకు అనిపిస్తోంది. |

శ్రీః, మునే! పరిమోహాయ
స అపి నూనం న శర్మదా ।
ఆయుః పల్లవకోణాగ్ర లంబ అంబుకణ
భంగురమ్ । ఉన్మత్త ఇవ సంత్యజ్య
యాతి అకాండే శరీరకమ్ ।

ఓ మునీశ్వరా! ధనము గొప్ప సుఖమని జనులు మోహము చేతనే భ్రమిస్తున్నారు. కానీ, ధనము ఉన్నవాడు మాత్రం 'సుఖిని' అన అనుకోవటంలేదు. అనేక చింతలు వదలటము లేదు.

ఇక ఈ ఆయుష్షు. ఇది వర్షాకాలంలో ఆకు చివ్వర వ్రేలాడే నీటి బిందువువలె అత్యంత క్షణ భంగురము.

ఒక పిచ్చిపట్టినవాడు విలువైన వస్తువును నేలపై విసురుచున్నవిధంగా ఈ శరీరము ఏ క్షణంలోనో నన్ను విడచి ఎటో వెళ్ళిపోగలదు.

---

విషయాశీ విషాసంగ పరిజర్జర చేతసామ్ ।
అప్రౌఢ ఆత్మ వివేకానాం
ఆయుః ఆయాసకారణమ్ ।
యుజ్యతే వేష్టనం వాయోః।
ఆకాశస్య చ ఖండనమ్।
గ్రంథనం చ తరంగాణాం।
ఆస్థా న ఆయుషి యుజ్యతే॥

నా ఈ చిత్తము పరిపరివిధములైన విషయములతో ఆశలు పెంచుకొని, చివరికి ఆయా విషయములలో చిక్కుకొని మ్రగ్గుతోంది.

ఆత్మగురించిన వివేకము విషయంలో అప్రౌఢము గా ఉన్నంతకాలము ఆయుష్షు శ్రమతో కూడి ఆయాసకారణమే. సుఖము కాదు.

గాలిని గుప్పిటలో బిగించవచ్చునేమో! ఆకాశమును ముక్కలు చేయుట సాధ్యమేమో! జల తరంగములను ప్రోగుచేసి ఒకచోట పెట్టవచ్చునేమో! కానీ ఆయుష్షును నమ్మి ఉండటం, స్థిరముగా ఉంటుందనటం ఎవ్వరివల్లా కాదు.

---

ప్రాప్యం సంప్రాప్యతే యేన
భూయో యేన న శోచ్యతే,
పరాయా నిర్వృతేః స్థానం
యత్ తత్ 'జీవితం' ఉచ్యతే॥
తరవో అపి హి జీవంతి। జీవంతి మృగ పక్షిణః ।
స జీవతి మనో యస్య మననే న ఉపజీవతి ॥

అపరోక్ష జ్ఞానము (లేక) ఆత్మజ్ఞానము ప్రాప్తించాలి. అట్టి ప్రాప్తించవలసినది ప్రాప్తించిందా....ఇక మరల దుఃఖము(worry) అనేదే ఉండదు. అట్టి నిర్వృత (Beyond shakle) పరస్థానము పొందినవానిదే జీవితము.

ఈ మానవుడు దీర్ఘకాలం జీవించటము - అనేది గొప్ప విషయమేమీ కాదు. చెట్లు జీవిస్తున్నాయి. జంతువులు, పక్షులు కూడా జీవిస్తున్నాయి. ఎవ్వని మనస్సైతే అఖండము సమస్తము అయి ఉన్న ఆత్మతో అనుసంధానము (ఉపజీవనము) పొందుచున్నదో, అట్టివాడే జీవించినట్లు. అప్పుడు మాత్రమే మానవుడవటము సద్వినియోగమయినట్లు. లేదా, గొప్ప అవకాశము దుర్వినియోగమే మరి.

---

3. జాతా స్త ఏవ జగతి జన్తవః సాధు జీవితాః,
యే పునః న ఇహ జాయంతే।
శేషాః జరఠ గర్దభాః।
భారో అవివేకినః శాస్త్రం।
భారో జ్ఞానం చ రాగిణః।
అశాంతస్య మనోభారో ।
భారో అనాత్మవిదో వపుః ॥

ఏ సాధు పుంగవులైతే ఆత్మజ్ఞానమును సంపాదించుకొని తిరిగి జగత్తులో జనించే అగత్యమును అధిగమిస్తారో, పునః జన్మించరో, వారి జన్మయే జన్మ. ఇక మిగిలినవారి జీవితము జరఠ (ముసలి) గాడిద జీవితంతో సమానము.

వివేకికి శాస్త్ర పాండిత్యము భారమేగాని సుఖవంతముకాదు.

- ఆయా దృశ్య విశేషములపట్ల రాగము తొలగనివానికి జ్ఞానము భారమేగాని భ్రమలు తొలగవు.

- అశాంతునికి మనస్సే భారము. ఆత్మ గురించి తెలియనివానికి శరీరమే భారము. శరీరము పొంది, బరువు మొయ్యటమేగాని, ఏ ప్రయోజనమూ ఉండదు.

---

అహంకారవశాత్ ఆపత్ । అహంకారాత్ దురాధయః ।
అహంకార వశాత్ ఈహా । న అహంకారాత్ పరో రిపుః॥

అహంకారమున్నచోటికి ఆపదలన్నీ వచ్చి చేరుతాయి. అహంకారమే దుష్టచింతలన్నిటికీ నాంది. అహంకారమువల్లనే అనేక కోరికలు. ఈ జీవునికి అహంకారము మించిన శత్రువే లేదు.

---

అహంకారవశాత్
యద్యత్ మయా భుక్తం చరాచరమ్,
తత్ తత్ సర్వం అవస్తు ఏవ
వస్తు-అహంకార రిక్తతా ।
ఇతః చేతశ్చ సువ్యగ్రం వ్యర్థమేవ అభి ధావతి,

అహంకారము, అట్టి అహంకారముతో కూడి అనుభవించబడే సమస్తము కూడా అవస్తువే! వస్తుతః అహంకారము అంతర్గతంగా ఏమీ లేనిదే! ఖాళీ అయినదే! అహంకార రహితమైనదే వస్తువు. అహంకారపూరితంగా పొందేదంతా అవస్తువే!

ఈ చిత్తము పిచ్చిపట్టినదానివలె ఎల్లప్పుడు వ్యర్థముగా వ్యగ్రత (Deep Worry) యందు చిక్కుకొని ఉంటోంది. 'మేము బాగున్నాము' అని పైకి చెప్పుకున్నప్పటికీ, ఈ జీవుని అంతరంగమున ఎన్నో వ్యథలు. చెప్పుకోలేని ఆదుర్దాలు. అనుమానాలు.

మనో దూరతయా యాతి
గ్రామే కౌలేయకో యథా॥
క్రూరేణ జడతాం యాతః తృష్ణా
భార అనుగామినా
వశః కౌలేయ కే-నైవ, బ్రహ్మన్! ముక్తోఽస్మి చేతసా।
(కౌలేయకము = కుక్క)

వీధికుక్క పొందేది ఏదీ లేకపోయినా కూడా, ఆ వీధి - ఈ వీధులలో శ్రమతో నిముష నిముషం తిరుగాడు విధంగా, ఈ మనస్సు పొందేది ఏమీ లేకపోయినప్పటికీ ఎక్కడెక్కడో తిరుగాడుచూ ఉన్నది.

క్రూరమైన మొగకుక్క వెంటబడగా పరుగులు తీస్తున్న ఆడకుక్కలాగా, క్రూరమైన, జడప్రాయమైన 'తృష్ణ' నావెంటబడుచూ ఉన్నది. నేను ఎటెటో ఏవేవో స్థితి - గతులకు, జన్మ కర్మలకు పరుగులు తీస్తున్నాను.

హే బ్రహ్మన్! వశమైన కుక్కవలె ఈ మనస్సు నాకు వశం కావాలి. వాస్తవానికి మనస్సుకు దాసుడను నేను కాదు. అదియే నాకు దాసుడు. అటువంటిది అదియే నా వెంటబడుతూ ఉంటే, నేనే పరుగులు తీస్తున్నాను.

---

<u>అపి అబ్ధి పానాత్</u> । మహతః,
సుమేరు ఉన్మూలనాత్ అపి,
అపి వహ్ని అశనాత్, బ్రహ్మన్ !
విషమః చిత్త నిగ్రహః ॥

అయినా కూడా ఈ మనస్సును నిగ్రహించటం ఎంతకష్టం! మహాసముద్రంలో ప్రవేశించి జలమంతా త్రాగవచ్చు. సుమేరు పర్వతాన్ని మొదలంట్లా పెరికివేయవచ్చు. అగ్నిని రుచికరమైన పదార్థము వలె భక్షించవచ్చు. కానీ ఈ చిత్తమును నిగ్రహించటము మాత్రం తేలిక కాదు.

---

**4.** చిత్తం కారణం అర్థానాం ।
తస్మిం తు సతి జగత్ త్రయమ్ ।
తస్మిన్ క్షీణే జగత్ క్షీణం ।
తత్ చికిత్స్యం ప్రయత్నతః ॥

ఈ చిత్తమే (లేక) ఈ మనస్సే సర్వ అర్థ - అనర్థములకు కూడా కారణము. అద్దానిరూపమే ఈ మర్త్య-భూ - స్వర్గ త్రిజగత్తులుకూడా. చిత్తము క్షీణిస్తే జగత్తు క్షీణిస్తుంది.

అట్టి చిత్తమునకు సర్వ ప్రయత్నములతో చికిత్స - అత్యంత ఆవశ్యకం.

---

యాం యాం అహం, మునిశ్రేష్ఠ !
సంశ్రయామి గుణశ్రియమ్,
తాం తాం కృతంతి మే తృష్ణా
తంత్రీమ్ ఇవ కుమూషికా॥

హే మునిశ్రేష్ఠా! ఋభు మహర్షీ! నేను ఏఏ శ్రేయోదాయకమైన గుణములను, అభ్యాసములను ఆశ్రయించ ప్రయత్నిస్తున్నానో, వాటన్నిటినీ కూడా - చెడ్డ ఎలుక వీణా తంతువులను కొరికి పాడుచేయు విధంగా - తృష్ణ వచ్చి (నా శ్రేయోప్రయత్నములన్నీ) త్రెంచివేస్తోంది.

---

పదం కరోతి అలంఘ్యే అపి ।
తృప్తా అపి ఫలం ఈహతే ।
చిరం తిష్ఠతి న ఏక అత్ర
తృష్ణా చపల మర్కటీ।

అంతరంగమున ప్రవేశించిన 'తృష్ణ' - అనే అత్యంత చపల స్వభావము గల కోతి :-

- ప్రవేశించకూడని (ఎక్కజాలని) కొండలన్నీ ఎక్కటానికి యోచిస్తోంది.
- ఏవేవో పొంది కూడా, ఇంకా ఏవో ఫలాల కొరకై అఱ్రులు చాస్తోంది.
- ఎక్కడా ఏ ఒక్కచోట ఎక్కువసేపు నిలకడ కలిగి ఉండదు.

---

క్షణం ఆయాతి పాతాళం ।
క్షణం యాతి నభఃస్థలం ।
క్షణం భ్రమతి దిక్ కుంజే ।
తృష్ణా హృత్ పద్మ షట్పదీ ॥

హృదయములోనే పుట్టుచున్న - ఈ తృష్ణ (ఇంకా ఏదో పొందాలి - అనే తపన) అనే తుమ్మెద - క్షణంలో పాతాళంలో ప్రవేశిస్తోంది.

- మరుక్షణం ఆకాశంలో విహారములు సలుపుతోంది.
- ఇంకొక క్షణంలో దిక్కులలోని పొదలలో పరిభ్రమిస్తూ పోతోంది.

---

సర్వ సంసార దుఃఖానాం
తృష్ణా ఏకా దీర్ఘ దుఃఖదా
అంతఃపురస్థమపి యా యో,
జయతు అతి సంకటే ।

సర్వ సాంసారిక దుఃఖములకు అసలైన కారణము ఎవరయ్యా - అని పరిశీలించి, పరికించి చూచాను. "అది తృష్ణయే" - అని తెలిసిపోతోంది. అది అంతరంగములోనే ఉండి అనేక సంకటములు జనింపజేస్తోంది. ఈ తృష్ణ నాలోనే జనించి, నన్ను జయించి వేస్తోందే! అంతఃపురములో హాయిగా ఉన్నవానిని కూడా వీధిపాలు చేస్తోంది.

---

తృష్ణా విషూచికా మంత్రః
చింతా త్యాగో హి స, ద్విజ !
స్తోకేన ఆనందం ఆయాతి ।
స్తోకేన ఆయాతి ఖేదతామ్ ॥

ఓ ద్విజోత్తమా! ఇంతలోనే ఎంతో సంతోషమును, ఇంతలోనే భయంకర దుఃఖములను, ఖేదములను కలుగజేస్తూపోతున్న ఈ "తృష్ణ" అనే విషూచివ్యాధి (విషజ్వరము)ని శమింపజేయగలిగినది - ఒకే ఒక్క ఔషధము/మంత్రము. అది - <u>చింతనను త్యజించి 'చింతనా త్యాగి' అయి ఉండటమే.</u>

**5.** **నాస్తి దేహసమః శోచ్యో**
**నీచో, గుణవివర్జితః।**
**కళేబరం అహంకార గృహస్థస్య మహాగృహమ్॥**

ఈ భౌతికదేహము ఉన్నది చూచారా? ఇంతటి అతి శోచనీయమైన, నీచమైన, గుణరహితమైన దుఃఖప్రదాత సృష్టి మొత్తంమీద మరొకటి లేదు.

ఈ కళేబరము (శరీరము) అనే ఇంటిలో 'అహంకారము' అనే ఇంటాయన ఎప్పటినుంచో నివాసము కలిగి ఉంటున్నాడు.

---

**ఉలత్వభ్యేతు వా స్థైర్యం**
**కిం అనేన, గురో, మమ?**
**పంక్తి బద్ధ ఇంద్రియ పశుం**
**వల్గతి తృష్ణా గృహ - అంగనామ్।**
**చిత్త భృత్య, జన అకీర్ణం ।**
**న ఇష్టం దేహగృహం మమ ॥**

హే అస్మత్ గురువర్యా! "అహంకారము" అనే దుర్మార్గుడు మనస్సును ఆక్రమించి పెత్తనము చెలాయిస్తూ ఉంటే నాకు భయము వేస్తోంది. ఇంక నాకు స్థైర్యము ఎక్కడిది?

హే భగవాన్! పితృదేవా! ఋభు మహర్షీ! ఈ దేహ గృహము (The House of Physical Body)లో -

- పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు - అనే పశువులు మేపబడుచూ ఉన్నాయి. అవన్నీ కట్టి వేయబడి, **"విషయములు"**- అనే గడ్డి పరకలను తింటూ, నెమరు వేస్తున్నాయి.

- తృష్ణ (ఏదో కావాలి। పొందాలి।) అనే ఆవేశము ఈ దేహ గృహములో సంచరించే గడుసరి ఇల్లాలు.

-'చిత్తవృత్తులు' అనే పనివాళ్ళు అత్యంత ఉద్వేగంగా ఏవేవో పనులు చేస్తూ పరుగులు తీస్తున్నారు.

అటువంటి ఈ దేహగృహము కలిగియున్న నాకు దేహమువలన అన్నీ బాధలేకాని, నాకేమీ లాభం కనిపించటంలేదు. ఇది ఏమాత్రం కూడా నాకు ఇష్టం కలిగించే వస్తువే కాదు.

---

**జిహ్వా మర్కటికా ఆక్రాంత**
**వదనద్వార భీషణమ్।**
**దృష్ట దంత - అస్థి శకలం**
**నేష్టం దేహగృహం మమ ।**

- ఈ దేహమునకు ముఖమే ద్వారము. భయంకరమగు ఆకారముగల 'నోరు' అనే కోతి ఈ ముఖద్వారమును ఆక్రమించుకొని అటూ - ఇటూ సంచారాలు చేస్తోంది. (నోటికొచ్చినట్లు మాట్లాడే స్వభావమే ఆ భీషణమగు కోతి).

- పళ్ళు (Teeth) బొమికల ఇత్యాది సమూహములతో నిర్మించబడిన , బొమికల గూడుగా అయి ఈ దేహము కనిపిస్తోంది. నాకు ఇష్టమైనదేదీ ఈ దేహగృహంలో కనిపించటంలేదు. ఇందులోనివన్నీ త్వరలో కృశించి, నశించబోయేవే మరి!

---

**రక్తమాంస మయస్య అస్య స్వ బాహ్య -**
**అభ్యంతరే, మునే !**
**నాశ ఏక ధర్మిణో । బ్రూహి!**
**కా ఏవ (క్వైవ) కాయస్య రమ్యతా?**

మహాత్మా! ఈ దేహము లోపల - వెలుపల రక్త - మాంస - చర్మమయము. ఏ క్షణంలోనో నశించటమే ధర్మముగా కలిగియున్నది. తండ్రీ! అటువంటి ఈ రక్తమాంసమయ - దేహంలో రమ్యమైనది ఏమున్నది? మరి, ఈ దేహధారులు పరస్పర దేహములలో చూస్తున్న 'రమ్యత' ఏమిటో చెప్పండి?

---

**తటిత్సు, శరదభ్రేషు, గంధర్వ నగరేషు చ,**
**స్థైర్యం యేన వినిర్ణీతం స విశ్వసతు విగ్రహే।**

ఎవ్వడైనా - శరత్కాల మేఘములు చూచి, మేఘములలో మెఱుపులు చూచి, మాయచే కల్పితమైన గంధర్వనగరము చూచి **"ఇవి శాశ్వతంగా ఉంటాయి"** - అని అనుకుంటాడా? **"ఈ శరీరము శాశ్వతము"** అని స్థైర్యము కలిగి ఉండటము అటువంటిది. నేను ఈ శరీరమును విశ్వసించి ఉండటానికి సిద్ధంగా లేను.

---

**శైశవే గురుతో భీతిః।**
**మాతృతః పితృతః తథా,**
**జనతో జ్యేష్ఠ బాలాత్ చ।**
**శైశవం భయమందిరమ్॥**

బాల్యము : బాల్యంలో గురువులంటే భయం. తల్లిదండ్రులంటే భయం. అన్యజనులంటే భయం. పెద్ద పిల్లలంటే భయం. 'బాల్యము' అనేది - అనేక భయములతో నిండి ఉన్న 'గృహము' వంటిది.

**6.** స్వచిత్త బిల సంస్థేన,
నానా విభ్రమకారిణా,
బలాత్ కామ పిశాచేన
వివశః పరిభ్రాయతే॥

ఇక యౌవనము :

జీవుని చిత్తములో అనేక విభ్రమములు (Illusions, Misconceptions, Misinterpretations etc.,) దాగి ఉండగా, ఈతడు బలవంతముగా 'కామము' అనే పిశాచమునకు వశుడై ఎటెటో తిరుగాడుచూ ఉన్నాడు. ఇంద్రియార్థములకు అమ్ముడవుచూ, మోసపోవుచున్నాడు. తన చిత్తముయొక్క ప్రవృత్తులకు, చాంచల్యములకు తానే వశుడైపోతున్నాడు.

---

దాసాః పుత్రాః స్త్రియశ్చ ఏవ,
బాంధవాః సుహృదః తథా,
హసంతి ఉన్మత్తకం ఇవ
నరం వార్ధక కంపితమ్॥
దైన్య దోషమయీ దీర్ఘా
వర్ధతే వార్ధకే స్పృహా ।

వార్ధక్యము : అయిందా? ఆ తరువాత వార్ధక్యము. ముసలి శరీరమును చూచి సేవకులు, సంతానము, స్త్రీలు, బంధువులు, స్నేహితులు (అంతకాలం గౌరవించినవారు అయి ఉండి) - ఇప్పుడు పిచ్చివాడిని చూచినట్లు చూచి నవ్వుకొంటున్నారు. వణికే శరీరం చూచి అందరికి ఎగతాళియే. దిగ తుడుపే.

వార్ధక్యమంతా దైన్యము (దిగులు, పిరికతనముల)తో నిండి ఉన్నదై అనుభవమగుచున్నది. సర్వ ఆపదలకు ముసలితనము సఖివంటిది. హృదయమునకు అనేక దాహములను ప్రసాదించునది.

---

సర్వ ఆపదాం ఏక సఖీ,
హృదిదాహ ప్రదాయినీ ॥

ఎక్కడి నుండి వచ్చి పడిందోగాని 'ఆశ' అనే దుష్ట సఖితో స్నేహం ఏర్పడి, "దృశ్యము నుండి ఏదో కావాలి, పొందాలి" అను రూపముగల అట్టి ఆశచే హృదయములో పేరాశల రూపంగా అనేక **దాహములు, తాపములు** వచ్చి హృదయగృహమును ప్రవేశించి, ఇక ఆక్రమించుకొని ఉంటున్నాయి.

---

క్వచిత్ వా విద్యతే యైషా సంసారే
సుఖ భావనా, ఆయుస్తంబమ్ ఇవ
ఆసాద్య కాలస్తామ్ అపి కృంతతి॥

ఈ సంసారములో ఎక్కడైనా **'ఇది సుఖము కదా!'**- అనిపించినా కూడా, ఎప్పుడో, ఏ క్షణంలోనో యముడు అనే ఆయన వచ్చి గడ్డి పరకలను కోసినట్లు ఆయుర్దాయమును త్రుంచి బుట్టలో వేసుకనిపోతున్నాడు.

---

తృణం పాంసుం మహేంద్రం చ
సువర్ణం మేరుసర్షపమ్, ఆత్మం
భరితయా సర్వం, ఆత్మసాత్ కర్తుం ఉద్యతః।
కాలోఽయం సర్వ సంహారీ।
తేన ఆక్రాంతం జగత్త్రయమ్।

గడ్డిపరక, ఆవగింజ, బంగార ఆభరణాలు, మహేంద్ర మేరు ఇత్యాది పర్వతాలు, పర్వత శిఖరాలు, ఇంకా ఈ జీవునికి ప్రియంగా కనిపిస్తున్న ఆయా వస్తు జాలములు, ఎంతో ప్రియ - ఉత్సాహములతో ప్రారంభించబడి గృహములు మొదలైనవి, గొప్ప ఉద్యమ స్ఫూర్తి విశేషములు - వీటినన్నిటినీ- విశ్వమంతా పొట్టగా కలిగియున్న కాలుడు ఉద్యుక్తుడై వచ్చి సర్వమును సంహరించివేస్తున్నాడు.
ఈ మూడు లోకములలో కనిపించే సమస్త వస్తువులను కాలస్వరూపుడు ఆక్రమించుకొని ఉన్నాడు. ఎప్పుడు దేనిని ఏమి చేస్తాడో - ఏమాత్రం ఎవ్వరికీ ఏమీ తెలియదు.

---

మాంస పాంచాలికాయాస్తు
యంత్రలోలే అంగపంజరే । (యంత్రలోలేంఽగ పంజరే)
స్నాయు అస్థి గ్రంథి శాలిన్యాః,
స్త్రియః కిం ఇవ శోభనమ్?

దేహ రమ్యత్వము : ఈ మూడు లోకములలో కనిపిస్తున్న దేహములన్నీ మాంసము, బొమికలు, నాడులు, కీళ్ళతో నిండిన అస్తిపంజర గూడులవంటివే కదా! బొమికలు, గ్రంథులు మొదలైన వాటిలో కూడిన ఈ స్త్రీ - పురుష శరీరములలో ఈ జీవులు ఏమి రమ్యత దర్శిస్తున్నారో - అది నాకు అర్థమే అవటము లేదు.

---

**7.** త్వక్, మాంస, రక్త, భాష్ప అంబు,
పృథక్ కృత్వా విలోచనే,
సమాలోకయ రమ్యం చేత్
కిం ముథా పరిముహ్యసి?

ఈ జీవులు పరస్పర భౌతిక దేహములను చూచి మురిసిపోతున్నారు. పరవశం పొందుచున్నారు. చర్మము, మాంసము, రక్తము, కంటి భాష్పములు (కళ్ళనీరు) మొదలైన వాటిని వేరువేరుగా చేసి పరిశీలించి చూస్తే ఒక్కొక్క దానిలోగల రమ్యత (Beauty, Attraction) ఏమున్నది? మరి ఈ స్త్రీ - పురుషులు పరస్పర భౌతిక దేహములను చూచి ఎందుకు ఎంతగానో మోహము చెందుచున్నారు? ఓయీ! జీవుడా! అనుక్షణం మార్పుచెందుతూ, క్రమంగా నశించబోయే స్వభావముగల ఈ భౌతిక శరీరభాగములు చూచి ఎందుకు మురిసిపోతున్నావు?

| | |
|---|---|
| మేరుశృంగ తట ఉల్లాసి<br>గంగాజల రయోపమా,<br>దృష్టా యస్మిన్, మునే!<br>ముక్తాహారస్య ఉల్లాస శాలితా,<br>శ్మశానేషు, దిగంతేషు స ఏవ<br>లలానా స్తనః, శ్వభిః ఆస్వాద్యతే కాలే<br>లఘు పిండ ఇవ అంధసః॥ | **(సత్-త్రిగుణోరతాఇతి'స్త్రీ'। సత్‌స్వరూపము త్రిగుణములందు రతిస్తున్నపుడు 'స్త్రీ' శబ్దముతో చెప్పబడుతోంది.)**<br>హేమునీశ్వరా! ఈ స్త్రీల మెడలు - మేరుపర్వతమునుండి క్రిందకు జారువారే గంగా జలపాతములవంటి ముక్తాహారములు స్తనముల క్రింద వరకు జాలువ్రాలుచూ చూపరులకు ఉల్లాసము కలిగించవచ్చుగాక! అట్టి అందంగా ఆకర్షిస్తున్న ఈ స్త్రీ పురుషుల శరీరములు ముందు ముందు ఏమి కాబోవుచున్నాయి? శృంగార పురుషులచే ప్రియముగా లాలించబడే స్తనములు, శరీర విభాగములు- కాలక్రమేణా ఒక సమయంలో శ్మశానములో చేరి, కుక్కలచే, అన్నపు ముద్దలవలె భక్షించబడుచూ కనిపిస్తున్నాయి. |
| కేశ కజ్జల ధారిణ్యో దుస్పర్శా<br>లోచన ప్రియాః, దుష్కృత అగ్నిశిఖా<br>నార్యో దహంతి తృణవత్ నరమ్ ॥ | పొడవైన తలవెంట్రుకల 'జాలువారు'ను, చర్మభాగములను, కనుకొనలను శృంగార భావములతో స్పృశించి మురియటము - ఇదంతా కూడా కామము అనే అగ్ని శిఖలుగా పరిణమిస్తోంది. యౌవనులగు స్త్రీ -పురుషులను-గడ్డిపరకలను కాల్చినట్లు కాల్చటమే అగుచున్నది. |
| జ్వలతామ్ అతిదూరే అపి।<br>సరసా అపి నీరసాః।<br>స్త్రియో హి నరక అగ్నీనాం<br>ఇంధనం చ అతి దారుణమ్॥ | ఈ స్త్రీ- పురుషుల పరస్పర దేహములపట్ల కామ భావనలు ఎటువంటివంటే...<br>అగ్ని దగ్గర ఉంటేనే కాల్చగలదు. కాని కామాగ్నియో! శరీరములు దూరదూరంగా ఉండియే (ఆ ఆశ్రయించిన వారిని) కాల్చుచున్నది.<br>- సరసముల రూపముగా ప్రారంభమై, నీరసములుగా పరిణమిస్తున్నాయి.<br>- ఈ (త్రిగుణ సంబంధరూపములగు) స్త్రీ పురుషుల పరస్పర కామరూపదేహాకర్షణలు 'నరకము' అనే అతిదారుణమైన అగ్నికి ఇంధనములు అగుచున్నాయి. |
| కామ నామ్నా కిరాతేన<br>వికీర్ణా ముగ్ధ చేతసః,<br>నార్యో నర విహంగానాం<br>అంగబంధనవాగురాః। | **'కామము'** అనే కిరాతకుడు ఈ జీవులను బంధించి, బుట్టలో వేసుకోవటానికై "బాహ్య సౌందర్యములు" అనే వలలను పన్నుచున్నాడు. ఈ జీవులు **"నేను జన్మించినది ఎందుకు?"** - అనే విషయమే మరచిపోయి, ఈ దేహాకర్షణల కామరూప వలలో చిక్కుకొనుచున్నారు. |
| **8.** జన్మ పల్వల మత్స్యానాం,<br>చిత్త కర్దమచారిణాం,<br>పుంసాం దుర్వాసనా రజ్జుః<br>నారీ బడిశ పిండికా। | మన్మథుడు అనే మత్స్యకారుడు "జన్మ" అనే కాలువలోగల 'చిత్తము' అనే బురద ప్రాంతంలో దుర్వాసనారూపమగు 'కామము' అనే వలను పన్నుచున్నాడు. **'దేహసౌందర్యములు'** అనే ఎరలను అమర్చి బహుదూరపు బాటసారులవంటి ఈ **'జీవులు'** అనే చేపలను పట్టుకొని **'జన్మ-జన్మాంతరములు'** అనే బుట్టలోకి త్రోయుచున్నాడు. |
| సర్వేషాం దోషరత్నానాం<br>సు సముద్గికయా అనయా,<br>దుఃఖ శృంఖలయా నిత్యం<br>అలం అస్తు మమ స్త్రియా। | "ఈ భౌతికాకర్షణ" అను కామమే, సర్వదోష రత్నములు ఏర్పడినవైయున్న దుష్టరత్నముల పెట్టె. "స్త్రీ-వ్యామోహ-దుఃఖబంధము-నన్ను దోషపూరితునిగా చేయగలుగునదే" - అని నాకు అనిపిస్తోంది. అవన్నీ ఇక చాలు. నాయొక్క శ్రేయస్సు కొరకై కామశృంఖలములను త్రెంచివేసుకోదలుస్తున్నాను. |
| యస్య స్త్రీ, తస్య భోగేచ్ఛా।<br>నిః స్త్రీ కస్య క్వ భోగభూః?<br>స్త్రియం త్యక్త్వా జగత్ త్యక్తం ।<br>జగత్ త్యక్త్వా సుఖీ భవేత్ ॥ | ఎవరు స్త్రీ సహవాసము కలిగి ఉంటారో, వారికి భోగేచ్ఛ కూడా దట్టమై ఉంటుంది. స్త్రీ సంబంధము లేనివానికి ఇక భోగేచ్ఛతో పనేముంటుంది? స్త్రీని త్యజించటము (లేక, స్త్రీ -పురుష భౌతికాకర్షణ త్యజించినవాడు) జగత్తునే త్యజించినట్లు. జగత్తును త్యజించినవాడు సుఖవంతుడు. |

| | |
|---|---|
| దిశో అపి నహి దృశ్యన్తే,<br>దేశో అపి అన్య ఉపదేశకృత్ । (అన్యోపదేశకృత్)<br>శైలా అపి విశీర్యంతే ।<br>శీర్యంతే తారకా అపి ।<br>శుష్యంతి అపి సముద్రాశ్చ ।<br>ధ్రువోఽపి అధ్రువ జీవనః ।<br>సిద్ధా అపి వినశ్యంతి ।<br>జీర్యంతే దానవ ఆదయః ।<br>పరమేష్ఠి అపి నిష్ఠావాన్ ।<br>హీయతే హరిః, అపి అజః ।<br>భవో అపి అభావమ్ ఆయాతి ।<br>జీర్యంతే వై దిక్-ఈశ్వరాః ॥ (దిగీశ్వరాః)। | ఈ దృశ్య జగత్తులో 'శాశ్వతము' అని చెప్పగలిగేది ఏదైనా ఉన్నదా? సమస్తము కాలము చేత జనిస్తున్నది. కాలము చేతనే నశిస్తున్నది. దేనిని ఏ రీతిగా నిత్యము - సత్యము అని నమ్మాలి?<br>- దిక్కులే ఒకానొకప్పుడు దిక్కులేకుండా పోతున్నాయి. అదృశ్యమై కనబడకుండాపోతున్నాయి.<br>- దేశ దేశములే (సింధు నాగరికతవంటివి) గుర్తుపట్టలేకుండా రూపుమాసిపోతున్నాయి.<br>- ఉత్తుంగ పర్వతములు మరొకప్పటికి చూర్ణమై పోతున్నాయి.<br>- ఆకాశంలో ప్రకాశించే నక్షత్రములే శుష్కించి కనుమరుగవుచున్నాయి.<br>- నిండు జలముగల సముద్రములే కాలమహిమచే మరొకప్పుడు ఇంకిపోతున్నాయి.<br>- 'ధృవము' (Wel-fixed) అనుకున్న గొప్పగొప్ప వస్తువులు అధృవమై, వినాశనమగుచున్నాయి.<br>- సిద్ధులంతటివారు వినాశనము పొందుచున్నారు.<br>- దానవులంతటి వారు కొంతకాలానికి దమించిపోతున్నారు.<br>- పరమేష్ఠి కూడా నిష్ఠాబద్ధుడౌతున్నారు.<br>- హరి అంతటివారు ఒకనాటికి హరించుకుపోతున్నారు.<br>- విష్ణువు నిష్ఠను వీడుచున్నారు.<br>- భవుడంతటివాడు అభవుడు, అభావుడు అగుచున్నారు.<br>- దిక్పాలకులు, దిక్-దేవతలు జీర్ణులై అదృశ్యులైపోతున్నారు. |
| **9.** బ్రహ్మా, విష్ణుశ్చ రుద్రశ్చ సర్వావా భూత జాతయః,<br>నాశమ్ ఏవ అనుధావంతి సలిలాని ఇవ బాడబమ్ ॥<br>ఆపదః క్షణం ఆయాంతి । క్షణం ఆయాంతి సంపదః ।<br>క్షణం జన్మ, అథ మరణం। సర్వం నశ్వరం ఏవ తత్॥<br>అశూరేణ హతాః శూరా ।<br>ఏకేన అపి శతం హతమ్ ॥ | బ్రహ్మవిష్ణు మహేశ్వరులంతటివారు కూడా - కాలముచే అరూపులు అగుచున్నారు. సముద్రంలో నుండే బడబాగ్ని జనించి సముద్రజలమునంతా మ్రింగివేస్తోంది. భూతజాలమంతా నాశనమువైపు పరుగులు తీస్తోంది.<br>ఈ విశ్వములో దృశ్యమైనమై కనిపించేదంతా - క్షణభంగురమే. క్షణంలో ఆపదలు. క్షణంలో సంపదలు. క్షణంలో జన్మ. క్షణంలో మరణము. ఇదంతా కూడా నశ్వరము. 'శాశ్వతము' అని చెప్పగలిగేది ఏదీ లేదు.<br>ఇంకా ఎన్నో చిత్ర - విచిత్రములు. బలహీనుడు (అశూరుడు) బలవంతుని సంహరిస్తున్నాడు. ఒక్కడు వందమందిని చంపుచున్నాడు. |
| విషం విషయ వైషమ్యం<br>న విషం విషం ఉచ్యతే॥<br>జన్మాంతరఘ్నా విషయా,<br>ఏతత్ జన్మ హరం విషమ్ ।<br>ఇతి మే దోష దావాగ్ని దగ్ధే సంప్రతి చేతసి ।<br>స్ఫురంతి హీన భోగాశా మృగతృష్ణా సరస్స్వపి । | విషం వాస్తవానికి విషం కాదు. విషయములే విషము. ఎందుకంటే, విషము వల్ల ఒక్క దేహము మాత్రమే నశిస్తుంది. విషయముల వల్లనో - జన్మజన్మాంతర పరంపరలు నాశనము కాగలవు.<br>ఓ పితృదేవా! ఋభుమహర్షీ! అస్మత్ గురుదేవా! అనేక దోషములు అంతరముగా కలిగియున్న నా చిత్తము నందు పుణ్యతీర్థయాత్రల సత్-ఫలితంగా ఇటువంటి భావనాపరంపరలు బయల్వెడలుచూ ఉన్నాయి.<br>మృగతృష్ణా సరస్సులో నీళ్ళు త్రాగి దాహం తీర్చుకోవాలని ఎవ్వరూ అనుకోరు కదా! అట్లాగే నాకు ఇక్కడి భోగములు పొందాలని, ఆస్వాదించాలని ఏమాత్రమూ కూడా అనిపించటము లేదు. |
| అతో మాం బోధయాశు త్వం<br>తత్త్వ జ్ఞానేన, వై గురో। నో చేత్,<br>మౌనం సమాస్థాయ, నిర్మానో,<br>గత మత్సరః। భావయన్<br>మనసా విష్ణుం లిపికర్మా అర్పితా ఉపమః॥<br>(అర్పితోపమః)। | అందుచేత, హే సద్గురూ! మీరు ఇప్పుడు నాపై దయతో తత్త్వబోధ చేయండి.<br>మీరు ఒకవేళ తత్త్వబోధను ప్రసాదించకపోతేనో? ఇక నేను మాన - అవమానములను త్యజించి, మత్సరమును వదలి పరమాత్మయగు విష్ణుభగవానుని మనసా భావన చేస్తూ చిత్రములో లిఖించబడిన చిత్రలేఖనంలాగా నిశ్చలుడనై ఉండిపోదలచుచున్నాను. |

# చతుర్థోఽధ్యాయః - సాధన చతుష్టయం - సమాధినిష్ఠ

**1.** నిదాఘ! తవ నాస్తి అన్యత్ జ్ఞేయం,
జ్ఞానవతాం వర !
ప్రజ్ఞయా త్వం విజానాసి
ఈశ్వర అనుగృహీతయా ॥
చిత్త మాలిన్య సంజాతం
మార్జయామి భ్రమం, మునే!
మోక్ష ద్వారే ద్వార పాలాః చత్వారః
పరికీర్తితాః। శమో విచారః
సంతోషః చతుర్థః సాధుసంగమః॥

**ఋభుమహర్షి:** ఓ నిదాఘా! జ్ఞానులలో ఉత్తముడా! బిడ్డా! నీవు తెలుసుకోవలసినది తెలుసుకొన్నట్లేనయ్యా! క్రొత్తగా తెలుసుకోవలసినది ఏమీ లేదు. ఈశ్వరానుగ్రహంచేత, స్వకీయప్రజ్ఞచేత అంతా చక్కగా గమనించియే ఉన్నావు.

మునీ! నీవు జ్ఞానివే. అయినప్పటికీ కూడా మనస్సుకు అంటిన కించిత్ మాలిన్యమును తొలగించుకోవటానికై కొన్ని విశేషాలు బోధిస్తాను. విను.

మోక్షద్వారపాలకులు

ఈ జీవుడు మానవజన్మ ఎత్తినందుకు ప్రయోజనంగా **"ఆత్మస్వరూపుడను అవటంచేత నాకు బంధమే ఉండజాలదు"** అనే రూపముగల మోక్షము ను సిద్ధించుకోవాలి. అట్టి మోక్ష ద్వారమునకు ద్వారపాలకులు నలుగురు. **(1) శమము (2) విచారణ (3) సంతోషము (4) సాధుసంగము.**

---

ఏకం వా సర్వ యత్నేన
సర్వం ఉత్సృజ్య సంశ్రయేత్ ॥
ఏకస్మిన్ వశగే యాంతి
చత్వారో అపి వశంగతాః ।
శాస్త్రైః సజ్జన సంపర్క పూర్వకైశ్చ తపో దమైః,
ఆదౌ సంసార ముక్త్యర్థం ప్రజ్ఞామేవ అభివర్ధయేత్ ॥

ఈ జీవుడు ఉద్యమించి సర్వప్రయత్నములతో ఒక్క ద్వారపాలకుడినైనా ఆశ్రయించాలయ్యా! ఒక ద్వారపాలకుడు వశమైతే తక్కిన ముగ్గురు తమంతట తామే (మార్గదర్శకులై) వశం కాగలదు.

**మునుముందుగా** శాస్త్ర పరిశీలన, సజ్జనులతో (ఆత్మజ్ఞులతో, తత్త్వజ్ఞులతో) సంపర్కము, తపస్సు, ఇంద్రియ నిగ్రహములను ఆశ్రయించాలి. తద్వారా సంసారమునుండి విముక్తి పొందటానికి అవసరమైన 'ప్రజ్ఞ' (wisdom) అభివర్ధనము కాగలదు.

---

స్వానుభూతేశ్చ (స్వ-అనుభూతేశ్చ) శాస్త్రస్య,
గురోః చైవ, ఏకవాక్యతా
యస్య అభ్యాసేన, తేన
ఆత్మా సతతం చ అవలోక్యతే॥

ఎవ్వరైతే

(1) స్వానుభవము (2) శాస్త్ర వచనములు (3) గురుబోధ - (4) వేదమహావాక్యముల విచారణ - వీటివీటిని సమీకరించుకుంటూ, సమన్వయించుకొంటూ సర్వత్రా సమస్తము ఆత్మగా దర్శించు అభ్యాసులై ఉంటారో:-

- వారికి ఆత్మదర్శనమగుచున్నది. అనగా సమస్తము 'ఆత్మ'గా సందర్శనమవగలదు.

స్వస్వరూపమే ఆత్మగా దర్శనమవగలదు.

---

**2.** సంకల్ప ఆశా అనుసంధాన
వర్జనం చేత్ ప్రతిక్షణమ్,
కరోషి తత్ అచిత్తత్వం
ప్రాప్తఏవాసి పావనమ్ ॥

ఓ నిదాఘ మహాశయా! నీవు కనుక (1) సంకల్పము (Assumption and presumption) (2) ఆశ (Expectation) - ఈ రెండిటి యొక్క అనుసంధానము (Application)ను త్యజించియే ఈ ప్రపంచములో యథావిధిగా కర్మలను నిర్వర్తిస్తూ ఉంటే, అప్పుడిక పవిత్రమగు (లేక) పావనమగు 'అచిత్తత్వము' లేక 'అమనస్కము' తనకు తానై సిద్ధించగలదు.

---

చేతసో యత్ అకర్తృత్వం
తత్ "సమాధానమ్" ఈరితమ్,
తత్ ఏవ "కేవలీ భావం" ।
సా శుభా "నిర్వృతిః" పరా ॥

(ఒకడు నాటకములో నటిస్తూ, తాను పాత్ర నిర్వర్తించే ప్రవర్తనలకు "నేను కర్తను" అను దృష్టి / అభిప్రాయము / భావన కలిగి ఉంటాడా? లేదు కదా! అట్లాగే) ఎవ్వరి బుద్ధి ఇక్కడి సమస్త ప్రవర్తన నిర్వర్తనములకు "అకర్తృత్వము" వహించి ఉంటుందో అదియే 'సమాధాన' లేక 'సమాధి' స్థితి. - అదియే **'కేవలీభావము'** (లేక) కైవల్యము. అదియే శుభప్రదమగు 'నిర్వృతి' లేక 'నిర్వాణము'. అదియే పరాస్థితి కూడా.

---

చేతసా సంపరిత్యజ్య
సర్వ భూతాత్మ భావనామ్,
యథా తిష్ఠసి తిష్ఠత్వం,
మూక - అన్ధ - బధిరా ఉపమః॥ (బధిరోపమః)।

చిత్తము (లేక) బుద్ధితో ("ఈ భౌతికంగా కనిపించే దేహమే ఆత్మ" అను) భూతాత్మభావనను మొదలంట్లా పరిత్యజించి, అప్పుడు శేషించే **'కేవలాత్మభావన'** (లేక) 'సర్వాత్మభావన'యందు సుస్థితుడవై ఉండవయ్యా. ఇక ఈ ప్రపంచక సమస్త భేద విశేషములపట్ల మూగవాని(Dumb) వలె, గ్రుడ్డివానివలె (Blind), చెవిటి (Deaf) వానివలె ఉండుము.

సర్వం ప్రశాంతమ్ అజమ్ ఏకమ్
అనాది మధ్యమా, భాస్వరం స్వదనమాత్రం
అచైత్య చిహ్నమ్ ।
'సర్వం ప్రశాంతం' ఇతి శబ్దమయీ చ దృష్టిః
బోధ అర్థం ఏవ హి ముధైవ తత్ "ఓం" ఇతి ఇదమ్॥
(తదోమితీదమ్)
"సర్వం కించిత్ ఇదం దృశ్యం
దృశ్యతే చిత్ జగత్ గతమ్,
"చిత్ నిష్పదాంశమాత్రత్వం।
న అన్యత్ అస్తి।" ఇతి భావయ ॥

ఓ నిదాఘమునీ! సర్వభేదభావనలను వదలివేసి 'ఆత్మభావన'ను ఆశ్రయించుము. **"తత్ - ఓం - ఇతి - ఇదమ్" అను శబ్దార్థము - పరమ శాంతమగు ఆత్మయే।**

- "ఇదంతా పరమ ప్రశాంతము. జనన - మరణ రహితము, స్వకల్పితము, కదలికలు - మార్పు చేర్పులు లేనిది అగు ఆత్మయే!" అనే భావనను అనుసంధానము చేస్తూ ఉండు.

అటు తరువాత **"ఇదంతా పరమ ప్రశాంతము"** అని ప్రయత్నపూర్వకంగా భావనచేయుటమును కూడా, - వాటి శబ్దమయదృష్టికి సంబంధించిన క్రియాత్మత్వమును కూడా వదలివేయి. అనగా, అట్టి బోధ స్వరూపము స్వాభావికంగా అయిఉండుము. 'అనుకోవటము'ను కూడా దాటివేసి 'అనిపించటము'లో ప్రవేశించుము. 'తదేవాஉహమ్' స్వానుభవుడవగుము.

"ఈ కనిపిస్తున్న సమస్త జగత్తు అంతా - కించిత్ నుండి బృహత్ వరకు - ఇద్దాని ఉత్పత్తి - గతించటముతో సహా - చిత్ నిష్పదాంశమాత్రము. **యథాతథముగా ఆత్మయొక్క అంశయే. ఆత్మకు వేరు లేదు** - అని భావన చేయి.

---

3. నిత్య ప్రబుద్ధ చిత్తః త్వం (చిత్తస్త్వం)
కుర్వన్ వా అపి జగత్ క్రియామ్।
ఆత్మ ఏకత్వం విదిత్వా త్వం
తిష్ఠ అక్షుబ్ధ మహా అబ్ధివత్ ॥

ఈ విధంగా "ఈ సమస్తము మమాత్మయే" - అను భావన సమన్వయములతో నిత్య ప్రబుద్ధుడవై (Ever awakened sence of experiencing everything as All Equal & All present SELF) నిశ్చల చిత్తుడవై ఉండుము. **"ఆత్మ నీకు-నాకు- ఈ జగదృశ్యమునకు అద్వితీయము"** - అని భావించి ఉండు. ఇక కర్మలు నిర్వర్తిస్తూనే (జగత్తులో) ఏమీ చేయనివాడవై ఉండుము. ఆత్మయొక్క ఏకత్వము ఎరిగినవాడవై - సముద్ర తరంగాలు కదులుచున్నా కూడా, సముద్రము కదలనిదే అయినట్లు - నిండు సముద్ర స్వరూపుడవై అఖండాత్మగా ఉండుము.

---

తత్త్వావబోధ ఏవ అసౌ
వాసనా తృణ పావకః -
ప్రోక్తః "సమాధి" శబ్దేన।
న తు తూష్ణీం అవస్థితిః ॥

"సమాధిస్థితి"ని అవధరించుము. సమాధి స్థితి అనగా? ఏదీ ఆలోచించకుండా, అన్నిటినీ త్యక్షీకరించి ఎక్కడో ఒంటరిగా ఉండటము - కానే కాదు. మరి? **"నీవుగా (త్వంగా) కనిపించేదంతా (తత్) అఖండ పరమాత్మస్వరూపమే"** - అను **"తత్త్వబోధ"**చే జనించే 'జ్ఞానాగ్ని'చే 'సమస్త భేదవాసనలు' అనే గడ్డిపరకలను కాల్చివేయటమే 'సమాధి'.

---

నిరిచ్ఛే సంస్థితే రత్నే యథా లోకః
ప్రవర్తతే, సత్తా మాత్రే పరే తత్త్వే
తథైవ అయం జగద్గణః ॥

ఒక జాతిరత్నము ఎటువంటి స్వకీయమైన ఇచ్ఛ (కోరిక) లేకుండానే ప్రకాశమును అన్నివైపులా వెదజల్లుతూ ఉంటుంది కదా! ఆ విధంగానే ఆత్మ కూడా తనయొక్క ఉనికి మాత్రం చేతనే ఈ జగత్ పరంపరలను స్వకీయ ఇచ్ఛ లేకుండానే ప్రదర్శించుచూ ఉన్నది. ఈ జగత్తు బ్రహ్మముయొక్క భావనా రూపమే.

---

ఆతశ్చ ఆత్మని కర్తృత్వం
అకర్తృత్వం చ వై, మునే !
నిరిచ్ఛత్వాత్ అకర్తా, అసౌ,
కర్తా సన్నిధిమాత్రతః ॥

అందుచేత ఓ మునీంద్రా! ఈ సమస్తమునకు కర్త ఆత్మయే. అయినప్పటికీ ఆత్మకు ఏ కర్తృత్వమూ లేదు. ఈ రెండూ నిజమే. ఆత్మకు జగత్తు యొక్క ఇచ్ఛ లేదు. కాబట్టి - 'అకర్త'. ఆత్మయొక్క సన్నిధానము చేతనే జగత్తు ఉనికి పొందుతోంది కనుక - కర్త కూడా.

---

తే ద్వే బ్రహ్మణి విందేతే
కర్తృతా, అకర్తృతే, మునే !
యత్రైవ ఏష చమత్కారః,
తం ఆశ్రితస్య స్థిరో భవ ॥

ఓ మునీ! ఈవిధంగా ఆత్మయొక్క పరస్పర వ్యతిరేకమైన అకర్తృత్వ - సకర్తృత్వ ధర్మములను గమనిస్తూ, అట్టి ఆత్మ (లేక) బ్రహ్మమును సర్వాతీత చమత్కారంగా దర్శిస్తూ, అట్టి బ్రహ్మమునే ఆశ్రయించినవాడవై ఉండుము. ఆత్మవే నీవై ఉండుము. నీవు సర్వదా అఖండమగు ఆత్మయే అయి ఉన్నావు కూడా।

తస్మాత్ నిత్యం "అకర్తా అహం" - ఇతి భావన
యేద్ధయా, పరమ-అమృత నామ్నీసా
"సమత" ఏవ అవశిష్యతే ॥

ఆత్మజ్ఞానిపట్ల "నేను నిత్యము కర్తను, అకర్తను కూడా। (అకర్తృ-కర్తృత్వములు తనవే అయిన) ఆత్మనే ।" - అనుభావన స్వాభావికమై శోభించుచున్నది. "సర్వత్రా సమరసానుభవము" - అను పరమామృత రూపమగు 'సమత'యే శేషించుచున్నది. అట్టి సమదర్శనమే 'సమాధి'.

---

నిదాఘ! శృణు సత్వస్థా జాతా
భువి మహా గుణాః ।
తే నిత్యమ్ ఏవ అభ్యుదితా,
ముదితాః, ఖ ఇవ ఇందవః॥

ఓ నిదాఘా। ఇంకా విను. ఎవ్వరైతే ఈ సమస్త జగత్తును స్వస్వరూప - ఆత్మసత్తామాత్రం గా (లేక) స్వస్వరూపాత్మ గా దర్శిస్తూ, ఆస్వాదిస్తూ ఉంటారో, అట్టివారు ఆకాశంలో ప్రకాశించే పున్నమినాటి చంద్రునివలె ప్రసన్నత - శాంతి - సుఖము సర్వదా సంతరించుకొన్నవారై ఉంటారు.

---

4. న ఆపది గ్లానిమాయాంతి, నిశి – హేమ అంబుజం యథా।
నేహంతే ప్రకృతాత్ అన్యత్, రమంతే శిష్ట వర్త్మని ॥
ఆకృత్యైవ విరాజంతే, మైత్ర్యాది
గుణ వృత్తిభిః। సమాః సమరసాః
సౌమ్యాః, సతతం సాధు వృత్తయః ॥
అబ్ధివత్ ధృత మర్యాదా భవంతి విశదాశయాః ।
నియతిం న విముంచంతి, మహాంతో భాస్కరా ఇవ॥

అట్టి సమరస ఆత్మభావన (లేక) సర్వాత్మక దృష్టిని ఆశ్రయించిన మహానుభావుని విషయంలో, వారు ఎట్లా ఉంటారు? రాత్రి కూడా వికసించియే ఉండే బంగారు కమలము వలె - ఆపదలందు కూడా శిష్టాచారులై, సత్ప్రవర్తనతో, సంతోషముగా ఈ జగత్తునందు విహారములు చేస్తూ, రమిస్తూ ఉంటారు.
వారు అకృత్యులై (కర్మలకు అతీతులై) విరాజిల్లుచూనే, ఎల్లప్పుడు మైత్రి - ఇటువంటి సాధు ప్రవర్తనలు కలిగి ఉంటారు. సమత్వము, సమరసభావన, సౌమ్యము మొదలైన సాధు వృత్తులను ఎల్లప్పుడు కలిగియే ఉంటారు.
నిర్మలాత్ములు అగు మహనీయులు మహదాశయులై ఉంటారు. సముద్రమువలెనే ధృతి - మర్యాదలను అతిక్రమించరు. ఆకాశములో సూర్య భగవానునివలె అంతా తెలిసియే, మర్యాదను అగౌరవించనివారై ఉంటారు.

---

కో అహం? కథం ఇదం చ ఇతి
సంసార మలమ్ ఆతతమ్? - ప్రవిచార్య
ప్రయత్నేన, ప్రాజ్ఞేన సహసా అధునా ॥

ఓ నిదాఘా! "నేను ఎవ్వరు? ఈ సంసార కథన దోషమంతా నాకు ఎట్లా ప్రాప్తిస్తోంది" - అనే విశేషములన్నీ ప్రాజ్ఞులగు సాధువులను సమీపించి వారి సన్నిధిలో చక్కగా విచారణ చేయాలి.

---

న అకర్మసు నియోక్తవ్యం ।
న అనార్యేణ సహా వసేత్ ।
ద్రష్టవ్యః సర్వ సంహర్తా, న మృత్యుః అవ హేళయా ॥

శాస్త్రముల చేత, సాంఘిక శ్రేయోభిలాషులగు పెద్దలచేత "ఇవి చేయకూడనివి" - అని నియమించబడే 'నిషిద్ధకర్మలు' నిర్వర్తించవద్దు. ప్రాపంచక విషయములే మహత్తరమనుకొనే అనార్యులతో స్నేహ-సంభాషణలతో కాలం వెళ్లబుచ్చరాదు. సర్వసంహర్తయగు 'మృత్యువు' గురించి విచారణతో తెలుసుకొని అమృతతుల్యులుకావాలి. అంతేగాని, మృత్యువుగురించి అవహేళన పనికిరాదు.

---

శరీరం అస్థి-మాంసం చ
త్యక్త్వా రక్తాది అశోభనమ్,
భూతముక్తావలీ తంతు,
"చిత్" మాత్రం అవలోకయేత్॥

'భౌమికల-మాంస-చర్మ రక్తములచేత నిర్మితమైన ఈ పంచభూత నిర్మిత భౌతిక శరీరముచేత నేను పరిమితుడను" - అను పరిమిత దృష్టి వీడుము. రక్తము మొదలైన అశోభ వస్తువులతో కూడిన - ఈ శరీరముయొక్క బాహ్యా శోభను చూచి మురిసిపోతూ ఉండవద్దు. దానికి ఆధారమై, "శరీరము కదల్చుటకు కారణమగు (కదలించుచున్న)" చైతన్యతత్త్వమునే అవలోకనము, అధ్యయనము చేయి.

---

5. ఉపాదేయ అనుపతనం
హేయ ఏకాంత విసర్జనమ్।
యత్ ఏతత్-<u>మనసో రూపం</u>
తత్ బాహ్యం విద్ధి। నేతరత్ ॥
(న-ఇతరత్)॥

***మనస్సుయొక్క రూపము ఏమిటి?***

(1) "ఇది నాకు కావాలి" అని కామించటము. (ఉపాదేయము)

(2) ఇది నాకు వద్దు. తొలగాలి (హేయము) అని అంతరమున ఏకాంత విసర్జనము.

ఇవియే మనస్సు యొక్క బాహ్యారూపము. హేయ - ఉపాదేయము (వద్దు-కావాలి)లకు వేరుగా మనస్సు మరింకేదీ కాదు.

గురు శాస్త్ర - ఉక్త (శాస్త్రోక్త) మార్గేణ
స్వ-అనుభూత్యా చ "చిత్‌ఘనే,
-బ్రహ్మ ఏవ అహం" (బ్రహ్మైవాహమ్) ఇతి జ్ఞాత్వా
వీత శోకో భవేత్ మునీ!

ఓ మునీ! నిదాఘ మహాశయా!

(1) గురుబోధ (2) శాస్త్ర ప్రవచనము / పాఠ్యాంశము (3) స్వవిచారణ ఈ మూడూ ఏమి వివరించి చెప్పుచున్నాయో, - శ్రద్ధగా విని, విచారించి "చిద్ఘనము, ఆనందరూపము అగు బ్రహ్మమే నేను సర్వదా అయి ఉన్నాను". - అని తెలుసుకొన్నవాడు రాగ-భయ-క్రోధములనుండి విడివడి ఆత్మసామ్రాజ్యములో ప్రవేశము పొందుచున్నాడు. ఈ విధంగా స్వానుభవము స్వాభావికం చేసుకొన్నవాడే ముని.

---

యత్ర నిశిత అసి - శత పాతనం
ఉత్పల తాడన వత్ సోఢవ్యమ్।
అగ్నినా దాహో హిమసేచనం ఇవ।

ఓ నిదాఘా! జీవన్ముక్తుడు ఈ దృశ్య సంబంధమైన సమస్తమునకు అతీతుడై, బ్రహ్మానందమును బ్రాహ్మీదృష్టిని ఏ పరిస్థితులలోను వీడనివాడై ఉంటున్నాడు.

- పదునైన ఖడ్గముతో ఈ శరీరము ఖండింపబడుచున్నప్పుడు కూడా తనపై కలువపూలు చల్లబడునట్లు భావిస్తూ ఉండగలడు.
- అగ్నిచే దహించబడుచున్నప్పుడు తనపై మంచు బిందువులు జాలువారుచున్నట్లు అనుభూతుడవగలడు.

---

అంగార ఆవర్తనం చందన చర్చేవ।
నిరవధి నారా చ
వికిరపాతో। నిదాఘ ! వినోదన -
ధారా గృహ శీకర వర్షణం ఇవ।
స్వ శిరః ఛేదః సుఖ-నిద్రా ఇవ ।
మూకీకరణ మానన ముద్రేవ।
బధిర్యం మహాన్ ఉపచయ ఇవ।-
ఇదమ్ న అవహేళనయా భవితవ్యం।
ఏవం దృఢవైరాగ్యాత్ బోధో భవతి॥

- నిప్పులలో త్రిప్పబడుచూ ఉండగా చందన శీతలమును అనుభవిస్తూ ప్రశాంతతను ఆశ్రయించి ఉండగలడు.
- బాణవర్షము కురుస్తూ ఉన్నప్పుడు నీటి జల్లులవలె దర్శించగలడు. యంత్రమునుండి మీదపడుచున్న పన్నీటిజల్లువలె భావించగలడు.
- తల తెగుచున్నప్పుడు కూడా సుఖనిద్రకు ఉపక్రమిస్తున్నట్లు ఆస్వాదించగలడు.
- ఎవ్వరైనా వాగ్బంధనము చేస్తూ ఉంటే, అంతరమున మౌనముద్రవలె వహించగలడు.
- ఎవ్వరైనా తన చెవులను మూసివేసి ఉంచటం జరిగినప్పుడు మహామౌనోపాసకుడై ఉండగలడు.

అటువంటి మహోన్నతమగు జీవన్ముక్తుని ఔన్నత్యము తక్కువగా చూడగలిగేది కాదు. అవహేళన చేయరానిది. ఆతడు స్వాభావికంగానే దృఢవైరాగ్యముతో కూడిన బోధస్వరూపుడై ఉంటున్నట్టివాడు. అంతేగాని అందుకొరకై కృత్రిమంగా ప్రయత్నించటంచేత కాదు.

---

గురువాక్య సముద్భూత,
స్వానుభూత్య అతి శుద్ధయా
యస్య అభ్యాసేన తేన 'ఆత్మా' -
సతతం చ అవలోక్యతే ॥

తత్త్వదర్శులగు గురువాక్యములు అయినట్టి **'తత్‌త్వమ్'** వాక్యార్థముయొక్క శ్రవణముచేత జనించే స్వానుభూతిని, 'సోఽహమ్' అనుభూతిని -అభ్యసిస్తూ ఉండగా బుద్ధి శుద్ధము (నిర్మలము), సునిశితము, విస్తారము అగుచున్నది. అట్టి శుద్ధబుద్ధి కలవాడు సర్వత్రా సర్వదా సమస్తమును ఆత్మగాను, స్వస్వరూపమునకు అనన్యముగాను అవలోకనము చేయుచున్నాడు.

---

**6.** వినష్ట దిక్ భ్రమస్య అపి (దిగ్భ్రమస్యాఽపి)
యథా పూర్వం విభాతి దిక్ ।
తథా విజ్ఞాన విధ్వస్తం
"జగత్ నాస్తి" ఇతి భావయ ॥
న ధనాని ఉపకకుర్వంతి । న మిత్రాణి।
న బాంధవాః । న కాయ క్లేశ వైధుర్యం ।
న తీర్థ ఆయతన ఆశ్రయః ॥

దిక్కులన్నీ ఏ కారణంచేతైనా వినష్టము అయినప్పటికీ (Even though all Dimensions Vanished) కూడా, '8' దిక్కులు ఆతని బుద్ధికి తెలియబడుచూనే ఉంటాయి. ఓ నిదాఘా! బ్రహ్మజ్ఞానముచే జగత్తు లేనిదై, బ్రహ్మమే జగత్తుగా ఉన్నదై-ఉన్నట్లు భావనచేయి.

**ఆ "బ్రహ్మమే నేను - నీవు - ఈ సమస్తము కూడా"** - అనబడే "తత్‌పదము" లభించేది ఎట్లా? - అది ధనసంపద - చేతగాని, గొప్ప, గొప్ప స్నేహితులు - బంధువులు కలిగి ఉండటంచేతగాని, శారీరక కష్టములు, తీర్థయాత్రల సేవనము....ఇటువంటి వాటి వలనగాని లభించేదికాదు.

| | |
|---|---|
| ప్రశాంతమైన మనస్సు<br>కేవలం తత్ మనో మాత్ర<br>జయేన ఆసాద్యతే పదమ్ ॥ | కేవల స్వరూపుడగు పరమాత్మతో మనస్సుచే 'తన్మయము' పొందువాడు మనస్సును జయించి తత్ పదమును పొందగలడు. |
| శాంతము - శమము<br>యాని దుఃఖాని, యా తృష్ణా,<br>దుస్సహా యే, దురాధయః,<br>శ్రాంత చేతస్సు తత్ సర్వం<br>'తమో ఆర్కేషు' ఇవ నశ్యతి ॥ | **శాంతము - శమము**<br>సూర్యకిరణములు ప్రసరించినచోట అంధకారము తనకు తానుగా వినాశనము పొందువిధంగా, **"శాంతము" "శమము"** (Withdrawl from worldly scenario) అభ్యాసముగా కలవాడు - సర్వదుఃఖములను, తృష్ణలను, దుష్టచింతనలను (సూర్యుని తీక్షణ కిరణములవలె) ఎండింపజేయగలడు. అవన్నీ-ఎండవలన మురికి గుంటలోని నీరు వలె ఆతనివట్ల హరించివేయబడతాయి. |
| మాతరి ఇవ పరం యాంతి, విషమాణి<br>మృదూని చ , విశ్వాసం ఇహ భూతాని<br>సర్వాణి శమశాలిని ॥ | విషపూరితమైన జంతువులు, సాధు జంతువులు కూడా శాంత మనస్కుని (శమము సిద్ధించుకొని స్వభావి)ని - తల్లివలె విశ్వసిస్తాయి. తల్లి వలె వాత్సల్యము ప్రదర్శిస్తాయి. |
| న రసాయన పానేన, న లక్ష్మ్య<br>ఆలింగితేన చ, స తథా సుఖం<br>ఆప్నోతి - శమేన అంతర్యథా జనః॥ | శమము (మనోలయము / బుద్ధి చాంచల్య ఉపశమనము) వలన లభించే అంతఃసుఖము → రసాయన అమృత పానము చేతగాని, లక్ష్మీ ఆలింగనము చేతగాని లభించునది కాదు. ఆత్మ భావనచే శమము స్వాభావికమవగలదు. |
| శ్రుత్వా, స్పృష్ట్వా చ, భుక్త్వా చ,<br>దృష్ట్వా, జ్ఞాత్వా శుభ - అశుభమ్,<br>న హృష్యతి, గ్లాయతి యః,<br>స "శాంత" ఇతి కథ్యతే ॥ | **"శాంతము" అనగా?**<br>శుభ-అశుభ సంబంధమైన విషయములు వినినా, స్పృశించినా, భుజించినా (అనుభవించవలసి వస్తున్నా), చూస్తూ ఉన్నా, తెలుసుకొంటూ ఉన్నా కూడా, ....ఎవ్వరి హృదయమందైతే కించిత్ కూడా "గ్లాని" (ఆదుర్దా ఆవేదన, భయము మొ॥వి) స్థానము పొందవో, అట్టి స్థితియే "శాంతము". |
| 7. తుషార కర బింబాచ్ఛం<br>మనో యస్య నిరాకులమ్,<br>మరణ, ఉత్సవ, యుద్ధేషు<br>స "శాన్త" ఇతి కథ్యతే ॥<br>తపస్విషు, బహుజ్ఞేషు, యాజకేషు నృపేషు చ,<br>బలవత్సు గుణాఢ్యేషు "శమవాన్" ఏవ రాజతే॥ | ఎవ్వరి హృదయమైతే - మరణ, ఉత్సవ, యుద్ధ సమయములలో కూడా మేఘములు లేని నిర్మలాకాశంలో పున్నమినాటి చంద్రునివలె ప్రశాంతంగా ప్రకాశమానమై ఉంటుందో అట్టి హృదయమే "శాంతము" - అనబడుతోంది.<br>సమస్త దృశ్య విషయములను ఉద్వేగరహితంగా, బ్రాహ్మీభావనతో చూడగలుగు శమవంతుడు సర్వులలో శ్రేష్ఠుడు. గొప్ప తాపసులలో, అనేక విషయములు తెలిసియున్న జ్ఞానులలో, యజ్ఞయాగములు నిర్వర్తించిన యాజకులలో, రాజ్యాలు ఏలే రాజులలో - వారందరికంటే కూడా 'శమము' సిద్ధించుకొన్నవాడే అత్యంత ప్రకాశమానుడై విరాజిల్లగలడు. |
| సంతోషము<br>సంతోష అమృతపానేన యే శాంతాః<br>తృప్తిమ్ ఆగతాః, ఆత్మారామా మహాత్మానః<br>తే 'మహాపదామ్' ఆగతాః॥ | **సంతోషము**<br>ఓ నిదాఘ మునీ! ఎవ్వడైతే "సంతోషము" అనే అమృతమును త్రాగి 'తృప్తి' కలిగి ఉంటాడో అట్టి మహాత్ముడు ఆత్మారాముడై మహాపదము (లేక) ఆత్మపదము సిద్ధించుకోగలడు. |
| అప్రాప్తం హి పరిత్యజ్య, సంప్రాప్తే<br>సమతాం గతః, అదృష్ట ఖేద-అఖేదో<br>(ఖేదాఖేదో) యః, 'సంతుష్ట' ఇతి కథ్యతే॥<br>(ఖేదాఖేదో యః, 'సంతుష్ట' ఇతి కథ్యతే.) | **సంతుష్టి - అనగా ఎవ్వడు?**<br>ఎవ్వరైతే,<br>- ప్రాప్తించనట్టి వాటిని మనస్సుతో పరిత్యజించినవాడై,<br>- ప్రాప్తించియున్న వాటిని ఈశ్వర ప్రసాదితంగా ఆస్వాదిస్తూ,<br>- దృష్టికి ఖేద-అఖేదములు మొదలే ఆతనికి ఉండవో, అట్టివాడే సంతుష్టుడు. |

న అభినందతి అసంప్రాప్తం,
ప్రాప్తం భుంక్తే యథా ఈప్సితమ్,
యః స సౌమ్య సమాచారః
"సంతుష్ట" ఇతి కథ్యతే ॥

ప్రాప్తముకాని వాటిగురించి వాంఛలు కలిగి ఉండక, ప్రాప్తమైన వాటిని ఇష్టముగా పొందుచూ, సౌమ్యమైన- సాత్వికమైన భావన-ప్రవర్తన కలిగి ఉండటమే 'సంతుష్టి'.

---

రమతే ధీః యథా ప్రాప్తే
సాధ్వీ ఇవ అంతఃపురాజిరే,
సా జీవన్ముక్తతా ఉదేతి
స్వరూపానంద దాయినీ ॥

అంతఃపురంలో ఉండే కులస్త్రీ (సాధ్వి) ఏవిధంగా సంతోషముగా మహారాజ్ఞిగా అంతఃపురంలోను, రాజ ఉద్యానవనములోను విహరిస్తూ ఉంటుందో, ఆ విధంగా ఉత్తమబుద్ధి గల ధీమంతుడు జీవన్ముక్తత్వము పుణికిపుచ్చుకొని ఈ జగత్తునందు స్వస్వరూపానందదాయకముగా విహారము చేస్తూ ఉంటాడు.

---

**సత్సంగము**

8. యథా క్షణం, యథా శాస్త్రం,
యథా దేశం, యథా సుఖమ్,
యథా సంభవ 'సత్ సంగం'
ఇమం మోక్షపథక్రమమ్, -
తావత్ విచారయేత్ ప్రాజ్ఞో
యావత్ విశ్రాంతిం ఆత్మని ।

**మోక్షపథము - సత్సంగము**

ప్రాజ్ఞుడైనవాడు - దేశ-కాల-శాస్త్రములకు సానుకూల్యమై లభిస్తున్న ప్రాజ్ఞులతో సంగము వదలక ఉంటాడు.

శాస్త్రములు చెప్పే విశేషములను, విధివిధానములను గౌరవిస్తూ ఉంటాడు. అసత్‌ను అధిగమించి 'సత్'ను ఆశ్రయిస్తూ ఉంటాడు.

"జీవాత్మగా కనిపిస్తున్న నేను పరమాత్మగా (సహజంగానే) బంధ రహితుడను"-అనే రూపమగు మోక్షమార్గమునకు **సంశయ నివృత్తికై** తత్త్వజ్ఞులతో సంభాషణమును ఆశ్రయిస్తాడు.

త్రికాలములలో పరమసత్యమైయున్న ఆత్మతత్త్వము గురించిన విచారణ కొరకై-"సత్-సంగము" సహాయముతో ఆత్మయందు విశ్రాంతిపొందుతాడు.

---

**తుర్య విశ్రాంతి॥**

తుర్య విశ్రాంతి యుక్తస్య
నివృత్తస్య భవార్ణవాత్ ।

తుర్యక్ విశ్రాంతి

అట్టి జాగ్రత్ -స్వప్న-సుషుప్తి సాక్షీరూపమగు తుర్యక్ విశ్రాంతియే 'భవము' అను సాగరము నుండి నివృత్తి (లేక) విడుదల.

---

జీవతో, అజీవతశ్చైవ,
గృహస్థస్య, అథవా యతేః,
న అకృతేన, కృతేన అర్థో
న శ్రుతి స్మృతి విభ్రమైః॥

ఒకడు జీవించుచూ ఉన్నవాడైనా, జీవితాంతము (ఆ తరువాత) అయినా, (లేక) గృహస్థుడు అయినా, యతి అయినా, కృతార్థుడు అయినా - కాకపోయినా కూడా శ్రుతి (వేద) - స్మృతులు (పురాణములు) తెలియకపోయినా కూడా **- తుర్యక్ స్వరూప విశ్రాంతుడు కృతకృత్యుడే!**

అట్టివాడు కర్మలు చేయుటచే అర్ధమునుగాని, చేయకుండుటచే అనర్థముగాని పొందడు. శ్రుతి, స్మృతి విభ్రమములతో కూడా పని ఉండదు.

---

నిర్మంథన ఇవ అంభోధిః
స తిష్ఠతి యథా స్థితః
సర్వాత్మ వేదనం శుద్ధం
యదా ఉదేతి తత్ ఆత్మకమ్॥

తరంగరహిత సముద్రజలమువలె అట్టి తురీయ భావ విశ్రాంతుడు పరమ ప్రశాంత స్థితిని ఆస్వాదిస్తూ ఉంటాడు.

(1) తెలుసుకొనుచున్నవాడు (2) తెలియబడుచున్నది కూడా, (జలంలో నుండి జలమునకు వేరు కానట్టి తరంగము బయల్వెడలుచున్నట్లు)- ఆత్మనుండియే, ఆత్మకు 'వేరు' కాకయే బయల్వెడలుచున్నాయి.ఆత్మ సర్వదా శుద్ధము. అట్లాగే సమస్తము తత్ - ఆత్మకమే కాబట్టి సర్వదా శుద్ధమే.

---

భాతి ప్రసృతి దిక్-కాల
బాహ్యం చిత్‌రూప దేహకమ్,
ఏవం ఆత్మా యథా యత్ర
సముల్లాసం ఉపాగతః,
తిష్ఠతి-ఆశు (తిష్ఠత్యాశు), తథా తత్ర
తత్ రూపశ్చ విరాజతే॥

ఆత్మ సర్వదా నిశ్చలమే. అయితే ఆత్మ తనయొక్క భావనచే - స్వప్న దృశ్యకల్పనవలె - భావనారూపముగా భావనాత్మకమై దిక్ - కాలములతో కూడి కనబడుతోంది. ఆత్మయొక్క భావనా ఉల్లాసమే జగత్ దృశ్యము. ఆత్మ దేనిని ఎట్లా భావన చేస్తూ ఉంటే, అది అట్లాగే (దృశ్యము, బంధము, మోక్షము, జీవాత్మ, ఈశ్వరుడు మొదలైన) ఆయా సమస్తముగా భాసిస్తోంది.

**యత్ ఇదం దృశ్యతే సర్వం**
**జగత్ స్థావర జంగమమ్,**
**తత్ 'సుషుప్తౌ' ఇవ స్వప్నః**
**కల్పాంతే ప్రవినశ్యతి॥**

నిద్రపోతున్నవానికి వచ్చిన ఆయా అనేక భేదములతో కూడిన స్వప్నములోని దృశ్యమంతా ఏమౌతోంది? ఎటుపోతోంది? కల తనదైనవాడిలో (మెలుకువ రాగానే) లయించిపోతోంది కదా! అట్లాగే ఇక్కడి స్థావర-జంగమాత్మక మగు జగత్తంతా కూడా ఆత్మయొక్క 'కల్పన'చే రూపము పొంది, కల్పనచే కొనసాగుతూ, కల్పన ముగియగానే ప్రవినాశనము 'ప్రళయము' పొందుతోంది.

---

**<u>"ఋతం, ఆత్మా పరంబ్రహ్మ సత్యం"</u>**
**ఇతి ఆదికా బుధైః**
**కల్పితా వ్యవహారార్థం**
**యస్య, సంజ్ఞా "మహాత్మనః"।**

ఈ జగత్తుయొక్క - నీయొక్క - నాయొక్క కేవల స్వరూపము (The Absolute one's own self) గురించి గుర్తు చేయుటకొరకై, **<u>"ఋతము, ఆత్మ, పరబ్రహ్మము, సత్యము"</u>**....మొదలైన పదజాలమంతా మహాత్ములు సంజ్ఞాపూర్వకంగా (ఆత్మగురించి బోధించుటకై) కల్పిస్తున్నారు. వాస్తవానికి ఆత్మ స్వానుభవమేగాని భాషాయుతంగా అందించగలిగేది కాదు.

---

**9. యథా కటక శబ్దార్థః పృథక్**
**భావో న కాంచనాత్, న హేమ కటకాత్,**
**తద్వత్ జగత్ శబ్ద – అర్థతా పరా ॥**
**తేనేయం (తేన ఇయం) ఇంద్రజాల**
**శ్రీః జగతి ప్రవితన్యతే। (ప్రవితస్యతే)।**

"బంగారు కంకణము" అని చెప్పునప్పుడు "ఇది బంగారము - ఇది కంకణము" అని విడదీసి చూపగలమా? కంకణము బంగారమునకు వేరై ఉన్నదా? లేదు. వాస్తవానికి బంగారమే ఉన్నదిగాని కంకణము బంగారమునకు వేరై లేదు. (Ornament is not seperable from Gold). అట్లాగే **ఆత్మయే (కంకణమువలె) జగత్‌రూప శబ్ద - అర్థములుగా ఉన్నది.** ఆత్మకు వేరుగా జగత్తు లేదు. అయినా కూడా ఆత్మయందు ఆత్మచే ఈ ఇంద్రజాల (ఇంద్రియ విషయకల్పిత) జగత్తు విస్తారమై ప్రదర్శనమౌతోంది.

---

**ద్రష్టుః దృశ్యస్య సత్తా '<u>అంతర్బంధ</u>' –**
**ఇతి అభిధీయతే ।**
**దృష్టా దృశ్య వశాత్ బద్ధో ।**
**దృశ్య అభావే విముచ్యతే॥**

'ఆత్మస్వరూపుడే' అయి ఉన్న ద్రష్ట తన భావనయందు దృశ్యము కలిగి ఉండుటచే....అదియే **'అంతర్-బంధము'** - అని బంధము గురించి చెప్పబడుచున్నది.
- 'దృశ్యము' యొక్క దృష్టి, భావనలచేత ద్రష్ట బద్ధుడగుచున్నాడు.
- ద్రష్ట దృశ్యమును అభావించినప్పుడో? ద్రష్ట బంధవిముక్తుడు అగుచున్నాడు. కాబట్టి బంధ-విముక్తులు భావనామాత్రమే।

---

**'జగత్ – త్వం – అహం'**
**ఇత్యాది సర్గాత్మా దృశ్యం ఉచ్యతే॥**

- ఆత్మకు అన్యముగా జగత్తు - త్వమ్ - అహమ్ - ఇవేవీ లేవు. సమస్తము ఆత్మ స్వరూపమే. ఆత్మ సర్వదా అనన్యము. తనను గురించి తానే కల్పించుకొంటూ, ఇంతలోనే కల్పనను విరమిస్తూ వినోదిస్తోంది.
- ఆత్మ - "జగత్తు-త్వమ్-అహమ్" లను కల్పన చేసుకొని - తనకు అన్యముగా భావించి అనుభవముగా పొందుచున్నట్టిదే **'దృశ్యము'.**

---

**మనసైవ ఇంద్రజాల శ్రీః, జగతీ ప్రవితన్యతే ।**
**యావత్ ఏతత్ సంభవతి, తావత్ మోక్షో న విద్యతే।**
**బ్రహ్మణాత్ అన్యతే విశ్వం మనసైవ స్వయంభువా।**
**మనోమయం అతో విశ్వం యత్ నామ పరిదృశ్యతే ॥**

ఆత్మయొక్క భావనారూపమగు మనస్సే ఈ **'దృశ్యజగత్తు'** - అను ఇంద్రజాల సంపదగా విస్తరించుచున్నది. ఇంద్రజాలములో కనబడే సంపద ఎటువంటిదో, మనస్సు పొందుచున్నవన్నీ అటువంటివి.

మనస్సుయొక్క కల్పన ఎన్నాళ్ళు ఆత్మకు అన్యముగా భావించబడి, అట్టి అన్య కల్పన ఉండి ఉంటుందో, అంత కాలము 'మోక్షము' అనునది సిద్ధించదు. అనగా దృశ్యము బంధముగా అనుభవమగుచూనే ఉంటుంది.

"స్వయంభువు" యొక్క కల్పనయే (లేక) సంకల్పమే మనస్సు. సంకల్పమే విశ్వరూపమై అగుపిస్తోంది. ఈ కనబడేదంతా మనోకల్పనయే.

---

**న బాహ్యే, న అపి హృదయే సత్‌రూపం**
**విద్యతే మనః, యత్ అర్థ ప్రతిభానం**
**తత్ 'మన' – ఇతి అభిధీయతే।**
**<u>సంకల్పనం మనో విద్ధి ।</u>**
**సంకల్పః తత్ర విద్యతే॥**

మనస్సుయొక్క రూపమేమిటి? బయట - లోపల ఏ విశ్వము అనుభూతమగుచున్నదో అదియే 'మనస్సు'. అంతేగాని మనస్సు విశ్వమునకు లోపలలేదు, విశ్వమునకు బయటలేదు. భావనకు వేరైన స్వకీయమైన 'ఉనికి' ఏదీ మనస్సుకు లేదు.

విషయ సంకల్పమే మనస్సుయొక్క రూపము. దేనికి ఏ అర్థము ప్రతిపాదించబడి అనుభూతమగుచున్నదో, అట్టి అర్థప్రతిపాదనయే మనస్సుయొక్క రూపము. 'సంకల్పనమే మనస్సు' అని గమనించు. సంకల్పమునకు వేరుగా మనస్సు లేదు. సంకల్పించటమే మనస్సుగా చెప్పబడుతోంది.

"యత్ర సఙ్కల్పనం, తత్ర మనో అస్తి"
ఇతి అవగమ్యతామ్ ।
<u>సంకల్ప మనసీ భిన్నే న కదాచన కేనచిత్</u>।
సంకల్పజాతే గళితే
**"సరూపం" అవశిష్యతే**॥

✠ ఎక్కడ సంకల్పము ఉంటే అక్కడ మనస్సు ఉంటుంది. అంతేగాని సంకల్పము ఒకచోట ఉండగా, మనస్సు మరింకెక్కడో లేదు. సంకల్పము లేనిచోట 'మనస్సు' ఉండదు. మనస్సు లేనిచోట 'సంకల్పము' - ఉండజాలదు.

✠ మనస్సుకు వేరుగా సంకల్పము లేదు.

✠ సంకల్పమునకు వేరుగా మనస్సు లేదు. అవి రెండూ భిన్నము కానేకాదు. పరస్పరము అభిన్నము.

'సంకల్పము' నశించినప్పుడు, అప్పుడిక స్వస్వరూపమగు ఆత్మయే శేషించినదగుచున్నది. **"సంకల్పించువాడు"** ఆత్మస్వరూపుడై సంకల్పము లేనప్పుడు కూడా **శేషించువాడై ఉంటాడు.** కనబడే సమస్తము ఆత్మగా దర్శిస్తూ ఉన్నప్పుడు అది మనోనాశనమే।

---

**10.** <u>అహం త్వం జగత్</u> – ఇతి ఆదౌ (ఇత్యాదౌ)
ప్రశాంతే దృశ్య సంభ్రమే –
సత్తా దృశీ కేవలతా దృశ్యే సత్తాం ఉపాగతే ॥
మహా ప్రళయ సంపత్తౌ హి
అసత్తాం సముపాగతే । అశేష దృశ్యే సర్గాదౌ
'శాంతమ్' ఏవ అవశిష్యతే॥

'అహమ్ (నేను) - త్వమ్ (నీవు) - జగత్తు' - ఈ మూడు నీ దృష్టిలో ఆత్మయందు, శమించిందా - దృశ్యమంతా శమిస్తుంది. దృశ్యము శమించగా శేషించేదే "కేవలము" (The Absolute). అట్టి <u>"కేవలమే నేను"</u> అను స్థితియే కైవల్యము.

"మహాప్రళయము"తో సహా దృశ్యమంతా కూడా 'అసత్త' స్వరూపముగా అగుచున్నది. కేవలాత్మ స్థానముయొక్క స్వానుభవముచే ఆత్మకు అన్యమైనదంతా "మొదలేలేనిది"....అను అసత్-తత్త్వము సంతరించు కుంటోంది. సత్తా సామాన్యము మాత్రమే శేషించినదగుచున్నది. సర్గము (కల్పన)చే ఏర్పడి అనుభవమగుచున్న దృశ్యమంతా నిశ్శేషంగా ఆత్మకు అనన్యమై, ఇకప్పుడు 'పరమశాంతము' సర్వత్రా స్వానుభవమగుచున్నది. అట్టి సశాంత స్వరూపమే ఈ జీవుని నిత్యసహజత్వము. (అదియే సోఽహమ్-తత్త్వమ్ పరమార్థము) - నిజము.

---

అస్తి – అనస్తిం ఇతో భాస్వాన్
అజో దేవో నిరామయః।
సర్వదా సర్వకృత్ సర్వః
"పరమాత్మ" ఇతి ఉదాహృతః॥

అట్టి స్వస్వరూప ఆత్మ భగవానుడు జన్మరహితుడు. దివ్యస్వరూపుడు నిరామయుడు (నిరామయుడు). ఆయనయే (అద్దములో దృశ్యము ఉండీ లేనట్టి తీరుగా) 'అస్తి-నాస్తి' రూపుడై భాసిస్తున్నారు. అట్టి ఏ తత్త్వమైతే సర్వదా సర్వము నిర్వర్తిస్తూ, సమస్తము అయి ఉన్నదో - ఆయనయే 'పరమాత్మ'. (పరమ్ = ఆవల దేనికి ఆవల? ఈ జగన్నాటకము, ఇందలి నాయొక్క 'పాత్ర' (Role)కు ఆవలగల స్వస్వరూపము కాబట్టి "పరమ్" అనబడుతోంది).

---

యతో వాచో వివర్తంతే, యో
ముక్తైః అవగమ్యతే, యస్య చ
ఆత్మాదికాః సంజ్ఞాః
కల్పితా । న స్వభావతః ॥

→ *(జలం నుండి తరంగం లాగా)*
ఎక్కడి నుండి వాక్కు జనించి తిరిగి ఉపశమిస్తోందో (That into which the speaking in getting withdrawn)
→ దేనిని సమస్త దృశ్యము నుండి ముక్తి పొందిన ముక్త పురుషులు సందర్శిస్తూ ఆస్వాదిస్తునారో..
అద్దానికి <u>"ఆత్మ"</u> అనే పేరు 'సంజ్ఞ'గా కల్పించబడింది. అంతేగాని 'ఆత్మ' అనగా ఒక పదార్థమో, ప్రదేశమో, స్థానమో కాదు. జగత్ విషయాలవలె స్వభావమువంటిది కాదు.

---

<u>చిత్త ఆకాశం, చిత్ ఆకాశం,</u>
<u>మహాకాశం</u> చ తృతీయకమ్ ।
ద్వాభ్యాం శూన్యతరం విద్ధి
చిత్ ఆకాశం। మహామునే!

అట్టి సంజ్ఞావివరణలలోని మరికొన్ని విశేషాలు చెప్పుకుందాము. ఈ భౌతికాకాశమును ప్రక్కగా పెడితే (1) చిత్తాకాశము, (2) చిదాకాశము, (3) మహాకాశము (ఆత్మాకాశము)

ఓ మహామునీ! భూతాకాశము కంటే చిత్తాకాశము వస్తురహితమైనది. చిత్తాకాశము కంటే (విషయ రాహిత్యం దృష్ట్యా) చిదాకాశము శూన్యతరము (శూన్యము=విషయరహితము) Superlativeely Blank . చిదాకాశము కంటే మహాకాశము శూన్యతమము.

| | |
|---|---|
| **దేశాత్ దేశాంతర ప్రాప్తౌ**<br>**సంవిదో మధ్యమేవ యత్,**<br>**నిమేషేణ చిత్ ఆకాశం -**<br>**తత్ విద్ధి, మునిపుంగవ!** | ఓ మునిపుంగవా! నిదాఘ మహాశయా! చిదాకాశము (**చిత్-ఆకాశము**) అనగా? దానిని ఎక్కడ గమనించాలి? విను. అది భూత-చిత్తాకాశములకంటే అత్యంత సూక్ష్మతరమైనది.<br>ఒకడు ఒక విషయమును వదలి మరొక విషయమును యోచన చేస్తూ ఉండగా,<br>**ఇతఃపూర్వపు విషయము** → **నిర్విషయస్థానము** → **తదనంతర విషయము**<br>విషయము - విషయము మధ్యగా ఏ **"అవిషయ కేవల సత్తారూపము"** (one's own presence of Absolute self) స్వస్వరూపముగా ప్రదర్శనమై, ప్రకాశమానమై ఉన్నదో....అదియే **"చిదాకాశము"**. (అదియే మనందరి 'సహజరూపము' ఇక, తదితరమైనదంతా సందర్భమాత్రము). |
| **11.** **తస్మిన్ నిరస్త నిశ్శేష**<br>**సంకల్ప స్థితమ్ ఏషి చేత్,**<br>**సర్వాత్మకం పదం శాంతం**<br>**తదా ప్రాప్నోషి అసంశయః ॥** | అటువంటి విషయ-విషయముల మధ్యగాగల వస్తురహిత-నిశ్శేష స్థానమును **'సంకల్పము'** అనే ఉపకరణము సహాయముతో ఆశ్రయించి, అద్దానియందు **బుద్ధిపూర్వకంగా** స్థితి పొందుచుండగా, పరమశాంతమగు **"సర్వాత్మక పదము"** తప్పక ప్రాప్తించగలదు. **నాస్తి అత్ర సంశయః॥**<br>నేను ఒక వ్యక్తిని = జీవాత్మభావన, "అందరిలోని నేనైన నేనే - నేను" = సర్వాత్మక పదము |
| <u>**సమాధి**</u> | **సమాధి** |
| **ఉదిత ఔదార్య సౌందర్య వైరాగ్య**<br>**రసగర్భిణీ, ఆనంద స్యందినీ యైషా (యఏషా)**<br>**"సమాధిః" అభిధీయతే ।**<br>**<u>"దృశ్య - అసంభవ"</u> భోధేన,**<br>**రాగద్వేషాదితానవే,**<br>**రతిః బలోవిదితాయా అసౌ, 'సమాధిః' అభిధీయతే ।** | **"ఔదార్యము-సౌందర్యము-వైరాగ్యము"**-ఈ మూడు రసములు అనుక్షణము గర్భము నందు కలిగి ఉన్నట్టిది, - అవ్యాజము,-స్వాభావికము అగు "పరమానంద రూప యోగస్థితి"యే **'సమాధి'.**<br>"దృశ్యము స్వతఃగా అసంభవము అని భావించటముచే ప్రాప్తించునది" - అగు అవగాహన చే (By virtue of logic based common sense of understanding) రాగద్వేష రహితంగా దృశ్యమునందు బుద్ధిబలంతో లీలగా, క్రీడగా, వినోదముగా సంచారము కలిగియుండినప్పటి బలోపేత స్థితియే **సమాధి.** |
| **దృశ్య అసంభవ బోధేన**<br>**జ్ఞానం జ్ఞేయం "చిత్-ఆత్మకమ్"**<br>**తత్ ఏవ కేవలీభావం, తతో**<br>**అన్యత్ సకలం మృషా ॥** | **"దృశ్యము మొదలే (ఎండమావులలో జలములాగా, కుందేటి కొమ్ములాగా) అసంభవము"** - అను జ్ఞానము (knowledge) జ్ఞేయము(practice)తో కూడిన **చిదాత్మతో మమేకత్వము, చిదాత్మతో కేవలీభావము, అన్యమైనదంతా భ్రమాత్మకము** - అనుధారణయే **సమాధి.** అదియే 'కేవలీభావము' లేక 'కైవల్య స్థితి'. |
| **"మత్త ఐరావతో బద్ధః సర్ష పీకోణ కోటరే"**<br>**"మశకేన కృతం యుద్ధం సింహౌఘైః అణుకోటరే।"**<br>**"పద్మాక్షే స్థాపితో మేరుః నిగీర్ణో భృంగ సానునా।"**<br>**నిదాఘ! విద్ధి తాదృక్త్వం జగత్**<br>**ఏతత్ భ్రమాత్మకమ్।** | ❖ ఒక మదపు టేనుగు ఆవగింజయొక్క పొట్టభాగంలో బంధించబడింది. ఇరుక్కున్నది! ❖ ఒక చిన్న వృక్షపు తొర్రలో ప్రవేశించిన సింహముతో ఒక దోమ యుద్ధం చేసి గెలిచింది! చెట్టు తొర్రలోని చిన్నచోటులో కూర్చుని దోమ - అటుగా వచ్చిన సింహమును మ్రింగింది కూడా। ❖ ఒక తామర పూస (పద్మాక్షము)లో మేరుపర్వతము ఇరుక్కొని ఉండగా, ఒక తుమ్మెద ఎటునుంచో వచ్చి ఆ తామరపూసను కాస్తా ఆకలికి ఆహారంగా మ్రింగివేసింది కూడా!<br>ఇవన్నీ అసంభవము, భ్రమ కల్పిత వాక్యములు కదా! అట్లాగే ఓ నిదాఘ మహాశయా! పంచేంద్రియములకు ఘనీభూతమై అనుభవమగుచున్న ఈ 'దృశ్య జగత్తు నిజంగానే ఉన్నది' - అనటము అటువంటిది. |
| **చిత్తమేవ హి సంసారో రాగాది క్లేశ దూషితమ్,**<br>**తత్ ఏవ తైః వినిర్ముక్తం <u>"భవాంత"</u> ఇతికథ్యతే॥** | రాగము, ద్వేషములతో కూడియున్న స్వకీయచిత్తమే - సంసారము. రాగద్వేషములు తొలగినాయా, - అప్పుడు ఆ స్థితియే **'సంసారమునుండి విముక్తి. మోక్షము'** అనబడుతోంది. "నా దృష్టిలో - ఈ దృశ్యము కలలో వలె కల్పన మాత్రమే। నిజమే కాదు।" అను స్థితి సిద్ధించటమే **"భవాంతము"** (లేక) **"భ(భా)వ బంధరాహిత్యము"** (లేక) **'భవరోగ నివారణము"**. |

| | |
|---|---|
| **12.** **మనసా భావ్యమానో హి దేహతాం యాతి దేహకః। దేహ వాసనయా ముక్తో దేహ ధర్మైః న లిప్యతే। కల్పం క్షణీ కరోతి అంతః క్షణం నయతి కల్పతామ్। "మనోవిలాసః సంసార" ఇతి మే నిశ్చితా మతిః।** | మననరూపమగు మనస్సుచే నిర్వర్తించుచున్న "భావనాపరంపరలు" - వలననే ఈ దేహి (లేక జీవుడు) దేహవాసనలు పొందుచూ, వాటిచే, "నేను దేహమాత్రుడను" అని అనుకుంటూ, అనుకుంటూ "నిబద్ధుడు" - అగుచున్నాడు.<br>దేహమునకు సంబంధించిన వాసనలను జయించి, వాటినుండి "విముక్తుడు (Relieved)" అగుచుండగా. ఇక ఈ జీవుడు దేహధర్మముల దోషము ఏమాత్రము పొందదు.<br>ఓ నిదాఘా! ఈ మనస్సుయొక్క విలాసము ఎంతటి అమోఘమైనదంటే, - ఇది తలచుకొంటే 'కల్పము' కాలమును 'క్షణ'మాత్రంగాను, 'క్షణ'కాలమును 'కల్పము' అంతటిదిగాను చేసి వేయగలదు.<br>ఈ 'సంసారము' అనబడునది మనస్సుయొక్క విలాసము మాత్రమే - అని నా నిశ్చితాభిప్రాయము. |
| **న అవిరతో దుశ్చరితాన్, న అశాంతో, న అసమాహితః, న అశాంత మనసోవాఽపి (ప్రజ్ఞానేనైవ ఏనం) న ఆప్నుయాత్॥** | అట్టి సంసారదోషము (దృశ్యముతో ఏర్పడుచున్న కల్పితసంబంధము) - తొలిగేది ఎట్లా? మనస్సుకు (లేక) ఆలోచనకు జననస్థానమైన ఆత్మయొక్క జ్ఞానముచే తనే తొలగిపోగలదు. అయితే ఆత్మగురించిన నిశ్చితమైన అవగాహన లభించేది ఎట్లా? ప్రజ్ఞ (Intelectual) చేతనే. కానీ<br>- ఎవ్వడు దుష్ట అభ్యాసముల నుండి వెనుకకు మరలడో,<br>- అశాంతితో కూడిన మనస్సు కలిగి ఉంటాడో,<br>- సర్వసమత్వభావనను ఆశ్రయించడో,<br>అట్టివాడు, - ప్రజ్ఞావంతుడై ఉండి కూడా,-ఆత్మతత్త్వ భావన సిద్ధించుకోలేడు. |
| **తత్ బ్రహ్మానందం, అద్వంద్వం, నిర్గుణం, సత్య - చిత్ ఘనమ్, <u>విదిత్వా - స్వ ఆత్మనో రూపం -</u> న బిభేతి కదాచన॥** | ఎవ్వడైతే స్వస్వరూపాత్మ (తన ఆత్మ)యే బ్రహ్మానందరూపమని, అద్దానికి ద్వితీయమై 'నీవు -జగత్తు' వేరుగా లేవని (ఆత్మ సర్వదా అనన్యమని, కేవల ఎరుకయగు చిద్ఘన రూపమని) తెలుసుకుంటాడో, అట్టివాడు ఇక దేనికీ భయము పొందడు. |
| **పరాత్ పరం యత్ - మహతో మహాంతం, స్వరూప తేజోమయ- శాశ్వతం శివమ్। కవిం। పురాణం। పురుషం। సనాతనం। సర్వేశ్వరం। సర్వదేవైః ఉపాస్యమ్। "అహం బ్రహ్మ" ఇతి నియతం <u>మోక్ష హేతుః</u> మహాత్మనామ్॥** | <u>**బంధ-మోక్షములు**</u><br>**"నేనే బ్రహ్మమును"** అను ఎరుకచే ఈ జీవుడు **"మహాత్ముడు"** అగుచున్నాడు.<br>ఏదైతే పరమునకే పరమో, పరాత్‌పరమో, (నాటకములోని పాత్రలన్నిటికీ కారణము రచయిత అయి ఉన్నతీరుగా) మహత్ స్వరూపమో, తేజోమయ స్వరూపమో, త్రికాలములచే మార్పు చెందక - శాశ్వతమో, సమస్తము కంటే మహనీయమో, కవి (శ్రేష్ఠము) అయిఉన్నదో, సమస్తమునకు మునుముందే ఉండిన **పురుషకారమో (పురాణపురుషమో)**, స్వతేజస్సుచే స్వయముగా ప్రకాశమానమో, జన్మకర్మలకు మును ముందుగా ఉండి ఉండటంచేత సనాతనమో, సర్వదేవతలకు ఉపాస్యమో, <u>అట్టి ఆత్మయే నేను. నా వాస్తవ రూపము ఆత్మయే</u>" - అను విజ్ఞానము మోక్షమునకు కారణము కాగలదు. |
| **13.** **ద్వే పదే బంధమోక్షాయ - <u>నిర్మమేతి;</u> <u>మమేతి</u> చ। మమేతి బధ్యతే జంతుః। నిర్మమేతి విముచ్యతే॥** | **"బంధము-మోక్షము"** అనునవి రెండు వేరువేరైన త్రోవలు.<br>(1) "మమ" కారము (నాది) (2) "నిర్మమ"కారము. (నాది అనునది ఏదీ లేదు) "మమకారము (నాది)"చే బంధము కలుగుతోంది. **'నాది కాదు'** - అనుకొనుటచే మోక్షము లభిస్తోంది. బంధ-మోక్షములు ఇంతమాత్రమే। |

"జీవ-ఈశ్వర" ఆది రూపేణ చేతన, అచేతనాత్మకమ్।
ఈక్షణ ఆది - ప్రవేశాంతా సృష్టిః ఈశేన కల్పితా॥
జాగ్రత్-ఆది→విమోక్ష అంతః సంసారో జీవకల్పితః।
"త్రిణాచిక - ఆది - యోగాంతా ఈశ్వర భ్రాంతిమ్
ఆశ్రితాః। లోకాయత → ఆది సాంఖ్యాంతా
జీవ విభ్రాంతిం ఆశ్రితాః॥
తస్మాత్ ముముక్షుభిః న ఏవ మతిః
జీవ-ఈశ వాదయోః కార్యా।
కింతు, బ్రహ్మతత్త్వం
నిశ్చలేన విచార్యతామ్ ॥

"జీవుడు", "ఈశ్వరుడు" (Individual - Collective) మొదలైన రూపములతో కల్పితమై కనిపిస్తున్న ఈ దృశ్య జగత్తు చేతన-అచేతనాత్మకము. "ద్రష్ట యొక్క దర్శనము' ద్రష్ట - దృశ్యములతో కూడిన ఈ జగత్తు ఈశ్వరునిచే "వీక్షణము" (Perception) నుండి ప్రవేశము (Entering into) వరకు నిర్మితమగుచున్నది. ఈశ్వరుని దృష్టి అంతమయ్యే వరకు ఈ సృష్టి ఈశ్వరునిచే పరికల్పించబడుచూనే ఉంటుంది. ఈశ్వర దృష్టియే సృష్టి. -జాగ్రత్ మొదలుకొని విమోక్షము (Relief) వరకు కొనసాగుచూ ఉన్న ఇక్కడి సంసారము జీవునిచే కల్పించబడుచున్నది.

త్రిణాచక యజ్ఞము మొదలైన (స్వర్గలోకప్రాప్తి) కార్యక్రమముల నుండి - సాంఖ్యయోగ పరాకాష్ఠానుభవము వరకు జీవుని స్వయం కృతంగా భ్రాంతి రూప నిర్మితమే. 14 లోకములు మొ॥వన్నీ జీవభ్రాంతిలోని అంతర్గత విశేషాలే। యజ్ఞయాగాలు మొదలుకొని "నేను జీవుడను. నేను ఈశ్వరుడను" - అనబడు అంతా కూడా భ్రాంతియే. అందుచేత ఈ జీవుడు జీవ-ఈశ్వర భావములను రెండిటినీ దాటివేసి - నిశ్చలమైన బుద్ధితో బ్రహ్మతత్త్వమును విచారణ చేయాలి.

---

అవిశేషేణ సర్వం తు యః పశ్యతి చిత్ అన్వయాత్,
స ఏవ "సాక్షాత్ విజ్ఞానీ" । స శివః। స హరిః। విధిః ।

ఇక్కడి సమస్తమును నిశ్శేషంగా చితానందరూపంగా, కేవలచిత్ స్వరూపంగా ఎవ్వరు దర్శిస్తారో, ఆతడే సాక్షాత్ విజ్ఞాని. ఆతడే బ్రహ్మ। ఆతడే హరి। ఆతడే శివుడు।

---

దుర్లభో విషయ త్యాగో।
దుర్లభం తత్త్వ దర్శనమ్,
దుర్లభా సహజ - అవస్థా,
సద్గురోః కరుణాం వినా।

## సద్గురు కరుణ

ఓ నిదాఘా! ఆత్మసాక్షాత్కారము కొరకై, సాక్షాత్ ఆత్మదర్శనమునకై సద్గురువును ఆశ్రయించాల్సిందేనయ్యా. సద్గురు కరుణ లేనిదే విషయత్యాగము, తత్త్వదర్శనము, సహజావస్థ - ఈ మూడు దుర్లభము.

---

14. ఉత్పన్న శక్తి బోధస్య,
త్యక్త నిశ్శేష కర్మణః,
యోగినః "సహజ అవస్థా"
స్వయం ఏవ ఉపజాయతే ।

ఎరుగుచూ ఉన్న వానిని ఎరుగుట - (The knowing about the knower) అనురూపముగల బోధజ్ఞానశక్తి ఉత్పన్నముకావాలి. కర్మలను మొదలంట్లా త్యజించివేయాలి. (నేను కర్తను, భోక్తను అనే భ్రమ తొలగాలి). అప్పుడు ఆ యోగి సందర్భావస్థలను దాటివేసి స్వయముగా "సహజావస్థ" (The Natural self which is mere witness to Incidental self) - అను స్థానమును స్వయముగా సిద్ధించుకొనుచున్నాడు.

---

యదా హి ఏవ ఏష ఏతస్మిన్
అల్పమపి అన్తరం నరః, విజానాతి
తదా తస్య భయంస్యాత్ ।
న అత్ర సంశయః॥

ఎంతెంత కాలము ఈ జీవుడు ఈ దృశ్యమానమగుచున్న జగత్తులో (సర్వ సమత్వము దర్శించకుండా) కించిత్ భేదము దర్శిస్తూ ఉంటాడో, అంతంతవరకు అట్టివానికి 'భయము' కొనసాగుచూనే తీరుతుంది. ఇందులో అనుమానం లేదు.

---

సర్వగం సచ్చిదానందం
జ్ఞానచక్షుః నిరీక్షతే। అజ్ఞానచక్షుః న ఏక్షేత, -
భాస్వంతం భానుం అంధవత్॥

**జ్ఞాన - చక్షువులకు** ఈ కనబడేదంతా కూడా **సర్వత్రా సర్వదా** సర్వ సందర్భములలోను **సత్-చిత్-ఆనందరూపమగు బ్రహ్మమే.** బ్రాహ్మీభావన నిస్సందేహమై, స్వాభావికమగుచున్నది.

ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తూ ఉన్నప్పటికీ - గ్రుడ్డివానికి సూర్యుని వెలుగు అగుపించదు కదా! అట్లాగే **అజ్ఞాన చక్షువులకు ఆత్మతత్త్వము అగుపించదు.**

---

ప్రజ్ఞానం ఏవ తత్ బ్రహ్మ,
సత్య ప్రజ్ఞాన లక్షణం।
ఏవం బ్రహ్మ పరిజ్ఞానాత్ ఏవ,
మర్త్యో అమృతో భవేత్॥

'కేవలమగు తెలివి' రూపమగు ప్రజ్ఞానమే (The property of absolute knowing) బ్రహ్మము. అట్టి ప్రజ్ఞానము "నేను ఉన్నాను" - అను అహం సత్ ('ఉనికి')కి సంబంధించినది. ప్రజ్ఞానముయొక్క స్వాభావిక లక్షణము - 'సత్'. ఈవిధంగా "నాయందలి ఉనికి -భావనలతో కూడిన ప్రజ్ఞయే బ్రహ్మము" - అను పరిజ్ఞానముచే ఈ జీవుడు 'అమృతుడు' అగుచున్నాడు. మార్పు-చేర్పులకు తాను విషయమేకానని ఎరుగుచున్నాడు.

భిద్యతే హృదయ గ్రంధిః, ఛిద్యంతే సర్వ సంశయాః
క్షీయంతే చ అస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరావరే॥

అట్టి ఆత్మయొక్క పరావర (Ones own 'Self' which is beyon all that is being seen here) దృష్టిచే హృదయ గ్రంథులు ముడివీడుతాయి. సర్వ అనుమానాలు ఛేదించ బడతాయి. కర్మబంధములన్నీ తెగిపోతాయి.

---

అనాత్మతాం పరిత్యజ్య నిర్వికారో జగత్ స్థితౌ,
ఏక నిష్ఠతయ అంతస్థః సంవిత్ మాత్రపరోభవ।

ఓ నిదాఘ ముని సత్తమా! భేదరూపమగు అనాత్మమైనదంతా వదలివేయి. పరిత్యజించు. ఈ జగత్తులో సంచరిస్తూ కూడా నిర్వికారుడవై ఉండుము. బాహ్యమున కనిపించే నామరూపములు, గుణములు ప్రక్కకు పెట్టి, సర్వదా **ఏకనిష్ఠతో-అహం-త్వమ్-జగత్తుల అంతరమగు ఆత్మనే సర్వత్రా సందర్శిస్తూ, అంతర్ముఖుడవై ఉండుము. సంవిత్‌మాత్ర పరుడవై ఉండు.**

---

మరుభూమౌ జలం సర్వం
మరుభూ మాత్ర ఏవ తత్ ।
జగత్త్రయం ఇదం సర్వం
చిన్మాత్రం - స్వవిచారతః॥

మరుభూమి (ఎడారి)లో ఎండమావులందు కనిపించే నీరు వాస్తవానికి ఎడారి భూమియే కాని, 'జలము' కాదు కదా!

అట్లాగే "స్వస్వరూపవిచారణ"చే - (జాగ్రత్ స్వప్న సుషుప్తులలో స్వర్గ-మర్త్య పాతాళ లోకములలో) కనిపించేదంతా - స్వకీయ ఎరుక యొక్క విస్తరణ రూపమే, చిన్మాత్రమే అయి ఉన్నది.

---

15. లక్ష్య - అలక్ష్య మతిం త్యక్త్వా, యః తిష్ఠేత్
కేవల ఆత్మనా, శివ ఏవ స్వయం సాక్షాత్,
అయం బ్రహ్మవిత్ ఉత్తమః॥

ఎవ్వడైతే బ్రహ్మమును తెలుసుకుంటాడో, ఆతడు బ్రహ్మమే - అగుచున్నాడు. ఎవ్వడైతే లక్ష్యము-అలక్ష్యములను (All Targetting and objectivation) వదలి, కేవలమగు ఆత్మయందే సంతిష్ఠితుడు అయి ఉంటాడో, ఆతడు సాక్షాత్ శివుడే. సాక్షాత్ 'బ్రహ్మమే'. ఆతడే ఉత్తమమగు బ్రహ్మవేత్త.

---

అధిష్ఠానం, అనౌపమ్యం, అవాక్ మానస గోచరమ్,
నిత్యం, విభుం, సర్వగతం, సు-సూక్ష్మం చ, తత్ అవ్యయం।

**అట్టి పరబ్రహ్మము ఎట్టిది?**

సమస్తమును ఆక్రమించుచూ, తన ఏలుబడియందు కలిగియుండటంచేత **అధిష్ఠానము**. ఉపమానములతో నిర్ణయించి చెప్పలేము కాబట్టి **అనౌపమ్యము**, వాక్కుకు, మనస్సుకు విషయము కాదు కాబట్టి **అవాక్-మానసగోచరము**. ఇంకా, **నిత్యమైనది.** సమస్తమూ తన ప్రదర్శనమే కాబట్టి **విభువు.** సర్వత్రా విస్తరిస్తూ **సర్వగతము.** అత్యంత **సూక్ష్మము.** మార్పు-చేర్పులకు ఆ అవిషయము కనుక **అవ్యయము.**

---

సర్వశక్తేః మహేశస్య విలాసో హి మనోజగత్ ।
సంయమ - అసంయమాభ్యాం చ,
సంసారం శాంతిమ్ అన్వగాత్॥

ఈ జగత్తు అనబడునది - అటువంటి సర్వశక్తిమంతుడగు మహేశ్వరుని మనో విలాసమే.

సంయమ - అసంయమములతో కూడిన ఈ జగత్తు - పరబ్రహ్మమునందే జనించి, పరబ్రహ్మమునందే సశాంతిస్తోంది.

---

మనోవ్యాధేః చికిత్సార్థం
ఉపాయం కథయామి తే।
యత్ యత్ స్వాభిమతం వస్తు
తత్ తత్ త్యజన్ "మోక్షమ్" అశ్నుతే॥

ఓ నిదాఘ! ఆత్మానందస్వరూపా! ఈ జీవుని స్వస్వరూపము పరబ్రహ్మమే! అట్టి పరబ్రహ్మము ఎట్లా స్వానుభవమౌతుందంటావా? కాకపోటానికి మనస్సే వ్యతిరిక్త కారణం. మనస్సు భేదదృష్టితో కూడిన "జగత్‌దర్శనము" అనే జాడ్యము అభ్యాసవశంగా వీడలేకపోతోంది. అటువంటి "మనోవ్యాధి" యొక్క చికిత్స కొరకై ఒక ఉపాయము చెప్పుచున్నాను. విను.
**ఏదేది "ఇది నాకు ప్రియము" - అని అనిపిస్తూ వస్తుందో - అట్టిదానినంతా మానసికంగా త్యజించి ఉండటమే - 'మోక్షము' సిద్ధించు ఉపాయము.**

---

స్వ-ఆయత్తం, ఏకాంత హితం,
స్వ-ఈప్సిత-త్యాగ వేదనమ్,
యస్య దుష్కరతాం యాతం,
ధిక్తం పురుష కీటకమ్॥

ఎవ్వడైతే - తనయొక్క స్వాధీనములోనే ఉన్నట్టి, ఏకాంతముగా అంతరమున అభ్యాసం చేస్తే హితము కలిగించునట్టి, - స్వకీయమైన మనో ఈప్సిత అభ్యాసమును (ఏదో కావాలి. వదలరాదు అనే రూపముగలది)ను జయించునట్టి - ప్రయత్నము "అది మాకు కష్టము కష్టము. కుదరదు" - అని అనుకుంటాడో, అట్టివాడు పురుషకీటకము. ('మానవుడు' రూపములో ఉన్న 'పురుగు' వంటివాడు). అట్టి అప్రయత్నశీలత్వమునకు ధిక్కారమగు గాక.

స్వపౌరుషా-ఏక సాధ్యేన
"స్వ-ఈప్సిత త్యాగ రూపిణా", -
మనః ప్రశమ మాత్రేణ
వినా నాస్తి శుభా గతిః॥

ఓ నిదాఘా! తనయొక్క ఇష్ట-అయిష్టములనుండే ఈ జీవునికి దృశ్యముతో 'సంసారము' అనే బంధము వచ్చిపడుతోంది. అటువంటి 'ఈప్సిత త్యాగము' అనే పురుషకారమగు స్వకీయ ప్రయత్నము లేకపోతే మనస్సు శమించదు. 'మనస్సు' విషయములపై వ్రాలటము. అనే జాడ్యము తొలగదు. మనస్సును జయించకుంటే శుభగతి లేనే లేదు.

---

అమనస్కయోగము

16. అసంకల్పన శస్త్రేణ
ఛిన్నం చిత్తం ఇదం యదా
సర్వం సర్వగతం శాంతం
బ్రహ్మ సంపద్యతే తదా॥

చిత్తము అనగా ఏమి? 'నేను-నాది అని సంకల్పించటము' యొక్క అభ్యాసమేకదా! ఇప్పుడు ఇక చిదాత్మానుభవమునకు అడ్డుగా నిలుస్తున్న 'చిత్తము'ను జయించవలసిందే. ఎట్లా? అందుకు ఉపాయం సాధనము కూడా **అసంకల్పమే. (లేక) నిస్సంకల్పమే.** "సంకల్పము చేయక **పోవటము"** అని పిలువబడే 'అసంకల్పము' అనే ప్రయత్నము - "అనేక విషయములపై వ్రాలి, వాటిలో చిక్కుకోవటం" - అనే రూపముగల **'చిత్తము'ను వశింపజేయగలదు.** అప్పుడు ఇక 'సర్వము, సర్వగతము, **శాంతము'**- అగు బ్రహ్మము యొక్క భావన (చిత్) సిద్ధించగలదు.

---

'భవ' భావనయా ముక్తో
యుక్తః పరమయాధియా,
ధారయ ఆత్మానం అవ్యగ్రా
ఉగ్రస్త చిత్తం చితః పదమ్॥
(అవ్యగ్రో-గ్రస్త చిత్తం-చితః పరమ్)

'ఈ జగదృశ్యము నిజంగా ఉండియే ఉన్నది' అనునదే భవరోగముగా చెప్పబడినది. అది భావనచేతనే ఏర్పడుతోంది. అందుచేత ఓ నిదాఘా! భవ-భావన (What ever beeing seen is permanent) నుండి ముక్తుడవు అవవయ్యా (Please get relieved). (భవము = ఉన్నది)

ఉత్తమమైన బుద్ధి-యుక్తులతో అవ్యగ్రముగా (unemotionally) చిత్తము చిత్‌పదమును ఆశ్రయించగలదు.

---

పరం పౌరుషం ఆశ్రిత్య
నీత్వా చిత్తం అచిత్తతామ్।
ధ్యానతో హృదయ ఆకాశే
చితి చిత్ చక్రధారయా।

**'పరము' కొరకై ఇహపురుషకారమును ఆశ్రయించి చిత్తమును అచిత్తముగా చేసివేయి.** ధ్యానరూపమగు ధ్యానముతో నీయొక్క (స్వకీయ) హృదయాకాశములో - చిత్తమును చిత్ చక్రముతో ఖండించి వేసి, కేవలచిత్ స్వరూపుడవు అగుము.

---

మనో మారయ నిశ్శంకం, త్వాం ప్ర బధ్నంతి నారయః।
"అయం, సోఽహం', ఇదం, తత్ మే,"
ఏతావత్ మాత్రకం మనః।
తత్ అభావన మాత్రేణ దాత్రేణ ఏవ విలీయతే।

కామరూపమున {(అనేక కోరికలు) (expectations) రూపంగా} ఉన్న మనస్సు అనే మారుడు - ఈ జీవుని బంధించుచున్నాడు. పురుషకారముతో సర్వాత్మకమగు అఖండ పరబ్రహ్మమును ఆశ్రయిస్తూ, హృదయములోనే 'సోఽహమ్' (-'అదియే నేను' భావనతో) ఆత్మోపాసన నిర్వర్తిస్తూ ఉండగా, ఇక మనోబంధములు నిన్నేమీ చేయలేవు.

**'భావన'**చే మనస్సు రూపుదిద్దుకొంటోంది. అభావన మాత్రం చేత మనస్సు - తరంగం సముద్రజలంలోలాగా - ఆత్మయందు విలీనము కాగలదు.

---

ఛిన్నాభ్ర మండలం వ్యోమ్ని
యథా శరది ధూయతే,
వాతేన అకల్పకేన ఏవ
తథా అంతర్ధూయతే మనః॥

శరత్ కాలంలోఆకాశంలోని మేఘములు వాయువుయొక్క ప్రసరణచే ఛిన్నాభిన్నమై జలరూపంగా వర్షిస్తున్నట్లు, మనస్సు **'ఆత్మధ్యానము'** అనే వాయుతరంగములచే ఛిన్నాభిన్నమై, హృదయస్థమగు ఆత్మయందు లయించిపోగలదు.

---

17. కల్పాన్త పవనావాంతు,
యాంతు చ ఏకత్వం అర్ణవాః,
తపం తు ద్వాదశ ఆదిత్యా,
నాస్తి నిర్మనసః క్షతిః॥

**మనోజయ ధ్యాని / ఆత్మధ్యాని**

- ప్రళయాంతమును సూచించు ప్రళయ వాయువులు వీచునుగాక!

- సప్త సముద్రములలోని జలము పొంగి ఏకముగుగాక!

-ద్వాదశాదిత్యులు తమయొక్క ఉష్ణకిరణములచే జగత్తులోని పదార్థజాలమునంతా తపించేసి మాడ్చివేయుదురు గాక!

***మనస్సును జయించిన అమనస్కుడు కించిత్ కూడా క్షోభ పొందడు.***

**అసంకల్పన మాత్రైక సాధ్యే సకల సిద్ధిదే।**
**'అసంకల్ప' ఆది సామ్రాజ్యే తిష్ఠ అవష్టభ్ధ**
**తత్ పదః। న హి చంచలతా హీనం**
**మనః క్వచన దృశ్యతే ॥**

సంకల్పము నిరోధించి, 'అసంకల్పము'ను ఆశ్రయించిన మాత్రంచేత అష్ట సంపదలతో సహా సమస్తము సిద్ధించగలదు, అందుచేత ఆది-స్వరూపము (The Origin Form of Self) అగు **'అసంకల్పత్వము'** అను, ఆత్మసామ్రాజ్య సింహాసనమును అధిష్ఠించి ఉండుము. అఖండ - ఆత్మత్వమును సంతరించుకొని ఉండెదవుగాక।

---

**చంచలత్వం మనో ధర్మో,**
**వహ్నేః ధర్మో యథా ఉష్ణతా।**
**ఏషాహి చంచల అస్పంద**
**శక్తిః చిత్తత్త్వ సంస్థితా।**
**తాం విద్ధి మాససీం శక్తిం,**
**జగత్ ఆడంబరాత్మికామ్।**

**మనోచాంచల్యము**

ఈ మనస్సు ఎప్పుడూ కూడా తనయొక్క చంచల స్వభావమును విడచి ఉండదు. అగ్నికి ఉష్ణము ఏవిధంగా ధర్మమో, మనస్సుకు చంచలత్వము అనేది ధర్మమైయున్నది.

అయితే మనస్సును కదల్చుచున్న చిత్‌శక్తి - తాను కదలక, మనస్సుయొక్క కదలికలకు కారణము అగుచున్నది - అని గమనించెదవు గాక. చిత్తుయొక్క 'కదల్చటము' అను చంచలశక్తియే (తాను కదలకయే) స్పందశక్తిగా ప్రదర్శనమగుచూ, మనోశక్తిగా ఈ జగదాడంబరమునకు కారణమగుచున్నది. **కదలేదానిని దాటి, కదిలిస్తూ తాను కదలక ఉన్న దానిని ఆశ్రయించు.**

---

**యత్తు చంచలతా హీనం, తత్ మనో అమృతం ఉచ్యతే॥**
**తత్ ఏవచ తపః, శాస్త్ర సిద్ధాంతే, "మోక్ష" ఉచ్యతే॥**
**తస్య చంచలతా యైషాతు అవిద్యా వాసనాత్మికా,**
**వాసనా 'పర' నామ్నీం, తాం విచారేణ వినాశయ॥**

జగత్తు యొక్క ఆడంబరమంతా కూడా మనోశక్తి ప్రదర్శనమే. ఏ మనస్సు యొక్క అంతరవిభాగము చంచల రహితమై ఉన్నదో....అదియే అమృత రూపము. అదియే ఆత్మ. అదియే తపోధనులచే "మోక్షము" అని సిద్ధాంతీకరించబడుచున్నది. కదలికలకుఆధారమై, తాను కదలక ఉన్నట్టిదే - ఆత్మ.

మనస్సుయొక్క అనిరోధరూపమగు చాంచల్యమే 'అవిద్యావాసన'. అట్టి అవిద్యచే జనించే వాసనలను (Tendencies) ఇప్పుడు నీవు **"ఆత్మతత్త్వవిచారణ"** - సహాయముతో మొదలంట్లా నశింపజేయాలి. లేదా అనేక చిత్తభ్రమలు కొనసాగుచూనే ఉంటాయి.

---

**పౌరుషేణ ప్రయత్నేన యస్మిన్ ఏవ పదే మనః,**
**యోజ్యతే తత్ పదం ప్రాప్య నిర్వికల్పో భవ।**
**అనఘ!**

పాపదృష్టి రహితుడవగు ఓ నిదాఘమహాయా! అనఘా! నీయొక్క పురుషప్రయత్నము, వివేక దృష్టిచే మనస్సును ఆత్మయందు విలీనము చేసి, సర్వత్రా **'ఆత్మదృష్టి'**ని పెంపొందించుకో. 'నిర్వికల్పము'ను అభ్యసించు. అప్పుడు ఏ ఆత్మ (తత్) పదము ప్రాప్తిస్తుందో - అట్టి అఖండాత్మయే నీవు అగుము. (అట్టి నిశ్చలాత్మయే నీ స్వభావము, స్వరూపము కూడా).

---

**18. అతః పౌరుషమ్ ఆశ్రిత్య, చిత్తం ఆక్రమ్య**
**చేతసా, విశోకం పదం ఆలంబ్య**
**నిరాతంకః స్థిరో భవ॥**

ఇప్పటికిప్పుడే పురుషకారమును ఆశ్రయించి, చిత్‌బుద్ధితో చిత్తమును ఆక్రమించు. విశోకమగు (No Worry) అతీత ఆత్మపదమును అవలంభించు. అన్ని ఆటంకములను (All Hurdles) జయించి, సర్వాత్మకమగు **"ఆత్మభావన"** యందు సుస్థిరుడవు, నిశ్చలుడవు అగుము.

---

**మన ఏవ సమర్థం హి మనసః దృఢ నిగ్రహే।**
**అరాజా కః సమర్థః స్యాత్ రాజ్ఞో నిగ్రహ కర్మణి?**
**తృష్ణా గ్రాహ గృహీతానాం సంసార అర్ణవ**
**పాతినామ్, ఆవర్తై రుహ్యమానానాం**
**(ఆవర్తైః ఉహ్యమానానాం) దూరం**
**స్వ మన ఏవ 'నౌః'॥**
**(రహ్యము = గతిక)**

మనస్సు చేతనే ఈ జీవునికి దృశ్యబంధము కలుగుచున్నమాటనిజమే. అయితే దృశ్యతన్మయమగుచున్నట్టి మనో విభాగమును దృఢముగా నిగ్రహించు **సామర్థ్యము** తిరిగి **(నిశ్చలవిభాగమగు)** మనస్సుకే ఉన్నది. ఏ విధంగా రాజును రాజే జయించగలడో, నిగ్రహించగలడో -మనస్సును మనస్సే నిగ్రహించగలదు. రాజు కానివాడు రాజును ఎట్లా జయించటం? 'సంసారము' అనే సముద్రములో తృష్ణ (ఆశ)' అనే సుడిలో ప్రవేశించి ఉన్న తరంగములలో చిక్కుకొని గతికలవలె ఊగిపోతున్న ఈ జీవునికి ఆతని (శుద్ధ) మనస్సే ఆతనిని కాపాడగల 'నౌక'.

మనసః ఏవ మనః ఛిత్వా పాశం పరమబంధనమ్,
భవాత్ ఉత్ తారయ (ఉత్తారయ) ఆత్మానం
న అసావత్ అన్యేన తార్యతే॥
యా యా ఉదేతి మనో నామ్నీ వాసనా వాసిత-
అంతరా, తాం తాం పరిహరేత్ ప్రాజ్ఞః
తతో అవిద్యా క్షయో భవేత్॥

వివేకములతో కూడిన మనస్సుతో అనేక దుష్టపాశములలో చిక్కుకొనియున్న అజ్ఞానమనోచంచల్యమును నీకు నీవే - ఉద్ధరించాలి. నీ మనస్సును నీవే పైకి తెచ్చి తరింపజేయాలి. నీ మనస్సు కాకుండా, వేరొక రెవరో వచ్చి ఉద్ధరిస్తారని అనుకోవద్దు. ఈ జీవుడు తనను తానే ఉద్ధరించుకోవాలి. ఎవ్వరైనా మనస్సును నిగ్రహించే మార్గం చెప్పగలరు. అంతవరకే కానీ మనస్సును నిగ్రహించుకోవలసినది ఎవరికి వారే।

ఈ మనస్సులో ఏఏ ఇష్టాఇష్టముల చేత అంతరంగా ఏఏ వాసనలు జనిస్తూ ఉన్నాయో, ఆయా అవిద్యా వాసనలన్నీ ప్రాజ్ఞుడైనవాడు తనకు తానే నశింపజేసుకోవాలి. అప్పుడు మాత్రమే అవిద్య క్షయించగలదు.

---

'భోగా' ఏక వాసనాం త్యక్త్వా, త్యజ త్వం భేదవాసనాం।
భావ-అభావౌ తతః త్యక్త్వా నిర్వికల్పః సుఖీభవ॥
ఏష ఏవ మనోనాశస్తు అవిద్యానాశ ఏవ చ।
యత్ తత్ సంవేద్యతే కించిత్
తత్రాస్థా పరిమార్జనమ్॥

ఓ నిదాఘా! నీ మనస్సునందు మనస్సుయొక్క అభ్యాసవశంగా పుట్టుకొస్తూ ఉన్నట్టి :-
(1) 'భోగించాలి' అనే రూపముగల,
(2) భేదములను దర్శించుచున్నట్టి,
(3) భావ - అభావములకు సంబంధించినట్టి
సమస్త వాసలను జయించి, త్యజించి, 'నిర్వికల్పస్థితి'ని సిద్ధించుకొని సుఖముగా ఉండెదవుగాక!

మనోనాశనమే అవిద్యానాశనము కూడా. ఏదేది దృశ్య సంబంధితమై వాసనల రూపముగా నీ హృదయమునందు ప్రవేశిస్తూ ఉన్నాయో - అవన్నీ కూడా గుర్తెరగాలి. (ఇల్లాలు వంటిల్లును శుభ్రము చేయు విధంగా) పరిమార్జనము (washing off) చేసివేసుకొంటూ ఉండాలి.

---

19. అనాస్థా ఏవహి నిర్వాణం।
దుఃఖం ఆస్థా పరిగ్రహః।
అవిద్యా విద్యమానైవ,
నష్ట ప్రజ్ఞేషు దృశ్యతే।
నామ్నా ఏవ అంగీకృత ఆకారా
సమ్యక్ ప్రజ్ఞస్య సా కుతః?
తావత్ సంసార భృగుషు
స్వాత్మనా సహ దేహినమ్।

***<u>దృశ్య విషయములచే ఇష్టము, విశ్వాసము కలిగి ఉండకపోవటమే నిర్వాణము.</u>***

దృశ్యవిషయములపట్ల ఇష్టము కలిగి పరిగ్రహిస్తూ (స్వీకరిస్తూ) ఉండటమే దుఃఖముయొక్క రూపము.

వాస్తవానికి 'అవిద్య' అనునది మొదలేలేదు. అయితే ఏం? అల్పప్రాజ్ఞులపట్ల అది కనబడుచూ, ప్రవర్తమానమౌతోంది.

"వాస్తవానికి లేనట్టిది, పేరుకు మాత్రమే ఉన్నట్టిది" - అగు అవిద్య అప్రాజ్ఞులకు (తెలివితక్కువవారికి) ఉన్నట్లే అగుపిస్తోంది. సమ్యక్ సిద్ధి పొందిన ప్రాజ్ఞులకు అది ఎట్లా ఉండగలదు? ఉండదు. "సంసారమును గుర్తించి జయించాలి" - అను యత్నశీలుర సమక్షంలో అవిద్య - మీమాంసకు (logically verification) నిలువదు. మోక్షేక్ష కలుగగానే అవిద్య తనకు తానే తోకముడుస్తుంది.

---

ఆందోళయతి నీరంధ్రం, దుఃఖకంటకశాలిషు,
అవిద్యాయావత్ అస్య అస్తు
న ఉత్పన్నా, క్షయకారిణీ।

అవిద్య "దుఃఖము" అనే ముళ్ల పొదలతో నిండి, ఈ జీవునికి అనేక ఆందోళనలు కలుగచేస్తోంది. ఏది అవిద్యచే మాత్రమే ఉనికి కలిగియుంటుందో, అట్టి శరీరతదాత్మ్యము ఈ జీవుని అనేక దుఃఖములలోకి త్రోస్తూనే ఉంటుంది. వాస్తవానికి అవిద్యకు ఉత్పత్తి లేదు. క్షయము లేదు.

---

స్వయం ఆత్మా అవలోకేచ్ఛా మోహ సంక్షయకారిణీ,
అస్యాః పరం ప్రపశ్యంత్యాః స్వ-ఆత్మనాశః ప్రజాయతే॥
దృష్టే సర్వగతే బోధే స్వయం హి ఏషా విలీయతే।

ఆత్మయొక్క అవలోకమునకు ఇచ్ఛ కలుగునంతవరకు మోహము కొనసాగుతుంది. ఆత్మయొక్క అవలోకేచ్ఛ మోహమును సంక్షయింపజేయు కారణము అగుచున్నది. సర్వగతమగు ఆత్మ దర్శనము మాత్రమే మోహమును నశింపజేయగలదు.

---

ఇచ్ఛామాత్రం అవిద్యేయం ।
తత్ నాశో - మోక్ష ఉచ్యతే।
స చ అసంకల్పమాత్రేణ
సిద్ధో భవతి వై, మునే !

అవిద్యయొక్క రూపమేమి? దృశ్య విషయములపట్ల ఏర్పడుచున్న అవినాభావ సంబంధమగు ఇచ్ఛయే. 'ఇచ్ఛ' నశిస్తే అవిద్య కూడా నశిస్తుంది. 'ఇచ్ఛ' సంకల్పముచేతనే రూపుదిద్దుకుంటోంది. కనుక ఓ మునీశ్వరా! అసంకల్పమాత్రముచేత ఈ జీవుడు 'సిద్ధి' పొందగలడు. ఇచ్ఛారాహిత్యము, సంకల్పరాహిత్యము, ఈ రెండూ అంతరమున పెంపొందించుకోవటమే "మోక్షము" - నకు మార్గము.

**20.** మనాగపి మనోవ్యోమ్ని వాసనా రజనీ క్షయే,
కాళికా తనుతామ్ ఏతి చిత్ ఆదిత్య ప్రకాశనాత్ ॥
చైత్య అనుపాతరహితం, సామాన్యేన చ సర్వగమ్।
యత్ "చిత్ తత్త్వం" అనాఖ్యేయం, స ఆత్మా పరమేశ్వరః॥

సంకల్పముయొక్క పరంపరచేతనే వాసన (Tendency) రూపుదిద్దుకుంటోంది. మనో ఆకాశములో వాసనాచంద్రుడు క్షయిస్తే (తెల్లవారగానే) అట్టి హృదయములో చిత్ -ఆదిత్య సూర్యుడు ప్రకాశమానుడవగలడు.

చిత్-తత్త్వము : అనుభవమగుచున్న దృశ్యము (చైత్యము)తో ఏమాత్రము సంబంధము లేనట్టిది, సర్వసామాన్యరూపంగా సర్వవ్యాపకమైనట్టిది. అనిర్వచనీయమైనది, అగు చిత్ ఆత్మయే పరమేశ్వరుడు.

---

సర్వం చ ఖలు ఇదం బ్రహ్మ ।
నిత్య చిత్-ఘనం, అక్షతమ్।
కల్పనా అన్యా మనోనామ్నీ విద్యతే నహి కాచన।
న జాయతే, న మ్రియతే కించిత్-అత్ర జగత్ త్రయే।
న చ భావ వికారాణాం సత్తా క్వచన విద్యతే।

ఈ సమస్తము కూడా - నిత్యము ఘనీభూతము అగు చిత్‌స్వరూపమే। క్షయము లేనిది అగు బ్రహ్మమే! సమస్తము బ్రహ్మమే అయి ఉండగా ఇక కల్పనా రూపమగు 'మనస్సు' అనబడునది ఎక్కడ ఉన్నది? లేనే లేదు.

ఈ మూడు లోకములలో కూడా ఏదీ జనించటమూ లేదు. నశించటమూ లేదు. అందుచేత షట్ భావ వికారములు (జన్మ - ఎదుగుదల - జీవనము - తరుగుదల - వార్ధక్యము - వినాశనము అనునవి) - కించిత్ కూడా సత్యమగు ఆత్మదృష్ట్యా లేనే లేవు.

---

కేవలం కేవలాభాసం సర్వసామాన్యం అక్షతమ్,
చైత్య-అనుపాతరహితం
'చిత్‌మాత్రమ్' ఇహ విద్యతే।
తస్మిన్ నిత్యే తతే శుద్ధే చిత్ మాత్రే
నిరుపద్రవే, శాంతే సమ సమాభోగే
నిర్వికారే చిత్‌ఆత్మని॥

అందుచేత - కేవలమగు ఆత్మయొక్క ఆభాస (Reflective)యే ఇదంతా. సర్వత్ర సమస్వరూపము, క్షయము లేనిది, తెలియబడేదంతా తానే అయినట్టిది, దృశ్యముగా దిగజారనట్టిది - అగు **'కేవల చిత్ మాత్రము'** - మాత్రమే ఇక్కడ సర్వదా ఉన్నది.

అట్టి నిత్యమైనట్టి, సర్వత్రా **'తతము' (వ్యాపకము)** అయినట్టి, **శుద్ధము** అయినట్టి చిత్ స్వరూపమే - **నిరుపద్రవమైన, శాంతమగు, నిర్వకారమగు** స్వస్వరూప చిత్ నందు "ద్రష్ట - దృశ్యము"ల రూపంగా భోగించుచున్నది. అట్టి విహరణయే మనస్సుయొక్క రూపము.

---

యైషా (య ఏషా) స్వభావ అభిమతం స్వయం
సంకల్ప్య ధావతి, చిత్ చైత్యం స్వయం
అమ్లానం <u>మననాత్ 'మన'</u> ఉచ్యతే ।
అతః సంకల్ప సిద్ధేయం సంకల్పేన ఏవ నశ్యతి॥

ఈ మనస్సు తన స్వభావమునకు సానుకూలమైనట్టి దానిని, అభిమతము అయినట్టి దానిని స్వయముగా కల్పించుకొంటోంది. చిత్ చైతన్యముయొక్క స్వయంకృతమైన తెంపులేని మననమే 'మనస్సు'. సంకల్పముచేత సిద్ధిస్తున్నట్టిదే మనస్సు. మరల సంకల్పము చేతనే సంకల్పించువానియందు (ఆత్మయందు) లయించుచున్నది.

---

**21.** "నాహం బ్రహ్మ" ఇతి సంకల్పాత్ సుదృఢాత్
బధ్యతే మనః। "సర్వం బ్రహ్మ" ఇతి సంకల్పాత్
సుదృఢాత్ ముచ్యతే మనః ॥

"నేను బ్రహ్మమును కాదు. బ్రహ్మము - అనునది నాకు వేరుగా మరెక్కడో ఉన్నది" - అను సుదృఢమైన మననము చేతనే మనస్సు కల్పితము అగుచున్నది. అట్టి మనస్సు దృశ్య వ్యవహారములకు సంబంధితమై, సుదృఢముగా 'బంధము' పొందుచున్నది.

'నాతో సహా ఈ సమస్తము బ్రహ్మమే' - అను సుదృఢ సంకల్పముచే మనస్సు బంధ విముక్తి పొందుచున్నది.

---

"కృశోఽహమ్" "దుఃఖ బద్ధోఽహమ్"
"హస్తపాద ఆది మాన్ అహమ్" –
ఇతి భావ అనురూపేణ వ్యవహారేణ బధ్యతే ॥

**"నేను కృశించి పోయినట్టివాడను"।**

**- దుఃఖములచే బద్ధుడను। అల్పుడను। స్వల్పుడను।**

**- ఈ కాళ్ళు - చేతులతో కూడిన దేహమునకు పరిమితుడను"** - అను భావనా-అనురూపముచేతనే ఈ జీవుడు దృశ్యవ్యవహారమునకు 'నిబద్ధుడు' అగుచున్నాడు.

---

"నాహమ్ దుఃఖీ । న మే దేహో బంధః।"
కో అస్య ఆత్మని స్థితః," – ఇతిభావ అనురూపేణ
వ్యవహారేణ ముచ్యతే॥

**'నేను దుఃఖినికాదు. ఆత్మానందస్వరూపుడను. నేను దేహముచే బంధము పొందువాడను కాను'** - అను రూపముగల వ్యావహారిత్వమును ఎవ్వడు ఆశ్రయిస్తాడో, ఆతడు ముచ్యుడే। సర్వదా విముక్తుడే।

| | |
|---|---|
| **"నాఽహమ్ మాంసం। న చ అస్థీని। దేహాత్ అన్యః పరోఽస్మి అహమ్।" - ఇతి నిశ్చితవానంతః క్షీణ అవిద్యో, విముచ్యతే॥** | **"ఈ మాంస బొమికల అమరికగల దేహము నేను కాదు. దీనిని ఉపయోగిస్తూ, దీనికి పరమై, దీనిని కదల్చుచూ ఉన్న చైతన్య స్వరూపుడను"** - అను అంతరంగములోని సునిశ్చితమైన సునిశ్చయముచేత విముక్తుడు అగుచున్నాడు. అవిద్య క్షీణిస్తోంది. నేను దేహమును కాను. దేహిని - అని అనుకున్నంతమాత్రం చేత అవిద్య 'లేనిదే' అవుతోంది. |
| **కల్పితే అయం అవిద్యేయం, అనాత్మని అత్మభావనాత్। పరం పౌరుషం ఆశ్రిత్య యత్నాత్ పరమయా ధియా, భోగేచ్ఛాం దూరతః త్యక్త్వా నిర్వికల్పః సుఖీ భవ॥** | అవిద్యచే జనించే అనాత్మభావన కేవలము కల్పితము మాత్రమే. పురుషకారమును ఆశ్రయించి సమస్తమునకు 'పరము' (Beyond) అయి ఉన్నట్టి 'ఆత్మభావన'చే అనాత్మభావనను జయిస్తూ, ఉత్తమమైన ప్రయత్నశీలుడవగుము. సునిశితము - విస్తారము అగు బుద్ధితో 'భోగేచ్ఛ'ను దూరంగా త్యజించివేయి. **నిర్వికల్ప సమాధిని** (సర్వకల్పనలను దాటిపోయి సర్వే సర్వత్రా సమస్వరూపమైయున్న ఆత్మత్వమును)ను ఆశ్రయించి సుఖించు. |
| **"మమ పుత్రో। మమ ధనం। అహం సోఽయమ్। ఇదం మమ"। ఇతీయం ఇంద్ర జాలేన వాసనా ఏవ వివల్గతి ॥** | <u>వాసనలు</u> : "నా కుమారులు। నా వారు। నా ధనము। నేను ఇంతటి వాడిని। ఇది నాది। అది నేను।" ఇటువంటి ఇంద్రజాల సమాశ్రయమువల్లనే వాసనలు (Tendencies) ఈ జీవునిపట్ల విజృంభిస్తున్నాయి. |
| **22. మా భవ అజ్ఞో। భవ జ్ఞః త్వం। జహి సంసారభావనామ్। అనాత్మని ఆత్మభావేన కిం అజ్ఞ ఇవ రోదిషి?** | ఓ నిదాఘ మహాశయా! ఓ తదితర ప్రియశ్రోతలారా!<br>మీరంతా అజ్ఞులు కాకండి. విజ్ఞులు అవండి. "నాది - నేను - నాకు సంబంధించినది - నేను దీనికి సంబంధించినవాడను'' - అనురూపముగల సంసారభావములను (పాము కుబుసమువలె) వదలి ఉండటమును అభ్యాసపూర్వకంగా నిర్వర్తించువారై ఉండండి. అనాత్మకమగు (కల్పిత-అపాదిత-సందర్భమాత్ర-ఊహాపరిమిత) విశేషములపట్ల **"వీటికి నేను బద్ధుడను"** అను భావనతో ఆత్మభావనచేస్తూ అజ్ఞునివలె మీరు ఎందుకు దుఃఖిస్తున్నారు? |
| **కః తవ అయం జడో మూకో దేహో మాంసమయో అశుచిః, యత్ అర్థం సుఖ దుఃఖాభ్యాం అవశః పరిభూయసే?** | **"దేనివలన నేను అవశుడనై సుఖ-దుఃఖములన్నీ అనుభవిస్తూ ఉన్నాను? - జడము, మూగది, మాంసమయము, అశుచికరము అగు ఈ దేహము నాకు ఎందుకు లభించింది? దేహిగా నేను ఎవ్వరు?"** - ఇవన్నీ యోచన చేయి. అది చేయకుండా, దేహమును చూచి భ్రమలు చెంది దుఃఖము పొందుచున్నావేమి? అనర్థమైన విషయాలగురించి దుఃఖించి ఏమి ప్రయోజనము? |
| **అహో! అను చిత్రం! (సు చిత్రం)! యత్ సత్యం బ్రహ్మ తత్ విస్మృతం నృణామ్। తిష్ఠతః తవ కార్యేషు మా అస్తు రాగ - అనురంజనమ్॥** | ఆహా! ఎంత విచిత్రం! ఈ జనులు సత్యమగు బ్రహ్మమును ఏమరచి కల్పితమాత్రమగు ఇంద్రియ దృశ్య వ్యవహారములే నిజమనుకొంటున్నరే! ఇక్కడ దేహములు, దేహసంబంధములు శాశ్వతమనుకొని మురిసిపోతున్నారే! ఇది నీ గురించి నీవే గమనించు. లౌకిక (ప్రాపంచక) కార్యములు నిర్వర్తిస్తూ ఉన్నప్పుడు రాగ-ద్వేషములను ఏమాత్రము దరిచేరనీయవద్దు. మనోబుద్ధులకు కర్మల దోషములను అంటనీయకుండా జాగరూకుడవై ఉండు. |
| **ఆహో। (అ)ను చిత్రం। పద్మోత్థై బద్ధా తంతుభిః అద్రయః, అవిద్యామానా, యా అవిద్యా తయా విశ్వం ఖిలీకృతమ్। ఇదం తత్ వజ్రతాం యాతం తృణమాత్రం <u>జగత్ త్రయం</u> ॥ <u>ఇత్యుపనిషత్</u>** | ఆహా! **"ఒక తామరకాడలోని తంతువులతో ఎవ్వరో అద్రిని (మేరు పర్వతమును) కట్టి ఈడ్చుకుంటూ ఇంటికి తెచ్చారు"** - అన్న తీరుగా యదార్థమే కానట్టి అవిద్యచేత విశ్వమంతా బంధనముతో కూడినదిగా అగుచున్నది! ఇది ఎంత ఆశ్చర్యం!<br>గడ్డి పరకతో సమానమైన ఈ త్రిజగత్‌కల్పనా వ్యవహారమంతా వజ్రతుల్యంగా జీవులకు అనుభూతమౌతోందే! ఏమి చమత్కారం!<br>**ఇతి ఉపనిషత్** |

# పంచమోఽధ్యాయః = జ్ఞాన - అజ్ఞాన భూమికలు

**ఋభు ఉవాచ :-**

**1. అథ అపరం ప్రవక్ష్యామి**
**శృణు తాత। యథా తథమ్।**
**'అజ్ఞాన' భూః సప్త (7) పదా,**
**'జ్ఞ' భూః సప్తపద (7) ఏవ హి॥**
**పదాంతరాణి అసంఖ్యాని ప్రభవన్తి అన్యథై తయోః।**
**స్వరూపాన్ అవస్థితిః ముక్తిః।**
**తత్ భ్రంశో అహంత్వ వేదనమ్ ॥**

**ఋభుమహర్షి :-**

బిడ్డా! నిదాఘా! ఇప్పుడు మనము "అపరము" - గురించి (ఆత్మకు అన్యమగు కల్పనావిశేషము గురించి) యథాతథంగా చెప్పుకుంటున్నాము. శ్రద్ధగా విను.

**(1) అజ్ఞాన భూమికలు - 7 (2) జ్ఞాన భూమికలు - 7**

పై రెండు విధములైన సప్త-సప్త భూమికల నుండి అన్యములైనట్టి అసంఖ్యాక భూమికలుగా కూడా శాస్త్రములు చెప్పుచున్నాయి. (గురువులచే అనేక ఉపవిభాగములుగా విశదీకరించబడుచున్నాయి)

స్వస్వరూపస్థితిలో ఉండి ఉండటమే మోక్షము.

అట్టి స్వస్వరూప స్థితి నుండి భ్రంశము (లేక) చ్యుతి పొంది అహమ్-త్వమ్ స్థూలానుభవము కలిగి ఉండటమే **బంధము.**

---

**శుద్ధ సత్ మాత్ర సంవిత్తేః**
**స్వరూపాత్ న చలంతి యే,**
**రాగద్వేషాదయో భావాః**
**తేషాం న అజ్ఞత్వ సంభవాః ॥**

ఎవ్వరైతే శుద్ధ - సత్ (కేవలమగు ఉనికి) మాత్ర - సంవిత్ (సత్‌విత్, ఉనికి+ఎరుక) - స్వరూపము నుండి చలనము పొందరో, విచలితులు కారో, రాగ-ద్వేషములకు కించిత్‌గా కూడా చోటు ఇవ్వరో, వారిపట్ల అజ్ఞానము సంభవించే ప్రసక్తియే ఉండదు. కేవల సంవిత్ ధారణ చేయు ధన్యులకు రాగద్వేష సంకల్పములు ఉండజాలవు.

---

**యత్ స్వరూప పరిభ్రంశశ్చ - యత్ అర్థే**
**చితి మజ్జనమ్, ఏతస్మాత్ అపరో మోహో**
**న భూతో, న భవిష్యతి॥**
**అర్థాత్ అర్థాంతరం చిత్తే, యాతి మధ్యే తు**
**యా స్థితిః, సా ధ్వస్త-మనన ఆకారా**
**"స్వరూపస్థితిః" ఉచ్యతే॥**

తన దృక్ స్వరూపము (The one who is seeing) నుండి పరిభ్రంశము పొంది, దృశ్యమునందు నిమజ్జనము **పొందటమే మోహము.** అట్టి అపర రూపమగు మోహముతో సమానమైన దుఃఖకారణము మూడు (త్రి)కాలము లలో మరొకటి ఏదీ లేదు. ఇక ఉండబోదు కూడా.

కనుక దుఃఖమునకు కారణము మోహమే. కేవలమగు స్వస్వరూపము పట్ల స్వకీయమైన ఏమరుపే.

**స్వరూపస్థితి** : ఆలోచనకు - ఆలోచనకు (లేక) ఒక సంకల్పము - ఆ తరువాత సంకల్పమునకు మధ్యగా గల మనన రహితమైనప్పటి మనో స్థితి (లేక) మనో రహిత స్వస్వరూప స్థితియే **'స్వరూపస్థితి'** అనబడుతోంది.

---

**సంశాన్త సర్వ సంకల్పా యా శిలావత్**
**అవస్థితిః, జాగ్రత్ నిద్రా వినిర్ముక్తా,**
**"స్వరూప స్థితిః పరా" ॥**

సమస్త సంకల్పములు మొదలంట్లా సశాంతించగా, ఏ స్థానము శిలవలె నిశ్చలంగా అవస్థితమై యున్నదో-జాగ్రత్-నిద్రారహితము అయినట్టి అదియే **"పరాస్వరూప స్థితి".**

---

**2. అహంతా అంశే క్షతే, శాన్తే**
**భేద నిష్పన్ద చిత్తతా,**
**అజడా యా ప్రచలతి,**
**తత్ 'స్వరూపమ్' ఇతి ఈరితమ్॥**

"అహమ్"నకు వివిధాంశాలు ఉన్నాయి. వాటిలో పెద్దగా చెప్పుకొనవలసినవి **(1) దేహమే నేను (2) ఈ విశ్వమే నేను (3) ఈ విశ్వమంతా దేహము** అగుచుండగా, అట్టి విశ్వమునకు వేరైన 'విశ్వదేహి'వి.

ఇదియే (1) వ్యష్టి (2) సమిష్టి (3) కేవలము. అన్నిటికన్నా అధమమైనది **"ఈ దేహమే (లేక) వ్యష్టిత్వమే - నేను"** అనేదే! అట్టి **"దేహమునకు దేహి మాత్రమే నేను"** - అను అహం ప్రవృత్తి నశించగా, **"జీవుడు వేరు - పరమాత్మ వేరు-జగత్తు వేరు"**-అను భేదము తొలగినట్టి (నిష్పందము- స్పందరహితము అయినట్టి) చిత్తము శేషిస్తుంది. అట్టి భేద నిష్పందమైనట్టి, అజడమైనట్టి చిత్‌యే "స్వరూపము" - అను శబ్దముచే చెప్పబడుతోంది.

---

**సప్త అజ్ఞాన భూమికలు**
**బీజ జాగ్రత్, తథా జాగ్రత్, మహాజాగ్రత్,**
**తథా ఏవ చ, జాగ్రత్ స్వప్నః, తథా స్వప్నః,**
**స్వప్నజాగ్రత్, సుషుప్తికమ్**
**ఇతి సప్తవిధో మోహః, పునః ఏష పరస్పరమ్ ॥**

సప్త అజ్ఞానభూమికలు - అజ్ఞానరూపమగు మోక్షము '7' అవస్థలు కలిగినదై ఉంటుంది. (1) బీజజాగ్రత్ (2) జాగ్రత్ (3) మహాజాగ్రత్ (4) జాగ్రత్‌స్వప్న (5) స్వప్న (6) స్వప్నజాగ్రత్ (7) సుషుప్తి. ఈ ఏడు అవస్థలే కాకుండా వీటివీటి కొంతకొంత మిశ్రమములచే అనేక రూపములుగా అవస్థలు ఏర్పడి ఉంటున్నాయి. ప్రతి భూమికలో అనేక చిలవలు, పలవలు ఉన్నాయి.

శ్లిష్టో భవతి అనేకాగ్ర్యం,
శృణు లక్షణం అన్య తు॥

అనేక రూపములై ప్రకటనమౌతూ ఉన్న వీటియొక్క ఆయా విశేషమైన లక్షణములు ఏ తీరైనవో చెప్పుతాను వినండి.

(1) బీజజాగ్రత్: ప్రథమం చేతనం, యత్ స్యాత్
అనాఖ్యం నిర్మలం చితః।
భవిష్యత్ చిత్త జీవాది
నామ శబ్ద-అర్థ భాజనమ్।
బీజరూప స్థితం జాగ్రత్,
“బీజ జాగ్రత్” తత్ ఉచ్యతే।

**(1) బీజ జాగ్రత్ అవస్థ**

ఈ ‘సృష్టి’ అనే చేతనము (కదలిక) ప్రారంభము అవటానికి మునుముందుగా కేవలమగు చైతన్యము మాత్రమే ఉన్నది. అది వాక్కుకు అందనిది. మాటలతో చెప్పబడలేనిది కాబట్టి ‘అనాఖ్యము’. విషయరహితము. కాబట్టి ‘అత్యంతనిర్మలము’. అట్టి కేవల చైతన్యమునందు : - బీజములో భవిష్యత్ వృక్షమునకు సంబంధించిన (ఆకులు-పూలు- కాయలు - పునరుత్పత్తి మొదలైన విశేషములన్నీ అప్రదర్శనశీలమై దాగి ఉన్నరీతిగా) భవిష్యత్‌లోని చిత్తము, జీవుడు, జగత్తు మొదలైన శబ్దార్థములన్నీ (బీజములోవలె) దాగి ఉన్నాయి. ఈ విధంగా నిశ్చలజలంలో భవిష్యత్ తరంగముల ఆకారాదులు దాగి ఉన్న రీతిగా - కేవల చైతన్యమునందు ఏఏ భవిష్యత్ జీవ-చిత్త-జగత్ రూపములు బీజరూపముగా దాగి ఉన్నాయో అదియే మొట్టమొదటిదగు **‘బీజజాగ్రత్’** అని పిలువబడుతోంది. ఈ బీజజాగ్రత్‌యే జ్ఞప్తికి, అహంభావనకు, దృశ్యానుభవత్వమునకు, త్వం జాగ్రత్ (‘నీవు’ అను భావనారూపమునకు)కు స్వస్థానము. అవన్నీ అరూపంగా దాగి ఉండి, తరువాత తరువాత ప్రదర్శనమవగల స్థానము - బీజజాగ్రత్।

ఏషా, జ్ఞప్తేః నవావస్థా
త్వం జాగ్రత్ సంస్థితమ్ శృణు।

నిర్మల కేవల చైతన్యముయొక్క తదనంతర - నూతనమగు అవస్థ అగు ‘జాగ్రత్’ గురించి ఇక విను.

2. జాగ్రత్ : నవ ప్రసూతస్య పరాత్ అయం చ
“అహం - ఇదం - మమ”
ఇతి యః ప్రత్యయః స్వచ్ఛః
“జాగ్రత్” ప్రాగభావనాత్ ॥

**(2) జాగ్రత్ అవస్థ :-**

కేవల చైతన్యమునుండి - ‘‘చేతనము’’- రూపంగా బీజజాగ్రత్ ప్రదర్శనమౌతోంది కదా! అట్టి బీజ-జాగ్రత్ నుండి అద్దానికి పరమై (వేరైన లక్షణముతో) “నేను - ఇది - నాది - అది / అతడు / ఆమె” - అను ఒకానొక వృత్తిజ్ఞానము (Avocative consciousness) ప్రదర్శితమగుచున్నది. అట్టి అహం-ఇదమ్-మమ ప్రారంభమే “జాగ్రత్-అవస్థ”.

(3) మహాజాగ్రత్ : అయం సోఽహమ్ ఇదం తన్మ ఇతి
జన్మాన్తరోదితః, పీవరః ప్రత్యయః
ప్రోక్తో, “మహాజాగ్రత్” ఇతి స్ఫుటమ్।।

**(3) మహాజాగ్రత్ అవస్థ :-**

అట్టి నేను - ‘ఇది, నాది’ రూప జాగ్రత్‌తో చైతన్యముయొక్క అనన్య (లేక) తన్మయ భావన ‘జన్మ’, ఆ తరువాత “మరొక జన్మ” - అను జన్మ-జన్మాంతరములుగా కొనసాగుచున్నది. అట్టి జన్మ-జన్మాంతర సంబంధముచేత - “నేను - నీవు - ఇది” - అను భావన ఆత్మకు వేరైనట్లుగా ప్రదర్శమవటమే ‘మహాజాగ్రత్ అవస్థ’.

(4) జాగ్రత్ స్వప్నము : అరూఢం, అథవా ఆరూఢం
సర్వథా తన్మయాత్మకమ్
యత్ జాగ్రతో మనో-రాజ్యం,
తత్ “జాగ్రత్ స్వప్న” ఉచ్యతే.

**(4) జాగ్రత్ స్వప్నము : - (ఊహాలోకం)**

జాగ్రత్‌లో ఉంటూనే ఆరూఢము అయినవి (Believed / Determined) (లేక) అరూఢముకానివి (Non Believed / Non-determined) (లేక) జాగ్రత్‌లో తన్మయమైన -ఆలోచనల సంబంధమైనవి - అగు ఆయా జాగ్రత్ దృశ్య సంబంధ విశేషాలతో మనస్సు నిర్మించుకొనే మనోలోకము - జాగ్రత్ స్వప్నము.

(5) స్వప్నము :
ద్విచంద్ర, శుక్తిక ఆరూప్య, మృగతృష్ణ - ఆది
భేదతః, అభ్యాసం ప్రాప్య జాగ్రత్ తత్ “స్వప్నః”
నానావిధో భవేత్ ॥

**(5)** స్వప్నము :- ఆకాశంలో కంటిదోషం చేత ఒక్క చంద్రుడు రెండు చంద్రబింబములుగా అగుపించటము, ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్లు అనిపించటము, ఎడారిలో కనిపించే ఎండమావులలో (మృగతృష్ణలో) నీరు ఉన్నట్లు అగుపించటము ఎటువంటిదో, అట్లాగే మనస్సు యొక్క అభ్యాసం ప్రభావం చేత స్వప్నములో నిదురించినప్పుడు ఏవేవో మనోకల్పిత నానావిధ భేద విశేషాలన్నీ అటువంటివి. జాగ్రత్ నుండి నిదురిస్తూ ఉండగా, ఊహాత్మకంగా అనుభవమయ్యేవి - “స్వప్నము”.

| | |
|---|---|
| అల్పకాలం మయా దృష్టం ఏతత్ న ఉదేతి<br>యత్ర హి, పరామర్శః ప్రబుద్ధస్య, స "స్వప్న"<br>ఇతి కథ్యతే' | -ఏదైతే స్వప్న సమయంలో 'నిజమే' అను రీతిగా **అనుభవించబడుతోందో,**<br>- "ఏ దృశ్యము నాకు కొద్ది సేపు కలలో కనిపించటం జరిగిందో అందులో నిజమనేది ఏదీ లేదు" - **అని మెలకువ వచ్చిన తరువాత పరామర్శ చేయబడుచున్నదో - అది స్వప్నము.**<br>ఆత్మయందు దృశ్యజగత్ - సంకల్పమే స్వప్నరూపముగా అనుభూత మౌతోంది. |
| **(6)** స్వప్నజాగ్రత్ :<br>చిరం సందర్శనాభావాత్, అప్రఫుల్లం బృహత్ వచః,<br>చిరకాల అనువృత్తిస్తు 'స్వప్నోజాగ్రత్' ఇవ<br>ఉదితః, "స్వప్న జాగ్రత్" ఇతి ప్రోక్తం ।<br>జాగ్రతి అపి పరిస్ఫురత్ ॥ | **(6) స్వప్నజాగ్రత్ :- (జాగ్రత్‌ను స్వప్నభావంతో సందర్శించడం)**<br>ఈ దృశ్య వ్యవహారమంతా చికరాలము దర్శించుచూ, ఇక తత్త్వార్థజ్ఞానమనకు ఈ జీవుడు సంసిద్ధుడై సాధన ప్రారంభిస్తున్నాడు. ఆ విధంగా ప్రయత్నశీలుడై ఉండి కూడా, "సోఽహమ్, తత్త్వమ్" వంటి మహావాక్యముల పరమార్థము అనుభూతికి స్వానుభవమునకు రాకుండా, కానీ ప్రయత్నశీలుడై ఉండే స్థితి 'స్వప్నజాగ్రత్'. జాగ్రత్‌ను అధ్యయంగా పరిశీలించు దృష్టి స్వప్నజాగ్రత్. ఈ స్థితిలో "జాగ్రత్ కూడా స్వప్నము వంటిదే" అని అనిపించసాగుతుంది. |
| **(7)** సుషుప్తి :<br>**4.** షట్ అవస్థా పరిత్యాగే జడా జీవస్య యా స్థితిః,<br>భవిష్యత్ దుఃఖ బోధాఢ్యా<br>"సౌషుప్తిః' స ఉచ్యతే గతిః।<br>జగత్ తస్యాం అవస్థాయాం అన్తః తమసి లీయతే॥ | **(7)** సుషుప్తి : - గాఢ నిద్రాస్థితి. "జన్మకుముందు-జన్మించటము-ఎదగటము-మధ్య వయస్సు వార్ధక్యము-దేహత్యాగము' - అనబడు 'షట్ (6) అవస్థలను పరిత్యజించినట్టి- ఈ జీవునియొక్క స్థితియే సుషుప్త స్థితి. భవిష్యత్‌కు సంబంధించిన 'దుఃఖావబోధ' అంతరంగమున శేషించియే ఉంటుంది కాబట్టి అది అవ్యాజము - కేవలము అగు ఆనందస్థితి కానేకాదు. అట్టి తమో అవస్థలో "సమస్తజగత్తు లీనమై, మరల మరొకప్పటికి ప్రదర్శనమునకు సంసిద్ధమై" ఉంటుంది. అనగా అది జగత్ - రాహిత్య స్థితి కాదు. "జగత్ అప్రదర్శిత జడ స్థితి" మాత్రమే. |
| "సప్త అవస్థా" ఇమాః ప్రోక్తా మయా అజ్ఞానస్య వై, ద్విజ।<br>ఏకైకా శతసంఖ్య అత్ర నానా విభవ రూపిణీ॥ | ఓ ద్విజోత్తమా! ఈ విధంగా మనము సప్త (7) అజ్ఞాన భూమికల (లేక అవస్థల) గురించి చెప్పుకున్నాము. '7' అవస్థలలో ప్రతి ఒక్క అవస్థతో కొంతగా కలిసి- వందలాది భూమికలు (లేక) అవస్థలు ఏర్పడినవై ఉంటున్నాయి. అవన్నీ నానావిధములైన విభవముల రూపంగా ప్రదర్శనమగుచూ, ఆత్మయొక్క సమక్షంలో 'కల్పనాక్రీడ' వలె ప్రదర్శనమగుచున్నాయి. |
| సప్తజ్ఞాన భూమికలు<br>ఇమాం సప్తపదాం జ్ఞానభూమిం ఆకర్ణయ, అనఘ!<br>న అనయా అజ్ఞాతయా భూయో, మోహపంకే నిమజ్జతి ।<br>వదన్తి బహు భేదేన వాదినో యోగ భూమికాః ॥<br>మమ తు అభిమతా నూనం ఇమా ఏవ శుభప్రదాః ।<br>అవబోధం విదుర్ జ్ఞానం తత్ ఇదం సాప్త భూమికమ్।<br>ముక్తిస్తు 'జ్ఞేయం' ఇత్యుక్తా భూమికా సప్తకాత్ పరమ్ ॥ | **సప్త (7) జ్ఞాన భూమికలు**<br>ఓ పాప దోష రహితుడా! నిదాఘా! ఇప్పుడిక సప్త (7) జ్ఞానభూమికల గురించి చెప్పుకుందాము. ఇవి ఎరుగకపోతే మరల మరల మోహ పంకములలో ఈ జీవుడు మునగగలడు. ఈ జ్ఞానభూమికల గురించి వేరువేరు ప్రవక్తలు వేరువేరు విధాలుగా చెబుతూ ఉంటారు. ఏ రీతి అయిన 'ఆరూఢి'గా ఎరగటము నీకు శుభప్రదమో, ఉత్తేజము కాగలదో ఆ రీతిగా విశ్లేషించి, నాకు చెప్పాలనిపించినట్లుగా సప్త భూమికా విశేషాలను చెప్పుచున్నాను. సప్తభూమికాజ్ఞానమే ఆత్మజ్ఞాన విశ్లేషణము. సప్త భూమికలకు పరము (Beyond)అగు జ్ఞేయ వస్తువే 'ముక్తి'-అయి ఉన్నది. వాటికి ఆవల ఉండి సమస్తము తెలుసుకొనుచున్నదే జ్ఞేయమగు ఆత్మ। |
| **5.** జ్ఞానభూమిః 'శుభేచ్ఛా' ఆఖ్యా ప్రథమా<br>సము దాహృతా। "విచారణా" ద్వితీయా తు ।<br>తృతీయా "తనుమానసీ" ।<br>"సత్త్వాపత్తిః" చతుర్థీస్యాత్ । తతో "అసంసక్తి" నామికా ।<br>"పదార్థ భావనా" షష్ఠీ, సప్తమీ "తుర్యగా" స్మృతా ॥<br>ఆసామ్ అన్తస్థితా ముక్తిః, యస్యాం భూయో న శోచతి ।<br>ఏతాసాం భూమికానాం, త్వం ఇదం నిర్వచనం శృణు ॥ | **సప్తజ్ఞాన భూమికలు**<br>(1) శుభేచ్ఛ (2) విచారణా (3) తనుమానసి (4) సత్త్వాపత్తి, (5) అసంసక్తి (6) పదార్థభావన (7) తుర్యగము<br>వీటికి ఆవల 'ముక్తి' స్థానము. సప్తభూమికలను అభ్యాసపూర్వకంగా తెలుసుకొని, ముక్తిని క్రమంగా సిద్ధించుకుంటున్న అభ్యాసి - ఇక మరల దేనికీ శోకించడు. (All worries vanish). అందుచేత అట్టి సప్త జ్ఞాన భూమికలు - నిర్వచనము చెప్పుకుంటున్నాము. |

"స్థితః కిం మూఢ ఏవ అస్మి? ప్రేక్షే అహం
శాస్త్ర సజ్జనైః", వైరాగ్య పూర్వం ఇచ్ఛా
ఇతి – "<u>శుభేచ్ఛా</u>" ఇతి ఉచ్యతే బుధైః॥

**(1) శుభేచ్ఛా భూమిక :**

"ఇదేమిటి? అశాశ్వతము, కాలబద్ధము, సందర్భ పరిమితము అగు విషయములను పట్టుకొని, అవి ఇస్తూ ఉన్న <u>సుఖ-దుఃఖ సంకెళ్లలో</u> చిక్కుకొని అనేక యాతనలు పడుచున్నానే! మూఢుడను అగుచున్నానే! కనుక అల్పాశయములను జయించి మహదాశయుడను కావాలి" - అని తలచి శాస్త్ర - సజ్జన సాంగత్య - వైరాగ్య పూర్వక ఇచ్ఛ పొందటమును 'శుభేచ్ఛ' అని విజ్ఞులు పిలుస్తున్నారు.

---

శాస్త్ర సజ్జన సంపర్క వైరాగ్య – అభ్యాస
పూర్వకమ్, సదాచార ప్రవృత్తిః యా,
ప్రోచ్యతే సా "<u>విచారణా</u>" ॥

**(2). విచారణ భూమిక :**

ఇంద్రియ విషయములపట్ల వైరాగ్యము అభ్యసిస్తూ, సదాచారము (Positive and flaw less conduct) ఆశ్రయిస్తూ శాస్త్రములను పరిశీలించటము; సజ్జనులతో తాత్త్వికచింతన చేయటము - ఇది **రెండవ జ్ఞానభూమికయగు 'విచారణ'.**

---

విచారణా శుభేచ్ఛాభ్యాం
ఇంద్రియ అర్థేషు రక్తతా,
యత్ర సా తనుతామేతి
ప్రోచ్యతే "<u>తను మానసీ</u>" ॥

**(3) తనుమానసా భూమిక :**

శుభేచ్ఛ, విచారణ భూమికల దీర్ఘమైన అభ్యాసముయొక్క ఫలితంగా (ఇంద్రియార్థముల పట్ల శబ్ద స్పర్శ రూప రస గంధములపట్ల) అనురక్తత తరగుచూ, శుష్కించుచూ ఉండటమును -3వ భూమికయగు 'తనుమానస' అనబడుచున్నది.

(తను=తరగుచున్న, మానసా = ఇంద్రియ విషయ ప్రియమనో అభ్యాసము.)

---

**6.** భూమికా త్రితయాభ్యాసాత్, చిత్తే తు
విరతేః వశాత్, సత్త్వ – ఆత్మని స్థితేశుద్ధే
"<u>సత్త్వాపత్తిః</u>" ఉదాహృతా ॥

**(4) సత్త్వాపత్తి భూమిక :**

పైవిధంగా 'శుభేచ్ఛ-విచారణ-తనుమానస' - అనే మూడు భూమికలను అభ్యాసముచేస్తూ ఉండగా, అట్టి అభ్యాసియొక్క చిత్తము అశాశ్వతము, కల్పనామయము, అనేక దోష ధ్యాసల, దృష్టుల అంతిమ ప్రయోజనముగా కలిగినవి - అగు దృశ్య విషయ సాంగత్యము నుండి చిత్తము-విరతి (Non Participation, Withdrawl) పొందసాగుతుంది. చిత్తము (లేక మనస్సు) ఆతని వశంలో ఉండటం ప్రారంభిస్తోంది. క్రమంగా అసత్యమగు దృశ్య విషయాలను వదలి సత్యము, శుద్ధము అగు ఆత్మయందు స్థితి (నిలకడ) పొందటం ప్రారంభిస్తుంది. ఈ భూమికను 'సత్త్వాపత్తి' (సత్-గుణమునందు సుస్థిరత) - అని అంటారు.

---

దశా చతుష్టయ అభ్యాసాత్ అసంసర్గ
ఫలా తు యా, రూఢ సత్త్వచమత్కారా
ప్రోక్తా "<u>అసంసక్తి</u>" నామికా ॥

**(5) అసంసక్తి భూమిక :**

ఆ విధంగా దశాచతుష్టయము (4 దశలను) అభ్యసిస్తూ ఉంటే - విషయములలతో అసంసక్తి (Non Participation. Withdrawl) దృఢం అవనారంభిస్తోంది. 'సక్తత' తగ్గుతూ వస్తున్న చమత్కారమును (అసతోమా సద్గమయ) - 'అసంసక్తి' అని పిలుస్తున్నారు.

---

భూమికా పంచకాభ్యాసాత్ స్వాత్మారామ
తయా దృఢమ్, అభ్యంతరాణాం బాహ్యానాం
పదార్థానాం అభావనాత్ ॥
పర ప్రయుక్తేన చిరం ప్రయత్నేన అవబోధనమ్,
"<u>పదార్థ (అ)భావనా</u>" నామ షష్ఠీ భవతి భూమికా ॥

**(6) పదార్థభావనాభూమిక (పదార్థా భావనాభూమిక) :**

పంచ (5) భూమికలు అయినట్టి "శుభేచ్ఛ, విచారణ, తనుమానస, సత్త్వాపత్తి, అసంసక్తి లను దీర్ఘకాలము అభ్యాసము చేస్తూ ఉండగా అట్టివాడు జగత్తునందు రమించుటను తగ్గించుకుంటూ "కేవలాత్మ" అనబడు - 'స్వ-ఆత్మారామము'నందు రమించటము ప్రారంభించుచున్నాడు. ఆత్మారాముడై, బాహ్యమున వస్తు-విషయ-నామ-రూపధ్యాసలను జయిస్తూ జగత్తులో వస్తు దృష్టిని వదలసాగుతాడు. "ఆత్మయే ఈ సమస్తము" అను ఆత్మ వస్తు-దృష్టిని ధారణ చేయసాగుతాడు. పరతత్త్వము గురించే వినుచూ,

మాట్లాడుతూ పరతత్త్వమునందు 'నియమితుడు' అవుతాడు. అట్టి 'పరప్రయుక్తము'నకు సంబంధించిన చిరకాల ప్రయత్నముచే పరబ్రహ్మము గురించిన బోధ (Message/cognition/cogitation) ప్రవృద్ధము అవుతూ ఉండగా, - "పదార్థ భావన" (పదార్థాభావన) అను ఆరవ భూమికలో ప్రవేశము పొందుచున్నాడు. (ఇక్కడ పదార్థము అనగా మూలపదార్థమగు కేవలాత్మ. జగత్ పదార్థ అభావన, ఆత్మ పదార్థ భావన - ఇద్దాని విశేషము.

**భూమి షట్ (6) చిరాభ్యాసాత్ భేదస్య**
**అనుపలంభనాత్,**
**యత్ స్వభావైక నిష్ఠత్వం సా జ్ఞేయా**
**"తుర్యగా" గతిః॥**
**ఏషా హి జీవన్-ముక్తేషు తుర్య అవస్థేతి విద్యతే,**

**(7) తుర్యగ భూమిక :**

ఈ విధంగా షట్ (6) భూమికల చిరకాల అభ్యాసముచేత ఆతడు జీవాత్మ - పరమాత్మల, జగత్తు - జగదీశ్వరుల, త్వమ్-తత్‌ల, అహమ్-తత్‌ల భేదభావనల వెంటబడక, వాటిని దాటివేయగలుగుతూ ఉంటాడు. అభేదము, అనన్యత్వము ఆశ్రయిస్తూ ఉంటాడు. సూక్ష్మభావనను సిద్ధింపజేసుకుంటూ తుర్యగ భూమికలో ప్రవేశిస్తున్నాడు. ఈవిధంగా 'తుర్యగము' అనబడు '7'వ భూమికలో ప్రవేశించిన వానిని జీవన్ముక్తుడు అని కూడా అంటారు.

**7. విదేహ ముక్తి విషయం "తుర్యాతీతమ్"**
**అతః పరమ్। యే, నిదాఘ !**
**మహాభాగాః సప్తమీం భూమిం ఆశ్రితాః ॥**

**తురీయాతీతము :**

ఆ విధంగా '7' భూమికలను అభ్యాసము చేస్తూ ఉండగా ఆ ముముక్షువు తుర్యగ భూమికను కూడా దాటిపోయి 'తుర్యాతీతము'ను చేరుచున్నాడు. అది భూమిక కాదు. స్థానము.

- అట్టి తురీయాతీత స్థితి (లేక) స్థానమునకు 'విదేహముక్తి'యే విషయము. ఓ నిదాఘా! మహాభాగా! మహాశయా! భూమికాభ్యాసమయి, సప్తభూమికలను అభ్యసించుచూ, సప్తభూమికలను అధిగమించి, స్వాభావికంగా **'తుర్యగాతీతుడు' (లేక) 'విదేహముక్తుడు'** అగుచున్నాడు.

**"ఆత్మా ఆరామా, మహాత్మానః"**
**తే మహాపదం ఆగతాః**
**జీవన్ముక్తా న మజ్జన్తి**
**సుఖ దుఃఖ రసస్థితే, ప్రకృతేన అథ కార్యేణ**
**కించిత్ కుర్వన్తి వా, న వా ॥**

అట్టిది **'మహాపదము'**. అట్టివాడు ఆత్మయందే రమించుచు, **'మహాత్ముడు'** అనబడుచున్నాడు. '7'వ భూమికయగు తుర్యగములో ప్రవేశించి, అభ్యాసము కొనసాగిస్తూ క్రమంగా 'ఆత్మారాముడు'అగుచున్నాడు. మహాత్ముడై మహాపదమునకు చేరిన మహనీయుడు జీవన్ముక్తుడగుచున్నాడు. ఇక ఆతడు అట్టి సుఖదుఃఖస్థితులలో ఏమాత్రము కూడా చిక్కడు. అనగా ఈ జగత్తులో కనిపించే సుఖదుఃఖవ్యవహారములు నిజమనుకోడు. **"సర్వకార్యములు ప్రకృతియే నిర్వర్తిస్తోంది. నాకేమీ సంబంధము లేదు, బంధము లేదు"**- అను ఆత్మసంబంధమైన ఎరుక అనుభవములను పుణికిపుచ్చుకొని ఉంటున్నాడు. తాను చేసినా, చేయకున్నా కూడా దేనికీ కర్తకాడు. అకర్త కూడా కాడు. సమస్తమునకు కేవలసాక్షి అయి వెలుగొందుచున్నాడు.

**పార్శ్వస్థ బోధితాః, సన్తః**
**పూర్వ ఆచార క్రమ ఆగతమ్,**
**ఆచారం ఆచరంత్యేవ,**
**సుప్త బుద్ధవత్ ఉత్థితాః ॥**

ఇక ఆతడు ప్రపంచంలో ఆయా కార్యములు చేస్తాడా? చేయడా? సమాధానం విను. జగత్తును స్వస్వరూపముగా దర్శించుచుండటంచేత , స్వాభావికంగానే ప్రేమాస్పదుడై ఉంటాడు. ప్రక్కవారిచేత, ఆయా సందర్భములచేత-బోధితుడై (గుర్తుచేయబడుచూ), తాను ఉన్నచోట శాస్త్ర, -శిష్ట-ఆచారములను అనుసరించి, ఆ క్రమంగా చేస్తూ ఉంటాడు. నిద్రపోతున్నవాడు నిద్రను కొనసాగిస్తూనే ఏదైనా వస్తువు తనను తాకినప్పుడు అసంకల్పితంగా స్పందించుతీరుగా ఈ ప్రపంచంలో అసంకల్పితంగా (Thought Less / Plan less Responses) - ప్రాపంచిక సందర్భ స్పందనములు దర్శిస్తూ, స్పందిస్తూ, నిర్వర్తిస్తూ ఉంటాడు.

| | |
|---|---|
| **భూమికా సప్తకం చ ఏతత్ ధీమతాం ఏవ గోచరమ్।**<br>**ప్రాప్య జ్ఞానదశాం ఏతాం పశు మ్లేచ్ఛ ఆదయో అపి యే॥**<br>**సదేహావ అపి అదేహావ**<br>**తే ముక్తా। న అత్ర సంశయః॥** | ఓ నిదాఘా! బుద్ధిచేతనే 7 భూమికలు తెలియవస్తాయి. అంతేగాని అవి భౌతికమైన వేషధారణవంటివి కాదు. ఉపాధులకు సంబంధించినవి కాదు. సాంఘిక (కుల) విభజనలవంటిది కాదు. పశువులు, మ్లేచ్ఛులు మొదలైన వారిలో కూడా సప్తజ్ఞాన భూమికలను సిద్ధించుకొన్నవారు ఉంటారు. అంతేగాని అది ఒక జాతికో, కులమునకో సంబంధించి పరిమితమైనది కాదు. |
| **8. స–దేహా వా, అస్య అ–దేహా వా, తే అత్ర ముక్తా।**<br>**తే ముక్తా న అత్ర సంశయః ।**<br>**జ్ఞప్తిః హి (జ్ఞప్తిర్హి) గ్రన్థి విచ్ఛేదః**<br>**తస్మిన్ సతి విముక్తతా ॥** | మనము చెప్పుకున్న జ్ఞానభూమికలలో విహరించు వారు - దేహము కలిగి ఉన్నప్పుడు , దేహము లేనప్పుడు కూడా - ముక్తులే. ఇందులో అనుమానము లేదు. (బ్రహ్మగ్రంథి - విష్ణుగ్రంథి - రుద్రగ్రంథి ఇత్యాది) జ్ఞప్తికి (జగత్తు గురించిన జ్ఞాపకమునకు) సంబంధించిన గ్రంథుల విచ్ఛేదమే- సంసారబంధ - విముక్తి. |
| **"మృగతృష్ణ అంబు"–బుద్ధి ఆది,**<br>**శాన్తి మాత్ర ఆత్మకస్తు అసౌ,**<br>**యే తు మోహార్ణవాత్ తీర్ణాః**<br>**తైః ప్రాప్తం పరమం పదమ్ ॥** | సప్తభూమికలను అభ్యాసము చేయుచూ, తురీయతీతమును అనునిత్య స్వాభావికంగా చేసుకోవటం ఎటువంటిదంటే - మృగతృష్ణలో జలము యొక్క భ్రాంతి వంటిదగు 'మహత్' (సమిష్టి, 'నేను') నుండి -స్థూలమగు 'అహమ్' వరకు గల "దేహభ్రాంతులు" సశాంతించిన స్థితి. ఎవ్వరు దృశ్యముపట్ల ఏర్పడిన మోహ-అజ్ఞానసాగరమునుండి ఆవలివడ్డుకు చేరుతారో - వారే 'పరమపదము'ను పొందినట్టివారు. |
| **తే స్థితా భూమికాసు ఆసు స్వాత్మ లాభ పరాయణాః ।**<br>**మనః ప్రశమన ఉపాయోః**<br>**"యోగ"– ఇతి అభిధీయతే॥** | సప్తభూమికలను అభ్యాసము చేయువారు ఇక దృశ్యలాభముల వైపుగా పరుగులు తీయరు. "స్వాత్మారామపరాయణులు" అగుచున్నారు. మనస్సు ఆత్మయందు సశాంతించు ఉపాయమే 'యోగము' అను శబ్దముయొక్క అర్థము. మనస్సును జయించు మార్గమే యోగము. |
| **సప్తభూమిః సవిజ్ఞేయః,**<br>**కథితాః తాశ్చ భూమికాః**<br>**ఏతసాం భూమికానాం తు**<br>**గమ్యం "బ్రహ్మ అభిదం పదమ్" ॥** | "అట్టి 'యోగము' యొక్క అభ్యాసమే సప్త (7) భూమికలు" అని కూడా గ్రహించెదవుగాక.<br>సప్తభూమికల గమ్యము **"పరబ్రహ్మపదమే".** |
| **త్వత్తా, అహన్తా ఆత్మతా యత్ర పరతా**<br>**న అస్తి కాచన, న క్వచిత్ భావ కలనా,**<br>**న భావ – అభావ గోచరా।** | అట్టి పరబ్రహ్మపదము ఎటువంటిదంటే :....<br>- "నీవు, ఆతడు, నేను" అను చిత్తవృత్తులు ఏమాత్రము పొడచూపనట్టిది.<br>- భావ-అభావములకు మునుముందే ఉండినట్టిది। భావాభావములజాడ కనబడనట్టిది । |
| **సర్వం శాన్తం నిరాలమ్బం వ్యోమస్థం శాశ్వతం**<br>**శివమ్, అనామయమ్, అనాభాసం,**<br>**అనామకమ్, అకారణమ్ ॥** | - సమస్తము అయినట్టిది । పరమశాంతరూపము ।<br>- ఏదీ కూడా అద్దానికి ఆధారము కాదు । సమస్తమునకు ఆధారము అట్టి బ్రహ్మీతత్త్వమే.<br>- ఆకాశము వలె నిర్విషయము । - త్రికాలములచే స్పృశించబడనిది । శాశ్వతమైనది।<br>- సమస్త శుభ-శాంతి-సుఖ-ఆనందప్రదాత।<br>- ఆభాసము కానట్టిది. (It is not reflective. It is original by itself). నామరూపరహితము । అకారణము ।<br>అట్టి స్వస్వరూప - సర్వస్వరూప పరబ్రహ్మము :- |

**9.** **న సత్ । న అసత్। న మధ్య - అంతమ్ ।**
**న సర్వం । సర్వం ఏవ చ । మనో వచోభిః**
**అగ్రాహ్యం।**
**పూర్ణాత్ పూర్ణం। సుఖాత్ సుఖమ్।**

✠ సత్తు (ఎదురుగా ఉన్నది) కాదు. ✠ అసత్తు (ఇక్కడ లేనిది) కాదు.
✠ ఉండీ - లేనిది కాదు. మధ్యలోనో చివరిలోనో ఉన్నది కాదు. ఈ కనబడే సమస్తము కాదు.
✠ ఈ సమస్తము అయి ఉండకపోనూలేదు. ఈ సమస్తము అదియే.
✠ వాక్కుచేత, మనస్సుచేత గ్రహించబడేది కాదు. అగ్రాహ్యము.
✠ అది పూర్ణమునకే పూర్ణము
✠ సర్వసుఖ ప్రదాత. సుఖమునకే సుఖస్వరూపము.

---

**అసంవేదనం । అశాన్తం । ఆత్మవేదనం ఆతతమ్ ।**
**సత్తా సర్వ పదార్థానాం। న అన్యో సంవేదనా దృతే ।**
**సంబన్ధే ద్రష్టృ దృశ్యానాం**
**మధ్యే దృష్టిః హి యత్ వపుః**
**ద్రష్టృ - దర్శన - దృశ్యాది - వర్జితం**
**తత్ ఇదం పరమ్॥**

✠ తెలియబడుచున్నదేదీ కాదు. తెలుసుకొంటున్నదే అది. తెలియబడేదంతా అద్దాని సంప్రదర్శనమే.
✠ శాంత స్వరూపము (మౌనస్వరూపము) కూడా కాదు.
✠ ఆత్మచేతనే ఆత్మగా తెలియవచ్చునది.
✠ సర్వ పదార్థములకు సత్తా (ఉనికి) ను ప్రసాదించునది. సమస్తము యొక్క సత్తాస్వరూపము.
✠ అద్దానికి వేరుగా "ఏదీ తెలియబడటము" అనునది లేదు. తెలియబడుచున్నట్టిది కాదు.
✠ ద్రష్ట - దృశ్యముల మధ్యగా దృష్టి రూపముగా సంప్రదర్శనమగుచూ ఉన్నట్టిది. 'దృక్' రూపముగా వేంచేసియున్నది.
- ద్రష్ట - దృశ్య - దర్శన త్రిపుటీరహితము. త్రిపుటీ అతీతము. మధ్యగా ఉన్నదంతా కూడా అదియే। అదియే ఇదంతా ! అది సర్వదా ఈ సమస్తమునకు పరము । అదియే నీవు । అదియే నేను। సమస్తము 'తానే' అయి, సమస్తమునకు వేరై కూడా ఉన్నట్టిది।

---

**దేశాత్ దేశం గతే చిత్తే - మధ్యే యత్**
**చేతసో వపుః, "<u>అజాడ్య సంవిత్ మననం</u>",**
**తన్మయో భవ సర్వదా ।**
**అజాగ్రత్ స్వప్న నిద్రస్య యత్తే రూపం సనాతనమ్,**
**అచేతనం చ, అజడం చ తన్మయో భవ సర్వదా ॥**

ఓ నిదాఘా! నీకొక 'సాధన' లేక 'ఉపాయము'-ఆత్మస్వరూపసిద్ధికొరకై - సూచిస్తున్నాను. విను.
**ఒక స్థానము (లేక, ఆలోచననుండి మరొకస్థానము (లేక ఆలోచనకు) వెళ్ళుచున్న చిత్తము మధ్యలో ఏ చేతనము (ఎరుక)గా సంస్థితమైయున్నదో, అట్టి అజాడ్యమగు (నిద్రా భావములేనట్టి) సంవిత్ (సత్+చిత్)ను మననము చేస్తూ సర్వదా తన్మయుడవై ఉండుము.**
జాగ్రత్ స్వప్న సుషుప్తులకు మునుముందే ఏర్పడినదై ఉన్న నీయొక్క అచేతనము (కదలిక లేనిది), అజడము అగు కేవల స్వరూపమును గమనించు. అదియే నీవై ఉండుము.

---

**జడతాం వర్జయిత్వా, <u>ఏకం శిలాయా</u>**
**హృదయం హి తత్, <u>అమనస్క స్వరూపం</u>**
**యత్, తన్మయో భవ సర్వదా।**
**చిత్తం దూరే పరిత్యజ్య**
**యోఽసి సోఽసి స్థిరోభవ।**

జడత్వము (Passive, Drowsy, Lazy) ను త్యజించివేయుము. హృదయమును ఏకశిలాస్వరూపముగా రూపు చేసికొనుచుండుము. ఆలోచనలకు కూడా సాక్షివై, ఆలోచనలకు జనన స్థానమై, అమనస్కుడవగుచూ, మనస్సుకు ఆవలగల స్వస్వరూపము నందు తన్మయుడవై ఉండుము.
వస్తువులపై, విషయములపై సంబంధ - అనుబంధములపై **"ఇష్టము/ధ్యాస"** - రూపమగు చిత్తమును మొదలంట్లా పరిత్యజించి, అప్పటికీ ఏది శేషిస్తుందో, అద్దానియందు సుస్థిరుడవై ఉండుము.

---

**10.** **పూర్వం మనః సముదితం**
**పరమాత్మ తత్త్వాత్ తేన ఆతతం,**
**జగదిదం సవికల్పజాలమ్,**
**శూన్యేన శూన్యం అపి, విప్ర!**
**యథా అంబరేణ నీలత్వం ఉల్లసతి**
**చారుతరం అభిధానమ్॥**

ఓ విప్రా! నిదాఘమహాశయా! ఆకాశము వాస్తవానికి శూన్యాతి శూన్యము (ఏ పదార్థము లేనట్టిది). కానీ నీలంగా కంటికి కనబడుచూ, ఏదో నీలపు పదార్థముతో నిండి ఉన్నట్లు అనిపిస్తూ ఉంటుంది.
అట్లాగే సమస్తమునకు మునుముందే ఉన్నట్టి కేవలాత్మతత్త్వము శూన్యము, నిర్వికల్పము అయిఉండి, అద్దానియందు సవికల్పజాలముతో కూడిన ఈ దృశ్యజగత్తు అనుభూతమై, ఉల్లసితమై అగుపించటము, అనిపించటము జరుగుతోంది. అయినా కూడా, సర్వాత్మకమగు స్వస్వరూపాత్మ సర్వదా యథాతథము.

సంకల్ప సంక్షయవశాత్ గళితే తు చిత్తే
సంసార మోహ మిహికా గళితా భవన్తి॥
స్వచ్ఛం విభాతి శరదీవ ఖమ్ ఆగతాయాం,
'చిత్' మాత్రమ్-ఏకం, అజం, ఆద్యం, అనన్తం, అన్తః॥

సంకల్పము (Assumption & Pressumption) చేతనే చిత్తము రూపుదిద్దుకుంటోంది. సంకల్పము క్షయిస్తూ ఉన్న మరుక్షణం సంసారమోహరూపము దాల్చియున్న చిత్తము తనకు తానే రహితమగుచున్నది. నాశనము అగుచున్నది.

శరత్కాలంలో ఆకాశము నిర్మలమై (మేఘరహితమై) ప్రకాశించుచున్నట్లుగా **చిదాకాశము** → ఏకమై, కేవలచిత్ - మాత్రమై, సమస్తమునకు ఆదిస్వరూపమై, అజమై (జన్మరహితమై), అనన్తమై, సమస్తమునకు ఆవల-ప్రకాశించుచున్నది. అయ్యది అంతరమునే అనుభవమగుచున్నది. (బాహ్యమున కాదు) (It has to be seen and enjoyed within, but not else where)

---

అకర్తృకం అరంగం చ, గగనే చిత్రం ఉత్థితమ్,
అద్రష్టృకం, స్వానుభవం,
అనిద్ర స్వప్న దర్శనమ్।
సాక్షి భూతే సమే స్వచ్ఛే నిర్వికల్పే చిత్ ఆత్మని,
నిరిచ్ఛం ప్రతిబింబంతి జగన్తి ముకురే యథా॥

ఆకాశంలో ఏ చిత్రకారుని ఇచ్ఛ. చిత్రలేఖనము లేకుండానే ఆయా అనేక రంగులు, రూపములు అగుపిస్తూ ఉన్నట్లు, ఈ కనబడేదంతా "-ద్రష్టలేకుండానే దృశ్యము వచ్చిందా?.....,
- నిద్రలేకుండానే స్వప్నంగా దర్శనము జరుగుతోందా?"
అనినట్లు కనిపిస్తూ ఉన్నది.

వస్తువు యొక్కగాని, - అద్దము యొక్క గాని, ఇష్టము, ఉద్దేశ్యము లేకుండానే ఆ అద్దములో ఆ వస్తువు ప్రతిబింబిస్తూ (స్వాభావికంగానే) కనిపిస్తూ ఉంటుంది కదా ।

అట్లాగే
**"కేవలము సాక్షిభూతము, సర్వత్రా సమరూపము, స్వచ్ఛము, నిర్వికల్పము"** అగు చిదాత్మయందు ఎట్టి ఇచ్ఛ లేకుండానే జగద్దృశ్యమంతా ప్రతిబింబించటము స్వాభావికంగా జరుగుతూ పోతోంది.

---

**11.** ఏకం బ్రహ్మ చిత్ – ఆకాశం,
సర్వాత్మకమ్ అఖండితమ్, ఇతి భావయ యత్నేన
చేతః చాంచల్య శాంతయే॥
రేఖా ఉపరేఖావళితా
యథా ఏకా పీవరీ శిలా,
తథా త్రైలోక్య వళితం
బ్రహ్మైకం ఇహ దృశ్యతామ్ :
ద్వితీయ కారణ అభావాత్ అనుత్పన్నం ఇదం జగత్॥

ఓ నిదాఘా! అనేక భేదములను దర్శించు వ్యసనము ప్రదర్శించుచున్న నీ చిత్తముయొక్క చాంచల్యము శమించాలి. "ఏకము, చిత్ ఆకాశస్వరూపము, సర్వాత్మకము, అఖండము" - అగు బ్రహ్మమే-ఇదంతా అను భావనను ఆశ్రయించు, నిత్యాభ్యాసివి అగుము. **"అదియే నేను"** అని-అనిపించేవరకు అనుకుంటూ ఉండు. భావనను యత్నపూర్వకంగా చేయి.

ఒకపెద్ద శిల అనేక చిన్న - పెద్ద రేఖలతో కనిపిస్తూ ఉన్నట్లుగా -ఏకమగు బ్రహ్మమునందు మర్త్య-పాతాళ-స్వర్గ త్రిలోకములు అగుపిస్తూ ఉన్నాయి.

ఆత్మ సర్వదా అద్వితీయము. ఆత్మకు ద్వితీయమై ఏదైనా ఉండటానికి కారణమే లేదు. కాబట్టి ఈ జగత్తు ఆత్మయందు ఉత్పన్నమే అయి ఉండలేదు. ఈ జగత్తునకు జన్మించటమనునదే లేదు. నశించటము లేదు.

---

జ్ఞాతం జ్ఞాతవ్యం అధునా। దృష్టం ద్రష్టవ్యం అద్భుతమ్।
విశ్రాంతోఽస్మి చిరం శ్రాంతః।
చిత్ మాత్రాత్ నాస్తి కించన ॥ –
– పశ్య విశ్రాన్త సందేహం, విగత అశేష కౌతుకమ్ ।
నిరస్తకల్పనాజాలమ్, అచిత్తత్వం పరంపదమ్॥

ఆహా! అద్వితీయమగు, ఈ జగత్తుయొక్క వాస్తవ స్వరూపమగు, అహం-త్వమ్‌ల శాశ్వతానందరూపమగు **"ఆత్మ"** గురించి తెలుసుకొనుచూ ఉండగా
- తెలుసుకోవలసింది తెలుసుకొన్నవాడను అగుచున్నాను.
- చూడవలసిన 'ఉన్నసత్యము'ను చూచుచున్నవాడనగుచున్నాను.
**"కేవలచిత్ (ఎరుక/ప్రజ్ఞ) యొక్క విన్యాసమే ఇదంతా!"**
అని తెలుసుకొని ఇంతకాలపు శ్రమ తొలగినది". - అని ఎలుగెత్తి పలుకు. విశ్రాంతిని ఆస్వాదించు.
ఓ నిదాఘా! అన్ని సందేహములనుండి విగతుడవై (Having come out), కౌతుకము (Inquisitiveness) లతో కూడిన సర్వకల్పనాజాలమును రహితం చేసి - "అచిత్తస్వరూపమగు పరమపదము"ను ఆశ్రయించు.

| | |
|---|---|
| త ఏవ భూమతాం ప్రాప్తాః, సంశాన్త<br>అశేష కిల్బిషాః, మహా ధియః శాన్త ధియో<br>యే యాతా విమనస్కతామ్॥ | కల్పనారూప మనస్సు ఆత్మయందు సశాంతించుచుండగా, బుద్ధియొక్క దోషములన్నీ తొలగిపోవుచుండగా, అమనస్కస్థితి (మనస్సుకే నియామకమగు స్వస్వరూపస్థితి) పొందుచుండగా -అట్టివారు భూమతమును (సప్తభూమికాసిద్ధిని) పొందుచున్నారు. |
| జన్తోః కృత విచారస్య, విగళత్ వృత్తి చేతసః<br>మననం త్యజతో నిత్యం<br>కించిత్ పరిణతం మనః ॥ | అనునిత్యమగు ఆత్మవిచారణచే చిత్తవృత్తులన్నీ విగళితము (రహితము) అగుచుండగా, ఉత్తమబుద్ధితో దృశ్య మననము త్యజించుచుండగా, ఆపై కించిత్ మనన-ధారణలచే బ్రహ్మభావము సిద్ధించగలదు. |
| 12. దృశ్యం సంత్యజతో హేయమ్, ఉపాదేయమ్<br>ఉపేయుషః, ద్రష్టారం పశ్యతో<br>నిత్యం, అద్రష్టారం అపశ్యతః ॥<br>విజ్ఞాతవ్యే పరే తత్త్వే జాగరూకస్య జీవితః,<br>సుప్తస్య ఘన సమ్మోహమయే సంసార వర్త్మని ॥ | హేయ (వదలటము) - ఉపాదేయ (స్వీకరించటము) - అను ద్వంద్వ ములతో కూడిన దృశ్యమును పరిత్యజించి (By leaving aside) కేవల ద్రష్టను దర్శించువాడే సత్యదర్శి. దృక్ స్వరూపమును చూస్తూ, ఈ సమస్తమును దృక్ స్వరూపమునకు అనన్యముగా చూచువాడే ఆత్మదర్శి.<br>తెలుసుకోవలసినట్టి పరతత్త్వమునందు సర్వదా జాగరూకుడైనవాడు, ఘనీభూత మోహ(Illusion) రూపమగు సంసార మార్గముల పట్ల నిద్రించువాడు (త్యజించి ఉండువాడు) - స్వస్వభావమగు ఆత్మస్థానమును సమీపిస్తున్నాడు. అజాగరూకుడై ఆత్మజ్ఞానముపట్ల నిదురించివాడు దట్టమగు 'సంసారాంధకారం'లో చిక్కుకుంటున్నాడు. |
| అత్యన్త పక్వ వైరాగ్యాత్,<br>అరశేషు, రసేషు అపి।<br>సంసార వాసనా జాలే, ఖగజాలం ఇవ అధునా,<br>తోదితే హృదయగ్రంథౌ<br>జ్ఞానవైరాగ్యరంహసా॥ | రస-అరసములైన సమస్త పదార్థములపట్ల, విషయములపట్ల అత్యంత పరిపక్వమైన వైరాగ్యము పెంపొందించుకున్నవాడు, వలను త్రెంచి బయటకు వచ్చిన పక్షివలె - ఇక్కడి సంసార వాసనా జాలమునుండి విడివడినవాడు, హృదయ గ్రంథులను జ్ఞాన-వైరాగ్యముల సహాయముతో త్రెంచివేసుకొన్నవాడు - ఆత్మభావమును సమీపించగలడు. |
| కాతకం ఫలం ఆసాద్య<br>యథా వారి ప్రసీదతి,<br>తథా విజ్ఞాన వశతః<br>స్వభావః సంప్రసీదతి॥ | చిల్లగింజలు జలములో వేయగా ఆ జలములోని ధూళికణములు క్రిందకుజారి జలము నిర్మలమగు విధంగా, 'విజ్ఞానము' అనే చిల్లగింజచే 'అజ్ఞానము' అనే మాలిన్యమును హృదయమునుండి తొలగించుకొన్నవాడు "స్వస్వభావత్మ"యందు ప్రసీదతుడు (Manifested) అవగలడు. |
| నీరాగం నిరుపాసంగం<br>నిర్ద్వంద్వం నిరుప ఆశ్రయమ్,<br>వినిర్యాతి మనో మోహాత్<br>విహంగః పంజరాత్ ఇవ॥ | పంజరమును త్రెంచుకొని బయటపడిన చిలుక లాగా-<u>మనస్సు రాగరాహిత్యము (Non fondness) పొందుచూ, సంగరహితము ఆసక్తిరహితము అగుచూ, ద్వంద్వాతీతము అగుచూ, దృశ్యమును ఆశ్రయించనిదై, దృశ్యమునందు చిక్కుకొననిదై</u> ఉంటుందో, అప్పుడా మనస్సు <u>మోహమును త్యజించి సర్వాబంధములనుండి విడివడగలదు.</u> |
| శాంత సందేహ దౌరాత్మ్యం<br>గత కౌతుక విభ్రమమ్,<br>పరిపూర్ణాంతరం చేతః పూర్ణ-ఇందురివ రాజతే। | <u>ఎప్పుడైతే బుద్ధి స్వస్వరూపాత్మ గురించిన సర్వ సందేహములను నివృత్తి చేసుకొని, కౌతుకములనుండి విభ్రమములనుండి విడివడుతుందో,</u> అప్పుడు ఆ బుద్ధి అంతరమున పరిపూర్ణత్వము సంతరించుకొని పూర్ణచంద్రునివలె విరాజిల్లగలదు. |
| న అహం, న చ అన్యత్ అస్తి ఇహ<br>బ్రహ్మైవ అస్మి నిరామయమ్।<br>ఇత్థం సత్ అసతోః మధ్యే<br><u>యః పశ్యతి, స పశ్యతి॥</u> | ఇక్కడ "అహమ్ (నేను)" లేదు. "నాహమ్" లేదు. నిరామయమగు బ్రహ్మమే సర్వే సర్వత్రా అఖండమై ఏర్పడి ఉన్నది. అట్టి బ్రహ్మమును సత్-అసత్‌ల మధ్యగా ఎవ్వరు దర్శిస్తారో, <u>అదియే సత్యదర్శనము.</u> |

**13. అయత్న ఉపనతేషు అక్షి దృక్ ద్రవ్యేషు**
**యథా మనః, నీరాగం ఏవ పతతి,**
**తద్వత్ కార్యేషు ధీర ధీః ॥**
**పరిజ్ఞాయ ఉపభుక్తో హి భోగో భవతి తుష్ట యే,**
**విజ్ఞాయ సేవితః చోరో మైత్రీం ఏతి న చోరతామ్।**

(అద్దమునందు దృశ్యమువలె) ఏ విధంగా అయితే ఈ కళ్ళు మొదలైన ఇంద్రియములు తమకు తారసబడే వస్తువులపై - తమకుగా ఏ స్వకీయ ఇష్ట - అఇష్టములు లేకుండానే వ్రాలుచూ క్రియలు నిర్వర్తిస్తున్నాయో, ఆ విధంగా --

ధీరునిబుద్ధి- తాను చేయుచున్నట్టి, చేయుచుండనట్టి - కార్యములలో రాగరహితంగానే ప్రవృత్తి కలిగి ఉంటుంది.

ఆత్మతత్త్వము గురించి చక్కగా ఎరిగిన యుక్తుడు (యోగి) భోగములను అనుభవిస్తూ ఉన్నప్పుడు కూడా, ఆ జ్ఞాన విజ్ఞానయోగి పట్ల - దొంగలు తమ స్నేహితునితో స్నేహభావము కలిగి యుండు విధంగా - (ఆ దొంగలు స్నేహితుని ఇంట్లో దొంగతనము చేయని విధంగా) **ఇంద్రియములు, ఇంద్రియ విషయములు స్నేహితులవలె ఉంటాయి.**

---

**ఆశంకిత అపి సంప్రాప్తా, గ్రామయాత్రా యథా అధ్వగైః,**
**ప్రేక్షతే తద్వత్ ఏవ, జ్ఞైః భోగశ్రీః అవలోక్యతే ॥**

బ్రహ్మనిష్ఠులగు జ్ఞానులు తమకు సంప్రాప్తిస్తున్న భోగములను, సంపదలను, సంబంధములను - వేరే మరొక గ్రామము వచ్చిన బాటసారివలె, తనకు సంబంధించనివిగా అవలోకనము చేస్తూ ఉంటాడు.

---

**మనసో నిగృహీతస్య లీలా భోగో అల్పకో అపియః**
**తమేవ లబ్ధ, విస్తారం**
**క్లిష్టత్వాత్ బహు మన్యతే ॥**

మనస్సు భోగములను తనలోకి స్వీకరించనంతకాలము - అల్పమైన భోగములను కూడా - ఆత్మజ్ఞాని - విస్తారముగాను బహు గాను భావన చేస్తూ తృప్తిని వదలక ఉంటాడు. అనాయాసంగా లభించిన స్వల్పమునకే అల్ప సంతోషి అయి ఉంటాడు. (Even simple things are enjoyable to him)

---

**బంధముక్తో మహీపాలో**
**గ్రాసమాత్రేణ తుష్యతి।**
**పరైః అబద్ధో న అక్రాంతో,**
**న రాష్ట్రం బహుమన్యతే॥**

ఒక మహారాజు శత్రు సైనికులచే బద్ధుడై, ఎట్లాగో తప్పించుకొని తిరిగి వస్తూ ఉండగా ఆతనికి అత్యంత ఆకలిగా ఉన్నది. అప్పుడు ఆతడు సామాన్యులు తినే ఆహారము కొంచెము లభించినా కూడా, అది రాజభోగములకంటే గొప్పదిగా ఆస్వాదిస్తాడు. అట్లాగే దృశ్యబంధములనుండి (సంసార శృంఖలముల నుండి) విడివడిన యోగి ఏ కొంచెము ఎక్కడ లభించినా తృప్తిగా, హాయిగా ఉంటాడే గాని, **"ఇంకా ఏదో లభించాలి కదా?"** అని వేదనలు పొందడు.

---

**హస్తం హస్తేన సంపీడ్య, దంతైః దంతాన్**
**విచూర్ణ్య చ, అంగాని అంగైః ఇవ**
**ఆక్రమ్య జయేత్ ఆదౌ స్వకం మనః ।**
**మనసో విజయాత్ –**
**న అన్యా గతిః అస్తి భవార్ణవే ॥**

ఓ నిదాఘా! ఈ మనస్సు పెద్దదొంగ. ఇది అనేక దుష్ట అభ్యాసములవైపుగా, దుష్పరిణామమునకు దారి తీయు వ్యవహారములవైపుగా చెప్పాపెట్టకుండానే పరుగులు తీస్తూ ఉంటోంది. అటువంటి మనస్సును,

- చేయి చేయి గట్టిగా కలిపి అయినా సరే,
- పళ్ళతో పళ్ళు నొక్కిపడుతూ అయినా సరే,
- అంగములతో అంగములను ఆక్రమించి అయినా సరే - మనస్సును **జయించవలసిందే. సంసారసాగరము దాటటానికి వేరే త్రోవలేదు.**

---

**14. మహానరక సామ్రాజ్యే మత్త దుష్కృత**
**వారణాః, ఆశా శర శలాకాఢ్యా దుర్జయా హి**
**ఇంద్రియా రయః ॥**

అనుక్షణము మార్పుచెందు స్వభావముగల "దృశ్యము" తో సుదీర్ఘముగా ఆత్మకు ఏర్పడిన సంబంధ రూపమగు 'సంసారము' అనే మహాసామ్రాజ్యములో "చెడుపనులు (దుష్కృతములు), చెడు ఆలోచనలు" అనే మదించిన ఏనుగులు భయమును గొలుపుతూ సంచారములు చేస్తున్నాయి. **"ఆశలు"** అనే బలహీనమైన బాణములను చేతబట్టుకొని **ఇంద్రియములు** అనే మదపుటేనుగులను వశం చేసుకోవటము కుదిరే విషయం కాదు. ఆశలవలన భోగవాసనలు వృద్ధి చెందుతాయేగాని, తీరవు.

---

**ప్రక్షీణ చిత్త దర్పస్య**
**నిగృహీత ఇంద్రియ ద్విషః,**
**పద్మిన్య ఇవ హేమంతే**
**క్షీయంతే భోగవాసనాః॥**

హేమంత ఋతువులో పద్మములు క్షీణించువిధంగా - మనస్సు అనే ఏనుగుయొక్క గర్వమును అణగద్రొక్కి, ఇంద్రియ విషయములను హృదయములోనికి స్వీకరించకుండా ఉంటే, వాటి భోగవాసనలు తమకుతామే క్షీణించగలవు.

తావత్ నిశీవ బేతాళా
వల్గంతి హృది వాసనాః
ఏకతత్త్వ దృఢ అభ్యాసాత్
యావత్ న విజితం మనః ॥

మనస్సును జయించకపోతేనో? కటిక చీకటి ప్రదేశములో దయ్యములు సంచారములు చేయుచుండు తీరుగా, హృదయములో భేదదృష్టితో కూడిన దుష్ట వాసనల సంచారమును ఆపలేము. ('ఏకత్వము') రూపమగు దృఢమగు సమత్వభావనయొక్క అభ్యాసము లేనంతవరకు మనస్సు జయించబడదు. కోతిలాగా, దయ్యంలాగా దృశ్య సంగతులతో గంతులు వేస్తూనే ఉంటుంది.

---

భృత్యో అభిమత కర్తృత్వాత్, మంత్రీ సర్వార్థ
కారణాత్, సామంతశ్చ ఇంద్రియ ఆక్రాంతే –
మనో మన్యే వివేకినః ।
లాలనాత్ స్నిగ్ధ లలనా, పాలనాత్ పాలకః పితా।
సుహృత్ ఉత్తమ విన్యాసాత్ మనో మన్యే మనీషిణః ॥
స్వ-ఆలోకతః శాస్త్ర దృశా స్వ బుద్ధ్యా స్వ అనుభావితః,
ప్రయచ్ఛతి పరాం సిద్ధిం, త్యక్త్వా ఆత్మానం మనః పితా॥

**వివేకి యొక్క మనస్సు...**

- ఇష్టకార్యములు నెరవేర్చటానికి భృత్యునివలె, విశ్వాసముగల సేవకునివలె ప్రవర్తిస్తుంది.
- రాజభక్తిగల మంత్రివలే సర్వ అర్థములను (AI-services) చేకూర్చగలదు.
- సామంతునివలె ఇంద్రియములను అదుపులో ఉంచటములో సహకారికములుగా ఉంటుంది.

ఆత్మవిచారణ - ఆత్మతత్త్వ నిశ్చయములతో కూడిన ఉత్తమబుద్ధిగల మనిషికి ఈ మనస్సు :

- లాలించటంలో ప్రియురాలివలె మెలగుతుంది.
- పాలించటములో తండ్రివలె వాత్సల్యము కలిగి ఉంటుంది.
- ఉత్తమ విన్యాసములలో (కార్యక్రమములలో) సహృదయుడగు మిత్రునివలె అగుచున్నది.

ఏవిధంగా అయితే తండ్రి తన సుఖములను విడిచిపెట్టైనా సరే, కుమారుని విద్య, వృద్ధి, సంపదలను కాపాడుతాడో, అట్లాగే, సాధనచే ఈ మనస్సు శాస్త్ర దృష్టితో అవలోకించటమునకు, స్వానుభవమునకు సహకరించగలదు. శుద్ధమనస్సు తండ్రి అయి రక్షించగలదు. అందుచేత వివేకివి అయి ఉండాలి సుమా!

---

**15.** సుహృష్టః, సుదృఢః, స్వచ్ఛః, సుక్రాంతః,
సుప్రబోధితః, స్వగుణేన ఊర్జితో భాతి
హృది హృద్యో మనో మణిః ॥
ఏనం మనోమణిం, బ్రహ్మన్! బహుపంక కళంకితమ్,
వివేకవారిణా సిద్ధ్యై ప్రక్షాళ్య అలోకవాన్ భవ॥
వివేకం పరమ్ ఆశ్రిత్య, బుద్ధ్యా సత్యం అవేక్ష్య చ,
ఇంద్రియ-అరీ నలం ఛిత్వా తీర్ణో భవ భవార్ణవాత్॥

మనస్సును సంతోషముతోను, సుహృత్ భావములతోను, సుదృఢముగాను, స్వచ్ఛముగాను, ఆత్మభావముతో సర్వత్రా ఆక్రమించినదిగాను, చక్కటి ప్రబోధయుక్తముగాను- తీర్చిదిద్దుకోవాలి. అప్పుడు స్వాత్మగుణ సమన్వితమై, హృదయమునందు ఉత్తమజాతి మణివలె ప్రకాశిస్తూ ఉండగలదు.

మణికారుడు (రత్నములను సానబెట్టువాడు)

ఓ బ్రహ్మన్ ! మణికారుడు మణిని దోషములు తొలగునట్లుగా కడిగి (cleaning to remove dust particles) ప్రకాశింపజేయునట్లుగా, ఈ మనస్సును వివేక రసముతో ప్రక్షాళన చేసి లోకాతీతుడవై ఉండుము.

పరమగు వివేకమును ఆశ్రయించి, బుద్ధితో పరమసత్యమగు ఆత్మగా జగత్తును దర్శిస్తూ ఇంద్రియములలోని దోషములను తొలగించుకొని సాంసారికమగు దృష్టులను తొలగించి, భవసాగరము నుండి తరించెదవుగాక। ఒడ్డుకు చేరెదవు గాక। ఇంద్రియములు - అనే శత్రువులను జయించి, పవిత్రుడవు అగుము.

---

ఆశా(స్థా)మాత్రం అనంతానాం దుఃఖానామ్ ఆకరం విదుః।
అనాశా(స్థా) మాత్రం అభితః సుఖనాం ఆలయం విదుః ॥
వాసనా తంతు బద్ధో అయం లోకో విపరివర్తతే,
సా ప్రసిద్ధా అతి దుఃఖాయ। సుఖాయ ఉచ్ఛేదమ్ ఆగతా ।
ధీరో, అపి, అతి బహుజ్ఞో అపి, కులజో అపి, మహాన్
అపి, తృష్ణయా బధ్యతే జంతుః
సింహః శృంఖలయాయథా ॥

"కోరికలు కోరుకోవటము" అనే అభ్యాసముచే అట్టి కోరుకోవటానికి అంతూ - పొంతూ ఉండదని విజ్ఞులు గమనిస్తున్నారు.

కోరికలు (Expectations) కలిగి ఉండని స్వస్థానము సుఖాలయము - అని కూడా విదితవ్వేతల సూచన. ఆశ ఉంటే అది అనేక దుఃఖములకు నాంది. ఆశను త్యజిస్తే, అదియే పరమసుఖము.

ఓ నిదాఘా! ఈ జనులలో అనేకులు వాసనలు అనే తంతువులచే (పురికోస త్రాళ్ళచే) బంధితులై జనన-మరణ చక్రములో పరిభ్రమిస్తున్నారు. అదియే దుఃఖకారకములు. వాసనా తంతువులు త్రెగితే సుఖము.

ఒకడు ధీశక్తి కలవాడైనా (తెలివితేటలు కలవాడైన), అనేక విషయాలు తెలిసినవాడైనప్పటికీ, గొప్ప వంశములో జన్మించినవాడు అయినప్పటికీ, మహనీయుడుగా ప్రసిద్ధుడు అయినప్పటికీ, -ఆతడు 'ఆశ' అనే అభ్యాసమును కొనసాగిస్తూ ఉంటే అట్టి ఆశాపాశములచే-సింహము గొలుసులచే బంధిపబడుచున్నట్లు - బంధింపబడుచున్నాడు.

| | |
|---|---|
| పరమం పౌరుషం యత్నం ఆస్థాయ ఆదాయ సూద్యమమ్। యథా శాస్త్రం అనుద్వేగం, ఆచరన్ కో న సిద్ధిభాక్? | ఓ నిదాఘ మహాశయా! ఉత్తమ ప్రయత్నముకలవాడై, దీక్ష-పట్టుదల కలవాడై, ఉద్యమించే ఉత్సాహంతో అనుద్వేగకరంగా (unemotionally) శాస్త్రానుసారం ప్రయత్నశీలుడై ఉంటే - ఎవ్వడు మాత్రం సిద్ధి పొందడు. తప్పక పొందుతాడు. |
| **1. ఈ సమస్తము నేనే**<br>**16.** "అహం సర్వం ఇదం విశ్వం పరమాత్మా। అహం అచ్యుతః। న అన్యత్ అస్తి" - ఇతి సంవిత్యా పరమా సా హి అహంకృతిః॥ | **(1) అహంసర్వం ఇదమ్ విశ్వమ్ - అహంకారము**<br>**పరమోత్తమపురుష-అహంకారము :** "నేను-ఈ విశ్వము, ఈ సమస్తము పరమాత్మ స్వరూపమే. నేను అఖండము, సమస్తము అగు ఆత్మస్థానమునుండి ఏ క్షణమందు చ్యుతి పొందుటయే లేదు. అచ్యుతుడను. ఇంతకు వేరై తెలుసుకోవలసినది, తెలియబడవలసినదీ ఏదీ లేదు" - ఈ పరమోత్తమహంకారము ప్రథమమైనది. |
| **2. "ఇదేదీ నేను కాదు"**<br>"సర్వస్మాత్ వ్యతిరిక్తో అహం, వాలాగ్రాత్ అపి అహం తనుః" ఇతి యా సంవిదో, బ్రహ్మన్! ద్వితీయ-అహంకృతిః శుభా॥ మోక్షాయ ఏషా। న బంధాయ। 'జీవన్ముక్తః' అస్య విద్యతే॥ | **(2) సర్వస్మాత్ పరమ్ = వ్యతిరిక్తోహమ్-అహంకారము**<br>"ఈ సమస్త దృశ్యముకంటే నేను వేరైనవాడను. వెంట్రుక చిట్టచివర విభాగముయొక్క సూక్ష్మభాగములో వెయ్యవవంతువలె సూక్ష్మాతిసూక్ష్మ స్వరూపుడను"- ఇది పరమ్-అహంకారము. ద్వితీయమైన అహంకారము. పై రెండూ జీవన్ముక్తుడు కలిగి ఉండే మోక్షరూప - బంధరహిత అహంకారములు (లేక) నిశ్చయములు. ఇరువురు జీవన్ముక్తులే. |
| **3. ఈ శరీరమే నేను**<br>"పాణి పాద ఆది మాత్రో అహం।" - ఇతి యస్య ఏష నిశ్చయః, అహంకారః తృతీయో అసౌ। లౌకికః తుచ్ఛ ఏవ సః। వర్జ్య ఏవ దురాత్మా సౌ, కందః సంసార దుస్తరో ॥ | **(3) ఇదమ్ దేహమే వాఽహమ్ - అహంకారము**<br>"ఈ కాళ్ళు చేతులు మొదలైన విభాగములతో భౌతికంగా కనిపిస్తున్న దేహమే నేను. దీనిచే నేను పరిమితుడనై ఉన్నాను"- ఇటువంటి నిశ్చయము (లేక) అహంకారము మూడవది. ఇది లోక-లౌకిక సంబంధమైనది. తుచ్ఛమైన (Mean) అహంకారము. ఇది సంసార మహావృక్షమునకు బీజము వంటిది. ఈ దురాత్మకమైన, దుష్టమైన అహంకారమును ఈ జీవుడు - ఎట్లాగైనా సరే - త్యజించాలి. జయించాలి. |
| అనేన అభిహతో జంతుః అధో అధః పరి ధావతి, అనయా దురహంకృత్యా భవాత్ సంత్యక్తయా చిరమ్, శిష్ట అహంకారవాన్ జంతుః శమవాన్ యాతి ముక్తతామ్। | మూడవదగు **"దేహమేవాఽహమ్"** అహంకారము, అనేక అధో-అధః (నిమ్న) గతులకు ఈ జీవుని త్రోసుకొనిపోతూ ఉంటోంది. అందుచేత, బహుకాలము ఆయా బహువిధములైన ప్రయత్నములచేత దేహమునకు సంబంధించిన, (మరియు) దృశ్యమునకు సంబంధించిన 'దురహంకారము"ను శమింపజేసుకొని, ఈ జీవుడు శరీరాహంకారము నుండి 'ముక్తుడు' (Relieved) కావాలి. దుఃఖము తొలగటానికి వేరే ఉపాయము లేదు. |
| **17.** ప్రథమౌ ద్వ అహంకార అంగీకృత్యత్వా లౌకికౌ, తృతీయ అహంకృతిః త్యాజ్యా లౌకికీ దుఃఖదాయినీ ॥ అథ తే అపి సంత్యజ్య సర్వ అహంకృతి వర్జితః, స తిష్ఠతి తథ అతి ఉచ్చైః (అత్యుచ్చైః) పరమేవ అధిరోహతి ॥ | (1) నేను - ఈ విశ్వము కూడా సర్వదా అఖండ పరబ్రహ్మస్వరూపమే.<br>(2) ఈ సమస్త దృశ్యమునకు పరము (Beyond) - అగు ఆత్మ (లేక) బ్రహ్మమే నేను.<br>అనురూపముగల ఒకటవ-రెండవ అహంకారములను అంగీకరించి, ఎంత ప్రయత్నంగానైనా సరే నిస్సందేహంగా స్వానుభూతం చేసుకోవాలి.<br>ఇక మూడవదగు లోకసంబంధమైన లౌకికాహంకారము త్యజించవలసియే ఉన్నది. ఎందుకంటే ఈ లౌకికమగు తృతీయాహంకారము సర్వ దుఃఖములకు ఆలవాలము. సర్వదుఃఖ ప్రదాత.<br>అటు తరువాత మొదట రెండు అహంకారములను కూడా వదలుచూ, సర్వాహంకార వర్జితుడు (one who left aside all kinds of Egos) అవ్వాలి. అట్టివాడు పరస్వరూపుడై, అత్యంత ఉత్కృష్టమైన పరమస్థానమును అధిరోహిస్తున్నాడు. |

| | |
|---|---|
| భోగేచ్ఛ మాత్రకో బంధః ।<br>తత్ త్యాగో మోక్ష ఉచ్యతే॥<br>మనసో అభ్యుదయో నాశో। మనోనాశో మహోదయః ॥<br>జ్ఞ-మనో నాశం అభ్యేతి । మనో అజ్ఞస్య హి<br>శృంఖలా। | ఓ నిదాఘా! భోగేచ్ఛ ఉండటమే 'బంధము'. అట్టి భోగేచ్ఛను త్యజించి ఉండటమే 'మోక్షము'. ఈ జీవునికి ఇంతకుమించి బంధము లేదు. మోక్షము లేదు. మనస్సుయొక్క అభ్యుదయమే (బయల్వెడలుటయే) ఈ జీవుని పట్ల నాశము - బంధము. మనోనాశమే ఈ జీవునిపట్ల మహోదయము. ఈ జీవుడు మనస్సు జయించి మహోదయుడు కావాలి. ఇదియే మోక్షమార్గము.<br>ఆత్మజ్ఞానికి స్వాభావికంగానే మనస్సు నశించినదై, ఆత్మతో అనన్యత్వము సంతరించుకొని ఉంటుంది. అజ్ఞానికో? మనస్సే బంధపుత్రాళ్ళు అయి కూర్చుంటుంది. |
| న ఆనందం, న నిరానందం,<br>న చలం, న అచలం స్థిరమ్,<br>న సత్। న అసత్। న చ, ఏతేషాం మధ్యం,<br>జ్ఞాని మనో విదుః॥ | జ్ఞానియొక్క మనస్సు ఆనందరూపముకాదు. నిరానందరూపముకాదు. చలము కాదు. అచలము కాదు. స్థిరము కాదు. అది ఉన్నది (సత్) కాదు. లేనిది (అసత్) కాదు. మధ్య ఉండి, తరువాత లేనిది కాదు. జ్ఞాని దృష్టిలో మనస్సుకు ఉనికియే లేదు. భావన చేయటమే మనస్సుయొక్క రూపము. అంతకుమించి, మనస్సు అనబడేదీ లేదు. |
| యథా సౌక్ష్మ్యాత్ చిదాభాస్య ఆకాశో<br>న ఉపలక్ష్యతే, తథా నిరంశః చిత్ భావః<br>సర్వగో అపి న లక్ష్యతే॥ | ఆకాశము అంతటా ఆక్రమించి ఉన్నప్పటికీ సూక్ష్మము కాబట్టి కంటికి కనబడదు, ఇంద్రియములకు విషయము కాదు కదా! అట్లాగే నిరంశము అగు చిత్ భావనారూపము సర్వత్రా ఆక్రమించి ఉన్నప్పటికీ - అత్యంత సూక్ష్మము కాబట్టి విషయములవలె గోచరించటము లేదు. |
| సర్వ సంకల్ప రహితా, సర్వసంజ్ఞా వివర్జితా,<br>స ఏషా చిత్ అవినాశ ఆత్మా -<br>'స్వాత్మ' - ఇత్యాది కృతాఽభిదా॥<br>ఆకాశ శత భాగాత్చ, జ్ఞే షు నిష్కళ రూపిణీ,<br>సకల అమల సంసార-స్వరూప ఏక ఆత్మ దర్శినీ॥ | సమస్త సంకల్పములచే బద్ధము కానట్టిది, సర్వ సంకల్పములు లేనట్టిది, ఎట్టి సంజ్ఞతోను చెప్పరానట్టిది, అవినాసి, సమస్త జీవుల కేవల స్వస్వరూపము - అగు తత్త్వమునకే "ఆత్మ, చైతన్యము" మొదలైన పేర్లతో చెప్పుకొంటున్నాము.<br>ఆత్మతత్త్వము ఎరిగినట్టి బ్రహ్మజ్ఞుల దృష్టిలో "ఆత్మ భౌతికాకాశము కంటే వందల వేల రెట్లు సూక్ష్మము. సర్వదా దోషరహితము (నిష్కళంకము). జీవుని నిజరూపము. ఏకము (అనేకముగా అవనిది) సంసారదోషముచే స్పృశించబడనిది". |
| **18.** న అస్తమేతి। న చ ఉదేతి। న ఉత్తిష్ఠతి। న తిష్ఠతి।<br>న చ యాతి। న చ ఆయాతి ।<br>న చ నేహ । న చేహ చిత్ । | అట్టి సర్వాత్మకమగు ప్రతి జీవుని కేవల స్వస్వరూపము (లేక) చిత్ (ఎరుకరూపమగు) చైతన్యము ఉదయించదు. అస్తమించదు. లేచునది కాదు. లేచి ఎటో వెళ్లుచున్నట్టిదికాదు. ఎక్కడి నుండో ఇక్కడికి వచ్చునది కాదు. ఇక్కడ మాత్రమే ఉన్నది కాదు. ఇక్కడ లేనిది కాదు. |
| స ఏషా "చిత్" - అమల ఆకారా, నిర్వికల్పా, నిరాస్పదా,<br>ఆదౌ శమ దమ ప్రాయైః గుణైః శిష్యం విశోధయేత్ ।<br>పశ్చాత్ సర్వం 'ఇదం' బ్రహ్మ శుద్ధః-,<br>"త్వం" ఇతి బోధయేత్ ॥ | అట్టి చిత్ చైతన్యము - సదా నిర్మలాకారము. కల్పనారహితము. నిర్వికల్పము. అది స్వానుభవమయ్యేది ఎట్లా? ఆత్మానుభావుడగు గురువును ఆశ్రయించుట చేతనే.<br>గురువు - మొట్టమొదటి శిష్యుని శమము, దమము, తితిక్ష, ప్రాణాయామము, ప్రత్యాహారము మొదలైన గుణములను అభ్యసింపజేసి (By conditioning)- పవిత్రునిగా, ఆత్మానుభవమునకు అర్హునిగా తీర్చిదిద్దాలి. అటుతరువాత "ఈ సమస్తము బ్రహ్మమే" అను పరాకాష్ఠ పాఠ్యాంశమును బోధించాలి. "అట్టి బ్రహ్మము అనగా - నీవే" - (De-conditioning) అని సుస్పష్టపరచాలి. |
| అజ్ఞస్య, అర్ధ ప్రబుద్ధస్య -<br>"సర్వంబ్రహ్మ" - ఇతి యో వదేత్,<br>మహానరక జాలేషు, స తేన వినియోజితః ॥ | అజ్ఞానికి, అర్ధప్రబుద్ధము (Half Enlightened) అయినట్టి శిష్యునికి మొట్టమొదటే "సర్వము బ్రహ్మమే" అను పరాకాష్ఠ పాఠమునందు నియోగించరాదు. అట్టి పరాకాష్ఠ బోధ అజ్ఞానికి చెప్పి నియమించటము 'మహానరకము' అనే చేపల వలలో త్రోయటము వంటిది అవగలదు. |

ప్రబుద్ధ బుద్ధేః, ప్రక్షీణ భోగేచ్ఛస్య
నిరాశిషః, "నాస్తి అవిద్య అమలమ్" -
ఇతి ప్రాజ్ఞస్తు ఉపదిశేత్ గురుః॥

ఎవ్వనికి బుద్ధి ప్రబుద్ధము (Wel Awakined and highly alert) అయి ఉన్నదో, ఎవనికి దృశ్య సంబంధమైన భోగేచ్ఛ నశించినదై ఉన్నదో - అట్టివానికి ఇక "అవిద్య, మాయ అనునవి మొదలే లేవు" అను రూపముగల వేదాంతసార విద్యను గురువు శిష్యునికి బోధించాలి.

---

సతి దీప ఇవ ఆలోకః।
సతి అర్క ఇవ వాసరః ।
సతి పుష్ప ఇవ ఆమోదః ।
చితి సత్యాం (సత్త్వాం) జగత్ తథా ।

దీపము ఉంటేనే కాంతి ఉంటుంది. సూర్యుడు ఆకాశంలో ప్రకాశిస్తూ క్రమంగా ఉంటేనే చీకటి తొలగి, జగత్ వస్తువుల ఉనికి, ఆకారములు కనిపిస్తాయి. పుష్పము ఉంటేనే సువాసన. అట్లాగే చిత్ చైతన్యము ఉంటేనే - జగత్తు, జీవుడు మొదలైన వాటికి ఉనికి.

---

ప్రతిభాసత ఏవ ఇదం, న జగత్ పరమార్థతః ।
జ్ఞానదృష్టౌ ప్రసన్నాయాం
ప్రబోధ వితత-ఉదయే,యథావత్ జ్ఞాస్యసి
స్వస్థో మత్ వాక్ వృష్టి బలాబలమ్॥

పరమార్థంగా చిత్ చైతన్యమే జగత్‌రూపముగా భాసిస్తోంది. అంతేగాని జగత్ అనబడుదానికి స్వకీయమైన ఉనికి లేదు.

నా ఈ వాక్యములయొక్క బలాబలములు ఏమిటో ఎటువంటివో - నీవు జ్ఞాన దృష్టిచే ప్రసన్నత సంపాదించుకొని, ప్రబోధితుడవు (Wel taught) అగుచూ ఉన్నప్పుడు - యథాతథముగా తప్పక గ్రహించగలుగుతావు.

---

అవిద్యయైవ ఉత్తమయా, స్వార్థ నాశ
ఉద్యమ అర్థయా,
విద్యా సంప్రాప్యతే, బ్రహ్మన్ !
సర్వదోష అపహారిణీ ॥

శాస్త్ర విశేషాలు, గురుబోధ - ఇవన్నీ అవిద్యలోని భాగమే. ఆత్మానుభవము ఒక్కటే విద్య. అయితే శాస్త్ర - గురు ప్రతిపాదితమగు అవిద్యాబోధవలననే సర్వదోష నివారణియగు ఆత్మవిద్య వికాసము పొందగలదు. స్వార్థము నశించి పరార్థము ప్రభవించగలదు. ఉత్తమ పురుషార్థము శుద్ధాంతః కరణములో ఆత్మాకార వృత్తిగా జనించగలదు.

---

19. శామ్యతి హి అస్త్రం అస్త్రేణ ।
మలేన క్షాళ్యతే మలమ్।
శమం విషం విషేణేతి।
రిపుణా హన్యతే రిపుః।
ఈదృశీ భూతమాయేయం
యా స్వనాశేన హర్షదా ॥

అస్త్రము అస్త్రముతోనే శమించగలదు కదా!

పాత్రకు పట్టిన ధూళి (మలము) మలముతోనే (ధూళితోనే) శుభ్రము చేస్తాము. విషము విషయతోనే శమిస్తుంది. శత్రువును శత్రుత్వముతోనే జయించగలము.

అట్లాగే మాయను మాయారూపమగు గురు-శాస్త్ర బోధలతోనే తొలగించగలము. శాస్త్ర-జ్ఞాన-గురువాక్య ప్రసాదమగు మాయా విషయములు ఈ జీవుని ఆశ్రయించిన మాయను తొలగించి, ఆ తరువాత తాము కూడా తొలగగలవు. (కాలిలో గ్రుచ్చు కొన్న ముల్లును ముల్లుతోనే తీసి, ఆ తరువాత ఆ రెండుముల్లులను విడచి వేస్తాం కాదు!)

---

### యా మా, సా మాయా।

న లక్ష్యతే స్వభావో అస్య। వీక్ష్యమాణైవ
నశ్యతి। నాస్తి ఏషా పరమార్థేన
ఇతి ఏవం భావన యేద్ధయా ॥
"సర్వం బ్రహ్మ" ఇతి యస్య అంతః భావనాం
సా హి ముక్తిదా। భేద దృష్టిః అవిద్యేయం ।
సర్వథా తాం విసర్జయేత్ ।

### యా మా సా మాయా।

విచారణచేసి చూస్తే 'మాయ' అనునది ఎక్కడ ఉన్నది? యా మా - మొదలే లేదు. దాని స్వరూప-స్వభావములు అధ్యయనము చేయ ప్రారంభించగానే, పరమార్థ దృష్టికి మాయ మొదలే లేనిదై నశిస్తోంది. 'మాయ యదార్థానికి లేదు' అని భావించినంత మాత్రంచేత 'లేనిదే' - అగుచున్నది.

"సర్వము సర్వదా బ్రహ్మమే" - అను భావనను అంతరమున (In the Heart of Heart) జనించగానే, అది ముక్తిప్రదాత అగుచున్నది.

ఏకము-అఖండము అగు ఆత్మదర్శనమే 'విద్య'. భేద దృష్టియే 'అవిద్య'! అందుచేత అవిద్యను సర్వదా విసర్జిస్తూనే ఉండాలి.

---

మునే! న అసాధ్యతే తద్ధి పదం "అక్షయమ్" ఉచ్యతే ।
"కుతో జాతేయమ్?" ఇతి తే, ద్విజ।
మ అస్తు విచారణా॥

"ఓ మునీశ్వరా! నిదాఘా! మాయకు ఆవలగల అక్షయపదము అసాధ్యము కాదు. ప్రయత్నశీలునకు సులభసాధ్యమే" అని అద్దానిని సిద్ధించుకొన్నవారిచే ప్రవచించబడుతోంది.

ఓ ద్విజోత్తమా! "మాయ ఎట్లా వచ్చింది?" అనే విచారణను ప్రక్కకు పెట్టు. "మాయ ఎట్లా తొలగుతుంది?" అనే విచారణ చేయి. మొదలేలేనిది "ఎట్లావచ్చింది?" అనే చర్చ దేనికి?

| | |
|---|---|
| **20.**"ఇమాం కథం అహం హన్మి?"<br>ఇతి ఏషా తే అస్తు విచారణా<br>అస్తం గతాయాం క్షీణాయాం<br>అస్యాం జ్ఞాస్యసి <u>తత్ పదమ్</u>॥ | ఓ ప్రియ నిదాఘా! **"నేను ఈ మాయను ఎట్లా నశింపజేయగలను?"** అనునదే ముఖ్యము. అదియే నీవు చేయవలసిన విచారణ. అంతేగాని **"మాయ ఏ చోటినుండి వచ్చింది? ఎక్కడికి పోతోంది?"** - అని కాదు. ఆ విచారణ అనవసరం. మాయను క్షీణింపజేస్తూ ఉండగా అట్టి విచారణ - అభ్యాసముల ప్రభావము చేత మాయ తనకుతానే తొలగిపోయినట్లు అవుతుంది. అక్షయమగు తత్ పదము స్వాభావసిద్ధము కాగలదు. వెలుగు వస్తే, ఇక చీకటి ఉండదు కదా! **ఏదైతే స్వతఃగా లేదో**, ఇక అది ఎందుకు **"ఎందుకు ఎట్లా వచ్చింది?"** - అనే ప్రశ్న ఎక్కడిది? |
| <u>"యత ఏషా?, యథా చ ఏషా? యథా నష్టా?"</u> - ఇతి అఖండితమ్, తత్ అస్య అరోగ శాలాయా, యత్నం కురు చికిత్సనే॥<br>యథా ఏషా జన్మ దుఃఖేషు, న భూయః త్వాం నియోక్ష్యతి ।<br>స్వ ఆత్మని స్వ పరిస్పందైః స్ఫురతి యచ్ఛైః చిత్ అర్ణవః ॥ | ఒక రోగము వచ్చినప్పుడు **"అది ఎట్లా వచ్చింది? ఎందుకు వచ్చింది? ఏ విధంగా నశిస్తుంది?"** - ఈ విషయాలన్నీ చికిత్స చేస్తూ ఉండగా తెలిసిపోతూ ఉంటాయి కదా! అరోగశాల(Hospital)కు వెళ్ళి "ఎందుకు వచ్చిందో ముందు చెప్పండి?" - అంటామా? మరి చికిత్సను ఆశ్రయించకుండా కేవలం చర్చిస్తూ కాలయాపన ఎందుకు?<br>అట్లాగే మాయను దాటివేసి ఆత్మజ్ఞానము - ఆత్మభావనవైపుగా అభ్యాసము కొనసాగుచుండగా **"జన్మ, దుఃఖము, దృశ్యబంధము"** ఇవన్నీ వాటి వాటి ఉత్పత్తి వినాశనములతో సహా (అజ్ఞానము వలననే - అని) తెలిసిపోతుంది. ఆత్మజ్ఞాన ఔషధముచే అవన్నీ మరల ఉత్పత్తి పొందవు. ఈ జగత్తు అనబడునది ఆత్మయొక్క స్వకీయస్పందనగా, ఆత్మయందే బయల్వెడలి, ఆత్మయందే ప్రవర్తించి ఆత్మయందే (సముద్రజల తరంగమువలె) లయిస్తోందని సుస్పష్టమౌతుంది. |
| <u>"ఏక ఆత్మకం, అఖండం - తత్"</u> - ఇతి అంతర్భావ్యతాం దృఢమ్ ॥ కించిత్ క్షుభిత రూపా, సా చిత్ శక్తిః చిత్ మహార్ణవే ॥<br>తన్మయ ఏవ స్ఫురతి యచ్ఛా, తత్ర ఏవ ఊర్మిః ఇహ ఆర్ణవే, <u>ఆత్మని ఏవ ఆత్మనా వ్యోమ్ని యథా సరతి మారుతః</u> ॥ | ఓ నిదాఘా! తత్ ఆత్మ సర్వదా అఖండమని, సమస్తము ఆత్మాత్మకమేనని అంతరమున దృఢభావనను ఆశ్రయించు. సముద్రంలో కించిత్ స్పందనచే తరంగములు బయల్వెడలునట్లు, ఆత్మయందు కించిత్ స్పందనా రూపములే ఈ జగత్ నామ పరంపరలన్నీ కూడా.<br>సముద్ర జలంలో జలమే తరంగములుగా స్ఫురిస్తున్న తీరుగా చిద్రూపమునందు చిద్రూపమే స్ఫురిస్తూ ఉంటుంది. సముద్రజలంలో జలమే, జలతరంగాలుగా, వాయువునందు వాయువే వాయుతరంగములుగా స్ఫురించు విధంగా ఆత్మాకాశమునందు ఆత్మాకాశమే **జగత్ - జీవాత్మలుగా** స్ఫురిస్తోంది. |
| **21.** తథైవ ఆత్మా ఆత్మ శక్త్యైవ<br>స్వ ఆత్మని ఏవ ఏతి లోలతామ్ ।<br>క్షణం స్ఫురతి సా దేవీ, సర్వశక్తి తయా తథా।<br>దేశ కాల క్రియా శక్తిః న యస్యాః సంప్రకర్షణే। | నీయొక్క చిత్ చైతన్యమే (లేక, ఆత్మయే) శక్తిదేవీ రూపము దాల్చి జగత్తుగా ప్రదర్శనమగుచున్నది. అట్టి దేవి సర్వశక్తిస్వరూపమైయున్నది. అనుక్షణము మహోన్నతమగు ఆ దేవీ తత్త్వములో "దేశ,కాల,క్రియలు"-అద్దములో ప్రతిబింబమువలె -స్ఫురిస్తున్నాయి. వాస్తవానికి అవి ఏవీ ఉండనట్టి ఆదిస్వరూపమే చిచ్ఛక్తి. |
| స్వస్వభావం విదిత్వా ఉచ్ఛైః, అపి అనంత పదే స్థితా,<br>రూపం పరిమితే న అసౌ భావయతి అవిభావితా। (తథా)। | నీ స్వస్వభావముయొక్క ఔన్నత్యమును (లేక - పరస్వరూపమును) - సమస్తమునకు ఆవల (ఉచ్ఛస్థానము అగు) అనందపదమునందు సంస్థితమైనదిగా దర్శించుము. ఇక ఈ పరిమితమగు నామరూపములను "భావన సహాయంతోనే అభావించి వేయుము. రూపనామముల పట్ల అభావితుడవై "ఆత్మభావన" చేయుచూ ఉండుము. **ఆత్మత్వమును సర్వదా వీడనివాడవై ఉండుము.** |
| యద్దైవం భావితం రూపం తయా<br>పరమకాంతయా, తదా ఏవ ఏనాం<br>అనుగతా నామ సంఖ్యాది కా దృశః॥ | చిచ్ఛక్తి ఏది ఏరూపమున ఏవిధంగా భావిస్తే ఆ భావనయే దేశ - కాల-క్రియాదుల రూపముగా, ఆయా నామ సంఖ్యాదులుగా ఆయా రూపములను పొందుతూ, (చిచ్ఛయే) ధరిస్తున్నది. చిచ్ఛక్తియే దృశ్యముగా ద్రష్టగా ఆస్వాదన **చేయుచున్నది-అగుచున్నది కూడా!**<br>అనగా, నీ స్వరూపాత్మయొక్క భావనాశక్తి ప్రదర్శనమే 'జగత్తు'గా అనుభవైకవేద్యము అగుచున్నది. |

| | |
|---|---|
| **వికల్ప కలిత ఆకారం, దేశ కాల క్రియాస్పదమ్।**<br>**చితో రూపం ఇదం, బ్రహ్మన్!**<br>**"క్షేత్రజ్ఞ" ఇతి కథ్యతే॥**<br>**వాసనాః కల్పయన్సోఽపి**<br>**యాతి 'అహం' కారతాం పునః।**<br>**అహంకారో వినిర్ణేతా**<br>**కళంకీ "బుద్ధిః"। ఉచ్యతే।**<br>**బుద్ధిః సంకల్పిత ఆకారా**<br>**ప్రయాతి మననాస్పదమ్॥** | క్షేత్రజ్ఞుడు : హే బ్రహ్మన్! చిచ్ఛక్తి యొక్క వికల్పన (విశేషమైన కల్పన / స్వరూపభావననుండి ఏమరుచునప్పటి సందర్భము) నుండియే దేశ-కాల-క్రియలు స్పందిస్తున్నాయి. కనుక ఈ సమస్తము చిత్ రూపమే! స్వకీయమగు ఎరుక యొక్క విన్యాసమే ఈ (అన్యముగా అనిపిస్తూ ఉన్న) ఎరుగబడేదంతా కూడా! ఎరుగుచున్నవాడే "క్షేత్రజ్ఞుడు".<br>అహంకారము : ఆ విధంగా ఆత్మనుండి వికల్పనా విశేషములగు దేశ-కాల-క్రియాస్పందనల అభిమాని అగు క్షేత్రజ్ఞుడు - వాసనలు (Tendencies) కారణంగా 'అహంకారసహితుడు' అగుచున్నాడు.<br>బుద్ధి : బాహ్యమునకు సంబంధించిన ఇష్ట-అయిష్ట, సామాన్య, విశేష...ఇత్యాది నిర్ణయాత్మక భావనలు వాసనలు (Tendencies) గా అగుచున్నాయి. ఆ వాసనల గురించి 'అహంకారము' యొక్క నిర్ణయాత్మకతయే - బుద్ధి.<br>మనస్సు : బుద్ధి సంకల్పముల ఆకారము పొందుటచే (మనన స్పందనముచే) 'మనస్సు' నిర్మితము అగుచున్నది. |
| **22.** **మనో ఘన వికల్పం తు**<br>**గచ్ఛతి ఇంద్రియతాం శనైః।**<br>**పాణి పాదమయం**<br>**దేహం ఇంద్రియాణి విదుః బుధాః।**<br>**ఏవం జీవో హి సంకల్ప-వాసనా రజ్జు వేష్టితః।**<br>**దుఃఖజాల పరీతాత్మా క్రమాత్ ఆయాతి నీచతాం॥**<br>**ఇతి శక్తిమయం చేతో ఘన-అహంకారతాం**<br>**'కోశకార క్రిమిః' ఇవ స్వేచ్ఛయా**<br>**యాతి బంధనమ్॥** | మనస్సుయొక్క ఘనీభూత వికల్పమే నెమ్మదిగా 'ఇంద్రియరూపములు'గా అగుచున్నది.<br>ఇక కళ్ళు, కాళ్లు, చేతులు మొదలైన కర్మేంద్రియ జ్ఞానేంద్రియ విశేషములు ప్రదర్శనమగు స్థానమే (లేక) పురమే ఈ దేహము. ఇదియే దేహపురము (లేక) పుర్యష్టకము అని బుధులు ఎరిగి ఉంటున్నారు. ఈ విధంగా చిచ్ఛక్తి సంకల్పవాసనామయములగు త్రాళ్ళతో సంబంధరూపబంధము కలిగియుండగా 'జీవుడు' అని పిలువబడుచున్నది.<br>అట్టి జీవుడు అంతులేని దుఃఖముల వలలో చిక్కుకొని పర్యవసానంగా స్వస్వరూప దురవహనవారూపములగు నీచస్థానములు పొందుచున్నాడు.<br>ఈ విధంగా అనంతశక్తిమయుడు, చేతనరూపుడు, కేవలాత్మస్వరూపుడు - అగు పరమాత్మ- ఘనమైన 'నేను-నేను వేరు' అను అహంకారమును ఆశ్రయించి, పాత్రలోపల (కోశము నందు) చిక్కుకొన్న చీమ వంటి క్రిమికీటకమువలె తనకు తానే ఇంద్రియ విషయముల బంధనములలో చిక్కుకొనుచున్నాడు. |
| **స్వసంకల్పిత తన్మాత్ర జాల అభ్యంతర**<br>**వర్తి చ, పరాం వివశతాం ఏతి**<br>**శృంఖలాబద్ధ సింహవత్॥**<br>**క్వచిత్ "మనః", క్వచిత్ "బుద్ధిః", క్వచిత్ "జ్ఞానం",**<br>**క్వచిత్ "క్రియా", క్వచిత్ ఏతత్ "అహంకారః"**<br>**క్వచిత్ "చిత్తమ్" - ఇతి స్మృతమ్। క్వచిత్ "ప్రకృతిః"**<br>**ఇతి ఉక్తం। క్వచిత్ "మాయ" ఇతి కల్పితమ్॥** | పరస్వరూపమగు ఆత్మపురుషుడే స్వయముగా భావనామాత్రంగా కల్పించుకొన్న తన్మాత్రల (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధముల) వల లోపలగా చిక్కుకొని, వివశమై - బోనులో చిక్కుకొన్న సింహము వలె - తన్మాత్రల మధ్యగా అటూ - ఇటూ తిరుగుచున్నాడు. జీవుడుగా అయి, పరాధీనుడై ఉంటున్నాడు. నిత్యముక్తుడగు పరమాత్మ - నిత్యబద్ధునివలె అగుచున్నాడు.<br>ఈ విధంగా అనంతశక్తిరూపమగు చిచ్ఛక్తియే-కొంత మనస్సుగా, కొంత బుద్ధిగా, కొంచెము జ్ఞానము రూపంగా, కొంత అహంకారము రూపంగా, కొంత చిత్తము రూపముగా ప్రదర్శనమౌతోందని గమనించు. ఆ చిచ్ఛక్తియే కొంత 'ప్రకృతి'గాను, కొంత మాయగాను - కల్పితము అగుచున్నది. |
| **క్వచిత్ "మలం" ఇతి ప్రోక్తం । క్వచిత్ "కర్మ"**<br>**ఇతి సంస్మృతమ్॥ క్వచిత్ "బంధ" ఇతి**<br>**ఖ్యాతం। క్వచిత్ "పురి-అష్టకం" స్మృతమ్।**<br>**("పుర్యష్టకమ్" స్మృతమ్)।**<br>**ప్రోక్తం క్వచిత్ "అవిద్య" ఇతి,**<br>**క్వచిత్ "ఇచ్ఛా" ఇతి సంమతమ్॥** | ఇంకా కూడా ఒకప్పుడు మల దోషము (అరిషట్ వర్గ రూపం)గాను, మరికొంత 'కర్మ' రూపంగాను ఆత్మయే ప్రదర్శనమౌతోంది.<br>కొంతసేపు 'బంధము' అనబడుతోంది. ఒకప్పుడు పుర్యష్టకముగా పంచభూతములు, మనో-బుద్ధి చిత్తముల కలయికారూపముగా ప్రదర్శనమగుచున్నది. అదియే ఒకప్పుడు అవిద్యగాను, ఇంకొకప్పుడు 'ఇచ్ఛ'గాను, రూపము దాల్చుచున్నది. ఈ విధంగా మనస్సు, బుద్ధి, జ్ఞానము, క్రియ, అహంకారము, చిత్తము, ప్రకృతి, మాయ, మలము, కర్మ, బంధము, పుర్యష్టకము, అవిద్య, ఇచ్ఛారూపములుగా చిచ్ఛక్తియే తనయొక్క చేతన ప్రదర్శనచే సంప్రకటితమౌతోంది. |

**23.** **ఇమం సంసారం అఖిలమ్**
**ఆశాపాశ విధాయకమ్,**
**దధ దంతః ఫలైః హీనం**
**వట ధానావటం యథా ॥**
**'చింతా' అనల శిఖా దగ్ధం ।**
**'కోప' అజగర చర్వితమ్ ।**
**'కామ' అబ్ధి కల్లోల రతం,**
**విస్మృత "ఆత్మ పితామహమ్" ॥**
**సముద్ధర మనో, బ్రహ్మన్! మాతంగం ఇవ**
**కర్దమాత్! ఏవం జీవాః చితో భావా**
**భవ భావనయా హి తాః ॥**

చిన్నదిగా కనిపించే ఒక చిన్న మఱ్ఱి విత్తనము మొలకెత్తిన కాలక్రమేణా ఒక పెద్ద మఱ్ఱి వృక్షముగా విస్తరిస్తూ ఉన్నది కదా! అట్లాగే, చిచ్ఛక్తితో బయల్వెడలిన 'ఆశ'- అనే ఒక చిన్న స్వయంకల్పిత స్ఫురణ - ఈ జన్మ జన్మాంతరములతో కూడిన సువిశాల మహా సంసార రూపముగా విస్తరణమౌతోంది.

హే బ్రహ్మమే స్వస్వరూపము కలిగియున్నట్టి బ్రహ్మన్! ఈ భావనా - ఆలోచనా రూపమగు మనస్సు
→ అసంఖ్యాక 'చింతలు' అనే అగ్ని శిఖలచే దగ్ధం అవుతోంది.
→ 'కోపము' అనే కొండచిలువచే మ్రింగబడుచూ ఉన్నది.
→ 'కోరికలు' అనే కల్లోలమైన సముద్రతరంగములలో చిక్కుకుని తిరుగాడుచున్నది.

ఈ విధంగా తన జనన స్థానమగు "ఆత్మపితామహస్థానము"ను పూర్తిగా ఏమరచి ఉంటున్నది.

బురదలో చిక్కుకున్న ఏనుగువలె - 'విషయములు' అనే లంపటములో మనస్సు చిక్కుకొన్నది. మరి ఆత్మచైతన్యస్వరూపుడవగు నీవు చూస్తూ ఊరుకోవటమేమిటి? ఈ మనస్సును విషయములనుండి సముద్ధరించాలి.

---

**బ్రహ్మణా కల్పిత ఆకారా, లక్షశో అపి,**
**అథ కోటిశః, సంఖ్య-అతీతాః పురా జాతా**
**జాయంతే అద్యాఽపి చ అభితః॥**
**ఉత్పత్స్యన్తే అపి చ ఏవ**
**అన్యే కణౌఘా ఇవ నిర్ఝరాత్, కేచిత్ ప్రథమ**
**జన్మానః! కేచిత్ జన్మ శతాధికాః ।**
**కేచిత్ చ అసంఖ్య జన్మానః ।**
**కేచిత్ ద్వి-త్రి భవాంతరాః ।**

జీవుడు ఇంద్రియములను ఉపయోగిస్తూ, దృశ్యమును స్వయముగా కల్పించుకొన్నదై ఉండగా - 'ఇదంతా నిజమై ఉన్నది' అను భవబంధము ఏర్పడుచున్నది. భావనలే అసంఖ్యాక తరంగరూపముల రూపము దాల్చి 'భవసాగరము' అగుచున్నది. ఆత్మస్వరూపుడే అయి ఉండి కూడా ఈ జీవుడు భవబంధములలో చిక్కుకొని ఉంటున్నాడు.

"ఇదంతా నిజమే" అను భావనలు బంధములై, భావసాగరంగా అవుతోంది.

ఈ భవభావములన్నీ "సమిష్టిసూక్ష్మ దేహాభిమాని" - అగు హిరణ్యగర్భునిచే అనేక ఆకారములుగా గుణ-మిశ్రమములు కల్పించబడి - లక్షల -కోట్లు అసంఖ్యాకముగా ప్రకటనమగుచున్నాయి.

ఈ అనేక రూప-నామ-గుణములతో కూడిన వివిధత్వము గల జీవరాసులు సృష్టి ప్రారంభంలోనే ఏర్పడి, సృష్టి యొక్క అంతమువరకు ఉండియే ఉంటున్నాయి. కొన్ని కణములుగా జనించి, కణములుగానే ఉంటున్నాయి. వీటిలో కొన్ని జీవదేహములుగా ఇప్పుడే పుట్టుచున్నాయి. మరికొన్ని ఈ దృశ్యజగత్తులో వందలాది జన్మలు, మరికొన్ని అసంఖ్యాక జన్మలు, కొన్నికొన్ని కొద్ది జన్మలే (రెండు, మూడు జన్మలు) కలిగి ఉంటున్నాయి.

---

**కేచిత్ కిన్నర గంధర్వ విద్యాధర మహోరగాః ।**
**కేచిత్ అర్క ఇందు వరుణాః**
**త్ర్యక్షాః అధోక్షజ పద్మజాః ॥**
**కేచిత్ బ్రాహ్మణ – భూపాల – వైశ్య–శూద్రగణాః స్థితాః।**
**కేచిత్ తృణ ఔషధీ వృక్ష ఫలమూల పతంగకాః ।**
**కేచిత్ కదంబ జంబీర**
**సాల తాల తమాలకాః ।**

కేవలాత్మ భగవానుని నుండి బయల్వెడలిన సృష్ట్యభిమానియగు హిరణ్యగర్భునియొక్క సృష్టి సంకల్పరూపములు - కొన్ని కిన్నెరులుగా, కొన్ని గంధర్వులుగా, విద్యాధరులుగా, మహాసర్పములుగా, మరికొన్ని సూర్య-చంద్ర-వరుణ మొదలైన అష్టదిక్పాలకులుగా, ఇంకా కొన్ని బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులుగా అగుచున్నాయి.

అట్టి సృష్టి కల్పనాభావములలో కొని బ్రాహ్మణ-భూపాల (క్షత్రియ) -వైశ్య (గోపాలక) శూద్ర (సేవాస్వభావ) గణములుగా స్థితి పొందుచున్నాయి. ఇంకా కొన్ని సంకల్పములు (లేక) భవాభావములు, తృణములు (గడ్డి)గాను, ఓషధులు (ఆహార ధాన్యములు ఇత్యాది)గాను, వృక్ష-ఫలములుగాను,

కొన్ని కంద-జంబీర-సాల-తాల-తమాల వృక్షములుగా అగుచున్నాయి.

---

**24.** **కేచిత్ మహేంద్ర మలయ సహ్య మందర మేరవః**
**కేచిత్ క్షారో దధి, క్షీర ఘృత ఇక్షు జలాశయః ।**

ఇంకొన్ని మహేంద్ర-మలయ-సహ్య-మందర, పర్వతములుగా,

కొన్ని భావనా తరంగములు క్షార (ఉప్పు) సముద్రముగా, మరికొన్ని పాలు-నేయి-తీయటి -చెఱకు రస జలాశయములుగా అగుచున్నాయి.

**కేచిత్ విశాలాః కకుభః। కేచిత్ నద్యో**
**మహోరయాః, విహరన్తి ఉచ్చకైః కేచిత్।**
**నిపతన్తి, ఉత్ పతన్తి చ॥**
**కన్దుకా ఇవ హస్తేన మృత్యునా అవిరతం హతాః,**
**భుక్త్వా జన్మ సహస్రాణి, భూయః సంసార సంకటే।**
**పతన్తి కేచిత్ అబుధాః సంప్రాప్య అపి  వివేకతామ్॥**

ఆత్మ పురుషుని నుండి మూల భావనగా జనించిన సృష్టికర్త యొక్క కేవలాత్మానంద స్వరూపమునుండి భావనారూపంగా జనించిన కొన్ని భావనాతరంగాలు: -

✠ విశాల అష్టదిక్ దృశ్యములుగాను, కొన్ని తీవ్ర తరంగములు ప్రదర్శించే నదులుగాను, (కకుభము = దిక్కు)

✠ కొన్ని భావనాతరంగాలు ఆకాశములలో విహరించే విహంగాలు (పక్షులు)గాను.

✠ కొన్ని ఎగురుచూ, వ్రాలుచూ, నడుచుచూ ఉండే పక్షులుగాను అగుచున్నాయి.

**సృష్టి కల్పనాభావనా తరంగములే అసంఖ్యాక రూపములుదాల్చి సృష్టిరూపదృశ్యముగా ప్రదర్శనమగుచున్నాయి.**

ఈ విధంగా అనంతప్రకారములైన భావములై, అసంఖ్యాక రూపములుగా ధరించుచూ ఉన్నాయి. చేతులు ఇటు నుండి  అటు, అటునుండి ఇటు కదలు విధంగా, ఈ వివిధ రకములుగా జనించిన జీవులు మరణము పొందుచున్నారు. మరణించి కూడా విరామము పొందక, తిరిగి జన్మించటం - (పునఃపునః జన్మించటం - మరణించటం - 'పునర్జన్మ') ఇవన్నీ పొందుచూ వేలాది జన్మలుగా మరల మరల సంసార సంకటములలో కూలుచున్నారు. కొందరు జీవులు వేలాది లక్షలాది జన్మపరంపరలు పొందుచూ, వివేకులు అయి ఉండి కూడా, అజ్ఞానులై జన్మ పరంపరలతో తిరుగాడుచున్నారు.

---

**దిక్ కాలాది అనవచ్ఛిన్నం ఆత్మతత్త్వం స్వశక్తితః**
**లీలయైవ యదా దత్తే దిక్-కాల కలితం వపుః।**
**తదేవ జీవ పర్యాయ వాసన- ఆవేశతః పరమ్।**
**మనః సంపద్యతే లోలం కలన - అకలన ఉన్ముఖమ్।**
**కలయన్తీ మనః శక్తిః ఆదౌ భావయతి క్షణాత్॥**

కొందరు, వివేకులు అయి ఉండి కూడా, ఆత్మతత్త్వమును ఎరుగుచూ కూడా అనుభవమును సుస్థిరీకరించుకోకుండా,.....తెలిసి తెలిసి దిక్-కాలములతో కూడిన దృశ్య జగత్తులో భౌతిక దేహములను ఆశ్రయిస్తూ మరలమరల భవసాగరములో పడుచున్నారు.

ఆహా! చిచ్ఛక్తి యొక్క "లీలా వినోదమా ఏమి?" - అని అనిపించే తీరుగా సృష్టియొక్క (లేక) సృష్టికర్త యొక్క భావనా రూపులగు జీవులు అనేక దేశ - కాల - పరిధులలో ప్రవేశ - నిష్క్రమణములు నిర్వర్తిస్తున్నారు.

ఈ విధంగా కేవలము, నిత్య నిర్మలము, సమస్తమునకు పరము-అగు చిచ్ఛక్తి 'జీవులు' అనే పర్యాయము (Transformation)ను వాసనావేశముచే పొందటము జరుగుతోంది. చిచ్ఛక్తియే 'జీవుడు' అని మరొక పేరును సంతరించుకోవటం జరుగుతోంది. చిచ్ఛక్తియొక్క సమక్షంలోనే స్వకీయప్రేరణాశక్తి చేత సంకల్ప-వికల్పములకు, కల్పన-అకల్పనలకు ఉన్ముఖమై 'మనస్సు' ఆవిర్భవిస్తోంది. అప్పుడు ఆ మనోశక్తి సమస్తమును భావనాత్మకంగా పొందటము జరుగుతోంది.

---

**25. ఆకాశ భావనా మచ్ఛాం శబ్ద బీజ రస-ఉన్ముఖీమ్।**
**తతః తత్ ఘనతాం యాతం ఘనస్పన్ద క్రమాత్ మనః॥**
**భావయతి అనిల స్పన్దం, స్పర్శ బీజ రస ఉన్ముఖమ్ ।**
**తాభ్యాం ఆకాశ వాతాభ్యాం**
**దృఢ అభ్యాస వశాత్ తతః ॥**

మనస్సే → ఆకాశముయొక్క భావనచే (ఆకాశకల్పనచే) ఆకాశమును పొందుచూ ఆకాశమునందు శబ్ద బీజముగా ఉన్ముఖము (directed) అగుచున్నది. అట్టి ఆకాశబీజ ఉన్ముఖత్వము (Diversion as a seed to space) నుండి మనస్సే ఘనీభూతమై, స్పందము అను రసము (Responsiveness) రూపుదాల్చుచున్నది.

ఆ తరువాత మనస్సే 'స్పర్శ' (Sense of touch)ను బీజరసస్వరూపముగా కలిగియున్న వాయువుగా ఉన్ముఖము అగుచున్నది.

---

**శబ్ద స్పర్శ స్వరూపాభ్యాం సంఘర్షాత్ జన్యతే అనలః ।**
**రూప తన్మాత్ర సహితం త్రిభిః తైః సహ సమ్మితమ్**
**మనస్తా దృక్ గుణగతం రస తన్మాత్ర వేదనమ్।**
**క్షణాత్ చ ఏతత్ అపాం శైత్యం**
**జలం సంవిత్ తతో భవేత్ ॥**

అట్టి మనస్సుయొక్క ఆకాశ-వాయుస్వరూపముల (స్వకీయమైన) దృఢఅభ్యాస వశంగా....అద్దాని శబ్ద-స్పర్శ-రూప అభ్యాసముల సంఘర్షణ నుండి జలము (Liquid) జనించుచున్నది.

శబ్దస్పర్శరూపముల మూడిటి సాన్నిహిత్యముచే వాటి సమ్మేళన ఫలితంగా మనస్సుయొక్క 'దృక్' గుణ విస్తరణచే మనస్సుకు అనన్యమైనట్టి 'రసతన్మాత్ర' రూపము దిద్దుకుంటోంది.

క్షణకాలంలో ఆ ద్రవతత్వమగు జలము సంవిత్ (మనస్సు)యొక్క స్పర్శచే శైత్యము (శీతలత్వము) పొందుచున్నది.

**తతః తాదృక్ గుణగతం మనో భావయతి క్షణాత్ ।**
**గంధ తన్మాత్రం ఏతస్మాత్ భూమి సంవిత్ తతో భవేత్॥**
**అథ ఇత్థం భూత తన్మాత్ర వేష్టితః తనుతాం జహత్ ।**
**వపుః వహ్ని కణ - ఆకారం స్ఫురితం వ్యోమ్ని పశ్యతి ॥**

మనస్సు శబ్ద-స్పర్శ-రూప-రసములను సమీకరించుకొన్న సుదీర్ఘ భావనచే 'గంధతన్మాత్ర'ను ప్రదర్శనము చేయు 'భూసంవిత్' (solid) రూపము దాల్చుచున్నది. అప్పుడు మనస్సు (మనో అనన్యమైనట్టి) భూతన్మాత్రయొక్క రూపమగు ఈ జగత్తును పొందుతోంది.

ఈ విధంగా మనస్సు శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములనబడే పంచతన్మాత్రలతో మమేకము పొందినదై, ఆకాశముతో అగ్నికణాకారముగా కనిపించు రూపము యొక్క అనుభవమువలె పుణికి పుచ్చుకుంటోంది.

**26. అహంకార కలాయుక్తం, బుద్ధి బీజ సమన్వితమ్,**
**తత్ "పుర్యష్టకం" - ఇతి ఉక్తం-**
**భూత హృత్పద్మ షట్పదమ్॥**

ఈ మనస్సు - పంచతతన్మాత్రలుగా ప్రదర్శనమగుచూ తనకు 'అన్యము' వలె వాటిని ఆస్వాదించుచూ ఉంటోంది. అట్టి మనస్సు "అహంకారము"తో కూడి తనయందు 'బుద్ధి' అనే బీజము కలిగియున్నప్పుడు ఇష్ట-అయిష్టరూపములతో సహా (పంచతన్మాత్రలు +బుద్ధి+చిత్తము+ అహంకారము కలిసి) మనస్సు 'పుర్యష్టకము'గా చెప్పబడుచూ-పద్మములో తుమ్మెదవలె- హృదయములో సంచారము కలిగి ఉంటోంది.

**తస్మింస్తు తీవ్ర సంవేగాత్ భావయత్ భాసురం వపుః,**
**స్థూలతాం ఏతి పాకేన మనో బిల్వఫలం యదా ।**
**మూషాస్థ ద్రుత హేమాభం స్ఫురితం విమల అంబరే,**
**సన్నివేశం అథా దత్తే తత్ తేజః స్వ స్వభావతః॥**

అప్పుడు - పద్మములోని తుమ్మెద చేయు 'ఝుం'కార నాదమువలె -పుర్యష్టకము హృదయములో (మననము-కారణంగా) స్థూలదేహరూపము దాల్చుచున్నది. బిల్వఫలములాగా (పుష్పము లేకుండానే కాయ ప్రదర్శనమగుచున్నట్లు) మనోసంకల్పమే స్థూలాకారమువహిస్తోంది. మూసలో కరిగించిన బంగారములాగా పరిశుద్ధ-ఆకాశములో సౌందర్య శోభతో మనస్సుయొక్క స్వస్వభావంగా ఒక "తేజస్సు" ఏర్పడుతోంది.

**ఊర్ధ్వం శిరః పిండమయం। అధః పాద మయః తథా।**
**పార్శ్వయోః హస్త సంస్థానం ।**
**మధ్యే చ ఉదర ధర్మిణమ్।**
**కాలేన స్ఫుటతాం ఏతి అభవతి అమల విగ్రహమ్।**
**బుద్ధి సత్వ బల-ఉత్సాహ-విజ్ఞాన-ఐశ్వర్య సంస్థితః॥**
**స ఏవ భగవాన్ బ్రహ్మా, సర్వలోక పితామహః।**
**అవలోక్య వపుః బ్రహ్మా కాన్తం ఆత్మీయమ్ ఉత్తమమ్॥**

ఆ మనోభావితమగు తేజస్సు తనకు తానే ఒక ఆకారమును ధరిస్తోంది. అదే మనస్సుయొక్క మూర్తీభవము. ఆ మూర్తీభవమునకు
- ఊర్ధ్వంగా (upper part) శిరస్సుయొక్క రూపము.
- క్రిందివైపుగా పాదముల రూపము
- ప్రక్కగా రెండు చేతులు
- మధ్యగా పొట్ట విభాగము. ఆయా పొట్టలోని 'జీర్ణము' మొదలైన ధర్మము.

కాలక్రమంగా అట్టి "శిరస్సు-పాదములు-చేతులు-పొట్ట" - ఇవన్నీ కలిగియున్న రూపము ప్రస్ఫుటమై నిర్మలవిగ్రహము రూపుదిద్దుకుంటోంది. ఈ విధంగా మూర్తీభవించిన ఈ దేహమునందు బుద్ధిబలము, సత్త్వ (సాత్త్విక/సత్స్వరూప) ఉత్సాహ విజ్ఞాన ఐశ్వర్యము (మనోప్రదర్శనంగా) సంస్థితమై ఉన్నాయి.

ఆ విధంగా పుర్యష్టకములోను, తేజోరూపుడుగాను ప్రదర్శనమగు ఆతడే సర్వలోక పితామహుడగు 'బ్రహ్మ'.

అట్టి సృష్టికి కర్త కాబోవుచున్న బ్రహ్మ ఉత్తమ-ప్రాకృతరూపమగు స్వశరీరమును అవలోకనము చేసుకొనుచున్నారు.

ఆ చతుర్ముఖ బ్రహ్మ భగవానుడు -

త్రికాలములను ఎరిగినవాడు (భూత వర్తమాన భవిషత్ రూప త్రికాలజ్ఞుడు), నిర్మలదర్శనుడు.

**27. చిన్తాం అభ్యేత్య భగవాం(స) త్రికాల అమల దర్శనః,**
**ఏతస్మిన్ పరమ ఆకాశే, చిన్మాత్ర ఏకాత్మ రూపిణీ।**
**అదృష్ట పార పర్యన్తే ప్రథమం "కిం భవేత్ ఇతి?"।**
**ఇతి చిన్తితవాన్ బ్రహ్మా, సద్యోజాతా, అమలాత్మదృక్॥**

-చిన్మాత్రము (కేవలమగు ఎరుక తెలివి స్వరూపము), ఏకాత్మ రూపిణి, అద్వితీయము అగు ఆత్మయే-ప్రప్రథమ శరీరము ధరించింది. స్వకీయ రూపము అయినట్టిది, అది - అంతము తెలియరానిది అగు ప్రప్రథమ శరీరమును చూచుకొని "ఇది ఏమైయున్నట్టిది? - అని ఆ బ్రహ్మ విచిన్తన, ధ్యానము చేయసాగారు. ఆ విధంగా నిర్మలాత్మదృష్టికలవాడు అయ్యారు. నిర్మలదృష్టితో జరిగిపోయిన సృష్టులయొక్క సృష్టి విధానములను గమనించ సాగారు.

అపశ్యత్ సర్గ బృందాని సమతీతాని
అనేకశః, స్మరతి అథో స సకలాన్
సర్వ ధర్మ గుణ క్రమాత్॥
లీలయా కల్పయా మాస చిత్రాః సంకల్పతః ప్రజాః ।

ఇతఃపూర్వము జరిగిపోయిన సృష్టులయొక్క స్వర్గ భూ, పాతాళములను, అందులోని అనేక విశేషాలను దర్శించారు. ఆ విధంగా దర్శించి గమనించిన రీతిగా సర్వధర్మ - గుణవిశేషముల ప్రకారము లీలగా చిత్రవిచిత్ర విశేషములతో సంకల్పమాత్రంగా మూడు లోకములను, వాటి అంతర్గత విశేషాలన్నీ కల్పించారు.

---

నానా ఆచార సమారంభా 'గంధర్వ
నగరం' యథా, తాసాం స్వర్గ అపవర్గార్థం
'ధర్మ-కామ-అర్థ' సిద్ధయే।
అనంతాని విచిత్రాణి శాస్త్రాణి సమకల్పయత్।
విరించి రూపాత్ మనసః
కల్పితత్వాత్ జగత్ స్థితేః, తావత్
'స్థితిః' ఇయం ప్రోక్తా। తత్ నాశే, 'నాశం' ఆప్నుయాత్ ॥

అనేక కార్యక్రమ విశేషములతో గంధర్వ (ఊహానిర్మిత) నగరము స్వర్గ-అపవర్గములు ఫలప్రాప్తములు, ఆ సృష్టిలో సంకల్పానుగుణంగా బయల్వెడలినాయి. వాటి వాటి సిద్ధి కొరకై అసంఖ్యాక చిత్ర విచిత్రములయిన శాస్త్రములు కల్పించబడ్డాయి.

ఓ నిదాఘా! ఆ రూపముగా ఉన్నది సమష్టి మనస్సే. అట్టి సమష్టి మనస్సులో వ్యష్టి (Individual) లో ఉన్నట్టి మనస్సుకూడా అంతరచమత్కార విభాగమే. ఈ జగద్దృశ్యములు అట్టి సమష్టి మనస్సు కొనసాగినంతకాలము ఈ జగద్దృశ్యమంతా 'ఉనికి'ని కొనసాగిస్తూ ఉంటుంది. అట్టి సమష్టి మనస్సు నశిస్తే జగత్తు కూడా వినాశనము పొందినదే అగుచున్నది.

---

**28.** న జాయతే న మ్రియతే క్వచిత్
కించిత్ కదాచన । పరమార్థేన, విప్రేంద్ర!
మిథ్యా సర్వస్తు దృశ్యతే ॥
కోశం ఆశా భుజంగానాం సంసార ఆడంబరం త్యజ ।
అసత్ ఏతత్-ఇతి జ్ఞాత్వా, మాతృ(మూల) భావం నివేశయ ॥

ఓ విప్రవర్యా! నిజానికి ఇక్కడ జగత్‌దృశ్యము అనబడుదానిలో - పరమార్థంగా ఏదీ జనించటమూ లేదు. నశించటమూ లేదు. ఇదంతా ఇంద్రజాలమువలె మిధ్యగానే (As an illusion) కనిపిస్తూ ఉన్నది.

అందుచేత పాము కుబుసమును విడచిపెట్టువిధంగా, ఇక్కడి సంసార-ఆడంబరమంతా మనస్సులో పరిత్యజించినవాడవై ఉండు. ఇదంతా కథలోని విశేషాలవలె, స్వప్నములో కనబడిన మేడయొక్క పాడవులె అసత్తే - అని ఎరిగినవాడవై దీని జననస్థానమైనట్టి "ఆత్మభావము"ను ఆశ్రయించి ఉండుము.

---

గంధర్వ నగరస్య అర్థే భూషితే, అభూషితే తథా,
అవిద్యాంశే, సుత ఆదౌ వా
కః క్రమః సుఖదుఃఖ యోః,
ధన దారేషు వృద్ధేషు దుఃఖ యుక్తం
న తుష్టతా। వృద్ధాయాం మోహ మాయాయాం
కః సమాశ్వాసవాన్ ఇహ?

గంధర్వనగరంలో (ఊహాకల్పితమైన స్వప్నముతో సమానమైన చోట) కనబడేవన్నీ గొప్పవి అయినా, కాకున్నా, అందులో ఏమి శేషం? అట్లాగే ఇక్కడ కనిపించే కుమారుడు మొదలైన సమస్త సంబంధాలు, ధనసంపదలు, హాని వృద్ధులు - ఇవన్నీ దుఃఖభూయిష్టములే అయి ఉన్నాయి. ఇవన్నీ జీవునికి తృప్తిని కలిగించేవి కావు. వీటినన్నింటినీ చూచి మురియుటవో, దుఃఖించటమో తెలివైన పనికాదు. మోహము యొక్క వృద్ధి వలన ప్రాప్తిస్తున్న విషయములవలన ఇక్కడ ఎవరికి శాంతి కలుగుతుంది? కలుగనే కలుగదు.

---

యైరేవ జాయతే రాగో మూర్ఖస్య అధికతాం గతైః,
తైరేవ భోగైః ప్రాజ్ఞస్య విరాగ ఉపజాయతే ॥
అతో నిదాఘ ! తత్వజ్ఞ ! వ్యవహారేషు
సంసృతేః, నష్టం నష్టం ఉపేక్షస్వ,
ప్రాప్తం, ప్రాప్తం ఉపాహర ।

ఏ భోగములు వృద్ధి చెందుతూ ఉంటే ముగ్ధునకు ఏదో అధికత్వముగా అనిపిస్తుందో, అట్టి అవే భోగముల ప్రవృద్ధిని చూచినప్పుడు ప్రాజ్ఞుడైనవాడు 'విరాగి'గానే ఉంటాడు. సరాగిగా అవడు. వాటి యందలి సార-అసారములు ఎరిగియే ఉంటాడు. సంపదల పట్ల ''మమకార వ్యాధి వృద్ధి చెందుతుందేమో?'' అను శంకతో విరాగి అయి ఉంటాడు.

అందుచేత! ఓ నిదాఘా! తత్త్వజ్ఞా! ఇక్కడి సంసార వ్యవహారములలో (సంసృతియందు) ఎటువంటి లాభనష్టములు వచ్చినప్పటికీ, అటువంటి సర్వసంఘటనలపట్ల - సందర్భములపట్ల ఉపేక్ష కలిగియుండుము. అపేక్ష కలిగి ఉండవద్దు. ప్రాప్తించే సుఖములతో సంతోషపడుతూ ఉండవద్దు. లభించని సంతోషములపట్ల కించిత్ కూడా 'అపేక్ష' వద్దు.

---

**29.** అనాగతానాం భోగానాం అవాంఛనం అకృత్రిమమ్,
ఆగతానాం చ సంభోగ ఇతి పండిత లక్షణం ।

**నిత్యానిత్యావివేకియగు పండితుని లక్షణము**

(1) లభించని భోగములపట్ల స్వాభావికంగా ఏమాత్రము వాంఛ కలిగి ఉండకపోవటము. (2) లభించిన భోగములను సమదృష్టిని, ఆత్మదృష్టిని వీడక భోగించటము - ఇవి పండితునియొక్క (నిత్యానిత్యవివేకి యొక్క) స్వాభావిక లక్షణములు.

| | |
|---|---|
| **శుద్ధం, సత్ – అసతోః మధ్యం**<br>**పదం బుద్ధ్వా అవలంబ్య చ,**<br>**స బాహ్యాభ్యంతరం దృశ్యం మా, గృహాణ।**<br>**విముంచ మా।**<br>**యస్య న ఇచ్ఛా**<br>**తథా, అనిచ్ఛా జ్ఞస్య కర్మణి తిష్ఠతః,**<br>**న తస్య లిప్యతే ప్రజ్ఞా పద్మ – పత్రం ఇవ అంబుభిః ॥** | సత్-అసత్‌ల మధ్యగా గల పరిశుద్ధమగు కేవలమగు పదము (లేక) స్థానమును బుద్ధితో గమనించి అవలంబించుచూ,<br>ఇక అటుపై...బాహ్య దృశ్యమును స్వీకరించనూవద్దు. వదలనూ వద్దు.<br>ఎవ్వడైతే ఇచ్ఛగాని, అనిచ్ఛ గాని (Neither interest nor disinterest) లేకుండా ఆయా నిర్వర్తించవలసి వస్తున్న కర్మలను నిర్వర్తిస్తూ ఉంటాడో, పద్మమునకు జలస్పర్శ దోషము కలిగించలేని విధంగా, - అట్టి వాని ప్రజ్ఞ దోషరహితమై, నిత్యనిర్మలమై ఉంటుంది. |
| **"యది తేన ఇంద్రియార్థ శ్రీః స్పందతే హృది వై, ద్విజ!**<br>**తదా విజ్ఞాత విజ్ఞేయః సముత్తీర్ణో భవార్ణవాత్ ॥**<br>**ఉచ్చైః పదాయ పరయా ప్రజ్ఞయా**<br>**వాసనా గణాత్, పుష్పాత్ గంధం**<br>**అపోహి ఆరం చేతో వృత్తిం పృథక్ కురు ॥** | ఓ ద్విజోత్తమా! ఎప్పుడైతే ఇక్కడి శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ సమస్త విశేషాలు కూడా హృదయమునందు ఇష్టము, కోపము మొదలైన స్పందనలు ఏమాత్రము కలిగించజాలవో, ఇక అప్పుడు నీవు తెలుసుకొనవలసినది తెలుసుకొని భవసాగరమును దాటి వేయగలుగుతావు.<br>ఓ నిదాఘా! పుష్పమునుండి గంధమును వేరుచేసి స్వీకరిస్తున్న విధంగా చిత్తవృత్తులనుండి వాసనలను ప్రజ్ఞతో వేరు చేసి, అప్పుడు అట్టి నిర్మల (కేవల) నీవు చిత్తముతో దృశ్య జగత్తును నీవు ఆస్వాదించెదవు గాక! |
| **<u>సంసార అంబునిధౌ</u> అస్మిన్, <u>వాసనా–అంబు</u> పరిప్లుతే,**<br>**<u>యే ప్రజ్ఞా నావం ఆరూఢాః, తే తీర్ణాః పండితాః పరే॥</u>**<br>**న త్యజన్తి, న వాంఛన్తి, వ్యవహారం జగత్ గతమ్,**<br>**సర్వం ఏవ అనువర్తన్తే పారావార విదో జనాః॥** | ఈ జీవుడు ఎప్పటినుంచోగాని, సంసార సాగరం లో చిక్కుకొని ఉన్నాడు. **"సంసారము"** అనే సాగరములో వాసనలు అనే జలము అనేక కల్లోలములు కలిగి ఉంటోంది. {The ocean of worldlyness with water of Tendencies, Relationships, Emotions Ignorant ideologies etc.,) ఎవ్వడైతే ఆత్మతత్త్వజ్ఞానమునకు సంబంధించిన 'ప్రజ్ఞ' అనే నావను అధిరోహిస్తాడో అట్టి మహాత్ముడు మాత్రమే సులభముగా ఒడ్డుకు చేరగలుగుచున్నాడు. అట్టి సంసార సాగరముయొక్క ఆనుపానులను, ఆత్మసంబంధమైన తత్త్వమును తెలిసియున్న **మహనీయులు** - ఇక్కడి ఆయా సమస్త వ్యవహారములను 'వదలరు'. పట్టుకోరు. కోరుకోరు. వద్దని అనరు. ఆత్మతత్త్వమును ఎరిగియుండి ఆత్మదృష్టిని ఏమాత్రము వదలకయే ఉంటారు. 'అపార సంసారముయొక్క - స్వకీయ కల్పనా - చమత్కార రహస్యము'ను ఎరిగియే దీని పారము (End) గమనిస్తూ ఎప్పటికప్పుడు ఏది ప్రస్తుతమో ఆ తీరుగా - ఏదీ అంటక అనువర్తిస్తూ ఉంటారు. |
| **30.** **అనంతస్య ఆత్మతత్త్వస్య**<br>**"సత్తా సామాన్య" రూపిణః,**<br>**చితః చేతో ఉన్ముఖిత్వం యత్,**<br>**తత్ "సంకల్ప అంకురం" విదుః॥**<br>**లేశతః ప్రాప్త సత్తాకః**<br>**స ఏవ ఘనతాం శనైః**<br>**యాతి చిత్తత్వమ్ ఆపూర్య,**<br>**దృఢం చ ఆకాశ మేఘవత్।** | ఆత్మ సర్వదా అనంతమై, జాగ్రత్-స్వప్న-సుషుప్తులచే పరిమితము కానిదై, దేహ-దేహాంతరములచే బంధింపబడనిదై ఉన్నది. అట్టి అనంతమగు ఆత్మతత్త్వము 'సర్వత్రా ఉనికి' అనబడు సత్తా సామాన్యరూపమైయున్నది. సమస్తముగా ఉన్నది ఆత్మయే.<br>**"అట్టి అనంత - సత్తా సామాన్య ఆత్మతత్త్వమగు కేవలచిత్ యొక్క స్ఫూర్తి "అన్యము" అనే కల్పనవైపుగా కించిత్ ఉన్ముఖమైనప్పుడు అట్టి సంకల్పముయొక్క అంకురమే ఈ సమస్త జగత్ ఆకార అనుభవము"** - అని విజ్ఞులు ఎరిగినవారై ఈ జగత్తులో లీలగా పాల్గొనుచున్నారు.<br>అట్టి ఆత్మయొక్క సత్తాసామాన్యసంబంధమైన కించిత్ అంకురమే చిత్తము. (అనగా, సహజమగు స్వస్వరూపము యొక్క కించిత్ సత్తా రూప ఘనీభూతమే చిత్తముగా ప్రదర్శనమౌతోంది. (దృఢచిత్తముగా పరిణమిస్తోంది).<br>అట్టి చిత్తమే సమస్తమైన జగదనుభవముగా అయి, ఈ సమస్త జగత్-దృశ్యముగా ప్రదర్శనమౌతోంది. ఆకాశంలో మేఘము ఆకాశమంతా నింపివేయుతీరుగా 'చిత్తము' అనబడే 'చిత్' యొక్క కించిత్ స్ఫూర్తి...సమస్త జగత్తుగా ప్రదర్శనమగుచున్నది. (ఒక చిత్రకారుని ఊహయే చిత్రలేఖనము (The Art of Painting) అగునట్లు, ఆత్మకు ఈ జగత్తు కళాప్రదర్శనమే)! |

| | |
|---|---|
| భావయన్తి చితిః చైత్యం వ్యతిరిక్తం ఇవ ఆత్మనః,<br>సంకల్పతాం ఇవ ఆయాతి బీజం అంకురతాం ఇవ॥<br>సంకల్పనం హి సంకల్పః స్వయం ఏవ ప్రజాయతే ।<br>వర్ధతే స్వయం ఏవ ఆశు,<br>దుఃఖాయ, న సుఖాయ యత్॥ | బీజము నుండి అంకురము (Seedling) వలె-"చిత్" (తెలుసుకునేవాని) నుండి "చైత్యము" (అనుభూతమయ్యేదంతా) బయల్వెడలుతోంది.<br>'చిత్' యొక్క సంకల్పము (Assumption) నుండి బయలుదేరుతూ, "అనుభవి (The Experiencer)కి అనుభవములు (The Experiences)గా అగుచున్నదంతా వేరు" అన్నట్లుగా (వ్యతిరిక్తంగా) అనుభూతమౌతోంది.<br>ఆత్మయొక్క "సంకల్పశక్తి" నుండియే - అసంఖ్యాక కల్పనా రూపములుగా - స్వయముగా కల్పనలు బయల్వెడలుచున్నాయి. ఆ విధంగా చైతన్యము నుండి బయల్వెడలిన సంకల్పములు అనేక కల్పనా పరంపరలుగా రూపుదిద్దుకోవటము - ఇదంతా సుఖము కొరకు కాకుండా, (ఆత్మకు బంధము ఆరోపించబడుచూ ఉండటంచేత) 'దుఃఖమునకే' - అవుతోంది. |
| మా సంకల్పయ సంకల్పం। మా భావం (అ)భావయ స్థితౌ।<br>సంకల్ప నాశనే యత్తో, న భూయో అననుగచ్ఛతి ।<br>"భావనా-అభావ" మాత్రేణ, సంకల్పః క్షీయతే స్వయమ్॥ | అందుచేత ఓ నిదాఘా! సంకల్పమును సంకల్పించనే వద్దు. అభావనను భావించనూవద్దు. 'భావాతీతము' నందు సంస్థితుడవై ఉండెదవుగాక. ఆత్మభావనయే ఆశ్రయించి ఉండెదవుగాక. అప్పుడు సంకల్పములు నిన్ను ఆక్రమించలేవు. కప్పి ఉంచజాలవు. 'భావన'ను భావించనంతమాత్రం చేతనే 'సంకల్పన' అను వ్యసనము తనకు తానే క్షీణించగలదు. |
| సంకల్పేన ఏవ సంకల్పం, మనసైవ మనో,<br>మునే! ఛిత్వా, స్వ-ఆత్మని తిష్ఠత్వం-<br>కిం ఏతావతి దుష్కరమ్?<br>యథైవ ఇదం నభః శూన్యం,<br>జగత్ శూన్యం తథా ఏవ హి॥ | ఓ మునీశ్వరా! "దృశ్యము గురించి సంకల్పించుచూ తన్మయమవటము" - అనే వ్యసనరూపమగు అలవాటును - 'సంకల్పించకపోవటము' అనే అభ్యాసముతోనే జయించాలి. మనస్సును మనస్సుతోనే ఛేదిస్తూ, ఆత్మ భావన-ఆత్మస్వభావమునందు సుస్థితుడవై ఉండు.<br>సంకల్పించటములోనే శ్రమ ఉన్నది కాని - సంకల్పించు శ్రమను విరమించటములో ఏమి కష్టము ఉన్నది? మరి "ఆత్మయేవాఽహమ్ - నేను ఆత్మను - అను నిశ్చిత భావన దుష్కరము (సాధ్యముకాదు)" అని ఎట్లా అంటావు? సాధ్యమే. 'సంకల్పించటం' నిర్వర్తిస్తూ ఉన్న నీవు "సంకల్పించకపోవటము"- ను కూడా తప్పక నిర్వర్తించగలవు.<br>ఆకాశము సర్వదా శూన్యమే! అందులో ఏ పదార్థము లేదు. అట్లాగే ఆత్మయందు జగత్తు శూన్యమే అయి ఉన్నది. ఆత్మయందు ఆత్మయే ఉన్నది. |
| తండులస్య యథా చర్మ, యథా తామ్రస్య కాళిమా,<br>నశ్యతి క్రియయా, విప్ర!<br>పురుషస్య తథా మలమ్॥<br>జీవస్య తండులస్య ఇవ మలం సహజం<br>అపి అలమ్, నశ్యతి ఏవ న సందేహః।<br>తస్మాత్ ఉద్యోగవాన్ భవేత్ ॥<br>ఇతి మహోపనిషత్॥ | ధాన్యమును దంచినప్పుడు ధాన్యపు గింజపైగల పొట్టు తొలుగుతోంది. రాగి పాత్రను (చింతపండుతో) శుభ్రం చేస్తే మకిలి తొలగి, తళతళా మెరుస్తోంది. ఓ విప్రవర్యా! అదేవిధంగా ఉత్తమ ప్రయత్నము చేత చిత్తములో (ప్రాపంచక సంబంధమైన అరిషట్ వర్గము అనే) మలము తప్పక తొలుగుతుంది!<br>బియ్యపు గింజలలో కొద్దిగా రాళ్ళు ధాన్యపుగింజలు వచ్చి చేరటం సహజమేకదా. అట్లాగే ఈ జీవుని మనస్సుకు 'కర్మవ్యవహారములకు సంబంధించిన దోషము అంటటము' - అనునది సహజమే.<br>రాళ్ళను ఏరి పొట్టును తొలగించి ఆవల పారవేసి బియ్యమును వండుకుంటాము కదా! "అయ్యో! వడ్లపై ఊక ఉందికదా। ఊక తీయటమెట్లా" (Paddy itself) - అని వడ్లనే వండుకుంటున్నామా? లేదు. పొట్టు తొలగిస్తున్నాము.<br>అట్లాగే, మలమును తొలగించి చిత్తమును (మనస్సును) ఎప్పటికప్పుడు నిర్మలముగా ఉంచుకొనే ఉత్-యోగ కార్యక్రమము నిర్వర్తిస్తూ ఉండాలి.<br>మానవ జీవితము - అటువంటి ఉద్యోగ సందర్భము. కనుక సద్వినియోగ పరచుకొనెదవుగాక। మనస్సు నుండి దృశ్య మలమును తొలగించుకొనటంలో ప్రయత్నశీలుడవై ఉండెదవు గాక।<br>"ఇతి ఉపనిషత్" |

# షష్ఠోఽధ్యాయః - యోఽసి, సోఽసి (అదియే ఇది)

**1. ఓం। అన్తరాస్థాం పరిత్యజ్య భావశ్రీం**
**భావనామయీమ్,**
**యో అసి, సో అసి (యోఽసి, సోఽసి)**
**జగత్ యస్మిన్, లీలయా విహర। అనఘ!**

ఓం।
ఓ అనఘా (పాపదృష్టులు లేనట్టివాడా)! నిదాఘముని సత్తమా! అంతరమున ఏఏ విషయములపట్ల "భావించటము" - అనునది ఏర్పడుచూ ఉంటోందో.... అట్టి "భావనా వ్యవహారమును- భావించబడు వస్తువులతో సహా" త్యజిస్తూ ఉండు. "శ్రీం" - శ్రియమగు ఆత్మభావనచే భావనారాహిత్యము అభ్యసించు. ఆలోచనలన్నీ ఆపివేయగా అప్పటికి ఏది ఇంకా శేషించి ఉంటోందో అదియే నీవై ఉండుము. ఇక ఆపై ఈ జగత్తులో లీలగా, క్రీడగా, సరదాగా విహరిస్తూ ఉండు. అట్టి 'ఆది' శేష్యమే 'శ్రీం' అక్షరార్థము.

---

**'సర్వత్ర అహం అకర్తా'**
**ఇతి దృఢ భావనయా అనయా,**
**పరమ అమృత నామ్నీ సా**
**<u>'సమతా'</u> ఏవ అవశిష్యతే॥**

"నేను సర్వత్రా సర్వదా దేనికీ కర్తను కాదు. అకర్తను" (అట్లాగే ఎవ్వరూ దేనికీ కర్త కాదు) - అను దృఢ తర భావనచే - పరమ అమృత స్వరూపమగు సర్వసమత్వ 'సమత'యే శేషించినది అవుతోంది. ('సమతా భావనాయేవ'శ్రీం').

---

**ఖేద ఉల్లాస విలాసేషు**
**స్వ-ఆత్మ కర్తృయా ఏకయా,**
**స్వ సంకల్పే క్షయం యాతే,**
**"సమత" ఏవ అవశిష్యతే॥**

"సమస్త ఖేద-ఉల్లాసములకు అకర్తృత్వమే స్వభావమైయుండు గాక। "సర్వాత్మకమగు స్వస్వరూపాత్మయే సమస్తమునకు కర్త- భోక్తకూడా" అనుధారణచే (దృశ్య సంబంధమైన) సంకల్పములు తమకు తామే క్షయిస్తాయి. సర్వత్రా సమ స్వరూపమైయున్న "సమత" యే శేషించగలదు.

---

**2. సమతా సర్వ భావేషు**
**యా అసౌ (యాఽసౌ) సత్య పరాస్థితిః,**
**తస్యామ్ అవస్థితం చిత్తం**
**న భూయో జన్మ భాగ్ భవేత్॥**

ఓ నిదాఘా!
సర్వత్రా సర్వభావనలయందు (భావనలకు ఆవల భావించువాని రూపంగా) "సమస్థితి" అనబడు సత్య - పరాస్థితిని ఆశ్రయించి, అద్దానియందు చిత్తమును నిశ్చలము చేసి ఉంచుము. ఆ విధంగా అఖండము, అప్రమేయము, నిత్యము అగు ఆత్మయందు అవస్థితమైన చిత్తము మరల జన్మ-కర్మల ప్రవాహములో చిక్కుకోదు.

---

**అథవా సర్వ కర్తృత్వం అకర్తృత్వం చ వై,**
**మునే! సర్వం త్యక్త్వా మనః పీత్వా**
**<u>యోఽసి సోఽసి స్థిరో భవ॥</u>**

-ఓ మునీ! (పై విధంగా కాదనుకుంటే) - పోనీ (లేదా, క్రమక్రమంగా)
(1) నేను కర్తను! (2) నేను అకర్తను - ఈ రెండిటికీ సంబంధించిన <u>ఉభయ భావములను వదలివేసి,</u> ఆత్మభావనతో 'మనస్సు' అనబడు ఆలోచనా విభాగమును మింగివేసి - అప్పటికీ నీవు ఏదై ఉన్నావో, అదియే అయి ఉండుము.

---

**శేష స్థిర సమాధానో <u>యేన త్యజసి, - తత్ త్యజ</u>**
**చిత్ మనః కలన ఆకారం ప్రకాశ తిమిర ఆదికమ్।**
**వాసనాం వాసితారం చ ప్రాణ స్పందన పూర్వకమ్,**
**సమూలం అఖిలం త్యక్త్వా వ్యోమ**
**సామ్యః ప్రశాన్త ధీః, హృదయాత్**
**సం పరిత్యజ్య సర్వా వాసన పంక్తయః,**
**యః తిష్ఠతి గత వ్యగ్రః**
**స ముక్తః పరమేశ్వరః॥**

స్థిర సమాధానము (Stabilized and wel answered) పొందిన వాడివై, దేనిని త్యజిస్తున్నావో అది కూడా దాటిపోయి.....ఇక 'త్యజించటము'ను కూడా వదలి వేసి ఉండెదవుగాక! "నేను త్యజిస్తున్నాను" అనే "అహంకర్తృత్వము"ను కూడా త్యజించివేయి. చిత్‌మనస్కుడవై జ్ఞాన-అజ్ఞాన ప్రకాశ-తిమిరము లను కూడా వదలివేయి.

ఎవ్వడైతే, ప్రాణ (ప్రియత్వ) స్పందన పూర్వకమై ఏర్పడు సమస్త వాసనలను సమూలంగా మొదలంట్లా త్యజించివేసి ఆకాశమువలె సశాంతముతో కూడిన బుద్ధితో ప్రశాంతముగా ఉంటాడో, హృదయములోని సర్వ దృశ్య సంబంధ భావావేశములను పరిత్యజించి, ఆత్మనే మననము చేస్తూ, నిర్విషయమును ఆశ్రయిస్తూ సర్వవ్యగ్రములను {దిగుళ్ళను (All Avocative disturbances)} వదలి ఉంటాడో - ఆతడు పరమేశ్వరుడే! ఆతడు సర్వదా ముక్తుడే!

దృష్టం ద్రష్టవ్యం అఖిలం
భ్రాన్తం భ్రాన్త్యా దిశో దశ,
యుక్త్యావై చరతో జ్ఞస్య
సంసారో గోష్పశీ - ఆకృతిః॥

ఓ నిదాఘా!

"ఈ సంసారసాగరము దాటటమనేది అత్యంత దుర్లభము" అని కొందరు అనుచుండగా వింటున్నాము కదా! విని "సంసారము అనగా ఏమి" అని పరిశీలించటము, అధ్యయనము చేయటము ప్రారంభించాను.

చూడవలసినదంతా పరిశీలించుచూ భ్రాంతితో పది దిక్కులు సుదీర్ఘ సంచారములు చేశాను. ఒక కొత్త విషయము నాకు తెలియవచ్చింది.

యుక్తితో ఆత్మజ్ఞానమును ఆశ్రయించి, స్వస్వరూపాత్మను నిత్యమైనదిగా, సమస్తము అయినట్టిదిగా గ్రహించువారికి "సంసార సముద్రము" అని చెప్పబడేది - ఆవు డెక్క యొక్క నేలపై పడిన ముద్రను దాటగలగడమంత సులభము - అని గమనించాను.

---

**3.** స బాహ్యే - అభ్యన్తరే దేహే హి
అథ-ఊర్ధ్వం చ దిక్షు చ,
ఇత ఆత్మా। తతో - అపి ఆత్మా।
నాస్తి అనాత్మ మయం జగత్॥

ఇక్కడ (దేహమునకు) బయట - లోపల కూడా, (అట్లాగే ఈ కనబడే విస్తార జగత్తుకు బయట,లోపల), పైన, క్రింద, సమస్త దిక్కులలోను, సర్వత్రా ఆత్మయే సమస్తమును ఆక్రమించి, సమస్తముగా కూడా ఉన్నది. ఆత్మకు వేరుగా 'జగత్తు' అనబడునది ఏ క్షణంలోనూ లేనే లేదు. నవల అంతా రచయితయొక్క కల్పనా చమత్కారమేగా।

---

న తత్ అస్తి న యత్ర అహం।
న తత్ అస్తి, న తత్ మయం (న తన్మయం)।
కిం అన్యత్ అభి వాంఛామి?
సర్వం సచ్చిన్మయం (సత్ చిత్ మయం) తతమ్॥

ఆత్మ లేనిచోటే లేదు. నేను ఆత్మస్వరూపుడనే అయిన ఉన్నాను. కాబట్టి నేను లేనట్టి ప్రదేశమే ఎక్కడా లేదు. నాది కానిది, నేను లేనిది లేనప్పుడు ఇక నేను దేనిని కోరుకోవాలి? లేదని దేనిగురించి దుఃఖం పొందాలి? సమస్తము సత్-చిత్-ఆనందమయమే।
అంతటా ఉన్న దానిని ఎక్కడ వెతకాలి? (తరంగము జలము కోసము ఎక్కడని వెతుకుతుంది - తానే జలమైనప్పుడు!) నేను ఆత్మను కానిది ఎప్పుడు?

---

సమస్తం ఖల్విదం బ్రహ్మ।
సర్వం ఆత్మా ఇదం ఆతతమ్।
అహం అన్యం ఇదం చ అన్యత్
ఇతి భ్రాంతిః త్యజ, అనఘ!

ఇక్కడి సమస్తము బ్రహ్మమే అయి ఉన్నది. ఆత్మచేతనే ఈ సమస్తము విస్తరించినదై ఉన్నది.

అందుచేత ఓ అనఘా! నిదాఘా!

'ఆత్మకు నేను వేరు. నీవు వేరు. ఇది అన్యము. అది కాదు' ఇటువంటి భ్రాంతిని మొదలంట్లా త్యజించివేయి.

---

తతో బ్రహ్మ ఘనే నిత్యే సంభవన్తి,
న కల్పితాః న శోకో అస్తి। న మోహో అస్తి।
న జరా అస్తి। న జన్మ వా।
యత్ అస్తి ఇహ, తత్ ఏవ అస్తి।
విజ్వరో భవ సర్వదా॥

అట్టి బ్రహ్మము సర్వత్రా ఘనీభూతమై, సంభవము (ఉనికి) కలిగియున్నది. ఆత్మకు అన్యమైనదంతా కల్పితమాత్రము. కథలో సంఘటనలవలె కల్పితమైన దానికి ఉనికి ఎక్కడిది?

ఓ మహాశయా! శోకము లేదు. మోహము లేదు. జన్మ లేదు. వార్ధక్యము లేదు. మృత్యువు లేదు. ఏది ఉన్నదో, అట్టి ఆత్మ మాత్రమే ఉన్నది. ఏది లేదో (కల్పితమో), అది మొదలే లేదు. కనుక ఎల్లప్పుడు ఎట్టి జ్వరము (వేదన) లేనివాడనై ఉండెదవు గాక!

---

యథా ప్రాప్త అనుభవతః సర్వత్ర
అనభివాంఛనాత్,
త్యాగా దాన పరిత్యాగీ,
విజ్వరో భవ, సర్వదా॥
యస్య ఇదం జన్మ పాశ్చాత్యం
తమ్ ఆశ్వేవ, మహామతే!

ఎప్పుడు ఏది 'అనుభవము'గా ప్రాప్తిస్తూ ఉంటే, అది ఇచ్ఛారహితంగా స్వీకరించు. దేనినీ వాంఛించవద్దు. ద్వేషించనూ వద్దు. ఎల్లప్పుడు సంతాపరహితుడవై ఉండు. దేనినీ విడిచిపెట్టనూవద్దు. పట్టుకోనూవద్దు. 'ఏదోవదలాలి' అనేది కూడా వదలి విజ్వరుడవై (ఆదుర్దా లేనివాడవై) ఉండు. ఇప్పుడు ఏమున్నదో, ఆ తరువాత కూడా అదే ఉన్నది.
ఓ మహామతీ! ఈ జన్మయే చివరి జన్మగా మలచుకొనుము. మొదలే జన్మలు లేనివాడవై, ఆత్మయే నీవై ఉండుము. జన్మలే లేని నీకు ఈ జన్మమాత్రం ఎక్కడున్నది?

| | |
|---|---|
| **4.** విశన్తి విద్యా విమలా<br>ముక్తా వేణుం ఇవ ఉత్తమమ్,<br>విరక్త మనసాం సమ్యక్<br>స్వ-ప్రసంగాత్ ఉదాహృతమ్॥ | "ఆత్మ విద్య"ను ఎరుగుటచే ఈ జీవుడు - ఉత్తమమైన ముత్యములచే గ్రుచ్ఛబడి అలంకరించబడిన వేణువువలె ఆత్మతత్త్వానుభవ సౌందర్యమును సిద్ధించుకోగలడు.<br>ఇంద్రియ విషయములపట్ల అనురక్తిత్యాజ్యమే (విరక్తి) ఆత్మ యొక్క (అభేదత్వము యొక్క) అనుసంధానమునకు మార్గము. "ఆత్మ గురించిన విచారణ అనగా-స్వస్వరూపము యొక్క ప్రసంగమే" - అని చెప్పబడుచున్నది. |
| 'ద్రష్టుః దృశ్య' సమాయోగాత్<br>ప్రత్యయ - ఆనంద నిశ్చయః<br>యస్తం స్వం-ఆత్మ తత్త్వ ఉత్థం (తత్త్వోత్థం)<br>నిష్పన్దం సం ఉపాస్మహే॥ | ఈ లోకరీతిని అనుసరించి 'ఆనందము' అనునది ద్రష్ట యొక్క దృశ్య వస్తువుతో సంయోగముచే ఏర్పడుచున్నదని - జనులచే భావించబడుతోంది. అయితే ద్రష్టకు దృశ్య వస్తువు యొక్క సందర్శనముచే బుద్ధియందు స్ఫురిస్తున్న ఆనందము స్వరూపతః ఆత్మనుండే జననము పొందుతోంది. స్పందరహితమగు అట్టి కేవలాత్మ స్వరూపమునకు నమస్కరిస్తున్నాము. ఉపాసిస్తున్నాము. సర్వాత్మభగవానునికి నమో నమః । |
| ద్రష్టృ దర్శన దృశ్యాని త్యక్త్వా వాసనయా సహ,<br>దర్శన ప్రథమా భాసం ఆత్మానం సం ఉపాస్మహే॥<br>ద్వయోః మధ్యగతం నిత్యం<br>"అస్తి-నాస్తి ఇతి పక్షయోః", ప్రకాశనమ్<br>ప్రకాశానామ్ ఆత్మానం, సం ఉపాస్మహే॥ | ద్రష్ట-దర్శన-దృశ్యములను వాటియొక్క వాసనలతో సహా (Including Tendencies) ప్రక్కకు పెట్టి దర్శనమునకు మునుముందుగానే (Even prior to perception) ఏది నిత్యోదిత-స్వయంప్రకాశరూపమైయున్నదో, సర్వదా అఖండజ్యోతివలె భాసిస్తోందో" అట్టి 'ఆత్మ'ను ఆత్మాఽహమ్ భావనతో ఉపాసిస్తున్నాము.<br>ఉన్నది - లేదు (సత్-అసత్) అను ఉభయపక్షముల (వాదముల/భావముల) మధ్య ఉండి, ఏది 'అస్తి-నాస్తి' భావములను ప్రకాశింపజేయుచున్నదో - అట్టి ఆత్మను ఉపాసిస్తున్నాము. |
| సంత్యజ్య హృత్ గుహేశానం<br>దేవం అన్యం ప్రయాన్తియే,<br>తే "రత్నం అభి వాంఛన్తి,<br>త్యక్త హస్తస్థ కౌస్తుభాః॥" | ఏ అఖండాత్మ జ్యోతి, ఆత్మానందము సర్వదా స్వకీయ హృదయగుహలో ప్రకాశమానమై ఉన్నదో అట్టి దేవాది దేవుని వదలి, 'అన్యదేవత'ను ఆశ్రయించటమంటే (పరమాత్మ నాకు అన్యము' అని భావించటం) అరచేతిలోని 'కౌస్తుభమణి'ని వదలి, బయట ఎక్కడో ఉన్న రత్నము (బాహ్యరత్నము) కావాలి - అని కోరుకోవటం వంటిది. |
| **5.** ఉత్థితా-అనుత్థితాన్ ఏతాన్<br>ఇంద్రియాదీన్ పునః పునః<br>హన్యాత్ "వివేక" దండేన,<br>వజ్రేణ ఇవ హరిః గిరీన్॥ | ఒకానొకప్పుడు పర్వతములు రెక్కలు కలిగియుండి...తమ గొప్పతనము గురించి గర్వము పొందసాగాయి. "సృష్టిలో మేము ఎంతో బలవంతులము. మేము దేనినైనా అణచగలము, ఆక్రమించగలము" - అని భావించి, గర్వించసాగాయి. ఆ గర్వము అంతటితో ఆగక "మా గొప్పతనం చూపిస్తాము"అను మాత్సర్యముతో గాలిలో ఎగిరి, జనావాసాలమీదపడి, ఊళ్ళు - ఊళ్ళనే సర్వనాశనం చేయసాగాయి. అప్పుడు త్రిలోకపాలకుడగు ఇంద్రుడు లోకరక్షణార్థం ఒకానొకరోజు వ్రజాయుధము చేతిలో ధరించి, ఆ పర్వతముల రెక్కలను ఖండించి, ఇక అవి ఎగురలేనివిగా చేయసాగారు. ఆ విధంగా ఓ నిదాఘా! ఈ బలవత్తరమగు ఇంద్రియములు విషయములపై వ్రాలటమును "వివేకము" - అనే వజ్రాయుధముతో మరల మరల రెక్కలు త్రెంచి, వాటియొక్క "విషయములవైపు చాంద్రాయణము"ను అరికట్టాలి. |
| సంసార రాత్రి దుస్వప్నే<br>శూన్యే దేహమయే భ్రమే,<br>సర్వం ఏవ అపవిత్రం తత్<br>దృష్టం సంసృతి విభ్రమమ్॥ | దుఃఖస్వప్నము (చెడుకల) - వాస్తవానికి వస్తుతః శూన్యమే అయి ఉండి కూడా, ఆ పీడకల ప్రశాంతముగా నిద్రపోవుచున్న ఆ జీవునికి అనేక అపవిత్ర-భయానక దృశ్యములను చూపి, భ్రాంతిని కొలుపుతూ ఉలికిపాటు కలిగిస్తోంది. అంతమాత్రంచేత ఆ స్వప్నద్రష్ట బద్ధుడా? కాదు.<br>అట్లాగే "సంసారము" అనే రాత్రి సమయంలో "నేను దేహమునకు |

సంబంధించినవాడను. ఈ దేహమునకు నేను పరిమితుడనై చావు - పుట్టుకలను అనివార్యంగా పొందుచున్నాను" - అనే చెడు కలను పొందుచూ, ఈ జీవులు వర్తిస్తున్నారు. 'దేహమే నేను' అనునదంతా అపవిత్రభావన. ఆవిధంగా చూడబడేదంతా సంసృతి (లేక) సంసార విభ్రమమే! (అయినా కూడా ఈ జీవుడు వాస్తవానికి ఆత్మగా బద్ధుడు కాదు)

---

అజ్ఞాన ఉప హతో బాల్యే।
యౌవనే వనితా హతః।
శేషే కళత్ర చిన్తా ఆర్తః।
కిం కరోతి నరాధమః?

ఆత్మ అప్రతిహతమైనది. అయితే కూడా ఈ జీవుని పరిస్థితి ఈ జీవుని పట్ల బాల్యమంతా అజ్ఞానముచే ఉపహతమై (కొట్టుబడుచున్నదై) ఉండిపోతోంది. యౌవనకాలమంతా శృంగార భావములు వచ్చి ఆక్రమించివేస్తున్నాయి. ఇక శేషించిన జీవితము భార్య-పిల్లల పోషణ గురించి కొట్టుకుపోతోంది. అజ్ఞానముతో ఆవరించబడిన ఈ జీవుడు ఇంక దుఃఖనాశనమునకై చేయుచున్నది ఏమున్నది?

---

సతో సత్తా స్థితా మూర్ధ్ని।
రమ్యాణాం మూర్ధ్ని అరమ్యతా।
సుఖానాం మూర్ధ్ని దుఃఖాని।
కిం ఏకం సంశ్రయామి అహమ్?

ఈ దృశ్యములో కనిపిస్తూ ఉన్న సమస్త వస్తువుల నెత్తిమీద "ఉన్నాయి కాని లేవు" - అనే సత్తాసత్త దోషము తాండవిస్తోంది.

రమ్యమైన (బాగుబాగు అనుకుంటున్న) సమస్త విశేషములపైన అరమ్యత (రోత) - నెత్తిన ఎక్కి కూర్చుని ఉన్నది.

-"ఇది సుఖము కదా" - అని అనుకుంటున్న ప్రతి విశేషముయొక్క ముఖమునందు దుఃఖము తాండవిస్తూనే ఉన్నది. మరి ఇక్కడ దేనిని ఆశ్రయించి ఉండాలి?

---

యేషాం నిమేషణ ఉన్మేషౌ
జగతః ప్రళయోదయౌ,
తాదృశాః పురుషా యాన్తి ।
మాదృశాం గణనైవకా?

ఏ సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు కనులు తెరచినప్పుడు ఈ అతి విశాల సృష్టి అంతా ఏర్పడినదై, ఆయన కనులు మూయగానే ఇదంతా (ప్రళయ సమయము దాపురించగా) - వినాశనము పొందుచున్నదో,....అంతటి ఆ చతుర్ముఖ బ్రహ్మ మొదలైన దేవతా ప్రముఖులు కూడా కాలము చేత క్షణంలో మటుమాయమగుచున్నారు. ఇక మా వంటి దేహబద్ధులగు అల్పజీవుల గురించి వేరే ఏమి చెప్పాలి? మా ఈ దేహములు ఒక్క లెక్కయా?

---

సంసార ఏవ దుఃఖానాం
సీమాన్త – ఇతి కథ్యతే,
తత్ మధ్యే పతితే దేహే
సుఖమ్ ఆసాద్యతే కథమ్?

**"దుఃఖములన్నిటికంటే పరాకాష్ఠ అయిన దుఃఖము ఏది రా?"** అని పరిశీలిస్తూ రాగా, "అనిత్యము, నిత్యనాశనము ధర్మములుగా కలిగియున్న ఇక్కడి దృశ్యముతో అవినాభావ సంబంధము తెచ్చిపెట్టుకొని ఒంటికి పూసుకోవటము. (కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యములనే ఆరు) త్రాళ్ళతో పేనుకున్న చాంతాడుతో స్వయముగా కాళ్ళు-చేతులు కట్టించుకొని ఉండటము"- ఈ ఈ రూపముగల సంసారబంధము అన్ని దుఃఖములకంటే 'పరాకాష్ఠ'-అని చెప్పబడుతోంది. అటువంటి సంసారారణ్యము మధ్యగా పడి వున్న ఈ దేహమువలన కలుగగల సుఖము ఏమున్నది?

---

6. ప్రబుద్ధో అస్మి। ప్రబుద్ధో అస్మి।
దుష్టః చోరో అయమ్ ఆత్మనః।
"మనో" నామ నిహంతి ఏనం,
మనసాస్మి చిరం హతః॥

నేను (అజ్ఞానము అనే) గాఢనిద్ర పోవుచూ ఉండగా - ఇంటిలోకి ('జ్ఞానము' అనే నాదైన రత్నమును దొంగిలించటానికి) దొంగ ప్రవేశించాడు. సుదీర్ఘ కాలంగా ఆతడు ఎక్కడ ఇంటిలో నక్కినాడో చీకటికారణంగా తెలియనే లేదు. "గురువాక్యమననము - శాస్త్ర శ్రవణము - సాధనలు" సహాయంతో బాగా మెలకువ వచ్చింది. 'జ్ఞానము' అనే వెలుగులో చూడగా అప్పుడు ఏమైంది? ఆహా! ప్రబుద్ధుడను అయ్యాను. బుద్ధి వికాసము పొందింది. ఆ దొంగ ఎవ్వరో కాదు. నా మనస్సే. మనస్సు అనే దొంగ చిరకాలంగా నన్ను భయపెట్టుచూ బాధిస్తున్నాడు.

**మా ఖేదం భజ హేయేషు।**
**న ఉపాదేయ పరో భవ।**
**హేయా-దేయ దృశౌ త్యక్త్వా,**
**శేషస్థః సుస్థిరో భవ॥**

అందుచేత ఓ నిదాఘా! అనివార్యంగా వదిలిపెట్టవలసిన వాటిగురించి, పట్టుకోవలసి వస్తున్న వాటి గురించి ఖేదము (Worry / Lamenting) పొందనే వద్దు. దృశ్యమునకు సంబంధించినట్టి అట్టి హేయ-ఉపాదేయములను అంతరంగా త్యజించినవాడవై, అప్పటికీ శేషించియున్న 'ఆత్మ-ఆత్మభావన' యందు సుస్థిరుడవై ఉండు.

---

**నిరాశతా, నిర్భయతా, నిత్యతా, సమతా జ్ఞతా,**
**నిరీహతా, నిష్క్రియతా, సౌమ్యతా, నిర్వికల్పతా,**
**ధృతిః మైత్రీః మనః తుష్టిః మృదుతా,**
**మృదు- భాషితా, హేయ ఉపాదేయ నిర్ముక్తే**
**'జ్ఞే' తిష్ఠన్తి అపవాసనమ్॥**

త్యాజ్య-గ్రాహ్యములకు అతీతులు, దృశ్యవాసనలను మొదలంట్లా జయించి వేసినవారు - అగు మహనీయులలో ఈఈ ఉత్తమ గుణములు స్వాభావికమై ఉంటాయి.

❊ నిరాశత : "ఈ ప్రపంచములో ఇంకా ఏదో పొందాలి! ఇది ఇట్లా ఉండాలి. అట్లా ఉండరాదు" - అనే **ఆశించటము**(Expectation) ను **త్యజించి ఉంటారు (నిరాశితులు).**

❊ నిర్భయత్వము : ఎప్పుడైనా ఏదో జరుగకూడనిది జరుగుతుందేమోననే భయావేశము లేకుండటము.

❊ నిత్యాతా : ఆత్మయొక్క నిత్యత్వమును ఏమరువకపోవటము

❊ సమతా : **"సమస్తజీవులు ఆత్మస్వరూపులే. ఆత్మస్వభావులే"** అను సమతాభావము.

❊ 'జ్ఞ'తా : వివేకముతో కూడిన ఆత్మతత్త్వజ్ఞానము.

❊ నిరీహత్వము (లేక) నిష్కామత్వము

❊ 'నేను దేనికీ కర్తను కాదు. భోక్తను కాదు' - అనే నిష్క్రియత్వము.

❊ సౌమ్యతా : ఇతరులకు ప్రీతి - సుఖము కలిగించే ఆచారములు

❊ సర్వకల్పనలకు ఆవల సంస్థితుడై ఉండు నిర్వికల్పత్వము.

❊ ధైర్యము, తెలివి. స్నేహపూర్వక మనస్సు సంతృప్తి. మృదువుగా సంభాషించటము. ఇవన్నీ ఆత్మజ్ఞానిని స్వాభావికంగానే ఆశ్రయించి ఉంటాయి. స్వాభావికంగానే వారు వాసనారహితులై ఉంటారు.

---

**గృహీత తృష్ణా శబరీ వాసనా జాలం ఆతతం।**
**సంసార వారి ప్రసృతం చిన్తా తంతుభిః ఆతతం।**

"తృష్ణ" అనే ఆటవిక స్త్రీ వాసనలు (Tendencies) అనే త్రాళ్ళతో అల్లిన 'వల' (Fishernet)ను తీసుకొనివచ్చి, "సంసారము" అనే తటాకంలో ఆ వలను విసరి, ఈ 'జీవులు' అనే చేపలను వలలోకి ఆకర్షించి బలవంతముగా పట్టుకొంటోంది.

---

**అనయా తీక్ష్ణయా, తాత।**
**ఛిన్ధి బుద్ధి శలాకయా।**
**వాత్యయైవ అంబుదం జాలం**
**ఛిత్వా తిష్ఠత తే పదే (తిష్ఠ తతే పదే)॥**

వాయువు వేగముగా వీచి దట్టమైన మేఘములను ఛిన్నాభిన్నం చేస్తాయి చూచావా! ఆ విధంగా 'జ్ఞానము' అనే చురకత్తిని చేబూని బుద్ధియొక్క సునిశితత్వముతో (పదునుతో) వాసనా సమూహములను నిర్మోహమాటంగా ఛేదించివేసి, సర్వత్రా వ్యాపించి ఉన్న తత్-ఆత్మ **పదమునందు సుస్థిరుడవు, నిశ్చలుడవు అయి ఉండెదవుగాక!**

---

మనసైవ మనః ఛిత్వా
**కుఠారేణేవ పాదపం,**
**పదం పావనం అసాద్య**
**సద్య ఏవ స్థిరో భవ॥**

గొడ్డలితో భీకరంగా గోడలపై పెరిగియున్న మఱ్ఱివృక్షమును ఖండిస్తాము చూచావా? ఆ విధంగా పరిశుద్ధము - నిశ్చలము అగు 'మనస్సు' - అనే గొడ్డలితో మనస్సు యొక్క వాసనా విభాగములను ఖండించివేసి, ఇక అప్పటికీ శేషించియుండే సద్యము (ఆత్మ)యందు సుస్థిరుడవగుము.
(సద్యము = అయమ్ సత్ = సత్ వస్తువు)

| | |
|---|---|
| **7. తిష్ఠన్, గచ్ఛన్ స్వపన్ జాగ్రన్<br>నివసన్ ఉత్పతన్ పతన్,<br>"అసత్ ఏవ ఇదమ్" ఇతి అంతః<br>నిశ్చిత్య ఆస్థాం పరిత్యజ။** | ఓ నిదాఘ మహానుభావన్! ఈ దృశ్య జగత్తు ఎల్లప్పుడు చంచలము, గతించుతూ ఉండేదే కూడా. నీవు కూర్చుని ఉన్నప్పుడు , లేచి నడుస్తూ ఉన్నప్పుడు, నిద్రిస్తున్నప్పుడు, కునుకులు పడుచూ ఉన్నప్పుడు, మెలకువగా ఉన్నప్పుడు, నిలబడి ఉన్నప్పుడు, పడుచూ ఉన్నప్పుడు, పడిపోయి ఉన్నప్పుడు కూడా <u>"ఈ దృశ్య జగత్తు సర్వదా కథలోని సంఘటనలవలె అసత్యము"</u> - అని అంతరంగములో నిశ్చయము కలిగి ఉండు. ఈ సమస్త దృశ్యమును మొదలే పరిత్యజించివేసి ఉండు. |
| **దృశ్యం ఆశ్రయసీదం చేత్,<br>తత్ - సత్ చిత్తో అసి బంధవాన్။<br>దృశ్యం సంత్యజసీదం చేత్<br>తత్ అచిత్తో అసి "మోక్షవాన్" ။** | "ఈ దృశ్య జగత్తు సత్యమే" అని చిత్తముతో ఇష్టముగా నమ్మి ఆశ్రయించినవాడవై ఉన్నావా? - ఇక అప్పుడు నీ చిత్తమే నీకు బంధము కాగలదు. చిత్తము ఉంటే ఇక బంధమే။<br>దృశ్యమును మొదలంట్లా త్యజించి (ఒక కథను చదువుచున్నట్లో, ఒక నాటకమును చూస్తున్నట్లో) జగద్దృశ్యమును మిథ్యగా దర్శిస్తూ ఉన్నావా..., ఆ చిత్తమే నిన్ను మోక్షస్వరూపునిగా చేసివేయగలదు. చిత్తము ఉన్నా లేకున్నా కూడా మోక్షమే. |
| **<u>"న అహం। న ఇదం"</u> ఇతి ధ్యాయం<br>తిష్ఠ త్వం అచలాచలః။<br>ఆత్మనో జగతశ్చ అంతః,<br>ద్రష్టృ దృశ్య దశ అన్తరే,<br>దర్శనాఖ్యం స్వం ఆత్మానం<br>సర్వదా భావయన్ భవ။** | ఓ నిదాఘా! నాటకములో ఒక పాత్రగా నటిస్తున్నప్పుడు "ఈ 'పాత్ర' - అనబడే ఒకాయన ఉన్నాడు" - అని అనుకొని నటిస్తామా? లేదు కదా! అట్లాగే "ఈ జగత్తులో ప్రతిబింబిస్తున్న 'నేను' అనునది గాని, నాటకీయమగు ఈ జగత్ దృశ్యము గాని మొదలే లేదు" - అను ధ్యాసను వీడక, ఎక్కడ ఉంటే అక్కడ సుతిష్ఠితుడవై ఉండు. అచంచలుడవై జగత్ + స్థ (జనిస్తూ - గతిస్తూ ఉండే) ఇద్దానిని మౌనంగా అతీతత్వముతో చూస్తూ ఉండు.<br>నీకు - ఈ జగత్తుకు (లేక) ద్రష్టకు - దృశ్యమునకు మధ్యగా గల కేవల దర్శన స్వరూపము యొక్క అంతరమున **స్వాత్మరూపముతో** భావనాపూర్వకంగా ఏర్పడినవాడవై ఉండు. |
| **స్వాద్య - స్వాదక సన్త్యక్తం,<br>స్వాద్య - స్వాదక మధ్యగమ్,<br>{స్వా(స్వ)} స్వదనం కేవలమ్ ధ్యాయన్<br><u>పరమాత్మమయో భవ။</u><br>అవలంబ్య నిరాలంబం మధ్యే మధ్యే స్థిరోభవ။** | "ఆస్వాదించుచున్నది ఆస్వాదించబడునది" - అగు రెండిటినీ మొదలంట్లా త్యజించి, ఆ రెండిటి మధ్యగా ఏర్పడి ఉన్న "ఆస్వాదనము" అను కేవల తత్త్వమును ధ్యానము చేస్తూ ఉండు. అనగా, కేవల స్వరూప ఆస్వాదనము నందు మాత్రమే ధ్యాసను నిలుపుచూ - **పరమాత్మమయుడవు** అగుము.<br>"నిరాలంబనము (Independence) 'ఆలంబనము (Dependence)ల మధ్యగా సమస్తమునకు అతీతుడవై, సుస్థిరుడవై ఉండవయ్యా। |
| **8. రజ్జు బద్ధా విముచ్యంతే।<br>తృష్ణా బద్ధా న కేనచిత్।<br>తస్మాత్, నిదాఘ! తృష్ణాం త్వం<br>త్యజ సంకల్ప వర్జనాత్။** | ఒకడు త్రాడుతో కట్టబడితే ఎట్లాగో - అట్లా ఆ త్రాళ్ళను త్రెంచి విముక్తి కలిగించగలం. కానీ తృష్ణ (The habit / Tendency / The Culture of craving for some thing) చే బంధించిబడినవాడిని బంధము నుండి విడిపించలేము. ఆ బంధము తేలికగా తెగదు.<br>అందుచేత ఓ నిదాఘా! నీవు తృష్ణను జయించే ప్రయత్నము చేయాలి. అందుకు ఉపాయం? సంకల్పములను త్యజిస్తే తృష్ణ జయించబడగలదు. |
| **ఏతాం అహంభావ మయీం అపుణ్యాం<br>ఛిత్వా <u>"అనహంభావ"</u> శలాకయైవ,<br>స్వభావజాం భవ్య భావాన్త భూమౌ<br>భవ, ప్రశాన్త అఖిల భూత భీతిః။** | (పొయ్యిలోనుంచి మండుచున్న కట్టెలను లాగివేస్తే ఉష్ణము తొలగుతుంది కదా!) అహంభావముతో నిండి ఉన్నది, పాప కార్యక్రమములలోకి త్రోసివేయునది - అగు తృష్ణ (లేక) ఆశ (ఆశించటము)ను "అనహంభావము" - అనే ఆయుధముతో త్యజించివేయుము. భవబంధమును త్రెంచివేయుము. ఆవల స్వాభావికమైయున్న "భౌమాస్థానము"ను ఆశ్రయించి ఉండుము. ప్రశాంత మనస్కుడవై అఖిల భూతజాలముల పట్ల భయమును రహితము చేసుకొని ఉండుము. ఆత్మ దృష్టిని కలిగి ఉండుము. |

"అహం ఏషాం పదార్థానాం।
ఏతే చ మమ జీవితమ్।
నా అహమ్ ఏభిః వినా కశ్చిత్। న మయా ఏతే వినా కిల।"
– ఇతి అంర్నిశ్చయం త్యక్త్వా, విచార్య, మనసా సహ॥
"న అహం పదార్థస్య, న మే పదార్థ" – ఇతి భావితే॥

"నేను ఇక్కడి పదార్థ విశేషములకు చెందినవాడను. ఈ ఇంద్రియ విషయములు, ఇక్కడ పదార్థజాలము నాకు చెందినవి. ఇవన్నీ లేకుండా నేను ఉండలేను. నేను లేకుంటే ఇవన్నీ ఉండజాలవు" - అనే అంతర నిశ్చయము ఎప్పటినుంచో హృదయములో రూపుదిద్దుకొని ఎందుకో గూడు కట్టుకుని, పేరుకొని ఉన్నది.
ఇప్పుడు అటువంటి అంతర నిశ్చయమును విడచివేయి. విచారణ చేయి. "ఈ ఈ పదార్థములు, మనస్సు నేను కాదు. నేను ఈ పదార్థములకు చెందినవాడను కాదు"- అని గమనించెదవు గాక!

---

అంతః శీతళయా బుద్ధ్యా
కుర్వతో లీలయా క్రియామ్,
యో నూనం వాసనా – త్యాగో
ధ్యేయో "బ్రహ్మన్" ప్రకీర్తితః॥

"ఈ దృశ్యములోని వస్తుజాలము, సందర్భములు, సంఘటనలు - ఇవన్నీ వీటిని స్వీకరిస్తూ ఉన్న మనస్సుతోసహా - నేను కాదు. అవి నాకు చెందినవి కూడా కాదు' అను అంతరశీతలమైన (Internally Calm) బుద్ధితో లీలగా, క్రీడగా ఆయా సందర్భానుచితమైన క్రియలు, "వాసనాత్యాగి" వయి నిర్వర్తించువాడు 'ధ్యేయత్యాగి' అని శాస్త్రములచే కీర్తించబడుచున్నాడు. ధ్యేయవాసనాత్యాగి "బ్రహ్మమే నేను" అని ఎరుగగలడు.

---

సర్వం సమతయా బుధ్యా యః కృత్వా
వాసనా క్షయమ్,
జహాతి నిర్మమో దేహం, నేయో
అసౌ వాసనా క్షయః॥

సర్వము పట్ల 'సమత' (The sense that Everything and every body is the presentation of Alpervading Divinity)తో కూడిన బుద్ధితో నిర్వర్తిస్తూ ఉంటే - 'వాసనలు తమకు తామే క్షీణించగలవు. నిర్మమకారములో చరిస్తూ ఉండగా, వాసనలు స్వయముగా క్షయించి -నేయోముక్తుడు (ఆతని దృష్టిలో దేహము కల్పితమేగాని- స్వయముగా ఉన్నది కానట్టివాడు) అగుచున్నాడు.

---

**9.** అహంకారమయీం త్యక్త్వా వాసనాం
"లీలయైవ యః,
తిష్ఠతి ధ్యేయ సంత్యాగీ, స "జీవన్ముక్త" ఉచ్యతే॥

<u>'నేను దేహము ఏమాత్రము కాదు - అనునదే నిర్మమో ముక్తి'</u>. ఎవ్వడైతే 1) వాసనలు త్యజిస్తూ 2) అట్టి వాసనలను ఏ అహంకారముతో త్యజిస్తున్నాడో అట్టి అహంకారమును కూడా త్యజిస్తూ, 3) ధ్యానము చేయుచున్న ధ్యేయమును కూడా త్యజించి ఉంటాడో, అట్టివాడు **'జీవన్ముక్తుడు'. (3 steps)**

---

నిర్మూలం కలనాం త్యక్త్వా, వాసనాం యః శమం గతః
"నేయ త్యాగం" ఇమం విద్ధి, ముక్తం తం బ్రాహ్మణోత్తమమ్॥
ద్వావేతౌ బ్రహ్మతాం యాతౌ, ద్వావేతౌ విగత జ్వరౌ,
ఆపతత్సు యథాకాలం సుఖదుఃఖేషు అనారతౌ,
సన్న్యాసయోగినౌ దాంతౌ విద్ధి శాంతౌ, మునీశ్వర!

'కల్పన' అనబడు నిర్మాల్యము రూపమగు వాసనలను త్యజించి అంతరమున పరమశాంతుడై ఉండటమే నేయత్యాగము (నేతి-నేతి) అనబడుచున్నది. అట్టి బ్రహ్మజ్ఞానియగు బ్రాహ్మణోత్తముడు ముక్తుడే (Relieved of all shackless and Bondages). ఓ మునీశ్వరా ! ఆతడే బ్రాహ్మణోత్తముడు. ఆతడే జీవన్ముక్తుడు కూడా.
సంపద - ఆపదల సందర్భములలో ఎవ్వడు వేదనారహితుడై ఉంటాడో, సుఖదుఃఖ సందర్భములలో వాటిలో రమించని వాడై ఉంటాడో, సన్న్యాస యోగి అయి, ఇంద్రియ నిగ్రహము కలవాడై ఉంటాడో - ఆతడే దాంతుడు, శాంతుడు. ఆతడే సన్యాసియోగి కూడా.

---

ఈప్సిత–అనీప్సితేనస్తో
యస్య అంతర్ వృత్తి దృష్టిషు,
సుషుప్తివత్ యః చరతి, స "జీవన్ముక్త" ఉచ్యతే॥
హర్ష అమర్ష భయక్రోధ కామ కార్పణ్య దృష్టిభిః
న హృష్యతి గ్లాయతి యః, పరామర్శ వివర్జితః॥

ఈప్సితములు నెరవేరుచున్నప్పుడు నెరవేరనప్పుడు, అనుకున్నవి జరిగినప్పుడు-జరుగనప్పుడు కూడా ఎవ్వడు 'అంతర్‌దృష్టి'చే గాఢనిద్రలో ఉన్న వాడివలె ఏమాత్రం సంబంధించనివాడై ఈ జగత్తులో విహారము చేస్తూ ఉంటాడో, ఆతడే జీవన్ముక్తుడు.
ఎవ్వడైతే - హర్ష - శోక - భయ - క్రోధ - కామ - కార్పణ్య (జాలి) దృష్టులు కలుగుచూ ఉన్నప్పటికీ ఏమాత్రము సంతోష - దుఃఖము పొందక, గ్లాని పొందక ఉంటాడో - ఆతడే **'జీవన్ముక్తుడు'**.

---

**10.** బాహ్య అర్థ వాసనా ఉత్ భూతా
"తృష్ణా బద్ధ" – ఇతి కథ్యతే॥
సర్వార్థ వాసనో విముక్తా "తృష్ణా ముక్తా"
ఇతి భణ్యతే॥

బాహ్యమున "ఇది పొందాను. ఇది ఇంకా పొందలేదు" అను వేదనల రూపంగా ఉద్భూతమగుచున్న వాసనా క్రమములను కలిగియున్నవాడు 'తృష్ణాబద్ధుడు' అని చెప్పబడుచున్నాడు.
సర్వ ఇంద్రియార్థ వాసనల పట్ల (విడివడినవాడు - Wel - Relieved) అయినవాడు "ముక్తుడు" - అని స్తుతించబడుచున్నాడు. (ఆత్మతో సోఽహమ్ భావము కలిగి ఉండటమే 'ముక్తి').

| | |
|---|---|
| "ఇదం అస్తు మమ" ఇత్యంతం-ఇచ్ఛాం ప్రార్థనయాన్వితామ్, తాం తీక్ష్ణాం శృంఖలాం విద్ధి దుఃఖ జన్మ భయ ప్రదామ్॥ తామ్ ఏతాం సర్వ భావేషు సత్ సు, అసత్ సు చ సర్వదా, | "ఇది నాకు కావాలి" అను వాంఛ (ఇచ్ఛ) హృదయమునందు ఉద్వేగంగా రూపము కలిగి యుండి, ఇచ్ఛల గురించిన యాచనను (Begging) అభ్యాసపూర్వకంగా ప్రకటనమవటమే తీక్షణమగు బంధము. "ఇది నాది" అను "అస్తు మమ భావన"యే దుఃఖ-జన్మ ఫలప్రదమై యున్నది. సత్ -అసత్‌గా (ఉండి-ఉన్నట్లు) కనబడుచూ ఉన్న సమస్త వస్తు-విషయ-దృశ్య వ్యవహారములను సర్వదా వదలియున్న వాడివై, పరమ ఉదారమగు "మహామనో పదము" సిద్ధించుకొనుము. |
| సంత్యజ్య పరమోదారం పదమేతి "మహామనాః"॥ బంధాస్థాం అథ మోక్షాస్థాం సుఖదుఃఖ దశాం అపి, త్యక్త్వా సత్-అసత్ ఆస్థాం త్వం తిష్ఠ, అక్షుబ్ధ-మహాఅబ్ధివత్॥ | ఏ నిదాఘా! బంధము-మోక్షము, సుఖము-దుఃఖము, సత్-అసత్-ఈ విధములైనవన్నీ వదలిపెట్టి, తరంగములు లేనట్టి మహా సముద్రము ఎట్లా ఉంటుందో - ఆ విధంగా నిశ్చలంగా, ప్రశాంతంగా సుతిష్ఠుడవై ఉండు. ఇక ఈ తదితరమైన జీవాత్మ, దేహము, దృశ్యములు మొదలైనవి ఏది ఎట్లా ఉండాలో, అట్లే ఉండుగాక। |
| జాయతే నిశ్చయః, సాధో! పురుషస్య చతుర్విధః (4)। | ఓ సాధూ! ఈ మానవులు (పురుషులు, జీవులు) నాలుగు (4) విధములైన నిశ్చయములు (way of understanding) కలిగి ఉంటున్నారు. |
| (1) అహమ్ శరీరమ్ : "ఆపాదమస్తకం అహం", మాతా పితృ వినిర్మితః ఇతి ఏకో నిశ్చయో బ్రహ్మన్! బంధాయాస విలోకనాత్॥ | (1) "ఇదమ్ దేహమహమ్" నిశ్చయము : "తల్లిదండ్రుల శరీరములనుండి నిర్మితమై పాదమునుండి మస్తకము (Foreface) వరకు కనిపిస్తున్న ఈ భౌతికదేహమే నేను" - అను నిశ్చయము (Determination). హే బ్రహ్మన్! అట్టి విలోకనము (perception) బంధముకొరకే అవుతోంది. అనేక శ్రమలకు, దుఃఖములకు త్రోవతీస్తోంది. |
| (2) అహమ్ అతీతో: అతీతః సర్వ భావేభ్యో వాలాగ్రాత్ అపి "అహం' తనుః ఇతి ద్వితీయో, మోక్షాయ నిశ్చయో జాయతే సతామ్॥ | (2) "ప్రత్యక్ - పర స్వరూపోఽహమ్"-నిశ్చయము : "నా భావములలో ఈ దేహము దృశ్యములతో సహా ఈ జగదనుభవమంతా ఏర్పడినదై ఉండగా, ఇక దీనికంతటికీ - వెంట్రుకయొక్క చిట్టచివరి సూక్ష్మవిభాగము వలె - నేను ప్రత్యేక-కేవల-(సర్వమునకు) అతీత స్వరూపుడను. అంతేగాని ఈ భౌతిక శరీరముతో సహా నేను ఈ దేహములోని ఒక వస్తువు అయి ఉండనే లేదు'. - ఇట్టి రెండవ నిశ్చయము మోక్షమునకు మార్గము అయి ఉన్నది. |
| 11. (3) అహమ్ సమస్తమ్ : "జగత్ జాల పదార్థ - ఆత్మా, "సర్వ ఏవ అహమ్ అక్షయః" తృతీయో నిశ్చయశ్చ ఉక్తో "మోక్షాయ" ఏవ, ద్విజోత్తమ! | (3) "అనన్యోహమ్। ఇదం సమస్తమ్ అహమేవ" - నిశ్చయము : "సమస్తము భావన చేతనే అనుభవమగుచున్నది. నేను భావమునకు ఆదికర్తను. కనుక ఈ జగత్ - జాల పదార్థమంతా కూడా అక్షయస్వరూపుడనగు నేనే! నాకు అన్యమై ఏదీ లేదు" - ఇది మూడవ నిశ్చయము. ఓ ద్విజోత్తమా! ఈ మూడవ నిశ్చయము యుక్తి యుక్తమే. ఎందుకంటే రెండవ నిశ్చయమువలె ఇది కూడా మోక్షదాయకమే అయి ఉన్నది. |
| (4) సర్వమ్ శూన్యమ్ : "అహం జగద్వా సకలం శూన్యం వ్యోమ సమం సదా", ఏవం ఏష చతుర్థో అపి నిశ్చయో, మోక్ష సిద్ధిదః॥ | (4) "సమస్తమ్ శూన్యమేవ" - నిశ్చయము : 'ఆకాశము యొక్క స్వరూపము సర్వదా శూన్యమే కదా! అదే విధంగా, "నేను", ఆ "నేను' చే అనుభవముగా పొందబడుచూ ఉన్న ఈ జగత్తు - రెండూ కూడా నిర్విషయమగు శూన్యస్వరూపములే". ఈ విధమైన నాలుగవ నిశ్చయము కూడా మోక్ష సిద్ధిని ప్రసాదించునదే అయి ఉన్నది. |
| ఏతేషాం ప్రథమః ప్రోక్తః తృష్ణయా బన్ధ యోగ్యయా। శుద్ధ తృష్ణాః త్రయః స్వచ్ఛా జీవన్ముక్త విలాసినః॥ | ఈ నాలుగు నిశ్చయములలో మొదటిది అగు "ఈ భౌతిక దేహమే నేను" - అనునది 'తృష్ణ'కు దారితీయుచూ, ఈ జీవునికి బంధమే అగుచున్నది. "ఆశించటము" అను ఆశారూపము ప్రసాదిస్తోంది. దానికిక అంతు ఉండదు. తదితర రెండవ, మూడవ, నాలుగవ నిశ్చయము మనస్సును క్రమంగా తృష్ణారహితము చేయుచు, పరిశుభ్రపరచుచూ, జీవన్ముక్తత్వమునందు విహారము ప్రసాదించగలదు. |

| | |
|---|---|
| “సర్వంచ అపి అహమేవ” - ఇతి నిశ్చయో<br>యో, మహామతే!<br>తమ్ ఆదాయ విషాదాయ న భూయో జాయతే మతిః॥ | ఓ మహామతే! “ఈ సమస్తము నేనే” - అను నిశ్చయముచే ఈ జీవుడు జ్ఞానపూర్ణుడగుచున్నాడు. అప్పుడు బుద్ధియందు ‘విషాదము’ - మొదలంట్లా తొలగిపోతుంది. ఇక మరల విషాదముగాని, దుఃఖముగాని జనించదు. సమస్తము వినోదమయమై చెన్నొందగలదు. |
| శూన్యం తత్ ప్రకృతిః మాయా<br>బ్రహ్మ విజ్ఞానం ఇతి అపి,<br>శివః పురుష ఈశానో<br>నిత్యం “ఆత్మ” ఇతి కథ్యతే॥ | పరస్వరూపమగు కేవల స్వరూపమును :-<br>❖ కొందరు ‘శూన్యము’ అంటున్నారు. మరికొందరు<br>❖ “ప్రకృతి” అని, “మాయ” అని,<br>❖ “పరబ్రహ్మము” అని, “విజ్ఞానము” అని,<br>❖ “శివము” అని, “పురుషుడు” అని,<br>❖ “ఈశానుడు” అని, “నిత్యమగు ఆత్మ”....అని ఈ-ఈ అనేక పేర్లతో ఆయా లక్షణ విలక్షణపూర్వకంగా అభివర్ణిస్తున్నారు. |
| 12. ద్వైత-అద్వైత సముత్ భూతైః<br>జగత్ నిర్మాణ లీలయా,<br>పరమాత్మ మయీ శక్తిః<br>అద్వైత ఏవ విజృంభతే॥ | పరమాత్మ స్వరూపము, అద్వితీయము - అగు చిత్ యొక్క నిర్మలమగు ఎరుక (Consciousness/Awareness)। అయి ఉన్న చైతన్య శక్తియే ద్వైత, అద్వైత సంకల్పములతో ఈ జగత్ నిర్మాణమును లీలగా, క్రీడగా, వినోదముగా స్వకీయ కల్పనారూపముగా తయారు చేసుకొనుచున్నది. పరమాత్మయే జగత్‌రూపంగా అద్వితీయుడై విజృంభించుచున్నారు. |
| సర్వాతీత పదాలంబీ,<br>పరిపూర్ణ ఏక చిన్మయః,<br>న ఉద్వేగీ, న చ తుష్టాత్మా<br>సంసారే న అవసీదతి॥ | బ్రహ్మము గురించి శాస్త్ర-అభ్యాసపూర్వకంగా సాధన చేసి ఎరిగిన జ్ఞాని ఈ సమస్త ప్రపంచమునకు అతీతమగు బ్రహ్మమును ఆలంబనముగా తీసుకొనుచున్నాడు. ఏకమేగాని, చతుష్టయము (4గా) కానట్టి ఆత్మను ఆశ్రయిస్తున్నాడు. పరిపూర్ణ చిదానందమయుడై ఉంటున్నాడు. ఏమాత్రము ఉద్వేగములేనివాడై ఉంటాడు। దేనికీ సంతోషించడు. విషాదము పొందడు. ఒకవైపు - ఇదంతా శూన్యముగా కాకుండా పూర్ణముగా చూస్తూనే, మరొకవైపు సంసారమును స్వీకరించనివాడై - అప్రమేయుడై ఉంటాడు. |
| ప్రాప్తకర్మకరో నిత్యం శత్రు మిత్ర<br>సమాన దృక్, ఈహితాని అనీహితైః ముక్తో,<br>న శోచతి। న కాంక్షతి। | ప్రాప్తించిన కర్మలను శాస్త్రీయ లోకానుకూల - ఆచారానుకూల విధానం నిర్వర్తిస్తూ, శత్రు - మిత్రులయందు సమదృష్టి కలిగియుండి, సర్వకోర్కెలను అకోర్కెలుగా (కోరుకోవలసిన అవసరము లేనివిగా) చేయుచున్నవాడై, ఇక దేనికీ శోకించడు. దేనినీ కాంక్షించడు. బ్రహ్మజ్ఞాని అయి, సుఖవంతుడుగా ఉంటాడు. |
| సర్వస్య అభిమతం వక్తా చ,<br>ఉదితః పేశల ఉక్తిమాన్,<br>ఆశయ జ్ఞశ్చ భూతానం,<br>సంసారే న అవసీదతి।<br>పూర్వాం దృష్టిం అవష్టభ్య<br>ధ్యేయ త్యాగ విలాసినీమ్,<br>జీవన్ ముక్తతయా స్వస్థోః<br>లోకే విహర, విజ్వరః॥ | అందరికీ సానుకూల్యమగునట్లుగా సంభాషిస్తూ ఉంటాడు. (ప్రేరణ చేయుచూ ఉంటాడు. యుక్తుడై సర్వజీవుల అభిప్రాయము (Expectation) అనుసరించి ఉంటాడు. ఇతరుల పట్ల “సర్వము సృష్టియజ్ఞములో అంతర్విభాగమే కదా!” - అని గమనిస్తూ ఎరిగియున్నవాడు మరల సంసారములో కృంగడు. మహదాశయుడై ఉంటాడు. సర్వసాక్షి అయి చిద్విలాసంగా సందర్శిస్తూ ఉంటాడు.<br>లోకే విహర విజ్వరః<br>ఓ నిదాఘా! ధ్యేయమగుచున్న (ఇంద్రియములకు విషయమగుచున్న) సమస్తమును అధిగమించివేసి, ఇంద్రియములకు మునుముందే ఉన్న కేవలాత్మయొక్క దృష్టిని అవలంబించి - స్వస్థుడవై, జీవన్ముక్తుడవై ఈ మనోకల్పిత దృశ్య ప్రపంచములో క్రీడగా, లీలగా విహరించెదవుగాక। |
| 13. అన్తః సంత్యక్త సర్వ ఆశో, వీతరాగో,<br>వివాసనః, బహిః సర్వ సమాచారో<br>లోకే విహర విజ్వరః॥ | ఓ నిదాఘా! (పడవ నీళ్ళల్లో ఉంటుంది. కానీ పడవలోకి నీళ్ళను ప్రవేశించనీయము కదా! అట్లాగే) - అంతర హృదయంలో సమస్త ఆశలను (All Expectations and desires) త్యజించివేసిన వాడవై, రాగ-ద్వేషములను రహితముచేసుకొని, వాసనలను పరిత్యజించి ఉండు. ఇక బాహ్యమున మాత్రం సర్వసమాచారములు కలిగియే ఉండి, - ఎట్టి జాడ్యము దరిచేరనీయకుండా విహరించెదవు గాక. |

బహిః కృత్రిమ సంరంభో,
హృది సంరంభ వర్జితః,
కర్తా బహిః అకర్తా అంతరః
లోకే విహర శుద్ధధీః॥

త్యక్త అహంకృతిః, (అశాన్తమతిః) ఆకాశ శోభనః,
అగృహీత కళంకాంకో లోకే విహర శుద్ధధీః॥
ఉదారః పేశల ఆచారః,
సర్వ ఆచార అనువృత్తిమాన్,
అన్తరసంగ పరిత్యాగీ,
బహిః సంసారవాన్ ఇవ।

(ఒక నటుడు రంగస్థలముపై నటిస్తూ ఉన్నప్పుడు "ప్రేమ, కోపము, ఆవేశము" మొ॥వి బయటకు ప్రదర్శిస్తూ లోన అవేవీ లేనివాడై ఉంటాడు కదా। అట్లాగే)

బాహ్యమున కృత్రిమ సంరంభము (Artificially active while functioning) కలిగి ఉండి, (జగన్నాటకీయత ఎరిగియే నటిస్తూ), హృదయములో ఎట్టి సంరంభము లేనివాడవై ఉండు. బయటకు 'కర్త'గాను, అంతరమున 'అకర్త'గాను శుద్ధ బుద్ధితో లోకములో విహరించు.

శుద్ధమైన వివేకము (బుద్ధి) గల ఓ నిదాఘా! అహంకారమును, అహంకర్తా భావనను త్యజించి ఉండుము. శాంతబుద్ధితో కళంక రహితుడవై ప్రశాంతమగు నిర్మలాకాశమువలె శోభిస్తూ, దేనినీస్వీకరించక ఈ లోకమునందు విహారము సల్పుచుండెదవుగాక!

ఉదారమైన సర్వ ఆచారములలో అనువర్తిస్తూనే, అంతరమున సంగమును మొదలంట్లా పరిత్యజించి ఉండుము. బయటకు సంసారివై ఉండుము. అంతరములో సమస్తము సన్న్యసించి ఉండు.

---

అంతర వైరాగ్యం ఆదాయ
బహిః ఆశా ఉన్ముఖే హితః।
'అయం బంధుః, అయం నేతి"
గణనా లఘుచేతసామ్।
ఉదార చరితానాన్తు, వసుధైక కుటుంబకమ్।
(వసుధైవ కుటుంబకమ్)।

అంతరమున ఈ దృశ్యసమస్తమునకు అతీతుడవుగా ఉండుము. వైరాగ్యమును ఆశ్రయించి, బయటకు లోకశ్రేయోదృష్టితో శుభాశయములను కలిగి ఉండుము. 'నేను ఇది కాదు' అని ఎరిగియే సహజీవులకు ఆహ్లాదప్రదుడై ఉండటము ఆత్మజ్ఞానికి స్వభావము అయి ఉన్నది. అంతరంలో ఆశలు లేనివాడవై, బయటకు ఆశలు కలిగినవాడవై ఉండు.

"వీరు నాకు బంధువులు. వారు కాదు" - అనునది అల్పబుద్ధివలననే ఏర్పడుతుంది. ఉదారచరితుడగు ఆత్మజ్ఞానికి ఈ భూమిపైగలవారంతా తన కుటుంబ సభ్యులే. ఈ భూమి అంతా తన కుటుంబమే।

---

భావ-అభావ (భవ-అభావ) వినిర్ముక్తమ్,
జరా మరణ వర్జితమ్,
ప్రశాన్త కలన ఆరంభం,
నీరాగం పదం ఆశ్రయ।

ఓ నిదాఘా! భావ - అభావములను రెండిటినీ త్యజించినవాడవై ఉండు. భావమునకు - అభావమునకు మునుముందే (మరియు) భావ-అభావముల మధ్యగా ఏ కేవల భావాతీత - భావరహిత - భావనలకే జననమగు స్థానము ఉన్నదో - అద్దానిని ధారణ చేస్తూ, ఆశ్రయించి ఉండుము. ఉనికి (భవ) భావనకు ముందే ఉన్నట్టి దానిని ఆరాధించు.

శరీర ధర్మములైనట్టి జన్మ - జరా-మరణములు దేనికి ఏమాత్రము చెందినవి కావో, అట్టి నీయొక్క కేవలస్వరూపమును ఆశ్రయించు.

ప్రశాంత జలములో తరంగములు బయల్వెడలుచూ ఉన్నప్పటికీ జలము తనయొక్క 'రుచి-నిరాకారము' మొదలైనవి పోగొట్టుకోదుకదా! అట్లాగే తన ప్రశాంత రూపమునుండి ఈ జగత్తులు మొదలైన 'కలనము'. ప్రారంభమగుచూ కూడా, ఆత్మ తనయొక్క సత్-చిత్-ఆనందములను వీడదు. అట్టి నీయొక్క ప్రశాంతకలనము - రాగ రహితము అగు పదమునే సర్వదా సందర్శించు.

---

ఏషా బ్రాహ్మీ స్థితిః స్వచ్ఛా, నిష్కామా విగతామయా
ఆదాయ విహరన్ న ఏవం, సంకటేషు విముహ్యతి॥
(ఆదాయ విహరన్ ఏవం, సంకటేషు న ముహ్యతి)

అట్టి స్వచ్ఛము, నిత్య నిర్మలము, నిష్కామము, మాయారహితము అగుస్థితిని సముపార్జించుకొన్నవాడు - ఇక, ఈ దృశ్య జగత్తులో ఎక్కడ ఉన్నప్పటికీ, అట్టివానికి ఇక్కడి సంకటములు మోహము కలిగించలేవు.

---

**14.** వైరాగ్యేణ అథ శాస్త్రేణ
మహత్వాది గుణైః అపి,
యత్ సంకల్ప హరార్థం తత్
స్వయం ఏవ ఉన్నయేత్ మనః॥ (ఉన్మయేత్ మనః)।

రాగ-ద్వేషములు లేకుండా చేసుకొను రూపమగు వైరాగ్యము, శాస్త్ర విచారణ, ("ఈ సమస్తము నేనైన నేను" అను) మహదత్వము, ప్రేమ-భక్తి-ఇత్యాది సాత్విక గుణములు ఇవన్నీ కూడా...."సంకల్పరాహిత్యము"ను (సంకల్పములను) దాటి, సంకల్పించువాని మునుముందు రూపముయొక్క ధారణ సిద్ధి) కొరకే। అట్టి సంకల్పరాహిత్యమును సంకల్పరూపమగు మనస్సు చేతనే యత్నించి, మనస్సును 'ఆత్మ' అను 'ఉత్' స్థానమునకు జేర్చాలి.

<table>
<tr><td>వైరాగ్యాత్ పూర్ణతాం ఏతి మనో నాశ<br>దశ అనుగమ్। ఆశయా రక్తతాం ఏతి<br>శరదీవ సరో అమలమ్॥</td><td>శరత్‌కాలములో (చలికాలంలో) నిర్మల సరోవర జలమును మంచు కప్పి, (సరోవర) నిర్మల జలమును కనబడకుండా చేస్తుంది చూచావా? మనస్సు ఆశలచే అనురక్తమగుటచేతనే నిర్మలమగు ఆత్మ అనుభవమవటంలేదు. వైరాగ్యముచే మనస్సు నిలిపినప్పుడు 'అన్యము' అనునదంతా మంచు కరిగినట్లు కరిగిపోయి - నిర్మలమగు ఆత్మయే సర్వత్రా అనుభవము కాగలదు.</td></tr>
<tr><td>తమ్ ఏవ భుక్తి విరసం వ్యాపార-ఔఘం<br>పునః పునః, దివసే దివసే కుర్వన్<br>ప్రాజ్ఞః కస్మాత్ న లజ్జతే?</td><td>రసహీనమైనట్టి విషయాలనే రోజురోజు మరల మరల అనుభవిస్తూ, ప్రతిరోజు చేసిందే చేయుచూ, విరసమగు వ్యాపారములో మునిగి తేలుచూ, ఆత్మజ్ఞానమునకు అవకాశమైయున్న ఆయుష్షును గడపటానికి ప్రాజ్ఞుడైనవాడు సిగ్గుపడవద్దా? తెలివిగలవాడు సిగ్గుపడాలి. సరిఅయిన మార్గము కొరకు ప్రయత్నించాలి.</td></tr>
<tr><td>చిత్ చైత్య కలితో "బన్ధః"।<br>తత్ ముక్త్వా "ముక్తిః" ఉచ్యతే।<br>చిత్ చైత్యాకిలాత్మ ఇతి<br>సర్వ సిద్ధాన్త సంగ్రహః।</td><td>చిత్ చైతన్యము - ఒకానొక సందర్భములో "దృశ్య విషయముల కలనమే (కల్పనను) సత్యము" - అని అనుకోవటమే బంధము. అనుభవముల నుండి అనుభవియొక్క ఆత్మచైతన్య స్వరూపము విడివడి ఉండటమే "ముక్తి." 'చైతన్యము' (అనుభవమయేదంతా) ఆత్మతో ఏకము-అనన్యము అయి ఉండటమే ముక్తి<br><br>"అనుభవము-అనుదానికి మునుముందే ఉన్న 'అనుభవి' యొక్క కేవలస్వరూపమగు ఆత్మచైతన్యమే తానై ఉండటము"-అనునదే సర్వ సిద్ధాంతముల సారము. సర్వప్రయత్నముల అంతిమ స్థానము - అదియే.</td></tr>
<tr><td>ఏతం నిశ్చయమ్ ఆదాయ, విలోకయ<br>యథా ఇచ్ఛయా, స్వయమేవ ఆత్మన్<br>ఆత్మానం "ఆనన్దం పదం" ఆప్స్యసి॥<br>చిత్ అహం। చిత్ ఇమే లోకాః।<br>చిత్ ఆశాః। చిత్ ఇమాః ప్రజాః ।<br>దృశ్య దర్శన (వి)నిర్ముక్తః<br>కేవల అమల రూపవాన్,<br>నిత్య ఉదితో, నిరాభాసో<br>ద్రష్టా సాక్షీ చిత్ ఆత్మకః॥</td><td>"అట్టి కేవలమగు ఆత్మయే సర్వదానేనై ఉన్నాను" - అను నిశ్చయము సిద్ధింపజేసుకొని, ఇక నీకు ఎట్లా ఇష్టమైతే అట్లా ఈ దృశ్య జగత్తులో విహరించు. అప్పుడిక ఆత్మచే ఆత్మానందపదమును పొంది ఆనందించగలవు.<br>= నేను చిత్ స్వరూపుడను.<br>= ఈ లోకము, ఈ సమస్త దృశ్యము చిత్ స్వరూపమే.<br>= ఆశ, ఆశించబడునది కూడా చిత్ స్వరూపమే.<br>= సమస్త జీవులు చిత్ స్వరూపులే.<br>= నేను దృశ్య - దర్శనముల నుండి నిత్యముక్తమగు (Always Relieved) స్వరూపుడను.<br>= కేవలమగు నిర్మలాత్మ స్వరూపుడను.<br>= నిత్యోదయ నిరాభాస (ప్రతిబింబరహిత) స్వరూపుడను.<br>= కేవల ద్రష్టను. సమస్తమునకు సాక్షిని. చిదానందాత్మ స్వరూపుడను.<br>అను భావనను ప్రవృద్ధము, నిశ్చలము చేసుకొనెదవు గాక!</td></tr>
<tr><td>15. చైత్య నిర్ముక్త చిత్ రూపం,<br>పూర్ణః జ్యోతిః స్వరూపకమ్,<br>సంశాన్త సర్వసంవేద్యం<br>సంవిత్ మాత్రం అహం మహత్॥</td><td>"సమస్త ఇంద్రియ విషయములచే (చైత్యరూపములచే) బద్ధుడను కానట్టివాడను. చిత్ జ్యోతి స్వరూపుడను. చిత్ తత్త్వముచే పూర్ణుడను. తెలియబడేదంతా సశాంతిస్తూ ఉండగా, మహత్ రూపమగు (సత్+విత్) సంవిత్ మాత్రుడను" - అను భావనను ఆశ్రయించు.</td></tr>
<tr><td>సంశాన్త సర్వ సంకల్పః<br>ప్రశాన్తః సకలేషణః, నిర్వికల్ప పదం గత్వా<br>"స్వస్థో" భవ, మునీశ్వర! ఇతి॥</td><td>ఓ మునీశ్వరా! ఈ విధమైన బుద్ధి యొక్క భావనచే సర్వ సంకల్పములను ఆత్మభావనయందు సశాంతింపజేసెదరు గాక. సకల ఈషణములు (Expectations & Desires) ఆత్మభావనచే ఉపశమించునుగాక! నిర్వికల్ప పదమునందు ప్రవేశించి స్వస్థుడవై ఉండుము.</td></tr>
</table>

## ఫల(శుతి

యఇమాం మహోపనిషదం బ్రాహ్మణో
నిత్యం అధీతే, అశ్రోత్రియః శ్రోత్రియో భవతి।
అనుపనీత ఉపనీతో భవతి।
సో అగ్నిపూతో భవతి।
స వాయుపూతో భవతి।
స సూర్యపూతో భవతి। స సోమపూతో భవతి।
స సత్యపూతో భవతి। స సర్వపూతో భవతి।
స సర్వైః దేవైః జ్ఞాతో భవతి।
స సర్వేషు తీర్థేషు స్నాతో భవతి।
స సర్వైః దేవైః అనుధ్యాతో భవతి।
స సర్వ క్రతుభిః ఇష్టవాన్ భవతి॥

## ఫల(శుతి

ఎవ్వడైతే ఈ "మహోపనిషత్" బ్రాహ్మణమును నిత్యము అధ్యయనము చేస్తూ ఉంటాడో అట్టివాడు

- అశ్రోత్రియుడు కూడా - ఉపనిషత్ హృదయమును ఎరిగినవాడై 'శ్రోత్రియుడు' కాగలడు.
- ఉపనీతుడు కాకపోయినా కూడా ఈ అధ్యయన ప్రభావముచేత బ్రహ్మతత్త్వజ్ఞుడు (ఉపనీతుడు) అవగలడు.
- అట్టివాడు అగ్నివలె, వాయువు వలె సూర్య-చంద్రులవలె పునీతుడు, పవిత్రుడు కాగలడు. సత్యముచేతను, సమస్తము చేతను పవిత్రుడగుచున్నాడు.
- సర్వ దేవ తత్త్వములు ఎరిగినవాడు, సర్వతీర్థములందు స్నానము చేసిన పవిత్రుడు కాగలడు.
- అట్టివాడు సర్వదేవతలను ధ్యానముచే ఉపాసించినవాడు అగుచున్నాడు.
- సర్వక్రతువుల ఇష్టాపూర్తము నిర్వర్తించినవాడు అవగలడు.

---

గాయత్ర్యాః షష్టి సహస్రాణి జప్తాని ఫలాని భవంతి।
ఇతిహాస పురాణానాం రుద్రాణాం,
శతసహస్రాణి జప్తాని ఫలాని భవంతి।
ప్రణవానాం అయుతం, జప్తం భవతి॥
ఆచక్షుషః పంక్తిం పునాతి।
ఆసప్తమాన్ పురుష యుగాన్ పునాతి॥
ఇత్యాహ భగవాన్ హిరణ్య గర్భః....।
**జాప్యేవ అమృతత్వం చ గచ్ఛతి।**
**ఇతిఉపనిషత్॥**

***ఇతి మహోపనిషత్***

***ఓం శాంతిః॥ శాంతిః॥ శాంతిః॥***

- గాయత్రీ మంత్రమును 60,000 సార్లు జపించిన మనోవికాసము / జపఫలము సిద్ధించగలదు.
- ఇతిహాస-పురాణముల అధ్యయన ఫలము లభించగలదు.
- లక్షసార్లు రుద్రమును జపించిన ఫలము పొందబడగలదు.
- అర్థయుక్తంగా ప్రణవమును జపించిన స్థితి స్థించగలదు.
- ఆతని చూపు చేత కనుచూపు మేర పరమ పవిత్రత సంతరించుకోగలదు.
- అధ్యయనము చేసినవాని అటు '7' ఇటు '7' తరములు పవిత్రము కాగలవు.

ఈ విధంగా భగవానుడగు హిరణ్యగర్భుడు జీవులందరికీ జ్ఞానము ప్రసాదించినవారై ఉన్నారు.

ఇందలి అంతరార్థ జపముచే ఈ జీవుడు అమృతస్థానము చేరగలడు.

***ఇతి మహోపనిషత్***

***ఓం శాంతిః॥ శాంతిః॥ శాంతిః॥***

---

**శ్రీమత్ సరస్వతీ జగన్మాతా సహిత**
**హిరణ్యగర్భాయ - బ్రహ్మదేవాయ**
**నమో నమో నమో నమః**

---

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘



# మహోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

## (యోగవాసిష్ఠ మహాగ్రంథ ముఖ్య విశేషములు)



***చిదాకాశమునందు సంస్థితమై (ఉనికి కలిగి), ఈ "మహోపనిషత్"చే తెలియబడుచూ ఉన్నట్టి పరమ-అద్వైతసామ్రాజ్యతత్త్వ స్వరూపుడగు తత్ - రామబ్రహ్మమే మాకు ఉపాస్యము. ఉపాస్య దైవము.***

## 1వ అధ్యాయము

## 1. నారాయణీయ → విరాట్-స్వరాట్

పరమాత్మకు అత్యంత సమీప్యమునకు, పరమాత్మతో మమేకత్వమునకు దారి చూపిస్తున్న 'మహోపనిషత్' వ్యాఖ్య (A Subtle Analysation)... ఇక ఇప్పుడు చెప్పుకుంటున్నాము. (ఇది "శ్రీమద్యోగవాసిష్ఠ సారవిశేషములు" - అని కూడా ఆర్యవాక్యము)

⌘

ఎదురుగా కనిపిస్తూ పంచేంద్రియములకు విషయము అగుచూ ఉన్న ఈ దృశ్య జగత్తుకు మునుముందుగా - **కేవల నారాయణతత్త్వము** మాత్రమే ఉనికిని కలిగియున్నది. అట్టి ఏకమగు నారాయణతత్త్వము సమక్షంలో మొట్టమొదటగా సృష్టి లేదు. సృష్టి యొక్క సంకల్పాభిమానియగు బ్రహ్మ లేరు. అనేక రూప-నామములుగా విస్తరించు విశేషణములు గల **ఈశ్వరుడు** లేరు. జలముగాని, అగ్నిగాని, ఓషధిప్రదాతయగు సోముడుగాని, ఆకాశముగాని, భూమిగాని, నక్షత్రములు గాని, సూర్యుడుగాని, చంద్రుడు (సూర్యచంద్ర బింబములు) గాని లేరు. నారాయణుడు మాత్రమే **కేవలుడై,** అన్యమునకు సంబంధించిన ఏకల్పనా కూడా లేనివారై రమించుచూ ఉన్నారు

అప్పుడు ఆ నారాయణుడు **"నాయొక్క వైభమును చూచుకొని నేను ఆనందించాలి కదా!"..** అను ఉత్సుకత, వినోదాభిలాష పొందారు. "క్రీడా వినోదము - విలాసము పొందటానికి నేను ఇప్పుడు ఏమి చేయాలి?" - అనురూపము గల 'తపన' పొందసాగారు. అదియే తపస్సు. **తస్య ధ్యాన - అంతస్థస్య "యజ్ఞస్తోమమ్" ఉచ్యతే॥** అనన్య స్వరూపుని యొక్క అన్యము కొరకై అంతర - ధ్యానమే **"యజ్ఞస్తోమము"** - అని పిలువబడుతోంది. ఆ యజ్ఞస్తోమము నుండి క్రీడా ఆనంద ప్రదర్శనంగా ఈ సృష్టి రచనా చమత్కారమంతా (అనన్యములో అన్యముగా) బయల్వెడలుతోంది.

## యజ్ఞస్తోమము

అన్యము యొక్క వినోదము సిద్ధించటానికై (అనగా) సృష్టియొక్క ప్రదర్శము మౌఖికము అవటానికై (To materialize the fun of Creation from out of Creator who has been since beyond creation) - 14 పురుషకారములు (లేక) పురుషులు బయల్వెడలసాగారు. ఒక 'కన్య' కూడా (బుద్ధి).. బయల్వెడలటం జరిగింది. **(మమ గుణ ధుర్యాం బుద్ధి కన్యాం ప్రదాసే॥)**

**10 ఇంద్రియములు (భావనా రూపములు)**

| **జ్ఞాన : ఇంద్రియములు** | **ఇంద్రియ గోళములు** | **ఇంద్రియ విషయములు** |
|---|---|---|
| (1) శ్రోత్ర – ఇంద్రియములు | చెవి | శబ్దము (వినికిడి) (Sound) |
| (2) త్వక్ – ఇంద్రియము | చర్మము | స్పర్శ (Touch) |
| (3) చక్షు – ఇంద్రియము | కన్నులు | రూపము (Form) |
| (4) జిహ్వ – ఇంద్రియము | నాలుక | రసము (రుచి) (Taste) |
| (5) ఘ్రాణ – ఇంద్రియము | ముక్కు | వాసన (గంథము) (smell) |
| **కర్మ : ఇంద్రియములు** | **ఇంద్రియ గోళములు** | **ఇంద్రియ విషయములు** |
| (6) వాక్– ఇంద్రియము | నోరు | వచనము (Talk) |
| (7) పాణి – ఇంద్రియము | చేతులు | ఆదానము (Working / Carrying) |
| (8) పాద – ఇంద్రియము | కాళ్ళు | గమనము (Walking) |
| (9) పాయు – ఇంద్రియము | గుదము | విసర్జనము (Releasing) |
| (10) ఉపస్థ – ఇంద్రియము | గుహ్యము | ఆనందము (Enjoying) |

(ఇంద్రియములు = శక్తి రూపములు)

**ఇంద్రియ గోళములు** = ఆ శక్తిని (దేహము నుండి) ప్రదర్శించుటకు బహిర్గతమగు స్థానములు (Just like Delivery Pumps)

**ఇంద్రియ విషయములు** = అనుభవించబడునవిగా అగుచున్నవి దృశ్య వ్యవహారములు (All That being experienced)

ఈ విధంగా నారాయణుని నుండి ఆయనయందే – దశేంద్రియములు భావనాశక్తి రూపములై బయల్వెడలసాగాయి. అంతేకాకుండా..,

**11వది** = తేజోరూపంగా **'ఆలోచనా ప్రవాహం'**గా మనస్సు జనించింది.

**12వది** = **అహంకారము** రూపము పొందింది. ('నేను' అను భావనకు కర్త నారాయణుడే అయి ఉండగా, నారాయణుడు, 'నేను'కు మునుముందే అమూర్తీభవించి ఉన్నవారు. అందుకే 'ఆదినారాయణుడు'. ఇవన్నీ ఆయన సంపద కాబట్టే శ్రీమన్నారాయణుడు').

**13వది** = ప్రాణశక్తి (అట్టి ప్రాణశక్తికి శ్రీమన్నారాయణుడే ప్రాణేశ్వరుడు. ఆత్మయే శ్రీమన్నారాయణుడు).

**14వది** = ఆత్మ (The Self) (శరీరము / శరీరి అని కూడా అర్థం చెప్పబడుతోంది)

**15వది** = బుద్ధి

*ఈ 15 మాత్రమే కాకుండా*

'5' సూక్ష్మభూతములగు పంచ తన్మాత్రలు [శబ్ద – స్పర్శ – రూప – రస – గంధ భావనలు (సూక్ష్మ భావనా చమత్కారములు)]

'5' – పంచ మహాభూతములు (Solid - Liquid - Heat - Vapour - Spacing)

పై '25' తత్త్వములతో సృష్టిగా పరమ పురుషుడగు శ్రీమన్నారాయణుని నుండి సృష్టి పురుషుడు (లేక, విరాట్ పురుషుడు జనించారు. అట్టి సృష్టిలో నారాయణుడే పురుషకారముగా (The Inspirer, The Worker of the Universe)గా ప్రవేశించారు. అదియే **"శ్రీమత్ చైతన్యము"** అని కూడా వర్ణితము. **"అధిష్ఠాన పురుషుడు"** అని కూడా అంటారు. ఒక రాజు గారి అధికారములు – పరిపాలన రాజ్యమంతా మూలమూలనా వ్యాపించటము ఎట్టిదో, అధిష్ఠాన పురుషుడు – అధిష్ఠాన పురుషకారము అటువంటిది.

ఆ విరాట్ పురుషుని నుండి అప్రమేయము, అభౌతికము, అనిర్వచనీయము, అప్రతిహతము, అతిచమత్కార రూపము – అగు కాలము (Time factor) – ప్రధాన, సంవత్సరముల రూపంగా (with the measuring units of years) పుట్టుకొచ్చింది.

**అథ పునరేవ నారాయణః సో అన్యత్ కామో మనసా ధ్యాయతా!** పై రీతిగా సంకల్పించిన శ్రీమన్నారాయణుడు ఇంకా కూడా సంకల్పనా వినోదము కొనసాగించసాగారు. సృష్టి యొక్క మరింత నిర్దేశ్యము, మరోహరము కొరకై – ధ్యానము చేయసాగారు. అట్టి ధ్యానము (Avocative thinking) చేత "లలాటము" (fore face) నుండి – (మూడు కనులు గల) "త్రినేత్రుడు, త్రిశూలప్రాణి"యగు ఒకానొక పురుషకారముతో కూడిన పురుషుడు జనించారు. ఆయనయే ఈశ్వరుడు. (సమస్తముగా విస్తరించు స్వభావుడు).

అనంత – మహత్తరము అగు అట్టి తేజోమయ పురుషకారము నుండి –

**– యశస్సు** ... సర్వత్రా ప్రకాశమానము, (Manifesting)

**– సత్యము**... యమ్–సత్–ఘనీ భూతము, అప్రతిహతమగు 'ఉనికి'–భావన **(The sense of one's own presence)**

**– బ్రహ్మచర్యము** .... 'బ్రహ్మము' (Alpervading Absolute Self) యొక్క చర్యము.

**– తపస్సు**... చైతన్యము యొక్క సమస్తమును తపింపజేయు – **దివ్య భావనారూపము.**

**– వైరాగ్యము** ... దేనిచేతనూ పరిమితము కానట్టి **రాగరాహిత్యము.**

**– మనస్సు** ... మనన రూపమగు **యోచనా ప్రవంతి.**

**– ఐశ్వర్యము** ... సమస్త **నామ–రూప –గుణ** ఇత్యాది విశేషములతో కూడిన **సంపద.**

**– ప్రణవ సహిత వ్యాహృతులు** ... 'అ'కార 'ఉ'కార 'మ' కార పురుష – ప్రకృతి. వ్యాహృతి విస్తరణ, రససౌందర్యములు.

**– 'ఋగ్వేదము'**.. ఋక్కులతో (బ్రహ్మమును నిర్వచించు సూత్రములతో) ప్రవరలు.

**– యజుర్వేదము** .. యజ్ఞ – యాగాది క్రమములతో కూడిన కార్యరూప (మంత్ర–తంత్రరూప) ఉపాసనలు.

**– సామవేదము** .. పరతత్త్వము గురించిన గాన రూపములైన అభివర్ణనములు

**– అధర్వణవేదము** ... ప్రకృతి సౌందర్యోపాసనలు, ప్రకృతి యొక్క జీవన – పోషణా చమత్కార రహస్య వర్ణనలు.

**– సమస్త ఛందస్సులు** .. శబ్ద సౌందర్యములు.

**ఇవన్నీ ప్రకాశించసాగాయి.** అట్టి త్రిమూర్తి యొక్క తేజోవిభవమే తదితర సమస్తము అవసాగింది. అదంతా ఆ త్రినేత్రుని సమాశ్రయించినదై సంప్రదర్శనమవసాగింది.

అందుచేతనే ఆ త్రినేత్ర పురుషుని – **"ఈశానుడు", "మహాదేవుడు, దేవదేవుడు"** అని **వేదవాక్కులు** స్తుతిస్తున్నాయి.

త్రినేత్ర పురుషుని కల్పన తరువాత శ్రీమన్నారాయణుడు – సృష్టికామము కొనసాగిస్తూ మనస్సుచే ధ్యానమును (ధ్యాసతో కూడిన భావనను) పునఃనిర్వర్తించసాగారు. ధ్యానములో మరికొంత సంకల్పమును చేయబూనారు. అట్టి ధ్యానముచేస్తూ ఉండగా ఆయన యొక్క లలాటము నుండి **స్వేదము (చెమట)** జనించింది.

– అట్టి స్వేదమే సృష్టికల్పనయందు సర్వత్రా **'జలము'**గా వ్యాపించసాగింది.

– అట్టి స్వేద–ఉదకము నుండి బంగారపు కాంతులు వెదజల్లుచూ ఒక అండము (హిరణ్మయమ్ అండమ్), జనించింది.

– ఆ అండము నుండి సృష్టికల్పన యొక్క అభిమానముతో – చతుర్ముఖుడగు (నాలుగు ముఖములుగల) **బ్రహ్మ** బయల్వెడలారు.

## బ్రహ్మధ్యానము – చతుర్ముఖము

**(1) పూర్వాభిముఖము :** ఆ బ్రహ్మ పూర్వాభిముఖుడై (Towards the dimension/point from where he came out) 'ధ్యానము' (Thinking) చేయటం ప్రారంభించారు. అట్టి **"పూర్వాభిముఖ ధ్యానము"** నుండి :–

- **'భూః'** అనే వ్యాహృతి (భౌతికతత్త్వముగా – భూః శబ్దముతో కూడినది).
- **"గాయత్రీ"** ఛందస్సు,
- ఋగ్వేదము (పరమాత్మ యొక్క తాత్త్వికాభివర్ణములతో కూడిన ఋక్కులు),
- అగ్ని దేవత (వెలుగు, ఉష్ణము) – ఆవిర్భవించాయి.

**(2) పశ్చిమ–అభిముఖము :** పశ్చిమ (West - side) - అభిముఖ దృష్టి (పశ్చిమాభిముఖమైన ముఖము) నుండి :–

- **'భువః'** ఇతి వ్యాహృతి (మనోవిన్యాసము),
- 'త్రిష్టుభ్' ఛందస్సు (జాగ్రత్ స్వప్న సుషుప్తి సంవిధానము),
- యజుర్వేదము (యజ్ఞ యాగ క్రతు విధానములు),
- వాయుదేవత (స్పందనశక్తి, సమస్త కదలికలు) –

**ప్రస్ఫుటము కాసాగాయి.**

**(3) ఉత్తర - అభిముఖము :** ఉత్తరము వైపు దృష్టి - (ముఖము) నుండి :-
- **'సువర్'** వ్యాహృతి (అశరీరులై, దివ్య స్వరూపులై, సృష్టిరచనలో పాల్గొను దేవతలు),
- 'జగతీ (జాగృతా) ఛందస్సు (మార్పు-చేర్పుల చమత్కారములు),
- సామవేదము (సంగీత/నాదోపాసన),

సూర్య-దేవత (తేజస్సు, జీవత్రాణ) **సంప్రదర్శితమైనాయి.**

**(4) దక్షిణ - అభిముఖము :** దక్షిణముగా అభిముఖమైన ముఖము నుండి :-
- **"మహః"** - వ్యాహృతి (జాగ్రత్ స్వప్న సుషుప్తులు తన మహత్తుగా కలిగియున్న నేను) - అను తత్త్వము (తురీయము),
- అనుష్టుప్ - ఛందస్సు (ప్రియము, ఇష్టము),
- అధర్వణ - వేదము, (ప్రకృతి-పురుషల చమత్కారము),
- సోమ(చంద్ర) దేవత (ఓషధులు, ఆహార తత్త్వము). **బహిర్గతమైనాయి.**

ఆ తరువాత బ్రహ్మదేవుడు మరల సృష్టి సామర్థ్యము కొరకై ధ్యానము కొనసాగించసాగారు. క్షీరసాగర నివాసి, దేవదేవుడు అగు శ్రీమన్నారాయణుని హృదయాకాశంలో దర్శించారు. ఆయన యొక్క సందర్శనము ఈ రీతిగా కనబడసాగింది.

- వేలాది శిరస్సులు (భావములు, బుద్ధులు కలవారు),
- సహస్రాది నేత్రములు (ద్రష్ట-దృష్టులు ప్రదర్శించువారు),
- విశ్వమంతటికీ ఆనందమును, శ్రేయస్సును, సుఖమును ప్రసాదించు విశ్వశంభురూపులు,
- సమస్త విశ్వమునకు పరము (వేరు/ప్రత్యక్) అయినట్టివారు,
- సర్వకాల సర్వావస్థలలో ఏర్పడి ఉండుటచే 'నిత్యుడు',
- సమస్త విశ్వము తన యొక్క స్వరూపముగా కలవారు,
- సముద్రంలో వేలాది తరంగములున్నప్పటికీ తరంగాలన్నీ ఏకస్వరూపమే అయి ఉన్న తీరుగా **ఏకో నారాయణుడు,**
- సర్వమును తన యందే ఇముడ్చుకొని హరించువాడు కాబట్టి **హరి,**

**అగు పరమాత్మను వివేకముతో కూడిన బుద్ధితో బ్రహ్మదేవుడు సందర్శించారు.**

ఆ ఆత్మానారాయణుడే ఈ విశ్వమంతటినీ తన యొక్క "తెలుసుకోవటము" - అనే స్వకీయ విలాసమునందు దర్శిస్తూ అద్దానియందు అణువణువు ఉజ్జీవింపజేయుచున్న **"చైతన్యస్వరూపులు".** ఈ విశ్వమంతటికీ ఏర్పడటము - ఉనికి - లయములను శాసిస్తూ **'పతి'**. ఈ విశ్వమంతా విస్తరించి విశ్వముగా ఏర్పడి ఉండటం చేత **"విశ్వేశ్వరుడు"**. సమస్తమును ప్రసాదించు దేవతా **'దివ్య స్వరూపుడు'**. సముద్రము వలె **"ఏకస్వరూపుడు"**. ఈ విశ్వమంతా ఆయన రూప విలాసమే కనుక **"విశ్వరూపుడు"**.

- అధోముఖముగా (క్రింద వైపుగా నిలబెట్టబడి పద్మపు మొగ్గవలె, పద్మము యొక్క అంతరాంతర కోశము (The Inner most Vacant Recess) వలె సర్వుల హృదయాకాశమున క్రిందకు వ్రేలాడుచూ ఆ నారాయణుడే భాసిస్తూ ఉన్నారు.

హృదయము మధ్యగా అనేక నాడులు. అవన్నీ ఒక దానితో మరొకటి కలిసి పెనవేసుకొని ఉన్నాయి. అట్టి పెనవేసుకొని ఉన్న నాడుల అంతర్ - మధ్య విభాగములో మహాన్-అగ్ని-(వైశ్యానరాగ్ని)- నలువైపులా తేజోపుంజములు వెదజల్లుతూ ఉన్నది. అదియే జఠరాగ్ని (లేక ప్రాణాగ్ని) కూడా. ఈ విశ్వమంతా నిండియుండి, విశ్వమంతటినీ తేజోభూతము (Inspiring every bit of / every point of the total Creation) చేయుచున్నది. <u>అది శ్రీమన్నారాయణ చైతన్య ప్రదర్శనమే</u>

అద్దాని అగ్ని శిఖ పైకి, క్రిందకు తేజోరూపముగా ఏర్పడి ఉన్నది. అట్టి 'వేదాగ్ని- జ్ఞానాగ్ని, వైశ్వానరాగ్ని - శోభాగ్ని" యొక్క అంతరమున అణుమాత్రముగా ఒక అగ్నికణము. అద్దాని యొక్కజ్వాల ఊర్ధ్వముఖముగా ఉన్నది. అట్టి బంగారపు రంగుతో మెరుస్తున్న అగ్ని శిఖ యొక్క చిట్టచివర (బ్రహ్మరంధ్ర సూక్ష్మాతిసూక్ష్మ అణుప్రదేశములో) పరమాత్మ విశేషముగా సర్వవిషయ-సహితుడై పరమ పురుషుడు సర్వదా వేంచేసియున్నారు.

అట్టి పరమ పురుషుడే సృష్టి సంకల్పి అగు **"బ్రహ్మ"**. సర్వానంద ప్రదాత అగు **"శివుడు"**. సమస్తముగా విస్తరించియున్న **"ఈశానుడు"**. ఆయనయే త్రిలోకములలోని ఇంద్రియములను చేతివ్రేళ్ళవలె ధరించియున్న **"ఇంద్రుడు"**. ఆయనయే మార్పు-చేర్పులచే స్పృశించబడని **"అక్షరుడు".** సకల జీవులలో స్వస్వరూపుడై (సర్వజీవులలో సమస్తాధినేత అయి పాలించుచున్న) **స్వస్వరూప - విరాట్! స్వరాట్!** (అశరీర దివ్యశక్తి ప్రదర్శకుడు).

**ఇతి మహోపనిషత్**

# 2వ అధ్యాయము
# శ్రీ జనక - శుక సంవాదము
# జీవన్ - విదేహముక్తులు

**శ్రీ శుక మహర్షి –** శ్రీ వేదవ్యాస మహర్షి కుమారుడు. మహాతేజోసంపన్నుడు. ఎల్లప్పుడు స్వస్వరూపము (లేక) అఖండాత్మ స్వరూపము నందు ఆనందతత్పరుడై ఉండువారు. జన్మతః ఆత్మతత్త్వానుభవి. పుట్టుక నుండియే ఆ **మునివరాట్** → ఏది సత్యమో అది ఎరిగియుండి ఎల్లప్పుడు ఆశ్రయించి, అసత్యమగు ఈ కల్పిత ప్రపంచము యొక్క ఆను-పానులు ఎరిగియుండేవారు.

**ఒకానొకప్పుడు....,**

ఆ శుకమహర్షి ఒక ఏకాంత ప్రదేశములో ప్రవేశించి తనకు తానే స్వ-మనస్సు స్వ-వివేకములతో ఆత్మ గురించిన **"విచారణ"** చేయసాగారు. **పంచేంద్రియములను, ఆరవ ఇంద్రియమగు మనస్సుకు కూడా అగమ్యమై, గుర్తించి చెప్పుటకు వీలు కానట్టిది" –** అగు స్వాత్మ గురించి సునిశితబుద్ధితో విచారణ చేస్తూ ఈ విధంగా నిశ్చయాజ్ఞానమును పొందసాగారు.

## శుక మహర్షి యొక్క "స్వాత్మ" గురించిన నిశ్చయము

**శ్రీ శుకమహర్షి :** (ఏకాంతముగా) "ఆహా! పంచేంద్రియముల చేత, ఆరవ ఇంద్రియమగు మనస్సు చేత కూడా నా యొక్క ఆత్మ గురించి వివరించి ఎప్పటానికి సాధ్యము అయ్యేది కాదు. ఎందుకంటే – **"కేవలమగు ఎరుక"**గా చిన్మాత్ర స్వరూపమగు నా యొక్క వాస్తవరూపము అణువు కంటే, ఆకాశము కంటే కూడా **<u>అత్యంత సూక్ష్మము. ఊహకు అందదు. ప్రజ్ఞకు మాత్రమే అందుతుంది.</u>**

పరమసూక్ష్మమగు నా యొక్క పరతత్త్వమే నా స్వస్వరూప – చిత్ అణువు నందు మాయాశక్తి యొక్క విశేషము చేత అనంతకోటి బ్రహ్మాండములను కల్పిస్తోంది. ఎడారిలో గాలి వీచినప్పటి అసంఖ్యాక ఇసుక రేణువులులాగా – నా యొక్క మాయా శక్తియే ఇక్కడే ఉత్పత్తి, స్థితి, లయములు కల్పించుకుంటూ పోతోంది.

నా యొక్క చిత్‌స్వరూపము బాహ్యమున శూన్యమువలె అగుపించటం చేత **"చిదాకాశము"** అని పిలువబడుతోంది. వాస్తవానికి నా ఆత్మ భౌతికంగా ఆకాశ రూపము వంటిది కాదు. ఆకాశము కంటే అత్యంత విలక్షణమైనది.

ఆత్మ యందు ఈ భౌతికాకాశము లేదు. నా ఆత్మ – 'ఇట్టిది' అని ఒక వస్తువువలె నిర్దేశించ చెప్పబడజాలనిది. అది ఉనికి – ఎరుకలను (సత్–చిత్‌లను) ప్రకాశింపజేయు స్వయం ప్రకాశరూపము. తెలియబడునదంతా తన యొక్క చేతన శక్తిచే తనకు అనన్యముగా ప్రకాశింపజేయుచు, తాను మాత్రము ఎల్లప్పుడు యథాతథంగా ఉంటోంది. విజ్ఞాన ఘన శిలాస్వరూపము. ఘనీభూతమైన 'ఎరుక' స్వరూపము. అత్యంత నిర్మలము. స్వయం ప్రకాశము. అట్టి నా యొక్క ఆత్మ– తనయందు తానే, తనయొక్క షోడశకళాచమత్కారంచేత **"జగత్తు"** అనే చిత్రమును **"ఎరుక"** అనే కుంచెతో **గీసుకొని వినోదిస్తోంది. మమాత్మయే భావనా మాత్రంగా జగత్తును ఒకప్పుడు కల్పించుకొని, మరొకప్పుడు "స్వస్వరూపమునకు అభిన్నమే కదా" అనే భావనతో తనయందు ఏకము చేసివేసుకుంటోంది.**

ఈ విశ్వము సర్వదా మామాత్మస్వరూపము యొక్క ప్రకాశరూపమే. కాబట్టి – అగ్నికి వెలుగు వేరుకాని విధంగా మమాత్మానందస్వరూపమునకు ఈ జగద్దృశ్యము ఏక్షణమూ నాకు వేరై ఉండనే లేదు. ఇక ఈ విశ్వమునకు ఉత్పత్తి ఏమున్నది? లయమేమున్నది? అగ్ని వెలుగుచుండగా అనేక అగ్ని శిఖలు ప్రదర్శితమగుచూ ఉంటే అవన్నీ అగ్నికి వేరా? కాదు.

అగ్నిశిఖ సాకారము కాబట్టి అగ్నికి ఆకారమున్నట్లా? కానే కాదు. అట్లాగే ఆత్మ అనే అగ్ని యొక్క శిఖలవంటి "పంచభూత–పంచతన్మాత్ర – పంచకర్మేంద్రియ – పంచజ్ఞానేంద్రియ – పంచప్రాణ–పంచ ఉపప్రాణ" – వంటి పంచ –పంచములతో కూడిన ఈ ప్రపంచము, ఈ భౌతిక దేహి–దేహములు సాకారముగా కనబడుచూ ఉన్నప్పటికీ – అవన్నీ ఆత్మాగ్ని యొక్క అగ్ని శిఖల వంటివి. **ఆత్మ సర్వదా నిరాకారము. సాకారంగా కనిపిస్తూ ఉన్నది కూడా ఆత్మయే.**

**తత్ భావమాత్రమ్, ఇదం జగత్, ఇదం విశ్వం ఇతి।** నా ఆత్మయొక్క 'భావన' చేతనే ఈ సమస్త విశ్వము రూపుదిద్దుకుంటోంది. ఇక్కడి జగత్తు యొక్క సారూప్యమంతా భావన యొక్క – రూపమునకు సంబంధించిన 'ఆశ్రయము' – మాత్రమే. **తత్ భాసమాత్రమ్। ఈ జగత్తు ఆత్మయొక్క ప్రకాశరూప చమత్కారమే।**

**నస్యాత్ తత్తః పృథక్।** నా యొక్క స్వకీయభావనా మాత్రంగా అనుభవమగుచూ, సాకారమై సన్నివేశములతో కనబడుచున్న–ఈ జగత్తు – నేను భావనలను విరమించిన మరుక్షణం – నాకు వేరువేరుగా కనిపించేదంతా నశించినదే అగుచున్నది. స్వప్నద్రష్టయందు స్వప్నము ఉపశమించుతీరుగా,.....ఇదంతా నాయందే ఉపశమించుచున్నది.

**జగత్ భేదోఽ పి తత్ భానమ్ ఇతి భేదోఽ పి తన్మయః।** ఆత్మనగు నేను 'భాసించటము" అనే క్రీడను లీలగా ప్రారంభించి, అనేక భేదములను భావించటము చేతనే ఇక్కడి జగత్తులో అనేక భేదములు కనిపిస్తున్నాయి. పరము, అప్రమేయము అగు నన్ను నేను కొంచెము సేపు ఏమరచి, నా యొక్క భావనారూప జగద్దృశ్యములో కనబడే భేదములతో లీలగా తన్మయమై ఉండటము చేతనే - **'జగత్తు'** అనబడేది ఉనికి పొందుతోంది. అందుచేత **సమస్త భేదములు ఆత్మమయమే.** "ఆత్మయే ఆత్మయందు అనేక భేదములవలె" (భ్రమదృష్టికి) అగుపిస్తోందిగాని, ఆత్మ ఎల్లప్పుడు అఖండమే।

**సర్వగః సర్వ సంబంధో గత్య భావాన్, న గచ్ఛతి।** ఆత్మ అనేక సంబంధములను భావనా రూపముగా కల్పించుకొనుచూ, ఈ అనేక భేద భావనలను ఒకప్పుడు కలిగిఉంటోంది. ఈ భేద భావనలన్నీ "రావటము - పోవటము" జరుగుచూ ఉండటమే **జగత్** (జ= జనించటము, జరుగుతూ - గత్= గతించటము). అయితే, భావముల 'రాక'తో నేను రావటము లేదు. భావముల 'పోక' తో నేను పోవటము లేదు. **నేను ఎక్కడి నుండీ రావటము లేదు. ఎక్కడికీ పోవటము లేదు.** భావములను ఆశ్రయించినంత మాత్రం చేత భావాతీతమగు ఆత్మగా నేను దేనినీ ఆశ్రయిస్తున్న వాడినీ కాను. సద్రూపుడనగు నేను - "జాతి-కుల -జన్మ-కర్మ-దేశ-కాల-ఇహ-పర-జీవాత్మ-పరమాత్మ"-ఇత్యాది భావములచే **పరిమితుడను కాను. బంధము పొందువాడనుగాను. అసలు సంబంధితుడనే కాను.**

సముద్ర జలంతో అనేక తరంగాలు బయల్వెడలి ఏమౌచున్నాయి? జలములోనే సంచారములు చేసి చివరికి జలమునందే లయమగుచున్నాయి. "తరంగములకు ఆకారమున్నది కాబట్టి జలము తరంగములవలె సాకారము" - అని అంటామా? అనము. జలము సాకారము కాదు. తరంగము జలమునుండియే ఉత్పన్నమగుచూ సాకారము కలిగి ఉండి, ఒకప్పుడు జలములో సాకారముతో సహా లయమగుచున్నది.

***కేవలచిత్ (లేక) కేవల ఆత్మానందసాగర జలస్వరూపుడనగు నాయందు ఇక్కడ అసంఖ్యాక బ్రహ్మాండములు తరంగములవలె బయల్వెడలి, సాకారముగా కనిపిస్తూ, నాయందే చరిస్తూ, చివరికి సాకారత్వముతో సహా నాయందే లయిస్తున్నాయి.***

అందుచేత, ఆత్మగా నేను సర్వదా నిరాకారుడను. అస్మత్ కల్పనా రూపములగు బ్రహ్మాండములు, వాటి యొక్క రాకపోకలు - జలంలో తరంగముల ఆకారము వలె - కల్పితము. **సాకారమైనదంతా నిరాకారము యొక్క స్వప్నతుల్య కల్పనా చమత్కారమే।**

**నాస్తి అసావ-ఆశ్రయా భావాత్ సద్రూపస్యాత్ తథాస్తి చ।** జలము ⟶ **'తరంగములు'** అనబడే మరొకటేదీగా అవనట్లే, నేను భావనా రూపముగా అవటమే లేదు. భావిస్తూ ఉన్నప్పుడు, భావరహితుడనై ఉన్నప్పుడు కూడా నా యొక్క **'భావాతీత యథాస్థితి'** ఏదీ కోల్పోవటం లేదు. పొందటం లేదు. సర్వదా సద్రూపమై వెలుగొందుచూ, **'భావనలు'** అనే వెలుగును నలువైపులా వెదజల్లుచున్నాను. ఆ భావనలచేతనే ఈ జగద్దృశ్యము (లేక) విశ్వము రూపము దిద్దుకోవటము, రూపము కోల్పోవటము కూడా జరుగుతోంది. అంతకుమించి **ఈ బాహ్య జగత్తు సంబంధమై మరే విశేషము ఏదీ లేదు.**



భావాతీత భావనారాయణుడనగు నానుండి జగత్ రూప భావనలు ఎందుకు బయల్వెడలుచున్నాయి? అదంతా నా యొక్క క్రీడా - లీలా-బాల్యచాపల్య-భావనా వినోదము మాత్రమే. అనగా, **ఈ జగత్తు నాయొక్క ఆనందస్వరూప సంప్రదర్శనము మాత్రమే.** నేను సర్వదా విజ్ఞానానంద స్వరూపుడను.

| | | |
|---|---|---|
| **విజ్ఞాన** | - | తెలుసుకొను స్వభావముతో |
| **ఆనంద** | - | ఆనందించు |
| **స్వరూప** | - | జగత్ కల్పనా స్వరూప చమత్కారుడను! |

ఈ జగత్తును త్యజించి ధ్యానించుచూ, ధ్యానసిద్ధిని పొందిన వారందరికీ అట్టి **భావాతీతమగు ఆత్మయే** పారాయణము (మనన వస్తువు)గా అగుచున్నది.

అందుచే..,

సర్వ సంకల్పములను బుద్ధితో త్యజించి, అట్టి బుద్ధితోనే ఆత్మత్వమును పరిగ్రహించాలి (లేక) స్వీకరించి ఉండాలి. భావాతీతము, భావరహితము అగు ఆత్మగా ఈ సమస్త జగత్తును దర్శించటమే ఆత్మ పరిగ్రహణము (లేక) ఆత్మ భావన (లేక) ఆత్మతాదాత్మ్యము (లేక) ఆత్మ సాక్షాత్కారము. ఎవ్వరికైతే జగత్తులో ఉన్నప్పుడు కూడా గాఢ నిద్రలో ఉన్నవానివలె - **"జగత్తును అభావించటము. ఆత్మను భావించటము"** అభ్యాసమౌతుందో - అదియే 'ప్రత్యక్ భావన' అని పిలువబడుతోంది. **"వృత్తులన్నీ త్యజించినప్పటి -వృత్తిరహిత కేవలాత్మభావనయే జ్ఞానము"** అని బుధులు ప్రవచిస్తున్నారు.

# జగత్తు యొక్క సృష్టి - ప్రళయములు

పార్థివ (లేక) పాదార్థిక దృష్టి ఆత్మజ్ఞానమును ఆవరించి ఉన్నప్పుడు కనిపించేదే ఈ సృష్టి.

"సృష్టి" అనగా **పాంచభౌతిక జగత్తు** యొక్క ఉత్పత్తి అని, **"ప్రళయము"** అనగా ఇద్దాని పాదార్థికమైన వినాశనమని భ్రమచే అన్వయించబడితే, అది అల్పబుద్ధి చేత మాత్రమే ఆ విధంగా అనుకోబడుతోంది. వాస్తవానికి **'జగత్' అనగా ఆత్మయొక్క 'జగత్-భావన'యే.** అందుచేత జగత్‌వృత్తి (Avocation) యొక్క వికాసమే - **జగత్తు యొక్క ఉత్పత్తి.** జగత్ వృత్తి యొక్క సంకోచమే - **"జగత్ ప్రళయము"**

**అహమ్ సత్-చిత్-పరానంద బ్రహ్మైవాఽస్మి। న చ ఇతరః।** నేను సర్వదా సచ్చిదానంద బ్రహ్మమే। అంతేగాని జీవాత్మను కాను. బద్ధుడను కాను. మరొకటేదీ ఏ క్షణమందు అవటమే లేదు.

- సచ్చిదానంద స్వరూపమే - నాయొక్క **సహజ స్వరూపము.**
- అందుకు అన్యమైనది (వేరైనది) ఏదైనా ఉంటే - అది **సందర్భ కల్పితము** మాత్రమే

❖ ❖ ❖

ఈ విధంగా ఆ శుకదేవుడు తనయొక్క సూక్ష్మబుద్ధితో స్వయముగా ఆత్మ యొక్క కేవలత్వమును, నిత్యత్వమును ఎరిగినవాడు (విజ్ఞాతవాన్) అయ్యారు. **స్వయైవ సూక్ష్మయా బుద్ధ్యా సర్వం విజ్ఞాతవాన్ శుకః।**

అయితే, ఆ విధంగా పరమవస్తువును బుద్ధితో స్వయముగా ప్రాప్తించుకొన్న తరువాత కూడా ఆతని మనస్సు మాత్రం ఇంకా ఆత్మదర్శనమునందు విశ్రాంతి పొందనే లేదు. **"ఆత్మయే ఈ సమస్తముగా ఉన్నది"** అనే **విశ్వాసమును, సందర్శనమును** ఉపాయ పూర్వకంగా ఆయన సిద్ధించుకోలేకపోయారు. ఆతని చిత్తము ప్రాపంచక విషయముల నుండి విరామము పొందటం జరిగిందేగాని, ఆత్మయందు ప్రశాంత -స్వాభావికానందరూపమగు, నిశ్చలత్వము పొందలేదు. చాతకపక్షి తటాక జలము వదలి మేఘముల నుండి జాలువారు వర్షపు చినుకులను విడువలేని విధంగా ఆతడు భోగముల పట్ల చిత్త చాంచల్యము వీడి, ఆత్మ మందిర ద్వారమును ఆశ్రయించినప్పటికీ, - **'ఆత్మానందము'** నందు బుద్ధి, మనస్సు, చిత్తము ఏకత్వము పొందలేదు. **ప్రశాంతత సిద్ధించ లేదు.**

-----

ఒకానొక రోజు శుకదేవులు తానున్న తపోవనము నుండి సుమేరు పర్వత శిఖరం వైపు బయల్వెడలారు. నిర్మల ప్రజ్ఞావంతులు, ఉపనిషత్తులతో సహా వేద వాఙ్మయమును సమీకరించి, విభాగించి, అధ్యయనమునకు మహత్తర సౌకర్యము కల్పించినవారు, భారత-భాగవతాది అష్టాదశ పురాణ ప్రదాత, బ్రహ్మసూత్ర ప్రవక్త, లోక కళ్యాణమూర్తి అగు తన పితృదేవులు జగద్గురువులు **శ్రీకృష్ణద్వైపాయన వ్యాస మహర్షి**ని సమీపించారు. శ్రీవ్యాసులవారు ఏకాంత ప్రదేశములో జ్ఞానానందనిష్ఠులై ఉండగా, శుకదేవుడు వారికి సాష్టాంగదండ ప్రణామములు భక్తిపూర్వకంగా సమర్పించి, అటుపై ఈ విధంగా ప్రశ్నించసాగారు.

**శ్రీ శుకదేవులు** : హే భగవాన్! పితృదేవా! కృష్ణద్వైపాయన వ్యాస జగద్గురూ! మహానుభావన్। పునః పునః నమోనమః। తండ్రీ! తత్త్వానుభవమునకు సంబంధించిన కొన్ని సందేహములు నన్ను, బుద్ధితో సమస్తము విచారణ చేసిన తరువాత కూడా, - ఇంకా వదలటము లేదు. అందుచేత, తమ నుండి **'ఆత్మతత్త్వము'** గురించిన విశేషములను శ్రవణము చేయటానికి మిమ్ములను శరణువేడుచున్నాను.

**శ్రీ వ్యాసభగవానుడు :** బిడ్డా! శుకా! ఇంకా కూడా ఏమి సందేహములు నిన్ను ఆశ్రయించి ఉంటున్నాయో, అడుగు నాయనా!

**శ్రీ శుకదేవులు :** తండ్రీ! ఈ జీవుడు సహజంగానే కేవలమగు ఆత్మయే స్వరూపముగా కలిగి ఉన్నాడు కదా?

**శ్రీ వ్యాసభగవానులు :** అవును. అందులో కించిత్ కూడా అనుమానమే అవసరం లేదు. ఇది మహనీయులగు ఆత్మతత్త్వజ్ఞులు ఎలుగెత్తి ప్రకటించుచున్న పరమసత్యమే. మరి నీకు సందేహమెందుకు?

**శ్రీ శుకదేవులు :** నాకు రెండు ప్రశ్నలు కొనసాగుచున్నాయి.

**(1) సంసారాడంబరం ఇదం కథం అభ్యుత్థితం, మునే?** ఓ మునీశ్వరా! ఆత్మస్వరూపుడే అయినట్టి ఈ జీవుని పట్ల ఈ సంసారాడంబరమంతా ఏ విధంగా రూపుదిద్దుకుని ఘనీభూతము అవుతోంది? ఎట్లా ఉత్పత్తి పొందుతోంది?

**(2) కథం చ ప్రశమం యాతి కియత్ కస్య కదా? వద।** ఇట్టి ఈ సంసార వ్యసనము (లేక) జాడ్యము ఎటువంటివారికి, ఏఏ విధానములచే, ఎప్పటికి, ఏవిధంగా తొలగగలదు?

దయతో ఈ ఈ విషయాలు నాకు వివరించి చెప్ప ప్రార్థన.

❖

అప్పుడు వ్యాసమహర్షి ఆ రెండు ప్రశ్నలకు సమాధానమైయున్నదంతా సవివరంగా, దృష్టాంతపూర్వకంగా, అధ్యాత్మశాస్త్ర విశ్లేషణా విధి- విధానంగా విడమర్చి చెప్పారు. అవన్నీ శుకుడు శ్రద్ధగానే విన్నారు. కానీ,... **"అజ్ఞాసిషం పూర్వమేవ అహమ్ ఇతి।" ఈ జీవుని సంసారాతీత కేవల స్వరూపము గురించి, కల్పనా మాత్రమగు సంసారము గురించి నేను ఇతః పూర్వమే నా యొక్క ఏకాంత విచారణచే తెలుసుకొన్న విషయమే నాన్న గారు చెప్పుచున్నారు కదా! ఇందులో క్రొత్త విషయము ఏమున్నది?"**.. అని తలచిన శుకదేవుడు తన తండ్రిగారు శ్రీ వ్యాసమహర్షి చెప్పుచున్న విషయముల పట్ల కొంతగా ఉదాసీనులై ఉన్నారు. **స శుకః స్వకీయా బుద్ధ్యా న వాక్యం బహు-మన్యతే।** "ఇవన్నీ తెలిసిన విషయాలే కదా!" అనే భావన కలిగి ఉండ సాగారు. తాను చెప్పుచున్న ఆత్మతత్త్వ సమాచారము పట్ల ఉదాసీన భావము కలిగియున్నట్లు శ్రీవ్యాసమహర్షి కుమారుని ముఖ కవళికలను బట్టి గమనించారు.

**శ్రీ వ్యాసమహర్షి!** ప్రియపుత్రా! శుకా! **నాహం జానామి తత్త్వతః।** ఆత్మ గురించి ఎంతవరకు తెలిసియున్నదో,.. అదంతా కూడా వివరించి చెప్పాను. ఇంతకుమించి నాకు కూడా తెలియదయ్యా! అయితే నాకంటే కూడా జ్ఞాన శ్రేష్ఠులగు ఒక మహానుభావుల గురించి నాకు తెలుసు. భూలోకంలో **'జనక మహారాజు'** అనే ఆయన మిథిలానగరంలో ఉంటారు. **జనకో నామ భూపాలో విద్యతే మిథిలాపురే!** ఆయన గొప్ప బ్రహ్మజ్ఞాని అని లోక ప్రసిద్ధి. **యథావత్ వేత్తి అసౌ వేద్యం తస్మాత్ సర్వమ్ అవాప్స్యసి।** వారు నీవడిగిన ప్రశ్నలకు మరింత సాధికారముగా సమాధానమును ప్రసాదించగలరు. వారిని ఆశ్రయించి, శిష్యుడవై నీవు ఏది నిర్దిష్టముగా తెలుసుకోవాలనుకుంటున్నావో, అదంతా శ్రవణం చేసి సమస్తమును పూర్తిగా ఎరుగుము.

❖

తండ్రి చెప్పిన వాక్యములు విన్న శుకదేవుడు తండ్రికి భక్తిపూర్వకంగా నమస్కరించి, శలవు తీసుకొని, అప్పటికప్పుడే మేరుపర్వత శిఖరాగ్రము నుండి దిగి భూమిపైకి వచ్చారు. సుదీర్ఘమైన ప్రయాణము చేసి, జనకమహారాజు పరిపాలిస్తున్న విదేహ నగరము (మిథిలానగరము)లో ప్రవేశించారు. మహారాజగు జనకుడు ఉండే రాజసౌధమును సమీపించారు. అక్కడి ద్వారపాలకులతో తనను తాను పరిచయం చేసుకొన్నారు.

**శ్రీ శుక దేవుడు :** ఓ ద్వారపాలకులారా! శ్రీవ్యాస మహర్షి కుమారుడను. 'శుకుడు' అను పేరు గలవాడను. మహారాజు జనక మహారాజు దర్శనం కోసం మా పితృదేవుల సూచనానుసారంగా ఆత్మజ్ఞానార్థినై మేరుపర్వత శిఖరమున గల మా తండ్రి గారి ఆశ్రమము నుండి వచ్చి ఉన్నాను. ఈ విషయము దయచేసి మహారాజుకు విన్నవించండి.

వెంటనే అక్కడి ద్వారపాలకుడు "స్వామీ! అట్లాగే! ఇక్కడ ఆసీనులై ఉండండి!".. అని పలికి రాజుగారి మందిరములోనికి వెళ్లాడు.

**ద్వారపాలకుడు :** మహారాజన్! జయము జయము! తమ దర్శనానికై రాజముఖద్వారము వద్దకు పూజ్యులగు శ్రీవ్యాసమహర్షి ప్రియపుత్రుడు, మహాతపశ్శాలిగా సుప్రసిద్ధుడు అగు శుకదేవుడు మేరుపర్వతశిఖరాగ్రమున గల వ్యాసాశ్రమము నుండి విచ్చేసిఉన్నారు. తమ దర్శనమునకై అభ్యర్ధన చేస్తున్నారు. ఆజ్ఞ!

**జనక మహారాజు :** ఓ ద్వారపాలకా! అంతటి మహనీయుడు, తపస్వి అగు శుకుడు ఊరికే వచ్చి ఉండరు. బహుశః తత్త్వజ్ఞానము, ఆత్మానుభవముల గురించి సందేహ నివృత్తికై వేంచేసి ఉంటారు. అయితే, బుద్ధికుశలతను గ్రహించి మాత్రమే పరాకాష్ఠ విశేషాలు చెప్పాలి కదా! అందుచేత జిజ్ఞాసుడై వచ్చియున్న ఆయనను కించిత్ పరీక్ష చేసి చూద్దాము. **"7 రోజుల వరకు రాజదర్శనము కుదరదు"** అని వారికి చెప్పండి. వారి పట్ల సామాన్యుని పట్ల ఉన్న విధంగానే కించిత్ తూష్ణీభావమే కలిగి ఉండండి!

❖

ద్వారపాలకుడు ఆ విధంగానే "శుకదేవా! 7 రోజుల వరకు మా జనక మహారాజులవారు అనేక వ్యవహారములలో నిమగ్నమై ఉంటారు. తమకు దర్శనము లభించదు".. అని పలికి తూష్ణీభావము వహించి ఉన్నారు. అప్పుడు శుకుడు, చెక్కు చెదరలేదు. **"నాయనా! అట్లే అగుగాక! వారికి సానుకూలమైనప్పుడే దర్శనమును ఇప్పించండి"**.. అని పలికి వేచియుండసాగారు.

7 రోజులు గడిచిపోయాయి. శుకమహర్షికి రాజభవన ప్రవేశము లభించింది. కానీ రాజదర్శనము మాత్రము లభించలేదు. అయితే అక్కడి సర్వవైభవములు గల ఒక విశ్రాంతిమందిరము నివాసముగా ఇవ్వబడింది. సమస్త రాచమర్యాదలు ఆయనకు అందించబడ్డాయి. రాజాజ్ఞను అనుసరించి యౌవ్వనవతులు, మదవతులు అగు సుందరస్త్రీలు వచ్చి పానీయములు, మధుర పదార్థములు మొదలైనవన్నీ అందించసాగారు. వారంతా రాజాజ్ఞానుసారం తమ తళుకు బెళుకులు చూపసాగారు. పిల్లగాలులు పర్వతమును తాకి కూడా అద్దానికి కదల్చలేవుకదా! ఆ విధంగా మధుర పదార్థములు, రుచికరమగు పానీయములు, సుందరస్త్రీల ఆటపాటలు, సరస విరస శృంగార కవ్వింపు సంభాషణలు శుకుని మనస్సును కించిత్ కూడా ఏమీ చేయలేకపోయినాయి. **కేవలం సుమనః స్వచ్ఛో మౌనీ ముదిత మానసః, సంపూర్ణ ఇవ శీతాంశుః అతిష్ఠత్ అమలః - శుకః।** ఆ శుకదేవుడు కేవలమగు ఆత్మస్వరూపమును ధారణ చేసినవారై, స్వచ్ఛమగు సాత్త్వికమైన మనస్సుతో వేచి ఉండసాగారు.

ఎదురుగా కనిపిస్తున్న సమస్త విషయముల పట్ల అంతరమున, **"ఇవి ఏ రీతిగా ఉన్నా నాకు ఒక్కటే కదా!"..** అను **'మౌనము'**ను వహించినవారై ఉన్నారు! స్వచ్ఛతను, సంతోష - సంతృప్తులతో కూడి, పూర్ణత్వమును ఆస్వాదించుచూ, - మలరహితము, ప్రశాంతము, వేదనా రహితము, చల్లతనములతో కూడిన బుద్ధితో **సాక్షిగా సర్వము సందర్శించసాగారు.** ప్రశాంత-ఆనందైశ్వరముతో కూడినవారై సర్వ సందర్భములను చిరునవ్వు వీడక - చూస్తూ ఉండసాగారు. వారికి అక్కడి సంబరములు, ఆడంబరములు మంత్రగత్తె చూపే మాయా విన్యాసముగా మాత్రమే కనిపించసాగాయి. జనక మహారాజు శుకుని ప్రవర్తన - స్పందనలను, ఆయన యొక్క చిరునవ్వుతో కూడిన మౌన-ఆనంద-అతీతత్వముల గురించి అక్కడి సేవకులను అడిగి తెలుసుకుంటూ ఉండసాగారు.

**ఈ విధంగా మరొక '7' రోజులు గడిచిపోయాయి.** ఆ తరువాత జనక మహారాజు స్వయముగా శుకదేవుడు ఉన్న శోభామందిరమునకు వచ్చి ఆయనకు హృదయపూర్వకముగా 'నమస్కారములు' సమర్పించారు. సాదరంగా రాజసభకు ఆహ్వానించి ఉత్తమాసనము సమర్పించారు. పరిజ్ఞాత స్వభావుడు (తెలుసుకోవలసింది ఎరిగియున్నవారు), ఆనంద స్వరూపులు అగు శుకుని గౌరవాభిమానములతో చూస్తూ ఇట్లా సంభాషించసాగారు.

**శ్రీ జనక మహారాజు :** హే శుకభగవాన్! నమోనమః। సుస్వాగతము। పడవ నీళ్లలో ఉన్నప్పటికీ పడవలో నీళ్లు ఉండని విధంగా, మీ అంతరంగము జగత్కార్యములేమీ కించిత్‌కూడా లేనిదై, పరమ నిర్మలమై ప్రకాశిస్తోంది. **తత్త్వభావనచే - ప్రాప్త మనోరథులకు ఈ జగత్తులో కావలసినదీ, పొందవలసినది ఏమీ ఉండదు** - అని మీరు అంతఃపురంలో ఉన్నప్పటి 7 రోజులు ప్రవర్తనచే నిరూపించారు. **నిశ్శేషిత జగత్ కార్యః, ప్రాప్త అఖిల మనోరథః।** హే మహనీయా! ఇక మీరు కోరుకొనుటకు అర్హమైనది సమస్త సృష్టిలో ఏదీ కించిత్ కూడా లేదు. సంసారముతో సంగమును మొదలంట్లా జయించివేశారు. **కిమ్ ఈప్సితమ్ తవ ఇతి?**

ఇంక మీరు కోరునదేముంటుంది? నిరాడంబరులు, జగద్దృశ్యమును జయించినవారు, మహనీయులు అగు మీకు ఇవే మిథిలానగర ప్రజల స్వాగత సుమాంజలులు. మీ దర్శనముచే మేమంతా పావనమైనాము. ఇక చెప్పండి. మేము మిమ్ములను ఏమి సేవించగలము?

**శ్రీ శుకదేవుడు :** గురుదేవా! విదేహదేశ ప్రభూ! జనక మహారాజా। తమకు తమ రాజ్య ప్రజలకు శుభ-శాంతి- ఐశ్వర్య-ఆనందములు సిద్ధించునుగాక - అని ముందుగా శుభాకాంక్షలు పలుకుచున్నాను.

హే మహానుభావన్! నేను తత్త్వజ్ఞాన సంబంధమైన సందేహమును నివృత్తింపజేసుకోవటానికై శిష్యుడనై మీపాదపద్మములను భక్తి ప్రపత్తులతో ఆశ్రయిస్తున్నాను. స్వామీ! నా సందేహములను వినండి.

**(1) సంసారాడంబరం ఇదం కథమ్ అభ్యుత్థితం, గురో?** వాస్తవానికి సర్వదా ఆత్మానందస్వరూపుడే అయి ఉన్న జీవుని పట్ల - ఈ సంసార రూప ఆడంబరమంతా ఎట్లా బయల్వెడలుతోంది?

**(2) కథం ప్రశమం ఆయాతి?** ఆత్మానుభవమును దట్టముగా కప్పి వేసి ఉంటున్న ఈ సంసార రూప ఆడంబరము ప్రశమము జరిగేది ఎట్లా?

అప్పుడు ఆ రెండు ప్రశ్నలకు సమాధానంగా మహా జ్ఞాన సంపన్నుడు, మహాత్ముడు అగు జనక మహారాజు ఉన్నది ఉన్నట్లుగా - సంసారము రూపుదిద్దుకొనుచున్న తీరు గురించి, అది మరి ఎట్లా తొలగగలదో - వివరించి చెప్పారు. "ఇదంతా మనో విలాసమే! **అంతకుమించి మరింకేదీ కాదు. అందుకు వేరై మరేమీ లేదు"** - అని సమీక్షించారు. అదంతా శ్రద్ధగా విన్న శుకుడు **"ఈ విశేషాలన్నీ పిత్రుదేవులు వివరించినవే కదా!"** - అని తలచి, ఇక జనక మహారాజుతో ఇట్లా పలుకసాగారు.

❖

**శ్రీ శుకదేవుడు :** హే మహాత్మన్! గురుదేవా!

**మనో వికల్ప సంజాతం। తత్ వికల్ప పరిక్షయాత్, క్షీయతే దగ్ధ సంసారో నిస్సార- ఇతి నిశ్చితః॥**

ఈ సంసారమంతా- ఇది ఏర్పడటము, ఈ జీవుని పట్ల బంధముగా రూపుదిద్దుకోవటం, ఘనీభూతమై అనేక జన్మ జన్మాంతరములుగా ఈ జీవుని దుఃఖితునిగా చేయటము, ఇదంతా కూడా - **మనస్సు యొక్క వికల్పము** చేతనే జరుగుతోంది. మనస్సు యొక్క వికల్పము మొదలంట్లా క్షయింపజేయబడిందా,... **'సంసారము'** కూడా దగ్ధమై క్షీణించగలదు. **మనస్సుచే కల్పించబడి, వాస్తవానికి 'స్వతఃగా' లేనిదే కాబట్టి ఇదంతా నిస్సారమైనదే।"** - అనే నిశ్చయము గురించి నేను ఇతఃపూర్వమే విచారణ చేశాను, అట్లే నిశ్చయించుకున్నాను కూడా!

**స్వయమేవ మయా పూర్వం అభిజ్ఞాతం విశేషతః।** ఈ విషయము నేను ఏకాంతముగా స్వవివేక విచారణచే గమనించాను. **"అవునా? ఇంతేనా?"** "ఆత్మతత్త్వ జ్ఞానము, మోక్షము అనగా - ఇంతమాత్రమేనా?" అను సందేహముతో అస్మత్ పితృదేవులగు శ్రీ వ్యాస మహర్షిని సమీపించాను.

**ఏతత్ ఏవ హి పృష్టేన పిత్రా మే సముదాహృతమ్।** వారు కూడా ఈ విషయములే విస్తరించి చెప్పారు.

**భవతాపి ఏషఏవ అర్థః కథితో, వాగ్విదాం వర!** ప్రబోధము చేయుటలో విశేష ప్రజ్ఞా సంపన్నులు, వాగ్విదాంవరులు అగు ఓ జనక మహారాజా! మీరు విస్తరించి, వివరించి చెప్పినది కూడా అదే. అదే అర్థమున ఆయా దృష్టాంతముల సహాయముతో నిరూపిస్తూ చెప్పారు. కృతజ్ఞుడను.

**ఏష ఏవ హి వాక్యార్థః శాస్త్రేషు పరిదృశ్యతే।** నాకు ఏకాంత స్వకీయ విచారణచే తెలియవచ్చినది, మా నాన్నగారు బోధించినది, మీరు వివరించి చెప్పినది అదే. ఈ విషయమే – (మనస్సే అంతా కల్పిస్తోంది. మనస్సు ఉపశమిస్తే, సంసారాడంబరము ఉపశమించగలదు. – అను విషయమే) – శాస్త్రములలో కూడా కనిపిస్తూ ఉన్నది. నిశ్చితముగా శాస్త్రములు కూడా అట్లాగే బోధిస్తున్నాయి.

సరే! శాస్త్రములు చెప్పే విషయాలన్నీ అట్లా ఉంచుదాము. **తత్కిం ఏతత్, మహాభాగ? తత్త్వం బ్రూహి!** మీరు ఈ సంసారమును ఏ విధంగా చూస్తూ ఉన్నారు? **"ఇదంతా నా మనోకల్పనయే"** అనే మనో నిశ్చయం ఏవిధంగా ఆరూఢం చేసుకున్నారు?.. ఈ విశేషాలు దయచేసి చెప్పండి. విదేహముక్త సామ్రాజ్య అభిషిక్తులుగా చెప్పబడుచున్న మీ యొక్క **స్వానుభవము** ఏమిటో, మీరు సంసార బంధ భావముల నుండి **విముక్తిని** ఎట్లా ఆస్వాదించగలుగుచున్నారో, మీ పట్ల **భ్రమ ఎట్లా తొలగుచున్నదో**.. అది శ్రవణము చేయతలచాను. దయతో వివరించండి. అది నాపట్ల 'సోహమ్' –ను స్వాభావికముగా తీర్చిదిద్దగలదు.

అప్పుడు శ్రీ జనక మహారాజు పకపకా నవ్వుచున్నవానివలె (ప్రహసన్ ఇవ) ముఖము గలవారై, ఇక ఈ విధంగా చెప్పటము ప్రారంభించారు.

❖ ❖ ❖

**శ్రీ జనక మహారాజు**: ఆత్మజ్ఞానము గురించి మహనీయులగు అనేక మంది ఆత్మజ్ఞులచేత, ఆధ్యాత్మ (వేదాంత) శాస్త్రముల చేత విస్తారముగా చెప్పబడింది. వాటన్నిటి యొక్క సార విశేషము (The Essence of all that) మరల ఇప్పుడు చెప్పుకుందాము. శ్రద్ధగా వినండి. ఈ మనం చెప్పుకోబోతున్న విషయాలు శ్రద్ధాసక్తులతో విని, తెలుసుకున్నంత మాత్రం చేతనే ఈ జీవుడు ఇప్పుడికిప్పుడే సద్యోముక్తుడు కాగలడు. **– యత్ విజ్ఞానాత్ పుమాం సద్యో జీవన్ముక్తత్వమ్ ఆప్నుయాత్।** సూటిగా ఉన్న మాట (వాస్తవం) ఏమిటంటే..,

**మం॥శ్లో॥ "దృశ్యం నాస్తి" – ఇతి బోధేన– మనసో దృశ్య మార్జనమ్,**
**సంపన్నం చేత్ తత్ ఉత్పన్నా పరా నిర్వాణ నిర్వృతిః॥**

ఈ జీవుడు స్వతఃగానే సర్వదానిర్మలము, కేవలము, అనునిత్యము అగు 'ఆత్మ'యే సహజమగు స్వరూపముగా కలిగి ఉన్నాడు. అయితే, లీలా వినోదంగా కల్పన–"Creation"- ను స్వయముగా సిద్ధింపజేసుకొన్నాడు. ఎప్పటినుంచో అట్టి కల్పనా మాత్ర దృశ్యమును **"ఇది ఉన్నది. ఉన్నమాట నిజమే! ఇదంతా వాస్తవమే"..** అను దృఢ భావనను అభ్యాసపూర్వకంగా ఆశ్రయించనారంభించాడు. **ఇదియే 'భవబంధము'గా చెప్పబడుతోంది. మరి, పర్యవసానం?**

కల్పనను నిజమేనని తలచి, ఇద్దానియందు తన్మయమై **"ఇది స్వతఃగా నాయొక్క కల్పనా మాత్రమే కదా? నేను సర్వదా వేరై ఉన్నాను. నేను కేవలమైయున్నాను. వేరుకాని క్షణమే లేదు"..** అను సత్యమును **ఏమరచటం** జరుగుతోంది. **"ఈ దృశ్యము నా కల్పనయే. ఇది స్వతఃగా** (అస్మత్ కల్పనకు భిన్నమై), **స్వతంత్రించి ఉన్నట్టిది కాదు. ఇది స్వయముగా** (By itself) **లేనే లేదు"** – అనే బోధచే మనస్సు 'దృశ్యము' అనే మురికిని వదిలించుకొని శుభ్రమవగలదు. "దృశ్యము నాస్తి" అనే అవగాహనాసంపదచే (లేక) అవగాహనా దృఢత్వము చేత, అప్పుడు ఉత్పన్నమగు స్థితియే **"పరాస్థితి; నిర్వాణము; నిర్వృతి"** మొదలైన శబ్దములు ఉపయోగించి పూజ్యులచే చెప్పబడుతోంది.

**మోక్షము అంటే ఏమిటి? "ఈ దృశ్యము ఇందలి సంఘటనలు సందర్భములు, సంబంధములు మొదలైనవన్నీ నాకు బంధము కాజాలవు. అవి ఉన్నా (లేక) లేకున్నా కూడా వాటితో నాకు ఎట్టి బంధము లేదు"** – అని **స్వాభావికంగా అనిపించటమే 'మోక్షము'**గా చెప్పబడుతోంది.. అయితే అసలు బంధము ఎట్లా ఏర్పడుతోంది?

❄ ఈ దృశ్యము పట్ల – "నిజమే?"..... అనే నమ్మకముతో కూడిన **బుద్ధి.**

❄ దృశ్యము పట్ల ప్రియముతో కూడిన **ధ్యాస।**

❄ అట్టి ధ్యాసను అనేకసార్లు కలిగి ఉండటం చేత **అభ్యాసము।**

❄ సుదీర్ఘమైన (ఇంద్రియములతో మనస్సుతో విషయముల) అభ్యాసముచే **వాసలు** (Tendencies)

ఈ విధంగా ధ్యాస (Avocation) → క్రియ (Act) గాను, క్రియ → అలవాటు (Habit)గాను, అలవాటు → సంస్కారము (Character) గాను, సంస్కారము → వాసనలు (Tendency) గాను ఏర్పడటం జరుగుతోంది. అప్పుడు ఏర్పడుచున్న దృష్టి గురించియే **"అనాత్మదృష్టి, భవబంధము, సంసారము"** మొదలైన శబ్దములు ఉపయోగించబడుచున్నాయి.

**అశేషేణ పరిత్యాగో వాసనాయాం య ఉత్తమః, 'మోక్ష' ఇతి ఉచ్యతే సద్భిః। స ఏవ విమల క్రమః।** దృశ్య విషయముల పట్ల రాగ-ద్వేషములే **వాసనల రూపము,** వాసనలు కలిగి ఉండటమే **బంధము.** అట్టి **వాసనలను** మొదలంట్లా పరిత్యజించి ఉండటమే **మోక్షము**. అందుచేత, **"వాసనలను వదిలించుకొంటూ అంతరంగమును శుద్ధి చేసుకోండి. అదియే మోక్షమునకు మార్గము" –** అని వాసనలను జయించిన సజ్జనులు సుస్పష్టము చేస్తున్నారు. అయితే వాసనలు {Tendencies (or) Past series of Physical and Mental Acts as a habit, Character and, <u>Tendency</u> then on} రెండు రకములు :–

**(1) శుద్ధ వాసనలు : యే శుద్ధవాసనా భూయో న జన్మ-అనర్థభాగినః।** ఇవి క్రమంగా దృశ్యపరిమిత వాసనలను జయించటానికి ఉపకరణములుగా అగుచూ, వాసనా రాహిత్య సాక్షీ స్థానమునకు దారితీయగలవు. సందర్భాతీతత్వమునకు జేర్చగలవు. 'పునర్జన్మలు' అనే అనర్థములను తొలగించగలవు.

**(2) మలిన వాసనలు :** దృశ్య సంబంధమై, ఆసురీ సంపదారూపమైన – వాసనలను వృద్ధి చేస్తూ **"సందర్భములు"** అను దాస్య శృంఖలములను (Slavery Bondages) వృద్ధి చేయగలవు. జన్మ పరంపరలకు దారితీస్తున్నాయి.

శుద్ధ వాసనలను ఆశ్రయిస్తూ ఉండగా, మలిన వాసనలు జయించబడుచూ ఉంటాయి. అనగా అంతరంగమున మార్పు చెందే స్వభావముగల దృశ్య విషయముల పట్ల **'నేను బద్ధుడను'** అను భ్రమను తొలగిస్తూ ఉండసాగుతాయి. ఎవ్వరైతే శుద్ధ వాసనలను పరిపోషణము చేసుకుంటూ ఉంటారో, అట్టివారు జనన-మరణాదులతో కూడిన అనర్ధములలో పునఃగా ప్రవేశించరు. **"నాకు జన్మలు మొదలే లేవు" –** అను స్థానమును సిద్ధించుకుంటారు. అట్టివారే జ్ఞాతజ్ఞేయులు. జ్ఞేయమగు ఆత్మను ఎరుగుచున్నవారు. మహత్తరమగు 'ధీ-(బుద్ధి)" – గల అట్టివారే **'జీవన్ముక్తులు'.**

**జీవన్ముక్తి** = ఎవరి దృష్టిలో సమస్త పదార్థములు భావించబడక, నిత్యముక్తమగు ఆత్మయే సర్వే-సర్వత్రా (స్వస్వరూపముతో సహా) భావించబడుచూ ఉంటుందో, – అట్టివాడే **'జీవన్ముక్తుడు'.**

**బంధము = పదార్థ భావనాదార్ఢ్యం 'బంధ' – ఇతి అభిధీయతే।** "అహమ్ – త్వమ్' లుగా కనిపిస్తూ, **అఖండమే** అయి ఉన్న ఆత్మను ఏమరచి, పదార్థ భావన (A strong perception of matter instead of the one who uses as User)యే బంధము

**మోక్షము = వాసనా తానవం 'మోక్ష' ఇతి అభిధీయతే।** హే బ్రహ్మన్! వాసనా క్షయమునే **'మోక్షము'** అని పిలుస్తున్నారు. అంతేగాని, మోక్షమనగా వాసనలకు సంబంధించని వేరైన స్థితికాదు. గతి కాదు. లోకము కాదు.

## జీవన్ముక్తుడు – స్వాభావిక లక్షణములు

ఓ శుక మహర్షీ! ఇంకా కూడా జీవన్ముక్తుని స్వాభావికమగు ముఖ్య లక్షణముల గురించి వినండి.

- **భోగా ఇహ న రోచంతే :** ఒకానొకనికి సుఖములు, కష్టములు, విషాద సంఘటనలు మొదలైన సానుకూల-వ్యతిరిక్త సందర్భములలో, ('తపస్సు', ఆశ్రమ మార్పు యత్నములు మొదలైనవిగా లేకుండానే,...) ఎట్టి యత్నముల ఆవశ్యకత అవసరపడకుండానే స్వాభావికంగా (In its very natural way) ఇక్కడి భోగముల పట్ల **"రుచి, అరుచి; కావాలి, వద్దు"** మొ॥వి లేకుండానే ఉంటుందో – అట్టివాడు 'జీవన్ముక్తుడు'. – **తపః ప్రభృతినా యస్మై హేతునైవ వినా పునః భోగా ఇవ న రోచంతే।**
- **న హృష్యతి। న గ్లాయతిః :** సుఖ-దుఃఖ, సంపద – ఆపద మొదలైన ఆయా సర్వసందర్భములు పొందుచూ కూడా ఎవ్వని అంతరంగము ఆత్మజ్ఞాన విలక్షణముచే హర్షముగాని, శోకముగానీ పొందదో, ... అట్టి **అంతర్హృదయుడు** జీవన్ముక్తుడు.
- **హర్షామర్ష భయక్రోధ కామ కార్పణ్య దృష్టిభిః న పరామృశ్యతే యో అంతః :–** కొండలోకి పిల్లగాలులు ప్రవేశించజాలని విధంగా ఎవ్వని యొక్క అంతఃకరణమును హర్షము (World happyness), అమర్షము (worldly unhappyness), భయము (fear for something known or unknown), క్రోధము (Long Anger with attributes turning out to be emotional remembrance), కామము (లేనిదేదో లభిస్తేగానీ నిండుతనము లభించదనే ఆవేదన), కార్పణ్య దృష్టి (ఇతరులపై, బెంగ, మమకార దృష్టి) – ఇవన్నీ – **సందర్భానుసారంగా స్పృశించినా కూడా, <u>ఏ మాత్రమూ (హృదయములో, చిత్తములందు) ప్రవేశించలేవో</u> – ఆతడే "జీవన్ముక్తుడు".**
- **అహంకార, వాసనామయీం, యః లీలయైవ త్యక్త్వా-తిష్ఠతి ధ్యేయ సంత్యాగీ।** ఎవ్వడైతే "వ్యష్టిగతమైన నేను-నాది" రూపమగు పరిమిత అహంకారముయొక్క వాసనలను త్యజించిన వాడై, తత్ ప్రయోజనముగా ధ్యేయము (Perception annexed to realing of possession)ను సంత్యజించిన వాడై ఉంటాడో (Left at its core), ఈ సమస్తమును లీలగా, క్రీడగా, వినోదముగా (Like a play, game, pleasure etc.,) దర్శిస్తూ ఉంటాడో, – అట్టివాడు జీవన్ముక్తుడు। **ధ్యేయరహిత ధ్యానమే (Sans object of the World) ఆత్మోపాసన.**

- **జాగ్రత్‌లో సుషుప్తయోగధారణ :** ఇక్కడి ఈప్సితములు (What ever liked) నెరవేరినా, (లేక) నెరవేరకున్నా అట్టి దృశ్యవ్యవహార సరళి అంతా – అంతర్వృత్తి దృష్టిచే **"మొదలే లేనివి"**గా దర్శిస్తూ, గాఢ నిద్రలో ఉన్నవానివలె ఈ సమస్తమును ఏమాత్రమూ పట్టించుకోకుండా ఇక్కడ విహరిస్తూ ఉంటాడో – అతడు **'జీవన్ముక్తుడు'** (Either get what you like, or like what you get - while being beyond both. Be content and be playfully witnessing while usually participating).
- **ఏక – అఖండ పూర్ణభావన :** ఎవ్వడైతే ఆధ్యాత్మము యందు ఆశీనుడై (కేవలాత్మయందు సుఖముగా స్థానమును పొంది), జీవాత్మ – జగత్తు – పరమాత్మల ఏకత్వ భావనచే పూర్ణముతో కూడిన మనస్సు కలవాడై (మనస్సు నందు అపూర్ణమునకు చోటు ఇవ్వనివాడై), పవిత్రమగు భావములు (తదితరుల పట్ల ఆత్మభావన) కలవాడై, ప్రాప్తిస్తూ ఉన్నదాని పట్ల విశ్రాంతి పొందుచూ, దేనినీ వాంఛించనివాడై, దేనిపట్లా స్నేహబంధమును కలిగియుండక ఉంటాడో – ఆతడు **జీవన్ముక్తుడు.**
- **సంవేద్యేన న లిప్యతే :** ఎవ్వరి హృదయాకాశము ఇక్కడి భౌతికాకాశములాగానే తెలియబడుచున్న (సంవేద్యము) దేనిచేతనూ కించిత్ కూడా దోషము పొందదో, జడమగు పదార్థములచే, విషయములచే కొంచెము కూడా సంగము (Attatchment) కలిగి ఉండదో, ఎవని బుద్ధి జడమును త్యజించి నిత్యోదిత ప్రదర్శనము అయి ఉంటుందో – **ఆతడే జీవన్ముక్తుడు.**
- **అనపేక్షుడు :** కర్మలు నిర్వర్తిస్తూ ఉన్నప్పుడు రాగద్వేషములు గాని, సుఖ–దుఃఖ భావన గాని, ధర్మాధర్మముల ఫలముల పట్ల అపేక్ష గాని లేకుండానే కర్మలు నిర్వర్తిస్తాడో.. – అట్టివాడు జీవన్ముక్తుడు. అంతరమున మౌనము (Unconcerned) వహించినవాడై, **"నేనే ఇది చేస్తూ ఉన్నాను"** – అనే అహంకారము లేనివాడై, (నిరహంకారుడై), మమకార–మత్సరములు ఏమాత్రము లేకుండా, ఉద్వేగ రహితంగా **"కర్తవ్యమితి మాం"** భావనతో కర్మలు నిర్వర్తిస్తూ ఉంటే, – **ఆతడు జీవన్ముక్తుడు।**
- **సాక్షీవత్ – విగత స్నేహో :** దేనిపట్ల స్నేహమబంధము లేనివాడై, నాటక దీపమువలె కేవలము సాక్షిగా ఉంటూ, ఇచ్ఛారహితుడై విద్యుక్త ధర్మములందు వర్తించువాడు **జీవన్ముక్తుడు.**
- **ధర్మా ధర్మ మనన ఈహితమ్ సర్వం అంతః పరిత్యక్తం :** మనస్సులో ధర్మ అధర్మ ద్వంద్వ భావములను వదలి (నేను అది చేయాలి। ఇది చేయకూడదు। అది ఎందుకు చేయాలి? అనే) ధర్మాధర్మ మీమాంసలకు అతీతుడై, మనస్సు నందు ఎట్టి కోరిక లేనివాడై, సమస్తమును అంతరంగమున మొదలే త్యజించినవాడై ఉంటాడో ఆతడే **జీవన్ముక్తుడు.**
- ఎవ్వడు ధర్మనిరతులను, అధర్మపరులను – ఇరువురను చూస్తూ – ఆత్మభావన నుండి **చ్యుతిపొందక, ఆత్మభావనతో మాత్రమే సమన్వయము కలిగి ఉంటాడో – ఆతడు జీవన్ముక్తుడు.**
- **అనన్య భావన :** ఎవ్వరైతే ఈ సమస్త దృశ్యమును కల్పనగాను, సర్వత్రా **సమస్వరూపుడగు పరమాత్మ యొక్క ప్రత్యక్ష రూపముగాను** దర్శించుచూ, **అన్యభావమును త్యజించి ఉంటాడో,** – ఆతడు **జీవన్ముక్తుడు.**
- **సమరుచి భావన :** కారము, పులుపు, ఉప్పు, చేదు, తీపి, వగరు ఇత్యాది షడ్రుచులను – రుచిగా ఉన్నప్పుడు లేనప్పుడు కూడా **సమభావన – కలిగి ఉంటాడో,..** ఆతడు **జీవన్ముక్తుడు.**
- ఎవ్వడైతే జరా – మరణముల పట్ల, ఆపద – సంపద సందర్భముల పట్ల ధనము – రాజ్యము దారిద్ర్యము పొందినప్పుడు – **"సర్వము కాలచమత్కారమే"** – అను భావనతో 'సమభావన' కలిగి ఉంటాడో, ఆతడే 'జీవన్ముక్తుడు'. వాటినన్నిటినీ రమ్యమైన భావనతో చూస్తూ ఉన్నవాడు జీవన్ముక్తుడు. (మాయామేయ జగమ్ అనిత్యమ్ ఇతి)।
- ఎవ్వడైతే ధర్మ–అధర్మ వ్యవహార సరళిని, మరణ–జన్మములను బుద్ధితో త్యజించినవాడై, వాటికి ఆవల గల **కేవలానందమగు ఆత్మసందర్శనమును వీడడో** → ఆతడు **జీవన్ముక్తుడు.**
- ఉద్వేగ (Emotion) ఆనంద (Ecstery) రహితుడై, సర్వసందర్భములలోను నిర్మలమైన, ప్రశాంతమైన, సమగ్రమైన అవగాహన గల బుద్ధితో **దేనికీ శోకించక, దేనినీ కాంక్షింపక** ఉన్నవాడు **'జీవన్ముక్తుడు'.**
- నిర్మలము, సునిశితము, విస్తారము అగు బుద్ధితో **సర్వ ఇచ్ఛలను, సర్వశంకలను, సర్వ లౌకికమైన ఈషణములను, సర్వ లోక సంబంధమైన నిశ్చయములను** పరిత్యజించి ప్రశాంత చిత్తుడై సమస్తము కాలవిన్యాసముగా దర్శిస్తూ ఉంటున్నవాడు **జీవన్ముక్తుడు.**
- ఎవ్వరి మనస్సైతే జన్మ–స్థితి– వినాశనములను సూర్యోదయ – అస్తమయముల వలె సమదృష్టితో చూస్తూ ఉండగలదో – ఆతడే **జీవన్ముక్తుడు.**
- ఎవ్వడైతే కించిత్ ద్వేషముగాని, కించిత్ కాంక్షగానీ లేకుండా ప్రకృతి ప్రసాదితమైన భోగములను ఆస్వాదిస్తూ ఉంటాడో, **'ఇవి నావి'** అను మమకార– అహంకార రహితంగా అతీతుడై సర్వ అనుభవములను స్వీకరిస్తూ ఉంటాడో – ఆతడు **జీవన్ముక్తుడు.**
- ఎవని పట్ల ఈ సంసార సంభ్రమమంతా శాంతించినదై, సమస్తము యుండి కూడా, ఆతడు ఏమీ లేనివాడై (కలా సమన్వితుడై ఒకప్రక్క ఉంటూనే మరొక ప్రక్క నిష్కళుడై) ఉంటాడో, సర్వ సందర్భములలోను ఎవ్వరిచిత్తము అచిత్తమై నిశ్చితాకారమై ఉంటుందో **ఆతడు జీవన్ముక్తుడు.**

- దృశ్యములోని సమస్త అర్ధజాలములందు (ప్రాపంచ అర్థములందు) నిస్పృహుడు (One who does not accord recognition and doesnot attach Priority) అయి, - **పరార్థము** ను పుణికిపుచ్చుకొని పూర్ణాత్ముడై ఉంటాడో **ఆతడే జీవన్ముక్తుడు.**

# విదేహ ముక్తుడు

**శ్రీ జనక మహారాజు :** ఓ వ్యాసప్రియ పుత్రా! మహాతపస్వీ! స్వయంజ్ఞానానంద స్వరూపా! శుకదేవా! ఇప్పటివరకు మనం జీవన్ముక్తుని యొక్క స్వాభావిక లక్షణములు ఏమేమి అయి ఉంటాయో - వివరించి చెప్పుకున్నాము.

ఇక **"విదేహముక్త లక్షణములు"** గురించి వినండి.

జీవన్ముక్తుడు అట్టి "జీవన్ముక్త పదము" నుండి తన భౌతిక దేహమును కాలస్వరూపునికి 'సమర్పణ' చేయబడినదిగా {కాలము యొక్క కలనా (కల్పనా) చమత్కారముగా} భావమును సిద్ధించుకొని - వాయువు స్పందమును, జలము తరంగత్వమును వీడు విధంగా **"విదేహముక్తత్వము"**లో ప్రవేశము పొందుచున్నాడు.

**విదేహముక్తుడు - స్వస్వరూపానుభవము**

- ఉదయించడు. అస్తమించడు. శమించడు. ఉద్యమించడు.
- ఆతని స్వాత్మానుభావము సత్తు కాదు. అసత్తు కాదు. ఆతడు దేనికీ దూరముగా ఉన్నవాడు కాదు. 'అహం' స్వరూపుడు కాదు. మరింకొకటేదో కాదు.
- ఈతడు ఏ వికారమునకు విషయుడు కాదు.
- ఆతని స్థితి అత్యంత స్థిమితమై, మహా గంభీరమును సంతరించుకొని ఉంటుంది.
- ఆతని కేవలానుభవము (లేక) గంభీరానుభవము - ప్రకాశము కాదు. చీకటి కాదు. చీకటి వెలుగుల మధ్య గల 'సంధ్య' కాదు. అది అవాచ్యము (మాటలతో చెప్పలేము). అనాఖ్యము (వ్యాఖ్యానించలేము). అభివర్ణించలేము (Indiscribable). అభివ్యక్తమైనదేదీ ఆతని ఆత్మానుభవము కాదు. కనుక **అనభివ్యక్తము. ఈ సమస్త జగత్తు ఆతనికి - "స్వస్వరూపము యొక్క కించిత్ 'కేవల సత్' రూపమున** ప్రదర్శితము" అయి ఉన్నట్టిది.
- ఆతని ఆత్మతత్త్వ స్వరూపానుభవము **శూన్యము కాదు. సాకారము కాదు. దృశ్యముకాదు. దర్శనము కాదు. భౌతికమైన పదార్థమేదీ కాదు.** సత్‌గాగాని,-అసత్‌గాగాని, సదసత్తుగాగాని స్థితించి ఉన్నది కాదు.
- "విదేహముక్తి స్థితి - ఇట్టిది" - అని ఏమి చెప్పగలం? అది "పూర్వమునకే పూర్వము" అని అంటూ ఉంటారు. అది సత్ - అసత్- సదసత్ నిర్వచనములకు పరిమితమైనది కాదు.
- ద్రష్ట-దర్శన-దృశ్యములను ఉపమేయముగా తీసుకుని చెప్పుకోవాలంటే అది దర్శన-దృశ్యములకు వేరైనట్టి, ఆ రెంటికీ సంబంధించనట్టి **"ద్రష్ట యొక్క దర్శనరాహిత్య కేవలరూపము"** - అని మనం చెప్పుకోవచ్చు. అది తెలుసుకొనునది - తెలియబడునది కూడా। కాబట్టి **"చిన్మాత్ర చైత్యరహితము". ద్రష్ట- దృశ్యముల మధ్య గల కేవలానంద రూపము.।**

*విదేహముక్తునికి అనుభవ విషయమగుచున్న సర్వాత్మకమగు స్వస్వరూపము.. ఇంకా కూడా,*

- → చిన్మాత్ర (Knowing) చైతన్య (That being known) రహితము. **'తెలుసుకోవటం - తెలియబడేది'లకు మునుముందే, ఆ ఉభయములకు అతీతమై ఉన్నట్టిది. ఆచోటి నుండి చ్యుతి పొందనిది.**
- → ఆది - అంతము అనే వస్తు ధర్మము లేనట్టిది కనుక **అనంతము.**
- → జర (వార్ధక్యము) అను శారీరక ధర్మము లేనట్టిది.
- → శివమ్ (సర్వశుభ-సుఖప్రదము).
- → ఆది-మధ్య-అంతము లేనట్టిది. అద్దానియందు దానికి అన్యముగా ఏదీ లేదు కనుక **'నిరామయము'.**
- → అది ద్రష్ట- దర్శన - దృశ్యముల మధ్యగా స్వానుభవమగుచూ, **ఆ మూడు తనకు అన్యము కానట్టిది.**

అట్టి విదేహముక్తునికి స్వానుభవమగుచున్న స్వాత్మకు భిన్నముగా నేను-నీవు-జగత్తు మొదలైనవేవీ కించిత్ కూడా లేనేలేవు. ఓ మునీశ్వరా! "అది అనన్యము" అనునది సునిశ్చయము. బంగారమే అనేక ఆభరణముల నామరూపములుగా అగుపిస్తున్నట్లు, **విదేహముక్తుని కేవల - సర్వాతీత తత్త్వమే - ఒక్కొక్క దృష్టికి ఒక్కొక్క తీరై కనిపించే ఈ సమస్తము** కూడా!

ఓ ప్రియ శుకదేవా! నేను ఇప్పటివరకూ చెప్తూతూ వస్తున్న **"జీవన్ముక్త – విదేహముక్తుల స్వాభావిక లక్షణములు"** – మీకు తెలిసియున్న విషయాలే! తపోధ్యానముల సహాయముతో ఈ విషయాలు స్వవివేకము (Your own self - analysis) చే గ్రహించియే ఉన్నారు. మీ పితృదేవులు, లోకపూజ్యులు, మాకు గురుసమానులు అగు వ్యాస మహర్షి మీకు ఈఈ విశేషాలే విశదపరచారు. ఆధ్యాత్మ శాస్త్ర వాఙ్మయము కూడా ఈ మనము చెప్పుకున్న విషయమే పరాకాష్ఠగా ఎలుగెత్తి గానం చేస్తూ చెప్పుచున్నది. వేదజ్ఞులు, తత్త్వజ్ఞులు అగు మహనీయులందరు సూత్రముల రూపంగాను, సంగ్రహముగాను, విస్తారముగాను చెప్పుచూనే ఉన్నారు. **'అవాక్ మానస గోచరము'గా** ఒప్పుకుంటూనే విశదపరచుచున్నారు. మీరు స్వయముగా తెలుసుకొని విజ్ఞాన స్వరూపులు అయ్యారు కూడా.

హే మహాత్మా! మీరు జ్ఞాతజ్ఞేయులే. తెలుసుకోవలసినది తెలుసుకొని ఉన్నవారే! ఇందులో సందేహమే లేదు. ఇట్లా ఎందుచేత చెప్పగలుగుచున్నానంటారా?

**భోగేభ్యో హి అరతిః జాతా దృశ్యా ద్వా సకలాత్ ఇహ।** ఈ ప్రాపంచక విషయములు చూస్తూ కూడా, వాటి యందు రమించకపోవడం మోక్షము సిద్ధించినవారి స్వాభావిక లక్షణము. ఆ లక్షణము మీరు ప్రదర్శించారు. సమస్త దృశ్య విషయముల పట్ల అనురక్తిని జయించి, మోక్షసామ్రాజ్యము సంపాదించుకొని **"మహావీరులు"** – అయ్యారు. ఓ శుక మహాశయా! నిశితమగు బుద్ధితో పూర్ణహృదయులై మీరు ప్రాప్తించుకోవలసినది ప్రాప్తించుకొనియే ఉన్నారు. మీరు స్వస్వరూప సుజ్ఞానము కొరకు తపస్యులై **తపన రూపమగు తపస్సుతో** స్వరూప–ఔన్నత్యము' సిద్ధించుకొన్నారు.

**హే బ్రహ్మన్! ముక్తస్త్వమ్।** మీరు నిత్యముక్తమగు ఆత్మను స్వస్వరూపముగా బుద్ధిచే దర్శించుచూనే ఉన్నారు.

అయితే, **భ్రాంతిమ్ ఉత్సృజ! "మోక్షము" అనగా మరింకేదో! నాకు తెలిసినంత తేలికైనది కాదు"** – అనే భ్రాంతిని ఇక ఇప్పటికిప్పుడు విడచిపెట్టండి.

**శ్లో॥ అతి బాహ్యం తదా అబాహ్యం అంతరాభ్యంతరం ధియః,**
**శుక! పశ్యన్ న పశ్యేత్ త్వం, సాక్షీ సంపూర్ణ కేవలః ॥**

ఓ శుకమునివర్యా! **బాహ్యము కానట్టిది, బాహ్య–అంతరములచే విభాగము పొందనట్టిది, స్వయముగా సంపూర్ణము అయినట్టిది, జాగ్రత్–స్వప్న–సుషుప్తులకు, జీవాత్మ ఈశ్వరాత్మాది సర్వ విభాగములకు కేవలము "సాక్షి" అయినట్టిది–** అగు ఆత్మను దర్శించుచునే ఉన్నారయ్యా! ఇంక 'ఆత్మ' గురించి మీకు సందేహములతో పనేమున్నది?

- **స్వస్వరూపాత్మ పట్ల సర్వ సందేహములు త్యజించండి. నిస్సందేహులవండి।**
- అఖండము, కేవలము అగు "ఆత్మ"యే అయి, ఇక ఆపై మీకు ఎట్లా ఇష్టమో అట్లాగే – **తన ఉద్యానవనంలో విహరించే చక్రవర్తిలాగా** – ఈదృశ్య జగత్తునందు లీలగా, తీరికగా, క్రీడగా, స్వానందభరితంగా, కార్య–కారణాతీతంగా విహరించెదరు గాక!

-----

శుకదేవుడు జనక మహారాజు చెప్పిన విశేషములన్నీ శ్రద్ధగా విని **ఆత్మ సంతృప్తి** పొందారు. గురుభావముతో జనక మహారాజు పాదములు స్పృశించి, నమస్కరించి – వారి వద్ద సెలవు తీసుకున్నారు.

**"అఖండమగు నిర్వికల్ప సమాధి'** యొక్క ఏకాంత అభ్యాసము నిర్వర్తించదలిచారు. అక్కడి నుండి మేరుపర్వతముపై గల తనకు ఇష్టమైనట్టి, తనకు సుపరిచయమైనట్టి ఒక ఏకాంత ప్రదేశమునకు చేరారు. అక్కడ వేయి సంవత్సరముల కాలము నిర్వికల్పసమాధియందు గడిపారు. తైలము లేని దీపమువలె అఖండాత్మయందు – విశ్రామము పొందారు. జలబిందువు సముద్రజలములో పడి అట్టి జలముతో అభేదము పొందిన రీతిగా, స్వల్ప – వాసనలను కూడా జయించి, సంకల్పదోషములన్నీ త్యజించి పరిశుద్ధుడై, **ఆత్మానంద కేవలీస్వరూపుడై వెలుగొందసాగారు.**

-----

## 3వ అధ్యాయము
## ఋభు-నిదాఘ సంవాదము (వైరాగ్య పూర్వక విశ్లేషణ)

ఋభు మహర్షి కుమారుడగు నిధాఘుడు గొప్ప జ్ఞాని. మునులలో శ్రేష్ఠుడు. మునిగణముచే 'మునివరుడు' అని గౌరవించబడుచుండే బ్రహ్మతత్త్వజ్ఞాని. మహాతపస్వి. లోకకళ్యాణ భావములు గల మహనీయుడు. బ్రహ్మజ్ఞానాభ్యాసకులకు దృష్టాంతరముగా చెప్పబడువారు. ఆయన తన బాల్యములో 5వ ఏట ఉపనయనము అవగానే, **విద్యార్థి** అయి గురు ఆశ్రమము ప్రవేశించారు. గురువులను భక్తితో సేవిస్తూ విద్యను అభ్యసించారు. అతి త్వరలో విద్యాపారంగతుడు (Expert) అయినారు. ఒక 7 సంవత్సరముల కాలములో విద్యాభ్యాసము

ముగించుకొని, గురు ఆజ్ఞానుసారం 12వ ఏట తల్లిదండ్రులు ఉంటున్న స్వగృహమునకు తిరిగి వచ్చారు. గురువులు ఆజ్ఞాపించిన విధంగా తన వలెనే విద్యను ముగించిన సహపాఠకులతో కూడి, తల్లిదండ్రుల అనుమతితో తీర్థయాత్రలకు బయల్వెడలారు. తాను **గురువుల వద్ద నేర్చిన లౌకిక - అలౌకిక విద్యలకు ప్రయోగశాల వంటి దేశదేశాంతరములో** ముఖ్యప్రదేశములను, తీర్థస్థలములను, మహనీయుల ఆశ్రమములను సందర్శించసాగారు. లోక ప్రసిద్ధులు, పూజ్యులు ఆశ్రమవాసులు మొదలైన మహనీయుల దర్శనము చేసుకొని, వారితో కొంచెము సేపు తాత్త్వికార్థపూర్వకంగా సంభాషిస్తూ తీర్థయాత్రలు కొనసాగించసాగారు. ఆ విధంగా అనేక పవిత్ర ప్రదేశములను, మహనీయుల సంశ్రయమును, మూడున్నర కోట్ల తీర్థములలో స్నానమును చేసి తిరిగి గృహోన్ముఖుడై ఇంటికి తిరిగివచ్చారు. తీర్థయాత్రల పుణ్యఫలముగాను, మహనీయుల సందర్శనము చేతను ఆయన యొక్క బుద్ధి **వివేక - వైరాగ్యములు** సంతరించుకోవటం జరిగింది.

ఆ విధంగా నిదాఘుడు విద్య-తీర్థయాత్రలను నిదాఘుడు పూర్తి చేసి ఇంటిలో ఉండసాగారు. ఒకరోజు ఋభుమహర్షి కుమారుడగు నిదాఘుని దగ్గిరకు పిలిచారు. విద్యా-అధ్యయన విశేషముల గురించి, తీర్థయాత్రలచే జనించిన పవిత్ర భావముల గురించి పరామర్శిస్తూ కుశల ప్రశ్నలు ప్రారంభించారు.

❖ ❖ ❖

**ఋభు మహర్షి :** బిడ్డా! నిదాఘా! నీవు చక్కగా ఏడు సంవత్సరములు విద్యాభ్యాసము నిర్వర్తించి విద్యాపారంగతుడవు అయ్యావు. అంతేకాకుండా, దీర్ఘకాలం తీర్థయాత్రలు కూడా నిర్వర్తించి అనేక విషయాలు ప్రపంచములో గమనిస్తూ తెలుసుకోవలసినది తెలుసుకొని ఉంటావు. ఏదీ! నీవు నేర్చుకొన్నది ఏమిటో, నీకు అనుభవమై, నీవు అర్థము చేసుకొన్నదేమిటో- నాకు వివరించి చెప్పు. నీవు ఏమి నేర్చుకున్నావో, ఏమి తెలుసుకున్నావో - విని మీ గురువులు, నేను కూడా సంతోషించెదముగాక.

**నిదాఘుడు :** పితృదేవా! పూజనీయా! నాకు విద్యాబుద్ధులకు మార్గము చూపిన మీకు జన్మజన్మాంతరములుగా కృతజ్ఞుడను.

అస్మత్ గురువులకు కూడా నమస్కారములు. నాకు మీరు తండ్రియే కాదు. గురుతుల్యులు కూడా. నా యొక్క మార్గదర్శనము కొరకై నాకు అనుభవమైనది, అనిపిస్తూ ఉన్నది - అంతా మీకు విశదీకరించి ఇప్పుడు చెప్పుతాను. పరమాత్మకు చేరటానికి **మార్గాన్వేషకుడనైన** నాకు దయతో మరికొంతగా **మార్గదర్శకులవండి.** మీరు నాకు పరమ సత్యమును బోధించుటకొరకై - ఒక రోగి వైద్యునికి చెప్పుకొను విధంగా - (1) నాకు తెలియ వస్తున్నది, (2) నాకు ఏర్పడి ఉంటున్న సందేహములు మొత్తం వివరిస్తున్నాను. వినండి.

❖

నేను 7 సంవత్సరములు మీరు ఆజ్ఞాపించి, దారిచూపిన విధంగా గురు-ఆశ్రమంలో విద్యార్థినై విద్యను సముపార్జించాను. గురుదేవులచే ఆశ్రమములో అనేక లౌకిక - ఆధ్యాత్మిక విద్యలు నేర్చుకొన్నాను. గురువుల సూచనానుసారంగాను, మీ అనుజ్ఞతోను $3^1/_2$ కోట్ల తీర్థములు దర్శించి పుణ్యనదులలో స్నానము చేశాను. దేవాలయములలో దైవదర్శనము చేసుకొన్నాను. అనేక మంది మహనీయుల పాదపద్మములు స్పృశించి, వారు చెప్పియున్న విశేషాలు శ్రవణం చేశాను. అనేక ఆశ్రమములలో విద్య నేర్పు విధానమును గమనించాను. ఆయా ఆశ్రమములలోని మహనీయులగు గురువులతో, విద్యార్థులతో జ్ఞానాసక్తుడనై సంభాషించాను. వీటన్నిటి యొక్క ప్రయోజనము చేతకాబోలు, నా ఆలోచనా విధానములో అనేక మార్పులు వస్తూ వచ్చాయి. **సార్థ త్రికోటి తీర్థేషు స్నాన పుణ్య ప్రభావతః ప్రాదుర్భూతో మనసి మే విచారః సో అయమ్ ఈదృశః॥** నా మనస్సులో ఒకానొక విచారణ (Analytical observation) బయల్వెడలింది. మీ పాదపద్మములకు నమస్కరిస్తూ నాకు అనిపిస్తూ ఉన్నదంతా జ్ఞానార్తుడనై మీముందు మనస్సు విప్పి చెప్పుకుంటాను. దయతో విని, **నాకు పరమాత్మను చేరు మార్గము చూపెదరు గాక!**

## ఎందుకు పుడుతున్నాం? ఎందుకు చస్తున్నాం?

అసలు మేము దేహములను ఎందుకు స్వీకరిస్తున్నామో అది ఏమరచి, శరీరముతో అవినాభావ రూపమైన స్నేహబంధముతో తన్మయులమై జీవితమును గడుపుచున్నాము. **"ఇదిగో, ఈ మహదాశయము కొరకై ఈ దేహమును అద్దెవాహనము వలె స్వీకరిస్తున్నాను. దేహమును తిరిగి ఇచ్చివేయవలసిన సమయము రాక ముందే అట్టి మహదాశయమును త్వరగా సిద్ధించుకోవాలి"** అనే విషయమే పూర్తిగా ఏమరచి, **సందర్భ మాత్రవిషయములగు అల్పాశయములకే** కాలమంతా సమర్పించి వేస్తున్నాము. ఈ విధంగా దైవకృపచే లభించిన **'జీవితకాలము'** అనే అవకాశమును సద్వినియోగపరచుకోకపోగా, దుర్వినియోగపరచుకొని మరింత అజ్ఞాన దృష్టులను మూటకట్టుకొంటూ ఉంటున్నామే? **జాయతే మ్రియతే లోకో, మ్రియతే జననాయ చ॥** "ఎందుకు పుట్టుచున్నాముర?" అని పరిశీలిస్తే "చావటానికే!" అవుతోంది. ఎందుకు చస్తున్నాము? **మరల పుట్టటానికే!** ఈ తతంగమునకు అంతూ-పొంతూ ఉండటమే లేదు.

ఈ దృశ్య-ప్రపంచంలో దేహముతో కూడి జీవిస్తూ ఉండగా, అనేక సంబంధములు, అనుబంధములు, బాంధవ్యములు స్నేహ-శత్రుత్వములు మొదలైనవన్నీ మా మనస్సుకు ఏర్పడినవై ఉంటున్నాయి.

**"మాకు చెందినవి, మాకు చెందనివి. మాకు సానుకూలమైనవి - ప్రతికూలమైనవి"** - ఇటువంటి అనేక నిర్వచనములతో జీవితము గడిచిపోతోంది. ఎప్పటికప్పుడు **"ఇదిగో! ఈ సంబంధములు, సంగతులు, వస్తు - విషయములు, ఈ ఈ కార్యక్రమములు సత్యమే! నిత్యమే!"**.. అంటూ రోజులు గడుపుచున్నాము. అసలీ దృశ్య ప్రపంచంలో **"ఇది శాశ్వతము. స్థిరము"** అని చెప్పుకోగలిగినది ఏమైనా ఉన్నదా? ఏ ఒక్కటీ స్థిరము కాదు.

**అస్థిరాః సర్వ ఏవ ఇమే స చరాచర చేష్టితాః॥** ఇక్కడి చరాచర జీవులయొక్క వర్తమాన క్రియా వ్యవహారములు, ఇప్పుడు ఉన్న (జీవుల) నామ రూపములు మొదలైన సమస్తమూ కూడా క్షణమునకు ఒక తీరుగా ఉంటూ ఉంటున్నాయి. ఇక్కడి సర్వజీవుల మనస్తత్వములు, క్రియా విశేషములు మొదలైనవన్నీ కూడా స్థిరముగా ఉండటమే లేదు. **ఇక్కడ సమస్తము అస్థిరమే** (Every thing and every context is quite Temporary). ఈరోజు ఒకరకంగా ఉంటున్నాయి. కొద్ది కాలము తరువాత మరొక రకం.

ఇక ఇక్కడి లోక సంబంధమైన కార్యక్రమముల గురించి అంటారా? **సర్వ ఆపదాం పదం పాపా విభవ భూమయః॥** ఇక్కడి ధనార్జన, బంధు సంబంధము, ఇంద్రియ సుఖ వ్యవహారములు - మొదలైన కార్యక్రమములన్నీ అంతరమున అనేక ఆపదలతో కూడుకొన్నవై, చివ్వరికి ఈ జీవుని పాపక్రియలతో కూడిన దుఃఖానుభవములు కలిగించే భూములకు జేరుస్తున్నాయి. అనేక తప్పుడు పనులకు, దోష పూరిత భావములకు దారి చూపుచున్నాయి. వాటి పర్యవసానముగా మేము అనేక దుఃఖములు అనుభవిస్తూ ఉపాధి పరంపరలు గడుపుచున్నాము.

ఇక ఇక్కడి భార్య- భర్త - తండ్రి - కొడుకు- స్నేహితుడు - శత్రువు - ఇల్లు - పొలము.., ఇటువంటి సంబంధాలన్నీ కలలో కనిపించే విశేషాలవలె బహుచమత్కారమైనవి. ఇక్కడి జీవులంతా కలిసి జీవిస్తూ ఉన్నప్పటికీ, ఒకరికి మరొకరు "స్నేహ-శత్రు, ప్రియ- అప్రియ" భావములచే అనేక విధాలైన సంబంధములు కలిగి ఉన్నట్లు కనిపిస్తూ ఉన్నారు. అట్లయి కూడా, **ఒకరికి మరొకరు సంబంధించినవారే కాదు.** ఎవ్వరి ప్రయాణము వారిది. ఎవ్వరి గొడవ వారిది. అయినప్పటికీ - ఇనపరింగుల వలె - ఒకరికి మరొకరు ముడిపడి ఉన్నట్లు సంభాషించుకొంటున్నారు. కీచులాడుకుంటున్నారు. వాదులాడుకుంటున్నారు. ఎవ్వరి భావములు వారివే అయి ఉండి కూడా, ఒకరిపై మరొకరు అవినాభావ సంబంధములను (ఆధారపడిన భావములను) పరిపోషించుకుంటూ కాలమును వెళ్ళబుచ్చుచున్నారు. వాస్తవానికి ఇక్కడి జీవులంతా సర్వ భావములకు మునుముందే ఉండి ఉన్న **"కేవల అభావస్వరూపులే"** కదా! అయితే, ఈ పరస్పర అవినాభావ- భౌతిక సంబంధములన్నీ కూడా - **"మనఃకల్పనయా అనయా"**- మనో కల్పన మాత్రమే. ఆహాఁ! ఎడారి భూములలో నడిచివెళ్ళుచూ ఉండే పథికునికి (బాటసారికి) నీరు, పళ్ళు, పూలు ఏ మాత్రము లభించని తీరుగా - ఈ 'దృశ్యము' అనే ఎడారిలో నడచివెళ్ళుచున్న బాటసారుల వంటి జీవులకు ఇక్కడి పరస్పర సంబంధ బాంధవ్యముల వలన లభించేది గాని, ఒరిగేదిగాని ఏదీ లేదు. ఇది జనులు గమనించటమే లేదు. తండ్రీ! **"శామ్యతి ఇదం కథం దుఃఖమ్ ఇతి?" - ఇతి తప్తోఽస్మి చేతసా।** నా బుద్ధి ఇదంతా గమనించిన తరువాత నాకొక క్రొత్త వేదన పట్టుకొన్నది. ఎడారిలో ఒంటరిగా నడిచివెళ్లే బాటసారివలె జగద్దృశ్యములో చరిస్తూ ఉండగా, నా చిత్తము వలన కలుగుచున్న అనేక సంబంధ - అనుబంధములు నాపట్ల దుఃఖమునకే అగుచున్నాయి. సుఖము కొరకు కానే కాదు. అటువంటి ఈ (సంసార) దుఃఖములు తొలగేది ఎట్లా?" - అని నా చిత్తము (ఇవన్నీ చూచిన తరువాత) ఎంతగానో తపించటము ప్రారంభించింది.

## ధన-సంపద మొదలైన వ్యవహారములు

స్వామీ! ఈ జగత్తులో ధనము సంపాదించి దాచుకోవటమనేది గొప్ప విశేషంగా అనుకోబడుతోంది. అయితే, ఓ మునీశ్వరా! **"ధనము సంపాదించటము-అనేది అనేక చింతలకు** (Multiple worried) **పర్యవసానము"** అని నాకు అనిపిస్తోంది. అట్టి ప్రయత్నములు చివ్వరికి ఆనందము కలుగజేస్తాయనే నమ్మకం నాకు ఏమాత్రమూ కలగటం లేదు. ఇక్కడి స్త్రీ-పురుష సంబంధములు, మిత్ర - కళత్ర-గృహ-ధన వ్యవహారములు మొదలైన ఇవన్నీ పేలవములనీ (సారరహితమనీ), పైగా తీవ్రమైన ఆపదలకు, మనో వేదనలకు మూలమని నాకు అనిపిస్తోంది. ఇక్కడి భార్య-భర్త -సంతానముల పరస్పర సంబంధవ్యవహారములన్నీ (ఆత్మజ్ఞానం దృష్ట్వా) సారరహితములు. (Have no inner essece). ఇవన్నీ గొప్ప 'మోహము' కలిగించేవే గాని, సుఖ ప్రదాతలు ఏమాత్రము కాదు.

## ఏమాత్రము నమ్మి ఉండకూడని "ఆయుష్షు"

ఇక, **'ఆయుష్షు'** విషయానికి వచ్చి చూస్తే "ఆఁ! మేము చాలా కాలము జీవించబోవుచున్నాములే!".. అను ఎవరికివారే అనుకుంటూ ఉండటం జరుగుతోంది. **ఆయుః పల్లవ కోణాగ్ర లంబాంబు క్షణభంగురమ్।** వర్షపు చినుకులు పడినప్పటి పూతీగ యొక్క ఆకు చివ్వర వ్రేలాడుతూ కనిపించే నీటి బిందువు వలె - ఈ ఆయుష్షు క్షణ భంగురము. ఏ క్షణంలో ముగుస్తుందో ఎవ్వరూ చెప్పలేరు. ఒక పిచ్చివాడు తన చేతిలో గల వస్తువులను ఏక్షణంలో నేలపై విసరుతాడో తెలియని విధంగా - ఈ శరీరము ఏక్షణంలో అకాలంగా మమ్ములను విడచి వెళ్లగలదో ఏ మాత్రమూ ఊహించలేము. అట్టి ఈ వినాశన శీలమగు భౌతిక శరీరమును నమ్మి ఎన్నో పాప-అజ్ఞాన

కార్యక్రమములలో నిమగ్నమై ఉంటున్నాము. అంతు – పొంతు లేని కార్యక్రమములు, వ్యథలు, ఆశలు, నిరాశలు! **మేము ఎందుకొచ్చాము? ఏమి చేస్తున్నాము?**

## మనోచాంచల్యము – ఆయుష్షు

ఈ భౌతిక శరీరము యొక్క గతి ఈ తీరుగా ఉండగా,.. ఇక ఈ మనస్సు పరస్పరము అనుకూలము– వ్యతిరేకము అయిన అసంఖ్యాక విషయాలపై వ్రాలినదై ఉంటోంది. నిరంతరము అనేక విషయాలలో చిక్కి ఉండి, తన జనన స్థానమగు ఆత్మయొక్క ఔన్నత్యము గురించిన – ఉన్న కొద్ది జ్ఞానము కూడా పోగొట్టుకొంటోందే? అటువంటపుడు ఆయుష్షు ఉండి కూడా ఏమి లాభము? **అప్రౌఢాత్మ వివేకానామ్ ఆయుః ఆయాస కారణమ్।** ఆత్మవివేకమును పొందుటకై పరిపక్వత పొందనపుడు, ఆయుష్షు అనేది ఆయాసము కలిగించేదే అవుతోంది.

**యుజ్యతే వేష్టనం వాయోః** గాలిని పట్టి గుప్పెటలో నిలపవచ్చునేమో!

**ఆకాశస్య ఖండనమ్।** అఖండాకాశమును కత్రతో ఖండనము చేయవచ్చునేమో!

**గ్రంథనం చ తరంగాణాం।** జల తరంగములను ప్రోగుచేసి ఒకచోట ఉంచవచ్చునేమో!

అంతేగాని, **అయుష్షు ఇట్లాగే నిలకడ కలిగి ఉంటుందనుమాట ఏ మాత్రం కుదిరేదే కాదు.**

## జీవితము – మహదవకాశము

**తరవోపి హి జీవంతి జీవంతి। మృగ పక్షిణః।** చెట్లు జీవిస్తున్నాయి. మృగములు జీవిస్తున్నాయి. మానవుడు జీవిస్తున్నాడు. జీవించినంతమాత్రం చేత ఏమి ప్రయోజనము?

> శ్లో॥ **ప్రాప్యం సంప్రాప్యతే యేన, భూయో యేన న శోచ్యతే,**
> **పరయా నిర్వృతేః స్థానం యత్, తత్ 'జీవితం' ఉచ్యతే॥**

ఏ మహదాశయముతో జీవుడు ఈ భౌతిక శరీరమును ఆశ్రయిస్తున్నాడో, అద్దానిని ఆశ్రయించాలి. ఈ జీవుడు ఏడుస్తూ పుట్టాడు. ఏడుస్తూనే మరణించరాదు. మరి? మరల ఇక దుఃఖమే ఉండజాలని స్థితి కోసమే జీవించాలి. ఏదైతే సమస్తమునకు పరమై, అన్ని దిగుళ్ళను రహితము చేయగలిగినదై ఉన్నదో, అట్టి మహాశయము కొరకు జీవించువాని జీవితమే 'జీవితము'. తక్కినవారిది గాడిదవలె బరువులు మోయటానికే అగుచున్నది. అంతేగాని జీవితమని అనిపించుకోదు. (బరువు మోయటము మాత్రమే)

**స జీవతి మనో యస్య మననేన ఉపజీవతి।** ఎవ్వడు అన్యమగు **"దృశ్యరూపమననమును జయించిన మనస్సు"**ను సంపాదించుకుంటాడో (లేక)అఖండము, నిత్యము, సత్యము అగు **'ఆత్మమననము'** అనే **"అనన్యభావము"** పొందిన మనస్సును సంపాదించుకొంటాడో – ఆతనిదే జీవితము. **ఇక తక్కినవారిది నిత్యమరణ సమానమే!**

## పునర్జన్మ జాడ్య రాహిత్యము

**జాతాః స ఏవ జగతి జన్తవః సాధు జీవితాః, యే పునః న ఇహ జాయంతే।** ఎవ్వడైతే పునః జన్మించవలసిన అగత్యమును మొదలంట్లా పెకలించివేసుకుంటాడో, అట్టి సాధుజీవనుని జన్మయే ఈ జగత్తులో సార్ధకము. **శేషా జరఠ గర్దభాః।** ఇక మా వంటి తక్కిన వారి జీవితము గురించి ఏమి చెప్పమంటారు? **ముసలిగాడిదల మూలుగు జీవితములతో సమానం.**

## అనుభవము లేని శాస్త్రజ్ఞానము – భారమే

| | |
|---|---|
| **భారో అవివేకినః శాస్త్రం।** | వివేకమును ఆశ్రయించని వానికి శాస్త్రజ్ఞానము భారమే అవుతుంది. |
| **భారో జ్ఞానం చ రాగినః।** | 'రాగము'(Attatchment) వదలనివానికి జ్ఞానము భారమే। |
| **అశాంతస్య మనో భారో।** | శాంతి లేనివానికి మనస్సే భారము. |
| **భారో అనాత్మవిదో వపుః।** | ఆత్మజ్ఞానము లేనప్పుడు శరీరమే భారము. |

## అహంకార శత్రువు

**నిదాఘుడు :** తండ్రీ! ఋభు మహర్షీ! మాకు సంప్రాప్తిస్తున్న ఆపదలన్నీ **'అహంకారము'** వలనే వచ్చి పడుచున్నాయి. – అని గమనిస్తున్నాను. అహంకారమే **దుష్టప్రవర్తనలకు, అల్పాశయముతో కూడిన ప్రయత్నములకు** 'కారణము'గా అవుతోంది. అహంకారము నుండే సమస్త దృశ్యము పట్ల ఈహములు (అనేక కోరికలు) వ్యసనముగా రూపుదిద్దుకుంటున్నాయి. కనుక **మాకు మా అహంకారమే శత్రువు.** అంతకుమించిన శత్రువు మాకు మరొకడు లేడు. అహంకారము వలన ఏవేవి నాకు అనుభవమౌతున్నాయో, అవన్నీ

అవస్తువులే. పరమ లక్ష్యమునకు అడ్డులే. సార రహితములే. ఎందుకంటే అహంకారమే స్వతఃగా అవస్తువు కాబట్టి. అహంకారమును ఆశ్రయిస్తూ ఉన్నప్పుడు మేము సమస్తము కోల్పోయేదేగాని పొందేది ఏకించిత్తూ లేదు.**"నేను ఇంతటి వాడిని కదా!" - అనునదంతా ప్రారంభములో మధురము. పరిణామము మాత్రము పరమ చేదు.**

## మనస్సు - చిత్తము

**ఇతశ్చ ఇతశ్చ సువ్యగ్రం వ్యర్థమేవ అభిధావతి, మనో దూరతరా యాతి గ్రామే కాలేయకో యథా।** హే బ్రహ్మన్! ఒక ఊరకుక్క పొందేది ఏదీ లేకపోయినప్పటికీ.. వీధి వీధులకు, గుమ్మము-గుమ్మములకు వెళ్లి వస్తూ, ఎక్కడా నిలబడకుండా తిరుగుతూ ఉంటుంది - చూచారా? ఆ విధంగా మా మనస్సు కూడా ఏవేవో నమ్ముకొంటూ, పొందేది ఏదీ లేకపోయినా కూడా, - ఎటెటో (వీధి కుక్క వలెనే) అనేక విషయములకు, సందర్భములకు, సంబంధములకు వెళ్లి వస్తూ ఉన్నది. మొగకుక్కను చూచి ఆడకుక్క భయముతో పరుగులెత్తు తీరుగా 'తృష్ణ'ను చూచినా ఈ మనస్సు ఎటెటో పరుగులు తీస్తోంది. ఇక నేనో! అట్టి క్రూరమైన తృష్ణ వెంటబడి, జడుని వలె విషయములవైపుగా పరుగులు తీస్తున్నాను.

హే బ్రహ్మన్! **ఇప్పుడు నేను ఈ మనస్సును పట్టించుకోవటం మానివేశాను.** దాని నుండి ముక్తుడనై ఉన్నాను. అయితే ఏం? ఎప్పుడో అది నన్ను వశం చేసుకుంటోంది. సముద్రములోని మొత్తము జలమును త్రాగివేయటము కంటేను, మేరుపర్వతమును మొదలంట్లా పెల్లగించటము కంటేనూ, అగ్నిశిఖలను మ్రింగటము కంటే కూడా-విషముతో సమానమైన విషయములతో వెంటబడే-చిత్తమును (ఇష్టా ఇష్టములను) నిరోధించటము నాకు కష్టము అనిపిస్తోంది. **నేను ఈ చిత్తమును వశము చేసుకోలేకపోతున్నానే! ఇక నాకు గతి ఏది?**

## చిత్త భ్రమలు

**చిత్త కారణమ్ అర్థానామ్। తస్మింసతి జగత్రయమ్।** హే భగవాన్! పిత్రుదేవా! ఋభుమహర్షీ! "ఈ త్రిజగత్తులలో సర్వ అనర్థములకు కారణము **"ఇష్టాఇష్టములను రెక్కలుగా గల ఈ చిత్తమే"**- అని నాకు అనిపిస్తోంది. చిత్తము క్షీణిస్తే జగత్తులు క్షీణిస్తాయి. చిత్తము లేచికూర్చుంటే జగత్తులు వచ్చిపడతాయి. **తత్ విచికిత్సం ప్రయత్న తః।** అందుచేత ఈనా చిత్తమునకు చికిత్స అత్యంత ఆవశ్యకం.

## తృష్ణ (CRAZY OF THINGS AND WORRYING)

ఓ మునిశ్రేష్ఠా! చిట్టెలుక వీణను సమీపించి ఆ వీణ యొక్క తంతువులను (సన్నటి తీగెలను) త్రెంచివేస్తుంది చూచారా? ఆ విధంగా, నేను ఏవైనా - పెద్దలు సూచించే ఉత్తమ అభ్యాసములకు - ఉపక్రమించగానే, తృష్ణ (Craving for worldly things) వచ్చి నా ప్రయత్నములను త్రెంచివేస్తోంది. ఈ తృష్ణ ఉన్నది చూచారూ! ఇది నా హృదయ పద్మములో ప్రవేశించి నానా హంగామా, గందరగోళములను నిర్వర్తిస్తోంది. అది క్షణకాలంలో పాతాళమునకు దిగిపోతోంది. (అనేక నిరుత్సాహములను నాకు కల్పిస్తోంది). మరుక్షణం ఆకాశంలోకి ఎగిరిపోతోంది. ("నేను అంతటివాడిని - ఇంతటివాడిని"- అని ఎగిరిపడుతోంది). ఇంకొక క్షణంలో ఆయా దిక్కులలో గల పొదరిండ్లలోకి దూరి ఉంటోంది. **సర్వ సంసార దుఃఖానాం 'తృష్ణ' ఏకా దీర్ఘ దుఃఖదా!** 'సంసారము'లోని సమస్త దుఃఖములు స్వల్పకాలికమే అయినప్పటికీ... తృష్ణచేతనే సుదీర్ఘముగా అనిపించబడుచున్నాయి. సర్వదుఃఖములకు, సర్వబంధములకు మూలకారణము తృష్ణయే. సంసారములోని ఆయా అన్యదుఃఖములన్నీ ఆయా సంఘటనలు తారసపడినప్పుడే కలుగుతుంది. కానీ 'తృష్ణ'యో? ఒకానొకడు అంతఃపురములో అనేక సందపల మధ్య, ఉన్నప్పుడు కూడా ఆతని తృష్ణ ఆతనిని బయటకు ఈడ్చుకువచ్చి అనేక సంకటములలోకి బలవంతముగా త్రోసివేయగలదు.

"తృష్ణ" అనే ఆధి (మానసిక వ్యాధి) మనస్సును పీడిస్తున్నంత సేపు అట్టి జీవునికి స్వల్ప విషయములకే దుఃఖము, ఆనందము క్షణక్షణికంగా కలుగుతూ, తొలగుతూ ఉంటాయి. ఓ ద్విజోత్తమా! అట్టి అతి భయానకమైన తృష్ణావిషూచిక (విషజ్వరము)కు ఒక్కటే ఔషధము. అది ఏమిటంటే.... **తృష్ణావిషూచికా మంత్రః, "చింతా త్యాగో'హి. "ప్రాపంచక విషయములు చింతన చేయకపోవటము"** ఒక్కటే తృష్ణ తొలగటానికి ఉపాయము. వేరే మార్గమే లేదు.

## దేహము

ఓ ఋషీశ్వరా! ఋభు మహాదేవా! ఈ ఘనీభూత భౌతికదేహము గురించి కూడా కొంత విమర్శించుకున్నాను. **నాస్తి దేహ సమశోఖో, నీచో గుణ వివర్జితః.** ఈ దేహముకంటే దుఃఖమైనది, శోచనీయమైనది, నీచమైనది. 'సంసారము'లో మరొక్కటేదీ లేదేమో! అందుకని అన్నిటి కంటే మొట్టమొదటగా మనస్సుతో విసర్జించవలసిన వస్తువు (To be first discarded at inner Zone of thought and feelings) - ఈ దేహమే సుమా!"

ఈ దేహము- ఒక పెద్ద ఇల్లు. ఇందులో **'అహంకారము'** అనే ఇంటాయన నివాసము కలిగి ఉన్నాడు. హే గురుదేవా! ఏదిఏమైతేనేమి? ఈ దేహము ఎప్పుడో నశించు గాక! లేక సుదీర్ఘ కాలము ఉండును గాక! దీనితో నాకేమి పని? నేను సర్వదా 'దేహి' స్వరూపుడను.

దేహమునకు సంబంధించనివాడను. అంతేగాని దేహములో ఒక అంగమును కాను. దేహము ఉన్నప్పుడు లేనప్పుడు కూడా నాయొక్క సత్–చిత్‌లకు వచ్చే భంగమే లేదుకదా।

ఈ 'దేహము' అనే పశువులశాలలో '5' కర్మేంద్రియములు, '5' జ్ఞానేంద్రియములు పశువులవలె కట్టివేయబడి ఉన్నాయి. 'తృష్ణ' అనే గడుసరి భార్య ఇక్కడి ఇంద్రియ పశువులను గదమాయించుచూ ఆయా కార్యములలో వాటిని నియమిస్తూ ఉన్నది. ఆవిడ అజమాయిషీలో చిత్తవృత్తులు (Avocations) అనే పాలేర్లు (సేవకులు, భృత్యులు) అటూ ఇటూ లౌకిక కార్యక్రమావర్తులై పరుగులు తీస్తున్నారు.

**నేష్టం దేహ గృహం మమ!** అటువంటి ఈ శరీర గృహము పట్ల నాకు ఏ మాత్రము ఇష్టం కలగటమే లేదు.

ఇంకా కూడా…,

ఈ శరీరము యొక్క ముఖద్వారము (Entrance Gate) – 'జిహ్వా– (నాలుక)' – అనే కోతిచే ఆక్రమించబడినదై ఉన్నది. దంతములు కలిగి, ఎముకలగూడుగా నిర్మిమైన ఈ శరీరము నాకు ఇష్టమైన వస్తువుగా ఏ మాత్రమూ అనిపించటం లేదు. ఇది లోపల రక్త–మాంసమయమై యుండి, బయటకు పూతలాగా చర్మముచే కప్పబడి కనిపిస్తోంది. **"కాలముచే కృశించి, నశించటము"** అనే అనివార్యమగు ధర్మము కలిగియున్నది. ఓ మునివర్యా! బొమికలు, రక్తము, మాంసము, దంతములు, చర్మము మొదలై వేరువేరు పదార్థములతో నిర్మితమైన ఈ శరీరములో 'అందమైన వస్తువు' అనునది ఎక్కడున్నది? మరి ఇట్టి రక్త–మాంస– చర్మమయ పరస్పర దేహములు చూచి మేమంతా ఎందుకు మోహము పొందుచున్నాము? ఇది నాకు అర్థమే కావటం లేదు. పోనీ కొద్ది క్షణములు సుకుమారంగా కనిపించినప్పటికీ, అట్టి **సుందర – సుకుమారత్వము** శాశ్వతమా? కొద్దికాలములో తలనెరిసి, చర్మము ముడతలు పడి అస్థిపంజరమునకు తొడిగిన తోలువలె అవబోతోంది కదా? **"ఈ శరీరము ఇట్లాగే అందముగా, సుకుమారంగా ఎప్పటికీ ఉండ గలదు"** – అని అనుకోవటమనేది శరత్కాలంలో మేఘముల మెరుపులు, ఊహాకల్పితమగు గంధర్వ నగరము, నదీ జలములో కనిపించిన **తరంగము యొక్క ఆకారము,** ఆకాశంలో ఎగురుచున్న పక్షుల గుంపు ఆకారము "ఎప్పటికీ ఉండేవే!" – అని నమ్మి ఉండటము వంటిదేకదా! ఇటువంటి నశ్వర శరీరములను చూచుకొని మేము ఎందుకు మోహము చెందుచున్నాము చెప్పండి?

## బాల్యము

**శైశవే గురుతో భీతిః, మాతృతః, పితృతః తథా, జనతో జ్యేష్ఠ బాలాచ్చ।**

వర్తమానములోని అనేక మానసిక వేదనలను దృష్టిలో పెట్టుకొని, కొందరు **"బాల్యములో మేము ఆనందంగా ఉండేవారము"**.. అని చెప్పుకుంటూ ఉంటారు. గురుదేవా! ఇది నిజమా? కానేకాదు. నవ్వుకోవలసిన విషయం. బాల్యంలో అంతా భయమే! తోటి బాలురవలన భయము! గురువుల వలన భయము! తల్లిదండ్రులంటే భయం! చీకట్లో ఏదో చూచి భయం! లేని పిశాచమును ఎవ్వరో అన్నారని చీకట్లో ఊహించుకొని భయం! **శైశవం భయ మందిరం।** 'బాల్యము' అనునది భయమునకు మందిరము వంటిది (Boyhood is a Temple of Fears). **"బాల్యములో మేము సుఖముగా ఉండేవారము"**.. అనుమాట మానసిక భ్రమవాక్యమే. అనేక అనారోగ్యములు, చదువు గురించిన ఆంక్షలు, తోటిబాలురను చూచి, నిప్పు, నీరు చూచి భయము – ఇవన్నీ కలబోసియున్న 'బాల్యము' బాగుంటుందని దేహమును ఆశ్రయించటము ఎంతటి తెలివితక్కువతనము!

## యౌవనము

బాల్యము ఎట్లాగో గడపి ఈ జీవుడు శారీరకంగా యౌవనము పొందుచున్నాడు. **స్వచిత్తబిలసంస్థేన, నానావిభ్రమ కారిణా, బలాత్ కామపిశాచేన వివశః పరిభూయతే।** ఇప్పుడిక ఆతని చిత్తమునందే అనేక విభ్రమములు. 'కామము' అనే పిశాచి ఎక్కడి నుండో వచ్చి ఈ జీవుని యౌవన దశలో తన వశం చేసుకొని ఈతనిని తోలుబొమ్మ వలె ఆడిస్తోంది.

## వార్థక్యము (ముసలితనము)

యౌవనము గర్వించినంతసేపు పట్టదు. చెప్పా పెట్టకుండా క్రమంగా ఈ దేహమును విడచి వెళ్లుతోంది. ఎక్కడి నుండో ఈ దేహమునకు **"ముసలితనము"** వచ్చి ఆవరిస్తోంది. చేతులు, కాళ్ళు వణకటం ప్రారంభమౌతోంది. ఎవ్వరెవ్వరైతే ఇంతవరకు వదిగి ఉన్నారో, అటువంటి వారంతా ముదుసలిని చూచి ఎకసెకియం, అపహాస్యం చేస్తున్నారు. **దాసాః పుత్రాః స్త్రియశ్చ ఏవ బాంధవాః సుహృదః తథా, హసంతి ఉన్మత్తకమివ నరం వార్థక కంపితమ్।** ముసలితనముచే వణుకుచున్న శరీరము చూచి సేవకులు, కొడుకులు, కూతుళ్ళు, భార్య, బంధువులు, స్నేహితులు మొదలైనవారంతా పిచ్చివాడిని చూచినట్లు చూస్తున్నారు. ఎగతాళి చేసి మాట్లాడనారంభిస్తున్నారు. కోతులను ఆడించువాడు కర్రతో అదిరిస్తున్నట్లు, ప్రతి ఒక్కరూ ముదుసలిని చూచి, **"అట్లా ఉండకూడదా? ఇట్లా ఉంటావేం?"** – అని అదిరిస్తున్నారు.

ఒకప్రక్క ముసలితనములో దైన్యము (Timidity and then, uncertainity about days to come) వృద్ధి చెందుతూ ఉంటుంది. **"మృత్యువు వచ్చి ఎప్పుడు కాటు వేస్తుందో?"**.. అని మనసంతా భయముతో నిండి ఉంటుంది. **"నేను సంపాదించిందంతా ఏమౌతుందో?"**.. అనే దిగులు వెంటనంటి ఉంటుంది. మరొకవైపు శరీరము శిధిలమగుచూ, అనేక శారీరక బాధలు ప్రారంభమై మనస్సును క్రుంగతీస్తూ ఉంటాయి.

ఓ పితృదేవా! చిత్రం చూస్తున్నారా? ఒకవైపు ఇంత జరుగుచున్నా కూడా, **'మృత్యువు అనివార్యము'** అని తెలిసియున్నా కూడా – **ఈ జీవునిలో వివేకముగాని, వైరాగ్యముగాని వికసించటమే లేదు.** ఎందుచేతనంటే ఆశ, లోభము చావవు. "నా ఇల్లు ఏమౌతుందో? పిల్లల గతి? నాకు తెలిసినంత ఈఈ కుటుంబ వ్యవహారముల గురించి మా వాళ్ళకు తెలియదే? వీళ్ల గతి ఏమిటి?".. ఇటువంటి భావములే చుట్టుముట్టి ఉంటున్నాయి. **"మరణము అనివార్యము"** అని ఎవరికి తెలియదు? అయినా కూడా ఆశ చావదేమి? **"నేనెవరు? ఈ దేహమేమిటి? జన్మ ఏమిటి? మరణమేమిటి? ఇదంతా ఎట్లా ప్రాప్తిస్తోంది? జగదనుభవమంతా ఏమి కానున్నది?"** – ఇట్టి ఆత్మజ్ఞాన సంబంధమైన ప్రశ్నలే ఉదయించటము లేదు.

⌘

ఈ విధమైన సంసారములో 'సుఖము' అనునది ఎక్కడ ఉన్నదో చెప్పండి? ఒకవేళ్ళ సంపదల వలననో, స్వజనమువలననో కొంచెము సుఖము ఉన్నదనే అనుకుందాము. సమస్తమును భక్షించే స్వభావము గల కాలుడు (కాలయముడు) ఒకానొకరోజు రానే వస్తున్నాడు. అల్లరిపిల్లవాడు సుకుమార పుష్పమును త్రెంచి పూరెక్కలను అటూ ఇటూ చిమ్మివేయు విధంగా, కాలుడు అప్పటివరకు "నాది – నాది" అనుకుంటూ వస్తున్న సమస్తమును, – భౌతిక శరీరముతో సహా – **మ్రింగి, చప్పరించివేస్తున్నాడు.** ఆ తదుపరి ఇంతవరకు నమ్మి జీవిస్తూ ఉన్న దృశ్య ప్రపంచములో 'ఇది నాది' అనునది ఏదైనా మరణానంతరము వెంటనంటి ఉంటోందా? ఏదీలేదు. ఇది గమనించి, జాగరూకత వహించవలసిన అత్యవసరము ఉన్నదా? లేదా?

ఈ సంసారములో జీవునికి సుఖమెక్కడ? నశించబోయేవాటి పట్ల నమ్మిక కలిగి 'నాది' అను మమకారము కలిగి ఉండటము ఎంతటి దౌర్భాగ్యము! గడ్డి పరక, ఆవగింజ, బంగారము, మహేంద్ర– మేరుపర్వతములు, చిన్న వస్తువులు, పెద్దవస్తువులు.. ఇవన్నీ కాలుడు మ్రింగి వేస్తూ ఉన్నాడు. అయినా ఆయన పొట్ట నిండటము లేదు. సమస్తము మ్రింగివేయటానికే కాలము – ఎలుకను చూస్తూ ఉన్న పిల్లి వలె – క్షణక్షణము ఉద్యుక్తము అవుతోంది.

- కాలము సర్వ సంహారి.
- కాలము – త్రిలోకములలోని సమస్తమును ఆక్రమించుకొని ఉన్నది. ఈ సమస్తము కాలస్వరూపమే. కాలానుగుతమే!

నశించబోయే స్వభావముగల వస్తువులను పట్టుకొని వ్రేలాడుచూ, **మేమంతా శాశ్వత వస్తువు గురించిన ప్రయత్నమును మరచి ఉంటున్నాము.** ఎంతటి ప్రమాదము? **నశించు ధర్మముగల వస్తువులను, విషయములను పట్టుకొని వేలాడుచున్న కారణంగా మేము ఎక్కడా కూడా ఏమాత్రము నిలకడలేకయే ఉంటున్నాము.**

## దేహ భ్రమ!

జీవులమగు మేము కొద్దికాలము క్రితము దేహములను స్వీకరించాము. అట్టి ఈ దేహములను చూచి ఎందుకు మోహము పొందుచున్నాము? శాశ్వతమగు ఆత్మ గురించిన **అధ్యయనమును, అభ్యాసమును** ఎందుకు ఏమరచి ఉంటున్నాము? నాడులతో, బొమికలతో, కీళ్ళతో, రక్తముతో, చర్మముతో నిండియున్న ఈ మాంసమయ దేహమును చూచుకుని ఎందుకు శృంగార పరవశము పొందుచున్నాము? ఈ స్త్రీ దేహము (అట్లాగే స్త్రీకి పురుష దేహము)లో ఏమి శోభ ఉన్నది? ఒక్కసారి – చర్మము, మాంసము, రక్తము, కన్నీళ్ళు మొదలైనవాటిని విడివిడిగా చేసి చూస్తే – ఇందులో మోహపరవశము పొందతగిన రమ్యత్వము ఏమున్నది? మరి పరస్పర దేహ సంబంధమైన పరవశము ఎందుకు మాపట్ల మా జ్ఞాన–విజ్ఞాన దృష్టులను ఆక్రమించివేస్తోంది? ఇదంతా ఇట్లా నిర్వర్తిస్తూ ఉన్నది ఎవ్వరు? మాకు ఏమాత్రము అర్థముకాని ఏదో మాయాశక్తి మమ్ములను వశము చేసుకొని క్రీడిస్తోందా?.

అరెరె! – జీవులుగా దృశ్యములో ప్రవేశించియున్న మేము–కొంచముకూడా కాలచమత్కారము, కాలగతుల గురించి గమనించటమే లేదే? ఇప్పుడు – వర్తమానంలో – మేరుపర్వత శిఖరము నుండి క్రింద కొండల వరకు జారువారు గంగా నదీజలపు మెరుపులవంటి గొప్ప హారములు ధరించిన స్త్రీల స్తనములు – కొంతకాలము తరువాత ఏమౌతున్నాయి? శ్మశానములో కుక్కలచే అన్నపు ముద్దలవలె భక్షించబడుచున్నాయి.

స్త్రీ, పురుషులు పరస్పర శరీరములోని కేశములు, భుజములు, కళ్ళు మొదలైనవి శృంగార భావములతో చూడటము, స్పృశించటము – ఇదంతా కూడా నిప్పును ముట్టుకోవటము వంటిదే! నిప్పు కన్నా కూడా ప్రమాదమైనవి. ఎందుకంటే అవన్నీ సమీపంగా లేకపోయినప్పుడు కూడా ఊహించినంత మాత్రంచేతనే మావంటి జీవుల మనస్సులను దహించివేస్తున్నాయి. **'దేహభావము'** కలిగియున్న

కారణంగా - విజ్ఞులైనవారు, లౌకిక ప్రజ్ఞ కలవారు కూడా - గడ్డి పరకలవలె దహించబడుచున్నారే! దూరంగా ఉన్న దేహములు కూడా శృంగారాకర్షణలు గుర్తు చేస్తూ మా మనస్సును దహించగలవు కదా! ఈ తళుకు బెళుకులతో రసమయంగా కనిపించే దేహములన్నీ నిస్సారములే! దేహములను చూచి తాదాత్మ్యము పొందటము నరకాగ్నులకు ఇంధనములు సమకూర్చుకోవటమే!

'కామము' అనే కిరాతకుడు 'జీవులు' అనే పక్షులను తెలివిగా బంధించి, తన బుట్టలో వేసుకొనుచున్నాడు. ఇదంతా తెలిసి తెలిసి కూడా మేమంతా ఆ కామునకు - **ఈ భౌతిక దేహంతో సహా, మా తెలివితేటలతో సహా** అమ్ముడుపోతున్నాము. **"జన్మ"** అనే చెరువు. అందులో **"చిత్తము"** అనే బురద. అట్టి చిత్తము అనే బురదలో చేపలవలె జీవులమగు మేము సంచరిస్తూ ఉండగా, **మన్మథుడు** అనే జాలరి **దుర్వాసనలు** (దుష్ట సంస్కారములు) అనే వలవేసి, **'కామము'** అనే ఎఱను తగిలించి ఆకర్షించి మరీ పట్టుకొనుచున్నాడు.

తండ్రీ! ఋభు మహర్షీ! కామమును ఆశ్రయించినందుకు మా దుర్గతులు వర్ణనాతీతము. అందుచేత ఇటువంటి స్త్రీ (దేహ) సంబంధములలో నేను చిక్కుకో తలచుట లేదు. ఏదో విధంగా ఈ శారీరక - భౌతిక సంబంధములకు దూరంగా వచ్చివేసి, **'సత్యము' కొరకై 'అణ్వేషణము' చేస్తూ ఉండ తలుస్తున్నాను.**

స్త్రీ ఉంటేనే భోగేచ్ఛ. స్త్రీతో సంబంధమే లేకపోతే (స్త్రీ, పురుషుల పరస్పర శారీరకాకర్షణమే లేకపోతే) భోగేచ్ఛ ఎక్కడిది?

**శ్లో॥ యస్య స్త్రీ తస్య భోగేచ్ఛా। నిః స్త్రీః, కస్య క్వ భోగభూః?**
**స్త్రియం త్యక్త్వా జగత్ త్యక్తం। జగత్ త్యక్త్వా సుఖీ భవేత్।**

ఈ స్త్రీ-పురుష శరీరముల భౌతికాకర్షణను త్యజిస్తే జగత్తును త్యజించినట్లే. జగత్తునే త్యజిస్తే అది సుఖమే కదా! ఇక దుఃఖమెక్కడ ఉంటుంది?

## కాలగతిః యత్ దృశ్యమ్, తత్ నస్యమ్

సర్వము కాలముచే నశించబోవుచుండగా ఇక్కడి వస్తు జాలముచే నేను 'బద్ధుడను' ఎందుకు కావాలి చెప్పండి?

- సుదూరంగా విస్తరించి కనిపిస్తూ ఉన్న దిక్కులన్నీ కూడా కొంతకాలానికి దిక్కు లేకుండా పోతున్నాయి. **దిశోఽపి నహి దృశ్యన్తే।**
- దేశ దేశములే కాలగర్భములో కలిసిపోయి 'అన్యోపదేశము' అగుచున్నాయి. (సింధునాగరికత, గుప్తరాజుల స్వర్ణయుగం ఇటువంటివే కదా). **దేశోఽపి అన్యోపదేశకృత్।**
- కొండలే చూర్ణములైపోతున్నాయి. **శైలాఽపి విశీర్యంతే।**
- ఆకాశములో నక్షత్రాలే ఒకరోజుకి నేలరాలుచున్నాయి. **శీర్యంతే తారకా అపి।**
- సముద్రాలు ఇంకిపోతున్నాయి. **శుష్యంత్యపి సముద్రాశ్చ।**
- ఎంతో 'ధ్రువము' అనుకున్నవి కూడా, కాలముచే అధ్రువము అయిపోతున్నాయి. **ధృవోపి అధృవ జీవనః।**
- సిద్ధులంతటివారు అప్రసిద్ధులు అగుచున్నారు. వారు ఎటువైపు వెళ్ళుచున్నారో, వారివారి సిద్ధులు ఏమగుచున్నాయో చెప్పలేకున్నాము! **సిద్ధాఽపి వినశ్యంతి।**
- దానవులు, రాక్షసులు మొదలైనవారే జీర్యము (వినాశనము) పొందుచున్నారు. **జీర్యంతే దానవాదయః।**
- హరుడంతటివాడు నిష్ఠను కోల్పోవుచున్నాడు. హరి అంతటివారు హరించుకుపోతున్నారు. విరించి అంతటివాడు వీగిపోవుచున్నారు. **పరమేష్ఠ్యపి అనిష్ఠావాన్। హీయతే హరిరప్యపి అజః।**
- భావించబడూ ఉన్నవన్నీ అభావమై కనబడటమే మానివేస్తున్నాయి. భవుడు అభవుడౌచున్నారు. **భవోఽపి అభావమాయాతి।**
- దిక్పాలకులంతటివారు అదృశ్యమైపోతున్నారు. **జీర్యంతే వై దిగీశ్వరాః।**

ఇక మా బోటి మానవ - దేహధారుల గురించి ఏమి చెప్పాలి? 'మావి' అనుకున్నవన్నీ ఎటో వెళ్లిపోతున్నాయి. ఈ దేహమే ఒకప్పుడు మరెటో వెళ్లిపోతోంది. 'నేను-నాది' అని గంతులు వేస్తున్న మేము ఇంకెటో వెళ్ళిపోతున్నాము. తదితర విశేషణములగురించి చెప్పేదేమున్నది? ఇటువంటి తుచ్ఛ - నశ్వర దేహములను మనో - దర్పణములో చూచుకొని **"ఆహాఁ! ఓహోఁ!"** అని మురిసిపోవుచున్నాము. **కాలగతిని మేము గమనించటమే లేదు.**

ఆహాఁ! ఏమి ఈ సృష్టికల్పనా చమత్కారము! సముద్రంలో అసంఖ్యాక తరంగాలు బయల్వెడలి, సముద్ర జలములో సంచారములు చేసి చేసి, తిరిగి సముద్ర జలమునందే లయము అవటం జరుగుతోంది కదా!

అట్లాగే..,

**శ్లో॥ బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ సర్వావా భూతజాతయః, నాశమేవ అనుధావంతి సలిలానీవ బాడబమ్।**

సముద్రజలంలో పుట్టిన బడబాగ్ని సముద్రజలమునే హరించివేస్తోంది చూచారా? అట్లాగే,

బ్రహ్మ - విష్ణు - రుద్రులు మొదలుకొని సమస్త జీవులు, ఆ జీవులు నివసిస్తూ ఉన్నట్టి, (అష్ట దిక్పాలకులు - నవగ్రహములు-సప్తఋషులు-సనత్కుమార సనస్సుజాతాది బ్రహ్మ మానసపుత్రులు వారువారు) ఏలుతూ ఉన్నట్టి సమస్త మండలములు, ఈ కనబడే 14 లోకములు కూడా కొంతకాలము తరువాత తమ యొక్క స్వరూపమును కోల్పోవుచున్నాయి. సమస్తమునకు సహజరూపమగు **అఖండ-కేవలాత్మానంద-చిదానంద సాగరం**లో సమస్తము లయమౌతోంది. **మరల మరెక్కడో ఇవన్నీ బయల్వెడలుచున్నాయి.**

## సమస్తము క్షణ భంగురమే కదా!

హే మహర్షీ! ఋభు దేవా! గురువర్యా! ఈ ప్రపంచంలో (ఆత్మకు అన్యముగా ఉనికి ఉన్నట్లుగా) కనిపిస్తూ ఉన్న సమస్తము క్షణికమే కదా!

- **ఆపదః క్షణమ్ ఆయాంతి।** ఈ జీవునికి క్షణంలో ఆపదలు వచ్చిపడుచూ ఉన్నాయి.
- **క్షణమాయాంతి సంపదః।** ఇంతలోనే ఆ ఆపదలు ఎటో పోయి, క్షణంలో సంపదలు వచ్చి చేరుచున్నాయి.
- **క్షణం జన్మ। అథ (క్షణం) మరణం।** క్షణంలో జన్మ। క్షణంలో మరణం।
- **సర్వం నశ్వరమేవ తత్।** ఇక్కడ కనిపించే సమస్తము నశ్వరమే! అతి కొద్దికాలము తరువాత - ఇవేమీ ఉండబోవటమే లేదు.

అసలు ఈ దృశ్యజగత్తులో **'ఇది శాశ్వతము'** అనతగ్గది ఏదైనా ఒక్కటన్నా ఉన్నదా?

ఇంకా కూడా గమనిస్తూ ఉంటే - ఈ **కల్పనా జగత్తు**లో అనేక **చిత్ర-విచిత్రాలు।**

- బలహీనుని చేతిలో బలవంతుడు మరణిస్తున్నాడు. ఒకని చేతిలో వందమంది చచ్చుచున్నారు.
- ఆరోగ్యముగా ఉన్నవాడు అకస్మాత్తుగా మరణిస్తున్నాడు. "చావబోతున్నాడురా!" అనుకున్నవాడు ఇంతలోనే తిరిగి జీవిస్తున్నాడు.

అందుచేత పితృదేవా! ఈ జగత్తులోని "జనించే - కనిపిస్తూనే - గతించే నామ రూపములతో వ్యసనంగా సంబంధమువృద్ధి చేసుకొని, సుఖ-దుఃఖములు ఆశ్రయించటము ఎంతటి తెలివితక్కువతనము!

## విషయములే విషము

అయితే, ఇంతగా సమస్తము వైరాగ్య పూర్వకంగా గమనిస్తూ ఉన్నప్పటికీ కూడా మేము విషయముల బారిన పడుచున్నామే!- ఒకానొకడు పర-దూషణ-తప్పనిఎరిగినప్పటికీ 'దూషించటము' అనే దురభ్యాసమును విడువలేనివిధంగా, ఈ **విషయములు** (జగత్ సంబంధమైన సంగతులు, సమాచారములు, సంబంధములు, సంయోగ - వియోగ భావావేశములు మొ॥వి) మమ్ములను **వదలిపెట్టడము లేదు.** వాటిని మేమూ వదలటము లేదు. **ఒక్క విషయం** - ఇక్కడ విషయముల గురించి - **నేను గమనిస్తూ ఉన్నాను.** అది ఏమిటంటే,

**శ్లో॥ విషం విషయ వైషమ్యం। న విషం విషమ్ ఉచ్యతే।**
**జన్మాంతరఘ్నా విషయా। ఏతత్ జన్మహరం విషమ్॥**

ప్రాపంచకమైన సంఘటన - సందర్భ - సంబంధ - ఇత్యాదుల పట్ల ప్రియ-అప్రియములు, ఆశ-నిరాశలు, మమకార- అహంకారములు మొదలైనవి కలిగియున్నప్పుడు అవి ఈ జీవునిపట్ల 'విషములు'గా అగుచున్నాయి. అయినా కూడా మేము వాటిని దేహము ఉన్నంత వరకు వదలలేకపోతున్నాము.

హే మహానుభావా! గురువర్యా!

**- విషము నిజానికి విషము కాదు. విషయములే నిజమైన విషము.** ఎందుకంటారా? విషము తీసుకోవటము వలన - అది ఈ వర్తమాన దేహమును మాత్రమే హరించగలదు. కానీ విషయములో? అవి మాపట్ల అనేక అల్ప-నీచ జన్మ పరంపరలకు కారణమగుచున్నాయి. అనేక దేహములను బూడిదపాలు చేస్తున్నాయి. "అజ్ఞానము" - అనే ఉప్పునీటిలో ముంచి ఉంచుచున్నాయి. **మా మనోబుద్ధులను ఎందుకూ కొరగానివిగాను, పైగా - పరమ దుఃఖమయముగాను చేసి వేస్తున్నాయి.** ఆహాఁ! 'విషయాకర్షణము' అనే దుఃఖపర్యవసానములు **మాకు ఎక్కడి నుంచి వచ్చిపడుచున్నాయి? మాపై వెదజల్లుచున్నది ఎవరు? ఏ అజ్ఞాత శక్తి మా ఈ వ్యవహారమంతా వెనకన ఉండి నడిపిస్తోంది?**

## వైరాగ్య ప్రకటన

హే భగవాన్! పితృదేవా! మహర్షీ! ఋభు మహానుభావన్। సద్గురూ! నేను చెప్పినదంతా గమనిస్తూ ఉన్నారు కదా! సముద్రంలో నుండే బడబాగ్ని జనించి సముద్రమునకే బాధ కలిగిస్తుంది చూచారా! ఆ విధంగా మా హృదయంలో ఎందుకో, ఎప్పటి నుంచో

**'సంసార దోషము'** అనే దావాగ్ని జనిస్తోంది. అనేక **జన్మ పరంపరలు.** అందులో అనేక అల్పదృష్టులు. అట్టి అగ్ని శిఖలు ప్రవృద్ధమగుచు హృదయములోని 'శాంతి'ని హరిస్తున్నాయని ఇప్పటికి గమనిస్తున్నాను.

***ఈ దృశ్య వ్యవహారము మాకు నిజమైన దాహము తీర్చే జలము గల సరస్సు కాదు. కేవలము "మృగతృష్ణా సరస్సు మాత్రమే।***

– ఇది గమనించిన తరువాత, ఎవ్వడైనా ఆయాసపడుతూ ఈ **'దృశ్య జగత్తు'** అనే మృగతృష్ణలోని నీరు త్రాగటానికి పరుగులు తీస్తాడా? లేదుకదా.

**స్ఫురంతి హీన భోగాశా మృగతృష్ణా సరస్స్వపి।** మృగతృష్ణా జలము వంటి ఈ దృశ్యములో కనిపిస్తూ, మేము ఆశించటానికై మమ్ములను ఆకర్షిస్తూ, మమ్ములను ఊరిస్తూ కనబడుచున్న విషయ భోగముల పట్ల 'భోగాశ' నాకు క్షీణించింది. ఏమాత్రము భోగించాలనే ఆశ, నమ్మకము (An expectation to enjoy the worldly matters, relationships, possessions and so on...) నాకు ఏమాత్రము ఏర్పడటమే లేదు. అయితే ఇప్పుడు నా యొక్క ప్రాపంచక భావములు, అర్థములు, సమన్వయములు, అనుభవములు, అనుభూతులు ఆత్మభావన యందు సశాంతించితేగాని నాకు ప్రశాంతత లభించజాలదని గమనిస్తూ ఉన్నాను.

## ప్రణిపాతేన

హే మహానుభావన్! ఇప్పుడు మీ పాదపద్మములను చేతులతో, నుదురుతో స్పృశించి కళ్ళకు అద్దుకుంటూ శరణాగతుడను అగుచున్నాను.

## తత్త్వజ్ఞాన బోధ ప్రసాదించండి

**అతో మాం బోధయాశు త్వం తత్త్వ జ్ఞానేన వై, గురో!** తండ్రీ! మహర్షీ! నిదాఘ మహాశయా! గురుదేవా! ఇప్పుడు నాకు **"తత్త్వజ్ఞానము"**ను ప్రసాదించవలసినదిగా రెండు చేతులను జోడించి, మరల మరల నమస్కరిస్తూ అభ్యర్థిస్తున్నాను.

(తత్– అదియే
త్వమ్ – నీవు
బోధ – ఏతత్ నిరూపణము)

తమ యొక్క తత్త్వ బోధామృతముచే నా యొక్క జన్మజన్మల సంసార జాడ్యము తొలగునుగాక! నేను కూడా మీవంటి మహర్షుల వలెనే అఖండాత్మానంద స్వరూపుడనై వర్ధిల్లుచూ, సమస్త సంసారదోషములు తొలగి, స్వచ్ఛుడనై ప్రకాశించెదనుగాక! ఈ ఆశయముతో మిమ్ములను శరణువేడుచున్నాను.

తండ్రీ! మరొక విషయం కూడా! ఒకవేళ్ళ నేను అర్హుడను కాకపోవటము చేతనో, (లేక) మరింకే కారణముగానో, మీరు **ఆత్మతత్త్వ** బోధను ప్రసాదించకపోతే? ఇక నా ప్రస్తుత నిర్ణయమేమిటో మీకు వినమ్రుడనై తెలియజేసుకుంటున్నాను. వినండి.

**శ్లో॥ నోచేత్ 'మౌనం' సమాస్థాయ, నిర్మానో, గత మత్సరః**
**భావయన్ మనసా "విష్ణుం", లిపి కర్మ – అర్పితోపమః॥**

→ "నేను ఇటువంటి వాడిని. అటువంటివాడిని" అను రూపముతో నన్ను వెంటనంటి ఉంటున్న **"మానము"**ను మొదలంట్లా త్యజించివేస్తాను.

→ **"వారికి అంతే తెలుసు। నాకే ఇంత తెలుసు।"** అనే రూపము గల **"మత్సరము"**ను వదలివేస్తాను.

→ మనస్సుతో విశ్వస్వరూపుడు, సర్వాంతర్యామియగు విష్ణుభగవానుని **తత్త్వమును భావన** చేస్తూ..,

చిత్ర పటములో లిఖించబడిన (Painting) చిత్రము వలె సమస్తము త్యజించి చలన రహితుడనై ఉండిపోతలచాను.

**అతో నమో నమః**

❑ ❑ ❑

ఇట్లు పలికి ఆ నిదాఘ మహాశయుడు తండ్రి వద్ద మౌనము వహించి ఉండిపోయారు. చేతకపక్షి వానకొరకు వేచి ఉండుతీరుగా పితృదేవులు, గురుదేవులు అగు ఋభుమహర్షి చెప్పబోవు మాటల **శ్రవణము** కొరకు **సంసిద్ధుడైనారు.**

# 4వ అధ్యాయము
# "అహం బ్రహ్మాస్మి" సత్సాధన - సంసిద్ధి

**ఋభు మహర్షి :** బిడ్డా! నిదాఘా! నీవు వివరించి చెప్పిన వివేకముతో కూడిన వైరాగ్య భావములన్నీ విన్నాను. చాలా సంతోషము. ఈ జీవుడు ఏదైతే దృశ్యమునందు సునిశిత బుద్ధితో పరిశీలించి తెలుసుకోవాలో, అదంతా కూడా - తీర్థయాత్రా ఫలితముగాను, మీ గురువుల ప్రసాదముచేతను, ఈశ్వరానుగ్రహం చేతను, స్వ-వివేకము చేతను తెలుసుకొన్నావు. జ్ఞానులలో శ్రేష్ఠుడవు అయ్యావు. ఓ జ్ఞానవతాంవర! **తవ నాస్తి అస్తి అన్యత్ జ్ఞేయం!** ఇంక వేరే **"తెలుసుకోవలసినది"** అన్నది ఏదీ నీ పట్ల మిగిలి ఉండలేదు. ఉన్నది ఉన్నట్లే పలికావు.

అయితే శాస్త్రముల నుండి, గురుముఖతః, (మరియు) స్వకీయ వివేక - వైరాగ్యములతో కూడిన "ప్రజ్ఞ" (Inteligence duly accompanying Common Sense) తో తెలుసుకోవలసినది తెలుసుకున్నావు. మంచిది ఆ తెలుసుకున్న జ్ఞానమును ఇప్పుడు ఇక్కడ **నిస్సందేహమగు విజ్ఞానరూప- అనుభవము**గా (As an experience here and now beyond doubt) తీర్చిదిద్దుకోవాలి. తెలుసుకొన్నది స్వాభావికంగాను, అనుక్షణికంగాను, అవ్యాజంగాను (Independent of wordly occasions) - అనుభవముగా అయితేనే - సిద్ధించినట్లు సుమా।

అనగా, జ్ఞానము జ్ఞేయముగా స్వానుభవం కావాలి. ఎట్లా? **చిత్తమాలిన్యము** రూపమున శేషించిన **కించిత్ భ్రమ మాత్రమే** నీ పట్ల **తొలగవలసియున్నది.** అట్టి భ్రమ తొలగితే నీవు కూడా బ్రహ్మ విష్ణు మహేశ్వరుల వలె, మాఋషుల వలె - **"ఆత్మస్వభావి"** అయి సంప్రాకాశించగలవు. ఒక పాత్ర సహజంగా నిర్మలమైనది అయినప్పటికీ, వాడుకలో మాలిన్యము తాకినప్పుడు, ధూసరం అవుతుంది. ఇకప్పుడు చక్కగా మార్జయము (తోమటము) నిర్వర్తించి, జలముతో కడిగితే? తిరిగి యథాతథముగా ప్రకాశిస్తూ కనిపించగలదుకదా! నీవంటి తీవ్ర సాత్విక-స్వాభావిక వైరాగ్యము సిద్ధించుకొన్న తరువాత కించిత్ 'మార్జయము' Cleaning వలన **"స్వస్వరూపావగాహన-అనుభవముల పట్ల శేషించియున్న ఏకించిత్ సంశయము"** కూడా తొలగగలదు.

ఇప్పుడు నేను చెప్పబోవు బోధ విశేషములచే అట్టి **మార్జయము** (Washing) జరుగగలదు. **అందుచేత శ్రద్ధగా విను.**

## మోక్షస్థితి

ఏ మహత్తరమగు **"ఆత్మమేవాऽహమ్। న మనో! న అన్యః"** అను అవగాహనచే (Clarity),... **'నాకు బంధము మొదలే లేదు. ఉండజాలదు"**.. అను రూపంగా స్వాభావికానుభమౌతుందో,.. అట్టి **అవగాహన - అనుభవస్థితియే** (The State of Understanding and Experiencing) **"మోక్షము"** అని పిలువబడుతుంది. "ఈ జీవుని దుఃఖము (Worry) మొదలంట్లా తొలగాలంటే, - **అట్టి 'మోక్షస్థితి'ని సిద్ధించుకోవటము - ఒక్కటే ఉపాయము"** - అని శాస్త్రములచే, తత్త్వదర్శులచే సుస్పష్టముగా, నిర్దుష్టముగా చేతులెత్తి ప్రకటించబడుతోంది. **(ఊర్ధ్వబాహుః విరమ్యోషమ్।)**

## సాధన చతుష్టయము

అయితే అట్టి మోక్ష స్థితి సంసార బద్ధుడగు ఈ జీవునికి సిద్ధించటము సాధ్యమా? **తప్పకుండా సాధ్యమే.** ప్రయత్నించేవానికి సిద్ధించనిదేముంటుంది? అప్రయత్న శీలునికి లభించేదేమున్నది? అందుచేత, ప్రయత్నించి, మోక్షస్థితి (లేక) స్థానము సిద్ధించుకోవటానికి మానవ ఉపాధి ఒక మహత్తరమైన అవకాశము. సాధన శీలునికి అది సులభమే! అందుకని ఓ నిదాఘా! తదితర శిష్యజనులారా! **"తప్పక మోక్షము సాధ్యమే"** అనే నమ్మికతో సాధనకు ఇక ఉపక్రమించండి.

ఎట్లా సాధ్యము? అందుకుగాను స్వానుభవులగు మహనీయులచే సశాస్త్రీయంగా **"సాధన చతుష్టయము"** మార్గదర్శకంగా చెప్పబడుతోంది.

**(1) శమము (2) విచారణ (3) సంతోషము (4) సాధు సంగము** - ఈ నాలుగు మోక్షగృహములో ప్రవేశించటానికి నలుగురు ద్వారపాలకులుగా చెప్పబడుచున్నారు. ఈ నాలుగింటిలో ఏ ఒక్కటైనా సరే, అన్ని ప్రయత్నములు చేసి ఆశ్రయించాలి. ఈ నలుగురు సాధన సంపత్తి ద్వారపాలకులలో ఒక్కడు వశమైనా కూడా, తక్కిన ముగ్గురు తమకు తామే వశము కాగలరు.

ప్రజ్ఞ (wisdom)ను పదునుపెట్టడానికి మొట్టమొదట శాస్త్ర-సజ్జన సంపర్కమును ఆశ్రయించాలి. ఆ తరువాత తపస్సు - దమములను (ఇంద్రియ నిగ్రహమును) "సంసార బంధ విముక్తి" కొరకై ఆశ్రయిస్తే ప్రజ్ఞ తనకు తానే నిర్మలము, సునిశితము, విస్తారము అగుచున్నది. అటుపై - ఏదైతే **ఈ జీవునికి సంబంధించిన పరమ సత్యమో,** అది తప్పక **అవగతమౌతుంది.** క్రమంగా శాస్త్ర-గురువాక్యముల పరమార్థమును అట్టి ప్రజ్ఞతో శ్రవణం చేసి మనన - నిదిధ్యాసలతో అభ్యాసము చేయాలి. అట్టి అభ్యాసము సహాయముతో సర్వత్రా ఆత్మనే సందర్శించాలి.

## సాధన యొక్క అనుక్షణికత్వం

ఓ నిదాఘా। సాధన అనునది రోజులో కొద్ది సమయమునకు మాత్రమే సంబంధించినది కాదు. కొన్ని క్షణములతో ప్రారంభించినప్పటికీ, అద్దాని యొక్క "అనుక్షణికత్వము"ను సిద్ధించుకోవటమే ముఖ్యాశయము.

(1) దృశ్య విషయములను ప్రియ–అప్రియములుగా సంకల్పిస్తూ ఉండటము.

(2) దృశ్యము నుండి ఏదో ఆశించుచూ ఉండటము.

(3) దృశ్యముతో అనుసంధానము కలిగి ఉండటము.

ఈ మూడు కూడా ఎల్లప్పుడు, సర్వసందర్భములలోను వర్జిస్తూ (Leaving aside) ఉండాలి. అప్పుడిక నీవు క్రమంగా పావనమగు **"అమనస్కస్థితి"** లేక **"చిత్తరాహిత్యము"** పొందగలవు.

**"ఈ జగత్తు నాటకము వంటిది. ఏ విధంగా పాత్రధారుడు నవరసములు నటిస్తున్నప్పటికీ వాటిని తాను 'కర్త' కాదో, ... అదేవిధంగా ఈ జగత్తులో నేను దేనికీ కర్తను కాదు. భోక్తను కూడా కాదు"** – అను అకర్తృత్వమును మనస్సుతో కలిగి ఉండటమే – **'సమాధాన స్థితి'** (లేక) **'సమాధి స్థితి'.** అదియే **"కేవలీ భావము"** అని **"కైవల్యస్థితి"** అని కూడా పిలువబడుతోంది. (స్వస్వరూపాత్మ కేవలముగాను, అన్యముగా కనిపించే సమస్తము సందర్భ మాత్రంగాను స్వానుభూతము అవటమే "కైవల్యము". అద్దానినే అత్యంత శుభప్రదమగు **"పరానిర్వృతి"** లేక **"ఉత్తమమగు నిర్వాణము"** – అని కూడా అంటూ ఉంటారు.

## బుద్ధితో సమస్తము త్యజించి ఉండటము

ఓ నిదాఘ ప్రియ పుత్రకా! **చేతసా సంపరిత్యజ్య సర్వభూతాత్మ భావనామ్ యథా తిష్ఠసి తిష్ఠత్వమ్, "మూక అంధ బధిరా" ఉపమా!** మనస్సుతో సమస్త **"వేరువేరు జీవాత్మలు – దేహములు – గుణములు"** – అను రూపముగా గల భేదరూపమైన భావనలను మొదలంట్లా పరిత్యజించివేయి. అప్పుడు ఏది శేషిస్తోందో అద్దాని యందు సంస్థితుడనై ఉండెదవుగాక. ఇక జగత్ చమత్కారమంటావా? ఈ దృశ్య జగత్తు నందు సర్వ బేధవిషయముల పట్ల మాట్లాడుతూ కూడా మాటలు రాని **మూగవానివలె,** చూస్తూ కూడా చూడని **అంధునివలె,** వింటూ విననట్టి **చెవిటివానివలె** ఉంటూ – సంభావన కలిగి ఉండుము.

> *నీకు నాకు కూడా – ఇంద్రియములకు విషయమై తారసబడుచున్న* ***ఈ సమస్తము*** *→* ***ప్రశాంతము, జనన ధర్మరహితము, ఏకము,*** *మొదలు – మధ్య – చివర లేనట్టిది.* ***(ఆది మధ్యాంతరహితము), స్వయం ప్రకాశకము, ఇంద్రియములకు విషయమై ఉండనట్టిది,*** *అనుభూతమగుచూ ఉన్న ఏదీ కానట్టిది – అగు* ***ఆత్మయే అయి ఉన్నదయ్యా!***

**'సర్వము, ప్రశాంతము'** మొదలైన శబ్దములు ఏమేమి చెప్పుకుంటున్నామో... అవన్నీ కూడా దృష్టి పవిత్రము చేయటానికి చెప్పుకొంటున్న మాటలు మాత్రమే. "అదంతా కూడా ఆత్మానుభవము సమక్షములో భ్రాంతివాక్యములే" – అని కూడా గ్రహించి ఉండు. ఇక్కడ ఏదేదైతే "దృశ్యము"గా దృశ్యమానమై కనిపిస్తోందో – అదంతా కూడా కేవలమగు చిత్–వస్తువే (చిత్ స్వరూపమే) అయి ఉన్నది. **"చిత్ స్వరూపమునకు వేరై (కేవలమగు తెలివికి వేరై) ఎక్కడా ఏదీ లేదు. 'తెలివి'యే తెలియబడుచున్న సమస్త జగత్తుగా ప్రకాశమానమగుచున్నది"** – అనే మననమును సర్వదా ఆశ్రయించి ఉండు. జగత్ క్రియలన్నీ ఆచరిస్తూ ఉండి కూడా **నిత్య ప్రబుద్ధ చిత్తుడవు** (One who is mentally awakened in the Inspiration of self) అయి ఉండెదవుగాక. **"ఆత్మ సర్వదా ఏకము, అఖండము, అక్షరము, సమస్తము అయ్యే ఉన్నది కదా!"** అని ఎరిగినవాడవై తరంగ రహిత సముద్రమువలె ప్రశాంతుడవై ఉండుము.

ఆత్మబోధ – "వాసనలు" అనే గడ్డి పరకలను కాల్చివేయు అగ్నివంటిది. అట్టి తత్త్వబోధ చేత సమస్తమును ప్రకాశింపజేయుచు **"ఈ సమస్తముగా ఉన్నది నేనే. నేను ఈ సమస్తమునకు అనన్యము"** – అను **సమాధి స్థితి** సిద్ధిస్తోంది.

తత్ = అఖండము అప్రమేయము అగు పరమాత్మయే
త్వమ్ = 'నీవు' రూపముగా అగుపిస్తోంది.
బోధ = వివేక దృష్టిచే 'నీవు' అనురూపంగా కనిపించేదంతా పరమాత్మ యొక్క యథాతథ సంప్రదర్శనమే – అని అనిపించటం.

- ఈ సమస్తము ఆత్మయే!
- దీనిని దర్శించుచున్న నేను ఆత్మస్వరూపుడనే! 'నీవు'గా కనిపిస్తున్నదంతా మమాత్మ ప్రదర్శనమే.
- కనుక ఈ సమస్తముగా ఆత్మస్వరూపుడనైన నేనే నా వినోదము కొరకు సర్వత్రా ప్రదర్శనమగుచున్నాను.
- జన్మ–జీవన–కర్మలతో సహా, ఇంద్రియముల–ఇంద్రియార్థముల–ఇంద్రియ దృశ్యానుభవములతో సహా నాకు వేరై ఎక్కడా ఏదీ లేదు। ఇదంతా నాకు స్వకీయ కల్పనా రూప వినోద చమత్కారము.

ఇట్టి స్వాభావికమగు అనుభూతియే (అప్రయత్నముగానే అనిపించటమే) "సమాధి". **నతు తూష్ణీం అవస్థితిః।** అంతేగాని ఈ సమస్త దృశ్యము తూష్ణీకరించి (వదలి) ఎక్కడకో వెళ్లిపోవటము కాదు. సమాధి యొక్క భావనా సిద్ధికొరకు సాధనగా ఒక ఏకాంత ప్రదేశమునకు వెళ్ళవచ్చుగాక! సాధనచే 'సమాధి' (సర్వేసర్వత్రా స్వస్వరూప సమదర్శనము) సిద్ధించిన తరువాత - ఇక ఆపై **"అంతా నేనే అయి ఉండగా నేను ఎక్కడికి వెళ్ళాలి?"......** అను ఎరుకతో ఎక్కడైనా స్వేచ్ఛ పుణికి పుచ్చుకొని ఉంటూ ఉండెదవుగాక.

ఒక జాతిరత్నము 'ఇచ్ఛ' అనేదేదీ లేకుండానే ఎక్కడ ఉంటే అక్కడ అన్నివైపులా తన రత్నకాంతులను వెదజల్లుతూ ఉంటుంది కదా! అట్లాగే నీవు ఎక్కడ ఎట్లా ఉన్నప్పటికీ నీయొక్క సత్తా విశేషము (Absolutely existent self)చే పరబ్రహ్మతత్త్వ స్వరూపుడవగుము. **"జగత్తంతా కూడా అస్మత్ ఆత్మజ్యోతి స్వరూపము యొక్క దివ్యకాంతియే"**.. అనే అవగాహనతో స్వాభావికంగానే ఆత్మానుభవి అయి ఉండుము.

**నిదాఘుడు :** "మహాత్మా! శాస్త్రములలో ఆత్మ గురించిన రెండు వాక్యములు నాకు పరస్పరము నిరుద్ధంగా అనిపిస్తూ వస్తోంది.

(1) ఈ జగద్దృశ్యము ఆత్మ యొక్క విన్యాసమే. కనుక ఆత్మయే ఈ సమస్తమునకు కర్త.

(2) ఆత్మ దేనికీ కర్తకాదు. సర్వదా అకర్తయే.

ఈ రెండిటి సమన్వయము ఏమై ఉన్నదో దయచేసి వివరించండి. **ఆత్మ కర్తయా? అకర్తయా?**

**ఋభు మహర్షి : ఆత్మశ్చ ఆత్మని కర్తృత్వం, అకర్తృత్వం చ వై మునే!** ఓ మునీ! ఆత్మకు ఆత్మ పట్ల (ద్రష్ట-దృశ్యముల పట్ల), కర్తృత్వమూ ఉన్నది. అకర్తృత్వమూ ఉన్నది. (ఆత్మ కర్త కాదు కూడా)।

(దృష్టాంతపూర్వకంగా..
→ నవలలోని ఒక పాత్ర యొక్క స్వభావమునకు కర్త ఎవరు? రచయితయే కదా! కాబట్టి 'కర్త'
→ పాత్ర యొక్క స్వభావము రచయిత కలిగియున్నాడా? లేదు. కనుక అకర్త కూడా!
→ ఆభరణముగా కనిపిస్తున్నది బంగారమే కదా! కాబట్టి "ఆభరణమవటము" అనుదానికి బంగారమే **"కర్త".** (మరొకటేదో కాదు).
→ ఆభరణముగా ఉన్నది బంగారమే కదా! కనుక బంగారము మరొకటేదీ అవకయే ఉన్నది కాబట్టి "అకర్త!")

**నిరిచ్ఛత్వాత్ 'అకర్తా' అసౌ। "కర్తా" సన్నిధ మాత్రతః। తే ద్వే (2) బ్రహ్మణి విందేతే "కర్తృతా-అకర్తృతే" - మునే!** ఆత్మకు 'జగత్తు యొక్క కల్పన' అనే ఇచ్ఛ ఏదీ లేదు. కనుక **అకర్తయే!** ఆత్మయొక్క సాన్నిధ్యము చేతనే జగత్తు, జీవుడు (That being experienced and One who is experiencing) అనే రెండు ఏర్పడుచున్నాయి. కనుక **ఆత్మయొక్క కర్తృత్వమే ఈ సమస్తము.**

**దృష్టాంతంగా → దీపము / నాటకదీపము**

- వెలుగు ఉంటేనే వస్తువుల ఆకారము కనిపించటము జరుగుతుంది. చీకటిలో వస్తువుల ఆకారములు చూడనే లేము. కనుక ఆకారముల అనుభవమునకు వెలుగు (light) కర్తయే!
- కాని వెలుగుకు 'ఆకారములు చూపాలి' అనే ఇచ్ఛ ఏదీ లేదు. వెలుగు యొక్క సాన్నిధ్యం చేతనే వస్తువుల ఆకారాలు కనిపిస్తున్నాయి. అందుచేత వెలుగుకు ఏ కర్తృత్వమూ లేదు.

"అదేవిధంగా **ఆత్మయే సమస్తమునకు కర్త। కానీ ఆత్మదేనికీ కర్త కాదు"** అనునది సమన్వయించుకొని ఉండు. **కర్తృతా, అకర్తృతే- మునే! యత్ర ఏవ ఏష "చమత్కారః" - సమాశ్రిత్య స్థిరో భవ॥**

నాయనా! నిదాఘా! జలమునకు తరంగములవలె, బంగారమునకు ఆభరణము వలె, వెలుగుకు ఆకారమువలె, రచయితకు కథలోని పాత్రవలె...

→ **బ్రహ్మము యొక్క ఈ జగత్తుకు సాన్నిధ్యముచే - 'బ్రహ్మమే కర్త'।**

→ **బ్రహ్మము యొక్క ఇచ్ఛా రాహిత్యముచే - "బ్రహ్మము అకర్త"।**

అను రెండూ ఎరిగియుండి, బ్రహ్మమును ఆశ్రయించి, బ్రహ్మము నందు సంస్థితుడవగుము.

***బ్రహ్మమే అయినట్టి నేను సమస్తమునకు నా యొక్క బ్రాహ్మీ సాన్నిధ్యముచే మహాకర్తను. బ్రహ్మముగా సమస్తమునకు అతీతుడనై, కేవలుడనై ఉన్నాను కాబట్టి అకర్తనుకూడా।***

అను ఆశ్రయమును నీగురించి నీవే కలిగియుండుము. సమస్తమునకు అకర్తగా తనను ఎవడు భావన చేస్తూ ఉంటాడో, ('అకర్తాఽహి అహమ్') భావనను ఎల్లప్పుడు వదలకయే ఉంటాడో. ఇక అట్టివాని పట్ల **"పరమామృతము"** అనే పేరుతో చెప్పబడే సమత్వమే సర్వత్రా శేషించినదై ఉండగలదు.

ఓ నిదాఘా! ఒక ముఖ్యవిషయం విను. ఎవ్వరైతే **సత్తా మాత్ర స్థితి** లో ఉంటారో వారే ఈ భూమిపై గల సర్వజీవులలో మహాగుణవంతులు. (సత్తామాత్ర స్థితి = కేవలసత్తాయే నా స్వరూపము. (I am always what I am, independent of everything else including formation or non-formation of this physical form. I am the form of mere presence)

**తే నిత్యం ఏవ అభ్యుదితా ముదితాః 'ఖ' ఇవ ఇందవః॥** అట్టివారు ఆత్మతత్త్వజ్ఞులలో శ్రేష్ఠులు. – అట్టివారు ఎక్కడున్నా, ఎట్లా ఉన్నా కూడా పౌర్ణమినాడు ఆకాశములో పూర్ణచంద్రునివలె షోడశకళలతో ప్రశాంతముగా ఆత్మప్రకాశమానులై ఉంటారు.

**"సర్వదా కేవల సత్ స్వరూపుడను. చిదానంద భరితుడను"** అను స్వకీయ స్వస్వరూప నిర్వచమును సర్వదా ఆశ్రయించినవారు మాత్రమే ఇక్కడ శాశ్వ సుఖమును పొందగలరు. **అట్టి స్వస్వరూపావగాహన సిద్ధించనంతకాలము సంసార దుఃఖము అనివార్యము.**

## బ్రాహ్మీస్థితి

**'భావన'** అనునది భావించువానికి అభిన్నము కదా! అట్లాగే బ్రహ్మము యొక్క భావనయే ఈ జగద్దృశ్యము. అందుచేత ఈ సమస్తము బ్రహ్మమునకు అభిన్నము. ఇట్టి అవగాహనారూపమగు స్వానుభము సిద్ధించుకొన్నవారు...,

**(–బ్రాహ్మీస్థితి ప్రాప్య న ముహ్యతి।)** – సంసారమోహమును మొదంట్లా జయించివేయగలరు. బ్రాహ్మీస్థితియందు సంస్థితులైన మహనీయులు :–

- సర్వదా 'సమభావులు' అయి ఉంటారు.
- పద్మము పగలు వికసిస్తుంది. రాత్రిపూట ముకుళించుకుపోయి కృశిస్తుంది. అదే బంగారు పద్మపుష్పమైతే! రాత్రిపూట కూడా కృశించదు కదా! అట్లాగే బ్రాహ్మీ స్థితి సిద్ధించుకున్నవారు ఆపదలందు కృంగరు. సంపదలందు పొంగరు. బ్రాహ్మీ భావనను, బ్రహ్మానందమును వదలరు. సర్వదా బ్రాహ్మీస్థితిని పుణికిపుచ్చుకొని, ఆశ్రయించి ఉంటారు.

– మైత్రి, కరుణ, ప్రేమ ఇత్యాది సద్గుణ (సాధు) వృత్తులతో సర్వదా శోభిల్లుతూ ఉంటారు.

ఓ సౌమ్యా! ఇంకా విను।

**బ్రహ్మతత్త్వమును స్వానుభవము చేసుకున్న మహనీయులు ప్రపంచంలో ఉండి ఉంటున్న తీరు :**

- సముద్ర జలము తీరము దాటి రాని విధంగా – వారు శాస్త్రమును, సాంఘిక మర్యాదను (The way positive to the world) విడువనివారై ఉంటారు.
- సూర్యునివలె నియతిని (నియమమును) అతిక్రమించనివారై ఉంటారు. దృశ్యము యొక్క బంధనములు కించిత్ కూడా హృదయమున లేనివారై, దృశ్యములో ఆనందంగా విహరిస్తూ అందరినీ ఆహ్లాదపరుస్తూ ఉంటారు.

ఓ నిదాఘా! నీవు ఎల్లప్పుడు – "నేను ఎవరు? **కోఽహమ్**? ఈ సంసారమలమంతా ఎందుచే నా పట్ల వ్యాపించినదై ఉన్నది? **"కథమ్ ఇదం చేతి సంసార మలమ్ ఆతతమ్?"** అనే విషయమును ప్రాజ్ఞులగు మహనీయులతోను స్వకీయముగాను కూడా విచారణ చేస్తూ ఉండాలి.

- కర్మలయందు తన్మయమగుచు జీవితమును వృధా చేసుకోరాదు. అట్లా అని, కర్మలు మానరాదు. **న అకర్మసు నియోక్తవ్యం।**
- **న అనార్యేణ సహ వసేత్।** ఆత్మ విచారణను సంసిద్ధులే కానివారితో వ్యావహారికంగా కాలమును వృధా చేసుకోకూడదు. లోకరీతిగా మర్యాద కొరకై లోకభావాలు దట్టముగా కలిగియున్న వారితో ప్రక్కప్రక్కనే కలిసి ఉన్నప్పుడు కూడా, నీవు **అలౌకికము– లోకాతీతము**గా ఆత్మయొక్క **ప్రియత్వము, సమగ్రత్వము** విడవనే వద్దు. జాగరూకుడవై పరిరక్షించుకో।
- వర్తమానములో **"ముఖ్యము కదా"** అను రూపంగా కనిపించే భౌతిక రూప భేద సంబంధములన్నీ మృత్యువుతో (మార్పుచే) **"ముగుస్తాయి కదా!"**.. అనే విషయం ఏమరువరాదు. మృత్యువు యొక్క (మార్పుయొక్క) అనివార్యత, సర్వభౌతిక భేద సంబంధముల మటుమాయము గురించి గ్రహించియే ఉండాలి. **అయినా కూడా, వేటినీ అవహేళన చేయరాదు.**
- ఇక్కడి రక్త–మాంసమయ దేహముల పట్ల "నావి–నావారు–నాకు చెందినవారు – నేననుకున్నట్లు లేరేమీ?".. ఇటువంటి మనో–అంతర్గత మమకారములను విడచిపెట్టి ఉండాలి.
- విద్యుక్త ధర్మములను సమర్పణ భావంతో నిర్వర్తించు **'కర్మయోగము'** ఆశ్రయించి ఉండాలి.

- ముత్యాల గొలుసుతో ముత్యములను చూచువిధంగా సర్వత్రా సర్వదా **"కేవలచిన్మాత్రము"**–ను దర్శించు నిత్యాభ్యాసమును విడువకుండా ఆశ్రయిస్తూ ఉండాలి.

**నిదాఘుడు :** గురుదేవా! ఈ మనస్సు యొక్క వాస్తవ రూపము **ఏమిటని మహనీయులగు మీరు గమనిస్తూ ఉన్నారు?**

**శ్రీ ఋభుమహర్షి:**

- **"ఇది నాకు కావాలి"** – అని కొన్ని విషయములవైపుగా ఇష్టముగా వెంటబడటము – **ఉపాదేయాను పతనమ్।**
- **"ఇది వద్దు. తొలగాలి"** – అని అంతరముగా అయిష్టము, ద్వేషించటము – **హేయ ఏకాంత విసర్జనమ్।**

**యత్ ఏతస్మిన్ మనసో రూపమ్।** మనస్సు యొక్క ముఖ్యరూపము ఇదేనయ్యా! అట్టి మనస్సును ఒక బాహ్య వస్తువును చూచినట్లు మేము చూస్తున్నాము. అంతేగా అద్దానిని ఆత్మ యొక్క స్వభావముగా మేము ఏ మాత్రము అనుకోవటము లేదు.

ఓ మునీ! (1) సద్గురువుయొక్క బోధ నుండి తెలియవస్తున్నది. (2) ఆత్మశాస్త్రములు చెప్పుచూ ఉంటున్నది (3) యుక్తి (స్వకీయ విశ్లేషణ– విచారణలు) – ఈ మూడింటి సహాయముతో ఘనీభూతమైయున్న **కేవలచిత్** (ఎరుగుచున్నవానిని ఎరుగుచున్న) **స్వరూపమును** స్వానుభూతిగా చేసుకొని **"బ్రహ్మైవాహమ్"** అని తెలుసుకొనుచున్నవాడవగుము. **"అహమ్ బ్రహ్మైవ"** అను విషయములో సర్వ సందేహములు తొలగగా, సర్వవేదనలు సమసినవాడివి అగుము. సర్వమునకు అతీతుడవై **జీవన్ముక్తుడవు** అగుము.

## జీవన్ముక్త భావనాస్థితి

**నిదాఘుడు :** జీవన్ముక్తుని ప్రాపంచక స్థితి ఎట్లా ఉంటుంది?

**శ్రీ ఋభు మహర్షి :** జీవన్ముక్తుని సమస్త ప్రపంచాతీత స్థితి అద్భుతమైనదిగా చెప్పబడుచూ ఉంటుంది.

- పదునైన ఖడ్గముచే ఈ భౌతికదేహము నరకబడుచూ ఉన్నప్పుడు కూడా, కలువపూలు తనపై చల్లుచున్నట్లు భావించగలడు.
- నిప్పుకణములు మీదపడుచున్నప్పుడు కూడా చల్లటి చందనమువలె స్వీకరించగలడు.
- బాణములు కురుస్తున్నప్పుడు కూడా యంత్రము పన్నీటి జలము చల్లుచున్నట్లు అనుకోగలడు.
- శిరస్సు ఛేదించబడునప్పుడు కూడా సుఖనిద్ర రాబోవుచున్నట్లు తలచగలడు.
- ఎవ్వరైనా మాట్లాడనీయకుండా వాక్‌బంధనము చేస్తూ ఉన్నప్పుడు కూడా "మౌన ముద్ర వహిస్తున్నాను కదా" అని ధారణ చేయగలడు. – ఎవ్వరైనా చెవులు మూసినప్పుడు "నిశ్శబ్దము"ను ఆస్వాదిస్తూ ఉండగలడు.

ఓ నిదాఘా! అటువంటి జీవన్ముక్త స్థితి **"దృఢమైన వైరాగ్యము"** వలననే లభించగలదు. అంతేగాని **అప్రయత్నశీలునకు లభించేది కాదు.** ప్రయత్నశీలునికో? **లభించకపోయే ప్రసక్తియే లేదు.** ఎవ్వరికైనా సుసాధ్యమే కూడా!

> **శ్లో॥ గురువాక్య సముద్భూత స్వానుభూత్య అతి శుద్ధయా**
> **యస్య అభ్యాసేన, తేన ఆత్మా సతతం చ అవలోక్యతే॥**

**'తత్–త్వమ్'** అని ప్రవచించి చెప్పుచున్న గురువాక్యములు శ్రవణ – మననములు చేస్తూ అభ్యాసపూర్వకంగా పరమార్ధమును ఉపాసిస్తూ ఉండగా, అట్టివారు అతిత్వరగా **"స్వస్వరూపాత్మ యొక్క లీలాప్రదర్శనమే ఈ సమస్తము కూడా"** – అను అవలోకనమును తప్పకుండా సిద్ధించుకోగలరు. ఎవ్వరైనా సరే, అందుకు అర్హులే!

ఒకానొకడు తనచుట్టూ తాను తిరుగుచూ ఉంటే అప్పుడు పరిసరములన్నీ పరుగులు తీస్తూ ఉన్నట్లుగా దిగ్భ్రమ చెందుతాడు. తిరగటము ఆపివేసి, కాసేపు కళ్ళుమూసుకొని, ఆ తరువాత కళ్ళు తెరిస్తేనో? తిరిగి '8' దిక్కులు అంతకుముందువలె యథాతథంగా కనిపిస్తాయి కదా! అట్లాగే, మనోచాంచల్యత్వముచే రూపము పొందిన జగత్ బంధములన్నీకూడా మనో నిశ్చలతచే 'విజ్ఞానము' నందు లయమై **ఆత్మభావన** సిద్ధించగలదు.

అందుచేత, చిత్తచాంచల్యము తొలగటానికై **"జగత్తు స్వతఃగా లేదు. నిశ్చలము – అఖండము అగు ఆత్మయే సర్వత్రా వెలయుచున్నది"** అను భావనను సర్వదా ఆశ్రయించి ఉండు. **"మనో చాంచల్యమును జయించటము"** అనే ప్రయోజనమును ధనము, సంపద, మిత్రులు, బంధువుల, (ఉపవాసముల వంటి) శారీరకశ్రమలు, తీర్థ స్థలములలో సుదీర్ఘ నివాసము – ఇవేమీ సిద్ధింపజేయలేవు. మరి? **మనస్సుతోనే మనస్సును జయించాలి. మనోనిశ్చలతతో మనోచాంచల్యమును మ్రింగివేయాలి.** వేరే ఉపాయం లేదు.

## శమము

మనస్సుతో మనస్సును జయించే సాధనయే **శమము.** మనస్సును అభ్యాసవశంగా విషయముల నుండి వెనుకకు మరల్చి **"ప్రశాంతత"** అను స్థానమునకు అభ్యాసవశంగా చేర్చాలి. ఎవ్వరైతే ఇంద్రియ చాంచల్యమును ప్రశాంత మనస్సుతో ఉపశమింపజేస్తారో, వారు మహత్తరమగు ప్రభావము కలిగి ఉంటారు. సూర్యుడు ఉదయించగానే చీకటి తనకు తానే మటుమాయమగుచున్న తీరుగా. ఇంద్రియ

నిగ్రహ-ఉపశమన రూపమగు 'శమము'ను అభ్యసించువాని పట్ల దుఃఖములు (Lamentations), తృష్ణ (Urge for some thing), సహింపరాని చింతలు (Irresistable worries), ఇవన్నీ కూడా **"శాంత స్వభావము"** సంతరించుకోగలవు. ప్రశాంతతను అభ్యాసము చేస్తున్న మనో అభ్యాసి సమక్షంలో సర్వ మనోవేదనలు తమకు తామే తోకముడుస్తాయి. క్రూరజంతువులు, సాధుజంతువులు కూడా శమమును అభ్యాసించు యోగి సమక్షంలో తమ తమ చాంచల్యమును విడచిపెట్టి - ప్రశాంతతను అనుభవించగలవు. విషజంతువులు కూడా క్రూరత్వమును విడచిపెట్టి శమమును సిద్ధించుకొన్న శాంతుని పట్ల విశ్వాసము కలిగియుండి, క్రూరత్వమును త్యజించుతాయి. తమ యందు ప్రేమరసమును ప్రేరేపించుకొను సమర్థత పొందగలవు. ఈ జీవుడు శమము (లేక) శాంతమును ఆశ్రయించుటచేతనే **'పరమసుఖము'** యొక్క **రుచిని** ఆస్వాదింగలడు. మనస్సును శాంతింపజేస్తూ ఉండగా లభించు సుఖము - అమృతపానము చేతగాని, సంపదల ఆలింగనము చేత గాని లభించేది కాదు.

***శమము (లేక) శాంతము అనగా ఏమి?***

> **శ్లో॥ శ్రుత్వా, స్పృష్ట్వా చ, భుక్త్వా చ, దృష్ట్వా, జ్ఞాత్వా - "శుభ-అశుభమ్" :-**
> **న హృష్యతి, గ్లాయతి యః, స 'శాంత' ఇతి కథ్యతే॥**

శుభ-అశుభ విషయములను చూస్తున్నప్పుడు, పొందుచున్నప్పుడు, వింటున్నప్పుడు, వస్తుజాలమును-వస్తువులను స్పృశించుచున్నప్పుడు, అనుభవించవలసి వచ్చుచునప్పుడు, చూస్తున్నప్పుడు, తెలియబడుచూ ఉన్నప్పుడు కూడా - ఎవ్వడైతే సంతోషముగాని, దుఃఖముగాని పొందక **ఆ ఉభయములకు అతీతుడై ఉంటాడో** - ఆతడే **శాంతుడు** (లేక) **'శమము' అను రాజద్వారమును ప్రవేశించినవాడు.**

ఎవ్వని మనస్సైతే మరణ సమయములోను, ఉత్సవ సమయములోను, యుద్ధము సందర్భములోను, నిర్మలాకాశములో ప్రకాశిస్తున్న చంద్రబింబమువలె ఏ మాత్రము 'వ్యాకులత' చెందదో, అట్టివాడే **శాంతుడు.**

ఓ నిదాఘా! ఒక ముఖ్యమైన విషయం ఏమిటంటే,

- తాపసులై గొప్ప తపస్సు చేస్తూ ఉన్నవారిలోను, పండితులై అనేక విషయములు తెలుసుకుంటూ ఉన్నవారిలోను, యజ్ఞకోవిదులై బహుయజ్ఞములు చేస్తూ ఉన్న వారిలోను, భౌతికంగా బలవంతులలోను, అనేక సద్గుణములు కలవారిలోను కూడా - ఎవ్వడైతే **'శాంతము'** అనే మహత్తర గుణమును పుణికిపుచ్చుకుంటాడో, - **ఆతడే అందరిలో శ్రేష్ఠుడై విరాజిల్లుచున్నాడయ్యా!**

## 2. సంతోషము (తృప్తి)

మనస్సు సంతోష - సంతృప్తులను సర్వదా వీడకయే ఉండటము సాధన చతుష్టయములో రెండవది. **"సంతోషము"** అనబడు అమృతమును పానము చేసి, శాంతి, తృప్తి కలిగినట్టి మహాత్ముడు **'ఆత్మారామ'** మహాపదము సిద్ధించుకున్నట్లే. **"సంతోషముగా ఉండకపోవటము"** - అనునది ఒక మానసిక దురభ్యాసముగా, దుర్వ్యసనముగా మహనీయులు గమనిస్తూ ఉన్నారు. మనకు గుర్తు చేస్తున్నారు. అట్లాగే సంతోషముగా ఉండటము ఒక సదభ్యాసము కూడా.

***"సంతోషము" - అనగా.., అప్రాప్తమైనది మనసః పరిత్యజించినవాడై, సంప్రాప్తించినది సమబుద్ధితో స్వీకరిస్తూ భేద - అభేదములను వేరువేరుగా చూడని వాడే 'సంతుష్టుడు'***

> **శ్లో॥ న-అభినందతి అసంప్రాప్తం, ప్రాప్తం భుంక్తే యథా ఈప్సితమ్,**
> **యః స సౌమ్య సమాచారః "సంతుష్ట" - ఇతి కథ్యతే॥**

ప్రాప్తము కానిదాని గురించి "లభించలేదే?" - అను కష్టమును భావించకుండా, లభించినదానితో సంతోషము పొందుచూ, ఎవ్వరైతే సౌమ్యమైన **'స్వభావము, ప్రవర్తన'** కలిగి ఉంటారో,.. అట్టివారే **సంతుష్టులు.** అంతఃపురములో ఉండే సాధ్వీమణి భర్త చేతులు మీదుగా పుష్పము మాత్రమే లభించినా కూడా సంతోషముగా జడలో ధరించువిధంగా, ఎవ్వడైతే **ఏది ప్రాప్తిస్తే అంతమాత్రమునకే సంతోషించినవాడై ఉంటాడో, అట్టి అభ్యాసము 'స్వరూపానందము'నకు దారితీయుచూ జీవన్ముక్తత్వమును ప్రసాదించగలదు.** అందుచేత లభించిన దానితో సంతృప్తిరూపమగు **సంతోషము**, లభించని దాని గురించి, **"ఇది కూడా శుభము కొరకే"** - అనే అవగాహన ఎంతగా ప్రయత్నించి అయినాసరే,.. అలవాటుగా చేసుకోవలసిందే. లభించిన దానిని గుర్తు పెట్టుకొని కృతజ్ఞత - సంతృప్తులను ప్రదర్శించువానికి 'సంతోషము' - సులభముగా అభ్యాసం (Ease habit) అవుతోంది.

## 3. విచారణ (Analysing the athma concept)

ప్రాజ్ఞుడైనవాడు (One who is wise) ఆత్మయందు మనస్సు శాంతించేవరకు - ఎంతగా వీలుంటే అంతగా, ఎంతవరకు శాస్త్రములు లభ్యపడితే అంతవరకు, ఎంతవరకు సదవకాశమో అంతవరకు, ఎంతగా సాధ్యపడితే అంతవరకు - **ఆత్మగురించిన విచారణ యందు నిమగ్నమయ్యే ఉంటాడు. 'విచారణ'ను విడువనే విడువడు.**

**నిదాఘుడు :** విచారణచే ఎట్టివారికి సులభముగా ఆత్మయందు విశ్రాంతి లభిస్తుంది? (బ్రహ్మచారి-గృహస్థ - వాన ప్రస్థ-సన్యాస) - చతుర్విధ ఆశ్రమములలో ఎవరు కృతకృత్యులు?

**ఋభుమహర్షి!** ఓ నిదాఘా! ఎవ్వరికీ కూడా వాస్తవమైన విశ్రాంతి జాగ్రత్ - స్వప్న-సుషుప్తులలో లభించదు. మరి? **"ఆ మూడు నావి కదా"** అని ఎరిగి, (నాలుగవదగు) తురీయయములో మనస్సును విశ్రాంతింపజేసి, **"జాగ్రత్-స్వప్న-సుషుప్త సాక్షిత్వము"** అభ్యాసపూర్వకంగా సిద్ధించుకొంటాడో,.. అట్టివాడే ఆత్మయందు విశ్రాంతిని సిద్ధించుకోగలడు. ఎవ్వడైతే తురీయ స్థితిలో సంస్థితిని వివేకముచే సిద్ధించుకొంటాడో - అట్టివాడు గృహస్థుడైనా (లేక) సన్యాసి అయినా (లేక) వాన ప్రస్థుడైనా (లేక) బ్రహ్మచారి అయినా, జీవిస్తూ ఉన్నా (లేక) మరణించినా - కృతకృత్యుడే.

**నిదాఘుడు :** ఒకానొకడు తురీయ స్థితిలో విశ్రాంతిని సిద్ధించుకొని ఉంటే, అట్టివాడు ఏఏ కర్మల యందు ప్రవృత్తుడౌతాడు?

**ఋభుమహర్షి :** తురీయయము నందు విశ్రాంతిని సిద్ధించుకొన్నవానికి కర్మలు చేయుటము వలన గాని (లేక), చేయకపోవటము వలన గాని వచ్చేది ఉండదు. పోయేది ఉండదు. ఆతనికి ఇక క్రొత్తగా శ్రుతుల, స్మృతుల సేవనయొక్క ఆవశ్యకత ఉండదు. చంచలము ఏమాత్రము లేనప్పటి పాలసముద్రము వలె ఆతడు అంతరమున ఈ ప్రాపంచక కల్లోలములను కించిత్ కూడా లేనివాడై, పరమ ప్రశాంతుడై ఉంటాడు. ఏది సర్వజీవుల అంతరముననే ఉదయించుచూ, సర్వజీవుల బాహ్యానుభవమంతా తానే అయి ఉన్నదో - అట్టి ఆత్మను సర్వత్రా దర్శించుచూ ఉంటాడు. ఎప్పుడైతే అట్టి ఆత్మజ్ఞానానుభవము అనుక్షణికము అవుతుందో, - అట్టి యోగి తద్రూపమే తానై, సర్వత్రా నిత్యోదితమైన (Dawning every minutes) అఖండాత్మగా విరాజిల్లుచున్నాడు.

అనగా బ్రహ్మజ్ఞానము పొంది, ఈ సమస్తమును బ్రహ్మముగా దర్శించుచూ ఉండగా,.. అట్టి అభ్యాసము చేస్తున్న జీవుడు అతిత్వరగా బ్రహ్మమే తానై ప్రకాశించుచున్నాడు. ***(బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి।)***

అందుచే బ్రహ్మతత్త్వాభ్యాసివగుము. **"దేశ - కాల-వస్తు పరిచ్ఛేదము ఏ మాత్రము కించిత్ కూడా లేనట్టి బ్రహ్మమే నేను"** - అను భావనను ఆశ్రయించి, అద్దానికి అద్వితీయుడవగుము. (లేక) అది నీకు అద్వితీయమగు గాక! **"సమస్తము అయి ఉన్న బ్రహ్మమే నేను"** - అను అభ్యాసము సులభమే గాని దుర్లభమేమీ కాదు. "కష్టము కదా" - అనే బలహీనతను నీవు దగ్గరకు రానీయవద్దు.

బ్రహ్మమే తానైనవాని పట్ల ఈ దృశ్యము ఏమౌతోంది?

- మెలకువ వచ్చిన తరువాత స్వప్నములో కనిపించిన స్వప్నదృశ్యము ఏమౌతోంది? స్వప్న ద్రష్ట యొక్క కల్పనయే కాబట్టి, ఆ స్వప్నద్రష్టయందు 'లయము' పొందుతోంది.
- నిదురించి కలకంటున్నవాని పట్ల ఈ జాగ్రత్ ఏమౌతోంది? జాగ్రత్‌యొక్క 'స్వానుభవి' యందే లయము పొందుతోంది.
- గాఢనిద్రలో ఉన్నవానిపట్ల జాగ్రత్ స్వప్న దృశ్యములు ఏమౌతున్నాయి? ఆ నిద్రించువానియందే లయము అగుచున్నాయి.

'స్వతఃగా లేనివే' - అని తెలియవస్తున్నాయి. అట్లాగే బ్రహ్మానుభవి పట్ల ఇక్కడి జాగ్రత్ జగత్తు మొదలైనవి ఉండి కూడా, 'లయము' అగుచున్నాయి. 'జగత్తులు'గా కాకుండా ఆత్మగానే స్వానుభవమై ఉంటున్నాయి. జాగ్రత్ స్వప్న సుషుప్తులు, జన్మ-జన్మాంతరములు స్వతఃగా ఏమాత్రము 'లేనివే' - అగుచున్నాయి. ఆత్మప్రకాశము యొక్క ప్రకాశరూపాలు అగుచున్నాయి.

**జగత్తుగా "మొదలే లేనివి", ఆత్మగా "ఎప్పటికీ ఉన్నవి" - అగుచున్నాయి. కల్పనగా కనిపించేదంతా ఆత్మగా అనుభవమవటమే కల్పాంతము.**

- జలము నందు బయల్వెడలిన తరంగముల యొక్క నామరూపములు తిరిగి జలముతో ఏకమైనప్పుడు - "తరంగమునకు చెందిన జలము (జలవిభాగము) నశిస్తోంది" - అనము కదా! ఎందుకంటే జలము పట్ల తరంగము యొక్క నామరూపములు ఆపాదితము (Altributed) మాత్రమే. అట్లాగే "జీవాత్మ-జగత్తులు **ఆత్మకు భిన్నముగా కనిపించటము"** అనే కల్పన **"ఆత్మగా అనిపించటము"** అనునదే మనోలయరూప-'కల్పాంతము'. అట్టి **"బ్రహ్మముగా సమస్తము అనిపించటము"** - అనే **"కల్పాంతస్థితి"** -లో అప్పటికీ శేషించే 'తత్బ్రహ్మానుభవము' - 'ఇట్టిది' అని నిర్వచించలేము. వర్ణించలేము. అయితే అట్టి స్వానుభవమాత్రము (Merely one's own experience while every thing is being enjoyed as unity, with not even a bit of Diversity still remaining) మాటగా చెప్పలేకపోయినప్పటికీ, బుద్ధికి 'సత్యము'గా అనుభవ మాత్రము - **తత్ సత్ బుద్ధ్యనుభవమాత్రమ్।**

**"ఋతమ్। ఆత్మా। పరంబ్రహ్మ। సత్యమ్।"** మొదలైన శబ్దములను ఆత్మానుభవులగు మహనీయులు (అట్టి అనుభవము ఏమరచిన ముముక్షువులమగు) మనకు బోధించటానికై (లేక) సూచించటానికై సశాస్త్రీయయుక్తంగా "కల్పిస్తున్నారు". కనుక, ఆ శబ్దములు **"విజ్ఞులచేత బోధ కొరకై కల్పించబడిన వ్యావహారిక శబ్దములు"**.. అని తెలిసియే, .. ఆత్మశాస్త్రమును శ్రవణ - మననములు చేయి. స్వయమాత్మానుభవమునందు 'అనుభవము' యొక్క సమక్షములో వాటికవియే లయించగలవు.

## సంజ్ఞార్థమ్ తాన్ బ్రవీమితే

**నిదాఘుడు :** తండ్రీ! ఋభుమహర్షీ! మీరు చెప్పేది ఆశ్చర్యం గొలుపుతోంది. అయితే – "ఆత్మ, బ్రహ్మము, పరబ్రహ్మము, ఋతము, సత్యము" మొదలైనవన్నీ బోధించటానికై కల్పించబడిన సంజ్ఞలు (Indicative terms / Terminology) మాత్రమేనని మీరు సిద్ధాంతీకరిస్తున్నారా! అది ఎట్లా? మరికొంత వివరించండి.

**ఋభు మహర్షి :** అవును. **"ఋతమ్, ఆత్మా, పరంబ్రహ్మ, సత్యమ్", ఇత్యాదికా బుధైః కల్పితా వ్యవహారార్థం, యస్య సంజ్ఞా మహాత్మనః॥** లౌకికంగా కూడా మనము ఉపయోగిస్తున్న శబ్దజాలమంతా సంజ్ఞార్థము కల్పించబడినదేకదా! బ్రహ్మతత్త్వజ్ఞుల అధ్యాత్మ శాస్త్ర ప్రవచ (బోధ) వాఙ్మయము కూడా సంజ్ఞార్థముగా కల్పించబడి చెప్పబడినవే. ఇందులో సందేహము దేనికి? ఈ విషయము గురించి కొంత దృష్టాంత పూర్వకంగా చెప్పుచున్నాను. విను.

***"బంగారపు కడియము (కటకము)"*** అనే శబ్దములో బంగారము వేరు – కడియము(గాజు) వేరా? బంగారమునకు వేరుగా 'కడియము' అనేది ఎక్కడ ఉన్నది? బంగారము ఒక ఆకారముగా ఉన్నప్పుడు 'కడియము' అని, మరివేరైన ఆకారములచే 'గొలుసు, ఉంగరము, గాజులు, ముక్కుపుడక".. మొదలైనవిగా చెప్పుకోబడుతోంది. అవన్నీ బంగారము కాని క్షణమేది? **"బంగారములో ఉంగరము ఉన్నది"** – అనునది పరమ సత్యము కాదు. **"బంగారమే ఉంగరముగా ఉన్నది. అప్పుడు 'బంగారపు ఉంగరము' అని సంజ్ఞగా చెప్పుకుంటున్నాము"** – అనునది పరమ సత్యము. అట్లాగే, బ్రహ్మమును (బ్రాహ్మీభావనచే) సిద్ధించుకొన్నప్పుడు మనకు ఇక 'జగత్తు' అనునది బ్రహ్మముగా వేరై **కనిపించదు, అనిపించదు.** ఉంగరము, గొలుసు వంటి ఆపాదిత శబ్దజాలమే – "జగత్తు, అందలి నేను–నీవు– పంచభూతములు – వస్తువులు"– మొదలైనవి కూడా.

**"జగత్తే బ్రహ్మము। బ్రహ్మమే జగత్తు।"** అను భావనయే **'జగత్ ప్రళయము'.**

చిత్‌బ్రహ్మము యొక్క **"ఎరుగుచుండటము"** అనే విన్యాసమే (బ్రహ్మము యొక్క ఎరుక విన్యాసమే) జగత్ రూపముగా 'ఇంద్రజాలములో' వలె భాసిస్తోంది. 'ఎరుక'లోంచే ఎరుగబడేదంతా – బయల్వెడలి, తిరిగి 'ఎరుక'లోనే – లయము పొందుతోంది. (The 'knowing' itself is extending as what ever being known)

## బంధము – విముక్తి

ఓ నిదాఘా! ఈ సందర్భములో కొన్ని విశేషాలు గమనించమని గుర్తుచేస్తూ ఉన్నాను. విను.

- అఖండమగు 'ఆత్మ' లేక "పరబ్రహ్మము" కేవలమై ఉంటూనే, లీలగా, క్రీడగా, వినోదముగా (అనిర్వచనీయ కారణంగా) – **"నేను ద్రష్టనౌతాను. అందుకుగాను దృశ్యమును కల్పించుకుంటాను"**.. అను 'కల్పన'ను స్వయముగా స్వీకరిస్తోంది.
- ఆ విధంగా కేవలమగు ఆత్మ నుండి (బ్రాహ్మీ స్వస్వరూపము నుండి) కల్పనా మాత్రముగా – బ్రహ్మము యొక్క (లేక) ఆత్మ యొక్క 'అంశ' అనతగిన **'ద్రష్ట'** (Perceiver/sensory self) బయల్వెడలుచున్నాడు.
- అట్టి 'ద్రష్ట' అనే అంశ స్వరూపుడు ఆత్మకు అనన్యుడే అయి ఉండి కూడా **ఆత్మ కల్పితమగు (లేక స్వయం కల్పితమగు) దృశ్యము యొక్క భావనచే "బద్ధుడు" అగుచున్నాడు.**
- **ద్రష్టా దృశ్యవత్ బద్ధో।** "ద్రష్ట పట్ల దృశ్యము ఉన్నది" – అను దృష్టియే బంధము" అని చెప్పబడుతోంది. **ద్రష్టుః దృశ్యస్య సత్తా 'బంధ' – ఇత్యభిధీయతే॥** ద్రష్టకు–దృశ్యమును (ద్రష్ట దృశ్యములకు) గల పరస్పరత్వమే 'బంధము' అని చెప్పబడుతోంది.
- **ద్రష్టా దృశ్య – అభావే ముచ్యతే।** దృశ్యము ఎప్పుడైతే అభావించబడదో, అప్పుడు ద్రష్టకు దృశ్యము లేకపోవటం చేత– 'విముక్తుడు' (Relieved) అనుబడుచున్నాడు. దృశ్యము అభావించబడుటచే ద్రష్టకూడా అభావించబడినట్లే. అప్పటికీ శేషించియుండే **'దృక్'** యే **'ఆత్మ'** యొక్క శబ్దార్థము.
- **దృశ్యము అనగా?** "జగత్తు – నేను – నీవు" మొదలైన వాటిలో సర్గము (Avocative relationship) – అనునదే 'దృశ్యము' – అని చెప్పబడుతోంది.
- జగద్దృశ్యము ఎట్లా ఏర్పడుతోంది? **మనసైన ఇంద్రజాల శ్రీఃజగత్ ప్రవితన్యతే॥** "ఆత్మ యొక్క మనన రూప విశేషము" అయి ఉన్న మనస్సే – ఈ 'జగత్తు' అనే ఇంద్రజాలమును విస్తరింపజేస్తోంది.
- మనస్సు జగత్ రూపముగా విస్తరిస్తూ, తనకు ఇదంతా 'అన్యము' అయినట్లుగా – జగత్ భావనను కొనసాగిస్తూ ఉన్నంత వరకు – 'మోక్షము' అను **బంధ రహిత స్థితి** అనుభవమవదు.

## ఇదంతా మనస్సే

(తన ఉనికికి తానే కారణము) – "స్వయంభువు" – అయినట్టి బ్రహ్మదేవుని మానసిక సృష్టియే – ఈ దృశ్యమానమగుచూ ఉన్నట్టి –విశ్వము (లేక) జగత్తు. **మనోమయం అతో విశ్వం యన్నామ పరిదృశ్యతే। 'విశ్వము'** అను రూపముగా **ఏది ఏవిధంగా చూడబడుతోందో..** అదంతా కూడా మనస్సే. మనోమయమే ఇదంతా. మనస్సే లేనప్పుడు – జగత్తు కూడా లేనిదే అగుచున్నది. మనస్సు ఉంటేనో,.. జగత్తు ఉండియే తీరుతుంది.

## మనస్సు ఉన్నట్టి స్థానము ఏది?

**నిదాఘుడు :** స్వామీ! జగత్తే మనస్సు యొక్క రూపమని చెప్పుచున్నారు కదా! మనస్సు అసలు ఉన్నదెక్కడ? బాహ్య ప్రపంచములోనా? హృదయములోనా? మరింకెక్కడన్నానా?

**ఋభుమహర్షి : న బాహ్యే, నాపి హృదయే, సద్రూపం విద్యతే మనః।** 'మనస్సు' అని పిలువబడే వస్తువు బాహ్యమున లేదు. అంతరమున లేదు. హృదయంలోనూ లేదు. అసలు **'మనస్సు' అనబడేదానికి వస్తుతః స్వయమైన ఉనికియే లేదు.** ఉనికియే లేనిదానికి **"ఇదిగో ఇక్కడ ఉన్నది"** – అని ఎట్లా అంటావు? మరి 'మనస్సు' – అని మనము అంటున్నది దేనిని? విను.

**యత్ అర్థప్రతిభానం తత్ 'మన' – ఇత్యభిధీయతే।** మనము ఒక వస్తువును, రూపమును, సందర్భమును ఏ అర్థమును ప్రతిపాదన (Attribute) చేసి చూస్తామో, (లేక) స్ఫురింపజేసుకుంటామో – అట్టి స్ఫురణయే (The way a meaning is being given to whatever)..'మనస్సు' – అనే శబ్దములో చెప్పుకుంటున్నాము. {మనస్సు – PERCEPTON}. సంకల్పమే మనోరూపము. సంకల్పించటమే మనస్సు. అంతకుమించి మనస్సుకు వేరైన రూపముగాని, అర్థముగాని లేదు. (1) సంకల్పించటము (2) మనస్సు – ఈ రెండు వేరువేరు కావు. వేరుచోటులలో ఉండవు. **యత్ర సంకల్పనం, తత్ర మనో –అస్తి – ఇతి అవగమ్యతామ్।** "ఎక్కడ సంకల్పము ఉంటుందో – అక్కడ మనస్సు ఉన్నట్లే సుమా! ఇది గమనించెదవుగాక. **'సంకల్పము, మనస్సు'** – ఈ రెండూ **ఎప్పుడూ భిన్నము కావు. భిన్నముగా ఉండవు కూడా.** ఈ జీవుని పట్ల **'సంకల్పములు'** నశించినప్పుడు ఇక **పరమాత్మ స్వరూపమే** శేషించినదై ఉంటుంది. అనగా, **అట్టివాడు మనస్సుకు కూడా సాక్షిగా అయి, స్వస్వరూప సందర్శనం చేస్తూ ఉంటాడు.**

**కేవలము (లేక) కైవల్యము :** ఎప్పుడైతే "నేను – నీవు–జగద్దృశ్యము" మొదలైన వాటితో కూడిన దృశ్య సంభ్రమము శాంతించినదో, అప్పుడు దృశ్యము ఆత్మకు వేరైన 'సత్తా' కోల్పోగలదు. అనగా **స్వస్వరూపాత్మకు దృశ్యం జగత్తు అనన్యముగా అనుభూతమౌతోంది.** అట్టి దృశ్య రహిత సత్తా అనుభవమే **'కేవలము'** అని, **'కైవల్యానుభవము'** అని అంటారు.

**మహా ప్రళయము :** 'దృశ్యము ఆత్మకు అన్యము కాదు. ఆత్మకు అన్యముగా దృశ్యము లేదు" అను ఘనీభూత దృష్టియే, (లేక) " జగత్తు నాకు అన్యముగా లేదు" అను స్వానుభవ స్థితియే (The Self encompossing all else) **"మహా ప్రళయము". దృష్టియే సృష్టి.** దృష్టి శమిస్తే సృష్టి శమించినట్లే అవుతుంది. అపుడు 'దృష్టి–సృష్టి' అను సంబంధములకు మునుముందే నిశ్చలము – ప్రశాంతముగా ఏ పరమాత్మ సర్వదా శేషించినదై ఉన్నదో,.. అదియే **"నీ యొక్క నాయొక్క ప్రతి జీవుని యొక్క"** సర్వదా శేషించియున్న. **వాస్తవము, కేవలము** అగు **పరబ్రహ్మ స్వరూపము.** జగత్తు (దృష్టి–ద్రష్ట) బయల్వెడలేది పరబ్రహ్మము నుండే! మహాప్రళయము పొందుచున్నది కూడా పరబ్రహ్మము నందే। సర్వదా ఉన్నది పరబ్రహ్మమే! అద్దములో దృశ్య వస్తువులు లేనట్లే (స్వస్వరూపమే అయి ఉన్న) "పరబ్రహ్మము" నందు జగత్తులు మొదలైనవి మొదలే లేవు.

- సృష్టికి పూర్వము ఏది ఉన్నదో – ప్రళయము తరువాత అదే శేషించి ఉంటోంది.
- సర్వదా స్వయంప్రకాశ స్వరూపునైయున్న సూర్యునికి ఉదయ–అస్తమయములు ఉంటాయా? ఎక్కడుంటాయి? అట్లాగే **సృష్టి–ప్రళయములకు ఈవల ఆవల శేషించియున్న ఈ జీవుని యొక్క పరమాత్మ స్వరూపము సృష్టి సమయంలో అస్తమించేది కాదు. ప్రళయానంతరము ఉదయించేది కాదు. అది నిత్యోదితము।**

## పరమాత్మ యొక్క విలక్షణ – లక్షణములు

పరమాత్మను నిర్వచించలేము. లక్షణములు వర్ణించి చెప్పుకొనూలేము. అయినప్పటికీ శ్రోత యొక్క ఆత్మోన్నత్యమును గుర్తు చేయటానికి స్వానుభవమును రంగరించి ఆత్మసాక్షాత్కారమును ఆస్వాదిస్తున్న మహనీయులు – పరమాత్మ గురించిన విశేషములను శాస్త్రరూపంగా (మనపై అవ్యాజమైన ప్రేమచే) అభివర్ణిస్తూ మనకు చెప్పుచున్నారు.

- ఆత్మ స్వయం ప్రకాశమై ఉండియే ద్రష్ట – దృశ్యములను **'దృష్టి'** అనే స్వకల్పిత – స్వల్పాంశచే ప్రకాశింపజేస్తోంది.
- **అస్తి యత్ న అస్తమితో।** ఆత్మ దృశ్యము దృష్ట్యా గాని, ద్రష్ట దృష్ట్యా గాని, మరింకే దృష్టి చేతగాని – **ఆత్మ ఉదయించటము లేదు. అస్తమించటమూ లేదు. 'అస్తి' (ఉనికి – 'నేను ఉన్నాను' అను దానికి) – అస్తమయమనునదే లేదు.**

**భాస్వాన్** – ఈ జీవుని యొక్క కేవల స్వరూపమగు కేవల **పరమాత్మ** నిత్య ప్రకాశస్వరూపులు.

**అజో** – దృశ్యము యొక్క ఉదయాస్తమయములచే జనించువాడు కాదు. లయమగువాడు కాదు. "జన్మ" మొదలైన దేహ- జీవధర్మములు ఏ మాత్రము లేనట్టివారు.

**దేవో** – సమస్తము ప్రసాదిస్తూ ఉన్నట్టివారు. దివ్యస్వరూపులు.

**నిరామయః** – జగత్తు-నీవు-నేను మొదలైన వేరువేరైన విశేషములేవీ కలిగి ఉండనట్టివారు.

**సర్వదా సర్వకృత్** – ఎల్లప్పుడు సమస్తమునకు కర్త అయి ఉన్నవారు.

**సర్వః** – సర్వదా సర్వము అయి ఉన్నట్టివారు.

**పరమాత్మా** – నాటకములో నటిస్తున్న ఒక నటుని- నాటకంలో పాత్రగా కనిపిస్తున్న దానికి వేరైన ఆ నటుని సహజ స్వరూపమువలె -(పరమ్-ఆత్మా) – ఆవల గల తేజోమయ ఆత్మ స్వరూపము. ఈ విధంగా ఆత్మ గురించి అభివర్ణించబడుతోంది.

ఇంకా కూడా...,

**యతో వాచో నివర్తంతే :** దేనిని వాక్కు ప్రయత్నించి కూడా, పలుకజాలక వెనుకకుమరలుచున్నదో..,

**యో ముక్తైః అవగమ్యతే।** ఈ జగత్ భావనా పరిధుల నుండి విముక్తులైనవారు ఏ స్థానమును చేరి ఈ సమస్తమును సందర్శిస్తున్నారో – అదియే **'పరమాత్మ' లేక "పరబ్రహ్మము".**

**యస్య చ "ఆత్మ"-ఆదికాః సంజ్ఞాః కల్పితా। న స్వభావజా।** ఎద్దాని గురించి "ఆత్మ, బ్రహ్మము కేవలము, అధ్యాత్మ, సాక్షి, తురీయాతీతము" – మొదలైన శబ్ద జాలమంతా కల్పించబడుచూ ఉన్నదో, ఎద్దానికి అవన్నీ స్వభావతః లేనివే అగుచున్నదో.. **అదియే ఆత్మ / బ్రహ్మము.**

## చిదాకాశము – మహాకాశము

ఓ నిదాఘా! ఇప్పుడు 'త్రయంబకములు' (3 ఆకాశముల)గురించి వివరిస్తున్నాను.

**(1) చిత్తాకాశము :** త్రిగుణ భావములు, స్వభావములు, స్వ-పరభావనలు, అనుభూతములు, అనుబంధములు మొదలైన భావనా విభవములు కలిగియున్న **'నేను'** యొక్క స్వరూపము **'చిత్తాకాశము'** అని పిలువబడుతోంది.

**వివరణ :** (ఆలోచనలు, భావనలు నావైన నేను) (What I am - in my zone of thought!)

**(2) చిదాకాశము :** నా యొక్క భావనలను, అనుభూతులను ఎరుగుచూ ఉన్న "నేను" (నాచే ఎరుగబడుచున్నప్పటి **'ఎరుక'** నాదైన నేనైన నేను) (What I am in my zone of Knowing)

**(3) మహాకాశము :** ఇంద్రియ జగత్తును, సమస్త దృశ్యములోను, సకల జీవులలోను 'నేను' అయి ప్రదర్శనమగుచున్న నేను. (ఈ సమస్తము నాలోని నేనైన "నేను") (That 'I' in which every thing and every body is placed in)

ఈ (భూత)- చిత్త – చిదా – మహాకాశములలో వరుసగా మొదటిదానికంటే తరువాతది సూక్ష్మమైనది, శ్రేష్ఠమైనది కూడా. చిత్తాకాశము కంటే కూడా **చిదాకాశము నిర్విషయమైనది. శూన్యమైనది.**

**చిదాకాశము : – అభివర్ణనము :**

> **శ్లో॥ దేశ దేశాంతర ప్రాప్తౌ సంవిదో మధ్యమేవ యత్,**
> **నిమేషేణ చిదాకాశం తత్ విద్ధి। మునిపుంగవ!**

ఓ మునీశ్వరా! ఆలోచన ఎల్లప్పుడు ఒక విషయము నుండి, వేరొక విషయము వైపుగా ప్రయాణించుచూ, 'నిత్యబాటసారి' అయి ఉంటోంది.

– ఒక ఆలోచననువదలిన తరువాత,

– తరువాతి ఆలోచనలో ఇంకా ప్రవేశించకముందు మధ్యస్థమై ఏ **"ఆలోచనా రహిత ఎరుకరూప కేవల చైతన్యము"** ఏర్పడి ఉన్నదో, **'చిదాకాశము'** సులభముగా అనుభవమవగల స్థానము. విషయము – విషయములమధ్యగా గల నిర్విషయ ప్రదేశములో రెప్పపాటు కాలము అనుభూతమగు **కేవలీ సత్తా స్వరూపమే "చిదాకాశము".**

అట్టి చిదాకాశ స్వస్వరూపస్థితి అనుభవమయ్యేది ఎట్లా?

> **శ్లో॥ తస్మిన్ నిరస్త నిశ్శేష సంకల్పస్థితిమ్ ఏషి చేత్**
> **సర్వాత్మకమ్ పదం శాంతం తదా ప్రాప్నోషి। అశంశయః॥**

అది సులభమే। ఎట్లాగంటే

**సర్వ సంకల్పములను - సంకల్పపూర్వకంగా దూరంగానెట్టి, దూరంగా నెట్టుచున్న ఆ ఒక (సాధనశీల) సంకల్పమును కూడా త్యజించి 'మౌనము'ను ధారణ చేస్తూ ఉండగా, సర్వాత్మకమైనట్టి, పరమ శాంతమైనట్టి అఖండాత్మ పదమును సిద్ధించుకోగలవు. ఇందులో సందేహము లేదు.**

అట్టి - **సర్వాత్మకము** (The 'Self' that is present in every body else), **నిత్యోదితము** (Always awakening), **సుందరము** (The sense of beauty), వైరాగ్య పూర్ణము (Detatched from all differences and be complete as All -present) అనునవన్నీ గర్భము నందు ధరించినట్టిది, **సహజానందము** (Happy and plenty by itself)- అగు **"అంతరంగ బుద్ధి - మనస్సు**"లయ స్థితియే **'సమాధి'** అనబడుతోంది.

"ఇంద్రియములకు మనోకల్పన తోడుఅగుచుండగా కనిపిస్తున్న ఈ దృశ్యము **స్వతఃగా ఉన్నది కాదు.** స్వతఃగా అసంభవము కూడా।" - అను "బోధ" (Understanding doubtlessly and with clarity)చే ఇక్కడి దృశ్య విషయముల పట్ల రాగము, ద్వేషము - ఉభయము హృదయంతో, 'రహితము' అగుచూ వస్తాయి. క్రమంగా కేవలచిదాత్మ యొక్క **జ్ఞానము** (Conceptual understanding), ధ్యేయము (Its perception here and now) గా అయి, ఇక సమస్తము **స్వస్వరూప పరమాత్మ**గా స్వాభావికానుభవము (ప్రయత్నము లేకుండానే అనిపించటము) అవగలదు. అదియే **'సమాధి'** అని చెప్పబడుతోంది.

**ఆత్మకు అన్యముగా ఎక్కడైనా ఏదైనా దృశ్య భావన రూపంగా కనిపిస్తూ ఉంటే - అది మిథ్యయే।** సకలం మృషా।

- మదించిన ఐరావతము (ఏనుగు)ను ఒకడు ఆవగింజలో బంధించి తీసుకువస్తున్నాడు-**మత్త ఐరావతో బద్ధః సర్షపీకోణ కోటరే।**
- ఒక దోమ సింహముల గుంపుతో బాహాటంగా యుద్ధం చేసి వాటిని చంపి తిరిగివస్తోంది. - **మశకేన కృతం యుద్ధం సింహోవై రణకోటరే।**
- ఒక పద్మము యొక్క మధ్యగా గల పుప్పొడి-రవ్వలో మేరుపర్వతము చిక్కుకొనిపోయింది. ఆ పద్మమును ఒక భృంగము (తుమ్మెద) చెప్పాపెట్టకుండా మ్రింగివేసింది. **పద్మాక్షే స్థాపితో మేరుః, నిగీర్ణో భృంగసూనునా।**

ఇవన్నీ జరగటము వాస్తవమా? **"ఈ దృశ్యము వాస్తవమే"** అని అనుకోవటము అటువంటి భ్రమవాక్యమే. పై వాక్యముల 'అర్థము' వలెనే ఈ జగదృశ్యము మొదలే భ్రమాత్మకము (It is being experienced in an illusionary scenario). అంతేగాని, వాస్తవముగా ఉన్నది కాదు.

మరి లేనిది ఉన్నట్లుగా ఎందుకు అనుభూతమౌతోంది? **చిత్తము** → 'రాగము, ద్వేషము' మొదలైన వాటిచే దూషితమవటం చేతనే. ధూళిచే దట్టముగా ఆవరించబడిన అద్దము (A Plain Mirror covered with dense dust) లో వంకరటింకరగా ముఖము కనిపించురీతిగా అట్టి చిత్తమునకు ఈ కల్పనతో కూడిన పాంచభౌతిక దృశ్యము - అనేక ప్రియ అప్రియ విశేషములతో కూడి కనిపిస్తోంది.

ఓ నిదాఘా! **ఈ దృశ్య జగత్తు "నిజమే। శాశ్వతమే। వాస్తవమే"** అని అనిపించటానికి కారణము **స్వకీయ చిత్తము యొక్క భ్రమయే -** అని గ్రహించు.

- రాగ ద్వేషములు మొదలైన వాటితో కూడి ఉన్నప్పటి చిత్తమే **'సంసారము'** అను **శబ్దార్థము.**
- రాగ ద్వేషముల **వినిర్ముక్తము** (Completely getting rid off) గురించియే **సాధన.**
- రాగద్వేషములు **లేకుండాపోవటమే 'సంసార నివృత్తి'** (లేక) **మోక్షము.**

## దేహభావన

వాస్తవానికి దేహి (One who is using the Body) వేరు. దేహము (The Body) వేరు. దేహము గురించిన మనస్సు యొక్క భావన చేతనే దేహముతో దేహికి బంధము ఏర్పడుతోంది. **"నేను దేహమునకు వేరై, 'దేహి'నై ఉన్నాను. దేహమునకు ముందే ఆత్మస్వరూపుడనై ఉండియున్నాను. ఇప్పటికీ, ఎప్పటికీ ఆత్మస్వరూపుడనే!"** అను భావన యొక్క సుదీర్ఘ - అభ్యాసముచే దేహ వాసనల నుండి (from the Tendencies of getting confiningly related to physical body) ఈ జీవుడు ముక్తుడగుచున్నాడు. ఇక ఆపై దేహధర్మములగు జన్మ-జరా-మరణములచే ఆతడు దోషము పొందడు. పరిమితుడు కాడు. బంధితుడుగాని, సంబంధితుడుగాని అవడు.

## మనస్సు యొక్క చమత్కృతి

ఓ నిదాఘా! 'సంసారము' అనగా? జీవునికి దృశ్యముతో ఏర్పడుచున్న అప్రతిహతమైన దుఃఖపర్యవసానము గల **సంబంధమే సంసారము.** వాస్తవంగా ఇదంతా మనస్సు యొక్క విలాసమేగాని, మరింక ఏమీ కాదు. **ఇది మా నిశ్చితమైన అభిప్రాయము.** ఎందుకంటావా! ఈ మనస్సు ఎంత మహత్తరమైనదంటే... ఇది ఒక **"కల్పము"** కాలమును **"క్షణము"**గాను, ఒక 'క్షణము కాలము'ను

**“కల్పము”**గాను చేసివేయగలదు. అట్టి మనస్సును నిగ్రహించటము – అనేది చిన్న చిన్న ప్రయత్నములతో కుదిరేది కాదు. **గొప్ప ప్రయత్నశీలురము కావలసిందే.** యోగాభ్యాసము, విచారణ, గురు ఆశ్రయము, సత్సంగము, ఇంద్రియ నిగ్రహోపాయములు – ఇవన్నీ అవసరం.

- ❖ ఎవ్వడైతే దుష్టకర్మల నుండి విరమించడో.., **న అవిరతో దుశ్చరితాః,**
- ❖ ‘శాంతము’ను ఆశ్రయించకుండా ఎల్లప్పుడూ అశాంతుడై ఉంటాడో.., **న అశాంతో,**
- ❖ ‘సర్వత్రా సమత్వము’తో కూడిన దృష్టిని విడనాడి భేదదృష్టినే అలవాటుగా కలిగి ఉంటాడో.., **న సమాహితః,**
- ❖ అశాంతమైన మనస్సును కలిగి ఉంటాడో.., అట్టివాడు ప్రజ్ఞావంతుడు అయి ఉండి కూడా, ఆత్మగురించి విని – చదివి – తెలుసుకొని కూడా. (దృశ్యధ్యాసల లయ రూపమగు) **ఆత్మ గురించి అనుభవము పొందలేడు. “ఈ సమస్తము మమాత్మానందస్వరూపమే”** అనే అనునిత్యానుభవ రూపమగు **“సంసారమునకు ఆవలిఒడ్డు”** – చేరలేడు.

ఎప్పుడైతే నీవు నీ ఆత్మ స్వరూపము గురించి : → బ్రహ్మానందము, ద్వితీయమే లేనట్టి **అద్వితీయము;** గుణములకు మునుముందే ఉండటంచేత **నిర్గుణము, సత్యము; చిదానంద ఘనము**..... అని సుస్పష్టముగా, స్వానుభవముగా ఎరుగుచున్నావో, ఆ తర్వాత ఇక సమస్త భయములు స్వాభావికం, వాటికివే సమసిపోతాయి.

**ఏ కేవలమగు స్వస్వరూపాత్మ :–**

- ❋ పరమునకే పరమైన **పరాత్‌పరమో,** మహత్తుకే **మహాంతమో** (‘అనేక ఉపాధులలో నేనైన నేను’ – కంటే కూడా మహత్తరమో),
- ❋ ఏ స్వరూపము **తేజోమయమో, శాశ్వతమో, శివమో,**
- ❋ ఎద్దాని రూపము **కవియో** (సర్వశ్రేష్ఠమో), అనంతకాలము నుండి ఉండటం చేత **పురాణమో, సనాతన పురుషకారమో,**
- ❋ ఈ సర్వము తనయొక్క విస్తారమే అయి ఉండటంచేత **సర్వేశ్వరమో,**
- ❋ ఇదంతా తనరూపమే కాబట్టి – **సర్వస్వరూపమో,**
- ❋ ఈ సమస్తము తన యొక్క “పురుషకారము”గా కలిగియుండటంచేత **పరమ పురుషుడో,**

**అట్టి బ్రహ్మమే నేను! అహమ్ బ్రహ్మాస్మి** అనునదే మోక్ష హేతువు. అట్టివాడు **‘మహాత్ముడు’** అగుచున్నాడు.

## బంధ – మోక్షములు

**ద్వే పదే బంధమోక్షాయ। ‘నిర్మమేతి’ ‘మమేతి’ చ।।** బంధము – మోక్షము కలిగించేవి రెండు వేరు – వేరైన మార్గములు ఈ జీవునికి ఎదురుగా ప్రత్యక్షమై ఉన్నాయి.

(1) **నిర్మమేతి** = ‘నాది – అన్నది దృశ్యములో ఏదీ లేదు” – అను భావన. ఇది **మోక్ష హేతువు।**

(2) **మమేతి** = “నాది” అను భావన. ఇది **బంధ హేతువు.**

## జీవ–ఈశ్వరతత్త్వములు

చేతన – అచేతనాత్మకమైన ఈ జగత్తు అంతా కూడా “జీవ–ఈశ్వర” (వ్యష్టి – సమిష్టి)రూపముగా ప్రదర్శనమగుతూ ఉన్నది.

**I. ‘ఈక్షణ’ ఆది → ‘ప్రవేశ’ అంతా సృష్టే “ఈశేన” కల్పితాః।।** అనేక ఉపాధులలో ప్రవేశము – నిష్క్రమణము – ఇదంతా ఈశ్వరమాయ. దర్శనము (seeing) నుండి ఈ జీవుడు జగత్ దృశ్యములో ప్రవేశించే వరకు జరుగుచున్నదంతా “ఈశ్వర కల్పితము” లేక “ఈశ్వరమాయ”. స్వర్గలోకములు, అందుకు యాగములు మొదలైనవన్నీ ఈశ్వరభ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి.

**II. జాగ్రత్ ఆది → విమోక్ష అంతో సంసారో జీవ కల్పితః। జాగ్రత్ మొదలుకొని → విమోక్షము వరకు** సంసార రూపమున **“జీవ”** కల్పితము (జీవునిచే తనకు తాను కల్పించుకొనుచున్నది). జీవమాయ లోకముల నుండి → సాంఖ్యము, (జ్ఞాన విచారణ – అందుకు ఆశ్రయించు మనో–బుద్ధి చిత్త– అహంకారాది విభజన మొదలైనవి) వరకు **జీవ విభ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి.**

ఓ నిదాఘా! ముముక్షువు అయినవాడు జీవ – ఈశ్వర వాదములలో బుద్ధిని పరిమితము చేయరాదు. ఎందుకంటే – రెండూ మాయలోనివే! రెండూ భ్రాంతి వెంటనంటియే ఉంటున్నాయి. ఈక్షణాముతో ప్రారంభమై, ప్రవేశాలతో సృష్టి, జాగ్రత్–ఆది–విమోక్షాలతో సహా – జీవానుభవము సమస్తము **కల్పితమేవ। మాయయేవ। అనగా, బంధ–మోక్షములు కూడా మాయా కల్పితమే।**

## బ్రహ్మతత్త్వము

(1) జాగ్రత్ - స్వప్న - సుషుప్తులతో కూడిన ఒక దేహమునకు సంబంధించిన **'నేనైన నేను'**

(2) దేహ-దేహాంతరములకు సంబంధించిన **"నేనైన నేను".**

అనే ఉభయ జీవ -ఈశ్వరతత్త్వములకు అవల 'బ్రహ్మతత్త్వము" **ప్రకాశమానమై ఉన్నది.**

ఎల్లప్పుడూ కూడా జీవ-ఈశ్వర ద్వంద్వములను బుద్ధితో అధిగమించి **'బ్రహ్మతత్త్వము'** గురించి సద్బుద్ధితో విచారణ చేయటమే ఉచితము. సమస్త ఉపాధులకు, సమస్త దృశ్యములకు ఆవల స్వస్వరూపమై వేంచేసి ఉన్నదే ఆత్మతత్త్వము.

(లోకాయతనము మొదలైన) ఆయా మతవాదములన్నీ జీవ - ఈశ్వర విశేషములనే అధికంగా ప్రసంగము చేస్తున్నాయి. ఆ ఉభయములు ఆత్మయందే సశాంతిస్తున్నాయి. **'ఆత్మతత్త్వమే' - అసలైన ఆశయము, లక్ష్యము అగును గాక! అదే మహదాశయము!**

చిత్ తత్త్వ - అన్వయముచే (ఇదంతా ఎరుక యొక్క విస్తారరూపమే అను అన్వయముచే) ఈ సమస్తము **'చిదాత్మ స్వరూపము'**గా (లేక) **మమాత్మానంద స్వరూపము** గా → తెలియబడగలదు.

→ ఆతడే **సాక్షాత్ విజ్ఞాని.**

→ ఆతడే **శివుడు, హరి.**

**కనుక "ఈ దృశ్యము, అట్టి దృశ్యములో అగుపిస్తున్న త్వమ్ -తత్‌లు, వాటిని దర్శిస్తున్న ద్రష్ట, ఆ ద్రష్టను మౌనముగా చూస్తూ ఉన్న దృక్ రూపము - ఇవన్నీ మమాత్మానంద ప్రదర్శనములే'** - అను అభ్యాసమునకు ఈ జీవుడు ఉపక్రమించాలి.

## సద్గురువు యొక్క ఆవస్యకత

**ఋభు మహర్షి:** నాయనా! విషయములను త్యజించాలి. అనగా? = ఆత్మకు అన్యముగా కనిపించటమే "విషయ ఆశ్రయము". అనన్యముగా అనిపించటము - "విషయ త్యాజ్యము"

(1) **"నీవు"గా కనిపిస్తూ ఉన్నదంతా పరమాత్మకు అన్యము కాదు. ఈ సమస్త జగత్తు పరమాత్మ యొక్క సాక్షాత్ స్వరూపమే -** - అను తత్త్వ దర్శనము సిద్ధించుకోవాలి.

(2) అప్పుడిక "ఆ పరమాత్మను నేనే", **ఆత్మమేవాఽహమ్"** - అను సహజావస్థ సిద్ధించగలదు.

ఇది జీవితము యొక్క **మహదాశయము, సహజాశయము.**

ఇక తక్కిన ఆశయములంటావా? అవన్నీ సందర్భమాత్ర ఆశయములుగా ఉద్దేశ్యించబడుగాక। గమనించబడుగాక।

**అందుకొరకై తత్త్వజ్ఞుడు, తత్త్వదర్శి అగు గురువును ఆశ్రయించాలి.**

## త్యాజ్యము - జ్ఞానము - అనుభవము

**నిదాఘుడు :** తండ్రీ! సద్గురుదేవా! మీరు మహత్తరముగా సూచిస్తూ ఉన్న (1) **విషయ త్యాజ్యము** (2) **తత్ - త్వమ్ జ్ఞానము (3) సోఽహమ్ అనుభవము** కష్టతరమైనవే. ఎందుకంటే, ఇతఃపూర్వమునకు సంబంధించిన వ్యతిరిక్తాభ్యాసముల ప్రభావము చేత మనస్సును నియమించటమనేది కష్టతరమే కదా!

**ఋభుమహర్షి :** అవును. కష్టతరమే. అయితే ఈ మూడు కూడా సాధనచే సుసాధ్యమే. అట్టి సాధనకు తత్త్వజ్ఞుడగు గురువు యొక్క సాన్నిధ్యము, బోధ యొక్క శ్రవణము, యోగాభ్యాసము, ధ్యానము యొక్క నియమనిష్ఠలు - అత్యావస్యకం.

**శ్లో॥ దుర్లభో విషయత్యాగో, దుష్లభమ్ తత్త్వ దర్శనమ్,**
**దుర్లభా సహజావస్థా, సద్గురోః కరుణాం వినా॥**

అందుచేత తత్త్వదర్శి అగు సద్గురువును ప్రశ్నిస్తే ఆయన నీ సహజ స్వరూపము ఎట్టిదో ఎంతటిదో చెప్పుతారు. సమస్తమైన 'అన్యము' కూడా అంతర్గతమై, నీ యొక్క **అనన్యత్వము** నందు అప్రతిహతంగా ఏవిధంగా అంతర్విభూతిగా ఏకమే అయి ఉన్నదో - నీకు విశదపరుస్తారు. అప్పుడు నీవు గురువు ప్రసాదించిన విచక్షణా జ్ఞాన - పరిశీలన - విజ్ఞానపూర్వక అభ్యాసములచే జీవాత్మత్వముతో సహా నీ యొక్క సమస్త సందర్భమాత్ర పురుషకారములను దాటి వేయుచు, పరమ పురుషార్ధమగు **'సహజావస్థ'**లో ప్రవేశితుడవు కాగలవు. అవ్యాజము, పరము అగు ఆత్మానందమునందు ఈ సమస్త జగత్తును దర్శించగలవు. **ఆత్మానంద సాగరంలో జనించిన ఒక తరంగము వంటిదే ఈ నీ "సమస్త జగత్ దర్శనము" అవగలదు. (అయిఉన్నది).**

# సహజావస్థ

**"ఇక్కడి దృశ్యమానమగుచున్న సమస్తము మమాత్మానంద స్వరూపమే" – అనునదే సహజావస్థ.**

సర్వకర్మఫలములను త్యజించు అభ్యాసముచేతను, ఈశ్వరానుగ్రహముచేతను, సర్వసంశయముల నివృత్తిచేతను – అట్టి యోగికి (యోగాభ్యాసి/యోగసిద్ధునికి) **"సహజావస్థ"** స్వయముగా సిద్ధించగలదు.

⌘ సమస్త భూతజాలమును తన యొక్క ఆత్మయందును,

⌘ తన ఆత్మనే సమస్త భూతజాలమునందును, – స్వాభావికంగా (అకృత్రిమంగా), అనుక్షణికంగా, అన్యమైన ఎద్దానికీ సంబంధము (Conditioning) లేకుండా – **దర్శించగలగటమే 'సహజావస్థ'.**

సర్వే సర్వత్రా సమముగా తిష్ఠించియున్న అఖండమగు ఆత్మయొక్క **అనుష్ఠానమే సహజావస్థ.**

**భేదదర్శనమే బంధము. సమదర్శనమే మోక్షము.**

**శ్లో॥ యదా హి ఏవైష ఏతస్మిన్ అల్పమపి అన్తరం నరః**
**విజానాతి, తదా తస్య భయం స్యాత్। న అత్ర సంశయః॥**

ఓ నిదాఘా! ఎంతెంత వరకు ఎక్కడెక్కడ ఆత్మకు వేరైన దర్శనము (లేక) ఆత్మకు వేరైనదిగా కొంచమైనా ఎరుగబడటము జరుగుతూ ఉంటుందో, అప్పుడిక ఈ జీవునికి 'భయము' తొలగదు. తొలగదు. ఇందులో సందేహమే లేదు. అందుచేత "భేద దర్శనము"ను నీవు జయించు "సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్" – రూపమగు అభేదదర్శనమును అభ్యాసముచే సిద్ధించుకో.

# జ్ఞాన చక్షువులు

సూర్యుడు ప్రకాశిస్తూ అంతటా వెలుగు నింపుతూ ఉన్నప్పటికీ గ్రుడ్డివాడు ఆ వెలుగుగాని, ఆ వెలుగులో వస్తువులను – వాటి ఆకారములను గాని చూడలేడు కదా! అట్లాగే జ్ఞాన చక్షువులు (Common sense Eye- achieved through Gnana) కలవాడే సర్వవ్యాపకము, సత్–చిత్–ఆనంద స్వరూపము అగు స్వస్వరూపాత్మను సర్వత్రా సర్వదా దర్శించగలడు. అజ్ఞాన చక్షువులకు అది సందర్శనము కాదు. జ్ఞాన చక్షువులకు అది **ఇక్కడే తప్పక కనిపిస్తూనే ఉంటుంది.**

# "ప్రజ్ఞానమేవ తత్ బ్రహ్మ"

ఏ 'తెలివి'చే ఈ దృశ్యము జీవునకు తెలియబడుచూ ఉన్నదో – అదియే 'ప్రజ్ఞ'. **ఆ ప్రజ్ఞయే బ్రహ్మము. "సత్ (ఉనికి)"** – అనబడునది బ్రహ్మము యొక్క స్వభావము. అనగా **"సత్–చిత్"** – ఈ రెండూ బ్రహ్మము యొక్క స్వాభావిక లక్షణములు. అట్టి ప్రజ్ఞానము యొక్క స్వరూప లక్షణమే – (1) తెలుసుకొనువాడు (సత్) (2) తెలుసుకోవటము (3) తెలియబడునది (The Knower, Knowing and All that being known) – కూడా అయి ప్రదర్శనమౌతోంది.

ఈ విధంగా త్రిలక్షణయుతమగు "ప్రజ్ఞానము" (The Absolute feature of 'knowing' in every Being)ను ఎవ్వడు 'బ్రహ్మము'గా ఎరుగుచున్నాడో, అట్టి "పరిజ్ఞానము"చేత (By virtue of its 'Knowledge') ఈ జీవుడు **'అమృతుడు'** అగుచున్నాడు. **అనగా 'సహజము, నిత్యము, సత్యము అగు ఆత్మస్వరూపుడనగు నాకు దేహమము యొక్క జనన– మరణ ధర్మములు కించిత్ కూడా లేవు. దేహముతో జనించను. దేహముతో మరణించను"** – అను ఇంగిత జ్ఞానముచే సునిశ్చితుడు, సునిశ్చలుడు అగుచున్నాడు.

అట్టి పరావర దృష్టియే **ఈ జీవునికి సర్వదా గుర్తుండవలసిన మహదాశయము. అదియే** సిద్ధి. **అదియే మోక్షము.** అదియే **"జన్మరాహిత్యము"**

**శ్లో॥ భిద్యతే హృదయ గ్రంథిః, ఛిద్యంతే సర్వ సంశయాః**
**క్షీయంతే చ అస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥**

– ఈ సమస్త జగత్తు పరబ్రహ్మము యొక్క యథాతథ సం ప్రదర్శనా స్వరూపమే. "నీవు – జగత్తు – ఆతడు నేను" ఇవన్నీ బ్రహ్మము యొక్క అమృతానంద రసస్వరూపమే! ఆత్మామృతముయొక్క మాధుర్య విశేషమే!

***"అస్మత్ ఆత్మయే అమృత స్వరూపమై ఈ సమస్తమును తన తేజస్సుగా ప్రదర్శించుచూ, ఈ సమస్తము అయిఉన్నది"***

అను పరాత్పర (లేక) పరావర దృష్టిని నీవు సిద్ధించుకొనెదవుగాక! అట్టి అఖండాత్మ దృష్టిచే హృదయ గ్రంథులు (ఈ దృశ్యము గురించి సృష్టించబడినది – అను **బ్రహ్మగ్రంథి,** పరిపోషించబడుచున్నది – అను **విష్ణుగ్రంథి;** లయించబడుచున్నది – అను **రుద్రగ్రంథి)** తెగిపోగలవు. జీవాత్మ – పరమాత్మ – దృశ్యముల పరస్పరత్వమునకు సంబంధించిన సర్వ సందేహములు సమసిపోతాయి. (All Doubts get smashed). సమస్త కర్మలు (నేను కర్తను. భోక్తను. నాకు సంచిత ఆగామి పారబ్ధ కర్మల వ్యవహారము ఉన్నది –

మొదలైనదంతా) – మొదలంట్లా క్షీణించగలదు. అందుచేత బిడ్డా! అనాత్మత్వమునకు సంబంధించిన సర్వభావములు, సర్వ సంకల్పములు ఇప్పుడే త్యజించి వేయి. ఈ జగత్తు, ఇద్దాని విషయ పరంపరల సందర్భములలో అంతరమున నిర్వికారుడవు (Unaffected and non -responsive) గా ఉండెదవుగాక. **ఏక నిష్ఠతయ అంతస్థః 'సంవిత్' – మాత్ర పరోభవ।** సర్వదా "సంవిన్మాత్రపరుడవు" (I am the absolute 'BEING' and 'KNOWING') – అయి ఉండుము.

→ మరుభూమి (ఎడారి)లో కనిపించే మృగతృష్ణ (లేక యండమావులలో కనిపించే జలము) వాస్తవానికి మరుభూమియే కదా!

→ అట్లాగే జాగ్రత్–స్వప్న–సుషుప్తులలో కనిపించేదంతా {'ఆత్మ' (అనే యడారి)లో కనిపించేదంతా} ఆత్మకు ఏ క్షణమందునూ ఏ మాత్రము భిన్నము కాదు.

**సమస్తము ఆత్మయే। "నేను, నీవు, నీది, నాది, అది, ఇది" – అంతా ఆత్మస్వరూపమే। ఇక్కడ ఉన్న సత్యము ఇది।**

## సాక్షాత్ శివత్వమ్

ఎవ్వడైతే లక్ష్యము – అలక్ష్యము (My aim - not my Aim) – ఈరెండిటినీ ప్రక్కకుపెట్టివేసి, "కేవలమగు ఆత్మ"యందే సుతిష్ఠితుడు అయి ఉంటాడో, అట్టి ఉత్తముడగు బ్రహ్మవేత్త – ఇక 'జీవుడు' అని అనిపించుకోడు. **సాక్షాత్ శివుడే అగుచున్నాడు.** "శివోఽహమ్" "శివతత్త్వజ్ఞానమ్" మొదలైన మాటలు మహదర్థము సిద్ధించినది అగుచున్నది. **శివయేవ స్వయం సాక్షాత్ అయం బ్రహ్మవిత్ ఉత్తమః॥** ఆతడు ఉత్తముడగు 'బ్రహ్మవేత్త' అగుచున్నాడు.

## అధిష్ఠానమ్ పరంబ్రహ్మ

**బ్రహ్మము ఎట్టిదో – విను.**

→ బంగారు ఆభరణములన్నిటికీ బంగారమే అధిష్ఠానమై ఉంటున్న తీరుగా,... ఇక్కడి ద్రష్ట–దర్శన–దృశ్యములు, అంతరంగ–బహిరంగములు మొదలైన సమస్తమునకు బ్రహ్మమే అధిష్ఠానమైయున్నది.

→ బ్రహ్మమును ఉపమానముల సహాయముతో నిరూపించి చెప్పగలిగేది కాదు. **అనౌపమ్యమ్।**

→ వాక్కుకు మనస్సుకు కూడా విషయము కాదు. **అవాక్ మానస గోచరమ్।**

→ నిత్యమైనది. సర్వగతమైనది. విభువు. సుసూక్ష్మము. అవ్యయము. (Always present, Alpervading. Every thing is its Vitality only. Subtle, Changeless).

## సంసారము శాంతించేది ఎట్లా?

**సర్వశక్తిమంతుడగు ఆ మహేశ్వరుని విలాసమే ఈ మనోజగత్.**

"ఆత్మకు అన్యము" అను దృష్టియే సంసారము. అట్టి సంసారము యొక్క సంయమము (Control of Indrias) చేతనే అట్టి సంయమి పట్ల సంసారము శమించగలదు. (లేక) శాంతించగలదు. **'సంసారము'** అనునది **'మనోవ్యాధి।** (లేక) **"మనోవ్యసనము"** – అనియే గమనిస్తూ ఉండు.

**నిదాఘుడు :** స్వామీ! అట్టి 'సంసారము' అనే **మనోవ్యాధి (లేక – మనోవ్యసనము)** తొలగేది ఎట్లా?

## మనోవ్యాధికి చికిత్స– ఉపాయము

**ఋభు మహర్షి :** అవును. 'సంసారము' అనే మనోవ్యాధి శమించటానికై ఈ జీవుడు 'చికిత్స'కు తప్పక ఉపక్రమించవలసిందే। అందుకు 'ఉపాయము' ఒకటి చెప్పుతాను. విను.

**యత్ యత్ స్వాభిమంతం వస్తు, తత్ తత్ – త్యజన్ మోక్షమ్ అశ్నుతే।** ఏఏ వస్తువులు నీకు "అనివార్యము, ఆవశ్యకము" – అని అనిపిస్తూ → ప్రియముగా, ఇష్టముగా అనిపిస్తూ ఉన్నదో – వాటిని మానసికంగా త్యజించివేసి ఉండుము. ఒకవేళ "అది ఎట్లా?" అంటావేమో. ఈ మాటవిను. **ఎవ్వడైతే తన యొక్క స్వాధీనములోనే ఉన్నట్టిది. తనకు అత్యంత శ్రేయస్సు కలిగించునది అగు "ఇష్టవస్తు పరిత్యాగము" – అను మానసిక ప్రయత్నము చేయడో, అట్టివాడు సర్వదా 'బద్ధుడు' అయియే ఉంటాడు. 'ఇష్ట వస్తు త్యాజ్యము" – అనే విషయంలో "అబ్బే! అది మాకెక్కడ కుదురుతుందండీ? మేము ఇష్ట వస్తువులను మానసికంగా విడువలేము।" అని అంటారా? అట్లా అయితే, ఆత్మజ్ఞుల దృష్టిలో అట్టివారు "పురుషాకారముగా ఉన్న కీటకముల వంటివారు. "ఇష్ట వస్తు త్యాజ్యము"** అనే ఉత్తమ ప్రయత్నమునకు సిద్ధపడనివారికి ధిక్కారమగు గాక!

అట్టి ఇష్ట వస్తు మనో పరిత్యాగము (Mentally leaving aside the attractions) - అనేది **ఎవరికి వారికే స్వకీయ పురుషకారముతో కూడిన ప్రయత్నము చేతనే సాధ్యము.** అట్టి స్వకీయ **'ఈప్సిత త్యాగము'**నకు సిద్ధపడనివానికి **"ఆత్మతత్త్వానుభూతి"** – అను శుభగతి

సుదూరము అగుచున్నది. ఓ నిదాఘా! నీకు సర్వత్రా సంప్రదర్శనమైయున్న ఆత్మయే సర్వదా ఇష్టవస్తువు - అగుగాక। ఇదియే - **"ఇష్ట వస్తుభ్రమ"** అనే జాడ్యమునకు ఏకైక ఉపాయము.

## అసంకల్పము

వస్తువుల గురించి, విషయముల గురించి, సందర్భముల గురించి, ప్రాపంచక సంబంధ - అనుబంధముల గురించి ఏ మాత్రము సంకల్పించక, సర్వదా **"మౌనము, అతీతము"** - వహించి ఉండటమే **"అసంకల్పము". "సంకల్పించకపోవటము"** అనే సునిశితమైన బుద్ధి రూపమగు శస్త్రము (లేక) చురకత్తితో 'చిత్తము' అనే అడ్డును (Hindrence) ఛేదించాలి. చిత్తము (Interestedness in worldly events)ను ఛేదించినప్పుడు మాత్రమే **"సమస్తము తానే అయి ఉన్నట్టిది, సర్వదా విస్తరించి - సర్వగతము అయిఉన్నట్టిది, పరమ శాంతము అయినట్టిది** - అగు **"కేవలాత్మ"** అనుభవమునకు రాగలదు.

మరల చెప్పుచున్నాను.

→ లోకమునకు సంబంధించిన విషయ భావనలను విడచి ఉండుము.

→ మనస్సును నిగ్రహిస్తూ, అదే మనస్సుతో బ్రహ్మభావమును ఆశ్రయించి ఉండుము.

→ శాంత మనస్కుడవై బ్రహ్మభావనతో మనస్సును మ్రింగివేసి, **'మనోనిగ్రహము'** అనే అభ్యాసముచే **"ఆత్మత్వము"** అనే అమనస్కమును ఆశ్రయించెదవుగాక।

**శ్లో॥ భవ భావనయా ముక్తో యుక్తః పరమయా ధియా,**
**ధారయ ఆత్మానం అవ్యగ్రో గ్రస్త చిత్తం "చితః పదమ్॥**

తరంగము సముద్ర జలములో లయించినప్పుడు - ఆపై సముద్ర జలమే శేషించు విధంగా, భావనాతరంగరూపములగు మనస్సు **ఆత్మయందు** లయించినప్పుడు శేషించునదే **బ్రహ్మము. మనస్సును ఆత్మయొక్క తేజోవిభవముగా గమనించుఉండటమే మనోలయము.**

**"భవభావన"**ను (ఈ జగత్తు నిజముగా ఉన్నది - అను భావనను) ఎవ్వడైతే - యుక్తుడై ఉత్తమమైన బుద్ధితో విడచి, అద్దాని నుండి ముక్తుడు అవుతాడో, - ఉద్వేగము లేకుండా చిత్తమును (అభిరుచి రూపములగు విషయములను ఆశ్రయించి స్వభావమును) విడచి ఉంటాడో,... అట్టివాడు **చిత్తమును "చిత్"**తో మ్రింగివేసి **"చిత్‌పదము"**ను ధరించుచున్నాడు. మంచుగడ్డ వెచ్చటి నీళ్ళలో కరిగినట్లు చిత్తము 'చిత్'లో లయము అగుచున్నది.

ఓ నిదాఘా! పురుషకారమును (భక్తి-జ్ఞాన- యోగ-సర్వసమర్పణా భావనలను) సమాశ్రయించుము. ప్రయత్నశీలత్వమును, ఆశ్రయించి **చిత్తమును 'అచిత్తము'గా చేసివేయుము.** విష్ణు భగవానుడు చక్రమును ధరించువిధంగా నీవు హృదయము నందు చిత్తమును స్మరించుచూ, అట్టి చిత్తమును చిత్‌ధారణాచక్రముచే ఖండించివేయుము. అప్పుడు మనస్సు అనే మన్మథుడు నిన్ను 'కామము' అనే బాణములచే - ఏమాత్రము కూడా బంధించలేడు. **'మనోబంధము' అనే శంకయే తొలగిపోగలదు.**

**"మనస్సు" అంటే ఏమిటి?**

**"అయం, సోఽహం, ఇదం తత్, మే" ఏతావత్‌మాత్రకం మనః।** నాది - నేను - నేను ఇది - అది కాదు-ఈఈ రూపంగా ఆలోచనల ప్రవర్తనయే మనస్సు.

"నేను-నాది-మావారు-కానివారు" అను భావనలు త్యజించి ఉన్నామా, ఈ మాత్రపు **'అభావన'** చేతనే మనస్సు (ఆత్మయందు) విలీనము అయిపోగలదు. శరత్కాలంలో వాయువీచికలచే మబ్బులు తునాతునకలు అయి ఎటో వెళ్లిపోవురీతిగా **"సమస్తము ఆత్మ చమత్కారమే"** అనే భావనావీచికలచే **"నేను-నాది-అది-అట్టిది-ఇట్టిది"** మొదలైన రూపములుగా దట్టముగా ఆత్మభావనలను ఆవరించియున్న మనస్సు ఆత్మజ్ఞానముచే, ఆత్మతత్త్వ మనన-అనుభవ వీచికలచే చిన్నాభిన్నమైపోగలదు. ఇదియే **'మనస్సు'** యొక్క **అంతర్ధానము.**

సర్వము అఖండము-అప్రమేయము అగు ఆత్మగా అనిపించటమే **'అమనస్కము'.** అదే **'మనోజయము' 'మనోనిలయము'** కూడా.
**'తత్' భావన మాత్రేణ దాత్రేణేవ విలీయతే॥**

అంతేగాని, **"ఆలోచించకుండా కూర్చుని ఉండటము"**- మనోలయముయొక్క **'పరమార్థము'** కాదు.

## అసంకల్పము

ఈ విధంగా సమస్తము స్వయముగా **అఖండ - అప్రమేయ ఆత్మస్వరూపమై, కేవలాత్మ భావనా-లీలా మాత్రమై** ఎవరియొక్క అవగాహన - అనుభూతి సుస్థిరము, నిశ్చలము అవుతాయో,.. అట్టివాడు →

- ప్రళయకాల వాయువీచికలు వీచటము ప్రారంభమైనా,
- సప్త సముద్రజలములు ఏకమౌతున్నప్పటికీ (కలిసిపోతున్నప్పటికీ),

–   ద్వాదశ (12) అదిత్యులు తపించటం అన్ని వైపులా ప్రజ్వలనమగుచున్నప్పుడు – ప్రారంభమైనా కూడా..,

'ఆత్మభావన– అనుభూతి – ఆత్మమేవాఽహమ్–త్వమ్ ఆత్మ".. స్థానము నుండి 'చ్యుతి' పొందదు. అట్టి మహత్తర నిశ్చల బ్రాహ్మీస్థితి ఎట్లా సిద్ధిస్తుంది? **– కేవలము సంకల్పించకపోవటము (అసంకల్పన) మాత్రం చేత సిద్ధించగలదు.**

ఓ నిదాఘా! 'అసంకల్పన' (Non Assuming and Non - Prasuming) అనే మోక్ష సామ్రాజ్యమును స్వాధీనము చేసుకొని ఆత్మ స్వరూప చక్రవర్తివై సుఖాసీనుడవై ఉండెదవుగాక.

***అభవము ఉండజాలదు" – అను అంతర్ – దృష్టియే అసంకల్పము.***

***దేని గురించీ ఆలోచించకపోవటమో, దేనికీ సంకల్పించకపోవటమో–అసంకల్పము లేక అమనస్కము ఏ మాత్రముకానే కాదు. "నేను మనస్సును చలన రహితం చేస్తాను"*** అనేది కుదిరేపని కాదు. ఎందుకంటావా? అగ్ని నుండి ఉష్ణమును తీసి ప్రక్కన పెట్టటము జరిగే పనియేనా? లేదు. ఉష్ణము అగ్ని యొక్క ధర్మము. అట్లాగే మనస్సు ఎప్పుడూ కూడా తన ధర్మమగు 'చంచలత్వము'ను ఏక్షణమూ వదలి ఉండదు. అయితే **కదలుచున్న మనస్సుకు ఆధారము ఏది?** కదిలే చేతిని **– కదిలించేవాడు** 'నిశ్చలుడు' అయినట్లుగా, కదిలే మనస్సుకు చంచలత్వమును – 'చిదాత్మ' యొక్క స్పందన శక్తియే ప్రసాదిస్తోంది.

→   కేవలము, నిశ్చలము అగు 'చిచ్ఛక్తి' నుండి → **స్పందన శక్తి। (చిత్–శక్తి)**

→   చిత్ స్పందన శక్తి నుండి → **మనో చలన శక్తి।**

→   మనోచలన శక్తి నుండి → **ఈ జగదాడంబరము।**

కాబట్టి ఏ జగద్దృశ్యము అనుభవమౌతోందో అదంతా **"మనో చలనరూపము"** మాత్రమే. అయితే మనస్సే మనస్సును ధారణ చేస్తోంది.

మనస్సు (1) చంచలము (2) నిశ్చల విభాగము – అను రెండు విభాగములుగా ఉన్నది.

మనస్సు యొక్క చలనముచే ఏ జగత్తు అనుభవమగుచున్నదో **– అది ఆత్మస్వరూపమే.** కనుక ఓ నిదాఘా! మనస్సుకు ఈవల–ఆవల నిశ్చలమగు ఆత్మయే సర్వదా వేంచేసి ఉండగా **ఇక మనోచాంచల్యము గురించి దిగులు దేనికి?**

**చంచలమైన తరంగములో నిశ్చలమగు జలమే 'అధిష్ఠానము' అయి వేంచేసి ఉన్న తీరుగా, మనోచంచలమునకు ఆధారము నిశ్చలమగు ఆత్మయే. ఈ విధంగా, చంచలమనస్సు యొక్క ఆధారమైయున్న నిశ్చలమగు ఆత్మ యొక్క సందర్శనమే తపస్సు, ధ్యానము, యోగము, శాస్త్రజ్ఞానము, విచారణ మొదలైన <u>సర్వప్రయత్నముల అంతిమ లక్ష్యము.</u>** కదిలే సమస్తమునకు ఆధారమైయున్న కదలని ఆత్మయొక్క అనునిత్య సందర్శనమే యోగము, మోక్షము కూడా. **యోగి (లేక) జ్ఞాని – కదిలే శరీరములకు ఆధారమైయున్న కదిలించే శక్తిని, ఆశక్తిని ప్రదర్శిస్తున్న ఈశ్వరుని – అందరిలోనూ దర్శిస్తూ ఉంటాడు.**

## అవిద్య

మనస్సు యొక్క ఏ అభ్యాసముచే దృశ్య వస్తువులు "సత్యము–నిత్యము–ప్రియము" అని అనిపిస్తోందో, **అది వాసనల చేతనే ఏర్పడుతోంది.** వాసనలు (Tendencies) ఎట్లా రూపుదిద్దుకుంటున్నాయి? నిరంతరం "సత్యమే। నిత్యమే। ప్రియమే।" – అను రూపముగా నామ–రూపముల పట్ల మానసికమైన వ్యసనరూప అభ్యాసమే కారణం. **దృశ్య మననము అభ్యాసముగాను, అభ్యాసము సంస్కారముగాను,** సంస్కారము **వాసనలుగాను** అగుచున్నది.

ఓ అనఘా! నిదాఘా! ఇప్పుడు పురుష ప్రయత్నముచే అదే మనస్సు యొక్క అభ్యాసముచే నామ–రూపాత్మకమైన ప్రియ–అప్రియత్వముల నుండి అభ్యాసపూర్వకంగా మనస్సును వెనుకకు మరల్చి **"ఆత్మగా అగుపించటము. ఆత్మగా అనిపించటము।"** అనే మార్గములో నియమించు అనుకుంటూ ఉంటే, అనిపిస్తుంది. ఈ విధంగా **నిర్వికల్పుడవు, పరమ పురుషుడవు** అయ్యెదవు గాక! ఆత్మగా భావన చేయు అభ్యాసికి ప్రపంచము సర్వదా ఆత్మగానే శేషించగలదు. ఇక దృశ్యమో? బంగారమునకు ఆభరణత్వము వంటిది అగుచున్నది. **ఆత్మగా భావనయే తత్పదము అదియే బ్రాహ్మీస్థితి.**




పురుషకారమును ఆశ్రయించి, చిత్తము యొక్క (ఇష్టవిభాగము యొక్క) శుద్ధ విభాగమును "ఉపకరణము" (washing material)గా తీసుకొని, మలిన విభాగమును ఆక్రమించివేయుము. అప్పుడిక విశోకమగు (where there happens to be not even a blink of worry) అవలంబించి, **నిరాతంకము** (No distraction from Absolute Sense of Self) నందు సుస్థితుడవై ఉండుము.

## మనస్సును జయించగలిగేది మనస్సు మాత్రమే

**మన ఏవ సమర్థంహి మనసో దృఢ నిగ్రహే।** రాజును రాజే నిగ్రహించటానికి సమర్థుడు కదా! రాజు కానివాడు రాజును ఎట్లా నిగ్రహించగలుగుతాడు? అట్లాగే మనస్సును నిగ్రహించాలంటే మనస్సునే ఉపయోగించాలి. **అరాజాః కః సమర్థ స్యాత్ రాజ్ఞో నిగ్రహ కర్మణి?** మనస్సుకు వేరైన మరొక వస్తువుతో మనస్సును నిగ్రహించలేము.

*"సంసారము" అనే సముద్రంలో 'తృష్ణ' అనే పాశములతో 'గ్రహించటము" అని సుడులలో చిక్కుకొన్న ఈ జీవునికి"శుద్ధమనస్సు" అనునదే 'నావ' (Boat) అయి ఒడ్డుకు చేర్చగలదు. 'నిశ్చలమైన మనస్సు'తో చంచలమనోతరంగాలను ఎదుర్కొనాలి. **'గ్రహించటము'ను నిగ్రహించటమే ఉత్తమ ఉపాయము.***

మనస్సు యొక్క 'వివేకాభ్యాసము' అనే విభాగముతో బంధము కలుగజేస్తున్న మనోరజ్జువులను ఖండించి, సంసార సాగరము నుండి **నిన్ను నీవే రక్షించుకోవాలి. నిన్ను నీవే ఉద్ధరించుకోవాలి.** (ఉద్ధరేత్ ఆత్మని ఆత్మానమ్). **భ్రమమాత్రమే** అయి ఉన్న సంసార బంధముల నుండి నీ మనస్సు తప్పితే, మరింకెవరో వచ్చి నిన్ను రక్షించలేరు. ప్రాజ్ఞుడైనవాడు – ఏవేవి దృశ్యసంబంధమై **'ఇష్టము'** రూపంగా జనించుచూ, **'సంబంధము'** రూపముగా ప్రవృద్ధము అవుతోందో, అదంతా – మునుముందుగా గమనిస్తున్నాడు. **"అది అంతా అవిద్యయేకదా"** అని నిర్ణయించుకొంటున్నాడు. గమనించి, వాటిని తొలగించే పురుషకారమునకై→మనస్సునే ఉపకరణముగా చేసుకొనుచున్నాడు. 'త్వమ్'గా ప్రదర్శనమగుచున్న 'తత్' వైపుగా మాత్రమే దృష్టిని సారిస్తున్నాడు.

- **'భోగించాలి'** అనే వాసనలను ముందుగా **'త్యాజ్యము'** అనే మార్గములో జయిస్తున్నాడు.
- ఆ తరువాత భేదవాసనలను (అదివేరు– ఇది వేరు అనే భావావేశమును) క్రమంగా పురుషకారముచే (with regular and constant effort)చే త్యజిస్తున్నాడు.

  ఏ భావముతో తదితర భావములన్నిటినీ త్యజిస్తున్నాడో, – అట్టి భావాతీతభావనను కూడా వదలి, ప్రశాంతుడగుచున్నాడు.
- ఆ క్రమంగా భావ–అభావములను కూడా త్యజించివేస్తున్నాడు.

ఈ విధంగా నీవు 'త్యాజ్యము' అను మార్గములో అడుగులు వేస్తూ క్రమంగా "నిర్వికల్పుడవు" అయ్యెదవు గాక! **"నిర్వికల్ప సుఖి'**వి అగుము. **నిర్వికల్ప సుఖీభవ।**

- ఇదియే మనో నాశనము.
- ఇదియే అవిద్యానాశనము కూడా.

ఏదేది నీకు తెలియబడుచూ ఉన్నదో, ఆ సమస్తమును "ఆత్మభావన" అను భౌమావిద్యచే కడిగివేసుకొనుము. ఆక్రమించివేయి. **ఈ సమస్తము అగుచున్న ఆత్మవే నీవై ఉండుము.**

## దృశ్య విషయ త్యాజ్యము

సమస్త దృశ్య విషయములను హృదయాంతరంగములో (In the Zone of Inner recess of Heart) పరిత్యజించి ఉండటమే "నిర్వాణము". "దృశ్య విషయములను **"నిజమే। నిత్యమే। సత్యమే"** – అని నమ్మిక పరిగ్రహించి ఉండటమే – బంధ దుఃఖము. పరిత్యజించటమే 'మోక్షము'. ఆహా! ఎంతటి చమత్కారం। **అవిద్య అవిద్యమానైవ।** 'అవిద్య' అనునది స్వతఃగా లేదు. అయితే ఏం? స్వతఃగా లేనట్టి అవిద్య ప్రజ్ఞచే పరిశీలించనిచోట రూపుదిద్దుకొని ఉంటోంది. అవిద్యమానైవ **నష్ట ప్రజ్ఞేషు దృశ్యతే।**

**సమ్యక్ ప్రజ్ఞ :** సర్వత్రా సమరూపమైయున్న బ్రహ్మమును దర్శించు ప్రజ్ఞ (Intelectual level by virtue of which all -equal absolute Self is being enjoyed). ఎవ్వరైతే అట్టి **'సమ్యక్ ప్రజ్ఞ'**ను సిద్ధించుకుంటారో, అట్టి వారికి **"అవిద్యాః నామ్నైవ అంగీకృతాకారా। అవిద్య నామకః!** ఉన్నట్లు (పేరుకు ఉన్నట్లు) చెప్పబడుతోందేగాని, **"అసలు అవిద్య ఉన్నదెక్కడ?"** – అని నిస్సంశయముగా అనిపిస్తోంది.

అజ్ఞానిని అవిద్య ఈడ్చుకుంటూ వెళ్లి అనేక దుఃఖ సంకటములలో పడవేస్తోంది. ఆందోళనలను కొనసాగింపజేస్తోంది. **'సమ్యక్ప్రజ్ఞ'** కలవారికో? అద్దాని ఉనికియే కనిపించటము లేదు. **"భేదరూపముగా చెప్పబడే అవిద్య ఎక్కడున్నదయ్యా?"** – అని వారు అజ్ఞానిని నిలబెట్టి ప్రశ్నిస్తున్నారు. "సమస్తము అఖండమగు ఆత్మయే కదా!" – అని గుర్తెరుగుచున్నారు. గుర్తు చేస్తున్నారు.

## అవిద్య ఎప్పటివరకు కొనసాగుతుంది?

ఎప్పటివరకైతే – **"నేను ఈ దృశ్యబంధనము నుండి విడివడి, సత్యము – నిత్యము అగు స్వరూపానందమును సిద్ధించుకోవాలి"** – అనే ఆత్మావలోకనమునకై ఇచ్ఛ పొందడో, అంతవరకు అవిద్య కొనసాగుతూనే ఉంటూ, క్రొత్త – క్రొత్త చిలువలు –పలవలుగా హృదయములో ఉత్పత్తి అయి విస్తరిస్తూనే ఉంటుంది.

**స్వయమాత్మావలోకేచ్ఛా మోహ సంక్షయకారిణీ।** స్వయముగా **"ఆత్మావలోకనము"** యొక్క ఇచ్ఛ వలన, **'సమస్తము'** అయి ఉన్న "స్వస్వరూపము" గురించిన **సామీప్యత సిద్ధించుచుండగా** మోహము తొలగిపోగలదు. **మోహము తొలగటమే "మోక్షము" యొక్క స్వరూపము. భ్రమ తొలగితే బ్రహ్మమే ఇదంతా।**

**"పరతత్త్వ దర్శనము స్వాత్మనాశనము"** అని కూడా చెప్పబడుచున్నది. ఎందుకంటే పరబ్రహ్మదృష్టి ఘనీభూతమగు చుండగా, .. **'వ్యష్టిత్వము' యొక్క పరిమితము పటాపంచలమవటము చేత.** సర్వగతమైన **'బోధ దృష్టి'**చే వ్యక్తిగత పరిమితమంతా తనకు తానే సర్వాత్మకము నందు స్వాభావికముగా విలీనము అగుచున్నది.

**ఇచ్ఛామాత్రం అవిద్యేయమ్।** అనుక్షణికము మార్పుచెందే స్వభావము గల దృశ్యము పట్ల – "ఇచ్ఛ"యే అవిద్య.

**తన్నాశో 'మోక్ష' ఉచ్యతే।** జగత్ వ్యవహారముల పట్ల అంతరంగము నందు "ఇచ్ఛ (Interestedness & Expectations)" లేకుండటమే **'మోక్షము'** అని చెప్పబడుతోంది.

ఓ మునీశ్వరా! అట్టి **"ఇచ్ఛారాహిత్యము, ముక్తి, మోక్షము"** అనునవి – సంకల్పములు క్షయించుట చేతనే, (సంకల్ప రాహిత్యము చేతనే, అసంకల్పము చేతనే) **– సిద్ధించగలవు.**

## చిత్తాకాశములో చిత్ సూర్యోదయము

చిత్తాకాశములో ఇంద్రియ విషయముల పట్ల **"దట్టముగా ఏర్పడిన వాసనలు"** – అనే చీకటి తొలగగా, అప్పుడిక **చిత్ సూర్యోదయము** అగుచున్నది. సూర్యుడు ఉదయించుచుండగా ఆకాశంలో చంద్రుడు వెలవెల పోవుచున్నట్లు, హృదయాకాశంలో జ్ఞానసూర్యుడు ఉదయిస్తూ ఉండగా, విషయ పరంపరలలో వ్రాలే మనస్సు వెలవెలపోగలదు. చిత్తములో **'భేదభావములు'** అనే మేఘములు తొలగితే ఆత్మసూర్యుని ప్రకాశము సర్వత్రా వెలయగలదు.

చైతన్యము (ఇంద్రియములకు తెలియబడుచున్నది; that being known) అనే మంచుపాతము లేనట్టిది, సర్వత్రా సమస్వరూపమై సర్వత్రా వెలయుచున్నట్టిది, వాక్కుచే వ్యాఖ్యానింపలేనట్టిది అగు **చిత్–తత్త్వమే – 'ఆత్మ'** అని, **'పరమేశ్వరుడు'** అని అభివర్ణించబడుచూ, స్తుతించబడుతోంది. అనగా, ఈ చిత్తము సమస్త ఇంద్రియ విషయములను దాటివేసినప్పుడు (లేక, త్యజించి ఉన్నప్పుడు) – అప్పటికీ శేషించే చిత్తమే – **'చిత్'** లేక **'ఆత్మ'।**

**సర్వం చ ఖలు ఇదం బ్రహ్మ, నిత్య చిద్ఘనమ్, అక్షతమ్।** ఇదంతా నిత్యచిద్ఘనము, అక్షయము అగు బ్రహ్మమే అయి ఉన్నది. సమస్తము బ్రహ్మమే అయి ఉండగా, ఇక 'మనస్సు' అనబడు వేరొక వస్తువు ఎక్కడి నుండి వస్తుంది? మనస్సు అనబడేది నామకః కల్పన మాత్రమే. వ్యావహారిక నామమే గాని, 'మనస్సు' అనబడే ఒక వస్తువే లేదు.

## న జాయతే మ్రియతే కించిత్ అత్ర జగత్రయే।

ఈ మూడు లోకములలో ఏదీ జనించటమూ లేదు. గతించుట/నశించటమూ లేదు. **"భావ వికారము–జగత్ కల్పన"** అనునవి కూడా వాస్తవమైన ఉనికి కలిగి లేదు. ఇక్కడ సర్వదా చిదాభాసముగా (In the form of reflaction as dual) ఉన్నది కూడా– కేవలము, సర్వ సామాన్యము, అక్షయము, చైత్యరహితము (తెలియబడునది – అనే అన్యమైనది లేనట్టిది) – అగు కేవల చిన్మాత్రయే (The Abslolute Form of knowing sans that being known) .

**మనోవిహారము :** అటువంటి నిత్యము, శుద్ధము, చిన్మాత్రము, ఉపద్రవరహితము, పరమశాంతము నిర్వికారము అగు 'చిన్మాత్రము" నందు – ఊహ, భావన, అనుభూతి వంటి స్వరూపము గల **'మనస్సు'** అనబడునది విహారము చేస్తోంది. అటువంటి మనస్సు తనకు ఏమి ఇష్టమైతే అది కల్పించుకొని 10 దిక్కులకు పరుగులు తీస్తోంది. ఆయాసము పొందుతోందేగాని విరామము పొందటం లేదు.

**మనస్సు అనగా → మననము చేయుచుండు అభ్యాస పరంపరా చమత్కారమే।** అంతకుమించి మనస్సుకు వేరే రూపము లేదు. వస్తువు కాదు. త్రాడు – వంటి వస్తువే కానప్పుడు – **అది చైతన్యరూపుడగు జీవుని బంధించడమేమిటి? ఆలోచనలు – ఆ ఆలోచించువానిని బంధించటమేమిటి?**

- మనస్సు **సంకల్పము** చేతనే సిద్ధిస్తోంది.
- అందుచేత **అసంకల్పము** చేతనే లయించగలదు. అందుచేత – **'సంకల్పించకపోవటము'**ను ఆశ్రయించు.

**అతః సంకల్ప సిద్ధేయం సంకల్పేనైవ నశ్యతి।। 'అన్యము' రూపముతో ఏర్పడుచున్న, సంకతల్పముల బంధము. "ఆత్మకు ఈ సమస్తము అనన్యము" అను మహత్ సంకల్పముచే బంధము త్రెంచివేయబడగలదు.**

# బంధము - బంధవిముక్తి

**'నాహమ్ బ్రహ్మ' ఇతి సంకల్పాత్ సుదృఢాత్ బధ్యతే మనః।** "నేను బ్రహ్మమును - కాను. జీవుడను. ఈ దేహమునకు సంబంధించినవాడను. దేహముతో కృశించుధర్మము కలవాడను. అనేక దుఃఖములచే బద్ధుడను. ఈ కాళ్ళు - చేతులు మొదలైనవి నా స్వరూప- స్వభావములు." - ఇటువంటి అభిమాన భావములను ఆశ్రయించు అభ్యాసము చేత ఈ జీవుడు దృశ్య వ్యవహార బద్ధుడు అయి ఉండటం జరుగుతోంది.

**విముక్తుడు: "సమస్తము సర్వదా బ్రహ్మము"** అను భావన అభ్యాసవశంగా సుదృఢమగుచూ ఉండగా, ఈ జీవుడు ముక్తుడు కాగలడు.

**"నేను దుఃఖినికాదు.** నేను **"దేహి"** (One who uses (or) operator the body)ను. అంతేగాని **దేహమును కాను. ఇంద్రియములు కాదు. అవి నాకు బంధము కాదు.** సర్వదా ఆత్మస్వరూపుడను. ఆత్మకు దేహము, ఇంద్రియములు ఉపకరణములు మాత్రమే. ఆత్మకు బంధము ఎట్లా ఉండగలదు? ఉండదు. ఆత్మగా నాకు-దేహము, ఆలోచన, భావన, ఇష్టాఇష్టములు-మొ॥వి ఉపకరణములు మాత్రమే.

- అటువంటి ఆత్మ భావన యొక్క **సుదీర్ఘ-అనునిత్య-సర్వ సందర్భ** అభ్యాసములచే, సమస్త లోక వ్యవహారములచే **"స్పృశించబడనివాడై", విముచ్యుడు** (Al-relieved) అగుచున్నాడు. అప్రమేయుడు, అపరిమితుడుగా స్వస్వరూప సందర్శనము సిద్ధించుకుంటున్నాడు.

- "నేను ఈ మాంస- రక్త-బొమికల వంటి దేహ పదార్థములు ఎట్లా అవుతాను? ఈ దేహమునకు వేరైన 'దేహి'గా పరస్వరూపుడను"

**ఇట్టి నిశ్చయము దృఢమగుచుండగా, ఈ జీవుడు అవిద్య నుండి విముక్తుడు కాగలడు.**

కల్పిత మాత్రమగు అనాత్మయందు ("నేను" దృశ్యములోని వాడను -అను రూపముగల) ఆత్మయొక్క భావన చేతనే **'అవిద్య'** - రూపము పొందుతోంది. అందుచేత ఓ నిదాఘా! తీవ్రమైన "పురుషకారము"ను ఆశ్రయించి సునిశితము - విస్తారము అగు బుద్ధి బలముతో **"ఈ దృశ్యములో ఇంకా ఏదో పొందాలి. లేకపోతే నా పట్ల ఇంకా లోపము ఉన్నట్లే"** - అను భోగేచ్ఛను సుదూరంగా త్రోసివేసి సుఖవంతుడవగుము.

ఆహాఁ! ఈ జగత్తు నిండా ఎన్నో భ్రమలు. అవి ఈ జీవుని యొక్క **'అవగాహన'**ను స్వకల్పితంగా చుట్టుముట్టినవై ఉంటున్నాయి. నేను - నావాళ్లు - నాది - నీది మొ॥వి ఇంద్రజాలములోని కల్పితవస్తువులై ప్రవర్తమానమగుచున్నాయి.

ఓ ఇంద్రజాలికుడు 'ఛూఛూ' వంటి శబ్దములు చేస్తూ ప్రేక్షకుల కళ్ళను, దృష్టిని భ్రమింపజేస్తూ, **'లేనివి'** కల్పించి, **'ఉన్నట్లే'** అనుభూతిని కలుగజేస్తూ ప్రేక్షకులను ఆశ్చర్యపరచి తికమక చేస్తూ ఉంటాడు. "ఆహాఁ! ఓహో! అయ్యో! ఏమి ఏమి ఏమి?.. అనే అనేక భావ - ఉద్వేగాలు జనింపజేస్తూ ఉంటాడు. "ఇంద్రజాలికుడు రంగముపై (on the Stage) దృష్టిని, మనస్సును మరల్చి ఎక్కడి నుండో ఏదో వస్తున్నట్లు, ఎక్కడికో ఏదో పోతున్నట్లు, ఒక వస్తువు మరొకటి అగుచున్నట్లు, అరచేతిలో చిలక పుట్టుకొస్తున్నట్లు, ఖాళీగా ఉండే 'తలపాగా' (శిరస్త్రాణము)లో నుండి పేకమేడలు పుట్టుకొస్తున్నట్లు చూపిస్తాడు. ఆ ఇంద్రజాలప్రదర్శనము చూస్తూ ఉన్నప్పుడు జనులు చప్పట్లు కొట్టి కేరింతలు పెట్టవచ్చుగాక! ఇంద్రజాల ప్రదర్శన అయిన తరువాత అది **'నిజము'** అని అనుకుంటామా? ఆ ఇంద్రజాలకుడిని మన ఇంటికి పిలచి, మన ఇంటిలోని ఒక పాత్ర ఇచ్చి **"అయ్యా! మాకు చిలకలంటే ఇష్టము. ఇందులోంచి రెండు చిలకలు పుట్టించి ఇవ్వండి"**.. అని అడిగితే? ఆయన పకపకా నవ్వడా?

**శ్లో॥ మమ పుత్రో। మమ ధనమ్। అహం సోఽయమ్। ఇదం మమ! - ఇతీయమ్ ఇంద్రజాలేన వాసనైవ వివల్గతి॥**

".... అయ్యా! ఇది మా ఇల్లు, వాకిలి, పొలము, పుత్ర! అదంతా ఆభరణములు, ఖరీదైన వస్త్రములు మొదలైన సంపద! ఇది మా ధనము! నేను అది (పదవులు, జాతులు మొదలైనవి)। వీరు నా భార్య। వారు నా కొడుకులు, కూతుళ్ళు, మనుమలు । ఇదిగో ఇంతవరకు మనది! అది మనం సంపాదించి తీరాలి! అది మనది కాదు!"

... ఇటువంటి జగత్తు అనే రంగములో కనిపించే ఇంద్రజాలములోని సంగతి - సందర్భము - సంఘటనలను చూస్తూ జీవులు తెలిసితెలిసి భ్రమలు చెందుచున్నారు. కారణం? అపరిశీలనాత్మకంగా అనేక విషయములు పట్ల-వ్యసనపూర్వకంగా - నిర్వర్తిస్తూ ఉన్న మనస్సు యొక్క సుదీర్ఘ అభ్యాసములు కారణంగా ఏర్పడిన దట్టమైన **"వాసనలు"** చేతనే.

ఓ నిదాఘా! **మా భవ అజ్ఞో। భవ జ్ఞః త్వమ్!** ఆత్మకు 'అన్యము' వలె అనిపిస్తూ ఉన్న ఇంద్రియ ప్రపంచమంతా ఇంద్రజాలము వంటిది. ఇది చూచి నీవు అజ్ఞుడవై **"నిజమే! ఉన్నదే!"** అను అజ్ఞాన దృష్టి (లేక), సాంసారిక దృష్టికి పరిమితుడవై ఉండకూడదు సుమా! భవ (ఉన్నది) బంధము పొందవద్దు. ఆత్మదృష్టిని సునిశిత పరచుకొని జ్ఞానివై ఉండాలయ్యా। **'జ్ఞానబలము'**తో సంసారభావములను మొదలంట్లా జయించివేయి. **జహి సంసార భావనామ్।**

**అనాత్మని ఆత్మభావేన కిమ్ 'అజ్ఞ' ఇవ రోదిషి?** మొదటే సత్యము కానట్టి, సందర్భములచే కల్పించబడుచున్నట్టి 'అనాత్మ' అయిన విషయములను, భావములను గట్టిగా పట్టుకుని అజ్ఞునివలె ఎందుకు దుఃఖము పొందాలి చెప్పు? జడము (That which is merely Passive, but not Active by itself), మూగది (Dumb), రక్త-మాంసమయము, అశుచి అయినది అగు ఈ పాంచభౌతిక శరీరముల

గురించి సుఖ-దుఃఖ వ్యవహారములకు వశుడవై ఎందుకు 'తీవ్రాందోళన' చెందుచున్నావో నాకు చెప్పు! ఇటు **నాశనమే స్వభావముగా కలిగియున్న, స్వతఃగా సత్యమే కానట్టి - ఈ భౌతిక శరీరము** గురించి, అద్దానితో ఏర్పడే (జడమగు) **పరిమిత సంబంధ, అనుబంధ బాంధవ్యముల** గురించి ఎల్లప్పుడు ఈజనులు మననము చేస్తూ...,

***ఏది సత్యమో, నిత్యమో, నిర్మలమో, అప్రమేయమో...*** అటువంటి ఆత్మను ఏమరుస్తున్నారే! ఇంతకన్నా చిత్రమేముంటుంది? అందుచేత, ఓ నిదాఘా! లౌకిక వ్యవహారములు నీపై "రాగము" అనే బురదను చల్లకుండును గాక!

- నీవు (ఆత్మగా) పర్వతము వంటివాడివి. ఇక్కడి లౌకిక వ్యవహారములన్నీ తామరతూడులలోని సన్నటి ధారములు వంటివి. ఆహాఁ! ఆశ్చర్యం కాకపోతే, తామరతూడు దారములు మహాపర్వతమును బంధించటమేమిటి?

**అవిద్యమాన యా అవిద్యా తయా విశ్వం ఖిలీకృతమ్!** అవిచారణచే జనించుచున్న అవిద్యా తంతువులచే ఈ విశ్వమంతా ముక్కలుగా ఖండనము పొందుచున్నదే! గడ్డిపరకతో పోల్చతగినట్టి, అవిద్యమాత్రంగా ప్రదర్శనమగుచున్నట్టి ఈ మూడు లోకాలు **అవిద్యయే** అయి ఉండి కూడా,.... వజ్రతుల్యంగా, బయటపడటానికి అసాధ్యమైనవిగా కనిపిస్తున్నాయే! ఇంతకన్నా ఇంద్రజాలము, చమత్కారము, చిత్రము ఇంకేమి ఉంటుంది?

- ఇతి ఉపనిషత్-

# 5వ అధ్యాయము

# సప్త అజ్ఞాన భూమికలు - సప్త జ్ఞాన భూమికలు

**నిదాఘుడు :** మహాత్మా! ఇప్పుడు దయచేసి సప్త - సప్త (7-7) అజ్ఞాన-జ్ఞాన భూమికల గురించి దయచేసి వివరించ ప్రార్థన.

**ఋభుమహర్షి :** సరేఁ! 'అపర విద్య' అను సప్త-సప్త **"అజ్ఞాన, జ్ఞాన"** భూమికల గురించి యథాతథంగా చెప్పుకుందాము. అట్టి భూమికల నుండి ఒక పెద్ద మర్రి చెట్టు యొక్క శాఖ-ఉపశాఖలవలె అనేకమైన వేరువేరు ఉప-భూమికలు కూడా సంసార వృక్షమునకు విస్తరించినవై ఉంటున్నాయి.

⌘ స్వస్వరూప స్థితియే - **ముక్తి.**

⌘ స్వస్వరూపము నుండి భ్రంశము (చ్యుతి) పొందటమే - అహమ్- త్వమ్ భావనాపరంపరలు. అట్టి చ్యుతియే **బంధము.**

స్వస్వరూపము సర్వదా శుద్ధ - సత్‌మాత్రము. కేవలమగు 'ఉనికి'చే అలంకరించబడినట్టిది, సత్ -చిత్ (ఉనికి-ఎరుక)లతో సర్వదా సమన్వితమైయున్నది. అట్టి ఈ జీవుని "కేవలము (The Absolute)" అను స్వరూపము నుందు, వాస్తవానికి "దృశ్యము-దృశ్యము పట్ల రాగద్వేషములు".. మొదలైనవేవీ ఉనికిని కలిగి యుండజాలవు, సంభవించజాలవు కూడా!. 'అజ్ఞానము' అనబడు దానికి వాస్తవానికి చోటు లభించజాలదు. ఒక రచయిత తాను రచించిన పాత్రయొక్క స్వరూప స్వభావములచే నిబద్ధుడు కాడుకదా।

**స్వరూప భ్రంశము :** నిర్మలము, నిత్యము, సర్వాతీతము - అగు దృక్ (కేవల ద్రష్ట స్వరూపము)→ దృశ్య కల్పనయందు నిమగ్నము అగుచూ ఉండటమే **"స్వరూపము యొక్క భ్రంశము"** - అనబడుచున్నది. నిజానికి పరస్వరూపము పరమునందే ప్రకాశము అగుచూ ఉన్నది. అది దృశ్యములోకి దిగిరాదు. దృశ్యముచే బంధింపబడదు.'స్వప్నము తనదైనవాడు' స్వప్నములోని గృహము(House)లో బంధితుడౌతాడా?

> **"నిర్మలుడగు దృక్→ "దృశ్యము" నందు నిమజ్జనము అగుచూ, తన కేవల రూపము ఏమరచటము" - అనునదే 'అపరము' అని 'మోహము' అని కూడా పిలువబడుతోంది.**

అంతకుమించి వేరైన మోహము (మోహమును మరెక్కడి నుండియో వచ్చిపడటము) అనునదేదీ ఇతఃపూర్వకము లేదు. ఇక ముందు ఉండబోదు.

## స్వరూప స్థితి

**శ్లో॥ అర్థాత్ అర్థాన్తరమ్ చిత్తే యాతి మధ్యే తు యా స్థితిః**
**సా ధ్వస్త మనన ఆకారా "స్వరూప స్థితి" ఉచ్యతే॥**

ఈ చిత్తము ఒక 'యోచన' నుండి - 'మరొక యోచన'కు ప్రయాణిస్తూ ఉండగా - అట్టి అర్థ - అర్థాంతరముల (భావన-అభావములమధ్యగా) ఏ **"మనన రహిత స్థితి"**.. ఏర్పడినదై ఉన్నదో,.. అదియే **"స్వరూప స్థితి".** సర్వ సంకల్పములు శమింపజేయబడగా, ఏ 'శిల' వంటి అంతర హృదయమౌనస్థితి ఉన్నదో, ఏ స్థితి అయితే జాగ్రత్ -స్వప్న-సుషుప్తులచే కించిత్ కూడా పరిమితము కానిదై, వాటికి పట్టుబడనిదై ఉన్నదో- అదియే **పరా - స్వరూపస్థితి". అదియే మనందరియొక్క-'శాశ్వతము, వాస్తవము'-అగు ఆత్మస్వరూపము.**

'అహమ్' (నేను – నాది రూపమగు) వృత్తి నివృత్తి అయిపోవుచుండగా, భేదముల భావనలు నిష్పందము(Non provocative) అగుచుండగా – **"జడము కానట్టిది, నిత్య చేతనా కేవలరూపము"**, అయి ఏది సర్వదా శేషించినదై ఉన్నదో – అదియే **"స్వరూపస్థితి"**.

## సప్త అజ్ఞాన భూమికలు: సప్త మోహములు (లేక సప్త అవస్థలు)

మోహము యొక్క ఏడు (7) ప్రదర్శనములు ఈ విధంగా చెప్పబడుచున్నాయి.

(1) బీజ జాగ్రత్ – అవస్థ (2) జాగ్రత్ – అవస్థ (3) మహాజాగ్రత్ – అవస్థ (4) జాగ్రత్ స్వప్న – అవస్థ (5) స్వప్న – అవస్థ (6) స్వప్న జాగ్రత్ – అవస్థ (7) సుషుప్తి – అవస్థ.

ఈ '7' కూడా మరల అనేక పరస్పర సమ్మేళనములు జరుగుచూ, అనేక అసంఖ్యాక ఉపమోహరూపములుగా దృశ్యములో ప్రదర్శనమవటం జరుగుతోంది. వివిధ రూపములతో ప్రదర్శనము అవుతూ ఉన్నట్టి **మోహసప్తముల** గురించి చెప్పుకొందాము.

**(1) బీజ జాగ్రత్ :** మొట్టమొదట సృష్టి యొక్క అనుభూతి–భావన– అనుభవము పుట్టకముందే, ఏ కేవల **చైతన్యము**–చేతనము (కదలిక) జనించక ముందే ఉండి ఉన్నదో – అట్టి పరమశాంత, కేవల చైతన్యము **అనాఖ్యాతము** (మాటలలో 'ఇట్టిది' అని చెప్పజాలము). అట్టి చైతన్యమునందు – (కళాకారుడు కళను ఇంకా ప్రదర్శించనప్పటి కళారూపమువలె) – **జీవుడు మొదలైన నామరూపాత్మకమైనదంతా – అప్రదర్శన శీలమైయున్నది.** 'జాగ్రత్'లోని సమస్తము ఎద్దానియందు బీజరూపమై (బీజములో భవిష్యత్ మహావృక్ష వ్యవహారమంతా మౌనము దాల్చి ఉన్న రీతిగా) ఉన్నదో, **భవిష్యత్ ప్రదర్శనా చమత్కారము అప్రదర్శితంగా (బీజరూపంగా) ఉన్నదో..** అట్టి కేవలచైతన్యమును 'బీజ జాగ్రత్' అని అంటారు. ఇదియే జ్ఞప్తి, అహంకారము మొదలైన క్రొత్త విశేషములకు **జనన స్థానము.**

**2) జాగ్రత్:** అట్టి కేవలమగు **'బీజ జాగ్రత్'** నుండి అహం–మమ (నేను–నీవు–అతడు–నాది..మొదలైన) **వృత్తులు** (Avocations) బయల్వెడలుచున్నాయి. ఆ నూతన స్థితిని **'జాగ్రత్'** అంటారు. భావనలకు ముందే ఉన్న బీజ జాగ్రత్ చైతన్యము నుండి భావనల రూపమగు జాగ్రత్ ప్రజ్ఞ–అనుభవములు బయలుదేరి 'జాగ్రత్' రూపము ధరిస్తోంది. "అనుభవి–అనుభవింపబడు వస్తువు–అనుభవము"–అనబడే '3' చమత్కారములు బయల్వెడలుచున్నాయి. అవి బీజ జాగ్రత్ కేవల స్థితికి "అన్యము" – వలె భాసిస్తూ ప్రదర్శనమగుచున్నాయి.

**(3) మహా జాగ్రత్ :** ఆ జాగ్రత్→ ఒక జన్మ, ఆ జన్మ తరువాత మరొక జన్మగా (దేహదేహాంతరములుగా) "నేను – నీవు– నాది" మొదలైన వృత్తులు కొనసాగుచూ ఉండటమును **"మహాజాగ్రత్"**.. అని పిలుస్తున్నారు.

***"జన్మ–కర్మలు, కర్మఫలములు, మరల కర్మఫలములుగా జన్మ జన్మాంతరములు, పునర్జన్మ, పునఃకర్మలు"*** – ఈ విధమై జన్మకర్మ చక్ర పరిభ్రమణము సుదీర్ఘమై, అంతులేనిదై, ఈ జీవుని పట్ల కొనసాగటమే – **మహా జాగ్రత్.**

**(4) జాగ్రత్ స్వప్నము :** జాగ్రత్‌తో ఇంద్రియములచే పంచభూత నిర్మిత వస్తువులను విషయములుగా అనుభవిస్తూ ఉన్న ఈ జీవుడు,అలసిపోయి కొంతసేపు విరామము కొరకై 'నిద్ర'కు ఉపక్రమిస్తున్నాడు. అప్పుడు జాగ్రత్‌లో నుండి –జాగ్రత్‌కు వేరైన **'స్వప్నము'** అనే రంగమును స్వయముగా కల్పించుకొని, అందులో ఊహానిర్మితంగా అనేక విశేషాలను అనుభవముగా పొందుచున్నాడు. అట్టి స్వప్న రంగములో**:–**

→ **ఆరూఢమైనవి** : జాగ్రత్ సిద్ధించు దృశ్యములు సంఘటనలు – మొదలైనవి.

→ **అథవా అనారూఢమ్:** మరియు జాగ్రత్‌లో లేనట్టివి. ఊహచే నూతనంగా కల్పించబడినవి.

సంఘటనా మిశ్రమములు వేరు వేరైన, వేరు వేరు కాలములలోని – సంఘటన, అనుభూతుల అర్థరహితమైన 'కలగలుపు'.

- జాగ్రత్ వ్యవహారములకు సంబంధించినవి, సంబంధించనివి,
- జగత్ వికారముల వంటివి (అనగా) **"భావనతో తన్మయము అవటము"** అనే జాగ్రత్‌ధర్మముతో కూడినది

జాగ్రత్ అనుభవమునకు వేరైన మరి వేరే (జన్మ–జన్మాంతర సంబంధమైన) భావనలు–మొదలైనవన్నీ సరూపం పొందుచున్నాయి. ఆయా దృశ్య విషయాలు స్వప్నములో పొందుచూ, **సుఖదుఃఖములు**, బంధ–మోక్షములు అభౌతికమగు స్వప్నముగా చూస్తూ తన్మయవటం జరుగుతోంది. ఇదియే **"జాగ్రత్ స్వప్నము"**. ఆత్మయందు –భౌతికమైన ఇంద్రియముల సహాయము లేకుండానే – దృశ్యము వివిధ **భంగిమలో మనస్సుకు అనుభూతమగుచుండటమే** స్వప్నము.

- కంటి దోషముచే ఆకాశంలోని ఒకే చంద్రుడు ఇద్దరు చంద్రులుగా కనిపించటము..,
- ముత్యపుచిప్పలో విలువైన 'వెండి' ఉన్నట్లుగా అనిపించటము...,
- **మరుభూమి (ఎడారి)లో (ఎండమావులులో)** జలము సమృద్ధిగా కలిగి ఉన్నట్లు కనిపించటము,

ఇవన్నీ సందర్భమవటం ఎటువంటిదో, స్వప్నములో కనిపించే 'దృశ్యము' అటువంటిదే. అభ్యాసముచేత ప్రాప్తించిన జగదనుభవమే స్వప్నములో అనేక విధములైన వస్తు-సంఘటనానుభవములయి, నానా విధములుగా స్వప్నములో ప్రాప్తిస్తున్నాయి. స్వప్నము మొత్తము స్వకీయ కల్పనయే. అయితే, మరొక చమత్కారమైన విశేషము :

**జాగ్రత్తులో కనిపించేవి "ఇవి మాత్రమే నిజము". స్వప్నములోని కావు" – అని జాగ్రత్తులో అనిపిస్తోంది.**

**స్వప్నములో కనిపించేవి– "ఈ స్వప్నములోవే నిజము. జాగ్రత్‌లోనివి కావు"** – అని స్వప్న సమయములో **ఉద్దేశ్యము కలిగి ఉండటం** జరుగుతోంది.

స్వప్నసమయంలో ఈ జీవుడు "స్వప్న దృశ్యము నిజమే" అని అనుకుంటూనే అనుభవిస్తున్నాడు. మెలకువ వచ్చిన తరువాత మాత్రం, **"అల్పకాలము ఊహలో ఏదో ఎక్కడో చూచాను. అది ఎక్కడా ఏ మాత్రమూ ఎప్పుడూ లేనేలేదు"**. అని తలచుచున్నాడు. బుద్ధిలో పరామర్శ చేసి, **"అబ్బే! ఎప్పుడూ ఎక్కడా జరుగనిదే కలలో కనిపించింది. అటువంటి స్వప్నదృశ్యమునకు ఉదయము లేదు. అస్తమయము లేదు"** – అని ఊరుకొని, ఇక జాగ్రత్ దృశ్యములో అనుభూతిని (నిద్రలేచిన తరువాత) కొనసాగిస్తున్నాడు.

**(6) స్వప్న జాగ్రత్ :** ఈ జాగ్రత్‌లో సంఘటనలు, సందర్భములు, సంబంధములు ఎప్పటికప్పుడు మార్పుచెందేవే అయి కూడా, ఆవర్తమానంలో "సత్యమే! స్థిరమే!" అని అనిపిస్తూ ఉండటమే జాగ్రత్ అనుభవ చమత్కారము. చాలాకాలము తన్మయమై **జాగత్-దృశ్యమును దర్శిస్తూ ఉండటము – అనే అభ్యాసముచేత.., "ఇదంతా స్వకీయ కల్పనా మాత్రమే"** – అనేది ఆరూఢవము కావటం లేదు. **"వేదాంత శ్రవణం చేయటం, గురువాక్య విచారణ"**.. మొదలైనవి ఆశ్రయిస్తూ ఉన్నప్పటికీ జీవునికి ఈ దృశ్యము గురించిన సత్యదృష్టి పోవటం లేదు. **అయితే అసత్‌ను అధిగమించి 'సత్' కొరకు చేయు అభ్యాసమే అందుకు ఉపాయము.**

(i) బహుకాలము ప్రయత్నపూర్వకంగా సత్యాసత్య-నిత్యానిత్య **వివేచన** చేయటం చేత, (ii) "తత్త్వమ్-సోఽహమ్" వంటి మహావాక్య **విచారణ** చేత, (iii) మహనీయులు జగత్తును సందర్శించుచున్న విధానమును **పరిశీలించటముచేత – *"ఈ ఘనీభూతమై అనుభవమగుచున్న జాగ్రత్ స్వప్నము వంటిదే" అని ఆరూఢమవగలదు. అట్టి జాగ్రత్‌ను స్వప్నము వంటిదే – అను దృష్టియే "స్వప్నజాగ్రత్" గా చెప్పబడుతోంది.***

**(7) సుషుప్తి :** ఇప్పటిదాకా మనము చెప్పుకొన్న – బీజ జాగ్రత్, జాగ్రత్, మహాజాగ్రత్, జాగ్రత్ స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రత్ – షట్(6) అవస్థలను పరిత్యజించి ఉన్నట్టి – ఈ జీవుని యొక్క ఒకానొక జడస్థితి – **సుషుప్తి.**

"అటువంటి గాఢనిద్రాస్థితిలో జాగ్రత్-స్వప్న దశలలోని దుఃఖము శేషించి ఉంటుందా? ఉండదా?"–అనే ప్రశ్నకు సమాధానం విను.

**భవిష్యత్ దుఃఖ బోధాఢ్యా సౌషుప్తిః స ఉచ్యతే గతిః।।** ఈ 'సుషుప్తదశ' – అనేక భవిష్యత్ దుఃఖములకు సంబంధించిన సందర్భములను తన యందు కలిగియే ఉంటుంది. వాస్తవానికి ఇది దుఃఖము – దుఃఖము మధ్య 'విరామము' మాత్రమే. అందుకే, **"సుషుప్త స్థితి జడస్థితియే గాని సుఖ స్థితి కాదు"** – అని కూడా చెప్పబడుతోంది.

ఈ సుషుప్తిలో సర్వజగదనుభవములు దాగినవై ఉంటాయి. పునః ప్రదర్శనమునకు సంసిద్ధమై, (కానీ) మౌనం వహించి ఉంటాయి. సుషుప్తి వీడగానే – తిరిగి వచ్చిపడసాగుతాయి.



ఓ ద్విజోత్తమా! ఇప్పటివరకు మనము ఈ జీవుని యొక్క 'అజ్ఞానభూమికలు' గురించి చెప్పుకున్నాము. ఇవన్నీ ఒక్కొక్కటీ అంతరంగా ఆయా విషయములతో సమన్వయమై, సంయోగము పొంది – బహు-అనంతసంఖ్యగా ఈ జీవుని సమక్షంలో ప్రవర్తనము కలిగినవై ఉంటున్నాయి. అట్టి వందలాది అవస్థలు వర్ణనాతీతము. అయితే ఈ సప్తభూమికల విభాగమును అర్థం చేసుకొంటే,.. తక్కినవన్నీ దైనందికానుభవమే కాబట్టి శ్రోతచక్కగా గ్రహించగలడు.

ఇక సప్త ***జ్ఞాన భూమికల*** *గురించి* చెప్పుకుందాము.

## సప్త – జ్ఞాన భూమికలు

**ఋభు మహర్షి:** ఓ అనఘా! నిదాఘా! **ఈ సప్త జ్ఞాన భూమికల గురించి శ్రవణం చేసినంత మాత్రం చేతనే ఇక ఆ శ్రోత 'మోహము' అనే బురదలో ఇరుక్కోడు** – అని ఆర్య వాక్యము.

యోగ భూమికావేత్తలు ఈ సప్త భూమికలను అనేక విభాగములుగా ('9'గా '12'గా '27'గా '108'గా.. ఈ విధంగా) ఆయా భేదముతో చెప్పుతూ ఉంటారు. నీ శ్రవణము యొక్క ఉత్తమ ప్రయోజనమును, ప్రస్తుత సందర్భమును దృష్టిలో పెట్టుకొని వీటిని ఈ **'సప్తభూమికలు'**గా మనము గమనించి క్రోడీకరించి చెప్పుకుందాము. ఇది నీకు శుభమగు ప్రయోజనము కలిగించగలదని నా అభిప్రాయము.

– **"సప్తభూమికల జ్ఞానమే యథార్థ జ్ఞానము"** అని మహాత్ముల ప్రవచనము

*మనము చెప్పుకోబోవు ఈ సప్త భూమికలకు ఆవల జ్ఞేయవస్తువు (That which is knowing all else) అగు "స్వస్వరూప – పరమాత్మ" సమస్తమును తేజోమయము చేయుచు, సర్వదా విద్యమానము – ప్రకాశమానము అయిఉన్నది.*

**సప్తజ్ఞాన భూమికలు – (1) శుభేచ్ఛ (2) విచారణ (3) తనుమానస (4) సత్త్వాపత్తి (5) అసంసక్తి (6) పదార్థభావన (7) తుర్యగ**

ఈ సప్త భూమికల అభ్యాసముచే వీటిని దాటిపోవాలి. **ఆసాం అంతస్థితా ముక్తిః, యస్యాం భూయో న శోచతి।** వీటికి ఆవల గల "ముక్తి స్థానము" (A State where all else is crossed) ... చేరినవాడు ఇక దేనికీ దుఃఖించడు. ఆదుర్దాపడడు. అందుచేత ఈ సప్తజ్ఞాన భూమికల నిర్వచనము ఇప్పుడు మనము చెప్పుకుంటున్నాము.

**(1) శుభేచ్ఛా భూమిక : శ్లో॥ స్థితః కిం మూఢ ఏవాస్మి? ప్రేక్షేఽహం శాస్త్ర సజ్జనైః,**
**వైరాగ్య పూర్వం ఇచ్ఛేతి – 'శుభేచ్ఛ' – ఇతి ఉచ్యతే బుధైః॥**

"అరెరే! క్షణానికి ఒక విధంగా ఉండే ఈ దృశ్య సంగతులలో నేను మూఢుడనై ఎందుకు సంచారములు చేస్తూ ఉన్నాను? ఇక చాలు. నేను శాస్త్రములను అధ్యయనము చేస్తాను. మహనీయుల వద్ద (సజ్జనుల వద్ద) శ్రవణం చేస్తాను. ఇంద్రియ విషయముల పట్ల విరాగినై, సత్యము, నిత్యము అగుదాని గురించి ప్రయత్నశీలుడను అవుతాను" – అను ప్రయత్నశీలత్వమే **"శుభేచ్ఛ".**

**(2) విచారణ భూమిక: శ్లో॥ శాస్త్ర–సజ్జన సంపర్క వైరాగ్య –అభ్యాసపూర్వకమ్**
**సదాచార ప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా "విచారణా"॥**

శాస్త్రములతోను, సజ్జనులతోను (ఆత్మతత్త్వజ్ఞులతోను) సంపర్కము కలిగి యుండటము, అభ్యాసపూర్వకంగా వైరాగ్యము కలిగి ఉండటము (Non attatchment as a practice) (దయ – ప్రేమ–స్నేహము –అమానిత్వము, అదంభిత్వము – అహింస–శాంతి మొదలైన) సదభ్యాసముల పట్ల ప్రవృత్తి కలిగి ఉండటము – ఇది రెండవ జ్ఞాన భూమిక అగు **"విచారణ".**

**(3) తనుమానసీ భూమిక: శ్లో॥ విచారణా శుభేచ్ఛాభ్యామ్ ఇంద్రియార్థేషు రక్తతా**
**యత్ర సా తానుతామ్ ఏతి ప్రోచ్యతే "తనుమానసీ"॥**

విచారణ, శుభేచ్ఛల అభ్యాస ప్రభావము చేత (శబ్ద స్పర్శ రూప రస గంధములు అనబడే) ఇంద్రియార్థముల పట్ల అనురక్తి (Fondness) తరుగుచూ ఉండటము – **"తను మానసీ"** – అనబడుతోంది.

**(4) సత్త్వాపత్తి భూమిక: శ్లో॥ భూమికా త్రితయ అభ్యాసాత్ చిత్తే తు విరతేః వశాత్**
**సత్త్వాత్మని స్థితే శుద్ధే "సత్త్వాపత్తిః" ఉదాహృతా॥**

ఆ విధంగా శుభేచ్ఛ, విచారణ, తనుమానసలను అభ్యాసము చేస్తూ ఉండగా, చిత్తము ఆ అభ్యాసి యొక్క వశము అగుచూ, ఇంద్రియ విషయముల పట్ల అనురక్తి త్యజిస్తూ విరక్తి పొందసాగుచున్నది. ఆతడు విషయములలో రమించటము తగ్గించుకొని **"సమస్తము ఆత్మయే"** – అనబడు ("విషయానురక్తి" నుండి) → ఆత్మతత్త్వానురక్తి" యందు ప్రవేశమును పొంది, దృశ్యము పట్ల ఆత్మభావన బలపడసాగుతుంది.. అట్టి శుద్ధమగు **"సత్త్వాత్మ"** యందు స్థితిని పొందటము – **"సత్త్వాపత్తి"** అనబడుతోంది. చిత్తము విషయము లందు వైరాగ్యము కలిగియుండి "స్వాత్మ" యందు ఈ దృశ్య జగత్తును **ఆత్మకు అనన్యంగా** చూడటమే **"సత్త్వాపత్తి"** యొక్క ఆరూఢత (Constant application).

**(5)"అసంసక్తి" భూమిక: శ్లో॥ దశా చతుష్టయ (4) అభ్యాసాత్ అసంసర్గ ఫలాతు యా,**
**రూఢ సత్త్వ చమత్కారా ప్రోక్తా "అసంసక్తి" నామికా॥**

"శుభేక్ష, విచారణ, తనుమానసీ, సత్త్వాపత్తి" – అను (పైన చెప్పుక్ను) 4 భూమికలు అభ్యాసము చేస్తూ ఉండగా క్రమంగా ఆ ముముక్షువు **'అసంసక్తి'** అనే పంచమ భూమికలో ప్రవేశము పొందుచున్నాడు.

మొదటి 4 భూమికల అభ్యాసముచే క్రమంగా ఆ అభ్యాసి తమో–రజో గుణములను అధిగమించి సాత్త్విక గుణములైనట్టి ప్రేమ, స్నేహము, సేవ, దైవోపాసన, 'నీవు'ను దైవభావముగా చూడటము, కరుణ, దానము, ధర్మనిరతి, అహింస మొదలైన వాటితో కూడిన సత్త్వగుణ–అభ్యాసి అగుచున్నాడు. అట్టి సత్త్వ ఆరూఢతచే (Having come out of Dull / Gloomy state and work - holic tendency) ఆతని యందు దృశ్య విషయములతో సంగము (Relatedness), దానితో బాటే సక్తత (attatchment) సన్నగిల సాగుతాయి. **"ప్రపంచములోని ఈ భౌతిక పదార్థములపైన, ఇక్కడి జనుల పరస్పర సంబంధములపైన ఆధారపడి ఉన్నవాడను కాను. పరిమితుడనుకాను.** (Neither I am dependent upon nor restricted to worldly matters and relationships). **అవన్నీ నిశ్చలాత్మ**

**యొక్క సమక్షములో వస్తూ-పోతూ ఉండే దృశ్య నాటక కథాకల్పిత సంఘటనలవంటిది. వాటితో సక్తత** (attatchment, **ఆసక్తి** (Inquisitiveness) **నాకు ఉండవలసిన అవసరము, అగత్యము** (necessity and inevitability) లేనే లేదు" – అను భావము పెంపొందసాగుతుంది.

*ఈ రీతిగా అసంగస్థితిలో ఈతడు ఉండటం చేత, అది **"అసంసక్తి"** అనబడుతోంది.*

**6. పదార్థ అభావన భూమిక: శ్లో॥** **"భూమికా పంచక" – అభ్యాసాత్ స్వాత్మారామతయా దృఢమ్,**
**అభ్యన్తరాణాం బాహ్యానాం పదార్థానామ్ అభావనాత్**
**పర ప్రయుక్తేన చిరం ప్రయత్నేన అవబోధనమ్**
**"పదార్థభావనా" నామ షష్ఠీభవతి భూమికా॥**

ఐదు భూమికల అభ్యాసము కొనసాగుచూ ఉండగా, అట్టివాడు పదార్థాముల అభావనా స్థితికి చేరుచున్నాడు. పదార్థములను దాటివేసిన భావనాస్థితిని (A state of thought where thought objects are side - lined) చేరుచున్నాడు. పదార్థములలో విహరించటమును విరమిస్తూ స్వాత్మారామము (In the Zone / House of absolute self) నందు విహరించటము ప్రారంభిస్తున్నాడు. దృఢమగు ఆత్మభావనను ఆశ్రయిస్తూ బాహ్య – అభ్యంతరములలో పదార్థముల అభావనచే (లేక ఆత్మభావనచే) ఆతని యందు ఆత్మారామభావన ప్రవృద్ధమవసాగుతుంది. పదార్థములుగా కనిపించేది 'సత్యము' కాదు. "ఆత్మగానే సత్యము" అను **ఉత్తరోత్తరా ఉత్తమ భావన** సిద్ధిస్తోంది.

- పదార్థముల వాస్తవ రూపభావనచే **"పదార్థభావన"** అని
- పదార్థముల ఆవల దర్శనముచే **"పదార్థాభావన"** అని కూడా ఈ 5వ భూమిక పిలువబడుతోంది.

**"పరమాత్మ ఈ సర్వజీవులలోను (అంతేకాకుండా) సమస్త జీవులుగాను కూడా ఉన్నారు కదా!"**.. అను రూపము గల "చిరకాలము అనుకోవటము" – అనే ప్రయత్నముచే ఏర్పడే "అవబోధన" (Constantly learned state)చే 'పదార్థాభావన' – అనే 6వ భూమిక సునిశ్చితము, సుస్థిరము అవుతోంది.

**7. తురీయ/తుర్యగా గతిః భూమిక శ్లో॥** **భూమి షట్క చిరాభ్యాసాత్ భేదస్య అనుపలంభనాత్**
**యత్ 'స్వభావైక' నిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః॥**

(పైన చెప్పిన) ఆరు భూమికల చిరకాల – అభ్యాసము చేత భేద దృష్టులన్నీ **'సమదృష్టి'** యొక్క **"విజ్ఞత"**యందు విలీనమై పోసాగుతాయి. **అనేకముగా కనిపిస్తూ ఉన్నప్పటికీ ఈ సమస్తము సర్వదా ఏకముగా అనిపించటము-పరిఢవిల్ల సాగుతుంది.**

- పాత్రలు వేరువేరైనా – నాటకము ఒక్కటే అయినట్లు।
- నవలలో సంఘటనలు వేరువేరైనా కూడా, రచయిత యొక్క 'రచనాకళ' (The Art of writing) ఒక్కటే అయినట్లు।
- వాయువు అనేకచోట్ల అనేక వేరువేరైన ప్రదర్శనా విశేషములు కలిగియుండి కూడా, వాయువు ఏకమే అయినట్లు।
- తరంగములు వేరే అయినప్పటికీ సముద్రజలము ఒక్కటే అయినట్లు.....,

తరంగములలో జలమును, వాయు వీచికలలో వాయువును, కథలోని పాత్రల వెనుక రచయితను దర్శించుతీరుగా ఈ భూమికలో **"ఆత్మయొక్క స్వభావమే ఇదంతా" అను స్వభావైక నిష్ఠత్వ దృష్టి, దర్శనములను వీడక ఉండటము – "తుర్యగా గతి" అనబడుతోంది.** అట్టి తుర్యావస్థ జీవన్ముక్తులయందు **స్వాభావికమై, అనునిత్యమై, అకృత్రిమమై ఉత్తరోత్తర స్థితికి దారితీయునదై ఉన్నది.**

-----

## తురీయాతీతము

ఇక ఈ '7' భూమికలకు ఆవల **తురీయాతీతము.** ఇప్పటివరకు చెప్పుకున్నది 'జీవన్ముక్తి'కి సంబంధించినవై ఉండగా, ఇక ఆపై 'తురీయాతీతము'→ **విదేహముక్తికి** సంబంధించినది.

తురీయమును కూడా దాటినట్టిది – **తురీయాతీతము.** హే నిదాఘమహాశయా! మహాభాగా! 7వ భూమికను ఆశ్రయించినవారు –

→ **ఆత్మాఽరామాం :** – సర్వదా అఖండాత్మ భావన యందు నిర్ద్వంద్వంగా రమించుచున్నవారై, ఆత్మయే ఆరామముగా కలవారై,

→ **మహాపదమ్ ఆగతాః** – 'ఆత్మమేవాఽహమ్' – నేనే ఆత్మను – అనే మహాపదమును అధిష్ఠించి,

→ **మహాత్మాన్ అస్తే** – ఈ సమస్తము ఏ కేవలాత్మ యందు అలంకారప్రాయమై కనబడుతోందో, అట్టి ఆత్మయే (లేక) బ్రహ్మమే నేను – అయినట్టి **'నిశ్చలానుభవము'** పొందినవారగుచున్నారు.

**జీవన్ముక్తా న మజ్జన్తి సుఖ-దుఃఖ రస స్థితే** - అట్టి జీవన్ముక్త పరాకాష్ఠులు- ఇక ప్రకృతి స్వాభావికములగు సుఖ-దుఃఖ రసములలో మునుగరు.

**నిదాఘుడు :** మహనీయా! అట్టి విదేహముక్త స్థితి సిద్ధించుకున్నవారు కర్మలు నిర్వర్తిస్తారా? లేక అన్నీ వదలివేసి ఉంటారా?

**ఋభుమహర్షి :** వారు ప్రాప్తించిన కార్యములను కించిత్ నిర్వర్తిస్తూ ఉండవచ్చు. లేక ఏదీ నిర్వర్తించకనూపోవచ్చు. 'కర్మలు చేయటము, మానటము' - ఈ రెండూ కూడా విదేహముక్తుల పట్ల **ఆచరణ నియమము కాదు. నిషిద్ధము కాదు.** అసలు విదేహముక్తి కర్మలకు సంబంధించినదే కాదు. ఒకడు నిద్రపోతూ ఉండగా ప్రక్కవారెవరైనా నిదురలేపి ఏదో చిన్న సహాయము (Help) అడిగితే అది నిర్వర్తించి, మరల వెంటనే నిదురలోకిజారుకుంటాడు చూచావా? సత్పురుషులగు జీవన్ - విదేహముక్తులు కూడా తోటివారి సానుకూల్యత-ప్రాతికూల్యతలను దృష్టిలో పెట్టుకొని నిర్వర్తించటము స్వాభావికము. ఎందుకంటే, **ఆత్మభావనచే వారు పరాప్రేమస్వభావులై ఉంటారు.**

ఓ నిదాఘా! పశువులు, మ్లేచ్ఛులు అయి ఉన్నప్పటికీ, ఎవ్వరైతే మనము చెప్పుకున్న సప్త (7) జ్ఞాన భూమికలను అభ్యాసము చేయటము ప్రారంభిస్తారో, వారు జీవన్ముక్తులు, విదేహముక్తులు తప్పక కాగలరు. అట్టి ఈ సప్త జ్ఞాన భూమికల వరకు ప్రయత్నించి సంచరించువారు ముక్తులే! ఇందులో సందేహమే లేదు.

**సదేహముక్తులు :** "దేహము కలిగి ఉన్నప్పటికీ 'దేహి'గా ఆత్మనే! అఖండాత్మనే! సర్వదా అప్రమేయ నిర్మల-కేవల - సర్వగత-సర్వాతీత-ఆత్మని కానిక్షణమే లేదు"

**విదేహముక్తులు :** నేను భౌతిక దేహరహితుడును. **విశ్వమంతా నాదేహమే. విశ్వరూపుడను.** అన్ని రూపములు నావేకాబట్టి **రూపరహితుడను.** సమస్తము నేనే అగుచూ కూడా **ఏదీ ఏక్షణములోను కానట్టివాడను! జగత్ రహితుడను, జగత్ సహితుడను కూడా!**

గ్రంథి = ముడి

| | | |
|---|---|---|
| ఈ సృష్టి సృష్టించబడినది | - | బ్రహ్మగ్రంథి |
| ఇది కొనసాగుచున్నది | - | విష్ణుగ్రంథి |
| ఇప్పుడు ఇది లయమగుచున్నది | - | రుద్రగ్రంథి |

**జ్ఞప్తిర్హి గ్రంథి విచ్ఛేదః। తస్మిన్ సతి విముక్తతా।** "ఈ విశ్వము కల్పనామాత్రము. ఈ జీవుడు కేవలస్వరూపుడు. ఈతడు సమస్తము కల్పించువాడు. సర్వదా పరమై, నిత్యముక్తుడై ఉన్నాడు. **ఈ సృష్టి స్వతఃగా ఎప్పుడూ లేదు. భావనచే కల్పించబడేది మాత్రమే! భావనకు ఆవల 'భావన' జనించుస్థానమే నేను"** - అను స్వానుభూతియే గ్రంథి విచ్ఛేదము (లేక) గ్రంథి విముక్తి. అట్టి హృదయగ్రంథి విముక్తియే **ఆత్మజ్ఞానము.**

"మృగతృష్ణలో జలము ఉన్నదా? లేనే లేదు. అట్లాగే సమష్టి అహంకారము మొదలుకొని, 'ఈ దేహమునకు చెందిన 'నేను' అను **"వ్యష్టి అహంకారము"** వరకు, ఇంకా 'నీవు'.. ఇవన్నీ కూడా **స్వతఃగా లేవు. భ్రాంతిచే కల్పించబడి పొందబడుచున్నాయి"** - అను ఎరుక నిశ్చలము అవగా, **భ్రాంతులన్నీ నశించినప్పటి స్థితియే ముక్త స్థితి.** అదియే జీవన్ముక్తి, విదేహముక్తి కూడా. **అది సమస్తము ఆత్మయందు భావనగా శమించినట్టి పరమ శాంత స్థితి.** ఎవ్వరైతే **సర్వభ్రాంతులు తరంగముల** వలె ప్రవహిస్తున్న **"మోహము** (Illusion)" అనే సముద్ర జలమును దాటుతారో - **వారే పరమ పదమును ప్రాప్తించుకోగలరు.**

ఎవ్వరైతే -**"ఈ జగద్విషయములను జయించి నా యొక్క స్వభావసిద్ధమైయున్న ఆత్మ గురించి అధ్యయనము చేస్తాను. ఆత్మతత్త్వము ఎరిగినవాడనై ఆత్మస్వరూపుడనై ఆత్మానందమును పొందుతాను"** - అను రూపంగా స్వాత్మారామ పరాయణులౌతారో, వారే సప్తజ్ఞాన భూమికలలో ప్రవేశము పొందుచున్నారు.

## యోగము

**మనస్సును ఆత్మయందు సశాంతింపజేయుటమునకు ఉపాయమే 'యోగము' అని చెప్పబడుతోంది. మనః ప్రశమన - ఉపాయో 'యోగ' ఇతి అభిధీయతే।।** అట్టి యోగము యొక్క అభ్యాసమే మనము సప్తజ్ఞాన భూమికలుగా విడదీసి, అభివర్ణించి సక్షిప్తంగా చెప్పుకొన్నాము. అట్టి సప్తజ్ఞాన భూమికల అంతిమ లక్ష్యము - **"పరబ్రహ్మపదమే"** గాని, మరింకొకటేదీ కాదు.

***అట్టి పరబ్రహ్మపదము (లేక) స్థానము ఎటువంటిది?***

- **త్వత్తా అహన్తా ఆత్మతా యత్రపరతా నాస్తి కాచన।** ఎద్దానియందైతే **"నేను - నీవు - వారు - వీరు"** .. మొదలైనవి ఏ కించిత్ కూడా ఏ మాత్రము ఏక్షణమందునూ లేనేలేవో,

- **న క్వచిత్ భావకలనా, న భావ-అభావగోచరా।** ఎద్దానియందైతే దృశ్య సంబంధమైన పరిమిత - సంకుచిత - అల్ప - దుష్టభావముల కలనమునకు చోటే లేదో, భావ - అభావములకు ఉనికియే ఉండదో..,
- సమస్తము పరమ శాంత స్వరూపమై, ఆకాశమువలె ఆలంబనము లేనట్టి నిరాలంబమో,
- ఏదైతే కాలాతీతమో, భావాతీతమో, దృశ్యాతీతమో, శాశ్వతమో,
- ఏదైతే శుభ-శాంతి-సుఖ ప్రదమో,
- ఏదైతే **అనామయమో** (నామరూపాత్మకమైనది అయి ఉండలేదో), **అనాభాసమో** (ఇంద్రియములకు, మనస్సుకు భాసించునదికాదో), **అనామకమో, (నామరూపరహితమో), అకారణమో**(కార్యకారణ కర్తృత్వములకు సంబంధించినది కాదో)..,

అదియే జీవన్ముక్తులు, విదేహముక్తులు కూడా విహారము చేయుచుండునట్టి **ఆత్మపదము** (లేక) **పరబ్రహ్మస్థానము.**

## పరబ్రహ్మానుభవము ఎట్టిది?

ఇంకా కూడా అట్టి **'పరబ్రహ్మము'** లేక పరమాత్మతత్త్వము (సదేహ-విదేహ ముక్తుల స్వానుభవంగా) ఎటువంటిదంటే,...

- అది సత్ (ఇంద్రియములకు విషయమై ఉన్నది) కాదు. అసత్ (లేనట్టిది) కాదు. సత్ (ఉన్నది) - అసత్ (లేనిది)ల మధ్య (In Between) కూడా కాదు.

  **న సత్। న అసత్। న మధ్య-అన్తమ్। (సదసత్ = "సత్-అసత్ కూడా" - అయినది కాదు. సత్తుకు గాని, అసత్తుకుగాని ఆవలగానో (లేక) ఈవలగానో ఉన్నది కాదు (నాన్తమ్)।**
- ఈ దృశ్యములో ఒక వస్తువు కాదు. ఈ సమస్త దృశ్యము పరబ్రహ్మము కాని క్షణము లేదు. **- న సర్వం, సర్వమేవ చ।**
- **మనో వచోభిః అగ్రాహ్యం।** మనస్సుచేత, వాక్కుచేత గ్రహించబడనిది. గోచరము కానిది. అవాక్ మానస గోచరము. **మాటలకు, ఆలోచనలకు** విషయమేకాదు. అయితే ఆ రెండు ఉపకరణములుగా-అగుచూ ఉండగా, **అవగాహనగా బుద్ధికి సిద్ధించగలిగేది.**
- అది శూన్యమా? కాదు. పూర్ణము. పూర్ణమునకే పూర్ణము. **పూర్ణాత్ పూర్ణమ్।**

  ఈ జగత్తులన్నీ అందులోంచే ప్రదర్శనమౌతూ ఉంటే, అది శూన్యమెట్లా అవుతుంది?
- సుఖమునకే సుఖము. **సుఖాత్ సుఖమ్।**
- తెలియబడే - చూడబడే ఏ వస్తువు వంటిదీ కాదు. **అసంవేదనమ్।** అది స్వహృదయమునందే అనుభవైకవేద్యము.
- శాంతిరూపము కూడా కాదు. **అశాంతమ్।** 'శాంతి'కే సాక్షి।
- ప్రతి జీవుని స్వస్వరూపముగా స్వ-అంతరముననే తెలియబడునది. **ఆత్మవేదనమ్।** సూచనలు, సాధనలు, ధారణలు- అందుకు ఉపాయములు. అది ఎవరికివారే తమకు తాముగా తామై తెలుసుకోవలసినది.
- సర్వత్రా సర్వదా వేంచేసియే ఉన్నట్టిది. **ఆతతమ్।** అద్దానికొరకై మర్కెడికో వెళ్ళవలసిన పనిలేదు.
- సర్వ పదార్థముల సత్తాస్వరూపమే - అయ్యది! ఈ దృశ్యమునకు వేరై ఎక్కడో ఉన్నది కాదు. **సత్తా సర్వపదార్థానాం, న - అన్య సంవేదనా ధృతే।** ఈ కనబడే సమస్తము అదియే అయి ఉన్నది. వేరుగా మరెక్కడో ఉన్నది కాదు. కనిపించేదంతా అదే అయి ఉండగా కన్నుమూతలెందుకు?
- ద్రష్ట (Perceiver) - దృశ్యము (Object)ల సంబంధము యొక్క మధ్యగా దృష్టి చైతన్యరూపముగా ఏర్పడినదై ఉన్నట్టిది - **సంబంధే ద్రష్టృ దర్శన దృశ్యానాం మధ్యే దృష్టిర్హి యత్ వపుః।** విషయ రహిత దృష్టి (నిర్మలదృష్టి)యే అద్దాని ఉనికి - ప్రదర్శనల స్వరూపసూచకము.
- ఇక్కడ కనిపిస్తూ ఉన్నట్టి ద్రష్ట - దర్శన - దృశ్యములకు (Perceiver - Perception - Object being perceived)లకు పరమై, ఆ మూడూ కూడా లేనట్టిది. అందుచేత **'దృక్'** స్వరూపము. **కేవల సాక్షి. సమస్తము బయల్వెడలేస్థానము.**

ఓ నిదాఘా! "నీవు, నేను" కూడా అట్టి అఖండమగు పరబ్రహ్మ స్వరూపలమేనయ్యా! ఆ తత్-పరబ్రహ్మమే - మన యొక్క **సమస్త సందర్భ స్వరూపములకు ఆధారమై, సహజస్వరూపమై, సమస్తమునకు అప్రమేయమై అనునిత్యముగా వెలుగొందుచున్నది.** అది నిర్మలబుద్ధికి స్వానుభవ విషయము.

**అట్టి పరమాత్మను** బుద్ధితో దర్శించటానికై, ఒకానొక స్థానము సూచనగా చెప్పుచున్నాను. విను.

- ఈ చిత్తము ఒక విషయము నుండి మరొక విషయమువైపుకు ప్రయాణిస్తూ ఉండగా ఆ ఉభయ విషయముల మధ్యగా విషయ రహితమై - ఏ 'చైతన్యము' కేవలమైయున్నదో,... అట్టి **అజాడ్యము** (జడము కానట్టిది), **సత్-చిత్** (కేవలమగు ఉనికి-ఎరుక) స్వరూపము, **ఉత్తేజితరూపము**గా ప్రకాశమానమై ఉన్నదో..,

| ఒక విషయము |  | మధ్యగాగల విషయరహిత 'యోచనా చైతన్యము' | →  | మరొక విషయము |
|---|---|---|---|---|

- ఎద్దాని రూపము జాగ్రత్- స్వప్న-సుషుప్తులకు ముందే ఉండి ఉండటం చేత **'సనాతనము'** అని చెప్పబడుతోందో, **'పరము'** అనబడుతోందో,
- మనో దేహ బుద్ధి సంబంధమైన సర్వ కదలికలకు కారణమగుచు తాను ఏ మాత్రము కదలిక లేనట్టిది కాబట్టి **'అచేతనము'** అని కూడా అనబడుచున్నదో..,
- ఏది – జాగ్రత్‌లోనికి, స్వప్నములోనికి, సుషుప్తిలోనికి, దేహ–దేహాంతరములలోనికి 'రావటము – పోవటము' అను ధర్మమే లేనిదై, సర్వదా యథాస్థితమో,
- అది శిలవలె నిశ్చలమై ఉన్నప్పటికీ సర్వచేతనములకు కారణ-కారణము కాబట్టి **'చైతన్యరూప శిలా-హృదయము'** అని అభివర్ణితమో,
- సర్వ ఆలోచనలకు మునుముందే ఆలోచించువానిని (The Thinkerను) కల్పించుకొనుచున్న చేతన రూపమవటంచేత **'అమనస్కము'** అయి ఉన్నదో..,

**అట్టి ఆత్మను బుద్ధితో గ్రహించి, అదియే నీవు అయి ఉండును.** నీవే బ్రహ్మమై (ఆభరణములో బంగారమువలె) **తన్మయుడవై ప్రశాంతుడవగము.** చిత్తము (ఇష్టము+ఆలోచనలను) దూరముగా పరిత్యజించి, అప్పటికీ ఏది అది అయి ఉన్నవో అదియే అయి సుస్థిరుడవై ఉండెదవుగాక. **ప్రశాంత-అవ్యాజానంద స్వభావుడవు** అయ్యెదవుగాక. **చిత్తం దూరే పరిత్యజ్య, యోఽసి సోఽసి స్థిరోభవ॥**

## ఈ జగద్దృశ్యము ఎటువంటిది?

ఆకాశము శూన్యమే (Has no matter) అయినప్పటికీ, ఆకాశములో వస్తు ధర్మము అయినట్టి 'నీలము' – **దృష్టి యొక్క ఉల్లసిత్వముచేత-కంటికి అగుపిస్తూ** ఉంటుంది కదా! అదేవిధంగా నిర్విషయమగు పరమాత్మతత్త్వము నందు మనస్సు యొక్క ఉల్లాసము చేతను, స్వకీయ భావనా విశేషముచేతను-**సవికల్ప జాలమయినట్టి ఈ దృశ్య జగత్తు మహత్తర విశేషమైనట్లుగా** అగుపిస్తోంది. 'నీలము' అనునది శూన్యకాశమే అయిన తీరుగా, **ఈ జగద్దృశ్యము శూన్యము – పూర్ణము కూడా అయి ఉన్న ఆత్మయే.**

- పరమాత్మతత్త్వము నుండి ముందుగా మనస్సు జనిస్తోంది.
- మనస్సు చేతనే దృశ్య రూప జగత్తు వ్యాప్తరూపముగా విజృంభింప జేయబడుతోంది.

"ఆకాశములో నీలము ఉన్నది" – అని ఎవ్వరైనా అంటే, అది **అధ్యారోపము** (Illusionary attribution) మాత్రమే! అట్లాగే "ఆకాశము ఉన్నది' – అనటము **అపవాదము** (mis-conception) మాత్రమే! అట్లాగే..,

> ***సర్వదా చిదాకాశమే ఉన్నది. 'మనస్సు' అనబడునది మొదలే లేదు. 'ఉన్నది' అని అనటము అధ్యారోపము మాత్రమే! (లేక) అపవాదము మాత్రమే.***

చిత్తము (లేక) మనస్సు యొక్క రూపము **"సంకల్పించటము"** అనే (ఆత్మయొక్క) **క్రియావిశేషము** మాత్రమే, (లేక) కల్పనా చాతుర్యము మాత్రమే!

సంకల్పముల సంక్షయిస్తేనో? చిత్తము కూడా లేనిదై సంక్షయిస్తుంది. సంకల్పములు ఉంటే చిత్తము, ఆ చిత్తమునకు విషయమై (ఆత్మకు అన్యముగా అనిపించే) జగత్తు ఉంటుంది. **కనుక చిత్తమే జగత్తు.**

- సంకల్పమే చిత్తము. చిత్తమే సంసార మోహము.
- సంకల్పము లేకుంటే చిత్తము లేదు. చిత్తము లేకుంటే సంసార మోహము లేదు. తరంగం జలంగా అగుతీరుగా, చిత్తము విషయరహితమైతే 'చిత్'గానే శేషిస్తోంది.

శరత్కాలంలో ఆకాశము, మేఘరహితమై నిర్మలంగా ప్రకాశిస్తుంది కదా! అట్లాగే సంకల్పములు 'రహితము' అయినప్పుడు – ఏకము, **అజము (జన్మరహితము), ఆది- అంత రహితము, ఆది- అంత-మధ్య స్వరూపము-అగు ఆత్మ నిర్మలముగా, ప్రశాంతముగా అనుభవమవగలదు. అట్టి అనంత – అఖండ – కేవలాత్మయే మన సహజ స్వరూపము.**

ఎవ్వరియొక్క ఏకర్తృత్వమూ లేకుండానే, ఏ రంగము (Place / Canvass) లేకుండానే, చిత్రకారుడు – రంగులు లేకుండానే–ఆకాశములో అనేక చిత్ర విచిత్రములన్నీ భౌతికమైన కంటికి కనిపిస్తూ ఉంటాయి కదా!

ఈ జగత్తు కూడా,.. ద్రష్ట లేకుండానే (అద్రష్టం) దృశ్యము వచ్చినట్లుగాను, నిద్రపోయేవాడు లేకుండానే స్వప్నదృశ్యము రూపము చెంది ఉన్నట్లుగాను – **సాకారంగాను, అనుభవైక వేద్యముగాను, ఉన్నట్లుగాను అగుపిస్తోంది.**

**ద్రష్ట లేకుండా దృశ్యము ఉండదు. కల కనేవాడు లేకుండా 'కల' ఉండదు. అట్లాగే జగత్తు స్వతఃగా లేదు. అనుభవియొక్క కల్పనయే ఇదంతా.**

## దర్పణం - నిరిచ్ఛ ప్రతిబింబము

దర్పణము యొక్క ఇచ్ఛగాని, వస్తువు యొక్క ఇచ్ఛగాని లేకుండానే దర్పణములో దృశ్యము ప్రతిబింబిస్తూ కనబడుచూ ఉన్నవిధంగా – కేవల సాక్షిభూతము, సర్వసమము, స్వచ్ఛము, నిర్వికల్పము అగు **చిదాత్మ** అనే దర్పణమునందు ఎట్టిఎవ్వరి ఇచ్ఛ లేకుండానే 'జగత్తు' అనే సాకార దృశ్యము, అందులో అనేక విశేషాలు కనిపిస్తున్నాయి. స్వప్నంలో దృశ్యమువలెనే జాగ్రత్ దృశ్యము నిరాలంబమై **నిర్విషయాత్మ యందు సవిషయమై** అగుపిస్తోంది. చిత్తము తన చంచలత్వమును జయిస్తే **"ఇదంతా ఆత్మయొక్క విన్యాసమే। శివతాండవమే"** – అనునది బుద్ధికి సుస్పష్టమవగలదు.

## చిత్త చాంచల్య జయము

ఓ నిదాఘా! చిత్తము యొక్క చాంచల్యము చేతనే ఈ జగద్దృశ్యము, ద్రష్ట కూడా అఖండాత్మకు వేరైన ఉనికి పొందినట్లు అగుపిస్తున్నాయి.

అట్టి **"ఆత్మ వేరు – దృశ్యము వేరు"** అనే మనో-చిత్త కల్పితమగు భేదదృష్టిని జయించటానికై ఉపక్రమించు. **"ఏకము, అఖండము, సర్వాత్మకము అగు బ్రహ్మమే ఈ దృశ్య జగత్తు యొక్క వాస్తవ రూపము, స్వభావము కూడా!"** – అను భావనను అనుక్షణికంగా ప్రయత్నపూర్వకంగా ఆశ్రయించినవాడివై ఉండెదవు గాక!

**శిలపై రేఖలు – ఆత్మశిలపై లోకములు :** ఒక పెద్దశిల. ఆ శిలపై అనేక చిన్న – పెద్ద రేఖలు. అయితే 'రేఖలు' ఉన్నచోట, రేఖల – రేఖల మధ్యగా ఉన్న ప్రదేశము – సమస్తము శిలయే కదా! శిలయొక్క ఈ చివర – ఆచివర, ఈ ఆకారము – ఆ ఆకారము : – సమస్తము శిలయే కదా! శిల్పముగా మలచబడి, సాకారముగా (శివ, విష్ణు ఇత్యాది విగ్రహములుగా) కనిపిస్తున్నదంతా శిలయే కదా!

**'ఏకము'** అయి ఉన్న **'పరబ్రహ్మము'** అనే ఒక మహాశిల **'లోకములు'** అనే శిలయే. (మరియు) **'అనేక జీవులు'** అనే **అసంఖ్యాక చిన్న-పెద్ద రేఖలతో** నిండియున్నప్పటికీ, **సమస్తము సర్వదా పరబ్రహ్మమే.**

## జగత్తుకు జనన స్థానము ఏది?

ఆత్మ అద్వితీయము. అద్దానికి 'ద్వితీయము' (Something secondary or next) అనునది ఉండటానికే వీలులేదు. **'ఆత్మ అద్వితీయము'** అనునని వేద-వేదాంత-ఋషి-ఆత్మతత్త్వజ్ఞుల మహావాక్య సిద్ధాంతము. 'ద్వితీయము' అను కారణము అభావము (లేనిది) అవటం చేత **అనుత్పన్నం ఇదం జగత్।** ఈ జగత్తు అనునది ఉత్పన్నమవనే లేదు.

ఆహాఁ!

→ ఇప్పుడు తెలుసుకోవలసినది తెలుసుకున్నాను. **జ్ఞాతం జ్ఞాతవ్యం అధునా।**

→ చూడవలసినదగు 'ఆత్మ' అను అద్భుతమును దర్శించుచున్నాను. **దృష్టం ద్రష్టవ్యమ్ అద్భుతమ్।**

→ అనేక జన్మలుగా దృశ్యముచే సంబంధీకుడనై అనేక భేద దృష్టులను కొనసాగిస్తూ వచ్చిన శ్రమంతా శమించగా **"సమస్తము స్వకీయ "ఎరుక" యొక్క విస్తరణ రూపము మాత్రమే. అట్టి చిన్మాత్రమునకు వేరై కించిత్ కూడా ఎక్కడా ఏదీ లేదు"** – అను ఆత్మతత్త్వజ్ఞానముచే **పరమ విశ్రాంతి ఇప్పుడు నాకు లభిస్తోంది.**

→ సందేహములన్నీ విశ్రాంతి పొందగా, కౌతుకమంతా విగతము (Passed away completely) అవగా కల్పనాజాలము నిరస్తము అవగా (రహితమైపోగా) – అప్పటికీ శేషించియుండునదే **'నేను'**. అదియే **'నీవు'**. అదియే ఈ **'జగత్తు'।**

## "పరమ పదము"

ప్రశాంతించిన 'చిత్తము' కలవారు, స్వధర్మోపాసనానిష్ఠులు, అల్ప-దుష్ట ధ్యాసలతో కూడిన కర్మల నుండి విరమించినవారు, ఉత్తమ బుద్ధి-శాంత బుద్ధి కలవారు, మనస్సును ఆత్మాభావనచే అమనస్కము (లేక) విమనస్కనము చేసినవారు – **'భౌమాస్థానము'** అగు **'సర్వాత్మక మహాత్మత్వము'**ను ప్రాప్తించుకొనుచున్నారు.

ఎవ్వరైతే **ఆత్మ విచారణ** యందు **శ్రద్ధ – భక్తి – ఆసక్తులతో** తమను తాము **నియమించుకుంటారో, బుద్ధియొక్క జగత్ సంబంధమైన సర్వ వృత్తులను** (భేదవృత్తులను) **త్యజించి** ఉంటారో, **మనన** రూపమగు మనస్సును కించిత్ పరిణతము (Matured) అగు మనో విభాగముతో ఆక్రమించి ఉంటారో – అట్టి వారికి **బ్రహ్మాభావము స్వాభావికమై అనుభవము కాగలదు.**

ఇంకా కూడా..,

స్వాభావికమగు విజ్ఞానరూప కేవల స్వస్వరూపము ఎవరి పట్ల సంప్రీతమగుచున్నదో – విను.

**తత్త్వజ్ఞుని స్వాభావిక విలక్షణ లక్షణములు:**

❋ **వదలవలసినది** (దృశ్యమును) **వదలవలసినంతగా వదలినవాడు-అగుచున్నాడు.** ఆశ్రయించవలసిన - పట్టుకోవలసినట్టి (ఉపాదేయము అయినట్టి) సమస్తమునకు పరమైనది (ఆవల) అయి యున్న **ఆత్మను పట్టుకొనవలసినంతగా పట్టుకున్నవాడై ఉంటున్నాడు.**

❋ ద్రష్టనే దర్శించుచు, అన్యము అయినదంతా (ద్రష్టకు వేరైనదంతా) సంపూర్తిగా త్యజించినవాడు అగుచున్నాడు.

❋ విజ్ఞాతవ్యము (అవశ్యము తెలుసుకోవలసినది) అయినట్టి **"పరతత్త్వ జ్ఞానము"** గురించి **జాగరుకుడై** జీవితమును సద్వినియోగపరచుకొనుచున్నాడు.

❋ ఇంద్రియములకు విషయములుగా కనిపిస్తున్న సమస్త విషయములపై రాగ-ద్వేషములుగాని, సంగముగాని, అసంగముగాని లేనివాడు, **(నిరుపాసంగం)** - అగుచున్నాడు.

❋ పరమాత్మకు ద్వితీయముగా ఎక్కడా ఏదీ దర్శించనివాడు. దేనియొక్క ఆశ్రమమునకూ ఏ మాత్రము పరిమితము కానివాడు **(నిరుపాశ్రయుడు)** - అయి ఉంటున్నాడు.

**వినిర్యాతి మనో మోహాత్ విహంగః పంజరాత్ ఇవ।** అట్టివాడు పంజరములో చిక్కుకున్న పక్షివలె ప్రవర్తించు మనస్సు యొక్క మోహపంజరము నుండి విడివడినవాడవగలడు.

ఏ హృదయము శాంతము వహించినదై, సందేహములన్నీ తొలగగా-కౌతుకములన్నీ తొలగి ఆత్మభావనచే ఆత్మగా పరిపూర్ణము అగుచున్నదో - **అట్టి హృదయము పున్నమినాటి పూర్ణచంద్రునివలె పరమప్రశాంతముగాను, తేజోసమన్వయముగాను** విరాజిల్లగలదు.

**"అహమ్**(నేను)"గాని, **"త్వమ్-నీవు"** గాని వాస్తవానికి ఆత్మకు వేరై లేవు. సర్వే సర్వత్రా సర్వదా నిరామయమగు బ్రహ్మమే ఉన్నది. అట్టి బ్రహ్మమే నేను అయి ఉన్నాను. **(అహంబ్రహ్మాస్మి).** అదియే నీవు కూడా **(తత్త్వమ్)**

ఈ విధంగా

| | | | |
|---|---|---|---|
| I. | సత్ | కేవల సత్తా మాత్ర స్థితి | అసత్ |
| II. | నేను | కేవల సత్తామాత్ర స్థితి | నీవు |
| III. | సత్ అగు బ్రహ్మము | కేవల సత్తా మాత్ర స్థితి | అసత్ అగు నీవు - నేను |

సత్ - అసత్‌ల మధ్యగా (నీవు-నేను మధ్యగా) ఏ కేవలమగు సత్తామాత్రస్థితి (The Absolute presence with absolute sense Viz, "I am existent)గా వెలుగొందుచున్నదో - అద్దానినే సర్వత్రా **జగత్తుగా, నీవుగా వెలుగొందుచూ ఉన్నట్లుగా దర్శించువాడే - సరి అయిన దృష్టి, దర్శనము గల 'జ్ఞాని'.** ఆతడే ఉన్నది ఉన్నట్లుగా చూస్తున్నట్టివాడు.

## ఆత్మదృష్టిని విడువకయే కర్మల నిర్వహణ

**నిదాఘుడు :** మహర్షీ! పితృదేవా! ఋభుదేవా! **భావన-భావనల** మధ్యగా, ద్రష్ట-దృశ్యముల మధ్యగా, 'నీవు-నేను'ల మధ్యగా, సత్-అసత్‌ల మధ్యగా ఏ **"నిర్వికల్ప చిదానంద సత్తాచైతన్యము"** (లేక) **"సత్తాసామాన్యము"** ఉన్నదో, **అద్దాని దర్శనమే పరమాత్మ దర్శనము"** - అని మీరు దయతో సూచిస్తూ ఉన్నట్లుగా నేను గమనిస్తున్నాను. అవునుకదా?

**ఋభు మహర్షి :** అవును. అట్టి కేవలమగు ఆత్మ చైతన్యదర్శనము→ జన్మ-కర్మల వంటి సమస్త సంసార వ్యవహారములను దాటివేసినట్టిది. **కేవలమగు స్వస్వరూపమే** సమస్తము అయి, **'పరమాత్మ'**గా వేద-ఇతిహాస-పురాణములచే అభివర్ణించబడుతోంది.

**నిదాఘుడు :** జన్మించినది మొదలు ఆయా అనేక అనునిత్య కర్మ వ్యవహారములలో అనివార్యంగా నిమగ్నమౌతున్న మా మనోబుద్ధులకు అట్టి **"ద్రష్ట - జగద్దృశ్యరహిత అహం-త్వమ్ రహిత ఆత్మచైతన్యము"** అనుభవమై లభించటము దుర్లభమేకదా?

**ఋభు మహర్షి :** దుర్లభముకాదు. "ఈ ప్రపంచంలో అనివార్యంగా నిర్వర్తించవలసి వస్తున్న కర్మ వ్యవహారములు నిర్విషయ-కేవలాత్మ భగవానుని దర్శనమునకు అడ్డుగోడలు - అనునది ....

(1) ఆత్మ తత్త్వము యొక్క అధ్యయనము (2) ఆత్మోపాసన (3) ఆత్మాతాదాత్మ్యము

అనే త్రిపుటీస్థానమునకు సిద్ధమే కానప్పటి ఒకానొక **బలహీనమైన అభిప్రాయము** మాత్రమే.

జీవన్ముక్తి-విదేహ ముక్తులకుగాని, మోక్షము - కేవలాత్మాహమ్ స్థానమునకు గాని **'ఇక్కడి నియమిత కర్మలు అడ్డు'** అని ఎక్కడా చెప్పబడనేలేదు. కర్మలను సన్న్యసించటమంటే **"అల్పమైన దృశ్య-ఆశయములను త్యజించండి. మహదాశయముతో, ఆత్మోపాసనాభావముతో స్వధర్మసంబంధమైన కర్మలు నిర్వర్తించబడు గాక"** - అనునదే శాస్త్రముల, తత్త్వజ్ఞుల హృదయము.

శ్లో॥ **అయత్న ఉపనతేషు అక్షిః దృక్ ద్రవ్యేషు యథా మనః** → కళ్ళలో గల 'చూపు' అనే ఇంద్రియము ఎదురుగా గల ఒక దృశ్య వస్తువుపై ప్రసరించినప్పుడు మనస్సు ఆ వస్తువును 'ఇదికదా' అని రాగము లేకుండానే గుర్తించగలదుకదా! అట్లాగే,

**నీరాగమేవ పతతి తద్వత్ కార్యేషు ధీరధీః** → ధీరుని (ఉత్తమ **'ధీ'**శక్తి గలవాని) బుద్ధి- ఆయా నిర్వర్తించబడుచున్న - నిర్వర్తించని కార్యములలో, ఎట్టి రాగము లేకుండా - నిర్వికారంగా పాల్గొన గలదు.

మనమంతా కూడా మనస్సును, బుద్ధిని కొన్ని కొన్ని విషయాలలో రాగ రహితంగా నియమిస్తూనే ఉన్నాము. కొన్ని విషయాలలో మాత్రమే రాగము కలిగి ఉండటము జరుగుతోంది. కనుక **ఈ జీవుడు సమస్త కార్యవ్యవహారములలో రాగా-ద్వేషరహితుడై వ్యవహరిస్తూ ఉండటము సుసాధ్యమే!**

ఇక ఇంద్రియ విషయముల గురించి అంటావా? నిత్యానిత్యములు, ఆత్మతత్త్వము ఎరుగకుండానే ఇంద్రియ-విషయలోలుడై భోగించబడేదంతా ఈ జగత్తులో **దుఃఖమే పర్యవసానముగా కలిగి** ఉంటోంది. **పరిజ్ఞాయ ఉప భుక్తోహి భోగో భవతి తుష్టయే।** ఆత్మ గురించి పరిజ్ఞానము కలిగియుండి ఇంద్రియములతో విషయములను భోగించువాడు మాత్రమే ఇక్కడ దృశ్యములో "తుష్టి-సంతుష్టి-సంతృప్తి" పొందగలడు సుమా! *(జ్ఞానవానేవ బలవాన్! జ్ఞానవానేవ జీవతి। జ్ఞానవానేవ సుఖవాన్।)*

ఎవ్వరు తత్త్వమును ఎరిగి ఇంద్రియములను తమ అధీనములో ఉంచుకొని ధర్మబద్ధంగా విషయములను సేవించువారై ఉంటారో, వారికి మాత్రమే ఈ జగద్విషయములు **"సంతోషము కలిగించటము"** అనే ధర్మమును వదలక ఉంటాయి. లేదా, ఆ విషయములే శాశ్వత సంతోషము కలిగించకపోగా, **'విష సమానము'** - అవుతాయి. ఒక దొంగ తన ప్రియమైన స్నేహితునితో మైత్రి-సేవ భావాలే కలిగి ఉంటాడుగాని, బాధించాలనో, దొంగిలించాలనో అనుకోడు కదా! అట్లాగే **ఆత్మతత్త్వోపాసకుని పట్ల ఈ ఇంద్రియములు (అనే దొంగలు) ప్రేమభావము, సేవాభావమే కలిగి ఉంటాయి.** ఆత్మజ్ఞాని పట్ల ఇంద్రియములు, ఇంద్రియ విషయములు అణకువ (Humbleness) కలిగి ఉంటాయి. భక్తిశ్రద్ధలు గల సేవకులు అవుతాయి.

**నిదాఘుడు :** ఆత్మజ్ఞానుల విషయంలో ఇంద్రియ భోగములు ఏవిధంగా వారిచే చూడబడతాయి?

**ఋభు మహర్షి :** ఒక బాటసారి తనకు అత్యంత ప్రియమైన ప్రదేశమును చూడటానికి, అక్కడ ఉండటానికి ఉత్సాహ-సాహస-విజ్ఞానములతో కూడుకొని బయలుదేరాడు. త్రోవలో ఏవేవో కొంచము ఆశ్చర్యకరమైన, సుందరమైన విశేషాలు కనబడ్డాయి. వాటిని చూచి తన ప్రయాణం విరమించి, ఆ బాటలో కూర్చునిపోతాడా? లేదు. చిరునవ్వుతో చూస్తూనే తాను వెళ్లవలసిన గమ్యమునకు నడక కొనసాగిస్తాడు కదా! అట్లాగే, అఖండమగు ఆత్మను ఉపాసించి, సిద్ధింపజేసుకొనే కార్యక్రమములో నిమగ్నమై ఉన్న (యోగ-జ్ఞాన-భక్తి ఇత్యాది) ఉపాసకునకు మార్గమధ్యంలో సుఖ-దుఃఖ-సుందర విషయాలు తారసబడవచ్చుగాక। మనో నిగ్రహము కలవాని పట్ల అవన్నీ వచ్చేపోయే మార్గమధ్యంలోని విశేషాలుగా స్వల్పమాత్రమే అగుచున్నాయి. ఇక్కడ ఇంకొక ముఖ్య విషయము. **'మనో నిగ్రహము'** కలవానికి ఈ సమస్త జగద్విషయము (కర్మలు, దృశ్య విషయములు మొదలైనవి) ఉపకరణములే అవుతాయిగాని, అపకారకములు కావు.

**శ్లో॥ మనసో నిగృహీతస్య లీలా భోగో అల్పకోఽపి యః**
**తమేవా లబ్ధ విస్తారం క్లిష్టత్వాత్ బహు మన్యతే॥**

మనస్సును నిగ్రహించినట్టి మనోవిజయుల విషయంలో-భోగములు లేకున్నా, ఉన్నా కూడా.. వారి ఆనందమునకు లోటు ఉండదు. అనాయాసంగా లభించిన కొంచమునకే వారు విస్తారముగా, బహుగా తృప్తి -ఆనందములను కలిగి ఉండగలరు.

ఉదాహరణకు :-

ఒక మహారాజుగారు శత్రువులచే ఎక్కడో దట్టమైన అడవిలో కట్టివేయబడ్డారు. చాలాసేపు గడచింది. ఆకలితో నీరసించసాగారు. ఆకలితో విలవిల్లాడుచుండగా, ఎవ్వరో ఆటవికుడు అటువైపుగా వచ్చి చూడటం జరిగింది. "ఎవ్వరో కట్టివేయబడి ఆకలితో అలమట్టిస్తున్నారు పాపం"... అని తలచి గబగబ వెళ్లి ఆతడు కట్లు విప్పి, రాజుగారిని బంధము నుండి విడిపించి చూశాడు. అప్పుడు గుర్తించాడు. "వీరు మన మహారాజు కదా!" అని

**ఆటవికుడు :** ప్రభూ! మీరు ఆకలిగా ఉన్నారనుకుంటాను.

**రాజుగారు :** అవునయ్యా! అవును. నీవు నాకు కట్లు విప్పావు - సంతోషమే. కానీ ఆకలితో నాకు నోట మాట రావటల్లేదయ్యా! ఏమైన ఆహారము ఉన్నదా?

**ఆటవికుడు :** మహారాజా! ఆహారమైతే ఉన్నది. అయితే గడ్డిపచ్చడితో కలిపిన ఆహారము. మీరా, దేశమును పాలించే మహారాజు. అందుచేత, పదండి మిమ్మల్ని అంతఃపురానికి తీసుకువెళ్తాను.

**రాజుగారు :** వద్దులేవయ్యా! నీ దగ్గిర ఉన్న గడ్డిపచ్చడితో ఉన్న అన్నము, తోలుత్తిత్తి లోని నీరు ఇవ్వు.

**బంధముక్తో మహీపాలో గ్రాస మాత్రేణ తుష్యతి।** ఆ రాజుగారు ఆటవికుడు గడ్డిపచ్చడి కలిపి అందించిన అన్నపు ముద్దలను తింటూ "ఇదేమిటయ్యా! ఇంతటి మధురమైన, అమోఘమైన, రుచికరమైన ఆహారము నేను ఎప్పుడూ తిననే లేదు" అని ఎంతో తృప్తిని ప్రకటించాడు. *ఆహారము తింటూ, శత్రువులే లేనట్టి రాజ్యమును పాలించిన ఆనందం పొందాడు.* సర్వసంపద ఆ ఆనందం పట్టలేక, ఆటవికుని గృహమును సంపదలతో ముంచివేశాడు.

- ఈ కథలో వలెనే సంసార శృంఖములను "శాస్త్ర-గురు-విజ్ఞుల వాక్యములు".. అనే సహాయముతో త్రెంచివేసుకున్న ఆత్మతత్త్వానుభవి.. ఇక ఆపై ఏ కొంచెమునకు కూడా తృప్తి కలిగి ఉంటాడు. సర్వదా మహదానందమును విడువక, ఆత్మసుఖమునందే తేలియాడుచూ ఉంటాడు.

## మనోజయము

అందుచేత ఓ నిదాఘా! మొట్టమొదట నీవు నీ మనస్సును జయించి నీ వశం చేసుకోవాలయ్యా!

**శ్లో॥ హస్తం హస్తేన సంపీడ్య, దంతైః దంతాన్ విచూర్ణ్య చ**
**అంగాని అంగైః ఇవ ఆక్రమ్య, <u>జయేత్ ఆదౌ స్వకం మనః॥</u>**

చేతులు చేతులు నొక్కిపట్టి, పళ్ళతో పళ్లను కొరికి, శరీర అంగములను అంగములతో ఘర్షణ చేసి అయినా సరే, **ముందుగా నీవు నీ మనస్సును జయించివేయాలి.** సంసార సాగరమును దాటటానికి **"మనస్సును జయించటము"** తప్పితే వేరే ఉపాయమే లేదు. ఇక తక్కినవన్నీ మనస్సును జయించటానికి **సహకారి-ఉపాయములు మాత్రమే!**

**చావు పుట్టుకల** పరంపరలతో కూడిన **"మహానరకము"** అనే సామ్రాజ్యంలో **"దుష్కృతములు** (Bad Deeds), **వాటి దుఃఖ పరిణామములు"** అనే మదించిన ఏనుగులు విచ్చలవిడిగా అటూ-ఇటూ పచార్లు చేస్తున్నాయి. ఇక ఈ ఈజీవుని ఇంద్రియములు అనేక విషయములపై వ్రాలటం, అనేక ఆశలను కలిగి ఉండటం చేస్తున్నాయి. **"ఆశలు తీర్చడం"** అనే ధారణచే ఇంద్రియ శత్రువులను జయించటమనేది సాధ్యమైయ్యేది కాదు. (న జాతు కామః కామానామ్ ఉపభోగేన శామ్యతే)।

**"ఇంద్రియ విషయములను అంతరంగమున స్వీకరించకపోవటము"** అనే అభ్యాసము చేత మాత్రమే చిత్తము యొక్క దర్పము క్షీణించగలదు. చిత్తము జయించబడుచూ ఉండగా హేమంత ఋతువులో పద్మమువలె భోగవాసనలు క్షీణించగలవు.

భేదవాసనలు త్యజించి ఏకతత్త్వమగు ఆత్మయొక్క దృఢ-అభ్యాసము లేకపోతే హృదయములో 'వాసనలు' అనే బేతాళుడు లొంగడు. భేదదృష్టులు ఉన్నంత వరకు మనస్సు జయించబడదు. భేదదృష్టులే సర్వత్రా పెత్తనం చెలాయిస్తాయి. ఆత్మజ్ఞానముచే వివేకవంతుడై ఉన్న మనస్సు →

- ఆ జీవుని అభిమతములను (ఇష్టములను) నెరవేర్చటములో **'సేవకుడు'**గాను,
- సర్వ అర్థములు నెరవేర్చటములో 'మంత్రి' వలెను,
- 'ఇంద్రియములు' అనే శత్రుసేనను ఆక్రమించటములో రాజభక్తిగల **సామంతరాజులవలెను,**

**<u>సహకారము అందించునదై ఉండగలదు.</u>**

వివేకవంతుని (ఆత్మనిశ్చయము సిద్ధించినవాని) బుద్ధి - స్నేహశీలి అగు లలన (Lady servant) వలెను, పాలించటములో 'తండ్రి' వలెను, ఉత్తమ కార్యములు చేయించటములో **శ్రేయోభిలాషి** (మంచి స్నేహితుని) వలెను ఉండగలదు.

శుద్ధ మనస్సు తండ్రివలె - (1) శాస్త్ర అధ్యయనము (2) బుద్ధిని సునిశితము చేయుటము (3) ఆత్మభావన (4) స్వానుభవమునకు దారిచూపునది - అయి, ఉత్తమ విషయములలో ప్రవేశింపజేయగలదు.

విషయముల నుండి వెనుకకు మరలి ఆత్మయందు (సమస్తము ఆత్మగా భావించుట యందు) నియోగించబడిన 'మనస్సు' అనే మణి - హృదయములో స్వచ్ఛముగా, దృఢముగా, జ్ఞానైశ్వర్యవంతముగా, ఆత్మలక్షణ సమన్వితంగా, రమణీయంగా ప్రకాశిస్తూ ఉండగలదు.

ఓ అనఘా! బ్రహ్మన్ ! నిదాఘా! ఒక విలువైన రత్నము బురదలో పడిపోతే ఏమి చేస్తాము? అట్లాగే వదలి ఉంటామా? లేదు. బయటకు తీస్తాము. బూడిదవంటి పదార్థములతో అనేకసార్లు తోమి, కడిగి, శుభ్రమైన వస్త్రముతో పరిశుభ్రము చేసి,.. అప్పుడు మెడలో ఆభరణముగా ధరిస్తాము కదా! అట్లాగే మనస్సు – అనే మణిని "వివేకము" అనే జలముతో 'అవివేకము' అనే బురదను తొలగించి, యోగాభ్యాసముతో ప్రక్షాళన చేసి, 'ఆత్మభావన' అనే కాంతి పుంజములు వెదజల్లునట్లుగా శుభ్రపరచి, ఇకప్పుడు ధరించాలి. అప్పుడు దృశ్యమంతా **ఆత్మానందమయమై, ఆత్మకు అభిన్నమై** (అట్టి శుభమగు మనస్సుచే) **ఆస్వాదించబడగలదు.**

పరమగు (ఆత్మస్వరూప-స్వభావ అధ్యయనమగు) వివేకమును ఆశ్రయించి, బుద్ధితో 'సత్యము'ను దర్శించుచూ, ఇంద్రియములనే 'శత్రువును జయించి భవసాగరమును {భవము = ఈ జగత్తు బాహ్యముగా (ఆత్మకు వేరుగా) – నిజముగానే ఉన్నది అనే భావతరంగములను} దాటి ఆవలి ఒడ్డుకు చేరెదవుగాక।

→ **"ఈ జగత్తు నిజముగానే ఉన్నది. అస్తి"**.. అనుభావనా మాత్రం చేత అది సమస్త దుఃఖములు తెచ్చిపెడుతోంది – అని గమనించు.

→ (ఇదియే భవబంధము). 'అనాస్తి' (జగత్తు వాస్తవానికి లేదు) – అను భావనా మాత్రం చేత అట్టి భావన సర్వ సుఖాలకు ఆలయము అగుచున్నది. అందుచే ఓ నిదాఘా! "ఇంద్రియములకు విషయమై కనిపిస్తున్న ఈ జగత్తుగా ప్రకాశమగుచున్నది – **'నేనే! మమాత్మయే!"** – అను అభ్యాసమును – **అట్లా అనిపించే వరకు** – నిర్వర్తించు.

## వాసనలు – ఆశ

ఈ జీవులు – "వాసనలు (Tendencies)" – అనే తంతువులచే బంధించబడి "జగత్తులు" అనే నిస్సార మరుభూమిలో (ఎడారిలో) దిక్కుతోచక **'ఇటు నుంచి అటు – అటు నుంచి ఇటు'** పరుగులు తీస్తున్నారు. వాసనలు **"ఆశించటము"** నుండి బయల్వెడలుచున్నాయి. 'ఆశ' ఉన్నచోట దుఃఖములన్నీ (All worries) జట్టుకట్టుకొని వచ్చిపడతాయి. వివేక దృష్టి యొక్క సునిశితత్వముచే 'ఆశ' అనునది ఖండించబడిందా,.. సర్వ సుఖాలు వెతుక్కుంటూ వచ్చి ఈ జీవుని ఆశ్రయిస్తాయి.

**"స్వప్నములో కొన్ని కొన్ని విలువైన వస్తు జాలములు లభించాలి"** అని ఆశించి ఎవ్వడైనా నిద్రకు ఉపక్రమిస్తున్నాడా? లేదుకదా! జాగ్రత్ కూడా స్వప్నము వంటిదే! ఇది గ్రహించినవాడు జాగ్రత్తులో కూడా **"ఇంకా ఏదో కావాలి. పొందాలి"**–అని ఆశకు నిబద్ధుడు కాడు.

ఒకానొకడు ఎంతో తెలివి కలవాడు (ధీరుడు) అయినప్పటికీ, అనేక శాస్త్ర-లౌకిక విషయాలన్నీ తెలిసియున్నప్పటికీ, గొప్ప కులములో పుట్టినవాడు – సూక్ష్మగ్రాహి, చురుకుగలవాడు అయి ఉండి కూడా – ఒక సింహము బోనులో బంధించబడువిధంగా – **ఆశల బోనులో చిక్కుకుంటున్నాడు. బంధములన్నీ నెత్తిమీదికి తెచ్చిపెట్టుకున్నవాడు అగుచున్నాడు.**

ఎవ్వడైతే పురుషకారముచే ఉద్యమించి శాస్త్రము చెప్పు మార్గములో అనుద్వేగంగా యత్నశీలుడౌతాడో, జాగ్రత్‌ను స్వప్నతుల్యంగా త్యజించినవాడై ఉంటాడో, **అట్టివాడు ఎవ్వడైనా సరే, – సిద్ధిని ఎందుకు పొందడు? తప్పక పొందుతాడు.**

## అహంకార త్రయము

అహంకారములు మూడు రీతులై ఉంటున్నాయి.

**I సర్వమహమేవ-అహం కారము II అతఃపరమహమ్ కారము III దేహమేవాహమ్-కారము**

**I "<u>సర్వమహమేవ-అహంకారము</u>"** (All this is what I am / I am all this) **: నేను-నీవు- అది-ఇది-ఆతడు -ఈతడు – సమస్తము పరమాత్మస్వరూపమే! పరమాత్మ నుండి ఏదీ ఎన్నడూ చ్యుతి పొందక, సర్వదా అచ్యుతమైయున్నది. కనుక 'నేను స్వయముగా పరమాత్మనే।' సంవిత్ స్వరూపుడనగు నాకు వేరుగా ఎక్కడా ఏదీ కించిత్ కూడా లేదు. ఎందుకంటే నేను సహజంగా పరమాత్మ స్వరూపుడనే".**

**అహం సర్వం ఇదమ్ విశ్వమ్:** ఈ విశ్వమంతా నాయొక్క స్వరూపచమత్కారమే! నా యొక్క విశ్వరూపమే ఇదంతా। **(ఇదియే విశ్వరూప సందర్శన యోగము కూడా).**

**పరమాత్మాఽహమ్ అచ్యుతః।** నేను సర్వదా 'పరమాత్మ'ను అయిఉండి, అట్టి పరమాత్మత్వము నుండి కించిత్ కూడా జీవుడుగా గాని, విశ్వముగా గాని చ్యుతి (Distraction from what I am) ఏ మాత్రము పొందటమే లేదు.

**ఇదంతా నా యొక్క సంవిత్ ఆనంద స్వరూపమే.** ఇది సర్వోత్తమమైన **'అహంకారము'**. ఇది **జీవన్ముక్తుని యందు స్వాభావిక లక్షణమై** ఉంటుంది.

**(మత్తః పరరతరం నాన్యత్ కించిదస్తి। మయి సర్వమిదమ్ ప్రోత్రమ్ సూత్రే మణిగణా ఇవ)। "నేను ఈ సమస్తమునకు వేరై, ఈ**

**సమస్తము నాయందే జనించుచున్నదై - నాకు ఈ సమస్తము అనన్యమై** - ఉన్నది" - అనునదే **సర్వమహమ్-కారము.** అట్టివాడు "ఇదంతా నేనే' - అను ఆనందము నుండి చ్యుతి పొందకయే ఈ జగత్ - ఉద్యానవనంలో తదితరుల వలెనే సంచరిస్తూ ఉంటాడు.

II **అతః పరమ్ - అహంకారము / సర్వస్మాత్ అంతోఽ హం కారము** (I am always separate from all this) : - "నేను ఈ దృశ్యము ఏ ఒక్క వస్తువును కాదు. ఈ సమస్త దృశ్యము, ఇంద్రియములు, శబ్ద-స్పర్శ-రూప-రస గంథములు, మనో-బుద్ధి-చిత్త అహంకారములు - వీటన్నిటికంటే అత్యంత సూక్ష్మాతి సూక్ష్మ స్వరూపుడను.

ఈ సమస్తమునకు సర్వదా అతీతుడను. కేవల ప్రజ్ఞాస్వరూపుడను. తెలియబడే సమస్తమునకు వేరై, సమస్తము ఎరుగుచుండువాడను. (దృష్టాంతంగా - స్వప్నములో కనిపించే సమస్తమునకు - 'స్వప్నము తనదైనవాడు' సర్వదా వేరే కదా!)

నా యొక్క సమస్తమునకు పరమైన ఆత్మస్వరూపము వెంట్రుక యొక్క చిట్టచివరి అణుమాత్రము కంటే కూడా లక్షవవంతువలె - **మహాసూక్ష్మము.**

ఇట్టి **"సమస్తమునకు వేరైన నేనే నేను"** అనునది రెండవ తీరైన అహంకారము. ఈ విధమైన పరస్వరూప-సంకల్పము కూడా శుభప్రదమైనదే. పై రెండు అహంకారములు మోక్షమునకు మార్గములై జీవన్ముక్తుని స్వాభావిక లక్షణములు అయి ఉన్నాయి.

III **ఇదం శరీర మాత్రఽ అహంకారము।** "కాళ్ళు-చేతులు మొదలైన విశేషములతో కనిపిస్తున్న ఈ భౌతిక దేహమే (లేక) రూపమే నేను" - అను అహంకారము. ఇది లోక సంబంధమైనది. '3' విధములైన అహంకారములలో తుచ్ఛమైనది (Low state of Comprehension). ఇది సంసార దోషమునకు కారణమై, (ఆత్మను తిరస్కరించటంచేత), **దురాత్మకము.** అనేక దుఃఖములకు, అపార్థములకు, బంధములకు కారణం. అందుచేత ఈ భౌతిక దేహాహంకారము మొదలంట్ల త్యజించి ఉండవలసినది అయి ఉన్నది. ఇట్టి "దేహమాత్రమేవా ఇహమ్- నేను దేహమును మాత్రమే" - అను అహంకారము ఈ జీవుని అధోగతి పాలు చేయగలదు - అని ఆత్మ తత్త్వజ్ఞులు 'జాగరూకత'ను చేతులెత్తి ప్రకటించుచున్నారు. **"నాయనలారా! నిమ్నగతులను తెలిసి తెలిసి అనుసరించకండి! అవి అత్యంత దుఃఖ స్థానముల యొక్క స్వయంకృతము"** - అనునది వేదవాణి.

చిరకాలముగా (బహుకాలముగా) ఈ జీవుడు **"నేను దేహమును మాత్రమే"** అనే దురభిమానమును ఆశ్రయించి, అభ్యసించుటచేతనే - అట్టి దేహాహంకార భ్రమ ఘనీభూతమై 'అనిపించటము' (ఈ జీవుని పట్ల) జరుగుతోంది. **"ఆత్మను కదా!"** అని అనిపించటమును - **"దేహమునే కదా!"** అనే **దట్టమైన ఆవరణ** వచ్చి ఆవరించి వేస్తోంది. అట్టి దేహాత్మభావనను మొదలంట్లా త్యజించి, ఆపై శేషించే **చైతన్యరూపమగు, పరిశుద్ధమగు** కేవల - అహంకారమును ఆశ్రయించాలి.

(1) ఈ సమస్తము ఆత్మయే. నేను ఆత్మయే। కనుక ఇదంతా నేనే!
(2) ఆత్మదృశ్యముగా అగుటయే లేదు. సమస్తమునకు నాటక దీపములాగా ఇచ్చుకు కూడా అతీతమైన ఆత్మయే నేను. అందుచేత దేనిచేతను బద్ధుడుకాక. సర్వదా పరమ్ (ఆవల గల) ఆత్మనై ఉన్నాను.

**... ఈ రెండింటి సమాశ్రయముచే ఈ జీవుడు పరమశాంతుడై, ముక్తిని పొందగలడు.**

ఓ నిదాఘా! అలౌకికమగు మొట్టమొదటి రెండు అహంకారములను అంగీకరించి, లౌకికమగు (లోక సంబంధముచే ఏర్పడుచున్నదగు) మూడవ అహంకారమును నీవు తిరస్కరించివేయుము. ఎందుకంటే, **అదియే సర్వదుఃఖములు తెచ్చిపెట్టే అహంకారము కాబట్టి.** ఆ విధంగా పట్టుదలగా అభ్యాసము చేసిన తరువాత, ఇక..,

## సర్వాహంకార త్యాజ్యము

**శ్లో॥ అథ తే అపి సంత్యజ్య సర్వాహంకృతి వర్జితః**
**స తిష్ఠతి తథా అతి ఉచ్చైః, పరమేవ అధిరోహతి॥**

ఆ తరువాత మొదటి రెండు అహంకారములు కూడా మొదలంట్లా త్యజించివేయి.. ఆ విధంగా సమస్త అహంకారములు త్యజించినవాడు **సర్వోత్తమము** అగు పరమపదమును అధిరోహించగలడు.

## బంధము - ముక్తి

- భోగముల పట్ల ఇచ్ఛ కలిగి ఉండటమే **'బంధము'**
- అట్టి భోగేచ్ఛను హృదయము నందు త్యజించి ఉండటమే **'మోక్షము'.**
- **మనో అభ్యుదయో నాశో** - మనస్సు యొక్క వృద్ధియే **(ఆత్మజ్ఞానము యొక్క ఏమరుపురూపమగు) నాశనము.**
- **మనోనాశో మహోదయః** - మనో నాశనమే (ఆత్మసూర్యుని) మహోదయము.

- **జ్ఞ మనోనాశమ్ అభ్యేతి** – జ్ఞానియందు మనస్సు నాశనము స్వాభావికంగానే జరుగుతుంది.
- జ్ఞాన సమన్వితమైన మనస్సే **ఆత్మ సాక్షాత్కారము** అనే అభ్యుదయము **ప్రసాదిస్తోంది.**
- **మనో అజ్ఞస్య హి శృంఖలా** – అజ్ఞానముతో కూడిన మనస్సే జీవునికి బంధము.

జ్ఞాని యొక్క మనస్సు ఎట్టిదంటే..,

- ఆనందము కాదు. అనానందము (నిదానందము) కాదు। (Neither Pleasant nor Un-pleasent)।
- అది చలించునది కాదు. చలించనిది (అచలము) కాదు. (స్థిరము కాదు) (Neither fixed nor variable)।
- సత్తు కాదు. అసత్తు కాదు. (Neither existent, Nor Non - existent). ఆ రెంటి మధ్యలోది కాదు. **(Nor-dual).**

**సత్తు–అసత్తుల మధ్య 'నిశ్చలతత్త్వము'గా ఉన్నదే జ్ఞానియొక్క మనస్సు.** పంచభూతములన్నిటిలో ఆకాశము అత్యంత సూక్ష్మము కాబట్టి అది కళ్ళకు కనిపించదు. అట్లాగే అంశరహితము (నిరంశము) అగు చిత్ తత్త్వము తన యొక్క భావనారూపంగా సర్వత్రా విస్తరించినదై ఉన్నప్పటికీ, అది కళ్ళకుగాని, మనస్సుకుగాని – ఒక వస్తువు వలె తెలియబడదు.

***సర్వ సంకల్పములు లేనట్టిది. సంకల్పములకంటే మునుముందే ఉన్నట్టిది. ఏ సంజ్ఞ చేతనూ నిర్వచించి చెప్పబడజాలనిది. చిత్ (ఎరుక) స్వరూపము. అట్టి చిదాకాశము ఈ జీవుని 'స్వాత్మ' గానే వెల్లివిరుస్తోంది.***

బ్రహ్మజ్ఞుల అనుభవములో ఆత్మ →

- ఆకాశము కంటే వందవందలంతగా సూక్ష్మమైనది.
- నిత్యము, శుద్ధము, నిర్మలము.
- ఇక్కడి సంసార దోషమునకు వేరైనట్టి అనునిత్య – **"ఆత్మయేవ ఇదగ్ం సర్వమ్"** సందర్శన రూపము.

## ఆత్మ యొక్క విశేషణములు

**ఇంకా కూడా :–**

**అట్టి నేను – నీవు – ఈ సమస్త జగత్తులను – తన ప్రదర్శనముగాను, 'తనకు అనన్యము' గాను కలిగి ఉన్నట్టి ఆత్మ (లేక) నిత్యోదిత చైతన్య– ఆత్మస్వరూపము – ఎటువంటి విశేషణములు కలిగి ఉన్నదో చెప్పుకుంటున్నాము. విను :–**

**న అస్తమేతి। న ఉదేతి।** భూమిపై మనకు సూర్యుని ఉదయము – అస్తమయము అనేవి, తద్వారా రాత్రి – పగలు అనేవి కళ్ళకు కనిపిస్తూ ఉన్నాయి. వాస్తవానికి అనునిత్య స్వయం ప్రకాశకుడై ఉండగా సూర్యునికి ఉదయ – అస్తమయములు ఉన్నాయా? ఎక్కడున్నాయి? అట్లాగే ఈ జీవుని కేవల – సత్య –నిత్య – అఖండ – అప్రమేయ స్వరూపమగు ఆత్మకు **'ఉదయించటము'** – అనే ధర్మమే లేదు. **'అస్తమించటము'** అనే ధర్మము కూడా లేదు.

**న చ యాతి। న చ అయాతి।** "ఈతడు ఒక ఊరు వదలి మరొక ఊరు వెళ్ళివచ్చాడు" అని అంటున్నప్పుడు ఆతని శరీరము "ఉన్నచోటు", "వెళ్లినచోటు" – "తిరిగి వచ్చినచోటు"... ఈ మూడూ ఉండవచ్చుగాక! కానీ ఆ సందర్భములలో 'నేను' అనునది – ఎక్కడికీ వెళ్ళదు – ఎక్కడ నుండో ఇక్కడికి రాదు. ఆ మూడు సందర్భములలో **'నేను'** అనునది సర్వదా **'నేను'**గానే ఉంటోంది కదా!

అట్లాగే, ఆత్మ ఇక్కడి నుండి ఎక్కడికీ వెళ్ళదు. ఎక్కడి నుండి ఇక్కడికి రాదు.

**కలలో ఒకడు మరొక ఊరు వెళ్లినా కూడా, కల తనదైనవాడు కలలో ఎక్కడి నుండి ఎక్కడికి వెళ్ళదు, ఎక్కడి నుండి ఎక్కడికి రాదు కదా!**

**– న చ నేహ – న చ ఇహ చిత్।** చిత్ స్వరూపమగు ఆత్మ **"ఇక్కడ లేదు"** అనలేము. **"ఇక్కడే ఉన్నది".** అనలేము. 'ఇక్కడ – అక్కడ' అనునది భూమి మొదలైన పంచభూతములకు ఉండవచ్చు గాక! **ఆకాశమునకే జనన స్థానమగు ఆత్మకు** – ఆకాశము యొక్క ధర్మములు అగు 'ఇక్కడ – అక్కడ' అనే ధర్మములు ఏ మాత్రము లేవు.

**ఓ నిర్మలహృదయా!** ఆత్మకు ఎట్టి దోషములు అంటజాలవు. **నిర్వికల్పము.** ఎట్టి సంకల్ప వికల్పములు లేనట్టిది. ఉభయము కంటే మునుముందే ఉన్నట్టిది. కల్పముల ఆదికి అంతమునకు సాక్షి అయి, పరమై ఉన్నట్టిది. **నిరాస్పదా।** నిత్య నిర్మల స్వభావము కలిగి ఉన్నట్టిది.

## గురువు – శిష్యునికి ఆత్మ బోధ

అట్టి ఆత్మ గురించిన తత్త్వశాస్త్రసారము – గురుముఖతః **"నీవు ఆత్మవు! దేహము మొదలైన మరింకేమీ కావు। అఖండాత్మ కాని క్షణము ఎప్పుడూ లేదు। సదా శివుడవు!"** – అను **మహత్తర – పరమ సత్యమును శ్రవణం** చేయాలి. ఆ తరువాత **"జన్మకర్మలకు సంబంధించని పరస్వరూపము స్మరణం చేయాలి. "ప్రాపంచక ద్వంద్వములు (పాప పుణ్యములు మొదలైనవి), బంధుత్వాదులు మొదలైనవి ఆత్మగా నాకు నియమితము కాదు"** అను గురువాక్యమహార్థ **మననం** చేయాలి.

అయితే గురువు శిష్యునికి **పరాకాష్ఠ - పరమాత్మకమగు పరతత్త్వమును** శిష్యునికి బోధించటానికి ముందుగా..,

**ఆదౌ శమ దమ ప్రాయైః గుణైః శిష్యం విశోధయేత్।** *శిష్యుని యొక్క శమమును, (అంతరింద్రియ - మనో చిత్త - బుద్ధుల ప్రశాంతతను), దమము (బాహ్యేంద్రయముల నియామక సామర్థ్యము)ను పరిశీలించి ఆత్మ విద్యను బోధించాలి.*

(శమము = withdrawn from outer - worldly events. దమము = Appointing 'Indrias' towards Absolute SELF)

"శిష్యుడు మహత్తరమగు సత్యమును తనయొక్క స్వధర్మముల పట్ల తిరస్కారము లేకుండానే ప్రజ్ఞావంతుడై, గమనించి, ఆకళింపు చేసుకొని, అనువర్తించగలడు." - అని తృప్తి చెందిన తరువాత గురువు అప్పుడిక - **పశ్చాత్ "సర్వమ్ ఇదం బ్రహ్మ శుద్ధః త్వమ్" ఇతి బోధయేత్।, "ఓ బిడ్డా! ఈ కనబడేదంతా నీ యొక్క శుద్ధమగు పరబ్రహ్మస్వరూపమే! అంతేగాని, ఇది ఏదీ నీకు అన్యము కాదు. సమస్తమునకు అనన్యమైయున్న ఆత్మయే సర్వదా నీ నిజ సహజ - వాస్తవ స్వరూపము"** అనే అఖండాత్మ గురించిన సత్యమును యుక్తియుక్తంగా బోధించాలి.

**అజ్ఞస్య, అర్ధ ప్రబుద్ధస్య 'సర్వం బ్రహ్మేతి' యో వదేత్, మహానరక జాతేషు, స తేన వినియోజితః।**

అజ్ఞానికి, అర్ధజ్ఞానికి (ఏమీ తెలియనివానికి, కొన్ని సిద్ధాంతములకో, సూత్రములకో పరిమితమై, మహత్ సత్యమునకు సంసిద్ధత లేనివానికి), (అనగా) "నాకు తెలిసిందే సత్యము. ఇంతకుమించి ఎవ్వరు చెప్పినా వినను. ఎవ్వరికీ తెలియదు"- అనే పరమార్ధ సమాచారమునకు సిద్ధపడని వానికి (మూర్ఖబుద్ధి కలవానికి) 'అంతా బ్రహ్మమే' అని చెప్పబూనటమనేది - ఆ చెప్పేవాడు కూడా తన 'తత్త్వమార్గము' నుండి దారితప్పి, 'మహానరకమార్గము'ను ఆశ్రయించటము అవగల ప్రమాదము.

## గురువు బోధింప తగిన - బోధింప వలసిన శిష్యుడు

- ఎవరి బుద్ధి ప్రబుద్ధము (Alert and awakened) అయి ఉన్నదో...,
- భోగేచ్ఛ కించిత్ కూడా లేకుండా ప్రక్షాళనమై (became completely clean) అయి ఉంటుందో.
- ప్రాజ్ఞులగు గురువుల ప్రవచనముచే అమలమగు అవిద్య అంతా నాస్తి (మొదలంట్లా రహితము) అయి ఉండగలదో..,

అట్టి వానికి స్వస్వరూప-ఔన్నత్యము, స్థానము, గాంభీర్యము, సమస్తమునకు పరము, సమస్తము అగు-**ఆత్మ** గురించి తప్పక బోధించాలి. **'తత్ త్వమ్'** అను **"నిరూపణ, జాగరణ"**లతో నిండిన పూర్ణార్థముతో గురువులు బోధించెదరుగాక. ఇక శిష్యుడో,...శ్రవణ మననములు చేసి, - అనుకోవటము - అనిపించటము' అను మనన-నిది ధ్యాసలకు ఉపక్రమించాలి. ఆత్మయే తానై ఆస్వాదించాలి (సమాధి).

## చిత్ సత్తయే జగత్ సత్త

**సతి దీప ఇవ అలోకః।** దీపము వెలుగుచున్నప్పుడే చీకటిలోని వస్తువులు సాకారమై కనిపిస్తాయి.

**సతి అర్క ఇవ వాసరః।** సూర్యుడు ఉంటేనే రాత్రి - పగలు, వారములు మొదలైన వాటికి ఉనికి.

**సతి పుష్ప ఇవ ఆమోదః। -** పుష్పము ఉంటేనే **'సువాసన'** ఉంటుంది.

**అట్లాగే... చిత్ సత్తయే - జగత్తు యొక్క సత్త అయి ఉన్నది. చితి సత్ యాం జగత్ తథా।** చిత్ ఉంటేనే జగత్తు ఉంటుంది.

ఈ జగద్దృశ్యమంతా కూడా అద్దములోనో, నీటిలోనో ప్రతిభాస (Reflection and Refraction) వంటిది మాత్రమే. పరమార్థతఃగా → సర్వదా బ్రహ్మ**మే ఉన్నది. జగత్తు అనబడునది స్వతఃగా ఉన్నది కాదు. "భావన" యొక్క చమత్కారం చేత స్వతఃగా ఉన్నట్లే అగుపించటము, అనిపించటము జరుగుతోంది.**

ఓ నిదాఘా! "ఈ జగత్తు స్వతఃగా ఉన్నది కాదు. ఇదంతా ద్రష్ట యొక్క ఊహారచన మాత్రమే' అని నేను చెప్పుచున్న ఈ వాక్యము యొక్క మహదర్థము - జ్ఞాన దృష్టిచే నీ యొక్క ప్రసన్నమైన, ప్రబోధము వికసించగా, నీ యొక్క బుద్ధికి స్వాభావికమై, స్వానుభవమవగలదు. నేను చెప్పు - "జగత్తు మనో కల్పితము మాత్రమే" - అను నా వాక్ దృష్టి యొక్క **"స్వకీయ అవగాహనా బలాబలములను"** అనుసరించి, నీవు ఆత్మతృప్తిచే 'స్వస్థుడవు' (లేదా) ప్రబుద్ధుడవు అగుచుండగలవు.

హే బ్రహ్మన్!

ఆత్మజ్ఞానోదయముచే ఈ ఇంద్రియ జగద్దృశ్య సంబంధమైన **"స్వప్నమాత్ర కల్పితత్వము"** యొక్క బుద్ధి నిశ్చయమును నిశ్చలముగా పొందగలవు. నా యొక్క "తత్ త్వమేవ" అను గురువాక్యము యొక్క విశ్వాసముచే బుద్ధి నిశ్చలము కాగలదు. 'నేను - నాది' మొదలైన రూపములతో ప్రదర్శనమగుచున్నదంతా అవిద్యయే! **ఆత్మవిద్యయే సర్వ మానసిక రోగములకు నివారణోపాయము.**

**శామ్యతి హి అస్త్ర మంత్రేణ :** శత్రువు ప్రయోగిస్తున్న అస్త్రము - తిరిగి అస్త్రమంత్రము చేతనే శమిస్తోంది.

**మలేన క్షాళ్యతే మలమ్:** పాత్రకు అంటిన ధూళి వంటి మలము – బూడిద వంటి మలము చేతనే తొలగగలదు.

**శమం విషం విషేణైతి। :** విషము విషము చేతనే విరుగగలదు.

**రిపుణా హన్యతే రిపుః :** శత్రువును శత్రువే నిర్జించగలడు. మాయా సాధనములచేతనే మాయను ఎదుర్కోగలం.

**ఈ దృశీ భూతమాయే అయం యా స్వనాశేన హర్షదా।**

ఈ ఎదురుగా కనిపిస్తున్న పాంచభౌతిక సాకారమాయా దృశ్యబంధమంతా తనను తానే నశింపజేసుకొన్నప్పుడు (బంధము తొలగి) హర్షము పొందుచున్నది.

***మాయ యొక్క అసలైన రూపమేమిటి?***

వెలుతురు లేకుండటమే చీకటి కదా! ఆత్మ యొక్క స్వరూపము గురించి ఏమరచి ఉండటమే మాయ.

***"అసలు మాయ యొక్క వాస్తవ స్వరూపమేమిటి?"*** అని అధ్యయనము చేసి, పరిశీలించి చూస్తే **"స్వకీయ కల్పనకు వేరుగా 'మాయ' అనునది మొదలే లేదు"** – అనియే తెలియవస్తోంది. భావనచే అనుభవమగుచున్న మాయ పరమార్థంగా చూస్తే నిలువజాలదు. సర్వం **ఖల్విదం** బ్రహ్మ– **"సమస్తము బ్రహ్మమే – అని వేదవచనమై ఉండగా, బ్రహ్మమునకు వేరై 'మాయ' గాని, మరొకటిగాని ఎక్కడ ఉంటుంది?"** – అను అవగాహన ముక్తిదాయకము.

## అవిద్య

**నిదాఘుడు :** గురుదేవా! 'మాయ' యొక్క చమత్కారమంతా 'అవిద్య' చేతనే రూపుదిద్దుకోబడుచున్నది – అని శాస్త్ర వచనం కదా! మరి అవిద్య యొక్క అసలైన రూపము ఏదై ఉన్నదని ముముక్షువులమగు మేము సమన్వయించుకోవాలి?

**ఋభు మహర్షి :** ఓ నిదాఘా! సర్వత్రా ఆత్మ దృష్టిని ఆశ్రయించి, అద్దానిని అనుక్షణికం చేసుకొనే ప్రయత్నమే విద్య. భేద దృష్టియే అవిద్య. **"సమస్తము పరబ్రహ్మస్వరూపముగా అనుకుంటూ ఉండటము"** ద్వారా – అవిద్యను సాధనాక్రమంగా విసర్జించి వేయాలి సుమా! అవిద్యచే స్వస్వరూప భావనను చేజార్చుకొనబడుతోంది. విద్యచే సమస్తము స్వస్వరూపముగా పొందబడుతోంది. అట్టి **పరబ్రహ్మము అక్షయమగు పదము.**

## "మాయ"

**నిదాఘుడు :** ఈ జీవుడు సర్వదా ఆత్మస్వరూపుడే అయి ఉండగా, మరి మాయ అసలు ఎక్కడి నుండి జనించి, బయల్వెడలుతోంది? ఎందుకు? ఎప్పటి నుండి ఎవ్వరు కారణంగా 'మాయ' ప్రారంభమగుచున్నది?

**ఋభు మహర్షి :** ఓ మునీ! ద్విజశ్రేష్ఠా!

**"కుతో జాతేయమ్?" – ఇతి తే మాస్తు విచారణా!** "మాయ ఎప్పటినుండి, ఎట్లా జనించింది?" – అనేది నీవు విచారణ చేయవలదు. ఎందుకంటే సమాధానము దొరకదు కూడా. అందుకు ఆవశ్యకత కూడా లేదు. **"ఒక రోగము ఏతీరుగా ఎక్కడి నుండి ఏఏ కారణల వలన, ఏఏ ఆహారాదుల వలన వచ్చిపడింది?"** – అనే ప్రశ్న కంటే కూడా, **"ఆ రోగము ఉపశమించటానికి వైద్యము ఏమిటి?"** – అనేదే ముఖ్యమైన ప్రశ్న కదా! అందుచేత, **"ఇమాం కథమ్ అహం హస్మి?" – ఇతి ఏషా తే అస్తు విచారణా! "ఈ మాయను నేను ఎట్లా జయిస్తాను? సాధనలేమిటి? ఉపాయాలు ఏమిటి?"** – అని నీవు విచారణ చేయటమే అవసరము. నీకు శోభాయమానము. ఆత్మ విచారణచే మాయ (లేక) అవిద్య నశిస్తూ ఉండగా, నీవు పరమదము తప్పక (యోగ సంసిద్ధః కాలేన) నీయందే ఎరుగ గలవు. ఇక్కడే ఇప్పుడే తత్‌పదమును సిద్ధించుకోగలవు.

సహజము, కేవలము, నిత్యము అగు నీ **స్వస్వరూపాత్మ యొక్క ఔన్నత్యమును గ్రహిస్తూ ఉండగా, అప్పుడిక 'మాయ' ఎప్పుడు, ఎట్లా జనించిందో నీకే తెలిసిపోతుంది.** ఎటు పోతోందో కూడా చెప్పలేము. దీపం వెలిగిస్తే చీకటి ఎటుపోతోంది? – ఏమని నిర్వచించగలం?

> శ్లో।। **యత ఏషా యథా చ ఏషా యథా నష్టేతి అఖండితమ్,**
> **తత్ అస్య అరోగశీలాయా యత్నం కురు చికిత్సనే,**
> **యథ ఏషా జన్మదుఃఖేషు న భూయః త్వాం నియోక్ష్యతి।**

వ్యాధి యొక్క చికిత్స కొరకై వైద్యుని సమీపించినప్పుడు, **"అయ్యా! వైద్యుల వారూ! ఈ వ్యాధి నాకు ఎట్లా ఎప్పుడు ఏమి తినటం చేత నాకు వచ్చిందో పరిశోధన చేసి చరిత్ర అంతా చెప్పండి. అదంతా నేను ముందుగా తెలుసుకోవాలి!"**.. అని తీరికగా కూర్చుని అంటామా? అనము. "అయ్యా! ముందు రోగం ఏమిటో కనిపెట్టి ఔషధం ఇవ్వండి. ఏఏ కారణాల సమూహములచేత ఎప్పటి నుండి ప్రారంభం అయి ఇప్పటికి ఇట్లా 'రోగము'గా అయినా కూడా, ముందు ఇది ఉపశమిస్తే గాని బాధ తొలగదు కదా!".. అని అంటాము / అనుకుంటాము. అట్లాగే ఓ నిదాఘా! సంసార రోగము (ఆత్మను ఏమరచి ఉండటం, దృశ్యములోని భేదమునంతా చూస్తూ క్రింద

–మీదా అగుచూ–ఇదంతా సత్యమే। భవమే”–అను సత్యదృష్టితో సుఖదుఃఖాలు అనుభవిస్తూ జన్మ–జన్మాంతర చక్రములో తిరుగాడటము) నకు చికిత్సను ఆశ్రయించటం ముందుగా చేయవలసిన పని. అటు తరువాత సంసారరోగము శమిస్తూ ఉంటే.., “అవిద్య అనేది ఏ లీలా–క్రీడా క్రమంగా (ఏకుగా వచ్చి మేకుగా అయింది? – మొదలైన) ఆయా విశేషాలు నీకే తెలిసిపోతాయి.. **“లేనిది ఉన్నదనుకోవటం, ఉన్నది ఏమరచి ఉండటమే మాయ”** (లేక) సంసారము (లేక) అవిద్య – అనునది సుస్పష్టమౌతుంది. ఇక ఆపై జన్మ కర్మ దుఃఖములందు తిరిగి మరల ప్రవేశించవు. నీ నిర్మలమగు కేవల స్వరూపముపై జన్మ–కర్మ–దుఃఖములను ఇక మరల **ఆపాదించవు.**

## ఏకము – అఖండము – అద్వితీయము

సముద్ర జలంలోనే తరంగములు జలమునకు అనన్యమై అసంఖ్యాకంగా బయల్వెడలుచున్నాయి. ఎన్ని తరంగములు ఎంతగా బయలుదేరి సంచరిస్తూ ఉన్నా కూడా, ఆ సంచారమంతా జరుగుచున్నది ఎక్కడ? జలములోనే కదా! జలమే తరంగములుగా అవుతోంది. అంతేకాదు. సముద్రంలో ఎన్ని తరంగాలు బయల్వెడలుచూ కనిపిస్తూ ఉన్నప్పటికీ సముద్రజలము సర్వదా ఏకము–అఖండము కూడా!

అట్లాగే,

> *స్వాత్మయే అయి ఉన్న చిత్ ఆనంద మహాసముద్రములో పరిస్పందములు (Waves of Inspirations / Responses) చిత్ ఆనంద స్వరూపములే–అయి, బయల్వెడలుచున్నాయి. ఈ జగత్ రూపస్పందనలు తిరిగి చిత్ సాగరములోనే లయిస్తున్నాయి. అయినప్పటికీ చిత్ చైతన్యము (The Blossoming of knowing of self / As self) సర్వదా ఏకము, అఖండము కూడా! తెలియబడేది అనేకము అయినప్పటికీ అవన్నీ కేవలమగు ‘ఎరుక’ నుండియే బయలుదేరుతూ ఉన్నాయి. **“ఎరుగబడేదంతా స్వకీయమగు ఎరుకకు అనన్యము కూడా!”** – అను దృఢమైన అభ్యాసమును సర్వదా ఆశ్రయించి ఉండుము.*

**“చిద్రూప** సాగరమునందు – చిద్రూపమే – **‘జగత్తులు’** అనే తరంగరూపాలుగా స్పందిస్తోంది. **‘ఎరుక’**యే ఎరుగుబడుచున్న సమస్తముగా అయి, అనేక రూపములు దాల్చుచున్నది.

– వాయువే వాయు తరంగాలుగా అగుచున్నట్లు, **స్వస్వరూపాత్మయే స్వస్వరూపము నందు జగత్తులుగా అగుపిస్తోంది.**

చిచ్ఛక్తియే తనయందుతాను ఈ అనేకములతోకూడిన సమస్త దృశ్యముగా వెలయుచున్నది.

## చిచ్ఛక్తి! చేతనా రూపా! జడశక్తిః! జడాత్మికా!

ఓ నిదాఘా! నీ యొక్క ఆత్మచైతన్యమునందే ఆత్మశక్తి బయల్వెడలుతోంది. ఆత్మలోని ఆత్మశక్తియే ‘స్పందనశక్తి’ కూడా!

– అట్టి స్పందనరూపము సర్వశక్తిమయమై, అనునిత్యంగా ప్రత్యుత్సాహ సమన్వితమైయున్నది.

**“ఆది స్వరూపము”** అగు నీ చిదాత్మయందు మొట్టమొదట దేశ–కాల–క్రియలు (The Place Factor, The Time Factor and the Function Factor) లేవు. అనగా ఏ నీయొక్క మహోన్నత స్థానములో దేశ–కాల–క్రియాదులు ఏమాత్రము స్ఫురించవో,... అదియే చిచ్ఛక్తి.

> **శ్లో॥ దేశకాల క్రియాశక్తిః న యస్యాః సంప్రకర్షణే**
> **స్వస్వభావం విదిత్వ ఉచ్చైః అపి అనంత పదే స్థితా।**

అట్టి చిచ్ఛక్తి తన యొక్క స్వస్వభావము ఎట్టిదో ఎరుగుచూ ఉన్నప్పుడు **“అత్యుత్తమము, అనంతము”** అను పదమును అధిష్ఠించినదై ఉంటోంది. స్వస్వభావమును ఏమరచి ఉన్నప్పుడో,.. జీవుడు, ద్రష్ట – దర్శన – దృశ్యములు, వస్తు – విషయప్రియత్వము మొదలైన ఆయా విశేషాలతో (స్వస్వరూప ఔన్నత్యము విడువకుండానే) తన్మయమై ఉంటోంది.

అనగా, స్వస్వభావమను సంభావించకుండా.. ఏ సమయ–సందర్భములలో ఏ రూపమును భావన చేస్తూఉంటే, ఆ సందర్భ – సమయములలో ఆరూపమే – అత్యంత ఉత్సుకతో, రమ్యముగా – ధరించి, **‘అదియే తానై’** – ఉంటోంది. ఎప్పుడు, ఎంతవరకు ఇష్టాపూర్వకంగా భావన చేస్తూ ఉంటే..,

- అంతవరకు తనను గురించిన అఖండాత్మ భావనను ఏమరచుచున్నది.
- అంతంత వరకు నామ–రూప–సంఖ్యాత్మకమైన అనుభూతులతో, సంకల్ప – వికల్పములకు ఆకాశము (స్థానము) అయి అద్దానిపై తన యొక్క సత్యత్వము – నిత్యత్వములను ఆపాదించి, అట్లే అనుభవముగా పొందుచున్నది.

## క్షేత్రజ్ఞుడు। అహంకారము। మనస్సు। బంధము।

హే బ్రహ్మన్! చిద్రూపముగా “ఏది ఎట్లు సత్యత్వమును ఆపాదించి ఎరుకగా పొందుచున్నదో – అట్టి ప్రజ్ఞయే **“క్షేత్రజ్ఞుడు”** (The one who is knowing the field of all else)గా పిలువబడుతోంది.

అట్టి చిచ్ఛక్తిరూప క్షేత్రజ్ఞుడు "ప్రియ–భావ–ఆవేశముల" రూపములగు వాసనలను తనకు తానే వినోదముగా సృష్టించుకొని **"–నేను వీటికి చెందినవాడను. ఇవన్నీ నాకు చెందినవి!"** అను రూపము గల **"అహంకారము"** (I and My)ను పొందుచున్నాడు.

→ అహంకారము దృశ్యమునకు సంబంధించిన "కలిగియుండటము (Possessing)" అనే దోషము (లేక) కళంకముతో కూడి ఉంటున్న సందర్భములో, పరిమితత్వము, సంకుచితతత్వము సంతరించుకుంటోంది.

→ ఆ అహంకారము విధి నిషేధములను, నిశ్చయముగా కలిగియుండగా – కలనము. **"నిశ్చయాత్మకమగు బుద్ధి"** (The opinion and decision maker-form of Inteligence)" – అని చెప్పబడుతోంది.

→ ఆ బుద్ధి **"సంకల్పించటముచే – వస్తువుతో సంకల్పితాకారము"** సంతరించుకొంటున్నప్పుడు **"మనస్సు"** అని పిలువబడుతోంది.

→ మనస్సు యొక్క ఘనీభూతమై (strongly materialized) సంకల్ప వికల్పముల కారణంగా ఆత్మ చైతన్యమే → చూపు – వినికిడి – స్పర్శ – రుచి – సువాసన → ఇత్యాది ఇంద్రియార్థములు, (+) ఇంద్రియరూపము దాల్చుచున్నది.

క్రమక్రమంగా మెల్లమెల్లగా కాళ్ళు–చేతులు, కళ్ళు–చెవులు మొదలైన కర్మేంద్రియ–జ్ఞానేంద్రియ ప్రదర్శనములను (Delivery Points)కు ఆధారమైయున్నదే భౌతికదేహము దాల్చుచున్నది ***–అని బుధులు – ఆత్మయొక్క సంకల్పచమత్కారము గురించి అభివర్ణించి చెప్పుచున్నారు.***

ఈ విధంగా ఆత్మయొక్క 'సంకల్పము' అనే అంశచే ఉత్పన్నమగుచూ, రూపము దిద్దుకొంటున్న ఈ 'జీవుడు' (జీవితము – అనే స్థితి యొక్క అభిమాన స్వరూపుడు). "చమత్కారమా!" అను విధంగా, ఇంద్రియ విషయ దృశ్యమునకు 'బద్ధుడు' అగుచున్నాడు. సంకల్పముల – అభ్యాసవశంగా రూపుదిద్దుకొంటున్న **వాసనలు.** (Tendencies that are formed because of operation of thought attached to interest and fondness) - అనే **పాశములలో** (Ties of Ropes) బంధించబడుచున్నాడు. క్రమంగా అంతులేని దుఃఖములలో (In Uncountable series of Worries)లో చిక్కుకొని స్వస్వరూపము గురించిన అపార్థములతో కూడిన అనేక నీచ స్థానములు పొందుచున్నాడు.

**శ్లో॥ ఇతి శక్తిమయం చేతో ఘన – అహంకారతాం గతమ్,**
**కోశకార క్రిమి – ఇవ స్వేచ్ఛయా యాతి బంధనమ్॥**

ఈ విధంగా సర్వత్ర వెలయు స్వరూపము గల–మహత్ శక్తిగల చైతన్యము–అహంకారమును (వ్యష్ఠిగతమైన **నేను–నాది**లను) అనుసరించిన కారణముచేత, ఇంద్రియ భోగముల ధ్యాసలలో చిక్కుకొని బంధమును తెచ్చిపెట్టుకుంటోంది. {భూతమయ(Matter)– ప్రాణమయ–మనోమయ–విజ్ఞానమయ–ఆనందమయ} కోశములలో చిక్కుకొని సర్వశృంఖలములను (Bondages) తెచ్చిపెట్టుకొని మరీ అనుభవిస్తోంది.

స్వసంకల్పితమైన పంచతన్మాత్ర (శబ్ద స్పర్శ రూప రస గంధ నిర్మితమైన) పంజరంలో బద్ధము అగుచున్నది. బోనులో చిక్కిన సింహమువలె అనుభూతులు – అనుభవములలో చిక్కుకొని ఉంటోంది.

చిచ్ఛక్తియే ఒక్కొక్కసారి **"మనస్సు"** రూపముగాను, **"బుద్ధి"** రూపముగాను, **"జ్ఞాన"** రూపముగాను, **"క్రియా"** రూపముగాను, **"అహంకార"** రూపముగాను, **"చిత్తము"** రూపముగాను.. ఆయా రూపములన్నీ (ఒకే మనస్సు వినటము, చూడటముచేయు విధంగా) అగుచున్నది.

చిచ్ఛక్తియే ఆయా ఒక్కొక్క సందర్భములో **'ప్రకృతి'** రూపముగాను, **'మాయ'** రూపముగాను, **'మలదోషము'** రూపముగాను, **'కర్మ'** రూపముగాను **'బంధము'** రూపముగాను, **పుర్యష్టకము** (పంచభూతములు + మనో – బుద్ధి – చిత్తములు) రూపంగాను చెప్పబడుతోంది.

– ఒక సందర్భములో చిచ్ఛక్తియే **'అవిద్య'**. మరొక సందర్భములో అదియే **'ఇచ్ఛ'**.

ఒక చిన్న మట్టి విత్తనము అంకురించి – అనేక ధర్మములతో (ఆకులు – కొమ్మలు – పిందలు మొదలుగా) కూడిన మహావృక్షముగా అగుచున్నది కదా! చిచ్ఛక్తి యొక్క కించిత్ 'స్ఫురణ'యే ఈ విస్తార దృశ్యము. అద్దానికి పాశముల చమత్కారము ఏర్పడుతోంది. జీవుడు, బంధములు ఇవన్నిటితో కూడి ఈ సమస్త సంసార చమత్కారమంతా సారూప్యముగా అగుచున్నది.

ఓ సుబుద్ధీ! "సంసారము వేరు – మనస్సు వేరు" **– కానే కాదు.** మనస్సే సంసారము. (మనయేవ మనుష్యాణాం కారణం బంధ–మోక్షయో). అట్టి మనస్సు "ఇదంతా సత్యమే! నిత్యమే!".. అనే కల్పనను కల్పించుకొని, దృశ్యముల ప్రవేశిస్తోంది. బంధమంతా తెచ్చిపెట్టుకుంటోంది. అయితే ఏం? **మనస్సు యొక్క జనన స్థానము నిత్యముక్తము. మనస్సు నిత్య బంధము.. ఆత్మ నిత్యముక్తము.**

**ఈ 'మనస్సు' యొక్క సాంసారికమైన స్థితి ఎట్టిదంటే..,**

→ **చింతా – అనల శిఖా దగ్ధం!**... 'చింతలు' అనే అగ్ని శిఖలచే నిత్యము దగ్ధము అగుచున్నది.

→ **కోప అజగర చర్వితము॥**... "కోపము" అనే కొండ చిలువచే దిగమ్రింగబడుచున్నది.

→ **కామాబ్ధి కల్లోల రతం॥** "కోరికలు" అనే భీకర తరంగములచే కల్లోలితమైన 'సముద్ర జలములో రమిస్తూ (చరిస్తూ) ఉన్నట్టిది.

→ **విస్మృతాత్మ పితామహమ్ :** ఆత్మను మరపింపజేయటములో మహాశ్రేష్ఠమైనవి. "జగత్తు, జీవుడు"లను ఆశ్రయించి, పరమాత్మను ఏమరపింపజేయుచున్నది.

ఓ నిదాఘా! బురదగుంటలో ఇరుక్కున్న ఏనుగును బయటకు తీసి రక్షించు తీరుగా – ఈ **మనస్సును విషయ లంపటముల నుండి అతిత్వరగా** (Urgently) **ఉద్ధరించాలి.** మనో కల్పితమైన సంసార కల్పిత భావములు ఈ జీవుని పట్ల అల్ప జన్మలకు కారణమవటంచేత – **"మనస్సే శత్రువు".** అట్టి ఈ మనస్సే **మోక్షమార్గములో ఏకైక ఉపకరణము కూడా।**

## భావములు

భావములన్నీ ఎక్కడి నుండి బయల్వెడలుచున్నాయి? జగత్ సంబంధింత భావములన్నీ "సమష్టి సూక్ష్మ శరీరాభిమాని" – అగు హిరణ్యగర్భుని నుండే బయల్వెడలుచున్నాయి. అట్టి భావముల లక్షల కోట్ల సంఖ్యలో అసంఖ్యాంగా సృష్టియందు ప్రవేశించి ప్రవర్తమానము అగుచున్నాయి. అట్టి అసంఖ్యాక భావనా పరంపరలన్నీ సృష్టి ప్రారంభము నుండి పుట్టి, సృష్టి కొనసాగేంతవరకు – కొనసాగుచూనే ఉంటున్నాయి. సెలయేరు (జలపాతము)లో ఎప్పటికప్పుడు జలకణములు, జలప్రవాహములు బయలుదేరు రీతిగా ఈ సృష్టిలో అనేక మంది శరీరధారులు, అనేక శరీరములు పుట్టినాయి. పుట్టుచున్నాయి. పుట్టబోతున్నాయి.

సముద్రంలో అసంఖ్యాక తరంగములవలె, **ఆత్మజలములో** ఈ **'జీవులు'** అనే తరంగములు, బిందువులు బయలుదేరుచున్నాయి.

## జీవన తరంగాలు – భావనా తరంగాలు

చిచ్ఛక్తి (లేక) ఆత్మ సర్వదా అఖండము. సమస్త భేదములకు అప్రమేయము. ఏకము. సమము. ఈ విధంగా అయి ఉండి కూడా, సృష్టిలో కనిపిస్తున్న అసంఖ్యాక లక్షల కోట్ల జన్మలలో (ఉపాధులలో / జీవాత్మలలో) **ఎంతో పరస్పర వ్యత్యాసములతో** – ఒకే జలములో అనేక తరంగముల ఆకారముల వలె – **ప్రదర్శనమగుచూ అనుభూతమగుచున్నది.**

- ఈ జీవులు, ఉపాధులు, పరస్పరము **'భేదరూము'.** వీటన్నిటి యొక్క వాస్తవ రూపము బ్రహ్మమే।

*అట్టి బ్రహ్మానంద సాగరములో కనిపిస్తున్న జీవాత్మ తరంగాలలో*

- కొన్ని జీవాత్మలు ఇప్పుడే పుట్టుచున్నాయి. – **కేచిత్ ప్రధమ జన్మానః।**
- కొన్ని ఇప్పటికే వందలాది జన్మలు కలిగియున్నట్టివి. **కేచిత్ జన్మశతాధికాః।**
- కొన్ని జీవాత్మలు అసంఖ్యాతంగా జన్మలు ఇతఃపూర్వం కలిగి యుండి, వాటినే చర్విత చర్వణంగా కొనసాగిస్తున్నాయి. **కేచిత్ అసంఖ్య జన్మానః।**
- కొన్ని జీవాత్మలు ఇంతకుముందు 2, 3 జన్మలు మాత్రమే ఎత్తినవై ఉన్నాయి. **కేచిత్ ద్వి–త్రి భవాంతరాః।**

ఓ నిదాఘా! **"ఇవన్నీ అఖండాత్మ నుండి బయల్వెడలుచున్న అసంఖ్యాక భావనా తరంగములు"** అని గమనించిన వాడవై ఉండుము.
**ఇంకా విను →:**

- కొన్ని భావనా రూపతరంగములు (లేక) ఉపాధులు (లేక) జీవాత్మలు.. గంధర్వులు. విద్యాధరులు. మహాసర్పములు. (ఇవన్నీ దేవతాజాతులు). **కేచిత్ కిన్నర గంధర్వ విద్యాధర మహోరగాః।**
- **కేచిత్ అర్క – ఇందు వరుణా త్ర్యక్షా అధోక్షజా పద్మజా!** ఆత్మ యొక్క భావనా తరంగములలో కొన్ని త్రిలోకములను వెలిగించుచు త్రాణరూపుడై యున్న సూర్యుడు (సూర్యుడను నేను– అను అభిమాని)గా అగుచున్నాయి. ఓషధరూపుడగు చంద్రుడు (ఓషధి ప్రదాత)గా కొన్ని అగుచున్నాయి. త్రాణ ప్రదాత అగు వరుణుడుగా కొన్ని భావతరంగాలు ప్రదర్శనమగుచున్నాయి.
- కొన్ని భావనా తరంగాలు → **త్ర్యక్షుడు** (త్రినే త్రుడుగు మహేశ్వరుడు), లోకరక్షణ – పరిపాలనా అభిమానియగు అధోక్షజుడు (విష్ణువు), **సృష్టికర్త–అగు పద్మజుడు (బ్రహ్మదేవుడు)**... గా సంప్రదర్శనము అగుచున్నాయి. (అనగా) **భావనా కల్పనా మాత్రమగు జగత్తులో త్రిమూర్తులు కూడా పరమాత్మ నుండి బయల్వెడలిన భావనా తరంగాలే అగుచున్నాయి.**
- ఆత్మ నుండి జనిస్తున్న అసంఖ్యాక భావనా తరంగాలలో ఇంకా కూడా కొన్ని – బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రగణములు (Groups) గా స్థితి కలిగి ఉంటున్నాయి.
- కొన్ని భావనా ప్రదర్శనములు– తృణములు (గడ్డిపరకలు)గాను, ఓషధులు (ఆహార పదార్థ ధర్మము ఉన్నవి)గాను, వృక్షములుగాను, వృక్షఫలములు గాను, (కంద, పెండలము మొదలైన) దుంప ఫలములుగాను,
- ఇంకా కొన్ని (ఆత్మ నుండి బయల్వెడలి) భావనా తరంగాలు కదంబ నిమ్మ, తాడి, తమాల వృక్షములుగాను – అగుచున్నాయి.

*ఒక నవలా రచయిత యొక్క కవిత్వపు స్రవంతి (The flow At of story - writing) → నవలలో అనేక పాత్రలు (Roles), పదార్థములు (Matters), స్వభావములు (Features)... పాత్రల పరస్పర సానుకూల్య – ప్రాతికూల్య ప్రవర్తనలుగా ప్రదర్శనమగుచున్నట్లే,* ***"కేవలము – అప్రమేయము – నిర్మలము"*** *అగు* ***పరమాత్మ*** *నుండి ఈ* ***అనేకరీతులైన జీవాత్మల ప్రహనమంతా*** *అనేక భావనా తరంగముల చమత్కారంగా సారూప్యము పొందటము, కొనసాగటము, గతించిపోవటము కూడా జరుగుతోంది.*

ఇంకా ఆ భావనా చమత్కార స్రవంతులలో...

- కొన్ని మహేంద్ర, మలయ, సహ్య, మందర మేరు పర్వతాలుగాను,
- మరికొన్ని ఉప్పు-పాలు-పెరుగు-చెరకురస సాగరములుగాను,
- కొన్ని ఆత్మ యొక్క భావనలు సువిశాలమై సుదూరంగా విస్తరించియున్న (తూర్పు-పడమర-ఉత్తర-దక్షిణ, ఈశాన్య, వాయువ్య, ఆగ్నేయ, నైరుతీ, ఊర్ధ్వ, అధో) పది దిక్కులుగాను,
- కొన్ని నదీ నదములుగాను,
- కొన్ని ఆత్మ యొక్క భావనా తరంగములు - ఆకాశంలో ఎత్తు ప్రదేశాలలోను, నేలపైన, కొండలపైన ఎగురుచూ ఉండే పక్షులుగాను, కీటకములుగాను,

ఈ విధంగా అనంత భేదములతో అనంతభావములు అనేక అసంఖ్యాక రూపములు ధరిస్తూ - చేతులతో అదిలించబడు పక్షులవలె - లోక లోకాంతరములు, దేహ-దేహాంతరములతో మాటిమాటికీ తిరుగాడుచున్నాయి.

**భుక్త్వా జన్మ సహస్రాణి భూయః సంసార సంకటే।** - అట్టి ఆత్మ భావనారూప తరంగములే స్వస్వరూపముగా కలిగియున్న కొందరు జీవాత్మలు **"ఇంద్రియానుభవములు"** - అనే సంసార లంపటములో మునిగి వందల వేల ఉపాధి పరంపరలతో ప్రవేశ-నిష్క్రమణములను నిర్వర్తిస్తూ **'అజ్ఞానము'**ను సుదీర్ఘకాలంగా కొనసాగిస్తున్నారు.

**పతంతి కేచిత్ అబుధాః సంప్రాప్యాపి వివేకతామ్॥** మరికొందరు శాస్త్ర పఠన - గురువాక్య శ్రవణములు చేసి వివేకమును సంపాదించుకొని కూడా,... తెలివి తక్కువ వారై అనేక ఉపాధులలో ప్రవేశ-నిష్క్రమణములు కొనసాగిస్తూనే ఉంటున్నారు. ఆత్మతత్త్వానుభవమును 'అలక్ష్యము' చేస్తూ మరల మరల సంసార సంకటములను ఆహ్వానించుకొంటున్నారు. **"భవ సాగరము"** అనబడే (దృశ్యములోని విశేషములు నిజమే అనే) భావనా పరంపరల తరంగములలో మరల మరల మునిగి తేలుచున్నారు. ఈ విధంగా **భావికుడు తనను తాను తన భావనలలో వెతుకుచున్నాడు. ఎంతటి చమత్కారం!**

చిచ్ఛక్తికి 'అభిన్నమే' అయిఉన్నప్పటికి కూడా, మనోశక్తి లీలవలె, (క్రీడా వ్యసనములాగా) - వాసనలచే సంకలితము అయిన ఆవేశమును ధరించి స్వయంకల్పిత - స్వస్వరూప "దృశ్యము"లో సంకల్ప-వికల్పములుగా ఉన్ముఖమై ఉంటోంది.

అనంతశక్తి స్వరూపి అగు ఈ **జీవుని స్వాత్మచైతన్యము** - క్షణకాలంలో అనంత దృశ్యమును లీలగా కల్పించుకొని, కొంతసేపు సంచారము చేసి, ఇక అటుపై,...

- ఇదంతా ఎట్లు దాపరించింది?
- ఎట్లా తొలగుతుంది?
- నేనెవ్వరు?

అనే 'వెతకటము'ను (To search 'Answer' for "what I am?" - అత్యవసరముగా భావిస్తోంది. తన కొరకు తానే తన కల్పనయందు వెతుకుతోంది. ఇదంతా, **"కలలోని నేను" - "కల నాదైన నేను" - కొరకై వెతకటము వంటిది.**

***ఎప్పుడో ఒకప్పుడు ఆత్మయే ఒక్క క్షణంలో "నిర్మలాత్మాకాశ స్వరూపము"ను కూడా మననము చేయగలదు. సిద్ధించుకోగలదు కూడా!***

## మనో భావనా చమత్కారము

ఈ జీవుడు ఆత్మస్వరూపుడే కాబట్టి, సర్వదా సత్యస్వరూపుడే. సత్యస్వరూపుడగు ఈ జీవుడు 'మనస్సు' అనే ఉపకరణముతో **ఏది 'సత్యము' అని భావిస్తూ ఉంటే, అది అట్లే సిద్ధించటము జరుగగలదు.** అందుచే 'ఈ జీవుడు (ఆత్మగా) **'సత్య సంకల్పుడు'** - అనబడుచున్నాడు. అట్టి మనస్సు ఏది ఎక్కడ **'భావన'** చేస్తే అక్కడ అది ఆ రీతిగా - **సత్యభావనను అనుసరించి - సిద్ధించగలదు.**

## సమస్తము మనస్సే

→ ఆకాశమునకు బీజము **ఆత్మయొక్క శబ్దరసోన్ముఖత్వమే.** మనస్సే ఆకాశరూపముగా ఘనీభూతమై, అద్దానియందు క్షణములో **'స్పందన'** రూపము దాలుస్తోంది.

→ అటు తరువాత మనస్సే **"స్పర్శబీజ రసోన్ముఖము"** - అయి క్షణములో **వాయురూపము, వాయు స్పందనరూపము** సంతరించుకుంటోంది.

→ ఆ తరువాత ఆకాశ-వాయువుల శబ్ద- స్పర్శకార్యముల దృఢ అభ్యాసము చేస్తూ తత్ఫలితంగా వాయు తరంగముల సంఘర్షణ నుండి అగ్ని జనిస్తోంది. అగ్ని - శబ్ద, స్పర్శ, రూపములుగా క్షణములో అవటము కూడా - మనస్సు చేస్తున్న పనే.

→ శబ్ద స్పర్శ రూపముల అభ్యాసముచే **మనస్సు రసస్వరూపముగా అగుచున్నది.**

→ శబ్ద-స్పర్శ-రూప-రసగుణసమన్వితంగా అగుచున్నదంతా **మనస్సు యొక్క భావనా చమత్కారమే.**

→ శబ్ద-స్పర్శ - రూప-రసముల సంఘర్షణచే గంధతన్మాత్ర బయల్వెడలి భూమి (Solid) రూపమును (మనస్సే) సంతరించుకుంటోంది. ఇదియే **మనస్సు యొక్క పృథ్వీ అనుభవము.**

ఈ విధంగా **మనస్సే పంచతన్మాత్రల రూపము దాల్చినదై,** సూక్ష్మతత్త్వము నుండి స్థూలమగు స్థూల పంచభూతములుగా విస్ఫురణము అవుతోంది.

## పుర్యష్టకము

అహంకార కలనము + బుద్ధి బీజసమన్వితము + జీవాత్మ + పంచతన్మాత్రలు (శబ్ద స్పర్శరూప రసగంధ సూక్ష్మతత్త్వములు) కలిపి "పుర్యష్టకము" (A Township of Eight factors) - అని పిలుస్తూ ఉంటారు. అట్టి పుర్యష్టక స్వరూపిణి అయి మనస్సే "హృదయము" అనే పద్మములో 'తుమ్మెద' వలె నివాసము కలిగి ఉంటోంది.

హృదయములో పూర్యష్టకరూపము దాల్చిన మనస్సు యొక్క తీవ్రమైన 'సంభ్రమము'ను ఆశ్రయించి, సంకల్పబలము వలన - బిల్వ వృక్షమునకు బిల్వ ఫలము వలె - స్థూలత్వమును మననము చేస్తూ **'స్థూలాకారము'** యొక్క భావనా ఫలమును పొందుతోంది. అప్పుడు మూసలో కరిగించిన బంగారము వలె నిర్మలాకాశములో 'తేజస్సు' అను స్వస్వభావ చమత్కారముగా రూపుదిద్దుకుంటోంది.

**సన్నివేశమ్ అథా దత్తే తత్ తేజః స్వస్వభావతః॥** ఆ తేజస్సే స్వస్వభావన చేత 'సాకారము'గా ప్రదర్శనము అవుతోంది. అది మూర్తీభవించి **'భౌతికరూపము'** దాల్చుచున్నది.

అట్టి మూర్తి (దేహాకారము యొక్క / పిండమయము) యొక్క
- **ఊర్ధ్వం శిరః॥** పై భాగమున శిరస్సు
- మధ్యన **పొట్ట.**
- క్రింద భాగము నందు **కాళ్ళు**
- రెండుప్రక్కల **చేతులు**

క్రమంగా ఈ మూర్తీభవించిన భౌతిక శరీరముగా నిర్మల నిగ్రహరూపమై ప్రస్ఫుటం అవుతోంది.

అట్టి మూర్తీభవించినట్టి మూర్తియే..,
- శరీరము అను భౌతిక రూపముగాను,
- అంతరమున బుద్ధి - సత్త్వము (తెలివి) - బలము - ఉత్సాహము- విజ్ఞానములను తన ఐశ్వర్యములుగాను

**ఆత్మయే దేహమున ప్రవేశమానమై ఉంటోంది.**

ఇట్టి మొట్టమొదటి పూర్యష్టక సమన్విత సాకార రూపమే - సృష్టికర్త, సర్వలోక పితామహుడు, సృష్టిభావనా సంకల్ప సమన్వితుడు, సృష్ట్యభిమాని - అగు **"బ్రహ్మదేవుడు".**

అట్టి ప్రథమ సాకారుడు - సారూప్యుడు, త్రికాలములు తెలిసిన త్రికాలజ్ఞుడు అగు బ్రహ్మ - తన **పుర్యష్టకసాకారమును** చూచుకొన్నారు. **"కేవల చిన్మాత్రరూపము, పారము** (Long extended), **కంటికి కనబడనట్టిది, సమస్తమునకు ప్రప్రథమము అగు పరమాకాశము నందు నా ఈ "సాకారము" అసలు ఏమై ఉన్నది?" అని యోచిస్తూ ధ్యానము చేయసాగారు. "బ్రహ్మమే బ్రహ్మముగా అయి బ్రహ్మము గురించి చింతన చేయనారంభిస్తోంది!" - అన్నమాట। - అని గమనించసాగారు.**

అట్టి ధ్యానము యొక్క ప్రయోజనముగా సృష్టి సంకల్పాభిమాని అగు బ్రహ్మదేవ చైతన్యము (లేక) బ్రహ్మదేవుడు నిర్మల హృదయుడు అయ్యారు. అట్టి నిర్మలమగు ఆత్మదృష్టిచే ఇతఃపూర్వపు సర్గములను (సృష్టులను) సందర్శించు సామర్థ్యము పొందారు. **"నేను కూడా ఆ విధంగానే సృష్టులను సంకల్పించెదనుగాక"** - అను రూపంగా **'సృష్టి సంకల్పుడు'** అయ్యారు. స్వధర్మ-స్వగుణ క్రమములను అనుసరించి ఆయన యందు ఈ సృష్టి సంరంభమంతా - మానసిక నగరము అయిన గంధర్వనగరం లాగా - **(లీలగా, క్రీడగా, సరదాగా)** బయల్వెడలసాగింది. అంతా సంకల్ప/ఊహామాత్రమే. అప్పుడు ఆయన....
- అనేక ఆచారములతోను (Practices), ప్రవృత్తులతోను (Advocations) కలిగి ఉండే వివిధ జీవరాసులను సంకల్పమాత్రంగా ఆత్మాకాశములో సృష్టి చేయసాగారు.
- ఆ తరువాత ఆ జీవులకు కర్మలు, కర్మఫలములు,
- ధర్మ - అర్థ - కామములు,
- స్వర్గ - అపవర్గములు (మోక్షము, ఫలప్రాప్తి, సమాప్తి మొదలైనవి)
- వాటి సిద్ధికై చిత్ర-విచిత్రమైన శాస్త్రములు,
- అర్థములు, అపార్థములు,... **ఇవన్నీ కల్పించసాగారు.**

కనుక,

- ఈ సమస్త దృశ్యజగత్తు ఒక నవల వ్రాసే నవలా రచయితలాగా – విరించి (బ్రహ్మదేవుని) యొక్క (సమిష్టి) మనస్సుచే సంకల్పించబడి – కల్పించబడినట్టిదే।
- సమష్టి మనస్సు ఉన్నంతవరకు 'జగత్తు' యొక్క ఉనికి కొనసాగుచూనే ఉంటుంది.
- సంకల్పము ఉపశమించటమే మనో **ఉపశమనము.**
- **మనస్సు** యొక్క **ఉపశనము** జరిగిందా, **జగత్తు నశించినదే అవుతుంది.**
- 'జగత్తు' అనబడునది ఊహ–భావనారూపమగు మనస్సు యొక్క కల్పన మాత్రమే.
- మనస్సు అనునది – జలంలో సాకార తరంగంలాగా – సమస్తమునకు ఆవల గల నిరాకారమగు ఆత్మ నుండి సాకారమై సారూప్యమగుచున్నది. తరంగము జలమునకు అభిన్నమైనట్లే, జగత్తు ఆత్మకు అభిన్నము.

## న జాయతే, న మ్రియదే క్వచిత్ కించిత్ కదాచన।

హే బ్రహ్మన్! మహాశయా! నిదాఘా! ఈ జగత్ దృశ్యమై ఒకానొక ముఖ్యమైన విషయము గమనించెదవుగాక। పరమార్థముగా గమనిస్తే ఇచ్చట దృశ్యమానమగుచున్న దృశ్యము–అనబడుదానిలో,–ఏదీ పుట్టటములేదు. నశించటమూ లేదు. ఇదంతా ఇంద్రజాలమువలె **"మిథ్యాదృశ్యము"** వంటిది మాత్రమే. అందుచే **"ఆశలు"** అనే విషయ సర్పములతో నిండియున్నట్టి సంసారాడంబరమును (The magic show of worldy appearence) నీవు మొదలంట్లా మునుముందుగానే బుద్ధితో త్యజించిన వాడివై ఉండెదవు గాక!

**"అసత్ ఏతత్" ఇతి జ్ఞాత్వా, మాతృభావం నివేశయ॥** ఓ నిదాఘా! ఈ సమస్త త్రిలోక దృశ్యము స్వతఃగా అసత్తే (Not individually and indepently existant)" అని ఎరిగినవాడివై, (తరంగమునకు జలమువలె) అద్దాని జనన స్థానము (The Origin) అగు 'ఆత్మ'యందు "మాతృభావము" (The sense of understanding that all this is always that) కలిగియుండెదవుగాక! మనోభ్రమచే దర్శించబడే గంధర్వనగరం (Illusionary Township)లో కనిపించే వస్తువులు భూషితము (Decorative) అయితే ఏమున్నది? అభూషితములు అయితే ఏమున్నది? **ఇక్కడి పుత్రులు మొదలైనవన్నీ మాయానగరంలోని వస్తుజాలమువంటివి** మాత్రమే। **కః క్రమ సుఖ దుఃఖయో?** స్వతఃగా లేనట్టి వస్తువులు కలిగించే సుఖ–దుఃఖములు ఏముంటాయి?

**ధన దారేషు వృద్ధేషు దుఃఖ యక్తం। న తుష్టతా!** ధనము – భార్య – భర్త – పుత్రులు మొదలైన వాటిలో సంబంధములు వృద్ధి చెందటము – అనేది అనేక దుఃఖములు తెచ్చిపెట్టేవేగాని, సుఖప్రదము కానేకాదు. మోహము, మాయ (Illusionary; Actually not there) అయి కనిపిస్తున్న వస్తు– విషయములపై విశ్వాసము కలిగి ఉండటమేమిటి?

> **శ్లో॥ యైరేవ జాయతే "రాగో" మూర్ఖస్య అధికతాం గతైః,**
> **తైరేవ భోగైః ప్రాజ్ఞస్య "విరాగ" ఉపజాయతే॥**

మూర్ఖునికి ఏఏ ప్రాపంచక విషయాలు, సంగతులు, సంపత్తులు, సంబంధములు, అనుబంధములు, బాంధవ్యములు, మొదలైనవాటి పట్ల, **"ఆహాఁ! ఇవి నాకు లేకపోతే ఎట్లా? ఇవి లేకుంటే నేను ఉండగలనా?"** – అను రూపము గల **'రాగము'** ఏర్పడుతోందా,..

వాటన్నిటి పట్ల ప్రాజ్ఞుడైనవాడు **"ఇవన్నీ కల్పిత ప్రపంచమునకు (జగన్నాటకమునకు) సంబంధించినవేగాని, ఆత్మస్వరూపుడనగు నాకు మొదలే సంబంధించినవి కావు. ఈషణ్మాత్రము కూడా కాదు"** – అనే **"విరాగము"** కలిగి ఉంటాడు.

అందుచేత తత్త్వజ్ఞా! నిదాఘా! **"అపేక్ష"**ను (Desire and fondness) త్యజించి ఉండుము.

– సంసార వ్యవహారములలో ఎటువంటి లాభ–నష్టములు, కష్ట–సుఖములు కలిగి ఉన్నప్పటికీ, అంతకుముందే సమస్త దృశ్యము పట్ల **"ఉపేక్ష** (Just Ignoring)" కలిగి యుండెదవుగాక! **నష్టం నష్టం ఉపేక్షస్వ।**

**ప్రాప్తం ప్రాప్తం ఉపాహర।** ఏది ఎంతవరకు ఆయాచితంగా ప్రాప్తిస్తే అంతమాత్రం చేతనే స్వీకరిస్తూ 'సంతృప్తి'ని స్వాభావికంగా కలిగి ఉండుము. 'సంతృప్తి'ని స్వాభావికంగా చేసుకొనెదవుగాక. సంతోషముగా ఉండటమును ఎట్టి పరిస్థితులలోను విడువవద్దు.

## పండిత లక్షణము

> **శ్లో॥ అనాగతానాం భోగానామ్ అవాంఛనమ్, అకృత్రిమమ్**
> **ఆగతానాం చ సంభోగ। – ఇతి పండిత లక్షణమ్॥**

- **లభించని భోగముల గురించి** 'వాంఛ' (Desire and dependence on its materializing) **కలిగి ఉండకపోవటము.**
- **లభించిన** దానిని అకృత్రిమ బుద్ధితో తృప్తి పడి **సంతోషముగా ఆస్వాదించటము.**

ఈ రెండు **నిత్యానిత్య వివేకులగు పండితులలో స్వాభావికంగా కనిపించే లక్షణములు.**

-----

ఓ నిదాఘా! సత్-అసత్ (I - my)ల మధ్యగా ఏ శుద్ధము - కేవలము అగు స్వస్వరూపము పదము (A state of SELF) వేంచేసి ఉన్నదో, అద్దానిని తెలుసుకొన్నవాడవై అవలంబించి ఉండుము. ఇక ఈ బాహ్య-అభ్యంతరములలో సందృశ్యమై కనిపిస్తున్న సమస్తమును **స్వీకరించనూ వద్దు. విడువనూ వద్దు.** ఈ సమస్త జగద్దృశ్య వ్యవహారమంతా కల్పనామాత్రమే." - అని గమనించినవాడవై, ఇద్దాని యందు **రాగము** (fondness) **కలిగి ఉండవద్దు. ద్వేషము** (Dislikingly hetridness) **కూడా కలిగియుండనే వద్దు.** ఎవ్వడైతే కర్మలు చేస్తూ ఉన్నప్పటికీ 'ఇచ్ఛ - అయిచ్ఛ' (Desire or Desirelessness) కలిగియే ఉండడో, అట్టివాడు - జలములో ఉండి కూడా జలమును స్వీకరించని పద్మము యొక్క పూరెక్కవలె **(పద్మపత్రమివ అంభస)** - ఆ కర్మల యొక్క కర్తృత్వముగాని, కర్మఫలముల భోక్తృత్వముగాని కలిగియుండడు: అట్టివాడే **'జ్ఞాని'. (<u>తస్మాత్ జ్ఞానమయో భవ।</u>)**

## భవసాగరము దాటటము ఎట్లా?

**భవము** = 'ఈ జగత్తు నిజంగానే ఉన్నది' అను భ్రమ భావన.

**సాగరము** = అనేక దృశ్యవిషయ పరంపరా తరంగములు హృదయములో 'నిజమే' అనే దృష్టితో పరస్పరం ముడివడి ఏర్పడినవై ఉండటము.

ఓ ద్విజోత్తమా! నిదాఘా! ఎప్పుడైతే నీకు హృదయములో శబ్ద - స్పర్శ-రూప-రస -గంధ సంబంధమైన సమస్త ఇంద్రియార్థములు (లేక) ఇంద్రియ విషయములు రుచింపకయే ఉంటాయో, ఇకప్పుడు నీ యందు ఆత్మజ్ఞానము వెల్లివిరియగలదు. అట్టి 'జ్ఞానము' అనే నావ సహాయముతో నీవు ఈ **భావసాగరమును** (ఇంద్రియార్థములతో పెనవేసుకొన్న ఇచ్ఛా-ద్వేష-కామ-క్రోధ-లోభములను) **దాటివేయగలవు.**

పుష్పము నుండి గంధమును వేరు అగుచున్న రీతిగా, నీవు చిత్తవృత్తుల రూపమున ఉన్న వాసనా సమూహములను ప్రజ్ఞతో వేరుచేసి 'పరము'న (సమస్తమునకు ఆవల) గల అత్యుత్తమమగు **"ఆత్మపదము"**ను సిద్ధించుకొనెదవుగాక!

పడవ జలములోనే ఉంటూ ఉన్నప్పటికీ, పడవ లోనికి జలమును రానీయముకదా! అట్లాగే **వాసనలు అనే సంసార సాగరజలములో** 'ప్రజ్ఞ' లేక 'ఆత్మజ్ఞానము' అనే పడవను అధిరోహించి, **మహాత్ములు జగత్ విషయములను, ఇచ్ఛ- అనిచ్ఛ సంబంధమైన ఇంద్రియ విషయవాసనలను దాటివేసి - ఆవల గల 'సోఽహమ్ ఆత్మ' అను ఒడ్డుకు సులభముగా చేరుచున్నారు. హృదయములో జగద్విషయములను చోటివ్వనివారై ఉంటున్నారు.**

**శ్లో।। యే "ప్రజ్ఞా-నావమ్"-ఆరూఢాః, తే తీర్ణాః పండితాః పరే।।** 'ప్రజ్ఞ' అను నావ (Boat)ను అధిరోహించి, ఈ సంసార సాగరమును దాటి, **"కేవలము-అఖండము"**-అగు ఆత్మతత్త్వమును ఎరిగి 'ఆత్మమేవాహమ్' సిద్ధించుకొన్నవారే **"పరతత్త్వజ్ఞులగు పండితులు".**

అట్టి మహనీయులగు బ్రహ్మతత్త్వజ్ఞులు-**న త్యజంత్తి, న వాంఛన్తి, వ్యవహారమ్ జగద్గతమ్**-జగత్-విషయములను వాంఛించరు. త్యజించరు. **సర్వమేవ అనువర్తన్తే పారావారవిదో జనాః।** సర్వము ఎరిగి, సర్వత్రా ఆత్మదర్శనము చేస్తూనే యధా -ఉచితమైన ఆయా స్వధర్మములగు కార్యములు నిర్వర్తిస్తూ ఉంటారు. అప్పుడు కర్మలు అట్టివారిని తమ ఆత్మభావన యొక్క సుస్థిరత్వము నుండి **చ్యుతి** కలిగించలేవు. అగ్ని ఏచోట, (తగులబెట్టటము, యజ్ఞవాటిక మొదలైన) ఏ ఏ విధులు నిర్వర్తించవలసి వస్తున్నప్పటికీ, తనయొక్క 'ఉష్ణము-తేజస్సు'లను విడచి ఉంటుందా? ఉండదు, అట్లాగే, ఆత్మజ్ఞాని తనయొక్క - "నిత్యత్వము, సత్యము, అఖండత్వము, అప్రమేయత్వము" మొదలైన ఆత్మానంద లక్షణములు - విడచి ఉండదు.

## సంకల్పమాత్ర జగత్ - సంకల్పమే బంధము

'ఆత్మ' యొక్క తత్త్వము అనంతము (The origin of SELF neither begins nor ends up with physical or mental (Thought) Zones)

అట్టి "నేను ఉన్నాను కదా" అను సత్తా సామాన్య రూపము (As a Sense of Presence Form) సర్వజీవులలోను, సమస్తమునందు సమముగా వేంచేసినదై ఉన్నది. అట్టి ఆత్మ - "దృశ్యము (అన్యము)ను ఎఱుగుట" అను మూలరూపముతో కూడిన 'చిచ్ఛక్తి'ని ఆశ్రయించినదై ఉన్నది. (The Self accompanies Existence and Energy. Energy takes form of Knowing).

**ఆత్మ యొక్క అట్టి చిచ్ఛక్తియే సంకల్పమునకు అంకురము.**

(విత్తనము యొక్క అంకురించటము అనే ధర్మమువలె) చిచ్ఛక్తి యొక్క **సంకల్పాంకుర** లేశము (A bit of it) 'సత్త' (ఉనికి - అనే ధర్మము)ను తీసుకొని - ఆకాశమంతా మేఘము ఆక్రమించురీతిగా - సర్వత్రా వ్యాపించి (ఆపూర్యముచేసి) ఘనీభూతమై **"చిత్తత్వము (ఇష్టము, అభిరుచి)"** అను (దృఢచిత్త) భావనారూపము పొందుచున్నది. సత్ యే చిత్తముగా అగుచున్నది 'ఉనికి' నుండియే ఇష్టము బయల్వెడలుతోంది.

☛ అప్పుడు – **భావయన్తి చితిః చైత్యం వ్యతిరిక్తమివ ఆత్మనః।** చిత్తము స్వయముగా భావనను జనింపజేసుకొని, అట్టి భావించబడు వస్తువుతో తన్మయమగుచున్నది. క్రమంగా తనయొక్క జనన స్థానమగు **ఆత్మను ఏమరచుచున్నది.** "ఈ నాకు అనుభవమగుచున్న భావనా స్థానమంతా **ఆత్మకు** (లేక) **ఆత్మనే అయి ఉన్న నాకు** వ్యతిరేకముగా వేరై ఉన్నది" – అను ఆత్మకు 'వ్యతిరేక' (లేక) వేరైన భావనా రూపము పొందుచున్నది. అనగా **"నేను వేరు! నాకు భావనగా ప్రాప్తిస్తున్న అనుభవవస్తువగు ఇంద్రియ-దృశ్యము వేరు"** – అను **"ఆత్మవ్యతిరిక్త భావన"**ను ఆశ్రయించి ఉంటోంది. సంకల్పము నందు తన్మయమవుతోంది. సంకల్పము అంటే? కల్పన (Attributive Visualization)నే "సంకల్పము" అని అంటున్నాము.

ఆత్మయే– **చిచ్ఛక్తి**గాను అటు తరువాత 'మనస్సు'గాను, ఆపై సంకల్పముగాను అగుచున్నది. సంకల్పమే శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ విషయములుగా రూపమును (నటుడు పాత్రగా రంగముపై కనబడుతీరుగా) అగుచున్నది.

*ఆత్మయే స్వయముగా కల్పన చేసి "కల్పనా రూపమగు జగత్తు – జగదభిమాని (The fondness by the perceiver of the scenary)" – అగుచూ, ఆస్వాదించటం ప్రారంభించుచున్నది. "ఇదంతా స్వయముగా నా కల్పనయే కదా!" – అనునది పూర్తిగా ఏమరచి, **'అన్యము'** అనే జాలములో పడుతోంది.*

**వర్ధతే స్వయమేవాశు దుఃఖాయ। న సుఖాయయత్।** అట్టి 'కల్పన' అనునది సుఖము కొరకు కాదు. దుఃఖము కొరకే అయిఉన్నది. అనగా, ఆత్మకు అన్యముగా కనిపించేదంతా-కల్పనగా, లీలగా ప్రారంభమై, 'బంధము, దుఃఖము' – గా పరిణమించినదగుచున్నది.

ఓ నిదాఘా! 'కల్పన' వలన జనించిన దుఃఖము (Worry) తొలగటానికి ఉపాయము ఏమిటి?

**మా సంకల్పయ సంకల్పం। సంకల్పమును సంకల్పించవద్దు. 'సంకల్పించటము'** అనే జాడ్యముచే జనించే దుఃఖము తొలగాలంటే **సంకల్పించటము మానివేయటమే ఉపాయము. భావనచేతనే** సమస్తమును **అభావన** చేసివేయి. (లేక) భావించటమును మానివేసి అప్పుడు ఇంకా శేషించిన దానితో (స్వస్వరూపమునందు) సంస్థితుడనై ఉండుము. **మ అభావమ్ భావయ స్థితే।** అభావమును కూడా భావించవద్దు.

= సంకల్పించువాడే సంకల్పించకుండా ఉండగలడు కూడా.

– "సంకల్పము, భావన" –ఈ రెండూ కూడా స్వస్వరూపము, కేవలము అగు ఆత్మయందు స్వతఃగా ఉన్నవి కావు.

అందుచే ప్రియ నిదాఘా! నీవు సంకల్పిస్తూ ఉన్నప్పుడు, సంకల్పించనప్పుడు కూడా – ఆ రెండింటికీ సంబంధించక, ఆవల ఉన్నట్టి **సంకల్పరాహిత్య (లేక) సంకల్ప రహిత (లేక సంకల్పాతీత) ఆత్మచైతన్యము** నందు **సదా సంస్థితుడవై ఉండటము**ను అభ్యసించు. అప్పుడు సంకల్పములు తమకు తామే 'స్వయముగా లేనివి' అవుతాయి. అవి మరల నిన్ను అనుసరించవు.

**భావనా అభావమాత్రేణ సంకల్పః క్షీయతే స్వయమ్।** భావనలను భావించకపోయినంతమాత్రం చేతనే సంకల్పములు (Assumptions and presumption or assuming and presuming) – క్షీణించగలవు.

- సంకల్పమును సంకల్పముతోనే ఛేదించాలి.
- మనస్సును మనస్సుతోనే క్షీణింపజేయాలి.
- ముల్లును ముల్లుతోనే తీయాలి.

మనస్సును మనస్సుతో జయించి, అప్పుడిక – మనస్సు ఎందులో లయిస్తోందో – అట్టి 'స్వాత్మ' యందు తిష్ఠితుడవై యుండుము. ఓ మునీశ్వరా! సంకల్పించటములోనే శ్రమ మొదలైనవి ఉన్నాయి. **నీలో నీవు ఉండటములో కష్టము ఏమున్నది? స్వాత్మని తిష్ఠత్వాం కిం ఏతావతి దుష్కరం?**

**యథైవ ఇదం నభః శూన్యం? జగత్ శూన్యం తథైవ హి॥**

ఏ విధంగా ఆకాశము స్వతఃగానే శూన్యమో, ఈ జగత్తు కూడా అదేవిధంగా (ఆకాశము నుండే జనించింది కాబట్టి) – **శూన్యమే. ఈ జగత్తు స్వతఃగా లేనేలేదు.** అయితే ఏది ఎట్లా దృఢముగా భావన చేస్తే, అది అట్లే జగదనుభవముగా సంతరించుకొని అనుభవమగుచూ **"ఆత్మ వేరు. నేను వేరు. జగత్తు వేరు"** – అనే భ్రమ (అవిచారణ కారణంగా) సిద్ధిస్తోంది.

"దృశ్యము" యొక్క అన్యదర్శన వ్యసనమే దృష్టిదోషముగా రూపము పొంది, అఖండము, స్వాభావికానందము, అగు **వాస్తవ స్వస్వరూపమును 'అనుభవ విషయము' కాకుండా చేస్తోంది.**

⌘

**నిదాఘుడు :** హే మహానుభావన్! సద్గురూ! అవును మీరు సూచిస్తున్నట్లుగా ఆత్మస్వరూపులమగు మేము స్వయం కల్పిత జగత్ దృశ్యములో మనస్సుతో ప్రవేశించి క్రమంగా రాగద్వేషములు, మమకార-అహంకారములు – అనే 'మలము' (Impurity) బుద్ధియందు నింపుకొని, ఈ జగత్ సంఘటనలకు నిబద్ధులమగుచున్నాము. ఈ 'మలము' తొలిగేది ఎట్లా?

**ఋభుమహర్షి : అభ్యాసదోషము వలన** వచ్చిన మలదోషము **అభ్యాసము చేతనే** పోగలదు. సత్యము – నిత్యము – సహజము అయినట్టి స్వస్వరూపాత్మ యొక్క స్వాభావికానుభవమును తిరిగి సముద్ధరించుకోవటానికే శాస్త్రములచే, శాస్త్ర ప్రవక్తలచే, **"యోగాభ్యాసము; భక్తియోగము; కర్మయోగము; జ్ఞానయోగము;"**... మొదలైన ఆయా సాధనా క్రియలు మార్గదర్శకంగా సూచించబడుచున్నాయి.

ఓ నిదాఘా! నిరుత్సాహము పడటమెందుకు? ఈ వర్తమాన మానవ జన్మ **'కర్మభూమి' అనుబడుచున్నది. అందుచేత సత్ ప్రయత్నములకై** ఉద్యమించాలి. **"అశ్రద్ధ, బద్ధకము, దుర్విమర్శలు" మొదలైనవాటిని దరిజేరనీయరాదు.**

బిడ్డా! **"మలదోషము రాగద్వేష-లోభ-మోహముల రూపంగా ఉన్నది కదా! ఎందుకుంటోందబ్బా?"**.. అను విశేషమై దిగులును, వేదనను వదలివేయి. **జీవస్య తండులస్యైవ మలం సహజమపి అలమ్!** ధాన్యమునకు పొట్టు ఏ విధంగా స్వాభావికమో, ఈ జీవుని పట్ల కూడా – **కర్మలు అనివార్యము. కర్మలు కొంత దోషము తెచ్చిపెట్టక మానవు.** అవి ఆ విధంగానే స్వాభావికం. "ఎందుకు వచ్చాయిరా?" అనే ప్రశ్నను ప్రక్కకుపెట్టి **"ఈ రాగద్వేషాది మలదోషము తొలగిపోయేది ఎట్లా?"**.. అనే ఉపాయం గురించే మరల మరల ఆలోచించాలి. ఉపాయములను అనుసరించాలి. మలదోషము మొదలంట్లా తొలగించుకోవాలి. **తండులస్య యథా చర్మ** – ధాన్యమునకు పొట్టుఉంటుంది. అప్పుడు ఏమిచేస్తాము? ధాన్యమును యథాతథంగా వండుకొని తినము. చక్కగా దంచుతాము. అప్పుడు బియ్యము–పొట్టు వేరౌతాయి. పొట్టు తొలగించి, బియ్యమును మాత్రమే వండుకొని అన్నము తింటాము కదా!

**యథా తామ్రస్య కాళిమా:–** రాగి చెంబుకు చిలుము పట్టటం సహజం. అప్పుడేమి చేస్తాము? పాత్రను అట్లాగే (As it is) వాడుతామా? లేదు. అట్లాగే వాడితే తినుబండారములు చేదుమయము అవుతాయి. అందుచేత బూడిద తెచ్చి, రాగిపాత్రను తోమి, నిర్మల జలముతో కడిగి, తుడిచి... శుభ్రముగా మెరయున్నట్లు చేసి, అప్పుడు త్రాగునీళ్లు మొదలైన వాటికోసము వాడుకుంటాము.

అట్లాగే..,

**నశ్యతి క్రియయా విప్ర! పురుషస్య తథా మలమ్। పురుష ప్రయత్నముచే** మలదోషము (రాగ–ద్వేష–మమకార– అహంకార–కామ–క్రోధ–లోభ–ఇత్యాదులు), విక్షేపదోషము (Distraction from fundamental truth) **తప్పక తొలగుతాయి.**

***ప్రయత్నశీలుడు ఆత్మతత్త్వానుభవమును తప్పక సిద్ధించుకోగలడు. ఇందులో సందేహమే లేదు.***

అందుచేత ఓ నిదాఘా! ఓ శ్రోత మహాజనులారా! మీరు **ప్రయత్నశీలురై, అభ్యాసపరులై** ఉండండి. "కర్మ–భక్తి–జ్ఞాన–ప్రాణాయా–గురుశుశ్రూష–శాస్త్ర పరిశీలన" – ప్రయత్నములను విడువనేవద్దు. ఇకప్పుడు **"ఆత్మజ్ఞానము, అఖండాత్మత్వము"** అనునవి ఎవ్వరికైనా సరే – లభించదనే ప్రసక్తియే లేదు.

**మలం నశ్యతి। ఇత్యేవ న సందేహః। తస్మాత్ ఉద్యోగవాన్ భవ।**

ఉద్యమించి ఉద్యోగవంతులు అవండి. సహజమగు ఆత్మ తప్పక స్వానుభావమౌతుంది. "అబ్బే! 'అఖండాత్మభావనాసిద్ధి' రూపమగు మోక్షము మా వల్ల ఎట్లా అవుతుంది?" – అనే సందేహ, బద్ధక (Doubtful, Lazy) రూపమగు మాటలు కట్టిపెట్టండి.

ఇతి ఉపనిషత్

## 6వ అధ్యాయము
## ఆత్మయే నీవై ఉండుము (యోఽసి–సోఽసి) స్థిరో భవ।

**ఋభుమహర్షి:**

> **ఓం। అంతరాస్థామ్ పరిత్యజ్య భావశ్రీం భావనామయీమ్,**
> **యోఽసి సోఽసి జగత్ యస్మిన్ లీలయా విహర అనఘ॥**

పాపదృష్టులు, లేనట్టి ఓ నిదాఘా!

- **హృదయములో అంతర్గతంగా** (Inner side of Heart) లోపల గల ఆసక్తి, ఆశలు, కోరికలు మొదలైన (సంబంధితమైన) భావనా పరంపరలు–అనే 'సంపద'ను ఈ జీవుడు కలిగి ఉంటున్నాడు. మరి ఉపాయం? **భావించటము మానివేయి.**
- అప్పుడు శేషించే 'కేవలాత్మ' యందు తత్–స్వరూపుడవై ఉండుము. రాజు గారు తన ఉద్యానవనములో విహరించుతీరుగా – లీలగా, క్రీడగా, వినోదముగా ఆత్మ ఉద్యానవనములో సంచరించెదవు గాక!

# దృశ్య విశేషములకు కర్త ఎవరు? కర్తయే లేదు!

*ఒక నాటకములో ఒక సంఘటనకు కర్త ఎవ్వరు?*

→ **పాత్రధారులు కర్తయా? – <u>కాదు.</u>** అక్కడ పాత్రధారులు నాటకములో నటిస్తున్నారు. అంతవరకే! అందుకు కారణం వారిపై ఆపాదించలేము.

**అవును కూడా ఎందుకంటే...,**

ఆ రసమును ప్రదర్శించి, రక్తి కట్టిస్తున్నారు కదా।

→ **ప్రేక్షకులు కర్తయా?** : కాదు. పేక్షకులు నాటకమును చూచి ఆనందించేవారు మాత్రమే. "వారు సంఘటనకు కర్త" – అని కర్తృత్వము ఎట్లా ఆపాదిస్తాము?

**అవును కూడా!**

ఆ రసమును ఆతీరుగా కోరుకొని ఆనందిస్తున్నారుగాం!

→ **దర్శకుడు కర్తయా?**

**కాదు.**

దర్శకుడు వ్రాయబడియున్న (Already written) నాటకమును రచయితయొక్క ఉద్దేశ్యమును ప్రదర్శితమయ్యేతీరుగా, ప్రేక్షకులను రంజింపజేసే విధంగా దర్శకత్వం (Direction) వహిస్తారు. అంతవరకే. నాటకములోని సంఘటనను ఆతనిపై ఆపాదించలేము.

**అవును కూడా!**

రచయిత యొక్క భావనను రసాత్మకంగా ప్రదర్శించబడునట్లుగా చిత్రగతిని నడుపుచున్నాడుకదా! ఆతను చెప్పిందే, నేర్పిందే పాత్రధారు నిర్వర్తిస్తున్నారు కదా!

→ **పోనీ రచయిత కర్తయా?**

**అవును** :

ఆతని రచన వల్లనే పాత్రలు ప్రవర్తిస్తున్నాయి కదా! అయితే, ఆతడు ప్రేక్షకులనురంజింపజేయటానికి రచనా కళాత్మకంగా రచించాడు. **అంతవరకు కర్తయే!**

**కాదు :**

కానీ, పాత్రల యొక్క చెడునో, మంచినో 'రచయిత యే కర్త। ఆతనే చేస్తున్నాడు" అని ఆపాదించగలమా? పాత్రల మంచి–చెడులను రచయితయే కారణము – అని చెప్పగలమా? (అనగా) నాటకములోని ఒక 'పాత్ర' చాలా మంచివాడు కాబట్టి **"రచయిత మంచివాడు"** – అనిగాని, (లేక) మరొక పాత్ర చెడ్డవాడు కాబట్టి **"రచయిత చెడ్డవాడు"** – అనుగాని ఆపాదించి చెప్పగలమా? లేదు. అట్లా చెప్పటం కుదరదు.

*ఆత్మస్వరూపుడు అగు ఈ జీవుడే వాస్తవానికి తన యొక్క జగదనుభవమునకు రచయిత, నిర్మాత, దర్శకుడు, నటుడు, ప్రేక్షకుడు కూడా! "అయినాసరే ఆత్మస్వరూపుడే అయి ఉండియుండటంచేత – ఈ జీవునికి మంచి, చెడు – ఇత్యాదులు ఆపాదించలేము. ఈ విధంగా తత్త్వజ్ఞులు జగత్‌విషయమై, ఆత్మపట్ల **'అకర్తృత్వము', 'కర్తృత్వము'** కూడా గమనిస్తున్నారు.*

*ఈ జగన్నాటకమునకు కర్తృత్వము ఎవరిపై ఆపాదించాలి? సృష్టకర్తకుగాని, జీవునికిగాని, మరెవ్వరికిగాని ఆపాదించలేము.*

# "నాహంకర్తా।" నాహం భోక్తా।

అందుచేత ఓ నిదాఘా! "నేను దేనికీ **కర్తను కాదు.** భోక్తను కూడా కాదు. మరొకరు కూడా **కర్త కాదు. భోక్త** కాదు" – అను ఎరుక, దృఢభావన నిస్సందేహముగా కలిగియున్నవాడివై, ఇక ఆపై **"జీవితము"** అనే సందర్భమును పురస్కరించుకొని.. ఈ లోకములో విహరించుము. ఇదంతా జగన్నాటకం. పాత్రలకు కర్తృత్వమేముంటుంది? **'కర్తయే లేదు. అన్న తరువాత 'భోక్త' కూడా ఉండదు కదా! భోక్తయే లేనప్పుడు బంధమెవరికి?**

# సమతా సర్వభావేషు!

**పరమామృత నామ్నీ సా 'సమతా' (ఏవ) అవశిష్యతే।** "నాహంకర్తా–భోక్తా' భావనచే, ఇక ఆపై నీపట్ల" **"పరమామృతము"** అని పిలువబడే **'సర్వత్రా సమదర్శనము'.** అనునిత్యమై సిద్ధించగలదు. **"ఇది సుఖము– ఇది దుఃఖము"** – అను భేద – ఉల్లాస వ్యవహారమంతా కేవలము మనస్సుచే కల్పించబడునదై ఉంటోంది. మనస్సుకు ఆధారమైనట్టి 'ఆత్మ'కు సంబంధించి కాదు. నీవో? **సర్వదా ఆత్మ**

**స్వరూపుడవు.** మనస్సో? సంకల్పముల రూపమే కదా! కనుక **"సంకల్పించటము" అనే క్రియా వ్యవహారము తొలగించుకొంటే,.. అప్పుడిక శేషించేది నీయొక్క కేవలము, నిర్మలము, సమస్తమునకు పరము, అఖండము అగు ఆత్మ స్వరూపమే!** మననమునకు ముందే ఉన్న నీ (మునుముందు) రూపమును మననము చేయి. ఇప్పుడు నీకు అన్యముగా కనిపించేదంతా ఆత్మగా భావన చేయి.

ఓ మునివర్యా! ఎప్పుడైతే నీయొక్క చిత్తము భేదదృష్టిని మొదలంట్లా త్యజించి, సర్వభావముల పట్ల సమతత్వము (భావనారాయణత్వము) వహించినదై ఉంటుందో, .. అట్టి "నిర్మలమైన – సమున్నతమైన" చిత్తము సిద్ధించుకొన్నవాడు – ఇక – పునః జన్మలలో చిక్కుకోడు. 'జన్మరాహిత్యము' – సిద్ధించుకొంటాడు.

**అథవా, సర్వకర్తృత్వం చ, త్యక్త్వా స్థిరోభవ। (లేదా) 'నేను సర్వదా అకర్తను'** – అనేది కాకుండా మరొక మార్గము వివరించి చెప్పుచున్నాను. విను. **"సమస్తము మనస్సు యొక్క కల్పనయే। మనస్సు నా నుండి బయల్వెడలే భావనా రూపమే. కాబట్టి సమస్తమునకు నేనే కర్తను"** – అను భావనను ఆశ్రయించు. **"సమస్తము నాకర్తృత్వమే"** అనే భావనతో **మహాకర్తృత్వము** వహించి ఆస్వాదించు. **"స్వప్నమునకు కర్తను నేనే అయినట్లు, జాగ్రత్ కూడా కర్తను నేనే"** అని భావించి, అప్పుడు–ఈ జగద్దృశ్యమును ఆహ్వానించు.

## కర్తృత్వ – అకర్తృత్వాతీతము!

**శ్లో॥ అథవా సర్వకర్తృత్వం(చ) – అకర్తృత్వం చ వై, మునే!**
**సర్వం త్యక్త్వా, మనః పీత్వా యోఽసి సోఽసి స్థిరోభవ॥**

ఓ మునీశ్వరా! క్రమంగా, (1) సర్వకర్తృత్వములు (2) సర్వ అకర్తృత్వములు – ఈ రెండూ మనస్సుతో త్యజించి వేయి. దేనితో ఆ రెండూ త్యజిస్తున్నావో, **అట్టి త్యజిస్తున్న మనస్సును కూడా** నీలోనికి ఉపసంహరించు. అప్పుడు ఏది శేషిస్తుందో అట్టి **"స్వస్వరూపాత్మ"** యందు సుస్థిరుడవై ఉండెదవుగాక.

(అనగా), దేనితో కర్తృత్వ–అకర్తృత్వములు త్యజిస్తున్నావో అద్దానిని కూడా (ముల్లు గుచ్చుకున్నవాడు మరొక ముల్లు తెచ్చి, గ్రుచ్చుకున్న ముల్లును బయటకు తీసి – ఆపై రెండు ముళ్ళు ఆవల సారవేస్తున్న విధంగా) – **త్యజించిన వాడవై ఉండుము.** అప్పటికీ శేషించిన ఆత్మయందు సమాధానము కలవాడవై (Having answered all types of differences) ఉండుము. ఆత్మస్వరూపుడవై మనస్సును శీతలపానీయమువలె పీల్చివేయుము.

***మనస్సును ఏ అహంకారముతో త్యజిస్తున్నావో, అట్టి అహంకారమును త్యజించి, నీయందునీవే ప్రశాంత – ఆనంద చిత్తుడువై ఉండెదవుగాక!***

- ఆకాశము వలె నిర్లేపుడవు (నిర్విషయుడవు) అయి హృదయములో గల సమస్త జగత్ పరిమిత–దేహపరిమిత విశేషములన్నీ పరిత్యజించివేయి. దేనిచేతనూ స్పృశించబడినివాడవై ఈ జగత్తు నందు క్రీడగా చరించు.
- చిత్ జ్ఞాన దీపపు జ్యోతితో హృదయములో చీకటిని పారద్రోలివేయి. అజ్ఞాన దృష్టులను, భావావేశములను శమింపజేసి వేయి.
- ప్రాణ స్పందన పూర్వకమైన వాసనలను సంపరిత్యజించివేయి. **'ఇష్టాయిష్టములు'** మొదలైన వాటి పట్ల **ప్రాణము (ప్రియత్వము) స్పందించుచుండటమును సశాంతింపజేసినవాడవై ఉండు.**
- ఆకాశమువలె సమస్తము సమూలంగా పరిత్యజించి **ప్రశాంత మనస్కుడవై ఉండు.**
- హృదయమునందు గల **సమస్త ప్రాపంచక దేహసంబంధమైన వాసనా సమూహములను పరిత్యజించి,** హృదయము నందు **'పరమ ప్రశాంతత'**ను నెలకొల్పుము. **సర్వత్రా 'ఆత్మభావన'ను సంస్థాపించుకొని ఉండుము.**

పై విధంగా తీర్చిదిద్దుకొనుచూ – ఎవ్వరైతే,

- **యః తిష్ఠతి గత వ్యగ్రః, సః ముక్తః పరమేశ్వరః।** సర్వ వ్యగ్రతలను సమూలంగా జయించి, ప్రశాంతంగా సమస్తము ఆత్మయందు ఏకముచేసినవాడై ఉంటాడో, (All worries at its core)
- **ఆతడే ముక్తుడు।**
- **ఆతడే పరమేశ్వరుడు। ఆతడే విష్ణువు। ఆతడే శివుడు।**

## ఆత్మానందము
## చిదానందరూపమ్। శివోఽహమ్। శివోఽహమ్।

**ఋభు మహర్షి :** హృదయమునందు ఆత్మానందజ్యోతిని వెలిగించి, 'సర్వప్రాపంచక దృష్టులు – ఈషణములు' అనే చీకటిని తొలగించుకొని,ఈ సమస్త బాహ్య– అభ్యంతరములను **స్వకీయ శివానంద స్వరూపము**గా దర్శిస్తున్న **మహనీయుని** బ్రహ్మానంద గానామృతమును విను.

ఆహా! (1) నాయొక్క, (2) తదితర "నీవు-ఆతడు-ఈతడు" మొదలైన సమస్త జీవుల యొక్క (3) ఈ సమస్త జగద్దృశ్యము యొక్క **"వాస్తవ-స్వాభావిక-సహజ-అనునిత్య"** రూపము **'ఆత్మ'యే**-అని దర్శించుచున్నాను. అట్టి **స్వాభావిక సిద్ధియే** ఆత్మ సాక్షాత్కారము. "అనుకోవటము" యొక్క అవసరం లేకుండానే సమస్తము స్వాభావికంగా స్వస్వరూపాత్మయే"- అని **అనిపించటమే ఆత్మసాక్షాత్కారము.**

**దృష్టం ద్రష్టవ్యమ్ అఖిలమ్। - చూడవలసిన సమస్తమును చూచిన వాడను అగుచున్నాను.**

ఇంతవరకు భ్రాంతితో "ఏదో పొందాలి! చేయాలి! చూడాలి! అప్పటికి గాని పొందవలసినది పొందినట్లు కాదు".. అని, "ఎక్కడో ఏమిటో? ఏదియో?" అని చెప్పుకుంటూ పది దిక్కులలోన సంచారాలు చేస్తూ అనేక ఉపాధులతో వెతికాను. చివ్వరికి **"అది నాయొక్క స్వస్వరూపాత్మయే"** అని ఇప్పుడు హృదయములో జ్ఞానజ్యోతి వెలుగుచుండగా, చీకట్లు తొలగి, సత్యము అత్యంత సుస్పష్టము అయింది.

**యుక్త్యా వై చరతో జ్ఞస్య సంసారో గోష్పదాకృతిః।** ఆత్మ గురించి ఎరిగి, కించిత్ ఉపాయముతో ఎవ్వరు సంసారము నందు చరిస్తూ ఉంటారో, అట్టివారికి - 'అపారము' అని చెప్పబడే సంసార సాగరము - గోవుపాదముద్ర దాటటమంత సులభము అవుతుంది. ఇక **"సంసారసాగరము, భవబంధము"** మొదలైన మాటలన్నీ కూడా 'ఉత్తుత్తివే' అవుతాయి.

ఏ ఇంద్రియ జగత్తు జాగ్రత్ -స్వప్నములలో ఎదురుగా తారసబడుచూ "అపారము, దాటరానిది. బంధము మోక్షము అతిదుర్లభము" - అని ఇంతకాలము అదంతా కూడా అనిపిస్తూ ఉన్నదో...అదంతా కూడా **"మొదలే లేదు"**.. అని తెలియవస్తోంది. ఎందుకంటే..,

> **శ్లో॥ స బాహ్య-అభ్యన్తరే దేహే హి, అధ ఊర్ధ్వన్చ దిక్షు చ**
> **ఇత ఆత్మా! తతోఽపి ఆత్మా। <u>నాస్తి అనాత్మమయం జగత్॥</u>**

ఈ దేహము యొక్క లోపల - వెలుపలి, క్రింద-పైన, సమస్త దిక్కులలో - ఆత్మయే సమస్తముగా వ్యాపించి సంప్రదర్శితమై ఉన్నది. అందుచేత 'అనాత్మ'అనుదానికి చోటెక్కడ? చోటేలేదు. 'జగత్తు' అనబడేదేదీ ఆత్మకు వేరై కించిత్ కూడా లేదు. సమస్తము ఆత్మయే అయి ఉండగా 'ఇది ఆత్మ। అది అనాత్మ" - అనే ప్రసక్తి ఎక్కడిది? **ఇది ఆత్మయే। అదీ ఆత్మయే।**

*అహమాత్మా! సోఽహమ్। నేను సర్వదా ఆత్మయే అయి ఉన్నాను. దృశ్యము, దేహము, ఇంద్రియములు, ఇంద్రియార్థములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము - ఇవన్నీ ఆత్మ స్వరూపుడనగు నాకు వేరై లేవు. ఎక్కడ ఏదీ నేను కానిదిగాని, నాచే **'తన్మయము'** కానిదిగాని లేనే లేదు. **సర్వం సత్-చిత్ -మయమ్ తతమ్। కిమ్ అన్యత్ అభివాంఛామి?** సమస్తము నా సచ్చిన్మయస్వరూపమే అయి ఉండగా, దేనిని వేరుగా కోరుకోవాలి.*

**సమస్తం ఖలు ఇదం బ్రహ్మ।** ఈ ఇంద్రియముల జగత్తుగా కనిపిస్తున్న సమస్తము స్వయముగా బ్రహ్మమే అయి ఉన్నది. ఈ సమస్తముగా ఆత్మయే విస్తరించినదై ఉంటోంది. **సర్వమ్ ఆత్మా ఇదమ్ ఆతతమ్।**

ఓ అనఘా! నిదాఘా మహాశయా! సమస్తము సర్వదా వ్యాపక బ్రహ్మమే అయి ఉండగా, ఇక అద్దానిలో **"అహమ్-నేను। అన్యమ్।- నాకు వేరైనది! నేను వేరు! ఇదంతా వేరు"**.. అనిపించటమనేది **'భ్రాంతి'**యే అయి ఉన్నది. ఘనీభూతమైనట్టి **"బ్రహ్మము"**నకు మాత్రమే **'ఉనికి'** ఉన్నది. బ్రహ్మమునకు అన్యమైనదంతా **'కల్పితము'** మాత్రమే! అందుచేత వస్తుతః స్వకీయమైన ఉనికి లేదు. ఆత్మ యొక్క భావనచేతనే **"అన్యము ఉన్నది"**- అని పరికల్పించబడుతోంది. అట్టి పరికల్పన (Deep attribution)చే ఉన్నదానివలె అగుచున్నది. "స్వతఃగా ఈ జగద్దృశ్యము ఉన్నదా?" అనే పరిశీలనాత్మక దృష్టితో చూస్తేనో?

**శ్లో॥ న శోకోఽస్తి। న మోహోఽస్తి। న జరాఽస్తి। న జన్మనా।**

ఇక్కడ స్వతఃగా (భావన-అనునది లేకుండా) శోకము లేదు. మోహము లేదు. జన్మలేదు. వార్ధక్యము లేదు. మరణము లేదు. మరి? **యత్ అస్తి ఇహ, తదేవ అస్తి।** ఏదైతే స్వతఃగానే ఉన్నదో, అదియే ఇక్కడ ఇదంతాగా ఉన్నది. కాబట్టి ఓ నిదాఘా! అన్ని వేదనలు త్యజించివేయి. విజ్వరుడవై సర్వదా ఆత్మస్వరూపుడవై ఉండెదవుగాక! **"సర్వదా సర్వత్రా సమస్తము స్వయముగా బ్రహ్మమే!"** అను దృష్టిని కలిగియుండి, ఏది ప్రాప్తిస్తే అది **సద్బ్రహ్మ భావన**తో ఆస్వాదించు. "ఏదో లేనిది కావాలి. ఉన్నది వదలాలి".. అనునదంతా త్యజించి ఉండు. **త్యాగా దాన పరిత్యాగీ విజ్వరో భవ సర్వదా।**

- "నేను వదలాలి। - ఇచ్చివేయాలి।" - అను ప్రయత్న వ్యవహారము కూడా వదలివేయి.
- సమస్తమును స్వాభావికంగానే త్యజించినవాడవై ఉండు.
- దేనితో పరిత్యజిస్తూ ఉన్నావో, అట్టి 'త్యాగము' అనుదానిని కూడా త్యజించినవాడవై, రుగ్మతలన్నీ రహితము చేసుకొని ఉండు.

ఓ మహామతీ! **"జన్మలే నాకు లేవు"** అని తెలుసుకొన్న నాకు, **"ఇదియే -అంతిమ జన్మ"** అను భావముతో మాత్రం పనియేముంటుంది? జన్మ-కర్మలకంటే ముందేగల ఆత్మగా - **"ఆత్మతత్త్వానుభవి"** - అయి ఉండుము.

మౌక్తికములు (ముత్యములు) నుంచి వెదురుకర్రతో చేసిన 'వేణువు'కు అలంకరించబడువిధంగా దృశ్యము పట్ల అనురక్తిని జయించిన మనస్సు సంపాదించుకొన్నవారు **'స్వస్వరూపాత్మ'** అనబడు **సమ్యక్ స్థానమును** సిద్ధించుకొంటున్నారు. ఆత్మయొక్క ప్రసంగముచే విషయముల పట్ల విరక్తి (అనురక్తి రాహిత్యము) స్వాభావికము అగుచున్నది.

ఓ నిదాఘా! మనందరికీ ద్రష్ట – దర్శన సంయోగము చేత (The pleasure that is emanating from the coincidence of Perceiver and the Object of Perception) ఏ ఆనందము జనిస్తోందో, – అది వస్తువులోంచి జనిస్తోందనుకుంటున్నావా? లేదు. **ఆత్మనుండియే ఆ ఆనందము పుట్టుకువస్తోంది.** అందుకు దృశ్యవస్తువు **'కారణము'** కాదు, **'కార్యమూ'** కాదు.

**'బుద్ధి'** అనే దర్పణములో ప్రతిబింబించే ఆనందము ఆత్మ నుండియే ప్రాప్తిస్తోంది. సమస్త ఆనందములు ఆత్మనుండియే బయల్వెడలుచూ ఉండగా – వస్తువు నుండి కలుగుచున్నట్లుగా (భ్రమచే) అనిపిస్తోంది. అట్టి స్వస్వరూప – సమస్త స్వరూప ఆత్మనే మేము ఎల్లప్పుడు ఉపాసిస్తున్నాము. **ఈ సమస్తము సర్వ జన్మ-కర్మ వ్యవహారములతో సహా – ఆత్మగానే ఆస్వాదిస్తూ, ఆత్మానందము పొందుచున్నాము.**

ద్రష్ట-దర్శన-దృశ్యములను వాటికి సంబంధించిన వాసనలతో సహా (Perceiver - Perception - All that being Percieved along with Tendencies) త్యజించగా, ఆ మూడింటి మధ్యగా ఏదైతే **ప్రప్రథమ దర్శనము** (perceiving)గా ఆభాసిస్తోందో, – అట్టి 'ఆత్మానందము'ను మేము సర్వదా ఉపాసిస్తున్నాము. అట్టి బుద్ధి వృత్తిజ్ఞానమును ప్రకాశింపజేయునదియే **'పరమాత్మ'**గా మాచే అభ్యాసపూర్వకంగా ఆరాధించబడుతోంది.

ఉన్నది – లేదు (అస్తి-నాస్తి)ల మధ్యగా అనునిత్యముగా "ప్రకాశము (Enlightenment) రూపముగా, ఏది ప్రకాశించుచున్నదో, – **అట్టి ఆత్మయే మాకు ఎల్లప్పుడు ఉపాస్య వస్తువు.**

ఓ నిదాఘా! **సంత్యజ్య హృత్ గుహేశానం "దేవమ్ అన్యమ్"** ప్రయాన్తియే,.. **తే రత్నమ్ అభివాంఛ్చన్తి – త్యక్త హస్తస్థ కౌస్తుభాః॥** ఎవ్వరైతే హృదయ గుహలో సర్వకాల-సర్వావస్థలందు ఆత్మానందరూపంగా ప్రకాశమానుడైయున్న ఆత్మభగవానుని ప్రక్కకు పెట్టి, అన్యముగా ఉన్న 'దేవత' కోసం ప్రయత్నశీలుడై ఉంటాడో..., అట్టివాడు చేతిలో ఉన్న 'కౌస్తుభమణి'ని విడచిపెట్టి, ఎక్కడో ఉన్న ఒక సాధారణమైన రత్నము గురించి దేవులాడేవాడు – అగుచున్నాడు.

## ఇంద్రియజయము

**నిదాఘుడు :** స్వామీ! మీరు చెప్పుచున్నవన్నీ అక్షర సత్యములే। సశాస్త్రీయములేకూడా। అయితే, మేము బుద్ధి యొక్క చ్యుతి (Distraction) స్వభావముతో కూడి ఉన్నవారమై, ఇంద్రియములను నియమించలేకపోతున్నాము. అవి విచ్చలవిడిగా విషయములపై వ్రాలి, మాకు అనేక బంధములు తెచ్చిపెడుతున్నాయి. మా ఆత్మ యొక్క ఔన్నత్యమును, మహత్-స్వభావమును మేము ఆస్వాదించలేకపోతున్నాము. ఏమి చేయాలి?

**మహర్షి ఋభు :** శ్లో॥ **ఉత్థిత – అనుత్థితాన్ ఏతాన్ ఇంద్రియాదీన్ పునః పునః,**
**హన్యాత్ వివేకదండేన వజ్రేణేవ హరిః గిరీన్॥**

బిడ్డా! నిదాఘా! ఒకానొక సందర్భములో పైకి లేచి గ్రామ-పట్టణములపై వ్రాలుచున్న పర్వతముల రెక్కలను ఇంద్ర భగవానుడు తన వజ్రాయుధముతో ఖండించి వేశారు చూచావా? ఆ విధంగా విషయముల వైపుగా మరల మరల తలలు ఎత్తుతున్న ఇంద్రియ శత్రువులను "ఆత్మజ్ఞాన వివేకము" – అనే వజ్రాయుధముతో అణచి, వశం చేసుకోవాలి. మాటిమాటికీ శాస్త్రప్రవచిత సాధనలందు ఇంద్రియములను నియమించాలి. అందుకే శాస్త్రములు, ఆత్మశ్రేయోభిలాషులు, గురువులు, సంఘ పెద్దలు కూడా **విధి నిషేధములను** (Dos and Don'ts) నియమించి చెప్పటము జరుగుతోంది.

- **సంసార రాత్రి దుస్స్వప్నే శూన్యే దేహమయే భ్రమే।** రాత్రి నిద్రించినప్పుడు అక్కడ ఉన్నది 'శూన్యమే' అయినప్పటికీ మనస్సు అనేక దుస్స్వప్నములు ప్రదర్శించి, ఆ స్వప్నశీలునికి-భయము, ఉద్వేగము, దుఃఖము-మొదలైనవి కలుగజేస్తూ పోతోంది కదా!
- అట్లాగే, సంసారము (ఇంద్రియ విషయ పరంపరలతో నిర్మలాత్మకు ఏర్పడుచున్న సంబంధ బంధము) స్వతఃగా శూన్యమే అయినప్పటికీ కూడా, "జన్మ-కర్మ- జరా-మరణ-బాధ-భయ-ఇత్యాది కల్పనచేసి ఈ జీవుని అయోమయములో ముంచి తేల్చుచున్నది.

**– ఈ దేహభ్రమ (దేహముతో ఏర్పడు అవినాభావ సంబంధము)** రాత్రి వచ్చిన కల వలె వాస్తవానికి శూన్యమే. అయితే మాత్రం ఏం? అదంతా సంసృత-విభ్రమమంతా కలుగజేస్తూ ఉన్నది. సంసారము అనబడు ఇదంతా కూడా (పవిత్రమగు ఆత్మభావనను మరుగునపరచునదై, ఏమరువజేయునదై) ప్రవర్తమానము అవుతోంది. ఈ విధంగా జనన- మరణ – ఇత్యాది విశేషాలతో కూడిన సంసృతి (లేక) సంసార భ్రాంతి "మిథ్యామాత్రమే" (It's actual form is one's own illusion only) అని తత్త్వవేత్తలు సిద్ధాంతీకరించి మరీ చెప్పుచున్నారు.

బాల్యమంతా 'అజ్ఞానము'చే ఉపహతము (Beaten) అయి వృథా అగుచున్నది. **– అజ్ఞాన ఉపహతో బాల్యే।**

**– యౌవనే వనితా హతః।** యౌవన కాలమంతా స్త్రీ పురుషుల పరస్పర ఆకర్షణ – వికర్షణ విశేషాలతో వృధా అయిపోతోంది.

**– శేషే కళత్ర చింతాఽఽర్తః।** ఇక మిగిలిన జీవితము భార్యాబిడ్డల వ్యవహారముల గురించిన చింతనలతో (Worries) గడచిపోతోంది. మరి స్వస్వరూపమగు ఆత్మగురించి తెలుసుకోవటం ఎప్పటికి?

## ఆత్మజ్ఞానము, గురించి అప్రయత్న శీలత్వము

అవును. ఆత్మజ్ఞానము కొరకై ప్రయత్నించకుండా ఈ జీవితమంతా గడపిన నరాధమునకు (నరులలో అధమ దశకు పరిమితమైన వానికి) చివరికి ఏమి మిగిలినట్లు? పుట్టినందుకు ఏమి సాధించినట్లు? **దుఃఖపరంపరలను సంస్కారరూపముగా అధికం చేసుకుపోవటమే అగుచున్నది.**

"ఈ ప్రపంచంలో గొప్ప గొప్ప వస్తువులు ఉన్నాయి కదా! గృహములు, గుర్రములు, ధనము, గొప్ప జన సంపద ఇవన్నీ సంపాదించుకొంటే సరిపోదా? అవన్నీ గొప్ప సుఖమును కలుగజేస్తాయి కదా!. అందుచేత అవి సంపాదించటానికి జీవితకాలమును వెచ్చిస్తే తప్పేమున్నది? "– అని కొందరు భావిస్తూ, ఆత్మతత్త్వజ్ఞానము గురించి **'విముఖులు'** అగుచున్నారు. కాలమంతా వ్యావహారిక విషయాలకే అర్పించివేస్తున్నారు. అయితే, మరికొందరు "తత్త్వజ్ఞానమునకు ఇప్పుడు తొందరలేదు. వార్ధక్యంలో చూచుకుందాం" – అను అభిప్రాయము కలిగి ఉంటున్నారు.

**సతో అసత్త స్థితా మూర్ధ్ని – "సుందరమైన గొప్ప వస్తువులు"** అనుకున్న వాటి నెత్తిపై కొన్నాళ్ళకు **'చెడిపోవటము నశించటము'** అనేది వ్రాసిపెట్టబడి ఉన్నది. అవన్నీ కొన్నాళ్ళకు ఎటో పోనున్నాయి.

**రమ్యాణాం మూర్ధ్ని అరమ్యతా। "ఈ ఈ వస్తువులు కలిగి ఉండటము, రమించటము అమోఘము"** అనుకుంటున్న వస్తువులపై కొన్నాళ్ళకు 'అరుచి' ఏర్పడుచున్నది. వాటి నెత్తి మీద **'అరమ్యత'** వ్రాయబడియే ఉన్నది. ఇప్పుడు **'ఎంతో బాగున్నాయి'** అని తెచ్చి ఆస్వాదిస్తూ ఉండగా, కొన్ని రోజుల తరువాత వాటిపై **'రోత'** పుట్టటం ప్రారంభమౌతోంది. ఈ జగత్తులో ఇప్పుడు రమ్యంగా కనిపించేవన్నీ 'అరమ్యము' కాబోవుచున్నాయి.

**సుఖానాం మూర్ధ్ని దుఃఖాని :** ఏవేవి "ఇవి నాకు ఎంతో సంతోషము, బ్రహ్మాండము" అనుకుంటూ పొందుతామో, కొంచెము సమయమైన తరువాత వాటి ముఖము దుఃఖముగా పరిణమించటమే పర్యవసానముగా అవబోవుచున్నాయి.

అటువంటి – (స్వతఃగా లేనట్టివి బంధుత్వములు మొదలైనవి) – భ్రమచే "నిజంగానే ఎప్పటికీ ఉంటాయి" అని భ్రమింపజేస్తున్నాయ్। పుత్రాదుల అవినాభావ సంబంధములు–(Relationships that outwardly appear as if really existant even though originally non-existent) పైకి రమ్యముగాను, తీరాచూస్తే కొన్నాళ్ళకు బంధము కలిగించేవిగాను అగుచున్నాయి.

– అటువంటి వస్తువులను ఆశ్రయించి ఏమి ప్రయోజనం? దృశ్యములో కనిపించే వస్తుజాలమంతా మార్పు–చేర్పులు పొందు **స్వభావము, నశించు స్వభావము, సౌందర్యము కోల్పోయి శిధిలమగు స్వభావము** కలిగియే ఉంటాయి కదా! నశించనిదంటూ దృశ్యములో ఏమున్నది?

**శ్లో॥ యేషాం నిమేషణ – ఉన్మేషౌ జగతః ప్రళయ–ఉదయౌ,**
**తాదృశాః పురుషా యాన్తి। మాదృశాం గణనైవకా?**

ఎవ్వరు కనులు తెరిస్తే జగత్తులు పుట్టుకురావటం, వారు కళ్ళు మూయగానే బ్రహ్మాండములు నశించటము జగత్తులు ప్రళయమై (నశించి) పోవటం జరుగుతోందో, అట్టి సృష్టికర్తలగు బ్రహ్మ మొదలైనవారే కాలముచే దిక్కులేని వారై అంతర్హితం అగుచున్నారే! ఇక మావంటి భౌతిక మానవ దేహధారుల గురించి వేరే చెప్పేదేమున్నది? ఈ దేహములు కనులు తెరచి – మూయు సమయంలో మటుమాయమగుచున్నాయి. ఈ విధంగా శరీరములే అత్యంత క్షణికమైనప్పుడు (అశాశ్వతమైనప్పుడు), ఇక దృశ్యములోని ప్రియ అప్రియ వస్తుజాలముల గురించి, సంబంధ – అసంబంధముల క్షణికత్వము గురించి వేరే అనుకోవాలా? అటువంటి దృశ్య సంసారము యొక్క మధ్యగా కనిపిస్తున్న ఈ శరీరము 'సుఖమైన వస్తువు' అని ఎవ్వరైనా అనగలరా? నమ్మి ఉండగలరా? క్షణమునకు ఒక విధంగా ఉంటున్న భౌతికదేహము సుఖమయము ఎట్లా అవుతుంది?

## స్వస్వరూప–ఆత్మ సందర్శన మహానందం

**ఋభు మహర్షి :** ఆత్మతత్త్వమును ఎరిగి **"నేను – సదా శివ బ్రహ్మమునే"** అని ఎరుగుచున్న బ్రహ్మతత్త్వజ్ఞుల బ్రహ్మానందగానము చెప్పుతాను. బిడ్డా! మునివర్యా! నిదాఘా! వినవయ్యా!

## మెలకువ

**ప్రబుద్ధోస్మి। ప్రబుద్ధోస్మి।** ఆహాc! ఇప్పుడు మెలకువ తెచ్చుకొని "ప్రబుద్ధుడను" **(Wel-clarified/Wel-aware/Wel-conscious)** అగుచున్నాను।

## నేను సదా ఆత్మస్వరూపుడనే। సదా శివుడనే!

మరి నాయొక్క అఖండ – అప్రమేయ సర్వాత్మకమైన అఖండాత్మను ఇంతవరకు ఎందుకు గమనించటంలేదు? ఎందుక ఆత్మానందమును ఆస్వాదించలేదు?

నాయొక్క **"ఆత్మాహమ్ అనుభూతి"** అనే సొత్తును ఒక గజదొంగ ఎల్లప్పుడూ దొంగిలిస్తూ వస్తున్నాడు. **అది నా మనస్సే!!** (స్వకీయ మననమే రూపముగా గల) మనస్సే అన్యభావనా మనన రూపంగా నన్ను జయిస్తూ వస్తోంది. ఇక ఇప్పుడో? **'ఆత్మ గురించిన మననము'** నందు ఈ నా మనస్సును నియమించగానే, అది తనయొక్క రూపమే కోల్పోయి, నాచే సంహరించబడుతోంది. మరుక్షణము "**ఈ సమస్త విశ్వము తన శరీరమైయున్న ఆత్మయే నేను"** అగుచున్నాను.

⌘

ఓ నిదాఘా! స్వస్వరూపాత్మ యొక్క స్వాభావికమగు **'ఔన్నత్యము'**ను గమనిస్తూ, **"అఖండాత్మ స్వాభావుడవు"** – అయి ఉండుము. దొంగ వంటి నీ మనస్సే "కాదేమో?" అనే శంకను కలిగిస్తోంది సుమా! మనస్సు మాట వినకు. బుద్ధిని నిశ్చలము చేసి, అప్పుడు ఆ నిశ్చల – నిర్మల బుద్ధిచే గమనించబడేది ఆశ్రయించు.

### మనస్సును వశం చేసుకోవటం ఎట్లా?

ఉపాయముచే అది సులభమే. ఉపాయము ఆశ్రయించని వానికి ఈ మనస్సు కంటే పెద్ద సమస్య మరింకొకటేదీ ఉండదు.

**నిదాఘుడు:** సర్వత్రా నిశ్చలస్వరూపమైయున్న ఆత్మను ఏమరపింపజేసి, చంచలములగు దేహము– గుణములు మొదలైనవి చూపి, మురిపించి చంచలత్వమును కలిగిస్తూ ఉన్న ఈ **'మనస్సు'ను 'ఉపాయము'తో వశం చేసుకొని, నిశ్చలాత్మ స్వరూపముతో అనుసంధానము సిద్ధించుకోవచ్చునని** మీరు సూచిస్తున్నరు కదా! హే గురువర్యా! తండ్రీ! ఋభుమహర్షీ! ***అట్టి ఉపాయములు ఏమిటో దయతో నాకు సూచిస్తూ, బోధించండి.***

## మనోజయ– ఆత్మానంద సిద్ధి ఉపాయములు

**ఋభుమహర్షి :** ఓ నిదాఘమహాశయా! మనస్సు స్వయంకృతమైన మననరూప నిర్మితమే కదా! అంతేగాని, మరొకరి బలప్రయోగ రూపము కాదుకదా! అందుచే **"అన్యమనము (ఆత్మమననము)** (- Another half) **చేత దృశ్య మనన రూపమగు మనస్సును జయించగలను"** – అని ముందుగా ఆత్మనమ్మకము కలిగి ఉండెదవుగాక! **మా ఖేదం భజ హేయేషు।** కొన్ని కొన్ని (వస్తువులు గాని, సంబంధములుగాని, లౌకికమైన సామర్థ్యరూపములగు విశేషములుగాని) నిన్ను విడచి వెళ్ళుచూ ఉన్నప్పుడు 'ఖేదము' పొందవద్దు. "అయ్యో! పోవుచున్నదే!" – అనే మననము చేయవద్దు – **<u>"ఆత్మనగు నాయొక్క దివ్యసమక్షంలో అవన్నీ రావటం – పోవటం కల్పనలోని ఒక లీలా విశేషము మాత్రమే"</u>** అనే మననము కలవాడవై ఉండుము. ప్రశాంతత, చిరునవ్వులను వీడవద్దు.

**న ఉపాదేయ పరో భవ।** నిన్ను ఆశ్రయిస్తూ వస్తున్న **"వస్తు–జన సంబంధ"** మొదలైనవాటిని మనస్సుతో స్వీకరించకుండానే, **"అవన్నీ దృశ్యములోని రాక–పోకల స్వభావము కలిగియున్న చమత్కారములు కదా!"**– అను దృష్టిని, అవగాహనను, సమన్వయమును వదలవద్దు.

**హేయ ఆదేయ దృశౌ త్యక్త్వా శేషస్థః సుస్థిరో భవ।** త్యాజ్య (Leaving) - గ్రాహ్య (Taking) ఉభయ భావములను త్యజించివేసి, అప్పటికీ శేషించియుండే నీ యొక్క **"సర్వాతీత స్వస్వరూపము"** నందు సుస్థిరుడవై ఉండుము.

దేనినీ వదలనూ వద్దు। స్వీకరించనూ వద్దు।

***అభ్యాసముగా కలిగి ఉండవలసినవి:***

- ❖ దృశ్యములో దేనినీ ఆశించకపోవటము – **నిరాశతా।**
- ❖ "ఏది వస్తుందో? ఏది పోతుందో?" – అనే భయము లేకపోవటము – **నిర్భయతా।**
- ❖ నిత్యమగు ఆత్మనే భావన చేస్తూ, అనిత్యములైన వాటిని – **'అనిత్యమే కదా'** అను అవగాహన కలిగి ఉండటము – **నిత్యతా।**
- ❖ సర్వత్రా సమముగా ఆక్రమించియున్న ఆత్మను దర్శిస్తూ, భేదదృష్టిని జయించు జ్ఞానము కలిగి ఉండటము – **సమతా జ్ఞ తా।**
- ❖ కోరికలు జయించి ఉండటము. నిష్కామత్వము. **నిరీహతా।**
- ❖ సర్వక్రియలకు ఆవల సర్వకర్తా – రూపమున ప్రకాశించుచున్న ఆత్మభావనచే కర్మాతీతము వహించటము. **నిష్క్రియతా।**
- ❖ సాత్వికత, ప్రశాంతత, అనుద్వేగత గల ప్రవర్తన కలిగి ఉండటము – **సౌమ్యతా।**
- ❖ సర్వకల్పనలను దాటివేసి నిర్వికల్ప స్వరూపమగు **'ఆత్మత్వము** వహించి ఉండటము. **నిర్వికల్పతా।**

- ఆత్మతత్త్వము పట్ల పట్టుదల కలిగి ఉండటము. **ధృతి.**
- తండ్రికి బిడ్డ పట్ల గల స్నేహపూర్వక ఆప్యాయతవలె సర్వజీవుల పట్ల మైత్రీభావన కలిగి ఉండటము. **మైత్రీ।**
- మనస్సును అసంతృప్తి తాకనీయకుండా, సర్వదా తృప్తి కలిగి ఉండటము. **మనస్తుష్టిః।**
- మృదువైన ప్రవర్తన, మధురమైన సంభాషణ అభ్యాసముగా కలిగి ఉండటము. మృదుతా। **మృదుభాషితా।**
- **'త్యజించటము – గ్రహించటము'** అనే హేయ – ఉపాదేయముల నుండి సర్వదా వినిర్ముక్తుడవై (Wel-relieved) అయి ఉండటము.

ఈ రూపమైన అభ్యాసములచే మనస్సు జయించబడుచూ, ఆత్మానందము స్వాభావికము అగుచూ ఉండగలదు.

**"తృష్ణ"** అనే జాలరి స్త్రీ – **"చింతలు"** అనే తంతువులతో **"వాసనలు"** అనే చేపల వలను అందముగా అల్లి, **"సంసారము"** అనే చెరువులలో ఆ వలను విసరి **"జీవులు"** అనే చేపలను పట్టి **"జన్మ–జన్మాంతరములు"** అనే బుట్టలో వేసుకొని వినోదిస్తోంది.

చైతన్య స్వరూపుడైయున్న ఈ జీవుడు పాంచభౌతిక దృశ్యముతో ఏర్పడిన సంసార బంధము నుండి విడివడటానికి యోచించాలేగాని, "నేను బద్ధుడను" నా గతి ఇంతే!" అని తలచుచూ చూస్తూ ఊరుకుంటే ఎట్లా? వాయు వీచికల వేగముచే మేఘములు తునాతునకలై ఎటో వెళ్ళిపోతాయి చూచావా? అట్లాగే. అభ్యాసముతో కూడిన "ఆత్మజ్ఞానము" అనే చురుకైన, పదునైన శరము (బాణము)తో (సునిశిత బుద్ధితో) వాసనా సమూహములను (The Groups of Tendencies) మొదలంట్లా ఛేదించాలి. **"తత్ పదము"** నందు బుద్ధిని నిశ్చలం చేసి ఇప్పుడే, ఇక్కడే ఆత్మస్వరూపుడవై, **నీయొక్క స్వరూపమునందు (కథా రచయిత కథయందువలె) సమస్త జగత్తును అంతర్గముగా చేసి ఆత్మానందము ఆస్వాదించెదవు గాక!**

ఓ నిదాఘా! నీవు కూర్చున్నప్పుడు, లేచి తిరుగుచున్నప్పుడు, నిదురిస్తున్నప్పుడు, మేలుకొని ఉన్నప్పుడు, నిలుచుని ఉన్నప్పుడు, పడుకున్నప్పుడు కూడా– **"అసత్ ఏవ ఇదమ్ ఇతి"**– = "ఇదంతా నాటకములోని పాత్రల పరస్పర సంబంధమువలె, కథలోని సంఘటనల వలె, స్వప్నములో కనిపించిన అద్దాల మేడవలె – మొదలే అసత్తు। జగత్ భావనచే (Subject to operating the sense of the world) మాత్రమే జగత్ రూపమై (ఆత్మకు అనన్యముగా ఉండి)– అన్యము వలె సందృశ్యమౌతోంది. 'ఇదంతా అసత్తే' – **అసదేవ ఇతి అంతర్నిశ్చిత్య అస్థాం పరిత్యజ।"** – అని అంతరమున నిశ్చయము కలవాడవై పరిత్యజించి ఉండెదవుగాక।

ఒకవేళ..,

**శ్లో॥ దృశ్యమ్ <u>ఆశ్రయ సీదం చేత్, తత్ చిత్తోఽసి</u> బంధవాన్॥**

"ఈ దృశ్యము సత్యమే" – అని నీవు ఆశ్రయించటం జరిగితే, అట్టి చిత్తముచేతనే నీవు బద్ధుడవు కాగలవు.

**శ్లో॥ దృశ్యం <u>సన్త్యజసీదం చేత్, తత్</u> అచిత్తోఽసి మోక్షవాన్॥**

ఈ దృశ్యమును – చదువుచున్న నవలలోని ఒకానొక సంఘటన వంటిదిగా భావించి, మొదలే పరిత్యజించావనుకో, అప్పుడు <u>చిత్తరహితుడవై</u> మోక్షవంతుడవు అగుచున్నావు.

**ద్రష్ట– దృశ్యముల మధ్య గల కేవల చైతన్యాత్మ రూపము అనుభవము అయ్యేది ఎట్లా? – విను**

**శ్లో॥ 'న అహమ్। న ఇదమ్।" – ఇతి ధ్యాయం తిష్ఠ త్వమ్ అచలాచలః**
**ఆత్మనో జగతశ్చ అంతః – ద్రష్టు దృశ్యదశ – అన్తరే॥**

→ "నేను" అనునది లేదు. ఈ జగత్తు లేదు" అను అభ్యాసమును ఆశ్రయించుము.

ఇటువంటి నిర్ణయముచే –

- జగత్తు యొక్క మధ్యలోను,
- ద్రష్ట – దృశ్యముల మధ్యలోను,
- ద్రష్టములకు ఆవలగాను –

ఆ ఉభయముల మధ్యగా ఉన్నట్టి 'కేవలతత్త్వము' (The Absolute self)ను అనుభవముగా తెచ్చుకొనుచు, ఒక కొండవలె నిశ్చలుడవై ఉండగలుగుతావు.

"ఆస్వాదించటము – ఆస్వాదించబడునది" – ఈ ఉభయములకు సంబంధించిన సంకల్పములను త్యజించివేయి. "ఆస్వాదించాలి – ఆస్వాదించబడునది–ఆస్వాదించకూడనిది'–లకు సంబంధించిన సర్వ సంకల్పములను వదలివేయి. **'కేవలాస్వాదన తత్త్వము'** – ను ఆశ్రయించుచూ, అద్దానిని ఆత్మతత్త్వమునకు అనుసంధానము చేయి. క్రమముగా **పరమాత్మానంద స్వరూపుడవై** విలసిల్లెదవుగాక।

ఆలంబనము – ఆలంబన రహితము (అనాలంబనము) (Dependence and Indepence) మధ్యగా గల **నిరాలంబ స్వస్వరూపమునందు, మధ్యగా సుస్థిరుడవై ఉండుము.**

## ఆశాపాశము / రజ్జువు

ఒకడు మామూలు త్రాళ్ళతో కట్టుబడితే ఎట్లాగైనా ముళ్ళు విప్పి విడిపించవచ్చు. కాని **"ఇంకా ఏదో కావాలిసిందే! ఇంకా ఏదో పొందాలిసిందే"** – అన్న **'తృష్ణ'** అనే త్రాళ్ళతో బద్ధుడైనవాడిని బయటవాడెవ్వడూ కట్లు విప్పి విడిపించలేడు. అందుచేత ఓ నిదాఘా! నీవు తృష్ణకు బద్ధుడవు కాకూడదు సుమా! ఎందుకంటే, నీ తండ్రిగా గాని, నీ గురువుగాగాని తృష్ణచే బద్ధుడవైనప్పుడు ఎంతగా బోధించి కూడా, మరింకేమైనా చేసి కూడా **నీయొక్క సంసార – బంధనముల నుండి మాత్రం నేను నిన్ను విడిపించలేను.** తృష్ణను జయించాలంటే ఒక్కటే ఉపాయం.

| ***కామ–లోభములకు సంబంధించిన సంకల్పములను త్యజించి ఉండటమే తృష్ణను జయించటానికి ఉపాయము.*** |
|---|

'తృష్ణ' అనునది **'ఆశించటము'** అనే వ్యసనముతో మొదలై, చివరకు **'భయము – ఉద్వేగము'** అనే భీకరమృగములు సంచారములు చేస్తూ ఉన్న కీకారణ్యములో పడవేయగలదు.

తృష్ణ ఎటువంటిదంటే..,

- 'అహంభావము'తో నిండియున్నట్టిది.
- పుణ్యకార్యముల నుండి విరమింపజేసి, పాపకార్యములందు, క్రోధ–మోహములందు నియమించగలిగినట్టిది.

అందుచేత ఓ నిదాఘా! అట్టి తృష్ణను నీవు ముందుగా **"అనహంభావము (లేక) నిరహంకారము"** అనే శస్త్రముతో జయించనారంభించాలి. ఎట్లాగైనా సరే, ఏది ఏమైనా సరే, నీవు 'తృష్ణ'ను జయించి తీరాలిసిందే। మంగళప్రదమైన, దృశ్యమునకు అతీతమైన, ప్రపంచమును అధిగమించినట్టి **"భూమిక"** (State)ను సిద్ధించుకొనెదవుగాక। సర్వభయములు సశాంతించిన **"ప్రశాంత స్థితి"**ని పుణికిపుచ్చుకొనెదవుగాక।

## అంతరంగ సంకల్పదోషములు

ఈ జీవుని పవిత్ర హృదయములోనికి – ఎప్పుడో **'దోషముతోకూడిన సంకల్పములు'** అనే దొంగలు ప్రవేశించి అశాంతిని కలుగజేస్తూ ఉన్నాయి.

- **అహమ్ ఏష పదార్థానామ్।** → నేను ఈఈ పదార్థములకు సంబంధించినవాడను. చెందినవాడను.
- **ఏతే చ మమ జీవితమ్।** → ఈఈ పదార్థాలు నాకు ప్రాణప్రదం. ఇవి కలిగి ఉన్నప్పుడే నేను 'జీవితము' కలిగి ఉండగలను.
- **న అహమ్ ఏభిః వినా కశ్చిత్। మయైవ ఏతే వినా కిలా।** ఈఈ పదార్థములు, పుత్రులు, బంధువులు లేకపోతే నేను బ్రతకలేను. నేను లేకపోతే వీళ్లూ బ్రతకలేరు.

ఇటువంటి భావాలన్నీ 'హృదయము' అనే ఇంటిలో ప్రవేశించి తిష్ఠ వేసుకొన్న ఇంటి దొంగలే మరి!

ఓ నిదాఘా! ఇటువంటి అంతర్–నిశ్చయమును త్యజించివేయి. ఈ సమస్తమును, దీనితో పొందుతున్న మనస్సుతో సహా చక్కగా విచారణ చేసి సత్యాసత్యములు, నిత్యానిత్యములు ఏమిటో ఉత్తమబుద్ధితో గమనించు. విచారణచే మనస్సుతో సహా సమస్త దృశ్యమును విడచిపెట్టు.

**"నాహం పదార్థస్య।** నేను పదార్థములకు, విషయములకు మొదలే సంబంధించినవాడను కాను. (I am not a matter)

**"న మే పదార్థ" – ఇతిభావతే"** నేను పదార్థములు (All material factors) కాను. వాటికి చెంది లేను" (Neither I belong to matter nor matter belongs to me) – అని అంతరమున ప్రశాంతముగా, చల్లగా అట్టేబెట్టుకో. (Keep the Inner Heart as very peaceful and cool). **"ప్రశాంతమైన బుద్ధి"**ని ఉపయోగించి, అప్పుడు ఇక ఈ జగత్తులో నీవు నిర్వర్తించవలసియున్న – కర్మలను చేస్తూ, క్రమంగా వాసనలను జయించు.

## వాసనా త్యాగము

వాసనాత్యాగము సిద్ధించటమే మహదాశయముగా కలిగిఉండాలి. హే బ్రహ్మన్। **వాసనా త్యాగమే** (To get rid of tendencies & samskarams) **మహదాశయమై నీ పట్ల** వర్తిల్లునుగాక! **"వాసనా త్యాగమే సిద్ధించుకోవలసిన ధ్యేయము"**–అని విజ్ఞులచే పరికీర్తించబడుతోంది. సర్వత్రా సమబుద్ధిని కలిగియున్నవాడు అతిత్వరగా, అతి సులభంగా మమకారమును త్యజించి సమస్త వాసనలను తేలికగా త్యజించివేయగలడు. వాసనా త్యాగముచే జీవన్ముక్తి సిద్ధిస్తోంది. క్రమంగా విదేహముక్తి కూడా కరతలామలకము అవుతోంది.

**అందుచేత వాసనలను క్షయింపజేసి సర్వత్రా సమబుద్ధి (లేక) ఆత్మబుద్ధి సిద్ధించుకోవటమే మహదాశయమై ఉండును గాక।**

| | |
|---|---|
| **వాసనా త్యాగమునకు గుర్తు। ఫలము।** → | ❖ **మమకారము యొక్క ప్రక్షాళనము.**<br>❖ **సర్వత్రా సమభావన.**<br>❖ **అంతఃశాంతి.**<br>❖ **సమస్తము లీలగా/క్రీడగా అనిపించటము.**<br>❖ **స్వాభావికమైన ముక్తి. స్వస్వరూపము యొక్క కేవలత్వానుభవము.** |

**ధ్యేయత్యాగము – జీవన్ముక్తి :** = 'అహంకారము' అనే మూలపదార్థముతో నిర్మితము అగుచున్న వాసనలను (All Tendencies) లీలగా త్యజించి, అట్టి త్యాగఫలంగా **"ధ్యేయము"** అయినట్టి సమస్త దృశ్యమును – **దృశ్యముగా త్యజించి, ఆత్మగా సందర్శించటము.**

**నేయ త్యాగము – బ్రాహ్మణోత్తమమ్:** సాంసారిక – దోషకలనములను (దృష్టులను) నిర్మూలనము చేసుకోగా, వాసనలన్నీ (దృశ్యముతో ఏర్పడిన భావనా – కర్మణా వ్యవసన సంబంధములన్నీ) శమించగా – సమస్తము దృశ్య భేదములుగా కాకుండా – "ఏకము–అఖండము" అగు బ్రహ్మముగా అనునిత్యంగాను– నిస్సందేహంగాను, స్వాభావికంగాను అనుభూతమగుచున్నది. **"బ్రహ్మము మరెక్కడో".. అనే నేయం త్యాగ(న–ఇయం త్యాగం) భావనయే "ముక్తి". అదియే "ఉత్తమ బ్రాహ్మణము" లేక "అహమ్ బ్రహ్మాస్మి" భావన।.**

## సన్న్యాసి – యోగి

= కర్మలు సన్న్యసించి ఏకాంతము ఆశ్రయించువాడు – 'సన్న్యాసి'.

= సంయోగ వియోగాతీతుడై సమర్పణ భావముతో కర్మలు చేయవాడు – 'కర్మయోగి'

ఈ **"సన్న్యాసి", "యోగి"** – ఇరువురు సంసార జ్వరము (రోగము) నుండి బ్రహ్మము **స్వస్వరూప–సత్యస్వాభావికత్వమును** సిద్ధించుకోగలరు. ఆపద సమయములందు, సుఖదుఃఖ సందర్భములందు కూడా దృశ్యము నందు **మొదలే రతించనివాడై,** సర్వదా – సర్వత్రా **ఆత్మనే దర్శిస్తూ,** ఆత్మయందే **రమించువాడే** సన్న్యాసి, యోగి కూడా.

ఇంద్రియములను జయించినవాడే → **"శాంతుడు। దాంతుడు। సన్న్యాసి। యోగి।"** కూడా!

## జీవన్ముక్తుని స్వాభావికత్వము

**ఎవ్వడైతే** → తాను అనుకొన్నవి, ఆశించినవి, కోరుకొన్నవి అగు "ఈప్సితములు" నెరవేరుచున్నప్పుడు, నెరవేరనప్పుడు కూడా అంతరవృత్తుల దృష్ట్యా (As per Inner Avocational Zone) దేనికీ సంబంధించనివాడై, (గాఢనిద్రలో ఉన్నవానివలె...) దేనినీ స్వీకరించనివాడై ఉంటాడో...

– హర్ష ఆమర్షములను (దృశ్య విషయముల పట్ల ఉత్సాహ నిరుత్సాహములను, సంతోష–దుఃఖావేశములను) భయ–క్రోధ– కార్పణ్య (జాలికి సంబంధించిన విషాదము), – సంబంధమైన దృష్టులను – పరామర్శలు చేయనివాడై

**– యో న హృష్యతి, న గ్లాయతి–** దేనికీ సంతోషము పొందక, దిగులు చెందక ఉంటాడో, ***<u>స "జీవన్ముక్త" ఉచ్యతే।</u>***

## తృష్ణాబద్ధుడు :: తృష్ణా ముక్తుడు

**తృష్ణా బద్ధుడు:** "బాహ్య దృశ్య జగత్తు నుండి పొందవలసినది చాలా ఉన్నది. అదంతా పొందాలి" అను బాహ్యమున ఏర్పడుచూ ఉన్న విషయ వాసనలే **'తృష్ణ'** అని అంటున్నారు. "తృష్ణ" కారణంగానే **"నిత్యముక్తాత్మస్వరూపుడు"–** అయి ఉండి కూడా ఈ జీవుడు **'బద్ధుడు'** అగుచున్నాడు. విషయ వాసనల సంబంధమైన తృష్ణనే **'బంధము'** అని పిలుస్తున్నారు.

**తృష్ణాముక్తుడు :** సమస్త ఇంద్రియ విషయ వాసనల నుండి విడివడి ఉండటము – ముక్తికి హేతువు. **"దృశ్యము నుండి ఇంకా ఏదో కావాలి"** అను అంతరంగ నిబద్ధత్వము (లేక) తృష్ణను త్యజించినవాడే 'ముక్తుడు'.

**దుఃఖ జన్మ భయప్రదము : "ఇది నాకు – నాకే చెందినవి. ఇదమస్తు మమ"..** అను ఇచ్ఛ, అంతటితో ఆగక, **"ఇదంతా నాకు ఇంకా కావాలి"** – అనే **వాంఛ, యాచన** (Desiring and Begging).. ఇవియే సంసార శృంఖలములు (Bondage with the scenary). అట్టి ఇచ్ఛ–తృష్ణల పర్యవసానంగా– ఈ జీవుని పట్ల దుఃఖము – భయముతో కూడిన జన్మ పరంపరలు అంతులేకుండా వచ్చిపడుచున్నాయి.

ఓ నిదాఘా! **"వాంఛయే (Desire to have (or) expect and there by get disturbed)** → త్రెంచుకోజాలని తీవ్రమైన సంకెళ్ళకు **(Shackles, శృంఖలములకు) కారణము"** – అని గమనించెదవుగాక!

ఎవ్వడైతే ఉన్నట్టివి - లేనట్టివి (సత్-అసత్ రూపములు) అగు **సర్వపదార్థముల** పట్ల, సంబంధ- అనుబంధ బాంధవ్యముల వంటి సమస్త **సందర్భ-సంఘటనల** పట్ల **'భావించటము'** అనునది తగ్గించుకుంటూ ఉంటాడో, ఆతడే **జీవన్ముక్తుడు.** నూనె అయి పోతూ వస్తున్న దీపము వలె - 'వాంఛలు' అనునవి కూడా తమకుతామే సన్నగిల్లుతాయి. అప్పుడు మనస్సు - 'మహామనస్సు' అయి పరమోదారము' - అయినట్టి **"సర్వసమదర్శన ఆత్మానుభవ స్థానము"** చేరగలదు.

ఓ నిదాఘా!

> **శ్లో॥ బంధాస్థామ్ అథ మోక్షాస్థాం సుఖదుఃఖదశామ్ అపి**
> **త్యక్త్వా సదసదాస్థాం త్వం తిష్ఠ అక్షుబ్ధ మహోబ్ధివత్॥**

"బంధము ఉన్నదా? మోక్షము ఇంకా పొందానా? లేదా? సుఖదశలో ఉన్నానా? దుఃఖితుడనా! ఉన్నదేది? లేనిదేది?" మొదలైన సమస్త స్థితులను, వాటిపై మనస్సుకు ఏర్పడే ఆధారము (Dependence)ను **అధిగమించివేయి.** మనస్సుతోనే త్యజించి, ఆ తరువాత ఆ **మనస్సును ఆత్మయందు లయింపజేసి** తరంగ సంబంధమైన క్షుబ్దత్వములేని మహాసాగరమువలె - భావనాతరంగ రహిత **ఆత్మానంద సాగర స్వరూపుడవై** విరాజిల్లుము. నిశ్చల-సుస్థిర- అచ్యుత- కేవల ఆత్మానంద రూపమును సంతరించుకొన్నవాడవై ఉండుము. సముద్ర దేవత సముద్రమంతా తనయందు ప్రశాంతముగా దర్శించుకొను విధంగా **అన్యమైనదంతా నీ అనన్య నిరుపమానంద స్వరూపంగా** అనుక్షణము దర్శిస్తున్నవాడవై ఉండు.

## చతుర్విధ నిశ్చయములు

ఓ నిదాఘా! నీవు **"దేనిని ఏతీరుగా నిశ్చయదృష్టితో దర్శిస్తావో అది అట్లే అనుభూతమవటము"** అనేది - దృష్టి యొక్క-సృష్టియొక్క ఒకానొక చమత్కారము. అంతరంగ నిశ్చయము (How you decisively interpret) అనుదాని ననుసరించియే (ఆత్మస్వరూపుడే అయి ఉన్న) ఈ జీవుని పట్ల **"బంధ-మోక్షములు"** అనే మనోకల్పిత చమత్కారములు వర్ధిల్లుచున్నాయి.

ఓ సాధూ! అటువంటి ఈ వివిధ జీవుల యొక్క "నిశ్చయములు" (The ways of being perceived and interpreted) - '4' విధములైనవిగా చెప్పబడుచున్నాయి. (1) భౌతిక దేహమే నేను (2) ఈ సమస్తమునకు అతీతుడను (3) ఈ సమస్తము నేనే (4) ఈ సమస్తము శూన్యము మాత్రమే.

**(1) "భౌతిక దేహమాత్రోఽహమ్" నిశ్చయము : "ఆపాద మస్తకమహమ్" నిశ్చయము :**

> **శ్లో॥ ఆపాద మస్తకమ్ 'అహం' - మాతా పితృ వినిర్మితః**
> **ఇతి ఏకో నిశ్చయో, బ్రహ్మన్। బంధాయా స విలోకనాత్।**

హే బ్రహ్మన్! "తల్లిదండ్రులచే ఏర్పరచబడినదై, "పాదముల (foor end) నుండి మస్తకము (End of foreface) వరకు ఏ భౌతిక దేహము ఎదురుగా కనిపిస్తూ ఉన్నదో- అట్టి **ఈ జగదృశ్యముతో కనిపిస్తూ ఉన్న భౌతికదేహమే నేను"** అనునది (4 టిలోని) **మొదటి నిశ్చయము.** ఈ "దేహమే నేను" అను నిశ్చయము ఈ జీవునికి సర్వ ప్రాకృతిక-మానసిక బంధములు కలుగజేస్తోంది. ఇది జీవునికి శ్రమ, ఆయాసము మొదలైన అనేక దుఃఖములకు మూలము.

**(2) 'సర్వాతీతోఽహమ్ నిశ్చయము :**

> **శ్లో॥ అతీతః సర్వభావేభ్యో వాలాగ్రాత్ అపి అహం తనుః**
> **ఇతి ద్వితీయో। మోక్షాయ నిశ్చయో జాయతే సతామ్॥**

నేను ఈ దేహమునకు, ఈ సమస్త భౌతిక ప్రపంచమునకు, వాటి వాటి అనుభవ పరిధులకు పూర్తిగా వేరైన **"సర్వాతీత స్వరూపుడను"** - అనునది **రెండవ నిశ్చయము.** "నా యొక్క స్వరూపము ఒక వెంట్రుక యొక్క చిట్టచివరి అణుప్రమాణము కంటే కూడా లక్షవవంతు అంత సూక్ష్మమై, దృశ్యమునందు ఏమాత్రము ప్రవేశించనిదై ఉన్నది.

- కదిలే దేహమును **'కదిల్చేవాడు'**గా,
- వచ్చే ఆలోచనలకు **'ఆలోచించేవాడు'**గా,
- జగత్ భావనలన్నిటికీ **"భావించేవాడు"**గా,

ఆవల మనస్సుకుగాని, కళ్ళు-చెవులకుగాని విషయమే కానంతటి వాడను. సర్వమునకు పరమై "పరమాత్మ" అనబడు కేవల చైతన్యరూపుడను... ***ఇట్టి రెండవ నిశ్చయము మోక్షము కొరకై - (ఈదృశ్యముగాని, మరింకేదీ గాని నాకు బంధము కాదు- అను స్థితి కొరకై) మార్గదర్శకము.***

**(3) "ఇదమ్ సమస్తమ్ అహమేవ" నిశ్చయము:**

> **శ్లో॥ జగజ్జాల పదార్థాత్మా సర్వ ఏవ అహమ్ అక్షయః,**
> **తృతీయో నిశ్చయశ్చ ఉక్తో మోక్షాయైవ, ద్విజోత్తమా!**

హే ద్విజోత్తమా! "ఈ సమస్త పదార్థములతో కూడిన, ఎదురుగా కనిపిస్తూ ఉన్న - దృశ్య జగత్తు యొక్క ఆత్మస్వరూపుడను - నేనే। నా నుండి భావనగా బయలుదేరి, సంకల్పముగా రూపుదిద్దుకొని, సంకల్ప సిద్ధికొరకై "సంకల్పించబడుచున్న సమస్తము"గా కూడా అగుచూ ఉన్నది. కనుక, **సమస్తము నేనే।** (మత్తః పరతరం న అన్యత్ కించిత్ అస్తి)। ఇదంతా నా వినోదము। క్రీడ। లీల।

**ఇట్టి 'సమస్తము నేనే'** అను నిశ్చయము కూడా మోక్ష స్థానమునకు దారితీయగలదు.

**(4) "అహం-జగద్వా సకలం శూన్యం" నిశ్చయము:**

> **శ్లో॥ అహం జగద్వా సకలం శూన్యం వ్యోమసమం సదా;**
> **ఏవమ్ ఏష చతుర్థో౽పి నిశ్చయో మోక్ష సిద్ధిదః॥**

ఒకరు ఒక కథను శ్రోతల ఆనందం కోసం కల్పించి చెప్పితే,.. అందులో పాత్రల మధ్య గల పరస్పర సంబంధం నిజమా? కాదుకదా! కలలో కనిపించే రతనాల మేడకు ఉనికి ఎక్కడిది? అట్లాగే మనస్సు అనే కవిచే కల్పించబడుచున్న కథా శ్రవణమే ఈ దృశ్యమంతా.

ఇట్టి దృష్టిచే **"జగత్తు - ఆ జగత్తు యొక్క అనుభవి, జగదంతర్గత భేదములు - సమస్తము ఆకాశమువలె స్వతఃగా శూన్యమే। సర్వదా శూన్యమే।"** - ఇది నాలుగవ నిశ్చయము. "పూర్ణుడగు నేను శూన్యమగు జగత్తుకు సాక్షిని" - అనునదే నాలుగవ నిశ్చయము.

ఈ నాలుగవ నిశ్చయము కూడా మోక్షసిద్ధిని ప్రసాదించగలదు. ఆత్మయొక్క తత్త్వము దృష్ట్యా ఇదంతా కల్పన మాత్రమే. వాస్తవానికి లేదు. ఒక నాటకములో ఒకడు చెడ్డవాడు కాబట్టి - రచయిత చెడ్డవాడా? పాత్రధారుడు చెడ్డవాడా? పాత్ర చెడ్డదా? - ఏదీ కాదు. ఈ విధంగా జగత్తు శూన్యమే.

పై నాలుగు నిశ్చయములలో →

→ **మొదటిది** - భౌతిక దేహమే నేను అను అహంకారము తృష్ణకు, **అనేక బంధనములకు కారణము.**

→ **రెండవది - దేహము కంటే వేరైన నేను** - అను అహంకారము తృష్ణను తొలగించి క్రమంగా జీవన్ముక్తత్వము ప్రసాదించగలదు.

→ మూడవదగు **"సర్వము నేనే కదా!"** - అను నిశ్చయాహంకారము సిద్ధించుకొన్న వానికి ఇక విషాదము యొక్క 'ఛాయ' కూడా ఉండదు.

నాలుగవదగు **'ఈ సమస్తము సర్వదా శూన్యమే'** అనే నిశ్చయాహంకారము - ప్రకృతి తత్త్వము బోధపరచునదై 'బ్రహ్మజ్ఞానము'గా పరిణమించుచున్నది. ఇదంతా కల్పిత నాటకంలాగా, కలలాగా, ఊహాచమత్కారంలాగా వాస్తవానికి లేదు కాబట్టి దుఃఖార్హం కాదు. **(జడో దేహో। న దుఃఖార్హో।)** మొదటిది తప్పించి తక్కిన మూడు నిశ్చయములు మనస్సును నిర్మలముగా తీర్చిదిద్ది బ్రహ్మానుభవమునకు రాజమార్గము అగుచున్నది. బ్రహ్మానుభవము స్వాభావికము అయిన తరువాత ఆ (చివరి) మూడు నిశ్చయములు బ్రహ్మానందసాగరములో (ఉప్పుబొమ్మ వలె) కరిగి నామరూపములు త్యజించి ఏకమై సశాంతిస్తున్నాయి.

## బ్రహ్మము అనగా?

సమస్త జీవులకు సంబంధించియున్నట్టి పరాకాష్ఠ (The Most and the Most Highest) స్వరూపము (లేక) పరాస్థితి కాబట్టి ఆత్మయే **'బ్రహ్మము'** అను శబ్దముచే చెప్పబడుతోంది. అది దృశ్యము, దేహము, ఇంద్రియములు, ఇంద్రియార్థములు (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధశక్తులు), మనస్సు, బుద్ధి, చిత్తము, వ్యష్టి అహంకారము, సమష్టి అహంకారము, కేవలము - అనబడుచున్న సమస్తముకంటే శ్రేష్ఠము, మహత్తరము కూడా. పైగా, ఆ చెప్పుకొన్నవన్నీ బ్రహ్మమునకు అనన్యము. అందుచేతనే 'బ్రహ్మము' అని అనబడుతోంది. అట్టి బ్రహ్మమే, **"శివము; పురుషుడు; పరమ పురుషుడు; ఈశానుడు; నిత్యుడు; ఆత్మ; పరమాత్మ"** మొదలైన పేర్లతో కూడా - ఆయా ధర్మములను అనుసరించి అభివర్ణించబడుచూ ఉన్నది.

ఆహా! నీకు, నాకు, సురాసురులకు, సమస్త ప్రాణులకు **"అద్వితీయమే"** అయి ఉన్న పరమాత్మ స్వరూప చిచ్ఛక్తీదేవి ద్వైత-అద్వైత సంకల్పములను ఉభయ హస్తములుగా చేసుకొని ఈ **"జగన్నిర్మాణ లీలావినోదము"**గా సర్వే సర్వత్రా అణువణువు విజృంభించుచున్నది కదా! అట్టి చిచ్ఛక్తీ దేవి యొక్క అత్యంత చమత్కార కళావిశేషమే ఈ అనేక విధములైన మనస్తత్వములతో కూడిన జగత్ నాటక రంగమంతా కూడా!

ఒక గొప్ప కథా రచయిత యొక్క కథనమంతా అత్యంత ఉత్సుకత కలిగించి, పాఠకునిచే **"ఈ పాత్రలు, సంఘటనలు నిజమే?** – అని అనుకునేట్లు అనిపింపజేసి **'భావోద్రేకము'**నకు దారితీయువిధంగా...,

ఆ చిచ్ఛక్తీ దేవి ద్రష్ట యొక్క – దృశ్యము యొక్క స్వస్వరూపమునకు అభిన్నమే అయి ఉండి, స్వకీయ కల్పనా చమత్కారంగా ఈ జగత్ రచన చేసి ప్రదర్శనము చేస్తోంది. అయితే **ఈ సమస్తము చిత్(ఎరుక) యొక్క ఆనంద స్వరూపమే.**

***ఎవ్వరు ఈ సమస్తమును చిదానంద ప్రదర్శనముగా చూడగలుగుతారు?***

**శ్లో॥ సర్వాతీత పదాలంబీ, పరిపూర్ణైక చిన్మయః**
**న-ఉద్వేగీ న చ తుష్టాత్మా సంసారే న అవసీదతి॥**

ఎవ్వరత్తై,

- సర్వాతీతమగు 'ఆత్మపదము'ను అవలంబించి,
- **"నా ఎరుక యొక్క విస్తరణ రూపమే ఈ సమస్తము కదా"** అను నిస్సందేహమైన పరిపూర్ణ – ఏక – చిన్మయ అనుభావి అయి,
- ఈ సమస్త దృశ్యము స్వస్వరూపము – సర్వాత్మకము అగు ఆత్మయొక్క వినోదరూప కల్పితముగా గమనిస్తూ,

ఉద్వేగముగాని అనురాగముగాని పొందనట్టివాడు అయి ఉంటాడో, **అట్టివాడు ఎట్టి దుఃఖముగాని, దృశ్యముతో తాదాత్మ్య-ఆవేశముగాని పొందడు.**

ఎప్పుడు ఏది నిర్వర్తించవలసి వస్తే, అట్టి 'ప్రాప్త కర్మలు' (వివాహిత కర్మలు) నిర్వర్తిస్తూ, శత్రు-**మిత్ర,** మాన-అవమాన, స్తుతి-నిందల ద్వంద్వములకు అతీతుడై, (లేక) వాటి పట్ల సమదృష్టిని ఏ మాత్రము వీడనివాడై, **"కోరుకొన్నవి – కోరుకోనివి"** అనే పరిధి నుండి ముక్తుడైనవాడు – ఇక **దేనికీ దుఃఖించడు. ఏదీ దృశ్యము నుంచి కాంక్షించడు. ఆత్మస్వరూపానందుడై విరాజిల్లగలడు.**

ఎవ్వరైనా ప్రేరేపిస్తే అందరికి అభిమతమైనది, శ్రేయమైనది అగు మాటలను మాత్రమే మాట్లాడతాడు. సర్వజీవులు కోరుకొనే విధంగా ప్రవర్తన కలిగి ఉంటాడు.**"సమస్తము అస్మత్ స్వరూపమే"** అను ఎరుకచే స్వాభావికంగానే సమస్త జీవులపట్ల ప్రేమాస్పదుడై ఉంటాడు.

ఓ నిదాఘా!

జన్మ-కర్మలకు మునుముందే తేజో – ఆనంద- ప్రజ్ఞారూపమైయున్న 'ఆత్మ' యొక్క దృష్టిని అవలంభించి, ధ్యేయము (All Objetives of knowing)ను అధిగమించి జీవన్ముక్తుడవై, స్వస్థుడవై సర్వ వేదనలు జయించినవాడవై ప్రకాశించెదవుగాక। ఆత్మకు అనన్యము అయినట్టి ఈ **"జగత్ కల్పనా ఉద్యానవనము"** నందు హాయిగా, ఆనందముగా, స్వేచ్ఛగా (బంధరహితుడుగా) విహరించుము.

**"ఈ దేహ-దేహాంతర సంచారమంతా ఆత్మానంద వినోదంగా నాయందు నేనే కల్పన చేసుకొని ఆస్వాదిస్తున్నాను"** – అను ఎరుకను తట్టిలేపుము. దృశ్య సంబంధమైన హృదయములో నుండి సర్వ ఆశలను (All materialistic world - related expections and wishes) త్యజించినవాడవై,

- దేనిపట్లా రాగము (Attatchment) లేనివాడవై,
- దృశ్యవ్యవహారములకు సంబంధించిన సమస్త వాసనలు మొదలంట్లా అంతరమున జయించి,

**బాహ్యమున మాత్రం లోకసమాచారముల పట్ల విజ్వరుడవై** (Uneffected) **ఉండుము. నిర్మల-ఉత్తమ-అతీత బుద్ధితో లోకములో విహరించెదవుగాక!**

***హృదయంలో స్వాభావికమగు సంరంభరాహిత్యము, బాహ్యము మాత్రమే లోక విహరణార్థము కృత్రిమ సంరభమును కలిగి ఉండుము.***

బాహ్యమున **కర్తగాను**, అంతరమున **అకర్తగాను** ఉంటూ ఈ దృశ్యప్రపంచంలో సంచరించు.

**హే శుద్ధబుద్ధీ!**

- హృదయాకాశంలో అహంకారము త్యజించినవాడవై (నాది-నేనులకు అతీతుడవై), **మేఘములు తొలగినప్పటి "నిర్మలాకాశము"** వలె శోభిల్లుము.
- ఎట్టి కామ క్రోధ ఆశ-ఆదిగా **కలనములు, కలంకములు (కళంకములు)** లేనివాడై **పరమశాంత చిత్తుడవై 'జీవితము'** అను సందర్భమును ఆస్వాదించుము.
- బయటకు ఉదారమైన, తదితరులకు సానుకూల్యము అయిన, శుభప్రదమైన ఆచారములను (Acts and Functions) శ్రద్ధాయుక్తులతో నిర్వర్తిస్తూ ఉండు. అంతరము ఏదీ ఏమాత్రము చేయనివాడవై ఉండుము.
- **అంతఃసంగపరిత్యాగీ, బహిఃసంసారవాన్ ఇవ।** బాహ్యమున దృశ్యముతో సంబంధము ఉన్నట్లే సంసారవంతుడవై ఉంటూనే అంతరమున మాత్రం **సర్వసంగములు బహిష్కరించివేసి ఉండుము.**

- **అంతరః వైరాగ్యమ్ ఆదాయ, బహిః ఆశోన్ముఖే హితః।** అంతరమున దేనిపట్లా ఎటువంటి 'రాగము' లేనివాడవై, వైరాగ్యవంతుడవై ఉండు. బాహ్యమును 'ఆశ' గురించిన ఉన్ముఖత్వము అందరివలెనే జగత్ కార్యక్రమముల కొరకై – కలిగి ఉండుము. ఒకనాటకములో నటిస్తున్న నటుని వలె అంతరము "నటనా కళ" (The Art of Acting) తప్పించి, మరి **యే నాటక సందర్భము** లేనివాడవగుము.

## ఉదారచిత్తుడు – వసుధైక కుటుంబం

ఓ నిదాఘా! **అయం బంధుః అయం నేతి గణనా లఘుచేతసామ్। ఉదార చరితులకు (మహనీయులక) విశ్వమమంతా తమ కుటుంబమే అయి ఉంటుంది.** అల్పబుద్ధి కలవారికి మాత్రమే – **"వీరు నా వారు, నాకు బంధువులు. వారు నాకు బంధువులు కాదు కాబట్టి నాకు వేరైనవారు"** – అనే భేదదృష్టి– ఉంటుంది. ఇక తత్త్వజ్ఞులగు మహనీయులకు **'వసుధైక కుటుంబ భావన'** అన్ని వేళలా స్వాభావికము అయి ఉంటుంది. **ఉదార చరితానాన్తు వసుధైక(వ) కుటుంబకమ్॥**

అందుచే ఓ నిదాఘ మునివర్యా! "ఈ జగత్తు నిజముగానే ఉన్నది" – అను భవబంధము (లేక) భవ భావన నుండి వినిర్ముక్తుడవై – ప్రశాంత స్వరూపము అయినట్టిది, రాగము (Attatchment, fondness for limited & time bound things) లేనట్టిది, అగు **'ఆత్మపదము'** (లేక) **బ్రహ్మపదమును** ఆశ్రయించినవాడవై ఉండు. అటువంటి స్వచ్ఛము, నిష్కామము, 'మాయ' అనే దోషము లేనట్టిది, – సిద్ధించుకొని, ఇక ఆపై ఈ దృశ్యజగత్తునందు నీకు ఇష్టమైన విధంగా సంచరించు. లోకో విహర। అప్పుడు **ప్రపంచములో సందర్భమగుచూ ఉండే సంకటములను చూచి నీవు 'మోహము' – పొందవు.**

## మనోలయము

ఓ నిదాఘా! **దృక్** (One who is seeing / perception) – దృశ్యముల మధ్యగా ఏర్పడి ఉంటున్న సంబంధమే 'మనస్సు' అని కూడా చెప్పబడుతోంది. ఆ మనస్సు అధోముఖమై,–వస్తు–విషయ–సందర్భముల మధ్యగా చిక్కుకొని ఉంటోంది. అట్టి **నీ మనస్సును ఉత్తేజ పరిచి ఊర్ధ్వముఖము చేసి, సమదర్శన రూపమగు ఆత్మస్థానమునకు జేర్చి, అక్కడ మనస్సును లయింపజేయాలి.**

'సంకల్పము' (Sense of Assumption and pressumption) చేతనే – జీవునకు 'బంధ భావన' వచ్చిపడుతోంది. ఇప్పుడు మనస్సుకు సర్వసమభావనను ఆశ్రయింపజేయటం చేత 'సంకల్పము' అనే అడ్డు తొలగి సోఽహమ్ భావమును ఈ జీవుడు సిద్ధించుకోగలడు. ఎట్లా?

**(1) వైరాగ్య ఆశ్రయము :** సమస్త దృశ్య వస్తువుల సందర్భముల పట్ల అనుబంధములు మొదలైన వాటి పట్ల 'రాగము'ను రహితము చేసి, చేయవలసిన కర్మలను ఆత్మోపాసనా భావముగా నిర్వర్తించటమే **'రాగరాహిత్యము'** లేక **'విరాగము'** లేక **'వైరాగ్యము.'**

(2) **ఆత్మ గురించిన శాస్త్ర అధ్యయనము (3) శాస్త్రములు సూచించు మార్గములను, ఉపాయములను అనుసరించటము.**

(4) **మహదహంకార సేవనము :** నేను ఒక శరీర పరిమితుడను కాను. **అందరిలోని నేనైన నేనే నేనై ఉన్నాను"** – అను 'మహదహంకారము'ను ఆశ్రయించటము.

**ఉత్తమ గుణాశ్రయము:**

| | |
|---|---|
| దైవీగుణములగు | → అద్వేష్టా సర్వ భూతానాం, మైత్రః కరుణ ఏవచ మొ॥వి |
| గుణాతీత లక్షణములగు | → 'న ద్వేష్టి సంప్రవృత్తాని', సుఖ–దుఃఖ సమస్థితి, చెదరని భక్తి మొ॥వి, |
| దైవీ సంపత్తి అగు | → అభయం, సత్త్వ సంశుద్ధి, జ్ఞానయోగవ్యవస్థితి మొ॥వి |

ఓ పాపరహితుడా! నిర్మల హృదయా! నిదాఘా! పై విధంగా (1) **వైరాగ్యం** (2) **శాస్త్ర అధ్యయన–అభ్యాసములు** (3) **మహత్ అహం–భావనము** (4) **ఉత్తమ గుణ సంపత్తి–** ఈ నాలుగు సహాయంతో సంకల్పములను హరింపజేయటము (దృశ్య విశేషాలతో ఏర్పడుచున్న రాగద్వేషములను వెనుకకు మరల్చటమును నిర్వర్తించుము. మహదాశయముతో కర్మలు నిర్వర్తిస్తూ ఉండగా, 'మనస్సు' తనకు తానే "ఊర్ధ్వముఖము" అయి, **"సమస్తమునకు మునుముందే ఉన్నట్టిది, సమస్తము 'తానే' అయినట్టిది"** – అగు 'ఆత్మ' యొక్క భావన వైపుగా 'ఉన్ముఖము' కాగలదు.

**వైరాగ్యాత్ పూర్ణతామ్ ఏతి మనో నాశ దశానుగమ్।** రాగ–ద్వేషములను ఉపశమింపజేయు 'వైరాగ్యము' యొక్క అభ్యాసముచే మనస్సు ఆత్మయందు లయించి, నశించినదిగా అగుచున్నది. అప్పుడు ఈ జీవుడు – 'అపూర్ణము – అసంతుష్టి –అసంతృప్తి" మొదలైన అల్పభావనలను త్యజించి, (అధిగమించి) – **'పూర్ణత్వము'** అను రూపము గల **ఆత్మభావనను** సంతరించుకోగలడు.

**ఆశయా రక్తతామ్ ఏతి శరదీవ సరోఽ మలమ్: "దృశ్యము నుండి, ఏదేదో ఆశించుచూనే ఉండటము"** అనే వ్యసనమును కొనసాగిస్తూ, ఇంద్రియ విషయముల పట్ల అనురక్తిని కొనసాగిస్తూ ఉంటేనో? శరత్కాలములో సరోవరము దట్టమైన మంచుచే కప్పబడటం చేత

సుందర పుష్పములతో కూడిన సరోవర ఉపరిసౌందర్యము మసకగా కనిపిస్తుంది చూచావా? ఆ విధంగా దృశ్య భావావేశములచే కప్పబడుటచే **"స్వస్వరూపాత్మ" యొక్క సౌందర్యము, ఔన్నత్యము** అనుభవమునకు రావటము లేదు. ఆ జీవుడు మల –ఆవరణములను తొలగించుకోలేక వాస్తవానందమగు ఆత్మానందమునకు సుదూరుడై ఉండిపోతున్నాడు.

## ప్రాజ్ఞః కస్మాత్ న లజ్జతే?

ఒకానొకడు శాస్త్రములు చదివి, గురువు యొక్క ఆప్త బోధలను విని, జగత్తులోని నిత్యానిత్యములను ప్రత్యక్షంగా చూస్తూ కూడా,... ప్రాజ్ఞుడు అయి ఉండి కూడా..,

- ఆయా రసరహితమైన ఇంద్రియానుభవములనే మరల మరల అనుభవిస్తూ,
- ఆయా ప్రాపంచక విశేషములగు జన సంపద, ధన సంపద, పేరు ప్రతిష్ఠలు, ఇంద్రియ–దురభ్యాములను ఆశ్రయించటము.

– అనేవి కొనసాగటానికి సిగ్గుపడడేం? అట్టి దురాశయములవైపుగా ఉల్లాసము పొందుచూ, **"అయ్యో? నేను ఎరుగుచున్నదేమిటి? నడుస్తున్నది ఎటువైపు"** – అని తనను తాను ప్రశ్నించుకోడేం? ఆత్మ విమర్శ చేసుకోడేమి? చేసుకోవాలి!

## బంధము – ముక్తి

**చిత్ చైత్య కలితో బంధః। కేవలము, నిర్మలము, సమస్తమునకు పరము, మహత్ స్వరూపము, అప్రమేయము, నిత్యము, సత్యము** అగు చిత్ స్వరూపమే ఈ జీవుని వాస్తవ – సహజ రూపము. అట్టి చిత్తు – ఇంద్రియములచే తెలియబడుచున్న విషయములను పొంది, **"ఇంతమాత్రమే నేను"** అనే కలనము (దోషదృష్టి) పొందటమే "బంధము". అనగా, వాస్తవానికి చిత్ రూపమగు ఆత్మకు స్వతఃగా బంధము లేకపోయినప్పటికీ, ... చైత్యము (The Objects or subject matter of perception)తో స్వయముగా పెట్టుకొన్న **'సంబంధము'** (Bondage relationship) చేత మాత్రమే **'బంధము'** అనునది ఏర్పడుతోంది.

**తత్ చైత్యముక్తౌ 'ముక్తి'ః ఉచ్యతే।** 'తెలియబడుచున్న దృశ్యము' అనబడే చైతన్యము నుండి ముక్తుడు (wel-Relieved) అయి ఉండటమే 'ముక్తి'.

- ఒకడు కథ చదువుచూ కథలోని విషయాలకు ముగ్ధుడై విషాదము పొందటము.
- నాటకం చూస్తూ కంటితడి పెట్టటము.

ఇటువంటి సందర్భములప్పుడు ఆ తరువాత – తరువాత కూడా ఆ విషాదము కొనసాగించి, అది స్వభావము అవటం సబబా? కాదుకదా! అట్లాగే **చిత్‌స్వరూపుడగు ఈ జీవుడు 'చైత్యము' అనబడే తెలియబడే దృశ్య విశేషములకు బద్ధుడవటము యుక్తి యుక్తమే కాదు.**
– బద్ధుడు అవటమే **బంధము.** బద్ధుడు కాకపోవటమే ముక్తి। **ఇంతకుమించి వేరే బంధము లేదు. ముక్తి లేదు.**

-----

ఓ నిదాఘా! ఒక పరమ రహస్యము చెప్పుచున్నాను. విను.

***చిత్ (ఆత్మ) – దృశ్యమునకు అతీతముగా ఉండటమే (లేక) ఈ జీవుడు దృశ్యమునకు అతీతుడై, సమస్తమును సాక్షిగా చూడగలుగుచూ ఉండటమే ఆత్మానుభవము. ఇదియే ఆత్మకు సంబంధించి సమస్త సిద్ధాంతముల అంతిమసారము.***

అందుచేత బిడ్డా! నిదాఘ మునీ। **ఏతాం నిశ్చయమ్ ఆదాయ, విలోకయ యథేచ్ఛయా! "ఈ తెలియబడుచున్నదంతా అసత్తు. దీనికి ఆవల కేవలము సాక్షి అయి ఉన్న మమాత్మానంద స్వరూపమే సత్తు"** అని నిశ్శబ్దంగా నిశ్చయము చేసుకో. ఆ తరువాత ఈ దృశ్యమునందు నీకు ఎట్లా ఇష్టమైతే అట్లా పాల్గొను. (లేక) త్యజించు.

- "ఇదంతా స్వప్నమాత్రము" – అనియో,
- "ఈ సమస్తమునకు నేను వేరై ఉన్నాను" – అనియో,
- "ఈ సమస్తము నేనే" – అనియో,
- ఇదంతా మొదలంట్లా శూన్యమే" – అనియో నీకు ఎట్లా 'ఇష్టము' అనిపిస్తే ఆ రీతిగానే దర్శనము కొనసాగించు.

స్వయముగా ఆత్మచేత ఆత్మయందు ఆత్మగా సమస్తము దర్శించు పదమును అప్పుడు తప్పక పొందగలవు. అట్టి అపరోక్ష జ్ఞాన–అనుభవ పదమును పొందిన తరువాత, ... **ఆపై ఈ దృశ్యమును ఆస్వాదిస్తావో, త్యజిస్తావో,... అదంతా నీ ఇష్టం. (విమృశ్య ఏతత్ అశేషేణ, యథేచ్ఛసి, తథా కురు। – భగవద్గీతా వాణి।)**

## ద్రష్టా సాక్షీ చిదాత్మకః।

నీవు ఇక కేవలాత్మరూపుడవై ఉండెదవుగాక.

**చిదహమ్।** నేను సర్వదా **కేవలచిత్-స్వరూపుడనే।**

**చిత్ ఇమే లోకా।** ఈ దృశ్యమానమై కనిపిస్తున్న ఈ లోకమంతా కూడా **చిత్ స్వరూపమే।**

**చిత్ ఆకాశా। :** ఈ కనబడే ఆకాశము, తదాదిగా కనిపిస్తున్న సకల పదార్థములు **చిత్ స్వరూపమే।**

**చిత్ ఇమాః ప్రజాః।** నాకు ఎదురుగా కనిపిస్తూ ఉన్న ఈ జీవులంతా కూడా **చిత్ స్వరూపులే!**

**ఇట్టి అనుక్షణికమైన సందర్శనాభ్యాసమునకు ఇప్పటికిప్పుడే ఉపక్రమించు.**

→ నేను సర్వదా ద్రష్ట – దర్శనములకు బద్ధుడను కాను. ద్రష్ట (Perceiver) – **దర్శనములకు** (perception) **సాక్షినగు కేవలచిదానంద స్వరూపుడను.**

→ సర్వదా **నిర్మలమగు ఆత్మ స్వరూప-స్వభావుడను.**

→ **నిత్యోదితుడను** (Ever - blossoming just Like SUN)

**నిరాభాసో –** అద్దంలో నా ప్రతిబింబము కనిపిస్తూ ఉన్నంత మాత్రం చేత అద్దంలో నేను ఉన్నట్లా? కాదు కదా! అట్లాగే ఈ దృశ్యములో దేహధారినై, జీవాత్మగా పిలువబడుచూ కనిపించినంత మాత్రం చేత **అట్టి ఆభాస** (Reflection)**గా నేను అవటం లేదు. నిరాభాసుడను.**

**– ద్రష్టా సాక్షీ చిదాత్మకః** ఈ దృశ్యమునకు నాకు గల సంబంధము ఎటువంటిదంటే...,

**ద్రష్టను :** ఈ సమస్తమునకు ద్రష్టను (I am the one who attaches meaning to what ever being seen, and there after, I my self am experiencing). I am the Drafter of the World that is being experienced by me.

**సాక్షిని :** ద్రష్ట – దృశ్యముల ఉభయమునకు నాటక దీపము వలె కేవల సాక్షిని. (I am Just like a lamp focussing light on the stage with out any relationship or attachments to incidents of the Drama that are taking place on the Stage)

**చిదాత్మకుడను : ఈ విశ్వమునకు, అద్దాని ద్రష్టకు ఆత్మస్వరూపుడను.**

{**దృష్టాంతము !** ఒక రచయిత రచించిన నాటకములోని పాత్రకు ఆత్మ ఎవ్వరు? పాత్రధారుడా? కాదు. నాటక రచయిత. ఈ జగన్నాటకమునకు నాటక రచయితా స్వరూపుడగు ఆత్మను నేనే}.

**చైత్య నిర్ముక్త చిద్రూపమ్। :** (1) ద్రష్ట (2) దర్శనము (3) దృశ్యము – ఈ మూడింటిలో దర్శన-దృశ్యములను తొలగించి చూస్తే, అప్పుడు శేషించే కేవల ద్రష్ట (లేక) దృక్ స్వరూపుడను నేను. అందుచేత,

***తెలియబడేదంతా లయించినా కూడా. అప్పటికీ శేషించి ఉందు చిదానంద స్వరూపుడను.***

**పూర్ణ :** స్వయముగా పూర్ణుడను. నా యొక్క పూర్ణత్వమునకు దృశ్యముగాని, మరింకేదోగాని అగత్యమేమీ కాదు. ఇక్కడి ద్రష్ట-దర్శన-దృశ్యములు, దేహ-దేహాంతరములు మొదలుగా గల సమస్తము- నా పూర్ణత్వము యొక్క పూర్ణచంద్ర కిరణ విశేషముల వంటివి మాత్రమే।

**జ్యోతిస్స్వరూపకమ్:** స్వయం జ్యోతి స్వరూపుడను. సమస్తము నాయొక్క ఆత్మజ్యోతి యందు ప్రస్ఫుటమగుచున్నాయి. నన్ను వెలిగించునది మరొకటేదీ లేదు. దృశ్య-దేహ- మనో-బుద్ధి- చిత్త-అహంకార- మహదహంకారార- చిదాత్మ-సర్వాత్మ స్వరూపములన్నీ అస్మత్ తేజో విభవములు మాత్రమే!

**సశాంత సర్వ సంవేద్యం –** నాచే జాగ్రత్- స్వప్న- సుషుప్తులలో తెలియబడుచున్నదంతా నా నుండే బయల్వెడలి, నాయందే ప్రదర్శనమగుచూ, **చివ్వరికి నాయందే సశాంతించినవి అగుచున్నాయి.**

## స్వస్తి

హే మునీశ్వరా!

**సశాన్త సర్వ సంకల్పః।** సమస్త సంకల్పములు నీయొక్క ఆత్మానందస్వరూపము నందు సశాంతించినవిగా అయిఉండును గాక!

**ప్రశాన్తః సకలేషణః।** దృశ్య ఈషణము, దేహ-ఈషణము, లోక-లోకాంతర ఈషణము".. అనబడే త్రి-ఈషణములు (All three types of fondness) నాయొక్క **ప్రశాంత స్వరూపమగు కేవల-అఖండ-అప్రమేయ ఆత్మానందము నందు కరిగిపోయి, సశాంతించునుగాక।**

**నిర్వికల్ప పదం గత్వా :** సమస్త కల్ప –వికల్పములకు (The Assumption, withdrawl of Assumptions) ఉభయములు జనించే మునుముందు నిశ్చల స్వరూపమైయున్న ఆత్మపదమును చేరినవాడవై ఉండెదవు గాక! ఆ రెండిటికీ సర్వదా అతీతుడవు, సాక్షివి అయి ఉండుము.

**స్వస్థోభవ : ప్రశాంత – నిర్వికల్ప – చిదానంద స్వరూపముతో "స్వస్థుడవు" అగుము.**

**BE IN YOU AS ALL THIS AND ENJOY THE FINEST OF PRESENCE and CONTENTMENT.**

## ఫలశ్రుతి

బ్రహ్మమును అధ్యయనము చేయు ఏ బ్రాహ్మణుడైతే (Not by caste, but by **Finest objective**) ఈ "మహోపనిషత్"ను నిత్యము అధ్యయనము చేస్తూ ఉంటాడో…,

→ అట్టివాడు వేదార్థములు పరిశీలించని అశ్రోత్రియుడైనప్పటికీ,… శ్రోత్రియునితో (వేదముల అంతరార్థమును గ్రహించి, అభ్యసించువానితో) – సమానుడు అగుచున్నాడు.

→ **ఉపనీతుడు** (ఆత్మసామీప్యము పొందినవాడు) కానప్పటికీ, ఇప్పుడు **"ఉపనీతుడు"** అగుచున్నాడు.

సోఽ అగ్నిపూతో భవతి। స వాయుపూతో భవతి। స సూర్యపూతో భవతి। స సోమ పూతో భవతి।। స సత్యపూతో భవతి। స సర్వపూతో భవతి। స సర్వైః దేవైః జ్ఞాతో భవతి।।

స సర్వేషు తీర్థేషు స్నాతో భవతి। స సర్వైః దేవైః అనుధ్యాతో భవతి। స సర్వక్రతుభిః ఇష్టవాన్ భవతి।

గాయత్ర్యాః షష్టి సహస్రాణి జప్తాని, ఫలా భవంతి। ఇతిహాస పురాణానాం రుద్రాణాం శతసహస్రాణి జప్తాని ఫలాని భవంతి।

ప్రణవానామయుతం జప్తం భవతి। ఆచక్షుషః పక్తిం పునాతి। ఆసప్తవాన్ పురుష యుగాన్ పునాతి।

ఈ "మహోపనిషత్" అంతరార్థమును నిత్యము పఠించువాడు, బోధించువాడు, శ్రవణము చేయువాడు ఇందలి అంతరార్థమును హృదయస్థము చేసుకొనువాడు.

- 'వేదము'ను పఠించని అశ్రోతియుడు కూడా వేదహృదయ–అంతరార్థమును శ్రవణము చేయుచున్నవాడు అగుచున్నాడు.
- అపవిత్ర భావములు కలవానిలో పవిత్రమగు ఆత్మధ్యానభావములు (లేక) అధ్యాత్మభావములు జనించగలవు.
- అగ్నివలె, వాయువు వలె, సూర్యునివలె, చంద్రుడు వలె పరమ పవిత్రుడు కాగలడు.
- సత్యము యొక్క సంస్పృశ్యతచే పరిశుద్ధుడు కాగలడు.
- సర్వదేవతల దివ్యతత్త్వము తెలుసుకొన్నవాడు అగుచున్నాడు.
- సర్వ పవిత్ర తీర్థములలో స్నానము చేసిన పవిత్రత, శాంతి సిద్ధించగలదు.
- సర్వదేవతలను ధ్యానించిన సత్–ప్రయోజనము లభించగలదు.
- సర్వక్రతువుల ఇష్టా–పూర్తముల అత్యుత్తమ ఫలితము పొందగలడు.
- గాయత్రీ మంత్రమును అరువది వేల (60,000) సార్లు జపించిన ఫలితము సంప్రాప్తించగలదు.
- ఇతిహాస పురాణములు అధ్యయనము చేసిన ఆత్మతత్త్వభావనా ప్రజ్ఞ ఆతడు పొందగలడు.
- వంద వేలసార్లు రుద్రజపము చేసిన సిద్ధి అనుభవమవగలదు.
- కోటి ప్రణవ జపధ్యానప్రయోజనము పొందబడగలదు.
- అట్టి "మహోపనిషత్" అధ్యయనము చేసివాని చూపు పవిత్రమై, ఆతని చూపు పడిన ప్రదేశమంతా దివ్యత్వము సంతరించుకోగలదు.
- అట్టివాని ఇటు '7' తరములు, అటు '7' తరములు తరించగలవు.

**ఈ ఉపనిషత్ సృష్టికర్తయగు హిరణ్యగర్భుని వాక్ స్రవంతిగా ఆయన బిడ్డలమగు మనందరిపై అమృతవర్షమై ప్రసరించినట్టిది.**

**ఇదమ్ ఉపనిషదమ్ పారాయణమ్ యో అమృతత్వం చ గచ్ఛన్తి।।**

ఈ ఉపనిషత్ పారాయణముచే – మృతము (మార్పు)ను దాటి **'అమృతస్వరూపము'** స్వానుభవము కాగలదు.

**ఇతి మహోపనిషత్**

*ఓం శాంతిః శాంతిః శాంతిః*

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 8 వాసుదేవోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## శ్లోక తాత్పర్య పుష్పమ్

శ్లో॥ యత్ సర్వ హృదయాగారం, యత్ర సర్వం ప్రతిష్ఠితమ్,
వస్తుతో యత్ నిరాధారం వాసుదేవపదం భజే॥



ఏది సర్వజీవుల హృదయగృహము సర్వదా నివాస స్థానముగా కలిగియున్నదో, ఎద్దాని యందు సర్వము (లోకములు, లోకస్థులు, లోకేశులు) ప్రతిష్ఠితమైయున్నదో, ఏది వస్తుతః దేనిపైనా ఆధారపడనిదై, నిరాధారమైయున్నదో.., అట్టి "వాసుదేవ పదము"ను సమాశ్రయించుచున్నాము. ధ్యానించుచున్నాము.

ఓం

'ఓం' పరమాత్మ సంజ్ఞాక్షరమునకు నమస్కరిస్తూ....,

1 నమస్కృత్య భగవాన్ నారదః
సర్వేశ్వరం వాసుదేవం పప్రచ్ఛ:
"అధీహి భగవన్।
ఊర్ధ్వ పుండ్ర విధిమ్,
ద్రవ్య – మంత్ర స్థానాది సహితం
మే బ్రూహి" – ఇతి॥

ఒక సందర్భములో బ్రహ్మమానసపుత్రుడు, సర్వలోక శ్రేయోభిలాషి అగు శ్రీ నారదదేవర్షి - సర్వేశ్వరుడగు వాసుదేవుని దర్శించి, నమస్కరించి, ఈ విధంగా పరిప్రశ్నించ సాగారు.

**శ్రీ నారద మహర్షి:** హే భగవాన్! వాసుదేవా! శరణు। నమో నమః। ద్రవ్య-మంత్ర - స్థాన మొదలైన వివరములతో సహా **"ఊర్ధ్వ పుండ్రవిధి"** గురించి దయతో నాకు వివరించమని ప్రార్థిస్తున్నాను.

2. తంహోవాచ భగవాన్!
వాసుదేవః:
వైకుంఠస్థానాత్ ఉత్పన్నం,
మమ ప్రీతికరం,
మత్ భక్తైః బ్రహ్మాదిభిః ధారితం।
విష్ణుచందనమ్।
మమాంగే ప్రతిదినమ్ ఆలిప్తం,

**శ్రీ వాసు దేవభగవానుడు** : బిడ్డా! ముముక్షువుల శ్రేయస్సును ఉద్దేశించి అడుగుచున్నావు. చాలా సంతోషమయ్యా! ఇప్పుడు చెప్పుచున్నాను విను.

**గోపీచందనము (లేక) విష్ణు చందనము:**

→ వైకుంఠ స్థానమున ఉత్పన్నమైనట్టిది.
→ నాకు అత్యంత ప్రీతికరము.
→ నా భక్తులగు సృష్టికర్త - బ్రహ్మ మొదలైన వారంతా నన్ను ఉపాసించు దీక్షతో ధారణ చేస్తూ ఉంటారు.
→ నేను కూడా అట్టి విష్ణు చందనమును ప్రతిదినము ధరిస్తూ ఉంటాను - కాబట్టి **'విష్ణు చందనము'**.
గోపీచందనము ధరించిన వారిని 'నిర్మలము'గా తీర్చిదిద్దు స్వభావము కలిగి యున్నట్టిది - కాబట్టి గోపీచందనము.

గోపీభిః ప్రక్షాళనాత్
'గోపీచందనమ్' – ఆఖ్యాతమ్।
మత్ అంగలేపనం, పుణ్యం।
చక్రతీర్థ అంతస్థితం।
చక్ర (తీర్థ) సమాయుక్తం।
పీతవర్ణం (పసుపురంగు)
ముక్తి సాధనం భవతి॥

వ్రజ గోపికలు అట్టి చందనమును నా యొక్క బాలకృష్ణ దేహమంతా ప్రతిరోజు పూసి, మరల ప్రక్షాళనం చేస్తూ ఆనందిస్తూ ఉండటం చేత "గోపీచందనము" అనే పేరుతో ప్రసిద్ధము.

నా అంగములను అలంకరించునదై ఉన్నట్టి - గోపీచందనము:

- పుణ్యాభావములు ప్రసాదించునది.
- విష్ణు చక్రమునకు మధ్యస్థమై ఉండునది. చక్రతీర్థ సమన్వితము.
- పసుపు పచ్చని రంగులో ప్రకాశించునది. (సంపద జ్ఞానములకు ప్రదీక).

అథ గోపీచందనం
నమస్కృత్య, ఉద్ధృత్య,
"గోపీచందన పాపఘ్న!
విష్ణుదేహ సముద్భవ!
చక్రాంకిత! నమస్తుభ్యమ్।
ధారణాత్ ముక్తిదో భవ॥"

అట్టి ఊర్ధ్వ పుండ్ర - గోపీచందనము ముముక్షువులకు ముక్తిసాధకమై యున్నది.

**ఉపాసించువిధి :** గోపీ చందనమునకు నమస్కరిస్తూ, చేతితో తాకుచూ...,

"ఓ గోపీ చందనమా! నీకు నమస్కరిస్తూ చేతులలోనికి స్వీకరించుచున్నాను. నీవు సర్వపాపదృష్టుల నుండి దుష్ట కర్మల నుండి మమ్ములను రక్షించు స్వభావము కలదానవు. విష్ణుదేహము నుండి జనించిన దానవు. చక్రాయుధముపై పూయబడి ఉన్నదానవు. విష్ణుచక్రప్రభావము సంతరించుకుని ఉన్నదానవు. నీకు భక్తితో నమస్కరిస్తున్నాను. ధరించబోవుతున్నాను. నాకు అపార సంసార బంధముల నుండి **ముక్తిని** ప్రసాదించ వేడుకొనుచున్నాను. - అని ప్రార్థించెదరు గాక.

---

ఇమం మే గంగేతి జలమ్ ఆదాయ
"విష్ణోర్నుకమ్" - ఇతి మర్దయేత్!
"అతోదేవా అవంతు న"
ఇతి ఏతైః మంత్రైః విష్ణుగాయత్ర్యా,
'కేశవా' ఆది నామభిర్వా ధారయేత్॥

ఈ విధంగా గంధమును అరచేతిలో ధరించి"ఇమం గంగేతి" అని గంధముపై జలమును సంప్రోక్షించాలి. (చల్లాలి) "విష్ణోర్నుకమ్" అని విష్ణురూపమును మననము చేస్తూ రెండు చేతుల వ్రేళ్ళతో మర్దన చేయాలి. 'విష్ణువు' నుండి బయల్వెడలిన విష్ణుతేజో రూపంగా భావించాలి.
**"అతోదేవా అవన్తు న"** అను మంత్రమును పలుకుతూ
- **"ఓం నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥"** అను విష్ణుగాయత్రిని చెప్పుకొంటూ,
**"ఓం కేశవాయనమః। నారాయణాయ నమః॥..** మొదలైన కేశవనామములు సముచ్చరిస్తూ, "గోపీచందనము"ను ధరించాలి.

---

**3** బ్రహ్మచారీ, వానప్రస్థో వా
లలాట హృదయ కంఠ
బాహుమూలేషు వైష్ణవ గాయత్ర్యా,
'కృష్ణా' ఆది నామభిః వా ధారయేత్।
ఇతి త్రివారమ్ అభిమంత్ర్య -
"శంఖ చక్ర గదా పాణే।
ద్వారకా నిలయ। అచ్యుత।
గోవింద। పుండరీకాక్ష।
రక్షమాం శరణాగతమ్"
ఇతి ధ్యాత్వా, గృహస్థో
'లలాట' - ఆది ద్వాదశ (12) స్థలేషు
అనామిక-అంగుల్యా వైష్ణవ గాయత్ర్యా
'కేశవా' ఆది నామభిర్వా ధారయేత్॥

బ్రహ్మచారి, వానప్రస్థులు - ఇరువురు - లలాటము (foreface)పై, హృదయము (గుండె)పై కంఠముపై, బాహుమూలములయందు (భుజములపై),
→ వైష్ణవ గాయత్రి చదువుచూ,
→ కృష్ణ మొదలైన నామములు పలుకుచూ
గోపీ గంధమును ధారణ చేసెదరుగాక।
ఇక గృహస్థుడు, మూడుసార్లు అభిమంత్రిస్తూ..,
"హే శంఖచక్రగదాపాణీ! ద్వారకా నివాసా! అచ్యుతా! గోవిందా! పుండరీకాక్షా! మేము మీకు శరణాగతులము. పాహిమాం! రక్షమాం!"
ఈ విధంగా ధ్యానిస్తూ 'లలాటము మొదలైన దేహములోని 12 ప్రదేశములలో అనామికాంగుల్యము (బొటనవ్రేలు నుండి క్రిందగా నాలుగవ వ్రేలు)తో స్వీకరించి వ్రాయాలి. వ్రాస్తూ ఉన్నప్పుడు వైష్ణవగాయత్రీ మంత్రము, కేశవాది 24 నామములు పలుకుచూ గోపీచందనము ధారణ చేయుదురు గాక!

---

బ్రహ్మచారీ, గృహస్థోవా
లలాట హృదయ కంఠ
బాహుమూలేషు వైష్ణవ గాయత్ర్యా
'కృష్ణా' ఆది నామభిర్వా ధారయేత్॥

ఈ విధంగా బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని
"లలాట- హృదయ- కంఠ- బాహుమూల" ప్రదేశములలో వైష్ణవగాయత్రి - "కృష్ణా-గోవిందా-గోపాలా-గోపీ జనలోలా - అచ్యుతా - అనంతా - నారాయణా -మొదలైన నామములు ఆయా అంతరార్థముల మనస్సుతో స్మరిస్తూ గోపీగంధమును ధారణ చేయుదురుగాక.

---

**4** యతిః → తర్జన్యా-శిరో, లలాట హృదయేషు
ప్రణవేనైవ ధారయేత్॥
బ్రహ్మాదయః త్రయో మూర్తయః।
తిస్రో వ్యాహృతయః।

యతులు - తర్జనీవ్రేలుతో (చూపుడు వ్రేలుతో) శిరోభాగంలోను, లలాటము నందు, హృదయ ప్రదేశములలో **'ఓం'** అను ప్రణవము పలుకుచూ గోపీచందనమును ధరించెదరు గాక!

| | |
|---|---|
| త్రీణి ఛందాంసి।<br>త్రయో అగ్నయః –<br>ఇతి జ్యోతిష్మంత (త్రయః)।<br>త్రయః కాలాః।<br>తిస్రో అవస్థాః।<br>త్రయ ఆత్మానః।<br>పుండ్రాః త్రయ ఊర్ధ్వా –<br>'అ' కార 'ఉ'కార 'మ'కార<br>ఏతే ప్రణవమయ<br>ఊర్ధ్వ పుండ్రాః<br>**తత్ ఆత్మా।**<br>**సత్ ఏతత్ 'ఓం' ఇతి।** | **త్రిపుండ్రములు దేనిదేనికి గుర్తు (లేక) సంజ్ఞ (లేక) ప్రదీక?**<br>**త్రిమూర్తులగు** బ్రహ్మ - విష్ణు - మహేశ్వరులకు<br>త్రి - **వ్యాహృతులకు** (భూః భువః సువః),<br>ఋక్ - యజుర్ - సామ - **త్రివేదములకు,**<br>దక్షిణ - గార్హపత్య - అహవనీయములకు (యజ్ఞములోని త్రి-అగ్నులకు),<br>.. వీటిని వెలిగించుజ్యోతి తత్త్వమునకు,<br>భూత - వర్తమాన-భవిష్యత్ **త్రికాలములకు,**<br>జాగ్రత్ - స్వప్న - సుషుప్తి **త్రి-అవస్థలకు,**<br>జీవాత్మ - అంతరాత్మ - పరమాత్మ అనబడే త్రైవిద్యకు<br>- 'అ'కార-'ఉ'కార-'మ'కారములో అంతర్గతమైయున్న ప్రణవమయ మగు ఏకాక్షరమునకు, ఓం తత్ సత్ నకు,<br>... వీటన్నిటికీ ఊర్ధ్వపుండ్ర త్రిరేఖలు చిహ్నములు. |
| తాని ఏకథా సమభవత్।<br>ఊర్ధ్వమ్ ఉన్నమయత<br>ఇతి 'ఓం' కారాధికారీ।<br>తస్మాత్ ఊర్ధ్వపుండ్రం<br>ధారయేత్।। | అట్టి మూడు పుండ్రములు ఏకగంధమే అయినట్లు - పైన చెప్పిన మూడు - మూడిటితో కూడినదే 'ఓం'. "ఏకమే అనేకముగా కన్పడుచున్నది" - సమభవత్। ఊర్ధ్వమునకు జేర్చునది కనుక ఊర్ధ్వపుండ్రము. 'ఓం' అను **'ఏక, అక్షర స్థానం'** యొక్క ఉపాసనకు సాధికారము కాబట్టి ఊర్ధ్వ పుండ్రము. అందుచేత బ్రహ్మతత్త్వము ఆశయముగా గల ముముక్షువు - అంతరార్థ ఉపాసనా పూర్వకంగా (తాత్త్వికార్థభావనతో) ఊర్ధ్వపుండ్రము ధరించునుగాక. |
| **05** పరమహంసో.. లలాటే ప్రణవేన<br>ఏకమ్ – ఊర్ధ్వ పుండ్రం వా ధారయేత్।<br>తత్త్వ ప్రదీప ప్రకాశం<br>స్వాత్మానం పశ్యన్ యోగీ<br>మత్ – సాయుజ్యమ్ అవాప్నోతి। | **పరమ హంస (సోఽహమ్ 'పరమమ్।।** నేను సర్వదా సమస్తమునకు ఆధారమైయున్న కేవలాత్మ స్వరూపుడనే - అను స్వానుభవము సిద్ధించుకున్నవాడు) లలాటముపై ప్రణవ పూర్వకంగా ఏకపుండ్రమును ధరించునుగాక!<br>▣ తత్ త్వమ్ → 'నీవు'గా ఏదేది కనిపిస్తోందో, అదంతా పరమాత్మకు అనన్యము.<br>▣ సోఽహమ్ → నేను స్వతఃగా, సహజముగా తత్ (పరమాత్మ) స్వరూపుడనే<br>ఎవ్వడైతే మమాత్మయే 'తత్'గా, 'త్వమ్'గా 'అహమ్'గా అఖండమగు చున్నదని, -అట్టి ఏకాక్షరాత్మ స్వాత్మయేనని గమనిస్తాడో,<br>**అట్టివాడు నా సాయుజ్యమును (విష్ణుసాయుజ్యమును) పొందుచున్నాడయ్యా!** |
| అథవా (మరియు)<br>న్యస్త హృదయపుండ్ర మధ్యే వా,<br>హృదయ కమల మధ్యే వా,<br>తస్య మధ్యే వహ్ని శిఖా<br>అణీయ ఊర్ధ్వా వ్యవస్థితా।<br>నీల తోయద మధ్యస్థా<br>విద్యుల్లేఖేవ భాస్వరా,<br>నీవార శూకవత్ తన్వీ | ఇంకా కూడా....,<br>- ఎక్కడ భావన (లేక) అనుభూతి ఉత్పత్తి అయి బయల్వెడలుచున్నదో అదియే హృత్-అయమ్ = హృదయమ్, (అహమ్ + ఋత్ = **"నేను"** యొక్క జననస్థానము, ఋత్ + అహమ్ = **"అహమ్"** యొక్క వాస్తవ/ పర స్వరూపము. ఆవల నేనైన నేను").<br>హృదయ పుండ్రము మధ్యగా హృత్ పద్మము (కమలము). అట్టి హృదయ కమలము మధ్యగా - నీల తోయదము (నీలి మేఘము)<br>మధ్యగా నీవారధాన్యపు గింజ (వడ్లగింజ) సూక్ష్మమైన చివ్వరికొనవలె - విద్యులేఖనము, మెరుపు బిందు స్ఫురణ స్ఫూర్తి. ఆ మెరుపుగా పరమాత్మ |

| | |
|---|---|
| **పరమాత్మా వ్యవస్థిత ఇతి।**<br>**అతః పుండ్రస్థం**<br>**హృదయపుండరీకేషు**<br>**తమ్ అభ్యసేత్।**<br>**క్రమా దేవం (క్రమాత్ ఏవం) స్వమ్ – ఆత్మానం**<br>**భావయేత్ మాం పరం హరిమ్।** | వ్యవస్థితమై ఉన్నారు. అట్టి పరమాత్మ కొరకు అనుక్షణికమైన ధ్యాస-భావన - ఉపాసనలు ఆశ్రయించబడుగాక!<br>ఈ విధంగా పరమాత్మను హృదయ ప్రదేశములో గల పుండరీకము (స్వహృదయ పద్మము)నందు 'అహమ్' స్వరూపులై మెఱుపు కణము వలె ఉంటూనే,<br>సర్వాత్మకుడు - అక్షరుడు - ఏకస్వరూపుడు - జగత్ రూపుడు - జగదాధారుడుగా కూడా వ్యవస్థితుడై ఉన్నారు. ఆ పరాపర స్వరూపుడగు హరిని గమనిస్తూ, హృదయంలో ఉపాసించెదరు గాక! |
| **ఏకాగ్రమనసా యో మాం ధ్యాయతే**<br>**హరిమ్ అవ్యయమ్,**<br>**హృత్ పంకజే చ స్వాత్మానం**<br>**స ముక్తో। న అత్ర సంశయః॥** | ఈ విధంగా ఎవ్వడైతే ఏకాగ్రతతో కూడిన మనస్సుతో స్వస్వరూపాత్మను, సమస్తమునకు పరుడను, అన్వయుడను అగు 'హరి'గా స్తుతించబడు చున్నాను. నన్ను హృదయ పద్మమునందు అహమ్ స్వరూప స్ఫురణగా ఎవరు ప్రదర్శనమగుచున్నట్లు దర్శించి ఉపాసిస్తాడో,<br>- 'స్వాత్మయే శ్రీమన్నారాయణుడు'' అని ఆస్వాదిస్తాడో - అట్టివాడు నిత్యముక్తుడే. ఇందులో సందేహం లేదు. |
| **6 'మత్ రూపం, అద్వయం బ్రహ్మ**<br>**ఆది–మధ్య–అంత వర్జితం,**<br>**స్వప్రభం, సత్–చిత్–ఆనందం,**<br>**భక్త్యా జానాతి చ అవ్యయమ్।**<br>**ఏకో విష్ణుః అనేకేషు, జంగమ స్థావరేషు చ**<br>**అనుస్యూతో వసతి ఆత్మా**<br>**భూతేషు అహమ్ అవస్థితః।** | ఓ నారదా! ''నేను'' ఎట్టివాడనో, తత్త్వమేమిటో, నామరూపాదుల విశేషమేమిటో చెప్పుచున్నాను. దేనికి "ద్వితీయము'' అనునదే లేదు కాబట్టి అద్వయమో, - అట్టి **"కేవలాద్వయ, ఆదిమద్యాంత రహిత పరబ్రహ్మమే"** నా రూపము. అట్టి అవ్యయము, స్వయం ప్రకాశుడను, సత్-చిత్-ఆనంద రూపుడను అగు నన్ను 'భక్తి'చేతనో **"సోఽహమ్ హరిః। హరిః తత్త్వమ్"**-గా తెలుసుకోగలరు.<br>సర్వత్రా సమముగా వేంచేసియున్న ఏకో-విష్ణురూపుడను. ఏకో-అక్షరుడనగు నేను స్థావర-జంగమములగు అనేక రూపములుగా సంప్రదర్శితుడను. **పూదండలో దారము వలె** సమస్త జీవులలో వారి వారి జాగ్రత్-స్వప్న-సుషుప్తుల అంతరమున అహమ్ స్ఫూర్తిగా అవస్థితుడనై ఉన్నట్టివాడను. |
| **<u>తైలం తిలేషు, కాష్ఠే వహ్నిః,</u>**<br>**<u>క్షీరే ఘృతం</u> యథా, <u>గంధః పుష్పేషు,</u>**<br>**= భూతేషు తథా ఆత్మా**<br>**అవస్థితో హి– అహమ్।**<br>**<u>బ్రహ్మరంధ్రే భ్రువోః మధ్యే</u>**<br>**<u>హృదయే 'చిత్' రవిం హరిమ్,</u>**<br>**<u>గోపీచందనమ్ ఆలిప్య</u>**<br>**<u>తత్ర ధ్యాత్వా ఆప్నుయాత్ పరమ్।</u>** | ఏ విధంగా ఈ సమస్త జీవులలో, సమస్త స్థావర-జంగములలో అంతరంగా హృదయాంతరంగుడనై ఉన్నానో, దృష్టాంత పూర్వకంగా విను.<br>తిలలో.. **తైలము** వలె, కట్టెలలో.. **అగ్ని** అంతర్లీనమై ఉన్నట్లు, పాలలో.. **నేయి**వలె, పుష్పములలో.. గంధము వలె-సర్వ జీవులలో అఖండాత్మగా అహమ్ చైతన్య స్వరూపుడుగా అవస్థితుడనై వెలయుచున్నాను.<br>→ (కొండనాలుకకు ఊర్ధ్వంగా సూటిగా శిరో ఉపరిభాగమున గల) **బ్రహ్మరంధ్రమునందును,**<br>→ రెండు కనుబొమ్మల మధ్యగా నుదిటియందు గల **భ్రూమధ్య ప్రదేశమునందు,**<br>→ ఆలోచనలు, భావనలు, అనుభూతులు, అనుభవములు జనించుచోటు-అగు **హృదయ స్థానమునందును - బుద్ధిని నిలిపి,**<br>చిత్ సూర్యుడు (లేక) చిదాదిత్యుడు అగు హరిని ధ్యానిస్తూ పైన వివరించుకొన్న విధంగా గోపీచందనమును ధరించువాడు సర్వదృశ్య వ్యవహారములను దాటినవాడై పరమపదమును పొందగలడు. |
| **7 ఊర్ధ్వ దండ, ఊర్ధ్వ రేతాశ్చ, ఊర్ధ్వ పుండ్ర, ఊర్ధ్వ యోగవాన్**<br>**ఊర్ధ్వం పదమ్ అవాప్నోతి, యతిః ఊర్ధ్వ చతుష్కవాన్।**<br>**ఇతి ఏతత్ నిశ్చితం జ్ఞానమ్, మత్‌భక్త్యా సిధ్యతి స్వయమ్।**<br>**నిత్యమ్ ఏకాగ్రభక్తి స్స్యాత్, గోపీ చందన ధారణాత్**<br>**బ్రాహ్మణానాం తు సర్వేషాం, వైదికానామ్ అనుత్తమమ్।**<br>**గోపీ చందనవారి భ్యామ్, ఊర్ధ్వపుండ్రం విధీయతే।** | (1) ఊర్ధ్వ దండమును చేతులలో ధరించటము -<br>(2) ఊర్ధ్వరేతస్సు (తేజో పాసనను)<br>(3) ఊర్ధ్వ పుండ్రములను ధరించటము<br>(4) ఊర్ధ్వయోగము (బ్రహ్మరంధ్రమును చీల్చి సహస్రారరమును చేరు యోగాభ్యాసము)<br>అనబడు **ఊర్ధ్వచతుష్టయమును** అభ్యాసముగా ఆశ్రయించువాడు ఊర్ధ్వస్థానము (లేక) కేవలాత్మానందస్థానము, (లేక) సోఽహమ్ స్థానము పొందగలడు. (సహస్రారములో శివునితో జీవైక్యము సిద్ధించుకోగలడు). |

| | |
|---|---|
| | (భక్తిః జ్ఞానమ్ ప్రజాయతే) "అఖండము. అప్రమేయము - నిత్యము - సత్యము-సర్వాత్మ స్వరూపము కేవలము అగు ఆత్మయే నేను"- అనే నిశ్చిత జ్ఞానము ఈ జీవునియందు- "భక్తి"చేతనే స్వయముగా సిద్ధించ గలదు. (తత్ స్వయమ్ యోగ సంసిద్ధః కాలేక ఆత్మని విందతి) అందుచేత నిత్యము ఏకాగ్ర భక్తితో గోపీచందన ధారణను నిర్వర్తించాలి. భక్తి ప్రవృద్ధ మగుచుండగా, ఆత్మజ్ఞానము తనకు తానై యథాకాలంలో సిద్ధించ గలదు. |
| **యో గోపీ చందన-అభావే,<br>"తులసీ మూల మృత్తి కామ్',<br>- ముముక్షుః ధారయేత్ నిత్యం<br>అపరోక్ష - ఆత్మశుద్ధయే (సిద్ధయే)।** | ఒకవేళ గోపీచందనము లభించకపోతే, అట్టి సందర్భములో తులసీవృక్షము ఉన్నచోట, వ్రేళ్ళకు మూలగా ఉన్న మృత్తిక (మట్టిని) తీసి నిత్యము ధారణ చేయుటచే ఆత్మశుద్ధి, అపరోక్ష జ్ఞానము ముముక్షువుకు తప్పక లభించగలదు. నేను తులసీ ప్రియుడనుకదా! |
| **8. అతిరాత్ర అగ్నిహోత్ర భస్మనా అగ్నే<br>భసితం ఇదమ్ విష్ణుః"<br>"త్రీణి పదేతి"<br>మంత్రైః వైష్ణవ గాయత్ర్యా<br>ప్రణవేన ఉద్ధూళనం కుర్యాత్।<br>ఏవం విధినా గోపీచందనం చ ధారయేత్॥** | ఆ మరునాడు → **చేయవలసినది**<br>**అగ్నేః భసితం ఇదమ్ విష్ణుః "త్రీణి పదేతి"। "నారాయణాయవిద్మహే వాసుదేవాయ ధీమహి తన్నోవిష్ణుః ప్రచోదయాత్"**<br>(వైష్ణవ గాయత్రి).... అని చదువుచూ అతిరాత్రాగ్నిహోత్ర భస్మమును ఉద్దూళనము (Removing) చేసి, విధిపూర్వకంగా గోపీచందనమును మరల ధారణము చేయాలి. |
| **యస్తు అధీతే వా<br>సర్వపాతకేభ్యః పూతో భవతి।<br>పాపబుద్ధిః తస్య న జాయతే।<br>స సర్వేషు తీర్థేషు స్నాతోభవతి।<br>స సర్వైః యజ్ఞైః యాజితో భవతి।<br>స సర్వైః దేవైః పూజ్యో భవతి।<br>శ్రీమన్నారాయణే మయి అచంచలా భక్తిశ్చ భవతి।** | ఈ విధంగా ఎవ్వరైతే ఊర్ధ్వ పుండ్ర - శ్రీగంధధారణ వివరములతో కూడిన వాసుదేవోపనిషత్తును విధి - విధాన- అంతరార్థపూర్వకంగా అధ్యయనం చేస్తారో.., శ్రీ గంధ ధారణ చేస్తారో...,<br>- అట్టివారు సర్వపాపముల నుండి పునీతులు అవగలరు.<br>- పాపబుద్ధికి వారి యందు ఇకచోటు ఉండదు.<br>- సర్వ తీర్థములలో స్నానము చేసి పుణ్యఫలము వారికి లభించగలదు.<br>- సర్వ యజ్ఞములు చేసిన యజనఫలము వారు పొంద గలరు.<br>- సర్వ దేవతలను పూజించిన పుణ్యఫలము వారికి సిద్ధించగలదు.<br>- శ్రీమన్నారాయణుడనగు నాయందు అచంచలమైన భక్తి రూపుదిద్దుకోగలదు. |
| **స 'సమ్యక్జ్ఞానం' చ లబ్ధ్వా<br>'విష్ణు సాయుజ్యం' అవాప్నోతి।<br>న చ పునరావర్తతే।<br>న చ పునరావర్తతే।<br>ఇత్యాహ భగవాన్ వాసుదేవః<br>యస్తు ఏతత్ వా అధీతే,<br>సోఽపి ఏవమేవ భవతి॥<br>ఇతి 'ఓగ్ం' సత్యమ్॥<br>ఇతి ఉపనిషత్॥<br><u>వాసుదేవోపనిషత్ సమాప్తా</u><br><u>ఓం శాంతిః శాంతిః శాంతిః</u>** | సర్వత్రా సమస్వరూప- అఖాండాత్మ సందర్శన ప్రజ్ఞతో కూడిన ఆనంద రూపమగు **"సమ్యక్ జ్ఞానము"** సిద్ధించినదై, అట్టి అధ్యయనశీలుడు విష్ణు సాయుజ్యమును పొందుచున్నాడు. అట్టివానికి పునః పునరావర్త దోషము కలుగదు.<br>ఈ విధంగా వాసుదేవ భగవానుడు నారద మహర్షికి విష్ణు సాయుజ్య సిద్ధికి ఉపాయమైన ఉత్తమ - అవగాహన గీతములతో కూడిన ఊర్ధ్వ పుండ్ర- శ్రీగంధ ధారణా విధి - విధానోపాయమును ఉపదేశించారు. ఎవరు ఈ "వాసుదేవోపనిషత్" పఠిస్తారో, వారు వాసుదేవ ప్రోక్తమైన ఫలశ్రుతిని తప్పక సిద్ధించుకోగలరు.<br>**॥ఇతి ఓ గ్ం సత్యమ్॥**<br>**<u>ఇతి వాసుదేవోపనిషత్ సమాప్తా</u>**<br>**<u>ఓం శాంతిః। శాంతిః। శాంతిః।</u>** |

సామవేదాంతర్గత

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

# 8 వాసుదేవోపనిషత్

⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘ ⌘

## అధ్యయన పుష్పము

ఒక సందర్భములో **బ్రహ్మ మానసపుత్రులు,** లోక కల్యాణమూర్తి **త్రిలోకసంచారి**, మానవాళికి **నారదభక్తి సూత్రప్రదాత** అగు దేవర్షి శ్రీ నారదులవారు వాసుదేవుడగు శ్రీకృష్ణస్వామి దర్శనార్థమై వచ్చారు. భగవానుడగు వాసుదేవునికి ప్రార్థనా-స్తుతి-స్తోత్ర-ప్రదక్షిణ-సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించారు. వాసుదేవులవారు శ్రీనారదులవారిని చిరునవ్వుతో ఆహ్వానించి సుఖాశీనులుగా చేశారు.

**శ్రీవాసుదేవుడు :** మహర్షీ! నారదా! క్షేమమేకదా? మహాత్ములు ఊరక రారు కదా! చెప్పండి. ఏమిటి విశేషము?

**శ్రీనారద మహర్షి :** స్వామీ! వాసుదేవభగవాన్! భక్త సులభులగు మీకు, మరల మరల నమస్కారము. హే అఖండజ్యోతి స్వరూపా! స్వామీ! మీ ముఖము ఊర్ధ్వపుండ్రముతోను, దేహమంతా గోపీచందనముతోను ప్రకాసిస్తూ ఉండగా, మీరు బ్రహ్మానందస్వరూపులై మీ భక్త జనులమగు మాకు దర్శనమిస్తున్నారు. మిమ్ములను సందర్శిస్తూ జన్మజన్మల జాడ్యము తొలగిపోతోంది. మేము త్రిపుండ్ర - గోపీచందన సువాసనలచే ధన్యులమగుచున్నాము. మా హృదయములు గోపీచందన మలయమారుత వీచికలచే మధురాతి మధుర మగుచున్నాయి.

**శ్రీవాసుదేవులు :** అవునయ్యా! విష్ణుచందనము ప్రతినిత్యము వ్రజగోపికలు నా దేహమునందు అలంకరించి, మరల పరిశుద్ధము చేస్తూ ఉండటము చేతనే దీనికి 'గోపీచందము' అనే పేరుతో లోక ప్రసిద్ధమగుచున్నది. ఇదంతా గోపస్త్రీల భక్తి పారవశ్యమాధుర్యమే. భక్తికి, అనురక్తికి వశుడనై ఉంటాను కదా!

**శ్రీనాదరమహర్షి :** అధీహి భగవాన్! వాసుదేవా! **ఊర్ధ్వపుండ్ర విధిమ్ - ద్రవ్య మంత్ర స్థానాది సహితం మే బ్రూహి। ఇతి।।** పరంధామా! వాసుదేవా! ద్రవ్య-మంత్ర-స్థాన ఇత్యాది సహితంగా "ఊర్ధ్వ పుండ్రవిధి - విధానము" గురించి ముముక్షువుల ఉపాసనా సౌకర్యార్థమై, విష్ణు సాయుజ్యసిద్ధిని ఉద్దేశ్యించి వివరించవలసినదిగా మీకు అభ్యర్థన సమర్పిస్తున్నాను. ఎందుకంటే అట్టి అలంకారముచే గోపికలు **పరాప్రేమను** సిద్ధించుకుంటున్నారు కదా.

**శ్రీ వాసుదేవ భగవానుడు :** హే త్రిలోక లోక పావన సంచారీ! ప్రియ నారదమహర్షీ! ఈ విష్ణు చందనము వైకుంఠ లోకములో ఉత్పన్నమైనట్టిది. నాకు ఎంతో ప్రీతికరము. నా భక్తులగు బ్రహ్మదేవుడు మొదలైనవారిచే కూడా ధరించబడుచూ ఉన్నది. అవ్యాజ పరాప్రేమ సిద్ధులగు గోపికలు నా బాలకృష్ణ-అంగాగములు అలంకరించి మురిసిపోతూ ఉండేవారు. అందుచేత మరింతగా నాకు ఇష్టమగుచున్నది.

నేను కూడా ఇప్పటికీ ప్రతిదినము విష్ణు - చందనాలంకృతుడనై ఆనందమును పొందుచూ ఉంటాను..

**అట్టి విష్ణు చందనము :-**

- నా అంగాంగములకు అలంకారముగా అగుచున్నట్టిది.
- ధారణచేస్తూ ఉండగా, జీవులకు పుణ్యవాసనలను, దైవీభావములు వృద్ధి చేయునది.
- చక్రతీర్థసమన్వితమై, చక్రతీర్థము మధ్యగా సంస్థితమై ఉన్నట్టిది. పవిత్ర తీర్థములలో భక్తి సౌరభరూపంగా ప్రసరించు అంతర్లీన తత్త్వము.
- పీతవర్ణము (పసుపుపచ్చని వర్ణము)తో పండుగ వలె శోభాయమానమైనట్టిది.
- ముక్తి సాధనము అయి ఉన్నట్టిది.

## విష్ణు చందన (లేక) గోపీచందన – ధారణోపాసన

గోపీచందనమునకు ముందుగా రెండు చేతులతో నమస్కరించి, అప్పుడు చేతిలోనికి తీసుకోవాలి.

**శ్లో॥ గోపీచందన! పాపఘ్న! విష్ణుదేహ సముద్భవ।**
**(తే) చక్రాంకిత। నమస్తుభ్యం। ధారణాత్ ముక్తిదో భవ॥**

"ఓ దివ్యస్వరూపమగు గోపీచందనమా! మాతా! నీకు నమస్కరిస్తున్నాను. ఇప్పుడు చేతులలోకి తీసుకొనుచున్నాను. నీవు సువాసనలచే– మాయొక్క దుర్భావములను, దుష్కృత్యములను, దురభ్యాస వ్యసనములను – తొలగించగలవు. విష్ణుదేహము నుండి జనించియుండుటచే దోషములను తొలగించి నన్ను పవిత్రునిగా తీర్చిదిద్దగలవు. విష్ణుచక్రమును కూడా అలంకరించి ఉన్నావు. శ్రీచక్రాంకితవు. నీకు నమస్కరిస్తున్నాను. నీ యొక్క ధారణకై అనుజ్ఞను ప్రసాదించు. జన్మకర్మల పట్ల బంధ భావన తొలగి, ముక్తిభావన సిద్ధించుటకై అనుగ్రహించుము!".

ఈ విధంగా 'విష్ణుగంధము'నకు హృదయపూర్వకంగా ముందుగా నమస్కరించాలి. **"ఇమం మే గంగేతి!"** అని పలుకుచూ నీటి చుక్కలను పొడిగంధముపై చల్లాలి. "విష్ణుపాదముల నుండి జనించిన ఈ గంగానదీ జలము అయి, ఈ విష్ణుగంధమునకు మరింత శోభ జతజేర్చును గాక!" అని భావించాలి. **"విష్ణోర్నుకమ్ నమస్తుభ్యమ్"** అని పలుకుచూ,, **"విష్ణుభగవానుని దేహస్పర్శచే పవిత్రమైన ఓ విష్ణుగంధమా! నన్ను పవిత్రునిగా తీర్చిదిద్దుటకై మాతృమూర్తివై వేంచేయుము"** – అని భావన చేస్తూ రెండు చేతులతో తడి గంధమును మర్దించాలి. (కలిపిరాయాలి). **"అతో దేవా అవన్తు న"** – మమ్ములను పరమాత్మ సామీప్యమునకు సన్నిధికి జేర్చెదవుగాక – అని శబ్దార్థ పూర్వకంగా ఆరాధన పూర్వకంగా మర్దించాలి. అట్టి సమయములో →

**(1) విష్ణుగాయత్రి : "ఓం। నారాయణాయ విద్మహే వాసుదేవాయ దీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్"**

**(2) కేశవనామములు :** ***ఓం కేశవాయనమః। నారాయణాయ నమః। మాధవాయ నమః। గోవిందాయ నమః। విష్ణవే నమః। మధుసూదనాయ నమః। త్రివిక్రమాయ నమః। వామనాయ నమః। శ్రీ ధరాయ నమః। హృషీకేశాయ నమః। పద్మనాభాయ నమః। దామోదరాయ నమః। సంకర్షణాయ నమః। వాసుదేవాయ నమః। ప్రద్యుమ్నాయ నమః। అనిరుద్ధాయ నమః। పురుషోత్తమాయ నమః। అధోక్షజాయ నమః। నారసింహాయ నమః। అచ్యుతాయ నమః। జనార్దనాయ నమః। ఉపేంద్రాయ నమః। హరవే నమః। శ్రీకృష్ణాయ నమః। శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః***

ఈ రెండూ గానము చేయుచుండును గాక. ఈ విధంగా పలుకుతూ విష్ణు గంధమును ధారణ చేయాలి.

**<u>'బ్రహ్మచారి' ఆశ్రమ వాసి అయి ఉన్నప్పుడుగాని, 'వానప్రస్త' ఆశ్రయవాసి అయి ఉన్నప్పుడుగాని</u> లలాటము హృదయము కంఠము ఉభయభుజములపై** – వైష్ణవ గాయత్రీమంత్రము, కేశవ నామములు చదువుచూ,

**"శ్రీకృష్ణా, పరాత్పరా! అచ్యుతా! భగవన్ స్వయమ్!"** – ఇత్యాది స్తోత్రములు చేస్తూ విష్ణుగంధధారణ చేయాలి.

గృహస్థుడు – పై మంత్రములు చదువుచూ

**శ్లో॥ శంఖ చక్ర గదా పాణే। ద్వారకా నిలయా। అచ్యుతా॥**
**గోవిందా। పుండరీకాక్షా। రక్షమాం శరణాగతమ్।"**

అని పలుకుతూ లలాటము మొదలైన దేహములోని 12 ప్రదేశములలో విష్ణుగంధమును ధారణ చేయును గాక!

**ధారణా పద్ధతి :** అనామిక వ్రేలుతో (అంగులీక వ్రేలుతో) వైష్ణవ గాయత్రి – కేశవాదినామములు – సంస్తుతిస్తూ, శ్రీకృష్ణ నామములు పలుకుచూ '12' చోట్ల శ్రీగంధమును ధారణ చేసెదరుగాక.

బ్రహ్మచారి – గృహస్థుడు – కూడా – అంతరార్థ పూర్వకంగా శ్రీకృష్ణా– గోవిందా – గోపాలా– గోపీజనలోలా – అచ్యుతా – అనంతా – నారాయణా– నామములలో – **లలాట హృదయ కంఠమూలేషు వైష్ణవ గాయత్ర్యా, శ్రీకృష్ణాది నామభిర్వా ధారయేత్॥**

**యతులు :** సన్న్యాసాశ్రమ ధారి (లేక) యతి తర్జనీ (చూపుడు) వ్రేలుతో శిరస్సు – లలాటము, హృదయప్రదేశములో 'ఓం' (ప్రణవము) ఉచ్చరిస్తూ ధారణ చేయునుగాక.

**త్రిపుండ్రముల సంజ్ఞ**– 'మూడు' రేఖలతో 12 దేహ ప్రదేశములతో ఉంగరపు వ్రేలుతో ధారణను **'త్రిపుండ్రము'** అని అంటారు.

ఊర్ధ్వ–త్రి–పుండ్రములు వేటివేటికి ప్రతీకలు?

- బ్రహ్మ – విష్ణు – మహేశ్వర → **త్రిమూర్తులకు,** (సృష్టి–స్థితి–లయములకు)।
- **త్రి –వ్యాహృతులకు,** (భూ–భువర్–సువర్)।
- ఋక్ –యజుర్ – సామ → త్రి–వేదములకు,। (ఋతము పలుకు ఋక్కులు, యజ్ఞయాగములు, గానములు (స్తుతులు)।
- దక్షిణ – గార్హ పత్య్ర – (ఆహారరూప) ఆహవనీయ → **త్రి –అగ్నులకు।**
- జగత్ జ్యోతి – ప్రజ్ఞా జ్యోతి – ఆత్మజ్యోతి → **త్రి – జ్యోతులకు।**
- భూత – వర్తమాన – భవిష్యత్ – **త్రి – కాలములకు।**
- జాగ్రత్ – స్వప్న – సుషుప్తి – **త్రి – అవస్థలకు।**
- జీవాత్మ – అంతరార్మ – పరమాత్మ – **ఆత్మత్రయమునకు।**

***→ వీటన్నిటికీ ఊర్ధ్వత్రిపుండ్రముల సంజ్ఞార్థములు.***

**ఇంకా కూడా. –**

- ప్రణవము (ఓం) యొక్క **'అ'** కార **'ఉ'**కార **'మ'** కారములకు,
- ఓం కారమునకు,
- ఏకత్వ – సమభవత్ స్థానమునకు అట్టి ఊర్ధ్వపుండ్రము మార్గముగాను,

... ఈ విధంగా "ఓం"కారాధికారికి ఊర్ధ్వపుండ్ర సంజ్ఞగా, ఊర్ధ్వస్థానమునకు చేర్చు మార్గము / సూచనగా అగుచున్నది.

- బ్రహ్మరంధ్రము దాటి సహస్రారము చేరుటకు,
- **"నాలో జగత్తులు (పరమాత్మా హమ్) – జగత్తులలో నేను (జీవాత్మాహమ్)"** ల ఏకత్వ – సమభవత్వమునకు–ఊర్ధ్వ తిరేఖా పుండరీకము ఉపకరణము, ఉపాయము, అంతరార్థము అగుచున్నది.

**అందుచేత ముముక్షువు ఊర్ధ్వ పుండరీకధారణము–శుభప్రదము.**

ఇంకా విను.

పరమహంసలు → లలాటమునందు 'ఓం' ప్రణవోచ్చారణతో ఏకపుండ్రమును ధరించుచున్నారు.

ఇట్టి విధాన – అవగాహనలతో విష్ణుగంధ– పుండరీక ధారణను నిర్వర్తించు యోగి – **స్వాత్మానం తత్త్వదీపప్రకాశమ్ పశ్యన్, యోగీ మత్ సాయుజ్యం ఆప్నోతి। 'త్వమ్'గా కనబడుచున్నదంతా స్వాత్మ యొక్క తత్త్వదీప ప్రకాశమే** – అను రూపమగు నాయొక్క **సాయుజ్య స్థానమును** చేరుచున్నాడు.

"మమాత్మయే (1) **తత్**గా (పరమాత్మగా), (2) **త్వమ్**గా (నీవుగా) (3) ఎదురుగా కనిపిస్తున్న ఈ **సమస్త జగత్తు"** అని దర్శిస్తూ –ఆత్మయొక్క ఏక–అక్షరత్వమును, అఖండత్వమును, అప్రమేయత్వమును బుద్ధితో ఎప్పుడు ఈ జీవుడు స్వానుభవం చేసుకుంటాడో – అట్టి స్థితియే ఈ జీవునియొక్క **విష్ణుసాయుజ్యము.** అదియే **"సోఽహమ్ సః"** స్థానముగా కూడా అభివర్ణించబడుతోంది. **'విష్ణు తత్ త్వమ్'**గా గానము చేయబడుతోంది.

# హృదయాంతర్గత శ్రీమన్నారాయణ ధ్యానము

ఎక్కడ నుండి అహమ్ - త్వమ్ - జగత్ ఇత్యాది భావనలు బయల్వెడలుచున్నాయో అదియే **హృదయము.**

- **హృదయ పుండ్రము** మధ్యగా (లేక) - **న్యస్త హృదయ పుండ్ర మధ్యే వా,**
- **హృదయ కమల మధ్యగా, హృదయ కమల మధ్యేవా,**

**తస్య మధ్యే వహ్ని శిఖా అణీయ-ఊర్ధ్వా వ్యవస్థితా, నీల తోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా।**

**నీల తోయద** (నీలి మేఘముల) మధ్య విద్యులేఖ (విద్యుల్లత, మేఘపు మెరపు) వంటిదిగాను, నీవారము (ధాన్యపు గింజ) యొక్క చిట్ట చివర కొనవలెను.

- **అతి సూక్ష్మరూపుడను, సర్వాంతర్యామిని, సర్వ తత్త్వ స్వరూపుడను-అగు** నేను సమస్త జీవుల హృదయ పుష్పమునందే వేంచేసి ఉన్నాను. అట్టి నన్ను సర్వదా **ధ్యానించటము**ను అభ్యసించాలి సుమా!

ఎవ్వడైతే తన హృదయపుష్పము (పుండరీకము) నందే - పుండరీక వరదుడుగా నన్ను దర్శిస్తూ, మననమును అభ్యసిస్తాడో, ఆతడు నన్ను తెలుసుకోగలడు. సర్వమునకు పరము అయినట్టి, సర్వము హరించు హరి స్వరూపునిగా భావిస్తూ ఉండునుగాక. ఏకాగ్రచిత్తముతో తన హృదయ పద్మమునందే స్వాత్మకు అనన్యమని నన్ను తెలుసుకొని, అట్టి అనన్యత్వము తానే సంతరించుకుంటాడో, అట్టివాడు నిత్యముక్తుడే। ఇందులో సందేహము లేదు.

**నారద మహర్షి** : మీయొక్క సహజ - తాత్విక రూపము ఎట్టిదో చెప్పండి. నా బుద్ధి యొక్క కుశలత కొరకై దయచేసి మరికొంత విశేషంగా వివరించండి స్వామీ!

**వాసుదేవుడు** : ఓహో ! నారదా! ఈ ప్రకృతి గత రూపమునకు వేరైన **నాయొక్క కేవలీరూపము** గురించి వినాలనుకుంటున్నావా! సరేం!

**మత్ రూపమ్ అద్వయ బ్రహ్మమ్ : కథారచనలో** ఏదీ కూడా ఆ కథా రచయితయొక్క **"రచనా కళావిశేషము"**నకు వేరై ఉండదు కదా! పాత్రల పరస్పర సంబంధములు, మంచి చెడు గుణములు మొదలైనవన్నీ రచయితయొక్క రచనా చమత్కారమే గాని వేరు కాదు. రచయితకు రచనలోని పాత్రలు అనన్యము. అట్లాగే...,

ఈ సమస్త విశ్వము నాకు వేరు కాదు. నాకు ద్వితీయమై ఎక్కడా ఏదీ లేదు. అందుచేత **నేను అద్వితీయుడను. అద్వయబ్రహ్మమే నాయొక్క అనునిత్య సహజ వాస్తవరూపము.** కథారచయిత కథలో వెతికితే కనిపించేవాడు కాదు. కాని రచయితగా పాఠకునిచే గమనించబడుతూనే ఉంటాడు. అట్లాగే **నేను జ్ఞాన-విజ్ఞాన దృష్టికి- 1) జగత్తుకు వేరై 2) జగత్ స్వరూపుడనై కూడా అగుపిస్తూనే ఉన్నాను.**

**'ఆది-మధ్య-అంత' వర్జితమ్। :** ఈ జగత్తుకు మునుముందటివాడను. దృశ్యములో కనిపించే సమస్తమునకు "మొదలు - మధ్య - చివర" ఉంటాయి. **'దృక్' (లేక) "కేవల ద్రష్ట"** స్వరూపుడనగు నాకు ఆది మధ్యాంతములు లేవు. జన్మ-మృత్యువులు, జన్మ-జన్మాంతరములు 'దేహము' యొక్క స్వభావమై ఉండవచ్చుగాక. వాటి ఆది-అంతములు 'దేహి'నగు నాకు చెందినవే కావు. దేహమునకు రూపమున్నది. మరి **దేహికి రూపమెక్కడిది? రూపమేలేని చోట నాశనమెక్కడిది?**

రూప పరిధులు లేవు కాబట్టి అనంతుడను. అనంతుడైనవానికి మొదలేమున్నది? చివర ఎక్కడిది? అందుచేతనే, **"ఆది మధ్యాంత రహితుడను".**

**స్వప్రభం** : చంద్రబింబము సూర్యుని వెలుగుగా కనిపించు విధంగా కాను. నేను మరొక బాహ్య వస్తువుచే వెలిగించబడుటలేదు. (సూర్యునివలె) **స్వయం ప్రకాశుడను. స్వయం సత్ స్వరూపుడను.**

- గుణములకు - 'గుణి' (గుణములు కలవాడు) యే వెలిగించుచున్నాడు.
- భావములను - భావికుడు ఆధారము.
- సృష్టికి - సృష్టిని సంకల్పించువాడు కారణము.

- **<u>అనుభవము</u>** – అనుభవిచే ప్రదర్శించబడుతోంది.
- **<u>14 లోకములు</u>** – బ్రహ్మదేవునిచే కల్పించబడుచున్నాయి.
- **<u>మనోచిత్త బుద్ధి అహంకారములు</u>** – జీవాత్మపై ఆధారము.
- **<u>జీవాత్మ</u>** – ఈశ్వరాత్మచే ప్రదర్శనమగుచున్నది.

అయితే, నేను ఏ బాహ్య (వేరైన) వస్తువుచే ప్రకాశించబడటం లేదు.

సర్వదా కేవల – అఖండ – అప్రమేయాత్మనగు నేను మరొక వస్తువుచే ఉనికిని పొందటము లేదు. **ఆత్మ స్వయం ప్రభవము – స్వయం సత్ స్వరూపము.** ఈ విధంగా కేవలాత్మయే స్వరూప – స్వభావముగా కలిగియున్న నేను **జ్యోతిర్జ్యోతిః – స్వయః జ్యోతిః, ఆత్మజ్యోతి స్వరూపుడను.**

**సచ్చిదానందమ్** : ఆత్మానంద స్వరూపుడనగు నాకు '3' ముఖ్య విశేష లక్షణములు.

**(1) సత్** = ఉనికి = 'నేను ఉన్నాను' అను స్వభావము నేను ఉంటేనే అనుభవము. నా ఉనికి చేతనే–లోకములు మొదలైనవి కూడా ఉండటము జరుగుతుంది.అట్లాగే, అన్యము, అంతరము (All else and the Inner Zone) మొదలైనవి కూడా ఉనికిని (ఉండటమును) పొందుచున్నాయి. 'అహమస్మి' అను సత్యము **దేశ-కాల-గుణ-రూప-నామాతీతము.** ఎందుకంటే సత్‌స్వరూపుడనగు నేను ఉన్నప్పుడే ఆయా దేశ – కాల – గుణ – రూప – నామములు నా ఉనికిలో కల్పితమైన ఉనికిగా ఉంటాయి. **'స్వభావి'** లేకుండా స్వభావము, జన్మించువాడు లేకుండా 'జన్మలు' ఉండవు కదా! **కేవలాత్మ స్వరూపుడను,** జాగ్రత్ – స్వప్న – సుషుప్తికి సాక్షిని అగు నేను ఉండుటచేతనే అవన్నీ 'ఉనికి'ని (వెలుగులో కనిపించే వస్తువుల ఆకారము వలె) పొంది ప్రకటనమగుచున్నాయి.

ఈ విధంగా **నేను** సర్వదా <u>కేవల సత్ స్వరూపుడను.</u>

**(2) చిత్ : 'ఎరుగుట'** అనునది స్వభావ సిద్ధముగా కలిగియున్నవాడను. నా యొక్క 'ఎరుగుట' నుండి 'ఎరుగబడునది' అనేదంతా నాచేతనే విస్తరించబడుతోంది. 'ఎరుగువాడు – ఎరుగబడునది' అను ఉభయము నానుండి **స్వాభావికంగాను, అనన్యముగాను** బయల్వెడలుచున్నాయి. తిరిగి లయిస్తున్నాయి. ఈ విధంగా జాగ్రత్ – స్వప్న –సుషుప్తులను, లోక లోకాంతర – జన్మ – జన్మాంతర వ్యవహారములను – నేను నా చిత్ స్వరూపముచే నింపి ఉంచుటచేతనే – అవి ఎరుగటం జరుగుతోంది. ఈ విధంగా ఈ త్రిలోకములు మొదలైన దృశ్య వ్యవహారమంతా నా చిత్ సూర్యస్వరూపము నుండి బయల్వెడలు తేజస్సులో సాకారము పొందుచున్న చిత్ చమత్కారములే। 'చిత్' కిరణ పుంజములే।

ఈ విధంగా **నేను** సర్వదా <u>కేవల చిత్ స్వరూపుడను.</u>

**ఆనందమ్ :** సమస్తమునకు అనన్యుడనగు నా నుండియే **అనన్యమగు అన్యము** బయల్వెడలి, తిరిగి అనన్యమునందు ఉపశమించుచున్నది. కారణం? అది నా లీలా వినోదము. క్రీడా చమత్కారము. ఆనందస్ఫూర్తి. 'అనుభవము, అనుభూతి' మొదలైనవన్నీ నా ఆనంద (Enjoying) విభాగము నందే బయల్వెడలుచున్నాయి. నా ఆనంద స్వరూపమునందే 'స్థితి' పొంది ఉంటున్నాయి. ఆనందమునందే లయిస్తున్నాయి కూడా!

**నేను** సర్వదా <u>కేవలానంద స్వరూపుడను.</u>

అన్యమైనదంతా ఆత్మనగు నాకు – నాయొక్క స్వయంకల్పిత అనుభూతి విన్యాసమే. ఈ విధంగా **నేను సర్వదా సత్ – చిత్ – ఆనందస్వరూపుడను.**

**భక్త్యా జానాతి చ అవ్యయము :** ఎదురుగా ఇంద్రియములకు విషయమై అనుభవమగుచున్నదంతా **'మార్పుచెందుట'** లేక **'నశించుట'**ను స్వభావముగా కలిగి ఉన్నది.(యత్ దృశ్యమ్, తత్ నశ్యమ్) 'వ్యయము'ను సంతరించుకోబోవుచున్నది. ఇష్టమైనవి – ఇష్టముకానివి, సామాన్యములు – ఆశ్చర్యములు, సంబంధ – అనుబంధ – బాంధవ్యములు, దేహ – దేహాంతరములు → ఇవన్నీ వస్తూ పోతూ ఉండేవి. **ఆగమాపాయనో అనిత్యః।**

**ఇక నేనో? అవ్యయుడను.** సర్వజీవులలో మార్పుచెందని **కేవల చిత్ చైతన్య రూపముగా, (ఆత్మగా)** – సర్వదా వేంచేసియే ఉన్నాను. అట్టి మమాత్మ స్వరూపము (లేక) విష్ణు (ఉనికి) స్వరూపము – జ్ఞాన – అజ్ఞానముల చేతనో, (లేక) జన్మ – మృత్యువుల చేతనో, (లేక)

జాగ్రత్-స్వప్న-సుషుప్తుల సందర్భములవలననో మార్పు చెందేది కాదు. అందుచేత నేను **'అవ్యయుడు'**గా తత్త్వజ్ఞులచే కీర్తింపబడు చున్నాను. సర్వ దేహములలో నేను **అవ్యయుడనై, అచ్యుతుడనై, అనంతుడనై, నిత్యుడనై, కేవలుడనై 'విష్ణువు'గా ఉన్నాను.**

ఈ జీవుడు సర్వదా అవ్యయమగు ఆత్మ స్వరూపుడే। మమానంద స్వరూపుడే। అయితే "నేను దేహ - మనో - బుద్ధి - చిత్త - దృశ్యములచే పరిమితముగా చేయబడుచున్నాను" అని సంకుచిత దృష్టిని తనపై ఆపాదించుకొనుచున్నాడు. 'జీవుడు' అని అనిపించుకుంటున్నాడు. తనయందు సర్వదా వేంచేసియున్న నాయొక్క విష్ణుతత్త్వమును గమనించటము లేదు. **సద్గురువులు ముముక్షువుకు ఇది గుర్తు చేస్తున్నారు.**

**మరి అవ్యయమగు, తన సహజస్వరూపమగు - నా విష్ణుతత్త్వము ఈ జీవుడు ఎట్లా ఎరుగగలడు?**

**అనన్యమైన భక్తి** చేత అది సుసాధ్యము. సర్వము విష్ణుమయముగా ఎరిగి, దర్శిస్తూ, ఉపాసిస్తూ ఉండగా, స్వాభావికమైన పరాప్రేమ చేతనే - విష్ణుతత్త్వమును ఎరిగి విష్ణు సాయుజ్యము సిద్ధించుకోగలడు.

**ఏకో విష్ణుః అనేకేషు జంగమ - స్థావరేషు చ, అనన్య భక్త్యా జానాతి చ - అవ్యయమ్॥**

ఒకడు ఒక కల కంటున్నాడు. ఆ కలలో కనిపించేవన్నీ ఎవరివి? (కలలో కనిపించుచున్న జీవులు, వస్తువులు) ఎక్కడివి? ఆ కల తనదైనవాని కలాకల్పనా చైతన్య స్వరూపములే కదా! కల కంటున్నవాడు ఒక్కడే అయి ఉండి, ....కలలో చెట్లు, రాళ్లు, కొండలు, జంతువులు, మనుష్యులు, దేవతలు మొదలైన అనేకమైన భేదములుగా కనిపిస్తూ, - కల తనదైనవాడిచే **అప్పటికి అవి - సత్యమే -** అన్నట్లుగా అనుభవించబడుచున్నాయి కదా!

కథా రచయిత ఒక్కడే అయి ఉండి, ఆతడు వ్రాసిన కథలో అనేక సాత్త్విక-రాజసిక-తామసిక పాత్రలు, వారి పరస్పర స్నేహ - శత్రుసంబంధములు, గృహవర్ణనలు మొదలైనవన్నీ అగుపిస్తాయి కదా! ఆ రచయిత-రచనలోని పాత్రలు వలెనే - నేను **ఏకో విష్ణు స్వరూపుడను.**

**అందరిలోని నేనైన నేనే నేను.** అందరిలోను ఏర్పడియే ఉన్నవాడిని కాబట్టి **మహాద్భుతుడను.** దృశ్యములో స్థావర - జంగమాత్మకంగా కనిపించేదంతా నాయొక్క **విశ్వరూప చమత్కారమే.** 'ఏకో విష్ణుః' అయి ఉన్న నేను - పూదండలో అంతర్లీనంగా ఉండే దారము వలె - సర్వభూతజాలములోను 'నేను-నేను' రూపంగా అనుస్యూతుడనై ఉన్నాను. అట్టి నా విష్ణుస్వరూపముతో అనన్యత్వమే ఈ జీవుడు సిద్ధించుకోవలసిన విష్ణుసాయుజ్యము. **అది భక్తితోనే చివరికి సుసాధ్యము.**

**ఓ నారదా! ఇంకా కూడా విను. ఈ సమస్తమునందు "అవ్యయ - ఆనంద - విష్ణు"** స్వరూపుడనై ఎట్లా ఏర్పడి ఉన్నానో - ఇంకా కొన్ని దృష్టాంతాల సహాయంగా వివరిస్తున్నాను. విను.

**(1). తైలం తిలేషు** : తిలలు (నువ్వులు) చిన్నవిగాను, సన్నవిగాను, నల్లని గింజల రూపంలోను ఉంటాయి కదా! మరి నువ్వుల నూనె తిలాతైలము ఎక్కడ ఉన్నది? నూనె కనబడదేమి? నువ్వులను గానుగలో ఆడిస్తే, అప్పుడు పిప్పి ప్రక్కకు పోయి నువ్వులనూనె (తైలము) లభించగలదు కదా! నువ్వులన్నిటిలో నూనె ఉన్నవిధంగా, నేను సర్వ జీవులలో సారవస్తువుగా, అంతర్యామిగా (విష్ణువై) ఉన్నాను. జ్ఞాన - విజ్ఞాన ప్రయత్నములచే **'ఏకో విష్ణుః'** గా తెలియబడగలను.

**(2). కాష్ఠే వహ్నిః** : రెండు కాష్ఠములు (చెక్కలు) ఒరిపిడి చేస్తే (ఒకదానితో మరొకటిని సంఘాతము చేస్తూ ఉంటే) అగ్ని జనిస్తోంది. అంతకు ముందు అగ్ని ఎక్కడున్నది? కాష్ఠములలోనే (కట్టెలలోనే) ఉన్నది. ఒరిపిడిచే బయల్వెడలుతోంది. అట్లాగే నేను సర్వ జీవులలో విష్ణుస్వరూపుడుగా అంతర్లీనుడనై ఉండి, భక్తి - జ్ఞాన - యోగాభ్యాస ఒరిపిడిచే స్వానుభవముగా అగుచున్నాను. **అంతర హృదయ అభ్రాంత మధ్య హృదయాంతరంగుడనగు నన్ను అంతరమున చూచుకోవటమే విష్ణు దర్శనము, విష్ణుసారూప్యము, విష్ణుసాలోక్యము, విష్ణుసాయుజ్యము కూడా.**

**(3). క్షీరే ఘృతమ్** : పాలలో నేయి ఉన్నదా? ఉన్నది. మరి పాలు చూస్తే నేయి కనబడదేం? అట్లా కనిపించదు. మరి? పాలు కాచి చల్లార్చి, తోడు వేసి, అప్పుడు లభించే పెరుగు చిలికితే 'వెన్న' లభిస్తుంది. ఆ వెన్నను కాచినప్పుడు నేయి పొందబడుతోంది. అట్లాగే సర్వజీవులలో నేను మహత్ - అఖండ విష్ణుతత్త్వ స్వరూపుడనై ఉన్నాను. ఈ జీవునికి విష్ణుతత్త్వము స్వానుభవముగా లభించాలంటే?

- బుద్ధిని యోగాగ్నిలో కాచి, చల్లార్చి,
- భక్తిని 'తోడు'గా వేసి,
- జ్ఞానముతో చిలికితే -

అప్పుడు – భక్తి జ్ఞాన వైరాగ్యములతో కూడిన **ఆర్ద్ర నిర్మల హృదయ విభాగము** అనుభవమౌతుంది. ఆ హృదయము 'పరమాత్మ సందర్శనము' అనే అభ్యాసయోగము (వేడి) చే నేయి అనే విష్ణుసాయుజ్యము (అహమేవ ఏకో విష్ణుః మహాద్భుతమ్) **స్వాభావిక – అనునిత్య – అవ్యాజానుభవంగా** సిద్ధించగలదు.

**(4). గంధః పుష్పేషు:** పుష్పములో సుగంధము ఉంటుంది. అది అనుభవము అవాలంటే? గాలి వీచి, ఆ గాలిలో ఆ సుగంధము ప్రవేశించి, సుగంధానుభవముగా అగుచున్నది. అట్లాగే సర్వజీవుల హృదయపుష్పములోగల నా యొక్క మధురానుభవము **'భక్తి – జ్ఞాన – యోగ – వైరాగ్య సాధనలు'** అనే వాయువీచికలచే స్వానుభవమవగలదు.

ఈ విధంగా **తిలలలో తైలము వలె, కాష్ఠములో అగ్నివలె, పాలలో నేయి వలె, పుష్పములో గంధమువలె** – ఆత్మ అంతటా వ్యవస్థితమై ఉన్నది. **ఆత్మగా ఈ దృశ్యమును దర్శించటమే విష్ణు సాయుజ్యము.**

**నారదమహర్షి :** అవును స్వామీ! జగద్గురూ! మీరు సర్వదేహములలో విష్ణుస్వరూపులై సర్వదా వేంచేసియే ఉన్నారని వేద – పురాణ – వేదాంగములు ఎలుగెత్తి గానం చేస్తూ ఉన్నాయి. తత్త్వజ్ఞులు పెద్దగా ఈ విషయం పలుకుచు స్తుతిస్తున్నారు. అయితే, 'ఉపాసన' కొరకై ఈ దేహములోని ఏ ఉత్తమ ప్రదేశములో సర్వతత్త్వస్వరూపము – అగు మీ విష్ణుతత్త్వమును విశేషముగా ధ్యానించుటకు యోగాభ్యాసమునకు సానుకూలమో దయతో వివరించండి.

**విష్ణు భగవానుడు :**

(1) బ్రహ్మరంధ్రము (2) భ్రూమధ్య (ఆజ్ఞాచక్రస్థానము) 3. హృదయము (అనాహతచక్రస్థానము)

ఈ మూడు ప్రదేశములలో 'గోపీచందనము'ను ఆలేపనముచేస్తూ, ఆయా ప్రదేశములలో చిత్ సూర్యుడు, చిత్ భగవానుడు, చిత్–అగ్ని తేజోరూపుడు అగు శ్రీహరిని పిలవాలి. సర్వాత్మక – సర్వతత్త్వస్వరూప – తత్త్వజ్ఞ లక్షణముల సమేతంగా, జ్ఞానస్వరూపి అగు శ్రీ లక్ష్మీసహితంగా ప్రార్థనాపూర్వకంగా ఆహ్వానించాలి. ఆ త్రి స్థానములను (కుడిచేతి మునివ్రేళ్ళతో) స్పృశిస్తూ విష్ణుధ్యానమును చేయాలి. ఈ విధంగా త్రి–స్థానములలో సర్వాత్మకుడగు శ్రీహరిని ఆహ్వానిస్తూ విష్ణుచందన – స్పర్శతో అపరోక్షాత్మస్థికి ధ్యానించాలి. విష్ణుతత్త్వములో మమేకమగుచూ, వ్యష్టి తత్త్వమును దాటివేస్తూ ఉండాలి.

**"పరమాత్మ మరొకచోట కైలాసమో – వైకుంఠమో స్థానము కలిగి ఉన్నారు" – పరోక్ష ధ్యానము.**

కళ్ళకు ఎదురుగా దృశ్యముగా ఉన్నారు – **ప్రత్యక్ష ధ్యానము.**

పరమాత్మ స్వస్వరూపముగా ఉన్నారు. ఆయన ఇంద్రియములకు ప్రత్యక్షము కాదు. మరొకచోట ఉన్నవారు కాదు. పరోక్షము కాదు. స్వస్వరూపచైతన్యమే కాబట్టి బుద్ధికి నిత్యప్రత్యక్షము. ఇంద్రియములకు విషయము కాదు కాబట్టి ఇంద్రియముల దృష్ట్యా పరోక్షము కూడా! – ఇది **అపరోక్షధ్యానము. అపరోక్షజ్ఞానము. అపరోక్షోపాసన.**

ఇట్టి అపరోక్షానుభూతిని మనోబుద్ధులతో ధ్యానము చేస్తూ, బ్రహ్మరంధ్ర – భ్రూమధ్య – హృదయ ప్రదేశములలో విష్ణుచందనము ధారణ చేయటము...అపరోక్షానుభవసిద్ధికి మార్గము.

**(1) ఊర్ధ్వ దండము** (ఊర్ధ్వమగు ఆత్మభావన– షట్చక్రముల స్థానములు గల 'వెన్నెముక'ను బ్రహ్మదండముగా 'గమనించటము' "సమస్తము బ్రహ్మమే" – అను బుద్ధియొక్క అచంచల నిశ్చయము).

**(2) ఊర్ధ్వ రేతస్సు** (సమస్తము ఆత్మతేజోవిభావముగా సందర్శించటము)

**(3) ఊర్ధ్వపుండ్రము** (ఆజ్ఞాచక్రమునుండి ఊర్ధ్వముగా బ్రహ్మరంధ్రము వరకు ఉపాసన).

**(4) ఊర్ధ్వ యోగము** (బ్రహ్మ రంధ్రము దాటి సహస్రారమునందు నిశ్చలమగు యోగాభ్యాసము).

ఈ నాలుగు యోగాభ్యాసములు నిర్వర్తించు యోగాభ్యాసి ఊర్ధ్వపదమును సిద్ధించుకొనుచూ 'యతి' అను స్థానమును సిద్ధించుకొనుచున్నాడు. ఇటువంటి ధ్యాన–సాధన–కార్యక్రమపరుడు క్రమంగా నాపట్ల గల భక్తిబలముచే **"నేను సర్వదా సర్వాత్మకమగు పరమాత్మ స్వరూపుడనే"** అనే నిశ్చిత, అచ్యుత జ్ఞానము – **స్వాభావికము, అనునిత్యము** చేసుకొనుచున్నాడు.

నిత్యము ఏకాగ్రమగు భక్తితో (పరాప్రేమతో), గోపీచందధారణను ఉపాసనా-విజ్ఞాన-పరమార్థ దృష్టితో నిర్వర్తిస్తూ ఉండటము ఉత్తమ భక్తిమార్గము. భక్తి వలన ఆత్మజ్ఞానము, ఆత్మజ్ఞానమువలన సమస్త సంసార నిర్మూలన రూపమగు **స్వ-అఖండ అవ్యాజానందము** సిద్ధించగలదు.

వైదికములగు బ్రాహ్మణములను ఉపాసించు బ్రాహ్మణులు గోపీచందనమును తీర్థముతో కలిపి ఊర్ధ్వపుండ్రము ధరించాలి. ఇది శాస్త్రములచే "తప్పక అనుసరించవలసిన పద్ధతి"గా చెప్పబడుతోంది.

**తులసీ ప్రదేశ మృత్తిక:**

ఒకవేళ గోపీచందనము లభ్యపడకపోవుచున్నప్పుడు, మరొక విధానము సూచించబడుతోంది. నాకు అత్యంత ప్రియమగు తులసీమొక్క మూలనుండి మృత్తికను (మట్టిని) ముముక్షువు స్వీకరించి గోపీచందనమువలెనే **'అపరోక్షాత్మసిద్ధి'** కొరకు (గంధమువలె) ఉపయోగించటముచే కూడా ఉత్తమ ప్రయోజనము తప్పక సిద్ధించగలదు.

**రాత్రి ధరించిన గంధమును తెల్లవారి: -**

**"అతిరాత్రాగ్నిహోత్ర భస్మన, అగ్నేః భసితం ఇదం విష్ణుః త్రీణి పదేతి మంత్రైః"** -అను మంత్రముతో, ఇంకా వైష్ణవ గాయత్రీ - ప్రణవమంత్రములతో, కేశవాది నామములతో 'ఉద్ధాళనము' (గంధము తొలగించటము) చేసుకొనును గాక. మరల సమయ నిర్ణయములను పాటిస్తూ (పైనచెప్పిన) విధి విధానంగా గోపీచందన ధారణము చేయుదురు గాక।

ఓ నారదమహర్షీ! ఇప్పుడు గోపీచందనధారణ యొక్క ఫలశ్రుతిని వినండి.

## ఫలశ్రుతి

ఎవ్వరైతే ఈ మన సంవాదములోని **విష్ణుగంధ ధారణ**ను భక్తి జ్ఞాన వైరాగ్యములతో **అంతరార్థ పూర్వకంగా** ధారణ చేస్తూ, హృదయ **పుండరీకమున విష్ణుదర్శనము** అభ్యసిస్తూ ఉంటారో - అట్టివారు సర్వ పాతకములనుండి విముక్తులై పునీతులగుచున్నారు.

→ సర్వపాపపు బుద్ధి దోషములను తొలగించుకొనగలరు.

→ సర్వపుణ్య తీర్థములలో స్నానము చేసిన పవిత్రతను సంతరించుకొనగలరు.

→ సర్వయజ్ఞ - యాగములు యజించిన (నిర్వర్తించిన) పుణ్యలోక ప్రవేశ ఫలములను పొందుచున్నారు.

→ దేవతాలోకములో పూజ్యులు అగుచున్నారు.

→ శ్రీమన్నారాయణుడనగు నాపట్ల అచంచలమగు భక్తిని సిద్ధించుకోగలరు.

→ **సర్వత్ర పరమాత్మను, సర్వము పరమాత్మయందు, సర్వమునందు పరమాత్మను దర్శించగల 'సమ్యక్‌జ్ఞానము'** సంపాదించుకొన్నవారై సాక్షాత్ విష్ణుసాయుజ్యమును పొందుచున్నారు.

**న చ పురనరావర్తతే। న చ పునరావర్తతే।** వారికిక "ఆబ్రహ్మ భువ నార్లోక పునరావృత్తి" అను దోషము ఉండదు.

**ఈ విధంగా భగవానుడగు వాసుదేవుడు శ్రీ నారద మహర్షికి ద్రవ్య - మంత్ర - స్థానాది విశేషముల సహితంగా ఊర్ధ్వపుండ్ర విధి గురించి బోధించారు.**

**ఎవ్వరైతే ఈ "వాసుదేవోపనిషత్"ను అధ్యయనము చేస్తారో, ఇందలి పరార్థమును ఉపాసిస్తారో -**

**అట్టివారు శ్రీ వాసుదేవస్వామి చెప్పిన ఉత్తమ ప్రయోజనము తప్పక పొందగలరు.**

**ఇతి వాసుదేవోపనిషత్ సమాప్తా**

***ఓం శాంతిః। శాంతిః। శాంతిః।***